| గ్రంథసంకేతములు. | గ్రంథముల నామములు | గ్రంథములయందలి ఆశ్వాసాదులు. | గ్రంథకర్తల నామములు. | గ్రంథకర్తల తరగతులు. (అ. ౬.) |
|---|---|---|---|---|
| 31. నవ. | నవనాథోపాఖ్యానము. ద్విపద. | భా. ౫. | గౌరన............... | ౫. |
| 32. నళ. | నళచరిత్రము. ద్విపద. | భా. ౫. | రాఘవార్యుడు........ | ౬. |
| 33. నిర్వ. | నిర్వచనోత్తరరామాయణము. | ఆ. ౧౦. | తిక్కనసోమయాజి...... | ౧. |
| 34. నీలా. | నీలాసుందరీపరిణయము. | ఆ. ౩. | కూచిమంచితిమ్మయ...... | ౪. |
| 35. నై. | నైషధము. (శృంగారనైషధము.) | ఆ. ౮. | శ్రీనాథుడు.......... | ౨. |
| 36. పంచ. | పంచతంత్రము. | ఆ. ౫. | నారాయణకవి......... | ౪. |
| 37. పంచ. | పంచతంత్రము. | ఆ. ౫. | వేంకటనాథుడు....... | ౫. |
| 38. పండి. | పండితారాధ్యచరిత్రము. ద్విపద. | ప్రకరణములు. ౫. | పాలకురికిసోమన....... | ౫. |
| 39. పద్మ. | పద్మపురాణము. ఉత్తరఖండము. | ఆ. ౧౧. | సింగనార్యుడు......... | ౫. |
| 40. పర. | పరమయోగివిలాసము. | ఆ. ౫. | తిమ్మభూవరుడు........ | ౪. |
| 41. పా. | పారిజాతాపహరణము. | ఆ. ౫. | ముక్కుతిమ్మన......... | ౩. |
| 42. పాంచా. | పాంచాలీపరిణయము. | ఆ. ౫. | కాకమానిమూర్తి........ | ౪. |
| 43. పాండు. | పాండురంగమాహాత్మ్యము. | ఆ. ౫. | రామకృష్ణకవి......... | ౨. |
| 44. పు. | పురూరవశ్చరిత్రము. (కవిరాజమనోరంజనము.) | ఆ. ౫. | అబ్బయ............ | ౪. |
| 45. ప్రభా. | ప్రభావతీప్రద్యుమ్నము. | ఆ. ౫. | పింగళిసూరన్న........ | ౨. |
| 46. ప్రభు. | ప్రభులింగలీల. | ఆ. ౫. | బసవప్ప............ | ౫. |
| 47. ప్రభు. | ప్రభులింగలీల. ద్విపద. | ఆ. ౨౫. | పిడుపర్తిసోమన........ | ౫. |
| 48. బస. | బసవపురాణము. ద్విపద. | ఆ. ౭. | పాలకురికిసోమన....... | ౫. |
| 49. బహు. | బహులాశ్వచరిత్రము. | ఆ. ౫. | వేంగళనాయకుడు...... | ౫. |
| 50. బ్ర. | బ్రహ్మోత్తరఖండము. | ఆ. ౫. | వేంకటరామార్యుడు..... | ౫. |
| 51. భ. | భర్తృహరి.(సుభాషితరత్నావళి.) | శతకములు. ౩. | ఏనుగులక్ష్మణకవి....... | ౪. |
| 52. భద్రా. | భద్రాపరిణయము. (ముకుందవిలాసము.) | ఆ. ౩. | పద్దన............ | ౫. |
| 53. భల్లా. | భల్లాణచరిత్రము. | ఆ. ౫. | నాగేశ్వరుడు......... | ౪. |
| 54. భాగ. | భాగవతము. | స్కం. ౧౨. ప్రథమాదులు. | బమ్మెరపోతన......... | ౨. |
| 55. భాగ. | భాగవతము. ద్విపద. | స్కం. ౧౨. ప్రథమాదులు. | కోనేరునాథుడు....... | ౫. |
| 56. భాను. | భానుమతీపరిణయము. | ఆ. ౪. | రెట్టూరరంగరాజు...... | ౪. |
| 57. భార. | భారతము.<br>౧. ఆది. ఆదిపర్వము. ఆ. ౮.<br>౨. సభా. సభాపర్వము. ఆ. ౨.<br>౩. అర. అరణ్యపర్వము. ఆ. ౭.<br>౪. విరా. విరాటపర్వము. ఆ. ౫. | పర్వములు. ౧౮. | నన్నయభట్టాదులు...... | ౧. |

| | గ్రంథసంకేతములు. | గ్రంథముల నామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదులు. | గ్రంథకర్తల నామములు. | గ్రంథకర్తల తరగతులు. (అవి. ౬.) |
|---|---|---|---|---|---|
| | | ౫. ఉద్యో. ఉద్యోగపర్వము. ఆ. ౪.<br>౬. భీష్మ. భీష్మపర్వము. ఆ. ౩.<br>౭. ద్రో. ద్రోణపర్వము. ఆ. ౫.<br>౮. కర్ణ. కర్ణపర్వము. ఆ. ౩.<br>౯. శల్య. శల్యపర్వము. ఆ. ౨.<br>౧౦. సౌ. సౌప్తికపర్వము ఆ. ౨.<br>౧౧. స్త్రీ. స్త్రీపర్వము. ఆ. ౨.<br>౧౨. శాం. శాంతిపర్వము. ఆ. ౬.<br>౧౩. అను. అనుశాసనికపర్వము. ఆ. ౫.<br>౧౪. అశ్వ. అశ్వమేధపర్వము. ఆ. ౪.<br>౧౫. ఆశ్ర. ఆశ్రమవాసపర్వము. ఆ. ౨.<br>౧౬. మౌ. మౌసలపర్వము. ఆ. ౧.<br>౧౭. మహా. మహాప్రస్థానికపర్వము. ఆ. ౧.<br>౧౮. స్వ. స్వర్గారోహణపర్వము. ఆ. ౧. | | | |
| 58. | భీ. | భీమేశ్వరపురాణము. (భీమఖండము.) | ఆ. ౬. | శ్రీనాథుఁడు.......... | ౨. |
| 59. | భో. | భోజరాజీయము. | ఆ. ౭. | అనంతుఁడు........... | ౩. |
| 60. | మార్క. | మార్కండేయపురాణము. | ఆ. ౮. | మారన.............. | ౨. |
| 61. | మై. | మైరావణచరిత్రము. | ఆ. ౩. | మాదయ............ | ౫. |
| 62. | య. | యయాతిచరిత్రము. | ఆ. ౫. | తెలగనార్యుఁడు......... | ౪. |
| 63. | రత్న. | రత్నపరీక్ష. (లక్షణగ్రంథము.) | ౦ | భైరవుఁడు. .......... | ౦ |
| 64. | రస. | రసమంజరి. | గుచ్ఛములు. ౩. | కోదండపతి .......... | ౫. |
| 65. | రసి. | రసికజనమనోభిరామము. | ఆ. ౭. | తిమ్మయ ............ | ౪. |
| 66. | రా. | రామాయణము. (అచ్చ తెనుఁగు రామాయణముకడనున్నట్లు దీనికి కాండము లెఱుంగునది.) | కాం. ౬. | భాస్కరుఁడులోనగువారు. | ౩. |
| 67. | రా. | రామాయణము. ద్విపద. (అచ్చ తెనుఁగు రామాయణము | కాం. ౬. | రంగనాథుఁడు.......... | ౩. |

| | గ్రంథసంకేతములు. | గ్రంథముల నామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదులు | గ్రంథకర్తల నామములు. | గ్రంథకర్తల తరగతులు. (అవి. ౬.) |
|---|---|---|---|---|---|
| | | కడనున్నట్లు దీనికిని కాండములేఱుంగునది.) | | | |
| 68. | రా. వి. | రాజవాహనవిజయము. | ఆ. ౫. | కాకమానిమూర్తి........ | ౪. |
| 69. | రాఘ. | రాఘవపాండవీయము. | ఆ. ౪. | పింగళిసూరన్న ......... | ౨. |
| 70. | రాజ. | రాజశేఖరవిలాసము. | ఆ ౩. | తిమ్మయ ............ | ౪. |
| 71. | రామా. | రామాభ్యుదయము. | ఆ. ౭. | అయ్యలరాజు రామభద్రుఁ | ౩. |
| 72. | రుక్మాం. | రుక్మాంగదచరిత్రము. | ఆ. ౫. | మల్లన........ [డు. | ౪. |
| 73. | రుక్మి. | రుక్మిణీపరిణయము. | ఆ. ౫. | తిమ్మయ........... | ౪. |
| 74. | లక్ష. | లక్షణసారసంగ్రహము. | ఆ. ౫ | కూచిమంచి తిమ్మయ...... | ౪. |
| 75. | లక్ష్మీ. | లక్ష్మీనృసింహావతారము. (నృసింహపురాణము.) | ఆ. ౫ | ఎఱ్ఱాప్రెగ్గడ......... | ౧. |
| 76. | వసు. | వసుచరిత్రము. | ఆ. ౬. | రామరాజభూషణుఁడు... (బట్టుమూర్తి.) | ౩. |
| 77. | వా. | వాసిష్ఠరామాయణము. | ఆ. ౫. | సింగనార్యుఁడు....... | ౫. |
| 78. | వి, పు. | విష్ణుపురాణము | ఆ. ౭. | వెన్నెలకంటిసూరన్న.... | ౩. |
| 79. | విక్ర. | విక్రమార్కచరిత్రము. | ఆ. ౭. | జక్కన............ | ౩. |
| 80. | విజ. | విజయవిలాసము. (సుభద్రాపరిణయము.) | ఆ. ౩. | చేమకూర వేంకటనాథుఁడు. | ౪. |
| 81. | విజ్ఞా. | విజ్ఞానేశ్వరీయము. ౧. ఆ. ఆచారకాండము. ౨. ప్రా. ప్రాయశ్చిత్తకాండము. ౩. వ్య. వ్యవహారకాండము. | కాం. ౩. | కేతన. (అభినవదండి.)... | ౩. |
| 82. | విష్ణు. | విష్ణుమాయావిలాసము. ద్విపద. ౧. పూ. పూర్వభాగము. ఆ. ౩. ౨. ఉ. ఉత్తరభాగము. ఆ. ౫. | భా. ౨. | కంకంటి. నారసింహరాజు... | ౫. |
| 83. | వీర. | వీరభద్రవిజయము. | ఆ. ౪. | బమ్మెరపోతన......... | ౨. |
| 84. | వేం. | వేంకటేశనిఘంటువు. | ౦ | (ఇందు గ్రంథకర్త పేరు లేదు.) | ౦ |
| 85. | వై. | వైజయంతీవిలాసము. (విప్రనారాయణచరిత్రము.) | ౦ | తిమ్మయ ........... | ౫. |
| 86. | శశాం | శశాంకవిజయము. (తారాశశాంకము.) | ఆ. ౫. | శేషము వేంకటపతి...... | ౫. |
| 87. | శివ. | శివయోగసారము. ఉత్తరార్ధము. | ఆ. ౪. | గణపతిదేవుఁడు......... | ౪. |
| 88. | శుక. | శుకసప్తతి. | ఆ. ౨. (దొరకినవి.) | కదిరీపతి............ | ౫. |
| 89. | శృం. | శృంగారరసాలవాలము. | ఆ. ౩. | ఒడ్డికవి ........... | ౫. |

| | గ్రంథసంకేతములు. | గ్రంథముల నామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదులు. | గ్రంథకర్తల నామములు. | గ్రంథకర్తల తరగతులు. (అవి. ౬.) |
|---|---|---|---|---|---|
| 90. | శేష. | శేషధర్మము. | ఆ. ౬. | శ్రీనివాసకవి.......... | ౪. |
| 91. | షో. | షోడశకుమారచరిత్రము. | ఆ. ౮. | ఎల్లన............... | ౪. |
| 92. | సకల. | సకలకథాసారసంగ్రహము. | ఆ. ౯. | రామభద్రుఁడు........ | ౫. |
| 93. | సత్య. | సత్యభామాసాంత్వనము. | ఆ. ౪. | కామేశ్వరుఁడు......... | ౫. |
| 94. | సమీ. | సమీరకుమారవిజయము. | ఆ. ౭. | పుష్పగిరితిమ్మన. ........ | ౪. |
| 95. | సా. | సారంగధరచరిత్రము. | ఆ. ౩. | *చేమకూరవేంకటనాథుఁడు | ౪. |
| 96. | సా. | సారంగధరచరిత్రము. ద్విపద. | భా. ౭. | శంభుకవి............. | ౬. |
| 97. | సాం. | సాంబనిఘంటువు. (నానార్థవర్గు గాకవర్గులు. ౪.) | వర్గులు. ౪. | రంగకవి............ | ౦ |
| 98. | సురా. | సురాభాండేశ్వరము. | ఆ. ౧. | గట్టుప్రభు........... | ౫. |
| 99. | స్వా. | స్వారోచిషమనుసంభవము. (మనుచరిత్రము.) | ఆ. ౬. | అల్లసాని పెద్దన......... | ౩. |
| 100. | హంస. | హంసవింశతి. | ఆ. ౫. | అయ్యలురాజు, నారాయణామాత్యుఁడు.... | ౫. |
| 101. | హ. న. | హరిశ్చంద్రనలోపాఖ్యానము. | ఆ. ౫. | రామరాజభూషణుఁడు... (బట్టుమూర్తి.) | ౩. |
| 102. | హరి. | హరివంశము. పూర్వభాగము. ఆ. ౯. ఉత్తరభాగము. ఆ. ౧౦. | భా. ౨. | ఎఱ్ఱాప్రెగ్గడ......... | ౧. |
| 103. | హరిశ్చ. | హరిశ్చంద్రోపాఖ్యానము. | ఆ. ౫. | శంకరకవి............ | ౪. |
| 104. | హరిశ్చ. | హరిశ్చంద్రోపాఖ్యానము. ద్విపద. | భా. ౨. | గౌరన............. | ౫. |

*చేమకూరవేంకటనాథుఁడు విజయవిలాసరచనానైపుణ్యముంబట్టి నాలవతరగతియందుఁ జేర్పఁబడినను సారంగధరచరిత్రరచనను బట్టి అయిదవతరగతియందుఁ జేర్పఁబడవలసిన వాఁడుగానున్నాఁడు.

(ఆ. ఆశ్వాసము. కాం. కాండము. భా. భాగము. స్కం. స్కంధము.)

నిఘంటువులయందును. లక్షణగ్రంథములయందును శైలిని కనిపెట్ట ననువుగాదు గాన వానికి తరగతులు ఏర్పఱుపఁబడలేదు.

# శబ్దరత్నాకరము.



అ. ఒక యక్షరము. ఉభ. వై. అవ్య. 1. మఱియొకదాని లేమిని తెలిపెడిని; "కులప్రయుక్తము గుచున్న సనాతనధర్మమిత్తెఱంగు." భార. విరా. ౧, ఆ. ("గీ. ఎవ్వరికిఁగాఁగ ధరణియు నెల్ల సుఖముఁ, గోరెదము వారలందఱు వీరవచ్చి." ఇక్కడ వీరవచ్చి అనియుండుట యుక్తమని తోఁచెడి. చూ, ఎ. భార. భీష్మ. ౧, ఆ.)—2. తనంతట అనునర్థమును దెలిపెడి*; "ఉ. ఇమ్ముగ సర్వశస్త్రములు నీవయెఱుంగుదు." కళా. ౪, ఆ. — 3. ...త్తిగా అనునర్థమును దెలిపెడి*. "ఎ, గీ. కులముపాడినదపఁడలఁపఁడపతి." (తలఁపఁడ=తలఁపు నేతలఁపఁడు.) భార. ఉద్యో. 3, ఆ.—సం. వి. పుం. 1. విష్ణువు; 2. బ్రహ్మ; 3. శివుఁడు. (అ. ఇత్యాద్యేకాక్షరశబ్దములు తెనుఁగున న్యస్తములుగాఁ బ్రయోగింపఁబడవు. అధర్మము, అనర్ఘము, ఇత్యాదులయందుఁ జెడి అకారము అభావార్థకమైన నఞ్సనందు నకారములోపింపఁగా శేషించినది.) 4. కాలవిళంబములేమిని దెలిపెడి. "సీ. వడిజిట్టి దిరిగి మ్రొగ్గను మదావళములుఁ దోన రూపఱిన యాఘోరణులును." జై. ౫, ఆ.

అ. దే. వి. 1. ప్రక్క, పార్శ్వము. "సీ. అంతంతఁ బసిబిడ్డ లడ్డంబు సుడిసిన జంకించి మిన్నంకఁ జౌకళించు." భో. ౬, ఆ.—2. అణకయొక్క రూపాంతరము.

అంకకాఁడు. దే. విశ. (అంకము+కాఁడు.) చలము పట్టువాఁడు, చలపాది. "గీ. ఎలసియేప్రొద్దుఁగనుపొంద నీకమరుఁడు, కలహమునకంకకాఁడయి కాలుద్రవ్వ." ఆము. ౫, ఆ. (అంకశబ్దమునకు వృత్తియందు చలమర్థమని యెఱుఁగవలెను. ఇది యొకానొక కవిచే శ్లేషయందు గుఱుతుగల వాఁడనునర్థమునఁ బ్రయోగింపఁబడియున్నది. "చ. హిమకరుఁడంకకాఁడు మధు వెప్పుడుజాతి విరోధి." కవిక. 3, ఆ.)

అంకణము. వై. వి. 1. నలుచదరపుచోటు*; 2. తొట్టికట్టు, కక్ష్య. (అది యెన్నియంకణముల యిల్లు?)

అంకపాళి. సం. వి. ఈ. స్త్రీ. 1. కవుఁగిలి; 2. తిన్నె; 3. దాది.

అంకపొంకములు. దే. వి. బ. (అంకము+పొంకములు.) 1. కోపము; 2. విరోధము. విశ. ఉగ్రము. (చూ, అంకాపొంకములు.)

అంకము. ఉభ. దే. వి. ఆక్షేపము. "ఉ. పొంకపుఁగావ్యలక్షణముపోక డెఱుంగక దిట్టకూళలై, కొంకక వంకరర్థములు గూర్చి సభాస్థలిఁ బ్రౌఢులట్లుని, శ్శంకఁజరించుచున్ సుకవి సంఘము పల్కుల మెచ్చకూరకే, యంకముసేయవచ్చునల యయ్యలమున్నగఁ బ్రస్తుతించెదన్." మై. ౧, ఆ.—సం. అ. పుం. 1. అంకె; 2. ఒడి; 3. గుఱుతు; 4. చోటు; 5. తప్పు; 6. నాటకపరిచ్ఛేదము; 7. నాటకభేదము; 8. భూషణము; 9. యుద్ధము; 10. సమీపము.

అంకమ్మ. ద్వ. వి. (అంకు+అమ్మ.) ఒక గ్రామదేవత.

అంకవిద్య. సం. వి. ఆ. స్త్రీ. గణితము.

అంకాపొంకములు. దే. వి. బ. (అంకము+పొంకములు.) 1. కోపము; "క. కింకరులచేతనంతన్, లంకకువేగం దెనందినన్ వినియంకా, పొంకాలుదరికొనంగని, రంకుశసాహససమర్థుఁడగుదశముఖుఁడున్." రామా. ౭, ఆ.—2. విరోధము. "సీ. బెడిదమౌశృంగార బీభత్సములకునం కాపొంకములు." కవిస. ౧, ఆ.—విశ. ఉగ్ర

ము. (బిడ్డకు జ్వరము అంకాపొంకములుగా కాయుచున్నది.)

అంకారించు. హిం. క్రి. ఓడచాప యెత్తిపోవుట.

అంకించు. ఉభ. దే. అ క్రి. ఉల్లసిల్లు. "వ. పంకజభవాండమండపంబు సంకుచేసినపొంకంబున నంకించుచు." వసు. ౮,ఆ.—స. క్రి. 1. ఆడించు, జళిపించు; "ఎ, గీ. ఖడ్గమంకింపవైష్ణవికరముఁ బట్టి, వాంఛితంబెద్ది వేఁడుము వరముననిన." జై. ౧, ఆ.–2. త్రిప్పు; "నెమ్మొగమడ్డమంకించి." నిర్వ. ౧, ఆ. "ఘనగదాదండమంకించి." జై. ౨, ఆ.—3. అపహరించు. "క. సంకెలలఁబడ్డ వారే, యంకింతురె నీదురాజ్యమర్థము నసువుల్." కృష్ణా. ౨, ఆ.—సం. స్తుతించు. "వ. అని మఱియు సముచితసంభాషణంబుల నంకించుచున్న పరమవైష్ణవీరత్నంబును." భాగ. ౧, స్కం.

అంకితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎంచఁబడినది; 2. గుఱుతిడఁబడినది. (పుంలింగమై అకారాంతమైనప్పుడు మహదర్థమందు అంకితుఁడు అనియు ఆకారాంతమైనప్పుడు అంకిత అనియు రూపములు. ఇట్లుతక్కినచోట్లను తెలియఁనది.)

అంకియ. వై. వి. 1. ఒకటిమొదలగు సంఖ్యలను దెలుపురేఖ; 2. వశము*. (చూ, అంకె.)

అంకియము. దే. వి. ఎద్దు మొదలగువానిపై యొక పార్శ్వపుభారము.

అంకిలి. దే. వి. 1. కలఁత; "క. అనియూఱడిలఁగఁబలికిన, వినియంకిలిదేఱు చిత్తవృత్తిగలుగునం, గనయేద్పుడిగెన్." భార. ఉద్యో. 3, ఆ. — 2. అడ్డగింత, అడ్డి; "ఎ, గీ. మహీధరముసేయు నంకిలిమానుటయును." కాశీ. 3, ఆ.—3. ఆపద. "క. ఇంకనిజలములుగలిగిన, యింకొక్కయగాధసరసి నిడినంజాలున్, సంకోచింపక మమునీ, యంకిలిఁబాపుటకునీవయర్హుఁడవనినన్." పంచ. నా. ౧, ఆ.

అంకిలిపడు. ద్వ. అ. క్రి. అడ్డిపడు. "క. దైవికమై, యంకిలిపడియెడి పనులకు, సంకటపడుటదియు నొకవిచారమెచెపుఁడా." భో. ౬, ఆ.

అంకిలిపెట్టు. దే. స. క్రి. అడ్డగించు. "వా, డాయత శక్తి నన్ను నిట నంకిలిపెట్టినయప్డు." రా. సుం, కాం.

అంకిళ్లు. దే. వి. బ. (అంగిలి+కీళ్లు.) దవుడక్రిందికీళ్లు.

అంకు. దే. వి. అంకమ్మ, గ్రామదేవత.

అంకుటము. సం. వి. అ. పుం. గడియమ్రానుదీసెడి వంకరయినుపకమ్మి, కుంచెకోల.

అంకుఁడు. దే. వి. దేవుఁడు. (చూ. వియ్యంకుఁడు.)

అంకురము. సం. వి. అ. పుం. 1. మొలక; 2 నీళ్లు 3. నెత్తురు; 4. వెంట్రుక.

అంకురించు. సం. అ. క్రి. మొలచు, మొలకెత్తు.

అంకురితము. సం. విణ. (అ. ఆ. అ.) మొలకెత్తినది

అంకుశము. సం. వి. అ. పుం, న. ఏనుఁగుకుంభస్థలమునందుఁ బొడిచెడియాయుధము, అంకుసము

అంకుసంబుమాద్రి. ద్వ. వి. మూలానక్షత్రము.

అంకుసము. వై. వి. అంకుశము.

అంకూరము. సం. వి. అ. పుం. అంకురము, మొలక

అంకె. వై. 1. ఒకటిమొదలగుసంఖ్యలను దెలుపునట్టిరేఖ, అంకము; 2. వశము*. "ఉ. అంగనమ్మరాదు తనయంకెకురానిమహాబలాఢ్యుణే భంగులమాయలొడ్డిచెఱుపం దలపెట్టు." భాస్క శతకము.

అంకెగొను. ద్వ. స. క్రి. (అంకె+కొను.) కప్పుకొను "గీ. మబ్బు, లవరిఘూత్కృతిరవిమధ్యమంకెగొనఁగఁ, జిక్కుపడకచరించు నం దొక్క కరటి." రా, వి. 3, ఆ.

అంకెన. దే. వి. ఒకానొక ఫలవృక్షము.

అంకెము. దే. వి. ఎద్దు మొదలగువానిపై యొకపార్శ్వపుభారము.

అంకెవన్నియ. ద్వ. వి. (అంకెము+వన్నియ.) గుఱ్ఱము నెక్కుట కిరుప్రక్కలనమర్చిన యినుపమెట్టు. (అంకెశబ్దమున కిక్కడపార్శ్వమమాత్రమర్థము.) "సీ. గోమేధికంబులఁ గొమరొందు కళ్లెంబు వజ్రాల మేలంకెవన్నియలును." ఉ, రా. ౭, ఆ. (రూ, అంకవన్నె.)

అంకోలము. సం. వి. అ. పుం. ఊడుగు*. (రూ, అంకోడము.)

అంక్యము. సం. వి. అ. పుం. కరక్కాయవంటి మృదంగము. విణ. ఎంచఁదగినది.

అంగ. దే. వి. కాలుచాఁచిపెట్టిన యడుగు.

అంగజ. సం. వి. ఆ. స్త్రీ. కూఁతురు. అ. న. ము నెత్తురు. పుం. 1. మదము; 2. వెంట్రుక. విణ దేహమునఁబుట్టినది. (మువర్ణకాంతమైనప్పుడు అంగజము అని రూపము. ఇట్లంతటతెలియఁగనది.)

**అంగజుఁడు.** సం. వి. అ. పుం 1. కొడుకు; 2. మన్మథుఁడు.

**అంగజాల.** దే. వి. రాణివాసపు కావలివాఁడు, సౌవిదల్లుఁడు. "వ. పాదపాదమని సౌవిదల్లులు హస్తపల్లవంబులు పట్టితివిచిన నప్పంకజాక్షికంకణ ఝుణఝుణత్కారంబుగాఁ గెంగేలుగుదిలిచితివిచికొని వికట కుటిల భ్రుకుటి నటన భీషణ ఫాల ఫలకయై కంకలం గటికినగవునగి కన్నులనిప్పులురుల హుంకారంబుసేసిన...అంగిజాలలు కాలుకాలం బెనఁచుకొని చాఁపకట్టుపడంగూలిన." కాశీ ౬, ఆ.

**అంగడి.** దే. వి. 1. పలుసరకులుంచుకొనియమ్మెడు చోటు, ఆపణము; 2. అగిసాలెలోనగువారు పనిచేయుచోటు; "మ. జేతసౌన్నారి తెలుంగునందనరవన్న వేశమిన్నంగడిన్." చంద్రా. ౪ ఆ —3. కొలువుకూటము, సభ; క. పవనజాగదయునునీగాం, డివమును నెటఁబోయెనంగడికిఁబాంచాలిం, దివిచికొనివచ్చునెడ." భార. ఉద్యో. ౪, ఆ —4. గ్రామస్థులుచేరి వ్యవహారముచేయుచోటు రచ్చ; "గీ గ్రామకార్యంబుదీర్చునంగడికివచ్చి" పాండు. 3 ఆ. — 5. న్యాయాధిపతి న్యాయమువిచారించుచోటు దివాణము. "ఉ. అంగడి మూఁడుమాడలును నడ్డుగబండుగవానిపైఁబడున్." విష్ణు. ప్రా, కాం.

**అంగణము.** సం. వి. అ న. అజిరము, ముంగిలి.

**అంగద.** ఉభ. దే.వి.1. ఆఁకలి, ‘ చ. అలుగు నెయుక్కుగుండుకడునంగడ గ్రుంగిన." రా. ఆర, కాం. ౨, ఆ.—2 ఆపద, "ద్వి. అంగదు యౌవరాజ్యమునందునునిచి, యంగదలేని సౌఖ్యముఁబొందుమీవు." రా. కిష్కిం, కాం.—3. ఉత్సాహము; "ఉ అంగదఁదత్స్వయంవర మహోమహవైభవకేలిహూతికిన్, గ్రంగనగంటపైఁగొడుపువ్రాలుటయెన్నఁడు నాఁటనుండియున్, సంగరముం గరంబు గమనంబున భావనసేయరై యామంగళకార్యనిష్ఠులయి మధ్యమలోకమునన్ మహీపతుల్." నై. 3, ఆ.—4. ఉపద్రవము, "గీ. ఆకుఁదోఁటలు నుగ్గాడి యనఁటితోఁట, లెల్లముల్లడిగొనఁ ద్రొక్కి యుల్లికంద, పసుపుఁదోఁటలు జంగిలికసవుబీల్లు, చెఱకుఁదోఁటలు పండినచేలుదీర్చి. క. ఓరాయఁడయీయంగద, కోరువలేకిటకువచ్చె నూళ్లన్నియు." నీలా. ౨, ఆ.—5. కోపము; "చ అ, య్యనిమిషనాథుఁబట్టుకొని యంగదవృత్రుఁడు మ్రింగె." సం. "అపాకృష్యాక్షిపద్వక్త్రే శక్రం కోపసమన్వితః." భార. ఉద్యో ౧, ఆ.—6. దుఃఖము. "చ. పాలకవణంపు కొనినిఁకఁ బూనఁగఁజాల నటంచు నేలతో, య్యలికటివేల్పుపాజ్జఁబడి యంగదతోఁదన చందమంతయున్, బొలుపుగ విన్నవించుకొనఁ బోయె నొకోయన మబ్బుత్రోవకుం, బలుపుగఁ గ్రుళ్లుదుమ్మెగసి పాఱెవడిన్ సురగాడ్పు పెంపునన్." అచ్చ కిష్కిం, కాం.—సం. ఆ. స్త్రీ. దక్షిణదిక్కునందలి యాఁడేనుఁగు. అ. న. ము బాహుపురి.

**అంగదట్టము.** దే వి. (అంగము+దట్టము.) పావడ. ‘సీ. తత నితంబాభోగ ధవళాంశుకములోని యంగదట్టపుకావి రంగువలన, శశికాంతమణి పతిజాజునాఁగ." స్వా. ౨ ఆ. (దీనికి అందమైనపావడయని అర్థము చెప్పవలసియుండినను వాడుకపావడయందే రూఢముగానున్నది.)

**అంగదుఁడు.** సం. వి. అ. పుం. ఒకానొకకోఁతి.

**అంగన.** సం. వి. ఆ స్త్రీ. 1 ఆఁడుది; 2. ఉత్తరదిక్కునందలి యాఁడేనుఁగు. అ. న. ము. 1. పోకడ; 2. ముంగిలి.

**అంగబిల్ల.** దే. వి. (అంగము+బిల్ల.) ఆఁడుపడుచుల మొలనుగట్టెడి వెండిబంగారములబిల్ల.

**అంగమచ్చము.** దే. వి (అంగము+మచ్చము.) అడియాలము, అభిజ్ఞానము.

**అంగమర్దుఁడు.** సం. వి. అ. పుం. కాళ్లుపిసికెడువాఁడు, సంవాహకుఁడు

**అంగము.** ఉభ. దే. వి. 1. అందము; (చూ, అంగు.) 2. విధము. "అంగము జాళువాపసిఁడి యంగము" విజ ౧, ఆ. (దీనికి వృత్తియందు అంత్యవర్ణలోపము. అంగదట్టము ఇత్యాదులు.)—సం. అ. న. 1. అవయవము; 2. ఉపాయము; 3. దేహము; 4. ఏ. అప్రధానము. పుం. ఒకానొకదేశము. విశే. 1. అవయవముగలది; 2. సమీపించినది. (చతురంగములు=రథము, గజము, తురగము, పదాతి.—అంగపంచకము=ఉపాయము, సహాయము, దేశకాలవిభజనము, ఆపదకుఁబ్రతిక్రియ, కార్యసిద్ధి. — పంచాంగములు=తిథి, వారము, నక్షత్రము, యోగము, కరణము.—షడంగములు=శిక్ష, వ్యాకరణము, ఛందస్సు,

నిరుక్తము, జ్యోతిషము, కల్పము. — సప్తాంగములు=స్వామి, అమాత్యుఁడు, సుహృత్తు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము. (ఇవి ప్రకృతులనియుఁ జెప్పఁబడును.) — అష్టాంగములు = యమము, నియమము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధ్యానము, ధారణ, మననము, సమాధి.)

అంగమొల. దే. వి. (అంగము+మొల.) వస్త్రహీనమైన మొల. (ఇక్కడ అంగశబ్దమునకు వ్యతిరేకలక్షణయని యెఱుఁగవలెను.)

అంగమొలవేల్పు. దే. వి. ముక్కంటి, శివుఁడు.

అంగరకా. హిం. వి. పైన ధరించు చొక్కాయి.

అంగరాగము. సం. వి. అ. పుం. చందనాదులపూఁత.

అంగరుహము. సం. వి. అ. న. రోమము, వెండ్రుక.

అంగరేకు. వై. వి. చొక్కాయ. "హాటకహర్మ్యంబులంగరేకులవారు." హ. 3, ఆ.

అంగరొల్లెలు. దే. వి. బ. భక్ష్యవిశేషము. హంస. ౧, ఆ.

అంగలారుచు. దే. అ. క్రి. 1. దుఃఖించు; 2. భీతిచేనఱచు. (రూ, అంగలార్చు. "చ. అ, కోశవున నాడువాలభుజగిం గని గోండ్రనియంగలార్చుచుక్." ఆము. 3, ఆ.)

అంగలారుపు. దే. వి. దుఃఖము. (రూ, అంగలార్పు.)

అంగవస్త్రము. సం. వి. అ. న. ఉత్తరీయము.

అంగవించు. దే. అ. క్రి. ఉత్సహించు. "ఎ, గీ. నింగినేలయుఁదాటింపనంగవించు, పగిది." వై. ౭, ఆ.—స. క్రి. అతిక్రమించు. "సీ. ఈక్షణజితపద్మునితనినేక్రమమున విమతపద్మములంగవింపఁజాలు." వై. ౫, ఆ. (అంగలించు అని కొన్ని ప్రతులయందున్నది. ఆపాఠము యతికి విరుద్ధము. లకారవకారములకు మైత్రి ప్రశస్తముకాదు. చింతనీయము.)

అంగహారము. సం. వి. అ. పుం. అవయవములకదలిక.

అంగారకము. సం. వి. అ. పుం. 1. ఇంగలము; 2. గుంటగలగరి*.

అంగారకవారము. సం. వి. అ. పుం. మంగళవారము.

అంగారకుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకగ్రహము.

అంగారధానిక. సం. వి. ఆ. స్త్రీ. హసంతి, కుంపటి.

అంగారము. సం. వి. అ. పుం, న. 1. నిప్పు; 2. బొగ్గు. పుం. డు. అంగారకుఁడు. (డువర్ణకాంతమైనప్పుడు అంగారుఁడు అని రూపము. ఇట్లంతట నెఱుంగునది.)

అంగారవల్లరి. సం. వి. ఈ. స్త్రీ. నిప్పువన్నెగుత్తుల కానుగు*.

అంగారవల్లి. సం. వి. ఈ. స్త్రీ. బారంగి*.

అంగారశకటి. సం. వి. ఈ. స్త్రీ. హసంతి, కుంపటి.

అంగారిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చెఱకుగడ; 2. మోదుగుమొగ్గ.

అంగారిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. కుంపటి; 2. సూర్యుఁడప్పుడె డఁబాసినదిక్కు.

అంగి. ఉభ. వై. వి. మోఁగాళ్లదాఁక జాఱుగల చొక్కాయి*.—సం. విశే. (న్. ఈ. న్.) 1. అవయవములుగలది; 2. ముఖ్యము. (ఈకారాంతమైనప్పుడు అంగినీ అనిరూపము. ఇట్లు తక్కినచోట్లను గ్రహించునది.)

అంగిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చోలము, రవిక; 2. చొక్కాయ.

అంగిటిముల్లు. దే. వి. కుత్తుకలోపలఁగలిగెడు రోగవిశేషము, గళాంకురము.

అంగిలి. దే. వి. లోకుత్తుక, అంతర్గళము.

అంగిలిగుంట. ద్వ. వి. గళగర్తము, వావిక. "క. మింటికినిమ్ముగ నంగిలి, గుంట దనరనోరుదెఱచికొని యున్ముఖుఁడై." (ఈ పద్యము మొదటి సగమునకు చూ. కుంటుపడు మూడవయర్థము కడ.) రామా. ౮, ఆ.

అంగీ. వై. వి. మోఁగాళ్లదాఁక జాఱుగలచొక్కాయి*.

అంగీకరించు. సం. స. క్రి. సమ్మతించు, ఇయ్యకొను.

అంగీకారము. సం. వి. అ. పుం. సమ్మతి, ఇయ్యకోలు.

అంగీకృతము. సం. విశే. (అ. ఆ. అ.) అంగీకరింపఁబడినది, ఇయ్యకొనఁబడినది.

అంగు. దే. వి. 1. అందము; "క. బంగారుఁడీనె యుంబలె, నంగునఁదగుపాలఁతిమేన." య. ౭, ఆ.—2. విధము. "ఆయెకిమీనితోడనే, యంగునమాటలాడితి." రసి. ౫, ఆ.

అంగుటము. వై. వి. బొటనవ్రేలు, అంగుష్ఠము. "వ. తనయంగుటంబు వ్రేలంగిటిన." సం. "అంగుళ్యగ్రేణరాజేంద్ర స్వాంగుష్ఠస్థాడితోభవత్." భార. శల్య. ౨, ఆ.

అంగుడుదుడిపి. దే. విశే. అక్కడిమాటలు ఇక్కడ ఇక్కడిమాటలు అక్కడ చెప్పెడువాఁడు, తంటలమారి.

అంగుళము. సం. వి. అ. పుం. 1. ఆఱుయవబీజముల ప్రమాణము, వ్రేలు; 2. బొటనవ్రేలు.

**అంగుళి.** సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. వ్రేలు; 2. తొండము చివర.

**అంగుళిత్రము.** సం. వి. అ. న. హస్తకవచము, అత్తెము.

**అంగుళిత్రాణము.** సం. వి. అ. న.——పై.——

**అంగుళిముద్ర.** సం. వి. ఆ. స్త్రీ. ముద్దుటుంగరము.

**అంగుళిమానము.** సం. వి. అ. న. జేన మూర మొదలగు కొలత.

**అంగుళీయకము.** సం. వి. అ. న. ఊర్మిక, ఉంగరము.

**అంగుష్ఠము.** సం. వి. అ. పుం. 1. బొటనవ్రేలు; 2. అంగుళము.

**అంగూరు.** దే. వి. ద్రాక్షావిశేషము ?.

**అంఘ్రి.** సం. వి. ఇ. పుం. 1. కాలు; 2. వేరు.

**అంఘ్రిపర్ణిక.** సం. వి. ఆ. స్త్రీ. కోలపొన్న ?.

**అంచలము.** సం. వి. అ. పుం. పల్లవము, కొంగు.

**అంచించు.** దే. అ. క్రి. ఫలపరిమితి నూహించు. "క. నంచిత్కాశీనగరీ, పంచక్రోశావనీ విభాగస్థలిపైఁ, బంచత్వమొందు జనునకు, నంచించి యనుగ్రహించునఁట యమ్మనువుల్." భల్లా. ౨, ఆ.

**అంచితము.** సం. విణ. (అ. ఆ. అ.) పూజింపఁబడినది.

**అంచియ.** దే. వి. పత్రికలులోనగువాని మోచుకొనిపోయెడుజనులును బండ్లులోనగునవియును మార్గమున నక్కడక్కడ నిలిచెడు ఘట్టము.

**అంచె.** దే. వి. 1. అంచియ. "వ. అంచె లంచెలం బంచతాపతిత చమర సృమర కిరి హరిణ రురు మహిష పృషదంశ గోధికా శశ పిశితఖండంబులొండొండ యయ్యెడ్డుగా నాకుఁ బొత్తరలంగట్టియు." స్వా. ౪, ఆ.—2. బ. పరుస. "ఉ. అంచెలుగట్టికాళ్లతోడుసై చననీవుగదమ్మపొరా, యంచలు." స్వా. ౫, ఆ.

**అంచె.** వై. వి. తూఁడుదిండి, తెలిపిట్ట, హంస

**అంచెన.** దే. వి. ఫలపరిమితినూహించుట.

**అంచెనదారుఁడు.** ద్వ. వి. ఫలపరిమితినూహించువాఁడు.

**అంచెపదము.** వై. వి. వ్రాఁతయందుతప్పుగలచోటుంచెడు హంసపాదాకారమైనగుఱుతు, హంసపాదము. "క. తెలియుటకందంచపదము తీరముగనిలిపెన్." ఆము. ౫, ఆ.

**అంచెయాన.** వై. వి. హంసవంటి నడగల ఆఁడుది "మత్త. అంచయానవరించువేళ." రుక్మాం. ౪, ఆ.

**అంచెరవుతు.** వై. వి. తమ్మిచూలి, నలువ, బ్రహ్మ.

**అంచెల.** దే. వి. ప్రక్క, పార్శ్వము. "ద్వి. జాళువాగిండియంచలదాల్చికుఁడు." విష్ణు. ఉ. ౪, ఆ.

**అంచేలము.** దే. వి. అచ్చలము, అగ్రహము. "ద్వి. పంచెఁదామెత్తుక పక్షులుదివికి, నంచలంబున నేగియందుండిపలికె." నళ. 3, ఘా. (ఇది బిందుయుక్తముగా నీ గ్రంథమునందుమాత్రమే కనఁబడుచున్నది.)

**అంచే.** యు. దే. ప్రే. 1. పుచ్చు. (చూ. అనుచు.) 2. ఆజ్ఞాపించు. (అనుచుయొక్క రూపాంతరము.) "పార్థసనుం దగనంచిపుచ్చవే." భార. అశ్వ. ౧, ఆ. "ఇత్తెఱంగుచె, ప్పిననిను ధర్మనందనుఁడు ప్రీతిగనందులకంచిపుచ్చు." భార. అశ్వ. 3, ఆ.—వి. విధము. "క. అంచు మరుత్తునికథవిని, పించిసమునితోడజనన భీరువుల కునే, యంచుననిహపరములని, ద్ధించునను చు నడుగనయ్యుధిష్ఠిరుతోడన్." జై. 3, ఆ.— వై. 1. ఓరు*; 2. తుద*; "ఈయంచుమ, ట్టని సింగారములేమి." పాంచా. ౪, ఆ.— 3. బండి కంటియాకు*; "ప. సంక్రోడంచులు నాలుకమ్ములు మూడుతోలులుంగలిగి." సం. "యస్యైకంచక్రం ద్వాదశారం షణ్నేమిత్రినాభి." భాగ. ౫, స్కం. — 4. చూచుకము*. "అంచులఁజేత నప్పళించి." క్షేత్రయ.

**అంచెలవాఁడు.** దే. వి. చిత్తరువువ్రాయువాఁడు, చిత్రకారుఁడు.

**అంజన.** సం. వి. ఆ. స్త్రీ. 1. హనుమంతునితల్లి; 2. ఉత్తరపుదిక్కునందలి యాఁడేనుఁగు. అ. న. ము. 1. కాటుక; 2. రసాంజనము; 3. సౌవీరము. పుం. 1. పడమటిదిక్కునందలి యేనుఁగు; 2. బల్లి.

**అంజనకేశి.** సం. వి. ఈ. స్త్రీ. నళియను గంధద్రవ్యము.

**అంజనావతి.** సం. వి. ఈ. స్త్రీ. ఈశాన్యపుదిక్కునందలి యాఁడేనుఁగు.

**అంజలి.** సం. వి. అ. పుం. 1. చేమోడుపు; 2. దోసిలి; 3. అభినయహస్తవిశేషము. (బొటనవ్రేలు వంచి చూపుడువ్రేలి మొదటఁగూర్చి తక్కిన వ్రేళ్లుచాఁచిన రెండుచేతులను గూర్చిపట్టినది.)

**అంజలికారిక.** సం. వి. ఆ. స్త్రీ. లేప్యమయస్త్రీ.

అంతఃపురము. సం. వి. అ. న. రాణివాసపు స్త్రీలుం డెడుచోటు, అంతిపురము.

అంతఃపురి. సం. వి. ఈ. స్త్రీ. అంతఃపురము, అంతిపురి.

అంతకము. వై. వి. అంతు, మొత్తము*.

అంతకుఁడు. సం. వి. అ. పుం. యముఁడు, జముఁడు.

అంతట. వై. ద్ర. అంత, అనంతరము.

అంతము. సం. వి. అ. న. స్వభావము. పుం, న. 1. తుద; 2. నిశ్చయము. పుం. చావు. విశే. 1. రమ్యము; 2. సమీపము.

అంతరంగము. సం. వి. అ. న. హృదయము, ఉల్లము.

అంతరదామర. మి. గ్రా. వి. (అంతరము+తామర.) నాఁచుపగ, జలపల్లి.

అంతరపల్లటీ. మి. గ్రా. వి. (అంతరము+పల్లటీ.) ఒకదినుసు పావురాయి.

అంతరము. సం. వి. అ. న. 1. భేదము; 2. తెఱపి; 3. నడిమిచోటు; 4. మఱుఁగు; 5. మేర; 6. వెలుపల; 7. సందు; 8. సమయము. పుం. 1. కట్టుఁగోక; 2. పరమాత్మ. విశే. 1. తనది; 2. అన్యము; 3. వెలుపలిది; 4. సమానము.

అంతరాయము. సం. వి. అ. పుం. విఘ్నము, పని చెఱుపు.

అంతరాళము. సం. వి. అ. న. 1. ఎల్లదిక్కులకు నడిమిచోటు; 2. నడిమిచోటు.

అంతరించు. సం. అ. క్రి. 1. చచ్చు; "ఎ, గీ. స్నానమర్దనవేళలమేనిచర్మ, మదరువాఁడైదునెలలకు నంతరించు." జై. ౯, ఆ. — 2. చెడు. "కన్యకావ్రతమంతరించినసెట్లుమ, జ్జనకునింటికిఁబోవ నేర్తు." భార. ఆది. 3, ఆ. — స. క్రి. కడచు. "బహుదేశములంతరించుచున్." జై. ౫, ఆ.

అంతరిక్షము. సం. వి. అ. న. ఆకాశము, మిన్ను. (రూ. అంతరీక్షము.)

అంతరీపము. సం. వి. అ. న. నీటినడిమిదిబ్బ, ద్వీపము.

అంతరీయము. సం. వి. అ. న. పరిధానము, కట్టుఁగోక.

అంతరువు. వై. వి. 1. తారతమ్యము; "పెద్దపిన్నయం, తరువులెఱింగి." విజ. ౧, ఆ.—2. మఱుఁగుచోటు. "క. అరుగునెడనంతిపురమున, నరవిరిపాన్పుపయినొఱగి యావలధరణీ, శ్వరుఁడును నీవలనొకయం, తరువునఁ జిత్రాంగిచెలువుఁదానుండంగన్." సా. 3, ఆ.

అంతర్గతము. సం. విశే. (అ. ఆ. అ.) 1. నడుమఁ బొందఁబడినది; 2. మఱువఁబడినది.

అంతర్ధ. సం. వి. ఆ. స్త్రీ. తిరోధానము, మఱుఁగు.

అంతర్ధానము. సం. వి. అ. న. మఱుఁగుపాటు.

అంతర్ధి. సం. వి. ఇ. పుం. పిధానము, మఱుఁగు.

అంతర్భూతము. సం. విశే. (అ. ఆ. అ.) లోపల నడఁగినది, అడకము.

అంతర్మనుఁడు. సం. విశే. స. దుఃఖమునొందిన మనస్సుగలవాఁడు, విమనుఁడు.

అంతర్ముఖుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) బయటికి సంసారివలెఁ గనఁబడుచుండియు లోపల బ్రహ్మజ్ఞానపరిపూర్ణుఁడైనవాఁడు. (ఈకారాంతమైనప్పుడు రూపము అంతర్ముఖీ. ఇట్లంతట తెలియునది.)

అంతర్యాగము. సం. వి. అ. పుం. మానసికపూజ.

అంతర్యామి. సం. వి. న్. పుం. 1. జీవాత్మ; 2. పరమాత్మ. విశే. లోపలనుండువాఁడు.

అంతర్లాపి. సం. వి. న్. పుం. ఉత్తరములోపల నణఁగియుండునట్లు అడుగునట్టి విషమసమస్య. "క. శ్రీకాంతుని దినమెన్నఁడు, రాకొమరునికద్ది ప్రియమురఘతిథియెన్నం, డేకొలఁదినన్నమఱుఁగును, ఏకాదశినాడు సప్తమేడేగడియల్." ఇత్యాది.

అంతర్వంశికుఁడు. సం. వి. అ. పుం. అంతఃపురమునకధికారి.

అంతర్వత్ని. సం. వి. ఈ. స్త్రీ. గర్భిణి, చూలాలు.

అంతర్వాణి. సం. విశే. ఇ. శాస్త్రమునెఱిఁగినవాఁడు.

అంతర్హితము. సం. విశే. (అ. ఆ. అ.) మఱుఁగుపడినది.

అంతలపొంతలవాఁడు. ద్వ. వి. దూరపుచుట్టము. "సీ. చనును బరంపరా సంబంధియంతల పొంతలవాఁ డందిపొందినట్టి, వాఁడనంగను." ఆం, భా. ద్వి. మ.

అంతవట్టు. ద్వ. స. (అంత+పట్టు.) 1. అంతయు; "గీ. పుట్టియంతవెన్నప్రోవుగఁబెట్టితిఁ, గడఁగి కడఁగి యొక్కగనపచేర, నంతవట్టుమ్రింగె." హరి. పూ. ౫, ఆ. (అంతవట్టువారు=అందఱు. "ధాత్రీపతులఁదోడు, తెచ్చితి పలువురఁ జచ్చిరంత, వట్టువారును." భార. శల్య. ౨, ఆ.)— 2. అంతమాత్రము. "సీ. ధృతరాష్ట్ర పాండు భూపతులకుమారులు తమలోననీసునసమరము

నేకుఁ, దొడఁగిననీవడ్డ పడవైతితగఁజాలు మాను సులౕగలిగియు మాననీయు, వాక్యండవయ్యును శక్యసమస్తకార్యుండనఁజేర్కొనియును నుపే క్ష, సేసితికురురాజుఁజెఱుపనతిరిగితి, నిఖిలరా జులఁదదనీకములను, నామమడఁచి తెల్లభూము లుఁబాడయ్యె, నంతవట్టుఫలము ననుభవింపు.'' భార. స్త్రీ. ౨, ఆ.

అంతశయ్య. సం. వి. ఆ. స్త్రీ. 1 చావు; 2. భూశ య్య; 3. శ్మశానము.

అంతస్తు. వై. వి. 1. మఱుఁగుచోటు; ''ఎ. గీ. ఎఱుఁ గవలసినయంతస్తులెల్లఁజూచె. వ. ఇవ్విధంబున సందుగొందు లొక్కొక్క నెపంబునం బరామ ర్శించిచూచుచు'' పర. ౫, ఆ.–2. తొట్టికట్టు*; ''ద్వి. అంతఃపురమువాసియల్లననివలి, యంతస్తు నకువచ్చునంతటిలోన'' విష్ణు. ఉ. ౪, ఆ.—3. నిలువు*; (రెండంతస్తులయిల్లు.) 4. పరువు*.

అంతస్థ. మ. వి. రహస్యముగానిచ్చు లంచము.

అంతావసాయి. సం. వి. న్. పుం. 1. మంగలవాఁ డు; 2. మాలవాఁడు.

అంతిక. సం. వి. ఆ. స్త్రీ. 1. నాట్యపరిభాషయందు అక్క; 2. శాతలమనెడిమోషధి; 3. ప్రాయ్య. విశే. సమీపము.

అంతికలు. దే. వి. బ. చాఁపవలెనల్లిన కసవుతడికలు.

అంతిపురము. వై. వి. రాణివాసము, అంతఃపురము.

అంతిపురి.• వై. వి. అంతిపురము, అంతఃపురి.

అంతిమము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కడపటిది; 2. సమీపించినది.

అంతియ. వై. స. అంతమాత్రము. ''వ. పదునొకం డువేల యోజనంబుల తనర్పను నంతియపొఁ తునుంగల మందరనగంబు.'' భార. ఆది. ౨, ఆ.

అంతు. •వై. వి. అంతకము, మొత్తము*.

అంతే. వై. స. అంతియ*, (రూ.) అంతే.

అంతేవాసి. సం. వి. న్. పుం. 1. శిష్యుఁడు; 2. మా లవాఁడు. విశే. సమీపముననున్నవాఁడు.

అంత్యజుఁడు. సం. వి. అ. పుం. చండాలుఁడు, మాల.

అంత్యము. సం. వి. అ. పుం. తుంగ1. విశే. 1. అధ మము; 2. కడపటిది.

అంత్రము. సం. వి. అ. న. ఆంత్రము, ప్రేగు.

అందంద. వై. అవ్య. మఱిమఱి. ''వ. ముకుందునకు నందందమ్రొక్కుచు.'' లక్ష్మీ. ౧, ఆ. ''గీ. అందం ద, పొదలుశోకవహ్నిఁబొగిలిపొగిలి.'' జై. ౭,ఆ.

అందంబుగూడుకొను. దే. అ. క్రి. (అందంబు+కూ డుకొను.) కలసికొను. ''వ. మీఁదఁగార్యంబుగ లమాను వినంగాదనం బనిలేదని యందంబుగూ డుకొని ఛందోనువర్తనపరుండై.'' ఆము. ౩, ఆ.

అందకత్తియ. వై. విశే. (అందము+కత్తియ.) సౌంద ర్యవతి, (రూ.) అందకత్తె.

అందగాఁడు. ద్వి. విశే. (అందము+కాఁడు.) సౌం దర్యవంతుఁడు.

అందగించు. వై. అ. క్రి. అందపడు, రమ్యమగు.

అందదుకు. దే. విశే. (అదుకు+అదుకు.) 1. మిక్కిలి యదుకుకలది. ''మ. రాక్షసాం, గనచేనందదు కైనయయ్యెడలు ద్రొక్కల్వా పెదంగ్రమ్మఱన్.'' హరి. ఉ. ౧, ఆ.—2. సంపూర్ణముకానిది. ''క. అందదుకుపాటపాడుచు.'' చంద్ర.

అందనుక. ద్వి. ద్ర. (అంత+దనుక.) అందాఁక.

అందపడు. వై. అ. క్రి. (అందము+పడు.) రమ్య మగు. (ప్రే. అందపఱచు.)

అందము. వై. వి. చక్కఁదనము, సౌందర్యము.

అందఱు. వై. స. (అంత+వారు.) 1. అంతశబ్దము నకు మహన్మహత్యర్థక బహువచనరూపము, ఎల్ల వారు. (సమస్తపురుషులు. సమస్తస్త్రీలు. సమస్త స్త్రీపురుషులు.) 2. అంతసంఖ్యగలవారు.

అందలము. వై. వి. 1. పార్శ్వములమఱుఁగులేనిపల్లకి, ఆందోళము. ''సీ. పొందుగానందలంబులు పల్ల కీలుదక్షతనాయితముసేయు శైబికులును.'' కళా. ౮, ఆ.—2. బ. బాలక్రీడావిశేషము*. ''సీ. కోలక్రోఁతులు బిల్లగోల్లు దూరనఁగోల లఁద లంబులు మఱి కుందికాళ్లు.'' వి, పు. ౭, ఆ.

అందాఁక. ద్వి. ద్ర. (అంత+దాఁక.) అంతపర్యం తము.

అందిక. దే. విశే. సమీపము. ''చ. నిల్చిరో, య్యన మిథిలాపురంబునకు నందికయౌ ముని పల్లెనా నిశన్.'' అధ్యా. బాల, కాం.

అందిపొందినవాఁడు. దే. వి. దూరపుచుట్టము. ''సీ. చనునుబరంపరాసంబంధి యంతలపొంతలవాఁ డందిపొందినట్టి, వాఁడనంగను.'' ఆం,భా. ద్వి.మ.

అందియ. వై. వి. స్త్రీలు కాళ్లనుధరించెడు భూషా విశేషము, అంగుకము.

అందు. దే. స. క్రి. 1. కైకొను, గ్రహించు; ''క. ప్రీతి వినోదించుమన, బ్భూతలపతిమధుర నీరపూర్ణచషకము, న్నాతికినిచ్చిననందక, యాత

నిదెసఁజూడకుండెనందఱుఁజూడఁగ." మార్క. ౫, ఆ.—2. పొందు. "గీ. నీవును, నేనుఁజనివి దర్భనిష్టలీల, నుండుదముమృగాకులో గ్రవనంబుల, కరుగనేల యిడుమ లందనేల." భార. అర. ౨, ఆ.—ద్ర. అచ్చోట. "అందులేఁడు." "అందుఁబోదము." మొ.—అప. ఒక ప్రత్యయము.

**అందుకము.** సం. వి. అ. పుం. 1. అందె; 2. ఏనుఁగుసంకెల; 3. సంకెల.

**అందుకొను.** దే. స. క్రి. కైకొను, గ్రహించు.

**అందుకోలు.** దే. వి. అందుకొనుట. విశ. అతిపమీపము.

**అందుగు.** దే. వి. అందువు, సల్లకి†.

**అందుపాటు.** దే. విశ. సమీపము. "ద్వి. రథము, నందుపాటుగఁబోలుమనుచుఁదోలించి." హరిశ్చ. ౧, భా.

**అందుబడి.** దే. విశ. 1. ప్రాప్తము; (ఆసొమ్ము నీకు అందుబడియైనదా?) 2. సమీపము.

**అందులకు.** దే. ద్ర. 1. అచ్చోటికి; "అందులకుంబోదము." భార. ఆది. ౭, ఆ.—2. దానికి. "నీవందులకేలపోయెదు ముందఱనివృత్తంబయ్యె." భార. అర. ౨, ఆ.

**అందువు.** ఉభ. దే. వి. అందుగు†. సం. ఉ. స్త్రీ. 1. అందియ; 2. ఏనుఁగుకాలుకట్టెడుగొలుసు, బారి.

**అందె.** వై. వి. అందియ.

**అందోలు.** వై. స. అందలముయొక్క రూపాంతరము. "క. భీమునకునం, దోలుగిడ్డ్వడఁదొడఁగిరుద్ధతులు రాజసుతుల్." భార. ఆది. ౫, ఆ.

**అంధకరిపువు.** సం. వి. ఉ. పుం. శివుఁడు, ముక్కంటి.

**అంధకారము.** సం. వి. అ. పుం. ధ్వాంతము, చీఁకటి.

**అంధకుఁడు.** సం. విశ. (అ. ఈ. అ.) గ్రుడ్డివాఁడు.

**అంధకూపము.** సం. వి. అ. పుం. పాడునుయ్యి.

**అంధతమసము.** సం. వి. అ. న. గాఢాంధకారము, చిమ్మచీఁకటి, (రూ.) అంధాతమసము.

**అంధము.** సం. వి. అ. న. చీఁకటి. విశ. గ్రుడ్డిది.

**అంధస్సు.** సం. వి. స్. న. అన్నము, వంటకము.

**అంధిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. చీఁకటి; 2. ఒక జూదము.

**అంధుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) అంధకుఁడు.

**అంధువు.** సం. వి. ఉ. పుం. కూపము, నుయ్యి.

**అంధ్రము.** సం. వి. అ. పుం. తెలుఁగుదేశము.

**అంపకము.** దే. వి. అంపుట, ప్రేషణము.

**అంపకాఁడు.** ద్వ. విశ. (అమ్ము+కాఁడు.) 1. విల్లు చేతఁబట్టినవాఁడు, ధానుష్కుఁడు; (అస్త్రిశబ్దము వంటిది.) 2. గుఱితప్పక అమ్ము వేయువాఁడు, కృతహస్తుఁడు. "గీ. హదనువచ్చుదాఁక నపరాధిపైరోప, మాఁగిహదనుగన్న నడఁపవలయు, లక్ష్యసిద్ధిదాఁకలావునశరమాఁగి, కాఁడవిడుచునంపకాఁడునోలె." ఆము. ౮, ఆ.

**అంపకోల.** ద్వ. వి. (అమ్ము+కోల.) అమ్ము, బాణము.

**అంపఱ.** ద్వ. వి. (అమ్ము+పఱ.) బాణసమూహము. "క. తఱచుగఁబఱపెఁగడిఁదియం, పఱ." హరి. ఉ. ౧, ఆ. (చూ. పఱ.)

**అంపాచౌరము.** వై. వి. జలప్రవాహము. "క. సంపాదితశంపావలిఁ, బెంపారినమేఘచయముపుష్పవియునభముం, గంపింపఁగబెట్టుఱుముచు, నంపాచారంపువాన లప్పుడుకురిసెన్." వి. పు. ౭, ఆ.

**అంపియ.** దే. వి. చింపిగుడ్డ, పటచ్చరము. (చూ. అంపె.)

**అంపు.** దే. స. క్రి. 1. ఆజ్ఞాపించు; 2. పుచ్చు. (చూ. అంచు.) వి. ఉత్సవవిశేషము. "ఎ. గీ. తద్వశేషంబులొప్పఁదేవ, తంతుసాకసనంపుజాతరలొలువన." ఆం, భా. ప్ర. నా.

**అంపుదోడు.** దే. విశ. (అంపు+తోడు.) ప్రయాణమైపోవువారికి తోడుగా అంపఁబడువాఁడు.

**అంపె.** దే. వి. అంపియ. "అంపెలుగట్టి కేలనొక, యుష్టిఘరించి." ద్వా. ౧౦, ఆ.

**అంబ.** సం. వి. ఆ. స్త్రీ. 1. అమ్మ; 2. కాశిరాజుకూఁతురు; 3. చేఁతిసొర†; 4. పులిచింత†. (అంబాత్రయము=జ్ఞానాంబ, భ్రమరాంబ, మూకాంబ.)

**అంబకము.** సం. వి. అ. న. 1. కన్ను; 2. బాణము.

**అంబకళము.** దే. వి. 1. ఒకదినుసుజావ; "అంబకళంబులతోడ రసావళులతోడ." కాశీ. ౭, ఆ. 2. అంబలి.

**అంబటిజోరిగాఁడు.** దే. వి. పక్షివిశేషము. "కాకియంబటిజోరిగాఁడు మూఁగ." హంస. 3, ఆ.

**అంబరము.** సం. వి. అ. న. 1. ఆకాశము; 2. వస్త్రము; 3. వ్యసనము; 4. సుగంధద్రవ్యము.

**అంబరీషము.** సం. వి. అ. న. 1. యుద్ధము; 2. వేఁపుడుచట్టి. పుం. 1. అంబాళము†; 2. గుఱ్ఱపుపిల్ల; 3. నరకవిశేషము; 4. పశ్చాత్తాపము.

అంబరీషుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకానొకరాజు; 2. శివుఁడు; 3. సూర్యుఁడు.

అంబరు. వై. వి. సుగంధద్రవ్యము. "గీ. చారుశ్రీగంధ మగరు కేసరి కదంబ, మంబరు పునుంగు జవ్వాది హారిణమదము, ఋక్క యత్తరు గోనగం బూరబోలు, చట్టకలపంబుపన్నీటఁ జాఁదిపూసి." హంస. ౫, ఆ.

అంబలి. దే. వి. 1. పిండియునూకలుచేర్చి అనుకు గావండినది; 2. అంబకళము. "చ. తెలినులి వెచ్చయోగిరముఁ దీయని చేరులుఁ దిమ్మనంబులున్, బలుసనియంబళుల్ చెఱుకుఁబాలెడనీళ్లు రసావళుల్ ఫలం, బులును సుగంధశీతజలముల్ వడపిందెలునీరుచల్లయున్, వెలయఁగఁబెట్టుభోజనము వేసవిఁజందనచర్చమున్నుగన్." ఆము. ౧, ఆ.

అంబష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. 1. అడవిమొల్లచెట్టు; 2. చిఱుబొద్దిచెట్టు; 3. పులిచింతచెట్టు. అ. పుం. ము. ఒకానొక దేశము. 4. బయుసదసరముచెట్టు.

అంబష్ఠుఁడు. సం. వి. అ. పుం. మంగలవాఁడు.

అంబారము. దే. వి. ధాన్యరాశి, అంబారు.

అంబారి. దే. వి. ఏనుఁగుమీఁదిపీఠము, సవుడోలు.

అంబారు. దే. వి. అంబారము.

అంబారుపిడుజో. దే. వి. పశువులమేసనంటికొని రక్తముపీల్చెడి జంతువిశేషము.

అంబాళము. వై. వి. అమ్రాతకముచెట్టు.

అంబిక. సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. ధృతరాష్ట్రునితల్లి; 3. తల్లి; 4. మేనత్త.

అంబు. వై. వి. 1. అమ్ము, బాణము. (మా. బుజె.) 2. మేదరవాని అమ్మునంటి యొక యినుపకోలముట్టు.

అంబుజము. సం. వి. అ. న. తామర. పుం. 1. ఎఱ్ఱగన్నేరుచెట్టు; 2. వానకోయిల.

అంబుదము. సం. వి. అ. పుం. మేఘము, మబ్బు.

అంబుభృత్తు. సం. వి. త్. పుం.——వై.——

అంబువాహిని. సం. వి. ఈ. స్త్రీ. ఎత్తుడునీరుపోయుటకైతొలిచికాలువమొదట నుంచెడు తాటిమ్రానులోనగునది, దోనె.

అంబువు. సం. వి. ఉ. న. ఉదకము, నీరు.

అంబువేతసము. సం. వి. అ. పుం. నీరుప్రబ్బచెట్టు.

అంబూకృతము. సం. విశే. (అ. ఆ. అ.) తుంపరకలది. (మాట.)

అంబే. వై. వి. ఆవులదూడలకూఁత. "అఱ్ఱులెత్తి యంబేయని యఱచుచు." వి. పు. ౭, ఆ. "ఉ. ఆయతరీతిఁదద్ధ్వని రసాయనమైచెవిసోఁకనప్పుడం, బేయనుచున్ బ్రతిస్వనము పెల్లుగఁజూపుచుఁ బాఱితేనువుల్, డాయఁగఁబోయి వేడుకనుడల్కదలించుచువాలమార్చుచున్, బాయకగుప్పు చుంగుడిచె బాలస్తృషంబునిజాంశదుగ్ధముల్." భో. ౬, ఆ.

అంబేద. దే. విశే. (అంబే+పేద.) దిట్టతనములేనివాఁడు, అస్పష్టుఁడు. "ఉ. వేదులుపల్కనన్నుదర వ్రేయఁగఁజూచెద వీఁదు నంతయుం, బేదలు లేరు." పద్మ. 3, ఆ.

అంభ. సం. వి. ఆ. స్త్రీ. ఆవుకూఁత, అంబే. "ఉ. గోవులెల్లనం, భాయనిచీరిహుమ్మనుచుఁ బైపడి మూర్కొనిసంచితిల్లె." భాగ. ౧౦, స్క. ౦. పూ.

అంభస్సు. సం. వి. స్. న. జలము, నీరు.

అంభోజము. సం. వి. అ. న. కమలము, తామర.

అంభోధి. సం. వి. ఇ. పుం. సముద్రము, కడలి.

అంభోరుహము. సం. వి. అ. న. పద్మము, తామర.

అంశకుఁడు. సం. వి. అ. పుం. పాలికాఁపు, దాయ.

అంశము. సం. వి. అ. పుం. 1. పాలు; 2. వంతు.

అంశుకము. సం. వి. అ. న. 1. ఉత్తరీయము; 2. సన్నవస్త్రము; 3. వస్త్రము.

అంశుమంతుఁడు. సం. వి. త్. పుం. 1. సూర్యుఁడు; 2. ఒకానొకరాజు. విశే. ధనవంతుఁడు.

అంశుమతి. సం. వి. ఈ. స్త్రీ. ముయ్యాకుపొన్నచెట్టు.

అంశుమత్ఫల. సం. వి. ఆ. స్త్రీ. కదళి, అరఁటిచెట్టు.

అంశుమాలి. సం. వి. న్. పుం. సూర్యుఁడు, వెలుఁగుఱేఁడు.

అంశువు. సం. వి. ఉ. పుం. 1. కాంతి; 2. కిరణము.

అంసకూటము. సం. వి. అ. పుం. ఎద్దుమూఁపురము, కకుదము.

అంసము. సం. వి. అ. పుం, న. 1. భుజశిరస్సు, మూఁపు; 2. అంశము.

అంసలుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) బలిసినవాఁడు, మాంసలుఁడు.

అంహతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఈవి; 2. తెవులు; 3. విడువు.

అంహస్సు. సం. వి. స్. న. పాపము, దోషము.

**అంట.** దే. అవ్య. 1. వృత్తాంతముచెప్పుటను తెలుపును. "క. తామంట తలంపంగఁ దలలంట." భాగ. ౧౦, స్కం. ఉ.—2. మహత్త్వమును తెలుపును. "క. ఐననురావణుఁడంట రిపుఁ, డానెలకువఁజొచ్చిపొదివితంట కయ్యమునం, జేసెత్తురుగాకుండఁగ, వానింజంపితంట తగదె వర్ణనసేయన్." నిర్వ. ౨, ఆ.

**అక.** వై. వి. 1. అక్క; 2. పూజ్యస్త్రీ*.

**అకట.** దే. అవ్య. అయ్యో. (రూ.) అకటా.

**అకటవికటము.** దే. విశే. తాఱుమాఱు. (రూ. అకటావికటము. "క. అకటా మఱఁ డిపు డుల్లం, బకటావికటముగఁజేసి యడలూన్చెను." రసి. ౩, ఆ.)

**అకము.** సం. వి. అ. న. 1. దుఃఖము; 2. పాపము.

**అకరణి.** సం. వి. ఇ. పుం. శాపము, తిట్టు.

**అకరు.** దే. వి. తామరదుద్దులోనగువానిచుట్టునుండునది, కింజల్కము. "సీ. బ్రహ్మసంవేద్యాదిబహుతీర్థములు తేకు లకరులుచారుది వ్యస్థలములు." భీ. ౩, ఆ. (రూ. అకరువు. "సీ. ఆకాశమండలంబనునల్లగలువకు నకరువాద్యుండులోలార్కమూర్తి." కాశీ. ౧, ఆ.)

**అకర్మకము.** సం. విశే. (అ. ఆ. అ.) కర్మలేనిది. (క్రియ.)

**అకస్మాత్తుగా.** సం. క్రి. విశే. అవ్య. ఉన్నట్టుండి. (వాడుకలోనిది.)

**అకారణము.** సం. క్రి. విశే. అ. న. కారణములేక. విశే. కారణములేనిది.

**అకారతుగా.** క్రి. విశే. కారణములేక.

**అకాలము.** సం. వి. అ. పుం. సరికానికాలము.

**అకించనుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) దరిద్రుఁడు.

**అకుతోభయుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) దేనివలనను వెఱపులేనివాఁడు.

**అకూపారము.** సం. వి. అ. పుం. 1. సముద్రము; 2. ఆదికూర్మము.

**అకృష్టకర్ముఁడు.** సం. విశే. న్. మంచినడవడికగలవాఁడు.

**అక్క.** ఉభ. వై. వి. 1. పెద్దదియగుతోఁడఁబుట్టినది; 2. పూజ్యస్త్రీ*; "క. ఎక్కడికిఁ బాటిపోయెదఁ, జిక్కుపడకయేనువీనిశీఘ్రగతికిన్, యక్క." కళా. ౩, ఆ. — 3. వంటలక్క*. "ఎ, గీ. దర్భపోటులఁదినిలేని తఱులమైత్రి, నంటిపితృశేషముభుజించియదియునెడల, నక్కవాడలఁనరకూళ్లమెక్కిమీఁద, పీనిశేఖరమొకతులార్త్విజ్యము గొని." ఆము. ౬, ఆ.—అవ్య. ఔర*. "అక్కయిదియేమిచోద్యమో." శుక. ౧, ఆ.—సం. ఆ. స్త్రీ. తల్లి. (సంస్కృతమున నీ యర్థము కొన్ని పుస్తకములయందు వ్రాయఁబడియున్నది.)

**అక్కజపడు.** వై. అ. క్రి. (అక్కజము+పడు.) ఆశ్చర్యపడు.

**అక్కజము.** వై. విశే. 1. అధికము*; "గీ. అక్కురుముఖ్యులయస్త్రశస్త్ర, కౌశలంబులుసూడనక్కజములైన, నచ్చెరువునొందిసేనలు పిచ్చలించె." భార. భీష్మ. ౧, ఆ.—2. అశక్యము*; "సీ. ఇవి ఘనబృందంబులివిగజయూథంబు లని విచారింపంగ నక్కజంబు, లై." భార. అర. ౩, ఆ.—3. ఆశ్చర్యము*.

**అక్కజుఁడు.** వై. విశే. అధికుఁడు*. "సీ. చంపెనాగాయుతసత్త్వజరాసంధు నెక్కటియోర్చిన యక్కజుండు." భార. అర. ౧, ఆ.

**అక్కజురాలు.** వై. విశే. (అక్కజె+ఆలు.) అధికురాలు*.

**అక్కట.** దే. అవ్య. అయ్యో, (రూ.) అక్కటా.

**అక్కటిక.** దే. వి. కనికరము. "సీ. ఆదివరాహంబవగుచు రసాతలగతనైన నన్ను నక్కటికతోడ, నుద్ధరించితివి." భాగ. ౪, స్కం. (రూ. అక్కటికము.)

**అక్కడ.** దే. వి. ఏ. (అ+కడ.) 1. ఆచోటు; 2. ఆవల. "వ. ఇక్కడలిగడచి చక్కనుత్తరాభి ముఖుండవైచనంజన హిమవంతంబు, అక్కొండకక్కడ బహుకూటశోభితంబగు హేమకూటంబు, అన్నగంబునకవల ఋషభాచలంబు." రా. యు, కాం. (అక్కడ, ఇక్కడ, ఎక్కడశబ్దములకడపట వృత్తియందు ఇకారమువచ్చుటచేత అవి వేఱు వేఱుశబ్దములుగా వ్రాయఁబడియెను. అక్కడివార్త. మొ.)

**అక్కరము.** వై. వి. అకారాదివర్ణము.

**అక్కఱ.** దే. వి 1. అపేక్ష; "అ, క్కఱదీఱఁబోరినక్కనం గరమువేడ్కంజేర్పనీక." భార. అర. ౭, ఆ. — 2. ఆవశ్యకకార్యము; "వ. నీకునైనయక్కఱదీర్చుటవారికరక్షకృత్యంబు." భార. అర. ౬, ఆ.—3. శ్రద్ధ.

క్కఱకాఁడు. దే. విశే. అక్కఱగలవాఁడు. "అక్కఱకాఁడవైయందందప్రేరేఁచి." క్షేత్రయ.

క్కఱగండఁడు. దే. విశే. శ్రద్ధకలవాఁడు. "ద్వి. అక్కఱగండఁడై యప్పటప్పటికి, వెక్కసంబుగ నూర్లువేలునప్పిచ్చి." హరిశ్చ. ౨, భా.

క్కఱపడు. ద్వ. అ. క్రి. అక్కఱగొను. "నన్నున, క్కఱపడి నీవు వేఁడుటిదికర్జమె." భార. అర. ౭, ఆ.

క్కఱపాటు. ద్వ. వి. అక్కఱపడుట.

క్కఱకర. దే. వి. జ్వరదోషాదులను పోఁగొట్టునట్టి మూలికావిశేషము.

అక్కఱలి. దే. వి. అల, తరంగము. "వ. కడలిమొగయక్కఱలిందగులువడిన జోగునుంబోలె." కాశీ. ౨, ఆ.

అక్కళించు. దే. స. క్రి. సగ్గించు. "అక్కళించిన పొట్ట మక్కళించి." స్వా. ౧, ఆ.

అక్కసము. దే. వి. సంతాపము. "ఉ. అక్షమలాక్షిఁజూచి యలకాధిపనందనుఁ డోపడంతి నీ, వెక్కడనుండివచ్చి తిది యేటికినుస్సురుమంటి నీకునీ, యక్కసమేలవచ్చెను." కళా. 3, ఆ.

అక్కసి. దే. విశే. అక్కసుగలవాఁడు, ఆగ్రహవంతుఁడు.

అక్కసు. దే. వి. ఆగ్రహము, కోపము.

అక్కసుకాఁడు. దే. విశే. అక్కసి, ఆగ్రహవంతుఁడు.

అక్కి. దే. వి. రోగవిశేషము.

అక్కిబిక్కిదండ. దే. వి. బాలక్రీడావిశేషము. "పిల్లమెఱములక్కిబిక్కిదండ." హంస. 3, ఆ.

అక్కిలి. దే. వి. అంకిలి, కలఁత. "మాపుగనన్నియు వచ్చెనేనినే, నక్కిలిదేటితత్కుశల మారయుచుండుదు." మార్క. ౮, ఆ.

అక్కిలిపడు. ద్వ. అ. క్రి. కలఁతపడు. "ద్వి. అక్కిలిపడి తెప్ప లల్ల మోదుచును." భాగ. ౭, స్కం.

అక్కు. దే. వి. ఱొమ్ము, వక్షము.

అక్కుళ్లు. దే. వి. బ. ధాన్యవిశేషము, ఆట్రగడలు.

అక్తము. సం. విశే. (అ. ఆ. అ.) 1. చేరినది; 2. పోయినది; 3. స్పష్టమయినది.

అక్రమము. సం. వి. అ. పుం. క్రమముతప్పు.

అక్షతము. సం. వి. అ. న. పేడి. విశే. నొప్పింపఁబడనిది.

అక్షతలు. సం. వి. అ. పుం. బ. సేసఁబ్రాలు. (దీనిని కొందఱు నపుంసకముగాను ఏకవచనాంతముగాను చెప్పుచున్నారు.)

అక్షదర్శకుఁడు. సం. వి. అ. పుం. దివాణమునందలి న్యాయవిచారణకర్త.

అక్షదేవి. సం. వి. న్. పుం. కితవుఁడు, జూదరి.

అక్షద్యూతికము. సం. వి. అ. న. జూదమునందలి జగడము.

అక్షధూర్తిలము. సం. వి. అ. పుం. వృషభము, ఎద్దు.

అక్షధూర్తుఁడు. సం. వి. అ. పుం. కితవుఁడు, జూదరి.

అక్షమాల. సం. వి. ఆ. స్త్రీ. 1. అరుంధతి; 2. రుద్రాక్షమాల; 3. జపమాల.

అక్షము. సం. వి. అ. న. 1. ఇంద్రియము; 2. సౌవర్చలమనెడియుప్పు; 3. తుత్తము. పుం. 1. తాండ్రకాయ; 2. పాచిక; 3. బండి; 4. బండికన్ను; 5. రుద్రాక్షము; 6 ఇంద్రాక్షము; 7. పదునాఱు మాషములయెత్తు; 8. వ్యవహారము; 9. తెలియఁబడినయర్థము. డు. రావణునికొడుకు.

అక్షయ. సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

అక్షరచణుఁడు. సం. వి. అ. పుం. లిపికారుఁడు, వ్రాఁతకాఁడు.

అక్షరచుంచువు. సం. వి. ఉ. పుం. అక్షరచణుఁడు.

అక్షరము. సం. వి. అ. న. 1. అకారాద్యక్షరము, అక్కరము; 2. బ్రహ్మము; 3. ముక్తి.

అక్షరుఁడు. సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. శివుఁడు. విశే. చెడనివాఁడు.

అక్షవతి. సం. వి. ఈ. స్త్రీ. కైతవము, జూదము.

అక్షవాటము. సం. వి. అ. పుం. జెట్టిసాదనచేయుచోటు.

అక్షాంతి. సం. వి. ఇ. స్త్రీ. ఓర్వలేనితనము, ఈరసము.

అక్షి. సం. వి. ఇ. న. నేత్రము, కన్ను.

అక్షింతలు. వై. గ్రా. వి. బ. అక్షతలు, సేసఁబ్రాలు. "మ. పరదేశంబు విభుండుచన్న పిదపం బ్రాణేశురాకన్నిరం, తరముంగోరుచు మేనమాసిచెవులన్ లక్కాకులుంజేతులన్, సొరదంగాజులు నల్లపూసలు మెడన్ జూపట్టుచుండంగసుం, దరి యక్షింతల బొట్టునుం బసుపు మోదంబందఁ దాల్పందగున్." రుక్మాం. ౪, ఆ.

**అక్షిగతుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పగగొనఁదగినవాఁడు.

**అక్షీబము.** సం. వి. అ. పుం. మునగ చెట్టు.

**అక్షీబము.** సం. వి. అ. న. తనకుఁదాన కలిగెడు సముద్రపు ఉప్పు. పుం. మునగ చెట్టు. విశే. క్రొవ్వనిది.

**అక్షోటము.** సం. వి. అ. పుం. కొండగోగు చెట్టు.

**అక్షోభము.** సం. వి. అ. పుం. 1. ఏనుఁగునుకట్టు కంబము; 2. కలఁతలేమి.

**అక్షౌహిణి.** సం. వి. ఈ. స్త్రీ. (ఇరువదియొక్క వేలు నెనమన్నూటడెబ్బదిరథములు, అన్నియేనుఁగులు, అఱువదయిదువేలు నాఱున్నూటపదిగుఱ్ఱములు, లక్షయుఁదొమ్మిదివేలమున్నూటయేఁబండ్రు కాల్బలమునుగల) సేనావిశేషము.

**అఖండము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. సమస్తము; 2. ఖండముకానిది.

**అఖండుకము.** సం. వి. అ. పుం. పొట్టిటెంకాయ చెట్టు, చెన్నంగి.

**అఖాతము.** సం. వి. అ. పుం. మనుష్యులచేత త్రవ్వఁబడని కోనేలు మొదలగు నీటిటెంకి.

**అఖిలము.** సం. విశే. (అ. ఆ. అ.) అశేషము, అంతయు.

**అగండ్రపాకు.** దే. వి. ఒకానొకచెట్టు.

**అగచరము.** సం. వి. అ. పుం. వానరము, కోఁతి.

**అగచాట్లపోతు.** దే. విశే. ఆపదలఁపొందుటయే స్వభావముగాఁగలవాఁడు.

**అగచాట్లమారి.** దే. విశే. అగచాట్లపోతు.

**అగచాట్లు.** దే. వి. బ. (అగ్గము+చాటులు.) ఇడుమ, ఆపద.

**అగజాత.** సం. వి. ఆ. స్త్రీ. పార్వతి, గట్రాచూలి.

**అగడిత.** వై. వి. కోటచుట్టు త్రవ్వఁబడిన జలాధారము, పరిఖ.

**అగడు.** దే. వి. దూఱు, నింద. విశే. నింద్యము. "ఎ, గీ. మగువకావుననిపుడునన్నగడుచేసె." పంచ. నా. ౪, ఆ.

**అగడుపడు.** ద్వ. అ. క్రి. 1. దూఱుపడు; 2. తొట్రుపడు. "క. బెగడువలదనుచు బెట్టిద, మగునెవ్వగి నగడుపడును నాఁడుపడుచులే, పగవాంకివలదన నా, పగవారికి నేలయొసఁగెఁ బద్ధుఁజూడనుచున్." వసు. ౬, ఆ.

**అగడ్త.** వై. వి. (చూ.) అగడిత.

**అగత్యము.** వై. క్రి. విశే. అవశ్యము. (వాడుకలోనిది.)

**అగదంకారుఁడు.** సం. వి. అ. పుం. వైద్యుఁడు, వెజ్జు.

**అగదము.** సం. వి. అ. పుం. ఔషధము, మందు.

**అగప.** దే. వి. కొయ్యను టెంకాయచిప్పనుగ్రుచ్చి గరిటెవలెచేసినది, అబక.

**అగపడు.** ద్వ. అ. క్రి. (అగ్గము+పడు.) 1. కనఁబడు, గోచరమగు; "సీ. బంధులకగపడ్డఁబాయునన్వయమును కలఁకమైఁ జెమటలు గ్రమ్ము దేహ." భార. విరా. ౨, ఆ.—2. అధీనమగు. "క. ముంగికిగూబకునగపడి, యంగంబులువడఁకుచున్న యవి." భార. శాం. 3, ఆ.

**అగపాటు.** ద్వ. వి. అగపడుట.

**అగమము.** సం. వి. అ. పుం. 1. కొండ; 2. చెట్టు.

**అగము.** సం. వి. అ. పుం. 1. కొండ; 2. చెట్టు; 3. పాము.

**అగరువు.** సం. వి. ఉ. న. చందనవిశేషము, అగలు.

**అగలు.** యు. దే. అ. క్రి. 1. భేదిల్లు; 2. పెల్లగిల్లు. (చూ. అగలుచు.) వై. వి. అగరువు.

**అగలుచు.** దే. ప్రే. 1. భేదించు; 2. పెల్లగించు. (రూ. అగల్చు). (1.) "గర్వమెలర్పఁబేరురముగల్చిన." జై. ౬, ఆ.—(2.) "అం, గదగొనిమెదరులగల్చికొనుచు." భార. స్త్రీ. ౨, ఆ.)

**అగలుసత్తు.** వై. వి. గంధద్రవ్యవిశేషము.

**అగలుసాంటి.** వై. వి. పాకళి.

**అగవాళ్లు.** దే. వి. బ. (అగ్గము+వాఱులు.) తేలికయైన ఓరట్టచెప్పులు.

**అగవు.** దే. వి. కార్యము, పని. "తే. అల్లుఁడనియూఁడుబిడ్డని యగవుతగవు, లంపకము శుభ శోభనమని." దశా. ౯, ఆ.

**అగసాలె.** ద్వ. వి. (అగ్గము+సాలె.) అగసాలెవాఁడు, స్వర్ణకారుఁడు. "గీ. బొమ్మయనుపేరి యగసాలె పూఁటచెలిని, గోరయలరించుటకుఁజడల్లుదుటఁగాఁచి, నీటముంచినమేటిపన్నియుపసిండి, పూదియనఁగ్రుంకఁగడలిలోఁ బ్రొద్దువ్రాలె." నీలా. ౩, ఆ. (వీఁడు గ్రామములయందు కాఁపులకు స్వాధీనుఁడు.)

**అగస్తి.** సం. వి. ఇ. పుం. 1. అగిసెచెట్టు; 2. అగస్త్యుఁడు.

**అగస్త్యము.** సం. వి. అ. పుం. అగిసెచెట్టు.

**అగస్త్యుఁడు.** సం. వి. అ. పుం. ఒకానొకముని.

**అగాడీ.** హిం. క్రి. విశే. ముందర. వి. గుఱ్ఱము ముందు కాళ్లకు కట్టు త్రాడు.

**అగాదు.** దే. వి. తుపాకిపిరంగిలోనగువానియందు నిప్పుఁదగిలించుట. "చ. తఱియనులోహకారకుఁడునగ్రతఁబశ్చిమశైలశృంగముం, గుఱిగొని వేలుపుందెరువు గొప్పపిరంగిని జాయమందుతోఁ, గొలలెడువిన్నునానికపు గుండు ఘటించి యగాదుచేసినన్, దలచుగఁగ్రుమ్ము క్రొంబొగలసంగజగంబునఁబర్వెఁజీఁకటుల్." రసి. ౪, ఆ.

**అగాధము.** సం. వి. అ. పుం. బొక్క. విశే. మిక్కిలి లోఁతుగలది.

**అగారము.** సం. వి. అ. న. గృహము, ఇల్లు.

**అగావు.** దే. వి. కుదప, అధి.

**అగిని.** వై. వి. అగ్ని. "ద్వి. దిగనిల్లభానువార్ధిపులు నశ్వినులు, నగినియింద్రుఁడుపేంద్రుఁ డమిత్రవిధులు." భాగ. ౨. స్కం.

**అగిసియ.** వై. వి. అగిసె, అగస్తి*.

**అగిసె.** వై. వి. అగిసియ.

**అగు.** దే. అ. క్రి. అవు. స. క్రి. కలుగు. "క. అఱుపుడుఁగావిముసుంగిడి, విఱిగినదండంబుఁదునిసి వ్రేలెడుగోచిన్, బఱియలయినకరకమునయి, చుఱచుఱఁజూడకు తెఱంగు మాపులతోడన్." ఉ. హరి. ౪, ఆ.—ప్ర. అంగీకారమును తెలుపును, అవును. "అగునదియట్టిద." భార. విరా. ౧, ఆ.

**అగుఁగదే.** దే. అవ్య. (అగును+కదే.) ఆశ్చర్యమును తెలుపును, (చూ.) ఔఁగదే.

**అగుఁగాక.** దే. అవ్య. (అగును+కాక.) అంగీకారమును తెలుపును.

**అగుఁబొమ్ము.** దే. అవ్య. (అగును+పొమ్ము.) సరే. "క. అనిచెప్పిన వినియగుఁబొ, మ్మనికైకొని." భార. విరా. ౧, ఆ.

**అగుదెంచు.** దే. అ. క్రి. (అగు+తెంచు.) అగు. "అంతసరోరుహాక్షుఁడుద, యంబగుదెంచె." నిర్వ. ౬, ఆ.

**అగుర.** దే. అవ్య. (అగును+ర.) అవుర. (ఆమ్రేడితమందు అగురగుర. "క. అగురగుర ముఖరముఖుఁడై. జగము వినం దనబలంబు చాటె సముద్రుం, డొగి బిరుదు దక్కఁడయ్యెన్, సగరకుమారులుగదా ప్రశంసార్హతముల్." రామా. ౭, ఆ.) (రూ. అగురా.)

**అగురు.** దే. వి. అవురుగడ్డి, వీరణము.

**అగురువు.** సం. వి. ఉ. న. ఇరుగుడు*. పుం, న. అగలు. విశే. చిన్నది.

**అగులు.** దే. అ. క్రి. ఊడు. "వ. శిరంబులనొగిలించియు సీసకంబులనగిలించియు" భాగ. ౬, స్కం.

**అగౌకసము.** సం. వి. స. పుం. 1. పక్షి; 2. సింహము; 3. శరభము.

**అగ్గపడు.** ద్వ. అ. క్రి. (అగ్గము+పడు.) అగపడు.

**అగ్గపాటు.** ద్వ. వి. అగ్గపడుట.

**అగ్గము.** దే. విశే. 1. అధీనము; 2. కనఁబడినది. దృష్టము. "సీ. ఇదిదుశ్చరిత్రనానెవ్వతచరియించు నట్టిబ్రాహ్మణిమీకునగ్గమైన." భో. ౩, ఆ.

**అగ్గలము.** దే. విశే. వెగ్గలము, అధికము. "క. విలువిద్య నొరులునీక, గ్గలముగ లేకుండ నిన్నుఁగఱపుదు." భార. ఆది. ౫, ఆ.

**అగ్గలించు.** దే. అ. క్రి. 1. అతిశయించు; 2. పూను, ఉత్సహించు. "ఉ. అ, క్షీణబలంబునం గవియు సేనకు మార్కొననగ్గలించితే." భార. విరా. ౫, ఆ.

**అగ్గలిక.** దే. వి. 1. ఆధిక్యము; "అచ్చెరువైనవిక్రమమునగ్గలికన్." భార. విరా. ౪, ఆ.—2. పూనిక, ఉత్సాహము; "గీ. అనినవట్లకాక యనిసర్వసేనాధ, పత్యభారపట్టబంధమునకు, నియ్యకొనియె భీష్ముఁడయ్యగ్గలికఁగొని, యాతఁడెవిభుండు ప్రముదితాత్ముఁడగుచు." భార. ఉద్యో. ౪, ఆ.—3. శౌర్యము. (చూ. ఇలువడి.) (రూ. అగ్గలికము. "పేర్చినయగ్గలికంబున." భార. కర్ణ. ౨, ఆ.)

**అగ్గి.** వై. వి. నిప్పు, అగ్ని. "క. అగ్గలికజముఁడు పరికొను, నగ్గితెఱంగమర." భార. భీష్మ. ౨, ఆ.

**అగ్గించు.** వై. స. క్రి. పొగడు, స్తుతించు*.

**అగ్గికంటి.** ద్వ. వి. ముక్కంటి, శివుఁడు.

**అగ్గిచూలి.** ద్వ. వి. కుమారస్వామి, కందుఁడు.

**అగ్గువ.** వై. వి. వెలతక్కువ, చవుక*.

**అగ్ని.** సం. వి. ఇ. పుం. 1. నిప్పు; 2. చిత్రమూలము. (త్రేతాగ్నులు=ఆహవనీయము, దక్షిణాగ్ని, గార్హపత్యము. ఇవి క్రమముగా వేదికిఁ బూర్వదక్షిణపశ్చిమదిక్కులయందుండును. పంచాగ్నులు = పైమూడు, సభ్యము, అవసథ్యము. సభ్యావసథ్యములు ఈశాన్యదిక్కునందుండును. సామాన్యాగ్ని భేదములు=అనలము, కుకూలము,

ఘగలము, వత్సలము. అనలము మొదలగువాని కర్థములను ఆయాపదములకడఁజూచి తెలిసికొన వలెను. అగ్నిచటాత్కారము సంస్కారము.)

**అగ్నికణము.** సం. వి. అ. పుం. విస్ఫులింగము, మిడుఁగుఱులు.

**అగ్నిచిత్తు.** సం. వి. త్. పుం. అగ్నిచయనముచేసిన వాఁడు.

**అగ్నిజ్వాల.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఆరెకి; 2. నిప్పుమంట.

**అగ్నిభువు.** సం. వి. ఊ. పుం. కుమారస్వామి, అగ్గిమాలి.

**అగ్నిమంథము.** సం. వి. అ. పుం. శ్రీపర్ణము, నెల్లికి.

**అగ్నిముఖము.** సం. వి. అ. పుం. న. జీడికి.

**అగ్నిముఖుఁడు.** సం. వి. అ. పుం. 1. బ్రాహ్మణుఁడు; 2. వేలుపు.

**అగ్నిశిఖ.** సం. వి. ఆ. స్త్రీ. 1. తరిగొజ్జికి; 2. వెన్నవెదురుకూర; 3. నిప్పుమంట. అ. న. ము. 1. కుంకుమపువ్వు; 2. కుసుమపువ్వు.

**అగ్నిష్టోమము.** సం. వి. అ. పుం. వసంతకాలమందు ఐదుదినములలో చేసిముగించెడి యాగవిశేషము.

**అగ్నిహోత్రము.** సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. ఆహితాగ్నులు ప్రాతస్సాయంకాలముల యందుఁ జేసెడిహోమము; 3. హవిస్సు.

**అగ్రజన్ముఁడు.** సం. వి. న్. పుం. 1. బ్రాహ్మణుఁడు; 2. అన్న; 3. బ్రహ్మ.

**అగ్రజుఁడు** సం. వి. అ. పుం. అగ్రజన్ముఁడు, అన్న.

**అగ్రణి.** సం. విశే. ఈ. ముఖ్యము, గామిడి.

**అగ్రతస్సరుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ముందు నడచువాఁడు; 2. మొదటివాఁడు.

**అగ్రబీజము.** సం. వి. అ. పుం. ముంతమామిడికి.

**అగ్రము.** సం. వి. అ. న. 1. చివర; 2. ఎదురు; 3. సమీపము; 4. సమూహము; 5. నాలుగు కళ్లకొలఁదిగలభిక్ష. విశే. 1. మొదటిది; 2. ముఖ్యము; 3. మిక్కుటము.

**అగ్రసరుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ముందు నడచువాఁడు; 2. మొదటివాఁడు.

**అగ్రహారము.** సం. వి. అ. పుం. బ్రాహ్మణులయిండ్ల వరుస, నల్లిండ్లు.

**అగ్రిముఁడు.** సం. విశే. (అ.ఆ.అ.) మొదటివాఁడు.

**అగ్రియము.** సం. విశే. (అ. ఆ. అ.) ముఖ్యము, గామిడి.

**అగ్రీయము.** సం. విశే. (అ. ఆ. అ.) అగ్రియము.

**అగ్రేదిధిషువు.** సం. వి. ఉ. పుం. మాఱుమనువుదాని మొదటిమగఁడు.

**అగ్రేసరుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ముందు నడచువాఁడు; 2. మొదటివాఁడు.

**అగ్ర్యము.** సం. విశే (అ. ఆ. అ.) అగ్రియము.

**అఘమర్షణము.** సం. వి. అ. న. సర్వపాపములను పోఁగొట్టెడుమంత్రము.

**అఘము.** సం. వి. అ. న. 1. పాపము; 2. వ్యసనము; 3. దుఃఖము.

**అఘోరము.** సం. విశే. (అ. ఆ. అ.) అంతకంటె ఘోరములేనిది.

**అఘ్న్య.** సం. వి. ఆ. స్త్రీ. సౌరభేయి, ఆవు.

**అచల.** సం. వి. ఆ. స్త్రీ. నేల. అ. పుం. ము. 1. కొండ; 2. మేకు. విశే. కదలనిది.

**అచిరద్యుతి.** సం. వి. ఇ. స్త్రీ. విద్యుత్తు, మెఱపు.

**అచేతనము.** సం. వి. అ. పుం. అప్రాణి.

**అచ్చారము.** అర. వి. సంచకరువు.

**అచ్చి.** దే. వి. దేశవిశేషము. (అచ్చిమట్టము.)

**అచ్చిక.** దే. వి. కొఱఁత. "ఉ. అక్కటనీకొకందులకు నచ్చిక లేక నెలంగవిష్ణుదా, సెక్కడిభర్తగాఁగ సృజియించెనజుండు." హంస. ౧. ఆ. (రూ. అచ్చికము. "చ. అదె ఘృతతండులప్రకరమ్ముల వెచీరలు భూషణాదిసం, పదలవెరాజురాకకులు పాయొనఁగూర్చిన యట్లుమీయెడుఁ, ముదితలకేమియచ్చికము." కళా. ౬. ఆ.)

**అచ్చికబుచ్చిక.** దే. వి. కలుపుకోలుతనము, అభేదము. "ఉ. అక్కఱఁజూడవేటి కల యచ్చికబుచ్చికసేయునంచలన్." విజ. 3. ఆ.

**అచ్చివచ్చు.** దే. అ. క్రి. అయివచ్చు. (నాకాయిల్లు అచ్చివచ్చినది.)

**అచ్చు.** సం. వి. ప్రాణాక్షరములు. (అకారాదులు.)

**అచ్చెరుపడు.** వై. అ. క్రి. (అచ్చెరువు+పడు.) ఆశ్చర్యపడు.

**అచ్చెరుపాటు.** వై. వి. అచ్చెరుపడుట.

**అచ్చెరువు.** వై. వి. వెఱఁగు, ఆశ్చర్యము.

**అచ్చెరువుపడు.** వై. అ. క్రి. ఆశ్చర్యపడు.

**అచ్చెరువుపాటు.** వై. వి. అచ్చెరువుపడుట.

**అచ్యుతుఁడు.** సం. వి.అ.పుం. విష్ణువు. విశే. స్థిరుఁడు.

**అచేటు.** దే. వి. ఏ. అచోటుయొక్క రూపాంతరము.

అచోటు. దే. వి. ఏ. (ఆ+చోటు.) ఆ స్థానము.

అచ్చ. (చూ. అచ్ఛము.)

అచ్చగుండ్లపేరు. దే. వి. 1. ముత్యాలహారము; 2. స్ఫటికమాల.

అచ్చటు. దే. వి. ఏ. అచ్చోటుయొక్క రూపాంతరము.

అచ్చనగండ్లు. దే. వి. బ. 1. బాలికాక్రీడావిశేషము; "మ. దినముల్ కొన్ని చనంగనంతఁగడు నర్థింబొమ్మపెండ్లిండ్లుగు, జైనగూళ్లచ్చనగండ్లుపింపిళులుకుచ్చెళ్ గీరనంగింజలో, మనగుంటల్ కనుమూసిగంతనలు కంబాలాట లోనైనఖే, లనముల్ మీఱఁగ బోట్లతోనలర బాలారత్న మెల్లప్పుడున్." కళా. ౬, ఆ.—2. అచ్చనగండ్లాడెడు చిన్న చిన్న గుండుతాళ్లు, గిరీయకములు. "ఎ, గీ. కొండలచ్చనగండ్లయినిండు చెలువు, లెల్లనద్దంపు బిల్లలై యేర్లుముత్తి, యంపు సరులైయరణ్యంపు గుంపులెల్ల, నారులైతోఁచుఁ బోడవున నారులార." నసు. ౪, ఆ.

అచ్చనగాయలు. దే. వి బ. (అచ్చన+కాయలు.) బాలికాక్రీడావిశేషము, అచ్చనగండ్లు. "సీ. కరకంకణధ్వనుల్ గలుగల్లుమని యింపు గావింప నచ్చనగాయలాడు." రుక్మి. ౧, ఆ.

అచ్చనగుండ్లు. దే. వి. బ. 1. అచ్చనలాడుగుండ్లు, గిరీయకములు; "సీ. ముదురు వెన్నెలగాయు ముత్యాలదిన్నెపైఁబైఁడి యచ్చనగుండ్లు పాఱవైచి." య. 3, ఆ.—2. అచ్చనగుండ్లాట.

అచ్చనలు. దే. వి. బ. బాలికాక్రీడావిశేషము. "క. దీర్ఘతరంబై, హెచ్చినశోకముమదిలో, నచ్చనలాడంగ." జై. ౧ ఆ.

అచ్ఛము. వై. విణ. 1. స్వచ్ఛము; "సీ. ఒండువిధంబులఁ, బడయంగరానియొక్కడుపదంబు, లచ్ఛమైనతపంబునవచ్చుఁబడయ." భార. అశ్వ. ౭, ఆ.—2. కేవలము*; "సీ. అచ్చ తెల్పునఁగడునభిరామమగునొక్క యశ్వంబుఁగాంచితి మవ్వధూటి, కేవలధవళంబునావిని యొద్దారమునకు నేనది నల్లఁదనముఁగంటి, వెనుక దెసనన్న వాదయ్యె." భార. అను. ౧, ఆ.—3. తెల్లనిది*; "ఈయచ్చ గురిజపేరందుఁగలిగె." య. ౧, ఆ.—4. దట్టము*. "సీ. అచ్చ వెన్నెలచాయ నవఘళింపఁగఁజాలుని ద్దంపు వెలిపట్టు నెఱికగట్టి." నై. ౬, ఆ. (వృత్తియందు అంత్యవర్ణలోపము వైకల్పికముగనగు.)

అచ్చెర. వై. వి. అప్సరస్త్రీ.

అచ్చెలము. దే. వి. 1. ఆగ్రహము; "వ. డెందంబునం గ్రందుకొనునచ్చలంబును మచ్చరంబునుం బెచ్చు పెరుగ." జై. ౫, ఆ.—2. పూనిక, ఉత్సాహము. "క. అందఱునన్ని ముఖంబుల, నందంద గిరిద్రుమాదులచ్చలమునసీ, నందుకొనునలునియరుదుం, జందముగనినుతియు వృత్తచరులు గడంకన్." రా. యు, కాం.

అచ్చెలించు. దే. అ. క్రి. ఆగ్రహించు.

అచ్చాళు. దే. విణ. (అచ్ఛము+ఆళు.) జంజాటము లేనివాఁడు. "ద్వి. చారుశీలా ముఖ్యజలజలోచనలఁ, జేరికొబంధులఁజెలులనీక్షణమె, పగఱకుఁ జొరరాక బహుదుర్గమార్గ, మగుకోహళ మహర్షియాశ్రమస్థలిని, జేరిచి మనము నిశ్చింతనేతెంచి, యారూఢ బలయుక్తినచ్చాళుగాఁగ, వనికిసన్నద్ధులమై యుందమవల." పతివ్రతామాహాత్మ్యము. (ఆళు అన్యదేశ్యము.)

అచ్చు. యు. దే. అ. క్రి. అప్పుపడు. "ద్వి. అచ్చినారొదుర బ్రహ్మకుఁబోవరాదు." హరిశ్చ. ౭, ఆ.—స. క్రి. 1. ఇచ్చు; "గీ. కలనఁబడినవారిఁ గయికొనిపోట్లపుం, డ్లోమిమగుడఁబుచ్చు టొప్పుఁబంత, మడుగమగుడబవరమచ్చుటయొప్పుఁ గా, కించుకేనిదానయేలుటొప్పు." ఉ, హ. ౫, ఆ.—2. దండుగిచ్చు. "క. ప్రీతిఁగులశ్రేష్ఠునిపై, నాతతముగలేని బ్రహ్మహత్యాదిమహా, పాతకము వెట్టితిట్టిన, నాతండేనూటనాలుగచ్చుఁబణంబుల్." విజ్ఞా. ప్రా, కాం.—వై. వి. 1. ముద్ర*; 2. విధము*; "ఉ. మీ, మెచ్చునకెంతవాఁడనను మీపదభక్తులలోనఁగూర్చియీ, యచ్చున నానతిచ్చు భవదాదరణంబిదికోటిసేయదే." భో. ౮, ఆ.—3. సాలెవానిసాధనవిశేషము*. విణ 1. శుద్ధము. "క. ముచ్చునుబట్టినమాత్రన, చెచ్చెరదండింపకతనిచేఁదెలిగొనివాఁ, డచ్చైనవిడుపు నిక్కపు, ముచ్చైనందగినదండమును గొనవలయున్." విజ్ఞా. ప్రా, కాం. "వ. వీరలకందఱకుం దేటతెల్లంబుగా భాగవతులయచ్చుందనంబేర్పరించి పిమ్మట నెట్లుగావలయునట్లు చేసెద." పర. 3, ఆ.

అచ్చుఁగూటము. ద్వ. వి. (అచ్చు+కూటము.) ముద్రాక్షరశాల.

**అచ్చేకట్టు.** ద్వ. స. క్రి. 1. ఏర్పఱచు; "గీ. అబ్ధులనగిరులన దీవులనఁగ నేలు, లఁగ నడవులనఁగ నూరులనఁగ వరుస, నచ్చుకట్టి." లక్ష్మీ. ౫, ఆ. —2. మడిమడిగాఁగనిమతీయు. "తే. అది మఱియు మెత్తగాదున్ని యచ్చుకట్టి." వై. ౧, ఆ.

**అచ్చేకుప్ప.** దే. విణ. ధనవంతుఁడు. "సీ. ఆఢ్యుఁడు విలసిల్లునాస్తికాఁడు, నాఁగఁగలవాఁడనంగను నచ్చుకుప్ప, యనఁగవిడిముడికలవాఁడటన్న." ఆం, భా. తృ. వి.

**అచ్చేకొను.** దే. స. క్రి. తానియ్యవలవని ధనాదికమును ఒప్పుకొనియిచ్చు.

**అచ్చెద్దు.** ద్వ. వి. (అచ్చే+ఎద్దు.) అచ్చుపోసి స్వేచ్ఛగాఁ దిరుగవిడిచిన వృషభము, ఆఁబోతు.

**అచ్చేదల.** దే. వి. 1. అప్పు; 2. అచ్చివచ్చుట.

**అచ్చేపడు.** వై. అ. క్రి. ఏర్పడు. "క. నెచ్చెలులు దన్నుఁగొలువఁగఁ, బచ్చవిలుతుకలిమియెల్లఁబట్టానదయై, యచ్చుపడినట్లు మెఱయుచు, నచ్చటికేతెంచె భూవరాత్మజనెమ్మిన్." భార. అర. ౭, ఆ.

**అచ్చేపాటు.** వై. వి. అచ్చుపడుట, ఏర్పాటు.

**అచ్చోటు.** దే. వి. ఏ. (ఆ+చోటు.) 1. ఆ స్థానము; 2. ఆఁడుగుఱి. "క. చేడియలమ్ముదురచ్చోటు." హరి. ఉ. ౯, ఆ. (రూ. అచ్చోటు.)

**అచ్చొత్తు.** ద్వ. స. క్రి. (అచ్చు+ఒత్తు.) అచ్చువేయు, ముద్రించు.

**అచ్ఛభల్లము.** సం. వి. అ. పుం. ఎలుఁగుగొడ్డు.

**అచ్ఛము.** సం. వి. అ. పుం. 1. ఎలుఁగుగొడ్డు; 2. పటికపుఱాయి. విణ. స్వచ్ఛము.

**అజ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రకృతి; 2. ఆఁడుమేఁక. అ. పుం. ము. మేఁకపోతు.

**అజగంధిక.** సం. వి. ఆ. స్త్రీ. వాయింట**?**.

**అజగరము.** సం. వి. అ. పుం పెనుఁబాము.

**అజగర్దము.** సం. వి. అ. పుం. నీరుపాము.

**అజగవము.** సం. వి. అ. న. శివునివిల్లు.

**అజన్యము.** సం. వి. అ. న. తోఁకచుక్కలోనగు ఉత్పాతము. విణ. జన్యముకానిది.

**అజప.** సం. వి. ఆ. స్త్రీ. 1. సగము మగపోలిక సగము ఆఁడుపోలికయుఁగల ఆకృతి; 2. మంత్రవిశేషము.

**అజపుఁడు.** సం. వి. అ. పుం. వైదికములుకానిగ్రంథములను చదువువాఁడు.

**అజభక్షము.** సం. వి. అ. పుం. బొబ్బలి**?**.

**అజమోద.** సం. వి. ఆ. స్త్రీ. ఒకదినుసు ఓమము.

**అజశృంగి.** సం. వి. ఈ. స్త్రీ. ఝొట్టువు**?**.

**అజస్రము.** సం. క్రి. విణ. అ. న. అనవరతము, ఎల్లప్పుడు.

**అజహ.** సం. వి. ఆ. స్త్రీ. దూలగొండి**?**.

**అజాగ్రత్త.** సం. వి. ఆ. స్త్రీ. జాగ్రత్తలేమి.

**అజాజి.** సం. వి. ఈ. స్త్రీ. జిలకఱ్ఱ.

**అజాజీవుఁడు.** సం. వి. అ. పుం. మేఁకలమేపువాఁడు.

**అజాతశత్రువు.** సం. వి. ఉ. పుం. ధర్మరాజు. విణ. శత్రువులులేనివాఁడు.

**అజితుఁడు.** సం. వి. అ. పుం. 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు. విణ. గెలుపఁబడనివాఁడు.

**అజినపత్ర.** సం. వి. ఆ. స్త్రీ. జతుక, జివుకపిట్ట.

**అజినము.** సం. వి. అ. న. చర్మము, తోలు.

**అజిరము.** సం. వి. అ. న. 1. ముంగిలి; 2. కప్ప; 3. గాలి; 4. శరీరము; 5. శబ్దాదివిషయము.

**అజిహ్మగము.** సం. వి. అ. పుం. బాణము, అమ్ము.

**అజిహ్మము.** సం. వి. అ. పుం. కప్ప. విణ. సరియైనది.

**అజిహ్వము.** సం. వి. అ. పుం. కప్ప. విణ. నాలుకలేనిది.

**అజీగవము.** సం. వి. అ. న. అజగవము, (రూ.) అజీగావము.

**అజుఁడు.** సం. వి. అ. పుం. 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు; 4. మన్మథుఁడు; 5. ఒకానొకరాజు.

**అజ్ఝట.** సం. వి. ఆ. స్త్రీ. నేలయుసిరిక**?**.

**అజ్ఞత.** సం. వి. ఆ. స్త్రీ. అజ్ఞత్వము, తెలివిలేనితనము.

**అజ్ఞానము.** సం. వి. అ. న. తెలివిలేమి.

**అజ్ఞుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. జడుఁడు; 2. మూర్ఖుఁడు.

**అజ్మాయిషీ.** హిం. వి. శోధన, పరీక్ష.

**అజారము.** దే. వి. 1. మొగసాల; 2. ఆస్థానమండపము. "లయగ్రాహి. నృప, పుంగవుఁ డజారమున కుం గదలివచ్చెన్." రా, వి. ౨, ఆ.

**అజ్జె.** యు. దే. వి. 1. అడుగు, పాదము; 2. సమయము. "గీ. అజ్జపాటించి మదివెఱ పుజ్జగించి." భార. శల్య. ౧, ఆ.—వై. అవ్య. బళి. "ద్వి. అజ్జగాఁదిలకంబుహావణించినదుట." (అజ్జగా — అజ్జెయను శబ్దముపుట్టఁగా బళీయనఁగాననుట) భద్రరాజపుత్రచరిత్రము. (రూ. అజ్జో.)

**అజ్జేము.** వై. వి. కొన్ని పనసలుగల వేదభాగము, అనువాకము. "ఉ. ఈ, యజ్జేములోననాపన సయన్న వసిష్ఠులు మీరు శ్రోత్రమం,దు." పాం చా. ౪, ఆ.

**అజ్జేరె.** ద్వ. అవ్య. (అజ్జె+రె.) బళిరె. "ఉ. అజ్జరె యంచుఁబంచుకొనిరందఱు వ్రేల్చుచు ద్రవ్యదక్షిణల్." పాంచా. ౪, ఆ. (రూ. అజ్జరే.)

**అజ్జవాలు.** ద్వ. వి. కోడి, చరణాయుధము. "ఉ. ఇంకనీ, యాటలుడించివేజరగుమంచును వెన్నెల కేనికేర్పడం, జాతెనవంగఁగూఁతలిడెఁజాగెఁదు టూరపుటజ్జవాల్గముల్." అచ్చ. అ, కాం.

**అజ్జొరె.** ద్వ. అవ్య. (అజ్జో+రె.) అజ్జెరె. (రూ. అజ్జొరే. "శా. ఆహోవిలాసంబుల, జ్జారేజవ్వనమద్ది రావగలు మజ్జారేతనూవిభ్రమం,బు." శశాం. ౨, ఆ.)

**అట.** దే. వి. ఏ. అక్కడ. "క. అంతనట నక్కుమారుం, డెంతయుఁగరుణమ్ముదోఁప నేడ్చుచునుండెన్." నిర్వ. ౨, ఆ. (అట ఇట శబ్దములకు వృత్తియందు అంత ఇంత అనునర్థము కలుగుచున్నది. అటమున్ను అంతకుముందు. ఇటమున్ను ఇంతకుముందు.) — ద్ర. అవుల. "హిమాచలమును నావల హేమకూ, టంబును నట నిషధంబు సెప్ప." భార. భీష్మ. ౧, ఆ.

**అటకలి.** దే. వి. నూనెజిడ్డునుపోఁగొట్టెడివస్తువు, ఉత్సాదనము.

**అటకాయించు.** హిం. క్రి. నిరోధించు, అడ్డగించు.

**అటకావు.** హిం. వి. అటంకము.

**అటతాళము.** సం. వి. అ. పుం. తాళభేదము. (౧౪ అక్షరకాలము.)

**అటని.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. వింటికొప్పు.

**అటమట.** దే. వి. 1. వంచన; (చూ. అటమటించు.) 2. దుఃఖము. "చ. కటకట రాజ చంద్రయిటు కర్జమెనిర్జర కన్యకామణిం, దటుకునఘోరమారనిశితప్రదరంబులపాలుచేసియు, చ్చటికిటుచేరినీవును విశంకటతాపభరాలసుండవై, యటమటఁజెందదేల." రసి. ౫, ఆ.—విణ. 1. అసత్యము; 2. వ్యర్థము. (రూ. అటమటము. అసత్యమునకు—"క. ఇటుచూచినఁజెలిపైఁద, ప్పటు చూచినసుతుని నేరమవుఁగాదనఁగా, నెటువలె నిచ్చునొమీఁదట, నటమటమోలేక నిజమొ యదియొఱుఁగముగా." సా. ౨, ఆ. — వ్యర్థమునకు — "క. ఇటువలె వెదకియుఁదమత్రి, ప్పటగురువిరహితులమంత్ర పఠనంబెటుల, ట్లటమట మైపోఁజూచిన." రామా. ౬, ఆ.)

**అటమటకాఁడు.** దే. విణ. అటమటీఁడు, వంచకుఁడు.

**అటమటించు.** దే. అ. క్రి. చలించు. "వ. మెఱుఁగుతుమ్మెదవన్నె పెన్నెఱుల నటమటించు నెన్నడుములవిన్నువెన్నుదన్ని." స్వా. ౫, ఆ.—స. క్రి. 1. వంచించు; "గీ. యతివనుచువేషభావల నటమటించి, పాంచితతివేచికన్నియఁ గొంచు నరిగె." విజ. 3, ఆ.—2. అపహరించు. "క. తమ్ముఁడవనిని స్నేగతి, నమ్మంగావచ్చునిట్లునా కొసఁగకర,త్నమ్మటమటించుకొంటివి, పొమ్మిక నీతోడిపొత్తుపొరపొచ్చెముగున్." వి, పు. ౬, ఆ.

**అటమటీఁడు.** దే. విణ. (అటమట+ఈఁడు.) మోసకాఁడు. (చూ. వాల్తీఁడు.)

**అటరూషము.** సం. వి. అ. పుం. అడ్డసరము.

**అటవి.** సం. వి. ఈ. స్త్రీ. అరణ్యము, అడవి.

**అటాట్య.** సం. వి. ఆ. స్త్రీ. భిక్షులోనగువాని కొఱకు తిరుగుట, పర్యటనము.

**అటి.** దే. విణ. అట్టి. "రగడ. ఏకాంతమనితోలఁగ దిందునీనటివేరు, చేకొనవెమున్నాడి చెలువ యీవటివేరు." స్వా. 3, ఆ. (ప్రయోగమిదియొక్కటియకానంబడియెడిఁగావున నింకను విచారింపఁదగినది.)

**అటిక.** దే. వి. ఒకదినుసుమంటిపాత్రము, అట్టిక.

**అటికమామిడి.** దే. వి. మండలచ్ఛదము.

**అటు.** దే. అవ్య. ఆప్రకారము. "క. ఊరకయటు మిముబోఁటులు, చేరువఁజరియింపఁగనిన సిద్ధింపవెయే, కోరికలైన." కళా. ౧, ఆ. (చూ. అట్లు.)

**అటుక.** దే. వి. ఇంటిలోపల గోడలమీఁద నడ్డముగా పలకలు కొయ్యలులోనగువానిచే మంచెవలె నమర్చినది, (చూ. అట్టుక.)

**అటులు.** దే. అవ్య. ఆప్రకారము. "ఎట్లు సెప్పె నటులు భక్తిమైనడువు." భార. విరా. ౧, ఆ. (చూ. అట్లు.)

**అటువంటి.** దే. విణ. అట్టి. "అటువంటినీవురొ, తనమగుదివ్యమూర్తి విదితంబుగఁ జూపితివి." వి, పు. ౭, ఆ.

**అటువలె.** దే. వి. అట్లు. "అటువలెనంటుకాఁడు." శశాం. ౪, ఆ.

**అటె.** దే. అవ్య. 1. ఆశ్చర్యమును తెలిపెడి; "క. నహుషుండుపనుచువాఁడటె, విహితానుష్ఠానపరులుపీరటెపోలో, కహితంబటె యిది మనకుఁ, మహనీయమ కాకయెట్లు మానఁగవచ్చున్." భార. ఉద్యో. ౧, ఆ.—2. దుఃఖమును తెలిపెడి. "సీ. ధర్మసుతుఁడు, భీమసేనుండును బీభత్సుఁడును దనకడుపునఁబుట్టినకొడుకట్టె. యెగ్గతంబునఁదానుగారగ్గిఁగాలె, నటెయనాథయై." భార. ఆశ్ర. ౨, ఆ.

**అట్ట.** దే. వి. 1. తలతెగినశరీరము, కబంధము; 2. చెప్పులకొఱకుఁ జక్కఁబఱపఁబడిన చర్మఖండము.

**అట్టచెమ్మ.** ద్వ. వి. నాలుగుగవ్వలతో నాడెడు దాయమువంటి యొకానొక ఆట.

**అట్టడి.** వై. వి. యుద్ధార్థము వాకిటిమండపముమీఁదఁగాని కొత్తళముమీఁదఁగాని యేర్పఱచిన గది, అట్టము. "కొత్తళంబులకెల్ల, నట్టళ్లు వెట్టించి." ఉ, హరి. ౨, ఆ.

**అట్టము.** సం. వి. అ. న. 1. వంటకము; 2. వంటచెఱకు. పుం. 1. అట్టడి; మేడవెనుకటియిల్లు. (అని కొందఱు.) 2. అతిశయము.

**అట్టహాసము.** సం. వి. అ. పుం. పెద్దనవ్వు.

**అట్టాలకము.** సం. వి. అ. పుం. 1. కోటబురుజు; 2. నగరు.

**అట్టి.** దే. విశే. అటువంటి.

**అట్టిఁడు.** దే. విశే. (అట్టి+వాఁడు.) అటువంటివాఁడు. "ఉ. ఈవసుధాధినాథులజయించినయట్టిఁడ." భార. ఆది. ౮, ఆ.

**అట్టిక.** దే. వి. అటిక.

**అట్టియ.** దే. వి. గుంపు, సమూహము. "క. అట్టియెడఁ జెలిమికత్తియ, లట్టియలుగఁగూడి చేడియంగని యనిరి." నీలా. ౨, ఆ.

**అట్టు.** దే. వి. అపూపవిశేషము. అవ్య. ఆప్రకారము, (చూ. అట్లు.)

**అట్టుక.** దే. వి. అటుక. "క. తలవరి గడగడ వడఁకినఁ, గలఁగకుమని పిఁపుఁజఱచి ఘనురాలతనిన్, నిలిపి యొకమూల నట్టుక, సెలమిని వాకిలిసడల్చి హితమలరారన్." హంస. 3, ఆ.

**అట్టుప్పు.** దే. వి. (అట్టు+ఉప్పు.) లవణవిశేషము, పాక్యము.

**అట్టులు.** దే. అవ్య. ఆప్రకారము, (చూ. అట్లు.)

**అట్టువ.** దే. వి. అటుక.

**అట్టువోలె.** దే. ద్ర. (అట్టు+పోలె.) అట్లు. "సీ. ఏనుంగునంజలో నెల్లసత్వంబుల యంజలునడఁగిన యట్టువోలె." భార. శాం. ౨, ఆ.

**అట్టె.** దే. అవ్య. 1. ఆశ్చర్యమును తెలిపెడి; "గీ. నలునకాని నలినదళనేత్ర వరియింప, దట్టెచూతమనుచు నమరవరులు." భార. అర. ౨, ఆ.—2. దుఃఖమును తెలిపెడి, (చూ. అటె.)

**అట్టెడ.** దే. వి. 1. పూడికయెత్తుటకు ఈఁతబద్దలులోనగువానితో అల్లినతట్ట; 2. నెరసులు పోఁగొట్టుటకై కూర్చిన జల్లెడవంటి తడిక; 3. కాయధాన్యములయందలి మట్టిగడ్డలు మొదలగువాని వెలువరించుటకుఁ గట్టిన గోఁగుకట్టెలులోనగువాని మోపు; 4. పంతెన.

**అట్ఠము.** వై. గ్రా. వి. వేదభాగము, అష్టకము.

**అట్లు.** దే. అవ్య. ఆప్రకారము. "క. అమరవరులందుఁబురుషో, త్తముఁడెట్లువిశేషమట్లు ధరణింగలతీ, ర్థములందునుబుష్కరతీ, ర్థముఁగరమువిశేషమభిమతార్థప్రదమై." భార. అర. ౨, ఆ. (దీనికి వృత్తియందు ప్రకారముమాత్రమర్థము. చెప్పినట్లు చేయుము. మొ.)

**అడ.** దే. వి. 1. ముద్ద; "సీ. అడలవెన్నెలఁజక్కఁరిడి చొక్కవెన్నెలఁబూనిక నాళీలుగానుగూర్చి." య. ౨, ఆ.—2. ఆకృతి. "ధూర్జటికంటి కడింది మంటలో, నడ పొడగానరాక తెగటాఱెయు." స్వా. 3, ఆ.

**అడఁకువ.** దే. వి. అణఁకువ, నమ్రత.

**అడఁగారు.** దే. అ. క్రి. అడఁగు, ఉపశమిల్లు.

**అడఁగు.** దే. అ. క్రి. 1. తగ్గు; 2. ఉపశమిల్లు; 3. నమ్రమగు; 4. నశించు; 5. లోపడు.

**అడంగు.** హిం. వి. మొదటిచోటు. విశే. తగులుబడియైన.

**అడఁచే.** దే. ప్రే. అడఁగఁజేయు. (అనుప్రయుక్తమైన అడఁగుధాతువునకును రూపమిట్లేయుంగునది.)

**అడకము.** దే. విశే. లోపలనణఁగినది, అంతర్భూతము. "ద్వి. నానామరేంద్రబృందము మాయలెల్ల, హరిమాయలోపల నడకముల్." విష్ణు. పూ. ౧, ఆ.

**అడకించు.** దే. స. క్రి. 1. అపహసించు; "చ. పలికిన నట్లయున్నదిరొ పత్రికలో నడకించెదోననున్, జెలియిటుచూపుమాయనుచుఁ జేరఁగఁ

బోవుచుఁ జేయిసాఁచెనా, యలినిభవేణి తత్సఖి
యు నట్టిటుపాఱుచు దేవునానయేఁ, గలదిరొ
యింతయుంజదువఁ గావినుచూచెదు గానినావు
డుఁగా." ప్రభా. 3, ఆ.—2. వంచించు. "గీ. అక
టనీవునన్ను నడకించిపోఁజూచె, దేనుమోసపో
నుగానిగోవ, యడవిలోననున్న యంతసెపులి
యింత, యెఱుకలేనిదయ్యెనే తలంప." భో.
౬, ఆ.

అడకొత్తు. దే. వి. (అడకాయ+ఒత్తు.) పోఁకొత్తు,
శంకుల. "ఓర్వదుబంధుజాలమడకొత్తునొత్తును
మామగారు." శశాం. 3, ఆ.

అడఁగుబొద్దు. దే. వి. బేఁటుదారిలోపల నణఁగియుం
డునట్లు గోడయంచులయందు గీటి యేర్పఱచెడు
బొద్దు.

అడగొను. దే. అ. క్రి. (అడ+కొను.) అడకట్టు,
ముద్దకట్టు.

అడగోలుకొను. దే. స. క్రి. (అడ+కోలుకొను.)
అపహరించు. "ఉ. ఆవెశంకరార్ధదే, హంబడగో
లుకొన్నసతియద్భుతరూపవిలాసగేయముల్."
హరి. ఉ. ౬, ఆ. "ఇల్లడసొమ్ము, నడగోలుకొని
త్రోచునతనిగతికి." భో. ౬, ఆ.

అడజెడి. దే. వి. అలజడి, దుఃఖము. (చూ. అడ
జెడిపెట్టు.)

అడజెడిపెట్టు. దే. స. క్రి. దుఃఖపఱచు. "చ. న
న్నడజడిపెట్టుమాట యిటు లాడఁగఁగూడునె
యీయకార్యముల్, పిడుపులతాంగి." మార్క.
౧, ఆ.

అడదడి. దే. వి. ప్రభుత్వము. (అప్ర.)

అడప. దే. వి. అడపముంచుకొనియుండు ఆఁడుది.
"చ. కలికివరాటరాజడప కప్పురవీడెము వెట్టె
పంచ్ఛనన్, నలునడపంబువానికి ఫణాధరవల్లి
దళాంతరంబునన్, బలితపుఁదేలుమైనమునఁబ
న్ని." సై. ౭, ఆ.

అడపకత్తె. ద్వ. వి. (అడపము+కత్తె.) అడపమునుం
చుకొనియుండునది, (రూ.) అడపకత్తియ.

అడపకాఁడు. దే. వి. అడపమునుంచుకొనియుండు
వాఁడు.

అడపట్టె. ద్వ. వి. పొలములో విత్తనమువిత్తి మిట్టప
ల్లము సమమగుటకై యెడ్లనుకట్టి త్రోలెడు
మ్రాను, దిండు.

అడపము. దే. వి. 1. వక్కలాకులతిత్తి. 2. మంగలతిత్తి.

అడపాడ. దే. వి. జాడ. "అతండు...వారియీసుచే
నడపాడలేకపోయె." కశా. ౭, ఆ.

అడబాల. వై. విశే. వంటవాఁడు, వంటలక్క*. "ద్వి.
అడబాలకొనిపోయియమ్మినుఁజించి, కడుపులో
సొకబాలుఁగని వెఱఁగంది." భాగ. ౧౦. స్కం.

అడరు. దే. అ. క్రి. 1. అతిశయించు; "క. ఆపాద
మస్తకముత, ద్రూపమువీక్షించుచుం గుతూహ
లమడరన్." భార. విరా. ౧, ఆ.—2. పూను;
"ఎ, గీ. ఇట్టిగోరత్నమొక్కనాఁడేకతంబ, పోఁ
కుమేయుచునుండబెబ్బులియొకండు, దానిఁగని
పొంచియొడలెల్లదాఁచివాల,మవనిఁదాటించుచు
న్ప్రేయనడరుటయును." భో. ౪, ఆ.—3. కలు
గు; "క. కడులజ్జయుదైన్యంబును, నడరి." భార.
ఆర. ౬, ఆ.—4. త్వరపడు; "క. మీరాఁకలిపె
ల్లుననా, హారంబుగశవముఁగొనుటకడరితిరి."
భార. అను. 3, ఆ.—5. వర్ధిల్లు; "క. ఈరీతినాబలేశ
మ. హీరమణునివంశమడరె." రామా. ౧, ఆ.—
6. విజృంభించు; "వ. కాలరుద్రులంబోలెనడ
రుచు." వీర. ౪, ఆ.—7. వ్యాపించు. "క. వఱ
టులు మనచేరువఁబె, ల్లఱచుటబెట్టైదురుగాలి
యడరుట." భార. కర్ణ. ౨, ఆ.—వి. ఆధిక్యము.
"క. గొనములసంద్రమయిత్తెఱఁ, గునఁజాలుపుఁ
దేర్లఁ డుకొదయొదవనిపెం, పుననడరొందు
చు." అచ్చ. అ, కాం.

అడరించు. దే. ప్రే. బాణమును ప్రయోగించు. "సీ.
అతఁడడరించునానాస్త్రశస్త్రముల హుంకార
రవమ్మునఁగ్రాఁచెదేవి." మార్క. ౬, ఆ.

అడరుచు. దే. ప్రే. అడరించు. (రూ. అడర్చు. "వెం
డియునాగ్రహంబున సువేగునిమధ్యముద్రెవ్వ
నొక్కబల్, కాండమడర్చె." జై. ౭, ఆ.)

అడరుదెంచు. దే. అ. క్రి. (అడరు+తెంచు.) అడరు,
అతిశయించు. "గీ. రెండుదరులుముంచి యొం
డొండవెల్లువ, యగ్గలింప నురువులడరుదేర, నతి
రయమునఁ బఱచునయ్యేటివఱ్ఱొడ్డి, పోయెద
వ్వఁగాఁగభూవిభుండు." మార్క. ౫, ఆ. (అడ
రుధాతువునకువలె దీనికిని సందర్భానుసారము
గా అర్థములన్ని చెప్పుకొనవలెను.)

అడలు. దే. అ. క్రి. 1. ఏడ్చు; "క. అనుచుందొరఁ
గెడునశ్రుల, మునిఁగినమోముతనపత్కమునఁజే
ర్చియు, వ్వనితయవస్థయతాల్చుచు, ననిలసు
తుండడలెదేహములమటఁబొందన్." సం. "మ

ఖమానీయ వైపత్న్యౌరురోదపరవీరహా." భార. విరా. ౨, ఆ.—2 విలపించు; "సీ. అనివిలాపింపనూరార్చియేటికిఁ గ్రేపుఁ బాసిగోడ్డాలవెడి పగిదినడలె, దు." జై. ౬, ఆ.—3. శోకించు. "క. కొడుకులదెస నెవ్వగఁజే, డ్పడివందురియున్నయా నృపాలుఁ డడుగులం, బడిభీష్ముపాటు సెప్పుచు, నడలికడున్నాదమెసఁగ నాక్రందించెన్." భార. భీష్మ. ౧, ఆ.—4. భయపడు. "సీ. పల్లెరంబిడులోనె పాలుపత్తెము సేయు నతివకాయిందఱు కడలుకుడుపు." పాంచా. 3, ఆ.—వి. 1. శోకము. "వ. ధర్మనందనుండు వెడవెడఁదెలిసియు మగుడనిగుడు నడలున." సం. "తతస్తత్ర మహాన్ శోకః ప్రాదురాసీన్మహాత్మనః." భార. సౌ. ౨, ఆ.—2. భయము. (అందఱికి వానియడలు పెద్దది గామన్నది.)

**అడలుకొను.** దే. అ. క్రి. అడలు, శోకించు. "గీ. అత్తెఱంగెల్లనాలించియపుడుచాల్వ, టరదముల దొరతద్దయు నడలుకొనుచు." అచ్చ. అ, కాం.

**అడవి.** వై. వి. కాన, అరణ్యము. [అడవిశబ్దము ముందుగల సంజ్ఞావాచకశబ్దములు—అడవికంద (సర్పనాళము†), అడవికాఁకర (వనకారవేల్లము†), అడవికిక్కస (దేవనాళము†), అడవికోడి (వనకుక్కుటము), అడవిగెనసు (పిండాంశుకము†), అడవిచెఱకు (కాంతారము†), అడవిచేమ (శకుటము†), అడవితొగరి (తువరిక†), అడవితొలసి (క్షవకము†), అడవిదున్న (వనమహిషము), అడవిదోమ (దంశి), అడవినువ్వులు (జర్తిలము), అడవిపంది (వనసూకరము), అడవిపెసలు (వనముద్గము), అడవిప్రత్తి (భారద్వాజి†), అడవిబచ్చలి (వనోపోదకి†), అడవిబీఱ (కోశఫల†), అడవిమల్లె (ఆస్ఫోట†), అడవిమామిడి (ప్రియాలము†), అడవిమామెన (శారిబాభేదము†), అడవిమునగ (వనశిగ్రువు†), అడవిమేఁక (ఇడిక్కము), అడవిమొల్ల (యూథిక†), అడవియులవలు (వనకుళుత్థము), అడవిసదాప (శాలేయము†), అడవీఁగ (దంశము). మొ.]

**అడవికుక్క.** వై. వి. తోఁడేలు, అరణ్యశునకము.

**అడవితిరుగుడు.** ద్వి. వి. కోఁతి, వానరము.

**అడవినట్టు.** ద్వి. వి. అడవితిరుగుడు. (ఇట్లు అడవిసెలవు, అడవిమనికి. మొ.)

**అడసాల.** వై. వి. వంటయిల్లు, మహానసము.

**అడావుడి.** హిం. వి. అల్లరి, దడబిడలు.

**అడి.** వై. ఉప. 1. అధికము; "క. అడిసిగ్గులుతమకంబులు, నుడివోవఁగ." మార్క. ౮, ఆ.—2. వ్యర్థము*. "క. అడిబీరపుఁదులువ గెలుచునె పాండవులన్." భార. ద్రో. ౪, ఆ.

**అడిగండ్లు.** దే. వి. బ. (అడుగు+కండ్లు.) మలువఁగా అడుగున నిలిచిన తాళ్లు. "ఆ. అడిగండ్లు మలిగండ్లు, తిరిపమిడెడు కటికి దేబెలెల్ల." వేమన.

**అడిగము.** దే. వి. భారవిశేషము. "చ. లెణగము లాసుకంట్లములు తండిగముల్ సలకల్ దడేల్కుతూ, గణములు చెక్కుగుంపు లడిగంబులు." హంస. ౫, ఆ.

**అడిగట్టు.** దే. వి. (అడుగు+కట్టు.) పావ, పాదుక. "ద్వి. హరిగణంబులకెల్ల నడిగట్టనిన." ప్రభు. ౪, ఆ. (అడుగు, కట్టు ఈ రెండుపదములు చేరునపుడు గకారముమీఁది ఉకారమునకు ఇకారము వచ్చినది. ఇట్లు అడిగొట్టు అడియాలము మొదలగువానికి తెలియఁగునది. పదములు ఒకటితోనొకటి చేరునపుడు వర్ణలోపవర్ణాగమవర్ణాదేశములు పెక్కులు పెక్కువిధములుగా వచ్చుచున్నవి. ఉదా. అకె, నూనె, తామరపాకు, ఇనుమడి. మొ.)

**అడిగొట్టు.** దే. విశే. (అడుగు+కొట్టు.) కుత్సితుఁడు. "ఎ, గీ. కఱటి యడిగొట్టు పలువ రోతరిగరాసు, లండు కూళ చెనఁటి కుచ్చితుండు మొండి, కట్టె నాఁగను గుజనాఖ్యగాఁజెలఁగు." ఆం, భా. తృ. వి.

**అడిచిపడు.** ద్వి. అ. క్రి. 1. తమకించు, త్వరపడు; "క. జడనిధిచందంబున నిమ్ముడువొప్పఁగ నిప్పుడేమి మాఁడెను నిమ్మై, నడిచిపడరత్తనెవ్వగ; లుడుగుఁడు మతిచూచికొంద మొయ్యనతతితోన్." భార. శాం. 3, ఆ.—2. మండిపడు. "గీ. అడిచిపడునాజ్యహూమ మంత్రాహుతులకు." నై. ౪, ఆ. "గీ. పాలు నెయ్యి నేలపాలైనఁ జిడిముడి, పడుచుఁ బడుచుమీఁద నడిచిపడుచు." వి, పు. ౭, ఆ.

**అడిచిపాటు.** ద్వి. వి. త్వర. "సమరము పేక్షించి శాంతిమైనుండెడు నడిచిపాటేటికి." భార. భీష్మ. 3, ఆ.

అడితి. దే. వి. ఒకవర్తకుఁడు మతియొకఁడంపెడు సరకులనమ్మి మరల వానికి సరకులుగొనిపంపుటకై వానివద్ద నూటికింతయని పుచ్చుకొనెడుతఱుగు.

అడిత్రాగుడు. దే. వి. (అడిగి+త్రాగుడు.) కఱవు దుర్భిక్షము. "క. అడిత్రాగుడనకయుప్పటి, కడిఁదికినేమాంసమైన గ్రక్కునఁగొనిరం, డెడనేయకనుచుననిపినఁ, గడుపడినలఁవురునుబోయిగహనములోనన్." పంచ. నా. ౧, ఆ.

అడిదపుమెకము. ద్వ. వి. (అడిదము+మెకము.) మీఁగండ్లమెకము, ఖడ్గమృగము.

అడిదము. దే. వి. కత్తి, కరవాలు, ఖడ్గము.

అడియఁడు. దే. విశే. (అడుగు+అఁడు.) పాదసేవకుఁడు. "సీ. దండంబుదర్పితో ద్దండరక్షోహర్త కడియండజాతరూపాంబరునకు." రుక్మాం. ౧, ఆ.

అడియరి. దే. వి. (అడుగు+అరి.) కింకరుఁడు. "ఇంక, నడియరితనమునన పాండవుల నాశ్రయింపఁగఁ జాల." సం. "కథమస్యభరిష్యామి ప్రేష్యభూతోదురంతకృత్." భార. సౌ. ౧, ఆ.—విశే. లోభి. "క. యాగార్థమడిగినర్థము, యాగమునకుఁబెట్టవలయు నడియరియైతా, భోగార్థముగా దాఁచిన, యాగముబాహ్యుండు కాకియైజన్మించున్." విజ్ఞా. ఆచా. కాం.

అడియాలము. దే. వి. (అడ+అలము.) గుఱుతు, చిహ్నము. (అలశబ్దమునకిక్కడ స్థానమర్థము.)

అడియాస. వై. వి. (అడి+ఆస.) కలుగునెడియాశ, ప్రత్యాశ*. "సామ్యములఁగోరక పొమ్మడియాసయేటికిన్." భార. అర. ౪, ఆ. (చూ. దొడ్డ.)

అడియొత్తు. దే. వి. (అడుగు+ఒత్తు.) అడిగట్టు. "ద్వి. జన్నిదంబులుచిక్కుజడలును బెట్టి, యడియొత్తునుంచి." భాగ. ౫, స్కం.

అడిసాటూ. దే. వి. (అడితి+సాటూ.) తఱుగుబేరము.

అడుకు. దే. స. క్రి. దొంతిగనిడు. వి. 1. దొంతి; 2. బ. వడ్లునానఁబోసివేఁచికొట్టినవి, చిపిటము. "క. అడుకులుదిన్నట్లగునే, కడుపునఁగుట్టెత్తినపుడు." భార. ద్రో. ౪, ఆ.

అడుగంటు. దే. అ. క్రి. (అడుగు+అంటు.) పట్టు. విశే. బ. అడుగుననిలిచినవి. "ర, త్నాకరరత్నరాసులడుగంట్లు." కవిక. ౧, ఆ.

అడుగు. దే. స. క్రి. 1. ప్రశ్నముచేయు; 2. యాచించు. వి. 1. క్రిందు; 2. పాదము; 3. పాదప్రమాణము. విశే. అధమము. "గీ. కొమ్మ, యడుగులకునుజిగురులడుగులయ్యె." అని. ౧, ఆ.

అడుగుకొను. దే. స. క్రి. 1. ప్రార్థించు; 2. యాచించు.

అడుగుకోలు. దే. వి. 1. ప్రార్థన; 2. యాచన.

అడుగుపడు. ద్వ. అ. క్రి. అధమమగు. "క. లలిఁగొప్పెక్కించితిమధు, పులకుకులమునడుగుపఱిచిపుష్పాస్త్రామా, లలకునుమంచంబులుబొఁ, పలకునుబీఁటలనుమాటబలిమి నిజముయ్యెన్." చంద్రి.

అడుచు. దే. స. క్రి. కొట్టు, తాడించు. "క. మదమునవెలుచన యొకగా, డిదకొదమంగోలఁగొనియడిచె." భార. అను. ౧, ఆ.

అడుజూ. దే. వి. ఒకజాతిడేగ, అఱుజూ.

అడుప. దే. వి. (అడుగు+పట్టినది.) పశువులకాళ్లయందుఁగలిగెడు వ్యాధివిశేషము. "సీ. పశుపాదరోగంబు పరఁగు నడుపయన." ఆం. భా. ద్వి. మ.

అడుపు. దే. వి. ఆటు, కొట్టు, తాడనము.

అడువ. దే. విశే. (అడుగు+పట్టినది.) ప్రాఁత. పురాతనము. (అడువసరకులు.)

అడువు. దే. స. క్రి. అడుగు. "ఎ. గీ. అనుచుమన్యువేగంబుననడువ." (నలకథయందు అడుగఁగాననియు, హరిశ్చంద్రకథయందు కొట్టఁగాననియు అర్థములు.) హర. ౫, ఆ.—వి. పాగము.

అడువుఁబుట్టువు. దే. వి. (అడువు+పుట్టువు.) కాఁపువాఁడు.

అడుసు. దే. వి. బురద, పంకము.

అడ్గు. దే. స. క్రి. 1. ప్రశ్నముచేయు; 2. యాచించు. వి. 1. క్రిందు; 2. పాదము; 3. పాదప్రమాణము. విశే. అధమము.

అడ్డ. యు. దే. వి. గుంటకలోనగువానిదిండు. వై. కుంచములోసగము*.

అడ్డంకి. దే. వి. అడ్డి, నిరోధము.

అడ్డకట్ట. దే. వి. (అడ్డము+కట్ట.) ఏఱులోనగువాని నీళ్లు వెలికిఁబోక కట్టెడు కట్ట, ఆనకట్ట.

అడ్డకట్టు. దే. స. క్రి. (అడ్డము+కట్టు.) అడ్డగించు, నిరోధించు. "గీ. అపరకాలుఁడడ్డ, కట్టుకొనియున్నవిపినమార్గమున." పర. ౪, ఆ.

అడ్డకత్తి. దే. వి. (అడ్డము+కత్తి.) ఆయుధవిశేషము, పట్టిసము,

అడ్డకమ్మి. ద్వ. వి. (అడ్డము+కమ్మి.) గడపయందు త్రొక్కుడుకమ్మికి సరిమీఁదుగా నడ్డముగ నేర్పఱుపఁబడిన దారువిశేషము, నాస.

అడ్డకట్ట. దే. వి. (అడ్డము+కట్ట.) అడ్డి, విఘ్నము. (నీవు నామాటకు అడ్డకట్టవేయకుము.)

అడ్డకోడమ. దే. వి. (అడ్డము+కోడమ.) మత్స్యము లఁబట్టు నౌకానౌకసాధనము. "గీ. కోడమ తిఱ్ఱడ్డకోడమ ద్రొబ్బుడుపటంబు." హంస. ౪, ఆ.

అడ్డగాలు. దే. వి. (అడ్డము+కాలు.) అడ్డకట్ట. "క. తలగలిగినఁగుఱ్ఱాయలు, గలవేవగనైననీవు గలిగి నఁదాదృ, క్కులరవములెన్నియైనం, గలిగెడుఁ బోకుమనియడ్డగాల్ వేయంగన్." సా. ౨, ఆ.

అడ్డగించు. దే. స. క్రి. అడ్డకట్టు, నిరోధించు.

అడ్డచాఁపు. దే. వి. (అడ్డము+చాఁపు.) అడ్డవాసపు దూలము.

అడ్డనము. వై. వి. 1. బెత్తములోనగువాని చేతఁ జేయఁబడినకేడెము; (చూ. ఒడ్డనము.) 2. కేడెము. "వ. అంతఁగ్రోధనుండు గరవాలంబునడ్డనంబు నుగొని." రా. యు, కాం.

అడ్డపట్టు. దే. స. క్రి. (అడ్డము+పట్టు.) అడ్డముగా పట్టు. "ద్వి. అడ్డపట్టెడు బాలుఁ డటవెరయో యమ్మ." సా.

అడ్డపట్టె. ద్వ. వి. (అడ్డము+పట్టె.) మడి చదునుపఱచెడి పలక. (రూ.) అడ్డపట్టియ.

అడ్డపడు. ద్వ. అ. క్రి. (అడ్డము+పడు.) అడ్డము వచ్చు.

అడ్డపాటు. ద్వ. వి. అడ్డపడుట, నిరోధము.

అడ్డపాప. దే. వి. 1 (అడ్డము+పాప.) అడ్డముగా పట్టఁదగిన శిశువు; 2. దూరదృష్టిలేనివాని కన్ను లలోనిపాప.

అడ్డపెట్టు. దే. స. క్రి. (అడ్డము+పెట్టు.) 1. అడ్డకట్టు, నిరోధించు; "గీ. అడ్డపెట్టెదఁగాక తీవ్రాంశురథము." కాశీ. ౧, ఆ.—2. ఈడుపెట్టు. వి. అడ్డగింత, నిరోధము. "అడ్డపెట్టభిసారికాంగనలకు." చంద్ర.

అడ్డబొస. దే. వి. నాసాభూషణవిశేషము. (దీనిని బులాకి అందురు.)

అడ్డమాను. దే. వి. (అడ్డము+మాను.) అడ్డపట్టె.

అడ్డము. దే. వి. 1. నిరోధము. 2. చాటు. 3. తాకట్టు. 4. పూఁట. విశ. నిరోధకము. (వృత్తి యందు అంత్యవర్ణలోపము. అడ్డకట్ట, అడ్డగాలు, అడ్డవేడెము. మొ.)

అడ్డరిక. సం. వి. ఆ. స్త్రీ. ఒకదినుసు పోలీ.

అడ్డవాట్లు. దే. వి. బ. (అడ్డము+వాట్లు.) అడ్డకట్ట. (నీవేల దానికి అడ్డవాట్లువేసెదవు?)

అడ్డవాతియమ్ము. ద్వ. వి. (అడ్డము+వాయి+అమ్ము.) ఒకదినుసుబాణము.

అడ్డవేడెము. ద్వ వి. (అడ్డము+వేడెము.) పాము నడకవంటి గుఱ్ఱపునడ. "రవగాలునుజోడనయడ్డవేడెముల్, దొక్కుడువాళిజిల్గు నడలుంగని పించుచు." సా. ౧, ఆ.

అడ్డసరము. వై. వి. అటరూషము?.

అడ్డసాళులు. ద్వ. వి. బ. (అడ్డము+సారెలు.) పాచికలు. "గీ. అతఁడుగాండివమునఁనడ్డసాళులు వైవఁ, దురులనంపవాన గురియఁగాని." సం. "నాక్షాన్ క్షిపతి గాండీవమ్" భార. విరా. ౪, ఆ. (రూ. అడ్డసాళ్లు.)

అడ్డాదిడ్డి. దే. విశ. (అడ్డము+దిడ్డి.) అక్రమము. (వాఁడు అడ్డాదిడ్డిమాటలాడుచున్నాఁడు.)

అడ్డి. దే. వి. అడ్డంకి, అభ్యంతరము, నిరోధము.

అడ్డిగలు. దే. వి. బ. ఆఁడువారు మెడనుంచుకొనెడు ఒకదినుసు సొమ్ము, గ్రైవేయకము.

అడ్డిపడు. ద్వ. అ. క్రి. అభ్యంతరమగు.

అడ్డీ. దే. వి. అనుకైనవస్తువుయొక్క పూఁఁత. (అప్ర.)

అడ్డు. దే. స. క్రి. అడ్డగించు. "జగమడ్డఁదగుదొడ్డసత్తియై." నీలా. ౧, ఆ.—వి. అడ్డగింత. "పారనేత్రములకడ్డుచొరకమున్న." కాశీ. 3, ఆ.

అడ్డుగ. వై. వి. రూకలోసగము, అర్ధపణము*.

అడ్డుగట్ట. దే. వి (అడ్డు+కట్ట.) 1. అడ్డకట్ట; 2. గడియమ్రాను. విశ. విఘాతము. "క. నీయడ్డుగట్టమాటల, కీయడఁబనియేమి." రుక్మాం. ౫, ఆ.

అడ్డుగొను. దే. అ. క్రి. (అడ్డు+కొను.) అడ్డపడు. "గీ. అడ్డుగొనిసోఁకుదొరకుఁబ్రహస్తుఁడనియె." అచ్చ. యు, కాం.

అడ్వాన్సు. ఆం. వి. ముందుగానిచ్చు రూకలు.

అణఁకువ. దే. వి. అడఁకువ, నమ్రత.

అణఁగారు. దే. అ. క్రి. అడఁగారు, ఉపశమిల్లు.

అణఁగు. దే. అ. క్రి. 1. తగ్గు; 2. ఉపశమిల్లు; 3. నమ్రమగు; 4. నశించు; 5. లోపడు.

అణఁచు. దే. ప్రే. అడఁచు, అణఁగించు.

అణక. దే. వి. మెడమీఁదనున్న కాఁడి మొదలగువానిని మెడక్రిందికి తెచ్చుకొనుట. "సీ. వెగడొంది రవితేరి సొగలఁగట్టినయట్టి వాహంబులణకలు వైచికొనియె." విక్ర. ౪, ఆ.

అణకించు. దే. స. క్రి. అడకించు. "ద్వి. అణకించు నొకటి రెండడుగులవానిఁ, బ్రణుతవిఖ్యాతి సంపద పెంపుగలిగి." భాగ. ౧, స్కం.

అణకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అధముఁడు, కుత్సితుఁడు.

అణవీనము. సం. విణ. (అ. ఆ. అ.) అణువులుపండునది. (పొలము.)

అణవ్యము. సం. విణ. (అ ఆ. అ.) అణవీనము.

అణా. హిం. వి. రూపాయలో పదియాఱవవంతు.

అణి. సం. వి. ఇ. పుం. స్త్రీ. 1. ఇఱుసుతుదిచీల; 2. అంచు; 3. ఎల్ల.

అణిమ. సం. వి. న్. పుం. 1. ఒకయైశ్వర్యము; (చూ. ఐశ్వర్యము.) 2. అణుత్వము.

అణీయము. సం. విణ. (స్. ఈ. స్.) అల్పిష్ఠము, మిక్కిలి యణువు. (ఈకారాంతమైనపుడు అణీయసీ అని రూపము. ఇట్లంతట నెఱుఁగునది.)

అణుకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. అల్పుఁడు; 2. నేర్పరి.

అణుజో. దే. వి. అచుజో. "గీ. సాళువముగిద్దుకడుజువేసడముకుఱుజు, బొంజుసెలకట్టె జాలియ వైరియఱుజు, నోరణంబునునాదిగాఁ బేసవడిన, వేఁటడేగలగిఱికొనవిడిచికడిమి." హరిశ్చ. ౨, ఆ.

అణువు. సం. వి. ఉ. పుం. 1. చిఱువడ్లు; 2. లేశము. విణ. అల్పము.

అతఁడు. దే. స. ఆశబ్దమునకు మహదర్థకపుంలైకవచనము, ఆతగాఁడు.

అతకరించు. వై. స. క్రి. క్రిందుపఱచు, అధఃకరించు; "గీ. అధికులగుతాపసులనెల్లనతకరించి, తానయఖిలలోకాధిపత్యంబునొందె." హరి. పూ. ౪, ఆ.—2. అతిక్రమించు*. "సీ. ఆచార్యులను మిమ్మునతకరించుట దోసమైనను నొకమాటయాడవలసె." లక్ష్మి. ౪, ఆ.

అతగుఁడు. దే. విణ. దుర్బలుఁడు. "క. అతగులచే ద్రుపదుఁడుబల, హ్యాతుఁడైపట్టువడనంత యల్పుఁడె." కవిక. ౬, ఆ. "ద్వి. అతివీరులతోఁ గలహము పెట్టుకొన్న, యతగునిరీతి." ప్రభు. ౫, ఆ.

అతనుఁడు. సం. వి. ఉ. పుం. మన్మథుఁడు. విణ. గొప్పవాఁడు.

అతర్కణము. వై. వి. మట్టుమీఱినకార్యము*. (వాడుకలోనిది.)

అతలషు. హిం. వి. వస్త్రవిశేషము.

అతసి. సం. వి. ఈ. స్త్రీ. నూనెయగిసె?.

అతిక్రమము. సం. వి. అ. పుం. అతిపాతము, మీఱుట.

అతిక్రమించు. సం. స. క్రి. మీఱు.

అతిక్రాంతము. సం. విణ. (అ. ఆ. అ.) అతీతము, మీఱినది.

అతిక్రాంతి. సం. వి. ఇ. స్త్రీ. అతిక్రమము.

అతిగండము. సం. వి. అ. పుం. ఒకయోగము. (చూ. యోగము.) విణ. దొడ్డచెంపగలది.

అతిచర. సం. వి. ఆ. స్త్రీ. మెట్టదామర?.

అతిచ్ఛత్ర. సం. వి. ఆ. స్త్రీ. సదాప?. అ. పుం. ము. గుడ్డికామంచి?.

అతిథి. సం. వి. ఇ. పుం, స్త్రీ. విందు. పుం. కుశుని కొడుకు.

అతిదేశము. సం. వి. అ. పుం. 1. ఒకచోటఁజెప్పఁబడినదానిని సామ్యముఁబట్టి మఱియొకచోట నుపయోగపఱచుట; 2. బదులు.

అతిధృతి. సం. వి. ఇ. స్త్రీ. ఒకఛందస్సు. విణ. అత్యంతధృతిగలవాఁడు.

అతినువు. సం. విణ. ఉ. ఓడఁగడచినది.

అతిపథము. సం. వి. న్. పుం. సత్పథము, మంచి త్రోవ.

అతిపాతము. సం. వి. అ. పుం. అతిక్రమము.

అతిబల. సం. వి. ఆ. స్త్రీ. 1. ముత్తవపులగముదినుసు?; 2. (విశ్వామిత్రుఁడుపదేశించిన) ఒకవిద్య. విణ. మిక్కిలి బలముగలది.

అతిభూమి. సం. వి. ఇ. స్త్రీ. అతిశయము.

అతిమాత్రము. సం. క్రి. విణ. అ. న. పెల్లు. విణ. అధికము.

అతిముక్తము. సం. వి. అ. పుం. 1. తినాసము?; 2. పువ్వులగురివింద?. విణ. కూడికలేనిది.

అతిరథుఁడు. సం. వి. అ. పుం. పెక్కువిలుకాండ్రతో పోరెడియోధుఁడు.

అతిరసము. సం. వి. అ. పుం. భక్ష్యవిశేషము. "సీ. అలివేణి నీచేతియతిరస రుచి రసజ్ఞానందమయ్యె నేమనఁగవచ్చు." అని. ౧, ఆ.

**అతిరిక్తము.** సం. విశే. (అ. ఆ. అ.) సమధికము, హెచ్చినది.

**అతిరేకము.** సం. వి. అ. పుం. ఆధిక్యము, హెచ్చు.

**అతివ.** దే. వి. ఆఁడుది, ఇంతి, వనిత.

**అతివస.** వై. వి. ఒకమందుదినుసు, అతివిష¶.

**అతివాదము.** సం. వి. అ. పుం. పరుషముగా మాటాడుట.

**అతివాసము.** వై. వి. శ్రాద్ధదినమునకుముందుదినము.

**అతివిష.** సం. వి. ఆ. స్త్రీ. అతివస¶.

**అతివృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. దేశమునకు హానికరమైన మిక్కిలివాన.

**అతివేలము.** సం. క్రి. విశే. అ. న. వెల్లు. విశే. అధికము.

**అతిశయము.** సం. వి. అ. పుం. ఆధిక్యము, అగ్గలిక.

**అతిశయిల్లు.** సం. అ. క్రి. అగ్గలించు.

**అతిశాయి.** సం. విశే. (న్. ఈ. న్.) అతిశయించినది.

**అతిసర్జనము.** సం. వి. అ. న. 1. ఈవి; 2. కొల.

**అతిసారకి.** సం. విశే. (న్. ఈ. న్.) అతిసారరోగముగలవాఁడు.

**అతిసారము.** సం. వి. అ. పుం. రోగవిశేషము.

**అతిహసితము.** సం. వి. అ. న. శరీరకంపముతోఁగూడిననవ్వు. (చూ. హాసము.) (ఇది అధమము.)

**అతీంద్రియము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రత్యక్షముకానిది.

**అతీతము.** సం. విశే. (అ. ఆ. అ.) అతిక్రాంతము, కడచినది.

**అతుకు.** దే. అ. క్రి. అంటుకొను. అం, ప్రే. అతికించు. వి. 1. అతుకుట; 2. అతికినతావు. (రూ. అదుకు.)

**అతులము.** సం. విశే. (అ. ఆ. అ.) సరిలేనిది.

**అతులితము.** సం. విశే. (అ. ఆ. అ.)——పై.——

**అత్త.** ఉభ. దే. వి. 1. మగనియొక్కతల్లి; 2. భార్యయొక్కతల్లి.—సం. ఆ. స్త్రీ. 1. అక్క; 2. తల్లి. (సంస్కృతమునసీయర్థములు కొన్ని పుస్తకములయందు వ్రాయఁబడియున్నవి.)

**అత్తడి.** దే. వి. గోడిగబుతువు. (గోడిగ=ఆఁడుగుఱ్ఱము.)

**అత్తపత్తి.** దే. వి. ఓషధివిశేషము, సోఁకుడుముడుఁగు.

**అత్తమిల్లు.** వై. అ. క్రి. 1. అస్తమించు. "సీ. ప్రాలేయ కిరణబింబంబు వెల్వెలఁబాటి యస్తాచలంబుపైనత్తమిల్ల." కాశీ. ౧, ఆ.—2. ఒఱగు*; "కాయలుత్తుంగ కుచపాళినత్తమిల్ల." స్వా. ౨, ఆ.—3. వ్యాపించు*; "వ. అంగళ్లముంగిళ్ల నత్తమిల్లిన ముత్తియంపురంగవల్లుల మీఁద." జై. ౨, ఆ.—4. శయనించు*. "సీ. పెనుఁబాఁపనునుఁబానుపునఁదమ్మియింటి తొయ్యలియజ్జెఁగొత్తంగ నత్తమిలిన, వెన్నునకు." అచ్చ. బాల, కాం.

**అత్తము.** దే. వి. అరఁటిపండ్లగెల.

**అత్తరము.** దే. వి. త్వర. "వ. అప్పుడమి ఱేఁడుఱేఁడు వెడందవాతితూపుల నతనికాళ్లు గత్తరించియయ్యుత్తరమునొత్తరముకఱుచపఱచిన." రామా ౮, ఆ. (రూ. ఆత్రము.)

**అత్తరు.** దే. వి. సుగంధతైలము, ప్రబోధనము. (రూ. అత్తరువు. "ఎ. గీ. తమ్మపడిగము మంచి గందంపుగోర, తబుకుచిన్నారి యడపమత్తరువుకుప్పె మొదలుగాఁగల వస్తుసంపదలుపొదలు, నమలవణిమయపటకుటీరాంతరమున." రసి. ౫, ఆ.)

**అత్తలము.** దే. వి. 1. ఈఁటె, కుంతము. "క. పెనుఁగడఁతదొడ్డయత్తల, మునవైచిన." స. "ప్రాసేన సహదేవస్య శిరసి ప్రాహరద్భృశమ్." భార. శల్య. ౧. ఆ. (రూ. అత్తళము.) 2. బల్లెము. "ఈఁటెల డొంకెనలన్ గటార్లబల్కొత్తుల నత్తలంబులను." కళా. ౮, ఆ.

**అత్తి.** దే. వి. మేడి. ఉదుంబరము¶.

**అత్తిక.** సం. వి. ఆ. స్త్రీ. (నాట్యపరిభాషయందు) అక్క. (తఱచుగా నిఘంటువులయందు అంతికయనియున్నది.)

**అత్తు.** దే. అ. క్రి. 1. కలుగు; "క. ఉత్తరమునఁబొడమునుబ్రత్యుత్తరముత్తరము లేకయుత్తరమగునే, యత్తినసువృష్టివలనన్, విత్తులకుంబొడమినట్టివిత్తులపోలెన్." పంచ. నా. ౧, ఆ.—2. కూడు. "క. ఉత్తమమగుద్రవ్యంబును, విత్తంబునునగ్రజునకు వింశాంశంబున్, బొత్తుననిచ్చి సహోదరు, లత్తిసమాంశంబుగొనుట యర్హంబెందున్." విజ్ఞా. వ్య, కాం.

**అత్తెము.** వై. వి. హస్తకవచము. "గీ. జేగ, తెగలదగనేర్పరించియత్తెములనుంచి, కదలెన్నువువెబడినయూడిగములగములు." ఉ, రా. 2, ఆ

త్తెసరు. దే. వి. (అత్తు+ఎసరు.) గంజివారకుండ నన్నముతోనిమిడిపోవునట్లు పెట్టెడియెసరు.

త్యంతము. సం. క్రి. విశ. అ. న. పెల్లు. విశ. అధికము.

త్యంతీనుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) పిచ్చల విడిఁగడు నడచువాఁడు.

త్యయము. సం. వి. అ. పుం. 1. అతిక్రమము; 2. చేటు; 3. దండము; 4. దుఃఖము; 5. దోషము.

త్యరాళము. సం. వి. అ. పుం. అరాళమనెడియేనుఁగునకంటె మిక్కిలి ప్రమాణముగలయేనుఁగు. (ఇది నింద్యము.) విశ మిక్కిలివక్రము.

త్యర్థము. సం. క్రి. విశ. అ. న. పెల్లు. విశ. అధికము.

త్యాకారము. సం. వి. అ. పుం. తిరస్కారము. తెగడిక.

త్యాహితము. సం. వి. అ. న. 1. మిక్కిలి వెఱపు; 2. బ్రదుకుఁగోరనిపని. విశ. కూడఁబడినది.

తంత్రము. వై. విశ. స్వాతంత్ర్యము తప్పినది. "ఉ. మా. తామహాయాగతంత్రమునదంత్రము చేసి." కాశీ. ౭, ఆ. (దీనిని అతంత్రమని సంస్కృతముగానే చెప్పవచ్చునని తోఁచుచున్నది. అయినను ప్రతులయందట్లు లేదు.)

దక. దే. వి. ప్రాఁతచెప్పు.

దటు. దే. వి. 1. గర్వము. "వ. అనిగర్వించిపలికిన కాళరాత్రిఁజూచి కనలి రాత్రించరేశ్వరుండు. సీ. అట్టహాసము చేసియాఁగఁ ప్రతాపోక్తులాఁడఁబడదానికి నింతయదటువలదు." కాశీ. ౬, ఆ.—2. మదము. "ఎ. గీ. అసలచాలనచణమైన యదటుగలిగె." స్వా. ౫, ఆ.

దనము. వై. విశ. అగ్గలము, అధికము.

దను. దే. వి. సమయము. (రూ.) హదను.

దపు. హిం. వి. గద్దింపు, హెచ్చరిక, భయము.

దయుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) దయలేని వాఁడు.

దరు. దే. అ. క్రి. చలించు. వి. 1. చలనము; "ద్వి. అదరును బెదరు నెయ్యంబు తియ్యంబు." భాగ. ౧, స్కం.—2. బ. మిడుఁగుఱులు. "గీ. అసురవీఁక నొక మహాచలశృంగంబు, వివిచివైచె నమరవిభుని మీఁద, గోత్రవైరిఘోరకులిశాభిహతిప్రయ్య, నడిచెదానిఁ జదలనదరులెగయ." భార. ఆర. ౫, ఆ. (వృత్తియందు ఏకవచనాంతమగు. అదరుటగ్గి. మొ.)

అదర్శనము. సం. వి. అ. న. 1. కల; 2. చూడమి.

అదలు. దే. అ. క్రి. బెదరు. (చూ. అదలుచు.)

అదలుచే. దే. ప్రే. అదలించు. (రూ. అదల్చు. "గీ. అతండురాజ, ధర్మమూఁదిచలింపకదల్చెనధిప." భార. కర్ణ. ౨, ఆ.) కోపమున గద్దించు, తర్జించు. (చూ. గద్దించు.)

అదలుపు. దే. వి. అదలించుట. (రూ.) అదల్పు, తర్జనము.

అదవద. దే. వి. కలఁత. "గీ. కీలిఁగబళించి యాత్మచూలిమించి, శూలిఁగదలించియుగ్రగ్రహాళినొంచి, యెందునున్నను దెత్తునీయిందువదన, వదన నను జూడు మదవదల్ వదలియధిప." రామా. ౫, ఆ.—విశ. వ్యత్యస్తము. "చ. అదవదలైనపయ్యెదలునందముతప్పిన హారవల్లులున్." విక్ర. ౫, ఆ.

అదవదపడు. ద్వి. అ. క్రి. కలఁతపడు. "క. పదపదరాఘవనిలునిలు, మదవదపడవలదు దశరథాధిప." రామా. ౪, ఆ.

అదాటు. వై. అవ్య. ఉన్నట్టుండి. (ఇది వాడుకలోనిది.)

అది. దే. స. ఆశబ్దమునకు అమహదర్థకప్రథమైకవచనము. (ఆయాఁడుది. ఆపశ్వాది. ఆజడవస్తువు.) (చూ. ఆ.)

అదిగో. దే. ద్ర. చూపుటను తెలుపునది. "గీ. పూనికర్ణాత్మజుఁడువృషసేనుఁడాత్మ, హయము దాఁటించినట్టివాఁగల్లయదిగో." కళా. ౧, ఆ. (రూ. అదిగో. "సీ. రామానుజుండదిగో మహాయతిరాజునాయకుండనఁగను న్నాఁడు వెలసి." పరి. ౫, అ.)

అదితినందనుఁడు. సం. వి. అ. పు. అమరుఁడు, వేలుపు.

అదిర. దే. అవ్య. (అది+ర.) ఔరా. (రూ. అదిరా. "క. మదిరాక్షికి నేగురుమగ, లదిరా." పాంచా. ౫. ఆ.)

అదిరిపడు. ద్వి. అ. క్రి. ఉలికిపడు.

అదిరిపాటు. ద్వి. అవ్య. ఉన్నట్టుండి, అకస్మాత్తుగా. "గీ. అదిరిపాటెవ్వఁడీక్షించె నాకసమున, హాటకపుఁగృష్ణపింగళుఁడైనపురుషు, నాతనికి వత్సరద్వయంబవధినూవె, ప్రాణధారణమునకిల్వలా

మురారి." సం. "అకస్మాద్వీక్ష్యతేయస్తుపురుషం కృష్ణపింగళమ్, తస్మిన్నేవక్షణేరూపం సజీవేద్వత్సరద్వయమ్." కాశీ. ౫. ఆ.

అదుకు. దే. అ. క్రి. అతుకు. "మహోపలంబుతో, నదికినరీతినున్నసవనాశ్వము." జై. ౪. ఆ.—అం. ప్రే. అతికించు. వి. 1. అతుకుట; 2. అతికినతావు.

అదుము. దే. స. క్రి. అణచు.

అదుముడు. దే. వి. అదుముట.

అదురు. దే. అ. క్రి. చలించు. "క. అదురుదురేపగదాయకుఁ, జెదురుదురేధైర్యమెడలిజీవితవాంఛన్, ముదురుదురేమూలలనరి, కెదురుదురేకాకహూరులెచ్చోనయినన్." చంద్ర.—వి. చలనము. (చూ. అదరు.)

అదురుఁగ్రోవి. దే. వి. (అదురు+క్రోవి.) అదురువేటు.

అదురుఁద్రిక్కు. దే. వి. (అదురు+త్రిక్కు.) పశురోగవిశేషము. "గీ. నరిడిపుప్పి కప్పనాపురుకడుపూఁద, యదురుఁద్రిక్కుయనఁగనడరిమఱియుఁ, దెవులులెన్నియేని తవిలియెంతయు మహోగ్రంబులయ్యెఁ బశుగణంబునందు." హరి. పూ. ౬, ఆ.

అదురుగడ. దే. వి. అదిరిపాటు. "చ. అదురుగడన్ సురారిభటులాజయశంఖరవంబువీనులన్, గదిసినగుండియల్పగులఁ గంపముతోఁదలలెత్తి." ఉ. రా. ౨, ఆ.

అదురుగుండియ. దే. విశే. భయపడుస్వభావముగలవాఁడు, భీరువు.

అదురుచు. దే. అ. క్రి. అదురుయొక్క రూపాంతరము. (రూ. అదుర్చు. "మ. ధరణీచక్రము దిర్దరన్ దిరిగె మార్తాండుండు కుంభీభవ, త్క్రూరణుండయ్యెదిశావితానము వడంకెన్ మిన్నదిర్చెన్ మహీ, ధరసంతానము గ్రక్కునంగదలె నుద్భ్రాంతంబులైయంబుధుల్, పోరలెన్ గట్టలమీఁద బిట్టుపిడుగుల్ మ్రోసెన్ మహోదగ్రతన్." భార. ద్రో. ౫, ఆ.)

అదురువేటు. దే. వి. మ్రానియందు ఇనుపగొట్టములునాటించి వానియందు మందుగట్టించి అదురునట్లు వేసెడువేటు

అదువ. దే. విశే. అస్థిరము. "వ. సదనంబులువిడిచి యదువలై యదువులు పదువులువదలి." భాగ. ౧౦, స్కం. పూ. "అదువగాఁపురము." ఆము. ౬, ఆ.

అదృక్కు. సం. విశే. శ్. గ్రుడ్డివాఁడు.

అదృశ్యము. సం. విశే. (అ. ఆ. అ.) దృశ్యముకానిది. (దృశ్యము=చూడఁదగినది.)

అదృష్టము. సం. వి. అ. న. 1. అగ్నిజలాదులవలనఁబుట్టెడికీడు; 2. భాగ్యము. విశే. చూడఁబడనిది.

అదృష్టి. సం. వి. అ. న. రోషముచేఁగ్రూరమైనచూపు.

అద్ద. వై. వి. 1. సగము; 2. అరసోల*; "సీ. అద్దయంచనఁగఁదదర్ధమొప్పు." ఆం. భా. ద్వి. వై.-3. నూర్చకవేసినకుప్పయొక్క క్రిందిసగముభాగము*. (దీనికి సగమను అర్థమునందు వ్యస్తముగాఁ బ్రయోగము కనఁబడలేదు.)

అద్దకము. దే. వి. వస్త్రమునకువేయురంగు.

అద్దగోడ. వై. వి. మఱుఁగుగోడ.

అద్దమరేయి. వై. వి. (అద్ద+రేయి.) అపరాత్రి అర్ధరాత్రము.

అద్దము. వై. వి. ముఖముచూచుకొనెడు గాజుబిళ్ల దర్పణము.

అద్ది. దే. స. (చూ.) అది. (రూ. అయ్యది, ఆయది.

అద్దికము. దే. వి. కావలి, రక్షణము. "ఎ. గీ. వాఁవాటిలోనింత తాటోటుచేసి, యటమటించయుండఁబైయద్దికముగ, నేవఁదిరుగాఁడువిశ్వాసలెపుడుమాకు, జాగిలంబులుసుమ్మనూసాకౌన." సా. ౧, ఆ. (ఈయుదాహరణమునం వాటివాటిలో అనునది గ్రామ్యము.)

అద్దియ. దే. వి. బాడుగ, భాటకము.

అద్దిర. దే. అవ్య. (అద్ది+ర.) అదిర. "తాయిఁ ద్దిరస్ఫురితంబుమమ్మయన." ఉ. రా. ౬, ఆ. (నికి అన్నయ్యలు అను ప్రయుక్తంబులగు. "అరన్న." "అద్దిరయ్య.") (రూ. అద్దిరా. "అద్దిపగలు." శశాం. 3, ఆ.)

అద్దిరపాటు. ద్వ. వి. అద్దిరపడుట. "అద్దిరపాటువానిఁజూచి." సా. 3, ఆ.

అద్దు. దే. స. క్రి 1. తోఁచు; 2. రంగువేయు.

అద్దువ. దే. విశే. (రూ.) అదువ. (చూ.)

అద్దె. దే. వి. అద్దియయొక్క రూపాంతరము.

అద్భుతము. సం. వి. అ. న. ఆశ్చర్యము. విశే. శ్చర్యకరము.

**అద్మరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) భక్షకుఁడు, తిండిపోతు.
**అద్యత్వము.** సం. వి. అ. న. ఇప్పుడు.
**అద్రి.** సం. వి. ఇ. పుం. 1. కొండ; 2. చెట్టు; 3. సూర్యుఁడు.
**అద్రికాకము.** సం. వి. అ. పుం. కాకిదినుసు, కొండకాకి.
**అద్రుచు.** దే. అ. క్రి. అదురు, కంపించు. (అదురుచు యొక్క మాఱురూపము.)
**అద్వయవాది.** సం. వి. న్. పుం. జైనులదేవత.
**అద్వైతము.** సం. వి. అ. న. 1. అభేదము; 2. జీవేశ్వరులకైక్యముచెప్పెడిమతము.
**అధఃకరణము.** సం. వి. అ. న. 1. క్రిందుపఱుచుట; 2. తక్కువపఱుచుట.
**అధఃకరించు.** సం. స. క్రి. 1. క్రిందుపఱుచు, అతకరించు; 2. తక్కువపఱుచు.
**అధఃకారము.** సం. వి. అ. పుం. 1. క్రిందుపఱుచుట; 2. తక్కువపఱుచుట.
**అధఃకృతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. క్రిందుపఱుపఁబడినది; 2. తక్కువపఱుపఁబడినది.
**అధమము.** సం. విణ. (అ. ఆ. అ.) అవద్యము, తక్కువైనది.
**అధమర్ణుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) అప్పులకాఁపు.
**అధరము.** సం. వి. అ. పుం. పెదవి. విణ. 1. క్రిందిది; 2. తక్కువైనది.
**అధరితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. క్రిందుపఱుపఁబడినది; 2. తక్కువపఱుపఁబడినది.
**అధర్మము.** సం. వి. అ. పుం. ధర్మముకానిది.
**అధర్వణుఁడు.** సం. వి. అ. పుం. 1. అధర్వవేదము దెలిసినబ్రాహ్మణుఁడు; 2. పురోహితుఁడు. (అధర్వణియని ఇకారాంతముగాఁ గొందఱు.)
**అధర్వము.** సం. వి. న్. న. ఒకవేదము.
**అధర్వుఁడు.** సం. వి. న్. పుం. బ్రాహ్మణుఁడు.
**అధికము.** సం. వి. అ. పుం. ఒకయర్థాలంకారము. (చూ. అలంకారము.) విణ. అదనము.
**అధికరణము.** సం. వి. అ. న. ఆధారము.
**అధికరించు.** సం. స. క్రి. చదువు.
**అధికాంగము.** సం. వి. అ. న. సారసనము, నడికట్టు.
**అధికారము.** సం. వి. అ. పుం. 1. ప్రక్రియ; 2. చెల్లుబడి.
**అధికారి.** సం. వి. న్. పుం. అధికారముకలవాఁడు, అధ్యక్షుఁడు.
**అధికృతుఁడు.** సం. వి. అ. పుం. అధికారి.
**అధిక్రియ.** సం. వి. ఆ. స్త్రీ. అధికారము.
**అధిక్షిప్తము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉంచఁబడినది; 2. దూఱఁబడినది; 3. బెదరింపఁబడినది.
**అధిక్షేపము.** సం. వి. అ. పుం. 1. దూఱుట; 2. బెదరించుట.
**అధిక్షేపించు.** సం. స. క్రి. 1. దూఱు; 2. బెదరించు.
**అధిగతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. చదువఁబడినది; 2. పొందఁబడినది.
**అధిగమము.** సం. వి. అ. పుం. 1. చదువుట; 2. పొందుట; 3. లాభము.
**అధిగమించు.** సం. స. క్రి. 1. చదువు; 2. తెలియు; 3. పొందు.
**అధిజ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ఎక్కుపెట్టినది.
**అధిత్యక.** సం. వి. ఆ. స్త్రీ. కొండమీఁదినేల.
**అధిపతి.** సం. విణ. ఇ. ప్రభువు, ఏలిక.
**అధిపుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.)——పై.——
**అధిభువు.** సం. విణ. (ఊ. ఊ. ఉ.)——పై.——
**అధిరోహణము.** సం. వి. అ. న. ఆరోహణము, ఎక్కుట.
**అధిరోహించు.** సం. స. క్రి. ఆరోహించు, ఎక్కు.
**అధిరోహిణి.** సం. వి. ఈ. స్త్రీ. నిశ్రేణి, నిచ్చెన.
**అధివసించు.** సం. అ. క్రి. నివసించు, ఉండు.
**అధివాసము.** సం. వి. అ. పుం. 1. ఉనికి; 2. వాసెనకట్టుట.
**అధివాసరము.** సం. వి. అ. పుం. న. అతివాసము.
**అధివిన్న.** సం. వి. ఆ. స్త్రీ. మొదటి పెండ్లాము. సవతితనముచేతదుఃఖించునది. (అనికొందఱు.)
**అధివేదనము.** సం. వి. అ. న. భార్యయుండ మఱలఁ బెండ్లియాడుట.
**అధిశ్రయణి.** సం. వి. ఈ. స్త్రీ. అంతిక, ప్రొయ్యి.
**అధిష్ఠాత.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) అధిష్ఠించువాఁడు. (ఈకారాంతమైనప్పుడు అధిష్ఠాత్రి అని రూపము. ఇట్లంతటనెఱుంగునది.)
**అధిష్ఠానము.** సం. వి. అ. న. 1. ఆక్రమించుట; 2. బండికన్ను; 3. ప్రభావము; 4. ఒకానొక పట్టణము.
**అధిష్ఠించు.** సం. స. క్రి. ఆశ్రయించియుండు.

అధీతము. సం. విణ. (అ. ఆ. అ.) అధ్యయనింపఁబడినది.

అధీతి. సం. వి. ఇ. స్త్రీ. అధ్యయనము. న్. పుం. అధ్యయనము చేసినవాఁడు.

అధీనము. సం. విణ. (అ. ఆ. అ.) ఆయత్తము, వగ్గము.

అధీశ్వరుఁడు. సం. వి. అ. పుం. సమస్తసామంతుల చేత సేవింపఁబడురాజు.

అధైర్యము. సం. వి. అ. న. ధైర్యములేమి.

అధోక్షజుఁడు. సం. వి. అ. పుం. అచ్యుతుఁడు, విష్ణువు.

అధోగతి. సం. వి. ఇ. స్త్రీ. తక్కువస్థితి.

అధోగతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తక్కువస్థితిని పొందినవాఁడు.

అధోభువనము. సం. వి. అ. న. క్రిందిలోకము, పాతాళము.

అధోముఖము. సం. విణ. (అ. ఈ. అ.) దిగుముఖముగలది.

అధ్యక్షించు. సం. స. క్రి. పరిపాలించు, ఏలు.

అధ్యక్షుఁడు. సం. వి. అ. పుం. అధికారి. విణ. ప్రత్యక్షమైనవాఁడు.

అధ్యగ్నికృతము. సం. వి. అ. న. వివాహవేళ అగ్నిహోత్రుని సన్నిధియందు చదివింపఁబడు స్త్రీధనము.

అధ్యయనము. సం. వి. అ. న. గురుముఖమున ఆనుపూర్విగ వేదముఁజదువుట.

అధ్యయనించు. సం. స. క్రి. అధ్యయనముచేయు.

అధ్యవసాయము. సం. వి. అ. పుం. ఉత్సాహము, పూనిక.

అధ్యాఖ్యానము. సం. వి. అ. న. కల్లజగడము, అభ్యాఖ్యానము.

అధ్యాత్మము. సం. అవ్య. జ్ఞానము.

అధ్యాపకుఁడు. సం. వి. అ. పుం. వేదముఁజదివించువాఁడు.

అధ్యాపనము. సం. వి. అ. న. వేదముఁజదివించుట.

అధ్యాయము. సం. వి. అ. పుం. గ్రంథభాగ విశేషము.

అధ్యాసనము. సం. వి. అ. న. ఆక్రమించుట, అధిష్ఠానము.

అధ్యాహావనికము. సం. వి. అ. న. పుట్టినింటనుండి వొచ్చినింటికిపోవునపుడియ్యఁబడునట్టి స్త్రీధనము.

అధ్యాహారము. సం. వి. అ. పుం. లేనిపదములు కొన్నిటిని తెచ్చుకొనుట.

అధ్యూఢ. సం. వి. ఆ. స్త్రీ. మొదటిపెండ్లాము. సవతితనముచేతదుఃఖించునది. (అనికొందఱు.)

అధ్యూఢుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

అధ్యేత. సం. వి. ఋ. పుం. చదువువాఁడు.

అధ్యేషణ. సం. వి. ఆ. స్త్రీ. పూజ్యులను సత్కారపూర్వకముగ నొకకార్యమున నియోగించుట. అడిగికొనుట. (అనికొందఱు.)

అధ్వగ. సం. వి. ఆ. స్త్రీ. ఆకాశగంగ, మిన్నేఱు.

అధ్వగుఁడు. సం. వి. అ. పుం. 1. దారినడచువాఁడు, తెరువరి; 2. సూర్యుఁడు.

అధ్వనీనుఁడు. సం. వి. అ. పుం. అధ్వగుఁడు, తెరువరి.

అధ్వన్యుఁడు. సం. వి. అ. పుం.——పై.——

అధ్వము. సం. వి. న్. పుం 1. త్రోవ; 2. చదుకము; 3. కాలము; 4. నిదురలోనగుసమయములందు శత్రువులపైఁబడుట.

అధ్వరము. సం. వి. అ. పుం. యాగము, జన్నము.

అధ్వరుఁడు. సం. వి. అ. పుం. ఒక వసువు. (చూ. వసువు.)

అధ్వర్యుఁడు. సం. వి. ఉ. పుం. యజ్ఞమునందు యజుర్వేదతంత్రమునడపువాఁడు.

అధ్వానము. సం. వి. అ. పుం. అమార్గము.

అన. దే. వి. 1. అనకట్ట; 2. అన్న; 3. చాఁగునట్టి మిక్కిలి లేఁతకొమ్మ. "క. అనలుఁగొనలుంబాఱుచు. మనమున నాకోర్కితీఁగె మగువకు మిగులన్." కళా. ౬. ఆ.

అనంగము. సం. వి. అ. న. 1. ఆకాశము; 2. హృదయము.

అనంగుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు. విణ. అంగములేనివాఁడు.

అనంత. సం. వి. ఆ. స్త్రీ. 1. భూమి; 2. పార్వతి; 3. ఉసిరిక!; 4. కరక!; 5. గఱిక; 6. తరిగొట్టి!; 7. తిప్పతీఁగ; 8. తీఁటకసింద!; 9. నీరుపిప్పలి!; 10. మామెన!. అ. న. ము. ఆకాశము. విణ. మేరలేనిది.

అనంతరము. సం. క్రి. విణ. అ. న. పిమ్మట. విణ. వెనుకటిది.

అనంతవిజయము. సం. వి. అ. పుం. ధర్మరాజుయొక్క శంఖము. విణ. ఎన్నికకుమీఱినజయములుగలది.

అనంతుఁడు. సం. వి. అ. పుం. 1. శేషుఁడు; 2. విష్ణువు.

అనఁగు. దే. అ. క్రి. కలయు. "ఉ. మనో, మోదము సేయుపిద్యలకుమువ్వురుఁజాలననఁగియున్న చో౯." ఉ, హరి. ౪, ఆ.

అనఁటి. దే. వి. అరఁటి, కదళీ.

అనక్షరము. సం. విణ. (అ. ఆ. అ.) ఉచ్చరింపఁగూడనిది. (తిట్టు.) సైఁగగాఁజెప్పునది. (మాట) (అనిర్వాచ్యము.)

అనఘము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నిర్దోషము; 2. నిర్మలము; 3. మనోజ్ఞము.

అనడ్వాహము. సం. వి. హ్. పుం. వృషభము, ఎద్దు.

అనద. వై. విణ. 1. అనాథ; 2. అల్పుఁడు*. "గీ. సలుపురోకనికోడిపాలుటబల్లిదు, లనదచేతఁజెడుటయునుఘటిల్లు." సం. "శూరంకాపురుషోహంతి." భార. ఉద్యో. 3. ఆ.

అనన్యజుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

అనన్యవృత్తి. సం. విణ. ఇ. ఒకటమనసు చెల్లినవాఁడు. ఏకాగ్రుఁడు.

అనన్యాదృశము. సం. విణ. (అ. ఈ. అ.) మఱియొకటితో సమానముకానిది.

అనన్వయము. సం. వి. అ. పు. ఒక యర్థాలంకారము. (చూ. అలంకారము.) విణ. అన్వయము లేనిది.

అనపత్యుఁడు. సం. విణ. (అ. ఆ అ.) బిడ్డలులేనివాఁడు.

అనపరాధి. సం. విణ. (న్. ఈ. న్.) అపరాధికానివాఁడు.

అనపాయము. సం. విణ. (అ. ఆ. అ.) అపాయము లేనిది.

అనపాయి. సం. విణ. (న్. ఈ. న్.) అపాయము లేనిది.

అనయము. ఉభ. దే. ద్ర. 1. అత్యంతము. "క. అనినవినియనుచితంబున, కనయముశఁకించియును." భార. విరా. ౨. ఆ. "క. మనమునఁగలిగి నవివేకమహిమకునయం, బును మెచ్చి." పర. ౪, ఆ.—2. అవశ్యము. "చ. కనకపుఁగుప్పలు౯ మణినికాయములు౯ ఘనధాన్యరాసులు౯, విసుతిగజాశ్వసంఘములు విశ్రుతగోమహిషాదికంబులు౯, దనకధికంబుగాఁగలిగిదాతయుభోక్తయునైనవాఁడునా, కనయముభర్తగావలయునంచొకభామినికోరవేడుక౯." భో. ౧, ఆ.—3. మతిమతి; "సీ. అదియేమి యెత్తిఁగింపుమని యాలతాంగితన్నయంబు నడుగ నిట్లనియెనతఁడు." కళా. 3, ఆ.—4 సతతము. "సీ. ననయమ్మువానిఁగన్నయమ్మగలయింతి ననయమ్మఁదాల్చువానన్నఁజెనకి." కా. ౪, ఆ. (కవిత్రయము వారిప్రయోగములయందీపదమున కత్యంతమను నర్థముతప్ప వేఱొండుగానఁబడదు. కడపటి యర్థము ఆధునికగ్రంథములయందే తఱుచుగాఁగనఁబడుచున్నది.)—సం. వి. అ. పుం. 1. అశుభము; 2. ఆపద; 3. దురదృష్టము; 4. ద్యూతాదివ్యసనము; 5. నీతికానిది.

అనరు. దే. వి. 1. సంకటము. "గీ. శరనిధులమాఖ్యములుదీఱెమరునకిట్టి, యనరునజయించుమని." ఆము. ౫, ఆ.—2. బ. జీవస్థానము, మర్మము. "క. తొడిగిన, యనలాస్త్రంబేసెననరులంటఁగనతఁడు౯." ఉ, హరి. ౪, ఆ.

అనర్గళము. సం. విణ. (అ. ఆ. అ.) అడ్డంకిలేనిది.

అనర్ఘము. సం. విణ. (అ. ఆ. అ.) వెలలేనిది.

అనర్ఘ్యము. సం. విణ. (అ. ఆ. అ.) (అర్ఘ్యము కానిది. అర్ఘ్యము=వెలపెట్టఁదగినది; పూజకొఱకైనది.)

అనర్థకము. సం. విణ. (అ. ఆ. అ.) పరస్పరాన్వయములేనిది. (దశదాడిమములు షడపూపములులోనగు పదసముదాయము.)

అనర్థము. సం. వి. అ. పుం. కీడు. విణ. అర్థము లేనిది.

అనర్హము. సం. విణ. (అ. ఆ. అ.) అర్హముకానిది.

అనలము. సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. జఠరాగ్ని.

అనలుఁడు. సం. వి. అ. పుం. 1. అగ్నిదేవుఁడు; 2. ఒక వసువు. (చూ. వసువు.)

అనవటిల్లు. దే. అ. క్రి. అన్నముపక్వమై చల్లారు.

అనవరతము. సం. క్రి. విణ. అ. న. ఎల్లప్పుడు. విణ. ఎడతెగనిది.

అనవరార్ధ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ముఖ్యము. గామిడి.

అనవస్కరము. సం. విణ. (అ. ఆ. అ.) కడుగుటలోనగువానిచేత గరగరికైనది, శోధితము.

అనస్సు. సం. వి. స్. న. శకటము, బండి.

**అనాకారము.** సం. విశే. (అ. ఆ. అ.) రూపములేనిది.

**అనాచారము.** సం. వి. అ. పుం. ఆచారములేమి. విశే. ఆచారములేనిది.

**అనాదరము.** సం. వి. అ. పుం. ఆదరములేమి.

**అనాది.** సం. విశే. ఇ. ఆదిలేనిది. (ఆది=మొదలు.)

**అనాదీయము.** సం. విశే. మరి పురాతనపుది.

**అనాథ.** సం. విశే. (అ. ఆ. అ.) నాథుఁడులేనిది.

**అనామతు.** హిం. వి. 1. నమ్మకముమీఁద అల్పకాలమొకవస్తువు నిచ్చుట. 2. ఒక వస్తువును వాడుకొనక యూరకయుంచుట.

**అనామధేయము.** సం. విశే. (అ. ఆ. అ.) పేరులేనిది.

**అనామిక.** సం. వి. ఆ. స్త్రీ. ఉంగరపువ్రేలు.

**అనాయకము.** సం. విశే. అరాజకము.

**అనాయాసము.** సం. వి. అ. పుం. ఆయాసములేమి. విశే. ఆయాసములేనిది.

**అనారతము.** సం. క్రి. విశే. అ. న. (చూ.) అనవరతము.

**అనార్యతిక్తము.** సం. వి. అ. పుం. నేలవేము**?**.

**అనావృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. దేశమునకు హానికలుగునట్లు బొత్తిగా వానలేకపోవుట, వఱపు.

**అనాస.** దే. వి. మొగలిపనస**?**.

**అనాహతము.** సం. విశే. (అ. ఆ. అ.) చలువచేయనిది, (క్రొత్తవస్త్రము) కోరికము.

**అని.** దే. వి. 1. యుద్ధము. 2. అల్లికమొదలు. స. ఏ. అన్నియొక్క రూపాంతరము. (చూ.) "పురాణంబులనియును నొకవిద్య." భార. శాం. 3, ఆ.—అవ్య. 1. ఈప్రకారము అను నర్థమును తెలుపును; "అంధుఁడవగుమని శాపంబిచ్చిన."—2. ప్రకారమును తెలుపును; "బ్రహ్మక్షత్త్రియవైశ్యశూద్రులని నాలుగువర్ణములవారు కలరు."—3. తలఁచుటను తెలుపును; "ఇమ్మహాత్మునకీఁగాంచితి, కృతార్థుండనైతినని మనంబున సంతసిల్లి."—4. కారణమును తెలుపును; "అశుచిభావంబునం గాకేమియప్పరమపతివ్రత మదీయదృష్టిగోచరకాకున్నదయ్యెనని పూర్వాభిముఖుండై."—5. ప్రసిద్ధిని తెలుపును. "ఉజ్జయిని అని యొక పట్టణముకలదు." (ఇంకను బ్రయోగములు విచారింపవలెను.)

**అనికి.** దే. వి. అల్లిక.

**అనిత్తువు.** సం. వి. అ. పుం. నల్లచెఱకు**?**.

**అనిత్యము.** సం. విశే. (అ. ఆ. అ.) నిత్యముకానిది. (నిత్యము=శాశ్వతము.)

**అనిదంపూర్వము.** సం. విశే. (అ. ఆ. అ.) అపూర్వము, అబ్బురము.

**అనిమిషము.** సం. వి. అ. పుం. మత్స్యము, చేఁప.

**అనిమిషుఁడు.** సం. వి. అ. పుం. దేవత, వేలుపు.

**అనిరుద్ధుఁడు.** సం. వి. అ. పుం. మన్మథునికొడుకు. విశే. అడ్డగింపఁబడనివాఁడు.

**అనిలుఁడు.** సం. వి. అ. పుం. 1. గాలి; 2. ఒక వసువు. (చూ. వసువు.)

**అనివార్యము.** సం. విశే. (అ. ఆ. అ.) నివార్యముకానిది. (నివార్యము=నివారింపఁదగినది.)

**అనిశము.** సం. క్రి. విశే. అ. న. (చూ.) అనవరతము.

**అనిష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) ఇష్టముకానిది.

**అనీకము.** సం. వి. అ. పుం, న. 1. యుద్ధము; 2. సేన.

**అనీకస్థము.** సం. వి. అ. పుం. 1. గుఱుతు; 2. వీరమర్దళము.

**అనీకస్థుఁడు.** సం. వి. అ. పుం. 1. యుద్ధమునందు నిలిచినవాఁడు; 2. ఏనుఁగులశిక్షించుటయందు నేర్పరియైనవాఁడు. 3. రాజ రక్షకుఁడు.

**అనీకిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. సేన; 2. (రెండువేలనూటయెనుబదియేడురథములు. అన్నియేనుఁగులు, ఆఱువేలనేనూటయుఱువదియొకటిగుఱ్ఱములు, పదివేలుందొమ్మనూటముప్పదియేవురు కాల్వురునుగల) సేనావిశేషము.

**అను.** దే. స. క్రి. 1. చెప్పు; "ఇట్లనియె." 2. అనిచెప్పు; "వ. ఇంద్రాదులకుఁ బ్రియంబుసేయుమనిన." 3. అనియడుగు. "ఏనుమీకిష్టంబుగా దూతనై యేమి సేయుదునవిన." భార. ఆర. ౨, ఆ.

**అనుఁగు.** దే. విశే. 1. ముఖ్యుఁడు. "క. తనకుంగాశిమహీపతి, యనుఁగుంజెలియగుటఁజేసి." హరి. ఉ. ౬, ఆ.—2. మొదటిది; "క. చనుదెంచి సర్వజనములుఁ, దనుఁగౌతూహలతరంగతరళితరవిలో, చనులైకనుఁగొనఁగ నగరి, యనుంగుమొగసాలగపనికవతీర్ణుండై." హరి. ఉ. 3, ఆ.—3. ఇంపు, మనోజ్ఞము. "సీ. వనవిహంగములయనుఁగుటెలుంగు లాహ్వానంబుచేయుకైవల్యఖగము." లక్ష్మి. ౫, ఆ.

అనుఁగుఁగత్తియ. ద్వ. విశే. (అనుఁగు+కత్తియ.) చెలికత్తె. "క. అత్తఱిఁబుత్తడిగీమున, బిత్తరిఁ గానక కరంబు పేర్చెననుంగుం, గత్తియలందఱు నొకచో, మొత్తము లైతత్తఱిలుచు మురి సడలంగన్." రసి. ౪. ఆ. (ఈయర్థము కవిత్రయము వారి సమ్మతము కాదనితోఁచెడి.)

అనుకంప. సం. వి. ఆ. స్త్రీ. కరుణ, కనికరము.

అనుకరణము. సం. వి. అ. న. అనుకృతి, అనుకరించుట.

అనుకరించే. సం. స. క్రి. అనుకరణము చేయు.

అనుకర్షము. సం. వి. అ. పుం. 1. నొగ చివర భూమిని ఆనక క్రిందనెత్తుగా సంధింపబడియుండు మ్రానితుండు, కోడిపీఁట; 2. ఆకర్షణము.

అనుకల్పము. సం. వి. అ. పుం. ముఖ్యకల్పమునకంటె నధమమైన వేదవిధానము.

అనుకామీనుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఇచ్ఛల పడినడచువాఁడు.

అనుకారము. సం. వి. అ. పుం. అనుకారము, పోలిక.

అనుకారి. సం. విశే. (న్. ఈ. న్.) పోలునది. (ఈ కారాంత స్త్రీలింగమైనప్పుడు అనుకారిణీ అని రూపము. ఇట్లంతట నెఱుంగునది.)

అనుకు. దే. విశే. ముద్దుగాక పలుచనైనది. "అనుకుంబాసెము." భీ. ౨. ఆ.

అనుకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఇచ్ఛగలవాఁడు. కాముకుఁడు.

అనుకూలము. సం. విశే. (అ. ఆ. అ.) ఆనుకూల్యముగలది.

అనుకూలించే. సం. అ. క్రి. అనుకూలమగు. ఒదవు.

అనుకూలుఁడు. సం. వి. అ. పుం. ఒక నాయకుఁడు. (చూ. నాయకుఁడు.) విశే. ఆనుకూల్యముగలవాఁడు.

అనుకృతి. సం. వి. ఇ. స్త్రీ. అనుకారము, పోలిక.

అనుక్రమణిక. సం. వి. ఆ. స్త్రీ. విషయసూచిక.

అనుక్రమము. సం. వి. అ. పుం. ఒకటి వెంబడి ఒకటి, సొరిది.

అనుక్రోశము. సం. వి. అ. పుం. దయ, కనికరము.

అనుక్షణము. సం. క్రి. విశే. అ. న. ప్రతిక్షణము.

అనుగంత. సం. విశే. (ఋ. ఈ. ఋ.) వెంబడించువాఁడు.

అనుగతము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పొందఁబడినది; 2. వెంబడింపఁబడినది.

అనుగతి. సం. వి. ఇ. స్త్రీ. వెంబడించుట.

అనుగమనము. సం. వి. అ. న. అనుగతి.

అనుగమము. సం. వి. అ. పుం. ఒక లక్షణము పెక్కింటికి సరిదాఁకుట.

అనుగమించే. సం. స. క్రి. వెంబడించు.

అనుగము. సం. విశే. (అ. ఆ. అ.) వెంబడించునది.

అనుగలము. వై. విశే. 1. అనుకూలము. "ఎ. గీ. అఖిలజగదీశ్వరునకింతయనుగలముగ, నేమి తపమొనరించెనో యిప్పయోధి." లక్ష్మీ. 3. ఆ. 2. సమానము. "క. పైనిగుడుమంచుఁదువ్వర, వానలచేఁదడిసి కమలవనలక్ష్మిహరి. ధ్యాననిమీలితలోచన, యానల రాధావధూటికనుగలమయ్యెన్." పాండు. ౪. ఆ.

అనుగుణము. సం. విశే. (అ. ఆ. అ.) తగినది, అర్హము.

అనుగ్రహము. సం. వి. అ. పుం. ఏలుకొనుట.

అనుగ్రహించే. సం. స. క్రి. ఏలుకొను.

అనుచరుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) సహాయుఁడు. తోడు.

అనుచితము. సం. విశే. (అ. ఆ. అ.) ఉచితము కానిది. (ఉచితము=తగినది.)

అనుచే. దే. ప్రే. 1. అరుగఁజేయు. పుచ్చు; "గీ. అధిపుఁడనిచిపుచ్చనతఁడుపోయి." నిర్వ. ౯. ఆ.—2. ఆజ్ఞాపించు. "చ. నేఁ బనిచెదవ్రజముకన్ జమునిపాలికి నన్నరిపాలు వేగమే. యనుచుటకు." భార. అశ్వ. ౧. ఆ.—(అనుచు అనుదానికి ఆజ్ఞాపించు అనియు. పనుచు అనుదానికి పుచ్చు అనియు ఔపచారికముగా అర్థములు వాడఁబడుచున్నవి. ఇది పెరుఁగుధాతువువంటిది.)

అనుజీవి. సం. వి. న్. పుం. సేవకుఁడు. కొలఁపుడుకాఁడు.

అనుజుఁడు. సం. వి. అ. పుం. కనిష్ఠుఁడు, తమ్ముఁడు.

అనుజ్ఞ. సం. వి. ఆ. స్త్రీ. ఆజ్ఞ. మొదల.

అనుజ్ఞాతుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఆజ్ఞాపింపఁబడినవాఁడు.

అనుజ్ఞానము. సం. వి. అ. న. అనుజ్ఞ. భార. సభా. ౨. ఆ.

అనుతర్షము. సం. వి. అ. పుం. 1. ఆశ; 2. కోరిక; 3. కల్లుమీఁదియాశ; 4. కల్లుత్రాగెడుగిన్నె; 5. కల్లుత్రాగుట; 6. కల్లువడ్డించుట.

**అనుతాపము.** సం. వి. అ. పుం. పశ్చాత్తాపము, వగపు.

**అనుత్తమము.** సం. విణ. (అ. ఆ. అ.) ముఖ్యము, గామిడి.

**అనుత్తరము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉత్తరదేశముకానిది; 2. మాఱుమాటలేనిది; 3. మీఁదుకానిది; 4. శ్రేష్ఠముకానిది; 5. శ్రేష్ఠము.

**అనుదాత్తము.** సం. వి. అ. పుం. వేదమునందలి స్వరవిశేషము. (చూ. స్వరము.)

**అనుదినము.** సం. వి. అ. న. నానాఁడు.

**అనునయము.** సం. వి. అ. పుం. ప్రశ్రయము, ఊఱట.

**అనునయించు.** సం. స. క్రి. ఊఱడించు.

**అనునీతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఊఱడింపఁబడినవాఁడు.

**అనుపదము.** సం. విణ. అ. న. వెంబడించునది. అవ్య. ఎడపదడప.

**అనుపదీన.** సం. వి. ఆ. స్త్రీ. కాలికిఁగొలఁదియైన చెప్పులు.

**అనుపపత్తి.** సం. వి. ఇ. స్త్రీ. ఉపపత్తిలేమి. (ఉపపత్తి=కలిమి.)

**అనుపమ.** సం. వి. ఆ. స్త్రీ. నైరృతిమూలయందలి యాఁడేనుఁగు. విణ. 1. చక్కనిది; 2. మేలైనది.

**అనుపయుక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉపయుక్తముకానిది. (ఉపయుక్తము = ఉపయోగిమైనది.)

**అనుపరి.** దే. వి. సుంకముతీయువాఁడు, సుంకరి.

**అనుపల్లవము.** సం. వి. అ. పుం. పల్లవివెంబడి చరణము.

**అనుపసూది.** ద్వ. వి. (అనుము+సూది.) గుండుసూది.

**అనుపానము.** సం. వి. అ. న. 1. మందుతోఁగూడఁ జేర్చిపుచ్చుకొనెడు వస్తువు; 2. అన్నముతోఁగూడ భుజింపఁదగిన కూరమొదలగుసాధనము.

**అనుపు.** దే. స. క్రి. 1. ఆజ్ఞాపించు; "మఖప్రారంభము వేళకనిషిపంపుదము." జై. ౮, ఆ.— 2. పుచ్చు. (చూ. అంచు.)—వి. 1. ప్రయాణమై పోవువారికితోడుపంపుట; "సీ. తస్కరబాధనొందకయుండ నెడరైనయటవీస్థలంబున ననుపుఁబెట్టు." సం. "అనువ్రజతి కాంతారే ప్రాంతరేపథికాన్పథి." కాశీ. ౪, ఆ.—2. సుంకము. "ఎ. గీ. తెఱవలటునీరువోయఁపందిరియఁ చేరి, యవలఁగొఱగాక పిచ్చుకుంటయియనంగఁ, డనుపుగొనఁజొచ్చెఁగల్లుగుట్టమరవారి, కధ్వగులులాసియిడు విడియములపేర." ఆము. ౨. ఆ.

**అనుప్రాసము.** సం. వి. అ. పుం. శబ్దసామ్యము గలిగియుండునట్లు చెప్పిన యొకశబ్దాలంకారము.

**అనుప్లవుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) అనుచరుఁడు, తోడు.

**అనుబంధము.** సం. వి. అ. పుం. 1. జరగుచున్నదాని ననువర్తించుట; 2. కట్టు; 3. తప్పుబయలుపఱచుట; 4. (వ్యాకరణమున) ప్రకృతిప్రత్యయాదులచేఁజెడెడియక్షరము; 5. ప్రకృత్యాది.

**అనుబంధించు.** సం. స. క్రి. అనువర్తించు.

**అనుబంధుఁడు.** సం. వి. అ. పుం. తల్లిదండ్రులులోనగు పెద్దల ననుసరించినడుచు కొడుకులోనగువాఁడు.

**అనుబోధము.** సం. వి. అ. పుం. ప్రబోధనము, అత్తరు.

**అనుభవము.** సం. వి. అ. పుం. అనుభవించుట, కుడుపు.

**అనుభవి.** సం. విణ. (న్. ఈ. న్.) అనుభవముకలవాఁడు.

**అనుభవించు.** సం. స. క్రి. అనుభవము చేయు, కుడుచు.

**అనుభావము.** సం. వి. అ. పుం. 1. నిశ్చయము; 2. ప్రభావము; 3. భావమునుదెలిపెడిముఖవికాసాది.

**అనుభావ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) అనుభవింపఁదగినది.

**అనుభుక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) అనుభవింపఁబడినది.

**అనుభుక్తి.** సం. వి. ఇ. స్త్రీ. అనుభవము, కుడుపు.

**అనుభూతము.** సం. విణ. (అ. ఆ. అ.) అనుభవింపఁబడినది.

**అనుభూతి.** సం. వి. ఇ. స్త్రీ. అనుభుక్తి, కుడుపు.

**అనుభోగము.** సం. వి. అ. పుం. అనుభూతి, కుడుపు.

**అనుమఁడు.** వై. వి. హనుమంతుఁడు. "క. వినుమనుమఁడ వినుమనుమఁడ, వనఁదనరిననీకునెందు నడ్డముగలదే." అచ్చ. యు, కాం.

అనుమంతిగాఁడు. వై. వి. హనుమంతుని సామర్థ్యమువంటి సామర్థ్యము కలుగుటచేత కుక్కకియ్యఁబడిన పేరు. (చూ. గబ్బి.)

అనుమతము. సం. విణ. (అ. ఆ. అ.) సమ్మతింపఁబడినది.

అనుమతి. సం. వి. ఇ. స్త్రీ. 1. సమ్మతి; 2. ఒక కళ తక్కువైన చంద్రుఁడుగల పున్నమ.

అనుమతించే. సం. స. క్రి. సమ్మతించు. ఒడఁబడు.

అనుమరణము. సం. వి. అ. న. ఒకరిచావుననుసరించి చచ్చెడుచావు.

అనుమానము. సం. వి. అ. న. 1. ఊహించుట; 2. ఒక యర్థాలంకారము; (చూ. అలంకారము.) 3. సందేహము. "మ. అనుమానాకులతం బదంబుమృదుశయ్యా గూర్పఁగా లేక." కవిక. ౪, ఆ. (దీని నీయర్థమునఁ గొందఱు దేశ్యమని చెప్పిరియున్నారు.)

అనుమానించే. సం. అ. క్రి. 1. ఊహించు; 2. సందేహించు. (చూ. అనుమానము.)

అనుము. దే. వి. 1. ఒప్పు; "క. అమ్మానేనిన్నేలిన, యమ్ముద్దియగాను బుడమిననుముదలిర్పన్, బ్రిమ్మురియయాతియుడిగపుఁ, గొమ్మన్." య. ౫. ఆ.—2. సస్యవిశేషము; 3. బ. ధాన్యవిశేషము.

అనుమేయము. సం. విణ. (అ. ఆ. అ.) ఊహింపఁదగినది.

అనుమోదము. సం. వి. అ. పుం. 1. సంతోషము; 2. సమ్మతి.

అనుమోదించే. సం. అ. క్రి. 1. సంతోషించు; 2. సమ్మతించు.

అనుయాయి. సం. విణ. (న్. ఈ. న్.) వెంబడించువాఁడు.

అనుయుక్తము. సం. విణ. (అ. ఆ. అ.) అడుగఁబడినది, పృష్టము.

అనుయోగము. సం. వి. అ. పుం. అడుగుట, ప్రశ్నము.

అనురక్తము. సం. విణ. (అ. ఆ. అ.) అనురాగము గలది.

అనురక్తి. సం. వి. ఇ. స్త్రీ. అనురాగము, కూరిమి.

అనురాగము. సం. వి. అ. పుం. అనురక్తి, కూరిమి.

అనురాధ. సం. వి. ఆ. స్త్రీ. నక్షత్రవిశేషము. (దీనినే అనూరాధ అందురు.)

అనురూపము. సం. విణ. (అ. ఆ. అ.) అనుగుణము.

అనురోధము. సం. వి. అ. పుం. అనుసరించి నడచుట, అనువర్తనము.

అనులాపము. సం. వి. అ. పుం. మాటిమాటికిఁ జెప్పెడుమాట.

అనులేపనము. సం. వి. అ. న. పూఁత.

అనులోమము. సం. విణ. (అ. ఆ. అ.) ఆరోహణక్రమముగలది.

అనువదించే. సం. స. క్రి. ఒకరుచెప్పినదానిని మరలఁజెప్పు.

అనువయించే. సం. స. క్రి. (గుడ్డలులోనగువాని) నేయు.

అనువరి. దే. విణ. (అను వు+అరి.) ఉపాయశాలి. "చ. అ, య్యనువరియూపుఁగైవడియు నన్వయముం జరితంబుఁజెప్పుమా." ఉ. హరి. ౫, ఆ.

అనువర్తనము. సం. వి. అ. న. అనురోధము.

అనువర్తించు. సం. స. క్రి. అనుసరించినడచు.

అనువాకము. సం. వి. అ. పుం. అజ్జము.

అనువాదము. సం. వి. అ. పుం. ఒకరుచెప్పినదాని మరలఁజెప్పుట.

అనువిద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) సంబంధించినది, కూడినది.

అనువు. దే. వి. 1. ఉపాయము; "క. తనువునవితిగినయమ్ముల, ననువునఁబుచ్చంగవచ్చునతినిష్ఠురతన్, మనముననాటిన మాటలు, వినుమెన్నియుపాయములను వెడలునెయధిపా." భార. ఉద్యో. ౨, ఆ.—2. విధము; "క. మనపనిదనపనిదనపని, మనపనిగానడతుమతఁడుమనమునొకఁడుమో, చినమోపిద్దఱుమోచిన, యనువున నీతోడుపడుట యతనికిఁగీడే." ఉ. హరి. ౫, ఆ.—3. అవకాశము. "వ. కలభాషిణి కంఠంబునకుఁ దనకంఠంబునడ్డంబుచేర్చి ప్రేటునకనువీకదాని నిరుగేలంబొదుగఁబట్టుకొని." కళా. 3. ఆ.—విణ. యుక్తము. "క. విను చదివించినయతఁడున్, దనతండ్రియునొక్కరూపు తలఁపఁగనదిగా, వుననీవు నాకుఁజెల్లెల, వనువగు నాయిట్టిమాటలాడఁగనీకున్." య. 3. ఆ.

అనువుచేయు. ద్వి. స. క్రి. సిద్ధపఱచు. "క. కురుపతిపడవాల్లందఱు, దొరలకడకు సత్వరముగ దురమునకుభటో, త్కరము ననువుచేయుటకై.

బరవసముదలిర్పఁబనిచెఁబార్థివముఖ్యా." సం. "అబ్రవీత్తావకాన్సర్వాన్ సన్నహ్యన్తాం మహారథాః." భార. శల్య. ౧. ఆ.

**అనువుపడు.** ద్వి. అ. క్రి. సరిపడు. యుక్తమగు.

**అనువ్రతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఒకరివ్రతమునను సరించిచేయు వ్రతముగలవాఁడు.

**అనుశయము.** సం. వి. అ. పుం. 1. అనుబంధము; 2. ద్వేషము; 3. పశ్చాత్తాపము.

**అనుశాయి.** సం. వి. న్. పుం. పుణ్యపాపరూపకర్మములకు ఫలభూతములైన స్వర్గనరకాదులననుభవించినపిమ్మట శేషించిన పుణ్యపాపములవాసనగలవాఁడు.

**అనుశాసనము.** సం. వి. అ. న. ఆజ్ఞ, ఆనతి.

**అనుశ్రుతి.** సం. వి. ఇ. స్త్రీ. ప్రస్తావవిషయము ననుసరించిన యితరజనసంభాషణములవినికి.

**అనుషంగము.** సం. వి. అ. పుం. 1. చేరిక; 2. తగులు.

**అనుష్టుప్పు.** సం. వి. భ్. స్త్రీ. 1. ఒక ఛందస్సు; (చూ. ఛందస్సు.) 2. సరస్వతి.

**అనుష్ఠానము.** సం. వి. అ. న. ఆచారము, నడవడి.

**అనుష్ఠించు.** సం. స. క్రి. ఆచరించు, నడపు.

**అనుష్ఠేయము.** సం. విణ. (అ. ఆ. అ.) అనుష్ఠింపఁదగినది, నడపఁదగినది.

**అనుష్ణుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. వేఁడిమిలేనివాఁడు; 2. సోమరి.

**అనుసంధానము.** సం. వి. అ. న. 1. కూర్పు; 2. భక్తిగ్రంథములపఠనము.

**అనుసంధించు.** సం. స. క్రి. 1. కూర్చు; 2. భక్తిగ్రంథములఁబఠించు.

**అనుసరణము.** సం. వి. అ. న. అనుసరించుట, తోడరిక.

**అనుసరించు.** సం. స. క్రి. అనువర్తనముచేయు, తోడరు.

**అనుసారణి.** సం. వి. ఈ. స్త్రీ. రెండవసారణి.

**అనుసారము.** సం. వి. అ. పుం. అనుసరణము, తోడరిక.

**అనుసారి.** సం. విణ. (న్. ఈ. న్.) అనుసరించువాఁడు.

**అనుసు.** దే. వి. గదాదండములులోనగువానికి వేసెడి యినుములోనగువానికడియము. "ద్వి. గీ. తలకుఁబుత్తడియనుసుబెత్తంపుఁగట్టెఁ, బట్టిసేనాధిపతి బరాబరులుసేయ." చంద్రా. ౧. ఆ.

**అనుస్మరణము.** సం. వి. అ. న. తలఁపు.

**అనుస్యూతము.** సం. విణ. (అ. ఆ. అ.) ఎడతెగనిది.

**అనుస్వారము.** సం. వి. అ. పుం. బిందువు, సున్న.

**అనుహారము.** సం. వి. అ. పుం. అనుకారము, పోలిక.

**అనూకము.** సం. వి. అ. న. 1. కులము; 2. శీలము. పుం. పూర్వజన్మము.

**అనూచానుఁడు.** సం. వి. అ. పుం. అంగములతోఁడ వేదాధ్యయనముచేసిన బ్రాహ్మణుఁడు. విణ. వినయముగలవాఁడు.

**అనూనము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. అంతయు; 2. వెలితిలేనిది. (రూ. అనూనకము.)

**అనూపము.** సం. వి. అ. పుం. ఎనుఁబోతు. విణ. జవుకుగలది. (నేల.)

**అనూరుఁడు.** సం. వి. అ. పుం. గరుత్మంతుని యన్న, అరుణుఁడు.

**అనృజుఁడు.** సం. విణ. ఉ. శఠుఁడు, మోసకాఁడు.

**అనృతము.** సం. వి. అ. న. కృషి. విణ. అసత్యము.

**అనేకపము.** సం. వి. అ. పుం. గజము, ఏనుఁగు.

**అనేకము.** సం. స. (అ. ఆ. అ.) పెక్కు.

**అనేడమూకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. చెవిటిమూఁగ; 2. మోసకాఁడు.

**అనేహస్సు.** సం. వి. స్. పుం. సమయము, తఱి.

**అనోకహము.** సం. వి. అ. పుం. తరువు, చెట్టు.

**అన్న.** దే. వి. అగ్రజుఁడు. (ఇది వాత్సల్యసంబోధనమునందు సంబోధ్యశబ్దంబునకు మాఱుగాఁ బ్రయోగింపఁబడును. "క. అన్న యిదిధర్మువనిమీ, యన్నను నన్నును నతిప్రియంబున నెదలో, మన్నించియేమిపనిచినఁ, గ్రన్నననాపనుపుసేయఁగడఁగుముబుద్ధిన్." భార. ఆది. ౭. ఆ. -- ప్రార్థనమందు వ్యతిరేకక్రియమీద ఆగమముగావచ్చును. "ఉ. వెన్నుఁడుప్రీతిఁజెప్పిన సవిస్తరవాక్ప్రచయంబుత్రోఁచఁబోవన్న." భార. ఉద్యో. 3, ఆ.)

**అన్నగళి.** దే. వి. నపుంసకుఁడు. (అప్ర.)

**అన్నన్న.** దే. అవ్య. (అన్న+అన్న.) ఆశ్చర్యమును దెలుపునది. "క. అన్నన్న మొగము వెన్నని, య

న్నన్న జయించుఁగన్నులన్నన్నలినా, సన్నములు నడుము మిక్కిలి, సన్నముమాటలుసుధాప్రసన్నములెన్నఁగ౯." విజ. ౧, ఆ.

అన్నప్రాశనము. సం. వి. అ. న. బిడ్డలకు మొట్టమొదట అన్నము తినిపించెడి యొక శుభకర్మము. (చూ. కర్మము.)

అన్నము. సం. వి. అ. న. వంటకము. విణ. తినఁబడ్డది.

అన్నా. దే. అవ్య. ఆశ్చర్యార్థకము. (చూ. నాడిక.)

అన్ని. ద్వ. స. ఏ. (అంత శబ్దమునకు అమహదర్థక బహువచనాదేశము.) 1. సమస్తము; 2. అంత సంఖ్యగలవి.

అన్చి. దే. ప్రే. అనుచుయొక్క రూపాంతరము. "పైఁబడిన తమ్ములనంతకు ప్రోలికన్చి." భార. ద్రో. ౧, ఆ. (చూ. అనుచు.)

అన్ను. దే. వి. 1. ఒల్లెయుఁగమి, పారవశ్యము; "ఉ. కన్నులనిద్రదేఱఁగ నకంపితుఁడైయతఁడెంతచేసినఁ౯, దన్ను నెఱుంగకొక్క మొగిఁదత్కపిసైన్యచయంబుఁబోరఁజే. రన్ను నమ్రింగఁజొచ్చె." భార. అర. ౭, ఆ.—2. ఆఁడుది.

అన్నుకొను. దే. అ. క్రి. పరవశమగు. "క. సన్నపుఁ దలయేరునమై, యన్నుకొనుచునాముదిన్నయల్లైరాఁగా." స్వా. ౪. ఆ. (ప్రే. అన్నుకొల్పు.)

అన్నువ. దే. విణ. అలఁతి, అల్పము. "క. వెడఁదయురంబునునన్నువ. కడుపును దృఢకఠినతనువుఁగలయాతనికి౯." భార. ఆది. ౭, ఆ.

అన్నువు. దే. వి. అన్ను, పారవశ్యము. "సీ. నలువ చెందొవల జేకులకునన్నువు వెట్టఁగోరికావించి నగుళికయనఁగ." భార. ద్రోణ. ౪. ఆ.

అన్నెకాఁడు. ద్వ. విణ. (అన్నెము + కాఁడు.) అన్యాయకారి. "అన్నెకాఁడైవాఁడు నావల పెల్లనారుదూఱు చేసెనే." క్షేత్రయ.

అన్నెకారి. వై. విణ. అన్యాయకారిణి. "అన్నెకారిచాడివిన్నాఁడు." క్షేత్రయ.

అన్నెము. వై. వి. అన్యాయము. "ఉ. మున్నొకనాడునంగనలముద్దులసుద్దులెఱుంగనట్టిచో, నన్నెమిఁకేల." శశాం. ౨, ఆ.—స. ఇతరము. "నన్నుఁగూడిన నాఁటనుండి యన్నెమెఱుఁగఁడు." క్షేత్రయ.

అన్యతరము. సం. స. (అ. ఆ. అ.) 1. రెంటిలోనేదేనియొకటి; 2. మఱియొకటి.

అన్యథాకరించు. సం. స. క్రి. వేఱుసేయు. "గీ. గురులలోనఁబరమ గురువుతల్లియయట్టి, తల్లివచనమునువిధాతకృతియు, నన్యథాకరింపనలవియె యనిన." భార. ఆది. ౭, ఆ.

అన్యము. సం. స. (అ. ఆ. అ.) వేఱైనది; 2. సరిలేనిది.

అన్యాదృశము. సం. విణ. (అ. ఈ. అ.) మఱియొకటితో సరియైనది.

అన్యాయము. సం. విణ. (అ. ఆ. అ.) న్యాయము లేనిది.

అన్యోన్యము. సం. వి. అ. న. 1. పరస్పరము; 2. ఒక యర్థాలంకారము. (చూ. అలంకారము.)

అన్వక్కు. సం. విణ. (చ్. ఈ. చ్.) వెంబడించువాఁడు.

అన్వక్షుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అన్వక్కు.

అన్వయము. సం. వి. అ. పుం. 1. కులము; 2. పొందిక.

అన్వయించు. సం. స. క్రి. పొందికపఱచు.

అన్వర్థము. సం. విణ. (అ. ఆ. అ.) పొసఁగిన యర్థముగలది.

అన్వవాయము. సం. వి. అ. పుం. వంశము, కొలము.

అన్వాహార్యము. సం. వి. అ. న. నెలనెలకు చేయఁదగిన పిండపితృయజ్ఞాదికము.

అన్వితము. సం. విణ. (అ. ఆ. అ.) కూడుకొన్నది.

అన్విష్టము. సం. విణ. (అ. ఆ. అ.) అన్వేషితము, వెదకఁబడినది.

అన్వీక్షకి. సం. వి. ఈ. స్త్రీ. తర్కవిద్య.

అన్వీక్షణము. సం. వి. అ. న. మార్గణము, వెదకుట.

అన్వీతము. సం. విణ. (అ. ఆ. అ.) అన్వితము.

అన్వేషణ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆమంత్రణార్థము వెదకుట; 2. వెదకుట.

అన్వేషించు. సం. స. క్రి. వెదకు.

అన్వేషితము. సం. విణ. (అ. ఆ. అ.) అన్విష్టము.

అప. ఊభ. వై. వి. 1. అమ్మ; "గీ. అనిశశివవాసమైన పుణ్యాపురమణివ, ఘాపహస్మృతివనుచునాయపకలంక, మానసోత్కర్షయుక్తులనూననుతులు, సేసియందఱుఁదత్పురస్థితినిబరఁగ." రాఘు. ౨, ఆ.—2. తండ్రి; (చూ. అప్ప.) 3. అక్క*. సం

ఉపసర్గము. విరుద్ధార్థమునిచ్చునది. (ఉదా. అపకీర్తి, అపజయము. మొ.)

అపకర్షము. సం. వి. అ. పుం. 1. ఆకర్షణము; 2. తక్కువపాటు.

అపకారము. సం. వి. అ. పుం. అపకృతి, కీడు.

అపకారి. సం. విణ. (న్. ఈ. న్.) అపకారముచేయువాఁడు.

అపకీర్తి. సం. వి. ఇ. స్త్రీ. చెడుపేరు, దుర్యశము.

అపకృతి. సం. వి. ఇ. స్త్రీ. అపకారము, కీడు.

అపకృతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అపకారముచేయఁబడినవాఁడు.

అపకృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) అధమము.

అపకృష్టి. సం. వి. ఇ. స్త్రీ. అపకర్షము, ఆకర్షణము.

అపక్రమము. సం. వి. అ. పుం. యుద్ధమువలనఁబాఱుట, ఈడఁబోక.

అపక్రమించే. సం. అ. క్రి. యుద్ధమువలనఁబాఱు. ఈడఁబోవు.

అపఖ్యాతి. సం. వి. ఇ. స్త్రీ. అపకీర్తి.

అపగతము. సం. విణ. (అ. ఆ. అ.) పోయినది.

అపగమము. సం వి. అ. పుం. గమనము, పోక.

అపఘనము. సం. వి. అ. పుం. 1. అవయవము; 2. శరీరము.

అపచయము. సం. వి. అ. పుం. 1. తగ్గుదల; 2. పూజ.

అపచయించే. సం. స. క్రి. పువ్వులుగోయు, చిదుము.

అపచాయితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పూజింపఁబడినవాఁడు, అపచితుఁడు.

అపచారము. సం. వి. అ. పుం. పెద్దలయెడఁజేసిన తప్పు.

అపచితి. సం. వి. ఇ. స్త్రీ. 1. పూజ; 2. ప్రాయశ్చిత్తము; 3. వ్యయము; 4. హాని.

అపచితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పూజింపఁబడినవాఁడు, అర్చితుఁడు.

అపజయము. సం. వి. అ. పుం. పరాజయము, ఓటమి.

అపటువు. సం. వి. ఉ. పుం. బాలుఁడు. విణ. తెవులుగొంటు.

అపతోక. సం. వి. ఆ. స్త్రీ. ఈఁచుకపోయినయావు.

అపత్నీకుఁడు. సం. వి. అ. పుం. భార్యపోయినవాఁడు.

అపత్యము. సం. వి. అ. న. బిడ్డ. (కొడుకుగాని కూఁతురుగాని.)

అపత్రప. సం. వి. ఆ. స్త్రీ. పరులవలనఁగలిగినసిగ్గు.

అపత్రపిష్ణువు. సం. విణ. ఉ. లజ్జయే స్వభావముగాఁగలవాఁడు, సిగ్గరి.

అపథము. సం. వి. అ. న. న్. పుం. తప్పుత్రోవ

అపథ్యము. సం. విణ. (అ. ఆ. అ.) పథ్యముకానిది.

అపదాంతరము. సం. విణ. (అ. ఆ. అ.) కదిసినది.

అపదానము. సం. వి. అ. న. 1. కడచినపని; 2. ఖండనము.

అపదిశము. సం. వి. అ. న. రెండుదిక్కులకు మధ్యభాగము. అయిమూల.

అపదూఱు. మి. గ్రా. వి. ఊరకమోపినదూఱు, అభిశాపము.

అపదేశము. సం. వి. అ. పుం. 1. కపటము; 2. నిమిత్తము; 3. ప్రసిద్ధి; 4. స్థానము.

అపధ్వస్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తిరస్కరింపఁబడినవాఁడు. నిర్భర్త్సనముచేత బహిష్కారముచేయఁబడినవాఁడు. (అనికొందఱు.)

అపనమ్మిక. మి. గ్రా. వి. అవిశ్వాసము. "క. సామ్మొకచోనుండఁగనప, నమ్మికయొకచోటనుండు నరులకునెపుడుఁన్." హరిశ్చ. ౫, ఆ.

అపనయము. సం. వి. అ. పుం. 1. కీడు; 2. తొలఁగించుట.

అపనయించే. సం. స. క్రి. తొలఁగించు.

అపనింద. సం. వి. ఆ. స్త్రీ. అపదూఱు.

అపనీతము. సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగింపబడినది.

అపనుదము. సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగించునది. "జయజయకిల్బిషాపనుద." ఉ, హరి. ౬, ౯

అపనెపము. మి. గ్రా. వి. అపదూఱు. "ద్వి. అటఁబోయినంతలోనపనెపమాను." సా. ౨, భా.

అపనేయము. సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగింపఁదగినది.

అపనోదము. సం. వి. అ. పుం. తొలఁగించుట.

అపనోది. సం. విణ. (న్. ఈ. న్.) తొలఁగించునది

అపపాడి. మి. గ్రా. వి. అన్యాయము. "గీ. అవపతులుఁ పలువురపపాడినొక్కనిఁ, దన్ను బొదివిపిలిచినను దరలకెదిర, పోటులాడివాఁ

పుత్రుండు పడుటకాఁ. గీర్తికరము గానికీడు గాదు." మార్క. ౮, ఆ.

అపప్రథ. సం. వి. ఆ. స్త్రీ. చెడ్డపేరు.

అపభ్రంశము. సం. వి. అ. పుం. 1. అపశబ్దము; 2. పడుట; 3. భాషావిశేషము.

అపమర్దము. సం. వి. అ. పుం. బాధ. నొగులు.

అపమృత్యువు. సం. వి. ఉ. పుం. స్త్రీ. తటాలున కలిగినచావు.

అపయశము. సం. వి. స్. న. అపఖ్యాతి.

అపయానము. సం. వి. అ. న. అపక్రమము.

అపర సం. వి. ఆ. స్త్రీ. మావి. అ. న. ము. ఏనుఁగు వెనుకటిపిక్కలోనగుకాలు. స. 1. ఇతరము; 2. క్రిందిది; 3. మీఁదిది.

అపరంజి. దే. వి. పదివన్నెబంగారు. ఉదిరి.

అపరక్రియ. సం. వి. ఆ. స్త్రీ. చచ్చినవానిగుఱించి వెనుకచేయుకర్మము.

అపరభాగము. సం. వి. అ. పుం. వెనుకటిభాగము.

అపరస్వరము. సం. వి. అ. న. ఏ. ఎడతెగని క్రియ. విణ. ఎడతెగనిక్రియగలది.

అపరాజిత. సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. తక్కిలి*; 3. విష్ణుక్రాంతము*; 4. సోమిదము*.

అపరాజితుఁడు. సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. శివుఁడు. విణ. గెలువఁబడనివాఁడు.

అపరాతిరి. మి. గ్రా. వి. అద్దమరేయి, అర్ధరాత్రము.

అపరాధము. సం. వి. అ. పుం. ఆగము, తప్పు.

అపరాధి. సం. విణ. (న్. ఈ. న్.) తప్పుగలవాఁడు.

అపరాద్ధపృషత్కుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) గుఱితప్పినబాణముగలవాఁడు.

అపరాద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) తప్పినది.

అపరాలు. దే. వి. బ. పయరధాన్యము.

అపరాహ్ణము. సం. వి. అ. పుం. దినము మూఁడు భాగములైనప్పుడు కడపటిభాగము. అయిదు భాగములైనప్పుడు నాలవభాగము. (చూ. కాలము.)

అపరిమితము. సం. విణ. (అ. ఆ. అ.) పరిమితము కానిది. (పరమితము=మితము.)

అపర్ణ. సం. వి. ఆ. స్త్రీ. పార్వతి. గట్రాచూలి.

అపలపించు. సం. స. క్రి. నిహ్నవించు. మఱుఁగుపుచ్చు.

అపలభ. సం. వి. ఆ. స్త్రీ. బుద్ధివిశేషము, మేధ.

అపలాపము. సం. వి. అ. పుం. 1. మఱుఁగుమాట; 2. ప్రేమము.

అపవనము. సం. వి. అ. న. ఉపవనము, తోఁట.

అపవరకము. సం. వి. అ. న. గర్భాగారము. లోఁగది.

అపవర్గము. సం. వి. అ. పుం. 1. మోక్షము; 2. ముగియిక; 3. ఈవి; 4. ఈడేఱుట.

అపవర్జనము. సం. వి. అ. న. 1. విడుపు; 2. మోక్షము; 3. ఈవి.

అపవర్తనము. సం. వి. అ. న. మిక్కిలి తక్కువ పనులనుండిమరలుట.

అపవాదము. సం. వి. అ. పుం. 1. దూఱు; 2. ఆజ్ఞ; 3. నమ్మకము.

అపవారణము. సం. వి. అ. న. తిరోధానము. మఱుఁగు.

అపవిష. సం. వి. ఆ. స్త్రీ. అతివస*.

అపశదుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తక్కువపడినవాఁడు, నీచుఁడు, (రూ.) అపసదుఁడు.

అపశబ్దము. సం. వి. అ. పుం. తొచ్చెపుమాట. అపభ్రంశము.

అపష్ఠువు. సం. వి. అ. పుం. కాలము. విణ. ప్రతికూలము.

అపసధ్యము. సం. వి. అ. పుం. ఔపాసనాగ్ని.

అపసరము. సం. వి. అ. పుం. తొలఁగుట.

అపసరిల్లు. సం. అ. క్రి. తొలఁగు.

అపసర్జనము. సం. వి. అ. న. 1. విడుపు; 2. ఈవి; 3. వధము.

అపసర్పుఁడు. సం. వి. అ. పుం. అక్కడక్కడ తిరిగి సమాచారము తెలిసికొనివచ్చి రాజునకు చెప్పువాఁడు. వేగరి.

అపసవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. దక్షిణము; 2. ప్రతికూలము.

అపసారము. సం వి. అ. పుం. అపసరము.

అపస్కరము. సం. వి. అ. పుం. నొగ కాఁడి బండికన్ను మొదలయినరథావయవము.

అపస్నాతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) చావు నిమిత్తము స్నానముచేసినవాఁడు.

అపస్నానము. సం. వి. అ. న. చావునిమిత్తపు స్నానము.

అపస్మారము. సం. వి. అ. పుం. 1. మోహదుఃఖాదులచేఁగలిగెడి యావేశము; 2. రోగవిశేషము.

అపస్మారి. సం. విణ. (న్. ఈ. న్.) అపస్మారముకలవాఁడు.

అపస్మృతి. సం. వి. ఇ. స్త్రీ. అపస్మారము.

అపస్వరము. సం. వి. అ. పుం. స్వరస్థానముతప్పఁజెప్పినస్వరము.

అపహము. సం. విణ. (అ. ఆ. అ.) చెఱచునది.

అపహరణము. సం. వి. అ. న. మోసపుచ్చి తీసికొనిపోవుట.

అపహరించు. సం. స. క్రి. మోసపుచ్చి తీసికొనిపోవు.

అపహర్త. సం. విణ. (ఋ. ఈ. ఋ.) మోసపుచ్చి తీసికొనిపోవువాఁడు.

అపహసించు. సం. అ. క్రి. దేహమదురఁగా కన్నీళ్లుకాఱఁగానవ్వు.—స. క్రి. గేలిచేయు.

అపహసితము. సం. వి. అ. న. అపహాసము. (ఇది అధమము.)

అపహారము. సం. వి. అ. పుం. 1. అపహరించుట; 2. తగ్గుదల.

అపహాసము. సం. వి. అ. పుం. దేహమదురఁగా కన్నీళ్లుకాఱఁగానవ్వెడునవ్వు. (రూ.) అపహాస్యము. (ఇది అధమము.)

అపహృతము. సం. విణ. (అ. ఆ. అ.) అపహరింపఁబడినది.

అపహృతి. సం. వి. ఇ. స్త్రీ. అపహరణము.

అపహ్నవము. సం. వి. అ. పుం. 1. మఱుఁగుమాట; 2. ఒక అర్థాలంకారము; (చూ. అలంకారము.) 3. స్నేహము.

అపాంగము. సం. వి. అ. పుం. 1. కడకన్ను; 2. తిలకము. విణ. అంగహీనము.

అపాంపతి. సం. వి. అ. పుం. సముద్రము, కడలి.

అపాదానము. సం. వి. అ. న. ఎందుండిపాయునో అది.

అపాననము. సం. వి. అ. న. ఊపిరి లోనికిఁదీయుట, నిశ్శ్వాసము.

అపానము. సం. వి. అ. న. మూడి. పుం. మూడిగాలి.

అపామార్గము. సం. వి. అ. పుం. ఉత్తరేను.

అపాయము. సం. వి. అ. పుం. హాని, చెఱుపు.

అపారపారము. సం. వి. అ. పుం. సముద్రము, కడలి.

అపారము. సం. వి. [illegible] ఈవలిదరి. విణ. దరిలేనిది.

అపార్[illegible]ము. సం. వి. అ. పుం. [illegible]ర్థము.

అపా[illegible]తము. సం. విణ. (అ. [illegible] అ.) 1. కప్పఁబడినది; 2. విచ్చలవిడియైనది.

అపాశ్రయము. సం. వి. అ. పుం. ఒఱగుదిండు. విణ. ప్రాపుపోయినది.

అపాసనము. సం. వి. అ. న. వధము, కొల.

అపాస్తము. సం. విణ. (అ. ఆ. అ.) నివర్తింపఁబడినది.

అపిధానము. సం. వి. అ. న. తిరోధానము, మఱుఁగు.

అపినద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కట్టఁబడినది. (వస్త్రము.); 2. తొడుగఁబడినది. (కవచము.)

అపుడు. ద్వ. వి. ఏ. అప్పుడుయొక్క రూపాంతరము. (చూ. అప్పుడు.)

అపునర్భవము. సం. వి. అ. పుం. మోక్షము.

అపురూపము. వై. విణ. అపూర్వము. "ఉ. వీఁటియముట్టుటల్ మిగుల వింతలు పెంపుడుఁజిల్కబోదతో, రాణదలిర్పఁబల్కుట కరంబపురూప మపూర్వమెంతయున్, బ్రాణసఖీరహస్యములఁబ్రాఁతియుఁగ్రీడలుకానివావియా, యేఁ విలోలలోచనను హెచ్చినమన్మథ చేష్టనయేడన్." కళా. ౬, ఆ.

అపూపము. సం. వి. అ. పుం. పిండివంట.

అపూర్వము. సం. విణ. (అ. ఆ. అ.) అపురూపము.

అపూర్వవాది. సం. వి. న్. పుం. మీమాంసకుఁడు.

అపేక్ష. సం. వి. ఆ. స్త్రీ. కాంక్ష, కోరిక.

అపేక్షించు. సం. స. క్రి. కాంక్షించు; కోరు.

అపేక్షితము. సం. విణ. (అ. ఆ. అ.) కోరఁబడిన[illegible]

అపేక్ష్యము. సం. విణ. (అ. ఆ. అ.) కోరఁదగిన[illegible]

అపేతము. సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగిన[illegible]

అపోగండుఁడు. సం. వి. ఉ. పుం. శిశువు. వి[illegible] 1. చొట్టపోయిన శరీరముకలవాఁడు; 2. [illegible]లుగలవాఁడు.

అపోసనము. వై. వి. అపోశనము. "క. కానీం దివసంబును, నీనిన్నటియట్లకాకయేమనఁ పో, సానంబులువడ్డించిరి, మానవతీజనులు మహీదివిజులకున్." భీ. ౨, ఆ.

[illegible]పోహము. సం. వి. [illegible]పుం. లేనిది ఊహించుట.
ప్పు. ద్వి. వి. ఏ. [illegible]యొక్క రూపాంతరము. (చూ. అ[illegible].)

[illegible]ప్ప. వై. వి. [illegible] తల్లి; 2. తండ్రి; "రగ[illegible]. అప్ప యానతిఁబూనికానల కరిగితపనుల వెఱపుఁదీఱి చి, చుప్పనాకను ముక్కుఁజెవులనుసొరిదిఁగోసి కొంతఁజేరిచి." అచ్చ. యు, కాం. -3. అక్క*. "క. అప్పయుఁబరిజనములుఁదనుఁ, దప్పకకనుఁ గొనుచునుండ." భార. విరా. ౨, ఆ.— అవ్య. ఆశ్చర్యమును దెలుపునది*. (ఆమ్రేడితమందు అప్పప్ప. "ఉ. అ, ప్పప్పభవత్ప్రభావవిభవాఢ్యత యేమనిసన్నుతింపఁగన్." సా. ౧, ఆ. రూ. అప్పా. "ఉ. అప్పాయప్పరిఁజెప్ప నొప్పదురు రూపా జీవికారత్నముల్." రా. వి. ౧, ఆ.)

అప్పగించే. వై. స. క్రి. 1. ఒప్పగించు; 2. పదిలముగా రక్షింపుమనియొప్పగించు*. "గీ. నీవుచతురమతివినీకునిక్కన్నియ, నప్పగింపనేలయైన నాదు, హృదయమలరుదీనియెడఁగడునార్ద్రమై, యుండుగానఁజెప్పకుండరాదు." భార. విరా. ౧, ఆ.

అప్పగింత. వై. వి. ఒప్పగింత, అర్పణము.

అప్పచి. దే. వి. 1. అపూపము; 2. బ. బాలక్రీడావిశేషము. "ఉ. అప్పచులాడుచున్నగవులాడుచు." చంద్రా. ౨, ఆ. (రూ. అప్పచ్చి.)

అప్పటము. దే. విణ. కలపడములేనిది, అచ్చము.

అప్పటి. దే. అవ్య. మరల. "చ. అట్లకా, కనియలభీమనాథునకునప్పటియుంబ్రణమిల్లి వేడుకన్." రుక్మాం. ౧, ఆ.

అప్పడము. వై. వి. భక్ష్యవిశేషము, అర్పటము.

అప్పతి. సం. వి. ఇ. పుం. వరుణుఁడు, నీటిఱేఁడు.

అప్పన. వై. వి. అనుమతి, ఆజ్ఞ*. "క. ధనములజాలెలురతనపుఁ, బనిఁదగునొకవరుసనొమ్ముఁబనిచినగణనా, ధునకీవచ్చుఁగదాయివి, యనికొమటికొమిరెవాని యప్పనగొనుచున్." శుక. ౧, ఆ.

అప్పనము. వై. వి. 1. అర్పణము; 2. రాజసూయాదిమహోత్సవములయందు రాజునకర్పించెడి యుపహారము, కానుక*; "ద్వి. దొరలుసామంతులుదుర్గాధిపతులు, నరియప్పనము లీయరని నిశ్చయించి." రా. అ, కాం.-3. అరి, కరము*.

అప్పనసేయు. వై. స. క్రి. (అప్పనము+చేయు.) ఒప్పగించు. "పుత్రులకును, దనరాజ్యమెల్ల నప్పనసేసి." భాగ. ౫, స్కం.

అప్పము. వై. వి. భక్ష్యవిశేషము. గుడాపూపము*.

అప్పళము. వై. వి. 1. అప్పడము; "చ. వలపులుగ్రమ్మగాఁబొగిచివండినకారపుఁగాయగూరల, ప్పళములు." ఉ. రా. ౫, ఆ.—2. ఆస్ఫాలనము; 3. బ. బాలక్రీడావిశేషము. (చూ. అల్లి.)

అప్పళించే. వై. అ. క్రి. యత్నించు*. "ఎ, గీ. అనుచుఁజూచుఁజేరునమ్ముగ్ధపలుకులు, వినఁగఁగోరుఁగేలుతనదుకేలఁ, గీలుకొలుపఁదలఁచుఁగీచకాధముఁడుని. జానురక్తిఁదెలుపనప్పళించు." భార. విరా. ౨, ఆ.—స. క్రి. 1. ఆస్ఫాలనముచేయు, చఱచు; 2. ఆక్రమించు*; "వ. కడళ్లప్పళించి నెరసిపరిసినంబొలుచుకలుకట్టులుంబోనిదిక్కటంబులును." భార. విరా. ౨, ఆ.—3. కప్పు*; "శేనగవుఁబొల్తుక యొప్పులనప్పళించుచున్." స్వా. ౫, ఆ.—4. గ్రహించు*; "చ. పసినికురంగికాపలలపాళి నిజాధరపల్లవంబుపైఁ, బసిగొని చేరఁబట్టిమునిపండులనొయ్యనప్పళింపఁగా." వై. ౬, ఆ.—5. తుడుచు*; "గీ. చేరఁజేసి, కన్నులనుగ్రమ్ముకన్నీరుకరతలమున, నప్పళించుచు." ఉ. రా. ౬, ఆ.—6. మెత్తు*; "గీ. అప్పళింపు మందారికయడుగులందుఁ, జల్లఁగాఁ బుండరీకకింజల్కధూళి." వై. ౨, ఆ.—7. స్ఫాళించు*. "సీ. తోరంపుటూరులఁదొడరియుద్ధతి నితంబములపై నాదటఁబ్రాకినాభు, లప్పళించి." హరి. పూ. ౮, ఆ.

అప్పళింత. వై. వి. చఱపు, ఆస్ఫాలనము. "ఉ. కించుఁదనంబులేక వలకేలనొకించుక యప్పళింతకా, వించినఁబండ్లువీడు." రామా. ౭, ఆ.

అప్పసము. దే. అవ్య. 1. నిచ్చలు, సతతము. "చ. పసిరికపాముపంటిదని పల్కుదురీయలి వేణి వేణిన, ప్పసము." శుక. ౧, ఆ.—2. వి. చిన్న నీటికాలువ.

అప్పిత్తము. సం. వి. అ. న. వహ్ని, నిప్పు.

అప్పీలు. ఆం. వి. పై న్యాయసభవారి విచారణకై విన్నపము.

అప్పు. ఉభ. దే. వి. ఋణము. సం. వ్. స్త్రీ. బ. నీళ్లు.

అపస్మారము. సం. వి. అ. పుం. 1. మోహదుఃఖాదులచేఁగలిగెడి యావేశము; 2. రోగవిశేషము.
అపస్మారి సం. విణ. (న్. ఈ. న్.) అపస్మారముకలవాఁడు.
అపస్మృతి. సం. వి. ఇ. స్త్రీ. అపస్మారము.
అపస్వరము. సం. వి. అ. పుం. స్వరస్థానముతప్పఁజెప్పినస్వరము.
అపహము. సం. విణ. (అ. ఆ. అ.) చెఱచునది.
అపహరణము. సం. వి. అ. న. మోసపుచ్చి తీసికొనిపోవుట.
అపహరించే. సం. స. క్రి. మోసపుచ్చి తీసికొనిపోవు.
అపహర్త. సం. విణ. (ఋ. ఈ. ఋ.) మోసపుచ్చి తీసికొనిపోవువాఁడు.
అపహసించే. సం. అ. క్రి. దేహమదురఁగా కన్నీళ్లుకాఱఁగానవ్వు.—స. క్రి. గేలిచేయు.
అపహసితము. సం. వి. అ. న. అపహాసము. (ఇది అధమము.)
అపహారము. సం. వి. అ. పుం. 1. అపహరించుట; 2. తగ్గుదల.
అపహాసము. సం. వి. అ. పుం. దేహమదురఁగా కన్నీళ్లుకాఱఁగానవ్వెడునవ్వు. (రూ.) అపహాస్యము. (ఇది అధమము.)
అపహృతము. సం. విణ. (అ. ఆ. అ.) అపహరింపఁబడినది.
అపహృతి. సం. వి. ఇ. స్త్రీ. అపహరణము.
అపహ్నవము. సం. వి. అ. పుం. 1. మఱుఁగుమాట; 2. ఒక అర్థాలంకారము; (చూ. అలంకారము.) 3. స్నేహము.
అపాంగము. సం. వి. అ. పుం. 1. కడకన్ను; 2. తిలకము. విణ. అంగహీనము.
అపాంపతి. సం. వి. అ. పుం. సముద్రము, కడలి.
అపాదానము. సం. వి. అ. న. ఎందుండిపాయునో అది.
అపాననము. సం. వి. అ. న. ఊపిరి లోనికిఁదీయుట, నిశ్శ్వాసము.
అపానము. సం. వి. అ. న. మూఁడి. పుం. మూఁడిగాలి.
అపామార్గము. సం. వి. అ. పుం. ఉత్తరేణి.
అపాయము. సం. వి. అ. పుం. హాని, చెఱుపు.
అపారపారము. సం. వి. అ. పుం. సముద్రము, కడలి.
అపారము. సం. వి. [illegible] ఈవలిదరి. విణ. దరిలేనిది.
అపా[illegible]ర్థము. సం. వి. అ. పుం[illegible]ర్థము.
అపా[illegible]తము. సం. విణ. (అ. [illegible] అ.) 1. కప్పఁబడినది; 2. విచ్చలవిడియైనది.
అపాశ్రయము. సం. వి. అ. పుం. ఒఱగుదిండు. విణ. ప్రాపుపోయినది.
అపాసనము. సం. వి. అ. న. వధము, కొల.
అపాస్తము. సం. విణ. (అ. ఆ. అ.) నివర్తింపఁబడినది.
అపిధానము. సం. వి. అ. న. తిరోధానము, మఱుఁగు.
అపినద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కట్టఁబడినది. (వస్త్రము.); 2. తొడుగఁబడినది. (కవచము.)
అపుడు. ద్వ. వి. ఏ. అప్పుడుయొక్కరూపాంతరము. (చూ. అప్పుడు.)
అపునర్భవము. సం. వి. అ. పుం. మోక్షము.
అపురూపము. వై. విణ. అపూర్వము. "ఉ. వీణియముట్టుటల్ మిగుల వింతలు పెంపుడుఁజిల్కబోదతో, రాణదలిర్పఁబల్కుట కరంబపురూప మపూర్వమెంతయుఁ, బ్రాణసఖీరహస్యములబ్రాఁతియుఁగ్రీడలుకానివానియా, యేణవిలోలలోచనకు హెచ్చినమన్మథ చేష్టనయ్యెడన్." కళా. ౬, ఆ.
అపూపము. సం. వి. అ. పుం. పిండివంట.
అపూర్వము. సం. విణ. (అ. ఆ. అ.) అపురూపము.
అపూర్వవాది. సం. వి. న్. పుం. మీమాంసకుఁడు.
అపేక్ష. సం. వి. ఆ. స్త్రీ. కాంక్ష, కోరిక.
అపేక్షించే. సం. స. క్రి. కాంక్షించు; కోరు.
అపేక్షితము. సం. విణ. (అ. ఆ. అ.) కోరఁబడినది.
అపేక్ష్యము. సం. విణ. (అ. ఆ. అ.) కోరఁదగినది.
అపేతము. సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగినది.
అపోగండుఁడు. సం. వి. అ. పుం. శిశువు. విణ 1. చొట్టపోయిన శరీరముకలవాఁడు; 2. వళులుగలవాఁడు.
అపోసానము. వై. వి. అపోశనము. "క. కానీయిదివసంబును, నీనిన్నటియట్లకాకయేమనఁగఁ బో, సానంబులుపడ్డించిరి, మానవతీజనులులీల మహిదివిజాలకున్." భీ. ౨, ఆ.

అపోహము. సం. వి. ... పుం. లేనిది ఊహించుట.
అప్పు. ద్వ. వి. ఏ. ... యొక్క రూపాంతరము. (చూ. అ...)
అప్ప. వై. వి. ... తల్లి; 2. తండ్రి; "ర. గ... అప్ప యానతింబూనికానల కరిగితపసుల వెఱపుదీతెచి, చుప్పనాకను ముక్కుఁజెవులనుసారిదిగోసి కొంతఁజేరిచి." అచ్చ. యు, కాం.-3. అక్క*. "క. అప్పయుఁబరిజనములుఁదనుఁ, దప్పకకనుఁ గొనుచునుండ." భార. విరా. ౨, ఆ.— అవ్య. ఆశ్చర్యమును దెలుపునది*. (ఆమ్రేడితమందు అప్పప్ప. "ఉ. అ. ప్పప్పభవత్ప్రభావవిభవాఢ్యత యేమనిసన్నుతింపఁగన్." సా. ౧, ఆ. రూ. అప్పా. "ఉ. అప్పాయప్పురిఁజెప్ప నొప్పదురు రూపాజీవికారత్నముల్." రా. వి. ౧, ఆ.)
అప్పగించు. వై. స. క్రి. 1. ఒప్పగించు; 2. పదిలముగా రక్షింపుమనియొప్పగించు*. "గీ. నీవుచతురమతివినీకునిక్కన్నియ, నప్పగింపనేలమ్మైన నాదు, హృదయమలరుదీనియెడఁగడునార్ద్రమై, యుండుగానఁజెప్పకుండరాదు." భార. విరా. ౧, ఆ.
అప్పగింత. వై. వి. ఒప్పగింత, అర్పణము.
అప్పచి. దే. వి. 1. అపూపము; 2. బ. బాల్యక్రీడావిశేషము. "ఉ. అప్పచులాడుచున్ నగవులాడుచు." చంద్రా. ౨, ఆ. (రూ. అప్పచ్చి.)
అప్పటము. దే. విశే. కలపడములేనిది, అచ్ఛము.
అప్పటి. దే. అవ్య. మరల. "చ. అట్లకా, కనియలభీమనాథునకునప్పటియుంబ్రణమిల్లి వేడుకన్." రుక్మాం. ౧, ఆ.
అప్పడము. వై. వి. భక్ష్యవిశేషము, అర్పటము.
అప్పతి. సం. వి. ఇ. పుం. వరుణుఁడు, నీటిఱేఁడు.
అప్పన. వై. వి. అనుమతి, ఆజ్ఞ*. "క. ధనములజాలెలురతనపుఁ, బనిఁదగునొకవరుసనొమ్ముఁబనిచినగణనా, ఘనకీపచ్చుఁగదాయివి, యనికొమటికొమిరెవాని యప్పనగొనుచున్." శుక. ౧, ఆ.
అప్పనము. వై. వి. 1. అర్పణము; 2. రాజనూయాదిమహోత్సవములయందు రాజానకర్పించెడి యుపహారము, కానుక*; "ద్వి. దొరలుసామంతులుదుర్గాధిపతులు, నరియప్పనము లీయరని నిశ్చయించి." రా. అ, కాం.-3. అరి, కరము*.
అప్పనసేయు. వై. స. క్రి. (అప్పనము+చేయు.) ఒప్పగించు. "పుత్త్రులకును, దనరాజ్యమెల్ల నప్పనసేసి." భాగ. ౫, స్కం.
అప్పము. వై. వి. భక్ష్యవిశేషము. గుడాపూపము*.
అప్పళము. వై. వి. 1. అప్పడము; "చ. వలపులుగ్రమ్మగాఁబొగిచివండినకారపుఁగాయగూరల, ప్పళములు." ఉ. రా. ౫, ఆ.-2. ఆస్ఫాలనము; 3. బ. బాల్యక్రీడావిశేషము. (చూ. అల్లి.)
అప్పళించు. వై. అ. క్రి. యత్నించు*. "ఎ, గీ. అనుచుఁజూచుఁజేరునమ్ముగ్ధపలుకులు, వినఁగఁగోరుఁగేలుతనదుకేలఁ, గీలుకొలుపఁదలఁచుఁగీచకాధముఁడుని, జానురక్తిఁదెలుపనప్పళించు." భార. విరా. ౨, ఆ.—స. క్రి. 1. ఆస్ఫాలనముచేయు, చఱచు; 2. ఆక్రమించు*; "వ. కడళ్లప్పళించి నెరసిపెరిసినంబొలుచుకలుకట్టలుంబోనిదిక్తటంబులును." భార. విరా. ౨, ఆ.-3. కప్పు*; "శేనగపుఁబొల్తుక అప్పలనప్పళించుచున్." స్వా. ౫, ఆ.—4. గ్రహించు*; "చ. పసినికురంగికాపలలపాళి నిజాధరపల్లవంబుపైఁ, బసిగొనిచేరఁబట్టిమునిపండులనొయ్యననప్పళింపఁగా." నై. ౬, ఆ.—5. తుడుచు*; "గీ. చేరఁజేసి, కన్నులనుగ్రమ్ముకన్నీరుకరతలమున, నప్పళించుచు." ఉ. రా. ౬, ఆ.—6. మెత్తు*; "గీ. అప్పళింపు మందారికయదుగులందుఁ, జల్లఁగాఁ బుండరీకకింజల్కధూళి." నై. ౨, ఆ.—7. స్పృశించు*. "సీ. తోరంపుటూరులఁదొడరియుద్ధతి నితంబములపై నాడటఁబ్రాఁకినాథు, లప్పళించి." హరి. పూ. ౮, ఆ.
అప్పళింత. వై. వి. చఱపు, ఆస్ఫాలనము. "ఉ. కించుఁదనంబులేక వలకేలనొకించుక యప్పళింతకా, వించినఁబండ్లువీడు." రామా. ౭, ఆ.
అప్పసము. దే. అవ్య. 1. నిచ్చలు, సతతము. "చ. పసరికపాముపంటిదని పల్కుదురీయలివేణి వేణిన, ప్పసము." శుక. ౧, ఆ.—2. వి. చిన్న నీటికాలువ.
అప్పిత్తము. సం. వి. అ. న. వహ్ని, నిప్పు.
అప్పీలు. ఆం. వి. పై న్యాయసభవారి విచారణకై విన్నపము.
అప్పు. ఉభ. దే. వి. ఋణము. సం. వ్. స్త్రీ. బ. నీళ్లు.

అప్పుడు. ద్వ. వి. ఏ. (అ+ప్రొద్దు.) అకాలము. (వృత్తియందు కేవలకాలవాచకమగును. ఎల్లప్పుడు. మొ.)

అప్పులకాఁపు. దే. వి. అప్పుపుచ్చుకొన్నవాఁడు. అధమర్ణుఁడు.

అప్పులపోతు. దే. వి. అప్పులకాఁపు.

అప్పులవాఁడు. దే. వి. అప్పిచ్చినవాఁడు, ఉత్తమర్ణుఁడు.

అప్పువడు. ద్వ. అ. క్రి. (అప్పు+పడు.) ఋణపడు.

అప్రగుణము. సం. విణ. (అ. ఆ. అ.) ఆకులము. చెదిరినది.

అప్రతిష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. ప్రతిష్ఠకామి, అగౌరవము.

అప్రదక్షిణము. సం. వి. అ. న. ఎడమప్రక్కగా చుట్టివచ్చుట.

అప్రమాణము. సం. వి. అ. న. తప్పుప్రమాణము.

అప్రమేయము. సం. విణ. (అ. ఆ. అ.) మితియిడశగనిది.

అప్రయోజకుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ప్రయోజకుఁడు కానివాఁడు.

అప్రయోజనము. సం. వి. అ. న. ప్రయోజనములేమి.

అప్రశస్తము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రశస్తము కానిది.

అప్రసిద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రసిద్ధము కానిది.

అప్రహతము. సం. విణ. (అ. ఆ. అ.) ఖిలము, దున్ననిది. (నేల.)

అప్రామాణికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ప్రామాణికుఁడుకానివాఁడు.

అప్రాశ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పఙ్క్తియందు భుజింపఁదగనివాఁడు.

అప్రియము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రియముకానిది.

అప్సరస. సం. వి. స్. స్త్రీ. అప్సరస్త్రీ, అచ్చేర.

అబందర. వై. విణ. చక్కనచెడినది. (ఆ యిల్లు మిక్కిలి అబందరగానున్నది.)

అబక. దే. వి. అగప.

అబద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) అనర్థకము.

అబల. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుది, అతివ, ఇంతి.

అబాధము. సం. విణ. (అ. ఆ. అ.) అడ్డపాటు లేనిది, నిరర్గళము.

అబిసీలు. దే. వి. బ. సికారు, [illegible]లి. "సీ. ఇది గాడ్పు బాబాలనెక్కి క్రొ[illegible]వియబిసీల్ దువాళించునట్టిబయలు." చంద్ర.

అబ్జజుఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మ, తమ్మిచూలి.

అబ్జబాంధవుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు. తామరచెలి.

అబ్జము. సం. వి. అ. న. 1. తామర; 2. ఉప్పు. పుం. న. శంఖము. పుం. ఎట్టిగన్నేరు?.

అబ్జయోని. సం. వి. ఇ. పుం. బ్రహ్మ, నలువ.

అబ్జారి. సం. వి. ఇ. పుం. చంద్రుఁడు, చందమామ.

అబ్జుఁడు. సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు; 2. ధన్వంతరి.

అబ్దము. సం. వి. అ. పుం. 1. ఏఁడు; 2. అద్దము; 3. ఒకానొకకొండ; 4. తుంగ?; 5. మబ్బు.

అబ్ధి. సం. వి. ఇ. పుం. 1. సముద్రము; 2. సరస్సు.

అబ్ధికఫము. సం. వి. అ. పుం. ఫేనము, నురుఁగు.

అబ్ధిమేఖల. సం. వి. ఆ. స్త్రీ. భూమి, నేల.

అబ్బ. వై. వి. తండ్రి, జనకుఁడు. అవ్య. బాధను దెలుపునది*. (ఆమ్రేడితమందు అబ్బబ్బ. "ఉ. అ. బ్బబ్బనితాంతకంతు శిశిఖాగ్నిశిఖాపరితాపమాఱునే." రసి. 3. ఆ.)

అబ్బకాఁడు. ద్వ. విణ. మూఢుఁడు. "క. అనిచిందరేఁగినట్ల, చ్చెనఁటిధరాసురుఁడు చెంతఁ జేపడిననిధిక్, మునిగాలఁదన్ని చనుగతి, ఘనజఘనక్ బాసి యబ్బకాఁడుగఁ బోయెక్." పంచ. వేం. ౪. ఆ.

అబ్బరము. వై. విణ. అపారము. "చ. మెఱుంగుటమ్ముల, బ్బరముగఁ బూన్చియయ్యుఱియబంటులనిద్దపుమేనులెల్లవా. విరినలియంగనేసి." అచ్చ. యు. కాం.

అబ్బాటు. దే. వి. జనసమ్మర్దమువలనఁగలిగెడుకాఁక. "వ. ఇంపారుకలపంబులబ్బాటునం జేటులెత్తియొండొరులయొత్తడింబొడిపొడియై." స్వా. ౫, ఆ.

అబ్బాలాడు. దే. అ. క్రి. (అబ్బాలు+ఆడు.) తడఁబడు, సంభ్రమించు.

అబ్బు. వై. అ. క్రి. దొరకు, ప్రాప్తించు.

అబ్బురపడు. వై. అ. క్రి. (అబ్బురము+పడు.) వెఱఁగుపడు, ఆశ్చర్యపడు.

అబ్బురపాటు. వై. వి. అబ్బురపడుట,

అబ్బురము. వై. వి. విశే. ఆశ్చర్యము*. విణ. అపూర్వము. "గీ. పావనులయింటఁబుట్టినబహిరబహిర, రాతిపర్గజయంబజస్రమునుగలిగి, వర్తిలుటయబ్బురమ్ముగాన." కళా. ౫, ఆ.

అబ్బెంద. దే. వి. వృక్షవిశేషము. "రగడ. అబ్బెందలమాకబ్బెందలఁజెలి." య. ౪, ఆ.

అబ్బెసము. వై. వి. అలవాటు, అభ్యాసము. "ఎ, గీ. మానమును శౌచమును యంత్రమంత్రములును, గావుకారణములుయోగకలనమునకు, నిశ్చయంబును నభియోగనిశ్చలతయుఁ, గడఁకయును నబ్బెసముఁగానికలశజన్మ." కాశీ. ౫, ఆ.

అబ్రపడు. వై. అ. క్రి. (అబ్రము+పడు.) ఆశ్చర్యపడు.

అబ్రము. వై. వి. విణ. అబ్బురముయొక్క రూపాంతరము.

అబ్రహ్మణ్యము. సం. వి. అ. న. చంపఁదగననుమాట.

అబ్రాశి. సం. వి. ఇ. పుం. సముద్రము, నీరుకుప్ప.

అభంగురము. సం. విణ. (అ. ఆ. అ.) భంగురముకానిది. (భంగురము=నశించునది.)

అభయ. సం. వి. ఆ. స్త్రీ. కరకకాయ. అ. న. ము. వట్టివేరు. విణ. భయములేనిది.

అభవుఁడు. సం. వి. అ. పుం ఈశ్వరుఁడు. విణ. పుట్టుకలేనివాఁడు.

అభాగ్యము. సం. వి. అ. న. భాగ్యములేమి. విణ. భాగ్యములేనిది.

అభావము. సం. వి. అ. పుం. 1. లేమి; 2. చావు.

అభాషణము. సం. వి. అ. న. మాటలేమి, మౌనము.

అభికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఇచ్ఛగలవాఁడు, కాముకుఁడు.

అభిక్రమము. సం. వి. అ. పుం. శత్రువులనుగూర్చి దండెత్తిపోవుట.

అభిఖ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. పేరు; 2. కీర్తి; 3. సిరి.

అభిగతము. సం. విణ. (అ. ఆ. అ.) పొందఁబడినది.

అభిగమనము. సం. వి. అ. న. 1. పొందు, పొందిక.

అభిగమము. సం. వి. అ. పుం.——పై.——

అభిగమ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందఁదగినది.

అభిగ్రహము. సం. వి. అ. పుం. 1. ఎదురుకొనిపోయి యాక్రమించుట; 2. పగకెదిరించుట; 3. గౌరవము; 4. తెరువాటు.

అభిఘరించు. సం. స. క్రి. (నెయ్యి) మిడుచు.

అభిఘాతము. సం. వి. అ. పుం. 1. కొట్టు; 2. దెబ్బ.

అభిఘాతి. సం. వి. న్. పుం. శత్రువు, పగతుఁడు.

అభిఘారము. సం. వి. అ. పుం. తిరుగఁబోఁత.

అభిచరించు. సం. అ. క్రి. సంచరించు, తిరుగు.

అభిచరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సహాయుఁడు, తోడు.

అభిచారము. సం. వి. అ. పుం. హింసార్థమైన హోమకర్మము, పంపు.

అభిజనము. సం. వి. అ. పుం. 1. పుట్టుచోటు; 2. కులము; 3. కులాగతమయిన పెక్కుములో నగు బిరుదు; 4. పొగడ్త.

అభిజాతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. మంచికులమునఁబుట్టినవాఁడు; 2. చదువరి; 3. తగవరి.

అభిజిత్తు. సం. వి. త్. స్త్రీ. 1. పగటఁ బదునాలుగుగడియలమీఁద రెండుగడియల కాలము; 2. ఒకనక్షత్రము. (చూ. నక్షత్రము.)

అభిజ్ఞానము. సం. వి. అ. న. 1. గుఱుతు; 2. తెలివి.

అభిజ్ఞుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తెలివరి.

అభిదర్శించు. సం. స. క్రి. చూచు.

అభిధ. సం. వి. ఆ. స్త్రీ. ఒక శబ్దవృత్తి. (సంకేతితములగుపదపదార్థములసంబంధము.) (చూ. వృత్తి.)

అభిధానము. సం. వి. అ. న. నామధేయము, పేరు.

అభిధేయము. సం. వి. అ. న. 1. పేరు; 2. అర్థము.

అభిధ్య. సం. వి. ఆ. స్త్రీ. పరద్రవ్యమునందపేక్ష.

అభినందనము. సం. వి. అ. న. సంతోషించుట.

అభినందించు. సం. అ. క్రి. సంతోషించు. స. క్రి. పొగడు.

అభినయము. సం. వి. అ. పుం. సూచింపఁదగినయర్థమునుసూచించుట. (ఇది చతుర్విధము.— ఆహార్యము. (భూషణాదులచేఁగలిగినది.) వాచికము. (వాక్కుచేతఁగలిగినది.) ఆంగికము. (అంగముచేతఁగలిగినది.) సాత్వికము. (సత్వముచేతఁగలిగినది అని.)

అభినయించు. సం. స. క్రి. అంగన్యాసాదులచే అర్థమునుసూచించు.

అభినవము. సం. విణ. (అ. ఆ. అ.) నవీనము, క్రొత్త.

అభిని. వై. గ్రా. వి. నల్లమందు, అహిఫేనము.

అభినిర్ముక్తుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడస్తమించువేళ నిద్రించువాఁడు.

అభినిర్యాణము. సం. వి. అ. పుం. బయలుదేఱుట, ప్రయాణము.

**అభినివేశము.** సం. వి. అ. పుం. 1. చొరవ; 2. పట్టు.

**అభినీతము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. న్యాయముతోఁగూడినది; 2. సంస్కరింపఁబడినది; 3. కోపముగలది.

**అభినుతము.** సం. విణ. (అ. ఆ. అ.) స్తుతింపఁబడినది, పొగడఁబడినది.

**అభినుతి.** సం. వి. ఇ. స్త్రీ. స్తుతి, పొగడ్త.

**అభినుతించు.** సం. స. క్రి. స్తుతించు, పొగడు.

**అభిపన్నుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. అంగీకరింపఁబడినవాఁడు; 2. ఆపదపొందినవాఁడు; 3. తప్పుచేసినవాఁడు; 4. దాక్షిణ్యముగలవాఁడు; 5. శత్రువుచేనాక్రమింపఁబడినవాఁడు; 6. శరణుచొచ్చినవాఁడు.

**అభిప్రాయము.** సం. వి. అ. పుం. ఆశయము, తలఁపు.

**అభిప్రేతము.** సం. విణ. (అ. ఆ. అ.) అభిప్రాయముకొనఁబడినది, తలఁపఁబడినది.

**అభిభవము.** సం. వి. అ. పుం. తిరస్కారము, తెగడిక.

**అభిభవించు.** సం. స. క్రి. తిరస్కరించు, తెగడు.

**అభిభూతము.** సం. విణ. (అ. ఆ. అ.) తిరస్కరింపఁబడినది, తెగడఁబడినది.

**అభిమంత్రణము.** సం. వి. అ. న. 1. పిలుపు; 2. మంత్రముచేసంస్కరించుట.

**అభిమంత్రించు.** సం. స. క్రి. 1. పిలుచు; 2. మంత్రముచేసంస్కరించు.

**అభిమంత్రితము.** సం. విణ. (అ. ఆ. అ.) అభిమంత్రింపఁబడినది.

**అభిమతము.** సం. వి. అ. న. సమ్మతి. విణ. సమ్మతము.

**అభిమరము.** సం. వి. అ. పుం. 1. చంపుట; 2. యుద్ధము; 3. కట్టుట.

**అభిమర్దము.** సం. వి. అ. పుం. 1. యుద్ధము; 2. రాయిడి.

**అభిమర్శనము.** సం. వి. అ. న. నిమురుట.

**అభిమర్శించు.** సం. స. క్రి. నిమురు.

**అభిమానము.** సం. వి. అ. పుం. 1. ధనాదులచేఁగలిగెడుగర్వము; 2. అజ్ఞానము; 3. ప్రేమము; 4. వధము.

**అభిమాని.** సం. విణ. (న్. ఈ. న్.) అభిమానముగలవాఁడు.

**అభిమానించు.** సం. స. క్రి. గొప్పపఱచు, గారవించు.

**అభిముఖము.** సం. విణ. (అ. ఆ. అ.) ఎదురుమొగమైనది.

**అభియాతి.** సం. వి. ఇ. పుం. వైరి, పగతుఁడు.

**అభియానము.** సం. వి. అ. న. ఎదురుకొనిపోవుట.

**అభియుక్తుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆశగలవాఁడు; 2. పగకెదిరించినవాఁడు.

**అభియోక్త.** సం. వి. ఋ. పుం. పగకెదిరించువాఁడు.

**అభియోగము.** సం. వి. అ. పుం. 1. ఎదురుకొనిపోయి యాక్రమించుట; 2. పగకెదిరించుట; 3. పూనిక.

**అభియోగి.** సం. వి. న్. పుం. అభియోక్త.

**అభియోగించు.** సం. స. క్రి. పగకెదిరించు.

**అభిరతి.** సం. వి. ఇ. స్త్రీ. అపేక్ష, ఇచ్ఛ.

**అభిరామము.** సం. విణ. (అ. ఆ. అ.) మనోజ్ఞము, ఒప్పిదమైనది.

**అభిరుచి.** సం. వి. ఇ. స్త్రీ. 1. అత్యాసక్తి; 2. జిగి.

**అభిరూపుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఒప్పిదముగలవాఁడు; 2. తెలివిగలవాఁడు.

**అభిలషించు.** సం. స. క్రి. వాంఛించు, కోరు.

**అభిలాపము.** సం. వి. అ. పుం. శబ్దము.

**అభిలావము.** సం. వి. అ. పుం. లవనము, కోఁత.

**అభిలాష.** సం. వి. అ. పుం. వాంఛ, కోరిక.

**అభిలాషి.** సం. విణ. (న్. ఈ. న్.) అభిలాషకలవాఁడు.

**అభిలాషుకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) గృధ్నుఁడు, కోరికగలవాఁడు.

**అభివందనము.** సం. వి. అ. న. నమస్కారము, మ్రొక్కు.

**అభివాదకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) వందారువు, మ్రొక్కువాఁడు.

**అభివాదనము.** సం. వి. అ. న. గోత్రనామములు చెప్పి పాదములుసోఁక మ్రొక్కుట, ఏటికోళ్లు.

**అభివృద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. పెంపు.

**అభివ్యక్తి.** సం. వి. ఇ. స్త్రీ. ప్రతిబింబము.

**అభిశంసనము.** సం. వి. అ. న. నింద, దూఱు.

**అభిశస్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. దూఱుట; 2. వేఁడుట.

**అభిశస్తుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పరస్త్రీగమనాదిదోషములచే దూఱఁబడినవాఁడు, అక్షారితుఁడు.

**అభిశాపము.** సం. వి. అ. పుం. అపదూఱు.

(అభి)షంగము. సం. వి. అ. పుం. 1. అవమానము; 2. ఒట్టు; 3. తిట్టు.

(అభి)షవము. సం. వి. అ. పుం. 1. కల్లుతేట; 2. యజ్ఞము; 3. సోమపానము; 4. స్నానము.

(అభి)షిక్తుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) అభిషేకింపఁబడినవాఁడు.

(అభి)షుతము. సం. వి. అ. పుం. పులియఁబెట్టిన కడుగునీరు. (కుల్మాషాభిషుతమని యేకపదముగాఁ గొందఱు.)

(అ)భిషేకము. సం. వి. అ. పుం. స్నానము, మునుక.

(అ)భిషేకించు. సం. స. క్రి. మునిఁగించు.

(అ)భిషేణనము. సం. వి. అ. న. సేనతో శత్రువునెదుర్కొనిపోవుట.

(అ)భిష్టుతము. సం. విశే. (అ. ఆ. అ.) శస్తము, పొగడఁబడినది.

(అ)భిష్యందము. సం. వి. అ. పుం. 1. కంటితెవులు; 2. మిక్కిలికాఱుట; 3. మిక్కిలివృద్ధి.

(అ)భిష్వంగము. సం. వి. అ. పుం. అభిరుచి, ఆత్యాసక్తి.

(అ)భిసంధము. సం. వి. అ. పుం. కంటితెవులు.

(అ)భిసంధానము. సం. వి. అ. న. వ్యళీకము, మోసపుచ్చుట.

అభిసంపాతము. సం. వి. అ. పుం. యుద్ధము, పోరు.

అభిసరించు. సం. స. క్రి. ప్రియులొకరొకరినుద్దేశించు. "గీ. రేయినిజనాథులనభిసరించిపోయి" కవిక. ౪, ఆ.

అభిసారి. సం. విశే. (న్. ఈ న్.) ఒకటి నుద్దేశించిపోవువాఁడు.

అభిసారిక. సం. వి. ఆ. స్త్రీ. ప్రియునిఁగూర్చి సంకేతస్థలమునకుఁబోయెడి నాయిక. (చూ. నాయిక.)

అభిహారము. సం. వి. అ. పుం. 1. పగ కెదిరించుట; 2. దొంగిలించుట; 3. ఆయిత్తపడుట.

అభిహితము. సం. విశే. (అ. ఆ. అ.) ఉక్తము, చెప్పఁబడినది.

అభీకుఁడు. సం. వి. అ. పుం. కవి. విశే. 1. నిర్భయుఁడు; 2. ఇచ్ఛగలవాఁడు; 3. క్రూరుఁడు.

అభీప్సితము. సం. విశే. (అ. ఆ. అ.) అభీష్టము, కోరఁబడినది.

అభీరుపత్రి. సం. వి. ఈ. స్త్రీ. పిల్లపీఁచరకి.

అభీరువు. సం. వి. ఉ. స్త్రీ. పిల్లపీఁచరకి. విశే. భీరువుకానిది.

అభీషంగము. సం. వి. అ. పుం. ఆక్రోశము, తిట్టు.

అభీషువు. సం. వి. ఉ. పుం. 1. కిరణము; 2. పగ్గము.

అభీష్టము. సం. వి. అ. న. కోరిక. విశే. కోరఁబడినది.

అభూతము. సం. విశే. (అ. ఆ. అ.) జరగనిది.

అభేదము. సం. వి. అ. పుం. భేదములేమి.

అభేద్యము. సం. విశే. (అ. ఆ. అ.) భేదింపఁదగనిది.

అభ్యంగము. సం. వి. అ. పుం. తలంటు.

అభ్యంజనము. సం. వి. అ. న. అభ్యంగము.

అభ్యంతరము. సం. వి. అ. న. 1. ఎల్లదిక్కులకు నడిమిచోటు; 2. నడిమిచోటు; 3. ఆటంకము.

అభ్యక్తము. సం. విశే. (అ. ఆ. అ.) 1. చేరినది; 2. పోయినది; 3. స్పష్టమయినది.

అభ్యగ్రము. సం. వి. అ. న. దాపు. విశే. దాపైనది.

అభ్యనుజ్ఞ. సం. వి. ఆ. స్త్రీ. అనుజ్ఞ, ముదల.

అభ్యమితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఆతురుఁడు, తెవులుగొంటు.

అభ్యమిత్రీణుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) శత్రువునెదుర్కొనిపోవువాఁడు.

అభ్యమిత్రీయుఁడు. సం. విశే. (అ. ఆ. అ.)—పై—

అభ్యమిత్ర్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.)—పై—

అభ్యర్చన. సం. వి. ఆ. స్త్రీ. అర్చన, పూజ.

అభ్యర్చించు. సం. స. క్రి. పూజించు.

అభ్యర్చితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) పూజింపఁబడినవాఁడు.

అభ్యర్థించు. సం. స. క్రి. 1. కోరు; 2. వేఁడు.

అభ్యర్థితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. కోరఁబడినవాఁడు; 2. వేఁడఁబడినవాఁడు.

అభ్యర్ణము. సం. వి. అ. న. దాపు. విశే. దాపైనది.

అభ్యర్హితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) తగినవాఁడు.

అభ్యవకర్షణము. సం. వి. అ. న. నాటినముల్లులో నగువానినూడఁదీయుట, నిర్హారము. పైరునకు విఘాతమైన గాదము మొదలయినవానిఁ బెఱుకుట. (అనికొందఱు.)

అభ్యవస్కందనము. సం. వి. అ. న. దోఁపుడు. ముట్టడి. (అనికొందఱు.)

అభ్యవహారము. సం. వి. అ. పుం. ఆహారము, తిండి.

అభ్యవహరించు. సం. స. క్రి. ఆహరించు, తిను.

అభ్యవహృతము. సం. విశే. (అ. ఆ. అ.) భక్షితము, తినఁబడినది.

అభ్యసనము. సం. వి. అ. న. అభ్యాసము, అలవాటు.

**అభ్యసనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) అభ్యసింపఁదగినది.
**అభ్యసించు.** సం. స. క్రి. అలవాటుచేయు.
**అభ్యస్తము.** సం. విణ. (అ. ఆ. అ.) అభ్యసింపఁబడినది.
**అభ్యాంతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఆమయావి, తెవులుగొంటు.
**అభ్యాఖ్యానము.** సం. వి. అ. న. మిథ్యాభియోగము, కల్లజగడము
**అభ్యాగతుఁడు.** సం. వి. అ. పుం. భోజనమప్పుడు వచ్చినయతిథి.
**అభ్యాగమము.** సం. వి. అ. పుం. 1. ఎదురుకొని లేచుట; 2. కొట్టు; 3. దాపు; 4. పగ; 5. పోరు.
**అభ్యాగారికుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) కుటుంబమునందు మిక్కిలి యాసగలవాఁడు.
**అభ్యాదానము.** సం. వి. అ. న. ప్రారంభము, కొరఁకోలు.
**అభ్యామర్దము.** సం. వి. అ. పుం. యుద్ధము, పోరు.
**అభ్యాశము.** సం. వి. అ న. దాపు. విణ. దాపైనది.
**అభ్యాసము.** సం. వి. అ. న. దాపు. పుం. అలవాటు. విణ. దాపైనది.
**అభ్యాసాదనము.** సం. వి. అ. న. దోఁపుడు. ముట్టడి. (అనికొందఱు.)
**అభ్యుత్థానము.** సం. వి. అ. న. ఎదురుకొని లేచుట.
**అభ్యుదయము.** సం. వి. అ. పుం. శుభోదయము, మేలుకాన్పు.
**అభ్యుదితుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు ఉదయించెడువేళ నిద్రించువాఁడు.
**అభ్యుద్ధరించు.** సం. స. క్రి. 1. పెల్లగించు; 2. మీఁది కెత్తు.
**అభ్యుపగమము.** సం. వి. అ. పుం. అంగీకారము, ఇయ్యకోలు.
**అభ్యుపగమించు.** సం. స. క్రి. అంగీకరించు, ఇయ్యకొను.
**అభ్యుపపత్తి.** సం. వి. ఇ. స్త్రీ. అనుగ్రహము, సాకతము.
**అభ్యూషము.** సం. వి. అ. పుం. పోళి, గుగ్గిళ్లు.
**అభ్రకము.** సం. వి. అ. న. గిరిజము, బేగడ.
**అభ్రగము.** సం. వి. అ. పుం. పక్షి, పులుఁగు.
**అభ్రపుష్పము.** సం. వి. అ. పుం. ప్రబ్బ?.
**అభ్రమాతంగము.** సం. వి. అ. పుం. తెల్లయేనుఁగు, ఐరావతము.
**అభ్రము.** సం. వి. అ. న. 1. ఆకాశము; 2. మబ్బు, 3. బంగారు; 4. బేగడ.
**అభ్రముపు.** సం. వి. ఉ. స్త్రీ. తూర్పుదిక్కునఁ దుండెడి ఆఁడేనుఁగు.
**అభ్రి.** సం. వి. ఇ. స్త్రీ. కొయ్యగుద్దలి.
**అభ్రియము.** సం. విణ. (అ. ఆ. అ.) మబ్బునఁబుట్టినది.
**అభ్రేషము.** సం. వి. అ. పుం. న్యాయము, పాడి.
**అమ.** ఉభ. వై. వి. 1. అమ్మ; 2. పూజ్యస్త్రీ*. (అమ్మ యొక్క రూపాంతరము.) సం. ఆ. స్త్రీ. అమావాస్య.
**అమంగళము.** సం. వి. అ. న. అశుభము. విణ. అశుభమైనది.
**అమండము.** సం. వి. అ. పుం. ఆముదపుచెట్టు.
**అమడలు.** వై. వి. బ. 1. కవలబిడ్డలు*; 2. తృణధాన్యవిశేషము*.
**అమత్రము.** సం. వి. అ. న. కంచుపాత్రము; 2. పాత్రము.
**అమయు.** దే. అ. క్రి. ఉపయుక్తమగు. "వ. సమరసమయంబునకమయందగు." ఉ, హరి. ౪. ఆ.
**అమర.** సం. వి. ఆ. స్త్రీ. 1. అమరావతి; 2. కంబము; 3. గఱిక; 4. తిప్పతీఁగ?; 5. మా. అ. పుం. ము. 1. పాదరసము; 2. పొగడ?.
**అమరకము.** దే. వి. అమరమునకు రూపాంతరము.
**అమరము.** దే. వి. 1. పాళెపట్టుదొరలకియ్యఁబడుకొలఁదిసీమ. "గీ. భటులు వేయిటికెన్న నిర్వదియు నాల్గు, వేలుగాలక్షయర్వదివేల ప్రజకుఁ, జెల్లనల్వదిలక్షలుజీతమునకు. యమరమేలెడుదొరలకు క్రమమెసుమ్మి." కృష్ణ. ౨. ఆ. 2 ఒకసిఘంటువు.
**అమరావతి.** సం. వి. ఈ. స్త్రీ. ఇంద్రునిపట్టణము.
**అమరిక.** దే. వి. 1. అందము; 2. విధము.
**అమరు.** దే. అ. క్రి. 1. ఒప్పు. "క. పురిరాకొను రులకీర్త్యం, బరవాహినిభుజగపురికిబలుపిడఁజనియం, దిరవుకొనసెడముచాలమి, మరలినతఱి బుగ్గలననమరుసౌధంబుల్." పాండు. ౧. ఆ.— 2. కుదురు; 3. పొందికపడు; 4. సిద్ధమగు; "వ. సమరంబునకునమరుండను నవసరంబున." ఉ, హరి. ౬. ఆ.—5. సిద్ధించు. "క. నిక్కముగనిపుడెల్లకోర్కులు, నమరెంగద మిమ్ముఁ జూచినంతనెమాకున్." అచ్చ. బాల, కాం.

**అమరుఁడు.** సం. వి. అ. పుం. వేల్పు. విణ. చావనివాఁడు.

**అమరుచు.** దే. ప్రే. అమరఁజేయు.

**అమర్త్యుఁడు.** సం. వి. అ. పుం. నిర్జరుఁడు, వేల్పు.

**అమర్యాద.** సం. వి. ఆ. స్త్రీ. మర్యాదలేమి. విణ. మర్యాదలేనిది.

**అమర్షణుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) అమర్షము గలవాఁడు.

**అమర్షము.** సం. వి. అ. పుం. 1. కోపము, కినుక; 2. ఓర్వలేనితనము.

**అమల.** సం. వి. ఆ. స్త్రీ 1. లక్ష్మి; 2. బొడ్డుకాఁడ; 3. నేలయుసిరిక ?. అ. న. ము. అభ్రకము. విణ. నిర్మలము.

**అమలు.** హిం. వి. అధికారము, ప్రభుత్వము.

**అమలుదారు.** హిం. వి. తహశ్శీలుదారు.

**అమవస.** వై. వి. అమాస, అమావాస్య.

**అమాంతగాఁడు.** దే. వి. (అమాంతము+కాఁడు.) చిల్లరబేరగాఁడు.

**అమాంతము.** దే. వి. 1. చిల్లరబేరము; 2. అకస్మాత్తు.

**అమాంసుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) బలములేనివాఁడు, దుర్బలుఁడు.

**అమాత్యుఁడు.** సం. వి. అ. పుం. మంత్రి, ప్రెగ్గడ.

**అమానస్యము.** సం. వి. అ. న. దుఃఖము, నెగులు.

**అమాని.** దే. విణ. దొరతనమువారి స్వతంత్రవిచారణకలది.

**అమానుదస్తా.** హిం. వి. తాంబూలముదంచుకోలు కోఁకలి.

**అమానుషము.** సం. విణ. (అ. ఆ. అ.) మనుష్యకృతముకానిది.

**అమారు.** దే. వి. ఓడలంగరుమోకు.

**అమావసి.** సం వి. ఈ. స్త్రీ. అమావాస్య, (రూ.) అమావాసి.

**అమావాస్య.** సం. వి. ఆ. స్త్రీ.—వై.—(రూ.) అమావస్య.

**అమాస.** వై. వి. అమవసయొక్క రూపాంతము.

**అమిజీ.** దే. వి. కూలిలేమి, వెట్టి.

**అమీన్.** హిం. వి. చిన్నప్రదేశముమీఁద న్యాయాధిపతి.

**అమూల్యము.** సం. విణ. (అ. ఆ. అ.) వెలలేనిది.

**అమృణాళము.** సం. వి. అ. న. 1. నీటివట్టివేరు; 2. వట్టివేరు.

**అమృత.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఉసిరిక ?; 2. కరక ?; 3. తిప్పతీఁగ; 4. పిప్పలితీఁగ. అ. న. ము. 1. సుధ; 2. నీళ్లు; 3. నెయ్యి; 4. అయాచితవృత్తి; 5. ముక్తి; 6. యజ్ఞశేషము. విణ. అందమైనది. (పంచామృతములు=ఉదకము, పాలు, పెరుగు, నెయ్యి, తేనె.)

**అమృతకలశము.** సం. వి. అ. న. 1. అమృతపుకుండ; 2. భక్ష్యవిశేషము. "వ. అతిరసమ్ములు సుకియలమృతకలశమ్ములు." హంస. ౧. ఆ.

**అమృతాంధసుఁడు.** సం. వి. స్. పుం. దేవుఁడు, వేల్పు.

**అమృతాంశువు.** సం. వి. ఉ. పుం. చంద్రుఁడు.

**అమృతుఁడు.** సం. వి. అ. పుం. 1. ధన్వంతరి; 2. వేలుపు.

**అమేధ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) పవిత్రము కానిది.

**అమేయము.** సం. విణ. (అ. ఆ. అ.) మితియిడతగనిది.

**అమేషా.** హమేషా. హిం. క్రి. విణ. ఎల్లప్పుడు.

**అమోఘ.** సం. వి. ఆ. స్త్రీ. 1. కరక ?; 2. వాయువిడంగము ?. విణ. వ్యర్థముకానిది.

**అమ్మ.** వై. వి. 1. తల్లి; 2. పూజ్యస్త్రీ*. అవ్య. ఔర. "స్ఫురితంబులమ్మయనఁ దేనియలొల్కెడి జిల్గుపాటతో." ఉ. రా. ౬. ఆ. (ఆమ్రేడితమందు అమ్మమ్మ.)

**అమ్మకచెల్ల.** ద్వి. అవ్య. (అమ్మ+అక+చెల్లెలు.) ఔర. "ఉ. అమ్మకచెల్లనాహృదయ మమ్మకచెల్లదువీనికియ్యెడన్." విజ. ౧. ఆ.

**అమ్మకము.** దే. వి. విక్రయము.

**అమ్మక్క.** వై. అవ్య. (అమ్మ+అక్క.) ఔర. "ద్వి. అమ్మక్కయని సతులక్కజంబంద." రా. బా. కాం.

**అమ్మచెల్ల.** ద్వి. అవ్య. (అమ్మ+చెల్లెలు.) ఔర. "అమ్మచెల్లయిట్టులనకుము." భార. శాం. ౩. ఆ.

**అమ్మనలు.** దే. వి. బ. 1. బాలికాక్రీడావిశేషము; 2. అమ్మనలాడుసాధనములు. (రూ. అమ్మనములు.)

**అమ్మయము.** సం. విణ. (అ. ఆ. అ.) జలమయము.

**అమ్మరో.** ద్వి. అవ్య. (అమ్మ+రో.) ఔర. "ఉ. అమ్మరో ధర్మరాజుఁ గొనియాడఁగఁజెల్లదె యెల్లదేశముల్." పాంచా. ౫, ఆ. (రూ. అమ్మరో.) (అమ్మను పిలుచుటయందును ఈ రూపములు వచ్చును.)

అమ్మవారు. ద్వ. వి. బ. 1. స్త్రీదేవత; 2. పూజ్యురాలగు బ్రాహ్మణస్త్రీ.

అమ్మాయి. వై. వి. పడుచు, బాలిక.

అమ్మి. వై. వి. అమ్మాయి.

అమ్మిక. వై. వి. పార్వతి. "గీ. గట్లమీఁనిపట్టికలకం ఋనిల్లాలు, కొండమసింగమెక్కు-కొన్నజంత, సత్తిసామితల్లిచండియమ్మికదుర్గ, యనఁగనీనెలం తయలరుసభవ." ఆం. భా. ప్ర. స్వ.

అమ్ము. యు. దే. స. క్రి. విక్రయించు. —వై. వి. బాణము. (దీనికి పిఁపునందలి నఖక్షతియు అర్థమని కొందఱనియెదరు. అప్పుడు బహువచనాంతము.)

అమ్ముడు. దే. వి. వెలకు ఒక వస్తువునిచ్చుట, విక్రయము.

అమ్ముడువోవు. దే. అ. క్రి. (అమ్ముడు+పోవు.) వెలపోవు.

అమ్ముమేటునేల. ద్వ. వి. బాణము పోయిపడునంత దూరముగలభూమి. "వ. గ్రామంబునకు నిర్ఋతి భాగంబున నమ్ముమేటు నేలకంటెదూరంబుగాఁ జని." వి. పు. ౪. ఆ.

అమ్లము. సం. వి. అ. పుం. పులుసు.

అమ్లానము. సం. వి. అ. పుం. పెద్దమేకులుగల చేమంతి; పెద్దగోరంట (అనికొందఱు.) విశ. 1. వాడనిది; 2. మాయనిది.

అమ్లిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చింతచెట్టు; 2. పులిచింత; 3. పులుసు; 4. త్రేఁపు.

అయ. వై. వి. తండ్రి*. విశ. పూజ్యుఁడు. (అయ్య యొక్క-రూపాంతరము.)

అయగారు. ద్వ. వి. అయ్యగారుయొక్క-రూపాంతరము. (ఆచార్యునకు—చూ. నడుగు మేఁడు.)

అయత్నము. సం. వి. అ. పుం. యత్నములేమి.

అయథార్థవర్ణుఁడు. సం. వి. అ. పుం. చారుఁడు, వేగులవాఁడు.

అయనము. సం. వి. అ. న. 1. సూర్యునిదక్షిణోత్తరదిశలపోక; 2. త్రోవ.

అయము. సం. వి. అ. పుం. మేలుగలుగఁజేసెడి కర్మము. మేలుగలుగఁజేసెడి దైవము (అనికొందఱు.)

అయస్కాంతము. సం. వి. అ. పుం. సూదంటురాయి.

అయస్కారము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగుపిక్క-ముందటిచోటు.

అయస్కారుఁడు. సం. వి. అ. పుం. ఇనుముపని చేయువాఁడు, కమ్మరి.

అయస్సు. సం. వి. స్. న. లోహము, ఇనుము.

అయారె. ద్వ. అవ్య. (అయా+రె.) ఔర, (రూ. అయారే.)

అయిమాయిషీ, అజమాయిషీ. హిం. వి. అంచనా.

అయివజు. హిం. వి. బదులు, మూలధనము, రాఁబడి.

అయుక్తము. సం. విశ. (అ. ఆ. అ.) యుక్తము కానిది. (యుక్తము=తగినది.)

అయుతము. సం. వి. అ. న. పదివేలు. విశ. కూడుకొననిది.

అయో. ద్వ. అవ్య. (అయ+ఓ.) అయ్యో. (ఆమ్రేడితమందు అయయో.)

అయోగము. సం. వి. అ. పుం. 1. ఎడఁబాటు; 2. కూడికలేమి; 3. మానసిప్రయత్నము.

అయోగ్యత. సం. వి. ఆ. స్త్రీ. అయోగ్యత్వము.

అయోగ్యుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) యోగ్యుఁడుకానివాఁడు.

అయోగ్రము. సం. వి. అ. న. ముసలము, రోఁకలి.

అయోనిజుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) గర్భమునందుఁబుట్టనివాఁడు.

అయోమయము. సం. విశ. (అ. ఆ. అ.) 1. ఇనుముది; 2. కఠినము.

అయ్య. వై. వి. తండ్రి*. (ఇది వాత్సల్యసంబోధనమునందు సంబోధ్యశబ్దంబునకుమాఱుగాఁ బ్రయోగింపఁబడును. "వ. ఆరాజర్షిముఖ్యుండయ్యాయిట్లేలతడసితనియడిగిన." భార. అర. ౭, ఆ.—మఱియు క్రియలమీఁదను విశేషణములమీఁదను వచ్చునపుడు వ్యతిరేకమును దెలుపును. "గీ. ఆఁ కొనఁగమునిఁడిదినిఁగ్రొవ్వులావు, కలుగునయ్య." భార. ఉద్యో. ఆ. 3, "గీ. ఎఱిగియెఱిఁగినన్ను నేకార్థసమవేతుఁ, బాడియయ్యయిట్టిపనికిఁబనుప." భార. అర. ౨, ఆ.)—విశ. పూజ్యుఁడు. "అద్దిరా అయ్యకుమన్మథాభ్యుదయము." కళా. 3, ఆ.

అయ్యగారు. ద్వ. వి. 1. ఆచార్యుఁడు; 2. పూజ్యుఁడగు బ్రాహ్మణుఁడు. (చూ. అయగారు.)

అయ్యది. దే. స. (అ+అది.) అది.

అయ్యరె. ద్వ. అవ్య. (అయ్య+రె.) ఔర, (రూ. అయ్యరే.)

అయ్యలు. వై. అవ్య. సంతోషమునుదెలుపును*. "అయ్యలుతాళలేననియామఁకొన్న ప్రేమతోడ, నియ్యానయిఁకఁదమి నిలుపలేననఁగాను." క్షేత్రయ.

అయ్యవారు. ద్వ. వి. బ. పూజ్యుఁడగు బ్రాహ్మణుఁడు.

అయ్యారె. ద్వ. అవ్య. (అయ్యా+రె.) ఔర. (రూ. అయ్యారే. "క. అయ్యారేచెలువెక్కుడ, నయ్యారే గెలువఁజాలు నంగజునారికా." విజ. ౧, ఆ.)

అయ్యో. దే. ద్ర. (అయి+యొ.) మీఁదవిరుద్ధధర్మము కలుగుటను తెలుపును. "గీ. ఉత్తమజ్ఞానవృద్ధు నానుండుదేని, బాలుఁడయ్యును బూజ్యుఁడు బ్రాహ్మణుఁడు." భార. సభా. ౨. ఆ.

అయ్యో. ద్వ. అవ్య. (అయ్య+ఓ.) అహో. "ఎ. గీ. కటికి నేలఁగండ్లుఁబొత్తనిద్రపోయెదునయ్యో." భార. ఆది. ౬, ఆ.—(రూ. అయ్యో. ఆమ్రేడితమందు అయ్యయ్యో, అయ్యయ్యో.)

అర. వై. వి. సగము, అర్ధము.

అరఁగు. దే. వి. తిన్నె, వేదిక. "ఉ. నీడసున్నపుణ్ , రంగుటరంగుపచ్చలయరంగయిపో." ఆము. ౫. ఆ.

అరఁటి. దే. వి. అనఁటి. కదళి.

అరక. దే. వి. ఎద్దులఁగట్టిదున్నుటకు సిద్ధపఱచిన నాఁగలి. ఏరు.

అరకాఁడు. దే. వి. (అరక+కాఁడు.) పైరుపెట్టువాఁడు, కర్షకుఁడు.

అరఖు. హిం. వి. ద్రవరూపమైన ఔషధము

అరగడము. దే. విణ. వయసుచెల్లినది. వృద్ధు.

అరగడి. దే. వి. కుఱచగోడ.

అరగన్ను. ద్వ. వి. (అర+కన్ను.) సగముమూయఁబడినకన్ను.

అరగలి. ద్వ. వి. (అర+కలిమి.) సందేహము. "చ. నరునకుఁబూనిపల్కితి వినం జవిమాలినయట్టిపల్కులే, నరగలిలేకబెట్టడరినప్పుడునూడుము నన్నునాతనికా." భార. కర్ణ. ౨. ఆ.

అరగలిగొను. ద్వ. అ. క్రి. (అరగలి+కొను.) సందేహించు. "ద్వి. హరుఁడుభక్తులమనంబరయంగఁదలఁచి, యరుదైనవస్తువులరుదెంచివేఁడ, నరగలిగొనకిత్తురల్లభక్తులును." బస ౪. ఆ.

అరగూఁడు. ద్వ. వి. గోడయందేర్పఱచినగూఁడు.

అరడ. దే. వి. ఏఱుదాఁటఁదగినసాధనవిశేషము. "గీ. ఈఁదుకాయలు తెప్పలునీఁదుకాయ. లరడలరిగోళ్లుపడవలుదరులుపుట్లు, చేపడవలోడలాదిగాఁజెలఁగునట్టి, యంబుతరణంబులకునెల్ల నధిపుఁడతఁడు." హంస. ౪, ఆ.

అరణము. వై. వి. వివాహకాలమునందు అల్లునకును ఆఁడుబిడ్డకును ఇయ్యఁబడుధనము, హరణము.

అరణి. సం. వి. ఇ. పుం. స్త్రీ. త్రచ్చినిప్పుఁబుట్టించెడుకొయ్య.

అరణ్యము. సం. వి. అ. న. కాననము, వనము, అడవి.

అరణ్యశునకము. సం. వి. అ. పుం. వృకము, తోఁడేలు.

అరణ్యాని. సం. వి. ఈ. స్త్రీ. పెద్దయడవి, పేరడవి.

అరత. వై. ద్ర. సమీపమునందు. "గీ. అనుజుగెలుపు. గాంచిమోదించెనరతనటించుచక్రి." (రామాయణార్థమున నరతననియు. భారతార్థమున అరతననియూచ్ఛేదము.) రాఘ. ౪. ఆ. (కొందఱు ఉపకంఠము అను సంస్కృతశబ్దముయొక్క అర్థమునుబట్టి తెనుఁగునను సమీపమునందు అనునర్థమున అఱుతనని ప్రయోగించినారు. చూ. అఱుత.)

అరతి. సం. వి. ఇ. స్త్రీ. 1. విరామము; 2. ఒక మన్మథావస్థ.

అరత్ని. సం. వి. ఇ. పుం. 1. చిటికెనచాచిన మూర; 2. మోఁచెయి.

అరదండ. దే. వి. రెండుచేతులకుఁదగిలించెడు సంకెల.

అరదము. వై. వి. తేరు, రథము.

అరప. దే. వి. మీఁదఁగూర్చుండుటకై యేర్పఱచిన చిన్నచప్పరము, మంచము.

అరపది. వై. స. పదిటసగము, అయిదు.

అరమర. ద్వ. వి. (అర+మరలుట.) 1. సందేహము; 2. భేదము. (రూ. అరమరము "ఉ. తామదినమ్మకున్నది విదర్భనరేంద్రతనూజ నిన్నుసు. త్రాముఁడవంచునీయరమరంబునఁబోమనసీదు నీకు." వై. ౮, ఆ.)

అరమరిక. ద్వ. వి. (అరమరియొక్కరూపాంతరము.) 1. సందేహము; 2. భేదము. "అరమరికలేనిచుట్టలు." క్షేత్రయ.

అరమీటుమొన. ద్వ. వి. మల్లబంధవిశేషము.

అరము. సం. వి. అ. న. బండికంటియాకు. క్రి. విణ. న. త్వరితము. విణ. వడిగలది.

**అరముడి.** దే. క్రి. విశే. మాటిమాటికి.

**అరయిక.** దే. వి. అరయుట, విచారణ.

**అరయు.** దే. స. క్రి. 1. విచారించు; 2. వెదకు.

**అరరము.** సం. వి. అ. న. 1. తలుపు; 2. ఆకు.

**అరరి.** సం. వి. ఇ. పుం, స్త్రీ. కవాటము, తలుపు.

**అరవరలు.** దే. విశే. బ. శుష్కము. "క. విరహాగ్ని వలన దేహము, లరవర లైహస్తభూషణావళులెల్లన్, హారిఁగోరిజాతిపడఁగా, నరుదుగనెుకచో టఁగూడియందఱుఁదమలోన్." వి. పు. ౭. ఆ.

**అరవాయి.** వై. వి. 1. అధైర్యము; 2. సంకోచము.

**అరవాయిగొను.** ద్వి. అ. క్రి. (అరవాయి+కొను.) 1. అధైర్యపడు; 2. సంకోచించు. "వ. చుట్టం బనియరవాయిగొనుటకర్జంబుగాదు." భార. కర్ణ. 3, ఆ.

**అరవిందము.** సం. వి. అ. న. పద్మము, తామర.

**అరవిరి.** ద్వి. వి. సగమువిరిసినమొగ్గ, ముకుళము.

**అరసావు.** ద్వి. వి. (అర+చావు.) మూర్ఛ. "చ. అతండు నీమఱం, దికినరసావొనర్చె." భార. ద్రో. ౫, ఆ.

**అరళము.** సం. వి. అ. న. తలుపు. "అరళంబులు విరళంబులైన." భాగ. ౧౦, స్కం. పూ.

**అరళువు.** సం. వి. ఉ. పుం. దుండిగము?.

**అరాజకము.** సం. విశే. (అ. ఆ. అ.) రాజులేనిది.

**ఆరాతి.** సం. వి. ఇ. పుం. శత్రువు, పగతుఁడు.

**అరాళము.** సం. వి. అ. పుం. 1. మదపుటేనుఁగు; (ఇదినింద్యము.) 2. సజ్జరసము; 3. అభినయ హస్తవిశేషము. (బొటనవ్రేలినివంచి చూపుడు వ్రేలి మొదటఁగూర్చి చూపుడువ్రేలిని వంచి తక్కిన వ్రేళ్లను జక్కఁగాఁ జాఁచిపట్టినది.) విశే. వంకరైనది.

**అరి.** ఉభ. దే. వి. 1. కప్పము; 2. శరసంధానస్థాన మైనయల్లెనడుము. "క. సరినాధానముసేయుట, యరిఁబోయుటతివియుటేయుటద్భుతకరమై, త రుణీశరములుభానుని, కరములగతిరిపులనేకకా లమకప్పెన్." విక్ర. ౬. ఆ. "సీ. బలితంపుఁ గ్రొవ్వాఁడిములుకుల సింగాణిఁగూరిచియరిసెకొనకులాగి." అచ్చ. యు. కాం. (దీనికి వృత్తియందు నిర్బంధములోనగు అర్థములు కలుగు చున్నవి. చూ. అరికట్టు. మొ.)—సం. ఇ. పుం. 1. చక్రము; 2. శత్రువు. (అరిషడ్వర్గము.—కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము.)

**అరిందముఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) శత్రువు నడఁచువాఁడు.

**అరికట్టు.** దే. స. క్రి. 1. అడ్డగించు; "సీ. తెరువు లనరుగంగ నరికట్టిచంపె నాబాలవృద్ధంబుగా బహుజనముల." నిర్వ. 3, ఆ.—2. పరివేష్టించు. "సీ. ఆకుశద్వీపంబునరికట్టుకొనియుండు నెనిమిదిలక్షలఘనఘృతాబ్ధి." భాగ. ౫, స్కం. ౨, ఆ.—వి. బ. దుప్పటిమెలిపెట్టి రెండుబుజముల యందును జందెపువాటుగానైచికట్టినకట్లు.

**అరిగ.** దే. వి. 1. కేడెము; "సీ. బెడిదంపుటరిగలు బిఱబిఱద్రిప్పుచు పడిఁబిల్లమొఱములు వైచువారు." కళా. ౧, ఆ.—2. ఒకబిరుదు. "సీ. కడువేగమునఁబెండ్లికొడుకు నెమ్మొగమున కరిగ యడ్డమున ట్టెఁగురువిభుండు." కళా. ౭. ఆ.

**అరిగాపు.** దే. వి. (అరి+కాపు.) కట్టుకాపరి. (అరి గాపుఁదోఁట=కట్టుకావలిగలతోఁట, వానియొ అరిగాఁపు అనఁగా కప్పముకట్టువాఁడు.)

**అరిగాల్లు.** దే. వి. బ. (అరి+కాల్లు.) ద్వారపుగుజ్జు పుపీఁటలకు వెనుకటిభాగమున ఊఁతగానుంచెడుకమ్ములు.

**అరిగొను.** దే. అ. క్రి. (అరి+కొను.) అడ్డపడు. "ద్వి. ఆలకుబెబ్బులియరిగొన్నయట్లు." వీరచరిత్రము.

**అరిగోలు.** దే. వి. (అరి+కోలు.) ఏఱుదాఁటఁదగిన సాధనవిశేషము. (చూ. అరడ.)

**అరిణ.** దే. వి. ఎత్తుడునీరుపోయుటకై తొలిచి కాలువమొదటనుంచెడు తాటిమ్రానులోనగునది, దోనె.

**అరితి.** దే. వి. కూరిమి, ప్రేమము. "ఎ. గీ. అరితి, బాళిప్రేముడి మచ్చికమక్కువయనఁ, బ్రేమ దోఁచును." ఆం. భా. ప్ర. నా.

**అరిత్రము.** సం. వి. అ. న. ఓడగడపెడుత్రెడ్డు, కడపుఁజేయి, చుక్కాని.

**అరిదళము.** వై. వి. హరిదళము, హరితాళము.

**అరిది.** దే. విశే. 1. అశక్యము. "క. అరిగరమునసేం దాల్చిన, నరిగరమునగేంద్రధీరుఁడైనంజెడఁడే, యరిదిర మైనన్నడుగుట. యరిదిర మైకాభిలాషుల గునృపతులకున్." ఉ. హరి. ౪, ఆ.—2. దుర్లభము. "సీ. హిమాద్రికన్య వరమునఁబుట్టిన యరిది

కూఁతురు." హరి. ఉ. ౭, ఆ.—3. దుస్సహము. "చ. అరిదినికృంతనాఖ్యనిరయంబిది." మార్క. ౨, ఆ.

అరిపడు ద్వ. అ. క్రి. అడ్డపడు. "చ. భద్భుజనాంతరాయత, త్వరమతినీకునిప్పుడరిపడ్డదురాత్ములనేఁడుగంటిరే." భాగ. 3, స్కం.

అరిమి. దే. వి. బిడ్డలకుగొంతునందుఁగలిగెడు వ్యాధివిశేషము. "ద్వి. ఏలవల్కవు చెప్పవేయన్ననీకు. నరిమియోకోవయోయఁగిటికినుల్లో." భల్లా. 3, భా.

అరిమేదము. సం. వి. అ. పు. వెలితుమ్మ. (అనికొందఱు.)

అరివాణము. వై. వి. గిన్నె*. "క. సతనాల్కలజేజేయవు, దతనికిఁబొడకట్టిపసిఁడియరివాణముతో, డుతఁదెచ్చిపాలయోరఁ, బతివలుమువ్వరకుఁబెట్టుమనియిడిచనుడుఁ." అచ్చ. బాల. కాం. (హరివాణశబ్దముసంస్కృతమనియు దానికర్థము గుండిగయనియుఁ దెలియునది.)

అరిష్టతాతి. సం. విశే. ఇ. క్షేమంకరుఁడు. మేలుచేయువాఁడు.

అరిష్టము. సం. వి. అ. న. 1. కీడు; 2. పురిటిల్లు; 3. మజ్జిగ; 4. చావుగుఱుతు; 5. కల్లు; 6. మేలు. పుం. 1. కాకి; 2. రాపులుఁగు; 3. వెల్లుల్లి; 4. కుంకుడు; 5. వేము.

అరుంతుదము. సం. విశే. (అ. ఆ. అ.) మర్మమును దాఁకునది.

అరుంధతి. సం. వి. ఈ. స్త్రీ. వసిష్ఠునిభార్య. అరుంజ్యోతి.

అరుఁగు. దే. వి. తిన్నె. "అరుంగుమెఱుంగుమెట్టికల్. మసలికనెక్కెఁడు." పాంచా. ౪, ఆ. (అరుఁగనియే తెలుఁగుగా వాడుక. అరఁగని యొకానొకచోఁ గానఁబడుచున్నది.)

అరుగు. దే. అ. క్రి. పోవు. గమించు.

అరుగుదెంచే. దే. అ. క్రి. (అరుగు+తెంచు.) 1. వచ్చు; "కాంచిరరుగుదెంచుమహాత్ముః." భార.ఆది .౭. ఆ.—2. పోవు "ఎ. గీ. హంసకేతనుపాలికినరుగుదేర." జై. ౪, ఆ. (ఇక్కడ తెంచుధాతువుస్వార్థమందు అనుప్రయుక్తమైనదని యెఱుంగవలయును. ఇట్లే ఏగు చను క్రియలకును. ఇట్టిప్రయోగము ఇతరగ్రంథములయందుఁగానఁబడదు. స్వార్థమందు తెంచు అనుప్రయుక్తమగుటకు పోవుటకు పోవుదెంచు అని ప్రయోగించిన ఆచార్యప్రయోగమే ప్రమాణము. చూ. పోవుదెంచు.)

అరుచి. సం. వి. ఇ. స్త్రీ. రుచిలేమి.

అరుజు. దే. వి. మత్స్యవిశేషము. శాలము. "సీ. అరుజునిల్లెపుఁజేఁపయాకుజెల్ల." హంస ౪. ఆ. (దీనిభేదములు.—కల్లరుజు. పుల్లరుజు.)

అరుణ. సం. వి. ఆ. స్త్రీ. 1. అతివస; 2. తెల్లతెగడ; 3. మంజిడి; 4. మామెన. అ. పుం. ము. 1. ఇంచుకయెఱుపు; 2. కపిలవర్ణము; 3. కుష్ఠభేదము; 4. సంధ్యారాగము. విశే. 1. ఇంచుకయెఱుపుగలది; 2. కపిలవర్ణముకలది.

అరుణిమ. సం. వి. న్. పుం. శోణిమము, ఎఱుపు.

అరుణుఁడు. సం. వి. అ. పుం. 1. అనూరుఁడు; 2. సూర్యుఁడు.

అరుదు. దే. వి. విశే. ఆశ్చర్యము. విశే. అపూర్వము.

అరుదుపడు. ద్వ. అ. క్రి. ఆశ్చర్యపడు.

అరుదెంచే. దే. అ. క్రి. (అరుగు+తెంచు.) 1. వచ్చు; 2. పోవు. "వ. చంపకాపురంబునకరుదెంచువారు." జై. ౪, ఆ. (చూ. అరుగుదెంచు.)

అరులు. దే. వి. వాత్సల్యము. "సీ. అక్కలియంచననరులు నానర్లనవాత్సల్యసంజ్ఞయైపరఁగుచుండు." ఆం, భా. ప్ర. నా.

అరులుమరులు. దే. వి. ముదిమియందుఁగలిగెడు మతిభ్రమ్మ, (రూ.) అర్లుమర్లు.

అరుళువు. సం. వి. ఉ. పుం. దుండిగము.

అరువు. దే. వి. ధాన్యాదులబుఱము.

అరువుఁద్రిక్క. దే. వి. (అరువు+త్రిక్క.) పశురోగవిశేషము.

అరువుఁబూఁట. దే. వి. (అరువు+పూఁట.) రొక్కపుపూఁట. (అచ్చేనకు అరువాదేశము.)

అరుష్కరము. సం. వి. అ. పుం. జీడి. విశే. వ్రణమునుకలుగఁజేయునది.

అరుసము. వై. వి. హర్షము. "చ. అరుసముఁజెంది వచ్చిరఁటయందఱుముందటిలీలనుంపులై." ఉ. రా. ౨, ఆ.

అరుసు. వై. వి. రాజు. "క. చేపట్టిన ధ్రువులగుదురు, కోపించిన రంభఁగూడుకొందురుజగతిః,

స్థాపింపఁబోడువఁజాలని, యాపందలుసాల్వకో నమరుసునకెనయే." అప్ప. 3. ఆ.

అరుస్సు. సం. వి. స్. న. వ్రణము. పుండు.

అరుహుఁడు. వై. విణ. అర్హుఁడు.

అరే. దే. అవ్య. ప్రశంసను దెలుపును. (రూ. అరే. ఆమ్రేడితమందు అరరె, అరరే. "చ. వెం, బడి బళిరే పురే యరరె బాపురెయంచుపచింపవేఁట రుల్." చంద్రా. ౨, ఆ. "అరరేదాంతి." చంద్రా. 3, ఆ.)

అర్కపుష్పిక. సం. వి. ఆ. స్త్రీ. కోలపాల?.

అర్కబంధువు. సం. వి. ఉ. పుం. శాక్యసింహుఁడనుబుద్ధుఁడు.

అర్కము. సం. వి. అ. పుం. 1. జిల్లేడు?; 2. పటికము; 3. రాగి.

అర్కారా. హిం. వి. దూత, పనివాఁడు. (రూ. హర్కారా.)

అర్కుఁడు. సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. అన్న; 3. ఇంద్రుఁడు.

అర్గళము. సం. వి. అ. న. ఆ. స్త్రీ. 1. గడియమ్రాను; 2. పెద్దయల. (ఇదిమూడులింగములయందని మేదిని.)

అర్గు. దే. అ. క్రి. అరుగుయొక్క రూపాంతరము. "మత్త. ఎన్నడుఁ గామతియిట్టటర్గియెఱుంగవు." కళా. 3, ఆ.

అర్ఘము. సం. వి. అ. పుం. 1. వెల; (రూ. అర్ఘువు.) 2. పూజించుట.

అర్ఘ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పూజకుఁదగినది; 2. పూజకొఱకైనది. (అష్టార్ఘ్యములు.—పెరుగు, తేనె, నెయ్యి, అక్షతలు, గఱిక, నువ్వులు దర్భ. పుష్పము.)

అర్చ. సం. వి. ఆ. స్త్రీ. 1. పూజ; 2. ప్రతిమ.

అర్చకుఁడు. సం. వి. అ. పుం. పూజచేయువాఁడు. నంబివాఁడు.

అర్చన. సం. వి. ఆ. స్త్రీ. పూజ. (మ్రుగ్గు, సుగంధము, అక్షతలు. పుష్పము, ధూపము. దీపము, ఉపహారము, తాంబూలము అని యొనిమిదివిధములుగలది.)

అర్చి. సం. వి. స్. స్త్రీ, న. 1. మంట; 2. వెలుఁగు.

అర్చించు. సం. స. క్రి. పూజించు. (సమర్చించు అనియు.)

అర్చితుఁడు. సం. విణ (అ. ఆ. అ.) అపచితుఁడు.

అర్జకము. సం. వి. అ. పుం. తెల్లగగ్గెర?.

అర్జీ. హిం. వి. వ్రాఁతపూర్వకమైన మనవి.

అర్జుక. సం. వి. ఆ స్త్రీ. నాట్యపరిభాషయందు వేశ్య.

అర్జునము. సం. వి. అ. న. 1. కసవు; 2. బంగారు; 3. కంటితెవులు. పుం. 1. ఏఱుమద్ది?; 2. తెలుపు; 3. నెమలి. విణ. తెల్లనిది.

అర్జుని. సం. వి. ఈ. స్త్రీ. 1 ఆవు; 2. బాణాసురునికూఁతురు; 3. బాహుదయనునది; 4. (ఒకానొకచో) కుంటెనకత్తె.

అర్జునుఁడు. సం. వి. అ. పుం. 1. కృతవీర్యుని కొడుకు; 2. పాండురాజుకొడుకు; 3. ఒకతల్లి కొక్కకొడుకు.

అర్ణము. సం. వి. స్. న. ఉదకము. నీరు.

అర్ణవము. సం. వి. అ. పుం. సముద్రము. కడలి.

అర్ణోరాశి. సం. వి. ఇ. పుం. సముద్రము. నీరుకుప్ప.

అర్తనము. సం. వి. అ. న. రోయుట, రోఁత.

అర్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. దుఃఖము; 2. వింటికొప్పు.

అర్థజ్ఞుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తెలివరి.

అర్థన. సం. వి. ఆ. స్త్రీ. యాచన, వేఁడికోలు.

అర్థనీయము. సం. విణ. (అ. ఆ. అ.) వేఁడఁదగినది.

అర్థపుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు, పైఁడిఱేఁడు.

అర్థప్రయోగము. సం. వి. అ. పుం. కుసీదము, వడ్డిచేతిబ్రదుకు.

అర్థము. సం. వి. అ. పుం. 1. శబ్దార్థము; 2. ఇంద్రియార్థము; 3. కారణము; 4. ధనము; 5. నివృత్తి; 6. న్యాయము; 7. ప్రయోజనము; 8. వస్తువు.

అర్థవంతుఁడు. సం. విణ. (త్. ఈ. త్.) అర్థముకలవాఁడు. (ఈకారాంతమైనప్పుడు అర్థవతీ అని రూపము. ఇట్లంతట నెఱుఁగునది.)

అర్థవాదము. సం. వి. అ. పుం. స్తుతి.

అర్థశాస్త్రము. సం. వి. అ. న. నీతిశాస్త్రము.

అర్థాపత్తి. సం. వి. ఇ. స్త్రీ. ఒక అలంకారము. (చూ. అలంకారము.)

అర్థి. సం. వి. న్. పుం. 1. వేఁడువాఁడు; 2. వాది; 3. కొలువుడుకాఁడు; 4. (తెనుఁగున) కోరిక.

అర్థించు. సం. స. క్రి. 1. కోరు, 2. వేఁడు.

అర్థితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కోరఁబడినది; 2. వేఁడఁబడినది.

అర్థ్యము. సం. వి. అ. న. సిలాజిత్తు. విణ. 1. తెలివిగలది; 2. న్యాయముతోఁ గూడినది; 3. వేఁడఁదగినది; 4. అర్థమువలన తొలఁగనిది.

అర్దన. సం. వి. ఆ. స్త్రీ. అర్థన, వేఁడికోలు.

అర్దితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అడుగఁబడినది; 2. నొప్పింపఁబడినది.

అర్ధచంద్ర. సం. వి. ఆ. స్త్రీ. నల్లతెగడ? అ. పుం. ము. 1. క్షురప్రమనెడి అమ్ము; 2. మెడపట్టి త్రోచుట కమర్చిన అర్ధచంద్రాకారపుచేయి; 3. గోటినెలవంక; 4. అభినయహస్తవిశేషము. (చూపుడువ్రేలుమొదలయిన నాలుగు వ్రేళ్లనొకప్రక్క సరిగాఁజేర్చి బొటనవ్రేలినెడముగాఁ జాఁచిపట్టినది.)

అర్ధతారము. సం. వి. అ. పుం. యుద్ధారంభ వాద్యధ్వని.

అర్ధము. సం. వి. అ. న. అర. పుం. తునుక.

అర్ధరథుఁడు. సం. వి. అ. పుం. ఒక్కరథికునితో సరిగా నిలిచి పోరలేని యోధుఁడు.

అర్ధహారము. సం. వి. అ. పుం. అఱువదినాలుగుపేటలుగలహారము. ఏఁబదినాలుగుపేటలుగల హారము. (అనికొందఱందురు.)

అర్ధేందువు. సం. వి. ఉ. పుం. 1. అరచందురుఁడు; 2. కలయికవగ; 3. మెడపట్టిత్రోయుటకమర్చిన చేయి; 4. గోటినెలవంక.

అర్ధోరుకము. సం. వి. అ. న. చండాతకము. చల్లడము.

అర్పటము. సం. వి. అ. పుం. అప్పడము.

అర్పణము. సం. వి. అ. న. అర్పించుట, అప్పనము.

అర్పించు. సం. స. క్రి. అప్పగించు.

అర్పితము. సం. విణ. (అ. ఆ. అ.) అర్పింపఁబడినది.

అర్బుదము. సం. వి. అ. పుం. 1. దశకోటి; (కోటి అనికొందఱు.) 2. నేత్రరోగవిశేషము; 3. ఒకానొకకొండ.

అర్భకుఁడు. సం. వి. అ. పుం. బాలుఁడు. విణ. 1. కృశుఁడు; 2. మూర్ఖుఁడు.

అర్మము. సం. వి. న్. న. నేత్రపక్ష్మమధ్యకేశము, కొరి. నేత్రరోగము (అనికొందఱు.)

అర్మిలి. దే. వి. 1. అపేక్ష; "చ. చూచుటఁగాని క్రీడిక, ర్మిలి మఱిలేదు భోజనముమీఁది యపేక్ష యొకించుకేనియున్." విజ. ౨, ఆ.— 2. ప్రేమము.

అర్య. సం. వి. ఆ. స్త్రీ. కోమటిది.

అర్యముఁడు. సం. వి. న్. పుం. 1. సూర్యుఁడు; 2. పితృదేవతలలోనొకఁడు.

అర్యాణి. సం. వి. ఈ. స్త్రీ. అర్య, కోమటిది.

అర్యీ. సం. వి. ఈ. స్త్రీ. కోమటివానిపెండ్లాము.

అర్యుఁడు. సం. వి. అ. పుం. 1. కోమటివాఁడు; 2. ఒడయుఁడు.

అర్లు. దే. వి. అరులుయొక్క రూపాంతరము. (చూ.) అరులు.

అర్వము. సం. వి. త్. న్. పుం. 1. గుఱ్ఱము; 2. తులువగుఱ్ఱము. విణ. అధమము, కీడ్వడినది.

అర్వాచీనము. సం. విణ. (అ. ఆ. అ.) క్రిందనుండునది.

అర్శము. సం. వి. స్. న. మూలరోగము.

అర్శసుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మూలరోగము గలవాఁడు.

అర్శోఘ్నము. సం. వి. అ. న. మీఁగడపెరుఁగు. (మీఁగడదీసినపెరుఁగు దధిబుసము.) పుం. కంద?.

అర్శోఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. నేలతాడి?.

అర్హా. సం. వి. ఆ. స్త్రీ. అర్చ, పూజ.

అర్హత. సం. వి. ఆ. స్త్రీ. యోగ్యత.

అర్హము. సం. విణ. (అ. ఆ. అ.) అనురూపము, తగినది.

అర్హితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అర్చితుఁడు.

అఱ. యు. దే. వి. 1. గది; 2. పెట్టెలోనగువాని లోపలి అఱ; 3. హస్తాది తలము. "మీఁజేయి యఱచేయి." సం. "పాణిపృష్ఠంపాణితలమ్." కాశీ. ౫, ఆ.— వై. 1. సగము; "అఱచందురునిక్రొత్త మెఱుఁగులు." హరి. ఉ. ౭. ఆ.— 2. కొంచెము*; "క. ఘోరంబగునీ జలధివధయించినీతో, నఱలేనిమనోజకేళినలరెదనెలమిన్." రా. అర. ౧. ఆ.—3. భేదము*; "సీ. పికభాషలకువిపంచికమ్రోఁతలకుభావ మఱలేక తోడ్పడిమెఱసెనేని." హరి. ఉ. ౭, ఆ.— 4. వంచన*; "చ. అనిననతండు నెమ్మనమునం దొగిమోదము ఖేదముంబెనం, గొనఁగఁబురోహితుంబిలిచికోమలిజన్మఫలంబుమీకుఁదోఁ, చినతెఱఁగంతయుందెలియఁ జెప్పుముపీరికి నీరుసమ్మతిం, చిననెటులైనలెస్స యఱచేసినదోషము వచ్చునావుడున్." భో. ౪. ఆ.—5. కీడు*; "ఎ. గీ. దుర్నయమున శకుని కర్ణదుశ్శాసనుల్, గఱ

పఁబాండవులకు నఱయచేయఁ, గడఁగెఁబాం డవులును గడుధార్మికులుగానఁ, బొరయరైరివారి దురితవిధుల." భార. ఆది. 3, ఆ.—6. చింపి*. "ద్వి. అఱలదోపతిమొలనంటఁగాబిగిచి, కుఱుచగాశిఖముడికొనియాడుకఱచి." రా.అ, కాం.

అఱక. దే. వి. మూఁపు, స్కంధము. "క. మోపుటఱకనేపారెడునీ, లావరిపులుఁగెక్కుడియది." హరి. ఉ. ౪, ఆ.

అఱకడ. దే. వి. (అఱక+కడ.) స్కంధప్రదేశము. "గీ. కడునిద్రగానమిఁదొడరుచువడిగొని నడు వంగనేరకతడువుచున్న, నెఱిఁగిచెచ్చెరఁదల్లినఱకడనిడి." భార. ఆది. ౬, ఆ. (రూ. అఱకడము. "గీ. హయంబునేన, గొఱియబలెఁ బెట్టుకొనివత్తునఱకడమున." జై. ౧, ఆ.) (కడశబ్దము స్త్రీసమమైనను పోరాటముమాఱాటము లోనగువానికివలె వృత్తియందు ము వర్ణకము వచ్చినదని తోఁచెడిని.)

అఱకము. దే. వి. అఱుకువ, అజీర్తి.

అఱగొండెతనము. ద్వ. వి. గుండెధైర్యము. "ద్వి. అద్రిరభక్తునియఱగొండెతనము." భల్లా. ౫, భా. (ఈ పదము ఇంకను విచారింపఁదగినది.)

అఱగొడ్డియము. దే. వి. అకార్యము, గుండగము. (చూ. అఱగొడ్డెము.)

అఱగొడ్డెము. దే. వి. అఱగొడ్డియముయొక్క రూపాంతరము. "క. ఎఱిఁగియెఱిఁగినీముందట, నఱగొడ్డెముచేసిపోయిరి." ఉ. హరి. ౪, ఆ.

అఱగొఱ. ద్వ. వి. న్యూనత. "చ. భీమనాయకుం డఱగొఱలేనివేల్పు నిఖిలాభ్యుదయంబులునీకు నయ్యెడుఁగాక." భీ. ౨, ఆ.—విశే. న్యూనము.

అఱచు. దే. అ. క్రి. 1. కూయు. "క. పనిగొనుచుమేయవచ్చిన, పసిఁగొనుచుంగోలుపులులుబలిసెగొన్నపనీ, యసియాడునేనియచ్చోట, నసియాడుందఱచు వెఱచునఱచుంబఱచున్." రామా. ౨, ఆ.—2. విలపించు. "క. నెఱిదప్పంబడిపెల్లుగ, నొఱలెడినరవాజికరులయులివభిమన్యుం డఱిముఱిఁబడుటకు వగమదిఁ, బఱిగొన నిలపెలుచనఱచుభంగిఁజెలంగెన్." భార. ద్రో. ౨,ఆ.

అఱజాతి. మి. విశే. దుష్టుఁడు. "క. వఱువాతలేచి నీదగు, కొఱగాములుచక్కఁద్రోచి కొనఁబోయెదినం, బఱుగువడిచనియెనీపను, లఱజాతివి నిన్నునేమియననేర్తునుతా." హరి. పూ. ౫, ఆ.

అఱడా. దే. వి. 1. జడకుచ్చుమీఁదిపూస. "అప రంజిబంగారుటఱడాలు." భాను. ౪, ఆ.—2. కర్నాటకపుపల్లకీ బొంగుకొనకువేసెడు సింహలలాటపుతగడు.

అఱడు. దే. వి. అఱడాయొక్క రూపాంతరము.

అఱపు. దే. వి. కూఁత. (చూ. అఱచు.)

అఱమర. ద్వ. వి. (అఱ+మరలుట.) 1. సందేహము; "క. మఱియు నొకమాటయెవ్వరు, నెఱుఁగనియదిదశరథునకునేకాంతమునం, దఱమరలేక దృఢంబుగ, నెఱుకపడంజెప్పవింటినేనొకరుండన్." నిర్వ. ౯, ఆ.—2. భేదము. "క. వెఱవకు నెమ్మదినుండుము, పెఱవారలబుద్ధినాత్మఁబెట్టకయనఘుం, డొఱపిఁడిచాడ్పుననామది. నఱమరలేదొండునమ్ముమనియెనరేంద్రా." విక్ర. 3,ఆ.

అఱమరిక. ద్వ. వి. (అఱమరయొక్క రూపాంతరము.) 1. సందేహము; 2. భేదము.

అఱవ. దే. వి. సాధువుకానియావు, ఒట్టియ. "సీ. అఱవలనైననునలవున వెరవునముట్టియంటఁగఁ బట్టి కట్టివిడునఁ, బిదుక." భార. విరా. ౧, ఆ. (ఇది యిట్లు వ్రాఁతప్రతులపాఠము ననుసరించి వ్రాయఁబడినది. అచ్చుపుస్తకములయందు నఱవయనిపాఠము గనఁబడుచున్నది.) విశే. దుష్టము, దుష్టుఁడు. "ఆ. పంగులఱవలై కాలుచేపిఱిచి సాధుజనులఁబఱచినారు." (ఇది వ్రాఁతప్రతులయందలిపాఠము.) భార. ఆను. ౫, ఆ.

అఱవడు. దే. వి. సస్యవిశేషము. "క. అఱవడుగం టెతపిండయు, నఱువదిదినములకుఁబండునని బ్రదుకాసన్, దఱుచుగనేతాలెత్తఁగఁ, బఱిపడియయుపియుమల్లెవడిచెడిపోయెన్." కాశీ. 3, ఆ.

అఱవత. ద్వ. వి. ద్రావిడస్త్రీ. "౨, గీ. కంచి యఱవత లసమాస్త్రఖడ్గలతలు." కాశీ. 3, ఆ.

అఱవము. వై. వి. (అఱ+వాయి.) ద్రావిడభాష.

అఱవఱలు. దే. వి. బ. సూక్ష్మఖండములు. "క. అఱవఱలైనరథంబులు, నెఱిదప్పంబడినయశ్వనికరంబులుఁబెం, దఱుచుగఁగూలినకరులున్, గిఱికొనియెన్సమరమేదినీతలమెల్లన్." భార. భీష్మ. ౨, ఆ.

అఱవఱసేయు. ద్వ. స. క్రి. (అఱవఱలు+చేయు.) 1. ఖండించు; 2. ధ్వంసించు. "అరిగిదతుఘోధ్వరంబఱవఱసేయంగ." హరి. ఉ. ౬, ఆ.

**అఱవలు.** వై. వి. బ. అఱవవారు, ద్రావిడులు.

**అఱిముఱి.** దే. వి. 1. సంభ్రమము. "చ. యుధిష్ఠిరుం డఱిముఱిఁజం పెసారథిఁదదశ్వములంబటుబాఁ పాణియై." సం. "తతో యుధిష్ఠిరో రాజాత్వరమాణో మహారథః." భార. విరా. 3, ఆ.—2. కలఁత. "క. విఱిగిభవత్సుతనివహం, బఱిముఱిఁగనుక నిఁజనంగననిలుసుతుండే, డ్తెఱనెగచివగచెవారం, డఱుఁదనచేఁజచ్చుటపుడు తప్పుటకుఁగడున్." భార. భీష్మ. ౨, ఆ.

**అఱిముఱిపడు.** ద్వి. అ. క్రి. కలఁతపడు. (చూ. అఱిముఱి.)

**అఱిమెనకుండలు.** ద్వి. వి. బ. బచ్చెనపనిచేసిన పెండ్లికుండలు.

**అఱిసియ.** దే. వి. అఱిసె. అతిరసము.

**అఱిసె.** దే. వి. అఱిసియయొక్క రూపాంతరము.

**అఱు.** దే. అ. క్రి. 1. క్షయించు; 2. నశించు. వి. 1. అఱ్ఱు. కంఠము; "సీ. ఇందుబింబముఁ బోచి చెందుప్పఁగలుసావి యఱులెత్తినాకంగ నాసపడిన." కాశీ. 3, ఆ.—2. సమీపము.

**అఱుఁదెవులు.** దే. వి. (అఱు+తెవులు.) క్షయరోగము. "అఱుఁదెవుల్గొన్నాతఁడు." భార. అను. 3, ఆ.

**అఱుకువ.** దే. వి. అఱకము. "అఱుకువయెఱుకతో." (ఇక్కడ అఱుకువ అనఁగా అపక్వమనియర్థము.) ఉ. హరి. ౪, ఆ.

**అఱుక్రమ్ము.** దే. అ. క్రి. కప్పు. "ద్వి. పఱచు నెత్తురుటేర్లు బహుమాంసములకు, నఱుక్రమ్ము భూతమ్ములెరణంబొప్పె." రా. సుం. కాం.

**అఱుగు.** దే. అ. క్రి. 1. జీర్ణించు; 2. క్షయించు.

**అఱుగుఁదెవులు.** దే. వి. (అఱుగు+తెవులు.) అఱుఁదెవులు.

**అఱుగుళ్లు.** దే. విశే. బ. శిథిలము. "సీ. కుడికరంబున నఱుగుడువేణుదండంబు." జై. ౭. ఆ. (వృత్తియందు ఏకవచనాంతమైనది. చూ. అఱువుళ్లు.)

**అఱుగువడు.** ద్వి. అ. క్రి. (అఱుగు+పడు.) 1. క్షయించు; 2. నశించు; 3. హీనమగు. "క. అఱుగువడిచనిరొనీపనులు." హరి. పూ. ౫. ఆ. (చూ. అఱజాతి.)

**అఱుత.** దే. ద్ర. సమీపమునందు. "గీ. మహితశుచిజీవనావాసమంగళగుణ, మఱసియఱుతఁదల్పి నఁగుందియూవెలంది." (హరిశ్చంద్రునికథయందు కంఠమందనియు, నలునికథయందు సమీపమందనియు అర్థము.) హన. ౫. ఆ. (చూ. అఱత.)

**అఱుపు.** దే. స. క్రి. దక్కించు.

**అఱుము.** దే. స. క్రి. 1. ఆక్రమించు; 2. ప్రతీక్షించు. "క. ఎఱుఁగుదు నేను సుయోధను కొఱగామియు నతనితోడఁగూడినన్నృపులం. దఱుఁబగమనమున నిడికొని, యఱుముటయును సంధి పొసఁగదనియు మహాత్మా." భార. ఉద్యో. 3, ఆ.—వి. అలము, ఆక్రమణము. "క. ఆతం డఱుమెడలకమఱియు నేసె నధికరయమునన్." భార. భీష్మ. ౨, ఆ.

**అఱువండ్రు.** ద్వి. స. అఱువదిమంది. (అఱువదికి మహన్మహత్త్వార్థకరూపము.)

**అఱువది.** ద్వి. స. (ఆఱు+పది.) అఱుపదులు.

**అఱువు.** దే. అ. క్రి. అఱుగుయొక్క రూపాంతరము.

**అఱువుఁదెవులు.** దే. వి. (అఱువు+తెవులు.) అఱుగుఁదెవులు. "ఉ. ఏను హితంబుచెప్ప నటు లేచి దురా చరణంబులిమ్మెయిన్, మానవులోగిచందయిన మం దఱువుం దెవులంటఁదాఁకినం, గాని యెఱుంగఁడప్పు ప్రతికారముఁగల్గు నెయట్లువోలెనీ, దైవనికృష్టవృత్తిఫల మంది తలంచెదుగాకపిమ్మటన్." నిర్వ. ౪, ఆ.

**అఱువుళ్లు.** దే. విశే. బ. శిథిలము. "క. ఆమెయిన వివిధవర్మ, స్తోమంబఱువుళ్లుసేసి." భార. విరా. ౫. ఆ. (అఱువుళ్లు ఇత్యాదిబహువచనాంతములు వృత్తియందు ఏకవచనాంతములగును. "అఱువుడుఁగావి." ఉ. హరి. ౪, ఆ. "అఱువుడుఁగుప్పసంపుఁబోరలై." లక్ష్మీ. ౧. ఆ. ఇత్యాది.)

**అఱ్ఱు.** దే. వి. 1. గది; 2. పెట్టెలోనగువాని లోపలి అఱ; 3. ప్రయాసమునఁ బిండఁదగినయావు, కరట.

**అఱ్ఱుము.** దే. వి. ముండ్లమోపులోనగునది.

**అఱ్ఱాఁక.** దే. వి. (అఁక+అఁక.) 1. మిక్కిలినిర్బంధము; "క. అఁకలిగాదోభక్తిం, దేఁకువగలనాఁడఁగానొ తినవేలకృపన్, సాఁకఁగదే నన్నిపుడ, ఱ్ఱాఁకలఁబెట్టకపలాశనాసక్తుఁడవై." కాశీ. 3, ఆ.—2. మఱుఁగు. "శా. ఊఁకోఁజెప్పఁగనెంతయేనిదడవో సూవిప్రశార్దూలనీ, వాఁకొన్నాఁడవు భోజనోత్తరమునం దాస్థానమైయుండిన,

ట్టాఁకంబెట్టక చెప్పెదఁ సకలవృత్తాంతంబునుం దేటగా, వీఁకఁ వేళయతిక్రమించెఁ గుడువఁ విచ్చేయుమా గ్రక్కునఁ." కాశీ. ౭, ఆ.

**అట్టాఁకలి.** దే. వి. (అఁకలి+అఁకలి.) మిక్కిలి త్తుత్తు. "క. సాలయక యన్నంబిడుమీ, జలజభవాన్వయులకనుట చాలదె యట్టాఁ, కలిసేయకుమ నియేలా, పలికితిరనియడుగ సతికిఁబతియిట్లనియెఁ." "శా. ఆహారాధికమైనమందునిలలో నయ్యగ్నిదేవుండు స్వ, ల్పాహారంబునమందువిప్రుఁడు." భో. ౬, ఆ.

**అట్టాడు.** దే. అ. క్రి. (అట్టు+ఆడు.) చేరువ చుట్టి చుట్టితిరుగు. "సీ. చిగురుజొంపములందుఁదగిలి యట్టాడుచుఁగెరలుకోయిలలసుస్వరములకును." మార్క. ౫, ఆ.—"వ. అనుచుఁ దలంగిపోక యిట్టునట్టుంజుట్టుమెట్టెడు చిట్టివడుగుల నానట్టువనగవునుంగోపంబుఁ గదురనదలించుచుందనమేళగాండ్ర నాలోకించి యిబ్బాలకులు మనవాలకపుసొమ్ములందు నేమేనియు నపహరించుటకు నట్టాడుచున్నవారు. మీరలీ ముచ్చులనెచ్చరికం గనుపెట్టుకొనియుండుఁడనుటయు." ప్ర భా. ౧, ఆ.

**అట్టియము.** దే. వి. అటకము. "సీ. అటకమట్టెమన నజీర్తియగు." ఆం, భా. ద్వి. మ.

**అట్టు.** దే. వి. 1. అటు, కంఠము; 2. సమీపము.

**అట్టెను.** దే. వి. అట్టియముయొక్క రూపాంతరము.

**అల.** యు. దే. వి. తరంగము. విశే. ప్రసిద్ధిని తెలుపును. "అలపర్జన్యుఁడు." వై. అవ్య సంబోధనమును దెలుపును. "ఉ. అక్కలకన్యకాత్వమిటులాటడివోవ నకారణంబనీ. కెక్కడిమాలు వచ్చె." నిర్వ. ౨, ఆ (రూ. అలా. "క. సెలవుల లాలలుతొరఁగంగ నన్నలా యనియొటలుఁ." ఉ, హరి. ౪, ఆ.)

**అలంకరించు.** సం. స. క్రి. కైసేయు, సింగారించు.

**అలంకరిష్ణువు.** సం. విశే. ఉ. 1. కైసేయువాఁడు; 2. కైసేయుస్వభావముకలవాఁడు.

**అలంకర్త.** సం. విశే. (ఋ. ఈ. ఋ.) కైసేయువాఁడు.

**అలంకర్మీణుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పనియందు నేర్పరియైనవాఁడు, కర్మక్షముఁడు.

**అలంకారము.** సం. వి. అ. పుం. 1. కైసేఁత; 2. భూషణము; 3. ఉపమాది. (ఉపమాదులు.—ఉపమ, అనన్వయము, ఉపమేయోపమ, స్మృతి, రూపకము, పరిణామము, సందేహము, భ్రాంతి, అపహ్నవము, ఉల్లేఖము, ఉత్ప్రేక్ష, అతిశయోక్తి, సహోక్తి, వినోక్తి, సమాసోక్తి, వక్రోక్తి, భావోక్తి, వ్యాజోక్తి, మీలనము, సామాన్యము, తద్గుణము, అతద్గుణము, విరోధము, విశేషము, అధికము, విభావన, విశేషోక్తి, అసంగతి, విచిత్రము, అన్యోన్యము, విషమము, సమము, తుల్యయోగిత, దీపకము, ప్రతివస్తూపమ, దృష్టాంతము, నిదర్శనము, వ్యతిరేకము, శ్లేషము, పరికరము, ఆక్షేపము, వ్యాజస్తుతి, అప్రస్తుతప్రశంస, పర్యాయోక్తము, ప్రతీపము, అనుమానము, కావ్యలింగము, అర్థాంతరన్యాసము, యథాసంఖ్యము, అర్థాపత్తి, పరిసంఖ్య, ఉత్తరము, వికల్పము, సముచ్చయము, సమాధి, భావికము, ప్రత్యనీకము, వ్యాఘాతము, పర్యాయము, సూక్ష్మము, ఉదాత్తము, పరివృత్తి, కారణమాల, ఏకావళి, మాలాదీపకము, సారము.)

**అలంకృతి.** సం. వి. ఇ. స్త్రీ. అలంకారము, కైసేఁత.

**అలంకృతుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) అలంకరింపఁబడినవాఁడు.

**అలంక్రియ.** సం. వి. ఆ. స్త్రీ. అలంకృతి, కైసేఁత.

**అలంగము.** దే. వి. కోట ప్రాకారపుగోడకు ఆధారముగా మట్టిచేతఁగాని తాళ్లచేతఁగాని యేర్పఱుపఁబడినకొఱడు, వప్రము. "సీ. అలంగంబునఁ నలవరినావప్రమగును." ఆం, భా. ద్వి. పు.

**అలంఘ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) లంఘ్యము కానిది. (లంఘ్యము=దాఁటఁదగినది.)

**అలంజరము.** సం. వి. అ. పుం. మణికము, కాఁగు, ముంత (అనికొందఱు.)

**అలంజుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) నిరర్థకజన్మము గలవాఁడు.

**అలఁగు.** దే. అ. క్రి. 1. వెనుదీయు; "చ. పలికిన నేనునీతలఁపుపద్ధతి గాకిపుడేమిమీఁటివ, త్తిలితిఁ గొడింబడఁ నిను వధింపఁగవచ్చెదనోయటంచునాకలఁగుచు రాకమానుమనియానలు వెట్టఁగ." కళా. ౬, ఆ.—2. శోకించు; "ఉ. బాలురచావు కర్ణములఁ బడ్డఁగలంగియలంగియోరువం, జాలక బాష్పతోయకణజాలము చెక్కులరాల సేడ్చె." భాగ. ౧, స్క.—3. శ్రమపడు; "మ. మలఁ

గుక్ మెల్లనిగాలికిం బటునటన్న త్తద్విరేఫాలికిక్, దలఁగుక్ గోయిలప్రోఁతకైయలఁగు." భాగ. ౧౦, స్క-౦. పూ.—4. సంకోచించు. "ద్వి. జలకేళిసలుపునిర్జరసతుల్ శుకుని. కలఁగకూరక యుండి యటుతరువాత." భాగ. ౧. స్క-.

అలఁచే. దే. ప్రే. అలఁగఁజేయు. శ్రమపఱచు. "లలిఁగడుడాసియేమిటికల చెడకుమ్మెయిననున్ను నీవు." మార్క. ౫. ఆ.

అలఁత. దే. వి. 1. బాధ; "క. పడినదివిఁపునవెడలిసఁ, బడియెఁబుడమినస్ఘనుండు పదపడి త్రెళ్లె. గొడుకునుమున్నతఁడేసిన. బెడిదపుటేటులయల. తఁబ్రొక్కెనాథా." భార. అశ్వ. ౪. ఆ.—2. శోకము; "సీ. అమ్మునియాశిష్యుఁడమ్ముని చేర గఁబిలిచినీ వేటికి నలఁతఁబొందె, దనిననలఁడుశిష్యుల దఱపైఁగల. కరుణమీఱఁబెద్దగాలమేని. మునిపరేణ్యనావలన లేదుదానికి. నుమ్మలిఁపకట్టులుండవచ్చు." భార. అశ్వ. 3. ఆ.—3. శ్రమము. "వేఁకటియలంత" అని. 3. ఆ.

అలఁతి. దే. వి. తేలిక. అపాతము. "సీ. మున్నపమానపాటు. దుఃఖపాటుగలిగితొడరఁగవచ్చిన. వారుగాన నలఁతిఁబోరు." భార. ఉద్యో. ౪. ఆ.—విణ. 1. అల్పము; 2. సూక్ష్మము. "ఎ. గీ. అలఁతియొలుఁగునవిట్లనునాలతా 8." భార. అను. ౧. ఆ.

అలఁదు. దే. స. క్రి. పూయు.

అలఁదురు. దే. అ. క్రి. ఉమ్మలించు. దుఃఖించు. "క. కొలఁదికిమీఱినవెప్పగ, నలఁదురి." నిర్వ. ౫. ఆ.—"చ. దీ నినినొకమ్రానఁగట్టెచననిశ్చయముందగఁజేసెదైవమే. మనఁగలదట్లకాకయని యాత్తనలందురిమందచేష్టుఁడై." భార. విరా. ౧. ఆ.

అలక. ఉభ. దే. విణ. సూక్ష్మము. సం. వి. అ. స్త్రీ. కుబేరునిపట్టణము. అ. పుం. ము. నెఱికురులు.

అలకన. దే. వి. సూక్ష్మత. విణ. సూక్ష్మము. "అలకని తెల్వి." హరి. ఉ. ౭. ఆ. "అలకనిజేబు." స్వా. ౬. ఆ. (విశేషణమైనప్పుడు సమాసమునందు కడపటి అకారమునకు ఇకారమువచ్చెడి.)

అలకి. వై. వి. కుండ*. "నాలుగే నలకులదొంతి డించి." హరి. పూ. ౫. ఆ.

అలకువ. దే. వి. 1. ఆయాసము; "తెలుపనలకువదీనక్." భల్లా. ౪. ఆ.— 2. వైముఖ్యము. "అలకువలేనినిష్ఠలను." మై. ౧. ఆ.

అలక్తము. సం. వి. అ. పుం. యావము, లత్తుక.

అలక్ష్యము. సం. విణ. (అ. ఆ. అ.) లక్ష్యముకానిది.

అలక్ష్యముచేయు. మి. స. క్రి. అనాదరించు.

అలగర్దము. సం. వి. అ. పుం. నీరుపాము, (రూ. అలగర్ధము. అరగర్దము.)

అలఘువు. సం. విణ. (ఉ. ఈ. ఉ.) లఘువుకానిది. (లఘువు=చులకన.)

అలజము. సం. వి. అ. పుం. కుక్కుభము. గంపపులుఁగు.

అలజడి. దే. వి. 1. ఆపద; "క. అలజడివచ్చుటకు మూలమదియెయ్యదియో." సం. "నాపదామస్తిమర్యాదా." భార. ఆర ౭. ఆ.—2. క్లేశము. "చ. అలజడిలేదుచిత్తమునకంగములందుఁబ్రయత్నమేమియుక్. పలవదు." లక్ష్మి. ౪. ఆ.

అలజడిదరి. దే. వి. పక్షివిశేషము. (ఆ ప్ర.)

అలపద్మము. సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము. (అయిదువ్రేళ్లనుగొనలుకూడకుండునట్లు విల్లువలె వంచి చిటికెనవ్రేలివెంబడి వ్రేళ్లన్ని యొడముగలుగఁద్రిప్పఁబడినది.)

అలవు. దే. వి. అలయిక, శ్రమము.

అలబలము. దే. వి. కలకలము. "క. అలబలములసంఖ్యములై, యలబలములుసేయుచుండ." విజ. 3. ఆ.

అలభ్యము. సం. విణ. (అ. ఆ. అ.) లభ్యముకానిది. (లభ్యము=పొందఁదగినది.)

అలమట. దే. వి. చింత. "గీ. ధర్మసుతుమాటచొప్పెప్పిద్ధంబొయెఁబుంగ. సునికిఁజేసిచింతిల్లితినొప్పు దీవు. తెలియఁజెప్పినాయలమటములుగఁజేయ." భార. ఉద్యో. ౨. ఆ.

అలమటపడు. ద్వ. అ. క్రి. చింతపడు.

అలమటించు. దే. అ. క్రి. చింతించు. "ద్వి. సాహాయ్యమునకు. నందుఁజెప్పరిగానకలమటించుచును." విష్ణు. ఉ. ౫. ఆ.

అలమరు. దే. అ. క్రి. చింతించు. "ద్వి. ఈవిధినలమరియేగుచుండఁగను." హరిశ్చ. ౧. ఆ.

అలమారుచే. దే. స. క్రి. బండియెడ్లనుమార్చికట్టు.

అలము. ఉభ. దే. అ. క్రి. కవియు. "చ. సులభ మొదుర్లభంబొయనిచూడనెఱుంగవు కన్నదాని పై. నలముదు కామమా." భార. శాం. ౪. ఆ.— స. క్రి. 1. ఆక్రమించు; "గీ. రక్కసులునుగుంతఖడ్గ, కార్ముకప్రముఖాయుధకలిత భుజులు.

కవచ ధారులునయి కోటఁగలయనలమ." రా. యు. కాం.—2. కౌఁగిలించు; "ఎ. గీ. అతివయత్యంతవివశయైయలమఁగ్రోవి, తేటతేనియ తెలినీటఁదెలివిదెచ్చు." హన. 3. ఆ.—3. పరిగ్రహించు. "గీ. అతఁడుమనుమునినందండప్రీతియడర, నలమియాలింగనముచేసి." మార్క. ౫. ఆ.—వి. 1. అలుము, ఆక్రమణము; "చ. అలమునఁదున్నివెవ్వఁడు." భార. అర. ౫, ఆ.—2. శాకవిశేషము. "క. అలములుదుంపలునమలుచు." అచ్చ. సుం. కాం.—సం. అ. న. 1. తేలుకొండి; 2. తేలుకొండిముల్లు.

అలముకొను. దే. అ. క్రి. 1. కవియు; "అలముకొనిన మూర్ఛలుపర్యాయమునఁదేటి." జై. ౭, ఆ.—2. పైకొను; "నిచ్చనిచ్చలులాలించినే నలముకొనుటే గాని. గ్రుచ్చికౌఁగిలించుకొనుటెన్నఁడులేదుగా." క్షేత్రయ.—3. వ్యాపించు. "గీ. రూపాదుల, నలముకొనవుచక్షురాదికములు." భార. శాం. ౪, ఆ.

అలయిక. దే. వి. అలపు, అలసట, శ్రమము.

అలయు. దే. అ. క్రి. 1. శ్రమపడు; 2. విసుగు; "క. అలయుసెడ డయ్యెసెడనాఁ, కలియుఁ దృషయునైన యెడలఁగడుకొనిధరణీ, తలనాథ పురుషునకుని, మ్ములభార్యయపాచుఁజిత్తము నదుఃఖంబుల్." భార. అర. ౨, ఆ.—3. ఆలస్యముచేయు. "క. కనుఁగొనినాతలఁచినపని, యనువుపఱ్ఱచిమఱచియైనయలయక వేగం, బునవత్తు." ఉ. హరి. ౨. ఆ.

అలరారు. దే. అ. క్రి. 1. ఒప్పు; 2. ప్రకాశించు.

అలరు. దే. అ. క్రి. 1. వికసించు; 2. సంతోషించు. వి. 1. పుష్పము; 2. సంతోషము. "మిగులనలరొంది" అచ్చ. సుం. కాం.

అలరుఁబోఁడి. దే. వి. (అలరు+పోఁడి.) 1. పుష్పమువలె మనోజ్ఞురాలైన యింతి; 2. ఇంతి. (ఇట్టి తావులయందుపోఁడిశబ్దము పరమగునపుడు ఎల్లచో నుగాగమంబగునని యెఱుఁగునది.)

అలరుచే. దే. ప్రే. అలరఁజేయు. "క. ఇలావంతుండని, యాచతురుఁడు నామకరణమలరిచి యంతట్." (అలరిచి అనఁగా ఇక్కడచేసియనియర్థము.) విజ. ౧. ఆ.

అలరువిలుకాఁడు. దే. వి. పుష్పధన్వుఁడు, మన్మథుఁడు.

అలరువిలుతుఁడు. దే. వి. అలరువిలుకాఁడు. "ఎ. గీ. అలరువిలుతుపూవుటమ్ముఁబోలె." భార. విరా. ౧. ఆ. (చూ. అలరువిల్తుఁడు.)

అలర్కము. సం. వి. అ. పుం. 1. తెల్లజిల్లేడు; 2. ముండ్లయుచ్చింతకీ; 3. మందుచేవెఱ్ఱెత్తినకుక్క.

అలవ. దే. వి. గుంజలునాటికమ్ములులోనగువాని సడ్డముగాఁజొప్పించిన వెలుగు. "సీ. గంధపుఁగాచముల్ పొందించికురువేళ్లనలవగాఁగట్టినయట్టి మహిమ." రా. వి. 3. ఆ. "సీ. నీటిలోఁదఁజేసినపాఠీనములగతి వెలుగులుసొచ్చియాపలికిఁబోవు. గోడలలవలువెసదాఁటుఁగ్రీడవోలె." హరి. పూ. ౬. ఆ.

అలవడు. ద్వ. అ. క్రి. (అలవు+పడు.) 1. అభ్యాసపడు, వాడుకపడు; (చూ. మర్యాద.) 2. తగు; "క. తలఁపఁగఁబువ్వులకతనం, దలకెక్కెక్ నారయనవిధ బునహరివా, రలమగుట నిట్టి పేర్మికి. నలవడితిమి ధన్యతముల మైతిమి ధరణిక్." హరి. ఉ. ౫, ఆ.—3. సిద్ధించు; "వ. అందుమీరెవ్వరెవ్వ రెక్కడెక్కడ నెయ్యే రూపంబులం జరియింపఁ గోరిననయ్యేరూపం బులల నడియెదరు." భార. అర. ౭, ఆ.—4. స్వాధీనపడు. "క. పురికొనుచుఁదెరలుచునో, హరిసా హరినొక్కచోటనలవడునొకచో, విరియునొక చోటఁదిరుగుక్, దిరుగక యొక్కచోట రెండు దెఱఁగులు నొప్పుక్." భార. భీష్మ. ౨. ఆ.

అలవరి. దే. వి. అలంగము, వప్రము. "సీ. అలంగంబన నలవరినావప్రమగును." ఆం. భా. ద్వి. పు. (ప్రయోగములయందు అఱుపరియని కనఁబడుచున్నది.)

అలవరించు. ద్వ. ప్రే. 1. అభ్యసించు; "గీ. శాస్త్రములనెల్లఁదగినభంగి నలవరించి." భార. అను. ౪, ఆ.—2. అలంకరించు; "స్త్రీవలెనెయలవరించి." క్షేత్రయ. 3. వహించు; "సీ. జపహోమదాన సంస్కారపూర్వకముగా నవ్వారవ్రతదీక్షయలవరించి." జై. 3, ఆ.—4. సవరించు; "సీ. ఒక్కింతసడలినయుత్తంసదామకంబభినవంబుగమాలినలవరించి." హరి. పూ. ౫, ఆ.—5. సిద్ధపఱచు; "గీ. అలవరించిచతుర్విధాహారములను, దుష్టిచేసి." ఉ. హరి. ౪, ఆ.—6. స్వాధీనపఱచు. "వ. ఆదివీరలు దిగ్విజయంబు

చేసియలవరించికొన్నపదంబగుటయు." భార. ఉద్యో. ౧. ఆ. (అలవడుధాతువు.)

అలవఱుచు. ద్వ. ప్రే. అలవడఁజేయు, అభ్యాసపఱుచు. (రూపాంతరము అలవరించు.) (ఒకానొకచో అలవర్చు అని రూపము కనఁబడుచున్నది.)

అలవాటు. ద్వ. వి. 1. అభ్యాసము; 2. సిద్ధి. "ఎ. గీ. ఆత్మ నిష్ఠయలవాటుగాంక్షించి." శాం. ౬. ఆ.—విణ. సిద్ధము. "తేరలవాటుగఁదేరనెక్కి." ఉ, హరి. 3. ఆ. (రూ. అలవడుట.)

అలవి. దే. వి. కొలఁది. "క. వృత్రఘ్నునబాహుబలంబలవికిమీఱెను." భార. ఉద్యో. ౧. ఆ.—విణ. శక్యము. "క. బలహీనుఁడైనవానికి, నలవియెమోపెట్టి తివియనక్కార్ముకముఁ." భార. ఆది. 2. ఆ.

అలవు. దే. వి. 1. పరిశ్రమము; "గీ. మావటీఁడల్లనల్లనమదగజంబు. నిచ్చలోఁగూడ నోజకుఁదచ్చునట్లు, యోగవిద్యాపరుండును నొయ్యనొయ్య, నలవులోఁగూడఁబవనంబునాఁగవలయు." మార్క. 3. ఆ.—2. బలము; "క. బలభద్రుని భరియింపఁగ, నలవుచెడి ప్రలంబదైత్యుఁ డయ్యెడ ధరణీ, తలమునకువచ్చె" వి. పు. 2. ఆ.—3. శ్రమము. "క. తురగమునునీరుజలజా. కరమునఁ ద్రావించితాపికచపుష్పఫలోత్కరధరవినమ్రచూతాం, తరమరకతవేదినలవునంబవళించుఁ." (అలవునఁ ఇక్కడ అలపునఁ అనియే యుండవచ్చును. అయినను ప్రతులయందంతటపాఠము అలవునఁ అనియున్నది. ఈరూపమును సాధువే.) జై. ౫. ఆ.

అలవోక. ద్వ. వి. (అల్ల+పోక.) 1. స్వేచ్ఛ, యదృచ్ఛ; "సీ. అంతటనొకఁడుమదాళయుండను జగతీనాయకుండురూపానుభూతి, యనుభార్యయునుదానుదనమంత్రిధీరభావాఖ్యుఁడుతోడ రానట యదృచ్ఛ, నెక్కుంతపోలయుటయును." (ఇది మఱియొకచో చెప్పఁబడినప్పుడు.) "వ. మదాళయుండనువాఁడు రూపానుభూతి యను భార్యయుందానుధీరభావుండనుమంత్రి తోడ నలవోకనటుపోలసినమాత్ర." కళా. ౫, ఆ.—2. లీల. "సీ. నీకతంబునఁగాదె కాకోల విషవహ్నినలవోకయునుబోలె నార్పఁగలిగె." కాశీ. ౬, ఆ.

అలస. సం. వి. అ. స్త్రీ. అల్లుడుతీఁగ. అ. పుం. ము. 1. వృక్షవిశేషము; 2. పాదరోగవిశేషము. విణ. సోమరి.

అలసందియలు. వై. వి. బ. కాయధాన్యవిశేషము. "అనుగమ్మింగువలసందియలు." మార్క. 3. ఆ.

అలసందెలు. వై. వి. బ. అలసందియలయొక్క రూపాంతరము.

అలసట. దే. వి. అలపు, ఆయాసము.

అలసత. సం. వి. ఆ. స్త్రీ. అలసభావము, ఆలస్యము.

అలసాంద్రము. సం. వి. అ. పుం. అలసందెలు.

అలాతము. సం. వి. అ. న. ఉల్ముకము, కొఱవి.

అలాబువు. సం. వి. ఉ. ఊ. స్త్రీ. సొరఁ.

అలాయిదా. హిం. విణ. ప్రత్యేకము.

అలికము. సం. వి. అ. న. లలాటము, నొసలు.

అలికిడి. దే. వి. చప్పుడు, ధ్వని.

అలిపిరి. వై. విణ. అల్పశరీరముగలవాఁడు*.

అలివేణి. సం. వి. ఈ. స్త్రీ. 1. తుమ్మెదవంటి వెండ్రుకలుకలయింతి; 2. ఇంతి.

అలుఁగు. దే. వి. 1. ఖడ్గము; 2. చెఱువునిండినప్పుడు నీళ్లుపోవుట కేర్పఱచినదారి, పరీవాహము; 3. బాణాదుల యగ్రపుటుక్కుతునుక, ఫలము. (రూ. అల్గు.)

అలుక. దే. వి. 1. కోపము; 2. ద్రోహచింత. "ఆటుసేయద్విజున్యుఁడల్కకా." ఆము. ౪, ఆ.

అలుకు. దే. అ. క్రి. భయపడు. స. క్రి. ఇల్లులో నగువానినలుకు. వి. భయము.

అలుకుఁజుట్టు. దే. వి. (అలుకు+చుట్టు.) అలికెడు ప్రాఁతగుడ్డలోనగునది.

అలుకుడు. దే. వి. అలికిడి, రొద, ధ్వని.

అలుకువ. దే. వి. అలుక, కోపము. "అలుకువతగ్గె." చంద్రి.

అలుఁగు. దే. అ. క్రి. 1. కోపముచేయు; 2. ద్రోహముతలఁచు. "క. తనయునికంటెను నను న, మ్మనుజేంద్రుఁడుకరము నెమ్మిమన్నించుమనం, బు ననట్టియగ్రజన్ముని, యనుపమరాజ్యమున కలుగ నగునేనాకుఁ." మార్క. ౫, ఆ. (రూ. అల్గు.)

అలుగుల. దే. వి. (చూ. అలుగులము.)

అలుగులపడు. ద్వ. అ. క్రి. (అలుగులము+పడు.) 1. నలఁగుడుపడు; "వ. ఒండొరుల యలుఁగులలుగులపడ వ్రేసియు." ఉ, హరి. 3. ఆ.—2. బాధపడు. "క. తలకంటగించుచుండఁగ, బలి

మినినావధరసంబు పానముసేయక, దలకొను రోగార్తునిక్రియ, నలమటతో బెరయు తెగువ నలఁగులపడుచుక." నిర్వ. ౧౦. ఆ.

**అలుగులము.** దే. వి. 1. నలఁగుడు; 2. బాధ.

**అలుచే.** వై. విశ. మందుఁడు. "క. అలుచైనను బగతుని దెసఁ, దలఁపుగలుగవలయుననినదరో ప్లెజ్ఞవ లదో, ర్బలులగుకొంతేయులమన, మెలమికలిమి నచ్చియిట్టులేమఱ నగునే." సం. "నావజ్ఞేయో రిపుస్తాత ప్రాకృతోపి బుభూషతా, కింపునః పాండవాస్తాత సర్వాస్త్రకుశలారణే." భార. విరా. 3, ఆ.

**అలుపము.** వై. విశ. అల్పము. "సీ. ఈ వెంద్రుకలు పట్టియీడ్చినయాచేయి తొలుతగాఁ బోఁలో దుస్ససేను, తనువింతలింతలుతునియలై చెదరి రూపఱియున్న గనియెడుకాలుఁగాక, యలుపా లఁబొనుపడునట్టిచిచ్చేయిది." (అలుపాలక = అల్పకార్యములచేత.) భార. ఉద్యో. 3, ఆ.

**అలువు.** దే. అ. క్రి. అలుగు. "వినుమునరేంద్రస్ప్రుడలివెక." భార. శాం. ౧, ఆ.—వి. అలుఁగు, పరీవాహము.

**అలేఖము.** సం. వి. అ. న. వ్రాయనిపుస్తకము.

**అల్కా.** దే. వి. అలుకయొక్క రూపాంతరము.

**అల్కా.** హిం. విశ. తేలికైన, నీచమైన.

**అల్గోజా.** హిం. వి. పిల్లనఁగ్రోవి.

**అల్పము.** సం. విశ. (అ. ఆ. అ.) సూక్ష్మము, అలఁతి.

**అల్పిష్ఠము.** సం. విశ. (అ. ఆ. అ.) కడునల్పము, అణీయము.

**అల్పీయము.** సం. విశ. (స. ఈ. స.) అల్పిష్ఠము.

**అల్మారా.** హిం. వి. సొరుగులుగల యెత్తయిన కఱ్ఱపెట్టె. (రూ. అల్మారు.)

**అల్ల.** యు. దే. విశ. ప్రసిద్ధిని తెలుపును. "అల్లనాడు." వై. మందము. "అల్లనగుచు."

**అల్లకము.** దే. వి. అల్లుట, అల్లిక.

**అల్లకల్లోలము.** దే. విశ. తాఱుమాఱు. వ్యత్యస్తము.

**అల్లటపెట్టు.** దే. స. క్రి. (అల్లాటము+పెట్టు.) శ్రమపఱచు. "ద్వి. అల్లనమూడేడులయ్యెనన్నెంత, యల్లటపెట్టెదోయయ్య నేనెలుఁగ." భల్లా. ౧, భా.

**అల్లన.** వై. వి. 1. తిన్నన; "అల్లనినగవు." (మా. అలకన.) 2. మెల్లన*. "చ. అనిలజుఁడో యి రావణుఁడయల్లన నేటికి బెట్టుచెప్పెదక." రామా. ౬. ఆ.

**అల్లము.** వై. వి. ఆర్ద్రకము*.

**అల్లరి.** దే. విశ. దోషముయొక్క ప్రకటనము. విశ. దోషమువలన ప్రకటనమైనది.

**అల్లలనాడు.** ద్వ. అ. క్రి. (అల్లన+అల్లన+ఆడు.) చలించు. "లేనడుమల్లలనాడ." స్వా. ౨. ఆ.

**అల్లలాడు.** ద్వ. అ. క్రి. (అల్ల+అల్ల+ఆడు.) చలించు, (రూ. అల్లల్లాడు.)

**అల్లాటము.** ద్వ. వి. అల్లాడుట, త్రిప్పట.

**అల్లాడు.** ద్వ. అ. క్రి. (అల్ల+ఆడు.) 1. చలించు; "అవనీచక్రము పాదఘాతముననల్లాడంగ." భార. ఆది. ౬. ఆ.—2. తిరుగు.

**అల్లారుచే.** ద్వ. ప్రే. అల్లాడఁజేయు.

**అల్లారుపు.** ద్వ. వి. అల్లార్చుట, నిక్షేపణము. "వాలంబునల్లార్పుల గాడ్పులరేఁచు." రామా. ౬. ఆ.

**అల్లారుబెల్లము.** ద్వ. విశ. (అల్ల+ఆరు+బెల్లము.) మిక్కిలి ప్రియము. "గీ. ఎల్లబంధువులకు నల్లారుబెల్లమై." కళా. ౬. ఆ.

**అల్లారుముద్దు.** ద్వ. విశ. (అల్ల+ఆరు+ముద్దు.) మిక్కిలి మనోజ్ఞము. "ను. అనుఁగుం గ్రీడలనెల్లవారలకు నిట్లల్లారుముద్దైనకూఁతునకుక." వసు. 3, ఆ.

**అల్లి.** దే. వి. 1. కలువవంటి యొకానొక జలపుష్పము; 2. పచ్చిగానుండునపుడే మంటవేయుటకుపయుక్తమైన యొకానొకచెట్టు; 3. బాలక్రీడావిశేషము. "సీ. చిడుగుడుప్పలపోటి చెండుకట్టినబోదియల్లియుప్పనఁబట్టయప్పళాలు." కాశీ. 3, ఆ.

**అల్లిక.** దే. వి. అల్లుట, అనికి.

**అల్లికబిల్లిక.** దే. వి. అల్లిబిల్లియొక్క రూపాంతరము.

**అల్లితెమ్మెర.** దే. వి. చల్లగాలి.

**అల్లిబిల్లి.** దే. వి. 1. పెనఁగువ; 2. ఒద్దిక. "గీ. అరిగితనకూర్మిచెలుపతో నల్లిబిల్లి, యగుచు నెప్పటియట్ల నెయ్యమునసుండె." పర. 3, ఆ.

**అల్లిబిల్లికొను.** దే. అ. క్రి. పెనఁగొను. "వావులక్రోవులు నల్లిబిల్లికొనుకాంతారంబునందు." స్వా. ౨, ఆ.

**అల్లియ.** దే. వి. వింటినారి, మౌర్వి.

అల్లియము. దే. వి. (చూ. అల్లెము.)
అల్లు. దే. అ. క్రి. (తీఁగ) ప్రాఁకు. స. క్రి. అల్లిక వేయు.
అల్లుఁడు. దే. వి. (అల్లు+వాఁడు.) కూఁతుమగఁడు, జామాత.
అల్లుఁడుకొమాళ్లు. ద్వి. వి. బ. (అల్లుఁడు+కొమారుఁడు.) కొంచెము ఇంచుమించుగ దొరతో సమమైన వేషమును భోజనమునుగలిగి దొరకు అంగరక్షకుఁడుగా నుండువాఁడు.
అల్లుడు. దే. వి. అల్లిక.
అల్లుబచ్చలి. దే. వి. తీఁగబచ్చలి.
అల్లువాఁడు. దే. వి. అల్లుఁడు. "క. అనఁడనము రామభద్రుని, మునిపరమేశ్వరునకిచ్చె మోహముతోన, జగన్నాథుఁడుజూచిల్లిన్, వననిధవలి గట్టునల్లు వానికిఁబోలెన్." రామా. ౪. ఆ.
అల్లె. దే. వి. అల్లియయొక్క రూపాంతరము.
అల్లెనిమ్మ. దే. వి. మాల్యవిశేషము. "ఎ. గీ. అల్లె దమ్ముప్పుఁజేఁపయుగొల్లదొరదు." హంస. ౪. ఆ.
అల్లెము. దే. వి. పెండ్లియైనతోడనె యల్లుని పిలిచి యత్తవారింటఁబెట్టెడిపిందు. (ఇది అల్లియము యొక్క రూపాంతరము.)
అల్లోనేరడు. దే. వి. 1. రాజజంబువృక్షము; 2. జంబువృక్షము; "సీ. హాలాహలంబనునల్లోనేరడుఁ బండుమినిమింతుఁడునాగాకమ్రింగినాఁడు." భ. ౧. ఆ.—3. బ. సంగీతవిశేషము. (రూ. అల్లోనేరేడు. సంగీతవిశేషమునకు. "శా. నికేవచ్చుసువాలయుక్ ధవళిమింతీయల్లోనేరల్లిగా. లకల్యాణములంచు." పాంచా. ౪. ఆ.)
అల్లోనేరడు. దే. వి. 1. రాజజంబువృక్షము; "క. ఎల్లెడయుంజీఁకటిచే. నల్లనయయితోఁడిమువట్టునాఁమూర్పునఁబొ, టల్లెడుచిలుగించునవని. మల్లోనేరెడుఁబంటియాకృతిఁజూపెన్." కవిక. ౪. ఆ.—2. జంబువృక్షము; 3. బ. బాలక్రీడావిశేషము. "క. ఎల్లసుఖంబులఁజేకొనఁ, జెల్లుటయౌవనమునందచిక్కినమఱిపాటల్లునె వెన్నెలదినములు. నల్లోనేరెల్లుగాక యావలఁగలవే." రా. సుం, కాం.
అల్వరించు. ద్వి. ప్రే. అలవరించుయొక్క రూపాంతరము. "సీ. ప్రేమలుగలిపంగ వెర వల్వరించిరో నోరఁజేతులుగ్రుక్కినొల్లునాఁడ." నిర్వ. ౧, ఆ.

అవ. ఉభ. వై. వి. అవ్వయొక్క రూపాంతరము. సం. (ఉపసర్గము.) చెడ్డ అనునర్థమును తెలుపునది. (ఉదా. అవగుణము, అవమానము. మొ.)
అవంతి. సం. వి. ఈ. స్త్రీ. 1. పట్టణవిశేషము; 2. అక్క.
అవంతీసోమము. సం. వి. అ. న. ధాన్యామ్లము, కలి.
అవకటము. సం. విణ. (అ. ఆ. అ.) విరుద్ధము.
అవకరము. సం. వి. అ. పుం. పొరకతోఁ జిమ్మిచేర్చిన కసవుకుప్ప.
అవకర్షణము. సం. వి. అ. న. వెడలించుట.
అవకాశము. సం. వి. అ. పుం. 1. ఎడము; 2. తెఱపి.
అవకీర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) చల్లఁబడినది.
అవకీర్ణి. సం. వి. (న్. ఈ. న్.) నశించిన బ్రహ్మచర్యాదివ్రతముగలవాఁడు.
అవకుంఠనము. సం. వి. అ. న. చుట్టుట.
అవకుంఠితము. సం. విణ. (అ. ఆ. అ.) చుట్టఁబడినది.
అవకృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) నిష్కాసితము, వెడలింపఁబడినది.
అవకేశి. సం. విణ. (న్. ఈ. న్.) గొడ్డుపోయినది. (చెట్టు.)
అవక్రయము. సం. వి. అ. పుం. 1. బాడిగ; 2. వెల.
అవక్షిప్తము. సం. విణ. (అ. ఆ. అ.) తప్పుపెట్టి త్రోయఁబడినది.
అవక్షేపము. సం. వి. అ. పుం. తప్పుపెట్టి త్రోయుట.
అవగండము. సం. వి. అ. పుం. బొటిమ.
అవగడము. వై. వి. అగడము, అకార్యము*.
అవగణన. సం. వి. ఆ. స్త్రీ. తిరస్కారము, తెగడిక.
అవగణితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తిరస్కరింపఁబడినవాఁడు, పరిభూతుఁడు.
అవగతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తెలియఁబడినది; 2. పొందఁబడినది.
అవగతి. సం. వి. ఇ. స్త్రీ. బోధము, తెలివి.
అవగాధము. సం. వి. అ. పుం. ప్రాతస్స్నానము.
అవగాహము. సం. వి. అ. పుం. 1. ఆకళింత; 2. మునుక.
అవగాహించు. సం. అ. క్రి. మునుఁగు. స. క్రి. ఆకళించు.
అవగీతము. సం. వి. అ. న. దూఱు. విణ. 1. దూఱఁబడినది; 2. చెప్పఁబడినది.

**అవగీర్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రణుతము, పొగడఁబడినది.

**అవగుంఠనము.** సం. వి. అ. న. ముసుఁగు.

**అవగుంఠితము.** సం. విణ. (అ. ఆ. అ.) ముసుఁగిడఁబడినది.

**అవగుణము.** సం. వి. అ. పుం. దుర్గుణము.

**అవగ్రహణము.** సం. వి. అ. న. 1. అడ్డపాటు; 2. అనాదరము.

**అవగ్రహము.** సం. వి. అ. పుం. 1. వఱపు; 2. అడ్డపాటు; 3. ఏనుఁగునొసలు.

**అవఘళము.** దే. వి. 1. వ్యాపనము; "ఎ. గీ. ఔరఁ కరవాఁడిచూపులయవఘళంబు." పాండు. ౧, ఆ.—2. సామర్థ్యము. "క. ఆరీతినేర్పుగలిగిన, భూరమణునిఁజేరుమనుచుఁబులుఁగులదొరతన్, జీరఁగ హేమావతివిని, యారాచెలియవఘళంబటంచుగణించెన్." హంస. 3. ఆ.–విణ. హెచ్చు. "ద్వి. వనజాక్షినినునాఁడువనవహ్నిఁగూల, ననుమతించిననాకునవఘళంబెద్ది." హరిశ్చ. ౨, ఆ.

**అవఘళించు.** దే. అ. క్రి. 1. వ్యాపించు; "సీ. కలయంగనలఁదినకస్తూరినెత్తావి యష్టదిక్కులయందునవఘళింప." కాశీ. ౧. ఆ.—2. సరియగు. "సీ. అవిముక్తదేశస్థుఁడయ్యేనేఁబతితుండునశ్వమేధాధ్వరాహర్తదొరయు, వారణాశిసంభవంబైనమశకంబు నైరావణముతోడనవఘళించు." కాశీ. ౨, ఆ.—స. క్రి. మీఱు. "సీ. తాపింఛవిటపికాంతార సంవృతయైనయంజనాచలరేఖనవఘళించి." స్వా. 3, ఆ.

**అవఘళుఁడు.** దే. విణ. వ్యాపకుఁడు. "సీ. వేఁడిపురందరు వేయిమాఱులుదాఁకనాజిలోఁదఱిమిన యవఘళుండు." మై. 3, ఆ.

**అవచూడము.** సం. వి. అ. పుం. 1. టెక్కెపుగుడ్డయొక్క క్రిందికొనకుచ్చు; 2. సిగ.

**అవచూర్ణనము.** సం. వి. అ. న. పొడిచేయుట, అవధ్వంసము.

**అవచూర్ణితము.** సం. విణ. (అ. ఆ. అ.) పొడిచేయఁబడినది.

**అవచ్ఛిన్నము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఛేదింపఁబడినది; 2. వేఱుపఱుపఁబడినది.

**అవచ్ఛేదము.** సం. వి. అ. పుం. 1. భాగము; 2. వేఱుపాటు.

**అవచాటము.** వై. క్రి. విణ. ఆకస్మాత్తు. "క. ఖరుఁడగుకంసునిపంపున, నరిగితృణావర్తుఁడవనికవచాటముగా, సురకరువలియైబిసబిస, నరుదరుడనముసరివిసరిహరిఁగొనిపోయెన్." భాగ. ౧౦, స్కం. పూ. (ఇది యింకను విచారింపఁదగినది.)

**అవజ్ఞ.** సం. వి. ఆ. స్త్రీ. అవగణన, తెగడిక.

**అవజ్ఞాతము.** సం. విణ. (అ. ఆ. అ.) పరిభూతము, తిరస్కరింపఁబడినది.

**అవటము.** సం. వి. అ. పుం. 1. బొక్క; 2. పల్లము; 3. నూయి; 4. పక్షిపిల్ల. విణ. మోసమునబ్రదుకునది.

**అవటీట.** సం. వి. ఆ. స్త్రీ. చెప్పటముక్కు. అ. న. ము. ముక్కుచప్పట. విణ. చప్పటముక్కుగలది.

**అవటువు.** సం. వి. ఉ. పుం. స్త్రీ. పెడతల. పెడతలయందలి ముచ్చిలిగుంట. (అనికొందఱు.) పుం. 1. నూయి; 2. పల్లము.

**అవడు.** దే. వి. అగడుయొక్క రూపాంతరము. "సీ. పనిఁబాయక ట్రొమ్మునందవడుఁబాముల మోపను." (ఇది వ్రాఁతప్రతులయందలిపాఠము.) భార. ఆది. ౨, ఆ. (చూ. పని. అయిదవయర్థము.)

**అవతంసము.** సం. వి. అ. పుం. 1. పూఁగమ్మ; 2. సిగబంతి.

**అవతంసితము.** సం. విణ. (అ. ఆ. అ.) అవతంసముగాఁజేయఁబడినది.

**అవతమసము.** సం. వి. అ. న. తగ్గినచీఁకటి, మసకసకన.

**అవతరణము.** సం. వి. అ. న. 1. దిగుట; 2. దాటుట.

**అవతరించు.** సం. అ. క్రి. 1. దిగు; 2. పుట్టు.

**అవతరిల్లు.** సం. అ. క్రి. పుట్టు.

**అవతల.** ద్వ. వి. (అవల+తల.) 1. ఆవలిప్రదేశము; 2. పిమ్మట.

**అవతారము.** సం. వి. అ. పుం. 1. దిగుట; 2. రేవు, 3. కోనేటిలోనగునది.

**అవతారిక.** సం. వి. ఆ. స్త్రీ. గ్రంథముఖమున వ్రాయఁబడు ఉదుత్పత్తిక్రమము.

**అవతీర్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. దిగినది; 2. దాటఁబడినది.

**అవదంశము.** సం. వి. అ. పుం. 1. ఊరుఁగాయ; 2. కల్లుత్రాగునపుడు నంజుకొనెడువస్తువు.

**అవదగాకి.** **దే.** విణ. పలుఁగాకి. "ఎ, గీ. కూర్చిచెట్టఁ బట్టుకొని తెచ్చెలోపలి, కవదగాకినారియత్తలా ." పంచ. నా. ౧ ఆ.

అవదాతము. సం. వి. అ. పుం. 1. తెల్లన; 2. పచ్చన. విణ. 1. తెల్లనిది; 2. పచ్చనిది; 3. స్వచ్ఛము; 4. శ్రేష్ఠము; 5. ఖండింపఁబడినది.

అవదానము. సం. వి. అ. న. 1. కడచినపని; 2. నఱకుట.

అవదాయము. మి. గ్రా. వి. తక్కువదాయము.

అవదారణము. సం. వి. అ. న. చీల్చుట. పుం. గుద్దలి.

అవదాహము. సం. వి. అ. న. నీటివట్టివేరు.

అవదీర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) చీల్పఁబడినది.

అవద్యము. సం. విణ. (అ. ఆ. అ.) అధమము.

అవధరించే. సం. అ. క్రి. ఎచ్చరికపడు. (వినవవధరింపుము. మొ.)—స. క్రి. ధరించు.

అవధానము. సం. వి. అ. న. ఎచ్చరిక.

అవధాని. సం. విణ. (న్. ఈ. న్.) అవధానముకలవాఁడు.

అవధాయకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అవధానముచేయువాఁడు.

అవధారణము. సం. వి. అ. న. నిశ్చయము.

అవధారు. వై. గ్రా. ని. వినుము. (దీనిని వర్తత్పృతీయమధ్యముగాఁజెప్పవచ్చునుగాని ప్రయోగములయందంతట నిట్లేయున్నది.)

అవధి. సం. వి. ఇ. పుం. 1. మేర; 2. ఎడము; 3. వేళ; 4. బొక్క.

అవధీరణము. సం. వి. అ. న. తిరస్కరించుట.

అవధీరితము. సం. విణ. (అ. ఆ. అ.) తిరస్కరింపఁబడినది.

అవధూతుఁడు. సం. వి. అ. పుం. దిగంబరసన్న్యాసి. విణ. కదలింపఁబడినవాఁడు.

అవధ్యము. సం. విణ. (అ. ఆ. అ) వధ్యముకానిది. (వధ్యము=చంపఁదగినది.)

అవధ్వంసము. సం. వి. అ. పుం. 1. పొడిచేయుట; 2. విడుపు; 3. దూఱు.

అవధ్వస్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొడిచేయఁబడినది; 2. విడువఁబడినది; 3. దూఱఁబడినది.

అవనతము. సం. విణ. (అ. ఆ. అ.) ఆనతము, వంగినది.

అవనము. సం. వి. అ. న 1. కాపాడుట; 2. తనివిపఱచుట.

అవనాట. సం. (చూ.) అవటీట.

అవనాయము. ఉభ. వై. విణ. న్యాయములేనిది. సం. వి. అ. పుం. పడఁద్రోయుట.

అవని. సం. వి. ఇ. స్త్రీ. భూమి, నేల.

అవపథ్యము. సం. విణ. (అ. ఆ. అ.) అపథ్యము.

అవపాతము. సం. వి. అ. పుం. ఏనుఁగులోనగువాని పట్టునపుడు అవి పడుటకై త్రవ్వి మీఁద తేలికైన కఱ్ఱలనుకంపలను పలుచనగాకప్పి ఆపైనికొద్దిగా మట్టిపఱచి నేలమట్టుగాచేసినపల్లము, ఓదము.

అవబోధము. సం. వి. అ. పుం. 1. మేలుకొనియుండుట. ఉపవడము; 2. బోధించుట.

అవభృథము. సం. వి. అ. పుం. యజ్ఞముకడపట న్యూనాతిరిక్తదోషపరిహారార్థము చేయుకర్మము.

అవభృట. సం. (చూ.) అవటీట.

అవమతము. సం. విణ. (అ. ఆ. అ.) అవజ్ఞాతము. అవమానింపఁబడినది.

అవమతి. సం. వి. ఇ. స్త్రీ. అవమానము, బన్నము.

అవమము. సం. వి. అ. పుం. మూడుతిథులుగూడినవారము. విణ. అధమము.

అవమర్దము. సం. వి. అ. పుం. పరులచేకలుగురాయిడి.

అవమర్యాద. సం. వి. ఆ. స్త్రీ. అమర్యాద.

అవమానన. సం. వి. ఆ. స్త్రీ. అవజ్ఞ, తెగడిక.

అవమానపడు. మి. అ. క్రి. భంగపడు.

అవమానపెట్టు. మి. స. క్రి. భంగపఱచు.

అవమానము. సం. వి. అ. న. అవమతి, భంగము.

అవమానించే. సం. స. క్రి. అవమానపెట్టు.

అవమానితము. సం. విణ. (అ. ఆ. అ.) అవమతము.

అవయవము. సం. వి. అ. పుం. కరచరణాది.

అవయవి. సం. విణ. (న్. ఈ. న్.) అవయవములుగలది.

అవరజుఁడు. సం. వి. అ. పుం. అనుజుఁడు, తమ్ముఁడు.

అవరతి. సం. వి. ఇ. స్త్రీ. విశ్రాంతి, ఉడుకువ.

అవరము. సం. వి. అ. న. ఏనుఁగువెనుకటిపిక్కలోనగుకాలు. స. వెనుకటిది.

అవరవర్ణుఁడు. సం. వి. అ. పుం. శూద్రుఁడు.

అవరీణము. సం. విణ. (అ. ఆ. అ.) ధిక్కరింపఁబడినది.

అవరుద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) ఉపరుద్ధము, అడ్డగింపఁబడినది.

అవరోధము. సం. వి. అ. పుం. 1. అంతఃపురము; 2. అంతఃపురకాంత; 3. అడ్డగింత; 4. మఱుఁగు.

అవరోధించు. సం. స. క్రి. నిరోధించు. అడ్డగించు.

అవరోహము. సం. వి. అ. పుం. 1. మెట్లులోనగు వానియూడ; 2. చెట్టుమొదలనుండికొనకెగఁబ్రాఁకెడితీఁగ; 3. దిగుట; 4. ఇంద్రునిపట్టణము.

అవర్ణము. సం. వి. అ. పుం. అపవాదము, దూఱు.

అవల. దే. వి. అవ్వలయొక్క రూపాంతరము.

అవలంబము. సం. వి. అ. పుం. ఆశ్రయము, ఊఁత.

అవలంబించు. సం. స. క్రి. ఆశ్రయించు. ఊఁదు.

అవలంబితము. సం. విశే. (అ. ఆ. అ.) ఆశ్రయింపఁబడినది.

అవలక్షణము. సం. వి. అ. న. దుర్లక్షణము.

అవలగ్నము. సం. వి. అ. పుం, న. నడుము. విశే. తగులుకొనినది.

అవలిప్తము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పూయఁబడినది; 2. గర్వమునొందినది.

అవలీఢము. సం. విశే. (అ. ఆ. అ.) నాకఁబడినది.

అవలీల. సం. వి. ఆ. స్త్రీ. చులుకన.

అవలుంఠనము. సం. వి. అ. న. పొరలిక.

అవలుంఠితము. సం. విశే. (అ. ఆ. అ.) పొర్లాడినది.

అవలేపము. సం. వి. అ. పుం. 1. పూఁత; 2. గర్వము; 3. భూషణము.

అవలేహనము. సం. వి. అ. న. నాకుట.

అవలోకనము. సం. వి. అ. న. చూచుట, చూపు.

అవలోకించు. సం. స. క్రి. వీక్షించు. చూచు.

అవలోకితము. సం. విశే. (అ. ఆ. అ.) చూడఁబడినది.

అవలోడనము. సం. వి. అ. న. పరామర్శము.

అవల్గుజము. సం. వి. అ. పుం. కారుగచ్చకాయ.

అవశకునము. సం. వి. అ. న. దుశ్శకునము.

అవశము. సం. విశే. (అ. ఆ. అ.) వశముకానిది.

అవశిష్టము. సం. విశే. (అ. ఆ. అ.) మిగిలినది.

అవశేషము. సం. వి. అ. పుం. మిగులు. మిగత.

అవశేషించు. సం. అ. క్రి. మిగులు.

అవశ్యము. సం. క్రి. విశే. అ. న. నిశ్చయముగా, నెట్టన.

అవశ్యాయము. సం. వి. అ. పుం. 1. మంచు; 2. గర్వము.

అవష్టంభము. సం. వి. అ. పుం. 1. అవలంబము; 2. గర్వము; 3. ప్రయత్నము; 4. బంగారు; 5. మ్రానుపాటు.

అవష్టబ్ధము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆక్రమింపఁబడినది; 2. ఆశ్రయింపఁబడినది; 3. కట్టఁబడినది; 4. సమీపించినది.

అవసడి. మి. గ్రా. వి. అపవాదము.

అవసథము. సం. వి. అ. న. గృహము, ఇల్లు.

అవసన్నము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కడముట్టినది; 2. నశించినది.

అవసరము. సం. వి. అ. పుం. 1. వేళ; 2. కురియుట; 3. మంత్రవిశేషము.

అవసాదము. సం. వి. అ. పుం. 1. నాశము; 2. కడ.

అవసానము. సం. వి. అ. న. 1. కడ; 2. ముగియిక.

అవసాయము. సం. వి. అ. పుం. 1. నిశ్చయము; 2. ముగియిక; 3. శేషము.

అవసితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఎడ్లచేనులు పఁబడినది; 2. తెలియఁబడినది; 3. ముగిసినది.

అవస్కందము. సం. వి. అ. పుం. నిద్రించుటలోనగుసమయములందు శత్రువులపైఁబడుట.

అవస్కరము. సం. వి. అ. పుం. 1. కడవయడుగంటు; 2. రథావయవము; 3. గుహ్యావయవము; 4. విష్ఠ.

అవస్థ్యము. సం. వి. అ. న. అవసథము, ఇల్లు.

అవస్థ. సం. వి. ఆ. స్త్రీ. కాలకృతమైన స్థితివిశేషము. (త్ర్యవస్థలు.—జాగ్రత్తు. స్వప్నము, సుషుప్తి.—చతురవస్థలు.—బాల్యము, యౌవనము, కౌమారము, వార్ధకము.—దశావస్థలు.—దర్శనము, మనస్సంగము, సంకల్పము. జాగరము, కార్శ్యము, అరతి, అలజ్జ, ఉన్మాదము, మూర్ఛ, మరణోద్యమము. కొందఱు జ్వరము, సంతాపము ఈ రెంటిని జేర్చి ద్వాదశావస్థలందురు. మఱికొందఱు దశావస్థలను వేఱొకవిధముగా పఠింతురు.)

అవస్థానము. సం. వి. అ. న. ఉనికి.

అవహననము. సం. వి. అ. న. దంచుట.

అవహారము. సం. వి. అ. పుం. 1. జూదము యుద్ధములోనగువానియందలియూఁటట; 2. గ్రాహము; 3. నిమంత్రణముచెప్పుటకు కొనిపోఁదగినవస్తువు.

**అవహారుఁడు.** సం. వి. అ. పుం. తస్కరుఁడు, దొంగ.

**అవహితము.** సం. విణ. (అ. ఆ. అ.) అవధానము నొందినది.

**అవహిత్థ.** సం. వి. ఆ. స్త్రీ. అ. న. గౌరవకౌటిల్యాదులచేఁ జేయుహర్షాద్యాకారములమఱుఁగుపాటు. అ. పుం. ము. అభినయహస్తవిశేషము.

**అవహేలనము.** సం. వి. అ. న. అవమానన, తెగడిక.

**అవాంతరము.** సం. విణ. (అ. ఆ. అ.) లోపలిది.

**అవాక్పుష్పి.** సం. వి. ఈ. స్త్రీ. సదాప?.

**అవాగ్రము.** సం. విణ. (అ. ఆ. అ.) అవనతము, వంగినది.

**అవాచి.** సం. వి. ఈ. స్త్రీ. దక్షిణదిక్కు.

**అవాచీనము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. దక్షిణదిక్కునందుఁ బుట్టినది; 2. వ్యత్యస్తమయినది.

**అవాచ్యము.** సం. వి. అ. న. దూఱుమాట. విణ. చెప్పఁదగనిది.

**అవాజా.** హిం. వి. శబ్దము, వదంతి.

**అవానము.** సం. వి. అ. పుం. నిశ్వాసము.

**అవాపము.** సం. వి. అ. పుం. ఆలవాలము, పాదు.

**అవాప్తము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రాప్తము, పొందఁబడినది.

**అవాప్తి.** సం. వి. ఇ. స్త్రీ. ప్రాప్తి, పొందు.

**అవాయి.** దే. వి. ఆకాశబాణము.

**అవారణము.** సం. వి. అ. న. అడ్డులేమి.

**అవారము.** సం. వి. అ. న. ఈవలిదరి.

**అవారి.** వై. విణ. అపరిమితము. (రూ. అవ్వారి.)

**అవారితము.** సం. విణ. (అ. ఆ. అ.) అడ్డగింపఁబడనిది.

**అవాసస్కుఁడు.** సం. వి. స్. పుం. జినదేవత. విణ. దిసమొలవాఁడు.

**అవి.** సం. వి. ఇ. స్త్రీ. ముట్టుది. పుం. 1. ఎలుక; 2. కంబళి, 3. కొండ; 4. గొఱ్ఱె; 5. సూర్యుఁడు.

**అవికలము.** సం. విణ. (అ. ఆ. అ.) వికలముకానిది. (వికలము=తాఱుమాఱయినది.)

**అవిఘ్నము.** సం. వి. అ. పుం. కలివె?.

**అవిచ్ఛిన్నము.** సం. విణ. (అ. ఆ. అ.) విచ్ఛిన్నముకానిది. (విచ్ఛిన్నము=విచ్ఛేదమునొందినది.)

**అవిటి.** దే. విణ. అంగహీనుఁడు, పోగండుఁడు.

**అవిత.** సం. విణ. (అ. ఆ. అ.) కావఁబడినది. (బు. ఈ. బు.) కాచువాఁడు.

**అవిద్య.** సం. వి. ఆ. స్త్రీ. అహమ్మతి, అజ్ఞానము.

**అవిధి.** సం. వి. ఇ. పుం. దుఃఖము, సంకటము.

**అవినీతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) సముద్ధతుఁడు, అడఁకువలేనివాఁడు.

**అవిభక్తము.** సం. విణ. (అ. ఆ. అ.) విభక్తముకానిది. (విభక్తము=భాగింపఁబడినది.)

**అవిముక్తము.** సం. వి. అ. పుం. కాశి. విణ. విడువఁబడనిది.

**అవియు.** దే. అ. క్రి. 1. చెడు; (కన్నవిసెనిత్యాదులు.) 2. పగులు. (గుండియలవిసెనిత్యాదులు.)

**అవిరతము.** సం. క్రి. విణ. అ. న. ఎల్లప్పుడు. విణ. ఎడతెగనిది.

**అవిరళము.** సం. విణ. (అ. ఆ. అ.) విరళముకానిది. (విరళము=విడవిడనుండునది.)

**అవిరి.** దే. వి. 1. నీలి?; 2. నేత్రరోగవిశేషము.

**అవిలంబితము.** సం. క్రి. విణ. అ. న. త్వరితము. విణ. వడిగలది.

**అవివేకము.** సం. వి. అ. పుం. తెలివిలేమి.

**అవివేకి.** సం. విణ. (న్. ఈ. న్.) తెలివిలేనివాఁడు.

**అవిసెయ.** వై. వి. అగస్త్యము?.

**అవిసె.** వై. వి. అవిసెయయొక్క రూపాంతరము.

**అవిసోఢము.** సం. వి. అ. న. గొఱ్ఱెపాలు.

**అవీచి.** సం. వి. ఇ. పుం. నరకవిశేషము. విణ. అలలులేనిది.

**అవీర.** సం. వి. ఆ. స్త్రీ. మగఁడును బిడ్డలునులేనిది. విణ. బలిమిలేనిది.

**అవు.** దే. అ. క్రి. అగు. ద్ర. అంగీకారమును దెలుపునది.

**అవుతుఖానా.** హిం. వి. స్నానముచేయుతొట్టి.

**అవేక్ష.** సం. వి. ఆ. స్త్రీ. హెచ్చరిక, కాచుట. (అనికొందఱు.)

**అవ్యండ.** సం. వి. ఆ. స్త్రీ. దూలగొండి?.

**అవ్యక్తము.** సం. వి. అ. న. 1. పరమాత్మ; 2. మహదాదితత్త్వము. విణ. తెల్లముకానిది.

**అవ్యక్తరాగము.** సం. వి. అ. పుం. ఇంచుకయెఱుపు, అరుణము.

**అవ్యక్తుఁడు.** సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. శివుఁడు.

అవ్యథ. సం. వి. ఆ. స్త్రీ. 1. కరకఁ; 2. మెట్టతామరఁ. అ. పుం. ము. పాము. విణ. దుఃఖము లేనిది.

అవ్యయము. సం. వి. అ. పుం, న. చాదిశబ్దవిశేష ము. పుం. శుభము. విణ. వెచ్చములేనిది.

అవ్యయుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు.

అవ్యవహితము. సం. విణ. (అ. ఆ. అ.) వ్యవహిత ముకానిది. (వ్యవహితము=వ్యవధానమైనది.) కదిసినది.

అవ్యాజము. సం. వి. అ. పుం. కపటములేమి. విణ. కపటములేనిది.

అవ్వ. వై. వి. 1. తల్లి; 2. తల్లితల్లి*; 3. పూజ్యురాలు*.

అవ్వల. దే. వి. (అ+వలను.) 1. అప్రక్క; 2. పిమ్మట.

అవ్వల్. హిం. విణ. మొదటి, శ్రేష్ఠమైన.

అవ్వారి. వై. విణ. అవారియొక్క రూపాంతరము.

అశక్తము. సం. విణ. (అ. ఆ. అ.) శక్తముకానిది. (శక్తము=ఓపినది.)

అశక్యము. సం. విణ. (అ. ఆ. అ.) శక్యముకానిది. (శక్యము=తరము.)

అశనము. సం. వి. అ. న. 1. అన్నము; 2. భోజనము.

అశనాయ. సం. వి. ఆ. స్త్రీ. బుభుక్ష, ఆఁకలి.

అశనాయితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఆఁకలి గొన్నవాఁడు, బుభుక్షితుఁడు.

అశని. సం. వి. ఇ. పుం, స్త్రీ. 1. పిడుగు; 2. మెఱపు; 3. వజ్రాయుధము.

అశబ్దవాది. సం. వి. న్. పుం. సాంఖ్యుఁడు.

అశితము. సం. విణ. (అ. ఆ. అ.) భక్షితము, తినఁబడినది.

అశిశ్వి. సం. వి. ఈ. స్త్రీ. బిడ్డలులేనిది, గొడ్రాలు.

అశీతి. సం. వి. ఇ. స్త్రీ. ఎనుబది.

అశుచి. సం. విణ. ఇ. పరిశుద్ధముకానిది.

అశుద్ధము. సం. విణ. (అ. ఆ. అ.) అశుచి.

అశుభము. సం. వి. అ. న. కీడు.

అశేషము. సం. విణ. (అ. ఆ. అ.) అఖిలము, అంతయు.

అశోక. సం. వి. ఆ. స్త్రీ. కటురోహిణిఁ. అ. న. ము. పాదరసము. పుం. కంకేళిఁ. (దీనికిదోహదక్రియపాదతాడనము.) విణ. శోకములేనిది.

అశోకుఁడు. సం. వి. అ. పుం. దశరథుని మంత్రులలో నొకఁడు. విణ. శోకములేనివాఁడు.

అశ్మంతము. సం. వి. అ. న. 1. ప్రొయ్యి; 2. చావు; 3. కీడు. విణ. మేరలేనిది.

అశ్మకుట్టకుఁడు. సం. వి. అ. పుం తాతిపనివాఁడు.

అశ్మగర్భము. సం. వి. అ. పుం. మరకతము, పచ్చ.

అశ్మజము. సం. వి. అ. న. గిరిజము, సిలాజిత్తు.

అశ్మపుష్పము. సం. వి. అ. న. రాపువ్వుఁ.

అశ్మము. సం. వి. న్. పుం. ఉపలము, రాయి.

అశ్మరి. సం. వి. ఈ. స్త్రీ. నీరుకట్టురోగము.

అశ్మసారము. సం. వి. అ. పుం. లోహము, ఇనుము.

అశ్రద్ధ. సం. వి. ఆ. స్త్రీ. శ్రద్ధలేమి, అసడ్డ.

అశ్రపుఁడు. సం. వి. అ. పుం. నిర్ఋతి, మాలకూఁడు.

అశ్రము. సం. వి. అ. న. అశ్రువు, కన్నీరు.

అశ్రాంతము. సం. క్రి. విణ. అ. న. ఎల్లప్పుడు. విణ. ఎడతెగనిది.

అశ్రి. సం. వి. ఇ. స్త్రీ. కోటి, అంచు.

అశ్రువు. సం. వి. ఉ. న. అశ్రము, కన్నీరు.

అశ్లీలము. సం. వి. అ. న 1. అర్థదోషవిశేషము; 2. శబ్దదోషవిశేషము. విణ. అసభ్యము. (మాట.)

అశ్వకర్ణకము. సం. వి. అ. పుం. ఇనుమద్దిఁ.

అశ్వఖుర. సం. వి. ఆ. స్త్రీ. తెల్లదింటెనఁ.

అశ్వగంధ. సం. వి. ఆ. స్త్రీ. పెన్నేరుఁ.

అశ్వతరము. సం. వి. అ. పుం. 1. కంచరగాడిద; 2. ఒకానొకపాము.

అశ్వత్థ. సం. వి. ఆ. స్త్రీ. పున్నమ. అ. పుం. ము. రావిఁ.

అశ్వము. సం. వి. అ. పుం. తురగము, గుఱ్ఱము. (అశ్వవిశేషములు.—ఇంద్రాయుధము, మల్లికాక్షము, శోణము, శ్రీవృక్షకి, హరితము, హాలహాలము, హేమము ఇత్యాదు లనేకములు. దీని ఉత్పత్తి సప్తవిధము. దీని ఱొమ్మునుడి శ్రీవృక్షకము. మెడనుడి రోచమానము. నిలువునుడి పురుషకము. దీని యగ్రభాగము వంకము. ఖురము పుటము. గతి విక్రాంతి. కవచము ప్రఖరము. మునికోల ప్రతోదము. పగ్గము రశ్మి. పార్ష్ణిక లుతనము.)

అశ్వయుక్కు. సం. వి. జ్. స్త్రీ. అశ్వినీనక్షత్రము.

అశ్వవాలము. సం. వి. అ. పుం. ఱెల్లుఁ.

అశ్వారోహ. సం. వి. ఆ. స్త్రీ. పెన్నేరుఁ.

దుదాత్తఘోరభంగి, భ్రమరిపాతికురున్నపాలకు నరిదంబు, నందువైచి యిట్టులనియెనధిప." భార. ద్రో. ౫. ఆ.—3. (ఆడుధాతువునకు) ప్రే. ఆడించు; "క. నేర్పరిపెక్కువిధంబుల, నార్పంగబొమ్మలఁగనెంగియాడెడుచందం, బేర్పడఁగా న్ప్రముకాలస, మ్ప్రతికార్యకములైనమానవుల దెసన్." భార. శాం. ౧, ఆ. "విటులాద్చును శిరపుఁదాళిన్వంతముల్." ... "నీసుతులుమంత్రులుసౌబలుజూదమార్చి." భార. ఉద్యో. 3, ఆ. "సీ. కెంగేలుగేలితోఁగీలించి నెయ్యంపు మాటలఁదగుమఱుమాటలార్చు." భార. విరా. ౨, ఆ. (ఇక్కడ ఒక్కొక్క అర్థమునకు ఒకొక్క యుదాహరణముగా వ్రాయఁబడినది.) 4. (అలుచుయొక్కరూపాంతరము.) ఆఁజేయు.

అర్జకుఁడు. సం. విణ. (అ. ఈ. ఆ.) సంపాదించువాఁడు, గడించువాఁడు

ఆర్జనము. సం. వి. అ. న. సంపాదనము, గడన.

ఆర్జవము. సం. వి. అ. న. ఋజుభావము, చక్కన.

ఆర్జించే. సం. స. క్రి. సంపాదించు, గడించు.

ఆర్జితము. సం. విణ. (అ. ఆ. అ.) సంపాదింపఁబడినది, గడింపఁబడినది.

అర్డరు. ఆం. వి. క్రమము, ఆజ్ఞ.

అర్డర్లీ. ఆం. వి. తైనాతిబంట్రౌతు.

అర్తగళము. సం. వి. అ. పుం. నల్లగోరంట?.

ఆర్తము. సం. విణ. (అ. ఆ. అ.) దుఃఖము నొందినది.

ఆర్తవము. సం. వి. అ. న. 1. స్త్రీఋతువు; 2. పుష్పము. విణ. ఋతుసంబంధమైనది.

ఆర్తి. ఉభ. వై. వి. హారతి. సం. ఇ. స్త్రీ. 1 దుఃఖము; 2. వింటికొప్పు.

ఆర్త్విజ్యము. సం. వి. అ. న. ఋత్విజునిభావము.

ఆర్థి. సం. వి. ఈ. స్త్రీ. సదృశాదిశబ్దప్రయోగము గల పూర్ణోపమాభేదము.

అర్దము. ద్వ. వి. (అలు + తూము.) అలుతూములు.

ఆర్ద్ర. సం. వి. ఆ. స్త్రీ. ఒకనక్షత్రము. విణ. తడిసినది.

ఆర్ద్రకము. సం. వి. అ. న. శృంగబేరము, అల్లము?.

ఆర్పు. దే. ప్రే. ఆఱుపుయొక్కరూపాంతరము.

అర్బటము. సం. వి. అ. పుం. ప్రోత.

అర్బటి. సం. వి. ఈ. స్త్రీ.——పై.——

ఆర్య. సం. వి. ఆ. స్త్రీ. 1. పదునాలేండ్లప్రాయముగల యాఁడుది; 2. పార్వతి.

ఆర్యకము. సం. వి. అ. న. పితృకార్యము.

ఆర్యపుత్రుఁడు. సం. వి. అ. పుం. (నాట్యపరిభాషయందు) పెనిమిటి.

ఆర్యావర్తము. సం. వి. అ. పుం. వింధ్యమునకును హిమవంతమునకును మధ్యదేశము.

ఆర్యుఁడు. సం. వి. అ. పుం. 1. (నాట్యపరిభాషయందు) పెనిమిటి; 2. సౌవిదల్లుఁడు. విణ. 1. పూజ్యుఁడు; 2. మంచివాఁడు.

అర్వేరము. వై. వి. అరవేరముయొక్కరూపాంతరము. (కలహమునకు. "గీ. ... నిట్టు వలఁదిసిగ్గు. హోయికొల్లనుపట్టి ... యయ్యె." అని. ౧. ఆ.—ద్వేషమునకు. "..., గి. పట్టియార్వేరమున బలవంతుతోడ. పాటకలెన గుటెల్లనిష్ఫలము గాద." అని. ౧, ఆ.—కలతకు.—చూ. అరవేరము.)

ఆర్షభ్యము. సం. వి. అ. పుం. ఆఁబోతుగావిడఁదగిన కోడెదూడ.

అర్షము. సం. వి. అ. పుం. ధర్మార్థము వరునివలన గోమిథునము పుచ్చుకొని కన్యకనిచ్చి ... శాస్త్రముగాఁజేయు వివాహము (చూ. వివాహము.) విణ. ఋషిది

ఆలడి. దే. వి. ... "సీ. ... మూర్ధాభ్యాఘ్రాణాలి నాఁడి ... ." వై. ౭. ఆ.—విణ. వ్యర్థము.

ఆలడిపడు. ద్వ. అ. క్రి. 1. దూఱుపడు; 2. వ్యర్థమగు. "ద్వి. నూఱుచేలే ద్దుసన్నుగిరితోడ. యాలడిపడిభ్రష్టమైయున్నవారు." రా. బాల కాం.

ఆలడపోవు. దే. అ. క్రి. 1. నూఱుపడు; "... అక్కలకన్యకాత్వమిటులాలడిపోవనకొం... బనీ. కెక్కడమాలంవచ్చె." నిర్వ. ... 2. వ్యర్థమగు. "అలడిపోకయుండ్ ... దుటయుండ్గని." భార. ఉద్యో. 3. ...

ఆలు. దే. అ. క్రి. 1. ఉపశమిల్లు; 2. ... తీయు; 3. నశించు. స. ఐదునొకటి.

ఆలుగురు. దే. స. అలుమంది. (అలునకు ముహ్హైత్యర్థకరూపము.)

ఆఱుచు. దే. ప్రే. 1. ఉపశమింపఁజేయు; 2. తడి తీయఁజేయు; 3. నశింపఁజేయు.

ఆఱుపు. దే. ప్రే. ఆఱుచు. వి. (అఱుపుయొక్క రూపాంతరము.) 1. కూఁత; 2. యోధుల బొబ్బరింత. "క. పొడిచిరి కదుఁజెంచమలాఱుపు లఁజదలదరన్." య. ౨, ఆ. (చూ. ఉఱుము.)

ఆఱుమోముల వేలుపు. ద్వి. వి. కుమారస్వామి, షణ్ముఖుఁడు.

ఆఱువాల్లు. దే. వి. బ. (ఆఱు+వాడులు.) కొంచెపు ఎండుట.

ఆఱువురు. దే. స. ఆఱుగురుయొక్క రూపాంతరము.

ఆఱుస. ద్వి. వి. (ఆఱు+నుంచము.) ఆఱుకుంచము లు. "సీ. పట్ప్రస్థ పేరాఱుసయన వెలయు." ఆం, భా. ద్వి. వై.

ఆలంకి. దే. వి. 1. కురిచీవ టిపల్లకి; 2. ఆల కిగుడి. (చూ. పిల్లదీవి.)

ఆలంకిగుడి. ద్వి. వి. బాలక్రీడావిశేషము. "సీ. సాలముల్ రపుఁజొట్టి సాధింతునమలీల నాలంకి గుడిడింభకాళిఁదిగుచు." రా, వి. ౨, ఆ.

ఆలంకులు. దే. వి. బ. ఆలంకిగుడి. "సీ. పుట్టచెండ్లుప్పనఁబట్టెలాలంకులు గుడిగుడిగుంచాలు గుటచాల్లు." వి. పు. ౭, ఆ.

ఆలంబము. సం. వి. అ. పుం. అవలంబము, ఊఁత.

ఆలంబించు. సం. స. క్రి. అవలంబించు, ఊఁదు.

ఆలంభము. సం. వి. అ. పుం. వధము, కొల.

ఆలకాపరి. దే. వి. 1. కృష్ణుఁడు; 2 గోపాలుఁడు.

ఆలకించు. వై. స. క్రి. 1. ఆదరించు*; "గీ. అంచ లారయాలకించివినుఁడు." చంద్ర.—2. విను*.

ఆలక్షించు. సం. స. క్రి. కనుఁగొను, చూచు.

ఆలగోఁడుబాలగోఁడు. దే. వి. పెదబొబ్బలు.

ఆలతి. వై. వి. రాగాలాపము. "చ. అలరులుకోసి కోసినవయస్యలఁబల్లఱుఁగౌఁగిలించికో, యిల లయోలుంగులోలిఁగొనియింపుగఁ జిక్కలతోడ నెమ్మిమై, నలవడిమాటలాడియళులాలతిసేయఁ గఁబాడిడాఁగురిం, తలుహరితోడనాడుగురుత ద్వనవీధులయందుగోపికల్." హరి. పూ. ౮, ఆ.

ఆలపించు. వై. స. క్రి. రాగమునాలాపించు. "ఉ. ఉద్యన్నఖరప్రఘాతములఁదంత్రులుమీటుచు నాలపించునా, తిన్ననియొల్లునా చెవులఁదేనియ లొల్కుచవుల్ దలంచెదన్." పాండు. 3, ఆ.

ఆలపోతు. దే. వి. ఆఁబోతు, వృషభము.

ఆలప్తి. సం. వి. ఇ. స్త్రీ. రాగాలాపము, ఆలతి.

ఆలము. ఉభ. దే. వి. ఉపేక్ష. "ఆలముసేసినాత గులమాఅడిపుచ్చఁగనేలజేల." భార. విరా. ౨, ఆ.—వై. యుద్ధము. "క. కాలంబగుటయున్న పులకు, నాలముసమకూఱె." భార. భీష్మ. ౧, ఆ.—సం. అ. న. 1. తేలుకొండి; 2. హరిదళము.

ఆలయము. సం. వి. అ. పుం. గృహము, ఇల్లు.

ఆలరి. దే. విశే. దుశ్శీలుఁడు. "ఉ. చాలఁబురేసరో జభవసత్పథవృత్తిఁదొలంగికూఁతుని, ట్లాలరివైర మింపహృదయంబునఁగోరుటధర్మరీతియే." భాగ. 3, స్కం.

ఆలఱేఁడు. దే. వి. బసవఁడు, వృషభము.

ఆలవట్టము. వై. వి. వస్త్రముతో గుండ్రముగాఁజేసిన విసనకఱ్ఱ.

ఆలవాలము. సం. వి. అ. న. ఆవాలము, పాదు.

ఆలసించు. వై. అ. క్రి. ఆలస్యముచేయు, తడయు.

ఆలస్యము. సం. వి. అ. న. 1. సోమరితనము; 2. జాగు. విశే. సోమరి. సం. వి. అ. పుం. నీరుపంది.

ఆలాజ్యము. సం. వి. అ. న ఇంధనము, వంట చెఱకు.

ఆలానము. సం. వి. అ. పుం, న. 1. ఏనుగునుకట్టు కంబము; 2. త్రాడు.

ఆలాపము. సం. వి. అ. పుం. 1. నిందుమాట, 2. రాగాలాపము.

ఆలాపించు. సం. స. క్రి. రాగముఁ దిన్నఁగానీడ్చు.

ఆలాబువు. సం. వి. ఊ. స్త్రీ. అలాబువు, సొరకాయ.

ఆలాయము. వై. విశే. పాత్రము*.

ఆలావర్తము. సం. వి. అ. న. ఆలవట్టము.

ఆలి. ఉభ. దే. విశే. (నాలియొక్క రూపాంతరము.) హీనము. "మ. మగఁడానీవుజగంబుచొప్పామి గులన్ మానంబువాటింతువా, లిగసెగ్గంబగు మాటవాటిలెనె." నిర్వ. ౫, ఆ. "ఉ. ఇయ్యాలి తినంబువాపెదఁ బ్రియంబొనరించెదనీకుఁదండ్రికిన్." భార. శల్య. ౨, ఆ.—సం. వి. ఇ. స్త్రీ. 1. పఙ్క్తి; 2. చెలికత్తె.

ఆలింగనము. సం. వి. అ. న. ఉపగూహనము, కవుఁగిలింత.

ఆలింగితము. సం. విశే. (అ. ఆ. అ.) కవుఁగిలింపఁబడినది.

ఆలింగ్యము. సం. వి. అ. పుం. గోపుచ్ఛమువంటి ఆకారముగల మృదంగము. విణ. కవుఁగిలింపఁదగినది.

ఆలించే. వై. స. క్రి. ఆలకించుయొక్క రూపాంతరము. (ఆదరించుటకు.—"గీ. ఇంక నైననన్ను నేల యాలింపవు, నాకుశరణమగుమునాథ." భార. ఆర. ౨. ఆ. "ఎ, గీ. లిఖితుఁడిట్లనుశంఖుఁడా లించివినఁగ." జై. ౪, ఆ.)

ఆలిగొను. దే. స. క్రి. (ఆలి+కొను.) 1. అపహసించు; "గీ. అట్టివికృతాననముగాంచియిట్టులనియె, నోనిశాటియీయొప్పుతోనున్న నిన్నుఁ, గన్న నార్తినిదూలరే కాముచేత, బేలనీకింతవలవనిజాలి యేల. ఎ. అని. క. ఈశీలసుమిత్రాసుతుఁడా లిగొనఁగ." రా. అర, కాం.—2. తక్కువపఱచు. "అమరుల్ తగు భోజ్యములెల్లమ్రింగిమోపుగొనుచుమిమ్ము నాలిగొనిపోయిరి." నిర్వ. ౫. ఆ.

ఆలిచిప్ప. దే. వి. కప్పచిప్ప, శంబూక.

ఆలీఢము. సం. వి. అ. న. విలుకాఁడు కుడికాలు ముందటికిచాఁచి నిలుచుట. (చూ. స్థానము.) విణ. నాకఁబడినది.

ఆలు. దే. వి. భార్య. (దీనికి వృత్తియందు ఆఁడుదియనిమాత్రమర్థము. జవరాలు, ధీరురాలు. మొ.)

ఆలుక. సం. వి. ఆ. స్త్రీ. గిండిచెంబు.

ఆలుకము. సం. వి. అ. పుం. న. గెనుసు. చేమ. (అనికొందఱు.)

ఆలుగడ్డ. హిం. వి. ఉరలగడ్డ. బంగాళాదుంప.

ఆలుడి. దే. వి. మంచినడత, శీలము.

ఆలువు. సం. వి. ఉ. స్త్రీ. గిండి. న. 1. గెనుసుగడ్డ; 2. పడవ.

ఆలెగాఁడు. దే. వి. క్రిందికొలువుగాఁడు.

ఆలెప్రొయ్యి. దే. వి. ఒకసారిగా నాలుగైదు పాత్రములు వేఱువేఱుగాఁబెట్టి వండునట్లేర్పఱచిన పొయ్యి.

ఆలేఖనము. సం. వి. అ. న. 1. వ్రాయుట; 2. చిత్తరువువ్రాయుట.

ఆలేఖ్యము. సం. వి. అ. న. 1. చిత్తరువు; 2. వ్రాఁత.

ఆలోకము. సం. వి. అ. పుం. 1. చూపు, (రూ. ఆలోకనము;) 2. ఎండ; 3. బట్టువాఁడుచేయు స్తోత్రము.

ఆలోకించే. సం. స. క్రి. వీక్షించు, చూచు.

ఆలోకితము. సం. విణ. (అ. ఆ. అ.) చూడఁబడినది.

ఆలోచన. సం. వి. ఆ. స్త్రీ. అ. న. యోచన.

ఆలోచించే. సం. స. క్రి. యోచించు, ఏకతమాడు.

ఆలోడనము. సం. వి. అ. న. కలఁత.

ఆలోడించే. సం. స. క్రి. కలఁచు.

ఆలోడితము. సం. విణ. (అ. ఆ. అ.) కలఁచఁబడినది.

ఆవ. దే. వి. సర్షపము. బ. సర్షపబీజములు. (ఈయర్థమందు తెలుచుగా ఆవాలు అని వాడెదరు.)

ఆవజము. వై. వి. వాద్యవిశేషము. "చ. అ, య్యమతిగాంచి దండియు యుపాంగము మద్దెలతాళ మానజం, బునుగొని." రామా. ౨. ఆ.

ఆవటము. దే. వి. పొందిక. విణ. పొందికైనది. "గీ. వలనుసంపదలందనాఁటమునాటము." భాగ. ౪, స్కం.

ఆవటముచేయు. దే. స. క్రి. పొందికపఱచు. "సీ. మోచేతివంపుగాముడిచిపట్టినకేల వరదాభయంబులావటముచేసి." పాండు. ౨, ఆ.

ఆవటిల్లు. దే. అ. క్రి. పొందుపడు. "గీ. అతఁడుఁ గొఱప్రాణములనుండిహారువుదరువు, లావటిలఁ దల్ప." రామా. ౬. ఆ.—(ప్రే. ఆవటించు.)

ఆవడ. దే. వి. చేఁదుగలబీఱ.

ఆవడి. దే. వి. హావడి, ఉపద్రవము. "క. మానుగ జగములయావడి. మానుపఁగాఁగోర." అని. సుం. కాం.

ఆవపనము. సం. వి. అ. న. (కాఁగు గంప మొదలైన) పాత్రము.

ఆవపాఱు. దే. అ. క్రి. 1. జ్ఞప్తికివచ్చు; 2. తోఁచు.

ఆవము. వై. వి. (కుమ్మరి కుండలులోనగునవి కాల్చుట కేర్పఱచిన) కావు. ఆవాపము.

ఆవరణము. సం. వి. అ. న. ఆచ్ఛాదనము, మూఁత. (సప్తావరణములు.—పృథివ్యప్తేజోవాయ్వాకాశాహంకారమహత్తత్వములు. ప్రకృతితోఁ గూడ అష్టావరణములగు.)

ఆవరించే. సం. స. క్రి. చుట్టుకొను.

ఆవర్జనము. సం. వి. అ. న. ఆకర్షణము.

ఆవర్జా. హిం. వి. దినచర్య, ప్రతిదినపులెక్క.

ఆవర్తనము. సం. వి. అ. న. 1. మరలుట; 2. పాముయొక్క వల్లె.

**ఆవర్తనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. మరలం దగినది; 2. వల్లింపందగినది.

**ఆవర్తము.** సం. వి. అ. పుం. 1. గుఱ్ఱపుసుడి; 2. నీటి సుడి; 3. మరలుట; 4. పాఠముయొక్క వల్లె.

**ఆవర్తించు.** సం. స. క్రి. పాఠమును వల్లించు.

**ఆవర్తితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. మరలినది; 2. వల్లింపఁబడినది.

**ఆవల.** దే. వి. (ఆ+వలను.) 1. ఆప్రక్క; 2. పిమ్మట.

**ఆవలి.** ఉభ. దే. వి. ఉపద్రవము. "సీ. మురహయ గ్రీవాంత్రమూలఫేనావళినావలిదలఁగఁజేకాకు పఱచె." ఉ. హరి. ౪, ఆ.—సం. ఇ. స్త్రీ. పఙ్క్తి.

**ఆవశ్యకము.** సం. వి. అ. న. అక్కఱ. విణ. అక్కఱ కైనది.

**ఆవసితము.** సం. విణ. (అ. ఆ. అ.) నుఱిచినది. (ధాన్యము.)

**ఆవహము.** సం. విణ. (అ. ఆ. అ.) కలిగించునది.

**ఆవహిల్లు.** సం. అ. క్రి. కలుగు. (ప్రే. ఆవహించు.)

**ఆవళి.** దే. వి. ఆవడియొక్క రూపాంతరము. "అత్యలఘుతరంగసంపదలకావలులావళులు." చ. ను. ౧, ఆ.

**ఆవాపకము.** సం. వి. అ. పుం. అందువానిచేతి మట్టిగాజు, సూడిగము.

**ఆవాపము.** సం. వి. అ. పుం. 1. పాదు; 2. విత్తుట; 3. ఆవము; 4. పరరాష్ట్రచింతన. (స్వరాష్ట్రచింతన తంత్రమనఁబడును.)

**ఆవాయకము.** సం. వి. అ. పుం. ఆవాపకము.

**ఆవాలము.** సం. వి. అ. న. ఆలవాలము, పాదు.

**ఆవాసము.** సం. వి. అ. పుం. సదనము, ఇల్లు.

**ఆవాహనము.** సం. వి. అ. న. ఆహ్వానము, పిలుపు.

**ఆవాహితము.** సం. విణ. (అ. ఆ. అ.) పిలువఁబడినది.

**ఆవి.** దే. వి. 1. శ్వాసము; "గీ. ఆసుయోధను ముక్కునవావిగలుగఁ, బుడమినీకేఁడు." భార. ఉద్యో. 3, ఆ.—2. తాపము. మ. "విహరించుమ్ మలయానిలంబచటఁదావిం జిల్కి నెమ్మేనియావి. విహరించుం బికనాదముల్ చెవికిఁగావించుం జవుల్ పోదమా." విజ. ౨, ఆ.

**ఆవించు.** దే. స. క్రి. వాసెనమీఁదఁ బెట్టి ఆవిరితోఁ బక్వము చేయు. "వ. కీచకతండులంబులంబిండి గొట్టికొట్రంబోసియుప్పిగొప్పలుగాఁజేసి యావించిన కుడుములబానలు." కాశీ. 3, ఆ.

**ఆవిగ్నము.** సం. వి. అ. పుం. కలివి?. విణ. ఆవేగము నొందినది.

**ఆవిధము.** సం. వి. అ. పుం. తొలిచెడుసాధనము.

**ఆవిద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. చక్కఁగా తొలువఁబడినది; 2. వంకరయినది.

**ఆవిరి.** దే. వి. ఊష్మము.

**ఆవిరిల్లు.** దే. అ. క్రి. చెమర్చు.

**ఆవిర్భవించు.** సం. అ. క్రి. ప్రభవించు, పుట్టు.

**ఆవిర్భావము.** సం. వి. అ. పుం. ప్రభవము, పుట్టుక.

**ఆవిర్భూతము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రభూతము, పుట్టినది.

**ఆవిలము.** సం. విణ. (అ. ఆ. అ.) కలఁకఁబాఱినది, కలుషము.

**ఆవిలి.** దే. వి. మాంత్రికుఁడు ఉపయోగించెడు కాచపాత్రవిశేషము.

**ఆవిష్కరణము.** సం. వి. అ. న. ప్రకటనము, వెల్లడి.

**ఆవిష్కరించు.** సం. స. క్రి. ప్రకటించు, వెలయించు.

**ఆవిష్కృతము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రకటింపఁబడినది, వెలయింపఁబడినది.

**ఆవిష్కృతి.** సం. వి. ఇ. స్త్రీ. ఆవిష్కరణము.

**ఆవిష్టియ.** సం. వి. ఆ. స్త్రీ.——వై.——

**ఆవిష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆవేశము కొన్నది; 2. చొచ్చినది.

**ఆవు.** దే. వి. గోవు. (వృత్తియందు అంత్యవర్ణలోపము వికల్పముగనగు. ఆఁగదుపు, ఆఁబడ్డ, ఆఁనెయ్యి, ఆమాఁవ. మొ.)

**ఆవుకుఁడు.** సం. వి. అ. పుం. (నాట్యపరిభాషయందు) తండ్రి.

**ఆవుత్తుఁడు.** సం. వి. అ. పుం. (నాట్యపరిభాషయందు) బావ.

**ఆవురు.** దే. వి. రోదనార్తధ్వనులయందగు ధ్వన్యనుకరణము. "ఉ. దేవుఁడొమానియోయనిమనోందలపోఁతలునాకికానినిన్, వేవురువేయిచందములనిందియొనర్చదరిద్రుమూఁగియన్, పావులనోరునీయెడమపాదతలంబునఁదన్నినట్లుగా, నీవొకయింతయావురనియేడ్వఁగఁదన్న కుమారరత్నమా." పర. ౨, ఆ.

**ఆవులించు.** దే. అ. క్రి. ఆవులింతవిడుచు, జృంభించు.

**ఆవులింత.** దే. వి. ఆవులించుట, జృంభము.

ఆవృతము. సం. విశే. (అ. ఆ. అ.) వలయితము, చుట్టుకొనఁబడినది.
ఆవృత్తము. సం. విశే. (అ. ఆ. అ.) తిరుగుడు పడినది.
ఆవృత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. తడవ; 2. తిరుగుడు; 3. వల్లె.
ఆవృత్తు. సం. వి. త్. స్త్రీ, న. అనుక్రమము, సారిది.
ఆవేగము. సం. వి. అ. పుం. (ఇష్టానిష్టప్రాప్తిచేఁ గలుగు) తొట్రుపాటు.
ఆవేగి. సం. వి. ఈ. స్త్రీ. బొద్దికూర?.
ఆవేదకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) తెలిపెడు వాఁడు.
ఆవేదనము. సం. వి. అ. న. తెలుపుట.
ఆవేదించే. సం. స. క్రి. తెలుపు.
ఆవేదితము. సం. విశే. (అ. ఆ. అ.) తెలుపఁబడినది.
ఆవేశనము. సం. వి. అ. న. 1. పట్టడ; 2. ప్రవేశము; 3. ఒళ్లెఱుఁగమి.
ఆవేశము. సం. వి. అ. పుం. 1. ఒళ్లెఱుఁగమి. సుమారీము; 2. వేగిరపాటు.
ఆవేశించే. సం. అ. క్రి. ప్రవేశించు, చొచ్చు.
ఆవేశికుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) అతిథి, విందు.
ఆవేష్టకము. సం. వి. అ. పుం. ముండ్లకంచె.
ఆశ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆస; 2. దిక్కు. అ. పుం. ము. 1. అగ్ని; 2. వ్యాప్తి.
ఆశంసనము. సం. వి. అ. న. కోరుట.
ఆశంసిత. సం. విశే. (ఋ. ఈ. ఋ.) కోరువాఁడు.
ఆశంసితము. సం. విశే. (అ. ఆ. అ.) కోరఁబడినది.
ఆశంసువు. సం. విశే. ఉ. ఆశంసిత.
ఆశపడు. మి. అ. క్రి. అపేక్షపడు.
ఆశయము. సం. వి. అ. పుం. 1. అభిప్రాయము; 2. ఆధారము; 3. మనస్సు.
ఆశయిత. సం. విశే. (ఋ. ఈ. ఋ.) తినిపించు వాఁడు.
ఆశరుఁడు. సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. రాక్షసుఁడు.
ఆశాబంధము. సం. వి. అ. పుం. 1. ఊఱట; 2. సాలెపట్టు.
ఆశాసనము. సం. వి. అ. న. ఆశీర్వాదము.
ఆశాసించే. సం. స. క్రి. ఆశీర్వదించు.
ఆశాస్యము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఆశీర్వదింపఁదగినది; 2. ప్రార్థింపఁదగినది.
ఆశి. సం. వి. ఈ. స్త్రీ. పాముయొక్క కోఱ.
ఆశించే. సం. స. క్రి. అపేక్షించు, ఆసించు.
ఆశితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. తినఁబడినది; 2. అంతకుముందు ఆవులనుమేపినది. (పొలము.)
ఆశీర్వదించే. సం. స. క్రి. దీవించు.
ఆశీర్వాదము. సం. వి. అ. పుం. దీవన.
ఆశీవిషము. సం. వి. అ. పుం. సర్పము, పాము.
ఆశీస్సు. సం. వి. స్. స్త్రీ. 1. హితముకోరుట; 2. పాముయొక్క కోఱ.
ఆశుగము. సం. వి. అ. పుం. 1. బాణము; 2. గాలి.
ఆశువు. సం. వి. ఉ. పుం. ఎఱ్ఱజిలమవడ్లు. క్రి. విశే. న. వేగ. విశే. వేగముగలది.
ఆశుశుక్షణి. సం. వి. ఇ. పుం. అగ్ని, వహ్ని, నిప్పు.
ఆశౌచము. సం. వి. అ. న. అశుచిత్వము, అంటు.
ఆశ్చర్యము. సం. వి. అ. న. అచ్చెరువు. విశే. అచ్చెరువైనది.
ఆశ్రమము. సం. వి. అ. పుం, న. 1. పర్ణశాల; 2. బ్రహ్మచర్యాది; (ఇవి నాలుగు. — బ్రహ్మచర్యము, గార్హస్థ్యము, వానప్రస్థము, సన్యాసము.) 3. మఠము; 4. అడవి.
ఆశ్రయము. సం. వి. అ. పు. 1. ఆడ; 2. బలవంతునాశ్రయించుట; (చూ. గుణము.) 3. ఇల్లు.
ఆశ్రయాశుఁడు. సం. వి. అ. పుం. అగ్ని. విశే. ప్రాపుచెఱచువాఁడు.
ఆశ్రయించే. సం. స. క్రి. ఆశ్రయముచేయు, అడఁగొను.
ఆశ్రవము. సం. వి. అ. పుం. 1. అంగీకారము, 2. క్లేశము.
ఆశ్రవుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) మాటదాఁటని వాఁడు. వినయముగలవాఁడు. (అనికొంచెము.)
ఆశ్రి. సం. వి. ఇ. స్త్రీ. కత్తివాదర.
ఆశ్రితము. సం. విశే. (అ. ఆ. అ.) ఆశ్రయింపఁబడినది.
ఆశ్రుతము. సం. విశే. (అ. ఆ. అ.) అంగీకరింపఁబడినది, సమాహితము.
ఆశ్లిష్టము. సం. విశే. (అ. ఆ. అ.) ఆలింగితము, కవుఁగిలింపఁబడినది.
ఆశ్లేషము. సం. వి. అ. పుం. 1. ఆలింగనము; 2. నక్షత్రవిశేషము.
ఆశ్లేషించే. సం. స. క్రి. కవుఁగిలించు.
ఆశ్వత్థము. సం. వి. అ. న. రావిపండు.

**ఆశ్వము.** సం. వి. అ. న. గుఱ్ఱములగుంపు, ఆశ్వీయము.

**ఆశ్వయుజము.** సం. వి. అ. పుం. ఒకమాసము.

**ఆశ్వసించు.** సం. స. క్రి. ఆశ్వాసించు, ఊఱడించు.

**ఆశ్వసితము.** సం. విశే. (అ. ఆ. అ.) ఊఱడింపఁబడినది.

**ఆశ్వాసము.** సం. వి. అ. పుం. 1. ఊఱట; 2. ఆఖ్యాయికపరిచ్ఛేదము; 3. పరిచ్ఛేదము.

**ఆశ్వాసించు.** సం. స. క్రి. ఆశ్వసించు.

**ఆశ్వాసితము.** సం. విశే. (అ. ఆ. అ.) ఆశ్వసితము.

**ఆశ్వికుఁడు.** సం. వి. అ. పుం. గుఱ్ఱపురౌతు.

**ఆశ్వినము.** సం. వి. అ. పుం. ఆశ్వయుజమాసము.

**ఆశ్వినేయులు.** సం. వి. అ. పుం. ద్వి. అశ్వులు.

**ఆశ్వీనము.** సం. విశే. (అ. ఆ. అ.) గుఱ్ఱము ఒకదినము నడవఁదగినది. (త్రోవ.)

**ఆశ్వీయము.** సం. వి. అ. న. ఆశ్వము.

**ఆషాఢము.** సం. వి. అ. పుం. 1. ఒకమాసము; 2. బ్రహ్మచారిపట్టుకొనెడుమోదుగుకోల; 3. మలయపర్వతము.

**ఆషూర్ఖానా.** హిం. వి. సత్రము

**ఆస.** వై. వి. ఇచ్ఛ, అపేక్ష.

**ఆసంగము.** సం. వి. అ. పుం. 1. ఆశ్రయము; 2. ఆసక్తి.

**ఆసకప్పెరగాఁడు.** దే. వి. పక్షివిశేషము.

**ఆసక్తి.** సం. వి. ఇ. స్త్రీ. అపేక్ష, ఆస.

**ఆసక్తుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ఆసగొన్నవాఁడు.

**ఆసచేయు.** వై. స. క్రి. ఆశించు. "ఇంద్రపదంబు కోరఁడుదిగీశులరాజ్యములాసచేయఁడు." వి, పు. ౨, ఆ.

**ఆసత్తి.** ఉభ. వై. వి. ఆశ. సం. ఇ. స్త్రీ. 1. లాభము; 2. సంగమము.

**ఆసన.** సం. వి. ఆ. స్త్రీ. కూర్చుండుట. అ. న. ము. 1. పీట; 2. స్వస్తికాది; (స్వస్తికాసనము, గోముఖాసనము, బద్ధాసనము, పద్మాసనము, వీరాసనము, సింహాసనము, భద్రాసనము, ముక్తాసనము. (దీనికి సిద్ధాసనమని, వజ్రాసనమని, గుప్తాసనమనియు నామాంతరములు గలవు.) మయూరాసనము. మొ.) 3. బలాఢ్యపేక్షచేదండెత్తిపోక నిలుచుట; (చూ. గుణము.) (ఇది పంచవిధము.—సంధాయాసనము, ప్రసంగాసనము విగృహ్యాసనము, సంభూయాసనము, ఉపేక్ష్యాసనము. వీనికర్థము యానశబ్దముకడవ్రాసినట్లెఱుంగునది.) 4. ఏనుఁగుమూఁపు. పుం. వేఁగిసకి.

**ఆసన్నము.** సం. వి. అ. న. దాపు. విశే. దాపైనది.

**ఆసపడు.** వై. అ. క్రి. అపేక్షపడు.

**ఆసపాటు.** వై. వి. అపేక్షపడుట.

**ఆసరా.** వై. వి. ప్రాపు, ఆశ్రయము.

**ఆసవము.** సం. వి. అ. పుం. 1. పక్వముకాని చెఱకురసమునఁజేసినకల్లు; చెఱకురసమునఁజేసినకల్లు. (అనికొందఱు.) 2. కల్లుతేట; 3. పూఁదేనె.

**ఆసాదనము.** సం. వి. అ. న. ప్రాప్తి, పొందు.

**ఆసాది.** దే. వి. మాదిగ. "సీ. ఆసాదిగోసంగిమాదిగ గూబరియున మాతంగుఁడగు." ఆం, భా. ద్వి. శూ.

**ఆసాదించు.** సం. స. క్రి. ప్రాపించు, పొందు.

**ఆసాదితము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రాప్తము, పొందఁబడినది.

**ఆసాద్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రాప్యము, పొందఁదగినది.

**ఆసాను.** హిం. వి. ఆధారము.

**ఆసారము.** సం. వి. అ. పుం. 1. జడివాన; వడిగలవాన. (అనికొందఱు.) 2. మిత్రబలము; 3. అంతటను సేన వ్యాపించుట.

**ఆసించు.** వై. స. క్రి. అపేక్షించు.

**ఆసికుఁడు.** సం. వి. అ. పుం. ఖడ్గాయుధుఁడు.

**ఆసితము.** సం. వి. అ. న. ఉనికిపట్టు. విశే. కూర్చుండినది.

**ఆసిద్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. అడ్డగింపఁబడినది; 2. కట్టాయితమయినది.

**ఆసీనుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) కూర్చున్నవాఁడు.

**ఆసుఁగ్రోవి.** దే. వి. (ఆసు+క్రోవి.) (సాలెవాఁడు ఆసుపోయునపుడు) నూలుచొప్పించెడుక్రోవి.

**ఆసుమ్రాను.** దే. వి. సాలెవాని ఒకకొలిముట్టు. (నూలుపోఁగువాటించుటకై వరుసకు మూడుమేంతునఁగాని అయిదుమేంతునఁగాని నాలుగైదువరుసలుగా మొలలుగూర్చిన కొయ్యచట్టము.)

**ఆసురము.** సం. వి. అ. పుం. ధనమిచ్చికన్యకనుదీనిచేసికొనెడియొకవివాహము.(చూ. వివాహము.)

**ఆసురి.** సం. వి. ఈ. స్త్రీ. కృష్ణిక, నల్లావాలు.

**ఆసురీణము.** సం. విశే. (అ. ఆ. అ.) నల్లావాలుపండునది. (పొలము.)

ఆసురుఁడు. సం. వి. ఆ. పుం. నిర్ఋతి, మూలకోఁడు.
ఆసువోయు. దే. స. క్రి. (ఆసు+పోయు.) (ఆసు త్రాని మొలలకునూలు) పోఁగువాఱించు.
ఆసేకము. సం. వి. అ. పుం. చల్లుట.
ఆసేచనకము. సం. విశే. (అ. ఆ. అ.) ఎంతచూచినను తనివితీఱనిది.
ఆసేచనము. సం. వి. అ. న. చల్లుట. విశే. కోరఁబడినది.
ఆసేధము. సం. వి. అ. పుం. నిరోధము, అడ్డగింత.
ఆసేధించే. సం. స. క్రి. నిరోధించు, అడ్డగించు.
ఆసేధ్యము. సం. విశే. (అ. ఆ. అ.) అడ్డగింపఁదగినది.
ఆస్కందనము. సం. వి. అ. న. 1. యుద్ధము; 2. ఇంకుట; 3. తిరస్కారము.
ఆస్కందితము. సం. వి. అ. న. అతివేగమును అతిమందమునుగాక నడితరముగాఁబాఱెడి యొక యశ్వధార, (చూ. ధార.) రవగాలు.
ఆస్తరణము. సం. వి. అ. న. 1. ఆసనము; 2. ఎఱ్ఱకంబళి; 3. ఏనుఁగుమీఁదపఱచెడి యెఱ్ఱకంబళి; 4. పఱపు.
ఆస్తరము. సం. వి. అ. పుం. 1. పఱపు; 2. ఆసనము; 3. ఎఱ్ఱకంబళి.
ఆస్తి. దే. వి. కూడఁబెట్టినధనము.
ఆస్తికాఁడు. దే. విశే. ధనవంతుఁడు. (చూ. అచ్చుకుప్ప.)
ఆస్తికుఁడు. సం. వి. అ. పుం. భగవంతుఁడున్నాఁడని నమ్మువాఁడు. విశే. శ్రద్ధగలవాఁడు.
ఆస్తిక్యము. సం. వి. అ. న. ఆస్తికునిభావము.
ఆస్తీర్ణము. సం. విశే. (అ. ఆ. అ.) పఱవఁబడినది.
ఆస్థ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆస్థానము; 2. ప్రయత్నము.
ఆస్థానము. సం. వి. అ. న. 1. సభ; 2. రాజసభ.
ఆస్థాని. సం. వి. ఈ. స్త్రీ.——పై.——
ఆస్పత్రి. ఆం. వి. వైద్యశాల, (రూ. ఆస్పిటాలు.)
ఆస్పదము. సం. వి. అ. న. 1. చోటు; 2. పని.
ఆస్ఫాలనము. సం. వి. అ. న. చఱపు. (రూ. ఆస్ఫాలము. పుం.)
ఆస్ఫాలించే. సం. స. క్రి. ఆస్ఫోటించు, చఱచు.
ఆస్ఫాలితము. సం. విశే. (అ. ఆ. అ.) చఱవఁబడినది.
ఆస్ఫోట. సం. వి. ఆ. స్త్రీ. 1. అడవిమల్లె?; 2. దింటెన?. అ. పుం. ము. జిల్లేడు?.

ఆస్ఫోటనము. సం. వి. అ. న. 1. చఱపు; 2. పోటు; 3. చీలిక.
ఆస్ఫోటని. సం. వి. ఈ. స్త్రీ. రత్నములకు బెజ్జము వేసెడుసూవి, పిడిసాన.
ఆస్ఫోటించే. సం. స. క్రి. 1. చఱచు; "క. మాటికిమనపైకఱుములు, చాటుచువేకోటులద్రిచరులుగొలువనా, స్ఫోటించిసేలఁగాలం, దాటించుచునున్నవాఁడుదంభుఁడుకంటే." రా. యు, కాం.—2. పొడుచు; 3. చీల్చు.
ఆస్ఫోటితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. చఱవఁబడినది; 2. పొడువఁబడినది; 3. చీల్పఁబడినది.
ఆస్య. సం. వి. ఆ. స్త్రీ. ఉనికి. క్షూర్చుండుట. (అనికొందఱు.) అ. న. ము. 1. ముఖము; 2. నోరు.
ఆస్రము. సం. వి. అ. న. 1. కన్నీరు; 2. నెత్తురు. పుం. వెండ్రుక.
ఆస్రవము. సం. వి. అ. పుం. క్లేశము, అలసట.
ఆస్వదనము. సం. వి. అ. న. 1. అనుభవించుట; 2. చవిచూచుట.
ఆస్వదించే. సం. స. క్రి. 1. అనుభవించు; 2. చవిచూచు. "ఆబావితేటనీరాస్వదించిన." కాశీ. ౬, ఆ.
ఆస్వాదనము. సం. వి. అ. న. ఆస్వదనము.
ఆస్వాదించే. సం. స. క్రి. ఆస్వదించు.
ఆస్వాదితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అనుభవింపఁబడినది; 2. చవిచూడఁబడినది.
ఆహకము. ఉభ. దే. వి. కుదువ. "ద్వి. ఆహకంబులువెట్టియవిదక్కమితులు, సాహసంబునఁబల్మిసాత్తులఁబెట్టి." హరిశ్చ. ౨, భా. (ఆయకము అనునది హకారమధ్యకముగా నిట్లీగ్రంథమునందు కనఁబడుచున్నది.) — సం. అ. పుం. ముక్కునఁగలుగు రోగము.
ఆహతము. సం. వి. అ. పుం. తప్పెట. విశే. 1. కలుగనేరనిది; (గొడ్రాలికొడుకుచూచుచున్నాఁడు. లోనగుమాట.) 2. కొట్టఁబడినది; 3. క్రొత్తది (వస్త్రము.) 4. ప్రాఁతది; (వస్త్రము.) 5. రెట్టింపఁబడినది.
ఆహతలక్షణుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) గుణములచేతఁ బ్రసిద్ధిఁజెందినవాఁడు, కృతలక్షణుఁడు.
ఆహరించే. సం. స. క్రి. 1. అపహరించు; "నేఁదల్లడమందభూషణవితానమునర్థమునాహరించి"

షా. ౪, ఆ.—2. ఆకర్షించు; "విజ్ఞానమునఁజేసి విషయాదివలనసెమ్మనమాహరించి." (ఇక్కడ ఆహరించి=మరలించియనుట.) ఆము. 3, ఆ.—3. ఆరగించు. "ఎ, గీ. బ్రహ్మచర్యమునకుఁబరమాయువుపవాస, ములకుఁజిత్తశుద్ధిఫలజలంబు, లాహరించియునికి కాధిరాజ్యముపత్ర, భక్షతకు దివంబుఫలములధిప." భార. ఆను. ౧, ఆ.

ఆహర్త. సం. విణ. (ఋ. ఈ. ఋ.) ఆహరించువాఁడు.

ఆహవనము. సం. వి. అ. న. యజ్ఞము, వ్రేలిమి.

ఆహవనీయము. సం. వి. అ. పుం. ఒక శ్రౌతాగ్ని. (చూ. అగ్ని) విణ. యజ్ఞమునబలియియ్యయోగ్యమైనది.

ఆహవము. సం. వి. అ. పుం. 1. యుద్ధము; 2. పిలుపు; 3. యజ్ఞము.

ఆహా. వై. అవ్య. ఔరా. "ఆహాపుట్టెడులాఁతిచూపఱకు." భార. శల్య. ౨, ఆ.

ఆహారము. సం. వి. అ. పుం. 1. భోజనము; 2. వంటకము; 3. అపహారణము.

ఆహారించు. సం. స. క్రి. ఆరగించు. "సీ. గ్రహణవేళలయందు రాహువాహారించితృప్తిమైగట్టునఁద్రేఁచేనేని." నై. ౨, ఆ.

ఆహార్యము. సం. వి. అ. పుం. హారాదిభూషణములచేఁగలిగెడి అభినయవిశేషము. (చూ. అభినయము.) విణ. తెచ్చుకోఁదగినది.

ఆహావము. సం. వి. అ. పుం. 1. పశువులు నీరుద్రావుటకై నూతియొద్ద ఏర్పఱచిన తొట్టి; 2. యుద్ధము.

ఆహికము. సం. వి. అ. పుం. 1. విడిచివిడిచి వంతుప్రకారమువచ్చెడు జ్వరము; 2. సుషిరవాద్యవిశేషము.

ఆహితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉంచఁబడినది; 2. చేయఁబడినది.

ఆహితాగ్ని. సం. వి. ఇ. పుం. అగ్నిహోత్రము నుంచుకొనియుండువాఁడు.

ఆహుతము. సం. విణ. (అ. ఆ. అ.) వేల్వఁబడినది.

ఆహుతి. సం. వి. ఇ. స్త్రీ. అగ్నియందువేల్చుట.

ఆహేయము. సం. విణ. (అ. ఆ. అ.) పాముది. (ఎముక, విషము. మొ.)

ఆహేరువు. సం. వి. ఉ. స్త్రీ. పిల్లపీఁచరకి.

ఆహోపురుషిక. సం. వి. అ. స్త్రీ. అహోపురుషిక.

ఆహ్నికము. సం. వి. అ. న. 1. పగలుచేయఁదగిన కర్మము; 2. ఆహారము; 3. ప్రకరణసమూహము. విణ. పగలుచేయఁదగినది.

ఆహ్లాదము. సం. వి. అ. పుం. సంతోషము, ఎలమి.

ఆహ్వా. సం. వి. ఆ. స్త్రీ. 1. పేరు; 2. పిలుపు.

ఆహ్వయము. సం. వి. అ. పుం. అభిధానము, పేరు.

ఆహ్వానము. సం. వి. అ. న. హూతి, పిలుపు.

ఆళి. సం. వి. ఇ. స్త్రీ. 1. పఙ్క్తి; 2. చెలికత్తె; 3. అడ్డకట్ట. న్. పుం. తేలు. విణ. ఇ. నిర్మలమయిన మనసుగలది.

ఆళిందము. సం. వి. అ. పుం. అళిందము.

ఆళుగ. దే. వి. (చూ.) (రూ.) ఆళువ.

ఆళువ. దే. వి. ముత్తెపుఁజిప్పలవంటి ముద్దచేతఁగప్పఁబడిన యొల్లయంగములుగల యొకవిధమైన పంది, శల్యకము. "ద్వి. కుందేలునుడుమునుగూర్మంబునేదుఁ, బందియాళువయునుభక్ష్యముల్ గాని, పంచనఖంబనిప్లవగంబుఁదినరు." సం. "శల్యకశ్శ్వావిధోగోధాశశకూర్మశ్చపంచమః." రా. కిష్కిం౦, కాం. (కొందఱు దీనిని నఖమృగమందురు.)

ఆళువరి. దే. వి. అలంగము, (రూ. ఆడువరి.)

ఆళువారు. దే. వి. హరిభక్తుఁడు. "గీ. అనినమాఱు పలుకనళికియయ్యాళువా, రియ్యకొనియెఁబోవ." ఆము. ౨, ఆ.

ఆళ్లకోస. దే. వి. ఒకదినుసుకాకి.

ఆళ్లు. దే. వి. బ. (అరుగ+లు.) ధాన్యవిశేషము, కోద్రవము.

ఆళ్వారు. దే. వి. ఆళువారుయొక్కరూపాంతరము. "శా. అంచత్ప్రేమవశంవదుండగుచు నాయాళ్వారిఁజేరంగర, మ్మంచుంబిల్చిమురారి." పర. ౪, ఆ.

## ఇ.

ఇ. ఒకయక్షరము.

ఇక్స్పెక్టరు. ఆం. వి. పైవిచారణచేయువాఁడు.

ఇంకు. దే. అ. క్రి. వట్టు, శోషిల్లు.

ఇంకుడు. దే. వి. ఇంకుట. విణ. 1. ఇంకినది; 2. ఎండినది. "సీ. ఇంకుడుచన్నులువంకచేతులుఁగడుపలమైనగానుగవంటినడుము." హరిశ్చ. ౪, ఆ.

ఇంగము. సం. వి. అ. పుం. 1. అభిప్రాయము; 2. ఆశ్చర్యము; 3. తెలివి. విణ. తిరుగునది.

ఇంగలము. వై. వి. నిప్పు. "క. వంగడపు వెదురుఁ గోపపు, టింగలమున నేర్చికనినయాసిరి." పాం డు. ౫, ఆ.

ఇంగాలము. ప్రా. వి. అ. పుం. బొగ్గు.

ఇంగితము. సం. వి. అ. న. 1. అభిప్రాయము; 2. బొమముడిలోనగువికారము.

ఇంగిలము. వై. వి. ఇంగలము. "గీ. కెరలునా కొని తూపుటింగిలమునందు." అచ్చ. సుం. కాం.

ఇంగిలాయి. దే. వి. మత్స్యవిశేషము.

ఇంగిలికము. వై. వి. రాగద్రవ్యవిశేషము, హింగుళము. "గీ. ప్రాగ్దిశాకాంతనిండుగర్భంబునందు, సూర్యుఁ డుదయింపఁ బొడ్డులుచొచ్చియుండ, మొవలఁదీంద్రింమశేఁతక్రొమ్ములకయొండ, నింగి యింగిలికాననభృంగమార్చ." కాశీ. ౧, ఆ.

ఇంగిలీకము. వై. వి. ఇంగిలికముయొక్క రూపాంతరము. "సీ. తరుణాంగుళీచ్ఛాయ దంతపుసర కట్టు లింగిలీకపువింతరంగులీన." స్వా. ౧, ఆ.

ఇంగుది. సం. వి. ఈ. స్త్రీ. గార?.

ఇంగువ. వై. వి. కూరలు మొదలగువానికుపయోగపడువస్తువు, హింగువు.

ఇంచిమంచి. దే. వి. ఏ. రుచిగలభక్ష్యము. "గీ. తనకు ననుకూలయగునొక్క దాసితోడ, మాలిమియొనర్చికొనియించిమంచిపెట్టి." శుక. 3, ఆ.

ఇంచు. యు. దే. అ. క్రి. 1. ఇంపగు; "క. నీ కర్ణములకునించునెట్లుకార్యవచనముల్." భార. ఉద్యో. ౨, ఆ.—2. మనోజ్ఞమగు. "ఎ, గీ. మెఱసితామేటివెన్నెలమిన్నయించె."(హరిశ్చంద్రకథయందు—ఎలమిఁ గానయించెననియు, నలకథయందు—మేటివెన్నెలమిన్న ఇంచెననియు భేదము.) హన. 3, ఆ.—స. క్రి. కోరు. "క. పల్వలలక్ష్మీజ్వల్యముగను, బులినమ్ములనించెలీల భూవరుఁడచటన్." (హరిశ్చంద్రకథయందు—నించెననియు, నలకథయందు — ఇంచెననియు భేదము.) హన. ౨, ఆ.—వై. వి. చెఱకు?.

ఇంచుఁబోఁడి ద్వి. వి. (ఇంచు+పోఁడి.) 1. చెఱకువలె మనోజ్ఞురాలగు ఆఁడుది; 2. ఆఁడుది; (చూ. అలరుఁబోఁడి.)

ఇంచుక. దే. అవ్య. కించిత్తు. (ఆమ్రేడితమునందు ఇంచించుక.)

ఇంచుపాలకడలి. ద్వి. వి. ఇక్షుసముద్రము.

ఇంచుమించు. ద్వి. వి. న్యూనాధిక్యము. "గీ. నలినలీలసంచునలినలిగావించు, నించుమించులాడునించుమించు, తేమనగవుచూపులు." విజ. ౧, ఆ.

ఇంచువిలుతుఁడు. ద్వి. వి. మన్మథుఁడు, ఇక్షుధన్వుఁడు, (రూ. ఇంచువిల్తుఁడు.) (ఇంచువిలుకాఁడనియు.)

ఇంజేటి. దే. వి. ఒకదినుసుకంద?. (ఈఁజేటియొక్క రూపాంతరము.)

ఇంటరము. దే. వి. ఇఱుకు, సంకటము. "ఒంటమింటరములువలుకుటుచితమే." భార. ఉద్యో. ౪, ఆ.

ఇంటికాఁపు. దే. వి. (ఇల్లు+కాఁపు.) గృహస్థుఁడు.

ఇంటిపట్టు. దే. వి. (ఇల్లు+పట్టు.) గృహస్థధర్మము. "సీ. పసుపునిగ్గులుదేఱుపాఁప జన్నిదమొప్పఁ బ్రమథాధిపతియింటిపట్టెటింగ." స్వా. ౧, ఆ.

ఇంటిపాప. దే. వి. (ఇల్లు+పాప.) వెలకుఁగొన్నదాని.

ఇంటియాతఁడు. దే. వి. (ఇల్లు+ఆతఁడు.) పెనిమిటి, భర్త, (రూ. ఇంటూతఁడు.)

ఇంటిల్లిపాది. దే. అవ్య. (ఇల్లు+ఇల్లు+పాది.) కుటుంబమువారందఱు.

ఇంట్రపడు. ద్వి. అ. క్రి. (ఇంట్రము+పడు.) సంకటపడు. "గీ. కడఁగికల్పాదిఁ గ్రమ్మఱఁగలుగఁజేయఁ, దనకసనిగాననట్లునొచ్చినజగముల, నోలిఁగంజోదరుండుని జోదరమున, నింట్రపడకుండఁగానిల్పె నెపములిచ్చి." హరి. ఉ. ౯, ఆ.

ఇంట్రము. దే. వి. ఇంటరముయొక్క రూపాంతరము. "గీ. ఎదురుగా నెగుదెంచుచో నింట్రమయ్యెఁ, దెండ్లియిరువంక చుట్టంపుఁబెద్దలకును." సై. ౬, ఆ.

ఇండె. దే. వి. 1. చీలిక, ఆస్ఫోటనము; 2. ఎముకకీలు.

ఇండెవాయు. దే. అ. క్రి. చీలు, ఆస్ఫోటితమగు.

ఇంత. ద్వి. స. (ఈ+అంత.) 1. ఈకొలఁది; "ఎ. గీ. నీయోగవిభవమింతయంతని పొగడనేనెంతదాన." కళా. ౨, ఆ.—2. ఇదియంతయు. "క. ఏనూరకయుండుదుఁదోడె, వ్వారికిఁబోనింతనిక్కువంబెబ్బంగిన్." భార. ఉద్యో. ౧, ఆ. (శబ్దముకంటెఁ బరమైన అ శబ్దముయొక్క అకారమునకువలె ఈలోనగు శబ్దములకంటెఁ బరమైన అంతలోనగు శబ్దములయొక్క అకా

మునకు లోపమని యెఱుంగునది. ఈకారము మొదలగువాని దీర్ఘమునకు హ్రస్వమగును.)("వ. సర్వలోకాభిగమ్యుండగునమ్మహానుభావునకుమన మభిగమ్యులమైతిమి. మనకింతకంటెను బెంపెయ్యది." ఇత్యాది స్థలములయందు ఇంతశబ్దము ఈయనుశబ్దముయొక్క అర్థము నిచ్చుచున్నది. "చ. కుంతియింతకుఁ బడుగయిపాలలోఁ బడినబల్లివిధంబుననుండకుండునే." ఇక్కడ ఇంతకుఁ అనఁగా ఇంతకాలమునకు అని యర్థము. చూ. అంత.)

ఇంతపట్టు. ద్వ. స. (ఇంత+పట్టు.) 1. ఇదియంతయు; "మ. జనకుండుఁ గురుభీష్ములుఁ దగినకర్జంబాపుత్రులెనీకుఁబ్రీతి నెఱింగించు తెలంగుగాదు తమబుద్ధింబోయిసంధానమిట్లొనరింజేయక యున్నఁగృష్ణునకునిన్నొప్పించువారింతపట్టునిజంబు." భార. ఉద్యో. 3, ఆ.— 2. ఇంతమాత్రము. "చ. అతులితవిష్ణుశక్తిసముపాహితమూర్తివిక్రమ్ములెమ్మసం, తతభుజశక్తినిట్టి యవధానమొనర్పఁగ నీవకానియీ, క్షితినొక రుండులేఁడధికకీర్తియుఁ బుణ్యముఁ జేరునిన్ను నూర్జితగుణయింతపట్టుతగఁ జేయుము కావుములోక మంతయుఁ." భార. అర. ౪, ఆ.

ఇంతి. వై. వి. ఆఁడుది, మగువ, వనిత.

ఇంతియ. ద్వ. స. (ఈ+అంతియ.) ఇంతమాత్రము. "మ. పెక్కండ్రకిం, తియకాలంబయియుండ నీమనముశాంతింబొందఁగా నేర్చునే." భార. ఉద్యో. ౪, ఆ. (చూ. ఇంత.)

ఇంతే. ద్వ. స. ఇంతియయొక్క రూపాంతరము. (రూ. ఇంతే.)

ఇందనుక. ద్వ. ద్ర. (ఇంత+దనుక.) ఇందాఁక.

ఇందము. దే. స. క్రి. ని. ఇదిగో తీసికొనుము. "జడలోరత్నమిందమనుచునిచ్చి." రామా. ౬, ఆ. (దీనికి బహువచనము ఇందండి. మొ.)

ఇందఱు. ద్వ. స. (ఇంత+వారు.) ఇంతశబ్దమునకు మహన్మహత్త్వార్థకబహువచనరూపము. వీరిందఱు. (ఈపురుషులందఱు. ఈస్త్రీలందఱు. ఈస్త్రీపురుషులందఱు.) 2. ఇంతసంఖ్యగలవారు.

ఇందాఁక. ద్వ. ద్ర. (ఇంత+దాఁక.) ఇంతపర్యంతము.

ఇంది. సం. వి. ఈ. స్త్రీ. ఇందిర, రమ, లక్ష్మి.

ఇందిందిరము. సం. వి. అ. పుం. భ్రమరము, తుమ్మెద.

ఇందిర. సం. వి. ఆ. స్త్రీ. రమ, లక్ష్మి.

ఇందీవరము. సం. వి. అ. న. 1. నల్లగలువ; 2. తామర.

ఇందీవరి. సం. వి. ఈ. స్త్రీ. పిల్లపీచర?.

ఇందు. దే. అ. క్రి. 1. అడఁగు; "ఇందనియీయాము చేఁబొదలు నేనుఁగులు." య. ౪, ఆ.—2. ఇముడు. ద్ర. ఇచ్చోట.

ఇందుఁడు. సం. వి. ఉ. పుం. చంద్రుఁడు, చందమామ.

ఇందుగు. దే. వి. చిల్ల, కతకము?. "ఎ. గీ. అందుగులు గేదఁగులుఁ మఱ్ఱులిందుగులును." అచ్చ. సుం, కాం. (దీనిగింజచేత నీళ్లు తేఱును.)

ఇందుప్పు. ద్వ. వి. (ఇందు+ఉప్పు.) సైంధవలవణము.

ఇందులకు. దే. ద్ర. 1. ఇచ్చోటికి; "ఇందులకిమ్మెయిఁ మనుజులెన్నఁడువత్తురు." భార. ఆది. ౬, ఆ.—2. దీనికి. "వ. ఇందులకుఁ బొందుపడుప్రత్యుత్తరంబుల వీనింగెలంకిన బుద్ధిక్షోభంబుగా నింతకంటె నే మేమియబద్ధంబులువినంబడుమె." ఆము. ౬, ఆ.

ఇందువారము. సం. వి. అ. పుం. సోమవారము.

ఇందువు. ఉభ. దే. వి. 1. చిల్లచెట్టు; "ఉ. ఇందువుగింజచేనుదక మెంతయు శీఘ్రముగం బ్రసన్నతఁ, జెందువిధంబునఁ." శివ. ఉ. ౨, ఆ.— 2. చిల్లగింజ. "సీ. రాగహీనతమనోగ్రంథిఁ ద్రెంపఁగ నీర్లకలఁకనిందువుడాచి తెలుచుభంగి." వాసి. 3, ఆ.—సం. ఉ. పుం. పలమెత్తువెండి.

ఇంద్ర. సం. వి. ఆ. స్త్రీ. మరునము?. అ. పుం. ము. ఒక గ్రహయోగము.

ఇంద్రకీలము. సం. వి. అ. పుం. మందరపర్వతము.

ఇంద్రకోశము. సం. వి. అ. పుం. మంచె.

ఇంద్రగోపము. సం. వి. అ. పుం. ఆరుద్రపురుగు.

ఇంద్రజాలము. సం. వి. అ. పుం. కనుకట్టువిద్య.

ఇంద్రజాలికుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రజాలము చేయువాఁడు.

ఇంద్రతూలము. సం. వి. అ. న. దూదిప్రోవు.

ఇంద్రద్రువు. సం. వి. ఉ. పుం. ఏఱుమద్ది?.

ఇంద్రనీలము. సం. వి. అ. పుం. నీలమణి, నల్లరాయి.

ఇంద్రయవము. సం. వి. అ. న. కొడిసెకాయ.

ఇంద్రలుప్తకము. సం. వి. అ. న. బట్టతల.

ఇంద్రలుప్తకుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) బట్టతలవాఁడు.

ఇంద్రవల్లి. సం. వి. ఈ. స్త్రీ. ఇల్లిందరి?.

**ఇంద్రవారుణి.** సం. వి. ఈ. స్త్రీ. పెద్దపాఁపరకాయ.

**ఇంద్రసురసము.** సం. వి. అ. పుం. వావిలి.

**ఇంద్రాణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఇంద్రునిభార్య; 2. ఒక మాతృక; (చూ. మాతృక.) 3. వావిలి.

**ఇంద్రాయుధము.** సం. వి. అ. న. మేఘములందు నానావర్ణమై ప్రతిఫలించుచు ధనురాకారముగాఁ గానఁబడెడి సూర్యకిరణము, రతనపువిల్లు.

**ఇంద్రారి.** సం. వి. ఇ. పుం. అసురుఁడు, వేల్పుదాయ.

**ఇంద్రావరజుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు.

**ఇంద్రియము.** సం. వి. అ. న. 1. త్వగాది; (ఇవి పది.—త్వక్కు, చక్షువు, శ్రోత్రము, జిహ్వ, ఘ్రాణము; (ఇవి జ్ఞానేంద్రియములు.) వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థము. (ఇవి కర్మేంద్రియములు.) మనస్సుతోడంగూడ ఏకాదశేంద్రియములనంబడు.) 2. రేతస్సు.

**ఇంద్రియార్థము.** సం. వి. అ. పుం. శబ్దాదివిషయము. (ఇవి యైదు.—శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము.)

**ఇంద్రుఁడు.** సం. వి. అ. పుం. 1. వేల్పుఱేఁడు; 2. ఒక ఆదిత్యుఁడు; (చూ. ఆదిత్యుఁడు.) 3. అంతరాత్మ.

**ఇంధనము.** సం. వి. అ. న. 1. చిదుగు; 2. వంటచెఱకు.

**ఇంపితము.** దే. విశే. (ఇంపు+ఇతము.) ఇంపైనది. (ఇది పోరితమువంటిది.)

**ఇంపు.** దే. వి. 1. ఆనందము; "ఆయింపే పరబ్రహ్మము." స్వా. ౨, ఆ. 2. ఇచ్ఛ. "ఉ. ఓ నితంబిని సుగంధి పటాభరణాదికంబునీ, నెమ్మది కించెనోయనుదు నేఁడయినం బరికించితౌరనా, నెమ్మదియింపుగింపునని నీరజలోచనపల్కెవెండియుఁ." పర. 3, ఆ.—విశే. ఇష్టము. "క. అనిందితచరితము లెనుమ్ము నీమదికింపుల్." కళా. ౭. ఆ.

**ఇంబు.** దే. వి. ఇంపుయొక్క రూపాంతరము. "ఉ. ఇంబడరంగ నియ్యకొని యొక రజనీచరుఁ డేమి భాగ్యమో, యంబుజనాభ." ప్రభా. ౧, ఆ.

**ఇఁక.** దే. క్రి. 1. ఇతఃపరము; 2. మఱియు. "ఇమ్మునీశ్వరుసామర్థ్యమునింకఁజెప్పెద." రా. అర. ౧, ఆ.

**ఇఁగ.** దే. క్రి. ఇఁకయొక్క రూపాంతరము.

**ఇక్క.** దే. వి. 1. స్థానము; "క. ఎయ్యది సుఖములకు నిక్కయేర్పడఁజెప్పుమా." భార. అర. ౭ ఆ.—2. ఇల్లు.

**ఇక్కట్టు.** దే. వి. (ఇక్కు+కట్టు.) ఇక్కుపాటు సంకటము. (ఇక్కు ఇఱుకుయొక్క మాఱురూపమని తెలియవలెను.)

**ఇక్కడ.** దే. వి. ఏ. (ఈ+కడ.) ఈచోటు. (చూ. అక్కడ.)

**ఇక్కము.** దే. వి. ఇఱుకటముయొక్క రూపాంతరము. "ఉ. ఎక్కడివాఁడవన్న కడు నిక్కపుఁ గాఱడ వింజరించెదు." ఉ, హరి. ౨, ఆ.

**ఇక్కుపాటు.** దే. వి. (ఇఱుకు+పాటు.) ఇక్కట్టు. "ద్వి. అక్కటా పుణ్యాత్ముఁడైన నీకిట్టి, యిక్కుపాటునుగల్గె నేతంత్రీయనుచు." రా. సుం, కాం.

**ఇక్కువ.** దే. వి. 1. ఉనికి; "ఎచ్చటఁగంటిరో విజయునిక్కువ నిక్కువమానె." విజ. ౨, ఆ. "క. చక్కరవిలుకాఁడొకఁడే, నొక్కఁడెఁడ ద్వైరులము వియోగవ్యధచే, నక్కడ నెపాలియుఁబోలియక, యిక్కువనిటవచ్చె నేనియిక్కడఁబోలియుఁ." (ఇక్కువన్—ఇక్కడ జీవముతోననియర్థము.) రామా. ౬, ఆ.—2. జాడ; "ద్వి. ఇటుచెల్లుమాటలయిక్కువలెఱిఁగి." రా. యు, కాం.—3. కళాస్థానము; "ఇక్కువలంటి." నీలా. 3, ఆ.—4. స్థానము. "క. దిక్కులనెల్లఁబొగడ్తకు, నెక్కినయక్కజపుఁగడిమి నేపారెడుమీ, రిక్కడనుండియు మీమీ, యిక్కువలకుఁజనుఁడుదాన వేశ్వరులారా." రా. యు, కాం.

**ఇక్షుగంధ.** సం. వి. ఆ. స్త్రీ. 1. గొలిమిడి; 2. తెల్లనేలగుమ్మడి; 3. పల్లేరు; 4. రెల్లు.

**ఇక్షుధన్వుఁడు.** సం. వి. న్. పుం. మన్మథుఁడు. ఇంచువిల్తుఁడు.

**ఇక్షునాళిక.** సం. వి. ఆ. స్త్రీ. నల్లచెఱకు.

**ఇక్షురము.** సం. వి. అ. పుం. ములుగొలిమిడి.

**ఇక్షువణము.** సం. వి. అ. న. చెఱకుతోఁట.

**ఇక్షువు.** సం. వి. ఉ. పుం. ఇంచు, చెఱకు. (దీని భేదములు.—పుండ్రము, కాంతారము, శతపర్వము, బంగాళము, నేపాళము. మొ.)

**ఇక్షుశాకటము.** సం. వి. అ. న. చెఱకుపండెడు పొలము.

**ఇక్షూదము.** సం. వి. అ. పుం. చెఱకుసముద్రము.

ఇక్ష్వాకువు. సం. వి. ఉ. స్త్రీ. చేఁదుసొరకాయ. పుం. సూర్యవంశపురాజులలో నొకఁడు.

ఇగము. వై. వి. ఇవము, శైత్యము*.

ఇగిరించు. దే. అ. క్రి. 1. చిగిరించు; 2. ఎఱ్ఱనగు. "అమమాఁడలిగి మొగమిగిరింపన్." య. 3, ఆ.

ఇగిరిక. దే. వి. హవిస్సు.

ఇగిలించు. దే. స. క్రి. పండ్లను వెలిపఱచు.

ఇగిలింత. దే. వి. ఇగిలించుట.

ఇగురుఁబోఁడి. దే. వి. స్త్రీ. 1. చిగురువలెమనోజ్ఞురాలగు ఆఁడుది; 2. ఆఁడుది. (చూ. అలరుఁబోఁడి.)

ఇగురు. దే. అ. క్రి. ఇంకు. వి. 1. చిగురు; 2. పండ్లచుట్టునుండుకండ.

ఇగురుకొను. దే. అ. క్రి. చిగిరించు, పల్లవించు.

ఇగురుచు. దే. అ. క్రి. చిగిరించు, (రూ. ఇగుర్చు.)

ఇగురొత్తు. దే. అ. క్రి. 1. చిగిరించు; 2. అనురక్తమగు. "వెడనవ్వునఁ బ్రియుచిత్తంబిగురొత్త." భార. ఆర. ౭, ఆ.

ఇగులుచు. దే. స. క్రి. ఇగిలించు, (రూ. ఇగుల్చు.)

ఇగో. దే. ద్ర. ఇదిగోయొక్క రూపాంతరము. "వీఁడిగో గుజ్జుపుదొంగవచ్చె." జై. 3, ఆ.

ఇగ్గు. దే. అ. క్రి. వెనుకకొఱగు. (ఈగుయొక్క రూపాంతరము.) (ఇగ్గ మ్రొగ్గనీడ్చెను.) "ఉ. ఇగ్గెడు వెన్కకుంబయికినీడ్చినఁబైఁటఁ దోఁగఁ జేయఁగే, లొగ్గెడు." (ఇక్కడ ఒఱగుటమాత్రము అర్థము.) విజ. ౨, ఆ.

ఇగ్గులాట. దే. వి. ఇగ్గులాడుట.

ఇగ్గులాడు. దే. స. క్రి. వెనుకకీడ్చు. "చిరంగతినిగ్గులాడకువెసిగ్గ." రస. 3, గుచ్ఛము.

ఇగ్రుచు. దే. అ. క్రి. ఇగురుచుయొక్క రూపాంతరము. "ఎ, గీ. ఇగ్రుచుకోర్కులఁదన డెందమివతళింప." కవిక. 3, ఆ.

ఇచ్చిపుచ్చుకోలు. దే. వి. ఇచ్చిపుచ్చుకొనుట.

ఇచటు. దే. వి. ఏ. ఇచ్చోటుయొక్క రూపాంతరము.

ఇచోటు. దే. వి. ఏ.——పై.——

ఇచ్చ. వై. వి. 1. ఇచ్ఛ; 2. చిత్తము*; "అనితనమాటకిచ్చకొనుసన్నరుపల్కులకిచ్చమెచ్చి." భార. మహా. ౧, ఆ. — 3. యదృచ్ఛ*. "క. ఎచ్చోటనున్నవాఁడతఁ, డిచ్చోటికిసేలరాఁడొ యిప్పుడనుడుఁదా, నచ్చటనంతరిత్తుఁడై, యిచ్చఁ జనియెఁదోఁచు నేటియెల్లిటిలోనన్." భార. విరా. ౫, ఆ.—విణ. అభీష్టము*. "క. సన్నిధిఁ బన్నగహారుఁడు, పెన్నిధిఁగనిపొంగుచున్న పేదలక్రియన, య్యన్నాదమ్ములఁగనిమి, కెన్నఁగ నేవరములిచ్చియిచ్చెదవానిన్." ఉ, హరి. ౪, ఆ.

ఇచ్చకము. వై. వి. ప్రియవచనము*. విణ. ప్రియము*. "ఎట్లిచ్చకమయ్యెనీకునివి." కాశి. ౨, ఆ.

ఇచ్చకుఁడు. వై. విణ. ఇచ్చకములాడువాఁడు*. "గీ. అప్పుడిచ్చకులగుచు బ్రాహ్మణులుకొండఱు." ఆము. ౪, ఆ.

ఇచ్చగించు. వై. స. క్రి. 1. ఇచ్ఛయించు; 2. అంగీకరించు*. "ఉ. నాతలపిచ్చగింపుమనినన్ బ్రభుఁడించుకయియ్యకోలునన్." హరి. ఉ. ౭, ఆ.

ఇచ్చగింత. వై. వి. ఇయ్యకోలు, అంగీకారము.

ఇచ్చగొండి. వై. విణ. ఇచ్చకములాడువాఁడు. "సీ. ఇచ్చగొండులకిచ్చియీయచ్చమల్లులకిచ్చివారకయుబ్బించువారికిచ్చి." విక్ర. ౭, ఆ.

ఇచ్చటు. దే. వి. ఏ. ఇచ్చోటుయొక్క రూపాంతరము.

ఇచ్చు. దే. స. క్రి. ఇడు, ఒసఁగు, దానముచేయు.

ఇచ్చోటు. దే. వి ఏ. (ఈ+చోటు.) ఈస్థానము. (రూ. ఇచోటు.)

ఇచ్ఛ. సం. వి. ఆ. స్త్రీ. కాంక్ష, వాంఛ, ఇచ్చ.

ఇచ్ఛావతి. సం. వి. ఈ. స్త్రీ. సంభోగము తక్కతక్కినవిషయములందు ఇచ్ఛగలస్త్రీ, కాముక.

ఇజాఫా. హిం. వి. వృద్ధి, ఎక్కువ.

ఇజారా. హిం. వి. గుత్త.

ఇజారు. హిం. వి. కాళ్లకు తొడిఁగికొను లాగు.

ఇజుకు. దే. వి. 1. శ్రమము; 2. సంకటము.

ఇజ్జలము. సం. వి. అ. పుం. ఎఱ్ఱగన్నేరు.

ఇజ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. పూజ; 2. ఈవి; 3. యజ్ఞము; 4. సంగమము; 5. కుంటెనకత్తె.

ఇజ్యుఁడు. సం. వి. అ. పుం. బృహస్పతి. విణ. గురువు.

ఇట. దే. వి. ఏ. ఇక్కడ. "వాఁడిటవచ్చువాఁడొయేనందులకేగుదాననో." భార. అర. ౨. ఆ. (చూ. అట.)—ద్ర. ఈవల.

ఇటఁబట్టి. దే. అవ్య. ఇదిమొదలుకొని. "క. దివముకాని యింక భువనంబులందిటఁ, బట్టిరాత్రిలేని యట్టుగాఁగఁ జేసెనొక్క విధి." భార. విరా. ౨, ఆ.

ఇటిక. వై. వి. బంకమట్టితోఁజేసి కాలవేసినఱాయి.

ఇటికపగడము. వై. వి. మట్టిపగడము, తిక్కణిక.

ఇటు. దే. అవ్య. ఇట్లు. "ఉ. ఊహయొనర్పరోయతిశదోక్తులవర్ణనలందునిట్టియు, వ్యాహతిసెల్లునంచు నొయిటాడితిరి." కళా. ౧, ఆ.

ఇటులు. దే. అవ్య.——పై.——

**ఇటువంటి.** దే. విశే. ఇట్టి. "కాగాదిటువంటిపల్కనక." కళా. ౩, ఆ.

**ఇటువలె.** దే. క్రి. ఇట్లు. "ఇటువలెవెదకియు." రామా. ౬, ఆ. (చూ. అటమట.)

**ఇట్వరము.** సం. వి. అ. పుం. షండము, ఆఁబోతు.

**ఇట్టలము.** దే. విశే. అగ్గలము, అధికము. "ఇట్టలపురయంబునంబొదివిడాసె." భార. విరా. ౩, ఆ. "క. ఇట్టలముగఁదగిలినట్టి యొఱ్ఱులువోలెన్." స్వా. ౪, ఆ.

**ఇట్టి.** దే. విశే. ఇటువంటి.

**ఇట్టిఁడు.** దే. విశే. (ఇట్టి+వాఁడు.) ఇటువంటివాఁడు. "గీ. ఎఱుఁగమేమేవురము నతండిట్టిఁడగుట." భార. శాం. ౧, ఆ. (బ-ఇట్టిరు.)

**ఇట్టిక.** వై. వి. ఇటికఱాయి.

**ఇట్టు.** దే. అవ్య. ఇట్లు.

**ఇట్టులు.** దే. అవ్య.——పై.——

**ఇట్టువోలె.** దే. క్రి.—పై.—"చ. ననుఁగనియొండుసత్వముమనంబునబెగ్గిలిడాయునప్పుడి, మ్మునివరుఁడిట్టువోలెఁగృపమొక్కలమై శరభంబుగాఁగఁజేయునో." భార. శాం. ౩, ఆ.

**ఇట్లు.** దే. అవ్య. 1. ఈప్రకారము; 2. ఇఁకమీఁదఁజెప్పఁబోవు ప్రకారము. "ధర్మజునకు రోమశుండిట్లనియె."

**ఇడ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకనాడి; (చూ. నాడి.) 2. నేల; 3. యజ్ఞమునందలి భక్షణపాత్రము; 4. బుధగ్రహముపెండ్లాము; 5. మాట; 6. ఆవు.

**ఇడి.** దే. వి. ఒకతూరియావిరిని ఒకతూరియెసటను వండినపిండిని తామరనూలిపోఁగంత సన్నముగా యంత్రమునఁబిండెడు భక్ష్యవిశేషము, సేవియ. "వ. బుడుకులునడుకులు నిడియుఁ జలిమిడియును." కాశీ. ౭, ఆ.

**ఇడికుడక.** దే. వి. భక్ష్యవిశేషము. "వ. ఏలకికాయలువెన్నమెఱుఁగులునిడికుడకలునడికుడకలు." హంస. ౧, ఆ.

**ఇడిక్కము.** సం. వి. అ. పుం. ఏడకము, పొట్టేలు.

**ఇడియు.** దే. అ. క్రి. చీలు, ఛేదిల్లు. "సీ. మారుతాహతిరాలునారికేళఫలాళి నిడిసిజల్లించుపుండ్రేక్షురసము." పాండు. ౧, ఆ. "సీ. ఇదిచిల్కపోటులనిడియుదాడిమ ఫలంబులజాలురసము చాల్ పారలువాఁక." చంద్ర.

**ఇడు.** దే. స. క్రి. 1. ఇచ్చు; 2. ఉనుచు.

**ఇడుగడ.** దే. వి. 1. అసూయ; "చ. తడయకమ్రొక్కియున్నవినతానుతునప్పుడునూచియాత్మలో, నిడుగడసేయుచున్ గడుసహింపక." భార. ఆది. ౨, ఆ.—2. హీనత్వము. "చ. వెడలఁగనీకగొందినిడి వేయివిధంబుల భంగపెట్టుచున్, జడకలుకట్టనిచ్చినిజసంపదకుంజొరనీక నిచ్చలుం, గడియెుఁడుకూడువెట్టుచును గాసియొనర్చుచు నేలతెంకిమై, నిడుగడసేయఁగావలయు నీలువుమాలినఱంకుటాండ్రకున్." విజ్ఞా. ఆచా, కాం. (ఇది విచారింపఁదగినది.)

**ఇడుపు.** దే. వి. 1. చీలిక; "ఇడిసిన యిడుపుల యెడల." ఆము. ౬, ఆ. — 2. గోడయిరుపార్శ్వముల మీఁదిచోటు. "గీ. దారువనవీధి శీతాంశుధరునిరంతు, శౌరిగోపాలకామినీచార్యకేళి, కామరసభావములుమించి కానఁబడఁగఁ దీర్చియిడుపులయందుఁజిత్రించినారు." నై. ౭, ఆ.

**ఇడుమ.** దే. వి. 1. ఆపద; "గీ. మగువఁగోల్పోయి కడునిడుమలఁగలంగు." అచ్చ. సుం, కాం.-- 2. అలసట, క్లేశము. "గీ. విప్రవరులుభోగములకువేడ్కసేయ, రిడుమలిహమునఁబడికాతురెలమిఁబరము,నందుసుఖము." మార్క. ౪, ఆ.

**ఇడుమపాటు.** దే. వి. ఇడుమపడుట.

**ఇడ్డెన.** దే. వి. వాసినకుడుము.

**ఇతఁడు.** దే. స. ఏ. ఈపూజ్యుఁడు. (ఈతఁడు యొక్కరూపాంతరము.)

**ఇతఃపరము.** సం. క్రి. విశే. అ. న. ఇఁకమీఁద.

**ఇతకరి.** వై. విశే. హితమైనది. "వ. ఇతకరిమాటలమొత్తంబులవారలచిత్తంబులును గలంచె." భార. అను. ౧, ఆ.

**ఇతము.** ఉభ. వై. విశే. హితము. "ఎ. గీ. పలుపలుకులేలయింకనాచెలుఁలుఁగిలుఁలు, నేగుదెంచి విఘ్నమొనర్తు రితమెఱుఁగక." (ఇతము—ఇతమైనకార్యమని యర్థము.) కళా. ౩, ఆ.—సం. (అ. ఆ. అ.) 1. తలఁపఁబడినది; 2. పొందఁబడినది.

**ఇతరుఁడు.** సం. స. (అ. ఆ. అ.) అన్యుఁడు. విశే. అధముఁడు.

**ఇతరేతరము.** సం. స. (అ. ఆ. అ.) పరస్పరము, ఒండొకటి.

**ఇతవరి.** వై. విశే. (ఇతవు+అరి.) హితముచెప్పువాఁడు.

ఇతవు. వై. విణ. హితము. "క. పితృపూజనమని యెవ్వరి, కితవుగఁజేయుదురుదీని సెఱిఁగింపు శివా." భార. అను. ౫, ఆ.

ఇతవుఁడు. వై. విణ. హితుఁడు. "చ. ఇట్టివారిత వులుతండ్రికిఁ సుతుల కేమన నేర్తుము పెద్ద రాజులన్." భార. ఉద్యో. ౪, ఆ.

ఇతికర్తవ్యత. సం. వి. ఆ. స్త్రీ. ఇట్లు చేయఁదగినదనుట.

ఇతిహాసము. సం. వి. అ. పుం. తొల్లిటికథ.

ఇత్తడి. వై. వి. ఒకలోహము, (చూ. లోహము.) (రూ. ఇత్తళి.)

ఇత్తిగ. ద్వ. వి. (ఇరు + తిగ.) పాచికలమీఁదమూఁడుబొట్లజత, దుందుభి.

ఇత్త్రాలము. సం. వి. అ. న. కరబుజము?.

ఇత్వరము. సం. వి. అ. పుం. ఇట్చరము, ఆఁబోతు.

ఇత్వరి. సం. వి. ఈ. స్త్రీ. అసతి, అంకుటాలు.

ఇత్వరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. దరిద్రుఁడు; 2. నీచుఁడు; 3. క్రూరకర్ముఁడు; 4. బాటసారి.

ఇది. దే. స. ఈ శబ్దమునకు అమహదర్థక ప్రథమైక వచనము, ఈయది. (ఈ యాఁడుది. ఈ పశ్వాదు. ఈ జడవస్తువు.) (చూ. ఈ.)

ఇదిగో. దే. ద్ర. (ఇది+కొమ్ము.) చూపుటను తెలిపెడిని. (రూ. ఇదిగో. "క. పూఁబోఁడియొరసికొనిచనఁ, గాఁబయ్యెదయొడిసిపట్టెఁ గనుఁగొం కెచెలీ, లేఁబొన్న నుబలి రాయిది, గోఁబురుహాహ్వాయము నిలుపుకొను సముచుంబుగన్." కళా. ౧, ఆ.)

ఇద్దఱు. దే. స. రెండుశబ్దమునకు మహన్మహత్యర్థక బహువచనాదేశము, ఇరువురు.

ఇద్ది. దే. స. ఇదియొక్క రూపాంతరము.

ఇద్దుగ. ద్వ. వి. (ఇరు+దుగ.) పాచికమీఁది రెండు బొట్లజత. "క. అత్తిచంచిత్తిగదుగ, సత్తాదచౌక పంచచౌవంచీరై, దిత్తిగయద్దుగబద్రలు, చిత్తంబు నదలఁచినట్లు చేతికిఁదెచ్చున్." ఉ. హరి. ౩, ఆ.

ఇద్దుము. దే. వి. (ఇరు+తూము.) రెండుతూములు.

ఇద్ధము. సం. వి. అ. పుం. ప్రకాశము. విణ. 1. పరిశుద్ధము; 2. ప్రకాశితము.

ఇధ్మము. సం. వి. అ. న. 1. చిదుగు; 2. వంటచెఱకు.

ఇనాం, ఈనాం. హిం. వి. బహుమతి, మాన్యము.

ఇని. ద్వ. స. ఏ. ఇన్నియొక్క రూపాంతరము.

ఇను. దే. స. వృత్తియందు హల్లుపరమగుచో రెంటికాదేశముగావచ్చునది. (ఇనుమడి, ఇనుమాఱు. మొ.)

ఇనుఁడు. సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. రాజు; 3. మగఁడు.

ఇనుకు. దే. వి. బొంతుచేతఁగప్పఁబడినయల్పధాన్యము. "ఎ, గీ. తుషయుక్తములగునల్పధాన్యములు చింక యినుకనఁదగుమహేశ." ఆం, భా. ద్వి. వై.

ఇనుమడి. దే. వి. (ఇను+మడుఁగు.) రెట్టి, ద్విగుణము.

ఇనుమడించు. దే. స. క్రి. రెట్టించు, ద్విగుణించు.

ఇనుమద్ది. దే. వి. (ఇనుము+మద్ది.) నల్లమద్ది, అశ్వకర్ణకము?.

ఇనుమనుమఁడు. దే. వి. మనుమనికొడుకు. ప్రపౌత్రుఁడు.

ఇనుమిక్కిలి. దే. విణ. అత్యధికము.

ఇనుము. దే. వి. ఒకలోహము, (చూ. లోహము.) కాలాయసము.

ఇన్ని. ద్వ. స. ఏ. (ఇంతశబ్దమునకు అమహదర్థక బహువచనాదేశము.) 1. ఈసమస్తము; 2. ఇంత సంఖ్యకలవి.

ఇన్నూఱు. దే. స. (ఇరు+నూఱు.) రెండునూఱులు.

ఇన్మడి. దే. వి. ఇనుమడియొక్క రూపాంతరము.

ఇన్మడించు. దే. స. క్రి. ఇనుమడించుయొక్క రూపాంతరము.

ఇన్సాల్వెంటు. ఆం. వి. దివాలాతీయుట.

ఇపుడు. ద్వ. వి. ఏ. ఇప్పుడుయొక్క రూపాంతరము.

ఇపుడు. ద్వ. వి. ఏ. ఇపుడుయొక్క రూపాంతరము. (చూ. ఇప్పుడు.)

ఇప్ప. దే. వి. మధూకము?.

ఇప్పపూరాజనములు. దే. వి. బ. శాలిధాన్యవిశేషము.

ఇప్పుడు. దే. వి. ఏ. (ఈ+ప్రొద్దు.) ఈకాలము.

ఇబ్బంది. ద్వ. వి. (ఇను+బంది.) మిక్కిలి నిర్బంధము.

ఇబ్బంది. దే. వి. (ఇరు+పంది.) అడవిపందికిని ఊరఁబందికిని పుట్టినపంది. (సంధిని పకారమునకు బకారము. ఇది డెబ్బదిలోనగువానివంటిది.)

ఇబ్బందిగాఁడు. దే. వి. (ఇబ్బంది+కాఁడు.) బెబ్బులికిని చిఱుతపులికిని పుట్టినపులి.

ఇబ్బడి. ద్వ. వి. ఇనుమడియొక్క రూపాంతరము.

ఇబ్బడించు. దే. స. క్రి. ఇమ్మడించుయొక్క రూపాంతరము.

ఇబ్బెడ. దే. వి. వృక్షవిశేషము. (హంస. ౪, ఆ.)

ఇభనిమీలిక. సం. వి. ఆ. స్త్రీ. చాతుర్యము, నేర్పు.

ఇభము. సం. వి. అ. పుం. ద్విపము, ఏనుఁగు.

**ఇభ్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. అందుగు?; 2. ఆఁడే నుఁగు. విణ. ఒడయురాలు.

**ఇమిడిక.** దే. వి. 1. అడకము; 2. పొందిక.

**ఇముడు.** దే. అ. క్రి. 1. అడఁగు; 2. పొందుపడు.

**ఇముడుకొను.** దే. అం, ప్రే. ఇముడ్చుకొను. "గీ. గర్భమందుకమలగర్భాండశతముల, నిముడుకొనినటించునీశ్వరేశ." భాగ. ౧, స్కం. "క. ఆభయార్తమ్మృగాక్షిన్, దావెనుక నిముడుకొనుచున్, గావుముకావుమనివాని కరములుపట్టెన్." కళా. 3, ఆ.

**ఇముడుచే.** దే. ప్రే. ఇముడఁజేయు. (రూ. ఇముడ్చు.)

**ఇమ్మడి.** దే. వి. ఇనుమడియొక్క రూపాంతరము.

**ఇమ్మడించు.** దే. స. క్రి. ఇనుమడించుయొక్క రూపాంతరము.

**ఇమ్ము.** దే. వి. 1. స్థానము; "ఎ, గీ. అతులధైర్యంబునకు నీమహాత్ముఁడిమ్ము." ఉ, రా. ౫, ఆ.—2. విరివి; "చ. వినుమిటులున్న యీజనుల విప్పుగనుంగొనవచ్చినంబురం, బునకిచటిమ్ముచాలదను బుద్ధిజనించెగణించిచూడుమా." హరి. ఉ. ౨, ఆ.—3. ఆనుకూల్యము; "క. తనకిమ్మగునంత కుదు, ర్జనుఁడిష్టుఁడపోలెనుండి సర్పమువోలెన్, దనకిమ్మగుడునుగఱచును, ఘనదారుణకర్మగరళఘనదంష్ట్రలచేన్." భార. ఆది. ౬, ఆ.-4. ఇంపు; "క. విదితంబైయుద్యోగము, మొదలుగఁబదునొక్కపర్వములనెంతయునో, ప్పిదమైయేనవపర్వంబు, బిదినా నుద్యోగపర్వమిమ్మగుసభలన్." భార. ఆది. ౧, ఆ.—5. ఉపాయము; "క. నెమ్మిగలవారినెల్లరు, తమ్మొల్లనివారివెనుకఁ దగులుదురధిక, త్వమ్మెఱఁగియెఱఁగితోడరుదు, రిమ్మెఱుఁగనియట్టివారలిభపురనాథా." భార. ఉద్యో. ౨, ఆ.—6. సుఖము. "ఇమ్ములనున్నవాఁడెహరి." భాగ. ౧౦, స్కం. పూ. (ఈ యర్థమందు ఇది తఱచుగా ద్వితీయా బహువచనాంతముగానే ప్రయోగములయందుఁ గానఁబడుచున్నది.)— విణ. 1. అనుకూలము; "గీ. ఎత్తికొనిచనంగనిమ్మగునట్లుగా, మెదలుచున్న ప్రయ్యలదిమిరెంటిఁ, గూడఁబెట్టె." భార. సభా. ౧, ఆ.--2. అమూలము; "వ. విచారపూర్వారబ్ధకార్యంబునకుదైవంబుననుకూలంబగుం గావుననిమ్ముగావిచారింపవలయు." భార. అర. ౧, ఆ.—3. మనోజ్ఞము; "వ. సూపకారుండు వధ్యస్థానంబునకుంజనిమనుష్యమాంసంబుఁదెచ్చియిమ్ముగావండిపెట్టిన." భార. ఆది. ౭, ఆ.—4. యుక్తము; "వ. ఇమ్మగునవసరంబునఁదద్గృహద్వారంబునందు ఘోరానలంబుదరికొల్పి." భార. ఆది. ౬, ఆ.—5. స్పష్టము. "గీ. వృక్షశాఖాగ్రముననున్న పక్షిశిరము, తెల్లముగఁజూచితేమహీవల్లభుండ, యనిననిమ్ముగఁ జూచితిననినవెండి, యునుగురుఁడు ధర్మజునకిట్టులనియెఁబ్రీతి." భార. ఆది. ౫, ఆ.

**ఇమ్ముకొను.** దే. అ. క్రి. వసించు. "సీ. అవ్వీర్యకలితుఁడాశత్రులయమ్మనాకులవృత్తి నిమ్ముకొనఁగఁ జేసె." రాఘ. ౨, ఆ.

**ఇమ్ముదప్పు.** దే. వి. (ఇమ్ము+తప్పు.) ఇక్కట్టు, సంకటము.

**ఇయత్త.** సం. వి. ఆ. స్త్రీ. కొలఁది.

**ఇయ్య.** వై. వి. ఈయయొక్క రూపాంతరము. (దీనికి ప్రత్యేకప్రయోగము కనఁబడదు. చూ. ఇయ్యకొను, ఇయ్యసేయు. మొ.)

**ఇయ్యకొను.** ద్వ. స. క్రి. ఈయకొనుయొక్క రూపాంతరము.

**ఇయ్యకోలు.** ద్వ. వి. అంగీకారము. "విచారవిమూఢునకైన నీవుపల్కినపలుకియ్యకోలగునె." భో. ౮, ఆ. (ఈయకోలుయొక్క రూపాంతరము.)

**ఇయ్యది.** దే. స. ఈయదియొక్క రూపాంతరము.

**ఇయ్యసేయు.** వై. అ. క్రి. (ఇయ్య+చేయు.) సమ్మతించు. (రాజ. 3, ఆ.)

**ఇర.** సం. వి. ఆ. స్త్రీ. 1. కల్లు; 2. నీళ్లు; 3. నేల; 4. మాట; 5. మేర.

**ఇరమ్మదము.** సం. వి. అ. పుం. మేఘమునందలియగ్ని.

**ఇరవారు.** దే. అ. క్రి. (ఇరవు+ఆరు.) స్థిరపడు.

**ఇరవు.** దే. వి. స్థానము. విణ. స్థిరము. "క. ఇరవుగసిద్ధించుననఘుయిహపరసుఖముల్." భార. అర. ౮, ఆ. (ఇది అకారమధ్యముగాఁజెప్పుటకు సరియైన ప్రయోగముకనఁబడలేదు. అయినను తఱచువాడుకనుబట్టి యిట్లు వ్రాయఁబడియెను. చూ. ఇరువు.)

**ఇరవుకొను.** దే.అ. క్రి. 1. నెలకొను; 2. స్థిరపడు.

**ఇరవుపడు.** ద్వ. అ. క్రి. ఇరవుకొను.

**ఇరసాలు, ఇరుసాలు.** హిం. వి. ప్రభుత్వమువారిసొమ్ము పంపుట.

**ఇరసాలునామా.** హిం. వి. పంపఁబడిన రూకలపట్టి.

ఇరాఱు. దే. స. ఈరాఱుయొక్క రూపాంతరము. "ఉ. ఆనగరంబుత్రోవను దినాధిపుఁడేగుచు దారికడ్డమై, పూనికనున్న కోటఁగనిపోవఁగలేక యిరాఱుమేసఁగన్, దానటుదిడ్డుదూఱి చనెద ధ్యముగాదనియంటిరేనియా, భానునిద్వాదశాత్ముఁడని పల్కఁగఁగారణమేమినిచ్చలున్." రుక్మి. ౧, ఆ. (వీనికి ఇతరగ్రంథములందుఁ బ్రయోగము గానఁబడలేదు.)

ఇరింగణము. సం. వి. అ. పుం. పడిగాలి.

ఇరిణము. సం. విశే. (అ. ఆ. అ.) 1. చవుటిది (నేల); 2. పాడైనది. (రూ. ఈరిణము.)

ఇరివిలి. దే. వి. పోఁగరతోఁజేయఁబడిన రంధ్రము.

ఇరు. దే. స. వృత్తియందు హల్లుపరమగుచో రెంటికాదేశముగావచ్చునది. (ఉదా. ఇరుగడ. మొ.)

ఇరుఁదలపాము. దే. వి. (ఇరు+తలపాము.) రెండు ప్రక్కల తలలుఁగల సర్పవిశేషము, డుండుభము.

ఇరుఁదలపులుఁగు. దే. వి. (ఇరు+తలపులుఁగు.) రెండుతలలుగల పక్షివిశేషము, గండభేరుండము.

ఇరుఁబుట్టువు. దే. వి. (ఇరు+పుట్టువు.) 1. పక్షి; 2. బ్రాహ్మణుఁడు. "సీ. అరిది తేజునఁబడగలెత్తి యునిరుఁబుట్టువు దొరలఁగన్గొనిమూలఁదూఱు కొనుచు." అచ్చ. బాల, కాం.

ఇరుగు. దే. వి. 1. ప్రక్కయిల్లు; 2. ప్రక్క. (చూ. ఇరువు.) (వృత్తియందు అంత్యవర్ణలోపము. "క. ఇరుచెవియెఱుఁగకయుండన్." ఉ. హరి. ౫, ఆ.)

ఇరుగుడు. దే. వి. శింశప.

ఇరుగురు. దే. స. రెంటికి మహన్మహత్త్వార్థక బహువచనాదేశము, ఇద్దఱు.

ఇరులు. దే. వి. చీఁకటి, అంధకారము. (ఇరులునన్ అని ప్రయోగములు.)

ఇరులుకొను. దే. అ. క్రి. చీఁకటిపడు.

ఇరులుగొంగ. దే. వి. వెలుఁగుఱేఁడు, సూర్యుఁడు.

ఇరువంద్రు. ద్వా. స. (ఇరు+పంద్రు.) ఇరువదికి మహన్మహత్త్వార్థకరూపము, ఇరువదిమంది.

ఇరువది. ద్వా. స. (ఇరు + పది.) రెండుపదులు, వింశతి.

ఇరువయి. ద్వా. స. ఇరువదియొక్క రూపాంతరము. "ఇరువైనాలుగుమూళ్లమేర." కాశీ. ౧, ఆ.

ఇరువాయికట్టు. ద్వా. వి. మలమూత్రబంధరోగము.

ఇరువు. దే. వి. 1. పక్కయిల్లు; 2. పక్క; "క. అనినియతిచేయుటయున, మ్మునిపలుకులు కన్యకాసమూహంబెల్లన్, వినియట్లిరువులఁజేరక, చనినందొక్కర్తువిధివశంబునవినమిన్." నిర్వ. ౨, ఆ.—3. స్థానము. "రగడ. మావులుదగు మరుమావులకిరువులు, దావులకును గడుఁదావుల విరువులు." య. ౪, ఆ. "సీ. నెఱనీటుకిరువు పన్నీటిచెలువు." శకాం. ౪, ఆ. (ఇట్లు. ఇరువుకొను, ఇరువుపడు. మొ.)

ఇరువుడు. దే. వి. ఇరుగుడుయొక్క రూపాంతరము.

ఇరువురు. దే. స. ఇరుగురుయొక్క రూపాంతరము.

ఇరుస. దే. వి. (ఇరు+కుంచము.) రెండు కుంచములు, అరతూము. "ఎ, గీ. ప్రస్థయుగళాఖ్యయిరుసనాఁబలుకఁబడును." ఆం, భా. ద్వి. వై.

ఇరుసు. దే. వి. 1. బండియక్షము; 2. ఏతపుమ్రానివడిమియడ్డుకొయ్య.

ఇర్వది. ద్వా. స. ఇరువదియొక్క రూపాంతరము.

ఇఱి. దే. విశే. ఇఱిసినది. (ఇఱిగౌఁగిలి, ఇఱిగొను.) (ఇట్లును చెప్పవచ్చును. అప్పుడిది నఱిలోనగువానివంటిది. అయినను దీనికి వ్యస్తముగాఁ బ్రయోగము గానఁబడదు.)

ఇఱికి. దే. వి. బాలక్రీడావిశేషము.

ఇఱియు. దే. అ. క్రి. నలఁగు. (చూ. నఱియు.)

ఇఱుకటము. దే. వి. ఇఱుకుచోటు. "క. తఱుచగుపెనుసందడిలో, నిఱుకటమునఁబడ్డనృపతి." వై. ౪, ఆ. (ఇఱుకాటముయొక్క రూపాంతరము.)

ఇఱుకాటము. దే. వి. (ఇఱుకు+ఆట.) ఇఱుకటము. (చూ. అఱకటము.)

ఇఱుకు. దే. అ. క్రి. 1. కొంచెపుతావుననడఁగు; "గీ. ప్రాఁకియమ్మేటియిరుగుడుమ్రాఁకుఁజివురు, జొంపములలోననిఱికియజ్జోటిసారె, సారెకునురామరామయన్ పేరునుడువ, నొనరనాలించి సీతయంచునుజెలంగి." అచ్చ. సుం, కాం.—2. రెంటిసందునఁజిక్కియదుముడుపడు. "క. బిగువెడలిచీలయూడిన, నగచరుబీజంబులిఱుకనానొప్పిఁగడున్, పెగడొందిమొఱలువెట్టుచుఁ, దెగియెన్ మర్కటముదానిత్రిమ్మటవింటే." పంచ. నా. ౧, ఆ.—అం, ప్రే. 1. కొంచెపుతావున నడఁచు; "క. నిఖిలలోకభీకరుఁడగున, ద్దనుజేంద్రుననాయాసం, బునఁజంకిటనిఱికియింద్రపుత్త్రుఁడచలుఁడై." నిర్వ. ౭, ఆ.—2. రెంటి సందునఁజిక్కఁబట్టియదుము. "ఎ, గీ ఉఱికి కొక్కరకంఠంబునిఱికిచంపె." పంచ. నా. ౧,

ఆ.—వి. 1. ఇఱుకటము; 2. గొంది. "పాతాళ భవనకోటికెల్ల నుగ్రంబైనయిఱుకుననున్న మీ తండ్రి." హరి. ఉ. ౭, ఆ.

ఇఱుకుమ్రాను. దే. వి. వెలుగులోపలికిఁబోవుద్వారమునందు ఒక్కొకమనుష్యుఁడుగా సంకటపడి పోఁదగినట్లు నాటినపంగకలగుంజలోనగునది.

ఇఱుము. దే. వి. మఱుఁగు. "స. ఎడలిఱుములు సందులురంధ్రంబులులేకుండనిండి." భాగ. ౮, స్కం.

ఇఱుముకొను. దే. అ. క్రి. మఱుఁగుపడు. "ఇఱుముకొనందొడంగె దెస లేచినచీఁకటిని." రా. యు, కాం.

ఇఱ్ఱి. దే. వి. జింక, హరిణము. "క. మనసిజరాగంబునఁబెనఁ, గినయిఱ్ఱినిలేడిఁజూచి." భార. ఆది. ౫, ఆ.

ఇఱ్ఱింకులు. దే. వి. బ. (ఇంకులు+ఇంకులు.) మిక్కిలి యింకుటలు. "సీ. భౌమవారపువీరభద్రపళ్లెరమిడుగృహదైవతంబులిఱ్ఱింకులింక." ఆము. ౪, ఆ. (ఇక్కడ ఇఱ్ఱింకులింక ననఁగా నిష్పస్తి పడఁగాననియర్థము.) ("ఎవ్వాఁడువింధ్యాద్రి నిఱ్ఱింకులింకించె." భీ. ౨, ఆ. "ఉ. కన్నుఁగొనలం, దంకురితంబులైనదరహాసలవంబులుపద్మనేత్రయి, ఱ్ఱింకులుచేసెఁబక్ష్ములయీఱమిగాటుక చిమ్మచీఁకటిన్." నై. ౭, ఆ. ఇత్యాది స్థలములయందు ఇఱ్ఱింకులింకించె, ఇఱ్ఱింకులుచేసె అనఁగా అణఁచెననియర్థము.)

ఇఱ్ఱిగోఱజెము. ద్వ. వి. కస్తూరి. "గీ. ఒక్కయెఱుకుఁడునక్కకొమ్ములునిఱ్ఱి, గోఱజంబుజున్నుఁజాఱపప్పుఁ, బీలిగఱులయంపకోలలుసెలవిండ్లు, గానుకిచ్చికరయుగంబుమొగిచి." స్వా. ౪, ఆ.

ఇఱ్ఱియలు. దే. వి. బ. ప్రక్క, పార్శ్వము.

ఇల. సం. వి. ఆ. స్త్రీ. 1. నేల; 2. బుధునిపెండ్లాము; 3. ఆవు; 4. మాట.

ఇలకఱచు. దే. స. క్రి. (ప్రాణము) బిగఁబట్టు. "గీ. కడిఁదివిలుచేఁదిగుఱికిలకఱచినిలుపు, మగునికువలయశరముకంపములఁబోలుఁ, దారకడకంటికైసారె చేరిచేరి, వేగమగుడుసలజ్జదృగ్విభ్రమములు." ఆము. ౫, ఆ. "గీ. అట్టుదూలసేయనాతండుమనసిల, కఱచిధైర్యమూఁతగాఁగనిలిచి." (ఇక్కడ బిగఁబట్టుటమాత్రమర్థము.) రా. యు, కాం. (ఈలకఱచుయొక్కరూపాంతరము.)

ఇలకోడి. దే. వి. ఈలపురుగు, ఝిల్లిక.

ఇలాకా. హిం. వి. సంబంధము.

ఇలాయి. దే. వి. చుట్టవత్తులువేసెడు దివ్వటీ. "తగ సూర్యప్రభలాయిలాయిలును జంద్రజ్యోతులున్." హంస. 3, ఆ.

ఇలారము. దే. వి. ఇలువరముయొక్క మాఱురూపము.

ఇలి. దే. వి. మెతుకు. (అనితోఁచుచున్నది.) (ఈఁగకు ఇలి పాముకు బలిదొరకదు ఇత్యాది వ్యవహారము నూహించునది.)

ఇలికము. సం. వి. అ. పుం. ఎలుక.

ఇలు. దే. వి. ఇల్లుయొక్కరూపాంతరము. "క. లక్కయిలుగాలినదిమొదలు." భార. ఉద్యో. 3, ఆ. (హల్లుపరమగుచో ఉత్వలోపము వికల్పముగానగు. "లక్కయిల్ గాలిచి." భార. ఉద్యో. 3, ఆ. మఱియు ఇది వృత్తియందు కులవాచకమగు. ఇలువేలుపు. "క. మనయింటిచేటుచూచితె." నిర్వ. ౯, ఆ.)

ఇలుకు. దే. వి. కీళ్లనరముబెడఁకుట. (నాచెయియిలుకుపట్టినది.)

ఇలుగు. దే. అ. క్రి. (ఈలుగుయొక్కరూపాంతరము.) చచ్చు. "క. బలవిక్రమఘనులగువారలిగినమనసేనమేదినీశ్వరవినుక, న్నులుచెడినట్లున్నది." భార. శల్య. ౧, ఆ.

ఇలునింపడము. దే. వి. వధూవరుల నూతనగృహప్రవేశము.

ఇలుఱేఁడు. దే. వి. (చూ.) గృహస్థుఁడు.

ఇలువడి. దే. వి. 1. కులీనత; "చ. వలనుగులంబులేనిపరివారముకోటియునేలనేర్పున, గ్గలికయుభక్తిపెంపుమదిఁ గల్గిసుహృజ్జనమిశ్రమాబలం, బిలువడిగల్గెనేనియిలయెల్లను నేలఁగఁ జాలువేయుర, జ్జాలఁవినురాజునేర్పరియు శూరుఁడుఁగావలయుంజుమీనృపా." "సం. ఏకమేత్తన్నుష్యేంద్రశూరైఃప్రాజ్ఞైర్బహుశ్రుతైః, కులీనైస్సహశక్యేతకృత్స్నాంజేతుంవసుంధరామ్." భార. శాం. 3, ఆ.—2. మంచినడత. "ఇలువడినున్నఁజేసి." భాగ. ౧౦, స్కం. పూ.

ఇలువరము. దే. వి. 1. గోడలులేని యెత్తుడుగుడిసె; 2. తృణముచే నేర్పఱపఁబడిన పుట్టివంటిగూడు. "గీ. భూమిసశ్రుతస్మృతదృష్టపూర్వమైన, బహుళసంపత్పరంపరపాదుకొనిన, గరిసెయనఁగోట

యటమించగణనకెక్కె, నందుపైనుంచు నిలుపరమనదివంబు.''(ఇలువారమనిపాఠాంతరము.) చంద్రా. ౧, ఆ.

ఇలువరుస. దే. వి. వంశానుక్రమము.

ఇలువారము. దే. వి. ఇలువరముయొక్కరూపాంతరము.

ఇలువేలుపు. దే. వి. కులదేవత.

ఇల్కుఅచు. దే. స. క్రి. ఇలకఅచుయొక్క రూపాంతరము.''పడివడియానమిల్కుఅచిపట్టుచు.'' రా. యు, కాం.

ఇల్లంట్రము. దే. వి. అల్లుఁడుమామగారియింటనే వాసముగానుండుట. (ఇది యిల్లటముయొక్క రూపాంతరము.) ''ఇల్లంట్రమనఁగనునిల్లట మన శ్వశురునిగృహాధివాసంబుచనును.'' ఆం, భా. ద్వి. మ.

ఇల్లటము. దే. వి. (ఇల్లు+ఆట.) ఇల్లంట్రము. ''సీ. దానివరుండు శాలీనాహ్వయుండిల్లటపుటల్లుఁడ త్తయింటనువసించు.'' కళా. ౪, ఆ.

ఇల్లడ. దే. వి. (ఇల్లు+అడకము.) పదిలపఱచిపెట్టి అడిగినప్పుడు ఇమ్మని యేదేనియొకవస్తువును ఒకరివద్దదాఁచుట, న్యాసము. ''చ. నన్నెద నమ్ముదేనియి, ల్లడయిడుభీమునర్జునునలంఘ్యబలాఢ్యులనానశంబునన్.'' సం. ''భీమసేనార్జునా శీఘ్రం న్యాసభూతౌ ప్రయచ్ఛమే.'' భార. స భా. ౧, ఆ.

ఇల్లము. మి. గ్రా. వి. (ఇరు+పలము.) రెండుపలములు. ''ఇల్లమనంగను నెసఁగుద్విపలి.'' ఆం, భా. ద్వి. వై.

ఇల్లరి. దే. వి. (ఇల్లు+అరి.) ఇంటికప్పుము.

ఇల్లతికము. దే. వి. (ఇల్లు+అతికము.) ఇల్లటము.

ఇల్లవ. దే. వి. ఒకదినుసుచేప.

ఇల్లామల్లి. దే. విణ. కొండెగాఁడు, పిశునుఁడు.

ఇల్లాలు. దే. వి. (ఇల్లు+ఆలు.) గృహిణి, భార్య.

ఇల్లి. దే. వి. ఉపవాసము. ''సీ. పస్తిల్లినుంకునిప్ప స్తునిట్రనఁగను నుపవాససంజ్ఞయైయొప్పుచుండు.'' ఆం, భా. ద్వి. బ్ర.

ఇల్లింద. వై. వి. ఇంద్రవల్లి*.

ఇల్లిగ్గులు. దే. వి. బ. (ఇగ్గులు+ఇగ్గులు.) మిక్కిలి వెనుకకొఱగుటలు. ''క. లొల్లియగువగలత్రొక్కన, నిల్లిగ్గులుగానవచ్చువ్రాదయములోనన్, మల్లామడియగుమదనుఁడు, మెల్లనఁగూర్చుండెఁ ద్రాళ్లిమినుమినుకనఁగన్.'' ఉ, హరి. ౫, ఆ.

ఇల్లిముక్కు. దే. వి. పగిలి నెత్తురుకాఱెడి ముక్కులోపలిభాగము.

ఇల్లు. దే. వి. ఉనికిపట్టు, ఇక్క, గృహము.

ఇల్లెము. వై. వి. మత్స్యవిశేషము. (చూ. అకుజెల్ల.)

ఇల్వడి. దే. వి. 1. ఇలువడియొక్కరూపాంతరము; (చూ. ఇలువడి.) 2. మంచినడత. ''రాసుతుల కెక్కుడియిల్వడియంచు దుర్జనస్తోమమునిందసేయ.'' పద్మ. ౯, ఆ.

ఇల్వల. సం. వి. ఆ. స్త్రీ. నక్షత్రవిశేషము. అ. పుం. ము. మత్స్యవిశేషము. డు. ఒకానొకరాక్షసుఁడు.

ఇవక. వై. వి. శైత్యము*. ''గీ. జలుబుసీతివతాళింపుచలువయివక, యనఁగశీతంబు.'' ఆం, భా. ప్ర. ది.

ఇవతల. ద్వ. వి. (ఇవల+తల.) 1. ఈవలిప్రదేశము; 2. ఈపిమ్మట.

ఇవతళించు. ద్వ. అ. క్రి. చల్లనగు. ''ఎ. గీ. ఇగురుచుకొర్కులఁదన డెందమివతళింప.'' కవిక. 3. ఆ. (ఇవతాళించుయొక్కరూపాంతరము.)

ఇవతాళించు. ద్వ. అ. క్రి. (ఇవక+తాళించు.) ఇవతళించు. ''సీ. కడునివతాళించుక్రంపుటరఁటులయిరవులఁబూవుఁజప్పరమువన్నె.'' కళా. ౬, ఆ.

ఇవతాళింపు. ద్వ. వి. శైత్యము. (చూ. ఇవక.) (చూ. ఆరగింపు.)

ఇవము. వై. వి. 1. మంచు, హిమము; 2. శైత్యము*.

ఇవముకొను. ద్వ. అ. క్రి. తడియు. ''గీ. ఎండనెండితిమంచుననివముకొంటి.'' కాశీ. 3, ఆ.

ఇవముమేపరి. ద్వ. వి. వెలుఁగుఱేఁడు, సూర్యుఁడు. ''ఎ. గీ. వార, లివముమేపరికొలపుజక్కవలనూడు, మఱువుసేరిరి.'' అచ్చ. యు, కాం.

ఇవమునూడు. ద్వ. వి. ఇనుముమేపరి. ''ఎ, గీ. ఇవమునూడుకొలపుటెకిమీనిబంటులు.'' అచ్చ. యు, కాం.

ఇవల. దే. వి. ఈవలయొక్కరూపాంతరము.

ఇవిరించు. దే. అ. క్రి. 1. చిగిరించు; 2. ఎఱ్ఱనగు. (ఇగిరించుయొక్కరూపాంతరము.)

ఇవురు. దే. అ. క్రి. ఇంకు. (హల్లుపరమగుచో వృత్తియందు కడపటి ఉకారమునకు లోపము వికల్పముగానగు. ఇవుర్వంటకము.) వి. చిగురు. (ఇగురుయొక్కరూపాంతరము.)

ఇవురుచు. దే. అ. క్రి. ఇగురుచుయొక్కరూపాంతరము, (రూ. ఇవుర్చు.)

ఇవులుచే. దే. స. క్రి. ఇగులుచుయొక్క రూపాంతరము, (రూ. ఇవుల్చు.)
ఇవ్వల. దే. వి. ఈవలయొక్క రూపాంతరము.
ఇషణము. సం. వి. అ. న. ఇచ్ఛ. (ఇషణత్రయము.—విత్తేషణము, పుత్రేషణము, దారేషణము.)
ఇషము. సం. వి. అ. పుం. ఆశ్వయుజమాసము.
ఇషిక. సం. వి. ఆ. స్త్రీ. ముండ్లదుబ్బు.
ఇషీక. సం. వి. ఆ. స్త్రీ. 1. చిత్తరువు వ్రాసెడి కుంచె; 2. ఏనుఁగు కనుగ్రుడ్డు; ఏనుఁగు భ్రూభంగము (అనికొందఱు.) 3. ముండ్లదుబ్బు.
ఇషుధి. సం. వి. ఇ. పుం, స్త్రీ. తూణీరము, అమ్ములపొది.
ఇషువు. సం. వి. ఉ. పుం, స్త్రీ. బాణము, అమ్ము.
ఇష్టక. సం. వి. ఆ. స్త్రీ. ఇటికఱాయి.
ఇష్టకాపథము. సం. వి. అ. న. నీటివట్టివేరు.
ఇష్టగంధము. సం. వి. అ. న. నూఁగుదోసె? విణ. మంచివాసనగలది.
ఇష్టము. సం. వి. అ. న. 1. యజ్ఞకర్మము; 2. సంస్కారము. పుం. యజ్ఞము. విణ. 1. కోరఁబడినది; 2. ప్రియమైనది; 3. పూజింపఁబడినది.
ఇష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. యజ్ఞము; 2. కత్తి; 3. కోరిక; 4. సంగ్రహశ్లోకము.
ఇష్వాసము. సం. వి. అ. పుం, న. ధనుస్సు, విల్లు.
ఇష్వాసుఁడు. సం. వి. అ. పుం. విలుకాఁడు.
ఇసడిలు. దే. అ. క్రి. విసుగు. "క. ఇసడిలకమఱి యోఁజనియు, వ్యాసుధేశుఁడుదండకమునవర్తింపఁగఁదా, పసహింపాపరులగురా, త్మసులిరువురు నేనుఁగూడికపటాకృతులన్." రా. అర. ౨, ఆ. (వ్రాఁతప్రతులయందీపాఠము కానఁబడుచున్నది.)
ఇసిరో. దే. అవ్య. (ఇసీ+రో.) ఇసీ. "ఇసిరో యిది పోరిపాడియే." భార. మౌ. ౧, ఆ.
ఇసిటింతలు. దే. వి. బ. చలనము. "క. భూపాలమెఱుఁగుఁబోఁడుల, చూపులకుందాయునీరుసాబగట్లగుటన్, మాపిన్నదియిసిటింతల, చూపులనరగంట వెఱచుచున్నిసుఁజూచున్." సై. ౫, ఆ.
ఇసిటింతలువాఱు. దే. అ. క్రి. (ఇసిటింతలు+పాఱు.) చలించు, అదరు. "క. అంతటనిద్దఱుమనసులు, కంతునిపసఁగలసె వింతకసమసలాలయన్, మంతనములఁబెదవులునిసి, టింతలువాఱంగనగవు లుప్పలుఁగోరన్." విక్ర. ౫, ఆ.
ఇసీ. దే. అవ్య. నిందించుటను తెలిపెడి. "ఇసీ యిటునాపనినీవచేసితి." భార. శాం. 3, ఆ.
ఇసుక. దే. వి. ఏ. ఒకటితో నొకటియంటని పొడినూకలవంటి మట్టిదినుసు, సికత.
ఇసుకదాసరి. దే. వి. ఒకదినుసుకూర, సైకతశాకము.
ఇసుకదిన్నియ. దే. వి. (ఇసుక+తిన్నియ.) ఇసుకదిబ్బ, సైకతము, (రూ. ఇసుకదిన్నె.)
ఇసుకదొందు. దే. వి. మత్స్యవిశేషము.
ఇసుకపులకండము. దే. వి. కండచక్కెర, మత్స్యండిక.
ఇసుకబేలు. దే. వి. ఒకానొకతీఁగె.
ఇసుకప్రాను. దే. వి. ఉలిమిరి, వరుణము?.
ఇసుము. దే. వి. ఏ. ఇసుక, వాలుక.
ఇసుల్లు. దే. వి. బ. ఱెక్కచెదలు, పక్షవల్మీకి.
ఇస్త్రా. ఆం. వి. మరమేకు.
ఇస్తిరి. హిం. వి. చిన్నయినుపపెట్టెలో నిప్పులువేసి బట్టలమీఁద రాచి నునుపుచేయుట.
ఇస్తిహారు. హిం. వి. ప్రకటన.
ఇస్తిహారునామా. హిం. వి. ప్రకటనపత్రిక.
ఇస్తువు. దే. వి. సొత్తు, స్వామ్యము.
ఇస్పేటు. ఆం. వి. చీట్లాటయందలి యొక కాకితము పేరు. [స్పేడు.]
ఇస్సిరో. దే. అవ్య. ఇసిరోయొక్క రూపాంతరము. "శా. అంభోగర్భముచొచ్చిపాండుసుతబాహాగర్వదుర్వారసం, రంభంబోర్వకడాఁగియుండెనఁటరారాజిస్సిరో." భార. శల్య. ౨, ఆ.
ఇస్సీ. దే. అవ్య. ఇసీయొక్క రూపాంతరము. "క. అందఱురథికులుపఱవఁగ, నిందేటికిమున్నువచ్చిరిస్సీయని." భార. విరా. ౫, ఆ.
ఇహము. సం. అవ్య. ఇహలోకము. "గీ. కుడిచి కట్టిననున్కిగాకిడుమపడుచు, నింటనున్నను బురుషార్థమేమికలదు, కడఁగియిహమైనఁబరమైనఁ గాకదాన, యూరకుండుట నరునకుఁబౌరుషంబె." భో. ౨, ఆ.
ఇహిహీ. దే. వి. నవ్వుటయందగుధ్వన్యనుకరణము. "ఇహిహీయనినవ్వెమదంబుపెంపునన్." రుక్మి. 3, ఆ. — అవ్య. ఇసీ. "క. తగవామగవారికినిటు, మగువలయందెగువఁజూపమాదృశవీరుల్, జగతిఁగఅవాదోరవా, మగఁటిమిగలరాచచందమాయిదియిహిహీ." రామా. ౫, ఆ.
ఇళ. సం. వి. ఆ. స్త్రీ. 1. బుధునిభార్య; 2. ఆవు; 3. మాట.

## ఈ.

ఈ. ఒకయక్షరము. దే. స. ఎదుటనుండుదానిఁ దెలుపును. "ఈ తపము."
ఈంద్ర. దే. వి. తాటిచెట్టులోనగువానిగీఁచి జీవించెడుజాతి. (ఈంద్రవాఁడు, ఈంద్రది.)
ఈంద్రము. దే. వి. పీడనము. "గీ. ఎన్న (డునినుఁబెట్టు మనుచు నీంద్రముసేయక." భాగ. ౮, స్కం.
ఈంద్రవాఁడు. దే. వి. ఈంద్రజాతివాఁడు. (ఈంద్రజాతిది ఈంద్రది.)
ఈంద్రించే. దే. స. క్రి. పీడించు. "శా. ఈరీతిం గుమతోక్తులంజనని తమ్మీంద్రింపనారాటముం, బోరాటంబుఘనంబులైన." కాళ. ౪, ఆ.
ఈఁక. దే. వి. పక్షియెఱక.
ఈఁకు. దే. అ. క్రి. (రూ.) ఇంకు.
ఈఁగ. దే. వి. మక్షిక.
ఈఁగపులి. దే. వి. సాలెపురుగు.
ఈఁగు. దే. అ. క్రి. చొచ్చు, ప్రవేశించు. "క. ఈగంగాదికతీర్థము, లీఁగంగానీవు దమ సమిద్ధాంబువులన్, దోఁగెడువారలగనగన, గ్రాఁగెడు నంగారసింధుకల్లోలములన్." పాండు. ౧, ఆ.— స. క్రి. తొలఁగించు, నివర్తించు. "గీ. ఎల్లభంగులనూభంగమీఁగుమభవ." భాగ. ౬, స్కం. (ఈ యర్థమందు ఇది నీఁగుయొక్క రూపాంతరము.)
ఈఁజేటి. దే. వి. ఇంజేటి. "తే. గునుకులూదర్లుబఱపటల్ గొల్లగొండు, లల్లిబియ్యము వెదురుబియ్యంబుగొట్టి, చెట్లునీఁజేట్లుఁదుంగముస్తియులు నీఁత, గుంజు మొదలుగఁదినదొరఁకొనియొజనము." కాళ. 3, ఆ.
ఈఁటియ. దే. వి. ఆయుధవిశేషము, కుంతము.
ఈఁటె. దే. వి. ఈఁటియయొక్క రూపాంతరము.
ఈఁటెకాఁడు. దే. వి. ఈఁటె ఆయుధముగాఁగలవాఁడు, కొంతికుండు.
ఈఁడు. దే. అప. కల అను అర్థమునందువచ్చెడి ఒక పుంప్రత్యయము (ఆగడీఁడు, కమ్మతీఁడు. మొ.)
ఈఁత. దే. వి. 1. ఈఁదుట. 2. (పశ్వాదులు) ఈనుట.
ఈఁతకాఁడు. దే. వి. ఈఁదెడువాఁడు.
ఈఁతకొట్టు. దే. అ. క్రి. ఈఁదు.
ఈఁద. దే. వి. ఈఁదర, చలిగాలి.
ఈఁదర. దే. వి.——పై.——
ఈఁదాడు. వై. వి. (ఈఁదు+తాడు.) గిఱకతాటిచెట్టు.

ఈఁదు. దే. అ. క్రి. ఈఁతకొట్టు. స. క్రి. దాఁటు. వి. 1. ఈఁతచెట్టు; (ఇది ద్వివిధము.— చిట్టీఁదు, పేరీఁదు.) 2. వాయువు. "క. ఈఁదునకుంగాదిలి కొమరుఁడ." అచ్చ. సుం, కాం.
ఈఁదులాడు. దే. అ. క్రి. (ఈఁదులు+ఆడు.) 1. ఈఁతకొట్టు; 2. వ్రేలాడు. "ఎ, గీ. ఈఁకెపోటులఁబడి ప్రేవులీఁదులాడ." స్వా. ౪, ఆ.
ఈకువ. దే. వి. తడి, ఆర్ద్రత.
ఈకె. ద్వ. స. ఏ. (ఈ+అక.) ఈమె. (చూ. అకె.)
ఈకొను. ద్వ. స. క్రి. ఈయకొనుయొక్క రూపాంతరము.
ఈకోలు. ద్వ. వి. ఈయకోలుయొక్కరూపాంతరము.
ఈక్షణము. సం. వి. అ. న. 1. కన్ను; 2. చూపు.
ఈక్షణిక. సం. వి. ఆ. స్త్రీ. దైవజ్ఞ, వేల్పుసాని.
ఈగడ. దే. వి. జాడ, పోబడి. "చ. ఏమిమాయయో, యిదియనివీరికైననొక యీగడ పెల్లునొయంచునేగితిన్." కళా. 3, ఆ. "క. కడుమేటియైనదొరచేఁ, బడినదిమీసొమ్ముపెచ్చుపడనోపిననీ, గడకొంతదివ్వవచ్చున్, బెడిదపురోదచేఘటింపనేరదొకటియున్." పర. ౫, ఆ.
ఈగి. దే. వి. ఈవి, త్యాగము.
ఈగికాఁడు. దే. విశ. ఈవికాఁడు, త్యాగశీలుఁడు.
ఈగిమ్రాను. దే. వి. ఈవిమ్రాను, కల్పవృక్షము.
ఈగు. దే. అ. క్రి. ఇగ్గు. "ద్వి. ఈగిదిక్కరులు ఘీంకృతులొనరించెఁ, గ్రాఁగినయసురులగతిసద్ధిలింకె." రా. యు, కాం.
ఈచ. దే. వి. (కాలుసేతుల) వంకర. "ద్వి. కాలకాశికుఁడనఁగాఁబేరువడసి, కాలీచఁజనుచు." హరిశ్చ. ౨, భా.
ఈచపడు. ద్వ. అ. క్రి. (కాలుసేతులు) వంకరగు. "గీ. అధిపకాలీచపడఁగను గ్రాటవులకు నరిగి." పంచ. నా. ౧, ఆ.
ఈచఁబోవు. దే. అ. క్రి. (ఈచ+పోవు.) ఈచపడు.— "ఈచఁబోయినచేతులు." ఉ. హరి. ౨. ఆ. "ద్వి. కాలీచఁబోయినకట్టిఁడిమాల." హరిశ్చ. ౨, భా.
ఈచు. దే. అ. క్రి. (పాఁడిపసులపాలు) వట్టు.
ఈచుకపోవు. దే. అ. క్రి. (ఆవు) చావుదూడవేయు.
ఈటు. దే. విశ. 1. వ్యర్థము; 2. శూన్యము.
ఈటువోవు. దే. అ. క్రి. (ఈటు+పోవు.) 1. వ్యర్థమగు; 2. శూన్యమగు.

**ఈడ.** ఉభ. దే. వి. (ఈ+కడ.) 1. ఈచోటు; 2. ఒకదినుసు ఎఱ్ఱకిత్తలి, పారేవతము. "రగడ. ఈడకుఁజెలిరాకీడకుఁగోయఁగ." య. ౪, ఆ. సం. వి. ఆ. స్త్రీ. స్తోత్రము.

**ఈడఁబోవు.** దే. అ. క్రి. (ఈడన్+పోవు.) వెనుదీయు, అపక్రమించు. "ఈడంబోవక వీఁకమైఁబొడువఁగా." భార. ఆది. ౧, ఆ. (చూ. ఈడు.)

**ఈడాడు.** దే. స. క్రి. (ఈడు+ఆడు.) మార్కొను. "ద్వి. ఓడకోడకు దేవి యుగ్రరాక్షసుని, నీడాడి నీచెఱ నేవిడిపింతు." రా. అర, కాం.

**ఈడిక.** దే. వి. 1. గడ్డిలోనగువానిఁదెచ్చెడి బండిపరమువంటి సాధనవిశేషము; "సీ. అలరుఁదృణాద్యానయన సాధనవిశేషసంజ్ఞయీడికయున సరవడియన." ఆం. భా. ద్వి. ఈ.—2. కంపతోడుగు. "తోడుగట్టియీడిక సుడుముకంప, యనఁదనర్చునుగంటకాదభారము." ఆం. భా. ద్వి. ప.

**ఈడిగ.** దే. వి. ఈండ్ర.

**ఈడిగవాఁడు.** దే. వి. ఈడిగజాతివాఁడు. (ఈడిగజాతిది ఈడిగది.)

**ఈడిగిలఁబడు.** ద్వ. అ. క్రి. (ఈడిగిలన్+పడు.) భయాదులచేరానని మొండివేసికొని కూర్చుండు. "వ. అన్నిలింపారాతియుమగుడవచ్చి తన్నుంగని భయంబుఁబొంది యద్దేవిహారామహారామయనుచునొక్కవృక్షంబిరుగేలంబట్టికొని యీడిగిలంబడియున్న బెట్టదల్చితరువువిడిపించియెత్తుకొనివియత్తలంబునకెగసి పఱవందొడంగిన." రా. అర. ౨, ఆ.

**ఈడిగిల్లు.** దే. అ. క్రి. ఈడిగిలఁబడు. "చ. అని జనయిత్రిపల్కెడు దురాగతభాషలు యౌవనాశ్వపా, వనులకుఁజెప్పికొంతవడివారికిహాస్యము పుట్టఁజేసియా, పెనపరివక్కరాలు మొఱపెట్టుచునీడిగిలంగనందలం, బున ఐడిఁగట్టివైచుకొని పొండని చెప్పినుదేవుఁడంతటన్." జై. ౨, ఆ.

**ఈడితము.** సం. విణ. (అ. ఆ. అ.) పొగడఁబడినది.

**ఈడు.** దే. అ. క్రి. 1. చాఁగు; 2. జాఱు. "గీ. శ్రద్ధగలిగిలోకసంగ్రహసంగంబు, నీడవిడిచియొవ్వఁడీయుపాయ, ములభజించువాఁడు మోక్షలక్ష్మీపతి, యగునొకింతసందియంబువలదు." భార. అశ్వ. ౧, ఆ.—స. క్రి. పిదుకు. "వ. గోవులకుంగ్రేవులవిడువకయు, విడిచివిడిచియీడకయు, ఈడియీడియీడినపాలుకాఁచకయు." భాగ. ౧౦, స్కం. పూ.—వి. ప్రాయము. విణ. సమానము.

**ఈడుచే.** దే. ప్రే. తిగుచు, ఆకర్షించు.

**ఈడుపడు.** ద్వ. అ. క్రి. సమానమగు.

**ఈడుపు.** దే. వి. 1. ఆకర్షణము; 2. విలంబనము; 3. బ. బుగడలగొలుసు.

**ఈడుముంత.** దే. వి. పాలుపిదుకుపాత్రము.

**ఈడె.** దే. వి. ఎఱ్ఱకిత్తలియను నర్థమునందు ఈడయొక్క రూపాంతరము. "ఎ. గీ. ఈడెలుంగని విభుఁజూపుఁడీడెలార." భాగ. ౧౦, స్కం. పూ.

**ఈడేఱు.** దే. అ. క్రి. (ఈడు+ఏఱు.) 1. వర్ధిల్లు; "మ. నా తనయుండెంతయుఁబూఁటపూఁటకు సముద్యత్కాంతినీడేఱఁగా." మై. ౨, ఆ.—2. నెఱవేఱు, సిద్ధించు.

**ఈడ్గిలఁబడు.** ద్వ. అ. క్రి. ఈడిగిలఁబడుయొక్క రూపాంతరము.

**ఈడ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) పొగడఁదగినది.

**ఈతఁడు.** దే. స. ఏ. (ఈ+ఁడు.) ఇతఁడు.

**ఈతగాఁడు.** దే. స. (ఈతఁడు+కాఁడు.) ఈతఁడు (స్వార్థమున కాఁడు.)

**ఈతల.** దే. వి. ఈవలిప్రదేశము.

**ఈతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. అతివృష్ట్యాది; (ఇవి యాఱు.—వాన, వఱపు, ఎలుక, చిలుక, మిడత, చేరువరాజు.) 2. ఉపద్రవము; 3. ఊరువిడిచిపోవుట.

**ఈదృశము.** సం. విణ. (అ. ఈ. అ.) ఇటువంటిది.

**ఈన.** దే. వి. చీఁపురుపుల్ల. (ఇది ఈనపుడక, ఈనపుల్ల అనియు చెప్పఁబడును.)

**ఈనిక.** దే. వి. పశువులీనుట, ఈఁత.

**ఈనియ.** దే. వి. ఈనె.

**ఈను.** దే. స. క్రి. 1. (పశ్వాదులు) ప్రసవించు; 2. కలిగించు. "ఉ. ఆనకశంఖదుందుభిమహారవముల్ దశదిక్కులం బ్రతి, ధ్వానములీనఁగా." జై. ౨, ఆ.

**ఈనె.** దే. వి. ఆకులనరము, పర్వరీణము. (ఈనియయొక్క రూపాంతరము.)

**ఈనెగాజులు.** ద్వ. వి. బ. బాలికాక్రీడావిశేషము.

**ఈపి.** దే. వి. (తలయందుండెడు) ఈరు, లిక్ష.

**ఈపె.** ద్వ. స. ఏ. (ఈ+అప.) ఈమె. (చూ. ఆకె.)

**ఈప్స.** సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛ, కోరిక.

**ఈప్సితము.** సం. విణ. (అ. ఆ. అ.) కోరఁబడినది.

ఈబరి. దే. విణ. నిష్ప్రయోజకుఁడు.

ఈబరిగొట్టు. దే. విణ.——పై.——

ఈబిడ. దే. స. ఈమె.

ఈమిరి. దే. వి. తడి, ఆర్ద్రత్వము.

ఈము. వై. వి. ఇవముయొక్క రూపాంతరము.

ఈమె. ద్వి. స. ఏ. (ఈ+అమ.) ఈపూజ్యస్త్రీ. (చూ. ఆకె.)

ఈయ. వై. వి. అపేక్ష. (దీనికి ప్రత్యేకప్రయోగము కనఁబడదు. చూ. ఈయకొను. మొ.)

ఈయకొను. ద్వి. స. క్రి. ఇయ్యకొను, అంగీకరించు.

ఈయకోలు. ద్వి. వి. ఈయకొనుట, అంగీకారము.

ఈయది. దే. స. (ఈ+అది.) (చూ.) ఇది.

ఈయన. దే. స. ఏ. (ఈ+అన.) ఈతఁడు.

ఈరము. దే. వి. పొదరిల్లు, నికుంజము. "ద్వి. బీరముల్ మెచ్చుచు భేదింపరాని, యీరముల్ చొచ్చుచు." రా. అర, కాం.

ఈరస. వై. వి. 1. ఈర్ష్య; "మ. వెసఖండించునద ల్పుఁద్రుంచుఁ జఱచున్ వ్రేయున్ వెసంజీఱు నీరసతోనొంచు." రా. యు, కాం.—2. కోపము*; 3. ద్వేషము*. (రూ. ఈరసము. కోపమునకు.—"క. ధీరుఁడులక్ష్మణుఁడుగృహ, ద్వారంబుననుండఁగనియెఁ దారాసుతుఁడా, తారాసుతునిన్ లక్ష్మణుఁ, డీరసమెసఁగంగఁ జూచి యిట్లనిపలికెన్. క. రామునియనుజన్ముఁడ నే, సౌమిత్రినిరామునాజ్ఞఁ జనుదెంచితి సౌ, త్రామిజ వేచెప్పుమురు, ధ్గామజుతో ననిన నతఁడుఁ దరణిజుతోడన్. ఉ. అచ్చుగ రామభూవిభుని యానతిలక్ష్మణుఁడుగ్రతేజుఁడై, వచ్చినవాఁడు వాకిటికవారితరోషముతోడ." రా. కిష్కిం, కాం—ద్వేషమునకు.—"క. పెక్కండ్రతోడనీరస, మొక్కటఁ జేకొనకతఱఁగియున్న పగతుతో, నుక్కాఁడిబంధుభావము, తక్కటిపగలు యెడవలయుఁదా నెఱపంగన్." భార. శాం. 3, ఆ.

ఈరసించు. వై. అ. క్రి. 1. ఈర్ష్యపడు; 2. కోపించు*; 3. ద్వేషించు*.

ఈరాఱు. దే. స. (ఈరు+ఆఱు.) పండ్రెండు.

ఈరిక. దే. వి. మొలక, అంకురము.

ఈరిణము. సం. విణ. ఇరిణముయొక్క రూపాంతరము.

ఈరితము. సం. విణ. (అ. ఆ. అ.) త్రోయఁబడినది.

ఈరు. దే. వి. పేనుగ్రుడ్డు, లీక్ష. విణ. అల్పము, హీనము. (ఈరెండ, ఈరెలుఁగు. మొ.) (దీనికివ్యస్తముగా ప్రయోగములేదు.) స. నీశబ్దమునకు బహువచనరూపము. వృత్తియందు అచ్చుపరమగుచో రెంటికాదేశము. (ఈరాఱు, ఈరేడు. మొ.)

ఈరుచు. దే. స. క్రి (ఈర్పెనతో ఈళ్లను) ఈడ్చు, (రూ.) ఈర్చు.

ఈరుపెన. దే. వి. ఈళ్లనీర్చెడుదువ్వెన.

ఈరువాఱు. దే. వి. (ఈరు+పాఱు.) అసివాఱు.

ఈరువు. దే. వి. ఎఱచి, మాంసము.

ఈరె. దే. వి. పంటెనుజుట్టితీసిననూలు.

ఈరెండ. దే. వి. (ఈరు+ఎండ.) కొంచెపాటియెండ.

ఈరెలుఁగు. దే. వి. (ఈరు+ఎలుఁగు.) హీనస్వరము.

ఈరేడు. దే. స. (ఈరు+ఏడు.) పదునాలుగు.

ఈరేను. దే. స. (ఈరు+ఏను.) పది.

ఈర్పెన. దే. వి. ఈరుపెనయొక్క రూపాంతరము.

ఈర్మము. సం. వి. అ. న. వ్రణము, పుండు.

ఈర్య. సం. వి. ఆ. స్త్రీ. ధ్యానమౌనాదివ్రతములయందు చాంచల్యములేక స్థిరుఁడైయుండుట. నడచుట నిలుచుట కూర్చుండుట పండుకొనుట మొదలైనవానియందు యతులు సమాధానముగలవారైయుండుట. (అనికొందఱు.)

ఈర్ష్య. సం. వి. ఆ. స్త్రీ. ఓర్వలేనితనము, ఈరసము.

ఈర్ష్యాళువు. సం. విణ. ఉ. ఈర్ష్యపడు స్వభావముగలవాఁడు, ఉడుకుఁబోతు.

ఈఱతాఱలు. దే. విణ. బ. 1. వక్రము; "గీ. వంకయైనతలంపెల్లవసుమతీశ, యరయమృత్యుపదంబగునార్జవాన్వి, తంబుబ్రహ్మపదంబింత తథ్యమేల, యీఱతాఱతలంపులబీఱువాఱు." భార. అశ్వ. ౧, ఆ.–2. పరుషము. "ఎ, గీ. మరలెదుర్మర్షణుఁడుతోన తెరలెసేన, యపుడు సమ్మెట కోలలనంకుశములఁ, జేఱుకోలల వ్రేటుల నీఱతాఱ, యదలుపులవాహనంబులు చెదరిపఱచె." భార. ద్రో. 3, ఆ. (చూ. అఱువుల్లు.)

ఈఱమి. దే. వి. తీఁగలులోనగువానితఱచు, జొంపము. "న. పూఁబొదరిండ్లయీఱమిమఱుంగున." కళా. ౧, ఆ.—విణ. తఱచైనది. (చూ. ఇఱ్ఱింకులు.)

ఈఱము. దే. విణ. తఱచు, సాంద్రము. "ఎ, గీ. ఈఱమగు వెన్నెలలలోనఁ దూఱితూఱి." విక్ర. ౬, ఆ. "గీ. పొదలు వేడ్కలనీఱంపుఁ బొదలు చొచ్చి." షో. ౮, ఆ.

**ఈల.** దే. వి. 1. ఒకదినుసుకూరాకు; 2. చిమ్మట కూఁత; 3. గోపకులులోనగువారి సంకేతధ్వని; "వ. ఈలవెట్టుచుగోగణంబులఁజెదరందోలి." వి, పు. ౨, ఆ.—4. సిగ్గు. "విడువుమీలయటంచు నొడివె హేమ." స్వా. 3, ఆ.

**ఈలకఱచే.** దే. స. క్రి. ఇలకఱచు. "క. పొడువునకు నెగసియెప్పటి, పడమటిదెసనిగిడి పెలుచఁబఱచినఁగూడం, గడురయమునఁజనియంచల్, గడవఁగ లేకీలకఱచి కాకము పాఱున్." భార. కర్ణ. ౧, ఆ.

**ఈలకూఁతలు.** దే. వి. బ. బాలక్రీడావిశేషము. "ఎ, గీ. ఏలపాటలుసరిబేసులీలకూఁతలు." వి, పు. ౨, ఆ.

**ఈలగ్రద్ద.** ద్వ. వి. ఒకదినుసుడేగ. విణ. లోభి. "గీ. ఏమునలువురందునెవ్వాఁడుగాఁజాలు, నిచ్చిపుచ్చుకొన్నయీలగ్రద్ద, మాకునింపుగావుమాను మీసుద్దులు. కలహముల మొగంబకలియఁగంబ." నై. ౨, ఆ.

**ఈలపురుగు.** దే. వి. ఇలకోడి, చిమ్మట, ఝిల్లి.

**ఈలుగు.** దే. అ. క్రి. చచ్చు, మరణించు. "క. పవనసుతుచేతనాథూ, ధవుఁడీలిగనేని." భార. కర్ణ. ౨, ఆ. (నీలుగుయొక్క రూపాంతరము.)

**ఈలువు.** దే. వి. పాతివ్రత్యము. "ద్వి. కాలదేశాంతరక్రమమునఁజెడని, యీలువొక్కఁడమఱుపింతియకాక, యెనసినకోటలు నిండ్లును దెరలు, వనితలకెందునావరణముల్ కావు." రా. యు, కాం. "ఇలఁబతివ్రతలలో నీలువుగలయట్టితల్లివి." కళా. ౪, ఆ.

**ఈల్గు.** దే. అ. క్రి. ఈలుగుయొక్క రూపాంతరము.

**ఈవ.** దే. వి. ఈగయొక్క రూపాంతరము.

**ఈవరి.** దే. విణ. (ఈవి+అరి.) ఈవికాఁడు. "క. సిరిరాచవేల్పకడునీ, వరితనముననీటితాల్ప." య. ౫, ఆ.

**ఈవల.** దే. వి. (ఈ+వలను.) 1. ఈప్రక్క; 2. ఇటుపిమ్మట.

**ఈవి.** దే. వి. ఈగియొక్క రూపాంతరము.

**ఈవికాఁడు.** దే. విణ. ఈగికాఁడు, త్యాగశీలుఁడు.

**ఈవు.** దే. స నీవునకురూపాంతరము.

**ఈవులమొదవు.** దే. వి. (దేవలోకమునందలి) కామధేనువు.

**ఈవులమ్రాను.** దే. వి. (దేవలోకమునందలి) కల్పవృక్షము.

**ఈవులరతనము.** ద్వ. వి. (దేవలోకమునందలి) చింతామణి.

**ఈశ.** సం. వి. ఆ. స్త్రీ. ఈషయొక్క రూపాంతరము.

**ఈశానము.** సం. వి. అ న. ప్రకాశము, వెలుతురు.

**ఈశానుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

**ఈశిత.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) ప్రభువు, ఒడయుఁడు.

**ఈశుఁడు.** సం. వి. అ. పుం. 1. రాజు; 2. శివుఁడు.

**ఈశ్వర.** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

**ఈశ్వరి.** సం. వి. ఈ. స్త్రీ. పార్వతి, గట్రాచూలి.

**ఈశ్వరుఁడు.** సం. వి. అ. పుం. 1. శివుఁడు; 2. మన్మథుఁడు. విణ. 1. ఒడయుఁడు; 2. ధనవంతుఁడు.

**ఈష.** సం. వి. ఆ. స్త్రీ. నాఁగటియేఁడికోల.

**ఈషిక.** సం. వి. ఆ. స్త్రీ. ఏనుఁగుకనుగ్రుడ్డు.

**ఈసడము.** దే. వి. దూఱు, నింద.

**ఈసడించే.** దే. అ. క్రి. 1. రోఁతపడు; "గీ. అంతనొకనాడు నిర్మలస్వాంతమౌని, మాళిభుజియింపఁబాత్రలోవ్రేలుదునిసి, పడినమదినీసడింపకడకుఁదిగిచి, వైచిభుజియించెనప్పతివ్రతలతల్లి." పాంచా. 3, ఆ.—2. కోపించు. "ఉ. ఆసుదతింగనుంగొనితదంగనయప్పుడు హెచ్చినట్టిప్పే, రీసుననీసడించుచు." కళా. 3, ఆ.—స. క్రి. నిందించు. "సీ. చండాలుఁడనిసారెసారెకునన్ను నీవీసడించుటపాటియేతలంప." హరిశ్చ. ౪, ఆ.

**ఈసపిట్ట.** ద్వ. వి. ఒకదినుసుచేఁప.

**ఈసు.** వై. వి. 1. ఈర్ష్య; 2. కోపము*. "వ. అంతఁబక్ష్మవదనుండు నిబిడజ్వాలాకరాళంబగు శూలంబు రాఘవుమీఁదఁబ్రయోగించిన నతండును నడుమనదానిఁదునియలుసేసిన నీసునంబెతిగి సురవైరి మఱియునుందరతరంబ శతసహస్రసంఖ్యలంగలశూలంబులు భిందివాలంబులుఁ దోమరంబులుశరంబులుంబరఁగించి." సం. "తతఃక్రుద్ధస్ససర్జాశుదశగ్రీవశ్శితాన్ శరాన్." భార. ఆర. ౨, ఆ.—3. వైరము*. "నాకుపద్రవముఁబెక్కువిధంబులఁజేసెనీసునన్." భార. సభా. ౧, ఆ.

**ఈసుకాఁడు.** వై. విణ. ఉడుకుఁబోతు, ఈర్ష్యాళువు.

**ఈహ.** సం. వి. ఆ. స్త్రీ. 1. కోరిక; 2. కడఁక.

**ఈహామృగము.** సం. వి. అ. పుం. 1. తోఁడేలు; 2. నాటకవిశేషము.

**ఈహితము.** సం. విణ. (అ. ఆ. అ.) కోరఁబడినది.

ఈహీ. దే. అవ్య. ఇసీ. "తక్కినబలాధీశాఖ్యకీటం బులిం, దెవ్వం డెవ్వఁడో మేలెచే టెఱుఁగరీహీ." కవిక. ౨, ఆ.

ఈళిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కత్తిపీఁట; 2. చురకత్తి.

ఈళితము. సం. విణ. (అ. ఆ. అ.) పొగడఁబడినది.

## ఊ.

ఊ. ఒకయక్షరము.

ఊంకించు. దే. అ. క్రి. కడఁగు, యత్నించు. "గీ. రక్తసంసిక్తమైన ధరాతలమున, నార్తిఁబొరలుచు నూర్పులందందసంద, డింపజీవంబు వెడలనూంకిం పఁజేష్ట, లొయ్యనొయ్యనయడఁగంగనున్న య ధిపు." భార. సౌ. ౧, ఆ.

ఊంకు. దే. అ. క్రి. ఎగురు. "గీ. నీరముంచిన సార కాయయెగసినట్లు, పేరుకొని వైచు తెల్లటిచీరవో లె, నూంకుచెండువిధంబున నుత్తరించు, తములపాకు నిక్కుడుక్రియ దాఁటెనిట్టి." ఉ. హరి. ౪, ఆ.— వి. సమ్మతి. "క. ఎక్కువకులంబునతనికి, నిక్కపు టాలైనదానినీచకులుండుం, కెక్కకబలిమిం గవి సినఁ, దక్కనిచంపుటయరాజధర్మంబెందున్." విజ్ఞా. ప్రా, కాం. (చూ. ఊంకుటుంగరము.)

ఊంకుటుంగరము. దే. వి. (ఊంకు+ఊంగరము.) వధూవరులు వివాహము చేసికొనుటకు పరస్పర ము సమ్మతించి మార్చుకొనెడియుంగరము.

ఊంకువ. దే. వి. అల్లుఁడు కన్యకార్థము మామకిచ్చెడి ద్రవ్యము, శుల్కము. "భవదీయశౌర్యమేయూం కువ చేసి కృష్ణపురుషోత్తమ చేకొనిపొమ్ము." భాగ. ౧౦, స్కం. పూ.

ఊంగ. దే. వి. బిడ్డలకుఁబోసెడియుగ్గు. "క. అంగ ములుమిగులనలియఁగ, నూంగేయుంగేయటంచు నొకనిమిషమునో, రంగాయవేయకేడ్చుచు, నం గీకృతబాల్యచేష్టనతఁడట్లుండెన్." పర. ౧, ఆ.

ఊంగరపువ్రేలు. దే. వి. (ఊంగరము+వ్రేలు.) చేతి చిటికెనవ్రేలికిముందువ్రేలు, అనామిక.

ఊంగరము. దే. వి. చేతివ్రేలియాభరణము, అంగుళీ యకము.

ఊంగిడి. దే. వి. నామును ఆముదపాకులును మేయు టచేఁ గలుగు పశురోగవిశేషము.

ఊంగుటము. వై. వి. బొటనవ్రేలు, అంగుష్ఠము. "గీ. మ్రొక్కి నిలిచియతనిముందట మేదిని, నూం గుటమున వొరయుచున్నఁ జూచి." నిర్వ. 3, ఆ.

ఊంగ్రము. దే. వి. ఊంగరముయొక్క రూపాంతరము.

ఊంచు. దే. ప్రే. ఉండఁజేయు, ఉనుచు.

ఊంచుకొను. దే. ప్రే. పెట్టుకొను.

ఊంఛము. సం. వి. అ. న. ధాన్యమేఱుకొని బ్రదు కుట, లేకిబ్రదుకు.

ఊంట. దే. వి. 1. ఊండ; "సీ. కలశవారిధిబయల్ వెలసికొమ్మునఁగొట్టనంటివచ్చిన నాఁచుటుంటపు డమి." చంద్రా. ౧, ఆ.—2. ఉండుట. విణ. గుండ్రము.

ఊంటగాలము. దే. వి. సీసపుగుండుకట్టిన యొక దినుసుగాలము.

ఊండ. దే. వి. మన్ను లోనగువానిచేతఁ జేయఁబడిన గుళిక. "సీ. కవజక్కవలువాయఁగరనాళములఁ జందురుండూఁదుపటికంపుటుండయనఁగ." పా. ౨, ఆ.—విణ. గుండ్రము.

ఊండక్రోవి. దే. వి. చేతికట్టి, లాతము.

ఊఁడసురియ. ద్వ. వి. ఆయుధవిశేషము. "వ. కొండగొఱియల నుండసురియలఁ జెండు బెం డాడుచుండ." రా. వి. 3, ఆ.

ఊండి. దే. అప. ఒకప్రత్యయము. అవ్య. మొదలు కొని అనునర్థమును తెలుపునది. "క. ఏనొకటి విన్నవించెద, దానవకులమథన పెద్దదడవునునుండిం, బూనివినిపింపఁగలపని, యౌనోకాదో విచార మది తెలియఁదగున్." (ఊండిన్ —యువర్ణలోపము.) ఉ. హరి. ౫, ఆ.

ఊండు. దే. అ. క్రి. 1. వసించు; 2. వర్తించు; 3. శేషించు. "గీ. ఇందుబింబాస్యనారాకకెదురుచూచు, నయనములు వేయువిరియించి నాక భర్త, యుదిలకొనుచున్న వారార్తినున్న ముగురు, కాలయాపనసేయఁగాఁ గాదునీకు." నై. ౪, ఆ.

ఊండ్ర. దే. వి. వెలిచంద్ర, కదరుముకి.

ఊండ్రము. దే. విణ. గుండ్రము, వర్తులము.

ఊండ్రములు. దే. వి. బ. ఊండ్రాలు, మోదకములు.

ఊండ్రస. దే. వి. ఊండ్రకి.

ఊందురము. సం. వి. అ. పుం. 1. ఎలుక; 2. పంది కొక్కు.

ఊందురువు. సం. వి. ఉ. పుం.——వై.——

ఊంపడము. దే. వి. గుత్తగా వేశ్యనుంచుకొనుట.

ఊంబ. వై. వి. గోవులయంభారవము.

ఊంబళి. దే. విణ. పన్ను లేనిది. (ఊంబళిగ్రామము. మొ.)

ఉంభనము. సం. వి. అ. న. నించుట.

ఉంభితము. సం. విణ. (అ. ఆ. అ.) నింపఁబడినది.

ఉక్కు. దే. వి. ఉమ్మ, ఊష్మము.

ఉక్కుఁబట్టు. దే. స. క్రి. పదలు. "క. నీకిష్టంబివికానీ, నాకాపాపాత్ముఁ జెప్పినంబదిలక్షల్, లేకున్నవిడుతుఁబ్రాణము, నీకైకూడుక్కుఁబట్టి నీలగ్రీవా." కాళ. 3, ఆ.

ఉక్కుడఁగు. దే. అ. క్రి. 1. ఉక్కుచెడు; "ఉక్కుడఁగెన్ మగధేశుసైన్యముల్." భార. సభా. ౧, ఆ.—2. చచ్చు. (ప్రే. ఉక్కుడఁచు.)

ఉక్కుడము. వై. విణ. గొప్ప. "ఉ. ఉక్కుడమైన మంచిహనువొప్పెడునాహయరత్నమెక్కినన్." సా. ౧, ఆ.

ఉక్కుడీఁడు. వై. విణ. (ఉక్కుడము+ఈఁడు.) బంటు, శూరుఁడు.

ఉక్కుణము. దే. వి. కావలి, రక్షణము. "చ. కడిందిమగల్ దగునుక్కుణంబుగా, భయమనుపేరులేక నిరపాయముగావిడియించుచున్ మనః, ప్రియమగుభంగి సేన నడపించె." నిర్వ. ౫, ఆ.

ఉక్కరి. దే. విణ. (ఉక్కు+అరి.) శౌర్యవంతుఁడు. "సీ. ఉక్కరివై పొంచినిక్కుచు నెకకోలఁగూలనేయఁగ నల్లవాలిగాఁడు." అచ్చ. యు, కాం.

ఉక్కఱు. దే. అ. క్రి. ఉక్కుడఁగు. "చ. చిఱునగవొప్పగాండివము చెచ్చెరసజ్యముచేసి సేనలు, క్కఱరభసంబుమైనడరఁగవ్వడి ద్రోణియు నీడఁబోకయ, త్తఱిఁదఱుమంగ." భార. విరా. ౫, ఆ.

ఉక్కలుఁడు. వై. విణ. ధురంధరుఁడు. "మ. విలసచ్చక్రచతుష్కమైఘనతరద్వీపిత్వగావేష్టనో, జ్జ్వలమైకిష్కుచతుశ్శతత్రితయవిస్తారాఢ్యమై రెండువే, లెలుఁగుల్ పూనినకాంచనోన్నతరథంబే పెక్కుఁగా నెక్కియు, క్కలుఁడై యేగను యుండుసైన్యమునకేక స్వామియీతండనన్." హరి. పూ. ౪, ఆ.

ఉక్కళము. యు. దే. వి. శత్రువులెత్తివచ్చుటను దెలిసికొనుటకై యుంచు కావలి, కోవురము. "వ. అప్పుడప్పర్వతప్రదేశంబుననుక్కళంబున్న యక్షకిన్నరులు." ఉ, రా. 3, ఆ.—వై. పురాభిముఖమైన రాజమార్గము, ఉపనిష్కరము. "ఉపనిష్కరంబగునుక్కళమన." ఆం, భా. ద్వి. భూ.

ఉక్కిరిబిక్కిరి. దే. విణ. ఊపిరితిరుగనిది.

ఉక్కివము. దే. వి. కపటము. "సీ. గాండీవముదిగాఁగలయాయుధంబుల నుక్కివంబున నప్పుడొడిచికొనఁగ, మఱచినవాఁడయ్యె." భార. ఆర. ౧, ఆ.

ఉక్కివుఁడు. దే. విణ. కపటముగలవాఁడు. "సీ. కడుఁగ్రొవ్వితొల్లి యెప్పుడునాకునేఁ డేఁటఁ జెయుపూజలు నేడు సేయనొల్ల, కుక్కివుఁడైనదామోదరుకఱపులు విని యొక్కచిడిపిగట్టునకుఁజెసిరి." హరి. పూ. ౭, ఆ.

ఉక్కిస. దే. వి. పాడిదగ్గు. "గీ. ఉక్కిసయును దగ్గుఁబిక్కటిల్లె." భాగ. ౬, స్కం.

ఉక్కీఁడు. దే. విణ. (ఉక్కు+ఈఁడు.) మూర్ఖుఁడు "ఉక్కీలయి నేర్పులేక తమకించి పయింబడినొచ్చువారు." నిర్వ. 3, ఆ.

ఉక్కు. దే అ. క్రి. 1. చచ్చు; "ద్వి. ఘోరాహవంబునఁగుంభకర్ణాది, వీరులు పెక్కండ్రు విపమవిక్రములు, ఉక్కిరందఱువిభుండొక్కఁడచిక్కె, నెక్కటి రఘురాము నితఁడేమి గెలుచు." రా. యు, కాం.—2. నలఁగు. "ద్వి. కరముఁ రామలక్ష్మణులనిద్దఱను, గరముక్కఁబట్టి రాక్షసుఁడుక్కుమీఱె." రా. ఆర, కాం.—వి. 1. ఆయస్సారము; 2. శౌర్యము; "చ. అనివినిపించినన్ బలమురాంతకులుక్కునఁబేర్చియవ్వనంబునఁగల దైత్యకోటిఁబోరపుచ్చకలోకముబాధమానదం, చుఁ గరిగి." వి, పు. ౭, ఆ.—3. స్థైర్యము. "క. ఎఱకలుగలకులశైలము, తెఱఁగువెఱయరయమునెఱయదివికినెగసిబి, ట్టుఱుము జలధరము క్రియను, క్కఱితద్వనమెల్ల నద్రుపనార్చుచుఁ గడిమిన్." భార. ఆర. ౬, ఆ. (ఈ పదమునకర్థము పరాక్రమము బలము అని చెప్పుచున్నారుగాని ("క. చక్కనగుమనినరక్కసుఁ, డక్కజముగఁ బెఱిగివచ్చి యయ్యనిలజునీ, యుక్కునుబీరముఁజూచెదఁ, జిక్కఁగ నిల్వుమనికడు విజృంభించివడిన్." భార. ఆది. ౬, ఆ. "గీ. ఇవ్విధంబునఁబోరెడునింద్రతనయునుక్కులావునునంతంతకక్కుఁడయ్యె." భార. విరా. ౫, ఆ.) ఇత్యాది ప్రయోగములనుజూడ అది సరిగా తోఁచలేదు.)

ఉక్కుతీఁగ. దే. వి. (వీణలోనగువానికివేసెడు) ఉక్కుతంతి.

ఉక్కుతునియ. దే. వి. ఉక్కుతునుక. విణ. శూరుఁడు. "గీ. ద్రౌపదేయులు నాసుభద్రాసుతుండు, నుక్కుతునియలు గారె." భార. ఉద్యో. ౨, ఆ.

ఉక్కుమడఁగు. దే. అ. క్రి. 1. ఉక్కుచెడు; "చ. ఉఱకవిరోధిసైన్యముల నుక్కుమడంగఁగ నుల్లసద్గతిం. బఱప." భార. విరా. ౫, ఆ.— 2. చచ్చు. (ప్రే. ఉక్కుమడఁచు. "ఎ, గీ. అనిని వాతకవచులనుదానవులనాతఁ, డొక్కరుండ కాదె యుక్కుమడఁచె." భార. విరా. ౪,ఆ.)

ఉక్కెఱ. వై. వి. చక్కెరఁజేర్చి పొరఁటినపిండి.

ఉక్త. సం. వి. ఆ. స్త్రీ. ఒకఛందస్సు. (చూ. ఛందస్సు.) విణ. చెప్పఁబడినది.

ఉక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. మాట; 2. సరస్వతి.

ఉక్థము. సం. వి. అ. న. సామవేదము.

ఉక్షము. సం. వి. న్. పుం. ఋషభము, ఎద్దు.

ఉఖ. సం. వి. ఆ. స్త్రీ. వంటకుండ, లోవి.

ఉఖ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ఉఖయందు వండఁబడినది, పైఠరము.

ఉగము. దే. వి. ఆయువు. "క. ఏనుంగనికరమరయక, పూనితిఁగాకిట్టియెడలఁబోసఁగుసెయేయుం, గానమెకాలనియమగతి, తోనా వేఁటమునియుగముఁద్రుంగించెదురర్." రాఘ. ౧, ఆ.

ఉగాది. దే. వి. చాంద్రాయణసంవత్సరాది.

ఉగ్గడించె. వై. అ. క్రి. మ్రోఁగు, శబ్దించు*. "బంగరుటందియలుగ్గడింపఁగర్." పాండు. ౨, ఆ.—స. క్రి. వచించు*; "గీ. అదియునుంగాక జనియించుటాదిగాఁగఁ, బసులలోనన పెరిగినపాలనుండు, వావిమాలినపశుమార్గవర్తనంబు, నూనుటరిదియెయిదియేలయుగ్గడింప." హరి. ఉ. 3, ఆ. "హరినామాంకములుగ్గడించుచు." లక్ష్మీ. ౫, ఆ.

ఉగ్గడువు. వై. విణ. మిక్కిలి, అధికము. "చ. ఏటుగంటియు, గ్గడువగు నెత్తుటన్నుడినిక్రక్కెడు నెత్తుటఁగుంకుమచ్చవిం, బడసి." ఉ. హరి. ౪, ఆ.

ఉగ్గము. వై. వి. చేతఁబట్టుకొనిపోవుటకు అనుకూలముగా కలశాదుల ముఖమునఁ గట్టుత్రాడు.

ఉగ్గళించె. వై. అ. క్రి. నట్టువుఁడుకొలిపించు.

ఉగ్గించె. దే. స. క్రి. (పడుగుపేకలపోఁగులను) చేర్చు.

ఉగ్గు. దే. వి. 1. బిడ్డలకుఁ గలిపిపోసెడి చనుఁబాలౌషధము; "చ. అతనికిభూతనామమిడియాదరణంబునఁబోచెనిందిరా, పతికృపనేగుదెంచియ లపద్మనివాసయుఁబాంచజన్యమర్, చతురపుఁబాలదర్విమలసత్యము పేరిటిపాలతోడన, చ్యుతపదభక్తి పేరిచముఁరుగ్గుగఁబెట్టుచుఁ బెంచెనర్థిలిర్." పర. ౧, ఆ.—2. ముదుత. "సీ. మేని యొగ్గులుమాన్చి మెదలకచిత్రరూపముభంగిఁ బర్వతభాతినుండె." వా. ౪, ఆ.

ఉగ్గుడు. దే. వి. మేర, మర్యాద. "ఎ, గీ. గడువనఁగ మేరయనఁగ నుగ్గుడటనంగ, నడరుమర్యాద." ఆం, భా. ద్వి. క్ష.

ఉగ్గుపడు. ద్వ. అ. క్రి. ముడుతపడు. "వ. జిగిదరిగి బిగివదలి ప్రగ్గియుగ్గుపడి తరంగితాయమానంబైన సర్వాంగీణచర్మంబును." కవిక. ౫, ఆ.

ఉగ్గులువాఱు. దే. అ. క్రి. (నూలిపోఁగు.) మెలిపడు.

ఉగ్గలి. దే. వి. ఆఁడుది, ఇంతి, మగువ, వనిత.

ఉగ్ర. సం. వి. ఆ. స్త్రీ. వస. విణ. భయంకరురాలు.

ఉగ్రంపశ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. క్రూరుఁడు; 2. భయంకరుఁడు.

ఉగ్రగంధ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకదినుసు ఓమము; 2. వస.

ఉగ్రాక్షుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, వేఁడికంటివేలుపు.

ఉగ్రాణము. దే. వి. సామగ్రులుంచెడుగది, కోష్ఠము.

ఉగ్రుఁడు. సం. వి. అ. పుం. 1. శివుఁడు; 2. శూద్రదానియందు క్షత్రియునికిఁబుట్టి కోశరక్షణాదులచే బ్రదుకువాఁడు. విణ. భయంకరుఁడు.

ఉచిఁత. దే. వి. ఉస్తె, శుండి, (చూ.) ఉచ్చింత.

ఉచితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తగినది; 2. ఉంచఁబడినది; 3. ఎఱుఁగఁబడినది; 4. కొలఁదియిడఁబడినది.

ఉచ్చండము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఆగ్రహముగలది; 2. వడిగలది.

ఉచ్చంద్రము. సం. వి. అ. పుం. అపరరాత్రము.

ఉచ్చట. సం. వి. ఆ. స్త్రీ. వట్రువముస్తె.

ఉచ్చము. సం. విణ. (అ. ఆ. అ.) ఉన్నతము, పొడవు.

ఉచ్చయము. సం. వి. అ. పుం. 1. సమూహము; 2. పోఁకముడి.

ఉచ్చరణము. సం. వి. అ. న. ఉచ్చారణము.

ఉచ్చరించె. సం. స. క్రి. వాక్రుచ్చు, చెప్పు.

ఉచ్చరితము. సం. విణ. (అ. ఆ. అ.) ఉచ్చరింపఁబడినది.

ఉచ్చాటనము. సం. వి. అ. న. 1. ఒకవిద్య; (చూ. విద్య.) 2. వెళ్లఁదోలుట.

ఉచ్చారణము. సం. వి. అ. న. ఉచ్చరించుట.

**ఉచ్చారము.** సం. వి. అ. పుం. పురీషము, విష్ఠ.

**ఉచ్చావచము.** సం. విణ. (అ. ఆ. అ.) బహుప్రకారములుగలది.

**ఉచ్చి.** దే. వి. సోడు, బ్రహ్మరంధ్రము.

**ఉచ్చింత.** దే. వి. ఉచితి?. "సీ. చెవులకీ తెల్లయుచ్చింతకాయ లెంతేసి." య. ౧. ఆ.

**ఉచ్చిచ్చిరి.** దే. వి. కుక్కనుపిలుచుటయందగు ధ్వన్యనుకరణము.

**ఉచ్చైశ్శ్రవము.** సం. వి. అ. పుం. ఇంద్రునిగుఱ్ఱము, నిక్కువీనులజక్కి.

**ఉచేకరించే.** దే. అ. క్రి. (అనాదరముచే) ఉచుక్కుమను.

**ఉచేక్కు.** దే. వి. ఉచుకరించుటయందగు ధ్వన్యనుకరణము.

**ఉచ్చే.** వై. వి. కాలుగుడి, మూత్రము*.

**ఉచ్చేబుడ్డ.** ద్వ. వి. నీరుతిత్తి, క్లోమము.

**ఉచ్చేమల్లి.** దే. వి. దిసమొల ఆఁడుది, నగ్నిక. "వ. అయ్యవసరంబునఁ గోటవియనంగ నొక్కయుచ్చమల్లివచ్చి యడ్డపడిన నానగ్నికంజూచి." ఉ, హరి. ౬, ఆ.

**ఉచ్ఛే.** దే. అ. క్రి. నాటివెడలు. "ఎ. గీ. ఉరము వడిఁదాఁకివీఁపునుచ్చిపోయె." భార. భీష్మ. 3, ఆ.—వి. ఉరి, వాగుర.

**ఉచ్ఛిష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) భుజింపఁగా మిగిలినది, ఎంగిలి.

**ఉచ్ఛృంఖలము.** సం. విణ. (అ. ఆ. అ.) అడ్డపాటు లేనిది.

**ఉచ్ఛూనము.** సం. విణ. (అ. ఆ. అ.) దట్టము.

**ఉచ్ఛ్రయము.** సం. వి. అ. పుం. ఉత్సేధము, పొడవు.

**ఉచ్ఛ్రాయము.** సం. వి. అ. పుం.——పై.——

**ఉచ్ఛ్రితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పెరిగినది; 2. పొడవైనది; 3. పుట్టినది.

**ఉచ్ఛ్వసితము.** సం. వి. అ. న. ఊపిరి వెలికిఁబుచ్చుట. విణ. ఊపిరి వెలికిఁబుచ్చినది.

**ఉచ్ఛ్వాసము.** సం. వి. అ. పుం. 1. ఊపిరి వెలికిఁబుచ్చుట; 2. ఊఱట; 3. కలఁజు; 4. ఆఖ్యాయికపరిచ్ఛేదము.

**ఉజాడు.** హిం. విణ. పాడయిన.

**ఉజ్జయిని.** సం. వి. ఈ. స్త్రీ. ఒకానొకపట్టణము.

**ఉజ్జాసనము.** సం. వి. అ. న. వధము, కొల.

**ఉజ్జి.** దే. విణ. ఉద్దియొక్క రూపాంతరము.

**ఉజ్జీవనము.** సం. వి. అ. న. జీవనము, బ్రదుకు.

**ఉజ్జీవించే.** సం. అ. క్రి. జీవించు, బ్రదుకు.

**ఉజ్జృంభితము.** సం. వి. అ. న. చేష్ట. విణ. విరిసినది.

**ఉజ్జ్వలము.** సం. వి. అ. పుం. సింగారము. విణ. 1. వెలుఁగునది; 2. తెల్లనిది; 3. విరియునది.

**ఉజ్జె.** దే. వి. ఊహ.

**ఉజ్జగిల్లు.** వై. అ. క్రి. తొలఁగు. "ముక్ద్వాపరముజ్జగిల్లుతటి." పాండు. 3, ఆ. (ప్రే. ఉజ్జగించు.)

**ఉజ్జగొను.** దే. స. క్రి. (ఉజ్జ+కొను.) ఊహించు. "సీ. అపకీర్తికోడఁబడు నాగాము లెఱుఁగఁడు లజ్జాభిమానంబులుజ్జగొనఁడు." రుక్మాం. ౫, ఆ.

**ఉజ్జనము.** వై. వి. విడుపు. "గీ. అనిననాసకారంబునుజ్జన మొనర్చి, యక్కుమారుఁడు నేమిరాయనుచునుండె." విక్ర. 3, ఆ.

**ఉజ్జనసేయు.** వై. స. క్రి. (ఉజ్జనము+చేయు.) విడుచు. "సంధ్యాభివందన శ్రద్ధయుజ్జనసేయు." కాశీ. ౪, ఆ.

**ఉజ్జని.** వై. వి. ఉజ్జయిని. "మ. తానేగెను, జనికిన్ సమ్మతిఁబొదుకంబువలనన్ సంతోషితస్వాంతుఁడై." విక్ర. ౨, ఆ.

**ఉజ్జాయించే.** దే. స. క్రి. ఊహించు.

**ఉజ్జీవకల్లు.** ద్వ. వి. అగ్నిపర్వతమునుండి వెడలఁగ్రక్కఁబడినఱాయి.

**ఉజ్ఝనము.** సం. వి. అ. న. విడుపు, ఉజ్జనము.

**ఉజ్ఝితము.** సం. విణ. (అ. ఆ. అ.) విడువఁబడినది.

**ఉటంకము.** దే. వి. టూకి, సంగ్రహము.

**ఉటంకి.** దే. విణ. 1. చొరవగలవాఁడు; 2. ధైర్యముగలవాఁడు.

**ఉటంకించే.** దే. స. క్రి. సంగ్రహించు.

**ఉటంకు.** దే. విణ. ఉటంకియొక్క రూపాంతరము.

**ఉటజము.** సం. వి. అ. పుం. న. 1. ఆకుటిల్లు; 2. ఇల్లు.

**ఉట్టంకణము.** సం. వి. అ. న. స్థాపనము.

**ఉట్టంకితము.** సం. విణ. (అ. ఆ. అ.) స్థాపింపఁబడినది.

**ఉట్టి.** దే. వి. పిడతలులోనగునవిడియుంచుటకై దారములతోనల్లివ్రేలఁగట్టెడియంత్రవిశేషము, శిక్యము.

**ఉట్టిచీల.** దే. వి. ఇరుప్రక్కల తలయేర్పడినచీల.

**ఉట్టిపడు.** దే. అ. క్రి. 1. ఉన్నట్టుండి కలుగు; 2. అతిశయించు. "ఆయతబంధురలంఘనోద్ధతిన్ గూర్చినవేగముట్టిపడ." శేష. ౨, ఆ.

ఉట్టు. దే. అ. క్రి. కాఱు, స్రవించు. "గీ. ఆర్చి నెత్తురుట్టనమ్మస్తకముపట్టి, కొనియతండుదాత్త ఘోరభంగి, బ్రమరిపాటికురున్నపాలకునరదం బు, నందువైచియిట్టులనియెనధిప." భార. ద్రో. ౫, ఆ.—వి. ఉప్పుపండఁదగిననేల.

ఉట్రవడియము. ద్వ. వి. ఒకదినుసువడియము.

ఉట్లబొద్ది. దే. వి. ఒకానొకచెట్టు.

ఉఠాణి. దే. విశే. గొప్ప, ఉన్నతము.

ఉడాయించే. హిం. క్రి. పాఱిపోవుట, హరించుట.

ఉడికిల్లు. దే. అ. క్రి. ఉడుకు, తపించు.

ఉడిగము. దే. వి. ఊడిగముయొక్కరూపాంతరము. "మహాస్రగ్ధర. అయ్యర్థులకుంబుత్తెంచెభూనా థుసతియుడిగపుందోయజాతాక్షిచేతన్." నై. ౭, ఆ.

ఉడివోవు. దే. అ. క్రి. (ఉడిగి+పోవు.) తొలఁగు. "క. అడిసిగ్గులుతమకంబులు, నుడివోవఁగఁగే లికడఁకలాదవఁగ." మార్క. ౭, ఆ.

ఉడుఁబోతు. దే. విశే. (ఉడుగు+పోతు.) ఉడుగు వాఁడు, విరతిశీలుఁడు.

ఉడుఁబోతుపిందె. దే. వి. కాపు ఉడిగినపిమ్మట చెట్లయందు కలిగెడుపిందె.

ఉడుక. వై. వి. వాద్యవిశేషము, హుడుక్కము.

ఉడుకాటము. దే. వి. ఉడుకాడుట.

ఉడుకాడు. దే. అ. క్రి. ఉడికిల్లు.

ఉడుకు. దే. అ. క్రి. తపించు. వి. తాపము.

ఉడుకుఁబోతు. దే. విశే. (ఉడుకు+పోతు.) ఈ ర్ష్యాళువు.

ఉడుకువ. దే. వి. ఊఱట, విరతి. "సీ. వాపిరిపాద లెడివగపుసందడిఁబడియురియుచునునికికినుడు కువయును." భార. విరా. ౨, ఆ.

ఉడుక్క. వై. వి. ఉడుకయొక్కరూపాంతరము.

ఉడుగర. దే. వి. 1. కానుక; "గీ. కడఁకరాసింగ మునకుడుగరలొసంగె." అచ్చ. యు, కాం.— 2. బహుమానము. "వ. ఇట్లు గావించియక్కరు వలిపట్టికమ్మటియకొమ్మచేతిగుఱుతుగొనివచ్చి ముద్దియుసుద్దియుద్ధవిడిసెఱింగించినఁబొంగిరా ముండతనిఁగౌఁగిటంజేర్చి గారవించియుడుగరలి చ్చియనిచిన." య. 3, ఆ.

ఉడుగు. దే. అ. క్రి. కృశించు. స. క్రి. మాను. "ఉత్పలగంధినన్నుడిగియొల్లనుబంపుము." భార. విరా. ౨, ఆ.

ఉడుత. దే. వి. వీఁపున మూఁడునిడుపుగీఱలుగల జంతువిశేషము, చిక్రోడము.

ఉడుపకుక్క. ద్వ. వి. (ఉడుము+కుక్క.) ఉడు ములొనగువానివేఁటాడెడుతుచ్ఛశునకము, మొ అసడము. "క. జాగిలములుమొఱసడములు, సొ గెఁగలసి చాపముక్తశరగతినందా, జాగిలముతె దిరెఁబందుల, కైగోధాదకముగాలికడరె నితర ముల్." (ఇదిమఱియొకచోచెప్పఁబడినప్పుడు.) "గీ. మున్నుజాగిలములఁగూడిచన్నయట్టి, యు డుపకుక్కలు కుందేళ్లనుందురువుల, నుడుముల గ్రహింపఁబుట్టలకడలఁబొదల, గిరులసరియులఁ బసివట్టితిరుగుచోట." స్వా. ౮, ఆ.

ఉడుపము. సం. వి. అ. న. ప్లవము, తెప్పమ్రాను.

ఉడుపు. దే. ప్రే. ఉడుగఁజేయు, ఉడిగించు.

ఉడుపుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు, చు క్కలఱేఁడు.

ఉడుపుష్పము. సం. వి. అ. న. 1. అశోకము?; 2. తామర; 3. దాసనము?.

ఉడుము. దే. వి. బల్లివంటిరూపముగల ఒకపెద్దజం తువు, గోధ.

ఉడువు. ఉభ. దే. స. క్రి. ఉడుగు. "ఉ. వింతయొ కాముశక్తి నుడివింపఁగ శక్యమె యెట్టివారికిన్." భార. ఆది. ౭, ఆ.—సం. వి. ఉ. స్త్రీ, న. నక్షత్రము.

ఉడుసర. దే. వి. కాఁచి, నాయసి?.

ఉడ్కువ. దే. వి. ఉడుకువయొక్కరూపాంతరము. "చ. వలవదుకోయఁబాండవులవారొకయుడ్కు వలేనిత్రిమ్మటన్, బలమఱిసైన్యసత్వములపాల్ప డిచచ్చినచోటఁబూరియున్, మొలవదె." భార. విరా. 3, ఆ.

ఉడ్డ. దే. వి. 1. నాలుగు; 2. రాశి.

ఉడ్డకేలువేలుపు. ద్వ. వి. విష్ణువు, చతుర్భుజుఁడు.

ఉడ్డమోము వేలుపు. ద్వ. వి. బ్రహ్మ, చతుర్ముఖుఁడు.

ఉడ్డా. దే. వి. ఉడ్డయొక్కరూపాంతరము.

ఉడ్డాడు. దే. అ. క్రి. కలఁగు. "ద్వి. వేగనందుని పల్లెవెలుచియుడ్డాడ, నలయకవర్షంపుఁడనిపల్కి యునుప." భాగ. ౧౦, స్కం. (ప్రే. ఉడ్డాడించు.)

ఉడ్డీనము. సం. వి. అ. న. పైకెగరుట, సెగవు.

ఉడ్డుగుడుచే. దే. అ. క్రి. ఊపిరిత్రిప్పలేకబాధపడు, తికమకలాడు. "వ. ఉదవాసక్లేశంబున నుడ్డుగుడి చివెలుపలికిఁబుట మెగయుచు." పాండు. 3, ఆ.

ఉడ్డపల్లంచి. దే. వి. బాలికాక్రీడావిశేషము.

**ఊబుజా.** దే. వి. మత్స్యవిశేషము. (అప్ర.)

**ఉతక.** దే. వి. ఉత్తరానితిరిగెడుకొయ్య.

**ఉతము.** సం. విణ. (అ. ఆ. అ.) ఊతము, నేసినది.

**ఉతుకు.** దే. స. క్రి. ఉదుకు, గుంజు.

**ఉత్కంఠ.** సం. వి. ఆ. స్త్రీ. ఇష్టవస్తుప్రాప్తియందలి వేగిరపాటు, తహతహ.

**ఉత్కంపించు.** సం. అ. క్రి. ఆకంపించు, వణఁకు.

**ఉత్కటము.** సం. వి. అ. న. లవంగపుపట్ట. విణ. 1. అధికమైనది; 2. మదించినది.

**ఉత్కము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉత్కంఠకలది.

**ఉత్కరము.** సం. వి. అ. పుం. 1. సమూహము; 2. రాశి.

**ఉత్కర్షము.** సం. వి. అ. పుం. శ్రైష్ఠ్యము, మేలు.

**ఉత్కలము.** సం. వి. అ. పుం. దేశవిశేషము.

**ఉత్కలిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఉత్కంఠ; 2. పెద్ద అల; 3. హేల.

**ఉత్కలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ధురీణుఁడు, నిర్వాహకుఁడు.

**ఉత్కారము.** సం. వి. అ. పుం. 1. ధాన్యము తూర్పెత్తుట; 2. ప్రోగుచేయుట.

**ఉత్కృష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) శ్రేష్ఠము, మేలుచేయి.

**ఉత్కోచము.** సం. వి. అ. పుం. లంచము.

**ఉత్క్రమణము.** సం. వి. అ. న. మీఁదికిఁబోవుట.

**ఉత్క్రోశము.** సం. వి. అ. పుం. లకుముకిపిట్ట; గోరువంక. (అనికొందఱు.) పెన్నడపులుఁగు. (అని కొందఱు.)

**ఉత్క్షిప్తము.** సం. విణ. (అ. ఆ. అ.) ఎగఁజిమ్మఁబడినది.

**ఉత్క్షేపము.** సం. వి. అ. పుం. ఎగఁజిమ్ముట.

**ఉత్ఖాతము.** సం. వి. అ. న. 1. గజక్రీడ; 2. విషమస్థలము. విణ. పెల్లగింపఁబడినది.

**ఉత్త.** దే. విణ. రిక్తము, శూన్యము.

**ఉత్తండములు.** దే. వి. బ. ఆఁడువారికంఠభూషావిశేషము.

**ఉత్తంభనము.** సం. వి. అ. న. 1. నిలుపుట; 2. పొడిగించుట.

**ఉత్తంభించు.** సం. స. క్రి. 1. నిలుపు; 2. పొడిగించు.

**ఉత్తంభితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. నిలుపఁబడినది; 2. పొడిగింపఁబడినది.

**ఉత్తంసము.** సం. వి. అ. పుం, న. 1. పూఁగమ్మ; 2. సిగబంతి.

**ఉత్తప్తము.** సం. వి. అ. న. ఎండినమాంసము. విణ. 1. కదలినది; 2. కాచఁబడినది.

**ఉత్తమ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఉత్తమురాలు; 2. చిఱుపాలి*. విణ. 1. ముఖ్యము; 2. (వ్యాకరణమునందు) కడపటిది.

**ఉత్తమర్ణుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) అప్పిచ్చినవాఁడు

**ఉత్తమాంగము.** సం. వి. అ. న. శిరము, తల.

**ఉత్తము.** సం. విణ. (అ. ఆ. అ.) ఆర్ద్రము, తడిసినది.

**ఉత్తర.** సం. వి. ఆ. స్త్రీ. 1. నక్షత్రవిశేషము; 2. ఉత్తరపుదిక్కు; 3. విరాటునికూఁతురు. అ. న. ము. 1. ఒక అర్థాలంకారము; (చూ. అలంకారము.) 2. మాఱుమాట. విణ. 1. ఉత్తరపుదిక్కుది; 2. మీఁదిది.

**ఉత్తరంగము.** సం. వి. అ. న. కడపకుసరిమీఁదికమ్మి. విణ. లేచునట్టి అలలుగలది.

**ఉత్తరక్రియ.** సం. వి. ఆ. స్త్రీ. 1. (మృతులకుఁజేసెడి) అపరకర్మము.

**ఉత్తరడొక్కరము.** వై. వి. మల్లబంధవిశేషము.

**ఉత్తరణము.** సం. వి. అ. న. దాఁటుట.

**ఉత్తరదోఃకరము.** సం. వి. అ. న. ఉత్తరడొక్కరము. "శ్లో. గ్రీవాయాశ్చభుజాయాశ్చపాదేనాక్రమణేసతి, అన్యజాన్వవబంధేనకుర్యాదుత్తరదోఃకరమ్." అని శివతత్త్వరత్నాకరము.

**ఉత్తరపక్షము.** సం. వి. అ. పుం. సిద్ధాంతము.

**ఉత్తరఫల్గుని.** సం. వి. ఈ. స్త్రీ. నక్షత్రవిశేషము.

**ఉత్తరభద్రపద.** సం. వి. ఆ. స్త్రీ. నక్షత్రవిశేషము.

**ఉత్తరవాసము.** సం. వి. స్. న. ఉత్తరీయము. "సీ. చంద్రాతపముతోడ సరియైన వెలిపట్టుపుట్టము త్తరవాసముగధరించి." నై. ౧, ఆ.

**ఉత్తరసాక్షి.** సం. వి. న్. పుం. సాక్షులగుటకుసాక్షి.

**ఉత్తరాషాఢ.** సం. వి. ఆ. స్త్రీ. నక్షత్రవిశేషము.

**ఉత్తరాసంగము.** సం. వి. అ. పుం. ఉత్తరీయము.

**ఉత్తరాని.** దే. వి. తలుపుక్రిందతిరిగెడుకుబుసము.

**ఉత్తరించు.** ఉభ. దే. స. క్రి. ఖండించు. "ఉత్తరించు తమలపాకునిక్కాడుక్రియ." ఉ, హరి. ౪ ఆ. "ద్వి. తలలుత్తరింతు." రా. అర, కాం.—సం దాఁటు.

**ఉత్తరీయము.** సం. వి. అ. న. బయిరవాసము.

**ఉత్తరుఁడు.** సం. వి. అ. పుం. 1. సామంతునిచేరువనున్న రాజు; 2. విరాటునికొడుకు. విణ. ఉత్తముఁడు.

**ఉత్తరువు.** వై. వి. సెలవు, ఆజ్ఞ*.

**ఉత్తరేను.** దే. వి. **అపామార్గము.** (దీనినే ఉత్తరేణి యని వాడుదురు.)

**ఉత్తరోత్తరము.** సం. క్రి. విశ. అ. న. పైపై.

**ఉత్తలపడు.** ద్వ. అ. క్రి. (ఉత్తలము+పడు.) 1. త్వరపడు; "వీచీభుజావళి యాలింగనకేళి కుత్తలపడఁగ." హరి. పూ. ౭, ఆ.—2. పరితాపపడు; "అనవినుచుం గలఁగుహృదయంబునఁదాపముని న్వటిల్ల." (అమీఁద.) "అనుచునుత్తలపడునయ్యవసరంబున." భార. విరా. ౫, ఆ.—3. వ్యత్యస్తమగు; "చ. కలఁగెఁబయోనిధుల్ గిరులుకంపము నొందెఁజలించెభూమిది, క్కులుఁపడఁకెఁగ వియత్తలముగుబ్బటిలెఁగ్రహతారకంబులు, త్తలపడఁజొచ్చె." భో. ౮, ఆ.—4. కలఁతపడు.

**ఉత్తలపాటు.** దే. వి. (ఉత్తలపడుట.) 1. త్వరపడుట; 2. పరితాపపడుట; 3. వ్యత్యస్తమగుట; 4. కలఁతపడుట.

**ఉత్తలపెట్టు.** దే. స. క్రి. (ఉత్తలము+పెట్టు.) 1. త్వరపఱచు; 2. పరితాపపడఁజేయు; 3. వ్యత్యస్తముకావించు; 4. కలఁతపఱచు.

**ఉత్తలము.** దే. వి. 1. త్వర; 2. పరితాపము; "క. చిత్తంబునఁబైకొనియెడు, నుత్తలమునడంచిముఖపయోరుహమునఁద, ల్లొత్తెడు వెడనవ్వునఁబ్రియు, చిత్తం బిగురొత్తఁజనియెఁ జెలువయెడవికిఁగ." సం. "సహభర్త్రాహసంతీన హృదయేన విదూయతా." భార.ఆర.౭,ఆ.—3.వ్యత్యాసము;4.కలఁత."ఉ. అత్తఱిఁగెంపుమీఱినఘనావళియాకసమెల్లఁగప్పి క్రొ, న్నెత్తురు నెమ్ములుఁగ గురిసెనీరధియెంతయు ఘూర్ణమానమై, యుత్తలమందెఁబర్వతములొక్కుమొగిఁగదలెఁగ మహోల్కముల్, మొత్తము గట్టిరాలెబలముల్ వెఱఁగందఁగఁజేటు తెల్పుచుఁగ." నిర్వ. ౨, ఆ.

**ఉత్తానము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. లోఁతులేనిది; 2. వెలికిలినది.

**ఉత్తానశయుఁడు.** సం. వి. అ. పుం. వెలికిలి పరుండుబిడ్డ, డింభుఁడు.

**ఉత్తారకుఁడు.** సం.విశ.(అ.ఆ.అ.)దాఁటించువాఁడు.

**ఉత్తార్యము.** సం. విశ. (అ. ఆ. అ.) దాఁటఁదగినది.

**ఉత్తాలము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. పొడవైనది; 2. తొట్రుపాటుగలది; 3. మేలైనది; 4. విరివియైనది.

**ఉత్తి.** దే. వి. ఈడు, ప్రతినిధి. "చ. శమనతనూజమాద్రిజాలుసాత్తులుగాఁజనియావనాశ్వదు, గ్గమువడిఁజొచ్చి యధ్వరతురంగముఁబావనికిచ్చి తన్ద్రిపా, పములనడంచిసద్గతికిఁ బంపినక్రీడిబుణంబు నేనత, త్సమరతలంబునఁగ వినుతశౌర్యమునుత్తిగఁబెట్టితీర్చెదఁగ." జై. ౧, ఆ. (ఇది యింకను విచార్యము.)

**ఉత్తీర్ణము.** సం. విశ. (అ. ఆ. అ.) దాఁటఁబడినది.

**ఉత్తుంగము.** సం. విశ. (అ. ఆ. అ.) పొడవైనది.

**ఉత్తుండి.** సం. వి. ఈ. స్త్రీ. గురుజే.

**ఉత్తుఁడు.** వై. విశ. తగినవాఁడు. "గీ. ఎన్నియేఁడులు మనుజుని యెమ్ముగంగ, వారిలోనుండునన్నివేల్ వత్సరములు, నాకలోకమహాసుఖశ్రీకివాతఁ, డుత్తుఁడైయుండు నిర్మలచిత్తవృత్తి." భార. అను. ౨, ఆ.

**ఉత్తేజనము.** సం. వి. అ. న. 1. ప్రేరేచుట; 2. వాఁడిచేయుట; 3. నడపుట; 4. పుచ్చుట.

**ఉత్తేజితము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. ప్రేరేపఁబడినది; 2. వాఁడిచేయఁబడినది; 3. నడపఁబడినది; 4. పుచ్చఁబడినది

**ఉత్థము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. నిలిచినది; 2. పుట్టినది.

**ఉత్థానము.** సం. వి. అ. న. 1. కూర్చుండిలేచుట; 2. పురుషప్రమాణము

5. యుద్ధము; 6. మలముజారెడి రోగవిశేషము; 7. సంతోషము; 8. సమాప్తి; 9. సైన్యము.

**ఉత్థాపకము.** సం. విశ. (అ. ఆ. అ.) లేపునది.

**ఉత్థాపనము.** సం. వి. అ. న. లేపుట.

**ఉత్థాపితము.** సం. విశ (అ. ఆ. అ.) లేపఁబడినది.

**ఉత్థితము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. లేచినది; 2. పుట్టినది; 3. పెరిగినది; 4. యత్నించినది.

**ఉత్పతనము.** సం.వి.అ.న.1. ఎగయుట; 2. పుట్టుక.

**ఉత్పతిత.** సం. విశ. (ఋ. ఈ. ఋ.) ఎగిరెడుస్వభావముకలవాఁడు.

**ఉత్పతితము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఎగసినది; 2. పుట్టినది.

**ఉత్పతిష్ణువు.** సం. విశ. ఉ. ఎగిరెడు స్వభావము గలవాఁడు.

**ఉత్పత్తి.** సం. వి. ఇ. స్త్రీ. జననము, పుట్టుక.

**ఉత్పథము.** సం. వి. అ. పుం, న. కానిత్రోవ.

**ఉత్పన్నము.** సం.విశ.(అ.ఆ.అ.)ఉత్థితము,పుట్టినది.

ఉత్పలపత్త్రము. సం. వి. అ. న. కలువ ఱేకు. బ. పిఱుఁదులమీఁదినఖక్షతములు. "చ. ఒనరఁగఁ జూడనింపెసఁగనుత్పలపత్త్రములొప్పుచున్నవీ, ఘనతరసైకతంబుపయిఁగంటిరెకిన్నరకంతులార యం, చనుపమలీలనీఁదునొకయంబుజపాణికటీ నఖాంకముల్, గనుఁగొనినర్మగర్భములుగానొక యంగనపల్కెనవ్వుచున్." భాను. ౨, ఆ.

ఉత్పలము. సం. వి. అ. న. 1. కలువ; 2. చెంగల్వ కోష్టు!.

ఉత్పలశారిబ. సం. వి. ఆ. స్త్రీ. మామెన!.

ఉత్పశ్యుఁడు. సం. విణ.(అ. ఆ. అ.) మీఁదుచూచు వాఁడు.

ఉత్పాటనము. సం. వి. అ. న. పెఱుకుట.

ఉత్పాటించు. సం. స. క్రి. పెఱుకు.

ఉత్పాటితము. సం. విణ. (అ. ఆ. అ.) పెఱుకఁబడినది.

ఉత్పాతము. సం. వి. అ. పుం. అపశకునము. (అనఁగా ఆబాలవిద్వజ్జనప్రసిద్ధమైన వస్తురూపమున కంటెభిన్నమైనవస్తురూపము. ఇది త్రివిధము.— దివ్యము, ఆంతరిక్షము, భౌమము అని. దివ్యము—అపూర్వగ్రహనక్షత్త్రములుపుట్టుట. ఆంతరిక్షము—పరివేషముఇంద్రధనుస్సునుకలుగుట, కొఱవియుపిడుగునుపడుట. భౌమము—అపూర్వములైనచరాచరవస్తువులుకలుగుట. ఇవి దుఃఖ రోగప్రదములు.)

ఉత్పాదకము. సం. వి. అ. పుం. శరభము. విణ. కలిగించునది.

ఉత్పాదనము. సం. వి. అ. న. ఆపాదనము, కలిగించుట.

ఉత్పాదితము. సం. విణ. (అ. ఆ. అ.) ఆపాదితము, కలిగింపఁబడినది.

ఉత్పాదిల్లు. సం. అ. క్రి. కలుగు. (ప్రే. ఉత్పాదించు.)

ఉత్ప్రాసము. సం. వి. అ. పుం. మర్మము దూఱిపాఱునాడెడు పరిహాసము.

ఉత్ప్రేక్ష. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒక అర్థాలంకారము; (చూ. అలంకారము.) 2. హెచ్చరికలేమి.

ఉత్ప్రేక్షించు. సం. స. క్రి. ఉత్ప్రేక్ష కలుగఁజెప్పు.

ఉత్ఫుల్లము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వికసించినది; 2. బలిసినది.

ఉత్సంగము. సం. వి. అ. పుం. 1. ఒడి; 2. తొడ; 3. అభినయహస్తవిశేషము. (వ్రేళ్లుచాఁచిపట్టిన రెండుచేతులనుమనికట్లయందుఁగూర్చిబొమ్మునఁ బట్టినది.)

ఉత్సన్నము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పెల్లగింపఁ బడినది; 2. పైకెత్తఁబడినది.

ఉత్సము. సం. వి. అ. పుం. ప్రస్రవణము, ఊట.

ఉత్సర్గము. సం. వి. అ. పుం. 1. త్యాగము; 2. దానము; 3. న్యాయము; 4. విడుపు; 5. సామాన్యము.

ఉత్సర్జనము. సం. వి. అ. న. 1. త్యాగము; 2. విడుపు.

ఉత్సర్జించు. సం. స. క్రి. విసర్జించు, విడుచు.

ఉత్సర్జితము. సం. విణ. (అ. ఆ. అ.) విడువఁబడినది.

ఉత్సవము. సం. వి. అ. పుం. 1. పండుగ; 2. కోరికలు కొనసాగుట; 3. గర్వము; 4. కోపము.

ఉత్సహించు. సం. అ. క్రి. యత్నించు, కడఁగు.

ఉత్సాదనము. సం. వి. అ. న. 1. నలుఁగు; 2. పెల్లగించుట; 3. పైకెత్తుట.

ఉత్సాదించు. సం. స. క్రి. 1. పెల్లగించు; 2. పైకెత్తు.

ఉత్సాదితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నలుఁగు పెట్టఁబడినది; 2. పెల్లగింపఁబడినది; 3. పైకెత్తఁ బడినది.

ఉత్సారణము. సం. వి. అ. న. కదలించుట.

ఉత్సారించు. సం. స. క్రి. కదలించు.

ఉత్సారితము. సం. విణ. (అ. ఆ. అ.) కదలింపఁ బడినది.

ఉత్సాహము. సం. వి. అ. పుం. 1. ప్రయత్నము; 2. సూత్రము.

ఉత్సాహవర్ధనము. సం. వి. అ. పుం. వీరరసము.

ఉత్సాహించు. సం. అ. క్రి. ఉద్యమించు, కడఁగు. "శా. మరుదైత్త్రింబొల్చుహంతౌకులీలఁగుశుఁడు త్సాహించెసోదర్యుతోన్." జై. ౬, ఆ.

ఉత్సిక్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. అతిశయించినది; 2. గర్వించినది; 3. పొంగినది; 4. ప్రోక్షింపఁబడినది.

ఉత్సుకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఇష్టమైనకార్యమునందు ఉద్యోగించినవాఁడు.

ఉత్సృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఇయ్యఁబడినది; 2. విడువఁబడినది.

ఉత్సేకము. సం. వి. అ. పుం. 1. అతిశయము; 2. గర్వము; 3. పొంగు; 4. ప్రోక్షణము.

ఉత్సేకించు. సం. అ. క్రి. 1. అతిశయించు; 2. గర్వించు; 3. పొంగు. స. క్రి. ప్రోక్షించు.

ఉత్సేధము. సం.వి.అ.న. శరీరము. పుం, న. పొడవు.
ఉదంచనము. సం. వి. అ. న. 1. మూకుడు; 2. విజృంభించుట; 3. పైకివైచుట.
ఉదంచితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. విజృంభించినది; 2. పైకివైవఁబడినది.
ఉదంతము. సం. వి. అ. పుం. వృత్తాంతము, సుద్ది.
ఉదంతుఁడు. సం. వి. అ. పుం. 1. మంచిమనుష్యుఁడు; 2. వర్తకుఁడు.
ఉదకము. సం. వి. అ. న. జలము, నీరు.
ఉదక్తము. సం. విణ. (అ. ఆ. అ.) చేఁదఁబడినది.
ఉదక్య. సం. వి. ఆ. స్త్రీ. రజస్వల, ముట్టుది.
ఉదగ్రము. సం. విణ. (అ.ఆ.అ.) 1. పొడవైనది; 2. భయంకరమైనది.
ఉదజము. సం. వి. అ. పుం. పసులఁద్రోలుట. విణ. నీటఁబుట్టినది.
ఉదధి. సం. వి. ఇ. పుం. సముద్రము, కడలి.
ఉదన్య. సం. వి. ఆ. స్త్రీ. నీళ్లుత్రాగనిచ్ఛ, నీరువట్టు.
ఉదన్వంతము. సం. వి. త్. పుం. సముద్రము, కడలి.
ఉదపానము. సం. వి. అ. పుం, న. కూపము, నుయ్యి.
ఉదయనీయ. సం. వి. ఆ. స్త్రీ. సమాప్తేష్టి.
ఉదయము. సం. వి. అ. పుం. 1. పుట్టుక; 2. ఉన్నతి; 3. తూర్పుకొండ; 4. పొడవు.
ఉదరంభరి. సం. విణ. ఇ. తనపొట్టపోసికొనువాఁడు.
ఉదరము. సం. వి. అ. న. 1. కడుపు; 2. యుద్ధము.
ఉదరిపడు. ద్వ. అ. క్రి. అదరిపడు. "గీ. ఉదరిపడిమేలుకనికన్నులువిదపిచ్చి, చూచికానదయట్టియాసొబగునచట." హరి. ఉ. ౭, ఆ.
ఉదరిపాటు. ద్వ. వి. 1. అదరిపాటు; "ద్వి. ఉదరిపాటునఁదడంకోపకినుండి." విష్ణు. పూ. ౧, ఆ.—2. ఉలికిపాటు. "ఎ, గీ. అతనియాకారమునుజూచియదరిబెదరి, చెదరపదములుతడఁబడనుదరిపాటు, గదుర." ఉ, రా. 3, ఆ.
ఉదరు. దే. అ. క్రి. అదరు, చలించు. "సీ. ఉదరిక్రేళ్లుతికెడుమృగకేసరులతోబిలగతాహులుకింకవెలికినెగయ." హరి. పూ. ౭, ఆ.
ఉదర్కము. సం. వి. అ. పుం. 1. రాఁగలకాలము; 2. రాఁగలఫలము; 3. ఉన్మత్తముల్లు.
ఉదర్చి. సం. వి. స్. పుం. అగ్ని. విణ. పైకెగయుమంటలుగలది.
ఉదవసితము. సం. వి. అ. పుం, న. గృహము, ఇల్లు.
ఉదశ్విత్తు. సం. వి. త్. న. సగమునీళ్లుచేర్చినమజ్జిగ.
ఉదస్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తొలఁగింపఁబడినవాఁడు.
ఉదాకరము. సం. వి. అ. పుం. సముద్రము, కడలి.
ఉదాత్తము. సం. వి. అ. పుం. 1. వేదమునందలిస్వరవిశేషము; (చూ. స్వరము.) 2. ఒక అర్థాలంకారము. (చూ. అలంకారము.)
ఉదాత్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. గొప్పవాఁడు; 2. దయగలవాఁడు; 3. ఇచ్చువాఁడు; 4. ఒప్పిదముగలవాఁడు.
ఉదానము. సం. వి. అ. పుం. 1. కంఠమునందలిగాలి; 2. పాము; 3. బొడ్డు.
ఉదారము. సం. వి. అ. పుం. ధాన్యవిశేషము, ఊదరలు. "శ్లో. ప్రియంగవోహ్యుదారాశ్చ కోరదూషాస్సతీనకాః." విష్ణుపురాణము. ప్రథమాంశము. ౬, అధ్యాయము.
ఉదారుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఇచ్చువాఁడు; 2. గొప్పవాఁడు; 3. తిన్నఁదనముగలవాఁడు.
ఉదాసము. సం. వి. అ. పుం. తగులమి.
ఉదాసించు. సం. స. క్రి. తిరస్కరించు.
ఉదాసీనుఁడు. సం. వి. అ. పుం. దండెత్తిపోవువానికి మిత్రుఁడగువానిదేశమునకు నావలిదేశపురాజు. విణ. తగులనివాఁడు. ఉదాసీనపుమాటలు, దుర్భాషలు.
ఉదాస్థితుఁడు. సం. వి. అ. పుం. 1. వాకిటికావలివాఁడు; 2. స్వకర్మమునువదలినముని; 3. వేగులవాఁడు.
ఉదాహరణము. సం.వి.అ.న. చెప్పెడియర్థమునకు సరితాఁకునట్లు ఎత్తిచూపెడు అర్థాంతరము, తెలివిడి.
ఉదాహరించు. సం. స. క్రి. ఉదాహరణపఱచు.
ఉదాహారము. సం. వి. అ. పుం. ఉదాహరణము.
ఉదాహృతము. సం. విణ. (అ. ఆ. అ.) ఉదాహరింపఁబడినది.
ఉదితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చెప్పఁబడినది; 2. పుట్టినది.
ఉదియ. వై. వి. (ఉద్దియయొక్కరూపాంతరము.) యత్నము. "మ. వడిఁజుట్టుంజనియార్చుఁబేర్చుఁగదియన్ వచ్చున్ వెసన్ ప్రచ్చుఁజే, ద్పడనొంచుంగబలించుఁజించుఁదొలఁగున్ డాయున్ దగన్ ప్రేయుచీ, ద్పడనొత్తున్ దివికెత్తుఁగిట్టియుదియన్ బట్టున్ బడంద్రోచుబ, ల్విడిఁదోఁచున్

రుధిరంబుఁబిల్చుఁబెలుచఁగఁ వీక్షించుఁగ్రోధంబు నఁగా." రా. అర. ౨, ఆ.
ఉదియఁగొను. ద్వి. అ. క్రి. (ఉదియ+కొను.) యత్నించు. "సీ. ఒండొరునొప్పింపనుదుగక పెనఁగంగనొదవునదల్పులను దియఁగొనుచు." రా. అర. ౨, ఆ.
ఉదిరి. దే. వి. అపరంజి. "ఉదిరియంబరమువాఁడు." చంద్రా. ౧, ఆ.—విణ. తప్తము. "సీ. ఇదికోల మెఱుఁగుగాదుదిరిబంగారంపుఁబసిమిగ్రమ్మెడు పచ్చపట్టుగాని." పాండు. ౪, ఆ.
ఉదిరిగొను. దే. అ. క్రి. (ఉదిరి+కొను.) వందు; తపించు. "వ. ఇట్లువ్యాదయంబునంగదిరినమద నానలఁబు చేనుదిరిగొనియాసుదతిచిత్రరేఖకిట్లని యె." (ఇక్కడ ఉదిలగొనియనియుండవచ్చును. అయినను ప్రతులయందు పాఠము ఇట్లున్నది.) ఉ, హరి. ౫, ఆ.
ఉదిల. దే. వి. పరితాపము.
ఉదిలకొను. దే. అ. క్రి. ఉత్తలపడు, పరితపించు. "ఎ, గీ. మరుఁడుదోడ్తోఁడఁదేఁకువమాలికదిసి, తూపుగములక్రొవ్వాఁడిమిచూపనంత, కంతకునువగ్గలంబగువంతఁదూలి, పోయెఁబావకుఁడేమి చెప్పుదునరేంద్ర. వ. ఇట్లుమదనాగ్నినుదిలకొని యగ్నిదేవుండకాఁతలోనేకాంతంబుననిట్లని యె." భార. అను. ౧, ఆ.
ఉదీచి. సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరపుదిక్కు.
ఉదీచ్యము. సం. వి. అ. న. కురువేరు. పుం. శరావతీ నదియెల్లగాఁగలపశ్చిమోత్తరముల మధ్యదేశము. విణ. ఉత్తరపుదిక్కుది.
ఉదీర్ణము. సం.విణ. (అ. ఆ.అ.) ఉదారము, గొప్పది.
ఉదుంబరపర్ణి. సం వి. ఈ. స్త్రీ. దంతి?.
ఉదుంబరము. సం.వి. అ.న. రాగి. పుం. 1. మేడి?; 2. గడప; 3. కుష్ఠభేదము.
ఉదుంబరుఁడు. సం.వి.అ. పుం. నపుంసకుఁడు, పేడి.
ఉదుకు. దే. స. క్రి. ఉతుకు, గుంజు.
ఉదుటు. దే. వి. ఉద్ధతి. "మూర్ఛతొలంగినఁగన్ను విచ్చిపేరుదుటునలే చెలఙ్మణసహోదరుఁడు." ఉ, రా. 2, ఆ.—విణ. ఉద్ధతము.
ఉదురు. దే. వి. ఉదుటు. "చ. చెదరకయక్షులద్దను జశేఖరుబిట్టెదిరించిభీకర, ప్రదరపరంపరల్ గురిసిపైపయినైకవిధాయుధచ్ఛటల్, గుదిగొనవిం చిబీరమునఁగోయనియార్చినచోమహోదరుం, డుదురుననొక్కఘోరగదయూనికృతాంతునిలీలనుగ్రుఁడై." ఉ, రా. 3, ఆ. (ఉదురుమిడుకు ఇత్యాదిపదప్రయోగమువలన నిది ప్రయోగవిరళముగానుండినను వ్రాయఁబడియెను.)
ఉదురుమిడుకు. దే. విణ. 1. ఉద్ధతుఁడు; 2. దుర్వినీతుఁడు.
ఉదూఖలము. సం. వి. అ. న. 1. ఱోలు; 2. గుగ్గిలపుచెట్టు.
ఉదూఢము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పెండ్లియైనది; 2. బలిసినది; 3. వహింపఁబడినది.
ఉద్గతము. సం. విణ. (అ. ఆ. అ.) భేదించుకొని వెలికుఱికినది.
ఉద్గతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఎగపు; 2. పుట్టుక. "జగదుద్గతికినిబీజము." ఆము. 3, ఆ.
ఉద్గమనీయము. సం. వి. అ. న. ఉదికినదోవతిజోడు. (కొందఱీద్విత్రిలింగమనియుదీనికర్థము ఉదికినదోవతి అనియు సహేతుకముగఁ జెప్పుచున్నారు.) విణ. ఎగయఁదగినది.
ఉద్గమము. సం. వి. అ. పుం. 1. ఎగపు; 2. పుట్టుక.
ఉద్గమించు. సం. అ. క్రి. ఎగయు.
ఉద్గరణము. సం. వి. అ. న. 1. క్రక్కుడు; 2. త్రేఁపు.
ఉద్గాఢము. సం. క్రి. విణ. అ. న. పెల్లు. విణ. అధికము.
ఉద్గాత. సం. వి. ఋ. పుం. యజ్ఞమునందుసామవేద తంత్రమునడపువాఁడు.
ఉద్గారము. సం.వి. అ. పుం. 1. క్రక్కుడు; 2. త్రేఁపు. (చూ. అభిఘారము.)
ఉద్గారించు. సం. అ. క్రి. త్రేఁచు.
ఉద్గీథము. సం. వి. అ. పుం. సామవేదము. (సామవేదముయొక్కభాగమని ఒకఁడు.)
ఉద్గీర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) క్రక్కఁబడినది.
ఉద్ఘూర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) పైకెత్తఁబడినది.
ఉద్గ్రాహము. సం. వి. అ. పుం. ఉగ్గము. ఎగఁబట్టుట. (అనికొందఱు.)
ఉద్గ్రీవుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. పైకెత్తఁబడిన మెడగలవాఁడు; 2. గర్వముగలవాఁడు.
ఉద్ఘనము. సం. వి. అ. పుం. చెక్కడుమ్రానికి ఊఁతగా క్రిందనుంచుకొనెడి బల్లలోనగునది, దాయి.
ఉద్ఘము. సం. విణ. అ. పుం. ఇది వృత్తియందు ఉత్తరపదమై శ్రేష్ఠతను తెలుపును. (ఉదా. గవోద్ఘము. మొ.)

**ఊఁకువగు.** దే. అ. క్రి. (ఊఁకువ+అగు.) పూను. "ఒక్కనిమేషమాత్రమం బుడుగహిరణ్యనాభత గనూఁకువగమ్ము." రా. సుం, కాం.

**ఊఁకొట్టు.** ద్వి. స. క్రి. ఊఁ ఊఁ అని వృత్తాంతము విను.

**ఊఁకొను.** ద్వి. స. క్రి. ఊఁకొట్టు. "క. అఁకొన్న మృత్యువనోయనఁ, బ్రాఁకినలయకాలరుద్రఫాలానలమో, యూఁకొనఁదడవయ్యెడునది, సోఁకినచోట్లెల్లగాలఁజొరనిచ్చెదమే." ఉ, హరి. 3, ఆ.

**ఊఁగాడు.** దే. అ. క్రి. (ఊఁగి+ఆడు.) ఊఁగులాడు. "వన్నెలాఁడిబన్నసరులు నాయురముపైనూఁగాడఁగా." క్షేత్రయ. (దోఁగియాడు దోఁగాడు, పాఱియాడు పాఱాడు, వ్రేలియాడు వ్రేలాడు అని మహాకవిప్రయోగములు గానఁబడుచున్నవి. ఇట్టిక్రియలందు స్వార్థమున ఆడు.)

**ఊఁగు.** దే. అ. క్రి. ఊఁగాడు, ఆందోళించు.

**ఊఁగులాట.** దే. వి. ఊఁగులాడుట, ఆందోళనము.

**ఊఁగులాడు.** దే. అ. క్రి. (ఊఁగులు+ఆడు.) ఊఁగాడు.

• **ఊఁచ.** దే. వి. 1. జొన్నలోనగువానికంకికాఁడ; 2. అరఁటిబొందె; 3. ముండ్లదుబ్బు. "గీ. విసరియొకయూఁచగొనివేయ వెంట వెంట, నదియయొక్కమహాస్త్రమైకదియ." రామా. ౫, ఆ.

**ఊఁచపడు.** ద్వి. అ. క్రి. 1. ఊఁచపట్టు; 2. కృశించు. "చ. సరసిజగంధిపెందొడలసాటికిరానెదిరించిపోరుసీ. కరభములెల్లఁజేపడఁగఁగన్గొనియుండియుఁదజ్జయార్థమై, పొరలఁబెనంగియూఁచపడిపోవుటలింతియకాకధాత్రిపై, నరఁటులుపిల్లపిల్లతరమైననుసామ్యముఁబొందనేర్చునే." భాను. ౨, ఆ. (ఇదిరెండర్థములకును ఉదాహరణము.)

**ఊఁచపోవు.** దే. అ. క్రి. కృశించు. "ఊఁచపోయిన పిఱుఁదుదుటుఁబొట్ట." భల్లా. ౪, ఆ. (పిఱుఁదుదు ఉదుటు అనిభేదము.)

**ఊఁచబియ్యము.** దే. వి. చక్కఁగానుదురనిజొన్నలోనగువానిధాన్యము.

**ఊఁచముట్టు.** దే. క్రి. విశే. నిశ్శేషము. "గీ. కొడుకతమ్ములుదోడ్పడఁగడఁగిశత్రు, వరులగెలిచెదనంటివొక్కరుఁడుదక్క, కుండనీతమ్ముగుట్టలనూఁచముట్టుగొనియెనేవిధియేగతిఁజనుదుఁజెపుమ." భార. శల్య. ౧, ఆ. "గీ. ఉద్దవిడినపసులనూఁచముట్టుగఁదెత్తు." భార. విరా. 3, ఆ.

**ఊఁచు.** దే. ప్రే. ఊఁగఁజేయు.

**ఊఁటు.** దే. స. క్రి. దూఁటు, పొడుచు. "సీ. చేసమ్మెటలనుజేఱుకోలలవ్రేసియుంకుశంబులనూఁటియతిరయమున." భార. భీష్మ. 3, ఆ. "సీ. పులిపులిగాఁగ బెబ్బులిపిండునొకనాడుచెదరఁగానూఁటెనాచేతియీఁటె." రామా. ౨, ఆ. (ఇట్లజాదిగాఁ బ్రయోగములందుఁ గానఁబడుచున్నదిగాని యిట్టిదయని నిర్ధారణచేయుటకుఁ దగిన ప్రయోగము దొరకినదికాదు.)

**ఊఁత.** దే. వి. 1. అవలంబము; "ఉ. లేఁతలలోనసెల్లగడులేఁతకృతాంతునిసమ్ముఖంబుదా, కోఁతలకెల్లఁబుట్టినిలుకోపముకందువమృత్యుమూర్తిపై, నూఁతసమస్తదోషములనుండెడు నిక్కడఁగెయొప్పుడుం, జేఁతికిఁజేఁదుదుష్టమిదిచిత్రజుమాయ తలంచిచూడఁగన్." శివ. ఉ. ౨, ఆ.—2. పైక్రిందులు బయలుగావిడిచి యడుగునుండి మీఁదికి వాటముగా గంపవలె చువ్వలతోనల్లిన మత్స్యగ్రహణ సాధనవిశేషము. "ఊఁతనీరు చెలఁదినేఁత." ఆము. ౬, ఆ.

**ఊఁతకొను.** దే. స. క్రి. ఊఁదు, అవలంబించు. "ఉ. కాననివానినూఁతకొని కాననివాఁడువిశిష్టవస్తువుల్, కాననిభంగి." భాగ. ౭, స్కం.

**ఊఁతకోల.** ద్వి. వి. ఊనుకోనెడుకఱ్ఱ.

**ఊఁతము.** దే. వి. పట్టు, అవలంబము. "సీ. తనచేతినిడుదయూఁతపుఁ గోలయందిచ్చి మెల్లమెల్లనె కొంతమెలఁగఁజేయు." సా. 3, ఆ.

**ఊఁద.** దే. వి. 1. వాఁపు; 2. ఈర్ష్య.

**ఊఁదబొద్దు.** దే. వి. ఊఱుకుబొద్దు. (చూ. తెట్టు.)

**ఊఁదర.** దే. వి. (కాయలుపండుటకును ఎలుకలులోనగునవి చచ్చుటకును వేసెడు) పొగ.

**ఊఁదరపెట్టు.** దే. స. క్రి. (పొగవేసి జంతువులను) తపింపఁజేయు.

**ఊఁదు.** దే. అ. క్రి. వాఁచు. స. క్రి. 1. శంఖములోనగువానినూఁదు; 2. నిప్పుమొదలగువానినూఁదు; 3. పట్టు; "క. ఉరగపతితలలవలనురు, తరజవముననసురులూఁదితత్పుచ్ఛమునిఁ, ర్జరవరులూఁదిమహామ, త్సరమునవడిఁద్రచ్చిత్రచ్చిజవమతియున్నన్." భార. ఆది. ౨, ఆ.—4. ఉంచు; "వీనులఁగప్పురమూఁది." కళా. ౬, ఆ.—5. అదుము; "గీ. దనుజాచందమెల్లఁదనదుచిత్తంబున, నెఱిఁగి శంకరుండుచిఱునగవునఁ, గాంతిమోముచెన్ను

వింతగావింపంగ, నుంగుటమున నల్లనూఁదుటయును." నిర్వ. ౪, ఆ.—6. నొక్కు; "అనియూఁది చెప్పి." భార. అను. ౧, ఆ.—7. (చేఁపలను) ఊఁతతోఁబట్టు.—వి. 1. చేఁపలను పట్టెడియూఁత; "క. వెరవుననూఁదుల నెత్తెలఁ, గరములమత్స్యములఁబట్టి." భార. శాం. 3, ఆ.—2.వాఁపు.

ఊఁదుఁగ్రోవి. దే. వి. (ఊఁదు+క్రోవి.) అగసాలెవాఁడు కుంపటియూఁదెడుగొట్టము. "మ. ప్రతిసూర్యుండను కమ్మటంబు మఘవద్బాణాసమక్కాలురో, హితమక్ పేరిటియూఁదుఁగ్రోవిచపలోపేతాంతరాంభోదసం, తతియుక్ మచ్చులసంచికావిరను నిద్రాటీకముక్ గన్పడక్, జతసాన్నారి తెఱంగునక్ దనరెవర్షా వేళమిన్నంగడిక్." చంద్రా. ౪, ఆ.

ఊఁదువత్తి. ద్వ. వి. సాంబ్రాణివత్తి, వర్తిధూపము.

ఊఁదు వెండి. దే. వి. శుద్ధమైన వెండి.

ఊఁపు. దే. ప్రే. ఊఁగఁజేయు. "శా. భూమిచక్రము పూనియెట్లుతలలూఁపుక్ బన్నగస్వామి." నై. ౫, ఆ.—వి. ఊఁచుట.

ఊఁపురము. దే. వి. మూఁపురము. (ఇట్లు అజాదిగా కొన్ని పుస్తకములందు వ్రాయఁబడియున్నది. దీనికిఁ బ్రయోగము చిక్కినదికాదు.)

ఊకనబొడ్డు. దే. వి. ఒకానొక మందాకుచెట్టు.

ఊచే. దే. అ. క్రి. (వ్యాధి చేతతల వెండ్రుకలు) రాలు.

ఊట. దే. వి. 1. ఊరెడునీరు; 2. ఊరుగాయరసము; 3. మూలగ; "ఎముకయూటచవిగనియూనుచు." భార. స్త్రీ. ౨, ఆ.—4. చేప.

ఊటకల్లు. దే. వి. ధాన్యవిశేషము. (అప్ర.)

ఊటబుడ్డిచెక్క. దే. వి. కట్టడమునకుఁదగిన యొక దినుసుమ్రాను.

ఊటాడు. దే. అ. క్రి. (ఊట+ఆడు.) 1. చలించు; "మ. కలఁగెందోయధిసప్తకంబుగిరివర్గంబెల్ల నూటాడెసం, చలతంబొందె వసుంధరావలయమాశాచక్రమల్లాడెఁగొం, దలమందెంద్రిదశేంద్రుపట్టణముపాతాళంబుఘూర్ణల్లెనా, కులమయ్యెక్ గ్రహతారకాకులముసంక్షోభించెనవ్వేధయుక్." (ఈపద్యము విరాటపర్వము నాలవయాశ్వాసమందునునున్నది.) నిర్వ. ౫, ఆ.—2. సంభ్రమించు. "ఇ. వేటవైఁగలశివుటనూటాడుచు." పాండు. 3, ఆ.

ఊటి. దే. వి. అడవియందలి యొకానొక వృక్షము.

ఊటించు. దే. స. క్రి. వంచించు.

ఊటు. దే. వి. వానచినుకులచేతకలిగినచెమ్మ.

ఊడ. దే. వి. మఱ్ఱిలోనగువానికొమ్మనుండి క్రిందికి దిగెడు వేరు, అవరోహము.

ఊడనిఁబాఁడు. దే. అ. క్రి. 1. తొలఁగు; "క. అక్కాంతామణి సెచ్చెలు, లొక్కొకపని పేరుచెప్పియూడనిఁబాడక్." కవి.3,ఆ.—2. పాఱు. "క. ఒకనాడురాత్రిపడుపడు, కకుఁజెప్పకయిల్లు వెడలిగాఢతరతమో,నికరమ తనతగులోడుగ, నొకరుఁడుఁజేరడవిత్రోవ నూడనిఁబాడెక్." పాండు. 3, ఆ.

ఊడి. దే. వి. ఒకదినుసుకూరాకు.

ఊడిగము. దే. వి. ఉడిగము, పరిచర్య, సేవ.

ఊడిగీఁడు. దే. వి. (ఊడిగము+ఈఁడు.) పరిచారకుఁడు. "గీ.వారలు వ్రెగడలుమన్నీలుబిరుదులొజ్జ.లూడిగీలనుబోగపుఁజేడియలును, బట్లుజెట్లును నెఱజన్నెగట్లుబలసి,కొలువఁ గొలువుండిపెద్దలఁగూర్చిపలికె." అచ్చ. అ, కాం.

ఊడిత. దే. వి. (సాలెవాఁడు పడుగుచేయునపుడు అది వ్రాలకుండఁ గ్రింద నూఁతగానిలువుననిలిపెడు) కొయ్య. "సీ. పరిపరియచ్చులుచఱికుండ యూడితచీవుదబ్బలుందండెనాడెక్రోవి." హంస. ౨, ఆ.

ఊడియము. దే. వి. ఊడిగము.

ఊడు. దే. అ. క్రి. 1. రాలు; "ఉ. వీఁడెట బ్రహ్మచారియటఁటపీనులఁబెట్టఁగ రానిమాటలే, లాడుచునున్నవాఁ డతిమదాంధుఁడువీఁడు నమస్కృవాయయెం, డాడఁగవల్దువీనిఁ గపటాత్మునిచ్చట నుండనీకపం, ఢ్లూడఁగ వ్రేసి ద్రొబ్బుఁడని యుగ్రతఁబల్కినఁగాంతలందఱుక్." వీర. ౨,ఆ.—2. ఐదలు; "క. పెరిగినత్రివిక్రమేశ్వరు, చరణతులాకోటియతఁడుసంప్రాప్తదేహ, స్ఫురణుఁడగునప్పుడూడిన, కరణింబురికోటయొప్పుఁగనకమయంబై." పాండు.౧, ఆ.—3. జాఱు; "గీ. తెల్లమచ్చతో నొకపోతుపిల్లయూడిపడ." భో. ౪, ఆ.—4. కాఱు; "చక్కరలపానకమూడెడుకావిమోవి." రసి. ౪,ఆ.—5. తెగు; "అప్పిసాళివైనుఱికి చలంబుమీఱుదలయూడఁగమొత్తెను." అచ్చ. సుం, కాం.—6. పాఱు. "ఎ, గీ. చాలనుడివడిదనుజుఁడాఖిలరౌద్ర, భంగిఁ బదివిండ్లుకొత్తియప్పుడుష్టివిభుని, నూడుకొనవేసితిరిగిపేఱొక్క

దిక్కు, తెరువుగానూడఁజూచినసురుఁగనీక." రా. అర. ౨, ఆ.

**ఊడుకొను.** దే. అ. క్రి. గ్రుచ్చుకొను. "ఊడుకొనఁగవైవుఁడుర్వీధ్రుముల." లక్ష్మీ. ౪, ఆ. (చూ. ఊడుకడపట.)

**ఊడుగు.** దే. వి. అంకోలము*.

**ఊడుచు.** దే. స. క్రి. 1. చిమ్ము, సమ్మార్జించు; 2. నాఱునాటు. (ప్రే. ఊడఁజేయు.) (రూ. ఊడ్చు.)

**ఊడుపు.** దే. వి. 1. ఊడ్చుట; 2. నాఱునాటుట.

**ఊడెము.** దే. వి. ఊడియముయొక్క రూపాంతరము.

**ఊఢ.** సం. వి.ఆ. స్త్రీ. పెండ్లాము. విశ. పెండ్లాడినది.

**ఊతము.** సం. విశ. (అ. ఆ. అ.) కుట్టఁబడినది. (వస్త్రాది.)

**ఊతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. కుట్టు; 2. రక్షణము.

**ఊదర.** వై. వి. తృణవిశేషము. బ. ధాన్యవిశేషము.

**ఊదా.** హిం. వి. వర్ణవిశేషము.

**ఊధము.** సం. వి. స్. న. (ఆవు మొదలగువాని) పాలపొదుఁగు.

**ఊధస్యము.** సం. వి. అ. న. క్షీరము, పాలు.

**ఊనము.** సం. విశ. (అ. ఆ. అ.) తక్కువైనది.

**ఊనిక.** దే. వి. 1. ఆనిక; 2. దిటవు.

**ఊను.** దే. స. క్రి. 1. అవలంబించు; "తే. అదియునుంగాక జనియించుటాదిగాఁగఁ, బసులలోనన పెరిఁగినపాలసుండు, వావిమాలినపశుమార్గవర్తనంబు, నూనుటరిదియెయిదియేలయుగ్గడింప." హరి. ఉ. 3, ఆ.—2. పొందు; "క. హీనప్రజ్ఞుఁడకార్యము, లైనవిచేసితుదివగచునతులప్రజ్ఞా, సానుమదారూఢుఁడువగ, నూనఁడుదురితమనువతితి కోడకయునికిన్." భార. శాం. 3, ఆ.—3. వహించు; "స. నవరత్న కలితభూవలయమొప్పించువైఖరి మణీఛత్రంబుభరతుఁడూన." హన. ౧, ఆ.—4. (తోలును) మెత్తపఱచు.

**ఊప.** దే. వి. అడవిలోని చెట్లగుంపు. (అప్ర.)

**ఊపిరి.** దే. వి. ఊర్పు, శ్వాసము.

**ఊపిరికుట్టు.** దే. వి. ఊపిరిపుచ్చనీకనొప్పించెడివ్యాధివిశేషము, యరాకము.

**ఊబ.** దే. వి. పేడి, నపుంసకుఁడు.

**ఊబి.** దే. వి. బురద, పంకము.

**ఊయల.** ద్వ. వి. ఊయేలయొక్క రూపాంతరము.

**ఊయాల.** ద్వ. వి.—వై.—

**ఊయెల.** ద్వ. వి.—వై.—

**ఊయేల.** ద్వ. వి. (ఊఁచు+ఏల.) ఉయ్యాల.

**ఊరఁగంద.** ద్వ. వి. (ఊరన్+కంద.) ఊరియందు పైరుచేసెడుకంద*.

**ఊరఁబంది.** దే. వి. (ఊరన్+పంది.) ఊరియందుతిరుగుపంది, గ్రామసూకరము.

**ఊరఁబిచ్చిక.** దే. వి. (ఊరన్+పిచ్చిక.) ఇండ్లపట్టునఁదిరిగెడు ఒకదినుసుపిట్ట, చటకము.

**ఊరఁబోవు.** దే. అ. క్రి. (ఊరన్+పోవు.) తగ్గు. "సీ. తలపోఁతతలకువెగ్గలమయ్యుభావంబునూఱటఁబొరిఁబొరినూరఁబోవ." హరి. ఉ. ౭, ఆ. (దీనికియొకచోట నేప్రయోగము కానఁబడుచున్నది.)

**ఊరక.** దే. అవ్య. ఏదేనియొకటిలేకయనునర్థమును దెలిపెడి. "రిత్తబవరంబుననాఅడిచావుసాకునిట్లూరకయుంటమేలె." భార. ఉద్యో. 3, ఆ. (ఇక్కడ ఊరకయనఁగాఁ బ్రయత్నములేకయనియర్థము.) "ద్వి. రాముఁడునన్నునూరకయేలచంపు." రా. కిష్కిం, కాం. (ఇక్కడ ఊరకయనఁగాఁగారణములేకయనియర్థము. ఇట్లుతక్కిన చోట్లను సందర్భానుసారముగా అర్థమునూహింపవలయును.)

**ఊరగోఁగు.** దే.వి. (ఊరన్+గోఁగు.) తీక్ష్ణవృక్షము*.

**ఊరజోగి.** ద్వ. వి. (ఊరన్+జోగి.) బిచ్చపుజోగి. "ద్వి. ఉరగకంకణుతోడనూరజోగులను, సరిచేసియెన్నినచందాన." హరిశ్చ. ౧, భా.

**ఊరబీఱ.** దే.వి. (ఊరన్+బీఱ.) ఆవడ, ఘోషకము*.

**ఊరవ్యుఁడు.** సం. వి. అ. పుం. వైశ్యుఁడు, కోమటి.

**ఊరాఱుచు.** ద్వ. స. క్రి. (ఊరుపు+ఆఱుచు.) ఊఱడించు. (రూ. ఊరార్చు. "క. ఊరార్చియింక నుచితా, చారంబులనడవుటయుచిటఁగృత్యము." భార. మా. ౧, ఆ.)

**ఊరీకరించు.** సం. స. క్రి. అంగీకరించు. "ద్వి. నిర్వాణతత్త్వంబు, నూరీకరించివేఱొకప్రదేశమున. సారనిష్ఠఁదపంబుసల్పుచుండెదను." విష్ణు. పూ. 3, ఆ.

**ఊరీకృతము.** సం. విశ. (అ. ఆ. అ.) అంగీకరింపఁబడినది, ఒప్పుకొనఁబడినది.

**ఊరు.** దే. అ. క్రి. 1. లోపలనుండి జలాదికము వెలికిఁదోఁచు; (నీళ్లూరును.)—2. నాను; (నిమ్మకాయ ఊరెను.)—3. తడిగలదియగు; (నోరూరుచున్నది.)—4. పుట్టు. "ఆసలూరఁగా." క్షేత్రయ. —(ప్రే. ఊరించు.)—వి. 1. ఏఁడికోలలేనినాఁ

గలి; 2. గ్రామము; 3. దేశము; "రాజోకఁడూ రశేఁడు." సా. ౨, ఆ.—4. దేశాంతరము. "ఊరికిఁబంచివచ్చితివో యొజ్జను." శశాం. ౨, ఆ.

ఊరుఁగాయ. దే. వి. (ఊరు+కాయ.) ఉపదంశము.

ఊరుఁబిండి. ద్వ. వి. (ఊరు+పిండి.) వ్యంజనవిశేషము.

ఊరుకొను. దే. స. క్రి. (మూరుకొనుయొక్క రూపాంతరము.) ఆఘ్రాణించు. "క. ఈరీతిఁబొదల మెదలుచు, నారీతిలకంబు మేనినచ్చికయిచ్చన్, గోరకనవసహకారక, కోరకమూరుకొనివడినిగుడగమకించెన్." వసు. 3, ఆ.

ఊరుచే. యు.దే. స. క్రి. తాతనంటినగంధములోన గుదానినిచేతరాఁదీయు. వై.ఊపిరివిడుచు. (రూ. ఊర్చు.)

ఊరుజుఁడు. సం. వి. అ. పుం. వైశ్యుఁడు, కోమటి.

ఊరుపర్వము. సం. వి. న్. న. జానువు, మోఁకాలు.

ఊరుపు. యు. దే. వి. వ్యంజనవిశేషము. వై. శ్వాసము. (రూ. ఊర్పు.)

ఊరువు. సం. వి. ఉ. పుం. సక్థి, తొడ.

ఊరేగు. దే. అ. క్రి. (ఊరు+ఏగు.) మెరవడివోవు.

ఊర్జము. సం. వి. అ.పుం. 1. కార్తికమాసము; 2. పూనిక; 3. బలము; 4. ఊపిరి వెలికిఁబుచ్చుట.

ఊర్జస్వలుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. మిక్కిలి యుత్సాహముగలవాఁడు; 2. మిక్కిలి బలము గలవాఁడు.

ఊర్జస్వి. సం. విశే. (న్. ఈ. న్.)——పై.——

ఊర్జితము. సం. విశే. (అ. ఆ. అ.) దృఢము, గట్టి.

ఊర్ణ. సం. వి. ఆ. స్త్రీ. 1. గొఱ్ఱెలోనగువానిబొచ్చు, త్రుప్పుడు; 2. నూలు; 3. కనుబొమ్మలనడిమిసుడి. (ఇది మహాపురుషలక్షణము.)

ఊర్ణనాభము. సం. వి. అ. పుం. 1. సాలెపురుగు; 2. అభినయహస్తవిశేషము. (అయిదువ్రేళ్లనుగొంచెమువంచి కొనలుకూడకపట్టినది.)

ఊర్ణనాభి. సం. వి. ఇ. పుం. సాలెపురుగు.

ఊర్ణాయువు. సం. వి. ఉ. పుం. 1. పొట్టేలు; 2. గొఱ్ఱెత్రుప్పటికంబళి; 3. సాలెపురుగు.

ఊర్ధ్వకము. సం. వి. అ. పుం. యవమధ్యమువంటి మధ్యముగలమృదంగము.

ఊర్ధ్వజ్ఞువు. సం. విశే. ఉ. 1. కొంగకాళ్లవాఁడు; 2. లేచినవాఁడు.

ఊర్ధ్వము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పొడవైనది; 2. మీఁదికెత్తఁబడినది; 3. మీఁదిది.

ఊర్ధ్వరేతస్సుఁడు. సం. వి. స్. పుం. 1. ఋషి; 2. శివుఁడు.

ఊర్ధ్వలోచనము. సం. వి. అ. పుం. శరభము, మీఁగండ్లమెకము.

ఊర్పోక. ద్వ. వి. (ఊర్పు+పోక.) ఉబుసుపోక. "సీ. ఘనునొద్దనుండియుఁదనకాసపడియె నేఁబొలఁతుకకదియనూర్పోకకూర్మి." కవిక. ౪, ఆ.

ఊర్పోవు. ద్వ. అ. క్రి. (ఊర్పు+పోవు.) ఊపిరివెడలు. "శా. సర్వారాతిపయిన్ నిజాంగములపైఁ జంచద్భుజాభీలతన్, దర్పంబేర్పడనొక్కపెట్టనటులాదైతేయవీరుల్ దిశా, సర్పద్దీప్తజటాసటాలపటుశస్త్రవ్రాతముల్ సాంద్రమై, యూర్పోకుండఁగనించిరన్ మురహరుండుద్దాను కోపాగ్నియై." నిర్వ. 3, ఆ. (ప్రే. ఊర్పుచ్చు. "శా. కంపంబొందె సురేంద్రుఁడగ్ని వెలిచెన్ గాలుం డుశంకించెఁజిం, తింపంబూనెనిశాచరప్రభుఁడు వార్ధిస్వామియూర్పుచ్చెఁదాఁ, బెంపెల్లన్ దిగిసోలిగాలివడఁకెన్ భీతింగుబేరుండువ, ర్తింపంజొచ్చెఁగపర్దియున్ బెదరెఁదద్దివ్యత్తపోవృత్తికిన్." శేష. ౫, ఆ.)

ఊర్మి. సం వి ఇ. పుం, స్త్రీ. 1. అల; 2. పెద్దఅల; 3. ఉమ్మి; 4. తహతహ; 5. నొప్పి; 6. పరంపర; 7. వస్త్రపుముడుత; 8. ప్రకాశము; 9. ప్రవాహము; 10. వంకర. (షడూర్ములు.—క్షుత్ తృష్ణా శోక మోహ జరా మరణములు.)

ఊర్మిక. సం. వి. ఆ. స్త్రీ. 1. అల; 2. ఉంగరము; 3. వస్త్రపుముడుత.

ఊర్మిమాలి. సం. వి. న్. పుం. సముద్రము, కడలి.

ఊర్మిళ. సం. వి. ఆ. స్త్రీ. 1. జనకమహారాజుకూఁతురు; 2. మగనియెడఁబాసిన స్త్రీ.

ఊఱట. దే. వి. 1. ఊఱడించుట, ఆశ్వాసము; "ఉ. అంతలు సేసిపోనడిచి యక్కటసంజయుచేతఁజెప్పపు. త్తెంతురెయిట్టియూఱటమదిం బ్రియము దెయుధిష్ఠిరుండు." భార. ఉద్యో. 3, ఆ.—2 తెలిపి, విరామము. "సీ. కోఁకమసంగడికోర్కులవెను వెంటఁబొలిచునునికికి నూఱటయును." భార. విరా. ౨, ఆ.—విశే. సహాయము. "ఎ, గీ. మందడీల కెల్లనూఱటయగుచున్నగల్ల నేర్తు." భార. విరా. ౧ ఆ.

**ఊఅడిల్లు.** దే. అ. క్రి. ఉపశమిల్లు. (ప్రే. ఊఅడించు.)
**ఊఅడు.** దే. అ. క్రి.—పై.—"క. కాఅడవిఁబఱచు మృగముల, నూఅడకవధించి." భార. ఆది. ౪, ఆ.
**ఊఅు.** దే. స. క్రి. సరిపోలు. "ఉ. వేఅొకవంకఁ గొండగుహవేశ్మము గాఁగనులాకధర్తత, న్నూతి నయంతలేనిబలియుర్ గలవాఁ డుపమర్దనాముఁ డా, యీఅుమునందు రేలుతమయిచ్చల మేసిదివం బులాగుహకా, దూఅివసించుచుండి." పంచ. నా. 3, ఆ.
**ఊలమాలగుడుచు.** దే. అ. క్రి. (ఊలమాల+కుడుచు.) తహతహపడు. "ద్వి. చిడిముడిఁబొందుచు సిగ మిట్టిమిట్టి, పడఁగఁబల్కులు తొట్రుపడనూల మాల, గుడుచుచు." నవ. 3, ఆ.
**ఊవాడు.** దే. అ. క్రి. (ఊవి+ఆడు.) ఊఁగాడు. "క. అలరుంబోఁడులలోపల, నలరుంబోఁడుము లనీకునగ్గలముగుచుకా, దలఁపూవాడకయుండు ము, తలపూవుధరించివికచతామరసాక్షీ." పా. ౧, ఆ.
**ఊవు.** దే. అ. క్రి. ఊఁగుయొక్క రూపాంతరము.
**ఊషణ.** సం. వి. ఆ. స్త్రీ. పిప్పలి*. అ. న. ము. మిరియము.
**ఊషము.** సం. వి. అ. పుం. 1. చవుడు; 2. వేకువ.
**ఊషరము.** సం. విశ. (అ.ఆ.అ.) చవుటిది (నేల.)
**ఊష్మకము.** సం. వి. అ. పుం. నిదాఘము, వేసంగి.
**ఊష్మము.** సం. వి. న్. పుం. 1. ఉమ్మ; 2. వేసంగి; 3. (వ్యాకరణమున) శషసహలు.
**ఊష్మలము.** సం. విశ. (అ. ఆ. అ.) ఉమ్మగలది.
**ఊష్మాగమము.** సం. వి. అ. పుం. గ్రీష్మము, వేసంగి.
**ఊసరము.** యు. దే. విశ. కృశించినది. వై. చవుటిది. (నేల.)
**ఊసరవెల్లి.** దే. వి. మూడువన్నెలుగలతొండ, బింబకము. "ఎ. గీ. వేగనేతెంచియూసరవెల్లితొండ, పాదములనుండితలదాఁకఁబ్రాకనేని, నతఁడు షణ్మాసములఁజూచు యమునిమొగము." సం. "ద్రుతమారుహ్యసరట స్త్రివర్ణోయస్యమస్తకమ్, ప్రయాతి యాతి తస్యాయు షణ్మాసే పరిసంక్షయమ్." కాశీ. ౫, ఆ.
**ఊసరిల్లు.** దే. అ. క్రి. చిక్కు, కృశించు.
**ఊసివాసము.** వై. వి. ఈర్ష్య*.
**ఊసు.** దే. వి. ఉబుసుయొక్క రూపాంతరము. "క. జనపతికినింక నేనే, మనిచెప్పిననేమియగునునది గడచనెనై, నను నూను పోకవెండియు, ననియెద నొకమాటరఘువరానుజనీతోకా." నిర్వ. ౯, ఆ.
**ఊహము.** సం. వి. అ. పుం. 1. అపూర్వార్థమును త్ప్రేక్షించుట; 2. లేనిమాటలుకొన్నిటిని దెచ్చుకొనుట.
**ఊళ.** దే. వి. నక్కకూఁత.

## ఋ.

**ఋ.** ఒకయక్షరము.
**ఋక్కు.** సం. వి. చ్. స్త్రీ. 1. ఒకవేదము; 2. వేదభాగవిశేషము.
**ఋక్థము.** సం. వి. అ. న. ధనము, విడిముడి.
**ఋక్షగంధ.** సం. వి. ఆ. స్త్రీ. బొద్దికూర.
**ఋక్షగంధిక.** సం. వి. ఆ. స్త్రీ. నల్లనేలగుమ్ముడు*. పాలగుమ్ముడు*. (అనికొందఱు.)
**ఋక్షము.** సం. వి. అ. న. నక్షత్రము. పుం. 1. ఎలుఁగుగొడ్డు; 2. ఒకానొకకొండ; 3. దుండిగము*. విశ. గ్రువ్వఁబడినది.
**ఋజీషము.** సం. వి. అ. న. పిండివంటచేసెడు పాత్రము. బూరెలమూకుడు. (అనికొందఱు.)
**ఋజువు.** సం. విశ. ఉ. ప్రగుణము, చక్కనైనది.
**ఋణము.** సం. వి. అ. న. పర్యుదంచనము, అప్పు. (ఋణత్రయము.—దేవఋణము, ఋషిఋణము, పితృఋణము.)
**ఋణార్ణము.** సం. వి. అ. న. అప్పుతీర్చుటకైతీసిన అప్పు.
**ఋణి.** సం. విశ. (న్. ఈ. న్.) అధమర్ణుఁడు, అప్పులకాఁపు.
**ఋణికుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.)——పై.—
**ఋతము.** సం. వి. అ. న. 1. శిలోంఛవృత్తి; 2. నీళ్లు. విశ. 1. సత్యమైనది; (మాట.) 2. పూజింపఁబడినది; 3. ప్రకాశమొందినది.
**ఋతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. త్రోవ; 2. పోటి; 3. రోఁత; 4. శుభము.
**ఋతీయ.** సం. వి. ఆ. స్త్రీ. జుగుప్స, రోఁత.
**ఋతుమతి.** సం. వి. ఈ. స్త్రీ. పుష్పవతి, ముట్టుది.
**ఋతువు.** సం. వి. ఉ. పుం. 1. వసంతములోనగునది; (అవి ఆఱు.—వసంతము, గ్రీష్మము, వర్షము, శరత్తు, హేమంతము, శిశిరము.) 2. ఆర్తవము; 3. వెలుఁగు.
**ఋత్విజుఁడు.** సం. వి. జ్. పుం. యజ్ఞకర్తచేత ధనముఁబుచ్చుకొని యజ్ఞముచేయించువాఁడు, ఒజ్జ.

(వీరు పదియాఱుగురు.—బ్రహ్మ, ఉద్గాత, హోత, అధ్వర్యుఁడు, బ్రాహ్మణాచ్ఛంసి, ప్రస్తోత, మైత్రావరుణుఁడు, ప్రతిప్రస్థాత, పోత, ప్రతిహర్త, అచ్ఛావాకుఁడు, నేష్ట, అగ్నీధ్రుఁడు, సుబ్రహ్మణ్యుఁడు, గ్రావస్తుతుఁడు, ఉన్నేత.)

ఋద్ధము. సం. విశే. (అ.ఆ.అ.) 1. నుతిచినది (ధాన్యము); 2. పెరిగినది.

ఋద్ధి. సం. వి. ఇ. స్త్రీ. 1. సమృద్ధి; 2. గంధద్రవ్యవిశేషము.

ఋభుక్షుఁడు. సం. వి. న్. పుం. ఇంద్రుఁడు.

ఋభువు. సం. వి. ఉ. పుం. నిర్జరుఁడు, వేల్పు.

ఋశ్యకేతువు. సం. వి. ఉ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

ఋశ్యప్రోక్త. సం. వి. ఆ. స్త్రీ. 1. దూలగొండి†; 2. పిల్లపీఁచర†.

ఋశ్యము. సం. వి. అ. పుం. మనుఁబోతు. (రూ.) ఋష్యము.

ఋషభము. సం. వి. అ. పుం. 1. ఎద్దు; 2. ఓషధివిశేషము; 3. తిరుమల; 4. కర్ణరంధ్రము; 5. ఒకస్వరము; డు. 6. ఉత్తరపదమైనచో శ్రేష్ఠుఁడు.

ఋషభి. సం. వి. ఈ. స్త్రీ. 1. దూలగొండి†; 2. మాచకమ్మ; 3. ముండ.

ఋషి. సం. వి. ఇ. పుం. 1. వసిష్ఠాది; 2. వేదము; 3. వెలుఁగు. (సప్తర్షులు.—మరీచి, అత్రి, అంగిరుఁడు, పులస్త్యుఁడు, పులహుఁడు, క్రతువు, వసిష్ఠుఁడు. (మఱియొకక్రమమున.) కశ్యపుఁడు, అత్రి, భరద్వాజుఁడు, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, జమదగ్ని, వసిష్ఠుఁడు.)

ఋష్యప్రోక్త. సం. వి. ఆ. స్త్రీ. 1. దూలగొండి†; 2. పిల్లపీఁచర†; 3. ఒకదినుసుచిట్టాముదపుచెట్టు.

## ఎ.

ఎ. ఒకయక్షరము. యు. దే. అవ్య. 1. ప్రశ్నమునుదెలిపెడి; "మాతామహుండైనమనశూరుఁడున్నాఁడె." భాగ. ౧, స్కం.—2. వ్యతిరేకమునుదెలిపెడి; "ఉ. నీమగఁడంతయెక్కుడెవెమనీషులుభూసురులింతతక్కువే." భార. ఆర. ౨, ఆ.—3. మెచ్చుకొనుటనుదెలిపెడి; "సతీజనమిట్టిదె యేజగంబులన్." భార. విరా. ౧, ఆ.—4. అడుదగుటనుదెలిపెడి. "రావేసుందరియేమెబోటి వినవే." భాగ. ౧౦, స్కం. పూ. "సీ. కుసిగుంపులిడకేగుకొన్న యంగడిలోనమాఱుబేరములేలెమంజువాణి." చంద్ర.—వై. 1. మఱియొకదానిలేమినిదెలిపెడి; "నన్నెదనుజుఁజేసితేముగుద." కళా. 3, ఆ.—2. మఱియొకదానికలిమినిదెలిపెడి*; "క. దుర్యోధననీ, దోర్బలమెపాండవేయుల, దౌర్బల్యమువాయు." ఇక్కడ నీదోర్బలమె—నీదోర్బలమొకటిమాత్రమా అనియర్థము. ఇట్లితరస్థలములయందు నెఱుంగునది. భార. ఉద్యో. 3, ఆ.—3. చూపుటనుదెలిపెడి*; "హరుఁడదెచిక్కె." భార. ఆర. ౫, ఆ. "అల్లదెయర్జునధ్వజవిహారముగానఁగనయ్యెడున్." భార. కర్ణ. ౨, ఆ. "చ. ఇదెయొకపిన్నవాఁడపరియెక్కుడుమూఁకలఁగ్రందఁదోలెడున్." భార. ద్రో. ౨, ఆ. "ఇదెవియద్వాహినియిదెమణికర్ణిక." కాశీ. ౫, ఆ. "అదెయివెపెక్కుబొగల్ నెగసె." రా. సుం, కాం. "వాఁడెభృంగీశుఁడు." కాశీ. ౫, ఆ. "వీఁడెకృష్ణుఁడు." హరి. ఉ. ౨, ఆ. "క. వీరెవనువులు." భార. ఉద్యో. ౮, ఆ.—4. తనంతటఅనునర్థమునుదెలిపెడి*; (నేనడుగలేదువాఁడెవచ్చియిచ్చిపోయెను.)—5. ఎక్కువతక్కువలనుదెలిపెడి*. "ఉ. వంశమెల్లఁబూ, తమ్మగునీదుచర్యననిధాతపడంతియెయానతిచ్చెస్వప్నమ్మునవచ్చి." కళా. ౮, ఆ. (వాఁడెచేయకపోయెనే నేనుచేయుదునా.)

ఎంగిలి. దే. వి. ఉచ్ఛిష్టము.

ఎంగెస. దే. వి. ఒకదినుసు అడవిచెట్టు.

ఎంచు. దే. స. క్రి. 1. గణించు; 2. తలఁచు; 3. ఆక్షేపించు; "ఉ. వింతలుభూమినేమయినవింటివెపౌరులునన్నుఁగూర్చినిం, దింతురొయెంతురో." ఉ. రా. ౬, ఆ.—4. ప్రశంసించు. "మ. ఫలభుక్కుల్ హతశేషులెల్లఁజనిచెప్పన్ జచ్చెనే లంకకున్, గలసేనాధిపుఁడింద్రవహ్నిముఖదిక్పాలప్రధాహారిక్రోఁ, తులచేనంచుఁబ్రహస్తునెంచి." రామా. ౮, ఆ.

ఎండ. దే. వి. సూర్యప్రకాశము, ఆతపము.

ఎండఁగట్టు. దే. స. క్రి. (ఎండన్+కట్టు.) ఆఱఁగట్టు. (ముంగిటగుడ్డను ఎండఁగట్టుము.)

ఎండఁగొట్టు. దే. స. క్రి. (ఎండన్+కొట్టు.) ఎండఁజేయు. (నీళ్లుచల్లక ఆపైరును ఎండఁగొట్టినాఁడు.)

ఎండఁబెట్టు. దే. స. క్రి. (ఎండన్+పెట్టు.) ఎండవేయు. (వరుగులెండఁబెట్టుము.)

ఎండదొర. దే. వి. సూర్యుఁడు. "గీ. విపులఖరకరభీతినవ్విపినసీమ, యుండగానియెండదొరఁబోరి

కరయఁబిలుచు, వీఁకఘూక మహోగ్భటుల్ వెల యఁజీమ, కైనఁదూఱంగ రానియక్కానదిప." శేష. ౨, ఆ. (ఇట్లు ఎండ తోఁడులోనగునవి.)
ఎండమావులు. దే. వి. బ. మిట్టమధ్యాహ్న వేళ బయళ్ల యందు నీటివలెఁదోఁచెడిసూర్యకిరణములు, మృగతృష్ణ.
ఎండు. దే. అ. క్రి. 1. తడియాఱు; (గుడ్డయెండె ను, చెట్టు ఎండెను.)—2. నీరింకు; (చెఱువు ఎండిపోయెను.)—3. తపించు; (వాఁడు ఎండలో ఎండుచున్నాఁడు.)—4. శుష్కించు. (అది అన్నములేక ఎండుచున్నది.)
ఎండుగులు. దే. వి. బ. ఎండఁబోసిన ధాన్యము "చ. కలమపు టెండుగుల్ ద్రవిడకన్యలు ముంగిటఁగాచుకుండి." ఆము. ౧, ఆ.
ఎండుతెవులు. దే. వి. దేహముశుష్కించెడువ్యాధి విశేషము.
ఎండుపుఁదట్ట. దే. వి. (ఎండు+తట్ట.) ఏదేనియెండ పెట్టుటకు వెదురుబద్దలుగోనగువాని చేతనల్లిన తట్ట, దాఁగర, ప్రసేవకము.
ఎండువులు. దే. వి. బ. ఎండుగులుయొక్క రూపాంతరము.
ఎంద్రకాయ. వై. వి. కర్కటకము. (చూ. ఎండ్రిక.)
ఎండ్రి. వై. వి.——వై.——(చూ. ఎండ్రిక.)
ఎండ్రిక. వై. వి.—వై.—"ఎ, గీ. ఎండ్రియనసెండ్రిక యనంగనెండ్రకాయ, యనఁగఁగర్కటకాభిధయులరుచుండు." ఆం, భా. ప్ర. వారి.
ఎంత. ద్వ్య. స. (ఏ+అంత.) 1. ఏకొలఁది; "ఎంత కాలము."—2. ఏయుద్దేశ్యపుకొలఁది. "గీ. ఇతనిఁ జూచిమీకునెంత మోహముగల, దంతకంటెమాకునధికమైన, మోహరసముమూరిమోచియున్నది." వి, పు. ౬, ఆ. (చూ. ఇంత.) (యును, ఏని, ఓ అనునవి వెనుకఁజేరునపుడు దీనికి అత్యంతము అనునర్థము కలుగుచున్నది. యువర్ణమునకు వికల్పముగలోపమగు. "సీ. ఎంతయుసంయమవంతుఁడు సహదేవుఁడ ధ్యాత్మవిద్యా సాధ్యుఁడెంత ననఘుండుధౌమ్యుండు." భార. సభా. ౨, ఆ. మొ. "నీకెంతేనితఁడాప్తుఁడో." కళా. 3, ఆ. "ఎంతో సంతోసంబున.")
ఎందనుక. ద్వ్య. ద్ర. (ఎంత+దనుక.) ఎందాఁక.
ఎందఱు. ద్వ్య. స. (ఎంత+వారు.) (ఎంతశబ్దమునకు మహత్త్వహత్త్వర్థకబహువచనరూపము.) ఎంతసంఖ్యగలవారు. (దీనికి ఏనిశబ్దము వెనుకఁజేరునప్పుడు అనేకులనెడియర్థము కలుగుచున్నది. "క. కద్ద కంటఁగరుణనొడమఁగఁ, బడఁతులుఎందఱ్నిందఱ్ని నిఁబరివేష్టింపన్." వీర. ౨, ఆ. ఇకారములోపింపఁగా ఎందఱేన్ "హెగ్గడికత్తెలెందఱేఁగొల్చి భజింప." కళా. ౨, ఆ.
ఎందాఁక. ద్వ్య. ద్ర. (ఎంత+దాఁక.) ఎంతపర్యంతము.
ఎందు. దే. ద్ర. ఎచ్చోట.
ఎందులకు. దే. ద్ర. 1. ఎచ్చోటికి. "క. ఎందుండి యేమిపనికై, యెందులకేగెదవు." భార. శాం. 3, ఆ.—2. దేనికి. "వ. ఇదియేమి యెందులకుంబోయెదవు." భార. ఆర. ౨, ఆ.
ఎంబన్న. దే. విశ. (ఎంబె+అన్న.) చేతకానివాఁడు.
ఎఁడు. దే. అప. పరిమాణార్థకము. "క. నీనుడువుల కేనడుగెం, డైననుదాఁటనని సత్యమాడెను." రుక్మాం. ౫, ఆ.
ఎకదొట్టు. దే. అ. క్రి. అతిశయించు. "నిట్టూర్పెకదొట్టన్." ఆము. ౫, ఆ.
ఎకరము. ఆం. వి. 4840 గజముల నేల.
ఎకరా. దే. వి. ఏనుఁగునుగట్టుమొగసాల. "మహాస్రగ్ధర. ఎకరాలన్ మందువాసాహిణములఁగల భద్రేభసందోహవాహ, ప్రకరంబుంగొంచు." స్వా. ౧, ఆ
ఎకరారు. హిం. వి. ఒప్పుకొనుట.
ఎకసకియము. దే. వి. ఎక్కసెక్కియముయొక్కరూపాంతరము. (చూ. ఎకసక్కెము.)
ఎకసకెము. దే. వి.—వై.— (చూ. ఎకసక్కెము.) (వికటమునకు. —"సీ. జడలల్లిచొల్లియంబిడియెకసకెముగా బాలేందుశకలంబుపదిలపఱచు." కాశీ. ౨, ఆ.)
ఎకసక్కియము. దే. వి.—వై.—(చూ. ఎకసక్కెము.)
ఎకసక్కెము. దే. వి.—వై.—1. వికటపుమాట; "గీ. జమునినాలికతో నెకసక్కెమాడఁ, దమకపడు క్రొత్తపైఁడిమోళ్ళముకటారి." వై. ౬, ఆ.—2. అవమానము; "చ. మునిపతివచ్చిపూవొసఁగిమోదముతోడభవత్ప్రియాంగనన్, వినుతియొనర్పఁగావినినవీనుల మాచవిగానిమాటలన్, వినవలెనే గదా యిపుడునీవిటవచ్చుటపారిజాతవా, సనఁబ్రకటించినాకు నెకసక్కెముచేయనకాదచెప్పుమా. క. మానంబెతోడవుసతులకు, మాన

మెప్రాణాధికంబు మానమఖిలస, న్మానములకు మూలంబగు, మానరహితమయిన బ్రదుకుమానిని కేలా." పా. ౧, ఆ.—౩. వంచన. "ద్వి. అకటచేతి కింజిక్కినటులమాటాడి, యేకసక్కెమెయొనర్చి యిచటనిల్వకరెయి, యిపుడొగింజనియెనయ్యిందీవరాక్షి." విష్ణు.ఉ. ౪, ఆ.—విశ. వికటము. "ఉ. చక్కనివారిలోమిగులఁజక్కనివాఁడవు గాననీకెనా, చక్కనివారిఁజంద్రునిప సంతునిఁగూరుచు కొంటయందమాఁ, జక్కెరవింటిరాజయేకసక్కెము దేమనికూర్చుకొంటివ, మ్మక్కయరూపకంబయిన యూయెలతెమ్మెరవాలిబూతముల్." విజ. 3. ఆ. (దీనికిని దీనిరూపాంతరములకును పరిహాసమర్థమని కొందఱు చెప్పుచున్నారుగాని కవులప్రయోగసరణినిబట్టి అది నిర్ధారణచేయఁగూడలేదు.)

ఎకసెకియము. దే. వి.—పై.—(చూ. ఎకసెక్కెము.)

ఎకసెకెము. దే. వి.—పై.—(చూ. ఎకసెక్కెము.)

ఎకసెక్కియము. దే.వి.—పై.—(చూ. ఎకసెక్కెము.)

ఎకసెక్కెము. దే. వి.—పై.— (వికటపుమాటకు.— "చ. బొమలెగవైచికన్గొనుచుఁబొందుగఁగన్గొని పేరు గ్రుచ్చికొం, చెముగహసించియొక్కయెకసెక్కెమటాడియయారినీకుగం, దముకడునందమౌననిముదంబునఁజెక్కిలిగింటియిట్లునె, య్యమెసఁగఁబల్కరించెనలినాక్షులనందఱునన్నిభంగులన్." చమ. ౧, ఆ.)

ఎకాయకీ. హిం. క్రి. విశ. అకస్మాత్తు, అతివేగముగా.

ఎకిమీఁడు. దే వి. అధిపతి, ఒడయఁడు, రాజు.

ఎకిరింత. దే. వి. ఎక్కిరింతయొక్కరూపాంతరము. "సీ. రేవెలుంగునుదాల్చుదేవేరియగుదుర్గకెకిరింతయైమించుమెకముదక్క." రామా. ౨, ఆ.

ఎక్కటి. వై. స. ఏ. ఒక్కటి. "సీ. కనలుబింకపుఁగింకఁగలుగువేఁడిమియెల్ల నెక్కటియైయొప లెత్తెనఁగ." లక్ష్మీ. ౨,ఆ.—విశ. అసహాయుఁడు; "ఉ. భీముఁడా, నెక్కటిదాఁకెదిక్కరిసహింపకసింహముఁదాఁకునట్టులు." భార. ఆర. ౪, ఆ.—అసహాయము. (ఎక్కటికయ్యము. మొ.)

ఎక్కటీఁడు. వై. వి. అసహాయుఁడైనబంటు. "సీ. ఇగురుకైజీతపుటెక్కటీలనుగుజ్జుపలుపుమామిడికట్టుబడిగఁజేసి." చంద్ర. (స్వార్థమున ఈఁడు.)

ఎక్కడ. దే.వి.ఏ.(ఏ+కడ.)ఏచోటు.(చూ.అక్కడ.

ఎక్కము. యు. దే. వి. గనిమ. వై. స. ఏ. ఒకటి. బ. గుణకహారపథకము, ఎక్కాలు.

ఎక్కలి. దే. వి. ప్రవాహముచేకొట్టుకొనివచ్చి కమ్ముకొనినయిసుక.

ఎక్కసకియము. దే. వి. ఎక్కసెక్కియముయొక్క రూపాంతరము. (చూ. ఎకసక్కెము.)

ఎక్కసకెము. దే. వి.—పై.—(చూ. ఎకసక్కెము.)

ఎక్కసక్కియము. దే. వి.—పై.— (చూ. ఎకసక్కెము.)

ఎక్కసక్కెము. దే.వి.—పై.—(చూ.ఎకసక్కెము.) (వికటపుమాటకు.—"సీ. నిక్కివీనులతోడనెక్కసక్కెములాడుకరణినున్నవి వీనిఘనభుజములు." స్వా. ౨, ఆ.)

ఎక్కసెకియము. దే.వి.—పై.—(చూ. ఎకసక్కెము, ఎకసెక్కెము.)

ఎక్కసెకెము. దే. వి.—పై.—(చూ. ఎకసక్కెము, ఎకసెక్కెము.)

ఎక్కసెక్కియము. దే. వి. (చూ. ఎకసక్కెము, ఎకసెక్కెము.)

ఎక్కసెక్కెము. దే. వి. ఎక్కసెక్కియముయొక్క రూపాంతరము. (చూ.ఎకసక్కెము, ఎకసెక్కెము.)

ఎక్కాడు. దే. స. క్రి. (ఎక్కు+ఆడు.) పురికొలుపు. "ఎ, గీ. పులిపేదపడినఁబసులవాండ్రెయెక్కాడిరనుకతవచ్చె నాకు." ఉ, హరి. ౪, ఆ.

ఎక్కిడు. దే. స. క్రి. నారిగలదానిగాఁజేయు, మోపెట్టు. "అన్యచాపమెక్కిడుటయు." భార. శల్య. ౧, ఆ.

ఎక్కిరంతి. దే.వి. వాహనము. "సీ. వేదాదివిద్యలువిహరణస్థలములుచక్క నిరాయంచయెక్కిరింత." నై. ౧. ఆ.

ఎక్కిలి. వై. వి. దప్పిమొదలగువానిచేఁగలిగెడివ్యాధివిశేషము, హెక్క.

ఎక్కు. దే.అ. క్రి. 1.అతిశయించు; "కంపెక్కఁకంటిక్రేవచెలువెక్కుడుసేయఁగ." భార. భీష్మ. ౨, ఆ.—2. ఇష్టమగు; "అధ్వరకర్మములెల్లనీదునెమ్మనమునకెక్కఁజేయుదుము." భార. అశ్వ. 3, ఆ.—3. సిద్ధించు. (చూ. ఉపాసము.) స. క్రి. ఆరోహించు. వి. 1. వింటినారి; "ఆత్తనలందురిమందచేష్టుఁడై. ఎక్కుడించిన." సం. "అపజ్యమకరోత్పార్థో గాండీవంసుభయంకరమ్." భార. విరా. ౧, ఆ.—2. బ. ప్రేరేపణ.

**ఎక్కుడించు.** దే. స. క్రి. హెచ్చించు. "గీ. వర్ణములునాశ్రమంబులువసుమతీశ, కలియుగంబునఁ గత్తరఁగలసిపోవుఁ, గానధర్మంబురూపయి కానరాదొ, కింతకలిగిననదిఫలంబెక్కుడించు." హరి. ఉ. ౯, ఆ.

**ఎక్కుడు.** దే. వి. 1. ఆరోహణము; "ద్వి. మెలఁతకునెక్కుడల్లననేర్పుచు." రా. అర, కాం.—2. వాహనము; "ఎక్కుడివారొకొగరుడుఁడెక్కుడుగాఁగలవారు." ఉ,హరి. ౬, ఆ.—3. వింటినారి. (చూ. ఎక్కుడుపెట్టు.) విశే. 1.అధికము; "రూపెక్కుడు." "ఎక్కుడువేగము."—2.ఉత్కృష్టము. "వీరపోయెక్కుడువారులోకులకు." ఉ, హరి. ౬, ఆ.

**ఎక్కుడుఁదీఁగ.** దే. వి. మానేరు. జ్యోతిష్మతి.

**ఎక్కుడుపెట్టు.** దే. స. క్రి. ఎక్కుపెట్టు, మోపెట్టు. "అతఁడొండొకబాణాసనమెక్కుడుపెట్టి." విక్ర. ౬, ఆ.

**ఎక్కుడుమెకము.** ద్వ. వి. ఏనుఁగు, మహామృగము.

**ఎక్కుపెట్టు.** దే.స.క్రి. ఎక్కిడు, మోపెట్టు. "ఒక్కవిల్లెక్కుపెట్టంగ." భార.భీష్మ.3,ఆ. "వ. గాండీవంబుఁబుచ్చికొనియెక్కుపెట్టి." భార. విరా. ౪, ఆ. (రూ. ఎక్కువెట్టు.)

**ఎక్కులుపెట్టు.** దే.స.క్రి. పురికొలుపు, ప్రేరేపించు.

**ఎక్కువ.** దే. వి. ఆధిక్యము. "క. అనుపమతత్పురనారీ, జనులకునచ్చెరలకంగ సౌందర్యమునం, గనఁబడ దెక్కువతక్కువ, కనుఱెప్పలయందకానిగణుతింపంగన్." కవి.౧,ఆ.—విశే.అధికము. "ఉ. నీమగఁడంతయెక్కువెమనీషులుభూసురులింత తక్కువే." భార. అర. ౫, ఆ.

**ఎగ.** దే. అవ. ఎగువశబ్దమునకు వృత్తియందు ఆదేశముగావచ్చినరూపము. (చూ. దిగ.) (వృత్తియందిది అర్థవిశేషములనిచ్చుచున్నది.—ఎగఁగొట్టు. స. క్రి. ఎగురఁజేయు. "సీ. వీచితన్నెగఁగొట్టువెక్కసంబగుసుడిగాలిరెక్కసుమీఁదలాలియూఁగి." చమ. ౧, ఆ.—ఎగఁగ్రోలు. స. క్రి. పీల్చు. "క. బలుమీనొక్కటినోరన్, సలిలంబెగఁగ్రోలుచుండఁజనిరాచెలువల్, వలువుగుఁదద్వదనములో, పలికాసలిలంబువెంటఁబార్థవతిలకా." కళా.౬,ఆ.—ఎగఁజల్లు. స. క్రి. పైకిఁజల్లు. "చ. నెలఁతలుబంతిగట్టుకొని నీరగఁజల్లఁదదీయమంజులాం, జలికలితోదకంబెగయు జాడనుతింపఁగనయ్యె." వసు. 3, ఆ.—ఎగఁజేఁపు. అ. క్రి. పాదుఁగునందలిపాలుపైకితెచ్చు. (ఆవు ఎగఁజేఁపినది.)—ఎగఁదన్ను. అ. క్రి. ఎగువకుఁదన్ను. (పాఁడియావు ఎగఁదన్నినది.) — ఎగఁబట్టు. స. క్రి. ఎత్తిపట్టు. "చ. కరముల నెత్తరాక యధికంబుగ వ్రేఁగయి యున్న దేవుఁగ్రమ్మఱఁ బెనుగౌఁగిటం బెనఁచి మాటికిమాటికిఁ బట్టియెత్తినన్, బరువయితోఁచె నంతనెగఁబట్ట సమర్థుఁడుగాక యద్భుత, స్ఫురితగతిన్ విభీషణుఁడు బుద్ధిగలంగిదురంతచింతతోన్." శేష. ౫, ఆ.—ఎగఁబాఱు. దే. అ. క్రి. ఎగువకుఁబాఱు. ఎగఁబోఁత. వి. 1. ఎగువకువ్యాపించుట; (వానికి చెమట ఎగఁబోఁతదిగఁబోఁతలుగానున్నది.) 2. దుర్బోధనచేయుట.—ఎగఁబోయు. అ. క్రి. 1. దుర్బోధనచేయు; "చ. దయవృషపర్వపుత్రియెడఁదద్దయునుంచియయాతిభార్గవ, ప్రియసుతనాదరింపక చరింపయదుండడిచూచితల్లికిం, తయునెగఁబోసిరోసమెదఁదార్కొనఁజేసిన." ఉ. రా. ౬,ఆ. స. క్రి. సూచించు. "సీ. మధునదంబెగఁబోసి మాకందమాలికా క్రీడానుషంగిభృంగీరవంబు." స్వా. ౬, ఆ. — ఎగఁబ్రాఁకు. అ. క్రి. మీఁదికిఁబ్రాఁకు. "ద్వి. అచలంబుపైకిగుండనకచెట్టనక, కిచకిచధ్వనులతోఁగిచకొట్టుకొనుచు, నెగఁబ్రాఁకియెక్కుచో." రా. కిష్కి. ౦, కాం.—ఎగదువ్వు. స. క్రి. మీఁదికిదువ్వు. "సీ. డిగజాఱుముంగురు లెగదువ్వుకైతవంబున నెమ్మొగంబుపై మోముఁజేర్చి." కవి.3,ఆ.—ఎగనూఁదు. స. క్రి. 1. పైకినూఁదు; 2. తిరస్కరించు. "సీ. వాంశికవంశికావైభవంబెగనూఁదెఁదాలికాధరకరతాళగరిమ." వసు. ౫, ఆ.—ఎగనెత్తు. స. క్రి. మీఁదికెత్తు. "మగుడఁదన్వేఁడుచునెగనెత్తిపట్టఁగా." కళా. ౭, ఆ.—ఎగరోఁజు. వి. నిట్టూర్పు. (వాఁడు ఎగరోఁజుదిగరోఁజులుగాపరుగెత్తుచున్నాఁడు.) (ఇట్లు ఎగరొప్పు.)—ఎగవిడుచు. స. క్రి. ఊరకవిడుచు. "తెకతేరగనీకెగవిడిచిపోయెదనె." కళా. 3,ఆ.—ఎగవేయు. స. క్రి. 1. అపహరించు; 2. చేసినదిలేదనిసాధించు. "ద్వి. ఎంతైనఁజేసితానెగవేయఁగలుగు." సా. ౭, భా.—ఎగవైచు. స. క్రి. ఎగురవైచు. "శైలములెత్తికందుకముచందముగానెగవైచి." రామా. ౫, ఆ. ఇత్యాదులు.)

ఎగచు. దే. ప్రే. 1. ఎగయఁజేయు. "ఆ. వీరసేనసుతుఁడు వీరుండుహంసల, నడబెడంగుఁజూచినగుచువాని, నెగచియొగచి యందు నెగయకుండఁగన్నొక్కి హంసఁబట్టుకొనియెనతిరయమున." భార. అర. ౨. ఆ. (ఈప్రయోగమునుబట్టియు తగినయాధారము లేకుండుటఁబట్టియు ఎగచు అనునది వేఱొక పదమని గ్రహింపక యిట్లు ఎగయుధాతుప్రేరణరూపమని గ్రహించుటయే యుక్తము. (చూ. ఎగయు.) (ఇది పోగచుపంటిది.) — 2. తఱుము. "క. ఆమ్మెయినినోడితొనుం, దమ్ముఁడుహతశేషమయిన దానవబలముఁ, గ్రమ్మఱితనవచ్చినమా, ర్గమ్మునఁబాఱెను విహంగగమనుండెగచెన్." నిర్వ. 3. ఆ. (కొన్నియెడల ధాతువునకు ప్రేరణమునందర్థభేదమును కలుగుచున్నది. (చూ. కావించు.)

ఎగతాళి. దే. వి. గేలి, పరిహాసము.

ఎగదిగ. దే. ద్ర. ఎగువదిగువలుగా. "ఎ, గీ. ఏగితనకూఁతుసింగారమెల్లఁబెక్కు, మాఱులెగదిగఁగ్రేగంటఁబాఱఁజూచి." కళా. ౭, ఆ.

ఎగపు. దే. వి. 1. గర్వము; 2. మండిపడుట. "ద్వి. బాగుమీఱినవాగబందపుమొగపు, తీఁగదానికిఁగల్గఁదీఱదేయెగపు." భాగ. ౧౦, స్కం.

ఎగయు. దే. అ. క్రి. 1. ఎగురు; 2. పైకిలేచు. "క. మసమసకనయ్యెదిక్కులు, పసిక్రేపుఁదలంచితిరుగఁబడెగూళ్లకుం, తసమాజముకలకలములె, గసెవెడవెడకన్నుమొగిచెఁగమలవనంబుల్." జై. ౨, ఆ.

ఎగపు. దే. వి. ఎగురుట, ఉడ్డీనము.

ఎగసన. దే. ద్ర. ఎగువగా. "సీ. తుదివ్రేలనెగసనఁద్రోచిన పుదియబొట్టురుఘాలపట్టిక నుల్లసిల్ల." రా. అర. ౨, ఆ.

ఎగసిపడు. ద్వి. అ. క్రి. 1. ఎగిరిపడు; 2. గర్వించు; 3. మండిపడు.

ఎగసిపాటు. ద్వి. వి. 1. ఎగసిపడుట; 2. గర్వించుట; "క. భసలమనీకింతయొగసిపాటేమిటికిన్." రసి. ౪, ఆ. (ఇది మీఁది రెండర్థములకును దాహరణము.)—3. మండిపడుట.

ఎగసిల్లు. దే. అ. క్రి. ఎగయు. (అప్ర.)

ఎగాదిగ. దే. ద్ర. ఎగదిగయొక్కరూపాంతరము. "కాంచినుతూలివెండిరయునెగాదిగఁజూచి." ఉ, రా. ౨, ఆ.

ఎగు. దే. విశే. వృత్తియందు ఎగువశబ్దమునకును ఎగురుశబ్దమునకును అంత్యవర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (ఎగుబుజములు, ఎగుబోద. మొ.)

ఎగుచు. దే. స. క్రి. తఱుము. "క. ఆమ్మెయినినోడితొనుం, దమ్ముఁడుహతశేషమైనదానవబలముఁ, గ్రమ్మఱితనవచ్చినమార్గమ్మునఁబాఱెనువిహంగగమనుండెగుచెన్." నిర్వ. 3, ఆ.

ఎగుడు. దే. విశే. ఉన్నతము.

ఎగుడుదిగుడు. దే. విశే. 1. సమముకానిది, విషమము; (ఎగుడుదిగుడునేల.)—2. అసంగతము. (ఎగుడుదిగుడుమాటలు.)

ఎగుదల. ద్వి. వి. (ఎగువ+తల.) 1. పైభాగము; 2. వృద్ధి.

ఎగుబుజము. ద్వి. వి. ఉన్నతభుజము. "ఎ, గీ. పొలుపుమీఱుచు నెగుబుజంబులునుదారు, జమలిమూఁపురములతోడ నమరుమల్ల, రంపుటాఁబోతులనుబోలెఁబెంపుమీఱ, జెట్లుచనుదెంచిరానృపుసేవకొఱకు." పర. 3, ఆ.

ఎగుబోద. ద్వి. వి. ఱెక్కలుమొలచి యెగిరెడువయసువచ్చిన పక్షిపిల్ల.

ఎగుమతి. దే. వి. ఓడకు సరకులెక్కించుట.

ఎగుమతిచేయు. దే. స. క్రి. ఓడకు సరకులెక్కించు.

ఎగురు. దే. అ. క్రి. ఎగురుట.

ఎగురులాడు. దే. అ. క్రి. దుముకులాడు.

ఎగువ. దే. వి. 1. మీఁదు; 2. ఆధిక్యము. "క. తగవామగవారికినిటు, మగువలయందెగువఁజూపు." రామా. ౫, ఆ.—విశే. ఉన్నతము. (వృత్తియందు అంత్యవర్ణలోపము.)

ఎగ్గతము. వై. వి. ఏకాంతస్థలము. "ఎ, గీ. ఎగ్గతంబునఁదానుగారగ్గఁగాలెనట." భార. ఆశ్ర. ౨, ఆ. "ఎ, గీ. అయ్యవ్వయతఁడెగ్గతంపుఁజోట, నరయదిక్కెవ్వరునులేనియట్టితెగుట, నొందఁగలవాఁడుగాఁబల్క." భార. మౌ. ౧, ఆ.

ఎగ్గాడు. దే. స. క్రి. (ఎగ్గు+ఆడు.) దూషించు. "శా. తోడంబుట్టినవానిభంగమునకున్ దుఃఖించిమాకృష్ణునెగ్గాడంజూడకు మమ్ము." భాగ. ౧౦, స్కం. ఉ.

ఎగ్గించు. దే. స. క్రి. అనాదరించు. "శా. ఏలాపట్టవదయొగ్గుమావలననీకెగ్గింపఁగానేటికిన్." భాగ. ౧౦, స్కం. పూ.

ఎగ్గు. దే. వి. 1. కీడు; "ఉ. అగ్గిసొరందలంచునటులగ్గునునెక్కటిదాఁకఁగోరనీ, కెగ్గిది." భార. కర్ణ.

౨, ఆ.—2. అపకారము; "బ్రాహ్మణసీమలకెగ్గు సేయ." భో.3,ఆ.—3. కీడుమాట; "ఎగ్గునారుల తిపేరెసఁగుచుండు." అం. భా. ప్ర. వాగ్వ.—4. అపరాధము; "శా. ఏలాయింతిపృథాభిమానము క్రియాహీనుండవైనావిధం, బాలోకింపకయెగ్గు చేసితివి." భో.3,ఆ.—5. దోషము; "ననుసెగ్గులుపట్టకుండినన్ బొందొనరున్." భార. కర్ణ. ౧, ఆ.—6. అనాదరము. "శా. ఏలావట్టుదయెగ్గుమావలననీకగ్గింపఁగా నేటికిన్." భాగ. ౧౦, స్కం.పూ.—7.బ.దూషణము."చ.ఇతనికినన్ను నిట్లుఅకయెగ్గులు పల్కఁగఁబోలఁగాక." భార. సభా. ౨, ఆ.

**ఎగ్గులుతు.** దే. వి. (ఎగుడ+గులుతు.) విషయసంగ్రహము. (ఎగ్గులుతులెక్క.) (రూ.ఎగ్గుర్తు.)

**ఎగ్గులాడు.** దే. స. క్రి. (ఎగ్గులు+ఆడు.) నిందించు.

**ఎచ్చిరిలు.** దే. అ. క్రి. వర్ధిల్లు. "గీ. ఏయుపాయంబుచేనైననెచ్చిరిలఁగ, నీకరాక్షసకులమురమేశ్వరుండు, తునుమునను శంకయొక్కటి మనమునందు, నున్నయదిదీనికెద్దియోయాయుక్తియింక." కళా. ౬, ఆ. (రూ. ఎచ్చిర్లు. "గీ. నృపులకపుల సమరనిష్ఠురత్వంబుల, నొచ్చిచరమదశకువచ్చి దనుజు, లెపుడుప్రొద్దుగ్రుంకునెపుడుమాకెచ్చిర్లఁ, గలుగుననుచుఁబోరుసలుపుచుండ." రామా. ౮, ఆ.)

**ఎచ్చిలు.** దే. అ. క్రి. 1. ఎచ్చిరిలు. "చ. మఱుసటినాటివేకువ నమాత్యుఁడుమేల్కనివంశమంతయున్, జెఱచిరికూఁతురుంగొడుకుఁజేకొనిముందఱఁజంద్రహాసుఁడె, చ్చిటెనఁబ్రమాదమానను చుఁజిత్తమునందలపోసివీనినే, తెఱఁగుననైనఁజంపెదయతిప్రవరోక్తులఁబొంకుచేసెదన్." జై.౮, ఆ.—2. బాగుపడు. "చ. నెఱయఁగ సంపరాని ధరణీజమువంపఁగడంగనేనియే, డ్డెఱబలఁఖడ్గధారజగతీధరశృంగముద్రవ్వెనేనిమీఁ, దెఱుఁగక బుద్ధిహీనునకునెంతయుబుద్ధులు చెప్పెనేనియో, చ్చిఱఁడొకవానరింబునకుఁ జెప్పినసూచిముఖుంబుచాడ్పునన్." పంచ. నా. ౧, ఆ.

**ఎచేటు.** దే. వి. ఏ.ఎచ్చోటుయొక్కరూపాంతరము. (చూ.) ఎచ్చోటు.

**ఎచేరించు.** దే. స. క్రి. ఎచ్చరించుయొక్కరూపాంతరము. "ద్వి. పచరించిమాయలుపన్నిభూపాలు, నెచరించికోయింపనెట్లాడెమనను." నవ.3,భా.

(దీనికి ఈ ప్రయోగమొక్కటే కనంబడుటచే ఇది యింకను విచారింపఁదగినది.)

**ఎచోటు.** దే. వి. ఏ. ఎచ్చోటుయొక్కరూపాంతరము. (చూ.) ఎచ్చోటు.

**ఎచ్చటు.** దే. వి. ఏ.——పై.——

**ఎచ్చరము.** దే. వి.ఎచ్చరిక. "వ. మఱియునయ్యశ్వరలెచ్చరంబులఁగచ్చువదలి." కవిక. ౬, ఆ.

**ఎచ్చరించు.** దే. స. క్రి. ఎచ్చరికచేయు.

**ఎచ్చరింత.** దే. వి. ఎచ్చరిక. "ఉ. వింతకవుంగిలింతల నవీనగళధ్వనియెచ్చరింతలన్." పాంచా. 3, ఆ.

**ఎచ్చరిక.** దే. వి. 1. అవధానము; "చ. మరలఁగఁబట్టగట్టఁగసమస్తమరుద్గవినన్నుఁగూర్చియె, చ్చరిక ధరింపఁబోలునన."పాండు.౨,ఆ.—2. సూచన.

**ఎచ్చరికించు.** దే. స. క్రి. ఎచ్చరించుయొక్కరూపాంతరము. "ఉ. కన్నిచ్చలువచ్చుచేడియల నెచ్చరికించుమధూర్తకోటితో, మచ్చరికించుచున్." విక్ర. ౮, ఆ.

**ఎచ్చు.** దే. అ. క్రి. అధికమగు. వి. అధిక్యము. విశ. అధికము.

**ఎచ్చోటు.** దే. వి. ఏ. (ఏ+చోటు.) ఏస్థానము. (రూ.) ఎచోటు.

**ఎట.** దే. వి. ఏ. ఎక్కడ. "ఇచ్చనుపయిటఁబోయెడు." భార. అర. ౨, ఆ.

**ఎటవారె.** దే. వి. కుందురుకి?.

**ఎటు.** దే. అవ్య. ఎట్లు. "ఎటాడుకొన్నసుంజెల్లగదమ్మనీకు." కళా. ౧, ఆ.

**ఎటులు.** దే. అవ్య.—పై.—"ఏనెటులట్లనీవరసియిచ్చెమెయింబనిగొమ్ము." భార. విరా. ౧, ఆ.

**ఎటువంటి.** దే. విశ. ఎట్టి. "మీరెటువంటిపెద్దవారు." కళా. 3, ఆ.

**ఎటువలె.** దే. ద్ర. ఎట్లు. "ఎటువలెభీతినీకొదవె." సకల. ౯, ఆ.

**ఎట్టకునేని.** దే. అవ్య. ఎట్టకేని. "కొంతసేపువేల్పెక్కినభంగినుండిధృతినెట్టకునేనియుఁబూని." రా. అ, కాం.

**ఎట్టకేని.** దే. అవ్య. అతిప్రయాసమున. "గీ. ఇట్టులరియాడుచిత్తంబునెట్టకేని, నాథుచెప్పినధర్మంబునకుఁజొరంగ,నూలుకొల్పి." భార.అను.౧,ఆ.

**ఎట్టకేలకు.** దే. ద్ర.—పై.—"ఎట్టకేలకునుదేర్చునప్పుడుబలంబులతోఁగురురాజునూడ." భార. విరా. ౫, ఆ. "క. పెన్నిధిఁగనిపోవఁగలే, కున్న

క్రుపణుమాడ్కిఁ జిత్తమాటాడఁగనా, కన్నెప
రాధీనతనతి, ఖిన్నయగుచునింటికెట్టకేలకుఁజని
యెన్." జై. ౮, ఆ.
ఎట్టటు. దే. అవ్య. (ఎట్టు+అటు+అ.) ఎట్టయిన. "క
ముదమెదవఁగసుతుఁడెట్టట, బ్రదికినఁజాలుననిచనియె." పర. ౨, ఆ. (చూ. తాలిమి.)
ఎట్టపోగు. ద్వ. వి. దండు. "చ.హరునకువెట్టఁజొట్టిన
యమాలయవాటికఁజేరియచ్చటన్, మరుఁడుతదీ
యశాసనమునన్ విరహిప్రకరంబునొంపదు,ష్మర
గతినెట్టపోగసఁగన్ గైకొనివచ్చినరీతివచ్చెఁగ్రొ,
వ్విరిగనదువ్వచాల్గొని దివిన్ మలయానిలవాత
పోతముల్." చంద్ర.
ఎట్టయెదురు. దే. వి. ఏ. (ఎదురు+ఎదురు.) చక్కని
యెదురు.
ఎట్టి. దే. విశే. ఎటువంటి.
ఎట్టిఁడు.దే.విశే. (ఎట్టి+వాఁడు.) ఎటువంటివాఁడు.
"ఎట్టిఁడునానిజేశుఁడు." రా. సుం, కాం. (బ.
ఎట్టిరు.)
ఎట్టు. దే. అవ్య. ఎట్లు.
ఎట్టులు. దే. అవ్య.——పై.——
ఎట్టువోలె. దే. ద్ర.——పై.——
ఎట్టూ. దే. అవ్య. ప్రశ్నమును దెలుపును. "ఎట్టూ
యిట్టగునయ్యపల్కదయలేక." ఆము. ౬, ఆ.
(ఆమ్రేడితమందు ఎట్టెటూ,ఎట్టెట్టూ. "అనుట
యునెట్టెటూ తెలుపుమయ్యమహాత్మక." కళా.
౭. ఆ. "శా. ఎట్టెట్టూవినమైతిమింకనొకమాటే
ర్పాటుగాఁజెప్పుమా." కాశీ. ౭. ఆ.)
ఎట్లు. దే. అవ్య. ఏప్రకారము. "క. అమరపరులం
దుఁబురుషో, త్తముఁడెట్లువిశేషమట్లుధరణింగల
తీ, ర్థములందునుబుష్కరతీ, ర్థముకరముకవిశేషమ
భిమతార్థప్రదమై." భార. అర. ౨, ఆ.
ఎడ. యు. దే. వి. 1. స్థానము; "పార్థులరుగునెడను
మనమునరిగి." భార. ఆది. ౬,ఆ.—2. అవకాశ
ము; "ఉ. నిచ్చలునిచ్చలోఁబొదలునీపితృభక్తికి
జ్ఞానశక్తికిన్, మెచ్చితినచ్చితిన్ గరమునియ్యెడ
నియ్యెడయేలవేఁడుకొ, మ్మిచ్చెదఁజెచ్చరన్ వల
యునీప్సితముల్ శతమేనిదీనవే, పొచ్చెమునొ
చ్చెముంజొరదుభూసురకేసరిసమ్మునావుడున్."
పాండు. ౨,ఆ.—3.దూరము; "క. కడునెడగా
వుననదియి,క్కడవినఁబడదేమొ."కళా.౪,ఆ.—
4.గడువు; "ఇప్పుడెడయిచ్చుటయుక్తమునాకు."
భార. ఉద్యో. ౧, ఆ.—5. భేదము; "క. ఎడయెఱుఁ
గియుండమలోపల, నెడయెఱుఁగకధర్మపథస
మేతస్థితికిన్, నడిమింటివారలైరా, నడిమింటిర
విన్ హసించునవ్యప్రభలన్." రామా. 3, ఆ.—
6.విఘ్నము; "క.నాకెంతయుఁబ్రియశిష్యుం, డీ
కపివరుఁడితనిపనికినెడకాకుండన్, బోకయుచి
తమనుకరణివి, భాకరుఁడపుడపరశిఖరిపైకరుగు
టయున్." రా. సుం, కాం.—7. వ్యవహారము;
"క.ఎనిమిదియేఁడులుశిశువగు, నెనిమిదియేఁడుల
టబాలుఁడెడయెఱుఁగఁడుగా, వునబాలుఁడెన్ని
భంగుల, జనకునిఋణమరువఁజనదుచనునటమీఁ
దన్."సం."గర్భస్థైస్సదృశోజ్ఞేయ ఆష్టమాద్వత్స
రాచ్ఛిశుః, బాలఆషోడశాద్వర్షాత్పౌగండశ్చేతి
శబ్ద్యతే, పరతోవ్యవహారజ్ఞఃస్వతంత్రఃపితురా
వృతేః."విజ్ఞా.వ్య,కాం.—8.సంధి; "ద్వి.ఎడమా
టలాడియాయినవంశుఁదేరఁ, గడుహనుమంతుం
డుగలిగనేనీకు." రా. కిష్కిం, కాం.—9. దేవ
తా నైవేద్యవస్తువు. (ఇది విచార్యము.)—విశే.
ఎలప్రాయముగలది. (ఎడదూడ, ఎడపడ్డ.)—
ద్ర.నడుమ. "ఎ,గీ.అంతనాభీష్ముఁడెడఁదునుమా
డెనధిప." భార.భీష్మ.3, ఆ. (ఆమ్రేడితమందు
ఎడనెడ.)—వై.వి.హృదయము. "ఎడఁబొలివో
నివేడుకలయేడ్తెఱసొంపున." నిర్వ. ౮, ఆ.
ఎడఁద. వై.వి. ఎద, హృదయము. "భీష్ముఁడర్థరథుఁ
జేసియెడందఁగలంచె." (కొన్ని ప్రతులయందు
పాఠమిట్లున్నది. ఇదియ పొందికగాఁదోచెడి.)
భార. శాం. ౧, ఆ.
ఎడఁబాటు. దే. వి. ఎడఁబాయుట, వియోగము.
"సీ. సాదరంబుగ రఘుస్వామివెంటనెలక్ష్మణుం
డెడఁబాటులేకుండు సేవ్య, సేవకభావంబుచె
న్నొందె." అధ్యా. బాల, కాం.
ఎడఁబాపు. దే. ప్రే. ఎడఁబాయఁజేయు.
ఎడఁబాయు. దే. స. క్రి. (ఎడ+పాయు.) వీడు,
వదలు.
ఎడకట్టు. దే. అ. క్రి. ఆటినపుండు మరలచీముపట్టు.
స. క్రి. చేర్చు. "సీ. ఇంద్రనీలములతో నెడకట్టి
గ్రుచ్చిన రమణీయతారహారముధరించి." కాశీ
౭, ఆ.
ఎడకత్తియ. ద్వ. వి. దూతిక, (రూ. ఎడకత్తె.)
ఎడకాఁడు. దే. వి. తార్చువాఁడు, దూత.

**ఎడకారు.** ద్వ. వి. మాఘమాసము మొదలు జ్యేష్ఠ మాసములోపల పండించెడుపంట.

**ఎడగడ్డ.** ద్వ. వి. ఒడ్డు, గట్టు, దరి, తీరము.

**ఎడగిల్లు.** దే. అ. క్రి. తొలఁగు, అపసరిల్లు.

**ఎడతాఁకు.** దే. అ. క్రి. చేరు, సంధించు. "వ. అంతట వారలు ద్రవ్యంబునకుం బ్రతిదినంబు నెడతాఁకంగ డంగినం దనమనంబున." పర. ౫, ఆ. "సీ. తన భూమివదలక ధనవంతులగువారియిండ్లకు నెడ తాఁకుచెల్లప్రొద్దుఁ, జేరిమిథ్యానమస్కారముల్ సేయుచుఁ బ్రియములునయములు పెక్కుచూపి." హరిశ్చ. ౪, ఆ.

**ఎడతీయు.** దే. అ. క్రి. ఎడతెగు.

**ఎడతెగు.** దే. అ. క్రి. 1. ఎడపడు; 2. విడిపడు. "క. ఒక్కకరినాథుఁ డెడతెగిచిక్కెన్." భాగ. ౮, స్కం.

**ఎడతెఱపి.** దే. వి. వ్యవధానము. (తిరునాళ్లకు జనులు ఎడతెఱపిలేక పోవుచున్నారు.) (చూ. ఎడతెర్పి.)

**ఎడతెర్పి.** దే. వి. ఎడతెఱపియొక్క రూపాంతరము. "చ. ఇద్దెసవచ్చె నేనియ, త్తెఱఁగయిపోయెయుంచు నెడతెర్పిగఁగొందఱు పాయవాఱఁగన్." భార. విరా. ౫, ఆ.

**ఎడత్రెచ్చు.** దే. అ. క్రి. ఎడతెగు. "క. పెనఁకువ యెడత్రెవ్వకపదు, నెనిమిదిదివసములు సెల్లె." భార. శల్య. ౧, ఆ.

**ఎడదవ్వు.** దే. వి. అతిదూరము. "ఎ, గీ. విశ్వభర్త, యానతిచ్చినయట్టులయధివసించెఁ, గాశికాపురి కెడదవ్వగలుగునడవి." కాశీ. ౭, ఆ.

**ఎడనీరు.** ద్వ. వి. 1. లేఁతటెంకాయలోనితియ్యనీరు; "సీ. ఎడనీటిబొండ్లాలవడువున మెదడెల్లజొత్తివైచినడొల్లుపుత్తొగములు." ఆము. ౬, ఆ.—2. ఎడనీటికాయ. "సీ. ఎడనీరటంచననగుఁదచ్చులాటువు." ఆం. భా. ద్వి. వ.

**ఎడపడు.** ద్వ. అ. క్రి. 1. ఎడతెగు; "క. ఎడపడక యహోరాత్రము, వడిగొనిచదివింప." భార. ఆర. 3, ఆ.—2. పూఁటపడు. "క. కుడిచినతఁడ రువకుండిన, నెడపడినయతండయచ్చుటెటేఁగి నృపతియా, కుడిచినతసిఁగనినప్పుడు, ఎడపడి నాతనికిరట్టియిప్పింపఁదగున్" సం. "ప్రతిభూర్దాపితోయత్తు ప్రకాశంధనినాంధనమ్, ద్విగుణం ప్రతిదాతవ్యమృణికైస్తస్యతద్భవేత్." విజ్ఞా. వ్య, కాం.

**ఎడపదడప.** దే. అవ్య. అప్పుడప్పుడు. "గీ. ఎడపదడప తనూభవుఁడెచటనుండుఁ, గానరాఁడనిగ్రహభర్తకాంతనడుగ." కాశీ. ౪, ఆ.

**ఎడపు.** దే. ప్రే. ఎడయఁజేయు. "క. జనవినుతమగ్నిహోత్రం, బును సంతానమును వేదములు నెడపంగాఁ, జనదు." భార. ఆది. ౪, ఆ.

**ఎడపెట్టు.** దే. స. క్రి. 1. తొలఁగించు; "గీ. ఎఱుఁగుమతఁడునిన్ను నెడపెట్టిపలికినవాఁడు." భార. ద్రో. ౧. ఆ.—2. మాఱుపడ్డించుకొనుటకైయన్నమునుదగ్గఱయెత్తియుంచు.

**ఎడపోవు.** దే. అ. క్రి. దౌత్యముచేయు. (అప్ర.)

**ఎడమ.** దే. విశే. సవ్యము. (ఎడమకాలు, ఎడమచేయి. మొ.—వృత్తియందు అంత్యవర్ణలోపము. ఎడకన్ను, ఎడవంక. మొ.)

**ఎడమడుగు.** దే. వి. 1. వ్యత్యాసము; (చూ. ఎడమడువు.) 2. వైషమ్యము. "క. ఉడుగుడుగుమోహనాస్త్రము, విడువకుమను నెలుఁగుతోడవేగంబునన, య్యెడకేగుదెంచినారదుఁ, డెడమడుగించుకయులేకయిట్లను నాతోన్." భార. ఉద్యో. ౪, ఆ.—విశే. వ్యత్యస్తము. "ఎ, గీ. వడుగుచందంబుతనకెడమడుగుగాక, కొమరుగానేగనెలకట్టి గుజ్జువేల్పు." హరి. ఉ. ౧౦, ఆ.

**ఎడమడువు.** దే. వి. 1. వ్యత్యాసము; "క. నడిపింపఁగఁబొడిపింపఁగ, నెడమడువైకలఁగినప్పుడేర్పఱపఁగనేఁ, గడునేర్తుఁ బేర్చునాదగు, కడిమియనీసైన్యమునకుగవుసెనకాదే." భార. ఉద్యో. ౪, ఆ.—2. వైషమ్యము. "క. అడలడఁచినెమ్మనమ్మున, వెడతెలివొడఁగూర్చిమాటవేర్పడకుండన్, జడిముడిపడకనయంబున, నెడమడు వొక్కింతలేకయిట్లనుసతితోన్." నిర్వ. ౮, ఆ.—విశే. వ్యత్యస్తము. (చూ. ఎడమడుగు.)

**ఎడమడువుపరువడి.** దే. వి. మల్లబంధవిశేషము.

**ఎడము.** దే. వి. 1. చోటు; "అతిథులకు నెడమిచ్చి." భార. అశ్వ. ౨, ఆ.—2. అవకాశము. "నాకు నాహారనిద్రలకెడములేదు." భార. ఆర. ౫, ఆ.

**ఎడయిక.** దే. వి. ఎడఁబాటు, వియోగము.

**ఎడయు.** దే. అ. క్రి. తొలఁగు. "క. ఏవురుపతులం దుధర్ము వెడయకయుండున్." భార. ఆది. ౭, ఆ.—స. క్రి. ఎడఁబాయు. (ఇటీవలికవులుకొందఱు దీనినిసకర్మకముగా ప్రయోగించుచున్నారు. పూ

ర్వగ్రంథములయందుఁ బ్రయోగము కనఁబడలేదు. విచార్యము.)

**ఎడరు.** దే. అ. క్రి. భగ్నమగు. "చ. తడయకఘోరదర్శనసుదర్శనపావకుచేదహింపఁగాఁ, బడిపరమేశ్వరోగ్రశరపావకదగ్ధపురత్రయాభమై, యెఱిధరిత్రిమీఁదఁబడియెన్ జెడెసౌంభకమంత సాల్వుఁడున్, బడియెమదీయచక్రపటుపాతరయంబునరెండువ్రయ్యలై." భార. అర. ౧, ఆ.— వి. 1. ఆపద; "గీ. వలదుశంకింపనింద్రునివలనఁ బుట్టు, నెడరువొందకయుండఁగఁ గొడుకునోపి, నంతగావుము కావంగనైనచావు, నపుడునన్నుఁదలంపుమేనదిమరల్తు." భార. శాం. ౧, ఆ.— 2. భంగము; "చ. ఇదితగదంచునడ్డపడునింతకు నేరకసభ్యులందఱున్, మదిమదినున్నయట్టియెడమానినికిందనుఁదానకాచికో, లాదవినదానఁ జేసిసభనెచ్చెముదక్కెఁబాండునందనుల్, బ్రదికిరిగాకయయ్యెడరు రాచకొమారులకోర్చునట్టిదే." భార. ఉద్యో. ౧, ఆ.—3. సందు; "గీ. అప్పాటుఁడసతి, నెత్తుకొనిపోవనిందందునెడరు వేచె." పాండు. 3, ఆ.— 4. ఎడారి. "వ. ఎడరునంజలిపందిరిడియెదమనియు." (కొన్నిప్రతులయందు ఎడవున అని పాఠమున్నది.) ఆము. ౪, ఆ.

**ఎడలు.** దే. అ. క్రి. 1 వికలమగు; "చ. అనవినిమేటిధర్మమగునట్టిదియెయ్యది యెద్దియెప్పడుం, గనియఁగఁబండియుండునెసకంబుగనెయ్యదినిగ్రహించినన్, దనరుఁబ్రమోదసిద్ధినియతంబుగనెవ్వరితోడిసంధియెం, దునువికలంబుగాదు పరితోషమెలర్పనుపన్యసింపవే. వ. అనిదివ్యుండు పలికిన నాదివ్యబోధనుండిట్లనియె. గీ. వినుమహింసమేటియనఁజనుధర్మంబు, యోగకర్మమెప్పుడునొనరఁబండి, యుండుమనసుక్రొవ్వుఖండింపఁగామోద, మెసఁగుసుజనసంధి యెడలదెందు." భార. అర. 2, ఆ.— 2. విచ్ఛిన్నమగు. "కురువంశమెడలవచ్చిన." భార. స్త్రీ. ౨, ఆ.— స. క్రి. విసర్జించు. "క. వందురిపగలన్ దేహము, పొందెడలఁగఁజూచునన్నుఁ బొడఁగనిదివిఁదా, నెందులకేగుచునోగిరి, నందనదిగివచ్చికరుణనాకిట్లనియెన్. మ. అతిసౌందర్యనిశాంతమీతనువలభ్యంబిట్లుశోకాతురా, న్వితవైదీనిఁదొఱంగఁగాఁదగునె." స్వా. ౬, ఆ.

**ఎడవాఁడు.** దే. స. కడవాఁడు, అన్యుఁడు.

**ఎడవు.** దే. విశే. దవ్వు. దూరము. "ఎ. గీ. తెరువు, నెడవనుచుజాలిఁగొని సంశయించువేళ." ఆము. ౬, ఆ.

**ఎడసాల.** ద్వి. వి. ప్రత్యేకమయినగది.

**ఎడాటము.** దే. వి. విషయము. "సీ. నెపమేమియునులేక నీయెడాటమ్మునఁ బాడిఁదప్పఁడుగదా భైరవుండు." భీ. ౨, ఆ. (దీనికి ఆట అని కొందఱు అర్థము చెప్పుచున్నారు.)

**ఎడారి.** దే. వి. చెట్లుచేమలులేనివిశాలపునిర్జలభూమి.

**ఎడారె.** ద్వి. వి. (ఎడ+ఆరె.) చెప్పులుకుట్టెడు చిన్నసూది.

**ఎడ్డ.** వై. వి. ఎడఁదయొక్క రూపాంతరము. "క. చెడిపోకుఁడుసంసారము, కడతేర్పుఁడుశౌరిచరణకమలములెడ్డం, బడికొనుఁడూరకకాలము, కడపకుఁడువివేకవీథిఁగడఁగుఁడునడవన్." లక్ష్మీ. ౪, ఆ.

**ఎడ్డమి.** దే. వి. ఆపద. "ఉ. ఎడ్డమియైనయప్పటికి నెవ్వరుఁజేరరు లోకులేమియున్, సడ్డలుసేయనొల్ల రవసానపువేళల దండధారుచే, జడ్డలెకానిమేలుకొనసాగ దయో తలపోసిచూచినన్." వి. పు. ౫, ఆ.

**ఎడ్డము.** దే. వి. అడ్డంకి, నిరోధము. "ఉ. ఏడుదినంబులన్నమున కెడ్డము పుట్టినయంతమాత్రలో, నేడుచుచున్నవాఁడవుమునీశ్వర." భీ. ౨, ఆ.

**ఎడ్డియ.** వై. విశే. మూఢుఁడు.

**ఎడ్డె.** వై. విశే. ఎడ్డియయొక్క రూపాంతరము.

**ఎడ్డెఁడు.** వై. విశే. ఎడ్డయొక్క రూపాంతరము. "పిసాసియునంటిగరాసుఁగూడునీ, యెడ్డెఁడు." శు (క. ౧, ఆ.)

**ఎడ్డెన.** దే. వి. భోజనపాత్రమునుంచుకొనెడి ఉన్నతపీఠము. "సీ. వెండియెడ్డెనలపై నెలచి తెచ్చినపైఁడి పళ్లెంబులాయితపఱచువారు." నై. ౬, ఆ. "గీ. పసిఁడియెడ్డెనలనుమించుపద్మరాగ, భాజనంబులవడ్డించుబహుపదార్థ, వితతులమరెసుమేరుసంగతసహస్ర, కరునిఁబొదివిన చిత్రమేఘములకరణి." జై. ౮, ఆ.

**ఎడ్లు.** దే. వి. బ. (ఎద్దు+లు.) వృషభములు.

**ఎతఁడు.** దే. స. ఏ. ఏపూజ్యుఁడు. (ఏతఁడుయొక్క రూపాంతరము.)

**ఎతుబరికాఁడు.** దే. వి. ఎత్తుబరికాఁడుయొక్క రూపాంతరము.

**ఎత్తనగోల.** దే. వి. 1. గోనెలెత్తి యెడ్లమీఁదవేయుటకు సాధనమైనకఱ్ఱ; "సీ. తనరుగోణ్యుద్ధారి

దండాఖ్యయెత్తనగోలనాబట్టిన గోలయనఁగ." అం, భా. ద్వి. వై.—2. ఊఁతగా నానించినకోల.

**ఎత్తనగోలు.** దే. వి. 1. మొదలు; 2. ప్రారంభము.

**ఎత్తరము.** దే. విశే. ఉన్నతము. "సీ. ఇలఁజొట్టుపడు తుండములమించిపూర్వాంగ మెత్తరంబైపిఱుందత్త మిల్ల." స్వా. ౫, ఆ.

**ఎత్తరవు.** దే. విశే. ఎత్తరము, ఉన్నతము.

**ఎత్తళి.** దే. వి. కొఱముట్టు, సాధనము.

**ఎత్తికొను.** దే. అ. క్రి. కడఁగు, యత్నించు. "గీ. ఎట్టి కష్టుఁడైననిట్టిపాపము సేయ, నెత్తికొను నెధరణి నీవుదక్క." భార. ఆర. ౬, ఆ.—స. క్రి. 1. అపహరించు; "భూసురకాంత నెత్తికొని పోవుటదోసముయామిమినీశ." వి, పు. ౬, ఆ.—2. వహించు; 3. ఉద్ధరించు. "క. ఇపుడానన్నెత్తికొనక, గ్రపపుట్టుటనీకుజానకీవృత్తాంతం, బెపుడుకొనివచ్చితిచ్చటి, కపుడేననునెత్తికొంటి వనిలకుమారా." (ఇది రెండర్థములకును ఉదాహరణము.) రామా. ౭, ఆ.

**ఎత్తికోలు.** దే. వి. 1. కడఁక, ప్రయత్నము; "క. తరతరమప్రజలఁదుని మెడు, నరునప్పటియెత్తికోలు నకుసురవిద్యా, ధరఖేచరులునుభీతిలె, బొరసిరి." భార. విరా. ౫, ఆ.—2. సంకల్పము. "క. పది వేలఁజంపఁగానో, పుదు నేనను నెత్తికోలు పుట్టినయది." భార. ఉద్యో. ౪, ఆ. "వ. ఎప్పుడేని మీరలడ్డమాడుదు రప్పుడశపింతునిట్టిదనాయెత్తికోలు." భార. అను. ౨, ఆ.

**ఎత్తిపొడుచు.** దే. స. క్రి. దోషములెత్తిచెప్పి మర్మము దూఱిపాడు.

**ఎత్తిలి.** దే. అవ్య. గట్టిగా. "ఉ. ఎత్తిలికావుకావురని యేడ్చితదీయపయోధరాగ్రముల్, కుత్తుకదాఁకఁబీల్చికొని క్రోలె." హరి. పూ. ౫, ఆ.

**ఎత్తివేయు.** దే. స. క్రి. 1. తీసివేయు; (వానిపేరెత్తివేయుము.)—2. అలక్ష్యముచేయు. (నన్నెత్తివేసినమాటాడెను.)

**ఎత్తు.** దే. అ. క్రి. 1. కలుగు, పుట్టు; "క. కౌరవులుసేయునవమతి, కారణముగఁగోపమెత్తు." భార. శాం. ౧, ఆ.—2. బయలుదేఱు. "వ. ఎత్తెడు చోట్లనువిడిదలలయందునులోనుగానిస్సాణాదులైనయుద్ధపటచిహ్నంబులుప్రకటింపక." భార. విరా. 3, ఆ.—స. క్రి. 1. అపహరించు; (ఆసొమ్మువాఁడేయెత్తినాఁడు.)—2. దండెత్తు; "గీ. అని కిప్పుడరిఁగొనియతండు, కౌరవులమీఁదనెత్తిరాఁగడఁగువాఁడు." భార. ఉద్యో. ౨, ఆ.—3. పైకెత్తు; "చెలిప్రాణమెత్తుటసదె." హరి. ఉ. ౭, ఆ.—4. గ్రహించు; (నీవాపుస్తకము నెత్తితివా.)—5. తీయు; (ఈబండిని నేను ఏలములో నెత్తితిని.)—6. (చల్లుడునీరు) పాఱించు; "సీ. నీరెత్తు వేళలనీరెత్తుఁబాదుపాదునకుఁగాలువలుపొందుగనమర్చి." కళా. ౪, ఆ.—7. ప్రస్తావించు; (అక్కడయీమాటయెత్తకుము.) — 8. వహించు; (వాఁడుమంచిపేరెత్తెను.) — 9. సంగ్రహించు. (ఇది మఱియొక గ్రంథమునుండి యెత్తివ్రాసినది.) (నోరెత్తు, పరుగెత్తు, భిక్షమెత్తు. ఇత్యాదులను వేఱువేఱుక్రియలుగాఁజెప్పుట యుక్తము.)— వి. 1. చదరంగపు ఎత్తు; 2. ఉన్నతి; "ఉ. తమ్ములకెల్లఁబెద్దయగు తామరసోదరనాభికాసరో, జమ్మదివిశ్వమున్ విధివశమ్మునఁగానిసృజింపఁజాలదీ, తమ్ములయెత్తుచిత్రచరితమ్ము." వసు. ౫, ఆ.—3. ఉపాయము; "గీ. ఇంతవట్టుననాపాలనిచటఁగూడె, నేమిసేయుదుఁబనికిఁబైయెత్తుదోఁచ, దనుచుఁజింతాపరంపరాత్యంతదంతురాంతరంగంబుతోనుండెనవ్విభుండు." రామా. ౭, ఆ.—4. రెండువీసెలకొలఁది; 5. తూనిక; "సీ. తొలునాదుశోధ్యునిదులఁదూఁచియాతని యెత్తైనయొద్దికలెల్లఁదాఁచి." విజ్ఞా. వ్య, కాం.—6. ప్రయత్నము; "చ. విలసితమోహదావాపరివేదనపొమ్మని యెత్తుపెట్టఁగా." హంస. ౧, ఆ.—7. పుష్పసరము; 8. బ. వలపుకత్తెవలచినవానికిచ్చుధనము. "సీ. పద్మాస్యపురినసుభవమునకీవయెత్తులువెట్టుదనఁగరావలసెనిటకు. (ఇది పైయర్థమునకును ఉదాహరణము.) ఆము. ౨, ఆ.—విశే. ఉన్నతము. "సీ. దొదలకుపధానమగుసొంపుదీపింపఁగుడికరంబెత్తుగానిడిచెలంగి." శేష. ౪, ఆ.

**ఎత్తుగడ.** దే. వి. (ఎత్తు+కడ.) 1. ఉపాయము; 2. యత్నము.

**ఎత్తుగడ్డలు.** ద్వ. వి. బ. ఎత్తుడుప్రొయ్యిగడ్డలు.

**ఎత్తుగున్న.** ద్వ. వి. లేఁతయేనుఁగుపిల్ల. "ఎ, గీ. అచటిమదపుటేనుఁగులకమరకరటి, యెత్తుగున్న." చంద్రా. ౧, ఆ.

**ఎత్తుదెంచు.** దే. అ. క్రి. (ఎత్తు+తెంచు.) దండెత్తివచ్చు. "ఆ. కాలయవనుఁడనఁగఁగాల కల్పుఁడు

శత్రుఁ, డేచినుధురమీఁదనెత్తుదేర." హరి. ఉ. ౨, ఆ.

ఎత్తుపెట్టు. దే. స. క్రి. పురికొలుపు. "చ. విలసితమోహదాహపరివేదనపొమ్మనియెత్తుపెట్టఁగా." హంస. ౧, ఆ.

ఎత్తుబరికాఁడు. దే. వి. దొంగ, చోరుఁడు.

ఎత్తుభారము. మి. విణ. పాడు.

ఎత్తువచ్చు. దే. అ. క్రి. సరిపోలు. "వ. అక్షవిద్యానైపుణ్యముగలభూపకుమారులతోఁ బసులకాఁపరులెత్తువత్తురేయని క్రొవ్వున నవ్వుచుం బలికిన." భాగ. ౧౦, స్కం. ఉ.

ఎత్తువడు. ద్వ. అ. క్రి. (ఎత్తు+పడు.) 1. చెడు; (వానిపేరు ఎత్తువడిపోయినది.)—2. లేవలేకపడు. "సీ. ఎత్తువడ్డమహోకుభృత్తులనతులితధృతిఁజీరికిఁగొననిధీరభటులు." వసు. ౨, ఆ.

ఎత్తువేయు. దే. స. క్రి. తూఁచు.

ఎత్తువోవు. దే. అ. క్రి. (ఎత్తు+పోవు.) 1. చెడు; "గీ. శిలచిగురుఁబోఁడియైయుల్లసిలనొనర్చి, యెత్తువోయినగౌతమునిల్లునిలిపె." రామా. ౮, ఆ.—2. తగ్గు. "క. అవిఘునునొకటికొకటిక, త్తువోకపెనఁగిననుగనిమధుత్రిపురహరుల్, సవరణతోమగుడంగాఁ, దివిచిరిఖేచరగణంబు దివిఁనుతింపన్." ఉ. హరి. ౭, ఆ.

ఎత్తెల. దే. వి. చేఁపలఁబట్టెడి అడ్డువల. "క. వెరవుననూఁదులనెత్తెలఁ, గరములమత్స్యములఁబట్టి కడుసంతసముం, బొరయుచుఁద్రాళ్లంగ్రువ్వఁగఁ,గరమూహించిమదిఁబ్రాప్తకాలజ్ఞుఁడనున్." భార. శాం. ౩, ఆ.

ఎద. యు. దే. వి. పశుబుతువు. "వ. ఎదపదనునం బొదలుపెట్టలకుంజొట్టంబులై." స్వా. ౮, ఆ.—వై. 1. హృదయము; 2. భయము*. "సీ. ఎదడింది మదమొందిగదనొందిరొదఁజెందిపొదసందిపెదపందిమెదుపునొక్కఁడు." చంద్రా. ౨, ఆ.

ఎదవడు. వై. అ. క్రి. (ఎద+పడు.) భయపడు. "క. అవ్వేళదివ్యబాణము, లెవ్వియుఁబనిసేయకున్న నెదవడిమదిలోఁ, గవ్వడికవ్వడిదూలఁగ, నవ్వుచుఁజిత్రాంగదాతనయుఁడిట్లనియెన్." శై. ౬, ఆ.

ఎదావు. దే. వి. (ఎద+ఆవు.) ఆఁబోతుచేర సమయమైనయావు.

ఎది. దే. స. ఏశబ్దమునకు అమహదర్థక ప్రథమైకవచనము. (ఏయాఁడుది. ఏపశ్వాది. ఏజడవస్తువు.) (ఏదియొక్కరూపాంతరము.)

ఎదిరి. దే. వి. విరోధి.

ఎదిరించు. దే. స. క్రి. ఎదురు.

ఎదుగు. వై. అ. క్రి. పెరుగు, వర్ధిల్లు.

ఎదురాడు. దే. అ. క్రి. (ఎదురు+ఆడు.) మాఱాడు.

ఎదురు. దే. స. క్రి. ఎదిరించు.—వి. ఏ. 1. పురోభాగము; "క. ఒకమఁకిరీటికట్టెది, రికినటిముటిఁబోయిరేనిరెండవమాటి, య్యకొనుటకోర్వఁగ లేరయి, రొకళ్లుఁగురురాజుసేనయోధులలోనన్." భార. విరా. ౫, ఆ.—2. ఎదుటివాఁడు. "ఎదురోర్వవలయు." భార. కర్ణ. ౧, ఆ.—3. వలపుకత్తెవలచినవానికిచ్చుధనము. "గీ. ఇంటిలోనున్నవస్తువులెదురువెట్టి." హంస. ౨, ఆ.—విణ. అన్యుఁడు. "పదపడిదుస్తరమగునీ, పదుమూడవయేఁడుగడవఁబడుటయరిదిత, మ్మెదురెఱుఁగమికైయాపద, లొదవినసైరించిరిట్టియునికియుఁగలదే." భార. ఉద్యో. ౧, ఆ.

ఎదురుకట్టుల. దే. ద్ర. ఎదుట. "క. అల్లంతనెదురుకట్టుల, నుల్లమలరఁగాంచి." భో. ౫, ఆ. (రూ. ఎదురుకట్ల. "గీ. గొల్లపడుచులుచనిగుంపుగూడిచూడ, ఊలుదామెనత్రాడునులీలతోడ, నీడ్చికొనివచ్చితమయింటియెదురుకట్లఁ, దసరుధవళార్జునంబులఁదగులఁబెట్టి." వి, పు. ౬, ఆ.)

ఎదురుకుత్తుక. దే. వి. అంకిళ్లుపట్టుకొనెడువ్యాధివిశేషము.

ఎదురుకొను. దే. అ. క్రి. ఎదురగు, అభిముఖమగు.—స. క్రి. ఎదిరించు. (వాఁడునన్నెదురుకొనినిలువనేరఁడు.) (రూ. ఎదుర్కొను.)

ఎదురుకోలు. దే. వి. 1. వివాహమునందుఁబడుచింటివారు వరునికెదురుగాఁబోవుట; 2. పూజ్యులువచ్చునపుడుఎదురుగాఁబోవుట. (రూ. ఎదుర్కోలు. "సీ. తనచక్రమునకునాతనిదివ్యతేజంబు గురుభావముననెదుర్కోలుసేయ." కళా. ౨, ఆ.)

ఎదురుగడ. దే. వి. (ఎదురు+కడ.) మాఱువ్రాసిన యొడంబడికలోనగునది. (ఎదురుగడయొడంబడిక, ఎదురుగడలెక్క. మొ.)

ఎదురుచు. దే. అ. క్రి. ప్రతికూలమగు. (చూ. ఎద్రుచు)—స. క్రి. ఎదిరించు, "ఉ. తమ్ములువీఁ

గినంబతియుదగ్రతభీము సెదిర్చియార్చుచుఁ." భార. భీష్మ. ౨, ఆ. (రూ. ఎదుర్చు.)

ఎదురుచుక్క. ద్వ. విశ. కానిది. (చుక్క అనఁగా శుక్రుఁడు. శుక్రుఁడెదురగుట యనిష్టప్రదము కనుక లక్షణచే నీయర్థము కలుగుచున్నది.)

ఎదురుచూచు. దే. స. క్రి. వేచు, ప్రతీక్షించు.

ఎదురుపడు. ద్వ.అ.క్రి. 1. ఎదురుగావచ్చు; (దారిలో నాకువాఁడెదురుపడెను.)—2. ఎదురుతిరుగు. (రూ. ఎదుర్పడు. "చ. యవనజరాసుతాదులకు నాజి నెదుర్పడలేక." భాగ. 3, స్కం.)

ఎదురుపాటు. ద్వ. వి. ఎదురుపడుట. (రూ. ఎదుర్పాటు.)

ఎదురుమ్రోయు. ద్వ. అ. క్రి. మాఱు చెలఁగు.

ఎదురుఱొమ్ము. ద్వ. వి. ఱొమ్మునడిమిభాగము.

ఎదురేగు. దే. అ. క్రి. (ఎదురు+ఏగు.) ఎదురుగాఁబోవు.

ఎదురొత్తు. దే. అ. క్రి. (ఎదురు+ఒత్తు.) మాఱొత్తు. —వి. బ. మాఱొత్తులు.

ఎద్దడి. దే. వి. దారిద్ర్యము. విశ. 1. దరిద్రము; 2. శూన్యము. "క. పసులకు మే పెద్దడియై." హరి. పూ. ౭, ఆ.

ఎద్దడినేల. దే. వి. నిర్జలభూమి, మరుభూమి.

ఎద్దము. దే. వి. పట్టెతీరినయంచు. (ఎద్దపుచీర.)

ఎద్ది. దే.స. ఏదియొక్క రూపాంతరము, (చూ.) ఏది.

ఎద్దు. దే. వి. వృషభము. (బ. ఎడ్లు.)

ఎద్దునాలుక. దే. వి. గోజిహ్వ.

ఎద్దుపట్టు. దే.స.క్రి. ఎద్దును ముష్కహీనము చేయు. "వ. వానింబట్టికట్టింపుము. ఒండెనెద్దుపట్టింపుము." హరి. పూ. ౬, ఆ.

ఎద్దుముట్టె. దే. వి. ఒకదినుసుగడ్డి.

ఎద్దురాసి. ద్వ. వి. వృషభరాశి.

ఎద్రుచు. దే. అ. క్రి. (ఎదురుచుయొక్క రూపాంతరము.) ప్రతికూలమగు. "చ. ఎద్రిచినకాలపాకమున నీగతి నీమదిఁ గ్రోధవల్లికన్, బద్రిచినవారు." ఉ. హరి. ౪, ఆ.

ఎన. దే. విశ. ఏ. సమానము. "నీకెనయెమానవనాథులు." భార. సభా. ౧, ఆ. "క. దీనికి, నెనకావుసుఁడీతలంప నేధర్మములున్." భార. అను. ౨, ఆ.

ఎనమండ్రు. దే.స. ఎనిమిదిమంది. (ఎనిమిదికి మహన్మహత్యర్థకరూపము.)

ఎనమండుము. ద్వ. వి. (ఎనిమిది+తూము.) ఎనిమిది తూములు.

ఎనమనూఱు. దే. స. (ఎనిమిది+నూఱు.) ఎనిమిది నూఱులు, (రూ.) ఎనమన్నూఱు.

ఎనయిక. దే. వి. 1. పొందిక. "క. వినుఁడీతగుసంబంధపు, టెనయికగని మోచి తెచ్చియిచ్చెననరె చుల్కనినరులు." ఆము. ౬, ఆ.—2. సామ్యము.

ఎనయు. దే. అ. క్రి. సరిపోలు. "ఉత్ఫుల్లలోచనుఁడావిష్ణునిమూర్తితో నెనయునీసన్మూర్తి." హరి. ఉ. ౫, ఆ.—స. క్రి. 1. పొందు; "చ. గనగనసెల్లప్రొద్దుఁగొని కాలెడు వేఁడిమిఁ బేర్చుభర్తమే, నెనయనుడగ్గఱన్ సయిఁపక." హరి. పూ. ౧, ఆ. —2. పోలు. "చ. ఎనయు దెనీవు పౌరుషవిహీనుఁడపద్విపిజేంద్రనందనున్." భార. కర్ణ. ౨, ఆ.

ఎని. ద్వ.స.ఏ. ఎన్నియొక్క రూపాంతరము. (చూ. ఎన్ని.) (హల్లుపరమగుచో నిత్యలోపము వికల్పముగనగు. "వానికెన్ తలల్ గలవు.")

ఎనిక. దే. వి. 1. గణనము. "క. తనకంటెనధికుఁబరసతి, నెనికమిగులఁదిట్టె నేని నేఁబదిపణముల్, తనకంటెహీనుఁదిట్టినఁ, దనరఁగఁ బంద్రెండునరయుదండువుగలుగున్." విజ్ఞా. ప్రా, కాం. (ఈయర్థమునందిదియెన్నికయొక్క రూపాంతరము.) —2. నాలుగుపోఁగులనూలుదారము.

ఎనిమిది. దే. స. ఏడునొకటి, (రూ.) ఎన్మిది.

ఎనిమిదికాళ్లచుక్క. ద్వ. వి. పూర్వభద్రపదానక్షత్రము.

ఎనిమిదికాళ్లరిక్కనెల. ద్వ. వి. భాద్రపదమాసము.

ఎనియు. దే. అ. క్రి. కలిసికొను.

ఎనుచు. దే. ప్రే. ఎనియఁజేయు, ఎనుపు.

ఎనుపతేలు. ద్వ. వి. (ఎనుము+తేలు.) నల్లతేలు.

ఎనుపమోఁకాలు. ద్వ. వి. ఒకానొకచెట్టు.

ఎనుపసరము. ద్వ. వి. (ఎనుము+పసరము.) బఱ్ఱె.

ఎనుపు. దే. ప్రే. ఎనియఁజేయు, ఎనుచు.

ఎనుపుడు. దే. వి. ఎనుచుట.

ఎనుపెంటి. ద్వ. వి. (ఎనుము+పెంటి.) బఱ్ఱె.

ఎనుపోతు. ద్వ. వి. (ఎనుము+పోతు.) దున్న, మహిషము.

ఎనుబండ్రు. ద్వ. స. ఎనుబదిమంది. (ఎనుబదికి మహన్మహత్యర్థకరూపము.)

ఎనుబది. ద్వ. స. (ఎనిమిది+పది.) ఎనిమిదిపదులు, అశీతి,

ఎనుము. వై. వి. బఱ్ఱె, మహిషి. (స్త్రీయందు అంత్యవర్ణలోపము. ఎనుపెంటి, ఎనుపోతు. మొ.)

ఎన్నఁడు. దే. వి. ఏ. (ఏ+నాఁడు.) 1. ఏకాలము; 2. ఎప్పుడు; "ఎ, గీ. భూతములు గ్రాలు నెన్నఁడేఁ బుట్టినిండ్ల, నపుడు వారాణసీ క్షేత్రమైదుకోసు, లంతమేరయుపద్రవంబందకుండు." కాశీ. ౨, ఆ. (ఎన్నఁడేనియనుచో ఏనిశబ్దము వాక్యాలంకారార్థము.)—3. ఎల్లప్పుడు. (ఇది యీ యర్థమందు ద్రుతాంతమునగు.)

ఎన్నాళ్లు. దే. వి. బ. (ఎన్ని+నాళ్లు.) ఎన్ని దినములు.

ఎన్ని. ద్వ. స. ఏ. (ఎంతశబ్దమునకు అమహదర్థక బహువచనాదేశము.) 1. ఎంతసంఖ్యకలవి; 2. అన్ని. "ఉ. ఏకపుఁబ్రోకయైనశ్రుతులెన్నియు నేర్పున నేర్పరించి." (ఇదియు వర్ణాంతమైనప్పుడే ఈయర్థము కలదిగాఁ గానఁబడియెడిని.) భో. ౧, ఆ.—(చూ. ఎవ్వఁడు.) (దీనికి ఏనిశబ్దము వెనుకఁ జేరునపుడు అనేకము అనెడియర్థము కలుగుచున్నది. "ఏనుగయ్యపుశకునంబులెన్నియేని గంటిని." భార. ఉద్యో. 3, ఆ.) (చూ. ఇన్ని.)

ఎన్నిక. దే. వి. ఎనిక, గణనము.

ఎన్నికచేయు. ద్వ. స. క్రి. ఎంచు, గణించు.

ఎన్నికపెట్టు. దే. స. క్రి.——పై.——

ఎన్ను. దే. స. క్రి. 1. ఆక్షేపించు; "సీ. చంద్రచంద్రాతపచందనశారదాశారదాంభోదకేసరుల నెన్ని." రసి. ౧, ఆ.—2. గణించు. వి. సస్యాది మంజరి. (వరియెన్ను. మొ.)

ఎన్నువ. దే. వి. ఆఁడువారేడ్చునప్పుడు అనుభవము నెంచియెంచి పాటగాఁబాడెడు చచ్చినవారిచారిత్రము.

ఎన్నెము. దే. వి. పురిటిపురుగు. (అప్ర.)

ఎన్బది. ద్వ. స. ఎనుబదియొక్క రూపాంతరము.

ఎపుడు. ద్వ. వి. ఏ. ఎప్పుడుయొక్క రూపాంతరము.

ఎప్డు. ద్వ. వి. ఏ. ఎపుడుయొక్క రూపాంతరము.

ఎప్పటి. దే. అవ్య. అప్పటి, మరల. "క. ఇవ్విధమునఁ బురమంతయు, నివ్వెలనవ్వెలను రేఁగియెప్పటిజాలన్, ఉవ్వెంగ బెగడిరయమున, నవ్వనచరమేఁగ దట్టమగు కానలకున్." భో. ౫, ఆ.

ఎప్పుడు. ద్వ. వి. ఏ. (ఏ+ప్రొద్దు.) 1. ఏకాలము; 2. ఎల్లప్పుడు. "రేయుపగలు నిద్రయు నెప్పుడెఱుఁగక." భార. ఆర. ౨, ఆ. (ఇది యీయర్థమునందు ఎన్నఁడు శబ్దమువలె ద్రుతాంతముగాను గానంబడియెడి. "ఏమఱకుండు నెనిజకృత్యములనెప్పుడును." భార. సభా. ౧, ఆ.)

ఎబ్బె. దే. వి. రోఁతపడుటయందుపయోగింపఁబడు మాట.

ఎబ్బెర. దే. వి. పక్షివిశేషము. (అప్ర.)

ఎబ్బెరాసి. ద్వ. విశ. రోఁతకలవాఁడు (లేక) రోఁత కలది. (ఎబ్బెటికపువస్తురాశిలోఁ జేరినది అని వ్యుత్పత్త్యర్థము.)

ఎబ్బెటికము. దే. వి. రోఁత. "సీ. తొడమీఁదనిడుకొనిదోషాచరాగ్రణియెత్తుకచనిలంక నేఁడుగాల, ముంచినయిల్లాలినించుక కొంచక మరలఁదాఁగొనివచ్చి మరులు హెచ్చి. యెబ్బెటికములేక యేలుచున్నాఁడు." ఉ, రా. ౬, ఆ.

ఎమిడిక. దే. వి. కడుపులోఁగలుగు పామువంటి తెల్లని పురుగు, ఎమిడిక పాము.

ఎముక. దే. వి. ఎమ్ముకయొక్క రూపాంతరము.

ఎముకలపట్టు. దే. విశ. వ్యాధిచే బక్కటిల్లినవాఁడు (లేక) బక్కటిల్లినది.

ఎమ్ము. దే. వి. ఎముక, అస్థి.

ఎమ్ముక. దే. వి.——పై.——

ఎమ్మూట. దే. వి. (ఎమ్ము+ఊట.) మూలగ. "నెఱవైన యెమ్మూట నెయ్యిగాఁగ." కవిక. ౨, ఆ.

ఎమ్మె. దే. వి. 1. మనోహరత్వము; "జాబిల్లియెమ్మె విడంబించు నెమ్మొగంబు." చంద్రా. 3, ఆ.—2. విలాసము. "ఒకనాఁడు వేలుపుటొడయఁడెమ్మెననుఁగోరి." అచ్చ. బాల, కాం.

ఎమ్మెకాఁడు. దే. విశ. విలాసవంతుఁడు.

ఎమ్మెలాఁడి. దే. వి. (ఎమ్మెలు+ఆఁడి.) విలాసముగల ఆఁడుది, విలాసిని.

ఎయిదు. దే. స. క్రి. 1. వెంబడించు, అనుగమించు; "గీ. ఇట్లుపఱచుటయును నెంతయురయమున, నమ్మృగంబు వెనుకనరిగియరిగి, యెయిదలేక." భార. ఆర. ౪, ఆ.—2. పొందు. "నీదుపూన్కి పారంబెయిదక." భార. విరా. ౨, ఆ.

ఎయ్దు. దే. స. క్రి. ఎయిదుయొక్క రూపాంతరము. (వెంబడించుటకు. — "సచివులఁజూచియిప్పుడ వెసన్ మనమెయ్దుకతక్కినన్." భార. విరా. 3, ఆ.)

ఎయ్యది. దే. స. (ఏ+అది.) ఎది. "చ. ఏమిటికిం గడంగియె. య్యదిదొరఁకొంటి మేలనుచునబ్జజుఁడిద్దఱఁజంచలాత్ములన్, సదృశులలెస్సగూర్చెజకనంబున నంచు." శశా. ౭, ఆ.

ఎర. దే. వి. 1. ఆహారము; "చ. ఫలముదళంబునుం దొడిమఁబాయుటరాలినవానిఁగొంచునాఁ, కలి కెరఁజేసి." భార.అను.౫,ఆ.—2. బలి; "క. అ ప్పాంచాలో, త్తరుసెుకనారసమునకును, నెరసే సె." భార. శల్య. ౧, ఆ.—3. వ్యసనము. "ఎరనొకడుండుభంబనునహింగని." భార. ఆది. ౧, ఆ.

ఎరఁగు. దే. అ. క్రి. 1. దిగు; "గీ. అపనికెరఁగిపోయి యతనిప్రేసె." సం. "తతోవిరాటః ప్రస్కంద్య రథాదథసుశర్మణః." భార. విరా. 3, ఆ.—2. నమ స్కరించు. "గీ. ఎట్టిరాజులునుమహీసురోత్తము లెదు, రరుగుదెంచునప్పుడధికభక్తి, నెరఁగిప్రియ ములికితెరువిత్తురు." భార. ఆది. ౭, ఆ.

ఎరఁగుడు. దే. వి. నమస్కారము. "సీ. మ్రొక్కుదం డముకేలుమోడ్పెరఁగుడు, నాఁగఁజెన్నొందును నతి." ఆం, భా. ద్వి. బ్ర.

ఎరగలి. దే. వి. మ్రాను ఒకటితోనొకటి ఒరసికొ నఁగాపుట్టి అడవినిదహించెడి అగ్ని, కార్చిచ్చు, దావము.

ఎరగొను. దే. అ. క్రి. (ఎర+కొను.) పరవశమగు. "వ. మృణాళంబులాహారంబులుగమెసంగి యెరగొని సుఖించురాజహంసంబులుంగల పులినస్థలంబుల వలనను." మై. ౨, ఆ.—స. క్రి. మ్రింగు. "క. ఉర గమునెరగొనుగరుడుని, వెరవునవపుడతఁడుగగన వీధికిదాఁటెన్." ఉ, హరి. ౫, ఆ.

ఎరపలి. దే. వి. ఎరగలియొక్కరూపాంతరము.

ఎరవు. దే. వి. 1. ఒకటిరెండుదినములువాడుకొను టకైయడిగితెచ్చుకొనెడిసొమ్ము, యాచితకము; "క. లోభమ్మునునొండ్లసొమ్ములు, రమ్మన్ననువ చ్చునేయెరవుసతమగునే." భార. ఆర. ౪, ఆ.—2. భేదము. "క. గురుభీష్మాదులమనములు, దుర మునకుంజొరకయుండదుర్యోధనుఁడా, తురుఁ డైయొడఁబఱపఁగని, ప్పరుసునెరవైనతెచ్చునడు బలమెల్లన్." సం. "భీష్మద్రోణకృపాదీనాంభే దంసంజనయిష్యతి." భార. ఉద్యో. ౧, ఆ.—విణ. అన్యము. "చ. ఎరవుగఁజూడసాగహరి ణేక్షణపిన్నటనాటనుండియున్, బరిచితిఁబూ నిమంజుగతిమాధురియున్ మృదువాగ్విభూతి యున్, వరుసనెతెల్పి తల్లికడవారును దండ్రిభ జించువారునై, గరిమముఁగన్నసద్ద్విజశిఖామ ణులన్వసులుబ్ధచిత్తులై." వసు. 3, ఆ.

ఎరియు. దే. అ. క్రి. 1. కాలు, మండు; "క. గురు కర్ణులయస్త్రాగ్నుల, నెరిసినయది." భార. శల్య. ౨, ఆ.—2. పరితపించు. "క. సుకుమారుఁడతఁ డుగోపా, లకవృత్తివహించియడవులంగ్రుమ్మరు చు, న్కికినాకకాదుపగవా, రికినైననుకటమ న మెరియదేవగలన్." సం. "దూయామిభరత శ్రేష్ఠదృష్ట్వాతేభ్రాతరంప్రియమ్." భార. విరా. ౨, ఆ.

ఎరువంటి. దే. వి. పంజెచెట్టు.

ఎరువాటు. దే. వి. (ఎరువు+వాటు.) ఎరువువైచుట. "సీ. సిరముకప్రపుదుమ్ముమరువంపుఁబొదులకెరు వాటువైచినయింపుసొంపు." రా, వి. 3, ఆ.

ఎరువు. దే. వి. పైరుకైపెక్కునాళ్లుచేర్చిపెట్టినపేఁ డ, పాంశువు. (ఎండచేపరితపించునదియని వ్యు త్పత్త్యర్థము.)

ఎరుసు. వై. వి. ఈర్ష్య. "గీ. వారిలోననగ్రనజా క్షిచల్లాంబ, మఱియుఁజిన్నపొలఁతిమల్లికాంబ, సవతులెరుసులేకసతతంబుమెలఁగుచు, సవతులే కయుండ్రుసమ్మదమున." రాజ. ౧, ఆ.

ఎర్కు. దే. వి. ఎఱుకయొక్కరూపాంతరము. "కా రెర్కుచందంబునన్." హరి. పూ. ౯, ఆ.

ఎఱ. వై. వి. వానపాము*. "ఎరువుటెఱలకు." ఆము. ౨, ఆ.—విణ. ఎఱ్ఱనైనది. "నెత్తుటఁదోఁగినేల యెుఱనింగితెఱంగుననుండె." భార. ద్రో. ౨, ఆ. (ఎఱ్ఱయొక్కరూపాంతరము.)

ఎఱఁగు. దే. అ. క్రి. 1. దిగు; "క. ఎఱఁగినయప్పె నుప్రేగున, విఱుగుటయును." భార. అను. ౧, ఆ.—2. నమస్కరించు. "సీ. తండ్రికిరేపుమ్రొ క్కియాచార్యవిప్రులకువరుస, మఱిమ్రొక్కు నదివీరికెఱఁగుటతక్కదే వార్చనంబునకుమున్న న్యకడకుఁ, జనఁగాదు." భార. అను. ౪, ఆ.

ఎఱక. దే. వి. 1. ఱెక్క, పక్షము; "క. ఎఱకలుగల కులశైలము, తెఱఁగుమెఱయ." భార. ఆర. ౬, ఆ.—2. భుజము. "ద్వి. చంద్రహాసంబెత్తిజానకి ప్రేయ, నింద్రారిగమకింపనెఱకలువట్టి." రా. సుం, కాం.

ఎఱగందు. ద్వ. వి. (ఎఱ+కందు.) లేఁతబిడ్డ, శిశువు.

ఎఱగన్ను. ద్వ. వి. (ఎఱ+కన్ను.) శివునియొక్క అగ్నినేత్రము. ద్వా. ౭, ఆ.

ఎఱగొను. ద్వ. అ. క్రి. (ఎఱ+కొను.) కోపగించు. "ద్వి. ఎఱఁగియువిషమిట్టులేలక్రోలెదవు, ఎఱ

గొన్న పెనఁబాము నేలత్రొక్కెడవు." రా. అర, కాం. "ఏపటిదయుండు లే యెఱగొంటగాఁగ." యు, కాం. (మా. ఎఱ్ఱనాఱు.)

ఎఱచి. దే. వి. పొల, మాంసము. "క. ఉఱవగునా నగపంటలు, దొఱియలపాఁడియనుదఱచగుణ్ బురుషులకుణ్, దెఱవలు చుట్టములయ్యెద, రెఱచియభుజియింతురర్థి నెల్లజనంబుల్." భార. అర. ౪, ఆ.

ఎఱచిదిండి. దే. వి. (ఎఱచి+తిండి.) అసురుఁడు. "సీ. బలిమి మైపోవుఁడు పట్టుఁడు కొట్టఁడంచే ద్రెఱఁదొడరియయ్యెఱచిదిండ్లు." అచ్చ. యు, కాం.

ఎఱచిపిడుక. దే. వి. చోరపుష్పి?.

ఎఱబఱికము. దే. వి. కోఁత. "చ. అఱమఱయేల నే నిలుచునాశ్రమదేశము నీదకాదనీ, కెఱబఱికంబులేకయిఁకనిచ్చుటనున్న తపస్వికాంతలం, దఱునుచితోపచారములొనర్పఁగలారు వివేకశాలినుల్, మఱితురె తెల్విదైవగతిమాన్పఁగనెవ్వరికైన శక్యమే." ఉ, రా. ౬, ఆ.

ఎఱసంజె. వై. వి. 1. సాయంసంధ్య; 2. ప్రాతస్సంధ్య. "సీ. ఎఱసంజకెంజాయ కెదురు మొగ్గరములై కనుపట్టువల్కలాగ్రములు దూల." రామా. ౫, ఆ. "సీ. చిగురాకుటెఱసంజ జిగికిఁ బాండురకోరకములు భాసుర తారకములు గాఁగ." కవి. ౨, ఆ.

ఎఱుఁగు. దే. స. క్రి. తెలియు.

ఎఱుక. దే. వి. 1. తెలివి; "క. చదివిన యెఱుకలకు సరియె చదువని యెఱుకల్." లక్ష్మీ. ౪, ఆ.—2. పరిచయము; "ఎఱుక పెఱికేఁడు ధనము." కు. ౧, ఆ.—3. సోదె; "గీ. భూతిదాఁచి పసుపుఁబూసి త్రిశూలహ, స్తంబుదాఁచి చేతసజ్జయమర, వెఁదిమేనఁగల్గువీరుండు వెలఁదియై, యెఱుక యెఱుకయనుచు నేగుదెంచె." వీర. ౨, ఆ.—4. గుఱుతు; "సీ. ఇటు నేలజేజేలకెఱుకైన చెంగావి నుద సంజదగుకొండఁజూచినాఁడ." కా. ౫, ఆ.—5. జోస్యము. "గీ. రాజునకుఁగీడు పుట్టెడు రాజ్యమడఁగు, ననుచు నెఱుక చెప్పెడు జ్యోతిషాధములను, గుడుపు కొఱుకు విప్రాకృతిఁగొన్న శూద్రుఁ, బణసహస్రదండముగొనఁబాడిగలదు." పఞ్చా. ప్రా, కాం.

ఎఱుకత. దే. వి. (ఎఱుక+త.) సోదెచెప్పునది, దైవజ్ఞ. "క. కడకంటఁగరుణవొడమఁగఁ, బడఁతులతన్నొందఁ జేనిపరివేష్టింపఁగ, మృదుసతియా యెఱుకతతో, నడిగిన కృత్యంబుఁజెప్పనగుమతి గలదే." వీర. ౨, ఆ.

ఎఱుకచేయు. ద్వి. స. క్రి. తెలియఁజేయు, తెలుపు. "లోనికెఱుకచేసి." భార. శాం. ౬, ఆ.

ఎఱుకపడు. ద్వి. అ. క్రి. విదితమగు. "క. కడునలుకయుఁ గార్శ్యయునే, ర్పడ నెఱిఁగించునదివానిఫలకాలమునన్, బిడుగును గాడ్పును జనులకుఁ, బడుటయు వీచుటయు నెఱుకపడియెడుభంగిన్." భార. ఆది. ౬, ఆ.

ఎఱుకసాని. ద్వి. వి. ఎఱుకత. "చ. అనవుడు నెందఱేనికమలాక్షులు వేగమ పాటిపీధికిన్, జనిగిరిజాతయో యెఱుకసాని నినుం బిలువంగఁబంచె." వీర. ౨, ఆ.

ఎఱుకు. దే. వి. 1. కిరాతుఁడు; "క. ఎఱుకని యెఱుఁగకమిమ్మున్, మఱకువమూర్కొన్న తప్పు మఱవుఁడు." (ఇది కిరాతార్జునసంవాదఘట్టము.) భార. అర. ౧, ఆ.—2. వ్యాధుఁడు. "చ. ఎఱుకుకులంబునందు జనియించియు ధర్మువులెల్లనిమ్ముగా, నెఱిఁగెదు." (ఇది ధర్మవ్యాధకౌశికసంవాదఘట్టము.) భార. అర. ౫, ఆ. "గీ. సాళువంబులు డేగలు జాగిలములు, వలలుజగురులు నురులుఁబోనులుఁవహించి, బోయదొరలును నెఱుకులు బోడికలును, నడచిరిరువంక వేఁటసన్నాహమమర." భల్లా. 3, ఆ. (ఎఱుకు అనఁగా వ్యతిరేకలక్షణచే ఎఱుఁగనివాఁడు మూఢుఁడు అని వ్యుత్పత్త్యర్థము.)

ఎఱుకువ. దే. వి. ఎఱుక, తెలివి, జ్ఞానము.

ఎఱుపు. వై. వి. ఎఱ్ఱన, రక్తవర్ణము.

ఎఱ్ఱ. వై. వి. 1. వానపాము, గండూపదము*; 2. ఎఱుపు. "ద్వి. కొనకనులను నెఱ్ఱఘోరమైపర్వ." రా. సుం, కాం. "ఎఱ్ఱకన్నులకుఁదెచ్చి." (ఇక్కడ ఎఱ్ఱకర్మము.) రా. యు, కాం.—విణ. ఎఱ్ఱనైనది. "కడునెఱ్ఱలయ్యెదిశలు." భార. ఉర. 3, ఆ.-[ఎఱ్ఱ అనువిశేషణముముందుగల సంజ్ఞావాచక శబ్దములు.— ఎఱ్ఱగందము (కుచందనము.), ఎఱ్ఱగడ్డ (నీరుల్లి?.), ఎఱ్ఱగన్నేరు (చండకము?.), ఎఱ్ఱగలిజేరు (వర్షకేతువు?.), ఎఱ్ఱగిసె (లాలసి?.), ఎఱ్ఱగురిజ (కృష్ణల?.), ఎఱ్ఱగోరంట (కురవకము?.), ఎఱ్ఱచీమ (తైలపిపీలిక.), ఎఱ్ఱచేమంతి (రక్తసేవంతిక?.), ఎఱ్ఱతుమ్మెద (గండోలి.). ఎఱ్ఱతెగడ (కాకనాసిక?.), ఎఱ్ఱపులుము (కుష్ఠభేదము.), ఎఱ్ఱప్రత్తి. (రక్తకార్పాసము.) ఎఱ్ఱమన్ను (కో

మృత్తిక.), ఎఱ్ఱమల్లె (ముచుండ!.), ఎఱ్ఱమీను (రోహితము.), ఎఱ్ఱమునుగ (మధుశిగ్రువు!.), ఎఱ్ఱలొద్దుగు (పట్టిక!.), ఎఱ్ఱాముదపుఁజెట్టు (హస్తిపర్ణి!.), ఇత్యాదులు.]

**ఎఱ్ఱగొల్ల.** దే. వి. ఒకానొకజాతి. బ. ఆజాతివారు.

**ఎఱ్ఱన.** వై. వి. ఎఱుపు, అరుణిమ. విశే. ఎఱ్ఱనిది. "క. పుష్పా, నీకమ్ములరయ నెఱ్ఱన." రా. యు. కాం. (చూ. అలకన.)

**ఎఱ్ఱనివేలుపు.** ద్వి. వి. జ్వలనుఁడు, అగ్ని.

**ఎఱ్ఱపోతమ్మ.** ద్వి. వి. (ఎఱ్ఱపోతు+అమ్మ.) ఒకానొక గ్రామదేవత.

**ఎఱ్ఱవాఱు.** ద్వి. అ. క్రి. (ఎఱ్ఱ+పాఱు.) 1. ఎఱ్ఱనగు. "గీ. మొగముఁగన్నులునెఱ్ఱ, వాఁడిమిగులశోక పైకములకు." (ఇది రెండర్థములకు నుదాహరణము.) ఆము. ౫, ఆ.—2. కోపగిల్లు. "గీ. కుటిలమగునీకటాక్షంబుకువలయాక్షి, యించుకించుకనామీఁదనెఱ్ఱవాఱె, నిగిడిమరలినభావంబు నిజము దెలిసె, శ్రవణకూపనిపాతైకశంకఁజూవె." నై. ౭, ఆ.

**ఎల.** దే. విశే. 1. యౌవనముగలది; "క. ఎలప్రాయమిచ్చితినినీ, కలఘుమతీయిచ్చెదనుమదాత్మజనుల్లం, బలరఁగఁబెండిలికమ్మని, పలికిమఱియునాతపస్విపతియిట్లనియెన్." (దీనివెంబడిని.) "క. సజ్జనసుతనీ, వనుమాన ముఁదక్కుముయౌ, వనమునుగైకొనుముకన్యవరియింపుతగన్." భార. అశ్వ. 3, ఆ.—2. స్వల్పము. "ఎలనగవు." (చిఱునగవు.)—3. సాక్షి. "గీ. ఎమ్మెకాఁడయ్యగ్గియెలగాఁగఁబెండిలి, యైనచెలినిడించియకటయొంటి, నేఁగఁదగునె." అచ్చ. అ, కాం.—క్రి. విశే. స్వల్పముగా.—"ఎలనగుచున్." "ఎలచూచున్."

**ఎలగోలు.** దే. వి. 1. కలకలము; 2. ముందునడచుట; "చ. కులగిరిరాజనందనుఁడుగూరిమినాభువనాభినందితన్, దలఁపఁదలంపులోపలనె దర్పకకేతనపల్లవంబులం, చలయెలగోలునంబుజవిశాలశిలీముఖతాండవంబులు, త్పలదళమండలాగ్రములు పైకొనునట్టివొత్తప్రభావముల్." (ఇదిరెండర్థములకునుదాహరణము.) వసు. ౨, ఆ.—3. మొదటిప్రసరణము; "గీ. దవులజల్లనితూఅనంతకమునుపటి, జల్లునీరూనివచ్చునజల్లుమొదలి, గాలియెలగోలుచేఁగొమ్మకదలిజల్లు, తలపడకముఁన్నెవంగుళ్లఁదడిపెఁదరులు." ఆము. ౪, ఆ. (ఇక్కడ మొదలుశబ్దమునకుపూర్వమర్థము)—4. మొదట పటపటమనివచ్చువాన. "సీ. పుష్కలావర్తకాంభోధరవ్రాతంబులెలగోలువర్షించునెన్నఁడేని." కాశీ. ౨, ఆ.—విశే. 1. ముందునడచునది; "అమ్మరునెలగోలుపౌఁజులు." పా. 3, ఆ.—2. మొదటిది. "వ. ఒండొరువులమఱుపెట్టిచూచునెలగోలుమాపులనితరేతరధైర్యంబులు గంటిఁడ." పా. ౨, ఆ.

**ఎలదోఁట.** దే. వి. ఆరామము. "వ. అంతనమ్మహామునీంద్రునియాజ్ఞానుసారంబునఁ దద్విమానంబుకలభాషిణివిహరించుచున్నయెలదోఁటలోనికిడిగియె." (క్రిందట) "ఉ. వసంతోరువిలాసభాసురపుగోపవనంబునకేగియచ్చటన్." కళా. ౧, ఆ.

**ఎలనాఁగ.** దే. వి. 1. యౌవనముగల ఆఁడుది; 2. ఆఁడుది.

**ఎలనీరు.** ద్వి. వి. లేఁతటెంకాయలోనితియ్యనినీరు. "ద్వి. ఎలనీటితోఁబ్రవహించెనందొకటి." రా. అ, కాం.

**ఎలమి.** దే. వి. 1. వికాసము; "సీ. ముదమునవెలనిసొంపొదవినెమ్మోముపైఁదోఁపఁగవచ్చినఁద్రోచిత్రోచి." భార. విరా. 3, ఆ. "పేరెలమిఁబొల్పుం జెందెడినంభోజనముల్" భార. ఉద్యో. ౨, ఆ.—2. సంతోషము.

**ఎలమికాఁడు.** దే. విశే. వికాసవంతుఁడు.

**ఎలయు.** దే. అ. క్రి. 1. చేరు; "సీ. ఏనుఁగుమదమునకెలయుఁ తేఁటులమొత్తములనీలిగొడుగులుచెలువుమిగుల." భార. భీష్మ. ౧, ఆ.—2. ప్రవేశించు; "సీ. వినుతొల్లిధర్మవర్తనములసహ్యంబులైనదానవులుమహాగ్రహమున, నరులయందెలసిన." భార. శాం ౫, ఆ.—3. కలుగు; "అద్భుతంబెలయఁగఁబుష్పవృష్టిగురియించిరి." భార. ఆర. ౭, ఆ.—4. ఆసక్తిపడు. "ఇంద్రియార్థములకునెలసినపురుషుండు." ఆర. ౫, ఆ.—స. క్రి. పొందు. "క. కడుమే, లెలసిపరమసుఖముపొందుమిచ్ఛావృత్తిన్." భార. శాం. ౪, ఆ.

**ఎలరారు.** దే. అ. క్రి. (ఎలమి+ఆరు.) అతిశయించు.

**ఎలమి.** దే. వి. 1. అతిశయము; 2. వికసనము.

**ఎలరుచే.** దే. అ. క్రి. (రూ. ఎలర్చు. 1. అతిశయించు; "గీ. బలునకెప్పటికంటెనుబలమెలర్చ." హరి. ఉ. ౭, ఆ.—2. వికసించు; "వేగుజామిప్పలె

లర్పు గాడ్పులకు." ఆము.౫, ఆ.—3. సంతోషిం చు. "క. గురుఁడునుగ్ర పుఁడునులోనగు, గురుల నుమోదింపబాహ్లీకుండు మొదలుగాఁ, గురుజా తియెలర్పఁగన, న్నరపతిభీష్మాభిషేచనంబొనరిం చెన్." భార. ఉద్యో. ౪, ఆ.)

ఎలరుపు. దే. వి. సంతోషము. (రూ. ఎలర్పు. "వ చ్చిన సంభ్రమంబుగరువంపు టెలర్పునునుల్లసిల్ల." భార. శాం. ౬, ఆ.)

ఎలుఁగించే. దే. అ. క్రి. కూయు. "సీ. ఇనుఁడున్న దెసనుండి యెలుఁగింపఁదొడఁగెఁ బక్షులు మృగం బులునతిఘోరరుతుల." భార. అర. ౬, ఆ. (లక్ష్య మందు ప్రకారము ఎలిఁగించు అనియుండవలసియున్న ను ప్రతులయందంతట పాఠ మిట్లేయున్నది. కా వున ఆలక్షణమిక్కడ ప్రవర్తింపదని యెలుఁగవ లెను.)

ఎలుఁగు. దే. వి. 1. కంఠస్వరము; 2. ఎలుఁగుగొడ్డు. (రూ. ఎల్గు.)

ఎలుఁగుగొడ్డు. దే. వి. ఎలుఁగు, భల్లూకము.

ఎలుఁగుబంటి. దే. వి.——పై.——

ఎలుక. దే.వి. మూషకము. (దీనిభేదములు—కల్లెలుక, చిట్టెలుక, చుంచెలుక.)

ఎలుకచెవి. ద్వ. వి. మూషకపర్ణి.

ఎలుకజీడి. ద్వ. వి.——పై.——

ఎలుకిమొక్క. దే. వి. ఒకానొకచెట్టు.

ఎలువు. దే. వి. ఎలుఁగుయొక్కరూపాంతరము.

ఎల్ల. దే. వి. పొలిమేర. ద్ర. సమస్తము. (ఇదియా యర్థమునందు ద్రుతాంతమైన అవ్యయముగానుం డియు ఎప్పుడునుశబ్దమువలె ఎల్లయందుఁన్ అని విభక్త్యంతముగాను, ఎల్లబోఁటిబాలుఁడు ఇత్యా దివిధమున సమస్త పదముగాను బ్రయోగింపఁబ డుచున్నది. మఱియు ఎల్లవినఁగన్, ఎల్లన్శి ష్యులను ఇత్యాదిప్రయోగంబులును గానంబడి యెడి.)

ఎల్లమ్మ. ద్వ. వి. (ఎల్ల+అమ్మ.) ఎల్లయందుండెడు నొకగ్రామదేవత.

ఎల్లరు. దే. స. బ. (ఎల్ల+వారు.) అందఱు. (దీనికేక వచనము ఎల్లవాఁడు.)

ఎల్లవాఁడు. దే. స. ఎవ్వఁడును. "సీ. వెరవిట్టితెలుఁగ నివెంగలితనమని యెల్లవాఁడునుదనయెఱిఁగినట్టి, తెలుఁగుననిజకార్యదృష్టిఁగనుఁగొనును." భార. సౌ. ౧, ఆ.

ఎల్లాఁపి. దే. వి. (ఎల్ల+ఆఁపి.) 1. అడవియందుఁ జోటుచేసికొని యెల్లయందుండి కొట్టిపోఁచెడు దొంగ; 2. దొంగ.

ఎల్లాఁపికత్తియ. ద్వ. వి. దొంగతనముగల స్త్రీ.(రూ. ఎల్లాఁపికత్తె.)

ఎల్లి. దే. వి. 1. గోడుగు; 2. ఏ. తేపు.

ఎల్లిదము. దే. వి. చులుకఁదనము. (చూ. ఏలిదము.) —విశ. చులుకనిది. "ఇంతయెల్లిదమెయాతనికిన్ మనయాజ్ఞ." భార. అశ్వ. ౧, ఆ. (ఇది ఏలిదము యొక్కరూపాంతరము.)

ఎల్లిగుఁడు. దే. విశ. చులుకనివాఁడు. "చ. ఎల్లిదుల గువారికేటికిసలీలవిహారము వేడ్క సేయఁగన్." నిర్వ. ౪, ఆ.

ఎల్లుండి. దే. వి. రేపటికి ఆవలిదినము.

ఎవఁడు. దే. స. ఏవాఁడుయొక్కరూపాంతరము.

ఎవత. దే. స. ఏ. ఎవరితయొక్కరూపాంతరము.

ఎవతి. దే. స. ఏ. ఎవరితియొక్కరూపాంతరము.

ఎవతుక. దే.స.ఏ.(ఎవత+క.) ఏస్త్రీ. (ఇక్కడస్వా ర్థమునకప్రత్యయము. కప్రత్యయముపరమగున పుడు ఉకారమువచ్చును. ఇట్లు ఇతరస్థలముల యందును తెలియునది.)

ఎవతె. దే. స. ఏ. ఎవరితెయొక్కరూపాంతరము.

ఎవయు. దే.అ.క్రి. ఎగయుయొక్కరూపాంతరము.

ఎవరిత. దే. స. ఏ. (ఎవరి+త.) ఏస్త్రీ. (రూ. ఎవర్త.)

ఎవరితి. దే. స. ఏ. (ఎవరి+తి.)—పై.— (రూ. ఎవర్తి.)

ఎవరితె. దే.స.ఏ. (ఎవరి+తె.)—పై.—(రూ. ఎవర్తె.)

ఎవర్తుక. దే. స. ఏ. (ఎవర్త+క.) — పై. — (చూ. ఎవతుక.)

ఎవుచే. దే. స. క్రి. ఎగుచుయొక్కరూపాంతరము. "మ. వైరిమనుజేంద్రశ్రేణికిన్ గొంగనా, నవనిం బేర్కొనియున్న యట్టివిజయత్శ్లాఘీశ్వరున్ గాని గా, నెవిచెన్ జోళనమన్నసిద్ధియని ప్రాయేటన్ బ్రగాఢోద్ధతిన్." నిర్వ. ౧, ఆ.

ఎవ్వఁడు. దే. స. ఏవాఁడుయొక్కరూపాంతరము. (ఎల్లవాఁడనుటకు.— "క. ఇమ్మహిధనవంతుఁడ తేఁడయెవ్వరికంటెన్." భార. అర. ౨, ఆ.)

ఎవ్వత. దే. స. ఏ. ఎవ్వరితయొక్కరూపాంతరము.

ఎవ్వతి. దే. స. ఏ. ఎవ్వరితియొక్కరూపాంతరము.

ఎవ్వతుక. దే. స. ఏ. (ఎవ్వత+క.) ఏస్త్రీ. (చూ. ఎవతుక.)

ఎవ్వతె. దే స. ఏ. ఎవ్వరితెయొక్కరూపాంతరము.

ఎవ్వరిత. దే. స. ఏ. (ఎవ్వరి+త.) ఏ స్త్రీ. (రూ. ఎవ్వర్త.)
ఎవ్వరితి. దే. స. ఏ. (ఎవ్వరి+తి)--పై--(రూ. ఎవ్వర్తి.)
ఎవ్వరితె. దే. స. ఏ. (ఎవ్వరి+తె.)—పై.—(రూ. ఎవ్వర్తె.)
ఎవ్వర్తుక. దే. స. ఏ. (ఎవ్వర్త+క.)—పై.—(చూ. ఎవతుక.)
ఎవ్వల. దే. వి. ఏవలయొక్క రూపాంతరము. "క. ఇవ్విధమున నేవర్ణము, నెవ్వలఁ బొడలేక పోవ." హరి. ఉ. ౯, ఆ.
ఎవ్వాఁడు. దే. స. (ఏ+వాఁడు.) 1. ఏపురుషుఁడు; 2. ఎల్లవాఁడు. (చూ. ఎవ్వఁడు.)
ఎస. దే. వి. ఆధిక్యము. "చ. వనరుహపత్రనేత్ర యిటువాగెవదల్చినకోర్కెఁ గామనో, జానకెస యిచ్చిడిల్లపడఁజూచినఁజూచిన వారు మెత్తురే." కవిక. ౨, ఆ.—క్రి. విశే. అత్యంతము. "మ. అసమానస్థిరదానవైభవకళాహంకార సింహాసనా, గ్రసమాసీనుఁడు వీఁడొ కొండుకలుగంగానర్థియా చ్ఛారస, వ్యసనాభావబహూభవత్ఫలభర వ్యాజంబునఁ గాన్రమ్మైపై,యెసనంక్రందన శాఖిడెందమునయం దెక్కించుమందాక్షమున్." నై. ౫, ఆ.
ఎసఁగు. దే. అ. క్రి. తనరు, అతిశయించు. "మన సుక్రొవ్వుఖండింపఁగా మోద మెసఁగు." భార. ఆర. ౭, ఆ. (చూ. ఎడలు.) 2. విజృంభించు. "క. అప్పలుమలకలు కలుమది, నుప్పరమెగయంగ నెసఁగెనుల్లాసమునై, నొప్పారఁగ బకగోలల, నెప్పించినభద్రగజమునూల్కొన్నగతిన్." ఉ. హరి. ౫, ఆ.
ఎసకము. దే. వి. 1. అతిశయము; "క. అపల్లెలోన నెప్పుడు, గోపతరుణులెల్లఁదనదుకోర్కెసలుపులీ, లాపాత్రములుగఁజేయుట, కేపారఁగనుత్సహించియెసకపు వేడ్కన్." హరి. పూ. ౭, ఆ.— 2. విజృంభణము; "గీ. అంతఁ దెలిసి రాముఁడతికుపితాత్ముఁడై, యేఱుపాఱుతెంచు నెసకమెసఁగ, నప్రమేయశరములడరింపఁ నతిసత్వ, రమున నేను బ్రతిహతములఁ జేసి." భార. ఉద్యో. ౪, ఆ.— 3. విధము. "వెండికొండపైఁ గంధరఖండమున్న యెసకంబున." కాశీ. ౬, ఆ.
ఎసకొను. దే. అ. క్రి. పురికొను. (ప్రే. ఎసకొలుపు. "తనవారణేంద్రమక్కురుకులవీరుమీఁద నెసకొల్పిన." భార. ఆర. ౬, ఆ.) దీనికి ప్రేరణమునందే ప్రయోగములు కనఁబడుచున్నవి.

ఎసటిపోఁతలు. దే. వి. బ. (ఎసరు+పోఁతలు.) ఎసట వేయఁదగిన బియ్యము. "సీ. ఇనుమాఱుగంచినయెసటిపోఁతలటంచు మనొనట్లయుఁడికెరుగాని యంచు." కళా. ౬, ఆ.
ఎసరు. దే. అ. క్రి. మీఱు. "క. ఇనుమంతకానిలేఁడీ, పసిబాలుఁడుకుసుమగూటి ప్రాయమువాఁడీ, ట్లెసరిబహు భిక్షుకానులు, మెసవెదువినుమఁదు ప్రతుష్టిమే కొనఁడుగదే." పాండు. ౪, ఆ. (చూ. రూ. ఏసరు.)—వి. వంటకై కాఁగఁబెట్టిననీరు.
ఎసరేఁగు. దే. అ. క్రి. విజృంభించు. "గీ. ఎడపకెస రేఁగినుతియించె దెచటనతని." హరిశ్చ. ౧, ఆ.
ఎసలారు. దే. అ. క్రి. (ఎసలు+ఆరు.) అతిశయించు. "సీ. అనిక్రమంబున వారలందఱవిందులుపెం పెసలారవేర్వేఱఁ బొగడి." భార. విరా. ౧, ఆ.
ఎసలిక. దే. వి. తీటిక, అవకాశము.
ఎసలు. దే. వి. దొమ్మియుద్ధము. (ఇట్లు ఒకఁడు వ్రాసియున్నాఁడు.)
ఎసవు. దే. అ. క్రి. ఎసఁగుయొక్క రూపాంతరము. "వ. ఆర్పులనదల్పులఁబొగడుటలం దెగడుటల నెసవునలివుతూర్యరవంబులం గెలువ." భార. కర్ణ. ౨, ఆ. (కొన్ని యచ్చుపుస్తకములయందును వ్రాఁతపుస్తకములయందును ఈపాఠమున్నది.)
ఎసవెట్టు. దే. స. క్రి. (ఎస+పెట్టు.) పురికొలుపు, ప్రేరించు. "లయగ్రాహి. కయ్యాలకెసవెట్టుచు నుపాళిఁజలపట్టుచు సుమాళములఁ గిట్టుచును బాలికలువేడ్కన్." కళా. ౬, ఆ.
ఎళనీరు. ద్వ. వి. ఎడనీరుయొక్క రూపాంతరము.
ఎళ్లము. మి. గ్రా. వి. (ఏడు+పలము.) ఏడుపలములు. "ఎ, గీ. ఉల్లసిలుసప్తపలినామమెళ్లమనఁగ." ఆం. భా. ద్వ. వై.
ఎళ్లు. దే. వి. బ. ఎడ్లుయొక్క మాఱురూపము. "సీ. బండ్లుమెట్టింపుపై బరువులెక్కింపు మీఁదెళ్ళను బూన్పు కావళ్ళనునుపు." హరి. పూ. ౬, ఆ.

ఏ.

ఏ. ఒకయక్షరము. యు. దే. స. 1. ప్రశ్నమును దెలిపెడి; "ఏతలఁపు."—2. ఉద్దేశ్యమును దెలిపెడి; "ఏకథలయందు." (చూ. ఆ.)—అవ్య. 1. ప్రశ్నమును దెలిపెడి; "నుఁగళ మేమనమాతులునకు." భాగ. ౧, స్కం.— 2. మెచ్చుకొనుటను దెలిపెడి; "వ. నాయాడినమాటలకునయ్యార్ధశ్చి

రుండుపలికినవచనంబులింతయొప్పవేయని యగ్గించిన." భార. ఉద్యో. ౨, ఆ.—3. వ్యతిరేకమును దెలిపెడి; "ఎ, గీ. శాశ్వతుఁడయ్యె నేనృపాలయమ్మహీశ్వరుండు." భార. ద్రో. ౨, ఆ.—4. ఎక్కువను దెలుపుటకు. (చూ. మదిమది.) 5. దుఃఖమును దెలిపెడి; "ఎ, గీ. కందమూలంబులాహారములుగఁ, బొదలఁబుట్టలఁబడియుండి పులుఁగుమెకములఁబవమేల్లనుచుండిరేయక్కటకట." భార. ఉద్యో. 3, ఆ.—6. విచారమును దెలిపెడి; "ఈదుర్యోధనుఁడింత గర్వియగునే." భార. ఉద్యో. 3, ఆ.—7. ప్రార్థించుటను దెలిపెడి; "క. ఉంగేయుంగేయటంచునొకనిమిషమునో, రంగాయువేయకేడ్చుచు." పర. ౧, ఆ.—8. ఆఁడుదగుటను దెలిపెడి. (అవునే, ఏమే. మొ.)—వై. 1. మఱియొకదానిలేమిని దెలిపెడి; "నిన్నే యేఁబొందితిఁదుదన్." కళా. ౪, ఆ.—2. చూపుటను దెలిపెడి*; "ఈక్షితిపాలుఁడే దశరథేంద్రకుమారుఁడు." రామా. ౪, ఆ.—3. తనంతట అనునర్థమును దెలిపెడి*. "మ. దానినినీ వేసృజియించితోయదియతానీతోడఁ గ్రీడింపఁగాఁ, దనమేనొక్కటిచాలదంచుఁ గడఁకన్ ద్వైరూప్యముందాల్చెనో." కళా. 3, ఆ.

ఏఁకట. దే. వి. 1. మిక్కిలియపేక్ష; 2, అపేక్ష. "ఏఁకటఁదీర్చి." స్వా. 3, ఆ. "క. ఏఁకటవాయంగభిక్షలిడియెదరండీ." భీ. ౨, ఆ.

ఏఁకర. దే. వి. కిరాతభేదము. "ఎ, గీ. కోయచెంచు, పరికియేనాదియేఁకరిపట్రయెఱుకు, వేఁకరియనంగఁజెల్లితద్భేదములుగఁ, బొల్చును." ఆం. భా. ద్వి. శూ.

ఏఁకరు. దే. అ. క్రి. వాఁచిపోవు. "క. ఆఁకటఁజిక్కి జలంబుల, కేఁకరిపెనుదప్పిఁబెదవులెండఁగనేఁడి, ట్రీకలములోననూరక, యాఁకటితో నేలనవయననిమననమురియుచున్." రుక్మాం. ౪, ఆ.

ఏఁకారు. దే. అ. క్రి. ఏఁకరుయొక్కరూపాంతరము. "సీ. పాలసుకేఁకారఁ బ్రేఁగులుమాఁడియున్న ప్రేతవ్రాతములబీదతనమువాసె." ఉ, రా. ౫, ఆ.

ఏఁచు. దే. స. క్రి. కాఱించు, బాధించు. "ఉ. ఈకంతకృపావిహీనమతి నాతఁడు నేఁచునెయన్నదమ్ములన్." భార. ఉద్యో. 3, ఆ.

ఏఁజెల్ల. దే. అవ్య. (ఏను+చెల్లె.) సంతాపమును దెలిపెడిసి. "ద్వి. ఏఁజెల్లయోయమ్మయీచక్కనన్న, రాజతేజముగలరత్నాలపెట్టె." హరిశ్చ. ౨, భా.

ఏఁడాది. దే. వి. (ఏఁడు+ఆది.) ఏఁడు, సంవత్సరము. "ఏఁడాదిచటన్ నిలువుము." ఉ, రా. ౭, ఆ. (ఏఁడాది అనుచో ఆదిశబ్దము నిరర్థకము. ఇట్టిశబ్దములు మహాకవిప్రయోగములయందు ఇంకను కొన్నికలవు. పంచాది, పాతాది. మొ.)

ఏఁడి. దే. వి. ఎక్కడనున్నాఁడు. (వాఁడేఁడి.) (చూ. ఏఁడీ. "ఏఁడీనాబలుమూనికంబులకోటారు." అచ్చ. అ, కాం. బ. ఏరి, ఏరీ. (వారేరి.) "వారేరీసిరిమూటకట్టుకొనిపోవంజాలిరే." భాగ. ౮, స్కం.)

ఏఁడికోల దే. వి. నాఁగటికొయ్య, ఈష.

ఏఁడు. దే. వి. సంవత్సరము. స. 1. ఏపురుషుఁడు; 2. ఎల్లవాఁడు.

ఏఁడుడి. దే. వి. (ఏఁడు+ఉడి.) ఆబ్దికము.

ఏఁదర. దే. వి. కుటుంబముతోఁ జేరనిస్వతంత్రపుసొత్తు. (వాఁడుకొంతయేఁదరకట్టుకొన్నాఁడు.)—విశే. కుటుంబముతోఁ జేరకస్వతంత్రమైనది. (నాకాయూరిలో ఏఁదరకమతముకలదు.)

ఏఁదుము. దే. వి. (ఏను+తూము.) అయిదుతూములు.

ఏఁపు. దే. వి. కాఱియ, బాధ. "కుసుమాయుధునేఁపులకింతయోర్వఁగా లేక." మార్క. ౪, ఆ.

ఏఁబండ్రు. ద్వ. స. ఏఁబదిమంది. (ఏఁబదికిమహన్మహత్యర్థకరూపము.)

ఏఁబది. ద్వ. స. (ఏను+పది.) అయిదుపదులు.

ఏఁబలము. మి. వి. (ఏను+పలము.) అయిదుపలములు. "సీ. పంచపలీసంజ్ఞపరఁగునేఁబలమున." ఆం, భా. ద్వి. వై. (ఇప్పటివాడుకలో పదిపలములు.)

ఏకకుండలుఁడు. సం. వి. అ. పుం. 1. బలరాముఁడు; 2. కుబేరుఁడు.

ఏకకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) అసహాయుఁడు, ఎక్కటి.

ఏకగురువు. సం. వి. ఉ. పుం. సహపాఠి, సతీర్థ్యుఁడు.

ఏకచరము. సం. వి. అ. పుం. అడవిపంది, ఒంటిగాఁడు. విశే. ఏకాంతమైనది.

ఏకతమాడు. ద్వ. అ. క్రి. ఆలోచించు. "కూరిమిమంత్రితోడనలకూబరుఁడేకతమాడి." స్వా. ౫, ఆ.

ఏకతము. వై. వి. 1. ఆలోచనకుఁదగినచోటు; 2. ఆలోచన*.

ఏకతానుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఒకటమనసుచెల్లినవాఁడు, ఏకాగ్రుఁడు.

**ఏకతాళము.** సం. వి. అ. పుం. 1. లయతోడికూడిక; 2. తాళభేదము. (నాలుగక్షరములకాలము.)

**ఏకదంతుఁడు.** సం. వి. అ. పుం. వినాయకుఁడు, ఒంటికొమ్మువేలుపు.

**ఏకదృష్టి** సం. వి. ఇ. పుం. కాకి. విణ. ఒకచూపుకలది.

**ఏకదేశము.** సం. వి. అ. పుం. అంశము, భాగము.

**ఏకధురము.** సం. వి. అ. పుం. నాఁగటినైనను బండినైనను మఱిదేనినైనను ఒక్కటిని లాగెడియెద్దు లోనగునది.

**ఏకధురావహము.** సం. వి. అ. పుం.——పై.——

**ఏకధురీణము.** సం. వి. అ. పుం.——పై.——

**ఏకన.** దే. వి. అంచు. (బద్దకంచము ఏకననుంచుము.)

**ఏకపత్ని.** సం. వి. ఈ. స్త్రీ. పతివ్రత, క్రొత్తడి.

**ఏకపది.** సం. వి. ఈ. స్త్రీ. మార్గము, త్రోవ.

**ఏకపింగళుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు.

**ఏకము.** సం. స. (అ. ఆ. అ.) 1. అన్యము; 2. అసహాయము; 3. ముఖ్యము; 4. ఏ. ఒక్కటి.

**ఏకలము.** సం. వి. అ. పుం. అడవిపంది. (ఇదిదేశ్యపదముగా వాడఁబడుచున్నదిగాని పూర్వకవిప్రయోగములందట్లుగానఁబడలేదు.) "ఉ. చేకొనియాకుపీటివిభుశ్రీపెదవేంకటుఁడెందియాత్మలో, నేకలసద్గుణంబుమహియెన్నదనేకలసద్గుణాప్తిచేఁ, గైకొని శేషభోగములకల్మిఁదలంపద శేషభోగలీ, లాకలనంబుచేతఁగరులన్ గిరులన్ మఱిచెప్పనేటికిన్." రాఘ. ౧, ఆ.—విణ. అసహాయము.

**ఏకలీఁడు.** వై. వి. అడవిపంది, వరాహము. "మ. అంచన్మత్తసారంగరాట్, సహకారంబులనేకలీలసమయించన్ సాగె." (నలకథయందు అనేకలీలన్ అని, హరిశ్చంద్రకథయందు ఏకలీలన్ అనియు భేదము.) హన. ౨, ఆ.

**ఏకసర్గుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఏకతానుఁడు.

**ఏకహాయని.** సం. వి. ఈ. స్త్రీ. ఒకయేఁడు ఈడుగల ఆవుపెయ్య. (ఏకాబ్ద అనియు.)

**ఏకాంగి.** సం. వి. న్. పుం. విరక్తుఁడైనవిష్ణుభక్తుఁడు. "క్రేవలనేకాంగులురా." ఆము. ౨, ఆ.—విణ. ఒంటివాఁడు.

**ఏకాండము.** వై. విణ. అఖండము. "గీ. మలిచియేకాండముగనొక్కమానికమున, వేష్క నెద్దానినిర్మించెవిశ్వకర్మ, యట్టిదేవేంద్రదత్తమహార్ఘనూత్న, పీటికాపేటిమామభూవిభునకొసఁగె." నై. ౬, ఆ. "ఏకాండపుఁదెరచీరలు." కవిక. 3, ఆ.

**ఏకాంతము.** సం. క్రి. విణ. అ. న. అత్యంతము. విణ. 1. మిక్కిలి; 2. ఇద్దఱకంటె నెక్కువజనములేనిది. (చోటు.)

**ఏకాకి.** సం. విణ. (న్. ఈ. న్.) ఏకకుఁడు.

**ఏకాక్షము.** సం. వి. అ. పుం. కాకి. విణ. ఒకకన్నుగలది.

**ఏకాగ్రుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఒకటియందుమనసు చెల్లినవాఁడు; 2. కలఁకఁబొలనివాఁడు.

**ఏకాదశము.** సం. స. న్. పదునొకండు. విణ. (అ. ఈ. అ.) పదునొకండవది.

**ఏకాదశి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పదునొకండవతిథి; 2. పదునొకండుతంత్రులుఁగలపరివాదిని యను వీణ.

**ఏకాయనగతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఏకతానుఁడు.

**ఏకాయనుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.)——పై.——

**ఏకావళి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకయర్థాలంకారము; (చూ. అలంకారము.) 2. ఒంటిపేటహారము.

**ఏకాష్ఠీల.** సం. వి. ఆ. స్త్రీ. చిఱుబొద్ది. అ. పుం. ము. బకపుష్పము.

**ఏకాహము.** సం. వి. అ. పుం. 1. ఒకదినము; 2. మృతిఁబొందినవారికిపదునొకండవనాఁడుచేయుశ్రాద్ధము.

**ఏకీభవించు.** సం. అ. క్రి. ఒక్కటియగు.

**ఏకీభావము.** సం. వి. అ. పుం. ఒక్కటియగుట, ఐక్యము.

**ఏకు.** దే. స. క్రి. 1. దూదినిచక్కఁజేయు; 2. దూఱు. (కానీనిన్నుఏకికాకులకువేసెద.)—వి. ఏకినదూదిచుట్ట. "గీ. ఏకువాఁడిచేసియిపుడేలపల్కెదు" చంద్ర.

**ఏకుడు.** దే. వి. దూదయేకుట. "సీ. తూలమృదూకృతితోఁచునేకుడనంగ." ఆం. భా. ద్వి. శూ.

**ఏకె.** ద్వ. స. ఏ. (ఏ+అకె.) ఏమె. (చూ. ఆకె.)

**ఏకోద్దిష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) ఒకఁడు ఉద్దేశింపఁబడినవాఁడుగాఁగలది. (శ్రాద్ధము.)

**ఏకోను.** దే. వి. సమాప్తి. (ఏకోనుకుమొత్తమెంత? ను.)

**ఏగాని.** దే. వి. దుగ్గాని.

**ఏగు.** దే. అ. క్రి. చను, పోవు, గమించు.

**ఏగుదెంచు.** దే. అ. క్రి. (ఏగు+తెంచు.) 1. వచ్చు; "పరాశరనందనుఁడేగుదెంచె." భార. ఆది. ౬. ఆ.—2. పోవు. "చ. ఈయహితుల నెల్లడించినవాశ్వముతోఁబురికేగుదెంచియు, మ్మహిపతిఁగాం

చి యీతనిక్రమంబవు డేమని విన్నవించెదన్." జై. ౨, ఆ. (చూ. అరుగుదెంచు.)

ఏగుపెండ్లి. దే. వి. పెండ్లికడపట వధూవరులను ఊరేఁగించునట్టివేడుక. "చ. జలనిధిసార్వభౌమతనుజాదనుజారులయేగుపెండ్లినాఁడు." వసు.3,ఆ.

ఏగురు. దే. స. (ఏను+గురు.) ఐదుగురు. (ఏనునకు మహన్మహత్వ్యర్థకరూపము.)

ఏగుస. ద్వ. వి. (ఏను+కుంచము.) అయిదుకుంచములు. "సీ. ప్రస్థపంచకసంజ్ఞపరఁగు నేగుసయన." ఆం, భా. ద్వి. వై.

ఏచే. దే. విశ. 1. గ్రామ్యము; "గీ. ఏచమాటలు జడగొన్నపీఁచుఁగురులు." య. ౧, ఆ. "వ. సరకట్లకిన్నెరలమెఱయ మొరయించు నేచపాటలతానమానంబులును." కాశీ. 3, ఆ.—2. వక్రము. (ఏచకంకటిచుక్క.)

ఏచేకంకటిచేుక్క. ద్వ. వి. ఉత్తరాషాఢానక్షత్రము.

ఏచు. దే. అ. క్రి. 1. అతిశయించు; "క. అది, యేచిన కృపనాకునానతిమ్ముమహాత్మా." విక్ర. ౨, ఆ.—2. పెరుగు; ఏచితనర్చితలిర్చినక్రోవుల." భార. ఆది. 3, ఆ.—3. విజృంభించు. "మహేంద్రుతో నేచిపోరుబలుండువోలె." భార. స్త్రీ. ౨, ఆ.

ఏట. దే. వి. పక్షము. (రూ. ఏటము. "క. మాటలు నేరకపలికిన, నోటమిగాఁగొనక కార్యమున్న నిజముఁదాఁ, బాటించినృపతిధర్మం, బేటముగాఁ బాడి నిర్ణయింపఁగవలయున్." విజ్ఞా. వ్య, కాం.)

ఏటవాలు. దే. వి. 1. వంపు; "ఏటవాలైనయదియీయరఁటిబాలెంత." (ఏటవాలైనయది ఒఱగినదియనియర్థము.) స్వా. 3, ఆ.—2. పక్షపాతము.

ఏటికపాము. దే. వి. (చూ.) ఎమిడిక.

ఏటికోళ్లు. దే. వి. బ. 1. ప్రవరచెప్పిచేయునమస్కారము; 2. నమస్కారము. "ప. కైలాసనిలయామీకుఁగోపులు. పళ్యల్లలాటామీకు నేటికోళ్లు. గౌరీమనోహరా మీకునమస్కారము." "గీ. నలువ సేవించియిందిరానాథుఁగాంచి, యితరపరివారదేవతావితతికెల్ల, నేటికోళ్లిచ్చియెక్కిరమ్మేటిమనులు, మృదునిహాటక శైలంబుమీఁదినిలువు." భీ. 3, ఆ.

ఏటిరింత. దే. వి. ఏట్రింత.

ఏటిఱేఁడు. దే. వి. (ఏఱు+ఱేఁడు.) సముద్రుఁడు, సరిత్పతి. "ఉ. ఏటిఱేఁడమ్మెయిత్రోవయీమిమ దినల్గుచుఁదావిలుకేలఁబూనుఁడున్." య.3,ఆ.

ఏటు. దే. వి. 1. బాణప్రయోగము; 2. బాణహతి.

ఏటులాడు. దే. అ. క్రి. (ఏటులు+ఆడు.) ఆయుధపాణులై పోట్లాడు. "వ. అబ్బినకైదువులచే నేటులాడిరి." శశాం. ౫, ఆ.

ఏట్రింత. దే. వి. భారద్వాజపక్షి. (ఏటిరింతయొక్క రూపాంతరము.)

ఏడ. దే. వి. ఏ. ఎక్కడయొక్క రూపాంతరము. "ఏ నేడనింద్రాదులేడ." భార. అర. ౨, ఆ.

ఏడక. సం. వి. ఆ. స్త్రీ. గొఱ్ఱె. అ. పుం. ము. పొట్టేలు.

ఏడగజము. సం. వి. అ. పుం. తగిరిస!.

ఏడమూకుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) 1. చెవిటిమూఁగ; 2. మోసకాఁడు.

ఏడాకుపొన్న. ద్వ. వి. (ఏడు+ఆకుపొన్న.) ఒకదినుసుపొన్న, సప్తచ్ఛదము!.

ఏడాకులరఁటి. దే. వి. (ఏడు+ఆకుల+అరఁటి.) ఒకదినుసు అరఁటి, సప్తపర్ణము!.

ఏడాగోడము. దే. విశ. విరుద్ధము. (ఏడాగోడపుమాట. మొ.)

ఏడాటలాడించు. దే. స. క్రి. (ఏడు+ఆటలు+ఆడించు.) మిక్కిలిశ్రమపఱచు. (వాఁడు నన్ను ఏడాటలాడించినాఁడు.) (ఏడాటలాడించుట=సప్తవ్యసనములను గలుగఁజేయుట. అనఁగా సప్తవ్యసనములుగలిగినప్పుడు ఎంత శ్రమము కలుగునో అంత శ్రమమును గలిగించుట అని యర్థము ఉండవచ్చును.)

ఏడిక. వై. వి. పొట్టేలు, ఏడకము.

ఏడు. దే. స. ఆఱునొకటి.

ఏడుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) చెవిటివాఁడు.

ఏడుగడ. దే. విశ. (ఏడు+కడ.) (గురువు, తల్లి, తండ్రి, పురుషుఁడు, విద్య, దైవము, దాత అని సప్తప్రకారములుగల) రక్షకము. "క. గురుఁడును దల్లియుఁ దండ్రియుఁ, బురుషుఁడు విద్యయును దైవమును దాతయునాఁ, బొరినేడు గడయుఁ దానై, హరినను రక్షించుఁగాత ననవరతంబున్." వాసి. ౧, ఆ.

ఏడుగురు. దే. స. ఏడుమంది. (ఏడునకుమహన్మహత్వ్యార్థకరూపము.)

ఏడుచు. దే. అ. క్రి. రోదనముచేయు, (రూ. ఏడ్చు.)

ఏడుపు దే. వి. రోదనము, (రూ. ఏడ్పు.)

ఏడూకము. సం. వి. అ. న. (చూ.) మెత్తినగోడ. (రూ. ఏడుకము.)

ఏడ్గడ. దే. విణ. ఏడుగడయొక్క రూపాంతరము.
ఏడ్తెఱ. దే. వి. 1. అతిశయము; "దీవియులయేడ్తెఱ సోయగమందె." భార. విరా. ౨, ఆ.—2. పరాక్రమము; "ఏడ్తెఱఁదనపూని కై." భార. ఉద్యో. ౨, ఆ. "క. అతఁడెక్కుడుమదమొలయఁ జేతియేడ్తెఱసూపెన్." భార. ద్రో. 3, ఆ.— 3. విజృంభణము. "చ. ఏడ్తెఱగలయప్పుశత్రునఃధిరితుఁజేయుటయొప్పుఁగాకయే, పతినఁబరాభవించిన జనావళినవ్వదె." భార. శల్య. ౨, ఆ.
ఏడ్తుము. ద్వ. వి. (ఏడు+తూము.) ఏడుతూములు.
ఏణము. సం. వి. అ. పుం. పెద్దకన్నులుగల నల్లయిఱ్ఱి.
ఏణి. సం. వి. ఈ. స్త్రీ. పెద్దకన్నులుగల నల్లలేడి.
ఏతఁడు. దే. స. ఏ. (ఏ+ఁడు.) ఎతఁడు. (చూ. ఆతఁడు.)
ఏతము. ఉభ. వై. వి. నీళ్లెత్తెడు యంత్రవిశేషము, అరఘట్టము*.-సం. వి. అ. పుం. చిత్రవర్ణము. విణ. 1. చిత్రవర్ణముగలది; 2. వచ్చినది.
ఏతరి. దే. విణ. దుర్నయపరుఁడు. "క. మీఁతరమువారతేతతి, నేతరితనమునఁదపస్విగృహకన్యకలన్, వీతభయవృత్తివేఁడిరొ, కోఁతముఁదర్కింపకారక్రొవ్వులటంచున్." స్వా. ౬, ఆ.
ఏతాము. వై. వి. ఏతముయొక్క రూపాంతరము.
ఏతు. దే. వి. ఉద్ధతి. "గీ. తనకనిష్టంబులగుకలిద్వాపరముల, కేతుసూపియుఁబోలెధాత్రీశ్వరుండు, నిత్యసత్రైకబుద్ధిప్రణీతమైన, త్రేతసేవించె విజితమిత్రేతరుండు." నై. ౭, ఆ. (ఈయర్థమింకను విచారణీయము.)
ఏతుల. దే. వి. చాఁపలల్లెడుమనుష్యజాతివిశేషము. "ఏతులకోమలు." ఆము. ౪, ఆ.
ఏతెంచే. దే. అ. క్రి. (ఏగుదెంచుయొక్క రూపాంతరము.) 1. వచ్చు; 2. పోవు. "మ. అరదంబెక్కి ప్రమోదమేర్పడఁగనయ్యక్రూరుఁడేతెంచుచున్." (వెనుకమఱియొకచో.) "అరిగియరిగి." వి, పు. ౭, ఆ.
ఏద. దే. వి. ఒకానొకచెట్టు.
ఏదడి. దే. వి. ఒకదినుసు ఎలుఁగుగొడ్డు. (అ ప్ర.)
ఏది. దే. స. ఎది. అవ్య. ఎట్లు. "ఏదియేదీయిదిచాలఁగ్రొత్త బళి" కళా. ౧, ఆ.
ఏదీ. దే. ని. ఎక్కడనున్నది. "నీకుఁబౌరుషమేదీ." భార. ఉద్యో. ౪, ఆ.—అవ్య. ఎట్లు. (చూ. ఏది.)

ఏదు. యు. దే. అ. క్రి. నశించు. "పెంపేదంగ్రూరతక్రోర్వరాదు." భార. ఉద్యో. 3, ఆ. "గీ. అజశివాదికమగు నీసమస్తజగము, నెందుఁబ్రభవించు వర్తించు నేదు." ఆము. ౬, ఆ. ("పారంబేదనిలజ్జదోఁప." "పారంబేదనివంతయుఁగలిగనే." ఇత్యాదిస్థలములయందు పారంబేదిన అనియుండుననితోఁచెడి.)—వి. ముండ్లపంది, శల్యము.—వై. స. క్రి. పెంచు*. "రఘుకుమారునేదిరిదాగుల్." రామా. 3, ఆ.
ఏదుపు. దే. వి. విడుపు. (ఇట్లు ఒకానొక నిఘంటుకారుఁడు వ్రాసియున్నాఁడు. అది విచారింపఁ దగినది.)
ఏదువేఁట. దే. వి. వేఁటలోభేదము. "గీ. హెచ్చరికమించి తెరవేఁటయేదువేఁట, గంటవేఁటయు మొదలుగాఁగఁగలుగువేఁట, లెన్నిగలవన్నియుఘటించియున్నరేంద్రుఁడు, డుగ్రమృగ భంజనక్రియోద్యుక్తుఁడయ్యె." రామా. ౨, ఆ.
ఏధ. సం. వి. ఆ. స్త్రీ. ధనాదిసమృద్ధి, నింపు. అ. పుం. ము. 1. చిదుగు; 2. వంటచెఱకు. (ఇదివెనుకటి రెండర్థములయందు సకారాంతక్లీబంబునగు.)
ఏధితము. సం. విణ. (అ. ఆ. అ.) వృద్ధిపొందినది.
ఏనస్సు. సం. వి. స్. న. 1. అపరాధము; 2. పాపము.
ఏనాదము. దే. వి. సముద్రతీరము.
ఏనాది. దే. వి. అడవియందు వాసముచేసెడి యొక హీనజాతివాఁడు.
ఏనాళ్లు. దే. వి. బ. (ఏను+నాళ్లు.) 1. అయిదుదినములు; 2. వివాహానంతరము వియ్యంకులొకరికొకరు పంపెడు సారె.
ఏని. దే. అవ్య. 1. పక్షాంతరమును దెలిపెడిని; "అట్లయేని." (ఆపక్షమునననియర్థము.) "ఇట్లయేని" (ఈపక్షమునననియర్థము.) "వినన్‌వలతే వినుము." (వినన్‌వలతేన్ వినవలచుపక్షమునననియర్థము.)—2. వికల్పమును దెలిపెడిని; "హరినేనబ్జజు నేని."—3. బొత్తిగా అనునర్థమును దెలిపెడిని. "ఓటయొకింతయేనియు సుయోధనుచిత్తమునందులేదు." "ఏనునిక్కమగ్గిననచటంగలండెరణకేళికిమార్కొననొక్కఁడేనియున్." భార. ఉద్యో. 3, ఆ. (ఏనియునని ప్రయోగింపఁబడుటచే దీనిని ద్రుతప్రకృతికముగా గ్రహింపఁగూడదు. ఏనిన్ ఏన్ అనురూపములు యువర్ణమును నివర్ణమునులోపింపఁగానైనవనియొఱుంగునది. ఎందేని,

ఎన్నఁడేని ఇత్యాదులయందలి యేనిశబ్దము వాక్యాలంకారనిబద్ధమని యెఱుంగునది.)

ఏనిక. వై. వి. ఏనుఁగు. "చ. ఏనికగములోయనంగఁ దరుణీమణులుల్లములుల్ల సిల్లఁగన్." రుక్మి. 3, ఆ.

ఏనికతిండి. ద్వ. వి. సింహము. "ఎ, గీ. పఱలు నేనికతిండివార్వమును దోలుతఁ, గాఁగఁదానెక్కి." కళా. 3, ఆ.

ఏనికదోమ. ద్వ. వి. తొండపుదోమ, ఘోణిక.

ఏను. దే. స. 1. అయిదు; (ఇందలి ఉకారము వికల్పముగ లోపించును. ఉదా. ఏన్పర్వంబులు.)—2. నేనుయొక్క రూపాంతరము.

ఏనుఁగు. వై. వి. ఏనిక. పిణ. పెద్దది*. (ఏనుఁగుకలబంద, ఏనుఁగుకాలు, ఏనుఁగుతుమ్మి, ఏనుఁగుపల్లేరు, ఏనుఁగుజలగ, ఏనుఁగుబీఱ. మొ.)

ఏనుఁగుకలబంద. ద్వ. వి. నారకుపయోగించెడి పెద్దకలబంద❦.

ఏనుఁగుకొమ్ములు. ద్వ. వి. బ. శాలిధాన్యవిశేషము. "సీ. ఇప్పపూరాజనాలేనుఁగుకొమ్ములు మల్లెశ్రీగంధులుమదనగంధులు." హంస. ౪, ఆ.

ఏనుఁగడుగులు. దే. వి. బ. (ఏనుఁగు+అడుగులు.) చిత్రవర్ణవస్త్రవిశేషము.

ఏనుఁగుగొంగ. ద్వ. వి. ఏనికతిండి, సింహము. (ఏనుఁగుఁబగఱ అనియు.)

ఏనుఁగుఁబల్లేరు. ద్వ. వి. పెద్దపల్లేరు❦.

ఏనుఁగుమోముసామి. వై. వి. విఘ్నేశ్వరుఁడు, గజాననుఁడు.

ఏనుఁగురాకాసిగొంగ. ద్వ. వి. శివుఁడు, గజాసురవైరి.

ఏనుఁగుసారము. వై. వి. సప్తస్వరములలోనొకటి, నిషాదము.

ఏనూఱు. దే. స. (ఏను+నూఱు.) అయిదునూఱులు.

ఏపరించు. దే. స. క్రి. దుఃఖపఱచు. "ద్వి. ఏపరింపుదురె నన్నిట్లుమాయయ్య." హరిశ్చ. ౨, భా.

ఏపారు. దే. అ. క్రి. (ఏపు+ఆరు.) 1. అతిశయించు; 2. విజృంభించు. "క. తలప్రయ్యలైననిష్ఠుర, కులిశగతింబగిలికూలుకులపర్వతముం, దలపించుచుఁగురువృద్ధుం, డిలఁగూలెం బ్రతిబలంబులే పారంగాన్." భార. ద్రో. ౫, ఆ.

ఏపు. దే. వి. 1. ఆధిక్యము; "ఉ. ఉమావల్లభుఁడాదినాయకుఁడువాసవవంద్యుఁడు వెండికొండపై, నెల్లగణంబులుంగొలువ నేపునఁబర్వతరాజపుత్రితో, సల్లలితాత్ముఁడై సకలసంపదలంగొలువుండె." వీర. ౧, ఆ.—2. విజృంభణము. (చూ. ఏపారు.) (ఈపదమును ఆధునికులు కొందఱు ప్రకారార్థమందు ప్రయోగించియున్నారు.)

ఏపె. దే. వి. సాలము❦. ద్వ. స. ఏ. (ఏ+అప.) ఏమె. (చూ. ఆకె.)

ఏబిడ. దే. స. ఏ. (ఏ+బిడ్డ.) ఏపె.

ఏమఱిల్లు. దే. అ. క్రి. ఏమఱు, ప్రమాదపడు. "సీ. పదబంధశిథిలతపాటిల్లఁగానీక యేచందములయందు నేమఱిలక." కళా. ౧, ఆ. (ప్రే. ఏమఱించు. "చ. లవణాసురుమాతులుఁ డేమఱించితీ, వ్రతఁగొనిపోయెనాలవకరస్థశరాసనమభ్ర వీధికిన్." జై. ౬, ఆ.)

ఏమఱు. దే. అ. క్రి. ఏమఱిల్లు. స. క్రి. "మంత్రగోపనము నేమఱుటయు." కళా. ౭, ఆ.

ఏమఱుచు. దే. ప్రే. ఏమఱఁజేయు.

ఏమఱుపాటు. ద్వ. వి. 1. అకస్మాత్తుగా. "గీ. అంతనొకనాఁడుపూఁదోఁటకాత్మగురుని, వెంటఁజనియందునట్లకావించినూతి, నీటిలోనీడఁజూడంగ నెలఁతఁజూచె, విష్ణుచిత్తుఁ డేమఱుపాటు వెనుకఁగదిసి." పర. ౪, ఆ.—2. వంచనగా. "ఇట్లిగురుఁబోఁడుల నేమఱిపాటుచంపినం, బేరును బెంపునుంగలదె." భో. ౫, ఆ.

ఏమి. దే. స. ఏ. ఏది. "ఏమికులంబునవాఁడొకో." విరా. ౧, ఆ.–అవ్య. ప్రశ్నమును దెలిపెడిని. (హల్లుపరమగునపుడును కడపటనుమివర్ణకమునకు వికల్పముగాలోపము. "శా. ఏలాయిందునునందుఁబాటెదవునీకేబ్రాఁతియే వెన్నలున్, బాలున్బాలక." హరి. పూ, భా. ౫, ఆ. "క. శవము క్రియనుండెదిదే." భాగ. ౯, స్కం.) (రూ. ఏమీ.)

ఏమె. ద్వ. స. ఏ. (ఏ+అమ.) ఏపూజ్యురాలు. (చూ. ఆకె.)

ఏయది. దే. స. (ఏ+అది.) ఎది.

ఏయు. దే. స. క్రి. (బాణము) ప్రయోగించు. "గీ. వలుదనారసంబువక్షంబుదూఱఁగ, నేయుటయును." భార. కర్ణ. ౨, ఆ.

ఏరండము. సం. వి. అ. పుం. ఆముదపుఁజెట్టు.

ఏరపకడ. దే. వి. డాసరడంగి, దేవతాళము❦.

ఏరాది. దే. వి. (ఎరవు+అది.) ఒకదానిసంతతియైన గుఱ్ఱము. "ఎ, గీ. అచటనున్న యుత్తమాశ్వములకు నేరాదిలేఖుర్ణభునితురంగము." చంద్రా. ౧, ఆ.

ఏరాలు. దే. వి. (ఎరవు+ఆలు.) తోడికోడలు. "సీ. ఏరాలిపట్టిబిట్టి త్రిచెక్కిలినొవ్వఁగఁ బచివాఁడేడ్చినఁ గౌఁగిలించు." పాండు. 3, ఆ.

ఏరాళము. వై. వి. 1. అధికము; 2. అసంఖ్యము*. "క. ఓరాజవదనయచటన, నీరాజనమబ్జనాభునికి నీనున్నా, రేరాళముహారివల్లభలు." (ఏరాళము= ఏరాళముగాననియర్థము.) పాండు. ౨, ఆ. (చూ. హేరాళము.)

ఏరు. దే. వి. 1. ఎద్దులను గట్టి దున్నుటకు సిద్ధపఱచిన నాఁగలి; "నేఁడేరు మోపిన నీకుఁ జోళన రేండ్రు నానసుమీ." పర. ౫, ఆ.—2. తలనొప్పి. "హా రనురొదఁదలయేరువోడమ." చంద్ర.

ఏరుగు. దే. అ. క్రి. విష్ఠించు. వి. విష్ఠ.

ఏరునేల. దే. వి. భూపరిమాణవిశేషము. "గీ. ఏరు నేలకొలఁదినెడనెడవిడియుచు." భార. అశ్వ. 3, ఆ.

ఏరుపడు. ద్వ. అ. క్రి. 1. తేటపడు; 2. నిర్ణయింపఁబడు; 3. బయలుపడు; 4. రూపువడు; 5. వేఱుపడు; "ఎ, గీ. ఏరుపడినాల్గుపోఁజులై యెప్పుడెప్పు, డురుదురంబనుచున్న వానరులఁజూచి." రామా. ౮, ఆ.—6. సిద్ధపడు. (చూ. ఏర్పడు.)

ఏరుపాటు. ద్వ. వి. ఏర్పాటునకు మొదటిరూపము.

ఏరువాక. దే. వి. దుక్కియొక్క ప్రారంభము.

ఏర్చు. దే. అ. క్రి. తలనొచ్చు. "గీ. తపముగావించువారిఁ, గనినఁదలయేర్చుఁగా డెయాఖండలునకు." పాండు. ౫, ఆ.—స. క్రి. 1. ఏర్పఱచు; "సీ. ఆఁకలిగొనునప్పుడబ్జనాళములలోనూటికొక్కటియేర్చినోటికొసఁగు." శుక. ౧, ఆ.—2. చక్కఁబఱచు; "క. కయ్యమున కాయితమై, మొనలేర్చి వేగనిచటికిఁ, జనుదెమ్ము." భార. ఉద్యో. ౪, ఆ.—3. దహించు. "గీ. ఇందయుండిరి మేనిఁదా నేర్చునగ్ని." భార. ఆది. ౮, ఆ.

ఏర్పడు. ద్వ. అ. క్రి. 1. తేటపడు; "అతని నేర్పడ నాకుఁజెప్పవలయు." భార. ద్రో. ౫, ఆ.—2. బయలుపడు; "వ. తనవంచనం జేర్పడకుండఁగృతప్రణాముండైతదాగమనప్రయోజనం బడిగిన." భార. అర. ౨, ఆ.—3. రూపగు; (దానికి అంగము లేర్పడ్డవి.)—4. నిర్ణయింపఁబడు. (క్షత్రియుఁడు రాజుగా నేర్పడును.) 5. వేఱుపడు. "ఎ, గీ. ఇమ్మాడు నొకచోట మేళవించి, యుండునొకొక యేర్పడి యుండునొక్క." పాండు. ౧, ఆ. (ఏరుపడుయొక్క రూపాంతరము.) (ప్రే. ఏర్పరించు, ఏర్పఱచు. "మత్త. ఈ వికర్ణుఁడు బాలుఁడయ్యును నేర్పరించి యథావిధిన్, దేవమంత్రియుఁబోలె ధర్మువుఁ దెల్పె." భార. సభా. ౨, ఆ.)

ఏర్పాటు. ద్వ. వి. 1. నిర్ణయము. ("వందిబృందముల కేర్పాటొప్పఁగా." పాంచా. ౧, ఆ.—2. నియమము; 3. వివరణము. "శా. ఎట్టెట్టూ వినమైతి మింక నొకమా టేర్పాటుగాఁ జెప్పుమా." కాశీ. ౭, ఆ.) (ఏరుపాటుయొక్క రూపాంతరము.)

ఏర్పు. దే. వి. మంట.

ఏఱు. దే. స. క్రి. క్రిందనుండువస్తువులనొకటొక్కటిగా ఎత్తు. "ఎ, గీ. తృణధాన్యమల్ప, మేఱికొని నత్తురాఁకలితీఱకుండు." భార. అశ్వ. ౪, ఆ.—వి. నది.

ఏఱుజాజి. ద్వ. వి. ధాతకి†.

ఏఱుపిడక. దే. వి. నేలఁబడి యెండి యేఱఁబడెడి పేఁడకడి, కరీషము. (దీనిని ఏఱుపుగ్గులనియుఁ జెప్పుదురు.)

ఏఱుపుచ్చ. దే. వి. కలింగపత్రము†.

ఏఱుమద్ది. దే. వి. నదీసర్జము†.

ఏఱుమల్లియ. ద్వ. వి. వాసంతిక†, (రూ. ఏఱుమల్లె.)

ఏఱువ. దే. వి. విలాతి, దేశము.

ఏఱుసంగ. ద్వ. వి. గండీరము†.

ఏఱువావిలి. దే. వి. సప్తల†.

ఏల. ఉభ. దే. అవ్య. ఎందుకు, (రూ.) ఏలా. వై. వి. 1. ఒకయేఱు; (దీని నే ఏలేఱందురు. ఇది పీఠాపురముసమీపమునఁ బాఱునట్టిది.) 2. బ. శృంగారపుఁబాట*. "ఏలలుపాడుచు." అచ్చ. యు, కాం.—సం. ఆ. స్త్రీ. పేరేలకి†.

ఏలకి. వై. వి. ఏల†. (దీని భేదము చిట్టేలకి.)

ఏలకికాయ. ద్వ. వి. 1. భక్ష్యవిశేషము; "వ. ఇడ్డెనలు తేనెతొలలుబుడుకులు నేలకికాయలు." హంస. ౧, ఆ.—2. ఏలాఫలము.

ఏలపాటలు. ద్వ. వి. బ. బాలక్రీడావిశేషము. "ఎ, గీ. ఏలపాటలు సరిబేసులీలకూఁతలు." వి. పు. ౭, ఆ.

ఏలము, వేలము. హిం. వి. అమ్ముటలో నొకవిధము.

ఏలము. వై. వి. కల్లుగీచువాఁడు ఆతోఁపునందు వేసికొనెడు గుడిసె.

ఏలముపట్టు. ద్వ. వి. ఆలంబలనము. (చూ. నానగండ.)

ఏలాపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. కారేలకి†.

ఏలాము. వై. వి. ఏలముయొక్క రూపాంతరము.
ఏలావాలుకము. సం.వి.అ.న. నూఁగుదోసకాయ.(రూ.) ఏలవాలుకము.
ఏలి. దే. విశే. కృత్రిమము. "ఏలిమాట." భార. ఉద్యో. 3, ఆ. "ఏలిసింగము." చంద్రా. ౨, ఆ.
ఏలిక. దే. వి. 1. రాజు; 2. ఒడయఁడు.
ఏలికసాని. ద్వి. వి. దొరసాని, రాజ్ఞి.
ఏలిదము. దే. వి. చులుకఁదనము. "క. బాలుఁడనితలఁచిరిపుతో, నేలిదమునఁగలసియునికియిదికార్యమె." భార. ఆది. ౬, ఆ.—విశే. చులుకనిది. (చూ. ఎల్లిదము.)
ఏలినవాఁడు. దే. వి. ఏలిక, రాజు.
ఏలు. దే. స. క్రి. 1. పరిగ్రహించు; "క. అని హర్షోత్కర్షంబున, మనమలరఁగఁబలికిమత్స్యమనుజాధీశుం, డనిలసుతు నేలెనాతఁడు, తనమనమున నూఱడిల్లెఁదదవసరమునన్." భార. విరా.౧,ఆ. "చ. ఇతనికులంబుఁ జేరువినియేలఁదలంచిన నేలుమేలునీ, కతిబలుఁడైనబంటుహృదయంబునరోషమువట్టి తేనిప, ధ్యతకువిధింప నేలయితఁడాఁకకుఁబాత్రము." ఉ, హరి. ౫, ఆ.—2. పాలించు.
ఏలుకొను. దే. స. క్రి. ఏలు, పరిగ్రహించు.
ఏలుకోటి. మి.వి.ఏలుబడికిలోఁబడినజనము,ప్రకృతిజనము.
ఏలుబడి. దే. వి. ఏలుట, పాలనము.
ఏవ. దే. వి. రోఁత. "మున్ను గొంటెనేవన్న నదండయొక్క మగవాఁడిడ." ఆము. ౧, ఆ. — విశే. రోఁతయైనది. (రూ. ఏవము. "సిగ్గేవంబేమియులేక." ఉ, హరి. 3, ఆ. "ఏవంబిచ్చరిత్రంబు." నిర్వ. ౬, ఆ.)
ఏవకాఁడు. దే. విశే. 1. రోఁతగలవాఁడు; 2. ఓర్వలేనితనముకలవాఁడు. "గీ. ఎడరుగాచిచెలిచునేవకాఁడగువాని, కంటెమేలుచూ వెకాలయముఁడు." రా. యు, కాం.
ఏవగించు. దే. అ. క్రి. రోఁతపడు. "గీ. అన్యవర్ణుఁడుదీనుఁడీయనకఁగూఁతు, నెట్టులీవచ్చునని మది నేవగించి, యూఁడ." భార. అను. ౧, ఆ.—స. క్రి. 1. నిందించు;"గీ. ఔర మెచ్చితినోబాఁపనయ్యనిన్నుఁ, దరుగకీమాటనీమదిఁదిరము సేయు, హీనకులుఁడనియితఁడునన్నేవగించి, పలికినాయాత్మకదియుంపములికియయ్యె." హరిశ్చ.౪,ఆ.
2. విడుచు. "అరిగాఁబంచమమేవగించివవలాలవ్రేళహిందోళవై, ఖరినూపన్." వసు. ౧, ఆ.
ఏవపడు. ద్వి. అ. క్రి. రోఁతపడు. "గీ. కిల్బిషంబుగోశకృన్మూత్రములకేవపడుట."భార.అను.3,ఆ.
ఏవల. దే. వి. (ఏ+వలను.) ఏప్రక్క. (చూ. ఎవ్వల.)
ఏవాఁడు. దే. స. 1. ఏపురుషుఁడు; 2. ఎల్లవాఁడు. (చూ. ఎవ్వఁడు.)
ఏవురు. దే. స. ఏగురుయొక్క రూపాంతరము.
ఏషణి. సం. వి. ఈ. స్త్రీ. 1. నారాచాకృతియైనయగసాలెవానిత్రాసు; 2. పుంటికంటఁజొప్పించెడుశలాక.
ఏష్యము. సం. విశే. (అ. ఆ. అ.) కాఁగలది.
ఏస. దే. వి. విజృంభణము. (చూ. ఏసరేఁగు.) విశే. 1. గ్రామ్యము; "ఏసమాట."—2. వంకర. "వ. ఊసి యేసగాఁ దీసి తడవిండ్ల నేసి క్రొవ్వునంగూసి డాసి." వసు. ౨, ఆ.
ఏసరు. దే. అ. క్రి. మీఱు. "ఆలపోతేసరరేఁగ." రుక్మాం. ౪, ఆ.
ఏసరేఁగు. దే. అ. క్రి. విజృంభించు. "గీ. ఇప్పుడమితాగ్రహంబున నేసరేఁగి, యిప్పుడమివేల్పుఁగోలమువారిందిరేళ, వెలియుగిలియంచునున్నారు." పర. ౨, ఆ.
ఏసి. దే. అవ్య. 1. వంతున. (రెండేసి,మూడేసి.మొ.) 2. కొలఁదిని దెలుపును. "ఇంతలేసిదొరలు."

## ఐ.

ఐ. ఒకయక్షరము.
ఐంగుదము. సం. వి. అ. న. గారపండు.
ఐందవము. సం. విశే. (అ.ఈ.అ.) ఇందుసంబంధమైనది. (ఇందుఁడు=చంద్రుఁడు.)
ఐంద్రజాలికుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రజాలవిద్య నేర్చినవాఁడు.
ఐంద్రము. సం. వి. అ. పుం. 1. ఒకగ్రహయోగము; 2. మాలకాకి.
ఐంద్రియకము. సం. విశే. (అ.ఆ.అ.) చక్షురాదీంద్రియగోచరమైనది, ప్రత్యక్షము.
ఐకకంఠ్యము. సం. వి. అ. న. ఏకకంఠత్వము, ఒద్దిక.
ఐకమత్యము. సం. వి. అ. న. ఏకమతిత్వము, ఒద్దిక.
ఐకాగారికుఁడు. సం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.
ఐకాగ్ర్యుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) ఏకతానుఁడు.
ఐక్యము. సం. వి. అ. న. ఏకీభావము, ఒరిమ.

**ఐణము.** సం. విణ. (అ.ఆ.అ.) ఏణముయొక్క చర్మము మొదలైనది. (ఏణము=ఇఱ్ఱి.)

**ఐణేయము.** సం. విణ. (అ.ఆ.అ.) ఏణియొక్క చర్మము మొదలైనది. (ఏణి=లేడి.)

**ఐతి.** దే. విణ. ఎల్ల, శక్యము. (అయితియొక్క రూపాంతరము.)

**ఐతిహాసికుఁడు.** సం. వి. అ. పుం. ఇతిహాసము తెలిసినవాఁడు. విణ. ఇతిహాససంబంధముగలవాఁడు.

**ఐతిహ్యము.** సం. అవ్య. పారంపర్యముచేనగు ఉపదేశము. (ఇది అకారాంతనపుంసకమనికొందఱు.)

**ఐదు.** దే. స. నాలుగునొకటి. (అయిదుయొక్క రూపాంతరము.)

**ఐదుగురు.** దే. స. (ఐదుఃకు మహన్మహత్యర్థకరూపము.) ఐదుమంది. (అయిదుగురుయొక్క రూపాంతరము.)

**ఐదుపదిచేయు.** దే. అ. క్రి. 1. నమస్కరించు; 2. ఓడిపోవు. "సుస్థిరభుజశక్తినైదుపదిచేయురుదత్తిని తక్క." (ఓడిపోవువారును చేతులుకూర్చిమ్రొక్కుదురు కనుక దీనికి ఓడిపోవుటయనునర్థము కలిగెను.) ఆము. ౧, ఆ. (అయిదుపదిచేయుయొక్క రూపాంతరము.)

**ఐదుమోములవేల్పు.** ద్వ. వి. శివుఁడు, పంచముఖుఁడు.

**ఐదువ.** ద్వ. వి. (ఐదు+వన్నెలుగలది.) మాంగల్యముగలస్త్రీ (వన్నెయనఁగా ఇక్కడ సుమంగలియొక్క అలంకారము. ఐదేనఁగా.—మంగళసూత్రము, పసుపు, కుంకుమము, గాజులు, చెవ్వాకు.) (అయిదువయొక్క రూపాంతరము.)

**ఐదువరాలు.** ద్వ. వి. (ఐదువ+ఆలు.) ఐదువ. (ఇక్కడ ఐదువశబ్దము విశేషణము. చూ. ఆలు.) (అయిదువరాలుయొక్క రూపాంతరము.)

**ఐద్దాయులు.** దే. వి. బ. (ఐదు+దాయులు.) వడ్లవాఁడు కమ్మరవాఁడు కంచరవాఁడు అగసాలెవాఁడు కాసెవాఁడు వీరిపనులు.

**ఐన.** దే. ద్ర. ముందుచెప్పఁబడినదానికి విరుద్ధమయిన యర్థమును దెలుపును. "గీ. నీవుచతురమతివినీకు నిక్కన్నియ, నప్పగింప నేలయైననాదు, హృదయములరుదీనియొడఁగదునార్ద్రమై, యుండుఁగానఁజెప్పకుఁడరాదు." భార. విరా. ౧, ఆ. (ఇది ప్రత్యేకముగావచ్చినప్పుడీయర్థము. మఱియొక పదముతోఁ చేరివచ్చినపుడు అనేకార్థములనిచ్చుచున్నది. "అలుకనైనఁ జెలిమినైన." ఇత్యాది స్థలములయందు వికల్పమును దెలుపుచున్నది. "అక్కటయిల్లు వేడికొననైనను బోయెదవో." ఇత్యాదిస్థలములయందు మిక్కిలితక్కువను దెలుపుచున్నది. "ఇంకనైననన్ను నేలయాలింపవు." ఇత్యాదిస్థలములయందు సమయమగుటను దెలుపుచున్నది. ఇట్లు ఇంకను ఊహ్యంబులు.) (అయినయొక్క రూపాంతరము.)

**ఐనిల్లు.** దే. వి. నట్టిల్లు, అంతర్గృహము. (అయినిల్లుయొక్క రూపాంతరము.)

**ఐపు.** దే. వి. తప్పు, దోషము. (అయిపుయొక్క రూపాంతరము.)

**ఐపోవు.** దే. అ. క్రి. 1. వెచ్చమైతీఱు; (సంబారములన్ని అయిపోయినవి.)—2. ముగియు. (వాఁడు ఉద్యోగముచేసిఅయిపోయినది.) (అయిపోవుయొక్క రూపాంతరము.)

**ఐమూల.** దే. విణ. మూలవాటు. (ఆయిల్లు ఐమూలగానున్నది.) (అయిమూలయొక్క రూపాంతరము.)

**ఐర.** దే. వి. నేత్రరోగవిశేషము. "అక్షిరోగవిశేషమైరయనఁగ." ఆం. భా. ద్వి. మ. (అయిరయొక్క రూపాంతరము.)

**ఐరకొను.** దే. అ. క్రి. చక్కఁబడు. "క. భీషణవనమునఁనాయు, శ్లేషవిశేషమునఁగుల్లిచివుకకయచ్చో,నీషద్రుజలేకమహా,ఘోషవృషంబునకునైరకొనికాల్వచ్చెన్." పంచ. వేం. ౧, ఆ. (అయిరకొనుయొక్క రూపాంతరము.)

**ఐరావణము.** సం. వి. అ. పుం. ఇంద్రునియేనుఁగు. ఐరావతము.

**ఐరావతము.** సం. వి. అ. న. వంపులేనినిడుపాటియింద్రధనుస్సు. పుం. 1. ఇంద్రునియేనుఁగు; 2. ఒకానొకపాము; 3. మబ్బుమీఁదవచ్చేడిమబ్బు; (దీనిని రాజమేఘమందురు.) 4. నారదబ్బ; 5. నిమ్మ.

**ఐరావతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. మెఱపు; 2. కోలమెఱపు.

**ఐరేని.** దే. వి. ఏ. బచ్చెనపని చేసిన పెండ్లికుండలు. "సీ. ఐరేనిగొనివచ్చిరైదువల్ పాటలుపాడుచు శుభవేళవేడుకలర." విజ. 3, ఆ. (అయిరేనియొక్క రూపాంతరము.)

ఐలబిలుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు, వైఁడి ఱేఁడు.

ఐలాఠము. దే. వి. మాలికావిశేషము. (అయిలారముయొక్క రూపాంతరము.)

ఐశేయము. సం. వి. అ. న. నూఁగుదోసకి.

ఐవచ్చు. దే. అ. క్రి. అచ్చివచ్చు. (అయివచ్చుయొక్క రూపాంతరము.)

ఐశ్వర్యము. సం. వి. అ. న. 1. అణిమాది; (అపి. ౘ. అణిమ మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము.) 2. సంపద.

ఐహికము. సం. విణ. (అ. ఈ. అ.) ఇహలోకసంబంధమయినది.

## ఒ.

ఒ. ఒకయక్షరము. దే. అవ్య. సందేహమును దెలుపును. "పద్మహితుఁడో హిమకరుఁడో శచీ. గృహమేధియో." భార. విరా. ౧, ఆ.

ఒంకియ. వై. వి. ఒంకె.

ఒంకె. వై. వి. పాగమొదలైనవి తగిలించెడు చిలుకకొయ్య. (ఒంకియయొక్క రూపాంతరము.)

ఒంజిలి. దే. వి. దుఃఖము. విణ. దుఃఖముకలవాఁడు (లేక) దుఃఖముకలది. (చూ. ఒందిలి.)

ఒంటరము. దే. వి. విరోధము. "క. ఒంటమిలేనివి యొంటర, మింటరములుపలుకుటుచితమే." భార. ఉద్యో. ౪, ఆ.

ఒంటరి. ద్వ. వి. (ఒంటి+అరి.) అసహాయుఁడైనబంటు. "మ. పూవుఁదీఁ, గెగుడెం దానలరాచయొంటరికడుం గేరించుచుం జిమ్మినన్." య. ౫, ఆ.—విణ. ఏకాకి.

ఒంటరికాఁడు. ద్వ. వి. 1. పంది, ఏకచరము; "సీ. క్రమ్మియొంటరికానిదొమ్మినొంచుయశంబు బయటిపల్లెలుగూల్చుబల్లికల్లి." చంద్రా. ౧, ఆ.—2. అసహాయుఁడయినబంటు. "ఒంటరికాండ్రనేకసూ, కరములుగుప్పదెప్పమసఁ గాఁబడఁగుమ్మిరి." ఉ, రా. ౭, ఆ.—విణ. ఏకాకి. (స్వార్థమున కాఁడు.)

ఒంటరిపాటు. ద్వ. వి. ఒంటి, ఏకాకిత్వము.

ఒంటరీఁడు. ద్వ. వి. (ఒంటరి+ఈఁడు.) అసహాయుఁడైనబంటు. "సీ. ఒంటరియొక్కటీఁడొంటరీఁడొంట్రింపునానేకభటునికి నామములగు." ఆం, భా. ద్వి. ఖ. (స్వార్థమున ఈఁడు.)

ఒంటి. వై. వి. ఏకాకిత్వము. "క. ఒంటిమెయినుండఁగాము, క్కంటికినాకచ్ఛపంబుగొరుంబట్టం, గంటయరిది." భార. అను. ౧, ఆ.

ఒంటింపు. దే. వి. 1. అనుకూల్యము; 2. వీఁడు వీఁడీయీపనినిజేయవలయునని యేర్పఱచునేర్పాటు. (చూ. అరగింపు.)

ఒంటికంటిగాము. ద్వ. వి. చుక్క, శుక్రుఁడు.

ఒంటికాఁడు. ద్వ. వి. పంది, ఏకచరము. విణ. 1. ప్రియురాలినెడఁబాసినవాఁడు, వియోగి; "సీ. అనురక్తిరేఁచు నూతనసారసాటోపమొంటికాండ్రకుఁబెంపులొసఁగునెచట." (హరిశ్చంద్రకథయందు పందులకనియు, నలకథయందు వియోగులకనియు అర్థము.) హన. ౨, ఆ.—2. ఏకాకి.

ఒంటికొమ్ము వేలుపు. ద్వ. వి. వినాయకుఁడు, ఏకదంతుఁడు.

ఒంటిపాటు. వై. వి ఏకాంతము. "ఒంటిపాటు చేకూఱినది."

ఒంటిపోఁగు. ద్వ. వి. బలరాముఁడు, ఏకకుండలుఁడు. (చూ. వితావిత.)

ఒంటియ. వై. వి. ఒంటె, లొట్టిపిట.

ఒంటియడుగుఁగత్తెర. ద్వ. వి. మల్లబంధవిశేషము.

ఒంటు. దే. అ. క్రి. ఇముడు, అనుకూలించు. స. క్రి. చేరు. "నగడ కమలములంటుచుఁగలువలనొంటుచు." శశాం. ౨, ఆ.—వి. 1. గ్రామసమూహము; 2. బ. పురుషులకర్ణభూషణము.

ఒంటుకొను. దే. స. క్రి. చేరు. "ఎ, గీ. ఒంటిపాటు సనవ్వాలఁగంటినంటె, యొంటుకొనఁజూచియోహోబాయయుక్తమనుచు."

ఒంటె. వై. వి. ఉష్ట్రము. (ఒంటియయొక్క రూపాంతరము.)

ఒంటెపులి. ద్వ. వి. మృగవిశేషము. (అప్ర.)

ఒంట్రింపు. ద్వ. వి. అసహాయుఁడైనబంటు, (చూ. ఒంటరీఁడు.)

ఒంట్లు. యు. దే. వి. బ. (ఒంటు+లు.) పురుషులకర్ణభూషణము. వై. అంకెలు.

ఒందు. వై. స. 1. అన్యము; 2. ఏ. ఏకము.

ఒండె. దే. ద్ర. 1. అటుకానిపక్షమున. "చ. అప్పురుషసింహులుభూరితపోధనుల్ మనం, బునఁగలుషించిరేనియుఁ దపోమహిమన్ మిము నిర్దహింతురొం, డెనతులితాస్త్రశక్తిని వడిందునుమాడుదురాజినిందఱున్." భార. అర. ౫, ఆ. (మీఁద

ఏనిశబ్దముకదిసియుప్రయోగింపఁబడును. "గీ. అష్టమీవాసరంబునయందునొండె, నొండెనేని చతుర్దశినిండుభక్తిఁ, బూజగావించి యెవ్వఁడు భూమిసున్న, దుర్గసేవింప దురితంబులొలఁగునం డ్రు." భీ. ౬. ఆ.) 2. కాని. "సీ. సమకట్టి సైన్యంబుసైన్యంబుతోనొండెఁదొడరిమీయువ్వ రతోడనొండె, నిద్దఱతోనొండె నెక్కటియొ క్కనితోనొండెఁబొడిచెవదోర్బలమున." భార. సభా. ౧, ఆ.

ఒండేని. దే. అవ్య. (ఒండెఁ+ఏని.) ఒండె. "మ. అనుషంగంబుననొండె నొండెను విహారాపేక్ష నొండేని ఘు, ర్దనిరాసంబుననొండెఁదీప్రభయ సంత్రాసార్థమొండేనియ, న్యనియోగంబునసె న్వఁడేమునుఁగు గంగాంభఃప్రవాహంబునఁ, జ నుఁడాతండును బుండరీకనయ నాశాసించు పాపౌఘముల్." కాశీ. ౫, ఆ.

ఒండొండ. దే.అవ్య.(ఒండు+ఒండు+అ.) క్రమక్రమముగా. "ఇప్పుడొండొండపొంగి కలయఁబా ఱుఁ బయోధులు గ్రమ్ముగ." భార. అర. ౪, ఆ.

ఒందిక. దే. వి. ఒద్దిక. "సీ. కలశపాథోరాశికన్య కారత్నంబు నొందికతోఁగూడి యున్నవాని." వి, పు. ౫, ఆ. (ఒద్దికయొక్క రూపాంతరము.)

ఒందిలి. దే. వి. దుఃఖము. విశే. దుఃఖముకలవాఁడు (లేక) దుఃఖముకలది. "వాఁడుధనహీనుఁడగుచు సంతాపమొంద విడుతురు బంధులవ్విధమున నొం దిలిర్యొచేయునదిలేక." భాగ. ౧౦, స్కం. ఉ.

ఒందు. దే. అ. క్రి. కలుగు. "పౌరచిత్తములకత్యా నందమొందంగ." భార. ఆది. ౮, ఆ.—స. క్రి. పొందు.

ఒక. వై. స.(వృత్తియందు ప్రత్యయములోపించిన రూపము.) 1.ఒక్క; 2.ఒకానొక. (ఒకింతుక, ఒకింత ఇత్యాదులయందు ఇది యల్పార్థకమని యెఱుంగునది.)

ఒకఁడు.వై.స. 1. అన్యుఁడు;2.ఏ.ఏకకుఁడు. (లేక) అన్యము; ఏకము.

ఒకట.వై.ద్ర. 1. ఏకకాలమున; (చూ.ఒక్కట.) 2. కూడ. (చూ. ఒక్కట.)

ఒకటి. వై. స. ఏ. 1. ఏకము; 2. అన్యము.

ఒకత. వై. స. ఏ. ఒకరితయొక్క రూపాంతరము.

ఒకతి. వై. స. ఏ. ఒకరితియొక్క రూపాంతరము.

ఒకతుక. వై. స. ఏ. (ఒకత+క.) (చూ.) ఒకరిత. (చూ. ఎవతుక.)

ఒకతె. వై. స. ఏ. ఒకరితెయొక్క రూపాంతరము.

ఒకరిత. వై. స. ఏ. (ఒకరి+త.) 1. ఏకస్త్రీ; 2. అన్యస్త్రీ. (రూ.) ఒకర్త.

ఒకరితి. వై. స.ఏ. (ఒకరి+తి)——పై.——(రూ.) ఒకర్తి.

ఒకరితె.వై.స.ఏ.(ఒకరి+తె.)——పై.——(రూ.) ఒకర్తె.

ఒకరుఁడు. వై. స. (చూ.) ఒకఁడు.

ఒకరువ్వుఁడు. వై. స.——పై.——

ఒకర్తు. వై. స. ఏ. (ఒకర్త+ఉ.) (చూ.) ఒకరిత.

ఒకర్తుక.వై.స.ఏ.(ఒకర్త+క.)——పై.——(చూ. ఎవతుక.)

ఒకానొక. వై. విశే. (వృత్తియందు ప్రత్యయము లోపించినరూపము.) ఉద్దేశింపఁబడని. (ఒకానొకపురుషుఁడు, ఒకానొకస్త్రీ, ఒకానొకమృగము.మొ.) (దీనిని ప్రత్యయముతోచేర్చిచెప్పున పుడు మహదర్థమున ఒకానొకఁడనియు, మహత్యర్థమున ఒకానొకతయనియు,అమహదర్థమున ఒకానొకటియనియు రూపములు.)

ఒకో. దే. అవ్య. సందేహమును దెలుపును. (రూ.) ఒకో. "క. ఈమేలు ప్రజలొనర్చిన, యామహిమకు నెలవుగొంతియు గ్గతనయుఁడో, భీముఁడో కొతమ్ముకుఱ్ఱలో, కోమలియొవ్వరొకొతలఁపుకొలఁదికిమీఱెఁ." భార. ద్రో. ౨, ఆ.

ఒకోఁడు.వై.స. (చూ.)ఒకఁడు.(చూ.ఒక్కొఁడు.)

ఒకోట. వై. ద్ర. (చూ.) ఒకట.

ఒకోటి. వై. స. ఏ. (చూ.) ఒకటి.

ఒకోత. వై. స. ఏ. ఒకోరితయొక్క రూపాంతరము.

ఒకోతి. వై. స. ఏ. ఒకోరితియొక్క రూపాంతరము.

ఒకోతుక. వై. స. ఏ. (ఒకోత+క.) (చూ.) ఒకరిత. (చూ. ఎవతుక.)

ఒకోతె. వై. స.ఏ. ఒకోరితెయొక్క రూపాంతరము.

ఒకోరిత. వై. స. ఏ. (ఒకోరి+త.) (చూ.) ఒకరిత. (రూ.) ఒకోర్త.

ఒకోరితి. వై. స. ఏ. (ఒకోరి+తి.)——పై.——(రూ.) ఒకోర్తి.

ఒకోరితె. వై. స. ఏ. (ఒకోరి+తె.)——పై.——(రూ.) ఒకోర్తె.

ఒకోరుఁడు. వై. స. (చూ.) ఒకఁడు.

ఒకోరువుఁడు. వై. స.——పై.——

ఒకోర్తు. వై. స. ఏ. (ఒకోర్త+ఉ.) (చూ. ఒకరిత.)

ఒకోర్తుక. వై. స. ఏ. (ఒకోర్తు+క.)——పై.—— (చూ. ఎవతుక.)

ఒక్క. వై. స. ఒకయొక్కరూపాంతరము. (చూ. ఒక.)

ఒక్కఁడు. వై. స. ఒకఁడుయొక్కరూపాంతరము.

ఒక్కట. వై. ద్ర. ఒకటయొక్కరూపాంతరము. (కూడ అనుటకు.—"అతనితోడనొక్కటఁబుట్టెనొకకన్యకృష్ణనా." భార. ఆది. ౭, ఆ. "నలుండుదమయంతి నాశ్వాసించుచునొక్కటఁజని." భార. అర. ౨, ఆ.)

ఒక్కటి. వై. స. ఏ. ఒకటియొక్కరూపాంతరము.

ఒక్కత. వై. స. ఏ. ఒక్కరితయొక్కరూపాంతరము.

ఒక్కతి. వై. స. ఏ. ఒక్కరితియొక్కరూపాంతరము.

ఒక్కతుక. వై. స. ఏ. ఒకతుకయొక్కరూపాంతరము.

ఒక్కతె. వై. స. ఏ. ఒక్కరితెయొక్కరూపాంతరము.

ఒక్కప్రొద్దు. వై. వి. వ్రతాదులచేనియమముతోఁ జేయునట్టి యొక్కపూఁటభోజనము.

ఒక్కరిత. వై. స. ఏ. ఒకరితయొక్కరూపాంతరము. (రూ. ఒక్కర్త.)

ఒక్కరితి. వై. స. ఏ. ఒకరితియొక్కరూపాంతరము. (రూ. ఒక్కర్తి.)

ఒక్కరితె. వై. స. ఏ. ఒకరితెయొక్కరూపాంతరము. (రూ. ఒక్కర్తె.)

ఒక్కరుఁడు. వై. స. ఒకరుఁడుయొక్కరూపాంతరము.

ఒక్కరువుఁడు. వై. స. ఒకరువుఁడుయొక్కరూపాంతరము.

ఒక్కర్తు. వై. స. ఏ. ఒకర్తుయొక్కరూపాంతరము.

ఒక్కర్తుక. వై. స. ఏ. ఒకర్తుకయొక్కరూపాంతరము.

ఒక్కళు. వై. వి. ఉగ్రభావము*. చ. "వఱలఁగరాముఁడంతననవద్యుఁడువచ్చిమహాప్రలాపియై, యఱచుచునున్నతల్లినిగృతాంతవశీకృతుఁడైన తండ్రినె, క్కొఱఁగనితీవ్రశోకపరిఖేదహతుండయి." భార. అర. 3, ఆ.—విణ. ఉగ్రము. "క. వెఱచఱవనీరిలోనొ, క్కొఱగానొకమొసలిమాడ్కికి నగోచరమై, పఱతెంచికుంభసంభవు, చిఱుదొడపడిఁబట్టుకొనియెశిష్యులుబెదరన్." భార. ఆది. ౫, ఆ.

ఒక్కో. దే. అవ్య. ఒకో, (రూ. ఒక్కో.)



ఒక్కోఁడు. వై. స. ఒకోఁడుయొక్కరూపాంతరము. "స్రగ్ధర. క్రూరేషాసంబులేదొక్కోఁడు." రాఘ. ౨, ఆ.

ఒక్కోట. వై. ద్ర. ఒకోటయొక్కరూపాంతరము. (చూ.) ఒకట. (ఏకకాలముననుటకు.—"క. ఇటఁబాండవకౌరవులొ, క్కోటనందఱుగురునను జ్ఞఁగొని." భార. ఆది. ౫, ఆ.)

ఒక్కోటి. వై. స. ఏ. ఒకోటియొక్కరూపాంతరము.

ఒక్కోత. వై. స. ఏ. ఒక్కోరితయొక్కరూపాంతరము.

ఒక్కోతి. వై. స. ఏ. ఒక్కోరితియొక్కరూపాంతరము.

ఒక్కోతుక. వై. స. ఏ. ఒకోతుకయొక్కరూపాంతరము.

ఒక్కోతె. వై. స. ఏ. ఒక్కోరితెయొక్కరూపాంతరము.

ఒక్కోరిత. వై. స. ఏ. ఒకోరితయొక్కరూపాంతరము. (రూ. ఒక్కోర్త.)

ఒక్కోరితి. వై. స. ఏ. ఒకోరితియొక్కరూపాంతరము. (రూ. ఒక్కోర్తి.)

ఒక్కోరితె. వై. స. ఏ. ఒకోరితెయొక్కరూపాంతరము. (రూ. ఒక్కోర్తె.)

ఒక్కోరుఁడు. వై. స. ఒకోరుఁడుయొక్కరూపాంతరము.

ఒక్కోరువుఁడు. వై. స. ఒకోరువుఁడుయొక్కరూపాంతరము.

ఒక్కోర్తు. వై. స. ఏ. ఒకోర్తుయొక్కరూపాంతరము.

ఒక్కోర్తుక. వై. స. ఏ. ఒకోర్తుకయొక్కరూపాంతరము.

ఒగరు. వై. వి. చక్కఁగాఁబండని దానిమ్మలోనగువానిరుచి, తువరము. (చూ. రసము.) "సీ. బిగికందకుండ లేఁజిగురాకు గొనివచ్చియొగరెల్లఁబుచ్చితీపొసఁగకున్న." విక్ర. ౫, ఆ.

ఒగరుచే. వై. అ. క్రి. ఒగరగు. "సీ. నులివాడునాఁచువల్పులగొంతొగర్చిలేఁబొలవల్చుగాలి వేఁబోక నెతెఁగి." ఆము. ౨, ఆ.

ఒగి. దే. ద్ర. క్రి. విణ. క్రమముగా. "ఉభయపక్షములవారి, నుద్ధరింతురందఱొగిఁబిండమిడినవారు." (ఇక్కడ ఒగిన్ అనఁగా విధిక్రమముగాననియర్థము.) భార. అర. ౨, ఆ. (ఇట్లక్కడక్కడ సందర్భానుసారముగా అర్థము తెలుఁగునది.)

ఒగిదిగ. దే. వి. జెడబిల్ల. "సీ. కన్నెగేదఁగి రేకునున్న గిలగఁజీటియొగిదిగగాఁబెట్టెనొక్క చెలికి." చము. ౧, ఆ. (దీనికి ప్రయోగాంతరము మృగ్యము.)

**ఒగుడు.** దే. వి. జొన్నలోనగువానియొండినయాకు.

**ఒగుడుకఱచు.** దే. అ. క్రి. కృశించు.

ఒగ్గము. దే. వి. (చూ.) అవపాతము. "క. ఒగ్గములు త్రవ్వి పడుమని, యొగ్గెడు పెనుఁదెరల వలల ను గ్రమృగములన్, దగ్గతినఁజంపువేడుక, వెగ్గల మైచిత్తమందు వేఁటాడింపన్." భాగ. ౧, స్కం.

ఒగ్గు. దే. అ. క్రి. మొనయు. "ఉ. ఏయుక్కును లేక యిట్టిపని కొగ్గనెయంచు లోక కొందఱాడఁగన్." పాంచా. ౨, ఆ.—స. క్రి. 1. (వల) పఱచు, ఒడ్డు; (చూ. ఒగ్గము.) 2. చాఁచు. "ఎ, గీ. ఆనెలంత మెడకునడ్డంబుగా మెడ, యొగ్గెవృద్ధసతియనూన కృపను." కళా. 3, ఆ.

ఒగ్గుబల్ల. దే. వి. తెరమెనపట్టెడు కొయ్యకాధార మైనబల్ల.

ఒచ్చెము. దే. వి. 1. కొఱఁత, న్యూనత; "గీ. అధ్వరా రంభమింతొప్పునయ్యాదక్షు, శివునిఁదోడ్తేనియొ క్కయొచ్చెంబు కాని." కాశీ. ౬, ఆ.—2. అవమానము. "చ. మానినికిందనుఁదానకాచికో, లాద వినదానఁజేసి సభనొచ్చెముదక్కినఁ బొందునంద నుల్, బ్రదికిరిగాక." భార. ఉద్యో. ౧, ఆ.

ఒచ్చెల. దే. అన్య. ఓ చెల్లయొక్కరూపాంతరము. "ఒచ్చెలనిన్నుఁజూచి వగనొందెదుఁజిత్తము." భో. ౫, ఆ. (రూ. ఒచ్చెల్ల. "క. అచ్చుగఁబ్రయాగ లోపల,విచ్చలవిడిఁదనదు మేనువిడిచినమనుజుం, డొచ్చెల్లయేమిచెప్పుదుఁ, జెచ్చెరఁగను నిష్టకా మ్యసిద్ధిధరిత్రిన్." భో. ౧, ఆ.)

ఒజ్జ. వై. వి. 1. ఉపాధ్యాయుఁడు; "క. పరుసనుదాత్త ప్రముఖ, స్వరములుకను బొమ్మసంజ్ఞజాఱక యుండన్, బోరిఁబొరఁగఱవుచువటువుల, నురుస్మృతిఁ జదివించుచున్న యొజ్జయుఁగడఁకన్." పర. ౨, ఆ.—2. పురోహితుఁడు*; "సీ. రాజునొజ్జలమంత్రరక్షాబలంబునరాఁ బొందుగాదయ్యెరాక్షసునకు." నై. ౪, ఆ.—3. యాజకుఁడు*. "గీ. భక్ష్య భోజ్యలేహ్యపానీయములమీఁద, సదములోని విప్రజనులమీఁద, వెగడుపడఁగఁ బాఱె వెఱపింత మొజ్జలు, తత్ప్రయోగవిధులుదప్పిపఱవ." భార. ఆది. ౨, ఆ.

ఒజ్జెనము. వై. వి. ఒజ్జెదనము, ఉపాధ్యాయత్వము.

ఒజ్జబంతి. వై. వి. ఉపాధ్యాయుఁడు చూపినపద్ధతి, మేలుబంతి. "సీ. తనకులాచారవర్తన వైష్ణవాచార పర్యాయములకొజ్జబంతియనఁగ." పాండు. ౧, ఆ.

ఒజ్జసాని. వై. వి. ఉపాధ్యాయునిభార్య. "ద్వి. కష్టమేర్పడఁగనాఁగాకనిపోయి, చపలాత్ముఁడా యొజ్జసానికిట్లనియె." హరిశ్చ. ౨, భా.

ఒట్టు. దే. అ. క్రి. కలుగు. "ఉ. అట్టిన్నపాలకీటము లనాజినెదుర్చఁగలేనివానియు, ట్లొట్టినభీతిమైని టుపయోధిశరణ్యుఁడవైతివి." భాగ. ౧, స్కం. ఉ.—స. క్రి. 1. ఉంచు; "ఉ. ఇట్టిదిక్రూరకృత్యమని యించుకకొంకక లక్కయింటఁజిచ్చొట్టితి." భార. శల్య. ౨, ఆ.—2. రగుల్చు. "ఒట్టినమంటవోలెఁగడునుగ్రతఁ బేర్చిన." నిర్వ. ౪, ఆ. "క. పట్టుదురుగాకొఱవులనుపడిఁ, బెట్టుదురసిపుత్రికలను బెనుమంటలయం, దొట్టుదురొడళ్ల నలియన్, మట్టుదురప్పాపచిత్తు మత్తుంబెలుచన్." (ఇక్కడ ఒట్టుటయనఁగా కాల్చుట యని యర్థము.) భాగ. 3, స్కం.—వి. శపథము.

ఒడఁగూడు. దే. అ. క్రి. 1. సిద్ధించు; 2. చేరు. "క. అమవసగావున నేఁడ, క్కమలజుఁగొలువఁగమ హర్షిగణములుఁబిత్రుసం, ఘములును బోదురు బ్రహ్మం, డమునంగలవారలందొడంగూడంగాన్." భార. ఆది. ౫, ఆ. (ప్రే. ఒడఁగూర్చు.)

ఒడఁబడిక. ద్వ. వి. 1. సమ్మతి; "ఎ, గీ. ఒడఁబడికగా నఁబడనీక యొడలునులియు, నెపముమైఁగొంగి టికెదుర్చునీరజాక్షి, యుపమయును భూమిపల్ల భునల్లమునకుఁ, గ్రొత్తచవిగొల్పెమఱి వేఱ కొన్ని నాళ్లు." కవిక. 3, ఆ.—2. సమ్మతించి వ్రాసి యిచ్చిన వ్రాఁత.

ఒడఁబడు. ద్వ. అ. క్రి. 1. సమ్మతించు; 2. అనుకూలించు; "చ. కడుఁజనువాఁడు నైపురుషకారియు దక్షుఁడు నైనమంత్రి పెం, పడరఁగ రాజపుత్రుల మహాధనవంతులఁ జేసివారితో, నొడఁబడిపత్తు మేర్పడఁగనుండుఁడుగా." భార. సభా. ౧, ఆ.—3. సంతోషించు. "సమున్నతపీఠమ్మునను౦చియథావిధిపూజలొడంబడఁజేసి." భార. ఆది. ౮, ఆ. (ప్రే. ఒడఁబఱచు.)

ఒడఁబాటు. ద్వ. వి. సమ్మతి. విణ. సమ్మతము. "క. అప్పరయమునుడిప్పులుకుల, కొప్పితిమీప్రతిమలోన నొకచిటికెన వ్రేల్ తప్పక యుండఁగనిప్పడ, యొప్పించెదనొప్పఁజెప్పు మొడఁబాటనియెన్." (ఇక్కడ ఒడఁబాటనఁగా ఒడఁబడ్డద్రవ్యమని తెలియవలెను.), పర. ౫, ఆ.

ఒడగోలుకొను. దే. స. క్రి. అడగోలుకొనుయొక్క రూపాంతరము. "వ. మనుష్యుండుపుట్టినకోలెని డుమలంబడిగడించినయొడమి పుడమిఁ దలిగి గడియతడవులోన నొడగోలుకొనకొక్కుండగునట్లు గృహాగతుండగునతిథి తిరస్కృతుండై యతని పూర్వార్జిత సుకృతంబులన్నియు నపహరింపం జాలు." భో. 3, ఆ. (ఇక్కడ అడగోలుకొన ననియే యుండవచ్చును. అయినను ప్రతులయం దిట్లు ఒకారాదిగాఁ గానఁబడుచున్నది.)

ఒడపి. దే. వి. గండి, రంధ్రము. "క. జాలుజాలుకని నెత్తురు వెలి, కులుకుచు రొదసేయ నటేతియొడపి నెయూర్పుల్, పటువమిడి గ్రుడ్ల వడఁకుచుఁ, గొ లప్రాణముతోడఁ దన్నుకొను నమ్మెదవుల్." ఆము. ౨, ఆ.

ఒడమి. దే. వి. ధనము. "వ. మాతరుండు కఠోరవచనంబులాడినఁ బింగళుండంగలార్చిన దండుండు దండించినం జక్కంబడమిఁ దనయొడమిఁ దానడిమి కడిమి నిజంబుగా రవి గారవించి." ఉ. హరి. ౬, ఆ. (దీనిని ఎదంతముగా వాడెదరుగాని ప్రతులయందిది యికారాంతముగానే కానఁబడియెడి. ప్రయోగశైలినిజూడ నిట్లుండుటే యుక్తమని తోఁచుచున్నది. చూ. ఒడగోలుకొను.)

ఒడయఁడు. దే. వి. మగఁడు. "అడిగియాతండొడయండగుమాన్యపాత్త్రజకని." భో. 3, ఆ.—విణ. స్వామి.

ఒడయుఁడు. దే. వి. మగఁడు. "గీ. యువతిమండలములకొడయుఁడవుగప్పు." జై. ౫, ఆ.—విణ. స్వామి.

ఒడయురాలు. దే. విణ. (ఒడయుఁడు+ఆలు.) స్వామిని.

ఒడలిచూపొడయఁడు. దే. వి. ఇంద్రుఁడు. అచ్చ. కిష్కి. ౦, కాం.

ఒడలు. దే. వి. మే, మేను, దేహము.

ఒడి. దే. వి. 1. తొడపైభాగము, ఉత్సంగము; 2. ఒడుపు; "ఒడిదప్పినపాముఁబోలెనుండఁగ." ఉ. హరి. 3, ఆ.—3. పశుయోని.

ఒడిఁబ్రాలు. దే. వి. బ. గర్భాధానాదికాలములయందు స్త్రీలకు ఒడియందుఁబోసెడు బియ్యము.

ఒడికట్టు. దే. అ. క్రి. కడఁగు, యత్నించు. "లోకనిందకొడిగట్టితివి." రామా. ౫, ఆ.—వి. ఒడ్డాణము.

ఒడికము. దే. వి. ఉపాయము. "చ. ఒడికముతోఁ బ్రయత్నమున నెక్కమహాశిలఁ గొండమీఁదికిన్, గడపఁగ భారమచ్చటిది గ్రక్కున భూమికి డిగ్గఁద్రోవఁగాఁ, గడు సుకరంబ." పంచ. నా. ౧, ఆ.—విణ. 1. మనోజ్ఞము; "కుడిచినపిమ్మటం గుసుమకోమలి విస్తృతసంస్తరంబుగా, నొడికపుశయ్యచేసి." భార. అర. ౫, ఆ.—2. యుక్తము. "తంత్రులొక్కవరుసవీటిమెట్టులొడికంబుగనొత్తి." ఉ, రా. ౬, ఆ.

ఒడికారము. దే. వి. ఉద్రేకము. "రగడ. కారనకే యొడికారపుఁగింకను." య. ౪, ఆ. (ఇదియింకను విచార్యము.)

ఒడిత్రాఁడు. దే. వి. వేఁటాడుటకు తగిన సాధన విశేషము. కాశీ. 3, ఆ. (చూ. తీపుఁద్రాడు.)

ఒడిదామర. ద్వ. వి. (ఒడి+తామర.) వృక్షవిశేషము.

ఒడిదారము. దే. వి. స్త్రీలమొలనూలు. "ద్వి. మొనసినాణ్ణాటంకములయొడిదార, మునకుఁగాఁదగదియమ్ముద్దియఁజీర." భాగ. ౧౦, స్కం.

ఒడిపిలి. దే. వి. ఆహారవిశేషము. (అప్ర.)

ఒడియు. దే. అ. క్రి. కొంచెముపైకెగురు. "ఎ, గీ. ఒడిసి తలపట్టితిగిచి మహోగ్రవృత్తిఁ, గొంకుకొసరించుకయులేకకూలఁదాఁచె." భార. విరా. ౨, ఆ. "ఎ, గీ. పడకతఁడువానిముఁదలయొడిసితిగిచి, పుడమిఁబడఁద్రోచిబలిమినుక్కడఁగఁ బట్టి." జై. 3, ఆ.—స. క్రి. తిగియు, ఆకర్షించు. "సీ. అపవర్గఫలసిద్ధిహదనైనఁజేపట్టుకైవడిబహుఫలోత్కరముఁలొడిసి." పాండు. ౨, ఆ.

ఒడిసియ. దే. వి. ఒడిసెగడ్డ.

ఒడిసె. దే. వి. ఒడిసియయొక్క రూపాంతరము.

ఒడిసెల. ద్వ. వి తాలువిసరివేయుటకై యేర్పఱుపఁబడిన యొకవిధపుత్రాఁడు, క్షేపణి. "ఒనరుదంచనముల నొడిసెలలను జాలంగ నెందును సవరించుట." హరి. ఉ. ౨, ఆ.

ఒడిసెలకాఁడు. ద్వ. వి. ఒడిసెలవేయువాఁడు. "ఒడిసెలకాండ్రను నొడ్డుఁడెందు." హరి. ఉ. ౧, ఆ.

ఒడుచు. దే. ప్రే. ఓడించు. "పారిజాతంబుఁగొనునెడఁదొడరవృత్రభేదినొడిచితి." హరి. ఉ. ౮, ఆ.

ఒడుదొడుకు. దే. వి. 1. సమముకామి, వైషమ్యము; "క. తరుణీమణిజఘనమునకు, దొరగాక తృణంబుఁబూనితుదిలేకవసుం, ధరయొడుదొడుకులఁబడుమహి, ధరములుచట్టువడితావుతరలకయుం

డుఁ." రసి. ౨, ఆ.—2. సంకటము. "వ. అడవికడకొత్తికొనినడచియొడుదొడుకగుడు." స్వా. ౪, ఆ.—విణ. సమముకానిది, విషమము.

ఒడుపు. దే. వి. 1. లక్ష్యముపెట్టిదాఁటినదాఁటు; "ద్వి. ఒడుపుదప్పినయట్టియురగంబుఁబోలె." హరిశ్చ. ౧, ఆ.—2. పూనిక; "వ. పెద్దయుం బ్రొద్దునకు నతండు దైవాధీన్యంబునం జైతన్యంబునొందిక్రమ్మఱ నాతోఁ బరిచర్యసేయందలంచిన నప్పుడ య్యొడుపుదప్పింపనెందు వెరవుదొరకమిఁదాన ట్లొడంబడి యెడపల్కినవిధంబునుఁజెప్పి." భో. ౪, ఆ.—3. లాభము.

ఒడ్డగ. దే. వి. రెండిట్టికొమ్ములు జతచేసియేర్పఱచిన ఆయుధవిశేషము.

ఒడ్డగిల్లు. దే. అ. క్రి. 1. ఒఱగు; "క. నావుడువిభీషణుండో, హూవీరాలాపములనె యోడించితిరే, పైవచ్చినబలవంతుల, నావనధియునొడ్డగిల్లినట్లనెయుండెన్. క.మీరేలవంచవలయును." రామా. ౭, ఆ.—2. అతిశయించు; "క. అపుడ, ప్పలభుక్కులకన్యవన్యఫలభుక్కులకున్, గలనయ్యెనందుఁబైకొని, గెలుపునఁగపివీరులొడ్డగిల దొరకొనినన్." రామా. ౮, ఆ.—3. చిప్పిల్లు, ఉప్పొంగు. "క. బిడ్డఁడు మ్రొక్కినఁదల్లులు, జడ్డననంకములనునిచిచన్నులతుదిఁబా, లొడ్డగిలఁ బ్రేమభరమున, జడ్డుపడందడిపిరక్షిజలములననఘా." భాగ. ౧, స్కం.

ఒడ్డగెడవు. దే. వి. ఒకప్రక్క క్రిందికొఱగిమఱియొకప్రక్కపైకిలేచుట, వాటుపడుట. "గీ. కెడసెహాయములొడ్డగెడవయ్యెరథములు." భార. భీష్మ. ౨, ఆ. "క. మునుహరగౌరీపరిణయ, మునకఖిలామరులుసంయములుఁగూడినన్రే, గునను త్తరభూస్థలిగ్రుం, గెనుదక్షిణభూమియొడ్డగెడవైయుండన్." పర. ౧, ఆ.

ఒడ్డనము. యు. దే. వి. 1. పందెము; "గీ. వాహనంబులుసారెలువాఁడిశరము, లూర్జితాక్షము లసువులొడ్డనములు, గాఁగఁబోరెడునీద్యూతకర్మమందు, నెసఁగజయమునపజయమెవ్వఁడెఱుఁగు." భాగ. ౬, స్కం.—2. వ్యూహము. "క. అపురూపములగుమాఱొ, డ్డనములు ప్రస్ఫురితములు దృఢంబులుఁగాఁదీ, ర్చినఁగాకతెఱంగగునే, యనిమొనలేర్పఱచె." భార. భీష్మ. ౨, ఆ.—వై. 1. బెత్తములోనగువానిచేతఁజేయఁబడినకేడెము; "చ. పలకలునొడ్డనంబులును బారణసేయఁగఁగత్తికొంతముల్, బలుసబళంబులున్ వెనుకఁబన్నఁగ." ఉ. హరి. ౬, ఆ.—2. కేడెము*. "చ. అనువననద్భుతంబులగు నాక్రమణంబుల వానినెల్లనొడ్డనమున నాఁగియాఁగినుద్ధృఢంబగు ఖడ్గముచేతఁగొన్నితుత్తునియలుసేయుచున్ గినిసి దుర్ధమత్రిప్రచపేటమైకడం, గినహరిలీలఁ గూల్పఁ దొడఁగెన్ గరిసన్నిభదైత్యపక్కులన్." హరి. ఉ. ౭, ఆ.

ఒడ్డాణము. వై. వి. 1. యోగపట్టె*; "సీ. ఐణేయమైనయొడ్డాణంబులవణిచేనక్కళించినపొట్ట మక్కళించి." స్వా. ౧, ఆ.—2. స్త్రీలునడుమునబిగికైధరించుకొనెడు బంగారులోనగువానిపట్టెడ*. "సీ. మొలనూలునొడ్డాణమును నేవళంబుఁబుంజాలదండయు బన్నసరముమొగపుఁ, దీఁగయుం." కళా. ౭, ఆ.

ఒడ్డాది. వై. వి. ఓఢ్రదేశము.

ఒడ్డారము. దే. వి. 1. ద్వేషము; "వ. మనకునక్కచెలియలిబిడ్డలకు నొడ్డారంబులేమిటికి నేకకార్యపరత్వంబున నడ్డంబులేక బ్రదుకుదము. తొల్లియన్యోన్యవిరోధంబులనలంగితిమి." భాగ. ౮, స్కం.—2. మాఱొడ్డుట, ప్రతిఘటించుట. "వ. చుఱుకుమినుకు లేని కొడుకుకడకుంజనిభయసంబులొలుకంబలుకులు పలికినంగనలివినకరాకయొడ్డారంబులొడ్డెనేని." రామా. ౬, ఆ.

ఒడ్డారించు. దే. అ. క్రి. 1. ద్వేషించు; "ద్వి. ఎదిరయొడ్డారింపనెవ్వరివశము." హరిశ్చ. ౧, ఆ.—2. మాఱొడ్డు. "క. ఒడ్డారించివిపసంబున, కడ్డముచనుదెంచికావనధిపులులేమిన్." భాగ. ౮, స్కం.

ఒడ్డిమి. దే. వి. ఒడ్డు, పందెము. "వ. ఆశకునియాడియుధిష్ఠిరుండొడ్డిన యొడ్డిమియెల్లగెలుచుచు వచ్చె." భార. ఉద్యో. ౧, ఆ.

ఒడ్డియ. వై. వి. ఒడ్డెవాఁడు.

ఒడ్డీఁడు. వై. వి. 1. ఓడ్రదేశపురాజు; 2. ఉడ్డీనగతిగలపావురాయి*. "సీ. ఘనమైనకండక్రొవ్వునఁబొఱితెంచినయొడ్డీని పెనులావులాడఁదన్ని." (ఇక్కడ శ్లేష.) జై. ౧, ఆ.

ఒడ్డు. యు. దే. స. క్రి. 1. పందెమిడు; "వివిధవస్తువాహననివహంబులొడ్డి." భార. ఆర. ౨, ఆ.—2. (వల) పఱచు, ఒగ్గు; "గీ. దాయలొడ్డినమాయజూదంపుటురులఁబడి." భార. విరా. ౨, ఆ.—3. చాఁచు; "గీ. అనిననాతఁడుభయమందియా

త్రలోన, నారులయీగికిసకటచేయొడ్డకుండు, నట్టివానికివలసెనే యనుచుఁగరము, సాఁచెనవ్విప్రుఁడెసకునిశ్చయముతోడ." భార. శాం. ౮, ఆ.—4. మొనయించు; "గీ. ఇత్తెఱంగు, పాడి గాఁగఁబూనిపలుకంగఁజెవియొడ్డి, యాదరించు వారినందుఁగాక." భార. ఉద్యో. ౧, ఆ.—5. అడ్డగించు; "దుర్మదక్రీడఁ జరించురాజు హరకేశవులొడ్డినఁగావ." భాగ. ౧, స్క-ం.—6. దాఁటు. "వేగనత్ఱొడ్డియల్లనవెడలి." భార. శాం. 3, ఆ.—వి. 1. తీరము; 2. పందెము; "వ. తనకొడుకు విరోచనుండునంగిర సుండనువిప్రుకొడుకు సుధన్వుండునుదమతమప్రాణంబులొడ్డుగానొడ్డి." భార. ఉద్యో. ౨, ఆ.—3. వ్యూహము; "పేరుక్కునఁగ్రౌంచచందమగునొడ్డుగలంగఁగఁజేసి." భార. భీష్మ. ౨, ఆ.—4. పూనికి; "మ. ఒక్కయొడ్డునబాష్పాంబుఝరంబులుప్పతిలె బోటుంబాటుగానెంతయుఁ౯." స్వా. 3, ఆ.—5. అడ్డపాటు. "క. బిడ్డనిఁగరములఁ బొమ్మున, నడ్డంబుగఁబట్టిపదములల్లన నిడుచు౯, జడ్డనఁగావలివారల, యొడ్డుగడచి పురిటి సాలయొయ్యన వెడలె౯." భాగ. ౧౦, స్క-ం. పూ.—విశే. 1. స్థూలము; (వాఁడొడ్డుపొడుగుగాఁబెరిగినాఁడు.)—2. పెద్ద; "ఒడ్డోలగము."—3. అధికము; "ఒడ్డుగానిట్టూర్పులొలయఁబొగులు." స్వా. 3, ఆ.—4. విశాలము. "వ. పయోధికన్న బిడ్డలుంబోని యొడ్డు చెఱువులచేతను." భీ. ౧, ఆ.—వై. స. అన్యుఁడు. "ప మొసఁగినట్టివృత్తులు చెల్లునే. ఒత్తొరవొడ్డులవలనఁబుట్టదుగదా." భార. ఉద్యో. ౧. ఆ.—ఏ. ఏకకుఁడు.

ఒడ్డె. వై. వి. ఒడ్డియయొక్క రూపాంతరము.

ఒడ్డొఱకము. దే. విశే. (ఒడ్డు+ఒఱకము.) ఎగుడు దిగుడైనది. (భూమి.)

ఒత్తగిల్లు. దే. అ. క్రి. 1. ప్రక్కకొఱగు; "గీ. ఒత్తగిలియీఁద" కవిక. ౮, ఆ.—2. ఒఱగు; "చ. చెలిభుజపీఠినొత్తగిలిచిల్కనుదువ్వుచువాలుఁగన్నుఁగ్రే, వలకుదధార చేరనొక వారవిలాసినినూచెరాసుతు౯." స్వా. ౫, ఆ.—3. అంటుకొను. "సీ. ఘ్రాణంబునీచమైకన్నులువెల్లనై యుదరంబుపీఁపుతోనొత్తగిల్ల." కాశీ. ౬, ఆ.

ఒత్తడము. దే. వి. ఒత్తుట. విశే. తఱుచు.

ఒత్తడి. దే వి. 1. రాపు, సమ్మర్దము; "ఒండొరులయొత్తడింబొడిపొడిరై." స్వా. ౫, ఆ.—2. తఱుచుఁదనము; "సీ. ఒడికంపుసరిగయొత్తడిసరంబునమించుమిసిమికల్లెపుఁగెంపుమేలివాగె." చంద్రా. ౨, ఆ.—3. బాధ. (అనికొందఱు.)

ఒత్తరము. దే. వి. ముమ్మరము, ఉద్రేకము. (చూ. అత్తరము.

ఒత్తరించు. వై. స. క్రి. 1. మించు*; "సీ. వితతవీరాగ్రహావేశాతిదర్పిత చిత్తులైయొండొరు నొత్తరించు, నుగ్రమహోద్ధతి." భార. శల్య. ౨, ఆ.—2. ఆక్రమించు*. "గీ. యువమనోజాంగలక్షేత్రమొత్తరించి, గరుసువడదున్నుమదనలాంగలికుహలము, కామినీమణిముక్కు." పాండు. 3, ఆ.

ఒత్తియాడు. దే. స. క్రి. (ఒత్తి+ఆడు.) ఒత్తు. (చూ. లంగగొను, ఊఁగాడు.)

ఒత్తిలి. దే. అవ్య. 1. గట్టిగా; "ఉ. చిత్తజరాజ్యసంపదయశేషముగైకొనిసౌఖ్యమందఁగా, నుత్తులుదారనాఁ బురవనోపవనంబులుచొచ్చియిచ్చఁబూ, గుత్తులవ్రాలి తేనియలు కుత్తుకబంటిగఁగ్రోలిలీలమై, నొత్తిలిమ్రోయుచింపుదలుకొత్తుచునుండుమదాళిదంపతుల్." విక్ర. ౧, ఆ.—2. పట్టుగా. "క. ఏనిదియంతయునెఱుఁగుదుఁ, గానవృథాశోకవహ్నిఁగాలమికిని నీ, మానసమునఁగృపకలిమికిఁ, గనొత్తిలిదేవగుహ్యగతియుఁదెలిపితి౯." భార. స్త్రీ. ౧, ఆ.

ఒత్తిల్లు. దే. అ. క్రి. ప్రక్కకొఱగు, ఒత్తగిల్లు. (రూ. ఒత్తిలు. "ఒత్తిలిరత్తపైకొనుచు.")

ఒత్తు. దే. అ. క్రి. 1. పొదుచుకొను; "ఎ, గీ. కటికినేలఁగడ్డులొత్తనిద్రపోయెదునయ్యొ." భార. ఆది. ౬, ఆ.—2. ఒఱగు; "చ. గరువునకొత్తఁజెంగలువకచ్చుఘటించినమాళిఁజుట్టఁజెం, ద్దరికతెఱంగునంబసిఁడితీఁగలునించినజిల్గుపాగ." స్వా. ౫, ఆ.—3. ఘనమగు. "ఉ. ఉల్లముప్రక్కలైకలఁగనొత్తినమూర్ఛవహించిధారణిం, ద్రెళ్లిన." జై. ౭, ఆ. (చిగురొత్తు ఇత్యాదులయందలి ఒత్తు ఇంచుక్కవంటిదని తెలియును.)—స. క్రి. 1. అదుము; "రథ ముద్దండాగ్రతుండంబునం బట్టుం గ్రిందికినొత్తునెత్తు." రా. ఆర. ౨, ఆ.—2. (కాళ్లు) పిసుకు; "గీ. కుడుపునిద్రయువర్జించి యడుగులొత్తు, చుండిరి." భార. అను. ౨, ఆ.—3. (శంఖమును) ఊఁదు; "చ. పిడుగులపిండుబిట్టు

లియు పెల్లునఁ బార్థుఁడు శంఖ మొత్తినన్." భార. విరా. ౪, ఆ.—4. బలాత్కరించు; "ఇమ్మెయిన న్నొత్తియడిగిన." భార. ఉద్యో. ౨, ఆ.—5. (పంట) నొక్కు; "మోవిదంతశిఖ నొత్తె." కళా. ౧, ఆ.—6. తుడుచు; "క. అశ్రులుమతి, యును గ్రమ్మంగ రతలమున నెత్తుచుఁ జూచున్." భార. మౌ. ౧, ఆ.—7. త్రోయు; "చ. ఒదవెడి జవ్వనంబు వెలికొత్తఁగఁ బయ్యెదసిగ్గుఁగూడిబి, ట్టదుమఁగ." ఆము. ౫, ఆ.—8. చేర్చు; "క. అత్తతి గంధర్వవిభుం, డత్తామరసాక్షిపదనమక్కునఁ గ్రపతో, నొత్తి." స్వా. 3, ఆ.—9. తీర్చు; "వ. తమ్మెఱుఁగని దుష్టాత్ములనడుమం గూర్చుండుటయు నవ్వెంబరవిత్తులఱచుపీటఁడియు అపులకువంకలొత్తిమాఱు సెప్పుటయు నొప్పక యుండు." భార. ఉద్యో. 3, ఆ.—10. ఆక్రమించు; "క. అనద తనంబును బెడిదపుఁ, దనమును లేకుండఁ బరఁగి దరియొత్తెదు నే, అనుబోలె నొత్తవలయును, మనుజేంద్రుఁడు మార్తురం గ్రమంబున నధిపా." భార. శాం.3,ఆ.—11.(అంట్లు) తోమ్కు..."సీ. అంట్లొత్తు వేళల నంట్లొత్తు సెలమిగా న్పించు లేఁగొమ్మల వంచి వంచి." కళా. ౪. ఆ.—వి. 1. అదుముడు; "సీ. చేదోయియొత్తునఁ జేసి సెత్తురు లైనయవయవంబులు నోరసనర చేయు." నై. ౨.ఆ.—2. తఱుచుఁదనము; "వ. మట్టలెత్తుకొని యొత్తుగల పాదరుటడవులు చొరంబాఱుపిడికడితి కదుపునురవడికి." స్వా. ౪, ఆ. -3. మెత్త; "సీ. పసిఁడికుందియనలోపల బట్టుపొత్తుల యొత్తున నొఱఁగికూర్చుండ నేర్చె." వి.పు.౭,ఆ.-4.ఆక్రమణము;"వ. పరులయొత్తు లేని రాజ్యంబు పూజ్యమహిమం బరఁగు." భార. ఉద్యో.౨,ఆ.—5.బ.బిడ్డలచేతియొకదిను సుబంగారు సొమ్ము.—విణ. తఱుచు."ఉ. ఒత్తుగమాంసముల్ మడుఁగుటో గిరముల్ ఘృతశర్కరాదులున్, గుత్తుకబంటి మేసి." హరివ్చ.౧,ఆ.

ఒత్తుకమ్మి. ద్వ. వి. బొద్దులకు ప్రక్కలకమ్మివలె నేర్పఱచెడు తెదవయవవిశేషము.

ఒత్తుకాఁడు. దే. వి. సుతిపోయువాఁడు. "వ. అతండును గుణధ్వనితంత్రీనాదంబుగా నావిండ్లవారొత్తుకాఱుగా గాండీవంబు వీణగా వినోదంబు సలిపె." భార. విరా. ౫, ఆ.

ఒత్తుకొను. దే. అ. క్రి. పొడుచుకొను. స. క్రి. ఆక్రమించుకొను. "క. వారు దెసలొత్తుకొనియుధ, రారాజ్యంబిచ్చిపోయిరాపోరో." భార. ఉద్యో. ౨, ఆ.

ఒత్తుడు. దే. వి. 1. అదుముడు, పీడనము; "ఉ. ఎవ్వతెం, బెట్టినవాఁడవో హృదయ పీఠికదానికి నొత్తుడొఁజూమి." కవిక. ౪, ఆ.—2. కాకితములో నగునది వ్రాయునపుడు మెత్తనకై దానిక్రిందనుంచుకొనఁబడు కాకితములోనగునది.

ఒత్తువడు. ద్వ. అ. క్రి. (ఒత్తు+పడు.) అదుముడుపడు. "ఎ. గీ. ఒత్తువడి కాంచనాదిధాతూచ్చయముల, రసముజొబ్బిల." హరి. పూ. ౭, ఆ.

ఒత్తోరవు. దే. వి. (ఒత్తు+ఒరవు.) మిక్కిలియదుముడు, సంపీడనము. "సీ. ప్రజఁదల్లిదండ్రులపగిదిఁ బాలింపు చేపరులొత్తోరవులేక బ్రదుకునట్లు." విక్ర. ౪, ఆ.

ఒదరు. దే. అ. క్రి. 1. విజృంభించు; "సీ. పలఁతులైనిగిడెడు వలుద తొండములచే నొదరిచేసాఁచు మృత్యువులుఁబోలె." లక్ష్మీ. ౪, ఆ.—2. సంక్షోభించు. "ద్వి. అనవుడు రోషతామ్రాక్షుఁడై చూచి, కనలుచుఁ గటములుత్కటములై యదర, నొడలెల్లఁ గంపింప నొదరుచుఁ బలికె." రా. బాల. కాం.—స. క్రి. నిందించు. "దుర్యోధనుండు విదురుం దూలనొదరి." సం. "ధిగస్తు క్షత్తారమితి బ్రువాణః." భార. సభా. ౨, ఆ.

ఒదరుచే. దే. స. క్రి. ఊడఁదీయు, (రూ. ఒదర్చు.) (చూ. అంట.)

ఒదలు. దే. అ. క్రి. వర్ధిల్లు. "గీ. అనిన నాచంద్రమౌళి వాక్యములభంగి, భూరినియమముతో సభిచారహోమ, మొదలఁగా వింపనగ్నియథోచితముగఁ, జెలఁగి దక్షిణవలమానశిఖల వెలిఁగె." భాగ. ౧౦, స్కం. ఉ. (పొదలుయొక్కరూపాంతరము.)

ఒదవు. వై. అ. క్రి. 1. కలుగు; "క. పార్థునపమూర్థకళేబరమెదురఁగనిరోదవుశోకమునన్." జై. ౭, ఆ.—2. ఉపయోగించు*; "సీ. సఫలమీతురగంబుజన్మంబు ధర్మజుండొనరించు క్రతువునకొదవెఁగాన." జై. 3,ఆ.—3. యుక్తమగు*. "క. ఇది యంతయుఁదగఁగనికొని, మదినిస్సారంపువిద్యమరగకబంధ, చ్ఛిదఁ జేయునాత్మవిద్యకు, నొదవఁ దొడఁగినాఁడనుడుగనుద్యమ మెట్లున్." లక్ష్మీ. ౪, ఆ.

ఒదవుబడి. ద్వ.వి. ఉపయోగము. విణ. ఉపయుక్తము.

ఒదిఁగిలు. దే. అ. క్రి. ప్రక్కకొఁ అగు, ఒత్తగిల్లు. "చ. ఒదికిలి పాన్పుపైఁ బతికి నెయ్యనఁ గేలుతలాఁపు చేసి." ఉ, హరి. ౫, ఆ.

ఒదిగిల్లు. దే. వి. బ. ఒద్దిగిలుటలు.

ఒదివిరిప్రాలు. దే. వి. బ. ధాన్యవిశేషము. "సీ. క్రొత్తగోనియల బియ్యమువడ్లు నెమిలివడ్లు, నొదివిరిప్రాలును నొనరంగఁ బోసి చాఁపలు మంచములుమీఁదబలియఁగట్టు." హరి. పూ. ౬, ఆ.

ఒదుఁగఁబాఱు. దే. అ. క్రి. (ఒదుఁగన్ + పాఱు.) ఒదుఁగు. "బ్రాహ్మణుండొదుఁగఁబాఱకనిల్చి." భార. అను. 3, ఆ.

ఒదుఁగు. దే. అ. క్రి. తొలఁగు. "గొరిజలత్రొక్కునం బ్రిదిలికుండలిభర్తయొదుంగ." లక్ష్మి. 3, ఆ.

ఒదుఁగువడు. ద్వ. అ. క్రి. (ఒదుఁగు+పడు.) తొలఁగు. "క. ఒదుఁగువడరాజనత్రయ, ముదలం బగువిమతసైన్యములనీరీతిన్, మదమడఁచి." జై. ౫, ఆ.

ఒదుఁగువాటు. ద్వ. వి. ఒదుఁగువడుట, తొలఁగుట.

ఒదుగు. దే. అ. క్రి. సమృద్ధమగు. (చూ. ఒదువు.) వి. సమృద్ధి. విణ. సమృద్ధము. "క. ముల్లుదలకొనని నవకపుఁ, బల్లవములతోడముక్తిభామచెవులకుం, బల్లేరుపూవులగుపువు, లుల్లసిలునలర్కశాకమొదుగుగఁగొనుచున్." ఆము. ౪, ఆ.

ఒదుగుబడి. దే. వి. సమృద్ధి.

ఒదువు. దే. అ. క్రి. 1. క్రమ్ము; "గీ. అతనిముందఱఁ బార్శ్వంబులందుఁ బిఱుఁద, నొక్కయుమ్మడిఁ బెక్కండ్రుఱుక్కుమిగిలి, యురవడించినదేవిపై నుగ్రదివిజు, లొదువఁ బేరల్కఁ బెదవులొండొండయదర." మార్క. ౬, ఆ. (పొదువుయొక్క రూపాంతరము.)—2. సమృద్ధమగు. "ధనమొదువంగఁబుచ్చుకొని." మార్క. ౨, ఆ. —వి. సమృద్ధి. విణ. సమృద్ధము. (ఒదుగుయొక్క రూపాంతరము.)

ఒద్ద. దే. వి. దాపు, సమీపము. "క. వచ్చెనుభృగునం, దనుఁడునిజనందనకుఁ బ్రియ, మొనరింపఁగఁ దలఁచిదానియొద్దకుఁ బ్రీతిన్." భార. ఆది. 3, ఆ.

ఒద్ది. దే. వి. ఒకానొకచెట్టు.

ఒద్దిక. దే. వి. 1. ఆనుకూల్యము; 2. ఒకవస్తువునకు సరియొత్తుగానుంచితూఁచెడు తూయిలోనగునది, ప్రతిమానము. "సీ. తొలునాడుశోధ్యునిఁదులఁదూఁచియాతని యొత్తగునొద్దికలెల్లదాఁచి." విజ్ఞా. వ్య, కాం.

ఒద్దియ. దే. వి. సమృద్ధి. (అప్ర.)

ఒద్దె. దే. వి.——పై.——

ఒనగూడు. దే. అ. క్రి. సిద్ధించు. (ఒడఁగూడుయొక్క రూపాంతరము.) (ప్రే. ఒనగూర్చు.)

ఒనరించు. దే. ప్రే. ఒనర్చు, చేయు.

ఒనరిక. దే. వి. పొందిక, పొంకము.

ఒనరు. దే. అ. క్రి. 1. కలుగు; "సీ. భూతగణంబులచేత నీహరి సత్త్వమునకు నెగ్గొనర నీననిశివుండు." నిర్వ. ౭, ఆ.—2. పొసఁగు, సరిపడు. "ఇదియు నదియునొనరు టెట్లొకొ." కళా. ౪, ఆ.—3. ఒప్పు. "సమాప్తినొనరెన్ ధరణీధర యాగమఖంబు." (సమాప్తిన్ సమాప్తిచేతననియర్థము.) భార. సభా. ౨, ఆ.—వి. 1. పొందిక; 2. ఇంపు. "సీ. రామభద్రుండుగరంబుదూరంబుగానరిగియంతటను దామరలుదృష్టి, కొనరుగైకొని." రాఘ. 3, ఆ.

ఒనరుచు. దే. ప్రే. ఒనరించు, చేయు.

ఒనరుపడు. ద్వ. అ. క్రి. పొందుపడు.

ఒనవెట్టుకొను. దే. అ. క్రి. (ఒనరు+పెట్టుకొను.) పొంచువేయు. "సీ. ఓగిరంబుహరింపనొనవెట్టుకొనియైన వేగునంతకుఁ జేసెజాగరంబు." కాశీ. ౪, ఆ.

ఒప్పందము. దే. వి. అమ్మెడువాఁడును కొనెడువాఁడును ఈ వెలకు ఈసరకు నింతమాత్రము ఇచ్చెదననికాని తీసికొనియెదననికాని చేసికొనెడు ఏర్పాటు.

ఒప్పగించు. వై. స. క్రి. అప్పగించుయొక్క రూపాంతరము.

ఒప్పగింత. వై. వి. అప్పగింతయొక్క రూపాంతరము.

ఒప్పనము. వై. వి. అర్పణము. "సీ. ఒఱఁగత్తిపెట్టెకినీకొప్పనమిదెయంచుసత్తికిఁ గత్తిచెయ్యెత్తిమ్రొక్కి." కళా. 3, ఆ. (అప్పనముయొక్క రూపాంతరము.)

ఒప్పనసేయు. వై. స. క్రి. అప్పనసేయుయొక్క రూపాంతరము. (చూ. ఉప్పెన.)

ఒప్పమి. దే. వి. 1. కీడు; "క. మున్నుగలగోపవర్గము, నిన్నుంగనికొలిచిభక్తినీపనిచేయన్, మన్ననమానిసివైనీ, వున్నంగడుమేలకాకయొప్పమిగలదే." భార. విరా. ౧, ఆ.—2. తప్పు. "నాయొప్పమియేమిసంఘటిలెనొక్కొయటంచు." కళా. ౪, ఆ.

**ఒప్పరము.** దే. వి. జలదారి. "సీ. తూపరాణపుటమ్ము తూ మొప్పరముజలదారియంచనఁ గనుదనరునుజల, నిర్గమము." ఆం, భా. ప్ర. వారి.

**ఒప్పరికము.** వై. వి. ఉపేక్ష.

**ఒప్పరికించు.** వై. స. క్రి. ఉపేక్షించు. "శౌర్యోన్నతుఁడైననందనునినొప్పరికించితి." నిర్వ. ౬, ఆ. "నన్ను నిటులొప్పరికించుట నీకుఁబాడియే." "క. నీవొకయపకృతినాకుం, గావింపవు నిన్నుపేక్షగైకొనివిడువన్." రా. బాల. కాం. "ఉ. తనున్ భరించినబుధోత్తము నొప్పరికించునమ్మహా, పాపికి నెన్నిజన్మములఁ బాయునొకో క్రిమికీటజన్మముల్." విక్ర. ౫, ఆ.

**ఒప్పారు.** దే. అ. క్రి. (ఒప్పు+ఆరు.) ఒప్పు. "శా. ఆరూఢస్థితినెల్లదేశములునొప్పారున్ బ్రకాశంబుగన్." భార. అర. ౪, ఆ.

**ఒప్పించు.** వై. స. క్రి. ఒప్పగించు.

**ఒప్పిదము.** దే. వి. (ఒప్పు+ఇదము.) 1. అందము; "కాళ్లయొప్పిదమాఁడుకట్టనుజ్వలము సేయంగ." భార. విరా. ౧, ఆ.—2. అలంకారము; "చ. ఒప్పిదము లొనర్పఁబంచిరిగభీరవిభూతి యెలర్పవీటికిన్." హరి. ఉ. 3, ఆ.—3. విధము. "క. మంత్రంబున బెట్టిదముగఁబడవైచినయొప్పిదము ననస్త్రమునఁగూల్చె భీష్మునినూతున్." భార. భీష్మ. ౨, ఆ.–విశే. మనోజ్ఞము.

**ఒప్పు.** దే. అ. క్రి. 1. ఒప్పిదమగు; 2. తగు; 3. సమ్మతించు. వి. 1. అందము; "ఆకామినియొప్పునఁజూడ్కి తగులమీటిన." భార. అర. ౬, ఆ.—2. తప్పుకామి; "క. ఒప్పగునో తప్పగునో, యిప్పటికిందోఁచుకార్యమిది." ఉ, హరి. ౪, ఆ.—3. సమ్మతి. "గీ. గంధమాల్యాదివాసనల్ గ్రమ్ముదేరఁ, దోడుకొనివచ్చిరప్పుడాతోయజాక్షి, సరసుఁడున్నట్టికేళికాసదనమునకు, బలిమిచేనొప్పుచేతనుబద్ధముఖుల." అని. ౧, ఆ.

**ఒప్పుకొను.** దే. స. క్రి. సమ్మతించు, అంగీకరించు.

**ఒప్పుకోలు.** దే. వి. ఒప్పుకొనుట.

**ఒప్పులాఁడి.** దే. వి. (ఒప్పులు+ఆఁడి.) 1. చక్కఁదనముగల ఆఁడుది; 2. ఆఁడుది.

**ఒబ్బట్లు.** దే. వి. బ. (ఒమ్ము+అట్లు.) భక్ష్యవిశేషము, పోళీ.

**ఒబ్బిడి.** దే. వి. 1. పంటనుతెపిడి; 2. నాశము. (ఇంటనున్న వడ్లగింజలన్నియు నొబ్బిడియైనవి.)

**ఒమ్మచ్చు.** ద్వి. వి. (ఒమ్ము+అచ్చు.) మణులను పొదుగుటకు బంగారుతో చేసెడు పీఠస్థానము.

**ఒమ్మిక.** దే. వి. ఇమిడిక, పొందిక. "ద్వి. సమ్మదంబునఁబర్ణశాలగావించి, యొమ్మికగురులనందునిచ్చి వాఁడ." రా. అ, కాం.

**ఒమ్ము.** దే. అ. క్రి. ఒవ్వు, సరిపడు. (ఈనీళ్లు నాకు ఒమ్మవు.)–వి. బలుపు, స్థౌల్యము. విశే. పెద్ద, స్థూలము.

**ఒయారము.** దే. వి. 1. విలాసము; "చ. పుట్టుగ్రుక్కగ, ట్లనుదనరెండుచేతులనొయారము మీఱఁగ నేలకొమ్మదాల్చిన." య. ౫, ఆ.—2. సౌందర్యము. "ఎ, గీ. రతివిధంబునఁగడునొయారమునఁబొదలి." చంద్ర. (ఒయ్యారముయొక్క రూపాంతరము.)

**ఒయారి.** దే. వి. 1. విలాసముగలస్త్రీ; 2. సౌందర్యముగలస్త్రీ. విశే. సౌందర్యముగలది. "ఉ. ప్రేలునొయారిక్రొమ్ముడులు వెన్ను కెలంకులచోముహుర్ముహుర్లీలనటింప." రామా. ౧, ఆ. (ఒయ్యారియొక్క రూపాంతరము.)

**ఒయ్య.** దే. క్రి. విశే. 1. తిన్నఁగా; "సీ. అంతఁబులోముఁడన్వంతరక్కసుఁడగ్నిహోత్రగృహంబునకొయ్యవచ్చి." భార. ఆది. ౧, ఆ.—2. మెల్లఁగా. "మ. నిజం, బడుగంజూచెదనంతయుందెలియనొయ్యంజెప్పరానావుడున్." రామా. ౬, ఆ. (ఆమ్రేడితమందు ఒయ్యొయ్య.)

**ఒయ్యన.** దే. వి. 1. తిన్నన; "ఒకనాడునారదుఁడొయ్యనఁగంసునియింటికిఁజనుదెంచి." భాగ. ౧౦, స్కం. పూ.—2. మెల్లన. (చూ. ఒయ్య.)

**ఒయ్యారము.** దే. వి. 1. విలాసము; 2. అందము. "సీ. హారముల్ మెఱయ నొయ్యారంబులుగ్రుచ్చియందందవింతగానలవరింతు." భార. విరా. ౧, ఆ.

**ఒయ్యారి.** దే. వి. (చూ.) ఒయారి.

**ఒర.** దే. వి. 1. ఒరపెట్టుట; "మ. చరమాశానికషోపలాంచలముల్ సంధ్యాప్రకాశోదయం, బొరగావించి విరించి చేకొనిన సూర్యుండన్పదార్పన్నెబం, గరవుంబూదియకై." నై. ౮, ఆ.—2. సామ్యము. "క. అప్పుడుమధ్యందినమున, నొప్పారినభానుతోడనొరవచ్చిగురుం, డప్పాండవబలములపైఁ, దెప్పదెరలఁగురిసెశరతతిందీవ్రముగాన్." భార. భీష్మ. ౨, ఆ.

**ఒరగట్టు.** దే. వి. (ఒర+కట్టు.) చుట్టగాఁజుట్టికట్టిన వస్త్రపుకట్టు. "సీ. ఒరగట్టుపంచెలుబెరసుపచ్చ

డములుకార్లొన్న లోవంకకటిఱియొడల్లు." నీలా. 3, ఆ.

ఒరగడుగు. దే. వి. (ఒర+కడుగు.) రెండవసారి బియ్యముకడిగిన నీరు.

ఒరగల్లు. దే. వి. (ఒర+కల్లు.) బంగారులోనగువాని నొరపెట్టెడుఱాయి, నికషము.

ఒరగాలు. దే. వి. (ఒరగు+కాలు.) 1. ఒరగినకాలు; "కప్పకు నొరగాలైనను."—2. మఱియొకకాలి మీఁదనొరగఁబెట్టినకాలు. "చ. కమలవనంబులోననొరగాలనెనిల్చి మునిద్రవోవఁగా, విమలమరాళముంగని నవీనసితాంబుజమంచు వేడ్కతో, రమణియొకర్తుముట్టినఁగరంబదిపద్మమటంచునంటఁగాఁ, గమలముఖుల్ కికాకికనగన్ భయమందుచువ్రాలెవెన్కకున్." భాను. ౨, ఆ. (చూ. ఱిక్క.)

ఒరగు. దే. అ. క్రి. 1. వంగు; 2. వ్రాలు. "చ. ధరణిజనాత్మలోఁదలఁచితద్దయుశోకముఁబొందిబాష్పములన్, దొరఁగఁగ వెచ్చనూర్పుచునుదుఃఖపరంపరనిద్రలేకతా, నొరగుచులేచుచున్." రా. కిష్కి. కాం.—వి. 1. ఒరగుదిండు; (చూ. ఒఱగు.) 2. వంపు. విణ. వంపైనది.

ఒరగొను. దే. స. క్రి. (ఒర+కొను.) ఒరపెట్టు.

ఒరచాలుదుక్కి. దే. వి. చాలుతేలికగాఁబాఱినదుక్కి.

ఒరచేబద్ద. ద్వ. వి. పలకలోనగునవి నునుపుపఱచెడు సడ్లవాని కొఱముట్టు. (అప్ర.)

ఒరపదను. దే. వి. కొంచెపుతడి.

ఒరపిడి. దే. వి. రాయిడి. "క. అన్నలుఁదమ్ములుఁగలుగుట, యున్నతుఁజేయున్నపు నెంతయొరపిళ్లయినన్, మన్ననయునీగియును సం, పన్నంబులుగాఁగవారిఁబాటించుటగున్." భార. శాం. ౨, ఆ.

ఒరపెట్టు. దే. స. క్రి. బంగారులోనగువానినిఒరయు.

ఒరయిక. దే. వి. రాపిడి, ఘర్షణము.

ఒరయు. దే. స. క్రి. 1. ఒరపెట్టు, రాచు; 2. పరీక్షించు; "సీ. అనుడుమహాత్మమిమ్మంత నేనొరయంగనర్హమేమీపల్కులందుఁగలదె, యనుమానమనుటయు." కళా. ౨, ఆ.—3. విచారించు; "క. నరపతిభృత్యులఁదొడవుల, నొరసితగిన నెలవులందు నునుపకయున్నన్, జరణంబునఁజూడామణి, శిరమునఁనందియయుఁబెట్టుచెలువముగాదే." పంచ. నా. ౧, ఆ.—4. వెదకు. "సీ. గవులలో మానిపుంగవులలోఁబరికించిప్రాదనదజనపదపదవులొరసి." రామా. ౫, ఆ.

ఒరవడి. దే. వి. విద్యార్థులు అక్షరములు కుదురుటకై మేలుబంతిఁజూచి వ్రాసెడువ్రాఁత.

ఒరసికొనిపోవు. దే. అ. క్రి. దోఁగిపోవు. (క్రిందఁబడి మోఁకాలు ఒరసికొనిపోయినది.)

ఒరిగ. దే. వి. మ్రొక్కు, నమస్కృతి. "ఒరిగ బ్రహ్మాండభాండోదరునకు." రుక్మాం. ౧, ఆ.

ఒరిజె. దే. వి. ఏనుఁగుమెడగొలుసు, కలాపకము. "సీ. గళలిప్తకస్తూరికారేఖలొరిజలు నునుఁజెక్కులజవాదిమొనపుమదము." చంద్రా. ౧, ఆ.

ఒరిమ. వై. వి. 1. ఒద్దిక; "చ. కనితనురాజులెన్నికొనఁగాఁబెనుఁబొఁజులతో సిరంగరా, యనికడకేగిమాటలనెయాయనఁదేటిచి తెచ్చిమల్కకున్, మనుకువనంటు చేసి యొరిమంగడుమెచ్చులు గొన్నమేటినే, మనిపొగడంగవచ్చు." య. ౧, ఆ.—2. ఐకమత్యము. (చూ. అంతరువు.)

ఒరిమిక. దే. వి. ఒరిమ.

ఒరుఁడు. వై. స. ఒకరుఁడుయొక్క రూపాంతరము.

ఒరుదల. దే. వి. (ఒరు+తల.) కొండెకానితనము, పైశున్యము. "ఉ. ఒరుండొరుదలన్ వినిపించినమాటడెందమున్, జెంద ముదంబుదక్కి చెడఁజేయఁడొరున్." ఆము. ౨, ఆ.

ఒరుదలకాఁడు. దే. విణ. కొండెకాఁడు, పిశునుఁడు. "క. మొదలనెయొరుదలకానిన్, జెదరంగానాడకాత్తఁజింతించిపదిం, బదిగమ్ముపయేనిమఱివిడు, ముదస్తుగాఁగాకయుండనొక్కమతమునన్." ఆము. ౪, ఆ.

ఒరుము. దే. అ. క్రి. కలయు. "క. శరనిధమునుగ్రోలినని, ర్భరజలములుగురిసిమేఘభావంబఱియా, కరములుకరములెకాజిగి, నొరిమెనన్ రవియుమెఱసె నుడిగెన్ మొయిలున్." ఆము. ౪, ఆ.

ఒరువుఁడు. వై. స. ఒకరువుఁడుయొక్కరూపాంతరము.

ఒఱ. దే. వి. 1. గవుసెన, నిచోళము; 2. ఖడ్గాదికోశము, ప్రత్యాకారము; "క. ఒఱలందునాయుధంబులు, విఱిగిపడందొడఁగె." జై. ౬, ఆ.—3. బావియొఱ.

ఒఱకటము. ద్వ. వి. (ఒఱగడ్డముయొక్క రూపాంతరము.) సంకటము. "ద్వి. మెఱయునీతఁడువోవమీఁదటఁజాల, నొఱకటంబున నెత్తురొగిఁబ్రజలెల్ల." భాగ. ౧, స్కం.—విణ. విషమము.

**ఒఱకము.** దే. వి. 1. పల్లము; "క. నెఱవైదట్టంబై కన్, దెఱచినఁగను మూసికొనిన తెఱఁగై తిమిరం, బొఱకంబిది మెఱకిదియని, యెఱుఁగన్ రాకుండఁజేసె నెల్లధరిత్రిన్." సురా.—2. సంకటము. "గీ. అతిథిబంతికి రాకున్న నారగింపఁ, డొంటినొక నాఁడుఁ బతియెట్టియొఱకమైన." కాశీ. ౭, ఆ.

**ఒఱకాటము.** ద్వ. విణ. ఒఱకటముయొక్క రూపాంతరము.

**ఒఱగఁబడు.** ద్వ. అ. (క్రి. ఒఱగన్+పడు.) (స్వార్థమునపడు.) ఒఱగు. (రూ. ఒరగఁబడు.)

**ఒఱగడ్డము.** ద్వ. వి. (ఒఱవ+గడ్డ.) సంకటము. విణ. విషమము.

**ఒఱగు.** దే. అ. క్రి. 1. వంగు; 2. వ్రాలు. "క. అఱకటనిడి ప్రాఙ్ముఖుఁడై, పఱచి జలధిలోనఁ జదలఁ బొఱలు నెడం జెయ్యాటిదప్పి నిలువఁజాలక, యొఱగినగాలవుని డించెనొక గిరిమీఁదన్." భార. ఉద్యో. 3, ఆ.—వి. 1. ఒఱగుదిండు; "ఒఱగుమీఁదటఁజేరి." కళా. ౮, ఆ.—2. వంపు. విణ. వంపైనది.

**ఒఱగుబిల్ల.** దే. వి. ఒఱగుదిండు, ప్రగ్రీవము. (రూ. ఒరగుబిల్ల.)

**ఒఱగుపోవు.** దే. అ. క్రి. (ఒఱగు+పోవు.) ఒఱగఁబడు. "సీ. కొంగ మెడ నూనిడు గూనివీఁపునొఱగువోయిన రొండియుఁబొక్కిబొమ్మ." హరిశ్చ. ౪, ఆ. (రూ. ఒరగువోవు.)

**ఒఱగొడ్డెము.** ద్వ. వి. (వఱగొడ్డెముయొక్క రూపాంతరము.) మనసు నొప్పించెడు వంకరమాట. "క. బిడ్డలకు బుద్ధి సెప్పని, గ్రుడ్డికిఁ బిండంబు వండికొని పొండిదపైఁ, బడ్డాఁడ నిభీముండొఱ, గొడ్డెము లాడంగఁ గూడుకుడిచెద వధిపా." భాగ. ౧, స్కం.

**ఒఱటు.** దే. విణ. దుశ్శీలుఁడు. "గీ. ఉసుఱుసిరియును నొల్లకిట్లొఱటు చాకి, యాదిదేవుని దెసవినయంబుదక్క, యిహపరంబులు లేకయిట్లేగె భగ్నకంఠుఁడై నేలపైఁగూలి కాలుఁగూడ." హరి. పూ. ౯, ఆ.

**ఒఱపరి.** దే. విణ. (ఒఱపు+అరి.) సౌందర్యవంతుఁడు. "ఒఱపరిఁగన్నఁ గూడఁజను." జై. 3, ఆ.

**ఒఱపిఁడి.** దే. విణ. (ఒఱపు+ఇఁడి.) అయోగ్యుఁడు. "క. వెఱవకు నెమ్మదినుండుము, పెఱవారలబుద్ధి నాత్మఁబెట్టు నెయునఘుం, డొఱపిఁడిచాడ్పున నామది, నఱమరలేదొండునమ్ముమని యెనరేంద్రా." విక్ర. 3, ఆ.

**ఒఱపు.** దే. వి. 1. సౌందర్యము; 2. ఉపాయము; "గీ. శక్రుతేరైన నడపంగఁజాలువాఁడ, నొఱపుచెప్ప దురథికునేమఱుఁగనీను." భార. కర్ణ. ౧, ఆ.—3. తాపము; "గీ. బాలతనుకాంతితో సాటిఁబోలఁగోరి, పృథివి ననలప్రవేశంబుఁ బెక్కుమార్లు, చేసియొఱపులఁబడెఁ గాని వీసమైనఁ, బోలఁగాఁజాలదయ్యె జాంబూనదంబు." రసి. ౨, ఆ.—4. ప్రతాపము; "ఎ. గీ. మదురుగోడల మెఱపు వాల్ మగలయొఱపు." రసి. ౧, ఆ.—5. యోగ్యత; (చూ. ఇందు యోగ్యమునుదాహరణము.)—6. స్థైర్యము. "సీ. ఒఱపు చేఁదోలు కారు మెఱపు చేవనదల్పుఁగలకంఠికలికి చూపుల బెడంగు." హ? 3, ఆ.—విణ. 1. దృఢము; "చ. ఒఱపుగఁదట్టఁ గ్రేబగమునొందిన యుగ్రపుభూతము." షో. ౪, ఆ.—యోగ్యము. "చ. ఎఱుఁగరుగాక లోకమున నెవ్వరికైనను మేలుసేయఁగా, నొఱపగు నాశ్రమంబున సమున్నతమైన గృహస్థధర్మమున్, బఱగడవైచి వెట్టిగొని పాఱెడి పాల్గకు ముక్తికల్గునే, పఱిగరయేటి సంగొలుచు ప్రాఁతటికింగల దేతలంపఁగన్." ఉ. హరి. ౫, ఆ.

**ఒఱపులాఁడి.** దే. వి. (ఒఱపులు+ఆఁడి.) సౌందర్యవతియైన స్త్రీ.

**ఒఱపెంకు.** దే. వి. బావియొఱ.

**ఒఱలు.** దే. అ. క్రి. 1. జోలు, విలపించు; "ఎ. గీ. అతిప్రబలపవన, ఘోరరయమునఁ గూలు మహీరుహంబు, తెఱఁగుదోఁప సుదక్షిణుఁ డొఱలి కడసె." భార. ద్రో. 3, ఆ.—2. మ్రోఁగు. "చ. తలఁగొనియంతలోన మధుదైత్యహరుండు మహేంద్రుసింజినిం, గొఱనెలతూపునం దునిమి క్రూరతరంబగు భల్లమొక్కటన్, నఱకినఁగూలెఁ దద్ఘనాఘనకల్పితమైన టెక్కియం, బొఱలుచు నోరుగాలి మొదలూడఁగఁ గూలెడు మ్రాను కైవడిన్." పా. ౫, ఆ.

**ఒఱవ.** దే. విణ. 1. వక్రము; "క. అఱపొఱడు కుఱుచ చేతులు, నొరవ శరీరంబు." భార. అర. ౨, ఆ.—2. వ్యత్యస్తము. "క. తెప్పించితొడుగుమీఁవని, యొప్పించిన సిట్టునట్టు నొఱవలుగామైఁ, గప్పికొనియా బృహన్నల, యప్పుడు నగిపించె నచటి యబలాజనమున్." భార. విరా. ౪, ఆ. 3. వికృతము.

ఒఱవఁబడు. ద్వ. అ. క్రి. ఒఱగఁబడు. "చ. ప్రాణమర్మముల్, వదలితతొంగయప్టినొఅవంబడె."జై. ౬, ఆ.

ఒఱవు. దే. అ. క్రి. ఒఱగుయొక్క-రూపాంతరము. (చూ. ఒఱవఁబడు.)

ఒఱుబీజము. మి. వి. (ఒఱ్ఱు+బీజము.) ఒకప్రక్క-బీజమువాఁచిన వ్యాధివిశేషము.

ఒఱ్ఱు. దే. విశే. కారమైనది, కటువు. "సీ. ఒకకొన్ని ద్రబ్బెడలొకకొన్ని తాలింపులొకకొన్ని విధములయొఱ్ఱుచేరులు." పాండు. ౪, ఆ.

ఒఱ్ఱుకసెంద. ద్వ. వి. కచ్చూరి.

ఒఱ్ఱన. దే. వి. ఒఱ్ఱఁదనము, కారము.

ఒఱ్ఱియ. దే. వి. సాధువుకానియావు, సుకత. విశే. వక్రము.

ఒఱ్ఱు. దే. విశే. గొప్పది, పెద్దది.

ఒఱ్ఱె. దే. వి. ఒఱ్ఱియయొక్క-రూపాంతరము.

ఒలయు. దే. అ. క్రి. 1. వ్యాపించు; "శుభానిలములొలసె." జై. ౬, ఆ.—2. ప్రవేశించు; "సలిలకేలికి నొలసియునొలయక." నిర్వ. ౧, ఆ. —3. కలుగు. "గీ. పౌర్ణమాసిఁబూర్వపక్షాష్టమినిజతు, ర్దశినినుభయపక్షవశతనచ్చు, షష్ఠిఁబంచమినినునిష్ఠమైనుపవాస, మున్నవివిధశుభములొలయునండ్రు." భార. అను. ౪, ఆ. 4. కలయు, చేరు. "ఆ. ఒలసినీపుత్రులెల్లనొండొరులతోడ, నెట్లొడంబడియుండుదురట్లచేయ, వలయు." భార. సభా. ౨, ఆ.—స. క్రి. 1. చుట్టుకొను; "గీ. సురసిద్ధ, సాధ్యకన్యలట్టిసఖులునూర్వు, రొలసితన్నఁగొలుచుచుండంగ." భార. ఆర. ౨, ఆ.—2. కదియు. "వ. తప్పిదారివె, న్నొలసినమాఱువన్నెఱుఁగ కుండుటయొచ్చెముసాదిక్రోటికించు." ఆము. ౨, ఆ.

ఒలి. దే. వి. ఒలుపు, దోఁపుడు, అపహరణము. "క. మొలకలురాజకుమారులు, తలిదండ్రులులేనివారు దయకర్హులుభూ, తలమునఁగలప్రజలందఱు, నొలిచిననొలివాఁడెదరు సుయోధనుబాధన్." జై. ౧, ఆ.

ఒలికి. దే. వి. సొదపేర్చెడుచోటు. "ఎ, గీ. ఊరనుండనొల్లఁడొలుకులలోఁగాని." వీర. ౨, ఆ.

ఒలుకులమిట్ట. దే. వి. (ఒలుకులు+మిట్ట.) కాడు, శ్మశానము.

ఒలిదామర. ద్వ. వి. (ఒలి+తామర.) ఒకానొకచెట్టు.

ఒలియు. దే. అ. క్రి. తోలుదోఁగు. "క. వదలకపెనఁగిపడుండ్రన్, బదియేవురనొక్క- పెట్టఁబట్టిధరిత్రిన్, జెదరఁబడవైచిపవనజుఁ, డదయుండైవీఁపులొలియనందఱనీడ్చున్." భార. ఆది. ౫. ఆ.

ఒలిపడు. ద్వ. అ. క్రి. (ఒలి+పడు.) దోఁపుడుపొవు. "సీ. ఒలిపడ్డ నెపముఁగలలేనిసిరిచెప్పిచుట్టలపైదాడిపెట్టువారు." ఆము. ౬, ఆ.

ఒలుకు. దే. అ. క్రి. 1. చిందు, "చ. కలశతనూజయచ్చెరువుకాశికయందొకశంభులింగమున్, దిలలనునక్షతంబులనుఁదీర్థయొక్కఁడు పూజచేసిపో, నొలికినవానిమేయుటకునోలిఁ బ్రదక్షిణమాచరించిచి, క్కైలుకశరీరముందొఱఁగకక్కనుబోరజతాద్రికూటమున్." కాశీ. ౬, ఆ.—2. కాఱు. అం. ప్రే. కార్చు. (చూ. మొక్కలము మూడవయర్థము నుదాహరణము.) స. క్రి. 1. చల్లు; "గీ. తానుజనవిప్రులును వనితాజనంబు, నేసలొలుకసింహాసనాసీనుఁడయ్యె." భార. విరా. ౫, ఆ.—2. పోయు. "సీ. నెయ్యుఁరఁబన్నీటనింపలావఱునొక్కనెలఁతతీవలకెల్లనీరమొలుకు." కవిక. ౬, ఆ.

ఒలుచు. దే. ప్రే. 1. ఒలియఁజేయు, తోలూడ్చు; 2. అపహరించు. (చూ. ఒలి.)

ఒలుపు. దే. వి. ఒలుచుట. (ఒలుపుఁబప్పు. మొ.)

ఒలె. దే. వి. (చూ.) ఒల్లియ. "సీ. పైఁడిబొసముచెట్లఁబడవైచిద్రుడ్డు పెట్లమఁబొఱుచు నెయిలెల్వైచువారు." ఆము. ౬, ఆ. (ఒల్లెయొక్క-రూపాంతరము.)

ఒల్ల. వై. క్రి. విశే. అల్లయొక్క-రూపాంతరము. (చూ. ఒల్లన.)

ఒల్లఁబాటు. ద్వ. వి. (ఒల్లమి+పాటు.) అపేక్షలేమి, ఒల్లమి. విశే. అపేక్షింపఁబడనిది. "గీ. ప్రాణములసర్థములునొల్లఁబాటుసేసి." భార. భీష్మ. ౧, ఆ.

ఒల్లఁబోక. దే. వి. (ఒల్లమి+పోక.) అనాదరము. "ద్వి. మెల్లనఁదావచ్చిమెచ్చినాకీక, యొల్లఁబోకలుసేసెనొల్లఁబోనిన్ను." రా. ఆర, కాం.

ఒల్లఁబోవు. దే. అ. క్రి. (ఒల్లమి+పోవు.) 1. మూర్ఛిల్లు; "గీ. అడ్డపడిగురుండుదొడ్డనారసమువక్షంబుదూఱ నేయసవ్యసాచి, యొల్లఁబోయితెలిసిపెల్లెసెనక్కుంభ, జన్మమీఁదనిశితసాయకములు." భార. ద్రో. 3, ఆ.—2. వాడు; "గీ. మెండుమీఁటినపగటబీఁటెండదాఁకి, యొల్లఁబోయినలేబొండు

మల్లెపొదల, తుదలఁజప్పటలైకడుదొడ్డలగుచుఁ, బొడమెమొగ్గలగములగ్గిబొబ్బలట్లు." ఆము. ౨, ఆ.—3. ఆదరింపఁబడనిదగు. (చూ. ఒల్లఁబోక.)

ఒల్లగిల్లు. దే. అ. క్రి. ఆదరింపఁబడనిదగు. "మ. పతిచూపుల్ సతిచూడ్కియుల్ సమగతిన్ బ్రస్ఫీతరాగంబులై, ధృతివాయం బుయిలోటయొల్లగిలనుద్వేగంబులన్ ప్రోపరి, చ్యుతివాటిల్లఁ బరస్పరాంగములపైనొండొండప్రాఁకంగఁద, చ్ఛతురాననస్థకృతార్థదంపతులయోజన్ బొల్చెనిర్వ్యాజతన్." హరి. ఉ. 3, ఆ.

ఒల్లన. వై. వి. తిన్నఁదనము, అల్లన. "క. వల్లవకాంతలుతనకథ, లెల్లను బాడంగనీరజేక్షణుఁడంతన్, వల్లవబలసంయుతుఁడై, యొల్లనగోష్ఠంబుచేరెను ర్వీనాథా." భాగ. ౧౦, స్కం. పూ.

ఒల్లమి. దే. వి. వలవమి. (వలచుధాతువుయొక్క వ్యతిరేక భావార్థకరూపము.)

ఒల్లియ. దే. వి. 1. వస్త్రము; "వెల్లతలయొల్లియమాలిదృఢంబుగానమర్చిన్." భార. కర్ణ. 3, ఆ.—2. ఉత్తరీయము. "సీ. శంపాలతికతోడిజలదంబుకైవడి మెఱుఁగుటొల్లియతోడి మేనివాని." భాగ. ౧౦. స్కం. పూ.

ఒల్లె. దే. వి. ఒల్లియయొక్క రూపాంతరము. "ఒక్క పరిశుద్ధపుసైకపుటొల్లెఁగట్టి." ప్రభా. ౮, ఆ.

ఒల్లెంక. దే. వి. మత్స్యవిశేషము.

ఒల్లెవాటు. దే. వి. అంగవస్త్రము కుచ్చెపెట్టి మెడచుట్టిరాభుజములమీఁద వైచుకొనుట.

ఒవ్వు. దే. అ. క్రి. గిట్టు, సరిపడు. "క. ఒవ్వనివారల యెదురను నివ్విధమున భంగపడితి నేను." భార. ఆర. ౬, ఆ.

ఒసఁగు. దే. స. క్రి. ఇచ్చు. వి. 1. ఈవి, త్యాగము; "మేయొసఁగుఁదప్పింపక." ఆము. ౬, ఆ.—2. బహుమానము. "ఎ, గీ. చూచిసామాజికులుతమసొమ్ములెల్ల, నొసఁగులుగ వైవ." ప్రభా. ౮, ఆ.

ఒసపరి. దే. విశ. 1. సుందరుఁడు; "ఒసపరిఁగన్న." —2. ఉత్కృష్టము. "ఒసపరిబాగులాఁడి."

ఒసవు. దే. స. క్రి. ఒసంగుయొక్క రూపాంతరము. (ఇచ్చుటకు.—"పిన్నబిడ్డలన్ వెన్నుఁడుమెచ్చి యెన్నఁడొసవెన్ వరముల్." వి, పు. ౨, ఆ.)

ఒహొ. దే. అవ్య. సంబోధనమునందు వచ్చును. "ఒహొకుమారయనుచున్ వ్యాసుండుచీరంగ." భాగ. ౧, స్కం.

ఒళవరి. దే. విశ. (ఒళవు+అరి.) మర్మజ్ఞుఁడు. (చూ. ఒళవు.)

ఒళవు. దే. వి. 1. మర్మము; "వ. ఇయ్యొళవుసకియలకుం జెప్పకుమని రాచిల్కకుఁ బ్రియంబుసెప్పాచు." విజ. ౨, ఆ.—2. లోఁకువ; 3. వీణాదండము, ప్రవాళము. "ఎ, గీ. చారుమార్వలేనిచాపదండమునోజ, లలితతంత్రిలేనియొళవుఁబోలె." రా. ఆర, కాం. ౨, ఆ.

ఒళ్లు. దే. వి. ఒడలుయొక్క రూపాంతరము. "ఉ. ఒళ్లారకమున్నవచ్చి యొకయంగన చూచెనుఁ జంద్రచంద్రునిన్." కవిక. 3, ఆ. (ఇది వెళ్లుసళ్లులవంటిది.)

ఒళ్లుపెట్టు. దే. అ. క్రి. బలియు.

ఓ.

ఓ. ఒకయక్షరము. దే. అవ్య. 1. పిలిచినప్పుడు ఎచ్చరించుకొనుటను తెలుపును; "శా. ఓనావేధిపబంధముల్ చెఱుపవేయోదేవకీనందనా." ఉ. హ. ౨, ఆ.—2. సందేహమును తెలుపును; "ఈశ్వరుండనుకూలింపఁదలంచునోతలఁపఁడో." భాగ. ౧౦. స్కం. పూ. — 3. ఊహను తెలుపును; "మేలుదొరకొనువిధమెట్లో." భార. శాం. 3, ఆ.—4. ప్రార్థనాదులను దెలుపును; "ఉ. ఓడోవనవాసులార వినరో మునులార యనాథవాక్యముల్." వీర. ౨, ఆ. "కుటుంబసహితంబైచరుఁడోనాకనున్." (ఇక్కడ విధిని తెలిపెడి.) కాశీ. ౫, ఆ.—5. ఆర్తిని తెలుపును; "గీ. ఒక్కదనుజాగముండుమొఱ్ఱోయనంగ, నన్నుఁజేఁగొనిపోయెదునన్నలార." భార. ఆర. ౫, ఆ.—6. అమ్ముటను తెలుపును; (చల్లోచల్ల.)—7. ప్రశ్నమును తెలుపును "క. వాఁడు దెసలొత్తుకొని యుద్ధరారాజ్యంబిచ్చిపోయిరాపోరో." భార. ఉద్యో. ౨, ఆ.

ఓంకారము. సం. వి. అ. పుం. ప్రణవము.

ఓండ్ర. దే. వి. గాడిదయొక్క కూఁత.

ఓండ్రించు. దే. అ. క్రి. ఓండ్రపెట్టు.

ఓఁక. దే. వి. పుల్లకలివె¶.

ఓఁకలివె. దే. వి. (ఓఁక+కలివె.)——వై.——

ఓకరం. వై. వి. 1. పిత్తవ్యాధి మొదలగువానివలన ధ్వనిపూర్వకముగా కడుపులోనిది నోటికివచ్చుట*; 2. రోఁత*.

ఓకరించు. వై. అ. క్రి. 1. ఓకరవచ్చి ఉమియు*; 2. రోఁతపడు*.

ఓకరింత. వై. వి. 1. ఓకరించుట*; 2. రోఁత*.

ఓకస్సు. సం. వి. స్. న. 1. ఇల్లు; 2. స్థానము. (ఈ శబ్దము అకారాంతపుంలింగమునగును.)

ఓకిలి. వై. వి. (చూ.) ఓకర*.

ఓకిలించు. వై. అ. క్రి. 1. ఓకరించు*; 2. రోఁతపడు*. "చ. మనముననోకిలించిమఱుమాటకుఁగిఁకిరిపాటుతోఁడుగా." (మీఁదమతియొకచోట.) "వ. అనుటయునమ్మునీంద్రుండునెమ్మనంబునందనికీనయేనంబునుభావంబునంబొడమినరోషంబునుమేలంబునందెలుపుచు." ఉ, హరి. 3, ఆ.

ఓకిలింత. వై. వి. 1. ఓకరింత*; 2. రోఁత*.

ఓకు. గ్రా. దుర్భిణియద్దము.

ఓగాత్మము. వై. విణ. అమంగళము*. (ఇది నాడుకలోనిది.)

ఓగితము. వై. విణ. యోగ్యము. "సీ. ఆటలుపసిబిడ్డయాటలైపెంపఁటియొరులయాటలఁబడనోగితముగ." లక్ష్మీ. ౨, ఆ. "ఉ. హాజగదేకవీరభవదీయకరాబ్జములెందుఁబోయెనే, రాజులనోర్వలేనిబలురక్కసునోర్చినయట్టినీవుని, స్తేజమునొందియల్పునిగతింగొఱమాలినక్రుక్కిమీఁదనీ, యోజననాథుపాటుపడనోగితమైతెమదీయవల్లభా." భో. ౫, ఆ.

ఓగిరము. వై. వి. ఓరెము, అన్నము.

ఓగు. దే. వి. కీడు "ఓగుదానవచ్చు."—విణ. 1. కీడైనది; (అది ఓగోబాగో.)—2. మూర్ఖుఁడు. "ఓగు నోగు మెచ్చు."

ఓగులాడుచు. దే. అ. క్రి. దేవురించు.

ఓఘము. సం. వి. అ. పుం. 1. సమూహము; 2. ప్రవాహము; 3. పరంపర; 4. నృత్యాదిద్రుతమానము; 5. ఉపదేశము.

ఓచెల. దే. అవ్య. ఓచెల్లయొక్క రూపాంతరము. "మ. కలుచంగోళబిలంబువెల్వడియదఃఖడ్గాహిపైనమ్చుచోఁ, జలనంబించుకలేకయీతనిరిపుక్ష్మాపాలసంఘాతమో, చెలహస్తాంబురుహాంగుళీమయమహాసిద్ధౌషధీపల్లవాం, చలముల్ మేసిభజించుఁజాంగలికతన్ సంగ్రామరంగంబులన్." నై. ౫, ఆ. (కొన్ని ప్రతులయందిక్కడ ఒచ్చెలయనియు పాఠము కనఁబడుచున్నది.)

ఓచెల్ల. దే. అవ్య. (ఓ+చెల్లె.) సంతాపమును తెలిపెడి. "క. ఓచెల్లవిరహిణీవధ, మేచతురతనీకు." స్వా. 3, ఆ.

ఓజము. సం. వి. అ. పుం. (జ్యోతిశ్శాస్త్రమునందు) బేసి.

ఓజస్సు. సం. వి. స్. న. 1. తేజము; 2. బలము; 3. ఉత్సాహము; 4. వెలుఁగు; 5. ఎండ.

ఓజ. యు. దే. వి. 1. క్రమము; "గీ. మావటీఁడల్లనల్లనమదగజంబు, నిచ్చతోఁగూడనోజకుఁదెచ్చునట్లు." మార్క. 3. ఆ.—2. విధము; "శా. ఏచాయంజూచినఁదోఁచుక్రొమ్మెఱుఁగునోజన్ నచ్చికన్నిచ్చరా, మేయున్." రామా. ౫, ఆ.—3. స్వభావము; "ఎక్కుళ్లునోజలుఁగైదువలును గొలువుగమి." అచ్చ. యు. కాం.—4. ఆజ్ఞ. "గీ. వానరేంద్రులఁబంపుమువలనుగాఁగ, నుదయవేళకుఁజనుదేరనోజచేసి." రా. యు, కాం.—వై. 1. ఉత్సాహము; "మ. హలికుండెంతయునోజదున్ను నెడసీరాగ్రంబునంబొందిప్రా, ణులనేకంబులుచచ్చు." భార. అర. ౫, ఆ.—2. ఉపాధ్యాయుఁడు; (ఒజ్జయొక్క రూపాంతరము.) "ఇతఁడుమాయాజాలములకునాఁడోజ." భార. స్త్రీ. ౨, ఆ.—3. భయము*. "చ. ఇర్వదిభుజశాఖలన్ బదిశిరంబులనోజయొనర్పఁజూడ్కికిన్." రా. అర, కాం.

ఓజపడు. ద్వ. అ. క్రి. క్రమపడు.

ఓజబంతి. వై. వి. ఒజ్జబంతియొక్క రూపాంతరము. "ఎ. గీ. అనుపమక్షాత్రధర్మపరత నృపపఙ్క్తికితఁడోజబంతియనఁగ." కా. ౧, ఆ.

ఓట. దే. వి. 1. భయము; "ఉ. ఎవ్వతెవీవుభీతహరిణేక్షణయొంటిఁజరించెదోటలే, కివ్వనభూమి." స్వా. ౨, ఆ.—2. సంకోచము. "ఓటయొకింతయేనియు సుయోధనుచిత్తమునందులేదు." భార. ఉద్యో. 3, ఆ.

ఓటమి. దే. వి. 1. భయము; "క. ఓటమితోనెల్లప్పుడు, పాటవమునఁబనులుచేసిబాలురతోనే, యాటలకుఁబోకయొకజం, జాటంబునులేకభక్తిసలుపుదునఘా." భాగ. ౧, స్కం.—2. భంగము. "క. కావుననీయోటమినీ, కేవిధమునఁబాయు." కళా. ౭, ఆ.

ఓటము. దే. వి. అపజయము. "ఎ. దురోదరపరాయణుండైన యన్నారాయణుండు గెలుపునో

టంబును సరిగానద్దేపీద్వయంబుతో వినోదించు
చు." ఉ, హరి. 3, ఆ. "నా యికలంగందర్పుఁడో
టంబెఱుఁగఁదటిమి." ఆము. ౫, ఆ.

ఓటఱు. దే. అ. క్రి. నిస్సత్త్వమగు. "గీ. వల్లియలు వైచియోదముల్ పెల్లుద్రవ్వి, తార్చివేసటి యురులొగ్గి తనిసిడయ్యఁ, దోలి యోటఱిపోనీక దొడ్డినాఁగి, పొదువ నడుసను నలుదెసఁబొంచి యోడి." హరి. పూ. ౬, ఆ.

ఓటాఱు. దే. అ. క్రి. ఓటఱుయొక్క రూపాంతరము. "క. వేటొకవిలుగొనియమ్ముల, గీటిమెఱుఁగునారసములుగిటికొలిపినవో, టాటిమెయింగ్రొన్నెత్తురు, పాఱునతఁడు తేరిమీఁదఁబడిమూర్ఛిల్లెన్." భార. ద్రో. ౫, ఆ. (ప్రే. ఓటాఱుచు.)

ఓటిల్లు. దే. అ. క్రి. ఓడు, సంకోచించు. "ద్వి. తన్నియంతటఁబోకతనపీటిలోన, నున్నఁజంపుదునని యోటిలకాడె." రా. యు, కాం.

ఓటిల్లుచిందఱ. దే. వి. బాలక్రీడావిశేషము. "ఎ, గీ. చిక్కనాబిల్లలోటిల్లుచిందఱాది, యైనశైశవక్రీడావిహారసరణి." కాశి. 3, ఆ.

ఓటు. దే. వి. 1. అపజయము; 2. భంగము. అవ్య. ప్రశ్నమును దెలుపునది. "గీ. నీటఁబుట్టినవాఁడు కాఁడోటువహ్ని." స్వా. 3, ఆ.

ఓటుపడు. ద్వ. అ. క్రి. 1. అపజయపడు; "వ. వీనోటుపడితి నేనినఖిలమహీరాజ్యంబునీయదియ. నీవోటుపడితేనిదమయంతినాయది." భార. ఆర. ౨, ఆ.—2. మోసపోవు. "వ. మఱియును బ్రియాలాపంబులు పలుకుగోమాయుమృదుమధురభాషణంబులకునోటుపడిగార్దభంబిట్లనియె." పంచ. నా. ౪, ఆ.—స. క్రి. కోలుపోవు. "గీ. మున్నునన్నోటుపడిమఱితన్నునోటుపడియెనో." భార. సభా. ౨, ఆ.

ఓటుపాటు. ద్వ. వి. ఓటుపడుట. "గీ. మొనసిని శితాస్త్రములువానిముఖమునిండ, దీటుకొలిపిన వాఁడోటుపాటులేక." అధ్యా. యు, కాం.

ఓటువోవు. దే. స. క్రి. (ఓటు+పోవు.) ఓటుపడు.

యె." భార. స్త్రీ. ౨, ఆ. (లేఖనగ్రంథములయందోటువోయెననిపాఠము.) (ప్రే. ఓటువుచ్చు.)

ఓటుచేయు. ద్వ. స. క్రి. (ఓటు+చేయు.) భంగపఱచు. "క. పొన్నపువ్వుతోడఁబోల్చులోకుల మాట, నోటుచేసివెల్పుబోటినాభి, విస్తరిల్లెనపుడు పెడఁదశావినిబోల్చు, నేర్పుకాంద్రమాట నేటుచేసి." రసి. ౬, ఆ.

ఓడ. వై. వి. కలము, నావ.

ఓడంగి. వై. వి. 1. ఓడవాఁడు; 2. పడవవాఁడు; 3. ద్రోనెను లోతట్టువేసెడు దూలము.

ఓడిక. దే. వి. తనయిచ్చఁబాఱెడు నీరు, ప్రవాహము. "క. ఏడాకుపొన్నకొమ్మలు, క్రోడాడెడు డపిగౌరుఁగొదమలుమోద, క్రీడఁదనరుచాడ్పునఁబై, నోడికలయి పువ్వుఁదేనె లురలఁగ నొప్పెన్." హరి. పూ. ౭, ఆ. "చ. అనవిని మేఘపర్ణుఁడనిలాత్మజుతోనను నీకుఁబుట్టిమ, జ్జనకుఁడు ముజ్జగంబులఁబ్రశస్తిసహించెనహల్యరాము నంద్రునిచరణాబ్జరేణువునఁదోఁగిశిలాకృతి పిక్క కొన్నలా, గున సురసింధుతో యములఁగూడిన యోడికవాఁగుకైపడిన్." (ఇక్కడ ఓడికకు ప్రవహించునట్టిదియని అర్థము.) జై. ౧, ఆ.

ఓడిగిల్లు. దే. అ. క్రి. 1. ప్రవహించు; "గీ. ఉదకమున్నతభూమిపైనుండలేక, పల్లమునకోడిగిల్లిన పగిదినతఁడు, కదలెదీర్ఘాంతరములకుఁగాశినుండి." కాశీ. 3, ఆ.—2. పరుగెత్తు; "క. వెన్నెల పడమటిదిక్కునకున్, బలపలనైయోడిగిలఁగఁ బలపలవేగెన్." జై. ౧, ఆ.—3. కాఱు. "సీ. బ్రహ్మరంధ్రము మోనఁ బాటి యయ్యింద్రియ ద్రవమోడిగిల్లె నేత్రములలోన." సం. "నేత్రాభ్యాంతస్యసుస్రావశతధాద్యోతయన్ దిశః." కాశీ. ౮, ఆ.

ఓడినక్క. ద్వ. వి. పొట్టినక్క. (అప్ర.)

ఓడు. దే. అ. క్రి. 1. అపజయపడు; "క. వినుకన్నెనికేనోడితి." భార. కర్ణ. 3, ఆ.—2. పాఱు. "చ. వెఱచి నిమీలితాక్షులయి వెన్కకొదంగెడ పువ్వుఁబోఁడులన్, వెఱవకుఁడోడకుండనుము." హరి. పూ. ౧౦, ఆ.—3. భయపడు; "వ. నీకన్యాత్వంబుదూషితంబుగాదోడకుమనిదానికి నచ్చి." భార. ఆది. 3, ఆ.—4. సంకోచించు. "అప్రార్థించినఁజంపనోడికృపతో నావేళకుంబోయె." మై. ౨, ఆ.—వి. కుండలోనగువానితూటు, ధార. (ఓటికుండ. మొ.)

ఓడుబిల్ల. దే. వి. ఇంటిపైఁగప్పెడి పెంకు. "క. పటోడుబిల్లలగఱడీలు." వసు. ౪, ఆ.

ఓఢ్యాణము. సం. వి. అ. న. 1. భూషావిశేషము; "విచిత్రోఢ్యాణబంధేనకటికోభాంవిధాయచ."

హాలాస్యమాహాత్మ్యము. ౨౬, వ. అధ్యాయము. 2. ఆసనవిశేషము.

ఓఢ్రపుష్పము. సం. వి. అ. పుం. దాసనము¶.

ఓఢ్రము. సం. వి. అ. పుం. 1. దాసనము¶; 2. ఒకానొక దేశము.

ఓఢ్రుఁడు. సం. వి. అ. పుం. ఓఢ్రదేశస్థుఁడు, ఒడ్డెఁడు.

ఓతువు. సం. వి. ఉ. పుం. మార్జాలము, పిల్లి.

ఓదనము. సం. వి. అ. పుం, న. అన్నము, వంటకము.

ఓదము. వై. వి. (చూ.) అవపాతము. "క. వలయుంబయోదము గాలము, కలిగికదామ్యగముఁబక్షిగజమురుఘసముద, తీఁగులఁబట్టుదురట్లయితఁడ్, జ్ఞాలువిజ్ఞానంబుకలిమిఁజూతురుపురుషుల్." భార. శాం. ౪, ఆ. "గీ. పల్లియలువైచియోదముల్ పెల్లుద్రవ్వి." (ఇక్కడ వృషభములను పట్టునట్టి ఘట్టము.) హరి. పూ. ౬, ఆ. "వ. ఇవ్వలవ్వలనుండియొడ త్రెవ్వకుండఁద్రవ్వినయోదంబులంబడి క్రొవ్వఱుగక యువ్వంబునివ్వటిల్లంబట్టువడిన చివ్వంగులును." ఉ, హరి. ౪, ఆ. "ద్వి. అసురేశుఁడనులులాయముఁబట్టితేర, సొఱపుగాఁద్రవ్వినయోదంబులనఁగ, నెఱసినపరిఘులనెలకొన్న దాని." రా. యు, కాం.

ఓదారుచు. దే. స. క్రి. ఊరార్చు, ఆశ్వాసించు.

ఓదియ. దే. వి. ఓది.

ఓది. దే. వి. కోఁతకోసి చేనియందక్కడక్కడనుంచెడు వెన్నుపోఁచలప్రోగు. (ఓదియయొక్క రూపాంతరము.)

ఓదకొంగ. ద్వ. వి. ఒకదినుసుకొంగ.

ఓదకొలుకు. దే. వి. ఓదకొంగ. (అప్ర.)

ఓనికట్టు. దే. వి. కొండలనడిమి గొందిదారి.

ఓపిక. దే. వి. 1. శక్తి; "ఓపికవాణినీకుఁగలయోపికవాణికిలేదు." హరిశ్చ. ౫, ఆ.—2. క్షమ. "ఉ. ఓపికలేకచచ్చిన మహోరగముంగొనివచ్చికోపినై, తాపసుమూఁపుపైనిడినదారుణచిత్తుఁడ." భాగ. ౧, స్కం.

ఓపు. దే. అ. క్రి. చాలు. (వాఁడీపనిచేయనోపును. మొ.)—వి. ఓపిక. "ఉ. నీవునొకతాలిమిగల్గినవాఁడవైనెపం, బొప్పినఁజెల్లె నీనిలుపునోపునుజూతముగాకయిచ్చటన్." భార. విరా. ౫, ఆ.

ఓమటి. దే. వి. అన్నము. "స. అన్నంబువెలయుచుండు, బువ్వయోమటికూడుబోనమువంటకంబోరమోగిరమన." ఆం, భా. ద్వి. వై.

ఓమనగాయలు. దే. వి. బ. (ఓమన+కాయలు.) ఓమనగుంటలాడుగింజలు.

ఓమనగుంటలు. ద్వ. వి. బ. బాలికాక్రీడావిశేషము. (చూ. అచ్చనగండ్లు.)

ఓమనపీఁట. ద్వ. వి. ఓమనగుంటలాడు పీఁట.

ఓమము. దే. వి. ఒకానొకయంగడిదినుసు, దీప్యము.

ఓము. దే. స. క్రి. కాచు, రక్షించు. "గీ. ధర్మసాధనంబుతనువుధర్మముపరి, జ్ఞానదాయియట్లుకానఁదనువు, నోమవలయుమర్త్యుఁడేమిటనేమఱ, కాత్మహితముగోరియనఘచరిత." భార. అశ్వ. ౧, ఆ.

ఓయన. దే. వి. ఒయ్యన. "క. ఈయగ్ని దేవుఁడసురకు, నోయనఁజెప్పుటయువినిమహోగ్రాకృతితో, నాయసురనన్నుసూకర, మైయప్పుడయెత్తుకొనిరయంబునఁజనుచోన్." భార. ఆది. ౧, ఆ. (యకారము ద్విత్వాద్విత్వములై ప్రాసములయందు మూటికొకటిచెల్లుట ప్రయోగములయందుఁ గనఁబడుటచేతను దొరకియుండెడి యీయొక ప్రయోగమును అద్విత్వయకారమే యుండవలయునను నిర్బంధములేనిదిగానుండుటచేతను ఇది యిట్లే యుండవలయునని నిర్ధారణచేయ శక్యముగానుండలేదు.)

ఓయారము. దే. వి. ఒయ్యారముయొక్క రూపాంతరము.

ఓయారి. దే. వి. ఒయ్యారియొక్క రూపాంతరము.

ఓయి. వై. అవ్య. పురుషసంబోధనమునందు వచ్చునది. (ఇందలి యివర్ణమునకు పురుషసంబోధనమునందు వికల్పముగాను ఇతరసంబోధనములందు నిత్యముగాను లోపంబగు. మఱియు నర్థవిశేషములయందురిసివర్ణంబులు దానికాదేశంబులగు. "ఓయీత్యామంత్రణంచ వికృతౌస్యాత్" అను సూత్రసారస్యమీయర్థకల్పనకు హేతువయ్యెడి. బాలసరస్వతిమతమునుసిదియ. "వికృతావత్రవాలోపస్స్యంబుద్ధ్యోయిపదేతుయేః." ఇత్యాద్యథర్వణకారికార్థమును ఈమార్గమునే బోధించెడిని.) (రూ. ఓయీ.)

ఓయిరము. వై. వి. ఓగిరముయొక్క రూపాంతరము. "గీ. అగ్నిమనలోననొక్కరుండౌనొకాఁడో, చేయఁడేమారుతమువునచెప్పినట్లు, వరుణుఁడెవ్వరివాఁడుమువ్వురునులేక, యాయితంబగునెబ్భంగినోయిరంబు." కాశీ. ౫, ఆ.

**ఓర.** యు. దే. వి. 1. అంచు; 2. ప్రక్క. విశ. 1. ఒరగినది; (ఓరచూపు, ఓరగచ్చ. మొ.) 2. వంగినది. "ఉ. విశ్వధరాతలేశ్వరుం, డోరయొనర్చెఁ బాపభయమొందినిజాననచంద్రబింబముల్." నై. 3, ఆ.—వై. అహోరాత్రము. (ఉదా. ఓరంతప్రొద్దు.)

**ఓరంతప్రొద్దు.** వై. వి. (ఓర+అంతప్రొద్దు.) 1. దినమంతయు; "సీ. అశనమబ్బకయున్ననైననుశివరాత్రియోర్ఁతప్రొద్దుననుపవసించె." కాశీ. ౪,ఆ.—2. ఎల్లకాలము. "ఎ,గీ. వెఱపకోడకయొకరుండుప్రేలఁజూప, నెంతవాఁడక్కమారునోరంతప్రొద్దుఁ, గలసిపాసిపోఁజాలనికతనమనకు, నేలఁదలకాళ్లునిలువమినిజముగాక." ఉ, హరి. ౫, ఆ. (ఇది ప్రయోగములందంతట ఏకవచనాంతముగానుండినను ఒక్కచోటమాత్రము బహువచనాంతముగాఁ గానఁబడియెడి. "మ. బ్రహ్మమిత్రుండుశిష్యులకుఁగంటనువత్తిఁబెట్టుకొని యాయుర్వేదమోరంతప్రొ, ద్దులుఁ జెప్పన్." స్వా. ౫, ఆ.)

**ఓరగచ్చె.** దే.వి. (ఓర+కచ్చ.) ప్రక్కకొదిఁగించినకాసీనము. "సీ. చనిచనియోరగచ్చగఁజేసినిలుచుండికాల్మడివిడుచుఁదక్కకచెలంగి." భల్లా. 3, ఆ.

**ఓరగిల్లు.** దే. అ. క్రి. 1. ఒరగు; 2. ఒదుఁగు. "సీ. మందాకినీతనయుఁడేచి, చేదిపాంచాలకేకయులాదిగాఁగఁ,గల్గుభూపాలకోటిమొగ్గరముల్లెల్లఁ, గలఁగఁ దిరుగుడువడనోరగిలఁగఁబెల్లఁ, గిలఁగఁ దల్లడపడ రణక్రీడసల్పె." భార. భీష్మ. ౧, ఆ.

**ఓరచ్చెలు.** ద్వ. వి. బ. (ఓర+అచ్చులు.) గుదికాలుంచెడుచోట ఎత్తుగా అట్టలు వేసికుట్టిన ఓరట్ట చెప్పులు. "క. మొలనీలికాసెయునుబద, ములనోరచ్చులుధరించి ముదముదలిర్పన్, సెలగోలయుములుబంతియుఁ, బలపముఁగత్తియునుబూనిపటుసాహసిరై." హరిశ్చ. ౫, ఆ.

**ఓరణము.** దే. వి. ఒకదినుసుడేగ. "సీ. కొంజుఁబౌఁజులఁబోవఁగానీకవానినోరణములఁ బఱపిశీఘ్రుంబతునిమి." రసి. ౧, ఆ.

**ఓరపాక.** దే. వి. పంచను దూలములులేక వెలిప్రక్కవంచికట్టినశాల.

**ఓరపాటు.** ద్వ. వి. ఒరగుడు. "ఉ. అందుననొచ్చిపక్షిముఖుఁడల్గిగదాహతిమాణిభద్రుమా, ళిందిలకించి కొట్టినఁజలించియతండలమాళి యోరపా, టొందెఁదదాదిగారఘుకులోత్తమయాయనపార్శ్వమాళినాఁ, జెందెనభిఖ్య." ఉ, రా. 3, ఆ.

**ఓరవలి.** దే. వి. వన్నెకోక. (అప్ర.)

**ఓరవోవు.** దే. అ. క్రి. (ఓర+పోవు.) 1. ఒరగు; "గీ. అతనిఁగాంచితినతఁడశ్రులడరనడలు, చూడ్కినా మోము చక్కఁగాఁజూడకోర, వోవఁజూచుచుదీనతవొందియునికి, గనిమనంబునశోకంబుగదురనేను." భార. శల్య. ౨, ఆ.—2. వంగు. "పాలఁతికన్బొమలోరవోనివిండ్లు." చంద్రి.

**ఓరసింపు.** వై. వి. ఓరసిల్లుట. "సీ. విడిచియు...జాలకెడతాఁకుసిగ్గుమోరోరసింపులయింపుతా...సింప." అని. 3, ఆ. (చూ. అరగింపు.)

**ఓరసిల్లు.** వై. అ. క్రి. ఓసరిల్లు, తొలఁగు. (రూ. ఓరసిలు. "చేయిసాఁచిననోరసిలుపయో...నన.") కవి. 3, ఆ.

**ఓరిమి.** దే. వి. ఓర్పు, క్షమ.

**ఓరు.** యు. దే. వి. ఇంటితిన్నె గోడలయడుగునమూలలనుతీర్చెడు ఎఱ్ఱమట్టిపట్టె.— వై. ఉప. పెద్ద. (ఓరుగాలి. మొ.)

**ఓరుగాలి.** ద్వ. వి. మిక్కిలి బలిమిగలవాయువు, ప్రకంపనము. (చూ. ఒఱలు.)

**ఓరుచే.** దే. అ. క్రి. 1. క్షమించు; 2. సహించు, ఓడుధాతుప్రేరణము, ఓడించు. (రూ. ఓర్చు.)

**ఓరుతీయు.** దే. అ. క్రి. ఇంటితిన్నె గోడలయడుగునను మూలలను ఎఱ్ఱమట్టితో పట్టెలుతీర్చు.

**ఓరుపరి.** దే. వి. (ఓరుపు+అరి.) 1. క్షమించువాఁడు; 2. సహించువాఁడు. (రూ. ఓర్పరి.)

**ఓరుపు.** దే. వి. 1. క్షమ; 2. జయము; 3 సహనము. (రూ. ఓర్పు. క్షమాజయములకు.—"గీ. ఓర్పులవారలామీఁదదర్పితారి, యోర్పుగలవారు." పాంచా. ౪, ఆ.)

**ఓరెము.** వై. వి. ఓయిరముయొక్క రూపాంతరము. "సీ. నీతల్లిలచ్చమనేసంతసిలనూరెములు వట్టు బుడమివేల్పులకునెల్ల." అచ్చ. బాల, కాం.

**ఓర్త.** వై. స. ఏ. ఒకర్తయొక్కరూపాంతరము.

**ఓర్తి.** వై. స. ఏ. ఒకర్తియొక్కరూపాంతరము.

**ఓర్తు.** వై. స. ఏ. ఒకర్తుయొక్కరూపాంతరము.

**ఓర్తుక.** వై. స. ఏ. ఒకర్తుకయొక్కరూపాంతరము.

**ఓల.** దే. వి. జలక్రీడాసమయమునందు ప్రేరేపించుటకై యుపయోగించునట్టిశబ్దము. "లయగ్రాహి. ఓలయనుచున్ వలదుగేలియనుచున్." కళా.

౬, ఆ. "గీ. ఓలలిడిపట్టనరిగినవారొయ్యనీట, మునిఁగిదవ్వులలేతురుముదితలు." య. 3, ఆ.

ఓలగందము. ద్వి. వి. పూఁతపసుపు. "సీ. అనుదినంబును బ్రాతరారంభవేళలనోలగందంబుతోను దకమాడి." కాశీ. 3, ఆ.

ఓలగము. దే. వి. 1. కొలువు; "ఉత్సాహ. కానలో మృగంబులోలగంబు సేయుచుండున, మ్మానిమండలేశ్వరుండు మనలఁగూడుజాడలేదు." రామా. ౨, ఆ.—2. కొలువుకూటము. "క. భ్రాజితమణిభూషాంబర, రాజివలనసమవిభావిరాజితులగుటన్, భోజునియోలగమునఁగవి, రాజులరాజులను దెలియరాదెవ్వరికిన్." భో. ౨, ఆ.

ఓలగించు. దే. స. క్రి. కొలుచు, సేవించు. "సీ. యోగీంద్రవంద్యుఁడయ్యును నుగ్రసేనుని నోలగించినవాటియొచ్చె మొకటి." జై. ౧, ఆ.

ఓలచెంగనాలు. దే. వి. బ. అపజయము. "సీ. అపజయసంజ్ఞయైయలరుబన్నములిఱుగోటమియోడుటయోలచెంగ, నాలువిఱుగుడునోటునా." ఆం, ఛా. ద్వి. ఖ.

ఓలమాసగొను. ద్వి. అ. క్రి. (ఓలము+ఆస+కొను.) మఱుఁగుపడు. "క. అతిథినినుఁగోరనేనియు, మతిఁగింకిరిపడకయోలమాసగొనకనీ, పతినిక్కిప్రియంబుసల్పుము, సతికింబతిపనుపుసేయఁజనునెల్లెడలన్." భార. అను. ౧, ఆ. "గీ. అనివిచారించుచుండెనయ్యవనినాథుఁ, డంతకయమున్న నలునిఁగానతనినెఱిఁగి, యెదురుగద్దియడిగ్గిపృథ్వీశతనయ, యవనికాంతరమున నోలమాసగొనియె." నై. ౪, ఆ.

ఓలము. దే. వి. 1. వృక్షములులోనగువానిచే మఱుఁగగుచోటు; "క. పెనుమిట్టదిపల్లంబిది, యనకుండఁగనోలమునుబయలునొక్కటిగాఁ, గనువిచ్చుటయును మోడ్చుట, యునుసరిగాఁదమముపర్వె నుర్వీంద్రోడ్రాన్." భార. విరా. ౨, ఆ.—2. దేహము. "ఓలములోడినన్ బ్రియోద్వృత్త విశాలవక్షమునవ్రేలెడునట్లుగవ్రాసి చూపి." కవిక. 3, ఆ. "ఉ. ఓలమువంచియొయ్యనరఘూద్వహుఁడమ్మరిఁబోసిశబ్దవి, న్మూలముదాఁకవిల్ దివిచి." మొల్లరామాయణము. బాలకాండము.

ఓలలాడు. దే. అ. క్రి. (ఓలలు+ఆడు.) 1. మునుఁగు; 2. తేలు. (ప్రే. ఓలలార్చు.)

ఓలాకు. దే. వి. అలయిక, శ్రమము.

ఓలాకుపడు. ద్వి. అ. క్రి. అలయు, శ్రమపడు. "వ. వేగిరంపుఁబయనంబులయ్యును బ్రజలనోలాకుపడనీక." భార. విరా. 3, ఆ.

ఓలాడు. దే. అ. క్రి. (ఓల+ఆడు.) 1. మునుఁగు; "వ. కణ్వవాహినినవగాహింతుము. కౌంతేయంబున నోలాడుదుము." భీ. ౬, ఆ.—2. తేలు. "గీ. అమ్మహాత్ముఁడు నిత్యదయార్ద్రహృదయుఁ, డతులితానందజలధినోలాడుఁగాత." లక్ష్మీ. ౧, ఆ.

ఓలి. యు. దే. వి. ఉంకువ. వై. వరుస.

ఓలిమి. దే. వి. ఓలము, మఱుఁగుచోటు. ఆం, ఛా. ప్ర. ది.

ఓల్లము. సం. వి. అ. పుం. 1. అల్లము? 2. కంద?

ఓవరి. వై. వి. 1. లోపలిగది, అపవరకము; "ఉ. ఓవరిలోనఁగొందిదెసనున్నవియెన్నియొయెన్నఁబెద్దభాండావలి." హరి. పూ. ౫, ఆ.—2. చంద్రశాల. "ఉ. ఆపురిమించుటోవరులనాడుమెలంతలగానమాధురిన్, బ్రాపితజీవలయ్యునుదదగ్రమణిప్రతిమల్ నిమేషము, ద్రాపలితాదివైకృతముఁదాల్పవుప్రాంతపరిభ్రమత్ప్రియా, మాపతిబింబనిర్గళదమందసుధారసధారఁదోఁగుటన్." హన. ౧, ఆ.

ఓవు. దే. అ. క్రి. ఒవ్వు, సరిపడు. "ఉ. ఓవరవైశ్యవంశకలశోదధిచారుహిమాంశురేఖనీ, వోవనివారిముందఱన యోమగనింగడకాలఁద్రోచి." శుక. ౧, ఆ.

ఓషధి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. ఫలించినతోడనే నశించెడి యరఁటిలోనగునది; 2. మందుచెట్టు.

ఓషధీశుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

ఓషము. సం. వి. అ. పుం. 1. కాలుట; 2. కాల్చుట.

ఓష్ఠము. సం. వి. అ. పుం. అధరము, పెదవి.

ఓసరింత. వై. వి. ఓసరిల్లుట. "ఓసరింతలేకలరెడు కౌఁగిలింతలు." ఉ, రా. ౬, ఆ.

ఓసరిల్లు. వై. అ. క్రి. తొలఁగు, అపసరిల్లు. "క. ఓసరిలిపఱచుమృగముల, నేసియు." భార. ఆది. ౪, ఆ. (ప్రే. ఓసరించు.)

ఓసరు. వై. అ. క్రి. ఓసరిల్లు. "వ. కుక్షింభరిత్వంబునత్యుత్కామలై తిరిగితిరిగి వేసరియోసరిదాసరిగుంపు." ఆము, ౪, ఆ.

ఓహటము. దే. వి. వెనుదీయుట.

ఓహటిల్లు. దే. అ. క్రి. వెనుదీయు. "గీ. కంతుఁడు నునీవిధుండు నొక్కంతవారు, సఖ్యమీయిద్దఱకు నొప్పసదృశులగుట, ముదితయొక్కండు హరుని నెన్నుదుటికంట, నొకఁడుకంసారికుడికంట నోహటిలిరి." నై. ౭, ఆ. (రూ. ఓహటించు.)

ఓహరిసాహరి. దే. క్రి. విణ. ద్ర. తండోపతండముగా. "ఓహరిసాహరిం బ్రథమ మొల్కెడుధారల." ఆము. ౪, ఆ.

ఓహో. యు. అవ్య. సంబోధనమునందువచ్చును. "ఓహోతక్షక క్రమ్మఱుము." భార. ఆది. ౨, ఆ. (ఒహోయొక్క రూపాంతరము.)— 2. ఏమీ. "సీ. పిలువకుండఁగనైనఁబలుకునోహోయనిబయలూఁతగొనఁజూచుబారసాఁచి." కపిక. ౪, ఆ.—వై. బళీ. "సుధీవర్గంబులోహోయనన్." కళా. ౧, ఆ. (ఆమ్రేడితమునందుఓహో హో.)

ఓహోరె. వై. అవ్య. (ఓహో+రె.) బళీ. "మత్తకోకిల. ధారతప్పక చెప్ప నేర్తువుదారవాక్పతురత్వమో, హోరెనాఁగఁబ్రబంధ మొక్కటియొక్కనాటనె." సమీ. ౧, ఆ. (రూ. ఓహోరె.)

ఓళిగ; హోళిగ. కపోళి.

## ఔ.

ఔ. ఒకయక్షరము. దే. 1. అగు. ద్ర. అంగీకారమును దెలుపును. 2. ప్రశంసను దెలుపును. (ఆమ్రేడితమునందు ఔనౌ.) (చూ. లివ.)

ఔఁగదే. దే. అవ్య. (ఔను+కదే.) ఔరా. సీ. ఔఁగదేలావణ్యమౌఁగదేమాధుర్యమౌఁగదేసతినవయౌవనంబు." సం. "అహోరూపమహో ధామహ్యాహో అస్యానవంవయః." భాగ. ౭, స్కం. (ఆమ్రేడితమునందు ఔనౌఁగదే. "మ. అమరేంద్రాదులుమాలికంపములతో నౌనౌఁగదే బాపురే, కమలాక్షాశరణంచుభూదిశలనాకాశంబునన్ మ్రోయఁగన్." భాగ. ౭, స్కం.) (అవుఁగదేయొక్క రూపాంతరము.)

ఔఁగాక. దే. అవ్య. (ఔను+కాక.) అట్లేకాని. "క. అనివేఁడికొనియతీంద్రులఁ, దనగృహమున నారగింపదామోదరుఁడిం, పునఁబ్రార్థించిన నేమియు, ననుమానములేకవారునౌఁగాకనినన్." ఉ, హరి. ౪, ఆ. (అవుఁగాకయొక్క రూపాంతరము.)

ఔఁగు. దే. వి. భక్ష్యవిశేషము. "మ. ఇడిరమ్మానికుశాయనమ్ములుమనోభీష్టంబుగాఁబూరియల్, వడలుంజక్కెరకర్జకాయలునులడ్వాలుక్కెరల్ పూర్ణపుం, గుడుముల్ గారెలు బెల్లమండెఁగలునౌఁగుల్ కమ్మచాఁపట్లునూ, టిడులున్ దోసెలు నప్పముల్ నుకియలున్ హేరాళమైకన్పడన్." రామా. ౨, ఆ. (అవుఁగుయొక్క రూపాంతరము.)

ఔకాఁపు. దే. వి. అద్దెకాఁపురము. (అవుకాఁపుయొక్క రూపాంతరము.)

ఔక్షకము. సం. వి. అ. న. ఉక్షములసమూహము. (ఉక్షము=ఎద్దు.)

ఔగాములు. దే. వి. బ. (ఔట+కామి.) 1. కలిమిలేములు; "క. అనవయ్యంగననాకే, మననోరున్నయదిమీఁదలనినంతయుఁజె, ల్లునమీకౌగాములు దె, ల్పనుపాయంబొకటికానఁబడునందాఁకన్." కళా. 3, ఆ.—2. యుక్తాయుక్తతలు; "గీ. దీనియౌగాములన్నియుఁదెలిసిశిక్ష, సేయదేశమేలెడుమహీనాయకునకుఁ, గానియితరులకుచితంబుకాదు." పర. 3, ఆ.—3. మేలుగీళ్లు. "క. చను నేవగవఁగనొకయెడ, ననయమునగునలువకైననౌగాములాగిన్." య. 3, ఆ. (ఇది యొకానొకచో నేకవచనాంతముగాను గానఁబడియెడి.) (అవుగాములుయొక్క రూపాంతరము.)

ఔచితి. సం. వి. ఈ. స్త్రీ. ఉచితత్వము, యోగ్యత.

ఔచిత్యము. సం. వి. అ. న. 1. ఔచితి; 2. సత్యము.

ఔజ్జ్వల్యము. సం. వి. అ. న. ఉజ్జ్వలత్వము.

ఔజో. దే. వి. 1. కాలువ; 2. పనివాఁడు. "పనివాని పేరుగాభాసిలునౌజన." ఆం, భా. ద్వి. ప్ర. (అవుజోయొక్క రూపాంతరము.)

ఔటుగుండు. ద్వ. వి. చట్టిపిరంగిగుండు.

ఔడవము. సం. వి. అ. పుం. ఐదుస్వరములతోఁగూడిన రాగము.

ఔడు. వై. వి. పెదవిక్రిందిచోటు. (అవుడుయొక్క రూపాంతరము.)

ఔత్కంఠ్యము. సం. వి. అ. న. ఉత్కంఠ, తహతహ.

ఔత్కృష్ట్యము. సం. వి. అ. న. ఉత్కర్షము, మేలు.

ఔత్తానపాది. సం. వి. ఇ. పుం. ధ్రువుఁడు.

ఔత్సుక్యము. సం. వి. అ. న. ప్రియస్మరణాదులచేఁ గాలవిళంబము నోర్వలేమి, ఉత్సుకత్వము.

ఔదనికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) వంటవాఁడు.

ఔదరికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) పొట్టపోసికొనువాఁడు.

ఔదల. దే. వి. (ఔ+తల.) 1. నడితల; "సీ. ఔదలఁజదలేటిలేఁదరఁగలుబాలుఁడగుచందమామను య్యాలలూఁప." హరి. ఉ. ౬, ఆ.—2. తల. "అడుగుపగతునియవుదలనిడితి." సం. "మూర్ధ్నితేషాంకృతఃపాదః." భార. శల్య. ౨, ఆ. (అవుదలయొక్కరూపాంతరము.)

ఔదార్యము. సం. వి. అ. న. 1. ఉదారత్వము; 2. ఒక శబ్దగుణము. (చూ. గుణము.)

ఔదు. దే. వి. ఔజుయొక్కరూపాంతరము. "వ. వలిమించుక్రొమ్మించుటౌదులీఁడియాఁడి" స్వా. 3, ఆ. (మొదటిరూపము అవుదు.)

ఔదుంబరము. సం. వి. అ. న. ఒక లోహము, రాగి.

ఔద్దాలకము. సం. వి. అ. న. పుట్టలో పెట్టినతేనె.

ఔద్ధత్యము. సం. వి. అ. న. ఉద్ధతత్వము, ఏపు.

ఔపగవకము. సం. వి. అ. న. ఔపగవములసమూహము. (ఔపగవములు=ఉపగువునపత్యములు.)

ఔపచారము. సం. విణ. (అ.ఈ.అ.) ఉపచారము వలనఁ గలిగినది. (ఇక్కడ ఉపచారమనఁగా ఒక దానియందుండు ధర్మమును మఱియొకదానియందారోపించుట.)

ఔపధర్మ్యము. సం. వి. అ. పుం. పాషండధర్మము.

ఔపనిషదుఁడు. సం. విణ. (అ.ఈ.అ.) ఉపనిషత్తు తెలిసినవాఁడు.

ఔపయికము. సం.విణ. (అ.ఆ.అ.) న్యాయముతోఁ గూడినది, యుక్తము.

ఔపవస్తము. సం. వి. అ. న. ఉపవాసము, పస్తు.

ఔపవాహ్యము. సం. వి. అ. పుం. రాజెక్కెడియేనుఁగు.

ఔపాసనము. సం. వి. అ. న. గృహస్థుఁడగు బ్రాహ్మణుఁడు ప్రాతఃకాలమునందు చేయు అగ్నియుపాసన. విణ. ఉపాసనావిషయమయినది.

ఔమీనము. సం. విణ. (అ.ఆ.అ.) ఉమలుపండెడు నది. (పొలము.)

ఔర. దే. అవ్య. (ఔను+ర.) ఆశ్చర్యమును దెలుపును. (ఆమ్రేడితమందు ఔరౌర.) (రూ. ఔరా.) (అవురయొక్కరూపాంతరము.)

ఔరభ్రకము. సం. వి. అ. న. ఉరభ్రములసమూహము. (ఉరభ్రము=గొఱ్ఱె.)

ఔరసుఁడు. సం. వి. అ. పుం. తనకుధర్మపత్నియందుఁ బుట్టినకొడుకు.

ఔరస్యుఁడు. సం. వి. అ. పుం.—పై.—

ఔరు. దే. వి. వీరణము?. (అవురుయొక్కరూపాంతరము.)

ఔర్ధ్వదైహికము. సం. విణ. (అ.ఆ.అ.) అపార్ధానము.

ఔర్వము. సం. వి. అ. పుం. బడబాగ్ని, వార్వపుటగ్గి.

ఔర్వవ్రతి. సం. వి. న్. పుం. జలాహారనియమము గలవాఁడు.

ఔర్వశేయుఁడు. సం. వి. అ. పుం. అగస్త్యముని.

ఔల. దే. వి. అవలయొక్కరూపాంతరము. "ద్వి. సారథిరథవాౌలఁజనఁద్రోలనదియు." రా. యు, కాం. (మొదటిరూపము అవుల.)

ఔలు. దే. అ. క్రి. అగులుయొక్కరూపాంతరము. (మొదటిరూపము అవులు.)

ఔలెమ్మ. దే. అవ్య. (ఔను+లెమ్మ.) ఔనౌను. "మ. ఇదిభోజాత్మజకిచ్చినంగినుకతో నేమంచునూహించునో, మదిసాత్రాజితి దానికేనిపుడు ప్రేమంబంపినన్ దీనినె, ల్లిదముంజేసినజాడలోఁ చునౌకొయౌలెమ్మిందు నేనున్కిఁజె, ల్లదువోయేరికిఁబంపఁగాననుచులీలన్ రుక్మిణీకాంతకున్." పా. ౧, ఆ. (అవులెమ్మయొక్కరూపాంతరము.)

ఔలే. దే. అవ్య. ఔలెమ్మయొక్కరూపాంతరము. (మొదటిరూపము అవులే.)

ఔశీరము. సం. వి. అ. న. 1. చామరదండము; 2. శయనము; 3. ఆసనము. విణ. వట్టివేరువలనఁ బుట్టినది.

ఔషధము. సం. వి. అ. న. అగదము, మందు.

ఔష్ట్రకము. సం. వి. అ. న. ఉష్ట్రములసమూహము. ఉష్ట్రము=ఒంటె.)

ఔను. దే. వి. హౌనుయొక్కరూపాంతరము. (మొదటిరూపము అవును.)

## క.

క. ఒకయక్షరము.

కంకటము. సం. వి. అ. పుం. కవచము, బొందలము.

కంకటి. వై. వి. మంచేము*. "సీ. కప్పుఁగుత్తుకవెట్టకన్నుముమ్మొనవాలుకంకటికోడుచేజింకపిల్ల." అచ్చ. యు, కాం.

కంకణము. ఉభ. దే. వి. జలపక్షివిశేషము. "చ. తలరిధరిత్రిసాఁచుగరుదాల్చినకేలనఁగంకణంపుమ్రోఁ, తలఁబులుదేలవండుపయిఁదాల్చినదుల్వడిఁజొచ్చెవారిధిన్." ఆము. ౪, ఆ.—సం. వి. అ. న. 1. ముత్తెముల పగడములులోనగువానిఁ

చేర్చి గ్రువ్వఁబడినచేసరము; 2. చేతఁగట్టుకొనెడు తోరము; 3. నీటిబొట్టు.

**కంకణాయి.** దే. వి. జలపక్షివిశేషము, కంకణము.

**కంకతము.** సం. వి. అ. పుం, న. దువ్వెన.

**కంకతిక.** సం. వి. ఆ. స్త్రీ.——పై.——

**కంకపత్త్రము.** సం. వి. అ. పుం. బాణము, అమ్ము.

**కంకము.** సం. వి. అ. పుం. రాపులుఁగు.

**కంకముఖము.** సం. వి. అ. పుం. కాఁచినలోహము నెత్తెడు సాధనము, పటుకారు.

**కంకర.** వై. వి. శిలావిశేషము. విణ. పరుషము. (కంకరగాడిద.)

**కంకరగాడిద.** వై. వి. కంచరగాడిద, అశ్వతరము.

**కంకాళము.** సం. వి. అ. పుం. చర్మమాంసరహితమయిన యెపలియెముకలగూఁడు, డొక్క.

**కంకి.** దే. వి. (జొన్నలోనగువాని) వెన్ను.

**కంకు.** దే. స. క్రి. 1. గద్దించు; 2. తిట్టు.

**కంకుఁడు.** సం. వి. అ. పుం. 1. కపటబ్రాహ్మణుఁడు; 2. రాపులుఁగులను జంపితినెడుబోయ; "శ్లో. కిరాతహూణాంధ్రపుళిందపుల్కసా ఆభీరకంకాయవనాఃకసాదయః, యేన్యేచపాపాయదుపాశ్రయాశ్రయాశ్శుధ్యంతితస్మైప్రభవిష్ణవేనమః." భాగ. ద్వి. స్కం.—3. యముఁడు; 4. యుధిష్ఠిరుఁడు.

**కంగటి.** వై. వి. కంకటియొక్కరూపాంతరము. "ఉ. భృంగితలంపఁ గాఁబరమభృత్యుఁడునర్మసఖుల్ పిశాచముల్, కంగటికాలునమ్మఁదగుకైదువు." జై. ౫, ఆ.

**కంగాణము.** దే. వి. కళ్లమునందలి కాణి.

**కంగారు** దే. వి. యుద్ధము. "సీ. పోరాటపోట్లాట పోరుకయ్యము చివ్వకంగారు కంగిసకలను దురము." ఆం, భా. ద్వి. కు.

**కంగాళీ.** హిం. విణ. నీచమైన, అత్యల్పమైన.

**కంగిస.** దే. వి. యుద్ధము.

**కంగు.** దే. వి. నూలిపోఁగుతో సంకగా నేర్పఱచిన కన్ను. "ద్వి. బంగారుసరగగన్నడు కుట్టులమరు, కంగులఅవికలుఁగనుపట్టఁదొడిగి." రా. బాల, కాం.

**కంగునీపత్త్రము.** సం. వి. అ. పుం. తుత్తిరి?.

**కంగువు.** సం. వి. ఉ. స్త్రీ. ప్రియంగువు, కొఱ్ఱలు.

**కంగేలి.** వై. వి. అశోకము? "సీ. పొగడనుగింగేలిఁడగవిరుల్ గలిగించెనెమ్మిఁగల్లుమిసితన్నియునొకర్తు. య. ౪, ఆ.

**కంగోరు.** దే. వి. నిడుపుకాసె.

**కంచి.** వై. వి. కాంచీపురము. "గీ. కాఁపుఁగోడలు కంచంతకాపురంబుఁ, బాలవంటికులంబుఁగీడ్పఱచియుటికె." పాండు. 3, ఆ.—విణ. పెద్ద?.

**కంచిమేఁక.** ద్వ. వి. పెద్దపొదుఁగుగల యొకదినుసుమేఁక.

**కంచియ.** దే. వి. 1. పసులుమేయుటకై దున్నకవిలిపినపొలము, వివీతము; 2. జెముడుబలుసులోనగువానిచే నేర్పఱుపఁబడిన వెలుగు, వృతి.

**కంచుకము.** సం. వి. అ. పుం. 1. అవిక; 2. కుబుసము; 3. పాముయొక్కకుబుసము; 4. కవచము.

**కంచుకి.** సం. వి. ఇ. స్త్రీ. ఓషధివిశేషము. న్. పుం. 1. అంతఃపురిపుకావలివాఁడు; 2. విటుఁడు; 3. పాము; 4. అగరుమ్రాను.

**కంచులిక.** సం. వి. ఆ. స్త్రీ. కంచుకము, అవిక.

**కంచె.** దే. వి. కంచియయొక్కరూపాంతరము.

**కంచెకోట.** ద్వ. వి. వెదురుపేములోనగు వానిచేఁ గోటకుఁజొట్టు నేర్పఱుపఁబడిన ఆవరణము, ప్రాచీనము.

**కంచెగోడ.** ద్వ. వి. కంపపాఁతినగోడ.

**కంచెల.** వై. వి. అవిక. "కంచెలతెగిపడ్డ." స్వా. ౫, ఆ.

**కంచేము.** వై. వి. 1. బంగారువెండిలోనగువానిచేఁ జేయఁబడినపాత్రము*. "ఘనగతశంపఁగంచమిడికాటుకదీర్చి." ఆము. ౨, ఆ.—2. బంగారువెండిలోనగువానిచేఁజేయఁబడినభోజనపాత్రము*.

**కంచేరి.** వై. వి. కంచుపనిచేసి బ్రతికెడుజాతి*. (కంచరవాఁడు.)

**కంచేరగాడిద.** వై. వి. (కంచేరము+గాడిద.) కంచరమునకుఁ బూన్చెడు ఒకదినుసుగాడిద, అశ్వతరము.

**కంచేరము.** వై. వి. రథవిశేషము, గాడీ*.

**కంచేరు.** వై. వి. కంచుపనిచేయువాఁడు, కాంస్యకారుఁడు.

**కంచే.** వై. వి. ఒకలోహము, కాంస్యము.

**కంచేకంటు.** దే. వి. బాణలి. "కందువుబాణలికంచుకంటనఁదగు." ఆం, భా. ద్వి. వై.

**కంచేమించే.** దే. విణ. అగోచరము. "గీ. కాఁకమించులవినుమానికంపుజోదు, మంచుగమిఁగ

చుమించుగావించుకరణి." "వ. పటుభుజాస్ఫాలనంబుల ఖగంబులు మృగంబులుఁ గంచుమించుచుఁ బైపఱవ." రామా. ౫, ఆ.

కంజజుఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మ, తమ్మిచూలి.

కంజము. సం. వి. అ. న. 1. తామర; 2. అమృతము. పుం. వెండ్రుక.

కంజాతము. సం. వి. అ. న. పద్మము, నీటిపుట్టుగు.

కంజుఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మ, నలువ.

కంజో. వై. వి. పక్షివిశేషము. (కొంజాయొక్క రూపాంతరము.)

కంట. దే. వి. 1. కనుట; "క. ఇంటం దేవులునఁ జచ్చుట, కంటెం బాపంబులొండుగలవె నృపులకున్, బంటైకలనంబొలియుట, కంటనిధానంబు కంటకాదే మనకున్." భార. భీష్మ. ౧, ఆ. 2. నాట్యబంధము. "సీ. కంటయంచనఁగను గట్టరమనఁగను నాట్యబంధంబొప్పు." ఆం, భా. ప్ర. నాట్య.

కంటక. సం. వి. ఆ. స్త్రీ. 1. ఎఱ్ఱతుమ్మెద; 2. కడుఁదురిఁగ.

కంటకపుంఖి. సం. వి. ఈ. స్త్రీ. ములువెంపలి†.

కంటకఫలము. సం. వి. అ. పుం. పనస†.

కంటకము. ఉభ. దే. వి. విరోధోక్తి. "రగడ. అతిమిననుజిగురునకునగు నెకంటకమాడ." స్వా. 3, ఆ.— విశే. విరుద్ధము. "తరల. కడఁగి బుద్ధిబలంబుఁ దద్దయుఁ గంటకంబుగఁ జేసి." భార. ఆర. ౬, ఆ.— సం. వి. అ. పుం, న. 1. ముల్లు; 2. చేఁపలోనగువానియెముక; 3. కాకి; 4. రోమాంచము; 5. వెదురు; 6. సూదిమొన.

కంటకారిక. సం. వి. ఆ. స్త్రీ. వాఁకుడు†.

కంటకుఁడు. సం. వి. అ. పుం. క్షుద్రశత్రువు.

కంటగించు. దే. అ. క్రి. 1. విరోధించు. "గీ. కంటగించును సాంఖ్యయోగంబటన్న." కాశీ. ౫, ఆ. "గీ. ఒంటికురు వేరుపోఁ చేకుఁ గంటగింపరైరి." ఆము. ౫, ఆ.—2. నొచ్చు. (చూ. అలుఁగులపడు.)

కంటగిల్లు. దే. అ. క్రి. నొచ్చు. "సీ. ననల క్రొందొడమునొత్తినఁ గంటగిలుమస్తకం బెట్టు మోచెనో కటకుజడలు." పాండు. ౮, ఆ.

కంటలము. దే. వి. 1. చిల్లరసరకులుంచి యెద్దు మొదలగువానిమీఁద వేసెడుసంచులజత; "ఎ, గీ. ఎలయము లెల్లఁ దెమ్ము కంటలపుటెడ్ల, నాయితము చేయుము." హరి. పూ. ౬, ఆ.—2. దూదిమూట.

కంటసము. దే. వి. విరోధోక్తి, విప్రలాపము. "ఎ, గీ. కంటసమ్మునాఁగను విప్రలాపమ్ము చెలఁగు." ఆం, భా. ప్ర. వాగ్వ.

కంటసరి. వై. వి. మెడను ధరించెడి యొకానొకసొమ్ము.

కంటియ. వై. వి. కంటె.

కంటివాలు. ద్వ. వి. (కల్లు+వాలు.) చక్రాయుధము. "సీ. ఇవిగదా దుక్కికైదువ సంకురవ తమ్మికంటివాల్గెరల బొక్కసములయ్యె." భద్రా. ౧, ఆ.

కంటు. దే. వి. పగ, విరోధము.

కంటె. యు. దే. అప. ఒకానొకవిభక్తి.—వై. వి. మెడను ధరించెడి చక్రాకారపు స్వర్ణాభరణవిశేషము. "గీ. నలుదవనమాలకంటెయు మలినతనువు." ఆము. ౭, ఆ. (కంటియయొక్క రూపాంతరము.)

కంట్లము. దే. వి కంటలముయొక్క రూపాంతరము.

కంఠగుణిక. సం. వి. ఆ. స్త్రీ. వల్లకి, వీణె.

కంఠము. సం. వి. అ. పుం. 1. కుత్తుక; 2. కుత్తుకయొక్క ధ్వని; 3. సమీపము; 4. మంగ†.

కంఠిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కంటె; "ఉ. కంకణ కంఠికా కటక కాంచి ముఖాభరణ ప్రజంబుతో." నై. ౭, ఆ.—2. మెఱుపు.

కంఠీరథము. సం. వి. అ. పుం. బాలకాదుల క్రీడాశకటము, డయనము.

కంఠీరవము. సం. వి. అ. పుం. సింహము, సింగము.

కంఠేకాలుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, కఱకంఠుఁడు.

కంఠేరుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) దరిద్రుఁడు, బీద.

కండ. వై. వి. 1. పులకండము; "సీ. చింపివల్కము లేమి చేసెడి వనఁగావు నెఱపైన కండమండెఁగలుగాని." జై. ౧, ఆ.—2. మాంసఖండము*; "గీ. ఖండాగ్రకోని కండతుండెములుగా ఖండించి." రామా. ౧, ఆ.—3. మాంసము*. "క. ఇందుభవత్తనువులఁగల, కండలు నెత్తురును వేగఁగమువంగానీ, యండజపతి కానందము, ఖండంబగుచుండు తుత్తుకలఁ కలడంపన్." మార్క. ౧, ఆ.

కండచక్కెర. వై. వి. పులకండము.

కండమక్క. వై. వి. కడుపులో కుడిప్రక్కనల్లనై యుండెడు మాంసవిశేషము, కాలఖండము. "వ. కండచుక్కయనంగఁ గాలఖండమలరును." ఆం, భా. ద్వి. మ.

కండనము. సం. వి. అ. న. కంబూకము, తవుడు.

కండని. సం. వి. ఈ. స్త్రీ. ఉలూఖలము, ఱోలు.
కండియ. వై. వి. నూలికండె*.
కండువా. దే. వి. 1. వెడల్పుగలయంగవస్త్రము; 2. అడ్డదూలము.
కండువు. సం. వి. ఊ. స్త్రీ. ఖర్జువు, తీఁట.
కండూతి. సం. వి. ఇ. స్త్రీ.——పై.——
కండూయ. సం. వి. ఆ. స్త్రీ.——పై.——
కండూర. సం. వి. ఆ. స్త్రీ. దూలగొండి‡. అ. పుం. ము. కంద‡.
కండె. వై. వి. 1. జొన్నకంకి*; 2. పేనిననూలిచుట్ట*; 3. సాముచే మిక్కిలిగట్టిపడిన భుజముఖము*. "సీ. గుండెలుఁగండెలుఁగోళ్లునుగీళ్లునుదొడలును మెడలుఁదుత్తుమురుగాఁగ." అచ్చ. యు, కాం.
కండెము. వై. వి. సాముచేమిక్కిలిగట్టిపడినభుజముఖము. "కండెపుఁబిసాళియురంబున."విజ.౧,ఆ.
కండోలము. సం. వి. అ. పుం. పిటము, గంప.
కండోలవీణ. సం. వి. ఆ. స్త్రీ. చాలవీణె, కిన్నెర.
కంతి. వై. వి. 1. గడ్డవలెఁబుట్టెడురోగవిశేషము; 2. దద్దు*. "ద్వి. దుద్దునవీఁపుకంతులుగట్ట మోఁది." హరిశ్చ. ౨, భా. (ఇక్కడదద్దులనియే చెప్పవచ్చును. అయినను పాఠమిట్లున్నది.)
కంతు. దే. వి. గడువు.
కంతుఁడు. సం. వి. ఉ. పుం. మన్మథుఁడు, మరుఁడు.
కంతువు. సం. వి. ఉ. పుం. గాదె.
కంత్రాక్టు. ఆం. వి. పనిచేయుటకు ఒడంబడిక.
కంథ. సం.వి. ఆ. స్త్రీ. 1. చింపిగుడ్డలనుగూర్చికుట్టిన బొంత; 2. చింపిగుడ్డ; 3. మట్టిగోడ.
కంథటిక. సం. వి. ఆ. స్త్రీ. కంథ, బొంత.
కంథావాటము. సం. వి. అ. పుం. ప్రాకారము.
కంద. సం. వి. అ. పుం. కందగడ్డ. (దీనిని గొందలు వైకృతముగా వాడియున్నారు.)
కందకము. దే. వి. అగడిత, పరిఖ.
కందణము. దే. వి. మల్లబంధవిశేషము. "సీ. కన్నాతచాంగణకందణంబుతిణింగి." ఆం, భా. ద్వి. తు.
కందనగాయ. దే. వి. గుండియ. "మ. మునుమున్ దెల్పును దూఱుఁదూఱుమతి కెంపున్ వెండియుం దూఱుఁగం, దనగాయంగలనల్పుఁదోఁపనఖకోణశ్రేణిచేవిక్రమం, బునవాఁడుగ్రతఁగొన్నయట్టివిలసన్మూర్తిత్రయీతేజమున్, గొనులీలన్ విదళింపవేయ సురవత్షోభిత్తిమిథ్యాహరీ." ఆము. ౪, ఆ.

కందము. ఉభ. వై. వి. పశుజాతిమూఁపు*. "ఉ. కందముతీరున్నత్తముల గౌరవముం బదసౌష్ఠవంబుసొం, పుందగిలక్షణస్థితులఁ బొల్చియలంక్రియనందమొందిపెం, పొందఁగసత్కవీంద్రకృతియుంబలెసాదులఁసంస్తుతింపమిం, చెందురగంబుళబ్దవివశీకృతకోవిదరాజలోకమై." రామా. ౨, ఆ.- సం. వి. అ. పుం. 1. గడ్డ; 2. మబ్బు; 3. పద్యవిశేషము; 4. కందగడ్డ; 5. తామరలో నగువాని దుంప.
కందరము. సం. వి. అ. పుం. 1. గుహ; (ఇది యీ యర్థమునందు ఆకారాంత స్త్రీలింగమునగును.) 2. అంకుశము.
కందరాలము. సం. వి. అ. పుం. 1. కొండగోనుగు‡; 2. కలజువ్వి‡.
కందర్పుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు, మరుఁడు.
కందళము. ఉభ. దే. వి. ఎద్దువీఁపుపైవేసెడుగంత. సం. అ. త్రి. 1. క్రొత్తమొలక; 2. అవ్యక్తమధురధ్వని; 3. ఉపరాగము; 4. కపాలము.
కందళి. సం. వి. ఈ. స్త్రీ. 1. టెక్కెము; 2. ఒకవిధమయినపొద; 3. ఇరువదియంగుళముల నిడివిగలలేడి. న్. పుం. ఇరువదియంగుళముల నిడివిగలయిఱ్ఱి. (అనికొందఱు.)
కందళించు. సం. అ. క్రి. అంకురించు, మొలచు.
కందళికము. దే. వి. ఎద్దువీఁపుపైవేసెడుగంత. "సీ. గూటపుఁదిరుగుళ్లఁగొలికి దామెనత్రాళ్లఁగందళికముఁగోలెకదురుకోల." హంస. ౫, ఆ.
కందాయము. సం. వి. అ. పుం. సంవత్సరమునందు మూఁడవభాగము.
కందారి. దే. వి. ఒకానొకచెట్టు, తీక్ష్ణకంటక.
కంది. దే. వి. సస్యవిశేషము, తువరి. బ. ధాన్యవిశేషము. (దీనిభేదములు—కొండకందులు, పొట్టికందులు.)
కందు. దే. అ. క్రి. 1. తపించు; "క. కందుగలబసిఁడిగాఁచినఁ, గందివివర్ణమయినట్లు." భార. సభా. ౨, ఆ.—2. నలుపగు. "ఎ, గీ. అతనికరతలప్లోష్టయావర్తితమ్ములై, కందియును మహోనుగంధకుసుమ, తతులుదొంటియట్లతమకంపువిడువక, యుండు."భార. ఆర. ౨, ఆ.—వి. 1. తాపము; "స. కలాపూర్ణుండు నిర్విధంబున నవ్వనిత డెందంబు

కందువాపి."కళా.౭,ఆ.—2. నలుపు; "వ. ఇందు బింబంబునందుఁ గందునుంబోలె వాలధియందు వాలంబులోకళొన్ని నీలంబులై యున్నయవి." కాశీ. ౬ ఆ.—3. బిడ్డ. "సీ. చిన్నివెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁబొడమిన చెలువతోఁబుట్టు నూను." స్వా. ౨, ఆ.

కందుఁడు. వై. వి. కుమారస్వామి.

కందుకము. సం. వి. అ. పుం. ఆడెడుచెండు. (రూ. కందుకము.)

కందురు. వై. వి. కందురీఁగ.

కందువ. దే. వి. 1. జాడ; "వ. అచ్చోటిపెద్దలవల నంగందువఁదెలిసి తత్పుణ్యాశ్రమంబుప్రవేశించిరి." కాశీ. ౨, ఆ.—2. సంకేతస్థలము; "క. కందువచోటికిఁగొనిపో, వందారరుగుటయు." భార. మా. ౧, ఆ.—3. ఋతువు; "సీ. వానకందులవల దివారాత్రములుజలధారలబయ లుఁడడియుచుండి." నిర్వ. 3, ఆ. —4. ఏకాంతము; "గీ. సకియలత్తెఱంగుసకలంబునూహించి, కార్యగతిదలంచికడుఁజలించి, యిందువదనయున్నకందువకేతెంచి, పొంచినిలిచియాలకించినపుడు." విక్ర. ౧, ఆ. (మఱియుకందువచుట్టము, కందువమందిరము ఇత్యాదులెఱుంగునది.)—5. చమత్కారము; "చ. నెలయుదయించునప్పుడలనీరజముల్కుముదంబులౌను రేల్, కలువలదా యరాకకుఁబగల్ కుముదంబులు నీరజంబులౌఁ, దలఁపఁగనింతవింతగలదాయని కందువ మాటలాడుచుం, దనరెఁ గిరీటిసారెదనప్రౌఢివిశారదుఁడై న్నుచుండఁగన్." విజ. ౧, ఆ.—6. ప్రదేశము; "క. నీకెదురుచూచుచుండితిఁ, గాకుత్స్థాన్వయవరేణ్యకడునద్భుతమీ, లోకమున నిట్టిచరితం, బేకందువనైనఁగలదెయెవ్వరికైనన్." నిర్వ. ౧౦,ఆ.—7. సామర్థ్యము. "వ. సారథ్యంబుసేయువాఁడు లేమికివిషాదంబునొందిననీకందువసైరంధ్రి చెప్పి నంబ్రియంబంది నిన్నుఁదోడ్తేరనన్నుంబనిచిన." సం."ఆచచక్షహయజ్ఞానేసైరంధ్రీకౌశలంతవ." భార. విరా. ౪, ఆ.—8. తెగ; "లయగ్రాహి. దితినందనులతోడన్, బొందుపడసంధియొకచందమునఁజేసి రిరుకందువలవారు నరవిందభవునాజ్ఞన్." వి, పు. ౧, ఆ.

కందువాఱు.దే.అ.క్రి.(కందు+పాఱు.) మలినమగు. "అరవిందవిరోధియుఁగందువాఱె." కా.౨, ఆ.

కందువు. ఉభ. దే. వి. బిడ్డ. (ఇది ప్రాచీనకవిప్రయోగములందు వు వర్ణాంతముగాఁ గనఁబడలేదు. సం. ఉ. పుం, స్త్రీ. పెనము.

కందెన. దే. వి. బండియిరుసునకుఁ బూసెడుమసి.

కందెఱ. ద్వి. వి. (కన్ను+తెఱ.) ఱెప్ప. "మ.మఱువాడంధక వృష్ణిభోజయదుసామంతాగ్రణీసేవఁగం, దెఱగాసాత్యకిరాముఁడుద్ధవుఁడుహార్దిక్యుండులోనైనకొం, దఱమాత్యుల్ దనుఁజుట్టిరానమరేనాస్థానంబునంగృష్ణుఁడా, కఱకంఠుండుపరీతపారిషదరేఖుంబూఁచుచందంబునన్." ఉ, హరి. ౨, ఆ.

కంధర. సం.వి.ఆ. స్త్రీ. మెడ. (రూ. కంధరము.) అ. పుం. ము. మబ్బు.

కంధి. సం. వి. ఇ. పుం. సముద్రము, కడలి.

కంప. దే. వి. ముండ్లమండ.

కంపకోట. ద్వి. వి. వెదురుపేములో నగువానిచేఁ గోటకుఁ జుట్టునేర్పఱుపఁబడిన యావరణము, ప్రాచీనము.

కంపగోడ. ద్వి. వి. కంపపాఁతినగోడ.

కంపణము. సం. వి. అ. పుం. ఆయుధవిశేషము. "వ. కణయ కంపణ ముసల ముద్గర పరిఘ పరశ్వథ కరవాల భిండివాల ప్రముఖ ప్రహరణంబులు." ఉ, హరి. ౪, ఆ.

కంపనము. సం. వి. అ. న. 1. కదలుట; 2.వణఁకుట. విశే. 1. కదలునది; 2. వణఁకునది.

కంపము. సం. వి. అ. పుం. వేపథువు, వణఁకు.

కంపరము. దే. వి. పాడె, ఖాటి.

కంపించు. సం. అ. క్రి. వణఁకు.

కంపితము. సం. విశే. (అ. ఆ. అ.) వణఁకెత్తినది.

కంపిల్లము. వై. వి. కాంపిల్యము?.

కంపు. దే.వి. గంధము. "చనదిటులంటకంపెఱుఁగఁ జాలదునాసిక." భార. అశ్వ. ౨, ఆ. (వాడుకయందు దుర్గంధమని చెప్పుదురు.)

కంపుఁదుమ్మ. దే. వి. (కంపు+తుమ్మ.) విట్ఖదిరము?.

కంపుటిరుగుడు. దే. వి. (కంపు+ఇరుగుడు.) భస్త గర్భ?.

కంపె. దే. వి. తాంబూలపాత్రము. "సీ. తాంబూలపాత్రంబు తబుకటంచనఁగను గంపెయంచనఁగను గుంపెయనఁగ, జాలవల్లికయనఁగను." ఆం, భా. ద్వి. మ.

కంపెలుక. దే. వి. (కంపు+ఎలుక.) చుంచు, గంధ మూషిక.
కంప్రము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కదలునది; 2. వణఁకునది.
కంబడి. వై. వి. కంబళి, కంబళము.
కంబమయ్య. వై. వి. (కంబము+అయ్య.) స్తంభోద్భవనృసింహస్వామి. "సీ. కంబమయ్యరొమ్మే లుకలిగిన నీకొక్కగరుటాలమంతునిఁ గానుకిత్తు." య. ౨, ఆ.
కంబము. వై. వి. 1. స్తంభము; 2. మల్లపరికరవిశేషము*. "సీ.తత్సాధనంబులై తగుకంబముకొనత." ఆం, భా. ద్వి. ఉ.
కంబమురాయఁడు. వై. వి. కంబమయ్య. "రాజుగాఁడమ్మకంబమురాయఁడు." య. ౧, ఆ.
కంబరత్రాఁడు. గ్రా. వి. కొబ్బరిపీచుతోనల్లిన త్రాఁడు.
కంబపల్లి. వై. వి. ఉపనయనమునందుఁ గడపటిదినము చేయుస్తంభపూజలోనగునది.
కంబళము. సం. వి. అ. న. నీరు. పుం. 1. కంబళి; 2.ఉత్తరీయము; 3.కంబళిపురుగు; 4.గంగడోలు; 5. ఏనుఁగుపక్కెర. డు. ఒక సర్పరాజు.
కంబళి. ఉభ. వై. వి. కంబళము. సం. న్. పుం. ఎద్దు.
కంబళిపండు. ద్వి. వి. పట్టుపురుగుచెట్టుపండు.
కంబళిపురుగు. వై. వి. శూకకీటము.
కంబాలాట. ద్వి. వి. (కంబాలు+ఆట.) బాలికా క్రీడావిశేషము. (చూ. అచ్చనగండ్లు.)
కంబి. సం. వి. ఇ. స్త్రీ. 1. వెదురుకమ్మి; 2. గరిటె.
కంబు. ఉభ. దే. వి. సజ్జపైరు. బ. సజ్జలు. సం.అ.న. 1. నీరు; 2. తల; 3. సుఖము. పుం. 1. గాలి; 2.నెమలి. (ఇట్టియేకాక్షరశబ్దములకు అమహదర్థమందుమాత్రము ఆధునికప్రయోగములయందు రూపమిట్లు కానఁబడుచున్నది.)
కంబుగ్రీవ. సం. వి. ఆ. స్త్రీ. మూడు ముడుతలుగల మెడ.
కంబువు. సం. వి. ఉ. పుం, న. శంఖము. పుం. 1. ఏనుఁగు; 2. కడియము; 3. నత్తగుల్ల.
కంబూకము. సం. వి. అ. పుం. కండనము, తవుడు.
కంసము. సం. వి. అ. పుం, న. 1. కంచు; 2. కంచుగిన్నె; 3. మానవిశేషము. పుం. డు. ఒక రాక్షసుఁడు.
కంసారాతి. సం. వి. ఇ. పుం. కృష్ణుఁడు, వెన్నుఁడు.

కకపాల. వై. వి. సన్యాసులు తలచుగాఁజంకనుబెట్టుకొనెడి యొకదినుసుసంచి. "సీ, కకపాలకే దారకటకముద్రితపాణిఁగులుచలాతాముతోఁ గూర్చిపట్టి." స్వా. ౧, ఆ. (కక్కపాలయొక్క రూపాంతరము.)
కకవికలు. వై. వి. బ. యథాయథలు*. "క. కకవికలుగఁబోట్లాడుచు, వికసితలైడునాకడింగివీరుల యందుణ." కళా. ౮, ఆ.
కకావికలు. వై. వి. బ. కకవికలుయొక్క రూపాంతరము. "ఉ. ఈడితశక్తి నంగజగతీశ్వరుసైనికులట్టు చెండుబెఁ, డాడఁగ నాత్మసైనికచయంబు కకావికలై కలంగియు, ప్రీడతఁబాలుఁజొచ్చుటయు." కళా. ౮, ఆ.
కకుత్తు. సం. వి. ద్. స్త్రీ. 1. ఎద్దుమూఁపురము; 2. రాజచిహ్నము. విణ. శ్రేష్ఠము.
కకునము. సం. వి. అ. పుం, న.——వై.——
కకుద్మంతము. సం. వి. త్. పుం. ఎద్దు. విణ. గొప్ప మూఁపురముగలది.
కకుద్మతి. సం. వి. ఈ. స్త్రీ. శ్రోణి, పిఱుఁదు.
కకుప్పు. సం. వి. భ్. స్త్రీ. 1. దిక్కు; 2. శోభ; 3. సంపెఁగదండ; 4. అల్లినజడ.
కకుభము. సం. వి. అ. పుం. 1. ఏఱుమద్ది; 2. వీణె కరివె; 3. రాగభేదము.
కక్కపాల. వై. వి. కకపాల. "ఎ, గీ. కక్కపాలయుఁ గక్షభాగమునఁబూని." విక్ర. ౨, ఆ.
కక్కరము. వై. విణ. కఱకు. "ద్వి. ఎక్కుడుముడిగిబ్బరియెమ్ములుసొమ్ము, కక్కరంబగుతోలుకట్టెడు వలువ." భాగ. ౪, స్క౦.
కక్కసపడు. వై. అ. క్రి. (కక్కసము+పడు.) 1. బాధపడు; 2. సంకటపడు. (చూ. కక్కసించు. కక్కసము.)
కక్కసపెట్టు. (కక్కసము+పెట్టు.) ద్వి. స. క్రి. 1. బాధపఱచు. "వ. ఇక్కరణిరక్కసులంగక్కసపెట్టి." రామా.౮,ఆ.—2. సంకటపఱచు. (చూ. కక్కసము.)
కక్కసము. వై. వి. 1. కళ. "కక్కసంబులఁ సదసదగాఁగ వ్రేసియును." జై. 4, ఆ.—2. బాధ*; (చూ. కక్కసించు.)—3. సంకటము*. "క. చేరినఁగాసారాఖ్యుఁడు, రారమ్మనిమిగులనాదరమ్మునఁబోటిం, పారనొసఁగెఁగక్కసమని, గోరపడకయివినుసాత్వికులచరితంబుల్." పర. ౧, ఆ.

—విణ. 1. కఠినము; "ఉ. ఈకక్కసపుందనంబు కొఱగాదనిసారెకుబుద్ధిచెప్పినన్." ఉ, రా. ౭, ఆ.—2. కష్టము*. "క. ఒక్కనివిరివికినెదొరల్, పెక్కండ్రెుక్కనొకని వెంబడినడుగుల్, పెక్కండ్రునిలువఁబనులగుఁ, గక్కసముకుదింపఁ బెంపఁగాఁగాకుండున్." ఆము. ౪, ఆ.

కక్కసించే. వై. స. క్రి. 1. బాధించు*; "ఉ. పోయినపిమ్మటంజనక పుత్త్రివదల్పులఁ గక్కసింపఁగాఁ, బోయెడురాక్షసీనిచయముంగని." రామా. ౬, ఆ.—2. సంకటపరచు*. (చూ. కక్కసము.)

కక్కిరిబిక్కిరి. దే. విణ. తాఱుమాఱు.

కక్కు. దే. స. క్రి. 1. కడుపులోనిది వెలిపుచ్చు; 2. వెడలించు. "సీ. సరకుసేయమియునుసభలోనులూకునిఁ బంచియాడించినపరుసఁదనముఁ, గక్కించి." భార. భీష్మ. ౨, ఆ.—వి. అంపముతాయిలోనగువానికిఁగలుగఁజేసెడుగఱుకు. (ఈయర్థమందిది కఱకుయొక్కమాఱురూపము.)

కక్కుఁదెవులు. దే. వి. (కక్కు+తెవులు.) వ్యాధివిశేషము.

కక్కుడు. దే. వి. కక్కుట.

కక్కుఱితి. దే. వి. 1. అశ్రద్ధ; 2. లోభము. "చ. కిఱుకులఁబెట్టివీరినడకించితొలంగెద మన్నవట్టిక, క్కుఱితియకాని దైవమనుకూలముగాదు." జై. ౬, ఆ.

కక్కుఱితికాఁడు. దే. విణ. 1. అశ్రద్ధగలవాఁడు; 2. లోభి. "ద్వి. కడఁగిపీనుఁగుమీఁదఁగంచంబు పెట్టి, కుడువఁగాఁజూచు కక్కుఱితికాఁడీతఁడు." హరిశ్చ. ౨, భా.

కక్కువాయి. ద్వ. వి. కాసరోగవిశేషము.

కక్కెర. వై. వి. పక్షివిశేషము. "గీ. గ్రద్దయును గాకికముఁజానుగక్కెరయును." హరిశ్చ. ౨,ఆ. (క్రక్కెరయొక్కరూపాంతరము.)

కక్ష. సం. వి. ఆ. స్త్రీ. 1. కచ్చె; 2. పోటి. అ. పుం. ము. 1. చంక; 2. కసిము; 3. గడ్డి; 4. పొద; 5. ఎండినయడవి.

కక్షపాల. సం. వి. ఆ. స్త్రీ. కకపాల. "ఎ. గీ. అక్షమాలనువస్తులకక్షపాల." సా. 3, ఆ.

కక్ష్య. సం. వి. ఆ. స్త్రీ. 1. తొట్టికట్టు; 2. మొలనూలు; 3. ఏనుఁగునడుమునఁగట్టెడుమోకు; 4. వాఁకుడు†.

కగ్గము. వై. వి. కత్తి, ఖడ్గము.

కచ. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడేనుఁగు. అ. పుం. ము. 1. వెండ్రుక; 2. కట్టు; 3. ఎండినపుండు. డు. బృహస్పతికొడుకు.

కచంకనము. సం. వి. అ. న. నిర్ణయింపఁబడినదినమునందుంచెడి యంగళ్లవరుస, సంత.

కచంగల. సం. వి. ఆ. స్త్రీ. జంతువులు మిక్కిలి తఱచుగాఁగలనేల.

కచిక్కు. దే. వి. పొడుచుటయందగు ధ్వన్యనుకరణము. "ద్వి. చికటారిఁగొందికచిక్కునఁబొడిచె." విష్ణు. ఉ. ౪, ఆ.

కచేలము. సం. వి. అ. న. జాబుమడుపు.

కచేరి, కచ్చేరి. హిం. వి. కొలువుకూటము, ఉద్యోగశాల.

కచోలము. సం. వి. అ. పుం. మానవిశేషము.

కచ్చరము. సం. విణ. (అ. ఆ. అ.) మయిలది.

కచ్చా. హిం. విణ. పచ్చి, తక్కువ, నీచమైన.

కచ్చి. దే. వి. (సాలెవాఁడు) లేక కొయ్యలను పడుగునందుఁ జొప్పించెడు సందు.

కచ్చించే. యు. దే. స. క్రి. సారెలులోనగువాని నడపు. వై. అ. క్రి. కచ్చఁగట్టు. "క. కచ్చించిమల్లులిద్దఱు, మచ్చరమునులావు మెఱయమత్తకరులరెం, డిచ్చఁజనుదెంచుచాడ్పున, నచ్చటికేతెంచినిలిచిరధిపతియెదురన్." హరి. పూ. ౯, ఆ.

కచ్చిక. దే. వి. కాలిన పిడకతునుక.

కచ్చితము. వై. విణ. ఎచ్చుతక్కువలులేక సరిగానుండునది*.

కచ్చియ. వై. వి. కలహము*

కచ్చె. వై. వి. కచ్చియయొక్కరూపాంతరము.

కచ్చెపోతు. ద్వ. విణ. కలహశీలుఁడు.

కచ్చేరి. వై. వి. 1. న్యాయవిచారణస్థలము; 2. వినోదగోష్ఠి*.

కచోరము. వై. వి. కచ్చూరకము†. (దీనినే గంధకచోరమందురు.)

కచ్చె. వై. వి. 1. వెనుకఁజెక్కుకొనెడు దోవతికొంగు; 2. కాసె*; "గీ. కచ్చయమరఁబట్టికాళ్లును జేతులు, వ్రేలమత్తగజములీల మెఱయ, ముష్టిబలువు నెఱయముక్కునవాతను, నెత్తురొలుక మల్లునెత్తివైచె." భార. విరా. ౨, ఆ.—3. గోఁచి*. "సీ. మొలకచ్చకట్టుపైమలఁగినపచ్చనినునుఁగొంగుదిండుగామలిచికట్టి." హరి. పూ. ౭, ఆ.

కచ్చేడము. యు. దే. వి. దూదిజీలకఱ్ఱలోనగువానిం దెచ్చెడుబండి. వై. కాపీనము. "ఎ, గీ. ఇనుప కచ్చడాల్ కట్టుకొనుమునిముచ్చులెల్ల." స్వా. ౨, ఆ.

కచ్చే. యు. దే. స. క్రి. సారెలులోనగువానినడ

పు. వి. 1. గర్వము; "సీ. వరుసతోనోషధీవల్లీ మతల్లులు కాంతివైభవలక్ష్మికచ్చువదల." కాశీ. ౧, ఆ.—2. ఉకు; "ఉ. పంచశిలీముఖుండు తుదబాణమునన్ జగమెల్ల గెల్చియ, భ్యంచితపుష్పవృష్టి మరుదావళినింపఁగనిప్పుడల్లుము, డ్రించినజాడఁ దెల్పెసుదతీమధుపంబుపరిచ్ఛదచ్ఛటా, కంచుకితోత్పలంబుతుదకచ్చునఁజిక్కియ చంచలాకృతిన్." వసు. ౪, ఆ.—3. సిగబంతి. "ఎ, గీ. భానుబింబంబుపొడిచెఁబ్రభాతలక్ష్మి, కబరిభారంబుమీఁదిచెంగలువకచ్చు." కాశీ. 3, ఆ.—4. పెద్ద వాసాము. వై. ఆస. "సీ. క్షీరోదమధ్యస్థతీరత్న నగగుహాగర్భనివాసంబుకచ్చువదలి." పాండు. ౨, ఆ.

కచ్చేకొను. దే. స. క్రి. ఆశించు. "వారలీమేలంబుల్ పచరించికచ్చుకొనిరే." రసి. ౫, ఆ.

కచ్ఛ. సం. వి. ఆ. స్త్రీ. 1. చిమ్మట; 2. ఒకమాతృక. (చూ. మాతృక.) అ. పుం. ము. 1. వెనుకచెక్కు కొనెడుదోవతికొంగు; 2. గోఁచి; 3. కసెము; 4. ఓడయంగము; 5. దరి; 6. పూఁదోఁట; 7. ప్రక్క; 8. నందివృక్షము.

కచ్ఛటిక. సం. వి. ఆ. స్త్రీ. కాపీనము, గోఁచి.

కచ్ఛపము. సం. వి. అ. పుం. 1. తాఁబేలు; 2. ఒక నిధి; 3. మల్లబంధవిశేషము.

కచ్ఛపి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుతాఁబేలు; 2. సరస్వతియొక్కవీణె; 3. మొటిమ.

కచ్ఛుర. సం. వి. ఆ. స్త్రీ. 1. గంట్లకచోరము?; 2. రెగడిదూల?; 3. వాఁకుడు?.

కచ్ఛురుఁడు. సం. వి. అ. పుం. జారుఁడు. విణ. గజ్జిగలవాఁడు.

కచ్ఛువు. సం. వి. ఊ. స్త్రీ. విచర్చిక, గజ్జి.

కచ్చూరకము. సం. వి. అ. పుం. గందకచోరము?.

కచ్చూరము. సం. వి. అ. పుం. గంట్లకచోరము?.

కజ్జలము. సం. వి. అ. న. 1. కాటుక; 2. చీఁకటి. పుం. మబ్బు.

కజ్యా, ఖజ్యా. హిం. వి. పోరు, జేగడము.

కజాయము. వై. వి. కజ్జాయము, భక్ష్యము. "కజాయంబులిందెన్నేనున్న విక్రొత్తయట్టికల." పాండు. ౪, ఆ. (కజ్జెముయొక్క రూపాంతరము.)

కజ్జెము. వై. వి.——వై.——"కజ్జంబులును బండ్లు గంధమాల్యంబులు ధృతరాష్ట్రసుతులువుత్తేర." భార. ఉద్యో. 3, ఆ.

కజ్జాయము. వై. వి. (కజ్జెముయొక్క రూపాంతరము.)

కజ్జూరము. వై. వి. ఖర్జూరము?. "మ. సురపొన్నల్ కలిగొట్లు చందుగులు కజ్జూరంబులబ్బెందలున్." య. ౫, ఆ.

కట. దే. అవ్య. సంతాపమును దెలుపును. "గీ. కట వియోగిలోకంబులుకటకటఁబడ." సా. ౨, ఆ. (రూ. కటా. ఆమ్రేడితమందు కటకట, కటకటా.)

కటంబకుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) కూరలువండెడువాఁడు.

కటంభర. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడేనుఁగు; 2. కటుకరోహిణి?; 3. గొంతెమగోరు?.

కటకట. దే. వి. కొఱుకుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. (పండ్లు కటకటకొఱికెను.) (చూ. గోండ్రించు.)

కటకటఁబడు. ద్వ. అ. క్రి. (కటకట+పడు.) 1. కోపించు; "గీ. అనినఁగటకటఁబడియిట్టులాడుకెల్ల, నతనివిజయముసందియమనుటగాదె." సం. "ఇత్యుక్తః కుపితో రాజా మత్స్యః పాండవ మబ్రవీత్." భార. విరా. ౫, ఆ.—2. బాధపడు. "క. వందిజనంబులుమాగధ, బృందంబులు సంస్తుతింపఁబెంపొందుచుమ్రో, లందిరిగెడు క్రవ్యాదుల, క్రందున నీవీను లిపుడు గటకటఁబడవే." భార. ద్రో. ౨, ఆ.

కటకటాలు. దే. వి. బ. ఇనుపకమ్ములులోనగువానిచే నేర్పఱచెడియడ్డు, (రూ.) కటకటాకమ్ములు.

కటకము. సం. వి. అ. పుం, న. 1. కడియము; 2. కొండనడుము; 3. ఏనుఁగుకొమ్మునకు వేసెడు పొన్ను; 4. రాజధాని; 5. సముద్రమునందుఁగలిగెడి యుప్పు.

కటకరము. వై. వి. గంధర్వమృగము. "సీ. గంధర్వమానుగడంతికటకరమంచనఁగాను." ఆం. భొ. ద్వి. సిం.

కటకాముఖము. సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము. (జొట్టన నడిమివ్రేళ్లసందునఁ బొటనవ్రేలుచూపించి యఱచేతిచాయవ్రాల్చి యుం

గరపుద్రేలిని జిటికెనద్రేలిని నించుకంతవంచి పొడవుగాఁబట్టినది.)

కటకారుఁడు. సం. వి. అ. పుం. 1. చాఁపలల్లువాఁడు; 2. మేదరవాఁడు.

కటపెట. దే. వి. ఒరయుటయందగు ధ్వన్యనుకరణము. "ద్వి. కఠినోరుదంష్ట్రలుకటపెటనొరయ." భాగ. ౭, స్కం.

కటభి. సం. వి. ఈ. స్త్రీ. 1. మానేరుతీఁగ; 2. ఒకానొక మ్రాను.

కటము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగుచెక్కిలి; 2. చాఁప; 3. అతిశయము; 4. పీనుఁగు; 5. ప్రతిజ్ఞ; 6. మొల; 7. శ్మశానము.

కటాక్షము. సం. వి. అ. పుం. 1. కడకన్ను, 2. కడకంటిచూపు.

కటాక్షించు. సం. స. క్రి. కడకంటఁజూచు.

కటాదము. సం. వి. అ. పుం. మహిషము, దున్నపోతు.

కటారి. వై. వి. 1. కత్తి. "చ. కలకలనవ్వుచున్నృపశిఖామణిపొన్నుగనీబులోనియి, ట్టలపుమెఱుంగుచాయల బెడంగుకటారి జరీనదూసిమంత్రులుగనశూద్రులుస్తముకఱుక్కునఁద్రుంచె." ఉ. రా. ౭. ఆ.—2. బాఁకు. "కలికిమిటారియంగజుకటారి." శశాం. ౪, ఆ.

కటారికత్తియ. వై. విణ. కటారిగలది. (ఆఁడుది.) "ఒక్కొకతెఱింబువుఁబోండ్లుకటారికత్తియల్." కళా. ౧, ఆ. (రూ. కటారికత్తె.)

కటారికాఁడు. వై. విణ. కటారిగలవాఁడు "బిరుదుకటారికాండ్రు." కళా. ౮, ఆ.

కటారు. వై. వి. కత్తి. "చ. భర్తయున్, శరమొకటేసి త్రెళ్లకవెసన్నిగుడన్ నఱకెంగటారునన్." "గీ. చొచ్చెఁగొలఁకునెలకు. మారుపై మారుఁ డనుచు కటారుఁబోలి." ఉ. రా. ౭. ఆ. (ఈ గ్రంథకర్త ప్రయోగములయందుమాత్రమిది యుకారాంతముగాఁ గానఁబడుచున్నది.)—2. బాఁకు.

కటాహము. సం. వి. అ. పుం 1. నూనెలోనగు వికాఁచెడి కడవ; 2. కప్పెర; 3. తాఁబేటిపెన్నుచిప్పు; 4. ఒకానొక దీవి; 5. అప్పుడే కొమ్ములు తలచూపెడి యెనుపదూడ.

కటి. సం. వి. ఇ. స్త్రీ. మొల. ఈ. స్త్రీ. పిప్పలి†.

కటిక. వై. వి. మాంసమమ్మువాఁడు. "గీ. కటికవానిల్లునాటికిఁగన్నపెట్ట." భల్లా. ౧, ఆ.—2. వెండిబెత్తమువాఁడు*. "వ. బంగారుజలపోతబెత్తంబులనటనఘుటియిల్లఁగటికవారుసారెకు బరాబరిసేయుచునేగుదేర." కళా. ౭, ఆ. (కట్టికయొక్క రూపాంతరము.) (చూ. కట్టిక.)

కటికమేకము. వై. వి. ఖడ్గమృగము.

కటికి. దే. విణ. 1. అధికము. "కటికినవ్వు."—2. కఠినము. "కటికినేల."—3. సాంద్రము. "కటికిచీఁకటి."

కటినము. సం. వి. అ. న. పత్రఫలాదులుంచెడుబుట్ట.

కటిల్లకము. సం. వి అ. పుం. 1. కప్పు; 2. కాఁకర†; 3. నల్లగగ్గర†.

కటీరము. సం. వి. అ. పుం. మొల. "సీ. పట్టసూత్రమయంబుపసిఁడియొడ్డాణమేయిగురుఁబోఁడి కటీరమెక్కె నొక్క." కాశీ. ౪, ఆ.

కటుంభర. సం. వి. ఆ. స్త్రీ. కటుకరోహిణి†.

కటుక. సం. వి. ఆ. స్త్రీ. కటుకరోహిణి†. అ. న. ము. సొంటి పిప్పలి మిరియములు.

కటుక్కు. దే. వి. కొఱుకుటయందగుధ్వన్యనుకరణము.

కటుతుంబి. సం. వి. ఈ. స్త్రీ. చేఁదుగల సొర†.

కటుమరలు. దే. వి. బ. చెక్కిళ్ల మీఁదిభాగములు, హనువు. "సీ. తళుకుఁజెక్కులు వెల్లఁదనము మెల్లనఁదాల్చెఁ గనరానికటుమరల్ పెనుపునొందె." చంద్రా. ౧, ఆ.

కటురోహిణి. సం. వి. ఈ. స్త్రీ. కటుకరోహిణి†.

కటువు. ఉభ. వై. వి. పాడె. సం. వి. ఉ. స్త్రీ. 1. కటుకరోహిణి†; 2. నల్లావ; 3. ప్రేంకణము†. న. కానిపని. పుం. 1. కారము; 2. వాసన. విణ. 1. ఇంపుకానిది; 2. కారముగలది; 3. మచ్చరముగలది; 4. వాఁడిమిగలది; 5. వాసనగలది.

కటోలవీణ. సం. వి. ఆ. స్త్రీ. మాలవీణె, కిన్నెర.

కట్ట. దే. వి. 1. మోపు; 2. చెఱువులోనగువానికట్ట. అవ్య. సంతాపమునుదెలుపునది, (రూ.) కట్టా.

కట్టకడ. దే. వి. (కడ+కడ.) అన్నిటికిఁగడ.

కట్టడ. దే. వి. 1. నియమము; "క. ఏయేకట్టడలెవ్వరి, కాయాకట్టడలుతప్పకధిపతిప్రజలన్, నాయమునఁబ్రోవవలయుఁగ్రూ, పాయుతుఁడైతస్కరాదిబాధలఁడుపుచున్." కళా. ౭, ఆ.—2. తీరు. "క. వీరలమునివేషంబుల. కారణమునఁగాకయొడలికట్టడయుముఖ, శ్రీరామణీయకంబును, హీరమణునియట్లకాదెయిరువురకరయన్." నిర్వ. ౧౦, ఆ.

కట్టడచేయు. దే. స. క్రి. ఆజ్ఞాపించు. "మ. జననీ భూపతిధర్మనందనునియజ్ఞంబర్థిలింజూడఁగో, రిన నుంగట్టడచేసెఁబట్టణము వారింగొంచుఁబొమ్మం చు." జై. ౨, ఆ.

కట్టనము. దే. వి. 1. కానుక; "సీ. గాండీవికిని మేలు కట్టనంబుల మర్చి స్వర్ణపేటికలందు సంఘటించి." జై. ౭, ఆ.—2. బంధనము. "ఉక్కుటులులరాక ట్టనపు టెడల్ గైకొనినఁబుకుట." హరి. ఉ. ౨, ఆ.

కట్టరము. వై. వి. నాట్యబంధము, (చూ. కంట.)

కట్టిఁడి. దే. విణ. (కట్టు+ఇఁడి.) క్రూరుఁడు. "శా. ఆనీచుండొకనాడువాఁడిమిఁజతుర్వ్యాధాన్వి తుండై పెనుం, గానందెర్వ్లులుగట్టియేగు ప్రజలం గట్టిండిమైదోఁచినీ, గానన్ రోయుచునుండె డ ప్పిగొనిమధ్యాహ్నతపాపాతజ, గ్లానిందత్సమ యార్తకాసరముఁబోలంజాలినల్దిక్కులన్." పాం డు. ౫, ఆ.

కట్టిక. వై. వి. వెండిబెత్తమువాఁడు*. "ద్వి. కోఁతి కట్టికలుసాఁగుబళాయనంగ, నేతాముపలెఁదా రుఁడేతెంచి మ్రొక్క." రా. కిష్కిం, కాం.

కట్టియ. వై. వి. 1. కాష్ఠము; 2. దండము; "క. క ట్టియఁజేకొని డేగం, బట్టియుబుసుపోకఁబాల ముఁబట్టినఁజాలున్, దొట్టిన క్రొవ్వులుగలయవి, చెట్టడిచినఁజేటెఁడేమిచెప్పంబులుఁగుల్." స్వా. ౪, ఆ.—3. బాణము*. "ఉ. కట్టియవైచెనెన్న దురుగాఁడభవత్తనయుండుమాద్రి లేఁ, బట్టిని." భార. శల్య. ౧, ఆ.

కట్టు. దే. అ. క్రి. 1. (ఆవులోనగునది) గర్భము ధరించు; 2. నిబద్ధమగు. "కట్టువిణ్మూత్రములు." మార్క. ౨, ఆ. (అంచెలుగట్టు, అంటలుగట్టు, అట్టుకట్టు, కరుడుకట్టు, కాలువలుగట్టు, గెలలు గట్టు, ఇత్యాదులయందిది అగుధాత్వర్థకమని యెఱుంగవలయు.)—స. క్రి. 1. బంధించు; 2. ఆ రోపించు; "క. దోషరహితకన్యకపై, దోషంబు లుగట్టిరిత్తదూషించిన." విజ్ఞా. ఆచా, కాం.—3. కూడఁబెట్టు; "క. మున్ కట్టినకర్మఫలఁబులు, నె ట్టనభోగింపకుండ నేర్తురమనుజుల్." భార. ఆది. ౫, ఆ.—4. నిర్మించు; (ఇల్లుకట్టు లోనగునది.)—5. (వస్త్రము) ధరించు; "సీ. కట్టంగఁదోడఁబుయ్యఁ బెట్టఁగొఱంతలేకానందమందెడునర్థులందు." ని ర్వ. ౧, ఆ.—వి. 1. బంధము; 2 తొట్టికట్టు; 3. వస్త్రధారణము; "కాళ్లయొప్పిదమాఁడుకట్ట నుజ్జ్వలముచేయంగ." భార. విరా. ౧, ఆ.—4. నిబంధనము; 5. నిర్బంధము; 6. ప్రదేశము; "ఉ. ఓర్తులతాంగి కేపెదు, ర్కట్టునముంగిటంగసవు గాండ్రయుఁబుచ్చుచుఁజేతిచీఁపురుం, గట్టయుఁ దాను జొచ్చెఁగఱకంఠుని నోంకృతివాదదేవు నిన్." కాశీ. ౬, ఆ. (ఇట్లు చనుకట్టులోనగున వి.)—7. మితి; "క. ఏడన్ మీకొలమింటన్, జాడము ముంగురులఁగూడుచుం గొనబునని, ట్లీ డేటికట్టుతప్పిన, చేడియ నిఁకనైనఁబెండ్లిసేయం దగదే." య. 3, ఆ.—8. ఉడికిసకందిపప్పులో నగువానిరసము, యూషము; 9. (పొల్లయొక్క) సమూహము. "గీ. సామరదిన్పృత్తుఖర్జరత్కుపిశా చ, పుంజమహీభుక్పతత్ర ప్రభంజనములు, సోఁక వెఱఁబాఱెఁగళ్లానశూర్పవాత, ఘట్టనలఁబాఱు పెనుఁబొల్లకట్టువోలె." ఆము. ౪, ఆ.

కట్టుఁగంబము. ద్వ. వి. (కట్టు+కంబము.) ఏనుఁగు లోనగువానిఁ గట్టునట్టి స్తంభము. "గీ. కట్టుఁగం బంబువిఱుచును గ్రంపుగజము." హరి. పూ. ౯, ఆ. "వ. పసపార్చికట్టుఁగంబంబులకుందార్చిబం ధించిన." (ఇక్కడ కుక్కనుగట్టు నట్టి స్తంభము.) స్వా. ౪, ఆ.

కట్టుఁగొంగు. దే. వి. (కట్టు+కొంగు.) కోకయొక్క కట్టుకొను చెఱఁగు.

కట్టుఁగొమ్మ. దే. వి. (కట్టు+కొమ్మ.) అనకట్ట.

కట్టుఁగొయ్య. దే. వి. (కట్టు+కొయ్య.) నాఁగటిమేఁడి.

కట్టుఁగోక. దే. వి. (కట్టు+కోక.) మొలనుధరించెడు వస్త్రము, అంతరీయము. (ఇట్లు కట్టుబట్ట లోన గునది.)

కట్టుక. దే. వి. గర్భస్రావము.

కట్టుగడ. దే. విణ. చేర్చిపెట్టినది. (ధాన్యము.)

కట్టుగొఱ్ఱు. దే. వి. (కట్టు+కొఱ్ఱు.) పసులను గట్టు టకు కళ్లమునఁ బాఁతినగుంజ, మేధి.

కట్టుదొన. ద్వ. వి. కోనేఱు. "సీ. తనచరిత్రామృత మునకుముజ్జగములజనులవీనులుకట్టుదొనలుగాఁ గ." చంద్రా. ౫, ఆ.

కట్టుపకాసి. ద్వ. వి. రణోద్యుక్తుఁడైన శూరుఁడు. "ఉ. కట్టుపకాసి దీర్ఘదృఢకాయుఁడు తత్ప్రతి వీరపాలకుండు." నిర్వ. ౪, ఆ.

కట్టుపకాసు. దే. విణ. అచలుఁడు. "చ. కనుఁగొ నిపార్థుఁడుండపుడు కట్టుపకాసయి వీఁకఁదాఁకి నన్." భార. భీష్మ. ౨, ఆ.

కట్టుపడు. ద్వ. అ. క్రి. బద్ధమగు.

కట్టుపాటు. ద్వ. వి. 1. కట్టుపడుట; 2. నిబంధనము.

కట్టుబండి. దే. వి. సకలపరికరసహితమైన శకటము. "ఉ. మొన్న మేరుగిరిపాటినిశాచరినంతచేసెనే, డేపునఁగట్టుబండి నిదెయిందఱుఁజూడఁగనింత చేసె." వి. పు. ౭, ఆ.

కట్టుబడి. దే. వి. బంటునకిచ్చెడుమాన్యము. "సీ. ఇగురుకై జీతపుటెక్కటీలకు గుజ్జుపఱపుమామిడి కట్టుబడిగఁజేసి." చంద్ర.

కట్టుమట్టు. దే. వి. 1. పసులనుగట్టుచోటు; (దీని నీ యర్థమందు కట్టుముట్టని వాడుచున్నారు.) 2. ఉనికితావు; "సీ. పాకారిముఖ్య దిక్పాలక నిలయంబు గ్రహతారకంబులకట్టుమట్టు." భల్లా. 3, ఆ.—3. ఏర్పాటు. "వ. దుష్టనిగ్రహశిష్టపరిగ్రహంబుగానప్పట్టణంబుసుగ్రీవాజ్ఞనడవంగట్టుమట్టుచేసి." రామా. ౫, ఆ.

కట్టుమామిడి. దే. వి. చిలుకలులోనగునవి కొఱకకుండ పండ్లుమూసికట్టఁబడిన మామిడి†.

కట్టుమ్రాను. దే. వి. తెప్ప, ప్లవము.

కట్టువ. దే. వి. వెలుగు, వృతి. "సీ. ఆటతిప్పలుప్రచ్చిపాటబండులుగూల్చికట్టువలన్నియుఁగాడు చేసి." అచ్చ. సుం, కాం.

కట్టె. వై. వి. కట్టియయొక్క రూపాంతరము.

కట్టెడ. దే. వి. ఎడనెడ కట్లుగల సర్పవిశేషము.

కట్టెపాఁపర. ద్వ. వి. ఒకానొకచెట్టు.

కట్టెవిఱుపుమాట. ద్వ. వి. పరుషవచనము, కఠినోక్తి.

కట్నము. దే. వి. కానుక. "క. నానాదేశంబులధర, ణీనాథులుగట్నమిచ్చి సెలవుఁబుత్తేరంగా." హరి. పూ. ౮, ఆ. (కట్టనముయొక్క రూపాంతరము.)

కట్ఫలము. సం. వి. అ. పుం. పినగుమ్ముడు†.

కట్వ. వై. వి. ఒకానొకతీఁగ, ఖట్వ†.

కట్లంక. దే. వి. పరుసడ్డలపైనుంచెడి యొంటెగుడ్డ.

కట్లగుదియ. ద్వ. వి. ఆయుధవిశేషము, ముసుండి.

కట్లజెట్టి. దే. వి. కట్లుగల పెద్దజెట్టి.

కట్లదండ. దే. వి. ఎడనెడ బంగారుకట్లుగ్రుచ్చిన నల్లపూసల సరము.

కట్లపురుగు. ద్వ. వి. సర్పవిశేషము.

కట్లబల్ల. ద్వ. వి. (కట్లు+బల్ల.) కత్తెరకాళ్లమడుపు బల్ల.

కట్లమారి. దే. విశే. కట్లుగలది. "సీ. కిన్నెరకాయలువన్నెవానిపియంచుఁ గట్లమారుల నుద్దిగట్టఁదగునె." చంద్ర.

కట్లసంచి. దే. వి. (కట్లు+సంచి.) చుట్టు అరలేర్పఱిచి కుట్టిన నిడుపాటి గుండుసంచి.

కట్లి. వై. వి. మంచేపుడోలి*.

కట్లియ. దే. వి. బంగారు తూనికగుండు.

కట్లె. దే. వి. కట్లియయొక్క రూపాంతరము.

కట్వాంగము. సం. వి. అ. పుం. దుండిగము.

కఠము. సం. వి. అ. పుం. కంఠస్వరము. 1. ఒకానొక ఋషి; 2. ఆ ఋషిచెప్పిన ఋక్కులను జదువువాఁడు; 3. ఆ ఋక్కులను దెలిసినవాఁడు.

కఠారము. సం. వి. అ. పుం. 1. కత్తి; "క. ప్రతిఘటియింపఁగవచ్చునె, ప్రతిభటులకు నసమసమరఘస్మరుతోడన్, శతకోటిదృఢకఠార, క్షతశాత్రవుతోడ లింగసచివునితోడన్." భీ. ౧, ఆ. "క. ఘోరక్రోధంబునన, వీరోత్తమునాజ్ఞనొక్క వెసనన్నక్తం, చారిణినప్పుడపట్టిక, ఠారంబునముక్కుఁజెవులుడగ్గఱిగోయన్." సం. "ఉద్ధృత్యఖడ్గంచిచ్ఛేదకర్ణనాసంమహాబలః." రా. అర. ౧, ఆ.—2. బాఁకు. "వ. కఠారకుఠారగదాదండభిండివాలకరవాలశూలముసలముద్గరతోమరచక్రాదినానాయుధపరివృతబాహుదండుండును." వీర. ౪, ఆ. "వ. కఠారంబులఁబొడిచియుఁగుఠారంబులనతికియు." రా. యు, కాం.

కఠింజరము. సం. వి. అ. పుం. నల్లగగ్గెర†.

కఠిన. సం. వి. ఆ. స్త్రీ. బెల్లపుచక్కెర. అ. న. ము. వంటకుండ. విశే. గట్టి.

కఠిని. సం. వి. ఈ. స్త్రీ. ఖటిక, బలపము.

కఠిల్లకము. సం. వి. అ. పుం. 1. కప్పు; 2. కాఁకర†. 3. నల్లగగ్గెర†.

కఠిల్లు. దే. వి. హరియందగుధ్వన్యనుకరణము. "వ. పరిహసితసితేతరపాషాణపాటవంబులగు విషాణపరిఘంబులొండొంటిందాఁకి కఠిల్లు పెఠిల్లు మనంబోరు కాఱుపోతుల కోలాహలంబులం బ్రతిశబ్దంబులీనుకొనలును." స్వా. ౪, ఆ.

కఠోరము. సం. విశే. (అ. ఆ. అ.) కఠినము, గట్టి.

కడ. వై. వి. 1. దిక్కు; "గీ. రిక్కరాయఁడుతమిమీఱరేవెలందిఁ, బెండ్లియగుననికడయను పేరఁటాలు, మొనసియైరేనినీటికైముంచుపసిఁడి, కుండయనఁబ్రొద్దుమున్నీటఁగ్రుంకెనంత." అచ్చ.

ఆర, కాం.—2. అంతము*; "సీ. నిడుపునఁదూరుపుఁబడమరయై రెండు కడలునంబోనిధిఁగదిసియుండు." భార. భీష్మ. ౧, ఆ.—3. దూరము*; "వ. ప్రాణవల్లభుండున్న వనంబునకరిగి కడనయుండి పరికించి." కళా. ౪, ఆ.—4. పార్శ్వము*; "సీ. హాయము క్రేళ్లు ఉకు గోయని రెండుకడలందు వాగెవట్టిరిమత్స్యవత్సపతులు." కళా. ౭, ఆ.—5. సమీపము*; "క. కడునసురక్తియు నేర్పును, గడఁకయుఁగలవారినుఅకగడనఁగనెగ్గుల్, నొడివెడువివేకశూన్యుల, కడనుండెడునంతకంటెఁ గష్టముగలదే." అను. 3, ఆ.—6. స్థానము*. విశే. అంత్యము*. "వ. ఎయ్యదికడగానిమ్ముల్లఘుండన గుదు." భార. శాం. ౧, ఆ.

కడంగరము. సం. వి. అ. పుం. 1. పొల్లు; 2. పొల్లు కసవు.

కడంగరీయము. సం. వి. అ. పుం. పొల్లుకసవు మేసెడి యెద్దు.

కడంబము. సం. వి. అ. పుం. కలంబము, కూరనార.

కడఁక. దే. వి. యత్నము. "ఉ. దానినం, టందటి మెక్ వరాహము కడంక నదశ్శిత మయ్యె న య్యెడన్." విక్ర. 3, ఆ.

కడకొఅవి. దే. వి. కాలిమిగిలిపొగసెడికట్టె. "క. జ్ఞాతులుతమలోఁబొందినఁ, జేతో మోదమునఁజెలఁగి చెలువొందుదుర, న్నీతింబాసినవిగతవి, భూతిం గడకొఅవులట్ల పొగయుదురధిపా." భార. ఉద్యో. ౨, ఆ.

కడఁగు. దే. అ. క్రి. యత్నించు. "క. మునినాథనీ వుమునుము, ట్టనె చెప్పినఁజాలుమతికడంగఁడు." ఉ, హరి. ౫, ఆ.

కడఁజా. దే. వి. గోకర్ణమృగము. "సీ. గోకర్ణనామం బగునుగడంజుకడఁజునా." ఆం, భా. ద్వి. సిం.

కడఁత. దే. వి. కంటికడప్రక్కచోటు, కణఁత. "ఎ, గీ. కడంతయనఁగశిరఃపార్శ్వమంతకారి." ఆం, భా. ద్వి. మ.

కడఁతి. దే. వి. గంధర్వమృగము. "పులులంద్రుం చికడంతులందునిమి." శుక. ౧, ఆ.

కడఁబడు. ద్వ. అ. క్రి. (కడమ + పడు.) తగ్గు. "క. హరిసూకరరూపంబున, హరిణాదిమృగాకృతుల మహర్షులజంబై, హరసుతుఁడు పూజ్యులైయుం, డరె వారలగౌరవము కడంబడియెనొకో." పంచ. వేం. ౧, ఆ.

కడకుఁబోవు. ద్వ. అ. క్రి. (కడకున్+పోవు.) బహిష్ఠయగు.

కడకొఅవి. దే. వి. కాలఁగామిగిలినకట్టె. "ద్వి. పొంతయొల్కలలోనఁబొడవడికాలి, కొంతచిక్కిన కడకొఅవులఁదెచ్చి." హరిశ్చ. ౨, భా.

కడగండ్లమారి. దే. విశే. కష్టశీలుఁడు.

కడగండ్లు. దే. వి. బ. (కడ+కండ్లు.) కష్టము.

కడగట్టు. ద్వ. స. క్రి. (కడ+కట్టు.) నిర్ణయించు. "క. మునుమున్న కాదెయార్యులు, వినుతనిజజ్ఞానదృష్టివిధిఁదెరముగఁగ, న్గొనికడగట్టినవారీ, తనియాద్యశభావచేష్టితములఖిలములన్" హరి. పూ. ౮, ఆ.

కడగన్ను. ద్వ. వి. (కడ+కన్ను.) కటాక్షము.

కడగొట్టు. ద్వ. అ. క్రి. (కడ + కొట్టు.) చచ్చు. "మ. కడసెన్ దుష్పులుడింక వేసెనెలఁగుల్ గిట్టెన్ బులుల్ సింగముల్ కడగొట్టెన్." సా. ౧, ఆ.—విశే. కడపటి. (కడగొట్టుకొడుకు, కడగొట్టుచెల్లెలు. మొ.)

కడచను. ద్వ. అ. క్రి. 1. చచ్చు; "సీ. జననాథశల్యుండుసమసె సౌబలుఁడు గీటడఁగె నులూకుండుమడిసెసకల, సంశప్తకులుఁగడచనిరి." భార. శల్య. ౧. ఆ.—2. నశించు; "గీ. ఇట్లుచేసిశక్తియెల్లనుగడచన్న, నతఁడు నేలవ్రాలెనతిరయమున." భార. అను. ౧, ఆ.—3. ముగియు. "క. అనఘాయీయజ్ఞమువిధి, సనాథబుత్విక్ప్రయోగసంపూర్ణంబ, య్యనుగడచన నేరదునడు. మనయుడుగును భూసురోత్తమనిమిత్తమునన్." భార. ఆది. ౨, ఆ.—స. క్రి. దాఁటు. "క. వననిధినవలీలఁగడ, చనువానిప్రసాదమొంది సతులు గృహంబుల్, ధనములునఖిలసుఖంబులు, మనమారంగాంతురోలిమర్కటులెల్లన్." రా. కిష్కి. ౦, కాం.

కడచే. దే. అ. క్రి. 1. గతించు; "క. చింతింపకు కడచినపనికి."—2. చచ్చు; "క. మహాహవము నసె, వ్వనిచేజటాయువీల్గెను, ఘనుఁడాదశరథసఖుండుకడచెనెయకటా." రా. కిష్కి. ౦, కాం. —3. నశించు; "సీ. అలివేణివదనచంద్రామృతంబునఁగానికడచు నే మోహాంధకారభరము." భా. ను. ౪, ఆ.—4. మేరమీఱు; "ఎ. గీ. ధరణీధరములుగూలంగధరణివడఁక, జలధు లుప్పొంగిక

డవఁగ." మార్క. ౨, ఆ.—5. హెచ్చు. "క. వడిగల్గిహంసగతికిం, గడవఁబఱచువారును." భో. ౫, ఆ.—స. క్రి. దాఁటు. "గీ. అలసుమం తునివీడ్కొనియర్కవంశ, ఘనులుగంగాతరం గిణిఁగడచి." రామా. ౫, ఆ.

కడచుక్క. వై. వి. రేవతీనక్షత్రము.

కడతెగు. ద్వ. అ. క్రి. సమాప్తమగు. "క. ఉడుమం డలంబుదాఁకను, వడినేగితిఁగోటదాఁట వచ్చు నోయంచున్, గడతెగకయంతకంతకుఁ, బొడవ య్యెనునాకుదాఁటిపోరాదయ్యెన్." మై. ౨, ఆ.

కడతేఱు. ద్వ. అ. క్రి. 1. చచ్చు; "సీ. శార్దూల ముఖుఁడీల్గె స్తనితహస్తుఁడు సెల్లెదీర్ఘజిహ్వుఁడు గడతేఱిపోయె." అచ్చ. సుం, కాం.—2. తీఱు; "అట్లకాదే విరహజ్వరంబుకడతేఱుటె." భో. 3, ఆ.—3. సమాప్తమగు. "సీ. ధ్రువమండలంబు నరుంధతిఁగనుశక్తికంటికిఁగలుగంగఁ గానకున్న, ముక్కునపలపలఁజెక్కవాసినయట్లుదోఁచినఁబూ ర్ణచంద్రుండుమలినుఁ, డైకానవచ్చిననాయువు సంవత్సరంబునఁ గడతేఱురాజముఖ్య." భార. శాం. ౬, ఆ.

కడప. యు. దే. వి. ఇంటిగడప, దేహళి. (కొన్నిదే శములయందిట్లు పరుషాదిగా వాడుచున్నారు.) —వై. కదంబము*.

కడపల. వై. వి. అంతము. "ఎ. గీ. ఏది మొదలేదికడ పలయేది మధ్యము." భీ. ౬, ఆ.

కడపు. దే. ప్రే. 1. ఇయ్యకపొమ్మను; "ఏపట్టునన ర్థులంగడప." భో. 3, ఆ.—2. చంపు; "సీ. ప్ర క్కనిద్రితుఁడైన రాకొమారునిఁజేరి బిగియారఁ గుత్తుకపిసికికడపి." హరిశ్చ. ౫, ఆ.—3. త్రో లు; "అరదంబుదారకుండుగడప." ఉ. హరి. ౪, ఆ.—4. వదలు. "చ. నీయనుజులనల్వురంగడపు మర్జునుఁజేతకుసమ్మతించితిన్." భార. ఉద్యో. ౪, ఆ.

కడపుఁజేయి. దే. వి. (కడపు+చేయి.) చుక్కాని, అరిత్రము. "సీ. వైరిసైన్యాబ్ధిలోవచ్చు గెల్పుల నావఁగడఁజేర్చుప్రాఁకుడుఁగడపుఁజేయి." పా. ౧, ఆ.

కడమ. దే. వి. 1. కొఱఁత; "క. కడమయొకింతయు పలదని." హరి. ఉ. 3, ఆ.—2. శేషము. "క. మొదలఁగానాకుంగలిగిన, యదిశంఖసుదర్శనాం కనాదిసహితమై, పాదలెడిప్రపత్తియిఁకనడ, పె దఁగడమయుఁబడుచునిమ్ముప్రేమదలిర్పన్." ప ర. ౪, ఆ.

కడమపడు. ద్వ. అ. క్రి. కొఱఁతపడు.

కడముంత. ద్వ. వి. కొయ్యముంతవంటి చిన్నమట్టి పాత్రము.

కడముట్టు. ద్వ. అ. క్రి. 1. సమాప్తమగు; "సీ. తన సేవగాఁబురందరుఁడు గట్టించుకొంపులహజారము కడముట్టెనొక్క." కళా 3, ఆ.—2. సిద్ధించు. "క. నీవలనన కడముట్టిన, దైవతమహిమయును." పాండు. ౧, ఆ.

కడయొత్తు. ద్వ. వి. (కడ+ఒత్తు.) గృహవిశేషము యొక్క చుట్టుగోడయందలి కంబములమీఁది దూలము.

కడలి. దే. వి. మున్నీరు, సముద్రము.

కడలికూఁతురు. దే. వి. సిరి, లక్ష్మి.

కడలిఱేఁడు. దే. వి. నీటిరాయఁడు, వరుణుఁడు.

కడలివెన్న. దే. వి. చంద్రుఁడు. "రగడ. కడలివెన్న యువేఁడివేలుపుగాడ్పునగ్గియు నెల్లగాములు." అచ్చ. యు. కాం.

కడలు. దే. వి. అల. "సీ. తూలెడుపయ్యెదదుఃఖాం బునిధిలోనఁగడలుచందంబునఁగడలుకొనఁగ." హరి. పూ. ౯, ఆ.

కడలుకొను. దే. అ. క్రి. 1. అతిశయించు; "క. వి డువకకావేరినియెం, పదరన్స్నానంబుసేయున నఘులకు సిరుల్, గడలుకొను." శేష. ౪, ఆ.— 2. ఉప్పొంగు; "గీ. ఇవ్విధమునఁగృష్ణుఁడేగినపి దపటి, కథవినంగనాకుఁగౌతుకంబు, మనమునిం డిగడలుకొనుచున్నయదివివ, రించిచెప్పు ముని వరేణ్యయనుడు." భార. ఉద్యో. 3, ఆ. — 3. వ్యాపించు. (రూ. కడల్కొను. "వీఁకంగేస రంబుల్గడల్కొన." భార. ఉద్యో. ౨, ఆ.)

కడలొత్తు. ద్వ. అ. క్రి. (కడలు+ఒత్తు.) వ్యాపిం చు. "సీ. కరమూలములజిగికడలొత్తి." హరి. పూ. ౮, ఆ.

కడవ. వై. వి. పెద్దకుండ*.

కడవఁబడు. ద్వ. అ. క్రి. (కడవన్+పడు.) గతిం చు. "గీ. కడవఁబడిమున్నువహ్నిం, గడుకొనిప డినవియుకానిక్రూరుతులం, బడసీనింకన్." భార. ఆది. ౨, ఆ. (స్వార్థమునపడు.)

కడవతీటు. ద్వ. వి. వాద్యవిశేషము, తుడుము.

కడవసము. దే. వి. తోలు. "క. కడవసములుగోల లుగ, ప్పడములులీరలధనంబు." భార. ఆది. ౭, ఆ.

కడవాఁడు. ద్వ. విణ. 1. అన్యుఁడు; 2. కనిష్ఠుఁడు. "సీ. గారాపు మీతల్లికడవాఁడఁగానియేగణుతిం పఁగడవాఁడఁగాఁజుమయ్య." స్వా. ౫, ఆ.

కడవెళ్లు. ద్వ. అ. క్రి. సమాప్తమగు. స. క్రి. దాఁటు. "ఎ, గీ. విరహవారిధి నేఁగడవెళ్లుపెపుడు." ప్రభా. 3, ఆ.

కడపరము. దే. వి. శ్యేనవిశేషము. "సీ. కన్నెలేడుల మీఁదగాటంపుబీరంపుఁగడపరంబులఁజోఁపిగం డడంచి." రసి. ౧, ఆ.

కడాని. దే. వి. అపరంజి, తప్తకాంచనము.

కడారము. సం. వి. అ. పుం. గోరోజనమువంటి వర్ణము. విణ. గోరోజనమువంటి వర్ణముగలది.

కడాసము. దే. వి. కడవసముయొక్క రూపాంతరము. "సీ. చర్మనామముకడాసముకడవసమన." ఆం, భా. ద్వి. ప్ర.

కడి. దే. వి. 1. కబళము, 2. వాసన. "సీ. కడివోదు నాకిమ్ము పడఁతి యీగేదంగి ననఁగడివోమిముం దతికిఁజూడు." ఆము. ౨, ఆ.

కడిఁది. దే. వి. ఆపద. "క. అడిదాగుడనకయిప్ప టి, కడిఁదికినేమాంసమైనగ్రక్కునఁగొనిరం, డ డసేయకనుచుననిపినఁ, గడువడివలఁపురునుబో యిగహనములోనన్." పంచ. నా. ౧, ఆ.—విణ. 1. అధికము; "చ. ఆత్మశరీరకర్తనం, బనఘుఁడు చేసిచేసి తనయంగమునం గలమాంసమెల్లఁబె, ట్టినసుగపోతభాగమ కడిందిగ డిందుచునుండెన త్తులన్." భార. అర. 3, ఆ.—2. అశక్యము; "ఎ, గీ. నవసిపొవసి యనుదినముఁ బరప్రేష్యులై, యునికిదలఁపనర్థమునకచూపె, యట్టిదుఃఖల బ్ధమైనట్టియర్థంబు, విడుచుటెవ్విధమునఁగడిఁది కాదె." భార. అర. ౬, ఆ.—3. కఠినము. "చ. అనుపమముల్ రతిస్థురులయాటకు నర్హములంచుఁ గప్పిపె, ట్టినపువుబంతులీసతికడిందిచనుంగవ." కళా. ౭, ఆ.

కడికండలు. ద్వ. వి. బ. ఖండఖండములు. "ఖడ్గరో మునిమేనుకడికండలుగఁజేసి." య. 3, ఆ.

కడిగొను. దే. అ. క్రి. (కడి+కొను.) కబళించు. "క. మెచ్చినమచ్చికగలిగిన, నిచ్చిననీవచ్చుఁగాక యిచ్చనొరులకున్, జిచ్చుఁగడిగొనఁగవచ్చునె, చిచ్చుఅచూపచ్చుపడిన శివునకుఁదక్కన్." భా క. ౫, స్కం.

కడితము. వై. వి. ఘట్టించిన నీలపటపులెక్కపుస్తకము*. "ఉ. దక్కఁగవ్రాసితిన్ మనుపటమునయం దుసుశర్మపాపముల్, లెక్కయెఱుంగరాదులవశేశమువానికినట్టివ్రాఁతయం, దక్కజమిప్పుడొక్కటియయునక్షరరూపములేదుదేవనే, దక్కడితంబుగట్టియిడినట్టులయున్నది కప్పుదేలుచున్." పాండు. ౫, ఆ.

కడితి. దే. వి. గోకర్ణమృగము. "వ. పిడికడితికరుపు నురవడికి విఱిగిపడిన విటపి విటపంబుల." స్వా. ౪, ఆ.

కడిమి. యు. దే. వి. 1. అతిశయము; "ఎ, గీ. కినిసియాఁకటికడిమినయ్య నిలసుతుఁడు." ఉ, రా. ౫, ఆ. "క. కేళికమనీయకానన, పాళికవెలువడికురంగపాళికళాబిం, బాళికలఁబాళికడిమిన్, బాలికఁదెచ్చికవిహారభవనంబునకున్." వసు. 3, ఆ.—2. ఆధిక్యము; "చ. వెరవునలావునంగడిమిబీరమునంబొలుపొందురాచదేవర." య. ౨, ఆ.—3. పరాక్రమము. "గీ. నీలుఁడంతకఱుకుఁదేలు వెంద్రుకలరా, కాసిబంటుఁబొదివికడిమి సొక్క, కడిమిఁబెటికివైచెఁగడిమిజేజేలుమిన్ను నఁజెలంగికన్గొనుమఁబొగడఁగ." అచ్చ. యు. కాం. (ఈ యర్థము ప్రశస్తముగాఁ దోఁచలేదు.) —వై. కదపశ. (దీనిభేదములు—నీరుకడిమి, బట్టకడిమి.)

కడిమిడి. దే. విణ. పచ్చికగలది (నేల.) "వ. పచ్చనికడిమిడిపట్టునం జటాయువుందలంచిదర్భపూతంబుగాఁ బిండంబువెట్టి." సం. "శకునాయ ద దౌరామోరమ్యేహరితశాద్వలే." రా. అర. ౨,ఆ.

కడియపుటట్టు. ద్వ. వి. (కడియము+అట్టు.) భక్ష్యవిశేషము. "సీ. బుడుకులుసుకియలుఁగడియం పుటట్లు వెన్నప్పాలువడియంబులప్పడాలు." కళా. ౭, ఆ.

కడియము. వై. వి. హస్తభూషావిశేషము, కటకము.

కడిలము. వై. వి. ఒకానొకచెట్టు.

కడివోవు. దే. అ. క్రి. (కడి+పోవు.) చెడు. "తొల్లికడివోయిననిం చుకలజ్జలావునన్." ఉ, హరి. ౫, ఆ. "ద్వి. ఎలనవ్వుకడివోవదెసఁగదుదప్పి." హరిశ్చ. ౧, ఆ.

కడు. దే. క్రి. అత్యంతము. (వృత్తియందచ్చుపరము గుచో డకారమునకు టకారద్వయమాదేశంబగు. ఉదా. కట్టనుఁగు, కట్టనువు, కట్టలుక, కట్టాణి, కట్టాయితము, కట్టావి, కట్టెండ, కట్టెదురు, కట్టె జ్జ. మొ. (చూ. మిడియ.)

కడుఁదురు. వై. వి. కందురీఁగ, గండోలి.

కడుకొను. దే. అ. క్రి. 1. అతిశయించు; "క. వెల యాలివలపుకడుకో, వెలకుఁగ వగలేకవాఁడు వెసఁ జీఁకటులన్, గలవారియిండ్లచెలులకుఁ, గలవా రపుసొమ్ము వెరఁజిగ్గైకొనఁజొచ్చెన్." శేష. ౪, ఆ.—2. ఉత్సహించు. "క. కడఁగివృకోదరుఁడ సురన్, బడఁగవడిన్ వైచి వామపాదంబునఁజే, ద్వడవానిఱొమ్ముఁదాఁచెన్, గడుకొనియసుర యునులేచికడునుద్ధతుఁడై." భార. ఆది. ౬, ఆ.

కడుగు. దే. అ. క్రి. ప్రక్షాళించు. వి. బియ్యములో నగునవి కడిగిననీరు, తండురీణము.

కడుజు. దే. వి. శ్యేనవిశేషము. (చూ. అణుజు.)

కడుపు. వై. వి. 1. కుక్షి; 2. గర్భము.

కడుపుమంట. ద్వ. వి. ఓరువలేనితనము, ఈర్ష్య.

కడుపూఁద. ద్వ. వి. (కడుపు+ఊఁద.) 1. జలమల ములుకట్టికడుపుబ్బరించెడిపశురోగము; "గీ. నరి డిపుప్పొకప్పనా వురుగడుపూఁద, యదరుఁద్రొ క్కయనఁగనడరి." హరి. పూ. ౬, ఆ.—2. ఈర్ష్య.

కడుపేడు. దే. వి. (కడున్+పేడు.) మేదరవాఁడు కట్టుకట్టెడు సన్నని వెదురుపేడు.

కడువు. దే. అ. క్రి. కడుగుయొక్క రూపాంతరము.

కడెము. వై. వి. కడియముయొక్క రూపాంతరము.

కడ్గు. దే. అ. క్రి. ప్రక్షాళించు. "అడుగులుఁకడ్గి." భార. అశ్వ. ౪, ఆ.—వి. బియ్యములోనగునవి కడిగిననీరు. (కడుగుయొక్క రూపాంతరము.)

కడ్డాయము. దే. వి. క్షోభము, బలాత్కారము.

కడ్డీ. వై. వి. 1. బలపపుఁగోవు; 2. పాళము*. 3. పుడక. (రూ. కడ్డి.)

కడ్పు. వై. వి. 1. కుక్షి; "భూతములున్నవిగాక కడ్పు నన్." హరి. పూ. ౫, ఆ.—2. గర్భము. (కడుపుయొక్క రూపాంతరము.)

కడ్మి. యు. దే. వి. 1. అతిశయము; 2. ఆధిక్యము; 3. పరాక్రమము. "సురేశ్వరునిఁగడ్మింబట్టితు న్నాడన... త్రుందగనిత్తు." రా. బాల, కాం. —వై. ...టిచు (కడిమియొక్క రూపాంతరము.)

కణ. సం. ... స్త్రీ. 1. ఒకా... 2. జిల కణ్ణ; 3. పిప్పలి?. అ. పుం. ము. 1. నీటిబొట్టు; 2. నూక; 3. లేశము.

కణఁక. దే. వి. కడఁకయొక్క రూపాంతరము. "సీ. కణఁకనిచ్చలుఁబ్రద...ణముగాఁదిరుగుమఁజెలఁ గియుండునుగల్పజీవి...నగుచు." భాగ. ౫, స్కం. ౨, ఆ.

కణఁకు. దే. వి. ఇంగలము. "ఎ.గీ. సారిదివిహరించు కపులొక్క చోట గూడి, కడిఁదిచలిచేతమేను లుకడునడంక, రాత్రి మెఱుఁగారుఖద్యోతరా జిఁజూచి, కణఁకకాఁబోలునని సీతుగాయుచుం డ." పంచ. నా. ౧, ఆ.

కణఁగు. దే. అ. క్రి. కడఁగుయొక్క రూపాంతరము.

కణఁజము. వై. వి. 1. ధాన్యముంచెడుపాఁతఱ; "చ. అలవిబుధాలయాహితిలయమ్ముల నెప్పుడుతోడఁ బుట్టవుల్, సలకొనియుండఁగాగరిసెలంగణఁజ మ్ముల నెత్తరావిచే, నిలిచినకుప్పకావలికి నిల్పుదు రప్పరిఁగొంగ్బత్తెపుం, గొలువునకియ్యకొల్పిహ లికుల్బికిరమ్ముపాసంగు వేలుపుల్." చంద్రా. ౧, ఆ.—2. ధాన్యముంచెడుగరిసె*. "సీ. కదలి రాయఁడుమున్న గలమిన్నగమిడాఁపఘుటియిం చుబంగారుకణఁజమనఁగ." ఉ. రా. ౧, ఆ. (ఇ క్కడ కోటను త్ప్రేక్షించినాఁడు.)

కణఁజు. దే. వి. కడఁజుయొక్క రూపాంతరము.

కణఁత. దే. వి. కడఁతయొక్క రూపాంతరము.

కణఁతి. దే. వి. కడఁతియొక్క రూపాంతరము. "చ. పులులుకురంగముల్ కరటిపోతము లేదులు మ న్బులేళ్లుదు, ప్పులుకణఁతుల్కిటుల్ చెవులపో తులుకొర్నవగఁడ్లుభల్లుకం, బులుచమరీమృగం బులెను బోతులుకస్తురిపిల్లులాదిగాఁ, గలమృగ రాజిఁ బెక్కువిహగంబులఁగానుకలంపెదండ్రి కిన్." కాశీ. 3, ఆ.

కణయము. సం. వి. అ. పుం. కుంతవిశేషము. "వ. కణ య కంపణ ముసల ముద్గర పరిఘ పరశ్వధ కర వాల భిండివాల ప్రముఖ ప్రహరణంబులు." హరి. ౪, ఆ.—శరవిశేషము. (అనికొందఱు.)

కణిక. సం. వి. ఆ. స్త్రీ. 1. నీటిబొట్టు; 2. గోదు మరవ; 3 అత్యంతసూక్ష్మవస్తువు; 4. నెల్లి?.

కణితి. వై. వి. రోగవిశేషము; కంతి. (కడితియొక్క రూపాంతరము.)

కణిశము. సం. వి. అ. న. సస్యమంజరి, ఎను...

కణిష్ఠము. సం. విణ. (స్త్రీ. అ. అ.) కడుంగొంచెము.
కణీయస్సు. సం. విణ. (స్త్రీ. ఈ. న్.)——పై.——
కణుందురు. వై. వి. కడుందురీగ.
కణుజు. దే. వి. కడుజు యొక్క రూపాంతరము.
కణ్వము. సం. వి. అ. న. పాపము. పుం. డు. ఒకానొక ఋషి.
కత. వై. వి. 1. కథ; "క. తెలుగమాసంసార, స్థితు లెల్లను జెప్పె." స్వా 3 ఆ.—2. వృత్తాంతము*. "మ. అక్కతలెల్లగా విని పట్టి కడుం డడ ఉల్లం బెంచె నుద్వేలుండై." రామా. ౯, అ.
కతకము. సం. వి. అ. పుం. చిల్ల?.
కతన. వై. ద్ర. కారణముచేత
కతము. వై. వి. 1. కారణము "క. క్రమమున నీచే సిన ప్రశ్నములకుఁ బ్రత్యుత్తరంబు సన్మతి నత్యు, త్తముఁడే వ్వఁడిమ్మనతనిక, తమునను శాపాంతమ గుబుధస్తుతనీకుక్." భార. శర. ౪, అ.—2. గుఱుతు. "క. రతిపతిహాళాహంబుదన యతిధైర్య ధనంబుఁగొల్లలాడెనటంచుక్, గతిమిచ్చు కరణి నిచ్చెం, బతియొక తెలనాకుముద్రపుఁ బ్రాణేశ్వరికిక్." (కతమిచ్చుకరణిక్ — తెలుపువిధమున నని యర్థము.) రామా. ౪, అ.
కతుక్కు. దే. వి. కొఱుకుటయందు ధ్వన్యనుకరణము. "గీ. ఒక్క నక్కవలెఁగతుక్కు నఁగొఱికితా, నవలఁజనఁగ వెంటఁదవిలెబలము." శుక. ౧, అ.
కత్తరి. దే. విణ. 1. నానావర్ణములుగలది, శబలము; (కత్తరియావు, కత్తరియెద్దు. మొ.)—2. వర్ణసాంకర్యముగలది. "క. ఉత్తమసతిశూద్రునితోఁ, జిత్తజసుఖకేలివాంఛఁజేసినఁ బ్రాయ, శ్చిత్తమున శుద్ధిఁబొందును, గత్తరిపురుషునకుఁ బాయుగర్భం బైనక్." విజ్ఞా. ఆచా, కాం
కత్తరిగలయు. దే. అ. క్రి. (కత్తరి+కలయు.) సంకరముగు. "క. పెరుగునువడ్లునుగలిపిన, కరణిక్ వర్ణాశ్రమములుకత్తరిగలయుక్." వై. ౫, అ.
కత్తరిల్లు. దే. అ. క్రి. చలించు. "ఎ, గీ. కటములదరంగమీసాలుగత్తరిల్ల." వై. ౭, అ.
[కత్త]లాని. వై. వి. తెల్లనిగొరిజయుం దోఁకయుం గెంపుంజూలునుగల నల్లగుఱ్ఱము. "అందలికత్తలానిగ [ము]లు." అచ్చ. బాల, కాం. (చూ. కర్తలానము.)
[కత్తళ]. వై. వి.——పై.——
[కత్తళ]. దే. వి. బొందలము, కవచము. "ఉ. ...ంబె ...సెల్లదివ్య శరజాలములంబోలియొ...

...ము, పాలకపుచ్చఁగత్తళము." సం. "నాహత్వా సర్వపాంచాలాక్ విమోక్ష్యే కవచంవిభో." భార. శల్య. ౨, అ.
కత్తళీఁడు. దే విణ. (కత్తళము+ఈఁడు.) కవచము దొడిగినవాఁడు, వర్మితుఁడు.
కత్తి. వై. వి. 1. ఖడ్గము; 2. మంగలికత్తి, క్షురిక*, 3. మల్లబంధవిశేషము*. "సీ. కల్లంబు రాటంబు కత్తితొక్కుస తొట్టి రూణింపు బరిపోటు రొండిమ్రేటు." ఆం, భా. ద్వి. ఉ.
కత్తికాను. వై. వి. వడ్లవాని ఆయుధవిశేషము.
కత్తిపిడిక. వై. వి. ఈండ్రవాని కత్తులబుట్ట.
కత్తిపీట. వై. వి. కూరగాయలు తఱుగుటకుఁ బీటయందమర్చిన కత్తి, ఈలిక.
కత్తిమందు. ద్వ. వి. 1. కత్తియొఱకు పూయుచూర్ణము, 2. గడ్డలకు పూయుమందు.
కత్తియ. వై. అప. ఒకానొకస్త్రీ ప్రత్యయము. (అటుకత్తియ, చెలికత్తియ. మొ.)
కత్తియము. దే. వి. అంకెలయడ్డబంతి.
కత్తిరించు. వై. ప్రే. వస్త్రములోనగువానిఛేదించు. "ఎ, గీ. హత్తిమిత్తిచందంబునహత్తి వెడఁద, కత్తిఁగుత్తికను బిఱానఁగత్తిరించి, సత్తిమత్తిల్లబలిసెసెసత్తి సొక్కఁ, డవనిపతియిచ్చు మేలుమేలనుచు మెచ్చ." చంద్రా. ౨, అ.
కత్తిరిల్లు. వై. అ. క్రి. భిన్నమగు. "గీ. అతని రెండు తొడలను వెసఁగత్తిరిలఁగనఱక." శుక. ౧, అ.
కత్తివాతియమ్ము. వై. వి (కత్తివాయి+అమ్ము.) అర్ధచంద్రబాణము. "గీ వాఁడియైనకత్తివాతియమ్మునుగొని, పగతుశిరముచెక్క లెగయగొట్టెగి." సం. "ఏవముక్త్వా సటాస్తస్య పంచచక్రేప్వకోదరః, అర్ధచంద్రేణబాణేన." భార. అర. ౬, అ
కత్తువ. దే.వి 1. మన్ను కెల్లగించెడు గసిక; 2. గనిమ
కత్తృణము. సం.వి.అ.న. 1. కామంచిగడ్డి; 2. నాఁచు.
కత్తె. వై. అప. కత్తియయొక్క రూపాంతరము.
కత్తెము. దే. వి. కత్తియముయొక్క రూపాంతరము.
కత్తెర. వై. వి. 1. కత్తిరించెడు ఆయుధము; 2. భరణిమూడు నాలుగుపాదములయందును కృత్తికయందును రోహిణి మొదటిపాదమందును సూర్యుఁడుండుకాలము; 3. కృత్తికానక్షత్రము. "సీ. పూచినకొఱవిపూఁబొదరింటిసందానఁగత్తెరయొక్కచోఁగదలకుండె." కాశీ ౧, అ. కత్తె

రవలె మృగములను ఖండించుటచే కుక్క కియ్యఁబడిన పేరు. (చూ. గబ్బి.)

కత్తెరకాలు. ద్వ. వి. అందలపుకాళ్లకు అడుగున పోటిగానమర్చెడు మార్పుకాలు.

కత్తెరగాయము. ద్వ. వి. గవాక్షవిశేషము. "మ. కత్తెరగాయంబులగండ్లముంగడలసందిం గొమ్మ కొమ్మల్ నిరం, తరముల్ సాదనదీవెలెత్తి." ఉ. హరి. ౨, ఆ.

కత్తెరచీల. ద్వ. వి. మీటమునసలచీలవదలిరాకుండ దాని చివర రంధ్రమున నడ్డముగా వేసెడు చీల.

కత్తెరబావిలీ. ద్వ. వి. స్త్రీకర్ణభూషావిశేషము.

కత్తెరవంగ. వై. వి. పెద్దవంగ‡.

కత్తెరవాసము. ద్వ. వి. ఎదురెదురుగాఁ గత్తెరవలె నుంచెడు వాసము.

కత్రి. దే. వి. జక్కిణియను ఆటయొక్క ఒకయంగ ము. "సీ. లాగుమైసిరియుఁబల్లటియుఁ గత్రియు బెళ్లువిలసిల్లుజక్కిణివిధ మొకర్తు." ఉ, రా. ౬, ఆ.

కత్రించు. వై. స. క్రి. కత్తిరించుయొక్కరూపాం తరము. "ద్వి. కత్రించికొనిపోయెఁగంఠమాత్ర ముల." రా. యు, కాం.

కథ. సం. వి. ఆ. స్త్రీ. ఇంచుక సత్యమైన కల్పిత ప్రబంధము. (కాదంబర్యాది.)

కథకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. కథచెప్పెడు వాఁడు; 2. చెప్పెడువాఁడు.

కథనము. సం. వి. అ. న. చెప్పుట.

కథించు. సం. స. క్రి. చెప్పు. "క. అనుటయు నైశం పాయనుఁ, డనఘా లెస్సకథ యడిగి తద్బుత్తిశు భలాం, ఛనసామధామ మర్త్యం, గొనియాడి క థింతు నీదుకోరికయలరన్." హరి. ఉ. ౫, ఆ.

కథితము. సం. విశే. (అ. ఆ. అ.) చెప్పఁబడినది.

కద. యు. దే. అవ్య. ప్రసిద్ధినిదెలిపెడి. "ఎ. గీ. అతివచియునవ్వువీక్షించునప్పుడుకద, యూళర చ్చంద్రచంద్రిక యింపొనర్చు." ఉ, రా. ౪, ఆ. (రూ. కదా. చూ. కాదా.)—వై. వి. 1. కథ; 2. వృత్తాంతము*. "క. మొదలనొకవేగువానిం, గదలరయఁగఁబనిచి పిదపఁగార్యముసేయుం, బది లమనిపలికెశరభుఁడు." రా. యు, కాం.

కదంబకము. ఉభ. వై. విశే. మిశ్రము. "చ. వినీలకేశముల్, ముడివడకుండఁదీర్చివిరులుంగురువేరుఁగదంబకంబుగాఁ, బొదవుగఁగొప్పువెట్టి."

పంచ. [illegible]—సం. వి. అ. న. గుంపు. పుం. తెల్లావలు.

కదంబము. ఉభ. వై. విశే. మిశ్రము. "సీ. పన్నీటితోఁగదంబముచేసిపుష్పమృగనాభిపసరాచన గరుదెలుప." ఆము. ౨, ఆ. (వృత్తియందంత్య వర్ణలోపంబు వికల్పంబుగానగు. కదంబకావి.)—సం. వి. అ. న. గుంపు. పుం. 1. కడపటి‡; 2. తెల్లావలు.

కదంబించు. వై. అ. క్రి. మిళితమగు. "సీ. సాంబ్రాణిధూపవాసనఁగదంబించు వీధుల మంగళ ద్రవ్యములుఘటించి." జై. ౭, ఆ.—అం, ప్రే. మిళితముచేయు. "సీ. గంబురామించఁగదంబించి కొందఱుకలికికన్నియలు బాగా లొసంగ." భాను. ౨, ఆ.

కదధ్వము. సం. వి. న్. పుం. కాపథము, చెడుత్రోవ.

కదనము. సం. వి. అ. న. 1. పాపము; 2. యుద్ధము; 3. హింస.

కదను. హిం. వి. అశ్వగతివిశేషము.

కదన్నము. సం. వి. అ. న. చెడ్డకూడు.

కదము. వై. వి. అశ్వగతివిశేషము, ఆస్కందితము.

కదరము. సం. వి. అ. పుం. 1. వెలిచంద్రి‡; 2. రోగవిశేషము; 3. అంపము.

కదరె. దే. అవ్య. (కద+రె.) సంతాపమునుదెలిపె డి. "గీ. రాతిరెల్లఁ గడిఁదివలవంతసెకలయగ్గలపు టార్తి, నెంతబడలెనొకదరెయయ్యొమ్మెకాఁడు." రసి. ౪, ఆ. (రూ. కదరే. "ఈ వ్యాజసావ్వం తుండు రుక్మియుబ్బుఁగదరే." రుక్మి. ౨, ఆ.)

కదర్యు[illegible]. సం. విశే. (అ. ఆ. అ.) పిసినిగొట్టు.

కదలా[illegible]. అ. క్రి. (కదలి+ఆడు.) చలించు. "[illegible]కొ[illegible]లుకడుంగదలాడఁగ ముద్దుగాఱు [illegible]ఁగపాలబుగ్గలును." పు. ౨, ఆ. (చూ. [illegible].)

కద[illegible]. దే. వి. 1. చలనము; "ఎ. గీ. కదలికలజాఱు [illegible]బయ్యెదలతోడ." పర. ౪, ఆ.—[illegible]ము. "క. ఇదివేళగాదుచోరఁబడి, వెద కఁగనియున్న యతనివెరవుత్రిలోకా, భ్యుదయాంకురార్పణంబీ, కదలికయాదేర్తునన్న గతిరవి గ్రుంకెన్." రామా. ౬, ఆ.

కదలు. దే. అ. క్రి. 1. చలించు; 2. ప్రయాణమగు; 3. యత్నించు. "గీ. నరుఁడుగాండీవమునవొంతు నారిఁగూర్చి, యతివఁదెగటార్తునను మఁగట్టలుక

తోఁడఁ, దీవ్రతరబాణమొకటిసంధించియేయఁ, గదలఁగన్గొనిపల్కె నాకాశవాణి." శై. ౫, ఆ.—వి. 1. చలనము; "సీ. తలఁపులసందడిదండడించినతాల్మికదలుశిరఃకంపగతులమెఱయ." భార. ఆర. ౭, ఆ.—2. యత్నము. "చ. పొదిశినభోవిహారమునఁబువ్వనుబోలెనలంగకుండన, మ్మదనసమానుఁబట్టికొనిమానవదానవదేవకోటికిన్, గదలెఱుఁగంగనీకచని కాంచె నుషాసతిఁ జిత్రరేఖయా, ముదితకురాకపోకలొకమూఁడుమునాళ్ళ రాత్రములయ్యెనయ్యెడన్." ఉ, హరి. ౫, ఆ.

కదలుచే. దే. ప్రే. కదలించు, (రూ. కదల్చు.)

కదలుడు. దే. వి. ప్రయాణము. "మీరలిప్పుడేకదలుడుచాటిచెప్పఁడెఱుఁగన్." శశాం. ౮, ఆ.

కదళ. సం. వి. ఆ. స్త్రీ. 1. కోలపొన్న ;. 2. దొండ ; 3. బూరుగు . అ. పుం. ము. 1. అరఁటి ; 2. కోలపొన్న .

కదళి. సం. వి. ఈ. స్త్రీ. 1. అరఁటి ; (దీనిపుష్పము శిలీంధ్రము.) 2. ఏనుఁగునంబారిమీఁదిటెక్కెము; 3.ఇరువదియంగుళములనిడివిగలలేడి.న్.పుం.ఇరువదియంగుళములనిడివిగలయిఱ్ఱి.(అనికొందఱు.)

కదించే. దే. ప్రే. కదియించుయొక్కరూపాంతరము. "చ. తలుపుగదించినూత్రపులుత్రాసునఁగూర్చుచున్నవాఁడిసీ." హంస. ౨, ఆ.(కదించియునఁగా నిక్కడ మూసియని యర్థము.)

కదియఁబడు. ద్వ. అ. క్రి. (కదియన్+పడు.) కదియు. "క. పఱతెంచికదియఁబడియే, డ్తెఱవ్రేసినమోముదాఁకి తిరిగె గరుడి యు, త్తటీహరిచక్రంబునఁబెడ, మఱివైచెనుదనుజునునుజుమస్తకము తెగన్." నిర్వ. ౨, ఆ. (స్వార్థమునపడు.)

కదియించు. దే. ప్రే. కదియఁజేయు.

కదియు. దే. అ. క్రి. 1. దగ్గఱవచ్చు; "క. ఆకలకలమునమేల్కని,యాకెలఁకుల యొడ్లరాజులది యేమనుచున్, వేకదియన్ గని."భార.సౌ.౧,ఆ.—2. సమానమగు. "మధ్యాక్కర. పదుగురఁబోలెడుసుతులనూఱ్వురఁబడయంగవలతొ, పనుగురనూర్వురకెనయగు సుతులఁబడయఁగవలతొ, వదలకవేవురుసుతులఁబడయఁగవల వేవురకుఁ, గదియంగనుత్తముసొక్కరుఁబడయఁ గమలాక్షి వలతొ."భార. ఆర. ౨, ఆ.—స. క్రి. చేరు. "క. కృతనిశ్చయుఁడగు శేషుని, ధృతరాష్ట్రుండనెడు ఫణికదిసియిట్లను." జై. ౭, ఆ.

కదుకొను. దే. అ. క్రి. (కదుము + కొను.) అతిశయించు. "చ. కదుకొనివేఁడిబాష్పములుగ్రమ్మిపయింబయిఁబర్వి." రా. యు, కాం. (కొందఱు కడుకొని అని వ్రాసి అప్రశస్తప్రాసమని చెప్పియున్నారు. అదియుక్తముగాఁ దోఁచలేదు.)

కదుపు. వై. వి. 1. సజాతీయపశుపక్ష్యాదిసమూహము, కులము*; (ఎనుపకదుపు, జక్కెకదుపు, పందికదుపు, లేటికదుపు; గూబకదుపు, చిల్కకదుపు, తేటికదుపు. మొ.)—2. గోసమూహము*. "క. కరులందోలెనుభీముఁడు, వెరవునగోపకుఁడు కదుపువెలిచినమాడ్కిన్." భార. భీష్మ. ౨, ఆ.

కదుము. దే. స. క్రి. ఆక్రమించు. "క. బహువిధోగ్రాస్త్రములన్, జిమురుపలుగనొనరించిరి, కదిమి సునాభాదిదనుజ గణ దేహంబుల్." ప్రభా. ౫, ఆ.—వి. దెబ్బతగిలినచోటనెత్తురుకట్టుకొనివాఁచువాఁపు.

కదురు. దే. అ. క్రి. 1. అతిశయించు; "మోము వెల్లఁదనమునఁగదురన్." భార. ద్రో. ౨, ఆ.—2. కలుగు; "సీ. ఇచ్చటదిక్కెలేరెవ్వరునాకనుభయమునమేనఁగంపంబుపుట్టఁ, జేయంగనేమియుపాయంబులేమివాసనమునవెల్లఁధనంబుగదుఁ." భార. విరా. ౨, ఆ.—3. విజృంభించు. "చ. ప్రిగులనిశౌర్యసంపదలఁ బెట్టినదండలుద్రెవ్వకేకడుం, గదురుచుహుంకరించుచునుగైదువుఁబాపుచునట్లయట్లయుం, చదెయిదెయంచు దవ్వగనుమంచుఁదగున్ బళియంచు నెందుఁగన్, జెదరుటలేకయైదుపదిసేయుకపోరిరి వేరువాఱుచున్." కళా. ౫, ఆ.—వి. నూలువడికెడుకదురు, తర్కువు.

కదుష్ణము. సం. వి. అ. న. ఇంచుకవేఁడి. విణ. ఇంచుకవేఁడిగలది.

కదే. దే. అవ్య. ప్రసిద్ధినిదెలుపునది. (రూ. కదే. "చ. తెలియఁగఁజూచిచెప్పనుగదే యని డెందమునందలంచె." నై. ౫, ఆ.) "చ. గాండీవంబుదివ్యాస్త్రసం, తతియుంబెట్టినయట్లయుండమమఁజింతంబాపరాదోకదే." (ఇక్కడఁగదే యనునది యనుప్రయోగమునందువచ్చినదియని తెలియవలయును.) భార. ఉద్యో. 3, ఆ.

కద్దుము. దే. విణ. దట్టము. "క. ఎద్దులుమఱుఁగులుగాఁజని, కద్దుములైచేరుపెన్మైకంబులసాలో,

నుద్ధవిడినొంచిరలవున, నద్దిరయనియయ్యయాతి యబ్బురపడఁగన్." య. ౨, ఆ.

కద్రువ., సం. వి. ఊ. స్త్రీ. పన్నగులతల్లి.

కద్రువు. సం. వి. ఉ. పుం. గోరోజనమువంటివర్ణము. విణ. గోరోజనమువంటివర్ణముగలది.

కద్వదుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నిందింపఁదగు మాటలాడువాఁడు.

కన. దే. ద్ర. ఇది వాక్యాలంకారముగఁ బ్రయోగింపఁబడును. "క. ఈహయరత్నముగనమన, సాహిణమునన్ను." జై. ౪, ఆ.

కనకచ్ఛద. సం. వి. ఆ. స్త్రీ. గేఁదగి.

కనకతప్పెట. ద్వ. వి. పటహము.

కనకన. దే. వి. నిప్పునందలి యధికప్రకాశము.

కనకనమను. దే. అ. క్రి. (కనకన+అను.) (నిప్పు) మిక్కిలి ప్రకాశించు. "గీ. కనలుచీఁకటిరక్కసి కన్నులందుఁ, దొరఁగు కనకనమనునిప్పుఁదునుక లనఁగ." య. ౨, ఆ.

కనకనలాడు. దే. అ. క్రి. (కనకనలు+ఆడు.) —పై.—

కనకము. సం. వి. అ. న. బంగారు. పుం. 1. ఉమ్మెత్త; 2. సంపెఁగ; (మఱియుఁగనకపర్యాయములన్నివీనికినామములగును.) 3. కాంచనము; 4. నల్లఅగలు; 5. నాగకేసరము; 6. మోదుగు.

కనకాక్షి. సం. వి. ఈ. స్త్రీ. పయిఁడికంటిపక్షి.

కనరు. దే. వి. 1. కందగడ్డలోనగువానియందలినస; 2. ఒగరు. "శా. తారుణ్యాతిగచూతనూత్న ఫలయుక్తైలాభిఘారస్వన, ద్ధారాధూపితకుమ్భదంబుహృతమాత్స్యచ్ఛేదపాకోద్గతో, ద్గారం పుంగనరార్చుభోగులకు." ఆము. ౨, ఆ.—విణ. అహితము. "ఉ. ఓ రావణనాదుబుద్ధివినదా కనరా కనరా శుభస్థితుల్." సమీ. 3, ఆ.

కనలు. దే. అ. క్రి. 1. కోపగించు; 2. మండు. "అనలజ్వాలలొక్కుమ్మడింగనలన్." హరి. పూ. ౬, ఆ.—వి. 1. కోపము; "కన్నులంగనలునఁగెంపుపెంపడరఁగా." హరి. ఉ. ౪, ఆ.—2. మంట. "కనలుటగ్గిఁద్రోయించి." లక్ష్మీ. ౪, ఆ.

కనస్టేబిలు. ఆం. వి. పోలీసు బంట్రౌతు.

కనారిలు. దే. అ. క్రి. కోపగించు. "చ. మర్త్యకోటిబ, న్నముగడతేఱె నింతటఁగనారిలి శైల్యపలమీఁదఁజూపువి, క్రమమదిమేలుగాను." ఉ, రా. 3, ఆ.

కనికరము. దే. వి. 1. కరుణ; 2. శోకము. "క. తన కుందనయాలులేమికిఁ, గనికరమందుచును." భల్లా. 3, ఆ.

కనికరించు. దే. అ. క్రి. 1. కరుణించు; 2. శోకించు.

కనిపట్టు. దే. స. క్రి. వెదకిపట్టు. "చ. పరిమెయిఁబాతివానిఁ గనిపట్టివెసన్ బెడకేలు గట్టితెచ్చిరి." భార. శాం. 3, ఆ.

కనిపించు. దే. ప్రే. కనఁజేయు. అ. క్రి. (కను+ఇంచు.) కనఁబడు, ప్రత్యక్షమగు. (స్వార్థమున ఇంచు. సంధిని వర్ణాధిక్యము.)

కనియు. దే. అ. క్రి. మాఁగు. "ఎట్టిదెప్పుడుంగనియఁగఁబండియుండు." భార. అర. ౭, ఆ.

కనిష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. చిటికనవ్రేలు. అ. పుం. ము. కొలఁదికిరెండరత్నులుకొలవడినయేనుఁగు. విణ. డు. 1. తమ్ముఁడు; 2. మిక్కిలి యల్పుఁడు; 3. మిక్కిలి కొంచెమైన వయస్సుగలవాఁడు.

కనీనిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కంటినల్లగ్రుడ్డు; 2. చిటికనవ్రేలు.

కనీయుఁడు. సం. విణ. (స్. ఈ. స్.) 1. మిక్కిలియల్పుఁడు; 2. తమ్ముఁడు; 3. మిక్కిలి కొంచెమైన వయస్సుగలవాఁడు.

కనీసము. వై. విణ. అధమము*.

కను. దే. స. క్రి. 1. చూచు; 2. ప్రసవించు; 3. తెలియు; "క. అప్పలుకునం, గనియెనుదనపలుకుతప్పుగానతఁడుమదిన్." భార. సౌ. ౨, ఆ.—4. పొందు; "అధ్యయనంబున దేవభావముం గనునవనీసురుఁడు." భార. అర. ౭, ఆ.—5. భాగ్యముఁ బొందు. "ఆ. పురుషవృషభులయినపురుషులతోడన, 'యరిగిపరమభక్తిఁబరిచరింపఁ, బోవఁగనుటనీవు పుణ్యంబుచేసితి." "క. సమరమున బహుబలదర్పముచూపనుగంటి." భార. సభా. ౨, ఆ. వి. 1. నేత్రము; 2. చెఱకులోనగువానిగనుపుక్రిందిగుంట. "కనుగలవింటఁజొక్కపుఁజవుల్ వుట్టించి." వసు. 3, ఆ. (హల్లుపరమగుచో ఉకారమునకు వైకల్పికముగ లోపంబగు. ఉదా. కన్గలిగి. మొ.)

కనుఁగొను. దే. స. క్రి. (కను+కొను.) 1. చూచు, వీక్షించు; 2. తెలిసికొను.

కనుఁబాటు. దే. వి. (కను+పాటు.) 1. దృష్టి; "గీ. శివునికనుఁబాటుదాఁకనిచిత్తభవుఁడొ." విక్ర. ౧, ఆ.—2. దృష్టిదోషము. "సీ. దర్పంబుకనుఁ

బాటు దాఁకకుండఁగ గొడుగులపెల్లుఖచరదృక్కోటినాఁగు." భార. భీష్మ. ౧, ఆ.

కనుఁబ్రాము. దే. స. క్రి. (కను+ప్రాము.) వంచించు. "క. అనుజన్మవధూగమనం, బొనరించినద్రోహివగుటనోర్వక నిన్నుం, గనుఁబ్రామి సంహరించిన, ననుఁజెందునె దుష్కృతంబు నగచరతిలకా." రామా. ౫, ఆ.

కనుక. దే. ద్ర. 1. హేతువునఁ దెలుపును; 2. వాక్యాలంకారముగఁ బ్రయోగింపఁబడును. "ఉ. భూసుతకోసమేఁ గనుక బొంకితి నేనియుఁ బెద్దకాలముం, జేసిన నాతపంబురహిఁ జెందక నిష్ఫలమౌ." ఉ, రా. ౮, ఆ.

కనుకట్టు. దే. వి. జాలవిద్యావిశేషము.

కనుకని. దే. వి. సంభ్రమము. "క. దినదినమునకుఁ గృశించెను, గనుకనియును ద్రపయు నిరవకాశతఁ బోలెన్." కళా. ౭, ఆ.

కనుకలి. దే. వి. చూపు. "చ. కనుకలి నిట్లు చిత్రఫలకంబునఁ గాంచిన యింతి నెమ్మనంబునఁ గడు నింతకంతపరిపూర్తివహించెనొ." ప్రభా. 3, ఆ.

కనుకుట్టు. దే. విణ. బాధకుఁడు. "విరాళికల్కిప్రోగులకనుకుట్టు." రా, వి. 3, ఆ.

కనుకుట్టుఁదనము. ద్వ. వి. (కనుకుట్టు+తనము.) ఈర్ష్య. "వ. కనుకుట్టుఁదనంబున నతనిధర్మంబునకు విఘ్నంబుగావింపం దలంచి." భో. ౬, ఆ.

కనుకూలి. దే. వి. భాన్యరూపమయిన కూలి.

కనుగుఁజేఁప. దే. వి. మత్స్యవిశేషము.

కనుచీఁకటి. దే. వి. సంధ్యాకాలమందలి లేఁజీఁకటి.

కనుపట్టు. దే. అ. క్రి. చూపట్టు, గోచరమగు.

కనుపాప. దే. వి. కంటిలోని ప్రతిమ.

కనుపాలవిత్తులు. దే. వి. బ. కులుత్థాంజనము.

కనుపు. దే. వి. వెదురుచెఱకులోనగువానియందెడనెడ నేర్పడియుండుముడి, పర్వము. (ఇట్లు పరుషాదిగాఁ గొన్ని దేశములందు వ్యవహారము.)

కనుపుగొట్టు. దే. స. క్రి. (కనుపు+కొట్టు.) 1. ఖండించు; "వ. కాలుబలంబులం గనుపుగొట్టినం గాలు చెయి తల డొక్కయని యేఱుపాటు లేక వండందఱిగినయట్లున్న రొడలును." భార. భీష్మ. 3, ఆ.—2. భంగపఱచు. "వ. అందుమందాకినీనందనుండమందపరాక్రమక్రీడం గొంతేయబలంబులం గనుపుగొట్టె." భార. భీష్మ. ౨, ఆ.

కనుపులగుండ్లు. దే. వి. బ. (కనుపులు+గుండ్లు.) మణిమయమైన హస్తభూషావిశేషము.

కనుపెట్టు. దే. అ. క్రి. ఎదురుచూచు, ప్రతీక్షించు. "బెట్టుకూ పెట్టుచు నిట్లు పోరఁ గనుపెట్టుక యొక్కరుఁడుండి." ఆము. ౬, ఆ. (ఇది వాడుకయందు కనిపెట్టు అని యున్నది.)

కనుపొట్టలు. దే. వి. బ. కంటిపైక్రింది ఱెప్పలు.

కనుబంటి. దే. వి. జీలుగుపక్షి. "వ. కౌశికంబుడబ్బుగబ్బులుఁగు గౌళి కనుబంటి పైఁడికంటి లోనగుతిర్యక్కులు." ఆము. ౬, ఆ.

కనుబడి. దే. వి. ఉత్పత్తి.

కనుమ. దే. వి. 1. సందు; "వ. ప్రవాహంబు నిజప్రవహణగుణంబువిడువక ప్రవహణద్వారంబు వెదకుచుం జిరకాలంబు నిలిచియేని యుంగనుమ గలిగినఁ బ్రవహించుచందంబున." కవిక. ౪, ఆ.—2. కొండలసందుత్రోవ. "వ. మునుములం గనుమలొనరించుకొనంబంచి." స్వా. ౪, ఆ.

కనుము. దే. వి. 1. మకరసంక్రమణమునకు ఆవలిదినము; 2. తృణవిశేషము, శరము.

కనుమూయు. దే. స. క్రి. వంచించు. "సీ. కప్పురంపుఁబలుకంచుఁ గనుమూసి యక్కటా బూదిగప్పిననిప్పు పాదుకొల్పి." చంద్ర. (దీనికి కర్మపదము క్రిందిపాదమున నున్నది.)

కనుమూసిగంతలు. దే. వి. బ. కన్నులు గప్పియాడెడియాట. "మ. ఓ మనగుంటల్ కనుమూసిగంతలు నగంబాలాటలో నైనఖేలనముల్." కళా. ౬, ఆ.

కనుమొఱఁగు. దే. స. క్రి. వంచించు. "మ. సిరినొక్కప్పుడు కన్మొఱంగి హరి తక్ జేరన్ బ్రహర్షంబు నూర్వరకున్." ఆము. ౧, ఆ.

కనువినికి. దే. వి. పాము, చక్షుశ్శ్రవము. "వ. ఇది కనువినుకుల నెలవు పట్టిచే విరివిగాఁ జెప్పంబడిజగంబు లెఱిఁగినదగుటం జేసి." య. 3, ఆ.

కనువెచ్చ. దే. విణ. నులివెచ్చ, కదుష్ణము.

కన్కని. దే. వి. కనుకనియొక్క రూపాంతరము. (చూ. సగ్గిసమొగ్గిస.)

కన్గంట. దే. ద్ర. (కంటన్+కంటన్.) ప్రత్యక్షముగా. "తాఁజూచి కన్గంటనయ్యుమప్రాణేశ్వరు నెట్లు మ్రింగుమనె." భాగ. ౮, స్కం.

కన్గొను. దే. స. క్రి. కనుఁగొనుయొక్క రూపాంతరము.

కన్న. దే. అప. ఒకానొక ప్రత్యయము. "అహిత వాక్యము మున్ను విన్నయన్నినదముకన్నఁదిన్న నయ్యె." పను. ౨, ఆ.

కన్నగాఁడు. వై. వి. (కన్నము+కాఁడు.) కన్నము పెట్టి దొంగిలించెడు దొంగ, ఖనకుఁడు.

కన్నడ. దే. వి. అలము, ఉపేక్ష. "సీ. ఒకనిమాటున వైరినుక్కడఁగించినదరు శౌర్యమెన్నఁగన్నడయొ నర్చి." చంద్రా. ౧, ఆ.

కన్నడము. వై. వి. భాషావిశేషము*.

కన్నడి. వై. వి. ఒకానొక కర్ణాటదేశస్థుఁడు*.

కన్నడించు. దే. స. క్రి. ఉపేక్షించు.

కన్నడీఁడు. దే. విణ. (కన్నడ+ఈఁడు.) ఉపేక్షచేయువాఁడు.

కన్నపెట్టు. ద్వ. స. క్రి. (కన్నము+పెట్టు.) కన్నము వేయు. "ఉ. నానాధనసంపదాఢ్యసదనంబులు నిత్యముఁగన్న పెట్టఁగన్." పర. ౪, ఆ.

కన్నపోవు. ద్వ. అ. క్రి. (కన్నము+పోవు.) కన్నము వేయఁబడు. "వ. నాగపట్టణప్రసిద్ధబుద్ధాయతనంబుగన్న పోయె." పర. ౫, ఆ.

కన్నము. వై. వి. దొంగ లోపలికిఁ బోవుటకై గోడయందుఁజేసెడి సొరంగము.

కన్నయ్య. వై. వి. (కన్నఁడు+అయ్య.) కృష్ణుఁడు. ద్వ. (కన్న+అయ్య.) కన్నతండ్రి.

కన్నఱ. దే. వి. దుఃఖము. "ఉ. తలిదండ్రులువారెఱుటనున్నవారొయీ, కన్నఱజూడఁబాలయితిఁగా విధినేమనిదూఱనేరుతున్." రామా. ౨, ఆ.

కన్నఱి. దే. విణ. (కన్నఱ+ఇ.) దుఃఖితుఁడు. "వ. నిర్జరులుజర్జరులుగా మేఘంబులుమోఘంబులు గాఁగిన్నరులుగన్నఱులుగా భూతంబులుభీతంబులుగా." ఉ, హరి. ౬, ఆ.

కన్నశవు. దే. వి. కన్నడ, ఉపేక్ష. "ఎ, గీ. కన్నశవుసేయఁగచ్ఛపాకారగరిమఁ, గరిమరాత్రికయానవీచరణమహిమ." వసు. ౪, ఆ.

కన్నవిటి. దే. విణ. (కన్ను+అవిటి.) చీకు, అంధుఁడు. "క. చెవిటికిశంఖధ్వని క, న్నవిటికిదీపంబు షండుఁడగుపురుషునకున్, యువతియుఁ ఖలునకునుపకృతి, శవమునకిడుభూషణములు జగతివృధ యగున్." భల్లా. ౪, ఆ.

కన్నాకు. దే. వి. (కన్ను+ఆకు.) తమలపాకు కట్టయందు మొదటనుండెడియాకు. విణ. 1. అగ్రేసరుఁడు; "గమికిఁగన్నాకయిగాలి యురయు." స్వా. ౪, ఆ.—2. ముఖ్యుఁడు. "క. కన్నాకుమన కుభీష్ముఁడు." భార. భీష్మ. ౧, ఆ.

కన్నాత. దే. వి. మల్లబంధవిశేషము. బ. మల్లవిద్యా విశేషము.

కన్నియ. వై. వి. 1. పెండ్లికానిపడుచు; 2. కూఁతురు; (చూ. కన్నె.) 3. ఒకానొకరాశి; 4. ఆఁడుది. "రాత్రియన్ కన్నియఁగూర్చిఁజిక్కఁదన కౌఁగిటఁజేర్చి." లక్ష్మీ. 3, ఆ.—విణ. 1. క్రొత్త*; (కన్నియగేదఁగిపూఱేకు, కన్నియమెఱుంగు. మొ.)—2. చిన్న. (చూ. కన్నె.)

కన్నియలేడి. ద్వ. వి. కారండవము. "ద్వి. కొక్కెర బెగ్గురు కొంగ రాపులుఁగు, కక్కెర యాడెలు కన్నియలేడి." హరిశ్చ. ౧, భా.

కన్నీరు. ద్వ. వి. (కన్ను+నీరు.) హర్షశోకములవలన కన్నులఁగారెడు నీరు, అశ్రువు.

కన్ను. దే. వి. 1. నేత్రము; 2. చూపు; "గీ. వచ్చి రెండకన్ను వానకన్నును నెఱుం, గనిపురంధ్రులు." భార. ఆశ్ర. ౧, ఆ. (మఱియుఁ వాఁడు నాయుంగరముమీఁద కన్ను వేసినాఁడు. చూ. సిరి మూడవయర్థము.)—3. జాడ; "వ. అనిపలుకుచున్నయంగదుపరుషభాషణంబులకురోషించిన యప్పటికన్నెఱింగి నలువురురక్కసులు గ్రక్కున నవ్వాలినందనుం బొదివిపట్టిన." సం. "ఇంగితజ్ఞాస్తతోభర్తుశ్చత్వారోరజనీచరాః, చతుర్ష్వంగేషుజగృహుః." భార. అర. 2, ఆ.—4. వెదురు లోనగువానిగనుపుక్రిందిగుంట; (కన్నులవిలుకాఁడు. మొ.)—5. బండిచక్రము; "గీ. కన్ను తలమానికము బండికన్ను జగిలె, కాఁడునై." అచ్చ. అ, కాం.—6. వంతెనద్వారము; 7. నెమలిపురికన్ను; 8. మృదంగాది వాద్యభాండముఖమునందేర్పఱుపఁబడినవృత్తనీలమండలము; "వ. ఎందేనియుఁగన్ను వేయుట మృదంగాదివాదిత్రంబులయంద." ఆము. ౪, ఆ.—9. వలయందలి రంధ్రము; "వ. ప్రాంతవలయునుంబోలెఁగన్నులుచెదరి." కవిక. ౪, ఆ.—10. వ్రణాదిరంధ్రము.

కన్నునీరు. ద్వ. వి. కన్నీరు. (దీనికి పెక్కులు మహాకవి ప్రయోగములు కనఁబడుచున్నవి.)

కన్నుమెఱుఁగు. దే. స. క్రి. కనుమెఱుఁగు, వంచించు.

కన్నులమ్రాను. దే. వి. చెఱకు, ఇక్షువు.

కపీతనము. సం. వి. అ. పుం. 1. అంబాళము/౹; 2. కలుజువ్వి౹; 3. దిరిసెనము౹; 4. రావి౹,

కపురము. వై. వి. కర్పూరము. "కపురపుఁగమ్మతావి." వసు. ౨, ఆ.

కపోణి. సం. వి. ఇ. పుం, స్త్రీ. కూర్పరము, మోఁచేయి.

కపోతపాలిక. సం. వి. ఆ. స్త్రీ. కొణిగయుండేర్పఱచిన పావురపుగూఁడు.

కపోతము. సం. వి. అ. పుం. 1. గువ్వ; 2. పావురము, 3. అభినయహస్తవిశేషము. (వ్రేళ్లుచాఁపఁబడిన రెండుచేతులను ప్రక్కలఁకూర్చి బోలుగాఁ బట్టినది.)

కపోతాంఘ్రి. సం. వి. ఇ. స్త్రీ. గువ్వగుత్తి౹.

కపోలము. సం. వి. అ. పుం. గండము, చెక్కిలి.

కప్ప. దే. వి. జలజంతువిశేషము, మండూకము.

కప్పకుఱుపు. దే. వి. కారకముచే అఱకాలిఁ బొందులేచెడుగుల్ల.

కప్పచిప్ప. దే. వి. నీటియందలిగుల్ల, శంబూక.

కప్పడము. వై. వి. 1. చినిఁగినవస్త్రము; "క. కడవసములు కోలలు క,ప్పడములు వీరలధనంబు."భార. ఆది. ౭, ఆ.—2. వస్త్రము. "సీ. కప్పుఁగప్పడమునుగస్తూరియునుగాటుకయుని వేదింతు ఘు కాళినీకు." పా. ౨, ఆ.

కప్పతాళము. మి. వి. ముద్దబీగము.

కప్పనావురు. దే. వి. చిఱుకప్పకాటుచేత పసులకుఁగలిగెడు పాసనపురోగము. "గీ. నరిడి పుప్పు కప్పనావురు కడుపూఁద, యదరుఁద్రిక్కయనఁగనడరి." హరి. పూ. ౬, ఆ.

కప్పము. దే. వి. ప్రజలురాజునకిచ్చెడిధనము, కరము.

కప్పరపడు. ద్వ. అ. క్రి. (కప్పరము+పడు.) సంభ్రమపడు. "క. అప్పకుమారులఁగనెనని, చెప్పినవార్తకువచ్చినతానుతులం, గప్పరపడిచూచిమనం, బుప్పొంగి పురస్కృతాగ్ని హోత్రుం డగుచున్." జై. ౬, ఆ.

కప్పరపాటు. ద్వ. వి. కప్పరపడుట. "గీ. తెల్లతమ్మి విరులఁదగడుకన్నులవాని, నవసుధాద్రవంబున వ్వవానిఁ, గనియెవేల్పుపిండుకప్పరపాటుతోఁ, గన్నులందునున్న కఱవుదీఱ." భాగ. ౬, స్కం.

కప్పరము. దే. వి. తొట్రుపాటు, సంభ్రమము.

కప్పలి. వై. వి. ఓడ, నావ*. "సీ. విరహాంబురాశి దాఁటి రథాంగములు బోరగిలనిడ్డ పసిఁడికప్పలియనంగ." పర. 3, ఆ. "క. చెప్పెడిదేమిఁకనాకచో, దెప్పరమగునుక్కుజీనుదిగవైచినఁబె, న్నెప్పుసఁగదలకయుండెడి, కప్పలివిధమునవుదేరు కదలకనిలిచెన్." శుక. ౨, ఆ.

కప్పిరి. దే. వి. (కప్పు+ఇరులు.) కొంచెపాటిచీఁకటి.

కప్పు. దే. అ. క్రి. క్రమ్ము. "విషముద్భవిల్లినల్లడలనువిస్ఫులింగములుకప్పఁగబర్వన." భార. ఆది. ౨, ఆ.—స. క్రి. ఆచ్ఛాదించు. వి. 1. ఆచ్ఛాదనము; 2. ఇంటిపైకప్పు; 3. నలుపు; 4. చీఁకటి; "చ. తనపయిరాజురావెసఁబతెంచుఁడుకాలవశాత్తినేగుచో, మనుకొని కప్పుమూఁకయునుముట్టె." హన. ౪, ఆ.—౫. దంతక్షతము. "చ. తామరకొమరాలు మాటెనలిమండలిపేరిటికప్పులన్నియున్." హన. ౪, ఆ.

కప్పుఁగుత్తుకపుల్గు. దే. వి. (కప్పు+కుత్తుకపుల్గు.) నెమలి. "సీ. కప్పుఁగుత్తుకపుల్గుగముల పిల్లుదోలంగఁదెలిమొగుల్ చదలనేడ్తెఱఁజెలంగ."ఆచ్చ. కిష్కిం, కాం.

కప్పుఁదెరువరి. దే. వి. (కప్పు+తెరువు+అరి.) అగ్ని, కృష్ణవర్త్మ.

కప్పుడు. దే. వి. ఆచ్ఛాదనము.

కప్పుదెంచు. దే. అ. క్రి. (కప్పు+తెంచు.) క్రమ్ము. "చ. ఊఱుముచునెల్లెడంబిడుగులుగ్రగతింబడ ఘోరమూర్తియై, యతిముఱిఁగప్పుదెంచు విలయాభ్రముచాడ్పున." భార. ద్రో. ౧, ఆ.

కప్పుబల్ల. దే. వి. ద్వారముమీఁద గొడుగుబల్లతన్నబల్లలకు నడుమనుండెడి పలక.

కప్పుమల. దే. వి. కాటుకకొండ, అంజనపర్వతము

కప్పుమేనిగాము. ద్వ. వి. (కప్పుమేను+గాము.) శనిగ్రహము.

కప్పురగంధి. వై. గ్రా. వి. కర్పూరగంధమువంటి గంధముగలస్త్రీ. "ఉ. వేలుపుం, గప్పురగంధులెక్కిరిధగద్ధగితోన్నతహర్మ్యరేఖలన్." పా. 3, [illegible] (దీనిని కప్పురగందియని శుద్ధవైకృతవ[illegible] చెప్పవచ్చును.)

[illegible]ప్పురపుటనఁటి. ద్వ. వి. (కప్పురము+[illegible] కర్పూరకదళి౹.

క[illegible]ప్పురపుబెండ. ద్వ. వి. (కప్పురము+బెం[illegible] ఒకానొకబెండ, గంధమూలము౹.

క[illegible]ప్పురపువంగ. వై. వి. (కప్పురము+వంగ.) [illegible]

కమరు. దే. అ. క్రి. కాలు. "కమరెనా పెక్కులక మరపర్యో ననుజాపక్షమ్ములు." సం. "తతో దగ్ధా విహాపక్షౌ నదగ్ధాతు జటాయుషః." భార. ఆర. ౭, ఆ.—వి. 1. కాలినకంపు; "క. అన్నంబుకమ రువలచుచు, నున్నది." ఘో. ౫, ఆ.—2. కమ్మరు యొక్క రూపాంతరము. "ఎ, గీ. కటిభరంబునవ జ్రాలకమరుదాల్చి." కాశీ. ౭, ఆ.

కమరుచే. దే. ప్రే. కమరఁజేయు, కాల్చు. "ద్వి. రమ ణీయగజవాజిరథశాలలోలిఁ, గమరిచి." రా. సుం, కాం. (రూ. కమర్చు.)

కమల. సం. వి. ఆ. స్త్రీ. 1. లక్ష్మి; 2. ఉత్తమురాలు. అ. న. ము. 1. తామర; 2. ఎఱ్ఱతామర; 3. నీరు; 4. మందు; 5. కడుపులో నొకప్రక్కనుండెడి యెఱ్ఱనిమాంసము; 6. రాగి. పుం. శివుని చేతి యిఱ్ఱి. ఈు. బ్రహ్మ.

కమలచ్ఛదము. సం. వి. అ. పుం. పక్షివిశేషము, రా పులుఁగు.

కమలవల్లభ. సం. వి. ఆ. స్త్రీ. పిన్నవరగోఁగు?.

కమలాప్తుఁడు. సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. విష్ణువు.

కమలాఫలము. సం. వి. ఫలవిశేషము, కిచ్చిలిపండు.

కమలాసనుఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మ, నలువ.

కమలిని. సం. వి. ఈ. స్త్రీ. 1. తామరకొలను; 2. తా మరతీఁగ.

కమలు. దే. అ. క్రి. 1. కందు; "చ. కమలెన శేషకోకన దకైరవపద్మలు శైవలంబులున్." భార. ఆది. ౬, ఆ.—2. కాలు. "మ. ఇనచంద్రాంశులఁబత్షముల్ కమలి యేసెచ్చోటికిం బోవ లేకునికిన్." రా. కిష్కిం, కాం.

కమలోత్తరము. సం. వి. అ. న. కుసుమపువ్వు.

కమసాలవాఁడు. వై. వి. లోహకారుఁడు.

కమాను. అన్యదే. వి. ప్రయాణము, విల్లు.

కమి. దే. వి. కమికిలి. "సీ. కాంతాజనంబులు కమి యారనిడుదురే పురముళోఁదత్తాల పుణ్యభిక్ష." భీ. 3, ఆ. (ఇది పిడిశబ్దమువంటిదని తోఁచెడి. ప్రయోగాంతరము గనఁబడలేదు.)

కమికిలి. దే. వి. వంపఁబడిన వ్రేళ్లుగల పుడిసిలి.

కమిచీ. హిం. వి. చేబుకు.

కమిత. సం. విణ. (బు. ఈ. బు.) కమనుఁడు.

కమియు. దే. అ. క్రి. 1. కవియు; "సీ. కమియునుద్ధ తవారణముఁద్రిప్పనేసదాచారధారేయుహుం కారరవము." భాను. ౧, ఆ.—2. నలఁగు; "క. కనలినిశాచరికేలు, క్కునఁ గమియఁగఁ బట్టిభీతి గొనఁదిగిచివడిన్." రా. సుం, కాం.—3. మాఁ గు. "చ. క్రమమునఁబిందెలుంబసరుఁగాయలుఁ గాయలుదోరపండులుం, గమిసినపండులుంగెల లుగట్టితదున్నతశాఖలన్నియుం, దమమయమైత లిర్పఁగ." హరి. పూ. ౬, ఆ.

కమిషన్. ఆం. వి. బేరముచేసినందు కిచ్చు పెచ్చు ద్రవ్యము.

కమీజు. ఆం. లోన ధరించుచొక్కా.

కముఁజా. వై. వి. కపింజలపక్షి. "ద్వి. కముఁజాలఁజి లుకలఁగ్రౌంచపక్షులను, భ్రమయించుపూరేళ్లఁ బావురంబులను." నళ. 3, భా.

కముచే. దే. స. క్రి. 1. గ్రహించు; "నడిమిచేక్కిఁగ మిచిపిధికరంబునఁదూఁచె." నై. ౫, ఆ.—2. మ్రిం గు. "సీ. అమృతాపహరణార్థమరుగుపక్షిస్వామి గతిఁబుళిందశ్రేణిఁగమిచికమిచి." స్వా. ౮, ఆ.

కమ్మ. దే. వి. 1. స్త్రీకర్ణభూషణము; 2. పత్రిక; "గీ. వలఁతిబంటులనిరువురఁబిలిచి మేలి, కమ్మయొసఁ గిన." అచ్చ. బాల, కాం.—బ. 3. శూద్రవిశేషము. "వ. వెలమలనఁగమ్మలన." భీ. ౧, ఆ.—విణ. 1. పులుసులేనిది; (కమ్మఁగూర. మొ.)—2. మధుర ము; (కమ్మనీరు. మొ.)—3. వాసనగలది. (కమ్మ నూనియ. మొ.)

కమ్మగాడ్పు. దే. వి. మలయమారుతము. "ఎ, గీ. అ ఖిలభువనైకమోహకుండైనమాధ, వునకునీవనవా సిరంజన మయత్న, కార్యలేశమ్ముసుమ్ముచుఁగమ్మ గాడ్పు, గడిమిమ్రోయించెఁగలకంఠకంఠఘంట." హన. ౨, ఆ.

కమ్మచ్చు. వై. వి. (కమ్మి+అచ్చు.) అగసాలెవాఁడు కమ్మితీసెడి కొలముట్టు. "ఉ. హెచ్చినమైత్రిఁ బద్మినులకెల్లఘనాత్యయకారకుండుసా, మ్మచ్చ పడంగఁజేయుటకునైయలక్రౌంచనగంబు పేరిక, మ్మచ్చున నీడ్చుశర్వగిరి యందలి వెండిసలాకపిం డునా, పచ్చిమరాళమాలికలువ్రాలెఁగొలంకుల వక్త్రమంకృతిన్." ఆము. ౮, ఆ.

కమ్మటము. దే. వి. అగసాలెవానికుంపటి. "మ. ప్ర తిసూర్యుండనుకమ్మటంబు మఖవద్బాణాసమన్ కాలు రో, హితమన్ పేరిటియూఁదుఁగ్రోవిచ పలోపేతాంతరాంభోదసం, తతియన్ మచ్చుల సంచి కావిరనునిద్రాటీకమున్ గన్పడన్, జతసా

"స్నారితెలుంగుననందనరెవర్నా వేళమిన్నంగడిఁ." చంద్రా. ౮, ఆ.

**కమ్మటీఁడు.** దే. వి. (కమ్మటము+ఈఁడు.) అగసాలె వాఁడు, స్వర్ణకారుఁడు.

**కమ్మతము.** దే. వి. అనేకులుచేరిచేయుసేద్యము, కృషి.

**కమ్మతీఁడు.** దే. వి. (కమ్మతము+ఈఁడు.) కమతకాఁడు, కృషీవలుఁడు. "కల్పకంబులపంటకమ్మతీఁడు." స్వా. ౫, ఆ.

**కమ్మన.** దే. వి. 1. కమ్మఁదనము; (చూ. కమ్మ.) 2. మాధుర్యము; 3. సౌరభము. (ఇది విశేషణమగుచో ఇకారాంతమగును.) "కడుఁదియ్యనికమ్మని పండులింపు సొంపారఁగనానియాని." భార. అర. ౬, ఆ.

**కమ్మనిమ్మ.** దే. వి. నిమ్మపండువంటివర్ణముగలకిత్తిలి, తియ్యనిమ్మ, శర్కరాంకము.

**కమ్మనీరు.** ద్వి. వి. మకరందము. "మ. ఉరుశక్తిఁ మధుమాసదోగ్ధపిదుకఁ జ్యోత్స్నగవీ చంద్రమస్స్ఫురదూధః ప్రవిముక్తమైన నిబిడజ్యోత్స్నా పయఃపూరముఁ, విరియంబాఱినగొజ్జెఁగల్ గురియమున్నీరైనయక్కమ్మనీ, రురహింగూడిననేర్పరించుగమ్మలై రోలంబకాదంబముల్." ఆము. ౫, ఆ.

**కమ్మనూనియ.** ద్వి. వి. సంపెఁగమొదలగువానిఁజేర్చి చేసినతైలము. "సీ. అతఁడుతైలాభ్యంగమడిగినఁ బతికమ్మనూనియఁదెప్పించి మేనుశిరము, నభ్యక్తములు సేయు." భార. అను. ౨, ఆ. (రూ. కమ్మనూనె.)

**కమ్మపంజాలు.** దే. వి. బ. పంజాలకమ్మలు. "వ. కమ్మపంజాలవజ్రంపుఁజకచకల నకనకలువీడుకొని." స్వా. 3, ఆ.

**కమ్మపిల్లి.** ద్వి. వి. పునుఁగుపిల్లి, మార్జారిక.

**కమ్మర.** వై. వి. ఇనుముపనిచేసి బ్రతికెడుజాతి. (కమ్మరవాఁడు, కమ్మరది.)

**కమ్మరి.** వై. వి. (కమ్మర+ఇ.) 1. కమ్మరవాఁడు; 2. బాణకారుఁడు*. "గీ. సెలయురేజవరాలుఁబెండిలికి సెదురు, సెడలఁదఱియనుకమ్మరికడయనంగఁ, గ్రాలుబిరుసులుసెలిపినఁబూలుఁబోగయు, సెగసెననమింటరిక్కలునిరులఁబర్వ." అచ్చ. అ, కాం.

**కమ్మరీఁడు.** వై. వి. (కమ్మర+ఈఁడు.) 1. కమ్మరవాఁడు; 2. బాణకారుఁడు*. "వ. తెరువరులగెలువందరలుమరునకుం దఱియనుకమ్మరీఁడు వెరవునంజేసియునిచిన కఱకుటమ్ములగుంపులసొంపునంబెంపారుకలువక్రొవ్విరులును." నీలా. 3, ఆ.

**కమ్మరు.** దే. వి. కమరు, మొలనూలు.

**కమ్మరుబొందు.** దే. వి. రెండుగాడికమ్ములనడిమిబిగిబద్ద.

**కమ్మరేను.** దే. వి. కశేరుకము?.

**కమ్మవిలుకాఁడు.** దే. వి. మన్మథుఁడు, సురభిసాయకుఁడు. "ఎ, గీ. కమ్మవిలుకాఁడుమెఱయుశృంగారవనము, లోనిగురివెందపొదక్రిందవానినునిచి." విక్ర. ౮, ఆ. (ఇట్లు కమ్మవిలుతుఁడు. మొ.)

**కమ్మి.** వై. వి. 1. వెదురులోనగువానికమ్మి; 2. బంగారులోనగువానికమ్మి*; 3. వస్త్రపుఁగమ్మి*; "సీ. గజచర్మమెన్నఁడోకానినిచ్చలుగట్టుపసిఁడికమ్ములపట్టుపచ్చడంబు." భీ. ౧, ఆ.—4. బండికంటికడకమ్మి*. "వ. పంచ్రేండంచులువాఱుకమ్ములనుమూడుతోలులుంగలిగి." సం. "యస్యైకంచ క్రంద్వాదశారంషణ్ణేమి త్రినాభి సంవత్సరాత్మకంసమామనంతి." భాగ. ౫, స్కం. ౨, ఆ. 5. పేముబొద్దు.

**కమ్మిబండి.** ద్వి. వి. కమ్మివేసిన మ్రానిచక్రపుబండి.

**కమ్మిరించే.** దే. స. క్రి. మూయు. "క. ఇలుసొచ్చిసకలభాండం, బులుశోధింపంగ నెక్కమూలదెసనుదొం, తులసంధిఁగమ్మిరించిన, సలసల మనువేఁడిపాయసమ్మఁగనుఁగొనెఁ." భో. 3, ఆ.

**కమ్ము.** వై. స. క్రి. కమ్మిగాచేఁగఁగొట్టు*. "గీ. మేటిజమ్మేటియసటఁగ్రొమ్మించుమించుఁ, బొదనిమిదనప్రతాపాగ్నిఁ బుటము వెట్టి, తమ్మిగద్దియదాఁగటఁగమ్మియట్టి, కొమ్మఁగావింపఁబోలు నెత్తమ్మి చూలి." వసు. ౨, ఆ.

**కమ్మేరాకు.** దే. వి. (కమ్మెర+ఆకు.) కారపు నల్లతమలపాకు.

**కమ్రము.** సం. విణ. 1. ఇంపైనది; 2. ఇచ్ఛకలది.

**కయాహము.** సం. వి. అ. పుం. ఎనుపదూడ.

**కయిపు.** హిం. వి. మత్తు.

**కయివారము.** యు. దే. వి. గనిమయంచు. వై. వి. స్తోత్రము*. "లయగ్రాహి. రసాలములవేడ్కఁగయివారములుసేయుచునుధీరముకురాస్యల్." భాను. ౨, ఆ.

**కయ్య.** దే. వి. మడి. (చూ. క్రయ్య.)

**కయ్యపుఁదిండి.** దే. వి. (కయ్యము + తిండి.) కలహాశనుఁడు, నారదుఁడు. "గీ. కూర్మిఁగయ్యంపుఁ

దిండి, తపసి కన్యాకు కతవినుతపసిఁజూచి, యి ట్టులనియె." అచ్చ. సుం, కాం.

కయ్యము. దే. వి. జగడము, యుద్ధము.

కయ్యర. దే. వి. హీనజాతి మౌక్తికము.

కయ్యాలక్రచ్చే. దే. విశ. కలహశీలుఁడు. "సీ. క య్యాలక్రచ్చయైకాలుద్రవ్వుచు సదా మండు వాఁడతిశాంతమహితుఁడయ్యె."పాండు. ౪, ఆ.

కర. యు. దే. వి. తీరము. "క. హరిభక్తితేపగాదు, స్తరసంసారాబ్ధిఁగడచుసాధుజనులకుం,గరయై." లక్ష్మీ. ౧, ఆ.—వై. విశ. తీక్ష్ణము. (కరసాన.)

కరంకము. సం. వి. అ. పుం. 1. లోపల నేమియు లేని బొండ్లపుఁజిప్ప; 2. డొక్క; 3. తల.

కరంజము. సం వి. అ. న.పులిగోరుచెట్టు. పుం.కానుగుచెట్టు.

కరండము. సం. వి. అ. పుం. 1. కత్తి; 2. తేనెపెర; 3. కరాటము. (ఇది యీ యర్థమున మూడులింగ ములందునగు.)

కరంబము.సం.వి.అ.పుం.1.కంపిల్లముచెట్టు;2. మేళనము.

కరంభము. సం. వి. అ. పుం. పెరుగుతోఁగలిపిన పే లపిండి.

కరఁగు. దే. అ. క్రి. ద్రవించు. "రమణభుజా నిపీ డనఁగరంగినకాంతల." లక్ష్మీ. 3, ఆ.—అం, ప్రే. కరఁగించు. "ఎ, గీ. కుసుమబాణుని బాణము ల్గూడనైదుఁ, గరఁగి నేరిమివాటించికరువుగట్టి, ప్రోదిచేసి చైతన్య సంపుటము తగఘ, టించిరో కాకయిట్టిచేడియలుఁగలరె." భార. విరా. ౨, ఆ.—వి. కరఁగుట. (చూ. కరఁగుపడు.)

కరఁగుపడు. ద్వి. అ. క్రి. (కరఁగు+పడు.) కరఁగు. "వ. కౌతుకాంకురంబు కరఁగుపడవెలుఁగుపడి." స్వా. ౬, ఆ.

కరఁచు. దే. ప్రే. కరఁగఁజేయు.

కరక. ఉభ. దే. వి. హరీతకిచెట్టు. సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. వడగల్లు. అ. న. ము. పుట్టగొడుగు. పుం, న. 1. గిండివంటిపాత్రము; 2. లోపల నేమియు లేని బొండ్లపుఁజిప్ప. పుం. 1. దాళిమ్మచెట్టు; 2. పక్షి విశేషము.

కరకంచు. దే. వి. (కరక+అంచు.) కరక్కాయనీ టితో వ్రాసినయంచు.

కరకణీ. దే. వి. వేఁటాడుటకు ఉపయుక్తమగు సా ధనవిశేషము. "గొరక లత్తళములు కరకణీలు." రుక్మాం. 3, ఆ.

కరకర. దే. వి. వ్రాయుటయందగు ధ్వన్యనుకరణము.

కరకరి. దే. వి. 1. క్రూరభావము; "కరకరిగూఁ టఁగట్టియుడఁగా." స్వా. 3, ఆ.—2. ద్వేషము. "కళింగజంబులగుగంధగజంబులకుంభరాజితోఁ గరకరిపుట్టఁగాఁగలదు." వై. ౫, ఆ.

కరకసా. వై. విశ. కఱకు. (కరకసానేల.)

కరక్కాయ. దే. వి. (కరక+కాయ.) కరకచెట్టు కాయ.

కరగసము. వై. వి. అంపము, క్రకచము.

కరగోడ. ద్వి. వి. (వెలుగునాటుటకై.) పొడిమట్టి తో నేర్పఱచినగోడ.

కరజము. సం. వి. అ. న. పులిగోరుచెట్టు. పుం. 1. గో రు; 2. కానుగుచెట్టు.

కరట. సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రయాసముచేతఁ బిదు కఁదగిన యావు, అట్టి. 2. కాఁచిచెట్టు. అ. పుం. ము. 1. కాకి; 2. కుసుమపువ్వు; 3. గోఁదురుఁగప్ప; 4. ఏనుఁగుచెక్కిలి; 5. నింద్యజీవనము; 6. వాద్య విశేషము; 7. ఏకాదశాహాది శ్రాద్ధము.

కరటి. సం. వి. న్. పుం. గజము, ఏనుఁగు.

కరడము. దే. వి. అల. "సీ. కాంతాదిసుఖము సైకత వేదికాస్థలి కందర్పవికృతులు కరడములును." భీ. ౫, ఆ.

కరడు. దే. వి. 1. అల; "సీ. గగనంబుతోరాయుకర డులుగలజలం బివిరి పొడఁటినయర్ణవము కరణి." భార. ద్రో. ౨, ఆ.—2. పక్షివిశేషము.

కరణకమ్మలు. దే. వి. బ్రాహ్మణజాతివిశేషము.

కరణము. సం. వి. అ. న. 1. లెక్కవ్రాయువాఁడు; 2. బవాది; (ఇవి. ౧౧.—బవ, బాలవ, కౌలవ, తైతిల, గరజి, వణిక్కు, భద్ర, శకుని, చతుష్పా త్తు, నాగవము, కింస్తుఘ్నము.) 3. కొఱముట్టు; 4. ఇంద్రియము; 5. కారణము; 6. క్రియాభేద ము; 7. పని; 8. క్షేత్రము; 9. గీతభేదము; 10. నృత్యభేదము; 11. పూఁత; 12. రతిబంధము; 13. శరీరము. పుం. డు. శూద్రస్త్రీకిని వైశ్యున కును బుట్టినవాఁడు. (త్రికరణములు.—మనస్సు, వాక్కు, కర్మము.)

కరణి. దే. వి. విధము. "క. ఒక్కఁడ సర్వగతుండై, యెక్కడు క్రియవాసుదేవుఁడితఁడని పెద్దల్, మ్రొక్కఁగనుండుజనార్దనుఁ, డక్కరణియనన్య మెఱుఁగవైతిదురాత్మా." హరి. ఉ. ౬, ఆ.

కరణికము. వై. వి. కరణమువానిపని.

కరణీయము. సం. విశ. (అ. ఆ. అ.) చేయఁదగినది.

**కరతిత్తి.** వై. వి. వస్త్రపుసంచి. "ద్వి. కుదియకకరతిత్తిగొనిదాని వ్రేయ." హరిశ్చ. ౨. భా.

**కరతోయ.** సం. వి. ఆ. స్త్రీ. గౌరీవివాహకాలమందు ఈశ్వరుని హస్తమువలనఁ బుట్టిన యేఱు.

**కరదము.** సం. వి. అ. పుం. ఉపహారము, కానుక.

**కరదివియ.** వై. వి. దివ్వటీ.

**కరదివ్వియ.** వై. వి.——పై.——

**కరదివ్వె.** వై. వి. కరదివ్వియయొక్క రూపాంతరము. "ది. కరమునఁబూనినఖడ్గప్రకాశ, మరుదుగాఁగరదివ్వెయై త్రోవఁజూప." హరిశ్చ. ౧, భా.

**కరదీపిక.** సం. వి. ఆ. స్త్రీ. దివ్వటీ.

**కరపక్క.** దే. వి. వర్ణహీనమైన కెంపుఱాయి.

**కరపత్రము.** సం. వి. అ. న. క్రకచము, అంపము.

**కరపుచ్చే.** దే. వి. సోమకర్కటి?.

**కరఫలము.** సం. వి. అ. పుం. గుజ్జుమునుదోమెడు గొఱపము.

**కరభుజము.** దే. వి. ఇత్త్రాలము?.

**కరబూజా.** హిం. వి. ఒకపండు.

**కరభము.** సం. వి. అ. పుం. 1. మనికట్టుమొదలు చిటికెనవ్రేలి మొదలుదాఁకఁగల చేతివెలుపలి చోటు; 2. ఒంటెపిల్ల.

**కరమర్దము.** సం. వి. అ. పుం. కలివె?.

**కరము.** ఉభ. దే. అవ్య. అత్యంతము. (వృత్తియందు దీనికి వాఁడిశబ్దము పరమగుచో మువర్ణలోపము మహాకవిప్రయోగములయందుఁ గానఁబడుచున్నది. "కరవాఁడిచూపులు." కరవాఁడినఖములు.)—సం. వి. అ. పుం. 1. చేయి; 2. కిరణము; 3. తొండము; 4. కప్పము; 5. వడగల్లు.

**కరరుహము.** సం. వి. అ. పుం. నఖము, గోరు.

**కరవటము.** వై. వి. బరణి*. "గీ. పొదలియొండొండదివియునుభువియుదిశలుఁ, బొదివికొనియెడి చీఁకటిప్రోవువలన, మిక్కుటంబుగఁగాటుకగ్రుక్కినట్టి, కరవటంబన జగదండఖండ మమరె." లక్ష్మీ. 3, ఆ.

**కరవాఁక.** దే. వి. సముద్రపుఁగట్టు నోరనుండెడి బురదనేల.

**కరవాయి.** దే. వి. లోహకారుఁడు సుత్తెతోఁ బాత్రములను చాఁగఁగొట్టునప్పుడు ఒత్తుడుగా వాని లోపలఁ జొప్పించెడి మొనవంపు దిమ్మె మొగపు యినుపకమ్మి.

**కరవాలము.** సం. వి. అ. పుం. ఖడ్గము, కత్తి.

**కరవాలు.** వై. వి.——పై.——"క. తివిరికరవాలు సేకొని, అవలవలెసఁగంగనత్తెలవపైఁజనుచో." అచ్చ. సుం, కాం.

**కరవాలిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. కత్తిపీఁట; 2. చేరకత్తి.

**కరవీరము.** సం. వి. అ. పుం. 1. కత్తి; 2. గన్నేరు?. 3. డు. ఒకానొక రాక్షసుఁడు.

**కరశాఖ.** సం. వి. ఆ. స్త్రీ. అంగుళి, వ్రేలు.

**కరసాన.** వై. వి. రత్నములు మొదలగువాని సానఁబట్టెడు చక్రాకారమైన సాన. "సీ. కలువలెన్నటికి శోభిలకుండఁ జేసినభానునిఁగరసానఁబట్టవలదె." భాను. 3, ఆ.

**కరహాటము.** సం. వి. అ. పుం. 1. తామరదుంప; 2. మంగ?.

**కరా.** వై. విశే. తీక్ష్ణము. (కరాచురి. మొ.) కరయొక్క రూపాంతరము.

**కరాచేరకత్తి.** వై. వి. ఖడ్గము. "డాకెలంకునసిరాజీకరాచురకత్తి." స్వా. ర, ఆ. (చురకత్తి, చుర, చూరి ఈ శబ్దములు కరాశబ్దపూర్వకమైనప్పుడు ఖడ్గవాచకములుగాఁ బ్రయోగములం గానఁబడుచున్నవి.)

**కరాచేరి.** వై. వి. (చూ.)——పై.——"వ. కటికనకమేఖలాఘటితంబగు చేఱు కరాచురిమరకతంపుఁబిడి మెఱుంగులు." స్వా. ౫, ఆ.

**కరాచూరి.** వై. వి. (చూ.)——పై.——"క. రాచూరితిమ్మవిభునిక, రాచూరిం దెగినిరంతరము సమరమృగీ, లోచనలమదన శాస్త్రా, లోచనలందుపలివర్తిలు దురభియాతుల్." రామా. ౧, ఆ.

**కరాటము.** వై. వి. బరణి*. "సీ. పమ్ముకాటుకకరాటమ్ముఘోరారిదుష్కీర్తిసంభృతరోదసీతలమ్ము." చంద్రా. ౧, ఆ. (కరవటముయొక్క రూపాంతరము.)

**కరాపువు.** వై. వి. లవంగము.

**కరారు.** హిం. వి. ఏర్పాటు, నిర్ణయము.

**కరారునామా.** హిం. వి. ఒడంబడికపత్రము.

**కరాళము.** సం. వి. అ. న. 1. నల్లగగ్గెర?; 2. వెన్నెముక. పుం. సజ్జరసమునూనె. విశే. 1. ఒడ్డుమిట్టయినది; 2. పొడవైనది; 3. వెలుపుఁబుట్టించునది.

**కరాళించు.** దే. అ. క్రి. 1. బొబ్బరించు; "వ. గిరిగహ్వరకాననంబులఁ దవులంబడి దరికొనియెరగలిగొనికాలుకాలానలంబుకయివడింగదిసి కరాళించి." వీర. ४, ఆ.—2. సకిలించు. "ద్వి. ఎక్కిన

దైతేయులిటునటుపడఁగ, లెక్కసేయకకరాళిం చుగుజ్జములు." రా. యు, కాం.—స. క్రి. నిందించు. "ద్వి. వక్కసేయనిలేకివాఁడనినన్ను, లెక్కసేయకకరాళించెనీరాజు." హరిశ్చ. ౨, భా.

కరి. ఉభ. దే. వి. 1. నిదర్శనము; "చ. తదీయతత్ఫలతకుహ్రస్వమాటెకరి." ఆము. ౪, ఆ.—2. మేర. "క. ఖాండీరవటముకరిగా." హరి. పూ. ౭, ఆ.—విశ. సాక్షి. "దినకరపవనాగ్ని తుహినదీప్తులుకరిగాన్." భార. ఆది. ౨, ఆ.—సం. వి. న్. పుం. 1. ఏనుఁగు; 2. కోఁతి.

కరిఖలము. సం. వి. అ. పుం. వేడుకగానాడెడు జూదము.

కరిణలు. దే. వి. బ. సాలెవారిలో నొకతెగవారు.

కరిణి. సం. వి. ఈ. స్త్రీ. ధేనుక, ఆఁడేనుఁగు.

కరిది. దే. వి. చర్మవాద్యవిశేషము. "ఎ, గీ. కవడయన నురుమ యనఁగను గరిది యనఁగఁ, దప్పెట యనంగవాద్యభేదములుచెలఁగు." ఆం, భా. ప్ర. నా.

కరిపిప్పలి. సం. వి. ఈ. స్త్రీ. గజపిప్పలి.

కరిమాచలము. సం. వి. అ. పుం. సింహము.

కరివె. దే. వి. ఇత్తడిలోనగువానితోఁజేసి వీణాదండమును బోదివికొనియుండునట్లు సొరకాయపయినమర్చెడు తదంగము, కకుభము.

కరివెద. దే. వి. నేల దున్ని విత్తుటకు వాన నెదురు చూచుట.

కరిసనము. వై. వి. కృషి. "క. అరులుమిగులఁగొని రాజులు, నరులకునెంతయును భయమొనర్తురు ధరణీ, సురులుగడఁగివాణిజ్యముఁ, గరిసనమును జేయఁగలరుకలికాలమునన్." భార. అర. ౪, ఆ. (చూ. కర్షనము.)

కరిసించు. వై. స. క్రి. ఘర్షించు. "సీ. కంఠీరవము నైనఁగరిసించుటయకాని యొరసి వెన్నీనిభటోచ్చయంబు." బహులాశ్వచరిత్రము.

కరిసె. వై. వి. కాలుపలము*. "కరిసెయనంగనుగా లుపలంబొప్పు." ఆం, భా. ద్వి. వై.

కరీరము. సం. వి. అ. పుం, న. వెదురుమొలక. పుం. 1. కుండ; 2. వెణుతురు?.

కరీరిక. సం. వి. ఆ. స్త్రీ. 1. ఏనుఁగుకొమ్ముమొదలు; 2. చిమ్మట.

కరీషము. సం. వి. అ. పుం, న. 1. ఎరువు; 2. ఏఱు పిడక; 3. పిడక.

కరుగు. దే. వి. 1. పోఁతపోసెడియచ్చు; "చ. కరుగునఁబోయుమాడ్కినొడికంబుగతాతమలంచుకై వడిన్." చంద్రా. ౨, ఆ.—2. పరిపొట్టకట్టి.

కరుడు. దే. వి. 1. గట్టిపడిన ముద్ద; "గీ. కలసిశుక్లశోణితములు కరుడుగట్టి, వినుమమేధ్యమధ్యమునఁబ్రవృద్ధిఁబొంది, కాలవశతనప్పిండమంగంబులెల్లఁ, గలిగి శిశువయిమారుత గతియెలర్ప." భార. స్త్రీ. ౧, ఆ.—2. దినదినము వ్రాసెడుసంకీర్ణపులెక్క.

కరుడుగట్టు. దే. అ. క్రి. (కరుడు+కట్టు.) గట్టి, ముద్దయగు. (చూ. చేలచేలన.)

కరుణ. సం. వి. ఆ. స్త్రీ. కనికరము. అ. పుం. ము. 1. ఒకానొకచెట్టు; 2. ఒకరసము. (చూ. రసము.)

కరుణించు. సం. అ. క్రి. కనికరించు.

కరుమల. వై. వి. (చూ.) కమ్మరి*. (కరుమలవాఁడు, కరుమలది.)

కరువ. వై. వి. కొండ. "క. గట్టనగుబ్బలియనంగఁ గరువయనంగా." ఆం, భా. ద్వి. వై.

కరువలి. దే. వి. గాలి, వాయువు.

కరువలిపట్టి. దే. వి. 1. భీముఁడు; 2. హనుమంతుఁడు. (ఇట్లు గాడుపుఁబట్టి, గాలిమాలి. మొ.)

కరువలిరిక్క. ద్వ. వి. స్వాతీనక్షత్రము.

కరువలివిందు. దే. వి. అగ్ని, వాయుసఖుఁడు. "సీ. వచ్చెఁబోమనరాజువారితోఁ గరువలివిందుసన్నిధినెంతపొందుపట్టె." రామా. ౬, ఆ.

కరువు. యు. దే. వి. కరుగుయొక్కరూపాంతరము. "చ. సరియగునిట్టివెట్టనివిసర్వము నంచటమీఁదిసృష్టికై, శరధిపదిజ్వరుజ్జ్వలితచండతరాతపవహ్నినాఁఁగాఁ, గరువులజొందుమీనిపయిఁగట్టినవం గను పట్టెవెచ్చలన్, గరికిరికాసరాంగములఁ గప్పినరొంపులునందయాఁఁగన్." ఆము. ౨, ఆ.—వై. గర్భము. "క. చరువులునమ్మునిచెప్పిన, తరువులువీవ్వడియె సుతకుఁ దల్లికి నట్లు, య్యిరువురునుపయోగింపఁగఁ, గరువులుఁదత్తత్ప్రకారకలితములయ్యెన్." భార. అను. ౧, ఆ.

కరుసు. వై. వి. పరుషోక్తి*. "సీ. కఱుకుకరుసుకాఱుకాటొడ్డుముపరుసుపరుసనయనఁగనిష్ఠురము వెలయు." ఆం, భా. ప్ర. వాగ్వ.

కరూశము. సం. వి. అ. పుం. ఒకానొకదేశము.

కరేకరము. సం. వి. అ. న. పిడికిటిపోటు.

కరేటువు. సం. వి. ఉ. పుం, స్త్రీ. పెద్దకక్కెర.

కరేణువు. సం. వి. ఉ. స్త్రీ. ఆఁడేనుఁగు. పుం. 1. ఏనుఁగు; 2. కొండగోఁగు॰.

కరోటకము. సం. వి. అ. న. వస్త్రములుపెట్టెడు పెట్టె, బొక్కెస.

కరోటి. సం. వి. ఇ. స్త్రీ. తలయెముక, పుఱ్ఱె.

కర్కంధువు. సం. వి. ఊ. పుం, స్త్రీ. 1. రేఁగు॰; 2. గంగరేఁగు॰.

కర్కటకి. సం. వి. ఈ. స్త్రీ. గొడ్డుకాఁకర॰.

కర్కటము. సం. వి. అ. పుం. 1. ఎండ్రి; 2. కక్కెర; 3. చెఱకు॰; 4. నూఁగుదోస॰; 5. బూరుగుకాయ; 6. ఒకరాశి; (చూ. రాశి.) 7. అభినయహస్తవిశేషము. (రెండుచేతులవ్రేళ్లను నొకటొకటిసందున నదికినట్టుగాఁ గూర్చిపట్టినది.)

కర్కటి. సం. వి. ఈ. స్త్రీ. దోస॰.

కర్కము. సం. వి. అ. పుం. 1. అందము; 2. అద్దము; 3. ఎండ్రి; 4. కుండ; 5. తెల్లగుఱ్ఱము; 6. నిప్పు. విశే. 1. తెల్లనిది; 2. మంచిది.

కర్కరము. సం. వి. అ. న. కంకరఱాయి. పుం. అద్దము. విశే. కఱకైనది.

కర్కరి. సం. వి. ఈ. స్త్రీ. 1. దోస॰; "ఘృతపిండనిభకర్కరీఖండములతోడ." ఆము. ౨, ఆ.— 2. గిండివంటి మట్టిపాత్రము.

కర్కరేటువు. సం. వి. ఉ. పుం, స్త్రీ. పెద్దకక్కెర.

కర్కశము. సం. వి. అ. పుం. 1. కంపిల్లము॰; 2. కసింద॰; 3. చెఱకు॰. విశే. 1. కనికరములేనిది; 2. కఱకైనది; 3. గట్టిది; 4. తెగువగలది; 5. నొప్పించునది.

కర్కారువు. సం. వి. ఉ. పుం. గుమ్మడి॰.

కర్కోటకము. సం. వి. అ. పుం. 1. ఒకానొకపాము; 2. మారేడు॰.

కర్కోటము. సం. వి. అ. పుం. మట్టుకాఁకర॰.

కర్కోలకము. సం. వి. అ. న. తక్కోలపు చెట్టు. (రూ. కర్కోలికము.)

కర్చూరము. సం. వి. అ. న. బంగారు. పుం. గచ్చూరము॰.

కర్జకాయ. దే. వి. భక్ష్యవిశేషము.

కర్జము. వై. వి. పని, కార్యము.

కర్ణజలూక. సం. వి. ఆ. స్త్రీ. చెవిఁజొరుపాము.

కర్ణజలౌకము. సం. వి. స్. పుం. ——వై.——

కర్ణధారుఁడు. సం. వి. అ. పుం. ఓడనడపువాఁడు, అరకాటి.

కర్ణపత్రము. సం. వి. అ. న. కర్ణిక, చెవికమ్మ.

కర్ణపూరము. సం. వి. అ. పుం. 1. కంగేలి॰; 2. కడప॰; 3. పుష్పాదులచేఁ జేయఁబడిన చెవికమ్మ; 4. దిరిసెము॰; 5. నల్లగలువ.

కర్ణము. సం. వి. అ. పుం. 1. చెవి; 2. కన్నము; 3. చుక్కాని. 4. డు. కుంతి మొదటికొడుకు.

కర్ణలత. సం. వి. ఆ. స్త్రీ. చెవితమ్మె.

కర్ణవేష్టనము. సం. వి. అ. న. కుండలము, పోఁగులు.

కర్ణాకర్ణి. సం. వి. ఈ. స్త్రీ. వినికివరుస.

కర్ణాటము. సం. వి. అ. పుం. ఒకానొక దేశము.

కర్ణిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చెవికమ్మ; 2. తొండము చివర; 3. తామరదుద్దు; 4. చేతినడిమివ్రేలు; 5. బాణవిశేషము.

కర్ణికారము. సం. వి. అ. పుం. 1. కొండగోఁగు॰; దీనికి, దోహదక్రియ సల్లాపము. 2. ఱేల॰.

కర్ణీరథము. సం. వి. అ. పుం. బాలకాదిక్రీడాశకటము.

కర్ణేజపుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) సూచకుఁడు, కొండెకాఁడు.

కర్త. సం. వి. ఋ. పుం. బ్రహ్మ. విశే. చేయువాఁడు.

కర్తనము. సం. వి. అ. న. 1. కత్తిరించుట; 2. స్త్రీలు రాట్నమువడుకుట; 3. కయివడిముస్తె॰.

కర్తరి. సం. వి. ఈ. స్త్రీ. 1. కత్తెర; 2. భ[illegible]యూడు నాలుగు పాదములయందును కృత్తికయందును రోహిణి మొదటిపాదమునందును సూర్యుఁడుండుకాలము.

కర్తరీముఖము. సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము. (బొటనవ్రేలినివంచిచూపుడువ్రేలిమొదటఁగూర్చియుంగరపువ్రేలినివంచి చూపుడునడిమివ్రేళ్లను గత్తెరవలెఁబట్టినది.

కర్తలాణము. సం. వి. అ. పుం. తెల్లనిగొరిజలోఁక వెండ్రుకలుగలనల్లగుఱ్ఱము, కత్తిలాని. "శ్లో. పూర్వవత్సర్వశుక్లాంగస్త్వచాకృష్ణోథ వేద్యది, వర్ణోనామ్నా సవిజ్ఞేయః కర్తలాణస్తురంగమః." అని శివతత్వరత్నాకరము. "క. అల్లునికి నిచ్చె ధాత్రీవల్లభుఁడనురక్తి నమరవల్లభహరితో, సుల్లసమానంజాలెడు, తెల్లనియొక కర్తలాణ తేజోహయము॰." సై. ౩, ఆ. (ఉచ్చైశ్శ్రవముతో దీని

సరిఁబోల్చి తెల్లని యని విశేషణమిచ్చియుండుట చేత నిక్కడ నిదియశ్వమాత్రపరమని యెఱుంగునది.)

కర్తవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) చేయఁదగినది.

కర్తారి. సం. వి. ఈ. స్త్రీ. కత్తెరవంగ†.

కర్దమము. సం. వి. అ. పుం. పంకము, అడుసు.

కర్పటము. సం. వి. అ. పుం. 1. వస్త్రము; 2. చినిఁగినవస్త్రము. మాసినవస్త్రము. (అని కొందఱు.)

కర్పరము. సం. వి. అ. పుం. 1. తలపుర్రె; 2. కొప్పెర; 3. శస్త్రభేదము.

కర్పరాలము. సం. వి. అ. పుం. కొండగోనుగు†.

కర్పరి. సం. వి. ఈ. స్త్రీ. మ్రానిపసుపునవండిన అంజనవిశేషము.

కర్పూరగంధి. సం. వి. ఆ. స్త్రీ. కప్పురగంది.

కర్పూరభోగి. సం. వి. న్. న. (మా. కప్పురబోగి.)

కర్పూరము. సం. వి. అ. పుం, న. ఘనసారము, కప్పురము.

కర్బురా. సం. వి. ఆ. స్త్రీ. కలిగొట్టు†. అ. న. ము. 1. నీరు; 2. బంగారు. పుం. 1. పాపము; 2. చిత్రవర్ణము. విణ. చిత్రవర్ణముగలది.

కర్బురుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు.

కర్మంది. సం. వి. న్. పుం. పారాశరి, సన్న్యాసి.

కర్మకరుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) పనివాఁడు.

కర్మకారుఁడు. సం. వి. అ. పుం. కమ్మరవాఁడు. విణ. వెట్టికిపనిచేయువాఁడు.

కర్మఠుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నెఱవేరుదాఁక నొక పనిచేయువాఁడు.

కర్మణ్యా. సం. వి. ఆ. స్త్రీ. 1. కూలి; 2. జీతము.

కర్మము. సం. వి. న్. న. 1. కారకవిశేషము; 2. పని. (రూ. కర్మవు.) (తర్కశాస్త్రమునందలి పంచవిధకర్మములు:—ఉత్క్షేపణము, అపక్షేపణము, ఆకుంచనము, ప్రసారణము, గమనము.) (షట్కర్మములు.—యజనము, యాజనము, అధ్యయనము, అధ్యాపనము, దానము, ప్రతిగ్రహము. షోడశకర్మములు.—గర్భాధానము, పుంసవనము, సీమంతము, జాతకర్మము, నామకరణము, అన్నప్రాశనము, చౌలము, ఉపనయనము, ప్రాజాపత్యము, సౌమ్యము, ఆగ్నేయము, వైశ్వదేవము, గోదానము, సమావర్తనము, వివాహము, అంత్యకర్మము.)

కర్మయుగము. సం. వి. అ. న. కలియుగము.

కర్మసాక్షి. సం. వి. న్. పుం. సూర్యుఁడు, చెయువులసాకిరి.

కర్మారము. సం. వి. అ. న. వెదురు.

కర్మారుఁడు. సం. వి. అ. పుం. కమ్మరవాఁడు.

కర్మేంద్రియము. సం. వి. అ. న. పాయూపస్థపాణిపాదవాక్కులలో నేదే నొకటి.

కర్వలి. దే. వి. కరువలియొక్కరూపాంతరము.

కర్షకుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) 1. ఈడ్చువాఁడు, 2. దున్నుకొని బ్రదుకువాఁడు.

కర్షణము సం. వి. అ. న. 1. ఈడ్చుట; 2. దున్నుట; 3. ఒరయుట.

కర్షఫలము. సం. వి. అ. పుం. తాండ్రి†.

కర్షము. సం. వి. అ. పుం, న. పదునాఱుమాషములయెత్తు. పుం. ఒరయిక.

కర్షితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఈడువఁబడినది; 2. దున్నఁబడినది; 3. ఒరయఁబడినది.

కర్షువు. సం. వి. ఊ. స్త్రీ. 1. కాలువ; 2. యజ్ఞార్థమైన దుక్కి. వంగ. (అనికొందఱు.) పుం. పిడకనిప్పు.

కర్సనము. వై. వి. కరిసనముయొక్కరూపాంతరము. "గీ. కాఁపులావువెరవుకలిగికర్సనముసేయంగ." భార. సౌ. ౧, ఆ. "ద్వి. కడఁగికేదారాదికంబులనెపుడు, సడలనిశక్తిఁగర్సనమొనరించు." భాగ. ౫, స్కం.

కఱ. వై. వి. 1. నలుపు; "చ. వెడకఱవడ్డమోముఁబటువేదనఁ గందినయంతరంగముల్, బడుగయియున్నమేనునయి." హరి. పూ. ౮, ఆ. — 2. మఱక*. "మ. కఱయున్ మాఁగునులేకపుట్టిన శుభాంగంబద్భుతాపాదియై, నెఱయన్." హరి. పూ. ౫, ఆ.

కఱకంఠుఁడు. వై. గ్రా. వి. శివుఁడు, గరళకంఠుఁడు.

కఱకరి. వై. విణ. (కఱకు+అరి.) కఠినుఁడు. "వివిధాయుధంబులంగఱకరియై." (కఱకరి అనఁగా ఇక్కడ సమర్థుఁడని యర్థము.) స్వా. ౪, ఆ.

కఱకఱ. దే. వి. కందుట, ప్రొద్దుపొడుచుట, ఒరయుట, తెఱుఁగుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. (కఱకఱఁగందె, కఱకఱఁబొడిచె, కఱకఱనొరయు, కఱకఱఁదఱుఁగు.)

కఱకటి. దే. వి. బాధ. "చ. ఎఱుఁగరుగాయొకద్భుతమునీచెలిదీర్ఘికఁదీర్థమాడనా, యఱుతఁదగిల్చిపోవుదనహారముపోయిననేనుఁబోవుదున్, మఱవక వెంటఁబోవ జలమగ్నతనొందిసున్నమైన

నన్, గఱకటఁబెట్టిసొమ్మడుగఁ గానినిజార్తిరొ
ఱంగదేమియున్." ఆము. ౫, ఆ.

కఱకు. వై. వి. 1. కర్కశత్వము, కాఠిన్యము. "సీ. కో
కంబులకుఁబైఁడికుండలకఱకు మోపంతయు సర
సతనబ్బె నేని." హరి. ఉ. ౭, ఆ.—2. బ. పరుషవచ
నము. "ద్వి. కఱకులాడెడుమాడ్కిఁగాదుమీఁ
దటను." రా. యు, కాం.—విణ. 1. కఠినము;
2. పరుషము. (కఱకునేల, కఱకుమాట. మొ.)

కఱకుగిలు. వై. అ. క్రి. బిరుసగు. "వ. పుంజుకొని
వెడలినిడుదలయియుండుకఱకుగిలునాసాకేశం
బులును." కవిక. ౫, ఆ.

కఱకుట్లు. దే. వి. బ. కఱ్ఱకుట్లుయొక్క రూపాంతర
ము. (దీనిని కఱకుట్లు అనియు, కఱుకుట్లు అని
యు ఉభయవిధముగా వాడుచున్నారు.)

కఱకుదుమ్ము. ద్వ. వి. ఇసుక. "సీ. మలయానిలము
చేదుమారంబు రేఁగుసౌగంధికంబురజంబుకఱకు
దుమ్ము." స్వా. ౫, ఆ.

కఱచు. దే. స. క్రి. 1. అభ్యసించు; 2. కాటుచే
యు. "వ. మునికోలనడిచియుంబొడిచియు, రజ్జు
వుచేనెత్తియుమొత్తియు, కరంబులంజఱచియుఁ
గఱచియు, పదాహతులమెట్టియుఁగిట్టియు."
శేష. ౪, ఆ.

కఱటి. దే. విణ. వంచకుఁడు. "క. మఱచినఁదలఁపింపఁగ
నగు, నెఱుఁగనినాఁడెల్లపాట్లనెఱిఁగింపనగున్,
మఱియెఱిఁగియెఱుఁగనొల్లని, కఱటిం దెలుపం
గఁగమలగర్భునివశమే." భార. ఆది. ౪, ఆ. "సీ. మా
నంబువీటిఁబోమసఁగి వ్రేతలఁజిక్కవఱచినయది
యొయీకఱటిచూపు." హరి. పూ. ౯, ఆ.

కఱత. వై. వి. 1. చేష్ట; 2. దుశ్చేష్ట*. "చ. కఱతలు
పెద్దవీనికిటుకాఱియఁబెట్టెడుమానకేమిటన్, నె
ఱఁకులుమీటుచుండుఁదననీచపుమాటలువీనిఁబ
ట్టిక, చ్చఱఁబరిమార్పఁజేసిన యుపాయములన్ని
యుగొడ్డువోయెనీ, వుఱకవధింపఁగావలయును
గ్రపుమాయలనిద్దురాత్మునిన్." లక్ష్మీ. ౪, ఆ.

కఱతలాఁడు. వై. విణ. (కఱతలు+ఆఁడు.) దుశ్చేష్టుఁ
డు. "క. కదలినమొత్తుదు నెక్కడఁ, గదలెదవ
టు కఱతలాఁడ కదలుమయేఁజూ, చెదననుచుఁ
బోయియిమ్ముల, ముదితనిజకుటుంబకార్యములఁ
దత్పరయై." హరి. పూ. ౫, ఆ.

కఱద. వై. వి. బుద్ధి*. "గీ. గోలయిట్టికాఱుఁగోనలో
నిన్నొంటి, ఢించిచనఁగనగునెయ్యించుకైన, నిడు
మకలుగనేరదిపుడుమాయన్నకు, వింతకఱదల్లె
విడువుమింక." అచ్చ. అర, కాం. "క. పిఱుతివి
యకనాముందఱఁ, దెఱవాయిప్పగిదినాడఁ దెఱ
వామేల్తేల్, కొఱమాలినయివ్విఱిఁడి, కఱదలునీ
కెవ్వరిపుడుకఱపిరిచెపుమా." అచ్చ. అ, కాం.

కఱదూపము. వై. వి. గృహధూమము, ధుంధుమార
ము. "గీ. విరహపరితాపవేదనవేఁగుచున్న, చక్ర
వాకాంగనలకటాక్షములయగ్గి, నావహిల్లినకఱ
దూపమనఁగనొప్పు, నుడుగణాధీశబింబంబునడి
మిమచ్చ." భీ. ౨, ఆ.

కఱనూనె. ద్వ. వి. (కఱ్ఱ+నూనె.) మ్రాని
తైలము.

కఱపు. దే. ప్రే. బోధించు. వి. దుర్బోధన. "గీ. శకు
నికఱపువినియసన్మార్గవృత్తికిఁ, జొచ్చియిట్టియె
డరుతెచ్చుకొనిరొ." భార. భీష్మ. ౧, ఆ.

కఱవ. దే. వి. ఒకానొక మూలిక.

కఱవాడు. దే. వి. ఎండినచేఁప.

కఱవు. దే. వి. 1. క్షామము; "కఱవుపయిఁగఱవుపొ
యుచు, వెఱపుపయిన్ వెఱపుదోఁపవిడువని
యిడుమం, దొఱఁగమిపైఁబురుషుఁడిడుమఁ, దొ
ఱఁగమిఁజేడ్పడుచునడఁచుదుష్కర్మములన్."
భార. శాం. ౪, ఆ. "క. తగవామగవారికినిటు, మగు
వలయందెగువఁజూపమాదృశవీరుల్, జగతింగఱ
వాడొరవా, మగఁటిమిగలరాచచందమా యిది
యిహీహీ." రామా. ౫, ఆ.—2. పూరియిండ్లు
కప్పునపుడు ఏర్పఱచుకొనుమితి. "సీ. కఱవుగె
స్తులయిండ్లఁగప్పు నేఁతలయందు నుడివడికలఁగు
టల్ మడుఁగులంద." అచ్చ. బా, కాం.

కఱి. వై. వి. పశుయోని*. విణ. నల్లనిది.

కఱిపక్కము. వై. వి. కృష్ణపక్షము.

కఱియ. వై. విణ. కృష్ణవర్ణము. "సీ. కఱియనెమ్మేనఁ
జీఁకటిమ్రాఁకుఁబ్రాఁకుబంగరుదీఁగక్రియఁదూ
లఁగద్రుశాటి." పాండు. ౫, ఆ.

కఱివేము. ద్వ. వి. కఱివేఁపాకుచెట్టు, కాలశాకము.

కఱివేలుపు. ద్వ. వి. వెన్నుఁడు, కృష్ణుఁడు.

కఱివేల్పురిక్క. ద్వ. వి. శ్రవణనక్షత్రము.

కఱుకు. దే. స. క్రి. రాచు. "ఎ, గీ. కఱకుటంఘ్రుల
నిఱికించిగజ్జెగదలఁ, గఱికినెఱినెఱిఁగొలెమ్మక
యునువిఱుగ, విఱిచెవడిఁగైజానొకపెద్దవేసడం
బు." స్వా. ౪, ఆ.—వి. మందాకుమాడ్చిరాచిన
పొడి,

కఱుకుట్లు. దే. వి. బ. కఱ్ఱుకుట్లుయొక్క రూపాంతరము. "సీ. కఱుకుట్లగతిరౌతులుఱికికాల్బలముల గ్రుచ్చిరి నేజాలగుదులుగాఁగ." చంద్ర.

కఱుక్కు. దే. వి. నఱుకుటయందగుధ్వన్యనుకరణము. "ఘూర్ణమస్తముకఱుక్కునఁద్రుంచె." ఉ, రా. ౭, ఆ.

కఱుగోల. దే. వి. (కఱ్ఱు+కోల.) వాఁతవేసెడు ఇనుపకమ్మి, చూఁడుఁగోడుపు.

కఱుదు. వై. వి. నేర్పు*. "వ. బిరుదులంబాపుచుఁగఱుదులంజూపుచు." ఉ, రా. ౨, ఆ. "వ. దీని కఱుదులెంతయరుదులుచూచితే." ప్రభా. 3, ఆ. "క. కఱుదులమాటలమమ్ముం, గుఱుచవడుగ యేల యింతగోసెక్కింపకఁ." హరి. ఉ. ౧౦, ఆ.

కఱుదులాఁడు. వై. విశే. (కఱుదులు+ఆఁడు.) నేర్పరి. "కఱుదులాఁడగుచక్రి కపటంపుటనువు నఁదనుమోసపుచ్చిన." హరి. ఉ. ౭, ఆ.

కఱ్ఱ. యు. దే. వి. కొయ్య. వై. 1. నలుపు; "గీ. కెఱ్ఱుఁ జెప్పులుదొడిసున్న గఱ్ఱతడుపు, లెలమితోఁగట్టి." హరి. పూ. ౫, ఆ.—2. మఱక*.

కఱ్ఱకుట్లు. దే. వి. బ. ఇనుపసలాకయందు గ్రుచ్చి కాల్చెడు మాంసఖండము, శూల్యము.

కఱ్ఱమడ. దే. వి. పెల్లగింప నుపయుక్తమైన ఆయుధ విశేషము. "గీ. గడ్డపాఱలఁ బాఱలఁ గఱ్ఱమడల, వెడఁదగుద్దండ్ల నాపుట్ట విరియఁద్రవ్వ, నందు నిద్రించుచున్న కాలాహిఁగెరలి, తూలిపాఱంగఁ గొందఱఁదోలితోలి." పంచ. నా. ౧, ఆ.

కఱ్ఱి. వై. వి. అర్జునుఁడు*. విశే. నల్లనివాఁడు. "వ, గీ. తెల్లదామర ఱేకులట్టుల్లసిల్లు, కన్నుదోయినొప్పారెడుకఱ్ఱియాతఁడు." హరి. పూ. ౯, ఆ.

కఱ్ఱు. దే. వి. నాఁగటిదుంపయందమర్చెడి యినుపపాళము, కృషకము.

కఱ్ఱుకుట్లు. దే. వి. బ. (చూ.) కఱ్ఱకుట్లు. "సీ. నీరువెళ్లఁగనొత్తినిప్పు లనందందకమ్మగాఁగాల్చినకఱ్ఱుకుట్లు." రుక్మా. 3, ఆ.

కఱ్ఱుగుద్దలి. ద్వ. వి. తొల్లిక. "సీ. త్రవ్వటంబులతటేఁ ద్రవ్వటంబులువెట్టఁ దగినట్టికఱ్ఱుగుద్దలిగడించి." కళా. ౮, ఆ.

కల. ఉభ. దే. వి. స్వప్నము. సం. ఆ. స్త్రీ. 1. ముప్పదికాష్ఠలకాలము; 2. చంద్రునిలోఁబదునాఱవ భాగము; 3. భాగము; 4. స్త్రీరజస్సు; 5. మొదలిసొమ్మువడ్డి; 6. శిల్పము అ.న.ము. రేతస్సు. విశే. 1. అవ్యక్తమధురము; (ధ్వని) 2. అజీర్ణము. (కలలు అఱువదినాలుగు. – ఇతిహాసము, ఆగమము, కావ్యము, అలంకారము, నాటకము, గాయకత్వము, కవిత్వము, కామశాస్త్రము, దురోదరము, దేశభాషాలిపిజ్ఞానము, లిపికర్మము, వాచకము, అవధానము, స్వరశాస్త్రము, శాకునము, సాముద్రికము, రత్నశాస్త్రము, రథాశ్వగజకౌశలము, మల్లశాస్త్రము, సూదకర్మము, దోహదము, గంధవాదము, ధాతువాదము, ఖనివాదము, రసవాదము, జలవాదము, అగ్నిస్తంభము, ఖడ్గస్తంభము, జలస్తంభము, వాక్స్తంభము, వయస్స్తంభము, వశ్యము, ఆకర్షణము, మోహనము, విద్వేషణము, ఉచ్చాటనము, మారణము, కాలవంచనము, పరకాయప్రవేశము, పాదుకాసిద్ధి, వాక్సిద్ధి, ఘుటికాసిద్ధి, ఐంద్రజాలికము, అంజనము, దృష్టివంచనము, స్వరవంచనము, మణిమంత్రౌషధాదిసిద్ధి, చోరకర్మము, చిత్రక్రియ, లోహక్రియ, అశ్మక్రియ, మృత్క్రియ, దారుక్రియ, వేణుక్రియ, చర్మక్రియ, అంబరక్రియ, అదృశ్యకరణము, దూతీకరణము, మృగయ, వాణిజ్యము, పాశుపాల్యము, కృషి, ఆసవకర్మము, ప్రాణిద్యూతకౌశలము.)

కలంకము. సం. వి. అ. పుం. 1. గుఱుతు; 2. ఇనుపచిట్టెము; 3. దూఱు.

కలంకారి. దే. వి. వ్రాఁతపనివస్త్రము.

కలంజము. సం. వి. అ. పుం. గంజాయి.

కలందాను. హిం. వి. కలములుంచు పెట్టె.

కలంబము. సం. వి. అ. పుం. 1. కూరనార; 2. బాణము.

కలంబి. సం. వి. ఈ. స్త్రీ. తీఁగబచ్చలి?.

కలఁక. దే. వి. 1. కలఁగుట; 2. కంటితెవులు.

కలఁకఁబాఱు. దే. అ. క్రి. (కలకఁ+పాఱు.) కలఁతపడు. "కలఁకంబాఱె మఱందిఁజెల్లెలినుదగ్రక్రోధుఁడైపట్టి." భాగ. ౧౦, స్కం. పూ.

కలఁకపాటు. ద్వ. వి. కలఁతపడుట. "వ. ఇక్కలంకపాటుతక్కినభయంబునకుంగాదుసుండు." కళా. ౮, ఆ.

కలఁకు. వై. వి. 1. కళ్లము; 2. స్థానము; 3. యుద్ధము*. (కలనుయొక్క రూపాంతరము. చూ. కలను.)

కలఁకువ. దే. వి. కలఁత. "పెక్కుకలంకువలమదింగూరినసైన." వాసి. ౫, ఆ.

కలెక్టరు. ఆం. వి. జిల్లాకు అధికారి.

**కలఁగఁబడు.** ద్వ. అ. క్రి. (కలఁగన్+పడు.) కలఁగు, సంక్షోభించు. "క. సాత్యకికో, ల్తలకోర్వక నీబలముగలంగంబడియెన్." భార. ద్రో. ౪,ఆ. (స్వార్థమునపడు.)

**కలఁగఁబాఱు.** దే.అ. క్రి. (కలఁగన్+పాఱు.)—పై.—"కలఁగంబాఱితోలంగెవారుణబలౌఘుంబుల్." హరి. ఉ. ౮, ఆ.

**కలఁగు.** దే. అ. క్రి. కలఁకఁబాఱు, కలఁతపడు.

**కలఁచియాడు.** దే. స. క్రి. (కలఁచి+ఆఁడు.) కలఁచు. "గీ. ఇట్లుకౌరవానీకంబునెల్లఁగలఁచి, యాడిభీష్మునిదెసఁబోవ." భార. విరా. ౫, ఆ.

**కలఁచే.** దే. ప్రే. కలఁగఁజేయు.

**కలఁత.** దే. వి. క్షోభము.

**కలఁతపడు.** ద్వ. అ. క్రి. కలఁగు, సంక్షోభించు.

**కలకంఠము.** సం. వి. అ. పు. 1. అవ్యక్తమధురధ్వని; 2. కోకిలము; 3. పావురము; 4. హంస.

**కలకల.** దే. వి. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము.

**కలకలము.** సం. వి. అ. పుం. 1. గుంపునఁబుట్టిన పెద్దమ్రోఁత, అలబలము; 2. సర్జరసము.

**కలకాలము.** మి. వి. ఎల్లప్పుడు.

**కలగలపు.** దే. వి. (కలపు+కలపు.) 1. కలుపుఁగోలుతనము; 2. కలుసుఁగూర. (రూ. కలగల్పు. కలుసుఁగూరకు. — "సీ. ఒకకొన్నికలగల్పులొకకొన్నిబజ్జులొక్కొకకొన్నిరీతుల యూర్పువగలు." పాండు. ౪, ఆ.)

**కలగుండు.** దే. వి. కలఁత, క్షోభము.

**కలగుండుగొను.** దే. అ. క్రి. (కలగుండు+కొను.) కలఁగు. "ఎ, గీ. చేదిమగధకేకయాదిసేన, లెల్లఁజెదరఁదరలఁదల్లడపడఁగల, గుండుగొనఁగఁజేసెఁగుంభజుండు." భార. ద్రో. ౧, ఆ.

**కలగుండుపడు.** ద్వ. అ. క్రి. (కలగుండు+పడు.) కలఁగు.

**కలగుండువెట్టు.** దే. స. క్రి. (కలగుండు+పెట్టు.) కలఁచు. "సీ. సాత్యకియేచి ధృష్టద్యుమ్నుఁడునుదానుగురుసైన్యములఁగలగుండువెట్ట." భార. భీష్మ. 3, ఆ.

**కలగూర.** దే. వి. (కలపు+కూర.) పెక్కుదినుసులు కలసిన కూరాకు.

**కలగొను.** దే. అ. క్రి. (కలపు+కొను.) 1. కలఁగు; "గీ. పక్షిమృగజాతులెల్లనుభ్రమసియిట్టు, నట్టుఁగలగొనిచెదరె." భార. విరా. ౪, ఆ.—2. వ్యాపించు. "ఎక్కువివర్ణతతోనలోపలంగలగొనె నారటంబు." ఉ, హరి. ౫, ఆ.

**కలజువ్వి.** దే. వి. కంచరాలము?.

**కలతెఱఁగు.** దే. వి. యాథార్థ్యము.

**కలధౌతము.** సం. వి. అ. న. 1. వెండి; 2. బంగారు; 3. అవ్యక్తమధురధ్వని.

**కలధ్వని.** సం. వి. ఇ. పుం. 1. అవ్యక్తమధురధ్వని; 2. కోకిలము; 3. నెమలి; 4. పావురము.

**కలన.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఎఱుఁగుట; 2. పొందుట.

**కలను.** వై. వి. 1. కళ్లము; "క. పొలమిల్లుతోఁటగ్రామము, కలనుపసులు మేయుకొఱను కాల్చినన్నృపకాం, తలతోసంగముచేసినఁ, గలయంబిరిసుట్టి వానిఁగాల్పఁగవలయున్." సం. "క్షేత్రవేశ్మవనగ్రామవివీతఖలదాహకాః, రాజపత్న్యభిగామీచదగ్ధవ్యాస్తుకటాగ్నినా." విజ్ఞా. వ్య. కాం.—2. స్థానము; "ఎ, గీ. ఏబలంబుదనకునెక్కుడు గలిగెన, బ్బలమునేలపోరుకలనుగాఁగ, నిసుఁడు సీతుగాలి వెనుకగామొనవడ, పించినడవ సంభవించుజయము." భార. శాం. ౨, ఆ.—3. యుద్ధము*. "క. అప్పుడ, ప్పలభుక్కులకన్యవస్యఫలభుక్కులకుం, గలనయ్యె." రామా. ౮, ఆ.

**కలప.** దే. వి. 1. నాఁగటిదుంప; 2. ఇల్లుకట్టుటకు ఉపయోగించెడు మ్రాను.

**కలపకట్టియ.** వై. వి. (కలము+కట్టియ.) వ్రాసెడు కలము.

**కలపడము.** దే. వి. ఒకటితోనొకటికలయుట. "గగడ. కలపడంబులుగలయవీచొక్కంపుఁగస్తురిరస్తు వీణెలు." శుక. ౧, ఆ.

**కలపతాల్పు.** దే. వి. 1. బలరాముఁడు; 2. శూద్రుఁడు.

**కలపనగంప.** దే. విశే. కలహశీలుఁడు. "చ. కలపనగంపయియాతపసికాలును నోరును బాదుకానకె. వ్వలనఁబరిభ్రమించుచు నుపాయపుఁబ్రేలరిమాటలాడిధీ, రులమదికైననూరకవిరోధమొనర్చుచునుండు." హరి. పూ. ౫, ఆ.

**కలపనఁబిండి.** దే. వి. (కలపడము+పిండి.) క్షోభము. "క. కలసెదఁబతినతఁడిచ్చుట, మెలఁగుట మాతండ్రివిన్న మేలగు నేప్రే, వులలోనసురియఁద్రిప్పిన, కలపనఁబిండైనఁజెలిమికత్తెలునగరే." ఉ, హరి. ౬, ఆ.

**కలపము.** దే. వి. 1. కలపుట; "క. తలయంటెనొకతెకేలునికిఁ, గలపంబునఁజేసితావిగల్గినమానెక."

య. ౮, ఆ.—2. పరిమళద్రవ్యములనుజేర్చికలపినచందనము. "సీ. కలపంబులభినవగంధంబులు గఁగూర్చితనువుననలఁదుదుననువుగాఁగ." భార. విరా. ౧, ఆ.

కలపు. దే. ప్రే. కలయఁజేయు. "మగలయిలువరుసఁగలపెను." రాఘ. ౨, ఆ. వి. కలయుట. "ఇరువురమనములకలపు." మార్క. ౫, ఆ.

కలబంద. దే. వి. ఒకానొక మందుచెట్టు, కన్య. (దీని భేదము ఏనుఁగుఁగలబంద.) (ఒక నిఘంటువునందు ఇది కలుబంద అని వ్రాయఁబడియున్నది.)

కలభము. సం. వి. అ. పుం. ఏనుఁగుగున్న. ముప్పదియేండ్లయేనుఁగు. (అని కొందఱు.) (తద్విశేషములు.—బాలము, పోతము, విక్కము.)

కలమము. సం. వి. అ. పుం. 1. వ్రాసెడు కలము; 2. వరిపైరు; 3. లత్తుక.

కలమరి. దే. విణ. (కలము+అరి.) ఓడయెక్కిపోవువాఁడు. "గీ. రథికునకుఁగలమరికిసారథియుఁగర్ణధారుఁడునుబోలెనాత్మకుఁదానుసుపథ, వర్తనైకవిధాయిగావలయుయోగ, ధారణానిశ్చయుండగుధీరుఁడధిప." భార. శాం. ౫, ఆ.

కలము. ఉభ. దే. వి. 1. ఓడ; "గీ. బ్రదుకుమీఁదియాసపాయంగఁబెట్టితిఁ, జిచ్చువంటివేఁకివచ్చినపుడ, జలధినట్టనడుమసాంయాత్రికుఁడుకలం, బవిసినపుడుధనమునాసపోలె." కాశీ. ౩, ఆ.—2. పండ్రెండుతూములకొలఁదిగలపరిమాణవిశేషము. "గీ. అంతనారాజగోవిందుఁడధికభక్తి, నల్లునకునాఁడుబిడ్డకునరణమిచ్చె, ముదముతోడమున్నూటఱువదిగలముల, హేమతండులములుజనులెల్లఁబొగడ." పర. ౩, ఆ.—వై. లేఖిని. సం. అ. న. రేతస్సు.

కలముఁడు. సం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.

కలయ. దే. ద్ర. అంతట. "వ. కొలువుకలయంగనుంగొని."భార.ఉద్యో.౨,ఆ.(రూ.కలయఁగ.)

కలయంపి. దే. వి. దుమ్మడఁగుటకై కస్తూరిచందనములోనుగాఁగల సుగంధవస్తువులఁగలపిచల్లెడునీరు. (కలాఁపియొక్కరూపాంతరము.)

కలయఁబడు. ద్వ. అ. క్రి. (కలయుక+పడు.) కలయు. "ఎ, గీ. కలయఁబడిమూఁపుమూఁపునఁదలఁగద్రోయు, రానిసందడినడమపౌరవ్రజంబు, నరయుచునుం." జై. ౩, ఆ. (స్వార్థమునపడు.)

కలయిక. దే. వి. సంగమము.

కలయు. దే. స. క్రి. కూడు. "కంటినిగలయంగనామనము." (నలకథయందు కంటిని కలయంగన్ అనియు హరిశ్చంద్రకథయందు కంటిని కల అంగనా అనియు ఛేదము.) హన. ౨, ఆ.

కలరవము. సం. వి. అ. పుం. పారావతము, పావురము.

కలరూపు. ద్వ. వి. యాథార్థ్యము.

కలలము. సం. వి. అ. పుం, న. 1. గర్భపిండము; 2. మావి.

కలవ. దే. వి. 1. కలయుట; 2. కలసిన యిసుకయు సున్నమును. విణ. కలసినది.

కలవంటకము. దే. వి. (కలపు+వంటకము.) మావు పొడిలోనగువానితోఁగలపినవంటకము, దివ్యాన్నము.

కలవడు. ద్వ. అ. క్రి. (కలపు + పడు.) కలయు. "క. కలవడిమాటలఁబ్రియముల." రుక్మాం. ౧, ఆ.

కలవరపడు. ద్వ. అ. క్రి. (కలవరము+పడు.) కలఁతపడు.

కలవరపోవు. దే. అ. క్రి. (కలవరము+పోవు.) కలవరపడు.

కలవరము. దే. వి. 1. కలఁత; 2. చింత.

కలవరించె. దే. అ. క్రి. మైమఱచిమాటాడు. "సీ. చెలరేఁగిరాయంచ చేరువమెలఁగుచోఁగలికిసెన్నడలంచుఁగలవరించు." అచ్చ. అర, కాం.

కలవరింత. దే. వి. మైమఱచినమాట. "వ. ఇదియేమయ్యా వెండియుమదాళయుండును మధురలాలసయునుగలాపూర్ణుండునంచుఁ బలుకుచున్నవారు. దేవరకునెప్పుడు నవియు కలవరింతలైయున్నయవి." కళా. ౫, ఆ.

కలవాఁడు. దే. విణ. 1. ఆప్తుఁడు; "ఉ. శాంతనవుండుసర్వకురుసంతతికింగలవాఁడు కాఁడె." భార. ఉద్యో. ౨, ఆ.—2. ధనవంతుఁడు; "సీ. అరకూటకలాపమర్త్యమేకలవాని కేవర్త్యానేనిర్జరేశ్వరునకు." నై. ౮, ఆ.—3. శక్తుఁడు. "వినుమాపనికొల్లఁబాండుపుత్త్రులెకలవారు." భార. ఉద్యో. ౩, ఆ.

కలవింకము. సం. వి. అ. పుం. 1. ఊరఁబిచ్చిక; 2. కూఁకటిమూఁగ అనుపక్షి.

కలశము. సం. వి. అ. పుం, న. ఈ. స్త్రీ. ఘటము, కుండ.

కలశాబ్ధి. సం. వి. ఇ. పుం. పాలసముద్రము.

కలశి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. కోలపొన్న; 2. పెరుగుఁజిలికెడుకుండ.

**కలహంస.** సం. వి. అ. పుం. 1. ధూమ్రవర్ణములైన ముక్కుకాళ్లు ఱెక్కలుగలహంస; 2. రాజహంస; 3. రాజశ్రేష్ఠుఁడు. (రూ. కలహంసము.)
**కలహము.** సం. వి. అ. పుం, న. జగడము. పుం. 1. యుద్ధము; 2. కత్తిగొఱు.
**కలహాంతరిత.** సం. వి. ఆ. స్త్రీ. ముందు కోపముచేఁ బ్రియుని విడనాడి వెనుక పరితాపము నొందెడు నాయిక. (చూ. నాయిక.)
**కలహాశనుఁడు.** సం. వి. అ. పుం. నారదుఁడు, అరి [illegible]ప్పుఁడపని.
**[illegible]** సం. అ. క్రి. జగడమాడు.
**[illegible]** సం. వి. ఈ. స్త్రీ. తమ్మపడిగము.
**[illegible]డు.** సం. వి. అ. పుం. 1. అగసాలెవాఁడు; 2. చంద్రుఁడు.
**కలాపకము.** సం. వి. అ. పుం. ఏనుఁగు మెడసంకెల.
**కలాపన.** దే. వి. కలఁత.
**కలాపము.** ఉభ. దే. వి. కలఁత. సం. అ. పుం. 1. ఇరువదియైదు పేటలుగల స్త్రీల యొడ్డాణము; 2. నెమలిపురి; 3. అమ్ములపొది; 4. భూషణము; 5. సమూహము.
**కలాపి.** దే. వి. (కలఁత+ఆఁపు.) కలయంపి. (సంధిని వర్ణలోప వర్ణవికారములు. "సీ. కలాపికలయంపిచానపి, యనగోముఖాఖ్యలై యలరుచుండు." ఆంధ్రా. ద్వి. పు. సం. వి. న్. పుం. 1. నెమలి; 2. జువ్వి?.
**కలాయము.** సం. వి. అ. పుం. గుండ్రనిసెనగలు.
**కలాయి.** హిం. పాత్రలకు తగరము పూయుట.
**కలాలి.** హిం. వి. కల్లుసారాయలమ్మువాఁడు.
**కలాలుఖానా.** హిం. వి. కల్లుసారాయలమ్మ దుకాణము.
**కలావరు.** అం. వి. చీట్లాటలో నొక కాకితముపేరు.
**కలాసి.** హిం. వి. ఓడమీఁది పనివాఁడు.
**కలి.** ఉభ. దే. వి. పులియఁబెట్టినకడుగునీరు. సం. ఇ. స్త్రీ. కల్లము. పుం. 1. జగడము; 2. ఒక యుగము; 3. యుద్ధము; 4. శూరుఁడు.
**కలింగలు.** అర. వి. అలుఁగు.
**కలిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. మొగ్గ; 2. కల్లము.
**కలికము.** దే. వి. శైత్యనివారణార్థము కంటికి వేసెడు మందు.
**కలికారము.** సం. వి. అ. పుం. 1. కూఁకటిమూఁగయనుపక్షి; 2. పచ్చపిట్ట; 3. నెమలియడుగుచెట్టు.
**కలికి.** దే. వి. 1. మనోజ్ఞురాలగు ఆఁడుది; 2. ఆఁడుది. విశ. మనోజ్ఞము. "సీ. దనుజశుద్ధాంతకాంతాకటాక్షములతోఁ గలికికాటుకలకుఁగానివావి." ఉ, హరి. 3, ఆ.
**కలిగొట్టు.** దే. వి. పాటలి?.
**కలితనము.** దే. వి. సామర్థ్యము. "గీ. అరులగుణములైననగ్గింతురెప్పుడుఁ, గలయఁ బెరసినపుడు కలితనంబు, మెఱయుదురుమహాత్ములు." భార. విరా. ౪, ఆ.
**కలితము.** సం. విశ. (అ.ఆ.అ.) 1. ఎఱుఁగఁబడినది; 2. పొందఁబడినది.
**కలితి, కల్తి.** హిం. వి. మిశ్రితము; స్వచ్ఛముకానిది.
**కలిద్రుమము.** సం. వి. అ. పుం. తాండ్ర?.
**కలిమము.** దే. వి. మాంసము. "వ. అప్పుడచంపితిత్రొలిచిగాలిగొనవైచిన కుక్క కలిమంబు గనుంగొని." భార. శాం. 3, ఆ.
**కలిమారకము.** సం. వి. అ. పుం. నెమలియడుగు?.
**కలిమి.** దే. వి. 1. కలుగుట; "ఇట్టిమహిమకలిమికిఁ గతమెయ్యది." భార. ఆర. ౪, ఆ.—2. సంపద. "క. కలిమియచుట్టలఁజేర్చును." భార. శాం. ౧, ఆ. (రూ. కల్మి.)
**కలిమిచెలి.** దే. వి. లక్ష్మి.
**కలిమిదండుగ.** ద్వ. వి. నేరములేకున్నను ధనవంతునియొద్ద రాజు పుచ్చుకొనెడు ధనము.
**కలియు.** దే. స. క్రి. పొందు. (కలువు, కలువుఁగోలు ఇత్యాది సాధారణ ప్రయోగంబులంబట్టి ఇట్లు ఇకారమధ్యముగాను వ్రాయఁబడియె.)
**కలిలము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. ఎఱుఁగరానిది; 2. చొరరానిది.
**కలివె.** దే. వి. కరమర్దము?.
**కలీయము.** సం. వి. అ. పుం, న. కల్లము.
**కలు.** యు. దే. వి. 1. బండిచక్రము; "సీ. ఆదిమనోమయంబగునొక్కచక్రంబుఁగల్పించె బ్రహ్మజగద్ధితముగఁ, గల్పించియాబండికలుడొల్చెసత్యలోకంబుననుండి యాకమలగర్భుఁడు." కాశీ. ౧, ఆ. — 2. ఱాయి. "సీ. ఏనుగ్రేఁగంటనొక్కించుకచూచినఁ గలుడెందమైనను గరఁగుననిన." లక్ష్మీ. ౨, ఆ.—వై. 1. మద్యము; "కలుద్రానంబనిపూనియాదవులు." ఉ, హరి. ౪, ఆ.— 2. మద్యవిశేషము. (చూ. కల్లు.)
**కలుఁగానుగు** దే వి (కలు+కానుగు.) త్రాయంతి?.

కలుఁగు. దే. వి. 1. బొక్క; 2. గుహ. "క. కడువడి నక్కలుఁగుమొగ౯, బడుకొక్కటిత్రోచివెను కపనులాతనికే, ర్వడఁజేసివీడుసేరినఁ,గడఁకంబజ తెల్లనన్నుఁగనుఁగొనియెలమి౯." అచ్చ. కిష్కిం, కాం.

కలుఁజు. దే. వి. చెఱువులోనగువాని నీళ్లుపోవుటకు ఱాతితోఁగట్టిన మార్గము.

కలుక్కు. దే. వి. మనసు నొచ్చుటయందగు అనుకరణము. "ఇత్తెఱఁగువినంగలుక్కుమనదే పగవారి మనంబును." సా. 3, ఆ.

కలుక్రాంత. దే. వి. కలుఁగానుగు*.

కలుగచ్చ. దే. వి. ఒక దినుసుగచ్చ*.

కలుగానుగ. దే. వి. ఱాతిగానుగ. "క. చెఱకొకటి కలుగఁగామరు, చెఱకు౯లోనైతిమనుచుఁజెఱకులగమినే, తతిఁగలుగానుగలాడుదు, రతిఁగిప్రజల్ సుగుణులన్న రేంద్రునిపీట౯." రామా. ౧, ఆ.

కలుగు. దే. అ. క్రి. 1. అగు; "చ. మునుమనచేతభంగపడిముచ్చిరియుండుటఁజేసిపాండునం, దనులు ను నెత్తివత్తురుచితంబుగసంగరమెట్లుఁగల్గు." భార. ఉద్యో. ౪, ఆ.—2. ఉండు; "గీ. ఇట్టి విక్రమంబునిట్టిసామర్థ్యంబుఁ, గలదెయొరులకిజ్జగంబునందు." భార. ఆది. ౨, ఆ.—3. ఓపు; "గీ. సింహకవచంబుదొడిగినఁజెనఁటికుక్క, గంధగజగంధమునకునుగలదెనిలువ." హరి. ఉ. ౬, ఆ.—4. పుట్టు; "వ. గర్గునకుశినిజన్మించె. శినికిగార్గ్యుండుగలిగె." భాగ. ౯, స్కం.—5. కూడు. "మ. కలికీ మాటలువేయునేటి కిఁక యీకాయంబుతోవానితోఁ, గలుగ౯భాగ్యముకల్గకున్న విభునింగాఁజేయుమీవీనిరాఁ,గలజన్మంబున." అని. ౨, ఆ.—స. క్రి. పొందు. "కరుణగలుగుమమ్మకమలనేత్ర." భార. ఆది. ౭, ఆ. "అంతయెఱుకలేనె." భార. అర. ౧, ఆ. (రూ. కల్గు.)

కలుచే. వై. వి. 1. దోషము; "క. కలుగుందోఁపమియమవసఁ, గలుగునెయంతటనెయమృతకరునకునాశం, బలఘుపరవస్తువునకుం, గల దెయభావంబుమనసుగాననికలుచ౯." భార. శాం. ౪, ఆ.—2. కలఁత*; (చూ. కలుచపడు.) 3. క్రోధము*. "మ. కలుచ౯గోశబిలంబువెల్వడియదఃఖడ్గాహిపైవచ్చుచోఁ, జలనంబించుకలేకయీతనిరిపుక్ష్మాపాలసంఘాతమో, చెలహస్తాంబురుహాంగుళీమయుమహాసిద్ధౌషధీపల్లవాం, చలమూల్మేసిభజించు జాంగలికత౯ సంగ్రామరంగంబుల౯." నై. ౪, ఆ.

కలుచపడు. వై. అ. క్రి. కలఁతపడు. "వ. తద్వ్యథోపాయంబునకుపాయంబూహించియెడ్డియుంగానకకలుచపడిపెలుచనంతిపురంబువెలువడికొలువుకూటంబునకువచ్చిసింహాసనాసీనుండై." లక్ష్మీ. ౪, ఆ.

కలుపు. దే. ప్రే. కలియఁజేయు. వి. 1. పైరులోనికసవులోనగునది; 2. పెరుగు. "ఒల్పుఁబప్పులు పాడికూరగుంపు కలుపు౯ వడియంబులు." శశాం. 3, ఆ.

కలుఁపుఁగోలు. దే. వి. (కలుఁపు+కోలు.) అభేదము. (రూ. కల్పుఁగోలు. "మ. ననుపుంజొట్టములెందఱేనిగలరింట౯వారుమాకైచలం,బునఁబోరాడుదురట్టివారలకుఁగల్పుంగోలుఁవుట్టింపనిం, పునమన్నింపవెనిత్యవైరమమృగంబుల్ మానిమేల్పొందమ, న్ననగావించిన మంత్రమైనమణియైన౯ మూలికైన౯మునీ." చంద్రా. 3, ఆ.)

కలుపుఁగోలుతనము. ద్వ. వి. అభిన్నత్వము. "వ. నటద్వల్లీమతల్లియుంబోలెనుల్లసిల్లియుల్లిబిల్లిఁదెచ్చికోలువలపుదెలుపుకలుపుఁగోలుతనంబులు సలుపుచునిట్లనియె." రామా. ౪, ఆ.

కలుము. దే. వి. కలుఁషగంధము. "ఎ, గీ. కలుమునాఁగఁగలుషగంధమఃభవ." ఆం, భా. ప్ర. ధీ.

కలువ. వై. వి. ఒకానొక జలపుష్పము, ఉత్పలము*. "చెలువలొనరించు బలుఁచలువలకుఁబైనలముకలువలకు." య. ౪, ఆ.

కలువకంటి. ద్వ. వి. (కలుఁవ+కన్ను.) 1. కలువఱేకులవంటి కన్నులుఁగల యాఁడుది; 2. ఆఁడుది.

కలువడము. వై. వి. (కలువ+వడము.) ఉత్సవాదికాలములలో ధ్వజస్తంభముఃలోనగువానియందు వ్రేలఁగట్టెడు బంగారు కలువపూదండ. "వ. బహిర్వితర్దికానికాయవిరచిత కురంగనాభిగోముఖోపరితరంగితరంగవల్లీ మతల్లికామనోజ్ఞమౌక్తికమండలీపాండిత్యంబు లత్యంతకాంతంబులగుచు నుత్తుంగహర్మ్య శిఖరకేతుసంఘసంఘర్షణ శకలితపతితాంతరిక్షఖండలక్ష్యమాణ నక్షత్ర సముత్ప్రేక్షాసంధుక్షణవిచక్షణంబులై వీక్షణపర్వంబునిర్వహింపఁ బెంపుమీఱుచుం దదవలంబనలంబమాన

వివిధాంబుద కదంబకంబుడంబు మాపు కలువడంబులును." కళా. ౨, ఆ. "వ. కమనీయ హేమ దండంబుల రామణీయకంబులం దొంగలికొను కాంచన కల్హారంబులు నెలకొల్పి కలయ నెత్తిన నభోభాగంబునం బెడంగడరు కలువడంబులును." రా. అ, కాం.

కలువము. దే. వి. మందునూఱెడు ఱాయి.

కలువరాయఁడు. వై. వి. చంద్రుఁడు. (ఇట్లు కలువ ఱేఁడు లోనగునవి.)

కలువఱేకు. ద్వ. వి. 1. కలువపూఱేకు; బ. 2. పిఱుఁదులమీఁది నఖక్షతములు.

కలువలదాయ. వై. వి. సూర్యుఁడు. "కలువలదాయ వంగడపుఁదోడవ." అచ్చ. యు, కాం.

కలువవిందు. ద్వ. వి. చంద్రుఁడు, కుముదబాంధవుఁడు. "గీ. కరముతోఁ బుట్టువగుటనో కలువవిందు, కందుదనయుందుఁదాల్చె లక్ష్మణకుమార." రామా. ౬, ఆ. (ఇట్లు కలువచెలి. మొ.)

కలువు. దే. అ. క్రి. కలుగుయొక్క రూపాంతరము. (పుట్టుటకు.— "ఉ. ఓయన్నువ పట్టినిఁగనిన యన్నువసుంధర సింధుజాతిలో, వన్నియ కెక్కనీవు గలువన్ నియతోన్నతిఁగాంచెఁదండ్రి యుఁన్." వసు. ౫, ఆ.—పొందుటకు.—"క. రారా పురేల చేసెదు, రారానను గలువఁ గలువ రారా మేడన్.")

కలుషము. సం. వి. అ. న. పాపము. పుం. దున్నపోతు. విణ. కలఁకఁబాఱినది.

కలుషించే. సం. అ. క్రి. కలఁకఁబాఱు.

కలుసుఁగూర. ద్వ. గ్రా. వి. (కలుసు+కూర.) అనుకుగా వండినకూర. "సీ. కలుసుఁగూరలును బజ్జాలుఁ దియ్య చేరులుఁ బంచదారలు నానవాలుజున్ను." జై. 3, ఆ. (వ్యవహారమునందు కనఁబడుటకాక గ్రంథములయందును నీ పదమిట్లు కనఁబడుచున్నది.)

కల్కము. సం. వి. అ. పుం, న. 1. కపటము; 2. పాపము; 3. నెయ్యి నూనె లోనగువానియందు అడుగున నిలిచిన మడ్డి; 4. మలము; 5. మలసామాన్యము; 6. తాండ్రి. విణ. డు. పాపాత్ముఁడు.

కల్కి. ఉభ. దే. వి. విణ. కలికియొక్క రూపాంతరము. (చూ. కలికి.) సం. వి. ఇ. పుం. విష్ణ్వవతారవిశేషము.

కల్పన. సం. వి. ఆ. స్త్రీ. అయుక్తము సేయుటకై యేనుఁగున కుఁగట్టిననిడుత్రాడు. అ. న. ము. 1. క్లృప్తి; 2. రచన.

కల్పము. సం. వి. అ. పుం. 1. బ్రహ్మదినము; 2. న్యాయము; 3. ప్రళయము; 4. వేదాంగమైనవిధి; 5. శాస్త్రము.

కల్పవృక్షము. సం. వి. అ. పుం. 1. కోరినవస్తువులిచ్చెడు దేవవృక్షసామాన్యము, వేల్పుమ్రాను; 2. తద్విశేషము. (ఇవి ౫.—మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము.)

కల్పాంతము. సం. వి. అ. పుం. ప్రళయము, త్రుంగుడు.

కల్పించే. సం. స. క్రి. 1. కలిగించు; 2. రచించు.

కల్మషము. సం. వి. అ. న. పాపము. పుం. 1. నరకవిశేషము; 2. నలుపు. విణ. నల్లనిది.

కల్మాషము. సం. వి. అ. పుం. 1. చిత్రవర్ణము; 2. నలుపు. డు. రాక్షసుఁడు. విణ. 1. చిత్రవర్ణము కలది; 2. నల్లనిది.

కల్య. సం. వి. ఆ. స్త్రీ. మద్యము. అ. న. ము. వేకువ. విణ. 1. చెవిటిమూఁగ; 2. నేర్పరి; 3. ఉపాయముకలది; (మాట.) 4. శుభమైనది; (మాట.) 5. రోగములేనిది; 6. సంపాదింపఁబడినది.

కల్యవర్తము. సం. వి. అ. పుం. ప్రాతర్భోజనము.

కల్యాణము. సం. వి. అ. న. 1. శుభము; 2. చొక్కపుబంగారు.

కల్ల. దే. వి. 1. అసత్యవచనము; "శా. ఓయబ్జాక్షి యేమంచువి, భ్రాంతింబల్కెదు కల్లయున్ నిజము వీడ్పాటొందఁగా." కళా. 3, ఆ. — 2. తప్పు; "క. తనకల్లఁ దెలుపదేకద, మన కల్లలతాంగి బుద్ధిమంతునొకని నే, ర్పున మెల్ల నెరా కొమరుని, మన మెల్లను దెలిసి రాఁగ మనమంపఁదగున్." సా. ౨, ఆ.—3. మోసము; "గీ. పునుకతాల్పు విల్లు దునిమెఁదాటకఁ జంపె, ఖరునిఁ దేర్చె వాలిఁ గడపఁ బనిచెఁ, గల్లజింకఁ ద్రుంచె గండగొడ్డలి తాల్పు, గరువమడఁచె నతని కడిమి యసదె." అచ్చ. యు, కాం.—4. పరుషవచనము; "సీ. తనతల్లి విసివి నిన్ను గొన్ని కల్లలాడుటయు నే వెళ్లిపోవుటయుఁ గలదు." పర. 3, ఆ.—5. తోఁటలోనగువాని వెలుగు. "వెలికల్ల వైతురా వేల్పులకుడుపుచో." ఉ. హరి. ౪, ఆ.—విణ. 1. అసత్యము; 2. పరుషము.

కల్లతనము. దే. వి. 1. చెడ్డనడత; "గీ. అన్నమీతండ్రి కోపగాఁడౌనొ కాఁడొ, యీవు పానరించు దుర్వృత్తిమెటిఁగెనేనిఁ, గల్లతనములు పలుమాఱుఁగప్పిపుచ్చి, నట్టిసామీఁదఁ జంపంగనలుగ

కున్నె." సం. "ఆచ్ఛాదయామి తేనిత్యంపత్యుర గ్రేకుచేష్టితమ్." కాశీ. ౪, ఆ. — 2. వంచన. "ఉ. కల్లతనంబుగాక పాడకట్టినపూర్వపురీతి నేఁడునా, యుల్లమునందునుండుము సమున్నత తేజముతోడభక్తిరం, జిల్లినచూపుగూడవిధిఁజెందిన ప్రోడబుధాళినీడమా, తల్లిదయామతల్లి ప్రణత ద్రుమకల్పకవల్లిభారతీ." భాగ. ౬, స్కం.

కల్లను. దే. వి. మల్లబంధవిశేషము. (చూ. కత్తి.)

కల్లరి. దే. విణ. (కల్ల + అరి.) 1. అసత్యముపలుకువాఁడు; 2. తప్పుచేసినవాఁడు; "గీ. తల్లి నామీఁదనటులేనితప్పు మోపె, నఁటమదిననుంగుతండ్రి తానదియెనిశ్చ, యంబుచేసెనఁట యిఁకఁగాదన్న (బోనె,యేరినన నేలకల్లరియేనయగుదు." సా. ౨, ఆ.—3. దుష్టుఁడు (లేక) దుష్టురాలు; "క. అల్లదె తాటకయనియెడు, కల్లరిరాకాసిపొగరుగ దురఁగవచ్చెన్." అచ్చ. బా, కాం. —4. వంచకుఁడు. "క. కల్లరితోలువేలుపు లేఁ, డల్లనఁజెఱవట్టుకొనుచునరుగుచునున్నాఁడు." అచ్చ. అర, కాం.

కల్లరీఁడు. దే. విణ. (కల్లరి+ ఈఁడు.) కల్లరి. (స్వార్థమున ఈఁడు.)

కల్లరుజొ. దే. వి. మత్స్యవిశేషము. "మిసికల్లరుజు తేలుమీను." హంస. ౪, ఆ. (చూ. అరుజు.)

కల్లు. యు. దే. వి. 1. కన్ను; "సీ. ఏ వేల్పుతలఁపంగ నినచంద్రులను బండికండ్లు గాఁగండ్లుగా ఘనతఁ జేసె." భల్లా. ౧, ఆ. (ఈయర్థమునసీప్రయోగ మొక్కండ కానఁబడియెడి.)—2. బండికన్ను; "వ. దాపటికల్లుక్రుంగినం దేరుఘూర్ణిల్లె." భార. కర్ణ. 3, ఆ.—3. ఱాయి. "గీ. గగనహరినీలశైలశృంగముననుండి, డొల్లిపడెఁబ్రొద్దుజేగుఱుఁగల్లువోలె." నై. ౮, ఆ.—వై. 1. మద్యము; "ఉ. ఉత్పలగంధినన్ను డిగియొడ్లను బంపుము కల్లుతేర." భార. విరా. ౨, ఆ.—2. మద్యవిశేషము*. "ద్వి. సారాయియొక యేఱుసరవిని బాఱెఁ, బారెఁగల్లును నొక్క పావనతటిని." రా. అ, కాం.

కల్లుపెంట. ద్వ. వి. కల్లమ్మెడుచోటు, కుండ.

కల్లువడు. ద్వ. అ. క్రి. (కల్లు+పడు.) స్తంభించు. "వ. గుండెజల్లుమని కల్లువడి మునితల్లజు పదపల్లవంబులం ద్రెళ్లియిట్లంటి." స్వా. ౫, ఆ. "క. భల్లంబొక్కటివింటను, మెల్లనసంధించినిలిచిమేవెఁచికిటిం, బెల్లులికిపడఁగ నేసినఁ, గల్లువడక లేచియంతఁగడువడితోడన్." (ఇందు కల్లువడన్—దీనికి కర్తతన్నేసినబోయ.) భల్లా. ౨, ఆ.

కల్లెలుక. దే. వి. (కల్ల+ఎలుక.) పొలములలోఁగలుఁగులయందుండెడి యెలుక. "గీ. ఉడుముఁగరిమిడికొక్కు దొందడియు వెల్ల, యెలుకకల్లెల్కతఱచును నేమిచెప్ప." స్వా. ౪, ఆ.

కల్లేడు. దే. వి. పక్షివిశేషము. "సీ. ఱెక్కతాఁకున ద్రుక్కినిక్కి ప్రక్కలునొక్కనుఱకకల్లేటి నోక్కోరణంబు." స్వా. ౪, ఆ.

కల్లేఱు. దే. వి. (కల్లు+ఏఱు.) వీరభద్రపర్వతపాదమూలమునఁబాఱెడియొకనది. "సీ. పాఱెనే శైలఁబుపాదమూలంబునఁ గల్లేటితో వృద్ధగంగవాని." కాశీ. 3, ఆ.

కల్లోలము. సం. వి. అ. పుం. 1. పెద్దయల; 2. సంతోషము. డు. శత్రువు.

కల్లోలిని. సం. వి. ఈ. స్త్రీ. నది, ఏఱు.

కల్వ. వై. వి. కలువయొక్క రూపాంతరము.

కల్వము. దే. వి. కలువముయొక్క రూపాంతరము.

కల్హారము. సం. వి. అ. న. ఇంచుక యెఱుపును దెలుపునుగలిగి మిక్కిలిపరిమళముగలకలువ, సౌగంధికము.

కవ. దే. వి. 1. జెత; (జక్కవకవ. మొ.)—2. యుగళము; (కన్నుఁగవ. మొ.) — బ. 3. కుళలవులు; "ఎ, గీ. కవలుకవనీశలూని ద్రాక్షాఫలోప, మానమానితవాల్మీకి మౌనిరచిత, చారు రామాయణ శ్లోకసమితిగాన, లీలఁబఱియింప." ఉ, రా. ౭, ఆ.—4. నకులసహదేవులు. "మ. కవలే తెంచిరివేడ్కనొండొరులకుంగయ్యంపు మైఁ జెప్పుచున్." భార. భీష్మ. ౧, ఆ.

కవకవ. దే. వి. 1. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము; "చ. కవకవనవ్వియజ్ఞతురగంబు మెడన్ దనయుత్తరీయమున్, లవుఁడుతవిల్చి." జై. ౬, ఆ.— 2. పలుకుటయందగుధ్వన్యనుకరణము; "కవకవఁబలికెడుకరణి." ఉ, రా. ౭, ఆ. (ఈయర్థమునకీప్రయోగ మొక్కటియ కానంబడియెడి.) — 3. వ్రాలుటయందగుధ్వన్యనుకరణము. "ద్వి. కపటంపుఁబక్షులుకవకవమనుచు, విపులేశుముందఱవెఱవకవాలె." నళ. 3, భా. (ఈ కృతికర్త కేవలము ఆధునికుఁడుగాఁ గానఁబడియెడి. కాన నీప్రయోగము విచారింపఁదగినది.)

**కవచము.** సం. వి. అ. పుం 1. బొందలము; 2. తప్పెట; 3. కలజావ్విరి.

**కవట.** దే. వి. పెద్దకొమ్మ, స్కంధశాఖ. "సీ. కవట లొండొంటితోఁ గదియుచు నెడములు ముంగి ప్రబ్బగసొంపుమిగులుడాని." భార. విరా. ౧, ఆ. విణ. లేఁత. (కవటాకు.)

**కవడె.** దే. వి. వాద్యవిశేషము. "ఎ, గీ. కవడెయన నురుమయనఁగను గరిదియనఁగఁ, దప్పెటయనంగవాద్యభేదములు చెలఁగు." ఆం, భా. ప్ర. నాట్య.

**కవణకాఁడు.** దే. విణ. మల్లగమనమును దెలిసినవాఁడు. "కవణకాఁడనమీఱుగమన వేది." ఆం, భా. ద్వి. తృ.

**కవణము.** వై. వి. గుఱ్ఱము మొదలగువానియొక్క ఉలవలులోనుగాఁగలభక్ష్యము. "చ. ఇంటనకట్టిగడ్డియుఁ గొ, గవణమునీరుచూపఁబతికట్టడచేయుఁగఁబోలుఁబావనీ." జై. ౨, ఆ. "చేరుడుబియ్యాలకవణంపు శేనుఁగుగములుఁ కదల." ఉ, హరిశ్చ. ౩, ఆ.

**కవను.** దే. వి. కసవు. "సీ. గడ్డిగాదముగవతముకసవుకవను, పుల్లుపూరియనంగఁ జెల్లునుదృణసంజ్ఞ." ఆం, భా. ద్వి. వ.

**కవరు.** ఆం. వి. కాగితపుసంచి, పైకప్పు.

**కవఱులు.** దే. వి. బ. పాచికలు. "ఎ, గీ. కవఱులుంకించివైవఁగొప్పవియనవలి, కరముననమర్ప." ఆము. ౧, ఆ.

**కవలు.** దే. వి. వేదాదిపఠనమునందుఁగొంతసామ్యము చేనొకటివిడఁబడి మఱియొకటివచ్చి కలయుట. "సీ. ఎడనెడనుగవళ్లఁదడఁబడకుండంగఁగుఱుతులుమదిఁబాదుకొలిపినిలిపి." కళా. ౮, ఆ.

**కవలుకొను.** దే. అ. క్రి. వేదాదిపఠనమునందుఁ గొంతసామ్యముచే నొకటి విడఁబడి మఱియొకటివచ్చి కలయు. "ఏ, గీ. కమలజాని వేదపఠనంబుకవలుకొనియె." విక్ర. ౮, ఆ.

**కవలువోవు.** దే. అ. క్రి. (కవలు+పోవు.) కవలుకొను. "గీ. పాఠమొనరించుతఱిఁదోడుపడుగురునకుఁ, గవలువోకుండఁబుత్త్రుఁడొకలువకంటి." పాండు. ౨, ఆ.

**కవాటము.** సం. వి. అ. పుం, న. ఈ. స్త్రీ. తలుపు.

**కవాడము.** అర. వి. ఎద్దులుమోయు బరువు.

**కవాతు.** హిం. వి. దండువారుచేయు సాధకము.

**కవి.** సం. వి. ఇ. స్త్రీ. కళ్లెము. పుం. 1. కవిత్వము చెప్పువాఁడు; 2. పండితుఁడు; 3. శుక్రుఁడు; 4. వాల్మీకి.

**కవించె.** దే. ప్రే. కవియించుయొక్క రూపాంతరము. "చ. కృత్యనాయుధో, త్కటవనమాలహస్తయునుగానొనరించికవించెరాజుపైన్." భాగ. ౯, స్కం.

**కవిక.** సం. వి. ఆ. స్త్రీ. ఖలీనము, కళ్లెము.

**కవిచేయు.** దే. అ. క్రి. కవియు. "గీ. తోడఁగవిచేయుదురువానితోరమించు, కాంతలందఱు." (ఇక్కడ కవిచేయుదురు అనఁగా సహగమనము చేయుదురని యర్థము. రెండుమూడు ప్రతులయందును ఈ పాఠమేయున్నది. ఉండినను ప్రయోగాంతరము దొరకమిచే ఈ పదమిట్లే యుండవచ్చునను నిశ్చయము పుట్టినదికాదు.) జై. ౫, ఆ.

**కవియు.** దే. అ. క్రి. పర్వు. "క. యవనశకసైన్యములుపైఁ, గవిసిన." భార. కర్ణ. ౨, ఆ.

**కవియుదెంచె.** దే. అ. క్రి. (కవియు+తెంచు.) కవియు. "గీ. హస్తిపురిపేరుగలమదహస్తినెక్కి, క్రాలుకావలిమూఁకలుఁకవియుదేర, నభ్రగజముపైఁ బర్జన్యుఁడనఁగనంప, వానపరఁగవికర్ణుండువచ్చితాఁకె." భార. విరా. ౫, ఆ. (స్వార్థమున తెంచు.)

**కవిరి.** వై. వి. తాంబూలముతోఁగూడ నుపయోగించుకొనుటకుఁ గాఁచులోనగు వస్తువులుచేర్చి చేసినయుండ.

**కవిల.** వై. వి. కపిలవర్ణము. "అక్కర. అవసరజ్ఞుండయి వ్యాసుఁడేతెంచెనంతనత్తపసి, కవిలగడ్డంబునుఁగవిలజడలునుగవిలకన్నులును, దవినయున్న వనల్లనై నదీర్ఘపుఁదనువునుజూచి, యువిదకన్నుంగవమొగిచితెఱవక యుండెభయమున." భార. ఆది. ౮, ఆ. (ఇక్కడనకారప్రాసముగనుక కవిలగడ్డమనియే చెప్పవలయును. అప్పుడు కవిల అనునది వైకృతమగుచున్నది.)

**కవిలియ.** దే. వి. కవిలె. "క. అనిపలుకునమ్మహామతిఁ, గనిజముఁడిట్లనియెనీదుకవిలియనీవ్రా, సినలిపియున్న దొలేదో, కనుఁగొను మీసారిలెస్సగా గణకవరా." పాండు. ౫, ఆ.

**కవిలె.** దే. వి. ఘట్టించిన నీలపటపువర్గులెక్కపుస్తకము. "సీ. కవిలెలోనున్న ప్రకారంబుప్రజపాపపుణ్యముల్ చిత్రగుప్తుండు తెలుప." ఉ, రా. ౩, ఆ. (కవిలియయొక్క రూపాంతరము.) (ఇప్పుడు దీనిని తాటాకుల లెక్కపుస్తకముగా వాడుచున్నారు.)

కవోష్ణము. సం. వి. అ. న. ఇంచుక వేఁడి. విణ. ఇంచుక వేఁడిగలది.

కవ్యము. సం. వి. అ. న. పితృదేవతల కియ్యఁదగిన యన్నము.

కవ్వడి. దే. వి. (కవ + వడి.) రెండుచేతుల వడిగలవాఁడు, అర్జునుఁడు. "క. కడఁగి ద్రుపదానుజుఁడునె, వ్వడిఁగవ్వడి నేసెనూఱు వాఁడిశరంబుల్, కడునలిగివానినన్నియుఁ, నడుమనతునియంగ నేసెనరుఁడస్త్రములన్." భార. ఆది. ౬, ఆ.

కవ్వపుఁగొండ. ద్వ. వి. (కవ్వము + కొండ.) మంథాద్రి. "చ. కమఠతనూవిలాసమునఁ గవ్వపుఁగొండధరించి దేవనీ, వమృతముఁ దెచ్చియాశ్రితజనావలికిచ్చితి." లక్ష్మీ. 3, ఆ. (ఇట్లు కవ్వపు మలలోనగునవి.)

కవ్వము. దే. వి. పెరుగుచిలికెడు సాధనము, మంథానము.

కవ్వు. దే. స. క్రి. 1. కబళించు; 2. అపహరించు.

కశ. సం. వి. ఆ. స్త్రీ. గుఱ్ఱములోనగువానిఁ గొట్టునట్టి చబుకు. అ. పుం. ము. పూతిమార్జాలము.

కశిపువు. సం. వి. ఉ. పుం. 1. అన్నము; 2. వస్త్రము; 3. అన్నవస్త్రములు; 4. పఱుపు. "శ్లో. సత్యాంక్షితౌకింకశిపోః ప్రయాసైర్బాహౌస్వసిద్ధేహ్యుపబర్హణైఃకిమ్." భాగ. ౨, స్కం.

కశేరుక. సం. వి. ఆ. స్త్రీ. వెన్నెముక. అ. న. ము. 1. కమ్మరేఁగు?; 2. కొట్టిగడ్డ.

కశ్మలము. సం. వి. అ. న. మూర్ఛ. విణ. మలినము.

కశ్యము. సం. వి. అ. న. 1. గుఱ్ఱమునడుము; 2. మద్యము. విణ. కశకుఁదగినది.

కష. సం. వి. ఆ. స్త్రీ. దక్షునికూఁతులలో నొకతె. అ. పుం. ము. 1. ఒరగల్లు; 2. సాన. డు. సానపెట్టుట మొదలగుపనుల చేజీవించెడు నొకనికృష్టపుజాతివాఁడు. "శ్లో. కిరాతహూణాంధ్రపుళిందపుల్కసాఆభీరకంకాయవనాఃకషాదయః, యేన్యేచ పాపాయదుపాశ్రయాశ్రయాశ్శుధ్యంతితస్మైప్రభవిష్ణవేనమః." భాగ. ౨, స్కం.

కషణము. సం. వి. అ. న. ఒరయిక.

కషాయము. సం. వి. అ. పుం, న. 1. ఒగరు; 2. ఔషధరసము; 3. పూసికొనెడుచందనాది; 4. చందనాదులపూఁత. విణ. 1. ఎఱ్ఱనిది; 2. వాసనగలది.

కషాయిక. సం. వి. ఆ. స్త్రీ. నీరుదోమ.

కష్టపడు. మి. అ. క్రి. (కష్టము+పడు.) దుఃఖపడు.

కష్టపాటు. మి. వి. కష్టపడుట.

కష్టము. సం. వి. అ. న. 1. దుఃఖము; 2. పాపము. విణ. 1. దుఃఖముగలది; 2. పాపముగలది; 3. చౌరరానిది; (అష్టకష్టములు — దేశాంతరగమనము, భార్యావియోగము, ఆపత్కాలమందు బంధుదర్శనము, ఉచ్ఛిష్టభక్షణము, శత్రుస్నేహము, పరాన్నప్రతీక్షణము, భంగము, దారిద్ర్యము.)

కసటు. వై. వి. 1. పాపము; "సీ. దురితంబులెన్నఁడుదొలఁగయక వెలుఁగొందుకమలాప్తకులమునఁగసటుకలిపి." భార. అర. ౬, ఆ.—2. మాలిన్యము*. "సీ. కసటువోబీటెండఁగరఁగికఱ్ఱలనంటిగమగమవలచుచొక్కపుజవాజి." స్వా. ౨, ఆ.

కసమస. దే. వి. తొట్రుపాటు. "క. అంతటనిద్దఱిమనసులు, కంతునిపసఁగల సివింతకసమసలొలయన్, మంతనములఁ బెదవులనిసి, జెంతలువాఱంగనగవు జెప్పలఁగోరన్." విక్ర. ౭, ఆ.

కసరతు. హిం. వి. సాధకము.

కసరు. దే. అ. క్రి. చలించు. "ద్వి. పసిఁడిసలాకసుపాణిముత్తియము, కసరకనిలుచుక్రొక్కారుమెఱుంగు." భాగ. ౭, స్కం.—స. క్రి. కోపించు. "క. అంపఁదగువారిఁ గసరుచునంపి." స్వా. ౫, ఆ.—వి. 1. కోపము; "ఎ, గీ. అలఁతఁబొనుపుపైఁబొరలాట తెలుపఁ దెగువలోలోన నేనవ్వునగవు తెలుపఁ, గలఁక మామిఁడిపనిలేనికసరు తెలుపఁ, బొలఁతిరేలు నీయునికియపులుఁగుగాదె." ఆము. ౫, ఆ.—2. వానగాలి, ఝంఝ. "వ. పెల్లడరు నిట్టూర్పుగాడ్పుల విసరులం గసరెత్తి." స్వా. 3, ఆ. 3. పెచ్చు, లాభము.

కసవు. వై. వి. 1. గడ్డి; 2. ఇంటిపెంట*. "సీ. గల్లుగల్లునరత్న కంకణంబులుమ్రోయగంధవాహునియాలుకసవునూడ్చు." భీ. 3, ఆ.

కసవుఁగుప్ప. ద్వ. వి. (కసవు+కుప్ప.) 1. పొరకతో నూడ్చిచేర్చిన పెంట, అపకరము; 2. గడ్డివామి.

కసాయి. దే. వి. కటికవాఁడు, సౌనికుఁడు.

కసి. దే. వి. 1. కోపము; (వానినికసితీఱఁగొట్టితిని.) 2. దురద; "క. చేతులకసిపోఁగయ్యము, సేతవిరెడునట్టి విధముచింతింపునఘం, భ్రీతునిఁగాఁగరుణించుట, యీతటిసెనకొల్పరానియీగిమహేశా." హరి. ఉ. ౭, ఆ.—3. కోరిక. "ద్వి. గోఁచిగట్టిననాటఁగోలెఁబీనుఁగుల, మోచిగడించినమూ

లధనంబు, కనిబెండపువ్వులగతిరానిపోని,పొసఁగునావాతనపొక్కు లెన్నితివి." హరిశ్చ. ౨, భా.—విణ. వృత్తియందుఁ గసిడిశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (కసికాటు. మొ.)

కసింద. వై. వి. కాసమర్దము. (దీనిభేదము తీఁట కసింద.)

కసిడి. దే. విణ. అల్పము. "ఎ, గీ. అగునయేనియును టువంటిమగనితోడఁ, గాపురము సేయు సతిదొడ్డ గరితయగుచుఁ, గసిడికోఁతకునోర్చిలోవిసివిసోనక, ధాతమాఱక తండ్రిచేఁతకువగవక." పాండు. ౪, ఆ.

కసిమసఁగు. దే. అ. క్రి. విజృంభించు. "సీ. కసిమసంగినమారికడఁగి జీవుల మీఁదనుగ్రతఁగవియు నట్లురవడించి." భార.ఉద్యో. ౨, ఆ.—స. క్రి. 1. ఖండించు; "క. నావుడుఁగల్పాంతఫణి, గ్రేవయకజాగ్రదుగ్రగతిఁగదిసిదశ, గ్రీవుఁడుసిఁగసిమసంగిన, లావరియగుపులుఁగుఁ ఱేఁడులావఱిపడియెన్." రామా. ౫, ఆ.—2. చంపు. "క. అసురులమాయోపాయులఁ, గసిమసఁగఁగనఁట మఖంబుగావఁగనఁటతా, పసుఁడొకఁడఁటససువులఁగ్రొ, న్నిసువులనడిగెనఁటమునులు నిర్ఘోషులుకా." రామా. ౪, ఆ.

కసిమసి. దే. వి. తొట్రుపాటు. "క. పశువులఁబొరిగొనిమఖములు, విశదములుగఁజేయునరునిపీక్షించితమున్, విశసనముచేయుసోయని, కసిమసిబెగడొందుభూతగణమునరేంద్రా." భాగ. ౭, స్కం.

కసిమిరి. దే. వి. తీఁట. "దానవుండైననాకీవేచేతులుచేసితీకసిమిరింకెట్లోర్తున్." ఉ, హరి. ౫, ఆ.

కసీదా, కసీమ. హిం. వి. వస్త్రముమీఁద పూలుబుట్టాలుకుట్టుట.

కసీసము. వై. విణ. నల్లనిది*. "ఉ. ఇంగిలికంబునం దడిపియెత్తుకసీసపు రెంటె మొత్తునన్, నింగిగరుత్పరంపరలనిగ్గునలేఁదొగరెక్కు." ఆము. ౪, ఆ.

కసు. దే. విణ. వృత్తియందుఁ గసురుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (కసుగాయ. మొ.)

కసుఁగందు. దే. వి. (కసురు+కందు.) 1. లేఁతబిడ్డ; "దండకము. కావుకావంచునేడ్చుల్లలిర్వంగకుం గందవై." పా. ౩, ఆ.—2. నలుపు. "ఉ. కసుఁగందొకయించుకలేకతిన్ననై, పున్నమచంద్రునొప్పిదముఁబోలెడుమోమునవవ్వదేటిఁగన్." (ఇందుఁ గసురుశబ్దమునిరర్థకము.) మై. ౧, ఆ.

కసుగందు. దే. అ. క్రి. (కందు+కందు.) మిక్కిలి వాడు. "క. కుసుమాయుధుబాణంబులఁ, గసుగందిభవద్వియోగకలుషతనర్చు, వసరంబులనర్చకులిడు, కుసుమములకువెఱచువహ్నికువలయనేత్రా." నై. ౪, ఆ. "మ. అనురాధీశసమర్పితంబులగులీలారామకల్పద్రుమ, ప్రసవంబుల్ కసుగందవయ్యె." (ఇక్కడవాడుటమాత్రమునందుఁ బ్రయోగింపఁబడియున్నది.) భీ. ౪, ఆ.—వి. బ. మిక్కిలి వాడుటలు. "క. వసివాళ్లువాడియప్పుడు, వసంతసమయంపుటెండవలనన్ నెతిపోఁ, గసుగందులుకందిననవ, కుసుమలతికవోలెమిగులఁగోమలియొప్పెన్." కళా. ౪, ఆ.

కసుగు. దే. అ. క్రి. నలఁగు. "ద్వి. విసిగినఁగసిగిన వెడనిద్రనొంది, నుసలినమసలిన." హరిశ్చ. ౨, భా.—అం. ప్రే. 1. నలఁచు; 2. పులుము; 3. బాధించు. "ద్వి. వేఁదుకొనుమాటమఱిబెట్టు చెవులు, గనలుశూలమునాటికసిగినట్లైన, నుల్లంబుగలఁగిబిట్టులికి." నవ. ౨, భా.

కసుబా. హిం. విణ. అధికారులుండుగొప్పగ్రామము.

కసుమాలము. వై. విణ. మలినము. "మ. ముసువుల్ ముచ్చటయున్ రహస్యమున నున్మద్రించినానాదివో, కసులాస్థానముకూడియాడుదురు శ్రీకాశీప్రదేశంబునన్, గసవైపుట్టెడుభాగ్యమైనమనకుంగల్పింపదాదైవమీ, కసుమాలంబగునాకమేలయనియుత్కంఠాతిరేకంబునన్." కాశీ. ౭, ఆ. (ఇక్కడ మలినమనఁగా పాపిష్ఠమనియర్థము.)

కసురు. దే. వి. లేఁతకాయ. "పెంపెనసినపండుకాయకసురేమియునైననునేరితించు." రా. యు, కాం. (దీనికిప్పృత్తియందంత్యవర్ణలోపమునులేతయనునర్థమునుగలుగును. కసుఁగందు, కసుగాయ, కసుగాఁపుపూపపయసుమిటారి. మొ.)

కసెము. వై. వి. కస్సెముయొక్కరూపాంతరము.

కస్తి. దే. వి. దుఃఖము. "ఉ. మానసికవ్యథల్ రుజలు మాన్పఁగనోపినపుణ్యరాశిగం, గానదిఁజేరియుం డియునుగస్తిపడందగునయ్య." ఉ, రా. ౬, ఆ.

కస్తురి. వై. వి. కస్తూరి. "చ. కస్తురికలయంపులేలతమహొక్కపుఁజూపులయింపుకల్ల." కళా. ౧, ఆ.

కస్తురిపట్టియలు. వై. వి. బ. 1. పుష్పవిశేషము; 2. ధాన్యవిశేషము. "గీ. పచ్చగన్నెరుకస్తురిపట్టియలును, గుత్తిమల్లెలుఁబ్రౌఢిగాఁగూర్చిమతియు, సకలజాతులఁబోషింపశక్తికలిగి, వాలికులు చైత్రుఁడెగడుదురప్పురమున." భాను. ౧, ఆ. (రూ. కస్తురిపట్టెలు.)

కస్తురిపసుపు. ద్వి. వి. గంధహరిద్ర.

కస్తురిపిల్లి. వై. వి. గంధమృగము.

కస్తురివీణియ. వై. వి. కస్తూరియుండెడి జింకబొడ్డు, మృగనాభి. "వ. కస్తురివీణియలును బిల్లిగడ్డలును." భల్లా. 3, ఆ.

కస్తూరి. ఉభ. దే. వి. కుక్కపేరు. "సీ. కడుఁదురీఁగయుఁబోలెవడిఁదోలికఅచి యీకస్తూరిదుప్పలగావుపట్టు." సా. ౧, ఆ.—సం. ఈ. స్త్రీ. మృగమదము, కస్తురి.

కస్నెము. వై. వి. నీళ్లు చిదచిదయనెడు నేల.

కహకహ. సం. వి. అ. స్త్రీ. రాక్షసహాసనమునందగు ధ్వన్యనుకరణము. "మహాస్రగ్ధర. కళరక్తక్రోడనిర్యత్కహకహనిన దోద్గాఢహాసంబు భూభృద్బిలముల్ మ్రోయింప." స్వా. ౪, ఆ.

కహారము. సం. వి. అ. పుం. గృహావిశేషముయొక్క నడిమికంబము, నిట్రాడు.

కహ్వము. సం. వి. అ. పుం. బకము, వక్కుకొంగ.

కళ. ఉభ. దే. వి. 1. మూర్ఛ; "గీ. ధరముసీమీఁద నిడివార్ధిఁదరుచునపుడు, హరుని మెడకందెహరియురంబందెఁగెంపు, నమరసంఘముకళనొందెనహహ తెలిసె, ఘనజగత్కుక్షివగుటకాకమఠవర్య." చంద్రా. ౧, ఆ.—2. రెమ్మ. "సీ. దక్షిణహస్తపద్మంబులఁదాల్చినలలితంపుఁ బువ్వారుకళల తోడ." పర. 3, ఆ. (దీనికీయర్థ మీగ్రంథమునందే కనఁబడుచున్నది.)—సం. ఆ. స్త్రీ. 1. ముప్పదికాష్ఠలకాలము; 2. చంద్రునిలోపదునాఱవభాగము; 3. భాగము; 4. స్త్రీరజస్సు; 5. మొదలిసొమ్మునడ్డి; 6. శిల్పము.

కళత్రము. సం. వి. అ. న. 1. పెండ్లాము; 2. పిఱుఁదు; 3. కోట.

కళపెళ. దే. వి. ఉడుకుటయందగుధ్వన్యనుకరణము. "సీ. వలకాఁకలకుఁదోడు కళపెళనుడుకు నూనియలుచల్లకురమ్మనెలఁతలార." రసి. ౪, ఆ.

కళవరము. దే. వి. మల్లబంధవిశేషము. "గీ. కళవరానకుఁజొచ్చిదొక్కరముహత్తి." ఉ, హరి. 3, ఆ.

కళవసము. దే. వి. తోలు. "చర్మనామముకళాసము కళవసమన." ఆం, భా. ద్వి. బ్ర.

కళవళపడు. ద్వి. అ. క్రి. (కళవళము + పడు.) 1. కలఁతపడు; "క. నావుడుదేవానీపద, సేవకులకునెందుఁగీడుచెందునెనిక్కం, బీవిన్నపమన రామ, క్ష్మావల్లభుఁడాత్మలోనఁగళవళపడుచుక్." జై. ౬, ఆ.—2. తొట్రుపడు. "క. వరబలుఁడగుమనుమనుమని, శరసంధిన్నాంగులగుచుసమరవిముఖులై, హరిరాజముఁగనిపఱచెడు, కరిబృందముఁబోలెఁజనిరికళవళపడుచున్." భాగ. ౪, స్కం.

కళవళపాటు. ద్వి. వి. (కళవళపడుట.) 1. కలఁతపాటు; "చ. వలపులవెచ్చ హెచ్చఁజెలువంబగునెమ్మెయిక్రాఁగసోలుచున్, గళవళపాటుతోఁ జెలిమికత్తెలదూఱుచునుండి వెండియున్." నీలా. 3, ఆ.—2. తొట్రుపాటు. "వేఁడుచుఁబోయిరెంతయుంగళవళపాటుతో." ఉ, రా. ౫, ఆ.

కళవళము. దే. వి. 1. కలఁత; "చ. నిలిచినభీతియున్ వడఁకునివ్వెఱపాటునుభూరిలజ్జయున్, గళవళమున్ జనింప." హరిశ్చ. ౫, ఆ.—2. తొట్రుపాటు. "క. పిలిచిప్రతివచనమొదవమిఁ, గళవళమునవిల్లుసాచ్చికానక." సం. "త్వరావాక్ సంభ్రమింపక్యే." కాశీ. ౫, ఆ.

కళవళించు. దే. అ. క్రి. 1. కలఁతపడు; "వ. కళవళించుడెందమ్ములతో నందఱుఁదరతరమ్ములైకూడి గోవిందుపిఱుందందగిలితమలోన." హరి. పూ. ౮, ఆ.—2. తొట్రుపడు. "ఎ, గీ. ముద్దుమోములల్లార్చుచోమూఁపులందుఁ, గర్ణభూషణజాలంబుకళవళింప." (ఇక్కడ కళవళించుట అనఁగా చలించుట అని యర్థము.) ఉ, హరి. ౫, ఆ.

కళానిధి. సం. వి. ఇ. పుం. చంద్రుఁడు, చందమామ.

కళాయి. దే. వి. 1. సీలిమందుకాఁచెడుగంగాళము; 2. ఇత్తడిపాత్రలులోనగువానికిఁబూసెడు సీసపుపూఁత.

కళాలతి. సం. వి. ఈ. స్త్రీ. 1. కళలనుదెలిసినయాఁడుది; 2. తుంబురునివీణ.

కళాసము. దే. వి. కళవసముయొక్క రూపాంతరము. "ఉ. లాలసఁగ్రొత్తబెబ్బులికళాసముఁబెట్టిరియాసనంబుగా." సై. ౬, ఆ.

కళాసించు. దే. అ. క్రి. అలయు. "ఎ, గీ. రతిఁగళాసించివచ్చినరమణమెఱయఁ, గొలనువెలువడివచ్చిరాజలజముఖులు." విక్ర. ౫, ఆ.

కళింగ. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుది. అ. న. ము. కొడిసెకాయ. పుం. 1. ఒకానొకదేశము; 2. కూఁకటిమూఁగయగుపక్షి; 3. సెమలియడుగు!.

కళుకు. దే. వి. 1. కాంతి; "ఎ, గీ. గడితపడునట్టి వెన్నెల కళుకులమర." య. ౫, ఆ.—2. పొడి; "తక్కంగలమణులకుంబనిఁడికళుకులకునీడగుచు వెలయఁగఁబరాగములు." కళా. ౧, ఆ.—3. పక్షివిశేషము.

కళేబరము. సం. వి. అ. న. శరీరము, మేను.

కళ్యము. వై. వి. కళ్లెము. "సీ. కళ్యాలఁబదిలంబుగానిగుఱ్ఱంబులఁ ద్రొత్తముట్టునకియ్య కొలుపువెరవు." భార. విరా. ౧, ఆ.

కళ్ల. దే. వి. శైత్యముచేగట్టిపడినయుమ్మి. 'కొమరొందు తెలినురువ్వులుమియుకళ్లలుగాఁగ." అన్న. కిష్కిం, కాం. (ఇట్లు పరుపాదిగాకొన్ని దేశములయందు వ్యవహారము.)

కళ్లము. వై. వి. ధాన్యమునూ ర్చెడుచోటు, ఖలము.

కళ్లాము. వై. వి. కళ్లముయొక్కరూపాంతరము.

కళ్లియము. వై. వి. కళ్లెము. "కత్తులకళ్లియంబొరయఁగా." కవిక. ౨, ఆ.

కళ్లెము. వై. వి. గుఱ్ఱమునోటఁ దగిలించునది, ఖలీనము. (కళ్లియముయొక్కరూపాంతరము.)

కా.

కా. ఉభ. దే. అవ్య. కదా. "చ. ఉడుపతివంశకర్త మహిమోన్నతికెయ్యదిమేర నాఁడుపాల్, కడలి జనించినప్పుడు దళంబుగనంటినమేనిజిడ్డువోఁ, గడుగుకొనంగనబ్బెనని కాళివునొదలయేటఁబాదముల్, తడఁబడనూలలాడుచుహళాహళిగావడినీఁదులాడెడిన్." (నాఁడుపాల్కడలిజనించినప్పుడను వానికికర్త ఉడుపతి. అది అధ్యాహార్యము.) జై. ౧, ఆ. దే. ద్ర. ఇది అవధారణార్థకావ్యయముమీఁద వచ్చినపుడు ఇత్యర్థకమగును. "వ. అదియునుదనకమ్మనుజేశ్వరుండపాయంబు సేయునకాఁదలంచి." భార. ఆర. ౨, ఆ.—సం. వి. ఆ. స్త్రీ. కాకియఱచుట యందగుధ్వన్యనుకరణము. "క. ఆకులతఁబొందిపలుకుచుఁ, గాకాయనిచంచుతెఱచికడునఱచుచునీ, రాకరమునమునిఁగెడున, క్కాకింగనివాంసపరమకారుణ్యమునన్." భార. కర్ణ. ౨, ఆ.—విశ. కుత్సితశబ్దమునకు వృత్తియందు వచ్చెడి ఆదేశము. (కాపురుషుఁడు. మొ.)

కాంక్ష. సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛ, కోరిక.

కాంక్షించే. సం. స. క్రి. ఇచ్ఛించు, కోరు.

కాంక్షితము. సం. విశ. (అ. ఆ. అ.) కోరఁబడినది.

కాంచనము. సం. వి. అ. న. 1. బంగారు; 2. అకరువు. పుం. 1. ఉమ్మెత్త!; 2. సంపెఁగ!; (చూ. కనకము.) 3. కాంచేనము!; 4. నాగకేసరము!; 5. పొన్న!; 6. మఱ్ఱి!.

కాంచనారము. సం. వి. అ. పుం. కాంచేనము!.

కాంచని. సం. వి. ఈ. స్త్రీ. హరిద్ర, పసుపు.

కాంచి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒంటిపేటగల ఆఁడుదానిమొలనూలు; 2. ఒకానొకపట్టణము.

కాంచేనము. వై. వి. కోవిదారము!.

కాంచే. దే. స. క్రి. 1. చూచు; 2. పొందు; 3. బిడ్డనుకను; 4. భాగ్యముఁబొందు. "క. నలినాయతాక్షికతిపయ, దినములఁ జూడంగఁగాంతుతివిరినలుని." భార. ఆర. ౨, ఆ.

కాంజికము. సం. వి. అ. న. ఆరనాళము, కలి. (రూ. కాంచికము.)

కాండపటము. సం. వి. అ. పుం. తిరస్కరిణి, తెర.

కాండపృష్ఠుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) ఆయుధములచేత బ్రదుకువాఁడు, శస్త్రాజీవుఁడు.

కాండము. సం. వి. అ. పుం, న. 1. కావ్యపరిచ్ఛేదము; సమూహము. (అనికొందఱు.) 2. బాణము; 3. జలము; 4. ఆకులులోనగువానియీనె; 5. తామరలోనగువానికాఁడ; 6. వరిలోనగువానిపోఁచ; 7. ముండ్లులోనగువానిదుబ్బు; 8. మోదుగులోనగువానికఱ్ఱ; 9. చెట్టుబోదె; 10. గుఱ్ఱము; కుత్సితము. (అనికొందఱు.) 11. ఏకాంతము; 12. సమయము.

కాండీరుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) బాణమును ధరించినవాఁడు. దండమును ధరించినవాఁడు. (అని కొందఱు.)

కాండేక్షువు. సం. వి. ఉ. పుం. ములుగోలిమిడి!.

కాండ్ర. దే. వి. తృణవిశేషము. "సీ. అస్ఫోటగసవుగాండ్రంతయుఁబుచ్చియత్నంబునదివసత్రయంబువెదకి." వాసి. ౫, ఆ.

కాండ్రు. దే. వి. పులికూయుటయందగుధ్వన్యనుకరణము. "వ. పాఱమ్ము బొమ్ముకిలంకులం గాఁడఁ గాండ్రుకాండ్రుమనిరొప్పి." స్వా. ౮, ఆ.

కాంత. సం. వి. ఆ. స్త్రీ. 1. కోరఁదగిన ఆఁడుది; 2. ఆఁడుది; 3. ప్రేంకణము!. అ. పుం. ము.

1. ఇనుము; 2. (చంద్రసూర్యాయశ్శబ్దములకును తత్పర్యాయశబ్దములకును వెనుకవచ్చునపుడు) ఱాయి. (చంద్రకాంతము, సూర్యకాంతము, అయస్కాంతము. మొ. వీని యర్థములు ఆయాయి శబ్దము కడఁజూచునది.)

కాంతలకము. సం. వి. అ. పుం. నందివృక్షము.

కాంతారము. సం. వి. అ. పుం, న. 1. పెరడవి; 2. పోరానిత్రోవ. పుం. తెలుపు కలసిన పచ్చ చెఱకు.

కాంతాళపడు. ద్వి. అ. క్రి. (కాంతాళము+పడు.) ఈర్ష్యపడు. "రగడ. తాల మెక్కి చెదెతాలకిటు కాంతాళపడుపంతాలదానవు." చంద్ర.

కాంతాళము. దే. వి. 1. ఈర్ష్య. "రగడ. ఇంతి దివి తోనొరయు నిదిగోహింతాళంబు, లింతవిరవాది విరికేల కాంతాళంబు." ఉ, రా. ౬. ఆ. "ద్వి. అంతటనిలువకహరిదిక్కుఁజూచి, కాంతాళము నఁబల్కెఁ గ్రమ్మఱఁగనలి." విష్ణు. పూ. ౨, ఆ. —2. తాలిమిలేమి. "క. అనియువ్విళ్లూరుచు మది,ననయముఁదలపోయు నుస్సురనుఁగాంతాళం, బునఁబొరలు నిట్టువిరహం, బున కోర్వక యవ్వధూటి బోటింబలికెన్." ప్రభా. 3, ఆ.

కాంతి. సం. వి. ఇ. స్త్రీ. 1. జిగి; 2. కోరిక.

కాంతుఁడు. సం. వి. అ. పుం. మగఁడు. విణ. ఒప్పిదముగలవాఁడు.

కాందవికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) పిండివంటలు చేయువాఁడు.

కాందిశీకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వెఱపుచేఁ బాఱెడువాఁడు.

కాంపిల్యము. సం. వి. అ. పుం. కంపిల్లము?.

కాంబవికుఁడు. సం. వి. అ. పుం. సంకుపూసలులో నగునవి చేసియమ్మెడువాఁడు.

కాంబళము. సం. విణ. (అ. ఈ. అ.) కంబళిచేతఁ గప్పఁబడినది. (రథము.)

కాంబోది. దే. వి. సస్యవిశేషము. "ద్వి. వీఁగెఁగాంబోదివావిరివంకడొంక." విష్ణు. పూ. 3, ఆ.

కాంభోజము. సం. వి. అ. పుం. 1. ఒకానొకదేశము; 2. కాంభోజదేశపుగుఱ్ఱము; 3. వెలిచంద్ర?; 4. పొన్న?.

కాంభోజి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొకరాగము; 2. వెలిచంద్ర?; 3. కారుమినుము?; 4. బండిగురివెంద?.

కాంస్యకారుఁడు. సం. వి. అ. పుం. కంచరవాఁడు.

కాంస్యము. సం. వి. అ. న. 1. కంచు; 2. బంగారు వెండిలోనగువానిచేఁజేయఁబడినపానపాత్రము.

కాఁక. దే. వి. 1. జ్వరము; 2. తాపము; 3. తపము; "ఉ. ఇంతిమృదూక్తిమాధురికి నిష్ఠురసంబెనవో లఁజాలకా, ద్యంతమునోడిమధ్యమ గుణాశ్రయమై నెఱకాఁక నెన్నిజ, స్వాంతరముల్ వహించియు." వసు. ౨, ఆ.—4. కోపము; "ఉ. కాఁకనెదిర్చి సంగరముఖంబున హెచ్చినరాజవంశముల్, గూఁకటివేళ్లతోఁ బెఱికి." జై. ౧, ఆ.—విణ. ఉష్ణము. (కాఁకవెలుఁగు. మొ.)

కాఁకర. వై. వి. కారవేల్లము?. (దీనిభేదములు.—అడవికాఁకర, తొమ్మకాఁకర, గొడ్డుఁగాఁకర, పొట్టికాఁకర.)

కాఁకరపత్తి. వై. వి. బాణసంచువిశేషము.

కాఁకవెలుఁగు. దే. వి. సూర్యుఁడు, ఉష్ణరశ్మి. "క. చుక్కలరాజొక్కఁడె కాఁ, డక్కాఁకవెలుంగుహృదయమందుజనించెన్, నిక్కమని తెల్పుక్రియ నెద, చక్కింగౌస్తుభముఁదాల్చి శౌరితలిర్చున్." రామా. 3, ఆ.

కాఁగు. దే. అ. క్రి. 1. తపించు. 2. కోపపడు. "ద్వి. కాఁగినవస్త్రములేనికవిపుత్రిఁబట్టి, లోఁగకయొకనూతిలోఁబడద్రొబ్బి." భాగ. ౯, స్కం.—వి. పెద్దబాన.

కాఁగుడు. దే. వి. తపించుట, తపనము.

కాఁచర. వై. వి. కాసర?. "ఎ, గీ. కాసరయనఁ గాంచరయనఁ గాశాదనిసమాహ్వాయము లగుభవ." ఆం, భా. ద్వి. వ.

కాఁచి. వై. వి. కాకమాచి?.

కాంచే. దే. ప్రే. కాఁగఁజేయు. వి. ఒకానొకయంగడిదినుసు.

కాంచేవడియము. ద్వి. వి. కవిరియుండ. (చూ. కైరవడి.)

కాఁడ. వై. వి. 1. కూరాకులోనగువానికాము; 2. తొడిమ.

కాఁడి. దే. వి. 1. పులియఁబెట్టిన కడుగునీరు; 2. ఎద్దుమొదలగువాని మెడమీఁదనుంచెడు బండిలోనగువానియుగము. "క. పలుపులుఁగాఁడులు పగ్గం, బులుఁదనయస్త్రంబులదరిపొడిచేసినవి, చ్చలవిడిఁబాఱెడిరథ్యం, బులనేయఁడుదివిజరాజపుత్త్రుఁడుకృపతోన్." భార. విరా. ౫, ఆ.

కాఁడిగట్టు. ద్వ. వి. ఒక్కరొకరి నేలలకు హద్దుగా నేర్పఱచిన కట్ట.

కాఁడు. దే. అప. ఒకానొకపుంప్రత్యయము. (సాగనుకాఁడు. మొ.)—అ. క్రి. నాటు. "సీ. కాఁడినవిషకంటకములు మెల్పునఁబుచ్చితనివెచ్చఁ బాదపద్మములుగాఁచి." జై. ౬, ఆ. "ఉ. భానుఁడు శీతభానుఁడుఁగాక్ గాఁడిన మేషుకాళిమవికారముదూరముసేయ." పాండు. ౪, ఆ.

కాఁదారి. దే. వి. అర్ధరాత్రము. "మ. అంతఃపురాంగనలం గన్నుమొఱంగి యప్పురమునం గన్నెఱు కాఁదారిప్రొద్దున భీమేశుఁడుసానివాడకరుగుక్ ధూర్తప్రకారంబునక్." భీ. ౧, ఆ.

కాఁదారిమాఁదారి. దే. వి.——పై.——"గీ. వడివడిం జనిపట్టియోవాలుగంటి, నీకుఁ బేరేమియెవ్వఁడు నీదుమగఁడు, పూని కాఁదారిమాఁదారిప్రొద్దు కాడ, నెందుఁబోయెదు తలిదండ్రులెవ్వరనుడు." య. ౨, ఆ.

కాఁపడము. దే. వి. నొప్పిగలిగినచోట వేఁడివస్తువుతో నొత్తుట.

కాఁపు. దే. వి. 1. కాఁపురము; "మ. అలపన్నిద్దఱు నూరులందునుసముద్యల్లీలఁగాఁపున్న వె, గ్గలపుం దాపమువాపనా." ఆము. ౧, ఆ.—2. గృహస్థుఁడు; "దొడ్డిఁబెట్టినవేల్పుగిడ్డికాఁపు." స్వా. ౧, ఆ.—3. పంటపెట్టువాఁడు. "గీ. కాఁపులావుపెరపుఁగల్గికర్షనముచే, యంగవృష్టితగినయట్లుకలుగ, ఫలముకల్గు." భార. సౌ. ౧, ఆ.—4. శూద్రుఁడు. "క. ఓకాఁపయిందురమ్మని, సాకతమునఁజేరఁబిలిచి కనువిధిజ్ఞుం, డాకసవుకట్టడించియు, నాకుల మతివిచ్చిచూడనప్పుడునడుమక్." భో. ౪, ఆ.

కాఁపుడు. దే. వి. కాఁచుట.

కాఁపురము. దే. వి. 1. నివాసము; 2. సంసారము. "సీ. ఏమేటియడుగుఁగెందామరబల్గాఁపురపు శేర్లతేనిక ద్రింపుఁదెప్పు." అచ్చ. బాల, కాం.

కాఁపురించు. దే. అ. క్రి. కాఁపురముచేయు, వసించు.

కాఁబట్టి. దే. అవ్య. (కాక్+పట్టి.) హేతువును దెలుపును, కనుక.

కాఁబట్టు. దే. అ. క్రి. (కాక్+పట్టు.) కావలసియుండు. (అది నాకు కాఁబట్టదు.)

కాఁబడు. ద్వ. అ. క్రి. (కాక్+పడు.) అగు. "చెలిమికాఁబడుఁగాకిటుమాటలాడినక్." జై. ౨, ఆ. (స్వార్థమునపడు.)

కాఁబోలు. దే. క్రి. (కాక్+పోలు.) కానోపు.

కాక. ఉభ. దే. అవ్య. 1. ఆశీరాద్యర్థమును దెలుపును. (అట్టులకాక, ఉండెదుఁగాక. మొ.)—2. తక్కనసునర్థమును దెలుపును. "గీ. నీవు నలునకుఁ బేర్మితో దేవివైనఁగాక." భార. అర. ౨, ఆ.—సం. వి. ఆ. స్త్రీ. 1. కాఁచి!; 2. కాకిదొండ!; 3. కారుకొల్లి!; 4. కుక్కమేడి!; 5. వెలమసంది!. అ. న. ము. కాకులసమూహము. పుం. 1. కాకి; 2. ఒకానొకచెట్టు.

కాకచించ. సం. వి. ఆ. స్త్రీ. గురిజె!.

కాకచించి. సం. వి. ఈ. స్త్రీ.——పై.——

కాకజంఘ. సం. వి. ఆ. స్త్రీ. 1. కాకిదొండ!; 2. వెలమసంది!.

కాకజంబుక. సం. వి. ఆ. స్త్రీ. కాకినేరెడు!.

కాకతాళీయము. సం. విణ. (అ. ఆ. అ.) కాకివ్రాలఁగా తాటిపండుపడిన విధమువంటిది.

కాకతిందుకము. సం. వి. అ. పుం. కాకితుమ్మి!.

కాకతుండఫల. సం. వి. ఆ. స్త్రీ. కాకిదొండ!.

కాకతుండము. సం. వి. అ. పుం. 1. అగరువు; 2. కాహళమనువాద్యవిశేషము; 3. బాణవిశేషము.

కాకనాసిక. సం. వి. ఆ. స్త్రీ. కాకిదొండ!.

కాకపక్షము. సం. వి. అ. పుం. పిల్లజుట్టు, కూఁకటి.

కాకపీలుకము. సం. వి. అ. పుం. కాకితుమ్మి!.

కాకపుష్టము. సం. వి. అ. పుం. కోయిల.

కాకమల్లి. సం. వి. ఈ. స్త్రీ. అడవిమల్లె!.

కాకమాచి. సం. వి. ఈ. స్త్రీ. కాఁచి!.

కాకము. సం. విణ. (అ.) అల్పము.

కాకముద్గ. సం. వి. ఆ. స్త్రీ. కాకిపెసర!.

కాకరుహము. సం. వి. అ. పుం. నువ్వులు.

కాకలము. సం. వి. అ. పుం. కాగితము.

కాకలీ. సం. వి. ఈ. స్త్రీ. సూక్ష్మమైన యవ్యక్త మధురధ్వని.

కాకాంగి. సం. వి. ఈ. స్త్రీ. కాకిదొండ!.

కాకాదని. సం. వి. ఈ. స్త్రీ. పెద్దకాఁచి!.

కాకాక్షిన్యాయము. సం. వి. అ. పుం. కాకిచూపువలె నేదే నొకప్రక్క కొఱగుట.

కాకి. ఉభ. వై. వి. కాకము. విణ. అల్పము. (కాకికలహ. మొ.)—సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుకాకి; 2. కాఁచి!.

కాకికలువ. వై. వి. అల్లిపువ్వు, కాకోత్పలము.

కాకిచిప్ప. ద్వ. వి. నీటియందలిగుల్ల, శంబూక. "క. అక్కడలిఁగాకిచిప్పలు." య. 3, ఆ.

కాకిచెఱుకు. ద్వ. వి. చెఱుకువంటి తృణవిశేషము, తేజనకము.

కాకిచావు. ద్వ. వి. ఆకస్మికపు మృతి.

కాకిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. కర్షమునందు నాలవ పాలు; 2. కొలిచెడుకోల; 3. ఒకగవ్వ; 4. తూనికభాగము; 5. ఎఱ్ఱగురిజ†.

కాకితము, కాగితము. హిం. వి. వ్రాయుపత్రవిశేషము.

కాకితీపు. ద్వ. వి. మూర్ఛావిశేషము.

కాకితుమ్మికి. ద్వ. వి. నల్లతుమికి, కాకతిందుకము†.

కాకిదొండ. వై. వి. అడవిదొండ, కాకతుండఫల†.

కాకినేరెడు. ద్వ. వి. నేలనేరెడు, కాకజంబువు†.

కాకిపెసర. ద్వ. వి. పిల్లపెసర, కాకముద్గ†.

కాకిబంగారు. ద్వ. వి. పీతాభ్రకము.

కాకిబాతు. ద్వ. వి. ఒకవిధమైన అడవిబాతు.

కాకిమేడి. ద్వ. వి. బమ్మమేడి, కాకోదుంబరిక†.

కాకిఱెక్కలు. ద్వ. వి. బ. ధాన్యవిశేషము.

కాకిఱెల్లు. ద్వ. వి. తృణవిశేషము. (దీని పుల్లలను చివ్వి వ్రాయుదురు.)

కాకివెదురు. ద్వ. వి. గుంద్రము†.

కాకిసొమ్మ. వై. వి. కాకితీపు.

కాకు. దే. వి. 1. గాసి; "క. పాకారిదురాలోక, ప్రాకారాకారపురపరాభవపరిఘా, కాకులునై కాకులవలెఁ, గాకైచనఁజొచ్చిరెల్ల కడలకునసురల్." రామా. ౬, ఆ.—2. తిరస్కారము. "క. పరతత్త్వమెఱుఁగకూరక, పరమర్షులతోడ నేనపరముఁడననుచుఁ, సురలెల్లఁగాకుసేయఁగ, దురహంకృతిఁబలుకఁదగునె తోయజగర్భా." కాశీ. ౫, ఆ.—విశే. 1. వ్యర్థము; "నిను వేఁడు కార్యముఁగాకుచేయక చేయుమీ." మై. ౧, ఆ.—2. శూన్యము. "ద్వి. వైకుంఠనగరంబువనజారికరము, సోఁకనికుముదంబుఁబోకఁగాకయ్యె." విష్ణు. పూ. ౩, ఆ.

కాకుఁడు. సం. వి. అ. పుం. పిచ్చుకకుంటు.

కాకుదము. సం. వి. అ. న. తాలువు, దవుడ.

కాకున్నె. దే. అవ్య. (కాక+ఉన్నె.) నిశ్చయమును దెలుపును. "గీ. అడవిఁ దన్నుఁబొసి యరిగిన నలిగికా, కున్నె యిట్లుచేయనువిదగడఁగె." (అలిగికాకున్నె—అలిగినది నిశ్చయమనుట.) భార. అర. ౩, ఆ.



కాకువు. సం. వి. ఉ. స్త్రీ. శోకభయాదులచేఁ గలిగెడు ధ్వనివికారము.

కాకృత్యము. సం. వి. అ. న. 1. అకార్యము; 2. పశ్చాత్తాపము.

కాకేందువు. సం. వి. ఉ. పుం. కాకితుమ్మిక†.

కాకేమి. దే. అవ్య. (కాక+ఏమి.) మఱియొకదాని లేమిని దెలుపును. "వ. అశుచిభావంబునంగాకేమియప్పరమపతివ్రత మదీయదృష్టిగోచరగాకున్నదయ్యె." (అశుచిభావంబునంగాకేమి—అశుచిభావమున నేయనుట.) భార. ఆది. ౧, ఆ.

కాకోత్పలము. సం. వి. అ. న. కాకికలువ.

కాకోదరము. సం. వి. అ. పుం. సర్పము, పాము.

కాకోదుంబరిక. సం. వి. ఆ. స్త్రీ. కాకిమేడి†.

కాకోలము. సం. వి. అ. న. నరకవిశేషము. పుం, న. విషభేదము. పుం. మాలకాకి. డు. కుమ్మరి.

కాకోలి. సం. వి. ఈ. స్త్రీ. కారుకొల్లి†.

కాక్షి. సం. వి. ఈ. స్త్రీ. 1. అడవితొగరితీఁగ; 2. తొగరి†; 3. తొగరిమన్ను.

కాగడా. దే. వి. (కాఁగు+గడ.) కొయ్య లేక గుడ్డతోనే యేర్పఱచిన చేతిదివ్వటీ. "జగతీజ్యోతులుకాగడాలు." హంస. 3, ఆ.

కాగిస. దే. వి. మత్స్యవిశేషము.

కాచకారుఁడు. సం. వి. అ. పుం. గాజుపనివాఁడు.

కాచము. సం. వి. అ. న. గాజుప్పు. పుం. 1. గాజుపూస; 2. గాజుమన్ను; 3. కావడియుట్టి; 4. నేత్రరోగవిశేషము; 5. కాసు. "శ్లో. కాచాయనీచంకమనీయవాచా, మోచాఫలస్వాదుముచానయాచే, దయాకుచేలేధనదత్కుచేలే, స్థితేకుచేలే శ్రితమాకుచేలే."

కాచస్థాలి. సం. వి. ఈ. స్త్రీ. కలిగొట్టు†.

కాచితము. సం. విశే. (అ. ఆ. అ.) కావడియుట్టియందుంచఁబడినది. (కుండలోనగునది.)

కాచే. దే. అ. క్రి. 1. (కాయ) కాచు; 2. (ఎండ) కాయు. ("గీ. నిడుదత్రాళ్లనిబయలనెప్పుడుఁ దిరుగుచుఁ, బొసఁగము ప్రాద్దుము వ్వేసములఁజెలఁగుచు, వెలుఁగులెల్లెడఁగాచుచునలరునిర్లు, వేఁటకాఁడవ్వు డెంతయుఁదేటమీఱె." ఈ యర్థమందు కాచుచునన్నది సాధువుకాదు. అచ్చ. అ, కాం.)—స. క్రి. 1. బాధలుతొలఁగించిరక్షించు;

"మముంగావుముప్రోవుము." హరి. పూ. ౭, ఆ. 2. ఎదురుచూచు; 3. సహించు. "మనంబునఁ బొంగువిషాదరోషముల్ గావంగలేక." భార. ఉద్యో. 3, ఆ.

**కాజి.** దే. వి. 1. ఒకానొకచెట్టు. "వెలితమ్మికాజిపువ్వులుముడుంగ." పా. ౨, ఆ. 2. మహమ్మదీయుల ఆచారి.

**కాటకము.** దే. వి. కఱవు, క్షామము.

**కాటా.** హిం. వి. పెద్దత్రాసు.

**కాటిగాఁడు.** దే. వి. పక్షివిశేషము.

**కాటిపాపఁడు.** దే. వి. (కాడు+పాపఁడు.) గొల్లవాఁడు. "ద్వి. కాటిపాపఁడు పసిఁగాచుచునుండ." భాగ. ౮, స్కం.

**కాటిపాపలవాండ్రు.** దే. వి. బ. జాలవిద్యచేసెడి ఆటవికజనవిశేషము.

**కాటిఱేఁడు.** దే. వి. (కాడు+ఱేఁడు.) ముక్కంటి, శివుఁడు. "గీ. మనుపుపడినమెకముఁగొనివచ్చిమిడిగ్రుడ్లు, పొడిచినీటశిరముఁదడిపితోఁక, గోసిధూపమిచ్చిమాసంబుపెకలించి, కానుకిచ్చికాటిఱేనిఁగొలిచి." కాళ. 3, ఆ.

**కాటు.** దే. వి. 1. కఱచుట; 2. కఱచినగాయము; "మాకఱచినకాట్లకుఁ శిశువుకాయముతోలునునుగ్గదయ్యె." లక్ష్మీ. ౮, ఆ.—3. మాఁడి యడుగంటుట.

**కాటుక.** దే. వి. అంజనము.

**కాటుకకొండ.** ద్వ. వి. అంజనపర్వతము. (ఇట్లు కాటుకగుబ్బలిలోనగునవి.)

**కాటుకపట్టు.** దే. అ. క్రి. నలుపుపాఱు. "క. బహుళజలప్లవమాన, ద్రుహిణాండముచెమ్మయుండి కిరూక్షార్కవిభా, రహితతఁగాటుకపట్టెను, రహిచెడియననంఘతిమసరాసులు బెరసెఁ." స్వా. 3, ఆ.

**కాటుకపిట్ట.** ద్వ. వి. ఖంజరీటము.

**కాటుకఱాయి.** దే. వి. సౌవీరాంజనము.

**కాటుకఱేకులపాము.** దే. వి. పులిపెంజెర.

**కాటులాడు.** దే. అ. క్రి. (కాటులు+ఆడు.) కలహించు. "సీ. అసుఖదంబైనరాజ్యామిషమునకుఁ గుక్కలభంగిఁదమలోనఁ గాటులాడి." భార. శాం. ౧, ఆ.

**కాటువోవు.** దే. అ. క్రి. (కాటు+పోవు.) మాఁడి యడుగంటు.

**కాట్రగడ.** దే. వి. కంపకోట.

**కాట్రేఁడు.** దే. వి. కాటిఱేఁడుయొక్కరూపాంతరము. "సీ. కాట్రేడమెకముల కదుపు రాఁజేయుమీజింక నొక్కటిని నీచేతికిత్తు." య. ౨, ఆ.

**కాడు.** వై. వి. 1. శ్మశానము; "సీ. దివ్యమందిరములఁదిరిగెడునరుఁడైన నొగిఁగాడు కావకయుండఁడలేఁడు." భల్లా. ౧, ఆ.—2. అడవి*. 3. నాశము*.

**కాడుచేయు.** వై. స. క్రి. నాశముచేయు. "గీ. ఒక్కనదిపొంతగార్హస్థ్యయుక్తమైన, పుణ్యాతపమాచరించుచుఁబుణ్యాజనులు, తారుబంధులుఁదామరతఁపరగుచుఁ, గూడియుండంగనెంతయుఁగాడుచేసె." భీ. ౮, ఆ.

**కాడుపడు.** వై. అ. క్రి. 1. కలఁతపడు; "క. కూడమ్మికొండ్రుజనములు, బాడబులాగమములమ్మిబ్రదుకుదురెందుఁ, జేడియలమ్ముదురచ్చోటు, కాడుపడినకలియుగమునఁగౌరవముఖ్యా." హరి. ఉ. ౯, ఆ. "సీ. కాలుకొన్నంతయుఁగడువేగమునఁబాతికనుకని దెసలందుఁగాడుపడియు." నిర్వ. ౮, ఆ.—2. కనఁబడకపోవు, నష్టమగు. "చ. తనయుఁడొకండువాఁడు గుణధాముఁడుక్రీడనవాంఛసాంద్రకా, ననమునకేగికాడుపడినందడవంజను దెంచియొందుఁగానను." సం. "భూరిద్యుమ్నంసుతంనష్టమన్వేష్టుంవనమాగతః." భార. శాం. 3, ఆ. "గీ. కుడిచికూర్చుండిమీరేలకొఱఁతయైన, కుమ్ములాడెదరోయన్నదమ్ములార, గొట్టె క్రొవ్వియెసెలగనుగొఱికినట్లు, కటకటామీవివేకంబుకాడుపడఁగ." భీ. ౮, ఆ. (ప్రే. కాడుపఱచు.)

**కాడ్పడు.** వై. అ. క్రి. కాడుపడుయొక్కరూపాంతరము. (కలఁతపడుటకు.—"ఉ. వృత్రునిఁజంపినప్పుడెను రేంద్రుని మేకొనెబ్రహ్మహత్యత, గాత్రముకంపమొందెమదికాడ్పడియెఁ." ఉ. రా. ౭, ఆ.—నష్టమగుటకు.—"కరులువారుల్ రథంబులునుగాడ్పడె." (ఇక్కడ కాడ్పడెననఁగా నశించెనని యర్థము.) ఉ. రా. ౨, ఆ.)

**కాణము.** ఉభ. వై. వి. గుఱ్ఱముమొదలగువానియొక్కయులవలులోనుగాఁగలభత్యము. "ఎ. గీ. బియ్యములును నేయి పెరుగును గూరగా, యులును వంటకట్టియలునుగడ్డి, కాణములును బెల్లుగానె

డఁగూర్చిని, గూఢవృత్తిఁదానుఁ గూడనడచె." భార. ఉద్యో. ౧, ఆ.—సం. అ. పుం. కాకి.

కాణయాచి. దే. వి. చిరకాలవాసస్థానము. "క. తెరువునజఘనపయోధర, భరమునఁనడుగలసియిడఁ గఁబతియూఁతగనై, కరమిచ్చు వాకునవ్వలి, కరమదినీకాణయాచిగాయుంగరమా." రామా. ౬, ఆ.—విశ. చిరకాలానుభవముగలది. (చూ. కాణాచి.)

కాణాచి. దే. వి. కాణయాచియొక్క రూపాంతరము. (చిరకాలవాసస్థానమునకు.— "శా. దేవబ్రాహ్మణభక్తిప్రౌఢప్రియవక్తృత్వంబు కాణాచివి, ద్యావైశద్యముదిక్కు ధర్మమునకుందార్యాకృణమర్యాదకున్, తావౌచిత్యముజీవగఱ్ఱహితశిష్టవ్రాతసంతోషణ, శ్రీవజ్రాంగియజాతశత్రుఁడుమహీభృన్మాత్రుఁడే చూడఁగన్." విజ. ౧, ఆ.—చిరకాలానుభవముకలది అనుటకు.— "క. మగఁడాపట్టంబునఁదలఁ, దెగఁగొట్టినఁగొట్టుఁగాకతెకతేరగనీ, కొగవిడిచిపోయెద నెప్రావగనాకాణాచియైనవలపులపంటన్." కళా. 3, ఆ.)

కాణాదము. సం. వి. అ. పుం. కణాదఋషిప్రోక్తన్యాయశాస్త్రము.

కాణుఁడు. సం. వి. అ. పుం. ఒంటికంటివాఁడు.

కాత. దే. ద్ర. ఆశీరర్థమునందు తద్ధర్మార్థక క్రియలకనుప్రయుక్తమగుశబ్దము. "అఖిలభూతములకు నానందమగుఁగాత." మొ. మార్క. ౮, ఆ.

కాతరుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) అధీరుఁడు. భయశీలుఁడు. (అని కొందఱు.)

కాతా, ఖాతా. హిం. వి. వ్యాపారములో సంబంధము, లెక్క.

కాతాళము. దే. వి. కోపము. "క. మాతంగరథభటాశ్వప, రీతుఁడగుచుఁద్రోవపుండరీకుఁడుచూపన్, గాతాళంబుననిలువక, పాతాళంబునకు నేగిపోఁజాలుచేయన్." వై. ౭, ఆ.

కాత్యాయని. సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. సగము వయసుచెల్లి కావిచీరఁగట్టినవిధవ.

కాదంబము. సం. వి. అ. పుం. 1. ధూమ్రవర్ణములైన ముక్కుకాళ్లు రెక్కలుగలహంస; 2. బాణము.

కాదంబరి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొకకావ్యము; 2. ఆఁడుకోయిల; 3. గోరువంక; 4. మద్యము; 5. సరస్వతి.

కాదంబిని. సం. వి. ఈ. స్త్రీ. మేఘపఙ్క్తి.

కాదా. దే. అవ్య. (కాదు+ఆ.) కదా. (దీనియొక్క మాఱురూపములు.—కద, కదా.)

కాదాచిత్కము. సం. విశ. (అ. ఆ. అ.) ఒకానొకప్పుడు కలుగునది.

కాదె. దే. అవ్య. (కాదు+ఎ.) కదా. "వర్ణతతినాశ్రమకోటినివాఁడుకాదనేసె." భార. శాం. ౧, ఆ. (రూ. కాదే. క. ఏనేమితప్పుచేసితి, నోనలినదళాక్షనీనియోగంబునఁగా, దేనాఁడుజలధినుండుట, మానియిటకు వచ్చినాఁడ మగువలుఁదానున్." వి, పు. ౭, ఆ.) (దీనియొక్క మాఱురూపములు. కదె, కదే.)

కాద్రవేయుఁడు. సం. వి. అ. పుం. కద్రువకొడుకు, పాము.

కాన. యు. దే. అవ్య. తెనుఁగుసంబోధనంబున అనుప్రయుక్తమగు శబ్దము. (తల్లికాన, సామికాన. మొ.)—ద్ర. కనుక. వై. వి. అడవి.

కానఁబట్టు. దే. అ. క్రి. (కానన్+పట్టు.) కనఁబడు. "ఏకొఅంతయును గానంబట్టదెప్పట్టునన్." రా. యు, కాం.

కాననము. సం. వి. అ. న. 1. అడవి; 2. ఇల్లు; 3. బ్రహ్మముఖము.

కాననివాఁడు. దే. విశ. అంధుఁడు. "ఉ. కాననివానినూఁతగొనికాననివాఁడువిశిష్టవస్తువుల్, కాననిభంగి." భాగ. ౭, స్కం.

కానరానిచేక్క. ద్వ. వి. అభిజిన్నక్షత్రము.

కాని. యు. దే. అవ్య. 1. వికల్పమును దెలుపును; (నేడుకాని రేపుకాని వచ్చును. చూ. కానీ.) — 2. తక్కననునర్థమును దెలుపును. "ఉ. కోపానలమేచియున్న నిబిడాటవిపైఁబ్రసరించుతీవ్రదా, వానలుఁబోలిశాత్రవచయంబుపయింగవియించినిల్చినంగాని." భార. ఉద్యో. ౨, ఆ.— వై. వి. వీసమునఁనాలవభాగము. "క. కానివ్యయం బెన్నఁడు నెక, కానియుఁజేయంగఁదగదు కార్యముగలచో, మానకధనంబుఁదృణముగ, మానవపతిచేయునదిసమగ్రవిభూతిన్." రుక్మాం. 3, ఆ. ("క. ఏనుగలిగియుండఁగనె, వ్వానికినిను ముద్దు సేయవాలాయమగున్, గానియిటమీఁదనెవ్వఁడుఁ, గానికిఁగైకొనక చుల్కఁగాఁ జూచుఁజుమీ." ఇత్యాది స్థలములయందు కానికిఁగైకొనక అనఁగా లక్ష్యపెట్టక అని యర్థము.)

**కానిక.** దే. వి. కానుక, ఉపహారము. "వృషముఁ గానికయిచ్చికరుణజనింపఁబలికి." భార. అను. ౫, ఆ.

**కానిపించు.** దే. అ. క్రి. ప్రత్యక్షమగు. "గీ.కాని పించియేమికావలయునువరం, బడుగుమనిన." కళా. ౨, ఆ. (కనిపించు అనుదానికి సైతము ఈయర్థము కలదు.) ప్రే. కనఁజేయు.

**కానీ.** దే. అవ్య. 1. అంగీకారమునుదెలుపును; "శా. మానిర్గోత్రవిధూతపత్త్రములమా మాతో సపత్త్రల్ కదా, కానీరండని." ఆము. ౨, ఆ.—2. కానియొక్కరూపాంతరము. "మ. నిరవద్యస్థిరభక్తితోడననుఁగానీశంభుఁగానీరమేశ్వరుఁగానీగుతియించి." కాశీ. ౨, ఆ.

**కానీనుఁడు.** సం. వి. అ. పుం. 1. కన్యకకొడుకు; 2. వ్యాసుఁడు; 3. కర్ణుఁడు.

**కాను.** దే. వి. నీళ్లుకలియనిమజ్జిగ, మథితము.

**కానుక.** దే. వి. కానిక. "క. సకలావనీశులిచ్చిన, యకలంక సువర్ణరత్నహయధనవస్త్ర, ప్రకరంబులు మొదలగుకా, నుకలందుకొనక సుయోధనుని నియమించెన్." భాగ. ౧౦, స్కం. ఉ.

**కానుగు.** దే. వి. కరంజము౹. (దీని భేదములు—గంట్లకానుగు, తీఁగెకానుగు, నిప్పువన్నెగుత్తులకానుగు.)

**కానుపు.** దే. వి. 1. ప్రసవము; 2. వీక్షణము. "అది కలలోనికానుపయి." హరి. ఉ. ౭, ఆ.

**కాన్క.** దే. వి. కానుకయొక్కరూపాంతరము. "సీ. గుములుగాఁబోలుచుపూగములఁజెన్నొందుపూగములఁగొన్నింటిఁగైకాన్కచేసి." చంద్ర.

**కాన్పించు.** దే. కానిపించుయొక్కరూపాంతరము.

**కాపంతము.** దే. వి. కుక్కనుగట్టెడికొయ్య. "ఎ,గీ. శ్వగళకాష్ఠంబు వెలయుఁగాపంతమనఁగ." ఆం, భా. ద్వి. శూ.

**కాపథము.** సం. వి. అ. న. నీటివట్టివేరు. (నామలింగానుశాసనమునందిది ఇష్టకాపథమని యిష్టశబ్దపూర్వకముగాఁ బఠింపఁబడియున్నను నిఘంట్వంతరములయందిట్లు తద్విరహితముగాఁ జెప్పఁబడియున్నది.) పుం. కుత్సితపుత్రోవ.

**కాపరి.** దే. వి. (కాపు+అరి.) రక్షకుఁడు. "ఉ. కాపరిలేనిగొఱ్ఱియలకైవడిఁగంటకచోరకోటిచే, నేపఱియున్నదీభువనమీశుఁడు కృష్ణుఁడులేమి." భాగ. ౧, స్కం.

**కాపాడు.** దే. అ. క్రి. (కాపు+ఆడు.) బాధలు తొలఁగించి రక్షించు.

**కాపి.** ఆం. వి. వ్రాఁతనేర్చుటకు పైనపెట్టు పటువడి; నకలు.

**కాపిలము.** సం. వి. అ. న. సాంఖ్యశాస్త్రము.

**కాపిశాయనము.** సం. వి. అ. న. మద్యము, కల్లు.

**కాపిశేయము.** సం. వి. అ. పుం. పిశాచము.

**కాపు.** దే. వి. 1. కాయలుకాచుట; 2. బాధలుతొలఁగించిరక్షించుట.

**కాపుగడ.** దే. వి. రక్షణము. "ద్వి. అన్యాయములుచేసియర్థముల్ గొనక, మాన్యతఁబ్రోతువేమితికాపుగడల." రా. అ, కాం.

**కాపురుషుఁడు.** సం. వి. అ. పుం. కుత్సితపురుషుఁడు.

**కాపేయము.** ఉథ. దే. వి. కృపణత. (అప్ర.) సం. అ. న. కపిస్వభావము.

**కాపోతము.** సం. వి. అ. న. 1. కపోతముల సమూహము; 2. అంజనవిశేషము.

**కాప్యకారము.** సం. వి. అ. పుం. మనసున పాపముంచి మాటాడుట.

**కాఫి.** ఆం. వి. ఒక విత్తనము.

**కామ.** దే. వి. 1. తామరలోనగువానికాఁడ; "గీ. కఱకుటెండతాఁకినతొగకామభంగిఁ, బాఁపడేనిమేనెంతయుబలముతఱిఁగిస్రుక్క." హరి. పూ. ౭, ఆ.—2. గొడుగులోనగువానిదండము; "చ. గొడుగుగఁజేసిగోవులకు గోపకుమారులకున్ నగంబుని, ట్లొడఁబడవచ్చుఁబొమ్మనఁగనొప్పెడుప్రేళులుపంజమాడ్కియై, యడరినమీఁదిమేఘతతియాస్పృతియైశిఖరంబుగుబ్బయై కడుబెడఁగొందహస్తమను కామతిరంబుగఁదాల్చిపొల్చుటన్." హరి. పూ. ౭, ఆ. (కనకపుకామతోమరము, పడగకామ, బంగరుకామకుంచె ఇత్యాదులెఱుఁగునది.)—3. మగగుఱి; 4. చూచుకము. (చూ. మిమ్మటము.)

**కామంచి.** వై. వి. కత్తృణము౹.

**కామంజిక.** సం. వి. ఆ. స్త్రీ. కామంచిగడ్డి.

**కామకూటము.** సం. వి. అ. పుం. 1. వేశ్యాప్రణయము; 2. వేశ్యావిభ్రమము.

**కామకేళి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. సురతము.

**కామధేనువు.** సం. వి. ఉ. స్త్రీ. కోరినవస్తువులిచ్చెడివేల్పుటావు.

కామన. సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛ. అ. పుం. ము. అశోకము†. విణ. 1. ఇచ్ఛగలది; 2. చక్కనిది.

కామనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఇచ్ఛగల వాఁడు; 2. చక్కనివాఁడు.

కామపాలుఁడు. సం. వి. అ. పుం. హలి, బలరాముఁడు.

కామము. సం. వి. అ. న. 1. కామ్యము; 2. రేతస్సు. పుం. ఇచ్ఛ. క్రి. విణ. అ. న. ఇచ్ఛవచ్చినట్టు.

కామయిత. సం. విణ. (ఋ. ఈ. ఋ.) కాముకుఁడు.

కామల. సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. ము. కామాల. అ. పుం. ము. 1. మరుభూమి; 2. వసంతఋతువు. విణ. డు. కాముకుఁడు.

కామాంకుశము. సం. వి. అ. పుం. నఖము, గోరు.

కామాటము. వై. వి. మోటపని*. "మ. అనినన్ మంత్రులునాప్తులుందొరలుదేవామ్రేఁడులున్ తొలుఁదే, రనయెంతేనల వడ్డయాని మితకాంత్రన్ భానుపుత్రాదులన్, వినుమీచంపకపట్టి తెచ్చిదినమున్ నీయింటి కామాటపుం, బనికిం జొచ్చెదమన్నదాఁకనిదె చెంపల్ వ్రేతుమత్యుద్ధతిన్." రామా. ౮, ఆ.

కామాటి. వై. విణ. (కామాటము+ఇ.) మోటపని చేయువాఁడు.

కామాల. వై. వి. రోగవిశేషము.

కామి. సం. వి. ఇ. స్త్రీ. ఇచ్ఛ. పుం. 1. కాముకుఁడు; న్, 2. జక్కవ; 3. పావురము. విణ. కాముకుఁడు.

కామిని. సం. వి. ఈ. స్త్రీ. 1. ప్రియసంగమమునందు మిక్కిలి యాసగలయాఁడుది; 2. ఆఁడుది; 3. ఆఁడుజక్కవ; 4. ఆఁడుపావురము; 5. బదనిక.

కాముఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

కాముకము. సం. వి. అ. పుం. 1. ఇరుగుడు†; 2. తినాసము†. విణ. ఇచ్ఛగలది.

కాముకి. సం. వి. ఈ. స్త్రీ. సంభోగమునందిచ్ఛగల ఆఁడుది.

కాముకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఇచ్ఛగలవాఁడు.

కామ్యము. సం. వి. అ. న. అగ్నిహోత్రాది. "శ్లో. ఇష్టాపూర్తస్య కామ్యానాం త్రివర్గస్యచయోవిధిః." భాగ. ౨, స్కం.—విణ. కోరఁదగినది.

కాయ. దే. వి. 1. చెట్టునఁగాచెడుకాయ; 2. కఠిన వస్తుసంస్పర్శముచేహస్తాదులయందు కాచెడుకాయ, కిణము; "ఉ. మున్నటులున్న పాణితలముల్ బలుకాయలుకాచెఁజూచితే." సం. "ఇత్యస్య దర్శయామాసకిణవంతౌకరావుభౌ." భార. విరా. ౨, ఆ.—3. నేత్రరోగవిశేషము; 4. పెసలులోనగువానిపైతోలు, శింబ, (ఇట్లు పూర్వపు కొన్ని నిఘంటువులయందు వ్రాయఁబడియున్నది.) "సీ. సెనగలుగోదుమల్ మినుములుతిలలుముద్గములు మున్నుగఁగలకాయధాన్యములు." ఉ, రా. ౮, ఆ.—5. జూదమునందలిసారెలోనగునది; 6. వీణెసొరకాయ. "సీ. వీణెలగవుసెనల్ వెడలించిచెఱఁగులమెఱుఁగు రాఁగాయల మీఁదఁదుడిచి." హరిశ్చ. ౨, ఆ.

కాయకంటి. దే. వి. (కాయ+కన్ను.) కుబేరుఁడు.

కాయకన్ను. దే. వి. కాయకాచిన కన్ను.

కాయకము. దే. వి. జీవనము.

కాయజలము. సం. వి. అ. న. మూత్రము.

కాయజుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

కాయపెండలము. దే. వి. పెండలముదినుసు.

కాయమానము. సం. వి. అ. న. పందిరి.

కాయము. ఉభ. దే. వి. బాలెంతకిచ్చెడుమందు, సర్వ. సం. అ. పుం. 1. శరీరము; 2. సమూహము; 3. స్వభావము; 4. గుఱి. విణ. ఋషిదేవతాకము.

కాయస్థ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉసిరిక†; 2. కరక†.

కాయస్థుఁడు. సం. వి. అ. పుం. 1. కరణమువాఁడు; 2. పరమాత్ముఁడు.

కాయిక. సం. వి. ఆ. స్త్రీ. నానాఁటివడ్డి. "శ్లో. కాయావిరోధినీశశ్వత్పణపాదాదికాయికా." విజ్ఞా. వ్య, కాం.—విణ. శరీరసంబంధమయినది.

కాయిదా, ఖాయిదా. హిం. వి. విధి, నిర్ణయము.

కాయిలా, ఖాయిలా. హిం. విణ. ఆరోగ్యములేని.

కాయు. వై. అ. క్రి. ఎండవెన్నెలలోనగునది ప్రకాశించు. "గీ. వెల్లమడుఁగుఁగోక విచ్చినరీతిఁబొ, లాఁబోసినట్టియందమునను, బిండిచల్లినట్లుపండువెన్నెలలుకా, యంగఁదొడఁగెఁ జలువలమర నంత." కళా. ౮, ఆ.

కాయువు. దే. వి. అనురాగము. (చూ. కాయ్వు.)

కాయ్వు. దే. వి. కాయువుయొక్క రూపాంతరము. "చ. కరమనురాగముల్లమునఁ గ్రమ్మఁగనమ్ముగిపుచ్ఛమూలముం, గరమున నంటుచున్ నృపతికామవికారముఁబొందివీఁకఁద, త్వరమతియైతనుంది వియఁబార్థివుచిత్తమెఱింగియేలనీ, కరమునఁబుచ్ఛమూలమిటుకాయ్వునఁబట్టెదు మేదినీశ్వరా." మార్క. ౫, ఆ.

కార. సం. వి. ఆ. స్త్రీ. 1. చెఱ; 2. చెఱసాల; 3. దూతిక; 4. వీణెకరివె; 5. సువర్ణకారిక. అ. పుం. ము. 1. కప్పము; 2. నిశ్చయము; 3. మంచుకొండ; 4. యత్నము; 5. వధము.

కారండవము. సం. వి. అ. పుం. కన్నెలేడి.

కారంధమి. సం. వి. న్. పుం. 1. కంచుపనివాఁడు; 2. రసవాది.

కారంభ. సం. వి. ఆ. స్త్రీ. ప్రేంకణము?.

కారకము. సం. వి. అ. న. కర్త్రాదిషట్కము. విణ. చేయునది.

కారగ్గి. ద్వ. వి. (కారు+అగ్గి.) దావానలము. "ఎ, గీ. ఎగ్గతంబునఁదానుగారగ్గిఁగాలెనటె." భార. ఆశ్ర. ౨, ఆ.

కారడుగు. ద్వ. వి. (కారు+అడుగు.) 1. రెండవ కారు; 2. అల్పధాన్యము.

కారణ. సం. వి. ఆ. స్త్రీ. యాతన. అ. న. ము. 1. హేతువు; 2. కొఱముట్టు; 3. వధము.

కారణికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) పరీక్షకుఁడు.

కారపుఁజెక్క. వై. వి. (కారము+చెక్క.) ద్రాక్షత్వక్కు.

కారపుఁబడుగు. ద్వ. వి. (కారము+పడుగు.) గట్టినూలిపడుగు. "కారంపుఁబడుగులుకఁడెలకప్పెర." హంస. ౨, ఆ.

కారము. వై. వి. 1. షడ్రసములలోనొకటి, కటువు; (చూ. రసము.) 2. చవుడు*; "చ. అంబరమునఁబుట్టినట్టిమలపంకము కారములోననద్దఁగా, విరిసినయట్లు." భార. శాం. 3, ఆ.—3. నూలుతడిపెడి యొకానొకద్రవద్రవ్యవిశేషము*; 4. బిడ్డలకుఁబోసెడిమందు*. "సీ. పసిఁదహాతహాపెట్ట మసలెడికార్చిచ్చు కారంపుమందుగా నారగించి." చమ. ౧, ఆ.

కారయిత. సం. విణ. (ఋ. ఈ. ఋ.) చేయించువాఁడు.

కారవి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఇంగువమ్రాను; 2. ఓమము; 3. నల్ల జీలకఱ్ఱ; 4. సదాప?.

కారవేల్లము. సం. వి. అ. పుం. కాఁకర?.

కారాకు. దే. వి. (కారు+ఆకు.) పండుటాకు. "క. భారముననులిచిత్రెంపక, కారాకులుడుల్లినట్లుకష్టములెల్లన్, దారపెడవాయువలయుట, సారకృపందెలియఁజెప్పెశౌరియతనికిన్." భార. భీష్మ. ౧, ఆ.

కారాకూరము. దే. విణ. కలఁగినది. "కారాకూరంబులై రాక్షసులహృదయముల్ కాడ్పడన్." ఉ. రా. ౧, ఆ.

కారాట. దే. వి. వ్యాపనము.

కారించు. సం. స. క్రి. బాధించు. "క. వైరముగొనిదైత్యుఁడుదు, ర్వారభుజారంభరోషరభసాకులుఁడై, కారింపఁదొడఁగెనమరులఁ, బోరులుతనకున్వినోదములుగాఁగడిమిన్." లక్ష్మీ. ౨, ఆ.

కారిక. సం. వి. ఆ. స్త్రీ. 1. సూత్రాదివివరణశ్లోకము; 2. యాతన; 3. చేయుట; 4. మంగలిలోనగువానిపని; 5. నట్టువునిపెండ్లాము.

కారికము. దే. విణ. చలువచేయనిక్రొత్తది. (వస్త్రము,) అనాహతము.

కారిజెము. వై. వి. కడుపులోనీరుతిత్తిక్రిందనుండెడు మాంసఖండవిశేషము, కాలఖండము. "గీ. పెల్చుముడుసువంటపిండితాలింపులు, సన్న గూరకారిజంబుక్రొవ్వు, పొదలుమారిషములుపొసఁగుకజ్జంబులు, నంబుజాతగంధులనువుపఱచి." రుక్మాం. 3, ఆ.

కారిత. సం. వి. ఆ. స్త్రీ. అప్పుతీసికొన్నవాఁడు తనయక్కఱకొలఁదిని తానుగా నేర్పఱచుకొన్నవడ్డీ, ఒడఁబాటువడ్డీ. "శ్లో. వృద్ధిస్సా కారితాయాధమర్ణకేనస్వయంకృతా." విజ్ఞా. వ్య. కాం.

కారీషము. సం. వి. అ. న. కరీషములసమూహము. (కరీషము=ఏఱుపిడక.)

కారు. యు. దే. వి. 1. అడవి; "కారుచిచ్చు."—2. ఎండకాలముచల్లెడు వరిధాన్యము; (కారువడ్లు.) — 3. ముదిమి; "కారాకు."—4. నల్ల; "కారుపిందె."—5. చౌడు; "వానకారుపాలంబునఁగల్గెనేనియుఁగొల్చుగావింప నేర్చునే." భార. సౌ. ౧, ఆ.—వై. 1. కాలము; "నన కారు."—2. వర్షకాలము*; "క్రొక్కారుమెఱుంగు." (చూ. కైపు.)—3. జ్యేష్ఠమాసము మొదలు నాలుగేసినెలలకాలము*; "ముక్కారు."—4. నలుపు. "కారుమొగులు."

కారుకొను. ద్వ. అ. క్రి. నల్లఁబాఱు. "క. కారుకొనిమేఘజాలా, కారంబునఁజాలనొప్పెఁగౌరవసైన్యం, బారూఢవీరరసవి, స్ఫారంబైయంతఁదోఁచెఁబాండవబలమున్." భార. భీష్మ. ౨, ఆ.

కారుకొమ్ముమేకము. ద్వ. వి. దుప్పి.

కారుకొట్టి. వై. వి. కాకోలి?.

కారుఖానా. హిం. వి. పనిచేయు స్థలము.
కారుకొల్లి. వై. వి. కాకోలి?.
కారుకోడి. ద్వ. వి. అడవికోడి.
కారుగచ్చ. ద్వ. వి. వాగుజి?.
కారుచిచ్చు. ద్వ. వి. ఎరగలి, దావానలము.
కారుచు. దే. ప్రే. కాఁడించు. (రూ. కార్చు). "చ. కవపటు డించి యేగు నుకఁగా సురెఁ గొంకులఁ గార్చి." ఆము. ౬, ఆ.)
కారుజనము. ద్వ. వి. శణపుష్పిక?.
కారుణికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కనికరము గలవాఁడు, కృపాళువు.
కారుణ్యము. సం. వి. అ. న. దయ, కనికరము.
కారునూవు. దే. వి. జర్తిలము?.
కారుపెసర. దే. వి. ముద్గపర్ణి?.
కారుపోఁక. ద్వ. వి. శైలపూగము.
కారుపోతు. దే. వి. అడవిదున్న, కాసరము.
కారుబుడమ. దే. వి. తీవ్రగంధము?.
కారుమినుము. దే. వి. మాషపర్ణి?.
కారుమునగ. ద్వ. వి. వనశిగ్రువు?.
కారువు. సం. వి. ఉ. పుం. విశ్వకర్మ. విణ. 1. శిల్పి; 2. చేయువాఁడు.
కారూరు. దే. వి. (కారు+ఊరు.) అడవిపల్లె. "వ. పల్లియలు వైచి కోడెలం బట్టి పెనఁచి కారూళ్లజట్టి కాఱులకు వసంబు చేయు బరవసంబె సంగ్రగు ష్మరువారును." హరి. పూ. ౫, ఆ.
కారె. వై. వి. క్షారతృణము. "క్షారతృణంబగు కారెనా." ఆం, భా. ద్వి. వ.
కారెము. దే. వి. మళ్లకు నీళ్లెత్తెడు తాటిదోనె.
కారేలకి. ద్వ. వి. (కారు+ఏలకి.) ఏలాపర్ణి?.
కారోత్తమము. సం. వి. అ. పుం. కల్లుతేట.
కార్కరకము. సం. వి. అ. పుం. పాలనురుఁగు.
కార్కశ్యము. సం. వి. అ. న. కఱకుఁదనము.
కార్కొను. దే. అ. క్రి. 1. నల్లఁబాఱు; (కారుకొనుయొక్క రూపాంతరము.) 2. సందడించు. "కార్కొన్న కోర్కుల్." య. ౫, ఆ. (కాఱుకొనుయొక్క రూపాంతరము.)
కార్చిచ్చు. దే.వి. కారుచిచ్చుయొక్క రూపాంతరము.
కార్చు. దే. ప్రే. 1. కారుచుయొక్క రూపాంతరము. (చూ. కారుచు.) 2. కాఱుచుయొక్క రూపాంతరము. (చూ. గలఁతియ.)
కార్జము. వై. వి. కారిజముయొక్క రూపాంతరము.

కార్తస్వరము. సం. వి. అ. న. స్వర్ణము, బంగారు. (చూ. కనకము.)
కార్తాంతికుఁడు. సం. వి. అ. పుం. జ్యోస్యుఁడు.
కార్తికము. సం. వి. అ. పుం. ఒకానొక నెల.
కార్తికికము. సం. వి. అ. పుం. కార్తికము.
కార్తికేయుఁడు. సం. వి. అ. పుం. కుమారస్వామి, కందుఁడు.
కార్తె. వై. వి. 1. కృత్తికానక్షత్రము; "కార్తెఁబాయసమబ్జగర్భునితారమాషములు." భార. అను. ౨, ఆ.—2. సూర్యుఁడుండునక్షత్రము*. (చిత్తకార్తె, స్వాతికార్తె. మొ.)
కార్పటికుఁడు. సం. వి. అ. పుం. 1. కోమటి; "ద్విత్రీణ్యహాని సంభ్రామ్య సకార్పటికసత్తమః." కాశీ. ౩౦. అధ్యా.—2. తీర్థము మోసికొనిపోయెడు బాటసారి.
కార్పణ్యము. సం. వి. అ. న. కృపణత్వము.
కార్పాసము. సం. వి. అ. పుం. న. ప్రత్తి. విణ. (అ. ఈ. అ.) నూలిచేత నేయఁబడినది. (చీర.)
కార్పాసి. సం. వి. ఈ. స్త్రీ. ప్రత్తిచెట్టు.
కార్మణము. సం. వి. అ. న. మూలికచేతఁజేసెడి యుచ్చాటనాదిక్రియ, చిల్లింగి. విణ. నెఱవేఱుదాఁకఁ బనిచేయునది.
కార్ముఁడు. సం. విణ. (అ. ఈ. అ.) కర్మశీలుఁడు.
కార్ముకము. సం. వి. అ. న. విల్లు. పుం. వెదురు?. విణ. పనియందు నేర్పరి.
కార్యదర్శి. సం. విణ. (న్. ఈ. న్.) పని నిర్వహించువాఁడు.
కార్యము. సం. వి. అ. న. 1. పని; 2. హేతువు.
కార్షాపణము. సం. వి. అ. పుం, న. 1. పదియాఱు పణములయెత్తు; 2. కర్షమెత్తు వెండిటంకము.
కార్షికము. సం. వి. అ. పుం. కర్షమెత్తు వెండిటంకము.
కార్షుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) దున్నుకొని బ్రదుకువాఁడు, కాఁపువాఁడు.
కార్ష్యము. సం. వి. అ. పుం. మద్ది?.
కాఱియ. వై. వి. యాతన. "క. వేటొకవిలుగొనివిమతుఁడు, తొఱఁగ హరి మేననాటెఁదొమ్మిదియమ్ముల్, మాటెను బదింటఁబొదివెక్, గాఱియగా మఱియుఁబఱపెగ మిగొనఁదూపుల్." హరి. ఉ. ౧, ఆ.
కాఱియపడు. వై. అ. క్రి. యాతనపడు. "క. మనుజువరింపక మనుజాం, గనమను జాళను వరించి కాఱియపడునే." రా. సుం, కాం.

**కాఱియపెట్టు.** ద్వి. స. క్రి. యాతనపఱచు. "క. పాఱినవాతని వెనుకన, పాఱితిసంప్రార్థనాప్రభాషణములతోఁ, దేఱిమఱలియమ్మునిమిముఁ, గాఱియపెట్టితిఁగదేయకటయనుచుదయన్." భార. అను. ౫, ఆ.

**కాఱు.** దే. అ. క్రి. 1. స్రవించు; 2. రాలు. "ఉ. కో అలుదీటుచున్ నయనకోణములన్ దవానస్ఫులింగముల్, కాఱఁగ." హరి. పూ. ౪, ఆ.—వి. 1. అజ్ఞానము; "క. వేఱుగఁగనినం బ్రకృతికిఁ, జీఱవిడిచినట్లతనదుసుజ్ఞానమున, క్కాఱువిడిచితనకంటెను, మీఱనొకటిలేమిగాన్పమెయికొనవలయున్." భార. అను. ౪, ఆ.—2. కఱ్ఱు; 3. నీఱుకాఱు; (చూ. ఊఁదుఁగ్రోవి.) 4. బ. అనృతవచనము; "గీ. ఇవము సూడు కొలఫుజేలికల్ముస్నెందుఁ, గాఱులాడిరనినకతరయొఱుంగము." అచ్చ. అ, కాం.—5. పరుషవచనము; "క. తడవులఁబట్టియునాతో, విడువకవర్తించుఁగానుపీసములీలేఁ, డెడయకయితఁడిట్లుండఁగఁ, గడునుడికిమదంబకొన్ని కాఱులుపలికెన్." పర. 3, ఆ.—6. వ్యర్థవచనము. "ఉ. ఆఱడిపోకయున్ ఫలములందుటయుంగనిపల్కనేరమిన్, మాఱటనోరిదాననయి మాటలుచిత్తమునందునిల్పకేఁ, గాఱులుప్రేలెదన్." భార. ఉద్యో. 3, ఆ.—విశ. సాంద్రము. "క. కాఱడవిఁబఱచుమృగముల, నూఱడకయతిగిచి." భార. ఆది. ౪, ఆ.

**కాఱుకొను.** దే. అ. క్రి. సందడించు. (చూ. కాఱ్కొను.)

**కాఱుచు.** దే. ప్రే. కాఱఁజేయు.

**కాఱ్ఱోడ్డెము.** దే. వి. పరుషోక్తి. "సీ. కఱకుకరుసు కాఱుకాఱోడ్డెము పరుసుపరుసనయనఁగనిష్ఠురము వెలయు." ఆం, భా. ప్ర. వాగ్వ.

**కాల.** సం. వి. ఆ. స్త్రీ. 1. కలిగొట్టు**?**; 2. నల్ల జిలకఱ్ఱ; 3. నల్ల తెగడ**?**; 4. నీలి**?**; 5. మంజిడి**?**. అ. పుం. ము. 1. సమయము; 2. నలుపు; 3. చావు. విశ. నల్లనిది. (కాలత్రయము — భూతభవిష్యద్వర్తమానములు. కాలపంచకము — ప్రాతస్సంగమమధ్యాహ్నపరాహ్ణసాయంకాలములు.)

**కాలకంఠము.** సం. వి. అ. పుం. 1. ఊరఁబిచ్చుక; 2. కాటుకపిట్ట; 3. కూకుడుగుండెంగ; 4. నెమలి; 5 వేఁగిస**?**.

**కాలకంఠిక.** సం. వి. ఆ. స్త్రీ. అలక్ష్మి, పెద్దమ్మ.

**కాలకంఠుఁడు.** సం. వి. అ. పుం. 1. శివుఁడు; 2. యముఁడు.

**కాలకము.** సం. వి. అ. పుం. పుట్టుమచ్చ.

**కాలకూటము.** సం. వి. అ. పుం. విషభేదము.

**కాలఖండము.** సం. వి. అ. న. (చూ.) కాలిజము.

**కాలజ్ఞము.** సం. వి. అ. పుం. 1. కోడి; 2. కోయిల.

**కాలజ్ఞుఁడు.** సం. వి. అ. పుం. జ్యోతిష్యుఁడు.

**కాలటుక.** దే. వి. (కాలు+ అటుక.) కుండలుంచుటకై రెండుమొనలు ఇరుప్రక్కల గోడలయందుఁబొదిగి యూఁతగాఁ గాళ్లనుంచి యడ్డముగా నమర్చిన మ్రాను.

**కాలధర్మము.** సం. వి. అ. పుం. మరణము, చావు.

**కాలపత్రి.** సం. వి. ఈ. స్త్రీ. గచ్చె**?**.

**కాలపృష్ఠము.** సం. వి. అ. న. 1. కర్ణునివిల్లు; 2. విల్లు. పుం. 1. ఒకదినుసు ఇఱ్ఱి; 2. రాపులుఁగుపక్షి.

**కాలమేషి.** సం. వి. ఈ. స్త్రీ. కారుగచ్చె**?**.

**కాలమేషిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. నల్లతెగడ**?**; 2. మంజిడి**?**.

**కాలరి.** దే. వి. (కాలు+అరి.) 1. పదాతి; "కాలరిపౌఁజులనేలఁజమిరి." అచ్చ. సుం, కాం.—2. నడచువాఁడిచ్చెడు పన్ను; 3. సమాచారమును దెలిసికొనిపోయిచెప్పువాఁడు, దూత. "వ. మనము వెసగలకాలరుల వేగంబుచ్చి శల్యకేకయజరాసంధతనయదృష్టకేతు ప్రభృతులయిన భూపతులకును వారివారిబంధుమిత్రజనంబులకు నెఱిఁగించుటకార్యంబు." సం. "దూతాగచ్ఛంతుశీఘ్రగాః." భార. ఉద్యో. ౧, ఆ.

**కాలరు.** ఆం. వి. చొక్కామెడపట్టి.

**కాలశాకము.** సం. వి. అ. పుం. కటివేము**?**.

**కాలశేయము.** సం. వి. అ. న. గోరసము, చల్ల.

**కాలసూత్రము.** సం. వి. అ. న. ఇనుపతంతులుగల నరకవిశేషము.

**కాలస్కంధము.** సం. వి. అ. పుం. 1. చీఁకటిమ్రాను; 2. తుమ్మిక**?**. 3. వేఁగిస**?**.

**కాలస్థాలి.** సం. వి. ఈ. స్త్రీ. కలిగొట్టు**?**.

**కాలానుసార్యము.** సం. వి. అ. న. 1. ఇరుగుడు**?**. 2. నల్ల అగలు**?**. 3. జాతిపువ్వు**?**.

**కాలాయసము.** సం. వి. అ. న. అయస్సు, ఇనుము.

**కాలిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. పార్వతీభేదము; 3. ద్రౌపది; 4. బొగ్గు; 5. నలుపు; 6. చీఁకటి; 7. ఆఁడుకాకి; 8. నూఁగారు; 9. పొగ

గుమి; 10. బంగారునందలి దోషము; 11. మద్యము; 12. శ్రోత్రమబ్బు; 13. మబ్బుగుంపు; 14. వైవర్ణ్యము; 15. సెలవడ్డి; 16. జటామాంసి?; 17. తేలుకొండి?; 18. పొట్ల?.

కాలిత్రోవ. దే. వి. (కాలు+త్రోవ.) ఒకఁడు నడచిపోఁదగినమార్గము, ఏకపది.

కాలినడ. దే. వి. (కాలు+నడ.) పాదచారము.

కాలిపుట్టువు. దే.వి. (కాలు+పుట్టువు.) శూద్రుఁడు.

కాలిబంటు. ద్వ. వి. (కాలు+బంటు.) పదాతి.

కాలిబోను. దే. వి. (కాలు+బోను.) మృగములకాళ్లుతగులుకొనసెడ్డిచియుండెడియురితో సంతనపఱిచినత్రాను. "వ. బిసయొడ్డిసంఘటించినకాలిబోనులంబడి." స్వా. ౪, ఆ.

కాలియ. వై. వి. పిశాచము*. "ఉ. కాలియపట్టినట్లుకడుఁగందికృశుండయివీడిపెంద్రుకల్, తూలఁగలాంఛనధ్వజముతోలగుడంబుదగన్ ధరించి ప్రే, తాలయమెల్లఁగ్రుమ్మరుచు నాయతులన్నియుఁగొంచురాజుపెక్, మాలతనంబునొందెఁ గొఱమాలినదైవము చెద్దునక్కటా." మార్క. ౧, ఆ.

కాలీచి. సం. వి. ఈ. స్త్రీ. న్యాయవిచారణ స్థలము.

కాలీయము. సం.వి. అ. న. నల్ల అగలు?. విణ. కాల సంబంధి.

కాలు. దే. అ. క్రి. దగ్ధమగు. వి. 1. పాదము; 2. పాతిక; 3. మంచపుఁగోడులోనగునది. "కంగటికాలునమ్మఁదగుకైదువు." జై. ౫, ఆ.

కాలుఁడు. సం. వి. అ. పుం. 1. యముఁడు; 2. శనైశ్చరుఁడు; 3. శివుఁడు.

కాలుకొను. దే. స. క్రి. కాలూఁదు. (ప్రే. కాలుకొలుపు. చూ. కాల్కొను.)

కాలుచు. దే. ప్రే. కాలఁజేయు, దహించు. (రూ. కాల్చు.)

కాలుదివియ. ద్వ. వి. కాగడా.

కాలుద్రవ్వు. దే. అ. క్రి. (కాలు+త్రవ్వు.) కారణములేకయ యుద్ధమునకు యత్నించు. (చూ. కాల్ద్రవ్వు.)

కాలుద్రొక్కు. దే. అ. క్రి. (కాలు+త్రొక్కు.) కదియు.

కాలుబలము. మి. వి. పదాతిసేన.

కాలుమడి. దే. వి. మూత్రము. (చూ. కాల్మడి.)

కాలుమడుచు. దే. అ. క్రి. మూత్రవిసర్జనముచేయు.

కాలుమానిసి. ద్వ. వి. పదాతి. "మొగ్గసేనుంగుఁ బడుకాలుమానిసియును." భార. ద్రో. 3, ఆ.

కాలువ. దే. వి. 1. నీళ్లుపాఱుటకుఁద్రవ్వినమార్గము, కుల్య. "గీ. లోనిజాలొట్టి నిండికాలువఁగఁజాగి." ఆము. ౬, ఆ.—2. పరంపర. "అలిగియర్జునుఁడు వాలంప కాలువలోలి నడరించుటయు." భార. భీష్మ. 3, ఆ.

కాలుష్యము. సం. వి. అ. న. కలఁక.

కాలేయకము. సం. వి. అ. న. గంధకాష్ఠవిశేషము పుం. మ్రానిపసుపు.

కాలేయము. సం. వి. అ. న. (చూ.) కారిజేము.

కాలేయులు. సం. వి. అ. పుం. బ. కాలకేయుల నెడు రాక్షసులు.

కాల్కొను. దే. స. క్రి. కాలుకొనుయొక్క రూపాంతరము. "క. జనపతిపంచినదూతను, జననాథునిపంపుగాకసత్కారముగై, కొనఁగభుజింపఁగనిటఁగా, ల్కొనినిలఁ పఁగనుచితమాసెకుమతీనాకున్." రా. కిష్కిం, కాం.

కాల్ద్రవ్వు. దే. అ. క్రి. కాలుద్రవ్వుయొక్క రూపాంతరము. "క. ముట్టినపగఱసొంపునడచుటయొప్పున్, వినుకయ్యమునకుఁగాల్ద్రవ్వఁబాటిలుదురితమెట్టివిభునకునైనన్." భార. శాం. 3, ఆ.

కాల్నడ. దే. వి. కాలినడయొక్కరూపాంతరము. "సీ. ఏమెల్లనుండనీవిట్లొంటిఁగాల్నడ నేగుచుని క్కిఁగతమెద్దియొకో." భార. భీష్మ. ౧, ఆ.

కాల్మడి. దే. వి. కాలుమడియొక్కరూపాంతరము. "సీ. చనిచనియోరగచ్చగఁజేసినిలుచుండికాల్మడివిడుచుఁదక్కకచెలంగి." భల్లా. 3, ఆ. "మదువులుపసులకాల్మడిఁబ్రుచ్చె." హరి. పూ. ౫, ఆ.

కాల్మడుచు. దే. అ. క్రి. కాలుమడుచుయొక్కరూపాంతరము.

కాల్యకము. సం. వి. అ. పుం. కచోరము?.

కాల్యము. సం. వి. అ. న. వేకువ. పుం. కచోరము?. విణ. కాలమునందు యోగ్యమయినది.

కాల్వ. దే. వి. కాలువయొక్కరూపాంతరము.

కాల్వూరు. దే. వి. బ. పదాతి.

కావచికము. సం. వి. అ. న. కవచము దొడిగినవారి సమూహము.

**కావటి.** సం. వి. ఈ. స్త్రీ. కావడి.

**కావడి.** వై. వి. నీళ్లుమొదలైనవిమోసికొనివచ్చుటకై రెండుకొనలయందును ఉట్లమర్చినవెదురుబద్ద.

**కావడించే.** వై. స. క్రి. కావడియందెత్తు. "వ. నంజుడులుచేవడింబ్రావడించక కావడించిప్రొద్దస్తమించునంతకునిజనిశాంతంబునకుంబఱతెంచునప్పుడు." పాండు. 3, ఆ.

**కావరము.** దే. వి. క్రొవ్వు, మదము.

**కావరించే.** దే. అ. క్రి. క్రొవ్వు, మదించు.

**కావరుఁడు.** దే. విశే. దుర్మదుఁడు. "ఈకావరుఁగష్టచిత్తునధికంబుగనమ్ముదునీవు." భార. అర. ౬, ఆ.

**కావలము.** దే. వి. పాపము. "ఎ, గీ. దేవపూజలఁబొలివోనికావలంబు, బ్రాహ్మణోపాస్తిఁబొలివోనిపాపచయము, నచ్యుతానంతగోవిందహరిమురారి, యనితలంచినయప్పుడయడఁగిపోవు." వి, పు. 3, ఆ.

**కావలయు.** దే. అ. క్రి. (కాన్ + వలయు.) 1. అగుట యావశ్యమగు; (ఆ పని యిప్పుడ కావలయును.) 2. అపేక్ష్యమగు; (1. నాకా సొమ్ము కావలయును. 2. ఆ యిల్లు కట్టుటకింక నూఱురూపాయలు కావలయును.) 3. అగు. (వాఁడు నీకేమికావలయును.) (ఇక్కడ ఏమి యనఁగా ఏవిధమైన బంధువు అని యర్థము.) (రూ. కావలెను.)

**కావలి.** దే. వి. రక్షణము. "క. వెలినుండుఁడిచ్చుటికిఁగా, వలినేనుండంగఁ జొచ్చువారుంగలరే." ఉ, హరి. ౨, ఆ.

**కావలికాఁడు.** దే. విశే. రక్షకుఁడు.

**కావలిబొట్టు.** ద్వ. వి. బిడ్డలకు రక్షగానుంచెడు నల్లని తిలకము. (చూ. కావిరిబొట్టు.)

**కావా.** దే. వి. అశ్వమండలగతి. "క. అవనములఁగీరావలి, యావలితగతిన్ భ్రమించు నందంబలరెన్, గావాతిరిగెడుమారుని, మావులునానపుడునికటమండలగతులన్." భద్రా. ౮, ఆ.

**కావారి.** సం. వి. ఈ. స్త్రీ. మొగలాకులోనగువానితో నేర్పఱుపఁబడిన గొడుగు.

**కావి.** దే. వి. ఎఱుపు. బ. కాషాయవస్త్రము.

**కావించే.** దే. ప్రే. కాఁజేయు.

**కావిగొను.** దే. అ. క్రి. (కావి+కొను.) ఎఱ్ఱనగు. "కన్నుఁగవధవళరుచుల్ కావిగొన." స్వా. ౨, ఆ

**కావితాలుపు.** దే. వి. సన్న్యాసి, కాషాయధారి.

**కావిరి.** దే. వి. నలుపు. "ఉ. సావుడురోషవహ్నివలనంబొగరేఁగినభంగిమోమునం, గావిరిపర్వ." ఉ, హరి. ౫, ఆ. "ద్వి. కావిరిచీఁకటుల్ గవిసెలోకముల." విష్ణు. పూ. 3, ఆ.

**కావిరిబొట్టు.** ద్వ. వి. కావలిబొట్టు. "సీ. ఫాలభాగంబుపైఁబరఁగుకావిరిబొట్టుకాముని గెల్చినకన్నుగాఁగ." (పాఠాంతరము కావలిబొట్టు.) భాగ ౧౦, స్కం. పూ.

**కావిటాయి.** దే. వి. ఎఱ్ఱని సుద్దటాయి.

**కావు.** దే. వి. 1. అఱచుటయేడ్చుటలోనగువానియందగుధ్వన్యనుకరణము. "సీ. కావుకావనుటరక్కసులమూఁకనెకాని ననిచెనీయెడ సింహనాదవిహృతి." పాండు. ౧, ఆ.—2. పాఁతఱలోనగువానిపైకప్పు; (కావుపాఁతఱ.) "వ. ఎసరుగాఁదేటలగులేడినల్లలు గ్రుమ్మరించి లవణకణసంచయంబునించి లావుగాఁగావుఁగప్పి." స్వా. ౮, ఆ.—3. కావలిబొట్టు. "సీ. కనుదోయిఁదిన్నఁగాఁగాటుకతీరిచి నుదుటిపైనునుఁగావు కుదురుకొల్పి." చంద్రా. ౨, ఆ.

**కావుట.** దే. వి. అగుట. "ఇది సిద్ధముకావుటెఱింగి." భార. ఆది. ౧, ఆ.

**కావుత.** దే. ద్ర. (చూ.) కాత.

**కావున.** దే. ద్ర. హేతువును దెలుపునది.

**కావేరి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొక యేఱు; 2. పసుపు; 3. వెలయాలు.

**కావేషము.** గ్రా. వి. ద్వేషము, పగ.

**కావ్యము.** సం. వి. అ. పుం. కబ్బము. (పంచకావ్యములు.—రఘువంశము, కుమారసంభవము, మేఘసందేశము, మాఘము, భారవి.)

**కావ్యుఁడు.** సం. వి. అ. పుం. శుక్రుఁడు.

**కాశము.** సం. వి. అ. పుం, న. రెల్లు. పుం. ఒకానొక దేశము.

**కాశి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొకపట్టణము; 2. శ్రమము. "అపశ్యత్కాపిసైన్యంతత్ జితకాశ్యగ్రతఃస్థితమ్." ఇత్యాది. భార. అర.

**కాశ్మరి.** సం. వి. ఈ. స్త్రీ. గుమ్ముడు?.

**కాశ్మర్యము.** సం. వి. అ. పుం.——వై.——

**కాశ్మీరజన్మము.** సం. వి. న్. న. కుంకుమపువ్వు.

**కాశ్మీరము.** సం. వి. అ. న. 1. కుంకుమపువ్వు; 2. మెట్టతామరదుంప. పుం. ఒకానొక దేశము.

కాశ్యపి. సం. వి. ఈ. స్త్రీ. భూమి. ఇ. పుం. అనూరుఁడు.
కాషాయము. సం. వి. అ. పుం. కావిచీర.
కాష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. 1. పదునెనిమిది ఱెప్పపాట్ల కాలము; 2. దిక్కు; 3. మేర; 4. మ్రానిపసుపు. 5. అతిశయము. అ. న. ము. కట్ట.
కాష్ఠతక్షుఁడు. సం. వి. ష్. పుం. వడ్లవాఁడు.
కాష్ఠపాటలి. సం. వి. ఇ. స్త్రీ. తెల్లకలిగొట్టు?.
కాష్ఠీల. సం. వి. ఆ. స్త్రీ. కదళి, అరఁటి?.
కాస. వై. వి. కాసె. "చల్లాడంబులమీఁదటన్ బిగువుకాసల్ కట్టి." అని. ర, ఆ. (ఇది తెలుఁగా ఎదంతముగానే వాడఁబడుచున్నది.)
కాసమర్దము. సం. వి. అ. పుం. కసింద?.
కాసము. సం. వి. అ. పుం. క్షవధువు, దగ్గు.
కాసర. వై. వి. ఒకానొకచెట్టు.
కాసరము. సం. వి. అ. పుం. మహిషము, ఎనుపోతు.
కాసరవడ్లు. దే. వి. బ. శాలిధాన్యవిశేషము.
కాసా. దే. వి. దాసీపుత్త్రుఁడు.
కాసారము. సం. వి. అ. పుం. సరస్సు, కొలను.
కాసించే. వై. స. క్రి. కాసెగాఁగట్టు. "ద్వి. కడుమైలపేలికగాసించి." హరిశ్చ. ౨, భా.
కాసియ. వై. వి. కాసె. "కట్టెబిగియందనకాసియ." రామా. ౬, ఆ.
కాసీఁడు. దే. వి. (కాసె+ఈఁడు.) ఱాతిపనివాఁడు, శిలాకుట్టకుఁడు. "ఎ, గీ. ఒక్కనాఁడుకాసీల కిట్లనునయముమీఱ." పర. ౫, ఆ.
కాసీసము. సం. వి. అ. న. మయిలుతుత్తము.
కాసు. వై. వి. 1. దుగ్గానిలో నాలవభాగము*; దుగ్గానిలో పదియవభాగము. (అనికొందఱు.) 2. ధనము*. "గీ. తీర్థయాత్రలుసేయంగఁదివిరి వచ్చి, సానివారిండ్లకరుగంగ సమయమగునె, యంతయునుగాక కాంచనాహ్లాదపరలు, కాంతలకునియ్యనూచేతఁగాసులేదు." భల్లా. ౫, ఆ.
కాసె. యు. దే. వి. ఱాయితొలుచుపని. వై. దట్టి. (కాసియయొక్క రూపాంతరము.) "మ. జిగిమైసొంపునుదమ్మిమైమఱుఁగుడాచేఁగల్వచేకత్తియున్, సిగపూమొగ్గల తాయెతుల్ బిగువుకాసెంజెక్కినంజాలఁబొ, ల్పగుసుస్నేదఁగిచేకువంకియునుజాయల్ మీఱఁగాఁబూవుఁదీఁ, గెగుదెందావలరాచయొంటరికడుంగేరించుచుంజిమ్మినన్." య. ౫, ఆ.
కాసెనిల్కడ. ద్వి. వి. మల్లబంధవిశేషము. "సీ. కాసెనిల్కడగళికత్తెరజోడింపు నరసింగముసరిబిత్తరముకిర్లి." ఆం, భా. ద్వి. ౬.
కాసెయులి. దే. వి. (కాసె+ఉలి.) ఱాయితొలిచెడి ఉలి, టంకము.
కాసెపోయు. దే. అ. క్రి. (కాసె+పోయు.) (వస్త్రమును) గోఁచివలె వెనుకచెక్కు.
కాహళ. సం. వి. ఆ. స్త్రీ. 1. వాద్యవిశేషము; 2. ఒకానొక అప్సరస్త్రీ. అ. పుం. ము. 1. కోడి; 2. సద్దు. విణ. 1. అసభ్యము; (మాట,) 2. ఎండినది; 3. చెడ్డది; 4. పెల్లయినది. (తెనుఁగుకావ్యములందు వాద్యమను నర్థమందును తెలుఁగ ఇది పుంలింగముగాఁ గానఁబడుచున్నది. "సీ. పణవమర్దళశంఖపటహకాహళవేణుభేరీధ్వనులమిన్నుపిక్కటిలఁగ." భాగ. ౧౦, స్క౦. పూ. మొ.)
కాహళి. సం. వి. ఈ. స్త్రీ. 1. వాద్యవిశేషము; 2. యౌవనస్త్రీ.
కాహళిక. సం. వి. ఆ. స్త్రీ. వాద్యవిశేషము.
కాహళికుఁడు. సం. వి. అ. పుం. కాహళియూఁదువాఁడు. "క. త్రికవులకుఁజతుష్కవులకుఁ, బ్రకటంబుగనెందునీవరాజవనుచుఁగా, తుకమునఁగాహళికునిపో, లికఁదాఁదద్బిరుదకాహళికపూరించెన్." పర. ౫, ఆ.
కాళంజి. వై. వి. తమ్మపడిగము, పతద్గ్రహము. "సీ. తమ్మిక్రొవ్విరిగిండికొమ్మయొక్కతె తాల్పఁగలువకాళంజియొకర్తుతేర." చంద్ర.
కాళయుక్తి. సం. వి. ఇ. పుం. ఒకసంవత్సరము. (చూ. సంవత్సరము.)
కాళి. సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. పార్వతీభేదము; 3. బొగ్గు.
కాళింగము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగు; 2. నేలగుమ్మడి?. డు. ఒకానొకపాము.
కాళింగి. సం. వి. ఈ. స్త్రీ. పుచ్చె?.
కాళింది. సం. వి. ఈ. స్త్రీ. ఒకానొకయేఱు, యమున.
కాళిందీభేదనుఁడు. సం. వి. అ. పుం. బలరాముఁడు.
కాళిక. సం. వి. ఆ. స్త్రీ. (చూ.) కాలిక.
కాళియ. వై. వి. వాద్యవిశేషము, కాహళిక. "మత్తెపుల్, గాళియల్ బహువస్త్రభూషణ గంధముల్ హరికర్పణం, బోలిఁజేసినవారు." రుక్మాం. ౨, ఆ.

**కాళియుఁడు.** సం. వి. అ. పుం. సర్పవిశేషము.
**కాళే.** వై. వి. కాళియయొక్క రూపాంతరము.

కి.

**కి.** దే. అప. షష్ఠీవిభక్తియందువచ్చెడు ప్రత్యయము. (హరికి, గిరికి, శ్రీకి, ప్రీకి. మొ.)
**కింక.** దే. వి. 1. కోపము. "ఉ. పంకజనాభమాపడిన పాటులు రాజ్యముకోలుపోకయుఁ, గింకకు మూలమై." భార. ద్రో. 3, ఆ. (కినుకయొక్క రూపాంతరము.) —2. పసులను మేఁకలను చంపెడు వ్యాధివిశేషము.
**కింకరుఁడు.** సం. వి. అ. పుం. పరిచారకుఁడు.
**కింకిణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. గజ్జె; 2. చిఱుగంట.
**కింకిరాతము.** సం. వి. అ. పుం. 1. కోయిల; 2. చిలుక; 3. వన్నెచెట్టు. (రూ. కింకిరాటము.)
**కింకిరాతుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు. (రూ. కింకిరాటుఁడు.)
**కింకిరి.** దే. వి. 1. కోపము; "మిముదుర్వ్యాపారులం జూచి కొంకక మాకింకిరికిం జెలంగిన." ఉ, హరి. ౪, ఆ.—2. రోఁత. (చూ. కింకిరిపడు.)
**కింకిరిపడు.** ద్వ. అ. క్రి. 1. కోపగిల్లు; "క. అతఁడెంతరేఁగితిట్టిన, మతిఁగింకిరిపడకయపుడుమాటాడకయా, నతయగుచునప్పతివ్రత, యతనినతిశ్రేష్ఠుఁగాఁగనాత్మఁదలఁచుచుఁ." మార్క. ౨, ఆ.—2.రోఁతపడు."ద్వి. అడరుదుర్గంధంబుకణుమాత్రమైనఁ, గింకిరిపడక." హరిశ్చ. ౨, భా.
**కింకిరిపాటు.** ద్వ. వి. 1. కోపపడుట; "చ. మననునోకిలించిమఱు మాటకుఁగింకిరిపాటుతోడుగా, మునిపతియుల్లసవ్వి." ఉ, హరి. 3, ఆ.— 2. రోఁతపడుట. (చూ. కింకిరిపడు.)
**కింగిరి.** దే. విశే. అల్పము.
**కించిత్తు.** సం. అవ్య. ఇంచుక.
**కించులికము.** సం. వి. అ. పుం. మహీలత, ఎఱ్ఱ.
**కించులుకము.** సం. వి. అ. పుం. మీఁదిగాలి.
**కించే.** వై. విశే. అల్పుఁడు. "వ. మీరలాజ్ఞాథంగంబుగావించునకించునొకించుకంతయువిచారింపకపట్టుకొనిపోయి మత్పురోహితులముందఱంబెట్టిరండు." జై. ౪, ఆ.
**కింజల్కము.** సం. వి. అ. పుం కేసరము, అకరువు.
**కింజుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) నిరర్థక జన్మముకలవాఁడు.
**కింపచానుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) లోభి, పిసినిగొట్టు.
**కింపాకము.** సం. వి. అ. పుం. కాంజీరము౹. విశే. మూఢుఁడు.
**కింపురుషము.** సం. వి. అ. పుం. భారతాదివర్షములలో నొకటి. (చూ. వర్షము.)
**కింపురుషుఁడు.** సం. వి. అ. పుం. అశ్వముఖమును నరశరీరమునుగల దేవయోనివిశేషము.
**కింవదంతి.** సం. వి. ఈ. స్త్రీ. జనులాడుకొనుమాట, నానుడి.
**కింశారువు.** సం. వి. ఉ. పుం. 1. బాణము; 2. వరిముల్లు; 3. రాపులుఁగు.
**కింశుక.** సం. వి. ఆ. స్త్రీ. మానేరు౹. అ. పుం. ము. మోదుగు౹. (దీనిమొగ్గ అంగారితము.)
**కింస్తుఘ్నము.** సం. వి. అ. పుం. బవాదికరణములలో నొకటి. (చూ. కరణము.)
**కికకిక.** దే. వి. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము. "చ. లుకలుకమస్తకంబు చెవులుంగ్రిమితోల్వఁగఁబుట్టెఁడాఁకటఁ, నకనకమేనుసోలిభవనంబులవెంటనువెవ్వరెవ్వరేఁ, గికకికనవ్విరిస్సనుచుఁగేళ్లనుఱువ్వఁగమోరతీపుతోఁ, జకచకపాటుతెంచునృపసత్తమయేమనివిన్నవించెదఁ." భల్లా. ౨, ఆ.
**కికాకిక.** దే. వి. కికకికయొక్క రూపాంతరము. "మిగులరొదగాఁగికాకికనగుచు." కళా. ౧, ఆ.
**కికి.** సం. వి. న్. పుం. చాషము, పాలపిట్ట.
**కికీదివి.** సం. వి. ఇ. పుం.——పై.——
**కికురించే.** దే. స. క్రి. వంచించు. "సీ. కికురించిరిచ్చిపుచ్చికొనుచోటులవారలాఁకకులోనుగాకప్పద్రోచి." స్వా. 3, ఆ.
**కికురింత.** దే. వి. మోసము, వంచన.
**కికురు.** దే. వి.——పై.——
**కికురువెట్టు.** దే. స. క్రి. (కికురు+పెట్టు.) వంచించు. "గీ. దశరథకుమారనీవిడుతప్పుటడుగు, లుల్లముననమ్మఁగాఁజాలమొండురెండు, తప్పుటడుగులమునుజగత్త్రయముఁగొంటి, బలిఁగికురువెట్టియనిబుధుల్ పలికిరపుడు." రామా. 3, ఆ.
**కికురువోడుచే.** దే. స. క్రి.. (కికురు+పోడుచు.) వంచించు. "క. పోరుదురుకికురువోడుచుచుఁ, దాఉదురుభయంబులేక తోరపుటిరవుల్, జాఱు

దురుఘునశిలాతటి, మీఱుదు రెన్నంగరాని మెలఁ
కువలన్నహా." భాగ. ౧౦, స్కం. పూ.

**కిక్కస.** దే. వి. క్రోవివంటితృణవిశేషము, నలము.

**కిక్కురించు.** దే. స. క్రి. కికురించుయొక్క రూపాంతరము. "గీ. చేతికొండయొకనిచేనిచ్చితలనున్న, కొండదొంతికుదురుకొననమర్చి, మగుడనడుగ వాఁడునగచరుల్ నగవానిఁ, గిక్కురించిపోయివెక్కిరించు." రా. యు, కాం.

**కిక్కురింత.** దే. వి. కికురింతయొక్క రూపాంతరము.

**కిక్కురు.** దే. వి. కికురుయొక్క రూపాంతరము.

**కిక్కురువెట్టు.** దే. స. క్రి. కికురువెట్టుయొక్క రూపాంతరము. "నన్నిటుల్ కిక్కురువెట్టఁ జూచెదు." రసి. 3, ఆ.

**కిక్కస.** దే. వి. మిక్కిలి కదియిక. "దండకము. భయభ్రాంతుఁడై పాఱనుంకించు నక్కించుఁగం సుంద్రిలోకీనృశంసుల్ నియుద్ధక్రియాపద్ధతిం గిక్కసల్ గొంతుక్రొల్లొన్కక్కి." పా. 3, ఆ.

**కిఖి.** సం. వి. ఇ. స్త్రీ. చిన్ననక్క, గొంకనక్క.

**కిగ్గాడి.** వై. విణ. అంబేద. "సీ. తనవిడిదికిరంభన నుపవైతనితట్టుకిగ్గాడియ నురకుఁగేలుమొగిచి." ప్రభా. ౧, ఆ. "గీ. పూనికగ్గాత్మజుఁడునృపసేనఁడాత్మ, హయముదాఁటించినట్టివాఁగల్లయదిగో, నాటికదియబ్బురముగానిపీటిలోని, నేటికిగ్గాడిగుఱ్ఱాలుదాఁటుచుండు." కళా. ౮, ఆ.

**కిచకిచ.** దే. వి. పక్షులులోనగువాని కూఁతయందగు ధ్వన్యనుకరణము. (చూ. కిచకొట్టు.)

**కిచకొట్టు.** దే. అ. క్రి. కూయు. "ద్వి. కిచకిచధ్వనులతోఁగిచకొట్టుకొనుచు." రా. కిష్కిం,కాం.

**కిచ్చడి. కిచిడీ.** దే. వి. నానావస్తువులుచేర్చివండిన చిత్రాన్నవిశేషము. "సీ. సద్యోఘృతంబులుచక్కెరలుక్కెరల్ పచ్చళ్లుకిచ్చళ్లుపాయసములు." ఉ. రా. ౬, ఆ.

**కిటకిట.** దే. వి. వీణెమొదలగువాని బిరడత్రిప్పుటయందగు ధ్వన్యనుకరణము. "సీ. శ్రుతులువిజ్జోడైనచోఁదంత్రిబిగివిరాఁ బీడించి కిటకిట బిరడత్రిప్పు." వై. ౧, ఆ.

**కిటి.** సం. వి. ఇ. పుం. వరాహము, పంది.

**కిటికి.** దే. వి. గవాక్షము.

**కిటుకు.** దే. వి. 1. కపటము. "చ. కటకటమిమ్ముపంటిగుణగణ్యులపుణ్యులఁజెప్పరానిసం, కటములఁబెట్టియిట్టికొఱగాములుచేసితిఁ బెక్కునాకు నీ, కిటుకున నేమిమేలుకలిగెఁ." వి,పు. ౭, ఆ.—2. మర్మము. "కామినియందిపుడేమిగాంచియీ కిటుకుగడించిపల్కెదు." కళా. ౫, ఆ.

**కిట్టము.** సం. వి. అ. న. మలసామాన్యము.

**కిట్టికోల.** దే. వి. ఇటికించుటకుఁగా నొకతట్టు కొనలఁజేర్చికట్టిచిన్నకోలలతో నేర్పఱుపఁబడినసాధనము.

**కిట్టిమము.** సం. వి. అ. న. ఉప్పునీళ్లు.

**కిట్టు.** దే. అ. క్రి. స. క్రి. సమీపించు. "భీమాగ్రజుం డాజిఁగిట్టినఁబట్టఁ." భార. ద్రో. ౧, ఆ. "గీ. పీరుఁగిమ్మీరుఁడనుసు, రారినిశ్చలభీకరాకారుఁ గిట్టి." భార. అర. ౧, ఆ.

**కిణము.** సం. వి. అ. పుం. కఠినవస్తు సంస్పర్శముచే హస్తాదులయందుఁ గాచెడికాయ.

**కిణిహి.** సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరేను*; తెల్లగినియ*.

**కిణ్వము.** సం.వి.అ.న. 1. పాపము; 2. సురాబీజము.

**కిత.** దే. వి. దేవతార్పణమునకై కళ్లమున నొకదెసఁ బోసెడు మూడుదోసిళ్లరాశి.

**కితవము.** సం. వి. అ. పుం. ఉమ్మెత్త*.

**కితవుఁడు.** సం. వి. అ. పుం. జూదరి. విణ. మోసకాఁడు.

**కితాబు.** హిం. వి. బిరుదు.

**కిత్తనార.** దే. వి. చాఁగనార, మోఁటుగుడ్డ.

**కిత్తలి.** దే. వి. నారంగజాతీయము, నాదేయి*.

**కిత్తి.** వై. వి. అగ్ని*. "గీ. అగ్గియనఁగిత్తనంగఁజిచ్చనఁ గవెలయుఁ,జేతనాచేతనాగ్ని." ఆం,భా.ప్ర.స్వ.

**కిదుకు.** దే. అ. క్రి. 1. బిడ్డలునిద్రలేచునపుడాలస్యముచే నొకవిధముగామూలుగు. "సీ. మేల్కొన్న తెలఁగునమెల్లనఁగనువిచ్చిక్రేఁగంటఁజూచుచుఁగిదికినీల్గి." భాగ. ౧౦, స్కం. పూ.—2. బిడ్డలు తల్లిదండ్రులులోనగువారినే దేనికావలసిపీడించునపుడొకవిధముగామూలుగు. "ద్వి. వత్సనేనునునన్నువదలకతిగిచి, యెత్తుకొమ్మనుచుఁబెల్లెసఁగుదైన్యమునఁ, గిదుకుచు." హరిశ్చ. ౧, భా.

**కినియు.** దే. అ. క్రి. 1. కోపించు; 2. సమీపించు. "గీ. కినిసిపాణినాళీకంబుసోనుపుటయును, నంతలోఁబడకదియుమోహప్రకటన, మానితన్నని చినయతిమానతుంగ, తరుణెనసితోనెగ్రహణగోచరతఁదొఱఁగె." హన. ౨, ఆ.

**కినుక.** దే. వి. అలుక, కోపము.

**కినుకకాఁడు.** దే. విణ. కోపముగలవాఁడు.

**కినుపు.** దే. వి. కోపము. "ఎ, గీ. అనుచుఁ గ్రేఁగంటనీరసంబంకురింపఁ, గినుపుకిలికించితమునార్తఁ గేలుకొనఁగ." కాశీ. ౪, ఆ.

**కినుపడు.** ద్వ. అ. క్రి. (కినుపు+పడు.) కోపపడు. (చూ. కిన్వడు.)

**కిన్క.** దే. వి. కినుకయొక్క రూపాంతరము.

**కిన్నర.** సం. వి. ఆ. స్త్రీ. వీణావిశేషము, కిన్నెర.

**కిన్నరుఁడు.** సం. వి. అ. పుం. అశ్వముఖంబును నరశరీరమునుగల దేవయోనివిశేషము. "గ. కిమనేన గృహీతేనవాకిన్నరయుగళేన ప్రయోజనమిద ముపశ్రుతమశ్వముఖద్వయమ్." కాదంబరి.— నరముఖమునశ్వశరీరమునుగల దేవయోనివిశేషమనికొందఱు. "శ్లో. బింబోష్ఠంబహుమనుతేతురంగవక్త్రశ్చుంబంతంముఖమిహకిన్నరంప్రియాయాః, శ్లిష్యంతంముహురితరోపితం నిజస్త్రీముత్తుంగస్తనభరభంగభీరుమధ్యామ్." మాఘము.

**కిన్నరేశుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు, పెద్దిఱేఁడు.

**కిన్నెర.** వై. వి. వీణావిశేషము. "సీ. శృంగారకుసుమంబు చిన్నిచుక్కలరాజు పసిఁడికిన్నెరవీణెపలుకుఁదోఁడు." నై. ౧, ఆ.

**కిన్వడు.** ద్వ. అ. క్రి. కినువడుయొక్క రూపాంతరము. "చ. జనకునిఁగన్నఁ గిన్నడుదు సభ్యులబంధులఁగాంచినంగడున్, గనలుదు." హరి. పూ. ౯, ఆ.

**కిఫాయతు.** హిం. వి. లాభము.

**కిముడు.** దే. విశ. అల్పము. "సీ. సైకతంబుకొంచెము సన్నంబుతో డెముచిఱుకిముడసదు లేచిఱుతలేఁత, కొద్దియున్నువనంగనుగొఱులునల్పము." ఆం, భా. తృ. వి.

**కిమ్మతు.** హిం. వి. వెల.

**కిమ్మీరము.** సం. వి. అ. పుం. 1. చిత్రవర్ణము; 2. నారదబ్బ?. విశ. చిత్రవర్ణముగలది.

**కిమ్మీరుఁడు.** సం. వి. అ. పుం. ఒకానొకరాక్షసుఁడు.

**కియ్య.** దే. వి. (క్రిందు+య.) ఒక యక్షరముక్రింది యకారము.

**కియ్యవడి.** దే. వి. ఒకయక్షరము క్రిందియత్వము.

**కిరణము.** సం. వి. అ. పుం. మయూఖము, వెలుఁగు.

**కిరము.** సం. వి. అ. పుం. పంది.

**కిరాటుఁడు.** సం. వి. అ. పుం. వైశ్యుఁడు, కోమటి.

**కిరాతతిక్తము.** సం. వి. అ. పుం. నేలవేము?.

**కిరాతము.** సం. వి. అ. పుం. 1. అల్పతనువు; 2. నేలవేము?.

**కిరాతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కిరాతస్త్రీ; 2. పార్వతి; 3. గంగ; 4. కుంటెనకత్తె.

**కిరాతుఁడు.** సం. వి. అ. పుం. నెమలిపింఛము ధరించి అడవియందు తిరిగెడు బోయ.

**కిరానా.** హిం. వి. చిల్లరదినుసులు.

**కిరాయి.** హిం. వి. బాడుగ, కూలి.

**కిరి.** సం. వి. ఇ. పుం. వరాహము, పంది.

**కిరీటము.** సం. వి. అ. పుం, న. ఒకవిధమైన రాజుల తలపాగ, బొమిడికము.

**కిరీటి.** సం. వి. న్. పుం. 1. అర్జునుఁడు; 2. కోడి.

**కిరీటిపచ్చ.** వై. వి. మరకతము. "చ. మొలకమెఱుంగుకెంపుమొనముక్కులనిక్కుకిరీటిపచ్చజా, చిలుకలకోళ్లతోఁ జికిలిచంద్రికవన్నియపట్టుపట్టెతోఁ, దొలఁకుపసిండివ్రాఁతతెరతో నెఱతావులమేలుకట్టుతోఁ, జలుపలుచిందుముత్తియపుఁజప్పరమంచముపైమహోన్నతిన్." వసు. ౪, ఆ. "క. చెలులు ప్రసంగవశమ్మున, నలరంగదు విజయభవనమనిన న్నవలా, తెలియవిను న్గలయఁగను న్, బలుమఱు బాగా కిరీటిపచ్చల టన్నన్." విజ. 3, ఆ.

**కిరుదెస.** వై. వి. రొండిలోనివాతరోగము. "సీ. గృధ్రసిపేరగుకిరుదెసయనఁగ." ఆం, భా. ద్వి. మ.

**కిరుసు.** దే. వి. ఇరుప్రక్కల వాదరగలిగి వాటమైన కత్తి. "చ. అపగతధైర్యుఁజేసె నను నత్తఱి నాశుకవాణివేణిచాౕ, క్కఁపుఁబసకాముబల్కిరుసు కత్తియుఁబోలెనరాళపార్శ్వమై, యుపరికృతప్రసూనరచనోజ్జ్వలతావిభవంబుచేతదం, తపుఁబిడికైవడి న్మొదలు తద్దయు నింపుజనింపఁజేయఁగన్." కళా. ౭, ఆ.

**కిర్లి.** దే. వి. మల్లబంధవిశేషము. (చూ. కాసెనిల్లడ.)

**కిఱకిఱ.** దే. వి. రథనేమిధ్వని.

**కిఱుఁజెప్పు.** దే. వి. కిఱ్ఱుఁజెప్పుయొక్క రూపాంతరము. "చ. గుఱుగుఱ్ఱుంచెడసందిబిట్టొఱలునఘోరారినీయంఘ్రికిం, గిఱుఁజెప్పైనవిధంబునామనములోఁగీలించినట్లయ్యెడున్." నై. ౮, ఆ.

**కిఱుకు.** దే. వి. త్రిప్పు. "చ. కిఱుకులఁబెట్టిపిరినడకించితొలంగుదమన్న పట్టిక, క్కుఱితియకానిదైవమనుకూలముకాదు." జై. ౬, ఆ.

**కిఱుకుపాడుచే.** దే. అ. క్రి. తిరుగు. "ప. ఉఱుముల కులికిపడక కిఱుకు పాడుచుచుఁ బింఛంబులు కొంచెంబులుసేయక విప్పి దెప్పరంబుగరొప్పచు

నర్తనంబులు నేయు మయూరంబులును." భాగ. ౧౦, స్క-౦. పూ.

కిఱుదు. దే. విశ. హీనము. (కిఱుదు నేల. మొ.)

కిట్లు. దే. వి. ధ్వన్యనుకరణవిశేషము.

కిట్లుఁజెప్పు. దే. వి. (కిట్లు+చెప్పు.) కిట్లుమను చెప్పు. (ఇట్లు కిట్లుమెట్టు.)

కిలకిల. దే. వి. 1. నవ్వుటయందగుధ్వన్యనుకరణము. "చ. సకినలకూఁకలం గిలకిలన్న గుమోహనశయ్య నున్నెడన్." వసు. ౬, ఆ.—2. ధ్వన్యనుకరణ విశేషము. "సీ. పలుకుపల్కు నకు నింగిలపు వేఁడిమి రాలఁ గిలకిలల్ గుల్కు చిల్కు లకుఁదోడు." య. ౫, ఆ.

కిలకిలలాడు. దే. అ. క్రి. (కిలకిలలు+ఆడు.) కిలకిల ధ్వనిచేయు. "సారెసారెకుం గిలకిలలాడుచున్ మిగులఁగేకలుకొట్టుదురు." నీలా. ౨, ఆ.

కిలకొట్టు. దే. అ. క్రి. మ్రోఁగు, చెలఁగు. "సీ. గిల కొట్టియట్టెచక్కిలిగిలియని పెట్టి కిలకొట్టినవ్విన వ్వోలయఁజేసి." చంద్రా. ౨, ఆ.

కిలాతము. దే. వి. గుజ్జము. "ఉ. విన్ను న నేగుతా మరలవిందుకిలాతపునీడ లెప్పుడున్, వెన్నెలరాచరాలఁగని వెళ్లకనీళ్లమునింగియున్నవి, మ్మన్నుల టంచుఁజెంచితలుమాటికి నమ్ములనేసినాటమిన్, మిన్నక సిగ్గునంగదలి మెల్లనఁబోవుదురిండ్లపట్ల కున్." య. ౨, ఆ.

కిలారము. దే. వి. పసులమంద, ఘోషము.

కిలారి. దే. వి. (కిలారము+ఇ.) గొల్లవాఁడు.

కిలారించు. దే. అ. క్రి. కిలకిలమని మ్రోఁగు.

కిలారుచు. దే. అ. క్రి. 1. కిలకిలమని మ్రోఁగు; 2. బొబ్బరించు. (రూ. కిలార్చు. బొబ్బరించుటకు.— "ఉ. సింగముగాలి వెంబడిన చేరికురంగముఁబట్టునట్లుచం, ద్రాంగదుజీవముల్ గొనికిలార్చెదబెట్టుగనిన్నుఁదీర్చెదన్." చంద్రా. ౬, ఆ.

కిలాసము. సం. వి. అ. న. సిబ్బెము. విశ. సిబ్బెము గలది.

కిలాసి. సం. విశ. (న్. ఈ. న్.) సిబ్బెముగలవాఁడు, సిధ్మలుఁడు.

కిలింజకము. సం. వి. అ. పుం. కటము, చాఁప.

కిలికించితము. సం. వి. అ. న. రోషాశ్రుహర్షభీత్యాదులసంకరరూపమగుస్త్రీయొక్క శృంగారచేష్టా విశేషము.

కిల్బిషము. సం. వి. అ. న. 1. పాపము; 2. తప్పు; 3. రోగము; 4. చెడ్డవిషము.

కిల్లాకు. ద్వ. వి. (కిల్ల+ఆకు.) చీటి. "గీ. ఇదియు నూరకయంటిరేగా కేలనీకు, మాకతల్ వినబంటు కిల్లాకుపోవఁ, దొత్తుకొడుకులువోలెఁదోడ్తోడి గంత,భూమిపతులంపుచున్నారుకామితములు." కళా. ౭, ఆ.

కివకివ. దే. వి. ధ్వన్యనుకరణవిశేషము. "సీ. చెవి గూఁటసెలకొన్న కవపిట్టకివకివల్ మొనసి నాద బ్రహ్మమినుమడింప." చంద్రా. 3, ఆ.

కివ్వు. దే. అ. క్రి. మడియు.

కిశోరము. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱపుపిల్ల; 2. తైలపర్ణి.

కిశోరుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు. విశ. యౌవనావస్థకలవాఁడు.

కిష్కువు. సం. వి. ఉ. పుం, స్త్రీ. 1. జేన; 2. మూంజేయి; 3. మూర.

కిసమస. దే. వి. వ్యర్థ. "క. గుసగుసలువోయివలపుల, కిసమసలని తెలిసిరసికకిసలయపాణుల్, బిస కిసల కుసుమరసములు, వెస మసలక తెచ్చిశిశిర విధిలాలసలై." విజ. 3, ఆ.

కిసరు. దే. వి. 1. అంటుసోఁకుటవలన పసిబిడ్డలకుఁ గలిగెడుదోషము; 2. కోపవికారము. "క. ఒసఁగి రగస్త్యార్ఘ్యములం, గొసరిజనుల్ వార్ధినీ రుక్రోలితివినిన్, పసికైమాకిమ్మనిక, న్కిసరుదుగంగా వనప్పగించెదుకరణిన్." ఆము. ౪, ఆ.

కిసలము. సం. వి. అ. న. కిసలయముయొక్క రూపాంతరము.

కిసలయము. సం. వి. అ. న. పల్లవము, చిగురు.

కిసుమిసు. దే. వి. లఘుద్రాక్ష.

కిస్తీ. హిం. వి. వంతుచొప్పున చెల్లించు ద్రవ్యము, వాయిదా.

కిస్తీబందీ. హిం. వి. వాయిదాల యేర్పాటు.

కిస్తుసుపండుగ. ఆం. వి. క్రీస్తుజన్మదినోత్సవము.

## కీ.

కీఁచు. దే. వి. ధ్వన్యనుకరణవిశేషము. "చ. నిజాస్త్ర శే దనన్ వనచరకాంత బెట్టులికి నాథునికాఁగిలివాసికీఁచుకీఁ, చనికడుబమ్మరించుచు." భో. ౫, ఆ.

కీఁచేబిల్ల. దే. వి. అదిమినపుడు కీఁచుకీఁచుమనట్లు లోపల విల్లు పెట్టికుట్టిన బటువుతలగడ.
కీఁచేబుఱ్ఱి. దే. వి. కీఁచుబిల్ల.
కీకటము. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము; 2. ఒకానొక దేశము. విణ. 1. పిసినివాఁడు; 2. పేదవాఁడు.
కీకసము. సం. వి. అ. న. ఎముక. పుం. సులిపురుగు.
కీచకము. సం. వి. అ. పుం. గాలితాఁకున మ్రోఁగెడివెదురు. డు. ఒకానొక రాక్షసుఁడు.
కీఁచట్లాడు. దే. అ. క్రి. (కీచు + ఆటలు + ఆడు.) కలహించు.
కీటకము. సం. వి. అ. పుం. సామాన్యమగుపురుగు. విణ. కఠినము.
కీటమణి. సం. వి. ఇ. పుం. మిడుఁగురుఁబురుగు.
కీటు. దే. వి. గోడపెట్టునపుడు ఒకతడవయుంచెడు మట్టిపొడవు.
కీడు. వై. వి. 1. అశుభము*; "తరువోజ. మీఁదుపరికింపకున్నఁగీడ్పాటిల్లకున్నె." భార. స్త్రీ. ౨, ఆ.—2. తప్పు*; "గీ. కృష్ణకృష్ణయనంతయేకీడు లేదు, వీరిదెసవెఱ్ఱులైవీరుతారతమకుఁ, దీర్పరాని యీ పెనుఁజిచ్చుఁదెచ్చుకొనిరి, కరుణసేవిప్రవర్యులఁగావవలయు." లక్ష్మీ. ౪, ఆ.—3. దోషము*; "గీ. తామ్రమాదిగఁగలయట్టిధాతుచయము, కొలిమినిడియూఁదఁగీడెల్లఁబోలియునట్లు, ప్రాణపవననిగ్రహమునఁగ్రాఁగిపోవు, ననఘుయింద్రియజనితదోషాలియెల్ల." మార్క. 3, ఆ.—4. పాపము*. "క. అదిపాపముదానికినా, మదినెప్పుడువగతువిమలమానసయక్కీ, డుదొలంగునట్లుగాస, త్పదార్థదానములుచేయుతాత్పర్యము నక." భార. అశ్వ. ౧, ఆ.—5. అపకారము. విణ. 1. అధమము; "నీవేమిటనిమ్మహాధ్వరంబుకీడంటి." భార. అశ్వ. ౪, ఆ.—2. అశుభకరము*; "క. కీడేకురువంశమునకతనిరాక." భార. ఉద్యో. 3, ఆ. — 3. దుష్టము*. "వ. వారలతలంపులుకీడు." భార. ఉద్యో. 3, ఆ. (హల్లుపరమగుచో దీనియుత్వమునకు వికల్పముగా లోపమువచ్చును. చూ. అశుభము అను నర్థము నుదాహరణము.)
కీడుపడు. వై. అ. క్రి. తక్కువపడు. (చూ. కీడ్పడు.)
కీడుపాటు. వై. వి. తక్కువపాటు. "చ. ఇదికడుముద్దరాలుపనులెవ్వియుఁజేయఁగనేరదెంతయుఁగా, మృదువాకకీడుపాటునకునోర్వఁజాలదు." భార. విరా. ౧, ఆ.
కీడ్పడు. వై. అ. క్రి. కీడుపడుయొక్క రూపాంతరము. "ఉ. అస్త్రసంతాడనశక్తికీడ్పడియెఁ దథ్యము బ్రాహ్మణశక్తియెక్కుడు." భార. అర. ౪, ఆ.
కీడ్పాటు. వై. వి. కీడుపాటుయొక్క రూపాంతరము.
కీత. దే. విణ. తక్కువ, నికృష్టము. (కీతనేల. మొ.)
కీదృశము. సం. విణ. (అ. ఈ. అ.) ఎటువంటిది.
కీనాశుఁడు. సం. వి. అ. పుం. 1. యముఁడు; 2. రాక్షసుఁడు. విణ. 1. ఒంటినున్నచోఁజంపెడువాఁడు; 2. దున్నెడువాఁడు; 3. పిసినివాఁడు; 4. పేదవాఁడు.
కీరము. సం. వి. అ. పుం. 1. చిలుక; 2. ఒకానొక దేశము.
కీరితి. వై. వి. యశము. "సీ. ఎవనికీరితికుభృద్ధవకుభృద్ధనబుధహాయసద్ధవస మిద్ధహారిణరుచిరము." హంస. ౧, ఆ.
కీర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కప్పఁబడినది; 2. చెదరినది; 3. నొప్పింపఁబడినది.
కీర్తనము. సం. వి. అ. న. స్తుతి, పొగడిక.
కీర్తనీయము. సం. విణ. (అ. ఆ. అ.) పొగడఁదగినది.
కీర్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. యశము; 2. విరివి; 3. తేట; 4. అడుసు.
కీర్తించు. సం. స. క్రి. స్తుతించు, పొగడు.
కీర్తితము. సం. విణ. (అ. ఆ. అ.) పొగడఁబడినది.
కీలక. సం. వి. అ. పుం. 1. ఒకసంవత్సరము. ము. 2. పసులఁగట్టెడుగూటము.
కీలకము. దే. వి. మర్మము.
కీలము. సం. వి. అ. పుం. 1. మేకు; 2. చిల్లకోల; 3. మంట; 4. మోఁచెయి; 5. లేశము. (ఇది కపటి యర్థము తక్కతక్కిన యర్థములయందు ఆకారాంత స్త్రీలింగమునగును.)
కీలరి. వై. విణ. (కీలు+అరి.) కీలెఱిగినవాఁడు.
కీలారము. దే. వి. కిలారముయొక్క రూపాంతరము. "క. ఆరాజొకనాఁడాకీ, లారముపసిఁజూడవచ్చిలావణ్యతను, శ్రీరుచులనొప్పిసింహకిశోరము క్రియనున్న క్రేపుఁ జూచిముదమునక." భో. ౨, ఆ.
కీలారి. దే. వి. కిలారియొక్క రూపాంతరము. "క. కీలారితనమునకు నేఁజాలుదును." సం. "గోసం

ఖ్యాతాభవిష్యామివిరాటస్యమహీపతేః." భార. విరా. ౧, ఆ.

కీలాలము. సం. వి. అ. న. 1. నెత్తురు; 2. నీళ్లు.

కీలి. సం. వి. న్. పుం. అగ్ని, నిప్పు.

కీలించు. సం. స. క్రి. తగులుచు.

కీలితము. సం. విణ. (అ. ఆ. అ.) కట్టఁబడినది, బద్ధము.

కీలు. వై. వి. 1. సులభముగా ఇటునటువంగుటతిరుగుటలోనగువాని కనుకూలముగా నేర్పఱచినమట (లేక) సూత్రము*; "మ. ఒకమాణిక్యపుబొమ్మయెట్టివగకీలోజాళువాజాలవ, ల్లికబాగాల్కపురంపుటాకుమడుపుల్ వేతెచ్చిరాజున్నచా, యకునందియ్యనతండులేనగవుతోనవ్వేళనవ్యాశ్శక, న్యకకెంగేలనొసంగఁగైకొనియెసయ్యాటంబువాటిల్లఁగన్." విజ. ౧, ఆ.—2. మ్రానులోనగువానిపైపూసెడి యొకానొకద్రవద్రవ్యము*; (తాటిపట్టెలకుకీలుపూసిరా?)-3. మర్మము*; "క. లోకంబుననాకీటం, బాకైటభవైరియెల్లయాత్మలకునభీ, ష్టాకాంక్షయొక్కచందమ, యీకీలెఱుఁగంగవలదెహృదయములోనన్." వై. 3, ఆ.—4. ఉపాయము*. "క. వినినృపకన్యారత్నము, తనమదిఁదలపోసిచూచిదానికినొకకీల్, గనియెను బుద్ధిచతుర్గుణ, మనుటసతులయందునిశ్చితార్థమనంగన్." భో. ౬, ఆ. (హల్లుపరమగుచో దీని యుత్వమునకు వికల్పముగా లోపమువచ్చును. కీల్బొమ్మ. మొ.)

కీలుకాఁడు. వై. వి. సూత్రధారి. "సీ. కీలుకాఁడె డలింపఁగెడసిన బొమ్మలకైవడిఁ బటుతురంగవ్రజంబు." భార. ద్రో. 3, ఆ.

కీలుకొను. ద్వి. అ. క్రి. 1. తగులు; "ప్రేమంబాత్మలోఁగీలుకొ." వై. 3, ఆ.—2. నాటు. "గీ. శోకవారిధిపారంబునాకుఁబొంద, నేలవచ్చుఁజిత్తంబునఁగీలుకొనియ, సహ్యమైకర్ణమరణోపజనితమైన, పరిభవంబనుశల్యమాతురతఁజేయు." భార. కర్ణ. ౧, ఆ. (ప్రే. కీలుకొలుపు.)

కీలుగంటు. ద్వి. వి. జాఱుగాముడిచిన వెండ్రుకల దూముడి, ధమ్మిల్లము.

కీలుపడు. వై. అ. క్రి. తగులు. (ప్రే. కీలుపఱచు. "ఎ. గీ. యౌవనలీలావికాసహాస, హేలనాదులఁజిత్తంబుగీలుపఱచి." భాగ. ౫, స్క. ౧, ఆ.)

కీశపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరేను?.

కీశము. సం. వి. అ. పుం. కోఁతి. విణ. దిసమొలది.

కీశవల్లి. సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరేను?.

కీస. దే. అవ్య. కొంచెము. "గీ. సంధ్యవార్చనిబ్రాహ్మణుండు, కీసతక్కువశూద్రుండుకేవలంబు." కాశీ. ౫, ఆ.

కీసర. దే. వి. తిత్తిలోనగువానిలోపలిపొర. "చ. ముదుకరుమాలఁగుడ్డ భుజమూలమునం గడితంబుమీఁదఁ బ్రాఁ, తదియగు, దుప్పటంబుమొలత్రాసును గీసరయుండుతిత్తిస, న్నదినెలవంకనామము వినాయకునుంగర మంగుళంబునన్, బొదువఁగ రత్నగుప్తుఁడు సమున్నతి నింటికిరాఁ బ్రియంబునన్." హంస. ४, ఆ.—విణ. అల్పము. (కీసరపాలు. మొ.)

కు.

కు. ఉభ. దే. అప. షష్ఠీవిభక్తియందువచ్చెడు ప్రత్యయము. (రామునకు, సోమునకు. మొ.) — సం. వి. ఉ. స్త్రీ. భూమి. (ఇది తెనుఁగున వ్యస్తముగాఁ బ్రయోగింపఁబడదు. కుతలము, కుధరము ఇత్యాదిసమస్తపదములు ప్రయోగింపఁబడును.) విణ. వృత్తియందుఁ గుత్సిత శబ్దమునకువచ్చునాదేశము. (కుజనుఁడు, కుతర్కము. మొ.)

కుంక. దే. వి. బాలవిధవ, రండ.

కుంకటి. వై. వి. (కూఁకటియొక్కరూపాంతరము.) 1. జుట్టు*; 2. పిల్లజుట్టు*. విణ. ప్రధానము*. (కుంకటివేరు.)

కుంకుడు. దే. వి. ఫేనిలము?.

కుంకుడుఁబురుగు. దే. వి. ఒకానొక యెఱ్ఱపురుగు.

కుంకుమపువ్వు. మి. గ్రా. వి. (కుంకుమము+పువ్వు.) ఒకానొక అంగడిదినుసు, అగ్నిశిఖము.

కుంకుమము. సం. వి. అ. న. కుంకుమపువ్వు.

కుంకుము. వై. వి. నుదుటఁబెట్టికొను రాగద్రవ్యవిశేషము, చెందిరము*. "మ. పురసౌధోన్నతకేతుఘట్టనలనంభోజారిపద్మాప్తులం, దిరవైకప్పుతలిర్పఁబద్ధవదనల్ హేలాగతిన్ మిత్రుఁడం, చురవింగుంకుమునింపఁగా నరుణుఁడైచూపట్టెఁగా దేనిభా, స్కరబింబంబునఁ గందుచెందునొకదా జాబిల్లియందుంబలెన్." చంద్రా. ౧, ఆ.

కుంచము. సం. వి. అ. పుం. మానవిశేషము, కుంచెము.

కుంచిక. సం. వి. ఆ. స్త్రీ. బీగముతీసెడువంకర ఇనుపకమ్మి, కుంచెకోల. "సీ. దంష్ట్రికార్గళితాహితతప

ణో గ్రకవాటకుంచికాయితశాతచంచుకంబు.” చంద్రా. ౧, ఆ.

**కుంచితము.** సం. విణ. (అ. ఆ. అ.) వక్రము, వంకరైనది.

**కుంచియ.** వై. వి. 1. కుచ్చు; 2. చిత్రము వ్రాసెడు తూలిక; 3. చామరము*; “చ. అతులితభక్తిఁబూర్వదిశయందు నను గ్రహయన్వధూటితాఁ, గుతుకముమీఱఁగాఁబసిఁడికుంచియవైచుచుఁగొల్వుసేయ.” కళా. ౮, ఆ.—4. కుచ్చోయిడినవస్త్రము*; 5. సాలెవాఁడు పడుగుసరిచేసెడుసాధనము*. (చూ. కుంచె.)

**కుంచె.** వై. వి. 1. కుచ్చు; “సీ. శత్రురాజులకునచ్చరలవాకర్షించుసమరేంద్రజాలపింఛంపుఁగుంచె.” పా. ౧, ఆ.—2. చిత్రము వ్రాసెడుతూలిక; 3. చామరము*; “సీ. జాలపాదముసంఘ్రిఁగీలితంబగుసితాబ్జముభాతిఁగుంచెహస్తమున వ్రేల.” పాండు. ౨, ఆ.—4. కుచ్చోయిడినవస్త్రము*; “ద్వి. స్థిరచిదానందవీచికఁబోలుకుంచె, మఱియొకభుజమునమార్తలయంగ.” విష్ణు. ఉ. ౫, ఆ.—5. సాలెవాఁడుపడుగుసరిచేసెడుసాధనము*. “సీ. కుంచెమగ్గపుగుంత గూటంబుపగ్గంబు పఱఁటెత్రొక్కుడుపట్టెపలకదోనె.” హంస. ౨, ఆ.—6. గోడకు సున్నముకొట్టెడుమట్టు*. (కుంచియ యొక్క రూపాంతరము.)

**కుంచెకోల.** ద్వ. వి. కుంచిక.

**కుంచేము.** వై. వి. నాలుగుమంతలు.

**కుంచే.** దే. ప్రే. క్రుంగఁజేయు. “కొంచెముగానిజాంగకముఁగుంచి.” కవిక. ౨, ఆ.

**కుంజము.** సం. వి. అ. పుం, న. 1. పొదరిల్లు; 2. ఏనుఁగుకటుమరలు; 3. ఏనుఁగుకొమ్ము.

**కుంజర.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఏఱుజాజి?; 2. కలిగొట్టు?. అ. పుం. ము. 1. ఏనుఁగు; 2. వెంద్రుక; 3. ఉత్తరపదమైనచో శ్రేష్ఠము.

**కుంజరాశనము.** సం. వి. అ. పుం. పిప్పలము, రావి?.

**కుంజలము.** సం. వి. అ. న. పులియఁబెట్టినకడుగునీరు.

**కుంట.** వై. వి. 1. కొలను; 2. పల్లము; 3. చెఱువు*; 4. భూపరిమాణవిశేషము*.

**కుంటదూలము.** దే. వి. కడదూలమునకునుగోడకును నడ్డముగానుంచుచిన్నదూలము. (దీనిని గుంటదూలమనియు వాడెదరు.)

**కుంటముక్కు.** దే. వి. మత్స్యవిశేషము.

**కుంటి.** దే. విణ. 1. కాలువిఱిగినవాఁడు, ఖంజుఁడు; “చ. అలుఁగులమ్రుందియందులమృగావలియుఁ విహగంబులుఁ ధియా, కులగతిఁబొందిముఁగలునుగుంటులుఁజీకులునైనయట్లులై.” భార. అర. ౧, ఆ.—2. స్వభావమునఁగాలులేనివాఁడు, పంగువు. “ఎ, గీ. నీప్రతాపంబుతనవలెనిఖిలతమము, నడఁపఁగాలేదొతానేలయరుగుదెంచుఁ, గుంటిసారథితోఁ నల్లకుముదవైరి.” కా. ౫, ఆ.

**కుంటిగాము.** ద్వ. వి. శనిగ్రహము.

**కుంటు.** దే. అ. క్రి. కాలునేలఁజక్కఁగామోపకనడచు. విణ. కాలులేనివాఁడు. “క. వింటికదానీతనయుని, కొంటెతనమువీరిమానికుటిలాలకన, క్కుంటునకునిత్తురఁటయిటు, వంటివిపోవెక్కునోళ్లవారలమాటల్.” భో. ౫, ఆ.

**కుంటుగించు.** దే. అ. క్రి. కుంటు.

**కుంటుపడు.** ద్వ. అ. క్రి. 1. కుంటియగు; “క. అరయఁగనాలుఁగువిధములఁ, జరఁగుఁజతుష్పాదన్పత్తిఁబరఁగినగోవృషా, దొరయుచునందొకఁడెడలిన, నరవరసద్ధర్మవర్తనముకుంటుపడుఁ.” భా. అను. ౪, ఆ.—2. చెడు; “మ. అవుడుద్దాలకుఁడాగ్రహించినిజభార్యంజూచినిర్భాగ్యురా, లపవిత్రంబగుపార్వణంబు నవలీలం బెంటపైఁచికుం, టుపడంజేసితిశ్రాద్ధకర్మమనికన్గొనల్ చిగుర్పంగవే, శపియించెఁ ఘనవింధ్యశైలవనిఁబాషాణత్వముంజెందఁగ.” జై. ౪, ఆ.—3. తగ్గు; “క. తొంటినడకుంటుపడినం, బంటుఁదనముకుంటుపడకపరుషధ్వనితో.” రామా. ౮, ఆ.—4. తెగు. “గీ. అనుచుఁదానన్నమాటచేకొనితడయక, ఘనభుజుండుసుమిత్రనందనుఁడుజిష్ణుఁ, డరిఁగరముగుంటుపడనేయనముజాగెలుపు, గాంచిమోదించెనరతనటించుచక్రి.” రాఘు. ౪, అ.

**కుంటుపిచ్చుక.** దే. విణ. కాలులేనివాఁడు, పిచ్చుకకుంటు. “సీ. తాపసనద్దియాధారమాదివిఁబ్రాఁకుపితృవర్యులకుఁ గుంటుపిచ్చుకలకు.” పాం డు. ౫, ఆ.

**కుంటువాఱు.** దే. అ. క్రి. (కుంటు+వాఱు.) బలహీనమగు. “సీ. గుదియఁజేకొనెఁదద్దకుంటువాఱిజముండుకుదిరెరక్కసుఁడుసోఁకుడుఁదనము న.” అచ్చ. బాల, కాం.

**కుంటెన.** వై. వి. తార్చెడువాఁడు*. “సీ. కుంటెననిన్నంపెఁగోర్కిసెనకఁడు.” రాజ. ౨, ఆ.

కుంటెనకత్తె. వై. వి. తార్చునట్టి స్త్రీ.

కుంటెనకాఁడు. వై. వి. తార్చువాఁడు. "క. మనసిజుఁ డిద్దఱకును గుం, టెనకానితనంబుచేసెడిం గసుఁ గొనఁగన్." విక్ర. ౧, ఆ. (స్వార్థమునకాఁడు.)

కుంటెనకుచ్చెలు. వై. వి. బ. ఈడ్పులనెడు కర్ణభూషావిశేషము.

కుంటెనముడి. ద్వ. వి. తాటాకులపుస్తకము దారము నడుమనుండెడు ముడి.

కుంటెనీఁడు. వై. వి. (కుంటెన+ఈఁడు.) కుంటెనకాఁడు. "సీ. కుంటెనీలకునిచ్చికోడిగీలకునిచ్చి మిన్నకవారకామినులకిచ్చి." విక్ర. ౭, ఆ. (స్వార్థమున ఈఁడు.)

కుంఠనము. సం. వి. అ. న. మొక్కపోవుట.

కుంఠితము. సం. విణ. (అ. ఆ. అ.) మొక్కపోయినది.

కుంఠుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. మూఢుఁడు; 2. సోమరి.

కుండ. వై. వి. 1. మట్టిపాత్రము*; 2. మేడమీఁదికలశము*; "మ. మేడలతుదన్ దార్కొన్న బంగారుకుం, డలుమిన్నేటనుగానుపించుచునువిన్నాణంపుఁదెల్విం గడున్, విలసిల్లున్." య. ౧, ఆ. —3. ఇరుసుతగిలించెడుబండికంటినడిమిగుబ్బ*; "వ. మున్ను కొండొకక్రుంగినచక్రంబు కుండమునుంగందిగఁబడిన." భార. కర్ణ. 3, ఆ.—4. బ. ఏనుఁగుకుంభస్థలము*. "సీ. కుండలుఁదాల్చికన్గొనల నీరొలుకచేతులుసాఁపుకడయేనుఁగులనురోసి." అచ్చ. బాల, కాం. (వృత్తియందుపాత్రమాత్రపరము. కంచుకుండ. మొ.) (సంస్కృతమునందుఁజెప్పఁబడనియర్థము లనేకములు తెనుఁగు గ్రంథములయందుఁ జెప్పఁబడియుండుటంజేసి దీనిని వైకృతముగానే గ్రహింపవలయును.)

కుండకీటుఁడు. సం. వి. అ. పుం. 1. చెడిపోయినబ్రాహ్మణస్త్రీకొడుకు; 2. దాసినికామించినవాఁడు; 3. చార్వాకవచనదక్షుఁడగువాఁడు.

కుండగోఁకరి. ద్వ. విణ. (కుండగోఁకు+అరి.) వంటవాఁడు, ఔదనికుఁడు. "ద్వి. కుండగోఁకరిఁజేసికువలయేశులకు,వండిపెట్టఁగఁజేసి." నళ. ౨, భా.

కుండపోఁగులు. ద్వ. వి. బ. కుండలవిశేషము. "సీ. కుండపోఁగులుచిప్ప గొడ్డండ్లు సెలగోలలూప్పారుపలువంకయుంగరములు." నీలా. 3, ఆ.

కుండమార్చు. ద్వ. స. క్రి. ఒకటినిచ్చి మఱియొకటిని బుచ్చుకొను.

కుండమార్పు. ద్వ. వి. ఒకటినిచ్చిమఱియొకటినిబుచ్చుకొనుట, వినిమయము. "చండాంశుసుతుపోల్కిఁగుండమార్పులుగాక." కా. ౫, ఆ.

కుండము. సం. వి. అ. న. 1. వంటకుండ; (ఈ యర్థమునందిది ఆకారాంత స్త్రీలింగమునగు.) 2. గుడిలోనిగుంట; 3. నిప్పులగుండము; 4. తూనికగుండు. పుం. కొండ.

కుండలము. సం. వి. అ. న. 1. పోఁగులు; 2. గుండ్రన; 3. త్రాడు.

కుండలి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఉప్పి*; 2. తిప్పతీఁగ; 3. కుండలాకారనృత్యము, గొండ్లి. "ఎ, గీ. దండలాసకవిధమునుగుండలియును." భార. విరా. ౧, ఆ.—న్. పుం. 1. పాము; 2. నెమలి; 3. వరుణుఁడు. విణ. పోఁగులుఁగలవాఁడు.

కుండలించు. సం. స. క్రి. సున్నచుట్టు. "క. పురకాంతలకౌనులకున్, సరిపడదని బ్రహ్మయాకసమునారసినే, సరిదానిఁగుండలించిన, సరణిన్ దివిముట్టియచటిసాలంబలరున్." చంద్రా. ౧, ఆ.

కుండలీకరణము. సం. వి. అ. న. సున్నచుట్టుట.

కుండానుగు. ద్వ. వి. (కుండ+అనుగు.) గోరతు*.

కుండి. సం. వి. ఈ. స్త్రీ. కమండలువు, గిండి.

కుండుఁడు. సం. వి. అ. పుం. మగఁడుండఁఱంకుమగనికిఁబుట్టినకొడుకు.

కుండ్రుణాచి. సం. వి. ఈ. స్త్రీ. తెల్లబల్లి.

కుంతము. సం. వి. అ. పుం. 1. ఈఁటె; బల్లెము. (అని కొందఱు.) 2. అడవిగోదుమలు.

కుంతలము. సం. వి. అ. పుం. 1. వెండ్రుక; 2. నాఁగలి; 3. యవలు; 4. ఒకానొకదేశము.

కుంతాలము. సం. వి. అ. పుం. శ్రీతాళము*.

కుంతి. సం. వి. ఈ. స్త్రీ. 1. పాండురాజుపెండ్లాము; 2. రేణుకయను గంధద్రవ్యము; 3. గుగ్గిలపుఁజెట్టు.

కుంథనము. సం. వి. అ. న. మూలుగు.

కుంద. వై. వి. స్తంభము*.

కుందకము. దే. వి. 1. అభ్యంతరము; 2. లోపము.

కుందనము. దే. వి. అపరంజి.

కుందము. సం. వి. అ. పుం, న. మొల్ల*. పుం. 1. ఒకనిధి; 2. బండికంటి తిరుగుడు.

కుందారము. సం. వి. అ. పుం. వరాహము, పంది.

కుంది. దే. వి. తాయిలోనగువానిచే జేయఁబడిన కుదురు.

**కుందికాళ్లు.** దే. వి. బ. బాలక్రీడావిశేషము. (చూ. అందలము.)

**కుందియన.** దే. వి. కుంది. "సీ. పసిఁడికుందియనలో పలఁబట్టు పొత్తుల యొత్తున నెుఱగికూర్చుండ నేర్చి." వి, పు. ౭, ఆ.

**కుందు.** దే. అ. క్రి. 1. క్రుంగు; "దిగ్గజముల్ మద మేదికుందె." భార. అర. ౪, ఆ.—2. తగ్గు; "ఎ. వెసకుందక వేగిరంపుఁబయనంబులయ్యును బ్రజలనోలాకుపడనీక." భార. విరా. 3, ఆ. — 3. దుఃఖించు; 4. కాలుచక్కఁగా నేలనానించక నడచు; 5. శోకించు. "గీ. బ్రహ్మచర్యమునఁదపంబులనుత్తమ, దానములనుబడయఁదలఁచునట్టి, గతులకంటె సౌఖ్యకారిణి యగుగతిఁ, బొందెనీసుతుండుకుంద నేల." భార. ద్రో. ౨, ఆ. — వి. 1. తక్కువ; "హెచ్చుకుందాడియు." నై. ౭, ఆ.— 2. దుఃఖము; 3. శోకము.

**కుందుఁడు.** సం. వి. అ. పుం. వెన్నుఁడు.

**కుందురుకి.** సం. వి. ఈ. స్త్రీ. అందుగు*. (రూ. కుందరుకి.)

**కుందురువు.** సం. వి. ఉ. పుం. కుందురుష్కమనెడు గంధద్రవ్యము. (రూ. కుందరువు.)

**కుందుటెల్లు.** దే. వి. ఇత్త్వారిక*.

**కుందువు.** సం. వి. ఉ. పుం. కుందురుష్కమను గంధద్రవ్యము.

**కుందెన.** దే. వి. 1. కుంది; 2. ఱోలగుంట. "చ. సురుచిరకామినీమణులుశోభితలీలలరత్నమండలీ, ఖచితముకాంచనోజ్జ్వలవికస్వరరూపమునైనకుందెనన్, బ్రచురవిశేషధాన్యమిడిపాడుచుదంచిరికంకణధ్వనుల్, రుచిరములై జనావలికిలోలత మిక్కిలిచేయుచుండఁగన్." భీమా. ౪. ఆ. 3. ఒకానొక చెట్టు. (కుందియనయొక్క రూపాంతరము.)

**కుందెనగిజె.** దే. వి. కుందెనగుడి అను బాలక్రీడావిశేషము.

**కుందెనగుడి.** ద్వ. వి. బాలక్రీడావిశేషము. "సీ. చిట్లపొట్లాకాయ సిరిసింగణావత్తి గుడుగుడు గుంచాలుకుందెనగుడి." కాశీ. 3, ఆ.

**కుందెలు.** దే. వి. కుందేలుయొక్క రూపాంతరము. "వంటయిల్ కుందెలుచొచ్చె." భార. ఆది. ౬, ఆ.

**కుందేటికొమ్ము.** దే. వి. (కుందేలు+కొమ్ము.) గడ్డదినుసు, శశశృంగము. విణ. శూన్యము.

**కుందేలు.** దే. వి. చెవులపోతు, శశము.

**కుంపటి.** దే. వి. చలికాఁచుకొనుటలోనగువానికై నిప్పుకలుంచెడు పాత్రవిశేషము, హసంతి.

**కుంపె.** దే. వి. తాంబూలపాత్రము. (చూ. కంపె.)

**కుంపెరుగు.** దే. వి. (కుండ+పెరుగు.) అడుగుపెరుగు, ద్రప్సము. "ఎ, గీ. కుంపెరుగునాఁగద్రప్సమగును." ఆం, భా. ద్వి. వై.

**కుంఫిణి.** ఆం. వి. ఆంగ్లేయ ప్రభుత్వమువారు.

**కుంబ.** సం. వి. ఆ. స్త్రీ. యూపముచుట్టుమిక్కిలి దుర్గమముగానిడిన వెలుగు. యజ్ఞశాలకుఁజుట్టునిడిన వెలుగు. (అని కొందఱు.)

**కుంభకము.** సం. వి. అ. పుం. ఊపిరి బిగఁబట్టుట.

**కుంభకారుఁడు.** సం. వి. అ. పుం. కులాలుఁడు, కుమ్మరి.

**కుంభము.** సం. వి. అ. న. గుగ్గిలపుఁజెట్టు. పుం. 1. కుండ; 2. ఏనుఁగుకుంభస్థలము; 3. ఒకరాశి.

**కుంభసంభవుఁడు.** సం. వి. అ. పుం. 1. అగస్త్యుఁడు; 2. ద్రోణుఁడు.

**కుంభాండము.** సం. వి. అ. పుం. గుమ్మడి*. డు. ఒకానొకరాక్షసుఁడు.

**కుంభాభిషేకము.** సం. వి. అ. పుం. క్రొత్తగా గుడి కట్టించి అందు ప్రతిష్ఠచేసిన విగ్రహమునకు కుంభమునం దుదకమునించి మంత్రపూతమైన ఆయుదకముచేత చేయించెడు స్నానము.

**కుంభి.** సం. వి. ఈ. స్త్రీ. 1. కలిగొట్టు*; 2. పినగుమ్ముడు*; 3. తీఁగపాఁచి; 4. వంటకుండ. న్. పుం. 1. ఏనుఁగు; 2. కుమ్మరవాఁడు; 3. మొసలి.

**కుంభించు.** సం. స. క్రి. (ఊపిరి.) బిగఁబట్టు.

**కుంభిక.** సం. వి. ఆ. స్త్రీ. తీఁగపాఁచి.

**కుంభిని.** సం. వి. ఈ. స్త్రీ. భూమి, నేల.

**కుంభీనసము.** సం. వి. అ. పుం. 1. విషజ్వాలలు క్రక్కెడు పాము; 2. పాము.

**కుంభీరము.** సం. వి. అ. పుం. నక్రము, మొసలి.

**కుంభుఁడు.** సం. వి. అ. పుం. 1. వైశికుఁడు; 2. కుంభకర్ణునికొడుకు.

**కుకరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఈఁచఁబోయిన చేయిగలవాఁడు.

**కుకుందరము.** సం. వి. అ. న. పిఱుఁదిమీఁదిగుంత.

**కుకూలము.** సం. వి. అ. న. వసినాటినగుంట. పుం. కుమ్ము. (చూ. అగ్ని.)

**కుక్క.** వై. వి. వేపి, శునకము. విణ. కుత్సితము*.

**కుక్కగొడుగు.** ద్వ. వి. పుట్టగొడుగు, ఛత్త్రాకము.

**కుక్కతొళసి.** వై. వి. ఫణిర్జకము*.

కుక్కసాల. ద్వ. వి. వటపత్త్రిక†.

కుక్కబూరుగు. ద్వ. వి. బూరుగుదినుసు†.

కుక్కమల్లు. ద్వ. వి. వ్యాధివిశేషము.

కుక్కమూతిపిందె. ద్వ. వి. కాపుడిగినప్పుడు గలిగెడు కుక్కమూతివంటి మూతిగలపిందె.

కుక్కమేడి. ద్వ. వి. కాకోదుంబరిక†.

కుక్కవాయింట. ద్వ. వి. శ్వానబర్బర†.

కుక్కి. దే. వి. 1. పల్లము; 2. త్రాళ్లువదలి పల్లము పడినమంచము. "ఉ. కోఁలమాలినకుక్కి మీఁదనే, యోజ ననాథుపాటుపడనోగితమై తెమదీయవల్లభా." భో. ౫. ఆ.—విణ. లోఁతు. "ద్వి. ఆకుక్కినూతిలోనారీతినున్న, యాకవిసుతఁగాంచి యద్భుతంబంది." భాగ. ౯, స్కం.

కుక్కిపడు. ద్వ. అ. క్రి. (కుక్కి+పడు.) పల్లముపడు. "గీ. కుక్కిపడినమిగులఁగొంగోడువోయినఁ, గుఱుచయైనమిగులఁగొంచెమైన, మలినమైననేత పలుచనైననునల్లు, లున్నయుక్కమంచమొప్పదండ్రు." వి. పు. ౪, ఆ.

కుక్కుటము. సం. వి. అ. పుం. 1. కోడి; 2. కపటము; 3. కుక్క; 4. మిణుఁగురులు.

కుక్కుటి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుకోడి; 2. అసత్యపునడక.

కుక్కుభము. సం. వి. అ. పుం. అలజము, గంపపులుఁగు.

కుక్కురము. సం. వి. అ. న. 1. గండిననము†; 2. మాచిపత్త్రి†. పుం. కుక్క.

కుక్షి. సం. వి. ఇ. పుం. జఠరము, కడుపు.

కుక్షింభరి. సం. విణ. ఇ. పొట్టపోసికొనువాఁడు.

కుచందనము. సం. వి. అ. న. 1. ఎఱ్ఱగందము; 2. కుష్ఠము; 3. బుజెపత్త్రి.

కుచము. సం. వి. అ. పుం. స్తనము.

కుచరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పరులదోషమును చెప్పెడువాఁడు. నికృష్టపుమాటలాడువాఁడు. (అని కొందఱు.)

కుచాననము. సం. వి. అ. న. చూచుకము.

కుచ్చితము. వై. విణ. నాలి, కుత్సితము.

కుచ్చితుఁడు. వై. విణ. చెనఁటి, కుత్సితుఁడు.

కుచ్చె. వై. వి. వస్త్రభంగము, నెఱి*.

కుచ్చెతీయు. ద్వ. స. క్రి. (రత్నములను) సానఁబట్టు.

కుచ్చెల. దే. వి. 1. ఎనిమిదిగొఱ్ఱులకొలఁది; "ఉ. పాంథకోటులక్, గుచ్చెలపట్టునం దెరువుకొట్టుదురప్పరివారభామినుల్." చంద్రా. ౧, ఆ.—2. కంకులతోడి జొన్నచొప్పలోనగువానిప్రోగు.

కుచ్చెళ్లు. వై. వి. బ. (కుచ్చె+లు.) 1. ఆఁడుదానికోకకుచ్చె, వలిభము*; 2. బాలికాక్రీడావిశేషము*. (చూ. అచ్చనగండ్లు.)

కుచ్చెలిగంత. వై. వి. సన్న్యాసులులోనగువారుధరించెడు బొంత. "ఉ. గ్రుచ్చినరత్నరాజిరుచిగుచ్ఛములుంబలుపన్నెపట్టునూ, లుక్కచ్చులుఁగల్గియొప్పుతనకుచ్చెలిగంతయు." పర. ౧, ఆ.

కుచ్చెలిబొంత. వై. వి.——పై.——"సీ. చెలువగు కలువమొగ్గలుజడల్ గానాఁచుపాలుపైనకుచ్చెలిబొంతగాఁగ." య. 3, ఆ.

కుచ్చు. వై. వి. 1. పట్టులోనగువానికుచ్చు; 2. బ. కొనచెవినుంచుకొనెడి భూషణవిశేషము*; 3. స్త్రీలు జడయందుఁజేర్చియల్లుకొనెడిభూషణవిశేషము*.

కుచ్చుమీను. వై. వి. మిక్కిలి పుచ్ఛముగలచేప, గండోలము.

కుచ్చులమెకము. వై. వి. (కుచ్చులు+మెకము.) చమరీమృగము.

కుజ. సం. వి. ఆ. స్త్రీ. 1. సీత; 2. పార్వతి. అ. పుం. ము. చెట్టు.

కుజంభిరుఁడు. సం. వి. అ. పుం. చంపి దోఁచుకొను దొంగ.

కుజనుఁడు. సం. వి. అ. పుం. కుత్సితపురుషుఁడు.

కుజుఁడు. సం. వి. అ. పుం. 1. అంగారకుఁడు; 2. నరకాసురుఁడు.

కుటజము. సం. వి. అ. పుం. కొండమల్లె†. (ఇది వర్షర్తువునఁ బూచును.)

కుటజుఁడు. సం. వి. అ. పుం. 1. అగస్త్యుఁడు; 2. ద్రోణుఁడు.

కుటన్నటము. సం. వి. అ. న. కయివడిముస్తె†. పుం. దుండిగము†.

కుటపము. సం. వి. అ. పుం. 1. ఇంటితోఁట; 2. ధాన్యమానవిశేషము. డు. ఒకానొకముని.

కుటము. సం. వి. అ. పుం, న. కుండ. పుం. 1. గుడిసె 2. చెట్టు.

కుటరము. సం. వి. అ. పుం. పెరుగుచిలికెడు కంబము, తరిగంబము.

కుటాక. దే. వి. పక్షివిశేషము.

**కుటి.** సం. వి. ఇ. స్త్రీ. బుడిపి. **ఈ.** స్త్రీ. 1. గుడిసె; **2.** నీళ్లుమోసెడు పనికత్తె; 3. మురయనెడు గంధద్రవ్యము.

**కుటిక.** సం. వి. ఆ. స్త్రీ. గుడిసె.

**కుటిల.** సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకయేఱు. విణ. వంకరైనది.

**కుటిలిక.** సం. వి. ఆ. స్త్రీ. మంగలవాఁడు వెండ్రుకలూడఁదీసెడుసాధనము, తండసము.

**కుటీరము.** సం. వి. అ. పుం. గుడిసె.

**కుటుంబము.** సం. వి. అ. పుం. పెండ్లాముబిడ్డలులోనగువారు.

**కుటుంబి.** సం. వి. న్. పుం. కుటుంబపోషకుఁడైనవాఁడు.

**కుటుంబిని.** సం. వి. ఈ. స్త్రీ. కుటుంబపోషకురాలగు స్త్రీ.

**కుటుఁడు.** సం. వి. అ. పుం. తాతిపనివాఁడు.

**కుట్టకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఛేదించువాఁడు.

**కుట్టడము.** దే. వి. కుట్టుపని. "సీ. ఉవికకుట్టడపుఁదోరపునిగ్గుజంటీలు తనులతాద్యుతికిఁగైదండయొసఁగ." శుక. ౧, ఆ.

**కుట్టనము.** సం. వి. అ. న. ఛేదనము.

**కుట్టని.** సం. వి. ఈ. స్త్రీ. కుంటెనకత్తె.

**కుట్టమితము.** సం. వి. అ. న. దంతపీడనాదులచేఁ గోపభావమభినయించినను లోపల మిక్కిలి యానందముపొందునట్టి స్త్రీలయొక్క శృంగారచేష్టావిశేషము.

**కుట్టాకుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) కుట్టకుఁడు.

**కుట్టారము.** సం. వి. అ. పుం. పర్వతము, కొండ.

**కుట్టారుగలు.** దే. వి. బ. (కుఱుచ+ఆరుగలు.) కోద్రవవిశేషము.

**కుట్టావలు.** దే. వి. బ. (కుఱుచ+ఆవలు.) సర్షపవిశేషము.

**కుట్టిమము.** సం. వి. అ. పుం, న. తాతికట్టనపునేల, నెలకట్టు. పుం. దానిమ్మ?.

**కుట్టియ.** దే. వి. గుదస్థానము.

**కుట్టు.** దే. స. క్రి. 1. ఆకుకుట్టు; 2. గుడ్డలుకుట్టు; 3. తేలులోనగునవికుట్టు. "గీ. మధువుఁగొననుత్సహించినమనుజుఁబట్టి, కుట్టినిర్జించుమధుకరకులమునట్లు." భార. అర. ౧, ఆ. (ఇట్లుచీమకుట్టెను. మొ.) వి. 1. కుట్టుడు; 2. పాయిలోక్రిక్కితెసియుండు బూడిదలోనగునది; 3. కొంచెపు కడుపునొప్పి.

**కుట్టుకాఁడ.** ద్వి. వి. చెవికుట్టుకమ్మి, కుట్టుపోఁగు.

**కుట్టుడాకు.** దే. వి. (కుట్టుడు+ఆకు.) పుల్లియ, విస్తర.

**కుట్టుడు.** దే. వి. కుట్టుట.

**కుట్టుపోఁగులు.** దే. వి. బ. ఉంగరమువంటి వట్టిపోఁగులు.

**కుట్టుపోయు.** దే. స. క్రి. కుట్టు.

**కుట్టుసులు.** దే. వి. (కుఱుచ+ఉసులు.) కొంచెము మిగిలియున్న ప్రాణము.

**కుట్టె.** దే. వి. కుట్టియయొక్కరూపాంతరము.

**కుట్మలము.** సం. వి. అ. న. నరకవిశేషము. పుం. అరవిరి మొగ్గ.

**కుట్ర.** దే. విణ. కుత్సితము. "లేఁగుట్రనుసుంగవుఁగలుగుకోమలి." విజ. ౨, ఆ.

**కుట్రపువాఁడు.** దే. వి. కుట్టుపనిచేయువాఁడు, సూచికుఁడు.

**కుఠరము.** సం. వి. అ. పుం. (చూ.) కుటరము.

**కుఠారము.** సం. వి. అ. పుం. స్వధితి, గొడ్డలి.

**కుఠేరకము.** సం. వి. అ. పుం. నల్లగగ్గెర?.

**కుడతా.** హిం. వి. చొక్కాయి.

**కుడపము.** సం. వి. అ. పుం. ధాన్యమానవిశేషము. మానిక.

**కుడి.** దే. వి. కుడుపు. "క. కడుపునకందియుఁగందని, కుడి." పంచ. నా. ౪, ఆ.—విణ. అపసవ్యము. (కుడికన్ను, కుడికాలు, కుడిచేయి, కుడిప్రక్క. మొ.)

**కుడితి.** దే. వి. బియ్యముడులోనగువాని కడుగునీరు. తండురీణము.

**కుడినీరు.** ద్వి. వి. త్రాగఁదగినజలము. "కుడినీరుమేడలు." వసు. ౪, ఆ.

**కుడిపి.** వై. విణ. కురూపి. "క. గ్రక్కునవెలువడి తనచేఁ, జిక్కలగుదివో లెనున్న సురుచిరహారంబక్కుడిపియెుతవైచుచు." భో. ౫, ఆ.

**కుడిమివాఁడు.** దే. వి. పాములవాఁడు, విషవైద్యుఁడు.

**కుడియడుగుపరువడి.** దే. వి. మల్లబంధవిశేషము.

**కుడిశము.** సం. వి. అ. పుం. మత్స్యవిశేషము.

**కుడుంగము.** సం. వి. అ. పుం. 1. పొదరిల్లు; 2. బోడతరము?.

**కుడుక.** దే. వి. తక్కిడతట్ట. "గీ. అక్కపోతముస్న తక్కెడకుడుకవ్రేఁగైన." శేష. ౨, ఆ.

కుడుచు. దే. స. క్రి. 1. అనుభవించు; "క. అప్పుడ తేఁడటులు సెప్పఁగఁ, దప్పఁదలంచినఫలంబుతగఁ గుడువకపోఁ, జొప్పడునె." భార. శల్య. ౧, ఆ. (దిగులుకుడిచి ఇత్యాదులయందు దిగులునుభొందియనియర్థము.)—2. త్రాగు; (చన్నుగుడిచెను.) 3. భుజించు. "వాసవనందనుఁడు కుడువక గుడునె." భార. ఆది. ౫, ఆ.

కుడుపరి. దే. విణ. (కుడుపు+అరి.) 1. అనుభవించువాఁడు; 2. భుజించువాఁడు. "సీ. తెలిగడలినిగరుసలికుడుపరిదొర పలవుపయినిదురబెరయును టెయ." అచ్చ. అర, కాం.

కుడుపు. దే. ప్రే. కుడుచుఁజేయు. వి. 1. అనుభవము; "క. ఎడపడకుండంగుడిచిన, కుడుపుప్రమాణంబుగాదుకొన్న తెఱంగుక, బడసిన తెఱఁగును దెలుపని, యడికుడుపునఁబొడిగెలువ దభినవదండీ." విజ్ఞా. న్య, కాం.—2. భోజనము. "గీ. కుల్యయందుఁద్రిరాత్రమ్ముకుడుపు దక్కి." భార. అను. ౨, ఆ.

కుడుము. దే. వి. భక్ష్యవిశేషము, మోదకము.

కుడ్చు. దే. స. క్రి. కుడుచుయొక్క రూపాంతరము.

కుడ్యకారుఁడు. సం. వి. అ. పుం. గోడపెట్టువాఁడు.

కుడ్యమత్స్య. సం. వి. ఆ. స్త్రీ. బల్లి.

కుడ్యము. సం. వి. అ. న. 1. గోడ; 2. పూఁత.

కుణకము. సం. వి. అ. పుం. పిల్ల. "వ. మఱియునా భరతుండు నిత్యనైమిత్తికక్రియాకలాపంబునిర్వర్తించునెడనంతనంతలేచి హరిణకుణకంబుఁజూచుచుఁగించిత్స్వస్థహృదయుండై దానినాశీఃపరంపరలనభినందించుచుంజుంబనాదులం బ్రీతిచేయుచు నతిమోహంబునం బెంచుచుండునెడ." సం. "తస్యహవా ఐణకుణకఉచ్చైస్తరాంతస్మిన్ కృతనిజాభిమానస్యాహరహస్తత్పోషణపాలన ప్రీణనలాలనానుధ్యానేనాత్మనియమాః సహయమాః పురుషపరిచర్యాదయ ఏకైకశః కతిపయేనాహర్గణేనవియుజ్యమానాః కిలసర్వ ఏవోదపసన్." భాగ. ౫. స్కం. ౧, ఆ.

కుణపము. సం. వి. అ. పుం. 1. పీనుఁగు; 2. దుర్గంధము.

కుణి. సం. వి. ఇ. పుం. నందివృక్షము. విణ. ఈచఁబోయిన చేయిగలవాఁడు.

కుణుంజము. సం. వి. అ. పుం. వనవాస్తుకము, చెంచలికూర.

కుతకుత. దే. వి. ఉడుకుటయందగు ధ్వన్యనుకరణము. (తుకతుకకు మాఱురూపము.)

కుతపము. సం. వి. అ. పుం, న. 1. దినముయొక్క యెనిమిదవభాగము; (చూ. దినము.) 2. వాద్యము; 3. మేఁకత్రుప్పటి కంబళి; 4. దర్భ.

కుతపుఁడు. సం. వి. అ. పుం. 1. తోడఁబుట్టినదాని కొడుకు; 2. సూర్యుఁడు.

కుతథ్యము. సం. విణ. (అ. ఆ. అ.) అసత్యము. (మాట.)

కుతిక. దే. వి. కుత్తికయొక్క రూపాంతరము. "ఉ. ఈయవివేకపుంబనులకిట్లు తొడంగితివొప్పదింతయ, న్యాయముగాలిఁబోయెడుదురాగతముల్ విని పాపబుద్ధిన, య్యోయిటువంటిముద్దుల సహోదరిముందల పట్టియీడ్చితో, కోయనికూయఁగాఁగుతికఁగోసినలోకమువారుతిట్టరే." వి, పు. ౭, ఆ. (చూ. కుత్తిక.)

కుతికఁటు. దే. వి. (కుతిక+అంటు.) బంగారుతీకు తోఁబెట్టిగామెడకంటియుండునట్లు చేసియుంచుకొనెడుస్త్రీభూషణవిశేషము. "సీ. బొగడలుం వానఁగ్రోవులు తీఁగె మెడనూలు కుతికంటు సరిపెణ గుండ్లసేరు." హంస. ౨, ఆ.

కుతినీ. దే. వి. ఒకదినుసుపట్టు. "సీ. కుతినీతలాడతళ్కుపసిండిచందువానిలువుటద్దములుపన్నీటిగిండ్లు." రసి. ౫, ఆ.

కుతిల. దే. వి. బాధ. "సీ. వినున్నపాలకయాళ్లవెంబడిదేవరగుళ్లపంచలఁజేరి కుతిలఁగుడిచి." హరిశ్చ. ౪, ఆ. (చూ. కుతిలపెట్టు.)

కుతిలపడు. ద్వి. అ. క్రి. బాధపడు. "క. మితికడచినఋణదాతలు, వెతపెట్టఁగనూరుచొరకవెలివెలిఁదిరుగుక, దతిఁగూడులేకయాఁకటఁ, గుతిలపడునతండుగువ్వకుత్తుకతోడక." పాండు. 3, ఆ. (ప్రే. కుతిలపఱచు.)

కుతిలపాటు. ద్వి. వి. కుతిలపడుట. "సీ. ఎఱుఁగఁడుమత్తిల్లిపరఁటిపుట్టువుగ్రుక్కగొనినయప్పుడు గలకుతిలపాటు." య. ౧, ఆ.

కుతిలపెట్టు. దే. స. క్రి. బాధించు. "వ, గీ. అరాజకత్వ, దోషజాతమైనదురితబాహుళ్యంబు, కుతిలపెట్టభూమియతలమునకుఁ, బోవ." సం. "తతఃకాలేనపృథివీపీడ్యమానాదురాత్మభిః." భార. శాం. ౨, ఆ.

కుతుక. దే. వి. కంఠము. "సీ. చేతము మ్మొనవాలుచిలువనూడిగములునొసలమిక్కిలికన్ను విసపుఁ

గుతుక." రాజ. 3, ఆ. (ఇట్లు ఉకారమధ్యము గాను బ్రతులయందుఁ గానఁబడుచున్న దిగాని యట్టిదయని నిర్ధారణచేయుటకుఁ దగిన ప్రయోగము దొరకినదికాదు.)

కుతుకము. సం. వి. అ. న. అనుభవింపని కోరికయం దలియాస, తమి.

కుతుపము. సం. వి. అ. పుం. చేతిసిద్దె.

కుతువు. సం. వి. ఊ. స్త్రీ. సిద్దె.

కుతూహలము. సం. వి. అ. న. 1. కుతుకము; 2. నాయికకు మనోజ్ఞమైన వస్తువును చూచుటయందుఁగల లోలత్వము. విణ. ప్రశస్తము.

కుత్కీలము. సం. వి. అ. పుం. కొండ. "ఉ. వీలక కాలజిత్ప్రముఖవీరులుమున్న కుశాశుగాహతిఙ్, గూలిరిరక్తధారలుబుగుల్కొనలక్ష్మణు ప్రౌలధాతుకు, త్కీలమునాల్గుసంకలనతిత్వరమాణసమీరవర్తనో, న్మీలితసంప్రఫుల్లసుమనోభరకింశుకవాటికైపడిఙ్." జై. ౬, ఆ. (కొన్ని నిఘంటువులయందుఁ గుకీలమనియునున్నది.)

కుత్తిక. దే. వి. గొంతు, కంఠము. "ఎ, గీ. హత్తిమిత్తిచందంబునహత్తివెడఁద, కత్తిఁగుత్తికనుబిత్తానఁగత్తిరించి, సత్తిమత్తిల్లబలిచేసెసత్తినొక్కఁ, డవనిపతియిచ్చుమేలుమేలనుచుమెచ్చ." చంద్రా. ౨, ఆ.

కుత్తుక. దే. వి. కుత్తిక. (చూ. కుతుక.)

కుత్స. సం. వి. ఆ. స్త్రీ. నింద, దూఱు.

కుత్సనము. సం. వి. అ. న.——పై.——

కుత్సించు. సం. అ. క్రి. రోఁతపడు. "సీ. కుత్సింపకుంబెట్టు లుత్సర్గవిణ్మూత్రలాలాద్రవశ్లేష్మజాలమునకు." కాశీ. ౪, ఆ.—స. క్రి. దూఱు.

కుత్సితము. సం. విణ. (అ. ఆ. అ.) నికృష్టము, కీడ్వడినది.

కుథము. సం. వి. అ. పుం. 1. దర్భ; 2. ఏనుఁగుమీఁదఁబఱచెడి యొట్టికంబళి. చిత్రకంబళము. (అని కొందఱు.) (ఈ యర్థమునందాకారాంత స్త్రీలింగమును గలదు.)

కుదప. దే. వి. రొంపిదుక్కి.

కుదరము. సం. వి. అ. పుం. గుజ్జము. "శ్లో. కుదరస్స్యాన్మ్యుపకారస్తుక్ష్కారః పాకలో జుహూరాణః." అ, పా. ద్వి. ష.

కుదించు. దే. ప్రే. కుదియించు, కుదియఁజేయు. "జమదగ్నిసూనుగర్వముఁగుదించి." జై. ౬, ఆ.

కుదికిలఁబడు. దే. అ. క్రి. ముఖముపైకెత్తుకొని ముడ్డినేలమోపగొంతుగూర్చుండు. "ద్వి. కుదికిలఁబడితన్నుకొనగుండెలవియఁ, గదిసియన్నీలుమోఁకాళ్లఁదాటించె." రంగ.యు. (స్వార్థమునపడు.)

కుదికిలు. దే. అ. క్రి.——పై.——"వ. అచ్చోరవసుదేవుండుసీసకంబునంబూఁచిన శైనేయుండుకుదికిలిగదనుడాకేలదాపించిన." ఉ,హరి.3.ఆ.

కుదియు. దే. అ. క్రి. 1. అడఁగు; "సీ. మదినిగిర్చిన మాటమగువనీపెంపునఁ గుదిసినానాలుకతుదికిరాదు." భార. విరా. ౨, ఆ.—2. క్రుంగు; "ఎ. గీ. కడునుబ్రేఁగు, గలుగునట్టివంటకట్టియమోపుల్లు,గుదియమోచితెచ్చె." భార. అశ్వ. 3, ఆ.—3. తగ్గు; "మొదలఁబెనిచిపిదపఁగుదియింప." ఆము. ౪, ఆ.—4.మరలు,నివర్తిల్లు. "లలిఁబ్రసరించునింద్రియములంగుదియించి." మార్క. 3, ఆ.

కుదిర. వై. వి. గుజ్జము. "సీ. వెలిపట్టునిద్దంపుఁదుకులపుట్టంబుమెలపారుపులుఁగుభంజళులకుదిర." కవిస. ౧, ఆ.

కుదిరిక. దే. వి. 1. అమరిక; 2. నిలుకడ; 3. నెమ్మది.

కుదిలిక. దే. వి. కుదులుట.

కుదుకనగోలు. దే. వి. వంచన. "ద్వి. కుదుకనగోలుకైకొనకనాధనము, వదలుముమున్నువిశ్వామిత్రుఋణము, మితితోడఁజెల్లించిమీఁదనెట్లయిన, ధృతిఁదీర్తునీబత్తెదినములలెక్క." "ద్వి. ఆలినిబుత్రునినంగడిఁబెట్టి, కాలకౌశికుఁడనుకష్టునకమ్మి, తూర్చినధనమెల్లఁగుదుకనగోలు, నేర్పునఁగైకొంటినీకుసిద్ధించె." హరిశ్చ. ౨, భా.

కుదుచు. దే. ప్రే. కుదించు. "ఎ, గీ. కదిసినున్గొల్లకొనలనుగుదిచిపట్టి." య. ౨, ఆ.

కుదుప. దే. వి. 1. దుర్మాంసపిండము; 2. వంచన. "చ. అసురేశ్వరుఁడప్పుడుకాలుఁజేయిలా,పతిరథసంబునంగుదుపనక్కడనిక్కడనూడఁజూచిమై, గిఱుపఁగ." నిర్వ. ౭, ఆ.

కుదుపు. దే. విణ. స్వభావమునఁగాలులేనివాఁడు, పంగువు. "ఉ. దేవతలెల్లఁదక్కఁగలదీవులకుఙ్ దివికేగునట్టిచోఁ, బోవఁగలేకకుంటికుదుపుంజిఱువేల్పులుదైత్యదానవుల్, సేవకులైమహీవిభునిచేనధికారనియోగవృత్తికై, జీవితమందనిల్చిరిత్యజింపఁగఁజాలకజన్మదేశముల్." కాశీ. ౫, ఆ. "గీ. కుంటికుదుపులశక్తులుకుష్ఠరోగు, లంధులునువృద్ధులునుబాలురాదిగాఁగఁ, గాశికరుగంగలేని

పిసానుల్లెల్ల, మోక్షమును బొందుదురుగాకదక్షు వాటి." ఖీ. ౫, ఆ.

కుదురు. దే. అ. క్రి. 1. అనుకూలమగు; 2. స్థిరమగు; 3. స్వస్థమగు. వి. 1. అమరిక; 2. అగసాలెవానికుంపటి; "గీ. బొమ్మయను పేరియగ సాలె పూఁటచెలిని, గోరియలరించుటకుఁజడల్కు-దుటఁగాఁచి,నీటముంచినమేటిపన్ని యపసిండి,పూదెయనఁగ్రుంకుఁగడలిలోఁబ్రొద్దు వ్రాలె." నీలా. 3, ఆ.—3. నిలుకడ; 4. నెమ్మది; 5. కుండలోనగునవికుదిరికగానిలుచుటకేర్పఱచినపీఠము; "వ. ఉపేంద్రాయేప్రకారంబునమహార్ణవంబుడగ్గఱితెరువవచ్చు. దీనికిఁజేరునుగుదురునుగర్వంబును నేనిగావలయు." వీర. 3, ఆ.—6. పాదు; "చ. కలికియొకర్తు రాముని జగత్త్రయమోహనరూపదివ్యమం, గళపటువిగ్రహంబుపసఁగాంచుతమింగటిఁబూని మేఖలా, వలయముఁగీలుకొల్పమఱందిగజాఱినయప్పుడవ్వధూ, కులమణికోమలాంగలతకుంగుదురుంబలె నొప్పెఁ జుట్టునన్." రామా. ౮, ఆ.—7. ప్రాపు. "క. కరితురగరథసమితిఁబొం, పిరివోయెడు నాదులక్ష్మి పెంపునకెల్లన్, సరసిరుహానన నీవకు, దురుగానొనరించె దన్గుతూహలమెసఁగన్." భార. విరా. ౨, ఆ.

కుదురుకొను. దే. అ. క్రి. కదలక నిలుచు, నెలకొను. "కుదురుకొనెన్గిరీంద్రములు." విక్ర. ౨, ఆ. (ప్రే. కుదురుకొలుపు.)

కుదురుచే. దే. ప్రే. కుదురఁజేయు, కుదిరించు. (రూ. కుదుర్చు.)

కుదురుపడు. ద్వి. అ. క్రి. 1. నెలకొను; 2. స్థిరపడు. (రూ. కుదుర్పడు. "క. అనవినికిరీటికర్ణను, తునిమస్తమురథముపైఁగుదుర్పఱచి." జై. ౭, ఆ.) (ప్రే. కుదురుపఱచు.)

కుదురుపాటు. ద్వి. వి. కుదురుపడుట.

కుదులు. దే. అ. క్రి. అదురు, చలించు.

కుదువ. దే. వి. తాకట్టు, ఆధి.

కుదువపెట్టు. దే. స. క్రి. తాకట్టుంచు.

కుద్దాలము. సం. వి. అ. పుం. 1. త్రవ్వునట్టి యొకానొకసాధనము, గుద్దలి; 2. కాంచనము?.

కుధరము. సం. వి. అ. పుం. పర్వతము, కొండ.

కునటి. సం. వి. ఈ. స్త్రీ. మణిసిల. నేపాళదేశపు మణిసిల. (అని కొందఱు.)

కునాశకము. సం. వి. అ. పుం. తీఁటకసింద?.

కునికిపడు. ద్వి. అ. క్రి. తూఁగిపడు.

కునికిపాటు. ద్వి. వి. తూఁగిపడుట, ప్రమీల.

కునుకు. దే. అ. క్రి. తూఁగు.

కున్న. వై. వి. కూనయొక్క-రూపాంతరము. (బిడ్డ కు.—"క. నిన్నింతవానిఁజేసిన, యన్నాలుగుమోములతఁడుహరిపొక్కిటియం, దున్నవెలితమ్మియీనిన, కున్నయగుట తెలిసివిడువుకోపముతండ్రీ." లక్ష్మీ. ౫, ఆ.)

కున్నఁడు. వై. వి. బాలుఁడు.

కున్నకము. సం. వి. అ. న. 1. గాజుచిప్ప; 2. పెద్దకుండ.

కుపసము. వై. వి. (కుప్పసముయొక్క-రూపాంతరము.) 1. అరచట్ట; "సీ. గురుపత్నినాకొక్క-కుపసంబుఁగుట్టుము చలిగాలియొడలిపైఁబొలయకుండ." కాశీ. ౭, ఆ.— 2. నిడుచట్ట; 3. అవిక; 4. పాముయొక్క-పైతోలు*. "ద్వి. కుపసంబులూడ్చిన క్రూరసర్పముల, నుపమింపననువులై." రా. యు, కాం. (చూ. కుప్పసము.)

కుపితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కోపించినవాఁడు, క్రోధనుఁడు.

కుపూయము. సం. విణ. (అ. ఆ. అ.) కుత్సితము.

కుప్ప. దే. వి. ధాన్యములోనగువాని రాశి.

కుప్పఁగూర. దే. వి. కుప్పవడుట. "హేమమెుసఁగెఁగుప్పఁగూరలుసమగ్రకుతూహలుఁడై." భార. అశ్వ. ౧, ఆ. "మ. సముద్యద్వేగుఁడై తోలితో, ప్పుఱఁబెట్టెన్ శరజాలమున్ బిఱుఁదఁ గుప్పంగూరనాటించుచున్." నిర్వ. ౫, ఆ.

కుప్పతిలు. దే. అ. క్రి. కుప్పవడు. "కూలినభద్రనాగములుఁగుప్పతిలంబడు తేరులున్." జై. ౫, ఆ.

కుప్పనఁగూర. దే. వి. కుప్పవడుట. "క. అప్పుడుగురుపుత్రాద్రిం, గప్పఁగవజ్రోపమానకాండములు వెసన్, గుప్పనఁగూరవఁబనరుఁ, డప్పరుసందనమునకొర్చియతఁడుం బెనఁగెన్." భార. కర్ణ. ౨, ఆ. అప్పుడు సతియునుబతియును, నొప్పగసమదృష్టిసుండిరుచితాసనులై, కుప్పనఁగూరలు గామరుఁ, డప్పువ్వుల కోలలేయునదనయ్యెవనన్." భో. ౭, ఆ.

కుప్పము. దే. వి. 1. గ్రామము; 2. చెంబడివారిపల్లె.

కుప్పపడు. ద్వి. అ. క్రి. (కుప్ప+పడు.)కుప్పగాఁజేరు.

కుప్పసము. వై. వి. 1. అరచట్ట; "చమురైనతోల్కుప్పసంబు." ఆము. ౬, ఆ.—2. నిడుచట్ట; "ద్వి.

పన్ను గాముదుకకుప్పసములుతొడిగి, చెన్నార బ్రద్దలు చేతులఁబట్టి." రా. యు, కాం.—3. అవి క; "కుప్పసముల్వదల్చిరి." ఆము. ౫, ఆ.—4. పాముయొక్క పైతోలు*. "క. మంగళచరిత్రయగుసీ, తాంగననపవాదభీతుఁడగునాకుఁద్యజిం, పంగఁదగునేఁడుదుష్టభు, జంగముతొలిప్రాఁతకుప్పసంబూడ్చుగతిన్." జై. ౬, ఆ.

కుప్పి. దే. వి. అవాక్పుష్పి†.

కుప్పించు. వై. అ. క్రి. ఊపిరిపట్టు*. "పయికింగుప్పించిలంఘించుచోన్." రామా. ౬, ఆ.

కుప్పిగంతుకొను. ద్వ. అ. క్రి. దుముకు. "గీ. వ్యోమకేశుజడలనుండియవ్వాహిని, కుప్పిగంతుగొని నఁగ్రుంగెధరణి." భో. ౭, ఆ.

కుప్పిగంతులు. ద్వ. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. కుప్పిగంతులు పిడిగుద్దులాటలు పిల్ల దీపులు గొబ్బిళ్లు గూవనాలు." వి, పు. ౭, ఆ.

కుప్పీలు. దే. వి. బ. బాలికాక్రీడావిశేషము.

కుప్పె. వై. వి. 1. మెడనిడుపుగాఁగలకాచపాత్రవిశేషము; "వ. కప్పురంపుఁగుప్పెలంగుప్పరించినసరసమధురసంబులు." పా. ౨, ఆ.—2. గొడుగుమీఁదిగుబ్బ*; "ద్వి. పెదపెద్దపసిఁడికుప్పెలు మీఁదనొప్పఁ, బ్రవిమలంబగు నెనుబదివేలసంఖ్య, ధవళాతపత్రముల్ దనుజులుపట్ట." రా. యు, కాం.—3. ఇత్తడిలోనగువానితోఁజేసియెద్దుకొమ్ముకొనఁదగిల్చెడుగుబ్బ*; 4. స్త్రీశిరోభూషావిశేషము*; "ఎ, గీ. అడరబెడఁగైన నిడువాలుజడసడల్చి, కుప్పెకవ్వడసవరంపుఁగొప్పుఁబెట్టి, మురియుముంగిటనిలుచుండి మొలకనగవు, లెసఁగవిటభాగ్యరేఖయా హేమరేఖ." హంస. ౧, ఆ.—5. గిండిలోనగువానిమీఁదిమూఁత*. "క. చాలఁగనమృతముబాలుఁడు, క్రోలుటకైనినిచికనకకుంభంబులపై, నీలపుఁగుప్పెలునిలిపిన, పోలికఁజనుమొనలఁగప్పుపాలతికినొప్పెన్." లక్ష్మ. 3, ఆ.

కుప్పెంట. దే. వి. హారితమంజరి†.

కుప్పెకోల. ద్వ. వి. బాణవిశేషము, క్షుద్రకము. "వ. సాత్యకితటిమిమనమొననుఱుము చేయందొడంగినద్రోణుండు మార్కొనియిరువదేనుకుప్పెకోలలనతనిచేత నేటులువడి." సం. "సాత్యకిఃపంచవింశత్యాక్షుద్రకాణాంసమార్పయత్." భార. ద్రో. 3, ఆ.

కుప్యము. సం. వి. అ. న. వెండి బంగారుఁదక్క తక్కిన లోహము.

కుబుసము. దే. వి. తలుపునకుఁ గ్రిందుమీఁదులనుంచెడు కూచము.

కుబేరకము. సం. వి. అ. పుం. నందివృక్షము.

కుబేరాక్షము. సం. వి. అ. పుం. బాలక్రీడావిశేషము. "సి. క్రీడించునొకవేళ తోడిబాలురఁగూడియక్షీణగతిఁగుబేరాక్షకేళి." పాండు. ౪, ఆ.

కుబేరాక్షి. సం. వి. ఈ. స్త్రీ. కలిగొట్టు†.

కుబేరుఁడు. సం. వి. అ. పుం. ధనదుఁడు, పైఁడిఱేఁడు.

కుబ్జ. సం. వి. ఆ. స్త్రీ. పాట్లి†. అ. పుం. ము. 1. గజవిశేషము; 2. ఒకానొకచెట్టు. విణ. మఱుగుజ్జు.

కుబ్జిక. సం. వి. ఆ. స్త్రీ. గొజ్జఁగ†. "కుబ్జికాభద్రతరణిర్బృహత్పత్రాతికేసరా, మహాసహా." ధన్వంతరినిఘంటువు.

కుమారము. సం. వి. అ. న. చొక్కపుబంగారు. పుం. 1. గుఱ్ఱపుపిల్ల; 2. చిలుక; 3. ఉలిమిరి†.

కుమారి. సం. వి. ఈ. స్త్రీ. 1. కూఁతురు; 2. పెండ్లికానిపడుచు; 3. పార్వతి; 4. ఒకానొకయేఱు; 5. జంబూద్వీపము; 6. నల్లపిచ్చుక; 7. కలబంద†; ౮. చేమంతి†; 9. పిన్నగోరంట. (అని కొందఱు.) 10. విరజాజి†.

కుమారిలు. దే. అ. క్రి. కుములు. "క. మానవతియిట్లుమానని, మానక్రోధములచేఁగుమారిలిచింతా, ధీనగతినుండమదిలో, నూనినప్రేమమునసంబుజోదరుఁడనియెన్." పా. ౧, ఆ.

కుమారుఁడు. సం. వి. అ. పుం. 1. కొడుకు; 2. బాలుఁడు; 3. స్కందుఁడు; 4. (నాట్యోక్తియందు) యువరాజు.

కుమి. దే. వి. కుసూలవిశేషము. "ఎ, గీ. తద్విశేషనామంబులుతనరుచుండుఁగొట్టెకూటుపొడకకుమిబొట్టయనఁగ." ఆం, భా. ద్వి. వై.

కుముఖము. సం. వి. అ. పుం. పంది.

కుముటు. దే. అ. క్రి. ఓకరకై కంఠబిలమున వికారమెత్తు. వి. ఓకరకై కంఠబిలమునఁనెత్తువికారము.

కుముద. సం. వి. ఆ. స్త్రీ. 1. గుమ్ముడు†; 2. ఱేఁకు†. అ. న. ము. 1. ఎఱ్ఱదామర; 2. తెల్లగలువ. పుం. 1. నిరృతిదిక్కునందలి దేనుఁగు; 2. ఒకానొక పాము.

కుముదబాంధవుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు. కలువవిందు.

కుముదిక. సం. వి. ఆ. స్త్రీ. పినగుమ్ముడు†.
కుముదిని. సం. వి. ఈ. స్త్రీ. తెల్లకలువతీఁగ.
కుముదుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకానొక కోఁతి; 2. ఒకానొక రాక్షసుఁడు.
కుముద్వంతము. సం. విణ. (త్. ఈ. త్.) తెల్లకలువలు తఱుచుగాఁగలది. (దేశము.)
కుముద్వతి. సం. వి. ఈ. స్త్రీ. 1. తెల్లకలువతీఁగ; 2. కుశుని పెండ్లాము.
కుములు. దే. అ. క్రి. లోలోపలఁదపించు. "క. అని బుజ్జగించియొయ్యన, నెనరంటినమనముతోడనె చ్చెలిపలుకఁగ, దనలోఁగుములుచుసీమం, తిని పైనిగనిగని వెలుఁగునెలఁగనిపలికెఁ." చంద్ర.
కుమ్మకు. హిం. వి. సహాయము, తోఁడు.
కుమ్మర. వై. వి. కుండలుచేసి జీవించెడుజాతి. (కుమ్మరవాఁడు. కుమ్మరది.) విణ. నలుపు*. (కుమ్మరగువ్వ, కుమ్మరపొనిక. మొ.)
కుమ్మరగువ్వ. ద్వి. వి. పక్షివిశేషము, ఖంజరీటము.
కుమ్మరచెట్టు. ద్వి. వి. ఒకానొకచెట్టు.
కుమ్మరత. ద్వి. వి. కుమ్మరది.
కుమ్మరపురుగు. వై. వి. ఒకానొకపురుగు, యమకీటము.
కుమ్మరపొనిక. ద్వి. వి. కృష్ణముంజము†.
కుమ్మరపోలికచెట్టు. ద్వి. వి. ఒకానొకచెట్టు.
కుమ్మరసారచుక్క. ద్వి. వి. విశాఖానక్షత్రము.
కుమ్మరి. వై. వి. (కుమ్మర+ఇ.) కుమ్మరవాఁడు.
కుమ్మరించు. దే. ప్రే. కుమ్మరిలఁజేయు.
కుమ్మరింపు. దే. వి. మల్లబంధవిశేషము. "సీ. కన్నాత చాంగణ కందణంబు తిణింగి గొంతుమాఱును జేబ కుమ్మరింపు." ఆం, భా. ద్వి. క్ష.
కుమ్మరిలు. దే. అ. క్రి. 1. నీళ్లులోనగునవి కుండలోనగువానియందుండిపడు; 2. రాలు. "మిడిగ్రుడ్డులనిప్పులు కుమ్మరిలఁగ." హరి. పూ. ౫, ఆ.
కుమ్మి. దే. వి. కుమికి మొదటిరూపము. "సీ. మూసి ముల్లడిచి కుమ్ములకొల్చు పైమెత్తు లూడ్వఁడు పస్తైనముండుఁగాని." పాండు. ౪, ఆ.
కుమ్ము. దే. స. క్రి. 1. నలియఁగొట్టు; 2. పొడుచు. వి. పొట్టునిప్పు, కుకూలము.
కుమ్ముసుద్ది. ద్వి. వి. సంకేతవృత్తాంతము.
కుమ్మె. దే. వి. పోటు. "క. కుమ్మెలుదాఁకినబంగరు, బొమ్మరములయొమ్మెఁగడకుఁబొమ్మను." సా. ౩, ఆ.
కుమ్మెలువోవు. దే. అ. క్రి. గాయమగు. "ఉ. కుమ్మెలువోపనొక్కి చెలిక్రోలినతేనియ కావిమోవితో." శశాం. ౪, ఆ.
కుయి. దే. వి. 1. మొఱ; "మ. దవధూమంపుఁదమంబులోఁదమరసద్రవ్యంబుపంకేజబాం, ధవభానుప్రతతుల్ హరింపఁగుయివెట్టన్వెళ్లుశూన్యోరుకూ, పవితానంబనఁజూడఁజూడఁబుడమింబాటిల్లిపైవిప్పులై, యవసంబంచుల నాడఁగానెగసెవాత్యాళిఁరజశ్చక్రముల్." ఆము. ౩, ఆ.— 2. రక్షణము. "సీ. పసులకైకుయివోయిపరులశస్త్రములచేననిలోనసమసినయట్టివారు." రుక్మాం. ౩, ఆ. (కుయ్యియొక్కరూపాంతరము.)
కుయ్యి. దే. వి. 1. మొఱ; "కుయ్యిడశక్తిలేదుదరగోళములోపలనున్నవాఁడ." భాగ. ౧, స్కం. — 2. రక్షణము.
కురంగమము. సం. వి. అ. పుం. హరిణము, జింక.
కురంగము. సం. వి. అ. పుం. 1. జింక; 2. కోఁతి.
కురంటక. సం. వి. ఆ. స్త్రీ. తుమ్మి†. అ. పుం. ము. 1. పచ్చగోరంట†; 2. పచ్చచేమంతి†. పచ్చపువ్వులములుగోరంట; పచ్చపువ్వుల పెద్దగోరంట. (అని కొందఱు.)
కురండము. సం. వి. అ. పుం. అండవృద్ధి, బుడ్డ.
కురపము. సం. వి. అ. పుం. గుజ్జుముఁదోమెడు గొఱపము.
కురము. దే. వి. పశువులకుఁ గళ్లగెడు శీతరోగము.
కురరము. సం. వి. అ. పుం. ఉత్క్రోశము, లకుముకిపిట్ట. గోరువంక. (అని కొందఱు.) పెన్నడపులుఁగు. (అని కొందఱు.)
కురరి. సం. వి. ఈ. స్త్రీ. 1. గొఱ్ఱె; 2. ఆఁడులకుముకి.
కురవకము. సం. వి. అ. పుం. 1. ఎఱ్ఱగోరంట†; దీనికి దోహదక్రియ ఆలింగనము. 2. ఎఱ్ఱచేమంతి†. ఎఱ్ఱపువ్వుల పెద్దగోరంట; ఎఱ్ఱపువ్వులములుగోరంట. (అని కొందఱు.)
కురాళము. దే. వి. చప్పరము. "మ. గుజ్జరి నిద్రాతగటీ కురాళములలో సంపెంగ పూఁబాన్పులన్." చంద్ర.
కురాసాని. దే. వి. ఒకానొకదేశము.
కురిచీ. దే. వి. కూర్చుండునట్టి యున్నతపీతము. "వట్టివేళ్లసురఁటీలుమేల్మైఁడికురిచీలు." రసి. ౧, ఆ.
కురిడి. దే. వి. లోపలి నీరింకినకొబ్బెర.

**కురిమిడి.** దే. వి. మడిచుట్టు వేసినకట్ట, గనిమ.

**కురియు.** దే. స. క్రి. వర్షించు. అం, ప్రే. కురియించు. "ఎ, గీ. అసురకామినీ నేత్రతోయములు కురిసి, యంబుదద్యుతిఁ ద్రిదశసస్యంబుఁ బ్రోచు. నెవ్వఁడవ్విష్ణుఁడు." హరి. పూ. ౪, ఆ.

**కురుంబము.** సం. వి. అ. పుం. సమూహము, గుంపు.

**కురుంజు.** దే. వి. 1. దూలముమీఁదిగుజ్జు; 2. మంచె. "ఉ. అప్పుడవారుదీర్పరుల నందులకుఙ్ సమకూర్పజాలువా, యొప్పులకుప్పలై మెఱయుచుండెడు మేరువులుం గురుంజులుం, జప్పరముల్ వితానములు సర్వమునాయితపెట్టి." విజ. ౨, ఆ.

**కురుజీ.** దే. వి. చిన్నకంట్లము.

**కురుజు.** దే. వి. 1. జున్ను; "ఎ, గీ. కురుజుతేనియకాదిదికనుమరసము." శశాం. 3, ఆ.—2. శ్యేనవిశేషము; 3. బాణపుసంచువగ. "వ. కురుజులుకుండబిఱుసులుసంపెంగపూలబిఱుసులు." హంస. 3, ఆ.—4. ఈఁకలురాల్చినపక్షి.

**కురుప.** దే. వి. గొఱ్ఱెతుప్పటకంబళినేయు గొల్ల.

**కురుపగొఱ్ఱె.** ద్వ. వి. దేహమునందు నిడుపుబొచ్చుగలగొఱ్ఱె.

**కురుమ.** దే. వి. గొఱ్ఱెతుప్పట కంబళి నేయు గొల్లజాతి. (కురుమవాఁడు.)

**కురుబిస్తము.** సం. వి. అ. పుం. బంగారముయొక్కపలము. (రూ. కురువిస్తము.)

**కురులు.** వై. వి. 1. ముంగురులు. "సీ. ప్రస్వేదమునఁదోఁగిఫాలంబుతోనంటి యుగ్గలికీకురు లొప్పగందె." భార. విరా. ౨, ఆ. "కూఁకటివేణితోఁ గురులుకూడకమున్న." కళా. ౧, ఆ.—2. వెంట్రుక*. "సీ. కొప్పు మెల్లనవిచ్చికురులుచిక్కడలించితలయంటెనేర్పుతోఁబాలఁతియొకతె." య. ౪, ఆ.

**కురువ.** దే. వి. కొండమీఁది కాలిత్రోవ.

**కురువిందము.** సం. వి. అ. పుం. 1. మాణిక్యవిశేషము. (ఇది కాలపురమునందు పుట్టినది, పసుపుదాళు కలది, మధ్యమజాతిరత్నము.) (చూ. మాణిక్యము.) 2. అద్దము; 3. ఇంగిలీకము; 4. నిడుముస్తె; 5. వ్రీహివిశేషము.

**కురువు.** సం. వి. ఉ. న. ఒక వర్షము. (చూ. వర్షము.) పుం. 1. ఒకానొకరాజు; 2. ఒకానొకదేశము; 3. అన్నము.

**కురువేరు.** ద్వ. వి. (కురులు+వేరు.) ఒకానొకవేరు, హ్రీబేరము.

**కురుళము.** సం. వి. అ. పుం. ముంగురులు. "తేలలోద్భ్రమరకాః కురుళాభ్రమరాలకాః." వైజయంతీనిఘంటువు.

**కుర్కురము.** సం. వి. అ. న. గండివనము†. పుం. కుక్క.

**కుర్దనము.** సం. వి. అ. న. క్రీడ. (రూ. కూర్దనము.)

**కుర్పరము.** సం. వి. అ. పుం. కూర్పరము, మోఁచెయి.

**కుర్వాణుఁడు.** సం. వి. అ. పుం. పనివాఁడు. విణ. చేయువాఁడు.

**కుఱంగలి.** దే. వి. సమీపము. "చ. తఱుచుగభానునందను నిధానమునందు నభీష్టవస్తువుల్, గుఱుతులు మీఱఁగొంచరుగు కోవిదకోటుల సమ్మదాశ్రుపుల్, వఱదలువాఱుఁ బ్రస్తుతరవంబులుమిన్నులరాయుచుండున, కుఱంగటశోకజాశ్రువులఁ గోయను నేడ్పులు నుప్పతిల్లదుఙ్." జై. ౧, ఆ.

**కుఱకుఱ.** దే. విణ. అల్పము. "క. ఎఱసంజ నెఱసివిరసెం, జిఱుచీఁకటులెగసి గగనసీమఙ్ బలసెఙ్, గుఱకుఱతెగలైకనఁబడి, తఱచైవెను వెనుక పెక్కుతారలుదోఁచెఙ్." రామా. ౭, ఆ.

**కుఱితినువ్వులు.** దే. వి. బ. తిలవిశేషము.

**కుఱు.** దే. విణ. వృత్తియందుఁ గుఱుచశబ్దమునకుమీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (ఉదా. కుఱుగద్దియ, కుఱుగనుపు, కుఱుగతి, కుఱుగేలు, కుఱుమాపు. మొ. అచ్చుపరమగుచో ఱకారమునకు టకారద్వయ మాదేశంబగు. కుట్టారుగ, కుట్టుముక, కుట్టుసుఱు, కుట్టూపిరి, కుట్టూరుపు, మొ.)

**కుఱుకు.** దే. వి. ప్రోవు, రాశి. "మ. కుఱుకుల్ గట్టెభటాంగకంబులురణక్షోణింబ్రవాహంబులై, పఱచెఙ్ నెత్తురు." భార. ద్రో. ౪, ఆ.

**కుఱుగడ.** ద్వ. వి. (కుఱుచ+గడ.) దండము. "విఱిగిపడినకుఱుగడలును." జై. ౫, ఆ.

**కుఱుచ.** దే. వి. 1. హ్రస్వస్వరము. 2. బ. నాట్యవిశేషము. "హారముల్ కుఱుచలు ద్రొక్క." వసు. ౫, ఆ.—విణ. హ్రస్వము. (కొన్ని యెడలవృత్తియందంత్యవర్ణలోపము. చూ. కుఱు.)

**కుఱుచపడు.** ద్వ. అ. క్రి. తగ్గు.

**కుఱుపు.** దే. వి. వ్రణము.

కుఱుమట్టము. దే. విణ. వినతము, వినమ్రము. "క. వెఱచుచు వంగుచు వ్రాలుచు, నఱిముఱిగుబురు లకుఁజనుచు హరిహరియనుచున్, మఱుఁగుచు ను లుకుచు దిరదిరఁ, గుఱుమట్టపుఁబొట్టివడుగుకొం తనటించెన్." భాగ. ౮, స్కం.

కుఱుమాడు. దే. వి. ఇంటిమూలకప్పు.

కుఱువు. దే. వి. తొడ, ఉత్సంగము. "ఎ, గీ. కుఱు వుపైనున్న కిన్నరయుఁబకత్రోచి." పాండు. ౫, ఆ.

కుఱ్ఱ. దే. వి. 1. కోడెయొనుపోతు; 2. కొడుకు; "గీ. ఎన్నఁగొమరులుకల్గకయున్న వారి, కిందునందు నునెమ్మదిపొందదనుచుఁ, బుడమి వేలుపుఁబెద్దలు నుడువుచుందు, రట్లగుటఁగుఱ్ఱలీఁక నాకునబ్బవల యు." అచ్చ. బాల, కాం.—౩. బాలుఁడు; "గీ. కోరు మెద్దియైనఁగుఱ్ఱనీవు." భాగ. ౭, స్కం.— 4. బిడ్డఁడు.

కుఱ్ఱఁడు. దే. వి. 1. కొడుకు; 2. బాలుఁడు; 3. బిడ్డఁ డు. "సీ. కొడుకుఁగుఱ్ఱఁడుచన్నుఁగుడువకట్లుం డవిచారించి మేదరసానియపుడు." పర. ౧, ఆ.

కుఱ్ఱి. దే. వి. పాఁడియావు, ధేనువు. "అంతధనంబు నునట్టిరాజ్యమున్, గొననగునయ్యయిచ్చిడిపికు ఱ్ఱికి." భార. ఆది. ౭, ఆ.

కుఱ్ఱు. దే. అ. క్రి. కూయు.

కులకము. సం. వి. అ. న. 1. ఒకక్రియతో ముగిసె డు పద్యముల సమూహము; 2. చేఁదుపొట్లꠑ. పుం. 1. కాకితుమ్మికꠑ; 2. పుట్ట.

కులకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కులశ్రేష్ఠుఁడు.

కులట. సం. వి. ఆ. స్త్రీ. అసతి, అంకుటాలు.

కులపర్వతము. సం. వి. అ. పుం. ప్రధానపర్వతము. (ఇవి. ౭. "మహేంద్రోమలయస్సహ్యశ్శుక్తి మాన్ గంధమాదనః, వింధ్యశ్చపారియాత్రశ్చస ప్తైతేకులపర్వతాః." త్రికాండశేషము.)

కులపాలిక. సం. వి. ఆ. స్త్రీ. తల్లిదండ్రులచేనిచ్చి పెండ్లిచేయఁబడిన స్త్రీ.

కులము. సం. వి. అ. న. 1. వంశము; 2. తెగ; 3. ఇ ల్లు; 4. ఊరు; 5. శరీరము; 6. చేఁదుపొట్లꠑ.

కులసంభవుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మంచివంశ మునందుఁ బుట్టినవాఁడు.

కులస్త్రీ. సం. వి. ఈ. స్త్రీ. కులపాలిక.

కులాయము. సం. వి. అ. పుం. 1. పక్షిగూఁడు; 2. చోటు.

కులాలము.꠹సం. వి. అ. పుం. పక్షివిశేషము, గంపపు లుఁగు.

కుళాయి. హిం. వి. తలమీఁదనుంచు టోపి.

కులాలి. సం. వి. ఈ. స్త్రీ. కనుపాలవిత్తులు.

కులాలుఁడు. సం. వి. అ. పుం. కుమ్మరవాఁడు.

కులి. సం. వి. ఈ. స్త్రీ. వాఁకుడుꠑ. ఇ. పుం. చేయి. "కులిర్హస్తోభుజాదళః." త్రికాండశేషము.

కులికము. సం. వి. అ. పుం. 1. ఒకానొక చెట్టు; 2. ఒకానొక పాము.

కులికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కులశ్రేష్ఠుఁడు.

కులిశము. సం. వి. అ. పుం, న. వజ్రాయుధము. పుం. మత్స్యవిశేషము.

కులీనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మంచికులమునఁ బుట్టినవాఁడు.

కులుకము. సం. వి. అ. న. నాలుక మఱికి.

కులుకు. దే. అ. క్రి. శృంగారముగ కుదులు. స. క్రి. 1. పూయు; "చ. అలఘుతదీయఖేలనలనాడెడున న్నులగుబ్బచన్నులన్, గులికినయేణనాభినవకుం కుమసంకుమదాంకపంకసం, కలితవిలేపముల్ కరఁగిగమ్మనికమ్మనితావులీనఁద, జ్జలములఁదేలిభో గులనఁజాలిరిచెల్వపుఁజిల్వపెందొరల్." హన. ౧, ఆ.—2. పోయు; "సీ. గొజ్జంగపూనీరుకులికి మేదించినకమ్మకస్తురిమేనఁగలయనలఁదు." కాశీ. 3, ఆ.—3. వెదచల్లు; "నాగరదధిగంధముల్ కులుకు కట్టుప్రసాదపుమూటతోడుతన్." పర. ౪, ఆ.— 4. వేయు. "క. గంబూరకులికియనురా, గంబూ రమునంబుచల్లఁగాఁబన్నిటన్, బింబోష్ఠియతని పాదా, బ్జంబుంగడిగిం చెఁగూర్మిసకియలచేతన్." సా. ౨, ఆ.—అం. ప్రే. కుదిలించు. "ఎ, గీ. పల్లఱును దేఁటిచిన్నిపాపలకుఁగులికి, పువ్వుఁదే నియయుగ్గులుపోసిపోసి." య. ౪, ఆ. — వి. 1. శృంగారపుకుదిలిక; (కులుకులాఁడి. మొ.) 2. ఒణఁకుట. "సీ. పసివాల్గువాడెడువదనాబ్జముల తోడ నలపుఁదెల్పెడుకుల్కుటెలుఁగుతోడ." పర. ౪, ఆ.

కులుకులాఁడి. దే. వి. (కులుకులు+ఆఁడి.) కులుకు గల స్త్రీ.

కులుప. దే. వి. శోఫ.

కుల్మాషము. సం. వి. అ. న. పులియఁబెట్టిన కడుగు నీరు. (కుల్మాషాభిషుతమని యేకపదముగాఁగొం

దఱు.) పుం. 1. గుగ్గిళ్లు; 2. గోధూమవిశేషము. యవవిశేషము. (అని కొందఱు.)

**కుల్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. కాలువ; 2. నీళ్లుపోయెడు త్రోవి; 3. తిప్పతీఁగ. అ. న. ము. 1. ఎముక; 2. తొలిచినకొండదొన; 3. మాంసము; 4. మానవిశేషము. విణ. 1. మంచికులమునఁబుట్టినది; 2. కులమునకు హితమైనది.

**కుల్యుఁడు.** సం. వి. అ. పుం. గౌరవింపఁదగిన మనుష్యుఁడు.

**కువ.** దే. వి. కువ్వయొక్క రూపాంతరము. "క. వివిధాస్త్రకోవిదుఁడువా, సవివానిరథంబురథ్యసారథులమహిఙ్, గువలువడ నేసెనుగ్రా, హవమునకునువాఁడువిముఖుఁడై వడిఁబఱవఙ్." భార. ఆది. ౬, ఆ.

**కువలము.** సం. వి. అ. న. 1. కలువ; 2. ముత్యము; 3. రేఁగుఁబండు. త్రి. రేఁగు*.

**కువలయము.** సం. వి. అ. న. ఉత్పలము, కలువ.

**కువలాయికము.** సం. వి. అ. పుం. హంసజాతివిశేషము.

**కువాడము.** వై. వి. కువ్వాడముయొక్క రూపాంతరము.

**కువాదుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పరులదోషమును పలుకువాఁడు. నికృష్టపుమాటలాడువాఁడు. (అని కొందఱు.)

**కువాళము.** యు. దే. వి. వాహనములోనగువానిగవుసెన. "సీ. వాహనాద్యాచ్ఛాద్యవస్త్రసంజ్ఞ, తనరుఁగువాళమంచనఁగ." ఆం, భా. ద్వి. ము.—వై. కపటము*. (ఈ యర్థమునందిది కువాడముయొక్క రూపాంతరము.)

**కువిందుఁడు.** సం. వి. అ. పుం. తంతువాయుఁడు, సాలెవాఁడు.

**కువేణి.** సం. వి. ఈ. స్త్రీ. చేఁపలఁబట్టివేయుబుట్ట.

**కువేలము.** సం. వి. అ. న. కువలము, కలువ.

**కువ్వ.** దే. వి. కుప్ప, రాశి.

**కువ్వాడము.** వై. వి. కపటము*.

**కుశ.** సం. వి. ఆ. స్త్రీ. త్రాడు. అ. న. ము. నీళ్లు. పుం, న. దర్భ. పుం. 1. ఒక ద్వీపము; 2. పలుపు.

**కుశలము.** సం. వి. అ. న. 1. క్షేమము; 2. తృప్తి; 3. పుణ్యము. విణ. నేర్పరి.

**కుశాలు.** హిం. వి. సంతోషము.

**కుశి.** సం. వి. ఈ. స్త్రీ. కఱ్ఱు. ఇనుములోఁజేసిన వస్తువు. (అని కొందఱు.)

**కుశికము.** సం. వి. అ. పుం. అయోవికారము.

**కుశికుఁడు.** సం. వి. అ. పుం. విశ్వామిత్రునితండ్రి.

**కుశీలవుఁడు.** సం. వి. అ. పుం. 1. నానాదేశసంచారకుఁడైన నట్టువుఁడు; 2. నానాదేశసంచారకుఁడైన బట్టువాఁడు; 3. వాల్మీకి.

**కుశుఁడు.** సం. వి. అ. పుం. రామునిపెద్దకొడుకు. విణ. 1. పాపముచేసినవాఁడు; 2. మదించినవాఁడు.

**కుశేశయము.** సం. వి. అ. న. పద్మము, తామర.

**కుషీ, ఖుషీ.** హిం. వి. సంతోషము.

**కుష్ఠము.** సం. వి. అ. న. 1. వ్యాధివిశేషము, పులుము; 2. చెంగల్వకోష్టు*. పుం. విషభేదము.

**కుసి.** దే. వి. గండియందుఁ జొప్పించుటకుఁగాను సన్నఁగాఁజెక్కిన మంచపుపట్టెలోనగువానిచివర. "గీ. కూలినప్పుడరయఁగు సులెల్లవిఱుగును."

**కుసిగుంపులు.** దే. వి. బ. శ్రమము, బాధ. "సీ. కుసిగుంపులిడకేగు కొన్నయంగడిలోన మాఱుబేరములేలెమంజువాణి." చంద్ర.

**కుసిలించు.** దే. అ. క్రి. అతృప్తిచే దుఃఖించు.

**కుసిలింత.** దే. వి. అతృప్తిచే దుఃఖించుట.

**కుసిని.** అన్య. దే. వి. వంటయిల్లు.

**కుసీదము.** సం. వి. అ. న. వడ్డికిచ్చి జీవనముచేయుట. విణ. డు. వడ్డికిచ్చి జీవనముచేయువాఁడు.

**కుసీదికుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) వడ్డికిచ్చి జీవనము చేయువాఁడు.

**కుసుంభము.** సం. వి. అ. న. 1. కుసుమపువ్వు; 2. బంగారు. పుం. కమండలువు.

**కుసుంభరాగము.** సం. వి. అ. పుం. బయటికిమాత్రము విశేషముగాఁగనఁబడి లోపల బొత్తిగాలేని అనురాగము. (చూ. పూర్వరాగము.)

**కుసుమ.** యు. దే. వి. 1. ఒకానొకచెట్టు; 2. [illegible] విశేషము. బ. ధాన్యవిశేషము. "మ. సొండిఁబేర్చినతీఁగమల్లియలు ఖర్జూరంబులుం బుప్పమంజరులుఙ్ మామిడిగుత్తులుఙ్ గుసుమలుఙ్ [illegible] పెంగలుఙ్ బచ్చగ, న్నెరుపూఁబాళలుఁగల్గి [illegible] జనముకాంతిందారుముల్ సూపిచే, లరుదారఙ్ గుఁబూవుఁదోఁటల బలాకానీకదంభంబునఙ్." ఆము. ౧, ఆ. — వై. వి. 1. కుసుంభపుష్పము; "సీ. పసిఁడికమ్ములతోడి కుసుమపూవన్నియ నిద్దంపుఁబుట్టంబుసెఱయఁగట్టి." కాశీ. ౭, ఆ.— 2. కుసుంభవర్ణము*. "ఎ, గీ. కుముదకేదారమునసుండిక్రొత్తవిరియు, కమలషండంబులకు వేడ్క

గాఁ పువచ్చు, కోదమతుమ్మెదకడ యెక్కుఁ గుసుమ వెక్టె, నభినవంబైన ప్రథమ సంధ్యాగమంబు." నై. ౮, ఆ.

కుసుమము. ఉభ. వై. వి. కుసుంభవర్ణము*. "క. కుసుమంబద్దినవిధమునఁ, బసుపునహత్తించినట్లు బంగారమునన్, బసనిచ్చినగతిసంధ్యా, వసరంబుననింగియరుణవర్ణంబయ్యెన్." నై. ౮, ఆ.—దే. బ. ధాన్యవిశేషము. "సీ. బలుతీఁగమల్లెలుపార్జించి తిమి చాలఁ గుసుమముల్ చేలుకగాఁ గూర్పలేమె." కవి. ౧, ఆ.—సం. వి. అ. న. 1. పువ్వు; 2. కంటితెవులు; 3. స్త్రీరజస్సు; 4. పండు.

కుసుమాంజనము. సం. వి. అ. న. పుష్పాంజనము.

కుసుము. దే. వి. పుండువందలి మొలక.

కుసుమేషువు. సం. వి. ఉ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

కుసులు. దే. అ. క్రి. కుసిలించు.

కుసూలము. సం. వి. అ. పుం. ధాన్యముంచెడుగరిసె.

కుసృతి. సం. వి. ఈ. స్త్రీ. నికృతి, కుత్సితభావము.

కుస్తరించు. దే. స. క్రి. 1. ఊఁటడించు; "గీ. స్వాగతము చేయు నేనాకుఁ జంద్రమౌళి, కాంక్షితంబిచ్చు నేనాకుఁ గాళగళుఁడు, కాశిలోఁ బద్ధమానభంగంబువాయఁ, గుస్తరించు నెననుకూలి కుంభజన్మ." భీ. 3, ఆ.—2. సమాధానపఱచు; "పంచశరవ్యథన్ దలఁకుభామము నేఁగతిఁ గుస్తరింతు." విక్ర. ౬, ఆ.—3. సవరించు; "సీ. సీమంతపథమునఁ జేర్చుక్క సవరించి కురులపైఁ జిన్నిపూఁగుస్తరించి." కాశీ. ౭, ఆ.—4. చఱచు. "చ. కనఁదగుతెల్లమానికపుఁ గప్పులనొప్పెడు చప్పరాలలోఁ, దనపాదవైననీడఁ గని తాళికయేనుఁగటంచుఁ గొమ్ములన్, జెనకఁగవచ్చికోటపయిఁ జేసిన ముత్తెపు సింగపుంగమిన్, గనుఁగొని తాలువేల్పదొరగా రతఁ డొదలఁ గుస్తరింపఁగన్." య. ౧, ఆ.

కుస్తుంబరి. సం. వి. ఈ. స్త్రీ. ధాన్యాకము, కొత్తిమిరి.

కుస్తుంబురువు. సం. వి. ఉ. న.——వై.——

కుస్తుభుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు. సముద్రుఁడు. (అని కొందఱు.)

కుహకము. సం. వి. అ. పుం. వంచన, మోసము.

కుహనుఁడు. సం. వి. అ. పుం. జారుఁడు, అంకుమగఁడు.

కుహన. సం. వి. ఆ. స్త్రీ. అర్థాపేక్షచేతనగు కపటచర్య. అ. పుం. ము. 1. ఎలుక; 2. పాము. విణ. ఈర్ష్యగలది.

కుహరము. సం. వి. అ. న. 1. గుహ; 2. బెజ్జము. పుం. ఒకానొకపాము.

కుహళి. సం. వి. ఆ. స్త్రీ. కాళె. "దిక్పథవాటీకుహళింబ్రతిధ్వనులుసంపాదింప." జై. ౫, ఆ.

కుహళి. సం. వి. ఈ. స్త్రీ. పోఁకపొత్తి. (చూ. పొత్తి మూఁడవయర్థము.)

కుహాళి. సం. వి. ఆ. స్త్రీ. కుహళియొక్క రూపాంతరము. "కాహళీతుకుహాళాస్యాత్." అ, పా. ప్ర. నాట్య.

కుహువు. సం. వి. ఊ. స్త్రీ. 1. చంద్రకళకానరాని యమావాస్య; 2. కోకిలధ్వని.

కుహేళిక. సం. వి. ఆ. స్త్రీ. ధూమిక, మూఁడమంచు.

కుళాయ. వై. వి. కుళ్లాయయొక్క రూపాంతరము. "క. ఉరములమణిహారంబులు, కరములఁ గటకాంగుళీయకప్రముఖములున్, శిరములమిసిమికుళాయలు, ధరియించిచెలంగిరఖిలతరుచరముఖ్యుల్." ఉ, రా. ౫, ఆ.

కుళింగము. సం. వి. అ. పుం. అడవిపిచ్చుక.

కుళీరము. సం. వి. అ. పుం. కర్కటకము, ఎండ్రకాయ.

కుళుత్థము. సం. వి. అ. పుం. ఉలవలు.

కుళుత్థిక. సం. వి. ఆ. స్త్రీ. కనుపాలవిత్తులు.

కుళువు. దే. వి. ఉఁగరమునకుఁ బొదిగెడు విశాలమగు మణివిశేషము. "చ. సరసిజసంభవుండుపురసారసగేహినికిన్ రచించునవ, చ్చెరువగునీలపుఁగుళువు చెక్కినమేలిపసిండిముద్దుటుం, గరమనమింటితోనారయికన్ గనుపట్టెడుగోపురస్ఫురద్గురుతరశాతకుంభ రుచి గుంభిత సాలము పీట మీటగున్." చంద్రా. ౧, ఆ.

కుళ్లా. వై. వి. కుళ్లాయయొక్క రూపాంతరము. "జిగిపొంగుబురుసాపనిబెడంగుగలకుళ్లా నింగికిఁద శతశలాసంగ." రా, వి. ౨, ఆ.

కుళ్లాయ. వై. వి. పటరచితమకుటము. "క. తలగలిగిన కుళ్లాయలు, కలవు." సా. ౨, ఆ.

కుళ్లు. దే. అ. క్రి. క్రుళ్లుయొక్క రూపాంతరము.

కుళ్లుపోతు. దే. విణ. క్రుళ్లుపోతుయొక్క రూపాంతరము.

కూ.

కూ. దే. అవ్య. పిలువఁగా పామరజనులెచ్చరించుకొనుటయందు వచ్చును.

**కూఁక.** దే. వి. అఱపు. "క. ఆఁకట మలమల మాఁడు చుఁ, గూఁకలువెట్టుచును బయటఁ గువలయును రుల, ట్రాఁకల నుండఁగ నీకీ, వీఁకఁ భుజియింప దగునె విప్రవరేణ్యా." శేష. ౧, ఆ.

**కూఁకటి.** వై. వి. 1. జుట్టు*; "గీ. వాఁడియైనకత్తి వాతియమ్మునుగొని, పగతుశిరముచెక్కలెగయ గొఱిగి, నరులకెల్లఁజూడనవ్వగునట్లుగాఁ, గలయ నైదుకూఁకటులనొనర్చె." భార. అర. ౬, ఆ. —2. పిల్లజుట్టు*; "సీ. ఉదకబిందుకలాపముట్టి యుట్టిపడంగఁగర మొప్పుముద్దుకూఁకట్లతోడ." సం. "తోయార్ద్రకాకపక్షాగ్రమ్." కాశీ. ౪, ఆ.—విశ. ప్రధానము. "కూఁకటివేణితోఁగురులుకూడకమున్న." కళా. ౧, ఆ. (ఇట్లు కూఁకటివేరు. మొ.)

**కూఁకటికువ్వె.** ద్వ. వి. పక్షివిశేషము.

**కూఁకటిమూఁగ.** ద్వ. వి. పక్షివిశేషము, కళింగము.

**కూఁకరించు.** దే. అ. క్రి. కూఁకలువేయు. "లేచి వారినిగూఁకరించిపోవు." సత్య. ౪, ఆ.

**కూఁత.** దే. వి. కూయుట.

**కూఁతకైదువు.** దే. వి. శంఖము.

**కూఁతనేల.** దే. వి. కోసునేల, క్రోశము.

**కూఁతపట్టు.** దే. వి.——పై.——

**కూఁతవేటు.** దే. వి.——పై.——"సీ.వినుమిచ్చటికిఁ గూఁతవేటుదూరంబునఁ గలదొక్కహ్రదమునిర్మలజలంబు." హరిశ్చ. 3, ఆ.

**కూఁతురు.** దే. వి. కొమార్తె, పుత్రిక.

**కూఁతురుబుడమ.** దే. వి. ఏలావాలుకము?.

**కూకీ.** దే. వి. పారావతవిశేషము. (కొందఱు హ్రస్వాంతముగాను వ్రాసియున్నారు.)

**కూకు.** దే. వి. పాలవిఱుగుడు, ఆమిక్ష. "సీ. ఆమిక్షసంజ్ఞయైయలరుఁగూకు." ఆం, భా. ద్వి. బ్ర.

**కూకుదుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) వరుని సత్కరించి యలంకృతురాలగు కూఁతునిచ్చువాఁడు.

**కూకురుగుండఁగి.** దే. వి. పక్షివిశేషము, దాత్యూహము.

**కూచి.** దే. విశ. 1. (యుద్ధయాత్రకు సైనికులు హెచ్చరికపడుటకై) యుద్ధవాద్యములను వాయించుట; "వ. అప్పుడుభయపార్శ్వవర్తులైబలసికలసిరాలిచియున్న చంద్రాదులవిలోకించిపయనం బయిరండు పొండనిపంచి కూచిసేయ నియమించి." చంద్రా. 3, ఆ.—2. వాఁడి. "ఉ.చూచుతఱిఁ మనోభవుఁడుచొచ్చి పరస్పరవీక్షణంబుల, న్కూచిమెఱుంగుబల్ చిలుకుఁగోలలపాలయి నొచ్చియెందునా,పోచనలేనియానరవరాత్మజులంజిగురాకుఁగత్తిచేఁ, గాచుటలేకయప్పునఁ బడఁగేఁ వడిసజ్జనజ్జగఁ." చంద్రా. ౨, ఆ.

**కూచిమారుఁడు.** సం. వి. అ. పుం. పురుషజాతులు నాల్గింటిలో నొక జాతివాఁడు.

**కూచేము.** దే. వి. 1. గూటము; 2. స్తంభము.

**కూజా.** హిం. వి. పాత్రవిశేషము.

**కూటకము.** సం. వి. అ. న. ఏఁడికోలలేని నాఁగలి, గొడగ. పుం. వెండ్రుకలకొప్పు.

**కూటమి.** దే. వి. 1. కూడిక; 2. సురతము.

**కూటము.** ఉభ. దే. వి. 1. కొలువుకూటము; "క. అలుకుఁడుమృగమదమునన్ము, గ్గులువెట్టుఁడుకప్పురమునఁగుంకుమమునగో, డలుపూయుఁడుమణిదామక, ములుగట్టుఁడు పెద్దకూటమునసాంపారఁ." భార. ఉద్యో. 3, ఆ.—2. చౌసడి. సం. వి. అ. పుం, న. 1. అమ్ము; 2. ఆకాశములో నగునది; 3. కపటము; 4. కట్టు; 5. కొండకొమ్ము; 6. గవను; 7. గారడము; 8. దుఃఖము; 9. ప్రోగు; 10. బొంకు; 11. బోను; 12. సంపెట. పుం. 1. ఇల్లు; 2. వితిగిన కొమ్ముగల యెద్దు.

**కూటశాల్మలి.** సం. వి. ఇ. స్త్రీ. కొండబూరుగు?.

**కూటస్థము.** సం. విశ. (అ. ఆ. అ.) ఎల్లకాలము నొక్కరూపయియుండెడు నది. (ఆకాశాదికము.)

**కూటాగారము.** సం. వి. అ. న. మేడమీఁది యిల్లు.

**కూటాము.** దే. వి. కూటముయొక్కరూపాంతరము.

**కూటినీళ్లు.** దే. వి. బ. పుల్లనీళ్లు, ఆరనాళము.

**కూటిముత్యము.** ద్వ. వి. మనుష్యులచేఁ జేయఁబడునట్టి ఒకదినుసు ముత్యము.

**కూటు.** దే. వి. ధాన్యముంచుటకు వెంటితోఁ నేర్పఱచెడు గరిసె.

**కూటుఁడు.** సం. వి. అ. పుం. త్రాయితోలుచువాఁడు, కాసీఁడు.

**కూటువ.** దే. వి. 1. గుంపు; "క. తావలారకొదమజక్కవ, కవలారకడిందిసోయగపుఁదుమ్మెదకూటువలారమీరిపుడుమా, నవలారతనంబుఁజూచినారేచెపుడా." అచ్చె. అర, కాం.—2. ప్రోగు. "క. వీటీపాటీరాగరు, హాటకతాటంకమణిమ

యాభరణంబుల్, కూటువలుగనిడిరొయ్యదనీక, జో
టీమాటాడిముద్దుచూపంగదవే." రసి. 3, ఆ.

కూటువమూఁక. దే. వి. ప్రోత్సాహపఱచి యక్కడక్కడ వెదకి తెచ్చిన పిటికిబలము. "చ. అడవులఁగొండలంబడి మహాపదరూపతి చన్న వారిని, ప్పుడుకొనివచ్చికృష్ణుఁడొక ప్రోవుగఁగూటువ మూఁకఁగూర్చినన్." భార. ఉద్యో. ౨, ఆ.

కూటువు. దే. వి. 1. గుంపు; "సీ. చవులతోఁ జెందొవపువులతోనసలుఁబుట్టువులతోఁ జిలుకకూటువులతోడ." అచ్చ. అర, కాం.—2. ప్రోగు. (చూ. కూటువ.)

కూడ. దే. ద్ర. సహితమనునర్థమును దెలుపునది. "వ. కృష్ణుండుపురాతనచన్నుఁ బాలతోడంగూడఁ బ్రాణంబులుఁ గ్రోలుటయును." వి, పు. ౭, ఆ.

కూడఁబడు. ద్వ. అ. క్రి. (కూడన్+పడు.) చేరు. "క. ఇత్తెఱఁగునసభలోపలఁ దత్తఱమునఁగూడఁబడినదర్పితసామం, తోత్తములలోనవిపదుఁడు, మత్తద్విపలీలమనసుమండనిటులనున్." ఉ, హరి. ౫. ఆ. (స్వార్థమున పడు.)

కూడఁబెట్టు. దే. స. క్రి. (కూడన్+పెట్టు.) 1. చేర్చు; "క. కట్టకకుడువక యొరులకుఁ, బెట్టక తమతండ్రి కూడఁబెట్టినసిరిఁదాఁ, గట్టియుఁగుడిచియు నొరులకుఁ, బెట్టియుఁదనయిచ్చ వెచ్చపెట్టఁదలంచెన్." విక్ర. ౨, ఆ. — 2. తార్చు.

కూడముట్టు. దే. స. క్రి. తలుముకొనిపోవు.

కూడలి. దే. వి. రెంటిమూటికూడిక. (కూడలిత్రోవ.)

కూడలితాయి. దే. వి. ఎల్లతాయి.

కూడలివాయి. ద్వ. వి. రెండు పంచలు చేరెడు మూల నేర్పఱచిన నీటిదారి.

కూడిక. దే. వి. చేరిక, సంయోగము.

కూడు. దే. అ. క్రి. తగు. "కూడునెసమయంబుదప్పఁగ." భార. శాం. ౧, ఆ.—స. క్రి. పొందు. అం, ప్రే. కూర్చు. (లెక్కఁగూడు, సుతిఁగూడు.)—వి. అన్నము.

కూడుదల. దే. వి. లాభము.

కూణి. సం. విణ. ఇ. కుణియొక్కరూపాంతరము.

కూన. వై. వి. 1. పిల్ల; 2. బిడ్డ. "క. కూనలఁగానలకుఁ బనుపుకొనసేరుతుశే." అచ్చ. బాల, కాం.

కూనగుంత. వై. వి. మీటమొదలు ఆనెడు పల్లము. "గీ. మ్రానుమీటుగ సెగయ గోమాయువప్పు, డేకతాళప్రమాణమల్లగసికూన, గుంతలోఁబడిగ్రుడ్లు

వెల్కుఱకనాల్గ ... ముడి
డిసిమడిసె." ప...

కూని, ఖూని. హి...

కూపకము. సం. ... ము; 2. పి
తిఁదిమీఁ...

కూపము. ...
3. ఓడ...

కూపారము...
రపారః...
యనిఁగుంటువు.

కూపి. సం. వి. ఈ. స్త్రీ. 1. కుప్పె; 2. గాజుకుప్పె.

కూపెట్టు. దే. అ. క్రి. (కూయి+పెట్టు.) 1. అఱచు; "క. తాఁపించెదనదునపనముఁ, గూపెట్టఁగఁ గాలకంఠుకొడుకు." కాశీ. ౭, ఆ.—2. మొఱయిడు. "క. విపన్నుల్ కూపెట్టినవినితీర్పుము." ఆము. ౪, ఆ.

కూబరము. సం. వి. అ. పుం. బండినొగ. విణ. మనోజ్ఞము.

కూయి. దే. వి. 1. మొఱ; "గీ. అకటయాఁడుకూయిఁ జాలకూయినిలాఁతి, వారికైననరయవలయునని న." భార. విరా. ౨, ఆ.—2. రక్షణము. "చ. అసమునమీఁదెఱుంగక మహాగ్రహవృత్తిఁగడంగిచెచ్చెరన్, బసులకుఁగూయిగాఁ జనియెఁబాపఁడు." భార. విరా. ౫, ఆ.

కూయు. దే. అ. క్రి. 1. అఱచు; 2. మొఱపెట్టు.

కూర. వై. వి. 1. వ్యంజనము*; 2. తోఁటకూరవంకాయలోనగునది*.

కూరటు. దే. వి. పొరలుట.

కూరపసుపు. దే. వి. కూరలలో చేర్చెడు పసుపు.

కూరము. సం. వి. అ. న. అన్నము, వంటకము.

కూరాడు. దే. వి. కాఁచిన కలి.

కూరిచి. దే. అవ్య. ఉద్దేశార్థమునందు ద్వితీయావిభక్తితో చేరివచ్చునది. (రామునిఁగూరిచి, సోమునిఁగూరిచి.) (రూ. కూర్చి.)

కూరిమి. దే. వి. చెలిమి, స్నేహము, (రూ.) కూర్మి.

కూరు. దే. అ. క్రి. 1. కలుగు; "క, శోకము, గూరన్ గద్గదికనెలుఁగుకుత్తుకఁదగులన్." భార. భీష్మ. ౨, ఆ.—2. దుస్సిపోవు. "వాఁడికైదువుల్ కూరఁగనాటినన్." భార. ఉద్యో. 3, ఆ.— స. క్రి. పొందు. "కుజనులువృద్ధింగూరుదురు." హరి. ఉ. ౯, ఆ.

[redacted] ౖంమ. ("ఉ. ఘృతంబతి [redacted] ాత్రికికూర్కి_యాక్షణము గొ [redacted] యనఁ." ఇక్కడ కూరుకు [redacted] గామండుట అని యర్థము. [redacted] ద్ర. "కూరుకురాదు రేయినా [redacted] ం, స్కాం. పూ. (రూ. కూ [redacted] చొచ్చు. అం, ప్రే. చొప్పిం చుట కుక్కు. (రూ. కూర్కొను. చొచ్చుటకు.— "కూర్కుల్ కూర్కొనెఁ గంట." రామా. 3, ఆ.- ప్ర న్కొటకు.—"సీ. ఏనుఁగంతను సుతుండు, గు ...నిరురుండుఁ గూర్కొని కూర్కొని చెప్పు ... శేష కార్య, వచనములు." భార.

కూ... ద్రు. ప్రే. కూడఁబె ట్టు. (... కుటకు. — "ఇత వికిఁ గూర్తు ... ా. ౨, ఆ.)

కూరఁ చేండు. దే. అ. ... (కూ... ) ఆసీ నుఁడగు. "నడచు ... " కాశీ. ౫, ఆ. (రూ. కూర్చుండు.)

కూరుపరి. దే. విశ. (కూరుపు+అరి.) కూర్చునట్టివాఁ డు, ఘటకుఁడు, (రూ.) కూర్పరి.

కూరుపు. దే. వి. ఘటన, (రూ.) కూర్పు.

కూర్చము. సం. వి. అ. పుం, న. 1. దర్భపిడికిలి; 2. కనుబొమలనడుము; 3. పెరిగినమీసగడ్డము లు; 4. మెచ్చు; 5. మోసము.

కూర్చశీర్షము. సం. వి. అ. పుం. జీవకమనెడి గంధద్ర వ్యము?.

కూర్చిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కుంచెకోల; 2. జున్ను; (ఇది ద్వివిధము — దధికూర్చిక, తక్రకూర్చిక.) 3. చిత్రము వ్రాసెడు తూలిక; 4. మొగ్గ; 5. సూది.

కూర్చుండఁబడు. ద్వి. అ. క్రి. (కూర్చుండక్ + పడు.) కూర్చుండు. "గీ. ఇంతపాపంబు చేయంగ నెత్తికొం దు, రయ్యరాజ్యలోభంబున నఖిలబంధు, జనులవ ధియింపఁ దొడఁగితి నిరర్థంబు, మీఁదఁ గూర్చుం డఁబడియెఁ జేయూఁదికొనుచు." భార, భీష్మ. ౧, ఆ. (స్వార్థమున పడు.)

కూర్పరము. సం. వి. అ. పుం. 1. మోఁచెయి; 2. మోఁకాలు.

'కూర్పాసకము. సం. వి. అ. పుం, న. 1. అరచట్ట; 2. రవిక.

కూర్మము. సం. వి. అ. పుం. 1. తాఁబేలు; 2. ఒక య పవాయువు. (చూ. వాయువు.)

కూలంకష. సం. వి. ఆ. స్త్రీ. ఏఱు. అ. పుం. ము. సముద్రము.

కూలఁబడు. ద్వి. అ. క్రి. (కూలక్ + పడు.) కూ... పడు. "కూలఁబడెఁ దెశల్." రామా. ... (స్వార్థమున పడు.)

కూలము. సం. వి. అ. న. 1. దరి; 2. గుంట; 3. వ ట్టిలోనగువాని దిబ్బ; 4. మూఁకవెనుక.

కూలి. దే. వి. 1. పనిచేసినదానికిఁ గాని చ్చెడు ధ నము; "గీ. వేదవిదుని చేతవిన్నాణి చేతను, ... చేతఁ బిన్నదాని చేత, రాయబారి చేత ... చేతఁ, గూలిపుచ్చుకొనుట చాలఁ దప్పు." ... ప్రా, కాం. – 2. ... "గీ. ... లోనన్న ... గేణ్య, ... మమమ్ముఁ, గావఁ బూనినక ... గాదెయొఁ చింతయొఱుఁగక రేలు నిద్రింతు మేము." సా... ౫, ఆ.

కూలు. దే. అ. క్రి. 1. పడు; (చూ. కూలుచు.) 2. చ చ్చు; "ఉ. కూలెదువారె పాండవులు ఘోరపుఁ బోరనొకండొకండయీ, చాలెదువార లెల్లను నుజావఁ గ్రమంబున సేనలన్నియుఁ, గూలఁగఁ గౌరవుల్ పి... గూలుదురు." భార. ఉద్యో. ౨, ఆ.

కూలుచు. దే. ప్రే. 1. పడఁజేయు; 2. చంపు. (రూ. కూల్చు. పడఁజేయుటకు.—"గీ. దుష్టచిత్తుఁడైన కష్టదుర్యోధను, శిరముఁ దన్ను వాఁడ ధరణిఁ గూ ల్చి." భార. సభా. ౨, ఆ.)

కూష్మాండము. సం. వి. అ. పుం. 1. గుమ్మడి?; 2. పిశా చభేదము; 3 భ్రూణవిశేషము. (రూ. కూశ్మాం డము.)

కూసము. వై. వి. కుప్పసముయొక్క రూపాంతరము.

కూళ. వై. విశ. 1. క్రూరుఁడు; "పూవిలుతుఁడు కూ ళవాఁడి డెడి వేదనకోరువఁజాల." రసి. 3, ఆ.– 2. కుత్సితుఁడు*. (చూ. కూళుఁడు.)

కూళుఁడు. వై. విశ. 1. కుత్సితుఁడు*; "క. పండుగ పబ్బంబైనను, గొండనిరొయికకాసునీనికూళునినీ సీ, లండును వెడలఁగఁ దోలుము, బంటాటము పేని వలపు పనికాదిచటన్." భల్లా. ౫, ఆ.—2. మూ ఢుఁడు*. "ఉ. లాలిత రూపయౌవన విలా ... నోహరయైతనర్చునీ, లాలకనిద్రపోఁకలని ...

దటఁగాఁగిట మేలుకొల్పఁగా, జాలకయాత్మఁదక్షిన విచారములొందఁగనూరకుండునా, కూళుఁడుకామరాజ్యమునకుకా వెలిగాఁడె తలంచిచూడఁగక." షో. ౨, ఆ.

## కృ.

కృకణము. సం. వి. అ. పుం. పక్షివిశేషము, కక్కెర.

కృకము. సం. వి. అ. పుం. కంఠనాళము, బొండుగు.

కృకరము. సం. వి. అ. పుం. 1. ఒక యుపవాయువు; (చూ. వాయువు.) 2. కక్కెర.

కృకలాసము. సం. వి. అ. పుం. 1. ఊసరవెల్లి; 2. తొండ.

కృకవాకువు. సం. వి. ఉ. పుం. 1. కోడి; 2. మయిలచాయతొండ; 3. నెమలి.

కృకాటిక. సం. వి. ఆ. స్త్రీ. పెడతల. పెడతలయందలి ముచ్చిలిగుంట. (అని కొందఱు.)

కృచ్ఛ్రము. సం. వి. అ. న. 1. పాపము; 2. బాధ; 3. సాంతపనాదివ్రతము.

కృతకము. సం. విశ. (అ. ఆ. అ.) మనుష్యులచేఁ జేయఁబడినది, కృత్రిమము.

కృతకర్మఁడు. సం. విశ. (న్. ఈ. న్.) నేర్పరి.

కృతకాద్రి. సం. వి. ఇ. పుం. క్రీడించుటకొఱకు నేర్పఱుపఁబడిన పర్వతము, చేతగట్టు.

కృతకృత్యుఁడు. సం. విశ. (అ.ఆ.అ.) కృతార్థుఁడు.

కృతఘ్నుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) చేసినమేలు మఱచినవాఁడు.

కృతజ్ఞము. సం. వి. అ. పుం. శ్వానము, కుక్క.

కృతజ్ఞుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) చేసినమేలు తలఁచువాఁడు.

కృతపడు. మి. అ. క్రి. (కృతము+పడు.) 1.కడచు; "వ. దేవావగచినం గృతపడినకార్యంబు క్రమ్మఱంబొడమునే." భార. కర్ణ. ౧, ఆ.—2. విడఁబడు. "సీ. సురకరులీయద్రిఁజరియించునేనికకొదమలఁగృతపడ్డకొదమలొక్కొ." మార్క. ౧, ఆ.

కృతపుంఖుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) గుఱితప్పక యేయువాఁడు, కృతహస్తుఁడు.

కృతమాలకము. సం. వి. అ. పుం. నల్లగూబ.

కృతమాలము. సం. వి. అ. పుం. ఱేల?.

కృతము. సం. వి. అ. న. ఒక యుగము. క్రి. విశ. చెల్లు. విశ. చేయఁబడినది; 2. నొప్పింపఁబడినది.

కృ...ఖుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) నేర్పరి.

కృతలక్షణుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) గుణములచేతఁ బ్రసిద్ధిఁజెందినవాఁడు.

కృతసాపత్నిక. సం. వి. ఆ. స్త్రీ. అధ్యూఢ, మొదటిపెండ్లాము.

కృతహస్తుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) 1. గుఱితప్పక యేయువాఁడు; 2. నేర్పరి.

కృతాంతము. సం. వి. అ. పుం. 1. అశుభకర్మము; 2. భాగ్యము; 3. సిద్ధాంతము.

కృతాంతుఁడు. సం. వి. అ. పుం. యముఁడు, జేఁకుఁడు.

కృతార్థుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) నెఱవేఱినపనిగలవాఁడు, ధన్యుఁడు.

కృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. చేయుట; 2. ప్రబంధము; 3. ఒక ఛందస్సు; (చూ. ఛందస్సు.) 4. నొప్పించుట. న్. పుం. చదువరి. విశ. 1. నెఱవేఱినపనిగలవాఁడు; 2. నేర్పరి.

కృతుఁడు. సం. వి. అ. పుం. కడుపుకూటివాఁడు.

కృత్తము. సం. విశ. (అ. ఆ. అ.) ఛేదింపఁబడినది.

కృత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. తోలు; 2. ఒకానొక దేవత; 3. చెట్టుపైపట్ట; 4. బుజపత్రి?.

కృత్తిక. సం. వి. ఆ. స్త్రీ. ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము.)

కృత్తివాసుఁడు. సం. వి. స్. పుం. శివుఁడు, ముక్కంటి.

కృత్య. సం. వి. ఆ. స్త్రీ. 1. చేయుట; 2. ఒకానొక దేవత. అ. న. ము. పని. విశ. ధనాదులచే భేదింపఁదగినది. (శత్రుగృహాది.)

కృత్రిమధూపకము. సం. వి. అ. పుం. అనేక పరిమళవస్తువులు కూర్చిచేసిన ధూపము.

కృత్రిమము. సం. వి. అ. న. ఉప్పుదినుసు. పుం. చిల్లమడ్డి. విశ. మనుష్యులచేఁ జేయఁబడినది.

కృత్స్నము. సం. వి. అ. న. 1. కడుపు; 2. నీళ్లు. విశ. అంతయు.

కృప. సం. వి. ఆ. స్త్రీ. దయ, కనికరము.

కృపణము. సం. వి. అ. పుం. పురుగు.

కృపణుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) 1. లోభి; 2. కుత్సితుఁడు.

కృపాణము. సం. వి. అ. పుం. కరవాలము, కత్తి.

కృపాణి. సం. వి. ఈ. స్త్రీ. 1. కత్తి; 2. కత్తెర.

కృపాళువు. సం. విశ. ఉ. కనికరముగలవాఁడు.

కృపీటము. సం. వి. అ. న. 1. కడుపు; 2. నీళ్లు.

కృపీటయోని. సం. వి. ఇ. పుం. అగ్ని, నిప్పు.

కృపుఁడు. సం. వి. అ. పుం. ద్రోణుని మఱఁది.

**కృమి.** సం. వి. ఇ. పుం. 1. పురుగు; 2. చెట్టుమీఁది నల్లపురుగు; 3. లక్క.
**కృశము.** సం. విణ. (అ.ఆ.అ.) 1. బక్క; 2. సన్నము.
**కృశానువు.** సం. వి. ఉ. పుం అగ్ని, నిప్పు.
**కృశానురేతసుఁడు.** సం. వి. స్. పుం. శివుఁడు.
**కృశాశ్వి.** సం. వి. న్. పుం. నటుఁడు, నట్టువుఁడు.
**కృశించు.** సం. అ. క్రి. 1. బక్కటిల్లు; 2. సన్నగిల్లు.
**కృషకము.** సం. వి. అ. పుం. కఱ్ఱు, (రూ.) కృషికము.
**కృషాణుఁడు.** సం. వి. అ. పుం. సేద్యకాఁడు.
**కృషి.** సం. వి. ఇ. స్త్రీ. సేద్యము, కరిసనము.
**కృషికుఁడు.** సం. వి. అ. పుం. సేద్యకాఁడు, (రూ.) కృషకుఁడు.
**కృషీవలుఁడు.** సం. వి. అ. పుం.——పై.——
**కృష్టము.** సం. విణ. (అ.ఆ.అ.) 1. ఒకసారి దున్నఁబడినది; (నేల.) 2. ఈడ్వఁబడినది.
**కృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. దుక్కి. పుం. చదువరి.
**కృష్ణ.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొకయేఱు; 2. ద్రౌపది; 3. ద్రాక్ష*; 4. నీలి*; 5. పిప్పలి*. అ. న. ము. 1. ఇనుము; 2. మిరియము. పుం. 1. నలుపు; 2. కాకి; 3. కోకిలము; 4. దున్న; 5. కృష్ణపక్షము; 6. నల్లనికడుపుగలమండపిచ్చుక. విణ. నల్లనిది.
**కృష్ణకర్ముఁడు.** సం. విణ. (న్. ఈ. న్.) దురాచారుఁడు.
**కృష్ణపాకఫలము.** సం. వి. అ. పుం. కలివె*.
**కృష్ణపాకి.** సం. వి. ఈ. స్త్రీ. నల్లగురిగింజ.
**కృష్ణఫల.** సం. వి. ఆ. స్త్రీ. కారుగచ్చ*.
**కృష్ణభేది.** సం. వి. ఈ. స్త్రీ. కటుకరోహిణి*.
**కృష్ణల.** సం. వి. ఆ. స్త్రీ. గురిజె*.
**కృష్ణలోహితము.** సం. వి. అ. పుం. నలుపుమించఁగలసినయెఱుపు. విణ. నలుపుమించఁగలసినయెఱుపుగలది.
**కృష్ణవర్త్మ.** సం. వి. న్. పుం. 1. అగ్ని; 2. దురాచారుఁడు; 3. రాహువు.
**కృష్ణవల్లి.** సం. వి. ఈ. స్త్రీ. కమ్మెరాకుతీఁగ, నల్లతీఁగ.
**కృష్ణవృంత.** సం. వి. ఆ. స్త్రీ. 1. కలిగొట్టు*; 2. కారుమినుము*.
**కృష్ణసారకము.** సం. వి. అ. పుం. నల్లవెదురు*.
**కృష్ణసారము.** సం. వి. అ. పుం. 1. నల్లయిఱ్ఱి; 2. ఇరుగుడు*; 3. జెముడు*. (రూ. కృష్ణశారము.)
**కృష్ణిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. తవిదలు; 2. నల్లావలు; 3. నల్లపిచ్చుక.
**కృష్ణుఁడు.** సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. అర్జునుఁడు; 3. వ్యాసుఁడు.
**కృసరము.** సం. వి. అ. న. 1. పులగము; 2. శ్రాద్ధమున నిమంత్రితులకు అభ్యంజనకాలమందు కలిపియిచ్చెడు నువ్వులు బెల్లము.
**క్లృప్తము.** సం. విణ. (అ. ఆ. అ.) ఏర్పాటుచేయఁబడినది.
**క్లృప్తి.** సం. వి. ఇ. స్త్రీ. ఏర్పాటు.

## కె.

**కె.** దే. విణ. వృత్తియందు కెంపుశబ్దమునకు మీఁది వర్ణములు లోపింపఁగా మిగిలినరూపము. (దీనికి పరుషసరళములు పరమగునపుడు నుమాగమమును తదితరములు పరమగునపుడు మీఁదిదానికి ద్విత్వమునువచ్చును. కెంగేలు, కెంజేడ, కెంజాయ, కెంజిగి, కెంజిగురు, కెందలిరు, కెందళుకు, కెందామర, కెందొవ, కెంబట్టు, కెంబువ్వు, కెంబెదవి, కెన్నురువు, కెమ్మొక్క, కెమ్మోవి. మొ.)
**కెందమ్మి.** ద్వ. వి. (కెంపు+తమ్మి.) ఎఱ్ఱదామర.
**కెంపు.** దే. వి. 1. పద్మరాగమణి; 2. ఎఱుపు. "క. ఇనుఁడుతనకడకునేతెం, చినరాగముఁబొందుటదియుచితమనఁగాఁగెం, పునమెఱసిపశ్చిమాశాం, గనజనసంభావనములగౌరవమందెన్." భార. వి రా. ౨, ఆ. —విణ. ఎఱ్ఱనిది. "చ. కనుఁగొని కుంకుమంపుఁ దిలకంబుగదిద్దిరికెంపుఁబుప్పొడుల్." చమ. ౧, ఆ. (ఈ యర్థమున వృత్తియందుఁ గొన్నియెడల నంత్యవర్ణలోపము. చూ. కెం.)
**కెంపుకంటి.** దే. వి. (కెంపు+కన్ను.) కోయిల.
**కెంపుగాము.** ద్వ. వి. గ్రహవిశేషము, అంగారకుఁడు.
**కెంపుసవతు.** ద్వ. వి. నక్షత్రవిశేషము, స్వాతి.
**కెడ.** దే. వి. పార్శ్వము. "గీ. కృపుడువృషసేనుఁడునువారికెడనకూడి, పార్థుతనువునఁదూపులుపఱపిరి." భార. ద్రో. ౪, ఆ.
**కెడపు.** దే. ప్రే. 1. పడఁజేయు; "చ. మిడుకమదగ్రజన్ముఁగుశమీఁదికిఁగట్టుకపోయి బావిలోఁగెడపితివి." జై. 3, ఆ.—2. త్రోయు; "క. ఒకతూపునరఘువీరుఁడు, మకరాకరమధ్యసీమమారీచునురాం, తకుఁబడఁగెడపి." రామా. ౪, ఆ. —3. చంపు. "నిర్మూలంబుగ శత్రులం గెడపి." ద్వా. ౫, ఆ.
**కెడయిక.** దే. వి. 1. పడుట; 2. చావు.

కెడయు. దే. అ. క్రి. 1. పడు; "సీ. వరమ లువడయం గశిరములుకెడయంగఁబ్రక్కకంతుఁడువీరిపాలఁ గనియె." ఉ, హరి. ౨, ఆ.—2. చచ్చు.

కెడవు. దే. వి. పాటు, పతనము.

కెరకొట్టు. దే. అ. క్రి. (కెరలు+కొట్టు) కలకలకూయు.

కెరలియాడు. దే. అ. క్రి. (కెరలి+ఆడు.) చెలరేఁగు. "గీ. బాణాసురుండు, దనుజసుందరీసహితుఁడై మనసులోనఁ, గెరలియాడుచుమధుపానకేళిఁదేలి, యాహవముఁగోరుచుండె." ఉ, హరి. ౫, ఆ.

కెరలు. దే. అ. క్రి. 1. అతిశయించు; "కెరలుకోర్కుల." స్వా. ౬, ఆ.—2. ఆగ్రహించు; "క. ఏసుధేశముక్కుడుస్సిన, పసరముక్రియఁగెరలితిట్టెఁబక్కునబుషి." స్వా. ౬, ఆ.—3. కూయు; "ఎ, గీ. ప్రమదమునఁదేఁటులెలుగెత్తిపాడుచోట, శారికలనంగశాస్త్రముల్ చదువుచోటఁ, గీరకలకంఠములుక్రొవ్వికెరలుచోటఁ, బావురములారజంబులుపలుకుచోట." స్వా. 3, ఆ.—4. విజృంభించు; "మహాస్రగ్ధర. హరోదగ్రలీలంగరలెనతఁడసంక్లిష్టదోర్దండకండూ, యనఘోరస్ఫారవీరాహవముతనకునభ్యగ్రమైతోఁచెనంచున్." హరి. ఉ. ౭, ఆ.—5. సంభ్రమించు. "ద్వి. వరకపీంద్రులుమహావంశవర్ధనులు, కెరలిపాలుదురెప్రాకృతులచందమున." రా. యు, కాం.

కెరలుచే. దే. ప్రే. కెరలఁజేయు.

కెరలువాడుచే. దే. అ. క్రి. (కెరలు+పాడుచు.) 1. వర్ధిల్లు; "గీ. గరిమనీరీతిమెల్లనఁగెరలువాడిచి, చెలఁగియాడంగ." భాగ. ౫. స్కం. ౧, ఆ.—2. విజృంభించు. "గీ. అతనిచేతనున్నయమృతకుంభముఁజూచి, కెరలువాడిచిసురలఁగికురువెట్టి, పుచ్చుకొనిరియసురపుంగవులెల్లను, మాఱులేకబలిమిమానవేంద్ర." భాగ. ౮, స్కం.

కెలఁకు. దే. స. క్రి. 1. కలపెట్టు; "వ. ఇందులకుం బొందుపడుప్రత్యుత్తరంబుల వీనింగెలంకినబుద్ధి [illegible]ధంబుగానింతకంటెనేమేమియబద్ధంబులువినంబడునో." ఆము. ౬, ఆ.—2. పెల్లగించే. "భృగునికన్నులుకెలఁకె." కాశీ. ౭, ఆ.—వి. 1. దిక్కు; "చ. కురిసెఁబ్రచండవృష్టి ఘనఘోషముతెల్లకెలంకులన్ భయం, కరములుగా." భార. అర. 3, ఆ.—2. పార్శ్వము.

కెలను. దే. వి. 1. దిక్కు; 2. పార్శ్వము. (రూ.) కెలఁకు.

కెలయు. దే. అ. క్రి. విజృంభించే. "ద్వి. కెలయుచునినునీవెక్కిరించుకొనెదు, కులజుండుతనుఁదానకొనియాడుకొనునె." రా. అర, కాం.

కెలవు. దే. వి. అనురాగము. "క. పలువురకొకభామినిపైఁ, దలఁపునునొకవారసతికిఁదగఁబలువురపై, వలపునుమృగవిహగాదుల, కెలవురసాభాసమయ్యెక్షితినెట్లన్నన్." కా. 3, ఆ.

కెలసము. దే. వి. అక్కఱ, పని. "వ. ఇంతటికెలసంబుఁదీర్పనైననువలదే." భార. అర. ౬, ఆ. "ఉ. ఏనునీ, చుట్టమనైభుజాబలముసొంపుననీకెలసంబుఁదీర్చెదన్." భార. అర. ౫, ఆ.

కెల్లగించే. దే. స క్రి. 1. పెల్లగించు; 2. రేఁచే.

కెళకుళి. వై. వి. కేళాకూళియొక్కరూపాంతరము. "సీ. ఈకెళకుళిలోననెలనాగప్రోదిరాయంచలకవలనిందించియాడె." షో. ౭, ఆ.

కెళవు. దే. వి. దూరము. "క. అనఘుఁడుసత్యమెరూపై, జనియించినవాఁడువీఁడసాధ్యుండీవే, శనుబ్రద్యుమ్నాదులనిట, నునిచి మనము కెళవు తొలఁగి యుండుదమనుచున్." జై. ౫, ఆ. ("క. అంగననిలిచినబాహువు, లుంగొనును నేర్పరించు లోకములకుర, త్నాంగదకాంచీభేదము, లుంగెళవులనడిమియునుకులున్ నూగారున్." ఆము. ౫, ఆ. ఇందుకెళవులఅనుపాఠముతప్పు. కెలఁకుల అని యుండునని తోఁచెడి.)

కెళాకుళి. వై. వి. కేళాకూళియొక్కరూపాంతరము. "సీ. ఈకెళాకుళిచెంతరాకేందుబింబాస్య తివిరియంచకునడల్ దిద్దుచుండె." రసి. 3, ఆ.

కెళాకూళి. వై. వి.—పై.—

## కే.

కే. దే. వి. ధ్వన్యనుకరణము. "క. నాయింటంబదికడవల, నేయి పెరుగుపాలుఁద్రావినీప్రియతనయుం, డోయమ్మకడవలన్నియుఁ, గేయఁగిబోరగిలఁద్రోచికేరుచువచ్చెన్." హరి. పూ. ౫, ఆ.

కేక. ఉభ. దే. వి. పెద్దకూఁత. సం. ఆ. స్త్రీ. నెమలికూఁత.

కేకయము. సం. వి. అ. పుం. ఒకానొకదేశము.

కేకరము. సం. వి. అ. పుం. 1. కడకన్ను; 2. మెల్లకన్ను.

కేకరించే. ఉభ. దే. అ. క్రి. 1. కేకలువేయు; "ద్వి. క్రీడించిమలయుచుఁగేకరించుచును." నవ. 3, భా.—2. సకిలించునట్లు శబ్దించు.—సం. స. క్రి. కటాక్షించు. "గీ. ఇంద్రునిదిక్కుఁ, గేకరించి

యుంజూడకకృష్ణుఁడచలి, తాసనుండయియుం డెననాదరమున." హరి. పూ. 2, ఆ.

కేకరింత. దే. వి. 1. కేకలువేయుట; 2. గొంతడుపు తీయుటకు సకిలించునట్లు శబ్దించుట. "సీ. ఒదవె డుగాడ్దద్యమదరిపాటునఁబల్కరింపఁబుట్టెడుకే కరింతదెలుప." ఆము. ౫, ఆ.

కేకరుఁడు. సం. విణ. (అ.ఈ.అ.) మెల్లకంటివాఁడు.

కేకి. సం. వి. న్. పుం. మయూరము, నెమలి.

కేకిసలు. దే. వి. బ. 1. చప్పట్లు; "ఎ, గీ. అనుచున వ్వుచుసరసోక్తులాడుకొనుచుఁ, గేకిసలుకొట్టు చునువడిఁగేకలిడుచు, ననిమిషాంగనలత్తపోవన ముఁజొచ్చి, వచ్చియచ్చట భూదేవవరునిఁగాం చి." శేష. ౧, ఆ.—2. అంజలులు. "రగడ. శ్వే తాద్రిస్థలిసింహాలోచనున, కెలమినిఁగేకిసలిచ్చు చుభక్తిని." హంస. ౪, ఆ."గీ. కిసలములకేలయిం తకేకిసలమసల." బహు. ౨, ఆ.

కేటత్రాఁడు. దే. వి. యమపాశము. "క. పితరదొరకే టత్రాటన్, జతనంబునఁదివియ." నీలా. ౧, ఆ.

కేటాయించు, ఖేటాయించు. గ్రా. క్రి. వేఱు పఱుచు.

కేడ. దే. విణ. ధూర్తుఁడు.

కేడించు. దే. అ. క్రి. స. క్రి. క్రీడించుయొక్క రూపాంతరము.

కేడెము. వై. వి. డాలువాలు, ఖేటకము.

కేతకి. సం. వి. ఈ. స్త్రీ. పచ్చపూమొగలి, గేదఁగి.

కేతనము. సం. వి. అ న. 1. టెక్కెము; 2. గుఱుతు; 3. ఇల్లు; 4. నిమంత్రణము.

కేతుమాలము. సం.వి.అ.న.ఒకవర్షము. (చూ.వర్షము.)

కేతువు. సం. వి. ఉ. పుం. 1. ఒకగ్రహము; (చూ. గ్రహము.) 2. టెక్కెము; 3. గుఱుతు; 4. అగ్ని; 5. కాంతి; 6. ధూమకేతువు.

కేదరము. సం. వి. అ. పుం. కేదారముయొక్కరూ పాంతరము.

కేదారము. సం. వి. అ. పుం, న. వరిమడి. పుం. 1. కొండ; 2. పాదు; 3. ఒకానొక పుణ్య క్షేత్రము.

కేదారుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

కేనిపాతకము. సం. వి. అ. పుం. (చూ.) అరిత్రము.

కేమము. సం. వి. అ. న. పులిపిరికాయ.

కేయూరము. సం. వి. అ. న. అంగదము, బాహుపురి.

కేరజెము. వై. వి. ఒకానొకపక్షి. "సీ. మూలసందు లనుండి మూల్గుడాబలక్రందు గుంపు కేరజెపుల య్యంపురొదలు." చంద్రా. ౨, ఆ. (దీని నొ కానొక యాధునికకవి కేర్జమని ప్రయోగించి నాఁడు.)

కేరడము. దే. వి. 1. ఉపేక్ష; "సీ. అయ్యింతితనపా పలందు మిక్కిలికూర్మిబెరయసంజ్ఞాదేవిబిడ్డలైన, మువ్వురనుగేరడముసేయ." హరి. పూ. ౧, ఆ. —2. తిరస్కారము; "సీ. అద్దేవుమనుమనినద్దిరా యెటుచూతుననక కేరడమెవ్వఁడలవరించు." ఉ, హరి. ౫,ఆ.—3. తిరస్కారపుమాట; "ఉ. బాడబ శూరునింజెనకుపార్థివులెవ్వరటంచుఁగేరడం, బా డబలాయిదేటిమదమంచు భృగూద్వహగర్వవా ర్ధికిన్, బాడబమూ ప్రతాపముఁగనంబడఁజేసి." ఉ, రా. ౧, ఆ.—4. వంకరమాట. "గీ. తప్పుగల భర్తమ్రోలసోత్ప్రాసఫణితిఁ, గేరడములాడుసతి మధ్యధీర." కా. ౨, ఆ.

కేరడించు. దే. స. క్రి. వక్రముచేయు. "సీ. భ్రమ రకంబులచిక్కువాపవేయుననింక భ్రమరకంబుల చిక్కువాయుననుచుఁ, బ్రథులకుచంబులుబ్బించ కేయనఁబ్రథులకుచప్రకాశకాలంబటంచుఁ, గ రఁగెఁబోవరతిలకంబనసున్నెహకలనఁగరఁగునర తిలకమనుచుఁ, గడుమొరయింపకేకటకంబులఁ మ్రోయుఁగటకముల్ శుభయత్నగరిమననుచుఁ, జెలిపలుకుఁగేరడించుచు." వసు. ౫, ఆ.

కేరళము. సం. వి. అ. పుం. ఒకానొకదేశము.

కేరించు. దే. అ. క్రి. విజృంభించు. "మ. పూవుఁదీఁ గెగుదెందావలరాచయొంటరికడుంగేరించుచుఁ జిమ్మినన్." య. ౫, ఆ.

కేరు. దే. అ. క్రి. 1. ఉత్సహించు; "క. భృత్యులఁడీ ర్పరులైనయు, మాత్యులకన్గొనిప్రమోదమతిసక లజన, స్తుత్యముగమంగళోచిత, కృత్యములొన రింపుఁడనినఁగేరుచువారున్." రుక్మి. ౨, ఆ.— 2.కుతూహలపడు; "హరిఁగనవచ్చెఁగేరుచున్." రుక్మి. ౫, ఆ.—3. విజృంభించు. "కువలయాధిపు పాటలువాడినంగరంబలరుచుఁగేరికేరినగు." కా. ౬, ఆ.—స, క్రి. 1. తిరస్కరించు; "క. రంగు గనెన్నడుమునని, న్నుంగేరినటంచుఁగినుకనూ ల్కొనగరితన్, మ్రింగితివోనిక్కంబుగ, సింగ మకలచందమెల్లఁజెపుమాసరగన్." అచ్చ. ౪,

కాం.—2. పరిహసించు. "వ. సంగడీలంజేరువా రునుసంగరభీరులంగేరువారును." పా. ౪, ఆ.

కేరుపు. దే. వి. విజృంభణము. "క. గారాబునఁజెరిగినశౌర్యం, గారాంబుధిగానిగడుసుగా దొకనాఁడుకా, గేరుపులగానిఁబెట్టెదు, సూరాసుతచూడనూనసుకుమారసుమీ." పాంచా. ౫, ఆ.

కేలు. వై. వి. ఏ. 1. చేయి; 2. తొండము. "కరినాథుకేల్మిడుదకొమ్ములతో బెరయంగఁద్రుంప." భార. ఆర. ౬, ఆ.

కేలుమొగ్గ. వై. వి. చేమోడ్పు, అంజలిబంధము.

కేవడము. వై. వి. కేడెముయొక్క రూపాంతరము. "సీ. మిహిపసిండిపరుంజా మొహదాకెలంకునతావుగుజ్జరివన్నె కేవడంబు." స్వా. ౪, ఆ.

కేవరి. దే. వి. (కేవు+అరి) కేవుపుచ్చుకొనువాఁడు.

కేవలము. సం. వి. అ. న. నిర్ణయింపఁబడినది. విశే. 1. అంత; 2. ఒకటి.

కేవలుఁడు. సం. వి. అ. పుం. పరమాత్మ.

కేవు. దే. వి. ఓడకిచ్చెడుకూలి.

కేశకారము. సం. వి. అ. పుం. కరఫలము, గొఱపము.

కేశఘ్నము. సం. వి. అ. న. బట్టతల.

కేశపాశి. సం. వి. ఈ. స్త్రీ. చూడ, సిగ.

కేశము. సం. వి. అ. పుం. 1. వెండ్రుక; 2. కురువేరు!.

కేశముష్టి. సం. వి. ఇ. పుం. తేనెమ్రాను.

కేశవము. సం. వి. అ. పుం. పొన్న!.

కేశవుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు. విశే. మంచివెండ్రుకలుకలవాఁడు.

కేశవేశము. సం. వి. అ. పుం. కబరి, కొప్పు.

కేశాంబునామము. సం. వి. అ. న. కురువేరు!.

కేశి. సం. వి. న్. పుం. ఒకానొకరాక్షసుఁడు. విశే. మంచివెండ్రుకలుకలవాఁడు.

కేశికుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) మంచివెండ్రుకలుకలవాఁడు.

కేశిని. సం. వి. ఈ. స్త్రీ. 1. కట్లతీఁగ; 2. పద్మపుతీఁగ. విశే. మంచివెండ్రుకలుగలది. (ఆఁడుది.)

కేశుఁడు. సం. వి. అ. పుం. వరుణుఁడు.

కేసరము. సం. వి. అ. న. ఇంగువ. పుం, న. అకరువు. పుం. 1. సింహములోనగువాని మెడమీఁది వెండ్రుక, జూలు; 2. నాగకేసరము!; 3. పొగడ!; 4. పొన్న!.

కేసరి. ఉభ. వై. వి. 1. ఒకానొకమృగము; "కేసరి యనఖేచరమగు." అం, భా. ద్వి. సిం.—2. ఒక దినుసువరిపైరు, బ. ఆధాన్యము. సం. వి. న్. పుం. 1. సింహము; 2. గుఱ్ఱము; 3. నాగకేసరము!; 4. పొన్న!.

కేళకుళి. వై. వి. కేళాకూళియొక్క రూపాంతరము. "ఎ, గీ. అంబుధులు కేళకుళులు కులాచలములు, మేడ లలచక్రగిరి చుట్టుగోడగాఁగ, నవనిఁబాలించెశుద్ధాంతభవనమట్ల, కీర్తిలక్ష్మీకళత్రుఁడీక్షితివరుండు." కవిక. ౨, ఆ.

కేళకూళి. వై. వి.——పై.——"ఎ, గీ. సంతసంబునఁ బూఁదేనెజాలువాఱ, గమ్మగందపుముద్దలగట్టువెట్టి, కాలువలుదీర్చినపసిండికేళకూళి, నిండితోలఁకాడుచున్న దేనీలవేణి." విక్ర. ౫, ఆ.

కేళాకూళి. వై. వి. క్రీడాసరస్సు. "క. లోకాలోకమహీధర, మేకోటకులాచలములుకృతకాద్రులుకే, ళాకూళులుఁజలరాసులు, శ్రీకరధృతిసాంద్రుఁడౌహరిశ్చంద్రునకున్." కవి. ౧, ఆ.

కేళి. సం. వి. ఇ. పుం. స్త్రీ. 1. పురుషులు స్నేహమున స్త్రీలులోనగువారిని గద్దించుట కొట్టుట పరిహసించుట మొదలుగాఁగలది; 2. ఆట; 3. ప్రియునితోడి విహారమునందలి నాయికయొక్క క్రీడ.

కేళిక. వై. వి. నృత్యము*. "జక్కిణికొరవంజివేషములఁగేళికసల్పిరి." రామా. ౨, ఆ.

కేళికిలుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) నవ్వించువాఁడు.

## కై.

కై. దే. అవ. చతుర్థీవిభక్తియందువచ్చెడు ఒక ప్రత్యయము. వి. 1. చేయి; "చిలుకంగైనుంచకేచిల్కపల్కులోనీపల్కులోకాంచలేము." ఉ, రా. ౬, ఆ.—2. తొండము. (కయియొక్క రూపాంతరము.)

కైంకర్యము. సం. వి. అ. న. 1. ఊడిగము; 2. భగవంతునికిని భగవద్భక్తులకును జేసెడి యూడిగము.

కైక. వై. వి. కైకేయి "క. కైకానీపూనినపని, కైకాకైకందినట్టియమ్మఁగుంగొడుకి, ల్లైకానలకేగెడు." అచ్చ. అ, కాం. (కయికయొక్క రూపాంతరము.)

కైకట్టు. ద్వ. వి. సందర్భము. (కయికట్టుయొక్క రూపాంతరము.)

కైకానుక. దే. వి. రాజులులోనగువారిని జూడఁబోవునపుడు కొనిపోయెడి యుపహారము. "మ. పులిగోరుల్ పెరతేనెకస్తురి మెకంబుల్ పున్గుజవ్వా

దిపి, ల్లులుగోరి జనమిత్తులుం బికిలిపూలుం జల్లు
లుకా మోవిపం, దులుఁగుం దేర్లనుజాఱపప్పుసెల
విండ్లుం బొఱవాతంపక, ట్టెలుఁగైకానుకలిచ్చిబో
యదొరబిడ్డల్ గాంచిరాభూవిభుణ్." రామా.
౨, ఆ. (కయికానుకయొక్క రూపాంతరము.)

**కైకేయి.** సం. వి. ఈ. స్త్రీ. కేకయరాజుకూఁతురు.

**కైకొను.** దే. అ. క్రి. పూను. "క. మాకుంబుణ్యము సాలమి, గాకేమిజగత్త్రయంబుఁగావం బ్రోవం, గైకొన్న నీవుసకలవి, వేకివిమాదుఃఖ మెఱుఁగవే మధుమథనా." ఉ, హరి. ౪, ఆ.—స. క్రి. 1. గ్రహించు; 2. లక్ష్యపెట్టు. "క. తనకోలఁదినుపాయంబులు, పొనరిచిధనవంతుఁడగుటభూపగుణముని, ధనునినిజప్రజయునుగై, కొనదువిరోధులునుసరకుగొనరుకుమారా." భార. శాం. 3, ఆ. (కయికొనుయొక్క రూపాంతరము.)

**కైకోలుపు.** దే. ప్రే. కైకొనఁజేయు. "క. నావుడు మానవనాథుఁడు, కేవలపురుషుండె వాఁడుకీడ్పొందుపనుల్, గావించు నెమదిబెదరం, గావలదని చెప్పిదొరలుకైకోలుపుటయుణ్." భో. ౪, ఆ. (కయికోలుపుయొక్క రూపాంతరము.)

**కైకోల.** దే. వి. గుడ్డలు నేసిబ్రదికెడు ఒకానొకజాతి. (కైకోలవాఁడు, కైకోలది.) (కయికోలయొక్క రూపాంతరము.)

**కైకోలు.** దే. వి. 1. అంగీకారము; "సీ. నీపకాకెవ్వరు నేర్తురీపనికియ్యకొమ్మనియతనికైకోలు వడసి." భాగ. ౮, స్కం.—2. గ్రహణము. "శా. గంగం దాల్చితివుత్తమాంగమునన ణ్గైకోలు గావించిత, ర్ధాంగీకారము." కా. ౧, ఆ. (కయికోలుయొక్క రూపాంతరము.)

**కైచాఁపులు.** ద్వ. వి. బ. నమస్కృతి. "మం, రగడ. నిబిడస్థలిలో నిబిడాకార, స్వామికిమతిఁగైచాఁపులొసంగుచు" హంస. ౪ ఆ. (కయిచాఁపులుయొక్క రూపాంతరము.)

**కైజీతము.** ద్వ. వి. బత్తెము. (కయిజీతముయొక్క రూపాంతరము.)

**కైజు.** దే. వి. వాగెను వెనుకకీడ్చికట్టుట. "క. అకోలాహలమరుదని, యాకర్ణించుచువిభుండువాయము డిగివాసా, రైకైజుచేసిమహా, నోకహాతలముననిలిచికనుంగొనుచుండణ్." చంద్రా. ౨, ఆ. (కయిజుయొక్క రూపాంతరము.)

**కైజాఱు.** దే. అ. క్రి. ఒఱగు. (కయిజాఱుయొక్క రూపాంతరము. "సడలిననీవియొరకయిజాఱిన ముత్తెపుఁజేఱుచుక్క." భాను. 3, ఆ.)

**కైజొ.** దే. వి. పక్షివిశేషము. "ఎ, గీ. కతికినెటినెటిఁ గొలెమ్ముకయునువిఱుగ, విటిచెవడిఁగైజునొకపద్దవేసడంబు." స్వా. ౪, ఆ. (కయిజొయొక్క రూపాంతరము.)

**కైటభారి.** సం. వి. ఇ. పుం. హరి, వెన్నుఁడు.

**కైడర్యము.** సం. వి. అ. పుం. 1. కతిశేము?; 2. పినగుమ్మడు?.

**కైత.** వై. వి. కవిత్వము. "ఉ. పూఁతమెఱుంగులుం బలెనుబూపబెడంగులుచూపునట్టివా, కైతలు." పెద్దనచెప్పినమాలికావృత్తము. (కయితయొక్క రూపాంతరము.)

**కైతవము.** సం. వి. అ. న. 1. కపటము; 2. జూదము.

**కైదండ.** దే. వి. హస్తావలంబము. (కయిదండయొక్క రూపాంతరము.)

**కైదారకము.** సం వి. అ. న. కేదారములసమూహము. (కేదారము=వరిమడి.)

**కైదారికము.** సం. వి. అ. న.——వై.——

**కైదార్యము.** సం. వి. అ. న.——వై.——

**కైదు.** దే. వి. కైజోయొక్క రూపాంతరము. "ఉ. దూరము గాఁగ నేగుకయిదుంగ నిడేగటమీఁదనుండియుణ్, దారునఁదారి." చంద్రా. ౨, ఆ. (మొదటిరూపము కయిదు.)

**కైదువు.** దే. వి. ఆయుధము. "క. పొరిమిదుఁగులు లెగసికైదువులపాడిరాలెణ్." భార. ద్రో. ౪. ఆ. (అధునికకవులుదీనిని అకారాంతముగాఁబ్రయోగించెదరు. "చ. కరమునశైలభేదియగుకైదువయున్నశచీకళత్రుఁడో." హరిశ్చ. ౪, ఆ. ఇత్యాదులు.)(కయిదువుయొక్క రూపాంతరము.)

**కైపదము.** వై. వి. కవిపరిజ్ఞానపరీక్షార్థముపూరింపనిచ్చెడిపద్యాంశము, సమస్య. "ఉ. కైపదమిచ్చువారలును గ్రక్కునఁబద్యముఁజెప్పువారలుణ్." భో. ౨, ఆ. (కయిపదముయొక్క రూపాంతరము.)

**కైపు.** దే. వి. 1. లాహిరి; (ఈరూపము వాడుకయందుఁగనఁబడుచున్నది. చూ. కైవు.) 2. అందము "ఉ. ఎల్లరునంతమేలుకొనియిందుముఖుల్ ముఖమజ్జనాదికం, బల్లనఁదీర్చికైపుగఁదులాంబరముల్ మణిభూషణావళుల్, మల్లెసరంబులుంబిరిమ

బులఁదాలిచి." రామా. ౨, ఆ.—3. విజృంభణము; "క. దీపమడఁగఁజీఁకటియును, గోపమడఁగశాంతిగుణముఁ గోల్కొనుక్రియనా, టోపోద్భటమగువేసవి, కైపుసడిలఁ దోఁచెఁగారు కాలముదళ్లై." పాండు. ౪, ఆ.—4. విధము. "గీ. రావణునిఁజెట్టపట్టినరాజ్యలక్ష్మి, కైపుతోఁపించు లంకపొంకంబుగాంచి." రామా. ౬, ఆ. (కయిపుయొక్క రూపాంతరము.)

కైఫీయతు. హిం. వి. ఒకసంగతి వివరము.

కైముడి. ద్వ. వి. వాద్యవిశేషము. (కయిముడియొక్క రూపాంతరము.)

కైమోడుపు. ద్వ. వి. నమస్కృతి. "మం, రగడ. మాహురమం దసమానత విడిసిన, కాలమేఘునకుఁగైమోడుపులని." హంస. ౪, ఆ. (కయిమోడుపుయొక్క రూపాంతరము.)

కైరఁడు. దే. వి. ఈ పేరుగల గుఱ్ఱము. (కయిరఁడుయొక్క రూపాంతరము.)

కైరవడి. వై. వి. తాంబూలముతోఁగూడ నుపయోగించుకొనుటకుఁ గాఁచులోనగు వస్తువులు చేర్చి చేసినయుండ, ఖాదిరము. (కయిరవడియొక్క రూపాంతరము.)

కైరవము. సం. వి. అ. న. తెల్లగలువ.

కైరవిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. తెల్లగలువల సమూహము; 2. తెల్లగలువలుండుకొలను.

కైరవుఁడు. సం.వి.అ.పుం. 1. జూదరి; 2. పగవాఁడు.

కైలాగు. దే. వి. కైదండ. (కయిలాగుయొక్క రూపాంతరము.)

కైలాటకాఁడు. దే. విణ. (కైలాటము+కాఁడు.) మాయోపాయముగలవాఁడు. (కయిలాటకాఁడుయొక్క రూపాంతరము.)

కైలాటము. దే. వి. మాయోపాయము. "తానునుగజాస్యుఁడులక్ష్మియుఁ జేసినట్టికైలాటమునఁ ఘటిల్లెసకలార్థము." కాశీ. ౬, ఆ. (కయిలాటముయొక్క రూపాంతరము.)

కైలాసము. సం. వి. అ. పుం. కుబేరుని యునికిపట్టు, వెండికొండ.

కైలు. హిం. వి. పండిన ధాన్యపు కొలఁత.

కైవడి. దే.వి.1. ప్రకారము. "సీ. కరులఁద్రుంచెడువేళగిరులఁదున్మాడుసంక్రందనుకైవడిగానవచ్చు." భార. శల్య. ౧,ఆ.—2. పోలిక. "గీ. అతనిమేను కుంతియట్టులకైవడియరయ." భార. శాం. ౧, ఆ. (కయివడియొక్క రూపాంతరము.)

కైవడిముస్తె.వై. వి. తుంగముస్తె. (కయివడిముస్తెయొక్క రూపాంతరము.)

కైవర్తము. సం. వి. అ. న. కైవడిముస్తె.

కైవర్తి. సం. వి. ఈ. స్త్రీ.——పై.——

కైవర్తుఁడు. సం. వి. అ. పుం. చేపలఁబట్టువాఁడు, జాలరి.

కైవల్యము. సం. వి. అ. న. అపవర్గము, మోక్షము.

కైవారము. ఉభ. దే. వి. గనిమయంచు. వై. స్తోత్రము*. (చూ. కయివారము.)—సం. ఆ. న. వందిస్తోత్రము. "ఈకైవారదుర్భాషణంబులకుంగాని యతండుమెచ్చఁడు." నై. ౭, ఆ.

కైవారి. సం.వి.న్.పుం.వంది. "మ. కమలాక్షస్వరఘుస్వరాబ్జభవులుఁ గైవారులు." హరి. పూ. ౧, ఆ.

కైవు. దే. వి. (కైపుయొక్క రూపాంతరము.) ఉన్మాదము. "క. కైవెక్కినవానిమేనుగరమునసిమిరెఁ." ఉ, హరి. ౨, ఆ. (మొదటిరూపము కయివు.)

కైవ్రాలు. దే. అ. క్రి. 1. ఒఱగు; "బలునుఁబందులచాయఁదనర్చి పండికైవ్రాలినరాజనంబులకు." విక్ర. ౪, ఆ.—2. పక్షులులోనగునవిక్రిందికి దిగు; "సీ.నఖపాళిబెడఁగుమాన్పకుమంచునుడులుకైవ్రాలెనాస్ఫటికాక్షమాలికదగ." ఉ, రా. 3, ఆ.—3. పడు. "వ. వియత్తలంబునంబాటికైవ్రాలుధారలవాద్యంబులుదడిసిన." ఆము. ౪, ఆ. (కయివ్రాలుయొక్క రూపాంతరము.)

కైవ్రాలుచు. దే. ప్రే. కైవ్రాలఁజేయు. (కయివ్రాలుచుయొక్క రూపాంతరము.)

కైశికము. సం. వి. అ. న. వెండ్రుకలసమూహము.

కైశికి. సం. వి. ఈ. స్త్రీ. ఒక కావ్యవృత్తి. (చూ. వృత్తి.)

కైశోరము. సం. వి. అ. న. వయోవిశేషము. "వ. బాల్యకౌమారకైశోరవయో విశేషంబులవింశతివాయనంబులుకడచు." భాగ. ౭, స్కం.

కైశ్యము. సం. వి. అ. న. కైశికము.

కైసాటిచుక్క. ద్వ. వి. హస్తనక్షత్రము. (కయిసాటిచుక్కయొక్క రూపాంతరము.)

కైసేఁత. ద్వ. వి. అలంకారము. (కయిసేఁతయొక్క రూపాంతరము.)

**కైసేయు.** ద్వి. స. క్రి. 1. అలంకరించు; "క. అసమ యమునఁగుమారిం, గైసేసి." విక్ర. ౪, ఆ.—2. పూజించు. "మ. తనకుందానప్రతిష్ఠితుండయిన యాదక్షాధ్వరధ్వంసి నే, మునుపూజించితిఁబిమ్మటన్ హరియునంభోజాతగర్భుండునుం, గవిఁగైసేసిరియంతమీఁద సురలున్ గంధర్వులున్ జేరియ, ర్చనముల్ చేసిరి మీరుఁజేయుఁడుతగన్ సమ్యక్సమారాధనల్." భీ. ౪, ఆ. (కయిసేయు యొక్క రూపాంతరము.)

కొం.

**కొంకనక్క.** ద్వి. వి. చిన్న జాతినక్క, కిఖి. "ఉ. శ్రీ మలుఁగాకులుం గ్రిములుజింకలునక్కలుఁగొంకనక్కలున్." భార. అశ్వ. ౨, ఆ.

**కొంకర.** దే. వి. వంపు. (అక్షరములువంకరకొంకరగా ఉన్నవి.)

**కొంకరలువోవు.** దే. అ. క్రి. (కొంకరలు+పోవు.) శైత్యాదులచేతఁగాళ్లుఁజేతులులోనగునవినిగిడికొను. "చ. నినుఁదనచంకవైచికొని నీరనిధాన చతుష్టయంబునన్, జనిచనిసాంధ్యకృత్యములు సల్పెడునంతకుఁద్రిప్పితెచ్చితెం, పునసటువైచి కొంకరలువోయిననీమెయిచక్కనొత్తిపో, వని చినవాలినందనుఁడనంగదుఁడన్ దళకంఠ వింటివే." రామా. ౭, ఆ.

**కొంకి.** దే. వి. 1. వంపుచీల; 2. దోఁటి; 3. బ. ముచ్చిలిగుంతకుఁబార్శ్వములనుండెడి యెముకలు; 4. మోఁకాలిచిప్పకులోతట్టురెండుప్రక్కలనుండెడియెముకలు. (కొంకివ్రేళ్లనుచోఁ గొంకిపలెనుండు వ్రేళ్లని తెలియవలెను.)

**కొంకు.** దే. అ. క్రి. 1. భయపడు; "క. శంకింపవలదు పోలఁగ, బొంకితిమనుశాసనాంతమునమ్రుచ్చులకుం, గొంకి." విక్ర. ౭, ఆ.—2. వెనుదీయు; 3. సంకోచించు. వి. 1. భయము; 2. వెనుదీయుట; "గీ. తోడలపైనిద్రవోయెడు దుష్టమృగముఁ, గొంకుకొసరింతయునులేకకూలఁద్రోవు." విక్ర. 3, ఆ.—3. సంకోచము.

**కొంకుపాటు.** ద్వి. వి. 1. భయపడుట; "సీ. పరులు తిట్టినచోటఁ బ్రత్యుత్తరములేక ప్రాణహానికిఁ గొంకుపాటులేక." కవిక. ౪, ఆ.—2. సంకోచపడుట. "శకుంగనికోమలికొంకుపాటుతో." హంస. 3, ఆ.

**కొంకువోవు.** దే. అ. క్రి. (కొంకు+పోవు.) కొంకరలువోవు. "చ. ఆపదం, బోరయకయుండఁజేయుముప్రభూతపునీతునఁగొంకువోయెడున్." (ఈతఁడుఅనుకర్తృపదమధ్యాహార్యము.) భార. శాం. 3, ఆ.

**కొంగ.** వై. వి. బకము*.

**కొంగకాళ్లవాఁడు.** ద్వి. విశ. నిడుపుమోఁకాళ్లవాఁడు, ఊర్ధ్వజ్ఞువు.

**కొంగవాలు.** వై. వి. మాదిగకత్తి. "ఉ. కుక్కలనెంపఁజూచి మఱికొందఱు కొన్నిటిఁ గొంగవాలులన్, బక్కలుసించినన్." య. ౨, ఆ.

**కొంగు.** దే. వి. వస్త్రపుచెఱఁగు.

**కొంగుమాయు.** దే. అ. క్రి. బహిష్ఠయగు.

**కొంగోడువడు.** ద్వి. అ. క్రి. (కొంగోడు+పడు.) ఒడ్డిగిల్లు, ఒఱగు. "సీ. కలఁగివారిధులపంకము నిప్పటిల్లెనుగులపర్వతములుఁగొంగోడువడియె." మై. ౨, ఆ.

**కొంగోడువోవు.** దే. అ. క్రి. (కొంగోడు+పోవు.) ——పై.——(చూ. కుక్కివడు.)

**కొంచించు.** దే. అ. క్రి. సంకోచించు. "క. కొంచింపకవడిఁబెన్నిధిఁ, గాంచినపేదయునుబోలెఘనతరహర్షో, దంచితమానసుఁడైయా, పంచాననమధ్యఁజేరిపల్కెన్ ప్రేమన్." రసి. ౫, ఆ.

**కొంచియము.** వై. వి. న్యూనత. (చూ. కొంచెము.) విశ. అల్పము*. "గీ. చంద్రశేఖరునిఁబ్రసంగవశంబునఁ, గొలిచినారుభక్తికొంచియంబు." కాశీ. 3, ఆ.

**కొంచెకత్తె.** వై. విశ. (కొంచెము+కత్తె.) 1. అల్పురాలు; 2. సామాన్యురాలు.

**కొంచెకాఁడు.** ద్వి. విశ. (కొంచెము + కాఁడు.) 1. అల్పుఁడు; 2. సామాన్యుఁడు.

**కొంచెతనము.** వై. వి. (కొంచెము+తనము.) సన్నఁదనము, అల్పభావము. "గొనబుఁగొనుకొంచెతనము." అచ్చ. అర, కాం.

**కొంచెపడు.** వై. అ. క్రి. (కొంచెము+పడు.) 1. తక్కువపడు; "వ. తండ్రీనీప్రసాదంబుననన్నియు సమకూరెడుంగాకకొంచెపడియెడునే." భో. ౬, ఆ.—2. సన్నగిల్లు. "సీ. కడుదొడ్డకటిలటి కడుఁగొంచెపడియుండె." చంద్రా. ౨, ఆ.

**కొంచెము.** వై. వి. న్యూనత. "ఉ. నీకునీ, కొంచెమువచ్చెనెల్ల హరిఁగోరినుతింపమి నార్యపూజి

తా." భాగ. ౧, స్కం.—విశే. అల్పము*. (కొంచియముయొక్క రూపాంతరము.)

కొంచె. వై. వి. 1. ఒకానొకకొంగ; 2. ఒకానొక పక్షి. "ఉ. ఱెక్కలుచించికంఠమున ఱేకులువాపిశిరంబువ్రచ్చివే, రుక్కునఁగొంచచంద మగు నొద్దుగలంగఁగఁజేసి." భార. భీష్మ. ౨, ఆ.

కొంచెదీవి. వై. వి. క్రౌంచద్వీపము.

కొంచెమల. వై. వి. క్రౌంచపర్వతము.

కొంచెమొగ్గరము. ద్వ. వి. క్రౌంచవ్యూహము.

కొంచెసారము. వై. వి. మధ్యమస్వరము.

కొంచె. యు. దే. వి. ముఱికిచెమట. "పరఁగుఁగొంచనఁగనుముఱికిచెమట." ఆం, భా. ప్ర. నా.—వై. అ. క్రి. సంకోచించు. "సీ. కొంచకనీరిలో ముంచుచునెత్తుచుఁ గారించితీరంబు సేరఁబెట్టు." భార. ఆది. ౫, ఆ.

కొంజు. వై. అ. క్రి. సంకోచించు. "క. అంజకబాలకుఁడనియును, గొంజకదయమాలిరాజకుంజరయంతక్, గుంజరమునుడీకొలిపెను, గుంజరపాలకుఁడుగోపకుంజరుమీఁదన్." భాగ. ౧౦, స్కం. పూ. (కొంచుయొక్క రూపాంతరము.)

కొంట. దే. వి. కొనుట. (అనుప్రయుక్తమైన కొను ధాతువునకును రూపమిట్లుండును. కనుఁగొంట, కయికొంట, పయికొంట. మొ.)

కొంటె. దే. విశే. అకార్యశీలుఁడు. "క. వింటికదానీతనయుని, కొంటెతనముపీరిమానికుటిలాలకన, క్కంటునకునిత్తురఁటయిటు, వంటివిపోపెక్కునోళ్లవారలమాటల్." భో. ౫, ఆ.

కొండ. వై. వి. మల, పర్వతము.

కొండకంది. ద్వ. వి. సస్యవిశేషము. బ. ఆఢాన్యము.

కొండకాకి. వై. వి. ఒకదినుసుకాకి, అద్రికాకము.

కొండకాలువ. వై. వి సెలయేఱు, ఝురము.

కొండగుఱుతు. ద్వ. వి. సామాన్యలక్షణము.

కొండగోనుగు. ద్వ. వి. అక్షోటము*.

కొండగొఱ్ఱె. వై. వి. గాడిదవంటి మృగవిశేషము, రాహిషము.

కొండగోఁగు. ద్వ. వి. కర్ణికారము*.

కొండచిలువ. ద్వ. వి. కొండపాము, అజగరము.

కొండచీమ. ద్వ. వి. ఒకదినుసుచీమ, ఉద్దీపకము.

కొండచూలి. ద్వ. వి. పార్వతి. "గీ. నందినెక్కిమాలినిందురోచులుపర్వ, శూలిపచ్చెఁగొండచూలితోడ." భాగ. ౯, స్కం. (ఇట్లు కొండరాచూలి.)

కొండజొన్న. వై. వి. సస్యవిశేషము. బ. ఆఢాన్యము.

కొండతంగేడు. ద్వ. వి. ఒకదినుసు తంగేడు*.

కొండత్రిమ్మరి. ద్వ. వి. కోఁతి. (ఇట్లు తిప్పత్రిమ్మరి, మలత్రిమ్మరి. మొ.)

కొండనాలుక. ద్వ. వి. చిఱునాలుక, గళశుండిక.

కొండపగతుఁడు. ద్వ. వి. ఇంద్రుఁడు, గోత్రారి. "సీ. కొండపగతుపట్టికోడలినిందు వేఁకటిఁగాచినట్టిచేకత్తివాఁడు." రా, వి. ౨, ఆ.

కొండపలుకు. ద్వ. వి. పర్వతబిలమునందలి ప్రతిధ్వని. "ఎ, గీ. కొమరుఁబిల్వనియులపల్కు కొండపల్కు." చంద్రా. ౧, ఆ.

కొండపిండి. వై. వి. వృక్షవిశేషము. "సీ. కొండపిండియనంగఁబిండికొండయనంగనగభేదసంజ్ఞగా నలరుచుండు." ఆం, భా. ద్వి. వ.

కొండప్రత్తి. వై. వి. ఒకదినుసుప్రత్తి*.

కొండబూరుగు. ద్వ. వి. కూటశాల్మలి*.

కొండబెండ. ద్వ. వి. కచ్చూరకము*.

కొండమల్లె. వై. వి. గిరిమల్లిక*.

కొండమామిడి. ద్వ. వి. కోశామ్రము*.

కొండమారేడు. ద్వ. వి. గంధగర్భము*.

కొండము. వై. వి. గుండము. "ఎ, గీ. కుండాఖ్యవెలయు, చుండుగుండమనంగను గొండమనఁగ." ఆం, భా. ద్వి. వై.

కొండముచ్చు. ద్వ. వి. నల్లనిమూతిగలకోఁతి.

కొండముసువ. ద్వ. వి.——వై.——

కొండయల్లుఁడు. ద్వ. వి. (కొండ+అల్లుఁడు.) ముక్కంటి, శివుఁడు.

కొండఱేఁడు. ద్వ. వి. హిమవంతుఁడు. "ఆ. కొండఱేనికూఁతుకును మోపకేళిచేఁ, బోవుఁబ్రతిదినంబు పువ్వులెల్ల." భోజ. ౫, ఆ.

కొండల్లము. వై. వి. (కొండ+అల్లము.) ఒకదినుసుఅల్లము, తృణపుష్పిక*.

కొండవారు. ద్వ. వి. బ. కొండయందుండుబోయలు.

కొండాటము. దే. వి. సంతోషము. "గీ. హరునితో డిదకొండాటమైలతాంగి, యుగ్రతాపంబుసైరింపకున్నఁజూచి." వీర. ౧, ఆ.

కొండాడు. దే. స. క్రి. పొగడు, స్తుతించు.

కొండి. దే. వి. 1. తేలుతోఁక; 2. ఱెక్కతలుపునంచులయందుఁగొట్టెడు తేలుతోఁకవంటి యినుప గొళ్లెము.

**కొండిక.** వై. విణ. 1. చిన్న*; "క. అనిపలికిహరి కిరీటిం, గనుఁగొనికొండికవునీవుగావుననీకుణ్, మునుగోరఁబాడియనవుడు." భార. ఉద్యో. ౧, ఆ. "క. ఒండుఁగొదలేదుతూరుప్పుఁ, గొండప యిం బ్రొద్దువొడిచెఁగొమ్మాయిఁకనే, డెండఁబడకుండఁగూఁతురు, కొండికయనకంపవలయుఁగూరిమినసుడుణ్." య. ౪, ఆ. "క. దండితబలివై జగములు, నిండఁబెరుగుచున్న వేళనీయడుగున భూ, మండలమతిసూక్ష్మాకృతిఁ, గొండికమచ్చ యునుబోలెఁగొమరొందుహరీ." పాండు. ౨, ఆ.—2. బాలుఁడు*. (ఇది యికారమధ్యమనుట కుఁదగినప్రయోగము దొరకినదికాదు. చూ. కొండొక.)

**కొండియ.** దే. వి. కొండె.

**కొండియము.** దే. వి. కొండెము. "కొండియముసంధిభేదనమన్యకర్శోపజీవనము." భార. అను. ౨, ఆ.

**కొండియుఁడు.** దే. విణ. కొండెముచెప్పువాఁడు, పిశునుఁడు. "ఉ. క్రూరుఁడులోభియుణ్ శఠుఁడుఁ గొండియుఁడుణ్ జడుఁడుణ్ గృతఘ్నుఁడుణ్, నేరనివాఁడుబొంకరియునిందకునోర్చునతండుపందయుణ్, ధీరతలేనిదుర్నయుఁడతివ్యసనత్వము గల్గుభృత్యుఁడుణ్, జేరుపమన్కి-భూపతికిఁజెట్టయొనర్చునరేశ్వరోత్తమా." భార. శాం. 3, ఆ.

**కొండీఁడు.** దే. విణ. (కొండియము+ఈఁడు.)——వై.——"సీ. కొండీనినాలుకరెండుగాఁజీఱెడు నలఖగంబులఁజూడుమవనినాథ." మార్క. ౨, ఆ.

**కొండె.** దే. వి. రాజులులోనగువారు మొగముత్తట్టువేసికొనిడువెండ్రుకలముడి. (కొండియయొక్క రూపాంతరము.)

**కొండెంగ.** వై. వి. కొండయందుండెడునల్లకోఁతి. "ద్వి. బడుగు, కొండెంగవీని వెక్కురుతలఁదఱుఁగ." హరిశ్చ. ౨, భా.

**కొండెకత్తె.** ద్వ. విణ. (కొండెము+కత్తె.) కొండెముచెప్పునది. (ఆఁడుది.)

**కొండెకాఁడు.** దే. విణ. (కొండెము+కాఁడు.) కొండెముచెప్పెడువాఁడు.

**కొండెము.** దే. వి. చాడి. "సీ. కొట్లుబేహారులగొనబుటంగడులంద తఱచుగాఁగొండెముల్ తలుపులంద." అచ్చ. బాల, కాం. (కొండియముయొక్క రూపాంతరము.)

**కొండెవల.** దే. వి. చేఁపలఁబట్టుటకు ఒకఁడువేసెడువల.

**కొండొక.** వై. విణ. 1. కొంచెము*; (కొండొకనేవు.) 2. చిన్న*; "కొండొకసవతియు." రాఘ. ౧, ఆ.—3. బాలుఁడు*. "క, అకటకటయుత్తరుఁడుకొం, డొకకాంభోజుండునుంగడుణ్ బాలుఁడు." భార. స్త్రీ. ౨, ఆ.

**కొండ్ర.** దే. వి. మళ్లించిదున్నినచాలు. "క. ధరఁ గొండ్రవేలుపండుణ్." కాశీ. ౪, ఆ.

**కొండ్రకైదువు.** దే. వి. నాఁగలి. "ఎ, గీ. కొండ్రకైదువుబల్లిదుకూర్మితోడు." రా, వి. ౧, ఆ.

**కొంత.** వై. స. (కొంచెము+అంత.) ఇంచుకకొలఁది. "కొంతదవ్వు." (చూ. ఇంత.)

**కొంతము.** వై. వి. ఆయుధవిశేషము, కుంతము. "క. గొంతాననొకఁడుబెబ్బులిఁ, గొంతానంజిదిమిమెచ్చికొనఁజేసినచో." శుక. ౧, ఆ.

**కొందఱు.** వై. స. (కొంత+వారు.) కొంతశబ్దమునకు మహన్మహత్యర్థకబహువచనరూపము.

**కొందలపడు.** ద్వ. అ. క్రి. (కొందలము+పడు.) కలఁతపడు, సంక్షోభించు.

**కొందలపాటు.** ద్వ. వి. కొందలపడుట.

**కొందలము.** దే. వి. కలఁత, క్షోభము. "మ. కలఁగెం దోయధిసప్తకంబుగిరివర్గంబెల్లనూటాడెసం, చలితంబొందెవసుంధరావలయమాశాచక్రమల్లాడెఁగొం, దలమందెణ్ద్రిదశేంద్రుపట్టణముపాతాళంబుఘూర్ణిల్లెనా, కులమయ్యెణ్గ్రహతారకాకులము సంక్షోభించెనవ్యేధయుణ్." భార. విరా. ౪, ఆ.

**కొందలించు.** దే. అ. క్రి. కలఁతపడు. "వ. అప్పుడు పందికదుపులవెనువెంటందవిలి కొందలింపంజిందఱవందఱగాఁజేసి." ఉ, హరి. ౪, ఆ.

**కొందు.** దే. స. క్రి. నజ్జొగనఱకు.

**కొంప.** దే. వి. ఇల్లు. (నింద మొదలగు సమయములయందే యిది ప్రయోగింపఁబడును.)

**కొంపోవు.** దే. స. క్రి. (కొని+పోవు.) తీసికొనిపోవు. "క. చంపినఁజంపుమునన్నటు, కొంపోకుండినను జాలు." ప్రభా. 3, ఆ.

**కొకిబికి.** దే. విణ. చక్కనతప్పినది. "సీ. కొకిబికివేసంపుగూనివీఁపులమీఁద మూడుపంగలయాఁటె మోపినాఁడు." స్వా. ౪, ఆ.

**కొక్కరాయి.** వై. వి. బకము*.

కొక్కరించు. దే. అ. క్రి. 1. (కోఁతి) వెక్కిరించు; "ద్వి. కొనచెవుల్ జిక్కించికొక్కరించుచును." రా. సుం, కాం.—2. పక్షులుకాళ్లతో కెల్లగించు. "గీ. కుప్పలైయున్నయెరువెల్లఁగొక్కరించి." పంచ. నా. 3, ఆ.

కొక్కరింత. దే. వి. కొక్కరించుట.

కొక్కిస. దే. వి. మల్లబంధవిశేషము.

కొక్కు. దే. వి. పందికొక్కు.

కొక్కురవుతు. ద్వ. వి. వినాయకుఁడు.

కొక్కెర. వై. వి. బకము*. "వ. ఒక్కమహాబకంబు వచ్చె. అదిపద్మభవునకుం బ్రసాదపాత్రంబగుచు నాళీజంఘుండు రాజధర్ముండునను పేళ్లంబరఁగు. ఆకొక్కెరకునమ్మఱ్ఱినివాసంబైయుండు." భార. శాం. 3, ఆ.

కొక్కెస. దే. వి. ఒకానొకచెట్టు.

కొక్కొరొకో. దే. వి. కొక్కొరోకోయొక్క రూపాంతరము. "కొక్కొరొకోయనికుక్కుటంబులుకూసె." కాశీ. 3, ఆ.

కొక్కొరోకో. దే. వి. కోడికూయుటయందగుధ్వన్యనుకరణము. "కొక్కొరోకోయనికూయఁడే యతఁడు." నై. ౮, ఆ.

కొజ్జా. దే. వి. రాణివాసపు కావలివాఁడు. "వీధులఁదిరుగంగ వెసఁదలారులుపట్టి కొజ్జానుజేసిరో." భో. ౪, ఆ.

కొటారము. దే. వి. ధాన్యాదిరాసులుండెడుచోటు. "ఎ, గీ. తోఁటచేనుకొటారంబుదొడ్డియనెడు, నాసలన్నియునిసుమంతలయ్యె." వసు. ౨. ఆ.

కొటారి. దే. వి. ఉగ్రాణపువాఁడు.

కొటారు. దే. వి. 1. ధాన్యాదిరాసులుండెడిచోటు; "ఎ. గీ. తేరులాకొమ్ముటేనుఁగుబారులాప, సారులాచొక్కటపురాచదారులాకొ, టారులాతీరులాగొనబారునార, ప్రోలియొయ్యారమేరికిఁబొగడనరిది." అచ్చ. బాల, కాం. 2. ఉప్పుకొఠారు.

కొటిక. వై. వి. కొట్టిక, గ్రామము. "నిటలాక్షుగుడిలేనికొటికనున్నయతండు." జై. ౧, ఆ.

కొటికాఁడు. దే. వి. కొట్టికాఁడుయొక్క రూపాంతరము. "ఉ. అప్డుకొటికాండ్రు కృపఁజలకాలిపిల్లప్రేల్, ముట్టఁగఁగోసి మంత్రివరుముందటఁబెట్టికృతప్రణాములై." జై. ౮, ఆ.

కొట్టకొన. దే. వి. (కొన+కొన.) అన్నిటికిఁగొన.

కొట్టడి. వై. వి. సామగ్రులుంచెడుగది, కోష్ఠము.

కొట్టము. యు. దే. వి. నృత్యవిశేషము. "సీ. ఆటయంచనఁగనాట్యంబొప్పెసఁగుఁగొట్టమనఁగహల్లీసకంబలరుచుండు." ఆం. భా. ప్ర. నా.—వై. పసులులోనగువానిఁగట్టెడుచోటు*.

కొట్టరువు. దే. వి. కొటారుయొక్క రూపాంతరము.

కొట్టాడు. దే. అ. క్రి. (కొట్టు+ఆడు.) 1. జగడమాడు; 2. బాధపడు. "క. కట్టాత్రికరణమెఱుఁగక, పుట్టినదుఃతములనపుడపాలియింపనియా, కట్టిఁడిదేహంబుడిగినఁ, గొట్టాడునుబిట్టునరకకూపంబులలోన్." భాగ. ౬, స్కం.

కొట్టాము. యు. దే. వి. ఒకానొకదేశము. "కోనబిట్టేర్చఁగొట్టాముఁదగిలె." స్వా. ౧, ఆ.—వై. పసులులోనగువానిఁగట్టెడుచోటు*. (ఈయర్థమునందిది కొట్టముయొక్క రూపాంతరము.)

కొట్టి. దే. వి. వేగు. (కోటియొక్క రూపాంతము. చూ. కొట్టికాఁడు.)

కొట్టిక. వై. వి. కొటికయొక్క రూపాంతరము.

కొట్టికాఁడు. దే. వి. వేగరి. "క. హరిణాజినోత్తరీయుఁడు, నిరాయుధుఁడునగుచునతనినెలవగునడవిన్, జొరఁగొట్టికాండ్రుటెక్కెము, పరికించియెటెంగికలయఁబడికూఁతలిడన్." ఆము. 3, ఆ. (పాఠాంతరము కోటికాఁడు.)

కొట్టు. యు దే. స. క్రి. ప్రహరించు. వి. ప్రహరము. వై. సామగ్రులుంచెడుగది. "కొట్లుబేహారులగొనబుటంగడులంద." అచ్చ. బాల, కాం.

కొట్టుపడు. ద్వ. అ. క్రి. వ్యయమగు.

కొట్టులాడు. దే. అ. క్రి. (కొట్టులు+ఆడు.) పోట్లాడు.

కొట్టులాట. దే. వి. కొట్టులాడుట.

కొట్టె. దే. వి. మట్టియొఱలయంతటిదళముగలకాఁగు. "ఎ, గీ. తద్విశేషసమాఖ్యలుతనరుచుండు, కొట్టెకూటుపాడకకుమిబొట్టయనఁగ." ఆం, భా. ద్వి. వై.

కొట్నము. దే. వి. 1. వడ్లదంపకము; 2. వివాహతంత్రవిశేషము; 3. ఊడిగము. "శా. ఇట్టట్టెందునుబోవరాకవగతో నెల్లప్పుడున్ వేలుపుల్, వెట్టింగొట్నముఁజేయ." య. ౨, ఆ.

కొట్ర. దే. వి. పిండిలోనగువానినుడుకఁబెట్టుటకుఁబెట్టెడియెసరు. "వ. కీచకతండులంబులంబిండిగొట్టికొట్రఁబోసియుప్పి గొప్పలుగాఁజేసియావించినకుడుములబానలు." కాశ. 3, ఆ.

కొట్లమారి. దే. విణ. (కొట్లు+మారి.) కొట్లుపడుస్వభావముగలవాఁడు. "సీ. తాళముల్ చూడఁగీర్తన పాత్రములటంచుఁగొట్లమారులజోడుకూర్పఁదగునె." చంద్ర.

కొట్లాట. దే. వి. కొట్టులాటయొక్క రూపాంతరము. "ఎ, గీ. తానగోసిడికొట్లాటతగులుపఱచు." భల్లా. 3, ఆ.

కొడమ. దే. వి. ముఖభాగమునఁగట్టులేకనడుమవలవలెనల్లికగలయీఁతవంటియొకమత్స్యగ్రహణసాధనవిశేషము. (చూ. అడ్డకొడమ.)

కొడవలి. దే. వి. కోసెడుసాధనము, లవిత్రము.

కొడి. వై. వి. దీపశిఖ*. "సీ. కొడిఁబుట్టుకాళిమాంకురపుమేఘములకుమెఱుఁగులైచూపుఁగ్రొమ్మించులలర." పాండు. ౨, ఆ.

కొడిది. దే. వి. ఒకానొకచెట్టు. "కొడిదిపూసలనంటుకొలిపినమొలత్రాఁడు." పంచ. వేం. ౧, ఆ.

కొడిదిలి. దే. వి. 1. వంచినచేర; 2. పుడిసిలి.

కొడిమె. దే. వి. 1. అపదూఱు; "ఎ, గీ. మదికివలసినయట్లుచేయుదురుగాని, పట్టికొడిమెలునాకునుగట్టఁజనదు." కళా. ౫, ఆ.—2. పాపము; "చ. జడముడిజాహ్నవీతట నిశాకర పోతముఁజూచియెవ్వరీ, కొడిమెలుగట్టిపెండ్లికొడుకుఁగడియారముమోవఁజేసిరి." శై. ౧, ఆ.—3. చేఁపలబుట్ట. "సీ.కువేణిచెలంగుఁగొడిమెయుంచనఁగను." ఆం, భా. ప్ర. వారి.

కొడిమెలాఁడు. దే. విణ. (కొడిమెలు+ఆఁడు.) పాపాత్ముఁడు.

కొడిసె. వై. వి. కొండమల్లె, కుటజము‡. (దీనికాయ ఇంద్రయవము.)

కొడిసెపాల. దే. వి. కొడిసెవిత్తు.

కొడుఁగురు. దే. వి. దీపముయొక్క చిట్టెము.

కొడుకఁడు. వై. వి. కొడుకు, పుత్త్రుఁడు*.

కొడుకు. వై. వి.——పై.——

కొడుపు. దే. వి. 1. గంటలోనగువానివాయించెడుసన్నకొయ్య, కోణము. "ఉ. క్రుంగనగంటపైఁగొడుపువ్రాలుటయెన్నఁడునాఁటనుండియుఁ౯." శై. 3, ఆ. "గీ. క్రొమ్మెఱుఁగుదీఁగెతళుకులకమ్మపనిఁడి, కొడుపుతాఁకులఘూర్ణిల్లెఘోరభంగి, దర్పకోద్దండదండయాత్రకునుభోలె, భూరితరమేఘమాలికభేరిభేరి." రామా. ౬, ఆ.—2. బలపములోనగువానికోపు; 3. తంతిమీటుటకుబంగారులోనగువానితోఁజేసివ్రేలికివేసికొనెడుగోరు; 4. వెదురుకనుపులనడిమిభాగము.

కొడుము. దే. వి. బింకెవంటికుండ.

కొడ్కు. వై. వి. కొడుకుయొక్క రూపాంతరము.

కొడ్డి. దే. వి. కొడిదియొక్క రూపాంతరము. "సీ. నివ్వగకప్పనిచంద్రనిప్పుకైవడినున్నదీకొడ్డిపూ ... కిచ్చె." శై. 3, ఆ.

కొ... ఎ. వాకిటి కావలియిల్లు.

కొణత. దే. వి. 1. కుక్కనుగట్టెడుకొయ్య; 2. మల్లపరికరవిశేషము. "సీ. తత్సాధనంబులైతగుఁగంబముకొణత." ఆం, భా. ద్వి. ఉ. (రూ. కొణతము. కుక్కనుగట్టెడుకొయ్యకు. — "సీ. బిరుదుగల్గినయింటఁబెరిగినఁగొణతంబువిప్పినంతనకుక్కవెదకుఁజెప్ప." వేణుగోపాలశతకము.—మల్లపరికరవిశేషమునకు.—"అమరంగ్రొవ్విరితేనెచాలుకొణతా లందందలాగించి." శళాం. ౨, ఆ.)

కొణిఁగె. దే. వి. కుప్ప, దిబ్బ. "వ. మగరాలగోడలనీడలందుఱంగలించుక్రీడాపులినంపుఁగొణింగెలంజెలంగు." కృష్ణ. ౧, ఆ.

కొణిగ. దే. వి. ముంజూరు. "సీ. సెలవులైచెలువారునిలువులవిలసిల్లి కొణిగఁబారావతకులముపదర." స్వా. ౬, ఆ.

కొణిద. దే. వి. జాతిభేదము.

కొణిదిలి. దే. వి. కొడిదిలియొక్క రూపాంతరము.

కొణుఁగురు. దే. వి. కొడుఁగురుయొక్క రూపాంతరము.

కొణుజు. దే. వి. పిడుఁజు.

కొతిమిరి. వై. వి. కొత్తిమిరియొక్క రూపాంతరము.

కొతుకు. దే. అ. క్రి. 1. వర్ణలోపముగామాటాడు; 2. సంకోచించు. "చ. అతితరమారఘోరవిశిఖాగ్నిశిఖాపరితాపభీతిఁ, య్యతివలమిన్ననిన్నిచటికంపెడినోమతియేమిపల్కనీ, మతిఁగొతుకంగనేలచెప్పుమా." రసి. ౫, ఆ.—వి. 1. వర్ణలోపముగలమాట; "గ్రచ్చుకొతుకునాఁగగ్రస్తాఖ్యనిలసిల్లు." ఆం, భా. ప్ర. వాగ్వ.—2. సంకోచము.

కొతుకుపడు. ద్వ. అ. క్రి. 1. (మాట) లుప్తవర్ణమగు; 2. సంకుచితమగు. "క. కొతుకుపడురతికిఁజతురత." హంస. ౨, ఆ.

కొత్తిమిరి. వై. వి. దనియాలపైరు. బ. దనియాలు.

కొత్తెము. దే. వి. తాటిపండ్లయందువిత్తులేనికండ.

కొత్వాలు. హిం. వి. పోలీసు అధికారి.

కొద. దే. వి. కొదవయొక్క రూపాంతరము. "ఉ. నాతమ్మునిముద్దుమాటలుకొదల్పడఁబల్కెడుచిల్క బోదని, త్వమ్మునుబొత్తునంగుడుచునర్మిలిచేడ్వుడు." నిర్వ. ౫, ఆ.

కొదమ. దే. వి. 1. పశుపక్ష్యాదులపిల్ల; (సింగపుఁ గొదమ, అంచ[illegible]మ, తేఁటికొదమ. మొ.)—2. అఁడు[illegible] విశే. 1. యౌ[illegible]మా పినది; (పశుపక్ష్యాదికము.) (కొద[illegible]కొదమతుమ్మెద. మొ.)—2. దృఢము. (కొదమ పిడుగు. మొ.)

కొదరు. దే. అ. క్రి. 1. అతిశయించు; "సీ. కోర్కుల తమకంబు కొదరియుఁదాలిమి పొందునసందం దక్రిందువడఁగ." హరి. ఉ. ౨, ఆ.—2. చెదరు; 3. రేఁగు.

కొదవ. దే. వి. కొఱఁత. "గీ. నీప్రాపుగలిగి, యుండఁగానిట్టికొదవమాకొదవనేల." రామా. 3, ఆ.

కొదుక. దే. విశే. తక్కువ. "ఎ, గీ. తక్కువకొఱంతయొచ్చెముతగ్గకుందు, కొదవలొచ్చుకొదుకయనఁబొదలున్యూనము." ఆం, భా. తృ. వి.

కొదుకు. దే. అ. క్రి. కొతుకుయొక్క రూపాంతరము. (సంకోచించుటకు.— "క. ఒదుఁగుచులక్షణమెఱుఁగక, కొదుకుచుఁబ్రాసంబువడియుఁగూడకమీఁదుల్, వెదకుచుఁబదసంధులుచెడ, నదుకుచు వెడకవితచెప్పునతఁడుంగవియే." కవిగజాంకుశము.)

కొదుపు. దే. స. క్రి. ఏదేనినోటవేసికొనిమ్రింగక ఊరకనములు.

కొద్ది. దే. వి. కొఱఁదియొక్క మాఱురూపము. "ద్వి. కొద్దిగాముత్తెంపుకొనలప్రాఁగెంపు, మద్దికాయలడాలుమలయఁజెక్కిళ్ల." రా. బాల, కాం. (ఈ రూపము ప్రాచీనకవులప్రయోగములందుకనఁబడలేదు.)

కొన. వై. వి. 1. చివర; 2. చెట్టుకొమ్మచివర*. "చ. తొఁదలపోసిహరించెనాకులుం, గొనలునుజొంపముల్ నిడుద కొమ్మలు రేయగుడుం గ్రమంబునన్." భార. శాం. 3, ఆ.

కొనకొను. ద్వ. అ. క్రి. యత్నించు. "వ. అమ్మెయింబలితుండు కొనకొనికొఱుకకుండుట యెఱింగిరో మముండిట్లనియె. క. తగునేయిట్లుకృతార్థుఁడ, వగునీ కురి కొఱుకకిట్టులాలస్యముచే, తగటా కృతఘ్నుతతు నెల, పగు టుఱునే కొఱుకుకడఁక నద్రోహుఁడవై." భార. శాం. 3, ఆ. (ఇది గ్రంథములయందుఁ గొన్నిచోట్లసరళాదిగాఁగనఁబడుచున్నది.)

కొనటి. వై. విశే. అంగహీనుఁడు. "గీ. రూపవిహీనులుదారురూపు, గలిగిలొలుమేనఁగొనటులఁబలికినారు." భార. అను. ౫, ఆ.

కొనరిక్క. వై. వి. రేవతీనక్షత్రము. "క. కొనరిక్కపేరుపొలఁతుక, పెనిమిటివైనాఁగలియుతునుబెనుతాటిసిడం, బునఁబూనిరవళికాంద్రన్, దునిమిపుడమిపడఁతిప్రేగుద్రోయఁదువ్వఁగదా." అచ్చ. బాల, కాం.

కొనలిడు. ద్వ. అ. క్రి. (కొనలు + ఇడు.) వర్ధిల్లు. "క. త్రుయ్యుదొకయించుకైనన్, డయ్యదకొనలిడియొదృష్ణ." భాగ. ౯, స్కం.

కొనలొత్తు. ద్వ. అ. క్రి. (కొనలు+ఒత్తు.)—— పై. ——"ద్వి. కొనిపోయివేడ్కలఁకొనలొత్తనపుడు, వినుతార్ఘ్యపాద్యాదివిధులఁబూజించి." రా. బాల, కాం.

కొనసాగు. ద్వ. అ. క్రి. 1. వర్ధిల్లు; "క. అనవుడు సాత్యకిమోమునఁ, గొనసాగనితెలివిదోఁపఁగుశలమునీచె, ప్పినవారికెల్లనసుటయు." ఉ, హరి. ౮, ఆ.—2. సిద్ధించు.

కొని. ద్వ. స. ఏ. కొన్నియొక్క రూపాంతరము. "క. మనుజపతి యివ్విధంబునఁ, దనచెఱ యుంటికిని మ్రుచ్చుఁదప్పనసొప్పిం, చినయట్టులమదినిసరకు, గొనకమఱచియున్నయెడను గొనిదినములకున్." నిర్వ. ౨, ఆ. (హల్లుపరమగుచో ఇకారలోపము. "కొన్నిగొడంగికొన్గునినీ." పాండు. ౮, ఆ.) (చూ. కొన్ని.)

కొనిపోవు. దే. స. క్రి. తీసికొనిపోవు.

కొనియాట. దే. వి. (కొనియాడుట.) 1. నుతించుట; "మీరు విజయాశ నసుం గొనియాటఁజేసియాఁ,గాదనకియ్యకొంటి." భార. ద్రో. ౧, ఆ.—2. ఆదరించుట; 3. కాపాడుట; "సీ. తలఁపం గనాద్యమైతనరుధర్మమునెప్డుఁ గొనియాటనాస్తికగోష్ఠిఁజనమి." భార. అర. ౫, ఆ.—4. కొలుచుట. "క. కడుఁగ్రొత్తలునీవిటునను, బడుగుంబాటించిమిన్నుప్రాఁకించెదునీ, యడుగులుగొనియాటకుఁబని, వడుపనియాతనికిమున్నుపాడియెపాగడన్." హరి. ఉ. ౮, ఆ.

కొనియాడు. దే. స. క్రి. (కొ[redacted]ము.) 1.[redacted]ం చు; 2. ఆదరించు; "క. అనిన[redacted]దేవతలుమా, కు నునీకునునరకగతియగుంజుమ్మీ[redacted]నమునమావ చనంబులు, కొనియాడకవిడిచి తెనకుంజలధిశశీ." మార్క. ౭, ఆ.—3. కాపాడు. "ఎ, గీ. అతనిపుత్ర కులుదాని, సెంగిళులుపెట్టికొనియాడ సెలమిఁబె రిగి." భార. కర్ణ. ౨, ఆ.

కొనివచ్చు. దే. స. క్రి. తెచ్చు.

కొను. దే. అ. క్రి. 1. నాటు; "అనలాస్త్రంబట్లువ త్తుంబవియఁగొనిన." మార్క. ౭, ఆ.—2. సరిప డు. "కుటిలబుద్ధులిచటఁగొనవు." భార. విరా. ౪, ఆ.—స. క్రి. 1. అపహరించు; "వ. పొత్తిచీరఁగొ నిపసిరికపురుగగు." మార్క. ౨, ఆ.—2. వెలకుఁ దీయు; 3. గ్రహించు; "గుదియలఁరోఁకండ్లు కొనిపీఁకమోఁదియు." రా. యు, కాం.—4. తీసి కొను; "ఎ, గీ. అతివపిండుఁ, గరులఁదురగములను నరదంబులనుగొని, యరుగుదెంచె." భార. మా. ౧, ఆ.—5. పట్టుకొను; "ఇందుఁగ్రోల్లాసబుల్ గొనుకౌవడిఁజొచ్చినకౌ." భార. ఆది. ౮, ఆ.— 6. పరిగ్రహించు; "క. వినుమిచ్చెదనని యామి యుఁ, గొనియెదననిపలికి పిదపఁగొనకునికియు న, త్యనృతంబులు." భార. శాం. ౪, ఆ.—7. ల క్ష్యపెట్టు; "క. మిముసెల్లమిగులుభుజగర్వము మదముంగలఁడుకొనఁడరాతులనధిపా." భార. ఉద్యో. ౪, ఆ.—8. వ్రేయు. "భీమపార్థులును గోకొమ్మంచునొక్కమ్మడికౌగవియకౌ." భార. భీష్మ. 3, ఆ. "క. మునునడినమెకముఁగొనిచని, కనుగ్రుడ్డుపెకల్చికత్తిఁగడిగికటారిం, గొనితోఁ కవడిచియొకఁడో, ననఁగనురాళించెనయ్యయాతి కిఁగడఁకకౌ." య. ౨, ఆ.

కొనుగోలు. దే. వి. 1. క్రయము; 2. నట్టువుఁడుకొ లిపించుట.

కొనుజా. దే. వి. పిడుఁజా. "సీ. ఎరువుతిప్పలుగొని యొల్లమందలఁగొను జెక్కిమేపులచోటుత్రొక్కఁ బడియె." హరి. పూ. ౫, ఆ.

కొనుబడి. దే. వి. కొనుగోలు, క్రయము.

కొనుమొదలు. దే. వి. కొనుటకిచ్చినధనము.

కొన్నాళ్లు. ద్వ. వి. బ. (కొన్ని+నాళ్లు.) కొన్నిదిన ములు.

కొన్ని. ద్వ. స. ఏ. (కొంతశబ్దమునకు అమహద్బహు బహువచనాదేశము.) కొంతసంఖ్యగలవి. (చూ. ఇన్ని.)

కొపురు. [redacted] 1. శిఖరము*; "క. దాఁటుటయుఁగొం డకొపుర[redacted]ట్టలువాసెను." అచ్చ. కిష్కిం, కాం.—2. ఉన్న[redacted]"గీ. గొనబుఁగొను, కొంచెత నముఁ బిఱుఁదుఁగొపురు[redacted]క్కలి, లోఁతునె న్న సెనగలుగుటయరిది.[redacted]ర, కాం. (కొప్ప రముయొక్కరూపాంతరము.)

కొప్పరము. వై. వి. 1. శిఖరము*; 2. మూఁపు*; "ఎ, గీ. కొప్పరముమూఁపటంచన నొప్పనంసము." ఆం, భా. ద్వి. మ.—3. విజృంభణము*. "వ. కొప్పరం బులదెప్పరంబులం దెలిపియు నిలిపియు." ఉ. హరి. ౬, ఆ. విశే. విజృంభితము. "రోగముల్ కొప్పరమైనచో." దాశరథిశతకము.

కొప్పరించు. వై. అ. క్రి. 1. అతిశయించు*; "వ. శ వెలుంగుతొచిప్పలంగప్పరంపుఁగుప్పెలంగొప్ప రించినసరసమధురసంబులు నించి." పా. ౨, ఆ.—2. విజృంభించు*. "వ. ఝుణఝుణఝుంకా రంబులం దదీయపరస్పర ఘర్షణాక్రేంకా రంబు లుం దమహుంకారంబులును ముప్పిరిఁగొనంగొ ప్పరించియు." ఉ. హరి. ౪, ఆ. "సీ. కొప్పరిం పఁగమింటఁగ్రొవ్వాఁడిరోమముల్ చొచ్చివెళ్లి నతోలుల్ చుక్కగుంపు." చంద్రా. ౧, ఆ.

కొప్పరింత. వై. వి. 1. అతిశయించుట*; 2. విజృం భణము*.

కొప్పు. దే. వి. 1. తలయందుదోఁపినవెండ్రుకలముడి; 2. వింటికొన; "క. లలిఁగొప్పెక్కించితిమధు, పు లశుకులనునడుగుపఱచి పుష్పాస్త్రామా, లలకును మంచంబులుబాఁ, పలుకునుబీఁటలను నాటుబలిని జమయ్యెకౌ." చంద్ర.—3. ఇంటి నశిఖా[illegible] మొగుడు.

చటి

కొప్పెర. వై. వి. వెడల్పుముఖముగల [illegible]పాత్రము, కటాహము. "గీ. రానివారలనువైవుఁ, దరసికొఁ గినచమురుకొప్పెరలలోన." జై. ౪, ఆ.

కొప్రము. వై. వి. శిఖరము*. "ఉ. పున్నమచందురు దెగడుపొంకపుమోములరాచకన్నియల్, క్రొ న్నెలతాలమేలిపనికొప్రపుమేడలనాటలాడ." నీలా. ౧, ఆ. (కొప్పరముయొక్క రూపాంత రము.)

కొబ్బెర. దే. వి. చిప్పతీసినటెంకాయ.

కొబ్బెరకాయ. దే. వి. టెంకాయ.

కొబ్బెరపండు. దే. వి. కొబ్బెరకాయ. "చక్కెరకొబ్బెరపండు లుండ్రముల్ మెక్కెడుపాఁపజం దెమఁలమేటికి." నీలా. ౧, ఆ.

కొబ్బెరయుండ. దే. వి. (కొబ్బెర+ఉండ.) భక్ష్య విశేషము, మాండము.

కొమ. దే. వి. 1. ... 2. ఆఁడుది. (కొమ్మయొక్క రూపాంతరము.)

కొమరసామి. వై. వి. కుమారస్వామి. "సీ. కొక్కొ కోకోయనికొమరసామిరథంబు కంఠంబుసాఁచి క్రొక్కారమిచ్చె." భీ. ౨, ఆ.

కొమరాలు. ద్వ. వి. (కొమరు+ఆలు.) 1. యౌవనవతి; 2. సౌందర్యవతి. "గీ. చాలముద్దరాలుజనరాలుకొమరాలు." భాగ. ౯, స్క౦. (చూ. కొమరు.)

కొమరిత. వై. వి. కూఁతురు. "ఎ, గీ. అతనునారాచమైన, రాచకొమరితఁబొంచాలిఁజూచునపుడు." పాంచా. ౨, ఆ.

కొమరు. వై. వి. 1. వృత్తియందుకొమిరెశబ్దమునకగు ఆదేశము; (కొమరాలు. మొ.) 2.మనోజ్ఞత*. "సీ. వదనంబు కొమరుభావన చేసి వేలుఁగనుదుటి సొంపలకలనెదుఁగఁబడఁగ." భార. విరా. ౧, ఆ.—విశ. మనోజ్ఞము.

కొమరుఁడు. వై. వి. కొడుకు, పుత్త్రుఁడు.

కొమరుఁదనము. వై. వి. (కొమరు+తనము.) యౌవనము. "తోఁచుఁ జూలేనికొమరుందనములేనిచెలువంబు." కళా. ౪, ఆ. (చూ. కొమరు.)

కొమరుఁబాయము. వై. వి. (కొమరు+పాయము.) యౌవనము. "క. నీకొమరుంబాయముమిక్కిలి, కొమరొందెడు." కళా. ౪, ఆ. (చూ. కొమరు.)

కొమరులు. దే. వి. బ. మేలుదూలముమీఁదిగుజ్జులు.

కొమరేఁలు. ద్వ. వి. (కొమర+ఏఁలు.) స్వామిపుష్కరిణి. "గీ. దివ్యవాహినిఁగొమరేటఁదీర్థమాడి." భీ. ౨, ఆ.

కొమారి. వై. వి. కూఁతురు. "గీ. ఈకొమరుఁబాయపుమిటారిరాకొమారి." చంద్ర.

కొమారిత. వై. వి.——వై.——"పల్లకియెక్కియాదొర కొమారిత." పాంచా. ౨, ఆ.

కొమారుఁడు. వై. వి. కొడుకు, పుత్త్రుఁడు. (బ. కొమారులు, కొమార్లు.)

కొమార్త. వై. వి. కొమారితయొక్క రూపాంతరము. "సీ. మును ... నన్నెఱుఁగుదువిన్నాతిన్నపుపురుషుఁడనుతోలు ... ప్పరాయనికొమార్త." య. ౪, ఆ.

కొమిరె. వై. వి. యౌవనముగలస్త్రీ*. "కొమిరెలు లేరెనీకుఁబదికోటులు." ఉ. రా. ౪, ఆ.

కొమ్మ. దే. వి. 1. శాఖ; 2. ఆఁడుది; 3. కోటకొమ్మ, కపిశీర్షము; "చ. కడఁగిరసాతలంబుభుజగంబులువెల్వడివచ్చికొమ్మలఁ, బడగలువిచ్చియాడుసెడఁబెంకజమిత్త్రుఁడురాహుశంకఁబె, ల్లడరడుభీతితోసరసమట్టుననిట్టునుదోలునిమ్ముమఁ, బొడవునునేమిచెప్పననఁబొల్చునగడ్తయుఁగోటయుఁ బురిఁ." భో. ౨, ఆ.

కొమ్మత్రిమ్మఁ. దే. వి. కోఁతి. "కొమ్మత్రిమ్మరినాడు." అచ్చ. యు, కాం.

కొమ్మనఁటి. దే. వి. (కొమ్ము+అనఁటి.) కదళీవిశేషము*. "ఎ, గీ. పనసపండ్లీఁదపండ్లుకొమ్మనఁటిపండ్లు." రసి. ౧, ఆ.

కొమ్మనగొట్టెపిండిచెట్టు. ద్వ. వి. పూతిక.

కొమ్మనగొలిమిడి. దే. వి. మూలఫలి*.

కొమ్మనగోర. దే. వి. వృక్షవిశేషము.

కొమ్మమెకము. ద్వ. వి. కోఁతి, శాఖామృగము. "కొమ్మమెకంపువెల్లువలు." య. 3, ఆ.

కొమ్మి. దే. వి. ఒకానొకచెట్టు.

కొమ్ము. దే. వి. 1. ఉకారముయొక్కరూపాంతరనామము; 2.ఎద్దులోనగువానికొమ్ము; 3. మాదిగవాఁడుక్రొవ్వుంచుకొనెడుపాత్రము; 4. పసుపులోనగువానియెండినదుంపాటిగడ్డ; 5. చిమ్మనఁగ్రోవి; "చ. తొడవులుతీసిక్రొమ్మెఱుఁగుదువ్వలువల్కడవేసిజిల్గుపా, వడలొగిఁగట్టిమేలినిడువాలికకొమ్ములువట్టియుద్దులే, ర్పడఁగవగూడియల్లవలరాయనిక్రొవ్విరిఁబోఁడికేనిప్రా, పడనియొయారిదారికనుపట్టఁగొలంకునఁజేరిరెంతయుఁ." చంద్ర.6.పల్లకిబొంగు; "సీ.—మొగలిరేకల్లికతొగకాఁడచట్టనుకుఱుగన్నుచెఱుక్రొమ్మెఱుఁగుఁగొమ్ము." (ఇక్కడ అందలముయొక్క వర్ణనము.) చంద్రా.3,ఆ.—7.ఏనుఁగుయొక్కదంతము; "ఉ.కొన్నిటిహస్తముల్ చదియఁగొన్నిటఁగొమ్ములుదుమ్ముధూళిగా." భార. భీష్మ. ౨, ఆ.—8. పందికోఁఱ; "సీ. నీటిలోమునిఁగిననేలచేడియఁగొమ్ముకొనఁనుబ్బనెత్తినఘోణివివ." పా. ౧, ఆ.—9. ఊఁదెడి యొకానొకవాద్యము; "వ. గుమ్మెటలచటులగ

వమ్మునుగొమ్ములనిసదమ్మును జెలంగ." కాశి.3,ఆ.— 10. శాఖ; "సీ. కలఁచుపున్నాగంబులలరుఁగొమ్ములమహోన్నతిగలయనభీకమకులనైన." హన. ౨,ఆ.—11. శిఖరము; "క. గుబ్బలికొమ్మెక్కటెఁగడు, నిబ్బరముగఁబెఱికియాతనిఁ బైచినవాఁడు బ్బుసెడకమలత్రిమ్మరి బెబ్బులిపై మొనలవాలు పేర్మిఁ బైచెన్." అచ్చ. యు, కాం.—12. కొన; "సీ. ధనువుక్రిందటి కొమ్ముధరణిపై మోపిమీఁదటికొమ్మువామహస్తమునఁబట్టి." భో. ౫, ఆ.— 13. ఉత్సాహము; "గీ. అంతగోపసింహుఁడసురకొమ్ములువట్టి, ధరణిఁద్రొబ్బిత్రొక్కి దైత్యభటుల,కొమ్మువీడసురలకొమ్ముపర్ధిలవాని, కొమ్ము చెఱికిమొత్తికూల్చెనధిప." భాగ. ౧౦, స్కం. పూ.— 14. బలము. "క. కొమ్మా దానవనాథుని, కొమ్మాహవమునకుఁదోలఁగె గురువిజయముగై, కొమ్మా మెచ్చితినిచ్చెదఁ, గొమ్మాభరణములునీవుకోరిన వెల్లన్." భాగ. ౧౦, స్కం. ఉ. 15. గవుండ్లవాఁడు బందము తగిలించెడు కత్తిపిడికలోని వంకరకొయ్య.

కొమ్ముకాఁకర. ద్వ. వి. కారవేల్లవిశేషము?.

కొమ్ముకాఁడు. దే. వి. 1. వరాహము; 2. అగసాలెవాఁడు. "సీ. నరకహేతుహిరణ్యహరణవృత్తిఁ జరించుకొమ్ముకాని భజించుకొదవలెల్ల." వసు. ౧,ఆ.—3. కొమ్మూఁదెడుమాదిగవాఁడు. "సీ. మాతంగసదృశుఁడౌమనుజుండు తెగుబోయుఁడనఁగ నుగొమ్ముకాఁడనఁగ." ఆం, భా. ద్వి. కూ.

కొమ్ముచేఁప. దే.వి. ఒకానొక ఱఁడుమత్స్యము, శృంగి.

కొమ్ముటేనుఁగు. దే. వి. (కొమ్ము+ఏనుఁగు.) మగయేనుఁగు. "కొమ్ముటేనుఁగువిభీషణతుండమునందించుకై వడిఁ దనుజవరుండువచ్చె." విక్ర. ౫, ఆ.

కొమ్ముపెసర. దే. వి. సస్యవిశేషము. బ. ఆ ధాన్యము.

కొమ్ముమూచకమ్ము. దే. వి. కొమ్ములుగల మూచకమ్ము.

కొమ్మువాఁడు. దే. వి. కొమ్మూఁదెడు మాదిగవాఁడు.

కొయుగూర. ద్వ.వి. (కోయు+కూర.) కోయఁదగిన నల్లతోఁటకూర.

కొయ్య. దే. వి. 1. కఱ్ఱ; 2. మ్రాను.

కొయ్యగాలు. దే. వి. (కోయు+కాలు.) కోఁతకోసినమోడు.

కొయ్యగూర. ద్వ.వి. కొయుగూరయొక్క రూపాంతరము.

కొరడా. హిం. వి. చేబుకు, జాటి.

కొరడు. యు. దే.వి. వంకరగాక సరిగానుండెడి యింద్రధనుస్సు. వై. గుడ్లగూబ.

కొరద. దే. వి. మత్స్యవిశేషము. "సీ. కొరద దాసరి కొయ్య కొఱ్ఱమీను లుచే ముచ్చుంగి బేడిస జెల్ల చాఱమీను." హంస. ౪, ఆ.

కొరవంజి. దే. వి. 1. ఎఱుకువాఁడు. "క. ఒడయని పేరిటియాచిఱు, బుడుతనికెనగానఁగానఁబురుడింపఁగని, క్కుడిబోయలలోమఱియు, క్కుడు చాయలమలల మెలఁగుకొరవంజులలోన్." చంద్రా. ౨, ఆ.—2. ఎఱుకుది. "ఏయేభూములు చూచినావెకొరవంజీ." శుక. ౧, ఆ.

కొరవి. వై. వి. ఎఱ్ఱగోరంట?. "చ. కనఁదిలకంబుఁగేసరముగల్లుమియన్ రహిఁబాడఁ బ్రేంకణం, బునిమురమావినవ్వసుర పొన్నముఖాంబుజ మెత్తఁ జంపకం, బు నెఱకవుంగిటంగొరవిమూర్ఛోనవావిలితన్నవంజుళం, బునుడువగోఁగునైతరుణిపూచుసురద్రుమమన్ని పువ్వులన్." పా. ౪, ఆ.

కొరనాసిగండు. ద్వ. వి. క్రూరమృగవిశేషము.

కొరి. దే. వి. అప్పనడిమి వెండ్రుక, అర్మము. "సీ. కలివోసినాన్చినగ్రచ్చకాయలభంగికొరిదూలినట్టిదృగ్గోళకములు." కాశీ. 3, ఆ.

కొర్నవగండు. ద్వ.వి. కొరసానిగండు. (చూ. కణఁతి.)

కొఱ. దే. వి. 1. కొఱంత; "క. మఱిమఱిచీఁకటిలోనం,దఱు రాజులుసమరముడిగితగ నెల్లిటికిన్, గొఱగలకలనగునడువుఁడు, నెఱవగుగోవర్ధనాద్రి నేలకుననుమన్." ఉ, హరి. ౪, ఆ.—2. ప్రయోజనము; "ద్వి. తఱిచను దేరనాతనికుక్షివలనఁ, గొఱగలయొకముంచికొడుకుజనించె." భాగ. ౯. స్కం.—3. మత్స్యవిశేషము; (కొఱ్ఱయొక్క రూపాంతరము.)—4. శిల్పము. "సీ. కొఱమించుపగడంపుగుండ్రకంబంబులు వలుదతామరకొఁపుదలుపుగములు." అచ్చ. అ, కాం.—విశే. ప్రయోజకము. "క. మఱచితిరేయదువిభుఁడిం, పఱకును బురియొప్పగించి తగనేగుటయు, త్రటినదిమూఱలువోవఁగఁ, గొఱయగునేమగతనంబుఁగుఱ్ఱమునుమనకున్." హరి. ఉ. ౬, ఆ.

కొఱఁకు. దే. వి. 1. పసులుమేయుకంచె, విపినము; 2. పశువులెరయేఱితినుచోటు. "ద్వి. కొఱఁకులమానిపశులుగూండ్లుసేర." హరిశ్చ. ౧, భా. (కొఱనుయొక్క రూపాంతరము.)

కొఱఁత. దే. వి. తక్కువ. "క. అంతటఁగడలం దెల్లఁ గొ, ఱంతయొకింతయును లేక ఱంపిల్లెనిరుల్." అచ్చ. సుం, కాం.

కొఱఁతనుఱుకు. దే. స. క్రి. (కొఱఁతన్+ఉఱుకు.) అకార్యముచేయు. "గీ. కొఱఁతనుఱుకుఁగాని కొడుకెన్నఁడును గార్య, తంత్రమునకుఁజొరఁడు." భార. స్త్రీ. ౧, ఆ. "వ. కృష్ణుఁడెప్పుడుం గొఱఁతనుఱుకుఁబిన్ననాఁడునుంబిన్నకొలందులం బోయెడువాఁడు కాఁడనువారును." హరి. పూ. ౭, ఆ.—విశే. అకార్యముచేయువాఁడు. "వ. వారుగదామీఁదెఱుంగక కొఱఁతనుఱుకులైచెడు తెరువునంబోయెడువారు." భార. ఉద్యో. ౨, ఆ.

కొఱకచ్చు. దే. వి. కొఱవి, అలాతము. "చ. అలమరు నాజ్ఞశీతకరునవ్వలరమ్మని చెప్పిగుంపులై, యలిబలముల్ వియోగి హృదయంబులు మూఁడఁగవచ్చినట్టివె, న్నెలకొఱకచ్చులోయనఁగనిండినచీఁకటిమీఁదనింగిఁజూ, క్కలుఁగనుపట్టెవచ్చి పొడకట్టెశశాంకుఁడునంతఁదూర్పునన్." రామా. ౨, ఆ.

కొఱకు. దే. అవ్య. చతుర్థీవిభక్తియందువచ్చెడు ఒక ప్రత్యయము. "సీ. పవనేరితములైన పాదపాంసువులనిం దఱఁగృతార్థులఁజేయు కొఱకొయనియు." కళా. ౨, ఆ.

కొఱకొఱ. దే. వి. కోపవికారము. "క. తెఱవలకడుపులలోనే, డ్తెఱఁబెఱిగెడుప్రోడరేయి త్రిమ్మరిదొరపైఁ, గొఱకొఱనూర్పులునిగుడుచు, తెఱఁగునగాటంపుటూర్పుఁదమ్మెరలడరెన్." అచ్చ. బాల, కాం.

కొఱకొఱలాడు. దే. అ. క్రి. (కొఱకొఱలు+ఆడు.) కోపగించు.

కొఱగామి. దే. వి. (కొఱ+కామి.) 1. అకార్యము; "క. వెఱవకకలలోఁజేసిన, కొఱగామికివగచుచోటగుణరత్నముచే, కుఱెనీకునలిగితన్నినఁ, బఱపుపయింబడినయట్లుపద్మదళాక్షీ." ఉ, హరి. ౫, ఆ.—2. దుర్లక్షణము; "క. ఆకొఱగాములఁగనుఁగొని." స్వా. ౮, ఆ.—3. దోషము. "క. ఇక్కొఱగాములలోపల, నొక్కటినీచిత్తవృత్తినొదవెను." సం. "కచ్చిదేతైర్మహాదోషైర్నస్పృష్టోసి నరాధిప." భార. ఉద్యో. ౨, ఆ.

కొఱడు. దే. వి. 1. ఆయుధవిశేషము; "ఉ. భూరిధృతింబసిండిజలపోఁతకటార్లుఁగొఱళ్లుఁబూని." కళా. ౯, ఆ.—2. మ్రానిమోడు, స్థాణువు. "గీ. కొఱడుగనిమర్త్యుఁడనుశంకఁగూరినట్లు." వా. ౨, ఆ.

కొఱడుకోల. దే. వి. ఆయుధవిశేషము. "చ. కొనలుమొనల్పడన్ గొఱడుకోలవిధంబునదూయఁజెక్కుచ, క్కనికుఱుమట్టపుంజెఱుతకట్టియనూరికొసంగి." చంద్రా. ౨, ఆ.

కొఱడుపాఱు. దే. అ. క్రి. తిమురుపట్టు.

కొఱను. దే. వి. 1. పసులుమేయుకంచె; "క. కొఱనుగనాఁగినపొలమును, నెఱయంగరిసనముగల్గు నేలయుసరి." విజ్ఞా. ప్రా, కాం. (చూ. కలను.)—2. పక్షులెరయేఱితినుచోటు. (చూ. కొఱఁకు.)

కొఱపము. వై. వి. గుఱ్ఱమునుదోమెడు గొఱపము. (ఇట్లు పరుషాదిగాఁ గొన్ని దేశములయందు వ్యవహారము.)

కొఱప్రాణము. మి. వి. కుట్టుసుఱు. "క. జాఱుజాఱుకని నెత్తురు వెలి, కుఱుకుచు రొదసేయనతిరయొడపి నెయూర్పుల్, పఱవమిడిగ్రుడ్లవడఁకుచుఁ, గొఱప్రాణముతోడఁదన్ని కొనునమ్మెదవున్." ఆము. 3, ఆ.

కొఱముట్టు. దే. వి. పనిముట్టు, ఉపకరణము.

కొఱలు. దే. అ. క్రి. 1. ఉండు; "క. పిఱుఁదంగురుధరణీపతి, యఱచేతంబ్రాణములుగనభియాతిబలం, బుఱని తెగువముందటఁబెన్, గొఱలుటచిత్తమునఁబెట్టికొనివిహరించెన్." భార. స్త్రీ. ౨, ఆ.—2. ప్రకాశించు. "చ. కొఱలెడితేజచేఁబసిఁడిగుబ్బలియున్ మఱివెండికొండయున్, గరఁగునటంచుసంద్రములుకాఁకలనింకునటంచు." యు. 3, ఆ.—స. క్రి. పొందు. "ఎ, గీ. శాంతిఁగొఱలివిప్రకులముదైవస్వరూపం బగుటమనంబు, నందుదృఢముగనిల్పి." భార. అను. ౫, ఆ. (ఆదికవుల ప్రయోగములు మొదటి యర్థమునందును ఈ యర్థమునందునే కానఁబడుచున్నవి.)

కొఱవ. దే. వి. ఒకానొక తక్కువజాతి. (కొఱవవాఁడు, కొఱవది.)

కొఱవతె. దే. వి. కొఱవది.

కొఱవి. దే. వి. కొఱకచ్చు. "ఎ, గీ. కొఱవిఁద్రిప్పిన యొప్పున మెఱసెఁబార్థు, గాండివము." భార. ఆర. ౬, ఆ.

కొఱవిచీమ. దే. వి. పెద్ద యెఱ్ఱచీమ.

కోఅవిదయ్యము. ద్వ. వి. పిశాచభేదము. "ఎ, గీ. ౫౫ నమనుపద్రభూమి నేకతమతిరుగు, నదరులుమి సెడుకోఅవిదయ్యంబువీఁడె." నై. ౨, ఆ.

కోఅవోవు. దే. అ. క్రి. (కోఅ+పోవు.) మూర్ఛిల్లు. "క. వినుమమ్మెయునిర్దేశం, బునవవ్వాగ్దేవిమూర్ఛ వోయినయప్లే, మినిబలుకకుండిపడపడి, విన యంబుననజునిశరణువేఁడెలతాంగీ. వ. అనిన బ్రాహ్మణిపతితో బ్రహ్మమాటకుంగోఅవోయిన వాణియేమిటందేఁలె." భార. అశ్వ. ౨, ఆ.

కోఅసంది. ద్వ. వి. ఆయము, జీవస్థానము. "క. ప అతెంచికరిమదమునే, డ్తెఁదొండంబెత్తి వ్రేయ దెప్పటికమునకౌ, గోఅసందితాఁకి నేలకు, నోఅ గినసింగంపుఁగోదమయొప్పమరంగౌ." నిర్వ. ౧౦, ఆ.

కోఅు. దే. వి. కొఱ్ఱుయొక్క రూపాంతరము. "క. నె తిమాలిబందెవట్టిన, నతిముతిఁజంపినసుగజము న శ్వముమ్రచ్చె, పతిగొనినవట్టివారలఁ, గోఅుఁల దిగచిచంపుటొప్పుఁ గువలయపతికిౕ." విజ్ఞా. ప్రా, కాం.

కోఅుసు. దే. స. క్రి. కఅచు. వి. మేహరోగవిశేషము.

కొఱ్ఱు. దే. వి. 1. మత్స్యవిశేషము, పాఠీనము; 2. స స్యవిశేషము. బ. ఆ ధాన్యము, ప్రియంగువు.

కొఱ్ఱు. దే. వి. మేకు, శూలము.

కొల. దే. వి. 1. పాపము; 2. హింస.

కొలఁకు. వై. వి. కొలనుయొక్క రూపాంతరము.

కొలఁకువు. వై. వి.——పై.——"కొలంకువుకలం కంబొందఁగాఁజొచ్చి." భాగ. ౮, స్క౦.

కొలఁది. దే. వి. పరిమితి. విణ. శక్యము. "వ. ఇప్పు డు రాజకులంబులు కొలందికిమిగిలి నాకు భరి యింపంగొలందిగాకయున్నయవి." హరి. పూ. ౫. ఆ.

కొలకొల. వై. వి. కలకలము. "చ. కొలకొలమంచు నుండుసితికోకపదప్రభవప్రసూతనా, కొలునిది తొంటినాఁడతిథికోటులసందడి." నై. 3. ఆ.

కొలగాఁడు. దే. వి. (కొలత+కాఁడు.) ధాన్యము కొలుచువాఁడు.

కొలగారము. దే. వి. ధాన్యము కొలతకిచ్చెడు కూలి.

కొలత. దే. వి. 1. పరిమాణము; 2. ధాన్యములోన గువానిని కొలుచుట.

కొలను. వై. వి. గుంట, సరస్సు, (రూ. కొలఁకు.)

కొలము. వై. వి. 1. వంశము; 2. సజాతీయప్రాణి సమూహము. "సీ. కలకలపల్కు చిల్కల కొలం బులఁజాల నలరుపొన్నలుమూఁగియలరులాఁ(గి." య. ౪, ఆ.

కొలారకము. దే. వి. ధాన్యమును కొలుచుట. "ఎ, గీ. కొలువడికొలారకంబనఁగొలుచుటకగు." వేం.

కొలారము. దే. వి. కొల్లారముయొక్క రూపాంతరము.

కొలారు. దే. వి.——పై.——

కొలారుబండి. దే. వి. కొల్లారుబండియొక్కరూపాంతర ము. "సీ. తండోపతండమైగండోపలములుండు పథములందుఁగొలారుబండ్లనాఁగి." శుక. ౧, ఆ.

కొలి. దే. వి. బిల్లగోడాడునపుడుబిల్లఁబెట్టికొట్టుట కుఁద్రవ్వినచిన్నపల్లము. "గీ. కూడిగిరులుఁదరు లుఁగొల్లంబుఁబల్లంబు, నరసిమిట్టపుట్టలడవిఁదవి, యోపితోలులుఁగొలులునోలంబుసాలఁబు, సూచిక్రంతగుంతచొచ్చిపచ్చి." ఉ, హరి. ౫, ఆ.

కొలికి. దే. వి. 1. ముక్కునంటినకంటిమూల; 2. హ రములోనగువానితెగిల్చెడువంకరకమ్మి; 3. పరిపా కము. "వ. కార్యంబునుగొలికికిపచ్చియున్నయ ది." వీర. 3, ఆ. "ద్వి. నిను నేఁడుముఖమునసె త్తురుప్రామి, కొనిగుల్లపఅపకకొలికికిరావు." హరిశ్చ. ౨, భా.

కొలికిపూస. దే. వి. కొలికికిఁదగిలించెడుపూస. "ము. పాలుపారఁగ శరదంగనాతిలకమంభోజాకర పుంజోకా, కొలికిందామరకొల్కిపూసలెసఁగ లోకెఁజేసిక్రౌంచాద్రిఁదా, రలలీలందగురెండు దార్లఁజెలువారఁగ వచ్చురాయంచబోఁదలవేఁగ ధరియించెనచ్ఛతరముక్తాదామమెంతేరహిఁగ." చంద్ర.

కొలికిముడి. దే. వి. పదలుముడి.

కొలిపించు. దే. అ. క్రి. నట్టువుఁడు కొనుగొలఁచే యు. ప్రే. ధాన్యాదికము కొలువఁజేయు.

కొలిమి. దే. వి. కమ్మరినిప్పుంచెడుపల్లము. "గీ. తా మ్రమాదిగఁగలయట్టిధాతుచయముఁ, గొలిమిఁ డియూఁదఁగిడెల్లఁబొలియునట్లు, ప్రాణపవ ని గ్రహమునఁగ్రాఁగిపోవు, ననఘుయింద్రియజ నితదోషాలియెల్ల." మార్క. 3, ఆ.

కొలిమితిత్తి. ద్వ. వి. కొలిమియూఁదెడుతిత్తి, భస్త్ర.

కొలుచు. దే. స. క్రి. 1. ఉపాసించు; "క. ధరణీశ్వ రుఁడమ్మునివరుఁ. బురాతనముని ప్రకాశుఁబుణ్యో త్తునిరం, తరకృతభక్తిసపర్యా, పరివస్యుండగుచు

భక్తివదలకకొలిచెక్." భార. సభా. ౧, ఆ.— 2. సేవించు; 3. ధాన్యాదికము కొలతచేయు. వి. 1. ధాన్యము; "సీ. వాన, కారుపొలంబునఁ గల్గ నేనియుఁగొల్చు గావింప నేర్చు నేకలవిధము న. వల నేర్పడఁగదున్న (బొలములో నైనవర్షంబులే కున్న ధాన్యంబులగునె." భార. సౌ. ౧, ఆ.— 2. వరిధాన్యము. "క. కొలుచుయవలుసెనగలుమి నుములుతిలలావలుకులుత్థములు మ్రుచ్చిలినన్." మార్క. ౨, ఆ.

కొలుపు. దే. అ. క్రి. 1. నట్టువుఁడుకొలిపించు; 2. సమ్మతించు; "క. మనసుకొలుపదనికినిపుడు." భార. భీష్మ. 3, ఆ.—3. సరిపడు; "క. ఈ పేదమా టలెల్లను, గోపవివశుఁడైననాకుఁ గొలుపవుము గ్గా." భార. అను. ౧, ఆ. "గీ. హీనమతికిబుద్ధి లేలకొలుపు." పంచ. నా. ౧, ఆ. "సామమువెండి భేదమున్ దానముఁగొల్పకుండినఁ గదామతిదం డనము." భో. ౪, ఆ.—4. చెల్లు. "ద్వి. మలఁగక నాపన్ను మాయలన్నియును, గొలుపవువీనిపై." హరిశ్చ. ౧, భా.—అం. ప్రే. 1. పురికొలుపు; "క. అలిగిదశార్ణాధీశుఁడు, కొలిపెనుభగదత్తుమీఁదఁ గ్రూరగజము." భార. భీష్మ. 3, ఆ.—2. పుట్టించు; "సీ. తపనమండలముశస్త్రపరం పరలఁగప్పికదన మంతయునుజీకట్లుకొలుప." జై. 3, ఆ. — 3. (కను) గీఁటు, సైగచేయు. "క. అనియిత్తెఱఁగు నఁబొఱుఁడు, వినిపించినగొల్ల ఁడు వేడ్కలుమ దిలో, ననలెత్తఁగఁదన మ్రోలన్, గనుపట్టుననుం గుఁబట్టిఁగనుకొల్పుటయున్." నీలా. ౧, ఆ. — 4. అనుప్రయుక్తమైనకొను ధాతువునకు ప్రేరణ మునందువచ్చెడిరూపము. (అడలుకొలుపు, పురి కొలుపు. మొ.)—వి. గ్రామశక్తికిచేసెడి యుత్స వము.

కొలువడి. దే. వి. (కొలుచు+వడి.) కొలత. (చూ. కొలారకము.)

కొలునాసములు. దే. వి. మత్స్యవిశేషము, రాజీవము.

కొలువు. దే. వి. 1. ఆస్థానము; "గీ. వచ్చికొలువుచూ చ్చినెచ్చెలిపిండునం, తంతనిలువఁబనిచియల్లన ల్లఁగడిసి ప్రౌఢవనితకైవడిముద్దియ, ముద్దుపుట్టఁ దనకుమ్రొక్కుటయును." భార. విరా. ౧, ఆ.— 2. సేవ; 3. ఉత్సవవిశేషము. "ఎ, గీ. తద్విశేషం బులొప్పఁదేవ, తంతు సాకన నంపు జాతర కొ లువన." ఆం, భా. ప్ర. నా.

కొలువుకాఁడు. దే. వి. సేవకుఁడు.

కొలువుకూటము. దే. వి. ఆస్థానమండపము.

కొలువుగొను. దే. స. క్రి. (కొలువు+కొను.) సేవకు నిగా పరిగ్రహించు. "క. కొలువుగొను మెల్లకుం డుట, కలిగినఁబొమ్మనుటయుంతకంటెను మేలు." భార. విరా. ౧, ఆ.

కొలువుడుకాఁడు. దే. వి. కొలువుకాఁడు, సేవకుఁడు.

కొలె. దే. ద్ర. మొదలుకొని యనునర్థమును దెలుపు నది. "భూపాలుఁ డారామక్షోణికిఁ జన్న నా టఁగొలె." వసు. ౪, ఆ. (కోలెయొక్క రూపాం తరము.)

కొల్ది. దే. వి. విణ. కొలఁదియొక్క రూపాంతరము. "నెవ్వడిఁజేకొల్దిగఁదీసి." నీలా. 3, ఆ.

కొల్పు. దే. వి. కొలనుయొక్క రూపాంతరము. "ఉ. అంతటఁ బొద్దుగ్రుంకుటయు నాశశకంబుగఁజెం ద్రరోహిణీ, కాంతునిఁగొల్పు చూచుటకుఁగాఁ దొడితెచ్చితి." పంచ. నా. 3, ఆ.

కొల్ల. దే. వి. దోఁపుడు, అభ్యవస్కందనము.

కొల్లకత్తె. ద్వ. విణ. కొల్లపెట్టునది. (ఆఁడుది.)

కొల్లకాఁడు. దే. విణ. కొల్లపెట్టువాఁడు.

కొల్లకొట్టు. దే. స. క్రి. 1. కొల్లపెట్టు; 2. (అధికలా భముగ) సంపాదించు.

కొల్లగొను. దే. స. క్రి. (కొల్ల+కొను.) కొల్లపెట్టు.

కొల్లపెట్టు. దే. స. క్రి. అపహరించు.

కొల్లలాడు. దే. స. క్రి. (కొల్లలు+ఆడు.) దోఁచుకొ ను, అపహరించు.

కొల్లవోవు. దే. అ. క్రి. (కొల్ల+పోవు.) చూఱవోవు.

కొల్లాడు. దే. స. క్రి. (కొల్ల+ఆడు.) కొల్లపెట్టు. "క. కొల్లాడిరికైవల్యలక్ష్మినమరులుమునులున్." కాశీ. ౨, ఆ.

కొల్లాబండి. దే. వి. గాడీ.

కొల్లాయచంచె. దే. వి. చిన్న అంగవస్త్రము.

కొల్లారము. దే. వి. నడుమ బయలును నాలుగుప్ర క్కలఁ గట్టడమునుగల యిల్లు.

కొల్లారు. దే. వి.——పై.——

కొల్లారుబండి. దే. వి. కొల్లాబండి. (చూ. కొలారు బండి.)

కొల్లి. దే. వి. ఒకానొకచెట్టు.

కొస. దే. వి. 1. కొన; "సీ. మునుమునుమునఁ జుట్టి కొస వెండ్రుకలు వట్టి పాపమ్మ నియందియలు లియఁదాఁచి." కవిక. ౪, ఆ.— 2. ఉపయుక్తము కాని తృణాదుల యగ్రాంశము.

కొసరు. దే. అ. క్రి. 1. విజృంభించు; "చ. కొసరి వసంతకాలమునఁ గోయిల క్రోల్చిన భంగి నేడ్చెన, బ్బిసరుహనేత్ర." కాశీ. ౫, ఆ.—2. సంకోచించు. "క. ఏమీ యిపుడొక విన్నప, మే మైనం జెప్ప కొనన పేక్షించినయ, ట్లై మోముతోఁచుచున్నది, యో మునివర కొసర నేల యొగిఁ జెప్పు మనన్." పర. ౫, ఆ.—స. క్రి. ప్రార్థించు. "సీ. జోగిణిఁ గొసరి బైసుక వెట్టి పలక పై సారెలు వోయించి సరము మూఁచి." ఉ, హరి. 3, ఆ.—వి. 1. కోరిక; "చ. కిసలయపత్రికన్ మకరకేతననూతన వార్తలన్ని యున్, బొసఁగ లిఖించి యందుఁదల పూవులఁ దమ్మయు నాస సేయు నా, కొసరు తెఱంగెఱింగి కుచకుంభములం బతిఁ దాల్చినన్ను సం, తసమున వ్రాసి యిచ్చినఁ గదా చెలి కత్తెల కేను మ్రొక్కుదున్." ఉ, హరి. ౫, ఆ.—2. ఏదేని యొకవస్తువు నుదీసికొన్న దానికిచ్చెడు పెచ్చు; 3. ప్రార్థనము; "ఉ. మ్రొక్కులు పల్కు మోడివిసరుల్ కసరుల్ కొసరుల్ చెలంగ." శశాం. 3, ఆ.—4. సంకోచము. "ఎ, గీ. సింహబలుఁడత్యుదగ్రతఁ జిగురుఁబోఁడి, పజ్జఁగడువడిఁ దగిలి కోపంబు గదుర, నాడి సితలపట్టి తిగిచి మహోగ్రవృత్తిఁ, గొంకు కొసరించుకయు లేక కూలఁదాఁచె." భార. విరా. ౨, ఆ.

## కో.

కో. దే. వి. అఱపునందగు ధ్వన్యనుకరణము.

కోంకణము. సం. వి. అ. న. ఆయుధవిశేషము. పుం. ఒకానొక దేశము. (చూ. దేశము.)

కోగిరి, ఖోగిరి. హిం. వి. గుజ్జుపుజీను.

కోఁగు. దే. స. క్రి. గొఱుగు. "సీ. ముండన సంజ్ఞయలరుచునుండును, గోఁగుటబోడింపు గొఱుగుటయున." ఆం, భా. ద్వి. బ్ర.

కోఁచే. దే. వి. పిఱికి, భీరువు.

కోఁచేవాఱు. దే. అ. క్రి. (కోఁచ+పాఱు.) భయపడు. "చ. భిదురధరుండుఁ జక్రియును బెట్టుగ దీర్ఘవిచారమెంతసే, యుదురఁట దైత్యుఁడెంతబలియుండొకదాయని కోఁచవాఱి కి, ట్టిదుటున వానిఁ ద్రుంతునను నొక్కనివంపిననంటిచాలకే." ప్రభా. ౨, ఆ.

కోఁడు. దే. స. క్రి. బియ్యము లోనగువానిని చేటలోఁబోసికొని ప్రక్కవాటుగా నిటునటు త్రిప్పు.

కోఁత. దే. వి. కోయుట, లవనము.

కోఁతపట్టు. దే. అ. క్రి. కోఁతకోయ నారంభించు.

కోఁతపడు. ద్వ. అ. క్రి. ఖండితమగు. "క. ఏయంగముఁ గొని శూద్రుఁడు, పాయక విప్రునకుఁ దానుబాధకుఁడగువాఁ, డాయంగము కోఁతపడక, పోయొదవన రాదు తనకు భూపతిచేతన్." విజ్ఞా. ప్రా, కాం.

కోఁతి. దే. వి. మల్లు, వానరము.

కోఁతిపుల్లలు. దే. వి. బ. మగ్గపు పలకదారములను మీఁదికిఁ దగిల్చెడు పుల్లలు.

కోఁతిమామిడి. దే. వి. అంబాళము.

కోఁదాడు. వై. వి. తాళవృక్షవిశేషము. "ముక్కు దాడిమబీజ మొగలింగ కోఁదాడు." హంస. ౪, ఆ.

కోక. దే. వి. వలువ, వస్త్రము. "ఉ. కోకయు నాసనంబు గొడుగున్ శయనాదులుఁ దానయై జయోత్సేకముతోడ నాగకుల శేఖరుఁడున్ ధ్వజవాహనాదికా, స్తోకవపుర్విశేషములతో గరుడుండుఁ బురంబు సర్వమున్, దాకొని కాచుచున్న కుముద ప్రముఖుల్ సతతంబుఁ గొల్వఁగన్." పర. ౧, ఆ.

కోకనదము. సం. వి. అ. న. 1. చెంగలువ; 2. చెందమ్మి.

కోకము. సం. వి. అ. పుం. 1. జక్కవ; 2. తోఁడేలు; 3. బల్లి; 4. కప్ప; 5. ఈఁదు.

కోకిలము. సం. వి. అ. పుం. పికము, కోయిల.

కోకిలాక్షము. సం. వి. అ. పుం. ములుగొలిమిడి.

కోగల. వై. వి. కోవెల, కోకిలము.

కోట. వై. వి. 1. దుర్గపురము; "సీ. కోటయేమఱ కప్పుఁబాటించి గడ్డియు ఖాణంబుఁ గొల్చును గట్టియలును, నేయినూనెయును నానాయుధమ్ములు నౌషధములు నాఖిలయంత్రములుఁ గూప, ములు లోను గానందు వలయు వానిసమగ్రములుగ గం పాదించి." భార. శాం. ౨, ఆ.—2. పట్టణము చుట్టుగల ప్రహరి*.

కోటఁడు. వై. వి. గుడ్లగూబ.

కోటము. సం. వి. అ. పుం. కోటఁడు, గుడ్లగూబ. "ఘూకః కోటో దివాభీతః." త్రికాండశేషము.

కోటరము. ఉభ. దే. వి. కోడంత్రము. "చ. అరయమిఁజేసికోడలసకప్పుడుదానిఁగఁజేసెనమ్మహా, పురుషుని పాలికింబతులు పోవఁగవీరలతోనయేచుఁజె, చ్చెరఁజనికోటరంబుఁదగఁజేయుదు నూయటుగాకపాడిమై, వరవుడమోపిచేయుదు నెవాకికిమాధవనిశ్చయింపుమా." భార. ఉద్యో. 3. ఆ.—సం. అ. పుం, న. చెట్టుతొఱ్ఱ.

కోటటికము. దే. వి. కోడటికముయొక్కరూపాంతరము. "చ. పలుకుపడంతియేయువిదపజ్జలఁగోటటికంబుసేయు." రామా. ౧, ఆ.

కోటవి. సం. వి. ఈ. స్త్రీ. దిసమొలది, ఉచ్చమల్లి.

కోటానఁగోటులు. మి. వి. బ. (కోటులు+కోటులు.) అసంఖ్యములు. "క. హాటకములుదక్షిణగాఁ, గోటానఁగోటులొసఁగికుంభినియెల్లన్, చాటించి ధారవోసెను, హాటకగర్భప్రభావుఁడగువరరుచికిన్." విక్ర. ౫, ఆ.

కోటి. ఉభ. దే. వి. వేగు. "క. చెడవిఱిగియడవిఁబడియెడ, నెడగట్టులతుదలఁగోటియిడిలోఁగడకున్, దడుకువోడిపించియాకుల, గుడిసెలవసియించెమంత్రిగురుభటయుతుఁడై." ఆము. 3, ఆ.—సం. ఇ. స్త్రీ. 1. అంచు; 2. అతిశయము; 3. వింటికొప్పు; 4. చివర; 5. సంఖ్యావిశేషము.

కోటికాఁడు. దే. వి. వేగువాఁడు. "క. హరిణాజినోత్తరీయుఁడు, నిరాయుధుఁడునగుచునతనినెలవగునడపిన్, జోరఁగోటికాండ్రుపెక్కుము, పరికించియెటింగికలయఁబడికూఁతలిడన్." ఆము. 3, ఆ. (పాఠాంతరము కొట్టికాఁడు.)

కోటివర్ష. సం. వి. ఆ. స్త్రీ. పిక్కచెట్టు.

కోటిశము. సం. వి. అ. పుం. మట్టిగడ్డలుకొట్టెడు కొయ్య, (రూ. కోటీశము.)

కోటీరము. సం. వి. అ. పుం. కిరీటము, బొమిడికము.

కోటు. ఆం. వి. చొక్కాయి.

కోటేరు. దే. వి. దుక్కికిఁబోవునపుడుగాని దుక్కియైమరలివచ్చునపుడుగాని దుంపమీఁదుగాకాఁడికి తగిలించిన నాఁగలి. "గీ. అదుసుదుక్కియైయామడికరుగుదెంచె, హాలికుఁడొక్కఁడుతన్నగరాశ్రయుండు, చేతియుగ్గంపుఁగుండతోఁజేర్లకోల, తోడనాఁగంటికోటేరుదోలుకొనుచు." పర. ౫, ఆ.

కోట్టము. సం. వి. అ. పుం. దుర్గపురము.

కోట్టారము. సం. వి. అ. పుం. నీటిపల్లము.

కోట్రము. దే. వి. కోటరముయొక్కరూపాంతరము. "సీ. వైవాహికక్రియావ్యసనంబుకొన్నాళ్లు కొన్నాళ్లుకోడంద్రకోట్రములును." వి. పు. ౫, ఆ.

కోఠము. సం. వి. అ. పుం. మండలాకారమైనకుష్ఠము.

కోర్టు. ఆం. వి. న్యాయసభ.

కోడంట్రము. దే. వి. కోటటికము. "క. ఓరమణీమణినీకోడం, ట్రము నెఱుఁగరువారుయోగరసనిశ్చలతన్." కళా. ౭, ఆ.

కోడంత్రికము. దే. వి.——పై.——"క. షకపకనగిదశకంఠుఁడు, నకినాతనుజానకునీవుసతివైకోడం, త్రికమెపుడుచేసితివనీ, మొకమేనెఱుఁగఁదల్పమునిజంబనినన్." ఉ. రా. ౪, ఆ.

కోడటికము. దే. వి. (కోడలు + టికము.) కోడంట్రము.

కోడలు. దే. వి. (కొడుకు+ఆలు.) కొడుకుయొక్క పెండ్లాము, స్నుష. (హల్లుపరమగుచో వికల్పముగానుత్వలోపంబగు. "క. కలదాశూద్రవసతిశశి, కలదాననఁజాలునొకవికారపుఁగోడల్, వలదాలోలకటాక్షాం, చలదామనిబద్ధతరుణజనఖంజనయై." పాండు. 3, ఆ.) (సంధిని వర్ణలోప వర్ణవికారములు.)

కోడాడు. దే. అ. క్రి. బాధపడు. "కోడాడఁగఁబట్టిచంపెవడి." భాగ. ౯, స్కం.

కోడి. వై. వి. అజ్జవాలు, కుక్కుటము.

కోడిగ. దే. వి. రత్నముల యిరువదింటి సంజ్ఞ.

కోడిగము. దే. వి. విలాసచేష్ట. "సీ. కడఁకఁజేసినకోడిగముల కెల్లను బ్రతిచెనకుటలొకకొన్నిదినములందు." అని. ౧, ఆ. "ఉ. ఈ కోఁతివిటుండుచేయువెడకోడిగముల్ గనిమాటివత్తురే." భల్లా. ౫, ఆ.

కోడిగీఁడు. దే. విణ. (కోడిగము + ఈఁడు.) కోడిగముచేయువాఁడు. "సీ. కుంటెనీలకునిచ్చికోడిగీలకునిచ్చిమిన్నకవారకామినులకిచ్చి." విక్ర. ౭, ఆ.

కోడిపీఁట. వై. వి. నొగ చివరక్రింద నెత్తుగానుంచెడు మోపుడుకొయ్య, అనుకర్షము.

కోడిబడి. దే. వి. పసిబాలురకుఁజేసియిచ్చెడుభక్ష్యవిశేషము. "లడ్వాలుకోడిబళ్లు." హంస. ౧, ఆ.

కోడియ. దే. వి. కోడెదూడ, వత్సతరము.

కోడీ. దే. వి. కోడిగ.

**కోడు.** దే. వి. 1. మంచములోనగువానికంబము; 2. ఊసిదరి నీటిపల్లము.

**కోడుతాఱు.** దే. అ. క్రి. పండినపైరుమిక్కిలియెండు.

**కోడె.** దే. వి. 1. కాఁడిమఱపఁదగినదూడ; 2. విటుఁడు. "ఎ,గీ. అడిగినంతయురోయిచ్చినట్టిక్రొత్త, కోడెఁజేకొనితనువెళ్లఁగొట్టుటయును, బ్రాఁతితనమునలంజియఁబాయలేక, క్రీడయించుకలేక చేబోడిబొజుఁగు." కవిక. ౪, ఆ.—విశే. తరుణము. "కోడెనాగముంబులుఁగులఱేఁడుతన్నికొనిపోవుతెఱంగు." రామా. ౬, ఆ. (కోడియయొక్కరూపాంతరము.)

**కోడెకాఁడు.** దే. వి. విటుఁడు. "ధనులగుకోడెకాంద్రకునుదంగెటిజున్నలు." రామా. ౧, ఆ.

**కోడెరవుతు.** ద్వ. వి. శివుఁడు, వృషభవాహనుఁడు.

**కోణంగి.** వై. వి. అంగములనువికారముగాఁజూపిబిచ్చమెత్తెడుదాసరి. "సీ. ఆశించునెపుడునత్యాసక్తినమ్మహానటుఁడు నేనగరిఁగోణంగియగుట." వైజ. ౧, ఆ.

**కోణపుఁడు.** సం. వి. అ. పుం. నైరృతుఁడు, మూలఱేఁడు.

**కోణము.** సం. వి. అ. పుం. 1. ఇల్లులోనగువానిమూల; 2. అంచు; 3. గంటలోనగువాని వాయించెడుకొడుపు; 4. దుడ్డుఁగోల; 5. వాద్యవిశేషము.

**కోణుఁడు.** సం. వి. అ. పుం. శనైశ్చరుఁడు.

**కోదండము.** ఉభ. దే. వి. బాలురనుదండించుటకై పట్టుకొనివ్రేలాడునట్లుమీఁదఁగట్టెడుత్రాడు. సం. అ. న. 1. విల్లు; 2. నాలుగుమూరలవిల్లు; 3. నెదురువిల్లు. పుం. 1. కనుబొమ; 2. ఒకానొకదేశము.

**కోద్రంగము.** సం. వి. అ. పుం. మంచె. "కోద్రంగస్తుతమంగస్స్యాత్." అ, పా. ద్వి. పు.

**కోద్రవము.** దే. వి. అ. పుం. కోరదూషము, ఆళ్లు.

**కోన.** యు. దే. వి. గోసమూహము. వై. 1. అడవి; "గీ. గోలయిట్టికారుఁగోనలోనిన్నెంటి, డించిచనఁగఁజనునె." అచ్చ. ఆర, కాం.—2. కోన; "కన్గోనలం దంద్రయెక్కుడుదోఁచెన్." హరి. ఉ. 3, ఆ.—3. మూల; "సీ. క్రొంజీఁకటులుగ్రమ్ముకోనలఁగోనల ఘనమైనయోగిపుంగవులగవుల." సా. 3, ఆ.—4. కొండలయందలిమఱుఁగుచోటు*; "మానికపుఁగోనలలోనెలమావికోనలో." వసు. 3, ఆ.—5. దేశవిశేషము*. "కోనటిక్టేర్చెఁగొట్టానఁదగిలె." ఆము. ౧, ఆ.

**కోనత్రిమ్మరి.** ద్వ. వి. కోఁతి, వనచరము. "కోనత్రిమ్మరిబిరుదులు." అచ్చ. యు, కాం.

**కోనమనికి.** ద్వ. వి. కోఁతి, వనౌకము. "కోనమనికిబంటుకలికి." అచ్చ. కిష్కిం, కాం. (ఇట్లు కోనవెంకి. మొ.)

**కోనఱేఁడు.** ద్వ. వి. నైరృతుఁడు, కోణపుఁడు.

**కోనెఱు.** ద్వ. వి. కోనేఱుయొక్కరూపాంతరము.

**కోనేఱు.** ద్వ. వి. (కోన+ఏఱు.) చుట్టుమెట్లుగలనలుచదరపుగుంట, పుష్కరిణి.

**కోపకత్తె.** మి. గ్రా. విశే. (కోపము+కత్తె.) కోపముగలది. (ఆఁడుది.)

**కోపకాఁడు.** మి. గ్రా. విశే. (కోపము+కాఁడు.) కోపముగలవాఁడు.

**కోపగించు.** వై. స. క్రి. కోపించు.

**కోపగిల్లు.** వై. అ. క్రి. కోపపడు.

**కోపన.** సం. వి. ఆ. స్త్రీ. కోపముగల ఆఁడుది. విశే. కోపముగలది.

**కోపము.** సం. వి. అ. పుం. క్రోధము, కినుక.

**కోపి.** సం. విశే. (న్. ఈ. న్.) కోపముగలవాఁడు.

**కోపించు.** సం. స. క్రి. కోపగించు.

**కోపు.** దే. వి. 1. బలపములోనగువానికడ్డి; 2. కడ్డి; 3. అందము; "గీ. కత్తలానులయేపుమేల్కట్లకోపు, మదురుగోడలమెఱపువాల్మగలయొఱపు." రసి. ౧, ఆ.—4. వింటికొప్పు; "చ. మృతసర్పమునొక్కటివింటికోపునన్, బనివడితెచ్చివైచెనటుబ్రహ్మమునీంద్రునియంసవేదికన్." భాగ. ౧, స్కం.—5. బ. నమస్కారము; "వ. కైలాసనిలయామీకుఁగోపులు. పశుపల్లలాటామీకునేటికోళ్లు. గౌరీమనోహరా మీకునమస్కారము." భీ. 3, ఆ.—6. నాట్యముతీర్పు; "మ. నాలిగా, డ్పులపేరంగలనట్టువులగఱపఁగోపులచ్చపులేఁదీవపా, త్రలకు." య. ౪, ఆ.—7. నిమిత్తము; "చ. వేఁటకో, పునసవరించినన్ దొరలుబోనులుగైకొనకొక్కయిచ్చ్వ, చ్చినఁజనుదెంచినాఁడ." య. 3, ఆ.—8. పార్శ్వము; "సీ. కరకంకణంబులుగల్లనఁజెలులిరుకోపులఁజేరివీచోపులిడఁగ." శశాం. ౪, ఆ.—9. విధము; "వ. కోపంబురూపంబుగైకొన్నకోపునసహంకరించి." ఉ, రా. ౮, ఆ.—10. సమయము; 11. చేఁపలగుదిగ్రుచ్చునట్టిసూది; 12. మద్యము; "మద్యమ్ముపేళ్లు, తనరుసారాయికోపన." వేం.

ిపుదారుఁడు. దే. వి. సరకులను బైటనుండి తెచ్చి యమ్మెడువాఁడు.

ిపువాఱు. దే. అ. క్రి. (కోపు + పాఱు.) అందగించు.

ిము. దే. వి. 1. గోపురమువలె పెరిఁగిన పుట్టచివర; "ద్వి. మెఱుఁగుఁగోఱలనువల్మీకముల్ వెడలి, యుఱుపుట్టకోములనుతికి." హరిశ్చ. ౧, భా.—2. ఆఁడుది. "గద్దరికారుజింకకోమా." అచ్చ. అర, కాం.

ిమటి. వై. వి. వైశ్యుఁడు. "భృత్యమాత్రవర్తించు పేదకోమటులము." మార్క. ౭, ఆ.

ిమలము. సం. వి. అ. న. నీళ్లు. విణ. మృదువు.

ిమలి. వై. వి. 1. చక్కఁదనముగల ఆఁడుది*; 2. ఆఁడుది*.

ిమలికము. వై. వి. చక్కఁదనము. "క. ఈముక్కు చెవులీమొగ, మీమేలిమిపాలుపుగలదెయేచెలువకునీ, కోమలికమెఱుఁగుటకునై, రాముఁడుమెలఁగించిచూచెరమణీనిన్నున్." రా. అర, కాం. ౧, ఆ.

ియ. దే. వి. ఒకజాతిబోయ. "రగడ. కోయలరులివేకోయకిఁకఁజెలికోయనవిలుకోయగనలును." చంద్ర.

యష్టికము. సం. వి. అ. పుం. చీకుఁగొక్కెర.

యిల. యు. దే. వి. 1. గుడి; 2. ఒకానొకదివ్యస్థలము. "క. కోయిలఁదిరుమలఁబెరుమా, కోయిలఁదిరుపతులఁగుంభకోణాదికపు, ణ్యాయతనంబులమాయం, బైయెక్కుడఁబోయెనొకొమురాంతకుప్రతిమల్." కాశీ. ౫, ఆ.—వై. కోకిలము. "చ. కోయిలలయొలుంగులోలిఁగొనియింపుగఁజిల్కలతోడ నెమ్మినై, నలవడమాటలాడి." హరి. పూ. ౮, ఆ.

యు. దే. స. క్రి. 1. తీఁగలులోనగువాని ఛేదించు, లవించు; 2. పువ్వులులోనగువాని గిల్లు.

ర. దే. వి. 1. గిన్నె; "ఎ, గీ. నాకుమిమ్మువంటిలోకోత్తరులకియ్యఁ, గలిగెనింతకంటెఘనతగలదె, యనుచుఁగోరలోనిఘనసారగంధంబు, వలసినట్ల యొసఁగెవారలకును." వి.పు. ౭, ఆ.—2. కల్లుత్రాగెడుగిన్నె, చషకము; "ఉ. అందఱిఁగైకొనంబనిచియాదటఁగాంతయుఁదానుకొక్కుకో, రందనుపారదివ్యమదిరామధురామృతపానకేలియం, దందయొనర్చెఁగాఁదొడఁగె." లక్ష్మీ. 3, ఆ.—3. తట్ట. "ఉ. కూరిమిమంత్రితోడనలకూబరుఁడేకతమాడి పెద్దబం, గారపుఁగోరఁగల్ప వనికాజని కాంతములైనచీరలున్, హారవిభూషణావళియు నమ్మిథునంబునకుంబ్రియంబుతో, నారదమానిచేత నదనంజదివించెఁగుబేరుపేరుగాన్." స్వా. ౫, ఆ.—విణ. పెద్ద. (కోరమీసము, ముచ్చుగోర.)



కోరంగి. సం. వి. ఈ. స్త్రీ. చిట్టేలకి?.

కోరకము. సం. వి. అ. పుం, న. 1. మొగ్గ; 2. అరవిరిమొగ్గ; 3. తామరతూఁడు; 4. తక్కోలము?.

కోరకొండె. దే. వి. బిడ్డలులోనగువారికి ముఖపార్శ్వమున వేసెడు కొండె.

కోరగించు. వై. అ. క్రి. 1. ముకుళించు*; "ఆ. కొమ్మకన్నుగవఁకు కోరగింపఁగఁబూచి, తలఁచు జొత్తుగ్రక్కుదాసనంబు." (గవఁకు—కర్త.) స్వా. 3, ఆ.—2. మొలకెత్తు. "సీ. జలదానిలంబునఁబులకించెనోయనఁగుటజభూజంబులుకోరగించె." విక్ర. ౪, ఆ.

కోరటు, కోర్టు. ఆం. వి. న్యాయసభ.

కోరడి. దే. వి. ఆవరణముగా వేసినపొడి మట్టిగోడ, కరగోడ.

కోరదూషము. సం. వి. అ. పుం. కోద్రవము, అల్లు.

కోరవాయి. ద్వి. వి. కోష్ఠశీర్షస్థమగువాయువు. "ఎ, గీ. కోరవాయియనఁగోష్ఠశీర్షస్థవాయువొప్పు." ఆం. భా. ద్వి. మ.

కోరవోవు. దే. అ. క్రి. (కోర+పోవు.) కొంకరలువోవు. "శరీరముకోరవోవఁగా." విక్ర. ౧, ఆ.

కోరసిగ. ద్వి. వి. కోరకొండె. "గీ. కోరసిగవేయుచోటనెకొమ్మువుట్టి, చెటిచెనని కానియొంటైనఁజేయవచ్చు." రామా. ౨, ఆ.

కోరా. దే. విణ. కొరికము, అనాహతము. (వస్త్రము.)

కోరాడు. దే. స. క్రి. (కోరి+ఆడు.) 1. ఏనుఁగులోనగునవికొమ్ములతో నేలఁబొడిచిదుమ్మెత్తిపైకిఁజల్లు; "ఎ, గీ. ఘనరజోవృష్టికైమీఁదికన్నుమొగుడఁ, గటిదెసలునిక్కబరితోలఁకదలఁగీలు, మదమత్తిక్తతనదులకీఁదదనుకృద్వ్భ, పాళితోఁదెంట్లుపటపఁగోరాడెఁగరులు." ఆము. ౪, ఆ. "సీ. ఈకొండెసెలయేఱులీశ్వరువృషభంబుకోరాడుకూలముల్ గూడియొప్పు." హరి. ఉ. ౬, ఆ.—2. పందిముట్టెతో నేలకల్లగించు; (చూ. క్రోడాడు.) 3. దుమ్ములోనగువానినెత్తిపైకిఁజల్లు. "తెలిదమ్మిధూళిఁగోరాడిరికంతుదంతులన." రామా.

౧, ఆ. (ఇది క్రోడాడు అను క్రియకు మాఱు రూపముగాఁ దోఁచుచున్నది.)

**కోరాబంగారు.** దే. వి. మట్టపుబంగారు.

**కోరింద.** దే. వి. లక్కగలిగెడి యొకానొకతీఁగ, జతూక.

**కోరిక.** దే. వి. 1. ఇచ్ఛ; "క. ఈకథయెవ్వరుచదివి నఁ, గైకొన్నసువిన్నఁగోరికను వ్రాసినవా, రేకాలముశంభునికృప, నాకల్పముగందుురైహికాముష్మికముల్." భల్లా. ౫, ఆ.—2. కోరుట; "కోరికయునొల్లమియులేక." భార. శాం. ౬, ఆ.—3. వరము. "నలువకోరికలొసఁగెడినాఁడు." అచ్చ. యు, కాం.—విణ. అభీష్టము. "తగుకోరికలిచ్చెఁబుళిందకోటికిన్." ఉ, రా. ౭, ఆ.

**కోరికి.** దే. వి. ఇచ్ఛ. "చ. ఇత్తెఱంగుకో, ర్కికిఁగత మేమిపాండవులగెల్చిధరన్ సగమీఁదలంచితే." భార. ద్రో. ౧, ఆ. (రూ. కోర్కి.)

**కోరు.** యు. దే. స. క్రి. 1. ఇచ్ఛించు; 2. కోరాడు. (దీనికి గ్రంథములయందు కోరాడు అని యే ప్రయోగము.) వై. వి. ధనేతరవస్తురూపమైనకప్పము*. "అరులకుఁగోరు వెట్టితిఁగదానినుఁదమ్ముఁడ." రామా. ౪, ఆ.

**కోర్టు.** ఆం. వి. న్యాయసభ.

కోఱ. వై. వి. దంష్ట్ర*. "ఉ. కోఱలుదీటుచున్ ఘనయసకోణములన్ దహనస్ఫులింగముల్, కాఱఁగ." హరి. పూ. ౮, ఆ.

**కోఱడము.** దే. వి. 1. అపహాస్యము; "చ. వడిగొని కాలకేయభటవర్గము ద్రోచినఁదాను సేనలున్, గడఁగినిశాచరేశ్వరుఁడు క్రందుగఁదాఁకిరణంబు సందడిన్, దొడిఁబడ వ్రేసెఁదీవ్రతరదోశ్శనిన్ దనునీడఁబోకకో, ఱడమునబిట్టుగిట్టినమఱందినెఱంగకదుర్మదాంధుఁడై." నిర్వ. ౫, ఆ.—2. బ. అపహాస్యవచనము. "చ. ధనదునియొద్దకేగియు చితంబుగఁబల్కి పురంబుఁబాసిపో, మ్మనిమునుచెప్పుకోఱడములాడినమద్భుజశక్తియంబుజా, సనవరశక్తి మూలబలశక్తియెఱుంగఁగఁ జాటిచెప్పిర, మ్మనిచతురాతి భాషణుఁబ్రహస్తుని బుచ్చెనురారిలంకకున్." నిర్వ. 3, ఆ.

**కోల.** ఉభ. దే. వి. 1. దండము; "ఎ, గీ. గొయ్యి, కోలఁద్రవ్వినమాత్రఁబాతాళయూన, మేలసిద్ధింపనేర్చు." భార. అశ్వ. 3, ఆ.—2. బాణము; "సీ. కోలఁదివెట్టఁగరానికోలలుహరిమీఁదనేసెదిగ్భాగంబులెల్లఁగప్ప." హరి. ఉ. ౮, ఆ.—3. వంటకట్టె; "సీ. బెడిదంపుఁగోలలు బెడఁగొందబహ్వగ్నచిత్రితాజినముపైచీరకాఁగ." భార. విరా. ౧, ఆ.—4. మగగుఱి. "గీ. గుదమునందేనుమాఱులుఁ గోలనొక్క, మాఱుదాపలిచేఁ బదిమార్లు రెండు, చేతులనుసేడుమాఱులుఁబ్రీతిమన్ను, చమరిశౌచంబు చేయుటచదుగుఁదనము." విజ్ఞా. ఆచా. కాం.—విణ. దీర్ఘము. (కోలనిమ్మ. మొ.)—సం. వి. ఆ. స్త్రీ. 1. చవ్యమనుగంధద్రవ్యము†; 2. పిప్పలి†.

కోలంబకము. సం. వి. అ. పుం. వీణెయొక్కసర్వాంగము.

**కోలకము.** సం. వి. అ. న. 1. తక్కోలపుచెట్టు; 2. మిరియము.

కోలక్రోఁతులు. దే. వి. బ. కోఁతికొమ్మంచియనుబాలక్రీడావిశేషము. (చూ. అందలము.)

కోలగగ్గెర. దే. వి. కాళ్లకుదారమును పెనఁచియెద్దులను మూటకట్టుగాకట్టెడుకట్టు. ("గీ. అనియుఁబాత్రయుఁదేఁబంపియాంత్రవల్లిఁ, గోలగగ్గెరద్రోయఁదత్కుజముతోడ, నొఱగిరక్కసుతోదైన్యవిరహితముగ, ధర్మమెఱిఁగించుసూక్తినాతండువలికె." (ఇక్కడ కోలగగ్గెరయనఁగా కాళ్లకుదారమును పెనఁచి యెద్దులను మూటకట్టుగాకట్టెడుకట్టువంటికట్టని తెలియునది.) ఆము. ౬, ఆ.)

కోలజొన్న. దే. వి. ఒకదినుసుజొన్న, ఔద్దాలకము.

కోలదబ్బ. దే. వి. ఒకదినుసు దబ్బ†.

కోలదళము. సం. వి. అ. పుం. నలియనెడు గంధద్రవ్యము†.

**కోలదివియ.** ద్వ. వి. వెలుతురుకట్టెలదివటీ. "గీ. వారుసంభ్రమించివడిఁగోలదివియలు, గొనుచుసాలివుమిగులఁ గూడఁబాఱి, నృత్తశాలఁజొచ్చి." "సం. సహసైవసమాజగ్ము రాదాయోల్కాస్సహస్రశః." భార. విరా. ౨, ఆ. (రూ. కోలదివ్వె.)

**కోలనిమ్మ.** దే. వి. నిడుపుదినుసునిమ్మ†.

**కోలపాల.** దే. వి. అర్కపుష్పిక†.

కోలపొన్న. ద్వ. వి. అంఘ్రిపర్ణిక†.

కోలము. ఉభ. దే. వి. వేషము. "గీ. గగనరంగస్థలంబునమిగులఁబ్రౌఢి, మమునఁగాలికనీలికోలము నటింపఁ, బోరిమొగంబునరాలునిప్పుకలనఁగ గుంపులైరాలెమహీనింద్రగోపతతులు." ఆము. ౪, ఆ.—సం. అ. న. రేఁగుఁబండు. పుం. 1. పంది; 2. తెప్ప; 3. ఒడి; 4. కాఁగిలి.

**కోలమెఱుఁగు.** దే. వి. నిలువుమెఱుఁగు, ఐరావతి. "శివుదిక్కునందు వేకువఁగోలమెఱుఁగులు మెఱసె." హరి. పూ. ౭, ఆ.

**కోలలవారు.** దే. వి. బ. వేత్రధరులు. "వ. సైనికులం జేరుకొనివానియెక్కించిపురికొలుపుకోలలవారి యెలుంగులును." ఉ. హరి. 3, ఆ.

**కోలవల్లి.** సం. వి. ఈ. స్త్రీ. గజపిప్పలి**?**.

**కోలవస.** ద్వ. వి. జటిల**?**.

**కోలాటకమ్మి.** దే. వి. ఒకదినుసుకమ్మి. "సీ. కడియాలుఁబెక్కుజోకలయుంగరములు ముంగరయును గోలాటకమ్మజోడు." (పాఠాంతరము. ముంగరయుఁగోలాటంపుఁగమ్మజోడు.) కళా. ౭, ఆ.

**కోలాటము.** దే. వి. (కోల+ఆట.) చేతులఁగోలలుం చుకొని యాడెడియాట. (చూ. అఱకడ.)

**కోలాహలము.** సం.వి.అ.పుం.కలకలము, అలబలము.

**కోలి.** సం. వి. ఈ. స్త్రీ. 1. రేఁగు**?**; 2. గంగరేఁగు**?**.

**కోలు.** దే. వి. 1. అనుప్రయుక్తమైనకొను ధాతువునకు భావార్థకరూపము; (ఇచ్చుకోలు, పుచ్చుకోలు. మొ.)—2. కొల్ల. "క. మున్నుగనేఁగారణముగ, నన్నియిడుమలనుభవించిరనుజులువీరిల్, గన్నారఁజూతుఁగానిజ, గన్నుతభీష్మునకుఁగోలు గానీఁజాలన్." భార. భీష్మ. 3. ఆ.—విశే. పెద్ద. (కోలుపులి, కోలుమొసలి, కోలుమూఁపులు. మొ.)—క్రి. విశే. మిక్కిలి. (కోలుమసఁగు.)

**కోలుకాఁడు.** దే. వి. 1. నియమించెడియధికారి; "క. పులికోలుకాఁడుగావున, నలయుకవరుసెఱిఁగివాని ననుపఁగనొకనాఁ, డొలసియొకచెవులపోతుకుఁ, గలయఁగనీవరుసయనుచు గ్రక్కునఁజెప్పెన్." పంచ. నా. ౧, ఆ.—2. కావలివాఁడు; 3. సుంకరి క్రిందిబంటు.

**కోలుకొను.** దే. అ. క్రి. 1. ఉత్సహించు; 2. తేఱుకొను; 3. వర్ధిల్లు. (రూ. కోల్కొను. ఉత్సహించుటకు.—"బంధువర్గమున్, ఘోరముగావధించుటకుఁగోల్కొనకున్నదిబుద్ధి." భార. ఉద్యో. ౪, ఆ.—తేఱుకొనుటకు.—"క. నరసూనునవపుమకర్ణజుఁ, డిరుమూఁడుశిలీముఖంబు లెదనించిననొ, చ్చిరయంబునఁగోల్కొనివా, నరదముఁదునిమెన్ పకేతుహయసూతముగన్." జై. ౭, ఆ.—వర్ధిల్లుటకు.—"క. దీపముడఁగఁజీఁకటియును, గోపమడఁగశాంతిగుణముఁగోల్కొనుక్రియ." పాండు. ౪, ఆ.)

**కోలుతల.** దే. వి. 1. ఎదుటనిలిచి యుద్ధముచేయుట; 2. (యుద్ధ)సన్నాహము. (రూ. కోల్తల. ఎదుటనిలిచియుద్ధముచేయుటకు. — "వ. శకునికడంగి యోధవరులతోమీరు కోల్తలసేయుండేను బెడ ముట్టునఁదాఁకి ధర్మనందనాదులసమయించెదనం చుసముద్ధతింగదిసె." సం. "యుద్ధ్యధ్వమగ్రతోయోధాః పృష్ఠతోహన్మి పాండవాన్." భార. శల్య. ౧, ఆ.— యుద్ధసన్నాహమునకు.— "వ. సుశర్మతమ్ముండు సంగతంబుగాఁగోల్తలసేసి రథసమూహంబుతో విరాటవ్యూహంబు నెదురుకొని." భార. విరా. 3, ఆ. "అనికింగోల్తలసేయు." అచ్చ. యు, కాం.)

**కోలుపడు.** ద్వ. అ. క్రి. 1. చెడు, నశించు; 2. అగపడు. స. క్రి. పోఁగొట్టుకొను. (రూ. కోల్పడు. చెడుటకు. — "క. ద్రోణాచార్యునియుగ్రపు, బాణంబులకోర్చియతఁడుపడునంతకున, క్షీణధృతినసమసమర, క్షోణినిలిచికర్ణుచేతఁగోల్పడియోఁగదే." భార. కర్ణ. 3, ఆ.—అగపడుటకు.—"మ. అడవింగోల్పడుప్రాణియెయ్యదియు లేకాఁకోపమేపారన, చ్ఛెడుగండుగ్రతఁదద్ద్రవ్యజంబుదెసకున్ శీఘ్రుంబయేతెంచె." హరి. పూ. ౮, ఆ.—పోఁగొట్టుకొనుటకు.—"క. తన, లలనంగోల్పడియెనతఁడులంకేశ్వరుచేన్." భార. అర. 3, ఆ. "ఉ. భవదాత్మజుఁగోల్పడెఘోషయాత్రలోన్." భార. ఉద్యో. ౨, ఆ.) (ప్రే. కోలుపఱుచు.)

**కోలుపాటు.** ద్వ. వి. 1. చేటు; 2. పోఁగొట్టుకొనుట. (రూ. కోల్పాటు. చేటునకు. — "శా. కుంతీసూనునిచేతఁగర్ణునికనింగోల్పాటుపాటిల్లునే." భార. కర్ణ. 3, ఆ.—పోఁగొట్టుకొనుటకు.—"గీ. ధరణిరాజ్యముకోల్పాటుఁదండ్రిచావు, నిష్టబంధువియోగంబు దుష్టయాత్ర, నిష్ఠురారణ్యవాసంబు నేఁడునాదు, దేహదాహంబుసేసెవైదేహికతన." రా. అర, కాం. ౨, ఆ.)

**కోలుపోక.** దే. వి. పోఁగొట్టుకొనుట. "ఉ. పంకజనాభ మాపడినపాటులురాజ్యము కోలుపోకయున్." భార. ద్రో. 3, ఆ. (చూ. కోలుపోవు.)

**కోలుపోవు.** దే. అ. క్రి. చెడు. "గీ. ఇట్టులగుటయెఱిఁగియెల్లభంగులరహ, స్యంబుకోలుపోనియట్లు గాఁగ, నడరునీదుకోర్కెకనురూపమెట్టిది, యట్టి భోగభంగిననుభవింపు." (ఇక్కడ చెడుటయనఁగా బయలుపడుట.) భార. విరా. ౨, ఆ.—స.

క్రి. పోఁగొట్టుకొను. "సీ. తాతలచేఁ బాలితంబై నమత్పురంబిటు కోలుపోదు నేహీనవృత్తి." మార్క. ౬, ఆ. (ప్రే. కోలుపుచ్చు.)

కోలె. దే. వి. వెన్ను కోసినకాఁడ. ద్ర. కొలె. "దాని వత్సంబునిన్నటఁగోలెనుడుగక యఱచుచున్న యదియు." భార. ఆది. ౮, ఆ. "ఎ.గీ. ఇతఁడు పుట్టినకోలెను నెసకమెసఁగ, దర్పమునవర్తిల్లె." భార. విరా. ౧, ఆ.

కోలెమ్ము. దే. వి. (కోల+ఎమ్ము.) వీఁపునడుమఁ బూసపూసగాగొలుసువలెఁ బెనఁచుకొనియుండెడి యెముక, కశేరుక. (ఇట్లు కోలెముక, కోలెమ్ముక.)

కోవ. దే. వి. 1. బిడ్డలకు గొంతునందుఁగలిగెడు వ్యాధి విశేషము. (చూ. అరిమి.) 2. పుట్టకోమ.

కోవిదారము. సం. వి. అ. పుం. కాంచేనము!.

కోవిదుఁడు. సం. వి. అ. పుం. విద్వాంసుఁడు, చదువరి.

కోవు. దే. వి. ఆర్పునందగు ధ్వన్యనుకరణము. "కోవునవార్చినఁ దెసలకుంజరముల్ బెదరెన్." కాశ. ౨, ఆ.

కోవురము. దే. వి. శత్రువునుబట్టుటకైపొంచెడుపొంచు. "గీ. ఉదయగిరిమీఁదఁగోవురంబుండినిగుడు, నహితరవిరశ్మి చేబద్ధుఁడగుచుఁదోడి, బలఁగమైనట్టిచుక్కలవలసత్రోవఁ, జూపనేతెంచెనన వేగుఁజుక్కవొడిచె." స్వా. 3, ఆ.

కోవెల. యు. దే. వి. గుడి. "కోవెలపారుపత్తెమున కుంబనిపూనియు." ఉ, రా. ౭, ఆ.—వై. కోకిలము. "సీ. తులకించుమూడవతొలిపల్కుఁ రవళి కోవెలకూఁతలకునొక్కవింతనెఱప." య. ౨, ఆ.

కోశకారము. సం. వి. అ. పుం. ఒకదినుసుచెఱకు.

కోశఫలము. సం. వి. అ. న. తక్కోలపుచెట్టు.

కోశము. సం. వి. అ. పుం, న. 1. కత్తియొఱ; 2. గుడ్డు; 3. జాజికాయబెరడు; 4. ఒకదివ్యము; (చూ. దివ్యము.) 5. పుస్తకము; 6. బొక్కసము; 7. కరఁగిపోసిన వెండిబంగారములముద్ద; 8. ముష్కము; 9. మొగ్గ. (తత్త్వవిషయమున పంచకోశములు. — అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము, ఆనందమయము.) (రూ. కోషము.)

కోశాతకి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆనడ!; 2. ఉత్తరేను!; 3. పొట్ల!.

కోశామ్రము. సం. వి. అ. పుం. కొండమామిడి!.

కోష్టు. వై. గ్రా. వి. మందుదినుసు, చెంగల్వకోష్టు.

కోష్ఠము. సం. వి. అ. పుం. 1. లోకడుపు; 2. సొమ్ములుంచెడు కొట్టు; 3. గాదె.

కోష్ణము. సం. వి. అ. న. ఇంచుకవేఁడి. విశే. ఇంచుకవేఁడిగలది.

కోసము. దే. అవ్య. నిమిత్తమును దెలుపునది. "క. భూసుతకోస మేఁగనుక బొంకితినేనియుఁబెద్ద కాలముం, జేసిననాతపంబురహిఁ జెందకనిష్ఫలమౌ." ఉ, రా. ౮, ఆ.

కోసలము. సం. వి. అ. పుం. ఒకానొకదేశము.

కోసు. వై. వి. రెండువేలవిండ్లపట్టుకొలఁది, క్రోశము.

కోస్తా. ఆం. వి. సముద్రతీరము.

కోహకము. సం. వి. అ. పుం. దేవమణంచుకొన్న పిల్లి.

కోహళము. సం. వి. అ. పుం. 1. కాహళమనువాద్యము; 2. బజాఱుమాట.

కోహలుఁడు. సం. వి. అ. పుం. నాట్యశాస్త్రప్రవర్తకుఁడైన యొక ముని.

కోహూ. దే. వి. పరిహాసమునందగు ధ్వన్యనుకరణము. "వ. కేలుచఱచికోహూయని గేలిసేయుఁగణికాకదంబంబులచప్పటలు." ఆము. ౪, ఆ.

కోశి. దే. విశే. ఆశ్చర్యమునొందినవాఁడు, విలక్షుఁడు. "సీ. కోశినాఁగను వెలుఁగుపడువాఁడనఁగ నువిస్మయాన్వితసంజ్ఞవెలయుచుండు." ఆం. భా. తృ. వి.

## కౌ.

కౌ. దే. వి. వృత్తియందు కౌనుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (కౌఁదీఁగె.) (కవుయొక్కరూపాంతరము.)

కౌంతి. సం. వి. ఈ. స్త్రీ. రేణుకయనుగంధద్రవ్యము!.

కౌంతికుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) ఈఁటెకాఁడు.

కౌఁగిలి. వై. వి. భుజాంతరము, క్రోడము. (కవుఁగిలియొక్కరూపాంతరము.)

కౌఁగిలించే. వై. స. క్రి. ఆలింగనముచేయు. (కవుఁగిలించుయొక్కరూపాంతరము.)

కౌఁగిలింత. వై. వి. ఆలింగనము. (కవుఁగిలింతయొక్కరూపాంతరము.)

కౌఁగిలింపు. వై. వి. కౌఁగిలింత. (కవుఁగిలింపుయొక్కరూపాంతరము.) "సీ. తరితీపెఱుంగనితరలి రులేపడిచూపుకరఁగింపనెఱుఁగనికౌఁగిలింపు." చంద్ర. (చూ. ఆరగింపు.)

కౌఁజు. వై. వి. కపింజలము. "సీ. కౌఁజుపౌఁజు బోఁవఁగానీకవానినో రణములఁబఱపిశీఘ్రుంబ తునిమి." రసి. ౧, ఆ. (కవుఁజుయొక్క రూపాంతరము.)

కౌకృత్యము. సం. వి. అ. న. 1. అకార్యముచేయుట; 2. పశ్చాత్తాపపడుట.

కౌక్కుటికుఁడు. సం. వి. అ. పుం. 1. కపటముకలవాఁడు; 2. చేరువచూచుచుఁబోయెడివాఁడు.

కౌక్షింభర్యము. సం. వి. అ. న. పొట్టపోసికొనువానితనము.

కౌక్షేయకము. సం. వి. అ. పుం. ఖడ్గము, కత్తి.

కౌచు. దే. వి. చేఁపమీఁది పొలుసు. (కవుచుయొక్క రూపాంతరము.)

కౌటతక్షుఁడు. సం. వి. అ. పుం. స్వతంత్రముగా పనిచేయు వడ్లంగి.

కౌటికుఁడు. సం. వి. అ. పుం. మృగపక్ష్యాదులను జంపి విక్రయించి జీవించువాఁడు.

కౌటిల్యము. సం. వి. అ. న. వంకరతనము.

కౌడు. వై. వి. కపటము. "క. అనుటయునతిమత్సరతఁ, బెనఁగెడువారలనుగౌడుఁబెట్టిపఱచికై, కొనియెదనీవస్తువులని, మనముననూహించిచతురమతియేపారఁ." షో. ౨, ఆ. (కవుడుయొక్క రూపాంతరము.)

కౌణపుఁడు. సం. వి. అ. పుం. నైరృతుఁడు, మూలఱేఁడు.

కౌతుకము. సం. వి. అ. న. 1. అనుభవింపని కోరికయందలి యాశ; 2. కోరిక; 3. పెండ్లియందుచేతఁగట్టుకొనెడు తోరము; 4. పండుగ; 5. స్త్రీపురుషపరిహాసము; 6. పైపైవచ్చిన మేలు; 7. సంతోషము; 8. పాటలోనగు సుఖము.

కౌతూహలము. సం. వి. అ. న. అనుభవింపనికోరికయందలి యాశ, తమి.

కౌద్రవీణము. సం. విశే. (అ.ఆ.అ.) అల్లుపండునది. (పొలము.)

కౌను. దే. వి. 1. నడుము; 2. వింటినడుము. "చ. పిడికిఁడుకౌనుఁ గొప్పఁగని ప్రేమఁద్రివక్రసమూంగిఁజేసితేఁ, బిడికెఁడుకౌనుఁగొప్పఁబయిఁజేర్చుగుణంబునుగంటినంచు." ఆము. ౧, ఆ. (వృత్తియందిదిపూర్వపదంబగునపుడునువర్ణంబునకువికల్పంబుగలోపంబగు. "ఆసదుకౌఁదీఁగయల్లాడుచుండ." భార. విరా. ౪, ఆ. నూదిజగాకవుఁ, లేఁ

నవు..
కొందఱు
రూపాంతర..

కౌపము. సం. వి. ౬

కౌపీనము. సం. వి. అ. న.
3. గుహ్యప్రదేశము.

కౌబేరము. సం. వి. అ. న. 1. చె..
దినుసు పిండివంట.

కౌమారము. సం. వి. అ. న. బాల్యపు వయోవస్థ.

కౌమారి. సం. వి. ఈ. స్త్రీ. ఒక మాతృక.

కౌముదము. సం. వి. అ. పుం. కార్తికమాసము.

కౌముది. సం. వి. ఈ. స్త్రీ. చంద్రిక, వెన్నెల.

కౌమోదకి. సం. వి. ఈ. స్త్రీ. విష్ణువుయొక్క గద.

కౌరు. దే. వి. వర్ణాధిక్యము. (కవురుయొక్క రూపాంతరము. "క. చివురాకౌతెఱ నల్లని, కవురానను సోగవెండ్రుకలు." హంస. 3, ఆ.)

కౌలటినేయుఁడు. సం. వి. అ. పుం. భిక్షుకియైన పతివ్రతకొడుకు.

కౌలటేయుఁడు. సం. వి. అ. పుం. 1. భిక్షుకియైన పతివ్రతకొడుకు; 2. అంకుటాలికొడుకు.

కౌలటేరుఁడు. సం. వి. అ. పుం. అంకుటాలికొడుకు.

కౌలవ. సం. వి. అ. పుం. ఒకకరణము. (చూ. కరణము.)

కౌలీనము. సం. వి. అ. న. 1. గొప్పవంశమునందలి పుట్టుక; 2. గుహ్యము; 3. పశుపక్ష్యాదుల జగడము; 4. జగడము; 5. నిందింపఁదగినపని.

కౌలు. దే. వి. రాజులోనగువారు ప్రజలులోనగువారికిచ్చునట్టి యొడంబడిక. "క. ఈశ్వరయునిలిందయునుబం, గాళియు మొదలైనపేరుగలదీవులలో, మేలైనసరకులాతని, కౌలున దిగుమాటనిజముగలవాఁడగుటఁ." శుక. ౧, ఆ. (కవులుయొక్క రూపాంతరము.) కౌలుఖత్తులు.

కౌలేయకము. సం. వి. అ. పుం. కుక్క. విశే. మంచికులమునఁ బుట్టినది.

కౌశలము. సం. వి. అ. న. నేర్పరితనము.

కౌశలి. సం. వి. ఈ. స్త్రీ. కుశలప్రశ్నము.

కౌశల్యము. సం. వి. అ. న. కౌశలము.

కౌశికము. సం. వి. అ. పుం. 1. గుగ్గిలపుచెట్టు; 2. గుడ్లగూబ; 3. ముంగిస.

...ప్రమిత్రుఁ...
...తెలిసినవాఁడు;

...ఆ. అ.) పట్టుది. (చీర.)
... న.1. కుసీదభావము; 2. ఆల
...కిపాటు.
... వి. అ. పుం. విష్ణువక్షస్స్థలమునం
...
...యము సం. విణ. (అ. ఆ. అ.) ఉలవలు పం
...మనది. (పొలము.)

## క్ర.

**క్రంగు.** దే. వి. మ్రోఁగుటయందగు ధ్వన్యనుకరణము. (చూ. కొడుపు.)

**క్రంత.** యు. దే. వి. 1. పెండ్లికొడుకువారు పెండ్లికూఁతునకుఁ దీసికొనిపోయెడి ప్రధాన ద్రవ్యము; "వ. ప్రకృతికాంత క్రంత సురకాంతలఁ గూడుకొని సంతరింప." ఆము. ౬, ఆ.—2. రచ్చ. "ద్వి. తనజాడఁ దెలిసి క్రంతకుఁ దీసికేని." హరిశ్చ. ౨, భా.—వై. 1. సందుత్రోవ*; "సీ. రచ్చలు క్రంతలు రాజమార్గంబులు విపణి దేశంబులు విశదములుగఁ, జేసిరి." భాగ. ౧౦, స్కం. పూ.—2. రంధ్రము*. "నృపాలు దేహముం గ్రంతలు చేసి చొచ్చె విశిఖంబులు." జై. ౨, ఆ.

**క్రందనము.** సం. వి. అ. న. 1. ఆర్పు; 2. ఏడ్పు; 3. పిలుపు.

**క్రందితము.** సం. వి. అ. న. 1. ఏడ్పు; 2. పిలుపు.

**క్రందిల్లు.** వై. అ. క్రి. మ్రోఁగు. "క. అందముగ వీరకాహళ, దుందుభి నిస్సహాణ శంఖ తూర్యంబులొగిన్, గ్రందిల్లె." వీర. ౪, ఆ.

**క్రందు.** వై. అ. క్రి. 1. మ్రోఁగు; 2. విలపించు*. "ఎ, గీ. కృతఘ్నుని గ్రకంటక సముదయము మీఁదఁ, గ్రందనదిమియుం." భార. అను. ౪, ఆ.—వి. 1. మ్రోఁత; "సీ. సిరిఁ బాసియును నొక్క చింతయు లేక వీచుల క్రందడంగిన జలధివోలె." భార. శాం. ౪, ఆ.—2. సందడి*; 3. ఉపద్రవము*; "గీ. ఏల వ్రేపల్లె పెద్దవారిట్లు వెట్టి, గొనిరి కృష్ణుఁ బోనిచ్చినఁ గ్రూరులైన, రక్కసులులోను గాఁ జేయు క్రందులెల్ల, నుడుపఁదమకు దిక్కైనవాఁడొరుఁడుగలఁడె." హరి. పూ. ౮, ఆ.—4. తఱచు*. "క. ప్రస్పందిత పాతక రవముల, క్రందునఁ గర్మజాఁడు మేలుకనియె." భార. ద్రో. ౨, ఆ.

**క్రందుకయ్యము.** ద్వ. వి. దొమ్మియుద్ధము. "గీ. క్రందుకయ్యంబులోన నరాతిభయద, బాహువిక్రమశీవిట్లు పాడచారి, వగుటవలదని." భార. భీష్మ. ౨, ఆ.

**క్రందుకొను.** ద్వ. అ. క్రి. 1. అతిశయించు; "కని వినయంబు క్రందుకొనఁ గాఁ బ్రణమిల్లి." జై. ౭, ఆ.—2. తఱచగు. "క. గగనమున సురవిమానము, లగణితముగఁ గ్రందుకొనియె." భార. అర. ౪, ఆ. (ప్రే. క్రందుకొలుపు.)

**క్రంప.** దే. వి. కంపకు మొదటిరూపము.

**క్రకచపత్త్రము.** సం. వి. అ. పుం. తేఁకు*.

**క్రకచము.** సం. వి. అ. పుం. 1. అంపము; 2. వెణుతురు*.

**క్రకరము.** సం. వి. అ. పుం. 1. కక్కెర; 2. అంపము; 3. వెణుతురు*. విణ. బీదవాఁడు.

**క్రక్కస.** వై. విణ. కఠినము. "ఉ. ఆ క్రక్కస జన్వనింగరము గారవమొప్పఁగఁ జూచియిట్లనున్." నై. ౫, ఆ.

**క్రక్కు.** దే. స. క్రి. కడుపునవికారమెత్తితిన్నదివెడలనుమియు. వి. 1. కడుపునవికారమెత్తితిన్నదివెడలనుమియుట; 2. వ్యాధివిశేషము.

**క్రక్కెర.** వై. వి. కక్కెరకు మొదటిరూపము, క్రకరము.

**క్రచ్చఱ.** దే. ద్ర. క్రి. విణ. (క్రచ్చు+అఱన్.) 1. నిష్కల్మషముగా; "చ. జగత్త్రయంబుఁ గ్రచ్చఱ భవదీయరక్షణమునంది వెలుంగుచునుండు." భార. అర. ౭, ఆ.— 2. శీఘ్రముగా. "చ. క్రచ్చఱ మునివర్గ వాహనుఁ డవైచను దిమ్మనుము." భార. ఉద్యో. ౧, ఆ. "క్రచ్చఱఁ దన క్రేవనున్న ఘన చాపముఁ దాల్చి." రా. యు, కాం.

**క్రచ్చు.** దే. స. క్రి. చుట్టుకొను. "వ. మచ్చరంబిచ్చం బెచ్చు పెరుగం జెచ్చెరం జొచ్చి క్రచ్చి." రామా. ౫, ఆ.—వి. పేనినత్రాడులోనగువానియం దు ఉపయుక్తము కాని తృణాదులయంశము.

**క్రచ్చుకొను.** దే. స. క్రి. చుట్టుకొను. "క. వచ్చి పసురాజశేఖరుఁ, డిచ్చినముద్రికల తాంగియెదుట నిడిచెలుల్, క్రచ్చుకొనియడుగ నిట్లను, నచ్చేడియతనయుదంతమాద్యంతంబున్." పను. ౪, ఆ.

**క్రతుధ్వంసి.** సం. వి. న్. పుం. శివుఁడు, జన్నపుగొంగ.

**క్రతుభుజుఁడు.** సం. వి. జ్. పుం. దేవత, జన్నపుఁదిండి.

**క్రతువు.** సం. వి. ఉ. పుం. 1. యజ్ఞము; 2. ఒకానొక ఋషి.

**క్రథనము.** సం. వి. అ. న. వధ, కొల.

**క్రన్న.** దే. ద్ర. క్రి. విశే. 1. శీఘ్రముగా. "తరల. తరుణిద్రౌపదియిట్లు పాండవధార్తరాష్ట్రులదైన భీ, కరపరస్పరకోపవేగము క్రన్నఁబాచి." భార. సభా. ౨, ఆ.—2. పిమ్మట; "గీ. మున్ను ననొ్నటు ఒడిమఱితన్ను నోటు, పడియె నోతన్ను మునొ్నటు పడివిభుండు, క్రన్న ననొ్నటు వడియెనో యన్న నాకు, దెలుఁగఁజెప్పుముదీనినీ వెలుఁగుదేని." భార. సభా. ౨, ఆ.—3. మరల. "గీ. ఇన్నరేంద్రుచేతమున్న గృహీతమై, యున్న నాకరంబు క్రన్న నింక, నొరులకర్హమగునె." భార. ఆది. 3, ఆ.

**క్రమణము.** సం. వి. అ. న. అడుగిడుట.

**క్రమము.** సం. వి. అ. పుం. 1. సొరిది; 2. అడుగిడుట; 3. అఱుముట; 4. బలిమి; 5. ఒడఁకు.

**క్రమించు.** సం. స. క్రి. 1. అతిక్రమించు; "మందాకాంచలముల్ క్రమించి కులధర్మప్రోద్ధతుల్ దాఁటి." అని. 3, ఆ.—2. ఆక్రమించు. "ఆచక్రధరుని జరయను రాక్షసి వెరవునఁబట్టి క్రమించుఁబొండని." భార. మా. ౧, ఆ.

**క్రముకము.** సం. వి. అ. న. 1. పోఁక; 2. తమ్ములము. పుం. 1. పోఁకచెట్టు; 2. ఎఱ్ఱలొద్దుగు ౘెట్టు; 3. గంగరావిౘెట్టు; 4. నాగముస్తెౘెట్టు; 5. ప్రత్తిచెట్టు.

**క్రమేలకము.** సం. వి. అ. పుం. ఉష్ట్రము, ఒంటె.

**క్రమ్మఱఁబడు.** ద్వి. అ. క్రి. (క్రమ్మఱన్ + పడు.) క్రమ్మఱు. "పోవుచువచ్చుచుఁ గ్రందు క్రమ్మఱంబడుటయు." భార. ఉద్యో. 3, ఆ. (స్వార్థమున పడు.)

**క్రమ్మఱిల్లు.** దే. అ. క్రి.——పై.——"పఱచిన దేవకీసుతుఁడు పక్కనవ్వినఁ గ్రమ్మఱిల్లి." పాండు. ౪, ఆ. (రూ. క్రమ్మఱిలు.)

**క్రమ్మఱు.** దే. అ. క్రి. మరలు. "క్రమ్మఱిచూచుం జెవిదార్చి నిల్చుమలయున్." భార. అర. ౬, ఆ.

**క్రమ్మఱుచు.** దే. ప్రే. క్రమ్మఱఁజేయు. "ఉ. ద్రోణభీష్మాదులసన్నిధానమున నమ్మెయిఁబల్కనపల్కతప్పఁగాఁ, గాదని ధర్మనందనుఁడు గ్రమ్మఱిచెన్ యదువీరకోపముల్." భార. అర. 3, ఆ.

**క్రమ్ము.** దే. అ. క్రి. 1. కవియు; "తదంగదేశమునందు మేఘమ్ము లెల్లకెలంకులంగడుఁ గ్రమ్మి." భార. అర. 3, ఆ.—2. పైకుబుకు; "ఎ, గీ. రమణిపొరిఁబొరిఁగన్నీరు క్రమ్మఁజొట్టు, మెలఁగి కాకుల గ్రద్దలఁదొలఁగనడుచు, చున్నయది." భార. స్త్రీ. ౨, ఆ.—3. వ్యాపించు. "రక్తజలంబు పైపయిం గ్రమ్మఁగ." రా. అర. ౨, ఆ.

**క్రమ్ముదల.** దే. వి. క్రమ్ముట.

**క్రమ్ముదెంచు.** దే. అ. క్రి. (క్రమ్ము + తెంచు.) పైకుబుకు. "సీ. బంధులకగపడ్డఁబాయు నన్వయమనుకలఁక మైఁజెమటలు క్రమ్ముదేర." భార. విరా. ౨, ఆ. (స్వార్థమున తెంచు.)

**క్రయము.** సం. వి. అ. పుం. 1. వెల; 2. (వెలయిచ్చి) కొనుట.

**క్రయవిక్రయికుఁడు.** సం. వి. అ. పుం. (సరకును) కొని యమ్మెడువాఁడు, బేహారి.

**క్రయించు.** సం. స. క్రి. (సరకును వెలయిచ్చి) కొను, విలుచు.

**క్రయికుఁడు.** సం. వి. అ. పుం. (సరకును వెలయిచ్చి) కొనువాఁడు, విలుపకాఁడు.

**క్రయ్య.** దే. వి. కాలువ. "క్రయ్యలుగట్టియున్న రుధిరస్థలులున్." రా. యు, కాం.

**క్రయ్యఁబడు.** ద్వి. అ. క్రి. (క్రయ్యన్ + పడు.) కలయు. "క. వెయ్యేఁడ్లయిననునీతోఁ, గ్రయ్యంబడియున్నవాఁడఁగామసుఖములన్." భాగ. ౯, స్కం. (స్వార్థమున పడు.)

**క్రయ్యము.** సం. విశే. (అ.ఆ.అ.) కొనుటకు అంగడియందు పఱుపఁబడినది. (సరకు.)

**క్రయ్యు.** దే. అ. క్రి. కలయు. (చూ. క్రయ్యఁబడు.)

**క్రల్లపడు.** ద్వి. అ. క్రి. ఎండు. "క. తిరుదెల్లఁ గ్రల్లపడఁగా, విరళములైనీడలున్నవిధము మొప్పెనహా, స్ఫురరుచులతోఁడఁదలపడి, యరవరలై తుమురుతుమురులైపడిన క్రియన్." హరి. పూ. ౬, ఆ.

**క్రవ్యము.** సం. వి. అ. న. మాంసము, పొల.

**క్రవ్యాత్తు.** సం. వి. ద్. పుం. రాక్షసుఁడు. విశే. మాంసము తినువాఁడు.

**క్రవ్యాదుఁడు.** సం. వి. అ. పుం.——పై.——

**క్రవ్యాశి.** సం. వి. న్. పుం.——పై.——

## క్రా.

**క్రాంతి.** సం. వి. ఇ. స్త్రీ. (చూ.) క్రమణము.

**క్రాఁక.** దే. వి. కాఁకయొక్క రూపాంతరము. (చూ. క్రాఁగు.)

**క్రాఁగు.** దే. అ. క్రి. కాఁగుయొక్క రూపాంతరము. (తపించుటకు. — "దుర్వారభవత్ప్రకోపమునఁ గ్రాఁగె." భార. శాం. ౧, ఆ.)

**క్రాఁగుడు.** దే. వి. కాఁగుడుయొక్క రూపాంతరము.

**క్రాఁచే.** దే. ప్రే. కాఁచుయొక్క రూపాంతరము.

**క్రాయకుఁడు.** దే. వి. అ. పుం. (చూ.) క్రయికుఁడు.

**క్రాయు.** దే. స. క్రి. 1. ధ్వనిపూర్వకముగా కళ్లలోనగువానినికంఠమునుండినోటికిఁదెచ్చికొను; "స. ధవళలాంగూలపల్లవచాలనంబులుకౌముదీచ్ఛాయలఁ గ్రాసియుమియు." కాశీ. ౪, ఆ.— 2. క్రక్కు; "మ్రింగియుఁ గ్రాయు." నై. ౨, ఆ.— 3. ఉమియు. "కడలినీరభ్రకలభముల్ క్రాసె." ఆము. ౪, ఆ.

**క్రార.** దే. వి. (క్రయ్య+ర.) (జడ్డయై యొకయక్షరముతో) కలయురేఫము.

**క్రారవడి.** దే. వి.——వై.——(స్వార్థమున వడి.)

**క్రాలు.** దే. అ. క్రి. 1. (టెక్కెము) అల్లలాడు; "వ. ఈరాజు నీరాజనకరణంబులకు రండనుచు నమరకాంతలఁబిలుచునోజం గ్రాలు నూతనకేతనంబులును." రా. అ, కాం.—2. గిరగిరఁదిరుగు; "క. నేలకునల్లెఁడుపొడవునఁ, గ్రాలుచుమును మెఱయుగురునిరథచక్రములు." భార. ద్రో. ౫, ఆ.—3. చెదరు; "ఉ. కాలమునాఁటిమృత్యువుముఖంబునఁబోలుచువిస్ఫులింగముల్, క్రాలఁగదేవసంఘములుకంపము నొందఁగ." భాగ. ౬, స్కం.—4. సంచరించు; "ఎ, గీ. గాలిపడగయాకసమునఁ గ్రాలుత్రోవ." ఉ, హరి. ౫, ఆ.—5. సంచలించు; "ద్వి. ఏలెవధూమణియెన్నిచందములఁ, గ్రాలుచునున్నాఁడఁగటకటాయనవు." రా. అర, కాం.—6. సంభ్రమించు; "క. ఆలోనన భోజపతిని, వాలమ్ములఁబొదివిరెల్లవారలుదానన్, దూలకతఁడు బలువిలుగొని, క్రాలుచునాభీమముఖ్యరథికులముంచెన్." భార. ద్రో. ౪, ఆ.—7. వర్తిల్లు; "క. కైలాసనగమునందును, గ్రాలెడు ప్రావృట్పయోధరము చందమునన్, లాలితకటిభాగంబున, నీలాంబరమమరురాము నింబొడగాంచెన్." వి, పు. ౭, ఆ.—8. ప్రవర్తిల్లు. "చ. గుణమిదిదోషమిట్టిదనికొంతయుతెంగినఁగాకయిట్లుని, ర్గుణతయుపట్టిక్రాలుతమకుందగువారలుచెప్పుసౌమ్యభాషణమునిరర్థకంబు." నిర్వ. ౬, ఆ.

**క్రాలుగంటి.** దే. వి. (క్రాలు+కన్ను.) 1. చలించునట్టికన్నులుగలఆఁడుది; 2. ఆఁడుది. (తరళేక్షణ.)

## క్రి.

**క్రి.** దే. విశే. వృత్తియందుఁ గ్రిందుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (దీనికి పరుషసరళములు పరములగునపుడు నుమాగమమును తదితరములు పరములగునపుడు పరవర్ణమునకు ద్విత్వమును వచ్చును. ఉదా. క్రిందల, క్రియ్యాట. మొ.)(ఇది దీర్ఘాంతమునగు. చూ. క్రీ.)

**క్రించు.** వై. విశే. అల్పుఁడు*. "ఉ. నీప్రేమకువచ్చుదాసునకుఁ గ్రించుఁదనంబున నెగ్గుచేసితిన్." భాగ. ౯, స్కం. (కించుయొక్క రూపాంతరము.)

**క్రించుఁడు.** వై. విశే.——వై.——"మ. జననిందంబడలేకనిన్నుఁగఠిన స్వాంతంబుతోఁగాననం,బునఁ ద్రోయించినతప్పుచాలకజగంబుల్ చూచి శోకింపఁ గ్రించు, చునిచందంబునరచ్చ పెట్టితినటంచుండాఁగిపోనేలసాం, పుననేఁడింకొకసారినీనగుమొగంబుంజూపవేజానకీ." ఉ, రా. ౨, ఆ.

**క్రిందల.** దే. వి. (క్రిందు+తల.) క్రిందగుతల. "సీ. మోముఁదమ్మికిఁదేఁటి మొత్తమైపాగపర్వ వ్రేలుఁ గ్రిందలగాఁగవృక్షశాఖ." పాండు. ౩, ఆ.

**క్రిందు.** దే. వి. 1. అధోభాగము; "గీ. వృష్టితటినిడ్డజనఁ ద్రావఁ గ్రిందనుండి." ఆము. ౭, ఆ.— 2. గతకాలము. (క్రింద జరగినవన్ని పోనీ ఇఁక జరగవలసినది యోచింపుము.) (వృత్తియందు అంత్యవర్ణలోపము. చూ. క్రి. క్రీ.)

**క్రిందుపడు.** ద్వి. అ. క్రి. అడుగుపడు. "క. తనవామపదాంగుష్ఠం, బున నదిమె దశాస్యహస్తములు క్రిందుపడన్." ఉ, రా. 3, ఆ. (ప్రే. క్రిందుపఱుచు.)

**క్రిక్క.** దే. వి. బట్టువాఁడు, వంది. "ఎ, గీ. బట్లు క్రిక్కలనఁబౌఠకులకురాగిల్లు." వేం.

**క్రిక్కిఱించే.** దే, అ. క్రి. క్రిక్కిఱియు. "క. పలుకునెడఁబార్థసేనా, కలకలములునిజపురోపకంఠసరణిది, క్కులఁ గ్రిక్కిఱింప." కై. ౨, ఆ.

క్రిక్కిఱియు. దే. అ. క్రి. (క్రిక్కు+ఇఱియు.) ఎడములేక వ్యాపించు. "చ. వాఁడుఱక నిశాతసాయకములొక్క మొగింబడి మేనియందుఁగ్రి, క్కిఱియఁగఁజేసి." భార. విరా. 3, ఆ. (కొన్నిచోట్ల వృత్తియందంత్య వర్ణలోపము. క్రిక్కిఱిచన్నదోయి. మొ.)

క్రిక్కు. దే. వి. కిఱుకురొక్కురూపాంతరము.

క్రిమి. సం. వి. ఇ. పుం. 1. పురుగు; 2. చెట్టుమీఁది నల్లపురుగు; 3. లక్క.

క్రిమిఘ్నము. సం. వి. అ. పుం. వాయువిళంగము?.

క్రిమిజము. సం. వి. అ. న. అగురువు, అగలు.

క్రిమినల్. ఆం. విశ. నేరములసంబంధమైన.

క్రియ. సం. వి. ఆ. స్త్రీ. 1. ధాత్వర్థము; 2. చేయుట; 3. చేష్ట; 4. పని; 5. ఆరంభము; 6. పూజ; 7. ఉపాయము; 8. చికిత్స; 9. ప్రాయశ్చిత్తము; 10. వ్యవహారమునందు నిశ్చయమును బుట్టించునట్టి లిఖితము సాక్ష్యములోనగునది; 11. శిక్ష; 12. విధము. "సీ. అంకిలిమేల్కనుతనిధృష్టద్యుమ్నుఁబట్టినక్రియఁదలపట్టియీడ్చి." భార. సౌ. ౧, ఆ. (కడపటి యర్థమునకు తెనుఁగునమాత్రము ప్రయోగము.)

క్రియాకారము. సం. వి. అ. పుం. ప్రతిజ్ఞ.

క్రియాకారుఁడు. సం. వి. అ. పుం. క్రొత్తశిష్యుఁడు.

క్రియావంతుఁడు. సం. విశ. (త్. ఈ. త్.) పనియందు పూనికగలవాఁడు.

క్రియ్యు. వై. అ. క్రి. కృశించు. "ఉన్నమీనము లెల్లఖిన్నంబులైవగఁగ్రిస్సియున్న." భాగ. ౧౦, స్కం. పూ.

క్రీ.

క్రీ. దే. విశ. వృత్తియందుఁ గ్రిందుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (ఉదా. క్రీఁగడుపు, క్రీఁదొడ, క్రీనీడ, క్రీయూట. మొ. ఇక్కడ దీర్ఘాంతముగాన నిందునున్న యీను పరవర్ణమునకు ద్విత్వమునురాదయ్యె. చూ. క్రి.)

క్రీఁగడుపు. ద్వ. వి. (క్రిందు+కడుపు.) పొత్తికడుపు.

క్రీఁదొడ. దే. వి. (క్రిందు+తొడ.) తొడకులోపలి భాగము.

క్రీవాడ. ద్వ. వి. (క్రిందు+వాడ.) పాటిపొలము.

క్రీడ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆట్లాట; 2. పరిహాసము; 3. దూఱు.

క్రీడి. వై. వి. కవ్వడి, అర్జునుఁడు.

క్రీడించే. సం. అ. క్రి. ఆట్లాడు.

క్రు.

క్రుంకు. దే. అ. క్రి. 1. మునుఁగు; 2. అస్తమించు; 3. చచ్చు. "శా. శంకాకీర్ణమనస్కదానవరిపుల్ చక్రాయుధుండింతలోఁ, గ్రుంకెంబోయనిభీతులైరి." ఉ, హరి. ౬, ఆ.—వి. మునుక.

క్రుంకుడు. దే. వి. అస్తమయము. (చూ. క్రుంకుడుగట్టు.)

క్రుంకుడుగట్టు. ద్వ. వి. అస్తపర్వతము. "సీ. నలిరేయుఁబగలునునడక కానఁగరాదు పుట్టుగ్రుంకుడుగట్లు పెట్టిరందు." య. 3, ఆ.

క్రుంకుమల. ద్వ. వి.——వై.——(ఇట్లు క్రుంకుమెట్టు. మొ.)

క్రుంగఁబడు. ద్వ. అ. క్రి. (క్రుంగన్ + పడు.) క్రుంగు. "సీ. బలభరంబునఁగ్రుంగఁబడునుర్వి మోఁతకు ఫణులాదికూర్మంబుఁబడఁకుదూఱు." రా. యు, కాం. (స్వార్థమున పడు.)

క్రుంగిలు. దే. అ. క్రి.——వై.——"రెమ్మిపోఁకముడియూడ్చినఁగ్రుంగిలిరెండుకొంగులుంబిగ్గనడంచుచున్ విడిచిపెట్టదు." విజ. ౨, ఆ.

క్రుంగు. దే. అ. క్రి. 1. క్రిందికి అడఁగు; 2. దిగఁబడు.

క్రుంచము. సం. వి. చ్. పుం. క్రౌంచపక్షి, కొంచ.

క్రుక్కు. దే. స. క్రి. 1. పేలులోనగువానిఁజేతిబొటనవ్రేలిగోటితోచేదుపు; 2. అడఁచు; "సీ. పాడిమరసావేశమునవచ్చు నర్మోక్తులాదవినాలుకకురాకుండఁగ్రుక్కి." స్వా. 3, ఆ.—3. తుఱుగు. "ఉ. అక్కమలాయతాక్షుఁడుభయంకరబాహువుదైత్యుకుక్షిలోఁ, గ్రుక్కినఁదద్దయుంబలిసిరోగముపేశ్శలచేతమేనికిన్, వెక్కసమైనచందమున విహ్వలభావముచేసి." వి, పు. ౭, ఆ.

క్రుక్కుడు. దే. వి. క్రుక్కుట.

క్రుధ. సం. వి. ఆ. స్త్రీ. కోపము, కినుక. (ఇది ధకారాంతమునగు.)

క్రుద్ధుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) కోపము నొందినవాఁడు.

క్రుమ్మరిల్లు. దే. అ. క్రి. క్రుమ్మరు, (రూ. క్రుమ్మరిలు.)

క్రుమ్మరు. దే. అ. క్రి. సంచరించు, తిరుగు.

క్రుమ్ము. దే. స. క్రి. పొడుచు. "ఈటియలఁగ్రుమ్మి" య. ౨, ఆ.—వి. (కొమ్ముల) పొడుపు.

**క్రుమ్ముడు.** దే. వి. (కొమ్ముల) పోడుపు.

**క్రుమ్ముడువడు.** ద్వి. అ. క్రి. (క్రుమ్ముడు + పడు.) పోటుపడు.

**క్రుమ్ములాడు.** దే. అ. క్రి. (క్రుమ్ములు+ఆడు.) క్రుమ్ముకొనిపోట్లాడు. "గీ. కోసరకాఁబోతు వాఁబోతుఁగ్రుమ్ములాడ, నడిమిలేఁబెయ్య దెసవచ్చె నాకునిపుడు." కాశీ. ౨, ఆ.

**క్రుయ్యఁబాఱు.** ద్వి. అ. క్రి. (క్రుయ్యక్ + పాఱు.) క్రుయ్యు. "సీ. పలుక సెంతయుఁగ్రుయ్యఁబాఱి ననుసుఁజెక్కులందంద తడిపెడునశ్రువారి." హరి. ఉ. 3, ఆ. (స్వార్థమున పాఱు.)

**క్రుయ్యు.** వై. అ. క్రి. 1. కృశించు; "చ. వడఁకుచు రోమకోటి నిలువంబడి మేనులుదూలఁగన్నులం, దుడుగక బాష్పముల్ వడియుచుండఁదలల్ దిగవైచి సోరఁద్రే, గుడుదొరఁగంగ నెంతయును గ్రుస్సి ఖురంబులు వ్రస్సి పుర్వులు, గ్గడువుగఁగాఱుఁ దద్దయును గాఁటియఁబోఁ దె వ్రజంబునంబసుల్." హరి. పూ. ౬, ఆ.—2. వెనుదీయు*. "ఉ. ఎయ్యెడఁగయ్యముల్ గలవొయొవ్వరుచివ్వలకుత్సహింతురో, క్రుయ్యకయుంచుఁగోరి వెసఁగ్రుమ్మరుచుండుదు నెందు నేను." హరి. పూ. ౭, ఆ.

**క్రుష్టము.** సం. వి. అ. న. 1. ఏడుపు; 2. సద్దు.

**క్రుళ్లగించు.** దే. అ. క్రి. (మనసులో) దుఃఖించు.

**క్రుళ్లగింత.** దే. వి. (మనసులో) దుఃఖించుట.

**క్రుళ్లు.** దే. అ. క్రి. 1. క్రుళ్లగించు; "సీ. కోపశోకంబులఁగ్రుళ్లుచుఁదనలోనమండుచు దితిచాలమఱఁగఁదొడఁగె." భాగ. ౬, స్కం.— 2. అవియు; "గీ. పిన్నయయ్యెనుగుణములఁబెద్దగాన, వానిజీవనమేమియుహీనపడక, యుండెనయ్యెన్కిఁగనుఁగొనిగుండెలెల్లఁ, గ్రుళ్లుచుండంగవదినెలుకుందికుంది." భో. ౬, ఆ. — 3. (కాలమతిక్రమించుటచే ఫలాదులు) నలుపుపాటిచెడు.

**క్రుళ్లుపోతు.** దే. విశ. క్రుళ్లగించుస్వభావముగలవాఁడు.

## క్రూ.

**క్రూరము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. నొప్పించునది; 2. భయంకరమైనది; 3. గట్టిది.

**క్రూరు.** దే. విశ. వాఁడి. "గీ. క్రూరుమొనవెట్టిన ట్టులుకొందఱుజ్వల, లాయుధములుఁగంకటములునమరనున్నఁ, జూచిచావనివారనిచూడఁజేర, నరుగకున్నవికంకగృధ్రాదులలికి." భార. స్త్రీ. ౨. ఆ. (దీనికి ప్రయోగాంతరము దొరకినదికాదు.)

## క్రే.

**క్రే.** దే. విశ. వృత్తియందు క్రేవశబ్దమునకు మీఁది వర్ణములోపింపఁగామిగిలినరూపము. (ఉదా. క్రేగన్ను, క్రేగయి. మొ.)

**క్రేఁటు.** దే. అ. క్రి. 1. గొంతెదుపుతీఱుటకు సకిలించునట్లు శబ్దించు; "వ. ఉమ్మలికయింతయేటికను టయునబ్బోటిగ్రేఁటుచునిట్లనియె." స్వా. ౬. ఆ. — 2. తొట్రుపడు. "ఉ. అమాసచీఁకటిం, గ్రేఁటుచు నేగుదెంచెనదు రేయినిజోరుఁడుకన్నపెట్టఁగన్." భల్లా. ౧, ఆ.

**క్రేఁటుకొను.** దే. అ. క్రి. గొంతెదుపుతీఱుటకు సకిలించునట్లు శబ్దించు. "క. పాటితకరిదంతద్యుతి. పాటచ్చరగండఫలకభాగంబులపైఁ, గాటుకకన్నీరొలుకఁగ, మాటవెడలఁగ్రేఁటుకొనుచుమానినిపలికెన్." స్వా. 3, ఆ. (స్వార్థమున కొను.)

**క్రేగన్ను.** దే. వి. (క్రేవ+కన్ను.) కడకన్ను, కటాక్షము.

**క్రేగయి.** ద్వి. వి. (క్రేవ + కయి.) హస్తాగ్రము. "చ. మంచపుఁగోడుతాలుపరిమన్కిగిడారపుమెట్టుఁగ్రేగయిం,గొంచకయెత్తినట్టినిను." అచ్చ. యు, కాం.

**క్రేడి.** దే. వి. సంబావుతోఁ గలసిన కార్యులోనగు ఎట్టువడ్లు.

**క్రేడించు.** దే. అ. క్రి. తొలఁగు. "క. ఓడితిమెమే మురణమునఁ, గ్రీడికిఁగ్రేడించిరాక గెలుపేయతఁడె, చ్చోడాఁగిపోయెనొకొమా, తోడిబవామిట్లుతానుదొలఁగినఁదెగునే." భార. ద్రో. ౧ ఆ.—స. క్రి. అలక్ష్యముచేయు. "ఎ, గీ. ఉఱకయాతఁడుకురుసేనఁదఁటియఁజొచ్చె. వ. ఇట్లుగ్రేడించి గాంగేయుండించిగాండీవితనయురదంబుయంబున. క. పఱపిరథికులనుసూతుల, నఱకిన." భార. భీష్మ. ౨, ఆ. (దీనికి గ్రామ్యరూపము కేడించు.)

**క్రేడిసేయు.** దే. స. క్రి. (క్రేడి+చేయు.) పరిహాసముచేయు. "వ. విలయమార్తాండమండలంబువేడిమింగ్రేడిసేయుమూడవ బాణంబు ఆఘాణంబు నందిగుచునప్పుడు." జై. ౫, ఆ.

క్రేణి. దే. వి. 1. ఉన్నతపదము. "క. మించిధనమూసఁ బ్రజనేరి, యించుదురాత్ములకుఁ గ్రేణియిచ్చుటప తియూ, హించిననిండినచెఱువవి, యించిశకుల కులముసంగ్రహించుటకాదే." కవిక. ౨, ఆ. —2. పరిహాసము. "ఉ. నారియొకర్తుచొక్క పుననల్గలచక్కనిచిన్నపొన్నకుం, జేరిప్రసూ నగుచ్ఛములశేషముగోసియుఁగ్రేణిసోర్తునీ, భూ రుహమెక్కుమన్నఁగిపూయఁగఁజేయుదు నాకి దెంతయుఁన్, మేరువుగాదు నానదినమేరువనం దగిపూచెఁగ్రమ్మఱన్." చమ. ౧, ఆ.

క్రేణించే. దే. స. క్రి. అలక్ష్యముచేయు. "సీ. క మలమొక్కటి నేను గానుకగానిచ్చినఁగనుసన్నఁ గ్రేణింపఁజను సెసకియ." రామా. ౧, ఆ. (క్రే డించుయొక్కరూపాంతరము.)

క్రేణిసేయు. దే. స. (క్రి. క్రేణి+చేయు.) పరిహా సముచేయు. "ఉ. ఆయతబాహులన్ వెడఁద యైన సమున్నతపక్షమున్ సరోజాయితలోచ నంబులుఁ బ్రసన్నముఖంబు నుదాత్తరేఖయుం, గాయజుఁగ్రేణిసేయు ననఁ గౌశికుమీఱు ననంగ విభ్రమ, శ్రీయును బెంపునుం గలుగఁజేసి విధా తృఁడుపేడిఁజేసెనే." భార. విరా. ౧, ఆ. (క్రే డిసేయుయొక్కరూపాంతరము.)

క్రేతొట్టు. దే. అ. క్రి. (క్రేవ+తొట్టు.) గట్టార యు. "వ. క్రేతొట్టుకడక్లకైవడిఁగలయబెర యు." ఉ, హరి. 3, ఆ.

క్రేపు. దే. వి. 1. దూడ; "క. క్రేపులరూపములనేఁ జరించెదననుచున్." భాగ. ౧౦, స్కం. పూ.— 2. (పర్వత) శిఖరము. "గిరిక్రేపులు మూఁపులు." స్వా. 3, ఆ.

క్రేయము. సం. విణ. (అ. ఆ. అ.) (వెలయిచ్చి) కొ నఁదగినది. (సరకు.)

క్రేయో. దే. వి. వెడలఁగొట్టుటయందగుధ్వన్యనుకర ణము. "శా. ఈయోషిద్బాడబులన్ ధనంబుఁగొని క్రేయోయంచు మర్త్యాళిదు, ర్భాషల్ వల్కఁబు రంబులో వెడలఁబంపంబాడి." భల్లా. 3, ఆ.

క్రేవ. దే. వి. పార్శ్వము. "శ్రీవిబుధద్రుమద్యుతు లుక్రేవలఁదోఁపఁగ." కవిస. ౧, ఆ. (వృత్తియం దంత్యవర్ణలోపము. చూ. క్రే.)

క్రేవు. దే. వి. సింహనాదమునందగుధ్వన్యనుకరణము. "ఎ.గీ. శంకరుఁడునంది పైనెక్కిహుంకరించి, యు తిశయార్భటిక్రేవునసార్చి పేర్చి." అని. ౮, ఆ.

క్రేళ్లు. దే. వి. బ. ఉన్నతి. "సీ. రోహిణాద్రియ పెక్కురూపులైయున్నట్లుక్రీడాచలంబులక్రేళ్లు గలిగి." రా. యు, కాం.

క్రేళ్లుదాఁటు. దే. అ. క్రి. 1. ఎగిరిపడు; "ద్వి. మీ లు, క్రేళ్లుదాఁటుచుమాటికినిసముల్లోల, కల్లోల ములఁదేలుక్రమముఁగన్గొంటె." విష్ణు. పూ. ౨, ఆ.—2. గంతులిడు. "సీ. అడ్డంపునిడుపుటాఁబ డ్డలగతిమన్నుఁబిళ్లుడొంకలనుండి క్రేళ్లుదాఁట." స్వా. ౨, ఆ.

క్రేళ్లుబ్బు. దే. అ. క్రి. (క్రేళ్లు+ఉబ్బు.) అతిశయిం చు. "సీ. అలజలంబులుధాత్రినవఘళింపకమున్న క్రేళ్లుబ్బువారియకీర్తిపంకము." కా. ౫, ఆ.

క్రేళ్లువాఱు. దే. అ. క్రి. (క్రేళ్లు+పాఱు.) గంతు లిడు. "తే. మలఁగిగజకంధరముఁద్రుంచి తొలఁ గనుఱికి, కెంపుదళుకొత్తువాలుతోఁగ్రేళ్లువాఱు, నావృకోదరుపైఁ గవియంగఁజేయి, వీచెసేనకుఁ గాళింగవిభుఁడుగడఁగి." భార. భీష్మ. ౨, ఆ.

క్రేళ్లుఱుకు. దే. అ. క్రి. (క్రేళ్లు+ఉఱుకు.) 1. ఎ గిరిపడు; "సీ. కేలిమైనెక్కటలీలఁగ్రేళ్లుఱికెడు వాలుగసోగలమేలుడించి." భార. విరా. ౨, ఆ. —2. గంతులిడు; "సీ. హయముక్రేళ్లుఱుకునో యని రెండుకడలందు వాగెపట్టేరిమత్స్యవత్స పతులు." కళా. ౨, ఆ.—3. దూఁకు. "క. క్రే ళ్లుఱికెందొలఁగంబగతుని. యుఱకడనుండిభువి మీఁదికబ్బలియుండున్." హరి. పూ. ౭, ఆ.

## త్రై.

త్రైలు. దే. వి. ధాన్యమునుఱిచిశోలుచుట, ఒబ్బిడి. ("వ. త్రైలుగనఱికిపగఱంజిట్టుమఃట్టాడుసహజ సాహసులును." ఉ, హరి. ౮, ఆ. ఇక్కడత్రైలు గననఁగాసర్వనాశముగననియర్థము. గ్రంథము లయందిట్లు రేఫసహితముగానిది కానఁబడుచు న్నది.)

త్రైలుదారి. దే. వి. త్రైలుచేయించెడి యధికారి.

## క్రొ.

క్రొ. దే విణ. వృత్తియందుఁగ్రొత్తశబ్దమునకు మీఁ దివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. (దీనికం టెఁబరములైనపరుషసరళస్థిరవర్ణములకుద్విత్వము కలుగును. క్రొక్కన్ను, క్రొక్కారు, క్రొగ్గండి, క్రొచ్చెలిక, క్రొత్తరఁగ, క్రొత్తలిరు, క్రొత్తావి,

క్రొన్నన, క్రొన్నలుపు, క్రొన్నురువు, క్రొన్నెత్తురు, క్రొన్నెల, క్రొన్నేయి, క్రొమ్మంచు, క్రొమ్మడుఁగు, క్రొమ్మావి, క్రొమ్మించు, క్రొమ్మిడుఁగులు, క్రొమ్ముడి, క్రొమ్మెదడు, క్రొమ్మెఱుఁగు, క్రొమ్మొగడ, క్రొమ్మొన, క్రొమ్మొలక, క్రొవ్వాఁడి, క్రొవ్విరి, క్రొవ్వెద, క్రొవ్వేఁడి. మొ. కొన్ని చోట్లఁ దత్సమపదము పరమగునపుడును ద్విత్వము కానఁబడుచున్నది. "సీ. పుష్కలావర్తకంబులలోను గాఁగల క్రొమ్మేఘములు వృష్టి కురియకుండ." భీ. 3, ఆ. కొన్ని యెడల పరుషములు పరములగునపుడు దీనికి నుమాగమము వచ్చును. క్రొంజాయ, క్రొంజెమట, క్రొందమ్మి, క్రొందలిరు, క్రొంబంట, క్రొంబదను, క్రొంబసఁడి, క్రొంబసిమి, క్రొంబుట్టము, క్రొంబువ్వు, క్రొంబొగ, క్రొంబొగడ. మొ.) (కొన్ని చోట్లఁ దత్సమపదములు పరమగునపుడును నుమాగమము కానంబడియెడి. ఉదా. క్రొంబులకలు. మొ.)

**క్రొంకి.** దే. వి. కొంకియొక్క రూపాంతరము.

**క్రొంచె.** వై. వి. కొంచయొక్క రూపాంతరము.

**క్రొక్కారము.** దే. వి. కోడికూఁత. "కార్కోడిగముల క్రొక్కారంపుసందడి." చంద్రా. ౨, ఆ.

**క్రొత్త.** దే. విశే. 1. నూతనము; "సీ. క్రొత్తముత్యములతో రుద్రాక్షమాలిక లష్టోత్తరశతంబులలుఁ దాల్చి." కాశీ. ౧, ఆ.—2. అపూర్వము. "క. తద్దా, రుణశిలలీవృష్టిమిగులఁ గ్రొత్తయగుచు వీక్షణములకత్యద్భుతకా, రణమైతనరార." కళా. ౬, ఆ. (వృత్తియందు అంత్యవర్ణలోపము. చూ. క్రొ.)

**క్రొత్తడము.** దే. వి. కోటబురుజు. "సీ. క్రొత్తడంబులకెంపుఁ గ్రొత్తడంబుల రంగు నింగికిఁ దోఁపు వన్నియలు నింప." య. ౧, ఆ.

**క్రొత్తడి.** దే. వి. మగనాలు. "చ. ఆదిపుణ్యచరిత్రకులాగ్రగణ్య క్రొత్తడి సకలంబుఁ జూడ సభన్ దైన్యముఁ బొందుటఁ జూచి పొక్కితిన్." భార. ఉద్యో. 3, ఆ.—పతివ్రత. (అని కొందఱు.)

**క్రొత్తముట్టు.** దే. వి. వడుకనారంభించినప్పుడు ఏకునుండి పురిలేకచాఁగఁదీసి కదురునకంటించెడు నూలు. "సీ. కళ్యాలఁబదిలంబుగానిగుఱ్ఱంబులఁ గ్రొత్తముట్టునకియ్యకోలుపు వెరవు." భార. విరా. ౫, ఆ.

**క్రొత్తళము.** దే. వి. క్రొత్తడముయొక్క రూపాంతరము.

**క్రొన్నెలలు.** దే. వి. బ. కపోలోరుకటోపరిప్రదేశములయందలి నఖక్షతములు.

**క్రొమ్మి.** వై. వి. ఎఱ్ఱగోరంటు. "సీ. కొరవినాఁ గ్రోవినాఁ గ్రొమ్మినాఁగఁ, గురవక నామమహా." ఆం. భా. ద్వి. వ.

**క్రొవ్విదము.** దే. వి. (క్రొవ్వు+ఇదము.) 1. దుష్కార్యము; "గీ. ఆలుబిడ్డలేనియట్టి త్రిమ్మరియగు, కొయ్యగాక కూడుకుదుటఁ బెట్టి, కుడుచువారలిట్టి క్రొవ్విదంబులు చేయఁ, జొచ్చుటిచ్చగించి మాతురయ్య." భార. ఉద్యో. ౨, ఆ.—2. పరువము. "సీ. విరియనూఁకించు క్రొవ్విదపు మల్లియ మొగ్గలెలతావిఁ జొక్కించు నిక్కలందు." లక్ష్మీ. 3, ఆ.

**క్రొవ్వు.** దే. అ. క్రి. మదించు. వి. 1. మదము; 2. మెదడు.

**క్రొవ్వగొను.** దే. అ. క్రి. (క్రొవ్వు + కొను.) మదించు. "సీ. పరువంపుఁ జెనుకులపసఁ గ్రొవ్వగొని తేలగిలఁబడువానకోయిలల యొప్పు." హరి. పూ. ౯, ఆ.

## క్రో.

**క్రోఁతి.** దే. వి. కోఁతియొక్క రూపాంతరము. "ద్వి. ఆక్రూరతకుఁగాక యగచరుల్ పఱవ, నో క్రోఁతులార మీకులుక నేమిటికి." రా. యు, కాం.

**క్రోడము.** సం. వి. అ. న. ఆ. స్త్రీ. 1. ఒడి; 2. రొమ్ము. అ. పుం. పంది.

**క్రోడాడు.** దే. స. క్రి. 1. (ఏనుఁగులోనగునవి) కొమ్ములతోఁ బొడుచు; "క. ఏడాకుపొన్న కొమ్మలఁ, గ్రోడాడెడు నడవిగౌరు కొదమలు మోద, క్రీడఁ దనరుచాడ్పునఁ బై, నోడికలయి పువ్వుఁదేనెలు రలఁగనొప్పెన్." హరి. పూ. 2, ఆ. "సీ. గోడలు క్రోడాడి కోవెలల్ నుగ్గాడి పందిళ్లు పడఁద్రోచి బండ్లువిఱిచి." (ఇందు కర్త యెద్దులు.) నీలా. 3, ఆ.—2. (పంది) ముట్టెతో నేలకల్లగించు; "వ. మహాదేహంబులగు వరాహంబులు చొచ్చి ఘోషంబున నెల్లచోట్లుం గ్రోడాడం దొడంగె." హరి. పూ. ౬, ఆ.—3. (ఏనుఁగులోనగునవి) కొమ్ములతోఁ బొడిచిదుమ్మెత్తి పైకిఁజల్లు; 4. (దుమ్ములోనగువాని) ఎత్తిపైకిఁజల్లు. (చూ. కోరాడు.)

క్రోడీకరణము. సం. వి. అ. న. 1. ఆలింగనము; "ఆలింగనంతథా క్రోడీకరణంచాంకపాల్యపి." అ. పా. తృ. సం.—2. క్రోడీకరించుట.

క్రోడీకరించు. సం. స. క్రి. ఒకటిగాచేర్చు.

క్రోడుఁడు. సం. వి. అ. పుం. శనిగ్రహము.

క్రోధన. సం. వి. ఆ. స్త్రీ. బెండకీ. అ. పుం. ఒకసంవత్సరము. (చూ. సంవత్సరము.) విణ. కోపముగలది.

క్రోధము. సం. వి. అ. పుం. కోపము, కినుక.

క్రోధి. సం. వి. న్. పుం. ఒకసంవత్సరము. (చూ. సంవత్సరము.) విణ. కోపముగలవాఁడు.

క్రోధించు. సం. అ. క్రి. కోపగిల్లు.

క్రోయు. దే. స. క్రి. విషమముగాచాఁచు. "క. నాలుకలు గ్రోయువహ్నులు, నాలుగుదిక్కులనమర్చినడుమనిలిచినూ, ర్వ్యాలోకనపరుఁడై మును, గాలొక్కటిమోపినిలిచెఘర్మపువేళన్." లక్ష్మీ. ౨, ఆ. "నాలుకలుక్రోయుమహోరగరాజయుగ్మముంజేరి." భార. ఆర. ౬, ఆ.

క్రోలు. దే. స. క్రి. 1. అనుభవించు; "ఎ, గీ. ప్రియుండుఁ బ్రియయుఁ గ్రోలిరి నూతనప్రేమరసము." హరి. ఉ. ౭, ఆ.—2. తిను; "క. నాలుకలు రెండునిన్నుం, గ్రోలనెకల్పించెనలువఘోరాహికిన, న్నాలిగ్రహమపుడ తెగఁదినఁ, జాలదుమ్మదుపవనవిరహిజనదురితమునన్." స్వా. 3, ఆ.—3. త్రాగు; "క. చాలఁగనిచ్చలువెన్నయుఁ, బాలుఁగుడకగొనితల్లిపట్టికిసెలవిన్, వ్రేలిడియింతింతియకాఁ, గ్రోలించునువెరవుతోడ రుచిగొలుపుక్రియన్." హరి. పూ. ౫, ఆ.—4. గ్రహించు; "చ. పాలఁతుక కాంతియింతపాలివోవఁగనీకసలారుతారని, శ్చలతఁగడంగిక్రోలికొనఁజాలుటఁగీచకముఖ్యలోచనం, బులునయనంప్రధానమనుపూర్వవచస్స్థితితప్పకుండఁగా, నెలమివహించెఁదక్కఁగలయింద్రియవర్గముధిక్కరించుచున్." భార. విరా. ౨, ఆ. (కొఱలుయొక్కరూపాంతరము.)—వి. క్రోవి. "బెబ్బులిగొంతుక్రోల్గఱచిపెల్లున మాన్పెడద్రెళ్లదాఁటుచున్." ఆము. 3, ఆ.

క్రోలుకసవు. ద్వ. వి. తృణవిశేషము, నడము.

క్రోలుచు. దే. అ. క్రి. కూయు, శబ్దించు. ప్రే. క్రోలఁజేయు. (రూ. క్రోల్చు). శబ్దించుటకు.—"చ. కొసరివసంతకాలమునఁగోయిలక్రోల్చినభంగినేర్చెన, బ్బిసరుహనేత్ర." కాశీ. ౫, ఆ.—క్రోలఁజేయుటకు.—"వీనులతేనెసొయ్యైకురియవింతగఁగావ్యరసంబుఁగ్రోల్చి." లక్ష్మీ. ౧, ఆ.)

క్రోవ. దే. వి. సరము. "సురాంతకు భాగ్యరత్నపుంగ్రోవ." రామా. ౭, ఆ.

క్రోవి. యు. దే. వి. 1. గొట్టము; 2. ఆసుపోసెడుగొట్టము; "సీ. పరిపరియచ్చులు చరికుండ యూడితచీడుదబ్బలుదండెనాడెక్రోవి." హంస. ౨, ఆ.—3. తుపాకి; "సీ. చేతిక్రోవులువైచిబీతుచెయ్యిలఁబాఱె బగ్గముపాడై తుపాకిమూఁక." రా, పి. ౫, ఆ.—4. బుడ్డి; "సీ. కపురంపుబరణిచిల్కలదివ్వెకంబంబునిల్వ్యాటద్దంబుపన్నీటిక్రోవి." నీలా. 3, ఆ.—5. భూమిలోపలనీళ్లువచ్చుటకేర్పఱచినమార్గము; "చ. కాలఁకులవాఁగులన్నదులఁ గ్రోవులబావులనిర్ఝరంబులన్, గలయఁగరోసిరోసి." భార. అర. ౪, ఆ.—6. మూస. "ఉ. కాలకళాదుఁడెండయను కాంచనరేణువు ప్రత్యగాశనాఁ, గ్రాలెడు క్రోవిఁగూర్చికరఁగంగ." కళా. ౮, ఆ.—వై. కురవకముకీ. "ఏచితనర్చితలిర్చినక్రోవుల." భార. ఆది. ౪, ఆ.

క్రోశము. సం. వి. అ. పుం. రెండువేలవిండ్లపట్టు కొలఁది, కోసు.

క్రోష్టము. సం. వి. అ. పుం, న. గెనుసుకీ.

క్రోష్టుపుచ్ఛిక. సం. వి. ఆ. స్త్రీ. కోలపొన్న, పొర్లుగాడికీ.

క్రోష్టువిన్న. సం. వి. ఆ. స్త్రీ. నక్కతోఁకపొన్నకీ.

క్రోష్టువు. సం. వి. ఉ. పుం. జంబుకము, నక్క.

క్రోష్ట్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడునక్క; 2. తెల్లనేలగుమ్మడికీ; 3. లాంగలికీ. (లాంగలి శబ్దమునకు తరిగొబ్బియు నీరుపిప్పలియు నర్థములు.)

## క్రౌ.

క్రౌంచదారణుఁడు. సం. వి. అ. పుం. గుహుఁడు, కుమారస్వామి.

క్రౌంచము. సం. వి. అ. పుం. 1. ఒకానొక కొండ; 2. ఒకానొక ద్వీపము; (చూ. ద్వీపము.) 3. ఒకానొక పక్షి.

క్రౌర్యము. సం. వి. అ. న. క్రూరభావము.

## క్ల.

క్లమథము. సం. వి. అ. పుం. శ్రమము, బడలిక.

క్లమము. సం. వి. అ. పుం.——పై.——

## క్లా.

క్లాంతము. సం. విణ. (అ. ఆ. అ.) బడలినది.
క్లాంతి. సం. వి. ఇ. స్త్రీ. క్లమము, బడలిక.

## క్లి.

క్లిన్నము. సం. విణ. (అ.ఆ.అ.) ఆర్ద్రము, తడిసినది.
క్లిశితము. సం. విణ. (అ.ఆ.అ.) దారిద్ర్యాదులచేత క్లేశమునొందినది.
క్లిష్టము. సం. వి. అ. న. ఒకానొక శబ్దదోషము. విణ. 1. దారిద్ర్యాదులచేత క్లేశమునొందినది; 2. పూర్వోత్తర విరుద్ధమయినది. (వాక్యా.)

## క్లీ.

క్లీతకము. సం. వి. అ. న. అతిమధురము.
క్లీతకిక. సం. వి. ఆ. స్త్రీ. నీలిచెట్టు.
క్లీబము. సం. వి. అ. న. నపుంసకము. విణ. విక్రమములేనిది.

## క్లే.

క్లేదము. సం. వి. అ. న. ఆర్ద్రత, తడి.
క్లేశము. సం. వి. అ. పుం. 1. దుఃఖము; 2. కోపము; 3. వ్యవసాయము.

## క్లో.

క్లోమము. సం. వి. న్. న.కడుపులో నెకప్రక్కనుండెడిరొమ్ముటిమాంసము, నీరుతిత్తి. (అని కొందఱు.)

## క్వ.

క్వణనము. సం.వి.అ.పుం. వీణలోనగువానిమ్రోఁత.
క్వణము. సం. వి. అ. పుం.——పై.——
క్వథితము.సం.విణ. (అ.ఆ.అ.) చక్కఁగా కాఁగినది.
క్వయినా. ఆం. వి. శీతజ్వరముల కౌషధము.

## క్వా.

క్వాణము. సం.వి.అ.పుం. క్వణముయొక్క రూపాంతరము.
క్వాథము. సం. వి. అ. పుం. బాధ.
క్వాథోద్భవము. సం. వి. అ. న. మ్రానిపసుపునవండిన అంజనవిశేషము.

## క్వి.

క్విట్రెంటు. ఆం. వి. మాన్యములమీఁద నీయఁబడు అల్పమైన పన్ను.

## క్ష.

క్షంత. సం. విణ. (ఋ. ఈ. ఋ.) క్షమిత, ఓర్పరి.
క్షణద. సం. వి. ఆ. స్త్రీ. రాత్రి. అ. న. ము. నీళ్లు
క్షణదుఁడు. సం. వి. అ. పుం. జోస్యుఁడు.
క్షణనము. సం. వి. అ. న. వధము, కొల.
క్షణప్రభ. సం. వి. ఆ. స్త్రీ. తటిత్తు, మెఱపు.
క్షణము. సం. వి. అ. పుం. 1. ఘటికయందా ఱవపాలు; 2. తిరునాళ్లు; 3. పండుగ; 4. వ్యాపారములేమి; 5. సమయము.
క్షణియించె. సం. స. క్రి. భోజనార్థమువరించు. "వ. అయ్యా నీవతిథివిమాయింటం గృతభోజనుండవైపొమ్మనిక్షణియించిన." భార. ఆది. ౧. ఆ. (రూ. క్షణించు.)
క్షతజము. సం. వి. అ. న. రక్తము, నెత్తురు.
క్షతము. సం. విణ.(అ.ఆ.అ.) 1.గాయమునొందినది; 2. నాశమునొందినది.
క్షతి. సం. వి. ఇ. స్త్రీ. 1. గాయము; 2. నాశము.
క్షత్త. సం. వి. ఋ. పుం. 1. శూద్రస్త్రీయందుక్షత్రియునికిఁబుట్టినవాఁడు; (క్షత్రియస్త్రీయందు శూద్రునికిఁ బుట్టినవాఁడని పాఠాంతరము.) 2. దాసీపుత్రుఁడు; 3. ద్వారపాలకుఁడు; 4. బ్రహ్మ; 5. సారథి.
క్షత్రబంధువు. సం. విణ. ఉ. స్వధర్మములేక క్షత్రియునకు బంధుమాత్రుఁడైనవాఁడు. (ఇది నిందయందువచ్చును.)
క్షత్రము. సం. వి. అ. న. శరీరము, మేను.
క్షత్రియ. సం. వి. ఆ. స్త్రీ. రాచేది.
క్షత్రియాణి. సం. వి. ఈ. స్త్రీ.——పై.——
క్షత్రియి. సం. వి. ఈ. స్త్రీ. రాచవాని పెండ్లాము.
క్షత్రియుఁడు. సం. వి. అ. పుం. రాచవాఁడు.
క్షత్రుఁడు. సం. వి. అ. పుం.——పై.——
క్షప. సం. వి. ఆ. స్త్రీ. రాత్రి, రేయి.
క్షపణకుఁడు. సం. వి. అ. పుం. బౌద్ధమతస్థుఁడు.
క్షపణము. సం. వి. అ. న. అశుచిభావము. విణ. సిగ్గులేనిది.
క్షపాకరుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.
క్షమ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఓర్పు; 2. నేల. అ. న. ము. యుక్తము. విణ. చాలునది.
క్షమి. సం. విణ. (న్. ఈ. న్.) సహిష్ణువు, ఓర్పరి.
క్షమించె. సం. స. క్రి. ఓర్చు. (క్షమియించు అనియు.)

క్షమిత. సం. విశే. (బు.ఈ.బు.) సహిష్ణువు, ఓర్పరి.
క్షముఁడు. సం. విశే. (అ.ఆ.అ.) 1. శక్తుఁడు; 2. హితుఁడు.
క్షయము. సం. వి. అ. పుం. 1. అఱుఁదెవులు; 2. తగ్గుదల; (ఇది త్రివర్గమునందొక్కటి. చూ. వర్గము.) 3. ప్రళయము; 4. ఇల్లు.
క్షయించే. సం. అ. క్రి. క్షీణించు, తగ్గు.
క్షయ్యము. సం. విశే. (అ.ఆ.అ.) క్షయింపఁదగినది.
క్షరము. సం. వి. అ. న. నీళ్లు. పుం. మబ్బు.
క్షవథువు. సం. వి. ఉ. పుం. 1. తుమ్ము; 2. దగ్గు.
క్షవము. సం. వి. అ. పుం. 1. తుమ్ము; 2. నల్లావలు.

## క్షా.

క్షాంతము. సం. విశే. (అ. ఆ. అ.) ఓర్వఁబడినది.
క్షాంతి. సం. వి. ఇ. స్త్రీ. క్షమ, ఓర్పు.
క్షాత్రము. సం. వి. అ. న. క్షత్రధర్మము.
క్షామము. సం. వి. అ. పుం. కఱవు. విశే. కృశము.
క్షారకము. సం. వి. అ. పుం. 1. కసుగాయ; 2. (పక్షులు మత్స్యములులోనగువానిఁ బట్టివేసెడు) బుట్ట; 3. పసరుమొగ్గ. మొగ్గలగుమి. (అని కొందఱు.)
క్షారము. సం. వి. అ. పుం. 1. ఉప్పు; 2. కారము; "త్రిరాత్రముభయోరధశ్శయ్యా. బ్రహ్మచర్యమ్ క్షారలవణవర్జనంచ." అని ఆపస్తంబసూత్రవాక్యము.—3. గాజు; 4. బూడిద; 5. ఉమ్మెత్త?.
క్షారాబ్ధి. సం. వి. ఇ. పుం. ఉప్పుసముద్రము.
క్షారితము. సం. విశే. (అ. ఆ. అ.) కాఁచినది.
క్షారితుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) పరస్త్రీగమనాది దోషములచే దూఱఁబడినవాఁడు.
క్షాళనము. సం. వి. అ. న. కడుగుట.
క్షాళితము. సం. విశే. (అ. ఆ. అ.) కడుగఁబడినది.

## క్షి.

క్షితి. సం. వి. ఇ. స్త్రీ. 1. నేల; 2. ఉనికి; 3. చిటికవేయునంతకాలము; 4. నాశము.
క్షితిధరము. సం.వి.అ.పుం. పర్వతము, నేలతాలుపు.
క్షితిపతి. సం. వి. ఇ. పుం. రాజు, నేలఱేఁడు.
క్షిప. సం. వి. ఆ. స్త్రీ. క్షేపణము, ప్రేరేపించుట.
క్షిప్తము. సం. విశే. (అ.ఆ.అ.) 1. త్రోయఁబడినది; 2. వైవఁబడినది.
క్షిప్ణువు. సం. విశే. ఉ. తిరస్కరించువాఁడు.
క్షిప్రము. సం. క్రి. విశే. అ. న. శీఘ్రము. విశే. పడిగలది.
క్షిప్రశ్యేనము. సం. వి. అ. పుం. పక్షివిశేషము, ఏట్రింత.
క్షియ. సం. వి. ఆ. స్త్రీ. క్షయము, తగ్గుదల.

## క్షీ.

క్షీణము. సం. విశే. (అ. ఆ. అ.) క్షయించినది.
క్షీణించే. సం. అ. క్రి. క్షీణమగు.
క్షీబుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) క్రొవ్వినవాఁడు.
క్షీరకాకోలి. సం. వి. ఈ. స్త్రీ. పిన్నపాల?.
క్షీరము. సం. వి. అ. న. 1. పాలు; 2. నీళ్లు. (శునకక్షీరము శూనారము.)
క్షీరమోరట. సం. వి. ఆ. స్త్రీ. చేఁగొండ?.
క్షీరవిదారి. సం. వి. ఈ. స్త్రీ. నల్లనేలగుమ్ముడు?
క్షీరశుక్ల. సం. వి. ఆ. స్త్రీ. తెల్లనేలగుమ్ముడు?.
క్షీరాబ్ధి. సం. వి. ఇ. పుం. పాలసముద్రము.
క్షీరావి. సం. వి. ఈ. స్త్రీ. చిఱుపాల?.
క్షీరాశము. సం. వి. అ. పుం. హంస.
క్షీరిక. సం. వి. ఆ. స్త్రీ. పాలచెట్టు.
క్షీరోదకన్యాయము. సం. వి. అ. పుం. నీళ్లునుపాలునుగలసినట్లొక్కటిగాఁ గలసియుండు ధర్మము.
క్షీరోదము. సం. వి. అ. పుం. పాలసముద్రము.

## క్షు.

క్షుణ్ణము. సం. విశే. (అ. ఆ. అ.) పొడిచేయఁబడినది.
క్షుణ్ణుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) వ్యుత్పన్నుఁడు.
క్షుతము. సం. వి. అ. న. త్. స్త్రీ. తుమ్ము.
క్షుతాభిజననము. సం. వి. అ. పుం. నల్లావలు. (క్షుధాభిజననమని కొందఱు.)
క్షుత్తు. సం. వి. ధ్. స్త్రీ. ఆఁకలి, బుభుక్ష.
క్షుద్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. ఈఁగ; 2. తేనెటీఁగ; 3. వేశ్య; 4. అంగహీనయగు ఆఁడుది; 5. నాట్యమాడెడు ఆఁడుది; 6. హింసించెడు ఆఁడుది; 7. పులిచింత?; 8. వాఁకుడు?.
క్షుద్రకము. సం. వి. అ. పుం. బాణవిశేషము, కుప్పెకోల. "శ్లో. అథైనం పంచవింశత్యా క్షుద్రకాణాం సమాచినోత్." భార. భీష్మ. "శ్లో. సాత్యకిః పంచవింశత్యాక్షుద్రకాణాం సమార్పయత్." భార. ద్రో.
క్షుద్రము. సం. విశే. (అ.ఆ.అ.) (చూ. క్షుద్రుఁడు.)
క్షుద్రమూలకము. సం. వి. అ. న. చిన్నముల్లంగి?.
క్షుద్రశంఖము. సం. వి. అ. పుం. నత్తగుల్ల.

**క్షుద్రుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. అధముఁడు; 2. అల్పుఁడు; 3. లోభి; 4. హింసకుఁడు.

**క్షుధ.** సం. వి. ఆ. స్త్రీ. క్షుత్తు, ఆఁకలి.

**క్షుధితము.** సం. విణ. (అ. ఆ. అ.) ఆఁకలిగొన్నది.

**క్షుపము.** సం. వి. అ. పుం. కుఱుచకొమ్మలును ఊడలునుగల చెట్టు.

**క్షుబ్ధము.** సం. విణ. (అ.ఆ.అ.) కలఁతపెట్టఁబడినది.

**క్షుభితము.** సం. విణ. (అ. ఆ. అ.)——పై.——

**క్షుమ.** సం. వి. ఆ. స్త్రీ. 1. నీలిచెట్టు; 2. నూనెయగిసె†.

**క్షురకము.** సం. వి. అ. పుం. 1. గొలిమిడి†; 2. పల్లేరు†; 3. బొట్టుగు†.

**క్షురప్రము.** సం. వి. అ. పుం. అర్ధచంద్రబాణము. "అర్ధచంద్రః క్షురప్రస్స్యాత్." అని హలాయుధ నిఘంటువు.

**క్షురము.** సం. వి. అ. పుం. 1. మంగలికత్తి; 2. గొలిమిడి†; 3. పల్లేరు†.

**క్షురి.** సం. వి. న్. పుం. మంగలి.

**క్షురిక.** సం. వి. ఆ. స్త్రీ. మంగలికత్తి.

**క్షుల్లకము.** సం. వి. అ. పుం. నత్తగుల్ల. విణ. 1. అల్పము; 2. నీచము; 3. పేద.

## క్షే.

**క్షేత్రజ్ఞుఁడు.** సం. వి.అ.పుం. జీవుఁడు. విణ. నేర్పరి.

**క్షేత్రము.** సం. వి. అ. న. 1. వరిమడి; 2. గణితశాస్త్రవిశేషము; 3. పెండ్లాము; 4. శరీరము; 5. సిద్ధస్థానము. (ఏనుఁగుయొక్క హస్త, వదన, దంత, శిరో, నయన, కర్ణ, గ్రీవా, గాత్రో, రః, కాయ, మేఢ్ర, పదములు పండ్రెండు క్షేత్రములనఁబడును.)

**క్షేత్రాజీవుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) దున్నుకొని బ్రదుకువాఁడు.

**క్షేత్రియము.** సం. విణ. (అ. ఆ. అ.) మడియందుఁ బుట్టినది. (తృణము.)

**క్షేత్రియుఁడు.** సం. విణ. అ. పరదారరతుఁడు.

**క్షేపణము.** సం. వి. అ. న. ప్రేరేపించుట.

**క్షేపణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఓడనడపుగడ; 2. ఒకానొక వల.

**క్షేపము.** సం. వి. అ. పుం. 1. చిమ్ముట; 2. త్రుళ్లు; 3. దూఱు; 4. పూఁత; 5. ప్రేరణము.

**క్షేపిష్ఠము.** సం. విణ. (అ.ఆ.అ.) మిక్కిలి క్షిప్రము. (క్షిప్రము=శీఘ్రము.)

**క్షేపీయము.** సం. విణ. (స్.ఈ.స్.)——పై.——

**క్షేమ.** సం. వి. ఆ. స్త్రీ. పార్వతి.

**క్షేమంకరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) మేలుచేయువాఁడు.

**క్షేమతండులము.** సం. వి. అ. పుం. ప్రయాణకాలమందు పట్టిచేతఁబోక యింటనుండి కొంఁదిగాఁ గట్టికొనిపోయెడు బియ్యము.

**క్షేమము.** సం. వి. అ. పుం, న. 1. కలిగినది చెడకుండుట; 2. శుభము. పుం. బలురక్కసి†.

**క్షైత్రము.** సం. వి. అ. న. క్షేత్రముల సమూహము. (క్షేత్రము=వరిమడి.)

## క్షో.

**క్షోణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. నేల; 2. ముంజతృణముచే నల్లిన బ్రహ్మచారి మొలత్రాడు.

**క్షోదము.** సం. వి. అ. పుం. 1. నూఱుట; 2. పొడి.

**క్షోదిష్ఠము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి క్షుద్రము. (క్షుద్రము=అల్పము.)

**క్షోదీయము.** సం. విణ. (స్. ఈ. స్.)——పై.——

**క్షోభము.** సం. వి. అ. పుం. 1. కలఁత; 2. దోఁపుడు.

**క్షోభించు.** సం. అ. క్రి. కలఁతపడు.

**క్షోభితము.** సం. విణ.(అ.ఆ.అ.) కలఁతపెట్టఁబడినది.

## క్షౌ.

**క్షౌద్రము.** సం. వి. అ. న. 1. తేనె; 2. నీళ్లు.

**క్షౌమము.** సం. వి. అ. న. 1. నారచీర; 2. నూనెయగిసె నారచీర; 3. కుందేటిత్రుప్పటిచీర. పుం, న. 1. తెల్లచీర; 2. యుద్ధార్థము వాకిటిమండపము మీఁదఁగాని కొత్తళము మీఁదఁగాని యేర్పఱచిన గది.

**క్షౌరము.** సం. వి. అ. న. మంగలిపని.

**క్షౌరికుఁడు.** సం. వి. అ. పుం. మంగలి.

## క్ష్ణు.

**క్ష్ణుతము.** సం. విణ. (అ.ఆ.అ.) వాఁడిచేయఁబడినది.

## క్ష్మా.

**క్ష్మా.** సం. వి. ఆ. స్త్రీ. 1. నేల; 2. నిద్ర. అ. న. ము. 1. స్థానము; 2. రాక్షసుఁడు.

**క్ష్మాజము.** సం. వి. అ. పుం. చెట్టు.

**క్ష్మాభృత్తు.** సం. వి. త్. పుం. 1. కొండ; 2. రాజు.

## క్ష్వా.

క్ష్వాంక. సం. వి. ఆ. స్త్రీ. ఎఱ్ఱని మొగముగల ఆఁడు కోఁతి. అ. పుం. ము. ఎఱ్ఱని మొగముగల మగ కోఁతి.

## క్ష్వే.

క్ష్వేడ. సం. వి. ఆ. స్త్రీ. 1. సింహనాదము; 2. వెదురుసలాక. అ. న. ము. 1. ఆవడపువ్వు; 2. ఎఱ్ఱజిల్లెడుకాయ. పుం. 1. చెవుడు; 2. మ్రోఁత; 3. విషము. విణ. 1. పొందరానిది; 2. వంకరైనది.

క్ష్వేడితము. సం. వి. అ. న. సింహనాదము.

క్ష్వేళ. సం. వి. ఆ. స్త్రీ. సింహనాదము. అ. పుం. ము. విషము.

క్ష్వేళితము. సం. వి. అ. న. సింహనాదము.

## ఖ.

ఖ. ఒక యక్షరము.

ఖంగుఖింగు. దే. వి. ఆయుధము లొకటితో నొకటి తాఁకునప్పుడు కలిగెడు ధ్వన్యనుకరణము. "ఉత్సాహ. నిబ్బరంపుటార్భటిని జనించె నంత నెల్లచో, డబ్బుడుబ్బు ఖంగుఖింగుఠంగుఠింగు మన్ ధ్వనుల్." కళా. ౧, ఆ.

ఖంజ. సం. వి. ఆ. స్త్రీ. ఛందోవిశేషము. విణ. కుంటిది.

ఖంజనము. సం. వి. అ. పుం. మందపిచ్చుక. కాటుకపిట్ట. (అని కొందఱు.)

ఖంజపాదము. సం. వి. అ. పుం. బాలక్రీడావిశేషము, గంజనగాలు.

ఖంజరి. సం. వి. ఈ. స్త్రీ. వాద్యవిశేషము. "సీ. కాహళదుందుభిఖంజరీమర్దళభేరీరవంబులుబోరుకలఁగ." భాను. ౪, ఆ.

ఖంజరీటము. సం. వి. అ. పుం. మందపిచ్చుక. కాటుకపిట్ట. (అని కొందఱు.)

ఖండ. సం. వి. ఆ. స్త్రీ. గర్భాధానాది విధిప్రతిపాదకగ్రంథము. "శ్రౌతులఁదప్పవట్టుదుగా ఖండలముష్టిపీడ్వఁగనినవ్వుదు." ఆము. ౬, ఆ.

ఖండకము. సం. వి. అ. పుం, న. గోఁచి.

ఖండనము. సం. వి. అ. న. నఱకుడు.

ఖండపరశువు. సం. వి. ఉ. పుం. 1. శివుఁడు; 2. పరశురాముఁడు; 3. రాహువు; 4. సున్నముపూయువాఁడు; 5. ఖండామలకమనెడు మందు.

ఖండము. సం. వి. అ. పుం, న. తునుక. పుం. 1. పులకండము; 2. రత్నదోషము.

ఖండశర్కర. సం. వి. ఆ. స్త్రీ. పులకండము.

ఖండా. వై. గ్రా. వి. పెద్దకత్తి. "సీ. ఒండొంటిఁగొట్టుచో ఖండాలుక్రంగుక్రంగునఁదాఁకి పెనుమిడుంగుఱులుగ్రక్క." కళా. ౧, ఆ.

ఖండించు. సం. స. క్రి. ఖండముచేయు, నఱకు.

ఖండిక, ఖండ్రిక. గ్రా. చిన్నపల్లె.

ఖండికము. సం. వి. అ. పుం. ధాన్యవిశేషము.

ఖండిత. సం. వి. ఆ. స్త్రీ. నాయకుఁడు రాత్రి మఱియొకదాని యింటికిపోయి యాచిహ్నములతో రాఁగా చూచి కోపమునొందిన నాయిక. (చూ. నాయిక.)

ఖండితము. సం. విణ. (అ. ఆ. అ.) నఱకఁబడినది.

ఖండీ. హిం. వి. పుట్టి.

ఖండీరము. సం. వి. అ. పుం. పచ్చపెసలు.

ఖండువా. గ్రా. వి. పైవస్త్రము.

ఖంబు. సం. వి. అ. న. 1. ఆకాశము; 2. స్వర్గము; 3. అభావము; 4. ఇంద్రియము; 5. తెలివి; 6. పట్టణము; 7. పరిమడి; 8. సుఖము; 9. సున్న. (చూ. కంబు.)

ఖగము. సం. వి. అ. పుం. 1. పక్షి; 2. బాణము; 3. గ్రహము.

ఖగుఁడు. సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. వేలుపు.

ఖగేశ్వరుఁడు. సం. వి. అ. పుం. గరుత్మంతుఁడు.

ఖచరము. సం. వి. అ. పుం. 1. పక్షి; 2. మేఘము; 3. గాలి.

ఖచరుఁడు. సం. వి. అ. పుం. 1. దేవుఁడు; 2. సూర్యుఁడు.

ఖచించు. సం. స. క్రి. చెక్కు, పొదుఁగు. (ఖచియించు అనియు. "క. ఖచియించినవజ్రంబుల, రుచులనుబోలుపారుసీవురులు బెరయుంగా." భార. ఉద్యో. ౪, ఆ.)

ఖచితము. సం. విణ. (అ. ఆ. అ.) చెక్కఁబడినది.

ఖజపము. సం. వి. అ. పుం. మిల్లి.

ఖజాక. సం. వి. ఆ. స్త్రీ. గరిఁటె.

ఖజానా. హిం. వి. ధనాగారము.

ఖటిక. సం. వి. ఆ. స్త్రీ. బలపము.

ఖటిని. సం. వి. ఈ. స్త్రీ.——పై.——

ఖట్టి. సం. వి. ఇ. స్త్రీ. పాడె.

ఖట్టిక. సం. వి. ఆ. స్త్రీ. 1. గద్దియ; 2. పాడె.

**ఖట్టికుఁడు.** సం. వి. అ. పుం. వేఁటకాఁడు.
**ఖట్వా.** సం. వి. ఆ. స్త్రీ. పర్యంకము, మంచము.
**ఖడ్గము.** సం. వి. అ. పుం. 1. కత్తి; 2. ఖడ్గమనెడు మృగము; 3 ఖడ్గమృగముకొమ్ము.
**ఖడ్గి.** సం. వి. న్. పుం. ఖడ్గమృగము. విణ. కత్తిగలవాఁడు.
**ఖతమాలము.** సం. వి. అ. పుం. 1. పొగ; 2. మబ్బు.
**ఖతిలకము.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.
**ఖత్తు.** హిం. వి. రీతి, ఉత్తరము.
**ఖదిర.** సం. వి. ఆ. స్త్రీ. ముడుఁగుఁదామర. అ. పుం. ము. చంద్రుఁ.
**ఖదిరుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.
**ఖద్ది.** దే. వి. బలము. "స్రగ్ధర. ఖద్దింజెండాడుమ్రోఁకుల్ కవుఁగిటికోలఁదుల్ కత్తిసొక్కుల్ కగా తఱి." స్వా. ౪, ఆ.
**ఖద్యోతము.** సం. వి. అ. పుం. మిడుఁగురుఁబురువు.
**ఖద్యోతుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.
**ఖనకము.** సం. వి. అ. పుం. 1. ఎలుక; 2. పందికొక్కు. (రూ. ఖానకము.)
**ఖనకుఁడు.** సం. వి. అ. పుం. 1. ఉప్పరవాఁడు; 2. కన్నపుదొంగ. విణ. త్రవ్వెడువాఁడు.
**ఖని.** సం. వి. ఇ. స్త్రీ. రత్నములు పుట్టెడుచోటు, గని, (రూ. ఖాని.)
**ఖనిత్రము.** సం. వి. అ. న. 1. గడ్డపాఱ; 2. గుద్దలి.
**ఖనిత్రి.** సం. వి. ఈ. స్త్రీ. పాఱ.
**ఖపుటుఁడు.** సం. వి. అ. పుం. అన్నమాకులోఁబెట్టుకొనక చేతఁబెట్టుకొని భుజించు వ్రతముగలవాఁడు.
**ఖపురము.** సం. వి. అ. పుం. 1. పోఁకజబరు; 2. పోఁకమ్రాను; 3. మ్రానిబంక; 4. నాగముస్తె.
**ఖర.** సం. వి. ఆ. స్త్రీ. దానరడంగిచెట్టు. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) న. ము. 1. ఎండుపోఁక; 2. వాఁడిమి; 3. వేఁడిమి. విణ. 1. వాఁడిమిగలది; 2. వేఁడిమిగలది.
**ఖరకరుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.
**ఖరకుటి.** సం. వి. ఈ. స్త్రీ. మంగలియిల్లు.
**ఖరణసుఁడు.** సం. విణ. (స్. అ. ఆ. అ.) వాఁడియైన ముక్కుగలవాఁడు, గద్దముక్కువాఁడు.
**ఖరపుష్ప.** సం. వి. ఆ. స్త్రీ. వాయింట.
**ఖరమంజరి.** సం. వి. ఈ. స్త్రీ. ఉత్తరేను.
**ఖరము.** సం. వి. అ. పుం. గాడిద.
**ఖరాగా.** హిం. క్రి. విణ. సరిగా, స్థిరముగా.
**ఖరాశ్వ.** సం. వి. ఆ. స్త్రీ. ఓమము.
**ఖరీదు.** హిం. వి. వెల.
**ఖరుఁడు.** సం. వి. అ. పుం. ఒకరాక్షసుఁడు. విణ. 1. వాఁడిమిగలవాఁడు; 2. వేఁడిమిగలవాఁడు.
**ఖరువు.** సం. వి. ఉ. పుం. 1. గర్వము; 2. గుఱ్ఱము; 3. పల్లు; 4. శివుఁడు. విణ. తెల్లనిది.
**ఖర్చు.** హిం. వి. వ్రయము.
**ఖర్జువు.** సం. వి. ఊ. స్త్రీ. 1. తీఁట; 2. ఒకానొక పురుగు; 3. చిట్టీఁదు.
**ఖర్జూరము.** సం. వి. అ. న. వెండి. పుం. 1. తేలు; 2. పేరీఁదు; 3. బ. ధాన్యవిశేషము.
**ఖర్జూరి.** సం. వి. ఈ స్త్రీ. చిట్టీఁదు.
**ఖర్పరము.** సం. వి. అ. పుం. 1. బిచ్చమెత్తెడుకప్పెర; 2. తలపుఱ్ఱె.
**ఖర్పరి.** సం. వి. ఈ. స్త్రీ. పాలతుత్తము.
**ఖర్పరుఁడు.** సం. వి. అ. పుం. దొంగ.
**ఖర్వటము.** సం. వి. అ. పుం. కొండదొననాశ్రయించియుండెడుపల్లె. కమ్మరి వడ్లంగిలోనగువారుండెడుపల్లె. (అని కొందఱు.) నన్నూఱు గ్రామములుగల పరగణాకు ముఖ్యగ్రామము. (అని కొందఱు.) (ఖర్పటమని కొన్ని పుస్తకములయందుఁగానఁబడుచున్నది.)
**ఖర్వము.** సం. వి. అ. న. సంఖ్యావిశేషము. విణ. 1. అధమము; 2. పొట్టి.
**ఖలతి.** సం. విణ. ఇ. బట్టతలవాఁడు.
**ఖలపువు.** సం. విణ. (ఊ. ఊ. ఉ.) కళ్లమునూడ్చువాఁడు.
**ఖలము.** సం. వి. అ. న. 1. చోటు; 2. నేల; 3. పాపము. పుం. కళ్లము. విణ. 1. అధమము; 2. క్రూరము; 3. నీచము.
**ఖలిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. కళ్లముల సమూహము; 2. ఖలుల సమూహము; 3. మురయనెడు గంధద్రవ్యము.
**ఖలీనము.** సం. వి. అ. పుం, న. గుఱ్ఱపుకళ్లెము, (రూ. ఖలినము.)
**ఖల్య.** సం. వి. ఆ. స్త్రీ. 1. కళ్లములసమూహము; 2. ఖలులసమూహము.
**ఖల్లము.** సం. వి. అ. పుం. 1. తోలు; 2. పల్లము; 3. వస్త్రవిశేషము; 4. వానకోయిల.
**ఖల్వాటుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) బట్టతలవాఁడు.
**ఖనూచి.** సం. విణ. ఇ. ప్రతిభలేనివాఁడు.

ఖష్పసము. సం. వి. అ. పుం. గసగసాలు.
ఖఖూరిక. సం. వి. ఆ. స్త్రీ. సాముకూటము, గరిడీ.

### ఖా.

ఖాండవము. సం. వి. అ. న. ఇంద్రునియొక్క ఒకానొక వనము.
ఖాటి. సం. వి. ఇ. స్త్రీ. పాడె, (రూ. ఖాటిక.)
ఖాణము. వై. గ్రా. వి. గుఱ్ఱము మొదలగువానియొక్క యులవలులోనుగాఁగలభక్ష్యము. "క. ఏణాక్షినపుడు వెడసిం, గాణింగొనియలరుఁదూపుగ మిఁజక్కెరయే, ఖాణముగాఁగలిగినఖేం, ఖాణముదొరపింజపింజగాఁడఁగనేసెన్." విజ. ౧, ఆ.
ఖాతకము. సం. వి. అ. న. అగడ్త, (రూ. ఖాతిక.)
ఖాతము. సం. వి. అ. న. పుష్కరిణి, కోనేఱు.
ఖాతకుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) 1. త్రవ్వెడువాఁడు; 2. అప్పుతీసెడువాఁడు.
ఖాదకుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) 1. తినువాఁడు; 2. అప్పుతీసెడువాఁడు.
ఖాదనము. సం. వి. అ. న. 1. తినుట; 2. తిండి; 3. పల్లు.
ఖాదితము. సం. విశే. (అ. ఆ. అ.) తినఁబడినది.
ఖాదిరము. సం. వి. అ. పుం. కవిరియుండ.
ఖాద్యము. సం. వి. అ. న. తినఁదగినబండము. విశే. తినఁదగినది.
ఖామందు. హిం. వి. యజమాని, స్వంతగాఁడు.
ఖాముఖా. హిం. క్రి. విశే. అగత్యముగా, గట్టిగా.
ఖాయము. హిం. విశే. స్థిరము, శాశ్వతము, రూఢి.
ఖారి. సం. వి. ఈ. స్త్రీ. పుట్టి. ఇద్దుము. (అని కొందఱు.)
ఖారీకము. సం. విశే. (అ. ఆ. అ.) పుట్టెఁడు విత్తులు విత్తఁదగినది. (పొలము.)
ఖాలీ, ఖాళీ. హిం. విశే. ఆక్రమింపఁబడని, ఉత్త.
ఖాసా. హిం. విశే. స్వంత.

### ఖి.

ఖిన్నము. సం. విశే. (అ. ఆ. అ.) ఖేదమునొందినది.
ఖిలము. సం. విశే. (అ. ఆ. అ.) 1. దున్ననిది (నేల); 2. చెడినది. (దున్నని నేలయను నర్థమునందు నపుంసకమని కొందఱు.
ఖిలీభవించే. సం. అ. క్రి. చెడు. "వ. ఉభయలోకమార్గంబును ఖిలీభవించుంగావున." కాశీ. ౫, ఆ.

### ఖు.

ఖుద్దున. హిం. క్రి. విశే. స్వంతముగా.
ఖురణసుఁడు. సం. విశే. (స. అ. ఆ. అ.) బుఱ్ఱముక్కువాఁడు.
ఖురము. సం. వి. అ. పుం. 1. గొరిజ; 2. నఖమనెడు గంధద్రవ్యములు.
ఖురముఖము. సం. వి. అ. న. బూరగొమ్ము.
ఖురళి. సం. వి. ఈ. స్త్రీ. సాము, (రూ. ఖురళిక.)
ఖురాకము. సం. వి. అ. పుం. మృగవిశేషము.
ఖురాలకము. సం. వి. అ. పుం. ఇనుపబాణము.
ఖుర్దనము. సం. వి. అ. న. క్రీడ, ఆట.
ఖులాసా. హిం. వి. సౌఖ్యము, నెమ్మది.
ఖుల్లకము. సం. విశే. (అ. ఆ. అ.) క్షుల్లకము, అల్పము.
ఖుల్లసు. హిం. వి. వివరము.

### ఖే.

ఖేంఖాణము. సం. వి. అ. పుం. గుఱ్ఱము.
ఖేచరము. సం. వి. అ. పుం. మృగవిశేషము.
ఖేచరుఁడు. సం. వి. అ. పుం. వేలుపు. విశే. ఆకాశమున సంచరించువాఁడు.
ఖేటకము. సం. వి. అ. న. 1. డాలువాలు; 2. గ్రామవిశేషము.
ఖేటము. సం. వి. అ. పుం, న. 1. పంటకాఁపులుండెడుపల్లె; వర్తకులుండెడుపేట. (అని కొందఱు.) 2. డాలువాలు; 3. కఫము. విశే. అధమము.
ఖేదము. సం. వి. అ. పుం. శోకము.
ఖేయము. సం. వి. అ. న. అగడ్త. పుం. నీళ్లుపాఱుటకుఁగట్టిన అనకట్ట. "శ్లో. సేతుశ్చద్వివిధోజ్ఞేయః ఖేయోబద్ధ్యస్తథైవచ, తోయప్రవర్తనాత్ఖేయోబద్ధ్యస్స్యాత్తన్నివర్తనాత్." అని నారదుఁడు. సం. విజ్ఞా. వ్య, కాం. వ్యాఖ్యానము.
ఖేల. సం. వి. ఆ. స్త్రీ. క్రీడ, ఆట.

### ఖై.

ఖైదీ, కైది. హిం. వి. చెఱలో నుంచఁబడినవాఁడు.
ఖైదు, కైదు. హిం. వి. చెఱ, కారాగృహము.

### ఖో.

ఖోడుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) కుంటివాఁడు.
ఖోలకము. సం. వి. అ. పుం. 1. కుల్లాయి; 2. పోఁకచిప్ప; 3. పుట్ట.

## ఖ్యా.

**ఖ్యాతము.** సం. విశే. (అ. ఆ. అ.) వాసికెక్కినది.

**ఖ్యాతి.** సం. వి. ఇ. స్త్రీ. ప్రసిద్ధి, వాసి.

## గ.

**గ.** ఒక యక్షరము.

**గంగ.** ఉభ. దే. విశే. 1. పూజ్యము; (గంగగోవు. మొ.) 2. పెద్ద. (గంగరావి. మొ.)—సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకయేఱు. (పంచగంగలు.—కావేరి, తుంగభద్ర, కృష్ణవేణి, గౌతమి, భాగీరథి. ఆకాశగంగమందాకిని, పాతాళగంగభోగవతి.)

**గంగడోలు.** దే. వి. ఆవులకును ఎడ్లకును మెడక్రింద వ్రేలాడెడుతోలు, సాస్న.

**గంగమయిలావు.** ద్వ. వి. (గంగమయిల+ఆవు.) నలుపును పసుపునుగలసిన వర్ణముగల ఆవు.

**గంగమ్మ.** ద్వ. వి. (గంగ+అమ్మ.) ఒకానొక గ్రామదేవత, (రూ. గంగనమ్మ.)

**గంగరావి.** దే. వి. బ్రహ్మదారువు†.

**గంగరేను.** దే. వి. పెద్దరేఁగు, లికుచము†.

**గంగాజలములు.** సం. వి. అ. న. బ. ధాన్యవిశేషము. "సీ. అర్థిఁబ్రయోగంబులార్జింపనార్జింపఁగానో పమెట్లుగంగాజలంబులు." కవి. ౧, ఆ.

**గంగాధరుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, మిన్నువాఁకతాలుపు.

**గంగాళము.** దే. వి. ఇత్తడి రాగిలోనగువానితోఁజేసిన నీళ్లకొప్పెర.

**గంగి.** దే. విశే. 1. పూజ్యము; (గంగెద్దు.) 2. యక్షయము. "శా. అన్నాచెల్లెలనయ్యెదక్ విడువు నీకన్నంబువెట్టింతునా, హృన్నాథుక్ ద్విజాగంగికుఱ్ఱనకటాహింసింపనేలయ్య." భాగ. ౯, స్కం. "గంగిగోవువంటి సాదుబాఁపనిక్ నినుక్ జనునె పలువయనఁగ." కళా. ౭, ఆ.

**గంగెద్దు.** దే. వి. (గంగి+ఎద్దు.) బిచ్చపుదాసరులు శృంగారించి తీసికొనివచ్చెడి యెద్దు, (రూ. గంగిరెద్దు.)

**గంజ.** సం. వి. ఆ. స్త్రీ. 1. కల్లమ్మెడియిల్లు; 2. గని. (ఒకానొకకవి గంజావాలలుపాంశునభుజించి యని ప్రయోగించియున్నాఁడు. అక్కడ గంజాశబ్దమునకు గంజాయి యర్థమగుచున్నది. అది విచారణీయము.) అ. పుం, న. ము. బండారము. పుం. తిరస్కారము.

**గంజి.** వై. వి. అన్నరసము*.

**గంజిగుల్ల.** వై. వి. నీటిబుగ్గవలె లేచెడి బొబ్బ.

**గంజితోరక.** ద్వ. వి. గంజిమీఁది మీఁగడ.

**గంజె.** దే. వి. కృషికి యోగ్యమైన భూమి.

**గంజెనగాలు.** ద్వ. వి. బాలక్రీడావిశేషము. "గంజనగాలనఖంజపాదక్రీడగాఁజెలంగు." ఆం, భా. ద్వి. శూ.

**గంజాయి.** వై. వి. కైపుపుట్టించునట్టి యొక వస్తువు, కళంజము. "ద్వి. గంజాయితినెనేమికలుద్రావెనేమి, యంజకధనమిచ్చునతఁడెనామెచ్చు." హరిశ్చ. ౨, భా.

**గంజో.** దే. వి. బజాఱు. (అప్ర.)

**గంట.** యు. దే. వి. గడ్డిదుబ్బు, తృణస్తంబము. 1. వాద్యవిశేషము; 2. కాలవిశేషము.

**గంటకట్టు.** దే. అ. క్రి. గంటయేర్పడినదియగు.

**గంటము.** దే. వి. తాటాకు వ్రాయుటకు నుపయుక్తమైన యుక్కుసాధనము.

**గంటలమ్మ.** వై. వి. (గంటల+అమ్మ.) ఒకానొక గ్రామదేవత.

**గంటవేఁట.** ద్వ. వి. వేఁటలో భేదము. (చూ. ఏదువేఁట.)

**గంటి.** దే. వి. 1. గాయము, క్షతి; "సీ. వినుమొక్కనాఁడత్తపస్విప్రేల్నాటిదర్భ. గంటిఁగూరయసరుగాఁటినవర్తించె, నతఁడుతపముసిద్ధికాత్మఁబొంగి." సం. "క్షతేఃకిలకరేరాజన్ స్తస్యశాకరసోద్రవత్." భార. శల్య. ౨, ఆ. — 2. దుఃఖము. "తరల. చిలువటెంకి మికంబు చెట్టనిచెప్పకొం దురుకల్లయీ, పొలఁతినెమ్మొగముం గడంకకుఁ బోలఁజాలక నెమ్మదిన్, గలఁగిచుక్కలరాయఁ డెంతయుగంటివెల్వెలఁబాఱెఁగా, కలరువిల్తుని మేనమామగునయ్యకాకొదగల్గునే." య. ౪, ఆ.

**గంటు.** దే. స. క్రి. గాయముచేయు. "ఉ. వేఁదుఱుగొన్న మానవుని వేమఱుగంటియు బిట్టుకాల్చియుఁన్, మోఁదియునీటఁద్రొక్కియునుమున్నొనితీర్పఁగడంగువెజ్జునట్లు." లక్ష్మీ. ౫, ఆ. — వి. 1. గనుపు; "సీ. కన్నుకనుపు గంటు గను పంచనగఁ బర్వమమరు." ఆం, భా. ద్వి. వ. — 2. ముడి; 3. రూకలముడి; 4. వెంద్రుకలముడి.

**గంటుబారంగి.** ద్వ. వి. ఒకానొక మందుచెట్టు.

**గంటువెట్టు.** దే. స. క్రి. (గంటు+పెట్టు.) (కోపముచే మొగము) ముడుఁచు. "వ. అనియాడిమొ

గంబుగంటు వెట్టుకొనియున్న సురనదీనందనుది
క్కు_మొగంబై.” భార. ఉద్యో. ౪, ఆ.
గంటె. దే. వి. 1. గరిటె; 2. సజ్జపైరు. బ. సజ్జలు.
గంటెకామ. దే. వి. ఒకానొకచెట్టు.
గంట్లకచోరము. ద్వ. వి. పద్గ్రంథిక?.
గంట్లకానుగు. దే. వి. పద్గ్రంథము?.
గంట్లము. దే. వి. గర్భిణులకోరిక, దోహదము. “సీ. పూలతేనెలయందుఁజాలాలిగోర్వంకపిండుగంట్లంబులు పెట్టిపెట్టి.” య. ౪, ఆ.
గండ. దే. వి. మ్రొక్కుబడి. (గండదల, గండదీపము. మొ.)
గండఁడు. వై. వి. శూరుఁడు. “గండఁడుశంభుఁడు.” వీర. ౪, ఆ.
గండకత్తెర. వై. వి. మెడ కత్తిరించుకొనెడి యొక దినుసు కత్తెర. “ద్వి. దండిపెద్దలమనోధైర్యంపులతకు, గండకత్తెర దీనికలికివాల్చూపు.” విష్ణు. ఉ. ౪, ఆ.
గండకము. సం. వి. అ. పుం. 1. ఖడ్గమృగము; 2. జోస్యము; 3. భేదము; 4. విఘ్నము; 5. సంఖ్యావిశేషము.
గండగొడ్డలి. వై. వి. పరశువు. “సీ. పులులమొత్తంబుల బోనులఁజొరఁ దోలిగండగొడ్డండ్లచేఁజెండిచెండి.” రసి. ౧, ఆ.
గండగొడ్డలితాలుపు. ద్వ. వి. పరశురాముఁడు.
గండడఁగు. ద్వ. అ. క్రి. (గండు+అడఁగు.) 1. పరాక్రమహీనుఁడగు; “చ. పగతుండుగండడఁగికాతరభావమునెమ్మనంబునన్, దనికినసర్వయత్నములుదక్కినృపాలసముత్కరంబుతోన్. వ. సేనాసముదయంబులనెల్ల దివియించుకొనినిస్తేజుండైతెనవచ్చినత్రోవనమిగిడె.” హరి. ఉ. ౨, ఆ.— 2. చచ్చు. “చ. సమధికకాలనేమిగుణశాలివినీవు దరస్థలోకసం, ఘములకుఁగీడొనర్తువనికైటభదానవభేదియంతరం, గమువెడలించెఁగానినినుగండడఁగించకపోయెనిందిరా, రమణిఁదలంచిరాత్రిచరరాగనిమగ్నులకేడధర్మముల్.” వసు. ౪, ఆ.
గండదల. దే. వి. “మును బావమఱఁదులిమ్ములనంబికకు గండదలలియ్య.” భో. ౫, ఆ. (చూ. గండ.)
గండపెండరము. ద్వ. వి. గండపెండారముయొక్క రూపాంతరము. “సీ. పాసంగసాదలలపకొన్నామి
డికమ్ములుపూని డాకాలగండపెండరమమర్చి.” అచ్చ. యు, కాం.
గండపెండారము. ద్వ. వి. (గండఁడు+పెండారము.) శూరులు బిరుదుగా కాలనుధరించెడి యందియ. “సీ. కదుమించుడాకాలిగండపెండారంబుమెల్లనవదలించెమెలఁతయొకతె.” య. ౪, ఆ.
గండభేరుండము. సం. వి. అ. పుం. పక్షివిశేషము. (పక్షివిశేషమని చెప్పచున్నారుగాని ప్రయోగములయందు మృగపర్యాయములతోఁడఁ జేర్చి చెప్పఁబడియున్నది.)
గండమాల. సం. వి. ఆ. స్త్రీ. మెడచుట్టు గడ్డలుఁలే చెడు వ్యాధివిశేషము.
గండము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగు చెక్కిలి; 2. చెక్కిలి; 3. ఒకగ్రహయోగము; (చూ. యోగము.) 4. ఖడ్గమృగము; 5. గుండ్రాయి; 6. గుఱుతు; 7. గుజ్జుపుసొమ్ము; 8. పుండు; 9. పొక్కు; 10. నీటిమీఁది బుగ్గ.
గండరగండఁడు. వై. వి. శూరులకెల్ల శూరుఁడు.
గండరించు. దే. అ. క్రి. పుట్టు. “ఎ, గీ. ప్రళయకాలానలమున, గండరించిన రూపంబు కరణిభీముఁ, డతిభయంకరాకారతనతిశయిల్లె.” భార. విరా. ౨, ఆ.—అం. ప్రే. పుట్టించు. “సీ. నవకల్పలతికలనవకంబునాతిగా శ్రీనందనుఁడు గండరించినట్లు.” మార్క. 3, ఆ.
గండరులు. వై. వి. బ. తునుకలు.
గండరువు. దే. వి. పడియచ్చు. “చ. కరువునఁబోసిరో విధునికాంతి సుధాబ్ధితరంగఁదెచ్చిగం, డరువొనరించిరో.” భార. అను. ౧, ఆ.
గండవడము. వై. వి. తెర. “క. ఉండిరికాంతయుఁబతియును, గండవడముమాటునందుఁగడునింపులతో, నిండినవేడ్కలుతనరఁగ, నొండొరులం జూడఁగన్నులువ్విళులూరన్.” షో. ౩, ఆ.
గండశైలము. సం. వి. అ. పుం. 1. కొండనుండి జాతిపడిన పెద్దఱాయి; 2. కోయిల; 3. నొసలు.
గండాడు. ద్వ. అ. క్రి. (గండు+ఆడు.) రమించు. “క. చండాలితోద్విజుండొగి, గండాడినవత్సము నభగము వ్రాసితగన్, దండువుగొని దేశంబున, నుండక యుండంగనడుచు టుచితము పతికిన్.” విజ్ఞా. ప్రా, కాం.
గండారు. దే. వి. చెఱసాల. “పచ్చగండార్లలో.” య. ౪, ఆ.

గండాలి. సం. వి. ఈ. స్త్రీ. తీఁగగతిక.

గండి. వై. వి. 1. బిలము*; "ఉ. సన్నపుగండియొక్కటిరసాతలమార్గముఁబోలెనిమ్నమై, యున్నతం డుకుంభివెలినుండఁగఁదానసహాయశూరుఁడై, మిన్నకయందుఁజొచ్చిచనిమేడలఁజారునికేతనంబులన్, జెన్నగునొక్కప్రోలుగనిచేరఁగఁబోవఁగ నందులోపలన్." భో. ౫, ఆ.—2. రంధ్రము*; "చ. భుజంగులహృదయస్థలుల్ వ్రాడిచికొంచక తోడనపోటుగండ్లదూ, ఱలలనయారయొక్కొ కతటింబువుఁబోండ్లుకటారికత్తియల్." కళా. ౧, ఆ.—3. సందు*; "గండిగాంచినరు తేరిపథంబునఁబోయిరేపునన్." భార. ద్రో. 3, ఆ.—4. నీళ్లధికముగావచ్చుటచేతఁ దెగిన చెఱువుకట్ట సందు*.

గండిక. వై. వి. గండియొక్కరూపాంతరము.

గండిదొంగ. ద్వ. వి. కన్నపుదొంగ, ఖనకుఁడు.

గండివనము. వై. వి. గ్రంథిపర్ణము‡.

గండీరము. సం. వి. అ. న. చిట్టికూర. పుం. 1. ఏఱువంగ‡; 2. తురుజకూర.

గండీరి. సం. వి. ఈ. స్త్రీ. 1. చిట్టికూర; 2. ముల జెముడు‡.

గండు. వై. వి. 1. పౌరుషము*; 2. బలము*; 3. పశుజాతియందు మగది*. "క. ఒడలుబ్బనిక్కి ముందఱి, యడుగులుధరనూఁదిచిందునలబలమునకున్, జడియకతొకగబ్బిగండె, క్కుడుకడిమిం దివిచెఁ గ్రుంగికొమ్ములయుడుమున్." స్వా. ౪, ఆ.

గండుఁడు. సం. వి. అ. పుం. శూరుఁడు.

గండూపదము. సం. వి. అ. పుం. కించులికము, ఎఱ్ఱ.

గండూపది. సం. వి. ఈ. స్త్రీ. శిలి, ఆఁడుఎఱ్ఱ.

గండూషము. సం. వి. అ. పుం. 1. పుక్కిలింత; 2. పుడిసిలి; 3. తొండముచివర.

గండూషించు. సం. స. క్రి. పుక్కిలించు.

గండె. వై. వి. చేఁప. "గీ. తానుసురమానినృపతనుల్ దూల్చియకట, కామినీతతినుడికించుకంటెనట్టె, గండెయును నల్లదాసరిగాఁడుఁగిరియు, హరియు నైపోవుటయెమంచిదనుయుగంబు." ఆము. ౫, ఆ.

గండోలము. సం. వి. అ. పుం. కుచ్చులమీను.

గండోలి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఎఱ్ఱతుమ్మెద; 2. కఱుఁదురీఁగ. (రూ. గంధోలి.)

గండ్ర. యు. దే. విశే. 1. ధృష్టుఁడు; 2. పెద్దది. (గండ్రచీమ. మొ.) బ. పరుషము. "శా. తంత్రీనాకునను గ్రహింపఁగదవైద్యంబంచుఁ బ్రార్థించినన్, గండ్రల్ గానటులాడిధిక్కృతులఁబోకార్లంటివి." స్వా. ౫, ఆ.—వై. వి. ఖండములు. "ఉ. అత్తఱినమ్మకుందుఁడు తదక్తసహస్రశరాసనంబులన్, గత్తిమొగంపుఁటమ్ములను గండ్రలుసేయుచు." అని. ౪, ఆ.

గండ్రచీమ. దే. వి. పెద్ద నల్లచీమ, ఉలంగవము.

గండ్రించు. వై. స. క్రి. ఖండించు. "వ. గండగొడ్డండ్లగండ్రించినఁగీలెడసినజంత్రంబులక్రియ." కవిక. ౨, ఆ.

గండ్రికలు. వై. వి. బ. ఖండములు. "గండ్రికల్ చేసినేలన్ నిండించెన్ దుష్పాలన్." య. ౨, ఆ.

గంత. ఉభ. వై. వి. 1. మెత్తగాఁ బఱచుకొనుటకై ప్రాఁతగుడ్డలనుజేర్చి దట్టముగాఁగుట్టిన బొంత*; "ఉ. గ్రుచ్చినరత్నరాజిరుచిగుచ్ఛములుంబలున్నెపట్టునూల్, కుచ్చులుగల్గియొప్పుతనకుచ్చుగంతయు." పర. ౧, ఆ.—2. ఎద్దులోనగువానిమీఁదవేసెడుగంత*.—సం. విశే. (బు. ఈ. బు.) పోవువాఁడు.

గంతవ్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) పోఁదగినవాఁడు.

గంతు. దే. వి. దుముకు. "ఓరినీగంతులడంగిపోన." రా. యు, కాం.

గంతుకొను. దే. అ. క్రి. 1. దుముకు; "వ. ఇక్కడఁజొచ్చియేమేమి దురుక్తులాడెడినో చూచెదంగాకయనుచునొక్కశాఖకుగంతుగొని." రా. సుం, కాం.—2. నచ్చు. "మ. కెడసెన్ దుష్పాలుడిఁకవేసెనెలుఁగుల్ గిట్టెంబులుల్ సింగముల్, కడగొట్టెన్ మనుఁబిల్లుగంతుకొను." సా. ౧, ఆ.

గంత్రి. సం. వి. ఈ. స్త్రీ. గాడీబండి.

గందపట్టె. వై. వి. తలుపుమీఁదనమర్చెడి యడ్డుకొయ్య. "మ. శమగాంభీర్యధృతిక్షమార్జవదయాశౌర్యప్రమోదాదికో, త్తమనానాగుణరత్నకోశనిలయోద్యత్కాంచనద్వారబం, ధమహోస్తంభసూనబాహుఁడగునాధాత్రీశుపక్షంకవాటము పైనెప్పాకొగందపట్టెగతినుండన్ నాడుకేల్ నేర్చుటల్." కళా. ౭, ఆ.

గందపుఁగొండ. వై. వి. (గందము+కొండ.) మలయపర్వతము. (ఇట్లు గందపుమల. మొ.)

గందపుమ్రాను. ద్వ. వి. (గందము+మ్రాను.) చందనవృక్షము.

గందపొడి. ద్వ. వి. (గందము + పొడి.) కొన్ని గంధద్రవ్యములఁజేర్చి చేసిన పొడి, చూర్ణము.
గందము. వై. వి. చందనము*.
గంధకము. సం. వి. అ. పుం. అంగడి మందుదినుసు.
గంధకారి. సం. వి. ఈ. స్త్రీ. ముడుఁగుఁదామర?.
గంధకుటి. సం. వి. ఈ. స్త్రీ. మురయనెడు గంధద్రవ్యము?.
గంధగజము. సం. వి. అ. పుం. మదపుటేనుఁగు.
గంధగర్భము. సం. వి. అ. పుం. కొండమారెడు?.
గంధనము. సం. వి. అ. న. 1. ఎత్తిఁగించుట; 2. నలుగిడుట; 3. నొప్పించుట; 4. వెలిఁగించుట.
గంధనాకులి. సం. వి. ఈ. స్త్రీ. సర్పాక్షి?.
గంధపిండీతకము. సం. వి. అ. పుం. వెలికి?.
గంధఫలి. సం. వి. ఈ. స్త్రీ. 1. ప్రేంకణము?; 2. సంపెఁగమొగ్గ. (రూ. గండఫలి.)
గంధమాదనము. సం. వి. అ. పుం. 1. ఒకానొక కొండ; 2. ఒకానొక కోఁతి; 3. మగతుమ్మెద; 4. మదపుటేనుఁగు.
గంధము. సం. వి. అ. పుం. 1. వాసన; 2. గంధకము; 3. గర్వము; 4. లేశము; 5. సంబంధము.
గంధమూలము. సం. వి. అ. పుం. 1. అడవికచోరము?; 2. కొండబెండ?.
గంధమూలి. సం. వి. ఈ. స్త్రీ. గంట్లకచోరము?.
గంధమూషి. సం. వి. ఈ. స్త్రీ. చుంచు, చుచుందరి.
గంధమృగము. సం. వి. అ. పుం. పునుఁగుపిల్లి.
గంధరసము. సం. వి. అ. పుం. బోళము, గోపము.
గంధరాజము. సం. వి. అ. పుం. ఒకానొక గంధద్రవ్యము?.
గంధర్వము. సం. వి. అ. పుం. 1. మృగవిశేషము; 2. గుఱ్ఱము; 3. అంతరపిశాచము; 4. మగకోయిల.
గంధర్వహస్తకము. సం. వి. అ. పుం. ఆముదపుచెట్టు.
గంధర్వుఁడు. సం. వి. అ. పుం. 1. దేవయోనివిశేషము; 2. పాటపాడువాఁడు.
గంధవతి. సం. వి. ఈ. స్త్రీ. 1. కల్లు; 2. వ్యాసుని తల్లి; 3. నేల; 4. ఒకానొక పట్టణము.
గంధవహ. సం. వి. ఆ. స్త్రీ. నాసిక, ముక్కు.
గంధవహుఁడు. సం. వి. అ. పుం. వాయువు, గాలి, (రూ. గంధవాహుఁడు.)
గంధసారము. సం. వి. అ. పుం. చందనము, గందము.
గంధాఖువు. సం. వి. ఉ. పుం. గంధమూషి, చుంచు.
గంధాశ్మము. సం. వి. న్. పుం. గంధకము.

గంధిక. సం. వి. ఆ. స్త్రీ.—పై.—
గంధిని. సం. వి. ఈ. స్త్రీ. మురయనెడిగంధద్రవ్యము?.
గంధిలము. సం. వి. అ. పుం. పెద్దజాతినక్క, నలుడు. విశే. వాసనగలది.
గంధోత్తమ. సం. వి. ఆ. స్త్రీ. మద్యము, కల్లు.
గంప. దే. వి. వెదురుబద్దలులోనగువానితో నల్లినది, కండోలము.
గంపపులుఁగు. దే. వి. కుక్కుభము.
గంబుర. వై. వి. కర్పూరము. "ఉ. కారుమెఱుంగు రాచిలుకకస్తురివీణపదాఱువన్నెబం, గారమురస్తుకుప్పెతెలిగంబురవెన్నెలమేటితేటయొయ్యారపుటెంకియందములకన్నిటికిం దగుపట్టుగొమ్మ సిం, గారపుదొంతియైనకులకాంతనయోరాయెడఁ బాయనేర్తునే." శుక. ౧. ఆ. (రూ. గంబురము.)
గంబురా. వై. వి.—పై.— "స. గంబురామించుఁ గదంబించికొందఱుకలికికన్నియలుబాగాలొసంగ." భాను. ౨. ఆ.
గంబూర. వై. వి.—పై.— "క. గంబూరకులికియనురా, గంబూరమనంబుచల్లఁగాఁబన్నీటన్, బింబోష్ఠియతనిపాదా, బ్జంబుంగడిగించెఁగూర్మి సకియలచేతన్." సా. ౨. ఆ. (రూ. గంబూరము. "సీ. తావిగంబూరంపుదీవినీమొగమెక్కపలుకింతనాపయిఁజిలుకరాదె." వసు. ౬. ఆ.)
గంభారి. సం. వి. ఈ. స్త్రీ. గుమ్ముడు?.
గంభీరము. సం. విశే. (అ. ఆ. అ.) లోఁతుగలది.
గంభీరవేది. సం. వి. న్. పుం. తోలుదోఁగునట్లును నెత్తురుకాఱునట్లును కండయూడునట్లును బరిగోలలతోడను అంకుశములతోడను పొడిచి యెంతబాధపెట్టినను ఒళ్లెఱుఁగకుండునట్టి మదపుటేనుఁగు.
గంభీరిమ. సం. వి. న్. పుం. గంభీరభావము.
గగనము. ఉభ. వై. విశే. దుర్లభము*. "సీ. గగనఘంటాపథక్రమణశీలునకెంత గగన మయ్యె లతాంగికౌనుచదలు." వసు. 3, ఆ. — సం. వి. అ. న. ఆకాశము.
గగురు. దే. వి. భయహర్షాదులచేత మేనివెండ్రుకలు నిక్కపొడుచుట, రోమాంచము.
గగురుపాటు. ద్వ. వి. రోమాంచముకలుగుట.
గగురుపు. దే. వి. రోమాంచము. (రూ. గగుర్పు. "గగుర్పుకూర్పు." చంద్ర.)
గగురుపొడుచే. దే. అ. క్రి. రోమాంచితమగు.

గగురుపొడుపు. దే. వి. గగురుపాటు. (రూ. గగుర్పొడుపు. "సీ. మొగలిపూఁబొదలుపోమునఁ జేర్చుచీరగాఁబూరిమోసులుగగుర్పొడుపుగాఁగ." అచ్చ. కిష్కిం, కాం.)

గగ్గు. యు. దే. అ. క్రి. సంకోచించు. వై. వి. సంతోషాదులచేతఁగలిగెడుగొంతడుపు, గద్గదిక. "సీ. గగ్గునా వెలయుగద్గదిక." అం, భా. ప్ర. శ.

గగ్గురు. దే. వి. గగురుయొక్క రూపాంతరము.

గగ్గులకాడు. దే. వి. ధాన్యమురాల్చిన కంకులసమూహము. "క. సిగ్గువడివిరియఁబాఱిరి, బగ్గనఁబొరివుచ్చువీరభద్రునిధాటికి, నుగ్గులయియువురుసవురయి,గగ్గులకాడైవికావికలయియమర్త్యుల్." కాశీ. ౭, ఆ. (ఇత్యాది ప్రయోగములయందు గగ్గులకాడై అనఁగా గగ్గులకాటివంటిదైయనుట. నిస్సారమై అని యర్థము.)

గగ్గులు. దే. వి. బ. గింజలురాల్చిన కంకులు. (గగ్గులు జల్లలోపోసి తీసికొనిరా.)

గగ్గెర. దే. వి. ఒకానొకచెట్టు. (ఇది తెల్లగగ్గెర, నల్లగగ్గెర అని ద్వివిధము.)

గగ్గోలు. దే. వి. కలఁత, క్షోభము. "గీ. అపుడుకొందఱుమృగయులయ్యడవిదూఱి, ఘోరముగఁ జెల్లకడలుగగ్గోలుగాఁగఁ,గూఁతలిడిసొంపుటయు మృగకులముకలఁగి. బయలు వెడలినఁగాంచియ ప్పార్థివుండు." రసి. ౧, ఆ.

గగ్గోలుపడు. ద్వి. అ. క్రి. (గగ్గోలు+పడు.) కలఁగు, క్షోభించు. "ద్వి. ఏనొక్కరుండనన్నిటఁదోడొకరిఁ, గానకబెగడినల్లడలుచూచుచును, బడలుచుగగ్గోలువడిపోరటిలుచు." విష్ణు.పూ.౩,ఆ.

గచ్చ. దే. వి. గ్రచ్చకు మొదటిరూపము.

గచ్చు. యు. దే. వి. 1. కాంతి; "క్రాలెడు పచ్చపట్టు నునుగచ్చులక్రొమ్మెఱుఁగైచలింప." హరి. పూ. ౬, ఆ.—2. పూఁత; "చ. ఇలఁగలవస్తుసంతతులకెల్లను గచ్చిడుమశ్వభావహా, టలరుచియింకవేఱయొకడాలిఁకవచ్చునెలక్క నీటమమ్ములమిన." ఆము. ౫, ఆ.—3. గారపూఁత. "పసిఁడిగచ్చరఁగు." ఆము. ౪, ఆ.—వై. విణ. వర్ణలోపముగాని పదలోపముగాని కలిగినది. (మాట.) "సీ.గచ్చుకొదుకునాఁగ గ్రస్తాఖ్యవిలసిల్లు."అం, భా. ప్ర. వాగ్వి.

గచ్చుకొను. దే. స. క్రి. పట్టుకొను. "క. ఉచ్చైశ్శ్రవమగు తనపై, విచ్చలవిడిసెక్కురౌతు వృద్ధశ్రవుఁడై, హెచ్చెననివేల్పుతేజిం,గచ్చుకొనిహసించులీలఁగల్గుహయంబుల్." చమ. ౧, ఆ.

గచ్చులాఁడి. దే. వి. (గచ్చులు + ఆఁడి.) బయటికి రోగ్యురాలివలె నటించునట్టి ఆఁడుది.

గచ్చువిచ్చగు. దే. అ. క్రి. (గచ్చువిచ్చు+అగు.) (కార్య) వైకల్యమగు. "గీ. అటుమూఁడయ్యెఁ గచ్చువిచ్చయ్యెననఁగ, బెడసె బుసివోయెననఁగ నుకెడియెననఁగ, నాఖ్యలగు కార్యవైకల్యమయ్యె ననుటకు." అం, శే.

గజకర్ణము. సం. వి. అ. పుం. ఏనుఁగు చెవివంటి యొకదినుసు విసనకఱ్ఱ.

గజత. సం. వి. ఆ. స్త్రీ. గజసమూహము.

గజదంతము. సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము.

గజనిమీలనము. సం. వి. అ. న. కపటము.

గజభక్ష్య. సం. వి. ఆ. స్త్రీ. అందుగు?.

గజము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగు; (గజజాతులుమూఁడు. భద్రము, మందము, మృగము అని. త్రివిధగజములకును మానభేదముచే అరాళము, అత్యరాళము, మధ్యము, కనిష్ఠము, వామనము అని నామములుగలవు. మఱియు పిష్టకము, వ్యాళము, పూతనము, మాతృకము, మాయికము పంచమంగళము అని గజభేదములనేకములు క?వు. గజముయొక్క శిరఃపిండములు కుంభములు. కుంభములక్రిందిచోటు ఆరత్నము. వానినడిమిచోటు విదువు. చెక్కిలి కటము. నొసలు అవగ్రహము. కనుగ్రుడ్డు ఈషిక. కడగంటిచోటు నిర్యాణము. కర్ణమూలము చూళిక. దంతమూలము కరీరిక. దంతమధ్యము శంఖము. అడ్డముగా విఱఁబడినకొమ్ముదెబ్బపరిణామము. నొసటిబుడిపి వాతకుంభము. వాతకుంభముక్రిందిచోటువాహిత్థము. వాహిత్థముక్రిందికొమ్ములలోపలిచోటు ప్రతిమానము. తొండము శుండ. తొండముచివరకర్ణిక. తొండమున వచ్చు తుంపురులు వమథువు. ముఖమునందలి బొట్లగుంపు పద్మకము. మూఁపు ఆసనము. మోఁకాలు ప్రోహము. మోఁకాలిక్రిందిచోటు సందానము. పిక్కకుముందటిచోటు అయస్కారము. ప్రక్కచోటు పక్షభాగము. ముందటిచోటు దంతభాగము. ముందటికాళ్లపిక్కలు మొదలుగాఁగలచోటు గాత్రము. వెనుకటికాళ్లపిక్కలు మొదలుగాఁగలచోటు అపరము. మెడనుగట్టెడు గొలుసు కలాపకము.

కాళ్లఁగట్టెడుగొలుసుత్రిపది. నడుమునఁగట్టెడు మోకువరత్ర. దీనిని ఆయితముసేయునపుడు మెడనుగట్టెడుత్రాడు సజ్జన. వీఁపుమీఁదఁబఱచు కంబళిము విధానము. గంతకారి. ఇదినీళ్లమునుఁగుట నిర్వాణము. దీని అలంకారము శృంగారము. దీనిఁ బట్టుటకుత్రవ్వెడుపల్లము అవపాతము. దీనికిఁ గలిగెడు పిత్తజ్వరము పాకలము. మదము దానాది. దానాదులు. ౘ. చూ. మదము.)–2. మూఁడడుగులకొలఁది; 3. వాస్తుస్థానవిశేషము.

గజయాన. సం. వి. ఆ. స్త్రీ. 1. ఏనుఁగునడవంటినడగల ఆఁడుది; 2. ఆఁడుది. (ఇట్లు ఇభయాన. మొ.)

గజరిపువు. సం వి. ఉ. పుం. సింహము, ఏనుఁగుగొంగ.

గజాననుఁడు. సం. వి. అ. పుం. వినాయకుఁడు, ఏనుఁగుమోముసామి.

గజిబిజి. దే. వి. 1. కలఁత; "క. గజదైత్యుఁడివ్విధంబున. గజిబిజిసేయంగఁగాశికానగరమునఁ, బ్రజనిత భయకంపమునఁ, బ్రజతామరసాకుసీళ్ల భంగిఁ నలంకెఁ." కాశీ. ౬, ఆ.—2. నలఁగుడు; "సీ. రాజితబహువిధరథసమూహముఁజొచ్చిగజిబిజియగునట్లుకలఁచికలఁచి." భార. విరా. ౫, ఆ. —3. సందడి. "వ. అయ్యవసరంబునఁగలా పూర్ణుండుతదాగమనంబునకెదురుచూచుచుండివారిగజిబిజికొంత చేరువనువినంబడిన." కళా. ౭, ఆ. —విశ. 1. కలఁగినది; 2. నలఁగినది.

గజిబిజించు. దే. అ. క్రి. కలఁగు. "వ. అట్టిరయొడఁ బదీయుసైన్యంబు గజిబిజించిన." ఉ, హరి. 3, ఆ.

గజ్జి. వై. వి. తీఁటకుఱుపు, కచ్ఛువు.

గజ్జియ. దే. వి. గజ్జె.

గజ్జె. దే. వి. కింకిణి. (గజ్జియయొక్క రూపాంతరము.)

గజ్జెగొలుసు. ద్వ. వి. స్త్రీపాదాభరణవిశేషము, పాఁజేబులు.

గజె. వై. విశ. పెద్ద*. (ఉదా. గజనిమ్మ.)

గజెగజె. దే. వి. వడఁకుటయందగుననుకరణము. "గీ. వానఁదడియుచుగజగజవడఁకుచున్న, సుతసతీమానిపుత్రులఁజూచివగచి." హరిశ్చ. 3, ఆ.

గజనిమ్మ. ద్వ. వి. లకుచము?.

గజేము. దే. వి. తుపాకికి మందుగట్టించెడి యినుపసలాక.

గజ్జె. దే. వి. తొడసందు, వంక్షణము.

గజ్జా. వై. వి. మదము*. "ఎ, గీ. కాలకంధరవాహంబుగజ్జాకేఁగ." పాండు. ౪, ఆ.

గజ్జూరము. వై. వి. ఖర్జూరము?.

గటక. దే. వి. పిండితోఁజేసినజావ.

గట్ట. వై. వి. సిద్దసోటికివేసిగట్టించెడు బిరడ.

గట్టన. వై. వి. గట్టించుట. (గులకపోసి గట్టనచేసినాఁడు.)

గట్టి. దే. విశ. 1. కఠినము; 2. దృఢము; 3. ఉచ్చైస్స్వరనాదముకలది. (వాఁడు గట్టిమాటాడఁడు.)

గట్టించు. వై. స. క్రి. గట్టనచేయు.

గట్టినబోది. దే. వి. బాలక్రీడావిశేషము. "సీ. చిడుగుడువ్వలపోటిచెండుగట్టినబోదియల్లియుప్పనఁబట్టెయప్పళాలు." కాళ. 3, ఆ.

గట్టివ. ద్వ. విశ. (గట్టి + వా.) ధూర్తుఁడు. "ఉ. గట్టివచేఁతలుం బసలుఁగల్లఁదనంబులు నీవుపుట్టఁగాఁ, బుట్టినవెందులేని పలుఁబోకల మాయలునీకు వెన్నతోఁ, బెట్టినవాటెతింగియును బేలతనంబుననిన్నునమ్మినా, గుట్టును దేబముల్ మిగులఁగోల్పడిపోయితి నేమిసేయుదుఁ." పా. ౧, ఆ.

గట్టివా. ద్వ. విశ. 1. గట్టిగ మాటలాఁడువాఁడు, గట్టిగమాటలాఁడునది; "తే. తవిలిపలుమఱుఁజెవులుచీఁదఱగొనంగ, బిట్టుమొరసెదు వసత్రాగినట్టులిట్టు, గట్టివాజోడలెట్టుగాఁ బట్టువడిరి, బెట్టుగానిన్ను వెసఁజెఱఁబట్టియిడను." నీలా. 3, ఆ.—2. ధూర్తుఁడు, ధూర్తురాలు. "గట్టివాయుక్తి." ఉ, రా. 3, ఆ. (గట్టివకు మొదటిరూపము.)

గట్టివాఁడు. దే. విశ. సమర్థుఁడు. (మహాత్మ్యమహాదర్థకరూపము గట్టిది.)

గట్టివాయి. ద్వ. విశ. గయ్యాళి, ధూర్తురాలు.

గట్టు. వై. వి. 1. తీరము; 2. కొండ.*

గట్టుఁద్రిమ్మరి. ద్వ. వి. (గట్టు + త్రిమ్మరి.) కోఁతి, అగచరము. "అగ్గట్టుంద్రిమ్మరిమొనకానిఁబట్టితెచ్చెద." అచ్చ. సుం, కాం. (ఇట్లు తిప్పత్రిమ్మరి, మలత్రిమ్మరి. మొ.)

గట్టుతాలుపు. ద్వ. వి. విష్ణువు, నగధరుఁడు.

గట్టుదాయ. వై. వి. ఇంద్రుఁడు, నగవైరి.

గట్టువాలు. ద్వ. వి. సైరంధ్రి. (పర్వతమువలెఁ బ్రవర్తించునది—అనఁగా పురుషసాంగత్యముఁగోరక ధైర్యముతో నుండునదియని వ్యుత్పత్త్యర్థము.)

గట్టురాచూలి. ద్వ. వి. పార్వతి, గిరిజ.

గట్టులఱేఁడు. ద్వ. వి. హిమవంతుఁడు, నగాధిపుఁడు. (ఇట్లు గట్టులరాయఁడు, గట్లరాయఁడు. మొ.)

**గట్టువాలు.** దే. వి. విచ్చలవిడియై యొకరియిండ్ల నుండి శృంగారించుటలోనగు పనులుచేయునట్టి ఆఁడుది. "మ. రాజిలమిఁకఁ దెచ్చిన గట్టువాలిది యనఁ హృద్యక్రియావిద్యఁజే, కలనైయుండుదు." హరి. పూ. ౯, ఆ.

**గట్టువిలుకాఁడు.** ద్వ. వి. శివుఁడు, శైలధన్వుఁడు. (ఇట్లు గుబ్బలివిలుకాఁడు. మొ.)

**గట్టువిలుతుఁడు.** ద్వ. వి.——పై.——(ఇట్లు మలవిలుతుఁడు. మొ.)

**గట్రాచూలి.** ద్వ. వి. గట్టురాచూలియొక్క రూపాంతరము. "శా. ఎట్రాశేషుఁడుపోతరించిసభలో నెగ్గాడెసారత్నమీఁ, దట్రావాసుకితక్షకాది ధృతరాష్ట్రామాత్యకర్కోటకుల్, చుట్రానిల్తురుగాక నన్ను సమరక్షోణిఁ విజృంభించియా. గట్రాచూలి విభుండెదిర్చిన నహంకారంబు వారించెదఁ." జై. ౭, ఆ.

**గడ.** వై. వి. 1. నిడుపాటికోల; (ఏతపుగడ, చెఱకుగడ, వెదురుగడ, దొమ్మరిగడ. మొ)—2. సమూహము; "సీ. మక్కువఁదేఁకువదక్కలోఁదవిలియాడెడుచక్రవాకపుగడలతోడ." నిర్వ. ౮, ఆ. —3. ఓడకంబము*; "క. గడకట్టినయోడపగిది, నడయాడుఁగ్రియాభియుక్తుఁడటన్నిష్క్రియుఁడై, యొడిసెలకాయిపడినకయి, వడిఁదత్వముఁ గలయుబంధునర్గముతోడఁ." శివ. ౨, ఆ.—4. కంబము*. "సీ. పరిభూతబిసపద్మభాతులుచేతులు కదళికాయుగళంబుగడలుతొడలు." (ఇక్కడ గడయనఁగా అరఁటిచెట్టుయొక్క అడుగుభాగము.) రా. సుం, కాం.

**గడగడ.** దే. వి. వణఁకుటయందగుననుకరణము.

**గడగడలాడు.** దే. అ. క్రి. (గడగడలు+ఆడు.) వడఁకు. (వాఁడు నన్నుచూచిన గడగడలాడును.)

**గడచీల.** ద్వ. వి. ఏతపుబానయందమర్చియుండెడుదండెపుఁబీఁటలుతగుల్చుటకు గడతలనుండెడు చీల.

**గడన.** వై. వి. 1. ఎన్నిక; "సీ. దట్టించిగంధమాదనముఁదేఁడనికానిఘనసారపాళికిగడనలేదు." (కడమలేదుఅనిపాఠాంతరము.) జై. ౫, ఆ.—2. స్తోత్రము; "గీ. అనినరాద్రరసము మనమున నడరంగఁ, బడగరొత్తునురగ పాలురేఖ, సెనయఁజేతి సారెఁగొనిత్రేసెఁబతిపేడి, గడనయుడుగుమన్ననుడుగవచ్చు." భార. విరా. ౫, ఆ.—3. సంపాదనము*. "క. గడనగలమగనిఁజూచిన, నడుగడుగుకుమడుఁగులిడుదురతివలుతమలో."

**గడనకత్తె.** వై. వి. భోగముది, వేశ్య.

**గడనపడఁతి.** ద్వ. వి.——పై.——

**గడప.** దే. వి. వాకిటి క్రిందిభాగము, దేహళి. (చూ. కడప.)

**గడబడ, గడిబిడి.** గ్రా. వి. అల్లరి, అతిలోఁదర.

**గడము.** ఉభ. దే. వి. కుండలోనగువాని మూఁత. "ఎ, గీ. గడియనగడంబు, నాఁగనుఘటాదికపిధానమాగిరీశ." ఆం, భా. ప్ర. ది.—సం. అ. పుం. 1. కండచేఁప; 2. విఘ్నము.

**గడవంచె, గడమంచె.** హిం. వి. మూఁటలక్రిందనుంచునది.

**గడసాదన.** వై. వి. సాము, వ్యాయామము.

**గడసె.** దే. వి. అటుక. (అప్ర.)

**గడి.** దే. వి. ఎల్ల, సీమము. "క. పరఁగునుసీమావాహిని, విరజయనఁగనచటనొకటివిమలామృతనిర్భరపూర్ణయగుచునదిగడి, పరమపదమునకుభవప్రపంచంబునకుఁ." పర. ౧, ఆ.

**గడించు.** వై. స. క్రి. 1. సంపాదించు; (గడియించు అనియు.) 2. కల్పించు. "కామినియందిపుడేమి గాంచియీకిటుకుగడించిపల్కెదు." కళా. ౫, ఆ.

**గడికాళ్లువేయు.** దే. స. క్రి. (రెండు రెండు పశువులను) ఒక్కొక్కకాలుచేర్చి లంకెవేయు. (ఆవులను పొలములో గడికాళ్లు వేసిరా.)

**గడితపడు.** వై. అ. క్రి. (గడితము+పడు.) గట్టిపడు. "ఎ, గీ. వలరాచమేపుడుకంటివేల్పు, జడలలోనుండివడియుచుగడితపడిన, తేటవేలుపుచేటిపన్నీటిబొట్టు, లనఁగఁజుక్కలుకనుపట్టెనలరుఁదలివి." య. ౨, ఆ.

**గడితము.** వై. వి. 1. తఱచు; "క. మిడుతలగడితముఁదోలుకరి, పిడుగులబెడిదంబుఁజెలునపిండులవడియుఁ, జడివాన పెల్లునడరఁగఁ, గడుసడరఁగఁజేసెఁగ్రోఁతిగమినత్తూవుల్." అచ్చ. యు. కాం.—2. ముదుగు. విశే. 1. తఱచైనది; 2. ముదుగైనది. "సీ. గడితంపు బెలుఁగుతోల్ కప్పినసొప్పారు బలుతేరువేయిమావులువహింప." హరి. ఉ. ౭, ఆ.

**గడిత్రాడు.** దే. వి. (రెండు రెండు పశువులను) ఒక్కొక్కకాలుచేర్చి లంకెవేసెడుపలుపు.

గడితేఱు. దే. అ. క్రి. (గడి+తేఱు.) సమర్థుఁడగు. (వాఁడు అన్నిట గడిదేఱినాఁడు.)

గడిదొంగ. దే. వి. ఒళవెఱిఁగినదొంగ.

గడిపోతు. దే. విణ. ఆఁబోతు.

గడియ. వై. వి. 1. ఇరువదినాలుగు నిమిషములకాలము; 2. గడెమ్రాను.

గడియారము. వై. వి. కాలపరిమాణమును దెలుపునట్టి యొక యంత్రము. "ఆనలినాయుతాత్మగడియారమునందు." పా. ౨, ఆ.

గడు. దే. వి. దారువిశేషము. "సీ. ఖండంబు వెలయఁ జెక్కనగడుదారుభేదంబు." ఆం, భా. ద్వి. వ.

గడులుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కుబ్జుఁడు, మఱుగుజ్జు.

గడువు. ఉభ. దే. వి. నిర్ణయకాలము. సం. ఉ. పుం. కణఁతి.

గడుసరి. దే. విణ. (గడుసు+అరి.) 1. అసాధ్యుఁడు; 2. కఠినుఁడు; (స్వార్థమున అరి.) 3. ధైర్యముగలవాఁడు. "క. గడుసరియగుశశకమొయ్యఁగదియఁగఁబోవన్." పంచ. నా. ౧, ఆ.

గడుసు. దే. వి. 1. కాఠిన్యము; 2. ధైర్యము. (చూ. గడుసువడు.) విణ. 1. అసాధ్యము; 2. కఠినము.

గడుసువడు. ద్వ. అ. క్రి. (గడుసు+పడు.) ధీరుఁడగు. "క. వెడవెడదుర్వ్యవహారపు, నడవడిగడిదేఱి గురుజనముశిక్షింపన్, గడుసువడివిప్రతనయుఁడు, సడికోరిచివంగపరక చాటున్ మానెన్." పాండు. 3, ఆ.

గడె. వై. వి. గడియయొక్కరూపాంతరము.

గడెకారి. అర. వి. బల్లెముగలవాఁడు; పోకిరి.

గడ్డ. వై. వి. 1. దుంప; 2. వ్రణము; 3. మంటిపెల్ల*; "క. ఘనతరమగుహ్రీగౌరవ, మునమునిఁగినపాపమఖిలమునురూపుసెడున్, బెనుపునవగ్గలికఁ బొగడు, గనినపయోరాశిఁ బడ్డ గడ్డయుఁబోలెన్." భార. అను. ౨, ఆ.—4. ద్వీపము*. "ఘనసాగరభీకరవీచికా సముత్కరపరిఖాంతమైననదుగడ్డకువచ్చి." భో. ౫, ఆ.

గడ్డపలుగు. ద్వ. వి. గుంటకపలుఁగు. (చూ. గుంటక, పలుగు.)

గడ్డపాఱ. ద్వ. వి. నేలపెల్లగించెడుసాధనవిశేషము, ఖనిత్రము. "గీ. వాఁడుశల్యాసురుండనవసుధఁ బరఁగు, శల్యరూపత మనికిఁ దచ్ఛలలచయము, గడ్డపాఱలకైవడిఁగానుపించి, పేర్చుటఖనిత్రశల్యుఁడనుపేరుఁగలదు." కళా. ౭, ఆ.

గడ్డప్రొయ్యి. ద్వ. వి. గడ్డలుగా ఏర్పఱచినపొయ్యి. (చూ. ప్రొయ్యి.)

గడ్డము. వై. వి. 1. చిబుకము*; 2. శ్మశ్రువు*. "వ. అర్ధనారికావునం బురుషుండుగాఁడు. గడ్డంబుకలిగినకతంబున యోషగాదు." కాశీ. ౭, ఆ.

గడ్డి. దే. వి. కసవు, తృణము.

గడ్డిపాము. దే. వి. ఒకవిధమైన పాము.

గడ్డిపిట్ట. ద్వ. వి. పక్షివిశేషము. "సీ. పికిలిపిట్టలు గడ్డిపిట్టలు గోరలు బంగరుపిచ్చికల్ పసుపుముద్దలు." రసి. ౧, ఆ.

గడ్డిబొద్దు. దే. వి. చుట్టకుదురు.

గడ్డు. దే. విణ. 1. అసాధ్యము; 2. మిక్కిలి. (గడ్డుపనులు, గడ్డుఱుకు. మొ.)

గడ్డుకొను. దే. అ. క్రి. అతిశయించు. "వ. యాదఃపతిమేదురామృతంబుజిడ్డున గడ్డుకొనిన పూసాదిత్యుఁడదనంబున నుప్పతిల్లు త్రుళ్లిమెఱుంగులు." భీ. ౫, ఆ.

గణకుఁడు. సం. వి. అ. పుం. 1. జోస్యుఁడు; 2. కరణమువాఁడు. (మేదిన్యాదినిఘంటువులయందిది ఇకారమధ్యముగానున్నది.)

గణగణ. దే. వి. ఘంటాధ్వనియందగుననుకరణము. (గంట గణగణమ్రోఁగుచున్నది.)

గణన. సం. వి. ఆ. స్త్రీ. అ. న. ఎన్నిక.

గణనీయము. సం. విణ. (అ. ఆ. అ.) ఎంచఁదగినది.

గణపతి. సం. వి. అ. పుం. వినాయకుఁడు.

గణము. సం. వి. అ. పుం. 1. సమూహము; 2. ప్రమథులసమూహము; 3. సేనావిశేషము. (ఇరువదియేడురథములు అన్నియేనుఁగులు ఎనుబదియొక్కగుఱ్ఱము నూటముప్పదియేవురుకాల్వురును గలది.)

గణరాత్రము. సం. వి. అ. న. పెక్కురాత్రులసమూహము.

గణరూపము. సం. వి. అ. పుం. జిల్లేడు†.

గణహాసకము. సం. వి. అ. పుం. 1. నల్లకచోరము†; 2. బలురక్కసి†.

గణాధిపుఁడు. సం. వి. అ. పుం. 1. వినాయకుఁడు; 2. శివుఁడు.

గణి. సం. వి. ఇ. పుం. సాంగముగా వేదాధ్యయనము చేసినవాఁడు.

గణించు. సం. స. క్రి. 1. ఎంచు; 2. లక్ష్యపెట్టు.
గణిక. సం. వి. ఆ. స్త్రీ. 1. వేశ్య; 2. ఆడేనుఁగు; 3. అడవిమొల్లతీఁగె; 4. నెల్లి ?.
గణికారిక. సం. వి. ఆ. స్త్రీ. నెల్లి ?.
గణితము. సం. వి. అ. న. గణితశాస్త్రము, అంక విద్య. విశే. ఎంచఁబడినది.
గణితవ్యము. సం. విశే. (అ. ఆ. అ.) ఎంచఁదగినది.
గణిల్లు. దే. వి. ఎద్దు అంకెవేయుటలోనగు వానియందగు ధ్వన్యనుకరణము. "ఎ, గీ. గంధలోభాను బంధిపుష్పంధయముల, ఝుంకృతులచేఁ గణిల్లన యంకెలిడుచు, విషమశరుపేరజన్ని యవిడిచిరనఁ గఁ, గ్రొవ్వి చరియించుచున్నవీవృటఁగోడెగాడ్పు." కవిక. ౧, ఆ. (గంటలు గణిల్లని మ్రోఁగుచున్నవి. వాఁడు గణిల్లని మాటలాడుచున్నాఁడు.)
గణుతి. వై. వి. 1. ఎన్నిక; 2. స్తోత్రము*; 3. లక్ష్యము*. (చూ. గణుతించు.)
గణుతించు. వై. స. క్రి. 1. ఎంచు; "మీ తెచ్చినవస్తుకోటిగణుతింపఁగ్రుతార్థతఁబొందె." నిర్వ. ౭, ఆ.—2. స్తోత్రముచేయు*; 3. లక్ష్యము చేయు*. "దిగ్గనలేచిపోయె గణుతింపక." నిర్వ. 3, ఆ.
గణెము. దే. వి. వేషధారులు ధరించెడి లక్క సొమ్ము.
గణేయము. సం. విశే. (అ. ఆ. అ.) ఎంచఁదగినది.
గణ్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఎంచఁదగినవాఁడు.
గతపడు. మి. అ. క్రి. (గతము+పడు.) 1. కడచు; 2. చచ్చు. "ద్వి. హతశేషులగు రాక్షసావలిచెప్ప, గతపడ్డయమ్మహాకాయునిఁదలఁచి." రా. యు, కాం.
గతము. సం. వి. అ. న. పోక. విశే. 1. పోయినది; 2. తెలియఁబడినది.
గతి. సం. వి. ఇ. స్త్రీ. 1. పోక; (ధనగతులుమూడు—దానము, భోగము, నాశము.) 2. త్రోవ; 3. నారిపుంటికంటెత్రోవ; 4. తెలివి; 5. ఉపాయము; 6. బాల్యములోనగుదశ; 7. విధము. (ఈ యర్థమునకు తెనుఁగున వాడుక.)
గతించు. సం. అ. క్రి. 1. కడచు; 2. చచ్చు.
గతుకు. దే. స. క్రి. ఎంగిలితిను. "క. ప్రతిగృహము సొపుడుఁదిరుగుచు, నతిశయజన భుక్తశేషసూతురమతినై, గతుకుచు." బ్ర. ౨, ఆ.—వి. ఎంగిలితినుట.
గత్త. దే. వి. ఎరువు. (రూ. గత్తము.)
గత్తర. దే. వి. ఉపద్రవము. (వాఁడు చాల గత్తరపడ్డాఁడు.)
గత్తు. దే. వి. మూత్రగంధము.
గద. సం. వి. ఆ. స్త్రీ. గుదియ. అ. పుం. ము. తెవులు. డు. కృష్ణుని తమ్ముఁడు.
గదమాయించు. గ్రా. క్రి. గద్దించు.
గదాగ్రజుఁడు. సం. వి. అ. పుం. గదునియన్న, విష్ణువు.
గదాధరుఁడు. సం. వి. అ. పుం.—పై.—
గది. ఉభ. దే. వి. ఇంటిలోపలియఱ. సం. వి. న. పుం. గదనుధరించినవాఁడు, విష్ణువు. విశే. తెవులుగలవాఁడు.
గదుకు. దే. స. క్రి. ఎంగిలితిను. "చ. కదిసిన నోరువోయి యెరుకబ్బ పుదొంతులసత్పదార్థముల్, గదుకుచు సెట్టివారిఁబొడగన్న నుగుజ్జనిస్నేహసాఖ్యముల్, మదికినసహ్యమైకునకమార్గమునంజయించుచున్నదు, వ్వదకపుతెల్లమత్కవితఁదప్పులుపట్టకవింద్రుకావుతన్." వాసి. ౧, ఆ.—వి. ఎంగిలితినుట. (గతుకుయొక్క రూపాంతరము.)
గదుము. దే. స. క్రి. గద్దించు. "క. అని బహువిధములమకరాంకునినిరసించుచు వధూటికోపమిగుర్వన్, ఘనభీకరకరములచే, ఘనవేణింగదుముతుహినకరుఁగనుఁగొనుచున్." భాను. 3, ఆ.
గదుముకొను. దే. స. క్రి.—పై.—"క. మరుఁడార్చిపోకుపోకని, విరితూపులగదుముకొనుచు వెన్దఱుమంగా." య. ౫, ఆ. (స్వార్థమున కొను.)
గదురు. దే. వి. చెడుకంపు, దుర్గంధము. "చ. ముదమునసోమకాసురుఁడు మ్రుచ్చిలి యచ్చలమారఁగొన్నప్రాఁ, జదువులు తెచ్చితజ్జఠరసాంద్రతరాంత్రములంటికట్టుబ, ల్గదురుదొరంగఁగీర్తియనుగంగఁదొలంచివిధాతృవిస్ఫుర, ద్వదనసరోజగంధలలితంబులు చేసితిగాజగన్నిధీ." పాండు. ౨, ఆ.
గద్గదము. సం. విశే. (అ. ఆ. అ.) డగ్గుత్తికపడినది. (మాట.)
గద్గదస్వరము. సం. వి. అ. పుం. 1. ఎనుపోతు; 2. డగ్గుత్తికపడిన యెలుఁగు.
గద్గదిక. సం. వి. ఆ. స్త్రీ. డగ్గుత్తిక.
గద్ద. వై. వి. పక్షివిశేషము, గృధ్రము.
గద్దగోరు. వై. వి. చోరసాధనవిశేషము. "క. బలపుముఁగన్నపుఁగత్తియుఁ, దలముల్లునుజొక్కునీలిదట్టియుసుమఁజీ, మల క్రోలుగద్దగోరును, ములుబంతియుఁగత్తెరయును మొదలగువానిన్." పర. ౪, ఆ.

గద్దముక్కువాఁడు. ద్వి. విశే. (చూ.) ఖరణఖుఁడు.

గద్దఱి. దే. విశే. దిట్టతనముకలది. "తద్ద్రుహసీమప సింపనియ్యదిగద్దఱిగద్ద." ఉ, రా. ౭, ఆ.

గద్దఱికాఁడు. దే. విశే. దిట్టతనముకలవాఁడు. "ఉ. అద్దిరవీనిఠీవియు నొయారము దిట్టతనంబుఁజేవ యుఁ, దద్దయునబ్బురంబెదకుఁదార్కొనఁజేయఁ దొడంగెనిట్టిబల్, గద్దఱికాఁడువాఁడినిజగంబు లుగెల్చుటదేమివింత." అచ్చ. సుం, కాం. (స్వా ర్థమున కాఁడు.)

గద్దించు. దే. అ. క్రి. కోపమున అదలించు. "మ. వని తాచూచితెకొన్ని భూరుహములీవామేత్సణల్ వింతగాఁ, గనినన్నవ్విసఁధన్నుఁబైనుమిసినన్గ ద్దించినన్గూర్చిపా, డిన మూర్కొన్నను ముట్టి నన్సరసగోష్ఠింబల్కినన్గౌఁగిలిం, చిన నంతం తెఁ దినర్చుఁగేవలతపస్విశ్రేణిచందంబునన్." రా మా. ౧, ఆ.

గద్దియ. వై. వి. 1. ఉన్నతపీఠము; 2. సింహాసనము*. (చూ. గద్దె.)

గద్దువ. దే. వి. గడ్డము. "సీ. వెడలిగద్దువమోవపీడి యంబులుచేసి కాంతిఁ జెంపలు మోవగందమ లఁది." కవిక. ౪, ఆ.

గద్దె. వై. వి. 1. ఉన్నతపీఠము; 2. సింహాసనము*; "సీ. ఉచితంబులగు షోడశోపచారంబులు నాగద్దె కతిభక్తినాచరించి." విక్ర. ౨, ఆ. (గద్దియ యొక్క రూపాంతరము.)—3. వరహా; "సీ. పది వేలమొదవులుపదివేలగద్దెలపసిఁడియు నిమ్మహీ పతులకిమ్ము." భార. అర. 3, ఆ.—4. సోదె*.

గద్దెపాంకము. ద్వి. వి. పరువునకుఁదగినగౌరవంపు మాట. "సీ. కలవిలేనివికొన్ని కొలువునఁగూర్చుం డిగద్దెపాంకము చెప్పఁగలరుగాక." చంద్రా. 3. ఆ.

గద్యము. సం. వి. అ. న. వచనము. విశే. చెప్పఁదగినది.

గద్యాణము. సం. వి. అ. న. ఒక బంగారునాణెము, వరహా.

గనగన. దే. వి. 1. తపించుటయందగుధ్వన్యనుకరణ ము; "సీ. వేసవిగనగనవేఁగుచట్రాతిపైనగ్గినల్లడ మండనర్కుఁజూచి." సర్వ. 3, ఆ.—2. మండు టయందగుధ్వన్యనుకరణము. "క. అనుటయుహం సుఁడుగనగనఁగనలి." ఉ, హరి. ౪, ఆ. (కర్మ ధారయ సమాసమునందు దీనికి నిగాగమంబు వచ్చును. "గనగననినిప్పులు.")

గనప. దే. విశే. పెద్ద. "గీ. నెత్తురొండొండవెల్లువై నేలఁబెద్ద, కాలువలుగట్టిపాఱంగఁగడుఁదనర్చి. కావిసెలయేఱులుఁరలెడుగనపకొండ, కరణినొం దెబాణుఁడుబాహుకర్తనమున." హరి. ఉ. ౮, ఆ.

గనయము. దే. వి. 1. పోఁకముడి; "సీ. అనయుఁబుఁ దిన్నని యనువునగనయంబు ప్రిదులంగమెలఁగి చొక్కుదవఁజేయు." భార. స్త్రీ. ౨, ఆ.—2. విం టికొప్పు. "క. గొనయంబు నెక్కఁద్రొచిన గన యంబునకెక్కకున్నఁగ్రమ్మినతమకం, బునవిల్లు విడిచివేఱొక, యనిమిషభటుఁడనికి వెడలెనడిద ముఁగొనుచున్." పా. ౪, ఆ.

గని. వై. వి. 1. బంగారులోనగునవి పుట్టుచోటు; 2. బిలము*. "చ. అనవుడునిప్పరోత్తమము నందు మహాబిలమొప్పచుండుదా, నను గుహయొక్క టెప్పుడును నవ్యము గాఁగను పట్టునందులో, నను పమమైనగుండుగలదందును నేడుబిలంబులుండు న, గ్గనులఁజరించుఁ దుష్మెదలకైవడి నెప్పుడు వానిప్రాణముల్." మై. 3, ఆ.

గనిమ. దే. వి. మడికిఁజుట్టు నేర్పఱచిన చిన్నకట్ట.

గనియ. వై. వి. ఖండము*. "గీ. మేనిగనియలన్నియు సంధానకరణినదికి." రా. యు, కాం.

గనీబు. దే. వి. ఒఱ. "చ. కలకలనవ్వుచున్నృపశి ఖామణిహొన్నుగనీబులోనియి, ట్టలపుమెఱుం గుచాయలబెడంగుకటారిజరీనదూసి మం, త్రులు గనశూద్రుమస్తము కఱుక్కునఁద్రుంచె." ఉ, రా. ౭, ఆ.

గనుపు. దే. వి. వెదురుచెఱకులోనగువానియందడనే డనేర్పడియుండుముడి, పర్వము. (చూ. కనుపు.)

గనె. వై. వి. గనియయొక్క రూపాంతరము. "సీ. సమధురస్థూలదాడిమబీజములతోడఁ దనుపారు రసదాడి గనెలతోడ." ఆము. ౨, ఆ.

గన్నెరాకమ్ము. ద్వి. వి. (గన్నెరు+ఆకు+అమ్ము.) గన్నేరాకువంటి యలుఁగుగల బాణవిశేషము. "వ. అట్లుతాఁకిననతండుదొరలగన్నెరాకమ్ములఁ జీకాకుపఱచె." భార. భీష్మ. 3, ఆ.

గన్నెరు. దే. వి. గన్నేరుయొక్క రూపాంతరము.

గన్నేరు. దే. వి. కరవీరము*. (ఎఱ్ఱగన్నేరు, తెల్ల గన్నేరు, పచ్చగన్నేరు అని ఇది త్రివిధము.)

గపటిక. సం. వి. అ. స్త్రీ. వరిగపైరు.

గప్పాలు. హిం. వి. జంభాలు, అతిశయపుమాటలు.

గబీలు. దే. వి. మంటయందగు ధ్వన్యనుకరణము. (ఆ యడవి గబీలున మండుకొన్నది, కడుపులో గబీలుమనుచున్నది.)

గబ్బాటు. దే. వి. కలంత. విశే. వెలతక్కువైనది. (పసుపు, కంద, చేమ, గెనసు. పెండలము మొదలగువస్తువు.)

గబ్బి. వై. వి. గాంభీర్యమునుబట్టి కుక్కకియ్యఁబడిన పేరు. "చ. పులియఁడు బూచిగాఁడనురపోతులరా జనుమంతిగాఁడు చెం, గలువ సివంగి భైరవుఁడు కత్తెర సంపెఁగ వెండిగుండు మ, ల్లెలగుది వాయువేగి చిటిలింగఁడు సాళ్వఁడు నత్సనాభియే, కలములమిత్తి గబ్బి యనఁగాఁగలవాని గ్రహించి యుద్ధతిక్." స్వా. ౪, ఆ.—విశే. గర్వముగలవాఁడు. "రాచబిడ్డయైయుండి గబ్బితనం బెఱుంగఁడు." ఉ, హరి. ౫, ఆ.

గబ్బిడాయి. దే. వి. గబ్బిలము, తైలపాయిక.

గబ్బిలము. దే. వి.——వై.——

గబ్బిలాయి. దే. వి. గబ్బిడాయియొక్కరూపాంతరము.

గబ్బిలి. దే. వి. పిడికిలి. (గబ్బెఁడుకూరతే.)

గబ్బిస. దే. వి. ఒకానొక మూలిక.

గబ్బు. యు. దే. వి. దుర్గంధము. "సీ. పొలసినగబ్బు కంపులుసోడుముట్టెడు నీనల్లతిరునామ మెచట దొరక." శై. 3, ఆ.—వై. 1. గర్వము; "సీ. పచ్చిబంగారుకుప్పలు చేయఁగారాద గబ్బుమీఱినవీరిగుబ్బలందు." పాండు. ౧, ఆ.—2. మదము*.

గబ్బుచీఁకటి. దే. వి. గాఢాంధకారము.

గబ్బుచెంక మెకము. ద్వ. వి. ఏనుఁగు.

గబ్బులుఁగు. దే. వి. ఒకానొక శకునపుపక్షి, భాసంతము. "వ. కౌశికంబు డబ్బు గబ్బులుఁగు గాళికనుఁబెంటి పైఁడికంటి లోనగుతిర్యక్కులు భావిప్రయోజనసూచకంబులైయున్న యవి." ఆము. ౬, ఆ.

గభస్తి. సం. వి. ఇ. స్త్రీ. అగ్నిపెండ్లాము. పుం. 1. సూర్యకిరణము; 2. సూర్యుఁడు.

గభీరము. సం. విశే. (అ. ఆ. అ.) గంభీరముయొక్క రూపాంతరము.

గభీరిమ. సం. వి. న్. పుం. గంభీరిమయొక్క రూపాంతరము.

గభోలి. సం. వి. ఇ. స్త్రీ. ఒఱుగుదిండు, ప్రగ్రీవము.

గమకము. ఉభ. దే. వి. యత్నము. "గమకమునసెదుర." య. ౧, ఆ.—విశే. 1. అధికము; "వ. అతనిమీఁదితమకంబు గమకంబైపర్వ." య. ౫, ఆ.—2. మనోజ్ఞము. "ద్వి. అందులఁగడుసనిహారువుచిత్తరువు, లందంబుగాఁదీర్చిహరినీలకరుల, గమిగమిచినపటికంపుసింగముల, గమకమాసోపానగతుల నేర్పఱచి." రా, బాల, కాం.—సం. వి. అ. పుం. సంగీతశాస్త్రమునందు స్వరవిన్యాసభేదము. విశే. తోఁపఁజేయునది.

గమకించే. దే. అ. క్రి. యత్నించు. "ద్వి. చంద్రహాసంబెత్తిజానకిప్రేయ, నింద్రారిగమకింప." గా. సుం. కాం.

గమగమ. దే. వి. వాసనకొట్టుటయందగు ననుకరణము. "గమగమవలచు చొక్కపుజవాజి." స్వా. ౩, ఆ.

గమగమించే. దే. అ. క్రి. గమగమయని వాసనకొట్టు. "ఎ, గీ. కప్పురపువీడియపుతావి గమగమింప." శేష. ౪, ఆ.

గమనము. సం. వి. అ. న. 1. పోక; 2. ప్రయాణము; 3. తలఁపు. "ఉ. సంగరముంగరంబుగమనంబునభావనసేయరైరి." నై. 3, ఆ.

గమనించే. సం. అ. క్రి. 1. పోవు; 2. తలఁచు. "నింతువు నాదుకోర్కిగమనింతువు కేళికహర్నిశంబు." శశాం. ౪, ఆ.

గమనిక. ఉభ. దే. వి. విధము. "వ. ముఖ్యవరాహబుగమనికనున్న తత్క్షణంబై." భాగ. ౯, స్కం.—సం. ఆ. స్త్రీ. నడపు. "సీ. మంత్రవర్తనముఁదంత్ర, గమనికయునువివిధములైనదానవిధులు బహుశత్యాగములునులోక, సంస్తుతములయ్యె." భాగ. అశ్వ. ౪, ఆ.

గమము. సం. వి. అ. పుం. 1. పోక; 2. ప్రయాణము; 3. త్రోవ.

గమాయించే. దే. అ. క్రి. గమగమించు. "మ. పరిపాన్నంబులుఁబిండివంటలును సూపంబుల్ గమాయించుపం, డ్లరసంబుల్." అని. ౧, ఆ.

గమి. దే. వి. సమూహము. విశే. తెఱచు. "గమిమెఱుఁగులడరునారసమున." భార. కర్ణ. 3. ఆ.

గమించే. సం. అ. క్రి. పోవు. (గమియించుఅనియు.)

గమికత్తె. ద్వ. వి. అంతఃపురమునందు కావలియుండెడు ఆఁడుది. "క. గమికత్తెలతోనపుడా, క్రమమెఱిఁగింపంగవారుగ్రక్కునఁజేరి, ప్రమదప్రదమైయొప్పెడు, ప్రమదవనము చేరియపుడు ప్రమదంబెసఁగన్." శశాం. ౪, ఆ.

గమికాఁడు. దే. వి. 1. అధిపతి; "సీ. కయ్యానజక్కులగమికానిముక్కంటిఁగుతిల పెట్టుటలునీకతనఁగాదె." య. 3, ఆ.—2. సేనాధిపతి; "క. అక్కరణిఁబోరుటక్కరి రక్కసిగమికాండ్రము ఖ్ఖర్ మానిని శేఁ, డొక్కొక్కకఱకుటమ్మునఁ, జెక్కంగానీకతలలుసిదిమెక్ గినుకక్." అచ్చ. అర. కాం.—3. ముఖ్యజనుఁడు. "గీ. అనుఁడునందుఁ గమికాండ్రురతనిఁజూచి, దేవరకునిట్టియక్క అదిర్పఁగాక, యెన్నటికిమేమునీసొమ్ముఁదిన్నవార, మిందఱమునినితమమూఁకలెల్లఁజూపి." పర. ౫, ఆ.

గమికొను. దే. అ. క్రి. ప్రోగుపడు. "క. వేఱొకవిలుగొనినిమతుఁడు, తూఱఁగహరిమేన నాటెఁవొమ్మి సుమ్ముల్, మూఱనుబదింటఁబొదివెక్, గాత్రయుగామతిఁయుఁబఱపెగమిగొనఁదూపుల్." హరి. ఉ. ౧. ఆ.

గమ్మతు. హిం. వి. వేడుక.

గమ్ము. దే. వి. వాసనకొట్టుటయందగునసుకరణము. "ఎ. గీ. గమ్మనఁబిసాళివలపులుకుమ్మరించు, కమ్మజవ్వాదిఁదలయంటెఁగలికియొకతె." వసు. ౫, ఆ.

గమ్యము. సం. విణ. (అ. ఆ. అ.) పొందఁదగినది.

గయ. సం. వి. ఆ. స్త్రీ. తీర్థవిశేషము. అ. పుం. ము. పశువు. డు. ఒక చక్రవర్తి.

గయాళము. దే. వి. గయ్యాళముయొక్క రూపాంతరము.

గయాళి. దే. విణ. గయ్యాళియొక్క రూపాంతరము.

గయాళించు. దే. అ. క్రి. గయ్యాళించుయొక్క రూపాంతరము.

గయాళు. దే. వి. సేద్యముచేయుటకుఁ దగనిపొలము.

గయ్యాళము. దే. వి. ధిక్కారపుమాట.

గయ్యాళి. దే. విణ. (గయ్యాళము+ఇ.) ధిక్కరించి మాటాడునది.

గయ్యాళించు. దే. అ. క్రి. ధిక్కరించి మాటాడు. "క. నీవిచ్చో మెఱయితవయి, కాపరమునవలసినట్లుగయ్యాళింపం, గాఁవెఱచిపెద్దమొఱగా, నేఁ గినివారిఁదగిలియేలవచింతుఁ." కళా. 3, ఆ.

గర. దే. వి. గడ్డ, ముద్ద.

గరకట్టు. దే. అ. క్రి. గడ్డకట్టు. "క్రమ్మెడుశోణితంబుగరకట్టఁగ." జై. ౭, ఆ.

గరకొను. దే. అ. క్రి. గరకట్టు, గడ్డకట్టు.

గరగ. వై. వి. 1. చిన్నకుండ*; "ద్వి. వరుణుండుతనబల్మివర్జించివచ్చి, గరగకావడిమీఁఁగాఁగాచియుండు." రా. సుం, కాం.—2. నీళ్లుత్రాగుటలోనగువాని కుపయోగించెడు చిన్నపాత్రము. "గీ. గరగలొసఁగిన నరుఁడుభూసురులొనర్చు, నాచమనముఖకర్మంబులందుపష్ట, భాగఫలమొందు." భార. అను. ౨, ఆ.

గరగడ. దే. వి. (గరగ + గడ.) నూనెమొదలయినవి చిన్ననోరుగల పాత్రములలోఁ బోయుటకు అడుగున ఆఁదోఁకవలె క్రోవియమర్చి చేసిన విశాలముఖపాత్రవిశేషము.

గరగర. దే. విణ. నిర్దోషము, నిర్మలము. "గీ. ఏనువంటలవాఁడనైయానరేంద్రుఁ, గొలిచిగరగరగాఁగూడుఁగూరచిత్త, మునకువచ్చినయాచందమున నొనర్చి, నేర్చిమెలఁగుదుఁగరమువినీతిమెఱయ." భార. విరా. ౧, ఆ. (కర్మధారయ సమాసమునందు దీనికి నిగాగమంబువచ్చును. గరగరనినెఱికురులు. మొ.)

గరగరిక. దే. వి. 1. నైర్మల్యము; "సీ. రతిరయచ్ఛిన్నసూత్రమునఁజిక్కకముత్తెములురాలుగరగరికలువహింప." ఆము. ౧, ఆ.—2. అందము. "గీ. చెలువమెడతుఁటవిల్తునిచిందమరయ, నందునిరుగడవైచినకుందనంపు, సరులుపూఁబోఁడిచేతులుచాలనరయఁ, గాకయుండిన నీగరగరికగలదె." య. ర, ఆ.

గరజి. సం. వి. ఇ. పుం. ఒకకరణము. (చూ. కరణము.)

గరదుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) విషముపెట్టువాఁడు.

గరము. సం. వి. అ. పుం. 1. ఒకకరణము; (చూ. కరణము.) 2. కృత్రిమవిషము. "గరస్తుకృత్రికంవిషమ్." అ, పా. ప్ర. భో.

గరపడు. ద్వ. అ. క్రి. (గర+పడు.) గడ్డకట్టు. "సీ. కరఁగుటెన్నఁడులేకగరపడ్డయామంచు దెచ్చియున్నతముగాఁదీర్చిరొక్కొ." భో. ౭, ఆ.

గరళము. సం. వి. అ. న. 1. విషము; 2. కసవుప్రోగు; 3. కొలఁది.

గరాగరి. సం. వి. ఈ. స్త్రీ. డావరడంగి?, (రూ. ఖరాగరి.)

గరాసు. వై. విణ. దుష్టుఁడు*.

గరిఁటె. దే. వి. ఇనుముతోఁగాని యిత్తడితోఁగాని చేసిన తెడ్డు, (రూ. గంటె.)

గరిడి. వై. వి. 1. సాము; "గరిడిసాదనలవేడ్కం గొంతదడవు." కళా. ౭, ఆ. — 2. సాముకూటము*; "మనమొక్కగరిడిఁజేసినసామొకద." చంద్ర. (రూ. గరిడీ. "కెంపుటోడుబిల్లలగరిడీలు." వసు. ౮, ఆ.)—3. చోటు*; "ఎ, గీ. దక్షవాటి కసకలతీర్థములకిరవు, దక్షవాటికసకలవిద్యలకు గరిడి, దక్షవాటికవిభవంబులౌనకంబు, దక్షవాటికశివునియంతఃపురంబు." భీ. ౬, ఆ. — 4. సమీపము*. "సీ. ఆసవనక్షోణియందును సరసుల గరిడి నిష్టపురాణ పరిచితిఁ బ్రియ, మందడుసమయంబునన్." రాఘ. ౨, ఆ.

గరిడిముచ్చు. ద్వ. వి. మంచివానివలె దగ్గఱఁజేరియుండి సమయముచూచి దొంగిలించెడుదొంగ. "ఎ, గీ. సంయమియునాయకంజాచిజాంబవతియు, సత్యభామయుభోజాత్మజయునువారియు, గురువులుగగానకలలెల్ల గరిడిముచ్చు, దనముతో నేర్పితివిగదయనుచుఁబలికె." కళా. ౨, ఆ.

గరిడీయ. వై. వి. బుట్ట. "క. ఫలభారము దుర్భరమని, వెలఁదియచటనొక్కవృక్షవిటపంబునని, మ్ము లగరిడీయఁదగిలిచియు, జ్జ్వలపరశువుఁగొనుచు మృదులసంభ్రమలీలన్." భార. అర. ౭, ఆ.

గరిత. వై. వి. 1. ఇల్లాలు; 2. పతివ్రత*. "అతనిదేవేరి సీతమ్మకడఁదిగరితయయేని." అచ్చ. యు, కాం.

గరిమ. సం. వి. న్. పుం. గొప్పతనము, (రూ. గరిమము.)

గరిమిడికొక్కు. దే. వి. పందికొక్కు, మూషిక. "గీ. ఉడుముగరిమిడికొక్కుదండడియు." స్వా. ౮, ఆ.

గరివడియము. వై. వి. వటకవిశేషము.

గరివించు. వై. అ. క్రి. గర్వపడు. "నేర్చుగరివింప మెప్పింపనేర్చు." కవిక. 3, ఆ.

గరిష్ఠము. సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి గురువు.

గరిసె. వై. వి. 1. ధాన్యముంచెడుకొట్టు*. "గీ. భూమి నశ్రుతస్మృతదృష్టపూర్వమైన, బహుళసంపత్పరంపరపాదుకొనిన, గరిసెయనఁగోటయటమించగణనకెక్కు, నందుపయినుంచునిలువారమనదివంబు." చంద్రా. ౧, ఆ.—2. మానవిశేషము*.

గరిసెబావి. వై. వి. మెల్లెలతో గరిసెవలెనల్లి భూమిలోపలికి కుంచియొత్తెడు నూయి.

గరీబు. హిం. వి. బీదవాఁడు.

గరు. దే. వి. రోమాంచము. "గీ. మేనుగరుదాల్చెఁ జలివచ్చెమెడలుసొచ్చె." కాశీ. 3, ఆ.

గరుజు. హిం. వి. అక్కర, అగత్యము.

గరుటామంతుఁడు. వై. వి. గరుత్మంతుఁడు.

గరుటాలమంతుఁడు. వై. వి. గరుటామంతుఁడుయొక్కరూపాంతరము. "సీ. కంబమయ్యారొమ్ములు కలిగిననీకొక్కగరుటాలమంతునిఁగానుకిత్తు." య. ౨, ఆ.

గరుడకంబము. వై. వి. (గుడియందలి) గరుడస్తంభము. "సీ. గరుడుల గరుడకంబములనెకట్టి గంధర్వాల గంధర్వతతుల నడిచి." ఉ, రా. ౨, ఆ.

గరుడధ్వజుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు, వెన్నుఁడు.

గరుడపచ్చ. వై. వి. మరకతము. "సీ. గరుడపచ్చల చాయగలపచ్చ గందనికూరలుశైవలాంకురములయ్యె." నై. ౭, ఆ.

గరుడసరులు. వై. వి. బ. మేలయిన శాలిధాన్యవిశేషము.

గరుడాగ్రజుఁడు. సం. వి. అ. పుం. గరుత్మంతుని యన్న, అనూరుఁడు.

గరుడి. వై. వి. గరుత్మంతుఁడు. "క. పఱతెంచికట్టయఁబడిరే, ద్వైఱవ్రేసినమోమువాఁకిలిరిగొగరుడియు, త్తఱిహరిచక్రంబునఁబెఱ, మఱివైచెనుడనుజానుజుమస్తకముదొగన్." నిర్వ. 3, ఆ.

గరుడిరవుతు. వై. వి. విష్ణువు, గరుడవాహనుఁడు.

గరుడుఁడు. సం. వి. అ. పుం. గరుత్మంతుఁడు, గరుడి.

గరుత్తు. సం. వి. త్. పుం. పక్షము, ఱెక్క.

గరుత్మంతము. సం. వి. త్. పుం. పక్షి.

గరుత్మంతుఁడు. సం. వి. త్. పుం. గరుడుఁడు, గరుడి.

గరుపాటు. ద్వ. వి. గగురుపాటుపు. "చ. అనవినిగుండెఁజల్లనఁగనచ్చెరుపాటునుఱిచ్చపాటునె, క్కనగరుపాటునుంగదురఁ గొండొకసేపటు లూరకుండి." శశాం. 3, ఆ.

గరుపాటుమొన. ద్వ. వి. పందిమూతిముట్టె.

గరుపాఱు. దే. అ. క్రి. రోమాంచితమగు. "క. గరుపాఱిన మేనుసుడలఁకు మనముఱిచ్చవడినచూపునునై." భార. విరా. ౮, ఆ.

గరుము. వై. విశే. గులకఱాలచేత గట్టియైనది. (గరుపనేల.)

గరువము. వై. వి. 1. గర్వము; "గీ. పునుకతొల్పవిల్లుదుని మెఁదాటకఁజంపె, ఖరునిఁదేర్చె వాలిఁగడవఁబనిచెఁ, గల్లజింకఁద్రుంచెగండగొడ్డలితొల్పు, గరువమడఁచెనతనికడిమియసర." అచ్చ. యు, కాం.—2. గౌరవము; "చ. ఇంతయున్, వనితయొఱుంగవైతి గరువంపు విచారములేదునీ

యొడన్." భార. అర. ౬, ఆ.—3. విరివి*. "మ. గరువంబారఁగనీకునన్ని యునువక్కాణింపఁగా నేటికిక్." వి. పు. ౧, ఆ.

గరువు. యు. దే. వి. చెంప. "చ. గరువునకొత్తఁజెం గలునకు చ్చుఘటించినమాళిఁజుట్టెఁజెం, దిరికతె ఱంగునంబసిఁడితీఁగలునించినజిల్గుపాగ." స్వా. ౫,ఆ.—వై.విణ.గులకతాలచేఁగట్టియైనది.(నేల.) "వ. గరువు నేలలగుంటలూనరించి." స్వా. ౪, ఆ.

గరుసు. యు. దే. వి. 1. మర్యాద, మేర; "క. దురము నఁజుట్టతికంబును, గరుసిడికొను టేల కలుగుఁగా దైవనాథా." భార. ద్రో. ౫, ఆ. "గీ. ఏకభోగం బుగాఁగ నేలెఱు గరుసు, కడలిసీమంబుగాతమి గంగయవధి, కప్పురపుఁగ్రోవికాశ్మీరఖండమవధి, యేలెవిశ్వకుటుంబిభీమేశ్వరుండు." భీ. ౫, ఆ.— 2. తోలు. "సీ. దానదానమనుసీఁగతుట్టెలరూ పేరుపడకక్రంపలను వ్రేలెడుగరుసుల." ఆము. ౬. ఆ.— వై. విణ. గులకతాలచేత గట్టియైనది. (నేల.) "సీ. గరువు గరును నాఁగ ఖరభూమి విల సిల్లు." ఆం, భా. ద్వి. భూ.

గర్గరి. సం. వి. ఈ. స్త్రీ. పెరుగుచిలికెడుకుండ, తరి గడవ.

గర్జ. సం. వి. ఆ. స్త్రీ. 1. (మేఘములోనగువాని) ధ్వని; 2. సింహనాదము.

గర్జనము. సం. వి. అ. న. 1. (మేఘములోనగువాని) ధ్వని; 2. కోపము.

గర్జించు. సం. అ. క్రి. 1. (మేఘములోనగునవి) ధ్వనించు; 2. కోపించు.

గర్జితము. సం. వి. అ. న. (మేఘములోనగువాని) ధ్వని. పుం. మదపుటేనుఁగు.

గర్తము. సం. వి. అ. పుం. 1. పల్లము; 2. పిఱుఁదుల మీఁది గుంతలు; 3. త్రిగర్తదేశవిశేషము.

గర్తాటము. సం. వి. అ. పుం. 1. ఎలుక; 2. పందికొక్కు.

గర్దభము. సం. వి. అ. న. తెల్లగలువ. పుం. 1. గాడిద; 2. గంధవిశేషము.

గర్దభాండము. సం. వి. అ. పుం. కలజువ్వి*.

గర్ధనము. సం. విణ. (అ. ఆ. అ.) ఇచ్ఛగలది, గృధ్నువు.

గర్భకము. సం. వి. అ. న. వెండ్రుకలలోపల ముడు చుకొన్న పూదండ.

గర్భము. సం. వి. అ. పుం. 1. కడుపు; 2. కడుపు లోనిపిండము; (గర్భసంస్కారములు మూడు. ఆ ధానికము, పుంసవనము, సీమంతోన్నయనము.) 3. బిడ్డ; 4. ఒక నాటకసంధి. (చూ. సంధి.)

గర్భాగారము. సం. వి. అ. న. లోపలిగది, ఓవరి.

గర్భాశయము. సం. వి. అ. పుం. గర్భమును బుట్టుకొ నియుండెడు సంచి, మావి.

గర్భిణి. సం. వి. ఈ. స్త్రీ. చూలాలు, అంతర్వత్ని.

గర్ముత్తు. సం. వి. త్. న. తృణసస్యవిశేషము, గంటె.

గర్వము. సం. వి. అ. పుం. 1. అహంకారము; 2. మదము.

గర్వి. సం. విణ. (న్. ఈ. న్.) గర్వముగలవాఁడు.

గర్వించు. సం. అ. క్రి. గర్వపడు.

గర్వితుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) గర్వించినవాఁడు.

గర్హణము. సం. వి. అ. న. నింద, దూఱు.

గర్హించు. సం. స. క్రి. నిందించు, దూఱు.

గర్హితము. సం. విణ. (అ. ఆ. అ.) నిందింపఁబడినది.

గర్హ్యవాది. సం. విణ. (న్. ఈ. న్.) (చూ.) కద్వదుఁడు.

గర్హ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. అధముఁడు; 2. నిందింపఁదగినవాఁడు.

గలగల. దే. వి. ధ్వన్యనుకరణ. భక్ష్యములునమలుటయందగుధ్వన్యను కరణము. (పరుగులుఁగలగల నమలుచున్నాఁడు.)

గలగలలాడు. దే. అ. క్రి. (గలగలలు+ఆడు.) గలగలయని మ్రోఁగు.

గలగోలు. దే.వి.తక్కువ. "చ. తతిమిసుశర్మత మ్ములును దానును నాజికి నన్నుఁబిల్వనే, నెఱుఁగనియట్లు లుండు టిదియే పురుషార్థము వారిసెల్లనే, దైఱను ఱుమాడఁబంపుము కడిందిగఁజూడకు నీకునేమి యుం, గలగోలు గాదుపోమికడుఁగష్టమునాకును దాత్తమానసా." భార. ద్రో. ౧, ఆ.

గటి. వై. వి. 1. ఱెక్క; 2. బాణము ఱెక్క. "మ. విచక్రుండున, త్రతి నేసెక్ దెగనిండనారసము నక్ దైత్యారివక్షంబునక్, గటిదోఁపక్." ఉ. హరి. ౪, ఆ.

గటిక. దే. వి. ఒకదినుసు కసవు, దూర్వ.

గటికచెక్క. ద్వ. వి. పచ్చికతోడిమట్టిపెల్ల, పచ్చిక పెల్ల. (గటికమోడిచెక్క అనియు.)

గటికమ్మి. ద్వ. వి. (గఱుకు+కమ్మి.) గటిబద్ద. (సంధిని వర్ణలోప వర్ణవికారములు.)

గటికనూదులు. ద్వ. వి. బ. శాలిధాన్యవిశేషము.

గటిచిప్ప. ద్వ. వి. ముత్యపుఁజిప్ప.

గఱిబద్ద. ద్వ. వి. (గఱుకు+బద్ద.) గఱుకుతోడి తాటాకుబద్ద. (సంధిని వర్ణలోప వర్ణవికారములు.)

గఱుకు. దే. వి. కొడవలిలోనగువాని కక్కు. "గఱుకులకక్లింబు గాడ్డకేల."

గఱుగు. దే. వి. ఒకానొక చెట్టు.

గఱువ. వై. విణ. 1. పెద్ద; "గీ. చిఱుతవానికింతగఱువతనంబిదిసన్నె." భార. సభా. ౨. ఆ.— 2. గొప్పవాఁడు. "గఱువల్ చవిగానికథల్ వచింతురే." ప్రభా. 3. ఆ.

గఱ్ఱు. దే. వి. త్రేఁచుటయందగు ధ్వన్యనుకరణము. "ఎ, గీ. విషము మ్రింగిన పెన్నుద్దివేల్పు తేఁడు, మనసిజారాతి మ్రింగి గఱ్ఱనఁగఁ ద్రేఁచు." కాశీ. ౪, ఆ.

గఱ్ఱె. దే. వి. మత్స్యములఁబట్టెడు సాధనవిశేషము. (దీని ఆకారము తిఱ్ఱెవంటిది గాని యిది మిక్కిలి పెద్దది.)

గలఁతియ. వై. వి. గిండిచెంబు. "చ. అలికులవేణి నోర్తుఁగనిహస్తములన్ ముఖమజ్జనాంబువుల్, గలఁతియరొత్తిపోయనవి గార్చుచునుండెనతండు దోయిటన్." నై. ౬, ఆ.

గలగల. దే. వి. 1. కదలుటయందగు ధ్వన్యనుకరణము; "గీ. గలగల కటక కాననములు గ్రక్కదలఁగ." రామా. ౭, ఆ.— 2. భూషణములు మ్రోయుటయందగు ధ్వన్యనుకరణము. "గలగల మ్రోయు నందెలును." కళా. ౬, ఆ.

గలతరించు. దే. అ. క్రి. (మేను) జల్లుమను. (నాకు ఒళ్లంతయు గలతరించుచున్నది.)

గలబ. దే. వి. కలఁత. "ద్వి. క్రతుకర్మములకు విఘ్నములు గావించి, క్షితిమీఁద గలబలు చేయుఁ డెల్లెడల." భాగ. ౭, స్కం.

గలబరించు. దే. అ. క్రి. కలఁగు. (నాకు బుద్ధి గలబరించిపోయెను.)

గలబా, గల్బా. హిం. వి. కలఁత, తొఱుమాఱు.

గలిజెరు. దే. వి. గలిజేరుయొక్క రూపాంతరము.

గలిజేరు. దే. వి. పునర్నవ.

గలిబిలి. దే. వి. సందడి. (అక్కడ మిక్కిలి గలిబిలి గానున్నది.)

గలీబు. హిం. వి. తలఁగడ యొఱ.

గల్ల. దే. వి. 1. పొల్లు; 2. మాదిగవాఁడు తోలు నానవేసెడు చట్టి.

గల్లము. సం. వి. అ. పుం. చెక్కిలి.

గల్లు. దే. వి. భూషణములు మ్రోయుటయందగు ధ్వన్యనుకరణము. "గల్లుననందియల్ గదలఁగ." కళా. 3, ఆ. (ఆమ్రేడితమునందు గల్లు గల్లు, గల్లుగల్లు. "అందియ లంఘ్రుల గల్లుగల్లనన్." శృ. ౫, ఆ. "గాజులుగలుగల్లనన్." నీలా. ౧. ఆ.)

గవఁకు. దే. వి. గవనుయొక్క రూపాంతరము.

గవతము. దే. వి. కసవు. (చూ. కవను.)

గవను. దే. వి. దుర్గపురద్వారము, గోపురము.

గవయము. సం. వి. అ. పుం. గురుపోతు.

గవరన. వై. వి. ఎఱుపు. "సీ. కడుపుమండించునాఁకటిచిచ్చు సెకతాఁకి గవరనైయున్న కన్గవలవారు." నై. ౭. ఆ.

గవర్నమెంటు. ఆం. విణ. ప్రభుత్వసంబంధమైన.

గవర్నరు. ఆం. వి. దేశప్రభువు.

గవలము. సం. వి. అ. న. ఎనుపకొమ్ము. పుం. నల్లయెనుఁబోతు.

గవాక్షము. సం. వి. అ. పుం. న. కిటికీ. పుం. డు. ఒకానొక కోఁతి.

గవాక్షి. సం. వి. ఈ. స్త్రీ. 1. పిన్నపాపర; 2. [illegible]డమ.

గవాదని. సం. వి. ఈ. స్త్రీ. 1. పసులుమేయుక[illegible] కొఱను; 2. పెద్దపాపర.

గవి. ఉభ. దే. వి. 1. గుహ; "మ. గవిలో బెబ్బులి డాఁగి గుర్రు మెఱవంగాఁ గాంచి రాజేసె." స్వా. ౪, ఆ.— 2. పల్లము. "గాతముగవి యనఖాతము." ఆం, భా. ప్ర. పా.— సం. ఈ. స్త్రీ. ఆవు.

గవిలెము. దే. వి. గందములోఁ జాచికలిపెడు విత్తు.

గవీనము. సం. విణ. (అ. ఆ. అ.) అంతకుముందు ఆవులు మేసినది, ఉండినది. (చోటు.)

గవుండ్లవాఁడు. వై. వి. సారాయమ్మువాఁడు. కల్లు గీచువాఁడు. (అని కొందఱు.)

గవేధుక. సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. అడవిగోదుమలు, పట్టివడ్లు.

గవేధువు. సం. వి. ఉ. పుం, స్త్రీ.——పై.——

గవేషణ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆమంత్రణార్థము పిలుచుట; 2. వెదకుట.

గవేషించు. సం. స. క్రి. వెదకు, అరయు.

గవేషితము. సం. విణ. (అ. ఆ. అ.) అన్వేషితము. వెదకఁబడినది.

గవ్య. సం. వి. ఆ. స్త్రీ. ఆవులమంద. అ. న. ము. 1. అల్లెత్రాడు; 2. రాగద్రవ్యము. విణ. 1. ఆవు

పాలులోనగునది; 2. ఆవునకు హితమైనది. (పంచగవ్యములు. పాలు, పెరుగు, నెయ్యి, పంచితము, పేఁడ.)

గవ్యూతి. సం. వి. ఇ. స్త్రీ. రెండుకోసులకొలఁది.

గవ్వ. దే. వి. శంఖముదినుసు, కపర్దకము.

గవ్వచౌకము. ద్వ. వి. వెలిగారము. "మ. చరమాశానికసోపలాంచలములన్ సంధ్యాప్రకాశోదయం, బొరగావించివిరించిచేకొనినసూర్యుండన్ సదార్వన్నెబం, గరపుంబూదియకైవియద్విపణివేష్కన్ గాలమున్ బచ్చుచె, చ్చెరఁజల్లించినగవ్వచౌకమనమించెందారకాచక్రముల్." నై. ౭, ఆ.

గశికము. సం. వి. అ. పుం. గసి.

గస. దే. వి. ఉబ్బసము.

గసగసలు. వై. వి. బ. ఒకదినుసు విత్తులు*.

గసి. యు. దే. వి. మేకు. "సీ. పసులుగసులుప్రోఁగువాఱువెండ్రుకత్రాళ్లుబలువిండ్లునమ్ములుబల్లెములును." హరిశ్చ. ౨. ఆ.—వై. నేయిలోనగువానియందడుగుననిలిచిన మురికి.

గసిక. దే. వి. 1. త్రవ్వుటకనువుగా కొనచెక్కినకొయ్య; 2. శలాక; "ద్వి. మండుపల్కులఁజేరి మానవమాంస, ఖండంబులొండొండగసికలఁగ్రుచ్చి." హరిశ్చ. ౨, భా.—3. బాణము."ద్వి.అని వీడుకొలిపిన నమ్మాటవ్రాదయ, మునవాఁడిగసికయై మునుమిడిగాఁడ." విష్ణు. పూ. ౧, ఆ.

గసిబిసి. దే. వి. విశే. గజిబిజియొక్క రూపాంతరము. (కలఁగినదియనుటకు— "సీ. ముసలపాతంబులగసిబిసిగామొత్తిసునిశితోద్యత పరశువులనఱికి." రా. యు, కాం.)

గస్తీలు. దే. వి. బ. (గస్తు+ఈలు.) కావలివారు. (పైగస్తీలు వచ్చినారు.)

గస్తు. దే. వి. (రాత్రివేళ దొంగతనములోనగునవి జరగకుండుటకై కావలివారు)ఊరుతిరిగికాచుకావలి. "ద్వి. ఆలీలఁగొఱవిదయ్యంబులదివ్వె, కోలలవారిఁగాఁగొనిగస్తుతిరిగి." హరిశ్చ. ౨, భా.

గహనము. సం. వి. అ. న. 1. అడవి; 2. గుహ; 3. దుఃఖము. విశే. 1. ఎఱుఁగరానిది; 2. చొరరానిది.

గహారము. సం. వి. అ. న. పొయికిఁబెట్టెడుకట్టె.

గహ్వరము. సం. వి. అ. న. 1. అడవి; 2. గుహ; 3. వెపము. పుం. పొదరిల్లు.

గహ్వరి. సం. వి. ఈ. స్త్రీ. భూమి, నేల.

గళంతిక. సం. వి. ఆ. స్త్రీ. గిండిచెంబు.

గళకంబళము. సం. వి. అ. పుం. (చూ.) గంగడోలు.

గళకత్తెర. వై. వి. మల్లబంధవిశేషము. (చూ. కాసెనిల్కడ.)

గళగండము. సం. వి. అ. పుం. (చూ.) గండమాల.

గళగళ. దే. వి. చెప్పుటయందగు ధ్వన్యనుకరణము. "గీ.అతఁడుతొలునాఁడుచదివినయంతవట్టు,గళగళనిచెప్పెఁదండ్రియక్కజమునొంద." పర.౫,ఆ.

గళనము. సం. వి. అ. న. జాఱుట.

గళము. సం. వి. అ. పుం. 1. కుత్తుక; 2. సజ్జరసము.

గళశుండిక. సం. వి. ఆ. స్త్రీ. కొండనాలుక.

గళాంకురము. సం. వి. అ. పుం. అంగిటిముల్లు, కొండనాలుక. (అని కొందఱందురు.)

గళితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. జాఱినది; 2. తినఁబడినది.

గళ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. కంఠముల సమూహము; 2. పోటుగళముల సమూహము.

గల్ల. దే. వి. (చూ.) కల్ల.

గల్లెము. దే. వి. పాలమీఁగడవంటి లేఁతకొబ్బెర.

## గా.

గాంగము. సం. విశే. (అ. ఈ. అ.) గంగది.

గాంగుఁడు. సం. వి. అ. పుం. 1. భీష్ముఁడు; 2. కుమారస్వామి.

గాంగేయము. సం. వి. అ. న. బంగారు. పుం. ఒకానొక చేఁప.

గాంగేయుఁడు. సం. వి. అ. పుం. 1. భీష్ముఁడు; 2. కుమారస్వామి.

గాంగేరుకము. సం. వి. అ. పుం. బలుసు?.

గాంగేరుకి. సం. వి. ఈ. స్త్రీ. బీఱ?.

గాండివము. సం. వి. అ. పుం, న. 1. అర్జునుని విల్లు, 2. విల్లు. (రూ. గాండీవము.)

గాండ్రించు. దే. అ. క్రి. (ముఖము) ఉబ్బు.

గాండ్ల. దే. వి. నూనె అమ్మి జీవించెడుజాతి. (గాండ్లవాఁడు, గాండ్లది.)

గాంధర్వము. సం. వి. అ. న. పాట. పుం. 1. కన్యావరులు పరస్పరేచ్ఛచేతఁ జేసికొను వివాహము. (చూ. వివాహము.) 2. దినముయొక్క ఏడవభాగము. (చూ. దినము.)

గాంధర్వుఁడు. సం. వి. అ. పుం. గంధర్వుఁడు.

గాంధారము. సం. వి. అ. పుం. 1. ఒక స్వరము; (చూ. స్వరము.) 2. సిందూరము; 3. ఒకానొక దేశము.

గాంధారి. సం. వి. ఈ. స్త్రీ. 1. గంజాయి; 2. ధృతరాష్ట్రునిభార్య.

గాంభీర్యము. సం. వి. అ. న. గంభీరభావము.

గాఁజెర. దే. వి. ఒకానొక దుంప. "ఎ, గీ. అల్లముల్లి పసుపుముల్లంగివెల్లుల్లి, గాఁజరయును మొదలు గాఁగఁగలవు." హంస. ౪, ఆ.

గాఁడి. దే. వి. 1. తొలిచికాని త్రవ్వికాని నిడుపుగా నేర్పఱచిన సల్లము; (గాఁడిపలక. మొ.)—2. పసులునీరుత్రాగుటకుగాఁడియేర్పడరాతితోఁ గట్టినతొట్టి, నిపానము; 3. పసులఁగట్టుచోటఁ గసువువేయుటకుఁ బలకలులోనగువానితో గాఁడిగానేర్పఱచిన స్థానము. "ఎ, గీ. కామగవిఁగట్టనిదికదాగాఁడిపట్టు." ఉ, రా. ౪, ఆ.

గాఁడిప్రొయ్యి. దే. వి. గాఁడిత్రవ్వి యేర్పఱచిన పొయ్యి. (చూ. ప్రొయ్యి.)

గాడీ. హిం. వి. బండి.

గాఁడు. దే. వి. కామమదము.

గాగర. దే. వి. (స్త్రీలుకట్టుకొను) పావడ.

గాజె. వై. వి. ధాన్యముపోయుటకు మట్టియొఱలచే నేర్పఱచిన బొట్ట, కుసూలము*.

గాజోపరుఁజా. ద్వ. వి. పరుఁజాయొక్కరూపాంతరము. "సీ. ఖడ్గాదిముష్టిసంగ్రాహ్యతలము,జరపరుంజానసంగను బరఁగునదియె,చనును సెమ్మలిపరుఁజాగాజాపరుఁజన." ఆం, భా. ద్వి. ఉ.

గాజు. వై. వి. 1. ఒకదినుసు మన్ను. "గాజుకాఁగు." భిల్హ. 3, ఆ.—2. బ. గాజుమట్టితోఁజేసిన వలయములు.

గాజుప్పు. ద్వ. వి. (గాజు+ఉప్పు.) ఒకానొక ఉప్పు, కాచము.

గాజులవాండ్రు. ద్వ. వి. బ. గాజులమ్మెడు బలిజెలు.

గాజువాఱు. ద్వ. అ. క్రి. (గాజు+పాఱు.) కాంతిహీనమగు. "గీ. నెఱయనర్థిలినెనయునీనెమ్మొగంబు, ఘనభుజంగవిషవ్యాప్తిగాజువాఱె, రాహుకబళితరోహిణీరమణుమాడ్కి, నుండఁగనుఁగొనియేసెట్టులుంటకుజ్ఞ." మార్క. ౧, ఆ. "ఉ. కందవుగాజువాఱవువికారమునొందవుపూతిగంధముం, జెందవువాడవప్పరమునీమలసెల్లెడవామకర్ణముల్, క్రిందుగదీర్ఘనిద్రలఢరిత్రిశయించిన జంతుదేహముల్." కాశీ. 3, ఆ. "గీ. గాజువాఱదుచరణపంకజయుగంబు, హస్తతలములకెంజాయలఁగిపోవు, కాదు వేఱొక్కరూపంబుకన్నుదోయి, యొడలిలోఁ బ్రాణములుండఁగియుండఁబోలు." హరిశ్చ. 4, ఆ.

గాటము. వై. విశ. అధికము. "గాటముగాఁదనప్పు కుతుకంబుల." కళా. ౧, ఆ.

గాటు. వై. వి. కారము. (పొగాకుపొడి మిక్కిలి గాటుగానున్నది.)

గాఁడికడుగు. దే. స. క్రి. (గాఁడి+కడుగు.) సంచయనము చేయు.

గాడి. దే. వి. రథవిశేషము. (రూ. గాడీ. "చిత్రలక్షణ తినొప్పనేనూఱుగాడీలు." భార. ఆది. ౫, ఆ.)

గాడిద. వై. వి. గార్దభము, గాలిగాఁడు. (రూ. గాడ్దె.)

గాడిదకాళ్లవాఁడు. ద్వ. విశ. ముట్టుమోఁకాళ్లవాఁడు, సంజ్ఞువు.

గాడిదగడపర. ద్వ. వి. వృషగంధిక?

గాడిదపులి. ద్వ. వి. దుమ్ములగొండి, కొర్నవగండు.

గాడుపు. దే. వి. గాలి, వాయువు. (రూ. గాడ్పు.)

గాడుపుచూలి. దే. వి. 1. భీముఁడు; 2. హనుమంతుఁడు.

గాడుపుపట్టి. దే. వి.——పై.——

గాడుపుమేపరి. దే. వి. సర్పము, పవనాశనము.

గాడుపుసంగడీఁడు. దే. వి. అగ్ని, వాయుసఖుఁడు.

గాఢము. సం. క్రి. విశ. అ. న. పెల్లు. విశ. అధికము.

గాణ. వై. వి. 1. పాటకాఁడు; "సీ. పోయెఁబోనుఁబిల్వఁజేయకతానొక నెఱగాణయైవిద్య నెఱపుకెట్లు." కళా. ౨, ఆ.—2. పాటకత్తె. "వ. మధురకిన్నరీనిక్వాణంబులరాణంద్రాగచెఱమివిన్నాణంబులుగొలుపుకెలుంగులవేల్పుగాణలు పాడు లక్ష్మీనారాయణుల కల్యాణంబుపాటలఁ దీటుకొనుతిన్ననిరవంబులంగలని." స్వా. ౫, ఆ.

గాణాపత్యము. సం. వి. అ. న. ఒకమతము. (చూ. మతము.)

గాణిక్యము. సం. వి. అ. న. గణికల సమూహము.

గాణీ. వై. వి. పాటకత్తె. "వ. వేల్పుగాణీలపాణిరతమాణిక్యవీణామధురరాణామృతంబులఁ గరఁగి." వసు. ౨, ఆ.

గాణుఁడు. వై. వి. పాటకాఁడు. "శా. పత్రంబుల్లలిఁదాల్చుకీరనిభదీవ్యద్వాణులుంగాణులున్." హరి. ఉ. ౭, ఆ.

గాణేయము. సం. విణ. (అ. ఆ. అ.) గణనీయము.

గాత. ఉభ. వై. వి. దెబ్బ. (చూ. ఖద్ది.) సం. బు. పుం. పాటపాడువాఁడు.

గాతము. వై. వి. పల్లము*. "ఉ. అతఁడుసంబడించు కొనియాకరిచొప్పున నేగియేగితా, నాతతగుల్మమ ధ్యమున వారసికన్గొనిదానిఁజుట్టిరా, గాతముఁ ద్రవ్వియాకలము గప్పినఁగానక కూలెవారణం, బాతతపక్షముల్ తునుమనంబుధిఁగూలిన కొండ కైవడిన్." వాసి. ౫, ఆ.

గాతి. వై. వి. తిండి, గ్రాసము. "ఎ. గీ. చెఱకులను మెల్లమునుజూపిచిన్న వాండ్రఁ, జంపితోడవులు గొనివచ్చుసాహసమునఁ, బాపములకెల్లనొడికట్టి పాయకెపుడు, శ్వేతుఁడీరీతిలంజియగాతికొఱ కు." భిల్లా. 3, ఆ.

గాతుకలఁగు. దే. అ. క్రి. ఛేదిల్లు. "సీ. కణఁతలెల్ల నుగాతుకలఁగి దిక్కులకుఁబొటపొటఁగన్నీటి బొట్లుపడియె." రామా. ౮, ఆ.

గాత్రము. ఉభ. దే. విణ. స్థూలము. సం. వి. అ. న. 1. శరీరము; 2. అవయవము; 3. ఏనుఁగుయొక్క ముందటిపిక్కలులోనగుచోటు. (ఈ యర్థము నందిది ఆకారాంత స్త్రీలింగమునగును.)

గాథ. సం. వి. ఆ. స్త్రీ. 1. చరిత్రము; 2. పద్యము; 3. పాట; 4. చక్కఁబఱుపఁబడనిభాష.

గాథకుఁడు. సం. వి. అ. పుం. పాటకాఁడు.

గాద. దే. వి. చెమటకాయలతఱచు.

గాదము. దే. వి. 1. పైరులోని కసవు; 2. ఆకు; "ఎ. గీ. జగతినేరాజుమారాజుచరణయుగముఁ, గాంచికొలువనివానినేఁగానసెందు, గాదమునమాటు పడియున్న కాయఁబోలె, నుజ్జయినిడాఁగియున్న నీవొకఁడుదక్క." విక్ర. ౪, ఆ.

గాదిలి. దే. వి. ప్రేమము. "గాదిలితనయుండు." భార. అశ్వ. ౪, ఆ.

గాదె. వై. వి. గాజెయొక్కరూపాంతరము.

గాధము. సం. వి. అ. పుం. 1. మిట్ట; 2. కోరిక.

గాధేయుఁడు. సం. వి. అ. పుం. గాధికొడుకు, విశ్వామిత్రుఁడు.

గానము. సం. వి. అ. న. గీతము, పాట.

గానుఁగ. దే. వి. నూనెదీసెడియంత్రము, పరంజము.

గానుఁగపిండి. ద్వ. వి. తెలికపిండి.

గాబ. దే. వి. తృణవిశేషము. (ఇక్కడ గాబనిండపెరిగి యున్నది.)

గాబము. (గాబయొక్కరూపాంతరము.)

గాబరా. హిం. వి. భయము, తొందర, కలవరము.

గాబు. దే. వి. కొప్పెర. "ఎ. గీ. గాబుకొప్పెరయ నఁగనుగర్వరమగు." ఆం. భా. ద్వి. వై.

గామ. దే. వి. పిపీలికావిశేషము. "ద్వి. కలగొనిచీమలగామలపలెను, జెలఁగుచుముందఱశిశువులాడఁగను." హరిశ్చ. ౨, భా.

గామిడి. వై. విణ. శ్రేష్ఠుఁడు. "మ. ఊరిగామిడి బాఁపల్ చను దెంచిరద్రుపదభూమీభర్తయిల్ చేరఁగన్." పాంచా. ౪, ఆ.

గాము. వై. వి. 1. సూర్యాదిగ్రహము; "క. గాము బుధుండరుణిమరుచి, యామయనాశకములబ్ధమ గ్రజవంశులం, బామహితత్వముదేవత, హైమవతిజకారమునకునాగమసరణిన్." కవిస. ౧, ఆ. —2. పిశాచము. "గీ. అనుచుఁబెలుచనొంపవచ్చుటిజనములు, కలఁగియపుడుమేలుకాంచిచూచి, భయముతోఁపఁగడిఁదిబలుగాముగాఁదమ, యుల్లములఁదలంచియొదిఁగియుండ." భార. సౌ. ౧, ఆ.

గాములఱేఁడు. ద్వ. వి. సూర్యుఁడు, గ్రహపతి.

గాయకము. దే. వి. మర్మము. "ఆగాయకపుజంత." సా. ౨, ఆ.— విణ. గూఢము. "గాయకపునుద్దులు." సా. 3, ఆ.

గాయకుఁడు. ఉభ. వై. విణ. గ్రహణశక్తిగలవాఁడు. సం. వి. అ. పుం. పాటపాడువాఁడు.

గాయత్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. మంత్రవిశేషము; 2. ఒక ఛందస్సు. (చూ. ఛందస్సు.) ఈ. స్త్రీ. న్. పుం. చంద్రి.

గాయని. సం. వి. ఈ. స్త్రీ. పాటపాడునది.

గాయనుఁడు. సం. వి. అ. పుం. పాటపాడువాఁడు.

గాయమానము. దే. వి. శస్త్రవిద్యావిశేషము. "ఎ. గీ. వఱకువరువడిగాయమానంబువిసరు, మొనలనంగనుదచ్ఛేదములుచెలంగు." ఆం. భా. ద్వి. ఉ.

గాయము. దే. వి. కత్తిలోనగువాని తాఁకుడు, క్షతి.

గార. దే. వి. 1. గోడలోనగువాని పూఁతకై యిసుకఁ జేర్చిదంచిన సున్నము; 2. మణిదోషవిశేషము; 3. ఇంగుది.

గారడము. వై. వి. 1. విషమంత్రము; 2. మాయ*. "గీ. గారడపురక్కసునిసెందుఁగానకుండి." అచ్చ. యు, కాం.

**గారడి.** వై. వి. (గారడము+ఇ.) పాములవాఁడు, అహితుండికుఁడు. "ఎ, గీ. వ్యాళసంగ్రాహినామమైవఱలు గార, డీఁడనంగను బాములవాఁడనంగ, గారడియనంగహస్తసంగతకురంగ." ఆం, భా. ప్ర. పా.

**గారడీఁడు.** వై. వి. (గారడము+ఈఁడు.)——పై.——

**గారము.** వై. వి. గారవముయొక్క రూపాంతరము. (గొప్పతనమునకు.—"గీ. జోగిబొబ్బ మెకమయీ గారపుంగుఱ్ఱలెవ్వరు." అచ్చ. బాల, కాం.—ప్రేమమునకు.—"ఇలనెంగుఁదల్లిదండ్రులగార మారఁగాఁబెరిగి." భో. ౬, ఆ.

**గారవము.** వై. వి. 1. గొప్పతనము; 2. ప్రేమము*. "క. ఆరాజర్షియుదానికిఁ, గారణమమ్మునియ కాఁ బ్రకాశజ్ఞానో, దారమతి నెఱిఁగికన్నియ, గారవమునఁగొనిపులస్త్యుకడకుంజనియెన్." నిర్వ. ౨, ఆ.

**గారవించే.** వై. స. క్రి. 1. గౌరవపఱచు; 2. ఆదరించు. "సీ. కార్తికేయునిశూలిగారవించి, ముద్దాడునెడఁ జూచిమోదంబు ఖేదంబుఁ బొడమ నెమ్మనములోఁగొడుకునిట్లు, పాటింపఁడేఁదండ్రిప నియేమి." ఉ, హరి. ౫, ఆ.

**గారవిల్లు.** వై. అ. క్రి. గౌరవపడు. (రూ. గారవిలు. "సీ. తనవంశకర్తనుత్పలబాంధవునిఁబోలుఁ గరములర్మిలిఁజూఁచి గారవిలుట." విజ. ౨, ఆ.)

**గారాబము.** వై. వి. 1. గొప్పతనము; "క. వారలలోఁ గౌసల్యా, నారీమణియఖిలపావనశ్రీమద్గ, ర్భాభరూఢలక్షణంబుల, గారాబముఁజెందెవిభుఁడు కడురంజిల్లన్." రామా. 3, ఆ.—2. ప్రేమము*. "శా. మావారందఱునన్ను భాగ్యవతిగామన్నించి గారాబమున్, గావింపందగుదాన." శృం. 3, ఆ.

**గారాబు.** వై. వి. గారాబముయొక్క రూపాంతరము. (ఈ పదము కలదని నిర్ణయించుటకుఁదగిన గ్రాంథిక ప్రయోగము దొరకినదికాదు.)

**గారాము.** వై. వి. గారవముయొక్క రూపాంతరము. (గొప్పతనమునకు.—"క. ఈరమణి క్రియావతియును, పేరనుబరఁగునని పల్కి ప్రేమముతోడన్, గారామారఁగఁబెనిచిన." రామా. 2, ఆ.—ప్రేమమునకు.— "నీదుగారాపుఁబట్టి." భార. స్త్రీ. ౧, ఆ.)

**గారు.** దే. అప. పూజ్యత్వమును దెలుపునది. (అయ్యగారు, అమ్మగారు.)

**గారుడము.** సం. వి. అ. పుం. 1. గరుడపచ్చ; 2. విషమంత్రము. విణ. గరుడునిది.

**గారుడికుఁడు.** సం. వి. అ. పుం. పాములవాఁడు.

**గారుత్మతము.** సం. వి. అ. న. పచ్చ, మరకతము.

**గారె.** వై. వి. అచ్చుమినుపపప్పువడ. (చూ. ఔఁగు.)

**గార్దభము.** సం. వి. అ. పుం. గాడిద, రాసభము.

**గార్భిణము.** సం. వి. అ. న. గర్భిణులసమూహము. (గర్భిణి=చూలాలు.)

**గార్హపత్యము.** సం. వి. అ. పుం. ఒక శ్రౌతాగ్ని.

**గార్హస్థ్యము.** సం. వి. అ. న. గృహస్థధర్మము.

**గాలకాఁడు.** దే. వి. (గాలము+కాఁడు.) చేఁపలను పట్టువాఁడు, కైవర్తుఁడు. "ఆమిషముగాలకానికెట్లు." భార. అను. ౫, ఆ.

**గాలము.** దే. వి. చేఁపలనుబట్టుటకు ఉక్కుకమ్మితో వంకరగాఁజేసినసాధనము, బడిశము. (దీనిభేదములు ఉంటగాలము, గోరుగాలము అని. ఇదియు గోరుగాలము.)

**గాలవము.** సం. వి. అ. పుం. లొద్దుగు. డు. ఒకానొకముని.

**గాలాము.** దే. వి. గాలముయొక్క రూపాంతరము. "సీ. వాలారుగోరుపెన్ గాలాముచేసె నేజెజేహిరణ్యాక్షశిశుకమునకు." పాండు. ౨, ఆ.

**గాలి.** దే. వి. 1. వాయువు; 2. మృగములదేహవాసన. "సీ. ఎగుచుకూఁతలుము ట్టెయెత్తిబిట్టాలించిగమికిఁగన్నాకయిగాలియరయు." స్వా. ౪, ఆ.— 3. పిశాచము. (దీనికి గాలిసోఁకినట్లున్నది.)

**గాలించే.** దే. స. క్రి. 1. బియ్యములోనగువానిని నీళ్లలోపోసి రాళ్లులేక శోధించు; 2. వెదకు. "కోటిగనఁకులారసిబలితంపుఁదేరులుగాలించి." అచ్చ. సుం, కాం.

**గాలికుంటు.** దే. వి. పశువులకు గొరిజలయందు పుండుపడెడు వ్యాధి.

**గాలిగాఁడు.** దే. వి. గాడిద. "ఉేవుగుఱ్ఱము గాక గాఁడు గాడిదయనఁగనుఖరమురాగిలుచుండు." వేం.

**గాలిగుడి.** ద్వ. వి. సూర్యచంద్రులకుఁ జుట్టు నేర్పడెడు మండలము, పరివేషము.

**గాలిగొను.** దే. అ. క్రి. (గాలి+కొను.) గాలిపాఱు. (చూ. కలిమము.)

**గాలిగ్రుడ్డు.** దే. విణ. పేద. (అప్ర.)

గాలిమోలి. దే. వి. 1. అగ్ని; 2. భీముఁడు; 3. హనుమంతుఁడు. (ఇట్లు గాలిపట్టి, గాలిబిడ్డఁడు. మొ.)

గాలిదిండి. దే. వి. (గాలి+తిండి.) సర్పము, పవనాశనము. "గీ. మోలుకప్పులుతోఁబేళ్లుగాలిదిండ్లు, మొసళులెండ్రులునెగడులుమొదలుగలుగు, నీరుత్రిమ్మరిపురువులు." అచ్చ. యు, కాం.

గాలినెచ్చెలి. దే. వి. అగ్ని, వాయుసఖుఁడు.

గాలిపంట. దే. వి. నిర్ణయములేనిపంట.

గాలిపటము. ద్వ. వి. బాలక్రీడాసాధనవిశేషము.

గాలిపడగ. ద్వ. వి. గాలిపటము. "గీ. అలజాలంబునీరజోనాడుజాడ, గాలిపడగయాకసమునఁగ్రాలుత్రోవ, నిదురిలోపలఁగలదోఁచునీడఁబిదపఁ, గానవచ్చునెయప్పుడ గన్నఁగాక." ఉ, హరి. ౫. ఆ.

గాలిమాట. దే. వి. లోకప్రవాదము, జనశ్రుతి.

గాలిమేపరి. దే. వి. సర్పము. (ఇట్లు గాలిమేఁతరి మొ. చూ. గాలిదిండి.)

గాలివాన. దే. వి. గాలితోడివాన, ఝంఝ.

గాలివేఁత. దే. వి. 1. గాలికొట్టుట; 2. జ్వరభేదము.

గావు. దే. వి. బలి. "గీ. గొప్పచింబోతుకదుపులఁగూర్చినీకు, గావువెట్టింతుఁజామ్మియోగంగనమ్మ." నీలా. ౧, ఆ.

గావుకోడి. ద్వ. వి. మూలికావిశేషము.

గావుపట్టు. దే. స. క్రి. 1. చంపు; "సీ. కడుఁదురీఁగయఁబోలెవడిఁదోలికఁబచి యాకస్తూరిదుప్పులగావుపట్టు." సా. ౧, ఆ.—2. నాశముచేయు. "ద్వి. పొదలెడుపురుషార్థములగావుపట్టి, మదముమాత్సర్యంబుమట్టిమల్లాడి." విష్ణు. పూ. 3, ఆ.—వి. గట్టిపట్టు.

గాసటబీసట. దే. వి. సలక్షణముగానిచదువు. "ఉ. భాసురభారతార్థములభంగులనిక్కమెఱుంగనేరమిన్, గాసటబీసచేఁచదివిగాథలుత్రవ్వుతెనుంగువారికిన్, వ్యాసమునిప్రణీతపరమార్థముతెల్లగఁజేసినట్టియ, బ్జాసనకల్పులందలఁతునాద్యులనన్నయతిక్కనార్యులన్." లక్ష్మీ. ౧, ఆ.

గాసము. వై. వి. ఆహారము. "వ. ఏసరేఁగిబేసంబులుగాసంబులుగొని." భాగ. ౮, స్కం.

గాసి. దే. వి. శ్రమము. (నాకిప్పుడు మిగుల గాసిగానున్నది.)

గాసిఁబడు. ద్వ. అ. క్రి. (గాసిన్+పడు.) బాధపడు. "క. స్త్రీసంతోషించుతెఱం, గాసపడనిమనసుగలుగునట్టియధముఁడి, చ్చోసడిఁగనుఁజనియచ్చో, గాసింబడు జమునిభటులఁగాఁతియవెట్టన్." భార. అశ్వ. ౪, ఆ.

గాసిఁబెట్టు. దే. స. క్రి. (గాసిన్+పెట్టు.) బాధించు. "క. ఆసభనమ్మెయినీగు, శ్శాసనుండపాండుపుత్రసతిఁగ్రూరాత్ముం, డైశంకలేకపెద్దయు, గాసింబెట్టంగనెఱిఁగికలఁగినమదితోన్." భార. స్త్రీ. ౨, ఆ.

గాసిచేయు. ద్వ. స. క్రి. నాశముచేయు. "చ. అనవుడుసమ్మదంబుతోఁగడఁగనిక్కముసట్లుకాకయ, ష్వనవిధివాఁటిలంకయునువానిసనంబును గాసిచేసినం, దనుఁదెగఁజూచివచ్చినవిశల్యబవియల్పులచేతఁదీరునే." నిర్వ. ౭, ఆ.

గాసియగు. దే. అ. క్రి. (గాసి+అగు.) నాశమగు. "వ. గీ. భూపతిలేకున్నమంత్రిజనము, లర్థపకృషిసేయుటయును బేహారమాడుటయును గోరక్షకావించుటయును మొదలు, గాఁగబ్రదికెడితెరువులుగాసిగావె." భార. శాం. ౨, ఆ.

గాసిల్లు. దే. అ. క్రి. 1. బాధపడు; 2. శ్రమపడు; 3. కోపపడు. (రూ. గాసిలు. బాధపడుటకు.— "క. మునియిట్లునెమ్మిఁగాంచినఁ, గనియతఁడాఁకొనుటఁజేసిగాసిలియొచ్చోఁ, గనువాఁడనోతగుభక్ష్యం, బనుచుండఁగవచ్చితివిప్రియంబుగననుడున్." భార. అశ్వ. 3, ఆ.— కోపపడుటకు.— "క. వాసవుఁడునందగోపుఁడు, చేసినయపరాధమునకుఁజిత్తములోనన్, గాసిలిమేఘగణంబుల, లోసంవర్తాఖ్యజలదలోకముఁబేలఁచన్." వి, పు. ౭, ఆ.) (మొదటి రెండర్థములకును ప్రేరణమందు రూపము గాసించు.)

గాహనము. సం. వి. అ. న. స్నానము, మునుక.

గాహితము. సం. విణ. (అ. ఆ. అ.) మునిఁగినది.

గాళకుఁడు. దే. విణ. 1. ధీరుఁడు; "ఉ. గాళకులాపురీభటశిఖామణులెక్కటియుక్కుతున్కలా, భీలతరాశనుల్ చిదిమిపెట్టినబంటులువైరికల్లబే, తాళుఁడువచ్చిడగ్గఱిన దబ్బఱగా దొకదెబ్బతీయఁగాఁ, జాలుదురేమిచెప్పమఱిసాదనమేలున సాహసంబునన్." విజ. ౧, ఆ.– 2. ప్రౌఢుఁడు. "గీ. అనుచునెల్లవేల్పులనుగొల్చిమునుకబ్బములనుగన్నగాళకులనుదలఁచి." నీలా. ౧, ఆ. "గీ. గోలగానిమిగులగాళకురాలుగా దింతి" నీలా. 3, ఆ.

## గి.

గి. దే. అవ్య. నిందయందు హ్రస్వాదియైన ఆమ్రేడిత శబ్దముయొక్క యాద్యక్షరమునకువచ్చెడియాదేశము. (చంద్రుఁడుగింద్రుఁడు, చిలుకగిలుక, వరములుగిరములు. మొ.)

గింగురు. దే. వి. వింటినారినుండి బాణము వెడలుటయందగు ధ్వన్యనుకరణము. "ద్వి. తెగగింగురనఁ బాపిదృష్టిసంధించి, తెగ నేయుటయు." హరిశ్చ. ౧, భా.

గింజె. దే. వి. 1. విత్తు. 2. బ. ధాన్యము.

గింజుకొను. దే. వి. బిడ్డలు వెలికిలఁబండుకొని యేడ్చునప్పుడు కాళ్లువిదిలించు. "శ్రీరమ్యాంఘ్రియుగంబుగింజుకొనుచున్." హరి. పూ. ౫, ఆ.

గింటెన. దే. వి. దంటెన?.

గింటెము. దే. వి. జంటనేఁతవస్త్రము. "గీ. మడఁతపసిమిడిగింటెముల్ మంజిడిజిగి, దోమతెరమంచములుహంసతులుజవాది, యగలుసిరులుచిన్నెలుగాఁగనతఁడుకడపెఁ, జలిసెలలు." కళా. ౭,ఆ.

గిండి. దే. వి. సన్నపుమెడగలచెంబు, భృంగారము.

గిచ్చు. దే. స. క్రి. గీచుయొక్క రూపాంతరము.

గిజిగాఁడు. దే. వి. పచ్చపిట్ట.

గిజ్జిగాఁడు. దే. వి. గిజిగాఁడుయొక్క రూపాంతరము.

గిజగిజ. దే. వి. తన్నుకొనుటయందగు ధ్వన్యనుకరణము.

గిజగిజగొను. దే. అ. క్రి. (గిజగిజ+కొను.) తత్తఱపడు. "క. తఱచగుచుఁబింజపింజయుఁ, గఱచుచుమిడుఁగుఱులుసెదరఁగడుమిడుతలచాల్, తెఱఁగున నడపెడుచిలుకులు, గిఱికొనఁ బఱపుటయువాఁడుగిజగిజగొనుచున్."అచ్చ.యు,కాం.

గిజగిజలాడు. దే. అ. క్రి. (గిజగిజలు + ఆడు.) ——పై.——

గిజేరు. దే. వి. మామిడిపండులోనగువానియందుండుబేసము.

గిటక. దే. విశే. పొట్టి, వామనుఁడు.

గిటగిట. దే. వి. పండ్లుకొఱుకుటయందగు ధ్వన్యనుకరణము. "వ. జటిలుండుగిటగిటంబండ్లుకొఱికి." స్కాం. ౫, ఆ.

గిటగిటన. దే. విశే. 1. అల్పము; "వ. హేమకూటంబు గిటగిటన." కాశీ. ౧, ఆ.—2. కృశము; "వ. నానాటికినగుచున్నయట్లు గిటగిటనగుచున్నది." ఆము. ౫, ఆ.—3. సూక్ష్మము. "వ.అందులకు సామగ్రిగిటగిటన." ఆము. ౧, ఆ. (విశేషణముగ చో "గిటగిటనినదుము." చూ. అలకన.)

గిటగిటమను. దే. అ. క్రి. (గిటగిట+అను.) వడఁకు. "క.... ప్రేఁగునగిటగిట, మనునెన్నఁడుమేమియగునో యనియెడుశంకన్, గనకపుఁగట్టిడినాఁడో, వనజాసనుఁడనఁగ వనితవలుఁబెఁపెసఁగున్." ప్రభా. ౨, ఆ.

గిట్ట. దే. వి. 1. పశువులకాలిగోరు, ఖురము; 2. బాణము. "పనసునేడుతూపుల వృషభునిఁదొమ్మిదిగిట్టల." అచ్చ. యు, కాం.

గిట్టించు. దే. అ. క్రి. గిట్టుబడియగు. ప్రే. చావఁజేయు.

గిట్టింపు. దే. వి. 1. గిట్టుబడి; 2. చావు. (చూ. అరగింపు.)

గిట్టు. దే. అ. క్రి. 1. అనుకూలించు; 2. చచ్చు; 3. నశించు.

గిట్టుబడి. దే. వి. అమ్మకమునందలి లాభము.

గిడస. దే. విశే. పొట్టి, గిటక, వామనము.

గిడిగిళ్లు. దే. వి. బ. నమస్కారము. "రగడ. భక్తిసారమునఁబ్రజలుజగత్పతి, కినిసంధించిన గిడిగిళ్లో యని." హంస. ౪, ఆ.

గిడియ. దే. వి. పటహవిశేషము. "ఎ. గీ. తుడుమునంగనుదముకునాగిడియయనఁగ, నరగజంబనఁడద్బదనామములగు." (ఇక్కడ తచ్ఛబ్దమునకు తప్పుటమర్థము.) ఆం. భా. ప్ర. నా.

గిడుగు. దే. వి. కామతేనిగొడుగు.

గిడ్డ. దే. విశే. పొట్టి, వామనుఁడు.

గిడ్డంగి. అన్య. దే. వి. 1. సరకులుంచియమ్మెడి యిల్లు; 2. చెఱసాల.

గిడ్డి. వై. వి. ఆవు, ధేనువు*. "వేల్పులగిడ్డికానివాఁడీనునెమోక్షతర్ణకము." కాశీ. ౬, ఆ.

గిడ్డు. దే. వి. శ్యేనవిశేషము.

గిత్త. దే. వి. 1. ఎద్దుపట్టనికోడె; 2. వృషభము

గిద్ద. దే. వి. సోలయందు నాలవభాగము.

గిద్దు. దే. వి. గిడ్డుయొక్క రూపాంతరము.

గినియ. వై. వి. కటభి*?.

గినుమాడు. దే. స. క్రి. (గినుము+ఆడు.) వంచించు "మ. తనునాప్యాయితుఁజేసి రేపుగృహకృత్యంబుల్ పొనర్పం దొడం, గినతల్లింగినుమాడి." హరి పూ. ౫, ఆ.

గిమము. దే. వి. వంచన.
గిన్నియ. దే. వి. గిన్నె.
గిన్నె. దే. వి. త్రాగెడుగిన్నె, చషకము. (గిన్నియ యొక్క రూపాంతరము.)
గిబ్బ. దే. వి. 1. అచ్చుటెద్దు; 2. వృషభము. "వ. ఆఁకొనినబెబ్బులికినబ్బినగిబ్బలవిధంబునం బడిన బలుమానుసులును." ఉ, హరి. 3, ఆ.
గిబ్బరౌతు. ద్వి. వి. శివుఁడు, వృషభవాహనుఁడు.
గిః. సం. వి. ఆ. స్త్రీ. వాక్కు.
గిరక. దే. వి. నూతిరాట్నము, ఘటయంత్రము.
గిరగిర. దే. వి. తిరుగుటయందగు ధ్వన్యనుకరణము. "చ. ప్రచండమండలా, గ్రముజళిపించుచుఁగిరగిరఁదిరుగఁ నెగవైచిపట్టుచున్." కళా. ౬, ఆ.
గిరణము. సం. వి. అ. న. మ్రింగుట.
గిరదా. హిం. విణ. గుండ్రని, జుట్టును చుట్టియుండు వెండ్రుకలు.
గిరవు. దే. వి. కుదువ. "సీ. కనుదోయి మెఱుఁగులుకం తుతూపులకడగిరవుగాఁ బెట్టి తేహరిణనయన." విక్ర. 2, ఆ.
గిరస. దే. విణ. పంద, పాఱుఁబోతు, పిఱికి, సమర భీరువు.
గిరాకి. హిం. విణ. వెల యధికమైన, ప్రియమైన.
గిరాటువేయు. దే. స. క్రి. (ఈయి) అవ్వు.
గిరి. సం. వి. ఇ. స్త్రీ. మ్రింగుట. పుం. 1. కొండ; 2. అచ్చనగాయలు; 3. నేత్రరోగవిశేషము. విణ. పూజ్యము.
గిరిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చిట్టెలుక; 2. జెలగ; 3. ఏనురాజుభార్య; 4. పార్వతి; 5. విధవ; 6. అడవిమల్లె?. పుం. ము. బొంగరము.
గిరికర్ణి. సం. వి. ఈ. స్త్రీ. దింటెన?.
గిరిగిటలు. దే. వి. బ. ఆడునప్పుడు వాయించెడు కంచుతాళము. "ద్వి. పసిఁడిపానంబు, గిరిగిటల్ గాఁబట్టికేళికల్ సేయు." భల్లా. ౨, భా.
గిర్గిటలు. దే. వి. బ. గిరిగిటలుయొక్క రూపాంతరము. "ద్వి. గాడగూడిపసిఁడిగిర్గిటలఁగేళికలు." భల్లా. ౨, భా.
గిరిజ. సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. మాదిఫలము?. అ. న. ము. 1. అభ్రకము; 2. లోహము; 3. సిలాజిత్తు. విణ. కొండయందుఁబుట్టినది.
గిరిధరుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు, గట్టుతాలుపు.
గిరిమల్లిక. సం. వి. ఆ. స్త్రీ. కొండమల్లె?.

గిరియకము. సం. వి. అ. పుం. అచ్చనగాయలు.
గిరిశుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, కొండయల్లుఁడు.
గిరిసెము. వై. వి. శిరీషము?.
గిరిస్తని. సం. వి. ఈ. స్త్రీ. భూమి, నేల.
గిరీశుఁడు. సం. వి. అ. పుం. 1. శివుఁడు; 2. హిమవంతుఁడు; 3. బృహస్పతి.
గిఱక. దే. విణ. గిటక, పొట్టి.
గిఱకతాడు. ద్వి. వి. హింతాలము?.
గిఱి. దే. వి. వలయాకారపురేఖ. (వాఁడు గీచినగిఱి దాఁటఁడు.)
గిఱికొను. దే. స. క్రి. చుట్టుకొను. "క. ఉఱికమదీయాంగంబులు, గిఱికొనునట్లేరుటయును." భార. ఉద్యో. ౪, ఆ.
గిఱిపిల్లాఁడి. దే. వి. స్త్రీలు కాలధరించెడి మూడవ వ్రేలి పిల్లాణి.
గిఱుకు. దే. స. క్రి. 1. అక్షరములు బటువుగా నేర్పడ వ్రాయక పంకరకొంకరగాగీచు; 2. తప్పు వ్రాఁతను తుడుచు. వి. తుడుపు.
గిఱుక్కు. దే. వి. మరలుటయందగు ననుకరణము. "గిఱుక్కునఁ మరలి వ్రేసెనుకండౌకజాలెడేఁగ." చంద్రా. ౨, ఆ.
గిఱుపు. దే. స. క్రి. 1. (కన్ను) త్రిప్పు; "సీ. అనిపల్కి క్రమ్మఱఁజనఁ జూచుచోఁదీవి తొఁడు బోదులఁగన్గిఱిపియుదల్చుటయు." అచ్చ. యు, కాం.— 2. కదలించు. "ఇక్కడనక్కడనూడఁజూచిమే గిఱుపఁగ." నిర్వ. 2, ఆ.
గిఱ్ఱు. దే. వి. తిరుగుటయందగు ననుకరణము. (గిఱ్ఱు నఁదిరిగె.) (ఇది మఱికొన్ని యర్థములందునువచ్చును. "ద్వి. దుడిదుడివచ్చిశత్రోయంబులొడికి, నడికిగిఱ్ఱునఁజుండోండములు వేవేగ, ముడిచిపాఱె డిని" రా. అర, కాం. ఆమ్రేడితమునందు గిఱ్ఱు గిఱ్ఱు. "ద్వి. గిఱ్ఱుగిఱ్ఱునఁగులగిరులనూఁగించు, నొత్తవాయువులుబిట్టొలయుచు విసరె." భాగ. ౧౦, స్క౦.)
గిఱ్ఱుపురుగు. ద్వి. వి. చెట్లయందుండి యెల్లప్పుడు గిఱ్ఱుమని కూయునట్టి యొక పురుగు.
గిలక. దే. వి. 1. గిలగిల మ్రోఁగుబాలక్రీడాసాధనము; 2. గిలగిలమని మ్రోఁగెడి యినుపతగటిబిల్ల. "గిలకలున్న వెదురుఁగోలఁబట్టి." పంచ. నా. ౨, ఆ.
గిలకచెట్టు. దే. వి. ఘంటారవ?.
గిలకబండి. దే. వి. చిన్నచక్రములబండి.

**గిలకరించు.** దే. స. క్రి. 1. గిలకొట్టు; 2. చిలుకు; "సీ. దుగ్ధాబ్ధిగిలకరింతు రెనిలింపులుతొల్లి యీయాసవముచవియైతిఁగిరేని." రుక్మాం. 3, ఆ.—3. మ్రోఁగు. "ఎ, గీ. మొలకనగవులు మొగముసగులకరింపఁ, దళుకుఁదేనియనుడువులఁదొలకరింపఁ, గలికిచూపులువీనులబలకరింప, సొలపునడపులనందియల్ గిలకరింప." చంద్రా. 3, ఆ.

**గిలకొట్టు.** దే. స. క్రి. 1. వ్రేళ్లతోకలఁచు; "సీ. కెరలించియమృతంబు గిలకొట్టఁగా రాదెముద్దుఁ జూపెడి వీరిమోవులందు." పాండు. ౧, ఆ.—2. కుదిలించు; "ఉ. పాలడలోనఁబోసిచనుఁబాలు పెయింగిలకొట్టి." స్వా. ౧, ఆ.—3. వ్రేళ్లతో పుణుకు. (చూ. కిలకొట్టు.)

**గిలగిలచెట్టు.** దే. వి. గిలకచెట్టు.

**గిలాబ.** హిం. వి. గచ్చుచేయుట.

**గిలి.** దే. వి. భయము. (పులిపోయిననుగిలిపోలేదు.)

**గిలిగించు.** దే. స. క్రి. గిలిగింతపెట్టు. "చ. వెలికిలిపెజ్జమీఁదఁగడువిప్పగుకన్నులచాయలొప్పఁజెక్కిలిగిలిగించి వ్రేతలునగింపఁగ." హరి. పూ. ౮, ఆ.

**గిలిగింత.** దే. వి. చక్కిలిగింత.

**గిలిగింతచెట్టు.** దే. వి. గిలకచెట్టు, గిలగిలచెట్టు.

**గిలిగిచ్చె.** దే. వి.——పై.——

**గిలిగిలి.** దే. వి. గిలిగింత. "చ. కెళవులవారిచూపుగిలిగిల్లుమొఱంగఁగవేళగోరుచున్." సై. ౫, ఆ.

**గిలిగిలించు.** దే. స. క్రి. (చూ.) గిలిగించు.

**గిలిగిలింత.** దే. వి. గిలిగింత. "సీ. లలిఁగపోలంబులఁగిలిగిలింతలువుచ్చినవ్వింపఁగలకలనవ్వినవ్వి." హరి. పూ. ౫, ఆ.

**గిలుకు.** దే. వి. మెట్టెలులోనగువానియందగుధ్వన్యనుకరణము. "ఎ, గీ. గిలుకుమెట్టెలచప్పుళ్లుగులకరింప." హరిశ్చ. ౨, ఆ.

**గిలుపు.** దే. స. క్రి. (కన్ను) గిఱుపు. "వ. అచ్చెలులువిభునకుంగన్నుగిలిపి." రామా. ౪, ఆ. (గిఱుపుయొక్కరూపాంతరము.)

**గిలుబాడు.** దే. స. క్రి. (గిలుబు+ఆడు.) అపహరించు. "గిలుబాడుఁదల్లిపైఁగలపసిండి." పాండు. 3, ఆ.

**గిలుబు.** దే. వి. అపహరణము.

**గిలుబుకొను.** దే. స. క్రి. గిలుబాడు. "రగడ. గురువిందనదెగిలుబుకొనియెఁబయ్యెరదొంగ." స్వా. 3, ఆ.

**గిలుబుసేయు.** ద్వి. స. క్రి. (గిలుబు+చేయు.) ——పై.——"కృతవీర్యునర్థంబుగిలుబుసేసిదాఁచియున్నవారని భార్గవులనెల్లఁబలికిన." భార. ఆది. 2, ఆ.

**గిల్లకన్ను.** దే. వి. మెల్లకన్ను. "సీ. వింతవానిఁగటాక్షవీక్షణంబునఁజూచుకిసలయాక్షివహించు గిల్లకన్ను." సం. "కటాక్షయతిపాన్యం వైకేకరాక్షీతుసాధవేత్." కాశీ. ౨, ఆ.

**గిల్లచూపు.** దే. వి. మెల్లచూపు. "ద్వి. పిల్లికన్నులుబల్లపెరిగినకడుపు, గిల్లచూపులుఁజాలగిఱికొన్నబొచ్చు." నవ. 3, ఆ.

**గిల్లు.** దే. స. క్రి. 1. నఖక్షతముచేయు; 2. ఆకులులోనగువానిఁగోయు. వి. నఖక్షతము.

**గిల్లుడు.** దే. వి. నఖక్షతము.

**గివురు.** దే. స. క్రి. గిఱుయొక్కరూపాంతరము. "ఎ, గీ. వెడలుబీరెండకునుశరద్వృక్షముఁడిగివార్షికమెయెక్కత్రోటినిర్వంకపక్షు, తులనగివురుచువెట్టిచూపులనురంబు, కెలఁకులుగనుంగొనుచుఁగానఁగేకులుండె." ఆము. ౪, ఆ.

**గిళనము.** సం. వి. అ. న. తినుట.

**గిళితము.** సం. విణ. (అ. ఆ. అ.) తినఁబడినది.

## గీ.

**గీ.** దే. అవ. నిందయందుదీర్ఘాదియైన ఆమ్రేడితశబ్దముయొక్కఆద్యక్షరమునకువచ్చెడియాదేశము. (దేవుఁడుగీవుఁడు, వాలిగీలి, సాత్యకిగీత్యకి. మొ.)

**గీఁక.** వై. వి. ఏనుఁగుకూఁత, బృంహితము.

**గీఁకు.** దే. స. క్రి. కత్తిలోనగువానితోగీచు.

**గీఁటు.** దే. స. క్రి. 1. (పండ్లు) కొఱుకు; "మ. లగ్నమిదిగోడాసెన్ముహూర్తుండురాజునయోనిన్నసెఱుంగరాకదలఁడెంచున్బండ్లుగీఁటన్వడిన్." పాంచా. ౪, ఆ.—2. (కన్ను) గిఱుపు; "క. మునుదక్షుఁడభవుఁబలుకఁగఁ, గనుగీఁటినభగునిఁబట్టి కన్నులుపెకలిం, చెనునందీశ్వరుఁడచ్చట, జనములహాహారవంబుసందడిగొలుపన్." భాగ. ౪, స్క.—3. చిమ్ము. "క. తూలుచుడగ్గఱికొఁగీఁటఁగిలించుచుఁగన్నీరుగీఁటియతనిపై, ధూళివెసఁదుడిచినెమ్మెగ, మాలోకించుచునుబుజ్జ్యడమునికనియెన్." వాసి. ౪, ఆ. (చూ. నాఁడు రెండవయర్థము నుదాహరణము.)

**గీఱ.** దే. వి. గీటు, రేఖ.

గీఁతకట్టియ. ద్వ. వి. పడ్లవాఁడు గీఁతలుగీయుట కుప యోగించెడుపలక, (రూ. గీఁతకట్టె.)

గీచు. దే. స. క్రి. గీటుగీచు.

గీటడఁగు. దే. అ. క్రి. చచ్చు. "సీ. జననాథశల్యుఁ డుసమసె సౌబలుఁడు గీటడఁగెనులూకుండుమడి సెసకల, సంశప్తకులుఁగడచనిరి." భార. శల్య. ౧. ఆ. (ప్రే. గీటడఁచు.)

గీటు. దే. వి. గీఁత, రేఖ.

గీటునఁబుచ్చు. దే. స. క్రి. అనాదరించు. "క. విని విననివానిచందం,బునగీటునఁబుచ్చి." జై. ౮, ఆ. "వ. వీఁడుసంయమివరుమాటగీటునంబుచ్చితన వలసినట్లుచేయువాఁడయ్యె." భార. సౌ. ౨, ఆ.

గీట్లబద్ద. ద్వ. వి. కాకితములులోనగువానియందు గీట్లువేయుటకుపయోగించెడు కోల.

గీతము. సం. వి. అ. న. పాట. విశ. పలుకఁబడినది.

గీతి. సం. వి. ఇ. స్త్రీ. 1. పద్యభేదము; 2. పాట.

గీపెట్టు. ద్వ. అ క్రి. (గీఁక + పెట్టు.) 1. ఏనుఁగుకూయు; "సీ. కేల్గలమెకములగీపెట్టుటలునుమావులసకిలిం తలగ్గలపుఁదేర్ల,రొదలుకాలరులయార్పులువాయి దమ్ములమ్రోఁతలునొక్కటై." అచ్చ. యు, కాం.—2. మొఱపెట్టు; "సీ. అలమిగీపెట్టింతుమలుకఁగో అలునూటిపైవచ్చుభూదారపతులనైన." హంస. ౨, ఆ.—3. శబ్దించు. "క. మదిరాక్షిజంఘలంగ జా, గదలగునూహింపఁగావు కాహళులవియే, న డుగువడకగీపెట్టక, పదనుదివిసిరాగిదేలిపలుకక యున్నే." పాండు. 3, ఆ. (గీఁపెట్టు ఇది యిట్లుం డుట యుక్తము.)

గీము. వై. వి. ఇల్లు "సీ. సాకేతనిలయయుష్మత్పూ జసలుపనిజామమృత్యువునిల్చుగీముగాదె." ఉ. రా. ౫, ఆ.

గీయు. దే. స. క్రి. గీఁతగీయు.

గీరనంగింజెలు. దే. వి. బ. బాలికాక్రీడావిశేషము. (మా. అచ్చనగండ్లు.) (రూ. గీరనగింజెలు. "ఉ. చారుచిరత్నరత్నమయసౌధములన్ బురివైశ్యక న్యకల్,గీరనగింజలాడుతతిఁగ్రిందనుజిందినదివ్య రత్నముల్, పౌరులుత్రొక్కుచుంజనఁగఁబాదు కొనన్ ధరణీపురంధ్రికిన్, వారకరత్నగర్భయను నామముపెట్టిరిసత్కవీశ్వరుల్." శశాం. ౨, ఆ

గీర్ణ. సం. వి. ఇ. స్త్రీ. మ్రింగుట.

గీర్వాణము. సం. వి. అ. పుం. దేవభాష.

గీర్వాణుఁడు. సం. వి. అ. పుం. దేవుఁడు, వేల్పు, బాసవాలు.

గీఱ. దే. వి. గీఁత, రేఖ.

గీఱు. దే. స. క్రి. 1. గోఁకు; 2. భేదించు. "క. గీఱు నెసాత్వికులబుద్ధిఁగిల్బిషచయముల్." లక్ష్మీ. ౧, ఆ.

గీఱుగాజులు. ద్వ. వి. బ. ఒకవిధమైన గాజులు.

గీఱుడు. దే. వి. 1. గోఁకుడు; 2. భేదనము.

గీఱునామము. దే. వి. గీఱగలిగిననామము. "సీ. కిట్టుఁ జెప్పులుగొప్పగీఱు నామంబులు మొలఁజెక్కుఁగ త్తులునిలువుసిగలు." నీలా. 3, ఆ.

గీలు. దే. అ. క్రి. స్రవించు. "ఎ, గీ. ఘనరజోవృష్టి కైమీఁదికన్ను మొగుడఁ, గటిదెసలునిక్కబరితో లుగదలగీలు, మదముతిక్తతనదులకీఁదదనుకృద్వ్ర, వాళితోఁదేంట్లుపఱవఁగోరాడెఁగరులు." ఆము. ౪, ఆ.

గీవు. దే. వి. గిరవుయొక్కరూపాంతరము. (అప్ర.)

గీష్పతి. సం. వి. ఇ. పుం. బృహస్పతి, (రూ. గీర్పతి.)

## గు.

గుంజ. సం. వి. ఆ. స్త్రీ. 1. గురిజ; 2. అవ్యక్తమ ధురధ్వని; 3. ఉప్పళము; 4. తప్పెట.

గుంజాటన. గ్రా. వి. వ్యసనము.

గుంజిలిపెట్టు. దే. స. క్రి. గోపనముచేయు. "నీచే సయొటెంగికాదమును చెప్పక గుంజిలి పెట్టియు న్కి." పంచ. వేం. ౪, ఆ.

గుంజిళ్లు. దే. వి. బ. చేతులుకట్టుకొని రెండుకాళ్లు చేర్చిపెట్టి కూర్చుండిలేచుట.

గుంజె. వై. వి. స్తంభము*.

గుంజెనను(గు. దే. స. క్రి. పరిహాసముచేయు. వి. ఎలుఁగుగొడ్డాట.

గుంజు. దే. స. క్రి. 1. ఈడ్చు; "సీ. కరముష్టిదండ మొక్కఁడుతీసిపోవైచెనంజకొక్కఁడుశిఖగుంజి యడిచె." హరిశ్చ. ౪, ఆ. ("సీ. అనిచిన్నికూఁక టిఁబెనఁచినజడఁబట్టిగుంజి యీడిచిచెంపఁగొట్టి తిట్టి." హరిశ్చ. ౫, ఆ. ఇత్యాదిస్థలములయందు ఈడిచికొట్టియనఁగాచేయిచక్కఁగాఁజాఁచి కొ ట్టియనియర్థము.)— 2. ఊదుకు. "సీ. పాదంబు లిరుచేతఁబట్టిగుంజుండు జర్జరితంబుగావీనిఁజట్టు జూత." కాశీ. 3, ఆ.—వి. 1. తాడు ఈఁదులో నగువానిమోవుమొదలు; "గీ. ఈఁతగుంజుమొ దలుగఁదినదొరఁకొనియౌజనము." కాశీ. 3, ఆ.—

2. తాటితేఁగ మొనయందు బుఱ్ఱలోనుండెడు గిజారు. (కొన్నిచోట్ల పుఱ్ఱెలోని మెదటికిని అర్థమగుచున్నది.)

గుంజాలాడు. దే. స. క్రి. (గుంజాలు+ఆడు.) లాగులాడు.

గుంట. వై. వి. 1. కొలను; 2. పల్లము; 3. భూపరిమాణవిశేషము; 4. చెఱువు*; "గీ. దేశవైశాల్యమర్థసిద్ధికినిమూల, మిలయొకింతైనగుంటకాల్వలు రచించి, నయముఁ బేదకునరిఁ గోరుననునొసంగి, ప్రబలఁజేసిననర్థధర్మములు పెరుగు." ఆము. ౪, ఆ.

గుంటక. దే. వి. దున్ని విత్తులుచల్లిన వెనుక నేల సవరచేయుసాధనము.

గుంటక్రోన. ద్వ. వి. ఒకదినుసు పిరంగి.

గుంటగలగర. ద్వ. వి. భృంగరాజము?.

గుంటగలిజేరు. ద్వ. వి.——వై.——

గుంటచోళ్లు. ద్వ. వి. బ. బాలక్రీడావిశేషము (చూ. అలంకులు.)

గుంటదూలము. వై. వి. గృహవిశేషములయందు కడయొత్తులమీఁదనుండి గుజ్జాలనడిమికిఁ జొప్పించెడి చిన్నదూలము.

గుంటనక్క. వై. వి. చిన్నజాతినక్క. కిఖి.

గుంటప్రొయ్యి. ద్వ. వి. గుంటత్రవ్వి యేర్పఱచినపొయ్యి. (చూ. ప్రొయ్యి.)

గుంటి. దే. వి. 1. చేనిభాగము; 2. దున్నుటమొదలగువాని కేర్పఱచుకొన్నభాగము.

గుంఠితము. సం. విణ. (అ.ఆ.అ.) (ధూళి మొదలగువానిచే) కప్పఁబడినది.

గుండ. యు. దే. వి. గుడ్డయొక్క రూపాంతరము. "సీ. ఎండగట్టినకావిగుండలకెంజాయచిగురుజొంపంబులచెన్నుఁబెంప." య. ౨, ఆ.—వై. పొడి.

గుండఁగి. దే. వి. నీరుకోడి.

గుండఁడు. దే. వి. దాసుఁడు. "గుండనికింబసిండిపనిగోర." హంస. ౫, ఆ.

గుండకము. సం. వి. అ. పుం. 1. దుమ్ము; 2. నూనెపాత్రము; 3. అవ్యక్తమధురధ్వని.

గుండగొయ్య. ద్వ. విణ. (గుండ+కొయ్య.) దుష్టుఁడు.

గుండము. వై. వి. నిప్పులగుంట. "ద్వి. ఈగుండములసొచ్చిరొలమిఁజొట్టియును, జాఁగిలిపడియుండుసర్పముల్ పెక్కు." రా. యు, కాం.

గుండా. దే. విణ. ధీరుఁడు.

గుండిగ. వై. వి. వెడల్పునోరుగలలోహపాత్రము*.

గుండియ. దే. వి. హృదయము. "సీ. పాంచజన్యధ్వనిపర్వినగుండియలవిసిచేష్టింపలేకలసియలసి." హరి. ఉ. ౭, ఆ.

గుండిలము. సం. వి. అ. పుం. మద్దెలప్రోఁత.

గుండీ. వై. వి. బరణి*, బొత్తాను.

గుండు. వై. వి. 1. గుండ్రపుటాయి*; 2. తూనికగుండు; 3. పిరంగిగుండు*; "చ. వేలుపుండెరువుగొప్పపిరంగినిజాయమందుతోఁ, గొఱలెడువిన్నమానికపుగుండుఘటించియగాదుచేసినన్." ౘసి. ౪, ఆ.—4. కపిలెగుండు*; 5. పెద్దటాయి*; "గీ. ఎదురఘనమైనయొకశిలఁగదియఁబోయి, బరులకండూతివాయబిట్టొరసికొనఁగ, నంటుకొనెనధ్వరాశ్వమగ్గుంటితోడ, జిగురుగడతాఁకిపిపాగిఁబుతగిలినట్లు." జై. ౪, ఆ.—6. కొండ. "సీ. నిడుదవెన్నగయాళితొడవుల దొరయుండుగుండుగండెసఁగఁగైచెండుచేసి." అచ్చ. సుం, కాం.

గుండుకొను. ద్వ. స. క్రి. చుట్టుకొను. "క. గుండుకొనిచూచుమానిసి,తండముఁదొలఁగించిఁద్రోచితత్కారివెసనా, చండాలుదెచ్చిభూజన, మండలికభిషిక్తుఁజేసెమంత్రులుచూడన్." వాసి. ౪, ఆ.

గుండుగిలు. వై. అ. క్రి. చుట్టువడు. "చ. జయముఁనఁబొంగి పెల్లుగనిశాచరవల్లభుఁడార్వసేనలున్. ప్రియమున నొక్క పెట్టనలిరేఁగిరవంబు చెలంగనార్చినన్, భయమునదండుగుండుగిలఁబాఱుచునాసమవర్తియెంతయున్, రయమునవుద్భటారుణతురంగసమూహరథాధిరూఢుఁడై." నిర్వ. ౫, ఆ.

గుండుగుత్త. వై. వి. సమస్తస్వాతంత్ర్యముతోడనిచ్చెడుగుత్త.

గుండుజెల్ల. ద్వ. వి. పెద్దగంప.

గుండుపులుఁగు. ద్వ. వి. చక్రవాకము.

గుండుములుపుగాఁడు. దే. వి. పక్షివిశేషము.

గుండె. దే. వి. 1. హృదయము; 2. మనసు. "గీ. తల్లిచనుఁబాలుగ్రుక్కఁడుతక్కినయవి, పుట్టెఁడునొకరూపనుభూమిఁబరఁగు, నుడువుబొంకయ్యెఁజన్నిత్తుఁదొడలమీఁద, గుండెవట్టియించుకలిడివుండవన్న." హరి. పూ. ౫, ఆ. (గుండియయొక్కరూపాంతరము.)

గుండెకాయ. దే. వి. హృదయము. "గీ. కపటధర్మకంచుకంబునవెలసిరి, గానిసత్యపురుషకారపరులు, కారుపాండుసుతులువారలనమ్మంగఁ. గాదు చేరగుండెకాయయుడిన." భార. కల్యా. ౨, ఆ.

గుండ్ర. వై. విశ. వృత్తియందు గుండ్రమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (ఉదా. గుండ్రకంబము, గుండ్రకడుపు. మొ.)

గుండ్రతుంగ. ద్వి. వి. (గుండ్రము+తుంగ.) ఒక దినుసు ముస్తె.

గుండ్రన. వై. వి. వర్తులత*.

గుండ్రము. వై. విశ. వర్తులము*. (కొన్ని యెడల వృత్తియందు అంత్యవర్ణలోపము. చూ. గుండ్ర.)

గుండ్రలు. దే. వి. బ. 1. పిండికొట్టిచెరుగఁగా వెనుక నిలిచిన ఉండలు; 2. చెఱకురాట్నపుకంబములు. "మ. ఇలకుఁ ద్రేఁగుగఁబండుతీరవనపుండ్రేక్షుచ్ఛటల్ తీపుల, గ్గలమైవ్రాల నురుస్వనంబులెసఁగంగాఁద్రిప్పురాట్నంపుగుం, డ్రలునాఁదేనెకొలంకులంబొరలిపారఁ జిచ్చుపంకేరుహాం, బులనాడెందొలుసంజఁదేఁటివలయంబుల్ తారఝుంకారముల్." ఆము. ౪, ఆ.

గుండ్రలుకొలుపు. దే. అ. క్రి. గుడ్లగూబకూయు. "క. కాకంబులువాపోయెడి, ఘూకంబులుసగరఁబగలుగుండ్రలుకొలిపెఁ." భాగ. ౧, స్కం.

గుండ్రాయి. ద్వి. వి. (గుండు+ఱాయి.) పొత్రము.

గుండ్రించే. దే. అ. క్రి. కడుపుత్రిప్పు.

గుండ్రింపు. దే. వి. గుండ్రించుట. (చూ. అరగింపు.)

గుంత. వై. వి. 1. పల్లము; (చూ. కొలి.) 2. పిఱిఁది మీఁదిగుంట*. (గుంటయొక్క రూపాంతరము.)

గుంద్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. నాగముస్తె; 2. ప్రేంకణముు. పుం. ము. కాకిచెఱకు.

గుంధము. సం. వి. అ. పుం. గుంజె.

గుంపించే. దే. స. క్రి. 1. కుప్పవేయు; "క. ఘూకంబులున్నగుహకును, వాకిటఁగాష్ఠములుఁదృణములుపడిగుంపింపఁ, వేకదిసిచిరంజీవియు, దాకొనితనముక్కుకొఱవిఁదగిలించెవడిఁ." పంచ. నా. 3, ఆ.—2. అతిక్రమించు. "క. చంపినఁజచ్చెదననుమను, గంపింపకయూరిపడుచకతినోక్తులనఁ, గుంపించెదుచావునకుం, దెంపరియైపదరువానితెఱఁగునఁగుమతీ." భాగ. ౭, స్కం.

గుంపు. దే. వి. ప్రాణిసమూహము.

గుంపెన. దే. వి. 1. ఒకానొకచెట్టు; "ఎ, గీ. పూగములనవ్యకుసుమపరాగమెసఁగె, నిమ్మలందునురేఁతపూరెమ్మలమరె, ననలఁబెనఁగొనెఁజిన్నిగుంపెనలగుంపు, లభినవంబగునావసంతాగమమున." కవి. ౨, ఆ.—2. విజృంభణము.

గుంఫనము. సం. వి. అ. న. మాటలులోనగువాని కూర్చుట.

గుంఫము. సం. వి. అ. పుం. 1. మాటలులోనగువాని కూర్పు; 2. బాహుభూషణము.

గుంఫించే. సం. అ. క్రి. గుంఫితమగు. "మ. అసురాధీశసమర్పితంబులగు లీలారామ కల్పద్రుమ, ప్రసవంబుల్ కనుగందవయ్యె విలసత్పాటీరగోరోచనా, ఘుసృణాలేపనపంకితాకలనమైగుంఫించె." భీ. ౪, ఆ.

గుంఫితము. సం. విశ. (అ. ఆ. అ.) కూర్పఁబడినది.

గుంబము. దే. వి. గుమ్మముయొక్క రూపాంతరము.

గుగ్గిలపుఁజెట్టు. ద్వి. వి. గుగ్గులువృక్షము.

గుగ్గిలము. వై. వి. గుగ్గులువృక్షపుబంక*.

గుగ్గిళ్లు. దే. వి. బ. ఉడుకవేసిన సెనగలులోనగునవి, అభ్యూషము.

గుగ్గులువు. సం. వి. ఉ. పుం. గుగ్గిలపుఁజెట్టు.

గుచ్ఛకము. సం. వి. అ. పుం. 1. పూగుత్తి; 2. నెమలిపురి; 3. పొద; 4. ముప్పదిరెండు మణులుగ్రుచ్చినహారము.

గుచ్ఛము. సం. వి. అ. పుం.——వై.——

గుజరీ, గుజిరీ. గ్రా. వి. సంతచోటు.

గుజస్తా. హిం. విశ. గడచిపోయిన.

గుజారతు. హిం. వి. వశము.

గుజెగుజె. దే. విశ. పీడితము. "క. గజముమదముడిగితిరుగుచు, గుజగుజయైగీఁకవెట్టఁగులిశము విడిచెఁ, భుజబలముచెడఁగనింద్రుఁడు, గజిబిజితోఁబొగడెనసురకడిమిజగంబుల్." భాగ. ౬, స్కం.

గుజెగుజెఱేకులు. దే. వి. బ. బాలికాక్రీడావిశేషము. "గుజగుజఱేకులఁగొబ్బిళ్లు." హంస. ౫, ఆ.

గుజెగుజెలాడు. దే. అ. క్రి. (గుజగుజలు+ఆడు.) త్రొక్కటపడు. "ద్వి. ఈవిధినుత్తరంబీకయొండొరులు, నీవునీవనిచూపినిఖిలసన్మునులు, గుజగుజలాడఁగన్గొని." హరిశ్చ. ౧, ఆ.

గుజెగుజెపోవు. దే. అ. క్రి. (గుజగుజ+పోవు.) త్రొక్కటపడు. "క. కాచినకావలివారలు, చూచిభయాకులతనొందిగ్రుక్కుచుఁదమలో, నోచెల్లయిట్లుదానవ, రాచూలికిఁజూలునిలిచెరాయొబ్బంగిఁ. క. అనిగుజగుజపోవుచు." భాగ. ౧౦, స్కం. ఉ. (రూ. గుజెగుజెలుపోవు. "క. గుజగుజలుపోవువారును, గజిబిజియగువారు." భాగ. ౯, స్కం.)

గుజేరాతి. వై. వి. 1. ఘూర్జరదేశము*; "సీ. గుజరాతికెంపులు గోమేధికంబు లుదారవజ్రములుము క్తాఫలములును." కవి. 3, ఆ.—2. ఘూర్జరభాష*. "ఎ,గీ.అరబిపారసిగుజరాతియారెమచ్చ, తెనుఁగుకన్నోజమొదలు గాఁదెలిసి వ్రాయ, దారిగన్నట్టివాఁడు."య.౧,ఆ.—3. నాట్యవిశేషము*. "సీ. నాట్యభేదంబుల నామముల్ దనరుజక్కిణి గుజరాతిపేరణులనంగ." ఆం, భా. ప్ర. నా.

గుజేరీ. వై. వి. ఘూర్జరదేశము. "రగడ. చెప్పఁజూపఁగ రాదుముక్కుసీమపీగుజరీతివాసులు." శుక. ౧, ఆ.

గుజేటి. దే. విణ. ధనవంతుఁడు.

గుజేరు. దే. వి. గిజురుయొక్క రూపాంతరము.

గుజ్జరాతి.వై.వి.ఘూర్జరదేశము*;2.ఘూర్జరభాష*. (గుజరాతియొక్క రూపాంతరము.)

గుజ్జరి. వై. వి. ఘూర్జరదేశము. "గుజ్జరినిద్రాతిగటీకురాళములలో." చంద్ర. (రూ.) గుజ్జరీ. (గుజరీయొక్క రూపాంతరము.)

గుజ్జు. యు. దే. వి. అనుకగురసద్రవ్యము. "సీ. గుజ్జుగాఁగాఁచిన గోక్షీరపూరంబు జమిలిమండెఁగలపైఁజల్లిచల్లి." వై. ౭, ఆ.—వై. 1. కుబ్జత్వము*; "చ. తనయులగుజ్జుమానుటకుఁ దండ్రిగనుంగొని సంతసించి." రా. బాల,కాం.—2.పొట్టియెద్దు*. "గీ.మేటిగుజ్జులఁగట్టినపాటబండి, యెక్కిశ్రీఘ్రంబమందకు నేగెనెలమి." హరి. పూ. ౫, ఆ.—3.గుంటకగుజ్జు*; 4. దూలపుగుజ్జు*; 5. బండిపటువుగుజ్జు*. విణ. పొట్టివాఁడు*. "గీ. గూనివాఁడును బిచ్చుకకుంటుగుజ్జుఁ. గొలుచులమ్ముచోఁగ్రచ్చులుకలపిసరకుఁ, దూఁచిపెట్టెడుచోటులఁదూన్కిపఱపి, పూర్వభవమునలోభంబుఁ బొందినారు." భార. అను. ౫, ఆ.—6. పాపటపుగుజ్జు.

గుజ్జుపొట్ల. వై. వి. పొట్టికాయలుగల పొట్లి.

గుజ్జుమామిడి. ద్వి. వి. పొట్టిదినుసుమామిడి, రాజామ్రము.

గుజ్జువేలుపు. ద్వి. వి. వినాయకుఁడు.

గుజ్జెనగూళ్లు. దే. వి.బ.1.(గుజ్జు+ఎన+కూళ్లు.)బాలక్రీడావిశేషము;(మా.అచ్చనగండ్లు.)2. బాలికలాడుకొనునప్పుడుగుసులగుతో వండినవంటకము.

గుటక. దే. వి.ఒకతూరినోటఁబోసికొని మ్రింగెడు నీళ్లులోనగువాని కొలఁది.

గుటగుట. దే. వి. 1. అన్నముడుకుటనీళ్లుత్రాగుటలోనగువానియందగుధ్వన్యనుకరణము; 2. పక్షికూఁత; "క. వడినుసికొలుపుటయునునిరు, గడలకొ వెనువంకఁజేరికఅవఁగఁగినుకకొ, గుడిసెదెసదిరుగుసెడమకొ, గుడిదిరుగుకొ సాగిపోకగుటగుటలడరకొ." య. ౨, ఆ. (ఒకానొకచో బుస్సుకూఁతగాను బ్రయోగింపఁబడియున్నది.)—3. పెద్దతికపుమాటలు. "వ. అటమటమ్మునవిద్యగానుటయుంగాకగుటగుటలుగురువుతో నా." స్వా. ౫, ఆ.

గుటుకు. దే. వి. గుటుక్కుయొక్క రూపాంతరము. "క. కటుకమగువిషమువిషధర, కటకంబగుకేలంబూని కౌతూహలియై, ఘుటికాసంసిద్ధుఁడురస, ఘుటికయునుంబోలెశివుఁడుగుటుకునమ్రుంగెకొ." భీ. ౪, ఆ. (ఆమ్రేడితమునందుగుటుగుటుకు. "గ్రుక్కగ్రుక్కకుగుటుగుటుకుమనుచు." భాగ. ౧౦, స్కం. పూ.)

గుటుక్కను. దే. అ. క్రి. (గుటుక్కు+అను.) చచ్చు.

గుటుక్కు. దే. వి. మ్రింగుటయందగుధ్వన్యనుకరణము. "ఈభువనకోటిగుటుక్కునమ్రింగిపుత్తునే." కవిక. ౨, ఆ.

గుట్ట. వై. వి. 1. చిన్నకొండ; "వ. నలునింబిలిచినీవువానరవీరులు తెచ్చి యందిచ్చుగట్టుగుట్టలం గట్టకట్టినవనధికట్టువడు." రామా. ౭, ఆ.—2. రాశి*; "వ. నెమ్ములరాసులును, ప్రేవులప్రోవులును, కండలతిప్పలును, శిరంబులగుట్టలునుంగలిగి." నిర్వ. శేషము. ౧౧, ఆ.—3. కొండ. "సీ.వలిమెట్టునాకుఁగావలిపట్టు దేవరసామిగుట్టకు నేను సామినౌడయ." చంద్రా. ౨, ఆ.

గుట్టు. వై. వి. మర్మము*.

గుట్టుఁబేడు. ద్వి. వి. (గుట్టు + పేడు.) రాజమిత్రముబయలుపడుట "చ. పలుకులువేయునేమిటికిఁబార్థివుఁడాత్మభుజాభృతక్షమా, తలముఁగుట్టుఁబేడుబహుధాయరయించియడంచిచలా, త్కులగమిలో మెలంగుపురుషుండునుబోలెఁశంకనించుచుకొ, మెలఁగఁడయేనిరాజఫలమేయదిరాజ్యముదుఃఖలబ్ధికే." ఆము. ౪, ఆ.

గుట్టుసాకిరి. వై. విణ. వాదితనవ్యవహారముగెలుచుటకొఱకురప్పింపఁగావచ్చి డాఁగియుండి ప్రతివాదియొక్క మాటలన్నియుఁజక్కఁగావిన్నసాక్షి.

గుడ. సం. వి. ఆ. స్త్రీ. 1. గుళిగ; 2. జెముడు?; 3. ద్రాక్ష?. అ. పుం. ము. 1. బెల్లము; 2. గోళి; 3. ఏనుఁగుకవచము.

గుడక. వై. వి. 1. టెంకాయబుఱ్ఱలోనగునది*; 2. పాలడ*. "క. చాలఁగనిచ్చలువెన్నయుఁ, బాలుఁగుడకగొనితల్లిపట్టికిసెలవిఁక, వ్రేలిడియింతిం తియకాఁ, గ్రోలించునువెరవుతోడరుచిగొలుపు క్రియన్." హరి. పూ. ౫, ఆ.

గుడత్వక్కు. సం. వి. చ్. న. లవంగపుఁబట్ట.

గుడత్వచము. సం. వి. అ. న.——పై.——

గుడపుష్పము. సం. వి. అ. పుం. ఇప్ప?.

గుడఫలము. సం. వి. అ. పుం. గోనుగు?.

గుడాక. సం. వి. ఆ. స్త్రీ. నిద్ర.

గుడాకు. మి. వి. గ్రా. (గుడము+ఆకు.) బెల్లముతోఁజేర్చి మర్దించిన పొగాకు.

గుడాకేశుఁడు. సం. వి. అ. పుం. 1. అర్జునుఁడు; 2. శివుఁడు.

గుడారము. వై. వి. వస్త్రముచేత నేర్పఱచిన యిల్లు, దూష్యము.

గుడారు. వై. వి. గుడారము. "క్రొందళుకుఁజందురు కావిగుడారులో." భాను. ౨, ఆ.

గుడి. యు. దే. వి. 1. ఇకారరూపాంతరనామము; 2. పరివేషము; "సీ. పరివేషనామంబుభాసిల్లుచుండునుగుడియనఁబరిదినాగుడుసునాఁగ."ఆం, భా. ప్ర. ది.—3.వలయాకారపురేఖ. "గీ. పరిఖగుడివోలెఁదనచుట్టుఁదిరిగియుండ." నై. ౨, ఆ. —వై. దేవాలయము*.

గుడిక. సం. వి. ఆ. స్త్రీ. గుళిగ.

గుడికట్టు. దే. వి. గ్రామము నాలుగుదిక్కుల యెల్లల యేర్పాటు.

గుడిగొను. దే. అ. క్రి. క్రమ్ము. "క. పదముడిశల్యునిఁ దొడిఁబడఁ, బుడిసిటిపట్టుగను బట్టి పుడమిపడంకన్, బడవైచినయెడనొడలన్, గుడిగొనదుమ్మతఁడుతుడిచికొనుచుంజనియెన్." పాంచా. ౨, ఆ. "క. అడలుచుఁబెదవులుతడుపుచు, గుడిగొనుకన్నీరుగ్రుక్కికొనుచున్ మదిలో, నుడుగనిసెంజిలినేమియు, నుడువనియద్మానధనుఁగనుంగొనివేగన్." స్వా. 3, ఆ.

గుడిగి. దే. వి. మోఁకాలివఱకుఁదొడిగికొను వస్త్రకవచము.

గుడిగుడి. దే. విణ. అల్పము. "ద్వి. గుడిగుడికన్నీరుగ్రుక్కుచు." హరిశ్చ. ౨, భా.

గుడిచేట్టు. దే. వి. చంద్రసూర్యులకుఁ జుట్టునేర్పడు మండలాకారము, పరివేషము.

గుడిజెల్ల. ద్వ. వి. మత్స్యవిశేషము.

గుడిదిరుగు. దే. అ. క్రి. (గుడి + తిరుగు.) గుండ్రముగాతిరుగు. "క. కుమ్మరిసారెగుడిదిరుగుకొలఁదుడువిధమునన్." జై. ౫, ఆ.

గుడిసె. యు. దే. వి. ఒకవిత్తు చింతపండు. వై. స్తంభములుఁగోడలునుంచక మెల్లెలునాటితృణాదులతో నేర్పఱచిన చిన్నయిల్లు.

గుడుక్కు. దే. వి. గుటుక్కుయొక్క రూపాంతరము. (ఆమ్రేడితమునందు గుడుగుడుక్కు. "ద్వి. ఉడుగక వెడలు నిట్టూర్పులతోడ, గుడుగుడుక్కున మ్రింగుగ్రుక్కిళ్లతోడ." నళ. ౫, భా.)

గుడుఁగుడు. గ్రా. వి. 1. చిన్నహుక్కా; దే. వి. 2. పరుగెత్తుటయందగు ధ్వన్యనుకరణము. (గుడుగుడుమని పరుగెత్తివచ్చెను.)

గుడుగుడుగుంచెములు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. (చూ. కుందెనగుడి.)

గుడుగురావిలము. దే. వి. పక్షివిశేషము. "సీ. కారోకడిగముఁలక్రొక్కారంపు సందడిగుడుగురావిలములబెడఁగుసోరము." చంద్రా. ౨, ఆ.

గుడుసరి. దే. విణ. (గుడుసు+అరి.) కపటముగలవాఁడు.

గుడుసు. దే. వి. పరివేషము. (చూ. గుడి)—విణ. గుండ్రము. "సీ. గుడుసైనపూవింటఁగూడికమ్మనితూపుకటకాముఖపుఁగేలఁగరముమెఱయ." నై. ౭, ఆ.

గుడుసుకయిదువు. దే. వి. విష్ణుచక్రము. (ఇట్లు గుడుసువాలుఁ. మొ.)

గుడుసువడు. ద్వ. అ. క్రి. (గుడుసు+పడు.) గుండ్రమగు. "క. మార్వీటంకృతిదిక్కులఁ, బర్వఁగ శార్ఙ్గంబుగుడుసువడఁదిగుచుచు."హరి.ఉ.౨,ఆ.

గుడూచి. సం. వి. ఈ. స్త్రీ. తిప్పతీఁగ.

గుడ్డ. దే. వి. వస్త్రము.

గుడ్డము. దే. వి. చేను. "క. ఎడ్డెతనపుఁగైసేఁతల, రడ్డులునడచిరిపురస్సరద్భార్యముగా, గుడ్డంబుచక్కఁగట్టం, బడ్డమహాశక్తిదివ్యభవనంబునకున్." పాండు. 3, ఆ.

**గుడ్లాము.** దే. వి. గుడ్లముయొక్కరూపాంతరము.

**గుడ్డి.** దే. వి. అట్టచెమ్మ ఆటలో వెలికిలఁబడ్డ ఒంటి కాయ.

**గుణకము.** సం. వి. అ. పుం. పెంచెడులెక్క.

**గుణపడు.** మి. అ. క్రి. (గుణము+పడు.) చక్కఁబడు.

**గుణము.** సం. వి. అ. పుం. 1. ఐశ్వర్యాది; (ఐశ్వర్యము, వీర్యము, యశము, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము. ఇవి భగవంతుని షడ్గుణములు.) 2. త్యాగశౌర్యాది; 3. త్రాడు; 4. వడము; 5. అల్లెత్రాడు; 6. మడుఁగు; (ఇనుమడుఁగు, ముమ్మడుఁగు. మొ.) 7. శబ్దాది; (శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము. ఇవి యైదు భూతగుణములు.) 8. శుక్లాది; 9. సంధ్యాది; (ఇవి యాఱు—సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైధము, ఆశ్రయము.) 10. సత్త్వాది; (ఇవి మూఁడు—సత్త్వము, రజస్సు, తమస్సు. వీనికి శక్తులనియు నామాంతరము కలదు.) 11. ఇంద్రియము; 12. అప్రధానము; 13. అలవాటు. (కావ్యగుణములు—శ్లేషము, ప్రసాదము, మాధుర్యము, సౌకుమార్యము, సమత, అర్థదీపనము, ఔదార్యము, కాంతి, ఓజస్సు, సమాధి, అని పది.)

**గుణవృక్షకము.** సం. వి. అ. పుం. ఓడకంబము.

**గుణాలయము.** సం. వి. అ. పుం. గుడారము.

**గుణి.** సం. వి. న్. పుం. విల్లు. విణ. గుణముగలవాఁడు.

**గుణించు.** సం. స. క్రి. గుణకముచేయు.

**గుణితము.** సం. వి. అ. న. హల్లులతో అచ్చులను హల్లులనుజేర్చి చెప్పుట. విణ. గుణింపఁబడినది.

**గుణుఁడు.** సం. వి. అ. పుం. భీముఁడు. విణ. వంటవాఁడు.

**గుణ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) గుణింపఁదగినది.

**గుత్త.** వై. వి. ఫలప్రదమైన యొకసొత్తును ఆ సొత్తుగలవానికి తత్ఫలార్థము తగిన ధనమిచ్చి తన యనుభవమున నుంచుకొనుట.

**గుత్తకాఁడు.** వ్య. విణ. గుత్తయొత్తినవాఁడు.

**గుత్తగొను.** వ్య. స. క్రి. (గుత్త+కొను.) గుత్తయొత్తు. "క. ఇక్కలికిగుత్తగొనుఁబో, తక్కకదివినిమిషమున్న దైవతవిటులకె." కళా. 3, ఆ.

**గుత్తము.** వై. వి. 1. కచ్చితము*; (గుత్తపుకంచెల.) 2. బిగువు*. కా. 3, ఆ.

**గుత్తి.** వై. వి. 1. పూవులోనగువానిగుచ్ఛము; 2. చీలమండ. "సీ. గుత్తులకొలఁదికిఁగృత్తంబులైపడియున్న పాదంబులొక్కొక్కచోట." నిర్వ. ౪, ఆ.

**గుత్తికగువ్వ.** ద్వ. వి. గువ్వగుత్తిక?.

**గుత్తికవ్వము.** ద్వ. వి. వెదురుకొయ్యచివరనుచీల్చి దారముతోఁగట్టి యేర్పఱచిన కవ్వము.

**గుత్తిపండ్లు.** ద్వ. వి. బ. గుత్తులుగుత్తులుగా పండెడు ఒక విధమైన పండ్లు.

**గుత్తిమల్లెలు.** వై. వి. బ. ధాన్యవిశేషము. "గీ. పచ్చగన్నెరుకస్తురిపట్టియాలును, గుత్తిమల్లెలఁద్రాడిగాఁగూర్చిమఱియు, సకలజాతులఁబోషింపశక్తిగలిగి, వాలిరులుచైత్రుఁదెగడుదురప్పురమున." భాను. ౧, ఆ.

**గుత్తిపడు.** వై. అ. క్రి. (గుత్తి+పడు.) ముడుఁగు. "ఎ. గీ. కొన్నిదేశంబులివముచేగుత్తిపడియె." కా. ౧, ఆ.

**గుత్సకము.** సం. వి. అ. పుం. పూగుత్తి, గుచ్ఛకము.

**గుత్సము.** సం. వి. అ. పుం. 1. వరిలోనగువానిగంట; 2. పూగుత్తి; 3. ముప్పదిరెండుమణులుగ్రుచ్చినహారము; 4. గండివనము?.

**గుదగుదలాడు.** దే. అ. క్రి. (గుదగుదలు + ఆడు.) డగ్గుత్తికతోనేడ్చు.

**గుదము.** సం. వి. అ. న. పాయువు, మూడి.

**గుది.** దే. వి. 1. ఆకులులోనగువానిగ్రుచ్చినసరము; "క. అనియొకగుదిమీలనడుమ, నెనయంగాఁదూఱికఱచియిరుదొడలఁద్రా, డొనరంగఁబట్టిక్రొఁగ్రుచ్చినచందము దోఁప మూర్ఛఁజెందిన భగికె." భార. శాం. 3, ఆ.—2. గుత్తి. "క. పడఁగ జేఁగిచికిలిచేసిన, మదనునినుఁదూపుఁదెగలుబుధుఁడిగురులమేల్, పొదులనిడెనఁగమొగ్గల. గుదులుతలిరుఁగొమ్మలందుగుదిగొనిపొదలెక్." ఉ. రా. ౨, ఆ.

**గుదికాలు.** దే. వి. చీలమండకుదిగువనుండుపాదము వెనుకటిభాగము, పార్ష్ణి.

**గుదికూర్పు.** దే. వి. (చూ.) గుంఫనము.

**గుదిగట్టె.** దే. వి. (గుది+కట్టె.) దుష్టమగుగోవుమెడలుగాఁగలవానికి మెడనుగట్టెడు కొయ్య.

**గుదిగుంజెలు.** ద్వ. వి. బ. పసులదొడ్డిలోనగువాని ద్వారమందు నిలువుగాఁ బాఁతిన కంబములు.

**గుదిగొను.** దే. అ. క్రి. (గుది+కొను.) 1. అతిశయించు; "ద్వి. మదివికారముగాంచెమైచెమ్మరించె, గుదిగొనెవలపుకోర్కులుసందడించె." విష్ణు. పూ. ౩, ఆ.—2. దట్టమగు; "క. మొగ్గల, గుదులుతలిరు

గొమ్మలందు గుదిగొని పొదలెన్." ఉ, రా. ౬, ఆ.—3. మూటకట్టుగాఁ గూలఁబడు. "మ. మదిరాపానవికారచేష్టలఁగడున్ మత్తిల్లి రక్తాక్షుఁడై, యెదురుందన్ను నెఱుంగలేకమిగులన్ హేయంబువాటిల్లఁగాఁ, బదముల్ తొట్రుపడంగఁజొక్కుచుమతిభ్రాంతిన్ బడంబొఱచున్, గుదిగొంచున్ వెడపాటఁబాడుచు దురుక్తుల్ ప్రేలుచున్ సోలుచున్." హరిశ్చ. ౮, ఆ.

గుదిత్రాడు. దే. వి. దూడకాలికిఁగట్టుత్రాడు.

గుదిత్రోయు. దే. స. క్రి. కాళ్లుకట్టిత్రోయు. "క. ఇదెయిచ్చెదనదెయిచ్చెదఁ, బదపదఁడని యాసఁజూపిపలుదెఱఁగులనా, హృదయమునొప్పించి తివిఁక, గుదిత్రోసెదనేఁడునిన్నుఁగొంకకయుచటన్." హరిశ్చ. ౮, ఆ. "ద్వి. అటఁజనుచుండమిథ్యాపరిభ్రాంతి, నటియించిసోలుచునక్షత్రకుండు, గుదిత్రోసినట్లువాఁగురునాథయనుచుఁ, జదికిలఁబడిహరిశ్చంద్రుతోననియె." హరిశ్చ. ౨, భా.

గుదియ. వై. వి. 1. నాలుగుమూరలనిడివిగలదండము; "క. ఇదె ప్రేఁపయడవిప్రమథులు, ముదమునశతకోటిసంఖ్యముసరికొనిప్రియం, బుదలిర్పదీనఁగోలలు, గుదియలుఁగైకొండ్రుతమకుఁగోరిధరింపన్." హరి. ఉ. ౬, ఆ.—2. గుదిగఱ్ఱ.

గుదియకఱ్ఱలు. ద్వ. వి. బ. గుదిగుంజలకడ్డముగాఁజొప్పించెడు కఱ్ఱలు.

గుదియతాలుపు. ద్వ. వి. యముఁడు, దండధరుఁడు. "క. కొండలుఁపిండియొనర్తునొ, గండెసఁగఁగనలువగ్రుడ్లు గాలింతునొవే, చెండుదునొగుదియతాలుపు, కండలుగుండియలువేల్పుగమినొంపుదునో." అచ్చ. సుం, కాం.

గుదిపడు. ద్వ. అ. క్రి. (గుది+పడు.) కట్టుపడు. "నిశ్శేష్టం బదద్వంద్వముల్ గుదిపడ్డన్ బెగడొందియున్." భార. విరా. 3, ఆ.

గుదె. వై. వి. గుదియయొక్కరూపాంతరము.

గుద్దలి. వై. వి. వేళ్లు మొదలగునవి పెల్లగించెడు సాధనము, కుద్దాలము.

గుద్దలించు. వై. స. క్రి. 1. గుద్దలితోఁ బెల్లగించు; 2. వెదకు. "సీ. దండపాణ్యాసవభాండేశ్వరంబులుఁ గుక్కుటస్థానంబుగుద్దలించి." కాశీ. ౨, ఆ.

గునగున. దే. వి. వేగముగానడచుటయందగుననుకరణము.

గునపనక్కడి. ద్వ. వి. వనకుక్కుటము.

గునపము. దే. వి. గడ్డపాఱ, ఖనిత్రము. "ఎ, గీ. బలితంపుటినుపకట్లమరనొప్పు, వెండిగునపంబులో కాకవెండికట్ల, యినుపగునపంబులో యనఁదనరికురిసె, నెంతయును జిత్తజల్లుగనేఁదుముండ్లు." కళా. ౬, ఆ.

గునామొలనూలు. దే. వి. బిడ్డలుఁకట్టుకొనెడు కటిసూత్రవిశేషము. "ఉ. కెంపులరావిరేకజుమికీల్ పులిగోరును జందమామసొ, న్నంపుసరాలుగాజులుఁ గునామొలనూల్ రవగట్టె లందియల్." భానుమద్విజయము. ౧, ఆ.

గునియు. దే. అ. క్రి. 1. నర్తించు; "వ. కావళ్లుమోచికొని యెుండొరులతోడం బంతంబులాడుచు గునిసిగునిసినడుచువారును." (ఇక్కడగునిసియనఁగా ఇటునటుప్రక్కకుమేనువాల్చియనుట.) వి, పు. ౭, ఆ.—2. కులుకు. "సీ. నేలజీరాడకకేలఁగుచ్చెలుపూను కొనియూడిగపుఁజెలుల్ గునిసినడవ." శుక. ౧, ఆ.

గునిసాడు. దే. అ. క్రి. (గునిసి+ఆడు.) 1. నర్తించు; "ఉ. క్రొన్నెలవంటినెన్నుదుటఁగుంతలముల్ గునిసాడుచున్నయా, చిన్నికుమారుఁగాంచి." బ్ర. ౫, ఆ.—2. కులుకు. (చూ. గునియు.) (దీనిమొదటిరూపముగునిసియాడు. "ద్వి. కొండలుతలసెత్తిగునిసియాడుచును." రా. యు, కాం.) (చూ. ఈఁగాడు.)

గునుకు. దే. అ. క్రి. కొద్దిపరువుగా పరువెత్తు. వి. తృణవిశేషము. బ. తృణధాన్యవిశేషము.

గునుపు. దే. వి. విలాసవిశేషము.

గున్న. వై. వి. పిల్ల. (ఏనుఁగుగున్న, పందిగున్న, మామిడిగున్న. మొ.)

గున్నంగి. దే. వి. పక్షివిశేషము.

గుప్తకేళి. సం. వి. ఈ. స్త్రీ. బాలక్రీడావిశేషము, దాఁగిలిమూఁతలు.

గుప్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కాపఁబడినది; 2. దాఁచఁబడినది.

గుప్తరాగము. సం. వి. అ. పుం. కేతకి, మొగలి.

గుప్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. కాపాడుట; 2. దాఁచుట; 3. చెఱసాల; 4. పాఁతఱ.

గుప్పళించు. దే. స. క్రి. 1. వస్త్రము మొదలగువానిఉఁకుము; 2. పుక్కిలించు; "సీ. నవనీటగుప్పళించెనుగళావతియోర్తుజిగిమోవిబీఁటికలెగయుకుండ." భాను. ౨, ఆ.—3. ఉంచు. "గీ. అప్పు

డొప్పలకుప్పకకుప్పవిభులఁ, దప్పకందఱఁబ్రభులఁగందర్పనిభుల. గొప్పకన్నులఱెప్పలఁ విప్పికనుచు, నిప్పపూదండఁగొనినడల్ గుప్పళించె." పాంచా. ౨, ఆ.

**గుప్పించు.** దే. స. క్రి. 1. (బాణాదులను) ప్రయోగించు; "మ. కల్పాంతశిఖి, రవభీమాకృతి నేచిభీష్ముఁడుశరవ్రాతంబుగుప్పించినన్." భార. భీష్మ. 3. ఆ.—2. కురియు. "క. రప్పించియధికసంభ్రమ. ముప్పొంగఁగనందగోపుఁడున్న వ్రజముపై, దెప్పరపుఱాలవర్షము, గుప్పింపుఁడు గోగణములు గోపులు మడియన్." వి, పు. ౬, ఆ.

**గుప్పిలి.** దే. వి. పిడికిలి. "వ. గొప్పకన్నుఁగవఁగప్పురంపురజంబొప్పఁగగుప్పగుప్పనగుప్పిళ్లకొలందిగఁగుప్పుచు." రసి. 3, ఆ.

**గుప్పు.** దే. స. క్రి. 1. ఉంచు; "ఉ. చెప్పినఁబ్రీతులైయతనిఁజెచ్చెరఁదోఁకొనిపోయిబూరెలుం, బప్పునునెయ్యుఁబాయసముఁ బక్వఫలాదులు నేత్రతృప్తిగా, గుప్పిరిముక్ పథశ్రమముగూరిన మేనికిదప్పిదీఱ." భో. ౬, ఆ.—2. చల్లు; "సీ. పుయ్యారె కెమ్మోవిఁబూఁదేనెసతులార గుప్పరేకపురంబుకొమ్మలార." చంద్ర.—3. (దూడపాలు త్రాగునప్పుడు తలతో) పొదుగును పొడుచు; (చూ. అంబే.)—4. (బాణాదులను) ప్రయోగించు; "మారుతరూపులంగుప్పితివీవు." ఉ, రా. ౬, ఆ.—5. విసరివైచు. "గుదియలగుండ్లను జదియగుప్పియదరంటగడియలో నాఁగిపట్టుదుననువాఁడును." హరి. పూ. ౬. ఆ. — వి. ఎగయుటయందును మ్రోయుటయందును వాసనకొట్టుటయందును వైచుటయందునునగుననుకరణము. (పొగగుప్పనలెగయుచున్నది.) "దేవదుందుభులుగ్రక్కున ధింధిమినాదవైఖరిన్ గుప్పనమ్రోసె." శశాం. ౨, ఆ. "వ. కప్పురంపుటనంటిగుప్పనంగప్పుతావుల." ఉ, రా. ౬, ఆ. "సీ. గుప్పుగుప్పనమోచికొనియున్ననలలతోఁ బలలంపుఁబొత్తరల్ పాఱవైచి." స్వా. ౮, ఆ.

**గుప్పున.** దే. ద్ర. క్రి. విశే. శీఘ్రముగా. "ఉ. అప్పుడు వేళగాఁదలిసియచ్చెరువారఁగ మోడ్పుకేలుతో, గుప్పునమ్రొలవాలి." రామా. ౬, ఆ.

**గుబక.** వై. వి. తలుపుగందపట్టెమీఁదిగుబ్బ.

**గుబగుబ.** దే. వి. కోకిలధ్వనియందగుధ్వన్యనుకరణము. "సీ. గుబగుబమనిపల్కు-కోవెలపల్కులవినియవి నేర్తువాయనుచునవ్వ." శశాం. ౨, ఆ.

**గుబాలు.** దే. వి. 1. గుబేలుయొక్క రూపాంతరము, "గుబాలునన్ లకుముకుల్ క్రిందైపడున్ లేచు." ఆము. ౧, ఆ. — 2. పగులుటయందగుధ్వన్యనుకరణము. "దరులుగుబాలునంబగుల." శేష. ౧. ఆ. (ఇది యీ కారమధ్యమనుటకుఁ దగినప్రయోగము దొరకినదికాదు.) (చూ. గుబేలు.)

**గుబాళించు.** దే. అ. క్రి. వాసనకొట్టు. "వ. మించుపూపుతావులగుబాళించుతనపర్ణశాలఁబ్రవేశించె." ఉ, రా. ౬, ఆ.

**గుబిలి.** దే. వి. 1. ఒకానొకశకునపుపక్షి, కనకాక్షి; "ఎ, గీ. వెలయుఁగనకాక్షిసకినాలపులుఁగుగుబిలి, పైఁడికంటినా." ఆం, భా. ద్వి. సిం.—2. గులిమి.

**గుబుకు.** దే. స. 1. క్రి. గుముకుయొక్క రూపాంతరము.

**గుబురు.** దే. వి. 1. దట్టము; 2. సమూహము. "ద్వి. సరసమందారమంజరులుగోయుచును, గురివెంద పందిళ్లగుబురుడాయుచును." విష్ణు. పూ. ౨. ఆ.

**గుబులు.** దే. వి. 1. గుప్పనికొట్టువాసన. "క. చొక్కపునడతోఁదలుకుం, బుక్కా-గుమగుమలుతట్టుఘనుఁగుగుబులునల్, దిక్కులనిండఁగనెంతయుఁజక్కనికాళిందియనెడుజవ్వనివచ్చెన్." చమ. ౧, ఆ. 2. భయము, గుండెకొనుట.

**గుబులుకొను.** దే. అ. క్రి. గుప్పనివాసనకొట్టు. "క. మేనన్, గొనబగు జవ్వాది తావి గుబులుకొనఁగన్." శశాం. 3, ఆ.

**గుబుసు.** దే. వి. కిటుకు, కపటము.

**గుబేలు.** దే. వి. పడుటయందగుధ్వన్యనుకరణము. "క. మఘవాహితుఁడున్, దనపాటునఁదేరొఁగన్, బెనుగుబ్బలిపడినగతిగుబేలునఁబడియెన్." రామా. ౭, ఆ.

**గుబ్బ.** వై. వి. 1. కుచము*; 2. గొడుగుమీఁదిగుబ్బ*; "సీ. మండువేసవినాటిమార్తాండబింబంబుగోడిగించుపసిండిగుబ్బతోడ." కాశీ. ౮, ఆ.—3. తలుపుగందపట్టెమీఁదిగుబ్బ*; "గీ. ఉదుటుగుబ్బలఁగలతల్పుటురముఁజూచి." ఆము. ౨, ఆ.—4. బాణమునలుఁగుక్రిందిగుబ్బ*. "వ. ఒకటి రెండు మూడుగొరకలనెఱకలుగాఁడగుబ్బకొలందికిందిగవైచి." స్వా. ౮, ఆ.—విశే. గుండ్రమైనది*. "గుబ్బచనుంగవ."

గుబ్బటిల్లు. వై. అ. క్రి. తిరుగుడువడు*. (రూ. గుబ్బటిలు. "చ. కలఁగెఁబయోనిధుల్ గిరులుకంపము నొందెఁజలించెభూమిది. క్కులువడఁకెన్ వియత్తలముగుబ్బటిలెన్ గ్రహతారకంబులు, త్తలపడఁజొచ్చె." భో. ౪, ఆ.)

గుబ్బతిల్లు. వై. అ. క్రి. 1. అతిశయించు*; "ఉ. సప్పదీ. మాలికఁదోఁచునబ్బురపుమబ్బులయుబ్బులుగుబ్బతిల్లఁగన్." వసు, ౧, ఆ.—2. ఉప్పొంగు*. (రూ. గుబ్బతిలు. ఉప్పొంగుటకు.—"క. బాలహరిణములఁజూచిన, క్రోలుపులిగతిన్ మనంబుగుబ్బతిలఁగ." జై. ౮, ఆ.)

గుబ్బన. దే. ద్ర. క్రి. విణ. శీఘ్రముగా. "చ. గుబ్బనఁబతిచిత్తవృత్తిఁగనిభట్టి విదర్భుఁడుఁదాను వేడుకన్." విక్ర. ౪, ఆ.

గుబ్బలాఁడి. ద్వ. వి. (గుబ్బలు+ఆఁడి.) యౌవనముగల ఆఁడుది, యువతి.

గుబ్బలి. దే. వి. కొండ, పర్వతము.

గుబ్బలివిలుకాఁడు. దే. వి. శివుఁడు, శైలధన్వుఁడు. "క. అబ్బాటువువాలుదాల్పను, గుబ్బలివిలుకాఁడునంచగుజ్జుపుజోదున్, గొబ్బుననడ్డమువచ్చిన, నిబ్బరముగఁబోర నేఁడునినుఁదెగటార్తున్." అచ్చ. యు, కాం.

గుబ్బసరము. వై. వి. పెక్కుదినుసుమణులుగ్రుచ్చినసరము. "సీ. సరివాటుగాఁగఁగేసరములుగ్రుచ్చినగురివెందవిరిగుబ్బసరముతోడ." కళా. 3, ఆ.

గుబ్బిక. దే. వి. పత్తులులోనగువానికిఁబెట్టెడిపేరు. "గీ. జారకిరిపక్షులకుమోటుసరసశశక, ములకుఁగట్టువయుపకాంతముఖ్యచటక, సంఘములకునుగుబ్బిక." హంస. ౨, ఆ.

గుబ్బిరి. దే. వి. ఒకానొక చెట్టు.

గుబ్బిలికాఁడు. దే. వి. పక్షివిశేషము, (చూ.) గుబిలి.

గుబ్బు. దే. వి. గుండెయదురుటయందగుననుకరణము. "క. నిబ్బరపుదప్పిమంటలు, ప్రబ్బినధృతిలేక నేత్రపదహస్తంబుల్, గొబ్బునవిష్ఫృతములగుమను, గుబ్బనుచున్నట్టికూఁతఁగూలెన్నే లన్." భాగ. ౧౦, స్కం. పూ. (చూ. గుబ్బుమను.)

గుబ్బుమను. దే. అ. క్రి. (గుబ్బు+అను.) గుండెగుబ్బనియదరు. "దానను గుండెగుబ్బుమన." కళా. ౪, ఆ.

గుబ్బురను. దే. అ. క్రి. (గుబ్బు+అను.)——పై. ——"గీ. దండునులభంబెపురుషవేదండులకును, గూచికావింపగుండియల్ గుబ్బురనఁగ." రా, వి. ౨, ఆ. (ఆమ్రేడితమునందుగుబ్బుగుబ్బురను. "వ. గుబ్బుగుబ్బురను నాదంబుల బ్రహ్మాండంబులన్నియు నదిరె." వీర. 3, ఆ.)

గుబ్బెత. వై. వి. (గుబ్బ+ఎత.) గుబ్బలాఁడి, యువతి.

గుమగుమ. దే. వి. 1. గుమగుమయను వాసన; (చూ. గుబులు.) 2. వాసనకొట్టుటయందగుననుకరణము. "గుమగుమవలచు."

గుమాను. హిం. వి. అనుమానము.

గుమాస్తా. హిం. వి. క్రింది యుద్యోగస్థుడు.

గుమి. దే. వి. గుంపు, సమూహము.

గుమికాఁడు. దే. వి. కాకి, వాయసము.

గుమితి. దే. వి. గుమ్మితియొక్కరూపాంతరము. "శా. బాణాంకిణిఁబెద్దకత్తిగుమితిన్ బాణాసనప్రౌఢిమన్, ద్రోణాచార్యులకైనఁబల్కుదురు నేర్పల్." శశాం. ౨, ఆ.

గుమిలి. దే. వి. పక్షివిశేషము. (గుబిలియొక్కరూపాంతరము.)

గుముకు. దే. స. క్రి. పిడికిటితో పొడుచు.

గుముడు. వై. వి. గుమ్ముడుయొక్కరూపాంతరము.

గుమురు. దే. వి. గుబురుయొక్కరూపాంతరము. (సమూహమునకు.— "ద్వి. తమతమవీధులఁదమదులోఁగిళ్ల, గుమురులుగాఁగూడికొనిపల్కిరిపుడు." రా. యు, కాం.)

గుమ్మ. దే. వి. పాలుపిండునప్పుడువచ్చెడుధార. "గుమ్మెఁడుపాలనాసుతునకుంబరతృప్తిజనించుఁగాని." భో. ౪, ఆ.

గుమ్మఁడు. దే. విణ. అలంకరించుకొనువాఁడు.

గుమ్మటము. దే. వి. దీపముంచెడు కాకితపుగూఁడు.

గుమ్మడి. వై. వి. కూశ్మాండము†.

గుమ్మతీలు. దే. వి. బ. చెవితమ్మెలనుంచెడుసొమ్ము.

గుమ్మము. దే. వి. వాకిలి, ద్వారము.

గుమ్మితి. దే. వి. ఆయుధవిశేషము. "తమ్మిగుమ్మితక్ జేకొనివీఁకమైమొనలుచిమ్మఁదొడంగెను." శశాం. 3, ఆ.

గుమ్ము. దే. స. క్రి. పిడికిటితో పొడుచు. వి. 1. పిడికిటిపోటు; 2. వాసనకొట్టుటయందగుధ్వన్యనుకరణము. "ద్వి. నెమ్మేనఁబొదలలోనిండినవిరుల, గుమ్మునజడివాన గురియించుదాని." అభిమన్యు ద్విపద.

గుమ్మడు. వై. వి. శ్రీపర్ణి. (ఇది ద్వివిధము—పెద గుమ్మడు, పినగుమ్మడు అని. ఇదే పెదగుమ్మడు.)

గుమ్మెట. దే. వి. వాద్యవిశేషము, తుడుము.

గుమ్మెత. దే. వి.——పై.——

గుమ్మెతకాఁడు. దే. వి. గుమ్మెతవాయించువాఁడు. "గుమ్మెతకానికందలున్." హంస. ౫, ఆ.

గురగుర. వై. వి. పందికూఁత. "సీ. గురగురధ్వనులునిర్భరముగఁ బర్విన నెలసి బ్రహ్మాండంబు నెదురుమ్రోయ." హరి. పూ. ౮, ఆ.

గురణము. సం. వి. అ. న. యత్నము, (రూ. గూరణము.)

గురిగి. దే. వి. ఆఁడుపడుచులు ఆడుకొను చిన్న పిడత.

గురిగింజె. ద్వ. వి. (గురిజె+గింజె.) గురిజపూస, శిలాపాకి.

గురిజె. వై. వి. గుంజ. (ఇది త్రివిధము—ఎఱ్ఱగురిజ, తెల్లగురిజ, నల్లగురిజ అని. ఇదే యెఱ్ఱగురిజ.)

గురివెంద. ద్వ. వి. (గురిజె+వెంద.) గుంజ.

గురు. దే. వి. మృగవిశేషము, గవయము. "ఎ, గీ. గురులఁదార్కొనివక్రవాగురులఁ దార్చి." భల్లా. 3, ఆ.

గురుగు. దే. వి. ఒకదినుసు కూరాకుచెట్టు, భూరుండి.

గురుజె. దే. వి. ఒకదినుసు కూరాకుచెట్టు, ఉత్తుండి.

గురువు. ఉభ. దే. వి. వేగపుపరుగు. (మా. గురువుదేఱు, గురువులువాఱు.) సం. ఉ. పుం. 1. ఉపాధ్యాయుఁడు; 2. బృహస్పతి; 3. కులము పెద్ద; 4. తండ్రి; 5. తండ్రితోఁడఁబుట్టినవాఁడు; 6. తాత; 7. అన్న; 8. మామ; 9. మేనమామ; 10. రాజు; 11. కాపాడువాఁడు. విణ. 1. అలఘువు; 2. గొప్పది; 3. భరింపఁగూడనిది.

గురువుదేఱు. దే. అ. క్రి. (గురువు+తేఱు.) జిఱ్ఱున చిప్పిలు. "త్రెవ్వెడుగంటులన్ గురువుదేఱుమనెత్తురు రాకమున్న." రా. యు, కాం.

గురువులువాఱు. దే. అ. క్రి. (గురువులు+పాఱు.) 1. వేగపుపరువుగా పాఱు; "సీ. విరులగుత్తుల మీఁద గురువులువాఱుచుముద్దిచ్చు తేఁటుల మొరపములకు." మార్క. ౫, ఆ.—2. అతిశయించు. "క. ఒండొరువులతోఁ బెనఁగు వేడ్కలుల్లంబులలో, గురువులువాఱఁగ." భార. ద్రో. ౧, ఆ.

గురుసు. దే. వి. 1. జీవస్థానము; "క. తురగములనూతుఁజంపినఁ, గురుపతిపాలివోక యతనిగురుసు నసేయన్, గరిమలిగిథనువుఁదునుముడు, బరవసమతియొునిశేరిపైకింటోయెన్." భార. ద్రో.

౫, ఆ.—2. మేర. "చ. దంతకాండముల్, గురుసులఁగూడిరాఁదిగిచిఘోరనిశాచరకోటిమోఁదుచున్." రా. యు, కాం.

గుర్తించు. దే. స. క్రి. గుఱుతుపట్టు.

గుర్విణి. సం. వి. ఈ. స్త్రీ. గర్భిణి. చూలాలు.

గుర్వు. వై. విణ. అధికము. "ఉ. మాలియద్దపై బోరనవచ్చియవ్విహగపుంగవకేతను నేసె నెంతయున్, క్రూరములైనయమ్ములనుగుర్వుగదానవులుత్సహింపఁగన్." నిర్వ. 3, ఆ.

గుర్వెట్టు. దే. అ. క్రి. గుఱువెట్టుయొక్క రూపాంతరము. "శా. కాలుంగేలు నెఱుంగకున్న కరిణింగన్నోడ్చి గుర్వెట్టుచున్." భాగ. ౧౦. స్కం. పూ.

గుఱక. దే. వి. నిద్రయందలిధ్వని.

గుఱుగుఱు. దే. వి. ఒకవిధమైన దురద.

గుఱి. దే. వి. 1. లక్ష్యము; "అమ్మహాసురున్ గుఱియుగఁ జేసి శాతశరకోటికి." భార. ద్రో. 3, ఆ.—2. గుఱుతు; "గీ. వసుధలో నెట్టి శ్రీగలవారి వేని కరభములు దాస్యము లెసేయు సరసిజాక్షి, యూరువుల కెట్లటన్నఁ బైఁదారు మోచు, గొడుగులనునల్ల కలశముల్ గుఱులుగావె." ఆము. ౫, ఆ.—3. దృష్టాంతము; "గీ. గాలవుండ గుఱియుఁగాఁడె మనకు." భార. ఉద్యో. 3, ఆ.—4. నిర్ణయము; "క. నా నెమ్మనమునఁగలయును, మానము పరతత్త్వబోధమహిమ నుడువు ప్ర, జ్ఞానిధియాశుల్కమునిం, పూనఁగఁగైకొనుట యనుచు నొక గుఱిచేసెన్." పర. ౮, ఆ.—5. మితి. "సీ. ఏదేవుఁడింతకునింతయై యంతకునంతయై గుఱిలేక యతిశయిల్లు." పాండు. ౫, ఆ.

గుఱించు. దే. స. క్రి. 1. ఉద్దేశించు; "గీ. ఇట్టిమముఁ గుఱించి హీనకార్యంబైన, మాకుఁ బ్రశయము గుచుమగువలార, భయమొనర్చె." కవిక. ౨. ఆ.—2. నిర్ణయించు. "సీ. ఓదముల్ త్రవ్వించియురులొడ్డనియమించి యువ్వలవ్వలవలలిడ గుఱించి." రామా. ౨, ఆ.

గుఱికట్టు. దే. వి. 1. అంచు; 2. మితి.

గుఱికాఁడు. దే. విణ. లక్ష్యముతప్పక యేయువాఁడు, కృతహస్తుఁడు.

గుఱికొండి. దే. వి. ఆయము, జీవస్థానము.

గుఱికొను. దే. స. క్రి. లక్షించు. "చ. తఱియనులోహకారకుఁ డుదగ్రతఁ బశ్చిమశైలశృంగమున్, గుఱికొని." రవి. ౮, ఆ.

గుఱిచి. దే. అవ. కూర్చిప్రత్యయమునకుపర్యాయము. "సీ. అబ్జాసనుఁడుతన్ను నర్థితోఁ గుఱిచియజించుటగోరిసృజించెనురల." హరి. పూ. ౨, ఆ.

గుఱుకొను. ద్వి. అ. క్రి. యత్నించు. "క. గుఱుకొని కార్యాకార్యము, లెఱుఁగక దుశ్చరితుఁడయియహితుఁడగు నేనిన్, మఱవక గురునైననుజను, లెఱుఁగఁగ శాసించునదిమహీశుఁడుబుద్ధిన్." భా. ఆది. ౬, ఆ.

గుఱుగుఱ్ఱు. దే. వి. ఒఱలుటయందగుధ్వన్యనుకరణము. "గుఱుగుఱ్ఱుంచెడసందిబిట్టొఱలునఘోరాహి." నై. ౮, ఆ.

గుఱుతు. దే. వి. 1. చిహ్నము; "క. వినుమేఁకగొఱియలుమొదవు, లెనుములు తురగములు గజములెందొకటియురెం, డునుమూడును నేనును నా, ఱును నేడునునుండునదిగుఱుతునీకుండన్." మార్క. ౪, ఆ. — 2. మేర. "సీ. దిక్కెవ్వరునులేనిదీనులసురలఁగైకొన్న నీకరుణకు గుఱుతుగలదె." లక్ష్మీ. ౫, ఆ.

గుఱుపాడుచు. దే. అ. క్రి. గుఱకపెట్టు. "సీ. వీచులతాఁకున నేచునర్ణవరవ మడఁగిపోవఁగ గుఱుపాడుచువారు." రా. యు, కాం.

గుఱుములు. దే. వి. బ. గింజలు.

గుఱువెట్టు. దే. అ. క్రి. (గుఱ్ఱు+పెట్టు.) గుఱకయిడు. "క. అతిమతివారలుచనిమే, నెఱఁగకనిద్దురలనూర్పుటీఁదలుగొఱలన్, గుఱువెట్టుచుఁగొండవలెన్, వెఱఁగొప్పఁగనున్నకుండవీనులజోదున్." అచ్చ. యు, కాం.

గుఱ్ఱపుఁజుక్క. వై. వి. (గుఱ్ఱము+చుక్క.) అశ్వినీనక్షత్రము.

గుఱ్ఱపుఁబీఁట. వై. వి. (గుఱ్ఱము + పీఁట.) ద్వారబంధముమీఁదనుంచెడు గుఱ్ఱపుమూతికొయ్య.

గుఱ్ఱపుమోమువేల్పు. ద్వి. వి. (గుఱ్ఱము+మోము వేల్పు.) కింపురుషుఁడు.

గుఱ్ఱపుసారము. వై. వి. (గుఱ్ఱము + సారము.) సప్తస్వరములలో నొకటి, ధైవతము.

గుఱ్ఱము. వై. వి. అశ్వము. (దీనికి బహువచనమునందు గుఱాలనియురూపముగలదు. "క. లలితనిజవామకరతల, కలితకనత్కంబుకాంతికలకలనవ్వన్, గలువలచెలిగిలిగింతల, నలువగుఱాలంబిసాళినలు ఎగుఱాలన్." పాండు. ౨, ఆ.)

గుఱ్ఱు. దే. వి. 1. కోపమునందగునను కరణము; "ఎట్టివారిఁబోడగన్నను గుఱ్ఱని." వాసి. ౧, ఆ. — 2. నిద్రయందగుధ్వన్యనుకరణము. (గుఱ్ఱెత్తెను.) (ఆమ్రేడితమునందు గుఱ్ఱుగుఱ్ఱు.)

గులక. వై. వి. ఒకదినుసుఱాయి.

గులకరించు. దే. అ. క్రి. రమ్యమగు. "ఎ, గీ. మొలకనగవులుమొగమునగులకరింప." చంద్రా. 3, ఆ.

గులగుల. దే. వి. 1. పుట్టలనుకోరాడుటయందగునను కరణము; "వ. ఎలుంగులు గులగులంబుట్టలునిశితనిజనఖరకులిశకోటులంగోరాడ." స్వా. ౪, ఆ.— 2. బ. చూర్ణము; "చ. కలితనిరూఢిరేఖఁదిరుగంబడిగర్జిలు శంఖకోటులన్, గులగులలైతముంగదుముకొన్నతదాత్మజరత్నవర్గముల్, తలఁచిగుణావళుల్ గలిగిదండలఁబాయకయుండెనోయనన్, సలలితతారహారములఁజందనగంధిగళంబురాజిలెన్." భాను. ౨, ఆ. — 3. నలఁగుడు; "క. వాఁడునుగులగులలైలావగ, లినమైవిదిలించికొనుచులేచెఁగిదుకుచున్." పాండు. ౪, ఆ.—4. దురద. (గుఱగుఱయొక్కరూపాంతరము.)

గులప. దే. వి. గుఱ్ఱపువాఁడు.

గులాము. వై. వి. దాసుఁడు*, దాసురాలు*.

గులాబి. హిం. వి. పుష్పవిశేషము.

గులి. సం. వి. ఈ. స్త్రీ. 1. గోలీ; 2. తీఁటగుల్ల.

గులిబి. దే. వి. గులిమియొక్కరూపాంతరము. (ఇట్లు బకారోపధముగాఁ గొన్నిదేశములందు వ్యవహారము.)

గులిమి. దే. వి. కర్ణమలము, పింజూషము.

గులిమికదురు. దే. వి. గులిమితీసికొనెడి వెండిలోనగువానిపుల్ల.

గుల్ఫము. సం. వి. అ. పుం. చీలమండ.

గుల్మము. సం. వి. అ. పుం. బోదలేనిచెట్టు; 2. వ్యాధివిశేషము; 3. సేనావిశేషము; (తొమ్మిదిరథములు అన్నియయేనుఁగులు ఇరువదేడుగుఱ్ఱములు నలువదేవురు కాల్వురునుగలది.) 4. సైన్యరక్షణము; 5. పురాభిముఖమైన రాజమార్గము.

గుల్మిని. సం. వి. ఈ. స్త్రీ. ఉలపము, పొదరు.

గుల్ల. వై. వి. 1. కప్పచిప్ప; 2. బొబ్బ. విణ. 1. అల్పము; (గుల్లకావి, గుల్లపుటిక. మొ.)—2. బోలు*. (గుల్లకజ్జ. మొ.)

**గుల్లకాఁడు.** ద్వ. విణ. ఏమిలేనివాఁడు, అకించనుఁడు. "గుల్లకాఁడైమనయింటికిగుఱుతులడుగవచ్చీని." క్షేత్రయ.

**గుల్లపడు.** వై. అ. క్రి. అవమానపడు. (దీనికిఁ బ్రయోగము ప్రేరణమందే కానఁబడుచున్నది. "ద్వి. నిను నేఁడుముఖమున నెత్తురుప్రామి, కొనిగుల్లపఅపకకొలికికిరావు." హరిశ్చ. ౨, భా.)

**గుల్లాము.** వై. వి. గులాముయొక్క రూపాంతరము.

**గువాకము.** సం. వి. అ. పుం. పోఁకచెట్టు, (రూ. గూవాకము.)

**గువ్వ.** దే. వి. అడవిపావురము, కపోతము.

**గువ్వకరిగొను.** దే. స. క్రి. మ్రుట్టుకొను. "క. అచ్చోటితీర్థవాసులు, వచ్చితగు నెనీకుఁ బుణ్యావాహినినిటువా, క్రుచ్చితివనివడినందఱు, గచ్చకదలినట్లుగువ్వకరిగొనిరిట్టల్." జై. ౮, ఆ.

**గువ్వకుత్తుక.** దే. వి. (అఁకటిచేతఁగలుగు) హీనస్వరము. (చూ. కుతిలపడు.)

**గువ్వకుత్తుకపడు.** ద్వ. అ. క్రి. (అఁకటిచేత) హీనస్వరమగు. "ద్వి. నెవ్వగఁగుందుచునీరసాన్నముల, గ్రొవ్విబల్లురెగువ్వకుత్తుకపడక." హరిశ్చ. ౨, భా.

**గువ్వకోలుకొను.** దే. స. క్రి. గువ్వకరిగొను. (రూ. గువ్వకోల్కొను. "గీ. మతియొకనమ్మాయలాడి కోమటి నెలంత, నందఱును గువ్వకోల్కొనియ గడుసేయ." శుక. ౧, ఆ.)

**గువ్వగుత్తి.** ద్వ. వి. కపోతాంఘ్రి.

**గువ్వగుత్తుక.** దే. వి.——పై.——

**గుసగుస.** దే. వి. రహస్యపుమాటలచప్పుడు.

**గుసగుసలువోవు.** దే. అ. క్రి. గుసగుసయనిమాటలాడు. "క. మెత్తుముగ దె మన మెపుడుఁది, లోత్తమచక్కఁదన మీతలోఁదరియెదుటల్, మెత్తఁబడె దానిచెలువని, యత్తఱి గుసగుసలువోయిరచ్చరలెల్లల్." విజ. 3, ఆ.

**గుహ.** సం. వి. ఆ. స్త్రీ. 1. కొండయందు తొలుపఁబడిన గొప్పబిలము; 2. పల్లము; 3. నక్కతోఁకపొన్న.

**గుహాశయము.** సం. వి. అ. పుం. వ్యాఘ్రము, పులి.

**గుహుఁడు.** సం. వి. అ. పుం. కుమారస్వామి, కందుఁడు.

**గుహ్యకుఁడు.** సం. వి. అ. పుం. దేవయోనివిశేషము.

**గుహ్యకేశ్వరుఁడు.** సం. వి. అ. పుం. కుబేరుఁడు.

**గుహ్యము.** సం. వి. అ. న. 1. ఏకాంతము; 2. స్త్రీపురుషులగుఱి; 3. తాఁబేలు; 4. నెపము. విణ. దాఁచఁదగినది.

**గుళిక.** సం. వి. ఆ. స్త్రీ. రసమణిలోనగునది.

**గుళిగ.** వై. వి. ——పై.——

**గుళుచ్ఛము.** సం. వి. అ. పుం. పువ్వులోనగువాని గుత్తి, గుచ్ఛము.

**గుళ్లు.** దే. వి. బ. కుందెనగుడియను బాలక్రీడావిశేషము. "సీ. కుప్పిగంతులుపిడిగ్రుద్దులాటలుపిల్లదీవులుగొబ్బిళ్లుగూనవాలు, గుళ్లుదాఁగిలిమ్రుచ్చులుగోడిపట్టెలు." వి. పు. ౭, ఆ.

## గూ.

**గూండ్ర.** దే. వి. గుడ్లగూబకూఁత.

**గూండ్రించు.** దే. అ. క్రి. (గుడ్లగూబ) కూయు.

**గూఁటి.** వై. వి. పంది, సూకరము.

**గూఁటిగువ్వ.** దే. వి. (గూఁడు+గువ్వ.) ఈఁకలురాల్చిన పక్షి.

**గూఁడు.** దే. వి. 1. పక్షిగృహము; 2. గోడయందు దీపముంచుటకేర్పఱచినచోటు; 3. (పెంపుడు చిలుకలులోనగునవియుండు) పంజరము; 4. ఆకుగుడిసె.

**గూఁడుకానుపు.** దే. వి. పక్షి. నీడోద్భవము. "సీ. తెలిగూఁడుకానుపు తేజీవజీరుచే విప్పుగాఁగొన లేని మెప్పులంది." అచ్చ. సుం, కాం.

**గూఁడుబండి.** దే. వి. చాఁపకట్టినబండి.

**గూటము.** వై. వి. 1. వడ్లవానియొకానొక కొలముట్టు*; 2. గుంజె*; 3. మేకు*; 4. మాదిగవాని ఒక కొలిముట్టు.

**గూటాము.** వై. వి. గూటముయొక్క రూపాంతరము.

**గూడ.** దే. వి. 1. వానకు తలమీఁద వేసికొనుటకైయల్లిన జమ్ముగూడ; 2. తిరుపగూడ; 3. నీళ్లుచల్లెడు వెదురుబుట్ట; 4. పూవులులోనగునవియుంచెడు బుట్ట; 5. మత్స్యములనుబట్టెడి సాధనవిశేషము; 6. దొప్ప. "తోలుగూడచే దివిచిన వేఁడిపాయసము." భో. 3, ఆ.

**గూడకట్టు.** దే. వి. కచ్చములేకకట్టినదోవతియడ్డకట్టు.

**గూడపాల.** దే. వి. మామెన, శారిబ.

**గూడబాతు.** దే. వి. బకవిశేషము.

**గూడారము.** వై. వి. గుడారముయొక్క రూపాంతరము.

గూడారు. వై. వి. గూడారముయొక్క రూపాంతరము.

గూడెము. దే. వి. కొండదొనవాశ్రయించియుండెడుబోయపల్లె. "సీ. విన్నుకొమ్ముడివాఁడువెండి గుబ్బలిగూడెమేలువాఁడుడివోని మేలువాఁడు." అచ్చ. బాల, కాం.

గూఢపాత్తు. సం.వి.త్.పుం. కానరానికాళ్లది,పాము.

గూఢపురుషుఁడు. సం. వి. అ. పుం. చారుఁడు, వేగువాఁడు.

గూఢమణి. సం.వి.ఇ. స్త్రీ. బాలికాక్రీడావిశేషము.

గూఢము. సం. వి. అ. న. 1. రహస్యము; 2. స్త్రీపురుషులగుటి. విఱ. దాఁచఁబడినది.

గూఢసాక్షి. సం. విఱ. (న్.ఈ.న్.) (చూ.) గుట్టుసాకిరి. (వీఁడు కృతసాక్షులేవురిలో నొకఁడు. చూ. సాక్షి.)

గూథము. సం. వి. అ. న. పురీషము, విష్ఠ.

గూన. దే. వి. పెద్దకుండ.

గూనివాఁడు. దే. విఱ. (గూను+వాఁడు.) కుబ్జుఁడు.

గూను. దే. వి. నడుముమీఁదివంపు.

గూనుఁడు. సం. విఱ. (అ.ఆ.అ.) విష్ఠించినవాఁడు.

గూనుగిల్లు. దే. అ. క్రి. గూనుకలుగు. "వ. కపటకిటి జరఠకమఠ భుజగపరివృఢులు గూనుగిల్లంబడ." కాశీ. ౬. ఆ.

గూబ. యు. దే. వి. కర్ణమూలము. "గీ. అతని చెవులు గూబలంటఁబెటికి." రామా. ౮, ఆ.—వై. గుడ్లగూబ.

గూబతెడ. దే. వి. మహాబలి?.

గూబరి. దే. వి. మాదిగవాఁడు. "సీ. ఆసాదిగోసంగి మాదిగ గూబరియన మాతంగుఁడగు." ఆం, భా. ద్వి. శూ.

గూపనాలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. (చూ. కుప్పిగంతులు.)

గూహనము. సం. వి. అ. న. గోపనము, దాఁచుట.

## గృ.

గృంజనము. సం. వి. అ. న. విషముతిన్నపశువుయొక్కమాంసము. పుం. వెల్లుల్లి?.

గృధ్నువు. సం. విఱ. ఉ. ఇచ్ఛగలవాఁడు, గర్ధనుఁడు.

గృధ్రము. సం. వి. అ. పుం. గద్ద. విఱ. పిసినివాఁడు.

గృధ్రసి. సం. వి. ఈ. స్త్రీ. (చూ.) కిరుదసి?.

గృష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఒకతూరి యీనిన యావు; 2. పాఁచితీఁగ.

గృహకచ్ఛపము. సం. వి. అ. పుం. (నూరెడు) సన్నికల్లు.

గృహగోధిక. సం. వి. ఆ. స్త్రీ. ముసలి, బల్లి.

గృహద్రుమము. సం. వి. అ. పుం. పాలతేఁకు?.

గృహపతి. సం. వి. ఇ. పుం. 1. గృహస్థుఁడు; 2. మంత్రి; 3. విడుపకయిచ్చువాఁడు.

గృహమణి. సం. వి. ఇ. స్త్రీ. దీపము, దివ్వె.

గృహము. సం. వి. అ. న. 1. ఇల్లు; 2. పెండ్లాము. "జాయాచగృహిణీగృహమ్." అనిహలాయుధనిఘంటువు. (ఇది యీ రెండర్థములయందును పుంలింగమునగును.అప్పుడుబహువచనాంతము.)

గృహమృగము. సం. వి. అ. పుం. శ్వానము,కుక్క.

గృహమేధి. సం. వి. న్. పుం. (చూ.) గృహస్థుఁడు.

గృహస్థుఁడు. సం. వి. అ. పుం. భార్యను పరిగ్రహించిధర్మార్థకామములనడపుచు వేదపాఠమువైశ్వదేవాదిహోమము అతిథిపూజపితృతర్పణముభూతబలియునెడుపంచయజ్ఞములను జేయుచుప్రవర్తించువాఁడు, ఇలువేల్పు, (రూ. గృహస్థు.)

గృహస్థూణము. సం. వి. అ. న. ఇంటినడిమికంబము, నిట్రాడు.

గృహావగ్రహణి. సం. వి. ఈ. స్త్రీ. దేహళి, గడప.

గృహి. సం. వి. న్. పుం. (చూ.) గృహస్థుఁడు.

గృహిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఇల్లాలు; 2. ఎఱ్ఱతుమ్మెద; 3. కణుఁదురీఁగ.

గృహీతము. సం. విఱ. (అ.ఆ.అ.) గ్రహింపఁబడినది.

గృహీతి. సం. వి. ఇ. స్త్రీ. గ్రహింపఁజాలినబుద్ధి. "ఊహాపోహక్షమాచార్వీ గృహీతిర్గ్రహణక్షమా." అ. పా. ప్ర. ధీ.

గృహ్యకము. సం. వి. అ. పుం. పెంపుడుమృగములోనగునది, దీమము. విఱ. పరాధీనము.

గృహ్యా. సం. వి. ఆ. స్త్రీ. శాఖానగరము. అ. న. ము. కర్మబోధకగ్రంథము. పుం. పెంపుడుమృగములోనగునది. విఱ. 1. స్వాధీనము; 2. పరాధీనము.

## గె.

గెంటసము. దే.వి. పరుషవచనము. "గీ.అనుచుననవింటిపెనుదంటనాడరాని, గెంటసములాడి." పఞ్చ. ౪, ఆ.

గంటించు. దే. అ. క్రి. చలించు. "వ. నిత్యప్రసాదయుగుయశోదళయ్యనొయ్యనఁజిన్నినల్లనయ్యనునిచిచయ్యననయ్యవ్వతూఁతునెత్తుకొని మరల నింటికిగంటింపకవచ్చి." భాగ. ౧౦, స్కం. పూ.

గంటు. దే. అ. క్రి. 1. చలించు; "గాంగేయవసుంధరాధరముగంటినగంటఁడు." హరిశ్చ. 3, ఆ.—2. తొలఁగు. "మాసిరుల్ గంటకయుండఁ గావు." య. ౨, ఆ.—స. క్రి. 1. త్రోయు; (వీఁడు వానిని మెడపట్టిగంటినాఁడు.)—2. ప్రయోగించు. "పంచాస్త్రంబులం గంటి భాస్కరపాత్రుం దెరలించి." జై. ౫, ఆ. — వి. చలనము. "గీ. అనుడులేవువాకునాశంకలెవ్వియు, నెన్నిమార్లుచూడుమన్నఁజూతుఁ, బడఁతికలదెజాతిపతిమకుఁజక్కిలి, గింతనాదుధృతికిగంటులేదు." కళా. 3, ఆ.

గంటువడు. ద్వ. అ. క్రి. (గంటు+పడు.) తప్పు. "క. వెంటనెరిపుసేనలనద, రంటఁదఱిమిపవనజుఁడుగదాహతి నొకఁడుఁ, గంటువడకుండఁ బీనుఁగుఁ, బెంటలుగావించె దివిజబృందముపొగడన్." జై. 3, ఆ.

గంటెము. దే. వి. జంటనేఁతవస్త్రము. విణ. దట్టము. "మదిన్ గంటెంపుంజలముప్పతిల్ల." స్వా. ౫, ఆ.

గగ్గలు. దే. వి. గేలి, పరిహాసము. (అప్ర.)

గడ. దే. వి. 1. జత; "క. కడుపేడ్కతోడ నీకుం, గొడుకయ్యెడు నంతకంటెఁ గోర్కియుఁగలదే, జడుఁడనకనన్నుఁ గయికొని, గడ సేయుమునన్నుఁగార్తికేయునితోడన్." ఉ, హరి. ౫, ఆ.—2. సమీపము; (చూ. గొంటు.) "ఉ. దిగ్గియనంచతూఁడుగొనితీరవనేత్తువువంకమీఁదుగా, నగ్గడపుల్లకేసరమునందువసింపఁగ." ఆము. ౫, ఆ.—3. వేఁటకుఁదగినయొకానొకసాధనము. "క. వడదోల్లనుముప్పిళ్లను, నడిదంబులు వెడఁదవాతియలుఁగులపొదులున్, దడవిండ్లుఁబందిగోల్లను, గడలున్ ధరియించి భటులుకెలఁకులఁ గొల్వన్." భల్లా. 3, ఆ.

గనయు. దే. అ. క్రి. పుష్టియగు. "రసాసతిధేనువుఁజేపిలోకముల్ గనయఁగ నెట్టుపాలుపిదికెన్." వి, పు. ౨, ఆ.

గనసు. దే. వి. ఒకానొకగడ్డ, అలువు.

గబ్బు. దే. స. క్రి. 1. అపహరించు; "గీ. నవ్వుఁబువ్వునవ్వుజవ్వనినాసిక, చివురునవురుజవురునువిదమోవి, మబ్బునుబ్బుగబ్బు బిబ్బోకవతికేణి, మెఱపునొఱపునెఱపుఁదెఱవమేను." విజ. ౧, ఆ.—2. గ్రహించు. "గీ. వానకందువమలలపైవ్రాలుమొగులు, చాలునరికట్టఁజాల్పెంచుజవ్వనులకు, నిబ్బరపుఁ దూపుతడవింటఁబ్రబ్బఁజేసి, మబ్బుపైఁబాఱుమెకములగబ్బుటెంత." ఉ. రా. ౭, ఆ.

గెఱ. దే. వి. రేఖ. "సీ. గెఱవ్రాసిమాయనంగీకరించినభంగివసనంబుగట్టకవచ్చువాని." భాగ. ౧. స్కం.

గెల. దే. వి. పండ్లయొక్కయు కాయలయొక్కయు గొల.

గెలివి. దే. వి. సంతోషము. (వాఁడు మిక్కిలి గెలివితోనున్నాఁడు.)

గెలివిడి. దే. వి. గెలివియొక్కరూపాంతరము.

గెలుచు. దే. అ. క్రి. పోవు. "ఎ, గీ. జడలొత్తిమిందయనుచు, నిచ్చితెలతెలవాఱంగనిచ్చగెలువు, మనిలజాయంచుదీవించియనుపుటయును." రామా. ౬, ఆ.—అం, ప్రే. పుచ్చు. "క. కంకుఁడయిధర్మజుఁడువల, లాంకుండైవాయుజుఁడుబ్బహన్నలయైని, శ్శంకుఁడుపార్థుఁడుహయగో. కిఁకరులైకవలుఁదొల్లిగెలువరెదినముల్." భో. ౭ ఆ.—స. క్రి. జయించు.

గెలుపు. దే. వి. 1. జయించుట; "గీ. పలువురొకనిగెలుపుగెలుపుగాదోడిన, వాఁడుగాఁడితఁడువారికాజి." మార్క. ౮, ఆ.—2. జయము.

గెలుపుకాఁడు. దే. విణ. జయశీలుఁడు.

గెలుపుకొను. దే. స. క్రి. జయించు. (రూ. గెల్చుకొను. "సీ. నినుగెల్చుకొనివాఁడినొనరడివేయిచేతులతేనిగెడపినబలియుగెలిచె." అచ్చ. సు. కాం.)

గెలువము. దే. వి. గెలుపు, జయము.

గెల్లి. దే. వి. ఉప్పుకుప్ప.

గెల్లు. వై. వి. కలకల ధ్వని.

## గే.

గేందుకము. సం. వి. అ. పుం. బాలురు ఆడుకొనెడు చెండు, కందుకము.

గేడికాళ్లవాఁడు. దే. విణ. కొంగకాళ్లవాఁడు.

గేదఁగి. వై. వి. పచ్చపూమొగలి*. "రగడ. లేఁప మరుబాఁకుగేదఁగికిరాగిల్లకుము." ఉ, రా. ౬, ఆ. (ఇది శివపూజకనర్హము.)

గేదె. దే. వి. 1. పొట్టిబఱ్ఱె; 2. బఱ్ఱె.

గేదెచెలప. దే. వి. మూఁడేండ్ల యెనుపదూడ.

గేయము. సం. వి. అ. న. పాట. విశే. 1. పాడఁదగినది; 2. పాడునది.

గేరంజము. సం. వి. అ. పుం. (చూ.) కేరజేము.

గేలి. వై. వి. పరిహాసము*.

గేలికొట్టు. ద్వ. స. క్రి. పరిహసించు. "రాజులగణింపకతిట్టుచుగేలికొట్టుచున్." పాంచా. 3, ఆ.

గేలికొను. ద్వ. స. క్రి. పరిహసించు. "సీ. ఇంద్రుఁడు చనుదెంచియేలయిచట, దునియెదవనినవమ్మనుజాధిపతితనకోర్కి చెప్పినగేలికొనుచుఁజనియె." సం. "అపహాస్యతతశ్శక్రో జగామత్రిదివంపునః." భార. శల్య. ౨, ఆ.

గేస్తు. వై. వి. (చూ.) గృహస్థుఁడు.

గేస్తుఁడు. వై. వి.——వై.——"ఎ, గీ. మన్నుగేస్తుఁడునగ్గియుమిన్నునీరు, ప్రొద్దునెలగాడ్పులెన్వానిరూపులయ్యె." నీలా. ౧, ఆ.

గేస్తురాలు. ద్వ. వి. (గేస్తు+ఆలు.) ఇల్లాలు.

గేహము. సం. వి. అ. పుం, న. గృహము, ఇల్లు.

గేహళి. సం. వి. ఈ. స్త్రీ. (దీనిని దేహళీపర్యాయముగా వాడుచున్నారు.)

గేహి. సం. వి. న్. పుం. గృహస్థుఁడు.

గేహిని. సం. వి. ఈ. స్త్రీ. ఇల్లాలు.

## గై.

గైరికము. సం. వి. అ. న. 1. పర్వత ధాతువిశేషము; 2. బంగారు.

గైరేయకము. సం. వి. అ. పుం. కారుపోఁక.

గైరేయము. సం. వి. అ. న. సిలాజిత్తు.

## గొ.

గొ. దే. అవ్య. చూపుటయందువచ్చును. (అదిగొ, ఇదిగొ. మొ.)

గొంగ. దే. వి. పగతుఁడు, శత్రువు.

గొంగడి. దే. వి. కంబళి. "క. గొంగడులెగరఁగవైచుచుఁ, జంగునదాఁటుచునుకెలఁగిచప్పట లిడుచున్, బొంగుచుఁగృష్ణునిఁబొగడుచుఁ, ద్రుంగినరక్కసునిఁజూచిత్రుళ్ళిరిగోమరుల్." భాగ. ౧౦, స్కం. పూ.

గొంగడికాఁడు. దే. వి. పక్షివిశేషము. "వ. నేలనెమలిడాబగొంగడికాఁడు." చంద్రా. ౨, ఆ.

గొంగళి. దే. వి. గొంగడియొక్క రూపాంతరము.

గొంగళిపురుగు. ద్వ. వి. (చూ.) కంబళిపురుగు.

గొంజె. దే. వి. గొడ్రాలు. "సీ. గొడ్డనవంజనగొంజనావంధ్యయా." ఆం, భా. ద్వి. వై.

గొంటరి. దే. విశే. (గొంటు+అరి.) 1. కుత్సితుఁడు; "ఉ. కోయిలపేరిగారడపుగొంటరితాబుతురాజాముందటన్, మాయపహించిలేఁజిగురుమారునికత్తులుమ్రింగ." శశాం. ౨, ఆ.—2. కఠినుఁడు. "సీ. గొంటరిధాతకీకుసుమకోమలియంగమలయుంగఁజేయనేచలమటంచు." హన. ౪, ఆ. (స్వార్థమున అరి.)

గొంటి. దే. విశే. దుష్టురాలు. "శా. ఆలోకేశ్వరుఁడాచరాచరవిభుండాబాలగోపాలుఁడా, బాలధ్వంసినిగొంటిగంటిడివెసన్ బాలెంతచందంబునన్, బాలిండ్లన్విషమానివచ్చుటమదిన్ భావించి." భాగ. ౧౦, స్కం. పూ. (ఇక్కడ ఇకారము స్త్రీవిషయకమైన ప్రత్యయమని యెఱుంగునది.)

గొంటు. యు. దే. విశే. దుష్టుఁడు. "శా. కపటాంతేవాసినైశాంబరిన్, గొంటుంజందముమీఱశిష్యులగెడంగూర్చుండిచర్చారతిన్." స్వా. ౫, ఆ.—వై. వి. బందనలేనివక్క*.

గొంటుకాఁడు. ద్వ. విశే. కఠినుఁడు. "గొంటుకాఁడు మువ్వగోపాలరాయఁడు." క్షేత్రయ. (స్వార్థమున కాఁడు.)

గొండిలి. వై. వి. 1. కుండలాకారనృత్యము*; "సీ. తెరలెత్తిసప్తసాగరములుపొరలంగవరుణుండు గొండిలిపరిఢవింప." ఉ, హరి. ౪, ఆ.—2. నృత్యము*; 3. నర్తకి*.

గొండ్లి. వై. వి. 1. కుండలాకారనృత్యము*; "సీ. జలదేవతాహస్తచామరానిలములు కుటిలాలకములకు గొండ్లిగఱప." కాశీ. ౫, ఆ.—2. నృత్యము*; "ఉ. చందనగంధులిందుమణిసౌధతలంబుల గొండ్లిసల్పఁగా." వసు. ౧, ఆ.—3. నర్తకి*. "క. లలితగగనరంగంబున, నలయకత్రొమ్మెఱుఁగుగొండ్లియైయాడెడిచో, నలవడియెమొగులుతెరలును, బొలుపగువడగండ్లగములపుష్పాంజలులున్."

హరి. పూ. ౬, ఆ. (గొండిలియొక్కరూపాంతరము.)
గొండెము. దే. వి. గొండ్లెము. (చూ. కొండెము.)
గొండ్లెము. దే. వి. తలుపుచిలుకు.
గొంతి. వై. వి. పాండురాజుభార్య.
గొంతు. దే. వి. 1. కంఠము; 2. కంఠధ్వని; (నీగొంతువిని నేనిక్కడికివచ్చితిని.)3.కుక్కుటాసనము. (వాఁడు గొంతుగూర్చున్నాఁడు.)
గొంతుక. దే. వి. కంఠము. "ఉ. దానవుఁ, గొంతుకత్రుంచికైకొనియెఁగొంకకతన్మషితార్క్ష్యచాపముఁ." జై. ౬, ఆ.(స్వార్థమునక ప్రత్యయము.)
గొంతుకపోఁక. ద్వ. వి. గొంతుముందటిప్రక్కపోఁకవలెనుండెడియెముక, గొంతుముడి.
గొంతుమాలు. దే. వి. మల్లబంధవిశేషము.
గొంతుముడి. దే. వి. గొంతుకపోఁక.
గొంతెముకోరిక. దే. వి. కోరఁదగనికోరికలనుగోరుట.
గొంతెమగోరు. దే. వి. (గొంతెమ+కోరు.) ప్రసారణి?.
గొంది. దే. వి. మూల. "ఉ. ఉదయార్కునిరాకనడంగెఁజీఁకటుల్, గొందులసందులఁగుహలగుట్టలచెట్టులచాటుమాటునఁ." అని. 3, ఆ.
గొగ్గి. దే. విశే. ఎచ్చుతక్కువైనది. "గొగ్గిపండ్లు." (వెం.)
గొజ్జఁగ. వై. వి. గొజ్జెఁగయొక్కరూపాంతరము. "రగడ. చిలుకుదేంట్లకొసఁగెగుజ్జెనగూళ్లుగొజ్జంగ, యెఱుఁగకదిపూవందనేలయిటురజ్జంగ." స్వా. 3, ఆ.
గొజ్జెఁగ. వై. వి. ఒకానొకపూఁజెట్టు. "ఎ, గీ. చిలుకుఁదేనియతోడిగొజ్జెంగపూవు, దలగవయమర్చియందునాచెలువపనిచి." కళా. ౬, ఆ.
గొటగొట. దే. వి. గోంద్రించుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. "ద్వి. గొటగొటగోంద్రించికొలలొండొంటి, గటగటఁదాఁకింపగర్భంబు గలఁగి." పవ. 3, భా. "సీ. క్రోల్పులుల్ మత్తిల్లి గొటగొటమనిరొప్పి బలుసింగములనైనఁబట్టఁజూచు." సా. ౧, ఆ. "ద్వి. ఊరుపులునిడుదలైగొటగొటనిగుడ." హరిశ్చ. ౨ భా.
గొట్టము. దే. వి. క్రోవి.
గొట్టి. దే. వి. ఒకదినుసుగడ్డ, కశేరుకము.
గొట్టు. దే. వి. 1. దౌష్ట్యము; "ద్వి. గొట్టునేయఁగ దొరఁకొంటిచేయుచుఁ, బట్టనీకదిపాణిపద్మంబుఁదక్తె." విష్ణు. ౬. ౪, ఆ.—2. విరోధి. "జక్కవలగొట్టు." రా, వి. 3, ఆ. (చూ. తడకట్టు.)విశే. 1. కఠినము; "వ. నట్టడవులలోమీపట్టంపుదేవిఁ విడిచిపెట్టివచ్చితినని యీగొట్టుమాట దిట్టతనంబుతోనధిపతింజేరియింక నెట్టువిన్నపంబుసేయుదు." ఉ, రా. ౬, ఆ.—2. దుర్లభము; "రగడ. గోరగోరఁటనించితివో కలిగొట్టు గొట్టుగఁగొయఁబొసఁగవు." (గొట్టుగఁ=దుర్లభముగా— పూర్ణముగాననుట.) పను. 3, ఆ.—3. దుష్టము. "ఉ. గొట్టుతనానఁదఁ వెడలఁగొట్టినఁ దిట్టుచుట్టడంచుతోఁ, బుట్టువనాటనొండనకపోయితి." ఉ, రా. ౨, ఆ.
గొట్టె. వై. వి. ఘోటజటికి.
గొట్లె. వై. వి. రేఁగుచెట్టు.
గొడఁగు. దే. స. క్రి. గొణఁగు. "ఉ. కొన్నిగొడఁగి కొన్నునిసికొన్నితుటూరములాడిమానరా, కొన్ని నిన్నినాళ్లకివియున్న నికూటికిఁబిచ్చపాటిగొన్న మహాప్రసాదమనిహర్షరసోల్లసదానవా... యై, యన్నలినాక్షిభర్తయిడి నన్నియ కైకొను ముక్కుధాన్యముల్." పాండు. ౪, ఆ.
గొడగ. వై. వి. ఏఁడికోలలేనినాఁగలి.
గొడగర. దే. వి. చెప్పులుకుట్టిజీవించెడుజాతి. (గొడగరవాఁడు, గొడగరది.)
గొడగరి. దే. వి. (గొడగర+ఇ.) మాదిగవాఁడు. "... చాకిబోయవాఁడుజలగరిగొడగరి, కుక్కసూకరగాఁడుకోడిపంది, బొడ్డుక్రిందియంగములు విప్రుఁ జోఁకిన,నచటుఁగడుగవలయునం(డ్రు)బుధులు." విజ్ఞా. ఆచా, కాం.
గొడవ. దే. వి. 1. ఆపద; "క. తఱచుగ మెకములు బొరిగొను, మఱుపునవచ్చితిమిదవ్వు మనపాలిమిటికి, త్తతెనగునిమిత్తములున్నవి, కొఱగావిడెముకుఁబెద్దగొడవగుననిన." స్వా. ౪,ఆ.—2. తప్పు; "చ. అడుగక కానిడాఁచిన పదార్థములిచ్చుటనీతికాదునీ, వడిగితికానిప్పుడు సమర్పణచేసితినింక నాయెడఁ, గొడవలు లేవు." వి. పు. ౬. ఆ. —3. దుఃఖము; "గీ. నీవుచదివింతువను మున్నియునువిడిచి, బిచ్చమెత్తంగ రాదు గాజెలఁతుకడవనాడకుచాలునీగొడవయేల, వెజ్జఁడిన మేఁ యనిమదిలజ్జవొడమి." స్వా. ౫, ఆ.—4. ... 5. కలఁత.

గొడారి. దే. వి. గొడగరియొక్క రూపాంతరము. "ద్వి. మాలకుమాంసంబుమఱిగొడారికిని, దోలునునన్నట్లు." భాగ. ౪, స్కం.

గొడిగ. వై. వి. గులకతాయి.

గొడియ. దే. వి. అందలముయొక్క ఒకానొక అవయవము. "సీ. మొగలిరేకల్లికతోఁగకాఁడచట్టముకులుగన్పచెఱకుఁగ్రొమ్మెఱుంగుకొమ్ము, జిగిగుల్కెడేమావిచిగురుటాకుపడమ్ముతోఁగరునెత్తామరతూఁడుగొడియ, లలరారుకురువేరుతళుకుబల్మసనాబుపరువంపుఁబొఁగడపూబటువుదిండ్లు, పొన్నాకుమేల్పచ్చవన్నియుపన్నాగమనఁటిక్రొవ్విరిగుత్తిగొనబుఁగుచ్చు; బొండుమల్లియపఱపుకప్పురిపుటొఱగు, వలపువిరవాదిబటువుబిల్లలునుగిలుగు, నందలమువేల్పుఁ దొయ్యలులనుసరింప నెక్కెయొకకొన్నిపయనంబులేగియంత." చంద్రా. 3, ఆ.

గొడుగు. దే. వి. ఆతపత్రము, ఛత్రము.

గొడుగుగడ్డి. దే. వి. గుడ్డికామంచి, అతిచ్ఛత్రము?.

గొడుగుబల్ల. దే. వి. తలుపుమీఁది కుబుసముతిరిగెడుపట్టె.

గొడుగుమెట్టెలు. దే. వి. బ. వాటముపెట్టి ఓరలుసన్నగాఁదీర్చిన వెడలుపుమెట్టెలు.

గొడె. దే. వి. గొడియయొక్క రూపాంతరము. "సీ. అపరంజిమొసలివాయనుసులశిరసుతోఁగనుపులు తొమ్మిదిగల్గుకొమ్ము,నలసూర్యపుటపుఁబన్నాగంబుసరిగమేల్కట్టుపనులహెచ్చుపట్టుకుచ్చు, లుదిరికంకణములింపొసఁగు దంతపు గొడెల్నయముమించినముసనాబుపటము." రా, వి. ౨, ఆ.

గొడ్డ. దే. వి. 1. బిఱుసు. 2. బ. బిఱుసుమాట. "ఎ, గీ. నాడునేడునుడమయీఁడులేఁడటంచు, గొడ్డలాడుదురొండొరులొడ్డులేక." రా, వి. ౧, ఆ.—విశే. ఓఱుసైనవాఁడు. "ద్వి. ఘుటికసిద్ధుఁడుతాయికొట్టినగొడ్డ, యటమటకాఁడుమహామాయలాఁడు." హరిశ్చ. ౨, ఆ.

గొడ్డగము. వై. విశే. బాధకము. "క. గొడ్డగపుజరావ్యాధుల, కడ్డమగుచు మృత్యుదుఃఖహరమైమిగులన్, దొడ్డగుసుఖదము వెండియు, నొడ్డాణపుబంధమెలమియోగీంద్రులకున్." శివ. ఉ. ౨, ఆ.

గొడ్డలి. వై. వి. చెట్లునఱకెడుసాధనము, కుఠారము.

గొడ్డు. దే. వి. 1. గొడ్రాలితనము; "గొడ్డువీఁగికనియెఁగొడుకునెంతయుమూర్తి, మంతునెలఁతలందుమహితభాగ్య, యొక్కతియయశోదయుర్విపైననుచున్రే, పల్లెఁబొగడిరెల్లపడఁతుకలును." హరి. పూ. ౫, ఆ.—2. ఈననిపశువు; "గీ. గొడ్డుబడుగుఁదెవులుగొంటెఁగ్రెపెడలిన, దాని నెచ్చటేనినూనమైన, యట్టిదానినొకటనాయాసపడియున్న, దానినీరుగోప్రదానవిదులు." భార. అను. ౨, ఆ.—3. గొడ్రాలు; "ఉ. నాయెడఁదప్పుపట్టదుమనంబుననాసతిగొడ్డుగావునన్." వి, పు. ౬, ఆ.—4. పశువు. "సీ. అనివిలాపింపనూరార్చియేటికిఁగ్రేపుఁబాసిగొడ్డొఱలెడిపగిది నడలెదు." జై. ౬, ఆ. — విశే. శూన్యము. (గొడ్డంబలి=నూఁకలులేనియంబలి అని యర్థము. (ఇట్లు గొడ్డుజావ, గొడ్డుసంకటి.) గొడ్డేఱు=నీళ్లులేనియేఱు అని యర్థము. గొడ్డుచెట్టు=ఫలములేనిచెట్టు అని యర్థము.

గొడ్డుఁగాఁకర. ద్వ. వి. (గొడ్డు+కాఁకర.) కర్కటకి?.

గొడ్డుఁబోతు. దే. విశే. (గొడ్డు+పోతు.) నిష్ప్రయోజకుఁడు.

గొడ్డురాలు. దే. వి. (గొడ్డు+ఆలు.) బిడ్డలుకనని ఆఁడుది, వంధ్య.

గొడ్డువోవు. దే. అ. క్రి. (గొడ్డు+పోవు.) వ్యర్థమగు. "వీనిఁబట్టిక్రచ్చఱఁబరిమార్పఁజేసినయుపాయములన్నియుగొడ్డువోయె." లక్ష్మీ. ౪, ఆ. ("చ. మునుమునుగొడ్డువోయిరగిముష్కరతంజెడనాడినట్టిదుర్జనుల." భార. శల్య. ౨, ఆ. ఇత్యాదిస్థలములయందుగొడ్డువోవుటయనఁగా పౌరుషహీనమగుట అర్థము.) ("క. అనిచదివిలవుఁడురాఘవ, మనుజేశునితల్లిపిరమాతఁటసీతా, జననికుశలవులనిరువురఁ, గనియునకటగొడ్డువోయెఁగడపటననుచున్." జై. ౬, ఆ. ఇత్యాది స్థలములయందు గొడ్డువోవుటయనఁగా గొడ్రాలగుట అర్థము.)

గొడ్డేఱు. దే. స. క్రి. (గొడ్డు+ఏఱు.) గుత్తయెత్తు. "గీ. బొడ్డుపల్లెనుగొడ్డేఱిమోసపోతి, నెట్లుచెల్లింతుఁదంకంబులేదునూర్లు." వి. (చూ. గొడ్డు.)

గొడ్రాలు. దే. వి. గొడ్డురాలుయొక్క రూపాంతరము. "కననీగొడ్రాలుబిడ్డన్." పాండు. 3, ఆ.

గొణఁగు. దే. అ. క్రి. మాటవెడలనీకనోటనెగొణగొణయను. (గొడఁగుయొక్క రూపాంతరము.)

గొణగ. వై. వి. గొడగయొక్క రూపాంతరము.

గొణగొణ. దే. వి. గొణఁగుటయందగు ధ్వన్యనుకరణము.

గొణగొణలాడు. దే. అ. క్రి. (గొణగొణలు+ఆడు.) గొణగొణయను.

గొణిజె. దే. వి. గొణిదయొక్క రూపాంతరము.

గొణిద. దే. వి. తలుపు గ్రంద తగిలించెడి యినుపచీల.

గొతుపు. దే. వి. నీలమణివిశేషము. "సీ. కప్పురాలనఁగనుగనుపట్టునీలముల్ గొతుపునాఁదద్భేదమతిశయిల్లు." ఆం, భా. ద్వి. వై.

గొత్తు. దే. వి. వెన్న మొదలగునవి పాసిపోయినకంపు.

గొద. దే. వి. ఆఁకలి, క్షుత్తు.

గొదకొను. దే. అ. క్రి. 1. అతిశయించు; "ఉ. ఆగతినున్నఁజూచిసఖులందఱు నేమిటువచ్చుశేమినీ, లాగిదియేమియింతికిదిలక్షణమేచను దెమ్ములెమ్మనన్, హ్రీగరిమంబునాఁపుచునొకించుకతేపఁగఁబూనుమానునా, లోఁగొదకొన్న సిగ్గునఁజెలుల్ బలిమిఁదనుఁదివ్వఁగోరుచున్." కళా. ౬, ఆ.—2. త్వరపడు; "వ. రేయింటియాఁకటిపెల్లునగొదకొనికవిసిచంచువులందిగిచిత్రుంచియానుచు." భార. విరా. ౨, ఆ.—3. విజృంభించు. "క. కదిసినబలములువిచ్చినఁ, గదుపులఁజెదరంగనీకగాండీవివెసన్, బొదివియటుగడపెనవియును, గొదకొనితమపాలముసాచ్చెగోపాలురతోన్." భార. విరా. ౪, ఆ.

గొదగొద. దే. వి. పగ, విరోధము. "క. నావినివిహగములనునయ, కోవిదయారంటికేలగొదగొదపాడమేన్." పంచ. వేం. ౩, ఆ.

గొనకొను. దే. అ. క్రి. యత్నించు. "సద్ధర్మవృత్తికిన్ గొనకొనఁడేని విన్కిమునికుంజర యేల." భార. శాం. ౬, ఆ.—ప్రే. గొనకొలుపు. "క. విక్రమమునకుం, గొనకొల్పితిట్లువీరల." భార. ఆశ్ర. ౧, ఆ. (చూ. కొనకొను.)

గొనప. దే. వి. అతిగిననాఁగేలు. విణ. పొట్టి. (గొనపకోడి. మొ.)

గొనబు. దే. వి. మనోజ్ఞత. విణ. మనోజ్ఞము.

గొనబుకాఁడు. దే. విణ. అందగాఁడు, సుందరుఁడు.

గొనమ. దే. వి. గొనపయొక్క రూపాంతరము. (ఇది యిట్లుమకారోపధముగాఁ గొన్ని గ్రంథముల యందు వ్రాయఁబడియున్నది.)

గొనము. వై. వి. శౌర్యాదిగుణము.

గొనయము. వై. వి. వింటినారి, మౌర్వి.

గొనుగు. దే. వి. గుడఫలము?.

గొప్ప. దే. విణ. పెద్ద, అధికము.

గొప్పాలు. గుహు. దే. వి. బ. పరిమడిలోనగువానియందు కొంచెముపాడవుగానుండెడుచోట్లు. (గొప్పలు త్రవ్వుచున్నారు.) వై. చూరుపట్టె, గోపానసి.

గొబ. వై. వి. 1. గుహ; "ఎ, గీ. పఱచుచురవడిఁబొడమునిబ్బరపుమ్రోఁత, కొండగొబలెల్లఁజొచ్చియొండొండఁబెరుగ." హరి. ఉ. ౫, ఆ.—2. గొంది. "క. మార్జాలంబులుసెలఁగుచు, గర్జించెనుగొబలనడఁగి." ఉ, హరి. ౫, ఆ.

గొబడి. దే. వి. పక్షివిశేషము.

గొబ్బండు. దే. వి. (గొప్ప+పండు.) పెద్దపండు. "సీ. పాకవేగారంభపరిపాటిఁదమయంగతఁబగిలినపనసగొబ్బండ్లబేసము." పాండు. ౧, ఆ.

గొబ్బరము. దే. వి. ఎరువు.

గొబ్బి. దే. వి. 1. ధనుర్మాసదినములసాయంకాలములయందు గడపలకుముందు బాలికలు పాటలుపాడి చేతులుతట్టుచుఁ జుట్టివచ్చిజరపించెడునొక వేడుక; 2. సమర్తాడినప్పుడు బాలికలు పాటలుపాడి చేతులుతట్టుచుఁ జుట్టివచ్చి జరపించెడి యొక వేడుక; ౩. ఇక్షురకము?.

గొబ్బిళ్లు. దే. వి. బ. 1. బాలక్రీడావిశేషము; (చూ. కుప్పిగంతులు.) 2. బాలికాక్రీడావిశేషము; "సీ. గుజగుజ రేకులుగొబ్బిళ్లు." హంస. ౫, ఆ. (గిరులపైగొబ్బిళ్లుగోరాడుచున్ అనుచోటగొబ్బిళ్లనెఁగోరాడుటయని తోఁచుచున్నది.)—౩. నమస్కారము. "రగడ. వజ్రపురీస్థానరమైచిక్కిన గోపప్రియునకుగొబ్బిళ్లనుచును." హంస. ౪, ఆ.

గొబ్బున. దే. ద్ర. క్రి. విణ. శీఘ్రముగా.

గొయ్యి. దే. వి. పల్లము, గర్తము.

గొరక. వై. వి. 1. ఇనుపబాణము; "గీ. క్రొవ్వినగొండకైవడి గునుకుసొక్క, యొంటిగానిమహీనాథుఁడొదిఁగియేయు, గొరకమేనుచ్చి ధరఁగాఁడశిరమువిసరె, లేదస్రుక్పానమనుచుఁదెల్పెడునంగ." స్వా. ౪, ఆ.—2. మృగవిశేషము.

గొరకకట్టె. వై. వి. అలుఁగుగల చేతికఱ్ఱ.

గొరగ. దే. వి. మైలారునుగొలిచెడి యొకానొకభక్తుఁడు. "సీ. గొరగయైమైలారుఁగొనియాడు నొకవేళ నొసటిపైబండారుపసుపుదాల్చి." కాశీ. ౭, ఆ.

గొరగొర. దే. వి. వేగము. "క. ఇరువంకలఁదన్నుఁ బొడివి,గొరువంకలుఁదుమ్మెదలునుగోయిలలుండ, క్కరిచిలుకలుఁబురిపులుఁగులు, గొరగొరరాముఁడువెడలెఁగొమ్మఁగలంపన్." నీలా. 3, ఆ.

గొరిజ. వై. వి. గొరిసెయొక్క రూపాంతరము.

గొరిసె. వై. వి. పశువులకాలిగిట్ట, ఖురము.

గొరిసెగాలి. ద్వ. వి. పశువుల గొరిసెలనడుమ పుండై పురుగులుపడెడి వ్యాధి.

గొరువంక. వై. వి. గోరువంకయొక్క రూపాంతరము. "క. గొరువంకయన్న మాటల, మరువంకఁదలంకు గలిగిమగువకుఁదమలో, వెరువింక నేమికలదని, యిరువంకలవగలఁబొగిలిరెంతయువంతన్." విక్రం. ౬, ఆ.

గొఱసు. వై. విశే. నీచుఁడు. "గీ. తానుజెసుటగాక తక్కినవారినిఁ, జెఱుపఁజూచెనొరగొఱుకుపడుచు." లక్ష్మీ. ౮, ఆ.

గొఱపము. వై. వి. గుజ్జుమునుదోమెడు సాధనము, కేశకారము. (ఇట్లు సరళాదిగాఁ గొన్ని దేశముల యందు వ్యవహారము.)

గొఱియ. వై. వి. గొఱ్ఱియయొక్క రూపాంతరము. "క. ఊఱవగునారుగపంటలు, గొఱియలపాఁడియునుదఱుచగున్." భార. అర. ౮, ఆ.

గొఱుగు. దే. స. క్రి. క్షౌరముచేయు.

గొఱె. వై. వి. గొఱ్ఱెయొక్క రూపాంతరము. "గొఱెతోళ్లు." పాంచా. ౨, ఆ.

గొఱ్ఱియ. వై. వి. గొఱ్ఱె.

గొఱ్ఱు. దే. వి. 1. ముప్పదిరెండు కుంటలకొలఁది; 2. దున్నినపొలముమీఁదదున్నెడుయంత్రము.

గొఱ్ఱె. వై. వి. మేషి. (గొఱ్ఱియయొక్క రూపాంతరము.)

గొల. వై. వి. పండ్లులోనగు వానియొక్క గెల. "చ. తొలిగుబ్బలిఁగొండగోఁగుపూ, గొలయలరించె నాఁబొడిచెఁగోకనదాప్తుఁడు పాటలద్యుతిన్." పా. ౨, ఆ.

గొలక.యు.వై.వి.కలకలధ్వని. దే.బ.తాటిచన్నులు.

గొలగొల. వై. వి. 1. కలకలధ్వని; "సీ. జమిలిముక్కాలి పిసాళిబల్ప్రోఁతకుఁ గొదమకోయిలచాలుగొలగొలలకు." నీలా. 3, ఆ.—2. ధ్వన్యనుకరణము. "వ. రంభాదిమరుద్రంభోరువులకలికినుసోగపలుకులకలకలంబున గొలగొలమనుకౌతుకాగారంబుసొత్తెంచి." స్వా. ౫, ఆ.

గొలిమిడి. దే. వి. ఇక్షురకము?.

గొలివె. దే. వి. తృణవిశేషము. బ. తృణధాన్యవిశేషము.

గొలుగు. దే. వి. గొనుగుయొక్క రూపాంతరము.

గొలుసు. దే. వి. 1. చేతధరించెడియొకసొమ్ము; 2. ఏనుఁగుకాలుగట్టెడునిగళము; 3. సంకెల. "సీ. శుకకదంబము గొలుసులచేనిబద్ధమైవారాంగనాగారకారఁబడఁగ." ఆము. ౨, ఆ.

గొలుసుమోడి. దే. వి. విడివిడిగాలేక గొలుసువలెనొకటితోనొకటి పెనఁగొన్నవ్రాలు.

గొల్ల.యు. దే.వి.1.ద్వారపాలకుఁడు; "క.ఇదియేమించుకవారిం, చెదమనుచుఁగడంగనీదుచిత్తమునకురా. దదిరిపడిమున్న గొల్లల, నదటుఱఁబొడిపించువాఁడవైతినరేంద్రా." పర. 3, ఆ.—2. ధనపాలుఁడు. "ద్వి. తొలుతమంత్రిపురోహితులుయువరాజు, దళవాయిగొల్లలంతఃపురికర్త, లాజ్ఞాధికుఁడుఁదీర్పునతఁడు నెచ్చెలియుఁ, దజ్ఞుఁడైసెలవులేతఱిఁజేయునతఁడు, నగరంబుపాలించునరనాయకుండు, తగవరిధర్మశాస్త్రముదెల్పువాఁడు, చనవరియుఁదలారిసారెదుర్గములఁ, దనకలిసుంచునాతఁడుననంబరఁగు, వారలతెఱఁగుసర్వంబునానాట, నేరుపాటుగవించెదయేకతంబునను." రా. అ, కాం.—వై. పశువులను మేపియు పాలుపెరుగు అమ్మియు జీవించెడుజాతి*. (గొల్లవాఁడు, గొల్లది.)

గొల్లఁడు. వై. వి. గోపాలకుఁడు.

గొల్లజిడ్డు. ద్వ. వి. శూలిని?.

గొల్లత. వై. వి. గోపిక. "గీ. అనఁగవేఱొక్క గొల్లతయమ్మవినుము, బానలోపలయవపిండిపంచదార, యొదువఁగలిపిమూలనుడాఁచియుండ వచ్చి, తినియెనంతయుఁగృష్ణుండుదేవరాన." హరి.పూ. ౫, ఆ.

గొల్లదొందు. దే. వి. మత్స్యవిశేషము. "ఎ, గీ. అల్లెదమ్ముప్పుఁజేఁపయుగొల్లదొందు." హంస. ౮, ఆ.

గొల్లము. వై. వి. లోఁతుగలపల్లము. (చూ. కొలి.)

గొల్లియన. దే. వి. గొల్లెన. "క. పసిఁడిజలపోసనంబుల,నసమరుచింబొలుచుగొల్లియనలున్నతిఁబెం,పెసఁగెంబసిండిగుబ్బలి, పసినిసుఁగులగతిఁదదంకభాగస్థములై." కవిక. ౨, ఆ.

గొల్లు. వై. వి. కలకలధ్వని.

చిక్కోల. దే. వి. (చిక్కు+కోల.) చిక్కంటె.

చిక్రోడము. సం. వి. అ. పుం. ఉడుత.

చిగిరించు. దే. అ. క్రి. చిగురుచు, పల్లవించు.

చిగిలింత. దే. వి. తృణవిశేషము.

చిగురాకుదిండి. దే. వి. (చిగురు+ఆకు+తిండి.) పికము. "సీ. చిగురాకుదిండ్లపల్లవమంటకెసఁగుపల్లవమంటపమునవిలంగమునిచి." చంద్ర.

చిగురాకువిలుకాఁడు. దే. వి. (చిగురు+ఆకువిలుకాఁడు.) మన్మథుఁడు. "చిగురాకువిలుకానిచేతిచక్రమురీతి." శశాం. 3, ఆ.

చిగురు. దే. వి. పల్లవము. విశే. లేఁత. (చిగురుఁగొమ్మ.) (హల్లుపరమగుచో దీనికడపటియుకరము వికల్పముగ లోపించెడి. "చిగుర్నగుమోవి.")

చిగురుఁగొమ్మ. దే. వి. (చిగురు+కొమ్మ.) చిగిరించిన లేఁతకొమ్మ. పూచిన లేఁతకొమ్మ. (అని కొందఱు.)

చిగురుఁబోఁడి. దే. వి. (చిగురు+పోఁడి.) 1. చిగురువలె మనోజ్ఞురాలగు ఆఁడుది; 2. ఆఁడుది. (చూ. అలరుఁబోఁడి.)

చిగురుకొను. దే. అ. క్రి. చిగిరించు. "గీ. సొగసుసొగవులు మొగమునఁజిగురుకొనఁగ." (ఇక్కడ చిగురుకొనఁగ అనఁగా పుట్టఁగా నని యర్థము.) చంద్రా. 3, ఆ.

చిగురుచు. దే.అ.క్రి. 1. చిగిరించు; 2. ఎఱ్ఱనగు. (రూ. చిగుర్చు. "కన్గొనల్ చిగుర్పంగ." జై. ౪, ఆ.)

చిగురువిలుకాఁడు. దే. వి. మన్మథుఁడు. (ఇట్లు చిగురువిలుతుఁడు. మొ.)

చిగురొత్తు. దే. అ. క్రి. (చిగురు+ఒత్తు.) 1. చిగురుచు; "క. మనమునఁగయ్యపువేడుక, చిగురొత్తె." (ఇక్కడ చిగురొత్త అనఁగా పుట్టఁగా నని యర్థము.) భార. ద్రో. ౧. ఆ.—2. అనురక్తమగు. "చిత్తముచిగురొత్త." (చూ. ఒత్తు.)

చిచ్చఱ. వై. విశే. (చిచ్చు+అఱ.) అగ్నిమయము. "చ. చిఱునగవొప్పగాండివముచెచ్చెరసజ్యముచేసి సేనలు, క్కఱఅరభసంబుమైనపరింగవ్వడిద్రోణియు నీడఁబోకయ, స్రుతిఁదలుమంగ వస్త్రములు దందడిఁదార్కొనిమండుచుండెఁజి, చ్చఱపిడుగుల్ వడిందొరఁగుచాడ్పుననంబరవీథినుగ్రమై." భార. విరా. ౫, ఆ.

చిచ్చఱకంటి. ద్వి. వి. (చిచ్చఱ+కన్ను.) శివుఁడు.

చిచ్చి. దే. అవ్య. బిడ్డలకుజోలలుపాడునపుడుపీడాపరిహారార్థము చెప్పఁబడుమాట, (రూ. చిచ్చీ.)

చిచ్చు. వై. వి. 1. అగ్ని; 2. తాపము. "సీ. ఈ వెంద్రుకలుపట్టియీడ్చినయాచేయి తొలుతగాఁబోరిలో దుస్ససేను, తను వింతలింతలుతునియలైచెదరి రూపఱి యున్నఁగని యుడుకాఱుఁగాక, యలుపాలఁ బొనుపడునట్టిచిచ్చే యిది." భార. ఉద్యో. 3, ఆ.

చిచ్చుబుడ్డు. ద్వి. వి. బాణముసంచువగ.

చిచ్చుఱ.వై.విశే.(చిచ్చు+ఉఱ.)అగ్నిమయము. "చ. వెఱవకుమన్నపోటుకురువీరులతోడనశక్యమేని న, త్తెఱఁగదియేలనీవుడుగు తేరికిసారథిగమ్మునాకుఁజి, చ్చుఱపిడుగెట్టులట్టడరిశూరుల మొత్తము నుగ్గుసేసెదన్, బఱపెదసేనరాజుధృతిఁబాపెద గోవులఁగ్రమ్మఱించెదన్." భార. విరా. ౪, ఆ.

చిటచిట. దే. వి. 1. కాఁగిననూనెయందునీటిబొట్లు పడఁగాఁగలుగునట్టిధ్వన్యనుకరణము; "సీ. నఖముఖోల్లిఖిత పరాఙ్ముఖముక్తబాష్పాంబుపటిమదీపపుఁజిటజిటలు దెలుప." ఆము. ౫, ఆ.—2. మిడుఁగుఱులు చెదరుట లోనగువానియందగుధ్వన్యనుకరణము; "క. కటకటమలదరఁగన్నులఁ, జిటచిట నిప్పుకలుచెదర." ఉ. రా. 2, ఆ. "ఇరుగంటనిప్పుకల్ చిటచిటరాల." రా. వి. ౫, ఆ.—3. మంటయందగుధ్వన్యనుకరణము.

చిటచిటమను. దే. అ. క్రి. (చిటచిట+అను.) మండిపడు.

చిటచిటలాడు. దే. అ. క్రి. (చిటచిటలు+ఆడు.) ——పై.—— "చ. సటలిటమానురోరిహరిసర్వమయుండటెయంచుఁబట్టితోఁ, జిటజిటలాడియుండుఁగనఁజేయుమునీవనిదైత్యుఁడాడినన్, బటపటతాటికంబమిరువాయలుగానరసింహమూర్తివై, కుటిలనఖాగ్రకుంచికలఁగ్రుచ్చవెవానియురఃకవాటమున్." పా. 3, ఆ.

చిటపాట. దే. వి. 1. ఈర్ష్యచేఁగలిగెడు స్త్రీయొక్క కోపము; "చ. కుటిలకటాక్షవీక్షణముఁగోమలనూత్నకపోలరాగమున్, జటులసముంచితభ్రుకుటిసంపలనంబుహుఁజూచువేడుకన్, జిటపాటలేఁచెరాజాసరసీరుహనేత్రకుఁగామకేళికిన్, గటువులుకానిమానములకావెప్రదీపనసిద్ధిహేతువుల్." వై. ౧, ఆ.—2. ఆకులుతినుటయందగుధ్వన్యనుకరణము; "క. నటనపరకేకిపాత్ర, స్ఫుటయవనికలనమొగిల్లుపొదివెఱ ధూర్ధ్వ, త్తటులనదియాకుదినుచిట, పొటరవములుచెలఁగెఁవాశ్రములచ

ప్పళ్లే." ఆము. ౪, ఆ.—3. చినుకులుపడుటయం దగుధ్వన్యనుకరణము; "క. ఆటమున్ను మొగులు బలియుచుఁ, జిటపొటమని పాటపాటఁజినుకులు పడఁజొ, చ్చుటయాదిగాఁగఁదన పెని, మిటితడి యనొయనికుగాత్రిమిగులవగపుతోఁ." కళా. ౪, ఆ.—4. కాయలురాలుటయందగుధ్వన్యనుకరణము. "ద్వి. చిమిడికాయలు నేలఁజిటపొటరాల." హరిశ్చ. ౧, భా.

చిటాలు. దే. వి. ధ్వన్యనుకరణము. "వ. మిటారం పుఁగటారంబులఁజిటాలుచిటాలునఁదుటారంబ డరహుటాహుటింబటాపంచలుగఁదఱుముచు." అచ్చ. యు, కాం.

చిటి. దే. విశ. 1. చిన్న; "చిటిపాప." 2. సన్న ము. "చిటిచాఁప." (చిట్టియొక్క రూపాంతరము.)

చిటిక. వై. వి. 1. నడిమివ్రేలిని పెద్దవ్రేలితోఁగూర్చి ధ్వనింపఁజేయునంతకాలము; 2. నడిమివ్రేలిని పెద్దవ్రేలితోఁగూర్చి ధ్వనింపఁజేయుట*.

చిటికరించు. వై. అ. క్రి. చిటికవేయు.

చిటికరింత. వై. వి. చిటిక.

చిటికాఁడు. దే. వి. పొట్టిగానుండుటచేత కుక్కకి య్యఁబడినపేరు. (ఇది చిటిలింగఁడు అనుదానికి పర్యాయము.) విశ. చిన్నవాఁడు.

చిటికెన. దే. వి. చిన్నవ్రేలు, కనిష్ఠిక. "చ. ఇటుత గునయ్యవిప్రుఁడవహీనగుణాఢ్యుఁడవీవునీకునే, మిటికిటువంటి దౌష్ట్యము శమించుసెమజ్జనకుం డువిన్నఁద,క్కటిజనులేమియందు్రుమరిఁగాంత్ర యొకగ్గిననగ్నిసాక్షిగాఁ, జిటికెనవట్టికాకవృథచే యుటధర్మమెకన్యకాత్వముఁ." భో. ౪, ఆ.

చిటికెనబొద్దులు. దే. వి. బ. కాలిచిటికెనవ్రేళ్లయం దుంచుకొనెడు భూషావిశేషము.

చిటిగోట్టె. ద్వి. వి. చిన్నజాతిగోట్టెచెట్టు.

చిటితాళము. మి. వి. మ్రానితోఁజేసినతాళవిశేషము. "సీ. చిటితాళములుచంక పుటికసెక్కొకమాటు గతిరయమ్మునఁ దాఁకికలసిమొరయ." అము. ౬, ఆ.

చిటిపొటి. దే. విశ. అల్పము. "క. చిటిపొటినవ్వు లుకనుఁగవఁ, బొటమరిలఁ." సా. 3, ఆ. (పొ టిశబ్దముయొక్క రూపాంతరము పొటి. చిటిపొ టిశబ్దములురెండుచేరియుండుటవలన అత్యల్పమ ను నర్థము చెప్పవచ్చును.)

... దే. వి. బ. చిటికెనబొద్దులు.

చిటిముత్తెములు. ద్వి. వి. బ. ధాన్యవిశేషము.

చిటిలింగఁడు. ద్వి. వి. చిన్నలింగమువలెనుండుటచే కుక్కకియ్యఁబడినపేరు. (చూ. గబ్బి.)

చిటివ్రేలు. దే. వి. చిటికెనవ్రేలు.

చిటుకను. దే. అ. క్రి. చిటుక్కనుయొక్క రూపాం తరము. "సీ. చెవిదార్చివినిచీమచిటుకన్ననటఁ బాటిసెలవి వెంపరలాడుఁజెట్టులెల్ల." స్వా. ౪, ఆ.

చిటుకుపొటుకు. దే. వి. వానవెలిసినపిమ్మట చెట్టు మీఁదనుండి బొట్లుపడునపుడు కలుగు ధ్వన్యను కరణము.

చిటుకుపొటుకుమను. దే. అ. క్రి. (చిటుకుపొటు కు+అను.) పలుకు. (వాఁడు చిటుకుపొటుకు మనక ఉన్నాఁడు.)

చిటుకురను. ద్వి. అ. క్రి. (చిటుకు+అను.) చిటు క్కనిమ్రోఁగు. "గీ. చీమచిటుకురన్నఁజిమ్మటఁజ ఱన్న, నెదురమూషకములు మెదలుకొనిన, నిదు రలేకభూమినిర్జరుఁడాలించు, నప్పుడబలకొలఁ ప్పుడనుచు." పంచ. వేం. ౪, ఆ.

చిటుక్కను. దే. అ. క్రి. (చిటుక్కు+అను.)—— పై.——

చిటులు. దే. అ. క్రి. చిట్లు. "చిటులుగంధపుఁబూఁత."

చిట్ట. దే. వి. 1. ఆశ్చర్యము. "ఉ. నీదుమహత్వమెం తయుం, జిట్టలుగాదె." భార. అర. ౫, ఆ. "వాని వర్తనము చెప్పంజిట్టలు." నిర్వ. 2, ఆ. "క. ముని నాథ చెప్పఁజిట్టలు, మనయనిరుద్ధుండునిన్నమగు వలుగొలుపఁ, దనయింటరాత్రి నెమ్మది, ననికిని లిగెఁబిదపనన్నయునికినయడఁగెఁ." ఉ. హరి. ౬, ఆ.—2. చిన్నపొద. "వ కరిపరక రేణువులు వం ప గుంపుచెడి యిట్టట్టుపడి తిట్టగు చిట్టల సంక టంబులగుడొంకలును." స్వా. ౪, ఆ. "పగడపుఁ జిట్టలఁ." వసు. ౧, ఆ. విశ.—కల్పితము. (ఇది చిట్టగానున్నది.)

చిట్టంటుచేతలు. దే. వి. బ. (చిట్టి+అంటుచేతలు.) విలాసము. "ద్వి. కైకేయి, పరవుఁడామంథరవాడ నేగుదెంచి, చిట్టంటుచేతలఁజెండుడట్టుటయు." రా. బాల, కాం.

చిట్టంటులు. దే. వి. బ. (చిట్టి+అంటులు.) నఖదం తక్షతాది. "ఎ, గీ. అంతకంతకుఁజిట్టంటులఁటి యంటి, చెలువలకుయావనమువిందుసేయనున్న మానగుణబద్ధుమన్మథమంత్రసిద్ధు, రుచిరరసవృద్ధు నాయనిరుద్ధుఁజూచి." (ఇక్కడ అంటియనఁగా

చేసియని యర్థము.) ఉ. హరి. ౫, ఆ. "సీ. చిట్టంబు చేతలనిగ్గుకీలెడలించి పలికింపనల్లనఁ బలుకుటయును." (ఇక్కడ వృత్తియందేకవచనాంతము.) భో. ౪, ఆ.

చిట్టకము. వై. వి. 1. శృంగారచేష్ట*; "ఉ. ఇంతులు కూడి చిట్టకములిట్లొనరింపఁగ నించుకేనియుం, జింత తెలంగులేక ధరణీధరముం బలెనున్న యాద్యపుం, ష, స్వాంతునిఁ జూచి జాపతిమ చక్కిలిగింతలు వోలెఁ గంటిరే, యెంత యురిత్తవో యి మనయింపఱు చేష్టలు నం మనవ్వుచుం." పర. 3, ఆ.—2. లీల*; "క. నీకొడుకు నీకయిచ్చితిఁ, గైకొను మిరించి చిట్టకాలకు లోనై, నాకుఁ బగయగుట నంగము, లేకున్నాఁడ తేఁడు కొఱంత లేదతని పయిం." ఉ. హరి. ౨, ఆ.—3. కపటము*. "చిట్టకంపుఁ బ్రాగుడుగ నిసన్నలన్నగిరి." ఆము. ౨, ఆ.

చిట్టచివర. దే. విణ. (చివర+చివర.) అన్నిటికి చివర.

చిట్టతుమికి. దే. వి. రావణవృక్షము.

చిట్టమిడుచు. దే. అ. క్రి. చిటికవేయు. "సీ. సకలాంగకంబులు జాదుకోఁ బులకించి చెయ్యెక్కించుక యెత్తి చిట్టమిడిచి." వై. ౫, ఆ.

చిట్టా. హిం. వి. దినపులెక్క.

చిట్టాడు. దే. అ. క్రి. (చిట్టి+ఆడు.) 1. సంచరించు; "మ. రణక్షితియందీనుఁగు పెంట చేసెఁ జెనయం జిట్టాడఁగా శక్యమే." భార. ద్రో. 3, ఆ. "సర్వసేనాంగాంగంబులమీఁద గాలియును జిట్టాడంగనీక." (ఇక్కడ చిట్టాడుట యనఁగా సోఁకుట యని యర్థము.) భార. ఉద్యో. ౨, ఆ.—2. ప్రసరించు; "సీ. సిగ్గులేఁ దెరవాసి చిట్టాడు చూపులు నవవిలాసమునకు నవక మొసఁగ." షో. ౨, ఆ.—3. తప్పటడుగులిడు; "సీ. చిట్టాడునాడు నాచిటికెన వ్రేల్ వట్టు చేతులాయివి ముద్దుచిన్ని కూన." సా. 3, ఆ.—4. చలించు. "క. కందోయి చల్లఁగా నిటు, గందోయి నృపాల లెస్స గానిఁక నొకమా, టందఱ ముందఱనీవని, చిందఱవందఱలగుట్టు చిట్టాడంగన్." సా. 3, ఆ.—5. క్రీడించు. "సీ. పొన్నక్రొవ్విరివంటి పొక్కిలి గిలిగింతలలరఁ జిట్టాడెడునట్టి వేళ." శుక. ౧, ఆ.

చిట్టాముదపుఁజెట్టు. ద్వ. వి. (చిట్టాముదము+చెట్టు.) బల.

చిట్టాముదము. ద్వ. వి. (చిట్టి+ఆముదము.) 1. చిట్టాముదాలనూనె; 2. బ. చిట్టాముదపువిత్తులు.

చిట్టి. దే. వి. సోలయందు నాలుగవ భాగమయిన మానవిశేషము. విణ. చిన్న. "ఎ, గీ. మలయపవనుండు పలునాఱు మలయకుండ, నలరుచిట్టిగవాక్షంబులరసి యరసి, యెందుఁ గందర్పతాపంబుడింగు పడక, చెలువ నీరాకమదిఁ బేక్షించునంత." విక్రి. ౪, ఆ. (ఇత్యాదిప్రయోగములం బట్టి చిట్టడవి, చిట్టాస, చిట్టీఁగు, చిట్టుడుకు, చిట్టెండ, చిట్టెలకి ఇత్యాదులయందుఁ బూర్వమునందుండునది చిట్టిశబ్దముగాని చిఱుతశబ్దము కాదని తోఁచుచున్నది.)

చిట్టియ. దే. వి (చూ.) చిట్టె.

చిట్టియము. దే. వి. (చూ.) చిట్టెము.

చిట్టీఁగు. దే. వి. (చిట్టి+ఈఁగు.) ఖర్జూరి?.

చిట్టీడ. దే. వి. (చిట్టి+ఈడ.) క్షుద్రరక్తసారంగము?.

చిట్టు. దే. వి. తవుడు కలిసిన సన్ననూక.

చిట్టుడుకునీళ్లు. ద్వ. వి. బ. (చిట్టి+ఉడుకునీళ్లు.) పొంగునీళ్లు.

చిట్టుములు. దే. వి. బ. (చిట్టి+ఉములు.) గర్భిణికిఁ గలిగెడి యొకానొక లక్షణము.

చిట్టె. దే. వి. 1. వస్త్రములయంచులయందు నేసెడు చిన్నకమ్మి; 2. వెదురుగనుపు. (చిట్టియయొక్క రూపాంతరము.)

చిట్టెము. దే. వి. ఇనుము కాఁచునప్పుడు వచ్చెడు ముఱికి, శింఘాణము. (చిట్టియముయొక్క రూపాంతరము.)

చిట్టెలుక. దే. వి. (చిట్టి+ఎలుక.) చిన్నజాతియెలుక, గిరిక.

చిట్టెలకి. ద్వ. వి. (చిట్టి+ఏలకి.) ఉపకుంచిక?.

చిట్లపొట్లాకాయ. దే. వి. బాలక్రీడావిశేషము. (చూ. కుందెనగుడి.)

చిట్లు. దే. అ. క్రి. 1. పగుల్లువాఱు; 2. మిక్కిలి కోపించు. వి. వృత్తాంతము. "క. ఇట్లయ్యిరువురుఁ దమలో, జట్లు వడ సికోర్కు లక్కజంబుగ సఖులీ, చిట్లెఱిఁగినఁ గార్యము తుది, నెట్లగునో యనుచునుండ నింతటిలోనన్." భో. 3, ఆ. (చిటులుయొక్క రూపాంతరము.)

చిట్లుకట్టియ. ద్వ. విణ. మిక్కిలి కోపముగలవాఁడు.

చిట్లుకట్టె. ద్వ. విణ. చిట్లుకట్టియయొక్క రూపాంతరము.

చిడిపి. దే. విణ. 1. అల్పము; "అంతధనంబును వట్టి రాజ్యముం గొననగునయ్య యిచ్చిడిపికుట్టికి."

భార. ఆది. ౭, ఆ. —2. పరుషము. "గీ. కొన్ని జీవులు చిడిపిడాల్గ్లాటికి బ్రుకుc, గొన్ని నునుసోగవెన్నెలక్రోలిపొదలు." నై. 3, ఆ. "గీ. విశ్వరూపభవదూర్భారివిభవమహిమ, నెంతవర్ణింపcజాలుమాయీ మనంబు, ప్రాcత పైచీర చెఱcగున బడుగునాcడు, హేమశైలంబు చిడిపిడాలెన్ని యుడుచు." నై. ౧, ఆ.

**చిడిముడి.** దే. వి. తొట్రు. "ద్వి. చిడిముడిcదన పైcటచేcదడియొత్తి." సా. 3, భా.

**చిడిముడిపడు.** ద్వ. అ. క్రి. తొట్రుపడు. "వ. అయ్యన్నయుందమ్ముండును వెఱcగుపడియునుంజిడిముడిపడక." భార. ఆర. ౭, ఆ.

**చిడిముడిపాటు.** ద్వ. వి. చిడిముడిపడుట, తొట్రుపాటు. "చిడిముడిపాటు పొడముల cజెందcగ." ఉ, హరి. ౨, ఆ.

**చిడుగు.** దే. విణ. అల్పము. "క. వెడబడుగుంజడదారుల, చిడుగుంబోడుములcదిరుగcజేయుట యరుదే." చంద్రా. 3, ఆ.

**చిడుగుడు.** దే. వి. బాలక్రీడావిశేషము. (చూ. ఉప్పెలపోటి.)

**చిడుము.** దే. వి. తీcటకుఱుపు.

**చిత.** సం. వి. ఆ. స్త్రీ 1. సొద; 2. ప్రోగు. విణ. 1. కప్పcబడినది; 2. చేర్పcబడినది.

**చితి.** సం. వి. ఇ. స్త్రీ. 1. సొద; 2. ప్రోగు.

**చితుకు.** దే. అ. క్రి. కుఱుపులోనగునవి నలcగు.

**చిత్త.** వై. వి. చిత్రానక్షత్రము; ఒక కార్తె పేరు.

**చిత్తగించు.** వై. అ. క్రి. మనస్కరించు. "గీ. ఓకుమారనీకు నొకకథ చెప్పెద, సర్వతత్వశాస్త్రసమ్మతంబు, నఖిలలోకసేవ్యమైనయర్థంబిది, వినుము చిత్తగించియనఘచరిత." వాసి. 3, ఆ. —స. క్రి. 1. తలcచు; "గీ. తండ్రి నీవు నాకు దయతోడ నిచ్చిన, వరము చిత్తగించి వలయు తెఱcగు, సమయసముచితముగ సమకట్టుమయ్యయీ, రాకుమారులవిధిc బోకయుండ." భార. విరా. ౧, ఆ.—2. యోచించు. "గీ. తల్లియైన నేలతన్ను దుసుతుcడైన, నేలననుశిపించు నీమృగాక్షి, యేను గాను సుతుcడనీయమతల్లియుc, గాదు చిత్తగింపు కర్మసాక్షి." వి. పు. 3, ఆ.

**చిత్తడి.** ద్వ. వి. (చిత్త+తడి.) మిక్కిలితడి. "క్రొంజెమటచిత్తడినంటి." భాను. ౪, ఆ.

**చిత్తము.** సం. వి. అ. న. మనసు, మానసము, మది.

**చిత్తర.** దే. వి. మత్స్యవిశేషము.

**చిత్తరువు.** వై. వి. 1. ఆశ్చర్యము; "తనతుక్కారంబు తేజీc జివుక్కనదాcటించి గుదించి చిత్తరువు బాగుగ్రీఁఱనాడించె." కళా. ౫, ఆ.—2. పటమునందు రూపము వ్రాయుట; "క. కరువునగండరువునcజిత్తరువుననినచంద్రరుచులcదారలరుచులన్, హరిహరవిధాతృలకునీ, హరిణము సరిరూపు వడయనలవియె యింకన్." రా. ఆర, కాం, ౨, ఆ.—3. పటమునందు వ్రాసినరూపము. "ఉ. జగతీపతిచిత్రముపాంగదృష్టిచేc, దప్పకచూచి రాజసుతతానును జిత్తరువయ్యెనత్తఱిన్." కవిక. 3, ఆ. (కృత్తియందుc గడపటివర్ణము వికల్పముగా లోపించును. చిత్తరుబొమ్మ. మొ.)

**చిత్తతి.** ద్వ వి. (చిత్త+తతి.) వర్షఋతువు.

**చిత్తిని.** వై. వి. స్త్రీజాతివిశేషము.

**చిత్తు** ఉభ. దే. వి. 1. దద్దిచక్కపఱుపని మొదట వ్రాసినవ్రాcత; 2. మొదట గుణించుకొను లెక్క. సం. త్. స్త్రీ. జ్ఞానము.

**చిత్య.** సం. వి. ఆ. స్త్రీ. సొద. అ. న. ము. గో.

**చిత్ర.** సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకనక్షత్రము; (చూ. నక్షత్రము.) 2. మాయ; 3. ఎలుకజీడి†; 4. గుమ్మడి†; 5. పిన్నపాపర†; 6. బుడమ†. అ. న. ము. 1. ఆశ్చర్యము; 2. చిత్తరువు; 3. నానావర్ణము; 4. బొట్టు. విణ. 1. ఆశ్చర్యకరమైనది; 2. నానావర్ణములుగలది.

**చిత్రకంఠము.** సం. వి. అ. పుం. కపోతము, గువ్వ.

**చిత్రకము.** సం. వి. అ. న. బొట్టు. పుం. 1. చిఱుతపులి; 2. ఆముదపుచెట్టు; 3. గుమ్మడి†; 4. చిత్రమూలము.

**చిత్రకాయము.** సం. వి. అ. పుం. చిఱుతపులి.

**చిత్రకారుcడు.** సం. వి. అ. పుం. చిత్తరువు వ్రాయువాcడు, ముచ్చి.

**చిత్రకుcడు.** సం. వి. అ. పుం.——పై.——

**చిత్రకృత్తు.** సం. వి. త్. పుం. తినాసము†.

**చిత్రగుప్తుcడు.** సం. వి. అ. పుం. 1. యమునివద్ద లెక్క వ్రాయువాcడు; 2. యముcడు.

**చిత్రతండుల.** సం. వి. ఆ. స్త్రీ. వాయువిడంగము†.

**చిత్రదండము.** సం. వి. అ. పుం. కంద†.

**చిత్రపక్షము.** సం. వి. అ. పుం. 1. కవుcజు; 2. నెమలి.

**చిత్రపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. కోలపొన్న†.

చిత్రబింబము. సం. వి. అ. పుం. కామరూపముగల కొండ, ఊసరవెల్లి.

చిత్రభాను. సం. వి. ఉ. పుం. ఒకసంవత్సరము. (చూ. సంవత్సరము.)

చిత్రభానువు. సం. వి. ఉ. పుం. 1. అగ్ని; 2. సూర్యుఁడు.

చిత్రరథుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకానొక గంధర్వుఁడు; 2. ఒకానొక విద్యాధరుఁడు; 3. సూర్యుఁడు.

చిత్రవాలము. సం. వి. అ. పుం. పాలపిట్ట.

చిత్రశిఖండిజుఁడు. సం. వి. అ. పుం. బృహస్పతి.

చిత్రశిఖండులు. సం. వి. న్. పుం. మరీచ్యాదిసప్తమహర్షులు.

చిత్రించు. సం. స. క్రి. చిత్రమువ్రాయు.

చిత్రిక. దే. వి. మ్రాను నునుపుసేయుచెడు సర్లవాని కొలిముట్టు, త్రోపుడు.

చిత్రిణి. సం. వి. ఈ. స్త్రీ. (చూ.) చిత్తిని.

చిత్రితము. సం. విశ. (అ.ఆ.అ.) చిత్రింపఁబడినది.

చిదక. దే. విశ. చప్పట. (చిదకముక్కువాఁడు. మొ.)

చిదగొద. దే. వి. భేదము, వ్యత్యాసము. "క. మొదలనపాయంబెన్నట, పిదపనుపాయంబులెక్కపెట్టుటతగునీ, చిదగొదలఁగాదెమునొక, ముదికొక్కురయనుఁగుసుతులముంగిసకిచ్చెన్." పంచ. వేం. ౧. ఆ.

చిదియు. దే. అ. క్రి. నలఁగు. "చిదియవుకొండపైఁబడిన." హరి. ఉ. ౫. ఆ. "వ. ముక్కులుచిదసియుఁజెక్కులుచిదిసియు." ఉ. హరి. 3. ఆ.

చిదుకు. దే. అ. క్రి. చిప్పిలు. "చ. పదములుకొంకువోఁబిసికిప్రక్కలసుక్కడలించిదంశవం, శదమునవృత్తినింపొసఁగిసాస్రనఖంబుల దువ్వియెత్తురుల్, చిదకెడుగంట్లభూరజముచిల్కిముఖస్థతృణంబు ద్రోచియ, మ్మొదవుమృదుక్రియన్ నడపిముంగిటఁబందిటిరాటఁగట్టుచున్." పాండు. ౫. ఆ.

చిదుగు. దే. వి. ఎండిన చిన్నపుల్ల, సమిధ.

చిదుపు. దే. ప్రే. చిదియఁజేయు.

చిదుము. దే. స. క్రి. 1. గిల్లు; "అదటునఁజిదిమిన నెఱుంగక." స్వా. ౨. ఆ.—2. పువ్వులులోనగువానిఁగోయు; "వ. నాసికాతిలప్రసూనంబునఖశిఖరాగ్రంబున మొదలంటఁజిదిమితి." భీ. 3. ఆ.—3. త్రుంచు; "చ. కొన్నికంఠముల్, చిదుముదునేలరక్తపరిషిక్తముగాఁగరవాలలీలలన్." భార. సౌ. ౧. ఆ. "సీ. అధిపుమైమ్రుచ్చింపనలయుతశోకరామతుదగోళ్లఁగుళములు చిదిమితెచ్చు." కవిక. ౬. ఆ.—4. వైచు. "క. మండూకమకరకచ్ఛప, గండూపదదులికులీరకలహంసకకా, రండవబకములవెండిఁబ, సిండినిగావించిగంగఁజిదుముచుమత్రతుల్." సం. "అభ్యర్చ్యగంధకుసుమైఃగంగాయాంప్రక్షిపేద్వ్రతీ." కాశీ. ౫. ఆ.—వి. చిగురు. "సీ. చిదుముఁడీచిదుములుమదకోకిలాబలాప్రభునకుఁబల్లవపాణులార." చంద్ర.

చిదురలు. దే. వి. బ. 1. సూక్ష్మఖండములు; "సీ. జంభారిదోస్స్తంభదంభోళిహతిఁదూలిచెదరినతారాద్రిచిదురలనఁగ." (ఇందువిషయము తారకామండలము.) భాను. 3. ఆ.—2. సూక్ష్మభాగములు. "క. కళలుఁగాష్ఠలులోనుగఁ, గలచిదురలఁగూర్చుకొనుచుఁగాలంబుజనం, బులవడ్డికిచ్చునాతని, వలెనలవడఁబొదివితనకువశ్యులఁజేయున్." భార. శాం. ౪. ఆ. "గీ. అయ్యుధిష్ఠిరురాజసూయంబుచిదుర, పాలుపోలదీమఖము." (ఇక్కడ వ్యుత్తియందేకవచనాంతము.) భార. ఆర. ౬. ఆ.

చిదురుపలు. దే. వి. బ.——పై.——"క. మదమునత్రుతాయువొక్కటఁ, బదునాలుగుతోమరములుపఱఁగించిననే, ర్పొదవఁగఁబవనజుఁడన్నిటిఁ, జిగురుపలుగఁజేసెఖడ్గచిత్రనిహతులన్." భార. భీష్మ. ౨. ఆ. (రూ. చిదుర్పలు. "చ. కొనకొనిరాజులేయుశరకోటిపరంపరఘట్టనంబులన్, దునుకలువ్రక్కలునొగిఁజిదుర్పలుఁదుత్తుమురై పడంగ." భో. ౫. ఆ.)

చిద్రుపలు. దే. వి. బ. చిదురుపలుయొక్కరూపాంతరము. "చ. శరీరపుం, జిద్రుపలుసేరుఁదత్సతులచేతులఁగాకకులంబువాతులన్." ఉ. హరి. ౪. ఆ. (చూ. చిదురుపలు.)

చిన. దే. విశ. చిన్నయొక్కరూపాంతరము. "చినకత్తి." అచ్చ. యు. కాం.

చిని. దే. విశ. 1. చిన్న; 2. మనోజ్ఞము. (చిన్నియొక్కరూపాంతరము.)

చినుఁగు. దే. అ. క్రి. వస్త్రాదికముఛిన్నమగు. "చ. అనిపినజాతుఁడీకరణినానతియిచ్చినఁదత్కృపాపారసం, బనుపెనువానమబ్బినక్రియన్ రయమారఁగఁదత్ప్రదేశమున్, ధనువునవారిరైయి నిగిడిదాని శర

మ్ముకరమ్ముదాఁకినన్, దునుఁగుఁజినుంగు ప్రేలుఁగ డుఁదూలుజగజ్జనజన్మలక్ష్యముల్." పాండు. ౫, ఆ.

**చినుకు.** దే. అ. క్రి. కాఱు. "ఎ. గీ. వృష్ణివీరుఁడు డిభకునివిల్లుదుని మె, నర్ధచంద్రబాణంబునసతఁడు వేఱ, వింటనిశితక్షురప్రంబు వెలయఁదొడిగి, సినివరునినోర నెత్తురుచినుక నేసె." ఉ, హరి. ౪, ఆ.—అం, ప్రే. కార్చు, కురియు. "లలాటఫలకంబందందఘర్మాంబువుల్ చినుకన్." స్వా. ౫, ఆ. "వ. మేఘంబులు నెత్తురుసినికెడు." రా. యు, కాం.—వి. వర్షబిందువు, (రూ. చిన్కు.)

**చినుకుఁబూస.** దే. వి. (చినుకు+పూస.) ముత్యము.

**చిన్న.** దే. విశ. 1. అల్పము; 2. కనిష్ఠము.

**చిన్నటనాడు.** దే. వి. (చిన్న+నాడు.) బాల్యసమయము.

**చిన్నది.** దే. వి. (చిన్న+అది.) బాలిక. విశ. చిన్నదైనది.

**చిన్ననాడు.** దే. వి. బాల్యసమయము.

**చిన్నము.** దే. వి. 1. నాలుగు గురిగింజలయెత్తు; "ఎ. గీ. చిన్ననాడునుబ్రియుఁ డొకచిన్నమంత, మాటయాడినవినితాపమగ్నవగుదు." కళా. ౪, ఆ.—2. నాలుగుగురిగింజలయెత్తుగలబంగారునాణెము. "చ. మునిబుణమేగతిన్ మొదలుఁ ముట్టఁగఁదీర్చెదవొక్కచిన్నమున్, జనపతిచేతలేదుజలజాతదళేక్షణవిత్తమెవ్విధం, బునసమకూరెడిన్ మితికిబొంకఁగనేరఁడొకింతయైననీ, పెనిమిటియిట్టిశీలమునఁబృథ్విఁజరింపఁగఁబోలదేరికిన్." హరిశ్చ. 3, ఆ.

**చిన్నరిపొన్నరి.** దే. విశ. చిన్నారిపొన్నారియొక్క రూపాంతరము.

**చిన్నతికము.** దే. వి. చిన్నతనము.

**చిన్నవాఁడు.** దే. వి. బాలుఁడు. విశ. చిన్నదైనవాఁడు.

**చిన్నవోవు.** దే. అ. క్రి. (చిన్న+పోవు.) ఖిన్నుఁడగు. (ప్రే. చిన్నవుచ్చు.)

**చిన్నారి.** దే. విశ. మనోజ్ఞము. (చిన్నారిచిగురు, చిన్నారిజాబిల్లి, చిన్నారినూఁగారు, చిన్నారిమొగము. మొ.)

**చిన్నారిపొన్నారి.** దే. విశ. మనోజ్ఞము. "సీ. చిన్నారిపొన్నారిచెక్కుటద్దములపైఁజెలువవ్వ మొలకలుచెంగలింప." విక్ర. ౭, ఆ.

**చిన్ని.** దే. విశ. 1. చిన్న; 2. మనోజ్ఞము. "చిన్నిరామచంద్రునినగుమోముదామరసిరుల్ కనుపండువుగాఁజెలంగ." రాఘు. ౨, ఆ.

**చిన్నిదము.** దే. వి. 1. చిన్నపువ్వు; 2. బంగారు.

**చిన్నిపువు.** ద్వి. వి. 1. భూషావిశేషము; "రగడ. కుటిలాలకములమీఁదఁజిన్నిపువుఁగుస్తరించుసచ్ఛగమణికర్ణిక." కాశీ. ౬, ఆ.—2. బ. నమస్కృతి. (రూ. చిన్నిపువ్వు. నమస్కృతికి.—"రగడ. అష్టభుజస్థలినష్టభుజానకును, జిత్తమురంజిలఁజిన్నిపువ్వులని." హంస. ౪, ఆ.)

**చిన్నిపూఁతకు.** ద్వి. వి.—వై.—

**చిన్నియ.** వై. వి. 1. గుఱుతు; (చూ. చిన్నె.) 2. విలాసము*. "చిలుకలకొల్కినీ వెడఁగుఁ జిన్నియ లెన్నఁగఁగ్రొత్తలు." నీలా. ౨, ఆ.

**చిన్నె.** వై. వి. చిన్నియయొక్క రూపాంతరము. (గుఱుతునకు. — "గీ. నలువకైనఁగన్గొనఁగరాకటక్కరి, వగుచుజోగితెగలయందెడాఁగి, కొలముగొనముఁరూపుగలుగకయుండునీ, కిట్టిరాచచిన్నెలెలయిపుడు." అచ్చ. యు, కాం.—విలాసమునకు.—"క. నెలబాలుఁజూపినునుగి, న్నెలఁబాలును నెయ్యివోసి నెలఁతుకలాచి, న్నెలబాలకుఁద్రావించుచు, నెలమిం గ్రీడింపఁజేసి రింపలరారన్." రుక్మి. ౧, ఆ.)

**చిన్నెలాఁడి.** ద్వి. విశ. (చిన్నెలు+ఆఁడి.) విలాసవతి.

**చిన్నెలాఁడు.** ద్వి. విశ. (చిన్నెలు+ఆఁడు.) విలాసవంతుఁడు.

**చిపిటము.** సం. వి. అ. పుం. అడుకులు. విశ. చప్పటముక్కువాఁడు.

**చిప్ప.** దే. వి. 1. కప్పచిప్ప; "ద్వి. చిప్పలుగుల్లలుఁజిక్కంగఁదన్ను, నిప్పుడధూళిగానింకించువాఁడ." రా. యు, కాం.—2. కల్లుత్రాగెడుగిన్నె, "క. కనకపుఁజిప్పలనిండించి మదము చిప్పిలుచుండన్. ఉ. అందఱుఁగైకొనంబనిచియాదటఁగాంతయుఁదానుమొక్కకో, రందనుపారదవ్యమదిరామధురామృతపానకేలియం, దందఱొనర్పఁగాఁదొడఁగె." లక్ష్మీ. 3, ఆ.—3. టెంకాయచిప్ప; 4. తామేటివీఁపుచిప్ప; "సీ. తలచూపలేకచిప్పలుపూని నంతలమెలఁగెడు తామేటమేటివ్వి." అచ్చ. బాల, కాం.—5. భూగోళమునందర్ధభాగము; "ద్వి. కనకమయాండమొక్కటచేసి దానిఁ, బనిపూనియన్నిటిపైనిఁదేలించె. పైచిప్పక్రిందిచిప్పయునొప్పమీఱ." విష్ణు. పూ. 3, ఆ.—6. ముత్తెపుఁజిప్ప; "సీ. ఏవీటిసతులపాలిండ్లపైగంబూరనవహారములచిప్పకవుచుమాన్చు."

త్రము. ౨, ఆ.—7. మోఁకాటిచిప్ప; 8. తునుక; "ద్వి. అప్పుడాకపిసేనయంగంబులెల్లఁ, జిప్పలు చిద్రుపలై చెదరంగఁజూచి." రా. యు, కాం.—9. తలపుచెక్క; 10. చేఁపమీఁదిపొలుసు. "గీ. అ ఘుగునడుగునఁబోడముచిహ్నంపుమీల, మేనిచిప్పలువోలెనానానిలింప, కనకకోటీరహీరాగ్ర ఘర్షణమున, మెఱుఁగుపచ్చినఖపఙ్క్తి మించువాని." పాండు. 3, ఆ.—విశే. అల్పము.

చిప్పకత్తి. దే. వి. చెట్లు మొదలైనవినఱకెడు మోట కత్తి.

చిప్పకసవు. ద్వి. వి. భూస్తృణము. (ఇట్లు చిప్పగడ్డి.)

చిప్పకూఁకటి. ద్వి. వి. పిల్లజుట్టు.

చిప్పగొడ్డలి. ద్వి. వి. చెట్లునఱకెడుగొడ్డలి. "సీ. కుంజపోఁగులు చిప్పగొడ్డండ్లుసెలగోలలొప్పారుపలుఁగంకయుంగరములు." నీలా. 3, ఆ.

చిప్పపెడక. దే. వి. ఇంటిపార్శ్వముల కప్పు.

చిప్పము. దే. వి. పెద్దమూట.

చిప్పముత్తెము. ద్వి. వి. కృత్రిమమౌక్తికము.

చిప్పమూతి. దే. వి. కళాహీనమగు ముఖము.

చిప్పిల్లు. దే. అ. క్రి. నీటిబొట్టులోనగునవి లోపల నుండి పైకుబుకు. "క. అప్పుడుపదిపదియమ్ములఁ, దిప్పకయాదవులబ్రహ్మదత్తకుమారుల్, నొప్పింపరుధిరధారలు, చిప్పిల్లనివారులేరుసేనలలోనన్." హ. హర. ౪, ఆ. (రూ. చిప్పిలు.)

చిప్పవాఁడు. దే. వి. కుట్రపువాఁడు.

చిబుకము. సం. వి. అ. న. గడ్డము, (రూ. చీబుకము.)

చిబుకు. దే. స. క్రి. చప్పరించు. "సీ. కోమలతరపదాంగుష్ఠంబుచిబుకుచునెడనెడనవ్వుచు నేడ్చుచుండు." జై. ౬, ఆ.

చిమచిమ. దే. వి. గాయపుమంటయందగుననుకరణము. "సీ. మొనపంటమొనసిసొక్కిననొక్కు చేఁ గెంపుటధరంబు చిమచిమయనినయట్లు." అని. ౨, ఆ.

చిమట. దే. వి. చిమ్మటయొక్క రూపాంతరము.

చిమిడిక. దే. వి. చిమిడినయన్నము.

చిముటాలు. దే. వి. బ. క్షౌరమప్పుడు తెండసముతో వెండ్రుకలూడఁదీయుట.

చిముటు. దే. స. క్రి. సైఁగకు కన్నుమూసి తెలుచు.

చిముడు. దే. అ. క్రి. 1. అన్నముపాకముమీఱనుడికిముద్దయగు; 2. పాకముచెడు.

చిముడుచు. దే. ప్రే. చిముడఁజేయు. "అజాండమంతయున్ జిమిడిచెదరన్." రామా. ౬, ఆ. (రూ. చిముడ్చు.)

చిమ్మ. దే. వి. జలకణసమూహము. "మ. అనిసంజిత్తముజల్లనన్ సారుగునయ్యంభోజపత్రాక్షిలో, చనగోళంబులఁజిమ్మలైచిలుపలైజాలైతరంగంబులై, చనుదోయింగొనబౌకురంగమదచర్చల్ జాతిపోనొక్కయొ, డ్డునబాష్పాంబుఝురంబులుప్పతిలెబోటుంబాటుగానెంతయున్." స్వా. 3, ఆ.

చిమ్మచీఁకటి. దే. వి. గాఢాంధకారము, అంధతమసము. "ద్వి. వివరింపుమిదెప్రొద్దువేగుజామయ్యెఁ, గవిసినచిమ్మచీఁకటి వెల్లఁబాఱె." హరిశ్చ. ౨, భా.

చిమ్మట. దే. వి. ఈలపురుగు, ఝిల్లిక.

చిమ్మదిరుగు. దే. అ. క్రి. గిరగిరఁదిరుగు. "ఎ, గీ. చిమ్మదిరుగుచునిలువకశిరమువ్రాల." భాగ. ౧౦, స్కం. పూ.

చిమ్మనగ్రోవి. దే. వి. (చిమ్మనము+గ్రోవి.) జలక్రీడయందు నీళ్లుచిమ్మెడుగొట్టము, శృంగము.

చిమ్మనము. దే. వి. చిమ్ముట. "గీ. చారుతరనాభియనెడుగంభీరసరసిఁ, గడఁగిక్రీడించుమరునిశృంగారరసపుఁ, జిమ్మనపుఁగ్రోవిదారనాఁజెన్నుమీఱుఁ, బడఁతినూగారుకన్నులపండువగుచు." ప్రభా. ౨, ఆ. (దీనికి వ్యస్తప్రయోగము కనఁబడ లేదు.)

చిమ్మి. అం. వి. పొగగూడు, పొగగొట్టము.

చిమ్మిరేఁగు. దే. అ. క్రి. మిక్కిలి విజృంభించు. "వ. ఇత్తెఱంగునసుగ్రీవుండు మూర్ఛిల్లిననుల్లంబులఖేదక్రోధంబులుక్రమ్మంజిమ్మిరేఁగి. క. గజగవయగవాక్షాదులు, గజిబిజియదలుపులుసెలఁగఁగదిసి గురుగిరి, వ్రజములుగురియఁగఁగనుఁగొని, రజనీచరరాజురౌద్రరసవివశుండై." రామా. ౬, ఆ.

చిమ్మిలి. దే. వి. నువ్వులును బెల్లమును కొట్టిచేసెడి యుండ.

చిమ్ము. దే. స. క్రి. 1. మీటు; 2. వైచు. వి. 1. పొడుచుట; "సీ. క్రొవ్వాఁడికొమ్ములకొనలచిమ్మునవలాహకసమూహముపకాపకలుగాఁగ." అని. ౪, ఆ.—2. వైచుట. "మరుచేచిగురాకడిదమ్ముచిమ్ములన్ దావడఁకెంబురూరవుఁడు." భాగ. ౯, స్కం.

చిమ్ముడు. దే. వి. చిమ్ముట, విక్షేపము.

చిమ్ముబిల్లలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. చీఁకటిమొటికిళ్లుచిమ్ముబిల్లలుసెట్లు బొట్టనగోలలుబొమ్మరాలు." వి, పు. ౭, ఆ.

చిమ్ములాట. దే. వి. చిమ్ములాడుట, ఒకరిమీఁదనొకరు చిమ్ముకొనుట.
చిమ్ములాడు. దే. స. క్రి. (చిమ్ములు + ఆడు.) ఒకరిమీఁదనొకరు చిమ్ముకొను.
చియ్య. దే. వి. కండ.
చిరంటి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఐదువరాలు; 2. జవరాలు.
చిరంతనము. సం. విణ. (అ. ఆ. అ.) బహుదినములది, ప్రాఁతది.
చిరక్రియుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తామసించి కార్యముచేయువాఁడు.
చిరజీవి. సం. వి. న్. పుం. 1. కాకి; 2. విష్ణువు. విణ. చిరకాలము జీవించువాఁడు.
చిరత్నము. సం. విణ. (అ. ఆ. అ.) చిరంతనము.
చిరమర. దే. వి. భేదము. "చెలిమి వేర్పాటను చిరమరలకుఁజొరక." భార. శాం. ౧, ఆ.
చిరము. సం. అవ్య. బహుకాలము.
చిరరాత్రము. సం. వి. అ. న. 1. రాత్రులసమూహము; 2. పెక్కురాత్రులు.
చిరాకు. దే. వి. కోపము. "పంచచామరము. పరాకు రాకు రాకుమంచుఁ బారసీకభూపతుల్, చిరాకు మీఱ దట్టమైన సింగిణీల కోరులన్, జిరాగుతాల నేసి డాసి చిల్లుపొల్లు చేయుచున్, నిరాకరించి మించివచ్చు నేర్పు చూచితేన్నపా." కృష్ణ. ౩, ఆ.
చిరాయువు. సం. వి. స్. న. బూరుగు ?. పుం. వేలుపు.
చిరి. సం. వి. ఇ. పుం. చిలుక.
చిరిక. సం. వి. ఆ. స్త్రీ. పురాతనమలము.
చిరిపి. దే. వి. తైలమార్జకము.
చిరిబిల్వము. సం. వి. అ. పుం. కానుగు ?.
చిరిమిడి. దే. వి. భక్ష్యవిశేషము. "న. పడలా మవడలొబ్బట్లు సారెసత్తులు సేవెలుఁజిరిమిళ్లు." హంస. ౧, ఆ.
చిరుఁగు. దే. అ. క్రి. చినుఁగు. "గీ. నరపతులకీర్తిపటములు చిరుఁగకుండ." ఉ. హరి. ౪, ఆ. "ఉ. అంధకవైరి నా యొడ దయాగుణసంపదఁ గల్గెనేని నీ, స్కంధమునందు నా యొడలి చర్మము పాయకయుండుఁ గాక ను, ర్గంధము లేక కర్కశము గాక చిరుంగక వెండికొండపైఁ, గంధరఖండమున్న యొసకంబు ననీవర మేవరించెదన్." కాశీ. ౭, ఆ.
చిరుక. సం. వి. ఆ. స్త్రీ. ఈలపురుగు, చిమ్మట.
చిరుగడము. దే. వి. తియ్యకంద ?. (చూ. చిరువడము.)
చిరుగుడు. దే. వి. వ్యాధివిశేషము, ఎఱ్ఱపులుము.
చిరుతలుకవియు. దే. అ. క్రి. మిఱుమిట్లుగొను. "ద్వి. కుహనావటు నిఁగనుఁగొని సభాసదులు, కనుఁగవల్ చిరుతలుకవియఁగఁ దిరుగ." భాగ. ౯, స్కం. (ఇట్లు చిరుతలుక్రమ్ము, చిరుతలువాఱు.)
చిరునాము. వై. వి. జాబులమీఁదను లెక్కలమీఁదను వ్రాయువ్రాఁత.
చిరువడము. దే. వి. చిరుగడముయొక్క రూపాంతరము. "క. అరుదుగ నపుడొక్కొక యెడ, మణిమణి పాత్రగగనమండలమయ్యెన్ జిరువడములపాకము శశ, ధరుఁడయ్యెం జక్కలయ్యె ద్రాక్షఫలంబుల్." నై. ౬, ఆ.
చిర్నవ్వు. ద్వ. వి. చిఱునవ్వుయొక్క రూపాంతరము.
చిర్భటము. సం. వి. అ. పుం. నక్కదోస ?.
చిఱచిఱ. దే. వి. కోపవికారము.
చిఱచిఱలాడు. దే. అ. క్రి. (చిఱచిఱలు + ఆడు.) మండిపడు.
చిఱి. వై. వి. చిఱ్ఱియొక్క రూపాంతరము.
చిఱు. వై. విణ. వృత్తియందు చిఱుతశబ్దము నందలి దీర్ఘము లోపింపఁగా మిగిలినరూపము. (ఉదా. చిఱుగజ్జె, చిఱుగెంపు, చిఱుచెమట, చిఱుతొయ్యి, చిఱుచేప, చిఱుదోఁక, చిఱుపోక, మొ.)
చిఱుగాలి. ద్వ. వి. (చిఱుత + గాలి.) మందమారుతము. "ఎ. గీ. తరఁగఁ దేలుచుఁ బూఁదీఁగఁ దనుకలడుచు, వచ్చు చిఱుగాలి సోఁకునకిచ్చ మెచ్చి." భార. అను. ౧, ఆ.
చిఱుగూబ. వై. వి. (చిఱుత + గూబ.) పైఁడికంటె.
చిఱుత. వై. వి. 1. చిన్నపులి; 2. సాముచేసెడునారు త్రిప్పెడు చిన్నకోల*. విణ. చిన్న*. "క. కిరి భీష్ముఁడని యెఱిఁగి, ట్లనియానతియియ్యఁ దగునె యెమ్మెయి నాపల్కినపల్కులు మతి నాతో కృష్ణ వ్రతమును జెఱుపనంత చిఱుత నె చెపుమా." భార. ఆది. ౪, ఆ. "గీ. చిఱుతవానికింత గలుగ దెందు, సన్నెవృద్ధజనములున్న చోట." సం. "యా... వీషి సభామధ్యే బాలస్థవిరభాషితమ్." భాగ. భా. ౨, ఆ. (తెలుగుగా వృత్తియందు అంత్యాక్షరమునకు లోపము. చూ. చిఱు.)
చిఱుతనగోడు. ద్వ. వి. (చిఱుత + గోడు.) బాలక్రీడావిశేషము. "సీ. చిఱుతనగోడాడ విఱుతురు కొల్లనగ జదంత మొక వ్రేలఁగరము పట్టి." చను. ౩, ఆ.

చిఱుతనబిల్లలు. ద్వ. వి. బ. (చిఱుత+బిల్లలు.) బాలికాక్రీడావిశేషము. "ఎ. గీ. పేర్మిఁజెలరేఁగిచిఱుతనబిల్లలాడు." రుక్మి. ౧, ఆ.

చిఱుతుక. వై. విణ. (చిఱుత+ఉక.) చిన్నవయసుగలది*. (ఆఁడుది.)

చిఱుతేఁకు. ద్వ. వి. (చిఱుత+తేఁకు.) భార్గి†.

చిఱుతిండి. ద్వ. వి. (చిఱుత+తిండి.) భక్ష్యము. "సీ. చిఱుతిండితిండినారికి మొఱఁగి యాహారించు నతివ సూకరజాతియందుఁబుట్టు." కాశీ. ౩, ఆ.

చిఱుతొడ. ద్వ. వి. (చిఱుత+తొడ.) పిక్క, జంఘ. (మా. ఒక్కఅ.)

చిఱునవ్వు. ద్వ. వి. (చిఱుత+నవ్వు.) స్మితము.

చిఱునాలుక. ద్వ. వి. (చిఱుత+నాలుక.) వ్యాధివిశేషము, గళశుండిక.

చిఱుపాల. ద్వ. వి. (చిఱుత+పాల.) క్షీరావి†.

చిఱుపులి. ద్వ. వి. (చిఱుత+పులి.) చిత్రకము.

చిఱుబంతిపసుపు. వై. వి. (చిఱుత+బంతిపసుపు.) పూసికొనుపసుపు. "సీ. సిద్ధవాహినినీటఁజిఱుబంతిపసుపాడి శ్రీవిశాలాక్షికైసేయఁదొడఁగె." కా. ౩, ఆ. "క. అంతటఁగనుపట్టెనుభా, స్వంతుఁడుచరమాద్రిమీఁదవారుణదిక్సీ, మంతినిజలకేళిఁజిఱు, బంతిపసుపుముద్దసన్నెపైనిడుభంగిన్." జై. ౩, ఆ. (ఇది బంతిపసుపనియుండవచ్చునని తోఁచుచున్నదిగాని దొరికిన యీరెండు ప్రయోగములయందును చిఱుశబ్దపూర్వకముగానే కానఁబడుచున్నది.)

చిఱుబొద్ది. ద్వ. వి. (చిఱుత+బొద్ది.) పాఠ†.

చిఱుము. దే. అ. క్రి. విజృంభించు. "ద్వి. చిఱిమివసిష్ఠకౌశికులకోపాగ్ని, లుఱికలోకంబులాహుతిఁగొననుచు." హరిశ్చ. ౧, భా.—స. క్రి. చిమ్ము. "మందరమంగుటంబునన్ జిఱుముదునే." రా. అర. కాం. ౩, ఆ.

చిఱువడ్లు. ద్వ. వి. బ. (చిఱుత+వడ్లు.) ధాన్యవిశేషము, అణువు.

చిఱుపాలు. వై. వి. (చిఱుత+పాలు.) ఇవురఁగాఁచినపాలు, ఆనవాలు. "మ. చేమఱుక్కను నేయిం జిఱువాలు వెల్లువగ నాహారంబిడున్ సీతునన్." ఆము. ౧, ఆ.

చిఱువేరు. ద్వ. వి. (చిఱుత+వేరు.) ఎఱ్ఱచాయ వేయుటకు ఉపయుక్తమయిన యొకానొక వేరు.

చిఱుసెనగలు. ద్వ. వి. బ. (చిఱుత+సెనగలు.) చిన్నజాతిసెనగలు, మసూరము.

చిఱ్ఱు. దే. వి. 1. కోపము; 2. చింపిఱి. (చిఱ్ఱుతల.)

చిఱ్ఱుచిఱ్ఱు. దే. వి. సంభ్రమము. "వ. చిఱ్ఱుచిఱ్ఱునట్టాడు ధేనువుల వేఱువేఱం బిలుచువారును." వి. పు. ౭. ఆ.

చిఱ్ఱులువోడుచు. దే. అ. క్రి. (చిఱ్ఱులు+పోడుచు.) సంభ్రమించు. "వ. పసులువెసందిరిగిమున్న పివ్వచ్చుందువచ్చినజాడఁగైకొని దక్షిణదిశకుఁజిఱ్ఱులువోడుచుం దెరలంబాఱిన." భార. విరా. ౪, ఆ.

చిఱ్ఱి. వై. వి. ఒకదినుసుకూరాకు, తండులీయము.

చిఱ్ఱిపట్టె. ద్వ. వి. బాలక్రీడావిశేషము.

చిఱ్ఱు. దే. వి. కోపము.

చిఱ్ఱుద్ది. ద్వ. వి. (చిఱుత+ఉద్ది.) చిన్నయుద్ది. "వ. అనియిట్లుపలికితానును బలభద్రుండును బెన్నుద్దులయియితరవల్లవులెల్లనుద్దించుకొని చిఱ్ఱుద్దులైవచ్చిన సమయంబున." భాగ. ౧౦, స్కం. పూ.

చిఱ్ఱుమను. దే. అ. క్రి. (చిఱ్ఱు+అను.) 1. కోపించు; 2. బుసకొట్టు. "సీ. పొరలూని మేతాలువులఁజిఱ్ఱుమని వెఱికోలుపుచు రెండు నాల్కలుదలిర్ప." అచ్చ. బాల. కాం.

చిఱ్ఱుముట్టాడు. దే. అ. క్రి. (చిఱ్ఱుముట్టు+ఆడు.) పెనఁగులాడు. "అడరికోర్కులఁ చిఱ్ఱుముట్టాడ." భార. విరా. ౩, ఆ. "వ. మసరుకవిసినవనలులాయంబులపోలికం జిఱ్ఱుముట్టాడుచు." భో. ౫, ఆ. —స. క్రి. భేదించు. "ఎ. వ్రేల్మిడిమొలలంగఠారమ్ములు వెఱికి క్రేలుగనఱికి పగలఁ జిఱ్ఱుముట్టాడుసహజసాహసులును." ఉ. హరి. ౪, ఆ. "ద్వి. చేకొని శరములఁజిఱ్ఱుముట్టాడు, కాకఘూకానేకకంకగృధ్రములు." రా. యు. కాం.

చిలచిల. దే. వి. పట్టుటయందగు ననుకరణము. "క. విరులఁజిగుళ్లనుజొరువుగ, సిరిగందపుటసలాకింతచిలచిలమనివే, గిరమవఱువట్లుగొనఁగడుఁ, బొరలెడితరలాక్షితాపమునంగనికలఁకన్." కళా. ౭, ఆ.

చిలవ. దే. వి. నీరుకోడి.

చిలికించు. దే. స. క్రి. చల్లు.

**చిలిచిమము.** సం వి. అ. పుం. కిక్కసకసపువందుం డెడి తేలువంటిచేఁప, తేలుమీను.

**చిలిపి.** దే. విశే. 1. అల్పము; "మ. నరుఁడత్తాపసుఁ జేరికేల్మోగిచివింతల్ నీశరీరంబునన్, దిరుగంబుట్టలువెట్టెసర్పములువర్తింపన్ దరుల్ జానుకూ, ర్పరదేశంబులఁబుట్టెఁగూండ్లశకునవ్రాతంబువర్తింపనీ, కరయన్ వాసములేకయీచిలిపి మత్తాకేమిప్రాపయ్యెడున్." జై. ౧, ఆ.—2. నికృష్టము. "సీ. కల్పవృక్షములిందుఁగలమహీరుహములుసిద్ధలింగములిటఁజిలిపితాలు." రుక్మాం. ౫, ఆ. (చిడిపియొక్కరూపాంతరము.)

**చిలిమిడి.** దే. వి. అక్షోళము?.

**చిలివిలివోవు.** దే. అ. క్రి. (చిలివిలి+పోవు.) సందడించు. "చిలివిలివోవుకోరికలుచిత్తములందలలెత్తి." విక్ర. ౪, ఆ.

**చిలుక.** వై. వి. శుకము. (చూ. తేఁటి.)

**చిలుకకూర.** వై. వి. హిలమోచిక?.

**చిలుకకొయ్య.** ద్వ. వి. వస్త్రములు మొదలైనవి యుంచుటకుఁగాను గోడయందుకొట్టిన చిలుకవంటి యాకారముగలకొయ్య. నాగదంతకము.

**చిలుకడ.** ద్వ. వి. (చిలుకు+కడ.) పగ్గములోనగువాని కొనను వేసెడి కొలికిముడి.

**చిలుకతాళి.** ద్వ. వి. మీఁద నిరుప్రక్కల చిలుకరూపేర్పఱచిన పతకము.

**చిలుకత్తు.** ద్వ. వి. (చిలుకు+అత్తు.) కవచవిశేషము.

**చిలుకముక్కు.** ద్వ. వి. శుకనాస?.

**చిలుకయారె.** వై. వి. (చిలుక+ఆరె) ఒకదినుసు మాదిగసూది.

**చిలుకరవుతు.** వై. వి. మన్మథుఁడు.

**చిలుకరించు.** దే. స. క్రి. చిలికించు. (ఒకానొకఁడు చిలుకరింపు అని కృదంతముగా ప్రయోగించియున్నాఁడు.)

**చిలుకలకొలికి.** ద్వ. వి. చిలుకకొలికివంటికొలుకులుగల ఆఁడుది; 2. ఆఁడుది.

**చిలుకు.** దే. అ. క్రి. 1. చిందు; "క. ఆత్మానందరసంబొకకణ, మైనఁజిలుకనీక." భార. శాం. ౬, ఆ.—2. ప్రసరించు; "సీ. చిలికినచోనెల్లనిరి వెలయించు నీయువనీశుదరహాసమమృతనిధియొ." హన. 3, ఆ.—3. మీఱు. "చేఁదుప్రింగెదవంచుఁజిలికినవ్వేఘృతాచి." స్వా. 3, ఆ.—స. క్రి. 1. చల్లు; "చ. శరజ్జలజాక్షికుండమున్, డలిసలిలంబుకల్మషమడంగ మొగిల్ విరియొండ గాఁచుచోఁ, జిలుకునిశారజఃపటలిచెన్నువహించె." ఆము. ౪, ఆ.—2. త్రచ్చు. వి. 1. కొలికి; "సీ. శిథిలత్వ మొందినచెంగావిజడముడిచిలు కూడిసెలవృత్వ చెంపవట్ట." పాండు. ౫, ఆ.—2. గొండ్లెము; 3. బాణము; "సింగిణినొకదొడ్డచిలుకుఁగూర్చి" అచ్చ. కిష్కిం. కాం.—4. బాణముయొక్క యలుఁగు. "సీ. కలికిపెన్నెరులింద్రశిలలయందముఁ జూపుఁజూపు క్రొన్ననవిల్తుతూపు చిలుకు." వసు. ౪, ఆ.

**చిలుకుడు.** దే. వి. చిలుకుట.

**చిలుగు.** దే. వి. దీర్ఘయష్టిక?.

**చిలుప.** దే. వి. కొంచెముగఁజేరినిలిచిననీళ్లు. (చూ. చిమ్మ.) విశే. అల్పము. "ద్వి. చిలుపచెమ్మటలు క్రొంజెక్కులమించ." విష్ణు. పూ. ౧, ఆ. (ఇది ద్రవవస్తువునకే విశేషణముగాఁ గానఁబడుచున్నది. అప్పుడు చిలుపని అని రూపము. "ఎ. గీ. చిలుపచిలుపనినేతులజిడ్డుదేలు." స్వా. ౪, ఆ.)

**చిలుము.** దే. వి. 1. రాగిలోనగు లోహములయందుఁ గల మఱికి; 2. విషము.

**చిలుమువాలు.** ద్వ. విశే. తులువ, కుత్సితుఁడు.

**చిలువ.** దే. వి. (చిలుము+వా.) పాము, విషధరము.

**చిలువతాలుపు.** దే. వి. శివుఁడు. "దళవాయియైకొల్చుఁజిలువతాల్పు." అచ్చ. సుం. కాం.

**చిలువతిండి.** దే. వి. 1. గరుత్మంతుఁడు; "ఎ. గీ. చిలువతిండిపూనుమామపై నెలఁగువాఁడు." ఉ. ౫, ఆ.—2. నెమలి. "చిలువతిండులకుఁజెచ్చెరనాటతమిమీఱె." అచ్చ. కిష్కిం. కాం.

**చిలువఱేఁడు.** దే. వి. సర్పరాజు, శేషుఁడు.

**చిలువాయనము.** దే. విశే. చిల్లర, క్షుద్రము. "సీ. చిలువాయనపు వేల్పుఁగొలముఁగొల్వక వానుదేవునారాధించు తెలివియొకటి." పాండు. ౨, ఆ.

**చిలువాలు.** దే. వి. (చిఱువాలుయొక్క రూపాంతరము.) ఇవురఁగాఁచినపాలు. ఆనవాలు. "ద్వి. ఫలవిశేషంబులుపాయసాన్నములు, చిలువాలువెన్నలుజీనిచక్కెరలు." రా. బాల. కాం.

**చిల్ల.** యు. దే. వి. కతకము?. వై. శల్యము. "క. విను చిల్లయిడినయాయుధ, మునువిషలిప్తముగుశస్త్రమునునెట్టియుమి, త్రునిపైనైనఁబ్రయోగించినన రపతినరకమునవసించున్నృపాలా." భార. శాం. ౨, ఆ.

చిల్లకోల. ద్వ. వి. తోమరము.

చిల్లగొండి. దే. విణ. కలహకారి.

చిల్లపెంకు. దే. వి. (చిల్లర+పెంకు.) పగిలినకుండ యొక్క చిన్న పెంకు.

చిల్లపెంచే. దే. వి. (చిల్లర+పెంచు.)——పై.——

చిల్లమడ్డి. ద్వ. వి. అందుగు బంకతోఁజేసిన ధూపద్రవ్యము.

చిల్లము. ఉభ. దే. వి. హుక్కాకునిప్పుపెట్టుకొనెడు పాత్రము. సం. అ. పుం. 1. చీపరపిట్ట; 2. తడికన్ను. విణ. తడికంటిది. (రూ. చుల్లము.)

చిల్లర. దే. వి. 1. చింతపండుమిరపకాయలులోనగు సరకు. "సీ. మదహస్తిగనిగిత్తబెదరిచిల్లరగోనెఁబడవైచికదలునప్పంటిగోడు." రా, వి. ౨, ఆ.— 2. కొంచెపాటినాణెము. విణ. సామాన్యము. (చిల్లరవేల్పులు.)

చిల్లరకాఁడు. దే. విణ. సామాన్యుఁడు.

చిల్లాడము. దే.వి. ఆయుధవిశేషము,(రూ. చిల్లాణము.)

చిల్లాభుఁడు. సం. వి. అ. పుం. బందిపోటువాఁగ.

చిల్లి. ఉభ. దే. వి. తూఁటు. సం. ఈ. స్త్రీ. చిత్త్రికూరి.

చిల్లింగి. దే. వి. మూలికచేతఁజేసెడి యుచ్చాటనాది క్రియ, కార్మణము.

చిల్లు. దే. వి. చిమ్ముటలోనగువానియందగుధ్వన్యనుకరణము. "వ. చంద్రశాలాఖేలనాలోలనాళీకలోచనాలోచనంబుల మరీచివీచికలపెల్లు చిల్లునంజిమ్మనగ్రోవులఁజిమ్ముగంధసారకస్తూరికానీరధారాప్రసారంబులతెఱంగెఱింగింప." కళా. ౨, ఆ. (ఆమ్రేడితమందు చిల్లుచిల్లు. "వ. చిల్లుచిల్లునవెళ్లు." కళా. ౫, ఆ.)

చిల్లుపాల్లు. దే. వి. సంక్షోభము. (చూ. చిరాకు.)

చిల్లులువోవు. దే. అ. క్రి. (చిల్లులు+పోవు.) తూంట్లుపడు. "పటురోమతాడనఁజెరిఁగియజాండకర్పరముచిల్లులువోవఁగ." లక్ష్మీ. 3, ఆ.

చిల్లోటి. దే. వి. ఒకదినుసు డాలువాలు.

చివఁగి. దే. వి. చివ్వఁగియొక్కరూపాంతరము. (చూ. చివ్వఁగి.)

చివక. దే. వి. సన్నని చిన్న నిడుపాటికొమ్మ.

చివచివ. దే. వి. గమనాదులయందగుననుకరణము. "వడిఁజివచివఁ రెండడుగులెదురేగి." కళా. ౫, ఆ. "చివచివడాసివిల్లురఘుశేఖరుఁడెత్తికదల్చి." రామా. ౪, ఆ.

చివర. దే. వి. కొన, అగ్రము.

చివికివెలమ. దే. వి. కాకజంఘ?.

చివుక. దే. వి. కాలురూపాయ.

చివుకపిట్ట. వై. వి. ఒకదినుసుగబ్బిలము, జతుక.

చివుకపిల్లి. వై. వి. ఒకదినుసు మార్జాలము.

చివుకు. దే. అ. క్రి. 1. తడియుటచే సారహీనమగు; "సీ. నీటిలోఁజివుకకనిలిచిక్రుమ్మరుపూన్కికఠినకర్పరముచుక్కానుబిగువు." పాండు. ౨, ఆ.— 2. సారహీనమగు. "చివికినవిల్లుత్రుంచుటయుఁజెడియనొంచుటయుఁ." అచ్చ. యు, కాం.—వి. ఎగయుటలోనగువానియందగుననుకరణము. (చివుక్కుయొక్క రూపాంతరము.) "ద్వి. చివుకునమింటికెగయునిప్పులకుప్పలు." విష్ణు. పూ. ౨, ఆ.—విణ. సారములేనిది. "గీ. తొలుపలుకువారువంబులవలఁతిచివుకు, విల్లుతునిమితివని చాలవిఱ్ఱవీఁగు, చున్నవాఁడవు." అచ్చ. బాల, కాం.

చివుక్కు. దే. వి. దాఁటుటలోనగువానియందగుననుకరణము. "చివుక్కునదాఁటించి." కళా. ౫, ఆ. "చివుక్కునసెక్కి." ఉ, రా. ౭, ఆ. "చివుక్కునన్నెగసి." చంద్రా. ౨, ఆ.

చివుక్కురుమను. దే. అ. క్రి. (చివుక్కురు+అను.) (తన్నెవరేని యొకమాటచెప్పినను మర్మము బయలుపడినను) మనసుకలఁగు. (మర్మము బయలుపడెనని మనసుకలఁగుటకు. — "క. అనవినిమనసుచివుక్కురు, మనఁగఁబ్రభావతివివర్ణముగువదనముతోఁ, గనుపట్టుడునింతసెముఁగి, సెసెకార్యంబేల యింత చింతిలననుచున్." ప్రభా. 3, ఆ. చూ. చెయువు.)

చివురు. దే. వి. చిగురుయొక్కరూపాంతరము. "గీ. చివురుసవురుజవురునువిదమోవి." విజ. ౧, ఆ.

చివ్వ. దే. వి. 1. కలహము; "ఉ. ఎవ్వఁడురోరితానునొకయొక్కఁడువీరుఁడపోలెరాత్రిమైఁ, జివ్వకువచ్చిముచ్చిమిగఁజేరినవాఁడు." ఉ, హరి. 3, ఆ.—2. సన్ననిచిన్ననిడుపాటికొమ్మ; "చిగురుంజివ్వలుజిహ్వలైతనర." పర. ౨, ఆ.— 3. బ. బాణపుసంచువగ. (చూ. చంద్రజ్యోతి.)

చివ్వఁగి. దే. వి. సివంగి. (తెలుచుగావ్రాఁతప్రతులయందు ఇట్లుపరుషాదిగానేకానఁబడుచున్నది.)

చివ్వలాఁడి. దే. విణ. (చివ్వలు+ఆఁడి.) కలహశీలురాలు. "గీ. తగవుచెప్పంగనిన్నుఁబ్రార్థనరొనర్చి, యొవ్వరిచటికిఁదెచ్చిరోచివ్వలాఁడి." హరిశ్చ. ౪, ఆ.

చివ్వు. దే. స. క్రి. చెక్కు. "ఉ. తోరపుమోటక త్తులవెదుళ్లు సమగ్రముగాఁగఁగొట్టినే, ర్వారఁగఁ జివ్వి." పర. ౧, ఆ.

చివ్వున. దే. ద్రు. క్రి. విశ. శీఘ్రముగ. "చివ్వునఁజేరు దము." భార. మా. ౧, ఆ.

చిహ్నము. సం. వి. అ. న. 1. గురుతు; 2. టెక్కెము.

## చీ.

చీ. దే. అవ్య. ధిగర్థకము. "అవిముక్తమహిమెల్లఁజీ యనంగ." ఉ. హరి. 3, ఆ.

చీఁకటి. దే. వి. (చీఁకు+కట్టు.) అంధకారము. (నీవు చీఁకటితో లేచిరమ్ము–ఇక్కడ చీఁకటితో ననఁగా తెల్లగా తెల్లవారకముందని యర్థము.)

చీఁకటిగాము. ద్వ. వి. రాహువు.

చీఁకటిగొంగ. దే. వి. సూర్యుఁడు.

చీఁకటిచెట్టు. దే. వి. తమాలము?.

చీఁకటితప్పు. దే. వి. జారత్వము. "సీ. చీఁకటితప్పు చేసినసరోరుహనేత్ర గూబయైవసియించుఁగో టరమున." కాశీ. ౨, ఆ.

చీఁకటిమొటికిల్లు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. చీఁకటిమొటికిల్లుచిమ్మబిల్లలుసెట్లుబొట్టన గోలలుబొమ్మరాలు." వి. పు. 2, ఆ.

చీఁకటియీఁగ. దే. వి. (చీఁకటి+ఈఁగ.) చిన్నదోమ.

చీఁకిలి. దే. వి. చీఁపురుఁగట్ట, సమ్మార్జని.

చీఁకు. దే. స. క్రి. 1. చప్పరించు; "సీ. ఎఱచిగీతిన జీరలేర్పడఁదుదముట్టఁజీఁకినమలుపచ్చికీకసము ల." ఆము. ౬, ఆ.—2. చుంబించు. "పెదవులు చీఁకుచుఁ." రా. సుం, కాం.

చీఁకు. దే. వి. గ్రుడ్డితనము, అంధత్వము. (ఈ యర్థము నందిట్లు దీనిని సబిందుకముగాఁజెప్పుట చీఁకటిశ బ్దమునకు వ్యుత్పత్తిని కల్పించుటకు అనుకూలము గానున్నది. ఇట్లు చెప్పుటచే ప్రయోగములకు విరోధము కనఁబడదు.) విశ. అంధుఁడు. (ఇట్లు చీఁకుకొక్కెర, చీఁకురించు, చీఁకువాలు అను నీ పదములను సబిందువులుగా గ్రహింపవలెను.)

చీఁద. వై. వి. చిందపక్షి. "గీ. చీఁదమొదలుగాఁగఁ బాదిపేటకుమీఱు, పిట్టలెల్లగూండ్ల బిట్టుచెలఁ గు." య. ౧, ఆ.

చీఁదఱ. యు. దే. వి. ఉపద్రవము. "మ. ఎలదేఁటుల్ తమవాలుఁగన్గవలపైనిందీవరభ్రాంతిచే, మెలఁగం జేరలఁగప్పుకోనలవిగామిం జీఁదఱంజెందియు, చ్చలఁగాంక్షించిరి నిర్నిమేషజలజాస్యల్ మానుష త్వంబుల, య్యలిభీతిలేముకులీకృతాక్షీయుగ సత్యాకాంతనీక్షించుచుఁ." పా. ౪, ఆ.—వై. తొఁటు.

చీఁదఱగొను. యు. దే. అ. క్రి. (చీఁదఱ+కొను.) 1. ఉపద్రవపడు; 2. ఆవేశమెత్తు. "సీ. చీఁదఱ గొనిపాఱుచోఁదరుశ్రేణులుదుర్వాతహతిఁబో లెఁదుమురుగాఁగ." భో. ౬, ఆ.—ద్వ. తొఁటు వోవు. "గీ. చెవులుచీఁదఱగొనంగ, బిట్టుమొ సెదువసత్రాగినట్టు." నీలా. 3, ఆ.

చీఁదఱరేఁగు. దే. అ. క్రి. ఆవేశమెత్తు. "ఉ. చీఁ దఱరేఁగినట్లు రిపుసేనలనెల్లనుముట్టి రోఁకటఁ, మోఁదుచు." హరి. ఉ. ౧, ఆ.

చీఁదఱలువోవు. ద్వ. అ. క్రి. (చీఁదఱలు+పోవు.) తొఁటువోవు. "శ్రుతిపుటములుచీఁదఱలువో వ." భో. ౬, ఆ.

చీఁదు. దే. స. క్రి. (చీమిడిబయలుపుచ్చుచు బుఱ్ఱని ఊపిరి వెలికిరా) మొదటి రెండువ్రేళ్లతో ముక్కు నదుము.

చీఁపురు. దే. వి. చీఁపురుఁగట్ట, సమ్మార్జని.

చీకాకు. దే. వి. (చీకు+ఆకు.) 1. చివికిన ఆకు; 2. శ్రమము, నలఁకువ. "క. వేల్పులు, చీకాకు నఁబడిరికలఁగి శ్రీహరిదక్కఁ." భాగ. ౮, స్కం. విశ. శ్రమమునొందినది, నలఁగినది. "క. ఈ కరణింబదిమొగముల, రాకాసియొనర్చినట్టిరా యిడిచేతం జీకాకగుచును వేలుపు, లాకటిదేవరకు నొడువ నరుగుచు సెదుటఁ." యయా. ౨, ఆ.

చీకాకుపడు. ద్వ. అ. క్రి. 1. బలహీనమగు; 2. శ్రమపడు.

చీకిరేను. దే. వి. ఒకానొకచెట్టు.

చీకిలించే. దే. అ. క్రి. మిఱుమిట్లుగొను. "సీ. చీకి లించుకయుండుఁ జిగురుటొప్పులలోనఁగుసుమ సాయకవైరినొసలికన్ను." కాశీ. 3, ఆ.

చీకిలిమాకిలి. దే. విశ. కొక్కిరిబిక్కిరి. "క. నెల పూదాలుపుమనపూ, జలుమెచ్చునెయనిమదిక్ విచారింపకుచీ, కిలిమాకిలిగానల్లిన, చెలఁది తెరల్ సూచిసంతసించుటలేదే." సా. ౧, ఆ.

చీకు. దే. విశ. 1. అంధము, అంధుఁడు; "కన్నుః చీ కులై." భార. శల్య. ౧, ఆ. "చీకునకత్యనుపమ సురూపదర్శనమును." భార. సభా. ౨, ఆ.— 2. నిస్సారము. "గీ. పార్వతీవిభుండుపాఱవైచిన

చీకు, విల్లువిఱిచివిఱ్ఱవీఁగఁదగునె." అధ్యా. బాల, కాం. (ఈ యర్థమునందిది చివుకుయొక్క రూపాంతరము.)

చీకుకొక్కెర. ద్వ. వి. కోయష్టికము.

చీకుకు. దే. దే. అ. క్రి. అంధమగు. "సీ. పంకేరుహాంబులుబొగు గావికసించెఘూకములు కన్నులుచీకుకించె." సురా.

చీకురువాయి. దే. వి. ఒకదినుసుగబ్బిలము, జతుక.

చీకువాలు. దే. వి. చీఁకటి. "క. భూపాలకపరమేశ్వరు, కోపానలకీలలంటికొనికమలినలం, కాపతికీర్తియెుకోయని, రూపింపఁగఁజీకువాలుగోదనినిండెక్." రా. యు, కాం.

చీకొట్టు. దే. స. క్రి. చీచీయును, ధిక్కరించు.

చీటకము. వై. వి. చిట్టకముయొక్క రూపాంతరము. (శీలకు.—"గీ. హస్తములరెంటనందంద నదిమియదిమి,తాటిపండారగించెడుచీటకమున,సత్యయంబునబ్రహ్మాండమాస్వదించు, ఖైరవుండిచ్చఁగా తకోభనయుమనకు." కాశీ. ౫, అ.)

చీటి. దే. వి. 1. ఖండపత్రిక; "సీ. కుంతలస్థలికిశేగుణగరిష్ఠునిచీటికమనీయకేతకీగర్భదళము." వసు. ౧, అ. "సీ. చెక్కుచెమ్మటచేలచెఱఁగునఁదుడుచుటచెలిమికినదితుదిచీటియేమొ." ఉ, రా. ౬, అ.—2. పత్రిక. "వ. అనినవచ్చానచెచ్చెరఁ జీటివిచ్చిపుచ్చుకొని సెచ్చెలికిచ్చిననదియిట్లని చదువందొడంగె." రసి. ౫, అ.

చీటికిమాటికి. దే. ద్ర. మాటిమాటికి. "ఉ. చీటికిమాటికిందెసలుచిల్లులువోవఁగఁజేసెహేషలక్." కాశీ. ౪, అ.

చీడ. దే. వి. సస్యాదులను చెఱిచెడి యొకానొకపురుగు. "వ, గీ. అఖిలతృణలతాతరునిచయంబుఁజీడ వట్టె." హరి. పూ. ౭, అ.

చీడు. దే. వి. పుంజెముతక్కువయగువార. (వార= ఎనిమిదిపుంజెములనూలు.)

చీడుబ్బ. దే. వి. నూలిచీడుతగిలించుటకు వెదురుబద్దలతో గుమ్మటమువలెఁ గట్టఁబడిన సాలెవాని సాధనము. (చూ. ఊఁడిత.)

చీనము. సం. వి. అ. న. బంగారు. పుం. 1. ముప్పది యంగుళములపొడవుగలిగిగువ్వవన్నె గలిగినజింక; 2. ధాన్యవిశేషము; 3. నూలు; 4. వస్త్రవిశేషము; 5 గుఱ్ఱపుపల్లమునకుక్రింద వేసెడుమెత్త. (అని యొకఁడు.) 6. ఒకానొకదేశము.

చీపర. దే. వి. పక్షివిశేషము, అతాయి.

చీపు. దే. వి. అరఁటిగెలయందలి యొకభాగము.

చీమ. దే. వి. పిపీలిక.

చీమిడి. దే. వి. నాసామలము, శింఘాణము.

చీము. దే. వి. చెడితెల్లనైననెత్తురు, పూయము.

చీముంత. దే. వి. చెంబు.

చీర. వై. వి. వస్త్రము*. "రజకుఁబొరిగొనికొనియెఁజీరలు." హరి.ఉ.౫,అ. (ఇదివాడుకయందుస్త్రీవస్త్రమాత్రపర్యాయముగా కానఁబడుచున్నది.)

చీరచింపు. ద్వ. వి. మత్స్యవిశేషము.

చీరణము. దే. వి. చిన్నయులి.

చీరపిట్ట. వై. వి. చీరపేను.

చీరపేను ద్వ. వి. గుడ్డనంటుకొనియుండు తెల్లనిపేను, ధేనుకము.

చీరపోతు. ద్వ. వి.——వై.——

చీరము. సం. వి. అ. న. 1. కౌపీనము; నారచీర. (అని కొందఱు.) వస్త్రవిశేషము. (అని కొందఱు.) 2. రేఖ; 3. జిలుగువ్రాఁత; 4. నలువదిపూసలుగ్రుచ్చినసరము.

చీరి. ఉభ. దే. వి. లక్ష్యము. "కొనందుద్రుపదాత్మజుడగ్గరుఁబోరఁజీరికిక్." భార. ద్రో. 3, అ. "ఉ. దారుణదైత్యసాయకవితాన విజృంభణమూర్తలోపలక్, జీరికినైనఁగైకొనక." హరి. ఉ. ౪, అ. (షష్ఠ్యంతముగానే యిది ప్రయోగములందుఁ గానఁబడుచున్నది.)—సం. ఈ. స్త్రీ. ఈలపురుగు.

చీరిక. దే. వి. చీలిక.

చీరు. దే. స. క్రి. 1. చీలుచు; "ఉ. ఘోరగదావిదారణవిఘూర్ణితశాత్రవకుంభికుంభముల్, చీరుచు." భార. అర. ౬, అ.—2. పిలుచు. "శా. ఈరూపంబున సంస్మృతించి నొఱఁగిమీరేచింతలంజెంతలం, జీరంగోరక." ఉ. హరి. ౪, అ.

చీరుక. సం. వి. ఆ. స్త్రీ. ఈలపురుగు, ఝిల్లి.

చీరుడు. దే. వి. 1. చీల్చుట; 2. పిలుపు.

చీర్ణము. దే. వి. చీరణముయొక్క రూపాంతరము.

చీలు. దే. స. క్రి. 1. గీఱు; 2. చీల్చు. (ఇట్లు అలఘురేఫముగా ఒకానొకఁడు వ్రాసియున్నాఁడు గాని దానికి ప్రయోగము దొరకినదికాదు.)

చీలుడు. దే. వి. చీల్చుట, విదారణము.

చీల. దే. వి. మేకు, కీలము.

చీలమండ. దే. వి. కాలిమడమల కిరుప్రక్కలనుండు కీలు, గుల్ఫము.

చీలి. దే. వి. పిల్లి, మార్జాలము.
చీలిక. దే. వి. పాయ, బ్రద్ద.
చీలు. దే. అ. క్రి. విదారితమగు.
చీలుచు. దే. ప్రే. చీలఁజేయు, విదారించు. (రూ. చీల్చు.)
చీవరము. సం. వి. అ. న. భిక్షుకునివస్త్రము.
చీవాట్లు. దే. వి. బ. గద్దింపుమాటలు.

చు.

చుంబకము. సం. వి. అ. పుం. 1. త్రాసుముల్లు; 2. సూదంటుఱాయి.
చుంబకుఁడు. సం. వి. అ. పుం. 1. పెక్కుగ్రంథములయందు ఇంచుకించుక చదివినవాఁడు; 2. ముద్దుపెట్టుకొనువాఁడు; 3. మోసకాఁడు.
చుంబనము. సం. వి. అ. న. ముద్దు.
చుంబించు. సం. స. క్రి. ముద్దు పెట్టుకొను.
చుక్రము. సం. వి. అ. న. చింతపండు. పుం. 1. పులుసు; 2. పుల్లప్రబ్బ?.
చుక్రిక. సం. వి. ఆ. స్త్రీ. పులిచింత?.
చుచుందరి. సం. వి. ఈ. స్త్రీ. చుంచెలుక, (రూ. చుందరి.)
చుబుకము. సం. వి. అ. న. చిబుకము, గడ్డము.
చులుకము. సం. వి. అ. పుం. 1. చేర; 2. పుడిసిలి; 3. ముంత; 4. చిఱుతపులి.
చుల్లి. సం. వి. ఈ. స్త్రీ. 1. పొయ్యి; 2. సొద.

చూ.

చూచుకము. సం. వి. అ. పుం, న. స్తనాగ్రము, అంచు.
చూడ. సం. వి. ఆ. స్త్రీ. 1. నెమలిజుట్టు; 2. జుట్టు; 3. చూరు; 4. బాహుపురి.
చూడామణి. సం. వి. ఇ. పుం. 1. అలంకారార్థము తలయందుంచుకొనెడు రత్నము; 2. గురిగింజ.
చూడాల. సం. వి. ఆ. స్త్రీ. వట్రువముస్తె?.
చూడాలుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) జుట్టుగలవాఁడు.
చూతము. సం. వి. అ. పుం. ఆమ్రము, మామిడి?.
చూర్ణకము. సం. వి. అ. పుం. పేలపిండి.
చూర్ణకుంతలము. సం. వి. అ. పుం. అలకము, నెఱికురులు.
చూర్ణము. సం. వి. అ. న. గందవొడి. పుం, న. సున్నము. పుం. 1. దుమ్ము; 2. పొడి.
చూర్ణిక. సం. వి. ఆ. స్త్రీ. 1. గద్యభేదము; 2. గ్రంథభేదము.
చూలిక. సం. వి. ఆ. స్త్రీ. 1. పిల్లజట్టు; 2. ఏనుఁగు చెవిమొదలు; 3. నాటకాంగము.
చూష. సం. వి. ఆ. స్త్రీ. ఏనుఁగునడుమునఁగట్టెడు తోలుమోకు, దూష్య.
చూషకము. సం. వి. అ. పుం. సరిగాలి.
చూషణము. సం. వి. అ. న. పీల్చుట.

చె.

చె. దే. విణ. వృత్తియందు చెన్ను శబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. (దీనికి పరుషము పరమగునపుడు నుమాగమము. ఉదా. చె గావి. మొ.)
చెంక. దే. వి. చెంప, కపోలము.
చెంగఁగొట్టు. దే. స. క్రి. (చెంగల్+కొట్టు.) డించు. "సింగంపుగుంపులఁజెంగఁగొట్టినవాఁడు."
చెంగనాలు. దే. వి. బ. 1. గంతులు; 2. నమస్కృతి.
చెంగలి. దే. వి. విణ. సమీపము, కుఱఁగలి.
చెంగలించు. దే. అ. క్రి. 1. అతిశయించు; "చ. కనుఁగొనియద్భుతంబును వికాసము భక్తియుఁజెంగలింప." వి, పు. ౭, ఆ.—2. ప్రకాశించు; "... కుముదంబులుముదంబందె, లాంగలిచెంగలించె." కాశీ. 3, ఆ.—3. విజృంభించు; "ఎ, గీ. అంతఁదనియకమదిఁజాలనాగ్రహించి, మఱియుఁదక్కనయోధులమదమడంచి, పగటిసూర్యునిగతిఁబ్రతాపమునమించి, సింహనాదంబుగావించెఁజెంగలించి." జై. ౭, ఆ.—4. హసించు. "ఉ. విందులువిందులంచుఁదను వేడుకనెత్తుకొనంగఁ బిల్వనిం, పొందఁగనేగి పైఁబడుచునుబ్బునఁగేరుచుఁ జెంగలించుచున్, సందిలిపట్టియాడుమన నాట్యములాడుచుముద్దులన్ మహా, నందమొనర్చు బాలకదినంబునుజుట్టపుఁబూవుఁబోండ్లకున్." కళా. ౬, ఆ.
చెంగలింపు. దే. వి. చెంగలించుట. (ఇట్లు కృదంతముగా నొకానొకఁడు ప్రయోగించినాఁడు. చూ. ఆరగింపు.)
చెంగలువ. ద్వ. వి. (చెన్ను+కలువ.) 1. ఎఱ్ఱకలువ, హల్లకము; 2. ప్రియముచే కుక్కకు ఇయ్యఁబడిన పేరు. (చూ. గబ్బి.)
చెంగల్వకోష్టు. వై. గ్రా. వి. పారిభాష్యము?.

చెంగావి. దే. వి. (చెన్ను+కావి.) మనోజ్ఞమైన యెఱుపు, (అనఁగా) ఎఱ్ఱదాళువర్ణము. (చెంగావిచీర. మొ.)

చెంగు. దే. అ. క్రి. 1. తొలఁగు; "గీ. చక్రములు పొంగెదస్యుసంచయ మడంగఁ, దమముచెంగ ద్విజప్రతాపముచెలంగ, సరసులందల్లఁగములాతిశయ మెసంగ, జగమువిందగునినుఁడు తేజము నఁబ్రబల." రసి. ౫, ఆ.—2. వెనుదీయు. "క. అంగజునిగెలిచెనొక్కఁడ, గాంగేయుఁడుతమకునలవిగాదనిమహిభృత్పుంగవులీవ్రతమోపక, చెంగిరినీకలవియైనఁజేయుమునియతిన్." వై. ౧, ఆ.—వి. 1. చెఱఁగు; 2. వాద్యవిశేషము. "వ. కొఱనెలతో నెమురును దురులుగలచదురాంద్రుఁ కొండ ఱంబులుహాకరంబులం దంబుఱలువీణెలు డక్కలుఁ బిల్లనగ్రోవులుఁ గిన్నరలుఁ జెంగులు పాంగంబులుఁదాళంబులుఁ మొదలగుజంత్రంబులుగొని." ఉ, రా. ౫, ఆ.

చెంచెత. వై. వి. శబరకాంత. (చూ. చెంచే.) ("క. మంచిఫలంబులుహారిచే, నించికరాలంబనములనెగడుమనిదక్రీ, డించెదరంగనచూడుము, చెంచితలన్ బింఛపత్రచేలాంచితలన్." భాగ. ౧౦, స్కం. పూ. ఈ ప్రయోగముచేత తవర్ణకంబు పరంబగునపుడు ఇకారంబును వచ్చుననితోఁచెడి.)

చెంచేసము. దే. వి. శ్యేనవిశేషము.

చెంచెలి. దే. వి. ఒకదినుసుకూరాకు, కుణుంజము.

చెంచే. వై. వి. శబరుఁడు. "గీ. చెంచునింటికిఁబోయిచెంచెతకుఁబ్రియము, చెప్పినమ్మించితలమీఁదఁజెయ్యిపెట్టి, వెఱకుమనితన్మఖంబున నెఱుకుచేసిఁ, గాంచియాతనితోడసఖ్యంబుచేసె." కాశీ. ౫, ఆ.

చెండాడు. దే. స. క్రి. (చెండి+ఆడు.) ఖండించు. "ఉ. వేడుకఁజూడుమేనుబటువిక్రమకౌతుకలీలఁబేచ్చెం,డాడెదవైరులన్." భార. కర్ణ. 3, ఆ. (చూ. ఊఁగాడు.)

చెండు. దే. స. క్రి. ఖండించు. "క. చ డగతివీరరథికులఁ, జెండుచు." భార. ద్రో. ౨, ఆ.—వి. 1. కందుకము; 2. పూబంతి; 3. బాలక్రీడావిశేషము. (చూ. ఉవ్వలపోటి.)

చెండుదానిమ్మ. ద్వ. వి. కాయలులేక పూవులుమాత్రము చెండువలెఁబూచెడి యొకదినుసుదానిమ్మ.

చెండుబెండాడు. దే. స. క్రి. (చెండుబెండు+ఆడు.) ఖండించు. "గీ. సర్వదివ్యాస్త్రదుర్వారసారయుతని. వాతకవచాదిరక్షోగ్రిజాతులరణ, విహరణోత్సాహదైవతవిమతసేన, పైనడరిచెండుబెండాడెఁ బ్రభుయుతముగ." రాఘ. 3, ఆ. (ఒకానొకకవి చెండుబెండొనరించియని ప్రయోగించియున్నాఁడు.)

చెంత. దే. వి. చేరువ, సమీపము.

చెందమ్మి. దే. వి. (చెన్ను+తమ్మి.) ఎఱ్ఱతామర, కోకనదము.

చెందిరము. వై. వి. కుంకుమము, సిందూరము.

చెందిరిక. యు. దే. వి. కమ్మపైదుద్దు. "చ. గరువనకొత్తఁజెంగలువకచ్చుఘటించినమాళిఁ జొట్టెఁజెం, దిరికతెఱంగునంబసిఁడితీఁగలునించినజిల్గుపాగ." స్వా. ౫, ఆ.—వై. 1. కుసుంభపుష్పము; 2. కుసుంభవర్ణము*. "చ. పడఁతియొకర్తుచెందిరకపావడఁబైతడియొత్తివైవ." వసు. ౫, ఆ. (చూ. చెంద్రిక.)

చెందు. దే. అ. క్రి. కలుగు. "ఉ. మిత్రులచేఁతలన్ సుఖముమేకొనునంటయుఁజెందుదుఃఖముల్, శత్రులచెయ్దినంటయును." భార. శాం. ౧, ఆ.—స. క్రి. పొందు.

చెందుప్పు. ద్వ. వి. (చెందు+ఉప్పు.) ఇందుప్పు, సైంధవము. "సీ. ఇందుబింబముఁజూచి చెందుప్పుగలుసావి యఱులెత్తినాకంగనాసపడిన." కాశీ. 3, ఆ.

చెందొవ. దే. వి. (చెన్ను+తొవ.) ఎఱ్ఱగలువ, హల్లకము.

చెంద్రము. వై. వి. సిందూరము. "సీ. పొసఁగుచెంద్రపుబిల్లబొట్టుపైఁగనుపట్టుతిలకుఁ గస్తురిరేఖ సొలపుదెలిపె." ఉ, రా. ౬, ఆ. (వృత్తియందు అంత్యవర్ణలోపము. చెంద్రకావి. మొ.)

చెంద్రవంకలు. వై. వి. బ. ధాన్యవిశేషము.

చెంద్రిక. యు. చెందిరికయొక్క రూపాంతరము. (కమ్మపైదుద్దునకు. – "ఉ. ఇంద్రజారాకధర్మజునకేర్పడఁగాశుభలేఖవ్రాసివే, చెంద్రికచుట్టియుందుపయిఁజెంద్రికవన్నియపాలుచుట్టిని, స్తంద్రతఁదానముద్రయిడిచారులచేఁబనిచెన్." విజ. 3, ఆ.—కుసుంభపుష్పమునకు.—"సీ. చికిలిపసిండివ్రాఁతనుఁజెంద్రికవన్నియమేలుఁకట్టునన్."

పను. ౬, ఆ.—కుసుంభవర్ణమునకు.—"చెంద్రిక పావడ." స్వా. ౯, ఆ.)

చెంప. దే. వి. 1. కపోలము; 2. పార్శ్వము. "సీ. ఆబోయవాఁడును నా పిల్లజట్టిగాఁగొనిపట్టుకొని పోయికొండచెంపఁ, జంపువాఁడై." భో. ౮, ఆ.

చెంపకల్లి. దే. వి. స్త్రీభూషావిశేషము.

చెంపకాయ. దే. వి. చెంపదెబ్బ.

చెంపకొప్పు. దే. వి. ప్రక్కకొఅగించివేసినకొప్పు. "సీ. వలయితనుమదామవలయమధ్యంబునఁగుల్కు ప్రాగ్దిశ చెంపకొప్పనంగ." భాను. 3, ఆ.

చెంపసరులు. ద్వ. వి. బ. స్త్రీభూషావిశేషము.

చెంబు. వై. వి. రాగి మొదలయినవానితోఁజేసినచిన్న నోరుగల స్వల్పపాత్రము*.

చెంబుతల. ద్వ. వి. బట్టగట్టినతల. "ఎ, గీ. చెంబుతలవానినవటుకచంబువాని." ఆము. ౬, ఆ.

చెకడా. వై. వి. సరకులు తెచ్చెడు రెండెద్దులబండి*.

చెకపికలాడు. దే. స. క్రి. తొందరపెట్టు. "ఎ, గీ. చెండిచెకపికలాడమాయుండె నేని." సా. ౧, ఆ.

చెకము. దే. వి. వస్త్రము మొదటిబద్దె.

చెకుముకి. దే. వి. నిప్పుకలుగుటకై యొకదినుసుఱాతితోఁ దాఁకించెడియుక్కుతునుక. "సీ. వెలుఁగురాచలుపకుప్పలపాలిచెకుముకి సముద్రగ్రకాననసామిథేని." చంద్రా. ౨, ఆ.

చెక్క. వై. వి. మ్రానులోనగువాని పలుచనిఖండము.

చెక్కకొణుజా. ద్వ. వి. చెక్కపిడుఁజా.

చెక్కచెట్టు. ద్వ. వి. ఎఱ్ఱచాయ వేయుటకుపయోగించెడు చెక్కగల యొకదినుసుచెట్టు.

చెక్కడము. దే. వి. (రత్నములను) పొదుఁగుట. "సీ. కటకంబు చేరి కీకటభర్త పనిచెక్కడపుచొక్కటపుమకుటంబువాల్చె." పాంచా. ౧, ఆ.

చెక్కతాపి. వై. వి. బేలుదారిగోడ మొదలగువానిమీఁదపూసినగారను తాచి మట్టపఱచెడు వీఁపునపిడి యమర్చిన గుండ్రనిదుపు జేసెఁడు చిన్నపలక.

చెక్కపిడుఁజా. ద్వ. వి. పశువులమేనిరక్తముఁబీల్చెడి యొకదినుసు పిడుఁజా.

చెక్కియము. దే. వి. చెక్కము.

చెక్కిలి. దే. వి. చెక్కు, కపోలము.

చెక్కు. యు. దే. స. క్రి. (రత్నములను) పొదుఁగు. వి. 1. చెక్కడము; "బంగరువుఁజెక్కులఁజెలంగుచవుకట్టులమెఱుంగు." రా, వి. ౨, ఆ.—2. చెక్కిలి. వై. స. క్రి. చెక్కలుచేయు.

చెక్కు. అం. వి. హుండీ.

చెక్కడుపాలు. ద్వ. వి. గడ్డిచెక్కడుపాలు.

చెక్కము. దే. వి. ఎముకలయందుండు నెయ్యి. "ఉ. కొంచక కాఁజుమీఁదన్ను పకుంజరుఁడేసినఁద్రాటబాణమం, టించినమాడ్కిఁజెంచడపు డేగవడింజనిగిట్టిపట్టి మేన్, జించినఁగాలిమూలగయుఁజెక్కముఁ జక్కరనద్దియిచ్చెయే, తెంచెనొకండు దాలవిటిదీటుచులావులు గూడదువ్వుచున్." చంద్రా. ౨, ఆ. (చెక్కియముయొక్కరూపాంతరము.)

చెచ్చెర. దే. ద్ర. క్రి. విణ. శీఘ్రముగ. "చ. చెచ్చెరఁగొనిరమ్ము నీదయినశిల్పకళాకుశలత్వ మేర్పడన్." భార. సభా. ౧, ఆ.

చెట్ట. వై. వి. 1. కీడు*; "పరమధర్మశీలపాంచాలికిఁజెట్టచేసిరి." భార. ఆశ్ర. ౧, ఆ.—2. చేయి*. "దేవుని చెట్టఁబట్టికొని." ఉ, హరి. ౬, ఆ.—విణ. దుష్టుఁడు*. "మనమెంత చెట్టలము." భార. ద్రో. ౯, ఆ.

చెట్టపట్టు. ద్వ. స. క్రి. (చెట్ట+పట్టు.) పెండ్లియాడు. వి. పెండ్లి.

చెట్టు. దే. వి. 1. గుల్మము; 2. వృక్షము.

చెట్టుఁద్రిమ్మరి. దే. వి. (చెట్టు+త్రిమ్మరి.) వానరము, వృక్షచరము. "క. అచ్చెట్టుంద్రిమ్మరి, మొనకాండ్రురుతాలవాన మొగిఁగురియుటయున్." అచ్చ. యు, కాం.

చెట్టుగట్టు. దే. అ. క్రి. (చెట్టు+కట్టు.) చెట్టుగా నేర్పడు. "తే. భక్తిసంయుక్తియనుపోఁత పాలనొయ్యఁ, జెట్టుగట్టుచు మునిశాఖనిట్ట మూప." పాండు. 3, ఆ.

చెట్టునట్టు. దే. వి. వానరము. "గీ. చెట్టునట్టు మొనకాఁడు వెండియునిట్టులనియె." అచ్చ. సుం, కాం.

చెట్టుప. దే. వి. తెక్క. "ఉ. కోమలతామ్రచూళికలక్రొవ్వొఱసంజకుఁబ్రోదివెట్టని, స్సీమకతోరతారరుతిఁజెట్టుపలార్చుచునట్టులెత్తివి, శ్రామమహోలెఁగూసె విలసచ్చరమాచలకూటపక్కణగ్రామటికాకుటీరశిఖరంబులఁగుక్కుటచక్రవాళముల్." సై. ౭, ఆ.

చెట్టుపడు. ద్వ. అ. క్రి. స్తంభించు. "వ. అట్టిరట్టువినినప్పుడ చెట్టువడి పుట్టినకోపంబుఁబట్టఁజాలక పాపపుణ్యంబులు కట్టిఁడి ప్రజమీఁదం బెట్టిపట్టభద్రుండిట్టి బెట్టిదంపుంబని చేసె." ఉ, రా. ౬, ఆ.

చేలము. దే. వి. మాత్సర్యము. (వృత్తియందు పొల్లు పరమగుచో అంత్యవర్ణములోపించును. చలపట్టు. మొ.)

చేలముకొను. దే. అ. క్రి. చేలపట్టు. "చ. చలముకొనంగ నేలశుభసంగమనం బెడచేఁతకృత్యమే." భార. మహా. ౧, ఆ.

చేలవాది. దే. వి. చావుసమాచారము చెప్పువాఁడు.

చేలాడము. వై. వి. చేల్లాడముయొక్క రూపాంతరము. చంద్రా. ౨, ఆ.

చేలి. దే. వి. 1. శీతము; 2. శీతబాధ.

చేలికారు. ద్వ. వి. శిశిరఋతువు. (ఇట్లు చలితఱి.)

చేలికి. దే. వి. చేడికియొక్క రూపాంతరము. (చూ. విన్నాణము రెండవయర్థము నుదాహరణము.)

చేలిగరువు. ద్వ. వి. మీఁద ఇసుకగలజౌతిపాఱు నేల.

చేలిగొండ. ద్వ. వి. (చలి+కొండ.) హిమవత్పర్వతము. (ఇట్లు చలిగట్టు, చలిమల. మొ.)

చేలిచీమ. దే. వి. ఒకవిధమైన నల్లచీమ.

చేలిది. దే. వి. (చలి+అది.) చల్ది, పర్యుషితాన్నము.

చేలిదిమూట. ద్వ. వి. చిట్టాముదము.

చేలినట్టు. దే. వి. గాలి. (ఇట్లు చేలియిక్క.)

చేలిసెల. దే. వి. మాఘమాసము (లేక) ఫాల్గునమాసము. కళా. ౭, ఆ.

చేలిపందిరి. దే. వి. దాహమునకు నీళ్లుపోసెడుచోటు, ప్రప.

చేలిపని. దే. వి. శైత్యోపచారము. "రగడ. తలిరాకుఁదగ మెట్టితమ్ములనుగీలించి, పలుమాఱుమూరుకొని పైదలిని లాలించి, చలిపనుల్ గావింపజాలిమానుటలేక." య. ౫, ఆ.

చేలిపిడుగు. ద్వ. వి. కొన్నిదేశములయందు కాలవిశేషమున ఆకాశమునందుండిపడెడు చెడగఱపు మంచుగడ్డ.

చేలిమిడి. దే. వి. 1. కూరాకుదినుసు; 2. బెల్లముకలిపినపిండి.

చేలిమిరి. దే. వి. చలువ, శైత్యము.

చేలియిసుక. దే. వి. (చలి + ఇసుక.) కర్పూరము, హిమవాలుక. "చలియిసుక వెట్టు నేడాకుటనఁటుల." వసు. ౨, ఆ.

చేలివాపు. దే. స. క్రి. (చలి+పాపు.) బుజ్జగించు.

చేలివాలు. ద్వ. వి. (చలి+పాలు.) ఆనవాలు. "చలివాలునవ్వు." హై. ౨, ఆ. (ఈయర్థమింక నువిచారింపఁబడగినది.)

చేలివెలుఁగు. దే. వి. చంద్రుఁడు, శీతకరుఁడు.

చేలుప. దే. వి. 1. చాఁపఱాయి; "చ. నలుగడలందుఁ గంబములనందగి రైవతకాది పర్వతం, బులుఁబయి కప్పుఱాచలుపపోలికనింగియునందుఁజిత్రభంగులుపచరించు సౌధమణికూటమరీచులు నొప్పనొప్పుమి, క్కిలిఁబురలక్ష్మికొల్వుచవికెంగొలువున్నగతిఁ శుభస్థితిఁ." కళా. ౧, ఆ.—2. ఱాయి*. (చూ. ఫులుదిండిచలుప.)

చేలుపు. దే. ప్రే. 1. చేయు; 2. కడపు. "వ. ఇప్పుడివ్వనంబునఁ బదుమూఁడుమాసంబులు చలిపితిని." భార. ఆర. ౧, ఆ. (చూ. చను.) (ఇది వ్యవహారమునందు సకారాదిగా కనఁబడుచున్నను గ్రాంథప్రతులయందంతట ఇట్లు పరుషాదిగానే కానఁబడుచున్నది.)

చేలువ. దే. వి. 1. శైత్యము; "వ. మలయంబునఁగలచలువకువిలువయెయ్యది." స్వా. ౨, ఆ.—2. జాడ్యమువలని శైత్యము; 3. ఉదికినవస్త్రము; "చెలువైనచలువొకచెలువయొసఁగె." సా. ౧, ఆ.—4. బ. శైత్యోపచారము.

చేలువగట్టు. ద్వ. వి. హిమవత్పర్వతము.

చేలువచేయు. దే. స. క్రి. చేవుటినీళ్లలోనుడికించియుదుకు.

చేలువజ్యోతి. ద్వ. వి. చంద్రుఁడు, శీతకిరణుఁడు.

చేలువడి. దే. వి. (చలువ+వడి.) శైత్యము. (స్వార్థమున వడి.)

చేలువమిరియము. ద్వ. వి. తోఁకమిరియము.

చేలువఱాయి. దే. వి. చంద్రకాంతము.

చేలువఱేఁడు. దే. వి. చంద్రుఁడు.

చేల్ది. దే. వి. చలిదియొక్క రూపాంతరము.

చేల్మిరి. దే. వి. చేలిమిరియొక్క రూపాంతరము. లక్ష్మీ. 3, ఆ.

చేల్ల. దే. వి. మజ్జిగ. విణ. శీతము. "చెలువనెమ్మెయి చల్లవలపు సంపెఁగకొమ్మ." చంద్ర.

చేల్లకడి. దే. వి. మెంతిమజ్జిగ.

చేల్లకము. దే. వి. చేల్లుట.

చేల్లగడ్డ. ద్వ. వి. శతమూలి?.

చేల్లచేప్పుడు. దే. విణ. జడుఁడు. "ద్వి. మొండరిచల్లచప్పుడుగోడచేర్పు." పారిజా. ౨, భా.

చేల్లజంపు. దే. విణ. భయంకరుఁడు. "వ, గీ. ప్రళయసమయంబునందుగ్రభంగిఁజీవ, పశుగణంబులసమయించుపశుపతియును, బోలెనాభీలదుస్స

హాళీలయొసఁగఁ, జల్లజంపయ్యెఁజంద్రుఁడుశత్రు తతికి." హరి. ఉ. ౧౦, ఆ.

ౘల్లడము. వై. వి. సగముతొడవలకుఁ దొడిగికొనెడు గుడిగి.

ౘల్లన. దే. వి. శైత్యము. విశ. శీతము. "గీ. అగ్నివెచ్చనొచల్లనో యనిమనమునఁ, గరము సందియమందుట కాదెనిన్ను, నధిపముక్తుండవో కావొయనితలంచుట." భార. శాం. ౬, ఆ. (విశేషణము గుచో చల్లనిగాలి. చూ. అలకన.)

ౘల్లపడు. ద్వ. అ. క్రి. చల్లనగు.

ౘల్లపిట్ట. ద్వ వి. పక్షివిశేషము.

ౘల్లరాడు. దే. వి. తరిగంబము.

ౘల్లవడియము. ద్వ. వి. వటకవిశేషము. "ద్వి. చల్లవడియములుఁజక్కిలంబులును." ధర్మా. 3, భా.

ౘల్లసేయు. ద్వ. స. క్రి. (చల్ల+చేయు.) చల్లపఱచు. "రామలక్ష్మణకపీంద్రులకన్నులుచల్లసేయుచుణ్." రా. సుం, కాం.

ౘల్లాడము. వై. వి. ౘల్లడముయొక్కరూపాంతరము. (చూ. కాస.)

ౘల్లారు దే. అ. క్రి. (ౘల్ల+ఆరు.) ఉపశమిల్లు.

ౘల్లు. దే. స. క్రి. (నీళ్లు) ౘల్లు, (విత్తనములు) చల్లు. వి. చల్లుట.

ౘల్లుపోరు. దే. వి. కొలఁకులయందు దిగి యొకరిమీఁదనొకరు నీళ్లుచల్లుకొనెడియాట. "ఉ. వేడుకనొక్కరుండుశతవీరకుమారులతోడఁజల్లుపో, రాడిజయించి." భార. ఆది. ౫, ఆ.

ౘల్లులాడు. దే. అ. క్రి. (చల్లులు+ఆడు.) కొలఁకులయందు దిగి యొకరిమీఁదనొకరు నీళ్లుచల్లుకొనియాడు. "ఎ, గీ. అంబుజాకరములఁజల్లులాడఁజనుదురు." భాగ. ౧౦, స్కం. పూ.

ౘల్వ. దే. వి. చలువయొక్కరూపాంతరము.

ౘవలము. దే. వి. వరహాలోనెనిమిదవభాగము.

ౘవి. దే. వి. 1. రుచి; 2. రసము.

ౘవికె. వై. వి. మండపము*. (చూ. చలుప.)

ౘవిగొను. దే. స. క్రి. (చవి+కొను.) రుచిచూచు. కళా. ౭, ఆ.

ౘవిలె. దే. వి. నాలుగుడబ్బులు.

ౘవ్వ. దే. విశ. చప్పయొక్కరూపాంతరము. "ద్వి. మటుమాయలాఁడు, హరిమీరలాతనియాఁడు రూపంబు, చవ్వసేయకకన్నజగములలోన, నవ్వగు." విష్ణు. ఉ. ౪, ఆ.



ౘవ్వంచె. ద్వ. స. (చవు+వంచ.) అయిరు.

## ౘా.

ౘాంగణ. దే. వి మల్లబంధవిశేషము.

ౘాఁగ. వై. వి. మొరటి.

ౘాఁగఱ. దే. వి. నాశము.

ౘాఁగఱగొట్టు. దే. స. క్రి. (చాఁగఱ+కొట్టు.) చంపు. "ద్వి. జాముపోయెడుదాఁకఁజాఁగఱగొట్టి, బాములఁబొందుచుఁబనులెల్లఁదీర్చి." (ఇక్కడ చాఁగఱగొట్టననఁగా బాధింపఁగానని యర్థము.) హరిశ్చ. ౨, భా.

ౘాఁగఱగొను. దే. స. క్రి. (చాఁగఱ + కొను.) 1. కొట్టు, "ఉ. నాఁగలిసాఁచుచుందిగుమనాగరధాళ్వభటావళింగదణ్, జాఁగఱగొన్నఁజక్కఁగఁబిశాచికలాచిఱునుగ్గులెక్కకై, రేఁగినచొట్లనుందెలుపురెండునుమూడునునాల్గునైదుగాఁ, గాఁగిటఁగొమ్ములుణ్ నెగలఁగాళులువ్రేళులుఁబట్టిచూపుచుణ్." ఉ, హరి. ౬, ఆ.—2. ఖండించు. "చ. మఱకువఁగత్తిరించి మదమానములంజఱవుచ్చిమెచ్చుఁజాఁ, గఱగొని." ఉ, హరి. ౪, ఆ.

ౘాఁగఱలాడు. దే. స. క్రి. (చాఁగఱలు+ఆడు.) నాశముచేయు.

ౘాఁగిలింత. దే. వి. నమస్కృతి. "రగడ. కడఁకసంగమగ్రామంబందలి సంగమస్వామికిఁజాఁగిలింతలని." హంస. ౪, ఆ.

ౘాఁగిల్లు. దే. అ. క్రి. నేలకువ్రాలు. (రూ. చాఁగిలు. "క. రంజిలియంజలిచేసిధ, రంజాఁగిలిమ్రొక్కినిలిచిరఘువరయపరా, ధింజూడుముకృపనఁదెలి, యంజాలఁగనైతినీమహామహిమనహా." రామా. ౫, ఆ.)

ౘాఁగు. దే. అ. క్రి. 1. దీర్ఘమగు; 2. దండాకారముగ నేలకువ్రాలు. "క. ధరఁజాఁగిమ్రొక్కిదశకం, ధరుఁడువినయమొప్పనిలిచితఱుగనితలపై, వెరవునఁదనకరపద్మము, లిరువదియునుమొగిచియల్లనిట్లనిపలికెణ్." నిర్వ. 3, ఆ. (చూ. చాఁగిల్లు.) — అవ్య. ప్రశంసనార్థకము. "గీ. బాపువలరాజుగర్వంబుఁబాపురూపు, చాఁగు రాజుకళలమించాఁగురేఖ, మేలునలరాజుపోయ

గఁ మేలుఁజెలువ, మమ్మయీరాజు ప్రతిగానమమ్మ రొచట." విజ. ౨, ఆ.

**చాఁగురె.** దే. అవ్య. ప్రశంసనార్థకము. "ద్వి. చాఁగురెయింద్రియజయమింకఁజాలు." విష్ణు. పూ. 3, ఆ. (రూ. చాఁగురే.)

**చాఁచే.** దే. ప్రే. చాఁగఁజేయు.

**చాతాని,** సాతాని. దే. వి. చాతనివాఁడుకురూపాంతరము.

**చాఁడు.** దే. స. క్రి. (గట్టివస్తువునునీళ్లుపోసి) ఱాచు. వి. 1. బొట్టుపెట్టుకొనుటకు పూయుటకు నగు నల్లనిద్రవద్రవ్యవిశేషము; "ద్వి. పలుచని చాఁదునఁబట్టెలఁ దీర్చి." హరిశ్చ. ౨, భా.—2. కాలునపుడు కాష్ఠమునందు ద్రవించెడుద్రవము "చ. తరుణులకొఁగిటన్ ననుచుతమ్ముపృథావిరులెత్తిచేసెమో, పరులఁగఁజైత్రుఁడంచుఁదదభావమనోభవవహ్ని వెచ్చిని, ర్భరమధుపాళిధూమముఁబరాగపునీఱును దేనెకట్టెచాఁ, దరుదుగఁదాల్పఁగాఁగొఱవులైయొఱగంబడెఁగొన్నిభూజముల్." ఆము. ౫, ఆ.

**చాఁప.** దే. వి. 1. క్రిందఁబఱచుకొనెడుచాఁప, కటము; 2. ఓడకుఁగట్టెడుచాఁప; "సీ. కలముపైఁగీలించిగాలికెత్తినచాఁపఁబోలిమిన్నంతయుఁబూరటిల్లె." భార. ఉద్యో. ౪, ఆ.—3. ఒకదినుసువల. "వ. పచ్చవిలుతునెచ్చరించు మచ్చెకంట్లనిడువాలుఁజూపులచాఁపలందగిలినట్టులిట్టట్టుకదలనేరక చిట్టకంబునంబొరలు నాగరికలోకంబును." జై. ౨, ఆ.

**చాఁపకట్టు.** దే. వి. చాఁపపఱపువంటి పఱపు. "గీ. అపుడునిశ్చేష్టితంబులైహయములవనిఁ, జాఁపకట్టుగఁబడియె." (చాఁపకట్టుగన్ అనఁగా చాఁపపఱచినట్టుగా. నేలతోనేలగాననుట.) భార. విరా. ౪, ఆ.

**చాఁపకట్టువడు.** ద్వ. అ. క్రి. (చాఁపకట్టు+పడు.) చాఁపపఱచినట్లగు. (నేలతోనేలగా అగు.) "సీ. గంధదంతావళికర్ణమారుతహతిఁ గాంతారములు చాఁపకట్టువడఁగ." భార. విరా. 3, ఆ. "చ. కరములుచాఁపకట్టువడఁగాగిరియొప్పటియట్లక్రుంగినన్." నిర్వ. ౪, ఆ.

**చాఁపగడ్డ.** ద్వ. వి. కుందేళ్లనుబట్టెడి యొక దినుసు డేగ.

**చాఁపట్టు.** దే. వి. (చాఁప+అట్టు.) అప్పడమువంటియొకదినుసుపిండివంట. "సీ. పట్టాసనములపైఁ బన్నీరుప్రోక్షించి చెయ్యార్చిచాఁపట్లుచేయువారు." సై. ౭, ఆ.

**చాఁపతాయి.** దే. వి. విశాలమైనతాయి.

**చాఁపలు.** దే. వి. బ. చిక్కులు. (అప్ర.)

**చాఁపు.** దే. ప్రే. చాఁగఁజేయు. వి. 1. చాఁచుట; "ఎ, గీ. పొదలఁదూఁటిననీఁటెచాఁపులవెడల్చి." ఆము. ౭, ఆ.—2 పడుగుకొలఁదివస్త్రము.

**చాకల.** దే. వి. వస్త్రములు ఉతికి జీవించునట్టి యొకజాతి. (చాకలవాఁడు, చాకలది.)

**చాకలపిట్ట.** ద్వ. వి. భరద్వాజము.

**చాకలి.** దే.వి. (చాకల+ఇ.) చాకలవాఁడు, రజకుఁడు.

**చాకి.** దే. వి.——పై.——

**చాకిత.** దే. వి. చాకలది, రజకి.

**చాకిబాన.** దే. వి. 1. బాలక్రీడావిశేషము; "సీ. పంతంబుతోఁజాకిబానతిర్గకునంచు బెబ్బులితిత్తులురబ్బురముగ." చమ. 3, ఆ.—2. పక్షివిశేషము.

**చాకీ.** దే. వి. భోజనపాత్రము, కంచేము.

**చాగకాఁడు.** ద్వ. వి. (చాగము+కాఁడు.) కుబేరుఁడు. విశ. త్యాగశీలుఁడు.

**చాగము.** వై. వి. త్యాగము. "శాంతియుదాంతియుఁజాగంబుభోగంబు." భార. విరా. ౧, ఆ.

**చాగరతనము.** వై. వి. (చాగము+రతనము.) చింతామణి.

**చాగరాడి.** దే. వి. గంధపిండీతకము?.

**చాగి.** వై. విశ. (చాగము+ఇ.) త్యాగశీలుఁడు.

**చాగు.** దే. అ. క్రి. 1. పోవు; "మ. శమితక్షత్రకళత్రనేత్రజలవర్షావేళనీకీర్తిహం, సముక్రౌంచనుఫటతావకాంబకనుషింజాగంగ." ఆము. ౪, ఆ.—2. ప్రవర్తిల్లు; "సీ. అంతరాయములేకహయమువచ్చుటయెట్లు సత్క్రియయాగంబుచాగుటెట్లు." జై. ౧, ఆ.—3. యత్నించు. "రగడ. మానుమానునుఁబోఁకబోదలమఱు వెమరువేశ్మస్థలంబగుఁ, జానజానగుననలుగోయఁగఁజాగిజాగిపుడేఫలంబగు." రుక్మి. 3, ఆ. (వ్యవహారమునందిది సాధారణముగా సకారాదిగా కానఁబడుచున్నది.)

**చాగుబడిక.** దే. వి. పూజ. "రగడ. భూతస్థానముపురమునవెలవగు, శార్ఙ్గస్వామికిఁజాగుబడికలని." హంస. ౪, ఆ.

చాచి. దే. వి. స్తనము.

చాటించు. దే. స. క్రి. డుడుములోనగునవి వ్రేయించియితరులకందఱికి విషయమును తెలుపు. "శా. చాటించెన్ మనువంశవర్ధనుఁడు విశ్వక్షోణినందందఘుం, టాటంకారము దుందుభి ధ్వనియుఁ గూడన్ వేగమై దేవతా, కోటుల్ మేదినినున్నఁ దప్పగుఁజూఁడో కోపంబుపాపంబుపా, త్రాటోంబు మెయింగుటుంబసహితం బైచేరుఁడో నాకమున్." సం. "పటహంఘోషయాంచక్రే దినందేవా వ్రజంత్వితి." కాశీ. ౫, ఆ.

చాటు. దే. స. క్రి. 1. చాటించు; "శా. వీటన్ వీధులనెల్లనేనుఁగులపై విస్ఫార ఘంటాధ్వనిన్, జాటంబంపుఁడు పేర్మినుత్తరు జయాశ్చర్యంబు." భార. విరా. ౫, ఆ.—2. విశదపఱచు. "గీ. మనుజ, భక్షణంబుచేసితిరేఖిబకునియట్ల, చత్తురనిరక్కసులకెల్లఁజాటిచెప్పె." భార. ఆది. ౭, ఆ.—వి. మఱుఁగు.

చాటుపడు. ద్వ. అ. క్రి. మఱుఁగుపడు. "గీ. అనుచుఁ బ్రియదూతికలఁగూడియాడికొనఁగ, బలుకులవిచాటుపడివించుఁబతులులోని, తుకతుకలుడించి క్రొత్తవేడుకలుపొదల, బయలుపడిపల్లభలసిగ్గుపఱచిరపుడు." కవిక. ౪, ఆ.

చాటువ. దే. వి. చాటించుట. "ఎ, గీ. చాటువకునెక్కసవ్విటిఘోటకాలి." భల్లా. ౧, ఆ.

చాడి. దే. వి. కొండెము.

చాడీ. దే. వి. చాడియొక్క రూపాంతరము.

చాడీగొట్టు. దే. విశ. కొండెకాఁడు.

చాడుపు. దే. వి. విధము.

చాడ్పు. దే. వి. చాడుపుయొక్క రూపాంతరము.

చాతనివాఁడు. దే. వి. శిఖాయజ్ఞోపవీతములు ధరింపని వైష్ణవుఁడు.

చాతు. దే. స. క్రి. ధరించు. "ఎ, గీ. పెరుగువడియంబులునుబచ్చివరుగులొలుపుఁ, బప్పుమధుసూదనార్చోపకరణపేటి, కలునుజాతినచాతనికులము బలసి, విధినిషేధములెఱుఁగితేమధురకరగ." ఆము. ౭, ఆ.

చాన. దే. వి. ఆఁడుది, ఇంతి.

చానపి. దే. వి. (చూ.) కలయంపి.

చాపరువు. దే. వి. (చావు+పరువు.) చచ్చునంతటి పరుగు. "క. అతిముఱిఁజాపరువువాఱియుల్లటుపడియెన్." స్వా. ౪, ఆ.

చామ. యు. దే. వి. ఒకదినుసుపడవ. వై. 1. యౌవనముగలస్త్రీ; 2. నలుపు; 3. సస్యవిశేషము; 4. బ. ధాన్యవిశేషము.

చామనము. వై. వి. నలుపు. విశ. నల్లనిది. "గీ. చామనపుమేనిమొగులుపైసంజకెంపు, లోఁతుపాక్కిటితమ్మికిలేఁతయెండ, దొరయఁజేయుఁబ్రశస్తకౌస్తుభగభస్తి, నలరుహరిధాతుమయ కజ్జలాద్రిఁబోలె." రామా. 3, ఆ. (వృత్తియందు హల్లు పరమగుచో అంత్యవర్ణము వికల్పముగా లోపించును. చామనచాయ.)

చాయ. వై. వి. 1. కాంతి; 2. సూర్యునిభార్య; "సీ. కమలాప్తువెనువెంటఁగనకాద్రివలగొను చాయపూఁబోఁడిమైచాయయనఁగ." భాను. 3, ఆ.—3. నీడ; 4. పోలిక*; "మహాస్రగ్ధర. పరభూభృత్ప్రాప్తిఁబ్రిన్ బడురవిహరులన్ బ్రౌఢిఁ బాటింపవెందున్, సరిగాఁదద్దిక్క్రతుల్ సైఁచకరవిహారియైచాయకున్ రానడంచున్." వసు. ౧, ఆ.—5. వర్ణము*; 6. వైపు*; "క. చనదిచ్చటనుండనొండుచాయకుఁజనుఁడీ." వి, పు. ౭, ఆ.—7. జాడ*; "క. నీయడిగిన ప్రశ్నలుమై, త్రేయశతాబ్దములనైనఁదీఱవుచెప్పన్, దోయజభవునకునైనను, జాయలుగావినుము కథలసంక్షేపంబుల్." వి, పు. ౭, ఆ.—8. సమీపము*; 9. ఋజుభావము*; "గీ. ఎంతసఖ్యంబుచేసినసెంతప్రియము, చేసితిరిగినదుర్జనచిత్తమేల, చక్కటికివచ్చుశునకపుచ్ఛంబుకడఁగి,వంకయొత్తినఁజాయకువచ్చునెట్లు." పంచ. నా. ౧, ఆ.—10. బ. కత్తియొక్క కాంతులు.

చాయచెక్కచెట్టు. ద్వ. వి. చాయవేయుటకు ఉపయుక్తమైన చెక్కగల ఒకానొకచెట్టు.

చాయపట్టి. ద్వ. వి. ఛాయాదేవిపుత్త్రుఁడు, శని. "చ. వసుమతిఁ జేయిపాదములవానికిఁబుట్టినచాయపట్టికిన్." నై. 3, ఆ.

చాయమగఁడు. ద్వ. వి. సూర్యుఁడు, వెలుఁగుఱేఁడు.

చాయవాఱు. ద్వ. అ. క్రి. (చాయ+పాఱు.) పోలు. "మ. శ్రుతపూర్వంబగువిశ్వమోహనకళాశోభావిశేషంబుస, మ్మతినూహింపఁగఁజాయవాఱుటయు." నై. 3, ఆ.

చారు. యు. దే. స. క్రి. పారకకట్టయడుగుతోఁ నుతిచినకల్లమునూడ్చు. వై. వి. 1. సున్నముకలిసిన

కల్లు*; 2. మిరియములోనగు సంభారములను చేర్చి కాఁచిన చింతపంటిరసము. (ఈ యర్థమందిది యిట్లు దంత్యాదిగా నొకచోట ప్రయోగింపఁబడి యున్నది. అయినను వాడుకయందు తాలవ్యాదిగా కనఁబడుటవలన అది యుక్తముగా తోఁచదు.)

చాఱ. యు. దే. వి. 1. రేఖ; 2. మత్స్యవిశేషము. (చూ. కొరద.)—వై. జీడిమామిడి*. "గీ. ఒక్కయెఱుకు ఱేఁడునక్కకొమ్మును నిత్తీ, గోఱజంబు జున్ను చాఱపప్పు, పీలిగఱుల యుంపకోలలు సెలవిండ్లుఁ, గానుకిచ్చికరయుగంబు మొగిచి." స్వా. ర, ఆ.

చాఱకంద. ద్వ. వి. మీఁదచాఱలుగల యొకదినుసు కంద, పిండాలువు*.

చాఱపప్పు. ద్వ. వి. జీడిమామిడిగింజలోనిపప్పు.

చాఱబియ్యము. ద్వ. వి.——వై.——

చాఱలమెకము. ద్వ. వి. పులి, వ్యాఘ్రము.

చాఱిక. దే. వి. చాఱ, రేఖ.

చాలమి. దే. వి. అశక్తి. "క. క్షమియించువారిఁగని చాలమి వెట్టుదురు." భార. ఉద్యో. ౨, ఆ.

చాలించు. దే. ప్రే. 1. నిలుపుదల చేయు; "కయ్యంబు చాలించి." భార. భీష్మ. ౧, ఆ.—2. శక్తము గఁజేయు. "వ. మఱియు నుదగినయెడలవలయు వలీముఖవీరులం జాలించుచు." రా. యు, కాం.

చాలిక. దే. వి. సామర్థ్యము.

చాలు. దే. అ. క్రి 1. కావలసినంతయగు, పర్యాప్తమగు; "ఉ. ఓలిగృహస్థధర్మములనుండెడువానికి గ్రాసవాసముల్, చాలఁగఁగల్గి పుత్రులుఁగళత్రము సౌఖ్యమునొందబంధువుల్, మేలననార్యకోటిమది మెచ్చఁగనుండుటయున్కి గాకయే, చాలును లేక యాచెనఁటిజాలిఁబడంబని యేమి చెప్పుమా." భో. ౨, ఆ.—2. ఓపు. "వ. పాంథులకు భయంబు సంపాదింపం జాలు క్రొమ్మావి మోకచాలును." నై. ౧, ఆ.—వి. 1. వరుస; (చూ. ఓపు అను అర్థము నుదాహరణము.)—2. దున్ను నపుడు కఱ్ఱుచే నేర్పడిన రేఖ; ౩. ధార; "మ. అమరక్ష్మ క్రొవ్విరితేనె చాలు కొణతా లందందలాగించి." శకాం. ౨, ఆ.—4. పర్యాప్తి. (చూ. పర్యాప్తమగు అను నర్థము నుదాహరణము.)

చాలువు. దే. వి. చాలు, వరుస, (రూ. చాల్పు.)

చాలుపేరంటిపూఁబోఁడి. ద్వ. వి. సీతాదేవి. "ఎ, గీ. పిలిచిరాకాసిప్రోలు విభీషణునకుఁ, దిరముగానిచ్చి సెగ బాసఁదేటినట్టి, చాలుపేరంటిపూఁబోఁడి నోలిఁగూడి, తానుఁదమ్ముఁడుఁదగ నయోధ్యకును వచ్చె." య. 3, ఆ.

చాలుబడి. దే. వి. చాలిక, సామర్థ్యము.

చాలుమాసి. ద్వ. విశే. పరాధీనుఁడు.

చాలువాఁడు. దే. విశే. శక్తుఁడు, సమర్థుఁడు. "చ. ఇత్తెఱఁగొక చాలువాని బలుతీర్పనఁగాక పాసంగ నేర్చునే." భార. ఉద్యో. ర, ఆ.

చాలువాఱు. దే. అ. క్రి. (చాలు+పాఱు.) వరుస తీరు. "క. చెలువుఁడు ప్రావృట్కాలుఁడు, పాలసినఁబులకించు భూమిపులకములనఁగా, మొలచితలలెత్తి నిక్కుచు, సలలితగతిఁజాలువాఱె సస్యములధిపా." భాగ. ౧౦, స్కం. పూ.

చావఁజూచు. దే. స. క్రి. (చావక్+చూచు.) చంపు. "ఎ, గీ. నినుధార్తరాష్ట్రులొండె, నీవువారలనొండెను జావఁజూడ, వలయుటప్పుడెఱుంగవే వసుమతీశ." భార. శాం. ౧, ఆ.

చావడి. దే. వి. 1. కొలువుకూటము; "క. అనరాదుగాని తక్కిన, మనుజేంద్రుల చొప్పుకాదు మనచావడిలో, ననయము నెవ్వరిఁజూచినఁ, జనవరులె ట్లనిన విను ము జగతీనాథా." పర. 3, ఆ.—2. చవికె, మండపము.

చావు. దే. వి. మృతి, మరణము.

చాళియ. దే. వి. మల్లబంధవిశేషము. ఉ, హరి. ర, ఆ.

చాళె. దే. వి. చాళియయొక్క రూపాంతరము.

## చు.

చుంగుడు. దే. వి. నిలువయగు చిల్లర ద్రవ్యము.

చుంగులు. దే. వి. బ. వస్త్రముకుచ్చెకొంగులు.

చుంచు. యు. దే. వి. పిల్లజుట్టు. "ఉ. అక్కటకోసలక్షితివరాత్మజ కానక కన్నముద్దులేఁ, జక్కని చుంచు రాకొమరు చందురు లెక్కడ." రామా. ర, ఆ. "క. చుంచొదవుఁబాలుద్రావుము, దంచితముగ ననుడుఁబాలుద్రావిజననితోఁ, జుంచొదవదను చులీలా, చుంచుం డైయతఁడు చుంచుఁజూపెన రేంద్రా." (ఇందు చుంచు అను పదమునకు బలము అర్థమని తోఁచుచున్నది) భాగ. ౧౦, స్కం. పూ.—వై. కంపెలుక.

చుంచెలుక. ద్వ. వి. (చుంచు+ఎలుక.) చుంచు.

చుంచుమిద్దె. ద్వ. వి. గోపురమువలె పొడవుగాఁగట్టిన కట్టడము.

చుంచుటాయి. దే. వి. మేడలమీఁద కప్పెడుటాతిపలకవంటి యొకదినుసుటాయి.

చుండు. దే. అ. క్రి. ఆకులోనగునది సెగచేశుష్కించు. వి. తలమీఁద ఉప్పుపూచినట్లుపూచెడు వ్యాధివిశేషము.

చుండెలుక. దే. వి. (చుండు+ఎలుక.) చుంచెలుక.

చుంయి. దే. వి. నిప్పునీళ్లుచేరినప్పుడుకలిగెడుధ్వన్యనుకరణము. "మ. పునుఁగుంబావినవౌదనంబు మిరియంపుంబొళ్లతోఁజట్టిచుంయనునాదా అని కూరగుంపు." ఆము. ౨, ఆ.

చుఁడి. వై. ని. చూడుఁడి, (రూ. చుఁడీ.)

చుఁడు. వై. క్రి. ని. చూడుఁడు.

చుక్క. వై. వి. 1. శుక్రుఁడు; 2. నక్షత్రము*; 3. మండలాకారమైనతిలకము*; "సీ. ఘనసారచూర్ణమ్మెక్కలతాంగి తెచ్చినబొటవ్రేలనేచుక్కబొట్టువెట్టి." (ఇక్కడ చుక్కశబ్దమునకు మండలాకారముమాత్రమర్థము.) స్వా. 3, ఆ.—4. నీరులోనగువానిబొట్టు*.

చుక్కకాఁడ. వై. వి. మాగాణిపొలములయందు మొలచెడి యొకదినుసుచెట్టు.

చుక్కకార. ద్వ. వి. మత్స్యవిశేషము.

చుక్కకూర. వై. వి. ఒకదినుసుకూరాకు.

చుక్కచేలు. వై. వి. 1. నుదుటవ్రేలాడనుంచుకొనెడు భూషావిశేషము; 2. చుక్కలచాలు. "సీ. మగువకొప్పునభంబుఁ దెగడనిర్దోషంపుఁజుక్కచేలుఘటించెనుదతియొర్తు." వసు. ౫, ఆ.

చుక్కపిల్ల. వై. వి. మత్స్యవిశేషము.

చుక్కపిల్లి. వై. వి. మార్జాలవిశేషము. (అప్ర.)

చుక్కయెదురు. ద్వ. విశే. (చుక్క+ఎదురు.) ఎదురుచుక్క. "గీ. ఇరుగుపొరుగులవారికి నెల్లఁజుక్క,యెదురునాయిల్లు వేయును నేలయింక." హరిశ్చ. ౪, ఆ.

చుక్కలతెరువు. ద్వ. వి. ఆకాశము, మిన్ను.

చుక్కలఱేఁడు. ద్వ. వి. చంద్రుఁడు, నక్షత్రేశుఁడు. (ఇట్లు చుక్కలదొర. చుక్కలరాయఁడు. మొ.)

చుక్కలి. దే. వి. ఒకానొకచెట్టు.

చుక్కవాలు. ద్వ. వి. చుక్కయెదురు. "చ. అమరులబోనపుట్టిక సహస్రమయూఖునిజోడుకోడెసం, తమసము వేరువిత్తు కుముదంబులచక్కిలిగింత పుంశ్చలీ, సమితికిఁజుక్కవాలు నవసారసలక్ష్మితోలంగుబావకో, కములకుగుండెతల్లడము కైరవమిత్రుఁడుతోఁచెఁదూర్పునన్." పా. ౨, ఆ.

చుక్కాను. దే. వి (చుక్క+ఆను.) అరిత్రము. "సీ. నీటిలోఁజివుకకనిలిచిక్రుమ్మరుపూన్కిఁ గరినకర్పరముచుక్కానుబిగువు." పాండు. ౨, ఆ. (దీనిని చుక్కాని యని వాడుచున్నారు.)

చుచ్చు. దే. వి. 1. మేఁక; "సీ. పచ్చిపుత్తితోల్ బత్తెచుచ్చాలమెట్లందికోఁదానె యూరెల్లగుత్తపట్టి." (పచ్చిజింకతోలును బత్తెలమేఁకలఆవుల (తోళ్ల) పాదరక్షలును దానముగ్రహింప తానెగుత్తయెత్తియని అర్థము.) ఆము. ౬, ఆ.—2. సంతాపమునందుకలిగెడు ధ్వన్యనుకరణము.

చుచ్చుకొట్టు. దే. అ. క్రి. సంతాపముచేత చుచ్చు అను.

చుచ్చులుకు. దే. విశే. (చులుకు+చులుకు.) మిక్కిలి తీక్ష్ణము. "చుచ్చులుకుపలుకులు." రామా. ౫, ఆ.

చుట్ట. దే. వి. 1. గుండుగాచుట్టినచుట్ట; 2. మోపుక్రిందతలమీఁదనుంచుకొనెడుచుట్ట; 3. పొగచుట్ట.

చుట్టకుదురు. దే. వి. కుండలు కుదిరికగానిలుచుటకై వానిక్రిందనుంచెడు వెంటిలోనగువానిచుట్ట, ఆధారకుండము.

చుట్టము. దే. వి. 1. బంధువు; 2. సంబంధి; "మ. శమితారాతిబలుండు వారలకుఁబాంచాలప్రభుండిప్పుచుట్టముతానయ్యె." భార. ఆది. ౮, ఆ.—3. స్నేహితుఁడు; "గీ. బాలకుండు వృద్ధు పగవాఁడు చుట్టంబు, బూతు నూనగాఁడు పాతకుండు, బొంకులాఁడుముచ్చు ముండరి కొండీఁడు, కల్లుత్రాగువాఁడు గాఁడుసాక్షి." సం. "స్త్రీబాలవృద్ధకితవమత్తోన్మత్తాభిశస్తకాః, రంగావతారిపాషండికూటకృద్వికలేంద్రియాః, పతితాప్తార్థసంబంధిసహాయరిపుతస్కరాః." విజ్ఞా. వ్య, కాం.—4. బంధుత్వము. "క. చుట్టము పగయనుభేదం, బెట్టిజనులవలనఁదగులదు." భార. శాం. ౫, ఆ. (వృత్తియందు హల్లుపరమగుచో అంత్యవర్ణము వికల్పముగా లోపించును. చుట్టతనము, చుట్టపక్కములు.)

చుట్టఱికము. దే. వి. (చుట్టము+అఱికము.) 1. బంధుత్వము; 2. సంబంధము. "గీ. పాండవులుధార్తరాష్ట్రులుపుండరీక, నేత్రచుట్టఱికంబుననీకునొ

క్కరూప." సం. "సంబంధీదయితో నిత్య ముభయోఃపక్షయోరపి." భార. ఉద్యో. ౩, ఆ.— ౩. స్నేహము. "క. అంతిపురముచుట్టటికం, బెంతయుఁగీడంతకంబె నెగ్గుతదీయో, పాంతచరకుబ్జవామన, కాంతాదులతోడిపొందుకలిమిభటునకుఁ." సం. "నైషాందారేషుకుర్వీత మైత్రీం ప్రాజ్ఞఃకదాచన." భార. విరా. ౧, ఆ.

చుట్టలఁగు. దే. వి. (చుట్టు+అలఁగు.) చక్రాయుధము. "చ. పెనిమిటియైన వెన్నుఁడొగిఁ బ్రేముడినిచ్చినఁబుట్టుగ్రుంకుగ, ట్లనుతన రెండుచేతుల నొయారముమీఱఁగ నేలకొమ్మతా, ల్చినపవడంపుఁజుట్టలఁగుఁ జిందమునుంబలెఁ జూడనొప్పె నం, తనుదగఁదూర్పునన్ వెనుకఁదమ్ములవిందును డదమామయున్." య. ౫, ఆ. (రూ. చుట్టల్గు.)

చుట్టిల్లు. దే. వి. (చుట్టు+ఇల్లు.) చుట్టునుగుండ్రముగాఁగోడ పెట్టినడుమనిట్రాడు నాటి దూలములు లేకకట్టినయిల్లు.

చుట్టివచ్చు. దే. స. క్రి. 1. ప్రదక్షిణించు; 2. పరివేష్టించు. "సాత్యకిరాముఁడుద్ధవుఁడుహార్దిక్యుండులోనైనకొందఱమాత్యుల్ తనుఁజుట్టిరానమరె." ఉ, హరి. ౨, ఆ.

చుట్టు. దే. స. క్రి. 1. చుట్టగాఁజుట్టు; "తనదుతోయ్యలివీడ్యముచుట్టియీ." పాండు. ౩, ఆ. — 2. తిరిగిరాఁజేయు. వి. 1. చుట్టిరాఁజేయుట; "క. తెలుగులపాదియొకదెసఁబె, య్యలదామెనయొక్కవలననువైయుండన్, మొలమోపి పెక్కుచుట్లన్, బలుత్రాటంజుట్టి గోపభావంబమరన్." భార. విరా. ౧, ఆ.—2. ఆఁడుదాని కాలిజుట్టనవ్రేలియుంగరము. విణ. చక్కగాఁగాక తిరిగితిరిగిపోఁదగినది. (మార్గము.) "క. ఎంచఁగనాగమనమునకు, నించుకచుట్టయిననయ్యె." కళా. ౨, ఆ.— క్రి. నాలుగుప్రక్కలను. "క. గోరథమునుబుషభము వై, హారము బుషిగిరియుఁ జైత్యకాద్రియు ననఁగా, నూరెలగిరులేనునునివి, శూరభటులువోలెఁగాచిచుట్టునునుండున్." భార. సభా. ౧, ఆ.

చుట్టుఁగైదువు. దే. వి. (చుట్టు+కైదువు.) చక్రాయుధము. "చుట్టుంగైదువుజోదు." రామా. ౩, ఆ.

చుట్టుఁగొండ. ద్వ. వి. (చుట్టు+కొండ.) చక్రవాళపర్వతము. (ఇట్లు చుట్టుగట్టు. మొ.)

చుట్టుఁబట్టు. దే. వి. (చుట్టు+పట్టు.) నలుప్రక్క. "వ. తన్మందిరంబుముందఱనున్న మృగేంద్రంబునకుం గ్రిందమీఁదఁజుట్టుపట్టున సెట్టిబెట్టిదంపుసింగంబులుం జన వెలుచు." కళా. ౩, ఆ.

చుట్టుఁబులుఁగు. దే. వి. (చుట్టు+పులుఁగు.) చక్రవాకపక్షి. (రూ. చుట్టుఁబుల్గు. "చుట్టుఁబుల్గులగమినోముపంట." కవి. ౩, ఆ.)

చుట్టుకొను. దే. స. క్రి. పరివేష్టించు.

చుట్టుకొల్లారము. దే. వి. కొల్లారము.

చుట్టుకొల్లారు దే. వి.——పై.—— "ద్వి. చూపుడుఁగంబాలచుట్టుకొల్లారు." సా. ౩, భా.

చుట్టుగుల్ల. ద్వ. వి. వలయాకారపుశంఖము.

చుట్టుదల. దే. వి. చుట్టుట.

చుట్టుమాలియ. ద్వ. వి. చుట్టుకొల్లారమనితోఁచెడి. (రూ. చుట్టుమాలె. "సీ. తిరుచుట్టుమాలెలోఁదిరమైనగణపతి యేకాంత దుండివిఘ్నేశ్వరుండు." భీ. ౩, ఆ.)

చుట్టువాఱు. దే. స. క్రి. (చుట్టు+పాఱు.) చుట్టుకొను. "చ. కొలకొలఁగూయుఁబైనొఱగుఁగుత్తుకఁగుత్తుకఁజుట్టువాఱు." స్వా. ౩, ఆ. (రూ. చుట్టువాఱుకొను. "ప్రత్యాలీఢపాదులైతముఁజుట్టువాఱుకొనుచు." రామా. ౮, ఆ.)

చుట్టువాలు. ద్వ. వి. చుట్టుఁగైదువు. (ఇట్లు చుట్టుఁగత్తి.)

చుట్టువాలుదారి. ద్వ. వి. విష్ణువు, చక్రాయుధుఁడు. (ఇట్లు చుట్టువాలుజోదు.)

చుట్టువేడెము. ద్వ. వి. గుఱ్ఱముయొక్కమండలగతి.

చునాయించు. దే. స. క్రి. బట్టలుమడతపెట్టు.

చుప్పనాక. వై. వి. శూర్పణఖ.

చుప్పనాతి. ద్వ. వి.——పై.——

చుబ్బనచూఱ. వై. వి. (చూఱ+చూఱ.) మిక్కిలిచూఱ. (పెద్దకొల్లయనుట.) "సుఖములెప్పుడుఁజుబ్బనచూఱలు." మార్క. ౮, ఆ. (ఇది యిట్లు పరుషాదిగానుండుట యుక్తము. అయినను గ్రంథములయందు సరళాదిగా కానఁబడుచున్నది.)

చుమి. వై. ని. చూడుమి, (రూ. చుమీ.)

చుము. వై. ని. చూడుము. "శౌరనీవుకదలెదుసుమంచు." కళా. ౩, ఆ.

చుమ్మ. యు. దే. వి. వేదన. వై. ని. చూడుమా, (రూ. చుమ్మా.)

చుమ్మచుట్లు. దే. వి. బ. కడుపులోఁగలుగు వేదన.

చుమ్మలుచుట్టు. దే. అ. క్రి. వేదనపడు, కలఁగు. "క. అట్టులులోఁగలి యెప్పుడు, దొట్టెడుబాష్పముల నడఁపఁదొట్రిలుముద్దుం, బట్టిఁగ నికడుపుచుమ్మలు, చుట్టఁగనదియుట్టుపఱచి శుభమొనరంగన్." విజ. 3, ఆ.

చుమ్మలువాఱు. దే. అ. క్రి. (చుమ్మలు+పాఱు.) చుమ్మలుచుట్టు. "గీ. కడుపు చుమ్మలువాఱఁదాఁగన్న కన్నె, చిలుక నెడబాఁసియేరీతినిలుచు వాఁడ." శుక. ౧, ఆ.

చుమ్మి. వై. వి. చుమియొక్క రూపాంతరము. (రూ. చుమ్మీ.)

చుమ్ము. వై. వి. చుముయొక్క రూపాంతరము.

చుయ్యంకి. దే. వి. వాద్యవిశేషము. ఆము. ౪, ఆ.

చురకత్తి. వై. వి. చిన్నకత్తి, సురియ.

చురచురపోవు. దే. అ. క్రి. (చురచుర+పోవు.) మండు. "క. తురగంబులతోఁగూడఁగ, నరదము సకలంబునుజ్జ్వ లానలశిఖలం, జురచురపోవుచునఁగని య న్నరుఁడచ్చెరువందికృష్ణునకునభిముఖుఁడై." సం. "తంతథాభస్మభూతంతు దృష్ట్వాపాండుసుతాః ప్రభో, అభవన్విస్మితాః." భార. శల్య. ౨, ఆ.

చురి. వై. వి. చురకత్తి.

చుఱచుఱ. దే. వి. కాలుటయందగుధ్వన్యనుకరణము. "క. చుఱచుఱఁజూఁడెడు తెఱఁగు చూపులతోడన్." ఉ, హరి. ౪, ఆ.

చులుకరి. దే. విశ. (చులుకు+అరి.) చొరవగలవాఁడు.

చులుకు. దే. వి. 1. వాఁడి; "క. చులుకుగలయొక్క కోలను." నీలా. ౧, ఆ. — 2. వాఁడిమి; "చులుకుగలసేనలతోన్." జై. ౬, ఆ. — 3. వేఁడిమి; "ఉ. అప్పుడు క్రీడివహ్నికిఁ బ్రియంబునఁ జేతులు మోడ్చి దేవయీ, చొప్పున సేన కుంజులుకుచూపుదురే." జై. ౪, ఆ.—4. వేగము; "చులుకుగలతురంగంబులంబఱపిన." రుక్మి. ౨, ఆ. —5. చులుక్కు. "రగడ. అతిమినను జిగురునకు నగునెకంటకమాడఁ, జులుకుమనెవేఱొక్క చోటఁగంటకమాడ." స్వా. 3, ఆ.—విశ. 1. వేఁడిమిగలది; "చులుకుమినుకు కేనికొడుకుకడకుంజని." రామా. ౬, ఆ.—2. వాఁడిగలది. "పాలంతిమిన్నవాల్ చులుకుఁబిసాళి క్రొందళుకుఁజూపులకోపు." రసి. ౫, ఆ.

చులుక్కు. దే. వి. నాటుటనిప్పుసోఁకుటలోనగువానియందగు అనుకరణము. "చేచులుక్కునసేయిన్." ఆము. ౧, ఆ.

చులువుచ్చు. దే. స. క్రి. (చులుకు+పుచ్చు.) కాల్చు. "క. ఎఱమంటలెగయనాతని, నెఱిచూపటఁనిలువునందనీఁలుగఁ దరువున్, జులువుచ్చుపిడుగు క్రియఁగను, గిటిపినయంతటన చేసెఁగిల్బిషుఁ బగతున్." హరి. ఉ. ౨, ఆ.

చుల్లు. దే. వి. కాలుట మొదలగు వానియందగుధ్వన్యనుకరణము. "గీ. అన్న నిన్నువంటియన్నకుఁ దోఁబుట్టి, యాఁడుబిడ్డపోఁడిమందలేక, సుతులఁగన్న కడుపుచుల్లునఁగాలఁగా, నలమటింపవలసెనకటనాకు." వి, పు. ౭, ఆ.

చుల్లుకొను. దే. స. క్రి. కాల్చు. "ద్వి. ఉఱకవువ్వులవిల్తునోడిఁజుల్లుకొన్న, చులుకుఁజూపులకన్నుచోద్యమై మెఱయ." హరిశ్చ. ౨, భా.

చులుక. దే. ద్ర. క్రి. విశ. 1. లాఘవముగా; "క. ముచ్చిలిరఘునాయకుసతిఁ, దెచ్చినయట్లగునె యనుచుధృతిచెడిపాఱన్, జొచ్చితివిస్సీ మగతన, మచ్చుపడియె నిప్పుడంచునలుకన్ జులుకన్." రా. అర. ౨, ఆ. — 2. సులభముగా. (చూ. చులుకన.)

చులుకఁజేయు. ద్వ. స. క్రి. (చులుక+చేయు.) లాఘవపఱుచు. 'ననుంజులుకఁజేసితి.'' భార. ద్రో. ౧, ఆ.

చులుకన. దే. వి. 1. లాఘవము; 2. సౌలభ్యము. "గీ. మనకుఁజులుకనయ్యెమనచేయుపనులుగం. ధర్వపరులుకూడితగనొనర్చిరి." భార. అర. ౫, ఆ.—విశ. 1. లఘువు; "క. చులుకనమఱితల్లిలేనిసుతుఁడుకుమారా." భో. ౬, ఆ.— 2. సులభము. (విశేషణమగుచో చులుకనిమాట.) (చూ. అలకన.

చులుకపాటు. ద్వ. వి. చులుకన. "ఉ. సమయంబు) తప్పినీ, పాలికివచ్చినన్ జులుకపాటొనరించెద వేరఘూత్తమున్." అధ్యా. కిష్కిం, కాం.

చుల్క. దే. ద్ర. క్రి. విశ. చులుకయొక్క రూపాంతరము. (లాఘవముగా అనుటకు.—"శా. కర్ణుం డున్ విజయుండునొండొరులఁజుల్కం దాఁకిచాపంబులా, కర్ణాంతంబగుచుండఁగాఁదిగిచియుగ్రక్రోధులై యేసిరి." భార. ఆది. ౭, ఆ.)

చుల్కన. దే. వి. చులుకనయొక్క రూపాంతరము

చుల్కపాటు. ద్వ. వి. చులుకపాటుయొక్క రూపాంతరము. "చ. కుసుమశరాసనుండధికకోమలపుష్పములేయునాఁగము, న్నె సఁగినచుల్కపాటుమది నేమియునూర్వఁగలేక." హరి. ఉ. ౮, ఆ.

చుల్ల. దే. వి. చుల్లియొక్క రూపాంతరము.

చుల్లజుండు. దే. వి. మొటిమవంటి చిన్న నెత్తురుగడ్డ.

చుల్లరము. దే. వి. కోడెవయసుగలపంది. "క. నరపతికనియరుదందఁగ, ధరఁ బ్రేవులుకుప్పవడఁగఁ దనుఁగొట్టినచు, ల్లరముకుతికకఱచుకతా, సరిచావుగఁజచ్చెనొక్కజాగిలమచటన్." చంద్రా. ౨, ఆ.

చుల్లి. దే. వి. మగగుఱి.

చువక. దే. వి. మెత్తని సన్నని నిడుపాటిచిన్న రెమ్మ.

చువ్వ. దే. వి. చువక.

చువ్వె. వై. ని. (చూడవు+ఎ.) చూడుమా, (రూ. చువ్వే.)

చూ.

చూ. వై. అవ్య. చూడుము, చూడుఁడు. "క. నీవా తనికినలిగినప్పుడ, చూ తెగియొక్." భార. కర్ణ. 3, ఆ. "మాయిరుపురు నీయొఱుకమల చెదరుసూపోయివత్తు." ప్రభా. 3, ఆ.

చూఁడి. దే. వి. చూలు, గర్భము. (ఉదా. చూఁడియావు, చూఁడిపంది. మొ.)

చూఁడు. దే. స. క్రి. కాల్చు. "క. వీఁడుమనలంకలోఁకన్, జూఁడినమర్కటము." జై. ౫, ఆ.—వి. వాఁత.

చూఁడుఁగోడుపు. దే. వి. (చూఁడు+కోడుపు.) పసరములకువాఁతవేసెడియినుపకోల. "గురుశ్వాసంహారకమైనచూఁడుఁగోడుపౌనిదిలంకకు." రామా. ౭, ఆ.

చూకురు. వై. వి. శోకము.

చూకురుపడు. వై. అ. క్రి. శోకించు. "క. అకపటరోదనమువిని, మూఁకలుగొనియింటిపొరుగుమదితలువడితో, నాకడకేగినదికడు, శోకింపఁగఁదానిఁజూచిచూకురుపడుచున్." బ్ర. (పుల్లయవిరచితము.) ౨, ఆ.

చూచాయ. వై. వి. (చూపు+చాయ.) 1. జాడ; 2. తేలిక.

చూచు. వై. స. క్రి. కనుఁగొను, వీక్షించు. వై. అ. క్రి. యత్నించు*. "చ. పదియగుదేయినిండుటయుఁ బజ్జిముఖుండు మనంబునన్ ముదం, బొదవఁగ నిర్వికారమున నున్న శిరంబును గోయఁజూచినన్." నిర్వ. 3, ఆ.

చూడికి. వై. వి. చూపు, వీక్షణము.

చూడ్కి. వై. వి. చూడికియొక్క రూపాంతరము.

చూపట్టు. ద్వ. అ. క్రి. (చూపు+పట్టు.) కనుపట్టు.

చూపరి. ద్వ. విశే. (చూపు+అరి.) చూడఁదగినవాఁడు, సౌందర్యవంతుఁడు.

చూపఱు. ద్వ. విశే. బ. (చూపు+వారు.) చూచువారు. "చూపఱునట్టోలుతాఁకు వెఱఁగుపడఁ జేసె." భార. కర్ణ. 3, ఆ.

చూపు. వై. ప్రే. చూపించు. వి. 1. చూడ్కి; "నిన్నుఁజూపుసదనుష్ఠానంబుగాదే." నిర్వ. ౭, ఆ.—2. దృష్టి. "చూపులుమిఱుమిట్లుగొనఁగ." భార. ద్రో. 3, ఆ.

చూపుగుట్టము. వై. విశే. పనికి ఉపయోగముకానివాఁడు. "ద్వి. నుకవాసిపనిపందచూపుగుట్టుబు." హరిశ్చ. ౨, భా. (రూ. చూపుడుగుట్టము.)

చూపుడుఁబూఁట. ద్వ. విశే. (చూపుడు+పూఁట.) చూపనొప్పకొన్న పూఁటకాఁపు. "క. చూపుడుఁబూఁటయతఁడుబుణిఁ, జూపవలయుఁజూపఁడేనిసొమ్మరునాఁదగున్, జూపకముండఁఱచ్చినఁ, జూపంబనిలేనువాని సుతసంతతికిన్." విజ్ఞా. వ్య, కాం.

చూపుడువ్రేలు. ద్వ. వి. జుట్టనవ్రేలు, ప్రదేశిని.

చూపెట్టు. ద్వ. స. క్రి. (చూపు+పెట్టు.) కనుపెట్టు, ప్రతీక్షించు.

చూపోపమి. ద్వ. వి. చూడసహింపమి.

చూపోవు. ద్వ. అ. క్రి. (చూపు+ఓపు.) చూడసహించు. "క. భూపాలుఁడుధనముగలుగుపురుషులసిరిదాఁ, జూపోపకకొనఁదగదు." భార. శాం. ౨, ఆ (ఇట్లు వ్యతిరేకమునందే దీనికి ప్రయోగములు కానఁబడుచున్నవి.)

చూరకత్తి. ద్వ. వి. చురకత్తియొక్క రూపాంతరము.

చూరి. వై. వి. చురియొక్క రూపాంతరము. "క. చూరితిమ్మవిభునిక, రాచూరిందెగినిరంతరమునమరమ్మృగీ, లోచనలమదనశాస్త్రా, లోచనలందివిలి వర్తిలుదురభియాతుల్." రామా. ౧. ఆ.

చూరియావు. దే. వి. (చూరి+ఆవు.) ఒకవిధమైన వన్నెగలయావు. (అప్ర.)

చూరి. వై. వి. చూరియొక్క రూపాంతరము.

చూరు. యు. దే. అ. క్రి. (పొగ) తగులు. వై. వి. 1. ఇంటిమీఁదికప్పుచివర, పలీకము; 2. ఏదేని యొకవస్తువుపొడి.

చూరుకమ్మి. వై. వి. పెండెలుజాతిరాకముంజూరు నందిత్తుగానమర్చినపట్టె.

చూరుకుట్టు. ద్వ. వి. ఇంటిమీఁదకప్పువేయునపుడు పూరిపఱచియాఁతమెల్లెలోనగువానిని పెండెవలె మీఁదవుంచికట్టుటకై నారతోఁకుట్టెడుకుట్టు.

చూరుకుట్టుదబ్బ. ద్వ. వి. చూరుకుట్టునకు నారగ్రుచ్చెడుదబ్బనమునంటికొయ్యదబ్బలోనగునది.

చూరుపట్టె. వై. వి. చూరుకమ్మి.

చూరుమొగ్గ. వై. వి. చూరుకమ్మియందు వాసమునకు సరిగా మొగ్గవలె నేర్పఱచినది. "తోరంపుమత్యాలచూరుమొగ్గలచేత." జై. ౫, ఆ.

చూరె. వై. ని. (చూడరు+ఎ.) చూడుఁడు. "సీ. భూతేశంబునఁజూరె ప్రజాపతుల్ బహువిధసృష్టినిర్వాహణనిపుణులైరి." భార. అశ్వ. ౨, ఆ. (రూ. చూరే. "క. భూతంబులదర్శింపమి, భూతస్పర్శనముభూతములతోడసంభా, షాతురతలనొందమి సూ, రేతెరువువిమోక్షసుఖగరిష్ఠతవడయన్." భార. శాం. ౩, ఆ.)

చూరెలుక. ద్వ. వి. ఒకదినుసుచిన్నయెలుక.

చూర్పు. దే. వి. ఇంటికప్పుక్రిందికప్పు.

చూఱ. వై. వి. కొల్ల*. "క. వేఱుగఁగనినంబ్రకృతికిఁ, జూఱవిడిచినట్లతఁడు సుజ్ఞానమునఁ, గ్రూరులువిడిచితనకంటెను, మీఁఱనొకటిలేమిగాన్పు మెయికొనవలయున్." భార. అను. ౪, ఆ.

చూఱకాఁడు. మి. గ్రా. విణ. కొల్లపెట్టినవాఁడు. "ఉ. అనవరతసుకవినికరస్తోత్రవచనరచనాసమయనిర్వికారుండును చెంచుమలచూఱకారుండును." వి, పు. ౧, ఆ. (ఇది బిరుదుపేరు. బిరుదుపేళ్లు లక్షణమునకు కట్టుపడియుండవు.)

చూఱకొను. ద్వ. స. క్రి. కొల్లపెట్టు. "క. సురగరుడోరగకిన్నర, పురములువడిఁజూఱకొనుచు." భార. ఆది ౮, ఆ.

చూఱకోలు. ద్వ. వి. చూఱకొనుట. "చ. రిపులనొంచియశంబిలనించిపుత్త్రుఁడై, క్కటిదివిచూఱకోల్ ప్రియముకాకిదియ ప్రియమేతలంపఁగాన్." భార. ద్రో. ౨, ఆ.



చూఱలాడు. ద్వ. స. క్రి. (చూఱలు+ఆడు.) చూఱకొను. "సీ. వీఁడచేయలయించి వ్రేతలమానంబుచూఱలాడినలోకసుందరుండు." భాగ. ౧౦, స్కం. పూ.

చూఱవోవు. ద్వ. అ. క్రి. (చూఱ+పోవు.) కొల్లపోవు. "గీ. చోరబాధాదికములచేఁ జూఱవోవు, ధనముధనమానియెన్నిచందములఁదలఁప." కాశీ. ౪, ఆ.

చూఱాడు. ద్వ. స. క్రి. (చూఱ+ఆడు.) కొల్లపెట్టు. "సీ. కమలినీకలికావికాసంబులెటిఁగిపైఁ జూఱాడుతేఁటిరాచూలుఁబోలె." ఉ, హరి. ౫, ఆ.

చూలాలు. దే. వి. (చూలు+ఆలు.) గర్భిణీస్త్రీ.

చూలి. దే. వి. పట్టి, బిడ్డ. "తమ్మికిఁజూలిలోకములతాత." హరి. పూ. ౧, ఆ.

చూలు. దే. వి. 1. గర్భము; "క. ఏదివసంబాదిగన, ట్లాదేవకితాల్చెగర్భమదియెమొగలుగా, మోదమునవందపత్నియ, శోదాదేవియునుఁలీలఁజూలుధరించెన్." హరి. పూ. ౫, ఆ.—2. బిడ్డ. "మాలిని. నలుమొగములచూలున్ నల్లనామేనిడాలున్." య. 3, ఆ.

చూలుకొను. దే. అ. క్రి. చూలుగలదియగు. "ఎ, గీ. నిద్రపోయిననుజూలుకొన్ననఁ బొర్లుచున్న." కాశీ. ౪, ఆ.

చూలుపడు. ద్వ. అ. క్రి. (చూలు+పడు.) చూలుకొను.

చూవె. ద్వ. ని. (చూడవు+ఎ.) చూడుము, (రూ. చూవే.)

చొ.

చొంగ. దే. వి. జొల్లు, లాల, పొగత్రాఁగుగొట్టము.

చొకా. వై. వి. చొక్కాయ. విణ. స్వచ్ఛమయినది. "జగాచొకాయలరుజాగామావటీలు." చంద్ర. (చొక్కాయొక్క రూపాంతరము. చూ. చొక్కా.)

చొకాటము. వై. విణ. చొక్కాటముయొక్క రూపాంతరము. "కారుమెఱుంగుగుంపులచొకాటపుమేనిమెఱుంగు." చంద్రా. ౨, ఆ. (చూ. చొక్కాటము.)

చొకాయ. వై. వి. చొక్కాయయొక్క రూపాంతరము.

చోకారము. వై. వి. మిక్కిలి స్వచ్ఛత. "సీ. చాననాఁ డెంపునుఁ జేమేనిచోకారంబు హేమాతిశయలీల సెగ్గులెన్ను." రసి. ౨, ఆ.—విశే. మిక్కిలి స్వచ్ఛమైనది. "సీ. రాకేందుముఖి చోకారంపువన్నెలకునుచేడియమురిపంపుఁజిన్నెలకును." రసి. 3, ఆ.

చోక్క. వై. విశే. వృత్తియందు చొక్కమునకు మీఁదివర్ణములోపింపఁగా మిగిలినరూపము. (ఉదా. చోక్కసగతులు. మొ.)

చోక్కటము. వై. విశే. స్వచ్ఛమైనది. "ఎ, గీ. పలుకుఁజెలిచోక్కటపుఁబాటపట్టిమాట." చంద్రా. ౧, ఆ.

చోక్కణ. దే. వి. శితలి?.

చోక్కతరము. వై. విశే. మిక్కిలి స్వచ్ఛము. "ఎ, గీ. చోక్కతరమైన వేగురుఁజుక్కవొడిచె." చంద్ర.

చోక్కము. వై. విశే. దోషములేనిది, స్వచ్ఛము. "క. నీచోక్కపుఁ గొడుకునుసీవును, నొక్కతలైస్రుక్కమానియుండుఁడు నెమ్మిన్." హరి. పూ. ౫, ఆ. (వృత్తియందు హల్లుపరమగుచో అంత్యవర్ణము వికల్పముగా లోపించును.)

చోక్కా. వై. వి. చోక్కాయ. విశే. వృత్తియందు చోక్కాటమునకు మీఁదివర్ణములు లోపింపఁగా మిగిలినరూపము. (ఉదా. చోక్కాపొత్తెము. మొ.)

చోక్కాకు. ద్వ. వి. (చొక్కు+ఆకు.) ఎండిన ఆకు. శుష్కపత్రము.

చోక్కాటము. వై. విశే. మిక్కిలి స్వచ్ఛమైనది. "మ. బలుకెంపుంజిగికెంపురా మొగసరిన్ బల్ టెక్కడాల్ పచ్చని, చ్ఛలపుంబట్టు మెఱుంగుపల్లమున సెంచన్ మించుబల్వన్నెత్రొం, దఱుకుంగంతపురేక పెన్ సరిపెనన్ బాగైనచోక్కాటపుం, బలుకుందత్తడి నెక్కిదర్పకుఁడు దర్పంబేర్పడన్ దాఁకినన్." చంద్రా. 3, ఆ. (వృత్తియందుఅంత్యోపాంత్యవర్ణములకు లోపము.)

చోక్కాయ. వై. వి. అంగరేకు.

చోక్కారము. వై. వి. మిక్కిలి స్వచ్ఛత. (చూ. చోకారము.) విశే. మిక్కిలి స్వచ్ఛమైనది. "చోక్కారపువల్పపావడలుగట్టి." షో. ౮, ఆ.

చోక్కిడు. దే. స. క్రి. (చొక్కు+ఇడు.) మోసపుచ్చు. "చ. ముచ్చుగతివధూటిఁదోడుకొనుచున్ బ్రజఁజొక్కిడిపోయెఁజూచితే." విక్ర. ౭, ఆ.

చోక్కిలి. దే. వి. చొట్ట. (చూ. చొక్కిళ్లుపోవు.)

చోక్కిళ్లుపోవు. దే. అ. క్రి. (చొక్కిళ్లు+పోవు.) చొట్టపడు. "సీ. కదిసిమైగందంగఁగొఁగిటఁగియింపఁజొక్కిళ్లుపోయిన సొమ్ముతోడ." య. ౨, ఆ.

చోక్కు. యు. దే. అ. క్రి. పరవశమగు. "క. సుతికి మధుసేవఁ దనువుచొక్కఁగఁజొచ్చెన్." కవిక. ४, ఆ.—వి. 1. పారవశ్యము; "క. అసిజముఖుఁడుచొక్కునఁ, దనువెఱుఁగకపలుకుచుండ." రుక్మా. 3, ఆ.—2. చొక్కుపొడి; "గీ. గొల్లపల్లియలోనున్న గొల్లవారు, చొక్కుఁ జల్లఁ గైపడి సొక్కఁడైన, మేలుకొనకనిద్రింప." గి పు. ౭ ఆ. 3. మూర్ఛ; "గీ. ఎల్లవారునెఱుఁగ లెడఁటిచోక్కొక్కని, ద్రాతిశయముననురక్తు లైరి." భార. విరా. ౫, ఆ.—4. మోహము. "ఉ. అక్కటనీ దెసంబతికినాఁడుదికూర్మియయ్యెనాయపుం, జొక్కులునీవు నిక్కముగఁజూచి మనంబునమోసపోయితి." భార. ఆర. ౬, ఆ.—వై. విశే. ఎండినది. (చోక్కాకు.)

చోక్కునీరు. ద్వ. వి. కల్లు, మద్యము "క. అడఁకిత్రేలిమిపసరము, బడిఁజనరక్కసులెఱిఁగిపట్టుకొనికచున్, పడిబూదిచేసితనకున్. వోడఁడఁగాఁజొక్కునీటితో నిచ్చిరొగిన్." య. 3. ఆ.

చోక్కుపెట్టు. దే. స. క్రి. చొక్కించు. "ఉ. అమ్మయలాఁడియక్కుమారునిఁజొక్కుపెట్టితెచ్చి.. లంపునంజని." వి, పు. ౮, ఆ.

చోక్కుపొడి. దే. వి. మీఁదఁజల్లినచో పరవశముఁ జేయు భస్మవిశేషము.

చోక్కుమందు. దే. వి. చొక్కుపొడి. "గీ. చొ.. మందులనఁగ సోయగంబులగను. లనఁగ నుథ.. నిక్కలనఁగఁజాలి, యనుపమానమూర్తులైయుల్లు.. ల్లుదురంబుజాయతాక్షులప్పురమున." లక్ష్మీ. ౧ ఆ.

చోగా. వై. వి. చోక్కాయ.

చొచ్చిల్లు. దే. అ. క్రి. చొచ్చు. (రూ. చొచ్చిలు. "క. ముచ్చులు తెక్కలికాండ్రుం, జొచ్చిల్లనొప్పింతురెపుడు జూదపుసభలందు." విజ్ఞా. ప్రా. కాం.)

చొచ్చు. దే. అ. క్రి. చొరఁబడు, ప్రవేశించు. (సుదతికిమధుసేవఁదనువుసొక్కఁగఁజొచ్చెన్." ఇత్యాదులయందు చొచ్చెన్ అనఁగా ఆరంభించెననియర్థము.)

చొటచొట. దే. వి. కాఱుట పడియుటలోనగువాని యందగుధ్వన్యనుకరణము. "చొటచొటఁగన్నీ రుఁగాఱఁగ." భో. ౫, ఆ.

చొట్ట. దే. వి. 1. చెంబులోనగునవి క్రిందఁబడుటలో నగువానిచేనగునొక్కు; 2 దేహమునందు వ్యా ధిమొదలగువానిచేతఁ గలిగినపల్లము (లేక) వం కర. విణ. వ్యాధిమొదలగువానిచేత వంకరైనది. "ప్రకంపమునకుఁగేలుచొట్ట." రసి. ౧, ఆ. (ఇది యిట్లు పరుషాదిగానును గ్రాంతయందును వాడు కయందును గానఁబడుచున్నది.)

చొడచొడ దే. వి. చిప్పిల్లుటయందగుధ్వన్యనుకరణ ము. "చ. అడిదపుఁ బ్రేటునన్ బఱియలైనశరీరము నందు నెత్తురుల్, చొడచొడఁ గ్రమ్మ" హరి. ఉ. ౪. ఆ.

చొత్తెంచు. దే. అ. క్రి. (చొచ్చు+తెంచు.) చొ చ్చి ప్రవేశించు. (స్వార్థమున తెంచు.)

చొను. దే. వి. చెమ్మ, తడి. "స్రగ్ధర. హస్తీంద్ర హస్తాంచితపమధులజేజేలపెంద్రోవలెల్లన్ జొ దుగొందన్." ఉ, రా. ౪, ఆ.

చొనుము. దే. వి. ఎండిన అరఁటిపట్ట.

చొనుపు. దే. ప్రే. చొరఁజేయు, చొప్పించు.

చొన్పు. దే. ప్రే. చొనుపుయొక్కరూపాంతరము.

చొప్ప. దే. వి. జొన్నలోనగువానిదంటు.

చొప్పకాఁడు. దే. వి. రెండెడ్లనుకట్టితోలెడుదిండు పాటి చొప్పమోపు.

చొప్పడు. ద్వ. అ. క్రి. (చొప్పు+పడు.) 1. సరిపడు; 2. కలుగు; "ఉ. పేరుక్కునఁబోరన్ సుగతియొండె జయంబునునొండెఁజొప్పడున్." భార. శల్య. ౧, ఆ.—౩. దొరకు. "గీ. ఆఁకటను నీరువట్టున నగ్గలంపు, డప్పిఁ బులుఁగును నొకచోటఁజొప్ప డమిని, దొంటిపగను నెట్టనఁగిరాతుండువోలెఁ, జంపియగ్గోవురక్తమాంసములుఁ గొనియె." హరి. పూ. ౭, ఆ.

చొప్పరి. దే. విణ. (చొప్పు+అరి.) త్రోవతెలిసి నవాఁడు, మార్గజ్ఞుఁడు.

చొప్పరించు. దే. ప్రే. చొప్పఱచుయొక్కరూపాం తరము.

చొప్పఱచు. దే. ప్రే. చొప్పడఁజేయు. (చూ. చొ ప్పడు.)

చొప్పించు. దే. ప్రే. చొరఁజేయు.

చొప్పిల్లు. దే. అ. క్రి. చొప్పడు, తగు.

చొప్పు. దే. వి. 1. జాడ; 2. మార్గము; ౩. విధము.

చొబలము. దే. వి. గుఱ్ఱముగర్భమందుండుపిండము.

చొరఁబడు. ద్వ. అ. క్రి. (చొరన్+పడు.) చొచ్చు. (స్వార్థమున పడు.)

చొరఁబాఱు. దే. అ. క్రి. (చొరన్+పాఱు.) చొ రఁబడు.

చొరపోఁత. దే. విణ. (చొరవ+పోఁత.) ఎడములే నిది, నిరంతరము. (వానికి అమ్మవారు చొరపోఁ తగాపోసినది.)

చొరవ. దే. వి. 1. ప్రవేశము; "వ. కలియుగంబు చొరవయాసన్నంబయ్యె." భార. శల్య. ౭, ఆ.— 2. బుద్ధికుశలత; 3. అన్నముమీఁదియిచ్ఛ. "వ. ముట్టంబడిన రోగంబునుంబోలెఁ జొరవలేక." కవిక. ౪, ఆ.

చొరవకత్తియ. ద్వ. విణ. చొరవగలది. (రూ. చొర వకత్తె.)

చొరవకాఁడు. దే. విణ. చొరవకలవాఁడు.

చొరుగు. దే. వి. చొక్కాకు. "క. సురగాలింబడి నచొప్పచొరుగునుబోలెన్." జై. ౫, ఆ.

చొరువు. దే. వి. చొరుగుయొక్కరూపాంతరము.

చోఱ దే. వి. మత్స్యవిశేషము. "అబ్ధిఁబెంజోఱద ఱియంగఁ జొచ్చుగతి చొప్పడ వానరసేనఁజొ చ్చి." రా. యు, కాం.—విణ. బాలుఁడు. "ద్వి. చోఱనీకుఁజోరరాదుచోరఁగనుద్వృత్తి, కోఱ గాదు." రా. సుం, కాం.

చోఱచోఱ. దే. వి. 1. పడియుటయందగుధ్వన్యనుక రణము; "క. నెఱకులుదాఁకిననమ్ములు, చోఱ చోఱనెత్తురులుపడియ శోభిల్లిరి వా, రెఱసంజ మీఁదఁబర్వఁగ, గుఱియైయొప్పారుక్రొత్తకుధర ములక్రియన్." హరి. ఉ. ౧౦, ఆ.—2. జొ బ్బిలుటయందగుధ్వన్యనుకరణము. "చోఱచో ఱదుర్విషానలము జొబ్బిలుచుండఁగ." భాగ. ౧౦, స్కం. పూ.

చోఱిగాఁడు. దే. వి. బోయ, వ్యాధుఁడు. "వ. పి ఱుందఱొప్పుచోఱిగాఱకుఁగాక వెఱచఱచిప ఱచునెడఁ దెఱపినుఱికిన తొఱుద్రొక్కనంగు క్కలచేఁబఱిపఱియైనయుఱుములును." ఉ, హ రి. ౪, ఆ.

చోలయు. దే. అ. క్రి. 1. మూర్ఛపోవు; 2. పెడ దీయు; 3. వైముఖ్యమునొందు; 4. వైరస్యము

నొందు. (చూ. సొలయు.) (ప్రాఁతప్రతుల యందిట్లు పరుషాదిగాఁ గనఁబడుచున్నది.)

**చోల్లు.** దే. వి. జొల్లు. (ఇట్లు పరుషాదిగా కొన్ని చోట్ల వాడుక.)

**చోల్లియము.** దే. వి. జడతో చుట్టినచుట్ట. "సీ. జడ లల్లిచొల్లియంబిడియొకసకెముగా బాలేందుశక లంబుపదిలపఱుచు." కాశీ. ౨, ఆ.

**చోల్లెము.** దే. వి. చొల్లియముయొక్క రూపాంతరము. "చ. జడలుముడంచిచొల్లెముగసన్నపుఁబాగనడంగఁజుట్టి." స్వా. ౪, ఆ.

## చో.

**చోట్.** దే. వి. అచ్చోటట్, ఇచ్చోటట్, కానిచోటట్, లేనిచోటట్ ఇత్యాదిసమాసపదముల యందు ఉత్తరపదమైనచోటు శబ్దముయొక్క సప్తమీ విభక్తిరూపమునందు టవర్ణము లోపింపఁగా మిగిలినది. (ఉదా. అచ్చోట్, ఇచ్చోట్, కానిచోట్, లేనిచోట్. మొ.) (ఇది కొన్ని యెడల అప్పుడు అనునర్థమునిచ్చుచున్నది. "ప్రాణహానితప్పించుచో." ఇత్యాదులు.)

**చోటు.** దే. వి. తావు, ప్రదేశము.

**చోడి.** దే. వి. సస్యవిశేషము. బ. ధాన్యవిశేషము. (చోళ్లు.)

**చోడు.** దే. వి. సోడు, బ్రహ్మరంధ్రము. "చ. దల మగుపచ్చకప్పురపుఁదావులు పైఁబయిఁ జోడు ముట్ట." విక్ర. ౧, ఆ. (ఇది తఱచుగ సకారాదిగానే వాడఁబడుచున్నది.)

**చోడుమ.** దే. వి. చోద, కష్టము.

**చోద.** దే. వి.——పై.——

**చోపు.** వై. స. క్రి. 1. కలఁచు; 2. త్రోలు*; "ఎ మ్మెయిఁ జోపినఁ బోవక మూఁగెడుఁ బక్షితతుల్." భార. స్త్రీ. ౨, ఆ.—3. తఱుము*. "ద్వి. సమ్మదంబుగఁజోపిజయ మొందుఁగాక." భాగ. ౧౦, స్క. ౦.—వి. కలఁత. "పోఁగువాతెంచిగొబ్బునఁజోపువెట్టించి." రామా. ౨, ఆ.

**చోపుడు.** వై. వి. కలఁత. "గీ. కలయఁజోపుడు వెట్టింపఁగరియుఁగిరియుఁ, గాసరముఁగేసరియుదుప్పి కడితిరొలుఁగుఁ, బులియు మొదలగు మెకములు కలఁకఁదొలఁకఁ, జెదరినలుదిక్కులకుఁబాఱెనదవిచెదరి." ఉ, రా. ౨, ఆ.

**చోపుడుఁగోల.** ద్వ. వి. (చోపుడు+కోల.) చోపు పెట్టుకోల "వ. అత్తఱిందత్తఱంబున మొత్తంబై చోపుడుఁగోలలుగొనికెలంకులపాలంబులఁబులుఁగులంజోపుచు." స్వా. ౪, ఆ. (ఇట్లు చోపుడు గట్టె.)

**చోపుదారుఁడు.** హిం. వి. వేత్రధరుఁడు.

**చోఱ.** దే. వి. మత్స్యవిశేషము. "సీ. చోఱనైనా రాశిఁదూఁటిచోరునిజీరిమీరుచారు విహారమేఁ గొనుము." ఉ, రా. ౫, ఆ.—విణ. బాలుఁడు.

**చోఱబుడుత.** దే. వి. 1. చోఱమీనుపిల్ల; 2. చేఁపంటికన్నులుగలయాఁడుది. "సీ. అనిమిషాక్షిను నుంగునాటలాడెదవేమె పడఁతుక నేఁ జోఱబుడుతఁగానె." చంద్ర.

**చోఱవాఁడు.** దే. విణ. బాలుఁడు. "సీ. అడపబు చోఱవాఁడెడవాయ కెడనెడమడిచినతెలనాకు మడుపులొసఁగ." ఉ, రా. ౭, ఆ.

**చోలా.** వై. వి. చొక్కాయ. (అప్ర.)

**చోవి.** దే. వి. బూరెలమీఁదమూఁతగాపెట్టెడుపిండి.

**చోళ్లు.** దే. వి. బ. (చోడి+లు.) ఒకతిను తివిఁదలు. "క. ఉలవలు కందులు కోద్రవములు కంబులు రాజమాషములు నవుములు చోళ్లును తవిదలు నూఁదగలును, గలవనియుడఁజనదు పైతృకమ్మునధిపా." వి, పు. ౪, ఆ.

## చౌ.

**చౌ.** వై. స నాలుగు. (చవుయొక్క రూపాంతరము.) విణ. వృత్తియందుచౌకమునకుమీఁదివర్ణములు లోపింపఁగామిగిలినరూపము. (చౌడోలు. మొ.)

**చౌక.** దే. విణ. 1. అగ్గువ; 2. తక్కువ. "ఎ. గీ. నాటిప్రియము, చౌకయైనట్టియిచ్చుటఁజనదు నిలువ." ఆము. ౫, ఆ. (చవుకయొక్క రూపాంతరము.)

**చౌకటులు.** ద్వ. వి. బ. చౌకట్టులయొక్క రూపాంతరము. (పోఁగులకు.—"సీ. బలుముత్తియపుఁజౌకటులడాలునిద్దంపుబవిరిగడ్డముమీఁదఁజవుకళింప." నీలా. ౨, ఆ.) (మొదటిరూపము చవుకటులు.)

**చౌకట్టులు.** ద్వ. వి. 1. నాలుగుముత్యములు చేర్చికట్టిన పోఁగులు; (చవుకట్టులయొక్క రూపాంతరము. "లయగ్రాహి. బంగరుపుఁజెక్కులఁజెలంగుచవకట్టుల మెఱుంగుబలుచుక్కలపయింగినిసిజంగల్ చెంగునఁగొనన్." రా, వి. ౨, ఆ.)—2. దోరణ

పుఁబట్టెమీఁద కపిలెబిల్లకు ఆధారముగా ఇరుప్రక్కలనమర్చెడుగుజ్జులు. 3. చేట్టము.

చౌకము. వై. వి. 1. చదరము*, 2. నిచుపు వెడల్పులుసరిగాఁగలతుండుగుడ్డ*; 3. అశ్వగతివిశేషము*. "చ. జవమునభంజళిన్ మురళిఁజౌకమునన్ నడినైదుధారలన్." రా. బాల. కాం.—స. నాలుగు. "ద్వి. అడిగినధనముఁ జయ్యనఁ జౌకమెన్ని." (చౌకమెన్ని అనఁగా చౌకముగా ఎన్ని యనియర్థము. రూపాయలు నాలుగేసిగా ఎంచుటవాడుక.) హరిశ్చ. ౨, భా. (చవుకముయొక్కరూపాంతరము.)

చౌకసేయు. దే. స. క్రి. (చౌక+చేయు.) తక్కువపఱచు. "గీ. పౌరసతులసరసభాషామృతంబుల, సోనలితనిచెవులసోఁకనేని, గొల్లసతులతోడికూరిమితలపోసి, యితఁడుచౌకసేయకేలమాను." వి పు. ౭. ఆ. (చవుకసేయుయొక్కరూపాంతరము.)

చౌకళి. ద్వ. వి. (చౌ+కాళ్లు.) ఆఁడువారికోకలనేఁతయందు నూలిపోఁగులచేత నేర్పడిన చచ్చౌకపుటిల్లు. "చ. సుపాణులచౌకాటపుఁజౌకళి కట్టుపట్టముల్, గడుఁబ్రియమొప్పనిచ్చికుతుకస్థితి నవ్వుసుమంతునప్పుడ, య్యెడయఁడుపంప." శుక. ౧, ఆ. (చవుకళియొక్కరూపాంతరము.)

చౌకళించు. ద్వ. అ. క్రి. (చౌకళి+ఇంచు.) నాలుగు కాళ్లుపైకెత్తిదాఁటు. "క. అనగరువెడలియొకకే, తనగకూటాగ్రమెక్కిలీలాగతిసం. ధానమునఁజౌకళించెన్, వానరవీరుండశోకవనిలోపలికిన్." రామా. ౬, ఆ. (చవుకళించుయొక్కరూపాంతరము. "ఎ, గీ. చెవులరుద్రాక్షపోఁగులు చవుకళింప." స్వా. ౧, ఆ.)

చౌకళింత. ద్వ. వి. 1. చౌకళించుట; 2. అశ్వగతివిశేషము, (చూ.) వల్గితము. (చవుకళింతయొక్కరూపాంతరము.)

చౌకాఁడిగుదియ. ద్వ. వి. నాలుగుపక్కలుతీరిన యినుపదండము. "చౌకాఁడిగుదియలమోఁదిన." కపిక. ౨. ఆ. (చవుకాఁడిగుదియయొక్కరూపాంతరము.)

చౌకారము. వై. వి. సబ్బు. (చవుకారముయొక్కరూపాంతరము.)

చౌకాలిపీఁట. ద్వ. వి. నాలుగుకాళ్లుగల యెత్తుపీఁట. (చవుకాలిపీఁటయొక్కరూపాంతరము.)

చౌకీ. వై. వి. సుంకరిమెట్టు*. (చవుకీయొక్కరూపాంతరము.)

చౌకు. దే. వి. చేఱుకోల, కశ. (చవుకుయొక్కరూపాంతరము.)

చౌకుచెట్టు. దే. వి. ఒకానొక విదేశవృక్షము.

చౌగంటి. ద్వ. వి. (చౌ+కంటి.) 1. అగ్నిదేవుఁడు; 2. శరభమృగము. (చవుగంటియొక్కరూపాంతరము.)

చౌటుప్పు. దే. వి. (చౌటి+ఉప్పు.) రౌమకము. (చవుటుప్పుయొక్కరూపాంతరము.)

చౌడు. దే. వి. 1. చౌటినేల; 2. చౌటిమన్ను. (చవుడుయొక్కరూపాంతరము.)

చౌడోలు. ద్వ. వి. (చౌ+డోలి.) ఏనుఁగువీఁపుమీఁద కూర్చుండుటకమర్చినతొట్టి. (చవుడోలుయొక్క రూపాంతరము.)

చౌతా. వై. వి. డోలి. (చవుతాయొక్కరూపాంతరము.)

చౌతి. వై. వి. పక్షమందు నాలుగవతిథి. (చవుతియొక్కరూపాంతరము.)

చౌతు. దే. వి. ఒకవిధమైనకుళ్లాయి. "సీ. బూదిబ్రుంగిన మొగంబునగౌదకట్టుమైనపుమైలప్రాఁజౌతునాఁగలుఁగ." ఆము. ౬, ఆ. (చవుతుయొక్కరూపాంతరము.)

చౌదంతి. వై. వి. ఇంద్రుని యేనుఁగు. (చవుదంతియొక్కరూపాంతరము.)

చౌదరి. వై. వి. గ్రామమునకైనను పరగణాకైనను పెత్తనకాఁడగుకాఁపు*. (చవుదరియొక్క రూపాంతరము.)

చౌపదము. వై. వి. నాలుగుమూలలు*. "సీ. దంతిదంతమ్ములాతముగఁద్రిప్పుచునాడుఁజౌపదమ్ములకఁబిశాచమొకటి." జై. ౫, ఆ. (చవుపదముయొక్కరూపాంతరము.) (ఈ యర్థమింకను విచార్యము.)

చౌపుటము. వై. వి. (చౌ + పుటము.) నాలుగు కాళ్లుపైకెత్తి దాఁటెడుదాఁటు. "సీ. తేళ్లభంగి నిజౌకళించిచౌపుటములొక్కుమ్మడి పదునైదుసుటికియుఁటికి." అని. ౪, ఆ. (చౌకళించి అనియుండుటచే ఇక్కడ దాఁటుమాత్రమర్థము (చవుపుటముయొక్కరూపాంతరము.)

చౌరు. దే. వి. తీపుతోకలసిన యించుకఉప్పు. (చవురుయొక్కరూపాంతరము.)

**చౌలు.** వై. వి. బ. ముత్తైపుకాంతి*. విజ. ౧, అ. (చవులుయొక్క రూపాంతరము.)

**చౌషష్టి.** వై. గ్రా. స. అఱువదినాలుగు. "ఎ, గీ. ఖగములగములు చవుషష్టికళలుఁగళలు." రుక్మాం. ౫, అ.) చవుషష్టియొక్క రూపాంతరము.)

**చౌసాల.** వై. వి. చుట్టుకొల్లారు. (చవుసాలయొక్క రూపాంతరము.)

**చౌసీతి.** వై. స. ఎనుబదినాలుగు. (చౌసీతిబంధములు.) (చవుసీతియొక్క రూపాంతరము.)

## ఛ.

**ఛ.** ఒకయక్షరము.

**ఛందము.** సం. వి. అ. పుం. 1. అభిప్రాయము; 2. వశము.

**ఛందస్సు.** సం. వి. స్. న. 1. పద్యలక్షణముచెప్పెడుశాస్త్రము; (ఛందస్సులు ఇరువదియాఱు.—ఉక్త, అత్యుక్త, మధ్య, ప్రతిష్ఠ, సుప్రతిష్ఠ, గాయత్రి, ఉష్ణిక్కు, అనుష్టుప్పు, బృహతి, పఙ్క్తి, త్రిష్టుప్పు, జగతి, అతిజగతి, శక్వరి, అతిశక్వరి, అష్టి, అత్యష్టి, ధృతి, అతిధృతి, కృతి, ప్రకృతి, ఆకృతి, వికృతి, సంకృతి, అభికృతి, ఉత్కృతి.) 2. వేదము; 3. యథేచ్ఛమైననడవడిక; 4. ఇచ్ఛ.

**ఛగల.** సం. వి. ఆ. స్త్రీ. బొద్ది?. అ. న. ము. నీలి రోక. పుం. 1. మేఁకపోతు; 2. పిడకనిప్పు.

**ఛట.** సం. వి. ఆ. స్త్రీ. 1. గుంపు; 2. వరుస.

**ఛడాయించుట.** గ్రా. క్రి. ఎచ్చుచేయుట.

**ఛడి.** హిం. వి. చువ్వ, బెత్తము.

**ఛత్ర.** సం. వి. ఆ. స్త్రీ. 1. గుడ్డికామంచి?; 2. అడవిసదాప?; 3. కొత్తిమిరి?; 4. పుట్టగొడుగు. అ. న. ము. గొడుగు. (తృణచ్ఛత్రము కావారి.)

**ఛత్రభంగము.** సం. వి. అ. పుం. 1. రాజ్యనాశము; 2. స్వాతంత్ర్యము; 3. ముండమోపితనము.

**ఛత్రాకము.** సం. వి. అ. న. పుట్టగొడుగు.

**ఛత్రాకి.** సం. వి. ఈ. స్త్రీ. సర్పాక్షి?.

**ఛత్రాతిఛత్రము.** సం. వి. అ. పుం. గడ్డిదుబ్బు.

**ఛదనము.** సం. వి. అ. న. 1. ఆకు; 2. ఈఁక; 3. ఱెక్క; 4. కప్పు.

**ఛదము.** సం. వి. అ. పుం. 1. ఆకు; 2. ఈఁక; 3. ఱెక్క; 4. గండివనము?; 5. చీకటిమ్రాను.

**ఛది.** సం. వి. స్. న. ఇంటికప్పు, పటలము.

**ఛద్మము.** సం. వి. న్. న. 1. నెపము; 2. మోసము.

**ఛన్నము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఏకాంతము; 2. కప్పఁబడినది.

**ఛర్దనము.** సం. వి. అ. న. వమనము. పుం. వేము?.

**ఛర్ది.** సం. వి. ఇ. స్త్రీ. ఛర్దనము, వమనము.

**ఛలము.** సం. వి. అ. న. 1. నెపము; 2. వెనుదీయుట; 3. ఒక యభిప్రాయముతో చెప్పినపదమునకు మఱియొక యభిప్రాయముచేసికొని యుత్తరము చెప్పుట. (ఇది వాదదోషములలో నొకటి.)

**ఛవి.** సం. వి. ఇ. స్త్రీ. 1. కాంతి; 2. కిరణము.

## ఛా.

**ఛాందసుఁడు.** సం. వి. అ. పుం. వేదముచదివినవాఁడు, శ్రోత్రియుఁడు.

**ఛాందోగ్యము.** సం. వి. అ. న. ఒకానొకఉపనిషత్తు.

**ఛాగము.** సం. వి. అ. పుం. మేఁకపోతు, అజము.

**ఛాగి.** సం. వి. ఈ. స్త్రీ. మేఁక, అజ.

**ఛాతము.** సం. విశే. (అ. ఆ. అ.) నఱకఁబడినది, ఛిన్నము.

**ఛాత్రము.** సం. వి. అ. న. పెద్ద తేనెతెట్టె.

**ఛాత్రుఁడు.** సం. వి. అ. పుం. శిష్యుఁడు, చట్టు.

**ఛాదనము.** సం. వి. అ. న. కప్పుట, ఛదనము.

**ఛాదితము.** సం. విశే. (అ. ఆ. అ.) కప్పఁబడినది, ఛన్నము.

**ఛాయ.** సం. వి. ఆ. స్త్రీ. 1. నీడ; 2. కాంతి; 3. శోభ; 4. వర్ణము; 5. ప్రతిబింబము; 6. సూర్యునిభార్య; 7. రక్షణము; 8. లంచము; 9. వరుస; 10. ఇంచుక. (కాంతిశోభలకు భేదము అలంకారగ్రంథమునందు చూచునది.)

**ఛాయాకరుఁడు.** సం. వి. అ. పుం. గొడుగుపట్టువాఁడు. విశే. నీడనుగలుగఁజేయువాఁడు.

**ఛాయాతరువు.** సం. వి. ఉ. పుం. నీడచేతనే మిక్కిలి ఉపయోగకరముగానుండెడు పెద్దచెట్టు.

**ఛాయాపుత్రుఁడు.** సం. వి. అ. పుం. శని, చాయపట్టి.

## ఛి.

**ఛిద.** సం. వి. ఆ. స్త్రీ. ఛేదము, నఱకుడు.

**ఛిదురము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. ఛేదించునది; 2. భాగించునది.

**ఛిద్రము.** సం. వి. అ. న. 1. బెజ్జము; 2. తప్పు.

**ఛిద్రితము.** సం. విశే. (అ. ఆ. అ.) బెజ్జము వేయఁబడినది, విద్ధము.

ఛిన్న. సం. వి. ఆ. స్త్రీ. తిప్పతీఁగ. విణ. ఛేదింపఁబడినది.
ఛిన్నరుహా. సం. వి. ఆ. స్త్రీ. తిప్పతీఁగ.

ఛు.

ఛురిక. సం. వి. ఆ. స్త్రీ. చురకత్తి. శస్త్రి.
ఛుల్లి. సం. వి. ఈ. స్త్రీ. చుల్లి, ప్రొయ్యి.

ఛే.

ఛేకము. సం. వి. అ. పుం. పెంపుడుమృగము (లేక) పెంపుడుపక్షి. విణ. నాగరికము.
ఛేకానుప్రాసము. సం. వి. అ. పుం. రెండేసిన్యం జనాక్షరములుజతజతగావెడనెడఁ జెప్పఁబడు అనుప్రాసభేదము. "పంచచామరము. స్ఫురత్కృపా బల ప్రతాప భూతి ధైర్య భూధరా. ...క దాన బుద్ధివైఖరీ హరీ హరీ సుధా, ...హారా హారా గిరీ గిరీ మహా... లలీ ...లలీ ...మా. గురూ గురూ జయింతువౌఁదగూ న్నృ ...హభూవరా." కా. ౪, ఆ.
ఛేత్తృ. సం. విణ. (ఋ. ఈ. ఋ.) ఛేదించువాఁడు.
ఛేత్తవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ఛేదింపఁదగినది.
ఛేదనము. సం. వి. అ. న. 1. ఛేదించుట; 2. భేదము.
ఛేదము. సం. వి. అ. పుం. 1. నఱకుడు; 2. తునుక; 3. భిన్నాంకమునందు క్రిందిసంఖ్య.
ఛేదించే. సం. స. క్రి. 1. నఱకు; 2. త్రుంచు.
ఛేదితము. సం. విణ. (అ. ఆ. అ.) ఛేదింపఁబడినది.
ఛేదితవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ఛేదింపఁదగినది.
ఛేద్యము. సం. విణ. (అ. ఆ. అ.) ——పై.——

ఛో.

ఛోటిక. సం. వి. ఆ. స్త్రీ. చిటిక.

జ.

జ. ఒకయక్షరము.
జంగమము. సం. విణ. (అ. ఆ. అ.) తిరుగునది, చరిష్ణువు.
జంగముఁడు. సం. వి. అ. పుం. జంగమువాఁడు.
జంగలము. సం. వి. అ. పుం, న. మాంసము. విణ. జనములేనిది. (చోటు.)
జంఘ. సం. వి. ఆ. స్త్రీ. పిట్టికాలివెనుకటిభాగము, పిక్క.
జంఘాకరికుఁడు. సం. వి. అ. పుం. నూరముగ సమాచారము తీసికొనిపోయి వచ్చిచెప్పి జీవించువాఁడు. పరుగెత్తువాఁడు. (అని కొందఱు.)

జంఘాలుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి వడిగనడచువాఁడు.
జండా. హిం. వి. టెక్కెము, ధ్వజము.
జంతుఫలము. సం. వి. అ. పుం. మేడి.
జంతువు. సం. వి. ఉ. పుం. ప్రాణముకలది, చేతనము.
జంతె. దే. వి. కలుఁపుపోవునట్లు దున్ను పనిముట్టు, దంతె.
జంత్రము. సం. వి. అ. న. యంత్రము. "సీ. రహివుట్టజంత్రగాత్రములతాల్ గరఁగించు విమలగాంధర్వంబువిద్యమాకు." స్వా. ౨, ఆ.
జంపతులు. సం. వి. ఇ. పుం. ద్వి. ఆలుమగలు, దంపతులు.
జంబాలము. సం. వి. అ. పుం. 1. అడుసు; 2. పాఁచి.
జంబీరము. సం. వి. అ. పుం. 1. నిమ్మ; 2. మరువము. (రూ. జంభీరము.)
జంబుకము. సం. వి. అ. పుం. నక్క, ఫేరవము.
జంబుకుఁడు. సం. వి. అ. పుం. 1. వరుణుఁడు; 2. నీచుఁడు.
జంబువు. సం. వి. ఊ. స్త్రీ. ఉ. న. నేరేడుపండు. ఊ. స్త్రీ. 1. నేరేడుచెట్టు; 2. నేరేడుదీవి; 3. నేరేటేఱు.
జంభభేది. సం. వి. న్. పుం. ఇంద్రుఁడు, వేల్పుఱేఁడు.
జంభము. సం. వి. అ. పుం. 1. నిమ్మ; 2. పల్లు; 3. తిండి. డు. ఒకానొకరాక్షసుఁడు.
జంభలము. సం. వి. అ. పుం. నిమ్మ. డు. జినదేవుఁడు.
జంభారి. సం. వి. ఇ. పుం. 1. ఇంద్రుఁడు; 2. వజ్రాయుధము.
జగచ్చక్షువు. సం. వి. స్. పుం. సూర్యుఁడు, జగముకన్ను.
జగతి. సం. వి. ఈ. స్త్రీ. 1. లోకము; 2. జనము; 3. భూమి; 4. ఒక ఛందస్సు. (చూ. ఛందస్సు.)
జగత్తు. సం. వి. త్, న. జగము. పుం. గాలి. విణ. తిరుగునది.
జగత్ప్రాణుఁడు. సం. వి. అ. పుం. వాయువు, గాలి.
జగము. సం. వి. త్. న. జగత్తుయొక్క రూపాంతరము.
జగలము. సం. వి. అ. పుం. 1. మంగ; 2. మద్యపిష్టము. విణ. మోసకాఁడు.
జగ్ధము. సం. విణ. (అ. ఆ. అ.) తినఁబడినది, భక్షితము.

జగ్ధి. సం. వి. ఇ. స్త్రీ. భోజనము, కుడుపు.
జఘనము. సం. వి. అ. న. 1. మడికట్టు; 2. మొల.
జఘనేఫల. సం. వి. ఆ. స్త్రీ. బమ్మమేడి!. కుక్క మేడి!. (అని కొందఱు.)
జఘన్యజుఁడు. సం. వి. అ. పుం. శూద్రుఁడు. విశ. తమ్ముఁడు.
జఘన్యము. సం. వి. అ. న. 1. మగగుఱి; 2. తోఁక; 3. గౌరిసె. విశ. 1. వెనుకటిది; 2. దూఱఁదగినది.
జట. సం. వి. ఆ. స్త్రీ. 1. జెడ; 2. ఊడ; 3. మాంసి!.
జటాయువు. సం. వి. ఉ. స్. పుం. 1. గుగ్గిలపుచెట్టు; 2. ఒక గృధ్రము, సంపాతితమ్ముఁడు.
జటాలము. సం. విశ. (అ. ఆ. అ.) జెడలుగలది.
జటావల్లి. సం. వి. ఈ. స్త్రీ. రుద్రజెడ!.
జటి. సం. వి. న్. పుం. 1. జువ్వి!; 2. జెడలుగల సన్యాసి.
జటిల. సం. వి. ఆ. స్త్రీ. 1. మాంసి!; 2. పిప్పలి!. అ. పుం. ము. సింహము. విశ. జెడలుగలది.
జటులము. సం. వి. అ. పుం. పుట్టుమచ్చ, తిలకము.
జఠరము. సం. వి. అ. పుం. కడుపు. విశ. 1. ముదిసినది; 2, కఠినమైనది.
జడ. సం. వి. ఆ. స్త్రీ. దురదగొండి!. అ. న. ము. నీళ్లు. విశ. 1. చల్లనిది; 2. తెలివిలేనిది; 3, మూఁగది.
జడత. సం. వి. ఆ. స్త్రీ. మనస్సును అంగమును చేష్టలు ఉడిగియుండుట.
జడధి. సం. వి. ఇ. పుం. జలధి, సముద్రము.
జడిమ. సం. వి. న్. పుం. జడత్వము, (రూ. జడిమము.)
జడులము. సం. వి. అ. పుం. పుట్టుమచ్చ, జటులము.
జడ్జి. ఆం. వి. న్యాయాధిపతి.
జతుక. సం. వి. ఆ. స్త్రీ. చివుకపిట్ట. అ. న. ము. 1. లక్క; 2. ఇంగువ.
జతుకృత్తు. సం. వి. త్. స్త్రీ. కోరింద!.
జతువు. సం. వి. ఉ. న. లాక్ష, లక్క.
జతూక. సం. వి. ఆ. స్త్రీ 1. కోరింద!; 2. చివుకపిట్ట.
జత్రువు. సం. వి. ఉ. న. ద్వి. మూఁపులయొక్క సంధియెముకలు, కొంకులు.
జనంగముఁడు. సం. వి అ. పుం. మాలవాఁడు.
జనకుఁడు. సం. వి. అ. పుం. 1. తండ్రి; 2. ఒకానొక రాజు.
జనత. సం. వి. ఆ. స్త్రీ. జనసమూహము.
జననము. సం. వి. అ. న. 1. పుట్టుక; 2. వంశము.
జనని. సం. వి. ఈ. స్త్రీ. 1. తల్లి; 2. దయ; 3. కోరింద!.
జనపదము. సం. వి. అ. పుం. 1. దేశము; 2. గ్రామము. గ్రామసమూహము. (అని కొందఱు.)
జనపదుఁడు. సం. వి. అ. పుం. మనుష్యుఁడు.
జనము. సం. వి. అ. పుం. 1. ప్రజ; 2. ఒకానొకలోకము. విశ. పామరుఁడు.
జనయిత. సం. వి. ఋ. పుం. తండ్రి, జనకుఁడు.
జనయిత్రి. సం. వి. ఈ. స్త్రీ. తల్లి, జనని.
జనశ్రుతి. సం. వి. ఇ. స్త్రీ. జనులు చెప్పుకొనెడు వృత్తాంతము, వానుడి.
జనాంతము. సం. వి. అ. పుం. దేశము, జనపదము.
జనాభా. హిం. వి. జనసంఖ్య.
జనార్దనుఁడు. సం. వి. అ. పుం. హరి, వెన్నుఁడు.
జనాశ్రయము. సం. వి. అ. పుం. జనులుచేరియుండునట్టిచోటు, మండపము.
జని. సం. వి. ఇ. స్త్రీ. 1. ఆఁడుది; 2. పెండ్లాము. ఈ. స్త్రీ. 1. కోడలు; 2. కోరింద!. ఇ. పుం. స్త్రీ. పుట్టుక
జనువు. సం. వి. ఉ. స్. న. పుట్టుక, జననము.
జనుసాంధుఁడు. సం. విశ. (అ.ఆ.అ.) పుట్టుగ్రుడ్డి.
జన్మము. సం. వి. అ. పుం, న. న్. న. పుట్టుక, ఉద్భవము.
జన్మి. సం. వి. న్. పుం. జంతువు, మేతాలువు.
జన్య. సం. వి. ఆ. స్త్రీ. 1. తల్లి చెలికత్తె; 2. తోడిపెండ్లికూఁతురు; 3. సుఖము. అ. న. ము. 1. యుద్ధము; 2. అంగడి; 3. దూఱు.
జన్యుఁడు. సం. వి. అ. పుం. 1. తండ్రి; 2. తోడిపెండ్లికొడుకు. విశ. 1. పుట్టఁదగినవాఁడు; 2. పుట్టించువాఁడు.
జన్యువు. సం. వి. ఉ. పుం. 1. జంతువు; 2. అగ్ని, 3. బ్రహ్మ.
జప. సం. వి. ఆ. స్త్రీ. దాసనము!. అ. పుం. ము. 1. మంత్రావృత్తి; 2. వేదాధ్యయనము.
జపించు. సం. స. క్రి. జపముచేయు.
జప్యము. సం. వి. అ. న. గాయత్ర్యాదిమంత్రము. విశ. జపింపఁదగినది.
జబరు, జబరుదస్తీ. హిం. వి. బలాత్కారము.
జమాదారు. హిం. వి. రౌతులపైయధికారి.
జమాయించు. గ్రా. క్రి. ఆడంబరముగానుండుట.
జయ. సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. పార్వతియొక్క చెలికత్తె; 3. తిథివిశేషము; (చూ. తిథి.) 4. కరక!; 5. తక్కిలి!; 6. నల్లి!. అ. పుం. 1. ఒకసంవత్సరము; (చూ. సంవత్సరము.) 2. గెలుపు.

జవ్వాజిపిల్లి. వై. వి. సంకువు.
జవ్వాడు. దే. అ. క్రి. (జవ+ఆడు.) చలించు. "సన్నపునడుములుజవ్వాడ." భాగ. ౯, స్కం.
జవ్వాది. వై. వి. జవాదియొక్క రూపాంతరము.
జవ్వాదు. వై. వి. జవ్వాదియొక్క రూపాంతరము.
జవ్వు. దే. వి. దుర్గదజలము.
జళిపించు. దే. ప్రే. జడియఁజేయు, ఆడించు. "ప్రచండమండలాగ్రముజళిపించుచుఁ." కళా. ౬, ఆ.
జళుకు. దే. వి. బెదరు. ("సీ. జళుకులువాఱలెస్సఁగదంచివెదురుబియ్యమునుబువ్వలవలెనలఁతిలోవి, వార్చి." ఇక్కడ జళుకులు అనఁగా పొట్టు అని తోఁచెడి. పాండు. 3, ఆ.)

## జా.

జాగా. వై. విశ. గొప్ప*. "మ. తలిరుంజొంపపుడాలు పూరజపునిద్దాజాలు బల్ తేఁటిగం, టలచాలుఁ విరితేనెమేలు తరులంటంగ్రాలుఁ దీవచే, ర్గలబాకీలు జగాచో కాయలరుజాగామావటీలోప్పఁగా, వలరాదంతులకైవడిఁ వనము త్రోవం ద్రిమ్మరుఁ దెమ్మెరల్." చంద్ర. (జగయొక్క రూపాంతరము.)
జాగరము. వై. వి. రాత్రిమేలుకొనియుండుట.
జాగిలము. దే. వి. పందిలోఁనగువానిఁబట్టెడువేఁటకుక్క.
జాగు. దే. వి. ఆలస్యము, జెంపు.
జాజము. దే. వి. పాలికలయందుఁబోసిన నవధాన్యములనాఱు. (చూ. జాజాము.)
జాజర. దే. వి. జజ్జర, వంచన. (చూ. జజ్జరకాఁడు. జజ్జరకత్తె.)
జాజాము. దే. వి. జాజముయొక్క రూపాంతరము. "గీ. శర్వరీచంద్రపరిణయసముచితాంకు, రార్పణక్రియలందు వియద్విభాగ, పాలికలఁదోఁచుక్రొత్తజాజాలమొలక, లనఁగఁదారకలొండొండయంకురించె." కవిక. ౪, ఆ.
జాజి. వై. వి. జాతి?.
జాజికాయ. ద్వ. వి. జాదిఫలము.
జాజు. వై. వి. ఎఱుపు*. "నిదురలుఁ లేమిఁగన్గొనలనిండినజాజులెలర్పుచుండ." య. ౫, ఆ.
జాజువాఱు. ద్వ. అ. క్రి. (జాజు+పాఱు.) ఎఱ్ఱనగు. "అంగడట్టపుకావిరంగునలన శశికాంతమణిపీఠిజాజువాఱఁగ." స్వా. ౨, ఆ.
జాటి. కే. వి. బండిగుఱ్ఱములుదుక్కిఱెడ్లులోనగువానిఁగొట్టెడుచేలుకోల. (కొన్ని ప్రాఁతప్రతులయందు సాటియని కనఁబడుచున్నది.)
జాడ. దే. వి. 1. అడుగులగుఱుతు; 2. సైఁగ; 3. పోబడి; 4. త్రోవ; "ద్వి. పారువంబులుదేగపదువుసమ్మోఁదఁ, దేరినాలవజాడఁద్రిమ్మరుచుండు, దానిపైత్రోవగృధ్రములేగనేర్చు." రా. కిష్కిం. కాం.—5. విధము. "క. చూడఁగపిగానిసమఁ, క్రీడాపరతంత్ర గరిమగిరిశునితోడఁ, జోడైయున్నాఁడితఁడే, జాడంజిక్కువడునని విచారించి వెసఁ." రామా. ౬, ఆ.
జాడకాఁడు. దే. వి. త్రోవగుర్తెఱిఁగినవాఁడు.
జాడా. దే. క్రి. విశ. సమూలము.
జాడాచేయు. ద్వ. స. క్రి. నాశముచేయు.
జాడి. దే. వి. ఒకదినుసుమట్టిపాత్రము.
జాడించు. దే. స. క్రి. 1. కంపమొందఁజేయు; "సీ. ఒడలుజాడించిఁబుడమిపైరాలినరోమజాలంబులురుచిరహరిత, వర్ణమై." భాగ. 3, స్కం.— 2. గుడ్డలు నీళ్లలో వేసి అటునిటు పొర్లించియెత్తు.
జాడీ. దే. వి. జాడియొక్క రూపాంతరము.
జాడు. దే. వి. గింజపట్టని జొన్నకఱ్ఱ.
జాణ. వై. విశ. నేర్పరి*.
జాణఁడు. వై. విశ. జాణయగువాఁడు*. "జాణఁడు నీభర్త." వై. ౧, ఆ. "పనివడియిక్కొడియలనుబట్టఁగఁగలజాణ, ణనికిచ్చెదనీకన్నియ." నీలా. ౨, ఆ.
జాణెత. వై. విశ. (జాణ+ఎత.) ధూర్తురాలు*. "క. ఇరుసెవియెఱుఁగకయుండఁ, దరుణీసుఖమనుభవింపఁదలఁచినఁబదివే, వురకన్నులెదుటఁబడీని, సరివారెల్లిదముసేయజాణెతనైతిఁ." ఉ. హ. ౫, ఆ. (స్వార్థమున ఎత.)
జాతర. వై. వి. 1. శక్తియుత్సవము*; "క. అతఁడి న్నగరీపతి, జాతరచాటించెఁ బశువిసర మనిశః సా, ధ్యాతతవాతామయని, ర్ఘాతాహతిఁమాలగాలిగంగలకెల్లఁ." పాండు. 3, ఆ.—2. ఉత్సవము*. "ఉ. జాతరసేయఁగావలయుసర్వజనంబులునంబురాశికిఁ." భార. మా. ౧, ఆ.
జాది. వై. వి. జాజియొక్క రూపాంతరము. "జాదులునెతికొప్పునఁదుఱిమి త్రోవనెపోయితిమే ని." పా. ౨, ఆ.
జాదిలి. దే. వి. బుడుబుడుక్కలవాఁడు.

జాదు. వై. వి. జాజేయొక్క రూపాంతరము.

జాదుకొను. దే. అ. క్రి. తలుచుకొను. "గీ. అనిన౯బు లకలు మైజాదుకొన౯గనపుడు." లక్ష్మీ. ౧, ఆ. "సక లాంగకంబులుజాదుకొ౯బులకించి." నై. ౫, ఆ.

జాదురజాదురంబు. వై. అవ్య. (జాదురంబు+జాదు రంబు.) మిక్కిలిచాతుర్యము. "ఉ. జాదురజాదురంబు మృదుచర్చరిగీదులువారుణీరసా, స్వాదవ వాతిరేకములఁజంద్రికగాయఁగదక్షవాటికా, వే దులమీఁదట౯ గనకవీణలుమీటుచుఁబాడిరచ్చరల్, మోద మెలర్పఁగాభువనమోహనవిగ్రహా భీమనాథుని౯." భీ. ౫, ఆ. (ఇది యింకను విచార్యము.)

జానకి. దే. వి. కర్ణాటకపు తుపాకుల చెవియందుఁ చెడు నిప్పుముట్టించు త్రాడు.

జానము. దే. వి. గుఱ్ఱపుపల్లముమీఁది మెత్త. "ఎ, గీ. క్రొత్తముత్తెంపుతెరలఁడళ్కొత్తుజానము." ఉ, రా. ౭, ఆ.

జాను. దే. వి. అందము, సౌందర్యము.

జానుగు. దే. వి. చెవి, కర్ణము.

జానువు. దే. వి. జానుయొక్క రూపాంతరము. "ఉ. నన్నినలినాప్తుఁడియ్యనలుఁడీ మృగలాంఛనుఁడీ సురోత్తముల్, జానువడంగనీక్షణమునంపరికో పపరీతచిత్తులై." (ఇక్కడ జానుపడంగ౯ అని వ్యుత్పత్తిచెప్పుటసరికాదు.) భార. అర. ౨, ఆ.

జాపత్త్రి. వై. వి. (జాజి+పత్త్రి.) జాతిపత్త్రిక.

జాపిరము. దే. వి. జాగు, ఆలస్యము. "క. జాపిరము లేకయిప్పుడు, క్రేపులతోఁ గొల్లసుతులఁగృష్ణుని దొరల౯, గీఁపెట్టఁగ మ్రింగెడునని, పాపపురక్కసుఁడు నేలఁ బడియుండెన్నృపా." భాగ. ౧౦, స్కం. పూ.

జాప్యము. దే. వి. —— వై. —— (ఇది వాడుక లోనిది.)

జాబిలి. దే. వి. జాబిల్లియొక్క రూపాంతరము.

జాబిలితాలుపు. దే. వి. శివుఁడు, చంద్రధరుఁడు. (రూ. జాబిలితాల్పు. "సీ. ఇసుమునఁగావించి యొఱఁగిజాబిలితాల్పుఁ దగఁగొల్చునజ్జడదారితు టుము." య. ౨, ఆ.)

జాబిలిమేపరి. దే. వి. రాహువు, విధుంతుదుఁడు. "తరల. పలుదెఱంగులఁబోవుచందురుఁబట్టనన్ని టికన్నిరై, యలిగివేవెను వెంటనేగడుఁ ట్టిజాబిలిమేపరుల్, బలెజడల్ గమునీటఁ జేలుచుఁ బైపయింజను దేరఁగా, నిలువుటీఁతలవచ్చుకొమ్మలనెమ్మొగఁబులుపొల్పగు౯." య. ౩, ఆ.

జాబిలిఱాయి. దే. వి. చంద్రకాంతము.

జాబిలిరిక్క. ద్వ. వి. మృగశీర్షనక్షత్రము.

జాబిల్లి. దే. వి. (జాను+బిల్లిక.) చంద్రుఁడు.

జాబిల్లు. దే. వి. బ. బాలికాక్రీడావిశేషము. హంస. ౫, ఆ.

జాబు. దే. వి. లేఖ, పత్త్రిక.

జాబుర. దే. వి. ఒకానొకచెట్టు, (రూ. జాబురా.) (దీని విత్తులు వస్త్రములకు రంగు వేయ నుపయోగించును. దీనికి అర్థము గందవోడి అని కొందఱు వ్రాసియున్నారు.)

జామ. వై. వి. ఒకానొకచెట్టు. (దీని పండ్లను జామపండ్లందురు. అవి తినుటకు ఉపయోగించును.)

జామారు. దే. వి. సెల్లా.

జామీను. హిం. వి. పూఁట.

జామీనుదారుఁడు. హిం. వి. పూఁటపడువాఁడు.

జాము. వై. వి. ఏడున్నరగడియకాలము.

జారీ. దే. వి. 1. గిండి; "సీ. తాల్పంగనీఁడుకుందనపుజారీచిప్పఁజెనకవచ్చిన తీనిచేతఁగాని." య. ౧, ఆ.—2. కమండలువు. "క. తనయిరువుఁ జేరునరిగెడు, పనియును నెఱిఁగించిడప్పివాయఁగ నీర్వే, డినవక్కల్లరిజోగియుఁ, దనజారీలోనినీళ్లు త్రావుమటన్న౯." అచ్చ. యు, కాం.

జార్చు. దే. ప్రే. జాఱుచుయొక్క రూపాంతరము.

జాఱు. దే. అ. క్రి. 1. జరగు; (కాలుజాఱిపడ్డాఁడు.)—2. ఉఱుకు; "సీ. మనజాలవల్లికమఱచివచ్చితిఁగొంచుఁజను దెంతుననియంచుజాఱె నొకతె." కళా. ౭, ఆ.—3. వదలు; "ఎ, గీ. జాఱవిడిచిమీకుఁబొఱఁగనగునయ్య." ఉ, హరి. ౬, ఆ.—4. స్రవించు; (కన్నులనీళ్లు జాఱుచున్నవి.) —వి. జాఱుడు. (ఆధునికులు కొందఱు దీనిని లఘురేఫముగా వ్రాసియున్నారు. అది ఆదరణీయము కాదు.)

జాఱుచు. దే. ప్రే. జాఱఁజేయు, జాఱించు, (రూ. జార్చు.)

జాఱుడు. దే. వి. జాఱుట, గళనము. "ద్వి. చలియించుమదిచొప్పుజాఱుడుఁగొప్పు." సా. ౩, భా.

జాఱుపాటు. ద్వ. వి. 1. స్ఖలనము; 2. స్ఖాలిత్యము. "ఉ. ఎయ్యెడ మేలెమా తురు గ్రహింపరుజాఱల

జాఱుపాటులన్." విజ. ౧, ఆ. (ఇది రెండర్థములకును ఉదాహరణము.)

జాఱువు. దే. వి. 1. జాఱుడు; 2. కొండచేటి.

జాఱువాఱు. దే. అ. క్రి. (జాఱు+పాఱు.) జాఱు. "సీ. నాతోడునీడలైననుఁబిన్న పెద్దగా సవరించు మీ మాపుజాఱువాఱె." ఉ, హరి. ౫, ఆ.

జాల. వై. వి. 1. చేఁపలనుబట్టువల; 2. కిటికి. (చూ. జాలకట్టి.)

జాలకట్టి. ద్వ. వి. నల్లతాటియందు బెజ్జములేర్పఱచి యుంచిన కిటికి. "ద్వి. సారిదిఁజేసినపాలసున్నంపుమిద్దె, జాళువాబంగారుజాలకట్టిలును." నిజలింగచిక్కయచరిత్రము.

జాలకాఁడు. యు. దే. విశ. (జాలము+కాఁడు.) ఆలస్యముచేయువాఁడు. వై. వి. చేఁపలఁబట్టువాఁడు.

జాలము. దే. వి. జాగు, ఆలస్యము. "ఎ, గీ. కలికిరాయంచబోదలకలికియలికి, యులికిపలమానపవమానగళితమాన, దళితమానసలీలనేఁదాళఁజాల, జాలమిదియేలలోలవిశాలనయన." శశాం. ౪, ఆ.

జాలరి. వై. వి. (జాల+అరి.) చేఁపలఁబట్టువాఁడు, ధీవరుఁడు. (దీనికి జెలగడుగువాఁడును అర్థమని కొందఱు చెప్పెదరు.)

జాలరు. వై. వి. గొడుగులోనగువాని కొసనుచేట్టు వ్రేలెడు జెల్లిలోనగునది. "ద్వి. పైనొప్పుచందువా పటమునల్గడలఁ, జానలుసవరించుజాలరుల్మెఱయ." సా. 3, భా.

జాలవల్లిక. ద్వ. (జాల+పల్లిక.) చిత్రపుపనిచేసిన తములపాకులతట్ట. "క. అప్పుడుతాంబూలంబులుఁ, గప్పురమును జాలవల్లికలఁబడఁతులుదే, నిప్పించెబంధుకోటికి, నప్పద్మదళాయతాక్షుఁడు." పా. ౨, ఆ.

జాలాఁరి. దే. వి. హింస్రి.

జాలి. దే. వి. 1. మనఃఖేదము; "క. చేదప్పినకార్యములకు, ఖేదనఁబొందుదురె జాలివిడువుమిఁకమనః, ఖేదమువిధిదప్పింపం, గాఁదరమేనీకునాకుఁగామినిచెపుమా." ఉ, రా. ౪, ఆ.—2. ఖేదము; 3. విచారము. "క. ఆజాలియేలనిర్మల, బీజహావిస్తంత్రమేను బ్రీతినొసర్పం, గాజగతివఱపునంతెడు, సేజన్నమువిఘ్నపడుటయేటికివగపన్." భార. అశ్వ. ౪, ఆ.

జాలిఁబడు. ద్వ. అ. క్రి. (జాలి+పడు.) 1. దుఃఖపడు; 2. విచారపడు. "క. మేలర్థింపనుగీడును, జాలింబడితోలఁగఁద్రోవసరితూష్ణీంభా, వాలంబిమనస్కుఁడనై, యాలంబుగఁజేసినడతునయ్యురదెఱఁగున్." భార. శాం. ౪, ఆ. (చూ. జాలిఁబెట్టు.)

జాలిఁబెట్టు. దే. స. క్రి. (జాలి+పెట్టు.) దుఃఖపెట్టు. "నిన్నతఁడుజాలింబెట్టెడుంజూడుమీ." భార. ఉద్యో. 3, ఆ.

జాలిగొను. దే. అ. క్రి. (జాలి + కొను.) (చూ.) జాలిఁబడు.

జాలియ. దే. వి. 1. జాలెడేగ; (చూ. అణుజే.)—2. జాలెసంచి; 3. బొంగరపుత్రాడు. (చూ. జాలె.)

జాలియము. దే. వి. జాలెసంచి. (చూ. జాలెము.)

జాలీ. దే. వి. గొడుగులోనగువాని కొసనువ్రేలెడు జాలరు. "చందువాముత్యాలజాలీలు." రసి. ౧, ఆ.

జాలు. వై. వి. 1. ఏఱు*; "సరసిజవృత్తము. కష్టగుతోలున్గొప్పనజాలున్గనువినుకులనోడిఁముల గుసరులున్." య. ౨, ఆ.—2. అల్పప్రవాహము*. (చూ. చిమ్మ.)

జాలుకొను. ద్వ. అ. క్రి. ప్రవహించు.

జాలువా. దే. వి. జాళువాయొక్కరూపాంతరము. "సీ. కఱకుదుండగపురక్కసులఁద్రెంపఁగఁజాలు జాలువాపిడి వాలువాలువాని." చంద్రా. ౧, ఆ.

జాలువాఱు. ద్వ. అ. క్రి. (జాలు+పాఱు.) ప్రవహించు. "సీ. కరుణారసము పొంగితొరఁగెడు చాడ్పునశశిరేఖనమృతంబుజాలువాఱ." భార. విరా. ౧, ఆ.

జాలువు. వై. వి. జాలుయొక్కరూపాంతరము. "ప. అమ్మహామహుసందర్శనాహ్లాదంబునజాలువులుగ బాష్పజలఁబులందడియుచు." అధ్యా. అర. కాం.

జాలె. దే. వి. 1. ఒకజాతిడేగ; 2. వరాలుపోసెడియొకదినుసుసంచి; "క. జాలెలఁబట్టింపుము పది, వేలునయిదువేలు రెండు వేలు నరయసా, న్నాలికుతలునకు మన, యేలిక తన్మంత్రియతనియింటికిఁబనుపన్." జై. ౭, ఆ.—3. బొమ్మరపుత్రాడు. "చ. కనకనగంబుబొమ్మరముగా భుజగేంద్రుఁడుజాలెగానమ, ర్చినగిరిపుత్రిగాంచియివిరెండునుదేవధనంబులన్నవ, జ్ఞనవిహితోపదేశమునసన్నతిదానబునః ప్రతిష్ఠచే, సీఁగగణాయతుఁడుక్కపసేయు

తసిద్ధనమంత్రికోరికల్." విక్ర. ౧, ఆ. (జాలియయొక్క-రూపాంతరము.)

జాలెత్రాడు. దే. వి. కెట్టియొక్క-యుపకరణవిశేషము. "రాలయుంగరములు జాలెత్రాడుగాఁగ." పాంచా. ౫, ఆ.

జాలెము. దే. వి. జాలియముయొక్క-రూపాంతరము. "గీ. తానునిల్లాలుకొమ్మయుఁదనయయుగము, మొలలవీనారముల జాలెములువహించి, సాతుఁగూడినసంగఁదస్కరులుతాఁకి, నలుగురనుబట్టి గనమొల్లనొలిచికొండ్రు." కాశీ. ౭, ఆ.

జావ. వై. వి. నూకలులోనగువానిఁజేర్చి పలుచగాఁగాఁచిన గంజి.

జావడము. దే. వి. 1. అపౌరుషము; "ఉ. నావుడు నవ్వుటాలకనినన్ బవనాత్మజయింత యేటికిన్, గేవలమోఘవేపరులకిల్బిషముల్ తలపోయుకిమ్మెయిన్, జావడమైనఁజూచియిదిచందముగాదని యంటిఁగాకనీ, చేవయుఁలావునీవుమునుచేసినభంగులునేనెఱుంగనే." సం. "అహోబానాశంసనేకించిత్పుంస్త్వఁక్లీబఇవాత్మని, గదతఃక్లీబయా వాచా." భార. ఉద్యో. ౩, ఆ.—2. పిఱికితనము; "బ్రాహ్మణజాతిజావడమునమఱియుఁగొంకుదు." కళా. ౭, ఆ.—3. గుజ్జుపుతట్టు; "క. లావుగలయుద్దిగుజ్జుపు, జావడములమీఁదమాత్రసంచులుమోలన్, గ్రేవలనేకాంగులురా, వివధముల నత్రిపిలవనివిభునకుఁగొనుచున్." ఆము. ౨, ఆ.—4. ఒకజాతిడేగ. "ద్వి. జాలెడేగలమంచి జావడంబులను, సాళువంబులమేలిజలకట్టియలను." హరిశ్చ. ౧, భా.

జావడి. దే. వి. (జావడము+ఇ.) చౌకలవాఁడు. "ద్వి. పరునింటనుండియెప్పటియునునింటి, కరుగుదెంచినయింతినలుగకయేల, నేవెత్త్రిరాముఁడనేయుని యొక్క, జావడియనుమాటచాయలుచెప్ప." భాగ. ౯, స్కం.

జావళము. దే. వి. గుజ్జుపుతట్టు. (జావడముయొక్క-రూపాంతరము.)

జావళి. దే. వి. గీతవిశేషము.

జావాహిరి. దే. వి. రత్నపుసొమ్ము. (రూ. జవాహిరి.)

జాళించె. దే. స. క్రి. జాడించుయొక్క-రూపాంతరము. "వ. ఒడలుజాళించితూలించినంజాలించక." రామా. ౯, ఆ.

జాళియ. దే. వి. (చూ.) జాళెము. (చూ. జాళె.)

జాళియము. దే. వి. (చూ.) జాళెము.

జాళువా. దే. వి. అపరంజి.

జాళె. దే. వి. జాళియయొక్క-రూపాంతరము. "ద్వి. పారిఁబారినంకుశంబుననియమించి, కరిజాళె సేయింపఁగడఁగెడువాఁడు." రా. యు. కాం. (చూ. జాళెము.)

జాళెము. దే. వి. అశ్వగతివిశేషము, (చూ.) రేచితము. "వ. అపసవ్యగతింజాళెంబునహయంబుఁబోనిచ్చుచు." స్వా. ౪, ఆ. "సీ. అట్లుఖండితబాహుఁడయ్యును శౌర్యంబువదలకడాకేలగదయమర్చి, తెగువజాళెంబులు త్రిప్పుచుఁబఱతెంచి." (జాళెంబులు త్రిప్పుచు అనఁగా జాళెములుగాత్రిప్పుచు అని యర్థము.) జై. ౫, ఆ.

జాళ్వా. దే. వి. జాళువాయొక్క రూపాంతరము.

## జు.

జుం. దే. వి. 1. తావిపీచుట మొదలగువానియందగుధ్వన్యనుకరణము; "సీ. తరళాక్షినీమేనితావిజుమ్మన నాదుమనసుజుమ్మనిరేఁగిమరులుఁజెందు." లావణ్యశతకము.—2. తుమ్మెదలులోనగునవిమ్రోయుటయందగు ధ్వన్యనుకరణము. "ద్వి. పొలసుకుజుమ్మనిపొలయుమక్షికల." హరిశ్చ. ౨, భా. (ఈయర్థమునందు ఆమ్రేడితమున జుంజుం. "క. మదగజదానామోదముఁ, గదలనితమకముఁలఁద్రావికడుపులనిండన్, బొదలుచుఁదుమ్మెదకొదమల, కదుపులుజుంజుమ్మటంచుగానముచేసెన్." భాగ. ౯, స్కం.) (అనుశబ్దము పరమైనప్పుడు జుంశబ్దముయొక్క అనుస్వారమునకు మకారాదేశము వచ్చెడి.)

జుంజెము. దే. వి. దీపావళిపండుగనాటిరాత్రి బాలురు కాల్చిత్రిప్పెడు తెల్లువిడపలిలోనగువానినిడుపాటి సన్నకట్ట, పంజో. దివ్వటీ. (అని కొందఱు.)

జుంజేము. దే. వి. జుంజెముయొక్క-రూపాంతరము.

జుంజేలు. దే. వి. 1. చింపిఱి; "సీ. కలుకుతైనట్టిజుంజులువెండ్రుకలునిర్లుకవియుమేనులుఁ గెంపుఁగన్నుఁగవయు." హరిశ్చ. ౨, ఆ.—2. జుంజేలుకట్ట.

జుంజేలుకట్ట. దే. వి. వెలుతురుపుల్లలులోనగువానిలో చేర్పఱచిన దివటీ.

జొంటితేనె. దే. వి. (జొన్ను + తేనె.) జొంటీఁగలు కూర్చినతేనె, క్షౌద్రము.
జొంటీఁగ. దే. వి. (జొన్ను + ఈఁగ.) తేనెటీఁగ, సరఘ.
జొజొలు. దే. వి. గుబురు. (చూ. జొజొలుకొను.)
జొజొలుకొను. దే. అ. క్రి. గుబురుకొను. "ఎ, గీ. అస్థిచర్మావశేషావయవములందు, జొజొలుకొన్న తనూరుహస్తోమములను." కాశీ. ౬, ఆ.
జొట్టనవ్రేలు. దే. వి. తర్జని.
జొట్టవ్రేలు. దే. వి. (జొట్టన + వ్రేలు.)——వై.——"జొట్టవ్రేలి మొదలుపితృతీర్థమనఁజెల్లు." విజ్ఞా. ఆచా, కాం.
జొట్రిలి. దే. వి. చాఁపఁబడిన బొట్టనవ్రేలి చూపుడువ్రేలి నడిమికొలఁత, ప్రాదేశము.
జొట్టు. వై. వి. సిగ, శిఖ.
జొట్టుఁబులుఁగు. ద్వ. వి. (జొట్టు+పులుఁగు.) నెమలి, శిఖావళము. (జొట్టుపిట్ట అనియు.)
జొట్టుపిట్టతాలుపు. ద్వ. వి. కుమారస్వామి. "గీ. బొమ్మఁగాఁడిపాలనమ్ముల నేసిన, సొమ్మవోయి మేటికొమ్మ మెకపు, బిరుదులోఁగిజొట్టుపిట్టతాలుపు వాలుఁ, గోలఁగొంచగట్టుఁబోలెవ్రాలె." అచ్చ. యు, కాం.
జొట్టుపు. దే. వి. అజశృంగి?.
జొడుఁగు. దే. అ. క్రి. 1. భయాదులచే ఒదుఁగు; "ఎ, గీ. బాహునాళాధరోష్ఠబింబకరకిసల, వదనజలజమ్ములకుమూఁగువరమరాళి, శుకపికశిలీముఖాళికిజొడిఁగిజొడిఁగి, సఖులుపుష్పాపచయకేళిసలిపిరపుడు." చంద్ర. "సీ. తొడకిక్రమ్మఱఁగాలువిడిచిప్రక్కజొడుంగుజొడిఁగియాయముపట్టిస్రుక్కఁజేయు." చంద్రా. ౨, ఆ.—2. డాఁగు; (చూ. జొణుఁగు.)—3. వెనుదీయు. "క. కాదె వినుఁడొక్కటియిం, కాదేవినిగలదికలిగినట్టు తెలుపునీ, పైదే నేరముజొడిఁగినఁ, గాదనియడుగుమనుఁడామెగట్టిగఁదెలుపుఁడ." సా. ౨, ఆ.
జొణుఁగు. దే. అ. క్రి. జొడుఁగుయొక్క రూపాంతరము. (భయాదులచే ఒదుఁగుటకు.—"ద్వి. జొణిఁగిరేలోకంబుచొచ్చినసైనఁ, దృణముగాఁబట్టి వధింతునిన్ననిన." రా. అర, కాం. —డాఁగుటకు.—"చ. వాఁడునుం, జొణిఁగిజొణింగి తూపడరుచోటెఱుఁగంబడనీక మాయలన్." రామా. ౫, ఆ.)
జొత్త. దే. వి. చాఁపఁబడిన బొటనవ్రేలి ఉంగరపువ్రేలి నడిమికొలఁత, గోకర్ణము.
జొత్తనవ్రేలు. దే. వి. జొట్టనవ్రేలుయొక్క రూపాంతరము.
జొత్తిలి. దే. వి. జొట్టిలియొక్క రూపాంతరము.
జొన్ను. దే. వి. 1. జొన్నుఁబాలు; 2. జొన్నుగడ్డ; 3. తేనెతెట్టె. "సీ. ఉన్నతతరువృక్షజొన్నునేకఁ గొని తేనియయానని వానిభంగి." భార. శాం. ౧, ఆ.
జొన్నుఁబాలు. ద్వ. వి. (జొన్ను+పాలు.) ఈని అయిదాఱుదినములలోనిపాలు, పియూషము.
జొన్నుగడ్డ. ద్వ. వి. కాఁగి గడ్డకట్టిన యీనిన అయిదాఱుదినములలోని పాలు.
జొబ్బ. వై. వి. బాహుపురి*. (అప్ర.)
జొమాయించు. దే. స. క్రి. (వాగెను) ఈడ్చిపట్టు. "ఉ. ఇంచుకకేలవాగెఁగుదియించిన సంభ్రమదాఁటుచున్ జొమా, యించిననేలగ్రక్కదలఁబట్టుగావడిఁద్రొక్కుచున్ దువా, ళించినగట్టుగట్టనకలెక్కకుమిక్కిలిదవ్వవాఱుచున్, మించినవారువంబులయిమీఱుచుఁద్రిమ్మరునెన్నియేనియున్." య. ౧, ఆ.
జొమికీలు. దే. వి. బ. 1. స్త్రీకర్ణభూషావిశేషము; (చూ. గునామొలనూలు.) 2. పుష్పవిశేషము.
జొమ్మ. దే. వి. పక్షివిశేషము.
జొమ్మఁడు. దే. వి. విటుఁడు. (చూ. జొమ్మకాఁడు.)
జొమ్మకాఁడు. దే. వి. (జొమ్మఁడు+కాఁడు.)——వై.——"జొదరులకునిచ్చిజొమ్మకాండ్రకు నిచ్చి." విక్ర. ౭, ఆ. (స్వార్థమున కాఁడు.)
జొఱుకు. దే. వి. నెత్తురులోనగునవిలోపలనుండి పైకి వేగమునవచ్చుటయందగుధ్వన్యనుకరణము. (ఆమ్రేడితమునందు జొఱుజొఱుకు. "క. జొఱుజొఱుకనినెత్తురువెలి, కుఱుకుచు." ఆము. ౩, ఆ.)
జొల్లు. దే. స. క్రి. పీల్చు. వి. 1. పీల్చుట; 2. పీల్చుటయందగుధ్వన్యనుకరణము. "జొల్లునఁగ్రొత్తే డుగ్రుక్కఁడేమధువుగ్రోలుచు." కళా. ౬, ఆ.
జొలఁము. దే. వి. దుండగము. "ద్వి. జొలఁములేటికినొం డుసుద్దులుమాని, తొలఁగుము." హరిశ్చ. ౨, ఆ.
జొల్మాన. హిం. వి. అపరాధము.
జొవ్వ. దే. వి. ఉచ్చు. (అప్ర.)
జొవ్వరించు. దే. అ. క్రి. విజృంభించు. "ఉ. చిప్పకుజొవ్వరించుననుఁ జెంతలఁగన్గొనుఁడంచుఁబలుకన్." పాంచా. ౨, ఆ.

జువ్వి. దే. వి. ప్లక్షము?.
జువ్విదీవి. ద్వ. వి. ప్లక్షద్వీపము.
జువ్వు. దే. వి. 1. వైచుటయందగుధ్వన్యనుకరణము; "మహాశాపకీలతల్ జువ్వునఁ గ్రమ్మ హాంబునిధిలోఁ బడినట్టి." వి, పు. ౨, ఆ.—2. ఇంకుటయందగు ధ్వన్యనుకరణము. "ఒకపాటి వాహినుల్ జువ్వున నింక." పర. ౪, ఆ.

## జూ.

జూంక. దే. వి. తత్తఱపాటు. "వ. వీఁకలుదాఁకలు జూఁకలుఝూఁకలు." భీ. ౪, ఆ.
జూఁకించు. దే. అ. క్రి. తత్తఱపడు. "వ. విసివి విసి వూలి వేసఱి యలసి యారటఁబొంది సొలసి జూఁకించి తూలి దూఁపటిలి యుల్లంబునఁ గ్రోధంబుప్పతిలఁ జిచిన." భీ. ౨, ఆ.
జూజము. వై. వి. 1. జూదము; 2. మోసము*. "సోమవదనకేపు మాపంచుఁ గపటకుజూజమే చేసితివి." క్షేత్రయ. (రూ. జూదకత్తియ, జూదకాఁడు, జూదరి.) (జూదముయొక్క రూపాంతరము.)
జూజి. వై. వి. దూతిక.
జూటాడు. ద్వ. స. క్రి. (జూటు+ఆడు.) మోసముచేయు. "క. వేఁటాడదొరలసన్నిధి, మాటాడ మదించుచెంచుమన్నీలకరం, బూటాడఁజేయు నన్నిట, జూటాడనెయుండునతఁడు మాంచెదరె కదా." రా, వి. 3, ఆ.
జూటు. వై. వి. మోసము*.
జూటుఁదనము. వై. వి.——పై.——"గీ. జూటుఁదనమునసభకెక్కుచోరవకాండ్రు." అము. ౪, ఆ. (స్వార్థమున తనము.)
జూదకత్తియ. వై. విశే. (జూదము+కత్తియ.) జూదమాడెడి యాఁడుది, (రూ.) జూదకత్తె, జూజకత్తియ.
జూదకాఁడు. వై. విశే. (జూదము+కాఁడు.) జూదమాడెడువాఁడు, (రూ. జూజకాఁడు.)
జూదము. వై. వి. ద్యూతము.
జూదరి. వై. విశే. (జూదము+అరి.) జూదకాఁడు, (రూ. జూజరి.)
జూలు. దే. వి. 1. సింహములోనగువాని మెడమీఁది వెండ్రుకలు; 2. ఏనుఁగుమీఁదఁబఱచెడి యెఱ్ఱకంబళి. "సీ. పరితః ప్రకీర్ణమైపఱచినట్లున్న శైవాలజాలమునీలిజూలుగాఁగ." రామా. ౭, ఆ.
జూవరము. వై. వి. సంతాపము*.

## జొ.

జొంపము. దే. వి. 1. ఆకులు కొమ్మలులోనగువాని గుంపు, గుబురు; "క. పెనుబొడవుపఱపుజొంప, మ్మునుగలయది." భార. విరా. ౧, ఆ.—2. కెమ్మ; "చ. తొఁడలపోసి హరించెనాకులం, గొనలును జొంపముల్ నిడుదకొమ్మలు రేయగుడుం గ్రమంబునన్." భార. శాం. 3, ఆ.—3. నిరంతరధార. "క. ముంపుగొనివిరులవానల, జొంపంబులుగురియు." భాగ. ౮, స్కం.—విశే. నిరంతరము. "జొంపంబైనలేఁబచ్చికన్." ఉ, రా. ౫, ఆ.
జొంపు. దే. వి. కొండయందలి యూటనీరు.
జొగ్గు. దే. వి. భిక్షువు. (జోగుయొక్క రూపాంతరము.)
జొటజొట. దే. వి. వడియుట కురియుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. "జొటజొట ధారగావడియుచున్." పాండు. ౪, ఆ. (గ్రంథములయందు కొన్నియెడల చొటచొట అనియు కానఁబడుచున్నది. ఇట్టిదియని నిర్ధారణచేయుటకు అనువుపడలేదు.)
జొత్తిల్లు. దే. అ. క్రి. 1. ఎఱ్ఱవాఱు; 2. రంజిల్లు. (రూ. జొత్తిలు. ఎఱ్ఱవాఱుటకు. — "నెత్తుటం జొత్తిలమేనబాణములుసొన్పి." భార. ద్రో. ౪, ఆ.—రంజిల్లుటకు.—"క. చిత్తమాశ్చర్యరసమున జొత్తిలంగఁ, జేయునీప్రశ్నము. పాండు. ౧, ఆ. దీనివలె రెండర్థములకును సరియైన తత్సమక్రియ రాగిల్లు.)
జొత్తు. దే. వి. ఎఱుపు. "పవడంపుజొత్తులఁజెవులరూపడఁగంగ." భార. విరా. ౧, ఆ. కృత్రిమరక్తము. (అని యొకఁడు.)
జొత్తుపాప. దే. వి. మేననెత్తురుడేఱుచున్న లేఁత బిడ్డ. "వ. తత్తటంబున నెత్తుటండడిసి జొత్తుపాపలవిధంబుల నెత్తొత్తులనలసి యమ్ములతిత్తులయిన రాహుత్తులును." జై. ౨, ఆ.
జొన్న. యు. దే. వి. వృక్షవిశేషము. వై. 1. సస్యవిశేషము; 2. బ. ధాన్యవిశేషము.
జొబ్బిల్లు. దే. అ. క్రి. 1. స్రవించు; 2. నిండారు; 3. ఉప్పతిల్లు. (రూ. జొబ్బిలు. స్రవించుటకు.— "జానకీరామనామమున జొబ్బిలుచున్న సుధారసంబు." దాశరథిశతకము.—నిండారుటకు.— "జొబ్బిలుకల్మి." హంస. ౧, ఆ.—ఉప్పతిల్లుటకు.—

"చోఱచోఱ దుర్విషానలము జొబ్బిలుచుం డఁగ." భాగ. ౧౦, స్కం. పూ.)

**జొల్ట్రీఁగ.** దే. వి. జొటీఁగయొక్క రూపాంతరము.

**జొల్ల.** దే. వి. చిన్నయేఱు.

**జొల్లు.** దే. వి. చొంగ, లాల.

**జొహారు.** దే. వి. నమస్కారము. "కానికల్ నృపతిముందటనుంచిజొహారొనర్చినన్." ఉ, రా. ౭, ఆ.

**జొహారువు.** దే. వి.—పై.—

## జో.

**జోక.** దే. వి. 1. సామ్యము; "మున్నిటిజోకనేయుంగఁజాలుచెలువుగట్టించె." యు. ౧, ఆ.—2. బాగు; "సీ. తమ్మికేఁకులజోకతలఁగఁజేయువిలోకనములుస్వనాసికాగ్రమునసుంచి." ఉ, రా. ౮, ఆ.—3. జేత; "జోకయెప్పుడుఁగామానని చక్రవాకములు." అని. ౫, ఆ.—4. విధము; "పాండవులజోకన్ సాత్వికాన్నంబులత్యంతాభీష్టతనారగించి." జై. ౨, ఆ.—5. ఉత్సాహము; "పయనంబుజోకకునిలింప స్వాములీశాన ముఖ్యనిశానాయకులేగి." చంద్రా. 3, ఆ.—6. మొత్తము; "ఉ. శూరకులంబుసర్వమొకజోకయివచ్చి యెదిర్చినేని." విజ. 3, ఆ.—7. స్వరూపము; "గీ. అనృపాలునియసమసాయకతఁజూచి, వానిసుమహితకార్ముకత్వంబుఁ జూచి, మనుజులవ్విభుజోకకుమారుఁబోల్తు, రతనిసౌందర్యమునుశౌర్యమట్టిదగుట." వు. ౧, ఆ.—విశే. 1. సమానము; "క. పెక్కువకుసాటియునుగా, కెక్కువకుంగా కజోకనీతనికంటెన్, దక్కువయయురానిఁకనను, మక్కువవీడ్కొలుపుమనిసమగ్రవినీతిన్." ఉ, రా. ౨, ఆ.—2. అధీనము; "క. జోకైయుండుఁబదార్థము, చేకుఱునందాఁకధనికుఁజేరిమహాత్మా." ౫, ఆ.—3. యుక్తము. "క. అకుర్కురమును వేఁటకు, జోకై." భిల్లా. ౨, ఆ.

**జోకచేయు.** ద్వి. స. క్రి. 1. సంపాదించు; "నీకె విధంబుననువిత్తముజోకచేసెదవు." హరిశ్చ. 3, ఆ.—2. సిద్ధపఱచు. "సీ. శ్వేతకేతుఁడుజోకచేసితెచ్చినపదార్థవ్రన్నెయంచహుమాయివడిగ నెక్క." ఉ, రా. ౨, ఆ. (ఇట్లు జోకకావించు.)

**జోకపడు.** ద్వి. అ. క్రి. జేతపడు. (ప్రే. జోకపఱచు. "ఎ, గీ. ఆమహాభాగుఁడచ్యుతుఁడాదరమున, మీకుననఘాఖ్యవిఖ్యాతిజోకపఱచె." భాగ. ౭, స్కం.

**జోకు.** దే. స. క్రి. తిట్టు. వి. తిట్టుట.

**జోకొట్టు.** దే. స. క్రి. 1. బిడ్డలునిద్రపోవుటకుఁగాను జోజోయని చేతవీఁపునమెల్లగాతట్టు; "క. లోకములునిదురవోవను, జోకొట్టుచు నిదురవోనిసుభగుఁడురమణుల్, జోకొట్టిపాడనిదురన్, గైకొను క్రిమనూరకుండెఁగను దెలివియున్." భాగ. ౧౦, స్కం. పూ.—2. చఱచు. "ఉ. వట్టిమఱుంగుఁజెట్టిమనుఁవంబనిలేదిదియెల్లఁజేరిజో, కొట్టుటకాఁక." ప్రభా. 3, ఆ.

**జోగపట్టియ.** వై. వి. యోగపట్టము, (రూ.) జోగపట్టె. "గీ. పులికళాసముకకపాలబూదిపూఁత, జడలుపాత్త్రఁబుకుదురక్కసరులుకావి, పట్టములులాతమును జోగపట్టియయును, దనరనయ్యింతిఁజేరిదీవనలిడుటయు." అచ్చ. ఆర, కాం.

**జోగము.** వై. వి. యోగము. "సీ. పదలుకానుపుఁదిండిచలువపాన్పునఁబండిజోగంపునిదురలఁజొక్కుచుండ." అచ్చ. బాల, కాం.

**జోగి.** యు. దే. వి. (జోగు+ఇ.) భిక్షుకుఁడు. వై. యోగి. "క. ఎక్కడదొరకెనొకోయీ, చొక్కపుగుబ్బెతవెడంగుజోగికినహహా." కళా. 3, ఆ.

**జోగిణి.** వై. వి. 1. ఒకానొక స్త్రీదేవత; "సీ. జోగిణిఁగొసరిబైసుకవెట్టిపలకపైసారెలు వోయించిసరముచూచి." ఉ, హరి. 3, ఆ.—2. సోదకత్తె*. "వ. జ్వరశాంతియగుటమున్నొకజోగిణి చేవింటి." షో. ౮, ఆ.

**జోగు.** దే. వి. 1. భిక్షము; 2. జనులెక్కిపోయెడియోడ. "మ. నునుఁగప్రంపుటనంటివిప్పఁబొరయన్ జోగెక్కిమాధ్వీమహా, వనధింబుప్పొడిదీవికిన్ మధుకరవ్యాపారులేతేరఁద, ఘనకర్పూరపటంబులందుకొనివేడ్కన్ గోరకవ్యూహమో, హాముక్తావళిఁదార్చి నీతఱుగుగావ్వజ్ఞాక్షిచిత్తించితే." వసు. 3, ఆ. "వ. మార్తాండుండుకొండప్రక్కంజిక్కికపిలి మొగయక్కలిం దగులువడిన జోగునుంబోలెసెదురునడవమరలంబఱవలేక చీకాకుపడియున్నవాఁడు." కాశీ. ౨, ఆ.

**జోగురాలు.** దే. వి. (జోగు+ఆలు.) భిక్షుకురాలు.

**జోజో.** దే. అవ్య. సుఖముగానుండుమనెడు దీవ. "క. జోజోకమలదళేక్షణ, జోజోమృగ

రాజమధ్యజోజోకృష్ణా, జోజోపల్లవకరపద, జోజోపూర్ణేందువదనజోజోయనుచున్." భాగ. ౧౦, స్కం. పూ.

జోటి. వై. వి. ఆఁడుది, ఇంతి. "ఉ. చూడకచూచుచుమాడ్కినలజోటిదిశల్ పరికింపనొక్కచో." స్వా. 3, ఆ.

జోటిక. వై. వి ——పై.—— "ఉ. కూడిచరించుచునున్నమానవుల్, జోటికలైరితానుసొకసుందరియయ్యెమహాద్భుతంబుగన్." పు. ౨, ఆ. (స్వార్థమున కప్రత్యయము.)

జోటికత్తియ. వై. వి. చెలికత్తియ, (రూ. జోటికత్తె.)

జోటిపని. ద్వ. వి. (జోడు+పని.) మిథునకృత్యము.

జోడఁగి. దే. వి. మిక్కిలి వేగముగా పరుగెత్తెడు వేఁటకుక్క. "క. దాడిమెయిదీనివెంబడిఁ, గూడన్ శబజాగిలములకుందరమేయీ, జోడంగివేపిమునుపఁ, లేడియుగీడియుజనంగలేదదుగైనన్." పు. ౨, ఆ.

జోడగించు. దే. స. క్రి. జోడననడతో నడపించు. "గీ. ఎనయఁగడుజోడగించిత్రోలినహయంబు. కనదుపత్క్షంబు నేలపైఁదాఁకినటుల, నోరిలోఁగాళ్లువెళ్లెడునోయనంగఁ, గంచుమించుగధరణిగ్రక్కదలఁగదల." సా. ౧, ఆ.

జోడన. దే. వి. అశ్వగతివిశేషము, (చూ.) ధారితకము. "సీ. జోడనలకొకింతజోడుగా నేరకవేల్పురాయనితేజివెల్లనయ్యె." ఉ, రా. ౧, ఆ.

జోడమ్ము. వై. వి. (జోడు+అమ్ము.) చేయమ్ము. "సీ. దివెదారుకొమ్ముతోల్ తిత్తియుజోడమ్ముమెడమీఁదిమొగలాకుగొడుగుఁదనర." ఆము. ౬, ఆ.

జోడాలు. వై. వి. బ. నతివిశేషము*.

జోడించు. వై. స. క్రి. జతచేయు, చేర్చు. "శా. దక్షుండెవ్వాఁడిలరామభారతకథల్ జోడింప భాషాకృతిన్." రాఘ. ౧, ఆ.

జోడింపు. వై. వి. మల్లబంధవిశేషము*. (చూ. ఆరగింపు.)

జోడు. యూ. దే. వి. కవచము. "క. ఓడవుసురాసురాదుల, కోడవుభవజలధిఁగడపనొండెవ్వఁడునీ, జోడుజగంబులమాకుం, జోడుభవత్కారుణమనుపఁజూడుమహాత్మా." రామా. 3, ఆ. (ఇదియె సమానమనుటకు నుదాహరణము.) — వై. జత*; "ఎ, గీ. వారలిరువురుబాల్యభావమునఁజేసి, శయనపానాన్నభోజనసమయములను, శాస్త్రపఠనాదివిద్యాప్రసంగములను, జోడువాయకయుందురువేడుకలర." బ్ర. ౫, ఆ. "కన్నుఁగవతామరజోడుతెఱంగుదాల్చె." ఉ, హరి. ౫, ఆ.—చెప్పులాజత. విణ. సమానము*.

జోడుకోడియ. ద్వ. విణ. 1. సమానుఁడు, సమానము. "ఎ, గీ. జాళువాగట్టుతోడి, జోడుకోడియలప్పొటిమేడగములు." రామా. ౧, ఆ.—2. జత. (రూ. జోడుకోడె. సమానుఁడనుటకు.—"అతఁడునీజోడుకోడె." జై. 3, ఆ.—జతయనుటకు.—"సహస్రమయూఖునిజోడుకోడె." పా. ౨, ఆ.)

జోడువేల్పులరిక్క. ద్వ. వి. విశాఖనక్షత్రము.

జోణఁగి. జే. వి. జోడఁగియొక్క రూపాంతరము.

జోత. దే. వి. నమస్కారము. "జోతలుకైటభాసురగర్వహరునకు." రుక్మాం. ౧, ఆ. (రూ. జోతము.)

జోతాము. దే. వి.——పై.——(జోతముయొక్క రూపాంతరము.)

జోతి. వై. వి. 1. కాంతి; "రాతిరియొకమీఁదఁజోతియుండెడునాఁడు." శశాం. ౨, ఆ.—2. దీపము*. "చ. ధనకాంబుజభాజనరాజినావటిం, చినకుసుమాన్నరాశిపయిఁజక్కనిచెందొవజోతినిల్పియు, ప్వనితకుఁజుట్టిరాబడిసివైచి." వసు. 3, ఆ.

జోదు. వై. వి. యుద్ధముచేయుబంటు, యోధుఁడు.

జోనంగి, జోణంగి. దే. వి. ఒకజాతికుక్క.

జోనడ. దే. వి. జోడనయొక్క రూపాంతరము. (ఇందు వర్ణవ్యత్యయము.)

జోబిల్లు. దే. వి. బ. నమస్కారము. "రగడ. ఘనతనహిబలగమడాద్రిహర, దాన్యసురవధునకునతిజోబిల్లని." (ఇక్కడ నతిశబ్దమునకు నమ్రతయర్థము.) హంస. ౪, ఆ

జోరాసరి. దే. వి. బలాత్కారము. (ఇది తెనుఁగుదేశములయందును వాడఁబడుచున్నది.)

జోరు. దే. వి. 1. కురియుటయందగుధ్వన్యనుకరణము. "ఉ. బోరునదుందుభుల్ మొరసెఁబుష్పమయంబగువర్షమంతటన్, జోరునవెల్లిగాఁగురిసె." చమ. 3, ఆ.—2. బలము, బలాత్కారము.

జోఱీఁగ. దే. వి. (జోఱు + ఈఁగ.) ఒకదినుసు ఈఁగ, పశుమక్షిక.

జోఱు. దే. వి. ధ్వన్యనుకరణము. (చూ. జోఱీఁగ.)

**జోల.** దే. వి. బిడ్డల నిద్దురపుచ్చునప్పుడు పాడెడు పాట. "సీ. వేదాంతవేద్యుఁడీవిశ్వంభరాధీశుకు ద్ధాంతకాంతలజోలఁజోక్క." రామా. 3, ఆ.

**జోలి.** దే. వి. 1. సంగతి, సంబంధము; (నాజోలికి రాకుము. జోలిమాలినపని.)—2. వృత్తాంతము. "గీ. అటులుజంబుమాలిదిటమంతయునుదూలి, సరగఁబోరఁగూలిజమునిప్రోలి, కేగినట్టిజోలియిం అచిమేపరులోలిఁ, దెలుపనొడుగఁ అచిదీవి సేఁడు." అచ్చ. సుం, కాం.

**జోలియ.** దే. వి. జోలె.

**జోలె.** దే. వి. చేకపుగుడ్డ నాలుగంచేలును జేతి జేతగాఁజేర్చి ముడివేసికుట్టి చేంకను వ్రేలవేసికొనెడుసంచి. (జోలియయొక్క రూపాంతరము.)

**జోవ.** దే. వి. జోలయొక్క రూపాంతరము. "ఉ. కాచముల్, జోవలువాడఁజల్లఁదరుచుక్క పడిఁద ర్శినిరజ్జుపాణియై." పంచ. వేం. ౧, ఆ.

**జోసి.** వై. వి. జోస్యుఁడు.

**జోస్యము.** వై. వి. జ్యోతిశ్శాస్త్రము.

**జోస్యుఁడు.** వై. వి. జోస్యము నెఱిఁగినవాఁడు, జ్యోతిషికుఁడు. "గీ. వలయుఁబ్రాహ్మణోదఙ్ముఖత్వ ములనొకటి, తారకంబులుతిథులునువారములును, జోస్యులెతెఁగించినవిమేలునుప్రవైక, శీల మంగళిపనికినిద్రెలమునకు." భార. అను. ౪, ఆ.

**జోహరు.** దే. వి. జోహారుయొక్క రూపాంతరము.

**జోహరువు.** దే. వి. జోహారువుయొక్క రూపాంతరము. "ఎ, గీ. అతఁడుసురలకుజోహారువనుచు మ్రొక్క." నై. ౭, ఆ.)

## జౌ.

**జౌకు.** దే. అ. క్రి. మిక్కిలి మెత్తగిల్లు. (కట్టుకట్టి గడ్డజౌకినది.)—వి. బురద. (జేవుకుయొక్క రూపాంతరము.)

**జౌజెవ్వ.** దే. వి. 1. పాఱుటయందగుధ్వన్యనుకరణము. "శరసంధానముతోనెకొన్నియడుగుల్ జౌజెవ్వనంబాటి." స్వా. ౪, ఆ.—2. క్రుంగుట యందగుననుకరణము. "ఉ. ఇవ్విధిఁబూనిసైనిక సమృద్ధినహీంద్రఫణాగణంబుజౌ, జవ్వనక్రుంగ." పర. ౪, ఆ. (జేవుజేవ్వయొక్క రూపాంతరము.)

**జౌరు.** దే. స. క్రి. 1. కొట్టు; "సీ. వాల్గంటికేల్గం టువైచివచ్చినచెల్వుజడయల్లుకొనునాటి సొరు జౌరు." విజ. 3, ఆ.—2. చేతులతో కుప్పచేసి యెత్తు. (జేవురుయొక్క రూపాంతరము.)

## ఝ.

**ఝ.** ఒకయక్షరము.

ఝుంకరించు. సం. అ. క్రి. ఝుంకారముచేయు.

ఝుంకారము. సం. వి. అ. పుం. తుమ్మెదరొద.

ఝుంకృతి. సం. వి. ఇ. స్త్రీ. ఝుంకారము.

ఝుంఝు. సం. వి. ఆ. స్త్రీ. 1. వానగాలి; 2. ధ్వని విశేషము.

ఝంప. సం. వి. ఆ. స్త్రీ. 1. జంపెతాళము; 2. దూఁకుడు.

ఝకటము. సం. వి. అ. పుం. జెగడము.

ఝట. సం. వి. ఆ. స్త్రీ. నేలయుసిరిక?.

ఝరము. సం. వి. అ. పుం. సెలయేఱు, నిర్ఝరము. (ఇది అకారాంత స్త్రీలింగమునగును.)

ఝరసి. సం. వి. ఈ. స్త్రీ. చేతరాసి?.

ఝరి. సం. వి. ఈ. స్త్రీ. 1. సెలయేఱు, (రూ.) ఝూరి; 2. తేళ్లపుట్ట.

ఝర్ఝరము. సం. వి. అ. పుం. 1. కయిముడియనువాద్యవిశేషము; 2. మణిదోషవిశేషము; 3. నది విశేషము; 4. కలియుగము.

ఝర్ఝరి. సం. వి. ఈ. స్త్రీ. ఝర్ఝరము, కయిముడి.

ఝల్లరి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఉడుక; పెద్దడోలు వంటి వాద్యవిశేషము. (అని కొందఱు.) 2. జాలరు; 3. నీటిసుడి. (రూ. ఝాల్లరి.)

ఝష. సం. వి. ఆ. స్త్రీ. బీఱ?. అ. పుం. మ. 1. చేప; 2. మొసలి; 3. అడవి.

ఝషకేతుఁడు. సం. వి. ఉ. పుం. మన్మథుఁడు. మీనుసిడముమేటి.

## ఝా.

ఝాటము. సం. వి. అ. పుం. 1. సమూహము; 2. కాఱడవి; 3. పొదరిల్లు; 4. చీఁపురుకట్ట.

ఝాటలము. సం. వి. అ. పుం. మొక్కపుచెట్టు.

ఝాటలి. సం. వి. ఈ. స్త్రీ. 1. మొక్కపుచెట్టు; 2. పొదరిల్లు.

ఝాబుకము. సం. వి. అ. పుం. సన్నపుఆకులపక్షి?.

## ఝు.

**ఝుంటి.** సం. వి. ఈ. స్త్రీ. 1. నల్లగోరంటి; 2. తెల్లగోరంటి. ములుగోరంటి. (అని కొందఱు.)

**ఝిల్లి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఈలపురుగు; 2. ఈలపురుగుకూఁత; 3. ఎండజిగి; 4. తుడిచెమగుడ్డ.

**ఝిల్లిక.** సం. వి. ఆ. స్త్రీ.——పై.——

## ఝు.

**ఝురుక.** సం. వి. ఆ. స్త్రీ. ఈలపురుగు, ఝిల్లి.

## ట.

**ట.** ఒక యక్షరము.

**టంకకము.** సం. వి. అ. పుం. వెండినాణెము.

**టంకణము.** సం. వి. అ. న. వెలిగారము.

**టంకము.** ఉభ. వై. వి. పదియాఱుడబ్బులబంగారు నాణెము, దీనారము*. "మేలుగాకేమిటంకాల గాశేములెవ్వి." కాశీ. 2, ఆ.—సం. అ. పుం, న. 1. వెలిగారము; 2. గడ్డపాఱ; 3. నల్లవెలఁగ. పుం. 1. కాసెయులి; 2. కత్తి; 3. కత్తియొఱ; 4. కోపము. (ఇది ఆకారాంత స్త్రీలింగమైనప్పుడు పిక్క అర్థము.)

**టంకరించు.** సం. స. క్రి. టం అని నారిని మ్రోయించు. "వ. హుంకరించుచునహంకరించుచుధనస్సులంబులుటంకరించుచు." భాగ. ౘ, స్కం.

**టంకవాటు.** ద్వ. వి. (టంకము+వాటు.) ఒకానొక బంగారునాణెము. "ద్వి పీటలుతలగడల్ బిరుదులుటంక, వాటులకొప్పెరల్ వాద్యఘోషము లు." రా. కిష్కిం, కాం.

**టంకసాల.** వై. వి. (టంకము+సాల.) నాణెముల ముద్రించెడుచోటు.

**టంకసాలవాటు.** ద్వ. వి. టంకవాటు. "గీ. వాఁ మొనరించిగెలిచితత్వంబుఁదెలుపు, వానికనిబీఱ పువ్వులుఁబోనిటంక, సాలవాటులునించియాస్థానిఁగట్టఁ, గాలసర్పముగతి వ్రేలుజాలెఁజూచి." ఆము. ౨, ఆ.

**టంకారము.** సం. వి. అ. పుం. 1. వింటినారియొక్క ధ్వని; 2. ఆశ్చర్యము; 3. ప్రసిద్ధి.

**టంకు.** దే. విణ. 1. నాగరికతకలవాఁడు; 2. డాంబికుఁడు. (చూ. సిరంగఁడు.)

**టంకృతి.** సం. వి. ఇ. స్త్రీ. వింటినారియొక్కధ్వని. టంకారము.

**టంగు.** దే. వి. టంగువాఱు.

**టంగువాఱు.** దే. వి. గుఱ్ఱములమీఁదిగంతి జాఱక బిగఁగట్టెడువాఱు.

**టకటొంకు.** దే. విణ. కుత్సితము. (చూ. సిరంగఁడు.)

**టక్కరి.** వై. విణ. (టక్కు+అరి.) మోసకాఁడు, మోసకత్తె.

**టక్కరికాఁడు.** వై. విణ. మోసకాఁడు. "గీ. ఓరి టక్కరికాఁడయియోవ్యాజలేని, కఱదలేటికివినుర నిక్కముగనిపుడు." అచ్చ. సుం, కాం. (స్వార్థమునకాఁడు.)

**టక్కియము.** దే. వి. ధ్వజము, టక్కెము. (ఇట్లు కొందఱు వ్రాసియున్నారు. దీనికి తగిన ప్రయోగము కనఁబడలేదు.)

**టక్కు.** వై. వి. మోసము*.

**టక్కుబాజీతనము.** వై. వి. టక్కరితనము.

**టక్కులాఁడి.** ద్వ. విణ. (టక్కులు+ఆఁడి.) టక్కులుచేయునది. (ఆఁడుది.)

**టక్కులాఁడు.** ద్వ. విణ. (టక్కులు+ఆఁడు.) టక్కులుచేయువాఁడు.

**టక్కెము.** దే. వి. టక్కియముయొక్కరూపాంతరము.

**టపా, టపాలు.** హిం. వి. అంచె.

**టపాకాయ.** దే. వి. బాణసంచావిశేషము.

**టలాయించు.** దే. క్రి. అటునిటు తిరుగు. (రూ. తస్సా.)

**టస్సా.** హిం. వి. రీతి, అచ్చు.

## టా.

**టాకనా, టంగనా.** హిం. వి. మట్టసపుగుఱ్ఱము.

**టాకు.** దే. వి. 1. ఉంగరము మొదలగునది జాతిరాకుండ బంగారులోఁగువానితో చేసివేసికొనెడు సన్నని సాదాఉంగరము; 2. ఓర. "ఉదిరి బంగరుబవిరి టాకులపచ్చలడంబుమీ ఱుతిన్నెలు." శకాం. ౪, ఆ.

**టాటోటు.** దే. వి. మోసము, కపటము.

**టాటోటుకాఁడు.** దే. విణ. మోసకాఁడు.

**టాపు.** ఆం. వి. పైభాగము.

**టాలాటోలితనము.** గ్రా. వి. టక్కరితనము.

## టి.

**టికము.** వై. వి. వెన్నెముకక్రిందిచోటు, ముడ్డిపూస.

**టికెట్టు.** ఆం. వి. రైలు అధికారులు ప్రయాణస్థులకిచ్చు కేవుచీటి.

టిట్టిభకము. సం. వి. అ. పుం. లకుముకిపిట్ట.
టిప్పణము. సం. వి. అ. పుం. టీకకు టీక.
టిష్టి. దే. వి. మోసెడు జంతువు.

టీ.

టీక. సం. వి. ఆ. స్త్రీ. అర్థవివరణము.
టీకము. దే. వి. ఒరగల్లు. (చూ. ఊఁదుఁగ్రోవి.)
టీకా. దే. వి. 1. ఒకదినుసు పతకము; 2. స్ఫోటకము పొడిపించుట.
టీను. దే. వి. నడచుటయందలి నిక్కు.
టీచరు. ఆం. వి. ఉపాధ్యాయుఁడు.
టీపు. దే. వి. తుంచినడవడికకు పూటగాఁగట్టిన ధనము

టూ.

టూకీ. దే. వి. సంగ్రహము.
టూకించు. దే. స. క్రి. సంగ్రహించు.

టె.

టెంక. దే. వి. ఎండినమామిడియూరుగాయలోని విత్తు; 2. మామిడికాయలోని విత్తు.
టెంకణము. దే. వి. నమస్కృతి. "రగడ. ధానుష్క స్థలిఁదలకొనుజగతీ, శ్వరునకుఁబెట్టెదనరి టెంకణములు." హంస. ౪, ఆ.
టెంకాయ. దే. వి. (టెంక + కాయ.) నారికేళఫలము.
టెంకాయచెట్టు. దే. వి. నారికేళము?.
టెంకి. దే. వి. 1. స్థానము; 2. తాటాకులకు బెజ్జము వేసెడు సాధనము.
టెంకియ. దే. వి. టెంకి.
టెంకె. దే. వి. మాదిగవాఁడు బెజ్జము వేసెడు సూది. (టెంకియయొక్క రూపాంతరము.)
టెక్కి. దే. వి. దాసరికుల్లాయి. "గౌదకట్టుకసెచేరులటెక్కియు." ఆము. ౬, ఆ.
టెక్కియము. దే. వి. టెక్కెము.
టెక్కు. దే. వి. యౌవనాదులవలనఁగలుగు గర్వచేష్ట. "ఎ, గీ. జక్కవలుగేరఁగలుగల టెక్కుజార." చంద్ర.
టెక్కులాఁడి. దే. విశే. (టెక్కులు + ఆఁడి.) టెక్కులుఁగలది. (ఆఁడుది.) ఉ, రా. ౪, ఆ.
టెక్కులాఁడు. దే. విశే. (టెక్కులు+ఆఁడు.) టెక్కులుగలవాఁడు.
టెక్కువ. దే. వి. టెక్కు. "ఎ, గీ. అఖిలకళలందుఁ దోడునీడగుచు మెలఁగు, నధిపునకుఁబాలమున్నీటియాఁడుబిడ్డ, యరిదిమక్కువఁడెక్కువనవిరళము, నురముడింపకయతఁడుతన్ను పచరింప." కళా. ౮, ఆ.
టెక్కెపుగాము. ద్వ. వి. (టెక్కెము + గాము.) కేతుగ్రహము.
టెక్కెము. దే. వి. ధ్వజము. (టెక్కియముయొక్క రూపాంతరము.)

టే.

టేంకణము. సం. వి. అ. పుం. ఒకానొకదేశము.
టేఁకి. దే. వి. మత్స్యవిశేషము.
టేఁకు. దే. వి. తేఁకు, క్రకచపత్రము?.
టేఁకుదీవి. ద్వ. వి. శాకద్వీపము.
టేపు. ఆం. వి. నాడా.
టేవు. దే. వి. మండుటయందగు ధ్వన్యనుకరణము. "ఉ. లావునవైరిదర్పము వెలార్పకయాఁకలిగొన్న చేతులన్, భావభవారిపాదములఁబట్టిపరాక్రమకేళిఁగోరితిన్, టేవునమండియన్న మతిటెక్కుముకూలినయప్డు సంగరం, బేవలనైనఁగల్గనిరయేన్ హరుఁడొండొకమోదమేటికిన్." ఉ. హరి. ౫, ఆ.

టై.

టైము. ఆం. వి. కాలము.
టైలరు. ఆం. వి. కుట్టుపనివాఁడు, దర్జీ.

టో.

టోకు. దే. వి. 1. మొత్తము; 2. జెట్లుభుజములో భుజముతాఁకించుట. "మ. లేగాడ్పుసా. దనదీదుల్ తగసాముచేయుటకుఁగాంతాకంటె టోకీయ్యఁగన్." చంద్ర.
టోపి. దే. వి. పట్టులోనగువానితో నేర్పఱచిన కిటము. "చ. జిలుఁగుమృణాళతంతుకృతచేలము తోఁజిగురాకుటోపితో." రా, వి. ౫, ఆ.
టోలా. హిం. వి. గుంపు.
టోలి. హిం. వి. పైసలో ఎనిమిదవ భాగము.

ఠ.

ఠ. ఒకయక్షరము.
ఠంగుఠంగు. దే. వి. ఆయుధము లొకటితో నొకటి తాఁకునప్పుడు కలిగెడు ధ్వన్యనుకరణము. (చూ. ఖంగుఖంగు.)

ఠక్కుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) మోసకాఁడు.

ఠక్కురుఁడు. సం. వి. అ. పుం. దేవత, వేలుపు.

ఠలాయించు. హిం. క్రి. అటునిటు తిఱుఁగు.

ఠవఠవ. దే. వి. శ్రమము. "క. దివిబిసరుహబాంధవ సైం, ధవసంఘంబెంతదవ్వుదగలేకరుగున్, భు వినంతదవ్వునేమును, ఠవఠవలేకరుగుదుముహు టాహుటినడలన్." స్వా. ౧, ఆ.— అడ్డంకి. (అని కొందఱు.)

ఠవణించు. దే. ప్రే. ఠవణిల్లఁజేయు, కావించు. "క. ఠవణింతు నొక్క శ్రీభా, గవతచరిత్రంబుపరమ కల్యాణసము, ద్భవభవనంబుఁజతుర్దశ, భువనమ హారత్నసూత్రముగఁదగు సరణిన్." పాండు. ౧. ఆ.

ఠవణిల్లు. దే. అ. క్రి. 1. ప్రవర్తిల్లు; "సీ. ఎవ్వఁడుఠ వణిల్లునెల్లజీవులయందుఁబూసలలోనున్న బొం దువోలె." కాశీ. ౫, ఆ.—2. ఒప్పు. "సీ. శ్రీ పాదములఁబైఁడిచిఱుగజ్జియలతోడఠవణిల్లుగం ధపెండారమమర." కాశీ. 3, ఆ.

ఠవరి. దే. విశే. నేర్పరి. "క. కొమ్మపయిఁబత్త్రపాత ము, నెమ్మెయినెఱపుదువిదేలయేఁచెదవకటా, క మ్మఁగనవాతుచక్కెర, కమ్మగమాటాడుఠవరకల నంఠవరా." విజ. 3, ఆ.

ఠవళి. దే. వి. మోసము, కపటము. "క. బంతిమొగం బులరిక్కసుఁ, డెంతయువైళంబఠవళియేఱుపడఁ గన్." అచ్చ. అర, కాం.

ఠవళికాఁడు. దే. విశే. మోసకాఁడు. "క. అటులున్న ఠవళికానిన్, దటుకునఁబొడఁగాంచి." అచ్చ. యు. కాం.

ఠవిణ. దే. వి. డవిణయొక్క రూపాంతరము. "సీ. గ్ర హరాజురథముముంగల జయాంకంబుగా డాకొ ల్పవజ్రంపుఠవిణయునఁగ." భాను. 3, ఆ.

ఠా.

ఠాకుఱు. వై. వి. గ్రా. 1. దేవత; 2. అధిపతి*; 3. తండ్రి*; 4. గురువు*. (ఇది వాడుకలోనిది.)

ఠాణా. హిం. వి. కావలిదండు, కావలిస్థలము.

ఠాయము. వై. వి. గ్రా. ఠాయియొక్క రూపాంత రము. "చ. ప్రమదయొకర్తుమాధవునిఁబాడవిపం చిధరించికేలసం, భ్రమమునఁదంత్రిమీటుచుఁ దిరంబుగఠాయముచేసియొక్కరా, గముతగనా లపించిసుభగస్వరజాతులువేఱువేఱుగా, నమరఁ గఁబాడెఁదన్ రమణుఁడౌనదారువులంకురింపఁ గన్." భాగ. ౧౦, స్కం. పూ.

ఠాయి. వై. వి. గ్రా. స్వరస్థాయి. "చ. ఠాయియు, ద్దిరస్ఫురితంబుమమ్మయనఁదేనియ లొల్కెడిజిల్గు పాటతోఁ, దరుణివిపంచిమీటె." ఉ, రా. ౬, ఆ.

ఠావు. వై. వి. గ్రా. స్థానము*. "క. ఈవిధమునవా ఘోషము, గోవిందుఁడుగాచికరుణకొనసాఁగం గా, గోవర్ధనాద్రిఁదొల్లిటి, ఠావున నిడి మహి మతో విడంబించుటయున్." వి, పు. ౭, ఆ.

ఠి.

ఠింగణా. దే. విశే. 1. బాలుఁడు; "గీ. సంగతియెఱయో యిసుమంతఠింగణావు, తత్త్వనిర్ణయవాదంబుతెర మెనీకు." ఆము. ౪, ఆ.—2. పొట్టివాఁడు.

ఠికానా. హిం. వి. ఆశ్రయము, గతి.

ఠీ.

ఠీవి. దే. వి. వైభవము. "సీ. ఠీవియుఁదేజుఁబొడియు మగఁటిమిఁదాల్మివడిఁగల్మినుడి వోనికడిఁది మేలు." అచ్చ. యు, కాం.

ఠే.

ఠేవ. దే. వి. 1. ఒప్పిదము; "మ. తనదుర్వారతరప్ర తాపశిఖిచేతంబుట్టుపీరాహితా, వనిరాట్పట్టణ భస్మపాళిఁ గొనిఠేవన్ వన్నెగావించునా, రనిజ శ్రీకరకీర్తిదర్పణముశ్రీరంగక్షమానాథనం, దన రత్నంబగువేంకటాద్రి జయపద్మాదర్శనార్థంబు గన్." రామా. ౧, ఆ.—2. విధము. "మన్నగ రయొప్పుబలభిన్నగరిఠేవన్." స్వా. ౫, ఆ.

ఠో.

ఠోలా. దే. వి. తెగ, సమూహము.

డ.

డ. ఒకయక్షరము.

డంక. దే. విశే. దిట్ట. "గీ. కొంకులేనివెతలఁగుందెడి ముగుదల, డంకతనముమీఱజంకులేక, బింకము నఁగలంచెదింక నెన్నఁడునీకు, వంకగల్గదోటుజిం కతాల్ప." నీలా. 3, ఆ.

డంకా. వై. వి. డక్కయొక్క రూపాంతరము.

డంగు. దే. అ. క్రి. దంగుయొక్క రూపాంతరము. (చూ. డంచే.)

డంగురము. దే. వి. చర్మవాద్యవిశేషము.

డంచే. దే. ప్రే. దంచేయొక్క రూపాంతరము. "డంపుదు మేకుభృత్యురివ్వఘంబుల." కాశీ. ౭, ఆ.

డంబము. వై. వి. 1. స్థితికిమించినవేషము*; 2. ప్రతిష్ఠ*. (చూ. డంబు.)

డంబరము. సం. వి. అ. పుం. విజృంభణము. "సీ. వాగ్డంబరమునఁగైవారంబు చేసితితగుదు వాచస్పతిత్వమునకీవు." కాశీ. ౪, ఆ.

డంబు. వై. వి. 1. కపటము; "పంచచామరము. నరాదుఁడీమృగంబు డంబునన్ వనంబులోనఁగానరా." ఉ, రా. ౧, ఆ.—2. స్థితికిమించినవేషము*; "ద్వి. తనడంబుతప్పకధనికులయిండ్ల, కనువునఁ జనివారికనురాగమొదవ, రత్నమొక్కలు మొక్క." హరిశ్చ. ౨, భా.—3. కాంతి*; (చూ. క్రొత్తడము.)—4. గర్వము*; "మ. క్షితినాథుఁడు నేను దిగ్విజయమున్ జేయంగడాయన్ గడిన్, బ్రతివీరప్రకరంబు డంబుమెయిఁగప్పం బొప్పనంబికయే, కతమాడంగలరే నరేశ్వరశిరోగర్వంబు సర్వంబుఁబో, పితిమీరానవరప్రసాదమున మీ పెంపెల్లెడన్ జెల్లఁగన్." ఉ, హరి. ౪, ఆ.—5. ప్రతిష్ఠ*; "ద్వి. నరుఁడుడంబునకుజన్మముచేసి నేని, నరనాథవైశసనమునదుఃఖించు." భాగ. ౬, స్కం.—6. విధము*. "సీ. తనదివ్యమకుటంబు తనడంబుననంత మణిసంతతద్యోతమహిమఁగాంచ." ఉ, రా. ౧, ఆ.—విణ. అధికము*. "క. డంబుగఁబంచమహాశ, బ్దంబులు మ్రోయంగ." రా. అ, కాం.

డక్క. వై. వి. వాద్యవిశేషము, ఢక్క.

డక్కి. వై. వి. డక్క, డమరువు. (అని కొందఱు.)

డక్కు. దే. అ. క్రి. దక్కుయొక్క రూపాంతరము. "ఉ. అక్కటమందభాగ్యునకునట్టితనూభవరత్నమెవ్విధిన్, డక్కెను." భార. ద్రో. ౨, ఆ.

డక్కొను. దే. అ. క్రి. దక్కొనుయొక్క రూపాంతరము.

డగర. దే. వి. పిశాచము. "గీ. మగువగాదురయిది పెనుడగరగాని." కళా. 3, ఆ.—విణ. గండు "ఎ, గీ. చొక్కముగఁబాటపాడుచుక్కొక్క చోట, డగరకోయిలలెల్లఁజొట్టలికమరయ." ఉ, రా. ౭, ఆ.

డగరము. దే. వి. కీడు. "గీ. కెలనివారికి నెంతటికీడు వచ్చె, నేనిఁదోలగించుహరితనకెగ్గుసేయు, వెడఁగుఁజెలుపఁడెయెదిరికిమడఁచువాఁడు, తనకుడగరంబుచెలువుచుకొంతటిభరంబు." ఉ, హరి. ౫, ఆ. (రూ. దగరము.)

డగ్గర. దే. వి. డగరయొక్క రూపాంతరము.

డగ్గఱ. దే. వి. విణ. దగ్గఱయొక్క రూపాంతరము "చ. అతినిష్ఠురఘోర విశాల దండతా, డనములుచేయుచున్ జయునిడగ్గఱకుంగొనిపోయి చూప." భల్లా. 3, ఆ.

డగ్గతించే. దే. అ. క్రి. దగ్గతించుయొక్క రూపాంతరము. "వానికింగాలముడగ్గతించె." ఉ, రా. 3, ఆ.

డగ్గఱు. దే. అ. క్రి. దగ్గఱుయొక్క రూపాంతరము. "క. వెఱచఱచివెగడుపడిని, వ్వెఱఁగందుమఁగురుబలంబువీరులతనిడ, గ్గఱకంతనంతఁజూచెఁ, నుఱకనదీసుతుఁడుదాఁకెనుద్భటభంగిన్." భా. భీష్మ. ౨, ఆ. "సీ. యజ్ఞంబుఁజూచెదరమ్మని వేఁడుకొనివారిఁగదలింపనేఁడుడగ్గఱుట దెలిసి." జై. ౮, ఆ. (చూ. డగ్గఱ.)

డగ్గు. దే. అ. క్రి. వి. దగ్గుయొక్క రూపాంతరము.

డగ్గుత్తిక. దే. వి. (డగ్గు+గుత్తిక.) గద్గదస్వరము, గాద్గద్యము. "మ. అనిడగ్గుత్తికతో మహాభయముతో నాకంపితాంగంబుతో." భాగ. ౧౦, స్కం. పూ.

డజన్. ఆం. వి. పండ్రెండు, డజన్ బాజీ. చాలదెబ్బలు.

డప్పి. దే. వి. దప్పియొక్క రూపాంతరము. (శ్రీనాథునకు. — "ప. నీవుకడుదూరంబువచ్చిడప్పితి, ఇంకమరలుటలెస్స, అనిపలికిననప్పతివ్రతయిట్లనియె. గీ. నాకుడప్పియొక్కడిదియనంబుభక్తి చరణపంకజాసక్తమైకరముభక్తి, నలరుమన్న సతులకునన్యమెట్టి, దియునుధర్మమెభర్తృసంప్రీతియమెకాక." భార. అర. ౭, ఆ.)

డప్పు. దే. వి. తప్పెట, తమ్మటము.

డబడబ. దే. వి. ఉద్ధతి. "సీ. పాలనాడురాముఁడ్రెబూతంపుఁజిల్కాలఁ గొట్టినడబడబల్ గట్టువడియె." చమ. ౨, ఆ.

డబ్బఱ. దే. వి. దబ్బఱయొక్క రూపాంతరము. "క. డబ్బఱలుపల్కువారికడ్డ బుకలదె." కాశీ. ౪. ఆ.

డబ్బా. దే. వి. తుపాకిమందులోనగునవి యుంచుకొనెడు తోలుపెట్టె.

డబ్బాటు. దే. క్రి. విణ. అవ్య. అకస్మాత్తుగా. "క. ఒకనాఁడజాంఘునీవీ, వకుడబ్బాటరుగుదెంచుట

యు." భార. శాం. 3, ఆ. (ఒకానొకఁడు డబ్బా టుమైనని ప్రయోగించియున్నాఁడు. అది విచార్యము.)

డబ్బాటుసాకిరి. ద్వ. విశే. ప్రసంగవశమునవచ్చి యొల్లకార్యములు తెలిసికొనినసాక్షి, యదృచ్ఛాభిజ్ఞుఁడు.

డబ్బి. దే. వి. బరణి.

డబ్బు. యు. దే. స. క్రి. బొంకాడు. (వాఁడొకడబ్బుడబ్బెను.) వి. 1. బొంకు; 2. రెండుదుగ్గానుల రాగినాణెము; 3. ధనము; 4. ఒకానొకశకునపుఁబక్షి. (చూ. గబ్బులుఁగు.) విశే. బొంకైనది. "ఇవి మిక్కిలిడబ్బులునిలువుముచాలు." పర. ౫, ఆ.– వై. డంబము*.

డబ్బుడుబ్బు. దే. వి. ఆయుధము లొకటితోనొకటి తాఁకునప్పుడు కలిగెడు ధ్వన్యనుకరణము. (చూ. ఖంగుఖంగు.)

డబ్బురి. దే. వి. 1. వెడలుపాటి నోరుగల లోహపాత్రవిశేషము; 2. గిన్నె. (చూ. దబ్బుర.)

డమరము. సం. వి. అ. పుం. కొల్లమొదలగు దేశోపద్రవము. హోవడి.

డమరుకము. సం. వి. అ. పుం. డమరువుయొక్కరూపాంతరము.

డమరుగము. వై. వి. చర్మవాద్యవిశేషము.

డమరువు. సం. వి. ఉ. పుం. 1. డమరుగము; 2. చమత్కారము.

డమాయి. వై. వి. చర్మవాద్యవిశేషము.

డమారము. వై. వి. డమాయి.

డమాను. హిం. వి. తెఱచాప.

డమ్మను. దే. అ. క్రి. (డం+అను) చేచ్చే.

డమ్మారము. వై. వి. డమారముయొక్కరూపాంతరము.

డయనము. సం. వి. అ. న. 1. బాలకాదులక్రీడాశకటము; 2. పక్షిగతి.

డయ్యు. దే. అ. క్రి. 1. బలహీనమగు, బడలు. "ఇంచుకసేపుపోరులఁ డయ్యుటతప్పె" భార. భీష్మ. 3, ఆ.—2. కృశించు. "ఎ. గీ. ఏమిగొంఱతయయ్యె నిట్లుడయ్యనుదను, చ్ఛాయదఱఁగియుండ." సం. "అయం త్వాం శకునిః ప్రాహవివర్ణం హరిణమ్ కృశమ్." భార. సభా. ౨, ఆ.

డలాయతు. హిం. వి. బిళ్లబంట్రౌతు.

డల్లి. హిం. వి. ముద్ద.

డవాలీ. హిం. వి. బంట్రౌతు బిళ్లతగిలించుపట్ట.

డవిణ. దే. వి. డంకా.

డహువు. సం. వి. ఉ. పుం. గజనిమ్మ*.

డా.

డా. దే. విశే. ఎడమ, సవ్యము. (డాకడ, డాకన్ను, డామూఁపు. మొ.)

డాంబికుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రజాలాదిమాయలుచేయువాఁడు.

డాఁకొను. దే. అ. క్రి. దాఁకొనుయొక్కరూపాంతరము. (ప్రే. డాఁకొలుపు.)

డాఁగనమ్రుచ్చులు. దే. వి. బ. డాఁగురుమూఁతలు. "సీ. తనదాడికరిడాఁగుననురీతిఁజెలికాండ్రకదనడాఁగనమ్రుచ్చులాడనేర్చు." రా, వి. ౨, ఆ. (రూ. డాఁగనమ్రుచ్చిల్లు. "క. అచ్చిన్నిచెలువ డాఁగన, మ్రుచ్చిల్లినునాల్గుగంబములయాటలు మేల్, మచ్చులనుగచ్చకాయలు, నచ్చనగఁడ్లాడుసరివయస్యలతోడన్." పాంచా. ౧, ఆ.) (దాఁగనమ్రుచ్చులుయొక్కరూపాంతరము.)

డాఁగిలిమూఁతలు. దే. వి. బ.——వై.——(దాఁగిలిమూఁతలుయొక్కరూపాంతరము.)

డాఁగిలిమ్రుచ్చులు. దే. వి. బ.——వై.——"సీ. డాఁగిలిమ్రుచ్చులాటలు గచ్చకాయలు వెన్నెలకుప్పలు తన్నుబిల్ల." కాశీ. 3, ఆ. (దాఁగిలిమ్రుచ్చులుయొక్కరూపాంతరము.)

డాఁగు. దే. అ. క్రి. దాఁగుయొక్కరూపాంతరము. (చూ. డాఁచు.)

డాఁగుడుమూఁతలు. దే. వి. బ. (చూ. డాఁగురుమూఁతలు.) చమ. ౧, ఆ.

డాఁగురించు. దే. ప్రే. 1. దాఁచు; "ఉ. ఏమటుపోకశౌరమదినేర్పడము■గని డాఁగురించెనో, యేమిటి కెందుఁబోయిరొ నరేంద్రయొఱుంగను." భార. సౌ. ౧, ఆ.—2. వంచించు. "గీ. అతివమొఱఁగి, మగఁడుఁబతిడాఁగురించిభామయుఁదిరుగుదురు." హరి. ఉ. ౯, ఆ. (దాఁగురించుయొక్కరూపాంతరము.)

డాఁగురింత. దే.వి. 1. డాఁగురించుట; 2. బ. డాఁగురుమూఁతలు. "చ. డాఁగురిం, తలుహరితోడనాడు దురుతద్వనవీధులయందుగోపికల్." హరి. పూ. ౭, ఆ. (దాఁగురింతయొక్కరూపాంతరము.)

డాఁగురుమూఁతలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. "సీ. పైఁడిమెట్టికలెక్కిపైకేగిచేఁతగట్లందుడాఁ

గురుమూఁతలాడియాడి." య. 3, ఆ. (దాఁగురుమూఁతలుయొక్క రూపాంతరము.)

డాఁచే. దే. ప్రే. దాఁచేయొక్క రూపాంతరము. "వృకోదరుండొకండతఁజికిఁజొచ్చి దోర్బలము డాఁపక పోరెడు." భార. భీష్మ. ౨, ఆ.

డాఁపు. దే. ప్రే. దాఁపుయొక్క రూపాంతరము.

డాక. దే. వి. 1. విజృంభణము; "అత్తొలితొలిడాకకే వెలిచి." ఆము. ౪, ఆ.—2. శౌర్యము. "క. లగ్గలకునల్లుకొటకు, డగ్గఱుతన మొనల నెల్ల డాకఁ దఱిమి." ప్రభా. ౫, ఆ.

డాకడ. ద్వ. వి. 1. ఎడమపార్శ్వము; 2. ఉత్తరపు దిక్కు.

డాకలి. దే. వి. దాకలియొక్క రూపాంతరము.

డాకల్లు. దే. వి. దాకల్లుయొక్క రూపాంతరము.

డాకిని. సం. వి. ఈ. స్త్రీ. పిశాచస్త్రీ.

డాకుు. దే. స. క్రి. (కాళ్లు) తేలగిలవేయు.

డాకొను. దే. అ. క్రి. దాకొనుయొక్క రూపాంతరము. "ఎ, గీ. డాకొనుచుఁబద్మజాండభాండఁబునిండి." భాను. 3, ఆ. (ప్రే. డాకొలుపు.)

డాక్టరు. ఆం. వి. పెద్ద వైద్యుఁడు, పండితుఁడు.

డాగు. దే. వి. 1. గుఱుతు; "సీ. గాఢనాళీకసంగ్రస్తుఁడై నేఁడును నీడాగు వాఁడు వాణీవిలాసి." వసు. 3, ఆ.—2. వాఁత; "చ. విరహిజనమ్ములన్ మరుఁడువీఁపులడాగులు వేయఁబూనిని, ష్కారుణనిజప్రతాపశిఖిఁగ్రాఁచఁగఁగ్రాఁగు సలాకలోయనన్, ధరిపయి నెల్లెడన్ దరులదట్టములై చిగురాకుజొంపముల్, నిరుపమలీలఁబొల్చెఁదరుణీకనుఁగొంకెమిటారిచూపులన్." చంద్ర.—3. మఱక.

డాత్కారము. సం. వి అ. పుం. చేఁదుగలచేప

డాపల. దే. వి. ఎడమభాగము. "క. పటుశరముఁ మీఁదికిడా, పటికిన్ వలపటికినపరభాగమునకుం, దటికిఁజదలనడపెసము, త్కటరయమునశరముఁగండుకక్రీడగతిన్." భార. ద్రో. ౪, ఆ.

డాపలించే. దే. అ. క్రి. ప్రదక్షిణమగు. "క. అరియుదముగానియిష్మో, హరమునకును డాపలించియరదముఁబోని, మ్మురవడి." భార. విరా. ౪, ఆ.

డాపు. దే. వి. విణ. దాపుయొక్క రూపాంతరము. "కర్ణకుండలరుచిధాళధళ్యముల డాపున నల్లనఁ బొంచి." వసు. 3, ఆ.

డాపురము. దే. వి. విణ. దాపురముయొక్క రూపాంతరము.

డాబ. దే. వి. 1. పక్షివిశేషము; "మూలసందులనుడిమూల్గుడాబలక్రందు." చంద్రా. ౨, ఆ.—2. జెందెనుపలె వేసికొనెడు తోలుపట్టె.

డాబా. దే. వి. బోడిమిద్దె.

డాబు. యు. దే. వి. దినుసులపట్టిక. వై. డంబము. అతిశయపుమాటలు.

డామరము. సం. వి. అ. పుం. 1. డమరముయొక్క రూపాంతరము; "చ. తదీయదేశముల్, తలఁకియుండురోగభయతస్కరడామరవర్జితంబులై." భార. ఆది. ౫, ఆ. (గ్రంథములయందు డాంబరమని కనఁబడుచున్నదిగాని దానికి అకారమేమియుఁ గానఁబడలేదు.)—2. శివోక్తతంత్రవిశేషము.

డాయి. దే. వి. దాయియొక్క రూపాంతరము.

డాయు. దే. అ. క్రి. దాయుయొక్క రూపాంతరము.

డాలించే. వై. స. క్రి. డాలువాఱుపూను.

డాలు. యు. దే. వి. 1. కాంతి; 2. టెక్కెము. వై. డాలువాఱు.

డాలుకాఁడు. ద్వ. విణ. డాలువాఱుచేతఁ బట్టినవాఁడు.

డాలువాఱు ద్వ. వి. డాలు, కేడెము.

డావరడంగి. దే. వి. దేవతాళము?

## డి.

డింకవేయు. దే. అ. క్రి. చేష్టు. "కడసెరదుష్టులఁడిఁకవేసెనెలుఁగుల్ గిట్టెన్ బులుల్." సా. ౧, ఆ.—డింకొట్టురూపాంతరము.

డిఁకీలు. దే. వి. బ. మల్లవిద్యావిశేషము.

డింకు. దే. అ. క్రి. చేష్టు.

డింగరీఁడు. వై. వి. 1. సేవకుఁడు; 2. భక్తుఁడు*. "శ. కటకటాకైటభారికనుంగులగు డింగరీలు దయారువులు కావలవదే." ఆము. ౬, ఆ.

డిఁగరుఁడు. సం. వి. అ. పుం. సేవకుఁడు.

డింగిల్లు. దే. వి. బ. నమస్కారవిశేషము.

డించే. దే. ప్రే. దించుయొక్క రూపాంతరము. (చూ. డిగు.)

డిండిమము. సం. వి. అ. పుం. రాయడిగిడిగిడియను వాద్యవిశేషము.

డిండీరము. సం. వి. అ. పుం. ఫేనము, నురుగు.

డిందు. దే. అ. క్రి. 1. అడఁగు; "ఆసాసలంబిఱుపోవుచ బొదలందుడిందుఁబొడముచ." భార. అర. ౬, ఆ.—2. ఇంకు; "క. తొలువానలుకురియఁగఁద, జ్జలనివహము దైత్యవిభుని సంతప్తాంగం బులయందుడిందెనౌర్వ, జ్వలనశిఖలడింగు జలధిసలిలముఁబోలెచ." లక్ష్మీ. ౨. ఆ.—3. కుంగు; "సీ. అతిరభసాంఘ్రివిన్యాసనిర్భరభరంబునవేలపాతాళమునకుడింద." మార్క. ౬. ఆ.—4. మ్రొగ్గు. "చ. తనయంగముఁగలమాంసమెల్లఁ దె, ట్టినను గపోతభాగమ కడిందిగ డిందుచునుండెనత్తులచ." భార. అర. 3, ఆ. — వి. అడఁకువ.

డిందుపడు. ద్వి. అ. క్రి. 1. అడఁగు, శమించు; "క. అనుమునతఁడుతనచిత్తం, బునఁదోఁచినవిధము ధర్మపుత్త్రునితోని, ట్లనిచెప్పె నాతనికిఁబు, ట్టినయుత్తలపాటుకొంతిడిందుపడంగచ." భార. విరా. ౧, ఆ. — 2. సమాధానపడు. "గీ. తొడిగినట్టితూపునోఁ లోనవైచిన, దనుకడింగుపడదుమనసునాకు." రామా. ౭, ఆ. (ప్రే. డింగుపఱచు.)

డిందుపాటు. ద్వ. వి. ఉపశాంతి. "వ. అయ్యుపస్థానంబునకు . . . ఏమిటనుడిందుపాటులేకుండిన." ద్రో. 3, ఆ.

డింపు. దే. వి. దింపుయొక్కరూపాంతరము. "ద్వి. పిద్దలబాలురబేలయునాసతులఁ, దద్దయుడింపునందరిగించుకొనుచు." (ఇక్కడ డింపునన్ అనఁగా దీనత్వముతోనని యర్థము.) భాగ. ౧౧, స్కం.

డింబము. సం. వి. అ. పుం. 1. కొల్లమొదలగు దేశోపద్రవము; 2. భయము; 3. పక్షి గ్రుడ్డు; 4. ఊపిరితిత్తుల నుండి బొడ్డు కుడిప్రక్కనుండెడు మాంసగోళము; 5. కడుపు నెడమప్రక్కనుండెడు మలాశయము.

డింభము. సం. వి. అ. పుం. 1. పిల్ల; 2. గ్రుడ్డు.

డింభుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. వెలికిలఁదిరిగి పరుండినవాఁడు; (బిడ్డ.) 2. మూర్ఖుఁడు.

డిగఁద్రావు. దే. అ. క్రి. దిగు. (చూ. దిగఁద్రావు.) —స. క్రి. విడుచు. (చూ. డిగ్గఁద్రావు.) (దిగఁద్రావుయొక్కరూపాంతరము.)

డిగఁబడు. ద్వ. అ. క్రి. దిగఁబడుయొక్కరూపాంతరము.

డిగనాడు. దే. స. క్రి. దిగనాడుయొక్కరూపాంతరము.

డిగనుఱుకు. దే. అ. క్రి. (డిగన్+ఉఱుకు.) దిగువకు దుముకు.

డిగియ. వై. వి. డిగ్గియయొక్కరూపాంతరము. "క. తిరుకొళమునూయిలోఁటయుఁ, జెఱువుమడువులొండుకుంటచెలమపడియకో, నెఱుబుగ్గవాఁగుదొనతల, పరిగుండముకాల్వడిగియబావిదొరువులన్." హంస. ౪, ఆ.

డిగు. దే. అ. క్రి. 1. డిగ్గు; "డిగకుఁడువాహనంబులుకడిందిమగంటిమిఁగోలుపోవ." భార. ద్రో. ౫, ఆ.—2. తగ్గు. "ఎ, గీ. బలంబునుజలంబు, డిగకనలవుమైఁబోరెనాడియుబకంబు." మార్క. ౨, ఆ. (దిగుయొక్కరూపాంతరము.)

డిగుడు. దే. వి. దిగుడుయొక్కరూపాంతరము.

డిగువ. దే. వి. విశే. దిగువయొక్కరూపాంతరము. (క్రిందునకు. — "ద్వి. డిగువనున్నాఁడు." రా. యు, కాం.)

డిగ్గఁద్రావు. దే. అ. క్రి. దిగు. (చూ. దిగఁద్రావు.)—స. క్రి. విడుచు. "గీ. మర్మభేదులైనమార్గణంబులకోహటించిసిగ్గుఁజలముడిగ్గఁద్రావి." భార. కర్ణ. ౧, ఆ. (డిగఁద్రావుయొక్కరూపాంతరము.)

డిగ్గదాఁటు. దే. అ. క్రి. డిగనుఱుకు. "క. ఆతం, డదిడిగ్గదాఁటి ధైర్య, స్పదమతి నభిమన్యుతేరిపైకెంజనియెన్." భార. భీష్మ. ౨, ఆ. (అది— దానినుండియనియర్థము.)

డిగ్గన. దే. ద్ర. క్రి. విశే. దిగ్గనయొక్కరూపాంతరము. "ద్వి. గద్దియమీఁదడిగ్గనడిగ్గనఁజికి." రా. యు, కాం.

డిగ్గనాడు. దే. స. క్రి. డిగనాడుయొక్కరూపాంతరము.

డిగ్గనుఱుకు. దే. అ. క్రి. డిగనుఱుకుయొక్కరూపాంతరము.

డిగ్గి. దే. వి. అగ్ని. (అప్ర.)

డిగ్గియ. వై. వి. నడబావి. "సీ. అలరునెత్తమ్ములకలిమిఁజెల్వగుడిగ్గియలతీరభూములనల్లవొంది." భార. శాం. 3, ఆ.

డిగ్గు. దే. అ. క్రి. దిగు. "తదీయోదప్రపూరంబు జాలైడిగ్గున్." పు. ౧, ఆ.- వి. తక్కువ. "ఎ, గీ. ఒక్కరూపకానియొక్కుడుడిగ్గును, గానరాదుముఖవికాసమునకు." నిర్వ. ౧, ఆ. (డిగుయొక్కరూపాంతరము.)

డిగ్గుడు. దే. వి. డిగుడుయొక్కరూపాంతరము.

**డిగ్గుపడు.** ద్వ. అ. క్రి. (డిగ్గు+పడు.) తక్కువపడు. "ఉ. నీయుసంబుచే, గాలిమెసంగు కేనియొడి కంబునుజుక్కలసోయుగంబును, త్యాలబెడంగు డిగ్గపడునట్లు గఁజేసినచాగ ఫుంబలీ." యు. ౪, ఆ.

**డిమము.** సం. వి. అ. పుం. నాటకభేదము. (చూ. నాటకము.)

**డిమ్మరి.** దే. వి దిమ్మరియొక్క రూపాంతరము. "క. వనితలపురుషులమొదఁబు, ట్టినయదితో వెళ్లివిఁసె డిమ్మరితనము." భార. శాం. ౬. ఆ.

**డిమ్మి** ఆం. వి. ఒకవిధమైన దట్టపుకాగితము.

**డిల్లపడు.** ద్వ. అ. క్రి. (డిల్లము+పడు.) (భయాదులచే) సత్త్వహీనమగు. "తనువుగ్గతఘర్మజలంబుఁ దాల్చుచుఁ డిల్లపడ గ." భార. విరా. ౨, ఆ.

**డిల్లపాటు.** ద్వ. వి. డిల్లపడుట.

**డిల్లపోవు.** ద్వ. అ. క్రి. (డిల్లము+పోవు.) డిల్లపడు. "ద్వి. అనిపల్కగుండెజల్లనిడిల్లపోయి." సా. ౪, భా.

**డిల్లము.** దే. విశ. (భయాదులచే) సత్త్వహీనమైనది. "గీ. భీమనందనుచావునఁ బ్రేముడించి, ధర్మతన యుండు బాష్పంబుధార లడర, మేనుడిల్లంబు గాఁదేరి మీఁదవివశుఁ, డగుచుఁ జదికిలఁబడుట యునచ్యుతుండు." భార. ద్రో. ౫, ఆ. "వ. అత్తలోదరియుల్లంబుడిల్లంబు గాఁదొడంగిన." (ఇక్కడ డిల్లమునకు ఉత్సాహహీనమైనదని యర్థము.) ఉ, హరి ౫. ఆ. (ద్విత్తియుందు అంత్యవర్ణలోపము. ఉదా. డిల్లపడు. మొ.)

**డిస్ట్రిక్టు.** ఆం. వి. జిల్లా; కలెక్టరు క్రిందనుండు దేశము.

## డీ.

**డీ.** దే. అవ్య. తలతో పొడుచుట.

**డీకు.** దే. వి. ప్రేరేపణ. (చూ. దీకు.)

**డీకొను.** దే. అ. క్రి. 1. పురికొను; 2. కవియు. స. క్రి. ఎదిరించు. "ద్వి. నన్నుడీకొనక వేమగుడిపొమ్ము." రా. సుం, కాం.—(ప్రే. డీకొలుపు.—పురికొలుపుటకు. — "ద్వి. కరులడీకొలిపినఁ గరులపైఁగవిసి." రా. యు, కాం.—కవియించుటకు.—"క. ఆయునమదిడీకొలుపలేక వ్యాకులమతియై." సా. ౨, ఆ.)

**డీకోలు.** దే. వి. డీకొనుట.

**డీనము.** సం. వి. అ. న. మీఁదికెగురుట.

**డీలించు.** దే. ప్రే. డీలఁజేయు, సడలించు. "గీ. నా ము డీలించిబాహులుదిగిచికొనఁగ." నిర్వ. ౪, ఆ.

**డీలు.** దే అ. క్రి. డిల్లపడు. (చూ. దీలు.) విశ. డీలము. (వాని పని డీలైపోయినది.)

**డీలుపడు.** ద్వ. అ. క్రి. డిల్లపడు.

**డీలుపాటు.** ద్వ. వి. డీలుపడుట. "డీలుపాటు కటదైన్యంబుఁదోఁప." వై. ౭, ఆ.

## డు.

**డు.** దే. అవ. బిందుపూర్వకమై ప్రథమైకవచనమందువచ్చు ఒకానొక ప్రత్యయము. (ఉదా. రాముఁడు, భీముఁడు మొ.) మఱియు ని క్రియలయందునువచ్చును. (ఉదా. మొక్కెనాఁడు, మొక్కఁడు, మొక్కఁడు. మొ. ద్రు. ఇది అనంతరార్థమునందువచ్చును. (ఉదా. కొట్టుడును, తిట్టుడును. మొ.)

**డుంకు.** దే. అ. క్రి. తగ్గు.

**డుండుకము.** సం. వి. అ. పుం. గుండిగము? కిడు. 1. అల్పుఁడు; 2. క్రూరుఁడు.

**డుండుభము.** సం. వి. అ. పుం. ఇసుడలపాము.

**డుక్కు.** దే. అ. క్రి. పాలుఁగుపడు. "ఉ. అక్క దిక్కులేమి రజతాచలమొక్కఁడుపెల్లగించె నే ఒక్కఁడుపంచెమేరు మఱియొక్క డుపి... ము నేలతాచె నొం, డొక్కఁడుతూపుఁ ... పెనుకృష్ణఁ గ్రౌంచము నంచునప్పుడు డుక్కి ట్లమోజనెగడుఁ నవరత్న వినూత్న సౌధము ... చంద్రా. ౧, ఆ. "వ. కాలువలనుతెప్పకాలు నుడుక్కు కాలుబలంబులను." చంద్రా. ౬. ఆ.

**డుబుడక్క.** ద్వ. వి. డుబుడక్క వాని వాద్యము "ఉ. డాకఁదలిర్చుమబ్బు డుబుడక్క వెలుగు మెఱుంగుపట్టుసం, జోఁకబలాకికాసమితిమ క్కలనామపు రేకనమ్మిబల్, కేకసరోజకేకి ... కీడును మేలును దెల్పుకూఁకగా, జోకఘునాగమ బురహిఁజొచ్చెమహిఁ డుబుడక్కవాఁడనఁ" చంద్రా. ౪, ఆ.

**డుబుడక్కవాఁడు.** ద్వ. వి. వేషము వేసికొని డుబుడక్కను వాయించుచు మేలుకీళ్లను దెల్పు యొక జాతిబిచ్చపుజోగి. "ఎ, గీ. నచ్చె ... డుబుడక్కవాఁడొకండు." హంస. ౨. ఆ.

**డుయ్యు.** దే. అ. క్రి. స. క్రి. 1. దుయ్యుయొక్క రూపాంతరము.౫ (బాణాదికము నాటి వెడలు

ను.—"క. అదియుక్కు—అఁగాఁడిడుస్సిపాతెన."
స్వా. ౪, ఆ.)

...చ్చి. దే. అవ్య. యుద్ధమునకు పిలుచుటయందు
ప్రయోగింపఁబడునది.

...ములు దే. వి. డుల్లుటయందగుధ్వన్యనుకరణము.
"...వ. డులడులచుక్కలడుల్చుకైవడిని." రా.
యు. కాం.

...చే. దే. ప్రే. డుల్లఁజేయు, (చూ. డుల్చు.)

...ల్లు. దే. అ. క్రి. 1. పడు; "గీ. రత్నకేతనములు
...జితశేఖరం, బులునురు విరఘుంటికలును బార్ధు,
...ణఁహతిఁదునిసిపడెఁగొరవులచేటు, తెలుప
...ల్లనుల్కములునుబోలె." భార. విరా. ౫, ఆ.
—2. ఊడు. "వ. శాండిలీయునునొక్కతిపస్వి
...పంబునఁబక్షంబులుడుల్లియతని యనుగ్రహం
...ంగ్రమ్మఱవచ్చిన." భార. ఉద్యో. 3, ఆ.

డూ.

...యు. దే. అ. క్రి. స. క్రి. డూయుయొక్కరూ
పాంతరము.

డె.

...ము. దే. వి. ఉల్లము, హృదయము.

...క్క. దే. వి. పశువుల కాలిగిట్ట, ఖురము. "సీ. కఠి
...ద్దాలవక్త్రములయ్యెనీజన్నెమును డెక్కలక్కం
...యూలములకు." పాండు. ౫, ఆ.

...క్కు. దే. స. క్రి. అడ్డగించు, నివారించు.

...క్కొను. దే. అ. క్రి. (డెక్క+కొను.) సెలకొను.

...ప్పు. దే. వి. కొండమీఁదిసమమైనచోటు, సెత్తము.

...ప్పరము. దే. వి. ఆపద. "క. ముందటియుత్పాత
ములకు, డెందంబులనోర్చియిప్పటికిఁబాయఁగ
లే, కిందుండఁగమనకిమ్మా, డ్కిందనుకఁగరాని
కడిఁదిడెప్పరమొందెన్." హరి. పూ. ౬, ఆ.
"డెందముపూఁదిచెందొవకు డెప్పరమేమియులే
దు." (ఇక్కడ ఆపద అనఁగా చలనము అని యర్థ
ము.) ఉ, హరి. ౫, ఆ.—విశ. 1. అశక్యము; "అ
తనిం దెగఁజూచుటగోరకాజిఁబట్టికొనుటగోరితి
ప్పిథము డెప్పరమెంతయు." భార. ద్రో. ౧, ఆ.—
2. దుస్సహము. "ఎ, గీ. డెప్పరంబుగాఁగ డెబ్బది
శరములు, నినిచెరామచంద్రుననుజుమేన." రా.
యు. కాం. (దీనికి సందర్భానుసారముగా
అసాధ్యము దుర్లభము మొదలగు అర్థములును
గలుగును.) (డెప్పరముయొక్కరూపాంతరము.)

డెప్పరించు. దే. అ. క్రి. అశక్యమగు.

డెప్పు. దే. స. క్రి. డెప్పుయొక్కరూపాంతరము.

డెబ్బండ్రు. ద్వ. స. డెబ్బదిమంది. (డెబ్బదికి మహన్మ
హత్త్యర్థకరూపము.)

డెబ్బది ద్వ. స. (ఏడు+పది.) ఏడుపదులు, సప్తతి.

డే.

డేఁగుర. సం. వి. ఆ. స్త్రీ. జయఘంటిక, జేగంట.

డేక్చా. హిం. వి. పెద్ద వంటపాత్ర.

డేగ. దే. వి. సాధారణపు పక్షులను కుందేలులోనగు
స్వల్పమృగములను వేఁటాడెడు ఒకదినుసుపక్షి,
శ్యేనము. (దీని భేదములు అనేకములు. చూ.
అణుజు.)

డేగాట. దే. వి. (డేగ+ఆట.) పెండ్లి అయిదవనా
డు సమీపబంధువులు పెండ్లికొడుకును పెండ్లి
కూఁతును మూఁపులమీఁద నెత్తుకొని వారిచే
మూలలు మార్పింప డేగలవలె ఎగిరియాడెడు ఆట.

డేరా. దే. వి. గుడారము. "వ, గీ. అభినవశృంగా
రగౌరవమునఁ, జాలఁదనరారె డేరాహజారమున
ను." రసి. 3, ఆ.

డై.

డైరి, డైలి. ఆం. వి. దినచర్య.

డొ.

డొంక. దే. వి. 1. నడిచి పల్లముగా నేర్పడిన కాలి
దారి; 2. పొద; "సీ. పాలచేరులువట్టితూలింప
బలిమినిడ్చుకొనిడొంకలఁదూఱి మట్లఁబెట్టు."
స్వా. ౪, ఆ.—వి. కోన. "వ. కరిపరికరేణువులు
నంపగుంపుచెడి యిట్టట్టువడితిట్టలగుచిట్టల సంక
టంబులగుడొంకలును." స్వా. ౪, ఆ.

డొంకు. దే. అ. క్రి. 1. ఇంకు; "క. వెల్లువముంచి
పిదపనీ, రల్లనువెసడొంకఁగొలనినెసఁగెడుచం
చ, త్పల్లారవిందములక్రియ, నల్లనవదనములు
తోఁచెనాశ్చర్యముగాన్." నిర్వ. 3, ఆ. —
2. ఎండు; "క. ధరణీపంకంబులింకెఁడటినులఁడొం
కెన్." రా. కిష్కిం, కాం.—3. అడఁగు. "దరస్మి
తవిలాసపుఁజంద్రికడొంకి." స్వా. 3, ఆ.—వి.
వంకర. "ద్వి. గూనుడొంకులుదీఱ." రా. అ, కాం.

డొంకెన. దే. వి. వంకర అలుఁగుగల యీఁటె. "వ.
అయ్యార్యుర్యుగాంధారకుమారులు నయ్యెలావజ
తుంబొదివి సెలకట్టెలవాట్ల డొంకెనలపోట్లనొ

ప్పించిన." భార. భీష్మ. 3. ఆ. "ఈఁటెలడొంకెన లంగటార్లబల్ కత్తులనత్తలంబులను."కళా.౮,ఆ.
డొంగ. దే. వి. దొంగయొక్కరూపాంతరము. "గీ. డొంగవలెవచ్చియిక్కడడొంగినావదేమయా." వైజయంతీవిలాసము.
డొంగు. దే. అ. క్రి. డాఁగు. (దొంగుయొక్కరూపాంతరము.) వి. చెట్టులోనిలొత్త.
డొకారము. దే. వి. లోను, అంతరాళము. (చూ. డొకారముసొచ్చు.)
డొకారముసొచ్చు. దే. అ. క్రి. (డొకారము+చొచ్చు.) లోనగు, లోపడు. "చ. పరబలభీకరంబగునపారసముద్ధతిఁగాంచివజ్రియై, పురవరణంబుమూడుజగములఁగయికొన్న మహాభయంబునన్, గగకరిమానియొక్కట డొకారముసొచ్చుకులాద్రులోయనన్, నిరుపమలీలసౌధములనేకములుల్లసిలున్బురంబునన్." చంద్రా. ౧, ఆ.
డొక్క. దే. వి. 1. ఒడలియొనుకలగూఁడు, కంకాళము; కడుపు. (అని కొందఱు.) 2. టెంకాయ బొండ్లపుచెక్క.
డొక్కబుఱ్ఱ. దే. వి. తేగపాతిపీడినతాటివిత్తు.
డొక్కరము. వై. వి. మల్లబంధవిశేషము. "గీ. కళవరానకుఁజొచ్చిడొక్కరముహత్తి." ఉ, హరి. 3, ఆ.
డొక్కు. దే. అ. క్రి. ముదియు. విశ. ముదిసినది.
డొగరు. దే. వి. 1. అపరాధము; 2. నింద.
డొప్ప. దే. వి. దొప్పయొక్కరూపాంతరము. "ఎ, గీ. డొప్పచెవులును గొగ్గిపండులునుగలిగి." నై. ౭, ఆ.
డొలుచు. దే ప్రే. డొల్లఁజేయు. (రూ. డొల్చు). "సీ. కల్పించియాబండి కలుడొల్చెసత్యలోకంబుననుండియాకమలగర్భుఁడదిడొల్లిగిరపిష్టపాంతరంబులుదాఁటి క్రమముతో భూమిచక్రమున వ్రాలె." కాశీ. ౧, ఆ.)
డొల్ల. దే. వి. చేటవలె మూడుప్రక్కలయందు అడ్డుపలకగల బల్లలోనగునది. బుట్ట. (అని కొందఱు.)
డొల్లు. దే. అ. క్రి. 1. పొర్లు; (దొర్లుయొక్కరూపాంతరము.) (చూ. డొలుచు.)—2. పడు. "క. విందునితలయిల, పైడొల్లఁగ నేసెఁ దీవ్రభల్లప్రహతిన్." భార. ద్రో. 3, ఆ.

డో.

డోఁకు. దే. అ. క్రి. ఓకిలించు. స. క్రి. గడ్డిలోఁగుడాని నెమరుగాఁజెక్కు. (ఈ యర్థమందు దోఁకుయొక్కరూపాంతరము.) వి. ఓకిలింత.
డోఁగియాడు. దే. అ. క్రి. (డోఁగి+ఆడు.) దోఁగాడు. "సీ. కొమరొప్పఁడునుఁదాఁ కూర్చుండఁగ నేర్చె నాడకాడకుడోఁగియాడ నేర్చె." చంద్రా. ౨, ఆ. (రూ. డోఁగాడు.)
డోఁగు. దే. అ. క్రి. దోఁగుయొక్కరూపాంతరము.
డోకడా. దే. వి. నూఱవపాలు.
డోరము. సం. వి. అ. న. చేతఁగట్టుకొనెడు ప్రతిసూత్రము, తోరము.
డోరములు. దే. వి. బ. కత్తిమీఁదిచాఱలు.
డోరియా. హిం. వి. చీర.
డోల. సం. వి. ఆ స్త్రీ. 1. డోలి; 2. తొట్ల; 3. నీలిచెట్టు. అ. పుం. ము. అభినయహస్తవిశేషము.
డోలనము. సం. వి. అ. న. ఊఁచుట. ఊఁపు.
డోలాబ్జము. సం. వి. అ. న. కలువపువ్వు.
డోలి. వై. వి. ఉయ్యాలవంటి అందలము, డోల.
డోలిక. సం. వి. ఆ. స్త్రీ.——వై.——
డోలు. వై. వి. చర్మవాద్యవిశేషము. "సీ. బేరులు డోళ్లుతప్పెటలు కాళెలుపిల్లఁగ్రోవులుతుంబురులుతీవిమెఱయు." అచ్చ. యు, కాం.
డోసు. ఆం. వి. ఔషధముపరిమాణము, మద్యపానము.
డోసుగాఁడు. ఆం. వి. త్రాఁగుబోతు.

డౌ.

డౌలు, డవులు. దే. వి. మదింపు, రీతి.

డ్రె.

డ్రెస్సరు. ఆం. వి. సహాయవైద్యుఁడు.

ఢ.

ఢ. ఒకయక్షరము.
ఢక్క. సం. వి. ఆ. స్త్రీ. యశఃపటహము. ఢంకా
ఢక్కాముక్కీ. హిం. వి. సంకటము, ఇబ్బంది.
ఢమామిక. సం. వి. ఆ. స్త్రీ. డమాయి.

ఢా.

ఢాలము. సం. వి. అ. న. డాలువాలు, ఫలకము

## ఢు.

ఢుండి. సం. వి. ఇ. పుం. గణేశుఁడు.

ఢులి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. ఆఁడుతాఁబేలు, కమఠి, (రూ. డులి.)

## ఢో.

ఢోలము. సం. వి. అ. పుం. డోలు.

## ణ.

ణ. ఒకయక్షరము.

## త.

త. ఒకయక్షరము. దే. అప. కులవాచకమగు స్త్రీ ప్రత్యయము. (చాకిత, వ్రేత. మొ.)

తంకర. దే. వి. తుచ్ఛధాన్యము.

తంగు. దే. వి. టంగుయొక్క రూపాంతరము.

తంగువాలు. దే. వి. టంగువాలుయొక్క రూపాంతరము.

తంగెడు. దే. వి. తంగేడుయొక్క రూపాంతరము.

తంగేడు. దే. వి. గోశ్రేణి?.

తంట. దే. వి. 1. కలహము; 2. చాడీ; 3. శ్రమము; 4. అప్పు; 5. మోసము. "ఉ. ఒంటిగబూదిపూసిజడ లుట్టిపడన్ బులితోలుపూనిము, క్కంటిమునీవలెన్ దపముగైకొని చేయఁడె చేతికబ్బినన్, గంటికివచ్చునొక్కకలకంఠికి మేనుసగంబొసంగఁడే, తంటలకేమి ముచ్చుజడదారులదాములుఁ గొంతెఱుంగుదుర్." చంద్రా. 3, ఆ.

తంటా. దే. వి. తంటయొక్క రూపాంతరము.

తంటియము. దే. వి. తంటెము?.

తంటెము. దే. వి. ప్రపున్నాటము?. (తంటియముయొక్క రూపాంతరము.)

తండకము. సం. వి. అ. పుం. 1. మిద్దెటింటికి అడ్డముగా వేసెడు దంతె; 2. వృత్తవిశేషము.

తండసము. ఉభ. దే. వి. మంగలవాఁడు వెంద్రుకఊడఁబెఱికెడు సాధనము, కుటిలిక. (ఒకానొక నిఘంటువునందు తంటసమని వ్రాయఁబడియున్నది.)—సం. వి. అ. పుం. కమ్మరకొలిమి.

తండా. వై. వి. 1. లంబాడీలసమూహము*; 2. సరకునింపిన గోనెలసమూహము*.

తండిరి. దే. వి. తండ్రికి మొదటిరూపము. "ఎ, గీ. అనినవారలిట్లులనిరితండిరిచావు, వినియువెనుక చేసి చనఁగనగునె." భో. ౬, ఆ.

తండు. దే. స. క్రి. (ఇయ్యవలసిన ధనమును) పోయి అడుగు.

తండుగోల. దే. వి. (తండు+కోల.) చేఁపలఁబొడిచెడు చిల్లకోల, మండము. "సీ. చుంగులెల్లాడు గోఁచులుతండుగోలల నెట్టుకొల్పినమీలపుట్టికలును." పంచ. వేం. ౧, ఆ.

తండురీణము. సం. వి. అ. పుం. 1. కడుగునీరు; 2. పురుగు; 3. బొబ్బరలు.

తండులము. సం. వి. అ. పుం. 1. బియ్యము; 2. వాయువిడంగము?.

తండులీయము. సం. వి. అ. పుం. 1. ధాన్యము; 2. చిత్తికూర.

తండువు. సం. వి. ఉ. పుం. ఊ. స్త్రీ. త్రెడ్డుకొయ్య. ఉ. పుం. నందికేశ్వరుఁడు.

తండెలు. దే. వి. ఓడపెత్తనగాఁడు.

తండేలు. దే. వి. తండెలుయొక్క రూపాంతరము.

తండ్రి. దే. వి. అబ్బ, జనకుఁడు. (మా. తలిరుచుకడ.)

తండ్రితండ్రి. దే. వి. తాత, పితామహుఁడు.

తంతి. వై. వి. వీణెమొదలగువానికి వేసెడు ఉక్కుకమ్మి.

తంతియలు. దే. వి. బ. మెట్లు. "చ. అనిమిషకోటి దైత్యవధమాత్మనుమర్వక యుండఁదల్పఁగా, వెనుకొనికోటతంతియల వెంబడిగాడిగివచ్చినందనం, దనుఁగనునన్నుచోఁబిద పదానిసమున్నతిఁ జెప్పనేటికిన్." భద్రా. ౧, ఆ.

తంతు. యు. దే. వి. ఉత్సవవిశేషము. వై. ఉభయార్థసాధకమైన ఉపాయము.

తంతుకాష్ఠము. సం. వి. అ. న. 1. సాలెవాని నాడె; 2. నూలునడికెడు కదురు.

తంతుకీటము. సం. వి. అ. పుం. పట్టుపురుగు.

తంతునాగము. సం. వి. అ. పుం. సర్పాకారమైన జలజంతువిశేషము, నెగడు.

తంతునాభము. సం. వి. అ. పుం. సాలెపురుగు.

తంతుభము. సం. వి. అ. పుం. సర్షపము, ఆవాలు.

తంతువాయము. సం. వి. అ. పుం. తంతునాభము.

తంతువాయుఁడు. సం. వి. అ. పుం. సాలెవాఁడు.

తంతువు. సం. వి. ఉ. పుం. 1. నూలిపోఁగు; 2. తంతునాగము.

తంతెలు. దే. వి. బ. తంతియలుయొక్క రూపాంతరము.

తంత్రకము. సం. విశ. (అ. ఈ. అ.) క్రొత్తది. (వస్త్రము.)

**తంత్రము.** సం. వి. అ. న. 1. ఉభయార్థసాధకమైన ఉపాయము; 2. స్వరాష్ట్రచింత; 3. వ్యాకరణశాస్త్రము; 4. కుటుంబవ్యాపారము; 5. ఉత్తమమైన ఔషధము; 6. సిద్ధాంతము; 7. ప్రధానము; 8. మగ్గము, నూలిపడుగు, (అని కొందఱు.) 9. పరివారము; 10. ఒకానొక వేదశాఖ; 11. హేతువు; 12. ఇట్లు చేయఁదగినదనుట.

**తంత్రి.** సం. వి. ఈ. స్త్రీ. 1. తంతి; 2. తిప్పతీఁగ; 3. నరము.

**తందనము.** వై. వి. మాటిమాటికి తానశబ్దపూర్వకముగాచేసెడు రాగాలాపము. "చ. జగడపుఁగూటిసత్తరువుసారెకుఁగోరుచు వీరివారినిన్, దగిలెడుతందనాలజడదారి." కళా. 3, ఆ.

**తందర.** వై. వి. తూఁగు, కునికిపాటు, తంద్ర.

**తంద్ర.** సం. వి. ఆ. స్త్రీ.—పై.—

**తంద్రి.** సం. వి. ఈ. స్త్రీ.—పై.—

**తంపర.** దే. వి. తామరగుంపు, షండము. "తామరతంపర."

**తంపి.** దే. వి. 1. దాలిగుంట; 2. కలహము.

**తంబ.** దే. వి. ఒకానొకతీఁగ, శింబి.

**తంబళ.** దే. వి. శివార్చనచేసి బ్రతికెడుజాతి. (తంబళవాఁడు, తంబళది.)

**తంబళి.** దే. వి. (తంబళ+ఇ.) తంబళవాఁడు. "ఎ, గీ. పెట్టెమూకుడులో మొగబీఱపత్రి, మట్టిదూపార్తిదీపముఁబెట్టుచమురుఁ, బొందుపఱచుక నిమాపుపూజసేయఁ, గొత్తకాణాచితంబళిహత్తుకొనియె." హంస. ౧, ఆ.

**తంబు.** దే. వి. తమ్ముఁడు. (ఇది వాత్సల్యసంబోధనమునందు వాడఁబడును.)

**తంబుగ.** దే. వి. మెడ నిడుపుగానుండెడు చెంబు.

**తంబుఱ.** ద్వ. వి. (తంతి + బుఱ్ఱ.) పాటపాడువారు శ్రుతికైయుంచుకొనెడు తంత్రీవాద్యవిశేషము. "ఉ. తంబుఱమీటి వేఱొకతెతానములెంతయువిస్తరించిరా, గంబునరక్తితాలుగరఁగన్ బలుమోదులుపల్లవింపన, య్యంబుజనీమనోహరకులాగ్రణిమీఁదిపదంబుపాడినన్, గొంబులకల్ జనించెసభకున్ దలవంచిరివైణికాగ్రణుల్." ఉ, రా. ౭, ఆ. (రూ. తంబురా.)

**తకరారు.** హిం. వి. వివాదము.

**తకతక.** దే. వి. తాళమునందగుధ్వన్యనుకరణము.

**తకపికలాడు.** దే. అ. క్రి. (తకపికలు+ఆడు.) ఇట్టట్టుచలించు. "నవరత్నపుఁబాపటబొట్టు మోమునందకపికలాడ." శశాం. ౪, ఆ.

**తకావి.** హిం. వి. సేద్యముచేయుటకై సహాయముగా నియ్యఁబడుసొమ్ము.

**తక్కటి.** దే. వి. మూఁడుముఖములుగల దీపారాత్రికపుతిట్ట.

**తక్కరి.** వై. విఽ. (తక్కు+అరి.) టక్కరి. "ఉ. కళవళంబుతక్కితక్కరిప్రియంబుననల్లునియుల్లంబు పల్లవింపంజేసియనిపి." జై. ౭, ఆ.

**తక్కిడి.** వై. వి. మోసము*. (చూ. తక్కిడికాఁడు.)

**తక్కిడికాఁడు.** వై. విఽ మోసకాఁడు. "క. ఉక్కడనేల తేఁడులఁ, డక్కునఁగనుఁబ్రామి నన్నిటకుఁదెచ్చినబల్, తక్కిడికాఁడవునీకీ, చిక్కనిమగతనముఁదెల్పసిబ్బితికాదే." అచ్చ. సుం, కా.

**తక్కిలి.** వై. వి. ఒకానొకచెట్టు.

**తక్కు.** యు. దే. అ. క్రి. తప్పు. "వ. ఉత్తరకుండక్కఁబాండవేయవంశవధూజనంబులకు గర్భంబులేకయుండె." భార. సౌ. ౨, ఆ.—స. క్రి. విడుచు. "ధర్మముందక్కటకోర్వఁజాలుదునె." భార. భీష్మ. 3, ఆ.—వి. మిగులు. విఽ. ఇతరము. "గీ. అట్టిగర్భంబునిలుపుతక్కన్నిగర్భ, ములునుభనదస్త్రమునదగ్ధములుగఁజేయును." భార. సౌ. ౨, ఆ.- వై. అ. క్రి. టక్కుచేయు. (చూ. టక్కు అనునర్థము నుదాహరణము.) ("ద్వి. వెన్నుఁడయ్యారయున్నితక్కులుతక్క." విష్ణు. ఉ. ౪, ఆ. ఇక్కడ ఇది సకర్మకము.)—వి. టక్కు. "ద్వి. నక్క, తక్కులునీవట్టితానకంబులును, గొలుపవుమాయెడ." హరిశ్చ. ౧, భా. (ఈ యర్థమందు ఇది టక్కుయొక్కరూపాంతరము.)

**తక్కుడు.** దే. వి. తక్కట. "వినయంబుతక్కుడుస్థైర్యముఁదేకయున్న." నిర్వ. ౪, ఆ. (ఇక్కడ తక్కట అనియే యుండవచ్చును. అయినను ప్రతులయందిట్లు కానఁబడుచున్నది.

**తక్కులాఁడి.** ద్వ. విఽ. (తక్కులు+ఆఁడి.) టక్కులాఁడి.

**తక్కులాఁడు.** ద్వ. విఽ. (తక్కులు+ఆఁడు.) టక్కులాఁడు.

**తక్కువపడు.** ద్వ. అ. క్రి. కొంఱఁతపడు.

తక్కువపాటు. ద్వ. వి. కొఱఁతపాటు. "ఉ. అట్టు లైననీ, తక్కువపాటు లేక ప్రమదంబున దేవపదం బునొందుదుకా." భార. ఆర. ౬. ఆ.

తక్కియ. దే. వి. రెండువిసెలయెత్తు. వై. తక్కిలి?.

తక్కిడ. వై. వి. 1. పేములతట్టలు గ్రుచ్చి వ్రేలవేసిన త్రాసు; (చూ. కుడక.) 2. తక్కిలి?.

తక్కిలి. దే. విశే. అల్పము.

తక్కిల. వై. వి. తక్కిలి?.

తక్కిడ. వై. వి.——వై.——(తక్కిడయొక్క రూపాంతరము.)

తక్కిల. వై. వి.——వై.——(తక్కిలయొక్క రూపాంతరము.)

తక్కొను. దే. అ. క్రి. (తల+కొను.) పూనుకొను. "నరుఁడుతక్కొన నేర్చునె తన్ను మ్రుచ్చిలకా." భార. ఆది. ౮. ఆ. (చూ. ఉంకు.)

తక్కోలకము. సం. వి. అ. న. తక్కోలపుచెట్టు. తక్కోలఫలము. (అని కొందఱు.)

తక్తు. హిం. వి. సింహాసనము.

తక్రము. సం. వి. అ. న. పాతికపాలు నీళ్లు చేర్చినమజ్జిగ.

తక్రాటము. సం. వి. అ. పుం. పెరుగుచిలికెడుకవ్వము.

తక్షకుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకసర్పరాజు; 2. వడ్లవాఁడు.

తక్షణము. సం. వి. అ. న. (మాను) చెక్కుట.

తక్షణి. సం. వి. ఈ. స్త్రీ. మానుచెక్కెడుసాధనము, బాడిస.

తక్షుఁడు. సం. వి. న్. పుం. తక్షకుఁడు, వడ్లవాఁడు.

తగటి. దే. విశే. (తగటు+ఇ.) సరిగది. (చూ. తగటీ. "మ. తలిరుంగైదువు రాయఁడిర్వగులపై దండెత్తి లేగాలిబె, స్తలచేఁ బంపినపండుటాకుతగటీ జాబుల్ కమంగొంచువిం, తలు గావారికిఁజై త్రుఁడిచ్చుబురుసాదట్టీలు ముత్యాలతా, వలమల్ వోలెఁ దగుం జిగుళ్లుఁ గలికావారమ్ములీరమ్ములకా." చంద్ర. (చూ. కురాళము.)

తగటు. దే. వి. సరిగ. "గీ. తగటుఁజీరలురతనంపుఁ దళ్కు(దొడవులు." అచ్చ. బాల, కాం.

తగడు. దే. వి. బంగారులోనగువాని రేకు. "క. లలితాంగి వెన్నుపట్టియు, తళతళమనుకుందనంపుఁదగడుం దెగడుకా." పాండు. 3, ఆ.

తగరము. ఉభ. వై. వి. లోహవిశేషము. సం. అ. పుం. 1. పొట్టేలు; 2. నందివర్ధనము?.

తగరు. వై. వి. పొట్టేలు.

తగరురవుతు. వై. వి. అగ్ని.

తగవరి. దే. వి. (తగవు+అరి.) న్యాయాధిపతి. "క. భగవంతుఁడు గోవిందుఁడు, జగతిం బెడవానిచని నశాసింపంగాఁ, దగవరులు లేమిదుర్జను, లెగసిమహాసాధుజనుల నేఁచెదరకటా." భాగ. ౧. స్కం.

తగవు. దే. వి. 1. తగుట; "క. కడునమ్మియునికియును నెఱ, క్కుడునమ్మమియును సుశీల కుశలతకాదే, య్యెడనైననుబుద్ధిసానిపి, తడవికనుఁగొనంగవలయుఁదగవుతగమియుకా." భార. శాం. ౨. ఆ.—2. న్యాయము; "గీ. చేటుగాలమైనఁ జెట్టమాటలు నెఱి, గాని తెరువుపట్టికర్జములును, దగవులట్లు తోఁచుఁదగయెడునవియవి, నీతులనిమనముననిశ్చయించు." సం. "అనయో నయసంకాశః." భార. ఉద్యో. ౨. ఆ.—3. ధనాదినిమిత్తమైన జగడము; 4. పెండ్లప్పుడు పెండ్లికూఁతునకు తల్లిదండ్రులిచ్చెడు బహుమానము. విశే. తగినది, యుక్తము. "క. తగుఁబగ వీర్పుటయిమ్మెయిఁ, దగవగునే నెత్తురత్రిత్రావుట." భార. స్త్రీ. ౨. ఆ. (చూ. ఇహిహీ.)

తగవుగోరి. దే. విశే. (తగవు+కోరి.) సంధిచేయువాఁడు. "వ తగవుగోరయుంబోలెఁ గూడఁబెట్టుచు." కవిక. ౪. ఆ.

తగాదా. హిం. వి. వ్యాజ్యము, తగవు.

తగిరిస. దే. వి. తంటెము, ప్రపున్నాటము?.

తగు. దే. అ. క్రి. యుక్తమగు.

తగుకత్తి. ద్వ. వి. సాదనకు ఉపయుక్తమైన ఆయుధవిశేషము.

తగులఁగట్టు. దే. స. క్రి. (తగులకా+కట్టు) తగిలించు.

తగులఁబడు. ద్వ. అ. క్రి. (తగులకా+పడు) తగులు. చిక్కు. (స్వార్థమున పడు.)

తగులఁబెట్టు. దే. స. క్రి. (తగులకా+పెట్టు.) 1. తగిలించు; 2. కాల్చు.

తగులము. దే. వి. 1. ఆసక్తి; "క. మగలడఁకువనుండకతమ, తగులమపాటింతు రట్టితగులంబైనకా, మగువలయెడఁదలనడఁగుకా, దగవువిడిచియడిచిపదరుధైర్యముపేర్మికా." భార. విరా. ౨. ఆ.—2. అడ్డపాటు. "చ. ఎడపకమున్ను మింటిపయి నేతగులంబును లేమిమూకతకా, వెడలెడుచోఁగఠోరఘనబృందములడ్డమువడ్డనాని మై, యుడియజవోష్మఁబొఱెడురవిందులదట్టపుబండికడ్డచ

ప్పుడుగతిమ్రోసె రేవగలు భూరిభయంకరగర్జలత్తటిక్." ఆము. ౪, ఆ.

**తగులాటకత్తె.** ద్వ. వి. (తగులాటము+కత్తె.) తగులాటముగల ఆఁడుది.

**తగులాటము.** దే. వి (తగులు+ఆట.) తగులు, బంధము (ఇది పోరాటము మాటాటమువంటిది.)

**తగులు.** దే. అ. క్రి. 1. చిక్కు; (పుస్తకమంతయు వెదకితిని ఆ పదమెక్కడ నాకు తగులలేదు.)—2. పట్టు; (ఆ యిల్లుకట్టుటకు కర్చు ఏమి తగిలెను?) —3. తాఁకు; (గడపతగిలి తల బొప్పికట్టినది.)—4. సక్తమగు; (అందు నా బుద్ధి తగులదు.)—5. అంటు; (నా కాలమున్ను తగిలినది.)—6. పొసఁగు. (ఒకపనితగిలి ఊరికి వెళ్లితిని.) అం, ప్రే. తగులుచు. (చూ. తిందనము.) — స. క్రి. వెంబడించు. (వాఁడు నన్ను తగిలివాఁడు విడువలేదు.)—వి. 1. ఆసక్తి; "గీ. ఎంతగాటూటువడిన నంతియజూదంబునందుఁదగులఁజలమునతిశయిల్లు." సం. "యథాయథాహిన్నృపతిఃపుష్కరేణైవజీయతే, తథాతథాస్యవైద్యూతేరాగోభూయోభివర్ధతే." భార. ఆర. ౨, ఆ.—2. అభిలాష; "సిగ్గెఱుఁగని తగులు." వి, పు. ౨, ఆ.—3. తగులాటము. "తల్లి తగులాడి." కళా. ౪, ఆ.

**తగులుకొను.** దే. అ. క్రి. తగులుకొను. (ఆ గుడిసె తగులుకొన్నది.)—స. క్రి. పలచు.

**తగులుకోలు.** దే. వి. తగులుకొనుట.

**తగులుగొండి.** దే. విశే. (వి. ని) తగులుకొనునట్టిది.

**తగులుచు.** దే. ప్రే. తగులఁజేయు, (రూ. తగులుచు)

**తగులుడు.** దే. వి. తగులుట. "క. పానముజూదము వేఁటయు, మానినియును భూపతులకు మధురవినోద, స్థానములగునైననుదగ, వైనవిధముదక్కఁ దగులు డాపదదెచ్చున్." (తగులము అని అచ్చు పుస్తకములయందున్నది) భార. శాం. 3, ఆ.

**తగులుదల.** దే. వి. తగులుడు.

**తగులుబడి.** దే. వి. పట్టుబడి.

**తగులువడు.** ద్వ. అ. క్రి. (తగులు+పడు.) పట్టువడు, చిక్కు. "గీ. దశరథమహానరేంద్రనందనుని చేత, పతనువిక్రమనరు చేతమదిఁదలంకి, యామహీనాథనాగకన్యాలలామ, తగులువడెనప్పుడే మిచోద్యంబొతలఁప." రామా. ౪, ఆ.

**తగులువాటు.** ద్వ. వి. తగులువడుట.

**తగ్గు.** దే. అ. క్రి. 1. తక్కువగు; 2. వెనుకకుఁదీయు; 3. తెగిపడు. "క. తగ్గడుఁగారణము లేక తడఁబడి పడగల్." భార. విరా. ౪, ఆ.—వి. 1. తక్కువ; 2. త్రివర్గమునందొకటియగు క్షయము. (చూ. త్రివర్గము.)

**తగ్గుదల.** దే. వి. తక్కువ.

**తచ్చన.** దే. వి. 1. కపటము; "ద్వి. తచ్చనఁదమయింటఁదద్దినంబనుచు, మునులను నియమించి మునుమెప్పఁదెచ్చి." రా. ఆర, కాం.—2. పరిహాసము. (చూ. ఉబ్బరపోవు.)

**తచ్చనలాడు.** దే. అ. క్రి. (తచ్చనలు+ఆడు.) పరిహాసముచేయు. "ద్వి. వరవజ్రకుండలోజ్జ్వలుల్లరుమలు, దరహాసలక్ష్మితోఁదచ్చనలాడ." విష్ణు పు. 3, ఆ.

**తచ్చనసేయు.** ద్వ. స. క్రి. (తచ్చన+చేయు.) పరిహసించు. "ఉ. పచ్చిపయోజపత్రములవ్రాలెడు తుమ్మెదదొమ్మిమూఁకలన్, దచ్చనసేయుచున్." పాండు. ౧, ఆ.

**తటకా.** దే. వి. నిశ్చేష్టత.

**తటకాపడు.** ద్వ. అ. క్రి. చేష్టలుతక్కు. "ఉ. విస్మయాక్రాంతమనంబుతోఁ దబ్బులకల్ దొలఁకన్ గనురెప్పవేయక, క్ర్కాంతమహాభిలాషఁదటకాపడిమాచెఁగుమారశేఖరున్." సా. ౨, ఆ.

**తటకాపాటు.** ద్వ. వి. తటకాపడుట.

**తటతట.** దే. వి. గుండెలదరుటలోనగువానియందగు ననుకరణము. "క. తటతటగుండియలదరఁగ." విక్ర. ౬, ఆ. (మఱియు. "రెక్కలు తటతట కొట్టుకొనుచు." ప్రభా. 3, ఆ. "తటతట పెనుగాలివిసరి." శేష. ౧. ఆ. తక్కినచోట్లను అర్థవిశేషములయందిట్లేయుండును.)

**తటమట.** దే. వి. మోసము. "క. తప్పకకనుమఱి వారితటమటలంతన్." ఇలా దేవీయము. ౨. ఆ.—విశే. 1. మోసముగలది; (చూ. తటపట.)—2. కలఁతనొందినది. "క. ఇటుసేయకున్నఁ బటిమిఁ, దటమనయసురాన్వయంబుఁ దక్కిఁజగముల్, గుటిలంబుఁ గుపీనిమాటలఁ దటమటగానంబులూనితప్పఁగనడచున్." లక్ష్మి. ౪, ఆ.

**తటమటించే.** దే. స. క్రి. 1. మోసపుచ్చు; "ద్వి. పచ్చపైకముకూడఁబడినదిలేదు, తచ్చనల్పచరించితటమటించెదవో." హరిశ్చ. ౨, భా.—

2. కలఁచు. "సీ. తమ్మికేకులనిరిఁదటమటింపఁగఁ జాలు మెఱుఁగుకన్నులుతలఁదిరిగిరాఁగ." భాగ. ౪, స్కం.

తటము. సం. వి. అ. న. పరిమడి. పుం, న. 1. ఏటి యొడ్డు; 2. ప్రదేశము. పుం. కొండచఱియ.

తటపట. దే. వి. మోసము. (చూ. తటమట.)—విశే. 1. మోసముగలది; "ద్వి. తటపటమాటలు." సా. ౫. భా.—2. కలఁతనొందినది. (చూ. తటమట.) (తటమటయొక్క రూపాంతరము.)

తటపటలుచేయు. ద్వి. స. క్రి. మోసపుచ్చు. "ద్వి. తల్లిని ద్రుంగఁబాపితటపటచేసి." ధర్మా. ౧, భా.

తటస్థము. సం. విశే. (అ. ఆ. అ.) 1. సమీపమునం దున్నది; 2. ఒనఁగూడినది.

తటస్థించు. సం. అ. క్రి. 1. సమీపించు; 2. ఒనఁ గూడు.

తటస్థుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) న్యాయస్థుఁడు.

తటాకము. సం. వి. అ. పుం, న. చెఱువు. (రూ. తటాగము.)

తటాన. దే. ద్ర. క్రి. విశే. తటాలునయొక్క రూపాంతరము. "అనిలజుఁడుతటాననేతెంచి." రామా. ౮, ఆ.

తటాయించు. దే. స. క్రి. అడ్డగించు, నివారించు.

తటాలు. దే. వి. గుండెయదరుటయందగుననుకరణము. "గుండియతటాలనఁగన్." జై. ౬, ఆ.

తటాలున. దే. ద్ర. క్రి. విశే. అతిశీఘ్రముగ. "ముని యెఱుఁగఁదటాలునసమున్నతపీఠముడిగ్గి." వసు. ౨, ఆ.

తటి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఏటి ఒడ్డు; 2. ప్రదేశము.

తటిత్తు. సం. వి. త్. స్త్రీ. మెఱుపు, విద్యుత్తు.

తటిత్వంతము. సం వి. త్. పుం. మేఘము, మబ్బు.

తటిని. సం. వి. ఈ. స్త్రీ. నది, ఏఱు.

తటుకున. దే. ద్ర. క్రి. విశే. తటుక్కునయొక్క రూపాంతరము. "ఏనుసూదత్తురంగముఁ దటుకునఁ బట్టెదన్." జై. ౪, ఆ.

తటుక్కున. దే. ద్ర. క్రి. విశే. తటాలున. "విల్లటు తటుక్కునధారణివైచి." రామా. ౨, ఆ.

తట్ట. దే. వి. 1. వెదురుబద్దలుమొదలగువానితో నల్లిన పల్లిక; (ఎండుపుతట్ట, తక్కెడతట్ట. మొ.) "వ స్త్రతోఁగూడఁదట్టెండవలసివచ్చె."—2. ఇత్తడి మొదలగు లోహముతో చేసిన తబుకు; (సిబ్బితట్ట, చెక్కుకుతట్ట. మొ.)—3. చిన్నగంప.

తట్టగిల్లు. దే. అ. క్రి. తట్టయగు.

తట్టము. దే. వి. టంగువాఱు. "పొట్టపట్టెడగాఁగఁ గట్టినపెనుఁబొంపతట్టంబుతోడ." కళా. 3, ఆ.

తట్టస. వై. వి. ధైర్యము*. "వ. అత్తరుణికరకాళలంబు నందట్టసయుంబుచ్చి పెట్టువెరవును." ఉ, హరి. 3, ఆ.

తట్టాడు. దే. స. క్రి. (తట్టు+ఆడు.) (అడుగులు) ఇట్టట్టు ఇడు. "సీ. రెండుమూడడుగు లొండొం డటఁదట్టాడునవ్వడుత్రివిక్రమలీలబుద్ధిఁజూచు." లక్ష్మీ. 3, ఆ.

తట్టి. దే. వి. 1. కంచెము; 2. వేఁటతెర. "సీ. తట్టికివచ్చియిట్టట్టువోనేరనితేళ్లవిధంబునలీలయొడలి." నిర్వ. ౫, ఆ.

తట్టు. హిం. వి. పొట్టిగుఱ్ఱము.

తట్టు. యు. దే. అ. క్రి. 1. కలుగు; "ఒకస్వప్నమున నగటుతట్టనినిండుమనంబునాఁడు." భద్రా. ౧, ఆ.—2. తోఁచు. "క. అట్టియుపాయము నీవుం, దట్టినన్నుపుపొందుమాటఁ దలఁపుము." హంస. ౨, ఆ.—స. క్రి. 1. చఱచు. "సీ. కేలఁదట్టినపట్లఁగోలఁగొట్టినయట్లకరకాసరాదులు కలఁగిప అన." రామా. ౬, ఆ.—వి. శబ్దదోషములలో నొకటి. "వ. జనరఁదనంబుగల్గినుతిజల్లినిబొల్లెను దట్టుప్రోనమ్ం, దవులక." భల్లా. ౧, ఆ.—వై. 1. దరి; 2. పార్శ్వము*.

తట్టుచేయి. ద్వి. వి. కోటకొమ్మమీఁది అపఋవిశేషము. (చూ. ద్వి. ర. యు, కాం.)

తట్టుపునుఁగు. ద్వి. వి. తట్టియుత్తిన మేలైనపునుఁగు. "సీ. అలరుకస్తురితెనెలలికివాకిండ్లచెంతలవైచిపోయినతట్టుపునుఁగు." య. ౧, ఆ.

తట్టుముట్టాడు. ద్వి. స. క్రి. (తట్టుముట్టి+ఆడు.) (దారిద్ర్యము) చుట్టుకొను. "తట్టుముట్టాడునిట్టి పేదఱికము." భాగ. ౧౦, స్కం. ఉ.

తట్టువ. వై. వి. 1. అశ్వము; "సీ. కనలూనుకీనాశకాసరమ్మునుబోలెఁ గవిసితట్టువగుంపు జవిరిజవిరి." స్వా. ౪, ఆ.—2. కుత్సితాశ్వము*. (రూ. తట్టువము. కుత్సితాశ్వమునకు.—"ఉ. అందలికత్తలానిగము లందఁగ గాడుపుతట్టువాలతోఁ, బందెము వైచి." అచ్చ. బాల, కాం.)

తట్టుపడు. ద్వి. అ. క్రి. (తట్టు+పడు.) బాధపడు. "వ. బిట్టైసంగునాఁకటందట్టుపడి." స్వా. ౪, ఆ.

**తట్రు.** వై. వి. బంగారుపనిచేసి బ్రతికెడుజాతి*. (తట్రువాఁడు, తట్రుది.)

**తడ.** దే. వి. 1. అడ్డి; 2. కడ. "అల్గిపోవ నాతడనొక నేరమైనఁగలదాయను." య. ౫, ఆ.—3. ధన్వము†. (దీని భేదము గూఁబతడ.)

**తడఁబడు.** ద్వ. అ. క్రి. (తడ+పడు.) 1. తొట్రుపడు; 2. వ్యత్యాసపడు; "చ. అలుఁగచంబులుకాలతలు నంగములుకాబువుగుత్తులుకాగుచంబులునుజిగుల్లఁబాణులును బుష్పవికాసమును దహాసముకా, గలసితడంబడకా." కళా. 3, ఆ.—3. చలించు. "చ. అధికవిభీతినీదుహృదయంబిటుమీఁదటభీమధామదం, డధరునిరోధశంకను దడంబడు నేని." హన. ౨, ఆ. (ప్రే. తడఁబఱచు.)

**తడఁబాటు.** ద్వ. వి. (తడఁబడుట.) 1. వ్యత్యాసము; "చ. బరవసమొప్ప గాలితడఁబాటుమెయికాగవిఁదూతియొక్కసుర్భ్యాలముతమంబులలోవెరఁజికో అలచేఁగబళించిపొట్టపై, జెరనుడుమంచుఁదచ్చికనిచేవదొఅంగకత్తుంచివైచె." స్వా. ౪, ఆ.—2. చలనము. (చూ. తడఁబడు.)

**తడక.** దే. వి. 1. ఈఁతబద్దలులోనగువానితోనల్లిగుడిసెలకునమర్చెడు తలుపు; 2. పక్షులవేఁటాడువాఁడు మఱుఁగుగానుంచుకొనుసాధనము. "క. కట్టలుకఁడడకచాటునఁ, బిట్టలనురిగోలఁదిగిచిబిఱుసునటెక్కల్, పట్టుకొనిచిక్కములో, బెట్టుచువిహరించె లోకభీకరలీలకా." భాగ. ౭, స్కం. (ప్రయోగములయందు తడికయనియు వ్యవహారమునందు తడికయనియు కానంబడుచున్నది. తడకయని యుండుటయే సాధువనితోఁచెడి.)

**తడకట్టు.** దే. స. క్రి. అడ్డగించు. వి. అడ్డగింత. "చ. చలువలరచ్చపట్టు జలజంబులతుట్టువిరాలికల్కిప్రో, గులకనుకుట్టు జక్కవలగొట్టు చకోరులమేలియట్టురే, పొలఁతుకతాలిబొట్టు తమపుందడకట్టు సరోజసౌధముల్, గలచెలితోడఁబుట్టు తొలుగట్టుపయింగనుపట్టెనంతటకా." రా. వి. 3, ఆ.

**తడకాలు.** దే. వి. మల్లబంధవిశేషము.

**తడగము.** దే. వి. తటాకముయొక్క మొదటిరూపము. "ద్వి. ఒడలిచీరనెఱుంగకుదరంబు పెద్ద, తడగంబుగతిఁదోఁప." హరిశ్చ. ౨, భా.

**తడప.** దే. వి. పట్టగానుండునార.

**తడపెట్టు.** దే. స. క్రి. తడఁబఱచు. "కార్యాలకుదుచేష్టితంబులఁదడపెట్ట." హరి. ఉ. ౨, ఆ.

**తడయు.** దే. అ. క్రి. ఆలస్యముచేయు.

**తడవ.** దే. వి. తేప, మాఱు, ఆవృత్తి.

**తడవాడు.** దే. అ. క్రి. (తడవి+ఆడు.) 1. కోఁగాడు; 2. తడఁబడు. "క. తడవాడిరిబలకృష్ణులు తడవాడిరివారిఁజూచితకరంభాదుల్, తడవాడిరులుభయమునఁ, దడవాడిరిమంతనములఁదనసులువేడ్కకా." భాగ. ౧౦, స్కం. పూ. (మొదటిరూపము. తడవియాడు. దోఁగాడుటకు.—"క. తడవియాడెవసుంధరాస్థలమునందు, విశ్వామిత్రమునుమణి వెదకురీతి." కాళ. 3, ఆ.)

**తడవిల్లు.** దే. వి. తడబద్దలతోఁజేసినవిల్లు. (చూ. విల్లు.)

**తడవు.** దే. అ. క్రి. 1. చేతులతో అట్టిట్టుపాముట. "సీ. కడునిద్రగాఁ దమిఁదొడరుచుపడిగోసలపడని నేరకతడవుచున్న." భార. ఆది. ౬, ఆ.—2. కోఁగాడు. "సీ. ముద్దులఁదొలఁకాడమ్రోఁకాలఁగలనుదడవుచునెందునుదారితారి." హర. పూ. ౫, ఆ.—స. క్రి. 1. నిమురు; "ఎ. గీ. వీనినీవిప్పఁపెట్టుఁ విడిచితడవుమనుడు." భార. ద్రో. 3, ఆ.—2. దడు; "క. ఎడయిమ్మునాకొకించుక, తడవక నా బుద్ధియందు." హరి. ఉ. ౭, ఆ.—3. ప్రస్తావించు. "వ. ద్వారకానగరంబునంగలభాషిణిగా... నుచున్నసిద్ధునకు త్రైశంసా ప్రసంగ... ణికంఠరునిమాటలతడవుటయు." కళా. ౬, ఆ. 4. విచారించు; "గీ. అతనిగుణములెన్న ... రాస్యుఁడయిన, నచతురాస్యుఁడుధూ... ణుండు, ధరనహీనుండుహీనుండుదక్ష... దక్షముఖులనమఱి వేఱెతడవనేల." కళా. ... ఆ.—౫. రక్షించు. "ఎ. గీ. తల్లిగొనుమన్న ... లోతన్నుఁదడవ." మార్క. ౨, ఆ.—వి. 1. ... ము; "క. ఈవాయుపుత్రుఁడాజికా, ద్రావునేదుస్సనేనురక్తంబనియెకా, ద్రావఁగ... నికా, ద్రావుమనంగాదెయింకఁదడవేమిటికికా." భార. ఉద్యో. ౪, ఆ—2. చిరకాలము. (... మొదలగు శబ్దములు ముందువచ్చునపుడు ... కేవలము కాలవాచకమగును. ఉదా. అంతతడవు, ఇంతతడవు, ఎంతతడవు, కొంతతడవు. మొ.)

**తడవుడు.** దే. వి. వెదకుట, అన్వేషణము.

తడవులనిడుపుఁడు. దే. వి. శేషుఁడు. అనంతుఁడు. "క. మడుపులపడఁతుకకైనన్, దడవులనిడుపని కైనఁదరమేయెన్నన్." అచ్చ. యు. కాం.

తడి. దే. వి. 1. తేమ; 2. నీరు. "తడితలడిగ్గియుంప." ఆము. ౪, ఆ.—విణ. తేమగలది. ఆర్ద్రము.

తడిక. దే. వి. తడకయొక్క రూపాంతరము.

తడికత్రోపరి. దే. వి. (తడిక+త్రోపరి.) తడికత్రోసివేసి లోపలఁదూఱెడు దొంగ.

తడిపొడి. దే. విణ. కొంచెము తడిగలిగి పొడిగానుండునది.

తడియు. దే. అ. క్రి. ఆర్ద్రమగు.

తడియొత్తు. దే. వి. (తడి+ఒత్తు.) తడితుడుచుకొను నుడ్డ. "సీ. విసనము పైనిలుపుట వెనవు గాపనుమ నోతడియొత్తులను మేని కల్లుతుడిచి." చంద్ర.

తడుకు. దే. వి. తోఁటలోనగునాని చుట్టు నేర్పఱచెడు వలుగు. "వ. మట్టలెత్తుకొని యొత్తుగలపొదగాటపువులుచోరంబొలు పిడికడితికదుపునురవడికివిఱిగిపడినవిటపివిటపంబులఁ దడుకువోడిచి నగతినొంగు నెడలును." స్వా. ౪, ఆ.

తడుకున. దే. ద్ర. క్రి. విణ. తటుకునయొక్క రూపాంతరము. "చ. ముడిఁగి మునుంగుతో వెనుకను దునుజూడకవచ్చి లోనికిం, దడుకునఁబోయి." కవిక. ౪, ఆ.

తడుపు. దే. ప్రే. తడియఁజేయు. వి. 1. గోఁచి; "గీ. కట్టు చెప్పులతోడినున్న గజ్జతడుపు. లెలమితోఁగట్టి." హరి. పూ. ౫, ఆ.—2. చిన్నవస్త్రము. "ఎ. గీ. తడుపుగట్టక నీళ్లాడఁదగవు గాదు." సం. "ననగ్నాస్నాతిచక్వచిత్." కాశీ. ౨, ఆ. "ఎ. గీ. దయనొకపధూటి మొలవన్నె తడుపుఁ జొట్టు." శై. ౮. ఆ.—విణ. తడిసినది. (వస్త్రము.) "గీ. పడఁతులయ్యెడఁదడుపుపావడలువిడిచి." భాను. 3, ఆ.

తడుపుదాలుపు. దే. వి. (తడుపు+తాలుపు.) బ్రహ్మచారి.

తడుము.. దే. అ. క్రి. ఆలోచించు. "క. అడిగిన నృపసుతఁగానని, నొడివెడినొకదే మనఁబునొవ్వఁసివిభుం, డుడురాజవదననడుగఁగ, దడుమనయొకకొంత ప్రొద్దుతడఁబడఁ జొచ్చెన్." భాగ. ౯, స్కం.—స. క్రి. నిమురు. "పృథుభీషణబాహులసాహసంబులన్ వడిమికరల్చుచుం జనిరి." స్వా. ౪, ఆ.

తణగము. దే. వి. ఎద్దుమీఁదనీళ్లు తెచ్చెడుతోలుసంచి.

తణగాము. దే. వి. తణగముయొక్క రూపాంతరము.

తతము. స. వి. అ. న. వీణాలోనగువాద్యము. పుం. గాలి. విణ. 1. విరివియైనది; 2. వ్యాపించినది.

తతి. ఉభ. దే. వి. సమయము. (చూ. కుతిలపడు.)—సం. ఇ. స్త్రీ. సమూహము.

తతిమ్మా. హిం. విణ. మిగిలిన.

తత్తడి. దే. వి. గుఱ్ఱము, అశ్వము, వాహనము.

తత్తబడి. దే. వి. సరివారము. "క. చిత్తంబూరకకలఁచెదు, నెత్తమునాతోడనాడ నేరుపుగలదేఁ, బొత్తుగలసినీవునని, తత్తబడిలుఁదడుగెలిచెదంబరువడితోన్." ఉ. హరి. 3, ఆ.

తత్తఱ. దే. వి. (తఱ+తఱ) సంభ్రమము. "ద్వి. దరిఁజేరుకరడుతత్తఱమొల్లరాదు." రా. అ, కాం. (రూ. తత్తఱము. "వ. తత్తఱమున నేగుదెంచి ప్రమదంబునని గనుఁగొంటినియ్యెడన్." రుక్మాం. ౫, ఆ.)

తత్తఱపడు. ద్వ. అ. క్రి. సంభ్రమించు.

తత్తఱపాటు. ద్వ. వి. తత్తఱపడుట.

తత్తఱపెట్టు. దే. స. క్రి. తత్తఱపఱచు. "క. మనసీఁజూఁడడ్డఱికనుగుం, దెనకానితనంబు చేసెడింగనుఁగొనఁగన్, జనవులుమాటలునవ్వులుఁ, దనువునఁబులకలునుగిలుగఁదత్తఱపెట్టెన్." విక్ర. ౮, ఆ.

తత్తఱిచేయు. దే. అ. క్రి. 1. సంభ్రమించు; 2. చలించు. (చూ. తత్తరిల్లు.)

తత్తరిల్లు. దే. అ. క్రి. 1. సంభ్రమించు; 2. చలించు. (రూ. తత్తరిలు. చలించుటకు.—"సీ. కడుఁదీఁగసాఁగుచుబడుగునెన్నడుముమిక్కిలికృశంబుగఁ దత్తరిలుమనిక్కి." కళా. ౭, ఆ.)

తత్తెర. దే. వి. సారాయిపోసెడుతిత్తి.

తత్పరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.)(ఒకట) ఆసగలవాఁడు.

తత్రత్యము. సం. విణ. (అ. ఆ. అ.) అక్కడ కలిగినది.

తత్త్వజ్ఞుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తత్వము తెలిసినవాఁడు.

తత్వము. సం. వి. అ. న. 1. పరమాత్మ; 2. స్వభావము; 3. నృత్యాది విలంబితమానము. (పంచవింశతి తత్వములు. — అష్టప్రకృతులు షోడశవికారములు పురుషుఁడు.)

తథాగతుఁడు. సం. వి. అ. పుం. బుద్ధదేవుఁడు.
తథ్యము. సం. వి. అ. న. సత్యము. విశే. సత్యమైనది.
తదాత్వము. సం. వి. అ. న. ఆకాలము.
తదియ. వై. వి. పక్షమునందు మూఁడవతిథి.
తదీయము. సం. వి. (అ. ఆ. అ.) తత్సంబంధమైనది.
తద్గుణము. సం. వి. అ. పుం. 1. ఒక యర్థాలంకారము; (చూ. అలంకారము.) 2. ఆగుణము.
తద్ద. దే. అవ్య. అత్యంతము. "తద్దతెగడు, తద్దనెమ్మి." భార. ఆది. ౪, ఆ. (ఇదియు నునద్ధాంతమునగును. "తద్దయురమ్యము." భార. ఆది. ౪, ఆ.)
తద్దినము. సం. వి. అ. న. ఆదినము. (వాడుకయందు మృతిపొందినదినము.)
తద్దె. దే. వి. పండుగ. (అట్లతద్దె, ఉట్లతద్దె. మొ.)
తనకలి. దే. వి. చిక్కు. (చూ. గొల్ల. దే. కడపటి ఉదా.) విశే. 1. చిక్కుగలది; "చ. పెనిమిటిచెడుగుదాఁచిచని పెంపునఁగ్రమ్మఱుదాఁక నీడియం, బును సిరిగందముల్ విరులు ముట్టక యుండఁడగున్ బొలంతి తే, జనఁగడు నొప్పు మట్టసపు సొమ్ములతోఁ గుఱుమాపుచీరతోఁ, దనకలి కొప్పుతో మిగులఁదారొక్కనుముత్తెపు సేసబొట్టుతోన్." య. ౪, ఆ.—2. చిక్కులఁబెట్టువాఁడు. "క. జూదరివి సుమాళివి నెఱ, వాదివి తనకలివి గెలుపవచ్చునటేదా, మోదర నిను మాకనుటయు. నా దెసఁగనుఁగొనక పిలువుమనెజాంబవతిన్." ఉ. హా. 3, ఆ.
తనఖా. హిం. వి. తాకట్టు. దత్తపత్రము.
తనఖీ, తనిఖీ. హిం. వి. విమర్శ.
తనము. ఉభ. వై. అప. భావార్థమునందువచ్చెడునొక ప్రత్యయము. (గొప్పతనము, చిన్నతనము. మొ.) – సం. వి. అ. పుం. 1. చందనము; 2. చిత్తము.
తనయ. సం. వి. ఆ. స్త్రీ. పుత్రిక, కూఁతురు.
తనయుఁడు. సం. వి. అ. పుం. పుత్త్రుఁడు, కొడుకు.
తనరారు. ద్వి. అ. క్రి. (తనరు+ఆరు.) 1. ఉన్నతమగు; "సీ. నెగసినకొనలేచి నింగియంతంతకు నవులఁద్రోయఁగఁదనరారుదాని." భార. విరా. ౧, ఆ.—2. అతిశయించు.
తనరు. వై. అ. క్రి. 1. అతిశయించు; "క. అనువారునందుఁగొందఱు, ఘనుఁడీతఁడు వీరికంటెఁగార్ముకవిద్యన్, దనరినవాఁడయిదీనికి, మొనసెంగాకన్యుఁడిట్లు మొనయంగలఁడే." భార. ఆది. ౭, ఆ.—2. విజృంభించు*; "చ. కనుఁగొని కోపవేగమునఁగన్నులనిప్పులురాలనంగముల్, తనరఁగసాంద్రఘర్మసలిలంబులు గ్రమ్మ." భార. విరా. ౨, ఆ.—3. ఒప్పు*. "క. నలువగలలోఁగన్గొక్కలి, నలువగలభుజంబులుం దనరుసిరినంటున్ గలిమిదొర నీకుమారుఁడు. కలిమిహికామినీ మూర్తిగాకన్యుండే." రామా. ౪, ఆ.
తనరుచు. వై. అ. క్రి. తనరుయొక్క రూపాంతరము. (రూ. తనర్చు.—అతిశయించుటకు.—"ఉప్పొంగి తనర్చు." అచ్చ. యు, కాం.—విజృంభించుటకు.— "తనర్చున్ భుజాగ్రములు." భార. ఉద్యో. ౩, ఆ.)—అం. ప్రే. తనరఁజేయు. "చ. అనవినిగుబ్బనంబొడమునల్కకు నెచ్చెలులైకనుంగవన్ దనలెను దట్టకెంపును మొగంబునఁబొడ్మెడుఘుర్ఘురకం. బును నిటలంబునందనరు భ్రూకుటియున్ భయమున్ దనర్చు." లక్ష్మీ. ౪, ఆ.
తనరుపు. వై. వి. 1. పొడవు; 2. అతిశయము. (రూ. తనర్పు. పొడవునకు.—"వ. అదియును నూఱుయోజనంబుల వెడల్పును నూటయేఁబదియోజనంబులనిడుపునైదుయోజనంబుల తనర్పునుంగలిగి." సం. "పంచయోజనముచ్ఛ్రితా." భార. సభా. ౧, ఆ.—అతిశయమునకు.—"భుజంగప్రయాతము. వినీతుండవైధర్మవేదిత్వబుద్ధిన్, దనర్పొందుదీవు." భార. స్త్రీ. ౧, ఆ.) (దీనికిఁ గొందఱు వెడల్పు అని అర్థము వ్రాసియున్నారు.)
తనాబి. దే. వి. స్తంభములమీఁదిగోడకు క్రిందవేసెడి పెద్దపలక.
తని. వై. విశే. 1. అల్పము; "సీ. కాఁడినవిసుకంటకములు మెల్లనఁబుచ్చితనివెచ్చఁబొడపస్త్రముఁగాఁచి." జై. ౬, ఆ.—2. సూక్ష్మము. "సీ. ప్రల్లాలిమిగుల వార్పనికమ్మక్రొమ్ముడిఁదనిమొగ్గిరవాఁదిదండపిరియ." ఆము. ౨, ఆ.
తనిమము. సం. వి. న్. పుం. 1. కార్శ్యము; 2. విస్తారము; 3. శరీరత.
తనియు. దే. అ. క్రి. ఆపోవు, తృప్తిపడు.
తనివి. దే. వి. ఆపోక, తృప్తి.
తనివు. దే. వి. తనివి. (కొన్ని వ్రాఁతపుస్తకములయందును అచ్చుపుస్తకములయందును ఈ పాఠము కనఁబడుచున్నది. దీనిని సాధువుగానే గ్రహింపవచ్చును. అప్పుడు ఇది ఉలివులోనగువానివంటిదని తెలియవలెను.)

తనివోవు. దే. అ. క్రి. (తనివి + పోవు.) తనియు. "ఉ. మహార్థమునిల్చినీసుఖాం, భోరుహావిక్షంబుతనివోనఁగఁగ్రోలిమదీయలోచనో. . . . మధుప్రతాలినుదమందెడునట్టులుగానొనర్చెనే." మార్క. ౧. ఆ.

తనివిసను. దే. అ. క్రి. (తనివి+చను.) ——పై.—— "క. తనివిసనితెఱఁగనమాయని, యను." రా. యు, కాం.

తను. దే. విశే. వృత్తియందు తనుపుశబ్దమునకు మీఁద హల్లు లోపింపఁగా మిగిలినరూపము. "క. అను పంబోలయునల్లని, తనుగాలిందేలి లజ్జితస్వాంతుండై." నిర్వ. ౪, ఆ.

తనరు. దే. అ. క్రి. 1. కలుగు; "క. ధరణికపగ్రాగ్ర . . . . . కయుండెన్." భార. సభా. ౨. ఆ.—2. జ్వలించు; "క. కొనిప్రచ్ఛదులోపలన. ల్లనిక్రిమియయితోఁచి మఱిరాయలత్తుకనన్నం. బునఁబొమ్మెనిపుపహ్ను లు, తనుకఁగఁగును మెఱఁగఁజిలితకుఁడెనగెన్." భార. ఆది ౨, ఆ.—3. ప్రకాశించు; "క. మొగమునఁదనికినకెంపుతోడమునిపతియుండెన్." ఉ, హరి. ౪, ఆ.— 4. తపించు. "ద్వి. అనుటయు నెట్లతండంబుధఁ ద్రచ్చెఁ. దనుకకమందరగిరి మెట్లుపూఁచె." భా. ౧. ౧, స్కం.—వి. తాపము. "గీ. కులనగముల . . ప్రయ్యలైకూలునట్లు, గానొనర్చెడిక్రైదునాక . . . . భావమెుడక్రమ్మఱవచ్చి పాకశాస, నానికరమునేరనెంతయుఁదనుకునొచ్చి." హరి. పూ. ౪. ఆ. (రూ. తన్రు.)

తనుత్రము. సం. వి. అ. న. కవచము, బొందలము.

తనుత్రాణము. సం. వి. అ. న. ——పై.—— (శిరస్త్రాణము శిరస్కము, ముఖత్రాణము దలపము. ఉదరత్రాణము నాగోదము, జంఘాత్రాణము మంఖణము, బాహుత్రాణము బాహులము, అంగుళీత్రాణము గోధ.)

తనుపారు. దే. అ. క్రి. (తనుపు+ఆరు.) 1. తనియు; "ప్రమదములుల్లసిల్లఁ దనుపారఁగ నిద్రలువోయి." హరి. పూ. ౧, ఆ.—2. చల్లనయగు. "క. కనియాపద్మాకరమునఁ, దనుపారెడునీరుద్రావి తనునేలవా. రునువిశ్రమించిరానే, చనకమునగుతరులనీడసైకతములపై." ఉ, హరి. ౪, ఆ.

తనుపు. దే. ప్రే. తనియఁజేయు. వి. 1. తనివి; "చ. కనుఁగొనిగారవంబునమొగంబునఁగేలుఁ బురఃప్రసారమున్, దనుపునునమ్రభావమునుదంత మరీచులసామినిగ్గమం, బునఁదమలోఁగఁదలిర్చెన్." భార. విరా. ౧. ఆ.—2. శైత్యము; "గీ. మహితసర్వదానమహిమనాలుగు నెల, లిలకుఁదనుపొనర్చునింద్రుకరణి." మార్క. 3. ఆ.—3. శైత్యోపచారము; "చ. కనుఁగొనిసత్యభామమదఁగంపమునొందకనాటియున్నయా. సునిశితబాణమున్ దెటికిశోణితమున్ గరిపల్లవప్రమా, ర్జనమునఁబాయఁబాపుచును జామరవాయుతసంప్రయుక్తిచేఁ, దనుపొనరించిపల్లభుగతవ్యథుఁజేసెమహార్థమాత్రలోన్." హరి. ఉ. ౪, ఆ.—4. పితృయజ్ఞము; 5. తడి. సా. ౨. ఆ. (రూ. తన్పు.)

తనుమధ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. సన్ననినడుముగల ఆఁడుది; 2. ఆఁడుది.

తనుపడు. ద్వ. అ. క్రి. (తనుపు + పడు.) చల్లఁబడు. "క. కనుఁగొనియించుకసేపునఁ, దనుపడునిషలికెఁబిడపఁదనుపడుటయును." భార. శాం, ౬, ఆ.

తనువు. సం. వి. ఉ. స్త్రీ. 1. దేహము; 2. తోలు. విశే. 1. చిన్న; 2. బక్క; 3. సన్నము.

తనూజుఁడు. సం. వి. అ. పుం. తనయుఁడు, కొడుకు.

తనూనపాత్తు. సం. వి. త్. పుం. అగ్ని.

తనూభవుఁడు. సం. వి. అ. పుం. తనూజుఁడు, కొడుకు.

తనూరుహము. సం. వి. అ. న. 1. వెండ్రుక; 2. ఱెక్క. (రూ. తనురుహము.)

తన్ను. దే. స. క్రి. 1. పాదముతో తాడనము చేయు; 2. ఒరయు. "చ. మెలఁతలుమిన్నుదన్నువెలిమేడలఁగ్రీడలుసల్పుచుండి." రామా. ౧, ఆ. — వి. పాదతాడనము.

తన్నుఁగోల. దే. వి. (తన్ను + కోల.) ఏటవాలుగా పోటుపెట్టినకోల.

తన్నుబల్ల. దే. వి. ద్వారముయొక్క అరిగాళ్లమీఁద వేసెడుపలక.

తన్నుబిల్ల. దే. వి. బాలక్రీడావిశేషము. (చూ. డాఁగిలిముచ్చులు.)

తన్నులాడు. దే. అ. క్రి. (తన్నులు+ఆడు.) ఒకరి కొకరు తన్నుకొను.

తన్మయము. సం. వి. (అ.ఈ.అ.) తత్స్వరూపమైనది.

తన్మాత్రము. సం. వి. అ. న. శబ్దాది. (పంచతన్మాత్రములు.—శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము.)

తనివి. ఉ-భ. దే. వి. తనివియొక్క రూపాంతరము. విజ. ౨, ఆ.—సం. ఈ. స్త్రీ. 1. కృశించిన దేహముగల ఆఁడుది, 2. ఆఁడుది.

తపతప. దే. వి. ఎక్కిళ్లుకొట్టుకొనుటయందగుధ్వన్యనుకరణము. "గీ. కోడి తపతప ఎక్కిళ్లుకొట్టుకొనుచుఁ, గూయుక్రమమొప్పమీఱె." కళా. ౫, ఆ.

తపనము. సం. వి. అ. న. 1. తాపము. (ఈ యర్థమున నిది తెనుఁగు ప్రయోగములయందు స్త్రీసమముగాఁ గానఁబడియెడి. "అక్కర. వనమునఁబడియు రెండేఁడులజ్ఞాతవాసమొక్కేఁడు, జనపదంబున నుండితపనవయ్యేండ్లుసలిపి." భార. ఆది. 3, ఆ.) 2. నాయికకు ప్రియవియోగకాలమందు మన్మథావేశముచే కలిగెడు చేష్ట. పుం. 1. వేసంగికాలము; 2. నరకవిశేషము; 3. జీడి*.

తపనీయము. సం. వి. అ. న. స్వర్ణము, బంగారు.

తపనుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

తపము. సం. వి. అ. పుం. వేసంగికాలము. స్. న. 1. తపస్సు; 2. ఒక లోకము; (చూ. లోకము.) 3. చాంద్రాయణాది పుణ్యకర్మము. పుం. 1. శిశిర ఋతువు; 2. మాఘమాసము.

తపసి. వై. వి. 1. తపస్వి; 2. గారచెట్టు. "చ. అపరిమితానురాగమనోలసయై చిగురాకుచేతులం, దపసిని కౌఁగిలించె వనితా యిదె రంభ తలంప రంభదా, నపరిమితానురాగమనోలసయైచిగురాకుచేతులన్, దపసినికౌఁగిలించు టుచితంబె కదాయనిన వ్వెరంభయుక్." స్వా. 3, ఆ.

తపస్య. సం. వి. ఆ. స్త్రీ. వ్రతచర్య. అ. పుం. ము. ఫాల్గునమాసము.

తపస్వి. సం. వి. న్. పుం. తపముచేయువాఁడు. విణ. కనికరింపఁదగినవాఁడు.

తపస్విని. సం. వి. ఈ. స్త్రీ. 1. తాపసురాలు; 2. కటుకరోహిణి*; 3. జటామాంసి*.

తపారము. దే. వి. ఒకదినుసు కుల్లాయి. "సీ. పాటలానిలములార్పఁగఁదపారపుముంగు లలరఁదావిరిమూఁగునలులఁజోప." అను. ౨, ఆ.

తపారు. దే. వి. తపారముయొక్క రూపాంతరము.

తపించు. సం. అ. క్రి. 1. తాపమునొందు; 2. తపస్సుచేయు.

తపోధనుఁడు. సం. వి. అ. పుం. తపస్సేధనముగాఁగలవాఁడు, తపస్వి.

తప్తము. సం. విణ. (అ.ఆ.అ.) తపింపఁజేయఁబడినది, కాఁచఁబడినది.

తప్పకాయ. దే. వి. విత్తుపట్టనికాయ.

తప్ప. దే వి. గింజపట్టని ధాన్యము.

తప్పిదము. ద్వ. వి. (తప్పు+ఇదము.) దోషము. (తప్పుయొక్క రూపాంతరము.)

తప్పు. యు. దే. అ. క్రి. తక్కు. "బలిమింజేకొనఁ గాఁదు సామమునఁదప్పక." జై. 2, ఆ.—వై. తప్పనేయు. "పాపబుద్ధులన్న దెసఁదప్పిరి." భార. ద్రో. 3, ఆ.—స. క్రి. అతిక్రమించు*. "ధర్మవ్ర నుచితంబుఁదప్పనివారల." భార. ఆది. 3, ఆ.—వి. తప్పిదము.

తప్పడు. వై. వి. తప్పట.

తప్పడుపడు. వై. అ. క్రి. (తప్పడు+పడు.) 1. తప్పుపడు; 2. సరితప్పు.

తప్పదల. ద్వ. వి. తప్పట.

తప్పదారి. వై. వి. తప్పుత్రోవ, అపథము.

తప్పదెబ్బలు. ద్వ. వి. బడియందు ప్రొద్దుపోయి వచ్చినందులకై వచ్చిన క్రమముఁబట్టి బాలురను ఉపాధ్యాయులుకొట్టెడు ఒకటి రెండు మొదలగు దెబ్బలు.

తప్పెట. వై. వి. 1. చర్మవాద్యవిశేషము; (చూ. దే.) 2. వనకులుత్థము**.

తఫావతు. హిం. వి. భేదము, లోపము, తక్కువ.

తఫసీలు. హిం. వి. వివర్ణము.

తబము. వై. వి. తపస్సు. "సీ. గాలియోగిరముగాఁ గనునీటిలోనఁదబములొనర్చెడునిరాశాంగములు." య. ౨, ఆ.

తబుకు. దే. వి. తములపాకుతట్ట.

తబేలా. హిం. వి. గుఱ్ఱపులాయము.

తబ్బిబ్బు. దే. వి. తడఁబాటు, విపర్యయము. "వ. మనపువేళలమాటలతబ్బిబ్బునంబుట్టుపాలయలుక లందలులవంచి." స్వా. 3, ఆ.

తబ్దీలు. హిం. వి. మార్పు.

తమంగము. సం. వి. అ. పుం. మంచె, తమగము.

తమకపడు. ద్వ. అ. క్రి. (తమకము+పడు.) 1. త్వరపడు; "క. ఈకరణివచ్చుతురగముఁ, బైకొనిపట్టంగఁదమకపడుపుత్రునినా, లోకించివలదువేగము, నీకనివారించిమనుమనింగనుఁగొన్నన్." జై. ౨, ఆ.—2. మోహపడు. (చూ. తమకము.)

తమకము. దే. వి. 1. త్వర; "క. ఎత్తెడు వేగమువిందు లు, తత్తఱమునవిఱుగ నేయుతమకమునయినం, జి త్తములుకృపాణరణా, యత్తములుఁగనిలుకునుతికి రావీరవరుల్." ఉ, హరి. ౪, ఆ.—2. మోహము. "ద్వి. తమవిలాసంబులఁదమయుపాయములఁ, ద మకంబుపుట్టించి." రా. బాల, కాం.

తమకి. దే. విశ. (తమకము+ఇ.) 1. త్వరగలవాఁడు; "క. వినుగర్భిణిప్రజబ్రదుకున, కనురూపములైన యట్టియాహారంబుల్, గొనుగతిఁబతిధరణీప్రజ, మనికికిఁదగనడమనదితమకిగాకెపుడున్." భార. శాం. ౨, ఆ.—2. మోహముగలవాఁడు. (చూ. తమకము.)

తమకించే. దే. అ. క్రి. 1. త్వరపడు; "ఉక్కిలియి యిట్లుసృష్టిపనికిం దమకింపఁగఁజన్నె." హరి. పూ. ౧, ఆ.—2. చలించు. "చ. వలఁబడిచిక్కి లో దివలవ్రచ్చుకపోవుటయొండెఁగాకప, ఝషు లవలఁగొంచుభారమునకుం దమకింపక యుబ్బ కుబుణన్, గలగొనిపాఱుఁటెట్లు." పంచ. నా. ౨. ఆ.

తమను. దే. అ. క్రి. చలించు. "సీ. తమకన్నులకుపీఁ గితమను చందంబునఁ బెల్లుగాఁగల్వలు తల్లడిల్ల." య. 3, ఆ.—వి. విధము. "వ. వలరాజునెత్తపలకత మకునంగనుపట్టువీఁపున నేపారి." పాండు. 3, ఆ.

తమగము. వై. వి. మంచె. "క. తమగమునకెదురు యదుస, త్తమగణ్యునిఁజూచిఖడ్గధరుఁడైయెదు రేగా, తమగమివారలువీరో, త్తమగణవిభుఁడనఁ గఁగంసధరణీపతియున్." భాగ. ౧౦, స్కం. పూ.

తమటము. సం. వి. అ. పుం. తప్పెట. "సీ. తమటని స్సాణమృదంగభేరీశంఖరవములు బోరనరహిఁ జెలఁగ." రుక్మా. ౧, ఆ. (చూ. తమ్మటము.)

తమము. సం. వి. స్. న. 1. చీఁకటి; 2. ఒకగుణము; (చూ. గుణము.) 3. శోకము. పుం, న. రాహు గ్రహము.

తమరము. సం. వి. అ. న. లోహవిశేషము, తగరము.

తమస్విని. సం. వి. ఈ. స్త్రీ. త్రియామ, రాత్రి.

తమాము. హిం. విశ. అంత.

తమాయించే. దే. అ. క్రి. స్తిమితమగు, శమించు.

తమాలపత్రము. సం. వి. అ. న. 1. బొట్టు; 2. మకరి కాపత్రము; 3. చీఁకటిమ్రాను.

తమాలము. సం. వి. అ. న. బొట్టు. పుం. 1. కత్తి; 2. ఉలిమిరి; 3. చీఁకటిమ్రాను.

తమాషా. హిం. వి. వేడుక.

తమి. ఉభ. దే. వి. 1. త్వర; "గీ. తమయభీష్టకేళిత మినొంతిర్యగ్జంతు, వనియె నశుగణింపకవ్విధము నఁ, జెప్పుకొనఁగవింటి నప్పల్కులేనువా, నడు మఁగదలిపోవజడిసియుంటి." కళా. ౫, ఆ. — 2. కుతూహలము; "క. తనివిసనకయవలికతయుఁ దమినడుగుటయున్." అచ్చ. అ, కాం. — 3. అపేక్ష; "ద్వి. అందఱెప్పుడుపోదురని వెచ్చ నూర్చు, నెందుపైఁదమిలేక యేకాంతమరయు." విష్ణు. ఉ. ౪, ఆ.—4. వలపు. (చూ. తమికొను.)—సం. ఇ. ఈ. స్త్రీ. 1. రాత్రి; 2. చీఁకటి.

తమిఁద. దే. వి. రాగిపైరు. బ. రాగులు. (చూ. తవ్వఁద.)

తమికొను. దే. అ. క్రి. 1. త్వరపడు; 2. కుతూహ లపడు; 3. అపేక్షపడు; 4. మోహపడు. (ప్రే. తమికొల్పు. మోహపఱచుటకు.—"సీ. వేల్పురా యని ప్రోలవెలయునాఁడెపుడుచ్చరలసెల్లఁదమి కొల్పికలసినాఁడ." అచ్చ. అర, కాం.)

తమిర. దే. వి. కాఁడినడిమిచీల, శమ్య.

తమిస్ర. సం. వి. ఆ. స్త్రీ. 1. చీకఁటిరేయి; 2. చి మ్మచీకఁటి. ఆ. స్త్రీ. అ. న. ము. చీఁకటి. న. కోపము.

తముకు. దే. వి. చర్మవాద్యవిశేషము, తుడుము. "సీ. తరలిరమ్మనిఁజేతముకొక్కటియకాని పేర్కొ న వెఱతురుపెదడమాయి." చంద్రా. ౧, ఆ.

తములపాకు. ద్వ. వి. (తములము+ఆకు.) నాగ వల్లీదళము, (రూ. తములపుటాకు.)

తములము. వై. వి. తమ్ములముయొక్క రూపాంతరము.

తమ్మ. దే. వి. 1. చర్వితతాంబూలము; 2. తంబళి.

తమ్మంటు. దే. వి. (తమ్మి+అంటు.) కుండలము. "సీ. పునుకతమ్మంటులఁబోలుచుమీసులవారునో సలమిక్కిలిచూపులెసఁగువారు." పాండు. ౧, ఆ.

తమ్మటము. సం. వి. అ. పుం. తమటము, తప్పెట. "వ. శంఖ కాహళభేరీ పటహ ఝల్లరీ పణవ మర్ద లతమ్మటప్రముఖనిఖిలవాద్యనిర్ఘోషంబులును." కళా. ౭, ఆ. "తమ్మటభేరీముఖస్వనములుసెలఁ గ." రుక్మాం. ౪, ఆ. "వ. అతితుములతమ ధమా మికా తమ్మట భేరికా పటహ తుత్తుంభికాదివా దిత్రగంభీరఘోషసంరంభంబు." వసు. ౬, ఆ.

"శ్లో. రాజకన్యావివాహేతు కేవలం తమ్మటధ్వనిః." అని చాటువు. (ప్రయోగములిట్లున్నవి. కొందఱు తమట తమ్మట శబ్దములను దేశ్యములుగా వ్రాసియున్నారు.)

**తమ్మతసుకు.** దే. వి. తమ్మపడిగము.

**తమ్మళ.** దే. వి. తంబళయొక్క రూపాంతరము. "క. అగ్రహారములోనన్, దమ్మళజోస్యములున్నవిధమ్మున." రుక్మాం. ౫, ఆ.

**తమ్మళి.** దే. వి. తంబళియొక్క రూపాంతరము.

**తమ్మి.** యు. దే. వి. వృక్షవిశేషము. వై. 1. పద్మము; 2. పద్మవ్యూహము*. "సీ. తమ్మిఁదాల్చినవానిఁదమ్మిఁదొల్చినవానిఁ దమ్మిమొల్చినవానిఁ దారసించు." కా. ౧, ఆ.

**తమ్మికంటి** ద్వ. వి. (తమ్మి+కన్ను.) 1. కమలములవంటి కన్నులుఁగల ఆఁడుది, కమలాక్షి; 2. ఆఁడుది; 3. విష్ణువు, కమలాక్షుఁడు. (ఇట్లు తామరకంటి. మొ.)

**తమ్మికెంపు.** ద్వ. వి. పద్మరాగమణి. "సీ. మగమానికముల క్రొన్నిగనిగల్ దులకింపఁబలుతమ్మి కెంపుమేల్ పసలునింప." నీలా. ౨, ఆ. (ఇట్లు తామరకెంపు. మొ.)

**తమ్మిచూలి.** ద్వ. వి. బ్రహ్మ, పద్మయోని. "గీ. భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు, శూలికైనఁ దమ్మిచూలికైన." భాగ. ౧, స్కం. (ఇట్లు తామరచూలి. మొ.)

**తమ్మిదీవి.** వై. వి. పుష్కరద్వీపము.

**తమ్మిదొర.** ద్వ. వి. సూర్యుఁడు, పద్మినీవల్లభుఁడు. "గీ. అట్లు కాకని మునివేషమధిగమించి, పంపకడఁ దమ్మిదొరచూలిపంపవచ్చి, గాడ్పుకొమరుండు రామలక్ష్మణులఁ గాంచి, పలికె భయభక్తియుక్తులేర్పడఁగనిట్లు." రామా. ౫, ఆ.

**తమ్మిపగతుఁడు.** ద్వ. వి. చంద్రుఁడు, అబ్జారి.

**తమ్మిపుట్టు.** ద్వ. వి. బ్రహ్మ, అబ్జయోని. "సీ. పుట్టుమూఁగనుదమ్మిపుట్టుగాఁ గైసేసి పరఁగు ప్రసాదవైభవమువాఁడు." భాను. ౧, ఆ.

**తమ్మియ.** దే. వి. 1. చెవితమ్మె; 2. పలుపుతమ్మె.

**తమ్మియింటిగరిత.** ద్వ. వి. లక్ష్మి, పద్మాలయ.

**తమ్ముఁడు.** దే. వి. వెనుకఁబుట్టినవాఁడు, అనుజుఁడు. (వ్యుత్పత్తియందు తమ్ముగమి, తమ్ముగుఱ్ఱ, తమ్ముదోయి, తమ్ముప్రోవు. మొ.)

తమ్ములము. వై. వి. తాంబూలము. "చ. అతండటు చూచి భీతిఁ దమ్ములమిలవైచినన్ నగిరిమూఁగిన రాజకుమారులందఱున్." (ఈ యుదాహరణమునందలి తక్కినమందటి భాగమును అడపకడఁ జూచునది.) వై. ౭, ఆ.

తమ్ములవిందు. ద్వ. వి. సూర్యుఁడు, పద్మబాంధవుఁడు (చూ. చేట్టలుఁగు.)

తమ్మువాఁడు. దే. వి. తమ్ముఁడు. (చూ. తమ్ముఁడు.)

తమ్మె. దే. వి. 1. చెవియొక్క అడుగుభాగము; 2. పసులమెడను దగిలించెడు పలుపుయొక్క ముందుభాగము. (తమ్మియయొక్క రూపాంతరము.)

తయారు. హిం. విశే. సిద్ధమైన.

తయునాతి. హిం. వి. కాచికొనియుండుట.

తరంగము. సం. వి. అ. పుం. ఊర్మి, అల.

తరంగిణి. సం. వి. ఈ. స్త్రీ. తటిని, నది, ఏఱు.

తరండము. సం. వి. అ. పుం, న. 1. ఓడ; 2. గాలపుదారము కట్టిన కొయ్యలోనగునది; 3. పుట్టి.

తరఁగ. వై. వి. అల. "సీ. కుంభజుమీఁద మార్కొనవచ్చునంభోధి తరఁగల గమిఁ బోలు తురగచయము." భాస్క. ఆర, కాం.

తరకటించే. వై. అ. క్రి. తర్కించు.

తరకటెంపు. వై. వి. తర్కము. (చూ. ఆరగింపు.)

తరకసము. దే. వి. అమ్ములపొది, తూణీరము. "సీ. గానొప్పారు పైఠాణంబు సింగిణి తళుకులకోరలతరకసంబు." స్వా. ౪, ఆ.

తరకసా. దే. వి. తరకసముయొక్క రూపాంతరము.

తరక్షువు. సం. వి. ఉ. పుం. సివంగి, మృగాదనము.

తరగంపియ. దే. వి. తరగంపె.

తరగంపె. దే. వి. ఒకదినుసు అంపము. (తరగంపియయొక్క రూపాంతరము.)

తరగతి. మి. గ్రా. వి. (తరము+గతి.) తరమును దేల్పెడుభాగము.

తరగతిగుండ్లు. మి. గ్రా. వి. బ. స్త్రీలకంఠభూషావిశేషము.

తరణము. సం. వి. అ. న. దాఁటుట. పుం. ఓడ.

తరణి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఓడ; 2. దాఁటుట; 3. పిన్నగోరంట? చేమంతి?. (అని కొందఱు.) పుం. 1. సూర్యుఁడు; 2. సముద్రము.

తరతరము. దే. అవ్య. క్రి. విశే. (తరము+తరము.) 1. క్రమముగా; "వ. కద్రూగర్భాండంబులుతి

తరంబవిసిన." భార. ఆది. ౧, ఆ.—2. పరంప రగా. "మేముతరతరంబయాశ్రితులము." భార. మహా. ౧, ఆ.

తరపణ్యము. సం. వి. అ. న. ఓడనడపువానికిచ్చెడు కూలి, కేవు.

తరపు. దే. స. క్రి. పోఁగొట్టు, హరించు. "గీ. సత్య భాషణనియమంబుజరపినాఁడు, నిత్యనైమిత్తికా దులనెరపినాఁడు, దండిలోభాదిగుణములఁదర పినాఁడు, మంచిగుణములుతనయందుమరపినాఁ డు." భాగ. ౬, స్కం.

తరపు. హిం. వి. పక్షము, దేశము.

తరబడి. దే. వి. (తరము+బడి.) తరము.

తరబిస్యాతు. హిం. వి. సేర్పు.

తరము. ఉభ. దే. వి. 1. పురుషాంతరము; "క. నిర తింబుబ్రహ్మ మొదలుగ, వరుసనయొడ తెగకయి ట్లునచ్చినవంశం, బురుభుజనీవుంజేగనీ, తరము నవిచ్ఛిన్న మగుటధర్మ వెయనినన్." భార. ఆది. ౪, ఆ.—2. మానము; "క. నీయొఱుఁగనియవి యులేవునిక్కపుఁదరముల్." (చూ. దీనివెనుక టిపద్యము.) భార. ఉద్యో. ౪, ఆ.—3. సామ్య ము, "సీ. నరపుంగవులుగానినరపుంగవులుగారు తరమెన్న పరధర్మధర్మభృతుల." వసు. ౧, ఆ.— 4. వరుస; "ఉ. అత్తెరవేఁట కాంద్రుయమునాం బుతరంగపరంపరాకృతిన్, ముత్తరమైననూకర సముత్కరముంగని." స్వా. ౪, ఆ.—5. దినుసు. 'బాలముద్దుం దలిచూపులంగజనితూపులలోప లమేల్ తరంబులు." విజ. ౧, ఆ.—విశే. 1. శక్య ము, 2. శక్తము; "మీరుమద్ఘనభుజశక్తికిన్ దర ముగారు." ఉ, హరి. ౪, ఆ. —3. సమానము. 'గీ. సాటిజంఘేటిజంబాలజాలమునకుఁ, బాటినూ త్నహరిద్రావిభంగమునకుఁ, దరము సౌదామినీ దామధామమునకుఁ, గరముపొలుపొందు దీని యంగములకాంతి." నై. 3, ఆ.—సం. వి. అ. పుం. దాటుట.

తరలు. దే. అ. క్రి. ప్రయాణమగు. (చూ. తముకు.)

తరవరి. వై. వి. పట్టాకత్తి "వ. తరవరులవెరవరులకి చ్చియు మెచ్చియు." ఉ, హరి. ౬, ఆ. (రూ. తరవలి. "వ. తరవలికత్తులందుత్తుమురు గామొత్తి." ఉ, హరి. ౪, ఆ.)

తరవాణి. దే. వి. పుల్లనీళ్లు.



తరవాయి. దే. వి. 1. సమయము; "ద్వి. దనుజేశునా కురాఁదరవాయిగాన,వచ్చితి." రా. యు, కాం.— 2. ఉపక్రమము; "లాఁతులమా తరవాయుండు గ." ఆము. 3, ఆ.—3. అనుక్రమము; "ఎ, గీ. పగఱలోన నొకనిపాల్పెట్టు మెట్టివాఁ, డైనసమ యఁజూచియరుగువాఁడ, నట్టిభంగిచాలదంటే నితరవాయి, గొనిషధింతు శత్రుకోటినెల్ల." భా ర. కర్ణ. ౧, ఆ.—4. తడవ. "గీ. ఒక్కతరవా యిదొరఁకొనియొకటినొకటిఁ, బృథుభుజాదం డమునఁబెట్టి పెలుచనూఁచె." హరి. పూ. ౭, ఆ.—5. మిగిలినది.

తరవారి. సం. వి. ఇ. పుం. కత్తి. పట్టాకత్తి. (అని కొం దఱు.)

తరసము. సం. వి. అ. న. మాంసము, పాల.

తరస్వి. సం. వి. న్. పుం. పులి. విశే. 1. బలిమిగలవాఁ డు; 2. వడిగలవాఁడు.

తరస్సు. సం. వి. స్. న. 1. బలిమి; 2. వడి.

తరహా. హిం. వి. విధము, రీతి.

తరళము. సం. వి. అ. పుం. హారమధ్యరత్నము. విశే. 1. చలించునది; 2. అనురాగముగలది; 3. ప్ర కాశించునది.

తరళితము. సం. విశే. (అ. ఆ. అ.) చలించినది.

తరళేక్షణ. సం. వి. ఆ. స్త్రీ. 1. చలించుకన్నులుగల ఆఁడుది; 2. ఆఁడుది. (దీనికి తెనుఁగున సరియైన పదము క్రాలుగంటి.)

తరాజూ. దే. వి. త్రాసు. (రాజోలుతరాజోలు.)

తరాసు. దే. వి. తరాజుయొక్కరూపాంతరము.

తరి. ఉభ. వై. వి. త్రచ్చుట, మథనము*. "క. తర తరమ తరువఁదరువన్, దరియందుదయంబునొం దెధన్వంతరిసా, గరమునఁగడుగరగరనై, కరము నఁగరమమరువమృతకలశముఁదానున్." భీ. ౪, ఆ.—సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. ఓడ; 2. పొగ; 3. మబ్బు; 4. మాగాని.

తరించు. సం. స. క్రి. (సముద్రములోనగువానిని ఓడలోనగు సాధనములచే) దాఁటు.

తరికాఁడు. వై. విశే. త్రచ్చువాఁడు. "క. తరికాం ద్రలోన నొకఁడట, తరిగడవకుఁగుడుదుకాఁడ త్రాడఁట చేతుల్, తరిగవ్వంబునుదానఁట, హరి హరిహరిచిత్రలీలహరియేయెఱుఁగున్." భాగ. ౯, స్కం.

**తరిగంబము.** వై. వి. (తరి + కంబము.) పెరుగుత్రచ్చెడు స్తంభము, కుటరము.

**తరిగడవ.** వై. వి. (తరి+కడవ.) పెరుగుత్రచ్చెడు కుండ, మంథని.

**తరిగొండ.** వై. వి. (తరి+కొండ.) మంథాద్రి. "సీ. తరిగొండకవ్వ మృతాబ్ధిఁద్రచ్చు చోఁగుదురైనము దుకకచ్ఛపములుమూఁడుపదులు." కాశీ. ౬, ఆ.

**తరిగొజ్జి.** ద్వ. వి. ఒకదినుసు కూరాకు, లాంగలి.

**తరిగోల.** ద్వ. వి. (తరి+కోల.) కవ్వము, మంథానము.

**తరిచుట్టు.** ద్వ. స. క్రి. (పెరుగుదేవతాదులకు) నివేదనము చేయు.

**తరిటి.** దే. వి. రెండు పెండెలు బిగించెడు గోనెపట్ట, (రూ. తరిటీ.)

**తరితీపు.** ద్వ. వి. 1. ఉపేక్ష; "మ. సరసాలాపసుధారసంబయినఁగాంక్షింగ్రోలఁగానియ్యవే, తరితీపేల." ఉ, రా. ౬, ఆ.—2. ఉద్ధృతి. "కులములోఁదరితీపుకలిగిమించినమేటి." (ఇక్కడ మంథనమాధుర్యమర్థాంతరము.) స్వా. ౫, ఆ.—3. అపేక్ష. "క. తన, దండను వేదండయానతరితీపువగల్, మెండుకొననుండ." శశాం. ౨, ఆ.

**తరితీపుసేయు.** ద్వ. అ. క్రి. (తరితీపు+చేయు.) గర్వించు. స. క్రి. ఉపేక్షించు. "క. నిన్ను నిటు తగిలినని, ల్లాలితనమెల్లఁబోయెనె, యేలాతరితీపుసేసియిట్లుడికింపక్." భో. ౪, ఆ.

**తరిత్రాడు.** ద్వ. వి. పెరుగుత్రచ్చెడుత్రాడు, మంథరజ్జువు.

**తరిదాలుపు.** ద్వ. వి. (తరి+తాలుపు.) మంథపర్వతమునుధరియించినవాఁడు, విష్ణువు. (రూ. తరిదాల్పు. "సీ. తరిదాల్పుపాక్కిటితమ్మికమ్మనితావియల్లనర్లైసలనుజల్లిచల్లి." లక్ష్మీ. ౧, ఆ.)

**తరిపట్టు.** దే. స. క్రి. (తరి+పట్టు.) (దేవతలనుద్దేశించి పెరుగును) త్రచ్చక నిలుపు. "జన్నెలఁదరిపట్టుజాడగలద." ఉ, హరి. ౪, ఆ.

**తరుచు.** వై. స. క్రి. చిలుకు, మథించు*. "క. తరువఁబడునబ్ధిక్రియసేనతిరుగఁబడిరి." భార. భీష్మ. 3, ఆ.

**తరుణము.** ఉభ. దే. వి. సమయము. సం. అ. న. కుబ్జపుష్పము. పుం. ఆముదపుఁజెట్టు. విణ. 1. యౌవనముగలది; 2. క్రొత్తది. (రూ. తలునము.)

**తరుణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. యౌవనముగల ఆఁడుది; 2. ఆఁడుది. (రూ. తలుని.)

**తరుణిమ.** సం. వి. న్. పుం. యౌవనము, జవ్వనము.

**తరుణుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) యౌవనము గలవాఁడు.

**తరువడి.** దే. వి. తఱిమెన. "సీ. బంగారుగొలుసులుఁబవడంపుఁదరువడిలోల్లసువింతబాగులబొంగడలు." కళా. ౨, ఆ.

**తరువాయి.** దే. వి. అనంతరము. "గీ. వినుముతరువాతికథలుసవిస్తరముగ." నిర్వ. ౪, ఆ.

**తరువు.** ఉభ. దే. వి. ఇయ్యవలసినధనాదికమునిమ్మని చేయునిర్బంధము. "గీ. తరువుపనిచెనుదనదుకింకరులవారు, నేగిధనమువచ్చుటకునై యిట్టునట్టుఁ, బరుసఁదనములుచూపితద్విరచితావమానులై క్రమ్మఱఁగవచ్చిమనుజపతికి." పర. ౪, ఆ. —సం. ఉ. పుం. చెట్టు.

**తరువుకత్తె.** ద్వ. విణ. తరువువచ్చినది.

**తరువుకాఁడు.** దే. విణ. తరువువచ్చినవాఁడు. "ఎ. గీ. వెరఁగునొందుచుఁదనమీఁదితరువుకాండ్రఁ జూచి." పర. ౪, ఆ.

**తర్కము.** సం. వి. అ. పుం. 1. ఊహ; 2. అధ్యాహారము; 3. కారణము; 4. కోరిక; 5. ఒకశాస్త్రము. (చూ. శాస్త్రము.)

**తర్కారి.** సం. వి. ఈ. స్త్రీ. తక్కిలి?.

**తర్కించు.** సం. అ. క్రి. తర్కముచేయు.

**తర్కుటము.** సం. వి. అ. న. (నూలు) వడుకుట.

**తర్కులాసకము.** సం. వి. అ. పుం. నూలువడుకునపుడు కదురుక్రిందనుంచుకొనెడు చిప్ప.

**తర్కువు.** సం. వి. ఉ. పుం. (నూలువడికెడు) కదురు.

**తర్చు.** వై. స. క్రి. తరుచుయొక్కరూపాంతరము. "మ. దేవాసురుల్, ఖరకాలోన్నతిఁబేర్చితర్చిరి సుధాకల్లోలినీవల్లభుక్." వీర. 3, ఆ. (అనేకగ్రంథములయందుపాఠమిట్లు కనఁబడుచున్నది.)

**తర్జనము.** సం. వి. అ. న. అదలుపు.

**తర్జని.** సం. వి. ఈ. స్త్రీ. ప్రదేశిని, జొట్టనవ్రేలు.

**తర్జించు.** సం. స. క్రి. అదలించు.

**తర్జుమా.** హిం. వి. భాషాంతరము.

**తర్జువు.** సం. వి. ఊ. స్త్రీ. త్రూనిగరిఁటె, త్రెడ్డు.

**తర్ణకము.** సం. వి. అ. పుం. అప్పుడు పుట్టినదూడ.

**తర్తనికము.** సం. వి. అ. పుం. కాకిగూఁడు.

**తర్పణము.** సం. వి. అ. న. తృప్తి, తనివి.

**తర్మము.** సం. వి. న్. న. యూపస్తంభపుకొన.

తర్లు. దే. అ. క్రి. ప్రయాణమగు. "ఇటఁదర్లిపోఁగ దే." భాగ. ౯, స్కం. (తరలుయొక్కరూపాంతరము.)
తర్షణము. సం. వి. అ. న. దప్పిగొనుట.
తర్షము. సం. వి. అ. పుం. 1. దప్పి; 2. ఇచ్ఛ.
తర్షితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దప్పిగొన్నవాఁడు.
తఱక. దే. వి. గింజెపట్టని ధాన్యము. "క. తఱకల చొప్పయచాలుౘ, మఱచియుఁదలపాలముది క్కుమసలెడిపనికిౘ, వెఱతునని పిఱికితనమున, నెఱివిఱుగుదుగాక సత్య నిష్ఠఁదలఁపుదే." భో. ౮, ఆ.
తఱచే. దే. వి. బాహుళ్యము. "క. అఱిముఱినడరి నరథికుల, తఱచునకు." భార. భీష్మ. ౨, ఆ.—విణ. 1. బహుళము; 2. అధికము. "క. పనిగొనుచు మేయవచ్చిన, పనిఁగొనుచుంగ్రోలుపులులుబలిసెౘన్నపనీ, యనియాడు నేనియచ్చట, నయాడుం దఱచు వెఱచు నఱచుౘ బఱచుౘ." రామా. ౨, ఆ. "రగడ. కలుగొట్లుప్రాఁకువేడ్కలెనీకుఁదఱచెదను, నలినాక్షికడిమిగండమున కే వెఱచెదను." స్వా. 3, ఆ. (ఈ ప్రయోగముల విధమునుజూడఁగా ఇది యిట్లు అకారమధ్యమముగానే యుండవలెనని యేర్పడుచున్నది. కొందఱు ఉకారమధ్యమముగా వ్రాసియున్నారు. అది యట్లుండవలెననుటకుఁ దగిన ప్రయోగము చిక్కినదికాదు.)
తఱటు. దే. స. క్రి. కళతోఁ గొట్టు. వి. 1. కళ; "క. ఏమోకవితల్, మొఱిగెడుకుకవులఁబద్యపుఁ,దఱటులఁగొని వ్రేయవలదె తజ్ఞులుసభలౘ." నన్నయభట్టీయఛందస్సు.—2. మార్ఖ్యము. "సీ. కుఱుచ చేతులుమిడిగ్రుడ్లునుగడుకొన్న తఱటులుమ తి చెంచుఁదనములమర." భార. అర. ౧, ఆ.—విణ. మూర్ఖము. (తఱటు వెజ్జి.)
తఱటుగొను. దే. స. క్రి. (తఱటు+కొను.) కళతో కొట్టు.
తఱటుసేయు. ద్వి. స. క్రి. (తఱటు + చేయు.) —పై.— "క. శితికంఠసుతుఁడుఖచర, స్తుతుఁడై యాయచ్ఛరూపుఁడురికిని వాస్కం, దిత ధారితకప్లుతకే, చితవల్గితగతులఁదఱటుసేసినన దియుౘ." పాండు. ౧, ఆ.
తఱతఱ. దే. వి. తత్తఱ. (వానికి తఱతఱ యెత్తినది.)
తఱతఱలాడు. దే. అ. క్రి. (తఱతఱలు + ఆడు.) తత్తఱపడు. (వాఁడు ఆ మాట విని తఱతఱలాడుచున్నాఁడు.)
తఱపి. దే. వి. 1. ఆఱునెలలదూడ, బష్కయము; 2. తారుణ్యము. "సీ. మెఱపులోవజ్రంపుటాఱపులో శశిరేఖతఱపులో యీవటూత్తమునికోఱలు." పాండు. ౮, ఆ.—విణ. తరుణము. "సీ. తఱపి వెన్నెలలోని ధావళ్యమొకకొంతనవసుధాకర్దమద్రవముగాఁగ." కాశీ. ౧, ఆ.
తఱపియావు. దే. వి. (తఱపి+ఆవు.) బహుకాలమునకు ముందీనినయావు, బష్కయణి.
తఱలు. దే. అ. క్రి. 1. చలించు; "చ. ఒఱగెవసుంధరాస్థలి మహోరగనాథుఁడుక్రుంగెఁ గూర్మముం, దఱలె." రా. యు, కాం. — 2. సంభ్రమించు. "సీ. ద్వాదశాదిత్యులుతఱలికాసినసైనఁగల్పశతంబులఁగ్రాఁగఁడు." వా. ౨, ఆ.—స. క్రి. విడుచు. "ద్వి. తఱలకుధైర్యంబుఁదలఁగకుమమ్ము, మఱవకునీసత్యమహిమంబుననుచు." హరిశ్చ. ౨, భా.
తఱలుచే. దే. ప్రే. తఱలఁజేయు. (రూ. తఱల్చు.—విడిపించుటకు. — "సీ. కల్పశాఖినిగెల్చికర్ణుకీర్తి మరల్చిఖచరువార్తఁదఱల్చిఘనునదల్చి." కళా. ౧, ఆ.)
తఱి. దే. వి. 1. సమయము; "క. వినుముతఱి వేచిరిపుమూఁ, పునమోవఁగవలయుసమయముంగనుఁ గొనిగ్ర, క్కునఁగడపశిలాస్థలివై, చినచాడ్పున నేర్పుమెఱయఁజెఱచుట యొప్పుౘ." భార. శాం. 3, ఆ. — 2. సమీపము; "సీ. ననుఁగోరి పుంజారూపునఁజేరినదు రేయితఱి నింటితఱిఁబొంచియఱచుటయును." అచ్చ. బాల, కాం. — 3. త్రాడులోనగువాని యొత్తుడు రేఖ; "చ. తీఁగచుట్టునె, త్తఱులయియున్న పాఁపతరిత్రాటిమలంకల." కాశీ. ౫, ఆ. — 4. వృత్తియందు తఱి మెనశబ్దమునకు మీఁదివర్ణములులోపింపఁగా మిగిలినరూపము. (తఱిగోడు.)—5. బ. వళి. "తరఁగలనిరసించుతఱులవారి." భాను. ౮, ఆ.
తఱిగొను. దే. అ. క్రి. (తఱి+కొను.) యత్నించు. "క. అఱువదికోటులుకపివరు, లుఱకజగత్త్రయముఁ బెలుచ నువ్వెత్తుగొనౘ, దఱిగొన్నయట్లు నడువఁగ, నెఱనీకుముదుఁడరుగుదెంచిన్నపవరుఁ గనియెౘ." భార. అర. ౭, ఆ.

**తఱిమెన.** దే. వి. మ్రానుచిలుకుట. (దీనికి వృత్తి యందంత్యవర్ణములులోపించును. చూ. తఱి.)

**తఱిమెనఁబెట్టు.** దే. స. క్రి. (తఱిమెనన్+పెట్టు.) మ్రానుచిలుకు.

**తఱియఁబడు.** వై. అ. క్రి. (తఱియన్+పడు.) తఱియు. "ఉ. అట్టిదిరైనవాఁడ తఱియంబడిమూర్ఖతనంబుసేయకే." భార. విరా. ౪, ఆ. (స్వార్థమున పడు.)

**తఱియు.** యు. దే. అ. క్రి. సమీపించు, "గీ. మెఱుఁగుమెఱిసినచాడ్పునఁ దఱియఁజోరుము." భార. విరా. ౫, ఆ.—వై. స. క్రి. 1. అతిక్రమించు; "చ. అమ్మహానదిసుచక్షువునావిలసిల్లుఁదద్వనం, బునుగొలనున్వడిందఱిసిపోయి నగంబులతిక్రమించి." మార్క. ౪, ఆ.—2. దాఁటు. "సీ. ఉగ్రంబులైన యాయుధముల మొనలపైను ఱుకుటయంభోధిఁదఱిసిచనుట." భార. ఆర. ౭, ఆ.

**తఱిపడు.** ద్వ. అ. క్రి. (తఱి+పడు.) ఒత్తుడుపడు. (చూ. గోడి.)

**తఱుఁగు.** దే. అ. క్రి. తగ్గు, క్షయించు. "క. వెఱఁగుపడిహర్షరాగము, తఱఁగినఁగడు వెల్లనైవదనము ల్వ్రాలన్, డెఱఁగేదిఱిచ్చవడిర, త్తఱిఁదత్పరిజనములెల్లఁదద్దయుఁసంతన్." భార. ఆర. ౬, ఆ. "ఉ. మవ్వమెక్కియొక్కుమ్మడినంకురించులతరెుప్పుదఱుంగద నీరుగానమిన్." నిర్వ. ౫, ఆ. "సీ. మఱుఁగుఁబూఁబొదలఁగ్రమ్మఱుగులుచ్ఛపుదారితఱుగుగైకొనుఁజల్లతఱుఁగుగాలి." చంద్ర.

**తఱుగరి.** దే. వి. (తఱుగు+అరి.) తఱుగుబేరకాఁడు.

**తఱుగాకు.** దే. వి. (తఱుగు+ఆకు.) కోయుగూర.

**తఱుగు.** దే. స. క్రి. 1. ఖండించు; 2. చించు. "దానివస్త్రార్ధంబుతఱిగి." భార. ఆర. ౭, ఆ.—వి. అమ్మెడువానికిని గొనెడువానికిని నొక సరకును వెలకుదిర్చి తీసియిచ్చి వారివద్ద నూటికింతయని దీసికొనుద్రవ్యము. (చూ. తఱుఁగు.)

**తఱుచే.** దే. వి. (చూ.) తఱచు.

**తఱుపు.** దే. వి. 1. ఏఁడాది వయసుచెల్లిన ఆఁడుదూడ; 2. మణివిశేషము.

**తఱుము.** దే. అ. క్రి. 1. కవియు; "క. తఱుమరువామీఁదనత్యుదగ్రతవారున్." భార. ఉద్యో. ౪, ఆ.—2. త్వరితపడు. "వ. విరాటునగరంబున కనతిదూరంబగు కాంతారంబునఁదఱిమిపోవుసమయంబున." భార. విరా. ౧, ఆ.—స. క్రి. 1. వెంబడించిపరుగెత్తించు; "క. మనయోధావళి, ఱిచ్చవడిరెువారిమొనదఱిమికొనివచ్చెన్." భార. ద్రో. ౧, ఆ.—2. బలాత్కరించు; "ఎ, గీ. ఇయ్యకొనుమనితఱిమెనిట్లింతదఱిమినను." భార. అను. ౧, ఆ.—3. తఱిమెనఁబెట్టు.

**తఱులమెకము.** ద్వ. వి. తఱులమోరమెకముయొక్కరూపాంతరము. "ఎ, గీ. తఱుల, మెకముబఁటులపైహెచ్చరికలవెడలె." అచ్చ. యు, కా.

**తఱులమోరమెకము.** ద్వ. వి. కోఁతి, వలీముఖము. "గీ. అంతఁబ్రొద్దుచూలియూనతిఁగడలకుఁదఱులమోరమెకపుదాఁటుతేగి." అచ్చ. యు, కా.

**తఱువు.** దే. అ. క్రి. తగ్గు. స. క్రి. ఖండించు.

**తఱుసలి.** దే. విశే. ఉద్ధతుఁడు.

**తట్టి.** దే. విశే. నీచుఁడు.

**తట్టు.** దే. విశే.——వై.——"తట్టులతోడిపొత్తడక." దాశరథిశతకము.

**తల.** యు. దే. వి. 1. శిరసు; 2. శిరసువెంట్రుకలు; "తలయుంజీరయువీడ." హరి. పూ. ౫, ఆ.—3. కొన; "వ. పొంతపల్లియకురయంబునంజనిపుల్లతలసంగతంబైనయింగలంబు. క. కొనివచ్చిపుల్లప్రోవునఁ, దనుకంగాఁజేసి." భార. శాం. ౩, ఆ.—4. పూనిక; "క.తలచెడిపాఱకబాహా, బలమొప్పఁగనాదుదృష్టిపథమునధృతితో, నిలిచినిష్ఠురవిశిఖా, ర్చులముంచి మదీయసఖునినాడిటఁదీర్తున్."భాగ.౧౦,స్కం.ఉ.—5.ఎత్తు; "క. వారొకతలయేనొకతల."భార.ఉద్యో.౧,ఆ.—6. ముందుభాగము; "గీ. నాఁడుసభనాడినంతియు నేఁడుసేయు,నట్టులున్నాఁడుమొనతలననిలుతుఁడు." భార. భీష్మ. ౩, ఆ.—7. మొత్తము; "క. ఒకఁడొకఁడుపాఁడవులఁదాఁ, కకపైనొక్కపేటగాఢగతినందఱునొ, క్కొకతలగాఁదలపడివా, రికడంకయుడుపఁగవలయుఁ గ్రీడయపోలెన్." శల్య. ౧, ఆ.—8. ఎడ; "చ. దోర్బలపరాక్రమభీకరులైనవారిను, ద్ధురగతినెట్లుమార్కొనిరెు దోకడువింతలువుట్టెనీతలన్." మార్క. ౭, ఆ.—9. సమయము. "క. మెలఁగుదె సమెలఁగిక్రమ్మఱు, తలనొకమరియేమటించిదాడిమెయిందో, ర్బలముమెఱసిపైఁబడినా, చలముసెఱపిపోదుమీకుఁజాటితిఁజాండీ." నిర్వ. ౬. ఆ.—విశే. మొదలు. "గీ. అతిరథులకెల్లఁదలఁ

క్రియట్టివాఁడు, అసురవిభుఁడుఘటోత్కచుం డు." భార. ఉద్యో. ౪, ఆ.—వై. వి. 1. చోటు; "ఉ. అతఁడత్తలదాఁటియెంతయుభయాతురుఁడై తొలఁగంగఁబాతినన్." హరి. ఉ. 3, ఆ.—2. రంగము; "చ. అనితలనీవుపాండుతనయావళికప్పుడు మేలుచేయినా, తన్నయులకుంబరాక్రమముతక్కువయుంబ్రకటింపవిందు." భార. భీష్మ. ౨, ఆ.—3. పక్షము*. "క. ఒకతలసమస్తజగములు, నొకటజనార్దనుఁడునిలిచియొకతలయైనన్, సకలమ్మునసారమతం, డొకరుఁడసారంబుచాలనుత్కృష్టమగున్." భార. ఉద్యో. ౨, ఆ. (ఇది శిరసు, శిరసువెండ్రుకలు, కొన, పూనిక, అనునర్థములు తక్క తక్కిన యర్థముల యందు సమస్తపదముగానే ప్రయోగములయందు కానఁబడుచున్నది.)

తలంటు. దే. అ. క్రి. వి. తలయంటుయొక్క రూపాంతరము.

తలఁకించే. దే. అ. క్రి. చలించు. "ఉ. ఆమదవతీరమణీయతనేమరుండుదా, నప్పరమేశపద్మనయనాంబుజగర్భులనైన వ్రేల్మిడిన్, ద్రిప్పులఁబెట్టు నంచువినుతించి మదిం దలఁకించి వెండియున్." విక్ర. ౫, ఆ.—ప్రే. తలఁకఁజేయు.

తలఁకు. దే. అ. క్రి. 1. చలించు; "క. అప్పురుసు నబాణాసురుఁ, డప్పటికప్పటికిఁదలఁకెనధికభయమునన్." ఉ, హరి. ౬, ఆ.—2. భయపడు. "చ. దేవతా, దులవలనన్ భయంబుద్రుపదుండెఱుఁగండుతదీయదేశముల్, తలఁకకయుండురోగభయతస్కరడామరవర్జితంబులై." భార. ఆది. ౮, ఆ.—వి. 1. చలనము; 2. భయము.

తలఁగు. దే. అ. క్రి. తొలఁగు. "క. నలుఁడునుధరణీరాజ్యము, తలఁగఁగసర్వంబునపహృతంబైనఁగడున్, దలరి." భార. అర. ౨, ఆ. — అం, ప్రే. తొలఁగించు. "సీ. ఉత్తమక్షత్రియుండొరులదుఃఖంబులు తలఁగంగఁబుట్టినధర్మశీలుఁడు." భార. ఆది. ౭, ఆ.

తలఁగుడు. దే. వి. తొలఁగుట.

తలఁచే. దే. స. క్రి. 1. ఎంచు; 2. ధ్యానించు; 3. స్మరించు.

తలఁపు. దే. వి. 1. తలఁచుట; "మ. విపినావాసముగూఢచర్యయునుగావింపం దలంపొప్పదే." భార. ఉద్యో. ౧, ఆ. — 2. అభిప్రాయము; "బాల్యమునఁ దలఁచుతలఁపుఁ గీడుచేసి." భార. సౌ. ౧, ఆ.—3. కోరిక; "క. మనకడకునేమిటికివ, చ్చెనొకోయేనిమ్మహాత్ము చెప్పినపనులెల్లనుజేయువాఁడఁగోరిన, కనకాంబరమణులుతలఁపుగడపఁగనిత్తున్." భార. విరా. ౧, ఆ.—4. చింత; "సీ. తలఁపులసందడిదండడించినఁదాల్మికదలుశిరఃకంపగతులమెఱయ." భార. అర. ౭, ఆ.—5. జ్ఞప్తి; "సీ. మునునీవనుగ్రహించిన మాటఁదలఁపునేసినఁజాలు బొంకవీవనుచుఁదలఁతు." కళా. ౭, ఆ.—6. హృదయము. "క. తలఁపునఁజూచినచూపును, వెలిఁజూచినచూపునొక్కవిధమయియున్నన్, నెలకొనిఘంటాకర్ణుఁడు, నళినాక్షునినామకీర్తనంబొనరించెన్." ఉ, హరి. ౨, ఆ.

తలఁపుచేయు. దే. అ. క్రి. ఎంచు, భావించు. "గీ. చెలువవనజవైరి శృంగారభావంబు, కన్నులారఁజూచికాంక్షతోడ, మదనబాణభిన్నహృదయయైయాతని, తలఁపు తెలిసితగులఁదలఁపుచేసె." వి, పు. ౫, ఆ.

తలఁపుచూలి. దే. వి. మన్మథుఁడు, భావజుఁడు.

తలఁపుమిన్న. ద్వ. వి. చింతామణి. "ద్వి. తలఁపుమిన్నయుఁగామితములిచ్చుమొదవు, వెలిగొరునలనిక్కుపీనులజెక్క." విష్ణు. ౪, ఆ. (ఇట్లు తలఁపురతనము, తలఁపుఱాయి.)

తలఁపుఱాయి. దే. వి. చింతామణి. "ఉ. చానతలంపుఱాచలుపచట్టులు వేల్పుఁజెట్లుఁగమ్మపూఁ, దేనియకాల్వపట్టులు మదీయనిశాంతమునందనర్చు." రామా. ౫, ఆ. (ఇట్లు తలఁపురతనము మొ.)

తలఁపుసాకిరి. ద్వ. విశ. ఈ కార్యము నీ వెఱిఁగియుండుమని పలుమాఱు వాదిచే తెలిపింపఁబడినసాక్షి, స్మారితుఁడు.

తలఁబ్రాలు. దే. వి. (తలన్ + ప్రాలు.) వివాహకాలమందు దోసిళ్లతో తలమీఁదఁబోయు నక్షతలు.

తలకట్టు. దే. వి. 1. అకారముయొక్క రూపాంతరనామము; 2. పాగకట్టుట; 3. పాగ. విశ. కన్నాకు, ముఖ్యము. "గీ. నన్ను బ్రదికించుటయు నీదునైపుణముల, కెల్లఁదలకట్టు." హరి. ఉ. 2, ఆ.

తలకడచే. దే. స. క్రి. తలమీఱు, అతిక్రమించు. "క. తలకడచినడచుద్రోణుని, యలవుఁజలంబునుసహింపక." భార. భీష్మ. ౨, ఆ.

**తలకాఁడి.** దే. వి. బరువు అధికమై రెండెద్దులకంటె హెచ్చుగాకట్టవలసినప్పుడు సంతనచేసి మొదటి కాఁడికి ముందుకట్టెడు మఱియొకకాఁడి, ప్రాసంగము.

**తలకాయ.** దే. వి. తల, శిరము. "సీ. ప్రేవులనర ములఁబెనఁ చినతలకాయ పేరులుగళమునఁబెనఁ గొనంగ." హరిశ్చ. 3, ఆ.

**తలకూడు.** దే. అ. క్రి. సిద్ధించు. "నాకోరినకోర్కె నేఁడుతలకూడెనరేశ్వర." భార. అర. ౨, ఆ. (ప్రే. తలకూర్చు. "సీ. తగినసహాయంబుతల కూర్చుకొనిపగసాధింపవలయు నుత్సాహలీల." పంచ. నా. ౧, ఆ.)

**తలకెడవు.** దే. విశ. తలక్రిందు. "సీ. మునుమించి నిడుమోరముంచిదూఁటినమహాజడధిపూరముత లకెడవుగాఁగ." హరి. పూ. ౪, ఆ.

**తలకొట్లమారి.** దే. విశ. (తలకొట్లు+మారి.) 1. శిర శ్ఛేదనముపొందినవాఁడు; 2. అవినీతుఁడు.

**తలకొను.** దే. అ. క్రి. 1. కలుగు; "చ. నెలకొనిసం గమంబున జనించునుగామము కామవృద్ధిచేఁ, దలకొనుఁగ్రోధ మట్టిబెడిదంబగుక్రోధమునం దనర్చుమోహ, హాలతికమోహవృత్తినుదయంబగు విస్మృతి విస్మృతింజనుత్, దలఁపఁగబుద్ధి బుద్ధిచ నినత్ మఱితాఁజెడుమానవుండిలన్." శేష. ౧, ఆ. — 2. యత్నించు. "సంతతిఁబడయఁదలకొ నుము." హరి. పూ. ౪, ఆ.—స. క్రి. తాల్చు, వహించు. "క. ఇలనీకైకొన్న తెఱఁగు, తలఁపఁగ ధర్మంబొకాదొదైవమెఱుంగున్, వలవనిచింత యుడిగిధృతిఁ,దలకొనిపాలింపుయజ్ఞదత్తుఁడవ గుచున్." భార. శాం. ౧, ఆ.—(ప్రే. తలకొ ల్పు. "చ. సుకృతములందునుంబరమశోభనమై నమదర్చునాదిని, ద్ధికిధరణీజనంబులమదిన్దలకొ ల్పనకాదెయేఁగృపా,ధికతదశావతారసముదీ ర్ణవిహారముపూనుటల్ దురా, త్మకులకుఁదన్నహామ హిమదర్శనమున్వృథయేమిసేయుదున్."కళా. ౬, ఆ.)

**తలకొనుదెంచు.** దే. అ. క్రి. (తలకొను+తెంచు.) తలకొను, కలుగు. "క. పగరును,దలయేరునును క్కసయునుదలకొనుదెంచెన్." భార. ఆది. 3, ఆ. (స్వార్థమున తెంచు.)

**తలకొఱవి.** దే. వి. అపరకర్మముచేయువాఁడు శవము ముమ్మొనపునుంచెడునిప్పు. "ద్వి. కొంతచిక్కినక డకొఱవులఁదెచ్చి, కుఱుప్రొగుగానిడికొడుక నందునిచి, కొఱవినొక్కటఁదలకొఱవిడఁబూని." హరిశ్చ. ౭, భా.

**తలకోల.** దే. వి. సాధువుకానియావును పితుకునప్పుడు కొనను త్రాడుకట్టి దాని కొమ్ములకు తగిలించి పట్టుకొనెడుకోల. "గీ. ఆవుఁబిదుకఁబోయియలి వేణియొక్కతె, దూడవెనుకకాళ్లతోడనావు నడఁగఁగట్టియొద్ది యాఁబోతుఁదలకోలఁ, బట్టి యుఱ్ఱుగట్టిబయలుపిదికె." వి, పు. ౨, ఆ.

**తలకోలు.** దే. వి. తలకొనుట.

**తలక్రిందు.** దే. విశ. 1.అధోముఖము;2.విలోమము.

**తలగడ.** ద్వ. వి. (తల+కడ.) 1. (పండుకొనునప్పుడు) తలయుంచుకొనెడుదిక్కు; "గీ. తూర్పుదక్షిణములలోనదొరకినట్టి, దిక్కుతలగడగాఁగని ద్రించెనేని, మేలుతక్కినదిక్కులుమేదినీశ, యధికరోగంబుగావించునరిబుధులు." వి, పు. ౪, ఆ. — 2. తలక్రిందఎత్తుగానుంచుకొనెడు నిడు పాటిదిండు, ఉపధానము.

**తలగడుగు.** దే. వి. (తల+కడుగు.) తలంటు, అభ్యంగము. "చ. తలగడుగంగమర్దనము ధౌతపటావరణంబు సంస్కృతో, జ్జ్వలకలమాన్నభోజనము చందనచర్చ ప్రసూనదామకం, బులుగపురంపువిడ్యములు భూషణపఙ్క్తులు గల్గి నిచ్చలుం, బులుకడుగంగఁబడ్డనును ముత్యముఁ బోలుచునాలుచుంబురిన్." పాండు. 3, ఆ.

**తలగాము.** ద్వ. వి. రాహువు. "ద్వి. తలగామువుట్టనితరుణేందురేఖ." భాగ. ౬, స్కం.

**తలగుంజె.** ద్వ. వి. నిట్రాడు.

**తలచీల.** దే. వి. మీటనుమునసనుజేర్చిబిగించెడుచీల.

**తలచేమురు.** దే. వి. నూనె.

**తలచావడి.** దే. వి. ఇంటిముందటిచావడి.

**తలచుట్టు.** దే. వి. 1. పాగకట్టుట; 2. పాగ, ఉష్ణీషము. "సీ. రారాజుద్రోణ, తనయుండుఁజుట్టిన తలచుట్లునల్లనియవి నూతపుత్త్రుశిరోంబరంబు పచ్చనియది కుంభభవకృపాచార్యుల యుష్ణీషములువెల్లలు." భార. విరా. ౫, ఆ.

**తలచూపు.** దే. అ. క్రి. పొడచూపు, తోఁచు. "చ. అతనితపోమహత్త్వమున కచ్యుతుఁడెంతయు మెచ్చిమూర్తమై, వితతపయోధివీథిఘనవీచులలోఁదలచూపుమఱి." భోజ. ౧, ఆ.

తలడిల్లు. దే. అ. క్రి. తల్లడిల్లుయొక్క రూపాంతరము. "విరక్తులుతలడిల్లువేళలు." భాగ. ౧౦, స్కం. పూ. (రూ. తలడించు.)

తలతల. దే. అవ్య. మనుష్యునికి మనుష్యునికి. "చ. తలతలపారుపత్తెములు తద్దయుమించెగిరీశుచెంగటన్." చంద్రా. ౧, ఆ.

తలత్రాడు. దే. వి. ఎద్దుకొమ్ములకుఁగట్టెడు కుచ్చుల తోలుత్రాడు.

తలదువారము. ద్వ. వి. తలవాకిలి. "సీ. తలదువారంపుఁబొంతలనంటిబోదియలును నిండుఁగుండలునొనరనిలిపి." అచ్చ. అ, కాం.

తలనట్టు. దే. వి. వేరుపురుగుకొఱికి మోవులెండుట.

తలపడు. ద్వ. అ. క్రి. 1. ప్రారంభించు; "క. పాండవులతోన చ్ఛలమునఁబోరఁగదొమ్మికిఁ, దలపడితివి." జై. ౭, ఆ.—2. ఏర్పడు.—స. క్రి. 1. ఎదిరించు; "చ. శలభమువహ్ని మీఁదఁజనుచందముగానృపాలుఁడర్జునుం, దలపడఁబోక." భార. ద్రో. ౪, ఆ.—2. తాఁకు. "వ. నాకేశుండునముచిందాఁకినతెఱంగునరారాజుండలపడి." భార. శల్య. ౨, ఆ. "ఉ. ఏలినవానిఁగాంచిమొనలెల్లనునెంతయుదర్పమెక్కియా, భీలనిశాతహేతిరుచిభీకరలీలనెదిర్చిమత్స్యభూపాలకసైన్యరాజిఁదలపడ్డ." భార. విరా. 3, ఆ.

తలపాటు. ద్వ. వి. (తలపడుట.) 1. ప్రారంభము; "ఉ. నావుడుఁనక్షమారుఁడుమనంబునసెంతయు రోసియిట్లసం, భావితుఁడైన వానితలపాటరయన్ నగుఁబాటుకాదె." నిర్వ. ౧౦, ఆ. —2. ఎదిరించుట. "వ. ఉగ్రసేనబలదేవసాత్యకికృతవర్మలుమున్నుగా వెడలి ప్రతివీరులందలపడిరట్టితలపాటునహయంబులమీఁదివారుహయారోహకులందాఁకి పెనఁగ." హరి. ఉ. ౬, ఆ.

తలపెట్టు. దే. అ. క్రి. ప్రారంభించు. అం, ప్రే. తలపడఁజేయు, ఎదిరింపఁజేయు. "క. బలమును శౌర్యముఁదేజముఁ, గలఁడనికౌరవులునమ్మికర్ణుని నీతోఁ, దలపెట్టిరినీబాణం, బులఁగూలెడునతఁడుఁగ్రొత్తవోఁడెడునిన్నున్." భార. కర్ణ. 3, ఆ.— స. క్రి. ప్రస్తావించు. "క. తలపెట్టకుఁడీకసెన్నఁడుఁ, గలనైనసుమిత్రసంగకారణమునవ, ద్రిలిపట్టియీశకథాస్థితి, నిలనిట్టివిగోరఁదివియనేఁజేయుపాయుణ్." శకు. ౪, ఆ.

తలపొలము. దే. వి. పొలిమేర వెంబడినున్న పొలము. "క. సాదురేఁగెనేనిన్, విదుతలపొలమునన కాని నిలువదుసుమ్మీ." భార. ఉద్యో. ౨, ఆ. (చూ. తలిక.)

తలపోఁత. దే. వి. 1. చింత; "ఉ. దేవుఁడొమానిరోయనిమదిందల పోఁతలునాకికానినిన్, దేవురువేయిచందనుల నిండరొమెనర్చెదరు." పర. ౨, ఆ.—2. ఆలోచన, విచారము. "ఒండుతల పోఁతలులేఁతలు." ఉ. హరి. ౪, ఆ. "నన్నునెత్తెఱఁగునసైనఁ బొందఁగమదిందలపోఁతయకల్గెనేని." భార. ఉద్యో. ౧, ఆ.

తలపోయు. దే. అ. క్రి. (తలఁపు+పోయు.) 1. చింతించు; 2. ఆలోచించు, విచారించు.

తలబీకనకాయ. దే. విశే. కలఁతనొందినది. "క. చిలువదళవారయు లప్పుడు, తలబీకనకాయలైరయథాజుధలైకూ, కులుపత్తులునైమొనతల, నిలువక శేషాహికడకుసెఱిచెడిపాఱన్." జై. ౭, ఆ. (దీనిని తలబీకరకాయ అని వాడుచున్నారు.)

తలమాటు. దే. వి. చేటు, నాశము. "క. అలఘురఘువంశమునకున్, దలమాటించుకయులేమితథ్యముగానీ, వలనసమస్తంబునుసేఁ, దెలిసితినామనముకలఁకతీఱెమహాత్మా." నిర్వ. ౯, ఆ.

తలమానికము. ద్వ. వి. అలంకారార్థము శిరమునందుంచుకొనెడు రత్నము. విశే. శ్రేష్ఠము. "క. కన్నియతలమానికమగు, నన్నాఁగటిచాలుసేరియతివన్." రామా. ౪, ఆ.

తలమించు. దే. అ. క్రి. ముందుమించు. "క. పెల్లుకొనఁగురిసిరప్పుడు, తల్లుగఁదమచూడ్కులకును దలమించెఁగభూ, వల్లభుపైఁబురభామలు, కొల్లలుగాలాజమిళితకుసుమాంజలులన్." కవిక. 3, ఆ.

తలమిగులు. దే. అ. క్రి. ముందుమిగులు. "క. తలమిగిలివచ్చుబాహ్లికు, నిలుమని విశిఖముల నొంచె." భార. ద్రో. ౧, ఆ.

తలమీఱు. దే. అ. క్రి. ముందుమీఱు. "క. మీరునుగృహస్థధర్మము, మేరకుఁదలమీఱి చనక." పాండు. ౪, ఆ.

తలము. ఉభ. దే. వి. ఏతము. విశే. శక్యము. "తలమేబ్రహ్మకునైన." స్వా. ౨, ఆ. (తరముయొక్క రూపాంతరము.)—సం. వి. అ. న. 1. వింటిదెబ్బతగులకుండ చేతికితొడుగుకొనెడి అత్తెము,

2. అడవి; 3. కారణము; 4. పాతాళలోకము. పుం, న. 1. స్వరూపము; 2. క్రిందిభాగము; 3. కాళ్లచేతుల క్రిందిభాగము. పుం. 1. తాటి చెట్టు; 2. చాఁచినవ్రేళ్లుగల అఱచేయి; 3. కత్తి యొక్క పిడి; 4. ఎడమచేతి తంతిమీటు.

**తలముదప్పు.** దే. అ. క్రి. (తలము+తప్పు.) అశక్య మగు. "గీ. తలముదప్పిన మెలం, కువలకల్పలియ్య కొనుటతగునె." భార. విరా. ౧, ఆ. "సీ. తన రూపునకుఁదోఁడు తలముదప్పినగర్వ మరగంటఁ జూడఁడేయరిగినపుడు." కాశీ. ౨, ఆ.

**తలమునుక.** దే. వి. 1. శిరస్స్నానము; 2. శిరఃప్ర మాణము, తలబంటి. (రూ. తలమున్క. "ఉ. అత్తరళాయతేక్షణ కటాక్షవిలాస రసప్రవా హముల్, కుత్తుకబంటితామరలకుఁ దలము న్కలుగండుమీలకున్." విజ. 3, ఆ.)

**తలముళ్లు.** దే. వి. బ. 1. వేఁటకానిసాధనము; (చూ. జీగురు.) 2. దొంగయొక్కసాధనము. (చూ. గద్దగోరు.)

**తలయంటు.** దే. అ. క్రి. (తల+అంటు.) తలమీఁద (నూనెపెట్టి) రాచు. "ఉపాధ్యాయునకుఁబ్రి యమునఁదలయంటుచుండ." పర. ౫, ఆ.—వి. తలమీఁద (నూనెపెట్టి) రాచుట, అభ్యంగము.

**తలయంపి.** దే. వి. 1. (పండుకొనునపుడు) తలయుం చుకొనెడుదిక్కు, తలగడ. "గీ. అతఁడుపవళిం పమునుగౌరవాధినాథుఁ, డరిగితలయంపిదెసను న్నతాసనమున, నుండెఁబదపడికాల్కడయొద్దక ల్లఁ, జనివినమ్రుఁడైనిలుచుండెసవ్యసాచి." సం. "తచ్ఛీర్షతశ్చకృష్ణస్యనిషసాదవరాసనే." భార. ఉద్యో. ౧, ఆ.—2. తలక్రిందనుంచుకొనెడు నిడుపాటిదిండు. (తలాఁపియొక్క రూపాంతర ము.)

**తలయెత్తు.** దే. అ. క్రి. 1. వర్ధిల్లు; 2. మొలచు. "చ. తొలుపాపఁబయోధరధారఁదోఁగున, య్యలఁద లయెత్తుక్రొత్తపులు నేపున నే పులకల్ తనూల తన్, మొలవంగనున్నదవ్వి." పాండు. ౭, ఆ.

**తలరు.** దే. అ. క్రి. 1. చలించు; "ఉత్సాహ. అతు లశౌర్యుఁడనిలతినయుఁడమితవాహినీపదా, హ తిధరిత్రిదలరనిట్టులరిగి." సం. "సకంపయన్ని వమహీంబలేనచతురంగిణా." భార. సభా. ౧, ఆ.—2. చింతించు; "అన్నాకపతియునిగ్గదఁగ దురన్. తలరి." సం. "సతూష్ణీంచింతయన్నావీ రోదేవరాజఃప్రతాపవాన్." భార. ఉద్యో. ౧, ఆ.—3. కలఁగు; "వ. లోకాపవాదభయం బునకుందలరి." భార. ఆర. ౨, ఆ.—4. సంభ్ర మించు; "క. మలగొంగమొదలుగలవే, ల్పులనం దఱుఁబొఱఁదఱిమిలోఁగని కడిమిన్, దలరుచు డుకు." అచ్చ. యు, కాం.—5. ఒప్పు. "క. లలి నలరుగొమ్మలనువ, ర్తిలిసద్ద్విజరాజసంగతిఁ దగి సువర్ణో, జ్జ్వలమైసుమనోభినుతిన్, దలరిపుర ముకోటతోఁటతనరుఘనశ్రీన్." కవి. ౧, ఆ. (ఈ యర్థమునకు నితరగ్రంథములయందు ప్ర యోగము కనఁబడలేదు.)

**తలవంపు.** దే. వి. 1. తలవంచుట; 2. మానభంగము. "సీ. తేఁకువలేకపుత్తెంచినయప్పాండవజ్యేష్ఠున కుఁదలవంపుగాఁగ." భార. ద్రో. ౪, ఆ.

**తలవరి.** వై. వి. తలారివాఁడు. "చ. తలవరులింత యుందెలిసితల్లడమందుచుఁగుందుచున్నవా, రిల పయిలేని దొంగనిపుడెచ్చటఁ దెచ్చెదమంచు." పర. 3, ఆ.

**తలవాకిలి.** దే. వి. ఇల్లులోనగువాని మొదటిద్వార ము. "ద్వి. వాఁడెహోమనతలవాకిటనున్న వాఁడు." హరిశ్చ. ౭, భా.

**తలవిడి.** దే. వి. తలనఱికిన తాటిచెట్టులోనగు తృణ ద్రుమముయొక్క తలతుండు. (తలవిడితుండు తలవిడిబద్దలు.)

**తలవీడు.** దే. వి. పురఃప్రదేశము, సమీపప్రదేశ ము. "క. కులకన్యకలకువేడుక, దలవీడులఁబరు లతోడితగుమాటలకున్, దలకొనఁదగునేగురుజ న, ములుగాకత్తెఱఁగువారుపురుషార్థనిధీ." భా. అను. ౧, ఆ.

**తలవు.** దే. అ. క్రి. తొలఁగు. "చ. పువ్వులొరులుగో యనీకతలవుండనిరొప్పగజంకసేయుచున్." నిర్వ. ౮, ఆ.—అం, ప్రే. తొలఁగించు. (తలఁ గుయొక్కరూపాంతరము.)

**తలసాల.** ద్వ. వి. ఇంటితలవాకిలి. "ద్వి. తలసాలనె డలెడుదాఁకనాదెసకు, మలయుచూడ్కులుగల మంచినీమోము, కన్నులఁగప్పినకైవడిఁదోఁచు చున్నది." హరిశ్చ. ౭, భా.

**తలా.** దే. అవ్య. క్రి. విశే. చెటి. "ఉ. అందఱుకుంది లాయొకటి స్వార్థముగల్గుటదోఁపఁబల్కె." ప్ర భా. ౫, ఆ.

**తలాఁపి.** దే. వి. (తల + ఆఁపి.) (చూ.) తలయంపి. (2. అర్థమునకు. — "చ. ఒదికిలిపాన్పుపైఁబతికి నొయ్యనఁగేలు తలాఁపిచేసి." ఉ, హరి. ౫, ఆ.)

**తలాటము.** దే. వి. (తల+ఆట.) పికిలిపిట్టయెక్కలులోనగువానిచే నేర్పఱచి గుఱ్ఱము నెత్తిని నిలువుగానమర్చెడు తురాయి. "ఎ, గీ. పీలికుంచెతలాటంబు పేరోజంబు, మణులమొగముట్టుఁబన్నిసాహిణీయొకండు, కర్తయెదుటికిఁ గొనివచ్చెగంధవాహ, బాంధవంబగునమ్మహాసైంధవంబు." స్వా. ౪. ఆ. (చూ. పోరాటము.)

**తలాడ.** ద్వి. వి. తలగడయొక్కరూపాంతరము. "పట్టుతలాడయుఁగాహళిఁదిపచ్చనునుంబఱపు." పాంచా. ౫, ఆ.

**తలారి.** వై. వి. రాత్రులయందు దొంగతనముపోక కావలికాచు దొరతనపుబంటు. (తలవరియొక్క రూపాంతరము.)

**తలారించు.** దే. అ. క్రి. మరలు. "వ. కోమలఘాస ఖాదనకుతూహలంబులంజిక్కి మక్కువలం గ్రేపులఁదలంచితలారింపక." భాగ. ౧౦, స్కం. పూ.

**తలి.** దే. వి. తల్లియొక్కరూపాంతరము.

**తలిక.** దే. అవ్య. ముందు. (ప్రొద్దుపొడువక తలిక వచ్చినాఁడు. మొ.)

**తలిమము.** సం. వి. అ. న. 1. దూదిపఱపు; 2. మేలుకట్టు; 3. ఱాతికట్టనపు నేల; 4. కత్తి.

**తలియ.** వై. వి. భోజనపాత్రము. "గీ. తలియఁబెట్టిన యశనంబుఁదలఁగఁద్రోసి, పిదపఁగుడిచెదనను వాఁడు బేలగాఁడె." భో. ౪, ఆ.

**తలిరు.** దే. వి. చిగురు, పల్లవము. "క. కలయఁగఁగరములఁజరణం, బులనురమునశోణితంబు బోరనఁ దొరఁగన్, దలిరొసఁగిననడమామిడి, చెలువునఁబఱతెంచెభీమసేనుఁడచటికిన్." భార. భీష్మ. 3, ఆ.

**తలిరుఁబోఁడి.** దే. వి. (తలిరు+పోఁడి.) 1. చిగురువలె మనోజ్ఞురాలైన ఆఁడుది; 2. ఆఁడుది. (చూ. అలరుఁబోఁడి.)

**తలిరుచు.** దే. అ. క్రి. 1. చిగిరించు; 2. సంతోషించు; 3. అతిశయించు. (రూ. తలిర్చు. సంతోషించుటకు. — "క. నేఁడున్నదుఁడైనుయోధనుఁడుతం, డ్రిదలిర్పఁగనేఁగుఁగరిపురికిఁ గొనియొలమిన్." భార. ద్రో. ౧, ఆ. — అతిశయించుటకు. — "యాపునవాశ్వనేయులసరియునఁదలిర్చు." భార. ఆర. ౭, ఆ.)

**తలిరుదిండి.** దే. వి. (తలిరు+తిండి.) కోయిల, పికము. "సీ. సకికొందలిరుదిండులకువందన మొనర్చి చిగురుటాకులుపాదయుగళిఁజేర్చె." విజ. 3, ఆ.

**తలిరువు.** దే. వి. తలిరుచుట. (రూ. తలిర్పు. "క. మునివరనాదగుచిత్త, మ్మునఁగౌతూహలముచాలమొలతెంచితలి, ర్పునసలరారెడు." భార. అను. ౪, ఆ.)

**తలిరువిలుతుఁడు.** దే. వి. మన్మథుఁడు, (రూ.) తలిరువిల్తుఁడు. (ఇట్లు తలిరువిలుకాఁడు.)

**తలిమము.** వై. వి. శయ్య. "క. తలిమములెక్కడివె న్నెల, పులుఁగులఁగనితనదుమదినిబొదలువిరాళిన్." య. ౨, ఆ.

**తలుకు.** దే. వి. తళుకుయొక్కరూపాంతరము. "సీ. మొలకనవ్వులవాఁడుతలుకారుతొలుకారుబలుకార్మొగులఁగేరుపోలుపువాఁడు." అచ్చ. సుం, కాం.

**తలుగు.** దే. వి. పసులఁగట్టెడుపలుపు, సందానము. "క. తలుగులపొదియొకదెసఁబె, ట్యాలదామెన యొక్కవలననువైయుండన్." భార. విరా. ౧, ఆ.

**తలుపు.** దే. వి. పనిచేసినవాకిటి మూఁతపలక, కవాటము.

**తలోదరి.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుది.

**తల్గడ.** ద్వి. వి. తలగడయొక్కరూపాంతరము.

**తల్గు.** దే. అ. క్రి. తలఁగుయొక్క రూపాంతరము. (తొలఁగించుటకు. — "ప్రభుత్వమెలర్పఁగఁదాల్మియూఁదిదుస్తరతరమానసవ్యథలు తల్గుము." భార. ఆర. ౬., ఆ.) వి. తలుగుయొక్కరూపాంతరము.

**తల్చు.** దే. స. క్రి. తలఁచుయొక్కరూపాంతరము. "తద్భాషణములుచిత్తమునఁ దల్చుచుండుటఁజేసి." భాగ. ౪, స్కం.

**తల్పము.** సం. వి. అ. న. 1. దూదిపఱపు; 2. అట్టడి; 3. భార్య.

**తల్లఁపి.** దే. వి. తలాఁపియొక్కరూపాంతరము. (1. అర్థమునకు. — "కరవీరపుఁజాయలదట్టిఁజుట్టి వేతల్లఁపిదిక్కునందునిడి." రా, వి. 3, ఆ.)

**తల్లకెడవు.** దే. విణ. తలకెడవుయొక్కరూపాంతరము.

**తల్లక్రిందు.** దే. విణ. తలక్రిందుయొక్కరూపాంతరము. "సీ. విటతాటనములఁగావిఱిగిచక్రములతోఁదల్లక్రిందైనరథవ్రజములు." జై. ౨, ఆ.

**తల్లజము.** సం. వి. అ. పుం. వృత్తియందు ఉత్తర పదమై శ్రేష్ఠతను దెలుపును. (ఉదా. కుమారీతల్లజము. మొ.)

**తల్లడకుడుచు.** ద్వ. అ. క్రి. (తల్లడము+కుడుచు.) తల్లడించు.

**తల్లడపడు.** వై. అ. క్రి. (తల్లడము+పడు.) చలించు. "క. అనిమొనసాల్వుఁడు ప్రద్యుమ్నునిశాతశరాలివిద్ధమర్ముండయి పెల్లనమూర్ఛవోయి పడియెన్, దనరథము పయిన్ ధరిత్రి తల్లడపడఁగన్." భార. అర. ౧, ఆ.

**తల్లడపాటు.** వై. అ. క్రి. తల్లడపడుట, చలనము.

**తల్లడపెట్టు.** ద్వ. స. క్రి. (తల్లడము+పెట్టు.) 1. చలింపఁజేయు; 2. బాధపెట్టు. "క. పెల్లుగఁదేళ్లుం గాసులుఁ, దల్లడపెట్టంగనో అలెదరునో రండన్." మార్క. ౨, ఆ.

**తల్లడము.** వై. వి. చలనము. "ఉ. తామరసాకునీగు వలెఁదల్లడమందిరి పౌరులందఱున్." ఉ. హరి. 3, ఆ.

**తల్లడిల్లు.** వై. అ. క్రి. చలించు. "ఎ, గీ. వచ్చెనకులుఁడమితవాహినీపదహతిఁ, దల్లడిల్లుచుండఁగరణితలము." సం. "ఇంద్రప్రస్థంవివేశాథకంపయన్నివమేదినీమ్." భార. సభా. ౧, ఆ. (రూ. తల్లడిలు. "లతాంగినేత్రముల్ చటులతలజ్జఁదల్లడిలె." స్వా. ౫, ఆ.) (తల్లడించు అనియు.)

**తల్లి.** ఉభ. దే. వి. జనని. విశే. 1. మొదటిది; 2 ముఖ్యము. (ఉదా. తల్లికొండ్ర, తల్లిగోడ. మొ.) సం. ఈ. స్త్రీ. జేవరాలు.

**తల్లికొండ్ర.** దే. వి. మొదటికొండ్ర.

**తల్లిగోడ.** ద్వ. వి. ఇంటికి ముఖ్యమైన ప్రక్కగోడ.

**తల్లితల్లి.** దే. వి. 1. తల్లినిగన్నతల్లి; 2. లక్ష్మి.

**తల్లియొఱ.** దే. వి. నూతిపైయొఱ.

**తల్లివేరు.** దే. వి. ముఖ్యమైనవేరు.

**తవన.** దే. వి. క్షుత్తకాలము. "ఋతువుతవనతప్పించెంచి." పర. ౨, ఆ.

**తవరము.** వై. వి. ఒక లోహము, తగరము.

**తవళి.** దే. వి. ఠవళి, అసత్యము.

**తవాయి.** దే. వి. (చో.) తర్లు, ఉపద్రవము, తప్పుగాలి.

**తవిఁద.** దే. వి. రాగిపైరు. "క. అఱవదుగంటెతవిందయు." (చూ. అఱవడు.) బ. ఆధాన్యము. (చూ. తవ్విఁధ.)

**తవు.** దే. అ. క్రి. తగుయొక్క రూపాంతరము. (చూ. కవిల.)

**తవుటిపాము.** దే. వి. (తవుడు+పాము.) మలుఁగు చేఁప.

**తవుడు.** దే. వి. బియ్యముమీఁది పొట్టు, కంబూకము.

**తవులఁబడు.** ద్వ. అ. క్రి. తగులఁబడుయొక్క రూపాంతరము. "క. తవులంబడఁడెందునత్యుగ్ర బలమునన్." భార. ఉద్యో. ౨, ఆ.

**తవులు.** దే. అ. క్రి. స. క్రి. తగులుయొక్క రూపాంతరము. (చిక్కుటకు.—"క. భవదాజ్ఞానిగళంబునఁ, దవిలి." భార. అర. ౧, ఆ. — సక్తమగుటకు.—"క. భవదీయబాహుపీఠిన్, దవిలినభూదేవి." కా. ౫, ఆ.—తగులమునకు.—"చ. ఎగ నుండవులొకయింతలేక సతతంబుఁజరించుసమల్లసద్గతిన్." మార్క. ౨, ఆ.)

**తవులుకొను.** దే. అ. క్రి. స. క్రి. తగులుకొనుయొక్క రూపాంతరము. (ప్రే. తవులుకొలుపు. తవులుకొలుపుటకు. — "సీ. చతురప్రకలితవిస్ఫురితహోమకుండంబుఁ ద్రవ్వించి పావకుఁదవులుకొల్పి." జై. ౮, ఆ.)

**తవులుచు.** దే. ప్రే. తగులుచుయొక్క రూపాంతరము. (రూ. తవుల్చు.)

**తవులువడు.** ద్వ. అ. క్రి. తగులువడుయొక్క రూపాంతరము.

**తవెల.** దే. వి. నూరు పెడల్పుగానుండు కుండవంటి లోహపాత్రము. "క. కమ్మనితావులుచల్లఁగ కమ్మనియాజ్యంబుహాటకపుఁదవెలలఁబోం. కమ్మగవంచిరి." రా, వి. 3, ఆ.

**తవ్వ.** దే. వి. రెండు సోలలకొలఁదిగల మానవిశేషము.

**తవ్విఁద.** దే. వి. తవిఁదయొక్క రూపాంతరము. "క. ఉలవలుచామలుకొద్రవ, ములుకందులురాజమాషములునిష్పావం, బులుచణకంబులుదప్పిదలుజొన్నలుఁగాని కూర్పఁదగుధాన్యంబుల్." జై. ౮, ఆ.

**తష్టము.** సం. విశే. (అ. ఆ. అ.) బాడిసలోనగువానిచే చెక్కఁబడినది.

**తసి.** దే. వి. దట్టమగు వాఱువరుస, సడ.

**తసిలీబు.** హిం. వి. బహుమానము.

**తనుకు.** దే. అ. క్రి. ప్రేమకలిగినట్లు చేష్టించు. వి. 1. ప్రేమగలిగినట్లుచేయు చేష్ట; 2. టక్కు.

తనుకులాఁడి. దే. విణ. (తనుకులు+ఆఁడి.) తనుకులుగలది.

తస్కరించు. సం. స. క్రి. దొంగిలించు.

తస్కరుఁడు. సం. వి. అ. పుం. దొంగ, చోరుఁడు.

తస్స. దే. వి. దుర్మాంసము.

తహతహ. దే. వి. తమకము, వ్యసనము. (చూ.) కుతుకము. "క. ఉప్పరమెగసియజాండము, చిప్పలుగాలంగ మేరుశిఖరంబులపైఁ, గుప్పించిదాఁటు కొందునొ. తప్పకనామనసులోని తహతహ తీఱన్." కాశీ. ౧, ఆ.

తహతహపడు. ద్వ. అ. క్రి. తమకపడు, వ్యసనపడు, కుతూహలపడు.

తహతహపెట్టు. దే. స. క్రి. తమకపఱచు, కుతూహలపఱచు. "క. తహతహపెట్టితిఁగానను, గహనామృగవాంఛ." రామా. ౧, ఆ.

తహశ్శీలు. హిం. వి. పన్ను, సిస్తు.

తహశ్శీలుదారు. హిం. వి. సిస్తువ్యవహారముచూచు ఉద్యోగస్థుఁడు.

తళతళ. దే. వి. 1. మిఱుమిట్లుకొలుపు కాంతి, "సీ. అరుణాంబుజంబులయంతర్దళంబులతళతళలనుజిగిదళముకొల్పి." భార. ఉద్యో. ౨, ఆ. — 2. మెఱయుటయందగు అనుకరణము. "క. పార్థునిపైఁ గ్రగ్గలికనడరేఁదాటిసిడము, తళతళమని మెఱయఁ గురుపితామహుఁడధిపా." భార. భీష్మ. ౨, ఆ.

తళిగ. వై. వి. 1. భోజనపాత్రము; 2. భగవన్నివేదనార్హమైనయన్నము*.

తళియ. వై. వి. తళిగయొక్క రూపాంతరము. (భోజనపాత్రమునకు.—"ఎ, గీ. మీతళియప్రసాదంబుకల్మియనుజన్మ, పావనముగాదె." పర. 3, ఆ.)

తళుకు. దే. వి. మిక్కిలి ప్రకాశము.

తళుకొత్తు. దే. అ. క్రి. (తళుకు+ఒత్తు.) మిక్కిలి ప్రకాశించు. "క. చిత్తంబునఁబైకొనియెడు, నుత్తలమునడంచిముఖపయోరుహమునఁద, ళ్కొత్తెడువెడనవ్వున." భార. ఆర. ౭, ఆ. (చూ. ఒత్తు.)

తళుక్కు. దే. వి. మెఱయుటయందగు అనుకరణము. (ఆమ్రేడితమునందు తళుకుతళుక్కు. "సీ. ఫాలభాగమునవజ్రాలపాపటబొట్టుతళుకుతళుక్కనితాండవింప." శశాం. 3, ఆ.) (చూ. గల్లు.)

తళ్లు. దే. వి. బ. చెఱువులోనగువానియందు గాలిచేత ఉబికి దరినిమోఁదెడు చినచిన్న అలలు. "సీ. తమమోములకునుల్కితగవణంకెడునట్లుతళ్లుకొల్పెడునీటితెమ్మెలలర." య. 3, ఆ.

## తా.

తా. దే. స. తాను అనుదానికి ప్రాతిపదికము.

తాండవము. సం. వి. అ. పుం, న. 1. ఉద్ధతమైన నృత్యము; 2. తృణవిశేషము.

తాండవించు. సం. అ. క్రి. ఉద్ధతముగా నృత్యము చేయు.

తాండ్ర. దే. వి. విభీతకము?.

తాంతము. సం. విణ. (అ. ఆ. అ.) బడలినది.

తాంతి. సం. వి. ఇ. స్త్రీ. బడలిక.

తాంత్రికుఁడు. సం. వి. అ. పుం. 1. సిద్ధాంతము నెఱిఁగినవాఁడు; 2. విషవైద్యుఁడు.

తాంబాళము. దే. వి. తాంబూలము మొదలగునవి యుంచుకొనుటకు ఉపయోగపడు ఇత్తడిలోనగువానితోఁజేసిన పెద్దతట్ట.

తాంబూలము. సం. వి. అ. న. 1. ఆకువక్కలు; 2. పోఁక.

తాంబూలవల్లి. సం. వి. ఈ. స్త్రీ. తమలపాకుతీఁగె.

తాంబూలి. సం. వి. ఈ. స్త్రీ.——పై.——

తాకత్తు. హిం. వి. శక్తి, బలము.

తాఁకించు. దే. స. క్రి. శ్రమపఱచు. "క. ఆఁకొని వచ్చినవిప్రులఁ, దాఁకింపకయశనమిడుము తత్పరమతి." భో. ౬, ఆ.—ప్రే. తాఁకఁజేయు.

తాకీదు. హిం. వి. ఆజ్ఞాపత్రిక.

తాఁకు. దే. అ. క్రి. మార్కొను. "గీ. మనబలంబులు పాండుకుమారసైన్య, సమితితోఁదాఁకె." భార. భీష్మ. ౨, ఆ. — స. క్రి. 1. అంటు; 2. (యుద్ధమున) ముట్టు. "చ. తాఁకెనమ్మనుజవరున్ గురుఁడుపటుమార్గణసంపిహితాంబరంబుగాన్. క. తాఁకినఁబోఁగడందగియెడు, వీఁకంబతిద్రోణు బాణవ్రతుఁజేయు." భార. ద్రో. ౧, ఆ.—వి. తాఁకుట. "ఆతఁడుదక్కనొరులుభీష్ముతాఁకోర్వరు." భార. ఉద్యో. ౪, ఆ.

తాఁకుడు. దే. వి. తాఁకుట, స్పర్శము. "క. అరుదెంచియలిగియుండెడి, యరుదెంచివితాకుతాఁకుడై." సా. ౨, ఆ.

తాఁకుడువేఁకి. దే. వి. వరుసమేరకువచ్చెడు జ్వరము.

**తాఁకుదల.** దే. వి. (తాఁకు + తల.) యుద్ధప్రారంభము. "గీ. బంటులుత్సహించి పగఁఅపోయి రిపోయి, రంపుఁగడఁగిబొబ్బలార్పులెసఁగ, న తిరయమునసడరునట్లుగదొరసము, ద్రథియొనర్ప వలయుఁదాఁకుదలల." భార. శాం. ౨, ఆ.

**తాఁగలి.** దే. వి. పల్లపుమడి.

**తాఁచు.** దే. స. క్రి. తన్ను. "ఎ, గీ. ఒడిసితలపట్టితిగిచిమహోగ్రవృత్తిఁ, గొంకుకొసరించుకయు లేకకూలఁదాఁచె." సం. "అథైనాంపశ్యతో రాజ్ఞఃపాతయిత్వాపదావధీత్." భార. విరా. ౨, ఆ.

**తాజా.** హిం. వి. క్రొత్త, చేర్చిన.

**తాఁట.** దే. వి. 1. చెట్టు పైపట్ట; 2. మోసము. "ద్వి. టక్కరి పూఁట తాఁటలు చేసిధనముఁ, జక్కనఁ గైకొని జరగినపిదప." హరిశ్చ. ౨, భా.

**తాఁటకత్తె.** ద్వ. వి. మోసకత్తె. (చూ. లోట.)

**తాఁటదమ్మఁడు.** ద్వ. వి. జీవనార్థము సన్యాసివేషము ధరించినవాఁడు, లింగి.

**తాఁడి.** దే. వి. తాండ్ర, విభీతకము?

**తాఁపు.** దే. వి. తన్ను, పాదతాడనము. "చ. అని మరలంగఁజూచుతటినద్దళకంఠుఁడు చండభానునం, దనుకడకాలికై యొడియఁ దత్కపినాథుఁడుచాలదయ్యెనో, మునుపటితన్ను గొమ్మనుచు మోములపైనొకతాఁపుతాఁచినన్, గినిసియతండుఁదైకుతికెఁగేసరికేసరిమీఁదికింబలెన్." రామా. ౭, ఆ.

**తాఁబేలు.** దే. వి. తామేలు, కూర్మము.

**తాకట్టు.** దే. వి. (తాకు + కట్టు.) అప్పుతీసికొన్నవానియొద్దనుంచెడి యీాకు.

**తాకు.** దే. వి. కాలిటాకు. "సీ. కారుమొసల్లవాకట్టుమందులుచరణాంగుళంబులఁదాకుటుంగరములు." పంచ. వేం. ౧, ఆ.

**తాగడించు.** దే. స. క్రి. (తాకు + గడించు.) నిర్బంధించు. "గీ. హరికి మామనగుదు నటుమీఁద శ్రీదేవి, తండ్రి నూరకేలతాగడింప." భాగ. ౯, స్కం.

**తాగాఁడి.** దే. వి. (తాకు + గాఁడి.) జాతితోఁగాని మ్రానితోఁగాని హంసపాదాకారముగా నూతిముఖమున నేర్పఱచెడు బంధనము, పీనాహము.

**తాగాణి.** దే. వి. తాగాఁడియొక్కరూపాంతరము.

**తాగు.** దే. స. క్రి. (నీళ్లులోనగువవి) త్రాగు.

**తాగుఁబోతు.** దే. విశే. నియతిలేక మద్యపానము చేయు స్వభావముగలవాఁడు.

**తాచు.** వై. స. క్రి. 1. చెక్కు, ఖచించు; "సీ. చెలఁగుచు మంచిపచ్చలుదెచ్చి మేలేర్చి దట్టంబుగాఁ గూర్చితాచితాచి." య. ౪, ఆ. — 2. తొలుచు*; "సీ. పాథోధిజలయుక్తిఁబాఁచిపట్టినదిశాకరులునాఁ జనుమరకతపుఁగరులఁ గరులతొండముచిక్కఁగబలించిమ్రింగినహరులునాఁ దొండమెుప్పుగుదదర్శ, హరులఁదాచినతాపలము." ఆము. ౧, ఆ.—3. అవలంబించు*. (చూ. అవలంబము.)

**తాజె.** దే. వి. కుళ్లాయ.

**తాటంకము.** సం. వి. అ. పుం. దంతములోనగువానిచేఁ జేయఁబడిన చెవికమ్మ.

**తాటాదూటము.** దే. విశే. చక్కనతప్పినది. "క. తోఁటలఁ లెస్సయున్నవి, తాటాదూటములు గావు తాపసులుండఁగన్, బేటలు." అప్ప. ౪, ఆ.

**తాటించు.** వై. స. క్రి. కొట్టు. (చూ. ఆస్ఫోటించు.)

**తాటికట్టెడ.** ద్వ. వి. తాటిగిజెపాము.

**తాటిగిజెపాము.** ద్వ. వి. తాటిచెట్టుమీఁదనుండెడిపాము.

**తాటిపడగవాఁడు.** ద్వ. వి. 1. బలరాముఁడు, 2. భీష్ముఁడు.

**తాటిరిక్క.** వై. వి. జ్యేష్ఠానక్షత్రము.

**తాటిరిక్కనెల.** ద్వ. వి. జ్యేష్ఠమాసము.

**తాటోటు.** దే. వి. టక్కు, మోసము. "ద్వి. కాటుకకన్నీరుకరమునఁదుడిచి, తాటోటులెఱుఁగనిదానిచందమున." సా. ౪, భా.

**తాడకు.** సం. వి. ఆ. స్త్రీ. సుత్తె.

**తాడనము.** సం. వి. అ. న. కొట్టుట.

**తాడించు.** సం. స. క్రి. తాటించు, కొట్టు.

**తాడితము.** సం. విశే. (అ. ఆ. అ.) కొట్టఁబడినది.

**తాడు.** యు. దే. వి. త్రాడు. వై. తాటిచెట్టు. "గీ. తాళ్లుతెగె రావణాదిశాత్రవులయాంద్ర, తాళ్లుతెగునిట్లయనెడుచందమున." రామా. ౫, ఆ.

**తాత.** ఉభ. దే. వి. తండ్రికితండ్రి. వై. బ్రహ్మ. "క. నీతెలుఁగరయఁగఁదెమ్మెర, మేతలుపంగడపుతోఁడుమినుసికవాఁడున్, దాతయునాతినాతియు, నేతురయొక్కించుకైననిక్కపుమోదవన్." అచ్చ. యు, కాం.—సం. ఆ. పుం.

తంత్రి. విశే. కనికరింపఁదగినవాఁడు. (సంస్కృతమైనపుడు దీనికి తెనుఁగునఁ బ్రయోగము కనఁబడదు.)

తాత్పర్యము. సం. వి. అ. న. అభిప్రాయము.

తాదృశము. సం. విశే. (అ. ఈ. అ.) అటువంటిది.

తానకము. వై. వి. 1. జెట్లు నిలుచుండుటయందలి భేదము; "వింతతానకంబులనిలిచికడిసినప్పుడు." భార. విరా. ౨, ఆ.—2. స్థానము*. "అంచకాఁపులకుఁదానకమై కడలుల్లసిల్ల." హరి. ఉ. ౬, ఆ.

తానము. ఉభ. వై. వి. 1. స్నానము; 2. స్థానము. "క. తానంబాడిమసీషివి, తానంబునకర్ఘమిచ్చి తానంతటసం, తానంబసఁదగిమగసం, తానంబునతేఁడుముదముతానంబయ్యెన్." రా. వి. ౨, ఆ.—సం. అ. పుం. తన్నకారముతో పాడెడు పాట.

తానవము. సం. వి. అ. న. తనుత్వము.

తాను. దే. స. తాశబ్దమునకు ప్రథమైకవచనము.

తాప. దే. వి. 1. నిచ్చెన; "కపిలునింగలపుఁజూపు సెకలంగలయు నాసగరువంగడముమోక్షోత్తుంగమణిసౌధమునకుఁగన్గడపుఁదాప." పా. ౨, ఆ.—2. మెట్టు. "వారిదేవతల్ దోలఁకులకేలఁదాపనిడితోమఁగలంకడఁగెన్." ఆము. ౪, ఆ.

తాపము. సం. వి. అ. పుం. 1. సంతాపము; 2. బాధ. (తాపత్రయము.—ఆధ్యాత్మికము, ఆధిభౌతికము, ఆధిదైవికము.)

తాపసతరువు. సం. వి. ఉ. పుం. గారచెట్టు.

తాపసుఁడు. సం. వి. అ. పుం. తపస్సుచేయువాఁడు, తపసి.

తాపి. యు. దే. వి. 1. మర్మము; 2. జోడ. వై. 1. బేలుదారి*; 2. బేలుదారి గోడపెట్టునపుడు గారను అదుమును ఎత్తివేసి తాళ్లనుపెట్టి సరిపఱిచెడు కొయ్యపిడివేసిన మట్టాకువంటి యినుపసాధనవిశేషము*. 3. చెక్కతాపి.

తాపించు. వై. స. క్రి. 1. నెలకొలుపు, నిలుపు; "ద్వి. అఘ్యాభిమీధరంబు, నడిచక్కి దేవతానగముఁదాపించి." విష్ణు. పూ. 3, ఆ.—2. చెక్కు; "క. సురుచిరపల్లవరుచినుం, దరతనువగుసీతఁగదిసిదళముఖుఁడొప్పెన్, బరఁగఁగాంచనకాంచిన్, వెరవుగఁదాపించియున్న నీలముఁబోలెన్." రా. అర. కాం.—3. మోదు*. "క. తాపించెధనదువదనముఁ, గూపెట్టఁగఁగాలకంఠుకొడుకు." కా శీ. 2, ఆ.

తాపింఛము. సం. వి. అ. పుం. చీఁకటిమ్రాను.

తాపికత్తియ. ద్వ. వి. సంధానముచేయునది. (రూ. తాపికత్తె. "చ. ఇలుగలసైనవెల్వడనియాలువుటాంద్రకుఁదాపికత్తెవై." ఆము. ౫, ఆ.)

తాపికాఁడు. దే. వి. సంధానము చేయువాఁడు. "గీ. తానచోరులకునుదాపికాఁడై వేష, ధారిమిన్న కేనితపముసేయు, చున్నయట్లుపలుకకున్నవాఁడు." భార. ఆది. ౪, ఆ.

తాపిత. దే. వి. మేలైన పట్టువస్త్రము. "సీ. పచ్చతాపితదట్టిఁబసమించు పచ్చరాచిలుకక్రొంబిడివంకియలవరించి." చంద్రా. ౨, ఆ. (రూ. తాపితా.)

తాపితము. సం. విశే. (అ. ఆ. అ.) తపింపఁజేయఁబడినది.

తాపీ. యు. వి. తాపియొక్క రూపాంతరము.

తాపు. వై. స. క్రి. చెక్కు. "పెనుదూనికములుదాపినవెడందపతకమును." నీలా. ౧, ఆ.—వి. అవలంబము*. "ఎ. గీ. ఏడుపాతాళములక్రిందియిఱుకుగొంది, కరిగితోయాత్తయైయున్నధరణిఁజూచి, మొగముఁదాపుగనిచ్చినిర్మద్రశక్తి, కరిమగడలొత్తఁగానెత్తెఁగరుణఁబ్రభుఁడు." హరి. పూ. ౪, ఆ.

తాబందు. దే. వి. పావడ, గాగర.

తాబేదారు. హిం. వి. తక్కువపనివాఁడు.

తామర. వై. వి. తామరపువ్వు, కమలము. (చూ. తమ్మికంటి, తమ్మికెంపు, తమ్మిచూలి.)

తామరచెలి. ద్వ. వి. సూర్యుఁడు, పద్మమిత్రుఁడు. "సీ. చెలిమితోఁదామర చెలిపట్టియనిచినచిఱునరంజీయొక్కచెలువపూన." య. ౧, ఆ.

తామరతంపము. ద్వ. వి. తామరతంపరయొక్క రూపాంతరము.

తామరతంపర. ద్వ. వి. 1. తామరలసమూహము, కమలషండము; 2. అభివృద్ధి. "తామరతంపరైన చెలులుఁజుట్టలుఁగలసి." భార. ఉద్యో. 3, ఆ.

తామరతూపరి. ద్వ. వి. (తామరతూపు+అరి.) మన్మథుఁడు.

తామరపాకు. ద్వ. వి. (తామర + ఆకు.) పద్మపత్రము. (చూ. తల్లడము.)

**తామరసము.** సం. వి. అ. న. 1. తామర; 2. బంగారు; 3. రాగి.

**తామలకి.** సం. వి. ఈ. స్త్రీ. నేలయుసిరిక.

**తామసము.** ఉభ. దే. వి. ఆలస్యము. "ఉ. నావుడుసత్యభామనిజనాథునకిట్లను నేలతామసం, బీవిబుధాధినాయకమహీరుహముం బెకలించిలోకసం, భావితమైననీపలుకుపంతము సెల్లమదీయగేహకే, శీవనవాటి వేడుకదలిర్పఁగనిల్పుముజీవితేశ్వరా." పా. ౪, ఆ.—సం. అ. పుం. పాము. విణ. తమోగుణముగలది.

**తామసి.** సం. వి. ఈ. స్త్రీ. 1. చీఁకటి; 2. పార్వతి.

**తామసించే.** దే. అ. క్రి. ఆలస్యము చేయు. "గీ. చెల్లదొక్కింతయును దామసింపనిచట." జై. 3. ఆ.

**తామసుఁడు.** సం. విణ. (అ.ఈ.అ.) 1. తమోగుణముగలవాఁడు; 2. దుష్టుఁడు.

**తామిస్రము.** సం. వి. అ. న. 1. చీఁకటి; 2. చీఁకటిమయముయిన నరకము.

**తామేలు.** దే. వి. తాఁబేలుయొక్క రూపాంతరము. (చూ. ఇంచు.)

**తామ్రకుట్టకుఁడు.** సం. వి. అ. పుం. రాగిపనివాఁడు, శౌల్బికుఁడు.

**తామ్రచూడము.** సం. వి. అ. పుం. 1. కోడి; 2. అభినయహస్తవిశేషము.

**తామ్రపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకానొకయేఱు; 2. పడమటిదిక్కునందుండెడు ఆఁడేనుఁగు.

**తామ్రము.** సం. వి. అ. న. రాగి. పుం. ఎఱుపు. విణ. ఎఱ్ఱనిది.

**తామ్రాక్షము.** సం. వి. అ. పుం. కోయిల. విణ. ఎఱ్ఱనికన్నులుగలది.

**తాయము.** దే. వి. అరుదగువస్తువు.

**తాయి.** వై. వి. తల్లి*. "సీ. కన్నబిడ్డలకేవఁగాందిశీకులఁ బ్రోవబంగారుతాయిమారంగళాయి." పాంచా. ౧, ఆ.

**తాయెతు.** ద్వ. వి. తాయెత్తుయొక్క రూపాంతరము. "ఎ, గీ. ఇమ్ముగా మేల్పసిండితాయెతులుమొల్ల, విరిసరుల్ దట్టముగఁజుట్టివేసినట్టి, రోరసిగమీఁదఁబైచెంగులునిచికట్టి, నట్టెఖురుసారుమాల్ హహోయల్ బిట్టుదనర." రసి. ౧, ఆ.

**తాయెత్తు.** ద్వ. వి. (తాయి+ఎత్తు.) తల్లి బిడ్డలకుఁగట్టెడు రక్షాబంధము.

**తార.** ఉభ. దే. వి. సుషిరవాద్యవిశేషము. సం. ఆ. స్త్రీ. 1. బృహస్పతిభార్య; 2. వాలిభార్య ఆ. స్త్రీ. అ. న. ము. 1. కనుగ్రుడ్డు; 2. నక్షత్రము.

**తారక.** సం. వి. ఆ. స్త్రీ. అ. న. ము. 1. కంటినల్లగ్రుడ్డు; 2. నక్షత్రము. అ. న. ము. కన్ను.

**తారకజిత్తు.** సం. వి. త్. పుం. తారకాసురుని జయిచినవాఁడు, కుమారస్వామి.

**తారకాణ.** దే. వి. దృష్టాంతము, (రూ. తాఁకాణము.)

**తారకాణించే.** దే. స. క్రి. 1. దృష్టాంతపఱచు; 2. మూదలించు. "గీ. అనఘమతులార నన్నుఁ బ్రాంగియెదుట, మునిచితారకాణించఁగఁగనకనిట్టి, కల్లనావల్లగోరంతగలిగెనేని, యాజ్ఞవల్క్యుఁడనుజామీయనియనుడును." సా. ౨. ఆ.

**తారకుఁడు.** సం. వి. అ. పుం. 1. మాలిమకాఁడు; 2. ఒకానొకరాక్షసుఁడు. విణ. దాఁటించువాఁడు.

**తారణ.** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) విణ. తరింపఁజేయునది.

**తారతమ్యము.** సం. వి. అ. న. తరతమభావము. న్యూనాధిక్యము.

**తారము.** ఉభ. దే. వి. నాలుగుకానులనాణెము. "గీ. అమరశైలముఁజిన్నమంతగాఁదలపోసియీశాలముఁదారమెత్తుచేసి." కా. ౫. ఆ.—సం. అ. న. వెండి. పుం. 1. పులుగడిగినముత్తెము; 2. ముత్తెముపులుగడుగుట. విణ. గట్టి. (మ్రోఁత.)

**తారసము.** దే. వి. 1. సమీపము; 2. తలపాటు. "క. ఈరీతినుభయబలములుఁ, దారసమునఁబోయెనెడ." జై. ౫. ఆ.—విణ. సమీపించినది. "చ. కలకరపంబుబోరుకలఁగ రమణుల్ తెరచీరఁబంచినన్, దటుకునరాజు మోమెదుటఁదారసమైన." స్వా. ౫. ఆ.

**తారసించే.** దే. అ. క్రి. తారసిల్లు.

**తారసిల్లు.** దే. అ. క్రి. 1. సమీపించు; 2. వ్యాపించు. (రూ. తారసిలు. సమీపించుటకు.—"ఉ. ఆర్తిటి రెండుసేనలుఁ రయంబునఁదారసిలెంగడంకపైనుత్తరదక్షిణార్ణవములొండొకటిన్ పడిఁవాసినోయనన్." కళా. ౮. ఆ.—వ్యాపించుటకు.—"సీ. తనకరారుణరుచుల్ ఘనలతాదులఁదారసిల్లనవ్యకిసలయావళులనింప." ఉ. రా. ౧. ఆ.)

తారాడు. దే. అ. క్రి. (తారి+ఆడు. (1. తిరుగులాడు; 2 జీరాడు. "మ. అలపర్జన్యుఁడు కేకిపాత్రములగుంపాడించుచో మేఘమం, డలపుల్ మద్దెల గుగ్రుంగ లేవనుమరున్నార్దంగికుండర్థిసె, త్తలలీల్ నేలకువ్రాలుచుల్ నెగయుచుందారాడున త్తెల్లజ, ల్లులుఁ గెంగుచ్చులునయ్యెధారలునుదల్లోలెం ద్రగోపంబులున్." ఆము. ౪, ఆ. (చూ. ఊఁగాడు.)

తారాపథము. సం. వి. అ. పుం. ఆకాశము, మిన్ను.

తారాపీఁట. ద్వ. వి. ఎద్దువెన్నుమీఁదవేసెడుపీఁట.

తారి. వై. వి. ఆటాడించెడు సూత్రధారి*.

తారీఖు. హిం. వి. ఆంగ్లేయమాసములో దినము.

తారు. దే. అ. క్రి. 1. సంచరించు; 'సీ. కానలోఁదారుమృగంబులకైవడిఁ గైకొనియసమాస్త్రకర్త కలన." రాఘ. ౧, ఆ.—2. పోవు; "ఆతనిజీవరేఖసౌదామనిపోలెనెచ్చటికిఁదారెడినో." నా. ౨. ఆ.—3. కదియు. "సీ. ఏవిహంగముఁగన్న నెలుఁగులిచ్చుచుసారికనుసైకతంబులఁగూడఁదారు." స్వా. 3, ఆ.

తారుకొను. దే. స. క్రి. కదియు. (ప్రే. తారుకొలుపు. చూ. తార్కొను.)

తారుచు. దే. ప్రే. తారఁజేయు, కదియించు. (రూ. తార్చు.)

తారుపు. దే.వి.1.తార్పుట; 2.బరణి. (చూ.తార్పు.)

తారుణ్యము. సం. వి. అ. న. యౌవనము, జవ్వనము.

తారేయుఁడు. సం. వి. అ. పుం. 1. అంగదుఁడు; 2. బుధుఁడు.

తార్కాణ. దే. వి. తారకాణయొక్క రూపాంతరము. "నీకిచ్చినదేవివాక్యమునకున్ దార్కాణగానామజన్మములన్ వింటిగదమ్మ." ప్రభా. 3, ఆ. (రూ. తార్కాణము.)

తార్కాణించు. దే. స. క్రి. తారకాణించుయొక్క రూపాంతరము. (దృష్టాంతపఱచుటకు.—"వ. తనతలంపుయథార్థంబగుటతార్కాణించె." ప్రభా. ౪, ఆ.)

తార్కికుఁడు. సం. వి. అ. పుం. తర్కశాస్త్రము తెలిసినవాఁడు.

తార్కొను. దే. స. క్రి. తారుకొనుయొక్క రూపాంతరము. "ధనవంతు గర్వంబు తార్కొనకేలుండు." పంచ. నా. ౧, ఆ. (ప్రే. తార్కొలుపు. "తదీయమూర్తివిభవధ్యానంబు గావించిచిత్తముసర్వాంగవిమర్శనక్రియలకున్ దార్కొల్పి." భాగ. ౪, స్కం.)

తార్క్ష్యుఁడు. సం. వి. అ. పుం. 1. గరుత్మంతుఁడు; 2. అనూరుఁడు.

తార్పు. దే. వి. తారుపుయొక్క రూపాంతరము. (బరణికి.—"గీ. కలఁచవెలిదొంగ రాయిడికలుగునింక, ననుచుమనుమున్న పద్మినితనపికాస, ధనము నిచినీటనిడురాగితార్పుఁబోలెఁ, బడియెఁబడమటికడలిలోఁబద్మహితుఁడు" రామా. ౨, ఆ.)

తార్పులాడు. దే. అ. క్రి. (తార్పులు+ఆడు.) (పెంపుడుపొట్టేలు కోడి మొదలగునవి) జగడమాడు. "గొట్టెపోతుల్ బెడఁగుగఁదార్పులాడఁగను బెట్టు." భల్లా. 3, ఆ.

తార్యము. సం. విశే. (అ. ఆ. అ.) తరింపఁడగినది.

తాఱు. దే. అ. క్రి. 1. అడఁగు; "శలభప్రకరంబు మహీరుహంబుపైఁదాఱు తెఱంగుసేసె." ఉ, హరి. 3, ఆ.—2. మఱుఁగుపడు. "సీ. నడనేర్పులేదాయెననుచురాయంచకుఁ బడవయ్యె ననుచుఁదాఁదాఱెనొకతె." యు. ౫, ఆ.

తాఱుమాఱు. దే. వి. క్రమముతప్పుట, వ్యత్యాసము. విశే. క్రమముతప్పినది, వ్యత్యస్తము.

తాఱుమాఱుపడు. ద్వ. అ. క్రి. (తాఱుమాఱు+పడు.) వ్యత్యస్తమగు.

తాలకి. సం. వి. ఈ. స్త్రీ. తాటికల్లు.

తాలధ్వజుఁడు. సం. వి. అ. పుం. 1. బలరాముఁడు; 2. భీష్ముఁడు.

తాలపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. మురయనెడు గంధద్రవ్యము ?.

తాలము. సం. వి. అ. న. హరిదళము. పుం. చాఁపఁబడిన బొటనవ్రేలి నడిమివ్రేలి నడిమికొలఁత.

తాలాంకుఁడు. సం. వి. అ. పుం. బలరాముఁడు.

తాలి. ఉభ. దే. వి. మంగళసూత్రము. "తాలివిభుండుగట్టినమొదల్." పాండు. ౪, ఆ.—సం. ఈ. స్త్రీ. నేలయుసిరిక ?.

తాలించు. దే. స. క్రి. (కూరమొదలగువాని) తిరుగఁబోయు.

తాలింపు. దే. వి. 1. తిరుగఁబోఁత; "వ. తాలింపులకమ్మనికంపు." కాశీ. ౨, ఆ.—2. తాలించిన కూర. "మ. తిరువారాధనమిట్లొనర్చిధరణీదేవా

న్వయత్రేష్ఠుఁడా, హరికర్పించుటఁబావనంబుల గుశాల్యన్నంబులుఁ జేతులుఁ, వరుగుల్ చేరులుపప్పులప్పడములుఁ దాలింపులుఁ బూపముల్, పరమాన్నంబులుఁబెట్టు సెట్టినభుజింపఁ గాదల్లికిఁ దండ్రికిఁ." పాండు. ౨, ఆ. (చూ. అరగింపు.)

తాలిక. దే. వి. మెలిక. "సీ. నడినెత్తిమత్తిపాలిడితాలికలొనర్చికడలుకొల్పినగొప్ప జడలద్రిండు." శుక. ౨, ఆ.

తాలిబొట్టు. ద్వ. వి. మంగళసూత్రపుబొట్టు.

తాలిమి. దే. వి. 1. క్షమ; 2. ధైర్యము. "క. పడఁతీయొట్టటప్రాణము, పిడికిటఁబెట్టుకొని నేఁడు ప్రియుతో నీవె, వ్వడుబలెఁబలుకకయించుక, తడవుండుము మాకుఁగాను దాలిమితోడన్." కళా. ౭, ఆ.

తాలిమికత్తె. ద్వ. విణ. క్షమావంతురాలు.

తాలిమికాఁడు. దే. విణ. క్షమావంతుఁడు.

తాలీశివ. సం. వి. ఆ. స్త్రీ. నేలయుసిరిక.

తాలీసపత్త్రము. సం. వి. అ. న. 1. తాళిసపత్రి; 2. నేలయుసిరిక.

తాలు. దే. వి. ఎన్నుతీసి యెండిపోయినపైరు.

తాలుచు. దే. స. క్రి. 1. ధరించు; 2. (నూలు) పిరిపెట్టు; 3. తిరికలుచేయు; 4. దారములోనగువానిపేను; 5. పిండిలోనగువానియందు మెటికలులోనగువానిని చేటతో తట్టియెత్తు. (రూ. తాల్చు. తిరికలుచేయుటకు.---"సీ. అనుకువెన్నెలఁదాల్చి తునిచిసేవలుచేసి వెన్నెలపాలనుజాన్నె నర్చి." య. ౨, ఆ.---దారములోనగువానిని పేనుటకు.---"గీ. ఎసఁగుసంతాపభరమున నిట్టునట్టుఁ, బొరలుశయ్యాతలంబునఁబువ్వుఁబోఁడి, తివురు విరహానలంబునదివ్వెయొత్తఁ, జీర్ణజాతుండుపత్తిఁ దాల్చినవిధమున." ఉ, హరి. ౫, ఆ.)

తాలువు. సం. వి. ఉ. న. దవుడ, కాకుదము.

తాలూకా. హిం. వి. జిల్లాలో నొకభాగము.

తాల్మి. దే. వి. తాలిమియొక్కరూపాంతరము.

తావకాళ్లు. దే. వి. బ. (తావలము+కాళ్లు.) తలమెత్తువాఁడు కాళ్లుంచుకొనుటకు నమర్చినపట్టెలు. (తావకోళ్లు. అని కొందఱందురు.)

తావకీనము. సం. విణ. (అ. ఆ. అ.) నీది, త్వదీయము.

తావడము. దే. వి. రుద్రాక్షలులోనగునవిగ్రుచ్చిన హారము. "ముత్తియంబులందావడముల్ ఖచించి నవిధంబున." వై. ౭, ఆ.

తావరము. వై. విణ. స్థిరమైనది.

తావలము. దే. వి. 1. స్థానము; "సీ. తావలంబైయొప్పునేవీడుకల్పపాదపకామధేనుచింతామణులకు." పు. ౧, ఆ. "ఉ. నావినియింకనేమియు వినఁగరణకోవిదనీకొకింతయున్, దావలమెద్ది." (ఇక్కడ స్థానమనఁగా అవకాశమని యర్థము.) కళా. ౬, ఆ.---2. ఆధారము. "క. క్రమమున శిష్టాచార, క్రమమెఱుఁగఁగధర్మమునకుఁ గర్మవాటంబై, విమలంబగుచిత్తమున, త్యాగమును హింసయును దనకుఁ దావలములగున్." భార. అర. ౫, ఆ.

తావళము. దే. వి. తావడముయొక్క రూపాంతరము. "మ. చైత్రుఁడిచ్చుబురుసాదట్టీలుముత్యాలతా, వళముల్ వోలెఁదగుంజిగుర్లుఁగలికావాములీరమ్ముఁలన్." చంద్ర.

తావి. దే. వి. పరిమళము.

తావిగట్టు. ద్వ. వి. మలయపర్వతము. "తావిగట్టుకడసంద్రములోపలిదీవి." య. ౨, ఆ. (ఇట్లు తావిగుబ్బలి. మొ.)

తావినూనె. దే. వి. తావిగలనూనె. అత్తరు.

తావిమోపరి. దే. వి. గాలి, గంధవహుఁడు.

తావివిలుకాఁడు. దే. వి. మన్మథుఁడు.

తావు. దే. వి. తావలము, స్థానము, కాకిదము.

తావుకొను. దే. అ. క్రి. నెలకొను, నిలుచు. "ఉ. ఇద్దెసన్, దానుసహించియేమిగతిఁదావుకొనున్ మెయిఁబ్రాణమర్జునా." భార. మా. ౧, ఆ.

తావేలువేయుట. హిం. క్రి. పోల్చిచూచుట, సప్రతించుట.

తాహతు. హిం. వి. శక్తి, బలము.

తాళకము. సం. వి. అ. న. 1. పర్వతధాతువిశేషము; 2. హరిదళము; 3. తోఁగరిమన్ను; 4. చిన్నబీగము.

తాళగించు. వై. అ. క్రి. తాళమువేయు. "గీ. ఓర్చి కరతాళమొనరింప నోర్తుసమద, గీతిఁబచరింప జతిఁదాళగింపనోర్తు, మధురమదిరారసోల్లాసమత్తయగుచు, నాడెనొక్క తెలలితాంగి హరితుల." లక్ష్మీ. ౨, ఆ.

తాళగిరి. వై. వి. తాళమువేయువాఁడు.

తాళపత్త్రము. సం. వి. అ. న. 1. తాటాకు; 2. చెవ్వాకు.

తాళము. ఉభ. దే. వి. మల్లబంధవిశేషము. "క. పెలుకుఱితాళంబీమదిఁ, దలఁచియనువుగాక ధరణితలముఁగరపుటం, బులనప్పళించెవాఁడ, కొ్కలువార్వఁగవిడిచిమెఱసెఁగుంతీ సుతుఁడుఁ." భార. విరా. ౨, ఆ.—సం. అ. న. బీగము. పుం. 1. పాడునపుడు చేతులతో చఱచెడి చఱపు; 2. తాటిచెట్టు; 3. పరుఁజు; 4. పాడునపుడు జరగెడు కాలపరిమాణము; 5. తాళమువేసెడు కంచువాద్యము.

తాళమూలిక. సం. వి. ఆ. స్త్రీ. నేలతాడు?.

తాళవృంతము. సం. వి. అ. న. విసనకఱ్ఱ. వ్యజనము.

తాళి. ఉభ. దే. వి. 1. పతకము; "వ. హృదయసదనంబగుమదనునకుఁబొడముభీభత్సరసంబురుచిరవక్షస్స్థలంబునం దోఁచినవిధంబున నీలంపుతాళితళుకుసంఘటింప." చంద్ర.—2. హారవిశేషము. "మ. రఘురామస్వామిస్వగ్రీవఁబొ, యని వైహార్యపుఁదాళిఁగైకొనితదీయగ్రీవనుంచెఁ గృపఁ." ఉ. రా. ౫, ఆ. (చూ. తాళీ.)—సం. ఈ. స్త్రీ. శ్రీతాళము?.

తాళించు. దే. స. క్రి. జూదమాడునపుడు క్రిందవేయుటకై పాచికలను చేతనుంచుకొని యిటునటు త్రిప్పు. "వ. తాళించుపాచికలపోలిక." ఉ. హరి. 3, ఆ.

తాళిక. దే. వి. ఓర్పు, క్షమ. విణ. చాలినది, క్షమము.

తాళిసపత్త్రి. వై. వి. ఒకానొకమందుదినుసు, (రూ. తాళిసపత్త్రి.)

తాళీ. దే. వి. తాళియొక్క రూపాంతరము. (హారవిశేషమునకు.—"సీ. పులుఁగురాపచ్చబల్ చిలుకతాళీయొక్క నుదతిపేరురమునఁగుదురుపఱప." రసి. ౧, ఆ. "ఎ, గీ. గొలుసులుంగరములుమురుగులనుబరిక, ములునుదాళీలు నేవళంబులును." అచ్చ. సుం, కాం.)

తాళీకుఁడు. దే. విణ. కార్యమును ముగించువాఁడు.

తాళు. దే. అ. క్రి. 1. తాళికయగు; (అది నాకంటికి తాళియుండలేదు. ఆసొమ్ము నూఱు రూపాయలు తాళును.) 2. సహించు; "ద్వి. కరుణఁ, దాళి ప్రోచుటమీకుధర్మమైయుండు." రా. కిష్కిం, కాం.—3. నిదానించు. (నీవు రెండు దినములు తాళిరా.)

తాళుకొను. దే. అ. క్రి. తాళు. (స్వార్థమున కొను.)

## తి.

తింట. దే. వి. తినుట, భుజించుట. "తరల. కులగురుండువసిష్ఠుఁడంతవికుక్షికుందెలుదింటలో, వలనెఱింగి." భాగ. ౯, స్కం.

తిండి. దే. వి. 1. భోజనము; 2. ఆహారము. "సీ. ఉపవాసములఁదద్దయునుగృశింపక మేనుతిండిచేఁ బోషించుచుండెనేని." జై. 3, ఆ.

తిండికత్తియ. ద్వ. విణ. మిక్కిలి తినునట్టి స్వభావము గలది, భక్షకురాలు, (రూ. తిండికత్తె.)

తిండికాఁడు. దే. విణ. మిక్కిలి తినునట్టి స్వభావము గలవాఁడు, భక్షకుఁడు.

తిండిపోతు. దే. విణ. తిండికాఁడు, తిండికత్తె.

తిండీఁడు. దే. విణ. (తిండి+ఈఁడు.) తిండికాఁడు.

తింత్రిణి. సం. వి. ఈ. స్త్రీ. చింతచెట్టు, (రూ. తింతిడి.)

తింత్రిణీకము. సం. వి. అ. న. చింతపండు, (రూ. తింతిడీకము.)

తిందుకము. సం. వి. అ. పుం. తుమ్మికి?.

తికమక. దే. వి. 1. కలఁత; "చ. తికమకగాఁగఁజేసి నలుదిక్కులనార్భటిసేయుసారమే, యుకములఁ జెల్గికొట్టినుఱుమాడుచునొక్కవరాహమేగ." సా. ౧, ఆ.—2. తొట్రుపాటు; (చూ. తికమకగొను.)—3. అంగములయొక్క అస్వాధీనత. "ఎ, గీ. ఉవిదపిండుతోడనవవిమానముతోడఁ, దనదువిద్యతోడధరణిఁద్రెళ్లి, తిరిగిలేవలేకతికమకగుడువంగ." భాగ. ౬, స్కం.

తికమకగొను. దే. అ. క్రి. (తికమక+కొను.) తొట్రుపడు; "క. ఒకమొకము గాకదివిజాలు, తికమకగొనివైరులెల్లదీకొనితమ్ముఁ, బకపకనగవకవకలై,లుకలుకఁబరువెత్తిరోడిలోఁగొనుభీతిఁ." భాగ. ౬, స్కం.— 2. (అంగములయొక్క) అస్వాధీనతనుపొందు. (చూ. తికమక.)

తికమకలాడు. దే. అ. క్రి. (తికమకలు + ఆడు.) 1. తొట్రుపడు; (చూ. తికమకగొను.) — 2. (అంగములయొక్క) అస్వాధీనతను పొందు. (చూ. తికమక.)

తిక్క. దే. వి. పిచ్చి, ఉన్మాదము. (త్రిక్కయొక్క రూపాంతరము.)

తిక్కగొను. దే. అ. క్రి. (తిక్క+కొను.) వెఱ్ఱిత్తు.

తిక్కటమక్కట. దే. వి. కలఁత, క్షోభము.

**తిక్కడి.** దే. వి. నూలువడికెడు చిప్పకదురు.

**తిక్కణిక.** సం. వి. ఆ. స్త్రీ. ఇటికపగడము.

**తిక్త.** సం. వి. ఆ. స్త్రీ. కటుకరోహిణి?. అ. న. ము. చేఁదిపొట్ల?. పుం. చేఁదు. విణ. చేఁదైనది.

**తిక్తశాకము.** సం. వి. అ. పుం. 1. ఉలిమిరి?; 2. చేంద్ర?.

**తిగ.** వై. స. మూఁడు, త్రికము.

**తిగకంటి.** ద్వ. వి. (తిగ+కన్ను.) శివుఁడు, త్ర్యంబకుఁడు. "సీ. పగలింటికడవాడుతిగకంటియొకి మానిగడితంపునిడువాలుజడలనంగ." అచ్చ. అ, కాం.

**తిగవంచే.** ద్వ. స. నాలుగు, చతుష్కము.

**తిగియు.** దే. స. క్రి. తివియు, ఆకర్షించు.

**తిగుచు.** దే. స. క్రి.——పై.——"క. స్రోతోవేగము పటుగతి, వీతబలుండగుచునట్లువిషయములీడ్చుచుఁ, జేతోబలసంభృతయో, గాతిశయుఁడుగానివానినంచితచరితా." భార. శాం. ౫, ఆ.

**తిగ్మము.** సం. వి. అ. న. వేఁడిమి. విణ. వేఁడిమికలది.

**తిట్ట.** దే. వి. రాశి. "మ. తలలంజేతులఁగాళ్లులఁబదనువులఁ ధాత్రీస్థలిఁ బెక్కుతి, ట్టలుగావించి." భార. ద్రో. ౫. ఆ. ("గీ. అప్పుడేపడంగియన్నిసేనలుభీష్ము, రథముపొంతకొదిఁగెరౌద్రగసవి. సొదిరయైనయగ్గునుఁడుధనుశ్చాలన, దీప్తమూర్తియగుచుఁదిట్టకుఱికె."(ఇక్కడ తిట్ట అనఁగా బలముల తిట్ట అని యొఱుంగునది.) భార. విరా. ౫, ఆ.)

**తిట్టాట.** దే. వి. తిట్టాడుట. "క. తిట్టాటఱంకుముచ్చిమి, యిట్టివివాదములచోటనెవ్వరికైనన్, నెట్టనసాక్షిగఁగొనఁజను, నట్టియెడన్ సాక్షిగుణములరయుదు పెద్దల్." విజ్ఞా. వ్య, కాం.

**తిట్టాడు.** దే. స. క్రి. (తిట్టు+ఆడు.) తిట్టు. (స్వార్థమున ఆడు.) (చూ. తిట్టాట.)

**తిట్టు.** దే. స. క్రి. 1. శపించు; "ఉ. ఆవిధినుండునంతటనొకప్పుడునిన్నునుజూచుచోమణి, గ్రీవుని పేరుదోఁచె మదికిన్ మణికంధర యేకదేశసా, మ్యావగుణంబుచేనతనివాతనియన్నను మద్ది చెట్లుగా, దైవతమానితిట్టినవిధంబుమనంబునఁబాతెనంతటన్." కళా. ౪, ఆ.—2. నిందించు. "చుట్టంబులుంబెలుఁలుందిట్టరె." భార. ఉద్యో. 3, ఆ.—వి. 1. శాపము; "గీ. అతండు, తత్పదద్వంద్వమునకువందనమొనర్చి, తపసితిట్టునఁ బ్లవమయ్యెఁదక్షుణంబ." పాండు. ౫, ఆ.—2. నింద. "ఎ, గీ. జగము, చేతఁదిట్టులు పడునట్లుచేసిపోయితేల." భార. ఉద్యో. ౧, ఆ.

**తిట్టువడు.** ద్వ. అ. క్రి. (తిట్టు+పడు.) నిందింపబడు.

**తిట్టువాటు.** ద్వ. వి. (తిట్టువడుట.) నింద. "ద్వి. ఆలిఁగోల్పడిపోయియక్కటామగుడఁ, దేరేఁడితండనుతిట్టువాటునకు, వెఱచితెచ్చితిఁగానివెలదినిన్నొల్ల." రా. యు, కాం.

**తిడిమ్మి.** దే. వి. రథముపాఱునప్పటిమ్రోఁతయంగు ధ్వన్యనుకరణము, (రూ. తిడిమి.) "క. పాడవులకునింగిచాలని, కడమకుబలెఁబుడమికిందిగంబడునెమ్ముల్, పిడుగులుద్రవ్వఁగ వెడలెన్, దడిమితిడిమ్ములు సెలంగఁదేరులువాఱన్." రామా. ౭, ఆ.

**తితఉవు.** సం. వి. ఉ. పుం, న. జల్లెడ.

**తితిక్ష.** సం. వి. ఆ. స్త్రీ. క్షాంతి, ఓర్పు.

**తితిక్షువు.** సం. విణ. ఉ. క్షమించునట్టి స్వభావము గలవాఁడు, ఓర్పరి.

**తిత్తి.** వై. వి. 1. ఒలిచికొలిమియూఁదుటకు అనువుగా నేర్పఱచిన మేఁకతోలు; (కొలిమితిత్తి.) 2. మృగములతోలు*; "వ. వాఁడులగుకత్తులందిత్తి లొలిచి." స్వా. ౪, ఆ.—3. ఒలిచిసుతిపోయుటకేర్పఱచినతోలు*; (తిత్తిపోయుము.) 4. ఒలిచిసారాయికొనిపోవుటకు అనువుగా నేర్పఱచిన మేఁకతోలు*; (సారాయితిత్తి.) 5. తోలుసంచి*; (కత్తులతిత్తి.) 6. సంచి*. (వక్కాకుతిత్తి.)

**తిత్తికాఁడు.** వై. విణ. తిత్తిపోయువాఁడు.

**తిత్తిరి.** సం. వి. ఇ. పుం. తీతువుపిట్ట.

**తిథి.** సం. వి. ఇ. పుం, స్త్రీ. 1. పాడ్యమిలోనగునది; (శుక్లపక్షము మొదలనుండి క్రమముగా ఐదేసి తిథులు నంద, భద్ర, జయ, రిక్త, పూర్ణయను నామములు కలవియగును.) 2. శ్రాద్ధదినము.

**తినాసము.** వై. వి. నెమ్మి, తినిశము?.

**తినిశము.** సం. వి. అ. పుం. తినాసము?.

**తిను.** దే. స. క్రి. భుజించు.

**తినుకు.** దే. అ. క్రి. ముక్కిముక్కి విసర్జించు. వి. ముక్కి ముక్కి విసర్జించుట.

**తిన్న.** దే. విణ. 1. మనోజ్ఞము; "సీ. కస్తూరికాతిలకంబునెన్నొసలిపైఁ దిన్నగాఁ గొనగోట దిద్ది

ద్దిద్ది." శేష. ౪, ఆ.—2. యుక్తము; "బుధరక్షతిన్న గాఁబూనువారు." పాండు. ౨, ఆ.—3. స్వస్థము; "ద్వి. కన్నులఁ దెఱవకు గ్రసమాధిఁబూని. తిన్న గాఁబదివేలదివ్యవర్షములు, తపముగావించె." విష్ణు. పూ. 3, ఆ.—4. ఋజువు; (నీవు ఈ దారిని తిన్న గాపొమ్ము ఊరు అగపడును.) 5. సౌమ్యము. "క. నాపలుకుఁదొట్టి యాగ్రహ. దీపితుఁడగుటుడిగిమదికిఁదిన్నఁదనమునీ, వాపాదింపుముచలమును, గోపముఁగ్రౌర్యంబువిడువుగుణనిత్న నిధీ." భార. సౌ. ౧, ఆ.

తిన్నన. దే. వి. 1. మనోజ్ఞత; 2. యుక్తత; 3. స్వస్థత; 4. సౌమ్యత; 5. ఋజుభావము. (విశేషణముగు చో "తిన్ననియెల్లు." పాండు. 3, ఆ. "తిన్నని యుపాయము." భార. విరా. ౨, ఆ. మొ. చూ. తిన్న. అలకన.)

తిన్నియ. దే. వి. తిన్నె. "సీ. తిన్నియలలికిముత్తియపుమ్రుగ్గులువెట్టి పసిఁడిగోడలరంగుఁబను లు వ్రాసి." అచ్చ. అ, కాం.

తిన్నె. దే. వి. అరఁగు, వేదిక. (తిన్నియయొక్క రూపాంతరము.)

తిపురుకట్టు. దే. అ. క్రి. వ్యాపించు. "ద్వి. తాటంకవజ్రాంశుధాళధళ్యములు, తేటచెక్కులమీఁదఁదిపురుకట్టఁగను." విష్ణు. ఉ. ౪, ఆ.

తిప్ప. వై. వి. 1. చిన్నకొండ*; 2. కొండ*; "తిప్పబిడారుంద్రిప్పని తేరక౯." య. ౨, ఆ.—3. దిబ్బ*. "బలుకప్రంపుటవంటికప్పరపుఁదిప్పల్." వసు. ౧, ఆ.

తిప్పకాయ. దే. విణ. ఆకతాయి.

తిప్పతీఁగ. దే. వి. గుడూచి*.

తిప్పత్రిమ్మరి. ద్వ. వి. కోఁతి, అగచరము. "గీ. తిప్పత్రిమ్మరినాడెల్లఁ దివిరిప్రోవుము." అచ్చ. కిష్కిం, కాం.

తిప్పతెల్లు. ద్వ. వి. ఇక్షుకము*.

తిబిరి. దే. వి. మాఱుపాటు. (వాఁడు ఈపనిలో కొంచెము తిబిరిచేసినాఁడు.) విణ. అల్పము. "సీ. మతొప్పదరక్షయు మావుపెన్నెలకఁగుట్టినయోటితిబిరిదండెయును మెఱయ." ఆము. ౬, ఆ.

తిబ్బి. దే. వి. ముందటికి కుట్టుపోనిచ్చుచు వెనుకకు మరలించి మరలించికుట్టెడు గట్టికుట్టు. (దీనికి డిబ్బియనికూడ వాడుకకలదు.)

తిమి. సం. వి. ఇ. పుం. నూఱుయోజనముల పొడువు గలచేఁప.

తిమింగిలము. సం. వి. అ. పుం. తిమిని మ్రింగెడు చేఁప.

తిమితము. సం. విణ. (అ.ఆ.అ.) ఆర్ద్రము, తడిసినది.

తిమిరము. సం. వి. అ. న. 1. చీఁకటి; 2. నేత్రరోగవిశేషము.

తిమిరి. దే. వి. తిమ్మిరియొక్క రూపాంతరము.

తిమిరిమీను. ద్వ. వి. ఒకదినుసుచేఁప.

తిమురు. దే. అ. క్రి. 1. త్వరపడు; "క. రమణీజనంబుకల్యాణమువాడఁబవిత్రతూర్యనాదములెసఁగఁగ౯, సుముహూర్తమైనవేళ్కలఁ దిమురువధూవరులనడిమితెరయెత్తుటయు౯." కవిక. 3, ఆ.—2. ఉద్రేకించు; "ద్వి. బ్రమసియచ్చటిమునిప్రవరులునడఁకఁ, దిమిరిదండము కేలఁద్రిప్పుచులేచి." హరిశ్చ. ౧, భా.—3. ఒళ్లువిఱుచు; 4. గర్వించు. వి. 1. తిమ్మిరి; 2. గర్వము. "క. తమిరెమొల్లఁదీర్చితమప్రియ, తముఁడగురాజస్తమింపఁదటిగొనినచ్చెక౯, దిమురునఁజండప్రభుఁడని, కుముదంబులు మోము మోడ్చి కుముదములయ్యె౯." రసి. ౫, ఆ.

తిమురుకొను. దే. అ. క్రి. ఆగ్రహముతో పెనఁగులాడి వదలించుకొను. (నేను పట్టితిని వాఁడు తిమురుకొనిపోయినాఁడు.)

తిమ్మ. దే. విణ. స్వస్థము. (చూ. తిమ్మపడు.)

తిమ్మఁడు. దే. వి. (తిరుమల+డు.) కోఁతి, వానరము.

తిమ్మదియ్యము. దే. వి. (తిమ్మ+తియ్యము.) రత్యతృప్తి.

తిమ్మన. దే. వి. స్వస్థత. (చూ. తిమ్మపడు. అలకన.)

తిమ్మనము. వై. వి. మజ్జిగపులుసు.

తిమ్మప్పఁడు. ద్వ. వి. (తిరుమల+అప్పఁడు.) వేంకటేశ్వరస్వామి. "కొండమీఁదితిమ్మప్పనివంటికావ్యపతియబ్బుటయబ్బురము." రా, వి. ౧, ఆ. (రూ. తిమ్మప్ప.)

తిమ్మపడు. ద్వ. అ. క్రి. (తిమ్మ+పడు.) స్వస్థపడు, సేదదేఱు. "సీ. ఇనవంశమణితమ్ముఁడును దానుబడలికల్ దీఱికూర్చుండిరితిమ్మపడియె, బలమెల్ల." రామా. ౮, ఆ.

తిమ్మిరి. దే. వి. స్పర్శము తెలియని వ్యాధివిశేషము.

తిమ్ము. దే. స. క్రి. దీవించు. (నేను వానిని తిట్టనులేదు తిమ్మనులేదు.) (దీనికి ప్రత్యేక ప్రయోగము లేదు.)

**తియ్య.** దే. విణ. మధురము. ("సీ. తమతియ్యపలుకులం బ్రమదరాగాంబుధిఁదనరారుమవ్వంపుఁదరఁగలనఁగ." (ఇక్కడ మధురము అనఁగా వినఁదగినది అని యర్థము.) లక్ష్మీ. ౧,ఆ. "సీ. కలికిపల్కులతియ్యక పురంపుఁబల్కులపొలఁతిచూపులనిల్చుపొదలు మెఱపులు." (ఇక్కడ మధురమనఁగా వాసనగలది అని యర్థము.) చంద్ర.)

**తియ్యఁబోఁడి.** దే. వి. (తియ్య+పోఁడి.) 1. చెఱుకువలె మనోజ్ఞురాలగు ఆఁడుది; "శా. ద్రోవదన్, తియ్యంబోఁడివరింపఁగావసుధకేతేఁజూచునాదిత్యులో." పాంచా. 3,ఆ.—2. ఆఁడుది. (చూ. అలరుఁబోఁడి.)

**తియ్యకంద.** మి. వి. కనరులేనికందా.

**తియ్యగూర.** ద్వ. వి. (తియ్య+కూర.) పులుసుచేరని కమ్మగూర. "వ. చేరులఁదియ్యగూరలుఁబచ్చడులుబజ్జులు." కాశీ. ౭, ఆ.

**తియ్యదానిమ్మ.** ద్వ. వి. తియ్యనివిత్తులుఁగల దానిమ్మా.

**తియ్యన.** దే. వి. తియ్యఁదనము, మాధుర్యము. (విశేషణమగుచో తియ్యనిపలుకులు. మొ.చూ. అలకన.)

**తియ్యనిమ్మ.** దే. వి. కమ్మనిమ్మ, శర్కరాంకము.

**తియ్యమామిడి.** దే. వి. సహకారము.

**తియ్యము.** దే. వి. 1. ప్రియవచనము, సాంత్వనము; "తియ్యముతేనిచాగమును." ఉ, హరి. ౫, ఆ.—2. ప్రియము. "గీ. నాకునిన్, దెలపనేలపలుకుఁదియ్యమేల." భార. అర. ౬, ఆ.

**తియ్యమునగ.** ద్వ. వి. ఎఱ్ఱమునగ, మధుశిగ్రువు.

**తియ్యమ్రాను.** దే. వి. చెఱకు, ఇక్షువు.

**తియ్యవిలుకాఁడు.** దే. వి. మన్మథుడు, స్వాదుధన్వుఁడు. "ఎ,గీ. తియ్యవిలుకానివిడిపడ్డదీమునఁగ." విక్ర. ౫, ఆ. (రూ. తియ్యవిల్కాఁడు. ఇట్లు తియ్యవిలుతుఁడు.)

**తిరపడు.** వై. అ. క్రి. (తిరము + పడు.) స్థిరపడు, కుదురుకొను. "చ. గరుడునిడిగ్గివీడ్కొలిపికంసవిరోధిపురంబులోపలన్, దిరపడిదారకుంబనిచితేరలవాటుగఁదేరనెక్కి." ఉ, హరి. 3, ఆ.

**తిరము.** వై. విణ. స్థిరము. "క. అఱిగరమునఁనేదాల్చిన, నరిగరమునఁగేంద్రధీరుఁడైనంజెడఁడే, యరిదిరమైనన్నఁడుగుట, యరిదిరమైకాభిలాషులగున్నపతులకున్." ఉ, హరి. ౪, ఆ.

**తిరశ్చీనము.** సం. విణ. (అ. ఆ. అ.) అడ్డముగాఁబోవునది.

**తిరస్కరించు.** సం. స. క్రి. అనాదరముచేయు, తెగడు.

**తిరస్కరిణి.** సం. వి. ఈ. స్త్రీ. తెరచీర, ప్రతిసీర.

**తిరస్కారము.** సం. వి. అ. పుం. అనాదరము, తెగడ్త.

**తిరస్కృతము.** సం. విణ. (అ. ఆ. అ.) తిరస్కరింపఁబడినది, తెగడఁబడినది.

**తిరస్క్రియ.** సం. వి. ఆ. స్త్రీ. తిరస్కారము.

**తిరస్తు.** దే. వి. సప్తాంగములలో నొకటి, రాష్ట్రము.

**తిరి.** దే. వి. 1. జట; "ఉ. ఈబసుమంబుకప్పురమెయీతిరివేణియె పట్టుచీరలే, యీబిరుసైనపల్కులము లీతపమిష్టమనోజభోగమే." ఉ, రా. 3, ఆ.—2. సుడి. "నిమ్ననాభులుతిరులయ్యె." కవి. క. ౪, ఆ.

**తిరిక.** దే. వి. మెలిక.

**తిరిగివచ్చు.** దే. అ. క్రి. ప్రదక్షిణమగు. "గీ. తంత్రిపనుపుననందఱుధరణియెల్లఁ, దిరిగిరాఁద్రవ్వి." హరి. పూ. ౨, ఆ.—స. క్రి. పరివేష్టించు. "క. కనియక్కైలాసతటం, బుననమరులఁతమవిమానములుడిగ్గిజనా, ర్దనుఁదిరిగివచ్చికొలువఁగఁ, గనువిచ్చినతండునియమగతిసెల్లుటయున్." ఉ. హరి. ౨, ఆ.

**తిరితీపులాడు.** దే. అ. క్రి. (తిరితీపులు+ఆడు.) పెనఁగులాడు. "ద్వి. తిట్టివారునుదానఁదిరితీపులాడి." హరిశ్చ. ౨, భా.

**తిరిపగాఁడు.** దే. వి. (తిరిపము+కాఁడు.) భిక్షుకుఁడు.

**తిరిపగొట్టు.** దే. విణ. (తిరిపము+గొట్టు.) విరక్తుఁడు కాక భిక్ష మెత్తువాఁడు.

**తిరిపము.** దే. వి. భిక్షము. "క. పరిసెలఁతలెన్నియేనియుఁ, దెరువులధనమునుగడించి తెచ్చుకొనఁగనో, తరళాక్షియొక్కదాసరి, తిరిపపుబాపనికి వలచితిరుగుటతగునే." పర. 3, ఆ.—విణ. భిక్షుకుఁడు. "సీ. కడఁదిరిపంబవైకాంతయునీవునుదేశంబులందెల్లఁదిరిగితిరిగి." కవిక. ౫, ఆ. (వ్యుత్పత్తియందు మువర్ణలోపము. "ఎ, గీ. తిరిపజోగిఁదగునెదేవుఁడనఁగ." వీర. ౧, ఆ. మొ.)

**తిరిపరి.** దే. విణ. (తిరిపము+అరి.) తిరిపగాఁడు. "క. ఇదిధర్మంబకులీనుల, కిదివిధియాతాపితృప్రహీనులకహహా, యిదికట్టడతిరిపరులకు, నెదిరిందమనెఱుఁగకునికికేలామాటల్." కాశీ. ౭, ఆ.

**తిరియు.** దే. స. క్రి. భిక్ష మెత్తు, భిక్షించు. "బంధులరాజుదేవులంజదిరియుచుదిరింక." సం. "పాలి

పుత్రాంతుశోచామిగాంధారీంపితరంచతే, భిక్షు కావిచరిష్యే తేశోచంతావృథివీమిమామ్." భా ర. సౌ. ౧, ఆ.

తిరిపడు. ద్వ. అ. క్రి. (తిరి+పడు.) కలఁతపడు.

తిరిపెట్టు. దే. స. క్రి. (తిరి+పెట్టు.) కలఁతపఱుచు. "ఎవటతిరిపెట్టక." భార. స్త్రీ. ౨, ఆ.

తిరీటము. సం. వి. అ. న. కిరీటము. పుం. లొద్దుగు?.

తిరు. దే. విశే. శ్రీప్రదము. (తిరునామము, తిరుమేను. మొ.)

తిరుఁడు. వై. విశే. స్థిరుఁడు.

తిరుకాపు. దే. వి. భగవంతునియొక్క అలంకారము. "వ. రంగనాయకునిసమారాధకులుతదారాధనంబునకువచ్చి తిరుకాపులువుచ్చిక్రమంబునంబంచ పాత్రవిమర్శనంబుసేయుచు." పర. 3, ఆ.

తిరుకొలను. దే. వి. పుష్కరిణి. "క. తిరుకొలనునూయిలోఁటయుఁ, జెఱువుమడువు." హంస. ౪, ఆ.

తిరుగఁబడు. ద్వ. అ. క్రి. (తిరుగక+పడు.) 1. ఎదిరించు; (నాతో వాఁడు తిరుగఁబడ్డాఁడు.) 2. తిరుగు; "క. కడుసంభ్రమమునఁదిరుగం, బడియెదరదియేమి తెలుఁగుపండువు." హరి. పూ. ౭, ఆ.—3. మరలు; "గీ. వానివినియునువపుడురాధాసుతుండు, తిరుగఁబడనిమనంబుతోఁధీరవృత్తిఁ, దల్లికిట్లను." భార. ఉద్యో. ౪, ఆ.—4. విపరీతమగు. "క. ఏవిధిసుఖదముదుఃఖద, మైపెసదుఃఖదముసుఖదమైతిరుగఁబడుక." లక్ష్మీ. ౪, ఆ. (స్వార్థమున పడు.)

తిరుగఁబోఁత. దే. వి. తిరుగఁబోయుట, తాలింపు. "క. తొంబొగపుఁగూరవగతిరు, గంబోఁతల." రా. వి. 3, ఆ.

తిరుగఁబోయు. దే. అ. క్రి. (తిరుగక+పోయు.) తాలించు.

తిరుగడ. ద్వ. వి. (తిరుగు+గడ.) మఱపెట్టినగొట్టము.

తిరుగలి. దే. వి. (తిరుగు+కలు.) 1. పిండిమొదలైనవి విసరెడుశిలాయంత్రము, ఘరట్టము; 2. (తిరుగు+కలి.) భ్రమము. "క. అనిగద్గదకంఠంబున, వినిపించినఁ గుంభి తాను వికవికనగుచుక, గనుతిరుగలిగాకాసతి, మనపెట్టినచోటలేక మతి యొందరిగక." భో. ౫, ఆ. (ఈ యర్థమునందు 'కలి' భావార్థమునందువచ్చిన ప్రత్యయము.)

తిరుగాడు. దే. అ. క్రి. (తిరుగు+ఆడు.) తిరుగు, సంచరించు. "అనిమిషరాట్సుతుండుతిరుగాడెడుసేనలతోడ." శై. ౫, ఆ. (రూ. తిరుగులాడు.)

తిరుగు. దే. అ. క్రి. 1. సంచరించు; "సీ. శివగణసమితిలోసేనానిశౌర్యంబుమెచ్చకతిరిగెడుమేటులార." ఉ, హరి. ౬, ఆ.—2. పరిభ్రమించు; "నేలదిర్దిరందిరిగె." భార. అర. ౪, ఆ.—3. వెనుకకుమరలు; "క. సుతులుసమరమునఁదిరుగక, వ్రతులైసద్గతికిఁజనినమేలిమియస్మ, ద్వ్రతిఁదలఁచివరముత్కృత్రచ, రితమనియప్పనికివగవఁబ్రీతియకలుగుక." భార. ఆశ్ర. ౧, ఆ.—4. మరలవచ్చు. "వ. తృతీయంబైనద్వాపరయుగంబు తిరుగుసమయంబున." భాగ. ౧, స్కం. (వానికి వయసు తిరిగినది.)—స. క్రి. పరివేష్టించు. "క. చుట్టంబులుఁజెలులుందనుఁ, జుట్టుఁదిరిగియుండ." నై. ౨, ఆ.—వి. తిరుగుట. "క. తలనుచ్చుట్టులుదిరిగినఁ, దలపోయఁగనూరిలోనిదయకడియన్న, ట్లిలసే తిరుగులఁతిరిగినఁ, గలుగదుగతివిష్ణుసేవఁగానించుకయుక." పాండు. ౪, ఆ.

తిరుగుఁబోతు. దే. విశే. (తిరుగు+పోతు.) తిరుగునట్టి స్వభావముగలవాఁడు, తిరుగునట్టి స్వభావముగలది.

తిరుగుడు. దే. వి. 1. తిరుగుట, భ్రమణము; 2. మాఱుపాటు; (అందులో ఒక తిరుగుడు ఉన్నది చూచినారా.) 3. మఱ; 4. చక్రము. "ఎ, గీ. సరకుసేయదుతిరుగుళ్లఁజోమపిఱుఁదు." హన. ౪, ఆ.

తిరుగుడుచీల. దే. వి. తిరుగుడునొక్కులుగలచీల, మఱ.

తిరుగుడుత్రాడు. దే. వి. పశులనుబట్టెడుసాధనవిశేషము. "ద్వి. తిరుగుడుత్రాళ్లనుదెలుఁగొప్పఁగట్టి." పల. 3, భా.

తిరుగుడునొక్కు. దే. వి. తిరుగుడు, మఱ.

తిరుగుడుపడు. ద్వ. అ. క్రి. పరిభ్రమించు.

తిరుగుడుపాటు. ద్వ. వి. తిరుగుడుపడుట. "నాకముబెగ్గలంబునక దిరుగుడుపాటుఁజెప్పిన." నిర్వ. 3, ఆ.

తిరుగుడుబిల్ల. దే. వి. స్త్రీల శిరోభూషణవిశేషము.

తిరుగుదల. దే. వి. మరలుట, నివర్తనము.

తిరుగుమొగము. ద్వ. విశే. 1. అభిముఖము; (వ్యాధి కొంచెము తిరుగుమొగముగానున్నది.) 2. విముఖము. "గీ. ఉచితనేపథ్యయుతలయ్యుసురగసతులు, నిఖిలనిజమౌళిమణికళ్ళుతివిఖిల్న లక్ష్మిసభిక

సంకేతములకు కేలరిగియరిగి, తిరుగుమొగమైనచి క్కులతెరువులివిర." పాండు. ౨, ఆ.

**తిరుగువాఱు.** దే. స. క్రి. (తిరుగు+పాఱు.) పరివేష్టించు. "ఎ. గీ. సరభసంబున నాపుట్టఁదిరుగువాఱె." పంచ. నా. ౧, ఆ.

**తిరుచిన్నము.** ద్వి. వి. సన్నగాళె.

**తిరుచూర్ణము** మి. వి. పసుపుబియ్యముచేర్చి చేసి వైష్ణవులు నొసటనుంచుకొనెడుపొడి. "ధవళోర్ధ్వపుండ్రములయందుఁగడుఁ దిరుచూర్ణమొప్ప." పర. 3, ఆ.

**తిరుచు.** దే. స. క్రి. తిరియుయొక్క రూపాంతరము.

**తిరునాళ్ల.** దే. వి. దేవోత్సవము. "తెప్పతిరునాళ్లరా." ఆము. ౨, ఆ.

**తిరునీఱు.** దే. వి. శైవులు నొసట నుంచుకొనెడు గోమయపిండభస్మము.

**తిరుపగూడ.** దే. వి. (తిరు+గూడ.) వైష్ణవులు తిరుమణి పెట్టె మొదలైనవి యుంచి చేఁకను దగిలించుకొనెడు తాటాకులబుట్ట. "ఒకచంకఁదిరుపగూడ." పాంచా. ౧, ఆ. (ఇది తామరపాకువంటిది.)

**తిరుపతి.** దే. వి. విష్ణుక్షేత్రము. "గీ. వినుముతల్లినూటయొనిమిదితిరుపతు,లందు సెన్న వేంకటాచలంబు, రంగధామమునుగరంబుసన్నుతిఁగాంచు, గ్రహములందుశశియురవియుఁబోలె." పర. ౪, ఆ.

**తిరుపు.** దే. వి. తిరుగుట. (చూ. తిరుపులుఁగట్టు. ఇది విఱుపువంటిది.)

**తిరుపులుఁగట్టు.** దే. అ. క్రి. (తిరుపులు+కట్టు.) వ్యాపించు. "చ. మరువిరిదూపురూపుపసమూపునొయారపుచూపునూరెలన్, దిరుపులుగట్టె." పంచ. వేం. ౪, ఆ.

**తిరుమజ్జనము.** మి. వి. భగవంతుని యభిషేకము. "తనుఁబ్రత్యహముఁ దిరుమజ్జనంపుసేవనలరఁజేయుంవాని." పర. 3, ఆ.

**తిరుమణి.** ద్వి. వి. (తిరు+మన్ను.) వైష్ణవులు నొసటనుంచుకొనెడుధవళమృత్తిక. "క. నడుముక్కుపొవఁదీర్చిన, కడుఁదోరపుఁదిరుమణియును గావివలువుఁజొ, ప్పడఁగంఠంబునఁదిరుమణి, వడములుధరియించివైష్ణవపువేషముతోన్." పర. 3, ఆ.

**తిరుమణిపడము.** మి. వి. తామరపూసలదండ. (చూ. తిరుమణి.)

**తిరుమన్ను.** ద్వి. వి. తిరుమణి. "ఎ. గీ. పట్టెతిరుమన్ను బెదరుతెంపుప్రుట్టుచూపు." ఆము. ౫, ఆ.

**తిరుమల.** ద్వి. వి. వేంకటాచలము. "క. ధరఁగలతిరుపతులొకకడ, వరుసకొనిముకుందమూర్తివర్గమునతఁడ, చ్చెరువుగనుతించెనెడనెడఁ, దిరుమలకేవరనుదిరిగితిరిగిపొగడుచున్." పర. ౨, ఆ.

**తిరుమాళిగ.** ద్వి. వి. (వైష్ణవపరిభాషయందు) గృహము. "క. జననాయకుఁడంతటనతి, వినయతఁదిరుమాళిగలకు వేంచేసెదరో, యనికేల్మోగుచు వైష్ణవ, జనులన్ వీక్షించి లిపిచనియొజలకంబునకున్." పర. 3, ఆ.

**తిరుముడి.** దే. వి. వైష్ణవుఁడు. "గీ. అట్లుపెండ్లియాడియాత్మపురికి నేగి, మామకిచ్చినట్టిమాటపట్టు, తప్పుకనుదినంబుఁ దనిపె వైష్ణవసహ, స్రమునభీష్టభోజనములచేత. క. అనుదినమువేయుతిరుముడి. కినమృష్టాన్నముల నారగింపులిడకయా, యనఘుఁజయింపఁడుమున్నుగఁ, దనవనితయుఁ దానుసెట్టితాత్పర్యంబో." పర. ౪, ఆ.

**తిరువడికోల.** దే. వి. దాసరినాని దీపస్తంభము. "... తోరంపుఁదిరువడికోలల రంధ్రగోళంబుల." ఆము. ౪, ఆ.

**తిరువరంగములు.** దే. వి. బ. శాలిధాన్యవిశేషము.

**తిరువారాధనము.** మి. వి. (తిరు+ఆరాధనము.) (వైష్ణవపరిభాషయందు) దేవతార్చన. (చూ. తాళింపు.)

**తిరువు.** దే. అ. క్రి. స. క్రి. వి. తిరుగుయొక్క రూపాంతరము.

**తిరోధానము.** సం. వి. అ. న. మఱుఁగుపాటు.

**తిరోభావము.** సం. వి. అ. పుం. మఱుఁగుపడుట.

**తిరోహితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) మఱుఁగుపడినవాఁడు.

**తిర్గు.** దే. అ. క్రి. స. క్రి. వి. తిరుగుయొక్క రూపాంతరము. (చూ. దిరదిర.)

**తిర్యక్కు.** సం. విశే. (చ్. ఈ. చ్.) అడ్డముగాఁబోవునది.

**తిటికి.** దే. వి. మత్స్యవిశేషము.

**తిట్టి.** దే. వి. బుట్టవలె తాటియాకులతో నల్లిన మత్స్యగ్రహణ సాధనవిశేషము. (చూ. అడ్డకోడము.)

**తిట్టిగొట్టు.** దే. విశే. (చూ.) తిరిపగొట్టు.

**తిలకము.** సం. వి. అ. న. 1. సౌవర్చలమనెడియుప్పు; 2. కడుపులో కుడిప్రక్కనుండెడు ఎఱ్ఱని మాంసము. నీరుతిత్తి. (అని కొందఱు.) పుం. న. బొట్టు. పుం. 1. నల్లగుల్ల; 2. పుట్టుమచ్చ; 3. బొట్టుగుఱి; (దీనికి దోహదక్రియ వీక్షణము.) 4. పొట్లకి. విశే. శ్రేష్ఠము.

తిలకాలకము. సం. వి. అ. పుం. పుట్టుమచ్చ.
తిలకించు. దే. అ. క్రి. 1. ప్రకాశించు; "చ. సురుచిరపానపాత్రమున సుందరియొక్కతి కేలనిండుచం, దురుఁడు ప్రకంపితాంగకముతోఁ దిలకించెఁ దదాననాంబుజ, స్ఫురితవికాసవైభవము సొంపు లడంకువ మ్రుచ్చిలింపఁ జె, చ్చెరఁజను దెంచిపట్టువడి చేడ్పడి భీతివడంకుచాడ్పునన్." లక్ష్మీ. 3, ఆ.—2. ప్రసన్నతనొందు. "క. అత్తలకు మ్రొక్కి తక్కటి, క్రొత్తడులందఱకుఁ బ్రియముకొన లునిగుడఁగా, నత్తఱిఁ దిలకించె." హరి. ఉ. ౪, ఆ. "తిలకించిచూడదు తిలకతరువు." విక్ర. ౧, ఆ.—స. క్రి. చూచు. "క. పొసఁగన్, బలుకఁగ నేర్తుగదా యని, చిలుకం దిలకించి ప్రియము చిలుకం బలికెన్." విక్ర. ౭, ఆ. (ఈ యర్థము ఆదికవుల ప్రయోగములందు కానఁబడదు.)
తిలఘాతుకుఁడు. సం. వి. అ. పుం. గాండ్లవాఁడు.
తిలతండులన్యాయము. సం. వి. అ. పుం. నువ్వులును బియ్యమును గలసినవిధము.
తిలతండులము. సం. వి. అ. న. ఆలింగనవిశేషము.
తిలపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. న్. పుం. రక్తచందనము.
తిలపేజము. సం. వి. అ. పుం. పొల్లనువ్వులు, (రూ. తిలపింజము.)
తిలయంత్రము. సం. వి. అ. న. గానుఁగ.
తిలలు. సం. వి. అ. పుం. బ. నువ్వులు. (ఇది సంస్కృతమున నిత్యబహువచనాంతము కాదు.)
తిలిత్సము. సం. వి. అ. పుం. కొండచిలువ, (రూ. తిలిత్సము.)
తిల్యము. సం. విశే. (అ. ఆ. అ.) తిలలు పండునది. (పొలము.)
తిల్వము. సం. వి. అ. పుం. లొద్దుగు, లోధ్రము?.
తివ. వై. స. తిగయొక్క రూపాంతరము. "క. తివిరకరవాలు సేకొని, అవలవలె సఁగంగనత్తెలవపైఁ జనుచోఁ, దివజడలరేయి ద్రిమ్మర, పువుఁబోఁడి యొకర్తు నెయ్యమున నడ్డంబై." అచ్చ. సుం, కాం.
తివాసి. వై. వి. మేలైన చిత్రాసనము. "చ. విరితొగచందువాతెగల వేడుకయానడియంకణంబులోఁ, బఱచిన రత్నకంబళిని బాగగు నూరెపుటంపుగద్దియన్, వలులు మెఱుంగు బంగరపువన్నె జగాబురుపా తివాసిపై, ధరణిజతోఁ వసించెఁ బతితళ్కుతలాడలఁ జేతులూనుచున్." ఉ, రా. ౭, ఆ. (రూ. తివాసీ.) ("రగడ. గొప్పలగుచౌకట్లకని చేకొంటిమి వెకట్టాణిపూసలు, చెప్పఁజూపఁగరాదు మక్కమున సీమవీగు జరీతివాసులు." శుక. ౧, ఆ. ఈ ప్రయోగముచేత అకారాంతముగాను నేర్పడుచున్నది. "నగాసు తివాసుపై." ఈ ప్రయోగముచేత ఉకారాంతముగా నేర్పడుచున్నది.)
తివియు. దే. స. క్రి. తిగియుయొక్క రూపాంతరము. (చూ. అలవి.)
తివుచు. దే. స. క్రి. తిగుచుయొక్క రూపాంతరము. "క. రవిస్ఫుజియించు నుపర్గము, రవియమగుడఁగిరణతతులరసమంతయుఁ దాఁ దివుచును." భార. శాం. ౬. ఆ.
తివుట. దే. వి. కోరిక. "ఊటలట చెయ్యులం దివుటలూరఁగ." హరి. ఉ. ౭, ఆ.
తివురు. యు. దే. స. క్రి. కోరు. "గీ. ఏమికారణమున నింద్రుఖాండవము గ్ని, దేవుఁడట్లు కాల్పఁదివిరె." సం. "కిమర్థం భగవానగ్నిః ఖాండవం దగ్ధుమిచ్ఛతి." భార. ఆది. ౮, ఆ.—వై. అ. క్రి. 1. త్వరపడు*; "క. తివిరి యభోజ్యంబగుమా, నవమాంసముతోడ భోజనము పెట్టినవాఁడవు." భార. ఆది. ౭, ఆ.—2. కుతూహలపడు*; "క. తివిరి సుతజన్మమెన్నం, డవునో కో దేవరునికరుణ ననుచునఁ నపప, ల్లవకోమలాంగియంబిక, ధవళేక్షణ విమలశయనతలమున నున్నన్." భార. ఆది. ౪, ఆ.—౩. యత్నించు*; "సీ. తివిరి సరస్వతీతీరంబునందు నిశ్చింతుఁడై తపము సేయుచున్న, యా దధీచికడకు నరిగి వేఁడుండు." భార. అర. 3, ఆ.—4. మ్రోఁగు*; "దేవదుందుభివ్రాతంబు దివిరె." భార. ఉద్యో. ౪, ఆ.—౫. కోపపడు*. "తివిరి తీక్ష్ణక్రకులభూతనివహము లకు." హరిశ్చ. 3, ఆ. (కడపటి యర్థమునకు ఆ ప్రయోగమొక్కటే కానఁబడుచున్నది.)
తిష్యఫల. సం. వి. ఆ. స్త్రీ. ఉసిరిక?.
తిష్యము. సం. వి. అ. పుం. 1. పుష్యనక్షత్రము; 2. పుష్యమాసము; ౩. కలియుగము.

తీ.

తీ. వై. స. వృత్తియందు తిగశబ్దమునకగు ఆదేశము. (తీవంచ.)
తీంట్రము. దే. వి. తీఁట, దురద, కండూయ.
తీండ్ర. దే. వి. 1. ప్రకాశము; (చూ. తీండ్రించు.)—2. వేఁడిమి; "గీ. అతివపూర్ణేందుభీతిఁ దదక్షన్

ల, దండియుతదందునినుమడితీండ్రఁదోఁప, మింటిపైనుంటకాదనియింటిపైకిఁ, దెచ్చుకొంటినటంచుఁజెలాతిచ్చవెడలు." ఆము. ౫, ఆ.—3. తేజము; "ఎ, గీ. అరుణకిరణసహస్రాభమభ్రగంబు, నగువిమానంబుపైనెక్కి నిగమశర్మ, తీండ్రఁబుండ్రేక్షుకోదండుతండ్రిఁబోలి, పరమధామంబునకుఁబోవుపథమునందు." పాండు. 3, ఆ.—4. చుఱుకు, చొరవ. "శా. మదితీండ్రల్గల్గినవారికేకరణినేనిఁక విద్యరాకుండునే." స్వా. ౫, ఆ. "సీ. సురలుబంతులుసాఁగిసుధమథస్ఫుహాఁద్రావుతీండ్రఁదేఁటులుపూవుఁదేనెలాన." పాండు. ౨, ఆ.

తీండ్రము. దే. విణ. తీక్ష్ణము, ప్రచండము. "క. తీండ్రమగురోషమునమీ, తండ్రినిమిత్తమునఁజక్రిదారుణమూర్తిన్, దండ్రమువిడువఁదుమెల్లనఁ, దండ్రీశీతలునిఁజేసిదయసేయఁగదే." భాగ. ౭, స్కం.

తీండ్రించు. దే. అ. క్రి. 1. ప్రకాశించు; "వ. తీండ్రించుశశిమండలంబునవెడలు శిశిరకిరణప్రణాళికామిళదమృతరసగ్రాసంబునంజేసి." స్వా. ౬, ఆ.—2. జ్వలించు. "సీ. చంద్రనిప్పులఁబోలెఁదీండ్రించుకనుమించు లెసఁగనొండొంటిపైనెక్కఁబాఱు." స్వా. ౪, ఆ. (తీఁడిరించుయొక్క రూపాంతరము.)

తీఁగ. వై. వి. 1. లత; "ఎ, గీ. కన్నెక్రొక్కాఱుమెఱుఁగుఁదీఁగయునుబోలె." వై. 3, ఆ.—2. స్త్రీలుమెడనుధరించెడుబంగారుపట్టెడ*; "ఉ. శోణితలేంద్రుఁజూడ నొకకొమ్మవడిం బఱతెంచెనుల్లస, ద్వేణిభరంబుతోమొగవుతీఁగవలగ్నమునందమర్చియొ, ఘ్రాణముతీఁగఁగానిడి మెడన్ వలగొనదిచాలమిన్గొనల్, పాణులనుండఁ గొనుమతిబాగుగఁగానుకపట్టుకైవడిన్." కళా. ౭, ఆ. — 3. మొలనూలు*. "ఉ. కట్టెరిసన్నపుందనువుఁగావిఁగటీతటిమేటితీఁగపై, నొట్టిరి." విక్ర. ౪, ఆ.—4. వీణమొదలగువానితంతి*.

తీఁగఁబోఁడి. ద్వ. వి. (తీఁగ+పోఁడి.) 1. తీఁగవలె మనోజ్ఞాంగాలగు ఆఁడుది; 2. ఆఁడుది. (రూ. తీవఁబోఁడి.) (చూ. అలరుఁబోఁడి.)

తీఁగకామగు. ద్వ. వి. మర్కటి?.

తీఁగగ[illegible]. ద్వ. వి. నిడుపుగతీర, గండాలి?.

తీఁగజోలి. వై. వి. ఒకదినుసుజోలి?.

తీఁగతుమడి. ద్వ. వి. దీర్ఘమూల?.

తీఁగపాల. ద్వ. వి. క్షీరావి?.

తీఁగబచ్చలి. ద్వ. వి. కలంబి?.

తీఁగమల్లియ. వై. వి. 1. మల్లికావిశేషము; 2. బ. ధాన్యవిశేషము. (చూ. కుసుమ.)

తీఁగమల్లె. వై. వి. తీఁగమల్లియయొక్క రూపాంతరము. (ధాన్యవిశేషమునకు.—"సీ. బలుతీఁగమల్లెలుపార్జించితిమిచాలఁ గుసుమముల్ చులుకగాఁగూర్పలేమె." కవి. ౧, ఆ.)

తీఁగమెఱుఁగు. ద్వ. వి. 1. ఉఱుములేని మెఱుపు; 2. ప్రొద్దుతిరుగుడుచెట్టు.

తీఁగమోడి. ద్వ. వి. వ్రాఁతపని.

తీఁగయిల్లు. ద్వ. వి. (తీఁగ+ఇల్లు.) పొదరిల్లు, నికుంజము.

తీఁగయెలుఁగు. ద్వ. వి. (తీఁగ+ఎలుఁగు.) హీనస్వరము. "ద్వి. అనితీఁగయెలుఁగున నాకోమలాంగి తన నాథుఁజేర్పోనితా నేడ్చుకొనుచు." పల్. ౪, భా.

తీఁగలువాఱు. ద్వ. అ. క్రి. (తీఁగలు+పాఱు.) వ్యాపించు. "ఉ. తీఁగలువాఱుపార్శ్వగతదృష్టిఁదగన్గలయంగఁజూచినన్." కవిక. ౬, ఆ.

తీఁగవిలుకాఁడు. ద్వ. వి. మన్మథుఁడు. (ఇట్లు తీఁగవిలుతుఁడు.)

తీఁగసరులు. వై. వి. బ. ధాన్యవిశేషము. (రూ. తీవసరులు. "ఎ, గీ. తెల్లనల్లచెన్నంగులుఁదీవసరులు." హంస. ౪, ఆ.)

తీఁగసాఁగు. ద్వ. వి. (తీఁగ+చాఁగు.) వర్ధిల్లు. "తీఁగసాఁగనవ్వు." (ఇక్కడ తీఁగసాఁగన్ అనఁగా దీర్ఘముగాననుట.) వి, పు. ౩, ఆ.

తీఁగియ. వై. వి. 1. తీఁగయొక్క రూపాంతరము. (లతకు.—"ఎ, గీ. అలరుఁదీఁగియతోనుద్దియయినయట్టి, కొమ్మనెమ్మేనువలపులుగొలుపుటరుదె." కవి. ౧, ఆ.) (చూ. తీఁగ.)

తీఁగె. వై. వి. తీఁగియయొక్క రూపాంతరము. (లతకు.—"చ. కలువలపేరుపేరుకొనఁగాఁగుసుమదమ్ములు మన్మథాంబకం, బులుగణుతింపఁగాఁగమలముల్ కమలంబులపుట్టువూర్వముల్, తెలియఁగఁబంకజాతములు తేటికనుంగొనఁగా మెఱుంగుఁదీఁ, గెలుచపలమ్ములిన్నియుఁ సఖీమణికన్నులఁబోలసేర్చునే." అని. ౫, ఆ.)

తీఁట. దే. వి. 1. ఒకవిధమైనగజ్జి; 2. దురద. "చేతుల తీఁటవోవమైతీఁటలువుచ్చి." రా, యు, కాం.

తీఁటకసింద. దే. వి. తీఁటకసివెందరయొక్క రూపాంతరము.

తీఁటకసివెంద. దే. వి. రేగడిదూల, కచ్చురీ.

తీఁటకోవెల. దే. వి.——వై.——

తీఁడిరించు. దే. అ. క్రి. ప్రకాశించు. "ఎ, గీ. త్రిభువనస్థానపతియైనదివసకరుని, ప్రాక్ప్రతీహారపాలుండుప్రాచినోసలి, ఘుసృణలీలాలలామంబు దిసరుహొవ్వు. తేరిసారథియొత్తునైతీఁడిరించె." కాశీ. 3. అ. (చూ. తీంఁడ్రించు.)

తీఁపురము. దే. వి. అగడము. "క. దాఁపురముతేకనీ క్రియఁ, గాఁపురములు సేయుచున్న గరితలలోనీ, తీఁపురములువాక్రుత్తురె, కాఁపులనీవంటివారిఁ గానవెతులువా." పంచ. వేం. ౪, అ.

తీక్ష్ణకంటక. సం. వి. ఆ. స్త్రీ. కంచారీ.

తీక్ష్ణగంధ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఓమము; 2. నల్లావాలు. అ. పుం. ము. 1. మునగ్; 2. పెద్దతుమ్మి; 3. నెరవెందీ.

తీక్ష్ణతుండము. సం. వి. అ. పుం. మశకము, దోమ.

తీక్ష్ణము. సం. వి. అ. న. 1. వేఁడిమి; 2. విషము; 3. పోరు; 4. ఇందుప్పు; 5. ఇనుము. పుం. గాజొప్పు. విణ. 1. చేఱుకైనది; 2. వాఁడియైనది.

తీచు. దే. స. క్రి. వాఁడిచేయు. "గీ. బరుసుకరసానఁ దీడినపందిపోట్లు, భూరి భుజపీఠములయందుఁ బొందుపఱచి." పంచ. వేం. ౨, అ.

తీతువు. వై. వి. తిత్తిరిపక్షి.

తేఁతేరగా. హిం. క్రి. విణ. తారుమారుగా, అరుమూడు.

తీనియ. దే. వి. తిన్నియయొక్క మొదటిరూపము. "సీ. పూనిపాఁపజగంబు బోరియ సొచ్చి వెడందతీనియ యలవర్చిదానియందు." అచ్చ. యు, కాం.

తీని. దే. వి. తీనియయొక్క రూపాంతరము.

తీపారు. దే. అ. క్రి. (తీపు+అరు.) మనోజ్ఞమగు. "తెలినవ్వుల్ వెలిదమ్మినెమ్మొగములన్ దీపార." హరి. పూ. 2, అ.

తీపి. దే. వి. 1. ఒకరసము, మాధుర్యము; (చూ. రసము.) 2. ఇచ్ఛ. "క. ముదియనివిరెండుచిక్కను, బ్రదికెడి తీపియును విషయ పక్షస్పృహయుక్." భాగ. ౯, స్కం.—విణ. మధురము.

తీపు. దే. వి. 1. మాధుర్యము; 2. యాతన. "సీ. తెల్లగ్రుడ్డులు తేలగిల్లితీపులువుట్టి దోషముల్ పొందుగఁదొట్టగిల్ల." కవిక. ౫, అ.—విణ. మధురము. (చూ. తీపి.)

తీపుఁద్రాడు. దే. వి. (తీపు+త్రాడు.) వేఁటాడుటకుఁదగినసాధనవిశేషము. "వ. ఉరులునురిగోలలుబోనులుఁజిక్కాంబులుఁజిగురుఁగండెలుఁదీపుఁద్రాళ్లునొడిత్రాళ్లుఁదలముళ్లును గొని." కాశీ. 3, అ.

తీయ. దే. విణ తియ్యయొక్క మొదటిరూపము.

తీయన. దే. వి. తియ్యనయొక్క మొదటిరూపము. "ఉ. అయనురాచలంబుధనువై విలసిల్లఁగ విష్ణువమ్ముగా, నేయువిధంబులంబరిఢవిల్లెడుశింజినిఁ గూర్చినట్టిశూ, లాయుధునొక్కమాత్రమున నంగముప్రయ్యఁగ మోఁదిమించితొఁ, దీయనివింట నే వెనుకతీయనిబీరమునన్ మనోభవా." చిత్ర భారతము. (చూ. తియ్యన.)

తీయము. దే. వి. తియ్యముయొక్క మొదటిరూపము. (ప్రియమునకు.—"క. వీయమువారికినిట్లుద, వీయముగానుండి వచ్చువిపులశ్రమముల్, దీయముదంబొనరిచికడుఁ, దీయముగనుపింపఁగాయుధిష్ఠిరుఁడనియెన్." విజ. 3, అ.)

తీయు. దే. అ. క్రి. 1. తొలఁగు; (చూ. తీయము.) 2. కృశించు; (నొప్పిచేత వాని దేహము మిక్కిలి తీసినది.) 3. తగ్గు. (చెఱువులో నీళ్లు తీసినవి.) స. క్రి. 1. ఈడ్చు; "సీ. కదిసితో మునిగాలుగఱచి వెంబడిఁదీయుఁదీసితోడ నెలేవఁ దెరువుకట్టు." చంద్రా. ౨, అ.—2. కొను; (వానివద్ద వీఁడు లంచము తీసినాఁడు.) 3. వెలయిచ్చికొను; (ఈ గుఱ్ఱమును వీఁడు ఇన్నూఱురూపాయలకు తీసినాఁడు.) (ఇది తెనుఁగుదేశమునందీయర్థమున వాడఁబడదు.) 4. వేయు. "క. గానిలియప్పులవారలు, తీసినకొట్టులునుగల వె." హరిశ్చ. ౪, అ.

తీరము. సం. వి. అ. న. 1. దరి; 2. తగరము.

తీరు. దే. అ. క్రి. 1. చేక్కఁబడు; "ఉ. తీరినతత్తడిన్ జవగతిన్ బుటముల్ దుమికించుచాడ్పునన్, దీరనితత్తడిన్ జవగతిన్ బుటముల్ దుమికించువాగెఁ బెం, పారబిగించిపైకుబికియుబ్బరమందివయాళి వేళన, య్యారెబలంబుధాటిబలియాలివయంచు వజీరులెంచఁగన్." చంద్రా. ౨, అ. ("ద్వి. ఓరినీగరోవ్వేక్కులుబ్బును మదముఁ, దీరనేయనుడుగ ద్దించివాఁడపుడు." (ఇందు నశించు అను నర్థమున లఘురేఫము కానఁబడుచున్నది. ఈ గ్రంథము

నందు ప్రక్షిప్తవాక్యములు అనేకములుండుటవలన ఇది యీ కవిప్రయుక్తమనియుఁ సాధువనియుఁ నమ్ముటకు అవకాశములేదు.) రా. ఆర, కాం.) 2. శక్యమగు. "శా. ఆ, నాకేశప్రియనందనుం జెనకి మాన ప్రాణముల్ గావఁగా, నీకుందీరునె." నిర్వ. ౭, ఆ.—వి. 1. చక్కన; 2. విధము.

తీరుకు. దే. వి. నాట్యగతివిశేషము.

తీరుచే. దే. ప్రే. 1. తీర్పుచేయు; 2. చక్కఁబఱచే, దిద్దు; "తీరిచినట్టులున్న వికదేకనుబొమ్మలు." విజ. ౧, ఆ.—3. నృత్తగీతవాద్యములుసమముకావించే. (చూ. తీర్చు.)

తీరుపరి. దే. వి. (తీరుపు+అరి.) 1. న్యాయాధిపతి; 2. చారుఁడు. విణ. 1. అధికారి; 2. కార్యనిర్వాహకుఁడు. (రూ. తీర్పరి. చారునకు.—"పంచినఁదీర్పరుల్ సచివుపాలికి నేగికృతప్రణాములై." జై. ౮, ఆ.—అధికారికి.—"ఎ, గీ. తత్పురంబుతీర్పరిఁ దనదుమర్నాటిపయన, మునకుఁదోడడిగె." పర. ౫. ఆ.—కార్యనిర్వాహకునకు.—"సీ. రాజాగ్రసేనుఁడై రాజిల్లఁదాను దీర్పరితనంబెంతయుఁ బ్రభుతతోడ, నడపువాఁడయ్యె." హరి. ఉ. ౨, ఆ.)

తీరుపు. దే. వి. 1. న్యాయము; 2. చేక్కఁబాటు; 3. నృత్తగీతవాద్యములుసమమగుట. "సీ. అభినయంబులకోపులరుదైనతీరుపుల్ వెలయఁగాఁబదచాలి విధమెుకర్తు." ఉ, రా. ౬, ఆ. (రూ. తీర్పు. చక్కఁబాటునకు.—"చ. ఇత్తెఱఁగొకచాలువానిబలుతీర్పునఁగాకపొసంగనేర్చునే." భార. ఉద్యో. ౪, ఆ.)

తీరువ. దే. వి. కాఁపులు ధాన్యములోనగునవి పంటపెట్టి తీసికొనిపోవునపుడు నేలయొక్క స్వాతంత్ర్యమునుబట్టి రాజునకు చేరవలసిన భాగమున కిచ్చెడు ధనము.

తీర్చు. దే. ప్రే. (తీరుచేయొక్క రూపాంతరము.) 1. తీర్పుచేయు; 2. చేక్కఁబఱచే, దిద్దు. "తెవులుగొంటులనైనఁదీర్చి." భార. విరా. ౧, ఆ.—3. నృత్తగీతవాద్యములు సమముకావించే. "సీ. కీవిఁదాళములుగ్గడించుచోఁదీర్చుచోవింతగాఁజేరణివిధమెుకర్తు." ఉ, రా. ౬, ఆ.—(తీఱుచేయొక్క రూపాంతరము.) 1. నాశముచేయు; "తీర్పవలయువానినెల్లఁదీర్చు." భార. ఉద్యో. ౨, ఆ.—2. పాపు. "ఎ, గీ. నీవునునాపద, కోర్చిభంగపాటుతీర్చికొనుము." భార. విరా. ౧, ఆ.

తీర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) దాఁటఁబడినది.

తీర్థమాట. మి. వి. తీర్థమాడుట, స్నానము. "చ. శైలకకాశికానగరి దేవతరంగిణిఁ దీర్థమాటకైయరుగుము." కాశీ. ౫, ఆ.

తీర్థమాడు. మి. అ. క్రి. (తీర్థము+ఆడు.) స్నానముచేయు. (తీర్థములాడు అనియు. "గోదావరిందీర్థములాడి." భీ. ౪, ఆ.) (ప్రే. తీర్థమార్చు. "ఉ. సంభృతభక్తిభావనఁద్రిసంధ్యమునందును నాత్మరంగిణుల్, శంభుఁద్రివిష్టపేశ్వరునిఁజంద్రకళాధరుఁదీర్థమార్చువి, స్రంభమునన్ గరాంబురుహసంగతమంగళశాతకుంభకుం, భోంభితగంధసారఘనసారసుగంధినవాంబుధారలన్." కాశీ. ౬, ఆ.)

తీర్థము. సం. వి. అ. న. 1. మహర్షులు స్నానముచేసిన పుణ్యోదకము; 2. పుణ్యనది; 3. రేవు; 4. నూతియొద్ది తొట్టి; 5. పుణ్యక్షేత్రము; 6. యజ్ఞము; 7. శాస్త్రము; 8. ఉపాయము; 9. పాత్రము; 10. స్త్రీరజస్సు; 11. ఉపాధ్యాయుఁడు; 12. మంత్రి.

తీర్థవాసి. సం. విణ. (న్. ఈ. న్.) తీర్థసేవచేయువాఁడు.

తీఱమి. దే. వి. అక్కఱ, పోరామి. "క. వేఱొకతెఱఁగుననోరులకు, మాఱాడకయునికిలెస్స మనుజేంద్రునకున్, దీఱమిగలచోటులఁదా, మీఱకడఁగివచ్చి పెంపుమెయికొనవలయున్." భార. విరా. ౧, ఆ.

తీఱిక. దే. వి. తీఱుబడి, అవకాశము.

తీఱు. దే. అ. క్రి. 1. నశించే; "అల్పకాలంబుననతఁడుఁదీఱె." భార. ఉద్యో. ౪, ఆ;—2. పాయు. "క. ఎదఁబరితాపము, తీఱఁగఁబైవీచెనన్న దీపవనంబుల్." భార. ఆది. ౪, ఆ;—3. అవకాశపడు. (నాకు ఱేపు తీరునుగాని నేఁడు తీఱదు.)—వి. సంధి. "రాజ్యముపాలులేక తీఱునకొడఁబాటుగల్గిననెఱుంగమివెట్టరె." భార. ఉద్యో. 3. ఆ.

తీఱుగడ. దే. వి. 1. ముగియుక; "నేఁడుసంగ్రామమునకుఁ దీఱుగడయగుఁగాకని." భార. భీష్మ. ౨, ఆ.—2. తీఱిక.

తీఱుచే. దే. ప్రే. 1. నశింపఁజేయు; 2. పాపు. (చూ. తీర్చు.)

తీఱుదల. దే. వి. ముగియుక. "ఎ, గీ. మోముమోమునగదియించిముద్దుగొనుట, యదియమోహాంభుధికిఁదీఱుదలయేమొ." ఉ, రా. ౬, ఆ.

తీఱుపడు. ద్వ. అ. క్రి. నశించు. "గీ. దేశకాలాంతరంబులఁదీఱుపడని, బుద్ధిసౌందర్య మెక్కుడగు భక్తియు గాఁగ." పంచ. వేం. ౧, ఆ. (ఈ పదప్రయోగ మీ గ్రంథమునందే కానఁబడుచున్నది.)

తీఱుపాటు. ద్వ. వి. తీఱిక, అవకాశము.

తీఱుపు. దే. ప్రే. తీఱుచు. (రూ. తీర్పు. "సీ. పెతరులఋణముఁ దీర్పఁడుసూనుఁజెందనిదౌర్భాగ్య ములగోత్రమ్ము త్రమ్ము." రాఘ. ౧. ఆ.) (ఈ పదప్రయోగము విచారణీయము.)

తీఱుబడి. దే. వి. తీఱుపాటు, అవకాశము.

తీలగు. దే. అ. క్రి. (తీలు + అగు.) అడఁగు. "ఉ. తీలగుకంతువెంబడిని తెమ్మెరలుఁగొరవిదీప్తికల్కి పా, తాళమువట్టుచుండి." ఆము. ౨, ఆ. (చూ. తీలుపడు.)

తీలు. దే. వి. అడకము. (చూ. తీలగు.)

తీలుపడు. ద్వ. అ. క్రి. తీలగు. "గీ. ఇట్టులత్యుగ్రమగుగ్రీష్మమేసరేఁగి, కాలవశమునఁ దహరాశి తీలుపడియెఁ, బెద్దవెరిగొట్టిదియు హెచ్చి పేర్చు బెల్ల, స్రగ్గుటకె యనిలోకోక్తిచాటుఁగాదె." పాండు. ౪, ఆ.

తీవ. వై. వి. తీఁగయొక్క రూపాంతరము. "గీ. ఆనతీవమ్మయిపుడెనీయానతీవఁ, బోఁడికూరిమిమదిలోనఁబూనివేగ, దానవారిని దెత్తు." రుక్మి. ౨, ఆ.

తీవచే. ద్వ. స. (తిగ+వంచ.) నాలుగు.

తీవరపడు. వై. అ. క్రి. (తీవరము+పడు.) త్వరితపడు.

తీవరపాటు. వై. వి. తీవరపడుట.

తీవరము. వై. వి. త్వరితము*. "క. ఆవనజాక్షినిడగ్గఱి, తీవరమునఁ గొంగుఁబట్టి తిగిచెంగినుకన్." కళా. 3, ఆ.

తీవరించు. వై. స. క్రి. త్వరితపఱచు*. "చ. మేలొదవెడుఁబోయిరమ్మనుచు నొజ్జలు వేమఱుఁదీవరింపఁగాన్." శశాం. ౪, ఆ.

తీవరుఁడు. సం. వి. అ. పుం. 1. చేఁపలఁబట్టువాఁడు, కైవర్తుఁడు; 2. సముద్రుఁడు.

తీవియ. వై. వి. తీఁగియయొక్క రూపాంతరము. "ఎ, గీ. హరువుమెఱయంగఁబాతరలాడుగడన, వెలఁదుకలుపవడంపుఁదీవియలు గాఁగ." అచ్చ. బాల, కాం.

తీవిరము. దే. వి. తీఁట, కండూయ.

తీవె. వై. వి. తీవియయొక్క రూపాంతరము.

తీవ్ర. సం వి. ఆ. స్త్రీ. 1. నల్లావలు; 2. కటుకరోహిణి; 3. తీఁగగతికి.

తీవ్రగంధ. సం. వి. ఆ. స్త్రీ. ఓమము. అ. పుం. ము. కారుబుడమ.

తీవ్రము. సం. క్రి. విశ. అ. న. పెల్లు. విశ. 1. అధికము; 2. మిక్కిలి వేఁడిమిగలది; 3. కారముగలది.

తీసివేయు. దే. స. క్రి. 1. ఖండించు; (నీవు నా తల తీసివేయుదువా.) 2. ఎత్తివేయు. (వానిని ఉద్యోగమునుండి తీసివేసిరి.)

## తు.

తుంగ. ఉభ. దే. వి. తృణవిశేషము, ముస్త. సం. ఆ. స్త్రీ. జమ్మి.

తుంగభద్ర. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకయేఱు. అ. పుం. ము. మదపుటేనుఁగు.

తుంగము. సం. వి. అ. పుం. 1. కొండ; 2. పొన్న. విశ. పొడవైనది.

తుంగి. సం. వి. ఈ. స్త్రీ. వాయింట.

తుంట. యు. దే. వి. 1. తునుక; 2. చెఱకు. "ఉ. గెల్వవెముజ్జగంబును, ద్దండత నెక్కు తుంటవిలు దాలిచియుంటినఁగందుతూపులన్." వసు. 3, ఆ. —వై. విశ. దుష్టుఁడు.

తుంటరి. ద్వ. విశ. (తుంట + అరి.) దుష్టుఁడు. "ద్వి. తుంటరిజోగి." హరిశ్చ. ౨, భా. (స్వార్థమున అరి.)

తుంటవిలుతుఁడు. దే. వి. మన్మథుఁడు, ఇక్షుధన్వుఁడు. (రూ. తుంటవిల్తుఁడు. "గీ. చెలువమెడతుంటవిల్తునిచిందమరయ." య. ౪, ఆ.) (ఇట్లు తుంటవిలుకాఁడు.)

తుంటి. దే. వి. కటిపార్శ్వభాగము, రొండి. "సీ. కందూతిక్రైరాయుఁగర్కశంబగుతుంటిఁబీఁటవెట్టిన మ్రాను పెల్లగిల్ల." స్వా. ౪, ఆ.

తుంటికూర. ద్వ. వి. తూఁటికూరయొక్క రూపాంతరము. "గీ. తుంటికూర పొన్నగంటికూర." వి, పు. ౪, ఆ.

తుండము. ఉభ. వై. వి. ఖండము. "వ. పాండవాగ్రజుండతనికోదండంబుతుండంబులుచేసిన." భార. ద్రో. ౨, ఆ. — సం. అ. న. 1. పక్షిముక్కు; 2. నోరు; 3. మొగము.

తుండి. సం. వి. ఇ. స్త్రీ. ఉఱుకుబొడ్డు. పుం. 1. పక్షిముక్కు; 2 మొగము. న. పక్షి.

తుండించు. వై. స. క్రి. ఖండించు, ఛేదించు. "వ. కరంబులుఖండించియు శిరంబులుతుండించియు." ఉ, హరి. ౭, ఆ.

తుండికేరి. సం. వి. ఈ. స్త్రీ. 1. దొండతీ; 2. ప్రత్తిచెట్టు.

తుండిభుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఉబుకుబొడ్డు వాఁడు.

తుండిలుఁడు. సం. విశే. (అ. ఆ. అ.)——వై.——

తుండు. వై. వి. తుండెము, ఖండము.

తుండెము. వై. వి. ——వై.——(రూ.) తుండె

తుంతుర్వము. సం. వి. అ. పుం. తుంపురు.

తుందపరిమృజుఁడు. సం. వి. అ. పుం. సోమరి.

తుందము. సం. వి. అ. న. కడుపు, ఉదరము, కుక్షి.

తుంది. సం. వి. ఇ. న. కడుపు. పుం. ఉబుకుబొడ్డు. విశే. (న్. ఈ. న్.) బొజ్జకడుపువాఁడు.

తుందిభుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) 1. బొజ్జకడుపువాఁడు; 2. ఉబుకుబొడ్డువాఁడు.

తుందిలుఁడు. సం. విశే. (అ. ఆ. అ.)——వై.——

తుందుడుకు. దే. వి. (తుడుకు+తుడుకు.) 1. సంతాపము; "చ. చులుకననన్నుఁగన్నమనసుతో లయుమందఁగఁ జేసినన్నునుతో, గెలువఁగఁ బూనియున్నమునికీటములతో విరవాదిమొగ్గపే, రలుఁగులపాలుచేసి జయమందుదుఁ దుందుడుకాఱునట్లుగాఁ, గొలపుగదీర్చుతోనికోడుకుం గొడుకే మదిలోఁదలంపఁగతో." చంద్రా. 3. ఆ.—2. విచారము; "వ. బుద్ధిలేనిజనులాడుకొను సుద్దులుకొన్ని తద్దయువగపుతో నెద్దనున్నతమ్ములకెతిఁగించి యద్దశరథుని పెద్దకొడుకుతుందుడుకు మెండుకొన వెండియులఱ్ఱుణుంగనుంగొని." ఉ, రా. ౭, ఆ.—3. కలఁత, క్షోభము. "ద్వి. ఈమునిమాటలెంతేవింతలగుచుఁ, దోఁచుచున్నవియని తుందుడుకొంది." విష్ణు. ఉ. ౫, ఆ.—విశే. యోచింపక త్వరపడిచేయువాఁడు. (ఇది ద్విరుక్తముగానే ప్రయోగములంజూపట్టెడు.)

తుందునుకలు. దే. వి. బ. (తునుకలు + తునుకలు.) చిన్నచిన్న ఖండములు. "వ. ఘరిఘూఘాతంబులఁ బలకలతోడనపునుకలు తుందునుకలై రూపుచెడి మడిసినచోట్లును." కవిక. ౨, ఆ.

తుందుభము. సం. వి. అ. పుం. సర్షపము, ఆవలు.

తుంపర. వై. వి. గాలిచేతచెదరిపడు నీరులోనగువాని బొట్టు, శీకరము. "ద్వి. భవ్యవీచీపరంపరలఁదుంపరల." విష్ణు. ఉ. ౪, ఆ.

తుంపిళ్లు. దే. వి. బ. తూరవాన.

తుంపురు. వై. వి. తుంపర. "సీ. కళుకుపైతెమ్మెపైఁ గ్రమ్మమంచునుబోలె మొగమునఁజెమటతుంపురులెలర్ప." య. 3, ఆ.

తుంపెసలాడు. దే. అ. క్రి. (తుంపెసలు+ఆడు.) 1. చలించు; "చ. తొకతొకమాటలుతోనొసలదుంపెసలాడెడునుంగరంపువెం, డ్రుకలునుముద్దుకాయలుగడుతోగదలాడఁగముద్దుగారుపొం దికజిగిపాలబుగ్గలును." పు. ౨, ఆ.—2. ఊఁగాడు; "సీ. బిసభుక్తిఁగ్రొవ్వితుంపెసలాడురాయంచకొదమపెట్టినతెల్లిగ్రుడ్లనంగ." చంద్రి.—3. నర్తించు. "హారలతాగుళుచ్ఛముల్ తుంపెసలాడ." పా. ౨, ఆ.

తుంపెసలు. దే. వి. చలనము. (చూ. తుంపెసలాడు.)

తుంపెసలుగునియు. దే. అ. క్రి. తుంపెసలాడు, చలించు. "సీ. కొఱనెలపైఁదోఁచునిరులునాఁటంక వొందినొసటిపైఁగురులుతుంపెసలుగునియ." భాగ. ౧౦, స్కం. ఉ.

తుంబకము. సం. విశే. (అ. ఆ. అ.) (చూ.) ...

తుంబి. సం. వి. ఈ. స్త్రీ. 1. తుమ్మితీ; 2. సొరతీ.

తుంబిక. సం. వి. ఆ. స్త్రీ. 1. బండిచక్రము నడిమి రంధ్రము, తూము; 2. సొరతీ.

తుకతుక. దే. వి. 1. సంతాపము; "ద్వి. తుకతుకలేకీర్తులుమిన్నుముట్ట, సకలరాజ్యమునొకసంయమికిచ్చి." హరిశ్చ. ౧, భా.—2. కోపము; "ద్వి. త్రోచిపోనిమ్మింకఁదుకతుకమాని." హరిశ్చ. ౧, భా.—3. ఉడుకుటయందగుధ్వన్యనుకరణము, "క. తనచేతనెతనబలములఁ, దునిమించుటకింద్రజిత్తుతుకతుకనుడికెతో." రామా. ౭, ఆ.—4. కాఁగుటయందగుధ్వన్యనుకరణము. "తుకతుకఁ గాఁగనేటికి." చంద్రా. ౨, ఆ.

తుకము. దే. వి. విత్తనాలచల్లకపు అంచున.

తుకాటము. దే. వి. మిక్కిలి ప్రాఁతది.

తుక్కు. దే. విశే. అల్పము. (అది చెడెఁబో తుక్కు.)

తుక్కుఁడు. దే. విశే. పనికిమాలినది.

తుక్ఖారము. సం. వి. అ. పుం. గుఱ్ఱము, ఘోటకము.

తుచ్ఛ. సం. వి. ఆ. స్త్రీ. చిట్టెలకతీ.

తుచ్ఛము. సం. వి. అ. న. దుఃఖము. విశే. శూన్యము.

తుజాలకము. సం. వి. అ. పుం. ఆరుదొండ?

తుఫ్ఫేగు. దే. విశే. త్వరపడువాఁడు.

తుటాయించు. దే. స. క్రి. అలక్ష్యపఱచు.

తుటారము. దే. వి. 1. దిట్టతనము; "ఉ. మాటికిమాటి కింజలముమానక జక్కవపెంట్లఁదమ్మిరే, బోటుల నేఁచెదాజగముచుట్టముడాయఁగ వచ్చె నింకనీ, యాటలుడించి వేజరగుమంచుమ వెన్నెల లేనికే ళ్వడన్, జాలెనసంగఁగూఁతలిడఁజాఁగెఁదుటా రపుటజ్జవాల్గముల్." అచ్చ. అ, కాం.—2. పరుషవచనము. (చూ. గొడఁగు.)

తుటారి. దే. విశే. (తుటారము+ఇ.) 1. దిట్టతనము గలది; (చూ. తుటారికత్తియ.) 2. పారుష్యము గలది. "కేవలముఁదుటారికారి." చంద్ర.

తుటారించు. దే. స. క్రి. తిరస్కరించు. "మామం బేర్కొనిదూఱుగంధవహుఁ బల్మాఱుఁదుటారిం చు." శుక. ౧, అ.

తుటారికత్తియ. ద్వ. విశే. 1. దిట్టతనముగలది; "చ. గాజులుగలుగల్లనన్ జూఱుకుఁజూపులచేఁదిరుగ ల్లెండెముల్, గలఁపుదురందులన్ బొలము కాఁ పరికాఁపుదుటారికత్తియల్." నీలా. ౧, అ.— 2. పారుష్యముకలది. (రూ. తుటారికత్తె. పారు ష్యముకలదానికి.—"ఉ. కంతుదురాపతాపహ తిఁగ్రాఁగుచునజ్జగవన్నె కాఁడున, న్నెంతతుటా రికత్తెయనియొగ్గులువల్కెనొ." రసి. ౪, అ.) (స్వా ర్థమున కత్తియ.)

తుటారికాఁడు. దే. విశే. 1. దిట్టతనముగలవాఁడు; 2. పారుష్యముగలవాఁడు. (స్వార్థమున కాఁడు.)

తుటుక్కు. దే. వి. గుండెలు అదురుటయందగుధ్వన్యను కరణము. (ఆమ్రేడితమునందుతుటుకుతుటుక్కు. "చ. తటుకునమంచెడిగ్గదొరదట్టిబిగించఁగ జూ చురాజుదు, ష్పటికటిఁగట్టు పార్థుఁడు ప్రజ్ఞలు పల్కుచుఁగార్ముకంబుచెం, గటికరుదెంచికాంచి పలుకైఁగదలింపఁగ నోడిగుండియల్, తుటుకు తుటుక్కనన్ దిగులుదొట్టినభూభుజుఁడయ్యె నయ్యెడన్." పాంచా. ౨, అ.) (చూ. గల్లు.)

తుటుము. దే. వి. సమూహము. "క. అటులేగిన లో లు వేలుపుఁ, దుటుములఁబొడగాంచి." అచ్చ. యు, కాం.

తుట్టతుద. దే. వి. (తుద+తుద.) కేవలము తుద.

తుట్టమర. దే. అవ్య. క్రి. విశే. బొత్తిగా. (పిల్లవాఁ డు తుట్టమర చదువఁడు.)

తుట్టియ. దే. వి. తుట్టె. (త్రుట్టియయొక్క రూపాం తరము.)

తుట్టు. దే. వి. నష్టి. (ఈ వ్యాపారములో నాచేతిసొ మ్మతుట్టుపెట్టుకొన్నాను.) విశే. నాశకుఁడు. "జ లజంబులతుట్టు." రా. వి. 3. అ. (చూ. తడకట్టు.)

తుట్టె. దే. వి. సమూహము. "సీ. దోనదోనమునునీఁ గతుట్టెలరూపేఱుపడక క్రంపలను వ్రేలెడుగరు సుల." ఆము. ౬, అ. (తుట్టియయొక్క రూపాం తరము.)

తుట్టెగట్టు. దే. అ. క్రి. (తుట్టె+కట్టు.) (పురుగులుఁ పట్టి) ఉండగట్టు.

తుట్టెపురుగు. ద్వ. వి. సామాన్యసర్పము. "క. ఈతు ట్టెపురుగులేమగు, నీతేజీవచ్చినపుడు." రామా. ౮, అ.

తుట్ర. దే. వి. మంచువంటి తూరవాన, ఊడ్చినవుప్ప. (అని కొందఱు.)

తుడుచు. దే. స. క్రి. 1. తడిపోవనొత్తు; 2. ఊడ్చు. "క. పరిపుష్టిఁగలపితనయులఁ, బరువడిఁదుడుపం గఁగృష్ణఁబనుపుగన్ భా, సురరాజ్యవిభవము ష్పవి, దురుఁజెచ్చెరఁబంచెదానిఁ దోడ్కొని తేరన్." సం. "ఏహిక్షత్త ద్రౌపదీమానయస్వ ప్రియాంభార్యాంసమ్మతాంపాండవానామ్, స మ్మార్జతాంవేశ్మపరైతుశీఘ్రంతత్రాస్తుదాసీభిరపు ణ్యశీలా." భార. సభా. ౨. అ.

తుడుపు. దే. వి. 1. తుడుచుట, మార్జనము; 2. తప్పు వ్రాలను గీఁకినగీఱు.

తుడుము. దే. వి. 1. వాద్యవిశేషము, మద్దువు; "సీ. కైదువుల్ విండ్లునుగత్తళంబులుఁదీర్చి బూరలుఁదు డుములుబుగ్గిఁగలిపి." అచ్చ. సుం, కాం.— 2. తుటుముయొక్క రూపాంతరము. "క. నడు ముండెమునదియునతనిది, కడలిన్ సగమువడియొ కసగంబిలఁబడనం, దడవులుఁగొండలుఁగ్రోఁ తుల, తుడుములుఁబెక్కొక్క పరియతుత్తుమురు య్యెన్." రామా. ౮, అ.

తుడ్చు. దే. స. క్రి. తుడుచుయొక్క రూపాంతరము. "ఉరమునసునుంచుదుడ్చు." భో. ౫, అ.

తుతినాగము. దే. వి. లోహవిశేషము.

తుత్తి. దే. వి. తుత్తిరియొక్క రూపాంతరము.

తుత్తిరి. దే. వి. కంగునీపత్రము?

తుత్తుంభిక. సం. వి. అ. స్త్రీ. వాద్యవిశేషము. (చూ. తమ్మటము.)

**తుత్తునియలు.** దే. వి. బ. (తునియలు+తునియలు.) చిన్న చిన్న తునుకలు.

**తుత్తుమురు.** దే. వి. (తుమురు+తుమురు.) మిక్కిలి తుమురు. (తుమురు=పొడి.)

**తుత్థ.** సం. వి. ఆ. స్త్రీ. 1. చిట్టేలకి; 2. నీలిచెట్టు. అ. న. ము. మ్రానిపసుపునవండిన అంజనవిశేషము. పుం. అగ్ని.

**తుత్థాంజనము.** సం. వి. అ. న. మయిలుతుత్తము.

**తుద.** దే. వి. 1. చివర, అగ్రము; 2. కడ, అంతము.

**తుది.** దే. వి. కడ, అంతము.

**తుదిముట్టు.** దే. అ. క్రి. చేచ్చు. "క. ఇదిమొదలువాలియిచటికిఁ, బదపడిచనుదెంచె నేనిభగ్నశిరుండై, తుదిముట్టును." అధ్యా. కిష్కిం, కాం.

**తుదిరేయి.** దే. వి. కల్పాంతము.

**తుదివాఁడు.** దే. విణ. కడపటివాఁడు, కనిష్ఠుఁడు. "తుదివాఁడువలసి పెట్టఁగఁగొనువాఁడు." భార. అను. ౨, ఆ.

**తునికోల.** దే. వి. (తూనిక+కోల.) తూఁచునట్టికోల. "క. మును వెండికొండఁదూఁచిన, తునికోలగదా మదీయదోర్దండము." రామా. ౬, ఆ.

**తునికోలదుడ్డు.** దే. వి. గవుండ్లవాఁడు కల్లుబుడ్డి తగిలించుకొనిపోయెడు తునికోలవంటి దుడ్డుకోల.

**తునియ.** దే. వి. తునుక, ఖండము.

**తునియు.** దే. అ. క్రి. తునుఁగు. ఖండితమగు.

**తునుఁగు.** దే. అ. క్రి.——పై.——"క. ప్రుక్కితునింగిన కాళ్లును, ఱెక్కలునైపడ్డపక్కిఁ జేనింగని." అచ్చ. అర, కాం.

**తునుక.** దే. వి. తునియ, ఖండము.

**తునుమాడు.** దే. స. క్రి. (తునుము+ఆడు.) 1. ఖండించే; "గీ. విరథుఁడయ్యును సురథుండు విపులచాప, మాస్తుఁడైతూణమున బాణమందుకొనఁగ, నలుకరెట్టింపనర్ధచంద్రాశుగమునఁ, గ్రీడితునుమాడెనతనిదక్షిణభుజంబు. అట్లుఖండితబాహుఁడయ్యును." జై. ౫, ఆ. — 2. చేంపు. (చూ. తునుము.)

**తునుము.** దే. స. క్రి. 1. ఖండించే; "క. మాధునిఁ బౌండ్రా, వనివిభునినీవునుడఁగఁ, దునుముదు నేఁడెల్లిలోనఁదుత్తునియలుగాన్." ఉ, హరి. 3, ఆ.—2. చేంపు. (రూ. తున్ము. చేంపుటకు.—"మ. వినుఁడీ సర్వజనంబులుంగడఁగియీ విప్రుండు రాలాపుదు, ర్జనునిన్ దున్మెదనస్మదీయకమహోచాపోగ్రనిర్ముక్తబా, ణనిపాతచ్ఛిదుఁగాఁగరక్తజలశోణక్షోణీసంసిక్తుఁగాఁ, గనుఁడీ యీదురితాత్మునంచునతిశీఘ్రప్రాప్తకోదండుఁడై." భార. ఆర. ౪, ఆ.)

**తున్నకము.** సం. వి. అ. పుం. నందవృక్షము.

**తున్నవాయుఁడు.** సం. వి. అ. పుం. కుట్రపువాఁడు, సౌచికుఁడు.

**తున్మాడు.** దే. స. క్రి. తునుమాడుయొక్క రూపాంతరము.

**తుపాకి.** దే. వి. (సిపాయిలు మందుగుండు వేసి గట్టిచికాల్చెడు) ఇనుపక్రోవి. (చూ. జబ. జగ.)

**తుపాను.** దే. వి. గాలివాన.

**తుభాసి.** వై. వి. ఒక భాషను మఱియొక భాషతో చెప్పెడువాఁడు.

**తుపుక్కు.** దే. వి. ఉమియుటయందగుధ్వన్యనుకరణము. (తమ్మ తుపుక్కని యుమిసినాఁడు.)

**తుప్ప.** దే. వి. చిన్నపొద. "క. తుమ్మెదనీత్రుళ్లఁ [illegible] ద్దతుప్పలఁబట్టన్." నీలా. 3, ఆ.

**తుప్పటిల్లు.** వై. అ. క్రి. తనియు. "ఎ, గీ. అప్పటప్పటికి నిజిహ్వతుప్పటిల్ల, నా మెతలెఱిఁగనీతు షారాద్రికతన." (వ్రాఁతప్రతులయందు జిహ్వత్రుప్పడుల్ల అని యున్నది.) స్వా. ౨, ఆ.

**తుప్పర.** వై. వి. తుంపర, శీకరము.

**తుప్పలుదూలు.** దే. అ. క్రి. (తూలు+తూలు.) మిక్కిలి చలించే. "గీ. అతఁడు వెఱచిచాల దూముగఁబోయితుప్పలుదూలియుండె." భార. శాం. ౫, ఆ.

**తుప్పు.** దే. వి. ఉమియుటయందగుధ్వన్యనుకరణము. "ఎ, గీ. ఉమిసెఁదుప్పన మొగముపైనొ [illegible] డు." హరిశ్చ. ౪, ఆ. (ఆమ్రేడితమునందు తుప్పుతుప్పు. "వ. విలూనఘ్రాణగళితంబైవా తెఱచి వచ్చునెత్తురు తుప్పుతుప్పున నుమియుచు." [illegible] మా. ౬, ఆ.)

**తుభము.** సం. వి. అ. పుం. మేఁకపోతు, ఛాగము.

**తుమికి.** దే. వి. తుమ్మికి, తిందుకము.

**తుమురు.** దే. వి. సూక్ష్మఖండము. "వ. పలుదెఱఁగులైనగదాప్రహతులందునియలు పఱియలు దుముల్లునైనీసకంబులుకత్తళంబులు ధరాతలంబునం బొరంగె." భార. శల్య. ౨, ఆ.

**తుములము.** సం. వి. అ. న. దొమ్మియుద్ధము. పుం. తాండ్ర.

తుమ్మ. దే. వి. అరిమేదము?.

తుమ్మి. వై. వి. ఒకదినుసు కూరాకు.

తుమ్మికి. దే. వి. తుమికియొక్క రూపాంతరము.

తుమ్ము. దే. అ. క్రి. క్షుతముచేయు. వి. క్షుతము.

తుమ్మెద. దే. వి. పూఁదేనెఁద్రావెడి యొకదినుసు నల్ల పుఱుగు. భ్రమరము.

తుమ్మెదకంటు. ద్వ. వి. సంపెఁగ?. (చూ. మొగడ.)

తుమ్మెదమామిడి. దే. వి. కోశామ్రము?.

తురంగము. సం. వి. అ. పుం. గుఱ్ఱము, అశ్వము.

తురంగము. సం. వి. అ. పుం.——పై.——

తురక. వై. వి. తురకవాఁడు, మ్లేచ్ఛుఁడు.

తురకదొగ్గలి. ద్వ. వి. ఒకదినుసు దొగ్గలి?.

తురకపికిలి. ద్వ. వి. ఒకదినుసు పికిలిపిట్ట.

తురకతాయి. ద్వ. వి. బొంతతాయి.

తురకవేము. ద్వ. వి. తృణాంబము?.

తురకాణ్యము. గ్రా. వి. తురకజనము, తురకప్రభుత్వము.

తురగము. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము; 2. హృదయము.

తురా. దే. వి. తురాయియొక్క రూపాంతరము. ''నిద్రా మెఱుఁగుందురాగులుక.'' శశాం. ౫, ఆ.

తురాయి. దే. వి. 1. నిడుపుకాఁడ పెట్టికట్టిన పూబంతి; 2 తలనుంచెడు భూషావిశేషము.

తురాసాహుఁడు. సం. వి. హ. పుం. ఇంద్రుఁడు.

తురి. సం. వి. ఈ. స్త్రీ. కండెలుంచి నేసెడు యంత్రము, నాడె.

తురికి. వై. వి. గుఱ్ఱము. (చూ. తఱటుసేయు.)

తురితము. వై. అవ్య. క్రి. విశే. శీఘ్రము.

తురీ. వై. ద్ర. క్రి. విశే. తటాలున. ''తురీన లేచు నట్టిజాడదోఁప.'' య. 3, ఆ.

తురీయము. సం. వి. అ. న. బ్రహ్మము, విశే. నాలుగవది.

తురుంధము. సం. వి. అ. పుం. పూలదండలు మొదలగునవి తుఱిమినకొప్పు.

తురుజె. దే. వి. ఒకదినుసు కూరాకు, గండీరము.

తురుపు. ఆం. వి. గుఱ్ఱపుదండు.

తురుష్కము. సం. వి. అ. పుం. 1. చిల్లమడ్డి; 2. ఒకానొకదేశము.

తురుష్కుఁడు. సం. వి. అ. పుం. తురకవాఁడు.

తుర్యతుండి. సం. వి. ఈ. స్త్రీ. పిండిదొండ?.

తుర్యము. సం. విశే. (అ. ఆ. అ.) తురీయము.

తుఱఁగలి. దే. వి. ప్రకాశము. ''సీ. ధూమంబువోదిననఁదుఱఁగలి మెఱుఁగులునలఁగిమాసినదీప కళికభంగి.'' భార. విరా. ౧, ఆ.

తుఱఁగలించు. దే. అ. క్రి. 1. ప్రకాశించు; ''గీ. అవని గంపింప లలితపీతాంబరంబు, చెఱఁగుదూలఁజ క్రాంశులుదుఱఁగలింప.'' భార. భీష్మ. ౨. ఆ.— 2. అతిశయించు. ''పంచచామరము. మెఱుంగుఁ బోఁడికిట్లుచల్వమీఁదమీఁదఁజేసినన్, గుఱంగటన్ నిలంగరాకకూర్మివెచ్చ హెచ్చఁగాఁ, దుఱంగలించుచింతతోడదూతిపల్కరంతపే, మఱున్ మరున్ మరుత్సగాంకమత్తకోకిలాదులన్.'' విజ. 3, ఆ.

తుఱఁగలిగొను. దే. అ. క్రి. (తుఱఁగలి+కొను.) ——పై.——(ప్రకాశించుటకు.—''క. మఱునాఁడయుగుటలెస్సగ, నెఱిఁగెనినుండపుడువేఁడియొడలినదీప్తుల్, తుఱఁగలిగొనఁబశ్చిమగిరి, చఱికినతిదూరమున విశదుఁడై తోఁచెన్.'' భార. మా. ౧, ఆ.—అతిశయించుటకు.—''చ. వెఱవకు మోకుమారపదివేలవిధంబులనైననిన్నునే, మఱవమ కేడకుంజనుటమానిసుఖంబునదక్షవాటికన్, దుఱఁగలిగొన్న సమ్మదముతో గమసింపుము భీమనాయకుం, డఱగొఱలేని వేల్పునిఖిలాభ్యుదయంబులునీకునయ్యెడున్.'' భీ. ౨, ఆ.)

తుఱుగు. దే. స. క్రి. (బలవంతమున లోపలవేసి) క్రుక్కు. ''తఱిగికండలు నోరఁ దుఱిగెదరఁట.'' మార్క. ౨, ఆ.

తుఱుతు. వై. వి. వేగిరపాటు*. ''క. పిఱికితనంబును జలమును, గొఱకొఱయీలేని గొనము గుఱితప్పుటయున్, దుఱుతునుబిగియునుగల్గియు, నెఱఁగఁడతండించుకయునపెల్లెడలందున్.'' నీలా. ౬, ఆ.—క్రి. విశే. శీఘ్రము. (నీవక్కడికిపోయి తుఱుతుగరమ్ము.)

తుఱుము. దే. స. క్రి. తుఱుముపీఁటతో పాడిపాడిచేయు. వి. పాడి. వై. స. క్రి. 1. (కొప్పుగా) ముడుచు*; ''క. వలపలిదిక్కునకించుక, మలఁగంగాఁదుఱిమి.'' భార. విరా. ౧, ఆ.—2. (కొప్పున) చెరువు*. ''రగడ. నేర్పుమైనల్లయది నెఱులఁదోలుపూఁదుఱిమె.'' స్వా. 3, ఆ.—వి. కొప్పు*.

తుఱుముపీఁట. ద్వ. వి. తుఱుముటకనువుగాచివరను పండ్లేర్పఱచిన వంకరయినుపకమ్మిచెక్కిన పీఁట.

తుజ్జు. వై. వి. వేగిరపాటు*. క్రి. విశే. శీఘ్రము. (తుఱుతుయొక్క రూపాంతరము.)

తుల. సం. వి. ఆ. స్త్రీ. 1. త్రాసు; 2. దూలము; 3. నూఱుపలములకొలఁది; 4. పోలిక; 5. ఒక రాశి. (చూ. రాశి.) (తులాసూత్రము ప్రగ్రాహము.)

తులకించు. దే. అ. క్రి. 1. ప్రకాశించు; "ద్వి. నలిన బంధుఁడు పూర్వనగశిఖరమునఁ, దులకించెనరుణ కాంతులు దిక్కులలను." విష్ణు. ఉ. ౫, ఆ.— 2. కుతూహలపడు. "ఉ. ఈవిరిఁబోఁడిఁగైకొను మి దేటికి సందియ మంచుఁ గూరిమిన్, దేవర యాన తిచ్చినమదిం దులకించుచుఁ బెండ్లియాడు నీ, రావల రాజునన్నును దిరంబగుసొంపునఁ బెంపు మీఱఁ గాఁ, గావునఁ గూఁతుఁ గావలసి కాదనకీచన వీయఁ గాఁదగున్." య. ౪, ఆ.

తులకింపు. దే. వి. ప్రకాశము. "క. వాతెఱకున మృతమేతుల, మేతులకింపుల పిసాళిమిసిమికిఁ గ్రొమ్మిం, చేతుల చేతుల కబ్జము, లేతుల లేతుల వెలందులీచెలితులయే." విజ. ౧, ఆ. (చూ. అరగింపు.)

తులము. దే. వి. పలమునందు మూఁడవభాగము (లేక) రూపాయయెత్తు.

తులసి. సం. వి. ఈ. స్త్రీ. తొళసి?.

తులాకోటి. సం. వి. ఇ. పుం. అందె, నూపురము.

తులామానము. సం. వి. అ. న. త్రాసునతూఁచెడు తూనిక.

తులితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. సరిపోల్పఁబడినది; 2. తూఁచఁబడినది.

తులుచే. దే. విశే. వేగముగలది. (చూ. తులుచేన.)

తులుచేన. దే. వి. వేగము. (విశేషణమైనచో. "ద్వి. తులుచని గాలిచేఁ దొడిమలు విదిలి, గలగలరవము లఁగారాకుడుల్లె." భాగ. ౧౦, స్క.) (చూ. అలకన.)

తులువ. దే. విశే. కుత్సితుఁడు. "చెలువలొసంగెంచు బలుచలువలకుఁ బైనలముకలువలకుఁ దేఁటులను తులువలకు." య. ౫, ఆ.

తులువకత్తి. ద్వ. వి. వంపుచురకత్తి.

తుల్యము. సం. విశే. (అ. ఆ. అ.) సమము, సరి.

తువర. దే. వి. తువ్వరయొక్క రూపాంతరము.

తువరము. సం. వి. అ. పుం. ఒకరసము, ఒగరు. (చూ. రసము.) విశే. ఒగరైనది. (రూ. తూవరము.)

తువరి. సం. వి. ఈ. స్త్రీ. 1. తొగరి?; 2. అడవి తొగరిచెట్టు; 3. తొగరిమన్ను.

తువాల. ఆం. వి. చేతిగుడ్డ.

తువ్వర. దే. వి. తూర. "క. మువ్వురమీఁదమరంద పుఁ, దువ్వరఁజల్లుచు." జై. ౪, ఆ.

తుషము. సం. వి. అ. పుం. 1. ఊక; 2. తాండ్ర?.

తుషారము. సం. వి. అ. పుం. 1. మంచు; 2. తుంపర. విశే. చల్లనిది.

తుషితుఁడు. సం. వి. అ. పుం. గణదేవతావిశేషము. (వీరు ముప్పదియాఱుమంది.)

తుష్టి. సం. వి. ఇ. స్త్రీ. సంతోషము.

తుష్టుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) సంతోషము పొందినవాఁడు.

తుస్సి. దే. విశే. ఒగరైనది. (నేల.)

తుస్సు. వై. విశే. నీచము. (తుస్సుపెంజెర.)

తుస్సుపెంజెర. ద్వ. వి. పెంజెరభేదము.

తుహినకరుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు, చలివెలుఁగు.

తుహినము. సం. వి. అ. న. హిమము, మంచు.

## తూ.

తూ. దే. వి. తూపొడుచుటయందగు ధ్వన్యనుకరణము. "తూయని పలుమాఱుఁ దూపొడిచి." క్రి. ౫, ఆ. (చూ. తూపొడుచు.)

తూఁగాడు. దే. అ. క్రి. (తూఁగి+ఆడు.) 1. ఊఁగు; "సీ. తూఁగాడుహారపఙ్క్తులదీప్తి వెలవెల్లనగుదీ... చులనునతికరింప." హరి. పూ. ౫, ఆ.—2. చలించు. "గీ. రయము మెఱయంగ నొక్కనాఁడనము ఫాల, దేశమునయందు నాటించి తీవ్రశక్తి, ముసైచినఁ దూఁగాడియొఱగనూఁడి, పట్టియుక్కి... వ్రణుఁడు దేర్చెఁబరశురాము." భార. ఉద్యో. ౪, ఆ. (మొదటిరూపము తూఁగియాడు. "వ. ... హపవనఝంపాసంపాతంబులందూఁగియాడు... రుల్లచప్పళ్లు." వై. ౫, ఆ.) (చూ. ఊఁగాడు.)

తూఁగు. దే. అ. క్రి. 1. ఊఁగు; (తూఁగుమంచము.) 2. కూరుకు; (వాఁడు తూఁగిపడుచున్నాఁడు.) 3. చలించు; "సీ. తూఁగాడునునుఁగురుల్ బోఁతె చుకుర్ణాంబువులఁదోఁగినుదుటి పైమలఁగుమంచు." నిర్వ. ౫, ఆ.—4. తూనికపడు; "గీ. వినుముతులనిడియెత్తుచో వేయుసశ్వ, మేధములకంటె

సత్యంబుమిగులఁదూఁగుఁ, గానసత్యయుక్తుండ వుగమ్మునమ్ము, దెమ్మమమ్మురమ్మనకు నీదెసకునింక." మార్క. ౧, ఆ.—5. నడచు. "ఉ. ఓమనుజేంద్రనీవెనుక నుద్ధవడింబఱతెంచుదాననీ, వామహనీయవేగమునకంకిలిసేయక తూఁగనోపిన౯, గామితసిద్ధినొందు." భో. ౭. ఆ. "గీ. అందుకతమునసీయింతికెందుఁదగినఁ, జెలువునెవ్వనిఁగూర్చునో నలునయనుచు, వంతనున్నాఁడఁగాక యీవాలుగంటి, పెండ్లితూఁగించుటదియెంతపెద్దనూకు." భో. 3, ఆ.—వి. 1. ఊఁగుట; (తూఁగుటుయ్యెల.) 2. కూరుకుపాటు. (వాకు తూఁగు వచ్చుచున్నది.)

తూఁగుటుయ్యల. ద్వ. వి. ఉయ్యాలమంచేము. "సీ. తూఁగుటుయ్యలఁదూఁగుచోఁ గొంతచెదరినయ రవిరిసెన్నిబాగట్లయుండ." కళా. ౨, ఆ. (రూ. తూఁగుటుయ్యాల. "సీ. గుజ్జుమావులనల్లుకొనిన్రేలునునుఁదీఁగతూఁగుటుయ్యాలలనూఁగి యూఁగి." పు. ౨, ఆ.)

తూఁగుపలక. ద్వ. వి. తాపివాఁడు గోడలమట్టము చూచుటకై జాయిత్రేలఁగట్టిన నిడుపాటిపలక.

తూఁగుమంచేము. ద్వ. వి. ఉయ్యాలమంచేము. "బంగారుకోళ్లతూఁగుమంచముపై." య. ౫, ఆ.

తూఁచు. దే. ప్రే. తూఁగఁజేయు, తూనికవేయు.

తూఁట. యు. దే. వి. తుంట, ఖండము. వై. విణ. దుష్టుఁడు. (చూ. తూఁటరి.)

తూఁటకట్టు. దే. అ. క్రి. ఖండితమగు.

తూఁటరి. వై. విణ. (తూఁట+అరి.) దుష్టుఁడు. "ఈ తూఁటరిదోసకారి పెనుదోసి యజామిళుఁడు." భాగ. ౬, స్కం. (స్వార్థమున అరి.)

తూఁటాడు. దే. స. క్రి. (తూఁటు+ఆడు.) వేధించు, జర్జరితముచేయు. "బలిమిన్ వేవురుపార్శ్వరక్షకులెదుర్పన్ దున్మితూఁటాడి." జై. ౭, ఆ.

తూఁటికూర. దే. వి. ఒకదినుసుకూరాకు, నళి. (చూ. తుంటికూర.)

తూఁటు. దే. వి. చిల్లి, రంధ్రము.

తూఁటుకట్టు. దే. అ. క్రి. తూఁటుపడు, తూఁటుపోవు. "గీ. తమతమవీరశంఖంబులెల్ల, దొరలునొత్తిరిడవిప్రోఁతఁదూఁటుకట్ట." భార. ఉద్యో. ౪, ఆ.

తూఁదరి. వై. విణ. తూఁటరియొక్క రూపాంతరము. "క. వాఁడెల్లవారునీపూఁ, బోఁడివలదుమానుమనఁగఁబయిలోడకతాఁ, దూఁదరియైతటిఁబడిన, వాఁడితనికి నేఁడువగవవలదనువారున్." భో. ౬, ఆ.

తూఁడు. దే. వి. తామరపువ్వులోనగువానివేరు, బిసము. "తమ్మితేఁదూండ్లాబాహువులు." విజ. ౧, ఆ.

తూఁడుదిండి. దే. వి. (తూఁడు+తిండి.) హంస. "గీ. తూఁడుదిండిమూవుదొరవంగడంబునఁబుట్టి." అచ్చ. యు, కాం.

తూఁతకొమ్ము. దే. వి. పిల్లంగ్రోవి, మురళి.

తూకము. దే. వి. పూనిక. "శా. తూకంబుల్ సెడితేరులాకసమునన్ దూలంబులైతూలఁగా." జై. ౭, ఆ.

తూకు. దే. వి. తూకముయొక్క రూపాంతరము. "క. వరుణుండువిప్రచిత్తియు, దురమొనరింపంగనొక్కతూకున." హరి. ఉ. ౧౦, ఆ.

తూకొను. దే. అ. క్రి. (తూకు+కొను.) పూను. "చ. అహిమరుచిప్రతాపుఁడగునాకుశనాభుఁడు బ్రహ్మదత్తుకై, దుహితృశతంబునీనతఁడుతూకొని వారిఁగ్రమంబునన్ గర, గ్రహణముసేయ." రా. బాల, కాం. (తూఱు+కొను.) చొచ్చు. "దునికిలఁబాఱుచీఁకటులుదూకొనుచుండెడుకీలుగంటు." హంస. ౪, ఆ.

తూణము. సం. వి. అ. పుం. అమ్ములపొది. (ఇది ఆకారాంత స్త్రీలింగముగాను ఈకారాంత స్త్రీలింగముగాను గలదు.)

తూణీరము. సం. వి. అ. పుం. తూణము, అమ్ములపొది.

తూదము. సం. వి. అ. పుం. గంగరావి.

తూనరతుక్కము. దే. వి. బాలక్రీడావిశేషము.

తూనిక. దే. వి. (త్రాసుతో) తూఁచేట, ఉన్మానము.

తూనికకోల. దే. వి. త్రాసుదండె.

తూనికవేయు. దే. స. క్రి. తూఁచు.

తూనిఁగ. దే. వి. తూనీఁగయొక్క రూపాంతరము. "ఉ. తూనిఁగలాడెఁదోయనిధిఁదొరపుత్రోఁత జనించెఁబజ్జులై, కానఁబడెన్ బలాకములుకప్పయొలుంగులుమించెనిర్జల, స్థానమునందుఁగుంజము తుదన్ గృకలాసమునిల్చినింగికై, యానవమెత్తె భూమిరజమంగములన్ బెరయించెఁబిచ్చుకల్." విక్ర. ౪, ఆ.

తూనీఁగ. దే. వి. ఒకదినుసు ఈఁగ, పతంగిక.

తూపరము. దే. వి. చిల్లి, రంధ్రము.

తూపరాణ. దే. వి. నీళ్లు బయటికివచ్చే తూము. (చూ. ఒప్పరము.) (రూ. తూపరాణము.)

తూపరాణి. దే. వి. ——పై.——"స. గుడిలాపరా తూపరాణికడనిలిచి." ఆము. ౬, ఆ.

తూపి. వై. వి. గుడిలో మూలవిగ్రహము ఉండెడుచోటికి మీఁదవిమానమువలె ఎత్తుగాకట్టిన కట్టడము.

తూపు. దే. వి. బాణము.

తూపురిక్క. ద్వ. వి. శ్రవణనక్షత్రము.

తూపురిక్కనెల. ద్వ. వి. శ్రావణమాసము.

తూపాడుచే. దే. స. క్రి. ఉమియు. (చూ. తూ.)

తూబరము. సం. వి. అ. పుం. కాలమున కొమ్ములు మొలవని యెద్దు.

తూబరుఁడు. సం. వి. అ. పుం. 1. ప్రాయమున గడ్డము మీసము రాని మగవాఁడు; 2. అంతఃపురపు కావలివాఁడు.

తూము. వై. వి. 1. బండిచక్రము నడిమిరంధ్రము; 2. నీళ్లుబయటికివచ్చునట్లు ద్వారమేర్పఱిచికట్టిన కట్టడము; "విలసన్ముక్తాకలాపచ్ఛలంబునఁ దూమేర్పడఁబెట్టి." వసు. ౪, ఆ.—3. నాలుగుకుంచేములకొలఁది*; 4. నూదిచెవి*. "ఉ. ఇందుధరుండనేను వరమిచ్చెదవేఁడుము మానిలోకసం, క్రందననావుదుఁగాదపసి కన్గవయల్లనవిచ్చి మాచినీ, విందుధరుండవేని వరమిచ్చెదవేనియుఁ నూదితూములో, నందగదారముఁజొరఁగ నాకిపుడిమ్ము వరమ్ము సత్కృపన్." పర. ౧, ఆ. 5. నగలమోపునందలి రంధ్రము.

తూర. దే. వి. 1. వానబొట్టు; (తువరయొక్క రూపాంతరము;) 2. మత్స్యవిశేషము. (చూ. తూల.)

తూరనగోలలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. (చూ. అందలము.)

తూరనతుంకములు. దే. వి. బ.——పై.——"సీ. తూరనతుంకాలు గీరనగింజలు పిల్లదీపాలంకిబిల్లగోడు." కాశి. 3, ఆ.

తూరి. దే. వి. తడవ, ఆవృత్తి. (ఇది ఏకాద్యర్థకశబ్దపూర్వకముగానే ప్రయోగింపఁబడును. ఉదా. ఒకతూరి, ఈతూరి. మొ.)

తూరు. దే. అ. క్రి. (సన్నగా) తూరపడు. (దీనిని చొచ్చు అను అర్థమందును కొందఱు లఘురేఫముగా ప్రయోగించియున్నారు. ప్రామాణిక ప్రయోగములయందట్లు కనఁబడలేదు.) వి. ధాన్యముతోఁ కలసియున్న గల్లపొట్టు మొదలైనది.

తూరుపాఱఁబట్టు. దే. స. క్రి. (తూరు+పాఱన్+పట్టు.) గల్లపొట్టులోనగునవి యెగిరిపోవునట్లుగా చేటలోనగువానితో ధాన్యములోనగువానిని పైకెత్తి క్రిందుగాఁబోయు, (రూ. తూర్పాఱఁబట్టు.)

తూరుపు. దే. వి. సూర్యుఁడుదయించెడు దిక్కు. ప్రాగ్దిశ. (రూ. తూర్పు.)

తూరుపుఁగొండ. ద్వ. వి. ఉదయాద్రి, పూర్వపర్వతము.

తూరుపుఱేఁడు. దే. వి. ఇంద్రుఁడు, పూర్వదిక్పతి.

తూరుపెత్తు. దే. స. క్రి. (తూరుపు+ఎత్తు.) 1. ధాన్యాదికమును ఎత్తి తూరుపుగాలికివిడుచు; 2. ఏదేనిగాలివాటముగా ఎత్తివిడుచు; "గీ. రట్టుగానన్నుమగనాలిఁబట్టిడాసి, తౌరమొఱ్ఱోయనుచు గుమ్మతూరుపెత్తు." శుక. ౨, ఆ.—3. వెంద్రుకలపాయఁదీసి అడ్డముగా మీఁదికెత్తిపట్టు. "గీ. ఎలయుసీత్కారములతోడనీళ్లుగ్రుక్కి, యంట్లుసట్లునుబరికించియంట్లఁబొడిచి, గోరు ముక్కుడిగదువ్వితూరుపెత్తి, నెఱులఁగల్గినపేలనన్నిటిదిగిచి." పాండు. 3, ఆ.

తూర్చు. దే. ప్రే. తూఱుచేయొక్క రూపాంతరము. "ఉ. దుర్వాచికసూచికాంకురపరంపరఁదూర్చుదుమాటిమాటికిన్, నాచెవులందు." వై. ౪, ఆ.

తూర్ణము. సం. క్రి. విశ. అ. న. త్వరితము. విశ. వడిగలది.

తూర్పిడి. దే. వి. తూరుపాఱఁబట్టుట.

తూర్పెత్తు. దే. స. క్రి. తూరుపెత్తుయొక్క రూపాంతరము.

తూర్యము. సం. వి. అ. న. వాద్యము. పుం, న. వాద్యప్రయోక్త.

తూఱఁబడు. ద్వ. అ. క్రి. (తూఱన్+పడు.) తూఱు. "సీ. పాఱఁజాలకముట్టఁబడిజాడదప్పంగిదొలఁగిపెన్గొందులఁ దూఱఁబడియు." నిర్వ. ౪, ఆ. (స్వార్థమున పడు.)

తూఱు. దే. అ. క్రి. చొచ్చు. "పాములుపుట్టలోనికిన్దూఱినయట్లుగా." భార. భీష్మ. ౨, ఆ. "ద్వి. నాతెల్లగరులబాణములింద్రజిత్తు, వేతూఱిచనినేఁడువెసలంకఁబడును." రా. యు, కాం.

తూఱుచే. దే. ప్రే. తూఱఁజేయు.

తూలు. దే. వి. పండుచేప, ఝషము.

తూలంబాఱు. దే. అ. క్రి. (తూలఁగ్+పాఱు.) 1. తూలు, చలించు; 2. తొలఁగు. "తూలంబాఱె రయంబీయువోక." కాశి. ౨, ఆ. (స్వార్థమున పాఱు.)

తూలనాళిక. సం. వి. ఆ. స్త్రీ. దూదిచుట్ట, ఏకు.

తూలపోవు. మి. అ. క్రి. (తూలము+పోవు.) చిన్నపోవు. "గీ. చిన్నవోయినీకొడుకులు సేయఁగలుగు, దొరలువిడిదలకరిగిరిపరఁగఁ భీము, సేనకొడుకునగ్గించుచుఁజెలఁగివారు, చెన్నుసొంపాఱఁజనిరాత్రిశిబిరములకు. వ. అని యిట్లు నాలవనాఁడు ధార్తరాష్ట్రులుతూలపోవుటసెప్పినవిని." భార. భీష్మ. ౨, ఆ. (ప్రే. తూలపుచ్చు. "ఉ. తిమ్ముఁ డనీవునాకొలఁదితిథ్య మెఱుంగక నాకు నిచ్చెభా, గ్యమ్ముగుభంగిఁజేసితివి వాసవయియ్యదెతిప్రసూతి వ, శమ్మఖిలమ్ముఁదాల్తునొకసన్నపుటీఁకనయిట్టి నన్నునీ, విమ్మెయిఁదూలపుచ్చెదుని యీత్కణరోము లఁగెంపెలర్పఁగన్." భార. ఉద్యో. 3. ఆ.)

తూలము. సం. వి. అ. న. 1. గంగరావిచెట్టు; 2. ఆకాశము. పుం. న. దూది.

తూలాడు. దే. అ. క్రి. (తూలి+ఆడు.) తూలు, చలించు. "ఎ. గీ. అలసి మేనులుదూలాడ నిలిచి నంతి, నంతినయ్యోధనుఖ్యులా హవముచక్కి..." భార. విరా. ౫, ఆ. (దీని మొదటిరూపము తూలియాడు. "గీ. గగనమండలమునఁగాలాయసపుఁ దెర, మాలకాకిపఙ్క్తి తూలియాడ." నై. ౭, ఆ. మా. ఊఁగాడు.)

తూలి. ఉభ. దే. వి. (తూలు+ఇ.) చేపలనుబట్టి జీవించెడి యొకానొక జాతివాఁడు. సం. ఈ. స్త్రీ. తూలిక.

తూలిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చిన్నయీఁక; 2. వ్రాసెడు కలము; 3. చిత్రమువ్రాసెడు వాగర.

తూలికాఁడు. దే. వి. తూలి. (స్వార్థమున కాఁడు.)

తూలు. దే. అ. క్రి. 1. చలించు; "గీ. వరరథాశ్వసుభటవర్గమెల్లనుగల్గి, చాలినంతభూమియేలఁగల్గి, తగినమంత్రిలేనిధరణీశురాజ్యంబు, గాలిఁదూలుదీపకళికఁబోలు." విక్ర. 3, ఆ.—2. తొలఁగు. "పయ్యెదసగముదూలించి." భార. విరా. ౨, ఆ.

తూలు. హిం. విశే. అనగత్యముగా పెంచిచెప్పిన; తూలుమాటలు, తిట్లు.

తూలుచు. దే. ప్రే. (తూలఁజేయు.) 1. చలింపఁజేయు; "ఉ. ఘనస్ఫుటనిశ్వసితానలంబులన్, దూలిచె దేవయానములఁదోరములైన భుజంగసంఘముల్." రా. యు, కాం.—2. తొలఁగించు. "ఋక్షసంఘముల తేజముఁదూలిచె." సా. ౧, ఆ. (రూ. తూల్చు.)

తూష్ణీకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) మాటలాడక ఊరకుండువాఁడు, తూష్ణీంశీలుఁడు.

## తృ.

తృట్టు. సం. వి. ష్. స్త్రీ. 1. దప్పి; "తృట్టైకదొట్ట." పాండు. ౫, ఆ.—2. ఇచ్ఛ.

తృణగ్రాహి. సం. వి. న్. పుం. పచ్చ, మరకతము.

తృణజలూక. సం. వి. ఆ. స్త్రీ. తృణములయందు సంచరించెడు జెలగవంటి యొక దినుసు పురుగు. "సీ. తనపూర్వభాగమెత్తి, వేఱొంటిపైఁబెట్టి వెనుకభాగంబెత్తగఁ దుకించు తృణజలూకయనుబోలె." భాగ. ౧౦, స్కం. పూ.

తృణత. సం. వి. ఆ. స్త్రీ. 1. తృణభావము; 2. విల్లు.

తృణద్రుమము. సం. వి. అ. పుం. తాటిచెట్టులో నగునది.

తృణధాన్యము. సం. వి. అ. న. విత్తకపండెడు గునుకు నివ్వరి దూసరిలోనగునది.

తృణధ్వజము. సం. వి. అ. పుం. వెదురు, వేణువు.

తృణపుష్పిక. సం. వి. ఆ. స్త్రీ. కొండయల్లము?.

తృణము. సం. వి. అ. న. 1. కిక్కసలోనగుగడ్డి; 2. గంటె చామలోనగుపైరు.

తృణరాజము. సం. వి. అ. పుం. 1. తాటిచెట్టు; 2. గిఱకతాటిచెట్టు; 3. టెంకాయచెట్టు.

తృణశూన్యము. సం. వి. అ. న. మల్లె. (రూ. తృణశూల్యము)?. (ఇది ఆకారాంత స్త్రీలింగమునగును.) అ. పుం, న. ఆ. స్త్రీ. మొగలిపండు. విశే. తృణములేనిది.

తృణీకరించు. సం. స. క్రి. తృణముగాఁజేయు, అలక్ష్యముచేయు.

తృణ్యా. సం. వి. ఆ. స్త్రీ. గడ్డిమోపు.

తృతీయము. సం. స. (అ. ఆ. అ.) మూడవది.

తృతీయాకృతము. సం. విశే. (అ. ఆ. అ.) మూడు చేట్లు దున్నినది. (నేల.)

తృతీయాప్రకృతి. సం. వి. ఇ. స్త్రీ. నపుంసకుఁడు, పేడి, (రూ. తృతీయప్రకృతి.)

తృప్తము. సం. వి. అ. పుం. పురోడాశము. విశే. తృప్తిపొందినది.

తృప్తి. సం. వి. ఇ. స్త్రీ. తనివి, తర్పణము.

తృప్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తనివినొందిన వాఁడు.

తృష. సం. వి. ఆ. ష్. స్త్రీ. 1. దప్పి; 2. ఇచ్ఛ.

తృషితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. దప్పిగొన్నవాఁడు; 2. ఇచ్ఛగొన్నవాఁడు.

తృష్ణ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఇచ్ఛ; 2. దప్పి.

తృష్ణక్కు. సం. విణ. జ్. 1. ఇచ్ఛగొన్నవాఁడు; 2. దప్పిగొన్నవాఁడు.

## తె.

తెంకాయ. దే. వి. టెంకాయయొక్క రూపాంతరము.

తెంకి. దే. వి. స్థానము. (టెంకియొక్క రూపాంతరము.)

తెంచు. దే. ప్రే. తెగఁజేయు. (త్రెంచుయొక్క రూపాంతరము.)

తెండు. దే. అ. క్రి. పరుండు, శయనించు. (చూ. తేఁడు.)

తెందెప్పలు. దే. విణ. బ. (తెప్పలు+తెప్పలు.) అపారము. "క. అందలమందలలేకిపు, డందలమందలయియున్నవయ్య మెకంబుల్, చెందామరకొలనువలెన్, దెందెప్పలవేమిచెప్పదేవుఁడెఱుంగున్." సా. ౧, ఆ. (రూ. తెందేపలు. "ఎ, గీ. పోటుచెలువు, నందుఁదెందేపలుగసిరుల్ క్రందుకొనఁగ." య. ౧, ఆ.)

తెంపరి. దే. విణ. (తెంపు + అరి.) సాహసికుఁడు. "ఉ. సింహాకిశోరవృత్తిగ, జ్రింపుచునున్నవాఁడుమదిమృత్యుభయంబిసుమంతలేకయీ, తెంపరి." జై. ౨, ఆ.

తెంపి. దే. వి. 1. విధవ; 2. తెంపుయొక్క రూపాంతరము. "ఎడతెంపిగఁగొందఱుపాయవాఱుగన్." భార. విరా. ౫, ఆ.

తెంపు. దే. ప్రే. తెంచు. వి. 1. తెగువ; 2. తెగుట.

తెకతెక. దే. వి. ఉడుకుట క్రాఁగుట యెగయుటలయందగు ధ్వన్యనుకరణము. "గీ. చిత్తముతెకతెకనుడికిమెత్తఁబడియె." పర. ౧, ఆ. "తెకతెకక్రాఁగు తమ్మివిరితేనియ." పా. ౪, ఆ. "తెకతెకసెకలెగయ." రామా. ౫, ఆ.

తెకతేర. దే. విణ. (తేర+తేర.) బొత్తిగా సంబంధములేనిది. "తెకతేరయిదియేమియొకరిసొమ్మె." పా. ౪, ఆ.—క్రి. విణ. మిక్కిలివ్యర్థము. "ఎ, గీ. ప్రాణమేటికిఁ దెకతేర పాపుకొనఁగ." పంచ. వేం. 3, ఆ. "తెకతేరగనీకగవిడిచిపోయెదన." కళా. 3, ఆ.

తెక్కరము. దే. వి. విలాసము.

తెక్కలి. వై. వి. 1. దొంగతనము*; "తెక్కలిబుద్ధియేదిక్కులందుఁదఱచయ్యె." భార. శాం. ౨, ఆ.—2. వంచన*; "మహోన్నతపీఠమలంకరించునిన్, దెక్కలిఁదాఁకిధాతయిలఁద్రెళ్లెడునట్లుగఁజేసె." భార. శల్య. ౨, ఆ.—3. ప్రమాదము*. "క. అక్కటనాగురుపుత్త్రుం, దెక్కలిఁగొట్టిడిలిని." భో. ౪, ఆ.—విణ. వంచకము*. "తెక్కలిమృత్యుభయంబు." భాగ. ౬, స్కం.

తెక్కలికాఁడు. ద్వ. వి. దొంగ. (చూ. చొచ్చిల్లు.) విణ. వంచకుఁడు*. "క. హితమొనరించెదనంచున్, ధృతరాష్ట్రతనూభవునకుఁ దెక్కలికాఁడై, మృతియొనరించెందానును, మృతుఁడయ్యెనుభ్రాతృపుత్రమిత్రయుతముగన్." భార. స్త్రీ. ౨, ఆ.

తెక్కలిపాటు. వై. వి. విపత్తు. "ఉ. ఎక్కడనెల్లలోకముల నెవ్వరుఁ గోరనిక్రొక్కనేఁడునా తెక్కలిపాటుకై తివిరి దేహమునేడఁగవచ్చి నాము." భాగ. ౬, స్కం.

తెక్కు. దే. వి. టెక్కుయొక్క రూపాంతరము. పా. ౫, ఆ.

తెగ. దే. వి. 1. సజాతీయసమూహము; "క. వినురక్కసులును వేల్పులు, ననియెడునీరెండుతెగలనాశుక్రుఁడునీ, వునుగదనడపెడువారు." య. 3, ఆ.—2. సమూహము; "క. బలుగాలిమూలుమబ్బుతె, గలచాడ్పున." అచ్చ. యు, కాం.—3. విధము; "ద్వి. అగలకమునినాథునప్పునకొక్క, తెగసేయవలయునోదేవియెట్లయిన." హరిశ్చ. ౨, భా.—4. పక్షము; "ఎ, గీ. బాలలుస్వపక్షమున సీతపక్షమునను, జల్లుపోరాడఁగనుఁగొంచుసరసిఁదేలె. క. తనతెగమగునలరించుఘురా, మునితెగకామినులమించిముంచిన." ఉ. రా. ౬, ఆ.—5. (ఎక్కుపెట్టిన) అల్లెత్రాడు, "ఎ, గీ. అతఁడు మూర్ఛ, తెలిసి యొకకోలఁదెగనిండఁదిగిచియేసె." ఉ, హరి. 3, ఆ.—6. (అల్లెత్రాటిని) ఎక్కుపెట్టుట; "ద్వి. నాతెగకేలపినాకివిల్ నిలుచు." రా. బాల, కాం.—7. నిడుపు. "క. పొగరెక్కినమూఁపురములుఁ, దెగనిడు

లవాలములు శైలదేహంబులుభూ, గగనములునిం
డలుఁకెలు, మిగుల మెఱయువృషభగణము మెల్ల
ననడఁచెన్." భాగ. ౧౦, స్కం. పూ.—క్రి.
1. నిశ్శేషముగా; "క. తెగఁదీర్పక తెగటార్పక."
భార. శాం. ౩, ఆ.—2. ఖండితముగా. "తెగ
వాడవలదుసభలను."

తెగఁగొట్టు. దే. స. క్రి. (తెగన్+కొట్టు.) నఱకు. (వాని తల తెగఁగొట్టెను.)

తెగఁజూచు. దే. స. క్రి. (తెగన్+చూచు.) చేంపు. "క. మిమ్ముఁదెగఁజూచిసద్గతి, కెమ్మెయిఁబోవంగనేర్తునేను." భార. అను. ౩, ఆ. (ఇందు పూర్వావయవమైన తెగ అనునది అంత్యావయవమైన చూచు క్రియకు వెనుకను ప్రయోగములయందు కానంబడియెడి. "క. నీచమతినన్ను నెవ్వఁడు, చూచిన నా రాత్రిలోనఁజూతురు తెగఁదా, రాచపలు." భార. విరా. ౧, ఆ.

తెగఁబడు. ద్వ. అ. క్రి. (తెగన్+పడు.) తెగించు. (స్వార్థమున పడు.)

తెగఁబాటు. ద్వ. వి. (తెగన్+పాటు.) తెగఁబడుట. "చ. తగినతెఱంగుచేసినను దాని సెఱుంగరు చెట్టగాంచినన్, దెగడుదు రెల్లభంగిజగతీజనముల్ వినుమట్లుగాకయున్, బగతుని నాయితంపుఁ దెగఁ బాటునఁబైపడి గెల్వ నేర్చినన్, మగఁటిమి దూలుఁ జే దొసంగు మాలఁగ దానవుఁజంపు మెమ్మెయిన్." నిర్వ. ౧౦, ఆ.

తెగఁబాఱు. దే. అ. క్రి. (తెగన్+పాఱు.) తెగించు. "గీ. నీవుగెల్చినదాస్యంబు నీకునేను, జేయఁగలదాననేను గెల్చిననునీవు, నాకుఁజేయంగఁగలదానవీకడింది, పన్నిదముచఱుమని తెగఁబాఱిపలికె." భార. అను. ౧, ఆ. (స్వార్థమున పాఱు.)

తెగచు. దే. అ. క్రి. కలఁగు. "ఎ, గీ. దేవయానఁ గనుంగొని తెగచివగచి." య. ౩, ఆ.

తెగటాఱు. దే. అ. క్రి. (తెగటు+ఆఱు.) చేచ్చు, నశించు. "క. లోకంబులు తెగటాఱఁగ." భార. అర. ౪, ఆ. "వేవురుసంశప్త కాగ్రేసరులు తెగటారిరి." భార. కర్ణ. ౨, ఆ.

తెగటాఱుచు. దే. ప్రే. తెగటాఱఁజేయు, (రూ. తెగటార్చు. "వ. అద్దానవుం దెగటార్చి దానివరియించె." మార్క. ౭, ఆ.)

తెగటు. దే. అ. క్రి. త్రుళ్లు. "వ. అట్లయిననందలిబంధుమిత్ర సహాయజనంబులుగలవి నవ్వుచుం దెగటుచునునికిమనమనంబులకుఁ బ్రియంబుసేయు." భార. ఉద్యో. ౧, ఆ.—వి. త్రుళ్లు.

తెగడ. వై. వి. త్రివృతి. (దీని భేదములు తెల్లతెగడ, నల్లతెగడ. ఇదే తెల్లతెగడ.)

తెగడు. దే. అ. క్రి. ఉపేక్షింపఁబడు. "క. మిగులఁగడగండ్లఁబడియున్, దెగడక వారెల్లనిపుడు నీమేనల్లుం, డగుకతి వేలుపుకతమున, సొగిసును బులతోడనిల్చియుండిరిసుమ్మీ." నీలా. ౧, ఆ.—స. క్రి. 1. తిరస్కరించు; 2. ఉపేక్షించు; "గీ. త్రెళ్లింపుముపొలఁతియనుచుఁ దెగడకదానిన్." అచ్చ. బాల, కాం.—౨. నిందించు. "చ. తగినతెఱంగుచేసినను దాని సెఱుంగరు చెట్టగాంచినన్, దెగడుదురెల్లభంగిజగతీజనముల్." నిర్వ. ౧౦, ఆ.—వి. నింద. "క. హితకా, ర్యగతులఁజెప్పఁగఁ దెగడఁగుఁ, బొగడఁగు." భార. కర్ణ. ౧, ఆ.

తెగవేయు. దే. స. క్రి. నఱకు. (దానితల తెగవేసెను.)

తెగించు. దే. అ. క్రి. సాహసించు.

తెగు. దే. అ. క్రి. 1. ఖండితమగు; 2. ఛిన్నమగు; 3. చేచ్చు. "నరనాయకులనుజచ్చిరికుమారులుఁ గలయుండఱుఁ దెగిరి." భార. శల్య. ౧, ఆ.—4. తీర్పగు; "క. తెగదిప్పుడుమూన్నెల్లకుఁ, దగవడుగఁగరండు." జై. ౮, ఆ. (త్రెగుయొక్క రూపాంతరము.)—5. సాహసించు. "ఉ. ఓరిదురాత్మ నీకుఁ దెగనొల్లకయుండుటనీపరాక్రమం, బారసికాదురా." ఉ, హరి. ౪, ఆ.

తెగుడు. దే. వి. తెగుట, విచ్ఛేదము.

తెగుదల. దే. వి. 1. అంతము; "ఎ, గీ. ఈమనోగ్లానికిఁ దెగుదలెద్దిచెపుమ." నిర్వ. ౯, ఆ.—2. క్షయము. "గీ. రాత్రి తెగుదలదినమేలగాకయుండు." భార. అర. ౫, ఆ.

తెగుదారి. దే. విశే. (తెగువ+దారి.) 1. సాహసికుఁడు, సాహసికురాలు; "ధవునెడఁబాసివచ్చు తెగుదారికి నాకిఁకవంతయేల." ఉ, రా. ౬, ఆ.—2. దాత. "కడుసొంపులుగాఁబొగడించుకోఁజామీతలఁపునవిప్పుడింత తెగుదారులమైతిమి." ప్రభా. ౧, ఆ.

తెగుదెంపు. దే. వి. (తెగు+తెంపు.) తీర్పు. "మ. యమునానుండనుఁగృష్ణుఁజూచిబకదాల్భ్యవ్యాసశుకాద్యాదిసం, యములుండం దెగుదెంపుచేయుకిటులేలావారిఁబొమ్మంటివి." జై. ౮, ఆ.

తెగుబడి. దే. వి. 1. తెగుట; 2. దుక్కి; 3. అమ్మకము.

తెగులు. దే. వి. 1. వ్యాధి; 2. చీడ.
తెగులుగొంటు. దే. విణ. వ్యాధిగ్రస్తుఁడు, వ్యాధిగ్రస్తురాలు, వ్యాధిగ్రస్తము.
తెగులుగొను. దే. అ. క్రి. (తెగులు+కొను.) వ్యాధిగ్రస్తమగు.
తెగువ. దే. వి. 1. సాహసము; 2. దాతృత్వము.
తెగువడు. ద్వి. అ. క్రి. (తెగుడు+పడు.) వేఁటుపడు. "తెగువడికచ్ఛపముపోక." పంచ. నా. ౨, ఆ.
తెచ్చు. దే. స. క్రి. తీసికొనివచ్చు, అనయించు.
తెట్టగిలఁబడు. ద్వి. అ. క్రి. (తెట్టగిలన్ + పడు.) తెట్టగిల్లు. (స్వార్థమున పడు.)
తెట్టగిల్లు. దే. అ. క్రి. నిస్సారమగు.
తెట్టతెరువు. దే. వి. (తెరువు+తెరువు.) నడివీధి. (ఇట్లు తెట్టతెన్ను.)
తెట్టియ. వై. వి. 1. తెట్టువ*; 2. తేనెపెర*; 3. తృణకాష్ఠాదిభారము*.
తెట్టు. దే. వి. పట్టణమునకైనను కోటకైనను బయట చుట్టు నేర్పఱచిన కంపకోట.
తెట్టువ. వై. వి. 1. సమూహము; "వ. బట్టబయలని లిచిచూచుటకు బెట్టులికియిట్టలంబగు మొగుళ్లతెట్టువలలోమలుఁగుపడి." ఉ, రా. 3, ఆ.—2. నీటియందు గాలికొక్కప్రక్కచేరిన తృణాదిసమూహము*. "గీ. వెల్లిడొంకిచనఁదోఁచునురువు తెట్టువలనంగ." లక్ష్మీ. 3, ఆ.
తెట్టువగట్టు. ద్వి. అ. క్రి. (తెట్టువ+కట్టు.) నీటియందుతృణాదికముగాలికొక్కప్రక్కచేరు. "తీరముఁలఁదెట్టువగట్టుసరోజరేణువుల్." నిర్వ. ౧, ఆ. (రూ. తెట్టువలుగట్టు. "వ. చతురంగంబులయుదయుదంబులఁజామరచ్ఛత్రకేతుశకలంబులుఁగోదండగదాదండాదిహేతిఖండంబులుం బెరసిపాఱునెత్తురుటేఱులఁ దెట్టువలుగట్టె." భార. ద్రో. ౪, ఆ.)
తెట్టువలుగొను. ద్వి. అ. క్రి. (తెట్టువలు+కొను.) తెట్టువలుగట్టు. (రూ. తెట్టెలుగట్టు.)
తెట్టువు. దే. వి. తెట్టుయొక్కరూపాంతరము.
తెట్టె. వై. వి. తెట్టియయొక్కరూపాంతరము.
తెట్టెము. వై. వి. మొత్తము*.
తెట్టెలుగట్టు. ద్వి. అ. క్రి. (తెట్టెలు+కట్టు.) రాశిపడు. "వ. తెట్టువలుగొన్న మాంసంబులును దెట్టెలుగట్టినయనిశకలంబులును." కళా. ౮, ఆ.
తెట్టెలుగొను. ద్వి. అ. క్రి. (తెట్టెలు+కొను.) తెట్టెలుగట్టు. "వ. తెట్టెలుగొనం గూలినకాలుబలంబులును." ఉ, హరి. 3, ఆ.
తెడ్డు. వై. వి. 1. కొయ్యగరిఁటె; 2. పడవత్రోసెడు పలక. (త్రెడ్డుయొక్కరూపాంతరము.)
తెడ్డుమూతికొంగ. ద్వి. వి. జలపక్షివిశేషము.
తెనమణు. దే. అ. క్రి. శయనించు. "క. హస్తికొనియొక్కకొందఱు, నత్తెరువుంగట్టఁబనిచియుఁ అక్రియఁదాఁ, దిత్తొకటియుఁగొని తెనమణి యుత్తరముత్తరమటంచు నొకప్రొద్దుకడన్. లేచి." (కొన్ని పుస్తకములయందు తెనమణి అనిపాఠము న్నది.) అను. ౫, ఆ.
తెనుఁగు. వై. వి. తెలుఁగుయొక్కరూపాంతరము.
తెన్ను. దే. వి. దారి, మార్గము. "తెన్నునకేనుగాచినను." య. 3, ఆ.
తెన్నుండు. దే. అ. క్రి. పరుండు, శయనించు.
తెప్ప. దే. వి. 1. తెప్పకొయ్య, కట్టుమ్రాను; 2. ప్రోవు. "సీ. తెప్పలైనెత్తావికుప్పలైపుప్పొళ్లురులగందవొడిత్రోవఁజిలుకవలదు." వసు. ౧, ఆ. (తేపయొక్కరూపాంతరము.)
తెప్పదరలఁగ. దే. ద్ర. క్రి. విణ. అతివేగముగా. "గీ. తెప్పదరలంగ బండులేతెంచుచున్న, యవినిహాత్తతన్నెమిజాతారవములు, గడఁకనెడ్లనుచిమిఱొప్పెడునరాలి, యులివునినియుల్లముసఁదునులుకుపుట్టె." భార. అను. ౪, ఆ.
తెప్పలఁదేలు. దే. అ. క్రి. (తెప్పలన్+తేలు.) ఓలాడు. (ప్రే. తెప్పలఁదేల్చు. "క. అప్పుడుసత్తముఁడునన్నునట్లురసాధిన్, దెప్పలఁదేలిచి." కళా. ౬, ఆ.)
తెప్పిర్లు. దే. అ. క్రి. తెప్పిటిల్లుయొక్కరూపాంతరము. "దశవక్త్రుండంతమూర్ఛిల్లియంతినె తెప్పిర్లి" ఉ, రా. 3, ఆ.
తెప్పిటిల్లు. దే. అ. క్రి. అపాయమునుండి తేలు. (రూ. తెప్పిటిలు.)
తెప్పిలు. దే. అ. క్రి. తెప్పిటిలు. "క. పెటికతెఁలఁగులుమేనులు, నెటిపడనెల్లెడలఁగలయవితిహాగులి, త్రటినీరులుద్రావకతె, ప్పిలకట్లొకొశత్రుసైన్యభీషణమూర్తి." భార. ద్రో. 3, ఆ.
తెప్పున. దే. ద్ర. క్రి. విణ. శీఘ్రముగా.
తెబక. దే. వి. మొత్తము, సమూహము.
తెమడ. దే. వి. శైత్యముచేఁగలిగెడు శ్లేష్మము.

**తెమలు.** దే. అ. క్రి. చలించు. "క. జముదూతవోలెనచటికి, సముదగతిన్ వేఁటకాఁడు చనుదేరంగా, దేమలక హిరణ్యకుండురి, దుమురులుగాఁ గొతికిబొక్కదూఱంబాఱెన్." పంచ. నా. ౨. ఆ.

**తెమలుచు.** దే. ప్రే. (తెమలఁజేయు.) ఉసుము. (రూ. తెమల్చు. "రొంపివోవనీటఁదెమల్చి." భార. అను. 3, ఆ.)

**తెమ్మ.** వై. వి. తేమయొక్క రూపాంతరము. "క. తెమ్మెరలు పిమ్మ మదగం, ధమ్ముల తెమ్మలకుసమ్మదంబులఁ జనిజుం, జుమ్మనుతుమ్మెదకొమ్మల, నిమ్మగుకరటమ్ములొమ్ము నిధనుఖుఁ గొలఁతున్." కవిస. ౧, ఆ.

**తెమ్మెర.** దే. వి. (తెమ్మ+ఎర.) 1. చల్లగాలి, మలయమారుతము; "క. తెమ్మెరనీకెంతెమ్మెర." విజ. 3, ఆ. (ఎరశబ్దమునకు వృత్తియందు గాలియర్థమని తెలియఁదగును.) 2. గాలి. (చూ. తెమ్మ.)

**తెర.** వై. వి. 1. మఱుఁగుచీర*; చ. తెరయును మేలుకట్లుఁదగుదీవియలున్ బొలుపొంద." భార. సౌ. ౧, ఆ.—2. అడ్డువల*; "క. ఇటువలె వేఁటాడెడుతఱిఁ, దటుకున నొకయిఱ్ఱి తెరలు దాఁటి పడింజెం, గటనుఱుక నెఱుకుదొరలా, ర్భటయున్ రాజులును దానిచొప్పునఁ జనఁగన్." ఉ. ౨. ఆ.—3. అల*. "తెరలెత్తి సప్తసాగరములఁ బొరలంగ." ఉ. హరి. ౪, ఆ.—4. బ. పరంపర. "క. నరవరులయ్యయిదిక్కుల, కరిగిమహీపతుల చేనరిగొనిధనముల్, దెరలుగఁ దెచ్చినమార్గము, పరువడి నెఱిఁగింపు నాకుఁ బరమమునీంద్రా." భార. సభా. ౧, ఆ.

**తెరతెర.** వై. వి. పరంపర*. (వానికి దగ్గు తెరతెరగా వచ్చుచున్నది.)

**తెరల.** దే. వి. కవణము, కబళము.

**తెరలఁబాఱు.** దే. అ. క్రి. (తెరలన్+పాఱు.) తొలఁగు. "మ. తెరలంబాఱెఁగలంగిగోవులుకడున్ దీనంబులై ఱొలచున్." హరి. పూ. ౬, ఆ. (స్వార్థమున పాఱు.)

**తెరలిక.** దే. వి. గుంపు, సమూహము.

**తెరలు.** దే. అ. క్రి. 1. తెర్లు; "క. ఖరకరకరహతి సలసలఁ, దెరలెడుమల్లీమరందదీర్ఘిక చుట్టున్." పాండు. ౧, ఆ.—2. బయలుదేఱు; "క. పురజనములెల్లముందటఁ, దెరలినపిమ్మటనువాసుదేవుఁడుగమన, స్ఫురణముతండ్రికిఁ జెప్పఁగ, నరుదెంచినసుతునితోడనతఁడిట్లనియెన్." జై. 3, ఆ.—3. కలఁగు; "క. అనిలోఁ దెరలుట తొలఁగుట, యనునివి చనుఁగాక." భార. కర్ణ. 3, ఆ. "ఊర్పులన్ దెరలిమహార్ణవోదకము త్రిప్పికొనన్." లక్ష్మీ. 3, ఆ.—4. తొలఁగు*. "పురికొనుచుం దరలుచు." భార. భీష్మ. ౨, ఆ.

**తెరలుచు.** దే. ప్రే. తెరలఁజేయు. (తొలఁగించుటకు.—"క. నరుఁడొకరథికునియనుమతిఁ, జొరఁ దలఁచునెమనుజసేనసురబలమైనన్, దెరలించికొనిచ్చెలవిడి, నరుగుందనవలయునెడకు." భార. ద్రో. ౪, ఆ. (రూ. తెరల్చు.)

**తెరలుడు.** దే. వి. బయలుదేఱుట, ప్రయాణము.

**తెరవాఱు.** ద్వ. అ. క్రి. (తెర+పాఱు.) జిడ్డుదేఱి తెరగట్టు. (తెర=అల.) "చ. ద్రవిడకుటుంబినుల్ పసుపురాచినగత్తు పుఁ జాపక్రిందనం, బువుతెర వాఱఁగా." ఆము. ౧, ఆ.

**తెరవేఁట.** ద్వ. వి. తెరయెత్తి ఆడెడు వేఁట. (చూ. ఏదువేఁట.)

**తెరవేఁటకాఁడు.** ద్వ. వి. తెరయెత్తి వేఁటాడెడు వేఁటకాఁడు. "ఉ. అత్తెరవేఁటకాండ్రుయమునాంబుతరంగపరంపరాకృతిన్, మత్తిరమైనసూకర సముత్కరముంగని వేఁటకాండ్రు విల్లెత్తకమున్నె రాజుమదికెక్కడునట్లుగ వీనివిత్తికిం, బుత్తమటంచుఁబట్టెడలు బోరున డుయ్యభయంకరార్భటిన్." (ఇక్కడ వేఁటకాండ్రు అనఁగా విలువేఁటకాండ్రు అని అర్థము.) స్వా. ౪, ఆ.

**తెరువరి.** దే. విశే. (తెరువు+అరి.) దారినడచువాఁడు, పథికుఁడు.

**తెరువాటీఁడు.** దే. విశే. (తెరువాటు + ఈఁడు.) తెరువాటుకాఁడు.

**తెరువాటు.** దే. వి. (తెరువు+ఆటు.) (దొంగలు) దారిగట్టికొట్టుట, అభిగ్రహము. "తెరువాటు పలనఁ దస్కరులచేతఁ జేటొందిధనము వాంఛించినతఁడు." భార. అను. ౨, ఆ. ("తెరువాటు కొట్టి, తెరువాటుకొట్టి." ఇత్యాది స్థలములయందు తెరువాటుగా కొట్టుటయని తెలియవలెను. అప్పుడు తెరువాటునకు దారికట్టుటమాత్రమర్థము.)

**తెరువాటుకాఁడు.** దే. వి. దారికట్టికొట్టి దోఁచుకొనుదొంగ, పరిపంథి.

తెరువు. దే. వి. దారి, మార్గము. "వ. ఇట్లుపన్న గారినగారిపొరువు తెరువునంజనునప్పుడు." ఉ, హరి. ౬, ఆ.

తెర్లు. దే. వి. నీళ్లులోనగునవి కాఁగి సలసలపొంగు. వి. నీళ్లులోనగునవి కాఁగి సలసలపొంగుట. (తెరలుయొక్క రూపాంతరము.)

తెర్వు. దే. వి. తెరువుయొక్క రూపాంతరము. (చూ. కట్టెఁడి.)

తెఱ. దే. విశే. తెఱపయయినది. (ఉదా. తెఱగంటి, తెఱన. మొ.) (దీనికి వ్యస్తముగా ప్రయోగము కనఁబడదు.)

తెఱఁగు. దే. వి. 1. విధము; "క. ఆఱడిఁజెందుట నీకుమేల్తెఱంగేతలఁపఁ గా." అచ్చ. యు, కాం.— 2. క్రమము; "పౌరజనులుజానపదులు తెఱఁగు తో నిన్ననుసరింతురు." భార. ఆశ్ర. ౨, ఆ.— 3. చక్కన; "క. వెఱఁగుపడిహర్షరాగము, దఱిఁగినఁగడు వెల్లనైనవదనములు వ్రాలఁగా, దెఱఁగేది తేచ్చపడిరి." భార. అర. 2, ఆ.—4. సంధి. "ఉ. కౌరవపాండవుల్ తెఱఁగునైకొనిశాంతతఁబొందియున్కియే, లారయనాకునీకుఁగులమంతకునీ నృపకోటికుర్వికిన్, బోరితమైన నింతకునుబుట్టు మహాపదకావునన్ ధరిత్రీరమణాగ్రగణ్యగణుతించి యవశ్యముఁబొందొనర్పవే." భార. ఉద్యో. 3, ఆ.

తెఱఁగుపడు. ద్వ. అ. క్రి. (తెఱఁగు+పడు.) సంధియగు. "గీ. మాటపొందెఱింగిమోటమైనల్లనఁ, జేరికౌరవేంద్రుచిత్తవృత్తి, కనుగుణంబుగాఁగనానతుండగుచుఁబ్రా, ర్థించియడుగకున్నఁదెఱఁగు పడదు." భార. ఉద్యో. ౧, ఆ. (ప్రే. తెఱఁగుపఱచు.)

తెఱకువ. దే. వి. 1. వివేకము; "చ. ఎఱిఁగినవాఁడు కర్మచయమెల్లనుమాని హరిస్వరూపమున్, సెఱయసెఱుఁగుఁదాను మదినేరుపుచూపు గుణానురక్తుఁడై, తెఱకువలేకభ్రమ్మచుదేహధనాద్యభిలాషయుక్తుఁడై, యెఱుఁగనివానికిందెలియనీశ్వరలీలలెఱుఁగఁజెప్పమా." భాగ. ౧, స్కం.— 2. ఉపాయము. "క. కనుఁగొనియిదియునియాశ్రమమనితహతహపొడమియచటికరిగిన నాకున్, గననగుటొక తెఱకువయని." స్వా. ౨, ఆ.

తెఱకొను. దే. అ. క్రి. (తెఱలు+కొను.) (చూ.) తెఱలు. (స్వార్థమున కొను. ప్రే. తెఱకొలుపు.)

తెఱగంటి. దే. వి. (తెఱ+కన్ను.) 1. అనిమిషుఁడు; "తెఱగంటిమూఁకలఁగడిందిబలంబునఁదాసి." ఉ, రా. ౮, ఆ.—2. అనిమిషస్త్రీ. "గీ. కులుకుభాయంపుముద్దులగుమ్మగలుగు, సొగసుకానికిఁదెఱగంటిచిగురుఁబోండ్లుఁ, బులుఁగురాచేడియలనుజక్కులవెలందు, కలుసువీనులకంటి చెల్వలునిఁకల." నీలా. ౨, ఆ.—3. చేఁప, అనిమిషము.

తెఱగంటిఱేఁడు. దే. వి. ఇంద్రుఁడు, లేఖర్షభుఁడు.

తెఱచు. దే. స. క్రి. తెఱపచేయు. "ఎ. గీ. నీకబులుద్రోవకఁచికటియును, దెఱచుటకుఫాలనేత్రంబు తెఱవవలసె." భార. అను. ౪, ఆ.

తెఱనోటిమెకము. ద్వ. వి. (తెఱనోరు+మెకము.) సింహము, పంచాస్యము. "గీ. పంచముఖసంజ్ఞ పార్వతీపతికిఁగాక, హరియనుశుభాహ్వయంబు శ్రీహరికిఁగాక, యిట్టి తెఱనోటిమెకములకేలయనుచుఁ, గనలియుగ్రంబులైనసింగములఁగడపె." రామా. ౨, ఆ. (ఇట్లు తెఱవామెకము.)

తెఱప. దే. వి. 1. తెఱచుట; 2. ఉపశమనము. వి. మఱుఁగులేనిది. (తెఱపనేల.)

తెఱపి. దే. వి. సందు, అవకాశము. "క. తెఱపిగని దానవేశ్వరుఁ, డుఱుకకృపాణమున నాభిగోత్రము నెఱుకల్, నఱికినఁగూలెనతండిల, నఱవఱలెపవనహతిమహాభ్రమువోలెన్." భార. అర. ౬. ఆ.

తెఱపుమఱపు. ద్వ. వి. (చిత్తస్వాస్థ్యము తప్పినప్పుడు కలుగు) తబ్బిబ్బు. (వాఁడు జన్మిపుట్టి తెఱపుమఱపు మాటలాడుమన్నాఁడు.)

తెఱలు. దే. అ. క్రి. (వాసన) బయలువెడలు.

తెఱవ. దే. వి. (తెఱ+వా.) ఆఁడుది, ఇంతి. "క. ఉఱవగునారుగపంటలు, గొఱియలపాఁడియును దఱచగున్ బురుషులకున్, దెఱవలు చుట్టములయ్యెద, రెఱచియుభుజియింతురర్థినెల్లజనంబుల్." భార. అర. ౪, ఆ.

తెఱవు. దే. అ. క్రి. తెఱఁగుయొక్క రూపాంతరము. "క. పిఱుతివియక నాముందఱఁ, దెఱవాయిప్పగిదినాడఁదెఱవా." అచ్చ. అ, కాం.

తెల్ల. దే. విశే. తెఱయొక్క రూపాంతరము. "సీ. బొక్కిఱొమ్ముననూదబొడ్డునుమిడిపండ్లు తెల్లనోరును బాఁచిదేఱు మొగము." భిల్లా. ౪, ఆ.

తెల. వై. విశే. తెల్లయొక్క రూపాంతరము. (ఆమ్రేడితమునందు తెలతెల. "తెలతెల వేగెనప్డు." (తెల—తెలతెలగానని యర్థము.) భార. మా. ౧,

ఆ. "క. తలయుంజీరయు నొడలును తెల తెల గా." పంచ. నా. ౪, ఆ.)

తెలగా. వై. వి. 1. త్రిలింగదేశమునందలి యొక శూద్రజాతి; 2. బ. ఆజాతివారు. (వృత్తియందు దీర్ఘమునకు హ్రస్వము. ఉదా. తెలగబలిజెలు.)

తెలచు. దే. స. క్రి. తెలుచుయొక్క రూపాంతరము. (ఇట్లు అకారమధ్యముగా గ్రంథములయందు కానంబడకున్నది ఆ పక్షమున ఇది వెలచు క్రియవంటిదిగా నుండవచ్చును.)

తెలతెలఁబోవు. ద్వ. అ. క్రి. (తెలతెల+పోవు.) వెలవెలఁబోవు.

తెలతెలవాఱు. ద్వ. అ. క్రి. (తెలతెల+పాఱు.) . తెలతెలబోవు; "క. తొలువేల్పుల మొగములు తెల, తెలవాఱఁగఁ దెల్లవాఱెఁ దెఱపల మోముల్." ...న్ని. బాల, కాం.—2. తెల్లగా తెల్లవాఱు. "క. తెలతెలవాఱెడి వేళను." భాగ. ౧౦, స్కం. ఉ.

తెలనాకు. ద్వ. వి. తెల్లనాకుయొక్క రూపాంతరము. "సీ. అడపంబుతో య్యాలిమడిచియిచ్చిన తెలనాకుచీలిక చేతియందయుండ." కళా. ౨, ఆ.

తెలవాఱు. ద్వ. అ. క్రి. తెల్లవాఱుయొక్క రూపాంతరము. "క. తెలవాఱెనపుడు దీపపుఁ గళికల తోఁ దెల్లవాఱఁగాఁ దన మోముల్." హంస. ౨, ఆ.

తెలి. వై. విశే. 1. తెల్లనిది. "తెలినవ్వు."—2. నిర్మలము. "ద్వి. తెలిడెందమున జలదేవత నిలిపి." రా. యు, కాం.

తెలికపిండి. వై. వి. గానుఁగపిండి, పిణ్యాకము.

తెలికలు. వై. వి. బ. నువ్వులు. (వృత్తియందు ఏకవచనాంతము. తెలికపిండి. మొ.)

తెలికవాఁడు. వై. వి. గాండ్లవాఁడు.

తెలిగంటి. ద్వ. వి. (తెలి+కన్ను.) ఆఁడుది, ధవళాక్షి. "సీ. దౌప్యదశ్రీ నిల్చు ధవళాంబుజము పోల్చిఁ దెలిగంటి నెమ్మోము తెల్లనయ్యె." ఉ. రా. ౨, ఆ.

తెలిగాము. వై. వి. గ్రహవిశేషము, శుక్రుఁడు.

తెలిగొను. ద్వ. అ. క్రి. (తెలి+కొను.) ప్రమాణము చేయించు. "క. ముచ్చునుబట్టినమాత్రన, చెచ్చెర దండింపక తిని చే దెలిగొని." విజ్ఞా. ప్రా, కాం.

తెలిదమ్మి. వై. వి. (తెలి+తమ్మి.) తెల్లదామర, పుండరీకము.

తెలిదమ్మికంటి. ద్వ. వి. (తెలిదమ్మి+కన్ను.) విష్ణువు, పుండరీకాక్షుఁడు. "చ. అని తెలిదమ్మికంటి మదినెంటి పెనంగొను మూర్తి నాడిన౯." నీలా. ౨, ఆ.

64

తెలిపక్కము. వై. వి. శుక్లపక్షము.

తెలిపిట్ట. వై. వి. హంస, శ్వేతగరుత్తు. "సీ. తెలిపిట్ట గమిఁజేరఁదీసితద్దయుబుద్ధి దెలిపి మెల్లన నడల్ దీర్పరాదె." నీలా. ౨, ఆ. (ఇట్లు తెలిపులుఁగు. మొ.)

తెలిమెకము. వై. వి. సింహము.

తెలిమొదవు. ద్వ. వి. కామధేనువు.

తెలియ. వై. వి. తెల.

తెలియు. దే. అ. క్రి. 1. విదితమగు; "వ. దేవత లకుం దెలియ నట్టివి యాతనికిం దెలియు." భార. ఉద్యో. ౨, ఆ.—2. విశదమగు; "క. కులిందకుఁ డాద్యంతమును దెలియవినిపించె౯." జై. ౫, ఆ.—3. మేలుకొను; "తెలియక నిద్రించుమగు వఁజూచి." పంచ. నా. 3, ఆ.—4. ప్రసన్నత నొందు. "క. చలముకొని యొరులనుడుపుట, బలియుండై తెంపు సేసి బవరమునకుఁ దాఁ, దెలియుట కాదేయని కురు, కులముఖ్యుఁడు పొంగియతనిఁ గొనియాడెఁ దగ౯." భార. భీష్మ. ౧, ఆ.—స. క్రి. ఎఱుఁగు. "సర్వము౯ దెలిసితినంచుగర్వితమతి౯ విహరించితి." భ. ౧, శతకము.

తెలియేఱు. ద్వ. వి. ఆకాశగంగ.

తెలివి. దే. వి. 1. దేహాత్మాదిభేదజ్ఞానము; 2. వివేకము; "ఇత్తెలివిమనంబున౯ జొనుపు." భార. ద్రో. ౨, ఆ.—3. ప్రకాశము; "గీ. అతనిముఖవికాసముడఁగఁగా దిశలకుఁ దెలివిచ్చె." రామా. ౫, ఆ.—4. కాంతి; "ఎ, గీ. తేటవేలుపు పేటిపన్నీటి బొట్టు, లనఁగఁ జుక్కలు కనుపట్టె నలరు దెలివి." య. ౨, ఆ.—5. వికాసము; "క. ఆశంకరయముఖకమలంబు తెలివి గాంచిముదమున౯." భార. ద్రో. ౨, ఆ.—6. ప్రసన్నత; "గీ. నీకు నీరలఁ దేర్చుట నెటియు కాదె, సిద్ధమెవ్వారిఁ దెలివొందఁ జేయనేర్తు." భార. ఉద్యో. 3, ఆ.—7. (నీళ్లు) తేఱుట; "క. కలఁగిన పెద్దమడుపువిను, తెలివిఁ బొరయునల్లఁ దాన." భార. శాం. 3. ఆ.—8. తెలుపు. "దిఙ్ముఖంబులవింత తెలివి సేర." స్వా. 3, ఆ.

తెలివికత్తె. ద్వ. విశే. వివేకముగలది, ప్రాజ్ఞ.

తెలివికాఁడు. దే. విశే. వివేకముగలవాఁడు, ప్రాజ్ఞుఁడు.

తెలివిడి. దే. వి. 1. దృష్టాంతము; 2. తెలియఁజేయుట

తెలుఁగు. వై. వి. తెనుఁగు. ఆంధ్రము.

తెలుచు. దే. స. క్రి. 1. మ్రొక్కు; "క. దేవానాం ప్రియులమ్రొక్కి తెలుతుఁగుకవులన్." (కుకవులన్—కుకవులనుగూర్చియనుట. కుకవులకున నియుప్రయోగము.) రాఘ. ౧, ఆ.—2. తేర్చు; "క. ద్రోణులచిత్తముశాంతివొందఁజేయుట, మనుఁదెలుచుట." భార. విరా. ౪, ఆ. "నీళ్లకలఁకనిందువురాచితెలుచుభంగి." వాసి. 3, ఆ.—3. ప్రార్థించు. "క. కోకిలములఁదెలిచినఁబలు, గాకులపాదిఁబొదలునట్టికష్టపుఁబులుఁగుల్, నాకునసహ్యములనియా, హాకూఁతలు మానఁగలవెయవిప్రార్థనలన్." కళా. ౬, ఆ. (రూ. తెల్చు.—తేర్చుటకు.—"తెల్చుర్ త్రిలోకంబులన్." హరి. ఉ. ౫, ఆ.) (చూ. తెలియు, తెలుపు.)

తెలుపారు. ద్వ. అ. క్రి. (తెలుపు+ఆరు.) తెల్లనగు. (రూ. తెల్వారు. "సీ. దుగ్ధార్ణవంబునందువిశాలరమణీయమగునొక్కదీవితెల్వారియుండు." భార. శాం. ౬, ఆ.)

తెలుపు. యు. దే. ప్రే. (తెలియఁజేయు.) 1. ఎఱిఁగించు; "క. ఈనారీరత్నముమా, లోనెవ్వరికర్హమగుదెలుపవేకరుణన్." భో. ౭, ఆ.—2. మేలుకొలుపు; "క. కడుఁదడవునిద్రవోయితిఁ, బడఁతీననుఁదెలుపవలదె." భార. అర. ౭, ఆ.—3. తేర్చు. (చూ. తియ్యము.)—వి. ఊఱట.—వై. 1. ధావళ్యము; 2. పరిశుద్ధి*; (చూ. తెలుపువాఱు.) 3. మేహరోగము*. విణ. ధవళము. (రూ. తెల్పు. ఊఱటకు.—"పాలయలుకలను దెల్పులు నటించుచు." మార్క. ౧, ఆ.)

తెలుపుడు. దే. వి. ఎఱుక. "తెలుపుడుదెల్పుచప్పుడును." రామా. ౫, ఆ. (రూ. తెల్పుడు.)

తెలుపుడుసేయు. ద్వ. స. క్రి. (తెలుపుడు+చేయు.) ఎఱిఁగించు. "రాజునెడఁదప్పకయిప్పనియొప్పమీఱఁగాఁ, దెలుపుడుసేసి." రుక్మి. ౧, ఆ. (రూ. తెల్పుడుసేయు.)

తెలుపువాఱు. ద్వ. అ. క్రి. (తెలుపు+పాఱు.) తెలుపారు. "సీ. కడుపులోనొప్పారుకొడుకునిర్మలబుద్ధితెలుపునాఁగనుఁగవతెలుపువాఱె." లక్ష్మీ. 3, ఆ.

తెలె. వై. వి. భోజనపాత్రము. "క. ఇనుపతెలెన్ మంటితెలెన్, బెనుచేతులనాకు పెణకఁబీఁటపయిన్ బో, జనమొనరించుటతగదని, మునుచెప్పిరిజనులకాదిమునివరుతెల్లన్." విజ్ఞా. ఆచా. కాం. (తెలియయొక్క రూపాంతరము.)

తెల్ల. వై. విణ. 1. ధవళము; 2. స్పష్టము. (చూ. ... సటబీసట.) [తెల్లఅనువిశేషణముముందుగల... జ్ఞావాచకశబ్దములు.— తెల్లకలిగొట్టు (కా... టలి!.), తెల్లకాకి (ధ్వాంక్షము.), తెల్లకొక్కు... (బలాక.). తెల్లగగ్గెర (అర్జకము!.) తెల్ల... (లశునము.), తెల్లగన్నేరు (శ్వేతకరవీరము!.), తెల్లగలిక (శతవీర్యా!.), తెల్లగలిజేరు (... త్రము!.), తెల్లగినియ (సునాభము!.), తెల్ల... (మతంగి!.), తెల్లగురిజె (మధుశ్రవ!.) తెల్ల... గురిగింజె (శ్వేతపాకి!.), తెల్లగోరంట (... యకము!.). తెల్లచెఱకు (తేజనకము!.), తెల్ల... జెనము (వృత్తపర్ణి!.), తెల్లజిలకఱ్ఱ (అజాజి!.), తెల్లజిల్లెడు (అలర్కము!.), తెల్లతెగడ (... వృతి!.), తెల్లదామర (పుండరీకము.), తెల్ల... టెన (అశ్వఖుర!.), తెల్లదీవి (శ్వేతద్వీపము.), తెల్లనేల గుమ్ముడు (విదారి!.), తెల్లపులుగుడి... (శ్వేతవాతంగిని!.), తెల్లములక (శ్వేతబృహ... తి!.), తెల్లయిరుగుడు (శ్వేతపత్రము!.) తె... ల్లయుప్పి (మాక్తికఫల!.). తెల్లలొద్దుగు (... వృంతము!.), తెల్లవట్టివేరు (లామజ్జకము.) ... ల్లవస (హైమవతి!.), తెల్లవావిలి (శ్వేతసు... స!.), తెల్లావలు (సిద్ధార్థము.) ఇత్యాదులు...

తెల్లడాలుమెకము. ద్వ. వి సింహము. "క. ఓరె... యిఁదెల్లడాలుమెకము,కాలిత్రుళులమీఁదనడరుకొనడి..." అచ్చ. యు, కాం.

తెల్లన. వై. వి. తెలుపు. విణ. తెల్లనిది. "క. అకట... మిక్కిలితెల్లన." రామా. యు, కాం. (ము... విశేషణమగుచో "క. తెల్లనితామరగద్దియ..." అచ్చ. బాల, కాం.) (చూ. అలకన.)

తెల్లనాకు. ద్వ. వి. (తెల్లని+ఆకు.) తెల్లనిస... తములపాకు. (ఇక్కడ తెల్లన అనఁగా తెల్ల... అని యర్థము.)

తెల్లనార. ద్వ. వి. మత్స్యవిశేషము.

తెల్లనిదొర. ద్వ. వి. 1. శివుఁడు; "క. పెల్లుసెకి... విసమా, తెల్లనిదొరకుతుకమోవఁదిని బ్రదుక... నీ, చల్లఁదనంబునఁగాదే, కల్లోలవతీమతల్లిక... తటినీ." విజ. ౧, ఆ.—2. బలరాముఁడు.

తెల్లమి. వై. విణ. తెల్లముయొక్క రూపాంతరము

తెల్లము. వై. విణ. స్పష్టము*. "క. ఇదియేమి తెలుఁగునకిని, మొదలెయ్యదినాకుఁ దెల్ల ముగఁజెప్పుఁడు." భార. ఆది. ౬, ఆ.

తెల్లయేనుఁగు. ద్వ. వి. (తెల్ల+ఏనుఁగు.) ఇంద్రుని తెల్లయేనుఁగు, ఐరావతము.)

తెల్లవాఱు. ద్వ. అ. క్రి. (తెల్ల+వాఱు.) 1. ఉదయమగు; "గీ. తెల్లవాఱుటగన్గొనియెల్లవారు." సా. 3. ఆ.—2. తెల్లనగు; "ఎ, గీ. తెల్లవాఱుచున్నదివియలల్లార్చుచు." భార. ఉద్యో. ౨, ఆ.—3. సారహీనమగు. (వాని పని తెల్లవాఱెను.)

తెఁ. దే. వి. సమూహము. "సీ. సొంపారు తెలిముత్తియంపుజొంపపు టెల్లి తెనలు నిద్దంపు నురువులు గాఁగ." అచ్చ. బాల, కాం. (తెగయొక్క రూపాంతరము.)

తెనడు. దే. స. క్రి. తిరస్కరించు. "నవపద్మదళము లఁ దెనడు మెఱుఁగుఁగనుదోయి." భార. ఆశ్ర. ౨, ఆ. (తెగడుయొక్క రూపాంతరము.)

తెవులు. దే. వి. తెగులుయొక్క రూపాంతరము. "క. కనుఁగొనికృష్ణుఁడు బలదే, వునకిట్లనుహాయముల సుఁదెవులుగడు వేసమైఁ, జననిచ్చుట కావుననీ, వు మూకొనిరమ్ము రథమునల్లన వెనుకన్." హరి, పూ. 3, ఆ.

తెవులుగొంటు. దే. విణ. తెగులుగొంటుయొక్క రూపాంతరము. "సీ. తెవులుగొంటులనైనఁదీర్చు సంకటమునకోపిముందటియట్లరూపు సేయ." భార. విరా. ౧, ఆ.

తెవులుగొను. దే. అ. క్రి. తెగులుగొనుయొక్క రూపాంతరము.

తెవులుపడు. ద్వ. అ. క్రి. (తెవులు+పడు.) వ్యాధిగ్రస్తమగు. "ఎ, గీ. విశ్వసించిననీరు ద్రావిననునిద్ర, పోయిననుజాలుకొన్నను బొర్లుచున్నఁ దెవులుపడ్డనుగుంపైనదిట్టచెడినఁ, జంపఁడనుకంప నెట్టిహింస్రంబునైన." కాశీ. ౪. ఆ.

తెవ్వుగొంటు. దే. వి. తెవులుగొంటుయొక్క రూపాంతరము. "ఉ. వ్రేఁకనిబండివానికినివిప్రునికిన్ బతికిన్ వివాదికిన్, వ్రేఁకని మోపువానికిని వృద్ధునికిన్ గడుఁజిన్న బిడ్డకున్, వ్రేఁకటియాఁడుమానిసికి వేఁదుఱువానికిఁ దెవ్వుగొంటుకున్, దేఁకువతోఁదొలంగునది తెల్లముగానెదురేగుదెంచినన్." విష్ణు. ప్రా, కాం.

## తే.

తేఁకు. దే. వి. టేఁకుయొక్క రూపాంతరము.

తేఁకువ. దే. వి. 1. ధైర్యము; "క. తేఁకువయులరఁగ నీగతిఁ దోకొనిచనిచదలరత్నతోరణపఙ్క్తుల్, ప్రాఁకెడుఘనగృహములన, మ్మూఁకలవిడియించె రాజముఖ్యుండంతన్." భో. ౪, ఆ.—2. భయము. "క. ఏఁకమెయిఁగ్రీడికొడుకున్, దాఁకఁగనీకొడుకుదలఁచితతిమికవిసెఁబే, రాఁకటితో నున్నహరిన్, దేఁకువచెడిచేరుకఁగతిం గురుముఖ్య." భార. ద్రో. ౨, ఆ. "ఉ. అల్లనయింతియిట్లనియె నారసివాసవుకల్మిలేమియున్, దెల్లముగానెఱింగికొని తేఁకువలేకిటవచ్చుటొప్పునా, యుల్లముశంకితంబగుచునుండఁగ వేగిరపాటుమేల." భార. ఉద్యో. ౧, ఆ.

తేఁటెట్టు. దే. వి. తెంకాయచెట్టు, నారికేళవృక్షము.

తేఁటి. దే. వి. తుమ్మెద, భ్రమరము. "గీ ఏప్రేలెదు తేఁటియింతేటికలుగ, సంశ్రితలసన్నగాలిరా సన్నగాలి, చెల్లునేరోపరసమింతచిలుకచిలుక, సారెకుందింపచందమాచందమామ." రామా. ౬, ఆ.

తేఁడు. దే. అ. క్రి. తెండు, శయనించే. "గీ. అతివపూర్ణేందుభీతిఁదదక్షశాలఁ, దేఁడియతఁడందునిసమడితింద్రఁదోఁప, మింటిపైనుంట కాదనియింటిపైకిఁ, దిమ్ముకొంటినటంచుఁబెన్ జిచ్చవెడలు." (కొన్ని ప్రతులయందు తెండి అని పాఠమున్నది.) ఆము. ౫, ఆ.

తేగ. దే. వి. తాటిమొలక.

తేగడ. దే. విణ. తేసినది. (నాణెము.)

తేగము. వై. వి. ఈవి, త్యాగము.

తేగాకత్తి. ద్వ. చేరకత్తి.

తేజనకము. సం. వి. అ. పుం. కాకివెదురు?.

తేజనము. సం. వి. అ. పుం. వెదురు, వేణువు?.

తేజని. సం. వి. ఈ. స్త్రీ. చేఁగ?.

తేజస్సు. సం. వి. స్. న. 1. ప్రకాశము; 2. ప్రభావము; 3. పరాక్రమము; 4. రేతస్సు. (రూ. తేజము.)

తేజస్వి. సం. విణ. (న్. ఈ. న్.) తేజస్సుగలవాఁడు.

తేజి. దే. వి. 1. మేలుజాతిగుఱ్ఱము; "ఉ. కోమటులెల్లనర్థపులుగుఱ్ఱములెల్లను దేజీలప్పరిన్." విక్ర. ౧, ఆ.—2. గుఱ్ఱము.

**తేజితము.** సం. విణ. (అ. ఆ. అ.) వాఁడిచేయఁ బడినది, **శాతము.**

**తేజీ.** దే. వి. తేజియొక్క రూపాంతరము. (మేలు జాతి గుఱ్ఱమునకు.—"క. అల్లునికినిచ్చెధాత్రీ, వ ల్లభుఁడనురక్తినమరవల్లభుహరితో, నల్లసమూడం బాలెడు, తెల్లనియొకకత్తలాని తేజీహయముల్." సై. ౬, ఆ.)

**తేజరిల్లు.** వై. అ. క్రి. ప్రకాశించు, (రూ.) తేజరిలు.

**తేజో.** వై. వి. 1. ప్రకాశము; 'క. జేజేరారాబాజో జే. గాజిగినెంగిఁదగడినెగడఁగాఁజోలెడు మేల్, తేజోనెడుకుతుకగల, జేజేకుల్ మొగులుదారిసి గజేజేకుల్." అచ్చ. బాల, కాం.—2. కాంతి; "గీ. నీలయను పేరఁదేజోననివ్వటిల్లు, నింతిపెండి లికతెఱఁగెట్టులనిన." నీలా. ౧, ఆ.—3. ప్రతాపము. "గీ. తేజోగలవారియందు సందియము లేక." అచ్చ. బాల, కాం.

**తేట.** దే. వి. 1. నైర్మల్యము; 2. ప్రసన్నతి; 3. తేటినమజ్జిగలోనగునది. విణ 1 నిర్మలము; (నీళ్లు మిక్కిలి తేటగా ఉన్నవి.) 2. ప్రసన్నము; (ఇప్పుడు వీని ముఖము తేటగా ఉన్నది.) 3. విశదము. (తేటగా మాటాడుము.)

**తేటతెల్ల.** ద్వి. విణ. 1. మిక్కిలి స్పష్టము; 2. స్పష్టము. "సీ. అనితేటతెల్లగానప్పుడువివరించిపల్కక తోడిఁబడఁబడఁతినతని. కమ్మితివి."హరిశ్చ. ౪,ఆ.

**తేటపడు.** ద్వి. అ. క్రి. విశదమగు. "లలనాజన్మప్రకారంబుతేటపడంగాంచెద." వసు. ౨. ఆ.

**తేటిక.** దే. వి. తెప్ప.

**తేడా.** వై. వి. పెచ్చు.

**తేది.** వై. వి. (సౌరమానమునందు) దినము*.

**తేనియ.** దే. వి. తేనె.

**తేనియతిండి.** దే. వి. తుమ్మెద, మధుపము. "సీ. ముఖమంబురుహమని ముమ్మరంబుగనవ్వళించు తేనియతిండిలేఁకలనఁగ." పాండు. 3, ఆ.

**తేనె.** దే. వి. మధువు. (పుట్టతేనె, పెరతేనె అని దీని భేదములు అనేకములుకలవు.) (తేనియయొక్క రూపాంతరము.)

**తేనెగద్ద.** ద్వి. వి. పక్షివిశేషము.

**తేనెగాజో.** దే. వి. కాచపలయవిశేషము.

**తేనెటీఁగ.** దే. వి. (తేనె + ఈఁగ.) తేనెకూర్చెడి యీఁగ, సరఘు.

**తేనెతిండి.** దే. వి. తేనియతిండియొక్క రూపాంతరము.

**తేనెతొల.** దే. వి. భక్ష్యవిశేషము.

**తేనెదానిమ్మ.** ద్వి. వి. తియ్యదానిమ్మ?.

**తేనెమామిడి.** దే. వి. తియ్యమామిడి?.

**తేనెమ్రాను.** దే. వి. కేశముష్టి?.

**తేనెయరఁటి.** దే. వి. (తేనె+అరఁటి.) బూడిద... పుపండ్లుగల నల్లఅరఁటి?.

**తేప.** దే. వి. 1. తడవ; 2. తెప్ప "ఉ. కోపము... హరింపుయదుకుంజరపాండవకోటికెల్లనుం. దే... వుగావెనీవు." భార. భీష్మ. ౨, ఆ.

**తేమ.** వై. వి. తడి. విణ. తడిగలది*. (నేల మిక్కిలి తేమ.) (సంస్కృతమునందువలెఁగాక కొం... అర్థభేదము కలిగియుంకుటవల్లను కుండ... దీనివంటి శబ్దములు కొన్ని వైకృతముగా ... బడియుండుటవల్లను ఇదియు వైకృతము... వ్రాయఁబడియెను.)

**తేమగిల్లు.** వై. అ. క్రి. చెమ్మగిల్లు, ఆర్ద్రమగు.

**తేమనము.** సం. వి. అ. న. 1. తడియుట; 2. ... పులుసు.

**తేమము.** సం. వి. అ. పుం. స్తేమము, తడి...

**తేమానము.** దే. వి. వడ్డి. (కొందఱు తే... యర్థము వ్రాసియున్నారు. దానికి తెనుఁగునందు ప్రయోగము కనఁబడలేదు.)

**తేమ్రాను.** దే. వి. టెంకాయమ్రాను.

**తేయాకు.** దే. వి. (తే+ఆకు.) తే అను ... ఆకు. (తే అనునది అన్యదేశ్యము.)

**తేయు.** దే. అ. క్రి. అఱుగు.

**తేర.** దే. వి. తేట; (చూ. తేరకొను.) 2. ... ములేమి. (చూ. తేరకాఁడు, తేరకత్తె.) ... సంబంధములేనిది. (తేరమాట, తేరసొమ్ము. ...) (చూ. తెకతేర.) క్రి. విణ. 1. వ్యర్థముగా; "... నానాసుఖో, పాత్తంబైనవయోనిధానమిది ... య్యాతేరయీవచ్చునే." భాగ. ౯. స్క... 2. అనాయాసముగా. "తేరతురగతెస్క... బట్టి." జై. ౬, ఆ.

**తేరకత్తియ.** ద్వి. విణ. సంబంధములేనిది. అన్య... లు. (రూ. తేరకత్తె. "ఉ. మతివారలుపక్షై... లైనఁదా. నెవ్వరినెల్లకొక్కటయి యుంద్రు...

చంద్రుఁడటంచ్రుబోటిదా, నివ్వలఁదేరకత్తెయ
ను." ఆము. ౫, ఆ.)

తేరకాఁడు. దే. విశ. సంబంధములేనివాఁడు. అన్యుఁడు. "క. ఉరుబాహుబలముగల్గియు, వెర వెఁడినై తేరకానివిధమున నకటా, కరుణయెద లోనఁదలఁపక, దురమునజమువాతనిన్నుఁద్రో చితిఁబుత్రా." రా. యు, కాం. (ఈపదమునకు తేరకపనుండు అర్థములనుబట్టి ఇతరములైనఅర్థ ముల నూహింపనది.)

తేరకు. దే. ద్ర. క్రి. విశ. 1. వ్యర్థముగా; "క. తేరకుమద్వీరభటులఁదెగటార్చినయ, వైరినిఁకం దెగఁజూచెద." ఉ, రా. 3, ఆ.—2. అనాయా సముగా. (వానికిసొత్తు తేరకువచ్చెను.)

తేరకుఁదేర. దే. అవ్య. క్రి. విశ. (తేరకున్ + తేర.) మిక్కిలిఅనాయాసముగా. "బళిరాతేరకుఁదేర చిక్కెనిటులీబంగారుకుండ." పాండు. 3, ఆ.

తేరకొను. దే. అ. క్రి. తేటపడు. "ఎ, గీ. మోముఁ, దేరకొనఁజూచినపుడకన్నీరువడిసె." (తేరకొ నన్ = తేటపడ. ఇట్లంతట గ్రహించునది.) స్వా. 3, ఆ. (దీనికి క్రియావిశేషణమునందే ప్రయోగ ము కానఁబడియెడి.)

తేరు. దే. అ. క్రి. కలుగు. "సీ. తనరుచొక్కపురాణ మునిదంపతులుదనుకంబులుదేర నెయ్యంబుమీ ఱ." రాఘ. ౧, ఆ.—వి. 1. రథము; 2. బండి. "క. మిన్నునకూరక నెగయదు,తన్న సమర్థుండుగాఁడు తల్పగతుండీ, చిన్నికుమారుఁడుతేరే, విన్ననువున నెగసెదీనివిధ మెట్టిదియో." భాగ. ౧౦. స్కం. పూ.

తేరుకాఁడు. దే. వి. (చూ.) రథికుఁడు.

తేరుపూన్పరి. దే. వి. (తేరుపూన్పు+అరి.) సారథి. మావుతిట్టకుంగుదురగు తేరుపూన్పరియు." అచ్చ. ౫. కాం.

తేఱి. దే. వి. కాఁచి తేటిననెయ్యి.

తేటిచూపు. దే. వి. తేరకొనఁజూచుట. "జంకెలు తేటిచూపు లెకసక్కెములన్." భాగ. ౧౦, ఉ.

తేలు. దే. అ. క్రి. 1. తేటపడు; "కామినీకాంతుల కలఁకదేఱె." స్వా. 3, ఆ.—2. ప్రసన్నతనొం దు; "తేలెబలదేవుఁడు." హరి. ఉ. ౪, ఆ.— 3. ఊఱడిల్లు; 4. తేలుకొను; (వాఁడుఇంకను తేఱలేదు.) 5. తెప్పిఱు; "క. తేఱుదురురిపుల నిప్పుడ, మీఱుదురనిఁ గడిఁది మూర్ఛ మెయి నిట్లున్నా, రాఱని తేజంబులతో, నీఱుపయింగ వినియున్న నిప్పుకఁబోలెన్." రా. యు, కాం.— 6. కలుగు; ఉ. సోయగంబుపైఁదేఱఁగఁబ్రౌఢ దంపతులతీరునఁబెంపెసలారిరిద్దఱున్." హరి. ఉ. ౭, ఆ.—7. మాగియు; (చూ. తేలుచే.) 8. తేరకొను. "క. ఓ తేఁడనీకువుదివే మాఱును గందఁగ నేలమానికినకన్, దేఱికనుంగొనుచో మఱి, మాఱుపడంగలరెయెట్టిమన్నీలయినన్." అచ్చ. అర, కాం. (ఇట్లు తేఱిచూచు. మొ.) (దీ నికి ఈయర్థమున క్త్వార్థమునందే ప్రయోగము కానఁబడుచున్నది.)

తేలుకొను. దే. అ. క్రి. స్వస్థతనొందు.

తేలుగడ. దే. వి. 1. మాగియిక; 2. తెలివిడి.

తేలుచే. దే. ప్రే. (తేలఁజేయు.) 1. ప్రసన్నత నొందించు. 2. చేపు. (ఈ యర్థమునందు తేలు చు అనియే ఉండవచ్చును. అయినను వ్రాఁత ప్రతులయందు పెక్కుచోట్ల తేలుచు అని కానఁబడుచున్నది.) (రూ. తేర్చు. ప్రసన్నత నొందించుటకు.—"గీ. తలఁకికురుపతి తాను జొట్ట లునుసాఁబుఁ, దెఱవతోఁదగఁగొనివచ్చి తేర్చుట యును. దేలెబలదేవుఁడు." హరి. ఉ. ౪, ఆ. —చంపుటకు.—(చూ. గరువము.)

తేలగిలఁబడు. ద్వ. అ. క్రి. (తేలగిలన్+పడు.) తేల గిల్లు. "సీ. పరువంపుఁజినుకులపసఁగ్రొవ్వగొని తేలగిలఁబడువానకోయిలలయొప్ప." హరి. పూ. ౯, ఆ. (స్వార్థమునం పడు.)

తేలగిల్లు. దే. అ. క్రి. 1. పైకితేలు; (చూ. తీపు) 2. పరవశమగు. (రూ. తేలగిలు. పరవశమగుట కు.—"ద్వి. మీఱిన మదమున మెయితేలగిలఁగ." పాల్కు. వి. భా.)

తేలవేయు. దే. స. క్రి. తేలగిలఁజేయు. (వాఁడు కన్నులు తేలవేసినాఁడు.)

తేలాడు. దే. అ. క్రి. (తేలి+ఆడు.) తేలు. "గీ. చులుకనిపిగానఁదేలాడెఁజూపులపుడు." రస. 3, గుచ్ఛము. (దీని మొదటిరూపము తేలియాడు. "ఎ, గీ. అంబికానాయకధ్యానహర్షజలధి, మధ్య మునఁదేలియాడెడుమనసుమనసు." భీ. 3, ఆ.) (చూ. ఊఁగాడు.)

తేలిక. దే. వి. లఘుత్వము. విశ. లఘువు.

తేలిపోవు. దే.అ. క్రి. 1. హానిచేయక తొలఁగిపోవు; (వానికివచ్చిన ఆపద తేలిపోయెను.) 2. తొలఁగి

పోవు. "మత్తకోకిల. ఆసంఖ్యయాదవసేనకుఁ, దేలిపోవక చక్కనయ్యెడు ధీరులెవ్వరుపోరు లన్." భార. ఆది. ౮, ఆ.

**తేలు.** దే. అ. క్రి. 1. నీళ్లలో మునుఁగకమీఁద సంచరించు. "వ. మునుంగుచుం దేలుచు." భీ. ౫, ఆ.—2. నీళ్లలో క్రీడించు; "శా. సంసారార్ణవసాగ మన్మథసుధాసారంబునం దేలఁగన్." ఉ, హరి. ౨, ఆ.—3. స్నానముచేయు; "సీ. మంగళస్నానసంభ్రమము దెల్పెడురీతిఁ గెలనఁ గెందామరకొలనఁ దేలి." విజ. ౧, ఆ.—4. తేలగిల్లు; "తేలెడుకన్నుదోయి." పాండు. 3, ఆ.—5. పొడచూపు. "సెలవుల్ వెసనాకుచుఁ బోయె ఋక్షమండలిక యితేలుచున్." ఆము. 3, ఆ.—వి. వృశ్చికము.

**తేలుకొండి.** దే. వి వృశ్చికాలి.

**తేలుచు.** దే. ప్రే. తేలఁజేయు. (రూ. తేల్చు.)

**తేలుమణి.** మి. వి. తేలుకొండి.

**తేలుమీను.** ద్వ. వి. (చూ.) చిలిచిమము.

**తేలుమెన.** దే. వి. తేలుకొండి.

**తేలురాసి.** ద్వ. వి. వృశ్చికరాశి.

**తేలువాఱు.** దే. అ. క్రి. (తేలు+పాఱు.) పుట్టు. "చ. అనిమినుతించుచున్నహృదయంబునసత్కృప తేలువాఱఁగాఁ, గనుఁగొని." రుక్మాం. ౧, ఆ.

**తేవ.** దే. వి. ఉత్సవవిశేషము.

**తేవనము.** సం. వి. అ. న. 1. ఆటతోఁట; 2. ఆట.

## తై.

**తైజసము.** సం. వి. అ. న. బంగారు వెండిలోనగు ధాతుద్రవ్యము. పుం. రాజసగుణము.

**తైజసావర్తని.** సం. వి. ఈ. స్త్రీ. బంగారులోనగునవి కరఁగుమూస.

**తైతిలము.** సం. వి. అ. న. ఒకకరణము. (చూ. కరణము.) పుం. మండెఁగ.

**తైత్తిరము.** సం. వి. అ. న. తిత్తిరిపక్షుల సమూహము.

**తైరు.** దే. వి. పెరుగు, దధి. పాంచా. ౪, ఆ. (మొదటి రూపము తయిరు.)

**తైర్థికుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) తీర్థసేవ చేయువాఁడు.

**తైలపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. చిల్లమఱ్ఱి; (ఇది దేవదారుబంకచే చేయఁబడి సరళద్రవమను పేరుగలది.) 2. శీతచందనము.

**తైలపాయిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. గబ్బిలము; 2. ఎఱ్ఱ తోఁటకూర.

**తైలము.** సం. వి. అ. న. నూనె. (ఇది ఏరండాదిశబ్దపూర్వకమైనప్పుడు తత్తద్భవద్రవ్యమును తెలియఁజేయును. ఏరండతైలము. మొ.)

**తైలికుఁడు.** సం. వి. అ. పుం. గాండ్లవాఁడు.

**తైలీనము.** సం. విశ. (అ. ఆ. అ.) తిలలుపండుచేను. (పొలము.)

**తైషము.** సం. వి. అ. పుం. పుష్యమాసము, పౌషము.

## తొ.

**తొంక.** దే. వి. తోఁకయొక్కరూపాంతరము. "సీ. తొంకతోఁ జుట్టికడంకమింటికి వైచినిడువాల్కపొలదిండిఁబుడమిఁగెడపి." అచ్చ. సుం, కాం.

**తొంగలి.** దే. విశ. 1. వాలునది; "తొంగలిఱెప్పలందొలఁగఁద్రోయుచు." స్వా. ౨, ఆ.—2. స్రవించునది. ఉ. తొంగలిపువ్వుఁదేనియలచూఁకొని మత్తిలితుమ్మెదల్ పయిం, బొంగుచువ్రాల." య. ౪, ఆ.

**తొంగలించు.** దే. అ. క్రి. 1. అతిశయించు; "క. కనయనురాగవికాసము, తనమనమునఁదొంగలింపఁ దగగాఢాలిం, గనమాచరించిసెయ్యం, బునఁగుశలప్రశ్న చేసిముదమునఁబలికెన్." భాగ. 3. స్కం.—2. ప్రకాశించు; "అనినముఱాంతకుండుదాహాసముమోమునఁదొంగలింప." ఉ, హరి. ఆ.—3. వికసించు; "గీ. నీముఖాంబుజాతనిర్ముక్త హరికథా, మృతముఁ ద్రావఁద్రావ మేనువొదలవంతమూనెనీరువట్టునాఁకలియును, దూరమయ్యె మనముఁదొంగలించె." భాగ. ౧౦, స్కం. పూ.—4. వర్ధిల్లు; "ఉ. ధర్మమునన్ మనంబు సతతంబుఁ బ్రవృద్ధముగా మనంబునన్, ధర్మముదొంగలింప." మార్క. 3, ఆ.—5. స్రవించు; "సమ్మదాశ్రువుల్ కనుఁగవఁదొంగలింప." విక్ర. ౨. ఆ.—6. నిక్కు. మై. ౧, ఆ.

**తొంగలిగొను.** దే. అ. క్రి. (తొంగలి+కొను.) తొంగలించు. "క. తొంగలిఱెప్పలపాఱుఁ గులఁ దొంగలిగొనుమేను." పా. ౨, ఆ.

**తొంగలిపాట్లు.** ద్వ. వి. బ. నమస్కృతి. "రగడ. కృష్ణకోటియనుక్షేత్రములోనిమధుద్విషునకు నిడ తొంగలిపాట్లని." హంస. ౪, ఆ.

తొంగిళ్లు. దే. వి. బ. నీళ్లలోనగువానిబొట్లు. "ద్వి. తొంగిళ్లుగార్న్రితో నెత్తివిడుచు." (తొంగిళ్లు=తొంగిళ్లుగా=బొట్టుబొట్టుగా.) భల్లా. 3, భా. "ద్వి. అనిశంబు బెజ్జమహాదేవితాను, జననియై ప్రాణేశుఁదనయుఁగావించి, తొంగిళ్లపైనిడిలింగమూర్తికిని, యంగనగావించె నభ్యంజనంబు." (తొంగిళ్లపైనిడి ఇక్కడ తొంగిళ్లు అనఁగా నూనెబొట్లు.) భల్లా. 3, భా. (ఇక్కడ ప్రాసయతిగానున్నది. ఇది సంప్రదాయము కాదు.)

తొంగు. దే. అ. క్రి. 1. వాలు; "క. అంగనయిన్వాళ్లనుముని, చెంగటికింబాటిపాటి సేవలుగావిం, చంగాఁబోదువు నేఁడటు, తొంగియుఁజూడవతఁడేమిదోసముచేసెన్." విజ. 3, ఆ.—2. శయనించు. "ఎ, గీ. ఇందఱకునిట్టినీమర్మమెఱుకపడఁగఁ, దొడరిబయలేలపడితివే తొంగియున్న, సుంకరీతలమూటకుసుంక మెంత, యనుటయిట్లమ్మచెల్లె మోసమగుఁగదమ్మ." చమ. ౨, ఆ. (ఈ యర్థమందు క్త్వార్థకముమాత్రమే కానఁబడుచున్నది.)

తొంట. దే. వి. 1. చెట్టుపట్ట, త్వక్కు, 2. కసవు వెంటి.

తొంటచేతివాఁడు. ద్వ. వి. (తొంటచేయి+వాఁడు.) ఈఁచేఁబోయిన చేయికలవాఁడు, కుకరుఁడు.

తొంటచేయి. ద్వ. వి. ఈఁచేఁబోయినచేయి.

తొంటి. దే. విణ. తొల్లిటి. (తొంటిపుట్టువు.)

తొండ. దే. వి. సరటము.

తొండపుఁద్రాడు. ద్వ. వి. (తొండము+త్రాడు.) కపిలెబొక్కన తోఁకకుకట్టెడు త్రాడు. (దీనిని తొండాపుఁద్రాడందురు.)

తొండపుదోమ. ద్వ. వి. (తొండము + దోమ.) నిడుపుముక్కుగల యొకదినుసు పెద్దదోమ, ఘోణి. (ఇదే యేనికదోమ.)

తొండము. వై. వి. 1. గజహస్తము*; 2. కపిలెబొక్కనతోఁక*.

తొండరూపురిక్క. ద్వ. వి. పుష్యమీనక్షత్రము.

తొండాడు. దే. స. క్రి. త్వరపఱచు.

తొండి. దే. వి. దొండియొక్కరూపాంతరము.

తొండు. దే. విణ. ప్రాలుమాలినవాఁడు, సోమరి.

తొండొరు. దే. విణ.——వై.——

తొండ్లి. దే. వి. ఒకానొకచెట్టు. హంస. ౪, ఆ.

తొంద. వై. వి. బొజ్జపెట్టినవాఁడు, తుందిలుఁడు.

తొందర వై. వి. (తొర+తొర.) 1. మిక్కిలి సంభ్రమము; 2. సంభ్రమము; 3. బాధ. (చూ. తొందరచేయు.)

తొందరచేయు. వై. స. క్రి. బాధించు. "చ. విలవిలనైర్ఋతిన్ విగతవీర్యునిఁజేసితివార్ధినాథునిన్, దొలుతజయించితిన్ బవనుఁదొందరచేసితి." అని. ౫, ఆ.

తొందరపడు. వై. అ. క్రి. సంభ్రమించు.

తొందరపాటు. వై. వి. తొందరపడుట.

తొందళము. దే. వి. రెండుమూడు దినుసుల కూరలుచేరిన దప్పళము.

తొందు. వై. విణ. (చూ.) తొంద.

తొంబ. గ్రా. వి. గుంపు, మూఁక.

తొంబండ్రు. ద్వ. స. బ. తొంబదిమంది. (తొంబదికి మహన్మహత్యర్థకరూపము.)

తొంబది. ద్వ. స. (తొమ్మిది+పది.) తొమ్మిదిపదులు.

తొంబనూఱు. ద్వ. స. (తొంబది+నూఱు.) తొంబదినూఱులు. "గీ. తొంబనూఱునుదొంబదితొమ్మిదియును, జలజములఁబూజచేసెను శార్ఙ్గపాణి." భీ. ౬, ఆ.

తొకతొక. దే. విణ. (చూ.) తొక్కు. (మాట.) (చూ. తుంపెసలాడు.)

తొక్క. వై. వి. చెట్టులోనగువానితోలు, పట్ట.

తొక్కట. దే. వి. సంకటము. "సీ. రిక్కరాయనిఁబాయఁదొక్కటగల్గినట్లొక్కటమై కార్శ్యము ప్పతిల్ల." శశాం. ౫, ఆ. (రూ. తొక్కటము. "క. తామరసనేత్రవీనుల, తో మొనసిజయింపలేక తొక్కటముననెం, తో మ్రాఁకలఁబడి స్రుక్కుచు, వేమఱుశష్కులులఁ గ్రాఁగి వేఁగుచునుండెన్." రసి. ౨, ఆ.) (త్రొక్కటయొక్కరూపాంతరము.)

తొక్కటపడు. ద్వ. అ. క్రి. సంకటపడు. "ఎ, గీ. దైన్యమాకారమైనచందముననున్న, వానిఁదమయన్నఁగనుఁగొనివారువెఱఁగు, పడిభయంపడి తొక్కటపడికటకటఁ, బడిదిగుల్పడివడఁకుచు భక్తిఁజేరి." ఉ, రా. ౬, ఆ. (త్రొక్కటపడుయొక్కరూపాంతరము.)

తొక్కటపాటు. ద్వ. వి. సంకటపాటు. "చ. వలుదపిఱుందుభారమునవారని తొక్కటపాటుమీఱఁగా." ఉ, రా. ౭, ఆ. (త్రొక్కటపాటుయొక్కరూపాంతరము.)

తొక్కి—స. దే. వి. మల్లబంధవిశేషము.

తొక్కు—. దే. స. క్రి. ఉప్పును కారమును చేర్చి మామిడికాయలులోనగువానిని తొట్టిలో వేసి చిదియఁగొట్టు. వి. ఉప్పును కారమును చేర్చి తొట్టిలో వేసి చిదియఁగొట్టిన మామిడికాయలులోనగువానిముద్ద. విశే. అవ్యక్తము. (బిడ్డలమాట.) "క. కలయనూగార్చెఁదన తొక్కుపలుకులొప్ప. వ. వానియవ్యక్తవచనంబులు వినియందఱు నేడ్పుడిగిరి." భార. ఆది. ౬, ఆ. "సీ. ముద్దియయల తొక్కుముద్దారుపలుకులు వినఁగనుత్తలపడు వేడుకయును." (ఇక్కడ సిగ్గుచేత తొక్కు అని యెఱుంగునది.) హరి. ఉ. 3, ఆ.

తొక్కుడు. దే. విశే. ఉప్పును కారమును చేర్చి తొట్టిలో వేసి తొక్కినది. (మామిడికాయలోనగునది.)

తొగ. యు. దే. వి. 1. కలువ; 2. సమూహము; "తరల. అగములెక్కుచు మిన్నుముట్టుచు హంకరంబు బలంబుతో, మృగమువంబున వంగఁజేయుచు మేనికప్పు చెలంగఁగా, వగలుమీఱఁగఁబాంధకోటులబాధపెట్టుచునుండు నీ, తొగతొగల్ వెడవింటిబోయకుఁదోడువచ్చినవారలో." విజ. 3, ఆ.—3. విధము; "ఎ. గీ. తొగలగములబ్రదుకు తొగలు రాజిల్లంగఁ, గడలు మిన్నుముట్టికడలుకొనఁగఁ, బొడిచెశీతకరుఁడు." భాగ. ౧౦, స్కం.—వై. వి. కష్టము. "ద్వి. తొగలు జానకియింకఁదొలఁగంగవైచు." రా. యు. కాం.—విశే. కష్టుఁడు. (చూ. సమూహమును అర్థమునుదాహరణము.)

తొగకంటి. దే. వి. (తొగ+కన్ను.) 1. తొగలవంటి కన్నులుగల ఆఁడుది; 2. ఆఁడుది.

తొగచెలికాఁడు. దే. వి. చంద్రుఁడు, కుముదబాంధవుఁడు.

తొగట. దే. వి. గుడ్డలు నేసి బ్రదికెడు ఒకానొక జాతి. (తొగటవాఁడు, తొగటది.) "తొగటసెట్టి." విశే. (తొగటరేకు. మొ.)

తొగడు. దే. వి. లోపలికణఁగుట. "ద్వి. తొగడించుక యులేక తోరముల్ గాక, మిగులనట్రువలు నైమించు పెందొడలు." రా. యు. కాం.

తొగర. వై. వి. ఒగరు, తువరము.

తొగరు. వై. వి. 1. కందిచెట్టు; 2. అడవికందితీఁగ; 3. సురాష్ట్రదేశపు మన్ను.

తొగరు. దే. వి. 1. ఎఱ్ఱనూలు; 2. ఎఱుపు. (చూ. కసిసము.) విశే. ఎఱ్ఱనిది. "క. అగలుంగుంకుమపువ్వును, దొగరుంజేలలును సీతుఁద్రోవంగలవే." పాండు. ౪, ఆ.

తొగరుకొను. దే. అ. క్రి. ఎఱ్ఱనగు. (ప్రే. తొగరుకొలుపు. ఆము. ౨, ఆ.)

తొగఱేఁడు. దే. వి. చంద్రుఁడు, (రూ.) తొగలఱేఁడు. (ఇట్లు తొగదొర.)

తొగవిందు. దే. వి. చంద్రుఁడు, కుముదబాంధవుఁడు "సీ. తొగవిందు రాచల్వజగతి వన్నియమీఱ అసురపొన్న పుప్పొడికురియఁదొడఁగె." భాను. ౨, ఆ. (ఇట్లు తొగచుట్టము.)

తొగసూడు. దే. వి. సూర్యుఁడు. "క. తొగసూడు గ్రుంకెదట్టం, బుగఁజీఁకటులొదవెరిక్కలు ... ముపోడమెఱె." నీలా. 3, ఆ.

తొచ్చియము. వై. వి. (చూ.) తొచ్చెము.

తొచ్చెము. వై. వి. తుచ్ఛవచనము. "వ. రఘునాథ సచ్చరితొచ్చ్యంబులను చ్చరించుచుఁదొచ్చెములఱొచ్చుసేయుచు." రామా. ౫, ఆ. (తొచ్చియముయొక్క రూపాంతరము.)

తొటతొట. దే. వి. 1. తొరఁగుటయందగు ధ్వన్యనుకరణము; "క. తొటతొటపుర్వులు దొఱఁగఁగ." భల్లా. ౨, ఆ.—2. పడుటయందగు ధ్వన్యనుకరణము. "క. తొటతొటచినుకులు వడినడి, దటతటపెనుగాలివిసరి ధారాళంబై, పొటపొటకురియఁగఁదొడఁగెను, చెటపెటనుఱుము మనవానఁబిడుగులునడియెన్." శేష. ౧, ఆ. (వాడుకయందు తుటతుట అని కనఁబడుచున్నది.)

తొట్ట. దే. విశే. స్థూలము. (పెదవి.) "సీ. అత్యంతగాఢదంతాగ్రపీడనమునఁ దొట్టవాతెఱనెత్తురు ట్టిపడఁగ." నై. ౭, ఆ.

తొట్టగిలఁబడు. ద్వ. అ. క్రి. (తొట్టగిలన్+పడు.) తొట్రుపడు. "క. పెట్టకపోననియాఁకటఁ దొట్టగిలంబడుచుఁబడుచుదురదురఁజని వే, నట్టింటఁగూరు ముండిన, నెట్టుననన్ జాలకామ్య గేశిణాత్రిన్." పాండు. ౪, ఆ.

తొట్టగిల్లు. దే. అ. క్రి. 1. అతిశయించు; (చూ. తిపు.)—2. కలుగు. "దానినెమ్మేయిన్ దరలఁగదీయలేక వగదట్టము గామదిఁదొట్టగిల్లె." భాగ. ౧౦, స్కం. (రూ. తొట్టగిలు.)

తొట్టి. దే. వి. 1. నూరు వెడల్పును అడుగుసన్ననైన గంపవంటి మట్టిపాత్రము; 2. పసులు నీళ్లు త్రాగుటలోనగువాని కుపయుక్తముగ రాతితో

కట్టినకట్టడము; 3. కొప్పెర. "చ. తడయకమందు తైలపరితప్తకటాహము కేలుదామరన్, దొడికిలిపట్టిరాహువు విధుం గబళించినరీతిఁ జూపఁ గ్రొమ్ముడుఁగునకేగుభద్రకరిమాడ్కి సుధన్వుఁడు చొచ్చెబిట్టుగా, నుడికెడునూనెతొట్టిబలియుర్వారిదాగులుసత్యసంపదన్." జై. ౪, ఆ.

తొట్టికట్టు. దే. వి. లోఁగిలి. "సీ. దురములోఁ దెఅగింటిదొరను గెల్చిననాటి కదలువ్రాసినతొట్టికట్టుదాఁటి." య. ౪, ఆ.

తొట్టియ. దే. వి. నేయువాఁడు నూలుకండెనుంచుకొనెడు నాడె.

తొట్టిల. దే. వి. తొట్ల. "క్రొందరఁగల్ కదలించు కల్వతొట్టిలలఁ గుమారుఁగూఁతును ఘటించి." (పాఠాంతరము తొట్టెల.) వసు. 3, ఆ.

తొట్టు. దే. అ. క్రి. 1. వ్యాపించు; "ఎ. గీ. జనములానందమునఁదేలజగములెల్లఁ, దొట్టినిండారువెన్నెలనిట్టవొడిచె." నిర్వ. ౬, ఆ.—2. ప్రవహించు; "మహాస్రగ్ధర. శత్రువీరవ్రజంబున్, దునుమన్ దచ్ఛోణితంబుల్ దొరఁగిమడువులై తొట్టె నయ్యుద్ధభూమిన్." భార. అర. ౫, ఆ.—3. స్రవించు; "కన్నులబాష్పముల్ దొట్ట." భాగ. ౯, స్కం.—4. ఎగదట్టు; "క. ధరిత్రీవిభుఁడు వేయిచేతుల, నావాహినినీరుతొట్టునట్టుగఁబట్టెన్." వి. పు. ౬, ఆ.—5. నిండుకొను; "వ. వీరావేశంబునరాజద్వారంబునందొట్టిరి." పా. ౪, ఆ.—6. నాటు; "తొట్టినబాణముల్ తొలఁగఁద్రోచి." రా. యు, కాం.—7. జరగు. "పొట్టలుచీలినఁ దొట్టువారు." రా. యు, కాం.—స. క్రి. 1. స్పృశించు; "సీ. గురుమెకంబులనట్లు కూల్చినకీడు దాఁదొలఁగు నేశిరసులఁ దొట్టుకొనక." పు. ౨, ఆ.—2. అవలంబించు; (చూ. తిన్నశబ్దముకడ సౌమ్యము అనునర్థము నుదాహరణము.)—3. మొదలుకొను. "క. వనకేళీకౌతుకమునఁ, జనియెను శ్రేష్ఠఁదొట్టిసఖులెల్లముదం, బునఁగొలిచిరాఁగ." భార. ఆది. 3, ఆ.—(ఈ యర్థమునకు క్త్వార్థము నందే ప్రయోగము.) వి. 1. చెఱువులోపలిపాలము; 2. స్పృక్కు; "గీ. చాలుఁజాలువగవఁగాలంబుగాదిది, లంకచేరెరాజ్యలక్ష్మిగలిగెఁ, గొఱంతలెల్లఁదీఱెఁ గోర్కులుసమకూఱెఁ, దొట్టువానెనింకదోసఁగులేదు." రా. యు, కాం.—3. పడుటయందగుధ్వన్యనుకరణము; "క. అట్టిహరిపట్టి కోలన్, దొట్టున యంత్రంబుపడిన." పాంచా. ౨. ఆ.—4. తెట్టువ. (అని కొందఱు.)

తొట్టుకొను. దే. అ. క్రి. తొట్టు. (వ్యాపించుటకు.— "క. తొట్టుకొనిసంజకెంప, ప్పట్టునరవిఁబాసినీ తగభస్తి నెదురుకో, నట్టిసిరివచ్చుటకునై, పట్టినకెంబట్టుదిద్దిపాలకివోలెన్." రామా. ౨, ఆ.) (స్వార్థమున కొను.)

తొట్టువ. దే. వి. తెట్టువ. (దీనికీయర్థము ఒకానొకచో వ్రాయఁబడియున్నది.)

తొట్టె. దే. వి. తొట్టియయొక్క రూపాంతరము.

తొట్టెల. దే. వి. తొట్ల. (చూ. తొట్టిల.)

తొట్ర. దే. వి. తొఱ్ఱ.

తొట్రిలఁబడు. ద్వ. అ. క్రి. (తొట్రిలన్+పడు.) తొట్రుపడు, సంభ్రమించు. "చ. మొగంబున నశ్రులు వెల్లిగొల్పఁదొ, ట్రిలఁబడుఁజల్లనంజెదరు డెందముఁగూడఁగఁ దెచ్చునన్నుఁ గే, వలమును ముట్టనెవ్వరికిచ్చునను న్." భార. విరా. ౨, ఆ.

తొట్రిల్లు. దే. అ. క్రి. 1. తడఁబడు; "ఎలుంగుగద్గదికఁదొట్రిల్లన్." పర. ౨, ఆ.—2. భేదిల్లు. "సీ. భగదత్తుగజముపై ఫల్గునుఁడేసిన పటుభల్లమునఁ జేసిపక్షివనిత, కడుపుదొట్రిల్లిన." మార్క. ౧, ఆ. (రూ. తొట్రిలు. తడఁబడుటకు.—"మ. అతని పజ్జన్ దగఁదాను నేగెఁ బదపద్మంబుల్ పొరిందొట్రిలన్." భార. అర. ౭, ఆ. "క. ఓయమునానదినీయం, దాయతముగ నాకువలయ నవగాహంబున్, జేయఁగరావోతేవో, తోయములనిపిలిచె నెలుఁగు తొట్రిలఁబెలుచన్."హరి. ఉ. ౨,ఆ.)

తొట్రు. దే. వి. సంభ్రమము.

తొట్రుకొను. దే. అ. క్రి. తొట్రుపడు. "గీ. తొట్రుకొనునడలును వెడదొక్కుపలుకు, లుల్లములసిగ్గులుంగమియు నుఘటించి, జవ్వనులకునుమరలశైశవముఁదెచ్చె, వారుణియునెట్టిసిద్ధౌషధీరసంబొ." కవిక. ౪, ఆ. (ప్రే. తొట్రుకొలుపు.)

తొట్రుపడు. ద్వ. అ. క్రి. 1. సంభ్రమించు; "తొట్రుపడుచునిట్లనియె." భార. విరా. ౪, ఆ.—2. తడఁబడు. "చరణయుగంబు తొట్రుపడ." భార. శల్య. ౧, ఆ.

తొట్రుపాటు. ద్వ. వి. తొట్రుపడుట, తడఁబాటు. "సీ. బెగడంతకంతకుమిగిలిననింతికిఁ బదములనటఁదొట్రుపాటు బెరసె." భార. విరా. ౨, ఆ.

తొట్ల. దే. వి. బిడ్డలుపండుకొను ఉయ్యాలతొట్టి. "శా. జోలల్వాడియాడింతురా, లావణ్యాంబు నిధుల్ వధూమణులుతొట్లంబెట్టి రాజాత్మజన్." పాంచా. ౧, ఆ. (తొట్టిలయొక్కరూపాంతరము.)

తొట్లియ. దే. వి. తొట్ల. "వ. చుట్టునున్న సభాసదుల నుగొందఱను గట్టెదురఁ కండవదేవేంద్రుండునుం బోలెనపూర్వవైభవంబుననున్న యొక్కరాజునున తనియగ్రభాగంబునఁబసిండి తొట్లియలోనున్న యొక్కచక్కని బాలకనుంజూచి." కళా. ౫, ఆ.

తొట్లె. దే. వి. తొట్లియయొక్కరూపాంతరము.

తొడ. దే. వి. గజ్జకు మోఁకాలికి నడిమిభాగము, ఊరువు.

తొడఁకు. దే. అ. క్రి. తొనఁకు. "ఎ. గీ. నిగుడు నాయువుతొడఁకనినిండుకుండ." చంద్రా. ౧, ఆ.

తొడఁగు. దే. అ. క్రి. 1. ప్రారంభించు; "అతఁడీకార్యంబుసేయంగ నేలతొడంగెన్." భార. శాం. ౨, ఆ. "మేనదట్టపుఁబులకల్ జనింపఁగఁ దొడంగె." భో. ౭,ఆ.—2. మొదలుకొను. "వ. పాడ్యమిదొడంగి పదునాలుగుదివసంబులొక్కొక్క గింజయకాఁదూ మెఁడుపడ్లు సమకూర్చి." భార. ఆర. ౫, ఆ. (ఈ యర్థమునకు ప్రయోగము క్త్వార్థమునందేయని యెఱుంగునది.)

తొడపుట్టువు. దే. వి. వైశ్యుఁడు, ఊరుజుఁడు.

తొడబెల్లము. దే. వి. తొడగిల్లుట.

తొడయు. దే.స. క్రి. 1. తుడుచు; "సీ. మణికుడ్యములకుంకుమంబునఁ జెలువొందఁదొడసిరి మెఱుఁగులుతుఱఁగలింప." హరి. ఉ. 3, ఆ.—2. కడుగు. "వ. పెండ్లిదొరలు సుగంధోదకంబులం జేతులు తొడసి." నై. ౭, ఆ.

తొడరిక. దే. వి. అనుసరణము.

తొడరు. దే. అ. క్రి. 1. కలుగు; "ఒకింతయుందొడరదునొప్పి." లక్ష్మీ. ౪, ఆ.—2. యత్నించు; "క. ఊరకయుండకపలువుర, తోరపమెసఁగంగఁబలుకఁదొడరకయుమదిన్, జేరువగలవాగరికులఁ, దారఁగలసిపలుకవలయుధరణీశుకడన్." భార. విరా. ౧, ఆ.—3. సక్తమగు; "క. అరయఁగవిషయములెంతయు, దురంతములువానియందుఁదొడరినఁజేటుం, బొరయుదురుదొడరకున్నన్, బరమపదవి యమ్మహానుభావులకునగున్." భార. శాం. ౪,ఆ.—4. తొట్రుపడు. "క. ఏచినపాదలఁ బడల్పడఁ, ద్రోచుచుముండ్లకునునల్లఁదొలఁగుచు దిక్కుల్, చూచుచుఁదొడరుచుఁద్రెళ్లుచు, జేమ చులలితాంగిసంచలించుచునరిగెన్." భార. ఆ. ౨, ఆ.—స. క్రి. 1. అనుసరించు; "సీ. కడఁగి జన్నపుఁదిండ్లుదొడరఁద్రిమ్మరుప్రోడకున్ఱలగమి తోడఁగూడియాడు." నీలా. ౧, ఆ.—2. ఎదిరించు; "సీ. బకదైత్యుఁదొడరయాభంగిరూపుఅఁజేసిరక్షించె నేకచక్రాపురఁబు." భార. విరా. ౧, ఆ.—3. ప్రాపించు; "వ. ఇప్పగిదినిచిరముఁడు కడలేనిసిరులఁదొడరకడలికడగాఁగలపుడమితపవేలె." యు. 3, ఆ.—4. అనుకరించు. "దేహరుచి వైభవముల్ నవమల్లికారుచిన్ దొడ..." పా. ౪, ఆ.—5. ఎదిరించు. "క. కడునధికుతోడఁ దొడరినఁ, బొడిచిననొడిచిననుబురుషుపురుషగుణంబే, ర్పడుఁగాక హీనునొడుచుట. కడిదియెపౌరుషముదానఁ గలుగునె చెప్పుమా." భార. సభా. ౧, ఆ.

తొడరువు. దే. వి. యత్నము. "గీ. దైవమిట్లుకలిమి నేపిరిమదిమది, నుండిఘోరమైనయుద్ధమునకు దొడగవలయునట్టి తొడరువుకావించి, కౌరవకురాజుకొడుకులేచి." భార. శల్య. ౧, ఆ.—వి. మొదటి. "ద్వి. తొడలపైనున్నయాతొడవులు కొడుకుఁ, దొడిఁబడఁగడఁబడఁద్రోసియాగ...న." భాగ. ౭, స్కం.

తొడవు. దే. వి. భూషణము. "తొడవులుతొడునది తొడవుతొడవు." భాగ. ౧౦, స్కం. పూ. (ఇది తొడుధాతుకృదంతము. నగవులోనగువానివంటిది.)

తొడి. దే. వి. త్వర, సంభ్రమము. "శా. నాయిట్టుం బుట్టెదపంచుఁగంసుఁడుతొడిన్ హింసించెనీయన్నలన్." భాగ. ౧౦, స్కం. పూ. (ఆమ్రేడితమునందు తొడిఁదొడి. "చ. నడచిశరావళిన్ మనుజనాథులమేనులుసించికంఠముల్, తొడిఁదొడిఁద్రుంచి." భాగ. ౯. స్కం.)

తొడిఁబడు. దే. అ. క్రి. (తొడిన్+పడు.) 1. చలించు; "ఉ. లోఁబొక్కుచువేఁడియూర్పుఁదిగఁబుచ్చితొడింబడికొంతసేపువే, ల్పెక్కినభంగినుండిధృతినెట్టకు నేనియుఁబూని." రా. అ. కాం. "క. నందనవనవాసముతన, డెందముఁగుందింపఁగాఁదొడింబడితానున్, నందనవనవాసమువిభుఁ, డొందెరఘూత్తమునిఁ బాసి యుండం గలఁడే."

రామా. ౫, ఆ. — 2. చెదరు; "క. వడ్డింపఁగనెం గిలితోడిఁ, బడ్డవెసఁ పంటకంబుఁబాయనిడఁద గుఁ." విజ్ఞా. ఆచా, కాం.—3. తొట్రుపడు. "నేను నీతలఁపుపద్ధతిగాకిపుడేమి మీఱివర్తిలితిఁ దొడింబడఁ." కళా. ౬, ఆ.

తోడికిలు. దే. స. క్రి. ఒడియు. (చూ. తొట్టికప గొప్పర అను నర్థము నుదాహరణము.)

తోడిదెచ్చు. దే. స. క్రి. తోడితెచ్చుయొక్క రూపాంతరము. "మహర్షులం గదియఁబోయి నమస్కృతులాచరించి భక్తింగరముల్ మొగిడ్చి తోడితెచ్చి." ఉ, రా. ౧, ఆ.

తోడిమ. దే. వి. ఆకు పూవు మొదలగువానితలనుండెడు కాఁడ, వృంతము.

తోడు. దే. స. క్రి. 1. సొమ్ములలోనగువాని తొడుగు. "ఉర్వీశులెల్లనెండొరులఁగడవఁగడువేడ్కఁ దొడిపూసికట్టి." భార. ఆది. ౭, ఆ. — 2. బాణము తొడుగు. "వెండియునేడు బాణములు వేతోడి నప్పుడు నొవ్వనేయ." భార. భీష్మ. 3, ఆ. ("కుడుముఁగట్టుఁదోడుఁ దనయిచ్చ నెక్కుడుఁ." "మించుతొడవులుదొడెనెక మించుఁబోఁడి." "తోడువింటివాఁడుచక్ త్రోవఁబోవక." "తొడకంకటములఁ దొడవులవిలసిల్లు, మణులఘృణుల దెసలమాఁగువిరియ." "కట్టందొడంబుయ్యఁ బెట్టఁగొఱంతలే కానందమందెడు నర్థులందు." ఇత్యాది ప్రయోగంబులను కానంబడుటచే తోడు అనునది యొక ప్రత్యేకక్రియయనియే గ్రహింపవలెను.)

తోడుకు. దే. స. క్రి. 1. పట్టు; "సీ. బెడఁగారుకాపాహిఁదొడుక నేనూగారుతోడుసొల్లఁగాకతాఁ దొడుకుమనిన." పాండు. ౫, ఆ. — 2. ఒడిసి పట్టు; కవిక. ౪, ఆ.—3. ఒడియు; "గీ. పాలములోనఁదొడికిపులిపట్టుకైవడి." ద్వా. ౭, ఆ.— 4. గ్రహించు. "సీ. అందందవత్షోరుహములు దంపులు వోవఁదొడుకనిచ్చుట యెట్లు దుర్ధరసము." కాశీ. ౪, ఆ. —వి. 1. ఆవు; "క. ఉడుకావిడకున్నదిమది, పడుకామిడుకంగనురకపఱవం జను నే, కొడుకానడుకానలకిటు, దుడుకానా పాలిపుడుకుఁ దొడుకానీకుఁ." అచ్చ. అ, కాం.—2. దొంగమేఁత. "క. తోడుకుదినఁబోవుపసరము, బడిఁబోకుము." భో. ౬, ఆ.

తోడుకొను. దే. స. క్రి. 1. తోడుకొనుయొక్క రూపాంతరము. "చ. కడువెరవేదిసేఁ బ్రథమగర్భవతిఁ సతిఁబుట్టి నింటికిఁ, దొడుకొని వచ్చుచో." విక్ర. ౧, ఆ.—2. తోడుగుకొను. (చూ. పాఁగ.) (రూ. తోడికొను.)

తోడుగఱ. దే. వి. తోడుగట్టియొక్క రూపాంతరము. "క. తడికంటనెపుడుఁదఱుఁగక, కడిదఱిఁ గినపడియుఁదఱిఁగిగాసింబుడమిం, బడినఁగనరాకముంచపుఁ, దొడుగఱలైరట్టె రుజలతో సేమందుఁ." స్వా. 3, ఆ.

తోడుగట్టి. దే. వి. (తోడుగు+కట్టి.) ముండ్లకంప మోపు.

తోడుగు. దే. స. క్రి. 1. (భూషణాదులను) ధరించు; "సీ. మదనాహితునినామమంత్రంబునుడుగువాఁడొడికంపుఁబాములఁ దొడుగువాఁడు." భల్లా. ౨, ఆ.— 2. (వింటబాణము) సంధించు. "ఎ, గీ. పొడుగుమడుగునుగాంచినయడుగువాఁడు, పిడుగుపడుగునరిపునెంచునుడుగువాఁడు, చెడుగులుడుగునట్లుగ నమ్ముఁదొడుగువాఁడు, బుడుగుపడుగురూపునబలినడుగువాఁడు." చంద్రా. ౧, ఆ.—వి. 1. ఆభరణము; "క. ఉడురాజముఖుల కెల్లను, దొడుగయ్యెడునాకుఁదొడుగుఁదొడుగఁగనేలా, తొడుగులుదొడిగినఁగొఱఁతని, యుడురాజోత్తంసుఁజూడనొక్క తెవచ్చెఁ." వీర. 3, ఆ.—2. కవచము; "సీ. తొడుగులుసడలికుత్తుకలెండిమిక్కిలి వడరూపులైపడ్డవీరభటులు." జై. ౨, ఆ.—3. బాణము; 4. గవుసెన; 5. ముండ్లకంపమోపు. "గీ. కంపతోడు గిడ్చినట్లేదుకానఁజన్న, తెరువెఱుంగుచు." స్వా. ౪, ఆ.

తోడుపు. దే. వి. 1. (చూ.) అనుసు; 2 కవచము; 3. చెప్పినది మరల చెప్పుట.

తోడువు. దే. స. క్రి. వి. తోడుగుయొక్క రూపాంతరము.

తోడుసు. దే. వి. సంబంధము.

తొడ్గు. దే. స. క్రి. వి. తొడుగుయొక్క రూపాంతరము. (భూషణముధరించుటకు.—"గురుపత్నినేఁడయక్కుండలంబులుదొడ్గుదివసము." భార. ఆది. ౧, ఆ.)

తొత్తతికము. దే. వి. (తొత్తు+అతికము.) తొత్తుఁదనము.

తొత్తు. దే. వి. 1. బానిస, దాసి; 2. లంజియ.

తొత్తులమారి. దే. విణ. తొత్తులయిండ్లకుఁబోవు స్వభావముకలవాఁడు.

తొన. దే. వి. తొల. విణ. రక్షకము. "గీ. తోడుదొనయైనచుట్టంబుదొరకుటెట్లు." జై. ౧, ఆ.

తొనఁకు. దే. అ. క్రి. తొలఁకు. "తేనియల్ తొనఁకనివాని." వసు. 3, ఆ.—వి. తొట్రుపాటు. "క. ఉల్లంబులబలు, తొనఁకుసొరఁగననికిఁ దొలఁగఁదోలిరిరథముల్." భార. కర్ణ. ౬, ఆ.

తొన్నుండు. దే. అ. క్రి. తెన్నుండు, శయనించు.

తొపారము. దే. వి. తోపారముయొక్క రూపాంతరము. "క. దోరములుదీసిచెంచులు, మోరలవేసి నదొపారములు వీడిచిను, వ్వారఁగనుదువ్వికొక్కల, నారజముగఁ డేగవేఁటలాడిరి వేడ్కన్." భానుమద్విజయము. ౨, ఆ.

తొప్పదోఁగు. దే. అ. క్రి. (తోఁగు+తోఁగు.) మిక్కిలితోఁగు. "ఉత్సాహ. తుములబాణపటలవృష్టిఁదొప్పదోఁగిరిద్వరున్." భార. ఆర. ౭, ఆ. (రూ. తొప్పఁగఁదోఁగు. "నెత్తుటన్ దొప్పఁగఁదోఁగియున్నవతోయజనాభుని." హరి. పూ. ౮, ఆ. ప్రే. తొప్పదోఁచు, తొప్పఁగఁదోఁచు. "నిలింపులఁదొప్పదోఁచె." రా. యు, కాం. "ఉ. భవదీయవచోమృతవారిధారచేఁ, దొప్పఁగఁదోఁచినన్నుఁ బరితోషితమానసఁగా నొనర్పవే." భో. 3, ఆ.) (తొప్ప అనుదానికి ప్రత్యేకప్రయోగము కనఁబడదు.)

తొప్పతిల్లు. దే. అ. క్రి. ఒఱగు, (రూ. తొప్పతిలు.)

తొప్పఱు. దే. అ. క్రి. ——వై.——"మ. వెఱచిట్లంబుధి సాధనందనులు దోర్వీర్యంబు సాలించియం, దఱుఁబొఱంగ నిశాచరేంద్రుఁడుజయోత్సాహంబునన్ వెన్నడిన్, దఱుమంగాఁబ్రజఁజేయివీచుచుసముద్యద్వేగుఁడైతోలితొ, ప్పఱఁ బెట్టెన్ శరజాలమున్ బిఱుఁదఁగుప్పంగూరనాటించుచున్." నిర్వ. ౫, ఆ.

తొప్పలుదొరలు. దే. విణ బ. కోటానఁగోటులు. "ఉ. తొత్తులువోలె దక్కు గురుతొప్పలుదొరలుముక్తిభామినుల్." కాశీ. ౨, ఆ.

తొప్పి. దే. వి. తోపియొక్క మొదటిరూపము. "గీ. హరిగదావిహారమల్లంతఁదోఁచిన, పరమువిమ్ముఁగావవలఁతియగుసె, వెత్తివారపిడుగు వేచినతలతొప్పి, యాఁగునేవివేకమైనవలదే." ఉ. హరి. ౪, ఆ.

తొబక. దే. విణ. విత్తులురాలినది. (మిరపకాయలకు నగునది.)

తొమ్మండ్రు. దే. స. బ. తొమ్మిదిమంది. (తొమ్మిదికి మహన్మహత్యర్థకరూపము.)

తొమ్మండుము. ద్వ. వి. (తొమ్మిది+తూము.) తొమ్మిది తూములు.

తొమ్మనూఱు. దే. స. (తొమ్మిది+నూఱు.) తొమ్మిదినూఱులు. వి, పు. ౨, ఆ. (రూ. తొమ్మన్నూఱు.)

తొమ్మాడు. దే. వి. నాశము. (దానిని తొక్కి తొమ్మాడుచేసినారు.)

తొమ్మిది. దే. స. ఎనిమిదియు నొకటి.

తొయ్యలి. దే. వి. ఆఁడుది, ఇంతి. "సీ. మించితావులు గ్రమ్ముమంచిగందమ్మునఁనటకలియిడియెఁదొయ్యలియొకర్తు." య. ౪, ఆ.

తొర. వై. వి. 1. వేగిరపాటు; "పండటంచువిభ్రాంతివహించి యాఁకటితొరన్ రవిపైకెగసెన్." ఉ, రా. ౫, ఆ.—2. ఆపద. "ఉ. బానిసగాఁ నీవికచపద్మదళేక్షణదారఁబోసిన, నానుమిఁకనాకొసఁగుమీభవదీయకృతాపరాధముల్, పూనికనేనుగైకొని ప్రభుత్వముకానఁబడంగనిల్చియే, వ్వానికిలోఁగకింతతొరవచ్చినఁగాచెదనిన్నుఁగూరిమిన్." హరిశ్చ. ౪, ఆ. (ఈ యర్థము విచారింపఁదగినది.)—క్రి. విణ. త్వరితము*. "ద్వి. తోడెవ్వరునులేక తొరతోడమీరు, వచ్చేయునపుడె." విష్ణు. పూ. 3, ఆ.

తొరఁగు. దే. అ. క్రి. 1. స్రవించు; "బాష్పముల్ కంటఁదొరంగుచుండఁదిరుగందిరుగంగనుఁ గొను." విజ. ౧, ఆ.—2. ప్రవహించు; "సీ. కమ్మనారసము బొంగితొరఁగెడుచాడ్పున శశిరేఖామృతంబుజాలువాఱ." భార. విరా. ౧, ఆ.—3. పడు; "క. వీరులగుసాల్వయోధుల, నారాచాళులుగప్పినారథముపయిన్, సారథిమీఁదఁదొరంగము, చారుధ్వజతతులపయి నసంఖ్యాతముగన్. వ. తొరఁగిన." భార. ఆర. ౧, ఆ.—4. వ్రాలు. పంచ. నా. ౧, ఆ. (గ్రంథములయందు అంతట ఇది యిట్లు అకారమధ్యముగానే కనఁబడుచున్నది. అయినను ఒక మహాకవిమాత్రము ఉకారమధ్యముగా ప్రయోగించియున్నాఁడు.)

తొరపడు. వై. అ. క్రి. వేగిరపడు. "ద్వి. బంతిఁగూర్చున్నశశధరార్కులకమృతంబు, మార్చితొ

నిటరాకమసలెనటంచుఁ, దొరపడుచున్న దైత్యు లకు.” విష్ణు. ఉ. ౪, ఆ.

తొరలు. దే. అ. క్రి. 1. కలుగు; “ద్వి. తొరలెడు జనదృష్టిదోషంబువాయ, నిరుమేలనారతులిచ్చు నట్లొలయ.” భాగ. ౧, స్కం. — 2. మాఱు. (చూ. తొరలుచు, తొర్లించు.)

తొరలుచు. దే. ప్రే. మార్చు, బదిలించు, (రూ. తొరల్చు. “ఉ. ఆయతికానికీకు మమరాలయ ముఖ్యములాతఁడర్థత్ర, స్నాయుతుఁడై నిజోర్వ రగునష్టికిఁదద్దనముందొరల్చిరా, జాయతనంబుఁ దెర్చునుతియట్టిదిపథ్యముగాన నెంటిగాఁ, డేయ ధకారికాపలయు నించుకతిన్నను వాఁడెరూప ఱుఁ.” ఆము. ౪, ఆ.)

తొరతొర. దే. అవ్య. క్రి. విశే. లెస్సగా.

తొఱంగు. దే. అ. క్రి. తొరఁగుయొక్క రూపాంత రము. (పడుటకు.—“వ. ఖలీనంబులఁ విలీనంబు లైన ఫేనంబులుతొరుఁగనిరుగడలఁగదలు కర్ణచా మరంబులినుమడింపక.” ఉ, హరి. ౪, ఆ.)

తొఱపు. దే. స. క్రి. తొర్లించు.

తొర్లించు. దే. ప్రే. వేనీళ్లుచల్లార్చు. (తొరలించు యొక్క రూపాంతరము.)

తొఱ. దే. వి. తొఱ్ఱయొక్క రూపాంతరము. “క. తొఱలోపల నెుకదెసనొక, యఱగానొనరించి చిగురుటాకులడుగునఁ, బఱచిననదికడు మెత్త ని. పఱపుగ నచ్చోటనాఁడుఁబట్టింగనియెన్.” భో. ౪, ఆ.

తొలఁగు. దే. స. క్రి. విడుచు. “క. భంగించియిత రకాంతఁదొ, ఱంగుటతప్పోతడంబఱచిపురుషు లకున్.” కళా. ౭, ఆ.—వి. విడివడుట. “ఎ, గీ. ఎన్నదాఁటులలోఁదొలఁగెఱుఁగఁబడునె.” ఉ, హరి. ౪, ఆ.

తొలఁగుచోపు. దే. అ. క్రి. (పసులు) తప్పించుకొ నిపోవు. విజ్ఞా. ప్రా, కాం.

తొలఁగువోవు. దే. అ. క్రి. (తొలఁగు+పోవు.) —పై.—“గీ. తొలఁగువోకుండ మెకము లఁగలపకుండఁ, బాఁడితఱుఁగక యుండనాపాటి గొల్లలిచ్చ మెచ్చఁగనీదృష్టికెక్కఁగదుపు, నరయ నేర్తునన్నేలుముధరణినాథ.” భార. విరా. ౧, ఆ.

తొఱట. దే. వి. తొఱ్ఱ, కోటరము.

తొఱటలువాఱు. దే. అ. క్రి. (తొఱటలు+పాఱు.) రంధ్రములుపడు. “క. పెక్కులుచీమలువెలువడి వడిఁ, దొలిచెశరీరాస్థులెల్లఁదొఱటలువాఱన్.” జై. ౭, ఆ.

తొఱతేనె. దే. వి. పుట్టతేనె.

తొఱవు. దే. స. క్రి. వి. తొలఁగుయొక్క రూపాం తరము.

తొఱుద్రొక్కు. దే. వి. (త్రొక్కు+త్రొక్కు.) గట్టి త్రొక్కుడు. (చూ. చొటిగాఁడు.)

తొఱ్ఱ. దే. వి. చెట్లయందేర్పడెడు పెద్దరంధ్రము, కోటరము.

తొఱ్ఱి. దే. వి. ముందటిపండ్లులేనినోరు. “తొఱ్ఱియ క్కరంబు.” ఆము. ౬, ఆ.

తొఱ్ఱివాఁడు. దే. విశే. తొఱ్ఱినోటివాఁడు.

తొఱ్ఱు. దే. వి. ఆవు, మొదవు. “సీ. అరణోచ్చార ణోద్ధతులయ్యెనీతొఱ్ఱుకంఠహుంకృతులేణగర్భి ణులకు.” పాండు. ౫, ఆ.

తొఱ్ఱుపట్టు. దే. వి. ఆవులమంద, ఘోషము. “గీ. ఘన భుజాండునరుఁడు తనతొఱ్ఱుపట్టుల, విశ్రమించి భువనవిశ్రుతుండు.” భార. ఆది. ౧, ఆ.

తొల. దే. వి. పనసపండులోనగువాని తొల, తొన. “పనసతొల.”

తొలఁకాఁడు. దే. అ. క్రి. (తొలఁకి+ఆడు.) 1. తొ నఁకు; “సీ. ప్రవహించునెచ్చోటఁబరిపూర్ణసంప దఁదొలఁకాడుచున పారదుగ్ధనదులు.” కాశీ. ౨, ఆ.—2. చలించు; (చూ. తొలఁకు.)—3. అతిశ యించు; “అనవుడుసమ్మదంబు దొలఁకాడఁగ.” నిర్వ. ౭, ఆ.—4. ప్రకాశించు. “వ. నేత్రాంచ లంబులనలంతినవ్వుదొలఁకాడ.” వై. ౪, ఆ. (మొ దటిరూపము తొలఁకియాడు.) (చూ. ఊఁగాడు.)

తొలఁకు. దే. అ. క్రి. 1. తొనఁకు; “సీ. మిన్నేటి జలముసుమ్మీతొలంకెడునని డాచేతమణికమండ లువొసంగి.” పా. ౫. ఆ.—2. చలించు; “చ. తొ లకరమించుకన్దొగల తోఁగలతోయజతారహార కాంతులఁదగునవ్వుక్రొన్ననలతోనలతొరపుగు బ్బచన్నులన్, దొలఁకెడుకొనుచంచలతతోలత తోఁదగుమేనితావికిన్, దులయగుకొప్పుగేదఁగు లతోఁగులతోయదవేణిమించినన్.” ఉ, రా. ౬, ఆ.—3. అతిశయించు; “చ. వెలవెలఁబొఱుమో ముపయివిన్నఁదనంబుదొలంకుచుండఁగన్.” యా. ౪, ఆ.—4. ప్రకాశించు. “సీ. కుఱుమాపుదడి మంపుఁగోకలోఁ దొలఁకెడు కంపమాననితంబ కాంతిపెంపు.” కళా. ౪, ఆ.—వి. 1. చలనము;

దడియదళాన్యుఁగనిరంభతడయకపలికెన్." ఉ, రా. ౪, ఆ.

దడబడ. దే. వి. ఆటోపము, ఆవేగము.

దడము. యు. దే. విణ. దట్టము. "దడముగమర్దళధ్వనులుఁదాళరవంబులుఁబిక్కటిల్ల." ఉ, రా. ౬, ఆ. (దళముయొక్క మొదటిరూపము.) — వై. వి. 1. సేన; "క. వడిఁబురము వెడలివిడిసిన, దడములపై నడువవిఱిగితత్పరతన్ మా, ర్పడికొందఱుబలములురూ, పడఁగంజెడిపోయిరంత నడరినభీతిన్." రా. బాల, కాం. —2. సమూహము*. "క. కొడుకులుఁ దానునుగుజ్జుపు, దడములఁగరిఘటలభటరథవ్రాతములన్, బుడమి చలింపఁగద్రుపదుఁడు, కడువేడుకఁ దోడునూపెఁ గౌంతేయులకున్." భార. ఉద్యో. ౧, ఆ.

దడి. దే. వి. వెదురుచాఁపలోనగువానితో నేర్పఱచినమఱుఁగు. "పట్టిపెళ్లనుదడిగట్టి." కళా. ౬, ఆ.

దడిగ. దే. వి. (చూ.) అరిగ. "చ. వెడలెడునమ్మహీవిభుని వేడ్కయొఱింగివృకోదరుండుఁగ, వ్వడియును బిన్నతమ్ములును వైభవమొప్పనలంకరించియొ, క్కడు మెఱయన్ ప్రధానభటఘోటకదంతిరథప్రతానముల్, దడిగలుఁగుంచెలుంగొడుగుదండములున్ విలసిల్లవచ్చినన్." భార. అశ్వ. 3, ఆ.

దడిబము. వై. వి. పఱపు, మెత్త, తల్పము, శయ్య.

దడిమము. యు. దే. విణ. సన్నము. "దడిమంపుఁ జేలలఁదడిరొత్తి." కళా. ౭, ఆ. — వై. వి. పఱపు.

దడియ. దే. వి. కొండచేరువనేల, ఉపత్యక. "గీ. కర్షకులకునెలవు గ్రామసీమావళి, యవులనడవులిందులాటవికుల, కడవులందుఁగొండదడియలు మనబోంట్ల, కింతవట్టుఁదెలియనెఱుఁగవలయు." హరి. పూ. ౭, ఆ.

దడియఁబడు. ద్వి. అ. క్రి. (దడియన్+పడు.) దడియు. (రూ. దడియఁగఁబడు. "సీ. దండియలును మీరుదడియంగఁబడకయుంతకయటుపొందు గంధర్వముఖ్యులు." లక్ష్మీ. ౧, ఆ.) (స్వార్థమున పడు. మహాకవిప్రయోగములయందు పద్యమును బంధముపరమగుచుండఁగా అగుధాతువుయొక్క తుమున్నర్థకరూపము పూర్వాగమముగా కానఁబడుచున్నది.)

దడియము. దే. వి. పదిసేరులయొత్తు. అయిదుసేరులయొత్తు. (అని కొందఱు.)

దడియు. దే. అ. క్రి. వణఁకు.

దడెము. దే. వి. దడియముయొక్క రూపాంతరము.

దడ్డియము. దే. వి.——వై.——

దణా. వై. వి. సేన. "భుజంగప్రయాతము. దణా పెద్దయాజ్ఞన్ సుధాభుగ్విరోధ్య, గ్రణీసేనలన్ మించెగంభీరభేరీ, ధణంధాణముల్." ఉ, రా. ౨, ఆ.

దణాయఁడు. వై. వి. సేనానాయకుఁడు. "పంచచామరము. దణాయలున్ దలారులున్ మునుంబునః క్రమంబుగా, క్షణక్షణంబునుం గబుర్లుసారసారెదెల్పఁగా." కృష్ణ. ౨, ఆ.

దణి. వై. వి. ప్రభువు, ఱేఁడు*.

దత్తకుఁడు. సం. వి. అ. పుం. దత్తపుత్రుఁడు.

దత్తము. సం. వి. అ. న. ఈవి. విణ. ఇయ్యఁబడినది.

దత్తి. సం. వి. ఇ. స్త్రీ. ఈవి, దానము.

దత్తు. వై. వి. స్వీకారము*.

దత్తుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకానొకరాజు; 2. దత్తాత్రేయుఁడు; 3. ఒకజాతి పురుషుఁడు. (చూ. పురుషుఁడు.) విణ. కుదువయుంచఁబడినవాఁడు.

దద్దడము. దే. వి. చిన్న గుడి, బోడిమిద్దె. "గీ. అట్టిపెనువానలోనసరోభిధానుఁ, డొక్కనికిఁబ్రయాసంబుననొదిగియుండఁ, జాలునల్పాంతరావకాశంబుతోడి, కడపగలయొక్కటాటిదద్దడముఁ జేరె." పర. ౧, ఆ. "సీ. వంకదారకుఁజేరి వాకిటిదద్దడంబులుసెర్చి కొమ్మలమోకువైచి." ఉ. హరి. 3, ఆ.

దద్దఱిల్లు. దే. అ. క్రి. తబ్బిబ్బుపడు. "సీ. ఇంతలోననయారయెన్ని తబ్బిబ్బులు దద్దఱిల్లకుఁడంము పునిపీఁపు, చఱచి." కళా. ౫, ఆ.

దద్దఱు. దే. అ. క్రి.——వై.——

దద్దళము. దే. వి. దద్దడముయొక్క రూపాంతరము.

దద్దిర్లు. దే. అ. క్రి. దద్దఱిల్లుయొక్క రూపాంతరము.

దద్దు. వై. వి. 1. రోగవిశేషము; 2. చీమకుట్టుటలోనగువానిచేఁగలిగెడు బుడిపి*.

దద్దురు. వై. వి. రోగవిశేషము, దద్దు.

దద్రుఘ్నము. సం. వి. అ. పుం. తగిరిసె.

దద్రుణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దద్దురోగము గలవాఁడు.

దద్రువు. సం. వి. ఉ. పుం. రోగవిశేషము, దద్దు.

దధి. సం. వి. ఇ. న. 1. పెరుగు; (దీని భేదములు అరోఘ్నము, ప్రాగ్రాటము, అఘనము.) 2. సరళమను ధూపద్రవ్యము; 3. మద్ది‡.

దధిత్థము. సం. వి. అ. పుం. వెలఁగ‡.

దధిఫలము. సం. వి. అ. పుం.——పై.——

దధిబుసము. సం. వి. అ. న. మీఁగడతీసిన పెరుగు. (మీఁగడ పెరుగు అరోఘ్నము.)

దధ్యుదము. సం. వి. అ. పుం. పెరుగుసముద్రము.

దనియాలు. వై. వి. బ. కొత్తిమిరివిత్తులు, ధాన్యాకము.

దనియు. దే. స. క్రి. కూడు, సంగమించు.

దనివు. దే. వి. కూడిక, సంగమము. "ఎ, గీ. దనివు మొదలైనచిగురొత్తుతమకమునకు." భార. విరా. ౨. ఆ.

దనుక. దే. ద్ర. వఱకు, పర్యంతము.

దనుకు. దే. స. క్రి. 1. తాఁకు; "చ. దీనమై, దనుకగుదీనఁబాదములు దాఁకదు నాదగు వేఁడి మేమియుఁ౯." భార. అను. 3, ఆ.—2. పొందు. "క. మనకిమ్మాడ్కిందనుకఁగ రానికడిఁది డెప్పర మొందఁ౯." హరి. పూ. ౬, ఆ. (రూ. దన్కు. "ఒల్లఁబాటుదన్కఁడించు కేనియుఁ౯." భార. స్త్రీ. ౧, ఆ.)

దనుజుఁడు. సం. వి. అ. పుం. అసురుఁడు, తొలివేల్పు.

దఫా. హిం. వి. తడవ.

దప్పము. దే. విశే. దట్టము. "ఈ తెలిదప్పపుఁగప్పురంపుబల్దీవులు." భాను. 3, ఆ.

దప్పళము. దే. వి. పలుచగాఁజేసిన వ్యంజనవిశేషము, పులుసు.

దప్పి. దే. వి. 1. నీరుపట్టు; "వ. ఆధర్మజుండుదప్పికొర్వకనీళ్లుత్రావుటకై సరోవరంబులోనికిడిగుటయు." భార. అర. ౭, ఆ.—2. శ్రమము. (చూ. డప్పి.)

దప్పిక. దే. వి. దప్పియొక్కరూపాంతరము. (స్వార్థమున క ప్రత్యయము.)

దబకాయించు. హిం. క్రి. అదుము, గదమాయించు.

దబదబ. దే. వి. తలుపులోనగునవి తట్టుట పరుగెత్తుట మొదలగువానియందగు ధ్వన్యనుకరణము. (దబదబతలుపుతట్టుచున్నాఁడు. దబదబ పరుగెత్తుచున్నాఁడు. మొ.)

దబరా. హిం. వి. వెడల్పయిన గిన్నె, బోగిణి.

దబాయించు. హిం. క్రి. అదుము, నెట్టు.



దబ్బ. యు. దే. వి. నారంగవిశేషము‡. "గీ. పనసపండులుదబ్బపండ్లనఁటిపండ్లు." నీలా. ౨, ఆ. (దీని భేదములు కొలగబ్బ, నారదబ్బ.) — వై. 1. దర్భ‡; "సీ. చెంగల్వవిరికళ్యాకంగ మొత్తుటకుల్కు బిబ్బోకరాశి కాదబ్బపాన్పు." పాంచా. 3, ఆ.—2. బద్ద; 3. వెదురుబద్ద*.

దబ్బడము. దే. వి. మూకుడు.

దబ్బడించు. దే. స. క్రి. 1. మూకుటితో మూయు; 2. చేతులతో చఱచు.

దబ్బనము. దే. వి. గోనెకుట్టెడు సూది.

దబ్బయుంగరము ద్వ. వి. పవిత్రపుముడివలె బంగారుతో చేసిన యుంగరము. "కమలాక్షునియంగుళిదబ్బయుంగరంబప్పరకాలుఁడెంతయును వారసిమూచి." పర. ౪, ఆ.

దబ్బఱ. దే. వి. 1. బొంకు; 2. మోసము; "గీ. వినిపుడమి కేఁడులెంతయు వెఱఁగుపడుచు,నద్దిరా కొండకుద్దిగ్గ్యైకొద్దిగాక, యున్నవిలు దెచ్చియందఱబన్న మొందఁ, జేసెఁబోల్వీఁడుదబ్బఱచేసి నేఁడు." అచ్చ. బాల, కాం.—3. విపత్తు. "ద్వి. పనసుఁడెటింగిదబ్బఱవచ్చెననుచు." రా. యు, కాం.—4. తప్పు. (చూ. బుజె.) విశే. 1. బొంకుకాఁడు; 2. మోసకాఁడు. "క. నెఱయంగా నీఛందము, తెఱఁగెఱుఁగక కవిత చెప్పఁదివురుసతఁడుద, బ్బఱచీకుచీకుగుఱ్ఱముఁ, బఱపినగతినిఖిలహాస్యపదనిరతుఁడగు౯." కవిజనాశ్రయము.

దబ్బఱకత్తియ. ద్వ. విశే. దబ్బఱలాడునది. (స్వార్థమున కత్తియ.)

దబ్బఱకాఁడు. దే. విశే. దబ్బఱలాడువాఁడు. (స్వార్థమున కాఁడు.)

దబ్బఱి. దే. విశే. (దబ్బఱ+ఇ.) దబ్బఱకాఁడు, దబ్బఱకత్తియ. (స్వార్థమున ఇ ప్రత్యయము.)

దబ్బవాఁడు. ద్వ. వి. మేదరవాఁడు.

దబ్బవ్రేలు. ద్వ. వి. పవిత్రపువ్రేలు, అనామిక.

దబ్బాటు. దే. క్రి. విశే. డబ్బాటుయొక్కరూపాంతరము.

దబ్బిచిప్ప. దే. వి. తాటిచెట్టుబద్దలు చేసెడుసాధనము.

దబ్బు. దే. స. క్రి. చెప్పు. వి. మాట. "ఉ. ఉల్లములోననేమముచు నందువొ రోయిశోకదబ్బుదబ్బెద౯." సా. ౧, ఆ.—2. దబ్బడము.—౩. చఱచుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము.

"క. గొబ్బునలేచిబుజంబులు, దబ్బునఁజఱచుకొని." నీలా. 3, ఆ.

దబ్బుడు. దే. వి. మూఁత, దబ్బడము.

దబ్బున. దే. ద్ర. క్రి. విణ. శీఘ్రముగా. (నీవుపోయి దబ్బునరా.)

దబ్బుర. దే. వి. డబ్బురయొక్క రూపాంతరము. (గిన్నెకు. చూ. రుక్మి. 3, ఆ.)

దబ్బువెట్టు. దే. స. క్రి. (దబ్బు+పెట్టు.) మూయు. (చూ. గోలెము.)

దభ్రము. సం. విణ. (అ.ఆ.అ.) సూక్ష్మము, సన్నము.

దమథము. సం. వి. అ. పుం. 1. క్లేశమునోర్చుతనము; 2. దండనము.

దమనము. సం. వి. అ. న. అణఁచుట. పుం. దవనము.

దమనుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకానొక ముని; 2. శూరుఁడు. విణ. అణఁచువాఁడు.

దమము. సం. వి. అ. పుం. 1. దండోపాయము; 2. క్లేశమునోర్చుతనము; 3. ఇంద్రియనిగ్రహము; 4. అణఁచుట; 5. అడుసు.

దమి. సం. విణ. (న్. ఈ. న్.) అణఁచువాఁడు.

దమించే. సం. స. క్రి. అణఁగఁద్రొక్కు, అణఁచు. (దమియించు. అనియు.)

దమితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. అణఁపఁబడినవాఁడు; 2. తపఃక్లేశసహనముగలవాఁడు.

దమునసుఁడు. సం. వి. స్. పుం. అగ్నిహోత్రుఁడు.

దమ్మఁడు. వై. విణ. కపటములేనివాఁడు*. "గీ. దమ్మఁడికఁ లేఁడు నాచేతఁ దగులువడియెఁ గౌశికునిఁ బ్రీతిఁబొందింపఁ గలిగె నాకు." హరిశ్చ. ౪, ఆ.

దమ్మము. యు. దే. వి. నాలుగుకాసులనాణెము. వై. ధర్మము.

దమ్మిడి. దే. వి. అయిదుకాసులనాణెము. రెండుకాసులనాణెము. (అని కొందఱు.)

దమ్ము. వై. వి. అడుసు, పంకము.

దమ్ముకొను. ద్వి. అ. క్రి. అడుసగు, పంకిలమగు.

దమ్యము. సం. వి. అ. పుం. మోయుటకును దున్నుటకును బనుపఱుపఁదగిన వయసుగలకోడె.

దయ. సం. వి. ఆ. స్త్రీ. కృప, కనికరము.

దయచేయు. మి. అ. క్రి. కరుణించు. "దయచేసి తత్ప్రార్థితములైనవరములు నొసఁగి." పాండు. ౫, ఆ. స. క్రి. ఇచ్చు. "క. నిద్రదయచేయుమనియెడు, రద్రోహియనమరవరులురదనాంకురచం, చద్రుచులునిగుడనవ్వుచు, భద్రముకదియుయనఁగఁబద్మజుఁడిచ్చెన్." నిర్వ. 3, ఆ. (మఱియు నిది గొప్పవారిని రండు పొందు అనుటయందును ఉపయోగింపఁబడును.) (రూ. దయసేయు.)

దయాళువు. సం. విణ. ఉ. కనికరముగలవాఁడు.

దయిత. సం. వి. ఆ. స్త్రీ. 1. ప్రియురాలు; 2. ఆఁడుది.

దయితుఁడు. సం. వి. అ. పుం. ప్రియుఁడు. విణ. ఇష్టుఁడు.

దయ్యము. వై. వి. 1. దేవుఁడు; "సీ. పూనియాదయ్యమానెమ్మనఁబుల వేడుకలన్ని యున్నదనఁగ." రాఘ. 3, ఆ. –2. వేలుపు; "దయ్యపుమూఁకలుపైఁడికొండపైననయముఁగాఁ పురంబులుగ." య. ౧, ఆ.—3. విధి; "క. అయ్యిరువురఁజఱఁగుఁ కప్పుడు, కయ్యమునకుఁ బరమసాధకంబుగ గెలిగెన్, ముయ్యంచుతుంగ యచ్చట, దయ్యము నేర్పు వినుసెప్పెదం గురునాథా." భార. మా. ౧ ఆ. –4. పిశాచము*. "ఉ. భవత్తనూజకే, దయ్యముసోఁకెనో మిగులఁదాపము నొందుచు నాఁడు నాఁటికిన్, దయ్యఁదొడంగె." భో. ౫, ఆ.

దయ్యు. దే. అ. క్రి. డయ్యుయొక్క రూపాంతరము.

దర. వై. వి. వెల, క్రయము*.

దరణము. దే. వి. ఎనిమిదిడబ్బులనాణెము.

దరము. సం. వి. అ. పుం. న. 1. భయము; 2. శంఖము. 3. గొయ్యి. అవ్య. ఇంచుక. (దరహాసము. చూ.)

దరహాసము. సం. వి. అ. పుం. చిఱునవ్వు.

దరాం. అం. వి. ఒక కొలఁత, మద్యపానము.

దర్ఖాస్తు. హిం. వి. విన్నపము.

దర్జా. హిం. వి. మెట్టు, స్థితి.

దరి. ఉభ. వై. వి. 1. గట్టు; "చ. గురుజనభక్తియుఁ గపటగోపకుమారపదాబ్జసక్తియున్, దరులఁగ." పాండు. ౪, ఆ.—2. మేర*; "ఎ, గీ. మఱియుఁ లేనిసొగసులేమఱక చేసి." నీలా. 3, ఆ.—3. సమీపము*. "సీ. చల్లనిసురపొన్నచాయలచాయలనరుదారుమాణిక్యదరులదరుల." సా. 3, ఆ.— సం. ఈ. స్త్రీ. గుహ.

దరికొను. దే. అ. క్రి. 1. మండు; "దరికొనునాఁటదనువిదాహము పుట్టిన." భార. శాం. 3, ఆ.– 2. కాలు. "మ. ఆశేషంబు బంగారుగు, బ్బలియై దొక్కుడఁ జెందినం దరికొనెన్ భస్మావశేషంబుగాన్." ఉ, హరి. ౫, ఆ. (ప్రే. దరికొలుపు.)

దరితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) భయబడినవాఁడు.

దరిద్రుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) బీదవాఁడు.

దరిబేసి. దే. వి. దైన్యముగలవాఁడు, దీనుఁడు. "సీ. భుజమునఁ గూబరంబుధరించుకొని సోలుదరిబేసి యగుచు బేతాళుఁ డొకఁడు." జై. ౫, ఆ.

దరిమిల. హిం. క్రి. విణ. తరువాత.

దరిసించు. వై. స. క్రి. 1. చూచు; "క. మిమ్ముౕ, దరిసించునభిమతంబున, నరుదెంచుచునుండి." వి క్ర. ౫, ఆ.—2. కానుకగానిచ్చు*. "ద్వి. తనదే ని నే తెచ్చిదరిసింతుననుచు." భల్లా. ౨. భా.

దరిసనము. వై. వి. రాజులులోనగువారిని చూడఁబోవునపుడు తీసికొనిపోయియిచ్చెడు కానుక*. "క. గిరిరాజాతన్నుడగ్గఱ, నరుదెంచిపిమ్మటఁ దఁడగుచు నబ్జదళాక్షికౕ. దరిసెనము పెట్టినిలిచినఁ, గరుణయుమోదంబుఁ బుట్టెఁ గలకంఠునకుౕ." వీర. ౧, ఆ.

దర్జీ. హిం. వి. కుట్టుపనిచేయువాఁడు.

దరుజు. దే. వి. గచ్చుపూఁతతో రాళ్లనుకలుపుట.

దరువు. వై. వి. 1. గీతివిశేషము; 2. తాళము*.

దరువుచేయు. వై. అ. క్రి. తాళము వేయు.

దర్దురా. సం. వి. ఆ. స్త్రీ. దుర్గ. అ. పుం. ము. 1. కప్ప; 2. మబ్బు.

దరోబస్తు. హిం. విణ. అంత.

దర్పకుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు మరుఁడు.

దర్పణము. సం. వి. అ. పుం. అద్దము, ముకురము.

దర్పము. సం. వి. అ. పుం. 1. గర్వము; 2. కస్తూరి.

దర్పించు. సం. అ. క్రి. గర్వించు. త్రుళ్లు.

దర్బారు. హిం. వి. కచ్చేరీ, కొలువుకూటము, ఒక రాగము.

దర్భ. సం. వి. అ. పుం. తృణవిశేషము, కుశము.

దర్భముద్రిక. సం. వి. ఆ. స్త్రీ. దబ్బయుంగరము. "సీ. శోకించువృద్ధభూసురుఁడాత్మపితృదత్తదర్భముద్రికకుఁజిత్తంబుగలఁగి." పాండు. 3, ఆ.

దర్యాప్తు. హిం. వి. విచారణ.

దర్వి. సం. వి. ఈ. స్త్రీ. 1. మిల్లి; 2. గరిఁటె; 3. పాముయొక్కపడగ.

దర్వీకరము. సం. వి. అ. పుం. సర్పము, పాము.

దర్శకుఁడు. సం. వి. అ. పుం. ద్వారపాలకుఁడు. విణ. 1. చూపెడువాఁడు; 2. నేర్పరి.

దర్శనము. సం. వి. అ. న. 1. చూపు; 2. కన్ను; 3. అద్దము; 4. బుద్ధి; 5. తెలివి; 6. కల; 7. శాస్త్రము; 8. ధర్మము.

దర్శని. సం. వి. ఈ. స్త్రీ. (చూ.) ఉపరథ్య.

దర్శనీయము. సం. విణ. (అ. ఆ. అ.) చూడఁదగినది.

దర్శము. సం. వి. అ. పుం. 1. అమావాస్య; 2. అమావాస్యనాఁడు చేయఁదగిన యిష్టి; 3. చూపు.

దర్శయిత. సం. విణ. (ఋ. ఈ. ఋ.) చూపువాఁడు.

దర్శించు. సం. స. క్రి. చూచు, వీక్షించు

దర్శితము. సం. విణ. (అ. ఆ. అ.) చూపఁబడినది.

దర్సనము. వై. వి. దరిసనముయొక్క రూపాంతరము. (చూ. చేదర్సనము.)

దలపము. సం. వి. అ. పుం. ముఖత్రాణము. (చూ. తనుత్రాణము.)

దలారి. దలాలి. హిం. వి. తరగరి.

దలిమము. దే. విణ. సన్నము. "క. ఎలనాగయొార్తు డలిమపు, వలిపంబులుగట్టనిచ్చె వడినడుగులఁబా, వలుదోడిగనొకతె యొక్కతె, తలఁబావడయొత్తిలిగిచితలయార్చెఁదగౕ." య. ౪, ఆ. (డడిమముయొక్క రూపాంతరము.)

దల్లు. వై. వి. జల్లుయొక్క రూపాంతరము. (వాసరు.—"క. పెల్లుకొనఁగురిసిరప్పుడు, దల్లుగఁదమచూడ్కులకునుడలమించుచుభూ, వల్లభుపైఁబురభామలు, కొల్లలుగాలాజమిళితకుసుమాంజలులౕ." కవిక. 3, ఆ.

దవ. దే. వి. దుమ్ము. చెఱకుకొన. (అని కొందఱు.)

దవంతి. దే. వి. అగడ్త, కందకము.

దవనము. వై. వి. వాసనగల మూలికావిశేషము.

దవము. సం. వి. అ. పుం. 1. కార్చిచ్చు; 2. అడవి.

దవసము. దే. వి. కొలుచు, ధాన్యము.

దవిష్ఠము. సం. విణ. (అ.ఆ.అ.) మిక్కిలి దవ్వైనది.

దవీయము. సం. విణ. (స్. ఈ. స్.)——పై.——

దవ్వ. దే. వి. మ్రానినడిమి మెత్తనిభాగము.

దవ్వు. వై. విణ. దూరము. (ఇది ద్వితీయాబహువచనాంతమైనచో దూరదేశమర్థమగుచున్నది. "అక్కర. ఎదురనుదవ్వులఁజూచినపాడవులెల్లఁద క్షణము, కదియఁగా." భార. అర. ౨, ఆ.)

దశ. సం. వి. ఆ. స్త్రీ. 1. అవస్థ; 2. వత్తి; 3. బ. బద్దె.

దశకము. సం. స. అ. న. పది.

దశనము. సం. వి. అ. న. కవచము. పుం. 1. పల్లు; 2. శిఖరము.

దశనవాసస్సు. సం. వి. స్. న. పెదవి, పలువలువ.

దశబలుఁడు. సం. వి. అ. పుం. బుద్ధదేవుఁడు.

దశమి. సం. వి. ఈ. స్త్రీ. పక్షమునందు పదియవతిథి. విణ. పదియవది. స్. మిక్కిలి వృద్ధుఁడు.

దశమిస్థుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. నష్టవీర్యుఁడు; 2. వృద్ధుఁడు.

దశాహము. సం. వి. అ. పుం. మృతిపొందినవానికి పదియవనాఁడుచేయు శ్రాద్ధము.

దష్టము. సం. విణ. (అ. ఆ. అ.) కఱవఁబడినది.

దసరా. వై. వి. దశరాత్రిపండుగ.

దసిలీ. దే.వి.1.ఒకదినుసుపట్టు, మొగ్గపట్టు; "దసిలీనూలుపట్టెయుల్లికబెడంగు." కళా. ౨,ఆ.—2.వదలు.

దసువంది. దే. వి. గుద్దులాటకు జెట్టీలను గూర్చువాఁడు.

దసెన. దే. వి. ఆయుధవిశేషము. (అప్ర.)

దస్థతు. హిం. వి. చేవ్రాలు.

దస్తరము, దస్త్రము. కాకిదములమూట.

దస్తావేజు. హిం. వి. వ్రాతపూర్వకమైన సాధనము.

దస్తు. హిం. వి. పోగుచేసిన సొమ్ము.

దస్తూరి. హిం. వి. వ్రాఁత. "గీ. సారముగవ్రాసియున్నదస్తూరిఁజూచి." కృష్ణ. 3, ఆ. (ఈ యన్యదేశ్యమీగ్రంథమునందుమాత్రము కనఁబడెడి.)

దస్యుఁడు. సం. వి. ఉ. పుం. 1. శత్రువు; 2. దొంగ.

దస్రులు. సం. వి. అ. పుం. ద్వి. అశ్వినీదేవతలు.

దహనము. సం. వి. అ. న. కాల్చుట. పుం. 1. చిత్రమూలము?; 2. జీడి?.

దహనుఁడు. సం. వి. అ. పుం. అగ్ని. విణ. దుష్టుఁడు.

దహించు. సం. స. క్రి. కాల్చు.

దళకొను. దే. అ. క్రి. దళముకొనుయొక్క రూపాంతరము. "దళకొనియున్నతొంటిసుకృతంబున." విక్ర. ౪, ఆ.

దళగించు. దే. అ. క్రి. దళముకొను, దట్టమగు.

దళనము. సం. వి. అ. న. 1. ఖండించుట; 2. భేదించుట.

దళము. ఉభ. దే. వి. ఆధిక్యము. "క. గండువుదానెక్కొనుప్పిదళమున నెపుడుఁ." విజ్ఞా. ప్రా, కాం.—విణ. 1. అధికము; "చ. బిలముఖపఙ్క్తినీధరణిభృత్పతివారిధినిర్భరభ్రమిఁ, దళముగమున్నద్రావినసుధారసధారగుణంబునం జూమీ." స్వా. ౫, ఆ.—2. తఱచు; 3. దట్టము.—సం. వి. అ. న. 1. ఆకు; 2. దండు; 3. పూరిదళము; 4. భాగము.

దళముకొను. దే. అ. క్రి. అధికమగు. "క. దుర్యోధను నెమ్మదికిఁ భయంబుదళముకొనంగఁ." శ. ప. ౧, ఆ. (ప్రే. దళముకొలుపు.)

దళవరి. యు. దే. వి. (దళము + వరి.) ధాన్యవిశేషము. వై. సేనాధిపతి.

దళవాయి. వై. వి. 1. సేనాధిపతి; (చూ. తలబీకనకాయ.) — 2. సుంకరికి సహాయుఁడైన యుద్యోగస్థుఁడు*.

దళసంచు. దే. వి. (దళము + సంచు.) దళముజాతి.

దళసరి. ద్వ. వి. (దళము+సరి.) ఘనత. "వ. నంద యశోదాదులైనగోపగోపికాజనంబులు హర్షదళసరియెఱుంగక." భాగ. ౧౦, స్కం. పూ.—విణ. 1. తఱచు; (నేఁతదళసరిగానున్నది.) 2. మందము. (ఈ రాగితగడు మిక్కిలి దళసరి.)

దళించు. సం. స. క్రి. 1. ఖండించు; 2. భేదించు.

దళితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఖండింపఁబడినది; 2. భేదింపఁబడినది; 3. వికసించినది.

దా.

దా. దే. విణ. డాయొక్క రూపాంతరము. (చూ. దాపల.)

దాంతి. సం. వి. ఇ. స్త్రీ. బ్రహ్మచర్యాదితపఃక్లేశము నోర్చుతనము.

దాంతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. అడఁపఁబడినవాఁడు; 2. తపఃక్లేశమునోర్చువాఁడు.

దాంపత్యము. సం. వి. అ. న. దంపతిభావము.

దాంభికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) దంభముగలవాఁడు.

దాఁక. దే. ద్ర. దనుకయొక్క రూపాంతరము.

దాఁకొను. దే. అ. క్రి. (దాఁగు+కొను.) మఱుఁగుపడు. "ఉ. మించినయామునేనుఁగుల మీఁదికిఁ జంగునదాఁటియాదలల్, చించిన గోళ్లలోఁ దగిలిచిందినముత్యములెల్లఁజట్లపై, మంచునఁ జేరఁగొనినమాటికినమ్ముల ద్రవ్వి త్రవ్వియ, చ్చోఁచునెలంతలేలుదురుసింగపుజాడలెఱింగియచ్చటన్." య. ౨, ఆ. (స్వార్థమున కొను.)

దాఖలా. హిం. వి. ఋజువు, సాక్ష్యము.

దాఁగనమ్ముచ్చులు. దే. వి. బ. దాఁగిలిమూఁతలు.

దాఁగర. దే. వి. ఎండువుఁదట్ట, ప్రసేవకము. "గీ. ఐరుగుతో దాఁగరకు నెండవలసినట్లు." ఉ, హ. ౪, ఆ.

దాఁగిలిమూఁతలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము, గుప్తక్రీడ. "ఉ. నవ్వునుసిగ్గుఁగూడివదనంబున దాఁగిలిమూఁతలాడఁగన్." అని. 3, ఆ.

దాఁగిలిముచ్చులు. దే. వి. బ.——పై.——"ఉ. చేతులువ్రేసిపాటియునుజెచ్చెరదాఁగిలిముచ్చులాడియున్." వి, పు. 2, ఆ

దాఁగు. దే. అ. క్రి. మఱుఁగుపడు, తిరోహితమగు.

దాఁగురించు. దే. స. క్రి. 1. దాఁచు; 2. పంచించు. (చూ. డాఁగురించు.)

దాఁగురింత. దే. వి. 1. దాఁగురించుట; 2. బ. దాఁగుడుమూఁతలు. (చూ. డాఁగురింత.)

దాఁగుడుమూఁతలు. దే. వి. బ. దాఁగిలిమూఁతలు.

దాఁచు. దే. ప్రే. దాఁగఁజేయు. "చ. మఘవతరరాజ్యసంపదలుదాఁచక సర్వమునీకునిచ్చితిన్." హరిశ్చ. 3, ఆ.

దాఁటడుగుపరువడి. దే. వి. మల్లబంధవిశేషము.

దాఁటడుగుమొన. దే. వి.——పై.——

దాఁటు. యు. దే. అ. క్రి. లంఘించు. (చూ. ఉంకు.) స. క్రి. 1. తరించు; (వాఁడాయేఱుదాఁటివచ్చెను.) 2. ఉల్లంఘించు. (వీఁడు నామాట దాఁటఁడు.) వి. లంఘనము.—వై. సమూహము. "సీ. రాయంచదాఁటులు మ్రోయులేఁదేఁటులు గృహసరోరుహములఁగేలిసలుప." విక్ర. 3, ఆ.

దాఁటుకట్టు. ద్వ. అ. క్రి. గుంపుగూడు. "గీ. చినుకులోఁగూడఁజలిగాలిచెలఁగఁజూచి. దాఁటుకట్టుచుమృగములుదాఁటుచుండ." పంచ. నా. ౨, ఆ.

దాఁటుకొను. దే. అ. క్రి. లంఘించు. "ఎ, గీ. మ్రొగ్గిదాఁటుకొనిసముద్ధతిదితిపట్టెఁబట్టె." హరి. ఉ. ౯, ఆ. (స్వార్థమున కొను.)

దాఁపన. దే. వి. దాఁచుట.

దాఁపరము. దే. వి. దొంగిలించుట. (చూ. దాఁపరీఁడు.)

దాఁపరించు. దే. స. క్రి. దొంగిలించు. "గీ. ముద్దులాడయివ్రేతలమొఱఁగిపాలు, వెన్నలునుదాఁపరింపఁగఁ దన్నుఁబట్టి, తల్లియోలితోదామెన త్రాటఁగట్ట, నితఁడకాఁడెముద్దులఁగూల్చియేపునూపె." హరి. ఉ. ౫, ఆ.

దాఁపరీఁడు. దే. వి. (దాఁపరము+ఈఁడు.) దొంగ. "సీ. వీఁడకేమందలోవెన్నలుదొంగిలి దర్పించి మెక్కినదాఁపరీఁడు." భాగ. ౧౦, స్కం. పూ.

దాఁపటికము. దే. వి. (దాఁపన+టికము.) దాఁపురము, గోపనము.

దాఁపు. దే. ప్రే. దాఁచు. "ద్వి. ఆపదవచ్చినయప్పుడేమున్న, దాఁపినధనమిచ్చితగుఁబత్నిఁగావ." హరిశ్చ. ౨, భా.

దాఁపుడు. దే. వి. దాఁచుట, గోపనము.

దాఁపురము. దే. వి. 1. మఱుఁగుపుచ్చుట, గోపనము; "గీ. ఇంతిసిగ్గుగదాయనియెంతదాఁకఁ. దలఁపుదాఁచిలోలోఁగుమారిలఁగవచ్చు. నదియుఁగాకేసులాఁతిసేయకటనీకు, రమణినాపట్టునను దాఁపురంబువలదు." కళా. ౬, ఆ.—2. దాఁచినసొమ్ము. "మ. కావలయువేళన్ వచ్చికొంపోదునే, నివినీ పెట్టియునాదుదాఁపురముగానిందుండనిమ్మిన్నియున్." సా. ౨, ఆ.

దాక. యు. దే. వి. 1. వెడలుపునోరుగల యటిక; 2. బోగిణి. వై. ద్రాక్ష?.

దాకలి. దే. వి. (దాయి+కలు.) కాఁచిసాగఁగొట్టెడు ఇనుము బంగారులోనగువానికి ఊఁతగా క్రింద నుంచెడు ఇనుపముద్దలోనగునది, నిఘాతిక. "దాకటిమీఁదఁబెట్టిబెడిదంబుగసంపెటవేయ." రత్న.

దాకల్లు. దే. వి. (దాపు+కల్లు.) బండికంటి కడకమ్మి, నేమి.

దాకొను. దే. అ. క్రి. (దాపు+కొను.) సమీపించు. "లగనముదాకొనియె." అచ్చ. అ, కాం.

దాక్షాయణి. సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. రోహిణీనక్షత్రము; 3. అశ్విన్యాదినక్షత్రము; 4. భూమి.

దాక్షిణ్యము. సం. వి. అ. న. మొగమోటము.

దాక్షిణ్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) దక్షిణకు తగినవాఁడు, (రూ. దక్షిణ్యుఁడు.)

దాగలి. దే. వి. దాకలియొక్క రూపాంతరము.

దాడి. వై. వి. 1. శత్రుజయార్థముదండెత్తిపోవుట; (చూ. జోడఁగి.) 2. గడ్డము.

దాడికాఁడు. వై. వి. వేగులవాఁడు. "చ. ఇదెచనుదెంచెఁజైత్రుఁడని యెల్లవనంబులకుం బ్రమోదముల్, పొదలఁగ మేలివార్తగొనిబోరనవచ్చినదాడికాఁడనన్, మృదుపవనదేవతాముఖసమీరమెదుర్కొనుపల్లవిల్లెనిం, పొదవఁగదక్షిణానిలమనూనమనోహరఖేలనంబునన్." లక్ష్మీ. ౨, ఆ.

దాడిచేయు. వై. అ. క్రి. దండెత్తు.

దాడినిమ్మ. వై. వి. దానిమ్మ**I**. "మత్తకోకిల. పూచెని మ్మలుదాడినిమ్మలుఁబొన్నలుఁగొనురపొన్నలుఁగా." య. ౪, ఆ.

దాడిమపుష్పకము. సం.వి.అ.పుం మలుమోదుగు**I**.

దాడిమము. సం. వి. అ. పుం, న. దానిమ్మ. (రూ.) దాడింబము**I**. (ఇది ఈకారాంతస్త్రీలింగమునగు ను.) పుం. ఏలకి**I**.

దాడిమ్మ. వై. వి. దానిమ్మ**I**.

దాడియాడు. ద్వి. స. క్రి. (దాడి + ఆడు.) మా ర్కొను. "ద్వి. ఈడఁబోవకయుంద్రుఁడీమనవీఁడు, దాడియాడుచువస్తుతతిఁగొల్లవిడిచి." భాగ.౭ స్కం.

దాఢ. సం.వి.అ. స్త్రీ. 1. కోఅపల్లు; 2. సమూహము.

దాణ. వై. వి. ఉలవలులోనగు గుఱ్ఱమునాహారము. "ఏతటిఁగలలోనినుంబడెఁడుదాణయెలుఁగను." హంస. ౫, ఆ.

దాణము. దే. వి. సుంకము, శుల్కము.

దాత. సం. విశ. (ఋ. ఈ. ఋ.) ఇచ్చువాఁడు.

దాతికట్టు. దే. వి. (దాయి+కట్టు.) (చూ.) ఉద్ఘనము.

దాత్యూహము. సం. వి. అ. పుం 1. కూకుడుగుం డఁగి; 2. వానకోయిల.

దాత్రము. సం. వి. అ. న. కొడవలి, లవిత్రము.

దాదాపు. దే. వి. (దాపు+దాపు.) మిక్కిలి సమీపము.

దాది. వై. వి. పాలిచ్చి పెంచుతల్లి.

దాదిలి. వై. వి.——పై.——

దాదుంగ. దే.వి. (దాయి+దుంగ.)(చూ.)ఉద్ఘనము.

దానము. సం. వి. అ. న. 1. ఈవి; (దశదానములు.—గోదానము, భూదానము, తిలదానము, హిరణ్యదానము, ఆజ్యదానము, వస్త్రదానము, ధాన్యదానము, గుడదానము, రౌప్యదానము, లవణదానము.—షోడశమహాదానములు.—గోదానము, భూదానము, తిలదానము, హిరణ్యదానము, రత్నదానము, విద్యాదానము, కన్యాదానము, దాసీదానము, శయ్యాదానము, గృహదానము, అగ్రహారదానము, రథదానము, గజదానము, అశ్వదానము, భాగదానము, మహిషీదానము.) 2. ఏనుఁగు కపోలమదము; 3. పాలనము; 4. ఛేదనము; 5. శుద్ధి; 6. చతురుపాయములలో నొకటి. (ఇది పంచవిధము.—తనకుఁగల ధనమంతయునిచ్చుట, ఎక్కడ నేని ధనము తీసికొన్నచో దానికిఁ దానను కూలుఁడైయుండుట, అపూర్వవస్తువులనిచ్చుట, ఒకని ధనముఁబుచ్చుకొనఁ బ్రవర్తింపఁజేయుట, అప్పుతీర్చుట అని. చూ. ఉపాయము.)

దానవారి. సం. వి. ఇ. పుం. దేవత, వేల్పు.

దానవుఁడు. సం.వి.అ. పుం. దనుజుఁడు, తొలువేల్పు.

దానశౌండుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి యీవికాఁడు, వదాన్యుఁడు.

దానిమ్మ. వై. వి. దాడిమము**I**.

దాపనము. సం. వి. అ. న. దండుగగొనుట.

దాపరము. దే. వి. ప్రాప్తి.

దాపరించే. దే. అ. క్రి. ప్రాప్తించు.

దాపల. దే. వి. డాపల, ఎడమభాగము. "చ. కటకటకాశికాపురినెుకానొకనిద్దురఁ గన్నుమోడ్చియ, స్ఫటికనువిచ్చునప్పుడుడిభాగముఁగన్గొనిచోద్యమందునా, పటిదెసఁజూచియచ్చెరువుపాటువహించుమనస్సరోజసం, పుటమునవాఁడులాగుమగపోఁడిమియుంగలజంతుసంతతుల్." కాశీ. 3, ఆ. (డాపలయొక్క రూపాంతరము.)

దాపలించే. దే. అ. క్రి. డాపలించుయొక్క రూపాంతరము. "వ. బకవైరిదాపలించితిఁగిఁ." భార. శల్య. ౨, ఆ.

దాపించే. దే. అ. క్రి. సమీపించు.

దాపితుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) దండుగగొనఁ బడినవాఁడు, సాధితుఁడు.

దాపు. దే. వి. 1. సమీపము; 2. భయము. "మత్తకోకిల. దాపులేనిరణంబు నేటికిదానవోత్తముమాఁ గాఁ." మై. ౧, ఆ.

దాపురమగు. దే. అ. క్రి. (దాపురము+అగు.) ప్రాప్తించు.

దాపురము. దే. వి. ప్రాప్తి. "వ. బుధులకునవనిధుల దాపురంబునువిపులజయలక్ష్మికిఁగాఁపురంబును." రామా. ౧, ఆ.

దాప్యము. సం.విశ. (అ.ఆ.అ.) దండుగగొనఁదగినది.

దామని. సం. వి. ఈ. స్త్రీ. దామెనత్రాడు.

దామము. సం. వి. న్. పుం, న. (పసులఁగట్టెడు) 1. తలుగు; 2. హారము.

దామర. దే. వి. 1. ఉరిత్రాడు; "చ. ఎలమిమునో జలధ్భుఁడెలయించిన జక్కవదీము వెంటిపే, లఁగునఁబిల్చిచూడ్కిఁగదియించి యెదుర్కొని మేనుమేనుని, శ్చలగుణసంగతింబెనఁచిచక్రము దామరతెంకిఁజేర్పఁద, త్కలకలశంకఁబో లెవిహా

గంబులువీడఁగులాయకూటముల్." వసు. ౪, ఆ.—2. మండలాకారకుష్ఠము.

దామెన. వై. వి. పెక్కుతలుగులుగల నిడివిత్రాడు.

దామోదరుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు, వెన్నుఁడు.

దాయ. దే. వి. 1. జ్ఞాతి; 2. శత్రువు. "దాయధనంబు." భార. అను. ౨, ఆ. "దాయగెల్వుమ సురేంద్రా." ఉ, రా. ౨, ఆ.

దాయఁగట్టు. దే. స. క్రి. (దాయక్+కట్టు.) (చూ.) ఉల్లుకట్టు.

దాయకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఇచ్చువాఁడు.

దాయము. ఉభ. దే. వి. 1. పాచికలు గవ్వలు మొదలైనవానియందలి పందెము. "ద్వి. ఇదియే మొయిపుడు దాయంబుపడనికతంబని." విష్ణు. పూ. ౨, ఆ.—2. గవ్వలాట; 3. విపత్తు. "ద్వి. దాయంబుతలనిట్టిదైన్యంబుతగునె." హరిశ్చ. ౨, భా.—సం. అ. పుం. 1. పంచుకొనఁదగినతండ్రిసొత్తు; 2. ఈవి; 3. అరణము; 4. కట్నము; 5. ఉల్లకుట్టుమాట.

దాయాదుఁడు. సం. వి. అ. పుం. 1. జ్ఞాతి; 2. పుత్రుఁడు.

దాయి. ఉభ. దే. వి. (చూ.) దాకలి. "చ. గరళపుముద్దలోహ మవగాఢమహాశనికోట్లు సమ్మెటల్, హరునయనాగ్ని కొల్మి యురగాధిపుకోఱలుపట్టుకార్లు ది, క్కరటిశిరంబుదాయి లయకాలుఁడుకమ్మరి వైరివీరసం, హరణగుణాభిరాముఁడగుమైలము భీమనఖడ్గసృష్టికిన్." భీమనచాటుధార.—సం. విశే. (న్. ఈ. న్.) ఇచ్చువాఁడు.

దాయు. దే. అ. క్రి. డాయు, సమీపించు.

దార. ఉభ. వై. వి. 1. నీటిచాలు; "రగడ. తమ్మిపువ్వులమీఁదిజలములదారదారకయుండఁజల్లుము." పా. ౪, ఆ.—2. దానము*; "ద్వి. దారలెక్కలకువైతరువులుపెట్టి, దారలనమ్మించిధనములుగొనెడి, కఠినచిత్తులులేరు." హరిశ్చ. ౨, భా.—3. క్రమము*. "ఎ, గీ. తప్పనాడకతొల్లింటిదారచెడక." ఉ, హరి. 3, ఆ.—సం. వి. అ. పుం. బ. అగ్నిసాక్షిగా పెండ్లాడిన పెండ్లాము.

దారకుఁడు. సం. వి. అ. పుం. 1. బాలకుఁడు; 2. కృష్ణునిసారథి. విశే. చీల్చువాఁడు.

దారణ. వై. వి. వెల, క్రయము*. "దారణవానికై కొదల్ పెట్టుచు." ఆము. ౬, ఆ.

దారణము. సం. వి. అ. న. చీల్చుట.

దారదము. సం. వి. అ. పుం. 1. విషభేదము; 2. పాదరసము; 3. ఇంగువ.

దారబందము. వై. వి. ద్వారబంధము.

దారము. దే. వి. నూలిత్రాడు.

దారి. వై. వి. 1. మార్గము*. విశే. ధరించువాఁడు. (జెడదారి. మొ.)

దారించు. సం. స. క్రి. చీల్చు.

దారితము. సం. విశే. (అ. ఆ. అ.) చీల్పఁబడినది.

దారిద్ర్యము. సం. వి. అ. న. బీదతనము.

దారుకీటము. సం. వి. అ. పుం. (చూ.) ఘుణము.

దారుణము. సం. వి. అ. పుం. భయానకరసము. విశే. భయంకరము.

దారున. దే. ద్ర. క్రి. విశే. తటాలున. "చ. దారునసెదురైరివైభవనిరూఢిఁజెలంగెడు కొండఱంగనల్." కళా. 3, ఆ.

దారువు. సం. వి. ఉ. న. 1. కొయ్య; 2. దేవదారువు*; 3. ఇత్తడి.

దారుహరిద్ర. సం. వి. ఆ. స్త్రీ. మ్రానిపసుపు.

దారుహస్తకము. సం. వి. అ. పుం. కొయ్యతెడ్డు.

దారోగా. హిం. వి. పైయధికారి.

దార్ఢ్యము. సం. వి. అ. న. దిటవు.

దార్వాఘాటము. సం. వి. అ. పుం. వడ్రంగిపిట్ట.

దార్వి. సం. వి. ఈ. స్త్రీ. 1. మ్రానిపసుపు; 2. బెండ*.

దార్వికా. సం. వి. ఆ. స్త్రీ. 1. బెండ*; 2. మ్రానిపసుపునవండిన అంజనవిశేషము.

దాలి. దే. వి. పాలుకాఁచుటలోఁగువానికిఁజేర్చిన పిడకలప్రోగు.

దాల్చిని. హిం. వి. సుగంధద్రవ్యవిశేషము.

దావ. దే. వి. తగవు. "దావలఁబెనఁచి." ద్వి. హరిశ్చ. ౧, భా. (ఇది విచార్యము.)

దావంతము. దే. వి. దుఃఖము. "ద్వి. దైవమాయామూఱు తప్పింపుమనుచు, దావంతమునమదిఁదలపోయుచుండె." సా. 3, భా.

దావము. సం. వి. అ. పుం. 1. అడవి; 2. కారుచిచ్చు.

దావరడంగి. దే. వి. డావరడంగియొక్క రూపాంతరము.

దావరి. దే. విశే. వీరుఁడు. "క. దేవరఁగొలిచెదననుడు, నీవిధముఁజేతమదుగఁడెవ్వఁడుమగఁడున్, దావరికాఁబోలుసువీఁ, డీవీరుఁడు మలయుచున్నవకుచు హృదయంబులరన్." సా. ౫, ఆ.

**దావరీఁడు.** దే. విశే. (దావరి+ఈఁడు.) దావరి. (స్వార్థమున ఈఁడు.)

**దావా.** హిం. వి. వ్యాజ్యము.

**దావికము.** సం. విశే. (అ. ఆ. అ.) దేవికానదియందుఁబుట్టినది.

**దాశపురము.** సం. వి. అ. న. కయివడిముస్తె?.

**దాశార్హుఁడు.** సం. వి. అ. పుం. హరి, వెన్నుఁడు.

**దాసనము.** దే. వి. జప?.

**దాసరయ్య.** వై. వి. (దాసరి+అయ్య.) తాఁబేలు. "క. వలఁజిక్కకచనెమ్మగమి, ప్వలఁజిక్కను దాసరయ్యవలవసజాలిన్, దలఁకంగ నేల నేఁడీ కొలఁదికిఁగూరయ్యెననుచుఁగొనిపోవుతఱిన్." పంచ. నా. ౨, ఆ.

**దాసరి.** వై. వి. విష్ణుసేవకుఁడైన శూద్రుఁడు*. "క. వ్యాససములైనయీధర, ణీసురపుంగవులనెల్లని రసించికటా, యీసభనర్చనయొక, దాసరిఁ గొనివచ్చియొసఁగఁదగునెదురాత్మా." పర. ౨, ఆ.

**దాసరికొయ్య.** ద్వ. వి. మత్స్యవిశేషము. (చూ. కొరద.)

**దాసరిగాఁడు.** ద్వ. వి. (దాసరి+కాఁడు.) తాఁబేలు.

**దాసరిపాము.** ద్వ. వి. సర్పవిశేషము.

**దాసి.** సం. వి. ఈ. స్త్రీ. 1. వెలకుఁగొన్న పనికత్తె; 2. కాకిదొండె?; 3. నల్లగోరంట?.

**దాసుఁడు.** సం. వి. అ. పుం. 1. వెలకుఁగొన్న పనివాఁడు; 2. శూద్రుఁడు; 3. జ్ఞాని; 4. చేపలఁబట్టువాఁడు. (ఈ యర్థమున నిది శకారోపధమునగు.)

**దాసేయుఁడు.** సం. వి. అ. పుం. పనివాఁడు. విశే. దాసికిఁబుట్టినవాఁడు.

**దాసేరుఁడు.** సం. వి. అ. పుం.——వై.——

**దాస్యము.** సం. వి. అ. న. సేవ, పని.

**దాహకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) కాల్చువాఁడు.

**దాహము.** సం. వి. అ. పుం. 1. కాలుట; 2. దప్పి.

**దాహరి.** వై. వి. దాసరియొక్క రూపాంతరము. "వ. కహకహనవ్వియద్దాహరికి సురద్రోహి యిట్లని యె." ఆము. ౬, ఆ.

**దాళా.** యు. దే. వి. పడియొక్క హెచ్చుతక్కువ. వై. (నెయ్యి నూనె మొదలగునవి తీయు పాత్రములనుగాని అవి యుంచియున్న పాత్రములనుగాని) పరియొత్తుటాలను దడతట్టనుంచితూఁచుట.

**దాళి.** సం. వి. ఈ. స్త్రీ. సెనగలులోనగువానిపప్పు.

**దాళిమ్మ.** వై. వి. దాడిమ్మయొక్క రూపాంతరము.

**దాళీకుఁడు.** దే. విశే. కార్యకర్త.

**దాళు.** దే. వి. వర్ణలేశము. "ద్వి. రసమెక్కియీశు లురయమునబలిసెఁ, బసుపుదాళెక్కి యేపుఁబల్చలగుచు." భాగ. ౧౦, స్కం.

**దాళువ** వై. వి. దౌడ.

**దాళువా.** దే. వి. శరదృతువు మొదలుకొని సీరాగ రానుపండెడు పల్లపుపంట.

## ది.

**ది.** దే. అవ. సంబంధమును దెలుపునది. (నాది, నీది, వానిది, వీనిది. మొ.)

**దించు.** దే. ప్రే. దిగఁజేయు. "ఎ. గీ. తెగువనాగ్రహబుద్ధియుడింపవైతి." రా. యు. కాం.

**దింటెన.** దే. వి. గిరికర్ణి?.

**దిండీఁడు.** దే. విశే. (దిండు+ఈఁడు.) కానెకట్టినవాఁడు.

**దిండు.** దే. వి. 1. నిడుపాటి గుండ్రపు తలగడ; 2. నిడుపాటి గుండ్రపు తలగడవలె చెక్కఁబడిన మ్రాను; (గుంటకదిండు, గొర్తిదిండు, పాపటదిండు. మొ.) 3. మెఱుఁగుబిళ్లలోనగునవి యంటించెడు ఆళ్లపనివాని సానతిరుగుడుకొయ్య. 4. దట్టి. "నునుపగుపచ్చపట్టునఁ గనుంగొనవొప్పగుదిండుగట్టి." హరి. పూ. ౬, ఆ.

**దిందిం.** దే. వ. దిమిదిమియొక్క రూపాంతరము.

**దింపు.** దే. వి. వ్రేలుట, లంబనము.

**దింపులువోవు.** దే. అ. క్రి. (దింపులు+పోవు.) వ్రేలాడు. "సీ. అందందవక్షోరుహములు దింపులువోవఁదొడుకనిచ్చుటయెట్లుదుర్గరసము." కా శి. ౮, ఆ.

**దిక్కుమొగములు.** వై. విశే. బ. భయముచేత దిక్కుదిక్కొకరుగా పాఱినవారు. "గీ. ఒక్కమొగముగ కయుటికిరిసైనికుల్, దిక్కుమొగములగుచుఁ జిక్కుభటులు, మొక్కిరీటియలతటుక్కునఁ డవైచి, యుక్కిరీటియెదుటనాఁగఁగలర." విజ. 3, ఆ.

**దిక్కామొగములు.** వై. విశే. బ. దిక్కుమొగములయొక్క రూపాంతరము. "సీ. పోయినపోకలైపోయిరిసిద్ధులు దిక్కామొగములైరి దిగధిపతులు." పా. ౫, ఆ.

**దిక్కు.** సం. వి. శ్. స్త్రీ. 1. దిశ; 2. శరణము.

దిగ. దే. అప. దిగుశబ్దమునకు వృత్తియందు ఆదేశముగావచ్చిన రూపము. (వృత్తియందు ఇది అర్థవిశేషముల నిచ్చుచున్నది. — దిగఁబోఁత. వి. దిగువకు వ్యాపించుట. (వానికి చెమట ఎగఁబోఁతలు దిగఁబోఁతలుగానున్నది.)—దిగరోఁజు. వి. కుట్టూపిరి. (వాఁడు ఎగరోఁజు దిగరోఁజులుగా పరుగెత్తుచున్నాఁడు.) ఇత్యాదులు.)

దిగంబరుఁడు. సం. వి. అ. పుం. 1. శివుఁడు; 2. భైరవుఁడు. విణ. దిసమొలవాఁడు.

దిగఁజీయు. దే. స. క్రి. దిగఁదుడుచు.

దిగఁదుడుచు. దే. స. క్రి. (దిగన్+తుడుచు.) (దృష్టిదోషము మొదలైనవానికి ఉప్పు మిరపకాయలోనగువాని) చేట్టివేయు.

దిగఁదుడుపు. దే. వి. దిగఁదుడుచుట. (చూ. దిగఁదుడుచు.)

దిగఁద్రావు. దే. అ. క్రి. (దిగన్+త్రావు.) దిగు. "క. కన్నంతనతనయేనిక, దున్నదిగంద్రావిరభసలోలాయితహో, రోన్నతవత్సస్థలుఁడై, యన్నలినాక్షునకువంచెనాత్మశిరంబున్." హరి. పూ. ౭. ఆ.—స. క్రి. విడుచు. "విశిష్టవృత్తి దిగఁద్రావియసాధువనంగనుండు." భార. అర. ౭, ఆ.

దిగఁబడు. ద్వి. అ. క్రి. (దిగన్+పడు.) 1. దిగు; "గీ. పంకముగొరిజదిగంబడిపఱవలేవు, మన్నులిష్వోళవేగటిమన్నులందు." స్వా. ౪, ఆ. (స్వార్థమున పడు.)—2. అడఁగు; "ధాత్రియుందిగంబడు." లక్ష్మీ. ౫, ఆ.—3. జాఱు. "గీ. తోఁచినట్టి, పిండమెడలిర్యైనఁబిదపదిగంబడదయ్యె." భార. కర్ణ. 3, ఆ.

దిగదిగ. దే. వి. వచ్చుట పోవుట విసరుట మెఱయుట లోనగువానియందగుననుకరణము. "నేలకుందిగదిగనింగినుండియురు డించిరి." "దిగదిగనరిగి." "దిగదిగవిసరి." "గీ. అబ్జరుచిఁదూర్పుదిగదిగయంచుమెఱసె."

దిగనాడు. దే. స. క్రి. (దిగన్+ఆడు.) విడుచు.

దిగవిడుచు. దే. స. క్రి. (దిగన్+విడుచు.)—పై.—"మగనిదిగవిడిచి." విష్ణు. ఆచా, కాం.

దిగసన. దే. ద్ర. క్రి. విణ. దిగువగా. "ఎగసనఁద్రోయుమన్న దిగసనఁద్రోసెదు."

దిగు. దే. అ. క్రి. 1. మీఁదనుండి క్రిందికివచ్చు; 2. దిగుమతియగు; "క. మేలైనసరకులాతని, కాలువదిగు." శుక. ౧, ఆ.—3. ప్రయాణమైపోవునపుడు దారిలోవిడియు; 4. దిగఁబడు. "గీ. కడుపుదిగెనంచుఁబౌరులుకలఁగఁబడఁగ." భాగ. ౧౦, స్కం. పూ.

దిగుచు. దే. ప్రే. దించు. "క. కౌఁగిలదిగిచిచంద్రుటొప్పుఁగువలయపతికిన్." విష్ణు. ప్రా, కాం.

దిగుడు. దే. విణ. 1. ఆనతము; (నేల ఎగుడుదిగుడుగానున్నది.) –2. తక్కువ. (చూ. దిగ్గుడు.)

దిగుదల. ద్వి. వి. (దిగుడు+తల.) క్రిందిభాగము.

దిగుమతి. దే. వి. (ఓడలోనున్న సరకును రేవునందు) దించుట.

దిగులు. దే. వి. గుండెయదరు.

దిగులుపడు. ద్వి. అ. క్రి. దిగులొందు.

దిగులుపాటు. ద్వి. వి. దిగులుపడుట.

దిగువ. దే. వి. క్రింది. "గిరిదిగువ." విణ. క్రిందైనది. "దిగువలోకములు."

దిగువాటు. ద్వి. వి. (దిగుడు+పాటు.) దిగువ. "క. మినుకుమినుకనెడిమింటన్, బొనపొనయులతెల్లమబ్బు పొంతనుదిగువా, టునన దె కలదోలేదో, యనుమాత్రముగాఁగఁగంటివా నృపతనయా." సా. ౧, ఆ.

దిగువాయి. దే. విణ. తక్కువ.

దిగువాఱు. దే. అ. క్రి. (దిగుడు+పాఱు.) 1. మీఁదనుండి క్రిందికిపడు; "ద్వి. వెగటుననవ్విరులవెన్ననిమీఁద, దిగువాఱఁబోయించి." విష్ణు. పూ. ౧, ఆ.—2. కాఱు; "వ. దృక్కోణంబులదిగువాఱుకన్నీరుచెన్నారుకర్ణద్వయీగోళకంబులునిండి." స్వా. 3, ఆ.

దిగ్గన. దే. ద్ర. క్రి. విణ. తటాలున. "ద్వి. కడునొగలలమిదిగ్గననేలతోడ, నడిచియు." రా. యు, కాం.

దిగ్గనాడు. దే. స. క్రి. దిగనాడుయొక్క రూపాంతరము.

దిగ్గియ. వై. వి. డిగ్గియయొక్క రూపాంతరము. (చూ. గడ రెండవయర్థము నుదాహరణము.)

దిగ్గు. దే. స. క్రి. దిగుయొక్క రూపాంతరము. "గీ. చేరియరదంబుఁదద్గృహద్వారసీమ, దిగ్గియరుదెంచిప్రణమిల్లిదేవయిపుడు, నీకుమారులసౌభాగ్యనిధులబుధుల, డించివచ్చితి గంగాతటీవసతిని." రామా. ౫, ఆ. — వి. భయమునందగుననుకరణము. "గీ. దేవతలమనంబుదిగ్గనంగ." నిర్వ. 3, ఆ.

దిగ్గుడు. దే. విణ. దిగుడుయొక్క రూపాంతరము. (తక్కువకు. — "అవ్విధిమాకు నెవ్విధిన్ దలిసినసీడుగాఁగలఁడెదిగ్గుడుమాకు." రామా. ౧, ఆ.)

దిగ్గున. దే. ద్ర. క్రి. విణ. దిగ్గనయొక్క రూపాంతరము.

దిగ్గురను. దే. అ. క్రి. (దిగ్గు+అను.) భయముచే హృదయము దిగ్గుమను. (సంధియందు వర్ణాధిక్యము.)

దిగ్గోలు. దే. వి. కోయుపయిరునకు ముందుపయిరు.

దిగ్ధము. సం. వి. అ. పుం. విషముపూసిన బాణము. విణ. పూయఁబడినది.

దిగ్బంధము. సం. వి. అ. పుం. 1. మంత్రముచేకట్టెడు దిక్కులకట్టు; 2. సాలెపురుగు.

దిగ్భ్రమము. సం. వి. అ. పుం. దిక్కుల తబ్బిబ్బు. (వాస్తవార్థము ఇదిగానుండినను వాడుకయందు భ్రమపర్యాయముగానే కానఁబడుచున్నది.)

దిచ్చేరి. వై. వి. వ్యభిచారిణి. "క. తెచ్చికుసూలము లోపలఁ, జొచ్చినబొజుఁగొగసియొగసి చూడఁగనవుడా, దిచ్చరిహెచ్చరికం బ్రియు, గ్రుచ్చిరతిక్రియలసొంపుగులుకుచునుండెన్." పంచ. వేం. ౧, ఆ.

దిచ్చ్చెమొగము. ద్వ. విణ. అదృశ్యము.

దిట. వై. వి. దార్ఢ్యము, శక్తి*. "క. దిటచెడిలోఁ బడెదైత్యుఁడు, సటికిన్ దంష్ట్రావిభిన్నశత్రుమహోర, స్తటికిన్ ఖరఖురపుటికిన్, గటితటవాతకమలజాండఘటికిన్ గిటికిన్." భాగ. 3, స్కం.

దిటము. వై. వి. ధైర్యము*. "గీ. అతితరాభీప్సితావృతస్వాంతయగుచుఁ, గొంతదిటమూనియున్న యనంతరమున." రసి. ౪, ఆ.—విణ. దృఢము. "చాలదిటంబగుభక్తిపూని." రసి. ౬, ఆ.

దిటవు. వై. వి. దార్ఢ్యము. విణ. దృఢము.

దిట్ట. వై. వి. దార్ఢ్యము, శక్తి*. (చూ. తెవులువడు.)—విణ. 1. దార్ఢ్యముగలవాఁడు; "వ. అఖండలాయఖండలాఘువాలాపంబులం గోపంబుపుట్టించితి. దిట్టవేనిగట్టితనం బేర్పడ నిప్పర్వతశిఖరంబుఁ బెఱుకుము." పాంచా. 3, ఆ.—2. ధైర్యముగలవాఁడు; "ఉ. దీనివిలాసముఁగనిమదిం గడుసోలరయొట్టిదిట్టలున్." రసి. 3, ఆ.—3. సామర్థ్యముగలవాఁడు*. "క. ఈదుడుకుఁగోఁతిఁగొనిచని, మీదిట్టతనంబులెల్ల మెఱయఁగనివుడోఁ, గాదనక తోఁకఁగాలిచి, వీదులవీదులను ద్రిప్పివిడువుఁడు కడఁకన్." అచ్చ. సుం, కాం.

దిట్టఁడు. వై. విణ. ధైర్యముగలవాఁడు. "ఉ. దిట్టఁడనైతి నెల్లవియుఁ దెల్లముగా వినవోర్తు సంజయా." భార. భీష్మ. ౧, ఆ.

దిట్టము. వై. వి. నిర్ణయము, చిక్కఁబట్టు*.

దిడ్డి. దే. వి. 1. గవనిలోనగువాని ప్రక్కనుండు చిన్నవాకిలి; 2. చిన్నవాకిలి. "క. నునుఁదైడి కావిచెఱఁగులఁ, బనుపడియెడిదిడ్డితోడిపల్లకికి... లెన్." య. ౪, ఆ.

దితము. సం. విణ. (అ. ఆ. అ.) నఱకఁబడినది.

దితి. సం. వి. ఇ. స్త్రీ. 1. అసురులతల్లి; 2. నఱుకుట.

దితిసుతుఁడు. సం. వి. అ. పుం. దితికొడుకు, దైత్యుఁడు.

దిద్దు. దే. స. క్రి. 1. శిక్షించు; "గీ. ముదితమేలు మేలుకొదవలే దెందునీ, యనఘచరితు దిద్దుమనుచుఁజనియె, జాంబవతియునొక్క సంవత్సరముదాఁకఁ, బొటనేర్పునికిఁబొటవమున." శా. ౨, ఆ.—2. సవరించు. "శా. అయిద్దఱు గేలిభి, న్నాలంకారములొక్కరొక్కరికినింపొనట్లుగాదిద్దుచున్." కళా. 3, ఆ. "క. నునుగుమ్మృగమదపంకం, బునఁదీనియదిద్ది." (ఇక్కడ సవరించుట అనఁగా అలుకుట. ఇట్లు సందర్భానుసారముగా అక్కడక్కడ నర్థము నూహించవలసినది.) రసి. ౪, ఆ.

దిద్దుగడ. దే. వి. దిద్దుపాటు.

దిద్దుడు. దే. వి.——వై.——

దిద్దుపాటు. ద్వ. వి. 1. సవరించుట; 2. శిక్షించుట.

దిద్దుబడి. దే. వి. దిద్దుపాటు.

దిదృక్ష. సం. వి. ఆ. స్త్రీ. చూడనిచ్ఛ.

దిదృక్షువు. సం. విణ. ఉ. చూడనిచ్ఛగలవాఁడు.

దిధక్ష. వి. ఆ. స్త్రీ. కాలువనిచ్ఛ. "లంకాపురీదిధక్షాదీక్షారూక్షప్రతాపు." రామా. 2, ఆ.

దిధక్షువు. సం. విణ. ఉ. కాలువనిచ్ఛగలవాఁడు.

దిధిషువు. సం. వి. ఊ. స్త్రీ. మాఱుమనువుది. ఉ. పుం. మాఱుమనువుదానిమగఁడు.

దినకరుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

దినబత్తెము. మి. గ్రా. వి. (దినము+బత్తెము.) దినమునిచ్చెడుబత్తెము. "నీకుమొదలన్ దినబత్తెము నేనొడంబడన్." హరిశ్చ. ౪, ఆ.

దినము. సం. వి. అ. న. 1. దివసము, పగలు. (దిన భాగములు పదునేను. — రౌద్రము, శ్వేతము

మైత్రము, కారభటము, సావిత్రము, విజయము, గాంధర్వము, కుతపము, రౌహిణేయము, విరించము, సోమము, నిరృతి, మాహేంద్రము, వరుణము, భటము.)

దినవెచ్చేము. మి. గ్రా. వి. (దినము+వెచ్చేము.) దిన దినము జేరగెడు వెచ్చము. "సీ. దినవెచ్చమునకునై తనమేనఁగలసొమ్ముఁగొదుకక బచ్చెంటఁగుదుపవైచు." పాండు. 3, ఆ.

దినసరి. దే. వి. 1. సస్యవిశేషము; "ద్వి. దినసరిసరి యయ్యేఁదీ తెలసంబావు." విష్ణు. పూ. 3, ఆ.— 2. బ. ధాన్యవిశేషము.

దినాంతము. సం. వి. అ. పుం. సాయంకాలము, మాపు.

దినారి. వై. వి. (చూ.) దీనారము. ("ఒకానొకచోటనుబుద్ధికాంచెఁ బెంపొంద దినారిటంకముల నుంచిన కాంచనకుంభము." (ఇక్కడ దినారిశబ్దమునకు పైఁడిమాత్రమర్థము.) పంచ. నా. ౧, ఆ.)

దినుసు. దే. వి. 1. ప్రకారము; 2. వస్తువు. (చూ. దినుస్సు.)

దినుస్సు. దే. వి. దినుసుయొక్క రూపాంతరము. (వస్తువునకు.— "గట్టిదినుస్సుతాయిఅప్పయు." కళా. ౬, ఆ.)

దిన్న. దే. వి. వృక్షవిశేషము. "సంపాతితాఁడియుశరభుండుదిన్నయునీలుండుమట్టియు." అచ్చ. యు, కాం. (జిన్నయొక్క రూపాంతరము.)

దిబ్బ. వై. వి. 1. ఉన్నతభూమి*; 2. కుప్ప*.

దిబ్బడము. దే. వి. దబ్బడముయొక్క రూపాంతరము.

దిబ్బెము. వై. వి. దీపము.

దిమాకు. హిం. వి. గర్వము, అధికారము.

దిమిదిమి. దే. వి. మద్దెలమ్రోఁతయందగు ధ్వన్యనుకరణము. "ద్వి. దిమిదిమియనుచుమద్దెలమ్రోయ." రా. కిష్కి. ౦, కాం.

దిమ్మ. వై. వి. 1. దిబ్బ, కుప్ప*; "గీ. తమ్మికొలఁకులనోలాడితమ్మిపూవుఁ, గొమ్మలుకదల్చికపురంపుదిమ్మలెక్కి." అచ్చ. బాల, కాం.— 2. భ్రమము*. "గీ. ఇట్లువైచిదానవిలమీఁదననుజుండు, దిమ్మఁదిరిగిపడుటఁదేటిచూచి." రామా. 3, ఆ.

దిమ్మరి. వై. విశే. (దిమ్మ+అరి.) 1. భ్రమకలవాఁడు, భ్రమకలది; 2. మత్తుకలవాఁడు, మత్తుకలది. "ఉ. అమ్మకచెల్లనేను వెలయాలనొ దిమ్మరినై పురంబువెణ్, ద్రిమ్మరఁజూచెనో." శుక. ౨, ఆ.

దిమ్మరీఁడు. వై. విశే. (దిమ్మరి+ఈఁడు.) మత్తుకలవాఁడు. "సీ. జక్కవగమినూడు చక్కనివగకాఁడు చిమ్మచీఁకటిఁజిమ్ముదిమ్మరీఁడు." కళాం. ౨, ఆ. (స్వార్థమున ఈఁడు.)

దిమ్మిస. దే. వి. నేలచేదును.

దిమ్ము. యు. దే. వి. సమూహము. "ఉ. తుమ్మెదదిమ్ముఁబొమ్మనుచుఁద్రోచుని గారవుసోగ పెన్నెఱుల్." రసి. 3, ఆ.— వై. 1. భ్రమము; "ఆమఖువార్తజన్మనొకయమ్మునదిమ్మునఁగూలనేని." రామా. ౫, ఆ. "వనచరేంద్రులకు దిమ్మునఁదలల్ దిరుగంగ." రామా. ౮, ఆ. "మానిని పెకా దిమ్మునసొమ్మసిల్లి." సా. ౨, ఆ. "ద్వి. తెలివొందిమదిలోనిదిమ్ముపోవిడిచి." హరిశ్చ. ౧, ఛా.— 2. మత్తు*. (చూ. దిమ్మరి.)

దిమ్ముపట్టు. ద్వ. అ. క్రి. (దిమ్ము+పట్టు.) 1. భ్రమగొను; "క. ముక్కున నోరనుసెత్తురు, గ్రక్కుచుఁదలదిమ్ముపట్టి కడుదైన్యముతో, నొక్కింతయూరలుంగున, నక్కములదశాత్ముఁజూచి యతఁడిట్లనియెన్." వి. పు. ౭, ఆ.—2. మత్తుగొను. (వీనికి తలదిమ్ముపట్టినది.)

దిమ్మె. దే. వి. 1. తామరపువ్వులోని దుద్దు; 2. కొయ్యబిరడ; 3. రాళ్లులోనగువానితో నేర్పఱచిన చిన్నమిట్ట.

దిమ్మెస. దే. వి. కాసెవాని ఒక కొలముట్టు.

దిరదిర. దే. వి. తిరుగుటయందగునను కరణము. "గీ. దిరదిరనుదిర్గిధరణికినొరగునపుడు." భల్లా. 3, ఆ.

దిరిసెనము. వై. వి. (చూ.) గిరిసెనము?.

దిరిసెము. వై. వి. దిరిసెనముయొక్క రూపాంతరము. "సీ. దిరిసెంపుఁబువ్వులఁదెగడుదోర్వల్లరీయుగమునఁగౌఁగిటికొనరఁజేర్ప." రా. యు, కాం.

దిర్దిర. దే. వి. దిరదిరయొక్క రూపాంతరము. "మూడులోకమ్ములుదిర్దిరందిరుగు." భార. ఆది. ౪, ఆ.

దిలాసా. హిం. వి. హెచ్చరిక, ధైర్యము.

దివటీ. వై. వి. ఇనుపసలాకకు గుడ్డలుచుట్టి ముట్టించెడు దీపము, (చూ.) దివ్వటీ.

దివము. సం. వి. అ. న. 1. ఆకాశము; 2. స్వర్గము; 3. పగలు.

దివసము. సం. వి. అ. పుం, న. దినము, పగలు.

దివస్పతి. సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు, వేల్పుఱేఁడు.

దివాంధము. సం. వి. అ. పుం. గుడ్లగూబ, ఘూకము.

**దివాకరుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు, పగటివేల్పు.

**దివాకీర్తి.** సం. వి. ఇ. పుం. 1. మంగలవాఁడు; 2. మాలవాఁడు.

**దివాణము.** వై. వి. 1. రాజుకొలువుకూటము*; "ఉ. పాండీఁడుదివాణముక్ చెలియనించినఁబ్రేలెడు దుర్మదాంధులక్, బోఁడిమిమాల్చి." ఆము. ౨, ఆ.—2. కొలువుకూటము*. "పుణ్యలక్ష్మికిక్ మొదలిదివాణముల్." పాండు. ౧, ఆ.

**దివాను.** హిం. వి. మంత్రి.

**దివాభీతము.** సం. వి. అ. పుం. 1. గుడ్లగూబ; 2. కలువకొలను.

**దివాభీతుఁడు.** సం. వి. అ. పుం. చోరుఁడు, దొంగ.

**దివాలా.** హిం. వి. వ్యవహారముచెడి కలుగు నష్టము.

**దివి.** సం. వి. వ్. స్త్రీ. 1. ఆకాశము; 2. స్వర్గము. (ఆధునికకవులు కొందఱు దీనిని వైకృతముగా వాడియున్నారు.) ఇ. పుం. పాలపిట్ట.

**దివిజుఁడు.** సం. వి. అ. పుం. దేవత, వేల్పు.

**దివిదారికొమ్ము.** ద్వ. వి. రెండిట్టికొమ్ములను ఇరుప్రక్క మొనలుగా జేతపట్టిచి యేర్పఱచిన మల్లసాధనవిశేషము.

**దివియ.** వై. వి. 1. దీపము; "చ. నవవికచారవిందరుచిన వ్వెడుకన్నులచాయచుక్కలక్, దివియలమాయఁజేయ." ఉ, హరి. ౪, ఆ.—2. దివటీ*. "క. చవుదంతివియన్న దిలో, నవగాహమొనర్చిచల్లనలవమధులొనా, దివియలచుక్కలుదోఁచఁగ, దివియలవారిఁ గొని యవుడు తెగువఁదలారుల్." సా. 3, ఆ. (దీవియయొక్కరూపాంతరము.)

**దివియకంబము.** వై. వి. దీవియకంబముయొక్కరూపాంతరము. "సీ. బంగారుదివియకంబములపైనిరుపంకదీపికాకాంతులు తేజరిల్ల." అని. 3, ఆ.

**దివియకోల.** ద్వ. వి. దివటీ. (చూ. తోఁడుకడ చలనము అను నర్థము నుదాహరణము.)

**దివిషదుఁడు.** సం. వి. ద్. పుం. దేవత, వేల్పు.

**దివు.** దే. అ. క్రి. దిగుయొక్కరూపాంతరము. "క. మగలయిలువరుసగల పెను, దగవరులొకఁడొకఁడొకర్తతనయు రుచిరశౌ, ర్యగతినుతిఁజెందఘనకీ, ర్తిగ నలరంగలరు ద్రోవదివ రక్రమతక్." రాఘు. ౨, ఆ.

**దివె.** వై. వి. దివియయొక్కరూపాంతరము.

**దివెకంబము.** వై. వి. దివియకంబముయొక్కరూపాంతరము.

**దివెదారికొమ్ము.** ద్వ. వి. దాసరుల దీపస్తంభము. (చూ. జోడమ్ము.)

**దివౌకసము.** సం. వి. స్. పుం. 1. పక్షి; 2. చాతకపక్షి. (రూ. దివోకసము.)

**దివౌకసుఁడు.** సం. వి. స్. పుం. దివిషదుఁడు, వేల్పు. (రూ. దివోకసుఁడు.)

**దివ్య.** ఉభ. వై. వి. దివియయొక్కరూపాంతరము. (చూ. దివ్యాఱుపుఁబ్రువ్వ.) — సం. అ. స్త్రీ. ఉసిరిక.

**దివ్యచక్షువు.** సం. వి. స్. పుం. సుగంధవిశేషము. విణ. 1. జ్ఞానదృష్టిగలవాఁడు; 2. మంచికన్నులుగలవాఁడు; 3. గ్రుడ్డివాఁడు.

**దివ్యము.** సం. వి. అ. న. 1. మహా వ్యవహారములయందు జయింపఁదగిన సత్యము, బాస; (ఇది పంచవిధము.—తులాదివ్యము, అగ్నిదివ్యము, జలదివ్యము, విషదివ్యము, కోశదివ్యము అని. చూ. సం. విజ్ఞా. వ్య, కాం.)—2. లవంగము. పుం. ఉత్పాతవిశేషము. (చూ. ఉత్పాతము.)—విణ. 1. దివియందుఁబుట్టినది; 2. ఒప్పునది.

**దివ్యాఱుపుఁబ్రువ్వ.** ద్వ. వి. (దివ్య + ఆఱుపు + ప్రువ్వ.) దీపమునార్చునట్టియొకానొక పురుగు. "గీ. గువ్వగ్రద్ద దివ్యాఱుపుఁబ్రువ్వగూబ యిల్లుసొచ్చినశాంతిసేయింపవలయు." భా. అను. ౪, ఆ.

**దివ్యోపపాదుకుఁడు.** సం. విణ. (అ.ఈ.అ.) అయోనిసంభవదేవాది.

**దివ్వటీ.** వై. వి. దివటీయొక్కరూపాంతరము. "సీ. పృథుల ప్రదక్షిణార్చిశ్చేదురములైన దివ్వటీలను మష్టినివ్వటిల్ల." విజ. 3, ఆ. (ఒకానొక నిఘంటుకారుఁడు దివ్వటి అని హ్రస్వాంతముగాను వ్రాసియున్నాఁడు.)

**దివ్వియ.** వై. వి. దీవియయొక్క రూపాంతరము. (చూ. దివ్వియకంబము.)

**దివ్వియకంబము.** వై. వి. దీవియకంబముయొక్కరూపాంతరము. "క. అయ్యయ్యయవుఁగాకయనుచును, దయ్య మెసఁగరాజుఁజూచిదివ్వియకంబం, బియ్యకొనియపూర్వపుగథ, సెయ్యంబునఁజెప్పఁదలఁచి సెటిరిట్లనియెక్." విక్ర. ౭, ఆ.

దివ్వె. వై. వి. దివ్వియయొక్క రూపాంతరము. "క. నవ్వులుసల్లాపంబులు, నివ్వటిలన్ బంధుమిత్ర నివహంబులతో, బువ్వంబులుభుజియించిరి, దివ్వె లునలుదిక్కులందుఁదేజములెసఁగన్." బ్ర. ౫, ఆ.

దివ్వెకంబము. వై. వి. దివ్వియకంబముయొక్క రూపాంతరము. "ఉ. కాంతిరేఖానవరత్న దీపకళి కన్ దనరారెడుదివ్వెకంబమున్." విక్ర. ౬, ఆ.

దివ్వెకోల. దే. వి. దివియకోలయొక్క రూపాంతరము. (చూ. గస్తు.) (ఒకానొక నిఘంటుకారుఁడు దివ్వెనకోల అని వ్రాసియున్నాఁడు.)

దివ్వెనుడి. ద్వ. వి. గోడయందు దీపము పెట్టుగూఁడు.

దిశ. సం. వి. ఆ. స్త్రీ. దిక్కు, ఆశ, దెస.

దిశ్యము. సం. విణ. (అ. ఆ. అ.) దిక్కునందుఁ బుట్టినది.

దిష్టము. సం. వి. అ. న. భాగ్యము. పుం. సమయము. విణ. ఉపదేశింపఁబడినది.

దిష్టాంతము. సం. వి. అ. పుం. మరణము, చావు.

దిసంతడుచు. దే. స. క్రి. (దిసంతు+అడుచు.) దూఱు. "మ. అదిగోఁదల్లిఁగడున్ దిసంతడిచియూ రాద్యంతమున్ బైపయిన్ వెదకన్ బల్విరఁబంచి." పర. 3, ఆ.

దిసంతు. దే. వి. దూఱు, నింద.

దిసంతుకొట్టు. దే. స. క్రి. దిసంతడుచు. "ఉ. పట్టఁగలేమికొండొరులఁ బల్మఱుఁజాల దిసంతుకొట్టుమన్." కళా. ౬, ఆ. (రూ. దిసంతులుకొట్టు. "చెలినెంచితని దిసంతులుకొట్టె మేనక." స్వా. 3, ఆ.)

దిసమొల. ద్వ. వి. వస్త్రహీనమైనమొల. (వీఁడు దిసమొలతో నున్నాఁడు.)

దిసమొలవాఁడు. ద్వ. విణ. వస్త్రహీనమైన మొలగలవాఁడు, దిగంబరుఁడు. (చూ. దిస్సమొలవాఁడు.)

దిసమొలవేల్పు. ద్వ. వి. 1. శివుఁడు; 2. కాలభైరవుఁడు. "దిసమొలవేల్పుసాహిణపుఁదేజులు." పు. ౨, ఆ.

దిస్సమొల. ద్వ. వి. దిసమొలయొక్క రూపాంతరము.

దిస్సమొలవాఁడు. ద్వ. విణ. దిసమొలవాఁడుయొక్క రూపాంతరము. "ఎ, గీ. దిస్సమొలవానిఁ బసిఁగాసఁద్రిప్పువాని." పాండు. ౧, ఆ.

దిస్సమొలవేల్పు. ద్వ. వి. దిసమొలవేల్పుయొక్క రూపాంతరము. (కాలభైరవునకు. — "దిస్సమొలవేల్పుందత్తడుల్." రామా. ౨, ఆ.)

దిస్సు. దే. వి. పాముబుసకొట్టుటయందగుధ్వన్యనుకరణము. "గీ. అద్ది పేరిటికుండలితాంగభోగి, దిస్సునందనపడగయెత్తెనొయనంగ." కళా. ४, ఆ.

## దీ.

దీ. దే. అవ్య. డీయొక్క రూపాంతరము.

దీకు. దే. వి. డీకుయొక్క రూపాంతరము. "క. ఏనపుడుధర్మపాశా, ధీనుఁడనైకోపమునకుదీకొనరింపం, గానేరకున్నమయిమయిఁ, బోనయ్యెంగాక యింకఁబొమ్మాయిచటన్." (కోపమునకు దీకొనరింపంగా నేరకున్న అనఁగా కోపింపకయుండఁగానని తాత్పర్యము.) భార. విరా. ౫, ఆ.

దీకొను. దే. అ. క్రి. స. క్రి. డీకొనుయొక్క రూపాంతరము. (ఎదిరించుటకు. — "ధృతిఁదనుదేవదానవులుదీకొనఁ జేరనియున్న." రామా. ౭, ఆ.)

దీకోలు. దే. వి. డీకోలుయొక్క రూపాంతరము.

దీక్ష. సం. వి. ఆ. స్త్రీ. యజ్ఞాదిక్రియారంభమునందు అనుష్ఠింపఁ బూనుకొనెడు ఆచారనియమము.

దీక్షించు. సం. అ. క్రి. దీక్షవహించు.

దీక్షితుఁడు. సం. వి. అ. పుం. సోమముగల యజ్ఞమునందు దీక్షవహించినవాఁడు.

దీటు. దే. స. క్రి. సరిచేయు. "చ. తిలకముదీర్చుచున్ గురులుదీటుచు." లక్ష్మీ. ౨, ఆ. "బెళ్కుచుఁబయ్యెదకొంగుదీటు." హంస. ౨, ఆ. "తంత్రులొక్కవరుసదీటి." ఉ, రా. ౬, ఆ.—విణ. ఏ. సరి. "నీకీసురలైనదీటగుదురే." ఉ, రా. ౨, ఆ.

దీటుకట్టు. దే. అ. క్రి. దీటుకొను. "వ. దేవదుందుభిధ్వానంబులోదనీకుహరంబునందీటుకట్టె." వై. ౬, ఆ.

దీటుకొను. దే. అ. క్రి. నిండుకొను. "దివిదీటుకొనంగఁజెలంగియార్వ." భార. కర్ణ. ౧, ఆ. "శస్త్రాస్త్రసంచయమున నభంబు దీటుకొనునట్లుచేయ." భార. విరా. ౫, ఆ. "గీ. అధ్వములునిఖిల, దిశలయందునునభమునదీటుకొనియె." మార్క. ౬, ఆ. ("ఉ. అందుజనించియనేకదైత్యులే, దిక్కునఁదారయైజగముదీటుకొనన్ గడునిండఁబర్వినన్." (ఇక్కడ నిండన్ అనునది అతిశయార్థకము.) మార్క. ౬, ఆ.)—స. క్రి. 1. సవరించు; "వ. చంచూపుటంబులదీటుకొనిధాఁటుకొనిశతకోటి సఖునఖముఖత్రోటింబరిపాటించదం

గంబుభంగంబుగాఁజించిచెండాడుచు." రామా. ౫, ఆ.—"తే. గీ. మాటిమాటికి మీసముల్ దీటు కొనుచు." హరిశ్చ. ౪, ఆ.—2. సరిపోలు. "గీ. ఒక్కతరలాక్షియప్సరోయువతివోలెఁ, జూచెఁ గను తెప్పవెట్టక రాచవాని, తేటితెక్కులగతి యమ్ముదీటుకొనఁగ." సై. ౬, ఆ.—(ప్రే.) దీటుకొలుపు. "ఎ, గీ. దివ్యబాణజాలంబులు దీటు కొలిపి." భార. ఉద్యో. ౪, ఆ.)

**దీదివి.** సం. వి. ఇ. పుం, న. అన్నము. పుం. బృహస్పతి.

**దీధితి.** సం. వి. ఇ. స్త్రీ. కిరణము, వెలుఁగు.

**దీన.** సం. వి. ఆ. స్త్రీ. ఎలుక. విశ. దీనురాలు.

**దీనారము.** సం. వి. అ. పుం. పైఁడినాణెము.

**దీనుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) 1. దరిద్రుఁడు; 2. దర్పముడిగినవాఁడు; 3. భయపడినవాఁడు.

**దీపకము.** సం. వి. అ. న. ఒకయర్థాలంకారము. (చూ. అలంకారము.) పుం. 1. ఓమము; 2. దీపము; 3. (చూ.) దీమము. విశ. వెలిఁగించునది.

**దీపము.** సం. వి. అ. పుం. 1. దీపిక; 2. తీఁగ; 3. బయిరవాసము; 4. మయూరశిఖి?.

**దీపవల్లి.** సం. వి. ఈ. స్త్రీ. దీపపువత్తి.

**దీపవృక్షము.** సం. వి. అ. పుం. దీపస్తంభము.

**దీపావళి.** సం. వి. ఇ. స్త్రీ. నరకచతుర్దశిమఱునాటి పండుగ.

**దీపిక.** సం. వి. ఆ. స్త్రీ. దీపము, దివ్వె.

**దీప్తము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. వెలిఁగినది; 2. కాలినది; 3. మండినది.

**దీప్తి.** సం. వి. ఇ. స్త్రీ. కాంతి, వెలుఁగు.

**దీప్యకము.** సం. వి. అ. పుం. 1. ఓమము; 2. యవలబియ్యము; 3. నెమిలిజుట్టు.

**దీప్యము.** సం. వి. అ. పుం. ఓమము.

**దీమము.** వై. వి. పక్షిమృగాదులను పట్టుటకై వేట కానిచేఁ బెంపఁబడినపక్షి మృగములోనగునది. (ఇక్కడ వేటకాఁడు అనునది ఉపలక్షణము.) "ఎ, గీ. మగలనలయించుమరునిదీమంబులనఁగ." రుక్మాం. ౧, ఆ. (దీనికి ఒక నిఘంటుకారుఁడు ఇల్లు అని యర్థము వ్రాసియున్నాఁడు.)

**దీమసము.** దే. వి. 1. ధైర్యము; "గీ. ఎట్టిలావెట్టిదీమసమెట్టితెగువ, యెట్టికడిమి." హరి. ఉ. 3, ఆ. "[illegible] సంశయలేశమైన, మతిలేకపల్కెదీమసము [illegible]ను." హరిశ్చ. ౨, భా.—2. ఉపాయము. "దీనిఁబాపికొను దీమసమెట్టిదియొక్కొ." భార. విరా. ౨, ఆ.

**దీము.** వై. వి. దీమముయొక్క రూపాంతరము. "గీ. క్రోధమొదవబండగులఁబ్రాఁకుదీములఁ, గరఁటి తాఁకికొమ్ముటురులఁదగిలి, వానిలేవనీడ్చి కానకై కొనిపోవుఁ, బోతరించి యిట్టిపోతు లచట." స్వా. ౪, ఆ.

**దీర్ఘకోశిక.** సం. వి. ఆ. స్త్రీ. ఏనుఁగుజెలగ, దుర్నామ.

**దీర్ఘజంఘము.** సం. వి. అ. పుం. బెగ్గురుపక్షి. విశ. నిడుపాటి పిక్కగలది.

**దీర్ఘదర్శి.** సం. వి. న్. పుం. 1. విద్వాంసుఁడు; 2. గద్ద. విశ. దూరపు యోచనకలవాఁడు.

**దీర్ఘదేహి.** సం. వి. ఈ. స్త్రీ. పందికొక్కు, మూషిక.

**దీర్ఘనిద్ర.** సం. వి. ఆ. స్త్రీ. చావు, పెద్దనిదుర.

**దీర్ఘపత్రము.** సం. వి. అ. పుం. తెల్లగలిజేరు?.

**దీర్ఘపృష్ఠము.** సం. వి. అ. పుం. సర్పము, పాము.

**దీర్ఘము.** సం. విశ. (అ. ఆ. అ.) నిడుద, ఆయతము.

**దీర్ఘమూల.** సం. వి. ఆ. స్త్రీ. తీఁగతుమడి?.

**దీర్ఘవృంతము.** సం. వి. అ. పుం. దుండిగము?.

**దీర్ఘసూత్రుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) (చూ.) చిరక్రియుఁడు.

**దీర్ఘాయువు.** సం. వి. స్. పుం. 1. కాకి; 2. మార్కండేయుఁడు; 3. బూరుగు?; 4. జీవకమను గంధద్రవ్యము. విశ. పెక్కేండ్లు బ్రదుకువాఁడు.

**దీర్ఘిక.** సం. వి. ఆ. స్త్రీ. (చూ.) డిగ్గియ.

**దీర్ణము.** సం. విశ. (అ. ఆ. అ.) 1. చీల్పఁబడినది; 2. భయపడినది.

**దీలు.** దే. అ. క్రి. డిల్లపడు. "సీ. అతిమిక్కిలి[illegible] నాలసింపఁగ నేలచల్లగాఁబన్నీరుచల్లరమ్మ." [illegible] ౫, ఆ.—విశ. డిల్లము. "అరుణాంశుండుహిమర్తుపకరజనిదీలై." ఆము. ౫, ఆ. (డీలుయొక్క రూపాంతరము.)

**దీలుపడు.** ద్వి. అ. క్రి. డీలుపడుయొక్క రూపాంతరము. "త్రిపురదైత్యులబాధదీలుపడితిమి." [illegible] ౪, ఆ.

**దీవన.** దే. వి. ఆశీర్వాదము. "క. అనుజులుఁదానును మునిశా, సనమునవన్వేదియొక్కసమధికపీఠంబునఁనొప్పిబ్రాహ్మణులదీ, వన లెసఁగఁగ ధర్మసుతుఁడువాసవలీలన్." భార. అర. 3, ఆ.

**దీవనఁబ్రాలు.** దే. వి. (దీవన+ప్రాలు.) అక్షతలు, శేసలు. "ఎ, గీ. జగముగెల్వంగదండెత్తుమగనిమీఁ

ద, లీలరతిచల్లుదీవనఁ బ్రాలనంగ, వేఁడివెలుఁగెం డఁ గ్రాఁగినవిన్నుమేన, సెక్కొనుచెమటబొట్లు నాఁజొక్కలమరె." పా. ౨, ఆ.

దీవసము. దే. వి. ధైర్యము. "క. గోవులకు వెనుకయ్యై వెసఁ, బోవుచునున్నారుగడవఁబోవక యుండక్, బోవలయునడ్డపడి యెదు, దీవసమెదఁగలిగెనేని దేవర కడఁకన్." భార. విరా. 3, ఆ. (దీమసము యొక్క రూపాంతరము.)

దీవి. వై. వి. నీటినడిమిదిబ్బ.

దీవించు. దే. స. క్రి. ఆశీర్వదించు.

దీవియ. వై. వి. దివ్వె, దీపము. "తెరయును మేలుకట్లుఁదగు దీవియలుక్ బొలుపొంద." భార. సౌ. ౧, ఆ.

దీవియకంబము. వై. వి. దీపస్తంభము. "క. దీవియ కంబమునకును, జీవముగల్పించికథలు చెప్పింపంగాఁ, బ్రావీణ్యముకలిగియునీ, వీవిధమునఁదప్పఁ జెప్పటిదినిపుణతయే." విక్ర. ౬, ఆ.

దీవె. వై. వి. దీవియయొక్క రూపాంతరము. "సీ. వేయిమానికపు దీవెలతోడిపడగలు మ్రాల్చునే దేవునిమలఁకపాన్పు." ఉ, హరి. ౨, ఆ.

దీవెన. దే. వి. దీవనయొక్క రూపాంతరము. "చ. దీవెనలొనరించిరవ్విధుని వేయువిధంబుల సన్నుతించుచున్." శశాం. ౫, ఆ. (ఆధునిక గ్రంథములయందే యీ రూపము కానఁబడుచున్నది.)

దీవెనకోల. దే. వి. నమస్కారము. "రగడ. వృద్ధపురస్థలివిడియువిప్రాశ్రయ, దేవునికిదిగోదీవెనకోలని." హంస. ౪, ఆ.

దు.

దుంకము. దే. వి. రంధ్రము.

దుంగ. దే. వి. మ్రానిమొద్దు.

దుండగము. వై. వి. 1. దౌష్ట్యము; "గీ. పెద్దతోలితోడ బిగువుదామెనతోడఁ, బడినమద్దిచెట్లనడుమముద్దు, లైనతొక్కుఁబలుకులాడుచునిలుచున్న, కపటబాలుదుండగములుచూచి." వి, పు. 2, ఆ.—2. కీడు*. "గీ. ద్రుపదుపీటిలోనదౌష్ట్యమయ్యముచేసె, బసులఁబట్టివిరటుపట్టణమున, మఱియునెన్నిలేవుమార్తాండతనయుండు, తోడరిమనకుఁజేయుదుండగములు." జై. ౧, ఆ.

దుండగీఁడు. వై. విశ. (దుండగము+ఈఁడు.) దుష్టుఁడు*. "గీ. వీఁడెకృష్ణుఁడు పెనుదుండగీఁడు మనకుఁ, జిక్కెఁబోనీకుఁడీయంచుఁజేరవచ్చి." వి, పు. 2, ఆ.

దుండతికము. వై. వి. దుండగము*.

దుండి. దే. వి. దొరసాని. (చూ. సరకు.)

దుండిగము. వై. వి. పెనుమ్రాను, దుండుకము†.

దుండుబలి. దే. విశ. సోమరి.

దుంతి. దే. వి. దున్న, మహిషము.

దుంతరవుతు. ద్వ. వి. యముఁడు.

దుందిలము. వై. వి. (చూ.) దుండిగము†.

దుందుకము. వై. వి.——పై.——

దుందుభి. సం. వి. ఇ. స్త్రీ. పాచికయందలి ఇత్తిగ. పుం. 1. భేరి; 2. వరుణుఁడు; 3. ఒకసంవత్సరము; (చూ. సంవత్సరము.) 4. ఒకానొక రాక్షసుఁడు.

దుందుము. దే. వి. చక్రాకారపుదివటీ. "చ. వడిఁదనుఁబొఱిఁగాఁదఱుమువాసరకర్షకుచేతిభానుఁడన్, బెడిదపుదుందుమార్పి కడుఁబేర్చుచుకోదసిపేరిపంటచే, నుడుగకచొచ్చు రేయనుమదోద్ధతహస్తి మొగంబునందు నొ, ప్పెడుమదబిందుబృందమనఁబెంపెసఁగెన్ గడసంజచూడ్కికిన్." కళా. ౮, ఆ.

దుందుఱు. దే. వి. ఝంఝాఱుయొక్క రూపాంతరము.

దుంప. దే. వి. 1. గెనుసులోనగువానిగడ్డ; 2. వాఁగేటిగోడగ.

దుంపబచ్చలి. దే. వి. ఉపోదక†.

దుంపరాష్ట్రము. ద్వ. వి. రాష్ట్రవిశేషము. (దీని భేదము సన్నరాష్ట్రము.)

దుంబాలా. హిం. వి. పన్నులేక యీనాముగానిచ్చిన భూమి.

దుంబొడి. దే. వి. (దుమ్ము+పొడి.) (మెంతి జిలకఱ చేర్చి చేసిన) నున్నని కూరపిండి. "క. క్రొంబొగపుఁగూరవగతిరు, గంబోఁతలమెంతిజీలకఱ్ఱలవలపుం, దుంబొళ్లతావిసిగరుల, గంబూరజగంబువొగడఁగానటసుడిసెన్." రా, వి. ౨, ఆ.

దుఃఖపడు. మి. అ. క్రి. (దుఃఖము+పడు.) నొగులు. (ప్రే. దుఃఖపఱుచు.)

దుఃఖపాటు. మి. వి. దుఃఖపడుట. "కులాచారము నిర్వహింపఁబలుచందములం దగ దుఃఖపాటు." భార. ఉద్యో. 3, ఆ.

దుఃఖపెట్టు. మి. స. క్రి. (దుఃఖము+పెట్టు.) దుఃఖపఱుచు.

దుఃఖము. సం. వి. అ. న. బాధ, వ్యథ, నొగులు.

దుకాణము. దే. వి. అంగడీ, పసారము.
దుకూలము. సం. వి. అ. న. 1. తెల్లవస్త్రము; 2. సన్న వస్త్రము.
దుక్కి. దే. వి. దున్నుట, కృషి. (దీని భేదములు రొంపిదుక్కి, వెలిదుక్కి.)
దుక్కిటెద్దు. దే. వి. (దుక్కి+ఎద్దు.) దున్నుటకుప యోగించెడి యెద్దు, హాలికము. (టుగాగమము సాధారణముగా ఉకారాంతపదములకు విధింపఁ బడినదైనను దుక్కిటెద్దు, మిద్దెటిల్లు ఇత్యాదుల యందును ప్రవర్తిల్లుచున్నది.)
దుక్కివాలు. ద్వ. వి. నాఁగలి, హలము. "దండకము. దుక్కివాల్ పూని పేరుక్కునన్ రేఁగవా." నీలా. ౨, ఆ.
దుక్కివాలుదాలుపు. ద్వ. వి. (దుక్కివాలు+తాలుపు.) బలరాముఁడు, హలాయుధుఁడు.
దుగ. వై. స. రెండు, ద్వయము.
దుగమొగములపులుఁగు. ద్వ. వి. గండభేరుండపక్షి (చూ. దుగమొగంబులపుల్గు.—"సీ. కులుకుచుఁ బలికింపఁజిలుకబారులుగావుదుగమొగంబులపు ల్గుఁదెగలుగాని." అచ్చ. అ, కాం.)
దుగమొగములవేల్పు. ద్వ. వి. అగ్ని. "క. దుగమొ గములవేల్పుగు, బ్బుగదరికొనికాల్పఁదొడఁగెఁ బ్రోలెల్లెడలన్." అచ్చ. యు, కాం.
దుగినుఁడు. వై. వి. బ్రహ్మ, నలువ.
దుగుణము. వై. స. దుగ*. ఉ, హరి. 3, ఆ.—విణ. రెండింతలు.
దుగులము. దే. వి. వరహాలో పదియాఱవభాగము.
దుగ్గ. వై. వి. 1. కాళి; "సీ. దుగ్గమ్మకారుపోతుల లోనుచేయుమీ తోలుముద్దగానిత్తుదుంతనొక టి." య. ౨, ఆ.—2. పార్వతి.
దుగ్గాని. వై. వి. (దుగ+కాని.) రెండు దమ్మిడ్లు.(టంకమునకు పదియాఱు డబ్బులుకనుక ఆ లెక్క ప్రకారము ఇక్కడ కానియనఁగా దమ్మిడి.)
దుగ్గి. వై. దుగ్గ, పార్వతి.
దుగ్గు. దే. విణ. రూపముచెడినది. (తృణము.)
దుగ్ధము. సం. వి. అ. న. పాలు. విణ. 1. పిదుకఁ బడినది; 2. నింపఁబడినది.
దుగ్ధిక. సం. వి. ఆ. స్త్రీ. చిఱుపాలు?.
దుట్టువు. దే. వి. తోట్టువుయొక్క రూపాంతరము.
దుడిదుడి. దే. వి. (చూ.) గునగున. "ద్వి. అడవియే సూఁగులునీరాసనీనదికి, దుడిదుడివచ్చి." రా. అర, కాం.
దుడుకఁడు. వై. విణ. (దుడుకు+అఁడు.) దుష్టుఁడు. "క. ఉడుగఁడుమధురిపుకథనము, విడువఁడుజడు పగిదిఁదిరుగువికసనముననే, నొడివిననొడువులు నొడువఁడు, దుడుకనిఁజదివింపమాకుదుర్లభ మ్మాపా." భాగ. ౭, స్కం. (ఇట్టివి చెడుగఁడు, నిడుపఁడు. మొ.)
దుడుకు. వై. వి. 1. దౌష్ట్యము*; "అందఱుఁజూచి యింతదుడుకాయనిదూఱఁగ." వి, పు. ౭, ఆ.— 2. ఉద్ధతి*. "ద్వి. మనుజేంద్రసుతయొక్క మనః గావింతు, వినఁదగు దుడుకుగావింపఁగరాదు." సా. ౨, భా.—విణ. 1. దుష్టము; "క. ఈదుడుకుఁగోఁతిఁగొనిచని." అచ్చ. సుం, కాం.—2. ఉద్ధతము*. (నీకు నోరు మిక్కిలి దుడుకు.)
దుడ్డు. యు. దే. వి. డబ్బు. వై. 1. లావుకఱ్ఱ, దండము; (చూ. కంతి.) 2. గద*. విణ. మోటుకాఁడు*. "క. దుడ్డునకుఁబోయునట్లొక, త్రెడ్డుడుకుంబాయసంబుదెచ్చియతనిచే, నిడ్డనడిచి పడికనలెడి, గుద్దులు తెలియంగఁదెఱచి కొనికి నుఁగొనుచున్." భో. 3, ఆ.
దుడ్డుఁగఱ్ఱ. ద్వ. వి. (దుడ్డు+కఱ్ఱ.) లావుకఱ్ఱ, దండము. (ఇక్కడ దుడ్డుశబ్దము స్థూలమాత్ర రము.)
దుడ్డుఁగోల. ద్వ. వి. (దుడ్డు+కోల.) (చూ.)—— వై.——
దుడ్డె. దే. విణ. 1. బాలకుఁడు; "క. దుడ్డెలరాకటుమసలిరి." కు. ౨, ఆ. —2. ధూర్తుఁడు, ధూర్తురాలు. "ఎ, గీ. దుడ్డెతనమునఁదిరుగునా దొడ్డసాని." హంస. ౪, ఆ.
దుత్త. దే. వి. చిన్నబుంగ. (చూ. బుంగ.)
దుత్తాయి. దే. వి. కుఱుచేలరచేట్ట.
దుత్తూరము. ఉభ. దే. వి. కపటము. సం. అ. పుం. ఉమ్మెత్త?.
దుగ్ధతుంబి. సం. వి. ఈ. స్త్రీ. పాలానుగు?.
దుద్దు. దే. వి. 1. తామరపువ్వులోనిదిమ్మె. కర్ణిక; 2. తాటాకుజోబుమీఁది చెంద్రిక; "చ. అది యును గాక రాయసపుటార్యులగంటములాకు దుద్దులున్, వదలక మోధిచూచి." హంస. ౪.

ఆ.—3. బ. ఒకదినుసు చెవికమ్మలు. (దుద్దుఁగమ్మలు.) విణ. అసత్యము.

దుద్దక్కు. దే. అ. క్రి. అతిశయించు. "ద్వి. పెద్దయుఁబ్రమదంబుభీతియుభక్తి, దుద్దక్కితనలోనఁ దొట్రుకొనంగ." బస. ౧, ఆ.

దుద్రుమము. సం. వి. అ. పుం. పచ్చనీరుల్లి?.

దున. దే. స. క్రి. దున్నుయొక్క రూపాంతరము. "క. దునకయు వెదపెట్టకయుఁ, దనరెనఖిలసస్యములును ధారణి." హరి. పూ. ౧, ఆ.

దునుకు. వై. వి. బాధ. "మ. తనఘోరధ్వనికిఁగలంగఁబడుతత్సైన్యంబుదైన్యంబునన్, దునుకొందన్." ఉ, హరి. ౫, ఆ.

దునెదారి. వై. విణ. 1. కత్తి చేతధరించిన శూరుఁడు*; (చూ. దునేదారి.)—2. శూరుఁడు*. "ద్వి. తొగతూపుదునెదారితోడఁదట్టికొనఁగ." విష్ణు. ఉ. ౪, ఆ.

దునేదారి. వై. విణ. దునెదారియొక్క రూపాంతరము. (కత్తి చేతధరించిన శూరునకు.—"మ. వదరుందత్తడిసామిచెంతఁగడుశేవన్ వచ్చులేమావిక్రొం, బదనుంగెందలిరాకుడాల్ వలపు బాబాయెక్కుముంగండుతేఁ, టిదునేదారులవెండిగిండిగమినూటిన్ మించుఁబూఁదేనెసం, పదనొక్కించుకవిచ్చుక్రొమ్మొగడ జొంపంబుల్ వనీవీధులన్." చంద్ర.

దున్న. దే. వి. 1. మహిషము; "ఉ. కాలునిదున్ననందినయిగంటలుదున్నకమంటినామహా, కాలునినందిదున్నయికర్దమమగ్నతలేకమంటినా, హాలికులెన్నఁడుందగనియారులచేలునుజొకుమళ్లనుం, గాలిలినేరుసాగిలిఁ గల్లుపసింగొనిపేదమున్నగన్." ఆము. ౪, ఆ.–2. పురుషపశువు. (చూ. దిగఁద్రావు.)

దున్నపోతు. దే. వి. దున్న, మహిషము. (దున్నసే దున్నపోతు అనియు వాడుచున్నారు.)

దున్ను. దే. స. క్రి. దుక్కిచేయు, కృషిచేయు.

దుప్పటము. వై. వి. వెలగలసన్నపాటి వెడల్పువస్త్రము*. "సీ. బంగరువన్నెదుప్పటముఁగప్పెడువాఁడుపక్కిరాతేజిపైనెక్కువాఁడు." బ్ర. ౧, ఆ.

దుప్పటి. వై. వి. 1. కప్పుకొనువస్త్రము, నిచోళము; 2. దుప్పటము*. "సీ. బంగారుతగటుదుప్పటిబిగ్గమొలఁజుట్టికేలఁజొక్కపుఁబిల్లఁగ్రోలువట్టి." లీలా. ౧, ఆ.



దుప్పటీ. వై. వి. దుప్పటము*. "ఏ, గీ. మిసిమిబంగారుతళుకులమేలిదుప్ప, టీచెఱంగులు." ఉ, రా. ౨, ఆ. (దుప్పటియొక్క రూపాంతరము.)

దుప్పి. దే. వి. 1. మృగవిశేషము, చమూరువు; "చ. బూడిదపండునుబోలెబూఁదుపా, రెడుసొకదుప్పికింగవియఁబ్రేలిభయజ్వరతప్తచిత్తమై." పాండు. ౫, ఆ.–2. జింక, మృగము. "వ. అప్పుడప్పుడమిఱేఁడయ్యేటనీఁదుచోనొక్కపిడిదుప్పిచేరినదానితోఁకఁబట్టుకొనియె." (మీఁద అమ్మృగి అని యున్నది.) మార్క. ౫, ఆ.

దుబారా. హిం. విణ. రెట్టింపు, వ్యర్థవు.

దుబాసి. హిం. వి. భాషాంతరము చేయువాఁడు, వ్యవహారము జరుపువాఁడు.

దుబ్బ. దే. వి. ఆఁడుగుఱి.

దుబ్బు. వై. వి. గడ్డిలోనగువానిగంట, తృణస్తంబము.

దుమగతికేతు. వై. వి. అరిష్టసూచకమైన నక్షత్రవిశేషము, ధూమకేతువు.

దుమదుమ. దే. విణ. మిక్కిలి తడిగలది. "క. సమదగజదానధారల, దుమదుమలైయున్న పెద్దత్రోవలతోడన్, రమణీయమయ్యెనప్పురి, రమణుఁడువచ్చినఁగరంగురమణియుఁబోలెన్." భాగ. ౯, స్కం. "క. తమపాటచినుకుచినుకుల, దుమదుమగాఁదడిసినట్టిదువ్వలువలతో." కళా. 3, ఆ.

దుమా. దే. వి. క్రాయుటయందగుధ్వన్యనుకరణము. "దుమాయనిక్రాయు." ఉ, హరి. ౨, ఆ.

దుమారము. దే. వి. దుమ్ము. "సీ. మలయానిలముచేదుమారమ్ముఁరేఁగుసౌగంధికమ్మురజమ్ము కలుకుదుమ్ము." స్వా. ౫, ఆ.

దుమాలు. దే. విణ. సమూలము. "ద్వి. కొండొకసేపులోఁగొట్టెదుమాలు, బెండుగానాశూద్రబృందంబుతలలు." భాగ. ౭, స్కం.

దుము. దే. వి. దుమ్ముయొక్క రూపాంతరము. (ఆమ్రేడితమునందు దుముదుము. "వనమువెలుకదుఁదుముదుముగాన్." రామా. ౭, ఆ.)

దుముకు. దే. అ. క్రి. 1. ఉఱుకు; 2. గంతువేయు. వి. గంతు.

దుముకులాడు. దే. అ. క్రి. (దుముకులు+ఆడు.) గంతులువేయు.

దుముక్కు. దే. వి. ఉఱుకుటయందగుధ్వన్యనుకరణము. "గీ. ముక్కుకొతికికొనిదుముక్కునఁదుమిసిన, సరసకుటికి రామచంద్రుఁగాంచి." రామా. ౯, ఆ.

దుముదారు. దే. వి. (దుము+తారు.) దండు. "సీ. స కుటుంబముగవీఁగిచరమశైలముఁజేరుతుహినాం శుదుముదారుదొరయనంగ." స్వా. 3, ఆ.

దుముదుములాడు. దే. అ. క్రి. (దుముదుములు+ ఆడు.) దుమ్ములురేఁగు, నిప్పులురేఁగు. (వీని ముఖ ము దుముదుములాడుచున్నది.)

దుమ్ము. దే. వి. దుమారము, ధూళి.

దుమ్ములగొండి. దే. వి. మృగవిశేషము, కొర్నవగండు.

దురయుముడి. దే. వి. దూయుముడియొక్క రూపాం తరము.

దుయ్యు. దే. అ. క్రి. దూయుయొక్క రూపాంతర ము. (వెడలుటకు.—"వ. నిన్నుశపింపనేమెంత వారమని యుపచారోక్తులుపలుకుచు దుస్సిపో యిరి." భో. ౭, ఆ.)

దురంతము. సం. విణ. (అ. ఆ. అ.) అంతములేనిది.

దురతిక్రమము. సం. విణ. (అ.ఆ.అ.) అతిక్రమిం పఁగూడనిది.

దురత్యయము. సం. విణ. (అ. ఆ. అ.) చేటులేనిది.

దురద. దే. వి. 1. జిల; 2. కనరు.

దురదకంద. ద్వ. వి. కనరుగలకంద, మహాకందము.

దురదగొండి. దే. వి. దూలగొండి, కండూరకి.

దురదగోవెల. దే. వి.——వై.——

దురదుర. వై. ద్ర. క్రి. విణ. శీఘ్రముగా. "క. దు రదుర దురమునకేపుగ, దురఁదురగేభములతోనె దురదురరులనం, దటఁదటఁదటఁగనిశాతో, దరిద టీయంజేరికడుబెదరిహరికనియెన్." రుక్మి. ౫, ఆ.

దురదృష్టము. సం. వి. అ. న. దౌర్భాగ్యము.

దురధిగమము. సం. విణ. (అ.ఆ.అ.) 1. కష్టముచేత పొందఁదగినది; 2. కష్టముచేత చదువఁదగినది.

దురధ్వము. సం. వి. అ. పుం. చెడ్డత్రోవ, కదధ్వము.

దురపిల్లు. దే. అ. క్రి. 1. శోకించు; "వ. నీచిత్తంబు నొప్పించితినదిధర్మజుండెంత దురపిల్లెడునోయు తింగెదుగాక." సం. "సశోచన్నరశార్దూలశాం తింనైవాధగచ్ఛతి." భార. శల్య. ౨, ఆ.— 2. తపించు; "వ. అనుచుమదనవేదనాభరంబు నందురపిల్లుచు." మార్క. ౮, ఆ.—3. కలఁగు. "వామనంబు చే పెట్టి కలంచినట్లు దురపిల్లెడు." జై. ౬, ఆ.

దురభిగ్రహము. సం. వి. అ. పుం. ఉత్తరేణుకి. విణ. గ్రహింపఁగూడనిది.

దురము. వై. వి. 1. యుద్ధము; (చూ. ఎరవు.)— 2. వేగము*. "చ. రమణిక్రమక్రమంబునదు రంపువగన్నటియించెవింతగా." శశాం. 3, ఆ.

దురవాపము. సం. విణ. (అ.ఆ.అ.) పొందఁగూడనిది.

దురా. దే. వి. దురాయియొక్క రూపాంతరము. "క. నుదురాజిగిక్రొన్నెలచె, న్నదురాగతమనుచ దేంట్లనుదురావెట్టున్, నదురాయనిముంగురులె, న్నదురానెటి వేణిజీవనదురాజసమున్." శశాం. 3, ఆ.

దురాకృతము. సం. వి. అ. న. అకృత్యము. క్రి. విణ. అకృత్యముగా.

దురాచారము. సం. వి. అ. పుం. చెడ్డనడవడి. విణ. చెడ్డనడవడికలది.

దురాచారుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) చెడ్డనడవడి కలవాఁడు.

దురాడము. దే. వి. ఒఱగుదిండు. "ఇంద్రగోపపుఁ బట్టుదురాడమున్." పాంచా. ౫, ఆ.

దురాత్ముఁడు. సం. విణ. (న్.) చెడ్డమనస్సుగలవాఁడు.

దురాధర్షము. సం. వి. అ. పుం. తెల్లావలు. విణ. తి రస్కరింపఁదగనిది.

దురాధర్షుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తిరస్కరింపఁ దగనివాఁడు.

దురాపము. సం. విణ. (అ.ఆ.అ.) పొందఁగూడనిది.

దురాయి. దే. వి. ఆజ్ఞ. "సీ. జగదధిష్ఠానభాస్వజ్జ్యో తియగువాఁడుబ్రహ్మాదులదురుదురాయివాఁడు." కృష్ణ. ౧, ఆ.

దురారోహ. సం. వి. ఆ. స్త్రీ. ఖూరుగుకి. అ. పు ము. తొండ. విణ. ఎక్కఁగూడనిది.

దురాలభ. సం. వి. ఆ. స్త్రీ. తీఁటకసిందకి. విణ. లభింపనిది.

దురాలాపము. సం. వి. అ. పుం. చెడుమాట.

దురాలోకము. సం. విణ. (అ.ఆ.అ.) చూడఁగూడనిది.

దురాశ. సం. వి. ఆ. స్త్రీ. వ్యర్థమైన ఆశ.

దురాసదము. సం. విణ. (అ.ఆ.అ.) పొందఁగూడనిది.

దురితము. సం. వి. అ. న. పాపము, కలుషే.

దురుసు. దే. వి. కాఠిన్యము. "ద్వి. ఇంతదురుసుగై కొనుటనీదోషంబుగాదు." విష్ణు. పూ. ౨, ఆ.— విణ. కఠినము. "సీ. దురుసుదండనలతోధరయే లుదొరఁగన్నహింసాపరుండనిరొయెంచరతని." ఉ. రా. ౬, ఆ.—క్రి. విణ. శీఘ్రము. "వేఁటకున్దు రుసుగమారుఁడస్త్రములునూఱె." ఉ, రా. ౫, ఆ

దురోదరము. సం. వి. అ. న. 1. జూదము; 2. పందెము.

దురోదరుఁడు. సం. వి. అ. పుం. జూదరి.

దుర్గ. సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. నల్లపిచ్చుక; 3. నీలిచెట్టు. అ. న. ము. కోట. విణ. పోఁగూడనిది.

దుర్గంధము. సం. వి. అ. పుం. గబ్బు. విణ. గబ్బుగలది.

దుర్గతి. సం. వి. ఇ. స్త్రీ. 1. నరకము; 2. బీదతనము.

దుర్గతుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) దరిద్రుఁడు, బీద.

దుర్గమము. సం. విణ. (అ.ఆ.అ.) 1. పోఁగూడనిది; 2. పొందఁగూడనిది.

దుర్గి. సం. వి. ఈ. స్త్రీ. దుర్గ, పార్వతి.

దుర్ఘటము. సం. విణ. (అ. ఆ. అ.) ఘటింపనిది.

దుర్జనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దుష్టుఁడు.

దుర్జయుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) గెలువఁగూడనివాఁడు.

దుర్జాతి. సం. విణ. (ఇ.) దుర్జనుఁడు.

దుర్జ్ఞేయము. సం. విణ. (అ. ఆ. అ.) ఎఱుఁగఁగూడనిది.

దుర్దాంతము. సం. విణ. (అ.ఆ.అ.) అణఁపఁబడనిది.

దుర్దినము. సం. వి. అ. న. మబ్బుకమ్మినదినము, ముసరుప్రొద్దు.

దుర్దురూటుఁడు. సం. వి. అ. పుం. నాస్తికుఁడు.

దుర్ధరము. సం. విణ. (అ.ఆ.అ.) ధరింపఁగూడనిది.

దుర్ధర్ష. సం. వి. ఆ. స్త్రీ. నల్లయుప్పిలి. విణ. తిరస్కరింపఁదగనిది.

దుర్ధర్షుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) తిరస్కరింపఁదగనివాఁడు.

దుర్నయము. సం. వి. అ. పుం. అన్యాయము, దుర్నీతి.

దుర్నామ. సం. వి. న్. స్త్రీ. ఏనుఁగుజెలగ. అ. న. ము. మూలరోగము.

దుర్నిరీక్ష్యము. సం. విణ. (అ. ఆ. అ.) చూడఁగూడనిది.

దుర్నివారము. సం. విణ. (అ. ఆ. అ.) నివారింపఁగూడనిది.

దుర్బలుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) బక్కవాఁడు.

దుర్బిణి. హిం. వి. దూరవస్తుదర్శనయంత్రము.

దుర్భగుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ద్వేషింపఁదగినవాఁడు.

దుర్భరము. సం. విణ. (అ.ఆ.అ.) భరింపఁగూడనిది.

దుర్భాగ్యుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) దురదృష్టుఁడు.

దుర్భిక్షము. సం. వి. అ. న. క్షామము, కఱవు.

దుర్మతి. సం. వి. ఇ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) విణ. దుర్బుద్ధికలవాఁడు.

దుర్మరణము. సం. వి. అ. న. (విషభక్షణాదులచేత చచ్చెడు) చెడ్డచావు.

దుర్ముఖి. సం. వి. న్. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

దుర్ముఖుఁడు. సం. వి. అ. పుం. ఒక రాక్షసుఁడు. విణ. అసంబద్ధ వచనములాడువాఁడు.

దుర్వర్ణము. సం. వి. అ. న. 1. వెండి; 2. నూఁగుదోసకి. విణ. చెడ్డవర్ణముగలది.

దుర్వహము. సం. విణ. (అ.ఆ.అ.) వహింపఁగూడనిది.

దుర్విధుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. దరిద్రుఁడు; 2. దుర్జనుఁడు.

దుర్వినీతుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) వినయములేనివాఁడు, అవినీతుఁడు.

దుర్హృదుఁడు. సం. వి. ద్. పుం. పగవాఁడు. విణ. చెడ్డమనసుకలవాఁడు.

దులదుల. దే. వి. సంభ్రమము. "క. దులదులఁదుమ్మెదలుతమ్మితుటుముల వెడలెన్." హంస. ౧, ఆ.

దులాబి. హిం. వి. దూబరదిండి.

దులి. సం. వి. ఇ. స్త్రీ. ఆఁడుతాఁబేలు. పుం. ముని.

దులుపు. దే. స. క్రి. 1. (ప్రక్కలనంటుకొనియుండు గింజలను) రాల్చు; "గీ. గాదెతెఱచిచూచికలదియ్యమన్నియుఁ, దగిన నందుఁబోచ్చితిరుగువాఱఁ, దుడిచిదులిపియొక్కదోసెఁడుండినఁదెచ్చి, వారిజాక్షివండివారమోపి." భో. ౬, ఆ. — 2. విదిలించు.

దుప. వై. స. దుగయొక్క రూపాంతరము.

దువారము. వై. వి. వాకిలి. "సీ. కదళికాస్తంభముల్ కనకకుంభంబులుఁ దలదువారంబులఁదగులుపఱిచి." రసి. ౬, ఆ.

దువాళము. దే. వి. వేగమున అంతమేరయు సమముగాపాఱెడి యశ్వధార, (చూ. ధార.) ప్లుతము.

దువాళి. దే. వి. దువాళముయొక్క రూపాంతరము.

దువాళించు. దే. అ. క్రి. దువాళముచేయు. అం, ప్రే. దువాళముచేయించు. (చూ. జోమాయించు.)

దువ్వ. దే. వి. దుమ్ము, ధూళి.

దువ్వటము. వై. వి. దుప్పటము. "ద్వి. దువ్వటంబులమీఁదఁదోయజనేత్ర, యెవ్వియుఁబనికిరావిచ్చలోఁదెలియుము." భాగ. ౧౦, స్కం.

దువ్వలువ. ద్వ. వి. (దువ+వలువ.) 1. దుప్పటము; 2. కట్టుకోక.

దువ్వి. వై. వి. 1. పులి; "సీ. దువ్వులు కొంచులుచి వ్వంగులడిదపు మెకములు సవరపు మెకములిర్లు." రసి. ౧, ఆ.—2. చిఱుతపులి*. "ఎ, గీ. ఒకదువ్వి వైరమెత్తి, కఱవవచ్చిననమ్మునికడకుఁబాఱు, తెం చెనాకుక్క." భార. శాం. 3, ఆ.

దువ్వు. యు. దే. స. క్రి. 1. (దువ్వెనతో తల) చి క్కుదీయు; 2. నిమురు. "ద్వి. కలితదక్షిణకరా గ్రమునదువ్వుటయు." రా. యు, కాం.—వై. వి. 1. పులి; "దువ్వుఁజూచినక్కయొడలుగాల్చు కొన్నవడువున." ఉ, హరి. ౪, ఆ.—2. చిఱుత పులి*. (చూ. దువ్వి.)

దువ్వెన. దే. వి. దువ్వుటకు ఉపయుక్తమైన సాధన ము, కంకతిక.

దుశ్చ్యవనుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

దుష్కరము. సం. విశ. (అ. ఆ. అ.) చేయఁగూ డనిది.

దుష్కృతము. సం. వి. అ. న. పాపము. విశ. దుష్ట ముగా చేయఁబడినది.

దుష్టము. సం. విశ. (అ. ఆ. అ.) చెడ్డది.

దుష్పత్రము. సం. వి. అ. పుం. 1. నల్లకచోరము*; 2. బలురక్కసి*.

దుష్ప్రధర్షిణి. సం. వి. ఈ. స్త్రీ. ములక*.

దుష్ప్రభ. సం. వి. ఆ. స్త్రీ. మైలచాయతొండ.

దుష్ప్రాపము. సం. విశ. (అ. ఆ. అ.) (చూ.) దురాపము.

దుసికిల్లు. దే. అ. క్రి. 1. జాఱు; 2. తప్పించుకొను. (రూ. దుసికిలు. జాఱుటకు.—"గీ. అట్టివేసవిబె డిదంపువెట్టకతన, హస్తముచెమర్చి సారెకులస్తకం బు, దుసికిలఁగఁగా దెసవరింపవశముగాక, పుష్ప బాణుని చెఱకువిల్ పుడమిఁబడియె." ఆము. ౨, ఆ.—తప్పించుకొనుటకు.—"చ. మోసపుచ్చె నే, దుసికిలిడాఁగిపోయియొకతుచ్ఛుఁడు నేఁడనిచిం తనొందుచుక్." రామా. ౧, ఆ.)

దుస్తరము. సం. విశ. (అ. ఆ. అ.) తరింపఁగూడనిది.

దుస్తు. దే. వి. 1. వస్త్రము; "సీ. శుభశోభనములదు స్తులొసంగ పెక్కుముంగలకు వద్దలుసేయఁగలరు గాక." చంద్రా. 3, ఆ.—2. అందము. "శా. అస్తోకక్రతుహోమధూమముల చాయల్ తీర్చ కుండంబులక్, దుస్తైతోఁపఁగ." చంద్రా. 3, ఆ.

దుస్త్యజము. సం. విశ. (అ. ఆ. అ.) విడువఁగూడనిది.

దుస్పర్శ. సం. వి. ఆ. స్త్రీ. వాఁకుడు*. అ. పుం. ము. తీఁటకసింద*. విశ. తీక్ష్ణమైన స్పర్శముకలది.

దుస్సర. దే. వి. దూసరయొక్క రూపాంతరము.

దుస్సలహా. ద్రా. వి. చెడు ఆలోచన.

దుస్ససేనుఁడు. వై. వి. దుర్యోధనుని తమ్ముఁడు. "ఎ, గీ. హీనుఁడైనదుస్ససేనునివధియించి, వేఁడిరక్త మానువాఁడఁగడఁగి." భార. సభా. ౨, ఆ.

దుస్సహము. సం. విశ. (అ. ఆ. అ.) సహింపఁగూ డనిది.

దుహిత. సం. వి. ఋ. స్త్రీ. కూఁతురు.

దుహ్యము. సం. విశ. (అ. ఆ. అ.) దోహనము చేయఁదగినది. (దోహనము=పాలుపిదుకుట.)

## దూ.

దూఁకలి. వై. వి. బాధ. (చూ. ఆకట.)

దూఁకు. దే. అ. క్రి. దుముకు. "సీ. అనిలంబుకేళి తివ్వనదూఁకిధరణిపైఁబడములు నిలుపకపఱచి పఱచి." అని. ౪, ఆ.

దూఁకుడు. దే. విశ. ఎగుడుదిగుడు.

దూఁకొను. దే. స. క్రి. (దూఁటు+కొను.) 1. ఆస్వా దించు; "ఉ. తొంగలిపువ్వుఁదేనియలదూఁకొ నిమత్తిలితుమ్మెదల్ పయిక్, బొంగుచు వ్రాల." య. ౪, ఆ.—2. పొందు. "క. ఆయుంగరంబు గైకొని, తోయజముఖి మోహమూర్ఛ దూఁకొ నియుండెక్." రామా. ౬, ఆ.

దూఁట. దే. వి. అరఁటియూఁచె.

దూఁటు. దే. స. క్రి. పొడుచు. "వ. తల్లులందూఁ టికుడుచుతఱపిదూడలు." భాగ. ౧౦, స్కం. పూ. "సీ. ఎండ్రికాలితికినసెగసియొక్కించుక తొలఁగిశితత్రోటిదూఁటితినుచు." ఆము. ౨, ఆ.

దూఁటుకొను. దే. అ. క్రి. ఎగురు. "వ. వానినిశ్వా సపవనంబు భువనంబున ధూమదహనజ్వాలాళీ లంబైసంవత్సరంబున కొక్కమాఱు వెలువడిభూ నభోంతరంబెల్లను నిరంతరనికతారజఃపటలంబు దూఁటుకొనంజేయు." సం. "తస్యనిశ్వాసవా తేన రజఉద్ధూయతే మహత్." భార. అర. ౪, ఆ.

దూఁబఱదిండి. దే. విణ. (దూయు + పఱ+తిండి.) మిగులఁబెట్టక యెంతయున్నను అంతయు వెచ్చించినవాఁడు.

దూఁబిడి. దే. వి. (దూయు+పిడి.) నూలుతోఁడు నపుడు చీడుతగిలించుటకు నిలిపెడు పీఠమమర్చిన కొయ్య.

దూఁగఱ. దే. వి. (దూపము+కఱ.) కఱదూపము.

దూడ. దే. వి. పశుశిశువు. (ఆవుదూడ, ఎనుపదూడ.) "అలయక లేడిదూడగుమినాఁగెడుక్రోల్పులుల౯ వధించు." ఉ, రా. ౨, ఆ. "అమ్మఱకలు రెంటికింబోడముమానుగదూడలునాల్గు." పంచ. నా. ౫, ఆ.

దూడపాల. దే. వి. శారిబ?.

దూత. సం. వి. అ. పుం. 1. రాయబారి; 2. కుంటెనకాఁడు. (రూ. దూతుఁడు.)

దూతి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. కుంటెనకత్తె, (రూ. దూతిక.)

దూత్యము. సం. వి. అ. న. 1. దూతభావము; 2. దూతకర్మము; 3. దూతస్వభావము.

దూది. దే. వి. విత్తుతీసినప్రత్తి, తూలము.

దూదిదబ్బ. దే. వి. తోలుదళముగానుండెడుదబ్బ?.

దూదినిమ్మ. దే. వి. మాతులుంగకము?.

దూనము. సం. విణ. (అ. ఆ. అ.) తపింపఁజేయఁబడినది, సంతాపితము.

దూప. దే. వి. దప్పి. "సీ. వికటంపుటెఱకలవిసరుననుష్ణంగుతుప్పరడెందంబుదూపడంగ." హరి. ఉ. ౫, ఆ.

దూపటిల్లు. దే. అ. క్రి. 1. దప్పిగొను; 2. పరితపించు. స్వా. 3, ఆ. (రూ. దూపటిలు. దప్పిగొనుటకు.—"ద్వి. కడుదూపటిలియుదకంబులుగ్రోలఁ, దడయక యయ్యేటిదరికేగుదెంచి." నవ. 3, భా.)

దూపము. వై. వి. వాసనగలపొగ. "సీ. తఱచుగాఁ బుట్టిన తావిదూపపుఁబొగల్ కుప్పలై మెలఁగుమొగుల్లుగాఁగ." ("తావిదూపపుఁబొగల్." ఇది ప్రౌఢప్రయోగమని తెలియంగునది.) య. ౪, ఆ. (వృత్తియందు అంత్యవర్ణలోపము. దూఁగఱ, దూపార్తి.)

దూపార్తి. వై. వి. (దూపము+ఆర్తి.) దూపము వేసెడు పాదము పెట్టినతట్ట.

దూపించు. దే. అ. క్రి. 1. దప్పిగొను; 2. పరితపించు. "క. క్రేపుఁదలఁచిపసి మేయుటఁ, జేఁపినపాళ్లలయు పెండచేఁబాంథజనుల్, దూపింపమికఁ జాఁడంపిన, యూపాగాయనఁగ నదుల నంచలు మెఱసె౯." ఆము. ౪, ఆ.

దూపిల్లు. దే. అ. క్రి.——వై.——.(పరితపించుటకు.—"వ. పార్వతీవల్లభుండుతనకుఁజేసినయవమానంబునమల్లంబునందుదూపిల్లుచుండె." భీ. ౨, ఆ.) (రూ. దూపిలు. దప్పిగొనుటకు.—"ఉ. ఆసమయంబునందుఁదమసాపగఁవాపస పుత్రుఁడాత్మవి, ద్యాసముదగ్రులైనతలిదండ్రులుదూపిలియుండవారల౯, గానిలకుండఁగుండనుదకంబులుముంపఁగనాధరావరా, గ్రేసరుఁడేసె నాధ్వనికరిధ్వనియంచువిచారశూన్యుఁడై." రామా. ౨, ఆ.)

దూబ. దే. విణ. అధముఁడు. "భృతికివేదంబుచెప్పెడిదూబ." ఉ, రా. 3, ఆ.

దూబూచి. ద్వ. వి. (దూయు+బూచి.) 1. బాలక్రీడావిశేషమునందగునకరణము; "ఎ, గీ. కనుమొఱఁగిచెలఁల్ మఱుంగుననడంగఁ, దొంగిచూచి దూబూచియన్నంగికాకి, కన్నగ." సా. ౧, ఆ.—2. బ. బాలక్రీడావిశేషము. "సీ. పచ్చరాజనుఁగుఁగ్రొంబనులసోరణగండ్లబుడిబుడిఁబొదలిదూబూచులాడి." చంద్రా. ౧, ఆ.

దూముడి. దే. వి. దూయుముడియొక్కరూపాంతరము.

దూయు. దే. అ. క్రి. 1. పాఱు; "గీ. దూసిరిండ్లకాకుదూసినట్లు." రుక్మి. ౫, ఆ.—2. బాణము నాటి వెడలు. (చూ. దుయ్యు.)—స. క్రి. 1. పిడికిటితో ఆకులులోనగువానినూడఁదీయు; (చింతాకు దూసికొనిరమ్ము.)—2. తీయు. "సీ. తాతతండ్రులనాటి ధనమెల్లఁబోకార్చి తులువలై యప్పులుదూయఁజొచ్చె." శేష. ౪, ఆ.

దూయుతీఁగ. ద్వ. విదూసర?.

దూయుముడి. దే. వి. సులభముగా నూడఁదీయునట్లు మొనమడిఁచి వేసినముడి. "సీ. బ్రహ్మాస్త్రబంధంబు పట్టుఁదోరపుదూయుముడియేయనాయాసమున నెవిడువ." రామా. ౨, ఆ.

దూరదర్శి. సం. వి. న్. పుం. 1. విద్వాంసుఁడు; 2. గద్ద. విణ. దూరపు యోచనకలవాఁడు.

దూరము. సం. విణ. (అ. ఆ. అ.) దవ్వు.

దూర్వ. సం. వి. అ. స్త్రీ. గఱిక?.

దూఱు. దే. స. క్రి. నిందించు. (చొచ్చు అనునర్థమున తూఱుశబ్దముకడ చూచునది.) వి. నింద.

దూఱుదుంకెన. దే. వి. బాలక్రీడావిశేషము.
దూఱుపడు. ద్వి. అ. క్రి. (దూఱు+పడు.) నిందింపఁబడు.
దూల. దే. వి. దురద, జిల, నవ, కండూతి.
దూలగొండి. దే. వి. దురదగొండి?.
దూలగోవెల. దే. వి. దురదగోవెల?.
దూలపోతు. దే. వి. ఎప్పుడును దూలగలవాఁడు.
దూలము. వై. వి. ఇంటికురుఁజాలకాదరువుగానమర్చెడు మ్రాను.
దూషణము. సం. వి. అ. న. దూషించుట. పుం. డు. ఒకానొక రాక్షసుఁడు.
దూషించు. సం. స. క్రి. నిందించు, దూఱు.
దూషిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కంటిపుసి; 2. వాగర; 3. సాలెపురుగు.
దూష్య. సం. వి. ఆ. స్త్రీ. ఏనుఁగు నడుమునఁగట్టెడు తోలుమోకు. అ. న. ము. 1. గుడారము; 2. వస్త్రము. విణ. దూషింపఁదగినది.
దూసర. దే. వి. వత్సాదని?.
దూసరి. దే. వి. 1. తృణవిశేషము; 2. బ. తృణధాన్యవిశేషము.

## దృ.

దృంభువు. సం. వి. ఊ. స్త్రీ. పాము. "శా. జంబూద్వీపములోనసెంతయుఁబ్రశస్తంబైనదీనికానట, ద్రృంభూకుండలజూటకోటరకుటీధృత్యర్ధునీవీచికా, లంబిస్విన్ననవేందుకందళిసుధాలంకారవాగ్వైఖరిన్, జంబూకావ్యముచేసెదన్ బుధజనశ్లాఘానిరాఘాటతన్." జై. ౧, ఆ.
దృక్కు. సం. వి. శ్. స్త్రీ. 1. కన్ను; 2. చూపు; 3. బుద్ధి. విణ. చూచువాఁడు.
దృఢము. సం. విణ. (అ.ఆ.అ.) కూర్పఁబడినది.
దృఢము. సం. క్రి. విణ. అ. న. అత్యంతము. విణ. 1. అధికము; 2. దిటవుగలది; 3. గట్టిది; 4. బలిసినది.
దృతము. సం. విణ. (అ.ఆ.అ.) ఆదరింపఁబడినది.
దృతి. సం. వి. ఇ. పుం. తిత్తి, భస్త్ర.
దృప్తుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) దర్పించినవాఁడు.
దృబ్ధము. సం. విణ. (అ.ఆ.అ.) గ్రువ్వఁబడినది.
దృశ. సం. వి. ఆ. స్త్రీ. దృక్కు, దృష్టి, చూపు.
దృశ్యము. సం. విణ. (అ.ఆ.అ.) చూడఁదగినది.
దృషత్తు. సం. వి. ద్. స్త్రీ. 1. ఱాయి; 2. సన్నెకల్లు.
దృషత్పుత్రి. సం. వి. ఈ. స్త్రీ. కల్వపుగుండు.
దృష్టము. సం. వి. అ. న. రాజునకు తన బలమువలనను పగవారివలనను పుట్టిన భయము. విణ. చూడఁబడినది.
దృష్టరజ. సం. వి. స్. స్త్రీ. సమర్తాడినపడుచు.
దృష్టాంతము. సం. వి. అ. పుం. 1. ఉదాహరణము; 2. ఒకయర్థాలంకారము; (చూ. అలంకారము.) 3. శాస్త్రము; 4. చావు.
దృష్టాంతీకరించు. సం. స. క్రి. ఉదాహరించు.
దృష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. చూపు; 2. కన్ను; 3. బుద్ధి.
దృష్టించు. సం. స. క్రి. చూచు.

## దె.

దెంచేనము. దే. వి. దంచేనము. "సీ. క్వథితతైలములఁబక్వముసేయఁబడువారుదెంచనంబులఁ ద్రేయఁద్రెళ్లువారు." కవిక. ౪, ఆ. (చూ. దంచేనము.)
దెందము. దే. వి. డెందముయొక్కరూపాంతరము.
దెప్పము. దే. వి. బాణాదులకెదుటనిలిపిన కృత్రిమలక్ష్యము, కూటలక్ష్యము. "చ. అలికులవేణిదెప్పయిడకానరపాలుఁడుసూచుచుండెని, శ్శలముతిఁగాముతూపులకుఁజాలఁగనిల్పినదెప్పమోయనన్." షో. ౮, ఆ.
దెప్పరము. దే. వి. 1. ఆపద; 2. బ. దుస్సహాచనము. "దెప్పరములువల్కఁగాదగునె." సం. "స్త్రియంసమాభాషతదుర్వినీతవిశేషతో ద్రౌపదీంధర్మపత్నీమ్." భార. సభా. ౨, ఆ.—విణ. 1. అశక్యము; 2. దుస్సహము. (చూ. దెప్పరము.)
దెప్పరిల్లు. దే. అ. క్రి. ఆపదనొందు. (చూ. దెప్పరిలు. "క. అప్పుడుసాందీపుఁడుమన, చొప్పేయుచువచ్చివానసోఁకుననువలికిన్, దెప్పరిలుట గనిఖేదం, బుప్పతిలంబలికెనకట యోపటులారా." భాగ. ౧౦, స్కం. ఉ. (ఇక్కడ ఆపదనొందుట అనఁగా బాధపడుట అని యర్థము.)
దెప్పతికము. దే. వి. (దెప్పరము+తికము.) దుస్సహత్వము. (చూ. తొలసంది.)
దెప్పు. దే. స. క్రి. (ఒకఁడు చేసిన కీడును మేలును) ఎదుటచెప్పు. "పాతకంబనిదెప్పిపలికె దండధరుండు." కాశీ. ౪, ఆ. మొ.

దప్పడు. దే. వి. దప్పట.
దబ్బ. దే. వి. కొట్టు, తాడనము.
దబ్బాటు. దే. వి. (దెబ్బ+ఆటు.) బలిష్ఠమైన వాన.
దస. వై. వి. 1. దిక్కు; "క. వెసరాధేయుఁడుతో లఁగిన, దెసకుంజనుటయునతండుధృతిచెడివితి గెణ." భార. ద్రో. ౨, ఆ.—2. అవస్థ; "గీ. కొసరకాఁబోతునాఁబోతుఁగ్రుమ్ములాడ, నడిమి లేఁబెయ్యదెసవచ్చెనాకుఁజూడ." కాశీ. ౨, ఆ.—3. దురవస్థ; "క. ఈదుస్స్వప్నమునెపమున, నీ దుర్దశకంటెనింక నేదెసయగునో." మార్క. ౨, ఆ.—4. పార్శ్వము*; "క. తెరువిమ్మనియటుల మ్రుగుము, సరభసగతినుదకమిరుదెసలఁబాయఁగ దుణ, బరువునఁబోవఁగనయ్యెడుఁ, దరుణీయ రుగుమలకాలుతడిగాకుండణ." భో. 3, ఆ.—5. కాపు*; (చూ. చెల్లచెదరు.)—6. ప్రాపు*. "దెసలేనిపులుమానిసికిఁబోలెనక్కురువృద్ధునక ట్టిచావుపాటిల్లె." భార. ఆశ్ర. ౨, ఆ.

## దే.

దేంద్ర. దే. వి. జేంద్రయొక్క రూపాంతరము.
దేకిచా. హిం. వి. పెద్ద వంటపాత్ర.
దేఁకు. దే. స. క్రి. ముడ్డితో రాచు.
దేబె. దే. విశే. దేవురుగొట్టు, దీనుఁడు.
దేయము. సం. విశే. (అ. ఆ. అ.) ఇయ్యఁదగినది.
దేజె. దే. వి. గుడారము. "మ. చలమొప్పణ మరుపాదుసాహిజగముల్ సాధింపదండెత్తిమ, త్తిలి బ్రహ్మాండపుఁగప్పుఁ దట్కుబురుసాదేరీజయెత్తిం పనం,దలియస్తాచలపూర్వశైలశిఖరస్తంభాగ్రభా గంబులణ, గలమాణిక్యపుబిల్లలోయనఁదగెణ గంజాప్తచంద్రాకృతుల్." భాను. ౪, ఆ.
దేవకము. సం. వి. అ. పుం. పాచిక, అక్షము.
దేవకీనందనుఁడు. సం. వి. అ. పుం. కృష్ణుఁడు.
దేవకుసుమము. సం. వి. అ. న. లవంగము.
దేవఖాతకము. సం. వి. అ. న. (చూ.) అఖాతము.
దేవచ్ఛందము. సం. వి. అ. పుం. నూఱుపేటలహారము.
దేవజగ్ధకము. సం. వి. అ. న. కామంచిగడ్డి.
దేవత. సం. వి. ఆ. స్త్రీ. వేలుపు, దేవుఁడు.
దేవతరువు. సం. వి. ఉ. పుం. కల్పవృక్షము, వేల్పుఁజెట్టు.
దేవతాడి. వై. వి. దేవతాళము†.
దేవతాళము. సం. వి. అ. పుం. డావరడంగి†.
దేవదత్తము. సం. వి. అ. పుం. 1. ఒక ఉపవాయువు; (చూ. వాయువు.) 2. అర్జునునిశంఖము.
దేవదారి. వై. వి. దేవదారువు†.
దేవదారువు. సం. వి. ఉ. పుం. ఒకానొక వృక్షము.
దేవద్ర్యఞ్చ్. సం. విశే. (చ్. ఈ. చ్.) 1. దేవతలనుగూర్చి పోవువాఁడు; 2. దేవపూజకుఁడు.
దేవనము. సం. వి. అ. న. 1. క్రీడ; 2. జూదము; 3. గెలువనిచ్ఛ; 4. వ్యవహారము. పుం. పాచిక.
దేవనాళము. సం. వి. అ. పుం. అడవిరెక్కసకసవు.
దేవభూయము. సం. వి. అ. న. దేవత్వము.
దేవమణి. సం. వి. ఇ. పుం. 1. కౌస్తుభము; 2. గుఱ్ఱము మెడసుడి; 3. శివుఁడు.
దేవమాతృకము. సం. వి. అ. పుం. వాననీళ్లచేతపండెడుపైరుగలదేశము.
దేవమాసము. సం. వి. అ. పుం. గర్భాష్టమమాసము.
దేవయజ్ఞము. సం. వి. అ. పుం. హోమము, వేలిమి.
దేవర. వై. వి. 1. దేవుఁడు; 2. ప్రభువు. (బ. దేవళ్లు.)
దేవరుఁడు. సం. వి. అ. పుం. మగనితోఁబుట్టువు.
దేవలుఁడు. సం. వి. అ. పుం. 1. తంబళవాఁడు; 2. నంబివాఁడు.
దేవళము. వై. వి. గుడి, దేవాలయము.
దేవవల్లభము. సం. వి. అ. పుం. పొన్న†.
దేవసాయుజ్యము. సం. వి. అ. న. (చూ.) దేవభూయము.
దేవాంగులు. సం. వి. న్. పుం. బ. జేంద్రవారు.
దేవాజీవి. సం. వి. న్. పుం. (చూ.) దేవలుఁడు.
దేవాజీవుఁడు. సం. వి. అ. పుం.——పై.——
దేవానాంప్రియము. సం. వి. అ. పుం. మేఁక.
దేవానాంప్రియుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) మూర్ఖుఁడు. "క. ఈవిధినభీష్టసిద్ధికి, దైవతకవినుతిరొయనర్చితప్పొప్పమదిణ, భావించిదిద్దకుండఁగ, దేవానాంప్రియులమ్రొక్కితెలుతుఁగుకవులణ." రాఘ. ౧, ఆ.
దేవాలయము. సం. వి. అ. న. గుడి, దేవళము.
దేవి. సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. రాణి; 3. చేఁగ†; 4. పిక్క†.
దేవిడీ. హిం. వి. కోటవాకిలి, రాజనగరు.
దేవు. దే. స. క్రి. 1. నీళ్లలోనగువానియందుండి తడవియెత్తు; 2. వెదకు. "మందసంబులుదేవి." అచ్చ. సుం, కాం.
దేవుఁడు. సం. వి. అ. పుం. దేవత, వేలుపు.

**దేవురించు.** దే. అ. క్రి. దైన్యముఁబొందు. "దేవురించుచువాకిటఁదేఱెడుమొగమును." హరిశ్చ. ౪, ఆ.
**దేవురింపు.** దే. వి. దేవురించుట. (చూ. అరగింపు.)
**దేవురు.** దే. వి. దైన్యము. "క. ఈవఱదనుకనురోఁతల, దేవుళ్లంబడితి." పంచ. వేం. ౪, ఆ.
**దేవురుగొట్టు.** దే. విశే. దేబె, దీనుఁడు.
**దేవులాడు.** దే. స. క్రి. (దేవులు + ఆడు.) వెదకులాడు.
**దేవృఁడు.** సం. వి. ఋ. పుం. (చూ.) దేవరుఁడు.
**దేవెరి.** వై. వి. దేవేరియొక్కరూపాంతరము. "సారులతిట్టయగుచాళ్వేరినాఁడెపుదేవెరింగొని." అచ్చ. యు, కాం.
**దేవేరి.** వై. వి. దొరసాని. "కావేరిదేవేరిగానంగీకారమొనర్చునే." పాండు. ౧, ఆ.
**దేశము.** సం. వి. అ. పుం. అనేక పట్టణములుగల గొప్ప భూభాగము, విలాతి. (దేశములు.—౫౬. అంగము, వంగము, కళింగము, కర్ణాటము, కేరళము, కామరూపము, గౌడము, వనవాసము, కుంతలము, కొంకణము, మగధము, సురాష్ట్రము, మాళవము, లాటము, భోటము, వరాటము, శబరము, కుకురము, కురువు, అవంతి, పాండ్యము, మద్రము, సింహళము, ఘూర్జరము, పారశీకము, మిథిలము, పాంచాలము, శూరసేని, గాంధారము, బాహ్లీకము, హైహయము, కౌళవము, సాల్వము, పుండ్రకము, ప్రాగ్జ్యోతిషము, మత్స్యము, చేది, బర్బరము, నేపాళము, గౌళము, కాశ్మీరము, కన్యాకుబ్జము, విదర్భము, ఖురసాణము, మహారాష్ట్రము, కోసలము, కేకయము, అహిచ్ఛత్రము, త్రిలింగము, ప్రయాగము, కరహాటకము, కాంభోజము, భోజము, చోళము, హూణము, కాశి.) (దేశములు మఱియు ననేకములు కలవు, అందు ఇవి ముఖ్యములు.)
**దేశరూపము.** సం. వి. అ. న. న్యాయము, పాడి.
**దేశపాండ్య.** కన్న. వి. చిన్న జమీదారుఁడు.
**దేశి.** సం. వి. ఈ. స్త్రీ. సంగీతవిశేషము. (చూ. సంగీతము.)
**దేశికుఁడు.** సం. వి. అ. పుం. 1. గురువు; 2. దేశము తిరుగువాఁడు.
**దేశ్యము.** సం. విశే. (అ.ఆ.అ.) దేశమునకుఁదగినది.
**దేహము.** సం. వి. అ. పుం, న. శరీరము, మేను.
**దేహయాత్ర.** సం. వి. ఆ. స్త్రీ. 1. తిండి; 2. చావు.
**దేహళి.** సం. వి. ఈ. స్త్రీ. (ఇంటి.) కడప.
**దేహి.** సం. విశే. (న్. ఈ. న్.) దేహముగలవాఁడు.

## దై.

**దైతేయుఁడు.** సం. వి. అ. పుం. తొలువేల్పు.
**దైత్యారి.** సం. వి. ఇ. పుం. 1. విష్ణువు; 2. వేల్పు.
**దైత్యుఁడు.** సం. వి. అ. పుం. తొలువేల్పు.
**దైన్యపడు.** మి. అ. క్రి. (దైన్యము+పడు.) దీనత్వముఁబొందు.
**దైన్యపాటు.** మి. వి. దైన్యపడుట.
**దైన్యము.** సం. వి. అ. న. దారిద్ర్యాదులచేత కలుగు దురవస్థ, దీనత్వము.
**దైర్ఘ్యము.** సం. వి. అ. న. నిడుపు.
**దైవజ్ఞ.** సం. వి. ఆ. స్త్రీ. 1. సోదెకత్తె; 2. బల్లి.
**దైవజ్ఞుఁడు.** సం. వి. అ. పుం. 1. జోస్యుఁడు; 2. గణకుఁడు.
**దైవతము.** సం. వి. అ. పుం, న. వేలుపు. విశే. దే-తది.
**దైవప్రశ్నము.** సం. వి. అ. పుం. (చూ.) ఉపశ్రుతి.
**దైవము.** సం. వి. అ. న. అదృష్టము. పుం. జ్యోతిష్టోమాదియజ్ఞము ప్రారంభింపఁబడినప్పుడు యథావిధిగాత్విక్కర్మమునడపినఋత్విజునినలంకరించి కన్యనిచ్చిచేయువివాహము. (చూ. వివాహము.)
**దైవాఱు.** దే. అ. క్రి. 1. అతిశయించు; "ఉ. కేక దైవాఱఁగఁబట్టిబిట్టుదితిపట్టినృసింహుఁడసహ్యతీవ్రతన్." లక్ష్మీ. ౫, ఆ.—2. పొరలిపాఱు. "వ. దైన్యరసంబుమొగంబులనిండిదైవాఱ." రా. యు, కాం. (మొదటిరూపము దయివాఱు.)
**దైవికము.** సం. విశే. (అ. ఆ. అ.) దైవమువలనఁ గలిగినది.

## దొం.

**దొంకెన.** ద్వ. వి. డొంకెనయొక్కరూపాంతరము. ద్వి. హరిశ్చ. ౧, భా.
**దొంగ.** దే. వి. 1. చోరుఁడు; 2. అరఁటిపువ్వులోని వస్తువిశేషము. విశే. వంచకము. (దొంగమోపు, దొంగనిద్ర, దొంగభక్తి, దొంగమాట. మొ.) [ఇది విశేషణమైనప్పుడు మఱియు విశేషార్థకమగుచున్నది. దొంగకూడు, (తన్నెరులెఱుఁగకుండఁబోయి కుడుచుకూడు.) దొంగగొడ్డు, (దొంగతనముమేయు పసరము.) దొంగనేల, (మోస

ముచేసి యపహరించిన సేల.) దొంగబీగము, (మారుబీగము.) దొంగమేఁత, (పసరముతప్పించుకొనిపోయి పొలములందు మేసెడు మేఁత.) దొంగయిసుక, (క్రిందినీళ్లు తెలియకుండ మీఁద వ్యాపించియుండెడి యిసుక.) దొంగరేయి, (దొంగలు దొంగిలించుటకు అనుకూలమైన యర్ధరాత్రము.) దొంగసొమ్ము. (దొంగిలించిన సొమ్ము.)]

దొంగపని. దే. వి. దొంగతనము.

దొంగటీకము. దే. వి.——పై.——

దొంగిలించు. దే. స. క్రి. ఒకరిసొమ్ము నపహరించు.

దొంగిలు. దే. స. క్రి. దొంగిలించు. "మ. జలజారాతిసతీముఖామితకళా సౌభాగ్యలేశంబుదొంగిలి." చంద్ర.

దొంగు. దే. అ. క్రి. డాఁగు, (రూ. డొంగు.)

దొండ. వై. వి. తుండికేరి?. (దీని భేదములు.—కాకిదొండ, చేఁదిదొండ, పాముదొండ.)

దొండి. దే. వి. తూఁటు, రంధ్రము.

దొంతర. ద్వ. వి. (దొంతి + తరఁగ.) 1. పరంపర; "క. సంతోషబాష్పధారలు, దొంతరగా." విజ. ౧, ఆ.—2. దొంతి. "ఉ. చక్కఁదనంబులెల్లనొకచక్కనిదొంతరగాఁగనిల్పెనో." విజ. 3, ఆ.—విణ. పరంపరయైనది. "ఎ, గీ. ఆశస్త్రకీలితద్విపతురంగ, వీరతనువులుదొంతర వెలుఁగొనర్చె." కళా. ౭, ఆ.

దొంతి. దే. వి. 1. ఒకటిమీఁద నొకటిగానుంచిన కుండలులోనగువానివరుస; "సీ. పోలించియొకమాటుభువనంబులన్నియుఁదనయింటిలో దొంతులనితలంచు." భాగ. ౭, స్కం. 2. వరుస. "తన చెన్నఁటిమాయలదొంతులు." లక్ష్మీ. ౪, ఆ.—విణ. దొంతియైనది. "క. కరసరసీరుహముననొక, సరసీరుహమమరవదనసరసీరుహముఙ్, బరిమళవశమున మోవుచు, ధరణీధరతనయదొంతిదామరఁజూపెన్." ఉ, హరి. ౫, ఆ.

దొందడి. ద్వ. వి. (దొందు+దడి.) సందడి, సమ్మర్దము. "ఇద్దఱుఙ్ దుర్జయశత్రుసైన్యములదొందడిసేమయిరొక్కఁ." భార. ద్రో. ౪, ఆ.

దొందడించు. దే. అ. క్రి. సందడించు, సమ్మర్దమగు. "సీ. తెగి రాలు హారమౌక్తికములు నశ్రుబిందువులేర్పఱుపరాక దొందడింప." హరి. పూ. ౯, ఆ.

దొందము. వై. వి. ద్వంద్వరోగము*.

దొందు. వై. వి. జెత.



దొంపు. దే. వి. 1. మళ్లవరుస; 2. (చూ.) తలవట్టు.

దొంబులిగొట్టు. ద్వ. వి. (దొందు+పులి+కొట్టు.) (వ్యతిరేకలక్షణచే) పిఱికి, భీరువు. (రెండు పులులను కొట్టువాఁడు అని శబ్దార్థము.)

దొగ్గలి. దే. వి. రక్తబాష్పము?.

దొడదొడ. దే. వి. కాఱుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. "ద్వి. దొడదొడ నీలనెత్తురు గ్రక్కుకొనుచు." రా. యు, కాం. "క. పడియెఙ్ దొడదొడలుగాఁగఁ బదిమకుటంబుల్." రామా. ౬, ఆ.

దొడవ. దే. విణ. కురూపి. "క. మగకోఁతియైనదొడవకుఁ, దగునేకన్నియ యనుసంగధరణీశునకుఙ్." షో. ౬, ఆ.

దొడ్డ. దే. విణ. గొప్ప, (దొడ్డవాఁడు, దొడ్డది.)

దొడ్డి. వై. వి. 1. పసులుమేయుకంచె; "వ. నలుదెసలంబొడువుగానమర్చిన బలితంపుములుకొలుగులంగరంబుజతనంబులైయొప్పు పెనుదొడ్లంగ్రమంబునం బ్రమోదంబున వేకువంబోఁకు మేసివచ్చి." హరి. పూ. ౫, ఆ.—2. పసులకొట్టము*; "దొడ్డిలోనంగలకామధేనువు." కాశీ. ౪, ఆ.—3. పెరడు*.

దొడ్డికట్టు. ద్వ. వి. (చూ.) చేట్టుకొల్లారు.

దొడ్డికాళ్లవాఁడు. ద్వ. విణ. పంగటికాళ్లవాఁడు.

దొడ్డికాళ్లు. ద్వ. వి. బ. పంగటికాళ్లు. (చూ. పంగటి.)

దొడ్డివల. ద్వ. వి. ఒకగినుసువల. "వ. దొడ్డివల లేటివల కుందేటివల పందివల సవదండవల మకరవల రౌలుకవల మొదలుగా వలయు వలలును." కాశీ. 3, ఆ.

దొడ్డు. దే విణ. దొడ్డయొక్కరూపాంతరము.

దొడ్డువాఱు. దే. అ. క్రి. (దొడ్డు+పాఱు.) అధికమగు.

దొత్తి. దే. విణ. వ్రేలాడునది.

దొద్ద. దే. వి. కొల్ల. "సీ. తొలఁగిపొండడియాస దొద్దకుఁజొచ్చినఁడలలేటియుర్వికి బలియొనర్తు." భార. మా. ౧, ఆ.

దొద్దకత్తె. ద్వ. విణ. కొల్లపెట్టునది.

దొద్దకాఁడు. దే. విణ. కొల్లపెట్టువాఁడు. "ఎ, గీ. దొద్దకార్లచేఁబటిపోయెఁ దూర్పుదిక్కు." ఉ, హరి. 3, ఆ.

దొద్దగొను. దే. స. క్రి. (దొద్ద+కొను.) కొల్లగొను.

దొద్దపోవు. దే. అ. క్రి. (దొద్ద+పోవు.) కొల్లపోవు.

దొడ్డు. వై. విణ. బొజ్జపెట్టినవాఁడు, తుందిలుఁడు.
దొన. వై. వి. 1. కొండమీఁది నీటిపల్లము; 2. అమ్ములపొది; "గీ. మరలదొనసొచ్చెరఘువీరవరుశరంబు, శరముదొనసేరుటెందుసాజంబెకాదె." రామా. ౫, ఆ. (ఇది మీఁది రెండర్థములకు నుదాహరణము.)—3. ఈంద్రవానికత్తిపిడిక*. "క. మోకునునిచ్చెనరయుమదా, టాకులబందంబు మెత్తనగు వడదోలుకా, జోకగుకత్తులదొనయును, దూకంబునఁబూనినిల్చెఁదొయ్యలియెదుటన్." కురా.
దొనదొనమను. దే. అ. క్రి. (దొనదొన+అను.) దొనదొనయనికూయు. "సీ. దొనదొనమనునీఁగతుట్టెలరూపేఱుపడక క్రంపలను ప్రేలెడుగరుసుల." ఆము. ౬, ఆ.
దొనయుప్పు. ద్వి. వి. (దొన+ఉప్పు.) సంభరిదేశమునందలిరుమయు సెడుఁగనియందు కట్టెలవలనఁగలుగు ఉప్పు, రౌమకము. చవుటియుప్పు. (అనికొందఱు.)
దొన్నె. వై. వి. త్రాగుటకుపయోగమైన దొప్ప. (రూ. దొన్నియ.)
దొప్ప. దే. వి. దొన్నె, (రూ. డొప్ప.)
దొప్పదొప్ప. దే. వి. అడిచికొనుటయందగు ధ్వన్యనుకరణము. "క. ప్రేలెడు వెండ్రుకలిరుగడఁ, దూలఁగఁదలయూఁచుదొప్పదొప్పననోరుం, గేలనడిచికొనుసెలవుల, లాలలుదొరఁగంగనన్నలాయనియొఱలున్." ఉ. హరి. ౪, ఆ.
దొబ్బ. దే. వి. 1. మాంసఖండము; "సీ. పొలసుదొబ్బలనుబబ్బు వులులపెన్బొబ్బలఁగడలియుఁ బలుమాఱుగలఁగిపారల." య. ౧, ఆ.—2. ముద్ద. (నురుఁగుదొబ్బ, నెత్తురుదొబ్బ. మొ.)
దొమ్మ. దే. వి. 1. పశువులయొక్క ఊొమ్మడుపువ్యాధి; 2. అవయవవిశేషము. "సీ. పొట్టలుచెట్టలు బొమ్మలుదొమ్మలుమోవులుప్రేవులు మొలలుతలలు." అచ్చ. యు, కాం.
దొమ్మడోలు. దే. వి. అశ్వగంధి.
దొమ్మర. దే. వి. గడకట్టియాడి జీవనముచేసెడి యొకానొకజాతి. (దొమ్మరవాఁడు, దొమ్మరది.)
దొమ్మరి. దే. వి. (దొమ్మర+ఇ.) దొమ్మరవాఁడు.
దొమ్మి. వై. వి. 1. అందఱు కలయఁబడిచేయు యుద్ధము; "క. పాండవులోన, చ్చలమునఁబోరఁగ దొమ్మికిఁ, దలపడితివి." భా. ౭, ఆ.—2. అందఱు కలయఁబడుట*; "సి. పడిఁజల్లులాడుచుజడియకనిలుచుచు దొమ్మిఁబల్వురొకర్తుఁ గ్రమ్ముకొనుచు." పర. ౪, ఆ.—3. సందడి*. "దొమ్మియూర్పులఁదావిఁగ్రుమ్మరించి." కవిక. ౪, ఆ.
దొమ్ములాడు. ద్వి. అ. క్రి. (దొమ్ములు+ఆడు.) 1. దొమ్మియుద్ధముచేయు; 2. పెనఁగులాడు "హాసముగ్ బ్రణయసంభ్రమముగ్ మది దొమ్ములాడ." కా. 3, ఆ.
దొర. దే. వి. 1. రాజు; "తమకుదొరక్రేఁగంటఁగనుంగొనంగ." రామా. ౨, ఆ.—2. సేనానాయకుఁడు; "సీ. బలములుగెడసినఁగలగుండుపడుదొరల్ దొరలు ద్రెళ్లినఁబొదల్ దూఱుబలము." చంద్రా. ౬, ఆ.—3. యోధవరుఁడు. "క. బరవసము మైంద్రిగర్తే, శ్వరుఁడిట్లనుటుచితమింకజననాయకుఁడె, వ్వరునువనానతియిచ్చెను, దొరలీమనిరట్లచేయఁదుదిఁగార్యమగున్." భార. విరా. 3, ఆ.—విణ. 1. గొప్పవాఁడు; "వ. నీవుదొరవుగానితుచ్ఛుండవుగావు." హరి. పూ. ౬, ఆ.—2. ఏ. సమానుఁడు. "అవ్వీరుఁడుజామదగ్నికల్ తాస్త్రుండిద్ధతేజంబునన్ దొరసప్తార్చికి." భార. కర్ణ. 3, ఆ.
దొరఁకుసన్నాసి. ద్వి. వి. నమ్మించి మోసపుచ్చి దొంగిలించుకొనిపోయెడు దొంగ. "గీ. యతిననుచువేషభావములనటమటించి, పాంచితటివేచికన్నియఁగొంచునరిగె, దొరఁకుసన్నాసియనుమాటతిరముగాఁగ, నర్జునుండద్దిరాయెంతదుర్జనుండు." విజ. 3, ఆ. (ఇక్కడ దొరఁకు అనఁగా యత్నించు అని యర్థము.)
దొరఁకొను. దే. అ. క్రి. యత్నించు. "శా. పుట్టంబుట్ట శరంబునన్ మొలవ నంభోయాన పాత్రంబునన్, నెట్టంగల్లను గాలిఁగొల్వనుబురాణింపన్ దొరంకొంటి." భాగ. ౧, స్కం.—స. క్రి. మొదలుకొను. "క. ఒకపంకఁజక్కగావే, గకమును దొరఁకొనినిశార్ధఘటికలుచనునం, తకువచ్చుట పోవుటలుడు, గకవైష్ణవులునికిన్ను వునగల్గెతెటంగే." పర. 3, ఆ.
దొరకు. దే. అ. క్రి. చిక్కు, లభించు. "క. అకళంకితనిట్లనుఁగొం, చకయేమీమనముసమరసముదారక్రీ, డకుసెండొరుమార్కొనుటదో, రకునవచ్చితిసెఱుంగరావాకినుకల్." రాఘ. ౨, ఆ. (ప్రే. దొరకించు.)

దొరకుపడు. ద్వ. అ. క్రి. (దొరకు+పడు.) చిక్కుకొను. "క. అరుదెండననికటంబున, కరిగినదధికర్ణుఁడంఘ్రిహతినారెంటిన్, దొరకుపడఁబట్టుకొనికం,ధరవిరియంగొత్తికిచంపితగభక్షించెన్." పంచ. వేం. 3, ఆ. (ఇతర గ్రంథములయందు దీనికి ప్రయోగము మృగ్యము.)

దొరకొను. దే. అ. క్రి. (దొరకు+కొను.) 1. లభించు; "అరదంబుతగన్ గడపంగనెవ్వరున్ దొరకొనకున్న." భార. విరా. ౪, ఆ.—2. సంభవించు; "భూనుత నేనునునీవుజూహ్నవీ,పుత్త్రుఁడునుండఁగానహితమున్ భయమున్ దొరకొన్నె." భార. సభా. ౨, ఆ.—3. సిద్ధించు. "క.తనవగచినకార్యముదొర, కొనుటకు ధృతరాష్ట్రపుత్త్రకుఁడుపాంగిపురో, చనుఁబిలిపించిరహస్యం, బునవానికిఁగరమునెయ్యమునన్నిట్లనియెన్." భార.ఆది.౭,ఆ.

దొరకోలు. దే. వి. 1. యత్నించుట; 2. లభించుట. "మ. వీఁడగ్గమై, దొరకోలర్జుననీకుఁదొంటినుక్కృతిస్తోమంబుకల్మింజుమీ." భార. ద్రో. 3, ఆ.

దొరకోలుసన్నాసి. ద్వ. వి. (చూ.)దొరఁకుసన్నాసి.

దొరగడలు. దే. వి. (దొర+కడలు.) గొప్ప అల, కల్లోలము. "సీ. జలరాసులేదునుగలగుండుగొనియొడగడ్డలపైదొరగడలు దొడర." హరి. ఉ. ౯, ఆ.

దొరయు. దే. అ. క్రి. 1. అంటు; (చూ. పచేరించు.) 2. సమానమగు; "సూతతనూజుఁడుషోడశాంశమున్ దొరయఁడునాకు." భార. కర్ణ. ౧, ఆ.—3. కలుగు; కళా. ౧, ఆ.—4. జేరగు. "గంభీరామరీనృత్యముల్ దొరసెన్." విక్ర. ౧, ఆ.—స. క్రి. పోలు. "చతుష్పాదవృత్తిఁబరఁగినగోవుం దొరయుచు." భార. అను. ౪, ఆ.

దొరలు. దే. అ. క్రి. 1. దొర్లు; "క. నిరంతరసంసృతిచక్రంబున, దొరలినరుండొందు సర్వతోదుఃఖంబుల్." కవిక. ౫, ఆ.—2. పడు; "సీ. భానుస్మభీతిమున్ పడినచుక్కలభంగి దొరలె వేకువగాలిఁదరులమంచు." స్వా. ౫, ఆ.—3. కలయు; "గీ. ద్రోహులగు వేలుపులలోన దొరలియున్న, పదియునొక్కండ్రురుద్రులఁబాఱవిడిచె." కాశీ. ౭, ఆ.—4. మాఱుకొను. "ద్వి. తరమెఱుంగకరామధరణీశుతోడ, దొరలితేభస్మమైత్రుంగదుగాక." రా. సుం, కాం.—స. క్రి. అనుభవించు. "క. ఇరువదియేఁడులుదనపాల, మొరుఁడుగుడుచుచునికిఁరొంతిఁగియున్నేనియుఁదా, దొరలకయున్నేనియుఁ, దత్పరిభోగముఁగుడిచినతనిపాలైపోవున్." విజ్ఞా. వ్య, కాం.

దొరవి. దే. వి. కొలను. "క. క్రీడివెఱుఁగందికనుఁగొనఁ, గేడించుచునుండుదొరవికింజనియుచటన్, జూడభయంకరమగుచును, గోడిగ తద్రూపము డిగిక్రొల్పులియయ్యెన్." జై. ౫, ఆ.

దొరసాని. ద్వ. వి. రాజభార్య, రాణి.

దొరుగండి. దే. వి. (దొరువు+గండి.) నిండినప్పుడు నీళ్లు వెలుపటికిఁ బోవుటకై యేర్పఱచిన దొరువుతూము. "సీ. మడువులుపసులకాల్వడిఁద్రుచ్చి దొరుగండిప్రంతలు పెనురొంపి ప్రంతలయ్యె." హరి. పూ. ౫, ఆ.

దొరువు. దే. వి. 1. నడబావి; 2. కొలను. "రగడ. ఎన్నికగవాసించెనిరువులునుబొరువులును, జిన్నిచెంద్రొనలచేఁజెరువులునుదొరువులును." రాఘు. ౨, ఆ.

దొరువుపట్టెడ. దే. వి. గంతయెద్దుల తోఁకక్రిందఁ దగిలించెడు పట్టెడ.

దొర్లు. దే. అ. క్రి. పొర్లు. (దొరలుయొక్క రూపాంతరము.)

దొఱయు. దే. స. క్రి. పొందు. "చ. గోస్వరూపతన్, దొఱసినరాక్షసాంగనలఁదోలెనతండునిమేషమాత్రలోన్." హరి. పూ. ౬, ఆ.

దొలుపు. దే. ప్రే. దొర్లఁజేయు. పాంచా. ౫, ఆ.

దొసఁగు. దే. వి. 1. ఆపద; "దండకము. దుంతబాబావజీరుండుగారింపమిఱందొసంగుల్ వెసన్ బొందవారిందగన్ జూచి." నీలా. ౨, ఆ.—2. విఘ్నము. "సీ. నేలతాలుపురాచచూలిగాదిలికందుదొసఁగుఁజీఁకటిచాల్పుతొగలవిందు." అచ్చ. బాల, కాం.

దొసవు. దే. వి. దొసఁగుయొక్క రూపాంతరము.

## దో.

దోః. సం. వి. స్. పుం, న. బాహువు. "ఉ. తదీయదంతములఁదోలనమర్చినఁజూడసొప్పిరా, చెంగటఁగాలదండములు చేకొనియున్నయమద్వయంబనన్." వి, పు. ౭, ఆ.

దోఁకిస. దే. వి. దోఁకుట.

దోఁకు. దే. స. క్రి. నేలను ఎదురుగచెక్కు.

దోఁకుడు. దే. వి. దోఁకుట, దోఁకిస.

దోఁకుడుఁబాఱ. దే. వి. దోఁకునట్టిపాఱ.

దోఁకుడుబార. దే. వి. బాలక్రీడావిశేషము, గూఢమణి.

దోఁగాడు. దే. అ. క్రి. (దోఁగి+ఆడు.) బిడ్డ నేలఁ జేతులూఁది మోఁకాళ్లతో నడచు. (మొదటిరూపము దోఁగియాడు. "గీ. దోఁగియాడంగ నేర్చి దైత్యులు కృశించి, తొంటిమద మేదిమేదినిఁ గుంటువడఁగ." రామా. 3, ఆ.) (చూ. ఊఁగాడు.)

దోఁగు. దే. అ. క్రి. 1. మేనితో లొలియు; 2. దోఁగాడు.

దోఁగురు. దే. వి. దొంగతనము, చౌర్యము.

దోఁచు. దే. స. క్రి. 1. దొంగిలించు; 2. అపహరించు.

దోఁటమ్ము. ద్వ. వి. (దోఁటి+అమ్ము.) దోఁటివంపైన అలుఁగుగల బాణము, కర్ణిశరము.

దోఁటి. దే. వి. అందని పండ్లులోనగువానిఁ గోయుటకు ఉపయుక్తముగా వంకరచిల్ల దోఁపిన కోల.

దోఁటిముక్కర. దే. వి. దోఁటివంటి ముంగర.

దోఁటు. దే. స. క్రి. ఇచ్చు. (ఇది వాడుకలోనిది.)

దోఁపరి. దే. వి. (దోఁపు+అరి.) 1. దొంగ; 2. కొల్లకాఁడు.

దోఁపిడి. దే. వి. 1. దోఁచుకొనుట; 2. కొల్ల.

దోఁపిడికాఁడు. దే. వి. 1. దొంగ; 2. కొల్లకాఁడు.

దోఁపు. దే. స. క్రి. చొప్పించు. "ద్వి. జిలుఁగు ముసుంగులోఁ జెంగల్వ రేకు, లొసపరిగా దోఁపియున్న కల్హార, కుసుమగంధంబులాగుబ్బుగా నెలయ." హరిశ్చం. ౧, భా.—వి. 1. దోఁచుకొనుట; 2. కొల్ల; 3. అలుకలదోఁపు, (చూ.) పూర్ణానకము.

దోఁపుకాఁడు. దే. వి. 1. దొంగ; 2. కొల్లకాఁడు.

దోఁపుడు. దే. వి. 1. దోఁచుకొనుట; 2. కొల్ల.

దోఁపుడుకాఁడు. దే. వి. 1. దొంగ; 2. కొల్లకాఁడు.

దోగ్ధ. సం. వి. ఋ. పుం. 1. గొల్లవాఁడు; 2. దూడ; 3. కవిత్వముచెప్పి జీవించెడుకవి. విణ. పిదుకువాఁడు.

దోగ్ధ్రి. సం. వి. ఈ. స్త్రీ. ఈనినఆవు.

దోణము. దే. వి. 1. భుజమునకు బలమువచ్చుటకై త్రిప్పెడు బెట్టివాని యుపకరణవిశేషము; 2. మ్రానుసుకరముగా చీలుటకై యక్కడక్కడ చెక్కిన మేకులను దిగఁగొట్టెడి యుపకరణవిశేషము.

దోణాము. దే. వి. దోణముయొక్క రూపాంతరము.

దోదశి. వై. వి. పక్షమునందు పండ్రెండవతిథి, ద్వాదశి.

దోదుమి. దే. వి. దోదుమ్మియొక్క రూపాంతరము.

దోదుముదారి. దే. వి. ఆయుధవిశేషము. "సీ. కలిమిఁ జెచ్చెలి కానిబలిమిఁ దామరతేకు చికిలిదోదుముదారి చెడఁగఁ జూచి." చంద్రా. 3, ఆ.

దోదుమ్మి. దే. వి. ఆయుధవిశేషము. "తమ్మిదోదుమ్మిఁ గొంది." ఉ, రా. ౭, ఆ.

దోనమ్ము. ద్వ. వి. (దోని+అమ్ము.) అల్పశరము.

దోని. యా. వై. వి. 1. దోన; "సీ. పటికంపుదోనలఁ బరఁగు గొజ్జంగపూనీటిబల్ జక్కరల్ దాఁటి దాఁటి." రసి. ౨, ఆ.—2. అరిణ; "వ. అయ్యోతంబు ముంగిస మ్రానికి వెదురునకు నంటఁగట్టిన యా ఉపరిమళంబా ఘ్రాణించి దోనిం బడిచని." హంస. ౧, ఆ.—3. కాలువతూము*. "ఏ, గీ. కైరవములకు వెన్నెలనీరు వరవఁ, బూని చేర్చిన పటికంపు దోనులనఁగ." పా. ౨, ఆ.—దే. విణ. అల్పము. (దోనమ్ము. చూ.)

దోనె. వై. వి. 1. చిన్నయోడ; 2. జెలగడుగువాని సాధనము; 3. అరిణ; "సీ. పచ్చతాపలకలబిం దోనెలబడి ఘుమఘుమస్వనములదుముకుచున్న పన్నీటియోయబావి." భాను. 3, ఆ.—4. సారె వాఁడు చాఁపుచు బెట్టెడు మ్రాను. (చూ. కుంచె.)

దోమ. దే. వి. మశకము.

దోమటి. దే. వి. అన్నము.

దోమతెర. ద్వ. వి. దోమలు చొరకుండ మంచెముచుట్టు వేయు వలగుడ్డ, చతుష్కి.

దోము. దే. వి. ఆహారము దేహమున పట్టక పనులు పాఱుకొనుట. కడుపువాఁపు. (అని కొందఱు.)

దోయి. వై. వి. జత. "క. నీయుపదేశముఁ దనచే దోయిబలువుఁ దోడుగాఁగ." భార. ద్రో. ౨, ఆ. "క. ఈకలియుగముఁ దృతీయయుగంబుగ, దోయియయినలునకుపహతి, సేయంగా లేవు." నై. ౭, ఆ.

దోయికట్టు. ద్వ. అ. క్రి. జతకూడు. "వ. తక్కి... వారునుందమలోన దొరయుభంగి దోయికట్టి." హరి. పూ. ౭, ఆ.

దోయిడి. దే. విణ. శూన్యము, రిత్త. "గీ. అనిమిష కేతుఁగనుఁగొని యనిలసుతుఁడు, పలికినాఁ ముతురగసంబంధమైన, ప్రతినలెన్నె నిధర్మసంధిపుని యొదుర, మనముదోయిడి చేతులమగుదుటెట్లు." నై. ౨, ఆ.

దోయిలి. వై. వి. వంపఁబడిన రెండుచేరల చేరిక, అంజలి.

దోయిలించు. వై. స. క్రి. వంపఁబడిన రెండుచేరలను చేర్చు.

దోర. దే. వి. రాశి. "శా. దోరల్ పట్టినచంద్రఖండములుదొంతుల్ గొన్న వెన్నప్పముల్." పాంచా. ౪, ఆ.—విశ. 1. ఎఱ్ఱపాటినది; (దోరగాయ, దోరకాఁగినపాలు.)—2. ఒఱిగినది. (దోరగల్లు, దోరపాక. మొ.) (దోరపండులుశ్ గమిసినపండులుశ్ అనుచో దోరపండనఁగా ఎఱ్ఱపాటినపండుగాని మాఁగినదికాదు.)

దోరగల్లు. దే. వి. (దోర+కల్లు.) (చూ.) ఒడ్డగడవు. "సీ. ఒకతట్టుదోరగల్లొఱిగివైఁబడుదు నొత్తొలఁగికమ్ములు మ్రోయనీఁచలింప." హరి. పూ. ౫, ఆ. (రూ. దోరగలు.)

దోరగల్లుపడు. ద్వి. అ. క్రి. (దోరగల్లు+పడు.) ఒడ్డగడవగు. "గీ. సాంధ్యనటనచండచండీశపదహతిఁ, దరణిచక్రమొఱిగిశరధిఁగ్రుంగ, దోరగల్లుపడియొభూరథితిరభాగ, చక్రమనఁగనపుడు శశియుఁదోఁచె." స్వా. ౫, ఆ. (రూ. దోరగలుపడు. "క. తగులువడియపుడువడిచెడి, గగనమణిరథంబు దోరగలుపడినిలిచెశ్, బొగరుమొగకడలియక్కలిఁ, దగిలినిలువఁబడినయానతిరయుంబోలెశ్." కాశీ. ౧, ఆ.)

దోరగించు. దే. ప్రే. దోరగిల్లఁజేయు.

దోరగిల్లు. దే. అ. క్రి. 1. ఎఱ్ఱపాఱు; (కాయలు దోరగిల్లెను, వరుగులు దోరగిల్లవేఁచును.)—2. వ్రాలు. (రూ. దోరగిలు. వ్రాలుటకు—"చ. తొలినుడిమానికంపుగనిదోరగిలెశ్ నాగిలెశ్ రథాంగముల్." వాన. ౪, ఆ.)

దోరణ. వై. వి. వాకిలి మొదలగు ప్రదేశములందుఁగట్టెడు మామిడాకులులోనగునవి గ్రుచ్చినదండ. "క. ఇలమీఁదికిడిగి వేలుపుఁ, బొలఁతులుమణికంధరునితపోవనమునకిం, పలరఁజనిరతమచూడ్కులు, తొలుతగనీలోత్పలములదోరణగట్టశ్." కశా. 3, ఆ. (రూ. దోరణము. "చ. అలవలరాజుచేతియలరమ్ములనశ్ దగుచేమిచెల్వవుం, బొలఁతులమోముఁదామరలఁ బోలనిసిగ్గున వీగిపెక్కురూ, పులఁజనివారివాకిలులపొంతలఁజేరననిందు చందమా, మలబలెమీ కెరంగులలమశ్ దొగదోరణముల్ బెడంగులై." య. ౪, ఆ.)

దోరణపుఁగమ్మి. వై. వి. (దోరణము+కమ్మి.) ద్వారముమీఁది యడ్డకమ్మి.

దోరణపుఁబట్టె. వై. వి. (దోరణము+పట్టె.) కటిలెబిల్లక్రింది యడ్డపట్టె.

దోరణపుసాటిరిక్క. ద్వి. వి. (దోరణము+సాటిరిక్క.) అనూరాధానక్షత్రము.

దోరపాక. దే. వి. (చూ.) ఓరపాక.

దోరము. వై. వి. దువారము, ద్వారము.

దోరు. దే. అ. క్రి. 1. చేవ్చు; "మనుఁబిల్లగంతు గొనెజంకల్ బిద్దదోరశ్ గిటుల్." సా. ౧, ఆ.—2. వ్రాలు. (చూ. దోరుచు.)

దోరుచు. దే. ప్రే. 1. చెంపు; 2. వ్రాల్చు. (రూ. దోర్చు. వ్రాల్చుటకు.—"క. ఇలఁజదికిలఁబడిపలుమఱుఁ, దలదోర్చుచువికృతమగువదనమునలాలా, జలములుతీఁగలుసాఁగఁగఁ, బలుకునతండాలిగుఱిచిపరిచితరక్తిశ్." పాండు. 3, ఆ.)

దోరువా. ద్వి. వి. పక్షివిశేషము. "సీ. కంజాలువూరెల్లు కన్నెలెల్లు నెముళ్లు లావుకల్ దోరువాల్ లకుముకులును." రసి. ౧, ఆ.

దోరము. దే. వి. డేగలకుకట్టెడు త్రాడు. "వ. బర్హిబర్హనిబద్ధాగ్రంబులైకొమరారు దోరపుఁద్రాళ్లతోడశ్ దిరుగుడులశ్ వెడంగుపడి." స్వా. ౪, ఆ.

దోర్ద్రధ్యము. సం. వి. అ. న. పిడికిటిపోటు.

దోల. సం. వి. ఆ. స్త్రీ. డోలయొక్కరూపాంతరము. (చూ. దిగఁద్రావు.)

దోవతి. దే. వి. మగవాని కట్టువస్త్రము, పరిధానము. (ఆఁడుదాని కట్టుకోక జేబు.)

దోష. సం. వి. ఆ. స్త్రీ. 1. భుజము; 2. రాత్రి. అ. పుం, ము. 1. తప్పు; 2. పాపము. (కావ్యదోషములు త్రివిధములు.—పదదోషములు, వాక్యదోషములు, అర్థదోషములు. అందు పదదోషములు. ౧౭.—అప్రయుక్తము, అపుష్టార్థము, అసమర్థము, నిరర్థకము, నేయార్థము, చ్యుతసంస్కారము, సందిగ్ధము, అప్రయోజకము, క్లిష్టము, గూఢార్థకము, గ్రామ్యము, అన్యార్థము, అప్రతీతికము, అవిమృష్టవిధేయాంశము, విరుద్ధమతికరము, అశ్లీలము, పరుషము. వాక్యదోషములు. ౨౪.—శబ్దహీనము, క్రమభ్రష్టము, విసంధి, పునరుక్తియుతము, వ్యాకీర్ణము, వాక్యసంకీర్ణము, అపూర్ణము, వాక్యగర్భితము, భిన్నలింగము, భిన్నవచనము, న్యూనోపమము, అధికోపమము, భగ్నచ్ఛందము, యతిభ్రష్టము, అశరీరము, అరీతికము, విసర్గలుప్తము, అస్థాన

సమాసము, వాచ్యవర్జితము, సమాప్తపునరాత్తము, సంబంధవర్జితము, పతత్ప్రకర్షణము, అధికపదము, ప్రక్రమభంగము. అర్థదోషములు. ౧౮.— అపార్థము, వ్యర్థము, ఏకార్థము, ససంశయము, అపక్రమము, భిన్నము, అతిమాత్రము, పరుషము, విరసము, హీనోపమము, అధికోపమము, అసమోపమము, అప్రసిద్ధోపమము, హేతుశూన్యము, నిరలంకృతి, అశ్లీలము, విరుద్ధము, సహచరచ్యుతము.)

దోషకము. సం. వి. అ. పుం. దోసె.

దోషకారి. సం. విణ. (న్.ఈ.న్.) దోషము చేయువాఁడు.

దోషగ్రాహము. సం. వి. అ. పుం. ఇందుపుఁజెట్టు.

దోషజ్ఞుఁడు. సం. వి. అ. పుం. 1. విద్వాంసుఁడు; 2. వైద్యుఁడు. విణ. దోషము నెఱిఁగినవాఁడు

దోషాకరుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు, రేఱేఁడు.

దోషాచరుఁడు. సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు; 2. రాక్షసుఁడు.

దోషి. సం. విణ. (న్.ఈ.న్.) దోషముగలవాఁడు.

దోషించు. సం. అ. క్రి. దోషముపుట్టు.

దోస. దే. వి. కర్కటిక. (దీని భేదములు. చేఁతిదోస, నక్కదోస, ములుదోస.)

దోసకారి. వై. విణ. 1. దుష్టుఁడు, దుష్టురాలు; 2. కుత్సితుఁడు, కుత్సితురాలు*. (చూ. తూఁటరి.)

దోసము. వై. వి. 1. పాపము; 2. తప్పు. "క. చేసినదానికిమాఱుగఁ, జేసినఁబగయుంతతోఁడఁదెగుఁ గాకగుణుల్, డాసినసమ్మేలువిడిచి, దోసముపట్టుదురెయెట్టితుచ్ఛులుఁజతురా." భార. శాం. 3, ఆ.

దోసి. వై. విణ. 1. తప్పుగలవాఁడు, తప్పుగలది; 2. పాపిష్ఠుఁడు, పాపిష్ఠురాలు. (చూ. తూఁటరి.)

దోసిలి. వై. వి. దోయిలియొక్కరూపాంతరము.

దోసిలించు. వై. స. క్రి. దోయిలించుయొక్కరూపాంతరము.

దోసె. వై. వి. ఒకదినుసు పిండివంట.

దోహదము. సం. వి. అ. న. 1. ఇచ్ఛ; 2. గర్భిణికిగల వేవిళ్లు; 3. ఎరువు; 4. తరుగుల్మలతాదులకు అకాలమునందు పుష్పాదులను బుట్టించెడు స్త్రీలపాదతాడనాదిక్రియ. (అశోకమునకు దోహదము పాదతాడనము, పొగడకు ముఖసీధువు, గోరంటకు ఆలింగనము, బొట్టుగునకు వీక్షణము, మామిడికి కరస్పర్శము, సంపెఁగకు ముఖరాగము, కొండగోఁగునకు సల్లాపము, వావిలికి ఉగ్గు, మొరటికి పాట, సురపొన్నకు నవ్వు.)

దోహదవతి. సం. వి. ఈ. స్త్రీ. వేవిళ్లుగల ఆఁడుది.

దోహదలక్షణము. సం. వి. అ. న. 1. స్త్రీలవయస్సంధి; 2. గర్భము.

దోహనము. సం. వి. అ. న. పాలుపిదుకుట.

దోహలము. సం. వి. అ. పుం. ఉత్సాహము. "సీ. అధిపసాలకటంకటులనఁగఁజనిన, నాఁటివాఁ పౌలస్త్యులనంగఁబరఁగు, నేఁటివారుసమానులుఁ గ్కమరయ, బాహుబలమునసాహసదోహలము న." నిర్వ. 3, ఆ.

## దౌ.

దౌ. దే. విణ. దూరము. (మొదటిరూపము దవు.)

దౌడ. దే. వి. బుగ్గలోపలిభాగము, తాలువు. "సీ. ఆరేయికలనెల్లవారునుగోఁఅదౌడలునుఁల్లని మే నుగలనెలంత, యొక్కతెయిలుసొచ్చియువిదఁ నీడిచికొనిపోవశస్త్రాస్త్రకోటికేతు, చయము నుభూషణసమితియు రాక్షసులపహరింపఁగఁ నిరి." భార. మా. ౧, ఆ. (మొదటిరూపముదవుడ.)

దౌడు. వై. వి. 1. జోడన; (చూ. ధౌరితకము.) (మొదటిరూపము దవుడు.) 2. దండయాత్ర; 3. పరుగు.

దౌత్యము. సం. వి. అ. న. 1. దూతభావము; 2. దూతకర్మము; 3. దూతస్వభావము.

దౌరాత్మ్యము. సం. వి. అ. న. దురాత్మభావము, చెడ్డతనము.

దౌరు. దే. వి. కాంతి. (మొదటిరూపము దవురు.) "సీ. తళుకొత్తునడుదట్టి దవురుదన్నడియుం గోపంపుపాపోసులేవునూప." రా, వి. ౫, ఆ.

దౌర్జన్యము. సం. వి. అ. న. దుర్జనభావము, చెడ్డతనము.

దౌర్భాగ్యము. సం. వి. అ. న. దుర్భగభావము, దురదృష్టము.

దౌవారికుఁడు. సం. వి. అ. పుం. ద్వారపాలకుఁడు.

దౌవు. దే. విణ. దవ్వుయొక్కరూపాంతరము. "ఉ. దౌదౌవులనిల్చిమద్ఘనగదాపటువిభ్రమతాడనఁ బులకా, జేవయుడంతు." శై. ౨, ఆ.

దౌష్ట్యము. సం. వి. అ. న. దుష్టస్వభావము, చెడ్డతనము.

దౌహిత్రుఁడు. సం. వి. అ. పుం. దుహితకొడుకు, మనుమఁడు.

దౌహృదము. సం. వి. అ. న. దోహదము, వేవిళ్లు.

## ద్యా.

ద్యావాపృథువులు. సం. వి. ఈ. స్త్రీ. ద్వి. మిన్ను మన్ను. (ఇట్లు ద్యావాభూములు. ఇ. స్త్రీ.)

## ద్యు.

ద్యుతి. సం. వి. ఇ. స్త్రీ. 1. కాంతి; 2. వెలుఁగు.

ద్యుమణి. సం. వి. ఇ. పుం. సూర్యుఁడు, చేదలుమానికము.

ద్యుమ్నము. సం. వి. అ. న 1. ధనము; 2. బలము.

## ద్యూ.

ద్యూతము. సం. వి. అ. పుం, న. జూదము. (ఇందలి జగడము అక్షద్యూతికము.)

## ద్యో.

ద్యోతకము. సం. విశే. (అ. ఈ. అ.) ప్రకాశింపఁజేయునది.

ద్యోతనము. సం. వి. అ. న. ప్రకాశించుట.

ద్యోతమానము. సం. విశే. (అ. ఆ. అ.) ప్రకాశించుచున్నది.

ద్యోతము. సం. వి. అ. పుం. ప్రకాశము, ఎండ.

ద్యోతించు. సం. అ. క్రి. ప్రకాశించు.

ద్యోతితము. సం. విశే. (అ. ఆ. అ.) ప్రకాశితము.

## ద్ర.

ద్రప్సము. సం. వి. అ. న. అడుగుపెరుగు. మీఁది పెరుగు. (అని కొందఱు.) నీళ్లుకలిసినపెరుగు. (అని కొందఱు.) పుం. నీటిబొట్టు.

ద్రబ్బెడ. దే. వి. భక్ష్యవిశేషము. "వ. ఇడియుఁజలిమిడియును ద్రబ్బెడయువడయును." కాశీ. 2, ఆ.

ద్రమంతి. సం. వి. ఈ. స్త్రీ. ఎలుకజీడి?.

ద్రవము. సం. వి. అ. పుం. 1. తడి; 2. పరిహాసము; 3. పరుగు; 4. యుద్ధమువలనఁబోవుట.

ద్రవించు. సం. అ. క్రి. కాఱు.

ద్రవిడము. సం. వి. అ. పుం. ఒకానొకదేశము.

ద్రవిణము. సం. వి. అ. న. 1. ధనము; 2. బంగారు; 3. బలము.

ద్రవ్యము. సం. వి. అ. న. 1. ధనము; 2. పృథివ్యాది; (ఇవి తొమ్మిది. పృథివి, అప్పు, తేజము, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు.) 3. ఇత్తడి; 4. పూఁత; 5. మందు; 6. లక్క. విశే. 1. భవ్యము; 2. ద్రువికారము.

## ద్రా.

ద్రాక్ష. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకతీఁగ, దాక?.

ద్రాఘిష్ఠము. సం. విశే. (అ.ఆ.అ.) మిక్కిలిదీర్ఘము.

ద్రాబ. దే. విశే. 1. అసారుఁడు, అసారము; "చ. దుష్టవితలులక్షణంబెఱుఁగఁజాలక ద్రాబలు గూర్చియల్లుచుణ్." కవిస. ౧, ఆ.—2. అధముఁడు, అధముఁడు. "క. గూబలచేనిట్లయితిమి, ద్రాబలమై." పంచ. నా. ౨, ఆ.

ద్రావకము. సం. వి. అ. పుం. 1. రసగంధకపాషాణాదులయందు తీసెడురసవిశేషము; 2. బరువైనతాయి. విశే. 1. నేర్పరి; 2. మోసకాఁడు.

ద్రావిడము. సం. వి. అ. న. ద్రవిడభాష. పుం. ద్రావిడకము, కచోరము?.

ద్రావిడుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) ద్రవిడదేశమునందుఁబుట్టినవాఁడు.

## ద్రి.

ద్రిండు. దే. వి. దిండుయొక్కరూపాంతరము. (ప్రయోగములయందు రేఫసహితముగా కానఁబడుచున్నది.)

## ద్రు.

ద్రుఘణము. సం. వి. అ. పుం. 1. ఇనుపగుదియ; 2. గండగొడ్డలి.

ద్రుడ్డు. వై. వి. దుడ్డుయొక్కరూపాంతరము. "గీ. ద్రుడ్లగుదియలఁబిడికిళ్లఁగరులను, మొత్తి." అచ్చ. యు, కాం.

ద్రుణము. సం. వి. అ. న. 1. కత్తి; 2. విల్లు. పుం. 1. ఒకదినుసుతుమ్మెద; 2. తేలు.

ద్రుతము. సం. క్రి. విశే. అ. న. త్వరితము. విశే. 1. వడిగలది; 2. కరఁగినది; 3. చీలినది.

ద్రుపదము. సం. వి. అ. న. బొందకొయ్య.

ద్రుమము. సం. వి. అ. పుం. 1. వృక్షము; 2. పారిజాతవృక్షము. డు. 1. కింపురుషుఁడు; 2. కుబేరుఁడు.

పాలునిస్నేహితుఁడు.

ద్రుమామయము. సం. వి. అ. పుం. లక్క, లాక్ష.

ద్రుమోత్పలము. సం. వి. అ. పుం. కొండగోఁగు.

ద్రువయము. సం. వి. అ. న. త్రాసు, మూర, తూములోనగు మానము.

ద్రువు. సం. వి. ఉ. పుం. వృక్షము, చెట్టు.

ద్రుహిణుఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మ, (రూ. ద్రుఘణుఁడు.)

ద్రూ.

ద్రూణము. సం. వి. అ. పుం. 1. ఎఱ్ఱతేలు; 2. తేలు.

ద్రొ.

ద్రొబ్బు. దే. స. క్రి. పడఁద్రోయు.

ద్రో.

ద్రోణదుఘ. సం. వి. ఆ. స్త్రీ. తూమెఁడుపాలు పిదికెడిఆవు.

ద్రోణము. ఉభ. దే. వి. దోణముయొక్క రూపాంతరము. "ద్రోణముల్ దివియుదోర్దండంబులం జేఁదియేసిరి." స్వా. ౪, అ. (ప్రయోగముల యందిట్లు రేఫయుక్తముగా కానఁబడుచున్నది.)—సం. అ. పుం, న. 1. తూము; 2. నల్లుము. పుం. 1. ఒకానొకకొండ; 2. తుమ్మికూర; 3. తేలు; 4. ఎఱ్ఱతేలు; 5. మాలకాకి.

ద్రోణాము. దే.వి. దోణాముయొక్క రూపాంతరము.

ద్రోణి. సం. వి. ఈ. స్త్రీ. 1. చిన్నయోడ; 2. పసులుమేయు కంచె; 3 కొండపల్లము; 4. దొన్నె; 5. అరిణ; 6. జెలగడుగువానిసాధనము; 7. దేశవిశేషము; 8. నీలి.

ద్రోణుఁడు. సం. వి. అ. పుం. ద్రోణాచార్యుఁడు.

ద్రోవది. వై. వి. ద్రుపదరాజుకూఁతురు, ద్రౌపది.

ద్రోహము. సం. వి. అ. పుం. 1. చేంపనిచ్ఛ; 2. కీడుతలఁపు.

ద్రోహి. సం. విణ. (న్. ఈ. న్.) ద్రోహముగలవాఁడు.

ద్రౌ.

ద్రౌణికము. సం. విణ. (అ. ఈ అ.) నల్లుమువిత్తులువిత్తఁదగినది. (పొలము.)

ద్వ.

ద్వంద్వము. సం. వి. అ. న. 1. స్త్రీపురుషులజెత; 2. ఇద్దఱొకరితో నొకరుచేయు యుద్ధము; 3. రహస్యము; 4. శీతోష్ణాదులు; 5. రెండు.

ద్వయము. సం. వి. అ. న. 1. జెత; 2. రెండు.

ద్వయాతిగుఁడు. సం. వి. అ. పుం. రజస్తమోగుణరహితుఁడు.

ద్వయి. సం. వి. ఈ. స్త్రీ. జెత, దోయి.

ద్వా.

ద్వాదశకము. సం. స. అ. న. పన్రెండు.

ద్వాదశము. సం. విణ. (అ. ఈ. అ.) పన్రెండవది.

ద్వాదశాంగుళము. సం. వి. అ. పుం. జేన, వితస్తి.

ద్వాదశాత్ముఁడు. సం. వి. న్. పుం. సూర్యుఁడు.

ద్వాదశి. సం. వి. ఈ. స్త్రీ. పక్షమునందు పన్రెండవతిథి. విణ. పన్రెండవది.

ద్వాపరము. సం. వి. అ. పుం. 1. ఒకయుగము (చూ. యుగము.) 2. సందేహము.

ద్వారపాలకుఁడు. సం. వి. అ. పుం. వాకిటికావలివాఁడు, పణివారి, గొల్ల.

ద్వారబంధము. సం. వి. అ. పుం. వాకిట నిరుప్రక్కలను క్రిందుమీఁదుల నమర్చిన మ్రానిచట్టము.

ద్వారము. సం. వి. అ. న. 1. వాకిలి; 2. ఉపాయము.

ద్వార్స్థితుఁడు. సం. వి. అ. పుం. ద్వారపాలకుఁడు.

ద్వాఃస్థుఁడు. సం. వి. అ. పుం.—పై.—

ద్వి.

ద్వికము. సం. స. అ. న. రెండు. వి. పుం. 1. కాకి; 2. జెక్కవ.

ద్విగుణాకృతము. సం. విణ. (అ. ఆ. అ.) రెండుచాళ్లు దున్నినది. (పొలము.)

ద్విజ. సం. వి. ఆ. స్త్రీ. 1. బారంగి; 2. రేణుకయను గంధద్రవ్యము. అ. పుం. ము. 1. పక్షి; 2. పల్లు; 3. పాము.

ద్విజన్మము. సం. వి. న్. పుం. 1. పక్షి; 2. పల్లు

ద్విజన్ముఁడు. సం. వి. న్. పుం. 1. బ్రాహ్మణుఁడు; 2. క్షత్రియుఁడు; 3. వైశ్యుఁడు.

ద్విజరాజు. సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు; 2. గరుత్మంతుఁడు; 3. శేషుఁడు.

ద్విజాతి. సం. వి. ఇ. పుం. 1. పక్షి, పాములోనగునది; 2. బ్రాహ్మణుఁడు.

ద్విజిహ్వము. సం. వి. అ. పుం. సర్పము, పాము.

ద్విజిహ్వుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కొండెగాఁడు.

ద్విజుఁడు. సం. వి. అ. పుం. 1. బ్రాహ్మణుఁడు; 2. క్షత్రియుఁడు; 3. వైశ్యుఁడు.

ద్వితయము. సం. స. అ. న. జేత, రెండు.

ద్వితీయ. సం. వి. ఆ. స్త్రీ. 1. భార్య; 2. విదియ. విణ. రెండవది.

ద్వితీయాకృతము. సం. విణ. (అ. ఆ. అ.) రెండు చాళ్లుదున్నినది. (పొలము.)

ద్వితీయుఁడు. సం. వి. అ. పుం. కొడుకు. విణ. రెండవవాఁడు.

ద్విపటి. సం. వి. ఈ. స్త్రీ. 1. దుప్పటము; "ద్విప టీక్వన్నపార్పితా." సం. కాశీ. ౧౩. అధ్యాయము.—2. కప్పుడుదుప్పటి.

ద్విపద. సం. వి. అ. న. పద్యభేదము.

ద్విపము. సం. వి. అ. పుం. ఏనుఁగు, రెంటఁద్రావుడు.

ద్విపాద్యము. సం. వి. అ. పుం. తగినదండుగకంటె ఇనుమడియగుదండుగ.

ద్విభాషి. సం. వి. న్. పుం. రెండుభాషలుతెలిసినవాఁడు, తుపాసి.

ద్విరదము. సం. వి. అ. పుం. ఏనుఁగు, ద్విపము.

ద్విరసనము. సం. వి. అ. పుం. సర్పము, పాము.

ద్విరేఫము. సం. వి. అ. పుం. తుమ్మెద, భ్రమరము.

ద్విషత్తు. సం. వి. త్. పుం. శత్రువు, పగవాఁడు.

ద్విషుఁడు. సం. వి. అ. ష్. పుం.——పై.——

ద్విసీత్యము. సం విణ. (అ. ఆ. అ.) రెండు చాళ్లుదున్నినది. (పొలము.)

ద్విహల్యము. సం. విణ. (అ. ఆ. అ.)——పై.——

ద్విహాయని. సం. వి. ఈ. స్త్రీ. రెండేండ్లప్రాయముగల పెయ్య. (ఇట్లు ద్వివర్ష. ఆ. స్త్రీ.)

ద్వీ.

ద్వీపము. సం. వి. అ. పుం. పులితోలు. పుం, న. దీవి. (సప్తద్వీపములు.—జంబువు, ప్లక్షము, కుశము, క్రౌంచము, శాకము, శాల్మలము, పుష్కరము.)

ద్వీపవతి. సం. వి. ఈ. స్త్రీ. నది, ఏఱు.

ద్వీపి. సం. వి. న్. పుం. 1. పులి; 2. చిఱుతపులి; 3. సముద్రము.

ద్వే.

ద్వేషణుఁడు. సం. వి. అ. పుం. శత్రువు, పగవాఁడు

ద్వేషము. సం. వి. అ. పుం. శత్రుత్వము, పగ.

ద్వేషి. సం. విణ. (న్. ఈ. న్.) ద్వేషముగలవాఁడు.

ద్వేషించు. సం. అ. క్రి. విరోధించు, పగగొను.

ద్వేష్ట. సం. విణ. (ఋ. ఈ. ఋ.) ద్వేషించువాఁడు.



ద్వేష్యుఁడు. సం. వి. అ. పుం. పగవాఁడు. విణ. పగగొనఁదగినవాఁడు.

ద్వై.

ద్వైతము. సం. వి. అ. న. 1. జీవాత్మ పరమాత్మలకు భేదముచెప్పెడి యొక మతము; (చూ. మతము.) 2. ఒకానొక వనము.

ద్వైధము. సం. వి. అ. న. షడ్గుణములలో నొకటి. (చూ. గుణము. ఇది త్రివిధము. బలవంతులగు నిద్దఱు శత్రువుల నడుమనుండెడువాఁడు వారి రువురతో ప్రత్యేకము నీ వాఁడనని చెప్పుట, అందొకనితో సంధిచేసికొనుట, ఒకనితో కలహించుట.)

ద్వైపము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ద్వీపిచర్మముచేత కప్పఁబడినది; (రథము.) 2. ద్వీపిసంబంధమైనది; 3. ద్వీపసంబంధమైనది.

ద్వైమాతురుఁడు. సం. వి. అ. పుం. 1. వినాయకుఁడు; 2. జరాసంధుఁడు.

ద్వ్య.

ద్వ్యష్టము. సం. వి. అ. న. తామ్రము, రాగి.

ధ.

ధ. ఒక యక్షరము.

ధగిడీ. హిం. వి. నీచస్త్రీ.

ధట. సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. ము. కొయ్యత్రాసు.

ధటి. సం. వి. ఈ. స్త్రీ. 1. దట్టి; 2. గోఁచి.

ధటిని. సం. వి. ఈ. స్త్రీ. నూలిమొలత్రాడు.

ధట్ట. సం. వి. ఆ. స్త్రీ. సేన. అ. పుం. ము. సమూహము. "సీ. తురగధట్టఖురలీనధుతఫేనతారకావళిశరత్కాలంబువరుసఁజూప." ఉ, హరి. ౪, ఆ.

ధనంజయము. సం. వి. అ. పుం. 1. ఒక ఉపవాయువు; (చూ. వాయువు.) 2. సర్పవిశేషము; 3. మద్ది?.

ధనంజయుఁడు. సం. వి. అ. పుం. 1. అర్జునుఁడు; 2. అగ్ని.

ధనదుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు. విణ. దాత.

ధనము. సం. వి. అ. న. 1. విత్తము; 2. ఆవులమంద.

ధనహారి. సం. వి. ఈ. స్త్రీ. 1. నల్లకచోరము?; 2. బలురక్కసి?.

ధనాధిపుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు, పయిఁడిఱేఁడు.

ధని. సం. విణ. (న్. ఈ. న్.) ధనముగలవాఁడు.

ధనిక. సం. వి. ఆ. స్త్రీ. 1. మంచి ఆఁడుది; 2. యౌవనముగల ఆఁడుది. అ. పుం. ము. దనియాలు.

ధనికుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. ధనముగలవాఁడు; 2. మంచివాఁడు; 3. అప్పులవాఁడు.

ధనిష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. నక్షత్రవిశేషము. (చూ. నక్షత్రము.)

ధనుఃపటము. సం. వి. అ. పుం. మోరటి†.

ధనుర్ధరుఁడు. సం. విణ. (అ.ఈ.అ.) విలుకాఁడు

ధనువు. సం. వి. ఉ. స్. పుం, న. 1. విల్లు; 2. ఒక రాశి; (చూ. రాశి.) 3. నాలుగుమూరలకొలఁది. (మొదటిరూపము ధనుస్సు.) పుం. మోరటి†. విణ. విలుకాఁడు.

ధనుశ్శ్రేణి. సం. వి. ఈ. స్త్రీ. చాఁగ†.

ధనుష్మంతుఁడు. సం. విణ. (త్.ఈ.త్.) విలుకాఁడు.

ధన్వ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉసిరిక†; 2. దాది. విణ. ధన్యురాలు.

ధన్యుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) పుణ్యవంతుఁడు.

ధన్వంతరము. సం. వి. అ. న. వింటిపట్టు.

ధన్వంతరి. సం. వి. ఇ. పుం. 1. దేవవైద్యుఁడు; 2. సూర్యుఁడు; 3. మహేశ్వరుఁడు.

ధన్వము. సం. వి. న్. న. 1. మెట్టనేల; 2. విల్లు. పుం. నిర్జలభూమి.

ధన్వయాసము. సం. వి. అ. పుం. తీఁటకసింద†.

ధన్వి. సం. వి. న్. పుం. 1. ఏఱుమద్ది†; 2. అర్జునుఁడు. విణ. 1. విలుకాఁడు; 2. నేర్పరి.

ధమనము. సం. వి. అ. పుం. కిక్కసకసవు.

ధమని. సం. వి. ఈ. స్త్రీ. 1. నరము; 2. నఖమను గంధద్రవ్యము; 3. మెడ; 4. అగసాలెవాని గొట్టము; 5. సువ్వకుత్తిక†.

ధమనుఁడు. సం. వి. అ. పుం. అగ్ని. విణ. 1. కొలిమితిత్తి నూఁదువాఁడు; 2. క్రూరుఁడు.

ధమ్మిల్లము. సం. వి. అ. పుం. కొప్పు.

ధర. సం. వి. ఆ. స్త్రీ. 1. నేల; 2. మావి; 3. మెదడు. అ. పుం. ము. 1. కొండ; 2. తాఁబేటిఱేఁడు; 3. పత్తి; 4. వెల.

ధరణము. సం. వి. అ. న. 1. ధరించుట; 2. మానవిశేషము.

ధరణి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. భూమి, నేల.

ధరణీధరము. సం. వి. అ. పుం. కొండ, నేలతాల్పు.

ధరణీధరుఁడు. సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. శేషుఁడు; 3. రాజు.

ధరణీశ్వరుఁడు. సం. వి. అ. పుం. 1. రాజు; 2. శివుఁడు.

ధరాధరము. సం. వి. అ. పుం. 1. కొండ; 2. తాఁబేలు.

ధరామరుఁడు. సం. వి. అ. పుం. బ్రాహ్మణుఁడు, నేలవేల్పు.

ధరావత్తు. హిం. వి. నిలువయుంచుసొమ్ము.

ధరించు. సం. స. క్రి. తాల్చు.

ధరిత్రి. సం. వి. ఈ. స్త్రీ. భూమి, నేల.

ధర్త. సం. విణ. (ఋ. ఈ. ఋ.) ధరించువాఁడు.

ధర్తవ్యము. సం. విణ. (అ.ఆ.అ.) ధరింపఁదగినది.

ధర్మజ్ఞుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ధర్మముతెలిసినవాఁడు.

ధర్మధ్వజి. సం. వి. న్. పుం. జీవనార్థములింగజటాభస్మాదులనుధరించినవాఁడు, తాఁటదమ్మఁడు.

ధర్మము. సం. వి. అ. పుం, న. 1. పుణ్యము; (రూ. ధర్మువు.) 2. న్యాయము; 3. సామ్యము; 4. స్వభావము; 5. ఆచారము; 6. అహింస; 7. వేదోక్తవిధి; 8. ఉపనిషత్తు; 9. యజ్ఞము. పుం. విల్లు.

ధర్మరాజు. సం. వి. అ. పుం. 1. యుధిష్ఠిరుఁడు; 2. యముఁడు; 3. బుద్ధదేవుఁడు.

ధర్మసంహిత. సం. వి. ఆ. స్త్రీ. మన్వాదిధర్మశాస్త్రము. స్మృతి.

ధర్మాత్ముఁడు. సం. విణ. (న్.) పుణ్యాత్ముఁడు.

ధర్మాధికరణము. సం. వి. అ. న. న్యాయవిచారణస్థలము.

ధర్మాధికృతుఁడు. సం. వి. అ. పుం. న్యాయము విచారించువాఁడు.

ధర్మాసనము. సం. వి. అ. న. ధర్మాధికారికూర్చుండుపీఠము.

ధర్మి. సం. విణ (న్. ఈ. న్.) ధర్మముగలది.

ధర్ముఁడు. సం. వి. అ. పుం. 1. యముఁడు; 2. సోమయాజి; 3. ఒక పసువు. (చూ. పసువు.)

ధర్మ్యము. సం. విణ. (అ.ఆ.అ.) ధర్మమువలనతొలఁగనిది.

ధర్షణము. సం. వి. అ.న. 1. తిరస్కరించుట; 2. ధర్షించుట.

ధర్షణి. సం. వి. ఈ. స్త్రీ. అంకుటాలు, పుంశ్చలి.

ధర్షించు. సం. స. క్రి. 1. తిరస్కరించు; 2. ధర్షణము చేయు.

ధవము. సం. వి. అ. పుం. 1. ఉమ్మెత్త?; 2. చేంద్ర?.

ధవళ. సం. వి. ఆ. స్త్రీ. ఆవు. అ. పుం. ము. 1. తెలుపు; 2. ఆఁబోతు. విశే. 1. తెల్లనిది; 2. చక్కనిది.

ధవళములు. వై. గ్రా. వి. బ. ఒకదినుసుపాట. "క. ఎడతెరులగనమనుచుణ్, బడిబడిఁబలుపాంగనపుడుబలువాయిదముల్, గడలుకొనంగానచ్చర, పడఁతులధవళములఁబెండ్లిపాటలఁజెలఁగెణ్." య. ౪, ఆ.

ధవళిమ. సం. వి. న్. పుం. తెలుపు. (రూ. ధవళిమము.)

ధవిత్రము. సం. వి. అ. న. యాగమునందు అగ్నిని ప్రజ్వలింపఁజేయుటకు కృష్ణాజినముతో చేయఁబడిన విసనకఱ్ఱ. యాగమునందు ఉష్ణపదార్థమందుఁగలయుష్ణత్వమునుచల్లార్చుటకొఱకు కృష్ణాజినముతో చేయఁబడినవిసనకఱ్ఱ. (అ. కొందఱు.)

ధవుఁడు. సం. వి. అ. పుం. 1. పెనిమిటి; 2. రాజు; 3. మనుష్యుఁడు.

## ధా.

ధాటి. సం. వి. ఈ. స్త్రీ. దండయాత్ర, దాడి.

ధాత. సం. వి. ఋ. పుం. 1. బ్రహ్మ; 2. ఒక ఆదిత్యుఁడు; (చూ. ఆదిత్యుఁడు.) 3. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) విశే. 1. ధరించువాఁడు; 2. రక్షించువాఁడు.

ధాతకి. సం. వి. ఈ. స్త్రీ. ఆరె?.

ధాతుపుష్పిక. సం. వి. ఆ. స్త్రీ.—పై.—

ధాతువు. సం. వి. ఉ. పుం. 1. వాతములోనగునది; (వాతము, పిత్తము, శ్లేష్మము అను ఇవి మూడు.) 2. వసలోనగునది; (వస, అసృక్కు, మాంసము, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్లము అని ఇవి యేడు. పక్షాంతరమున రోమత్వఙ్మాంసాస్థిస్నాయుమజ్జాప్రాణములు.) 3. మణిశిలలోనగు శిలావికారము; 4. గైరికధాతువు; 5. పృథివిలోనగునది; (చూ. భూతము.) 6. శబ్దములోనగునది; (చూ. గుణము.) 7. త్వక్కులోనగునది; (చూ. ఇంద్రియము.) 8. భూధాతువులోనగునది.

ధాత్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. నేల; 2. దాది; 3. తల్లి; 4. ఉసిరిక?. విశే. 1. ధరించునది; 2. ధరింపఁజేయునది.

ధాత్రేయి. సం. వి. ఈ. స్త్రీ. 1. దూతికావిశేషము; 2. భూమి. "క. పోయెడుఁబో నిప్పుడు ధాత్రేయికి." సై. ౭, ఆ.

ధాన. సం. వి. ఆ. స్త్రీ. 1. దనియాలు; 2. మొగ్గ; 3. బ. బొరుగులు. (ఈయర్థమున నామలింగానుశాసనేతర నిఘంటువులయందు ఇది నిత్యబహువచనాంతముగా పఠింపఁబడలేదు.)

ధానుష్కుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) విలుకాఁడు.

ధాన్యము. సం. వి. అ. న. 1. కొలుచు; (నవధాన్యములు.— గోదుమలు, యవలు, పెసలు, సెనగలు, కందులు, బొబ్బరలు, నువ్వులు, మినుములు, ఉలవలు.) 2. దనియాలు.

ధాన్యాకము. సం. వి. అ. న. దనియాలు.

ధాన్యామ్లము. సం. వి. అ. న. పులియఁబెట్టిన కడుగునీరు, కలి.

ధామనిధి. సం. వి. ఇ. పుం. సూర్యుఁడు.

ధామము. సం. వి. న్. న. 1. ఇల్లు; 2. చోటు; 3. వెలుఁగు; 4. కాంతి; 5. ప్రభావము; 6. మేను; 7. పుట్టువు.

ధామార్గవము. సం. వి. అ. పుం. 1. ఆవడ?; 2. ఉత్తరేను?.

ధాయ్య. సం. వి. ఆ. స్త్రీ. యాగమునందు అగ్నిని ప్రజ్వలింపఁజేయునపుడు పఠించెడు ఋక్కు.

ధార. సం. వి. ఆ. స్త్రీ. 1. పైనుండిపడు నీరులోనగువానిచాలు; 2. వానకాలు; 3. కత్తిలోనగువాని వాదర; 4. కుండలోనగువాని చిల్లి; 5. దండు ముందటిభాగము; 6. అశ్వగతి; (ఇవి అయిదు.— ఆస్కందితము, ధౌరితకము, రేచితము, వల్గితము, ప్లుతము.) 7. ప్రవాహము; 8. పరంపర; 9. ఒకానొక పట్టణము. అ. పుం. ము. 1. అప్పు; 2. పర్వతవిశేషము.

ధారణ. సం. వి. ఆ. స్త్రీ. 1. భగవంతునిఁదప్ప మఱియొకటి నెఱుఁగమి; (ఇది యోగాంగములలో నొకటి. చూ. అంగము.) 2. మేర. అ. న. ము. ధరించుట.

ధారణి. సం. వి. ఈ. స్త్రీ. భూమి. (ధరణియొక్క రూపాంతరమనియెదరు.)

ధారపోయు. మి. స. క్రి. చేత నీళ్లుపోసికొని దత్తము చేయు.

ధారాకదంబము. సం. వి. అ. పుం. నీరుకడిమి?.

ధారాటము. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము; 2. వానకోయిల.

ధారాధరము. సం. వి. అ. పుం. 1. మేఘము; 2. ఖడ్గము.

ధారాళము. సం. విణ. (అ. ఆ. అ.) అడ్డపాటులేనిది.

ధారిక. సం. వి. ఆ. స్త్రీ. 1. చెవిచోరుపాము; 2. జెఱ్ఱి.

ధార్తరాష్ట్రము. సం. వి. అ. పుం. నల్లనిముక్కు కాళ్లుగల హంస.

ధార్తరాష్ట్రుఁడు. సం. వి. అ. పుం. 1. ధృతరాష్ట్రుని కొడుకు; 2. సర్పవిశేషము.

ధార్మపత్తనము. సం. వి. అ. న. మిరియము.

ధార్మికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) 1. పుణ్యాత్ముఁడు; 2. ధానుష్కుఁడు.

ధార్య. సం. వి. ఆ. స్త్రీ. 1. (చూ.) ధాయ్య; 2. కోరిందకీ. విణ. ధరింపఁదగినది.

ధార్ష్ట్యము. సం. వి. అ. న. దిట్టతనము.

ధావనము. సం. వి. అ. న. 1. పరుగు; 2. శుద్ధి.

ధావని. సం. వి. ఈ. స్త్రీ. నక్కతోఁకపొన్నకీ.

ధావళ్యము. సం. వి. అ. న. ధవళిమము, తెలుపు.

## ధి.

ధిక్కారము. సం. వి. అ. పుం. తిరస్కారము.

ధిక్కృతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తిరస్కరింపఁబడినవాఁడు. వెలివేయఁబడినవాఁడు. (అని కొందఱు.)

ధిక్క్రియ. సం. వి. ఆ. స్త్రీ. ధిక్కారము.

ధిషణ. సం. వి. ఆ. స్త్రీ. బుద్ధి, మనీష.

ధిషణుఁడు. సం. వి. అ. పుం. బృహస్పతి.

ధిష్ణ్యము. సం. వి. అ. న. 1. గృహము; 2. స్థానము; 3. బలము; 4. నక్షత్రము.

## ధీ.

ధీ. సం. వి. ఈ. స్త్రీ. బుద్ధి, మతి.

ధీంద్రియము. సం. వి. అ. న. జ్ఞానేంద్రియము. (చూ. ఇంద్రియము.)

ధీమంతుఁడు. సం. వి. త్. పుం. 1. విద్వాంసుఁడు; 2. బృహస్పతి. విణ. బుద్ధిగలవాఁడు.

ధీర. సం. వి. ఆ. స్త్రీ. వ్యంగ్యముగా కోపప్రకాశము చేయు నాయిక. (మధ్య (లేక) ప్రగల్భ.) అ. వ. ము. కుంకుమపువ్వు.

ధీరలలితుఁడు. సం. వి. అ. పుం. సాధారణచతుర్విధనాయకులలో నొకఁడు. (చూ. నాయకుఁడు.)

ధీరశాంతుఁడు. సం. వి. అ. పుం. —పై.—

ధీరాధీర. సం. వి. ఆ. స్త్రీ. వ్యంగ్యావ్యంగ్యముగా కోపప్రకాశము చేయు నాయిక. (మధ్య (లేక) ప్రగల్భ.)

ధీరుఁడు. సం. వి. అ. పుం. విద్వాంసుఁడు. విణ. 1. ధైర్యముగలవాఁడు; 2. స్వాతంత్ర్యముగలవాఁడు.

ధీరోదాత్తుఁడు. సం. వి. అ. పుం. సాధారణచతుర్విధనాయకులలో నొకఁడు. (చూ. నాయకుఁడు.)

ధీరోద్ధతుఁడు. సం. వి. అ. పుం. —పై.—

ధీవరుఁడు. సం. వి. అ. పుం. జాలరి, కైవర్తుఁడు.

ధీసచివుఁడు. సం. వి. అ. పుం. కార్యాలోచనయోగ్యుఁడగు మంత్రి.

## ధు.

ధుంధుమారము. సం. వి. అ. పుం. 1. కఱదూపము; 2. పట్టుపురుగు.

ధుతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కదలింపఁబడినది, 2. విడువఁబడినది.

ధుత్తూరము. సం. వి. అ. పుం. ఉమ్మెత్తకీ, (చూ. ధుస్తూరము.)

ధుని. సం. వి. ఈ. స్త్రీ. నది, ఏఱు.

ధుర. సం. వి. ఆ. స్త్రీ. బరువు, భారము.

ధురంధరము. సం. వి. అ. పుం. బరువుమోసెడియెద్దు. విణ. బరువుమోయునది.

ధురంధరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) భారము వహించువాఁడు.

ధురీణము. సం. వి. అ. పుం. బరువుమోసెడియెద్దు. విణ. బరువుమోయునది.

ధురీణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) భారమువహించువాఁడు.

ధుర్యము. సం. వి. అ. పుం. బరువుమోసెడియెద్దు. విణ. బరువుమోయునది.

ధుర్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) భారమువహించువాఁడు.

## ధూ.

ధూంక్ష్మము. సం. వి. న్. పుం. తెల్లకాకి.

ధూతము. సం. విణ. (అ. ఆ. అ.) ధుతముయొక్క రూపాంతరము.

ధూననము. సం. వి. అ. న. కదలించుట.

ధూపము. సం. వి. అ. పుం. (చూ.) దూపము.

ధూపాయితము. సం. విణ. (అ. ఆ. అ.) తపింపఁజేయఁబడినది, సంతప్తము.

ధూపితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ధూపము వేయఁబడినది; 2. తపింపఁజేయఁబడినది.

ధూమకేతువు. సం. వి. ఉ. పుం. 1. ఉత్పాతము; 2. అగ్ని.

ధూమధ్వజుఁడు. సం. వి. అ. పుం. అగ్ని.

ధూమము. సం. వి. అ. పుం. పొగ.

ధూమయోని. సం. వి. ఇ. పుం. మేఘము, మబ్బు.

ధూమలము. సం. వి. అ. పుం. నలుపుమించెఁగలసిన యెఱుపు. విణ. నలుపుమించెఁగలసిన యెఱుపుగలది.

ధూమిక. సం. వి. ఆ. స్త్రీ. మూడమంచు.

ధూము. హిం. వి. కలత, జాడ్యము.

ధూమ్యా. సం. వి. ఆ. స్త్రీ. ధూమముల సమూహము.

ధూమ్యాటము. సం. వి. అ. పుం. పక్షివిశేషము, కూఁకటిమూఁగ.

ధూమ్రపత్రిక. సం. వి. ఆ. స్త్రీ. పొగచెట్టు.

ధూమ్రము. సం. వి. అ. పుం. నలుపుమించెఁగలసిన యెఱుపు. విణ. నలుపుమించెఁగలసిన యెఱుపుగలది.

ధూర్జటి. సం. వి. ఇ. పుం. శివుఁడు, ముక్కంటి.

ధూర్తము. సం. వి. అ. న. ఒకదినుసు ఉప్పు. పుం. ఉమ్మెత్త?.

ధూర్తుఁడు. సం. వి. అ. పుం. జూదరి. విణ. మోసకాఁడు. (రూ. ధూర్తు.)

ధూర్వహము. సం. వి. అ. పుం. బరువుమోసెడియెద్దు. విణ. బరువుమోయునది.

ధూర్వహుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) భారము వహించువాఁడు.

ధూళి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. దుమ్ము, పరాగము.

ధూళికదంబము. సం. వి. అ. పుం. బట్టకడిమి?.

ధూళిధ్వజుఁడు. సం. వి. అ. పుం. వాయువు, గాలి.

ధూసరము. సం. వి. అ. పుం. 1. బూడిదవర్ణము; 2. గాడిద. విణ. బూడిదవర్ణముగలది.

## ధృ.

ధృతము. సం. విణ. (అ. ఆ. అ.) ధరింపఁబడినది.

ధృతరాష్ట్రుఁడు. సం. వి. అ. పుం. 1. దుర్యోధనుని తండ్రి; 2. సర్పవిశేషము; 3. రాజు.

ధృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ధరించుట; 2. ధైర్యము; 3. సంతోషము; 4. సౌఖ్యము; 5. ఒక గ్రహయోగము; (చూ. యోగము.) 6. ఒక ఛందస్సు. (చూ. ఛందస్సు.) పుం. యజ్ఞము.

ధృవ. సం. వి. ఆ. స్త్రీ. ముయ్యాకుపొన్న?

ధృష్టుఁడు. సం. వి. అ. పుం. చతుర్విధశృంగారనాయకులలో నొకఁడు. (చూ. నాయకుఁడు.) విణ. దిట్టతనముగలవాఁడు.

ధృష్ణువు. సం. విణ. (ఉ.) దిట్టతనముగలవాఁడు.

## ధే.

ధే. దే. వి. గుఱ్ఱమునతోలుటయందగుధ్వన్యనుకరణము. "హయమునడల్చి ధేయనుచు వాజికిఁదోలుటయొండుదోఁచె." కళా. ౧, అ.

ధేనుక. సం. వి. ఆ. స్త్రీ. 1. లేఁగటియావు; 2. ఆఁడేనుఁగు; 3. ఆఁడుగుఱ్ఱము; 4. చిన్నకత్తి; 5. పార్వతి. అ. పుం. ము. చీరపేను. డు. ఒకానొక రాక్షసుఁడు.

ధేనువు. సం. వి. ఉ. స్త్రీ. లేఁగటియావు, ధేనుక.

ధేనుష్య. సం. వి. ఆ. స్త్రీ. బందెపడ్డయావు. కుదువపెట్టినయావు. (అని కొందఱు.) బందెపడ్డయేనుము. (అని కొందఱు.) కుదువపెట్టినయేనుము. (అని కొందఱు.)

## ధై.

ధైనుకము. సం. వి. అ. న. ధేనుకలసమూహము.

ధైర్యము. సం. వి. అ. న. ధీరత్వము, దీమసము.

ధైవతము. సం. వి. అ. పుం. సప్తస్వరములలో నొకటి. (చూ. స్వరము.)

## ధో.

ధోరణము. సం. వి. అ. న. ఎక్కఁదగిన యేనుఁగులో నగునది, వాహనము.

ధోరణి. సం. వి. ఇ. స్త్రీ. 1. పద్ధతి; 2. పఙ్క్తి.

## ధౌ.

ధౌతము. సం. విణ. (అ.ఆ.అ.) కడుగఁబడినది.

ధౌరంధర్యము. సం. వి. అ. న. ధురంధరత్వము.

ధారితకము. సం. వి. అ. న. ఆస్కందితమునకంటె నధికమై చతురమైన యొక యశ్వధార, (చూ. ధార.) జోడన, (రూ. ధోరితకము.)

ధారేయము. సం వి. అ. పుం. బరువుమోసెడి యెద్దు. విణ. బరువు మోయునది.

ధారేయుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) భారము వహించువాఁడు.

ధార్త్యము. సం. వి. అ. న. ధూర్తత్వము.

## ధ్యా.

ధ్యాత. సం. విణ. (ఋ. ఈ. ఋ.) ధ్యానించువాఁడు.

ధ్యాతము. సం. విణ. (అ.ఆ.అ.) ధ్యానింపఁబడినది.

ధ్యాతవ్యము. సం. విణ. (అ. ఆ. అ.) ధ్యానింపఁదగినది.

ధ్యానము. సం. వి. అ. న. చాంచల్యములేక భగవంతుని మనసునతలఁచుట. (ఇది యోగాంగములలో నొకటి. చూ. అంగము.)

ధ్యానించు. సం. స. క్రి. ధ్యానము చేయు.

ధ్యామము. సం. వి. అ. న. 1. కామంచిగడ్డి; 2. దవనము. విణ. నల్లనిది.

ధ్యాయము. సం. వి. అ. న. కామంచిగడ్డి.

## ధ్యే.

ధ్యేయము. సం. విణ. (అ. ఆ. అ.) ధ్యాతవ్యము.

## ధ్రు.

ధ్రువ. సం. వి. ఆ. స్త్రీ. 1. గీతివిశేషము; 2. స్రుగ్భేదము; 3. గుఱ్ఱపుసుడి; 4. గుఱ్ఱపుసుడి యుండుచోటు; 5. చేఁగ; 6. ముయ్యాకుపొన్న. అ. న. ము. 1. ఊహ; 2. నిశ్చయము. పుం 1. మఱ్ఱి, 2. మ్రోఁడు; 3. గనిక; 4. గ్రహయోగవిశేషము; (చూ. యోగము.) 5. తాళవిశేషము. (పదునాలుగు అక్షరముల కాలముగలది.) విణ. 1. ఎడతెగనిది; 2. కదలనిది; 3. నిలుకడగలది.

ధ్రువుఁడు. సం. వి. అ. పుం. 1. నక్షత్రవిశేషము; 2. ఒక వసువు; (చూ. వసువు.) 3. విష్ణువు; 4. శివుఁడు.

## ధ్వ.

ధ్వంసము. సం. వి. అ. పుం. నాశము.

ధ్వంసితము. సం. విణ. (అ.ఆ.అ.) ధ్వంసము చేయఁబడినది.

ధ్వజము. సం. వి. అ. పుం, న. 1. టెక్కెము; 2. టెక్కెపు కంబము; 3. గుఱుతు; 4. మగగుఱి; 5. గర్వము. పుం. డు. కల్లమ్మెడువాఁడు.

ధ్వజిని. సం. వి. ఈ. స్త్రీ. 1. సేన; 2. సీమాభేదము.

ధ్వని. సం. వి. ఇ. పుం. 1. శబ్దము; 2. వ్యంగ్యప్రధానశబ్దము.

ధ్వనించు. సం. అ. క్రి. శబ్దించు, మ్రోయు.

ధ్వనితము. సం. విణ. (అ.ఆ.అ.) మ్రోయునది.

ధ్వస్తము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నశించినది; 2. జారినది.

## ధ్వా.

ధ్వాంక్షము. సం. వి. అ. పుం. 1. కాకి; 2. కొక్కెర.

ధ్వాంతము. సం. వి. అ. న. అంధకారము, చీఁకటి.

ధ్వానము. సం. వి. అ. పుం. ధ్వని, మ్రోఁత.

## న.

న. ఒక యక్షరము. దే. అవ. సప్తమ్యేకవచనమునందువచ్చెడి యొకానొక ప్రత్యయము. (వనమున. మనమున. మొ.)

నంకు. దే. స. క్రి. నేలనుకోరాడు.

నంగ. దే. విణ. నంగనాచి.

నంగనాచి. దే. వి. పచ్చచిలుక. విణ. దిట్టతనముకలిగియు బయటికి ఏమియు తెలియనిదానివలె నుండునది. స్వా. 3, ఆ. (నంగనాచి నంగిముల్లు అని సామ్యము.)

నంగి. దే. విణ. ముక్కుతో మాటాడఁబడునది, (మాట.) తుంబకము.

నంగు. దే. అ. క్రి. ముక్కుతో మాటాడు.

నంజ. అర. వి. మాగాని.

నంజె. దే. వి. నంజుకొనువస్తువు, ఉపదంశము. పా. 2, ఆ.

నంజు. దే. స. క్రి. (కూరలోనగు వ్యంజనములను) తిను. "సీ. దేవపిత్రతిథిపూజావిధులందిడిమటినంజు పురుషుఁడమాంసభోజి." భార, శాం. 6, ఆ.— వి. 1. విషము; "నాలుకబంతిఁ వ్రేలఁబడినంజునందోఁగి." స్వా. 4, ఆ.—2. నెత్తురుచచ్చి తెల్లపాఱుట. (వానికి జ్వరమువచ్చి నంజు కనిపించినది.)

నంజుడు. దే. వి. మాంసము, ఎఱచి.

నంజుడుదిండి. దే. వి. (నంజుడు+తిండి.) రాక్షసుఁడు. "క. కడయొడయలఁదటిమెడునం, జుడుదిండులు మిమ్మునుపఁ జూతురెపోరన్, నుడి

మ్రింగెడువానికిలో, నచరికు వేల్పుట్రవడియ మగుఁగడతలఁపక." అచ్చ. సుం, కాం.—విశే. మాంసముతినువాఁడు.

నంజేపాలు. దే. అ. క్రి. (నంజే+పాలు.) నెత్తురు చచ్చి తెల్లపాలు.

నంటు. దే. వి స్నేహము. "ఎ, గీ. తొలుదొలుతఁ గృష్ణవర్తకుఁగళరయొసంగి, నంటుగావించు కెల్లనాథయువతి, జనతనూదాహసాహాయ్యమునకుఁగాక, కానవావారికెవ్వారిఁగమలవైరి." ఐసు. ౪. ఆ.—విశే. స్నేహితుఁడు. "తెలిక్కీర్తిచేనంటుఁ గలువకన్నియనంటు." శశాం. ౧. ఆ.

నంటుకత్తె. స్వా. విశే. స్నేహితురాలు. (స్వార్థమునఁ కత్తె.)

నంటుకాఁడు. దే. విశే. స్నేహితుఁడు. (స్వార్థమునఁ కాఁడు.)

నంది. సం. వి. ఆ. స్త్రీ. 1. తిథివిశేషము; (చూ. తిథి.) 2. ముంత; 3. కలిమి.అ. పుం. డు. ఒకగోపకుఁడు.

నందకము. సం. వి. అ. పుం. విష్ణుఖడ్గము. విశే. సంతోషించునది.

నందన. సం. వి. ఆ. స్త్రీ. కూఁతురు. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) న. ము. 1. ఇంద్రుని యుద్యానవనము; 2. ఉద్యానవనము.

నందనుఁడు. సం. వి. అ. పుం. కొడుకు. విశే. సంతోషించువాఁడు.

నంది. సం. వి. ఇ. న్. పుం. 1. శివుని వృషభము; 2. వృషభము. న్. పుం. 1. కలజువ్వి?; 2. మఱ్ఱి?.

నందిముఖి. సం. వి. న్. పుం. నక్కతోఁకబియ్యము.

నందివర్ధనము. ఉభ. వై. గ్రా. వి. ఒకానొక పూఁచెట్టు. "సీ. బొండుమల్లెలశోకములుమంకెనలు నందివర్ధనంబులువిరవాదివిరులు." ఉ, రా.3, ఆ.—సం. అ. పుం. అమావాస్య (లేక) పున్నమ.

నందివృక్షము. సం. వి. అ. పుం. వృక్షవిశేషము.

నంద్యావర్తము. సం. వి. అ. పుం. 1. పడమటఁదక్కఁ దక్కిన మూడుదిక్కుల వాకిళ్లుగల రాజగృహము; 2. నందివర్ధనము?.

నంబరు. ఆం. వి. సంఖ్య, వ్యాజ్యము.

నంబి. దే. వి. విష్ణుపూజకుఁడు.

నంబెరుమాళ్లు. అర. దే. వి. బ. (నమ్+పెరుమాళ్లు.) శ్రీరంగనాయకులు.

నకనకఁబడు. ద్వ. అ. క్రి. (నకనక+పడు.) వాడు, కృశించు. "కడుపు మహాక్షుధకొనకనకంబడ." ఆము. ౬. ఆ.

నకనకలాడు దే. అ. క్రి. (నకనకలు+ఆడు.) నకనకఁబడు. (వీనికడుపు నకనకలాడుచున్నది.)

నకనకలు. దే. వి. బ. కార్శ్యము. "వ. కమ్మపంజాల నజ్రంపుంజకచకల నకనకల పీడుకొని." స్వా. 3. ఆ.

నకనకలుగుడుచు. దే. అ. క్రి. (నకనకలు+కుడుచు.) నకనకఁబడు. (రూ. నకనకల్గుడుచు. "సీ. గతి సంభ్రమంబునఁ గరముబెడంగుచు నకనకల్గుడుచు మనెన్నడిమిసొబగు." కళా. ౪, ఆ.)

నకలు. హిం. వి. ఒకదానిచూచి వ్రాసినది.

నకాష్, నకాసి. హిం. వి. రంగుపనిచేయువాఁడు.

నకిషీ. హిం. వి. అలంకారపుపని.

నకీబు దే. వి. వెండిబెత్తమువాఁడు, వేత్రధరుఁడు. "చాఁగుబళియంచు నకీబులు మ్రోయ." స్వా. ౫, ఆ.

నకులము. సం. వి. అ. పుం. ముంగిస. డు. యుధిష్ఠిరుని తమ్ముఁడు.

నకులేష్ట. సం. వి. ఆ. స్త్రీ. సర్పాక్షి?.

నక్క. వై. వి. జంబుకము*. (దీని భేదములు నలుడు, గుంటనక్క.) విశే. క్షుద్రము*. (చూ. నక్కదోస. మొ.)

నక్కతోఁకసవు. ద్వ. వి. సింహపుచ్ఛి?. (దీనిని కొందఱు నక్కతోఁకపొన్న అందురు.)

నక్కతోఁకపొన్న. ద్వ. వి. క్రోష్టువిన్న?. (దీనిని కొందఱు నక్కతోకసవు అందురు.)

నక్కతోఁకబియ్యము. ద్వ. వి. ధాన్యవిశేషము.

నక్కదోస. ద్వ. వి. చిర్భటము?.

నక్కనరము. ద్వ. వి. ఒకజనుసు వేలు.

నక్కనేరడు. ద్వ. వి. కాకినేరేడు?.

నక్కవింగి. ద్వ. వి. క్షుద్రశ్లేష్మాతకము?.

నక్కి. హిం. వి. మోటుశేరీ.

నక్కిళ్లు. ద్వ. వి. బ. (నక్కు+కీళ్లు.) పక్కపండ్లకీళ్లు.

నక్కు. దే. అ. క్రి. ఒదుఁగు. "ఉ. వాలితనంబుచేర్చుకొనినక్కుచునక్కుచువాడవాడకే, లాలవలీలతావలికెలంకులనుండిటువచ్చివచ్చిదం, భోళియుఁబోలెమీఁదఁ బడిపోయెదుఁబల్లఱుఁ బిల్చితెల్పకే,తాళుకొనంగ నీయనుఁగుతండ్రికి ధన్య

విచారమూరుతీ." రామా. 2, ఆ.—వి. 1. మ్రూని యతుకు; (ఇది నక్షుదూలము.) 2. బంగారపుబిల్ల; "గీ. నక్కుచెక్కుఁజెక్కునాతుక చెక్కులు." చంద్ర.—3. బంగారు నలుకఁగా నకుమఁగనుపట్టెడు నిగ్గు; 4. నాఁగటికఱ్ఱు.

నక్కెర. దే. వి. కంది, తొగరి.

నక్కేలు. ద్వ. వి. (నక్క+ఏలు.) ఒకానొకచెట్టు.

నక్తంచరము. సం. వి. అ. పుం. గుడ్లగూబ.

నక్తంచరుఁడు.సం.వి.అ.పుం. రాక్షసుఁడు, రేద్రిమ్మరి.

నక్తకము. సం. వి. అ. పుం. 1. చినిఁగినవస్త్రము; 2. మాసినవస్త్రము; 3. వస్త్రము; 4. నల్లగూబ.

నక్తమాలము. సం. వి. అ. పుం. కానుగు? (చూ. నక్తమారము.)

నక్తము. సం. వి. అ. న. రాత్రి. "గీ. సోమవారవ్రతంబతిశుభదమగుచు, నెనరునుపవాసయుక్తుఁడౌననఘమతికి, నక్తమునసేకభుక్తియొనర్చెనేని, శివుఁడుసుప్రీతుఁడగు నిజం బవనినాథ." శేష. ౨, ఆ.

నక్రము. సం. వి. అ. న. 1. అడ్డకమ్మి; 2. త్రొక్కుడుగమ్మి. పుం. మొసలి.

నక్షత్రమాల. సం. వి. ఆ. స్త్రీ. ఇరువదియేడుముత్యములుగ్రుచ్చినయొంటిపేటహారము.

నక్షత్రము. సం. వి. అ. న. అశ్వినిమొదలగు రిక్క. (ఇవి యిరువదియేడు.—అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి అని. అభిజిత్తు అని ఇరువదియెనిమిదవ నక్షత్రము ఒకటి కలదందురు.)

నక్షత్రేశుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు, రిక్కరాయఁడు.

నఖము. సం. వి. అ. పుం, న. గోరు. పుం. గంధద్రవ్యవిశేషము.

నఖముఖాలు. సం. క్రి. వి. అన్నిదిక్కులు.

నఖరము. సం. వి. అ. పుం, న. నఖము, గోరు. (దీనికి ఆయుధవిశేషమును అర్థమగుచున్నది.

నఖరాయుధము. సం. వి. అ. పుం. కోడి.

నఖోత్పాటని. సం. వి. ఈ. స్త్రీ. (చూ.) గోరుగల్లు.

నగ. దే. వి. 1. భూషణము; 2. లోహపాత్రము; 3. పొగాకు మూడింటిలోనగువాని కంట్లపుమాట; 4. సిద్దెలజోడు.

నగదు. హిం. వి. నాణెరూపమైన సొమ్ము.

నగధరుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు, గట్టుతాలుపు.

నగము. సం. వి. అ. పుం. 1. కొండ; 2. చెట్టు.

నగరము. సం. వి. అ. న. పట్టణము, పురము.

నగరి. సం. వి. ఈ. స్త్రీ. పట్టణము, పురము.

నగరు. దే. వి. 1. రాజగృహము; "వలలుఁడనంగనీ నగరవంటలవాఁడయినిల్చి." భార. విరా. ౫. ఆ. (చూ. దొరకొను.)—2. దేవగృహము. (చూ. చేఅచుకడకొట్టు అనునర్థము నుదాహరణము.)

నగవరి. దే. విశే. (నగవు+అరి.) నవ్వుగలవాఁడు.

నగవు. దే. వి. నవ్వు, హాసము.

నగవైరి. సం. వి. న్. పుం. ఇంద్రుఁడు, గట్టుగొంగ.

నగాధిపుఁడు. సం. వి. అ. పుం. హిమవంతుఁడు, గట్టులఱేఁడు.

నగారా. హిం. వి. పెద్దఢంకా.

నగాసు. హిం. వి. చిత్రము.

నగు. దే. అ. క్రి. 1. హసించు; 2. అపహసించు. "వ. ఆయాయుర్వేదవిద్యయెనిమిది నెలలభ్యసించిహర్షించి యతనిముందటికరిగియాందందనగుచున్న." మార్క. ౫, ఆ. —వి. హాసము. "క. నగునగువెన్నెలనిగనిగ." అచ్చ. బాల. కాం.

నగుఁబాటు. ద్వ. వి. (నగు+పాటు.) అపహాసము. "వ. నీవులోకంబుచేతనగుఁబాటు పొందఁగలవాఁడవనికర్ణుండుసెప్పిన." సం. "రాజ్ఞాంహాస్యోభవిష్యసి." భార. అర. ౨, ఆ.

నగౌకసము. సం. వి. స్. పుం. 1. పక్షి; 2. సింహము; 3. శరభము.

నగ్గు. దే. వి. నగ్గు. "సీ. రథ్యసారథికేతురథికాంగనిర్దళనప్రౌఢిఁదేరులునగ్గుచేసి." మార్క. ౮, ఆ. (దీనికి ప్రయోగాంతరము కనఁబడలేదు.)

నగ్నహువు. సం. వి. ఉ. ఊ. పుం. నానాద్రవ్యములచేత చేయఁబడిన సురాబీజము, కిణ్వము.

నగ్నిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కన్యక; 2. దిసమొలయాఁడుది.

నగ్నుఁడు. సం. వి. అ. పుం. 1. బుద్ధదేవుఁడు; 2. బట్టువాఁడు. విశే. దిసమొలవాఁడు.

నచ్చిక. దే. వి. నమ్మిక. (చూ. నచ్చు.)

నచ్చిగ. దే. వి. నచ్చికయొక్క రూపాంతరము. (చూ. నమ్మిగ.)

నచ్చు. దే. స. క్రి. నమ్ము. "క. ద్రోణభీష్ములలాపుల్, నచ్చియుఁగర్ణుండొక్కఁడ, యిచ్చుఁదవకు విజయమనియు నెంతయుఁ బొంగున్." భార. ఉద్యో. 3, ఆ.—వి. 1. ఆలస్యము; 2. బాధ.

నచ్చుకాఁడు. దే. విశే. 1. అలసుఁడు; 2. బాధకుఁడు.

నచ్చుకుప్ప. దే. విశే. నచ్చుగొట్టు.

నచ్చుగొట్టు. దే. విశే. నచ్చుపెట్టువాఁడు.

నచ్చుపెట్టు. దే. స. క్రి. తొందరపెట్టు, బాధించు.

నజరానా. హిం. వి. అపరాధము, రాజులకిచ్చు కానుక.

నజరు. హిం. వి. సముఖము, సౌందర్యము, కానుక.

నజ్జు. దే. వి. నలుజుయొక్క రూపాంతరము. "చ. ఒకపెనుఁబాంపతోఁడు చల ముప్పరసాతలసీమ కున్ జకో, రకములుభూతధాత్రికినురల్ దివికిన్ బగతీలునట్లుగా, మెకమెకపాటుతోడనిను మ్రింగకపోరపుడున్ ద్రిలోకకం, టకుఁడవుగా ననీయొడలునజ్జుగఁజేసెకురంగలాంఛనా." స్వా. 3, ఆ.—విశే. మిక్కిలి నలఁగినది.

నటనము. సం. వి. అ. న. 1. నాట్యము; 2. నటన, కపటప్రవర్తనము.

నటము. సం. వి. అ. పుం. 1. ఇరుగుడు?; 2. దుండిగము?.

నటవాలు. దే. వి. అశ్వగతివిశేషము, (చూ.) రేచితము.

నటి. సం. వి. ఈ. స్త్రీ. 1. వేశ్య; 2. నట్టువుని పెండ్లాము; 3. కాకిదొండ?; 4. గువ్వగుత్తిక?.

నటించు. సం. అ. క్రి. 1. నర్తించు; 2. వర్తించు; 3. కపటముగా ప్రవర్తించు.

నటుఁడు. సం. వి. అ. పుం. నట్టువుఁడు.

నటుపైడ్లు. ఆం. విశే. సొమ్ము చెల్లింపకుండ టప్పాద్వారా పంపఁబడిన.

నట్ట. దే. వి. పాచిక. "నట్టలు రెండుఁ దానజతనంబునఁ జేకొని." భో. ౭, ఆ.

నట్టకనడుము. దే. వి. (నడుము+నడుము.) సరినడుము. "నట్టకనడురేయి." వేం, పంచ. ౧, ఆ.—(ఇతరగ్రంథములయందు దీనికి ప్రయోగము మృగ్యము.)

నట్టడవి. ద్వి. వి. (నడుము+ అడవి.) అరణ్యమధ్యము. "క. నీపాదంబుల్, పట్టికొనఁగవచ్చినము ము, నట్టడవినిడించిపోవన్యాయమెకృష్ణా." భాగ. ౧౦, స్కం. పూ.

నట్టనడుము. దే. వి. (నడుము+నడుము.) సరిమధ్యము. "మలచపువేణినట్టనడుమున్ దిగిచేతికిఁదున్కచిక్క." ఉ, రా. 3, ఆ.

నట్టాడు. ద్వి. అ. క్రి. (నట్టువ+ఆడు.) 1. నర్తించు; 2. చలించు. "నట్టాడునడుము." భాగ. ౯, స్కం.

నట్టిల్లు. దే. వి. (నడుము+ఇల్లు.) 1. గృహమధ్యము; (చూ. తొట్టిగిలఁబడు.) 2. గర్భగృహము. "సీ. మలిపించెబంగారములదేవగృహములుకూర్పించె నట్టిండ్లుకుందనమున." భీ. ౫, ఆ.

నట్టు. యు. దే. వి. 1. వాసస్థానము; "గీ. అపుడు గొల్లనాయఁడందంబుగాఁదన, నట్టులలరఁజేయు నట్టుగాను, నేర్పుగల్గువారి నేర్పరించి." నీలా. 3, ఆ.—2. స్థానము; "గీ. వారిఁదద్దయున్నర్మిలిగారవించి, బంతిమోము లదొరతనబంతిఁగుడువఁ, బెట్టివీడెంబులిడియొక్కనట్టునందు, నెమ్మిఁగూర్చున్నచోఁబినతమ్ముఁడనియె." అచ్చ. యు, కాం.—3. ఆలస్యము; (ఏలనట్టుచేసెదవు, వేగపొమ్ము.) 4. ఆటంకము; (ఆ పనికి నట్టువచ్చినది.) 5. సస్యరోగవిశేషము. వై. నట్టువుఁడు.

నట్టుకొట్టు. దే. అ. క్రి. ఆలస్యముచేయు. "క. పలికిననినుఁగాదనభీ, తిలియిటునటునట్టుకొట్టుతెఱవతెఱఁగుభూ, తలవిభుఁడు చూచి." కళా. ౭, ఆ.

నట్టుకొను. దే. అ. క్రి. కుదురుకొను, నెలకొను. "వ. పట్టుగలపటికంపుటాచట్టు నేలలనట్టుకొని." స్వా. 3, ఆ.

నట్టుగుఁడు. వై. వి. నట్టువుఁడు.

నట్టుపులుఁగు. ద్వి. వి. నట్టువపులుఁగుయొక్క రూపాంతరము. "సీ. విషధరాగమునంబెవేఁడుచుఁ గేకలు వెట్టుశిఖండు లీనట్టుపులుఁగులు." రుక్మి. 3, ఆ.

నట్టువ. వై. వి. 1. ఆట, నర్తనము. "వ. మఱియు విరితేనియలాని పూనిమత్తిలి తత్తఱంబునం దిరుగు తేఁటిమొత్తంబులయొఱకలసన్నగరువలిగట్టువ నట్టువగఱప." య. ౪, ఆ.—2. నట్టువుఁడు. (చూ. అత్తాడు.)

నట్టువకాఁడు. ద్వి. వి. నట్టువుఁడు.

నట్టువడు. ద్వి. అ. క్రి. (నట్టు+పడు.) అడ్డపడు.

నట్టువపులుఁగు. ద్వి. వి. నెమిలి, నర్తనప్రియము. (ఇట్లు నట్టువపిట్ట.)

నట్టువాఁడు. ద్వ. వి. (నట్టువ+వాఁడు.) నట్టువుఁడు. (చూ. బూతు రెండవయర్థము నుదాహరణము.)

నట్టువుఁడు. వై. వి. (వేశ్యలకాటగఁ జవు) నటుఁడు. (నట్టుగుఁడుయొక్క రూపాంతరము.)

నట్టువొజ్జ. వై. వి. (నట్టువ + ఒజ్జ.) నాట్యోపాధ్యాయుఁడు. "గీ. నట్టువొజ్జనై మెలఁగుదునగరిలందు." భార. విరా. ౧, ఆ.

నట్టేఱు. దే. వి. (నడుము+ఏఱు.) నదీమధ్యము.

నట్టొట్లు. దే. వి. బ. జలధారలులోనగునవి నిరంతరముగాపడి యుడిగినవెనుక అచ్చోట నిలిచినిలిచి పడెడుబొట్లు. "నవమాలికలతేనెనట్టొట్లుపడుచోట." స్వా. 3, ఆ.

నట్వాలు. దే. వి. నటవాలుయొక్క రూపాంతరము.

నడ. దే. వి. నడక, గమనము.

నడక. దే. వి. 1. గమనము; 2. ప్రవర్తనము.

నడగాఁడు. దే. వి. (నడ+కాఁడు.) గుఱ్ఱము, హయము. "క. ఆలోనఁజంద్రహాసుఁడు, మేలుకనుచు నవుడుతత్సమీపసరఃప్ర, క్షాళితముఖుఁడైనడగని, బోలెమునఁగదల్చి నగరముఁబ్రవేశించెన్." జై. ౮, ఆ.

నడగొట్టు. దే. అ. క్రి. (నడ+కొట్టు.) నిలుచు, ఉండు. "క. పోకనడగొట్టితేనియు, రాకింతుఁజూమీ మొగంబురాచట్టుపయిన్, శ్రీకాశికనిందించిన, నీకింతటనేలపోవునీచచరిత్రా." భీ. ౨, ఆ.

నడచు. దే. అ. క్రి. 1. గమనించు; "వ. పతంగపతివసుమతికినవతరించివసుదేవసుతునితలంపునకనుగుణంబుగనడచికడచి." ఉ, హరి. ౫, ఆ — 2. ప్రవర్తించు.

నడజోదు. ద్వ. వి. కాలిబంటు, పదాతి. "వ. అడిదంబులఁబొడిపొడిగా నడుచునడజోదుభటులును." ఉ, హరి. ౪, ఆ.

నడత. దే. వి. నడవడి, ప్రవర్తనము.

నడతెంచు. దే. అ. క్రి. (నడచు+తెంచు.) నడచు, పోవు. "ఉ. పాండవకోటినూతనసుతుపైనడతెంచినచందమెట్టులా, ఖండలసూతిసర్పముఖకాండముతాఁకునరూపుమానిపో, కుండుటయెట్లుకల్గె." భార. కర్ణ. ౧, ఆ. "ద్వి. మేదినీసుతకు, నగవుపుట్టించుచునడతెంచునెడల." రా. అ, కాం. (స్వార్థమున తెంచు.)

నడదివియ. ద్వ. వి. దివటీ. "సీ. నడదివియలునేనె నగరికిమాణిక్యమకుటముల్ పూనినమనుజపతుల." భార. విరా. ౫, ఆ.

నడపు. దే. ప్రే. నడవఁజేయు. వి. 1. గమనము; "సీ. అల్లఁదనంబునయనువుమైకొనఁజూచునడపుకాంతికివింతతోడవుగాఁగ." భార. విరా. ౧, ఆ.— 2. ప్రవర్తనము.

నడబావి. ద్వ. వి. నడచిపోవుటకు మెట్లేర్పఱచిన బావి.

నడము. సం. వి. అ. పుం. కిక్కసకసవు, (రూ. నళము.)

నడయాడు. దే. అ. క్రి. (నడ+ఆడు.) 1. సంచరించు; "క. గడకట్టినయీడపగిది, నడయాడుఁగ్రియాభియుక్తుఁడటనిష్క్రియుఁడై, యొడిసెలఱాయి పడినకయి, వడిఁదప్పుముఁగలయు బంధువర్గముతోడన్." శివ. ఉ. ౨, ఆ.—2. చలించు. "ద్వి. సరులు, నడయాడుచున్నకిన్నరసతుల్ నడప." రా. సు, కాం.

నడవ. దే. వి. 1. తలవాకిటికిని నడిమివాకిటికిని నడిమిచోటు, అలిందము; 2. సేతువు; "గీ. అవిరామవలీలనందందయందుకొనుచు, నడవఁగావించుచున్నయన్నలునిసేతు, కర్మకౌశలమీక్షించుగగనచరుల, కనిమిషత్వంబుచరితార్థమయ్యెనపుడు." రా. యు, కాం.—3. మార్గము. "వ. కూలినబావితెఱంగుననడవలేక." కవిక. ౪, ఆ.

నడవడి. దే. వి. నడత, చరిత్రము.

నడవడిక. దే. వి. నడవడియొక్క రూపాంతరము. (స్వార్థమున క ప్రత్యయము.)

నడి. దే. వి. నడుమునకువృత్తియందుఁగలుగు నడిమి అను రూపమునందు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినది. (చూ. నడికట్టు, నడిప్రేలు. మొ.)

నడికట్టు. దే. వి. (నడిమి+కట్టు.) మగవారు బిగువునకై నడుమునఁగట్టుకొనెడుకట్టు, పారసనము.

నడికట్టుత్రాడు. దే. వి. ఏనుఁగు నడుమునఁగట్టెడు త్రాడు, కక్ష్య. "క. వెండియునిట్టటుకదలక, యుండనతండతులబలరయోద్ధతిమహానీ, యుండగుచువానిఁదద్వే, దండమునడికట్టుత్రాళ్లఁదగబంధించెన్." కళా. ౮, ఆ.

నడికిరేయి. ద్వ. వి. (నడిమికిన్+రేయి.) అర్ధరాత్రము. "గీ. నడికిరేయివచ్చిననునొప్పఁబలికినఁ, గలుగునయ్యజయము." భార. భీష్మ. 3, ఆ. (రూ.

నడికిరే. "రేపువత్తుననిపోయినడికిరేయర్థితోఁజనుదెంచు." భార. అర. ౭, ఆ.) (బ. నడికిరేలు. ఆము. ౫, ఆ.)

నడితి. దే. వి. నడతయొక్క రూపాంతరము.

నడివ్రేలు. దే. వి. (నడిమి+వ్రేలు.) మధ్యమ.

నడు. దే. వి. వృత్తియందు నడుమశబ్దమునకు మీఁది వర్ణములు లోపింపఁగా మిగిలినరూపము. (ఉదా. నడునెత్తి, నడుముక్కు, నడురేయి. మొ. నడునెత్తిలోనగువానియందు పూర్వ పదార్థమునకు ప్రాధాన్యమని యెఱుంగవలెను.)

నడుఁకు. దే. అ. క్రి. వడఁకు, కంపించు. "ఉ. వాఁడుందగఁ బోయియల్లననడుంకుచుభూవిభుఁజేరినప్పుడై." నిర్వ. ౨, ఆ.—వి. కంపము. (నన్నుఁ జూడఁగానే వానికి నడుఁకుపుట్టెను.)

నడుకొను. దే. అ. క్రి. (నడుఁకు+కొను.) కంపించు. "క. అనుచునొడఁబాటులేకు, న్ననునయ్యుత్తరునినాఁగలనడుకొననిడి." భార. విరా. ౪, ఆ.

నడుగుంట. ద్వి. వి. (నడుము+గుంట.) తలనడిమిపల్లము, బ్రహ్మరంధ్రము. "సీ. చమురూరనడుగుంటనిమురుచుఁదలయంటి." చంద్రా. ౨, ఆ.

నడుచే. దే. అ. క్రి. నడచుయొక్క రూపాంతరము. "సీ. నగజామనోనాథునగరికినడుచువారెడపక్రొన్నెలముడుచువారు." భల్లా. ౨, ఆ.

నడుచొచ్చు. దే. అ. క్రి. (నడుము+చొచ్చు.) నడుమప్రవేశించు. "ద్వి. ఎనసిసుగ్రీవుతో నేనుబోరాడ, నను నేయఁదగునయ్యనడుచొచ్చినీవు." రా. కిష్కి. ౦, కాం.

నడుదింపు. దే. వి. మాంసవిశేషము. "వ. మృగంబులనడుదింపునంజుడు నమలినయతం డంధుండును బంగుండునునైయావిర్భవించు." మార్క. ౨, ఆ.

నడునడు. దే. వి. నడుఁకుటయందగు ననుకరణము. "నడునడునడిఁకివారలభయంబువేఁడిన." భార. ద్రో. ౨, ఆ.

నడువు. దే. ప్రే. వి. నడపుయొక్క రూపాంతరము.

నడుమంతరము. మి. వి. (నడుము+అంతరము.) 1. కాను; 2. మధ్యకాలము. (చూ. నడుమంత్రము.) విశే. మధ్యకాలమునఁగలిగినది. "గీ. వెలఁదినడుమింతమాత్రనేవిఱ్ఱవీఁగె, నహహానడుమంతరపుఁగళికదినిజంబు." అని. 3, ఆ. (ఇది మొదటివిశేష్యమునకును విశేషణార్థమునకును ఉదాహరణము.) (చూ. నడుమంత్రము.) (సమానార్థకము లైన రెండు పదములు చేరి ఒక పదముగా వాడఁబడుచున్నది. ఇది దున్నపోతువంటిదన వచ్చును. అయిన అవి రెండును తెనుఁగుపదములు. ఇందు ఒకటి తెనుఁగు ఒకటి సంస్కృతము.)

నడుమంత్రము. మి. గ్రా. వి. 1. కాను; (చూ. విశేషణార్థము నుదాహరణము.) 2. మధ్యకాలము. "నడుమంత్రంబునబల్మిఁదెచ్చుకొని." ఉ. రా. ౨, ఆ.—విశే. మధ్యకాలమునఁ గలిగినది. "క. నడుమంత్రముకుచభారము, నడుమంత్రమునైఁపదు." శృం. ౨, ఆ. (నడుమంతరముయొక్క రూపాంతరము.)

నడుము. దే. వి. 1. కాను; 2. మధ్యభాగము. "దుస్సేనువిల్ నడిమికిఁద్రుంచి." భార. కర్ణ. ౧, ఆ. (వానికి నడుము వదలెను. ఇత్యాది స్థలములయందు అర్థవిశేషమని యెఱుఁగునది.)

నడుముకట్టుకొను. దే. అ. క్రి. సిద్ధపడు. (వాఁడు దేనికిని నడుముకట్టుకొని వచ్చుచున్నాఁడు.)

నడురేయి. ద్వి. వి. (నడుము+రేయి.) నడికిరేయి. (రూ. నడురే. "అనిష్టానిధిగేహసీమనడురేయాలించినకమ్రోయు." మొ. ఆము. ౧, ఆ.)

నడువడి. దే. వి. నడవడియొక్క రూపాంతరము.

నడ్డి. దే. వి. పూర్వకాయము వెనుకకు వంగియుండుట. (పూర్వకాయము ముందటికి వంగియుండుట గూను.) విశే. చప్పట. "ద్వి. నరసినగడ్డంబునడ్డి నాసికయు." నళ. 3, భా.

నడ్డిగుంట. ద్వి. వి. (చూ.) కుకుందరము.

నడ్డిముక్కువాఁడు. దే. విశే. (చూ.) అవటీటుఁడు.

నడ్తి. దే. వి. నడితియొక్క రూపాంతరము.

నడ్ము. దే. వి. నడుముయొక్క రూపాంతరము. "తే. గీ. వారలకు మనకుఁ బొసఁగు నే నడ్మఁబెట్టిన పూరిగాలు." ఉ. హరి. ౫, ఆ.

నడ్వ. సం. వి. ఆ. స్త్రీ. కిక్కసవామి.

నడ్వంతము. సం. విశే. (త్.ఈ.త్.) కిక్కసకసవు గలది. (దేశము.)

నడ్వలము. సం. విశే. (అ.ఆ.అ.)——పై.——

నతము. సం. విశే. (అ.ఆ.అ.) 1. వంగినది; 2. వంకరైనది; 3. లోఁతైనది. "నతనాభిక." స్వా. ౨, ఆ.

నతి. సం. వి. ఇ. స్త్రీ. నమస్కారము, మ్రొక్కు.

నత్త. దే. వి. గుల్లయందుండు పురుగు.

నత్తగుల్ల. ద్వి. వి. క్షుద్రశంఖము.

నత్తి. దే. వి. తడఁబడుచుమాటాడెడువ్యాధివిశేషము.

నత్తివాఁడు. దే. విణ. నత్తిగలవాఁడు, ఆక్షేపకుఁడు.

నత్తు. దే. అ. క్రి. తడఁబడుచుమాటాడు. వి. ముక్కుపోఁగు. భద్రా. ౨, ఆ.

నదము. సం. వి. అ. పుం. 1. పడమరగాఁబాఱెడి యేఱు; 2. (నీటి) మడువు; 3. సముద్రము; 4. మ్రోఁత.

నది. సం. వి. ఈ. స్త్రీ. 1. ఏఱు; 2. ఆమడకు మీఱి పాఱెడియేఱు.

నదీమాతృకము. సం. వి. అ. పుం. ఏటినీళ్లచేత పండెడు పైరుగలదేశము.

నదీసర్జము. సం. వి. అ. పుం. ఏఱుమద్ది?.

నద్ధము. సం. విణ. (అ.ఆ.అ.) 1. కట్టఁబడినది; 2. పైకెత్తఁబడినది, నిక్కినది. (అని కొందఱు.)

నధ్రి. సం. వి. ఈ. స్త్రీ. టంగువాఱు, వరత్ర.

నన. దే. వి. 1. పుష్పము; "మ. వనితల్ నవ్వఁగఁ గాఁగిలింపఁ గన నిశ్వాసింప గానంబొనర్పనదల్పన్ బలుకన్ ముఖాసవముఁగూర్పన్ దన్ను నంటన్ ననల్, మొనపున్ బొన్న కురంటకంబుఁ దిలకంబున్ సిందువారంబుఁ బ్రేం, కనమున్ సంపెఁగ గోఁగుమున్ వకుళమున్ గంకేలియున్ మావియున్." రామా. ౧, ఆ.—2. మొగ్గ; "చ. కుసుమములెల్లఁగామినుల కొప్పులనుండ నటుండలేనిసి, గ్గసఁగఁగ వంగినట్లు జనియించె ననల్." ఆము. ౪, ఆ.—3. చిగురు. (చూ. ననుచు.)

ననంద. సం. వి. ఋ. స్త్రీ. మగనితోఁడఁబుట్టినది, (రూ. ననాంద.)

ననఁబోఁడి. దే. వి. (నన+పోఁడి.) 1. పుష్పమువలె మనోజ్ఞురాలైన ఆఁడుది; 2. ఆఁడుది. "పురుషుఁడవెంచిచూడననఁబోఁడివిగావు." బ్ర. 3, ఆ. (చూ. అలరుఁబోఁడి.)

ననకారు. ద్వ. వి. ఋతువిశేషము, వసంతము.

ననసీరు. ద్వ. వి. పుష్పరసము, మకరందము. (చూ. సీటిక.)

ననయు. దే. అ. క్రి. 1. పూచు; 2. చిగిరించు. (అప్ర.)

ననవిలుకాఁడు. దే. వి. మన్మథుఁడు, పుష్పధన్వుఁడు. "చ. ననవిలుకాఁడమన్మథయనాథవధూవధపాతకంబునన్, గొనిమునిఁగించె." సై. ౨, ఆ. (ఇట్లు ననవింటివాఁడు. మొ.)

ననవిలుతుఁడు. దే. వి.—పై.—(రూ. ననవిల్తుఁడు. "విరతాలగెల్వవచ్చు ననవిల్తుఁడటంచు." భోజ. ౨, ఆ.)

ననుఁబ్రాయి. దే. వి. (నాను+ప్రాయి.) చక్కగా ఉడుకనిబియ్యము.

ననుఁబ్రాయివడు. ద్వ. అ. క్రి. (ననుఁబ్రాయి+పడు.) ననుఁబ్రాయియగు. "క. బిరుసింతగాక నడిమికి, మురియక ననుఁబ్రాయివడిచిముడఁబాఱకయే, బెరికియునులేకనిక్కిలి, గరగరనగు నేఱుప్రాలకలమాన్నంబుల్." శై. ౫, ఆ.

ననుచు. దే. అ. క్రి. 1. పూచు; (చూ. చేఁదుశబ్దముకడ రెండవయర్థము నుదాహరణము.) 2. చిగిరించు; "ఏచిననిచివుఁజికాచిపండిన." య. ౧, ఆ.—3. మొగ్గయెత్తు; (చూ. నన.) 4. అనురాగమొందు; "క. ననిచినప్రియుఁడవుభర్తవు." రా. కిష్కిం, కాం.—5. అతిశయించు; "ద్వి. ననిచిన కడిమిమైనన్ను సాధించి." రా. సుం, కాం.—6. ఇంపగు. (చూ. ననుపు.) (ప్రే. ననిపించు.)

ననుపు. దే. వి. 1. అనురాగము; "క. ననుపునఁజని రతినివేణునాదంబునకున్." వి. పు. ౭, ఆ.—2. అతిశయము; "గీ. మనములోనిండియున్నదిన ననుపుఁగూర్మి." సై. ౭, ఆ.—3. ఇంపు. "ననుపుగ వీనిలక్షణమొనర్తు." కా. ౨, ఆ. (చూ. ననుపుకాఁడు.)

ననుపుకత్తె. ద్వ. విణ. 1. ప్రియురాలు; 2. విటురాలు.

ననుపుకాఁడు. దే. విణ. 1. ప్రియుఁడు; "చుక్కల జవరాండ్రకున్ ననుపుకాఁడు." రామా. ౨, ఆ.—2. విటుఁడు. "సీ. ననుపుకాఁడయివేల్పు నాగవాసముఁగూడి మహిమగోల్పడియె నేమాఁడకర్ణి." స్వా. ౨, ఆ.

ననుపువడు. ద్వ. అ. క్రి. (ననుపు+పడు.) స్నేహపడు. "వ. పెక్కుదినంబులుననుపువడియును నెడరుగలిగిన నొండొరులనిం గూడుకొనుటదిస్వభావగుణంబు." కవిక. ౪, ఆ.

నన్న. దే. విణ. కుఱుచే.

నన్నూఱు. దే. స. (నాలుగు+నూఱు.) చతుశ్శతము.

నన్పుకాఁడు. దే. విణ. ననుపుకాఁడుయొక్క రూపాంతరము. "సీ. చనిచూడఁగల్గినఁజాలుఁజేయుము నన్పుకానిఁగాఁబూవిలుకానినైన." (ఇక్కడశ్లేషగనుక మొదటియర్థము అనుపుకాఁడు అని తెలియవలెను.) య. ౧, ఆ.

నన్బ్రాయి. దే. వి. ననుఁబ్రాయియొక్క రూపాంతరము. "సీ. రాగిలోహండినన్బ్రాయిలేకుండంగ వండిదింపవిపురుపంటకంబు." కాశీ. 3, ఆ.

నపుంసకుఁడు. సం. వి. అ. న. షండుఁడు, పేడి.

నప్త. సం. వి. ఋ. స్త్రీ. మనుమరాలు. పుం. 1. మనుమఁడు; 2. ముమ్మనుమఁడు.

నప్త్రి. సం. వి. ఈ. స్త్రీ. మనుమరాలు.

నఫా. హిం. వి. లాభము.

నభము. సం. వి. స్. న. ఆకాశము. పుం. 1. శ్రావణమాసము; 2. మేఘము; 3. వర్షాకాలము; 4. బిసతంతువు; 5. తమ్మపడిగము; 6. ముక్కు.

నభసంగమము. సం. వి. అ. పుం. పక్షి, పిట్ట.

నభస్యము. సం. వి. అ. పుం. భాద్రపదమాసము.

నభస్వంతుఁడు. సం. వి. అ. పుం. వాయువు, గాలి.

నమనము. సం. వి. అ. న. వంగుట, నమ్రమగుట.

నమలు. దే. స. క్రి. తిను, భక్షించు. "నమలమాంసంబు." భార. ఆర. ౫, ఆ.

నమసితుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) అర్చితుఁడు.

నమస్కరించు. సం. స. క్రి. చేమోడ్చు.

నమస్కారము. సం. వి. అ. పుం. చేమోడ్పు.

నమస్కారి. సం. వి. ఈ. స్త్రీ. ముడుఁగుదామరతీ.

నమస్కృతి. సం. వి. ఇ. స్త్రీ. నమస్కారము.

నమస్య. సం. వి. ఆ. స్త్రీ. పూజ, సపర్య.

నమస్యితుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) అర్చితుఁడు.

నమస్సు. సం. వి. స్. న. నమస్కారము. "ఎ, గీ. నతమృడాదికసుమనస్సునకునమస్సు." ఆము. ౬, ఆ. (దీనికి ఇతర గ్రంథములయందు ప్రయోగము మృగ్యము.)

నమించు. సం. స. క్రి. నమస్కరించు. "వ్యాసుని నమింతు." శశాం. ౧, ఆ. (దీనికి ప్రయోగాంతరము కనఁబడదు.)

నమితము. సం. విశ. (అ. ఆ. అ.) వంగినది, నమ్రమైనది.

నమిలి. దే. వి. నెమిలియొక్క రూపాంతరము. "సీ. ప్రణవాక్షరాభ్యాస పరిపాటిఁబాటించు నానావిధంబులనమిలిపిండు." భీ. 3, ఆ. (చూ. నెమిలి.)

నముచిసూదనుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

నమూదు, నమోదు. హిం. విశ. కనపఱచఁబడిన, వివరింపఁబడిన.

నమూనా. హిం. వి. మాదిరి.

నమేరువు. సం. వి. ఉ. పుం. సురపొన్నతీ. (దీనికి దోహదము హసితము. చూ. దోహదము.)

నమ్మకము. దే. వి. నమ్మిక, విశ్వాసము.

నమ్మదుంప. దే. వి. గొట్టిగడ్డ, కశేరుకము.

నమ్మి. దే. వి. నెమిలి. "సీ. లయదప్పకుండమెల్లనెసోగవురివిచ్చి నమ్మిబోదలుపేరణము లుఱ్ఱూక్క." చంద్ర. (నెమ్మియొక్క రూపాంతరము.)

నమ్మిక. దే. వి. నమ్మకముయొక్క రూపాంతరము.

నమ్మిగ. దే. వి. నమ్మికయొక్క రూపాంతరము. "క. తగుమాటలాంబికేయుం, డగుననికైకొనునెయెన్నఁడైనను గొడుకుల్, మగఁటిమిగలఁడని యెడున, మ్మిగఁజూచుచునుండువిమఁముగ్రింగినయేని." భార. ఉద్యో. ౧, ఆ.

నమ్ము. దే. స. క్రి. నమ్మకముచేయు, విశ్వసించు.

నమ్రము. సం. విశ. (అ. ఆ. అ.) వంగినది, నతము.

నయ. దే. వి. అందము. "సీ. నయకలవ్రేళ్లమట్టియలుఁ బిల్లాండ్లిడి పాయపట్టము వెట్టెఁబడఁతియొర్తు." ఆము. ౬, ఆ. (దీని మొదటిరూపము నయము.)

నయగారము. దే. వి. (నయము+కారము.) 1. మృదుత్వము; "క. ప్రియమైరమణీయమణీ, మయమైయతిచిత్రమంజుమంజీరములన్, నయమైనచిలుకపలుకుల, నయగారమునంజెలంగిననయగారమునన్." సా. ౧, ఆ.—2. మృదువచనము. "సీ. పలుకుదీయములకు వెలిగొడుగులుగావె నయగారములలోనినగవుపసలు." రామా. ౨, ఆ. (కారము అనునది భావమునందువచ్చెడు ఒకానొక ప్రత్యయము. చూ. చెలికారము. మొ.)

నయగారి. దే. విశ. (నయగారము+ఇ.) మృదుత్వముగలవాఁడు, మృదువచనముగలవాఁడు. "నయగారితనమున నాథుఁడాశ్లేషింప." చంద్ర.

నయనము. సం. వి. అ. న. 1. కన్ను; 2. పొందించుట.

నయము. ఉభ. దే. వి. 1. లాభము; "గీ. నయముపేదకునరిఁగోరుననునొసంగి." ఆము. ౪, ఆ.—2. నునుపు; "మ. మనుసౌరభ్యమునివ్వటిల్లఁగ మనోమోదంబునందేఁటుల, ల్లననోలిన్ వెడలంగ జేకులుసముల్లాసంబునంబింకమె, క్కనయంబెక్కుచుఁగ్రందు పొందెడలివీఁకన్ గేసరంబుల్ గడ, ల్కొనఁ దోడ్తోమధువుబ్బఁ బేరెలమిఁబొల్పుం జెందెనంభోజముల్." భార. ఉద్యో. ౨, ఆ.—3. మృదుత్వము; "చ. నినుపులొకర్తచేతఁగమనీయలతాంతములున్న నొక్కెడన్, గనుఁగొనిముగ్ధయొక్కతె వికాసినిరైనవకంపుఁదీఁగఁబా, సినయొలగొమ్మగుత్తిసవిచేరినయంబునఁబట్టి త్రోయఁజా, చిన నదియల్లనవ్వ నదిసిగ్గుపడన్ గనియార్చిరందఱున్." (నయమునన్=మృదుత్వముచే—

నఁగా తిన్న గానను.) నిర్వ. ౮, ఆ.—4. అంద ము. "ఎ, గీ. సాలపువలపులుగొలుపునిచ్చులపుఁ దెలుపు, నగవుమల్లెలకొకవింతనయముఁదెలుప." య. ౧, ఆ.—విణ. 1. చౌక; 2. నునుపైనది; 3. మేలైనది; "ద్వి. కల్మిబోటి యాట నయం బయి." విష్ణు. పూ. ౨, ఆ.—4. మృదువైనది; 5. అందమైనది. (చూ. నయగారముకడ మృదుత్వము అనునర్థము నుదాహరణము.)—సం. వి. అ. పుం. 1. నీతి; 2. పొందించుట; 3. ద్యూత విశేషము.

నయించు. సం. స. క్రి. పొందించు.

నర. దే. వి. 1. ముదిమిచే వెండ్రుకలయందుఁగలుగు తెలుపు, పలితము; 2. ముదిమిచేత తెల్లఁబాఱిన వెండ్రుక. "క. అవ్విభు, తలనొకనరయున్నఁ జూపితరలాక్షియనుక్." మార్క. ౭, ఆ.

నరకఁడు. వై. విణ. దుష్టుఁడు*. "నరకానీవాకతాఁ కె." హంస. 3, ఆ.

నరకము. సం. వి. అ. పుం. దుర్గతి. (నరకములు ౨౧.—తామిస్రము, లోహశంకువు, మహానిరయము, శాల్మలి, రౌరవము, కుంభలము, పూతిమృత్తికము, కాలసూత్రము, సంఘాతము, లోహితోదము, సవిషము, సంప్రపాతనము, మహానరకము, కాకోలము, సంజీవనము, మహాపథము, అవీచి, అంధతామిస్రము, కుంభీపాకము, అసిపత్రవనము, తాపనము.) డు. ఒక యసురుఁడు.

నరకాంతకుఁడు. సం. వి. అ. పుం. కృష్ణుఁడు.

నరగ. దే. వి. వాద్యవిశేషము, భేరి.

నరగజేము. దే. వి. నరగయొక్కరూపాంతరము.

నరపాలుఁడు. సం. వి. అ. పుం. రాజు, ఱేఁడు.

నరవు. దే. వి. నర, పలితము. (నరపగడ్డము, నరపమీసము అని ప్రయోగములయందు కానఁబడుటం జేసివృత్తియందు వర్ణవికారమని తెలియవలెను.)

నరము. ఉభ. దే. వి. నాడి. సం. అ. న. రామకర్పూరము?.

నరయు. దే. అ. క్రి. ముదిమిచే వెండ్రుకలు తెలుపగు.

నరవ. దే. వి. కొండత్రోవ.

నరవాహనుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు.

నరసింగఁడు. వై. వి. నృసింహుఁడు. "నరసింగయకృష్ణుఁడు. కళా. ౧, ఆ.

నరసింగము. వై. వి. మల్లబంధవిశేషము*.

నరాజి. దే. వి. కత్తి, ఖడ్గము. "సీ. ఒక్కొక్కకెం దలిరుదయించెఁదరురాజితోరమైతనరెఁగంతుని నరాజి." కృష్ణ. ౪, ఆ. (రూ. నరాచి. "సీ. తన నరాజీ చిల్వకును మార్తురాతెండ్లయుసుఱుగా డుపులింపులొసఁగుచుండ." య. ౧, ఆ.)

నరిగి. దే. వి. గొట్టెలశరీరవర్ణవిశేషము. హంస. ౨, ఆ.

నరిడి. దే. వి. గుండెయుబ్బరపు పశురోగవిశేషము. (చూ. అదురుద్రిక్క.)

నరియఁడు. దే. వి. నక్క. "సీ. నరియఁడు తెరువాఁగెగరుడియుఁబాలయు నెడమనుండియువచ్చికుడినినిలిచె." ఉ, రా. ౬, ఆ.

నరియు. దే. అ. క్రి. నరయుయొక్కరూపాంతరము. "క. సురకుంజరములకొమ్ములు, మురిసెన్ దొండములువిరిసె మోములునరిసెన్, బొరఁబొరనఖలాంగంబులు, నెరిసెంజిత్తంబులురిసె నిరిసెఁగంబుల్." లక్ష్మీ. ౪, ఆ.

నరుఁడు. సం. వి. అ. పుం. 1. మనుష్యుఁడు; 2. అర్జునుఁడు; 3. ఒక ఋషి.

నరుపు. దే. వి. నరపుయొక్కరూపాంతరము. (చూ. నరియు.)

నరేంద్రుఁడు. సం. వి. అ. పుం. 1. రాజు; 2. పాములవాఁడు.

నర్తకి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆటకత్తె; 2. ఆఁడేనుఁగు; 3. గువ్వగుత్తిక?.

నర్తకుఁడు. సం. వి. అ. పుం. 1. నట్టువుఁడు; 2. పాములవాఁడు. విణ. ఆడెడువాఁడు.

నర్తనప్రియము. సం. వి. అ. పుం. నెమిలి, నట్టువపులుఁగు.

నర్తనము. సం. వి. అ. న. నటనము, ఆట.

నర్తించు. సం. అ. క్రి. నర్తనముచేయు, ఆడు.

నర్తిల్లు. సం. అ. క్రి. ——వై.—— (రూ. నర్తిలు. "హారములక్కునన్నర్తిలంగ." రుక్మి. ౧, ఆ.)

నర్మద. సం. వి. ఆ. స్త్రీ. ఒకయేఱు. అ. పుం. డు. నర్మసచివుఁడు.

నర్మము. సం. వి. న్. న. పరిహాసము, మేలము.

నర్తిలి. దే. వి. అపేక్ష. "ఉ. వీయపురాలవైతిగదవే యిపుడత్తవులొంటివానినో, లోయజనేత్రఁ గాంచినవధూమణినీసుతఁబెండ్లియాడఁగా, నాయమునాకుమారునకునర్తిలిహత్తగనత్తవావిచే, నాయువుగల్గువాఁడవునటండ్రు శుభంబగు దీననెం

శయుఁడ." విజ. 3, ఆ. (ఇది అఱ్ఱిలియొక్క మొదటిరూపము.)

నఱకు. దే. స. క్రి. ఖండించు. "క. నఱకెఁ దత్సేనఁ బార్థనందనుఁ డుడిఁ." భార. ద్రో. ౧, ఆ. "క. సుత్రామజ యాదుష్టమతి నఱకఁబంపు నెడఁ." జై. ౮, ఆ.—వి. నఱకుడు.

నఱకుడు. దే. వి. ఖండనము.

నఱకుడువడు. ద్వ. అ. క్రి. (నఱకుడు+పడు.) ఖండితమగు. "క. పడుతలలుఁ దఱచు నఱకుడు, వడు చేతులుఁ జడిసి బెండువడుగుండెలుఁ జే, డ్పడు మేనులుఁ గడుఁ ద్రొక్కుడు, వడునడుగులుఁ బక్షిముఖుని భటులకుఁ గలిగెన్." ఉ, రా. ౪, ఆ.

నఱవ. దే. వి. అఱవకు మొదటిరూపము. "సీ. నఱవలనైనను నలువైన వెరవున ముట్టి యంటఁగఁ బట్టి కట్టివిడువ." (ఇట్లొక పాఠము.) భార. విరా. ౧, ఆ.

నఱుకు. దే. స. క్రి. నఱకుయొక్క రూపాంతరము. "ఐ. వాజాలకుఱికి యువాలంబులనఱికియు." భాగ. ౬, స్కం.—వి. నఱకుడు.

నఱుకుడు. దే. వి. నఱకుడుయొక్క రూపాంతరము.

నఱుకుపరువడి. దే. వి. శస్త్రవిద్యావిశేషము.

నఱుకుబియ్యము. దే. వి. (చూ.) నను(బ్రా)యి.

నఱుకులాడు. దే. స. క్రి. (నఱుకులు+ఆడు.) ఒకరినొకరు నఱుకుకొను.

నఱుక్కు. దే. వి. దిగులుపడుటయందగు ననుకరణము. "క. అప్పుడు సురనాయకుఁడు క, కుప్పతియుతుఁ డగుచు హరునిఁ గొలువఁగఁ జనుచున్, ముప్పిరిగొని యెదువగతో, నప్పాఱునిఁ జూచె గుండియ నఱుక్కనఁగన్." చంద్రా. 3, ఆ.

నఱుజొ. దే. వి. అణువు. "క. నఱుజొ మెయిపూని యాద, బ్బఱపొలఁతుకలోను దూఱె." అచ్చ. కిష్కిం, కాం.

నఱుమాడు. దే. స. క్రి. (నఱుము+ఆడు.) పొడిచేయు. "క. పెఱవారలధికభీతిన్, విఱిగిచనిరిభీష్ముఁ డేచివీరరథికులం, దఱఁ జూచి రాచకొడుకుల, నఱుమాడెడు భీముఁ డిట్లు నడుఁకం దగునే." భార. భీష్మ. ౨, ఆ.

నఱుము. దే. స. క్రి. పొడిచేయు. వి. పొడి. "చ. భటులు లెక్కకు మిక్కిలి సేనపాడుగా, నఱుమ యిరవుకృష్ణుఁడు నినాదము భూగగనాంతరంబునన్, దఱచుగ నొత్తె నిర్మథితదానవసైన్యముఁ బాంచజన్యమున్." భార. ద్రో. 3, ఆ.

నఱ్ఱి. దే. వి. 1. ప్రయాసము చేత పిదుకఁదగినయావు; (చూ. అఱ్ఱి.) 2. ప్రయాసముచేత బండిలోనగువానికి పూన్పఁదగినయెద్దు. "క. గుఱ్ఱములపరువు మెచ్చని, నఱ్ఱులఁ గట్టినరథముల నందవ్రజముల్, కుఱ్ఱలయార్పులు చెలఁగఁగఁ, దొఱ్ఱులగమి వెంటనంటఁ దోలిరిలేశా." భాగ. ౧౦, స్కం. పూ.

నల. వై. విశే. నల్లయొక్క రూపాంతరము. (చూ. నలమేనిదొర.)

నలఁక. దే. వి. నలఁకువ.

నలఁకువ. దే. వి. 1. వ్యాధి; 2. శ్రమము; 3. బాధ. "ఎ, గీ. సెమ్మిఁ దత్కరములు మృణాళములనుచుఁ, బొడిచి పొడిచినోటికిఁ దగుల్పడక యున్న, విడిచి విడిచిన లంకువ నడలు నట్టి, బడుగు టంచలఁ గాంచియ పార్థివుండు." చంద్ర.

నలఁగు. దే. అ. క్రి. 1. నలియగు; 2. పీడితమగు; "చ. పొదివిన భోవిహారమునఁ బూవునుబోలె నలంగకుండ నమ్మదనసమానుఁ బట్టికొని." ఉ, హరి. ౫, ఆ.—3. చెడు; "సీ. తూపుకంటఁ జెలంగ రూపుమంటనలంగఁ బంచబాణుఁడు వీరిపాలఁ గనిరొ." ఉ, హరి. ౨, ఆ.—4. శ్రమపడు. "చ. ఇడుమపాట్లకుఁ జొచ్చి నలంగితంచు నె, క్కుడుతమకంబుతోడఁ దలగ్రుచ్చి కవుంగిటఁ గూర్చె నంతటన్." కళా. ౪, ఆ.

నలఁగుడు. దే. వి. పీడనము.

నలఁగుడువడు. ద్వ. అ. క్రి. (నలఁగుడు+పడు.) పీడితమగు.

నలఁగుడువెట్టు. దే. స. క్రి. (నలఁగుడు+పెట్టు.) పీడించు. "అద్దశకంధరుఁ డూర్ధ్వలోకముల్ నలఁగుడువెట్టనెంచి." ఉ, రా. ౫, ఆ.

నలఁచే. దే. ప్రే. నలఁగఁజేయు. "ఘనాతిచండకాండవృష్టిఁ గానలంపవచ్చు." రాఘ. ౨, ఆ.

నలకూబరుఁడు. సం. వి. అ. పుం. కుబేరుని కొడుకు.

నలదము. సం. వి. అ. న. 1. వట్టివేరు; 2. పూఁదేనె.

నలమేనిదొర. ద్వ. వి. విష్ణువు, కృష్ణుఁడు. "సీ. లీలమైశూలంబుఁ గేలఁ బూనినవాఁడు నలమేనిదొర తూపు గలుగువాఁడు." కృష్ణ. ౧, ఆ.

నలి. ఉభ. దే. వి. 1. రోగము; 2. పొడి. విశే. 1. నలఁగినది; "సీ. మఱికొండవీడెక్క మాఱ్కొనిన లియైనయలకసవాపాత్రునంటిగాఁజె." స్వా. ౧,

ఆ. (ఆమ్రేడితమునందునలినలి. "గీ. నలినలీలసంచునలినలిగావించు." విజ. ౧, ఆ.)—2. సన్నము. "గీ. వళులలావునవలికౌనుబలిసినిలువ." లక్ష్మీ. ౨, ఆ.—క్రి. అత్యంతము. "ద్వి. నలిరేఁగిచిత్రాంగిన గరికిఁబోరు." సా. ౨, భా.—క్రి. క్రి. విణ. యోగ్యముగా. "గీ. నాదుప్రశ్నములకునలినుత్తరములిచ్చి, వారిగోనుమునీవువలసినట్లు." భార. ఆర. ౭, ఆ. "ఎ, గీ. పురుషులుఁగాంతలుఁగామహర్ష, లీలలెసఁగఁగ్రోధాదులులేకరుజయు, జరయునెఱుఁగకనలిఁజరింతురుదివఁబు, నందుసంతతనిర్భరానందమొంద." భార. అను. ౫, ఆ.—సం. వి. ఈ. స్త్రీ. గువ్వగుత్తికి?.

నలికండ్లపాము. దే. వి. నలికీఁచు, రక్తపుచ్ఛిక.

నలికము. దే. వి. సన్నఁదనము, తనుత్వము.

నలికిరి. దే. వి. నలికండ్లపాము.

నలికీఁచే. దే. వి.——పై.——

నలిగులి. దే. విణ. మిక్కిలి నలఁగినది. "సీ. తోరంపుగొరిజలత్రొక్కునసొడలెల్ల నలిగులిర్యైసర్పవాధుఁడౌదుఁగ." హరి. పూ. ౪, ఆ.

నలిగొట్టు. దే. విణ. సన్నమగునది. "ద్వి. నన్నురమ్మనిపిల్చునలిగొట్టుపలుకు." హరిశ్చ. ౨, భా.

నలితిండి. దే. వి. చిఱుదిండి.

నలినము. సం. వి. అ. న. 1. తామర; 2. నీరు.

నలిని. సం. వి. ఈ. స్త్రీ. 1. తామర; 2. తామరకొలను; 3. తామరతీఁగ; 4. తామరతంపర; 5. మిన్నేఱు.

నలియు. దే. అ. క్రి. నలఁగు. "వ. ప్రక్కలునలిసియుఁడొక్కలునులిసియు." ఉ, హరి. 3, ఆ.

నలు. దే. స. వృత్తియందు హల్లుపరమగుచో నాలుగున కాదేశముగావచ్చురూపము. (ఉదా. నలుగడ, నలుమూల. మొ.)

నలుఁగు. దే. అ. క్రి. నలియుగు. (నలఁగుయొక్కరూపాంతరము.) వి. 1. స్నానమప్పుడుమేనటాచుకొనుటకు కొన్ని గంధద్రవ్యములుచేర్చి నూఱినపిండి, ఉద్వర్తనము; "నున్నఁదనంబుగానలుఁగుబెట్టియు." భార. విరా. ౨, ఆ.—2. స్నానమప్పుడు పెండ్లికూఁతునకును పెండ్లికొడుకునకును మేననలుఁగుపిండి పెట్టినలఁచుట. "క. అంతట నృపుఁడంతఃపుర, కాంతలఁగుంకుమహిమాంబుకస్తూరికలఁ, వింతగనలుంగులిడుమని, కుంతీసందనులఁబెండ్లికొడుకులఁబొఁ." పాంచా. ౪, ఆ.

నలుఁగుడు. దే. వి. నలఁగుడుయొక్కరూపాంతరము.

నలుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకరాజు; 2. ఒక వానరుఁడు; 3. పితృదేవత.

నలుకువ. దే. వి. 1. రోగము; 2. బాధ. "వ. కావుననలుకనలుకువకునిలుకడయగుటందానివిడువవలయు." య. 3, ఆ.

నలుగురు. దే. స. నాలుగునకు మహన్మహత్త్వార్థక బహువచనాంతాదేశము.

నలుచు. దే. ప్రే. నలియఁజేయు.

నలుతుము. ద్వ. వి. (నాలుగు+తూము.) నాలుగు తూములు, ద్రోణము.

నలుపు. యు. దే. ప్రే. నలుచుయొక్క రూపాంతరము. వై. వి. నీలవర్ణము. విణ. నీలవర్ణముగలది. "గీ. జ్యోత్స్నయాఁగదమిస్రనానుభయభార్య, లుడుపతికినందునొక తెతెల్పొర్తునలుపు." నై. ౮ ఆ.

నలువ. ద్వ. వి. (నాలుగు+వా.) బ్రహ్మ, చతుర్ముఖుఁడు.

నలువండ్రు. ద్వ. స. నలువదిమంది. (నలువదికి మహన్మహత్త్వార్థకరూపము.)

నలువది. ద్వ. స. (నాలుగు+పది.) నాలుగుపదులు.

నలువు. దే. వి. 1. ఒప్పిదము; "ఎ, గీ. నవవిధంబైన హరిభక్తినలువుమెఱసి." (ఇక్కడ నలువుమెఱసి అనఁగా నలువై అని యర్థము.) పర. ౨, ఆ.—2. సామర్థ్యము. "వ. వలచుట్టునంజెట్టుదండగొని నిలువనలువుగలపుళిందులఁగొందఱనిలిపి." స్వా. ౪, ఆ.—విణ. ఒప్పిదమైనది.

నలువురు. దే. స. నలుగురుయొక్కరూపాంతరము.

నలుసాల. ద్వ. వి. (నాలుగు+సాల.) చుట్టుకొల్లారు.

నలుసు. దే. వి. తృణాదిలేశము, రేణువు. "చ. సురలకుగుండెతల్లడము శూరులడెందములోని కొఱ్ఱు ఖే, చరతతికంటిలోనలుసు సాధ్యులకొంగ ననున్నచిచ్చు భూ, సురులకు సెల్లనాఁడు మెడఁజుట్టినపాము మునీంద్రకోటిపైఁ, బొరిఁబడనున్న యాపిడుగుఁ బొల్పఱఁజేసితినీవురాఘవా." యు, కాం.

నల్గురు. దే. స. నలుగురుయొక్కరూపాంతరము.

నల్తుము. ద్వ. వి. నలుతుముయొక్కరూపాంతరము.

నల్ల. యు. దే. వి. నెత్తురు. "నల్లద్రావుడుదొర." అచ్చ. సుం, కాం.—వై. 1. నలుపు; "గీ. అమ్మహాశ్వంబుధవళదేహంబునందు నల్లగలిగిననీవిప్పు నాకుదాసి, వగుము." భార. ఆది. ౨, ఆ.—2. బొగ్గు*. విణ. నలుపైనది. "ఈ నల్లతిరునామమె

చటదొరక." జై. 3, ఆ.—[నల్ల అను విశేషణము ముందుగల సంజ్ఞావాచకశబ్దములు.—నల్లకచోరము, (చోరము!.) నల్లగగ్గర, (కతింజరము!.) నల్లగటిక, (బాలతృణము!.) నల్లగలుప, (ఇందీవరము.) నల్లగింటెన, (నీలపుష్పి!.) నల్లగినియ, (గినియ!.) (గినియనే నల్లగినియయుందురు.) నల్లగిసియ, (అతసి!.) నల్లగురిగింజె, (కృష్ణపాకి.) నల్లగురిజె, (కృష్ణగుంజ!.) నల్లగూబ, (కృతమూలకము.) నల్లగొలిమిడి, (నీలదూర్వ!.) నల్లగోరఁట, (ఆర్తగళము!.) నల్లచీమ, (మర్కటపిపీలిక.) నల్లచెఱకు, (అనిక్షువు!.) నల్లచేమ, (కృష్ణాలుకము!.) నల్లజీలకఱ్ఱ, (కారవి.) నల్లతుమికి, (కాకతిందుకము!.) నల్లతెగడ, (కాలమేషిక!.) నల్లతోఁటకూర, (కాలమారిషము!.) నల్లచెరిసెనము, (ఇరుగుడు!.) నల్లదోమ, (తీక్ష్ణతుండము.) నల్లనేలగుమ్ముడు, (క్షీరవిదారి!.) నల్లపిచ్చుక, (పోతకి.) నల్లపులుగుడు, (కృష్ణకాంభోజి!.) నల్లపెసలు, (శింబికము.) నల్లబుడుసర, (కాకమాచి!.) నల్లమద్ది, (అశ్వకర్ణము!.) నల్లయిరుగుడు, (కృష్ణశింశప!.) నల్లయుప్పి, (దుర్ధర్ష!.) నల్లయుమ్మెత్త, (హేమిక!.) నల్లరఁటి, (కృష్ణరంభ!.) నల్లవావిలి, (శేఫాలిక!.) నల్లవెదురు, (కృష్ణసారకము!.) నల్లావలు, (రాజిక.)]

నల్లగ్రుడ్డు. ద్వ. వి. కంటిలోని నల్లనిగ్రుడ్డు, కనీనిక.

నల్లచ్చిగాఁడు. ద్వ. వి. (నల్ల+లచ్చెనము+కాఁడు.) పక్షివిశేషము, భరద్వాజము.

నల్లతీఁగ. వై. వి. కమ్మెరాకుతీఁగ, కృష్ణవల్లి.

నల్లదాసరిగాఁడు. ద్వ. వి. (నల్లదాసరి+కాఁడు.) తాఁబేలు, కమఠము. (చూ. గండె.)

నల్లద్రావుడు. దే. వి. (నల్ల + త్రావుడు.) రాక్షసుఁడు, అస్రపుఁడు. "ఎ, గీ. అల్లనల్లద్రావుడు మూఁకలఁద్రెళ్లఁజేసి." అచ్చ. అర, కాం.

నల్లన. వై. వి. నలుపు, కృష్ణవర్ణము. (విశేషణమగుచో. "ఉ. నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబుపైఁ, జల్లెడువాఁడుమాళిపరిసర్పిత పింఛమువాఁడు నవ్వురా, జిల్లెడుమోమువాఁడొకఁడు చెల్వలమానధనంబుఁదెచ్చెనో, మల్లియలారమీపొదలమాటున లేఁడుగదమ్మచెప్పరే." భాగ. ౧౦, స్కం. పూ. చూ. అలకన.)

నల్లనయ్య. వై. వి. (నల్లని+అయ్య.) కతివేల్పు, కృష్ణుఁడు. "ద్వి. అన్ననీవిపుడునన్నడిగిన వెల్ల, నన్నల్లనయ్యమాయానాటకంబు." విష్ణు. పూ. ౧, ఆ.

నల్లపూస. ద్వ. వి. కొందఱు ముత్తయిదువలుగ్రుచ్చి మెడనుగట్టుకొనెడు చిన్న నల్ల గాజుపూస.

నల్లమందు. ద్వ. వి. అభిని.

నల్లమడుఁగు. ద్వ. వి. మిక్కిలి లోఁతుగలమడువు.

నల్లపడు. వై. అ. క్రి. (నల్ల+పడు.) నల్లనగు.

నల్లవలువతాలుపు. ద్వ. వి. బలరాముఁడు, నీలాంబరుఁడు.

నల్లవో. దే. అవ్య. ఔరా. "ఉ. నల్లవోనిక్కమాడెన్నృపనందనుముందటద్రోణుఁడొక్కఁడుఙ." భార. విరా. ౪, ఆ. (రూ. నల్లవో. "గీ. ఇంతప్రొద్దుకిరీటికట్టెదురనిలువ, వెఱవకున్నపుద్రోణుండవింటివాఁడు, నల్లవోతనయున్న సేనకునొకండ, బలిమిఁదలమీఱనేయిట్లునిలువవలదె." భార. విరా. ౫, ఆ.)

నల్లి. దే. వి. (నల్ల+ఇ.) పఱుపులయందుండి నెత్తురుత్రాగెడుపురుగు, మత్కుణము.

నల్లిండ్లు. దే. వి. బ. (నల్ల+ఇండ్లు.) అగ్రహారము. "క. సుతుఁడునుగుడినిధిచెఱువును, గృతియును నల్లిండ్లువనముక్షితిలోపలసం, తతులిందులోనగానన్నఁగఁ, గృతివలనంగలుగునంద్రుకీర్తియుగతియుఙ." మై. ౧, ఆ. (ఔపాసనధూమముచే నల్లనివని యొఱుంగునది.)

నల్లిక. దే. వి. నలికండ్లపాము.

నల్లె. దే. వి. జేన. (చూ. అంటసిల్లు.)

నల్లెరు. దే. వి. నల్లేరుయొక్కరూపాంతరము.

నల్లేరు. దే. వి. ఒకదినుసుతీఁగ, వజ్రవల్లి.

నల్వది. ద్వ. స. నలువదియొక్కరూపాంతరము.

నల్వము. సం. వి. అ. పుం. నన్నూఱుమూరలదూరము.

నల్వురు. దే. స. నలుఁవురుయొక్కరూపాంతరము.

నవ. దే. వి. జిల, దురద, కండూతి.

నవటాకు. హిం. వి. సేరులో ఎనిమిదవవంతు.

నవఁత. దే. వి. 1. నవయుట; "ద్వి. తెవులునుముదిమియుఁదీవ్రవేదనయు, నవఁతయులేనిప్రాణంబులుగాన." రా. కిష్కిం, కాం.—2. దుఃఖము. "ద్వి. నారచీరలుజడల్ నవఁతమైఁదాల్చి, నారాకఁగోరుచున్నమహామహుండు." రా. అర, కాం. (అలఁతవంటిది.)

నవకము. ఊభ. దే. వి. మృదుత్వము. "గీ. నవశిరీష సుమంబులనవకమునకు, నన్నదమ్ములుఁవోనినీయ డుగుఁదమ్ము, లెంతదూరమ్మునడిపింపనిచ్చగించె, నో కా-నిర్దయమైననీయుల్లమిపుడు." సై. 3, ఆ.—సం. అ. న. తొమ్మిది.
నవక్షారము. సం. వి. అ. పుం. నవాసారము.
నవగోజె. దే. వి. పెద్దగుడారము.
నవతి. సం. స. ఇ. స్త్రీ. తొంబది.
నవనము. సం. వి. అ. న. స్తోత్రము, పొగడ్త.
నవనీతము. సం. వి. అ. న. అప్పుడు చిలికియెత్తినవెన్న.
నవమము. సం. విశ. (అ. ఈ. అ.) తొమ్మిదవది.
నవమాలిక. సం. వి. ఆ. స్త్రీ. విరజాజి.
నవమి. సం. వి. ఈ. స్త్రీ. పక్షమునందు తొమ్మిదవ తిథి. విశ. తొమ్మిదవది.
నవము. సం. వి. అ. పుం. స్తోత్రము. విశ. క్రొత్త.
నవయు. దే. అ. క్రి. 1. (రోగాదులచేత) కృశించు; "క. అనిలనందనుఁడు మహా, ద్వేగాత్ముఁడగు చుడస్సిన, నాగముక్రియనుండకున్నె నవసివన మునన్." భార. అర. ౫, ఆ.—2. శుష్కించు. "సీ. వెడలునిట్టూర్పులవేఁడిమినవసినయధరపల్లవముకారాకుఁబోల." భార. అర. 2, ఆ.
నవరంగము. సం. వి. అ. న. గృహవిశేషము. "మ. విద్వద్వదనాంతరాళనవరంగక్షోణిరాణించును, జ్జ్వల వజ్రవ్రజశంఖసంఘనిభ భాషాయోషజీవస్థలిన్." పాండు. ౫, ఆ.
నవరు. దే. వి. నగరుయొక్క రూపాంతరము. "క. వివిధోత్సాతంబులకున్, నవళ్లలోఁదోఁచుకీడునకుఁ దోడ్తోశాం, తివిధానంబుననిరసన, మవునుబురోహితునిచేతననవరతంబున్." భార. శాం. ౨, ఆ.
నవల. దే. వి. ఆఁడుది, ఇంతి. "క. అన్నవలముద్దుమోమును, దిన్ననిచెన్నడుము నగవు దేటెడుకన్నుల్." విక్ర. ౫, ఆ. (రూ. నవలా. "మ. నతనాభిన్నవలాసెకాసెకమరున్నారీ శిరోరత్నమున్." స్వా. ౨, ఆ.)
నవాతు. దే. వి. మిక్కిలి తెల్లనిగడ్డచక్కెర. (చూ. తవర.)
నవారు. హిం. వి. మంచమునకల్లునూలుపట్టె.
నవాసారము. వై. వి. ఒకదినుసు ఉప్పు.
నవి. దే. వి. కరగోడపెట్టుటకు నిడుపున త్రవ్వియెత్తినమట్టిపెల్లము.
నవీనము. సం. విశ. (అ.ఆ.అ.) నూతనము, క్రొత్త.
నవుకరి. హిం. వి. కొలువు.
నవుకరు. హిం. వి. కొలువుకాఁడు.
నవ్యము. సం. విశ. (అ.ఆ.అ.) 1. నవీనము; 2. నుతింపఁదగినది.
నవ్వు. దే. అ. క్రి. 1. హసించు; 2. వికసించు. "ఎ. గీ. చూతపున్నాగకురవకాశోకతరులు, నవ్వెనవ్వులుపువ్వులైనివ్వటిల్ల." రామా. ౨, ఆ. (ఇది పై రెండర్థములకు నుదాహరణము.) — స. క్రి. 1. పరిహసించు; "ఉ. అవ్వలనెన్నిలేవిట మహాగహనంబునఁగుంజప్రవృత్తముల్, దవ్వులెయిప్పుడున్నయదిదామనకుండగుకాణయాచియే యివ్విధిమున్నయేనెఱిఁగి యెంతయుఁజెప్పననాదరంబుతో, నవ్వితిగానిపుట్టదుమనంబునమీఁదటిహానిధీనిధీ." పంచ. నా. ౧, ఆ —2. అపహసించు 'గీ. నువ్వుఁబువ్వునవ్వుజవ్వనినాసిక." విజ. ౧, ఆ.—వి. 1. హాసము; 2. వికాసము; (చూ. హసించు, వికసించు అను నర్థముల యుదాహరణము.) 3. పరిహాసము; "క. అనృతముపాతకమగునై, ననువనితలయెడను బెండ్లినవ్వునమృతివచ్చినసర్వధనముచెడుచో, వినుమదిపాపంబుగాదువిమలచరిత్రా." సం "ననర్మయుక్తమనృతం హినస్తి నస్త్రీషురాజన్నవివాహకాలే, నగుర్వర్థేనాత్మనోజీవితార్థే పంచానృతాన్యాహురపాతకాని." భార. శాం. 3, ఆ. — 4. అపహాసము (వాని బ్రతుకు నవ్వులపాలైనది.)
నవ్వుఁబాటు. ద్వి. వి. (నవ్వు+పాటు.) నగుఁబాటు అపహాసము, "ఎ. గీ. నాకతంబునవచ్చిననవ్వుఁబాటు, మాటువడఁజేసినీకూర్మిమగనిఁదెత్తు." ఉ హరి. ౫, ఆ.
నవ్వుటాల. దే. వి. నవ్వులాటయొక్క మాఱురూపము. "ఉ. సావుడునవ్వుటాలకనినన్ బవనాత్మజయింతయేటికిన్." భార. ఉద్యో. 3, ఆ 'రామస్వామితోనవ్వుటాలటులొక్కమ్మునఁదిక్కొరద్వయమువ్రయ్యంజేసె." (నవ్వుటాల—నవ్వుటాలగా.) అధ్యా. అర, కాం.
నవ్వులబండి. దే. విశ. నవ్వెడు స్వభావముకలది
నవ్వులాట. దే. వి. (నవ్వులు+ఆట.) పరిహాసము
నశించు. సం. అ. క్రి. నాశమగు.
నశ్వరము. సం. విశ. (అ. ఆ. అ.) నశించునది.
నష్టము. సం. విశ. (అ.ఆ.అ.) 1. నాశమునొందినది, 2. మఱుఁగుపడినది.
నష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. నాశము; 2. ద్రవ్యనాశము.

నస. ఉభ. దే. వి. 1. దురద; 2. ఉపద్రవము. (ప్రొద్దునలేచిన నీ నస నాకు పెద్దదిగానున్నది.) సం. ఆ. స్త్రీ. నాసిక.

నసగూఁటి. దే. విణ. (నసగూఁడు+ఇ.) కామోద్రేకముకలది, జారిణి. "సీ. విసవెత్తికసరెత్తియొసరేఁగునసగూఁటి పూఁబోండ్లు తమయిండ్లపొంతకరుగ." హంస. ౧, ఆ.

నసగూఁడు. దే. వి. కామోద్రేకము. "నసగూఁటఁగదుఁక జపలస్వభావలై." పంచ. నా. ౨, ఆ.

నసిమిరి. దే. వి. దురద, కండూతి.

నసుకు. దే. వి. అసత్యపుమాట. విణ. అసత్యము.

నస్తితము. సం. వి. అ. పుం. ముక్కుద్రాడుకుట్టిన యెద్దు.

నస్యోతము. సం. వి. అ. పుం.——పై.——

నళ. సం. వి. అ. పుం. సంవత్సరవిశేషము. (చూ. సంవత్సరము.)

## నా.

నా. దే. స. నేను అనుదానికి ప్రాతిపదికము.

నాంచారు. అర. వి. ఒకదేవత.

నాంది. సం. వి. ఈ. స్త్రీ. 1. దేవతలు బ్రాహ్మణులు లోనగువారు చేయునట్టి ఆశీర్వాదము; 2. నాటకప్రారంభమునందు జరపెడు మంగళము; 3. భేరి.

నాందీకరుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఆశీర్వాదముచేయువాఁడు; 2. భేరివాయించువాఁడు.

నాందీవాది. సం. విణ. (న్. ఈ. న్.)——పై.——

నాఁగటిచాలుకూర. ద్వి. వి. తటిగొట్టి, లాంగలికి.

నాఁగటిచాలుపేరియతివ. ద్వి. వి. సీత. "క. కన్నియతలమానికమగు, నన్నాఁగటిచాలుపేరియతివనుసిరికిం, బెన్నుద్దిసెత్తుకొనిచని, యెన్నిచుఁడురథముమీఁదనిడుకొనికడిమిన్." రామా. ౫, ఆ.

నాఁగటిచిప్ప. ద్వి. వి. (నాఁగలి+చిప్ప.) (నాఁగటి) పణత.

నాఁగటిజోదు. వై. వి. (నాఁగలి+జోదు.) బలరాముఁడు, హలాయుధుఁడు. "ఉ. లాలసరీగజాంకుశుఁడులావుననాఁగటిజోదునైనఁగెం, గేలనెగీటడంచిబలుగెల్పుఁబయిండి నెలంతసేలుకోఁ, జాలినవాఁడు." య. ౧, ఆ.

నాఁగటిదుంప. ద్వి. వి. (నాఁగలి+దుంప.) (చూ. నాఁగటిచిప్ప.)

నాఁగలి. వై. వి. దున్నెడుసాధనము; లాంగలము. "గీ. స్కంధపీఠంబుమీఁదనాఁగలిదగిల్చి." హరి. ఉ. ౧, ఆ.

నాఁగు. దే. వి. ధాన్యమునకు వడ్డిగానిచ్చు ధాన్యము. "సీ. అచటి రెడ్డికొమాళ్లు నలహాలాయుధపాణి నాఁగునకడుగుధాన్యంబుకొంత." పాంచా. ౧, ఆ.

నాఁగురు. వై. వి. నాగినికి.

నాఁగెలు. వై. వి. నాఁగలియొక్క రూపాంతరము.

నాఁగేలు. వై. వి. నాఁగెలుయొక్క రూపాంతరము.

నాఁచికోలు. దే. వి. (నాఁచికొనుట.) అపహరించుకొనుట. "ఉ. ఫల్గునుఁడందఱిమీఁతి సైంధవ, ప్రాణమునాఁచికోలునరపాలతలంపఁగమర్త్యకృత్యమే." భార. శల్య. ౧, ఆ.

నాఁచు. దే. స. క్రి. అపహరించు. "ఉ. వీఁడుగదమ్మ నాహృదయవిత్తమునాఁచినవాఁడునుగ్మలీ." అని. ౨, ఆ.—వి. తీఁగపాఁచి, కుంభిక.

నాఁడు. దే. వి. 1. ఆకాలము; "ఉ. వేఁడినవేఁడిమాటన్నృపవీరుఁడుసైఁపకకర్ణరంధ్రముల్, చూఁడినభంగిఁదాఁకుటయు స్రుక్కిమనంబున నొచ్చినిన్ననే, నాఁడున్నృపాలపుత్త్రివని నమ్మివరించితిఁగాకయిమ్మెయిన్, నేఁడొకకాలసర్పమయినీవిటుసేయుటనాకుఁదోఁచునే." రా. అ, కాం.— 2. ఆదినము. "క. నాఁటికయిదేండ్లవాఁడను, మాటవినికృతంబుదలఁచి మానసమునన, త్తోఁటులమీఁదనుబండులు, గీఁటుకొనుచు దుష్టబుద్ధికృత్రిమబుద్ధిన్." జై. ౮, ఆ. [నాఁడు అనుటకు అనాఁడు అనియు నొకానొకచోట ప్రయోగము కానఁబడుచున్నది. "క. ఏనాఁడుబ్రహ్మపుట్టెనొ, యేనాఁడుప్రజాసమృద్ధినిద్ధరగనెనో, యానాఁడెనిలువనీడని, యీనీడముఁగట్టితిన్ నరేశ్వరయనినన్." ఉ, రా. ౭, ఆ. వృత్తియందు కేవల కాలవాచకమును దినవాచకమునగు. "చిన్ననాఁడు." "నానాఁడు." మొ. ప్రామాణిక కవిప్రయోగములందిది నిర్బిందువుగానును గానంబడియెడి. "క. మీటుగలరథికులనొక, నాటికివేవురవధింతునరుశరములునో, నాటిపడవైచునంతకు, వేఁటాడెదఁబ్రతిబలంబు వీరులనెల్లన్." ("మీటుగలరాజరథికుల, నాటికివేవురవధింతు" అని వ్రాఁతప్రతులయందు పాఠము కనఁబడుచున్నది.) భార. ఉద్యో. ౪, ఆ. "ఉ. నాటికిసెట్టిదైవఘటనంబుననో నిను నెల్లకొంతయున్, గాటపుఁగోపమున్ బెనుపఁగాఁదనునమ్మెయి నంటిఁగాకపూఁ, దోఁటకుఁజేరఁ గాంత్రుమనతొల్లిటివారలురేరనీవిధుం, జేటికిఁజోఁ

గావలయునీవటుపోవఁగనేలకూఁతురా." కళా. ౪, ఆ. మఱియు చూ. రెన్నాళ్లు, మూన్నాళ్లు. మొ.] 3. కాలము. (ఆనాఁడు, ఏనాఁడు, ఎల్లనాఁడు.)

నాఁడెము. వై. వి. నాణెమునకు మొదటిరూపము. (చూ. నాణెకత్తె, నాణెకాఁడు.)

నాఁపతాయి. దే. వి. (నాము+తాయి.) విపశిల. (దీనిని త్రొక్కినను ఆ చోట నెప్పికలుగును.)

నాకబలి. సం. వి. ఇ. పుం.(చూ.)నాగవల్లి. "పాలుపు మీఁటఁగనాకబలికృత్యములుసల్పి." కళా. ౭, ఆ.

నాకము. సం. వి. అ. పుం. 1. స్వర్గము; 2. ఆకాశము.

నాకిని. సం. వి. ఈ. స్త్రీ. దేవతాస్త్రీ.

నాకు. దే. స. క్రి. లేహనముచేయు.

నాకులి. సం. వి. ఈ. స్త్రీ. సర్పాక్షి?.

నాకువు. సం. వి. ఉ. పుం. 1. పుట్ట; 2. కొండ; 3. ముని.

నాకేశుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

నాక్రము. సం. వి. అ. పుం. నక్రముయొక్క ముఖమువంటి ముఖముగల నక్క.

నాగ. వై. విశే. 1. పూజ్యము*; (నాగబెత్తము. మొ.) 2. పెద్ద*. (నాగగన్నెరు. మొ.)

నాగఁడు. వై. వి. శేషుఁడు.

నాగకేసరము. సం. వి. అ. పుం. ఒకానొకచెట్టు.

నాగకేసరులు. ద్వి. వి. బ. ధాన్యవిశేషము.

నాగగన్నెరు. ద్వి. వి. ఒకదినుసు గన్నేరు. "నాగగన్నెరులు మూనాళ్లసొబగు." భల్లా. 3, ఆ.

నాగజిహ్విక. సం. వి. ఆ. స్త్రీ. మణిసిల.

నాగదంతకము. సం. వి. అ. పుం. గొండ్లెముతగిలించెడు నాగవాసము.

నాగదాళి. దే. వి. ఒకదినుసు ముండ్లచెట్టు.

నాగనేరెడు. ద్వి. వి. ఒకదినుసు నేరేడు?.

నాగపడగలదండ. మి. గ్రా. వి స్త్రీకంఠభూషావిశేషము. "ద్వి. భాసురంబగునాగపడగలదండ, యాసలఁజేరె నచ్యుతివ నీదండ." భాగ. ౧౦, స్కం. (చూ. నాగపడగలు.)

నాగపడగలు. మి. గ్రా. వి. బ. పాఁపపడగవలె నేర్పడియుండు కర్ణభూషావిశేషము.

నాగపసాని. వై. వి. నాగవల్లినడపెడు ముత్తయిదువ.

నాగపాశము. సం. వి. అ. పుం. 1. వరుణునియాయుధము; 2. రతబంధవిశేషము.

నాగపెంటెర. ద్వి. వి. ఒకదినుసు పెంటెర.

నాగప్పసాని. వై. వి. నాగపసానియొక్క రూపాంతరము.

నాగబంధము. వై. వి. సర్పాకారరచన. (చూ. ఎగపు.)

నాగబల. సం. వి. ఆ. స్త్రీ. బీఅ?.

నాగబెత్తము. వై. వి. పొన్నువేసి మంత్రపూతమైన చిన్న పేము. "చ. లలితపుబూదిపూఁతయును లాతపుఁగోలయుఁ గక్షపాలయుఁ, మలగొనుచిన్నికెంజడలు మంతులపొత్తము నాగబెత్తముఁ, లలిగనుపట్టుకిన్నెరయు లాహిరిమోదము సింగినాదముఁ, జెలువలరంగనొప్పనొకసిద్ధుఁడు సింగపువారువంబుతోఁ." కళా. ౨, ఆ.

నాగమల్లె. వై. వి. ఒకదినుసు మల్లె, అష్టపత్రిక.

నాగము. సం. వి. అ. న. 1. సత్తు; 2. తగరము; 3. రతబంధవిశేషము. పుం. 1. పాము; 2. ఏనుఁగు; 3. కొండ; 4. గ్రహము; 5. గొండ్లెము తగిలించెడు నాగవాసము; 6. మబ్బు; 7. ఒక ఉపవాయువు; (చూ. వాయువు.) 8. ముస్తె?; 9. నాగకేసరము?; 10. పొన్న?; 11. (ఉత్తరపదమైనపుడు) శ్రేష్ఠము. (అష్టనాగములు. అనంతుఁడు, వాసుకి, తక్షకుఁడు, శంఖపాలుఁడు, కులికుఁడు, పద్ముఁడు, మహాపద్ముఁడు, కర్కోటకుఁడు.)

నాగముస్తె. వై. వి. భద్రముస్తకము?.

నాగరంగము. సం. వి. అ. పుం. నారంగము, నారింజ?.

నాగరము. సం. వి. అ. న. 1. సొంటి; 2. ముస్తె?; 3. నాగరదేశీయాక్షరము. పుం. గోరంట?. విశే. నగరమునఁబుట్టినది.

నాగరికత. సం. వి. ఆ. స్త్రీ. నాణెము.

నాగరికము. సం. విశే. (అ. ఆ. అ.) నాణెమైనది.

నాగలోకము. సం. వి. అ. పుం. పాతాళము.

నాగవము. సం. వి. అ. న. ఒకకరణము. (చూ. కరణము.)

నాగవలి. వై. వి. నాగవల్లియొక్క రూపాంతరము.

నాగవల్లి. ఉభ. వై. వి. పెండ్లిలో నాలవనాఁడు జరుగు శుభకార్యము. "గీ. నాగవల్లిమించెనానామనీషిపు, న్నాగవల్లికిచ్చుబాగుదీర్చి, త్యాగమెల్లియనుచుఁదక్కువారలాసంగు, నాగవల్లిమాత్రనాఁ దలంప." పాంచా. ౪, ఆ.—సం. ఈ. స్త్రీ. తమలపాకుతీఁగ. (దీని తోడిమవ్యాధికరము.)

నాగవాసము. ఉభ. దే. వి. గొండ్లెముతగిలించెడు రెండు కొనలువంచిన యినుపకమ్మి. వై. 1. వేశ్యాసమూహము*; "సీ. ననుపుకాఁడయిపేల్పు

నాగవాసముఁగూడిమహిమగోల్పడియె నేమాం డకర్ణి." స్వా. ౨, ఆ.—2. ఆటమేళము*. "సీ. నాఁడెంపుఁగోటలనాగవాసంబులఁగొమ్మలుఁగొమ్మలుగొనబునూప." అచ్చ. బాల, కాం.—సం అ. పుం. నాగలోకము.

నాగసంభవము. సం. వి. అ. న. సిందూరము.

నాగసరము. వై. వి. 1. పాములవాఁడు ఊఁదెడుబుఱ్ఱ; 2. సన్నాయి*. "ద్వి. కంచుకొమ్ములుబూరిగలునాగసరము, లంచితపటహకాహళములుసరుమ." నల. ౨, భా.

నాగసుగంధ. సం. వి. ఆ. స్త్రీ. సర్పాక్షి?.

నాగస్వరము. సం. వి. అ. పుం. పాములవాఁడు ఊఁదెడుబుఱ్ఱ.

నాగా. హిం. వి. శూన్యము, సున్న, విడిచిపెట్టఁబడినది.

నాగాంతకుఁడు. సం. వి. అ. పుం. గరుత్మంతుఁడు.

నాగిని. ఉభ. వై. వి. లోకాంతరముపొంది దేవతాత్వమువహించిన ముత్తయిదువ. సం. ఈ. స్త్రీ. గొల్లజిడ్డు?.

నాగుఁబాము. ద్వ. వి. (నాగు+పాము.) నాగము.

నాగులు. వై. వి. బ. నాగుఁబాము. "నాగులచవుతి వ్రతము." క్షేత్రయ.

నాగువు. వై. వి. నాగుఁబాము. "గీ. పాతకముచేసిర్యైనునుబరితపించి, ధరణిదానంబుచేసినధన్యుఁడను చు, నయ్యఘముఁదథ్యమిడినిర్జరాధినాథ, కుబుసమూడ్చినమేటినాగువునుబోలె." భీ. ౫, ఆ.

నాగోదము. సం. వి. అ. న. ఉదరత్రాణము.

నాజూకు. హిం. విశే. సున్నితమైన, నాణ్యమైన.

నాట. సం. వి. అ. పుం. రాగవిశేషము.

నాటకము. ఉభ. వై. వి. 1. నర్తనము; "దండకము. పెన్నాటకంబైనక్రొల్లన్నులన్." పాండు. ౪, ఆ.—2. ప్రవర్తనము*. "గీ. పుండరీకాక్షునకుశౌరి పూజలిచ్చి, సంయములుచూడబదరికాశ్రమము నందు, నాఁగవిందుమయ్యిరువురనాటకంబుఁ, జెప్పిచెవులకుఁబండువుసేయుమనఘ." ఉ, హరి. ౨, ఆ.—సం. అ. న. నాట్యప్రధానమైపద్యగద్యాత్మకమైనగ్రంథవిశేషము. (ఇవి.—౧౦. నాటకము; ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము, వ్యాయోగము, సమవాకారము, వీథి, అంకము, ఈహామృగము.) పుం, న. నాటకగ్రంథముయొక్కనాట్యము.

నాటకసాల. వై. వి. నాట్యశాల. "చ. చిలుకలకొల్కికల్కియొక చేడియనాటకసాలమేడపై, నిలువుననాడుచుండి." స్వా. ౫, ఆ.

నాటు. దే. అ. క్రి. గ్రుచ్చుకొను. "క. మీటుగలరథికులను నొక, నాటికి వేవురవధింతునరుశరములనో, నాటిపడవైచునంతకు, వేఁటాడెదఁబ్రతిబలంబువీరులనెల్లన్." భార. ఉద్యో. ౪, ఆ.—అం, ప్రే. గ్రుచ్చు. "శక్తిదళకంబవ్వీరుపైనాటినన్." ఉ, హరి. 3, ఆ.—స. క్రి. (నేలను) నాఁటులోనగువానిగ్రుచ్చు. "ఎ, గీ. నాటెమందారతరువులుతోఁటలందు." భీ. ౫, ఆ.—వి. 1. నాట్నము; (ఆచేనియందు నాటు ముగిసినదా.) 2. నాటుట. "మున్పడినయహార్యకూటములునాటిననాటులవెంబడిన్." చంద్రా. ౧, ఆ.

నాటుకొను. దే. అ. క్రి. నెలకొను. "గీ. నాటనుండియుఁగంనుండునాటుకొన్న, దిగులుపెంపునవనుదేవదేవకులను, మిగులఁబదిలంబుగావించిమెదలనీక, యొక్కకారాగృహంబుననునిచియుండె." వి, పు. ౭, ఆ. (ప్రే. నాటుకొలుపు.) "క. ఆమాటమదినిబెట్టక, నామీఁదంగనికరంబు నాటుకొలుపుచున్, వేమొనలుతెచ్చిరక్కసి, గామిడిఁగడపుమనియతనికడఁగడుఁజెపుమా." అచ్చ. సుం, కాం.

నాటుపురము. అర. వి. పల్లెటూరు.

నాట్నము. దే. వి. నాఁటులోనగువానినాటుట. (దీనికి మొదటిరూపము నాటనము.)

నాట్యము. సం. వి. అ. న. 1. నృత్యము; 2. నృత్తగీతవాద్యములకూడిక.

నాడా. హిం. వి. సన్ననినూలుపట్టె.

నాడి. సం. వి. ఈ. స్త్రీ. 1. నరము; 2. గడియకాలము; 3. నారికురుపు; 4. ఈనె; 5. కాఁడ; 6. తెల్లగఱిక; 7. మోసకానినడక. (ప్రాణాయామవిషయమున నాడులుమూడు. ఇడ, పింగళ, సుషుమ్న.)

నాడింధముఁడు. సం. వి. అ. పుం. అగసాలెవాఁడు.

నాడిక. ఉభ. దే. వి. దేశము. "క. అన్నాతియు నొడయఁడునటు, లన్నారనినీవుకోన కరుడెంచినచో, నన్నాయన్నాడికనా, యన్నాసాకుకొనఁజాలునట్టిదెచెపుమా." అచ్చ. అ, కాం. (నాడుయొక్కరూపాంతరము.)— సం. ఆ. స్త్రీ. గడియకాలము.

నాడీవ్రణము. సం. వి. అ. పుం. నారికుఱుపు.

నాడు. దే. అ. క్రి. నాటు. "క. తోడనసహాయ సూతులసూ, నాడఁగ నేయుటయు నతఁడునలిగికడఁకవిల్, గ్రీడయుపోలఁ గొనిమెయి, నాడఁగనిగిడించెఁద్రిదశ నారాచంబుల్." భార. కర్ణ. ౨, ఆ.—వి. 1. దేశము; 2. జనపదము. "వ. ఇవ్విశ్వంభర నేద్వీపంబున నేదేశంబున నేనాట నేవీట నేత్రోవ నేక్రేవ నే వేళ నెవ్వండేమి సేయఁదలంచె." ఆము. ౪, ఆ.

నాడె. దే. వి. నడుమనూలికండెనుంచి నేసెడు సాలెవాని సాధనవిశేషము. (చూ. క్రోవికడ ఆ నుపోసెడుగొట్టము అనునర్థమునుదాహరణము.)

నాణకము. సం. వి. అ. న. రూపాయలోనగు నాణెము.

నాణెకత్తె. వై. విణ. (నాణెము + కత్తె.) నాణెము గలది. (మొదటిరూపము నాఁడెకత్తె.)

నాణెకాఁడు. వై. విణ. (నాణెము + కాఁడు.) నాణెము గలవాఁడు. (మొదటిరూపము నాఁడెకాఁడు.)

నాణెము. వై. వి. 1. ముద్రింపఁబడిన రాగి వెండి బంగారములబిల్ల; 2. ఇచ్చిపుచ్చుకొనుటయందలి యోగ్యత*; 3. నాగరికత*. (నాఁడెముయొక్క రూపాంతరము.)

నాతము. దే. వి. బత్తెము. "ఉ. కొల్చిన పేదసాదలన్, దప్పనిజీతనాతములఁదన్పుట భూషణమయ్యెఁబుత్రకా." రా, వి. ౨, ఆ.

నాతి. దే. వి. ఆఁడుది. ఇంతి.

నాతుక. దే. వి. (నాతి + ఉక.) నాతియొక్క రూపాంతరము. (స్వార్థమున ఉక.)

నాదము. సం. వి. అ. పుం. ధ్వని, మ్రోఁత.

నాదారు. హిం. విణ. లేమిడిగల, చిక్కిన.

నాదించు. సం. అ. క్రి. మ్రోఁగు. "గీ. గంటనాదించినవితాన గండు తేఁటి, మొరయుచందాన జలధరముఱుమురీతి, నురుమగించిన భాతి నయ్యుత్పలాక్షు, నారిరణమున మ్రోసె నాదారకపుడు." శశాం. ౫, ఆ.

నాదు. వై. వి. ధ్వని. "ఎ, గీ. నాదుమొలనూలిగంటలనాదువినక." సా. ౨, ఆ.

నాదేయము. సం. వి. అ. పుం. కైవడిముస్తె? విణ. నదీసంబంధమైనది.

నాదేయి. సం. వి. ఈ. స్త్రీ. 1. కిత్తలి?; 2. నారదము?; 3. తక్కిలి?; 4. దాసనము?; 5. నీరుప్రబ్బ?; 6. శాకినేరేడు?; 7. నేలనేరేడు?.

నాధము. సం. వి. అ. పుం. ముకుత్రాడు.

నాధవంతుఁడు. సం. విణ. (త్. ఈ. త్.) పరాధీనుఁడు.

నాధుఁడు. సం. వి. అ. పుం. 1. పెనిమిటి; 2. ఱేఁడు; 3. ఇంద్రుఁడు.

నాన. వై. వి. సిగ్గు*. "క. మాయయ్యకుఁబాయక పని, సేయుచుదీవించి ప్రియము సేయుచునుండుఁన్, మీయయ్యయేటిమహిమలు, నాయొద్దనెపలుక నీకునానయు లేదే." భార. ఆది. 3, ఆ.

నానఁబ్రాలు. దే. వి. (నానన్ + ప్రాలు.) నానబియ్యము.

నానగండ. వై. విణ. సిగ్గుమాలినవాఁడు. "చ. చిలుకలు గమ్మదెమ్మెరలు శీతమయూఖుఁడు దేఁటులాదిగాఁ, గలననవిల్తుసాధననికాయములేలము పట్టులంగనా, కులమటుగానదానివిడఁగొట్టకత్రుట్టికదొట్టవీతరా, గులమని విఱ్ఱవీఁగెదరు కొందఱు బోడలునానగండలై." పాండు. ౫ ఆ.

నానబియ్యము. దే. వి. (నానన్ + బియ్యము.) నానఁబెట్టిన క్రొత్తచేరుడుబియ్యము, లాజము.

నానారూపము. సం. విణ. (అ. ఈ. అ.) పలుదెఱఁగులుగలది.

నాను. దే. అ. క్రి. ద్రవద్రవ్యముసోఁకున బహుకాలముండు. వి. నానుక్రోవి.

నానుక్రోవి. దే. వి. కంఠాభరణవిశేషణము.

నానుచు. దే. ప్రే. నానఁజేయు. "గీ. అలరుదేనియనానిచి మొలకగట్టి." పాండు. 3, ఆ (రూ నాన్చు. చూ. కొరి.)

నానుడి. దే. వి. (నాను + నుడి.) 1. (చూ.) కింవదంతి, 2. సామెత. "చ. వింటలేదెయిం, టగెలిచిరిచ్చగెల్వుమనునానుడి నానుడి నిశ్చయంబగున్." సా. ౨, ఆ.

నానుడు. దే. విణ. తడిసినది. (నానుడు నేల.)

నానుడువాన. దే. వి. విడువకకురిసెడు పొడిపొడిచినుకులవర్షము.

నానుపు. దే. ప్రే. చేలువచేయు.

నానుబోర. దే. వి. మాంసముగల బొమ్మ.

నాన్తెల. దే. వి. భక్ష్యవిశేషము. (చూ. జంతిక)

నాపసాని. వై. వి. నాగపసానియొక్క రూపాంతరము. "ఉ. అప్పుడునాపసాని చతురశ్రికమండలి హేమకుంభికల్, ముప్పదిమూటిఁజొట్టునిడి ముత్తియముల్ ఘటియించితంతులం, దొప్పుగ

జుట్టి దేవతలినుత్కటభక్తి నిబొడుకొంచుఁదాఁ, జె ప్పినరీతి దంపతులఁ జేయఁగఁజేసెఁ దదర్థకృత్యముల్." భల్లా. ౪, ఆ.

నాపితుఁడు. సం. వి. అ. పుం. మంగలవాఁడు.

నాభి. సం. వి. ఇ. స్త్రీ. కస్తూరి. పుం, స్త్రీ. బొడ్డు. పుం. 1. వసనాభి; 2. బండికంటినడిమితూము; 3. తిలకము; 4. క్షత్రియుఁడు; 5. చక్రవర్తి.

నాభిజన్ముఁడు. సం. వి. న్. పుం. బ్రహ్మ, పొక్కిలిచూలి.

నామకరణము. సం. వి. అ. న. బిడ్డలకు పేరుపెట్టుట. (చూ. కర్మము.)

నామకా, నాముకా. గ్రా. క్రి. విణ. పేరుకు.

నామగుంట. ద్వి. వి. (నామము+గుంట.) గళగర్తము.

నామధేయము. సం. వి. అ. న. అభిధానము, పేరు.

నామమడఁచు. మి. స. క్రి. (నామము+అడఁచు.) చంపు. "క. జననియుఁదండ్రియుఁదొలుబా, మునఁజేసినపాపకర్మమునఁగాక మురియా, ధనుఁడు మొదలైననూర్వుర, ననఘుఁడుధర్మజుఁడునామము డఁపఁగఁదగునే." భార. స్త్రీ. ౨, ఆ.

నామము. ఉభ. దే. వి. నొసటపెట్టుకొనెడు బొట్టు. "ఎ, గీ. మంచికపురంపు గీఱునామములు దీర్చి." (ఇక్కడ స్త్రీ ప్రశంస.) చంద్ర. "మ. నొసలకొనామమొకింతదాల్చిననుజాలుకా నీకు సెవ్వారలై, ననుపూజ్యుల్." (ఇక్కడ పురుష ప్రశంస.) పర. 3, ఆ.—సం. న్. న. నామధేయము.

నామరులు. దే. వి. (నామము+మరులు.) పాచికలు. "చ. బలితపుఁ బద్మజాండ మనుపాళి ఘటించుట మీఁదఁబద్దజీ, వుల నెడుసారెలుంచి రహిపుట్టఁగ నమ్మిహిరేందు నామముల్, కలిగిననామరుల్లోని యలౌకికచిత్రదురోదరంబుగా, నలరమతోడనాడుకమలాత్ముఁడుమైకొనెఁగంటె జూదముల్." చమ. ౧, ఆ.

నామర్దా. హిం. విణ. పుంస్త్వములేనివాఁడు, పిరికివాఁడు.

నామా. హిం. వి. వ్రాతపూర్వకమైనది. (కరారునామా, రాజీనామా, వాకాలతునామా. మొ.)

నాము. దే. వి. తొన్నలోనగువానికొయ్యగాలున చిగిరించినమొలక. (దీనిని పసులుతిన్న ను మృతినొందును.)

నామూషీ, నామూషీ. హిం. వి. అవమానము.

నాయఁకరము. ద్వి. వి. (నాయఁకుఁడు + కరము.) అధిపత్యము. "దళవాయినాయఁకరపుఁబట్టము నవిలిచి." పాండు. ౧, ఆ.

నాయఁకవాడి. ద్వి. వి. సేద్యపుపనులను పరామరిక చేసెడు దివాణపుబంటు. (రూ. నాయఁకవాళి.)

నాయఁకుఁడు. వై. వి. 1. అధిపతి; "ఎ, గీ. ఎఱుకునాయంకుఁడొక్కరుఁడువచ్చి, పుడమిరా వేల్పురాయనికడనునిల్చి." చంద్రా. ౨, ఆ.— 2. పన్నిద్దఱుభటులకధిపతి*. "ద్వి. పిలువఁ, బుచ్చెనాయఁకులనప్పుడపడవాళ్ళ." రా, యు, కాం.

నాయఁడు. వై. వి. 1. ప్రభువు; "గొల్లలనాయఁడైపరఁగుకుంభకుమంద." నీలా. ౨, ఆ.—2. బలిజెలులోనగువారి పట్టపుఁబేరు*.

నాయకము. సం. వి. అ. పుం. పతకమునడిమిరత్నము.

నాయకుఁడు. సం. వి. అ. పుం. 1. అధిపతి; (సాధారణనాయకులు నలుగురు.—ధీరోదాత్తుఁడు, ధీరోద్ధతుఁడు, ధీరలలితుఁడు, ధీరశాంతుఁడు.)— 2. శృంగారరసాలంబనపురుషుఁడు.) వీరు నలుగురు.—అనుకూలుఁడు, దక్షిణుఁడు, ధృష్టుఁడు, శఠుఁడు.)—విణ. శ్రేష్ఠుఁడు.

నాయన. దే. వి. (నా + అన.) తండ్రి, జనకుఁడు. (ఇది వాత్సల్యసంబోధనమునందు సంబోధ్యశబ్దమునకు మాఱుగాను ప్రయోగింపఁబడును.)

నాయము. ఉభ. వై. విణ. న్యాయయుక్తము. (ఇది నీకు నాయముకాదు.) — సం. వి. అ. పుం. 1. ప్రాపణము; 2. నీతి.

నాయిక. సం. వి. ఆ. స్త్రీ. శృంగారరసాలంబనస్త్రీ. (త్రివిధనాయికలు.— స్వీయ, పరకీయ, సామాన్య. అష్టవిధనాయికలు.— స్వాధీనపతిక, వాసకసజ్జిక, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక.)

నార. దే. వి. 1. చీల్చిన తాటిమట్టలోనగునది; 2. జనుములోనగువానిపీఁచు; 3. కూరమీఁది పీఁచు, కడంబము; 4. తాడులోనగువానిపీఁచు; 5. బ. చెట్టుమీఁదిపట్ట, వల్కలము. "ఉ. నారలుగట్టికూరలశనంబుగనుగ్రవనంబులోఁదపో, భారమునంగృశుండయినబ్రాహ్మణుఁడు." భార. ఆర. ౨, ఆ.

నారంగము. సం. వి. అ. పుం. 1. నారింజకాయ; 2. అమడబిడ్డ; 3. పిప్పలిరసము. డు. విటుఁడు.

నారకము. సం. వి. అ. పుం. నరకము, నిరయము.

నారట్టము. సం. వి. అ. పుం. బీటికనేల.
నారణపక్కి. వై. వి. నారాయణపక్షి.
నారదబ్బ. దే. వి. ఒకదినుసుదబ్బరి.
నారదము. సం. వి. అ. పుం. నారంగము, నారింజరి.
నారదుఁడు. సం. వి. అ. పుం. ఒకానొకదేవముని.
నారమడి. దే. వి. ఒకదినుసునారతో నేసిన మడి వస్త్రము.
నారము. సం. వి. అ. న. నరులసమూహము. పుం. 1. అప్పుడుపుట్టినదూడ; 2. బ. నీళ్లు.
నారసము. వై. వి. (చూ.) నారాచము. "క. చేరివి కర్ణునికరిసెక, నారసమునఁగూల్చికదిసినరపతి నొంచెన్." భార. విరా. ౫, అ.
నారాచము. సం. వి. అ. పుం. 1. అచ్చము ఇనుపబాణము;"సర్వలోహాస్తుయేబాణా నారాచాస్తేప్రకీర్తితాః." అని ప్రమాణము.—2. నీటియేనుఁగు.
నారాచి. సం. వి. ఈ. స్త్రీ. బంగారునఁఅకెడు కొఅముట్టు,సానము. అగసాలెవాని యినుపత్రాసు. (అని కొందఱు.)
నారాజి. దే. వి. నరాజియొక్కరూపాంతరము. "ఎ, గీ. రకవుఁజికిలిసిరాజినారాజిఁబన్ని." చంద్రా. ౨, ఆ. (రూ. నారాజీ.)
నారాయణపక్షి. సం. వి. న్. పుం. పక్షివిశేషము.
నారాయణము. సం. వి. అ. న. తైత్తిరీయమనువేద భాగమునందొకపన్నము.
నారాయణి. సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. లక్ష్మి; 3. పిల్లపీఁచెరరి.
నారాయణుఁడు. సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. సూర్యుఁడు; 3. చంద్రుఁడు; 4. బ్రహ్మ; 5. శివుఁడు; 6. అగ్ని.
నారి. ఉభ. దే. వి. వింటియల్లెత్రాడు. "గీ. అపుడువిల్లెక్కుపెట్టివాలారుతూపు, నారిఁగూర్చిని శాచరనారిఁగూర్చి, కాఁడనేసెఁదదీయవక్షస్థలంబు, రాఘవుఁడమోఘ తరళరలాఘవుండు." రామా. ౮, ఆ.—వై. నరము. (నారికుఱుపు.)— సం. ఈ. స్త్రీ. ఆఁడుది.
నారింజ. వై. వి. నారంగమురి.
నారికడము. వై. వి. నారికేళమురి.
నారికాయ. దే. వి. అల్లెత్రాటితాఁకుడువలన చేతఁ గలిగిన కిణము.
నారికుఱుపు. ద్వ. వి. సెలపుండు, నాడీవ్రణము.
నారికేళము. సం. వి. అ. పుం. టెంకాయచెట్టు.

నారుచు. దే. క్రి. నాడఁజేయు. (రూ. నార్చు. "మరుఁడు వెడవెడననార్చ." ఆము. ౮, ఆ.)
నాఱు. దే. వి. నాట్నమునకుఁగాను దఱచుగా విత్తులుపోసి మొలచిన మొలకలు.
నాలము. హిం. వి. గుఱ్ఱపుగిట్టలకు వేయు ఇనుపబిల్ల, లాడము.
నాలాయకు. హిం. విశ. తగని, లాయకుకాని.
నాలి. దే. వి. కుత్సితపుపని. (వాఁడు కూలినాలిచేసి జీవనము చేయుచున్నాఁడు.) విశ. 1. కుత్సితము; "క. నాలుకలురెండునిన్నుం, గ్రోలనెకల్పించెనలువఘోరాహికిన, న్నాలిగ్రహముపుడు తెగఁదినఁ, జాలదమ్మ్రుదుపవనవిరహిజనదురితమునన్." స్వా. 3, ఆ.—2. మందము; "నాలిగాలి."— 3. వంచకము. "వ. నాలియేడ్పులేడ్చుప్రియలఁ మనయింప." స్వా. 3, ఆ.
నాలిక. దే. వి. నాలుకయొక్కరూపాంతరము. "వ. నాలికలుపేలికలవిధంబునందూల." జై. ౭, ఆ.
నాలికచేఱు. ద్వ. వి. 1. తృణవిశేషము; 2. నాలికచేర్లు తినుటవలన పసులకు నాలుకయందు ముండ్లవలెఁ గలిగెడు వ్యాధివిశేషము.
నాలికి. హిం. వి. పల్లకి. (నాలకి, నాల్కి. రూపాంతరములు.)
నాలిబూతము. ద్వ. విశ. కుత్సితుఁడు, కుత్సితురాలు.
నాలిముచ్చు. దే. విశ. కుత్సితుఁడు. "గీ. తెలివిగలుగువారికెలననుండెడుమీకు, నాలిముచ్చునడక నడకగాదు." చంద్ర.
నాలుక. దే. వి. 1. జిహ్వ; "క. వికచముఖుఁడగు చుశాత్రవు, లకుహితులగునట్టివారలంగని భూపా, లకుఁడెడకత్తెరయునునా, లుకబెల్లమునైక లయఁబలుకఁగావలయున్." భార. శాం. 3, ఆ.—2. బ. సర్పజిహ్వికలు; "గీ. అప్రమత్తుండవగుచుఁబద్ధాక్షునీవు, మ్రింగుదువుచాలనాఁకట మెఱసియపుడు, నాలుకలు గ్రోయుభూరిపన్నగమువాఁతఁ, బడినయెలుకను భక్షించుపగిదినను." భాగ. ౮, స్కం.—3. జ్వాలలు. "ఉ. ఆఘోరపుశక్తినాలుకలు గ్రోయుమెఱుంగులు ప్రజ్వరిల్లఘుం, టారవముగ్రవీధినిగుడన్ గదఁగేలనమర్చి." భార. ద్రో. ౫, ఆ. "నాలుకలోలిఁ గ్రోయుము." (ఈ ప్రయోగమువలన నాలుకలు గ్రోయు అని యొక క్రియగా ఎత్తుటకు అనువు కాదు.) రా. యు, శాం.

నాలుగు. దే. స. మూడునొకటి, (రూ. నాల్గు.) (వృత్తియందు హల్లుపరమగుచో లువర్ణముమీఁది ఉకారమునకును గువర్ణంబునకును లోపంబగు. "నాల్జాలు, నాల్నాళ్లు." మొ.)

నాలువు. దే. స. నాలుగుయొక్క రూపాంతరము.

నాల్క. దే. వి. నాలుకయొక్క రూపాంతరము. "గీ. నాసికాగ్రంబువంగుటనాల్కనల్ల, నగుటవదనంబుకడునెఱ్ఱనగుటయుష్ట్ర, రాసభంబులుపూనినరథముసెక్కి, యమునిదెసఁజనఁగలగంటయునాయువడఁచు." మార్క. 3, ఆ.

నాల్గుకన్నులవేల్పు. దే. వి. అగ్ని. "సీ. నాల్గుకన్నులవేల్పునకువేల్మలెన్నేనిచేసిమేలేమియుఁ జెందకున్న." అచ్చ. బాల, కాం.

నావ. సం. వి. ఔ. స్త్రీ. ఓడ, తరణి.

నావి. దే. వి. సస్యరోగము.

నావికుఁడు. సం. వి. అ. పుం. ఓడనడపువాఁడు, కర్ణధారుఁడు.

నావురు. వై. వి. నాఁగురుయొక్క రూపాంతరము.

నావ్యము. సం. విశ. (అ.ఆ.అ.) నావచేదాఁటఁదగినది.

నాశము. సం. వి. అ. పుం. 1. చేటు; 2. కనఁబడమి; 3. అనుభవములేమి.

నాశిల్లు. సం. అ. క్రి. నశించు. (రూ. నాశిలు. "క. ఈసరణిఁగామతంత్రా, భ్యాసపరిశ్రాంతిమిగులఁబరవశమైనన్, వాశిలిధాతుక్షయమై, మాసములోపలనవాఁడుమరణమునొందున్." జై. ౫, ఆ.)

నాస. సం. వి. ఆ. స్త్రీ. 1. ముక్కు; 2. (చూ. అడ్డకమ్మి.)

నాసత్యులు. సం. వి. అ. పుం. ద్వి. అశ్వినీదేవతలు.

నాసామణి. సం. వి. ఇ. పుం. ముక్కర.

నాసి. దే. వి. పిల్లి, మార్జాలము.

నాసిక. సం. వి. ఆ. స్త్రీ. ముక్కు, ఘ్రాణము.

నాసిల్లు. వై. అ. క్రి. నశించు.

నాసీరము. సం. వి. అ. న. 1. సేనాముఖము; 2. దర్పము.

నాస్తా. హిం. వి. చల్దిభోజనము, ఫలాహారము.

నాస్తికత. సం. వి. ఆ. స్త్రీ. పరలోకము లేదనెడుబుద్ధి.

నాస్తికుఁడు. సం. వి. అ. పుం. పరలోకములేదనువాఁడు.

నాస్తిక్యము. సం. వి. అ. న. నాస్తికత.

నాళము. ఉభ. దే. వి. లాడము. సం. అ. పుం, న. 1. తామరలోనగుకాని కాఁడ; 2. క్రోవి; 3. చిమ్మనఁగ్రోవి; 4. అగసాలెవాని ఊఁదుఁగ్రోవి. (ఇది ఆకారాంత స్త్రీలింగమునగును.)

నాళి. సం. వి. ఈ. స్త్రీ. కూరయొక్క నార.

నాళికేరము. సం. వి. అ. పుం. నారికేళముయొక్క రూపాంతరము.

నాళీకము. సం. వి. అ. న. 1. తామర; 2. తామరతంపర. పుం. 1. బాణము; 2. బాణపుములికి.

నాళీకాసనుఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మ, నలువ.

## ని.

ని. దే. అప. ద్వితీయైకవచనమందువచ్చెడు ఒకప్రత్యయము. (రాముని, సోముని, హరిని, గిరిని. మొ.)

నింకెఱ. దే. అవ్య. క్రి. విశ. శీఘ్రము.

నింగి. దే. వి. ఆకాశము. "క. నింగికయికుంచెరొత్తివె, సంగోయనియార్వఁబక్షసంహతిగాడ్పుల్, రింగనిమ్రోయఁ గుజాగ్రము, కొంగలనొకలగుడుడిగ్గికొట్టెనిలఁబడన్." స్వా. ౪, ఆ.

నింగిచూలి. దే. వి. వాయువు, నభస్వంతుఁడు.

నింగిమిరి. దే. వి. సువర్చలకీ.

నింగివడు. ద్వ. అ. క్రి. (నింగి+పడు.) అస్తమించు. "శా. ఆదైతేయతనూజనింగివడఁగాహర్మ్యంబుపైనొక్కనా, డేదిక్కుంజెలిపిందుమెండుకొనఁగానేకాంతనిద్రారతిన్, మోదింపన్." ఉ, హరి. ౫, ఆ.

నింగిసిగ. ద్వ. వి. శివుఁడు, వ్యోమకేశుఁడు. "ఉ. క్రొన్నెలఁదాల్చునింగిసిగకుం గసుగందనిపూలదండయా, వెన్నునిమించుఁగాలిబోట వ్రేలికిఁగూఁతురు." రామా. ౫, ఆ.

నించు. దే. ప్రే. నినుచుయొక్క రూపాంతరము. నిండఁజేయు, నిండించు.

నింట. దే. వి. జలపూరము. "క. కంటిమికన్నులపండువు, మంటిమనుచుఁదద్దుణౌఘమధువాహినిపె, న్నింటందేలుచుసమ్మద, కంటకితాంగులయిరేఁగి కాంచిరిపరుసన్." హరి. ఉ. ౬, ఆ.

నిండఁబడు. ద్వ. అ. క్రి. (నిండన్+పడు.) నిండు. "గీ. ఎన్నఁబెక్కులగుచునెక్కఁడఁబూచిన, నడచువారునడపఁగడఁగువారు, విడియువారుమఱియుపీడెత్తువారునై, నేలయీనినట్లునిండఁబడిరి." రా. యు, కాం. (స్వార్థమున పడు.)

నిండారు. దే. అ. క్రి. (నిండు+ఆరు.) నిండు. "క. అనినవినిసింహబలము, ర్దనునపలోకించిద్రుపద

రాజతనయుయి, ట్లనూఁదనమనమునని౦డా, రినస ప్మోదంబువెలివిరిసిబెరయుంగాక." భార. విరా. ౨, ఆ.

**నిండు.** దే. అ. క్రి. పూర్ణముగు. వి. పూర్ణత. విశ. పూర్ణము. "ఉ. నిండుమనంబునవ్యనవనీతసమానము." భార. ఆది. ౧, ఆ.

**నిండుకొను.** దే. అ. క్రి. నిండు. "క. గుండియజల్లనమదిలో,నిండుకొనినభీతినావినిర్మలచిత్తుం,దుండడకనలుగడలకున, యుశ్యండవిడిచిపఱవఁదలఁచునాసమయమునఁ." శేష. ౨, ఆ. (ప్రే. నిండుకొలుపు. స్వార్థమున కొను.) (బియ్యము నిండుకొన్నవి, పసుపు నిండుకొన్నది; ఇట్టి చోట్ల నిండుకొనుటయనఁగా అయిపోయినవని యర్థము.)

**నింద.** సం. వి. ఆ. స్త్రీ. 1. దూఱు; 2. అపదూఱు.

**నిందించు.** సం. స. క్రి. దూఱు.

**నిందితుఁడు.** సం. విశ. (అ. ఆ. అ.) దూఱఁబడినవాఁడు.

**నింద్యుఁడు.** సం. విశ. (అ.ఆ.అ.) దూఱఁదగినవాఁడు.

**నింపాది.** దే. విశ. (నింపు+ఆది.) సమృద్ధము. (కొలనిలో నీళ్లు నింపాదిగానున్నవి.)

**నింపారు.** దే. అ. క్రి. నిండారుయొక్క రూపాంతరము.

**నింపిరి.** దే. వి. ముఱికి, మలము.

**నింపు.** దే. ప్రే. నించుయొక్క రూపాంతరము. వి. సమృద్ధి. "నిద్దపుఁజెక్కుటద్దముల నింపులుగాఁ బులకల్ జనింప." కళా. ౬, ఆ. (నిండుపుయొక్క రూపాంతరము.)

**నింబతరువు.** సం. వి. ఉ. పుం. వారిజేము?.

**నింబము.** సం. వి. అ. పుం. వేము?.

**నికటము.** ఉ.భ. దే. వి. నిర్బంధము. సం. అ. న. సమీపము. విశ. సమీపమైనది.

**నికము.** దే. వి. నిక్కముయొక్క రూపాంతరము. "గీ. క్షీణసంకల్పజాలుఁడౌ జీవుఁడొందు, నికము బ్రహ్మత్వమును." అధ్యా. ఉ, కాం.

**నికరము.** ఉ.భ. దే. విశ. త్రోపుడుపోఁగా మిగిలినది.—సం. అ. పుం. 1. సమూహము; 2. నిధి. విశ. శ్రేష్ఠము.

**నికర్షణము.** సం. వి. అ. న. ఇల్లులోనగువానివెనుకటిభాగము. పట్టణముచుట్టువాతినబయలు. (అనికొందఱు.)

**నికష.** సం. వి. ఆ. స్త్రీ. రాక్షసులతల్లి. అ. పుం. ము. 1. ఒరగల్లు; 2. సాన.

**నికషాత్మజుఁడు.** సం. వి. అ. పుం. నిర్ఋతి.

**నికామము.** సం. క్రి. విశ. అ. న. యథేచ్ఛము.

**నికాయము.** సం. వి. అ. పుం. 1. ఇల్లు; 2. తెగ; 3. లక్ష్యము; 4. ప్రోగు; 5. పరమాత్మ.

**నికాయ్యము.** సం. వి. అ. పుం. గృహము, ఇల్లు. (రూ. నీకాయ్యము.)

**నికారణము.** సం. వి. అ. న. వధము, కొల.

**నికారము.** సం. వి. అ. పుం. 1. వంచన; 2. ధాన్యము ప్రోగుచేయుట; 3. దంతనిష్పీడనమువలనఁ గలిగిన ముఖవికారములోనగునది.

**నికాశము.** సం.వి.అ.పుం.నిశ్చయము.విశ.తుల్యము.

**నికుంచకము.** సం. వి. అ. పుం. సోల.

**నికుంజము.** సం. వి. అ. పుం, న. పొదరిల్లు.

**నికుంభము.** సం. వి. అ. పుం. దంతి?. డు. కుంభకర్ణునికొడుకు.

**నికురుంబము.** సం. వి. అ. న. సమూహము, గుమి

**నికృంతనము.** సం. వి. అ. న. ఖండనము, నఱుకుడు.

**నికృతము.** సం.విశ.(అ. ఆ. అ.) 1. దూఱఁబడినది, 2. వంచింపఁబడినది; 3. త్రోపుడుచేయఁబడినది.

**నికృతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. బెదరుమాట; 2. వంచన; 3. త్రోపుడు.

**నికృత్తము.** సం. విశ. (అ. ఆ. అ.) నఱకఁబడినది.

**నికృష్టము.** సం. విశ. (అ. ఆ. అ.) అధమము.

**నికేతనము.** సం. వి. అ. న. గృహము, ఇల్లు. (రూ. నీకేతనము.)

**నికోచకము.** సం. వి. అ. పుం. ఊడుగ?.

**నిక్కచ్చి.** దే. వి. నిర్బంధము,నికటము. (వాఁడాయప్పునకై నన్ను చాలనిక్కచ్చిచేయుచున్నాఁడు.)

**నిక్కము.** దే. వి. 1. నిశ్చయము; "క. మేనులకెల్లనుజీవుఁడు, తానేగోవిందుఁడొకఁడు తంత్రీయున్నాఁ, డానిక్కముతనకబ్బెను." లక్ష్మీ. ర, ఆ. — 2. యథార్థము; "చ. మానముజలముం దెగందొలఁగినామగుడంబురికొంటలేదని, క్కము సెపుమా." భార. కర్ణ. ౧, ఆ.—3. సత్యము, "నిక్కమురూపగు వానిభక్తి గమ్యుఁడలంతుక." భార. శాం. ౨, ఆ.– విశ. 1. సత్యమైనది; "గీ. ఒరునినింకనేనుపరియింపనిదినిక్క, మనిన." మార్క. ౮, ఆ.—2. అన్వర్థము. "వ. అతనికిఁబరత్రిమనిక్కంపుపేరివాఁడుపుట్టె." హరి. పూ. ౩, ఆ.

నిక్కల. దే. వి. (నిక్కము+కల.) కన్నది యనుభవమునకుతెచ్చెడు కల. "క. నాకలనిక్కలయయ్యెడు, శోకింపకుమమ్మ." భార. అర. ౨, ఆ.

నిక్కవుడు. వై. వి. నిష్కపటము.

నిక్కవొడుచు. దే. అ. క్రి. (నిక్కు+అ+పొడుచు.) నిక్కనిలుచు. (మేనవెండ్రుకలు నిక్కవొడిచె.)

నిక్కాఁక. దే. వి. (నిండు+కాఁక.) మిక్కిలికాఁక. (దేహము నిక్కాఁకగానున్నది.)

నిక్కు. దే. అ. క్రి. 1. ఉన్నతమగు; 2. గర్వించు; 3. అతిశయించు; "వ. అనీకంబు లనేకంబులు పొడవడంగినిక్కినభయంబునందక్కినరయంబు గలబలంబులుగళవళించిమగిడినిగిడినగరఁబుసొచ్చిన." ఉ, హరి. ౨, ఆ.—4. వర్ధిల్లు. "గీ. మించివృశ్చికాదిపంచమాసములనొ, క్కొక్కగడియరాత్రినిక్కినడుచు." భాగ. ౫, స్కం. ౨, ఆ. — వి. 1. ఉన్నతి; "చ ఎనిమిదితావులందొడరియేపునసెప్పుడునాము జాఱఁగా, నెనయుచుఁగెంపురేకలుపయింబొలుపొందఁగనందునేనుఁగుల్, దనరుచునుండునాకసముఁదాఁకెడునిక్కునఁజూపరబ్బురం, బునసెలయేళ్లతోడ నడయాడెడుజేగుఱుఁగొండలోయనన్." య. ౧. ఆ.—2. గర్వము.

నిక్కుఁబోతు. దే. విశే. (నిక్కు+పోతు.) గర్వస్వభావముగలవాఁడు.

నిక్కుడు. దే. వి. ఉన్నతి. హరిశ్చ. ౪, ఆ.

నిక్కువము. దే. వి. నిక్కముయొక్కరూపాంతరము. (యథార్థమునకు.—' ద్వైనెఱయువానికిఁగలనీతిశాస్త్రములు, కొఱమాలియుండు నిక్కువమివ్విధంబు." రా. యు, కాం.)

నిక్కువీనులజెక్కు. దే. వి. (చూ. ఉచ్చైశ్శ్రవము.) (చూ. తలఁపుమిన్న.)

నిక్వణము. సం. వి. అ. పుం. వీణాస్వనగువాని మ్రోఁత.

నిక్వాణము. సం. వి. అ. పుం.——వై.——

నిక్షేపము. సం. వి. అ. పుం. 1. చెప్పిచూపియుంచినయిల్లడ; 2. నిధి.

నిక్షేపించు. సం. స. క్రి. పాఁతు, పూడ్చు.

నిఖాతము. సం. విశే. (అ. ఆ. అ.) త్రవ్వఁబడినది.

నిఖిలము. సం. విశే. (అ. ఆ. అ.) సర్వము, ఎల్ల

నిగణము. సం. వి. అ. పుం. హోమధూమము.

నిగదము. సం. వి. అ. పుం. స్పష్టముగాచెప్పుట.

నిగదించు. సం. స. క్రి. స్పష్టముగాచెప్పు. "క. మానుషజన్మముపొందిన, మానవులకులభ్యమానమరణులకుమహా, జ్ఞానులకుఁ జేయవలయువిధానము నిగదింపఁబడియెధరణీనాథా." భాగ. ౨, స్కం.

నిగనిగ. దే. వి. మెఱయుటయందగుననుకరణము. "నిగనిగయను క్రొమ్మెఱుంగు." కళా. ౨, ఆ. (విశేషణమగుచో నిగనిగని = నిగనిగయను కాంతిగలది. "ఎ, గీ. నిగనిగనిసంజకెంజాయ పొగడుఁదెగడు." వసు. ౬, ఆ.)

నిగమము. సం. వి. అ. పుం. 1. వేదము; 2. అంగడివాడ; 3. మార్గము; 4. పట్టణము.

నిగముఁడు. సం. వి. అ. పుం. బేహారి, వణిజుఁడు.

నిగరణము. సం. వి. అ. న. మ్రింగుట. పుం. కంఠము.

నిగరము. ఉభ. వై. విశే. శ్రేష్ఠము. "నిగరంపుఁబగడంపుజిగిదొట్టుమొగముట్టు." ఉ, రా. ౭, ఆ.—సం. వి అ. పుం. మ్రింగుట.

నిగళము. సం. వి. అ. పుం; న. 1. ఏనుఁగుకాలిసంకెల; 2. సంకెల. (రూ. నిగడము.)

నిగా. హిం. వి. దృష్టి, విచారణ. (రూ. నిఘా.)

నిగాదము. సం. వి. అ. పుం. నిగదముయొక్కరూపాంతరము

నిగారము. ఉభ. వై. విశే. శ్రేష్ఠము. "ఉ. కుందనమొందునుందొరయుకొమ్మనిగారపు మేనిచాయకున్." నీలా. ౧, ఆ. "క. ఇట్టినిగారపుగొనముల, తిట్టలఁగనికరముమాలితెంపొదవంగాఁ, గట్టడవులకుంబనుపఁగఁ, గట్టాయిమ్ముదుకఁడెంతికట్టిఁడిచెపుఁడా." అచ్చ. అ, కాం. (నిగరముయొక్కరూపాంతరము.)—సం. వి. అ. పుం. మ్రింగుట.

నిగాళము. సం. వి. అ. పుం, న. గుఱ్ఱపుమెడ సమీపపుచోటు.

నిగిడారు. దే. అ. క్రి. (నిగిడి+ఆరు.) వ్యాపించు "ఉ. నవ్వకనవ్వునెమ్మొగమునన్ నిగిడారెడువింతకాంతియున్." ఉ, హరి. ౫, ఆ. (చూ. తోఁగాడు.)

నిగుడు. దే అ. క్రి. 1. వ్యాపించు; "సీ. సమధికదర్పదుర్జయములై నిగిడెడు నింద్రియంబులగుదియించితెచ్చి." భార. అర. ౪, ఆ. —

2. నిక్కు; "వ. తోలాడ్పుమహానాగంబునుంబో లెఁగరవాలంబు తొవరయొఱవెలికి నిగుడుచున్న యది." భార. ఉద్యో. ౨, ఆ.—3. చేఁగు; "క. మొగిచినచేతులుముందట, నిగిడించి." భార. విరా. 3, ఆ.—4. పఱఁగు; "వ. విచ్చలవిడిఁ దనమయంబుగాగగనంబుననిగుడునచ్చక్రంబుం గనుంగొని." ఉ, హరి. 3, ఆ. "సాత్యకిడిభకు పైసాయకదళకంబునిగిడింప." ఉ, హరి. ౪, ఆ.—5. విజృంభించు; "సీ. సెత్తుటఁదోఁగియు నిగిడిపోరెడువీరులలరిననడమోదుగులవిధంబు." భార. శల్య. ౧, ఆ.—6. వేగిరపడు; "చ. గరుడునిడిగ్గి వీడ్కొలిపి కంసవిరోధిపురంబులోపలన్, దిరపడిదారకుంబనిచి తేరలవాటుగఁదేరనెక్కి సం, గరకుతుకంబుతో వెడలిగర్వితులెల్లనుదల్లడిల్లని, ఘోరరవపాంచజన్యుఁడగుడున్ నిగిడెన్ గనిపొంద్రుఁడత్తఱిన్." (చూ. దీని వెనుక.) ఉ, హరి. 3, ఆ.—7. కవియు; "క. భగదత్తుని నాకవ్వడి, వెగడొందఁగఁజేసియతని వెలియేనుఁగుఁగెం, పుగఁజేసిననాతండును, నిగిడెన్ బాంచాలమేదినీపతిమీఁదన్." భార. భీష్మ. 3, ఆ.—8. చక్కఁబడు; "క. బెడిదముగఁగత్తిగొడ్డటఁ, బొడువఁదగినమ్రానఁజిగురు పొడముఁ బలుకులన్, జెడఁ దునిసినకార్యంబుని, గుడ నేరదుపిదపఁ బెట్టుఁగురువంశనిధీ." భార. ఉద్యో. ౨, ఆ.— 9. చిప్పిల్లు. (చూ. నివుడు.)

నిగుడుచు. దే. ప్రే. నిగుడఁజేయు, (రూ. నిగుడ్చు.)

నిగుడుదెంచు. దే. అ. క్రి. (నిగుడు+తెంచు.) నిక్కు. ("గీ. నగవు మొలక మొగంబుననిగుడు దేర." ఇక్కడ నిగుడు దేరన్ అనఁగా మొలవఁగానని యర్థము. రామా. ౮, ఆ.) (స్వార్థమున తెంచు.)

నిగుఱు. దే. వి. కట్టెనిప్పుమీఁదిభస్మము. "ఎ, గీ. నిగుఱులో నిప్పుతీరుననీచరిత్ర, మెఱుఁగఁబడదు." ఉ, రా. ౫, ఆ.

నిగూఢము. సం. విణ. (అ.ఆ.అ.) మఱుఁగుపుచ్చినది.

నిగూహనము. సం. వి. అ. న. మఱుఁగుపుచ్చుట.

నిగ్గడి. దే. విణ. కఠినము. "అవియకనిగ్గడియైనయినుపగుండియకు." భార. స్త్రీ. ౨, ఆ.

నిగ్గు. దే. అ. క్రి. నిర్వహిల్లు. (నాతో సరిగా వాఁడు నిగ్గలేఁడు.)—వి. 1. ఉత్కృష్టకాంతి; 2. వర్ణలేశము. (చూ. ఇంటిపట్టు.)—విణ. త్రోపుడుపోఁగా మిగిలినది.

నిగ్రహము. సం. వి. అ. పుం. 1. త్రోపాట; 2. బెదరుమాట; 3. చెఱ; 4. మేర.

నిగ్రహించు. సం. స. క్రి. త్రోపాడు.

నిఘంటువు. సం. వి. ఉ. పుం. పదపదార్థములను తెలియఁజేసెడు గ్రంథము.

నిఘము. సం. వి. అ. పుం. చదరపువస్తువు.

నిఘసము. సం. వి. అ. పుం. భోజనము, కుడుపు.

నిఘాతిక. సం. వి. ఆ. స్త్రీ. ఇనుమును పెట్టికొట్టెడి యినుపముద్ద, దాఁగలి.

నిఘ్నుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) లోఁకువైనవాఁడు, అధీనుఁడు.

నిచయము. సం. వి. అ. పుం. సమూహము, గుమి.

నిచితము. సం. విణ. (అ.ఆ.అ.) పఱుపఁబడినది.

నిచులము. సం. వి. అ. పుం. 1. ఎఱ్ఱగన్నేరు; 2. కప్పుడుదుప్పటి.

నిచోళము. సం. వి. అ. పుం. 1. గవుసెన; 2. కప్పుడుదుప్పటి.

నిచ్చెన. వై. వి. పైకెక్కఁదగినసాధనము, నిశ్రేణి.

నిచ్చెనపంజు. ద్వ. వి. దివటీలకమ్ములమర్చిన నిచ్చెనవంటిసాధనము. "నిచ్చెనపంజులారతులునగ్నిజ్యోతులున్ వెల్గఁగన్." హంస. 3, ఆ. (నిచ్చెనదివ్వెపంజులనియు. "ఉ. అచ్చపుఁబ్రేమమీఱుధవళాంకుఁడుయామవతిన్ వరింపఁగా, వచ్చునటంచు మున్నులువంకలఁదత్సమయాధికారిదా, నెచ్చెలికిన్ బహుప్రభల నింపులుగుల్కఁగఁదీర్చినట్టియా, నిచ్చెనదివ్వెపంజులన నిండె దవానలరేఖలద్రులన్." భాను. 3, ఆ.)

నిచ్చే. వై. అవ్య. 1. సదా; "శా. ఆపద్భోద్భవునోలగంబునకు దివ్యద్వీపినుల్ నిచ్చరా, రోపోరో." వసు. ౨, ఆ.— 2. ప్రత్యహము. "సీ. నిచ్చయొక్కమృగంబునీకుఁ గట్టడగాఁగఁబ్రీతినాహారంబుపెట్టఁగలము." పంచ. నా. ౧, ఆ. "మ. భవనంబుల్ వడిఁజొచ్చు నిచ్చశిఖిదీపశ్రేణిదంభంబునన్." చంద్ర.

నిచ్చేయము. వై. వి. నిశ్చయము. "క. మెచ్చుగనే సరసానకు, వచ్చినఁదుదిసంధి మనలవారలకొలఁదుల్, నిచ్చయముచేసియొటువలెఁ, జొచ్చితిమన కింకనొండుచొప్పులుగలవే." రా. యు, కాం.

నిచ్చేలము. వై. వి. నిశ్చయము*. "ఉ. నిచ్చలమమ్మహామహుని నేత్రములబ్జములౌటవాసవా." కవిక. ౨, ఆ. (చూ. నిచ్చేలు.)—విణ. 1. నిశ్చలము;

"క. వచ్చినఁగు బేరమూనఁడు, నచ్చెలువలు సెదురుగాఁగనరిగియతనికిన్, నిచ్చలమగుతాత్పర్యం, బచ్చుపడఁగ మ్రొక్కి రతఁడు నల్లననగుచున్." కళా. 3, ఆ.—2. నిర్దోషము*; "ఉ. నిచ్చలమైన కెంపులును నీలమణుల్ వరమౌక్తికంబులున్." శశాం. ౨, ఆ.—3. నిరంతరము*. "సీ. నిచ్చలంబైన తేనియవానజడిసొంపులాలితదానధారాళిగాఁగ." రాఘ. ౨, ఆ.

నిచ్చెలు. వై. వి. నిశ్చయము*. "ఎ, గీ. నీకుఁజేయలంతిగానిచ్చలుఁ చెలియయిత్తు." హరి. ఉ. ౭, ఆ.—అవ్య. సదా. "ఉ. నిచ్చలునిచ్చలోఁ బొదలునీపితృభక్తికిజ్ఞానశక్తికిన్, మెచ్చితి." పాండు. ౨, ఆ. "మ. అమరద్వీపవతీపయోవిహరణప్రాంచత్సురస్త్రీలవ, భ్రమయాభ్రంకషమండ పాగ్రములనిచ్చల్ క్రీడగావించుత, ద్రమణీవారము వేఱువేఱు పలుపన్ రాదంచుగాదివ్యరా, జముఖీపాళికిఁ దమ్మిచూలి యనిమేషత్వంబుగావించుటల్." కవి. ౧, ఆ.

నిజము. సం. వి. అ. న. స్వభావము. విణ. 1. తనది; 2. శాశ్వతమైనది.

నిజాయతీ. గ్రా. విణ. న్యాయమైన, సత్యమైన.

నిజేమరి. ద్వ. విణ. (నిజేము+అరి.) సత్యశీలుఁడు. "క. తానెక్కనిజమరివలెన్, బూనిపలికె." భో. ౬, ఆ.

నిజేము. వై. వి. 1. సత్యవచనము*; (నిజేముచెప్పుము.)—2. నిశ్చయము*. "చ. మునుపునిజేశునగ్రపతిముద్దుఁగుమారుఁడటంచునానితం, బినిపలుకంగవింటినిగుబేరతనూజునికింగరంబుమో, హినియగుకాంతరంభయనియాడుకొనంగ వినంబడున్ మనం, బుననిపుడెన్న నామెఱుఁగుఁ బోఁడియకాపలయున్ నిజంబుగన్." "క. ఇప్పుడిదినిశ్చితంబుగ, నప్పరమమునీంద్రుఁజేరియడుగఁగవలయున్." కళా. ౧, ఆ.—విణ. సత్యము*. "చ. ఒకటఁగొఱంతలేదుగురునొద్దనృపాలనయోపచారముల్, సకలమువభ్యసించితి నిజం బవి మంచివి కావు." (నిజేంబు—నిజేముగాననుట.) లక్ష్మీ. ౪, ఆ. "క. వినుమప్పలుకులుపాటిగఁ, గొనిదుర్యోధనుని తోడఁగొంటినిబగము, న్ను నిజముగా నెఱుఁగనువీఁ, డనిరాధేయునకు వెఱచుననియేనిన్నున్." భార. కర్ణ. 3, ఆ.

నిటలము. సం. వి. అ. పుం, న. నుదురు, ఫాలము.

నిటలాక్షుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

నిటాలము. సం. వి. అ. పుం, న. నిటలముయొక్క రూపాంతరము.

నిట్ట. దే. వి. 1. ప్రవాహము; "సౌఖ్యంపునిట్ట." భార. విరా. ౨, ఆ.—2. స్తంభము; "అఁగటినిట్టలపైపొరలాడిరాలుకర్పూరపుదీవి." కవిక. 3, ఆ.—3. స్థానము; "సీ. నిట్టలఁద్రోచుచు నెలవులకలమేరలెల్లనుజిగియెక్కియేర్పడంగ." భార. విరా. ౧, ఆ. "ద్వి. మూడుమూర్తులనిట్టమెఱుక్కులగుట్ట, వేఁడివేలుపుప్రభ వించెఁదూర్పునను." హరిశ్చ. ౧, భా.—4. నిక్కు. "గీ. భక్తిసంయుక్తియనుపోఁతపాలనొయ్యఁ, జెట్టుకట్టుచు మునిశాఖినిట్టచూప, నిజమనోమార్గసంపసన్నిలవర్ణ, కైతవంబునలోఁజేగగఁయనూర." పాండు. 3, ఆ.—విణ. 1. నిక్కినది; "గీ. కన్నమాత్రనతఁడుకల్మషంబులఁబాసి, విమలచిత్తుఁడగుచువిశదభక్తి, నిట్టరోమములకుఁబట్టగుచానంద, బాష్పనేత్రుఁడగుచుఁబ్రణుతిచేసె." భాగ. ౬, స్కం.—2. సరియైనది. "ఎ, గీ. నిట్టతాడనఁబొడవుచేనిక్కినాఁడు." స్వా. ౪, ఆ. (చూ. నిట్టనిలుచు. మొ.)

నిట్టకనిలుచే. దే. అ. క్రి. నిట్టనిలుచు. "క. ఇలుగాలికూలినిట్టక, నిలిచిననిట్రాడువోలెనిజరథమటులై, పొలియన్ నిలఁబడిరాకా, సులకోఁడుండుటకునగుచుఁజూచిరివేల్పుల్." (ఇక్కడ స్వార్థమున కకారాగమమనియెఱుంగునది.) రామా. ౮, ఆ.

నిట్టకనిలువు. దే. వి. సరినిలువు. (రూ. నిట్టకనిల్వు. "ఉ. నిట్టకనిల్వునంగలఁగి నేత్రయుగంబునఁబాష్పపూరముల్, దొట్టఁగఘర్మతోయముల తోఁబులకాంకురజాలమెల్లెడన్, బుట్టఁగఁదొల్లి యుల్లుకఁబూనియొనర్చినమంటిమద్దఁదాఁ, బెట్టెఁదదీయపాత్ర నది భిక్షయకాఁగొనిపోయెసిద్ధుఁడున్." భో. 3, ఆ. (చూ. నిట్టకనిలుచు.)

నిట్టగ్రమ్ము. దే. అ. క్రి. (నిట్ట+క్రమ్ము.) నిట్టవొడుచు. "సీ. చామలనగుమోముఁజందురుపొడుపునరాగాంబుధులునిట్టగ్రమ్మననుట." లక్ష్మీ. ౨, ఆ.

నిట్టనిలుచే. దే. అ. క్రి. సరిగానిలుచు. "ఎ, గీ. భవనఘటనకుమొదలికంబమునుబోలె, భువనములు

క్లలనీపాదిభూతుఁడగుచు, నిట్టనిలుచున్కి చేఁ గాదెసెట్టుకొనిరయి, గెంటుగుంటును లేకలక్ష్మీక శత్ర." పాండు. ౨, ఆ.

నిట్టనిలుచుండు. దే. అ. క్రి. సరిగా నిలుచుండు. "గీ. మేదినీధరమిబ్భంగిమిన్ను ముట్టి, నిట్టనిలుచుం డిచూచె విర్నిమిషదృష్టిఁ, దనయనుష్ఠానకాలం బుదప్పకుండు, బ్రాహ్మణుఁడు లేపకడఁబోలె భాసుపొడుపు." కాశీ. ౧, ఆ.

నిట్టరాడు. దే. వి. దూలములేని యింటినడిమి పొడ వుకంబము, కపోరము.

నిట్టలము. దే. విణ. ఇట్టలమునకు మొదటిరూపము. "నింగికి నేలకుంబొడవు నిట్టలమై." భాగ. ౬, స్క. ౦.

నిట్టవొడుచు. దే. అ. క్రి. (నిట్ట+పొడుచు.) 1. ఉ ప్పొంగు; 2. రోమాంచితమగు; 3. విజృంభించు. "ఎ, గీ. భూనభోంతరదిక్పరిపూర్ణమైన, నిఖిల రూపులు తెల్లనైనివ్వటిల్ల, నిండితండోపతండమై నిట్టవొడిచెఁ, బండువెన్నెలకన్ను లపండువగు చు." భాను. 3, ఆ.

నిట్టు. దే. వి. 1. ఉపవాసము; "సీ. వంటగుడారు క్రిందంటి వెల్లువనీరు ప్రాయిపిఁగఁదొట్టినపూఁ టనిట్టు." రా, వి. ౨, ఆ.—2. క్షామము. "క. దున్నక వెదపెట్టకయు, తృన్నములైనట్టివిపులబ హుసస్యంబుల్, సన్నసనఁబండుఁబ్రాణుల, కు న్నిట్టనుమాటలేదు గోరంతైనన్." మార్క. ౮, ఆ.—విణ. శుష్కము. (చూ. నిట్టుపాసము.)

నిట్టుపాసము. ద్వ. వి. (నిట్టు+ఉపాసము.) శుష్కో పవాసము. కాశీ. ౭, ఆ.

నిట్టూరుచు. ద్వ. అ. క్రి. (నిడుద+ఊరుచు.) నిట్టూ ర్పువిడుచు, (రూ. నిట్టూర్చు.)

నిట్టూరుపు. ద్వ. వి. (నిడుద+ఊరుపు.) దీర్ఘనిశ్వా సము, (రూ. నిట్టూర్పు.)

నిట్ర. దే. వి. నిలువు. (రూ. నిట్రము. కలము అం తనిట్రముగా పట్టుకొనకుము.)

నిట్రాడు. దే. వి. నిట్టరాడుయొక్క రూపాంతరము. (చూ. నిట్టకనిలుచు.)

నిట్రాయి దే. వి. (నిట్ట+రాయి.) పొడువురాయి. "వ. అయ్యవసరగాకిలింకుటాలింగాలంగెలంబొ డిచిపెడమరలందిగిచినిట్రాతనేతపస్తంబునబం ధించికాలికిందునిద్రించె." పంచ. వేం. ౧, ఆ.

నిట్రించు. దే. స. క్రి. నిలువుగానుంచు.

నిట్రిల్లు. దే. అ. క్రి. ఉపవాసముండు.

నిట్రు. దే. వి. ఉపవాసము. "సీ. దశమినాఁడేక భుక్తముసేసియవలినాఁడోర్చి జాగరముతో నుం డునిట్రు." ఆము. ౪, ఆ.—విణ. శుష్కము. (చూ. నిట్రుపాసము.) (నిట్టుయొక్క రూపాంతరము.)

నిట్రుపాసము. ద్వ. వి. (నిట్రు+ఉపాసము.) శుష్కోపవాసము.

నిడివి. దే. వి. దైర్ఘ్యము. విణ. దీర్ఘము. "గీ. ఇట్టి వేసవితఱిఁబగలిట్టినిడివి, యైనసయిరించు నేదివి జారియనుచు." లక్ష్మీ. 3, ఆ.

నిడు. దే. విణ. వృత్తియందు నిడుదశబ్దమునకు మీఁ దివర్ణములోపింపఁగా మిగిలినరూపము. (ఉదా. నిడుమోము, నిడువాలు. మొ.)

నిడుచేను. దే. అ. క్రి. (నిడుద+చేను.) చాఁగు. "క. వడినాడుకఅచివలకేల్, నిడుచనఁగనయము నఁబెనఁచి నీల్గిబలంబే, ర్పడవిల్లువంప నోపక, యుడిగిరినృపసుతులుకొండలో య్యనలజ్జన్." భార. ఆది. ౭, ఆ.

నిడుద. దే. విణ. నిడుపు, దీర్ఘము.

నిడుదవెన్ను. దే. వి. సర్పము, దీర్ఘపృష్ఠము "సీ. నిడుదవెన్నగయాలితోడవులదొరయుండుగుం డుగండెసఁగఁగైచెందుచేసి." అచ్చ. సుం, కాం.

నిడుపఁడు. దే. వి. (నిడుపు+అఁడు.) సర్పము.

నిడుపకమ్ములు. ద్వ. వి. (నిడుపు+కమ్ములు.) కడపకు నిరుప్రక్కలనుండు నిలువులు.

నిడుపు. దే. వి. నిడివి. విణ. నిడివియైనది.

నిడుముస్తె. ద్వ. వి. (నిడుద+ముస్తె.) తుంగ.

నిడువెండ్రుక. దే. వి. (నిడుద+వెండ్రుక.) రో మాంచము. "క. జడనుండాపమునిద్రయు, నిడు వెండ్రుకతోడసెగయునిట్టూర్పులుసం, దడిగొ నివడిగొన." ఉ, హరి. ౬, ఆ.

నిడువెండ్రుకపెట్టు. దే. అ. క్రి. (నిడువెండ్రుక+ పెట్టు.) (చూ. నిట్టవొడుచు.) "చ. సరసిజనాభ బంధుజనసంతతిఁగయ్యపునేలఁజూడఁగా, విరి విరవోయిమేను నిడువెండ్రుకపెట్టుచుఁ గంప మొందె." భార. భీష్మ. ౧, ఆ.

నితంబము. సం. వి. అ. పుం. 1. పిఱుఁదు; 2. మొల, 3. కొండనడుము; 4. మూఁపు; 5. దరి.

నితంబిని. సం. వి. ఈ. స్త్రీ. 1. గొప్పపిఱుఁదులుగల ఆఁడుది; 2. ఆఁడుది.

నితాంతము. సం. క్రి. విణ. అ. న. పెల్లు. విణ. అధి కము.

నిత్తెమల్లె. వై. వి. మల్లికావిశేషము. "సీ. నీలాంబరంబులునిత్తెమల్లెలుకొండగోఁగులుమల్లెలుగోరఁటలును." భల్లా. ౩, ఆ.

నిత్యము. సం. క్రి. విణ. అ. న. ఎల్లప్పుడు. విణ. ఎడతెగనిది.

నిదర్శనము. సం. వి. అ. న. దృష్టాంతము. పుం. ఒకయర్థాలంకారము (చూ. అలంకారము.)

నిదాఘము. సం. వి. అ. పుం. 1. వేసఁగి; 2. వేఁడిమి; 3. చెమట.

నిదానము. ఉభ. వై. వి. ఆత్రపడక విచారించుట*. (వానియోగ్యత నిదానముమీఁద తెలియును.)—సం. అ. న. 1. ఆదికారణము; 2. పెయ్యపలుపు; 3. రోగనిర్ణయము. (చూ. స్కంధము.)

నిదానించు. వై. అ. క్రి. ఆత్రపడకవిచారించు. (నిదానించకకాని గుణాగుణములుతెలియవు.)

నిదిగ్ధము. సం విణ. (అ. ఆ. అ.) పెంపఁబడినది.

నిదిగ్ధిక. సం. వి. ఆ. స్త్రీ. వాఁకుడు?.

నిదిధ్యాసనము. సం. వి. అ. న. మఱిమఱితలఁచుట.

నిదుర. వై. వి. నిద్ర. "క. పురరక్షణముదృఢంబుగ, నరవరచేయంగవలయునమ్మఁగలుగుస, త్పురుషులరోఁడఁదగుఁగుడుపుని, దుర మొదలగులోనిపనులదోషంబులుగన్." భార. ఆశ్ర. ౧, ఆ.

నిదురపోతు. ద్వి. విణ. నిదురపోవుస్వభావముకలవాఁడు, నిద్రాళువు. "క. వినియువినవురణభీరువు, మనుజాధమునిదురపోతుమందునినకటా, నినుఁజక్రవర్తిఁజేసిన, వనజాసనుకంటె వెఱ్ఱివాఁడునుగలఁడే." భాగ. ౯, స్కం.

నిదురవోవు. ద్వి. అ. క్రి. (నిదుర+పోవు.) నిదురించు.

నిదురించు. వై. అ. క్రి. నిద్రించు. "క. నిదురించినశిశువాఁకొని, కిదుకుచు." భాగ. ౧౦, స్కం. పూ.

నిదేశము. సం. వి. అ. పుం. 1. పనుపు; 2. చెప్పుట; 3. దాపు.

నిదేష్ట. సం. విణ. (ఋ. ఈ. ఋ.) ఆజ్ఞాపించువాఁడు.

నిద్దము. వై. విణ. 1. నునుపుగలది; "నిద్దపుఁజెక్కులు." కళా. ౨, ఆ.—2. స్నేహముగలది. "సీ. తల్లిదండ్రులకునిద్దపుభక్తితఱఁణిల్ల శుశ్రూషచేసినశుద్ధమతులు." కాశీ. ౨, ఆ.

నిద్దా. వై. విణ. నునుపుగలది. "మ. తళుకుంబ్రొద్దువెలుంగుక్రొంబసిఁడినిద్దాచోపుడుంగట్టియున్." చంద్రా. ౧, ఆ. (నిద్దముయొక్క రూపాంతరము.)

నిద్దుర. వై. వి. నిదురయొక్క రూపాంతరము. "ఏమిచెప్పనిద్దుర మును మున్న గాఁ దెలిపి." (రామాయణార్థమునందు నిద్దుర మునుమున్న గాననియు, భారతార్థమునందు ఇద్దురమును మున్న గాననియు భేదములు.) రాఘ. ౪, ఆ.

నిద్దురపోతు. ద్వి. విణ. నిదురపోతుయొక్క రూపాంతరము. "సీ. అతిధనాపేక్షచేనలరకనిద్దురపోతునుగాక పెంపుడునుగాక." భల్లా. ౪, ఆ.

నిద్దురవోవు. ద్వి. అ. క్రి. నిదురవోవుయొక్క రూపాంతరము.

నిద్ర. సం. వి. ఆ. స్త్రీ. నిదుర.

నిద్రపోవు. మి. అ. క్రి. నిద్రచేయు.

నిద్రాణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నిదురపోతు.

నిద్రాళువు. సం. విణ. ఉ.——వై.——

నిద్రించు. సం. అ. క్రి. నిద్రపోవు.

నిద్రిల్లు. సం. అ. క్రి. నిద్రించు. (రూ. నిద్రిలు. చూ. త్రుళ్లె.)

నిధనము. సం. వి. అ. న. కులము. పుం, న. 1. చావు; 2. చేటు.

నిధానము. సం. వి. అ. న. 1. ఉంచుట; 2. పాఁతఱ.

నిధి. సం. వి. ఇ. పుం. పాఁతఱ. (నవనిధులు.—పద్మము, మహాపద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, వరము.)

నిధువనము. సం. వి. అ. న. 1. కలయిక; 2. వడఁకు.

నిధ్యానము. సం. వి. అ. న. దర్శనము, చూపు.

నినదము. సం. వి. అ. పుం. ధ్వని, మ్రోఁత.

నినాదము. సం. వి. అ. పుం. నినదముయొక్క రూపాంతరము.

నినుచు. దే. ప్రే. నించుయొక్క రూపాంతరము. "క. అనుటయు రసలింగమునిడు, తనవట్రువ ప్రేఁపసజ్జెదంతవు బరణిన్, నినిచినయొకపసరిదియది, యనిచెప్పకపూసెఁదత్పదాంబుజయుగళిన్." స్వా. ౧, ఆ.

నినుపారు. దే. అ. క్రి. (నినుపు+ఆరు.) పూర్ణముగు. "క. నినుపారెడిచూడ్కివారి సెమ్మొగములపైఁ, దనుపారుచుఁబొలసు." భార. అశ్వ. ౩, ఆ.

నినుపు. దే. వి. నింపుయొక్క రూపాంతరము. "క న్నులన్ నినుపులుగాఁగబాష్పములు నివ్వటిలంగ." భో. ౭, ఆ. (వృత్తియందు అంత్యవర్ణమునకు లోపము. "నినుపల్లు." య. ౧, ఆ.)

నిన్న. దే. వి. (నిరు+నాడు.) కడచినదినము.

నిపఠము. సం. వి. అ. పుం. పాఠము, చదువు.
నిపతించు. సం. స. క్రి. నిపాతముచేయు.
నిపము. సం. వి. అ. పుం. కుండ, కలశము.
నిపాతము. సం. వి. అ. పుం. నిపతముయొక్క రూపాంతరము.
నిపాతనము. సం. వి. అ. న. దిగద్రొబ్బుట.
నిపాతము. సం. వి అ. పుం. 1. పడుట; 2. (వ్యాకరణమునందు) సాధారణవిధికిసంబంధింపక విధింపఁబడినశబ్దము; 3. అవ్యయము.
నిపాతించు. సం. స. క్రి. పడఁద్రోయు.
నిపానము. సం. వి. అ. న. పసులులోనగునవి నీళ్లు త్రాగుటకై నూతివద్ద తొట్టిలోనగువానితో నేర్పఱచినతొట్టి.
నిపుణుఁడు. సం. విశే. (అ ఆ. అ.) నేర్పరి, కుశలుఁడు.
నిప్పచ్చె. ద్వ వి. (నిఱు+పచ్చ.) నాశము.
నిప్పచ్చరము. వై. వి. దారిద్ర్యము*. "ఎ, గీ. మెలఁతుకలమిన్న నిద్దంపు మేల్పసిండి, కలుగకుండినమదిలోనగాటమగుచు, నిచ్చలును హెచ్చుకలఁకనిప్పచ్చరంబు, విడుచు టెటులింకఁబరికింపఁబుడమి వేల్ప." నీలా. ౨, ఆ.—విశే. శూన్యము. "గీ. బోధమల్పంబుగర్వమభ్యున్నతంబు, శాంతినిప్పచ్చరంబుమత్సరముఘనము, కూపమండూకములఁబోలెఁగొంచెమెఱిఁగి, పండితంమన్యులైన వేదండికులకు." భీ. ౧. ఆ.
నిప్పటి. దే. వి. నిప్పట్టుయొక్క రూపాంతరము. "భానుమండలముమాఁడిననిప్పటివోలెనుండు." రామా. ౮, ఆ.
నిప్పట్టు. దే. వి. (నిప్పు+అట్టు) ఆకులుమీఁదకప్పి నిప్పులోవేసికాల్చెడి భక్ష్యవిశేషము.
నిప్పస్తు. దే. వి. (నిఱు+పస్తు.) శుష్కోపవాసము.
నిప్పు. దే. వి. 1. అగ్ని; 2. బ. అగ్నికణము. "క. అప్పుడుక్రోధముగన్నుల, నిప్పులురాల్పంగ." భార. భీష్మ. 3, ఆ.
నిప్పుఁదిండి. దే. వి. (నిప్పు+తిండి) పక్షివిశేషము.
నిప్పుక. దే. వి. 1. అగ్ని; "ద్వి. మఱుపడ్డనిప్పుకమాడ్కినున్నాఁడు." హరిశ్చ. ౨, భా.—2. బ. అగ్నికణము. "క. కురిసెన్, గనగనగనమనుచు నిప్పుకలుకుప్పలుగన్." పాండు. ౫, ఆ.
నిప్పువన్నెసుత్తులకాకుగు. ద్వ. వి. అంగారవల్లరి.
నిబంధనము. సం. వి. అ. న. 1. ఏర్పాటు; 2. బంధము; 3. (చూ.) ఉపనాహము; 4. హేతువు విశే. కూర్పఁబడ్డది.
నిబంధము. సం. వి. అ. పుం. 1. మలమూత్రబంధము; 2. బంధము; 3. వర్షాశనము మొదలైనది
నిబంధించు. సం. స. క్రి. 1. బంధించు; 2. అడ్డగించు.
నిబద్ది. వై. విశే. నిజము, సత్యము*. (వానిమాట నిబద్దిగా ఎంచఁగూడదు.)
నిబద్దించు. వై. స. క్రి. నిజపఱచు*. "క. లేదన్న నిబద్దించుముజూడకున్నఁబరితాపించున్." రాధామాధవసంవాదము.
నిబద్దిలించు. వై. స. క్రి. నిబద్దించుయొక్క రూపాంతరము. "మ. పొందుగనీసుద్దినిబద్దిలించుజవభద్రుండాగ్రహంబందుచోన్." ఉత్తరహరిశ్చంద్రకావ్యము.
నిబద్ధము. సం విశే. (అ. ఆ. అ.) 1. బంధింపఁబడినది; 2. అడ్డగింపఁబడినది.
నిబర్హణము. సం. వి. అ. న. వధము, చేంపుట.
నిబర్హితము. సం. విశే. (అ. ఆ. అ.) చంపఁబడినది
నిబిడము. సం. విశే. (అ. ఆ. అ.) సాంద్రము, దట్టము
నిబిడీకరించు. సం. అ. క్రి. దట్టముచేయు.
నిబిడీకృతము. సం. విశే. (అ. ఆ. అ.) నిబిడముగాఁజేయఁబడినది.
నిబిరీసము. సం. విశే. (అ. ఆ. అ.) నిబిడము.
నిబోధనము. సం వి. అ. న. చూపు, ఆలోకనము.
నిబ్బద్ది. వై. విశే. నిబద్దియొక్క రూపాంతరము.
నిబ్బరము. వై. వి అశ్వగతివిశేషము, (చూ.) ప్లుతము*. "సీ. బలునిబ్బరమునకుఁ బ్రతిగాకగరుడియవామ ధేయునివాహనంబనఁదగె." ఉ. రా. ౧, ఆ.—క్రి. విశే. పెల్లు. "క. హరిచూచి వెఱఁగుపడన, ప్పరుషప్రహారణమువచ్చి పక్షీంద్రునిని, బ్బరముగఁదాఁకినవడఁకెన్, భూరినాతఁడు వజ్రనిహతభూధరముక్రియన్." హరి. పూ. ౪, ఆ.—విశే. అధికము. (చూ. గొబ.)
నిబ్బరించు. వై. అ. క్రి. 1. అతిశయించు, "ఉ. ముఖాంబుజంబునన్, గప్పులువ్రాలఁగాఁదివురు కైవడియుబ్బునిబ్బరించుచున్." చంద్ర.—2. నిదానించు*.
నిబ్బరికము. దే. వి. కరుణ. "గీ. నిబ్బరికమేదియు నామేదినీవరేణ్య, వనమునకునీవు వేగఁబోవంగఁ

ప్రొద్దు, గడపలేనందు చేతఁజిల్కఁగొనిదాని, చేతఁగొంతయుబుసుపోకఁజెలఁగునంత." సా. ౨, ఆ.

నిబ్బరికించు. య. దే. అ. క్రి. కరుణించు. "ఉ. నిన్ను నెనమ్మియున్న యెడ నిబ్బరికింపక చోరవృత్తినా, కన్నియఁదెచ్చుటింతయును గానివిధంబ నికాకదూఱుటల్." పర. ౪, ఆ.—వై. ఉప్పొంగు. "వ. అగ్గుబ్బలిసోయగంపుటుబ్బునకుమైనిబ్బరికింపనబ్బురపడియబ్బలియుండు తనలోన." య. ౨, ఆ.

నిభము. సం. వి. అ. పుం. నెపము. విణ. సమానము.

నిభాయించు. హిం. క్రి. సహించు, తాళు.

నిభృతము. సం. విణ. (అ. ఆ. అ.) తీర్పఁబడినది.

నిమంత్రణము. సం. వి. అ. న. శ్రాద్ధభోజనాదులయందు తగినవారిని నియమించుట.

నిమంత్రించు. సం. స. క్రి. శ్రాద్ధభోజనాదులయందు తగినవారిని నియమించు.

నిమంత్రితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నిమంత్రింపఁబడినవాఁడు.

నిమజ్జనము. సం. వి. అ. న. మజ్జనము, స్నానము.

నిమటాయి. దే. వి. ఒకదినుసుతీఁగ.

నిమాజు. హిం. వి. ప్రార్థన, పూజ. (రూ. నమాజు.)

నిమయము. సం. వి. అ. పుం. (వస్తువుల) మాఱుపు.

నిమితకాఁడు. ద్వ. వి. (నిమితము+కాఁడు.) బరువు మోసెడు పనివాఁడు. (చూ. కామాటము.)

నిమితము. వై. వి. నియమనము. (చూ. నిమితకాఁడు.)

నిమిత్తము. సం. వి. అ. న. 1. కారణము; 2. శకునము; 3. గుఱి; 4. గుఱుతు.

నిమిషము. సం. వి. అ. పుం. 1. ఱెప్పవేయుట; 2. ఱెప్పవేయునంతకాలము.

నిమీలనము. సం. వి. అ. న. 1. కనుమూయుట; 2. చావు.

నిముకళ్లా. దే. వి. (నిమురు+కళ్లము.) 1 కైలుచేసిన కళ్లమునందలి యడుగుధాన్యము; 2 కొఱఁత.

నిముకు. దే. స. క్రి. స్తన్యపానముచేయు, కుడుచు. "ద్వి. గమిగూడిచూచియుక్కటదాదిచన్ను, నిముకనేరనిచిన్ని నెత్తురుగందు." హరిశ్చ. ౨, భా.

నిమురు. దే. స. క్రి. (ప్రేమమునశరీరమును) అల్లన తడవు. "గీ. నిద్రపోవంగ మెల్లననిమిరియెత్తి." వి. పు. ౭, ఆ. "అక్కుచూరుమైనిమిరి." రామా. ౪, ఆ.

నిముసము. వై. వి. (చూ.) నిమిషము.

నిమేషము. సం. వి. అ. పుం. నిమిషముయొక్క రూపాంతరము.

నిమ్నగ. సం. వి. ఆ. స్త్రీ. ఏఱు, నది.

నిమ్నము. సం. విణ. (అ.ఆ.అ.) లోఁతు, గభీరము.

నిమ్మ. దే. వి. జంబీరము†.

నిమ్మళము. వై. విణ. 1. నిశ్చింతము*; 2. స్వస్థము*.

నిమ్మళించు. వై. అ. క్రి. 1. నిశ్చింతమగు*; 2. స్వస్థమగు*.

నియంత. సం. వి. ఋ. పుం. తేరునడపువాఁడు. విణ. నడపువాఁడు.

నియంతవ్యుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) 1. అడ్డగింపఁదగినవాఁడు; 2. ఆజ్ఞాపింపఁదగినవాఁడు.

నియంత్రణ. సం. వి. ఆ. స్త్రీ. అడ్డగింత.

నియంత్రితము. సం. విణ. (అ. ఆ. అ.) అడ్డగింపఁబడినది.

నియతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నియమము గలది; 2. నిత్యమయినది.

నియతి. సం. వి. ఇ. స్త్రీ. 1. నియమము; 2. భాగ్యము.

నియమనము. సం. వి. అ. న. నియమించుట, ఏర్పాటు.

నియమము. సం. వి. అ. పుం. 1. ఏర్పాటు; 2. కట్టు; 3. పనుపు; 4. ప్రతిజ్ఞ; 5. శరీరముకంటె భిన్నములైన మృజ్జలాదులు సాధనముగాఁగలిగి నిత్యముగా నాచరింపఁదగిన యొక యోగాంగము. (ఇది దశవిధము.—తపము, సంతోషము, ఆస్తికత్వము, దానము, భగవదర్చన, వేదాంతశ్రవణము, లజ్జ, మతి, జపము, వ్రతము. చూ. అంగము.)

నియమించు. సం. స. క్రి. ఆజ్ఞాపించు, పనుచు.

నియమితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. నియమింపఁబడినది; 2. కట్టఁబడినది.

నియమ్యము. సం. విణ. (అ.ఆ.అ.) నియమింపఁదగినది.

నియాతనము. సం. వి. అ. న. దిగద్రొబ్బుట.

నియామకుఁడు. సం. వి. అ. పుం. 1. (చూ.) ఆరకాటి; 2. (చూ.) తండేలు. విణ. నియమించువాఁడు.

నియామము. సం. వి. అ. పుం. నియమముయొక్క రూపాంతరము.

నియుక్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నియోగింపఁబడినవాఁడు.

నియుతము. సం. వి. అ. న. సంఖ్యావిశేషము, లక్ష.

నియుద్ధము. సం. వి. అ. న. బాహుయుద్ధము.

నియోక్తవ్యము. సం. విశ. (అ. ఆ. అ.) నియోగింపఁ దగినది.

నియోగము. సం. వి. అ. పుం. ఆజ్ఞ, పనుపు.

నియోగి. సం. విశ. (న్. ఈ. న్.) నియోగముకలవాఁడు.

నియోగించే. సం. స. క్రి. ఆజ్ఞాపించు, పనుచు.

నియోగ్యుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) నియోగింపఁ దగినవాఁడు.

నియోజనము. సం. వి. అ. న. ఆజ్ఞాపనము, పనుపు.

నియోజ్యుఁడు. సం. వి. అ. పుం. పనివాఁడు, భృత్యుఁడు.

నియోద్ధ. సం. వి. ఋ. పుం. బాహుయుద్ధము చేయు వాఁడు

నియ్యోగి. వై. వి. 1. మంత్రి; 2. ఒకతెగ బ్రాహ్మణుఁడు*.

నిరంకుశ. సం. వి. ఆ. స్త్రీ. జిబిలిక?. విశ. అడ్డములేనిది.

నిరంజన. సం. వి. ఆ. స్త్రీ. పున్నమ. అ. పుం. ము. యజ్ఞమునకుఁదగిన చిత్రవర్ణహరిణము. విశ. 1. కాటుకలేనిది; 2. దోషములేనిది.

నిరంతరము. సం. విశ. (అ.ఆ.అ.) 1. దట్టము; 2. ఎడతెగనిది.

నిరకు. హిం. వి. అంగడివెల.

నిరతము. సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలి ఆసక్తికొన్నది.

నిరతి. సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలి ఆసక్తి.

నిరత్యయము. సం. విశ. (అ.ఆ.అ.) నాశములేనిది.

నిరపరాధుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) అపరాధములేనివాఁడు.

నిరపాయము. సం. విశ (అ. ఆ. అ.) అపాయములేనిది.

నిరపేక్షము. సం. విశ. (అ. ఆ. అ.) అపేక్షలేనిది.

నిరయము. సం. వి. అ. పుం. దుర్గతి, నరకము.

నిరర్గళము. సం. విశ. (అ. ఆ. అ.) అడ్డములేనిది.

నిరర్థకము. సం. విశ. (అ. ఆ. అ.) ప్రయోజనములేనిది.

నిరవగ్రహుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) అడ్డపాటులేనివాఁడు, స్వతంత్రుఁడు.

నిరవధికము. సం. విశ. (అ. ఆ. అ.) మేరలేనిది.

నిరసనము. సం. వి. అ. న. 1. తిరస్కారము; 2. ఆక్షేపము; 3. వధము; 4. ఉమియుట.

నిరసించే. సం. స. క్రి. 1. తిరస్కరించు; 2. విడుచు.

నిరస్తము. సం. విశ. (అ. ఆ. అ.) 1. త్వరితముగాఁ జెప్పఁబడినది; (మాట.) 2. తిరస్కరింపఁబడినది; 3. వెడలఁగ్రక్కఁబడినది; 4. న్యాయముచేత్రోయఁబడినది; 5. ప్రయోగింపఁబడినది. (బాణము.)

నిరాకరణము. సం. వి. అ. న. తిరస్కారము.

నిరాకరిష్ణువు. సం. విశ. ఉ. తిరస్కరించువాఁడు.

నిరాకారము. సం. వి. అ. పుం. 1. తిరస్కారము; 2. ఆకాశము.

నిరాకారుఁడు. సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. శివుఁడు; 3. పరమాత్ముఁడు. విశ. ఆకారములేనివాఁడు.

నిరాకృతము. సం. విశ. (అ. ఆ. అ.) న్యాయముచే త్రోయఁబడినది, నిరస్తము.

నిరాకృతి. సం. వి. ఇ. స్త్రీ. తిరస్కారము. విశ. 1. రూపములేనివాఁడు; 2. వేదముచదువనివాఁడు.

నిరాఘాటము. సం. విశ. (అ. ఆ. అ.) 1. కొలఁదిలేనిది; 2. మేరలేనిది.

నిరాతంకము. సం. విశ. (అ. ఆ. అ.) 1. భయములేనిది; 2. వ్యాధిలేనిది.

నిరాపనింద. మి. గ్రా. వి. అపదూఱు. "క. పినతల్లివిపెనుపఁగనో, పినతల్లివిగానవచ్చిపిలిచినఁయోగ్యా, గనికరములేకవానిం, గనికరమునిరాపనిందగట్టందగునే." సా. 3, ఆ.

నిరాబారి. వై. వి. ముని*. (చూ. తబము.)

నిరామయము. సం. వి. అ. పుం. రోగములేమి. విశ. రోగములేనిది.

నిరాయాసము. సం. విశ. (అ. ఆ. అ.) ఆయాసములేనిది.

నిరాయుధము. సం. విశ. (అ. ఆ. అ.) ఆయుధములేనిది.

నిరాలంబము. సం. విశ. (అ. ఆ. అ.) అవలంబములేనిది.

నిరాశము. సం. విశ. (అ. ఆ. అ.) ఆశలేనిది.

నిరాసకము. సం. విశ. (అ. ఆ. అ.) నిరసించునది.

నిరాసనము. సం. వి. అ. న. నిరసనముయొక్క రూపాంతరము.

నిరాహారము. సం. విశ. (అ. ఆ. అ.) ఆహారములేనిది.

నిరీక్షణము. సం. వి. అ. న. దర్శనము, చూపు.

నిరీక్షించే. సం. స. క్రి. దర్శించు, చూచు.

నిరీక్షితము. సం. విశ. (అ. ఆ. అ.) చూడఁబడినది.

నిరీషము. సం. వి. అ. న. (చూ.) గొడగ.

నిరు. వై. అవ్య. గతార్థకము. (నిరుడు, నిన్న, నిప్పచ్చ. మొ.)
నిరుకడము. దే. వి. ఒకానొక చెట్టు.
నిరుకళము. వై. విణ. నిరర్గళము. "ఎ, గీ. నిగమ నూపురములఁ బ్రోయు నిరుకళముగ." పాండు. ౨, ఆ.
నిరుకు. దే. వి. 1. నిర్ణయము; 2. నిర్ణయముచేసిన వెల.
నిరుక్తము. సం. వి. అ. న. ఒక వేదాంగము. (చూ. అంగము.) విణ. చెప్పఁబడినది.
నిరుక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. అర్థనిర్వచనము; 2. అలంకారవిశేషము.
నిరుడిమావియావు. దే. వి. (నిరుడిమావి+ఆవు.) ఒక తూరియీనిన ఆవు, గృష్టి.
నిరుడు. దే. వి. (నిరు+ఏఁడు.) కడచినసంవత్సరము.
నిరుద్ధము. సం. విణ. (అ.ఆ.అ.) నిరోధింపఁబడినది.
నిరుపద్రవము. సం. విణ. (అ.ఆ.అ.) ఉపద్రవములేనిది.
నిరుపమము. సం. విణ. (అ. ఆ. అ.) ఉపమలేనిది.
నిరూఢము. సం. విణ. (అ.ఆ.అ.) ప్రసిద్ధికెక్కినది.
నిరూఢి. సం. వి. ఇ. స్త్రీ. ప్రసిద్ధి.
నిరూపణము. సం. వి. అ. న. 1. అరయిక; 2. చూపు; 3. తార్కాణ.
నిరూపించు. సం. స. క్రి. నిరూపణముచేయు.
నిరూపితము. సం. విణ. (అ. ఆ. అ.) నిరూపింపఁబడినది.
నిరూప్యము. సం. విణ. (అ. ఆ. అ.) నిరూపింపఁదగినది.
నిరూహము. సం. వి. అ. పుం. ముగిసినవాక్యము. విణ. 1. ఊహలేనిది; 2. నిశ్చయింపఁబడినది.
నిరృతి. సం. వి. ఇ. స్త్రీ. పెద్దమ్మ. పుం. 1. దక్పాలవిశేషము; 2. దినముయొక్క పంద్రెండవభాగము. (చూ. దినము.) విణ. ఉపద్రవములేనిది.
నిరోధము. సం. వి. అ. పుం. 1. అడ్డు; 2. చేటు.
నిరోధించు. సం. స. క్రి. అడ్డగించు.
నిర్గంధము. సం. విణ. (అ. ఆ. అ.) గంధములేనిది.
నిర్గతము. సం. విణ. (అ. ఆ. అ.) వెడలఁబడినది.
నిర్గతి. సం. వి. ఇ. స్త్రీ. వెడలఁబాటు, నిర్గమనము.
నిర్గమనము. సం. వి. అ. న.——పై.——
నిర్గమము. సం. వి. అ. పుం.——పై.——
నిర్గమించు. సం. అ. క్రి. వెడలఁబడు.
నిర్గళనము. సం. వి. అ. న. వెలికిజాఱుట.
నిర్గళితము. సం. విణ. (అ. ఆ. అ.) వెలికిజాఱినది.
నిర్గుండి. సం. వి. ఈ. స్త్రీ. 1. వావిలి; 2. నల్లవావిలి.
నిర్గుణుఁడు. సం. వి. అ. పుం. భగవంతుఁడు. విణ. గుణరహితుఁడు.
నిర్గ్రంథనము. సం. వి. అ. న. వధము, చంపుట.
నిర్గ్రంథుఁడు. సం. వి. అ. పుం. 1. దిసమొలవాఁడు; 2. బీదవాఁడు; 3. మూర్ఖుఁడు.
నిర్ఘటము. సం. వి. అ. న. బహుజనసమ్మర్దముగల అంగడి. విణ. ఘటములేనిది.
నిర్ఘాతము. సం. వి. అ. పుం. 1. పిడుగు; 2. వజ్రము.
నిర్ఘృణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కనికరములేనివాఁడు.
నిర్ఘోషము. సం. వి. అ. పుం. ధ్వని, మ్రోఁత.
నిర్జనము. సం. విణ. (అ. ఆ. అ.) జనములేనిది.
నిర్జర. సం. వి. ఆ. స్త్రీ. 1. తిప్పతీఁగ; 2. మురళి.
నిర్జరుఁడు. సం. వి. అ. పుం. దేవత, వేలుపు. విణ. ముదిమిలేనివాఁడు.
నిర్జలము. సం. విణ. (అ. ఆ. అ.) జలములేనిది.
నిర్జించు. సం. స. క్రి. జయించు, గెలుచు.
నిర్జితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) గెలువఁబడినవాఁడు.
నిర్జీవుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) జీవములేనివాఁడు.
నిర్ఝరము. సం. వి. అ. పుం. సెలయేఱు, ఝరము.
నిర్ఝరిణి. సం. వి. ఈ. స్త్రీ. ఏఱు, నది, సరిత్తు.
నిర్ణయము. సం. వి. అ. పుం. ఏర్పాటు
నిర్ణయించు. సం. స. క్రి. ఏర్పాటుచేయు.
నిర్ణాయకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నిర్ణయముచేయువాఁడు.
నిర్ణిక్తము. సం. విణ. (అ. ఆ. అ.) కడుగుటలోనగువానిచేత గిరగరికైనది, మృష్టము.
నిర్ణీతము. సం. విణ. (అ.ఆ.అ.) నిర్ణయింపఁబడినది.
నిర్ణేజకుఁడు. సం.వి.అ.పుం. చాకలవాఁడు, రజకుఁడు.
నిర్ణేత. సం. విణ. (ఋ. ఈ. ఋ.) నిర్ణయముచేయువాఁడు.
నిర్ణేయము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్ణయముచేయఁదగినది.
నిర్దగ్ధము. సం. విణ. (అ. ఆ. అ.) చక్కఁగా కాలినది.
నిర్దయుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దయలేనివాఁడు.
నిర్దళనము. సం. వి. అ. న. చక్కఁగా భేదించుట.

నిర్దళితము. సం. విశే. (అ. ఆ. అ.) చక్కఁగా భేదింపఁబడినది.
నిర్దహనము. సం. వి. అ. న. చక్కఁగా కాలుట.
నిర్దహించు. సం. స. క్రి. చక్కఁగా కాలుచు.
నిర్దారణము. సం. వి. అ. న. చక్కఁగా చీల్చుట.
నిర్దారితము. సం. విశే. (అ. ఆ. అ.) చక్కఁగా చీల్పఁబడినది.
నిర్దిష్టము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్దేశింపఁబడినది.
నిర్దేశము. సం. వి. అ. పుం. 1. ఆజ్ఞ; 2. చెప్పుట; సమీపము.
నిర్దేశించు. సం. అ. క్రి. ఆజ్ఞాపించు, పనుచు.
నిర్దేశ్యము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్దేశింపఁదగినది.
నిర్దేష్ట. సం. విశే. (ఋ. ఈ. ఋ.) నిర్దేశించువాఁడు.
నిర్దోషము. సం. విశే. (అ. ఆ. అ.) దోషములేనిది.
నిర్ధనుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ధనములేనివాఁడు.
నిర్ధరించు. సం. స. క్రి. నిర్ధారణచేయు కాశీ. ౫, అ.
నిర్ధారణ. సం. వి. ఆ. స్త్రీ. అ. న. ము. నిశ్చయము.
నిర్ధారణీయము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్ధరింపఁదగినది.
నిర్ధారితము. సం. విశే. (అ.ఆ.అ.) నిర్ధరింపఁబడినది.
నిర్ధార్యము. సం. విశే. (అ.ఆ.అ.) నిర్ధారణీయము.
నిర్ధార్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) దుఃఖాదులు కలిగినను మనోవికారమునుచెందక పూనినపని విడువక చేయువాఁడు.
నిర్ధూతము. సం. విశే. (అ. ఆ. అ.) విడువఁబడినది.
నిర్నిద్రము. సం. విశే. (అ. ఆ. అ.) 1. నిద్రలేనిది; 2. జాగరూకతకలది.
నిర్బంధము. సం. వి. అ. పుం. 1. బలాత్కారము; 2. కదలమెదలఁగూడనికట్టు.
నిర్బంధించు. సం. స. క్రి. నిర్బంధముచేయు.
నిర్భయము. సం. విశే. (అ. ఆ. అ.) భయములేనిది.
నిర్భరము. సం. క్రి. విశే. అ. న. పెల్లు. విశే. అధికము.
నిర్భర్త్సనము. సం. వి. అ. న. 1. అదలుపు; 2. లత్తుక.
నిర్భర్త్సించు. సం. స. క్రి. అదలించు.
నిర్భర్త్సితము. సం. విశే. (అ.ఆ.అ.) నిర్భర్త్సింపఁబడినది.
నిర్భాగ్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) భాగ్యములేనివాఁడు.
నిర్భిన్నము. సం. విశే. (అ.ఆ.అ.) చక్కఁగా భేదింపఁబడినది.
నిర్మదము. సం. వి. అ. పుం. మదముఉడిగిన యేనుఁగు. విశే. మదములేనిది.
నిర్మలము. సం. వి. అ. న. 1. నిర్మాల్యము; 2. అభ్రకము. విశే. మయిలకానిది.
నిర్మాణము. సం. వి. అ. న. 1. నిర్మితి; 2. యోగ్యత, 3. సారము.
నిర్మాత. సం. విశే. (ఋ. ఈ. ఋ.) నిర్మించువాఁడు.
నిర్మాయి. సం. విశే. (న్. ఈ. న్.)——పై.——
నిర్మాల్యము. సం. వి. అ. న. ధరించి తీసివేసినది.
నిర్మించు. సం. స. క్రి. నిర్మాణముచేయు, కలుగఁజేయు
నిర్మితము. సం. విశే. (అ. ఆ. అ.) నిర్మింపఁబడినది.
నిర్మితి. సం. వి. ఇ. స్త్రీ. నిర్మించుట, నిర్మాణము.
నిర్మిమీష. సం. వి. ఆ. స్త్రీ. నిర్మింపనిచ్ఛ.
నిర్ముక్తము. సం. వి. అ. పుం. కుబుసమువిడిచినపాము.
నిర్ముక్తుఁడు. సం. వి. అ. పుం. సంగమువిడిచినసన్యాసి. విశే. సంగమువిడిచినవాఁడు.
నిర్మూలము. సం. విశే. (అ. ఆ. అ.) వేరులేనిది.
నిర్మూలించు. సం. స. క్రి. 1. వేరులేనిదిగాఁజేయు, 2. నాశముచేయు.
నిర్మృష్టము. సం. విశే. (అ. ఆ. అ.) తుడువఁబడినది.
నిర్మోకము. సం. వి. అ. పుం. 1. పాఁపకుబుసము, 2. కుబుసము; 3. విడుపు; 4. ఆకాశము.
నిర్యంత్రణము. సం. విశే. (అ.ఆ.అ.) అడ్డములేనిది.
నిర్యంత్రితము. సం. విశే. (అ. ఆ. అ.) అడ్డములేనిదిగా చేయఁబడినది.
నిర్యాణము. సం వి. అ. న. 1. ఏనుఁగుకడకన్ను, 2. చావు; 3. ముక్తి; 4. వెడలఁబోటు.
నిర్యాతనము. సం. వి. అ. న. 1. పగతీర్చుట, 2. చంపుట; 3. అప్పులోనగువానిఁదీర్చుట, 4. దాఁచఁబెట్టినసొమ్ము మరల నప్పగించుట; 5. ఈవి.
నిర్యాతము. సం. విశే (అ. ఆ. అ.) వెడలఁబడినది.
నిర్యాసము. సం. వి. అ. పుం. మ్రానిబంక.
నిర్యూహము. సం. వి. అ. పుం. 1. సిగబంతి, 2. నాగవాసము, గృహద్వారువిశేషము. (అనికొందఱు.) 3. మ్రానిబంక; 4. వాకిలి.
నిర్లజ్జము. సం. విశే. (అ. ఆ. అ.) లజ్జలేనిది.
నిర్వచనము. సం. వి. అ. న. అర్థవివరణముచేసి చెప్పుట. విశే. మాటలేనిది.
నిర్వచనీయము. సం. విశే. (అ.ఆ.అ.) నిర్వచింపఁదగినది.
నిర్వచించు. సం. స. క్రి. నిర్వచనముచేసి చెప్పు.

నిర్వపణము. సం. వి. అ. న. దానము, ఈవి.

నిర్వర్ణనము. సం. వి. అ. న. చూపు, ఆలోకనము.

నిర్వర్తించే. సం. ప్రే. నిర్వర్తిల్లఁజేయు.

నిర్వర్తిల్లు. సం. అ. క్రి. నెఱవేఱు.

నిర్వహణము. సం. వి. అ. న. 1. ప్రస్తుతకథాసంహారరూపమైన యొక నాటకసంధి; (చూ. సంధి.) 2. నిష్ఠ.

నిర్వహించే. సం. ప్రే. నిర్వహిల్లఁజేయు.

నిర్వహిల్లు. సం. స. క్రి. 1. జరగు; 2. నెఱవేఱు.

నిర్వాణము. సం. వి. అ. న. 1. ముక్తి; 2. నాశము; 3. సుఖము; 4. ఏనుఁగు నీళ్లలో మునుఁగుట. విణ. 1. చల్లాఱినది; (దీపము నిప్పులోనగునది.) 2. నీళ్ల మునిఁగినది. (ఏనుఁగు.)

నిర్వాణుఁడు. సం. వి. అ. పుం. 1. పనివాఁడు; 2. బరువుమోసెడివాఁడు. విణ. 1. ముక్తినొందినవాఁడు; (ముని. మొ.) 2. శాంతిఁబొందినది. (వహ్ని. మొ.)

నిర్వాతము. సం. వి. అ. పుం. చలింపనిగాలి. విణ. గాలిలేనిది. (చోటు. మొ.)

నిర్వాదము. సం. వి. అ. పుం. 1. అపవాదము; 2. వాదములేమి; 3. నిశ్చితవాదము.

నిర్వాపణము. సం. వి. అ. న. 1. కొల; 2. ఈవి.

నిర్వాసనము. సం. వి. అ. న. 1. చంపుట; 2. వెళ్లఁగొట్టుట.

నిర్వాసితము. సం. విణ. (అ. ఆ. అ.) వెళ్లఁగొట్టఁబడినది.

నిర్వాస్యము. సం. విణ. (అ. ఆ. అ.) వెళ్లగొట్టఁదగినది.

నిర్వాహకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నిర్వహించువాఁడు.

నిర్వాహము. సం. వి. అ. పుం. 1. శక్తి; 2. జరగుఁబాటు.

నిర్వికారుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వికారము లేనివాఁడు.

నిర్విఘ్నము. సం. విణ. (అ. ఆ. అ.) విఘ్నములేనిది.

నిర్విణ్ణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నిర్వేదమునొందినవాఁడు.

నిర్విశేషము. సం. విణ. (అ. ఆ. అ.) విశేషములేనిది.

నిర్విష. సం. వి. ఆ. స్త్రీ. అతివస. విణ. విషము లేనిది.

నిర్విష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. చొరఁబడినది; 2. పొందఁబడినది; 3. నిలిచినది.

నిర్వీర్యము. సం. విణ. (అ. ఆ. అ.) వీర్యములేనిది.

నిర్వృతము. సం. వి. అ. న. ఇల్లు. విణ. 1. సుఖించినది; 2. వశించినది.

నిర్వృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. సుఖము; 2 ఊటు; 3. నాశము.

నిర్వృత్తము. సం. విణ. (అ. ఆ. అ.) నెఱవేఱినది.

నిర్వృత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. సంతోషము; 2. మోక్షము; 3. నెఱవేఱుట. విణ. వృత్తిలేనిది.

నిర్వేదము. సం. వి. అ. పుం. తత్త్వజ్ఞానదుఃఖాదులచేతఁగలుగు హేయత్వబుద్ధి.

నిర్వేదించే. సం. అ. క్రి. నిర్వేదపడు.

నిర్వేశము. సం. వి. అ. పుం. 1. కూలి; 2. జీతము; 3. భోగము; 4. మూర్ఛపోవుట.

నిర్వైరము. సం. విణ. (అ. ఆ. అ.) వైరములేనిది.

నిర్వ్యథనము. సం. వి. అ. న. రంధ్రము, బెజ్జము.

నిర్వ్యాజము. సం. విణ. (అ. ఆ. అ.) నెపములేనిది.

నిర్హరణము. సం. వి. అ. న 1. నిశ్శేషముగా హరించుట; 2. పీనుఁగును కాల్చుట.

నిర్హ్రాదము సం. వి. అ పుం. ధ్వని, మ్రోఁత.

నిర్హారము. సం. వి. అ. పుం. నాటినముల్లికిలోనగువాని నూడఁబెఱుకుట. పైరునకు విఘాతమైనగాదము మొదలైనవానిఁబెఱుకుట. (అని కొందఱు.)

నిర్హారి. సం. విణ. (న్. ఈ న్.) దూరము వ్యాపించునట్టిది. (పరిమళము.)

నిర్హృతము. సం. విణ. (అ. ఆ. అ.) ఊడఁబెఱికినది. (నాటినముల్లులోనగునది.)

నిర్హృతి. సం. వి. ఇ. స్త్రీ. (చూ.) నిర్హారము.

నిఱు. వై. ఉప. మిక్కిలి. (నిఱుపేద, నిఱుపేదరాలు. మొ.)

నిఱ్ఱనీలుఁగు. దే. అ. క్రి. (నీలుఁగు+నీలుఁగు.) 1. మిక్కిలి నీలుఁగు; 2. గర్వించు.

నిలఁబడు. ద్వ. అ. క్రి. నిలువఁబడుయొక్క రూపాంతరము. (చూ. నిట్టకనిలుచు.)

నిలక. దే. వి. నిలువు. (ఇది నాకు నిలకయియ్యలేదు.)

నిలయనము. సం. వి. అ. న. (చూ.) కనుమూసిగంతలు.

నిలయము. సం. వి. అ. పుం. గృహము, ఇల్లు.

నిలింపుఁడు. సం. వి. అ. పుం. 1. వేలుపు; 2. బోయ.

నిలీనము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి అడఁగినది.

నిలుకడ. దే. వి. 1. ఉనికి; 2 స్థైర్యము; 3. విరామము. "సీ. అందందగదికెడుకొండలపాటుచేఁదలఁకుచును నికికినిలుకడయును." భార. విరా. ౨. ఆ. (రూ. నిల్కడ.)

నిలుగు. దే. అ. క్రి. ఒళ్లువిఱుచుకొను. "చ. నిలుగుచునావులించుచువనీవిహగోత్కరమెట్లువల్కిన,వ్వలుకులెయట్లులెత్తివినిపల్కెడువింటివెకిరళారికల్." ప్రా, 3, ఆ.—వి. నిలుగుట. (నీలుగుయొక్క రూపాంతరము.)

నిలుచు. దే. అ. క్రి. 1. నిలఁబడు; 2. ప్రతిష్ఠితమగు; 3. ఉండు; 4. శేషించు; 5. అడ్డిపడు. (వచ్చునది రాకనిలువదు.) (రూ. నిల్చు. చూ. నిలుపు.)

నిలుచుండు. దే. అ. క్రి. (నిలిచి+ఉండు.) నిలఁబడియుండు, (రూ. నిల్చుండు.)

నిలుచుకొను. దే. అ. క్రి.——పై.——(స్వార్థమున కొను.)

నిలుపు. దే. ప్రే. (నిలువఁజేయు.) 1. నిలువఁబెట్టు; (వానినిపదిమందిలోనిలిపివిచారణచేసిరి.) 2. ప్రతిష్ఠించు. 3. అడ్డగించు; (నన్నుపోవలదని నిలిపినాఁడు.) 4. స్థిరపఱచు. వి 1. నిలుచుట, ఉండుట; "ఎ, గీ. నిధనముంబొందు నొకకొన్ని నిలుపులేక." శేష. 3, ఆ.—2. నిష్ఠ; "ఆత్మరతిఁ నిలుపిచ్చు మోక్షముఁ." భార. శాం. ౪, ఆ.—3. నిలుపుట, ప్రతిష్ఠ; "క. తనప్రాణమునిలుపుకన్నధర్మముగలదే." పాండు. ౪, ఆ.—4. స్థైర్యము. "చ. నీనిలుపును బార్థుచాలుటయు నేడుగదాభువనంబెఱింగెడుఁ." భార. ద్రో. ౭, ఆ.—విశే. 1. నిలుపునది; "క. నీరక్షయవీనికల్లనిలుపైయుండుఁ." భార. భీష్మ. ౭, ఆ.—2. స్థిరమైనది. (రూ. నిల్పు. ప్రతిష్ఠించుటకు. "మ. మీరలెఱమంద్రుఁ నిల్పనారంభికా, విభునిఁ సత్యమనేనుజెప్పితినభోవీధివిటంకంబునఁ." భీ. ౪, ఆ.—స్థిరమునకు. "బలుపూన్కినిల్పారవిప్రసూతి." హన. ౪, ఆ.)

నిలుపోవు. దే. అ. క్రి. (నిలుపు+ఓపు.) ఓర్చు, సహించు. "క. నిలిచినకపివరుఁదోడుకొని, నిలుపోపక మొసలిపలికె నేడీమిత్రుఁ, జలముకొని చంపవలసెను, గలఁడేతనవంటిపాపకర్ముఁడు జగతిఁ." పంచ. నా. ౪, ఆ.

నిలువ. దే. వి. నిలిచినవస్తువు, శేషము, (రూ. నిల్వ.)

నిలువఁబడు. ద్వి. అ. క్రి. (నిలువఁ+పడు.) 1. నిలుచు; 2. అడ్డిపడు; "అకటపితృపిండవిధులు నిలువఁబడనోపు." మార్క. ౬, ఆ.—3. ప్రతిష్ఠితమగు. "క. మేలెట్టిదట్టిశోభన, కాలమునరి కడచెనేనికాదనికంఠే, కాలుఁడుకారుణ్యసమ, స్మీలితమతిఁదనకుఁదాననిలువంబడియెఁ." భీ. ౪, ఆ. (రూ. నిల్వఁబడు. — నిలుచుటకు.— "మూర్ఛావశుండైనిల్వంబడిలోచనంబులరమూయఁ." జై. ౭, ఆ.) (స్వార్థమున పడు.)

నిలువరము. దే. విశే. స్థిరమైనది. (రూ. నిల్వరము.)

నిలువరించు. దే. అ. క్రి. చలింపకనిలుచు. "గీ. వీఁడెవచ్చుచున్నవాఁడుపార్థుఁడుమన, మేమిసేయువారమీవుదక్క, నొరులు నిలువరింపనోపెడువారలే, యోటలేకతాఁకియోర్వవలదె." భార. విరా. ౫, ఆ.—అం. ప్రే. 1. చలింపకనిలుపు; "వ. కలఁగిపాఱునిజబలంబులనిలువరించుచు." కళా. ౬, ఆ.—2. నిలుపు. (చూ. నిల్వరించు.)

నిలువు. దే. వి. 1. నిలుచుట, నిలుపు; "నిలిచిననిలువునసె." రామా. ౬, ఆ. "నిలువుఁజూపులఁజూచి." కవిక. ౪, ఆ.—2. చేయిమీఁదికెత్తుకొని నిలుచున్నపురుషునిచేయిపొడువుకొలఁది; (ఈనూతిలోరెండునిలువులనీళ్లున్నవి.)—3. మీఁదియంతస్తు; "చ. ఇదిశతయోజనోన్నతముహేమగిరిప్రతిమంబుహర్మ్యమీ, తుదినిలువెక్కివీని దిగఁద్రోవుడు." లక్ష్మీ. ౪, ఆ.—4. ఆకృతి; "నిలువుదయామయంబు." రామా. ౧, ఆ.—5. చేనిలోకొంతకోసినతరువాతకోయఁగలభాగము; 6. బ. అరిగాళ్లు.

నిలువుఁగొలువు. దే. వి. (నిలువు+కొలువు.) నిలుచుండి చేయుసేవ.

నిలువుగాళ్లు. దే. వి. బ. (నిలువు+కాళ్లు.) తొవకాళ్లకువెనుక మానుమొదలైనవాని కాధారముగా నాటిన స్తంభములు.

నిలువుజీతము. ద్వి. వి. నిలుచుండి సేవచేయునట్లు ఏర్పాటుచేసికొనియిచ్చెడుజీతము.

నిలువోపు. దే. అ. క్రి. (నిలువు+ఓపు.) నిలుపోపుయొక్క రూపాంతరము.

నిల్కడ. దే. వి. నిలుకడయొక్క రూపాంతరము.

నిల్వ. దే. వి. నిలువయొక్క రూపాంతరము.

నిల్వరము. దే. విశే. నిలువరముయొక్క రూపాంతరము.

నిల్వరించు. దే. అ. క్రి. అం, ప్రే. నిలువరించుయొక్క రూపాంతరము. (చలింపకనిలుచుటకు.— "క. పాండవయోధులు నిల్వరించుటకుఁజాలకతీవ్రపడిన." భార. భీష్మ. ౭, ఆ.—నిలుపుటకు.—

"విషాదాస్పదమైనసంసృతి హయగ్రీవుండనైని ల్వరింతు." భో. ౧, ఆ.)
నివరి. వై. వి. నివ్వరియొక్క రూపాంతరము.
నివర్తనము. సం. వి. అ. న. మరలఁబాటు.
నివర్తించే. సం. ప్రే. నివర్తిల్లఁజేయు.
నివర్తిల్లు. సం. అ. క్రి. మరలఁబడు, (రూ. నివర్తిలు.)
నివసతి. సం. వి. ఇ. స్త్రీ. గృహము, ఇల్లు.
నివసథము. సం. వి. అ. పుం. గ్రామము, ఊరు.
నివసనము. సం. వి. అ. న. నిలయము, ఇల్లు.
నివసించే. సం. అ. క్రి. వాసముచేయు, ఉండు.
నివహము. సం. వి. అ. పుం. సమూహము, గుమి.
నివాకము. సం. వి. అ. పుం. జయఘంటమొదలగు వానిగుండ ధాన్యాదులవెలప్రసిద్ధపఱచుట. వ్య వహారాదులయందున్యూనాధిక్యములు లేకకలిగి నదిపలుకుట. (అని కొందఱు.) మహార్ఘములైన ధాన్యాదులయందలి జనులయాదరాతిశయము. (అని కొందఱు.)
నివాతము. సం. వి. అ. పుం. ప్రాపు. విణ. 1. బాణ ములచే భేదింపరానిది; (కవచము) 2. గాలి లేనిది. (చోటు.)
నివాపము. సం. వి. అ. పుం. పితాళ్లనుద్దేశించి నువ్వు లునీళ్లువిడుచుటలోనుగాఁగల కర్మము.
నివారణము. సం. వి. అ. న. అడ్డగింత, నిరోధము.
నివారణీయము. సం. విణ. (అ.ఆ.అ.) అడ్డగింపఁద గినది.
నివారించే. సం. స. క్రి. నివారణచేయు, అడ్డగించు.
నివారితము. సం. విణ. (అ.ఆ.అ.) అడ్డగింపఁబడినది.
నివాసము. సం. వి. అ. పుం. ఇల్లు, నివసనము.
నివాసి. సం. విణ. (న్. ఈ న్.) వాసముచేయువాఁడు.
నివాళి. వై. వి. నివ్వాళియొక్క రూపాంతరము. "నివా ళిపళ్లెము." భాను. ౪, ఆ
నివాళించే. వై. అ. క్రి. ఆరతెత్తు*. "గీ. పార్వతీదే వికైసేసెబహువిధములఁ, బలుకుఁదొయ్యలిరత్న దర్పణముచూపె, శచినివాళించె మణిదీపసంచ యమున, శేషశయనునిఁబట్టాభిషేకవేళ." కాశీ. ౪, ఆ.
నివాళిక. వై. వి. నివాళియొక్క రూపాంతరము. "ద్వి. వనజలోచనలునివాళికలొసఁగ." రా. బాల. కాం. (స్వార్థమున క ప్రత్యయము.)
నివాళితము. సం. విణ. (అ.ఆ.అ.) చుట్టఁబడినది. "వ. ప్రతిగృహాంగణప్రదేశనివాళిత నీరాజనం బులుగైకొనుచు." బ్ర. ౫, ఆ.
నివిష్టుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. కూర్చున్నవాఁ డు; 2. ప్రవేశించినవాఁడు.
నివీతము. సం. వి. అ. న. మెడనుదండవలెవ్రేలెడు జన్నిదము. విణ. కప్పఁకొనఁబడినది. (వస్త్రము.)
నివీతి. సం. వి. న్. పుం. నివీతముగలవాఁడు.
నివుడు. దే. అ. క్రి. నిగుడుయొక్క రూపాంతరము. (చిప్పిలుటకు.—"గీ. అనిదురంతశోకముఁగాఁబొం దిసెజ్జపై, మేను వైచికన్నుఁగోనలందు, నివుడున శ్రువారిచెవులకొలంకుల, నిండనిట్టులనువిభుం డుమతియు." నిర్వ. ౯, ఆ.)
నివుడుచే. దే. ప్రే. నిగుడుచుయొక్క రూపాంత రము. (రూ. నివుడ్చు.)
నివురు. దే. స. క్రి. నిమురు. "క. కరమనురక్తినిమో మునివిరి." భాగ. ౪, స్కం.
నివుఱు. దే. వి. నిగుఱుయొక్క రూపాంతరము.
నివృతము. సం. విణ. (అ. ఆ. అ.) నలుప్రక్కల చుట్టఁబడినది, పరిక్షిప్తము.
నివృతి. సం. వి. ఇ. స్త్రీ. నలుప్రక్కలచుట్టుట.
నివృత్తము. సం. విణ. (అ.ఆ.అ.) మరలఁబడినది.
నివృత్తి. సం. వి. ఇ. స్త్రీ. మరలఁబాటు, అప్రవృత్తి.
నివేదనము. సం. వి. అ. న. 1. ఎఱుక; 2. సమర్ప ణము.
నివేదించే. సం. స. క్రి. 1. ఎఱిఁగించు; 2. సమర్పించు.
నివేదితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎఱిఁగింపఁ బడినది; 2. సమర్పింపఁబడినది.
నివేద్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ఎఱిఁగింపఁ దగినది; 2. సమర్పింపఁదగినది.
నివేశము. సం వి. అ. పుం. 1. ఇల్లు; 2. చొరవ; 3. ఎత్తినదండువిడిసినపాళెము; 4. పెండ్లి; 5. ఇల్లడ.
నివ్వటించే. వై. ప్రే. నివ్వటిల్లఁజేయు.
నివ్వటిల్లు. వై. అ. క్రి. 1. నెఱవేఱు; "ద్వి. అనఘు నీచేతఁగార్యమునివ్వటిల్లు." రా. యు, కాం.— 2. అతిశయించు; 3. కలుగు; 4. వ్యాపించు. (రూ. నివ్వటిలు. అతిశయించుటకు. - "తద్వియోగసం తాపములంతకంతకు మనంబుననివ్వటిలంగ." వి, పు. ౭, ఆ.- కలుగుటకు.—"క. ఎవ్వఁడుసచరా చరగురుఁ, డెవ్వనినాభిసరోజమిూవిధాతకు, నివ్వటిలుజగములన్నియు, నెవ్వనిచేనవ్విభుండు

సెప్పుడుఁగొలుతుక్." భార. శాం. ౪, ఆ.—వ్యాపించుటకు.— 'క. ఇవ్విధమునశినివీరుని, క్రొవ్వు చెఱిచి పాండుపుత్త్రకులబాణంబుల్, నివ్వటిల నీకనలుపుర, నవ్వీరుఁడు సెవ్వ నేసె నద్భుతభంగిక్." భార. శల్య. ౧, ఆ.)

నివ్వరి. వై. వి. తృణధాన్యవిశేషము. (నీవరియొక్క రూపాంతరము.)

నివ్వాళి. వై. వి. ఆరతి*. ' నివ్వాళిపళ్లెము." భల్లా. ద్వి. ౧, భా.

నివ్వాళిక. వై. వి. నివ్వాళియొక్క రూపాంతరము. (స్వార్థమున క ప్రత్యయము.)

నివ్వెర. దే. వి. నివ్వెఱయొక్క రూపాంతరము. "వెడంద సెఱతూపుల్ సింగిణింగూర్చి నివ్వెరదోఁపక్ నిగుడంగ రాకొమరుపై వేచిమ్మినొప్పింప." అచ్చ. యు, కాం. (దీనికి మిక్కిలి భయమను అర్థము లేదు.)

నివ్వెఱ. దే. వి. 1. పారవశ్యము; "చ. పరవశదైన్యమా దుకొను ప్రౌఢలఁగానదు ఘర్మవారిచేఁ, గరఁగి స్రవించు చిత్రకముకాన దనాదృతవీటిపాటలా, ధరముని సున్నమంటినవిధంబును గానదు నవ్వుటాలకా, భరణముఁగొన్నఁగాన దొక బాలనృపాలునిఁజూచి నివ్వెఱక్." స్వా. ౫, ఆ.—2. నిశ్చేష్టత; (చూ. నివ్వెఱపడు.) (నివ్వెఱఁగుయొక్క రూపాంతరము.) 3. భ్రాంతి; (చూ. నివ్వెఱఁగు.) 4. (నిండు+వెఱ.) మిక్కిలి భయము (చూ. నివ్వెఱపడు.)

నివ్వెఱఁగు. దే. వి. (నిండు + వెఱఁగు.) పారవశ్యము; "చ. పులిఁబొడగన్న లేళ్లగమిఁబోలెసుయోధనునగ్రసైనికుల్, దలఁకికలంగినివ్వెఱఁగుదన్కినఁ జేష్టలు దక్కి చిత్రరూ, పులక్రియనుండిరి." భార. భీష్మ. ౨, ఆ.—2. నిశ్చేష్టత; (చూ. నివ్వెఱపడు.) ౩. భ్రాంతి; "ద్వి. నిలుకడదప్పిననివ్వెఱఁగందె."(చూ. మీఁదిపద్యములు.) విష్ణు. పూ. 3, ఆ.

నివ్వెఱపడు. దే. అ. క్రి. 1. పరవశమగు; (చూ. నివ్వెఱ.) 2. చేష్టలుదక్కు; "గీ. నీవుమమ్ముబోధింపఁగా నేర్తుగాక, యిమ్మహానలస్ఫురణంబు నిట్టిదనఁగ, నేమునేర్తుమె యేమియొయెఱుఁగకునికి, గాదె నివ్వెఱపడితిమికమనఃనాథ." భార. అను. ౪, ఆ. (చూ. వెఱఁగుపాటు.)—3. భ్రాంతిపడు; (చూ. నివ్వెఱఁగు.) 4. మిక్కిలి భయపడు. "వ. కౌరవసైనికులు కలంగినమనంబులతోడ నివ్వెఱపడియుండ." సం. "విత్రస్తమనసస్సర్వే ధనంజయకృతాద్భయాత్." భార. విరా. ౪, ఆ.

నివ్వెఱపాటు. ద్వ. వి. 1. పారవశ్యము; "వ. ఒక్కింతదడవు నివ్వెఱపాటున నిశ్చలుండగుచునుండి సదంపడి." కళా. ౫, ఆ.—2. నిశ్చేష్టత, "సీ. చిత్రరూపంబునఁ జెలువున నేలోకపతిమూర్తినివ్వెఱపాటునొందె." నిర్వ. ౭, ఆ.—3. భ్రాంతి, (చూ. నివ్వెఱఁగు.) 4. మిక్కిలి భయము. 'గీ ఇట్లుపాండవసైన్యంబులెల్లఁగలఁగి, యిక్కడక్కడఁబడుచుండనక్కజంపు, కడిమిక ద్వైరువడియొక్కకడకువచ్చి, పాండునూనులునివ్వెఱపాటునొంద." భార. భీష్మ. ౧, ఆ.

నిశ. సం. వి. ఆ. స్త్రీ. 1. రేయి; 2. పసుపు, 3. మ్రానిపసుపు.

నిశాంకుశ. సం. వి. ఆ. స్త్రీ. జిబిలికి?.

నిశాంతము. సం. వి. అ. న. 1. ఇల్లు; 2. వేకువ. విణ మిక్కిలి అడఁగినది.

నిశాకరుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు, రేఱేఁడు

నిశాఖ్య. సం. వి. ఆ. స్త్రీ. పసుపు, హరిద్ర.

నిశాచరి. సం. వి. ఈ. స్త్రీ. 1. రాక్షసి; 2. ఱంకుటాలు; 3. పయిఁడికంటె అను పక్షి.

నిశాచరుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు, రేద్రిమ్మరి.

నిశాటుఁడు. సం. వి. అ. పుం.——పై.——

నిశాతము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి వాఁడిచేయఁబడినది.

నిశాన్. హిం. వి. జెండా, గుఱుతు, చేవ్రాలు.'

నిశానుదారు. హిం. వి. గుఱుతుమాత్రము పట్టఁగలవాఁడు.

నిశాపతి. సం. వి. ఇ. పుం. 1. చంద్రుఁడు, రేఱేఁడు; 2. కర్పూరము.

నిశారణము. సం. వి. అ. న. మారణము, చంపుట.

నిశారము. సం. వి. అ. పుం. చలికప్పుడుపుప్పటి, (రూ. నీశారము.)

నిశితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి వాఁడిచేయఁబడినది; 2. సానఁబెట్టఁబడినది

నిశీథము. సం. వి. అ. పుం. 1. నడురేయి; 2. రేయి.

నిశీథిని. సం. వి. ఈ. స్త్రీ. రేయి, రాత్రి, నిశ.

నిశ్చయము. సం. వి. అ. పుం. నిర్ణయము.

నిశ్చయించు. సం. స. క్రి. నిర్ణయించు.

నిశ్చల. సం. వి. ఆ. స్త్రీ. నేల. విణ. కదలనిది.

నిశ్చాయకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) నిశ్చయించువాఁడు.
నిశ్చింతుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) చింతలేనివాఁడు.
నిశ్చితము. సం. విశే. (అ. ఆ. అ.) నిశ్చయింపఁబడినది.
నిశ్చిష్టాకరణము. సం. వి. అ. న. మన్మథబాణములలో నొకటి. (చూ. బాణము.)
నిశ్చేష్టితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) చేష్టలు తక్కినవాఁడు.
నిశ్రేణి. సం. వి. ఇ. స్త్రీ. 1. నిచ్చెన; 2. ఈఁతచెట్టు.
నిశ్శ్రేయసము. సం. వి. అ. న. 1. ముక్తి; 2. మేలు. పుం. డు. శివుఁడు.
నిశ్వసనము. సం. వి. అ. న. నిట్టూర్చుట.
నిశ్వసించే. సం. అ. క్రి. నిట్టూర్పువిడుచు, నిట్టూర్చే.
నిశ్వాసము. సం. వి. అ. పుం. నిట్టూర్పు.
నిశ్వాసించే. సం. అ. క్రి. నిశ్వసించు. (చూ. నన.)
నిశ్శబ్దము. సం. వి. అ. పుం. తాలమానలఘుచతుష్టయకాలము. విశే. శబ్దములేనిది. (ఆకారాంత స్త్రీలింగమైనప్పుడు రాత్రి అర్థము.)
నిశ్శలాకము. సం. విశే. (అ. ఆ. అ.) ఏకాంతము. (చోటు.)
నిశ్శేషము. సం. విశే. (అ.ఆ.అ.) సర్వము, అంతయు.
నిశ్శోధ్యము. సం. విశే. (అ. ఆ. అ.) కడుగుటలోనగువానిచేత గరగరికైనది, శోధితము.
నిషంగము. సం. వి. అ. పుం. 1. అమ్ములపొది, 2. మిక్కిలి సంగము.
నిషంగి. సం. విశే. (న్. ఈ. న్.) విలుకాఁడు.
నిషణ్ణము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉండినది, 2. కూర్చుండినది. "తీరనిషణ్ణయై." స్వా. 3, ఆ.
నిషద్య. సం. వి. ఆ. స్త్రీ. 1. అంగడి; 2. కూర్చుండుట.
నిషద్వర. సం. వి. ఆ. స్త్రీ. రేయి. అ. పుం. ము. అడుసు.
నిషధము. సం. వి. అ. పుం. 1. ఒకానొకకొండ; 2. ఒకానొకదేశము. విశే. కఠినము.
నిషా. హిం. వి. మత్తు.
నిషాదము. సం. వి. అ. పుం. ఒకస్వరము, (రూ.) నిషదము. (చూ. స్వరము.)
నిషాది. సం. వి. న్. పుం. మావటివాఁడు.
నిషాదుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకతెగ బోయవాఁడు; 2. మాలవాఁడు.

నిషిద్ధము. సం. విశే. (అ. ఆ. అ.) నిషేధింపఁబడినది.
నిషూదనము. సం. వి. అ. న. వధము, చంపుట.
నిషేకము సం. వి. అ. పుం. గర్భాధానము.
నిషేధము. సం. వి. అ. పుం. త్రోపుడు.
నిషేధించే. సం. స. క్రి. త్రోపుడుచేయు.
నిషేవణము. సం. వి. అ న. 1. చక్కఁగా సేవించుట; 2. సోమపానము.
నిషేవితము. సం విశే. (అ. ఆ. అ.) చక్కఁగా సేవింపఁబడినది.
నిషేవ్యము. సం. విశే. (అ. ఆ. అ.) చక్కఁగా సేవింపఁదగినది.
నిష్కము. సం. వి. అ. పుం, న. 1. మాడ; 2. టంకము; 3. నూటయెనిమిదిమాడలు; 4. పతకము; 5. పలము; 6. బంగారు; 7. వెండి.
నిష్కర్ష. సం. వి. అ. పుం. నిశ్చయము.
నిష్కర్షించే సం. స. క్రి. నిశ్చయించు.
నిష్కళ సం. వి. ఆ. స్త్రీ. ముట్లుడిగిన ఆఁడుది. విశే. 1. కళలేనిది; 2. వీర్యములేనిది.
నిష్కాసితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఉనుపఁబడినది; 2. వెడలింపఁబడినది.
నిష్కుటము. సం. వి. అ. పుం. 1. తోఁట. (రూ. నిష్కూటము.) 2. అంతిపురము; 3. ఇంటితోఁట; 4. తలుపు; 5. మడి.
నిష్కుటి. సం. వి. ఈ. స్త్రీ. పెద్దయేలకులు.
నిష్కుహము. సం. వి. అ. పుం. తొఱ్ఱ, (రూ. నిష్కూహము.)
నిష్కృతము. సం. విశే. (అ.ఆ.అ.) 1. ప్రాయశ్చిత్తముచేయఁబడినది; 2. చేయఁబడినది.
నిష్కృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ప్రాయశ్చిత్తము; 2. చేయమి.
నిష్క్రమము సం. వి. అ. పుం. 1. చెడుకులము; 2. బుద్ధిసంపత్తి; (శుశ్రూష, శ్రవణము, గ్రహణము, ధారణము, ఊహ, అపోహము, అర్థవిజ్ఞానము, తత్త్వవిజ్ఞానము అను యెనిమిది.) 3. వెడలఁబాటు
నిష్క్రాంతము. సం. విశే. (అ. ఆ. అ.) బయలువెడలినది.
నిష్క్రాంతి. సం. వి. ఇ. స్త్రీ. బయలువెడలుట.
నిష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉనికి; 2. చేటు; 3. తుది; 4. ముగియిక; 5. వేఁడికోలు; 6. ప్రస్తుతకథాసంహారరూపమయిన యొకనాటకసంధి. (చూ. సంధి.)
నిష్ఠానము. సం. వి. అ. న. మజ్జిగ పులుసు, తేమనము.

నిష్ఠించు. సం. అ. క్రి. స్థిరమగు. "అనినిష్ఠించిపలుక." భార. అశ్వ. ౨, ఆ.
నిష్ఠీతము. సం. విణ. (అ. ఆ. అ.) చక్కఁగా నుంచఁబడినది.
నిష్ఠీవనము. సం. వి. అ. న. ఉమియుట.
నిష్ఠురము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కఠినము; 2. పరుషమైనది. (మాట.)
నిష్ఠూతము. సం. విణ. (అ. ఆ. అ.) త్రోయఁబడినది.
నిష్ఠేవము. సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. ఉమియుట.
నిష్ఠ్యూతము. సం. విణ. (అ.ఆ.అ.) 1. ఉమియఁబడినది; 2. త్రోయఁబడినది.
నిష్ఠ్యూతి. సం. వి. ఇ. స్త్రీ. ఉమియుట, నిష్ఠీవనము.
నిష్ణాతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నేర్పరి.
నిష్పక్వము. సం. విణ. (అ. ఆ. అ.) చక్కఁగా కాఁగినది, క్వథితము.
నిష్పత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. సిద్ధి; 2. పరిసమాప్తి.
నిష్పన్నము. సం. విణ. (అ. ఆ. అ.) సిద్ధించినది.
నిష్పాదనము. సం. వి. అ. న. నిష్పత్తి, సిద్ధి.
నిష్పాదించు. సం. స. క్రి. సిద్ధింపఁజేయు.
నిష్పాదితము. సం. విణ. (అ. ఆ. అ.) సిద్ధించినది.
నిష్పాద్యము. సం. విణ. (అ.ఆ.అ.) సిద్ధింపఁదగినది.
నిష్పావము. సం. వి. అ. పుం. 1. అనుములు; 2. చేటగాలి; 3. తూర్పెత్తుట; 4. పెసలులోనగువాని పొట్టు; 5. పొల్లు. విణ. నిలుకడైనది.
నిష్పిష్టము. సం. విణ. (అ.ఆ.అ.) చక్కఁగానూఁఱఁబడినది.
నిష్పేషణము. సం. వి. అ. న. చక్కఁగానూఱుట.
నిష్ప్రయోజనము. సం. విణ. (అ.ఆ.అ.) ప్రయోజనములేనిది.
నిష్ప్రవాణి. సం. విణ. ఇ. క్రొత్తది, (వస్త్రము.)
నిష్ఫలము. సం. విణ. (అ. ఆ. అ.) ఫలములేనిది.
నిసర్గము. సం. వి. అ. పుం. 1. స్వభావము; 2. కలిగించుట; 3. ఈవి.
నిసి. వై. వి. 1. రాత్రి; 2. అర్ధరాత్రము*.
నిసింధా. హిం. వి. వ్రాయువాఁడు. (నిసింధా వ్రాఁత.)
నిసివెలుఁగు. ద్వ. వి. చంద్రుఁడు.
నిసుఁగు. వై. వి. శిశువు. "గీ. అందులకుఁజాలసందియంబందిఁ బోఁడు, వీనిఁదొగటార్చిరండనివేగగాఁడు, బుసభుఁడంగదుఁడీఁదయుర్తిలినిసుంగు, నలుఁడుమొదలగుబలియురఁబిలిచిపనిచె." అచ్చ. యు, కాం.
నిసువు. వై. వి. నిసుఁగుయొక్కరూపాంతరము.
నిసృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. దాఁచఁబెట్టినది; 2. మధ్యస్థము.
నిస్తంద్రము. సం. విణ. (అ. ఆ. అ.) చొరవగలది.
నిస్తరణము. సం. వి. అ. న. 1. దాఁటుట; 2. వెడలఁబాటు; 3. వెరవు.
నిస్తరించు. సం. స. క్రి. చక్కఁగాదాఁటు.
నిస్తర్హణము. సం. వి. అ. న. వధము, చంపుట.
నిస్తలము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కదలునది; 2. వట్రువైనది.
నిస్తారకము. సం. విణ. (అ.ఆ.అ.) నిస్తరింపఁజేయునది.
నిస్తారము. సం. వి. అ. పుం. నిస్తరణము, దాఁటుట.
నిస్తుషితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. చేలుకనగా చేయఁబడినది; 2. పొట్టుపోఁగొట్టినది; 3. విడువఁబడినది.
నిస్త్రింశము. సం. వి. అ. పుం. కత్తి. విణ. కనికరములేనిది.
నిస్పందము. సం. వి. అ. పుం. మిక్కిలిచలనము.
నిస్పృహము. సం. విణ. (అ. ఆ. అ.) ఆశలేనిది.
నిస్రావము. సం. వి. అ. పుం. గంజి, ఆచామము.
నిస్వనము. సం. వి. అ. పుం. ధ్వని, మ్రోఁత.
నిస్వానము. సం. వి. అ. పుం.——వై.——
నిస్సంతు. వై. విణ. సంతానములేనిది. (అతని సంతు నిస్సంతయిపోయినది.)
నిస్సత్తువ. వై. వి. శక్తిలేమి, అశక్తి.
నిస్సరణము. సం. వి. అ. న. 1. ఇల్లులోనగువాని ముందటిభాగము; 2. చావు; 3. ముక్తి; 4. వెడలఁబాటు; 5. వెరవు.
నిస్సహాణము. వై. వి. చర్మవాద్యవిశేషము. "ఉ. భేరులుఁదమ్మటంబులును నిస్సహాణంబులుశంఖకాహళుల్." (ఇందు భకారము ద్రుతపూర్వము.) రుక్మాం. ౧, ఆ.
నిస్సాణము. సం. వి. అ. పుం.——వై.——"శంఖనాదనిస్సాణధణంధణల్ చెలఁగ." అని. ౫, ఆ.
నిస్సానము. వై. వి.——వై.——య. ౪, ఆ. (దీనికి ప్రయోగాంతరము కనఁబడలేదు.)
నిస్సారము. సం. విణ. (అ. ఆ. అ.) సారములేనిది.
నిస్స్యందము. సం. వి. అ. పుం. కాఱుట.
నిస్స్వుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) బీదవాఁడు.

నిహంత. సం. విణ. (బు.ఈ.బు.) చంపువాఁడు.

నిహతము. సం. వి. అ. న. గుణకారము. పుం. అనుదాత్తస్వరము. విణ. 1. చంపఁబడినది; 2. గుణింపఁబడినది.

నిహతి. సం. వి. ఇ. స్త్రీ. చావు, మరణము.

నిహననము. సం. వి. అ. న. వధము, చంపుట.

నిహాక. సం. వి. ఆ. స్త్రీ. 1. ఉడుము; 2. నీటియుడుము.

నిహింసనము. సం. వి. అ. న. వధము, చంపుట.

నిహితము. సం. విణ. (అ. ఆ. అ.) ఉంచఁబడినది.

నిహీనుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నీచుఁడు.

నిహ్నవము. సం. వి. అ. పుం. 1. అపనమ్మిక; 2. కపటము; 3. తిరస్కారము; 4. దాఁపఱికము; 5. నమ్మిక; 6. మఱుఁగుమాట.

నిహ్నవించు. సం. స. క్రి. మఱుఁగుపుచ్చు.

నిహ్నుతి. సం. వి. ఇ. స్త్రీ. మఱుఁగుపుచ్చుట.

## నీ.

నీ. దే. స. నీవు అనుదానికి ప్రాతిపదికము.

నీఁగు. దే. స. క్రి. నివర్తించు. "ఉ. ఇక్కథభక్తితో వినినఁజెప్పుడుఁగీర్తనచేసినఁజనుల్, నిక్కము సర్వదోషముల నీఁగి భజింతురుభవ్యభద్రముల్." భార. ఆర. ౫, ఆ.

నీఁడు. వై. వి. కమ్మవారిబిరుదుపేరు. (అబ్బినీఁడు, సామినీఁడు. మొ.) (నాయఁడుయొక్క మాఱురూపము.)

నీకాశము. సం. వి. అ. పుం. 1. ప్రకాశము; 2. నిశ్చయము. విణ. తుల్యము.

నీచుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. అధముఁడు; (రూ. నీచు.) 2. వామనుఁడు.

నీటికానుపు. ద్వ. వి. (నీరు+కానుపు.) అగ్ని, కృపీటయోని. "ఎ, గీ. బారకైనీటికానుపుపాపయప్ప." అచ్చ. బాల, కాం.

నీటికుప్ప. ద్వ. వి. (నీరు+కుప్ప.) సముద్రము, జలరాశి. "సీ. తనకుందనపుజాయపెనునీటికుప్పకప్పెవసినపసఁ బసరెక్కెననఁగ." వసు. ౫, ఆ. (మొదటిరూపము నీరుకుప్ప.)

నీటిచూలి. ద్వ. వి. (నీరు+చూలి.) అగ్ని, కృపీటయోని.

నీటితాత. ద్వ. వి. (నీరు+తాత.) వాయువు.

నీటిదయ్యము. వై. వి. (నీరు+దయ్యము.) జలగ్రహము, సెగడు.

నీటిపుట్టుగు. ద్వ. వి. (నీరు+పుట్టుగు.) తామర, అబ్జము. "మత్తకోకిల. నీటిపుట్టుగుపట్టియున్నఁడునెమ్మిగానఁగలేనియ, మ్మేటివేలుపురాయఁడామరుమేపుకంటికిమామగా, నేటినీటుతబంబుచేసెనోయీవాడంకుమలంచు." య. ౨, ఆ. (మొదటిరూపము నీరుపుట్టుగు.)

నీటియిక్క. ద్వ. వి. (నీరు+ఇక్క.) విష్ణువక్షస్స్థలమునందలిమణి, కౌస్తుభము. "సీ. తొలుకడకడలిలోఁదిలకించుసిరిగేస్తునక్కనఁదగునీటియిక్కయనఁగ." య. ౨, ఆ.

నీటిరిక్క. వై. వి. (నీరు+రిక్క.) పూర్వాషాఢానక్షత్రము.

నీటిఱేఁడు. ద్వ. వి. (నీరు+ఱేఁడు.) 1. వరుణుఁడు, అప్పతి; "తెగినీటిఱేనిపెంపిగురఁజేసి." య. ౨, ఆ.—2. సముద్రుఁడు, అపాంపతి. (ఇట్లు నీటిరాయఁడు.)

నీటిఱేనిరిక్క. ద్వ. వి. శతభిషఙ్నక్షత్రము.

నీటు. దే. వి. శృంగారగర్వము, మురిపము.

నీటుకత్తియ. ద్వ. విణ. నీటుగలది, (రూ. నీటుకత్తె.)

నీటుకాఁడు. దే. విణ. నీటుగలవాఁడు.

నీడ. దే. వి. 1. ఛాయ; 2. ఎండలేమి.

నీడము. సం. వి. అ. న. చోటు. పుం, న. పక్షిగూఁడు.

నీడోద్భవము. సం. వి. అ. పుం. పక్షి, గూఁడుకానుపు.

నీతకము. వై. వి. నీతముయొక్కరూపాంతరము.

నీతము. ఉభ. వై. వి. నియమము. శశాం. 3, ఆ.—సం. వి. అ. న. 1. ధనము; 2. ధాన్యము. విణ. 1. పొందింపఁబడినది; 2. శిక్షింపఁబడినది; 3. తేఁబడినది.

నీతి. సం. వి. ఇ. స్త్రీ. 1. న్యాయము; 2. పొందించుట.

నీపము. సం. వి. అ. పుం. 1. కడిమి; 2. మంకెన!; 3. నల్లయిరుగుడు!.

నీయంచు. దే. వి. కంకికాఁడ.

నీరంధ్రము. సం. వి. అ. న. ఆకాశము. విణ. సందులేనిది.

నీరజము. సం. వి. అ. న. 1. తామర; 2. ముత్యము; 3. చెంగల్వకోష్టు. విణ. నీటఁబుట్టినది.

నీరదము. సం. వి. అ. పుం. 1. మబ్బు; 2. తుంగ!.

**నీరధి.** సం. వి. ఇ. పుం. సముద్రము, కడలి.
**నీరము.** సం. వి. అ. న. జలము, నీరు.
**నీరసము.** సం. వి. అ. పుం. దానిమ్మ?. విణ. రసము లేనిది.
**నీరాకు.** ద్వ. వి. (నీరు+ఆకు.) పాంచి, వారిపర్ణి.
**నీరాజనము.** సం. వి. అ. న. ఆరతి.
**నీరాట.** ద్వ. వి. (నీరు+ఆట.) 1. స్నానము; 2. జలక్రీడ. "గీ. చల్లులాడంగనప్పుడుచదలసెగసి, మగుడఁ దెలినీటితుంపురుల్ దగియెంజూడ్క, వారినీరాటకును మెచ్చివలపురాయుఁ, డానికురిపించుపువ్వులవానయనఁగ." య. 3, ఆ. (రూ నీరాటము. స్నానమునకు.—"క. నీరాటమొనర్చియు శ్ర్రం, గారించిరి." బిల్హణీయము. 3, ఆ.)
**నీరాటము.** సం. వి. అ. పుం. నీళ్లయందు చరించు జంతువు. "క. నీరాటవనాటములకుఁ, బోరాటం బెట్లుకలిగె." భాగ. ౧, స్కం.
**నీరాడు.** ద్వ. అ. క్రి. (నీరు+ఆడు.) స్నానముచేయు, క్రుంకు. "నీరాడితనదుమందిరమల్కిగ్రుమ్మగ్గిడి." శేష. ౬, ఆ.—వి. కూరాటిలోపోసెడు వేన్నీళ్లు.
**నీరామని.** ద్వ. వి. (నీరు + ఆమని.) వర్షఋతువు. "క. ధారణిఁగలమేలెల్లను, ధారాళకరాళపరుషధారలచేతన్, నీరామనికాఁగలదని, పూరాల్చినభంగి మునురు పొరిఁబొరిఁదొరిఁగెన్." విక్ర. ౮, ఆ.
**నీరారుచు.** దే. ప్రే. నీరాడఁజేయు, (రూ. నీరార్చు.)
**నీరిజె.** దే. వి. ఒకానొక అడవిచెట్టు.
**నీరిప్ప.** ద్వ. వి. (నీరు+ఇప్ప.) మధూలకము?.
**నీరు.** యు. దే. విణ. అల్పము. (నీరుకావి. మొ.) (హల్లుపరమగుచో దీని ఉత్వము వికల్పముగాలోపించును. నీర్కావి. మొ.) - వై. వి. 1. ఉదకము; 2. కన్నీరు*; "నిరంతరశోకంబుననీరుగన్నులని డెన్." భాగ. ౧, స్కం —౩. మూత్రము*.
**నీరుకట్టియ.** వై. వి. నీరుకట్టె.
**నీరుకట్టు.** ద్వ. వి. మూత్రబంధరోగము, అశ్మరి.
**నీరుకట్టె.** వై. వి. నీరుపాము, అలగర్దము. (నీరుకట్టియయొక్కరూపాంతరము.) (చూ. పరుజా.)
**నీరుకడిమి.** ద్వ. వి. ధారాకదంబము?.
**నీరుకాకి.** ద్వ. వి. జలకాకము, మద్గువు.
**నీరుకాయ.** ద్వ. వి. నీటిబుగ్గ, బుద్బుదము.
**నీరుకాయవాఁడు.** ద్వ. వి. నీటిమనుష్యుఁడు.
**నీరుకాఱు.** ద్వ. వి. కమసాలెవాని యొకదినుసు కొఱముట్టు.
నీరుకావి. దే. వి. కొంచెమెఱుపు. (రూ. నీర్కావి.)
నీరుకాళ్లు. ద్వ. వి. బ. కోణపారితవర్ణములైయుభయసంధ్యలయందుఁదోఁచెడుసూర్యకిరణములు. "నిడుదలైతిలకించెనీరుకాళ్లు." హరి. పూ. ౭, ఆ. (ఇది వర్షసూచకము.)
నీరుకుక్క. వై. వి. జలశునకము.
నీరుకుప్ప. ద్వ. వి. సముద్రము, జలరాశి.
నీరుకోఁతి. ద్వ. వి. జలమర్కటము, శింశుమారము.
నీరుకోడి. ద్వ. వి. జలకుక్కుటము, పరిప్లవము.
నీరుగండి. ద్వ. వి. తూముకాలువ, వాహసము.
నీరుగన్నేరు. ద్వ. వి. హింజలము?.
నీరుగొబ్బి. ద్వ. వి. ఒకానొకచెట్టు, ఇక్షురము.
నీరుచిచ్చు. వై. వి. బడబాగ్ని, బాడబము.
నీరుచెంచలి. ద్వ. వి. ఒకదినుసుచెంచలి, వితున్నము?.
నీరుచేఱుకు. ద్వ. వి. నీరుదిగునపుడు మంటయెత్తెడు రోగవిశేషము.
నీరుటెంకి. ద్వ. వి. జలాశయము.
నీరుడి. ద్వ. వి. (నీరు + ఊడు.) నీరు అధికముగా దిగు రోగవిశేషము.
నీరుడుము. ద్వ. వి. (నీరు+ఉడుము.) నీటియుడుము, గోధిక.
నీరుతాలుపు. ద్వ వి. మబ్బు, జలధరము. "ఏడీఁక్కనినీరుతాలుపులగాడ్పు" అచ్చ. అ, కాం. (రూ. నీటితాల్పు.)
నీరుతిట్ట. ద్వ. వి. సముద్రము, జలరాశి. "నీరుతిట్టబత్తళికపజీరు బల్విలుదునిమినవెరవరినొసల." అచ్చ. అ, కాం.
నీరుతిత్తి. వై. వి. మూత్రకోశము, క్లోమము.
నీరుతుట్ర. ద్వ. వి. నీరుకట్టె, అలగర్దము.
నీరుదొత్త. ద్వ. వి.——పై.——"గీ. నిక్కమొకయాఁటదియునొకనీరుదొత్త, యొక్కగాడిదయొకకోడియొక్కగుఱ్ఱ, మనితలంపకు నను విలాస్త్రారిగంధుఁ, డగుజరాసంధునిఁగ నింక నరసికొనుము." హరి. ఉ. ౧, ఆ.
నీరుదోమ. ద్వ. వి. జలమశకము, కసాయిక.
నీరుద్రిమ్మరి. ద్వ. వి. (నీరు+త్రిమ్మరి.) జలజంతువు. "గీ. మీలుగప్పలుతాఁబేళ్లుగాలిదిండ్లు, మొసళులెండ్రులు సెగడులు మొదలుగలుగు, నీరుద్రిమ్మరిపసువులు." అచ్చ. యు, కాం.

నీరుపంది. ద్వా. వి. జలసూకరము, అలస్యము.

నీరుపదును. దే. వి. కొంచెపుపదును. "సీ. ఘుమఘుమాధికరుతాకుంభితాంభోరాశి నిజసాయకమున కునీరుపదును." చంద్రా. ౧, ఆ.

నీరుపాది. ద్వా. వి. ఒకానొకచెట్టు.

నీరుపాప. ద్వా. వి. 1. అగ్ని; 2. నీటిమనుష్యుఁడు.

నీరుపాము. ద్వా. వి. జలసర్పము, నీరుకట్టె.

నీరుపాయము. ద్వా. వి. జెవ్వనము, యౌవనము.

నీరుపిప్పలి. వై. వి. పిప్పలీవిశేషము, తోయపిప్పలీ?.

నీరుపిల్లి. వై. వి. జలమార్జాలము, ఉద్రము.

నీరుపుట్టువ. ద్వా. వి. 1. తామర; 2. శంఖము; 3. కౌస్తుభము. (దీనికి సంస్కృతమునందు సరియైన పదము అబ్జము.) "సీ. నీరుపుట్టువయును నీరుపుట్టువయును బూరయుఁదోడవునై పాలుపునెఱప." (ఇది వెనుకటి రెండర్థములకు నుదాహరణము.) అచ్చ. బాల, కాం.

నీరుప్రబ్బ. ద్వా. వి. జలవేతసము, విదులము?.

నీరుబొద్ది. ద్వా. వి. వృద్ధదారకవిశేషము?.

నీరుమజ్జిగ. వై. వి. మూడుపాళ్లు నీళ్లుగలసినమజ్జిగ. (ఇట్లు నీరుచల్ల, నీరుమోరు. మొ.)

నీరుమట్టము. ద్వా. వి. జలవ్యాప్తిగల భూభాగము.

నీరుమానిసి. వై. వి. నీటిమనుష్యుఁడు. "క. ఏనుంగులాగుపందికి, మానిసిచందంబునీరుమానిసికినగుఁ, గానిగుణంబులుగలుగవు." ఉ, హరి. 3, ఆ.

నీరుముంపు. ద్వా. విశే. జలప్రాయము, అనూపము.

నీరుముట్టు. ద్వా. అ. క్రి. జలస్పర్శముచేయు. "గీ. రచ్చతెరువునగృహవాటిమచ్చుమీఁద, నీటిచేరువఁ గొఱగాదు నీరుముట్ట." వి, పు. ౪, ఆ.

నీరుమోపరి. ద్వా. వి. 1. కుంభము. హన. ౪, ఆ.—2. మేఘము. విశే. నీరుమోచునది.

నీరుల్లి. ద్వా. వి. (నీరు+ఉల్లి.) ఎఱ్ఱగడ్డ, పలాండువు?.

నీరువంగ. వై. వి. వార్తాకవిశేషము, వృంతాకము?.

నీరువట్టివేరు. ద్వా. వి. ఉశీరవిశేషము, లామజ్జకము.

నీరువట్టు. ద్వా. అ. క్రి. దప్పిగొను. "గీ. రాత్రిజాగరణభరశ్రాంతులైవారు, నిద్రఁబొందియుండ నీరువట్టి, ధారణీశ్వరుండుతన్మంత్రకలశోద, కంబులెల్లద్రావెఁగడుపునిండ." భార. అర. 3, ఆ.— వి. దప్పి, పిపాస. "ఎ, గీ. ఆఁకలియును, నీరువట్టునుదగిఱొదుసెఱినడంచి, దేవతాతిథిశేషోపజీవిగుము." భార. శాం. ౨, ఆ.

నీరువత్తిగ. వై. వి. భక్ష్యవిశేషము. హంస. ౧, ఆ.

నీరువరి. ద్వా. వి. నీవారతృణము.

నీరువామి. ద్వా. వి. సముద్రము, జలరాశి. "చ. కలువలదాయవంగడపుగామిడిచామను దెచ్చినట్టిమో, క్కాలవుఁబిసాళిరక్కసుని గట్టిగలోనిడుకొంటి వింకరా, సెలఁగడిమిన్ గలంచుఁగదనిన్ననుచున్ దమతేనికేర్పడన్, దెలుపఁగనేగెనాఁబఱచెఁదెల్లగనేఱులునీరువామికిన్." అచ్చ. కిష్కిం, కాం.

నీరెత్తువంగ. ద్వా. వి. నీరువంగ, వృంతాకము?.

నీరేనుఁగు. ద్వా. వి. (నీరు+ఏనుఁగు.) నీటిగజము.

నీరొట్టు. ద్వా. వి. భక్ష్యవిశేషము.

నీర్కావి. ద్వా. వి. నీరుకావియొక్క రూపాంతరము. "సీ. నిద్దమైనమడుంగునీర్కావిదోవతికనకమేఖలతోడఁగటిఘటించి." కాశీ. ౧, ఆ.

నీర్చిచ్చు. వై. వి. నీరుచిచ్చుయొక్క రూపాంతరము.

నీర్వట్టు. ద్వా. అ. క్రి. వి. నీరువట్టుయొక్క రూపాంతరము. (దప్పిక.—"ఆఁకలియునీర్వట్టుఁగణింపక్." పాండు. ౫, ఆ.)

నీర్వామి. ద్వా. వి. నీరువామియొక్క రూపాంతరము. "గీ. మ్రుచ్చుఁదనమునరాకొమ్మఁదెచ్చినట్టి, యొఱియ రక్కసుఁడిదె డాఁగియున్నవాఁడు, రండనుచుఁదమ్ముసెలమిఁజేరంగఁబిలుచు, కరణిఁగడుమ్రోయునీర్వామిఁ గనిరిమ్రోల." అచ్చ. కిష్కిం, కాం.

నీఱు. దే. వి. భస్మము. "గీ. మాఱుకొన్నవారినీఱు చేయుము." భార. శాం. ౧, ఆ. (నిగుఱుయొక్క రూపాంతరము.)

నీలంగువు. సం. వి. ఉ. స్త్రీ. ఈఁగ. పుం. 1. నక్క; 2. పురుగు.

నీలఁడు. వై. వి. నీలాశ్వము*.

నీలకంఠము. సం. వి. అ. న. ముల్లంగి?. పుం. 1. నెమిలి; 2. ఊరఁబిచ్చుక; 3. బంగారుపిచ్చుక; 4. కాటుకపిట్ట; 5. పాము.

నీలకంఠుఁడు. సం. వి. అ. పుం. కఱకంఠుఁడు.

నీలకము. సం. వి. అ. పుం. నల్లకోఁతి, కొండెంగ.

నీలగంధి. సం. వి. ఇ. పుం. మాణిక్యవిశేషము. (ఇది తుంబురమునఁ బుట్టినది, నల్లదాలుగలది, అధమజాతిరత్నము. చూ. మాణిక్యము.)

నీలదూర్వ. సం. వి. ఆ. స్త్రీ. నల్లగొలిమిడి?.

నీలపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. నల్లగింటెన?.

**నీలము.** సం. వి. అ. న. 1. నల్లఱాయి; 2. నీలిచెట్టు. పుం. 1. నలుపు; 2. ఒకకొండ; 3. ఒకనిధి. (చూ. నిధి.) విణ. నల్లనిది.

**నీలలోహితుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

**నీలాంబరుఁడు.** సం. వి. అ. పుం. 1. బలరాముఁడు; 2. నైరృతి; 3. శని.

**నీలాబ్జము.** సం. వి. అ. న. నల్లకలువ, నీలోత్పలము.

**నీలాలి.** ద్వ. వి. రెండుముఖములదీపారాత్రికపుతట్ట.

**నీలి.** ఉభ. దే. విణ. గారడముగలది. "జగనీలిపిసాళిజంతయుమ్ముద్దియ." పాండు. 3, ఆ. (చూ. కోలము.) — వై. వి. నల్లనూలు*. విణ. నల్లనిది. (ఒకానొకచో దీని ఇత్వమునకు లోపమువచ్చును. "నీల్దట్టీలు." హరిశ్చ. ౨, ఆ.) — సం. వి. ఈ. స్త్రీ. 1. నల్లగోరంటి; 2. నీలిచెట్టు.

**నీలిమ.** సం. వి. న్. పుం. నలుపు, (రూ. నీలిమము.)

**నీలిమబ్బు.** ద్వ. వి. వేటసాధనవిశేషము. "ద్వి. తెగనీలిమబ్బులుత్రిప్పుడుత్రాళ్లు." నల. 3, భా. (ఇది విచార్యము.)

**నీలీరాగము.** సం. వి. అ. పుం. బయటికి విశేషముగా కనఁబడక లోపల నెప్పటికి వీడకుండెడు గాఢానురాగము. (చూ. పూర్వరాగము.)

**నీలుఁడు.** సం. వి. అ. పుం. ఒకానొక వానరుఁడు.

**నీలుగు.** దే. అ. క్రి. 1. ఒళ్లువిఱుచుకొను; 2. చచ్చు. "క. బలితపుటురిగామంబున, నిలుచుటయారజ్జు ద్రెవ్వ నీలిగిసుమతుల్, వెలలిచనిముఖులగుదుర, వ్వలనెఱుఁగరు పడుదు రందు వత్స దురాత్ముల్." భార. శాం. ౬, ఆ. (ఈలుగునకు మొదటిరూపము. రూ. నీల్గు.)

**నీవరి.** వై. వి. నివ్వరికి మొదటిరూపము.

**నీవాకము.** సం. వి. అ. పుం. అర్ఘోత్కర్షహేతువైన జనాదరము.

**నీవారము.** సం. వి. అ. పుం. విత్తకపండెడు దూసర్లులోనగు తృణధాన్యము, నివ్వరి.

**నీవి.** సం. వి. ఈ. స్త్రీ. 1. సంచిమొదలు; 2. పోఁకముడి; 3. చెఱసాల; 4. పందెపుసొమ్ము.

**నీవు.** దే. స. నీశబ్దమునకు ప్రథమైకవచనము.

**నీవృత్తు.** సం. వి. త్. పుం. 1. గ్రామము; 2. దేశము.

**నీధ్రము.** సం. వి. అ. న. 1. చూరు; 2. బండికంటికడకమ్మి; 3. అడవి; 4. రేవతీనక్షత్రము.

**నీహారము.** సం. వి. అ. పుం. మంచు, (రూ. నిహారము.)

**నీళ.** సం. వి. ఆ. స్త్రీ. విష్ణుభార్యలలోనొకతె. (చూ. నెట్టికసీల.)

**నీళ్లవరుగు.** ద్వ. వి. ఉప్పు, లవణము.

**నీళ్లాడు.** ద్వ. అ. క్రి. (నీళ్లు+ఆడు.) 1. ప్రసవిం చు; 2. స్నానముచేయు. "ఓర్తుతడుపుగట్టక నీ ళ్లాడఁగా." భార. శల్య. ౨, ఆ.

## ను.

**ను.** దే. అప. 1. నాశబ్దమునకు ప్రథమైకవచనమునందువచ్చెడు ప్రత్యయము; (నేను.) 2. తఱచుగ అమహదర్థకశబ్దములకు ద్వితీయైకవచనమునందువచ్చెడు ప్రత్యయము; (వనమును, గోవును వనితను, రాజును. మొ.) 3. క్రియలలో తద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనమునందును, తద్ధర్మవర్తమానభవిష్యద్వ్యతిరేకార్థకోత్తమపురుషైకవచనములయందును వచ్చెడు ప్రత్యయము. (కొట్టును, కొట్టుదును, కొట్టుచున్నాను, కొట్టఁగలను, కొట్టను. మొ.) — అవ్య. 1. సముచ్చయార్థమును తెలుపును; (ఇది ఉకారేతరముల మీఁద యువర్ణపూర్వకముగావచ్చును.) "చ. ఇవియేనుఁ సతతంబు నాయెడఁ గరంబిష్టంబులైయుండుఁబా, యవుభూదేవకులాభితర్పణమహీయఃప్రీతియుఁ భారత, శ్రవణాసక్తియుఁ బార్వతీపతిపదాబ్జధ్యానపూజామహా, త్సవముఁ సంతతదానశీలతయు శశ్వత్సాధుసాంగత్యముఁ." భార. ఆది. ౧, ఆ. మొ. (అయువర్ణము ఒకానొకచో లోపించును. "సీ. ఎంతయుసంయమవంతుండు సహదేవుఁ డధ్యాత్మవిద్య నారాధ్యుఁడెంత." భార. సభా. ౨, ఆ. "సీ. నిడుపునఁదూర్పునఁబడమరనై రెండుకడలనంభోనిధికడిసియుండు." భార. భీష్మ. ౧, ఆ. "బలుమేరుఁ నిరసింప లేఁజిగురుఁగొమ్మం జేవ గాకుండునే." (కొమ్మఁ—కొమ్మయునని యర్థము. ఇక్కడచేవ యనఁగా చేవగలదియనుట. ఇట్లుగాక చేవయును నదిధర్మపరమనికవియభిప్రాయమేని "చేవలేకుండునే" అని ప్రయోగింపఁబడియుండును. "గీ. అచటఁబుట్టినచిగురుఁగొమ్మయునఁజేవ." అని పెద్దనగారును ప్రయోగించియున్నారు.) వసు. 3, ఆ. "వాలింగీలియువాయుపుత్రుసరియే." నిర్వ. 2, ఆ.) — 2. అవధారణార్థమును దెలుపును; "క. ఒకండును మధ్యేరాత్రమునఁ గడుంగుటుకము

నన్." హరి. ఊ. ౫, ఆ.—3. సహితార్థమును తెలుపును; "వ. మేనంబులకలివ్వడుఁబోడమెడు." స్కా. ౧, ఆ.—4. వ్యతిరేకార్థద్యోతకమైనప్రశ్నమునందుసహితార్థమును తెలుపును; "గీ. వాసుదేవునికృపగలవారికెందు,నరయదుర్ఘటమైనకార్యమునుగలదె." జై. ౧, ఆ.—5. ఏని, ఐన అనువానివలె వ్యతిరేకార్థద్యోతకమైన ప్రశ్నమునందువచ్చును; "ఇట్లుచేసినవారెవ్వరుఁగలరె." భార. ఆది. ౭, ఆ. "క. భీమార్జునులకురణమున, నేమగలుఁనుబ్రతిరెయు." భార. ఉద్యో. ౧, ఆ. "క. గాంగేయుఁగెలువనెవ్వరి, కింగోలఁదిరెయు." (ఇకారముమీఁదిదిగాననిక్కడ ఇత్వము వచ్చినది.) భార. ఉద్యో. ౪, ఆ. "క. దినకరునిఁబాపితత్ప్రభఁ, గొనివచ్చెదనను నెయెట్టికుమతియు." రా. అర, కాం. ౨, ఆ.—6. ఎటులు, ఎట్టు, ఎట్లు అనుశబ్దములకడపటఁజేరినప్పుడు ఏవిధముచేతనైన అనునర్థమును తెలుపును; "మనీయశక్తియెటులున్ డిందున్." భార. అర. ౭, ఆ. "గీ. ఏనుజెప్పితిఁదొల్లియుఁనీచేత, నెట్టుఁగౌరవులకునెగ్గుపుట్టుననియు." భార. అర. ౧, ఆ. "క. పోవఁగనిత్తునెవిరోధిఁబోరిగొనకట్టున్." హరి. ఊ. ౮, ఆ.—7. కొన్నిచోట్ల అర్థవిశేషములను తెలుపును; "చ. పాండవోత్తములచరిత్రనాకుసతతంబువినంగనభీష్టమెంతయున్." భార. ఆది. ౧, ఆ. — 8. వ్యతిరేకక్రియలమీఁదవికల్పార్థమును తెలుపును; "మున్నిట్టివిచూడరున్ వినరునెవ్వారున్." భార. ద్రో. 3, ఆ.—9. పాదపూరణమందు అంతలోనగుశబ్దములమీఁదవచ్చును. (అంతయును, అందఱును, ఎప్పుడును, తద్దయును, నిచ్చలును, వాలాయమును, మఱియును, వెండియును. మొ. "ఇవియేనున్." అనుచో ఏనుశబ్దముమీఁదిదియు పాదపూరణమునందువచ్చినదని యెఱుంగునది. ఇట్లు ఇతరస్థలములయందును తెలిసికొనవలయును. ఇదియెద్రుతమనఁబడు. దీనియుత్వమునకు తఱుచుగలోపంబగు.)

**నుంకు.** దే. వి. పస్తు, ఉపవాసము.

**నుక్కట.** దే. వి. చలనము. "ద్వి. నడుము, నుక్కటనొక్కింతనూఁగారుదోఁప." హరిశ్చ. ౨, భా.

**నుగ్గాడు.** దే. స. క్రి. (నుగ్గు+ఆడు.) ఖండించు. "ద్వి. నీతలల్ నుగ్గాడి నిను సంహరించి." రా. సుం, కాం.

**నుగ్గు.** దే. అ. క్రి. నలఁగు. "తోలునునుగ్గదేమియున్." లక్ష్మీ. ౪, ఆ. (చూ. కాటు.)—వి. 1. చూర్ణము; 2. ఖండము; 3. బ. పిడక.

**నుగ్గులువాఱు.** దే. అ. క్రి. (నుగ్గులు+పాఱు.) నుగ్గగు. "ద్వి. కులగిరులైననుగ్గులువాఱఁగాలు." హరిశ్చ. ౨, భా.

**నుచ్చిళ్లు.** దే. వి. బ. నురుఁగు, ఫేనము.

**నుచ్చె.** దే. స. క్రి. నుచ్చుపాఁతలుచుట్టు. వి. గొఱ్ఱెలమేఁకలపెంట్రుక. (పెంట్రుకనేపింటిక యందురు.) "వ. నెల్లికొయ్యలుద్రచ్చినుచ్చులంటించినం బెచ్చువెరుగుచిచ్చు లాత్రంపులం దవిలించి." స్కా. ౪, ఆ.

**నుచ్చెపాఁత.** ద్వ. వి. గొఱ్ఱెలమేఁకలచన్నులకుఁజుట్టెడుగుడ్డ.

**నుజ్జు.** దే. విణ. క్షతినొందినది. య. ౨, ఆ. ఉ, రా. ౭, ఆ.

**నుడి.** దే. వి. 1. మాట; "దశకంఠుండనుఁదాతనీనుడియథార్థంబైనచో." ఉ, రా. ౨, ఆ.—2. అపప్రథ. "క. పుడమినపప్రథయగునెడఁ, బడఁతికిదేహంబువిడువఁ బాడియకాదే, నుడికంటెఁ జావుమేలను, నుడువుపురాతనముగాదె నూతనపదమే." భో. ౭, ఆ.

**నుడికారము.** దే. వి. మాటచమత్కారము. "నుడికారముసొంపెసలారభారతంబెట్టురచించితీవు." కాశీ. ౭, ఆ.

**నుడుగు.** దే. స. క్రి. చెప్పు. "వ. అప్పలుకనురవరుండునుడుగ." రామా. ౬, ఆ. — వి. మాట. (చూ. తొడుగు. రూ. నుడువు.)

**నుడుగుఱేఁడు.** దే. వి. బృహస్పతి, గీష్పతి. "సీ. అరయువేల్పులకెల్లనయగారనందగు నుడుగుఱేనికిఁగూర్చికొడుకుఁగుఱ్ఱ." య. 3, ఆ.

**నుడువరి.** దే. విణ. (నుడువు+అరి.) మాటలమారి, వాచాలుఁడు. "ద్వి. వడుగుచేసినభక్తివట్టిపాటగునె,నుడువరితనమునఁగడవనాడెదవు." బస. ౧, ఆ.

**నుడువు.** దే. స. క్రి. వి. నుడుగుయొక్క రూపాంతరము.

**నుతము.** సం. విణ. (అ. ఆ. అ.) నుతింపఁబడినది.

**నుతి.** సం. వి. ఇ. స్త్రీ. స్తోత్రము, పొగడిక.

**నుతించు.** సం. స. క్రి. స్తోత్రముచేయు, పొగడు.

**నుతిక.** దే. వి. తెగ, మొత్తము.

**నుత్తము.** సం. విణ. (అ. ఆ. అ.) త్రోయఁబడినది.

**నుదురు.** దే. వి. నొసలు, లలాటము. "సీ. తళుకు టద్దములపొక్కులనొక్కు చెక్కులు హేమంపుఁ బట్టికసెదురునుదురు." శేష. ౫, ఆ.

**నును.** దే. విణ. వృత్తియందు నునుపుశబ్దమునకు మీఁదివర్ణములోపింపఁగా మిలిగినరూపము. (వృత్తియందిది అల్పార్థకమునగును. ఉదా. నునుఁజెక్కిలి, నునుసిగ్గు. మొ.) (హల్లుపరమగుచో కడపటి ఉకారము వికల్పముగ లోపించును. నున్‍బూది. మొ.)

**నునుపరి.** దే. విణ (నునుపు+అరి.) నునుపుగలది.

**నునుపు.** దే. వి. నున్నన, స్నిగ్ధత. విణ. నున్న, స్నిగ్ధము. (చూ. దిండుకడ వాలుగవ అర్థము.)

**నున్న.** దే. వి. నున్ననిఉముక. విణ. నునుపైనది, స్నిగ్ధమైనది. (నున్నకావి, నున్నకొంగు, నున్నచేల నున్నక్రొత్తకంబళ్లు, నున్నగజ్జతడుపులు, నున్నమెఱుఁగుగట్లు. మొ.)

**నున్నన.** దే. వి నున్నఁదనము, నునుపు. (విశేషణమగుచో నున్ననికప్పు, నున్ననిపల్కు. మొ. చూ. అలకన.)

**నున్నము.** దే. విణ. (అ. ఆ. అ.) త్రోయఁబడినది.

**నుయి.** దే. వి. నుయ్యియొక్కరూపాంతరము. "శా. అంతర్వాణికుశేశయద్యుమణిఁ బద్మాక్షున్ మదిన్ నిల్పిదు, ర్దాంతానంతభవాంధకూప తరణప్రౌఢిన్ దృఢస్థేమఁబా, టింతుర్ పెద్దలుతద్దన మ్మినుయిదాఁటేవానికిన్ జింతయా, కంతైనంగడమేనియున్ గడమకాదాయంచునూహించుచున్." పాండు. ౪, ఆ.

**నుయ్యి.** దే. వి. నూయియొక్కరూపాంతరము. "గీ. ఒకనిపాలములోననొకఁడుధర్మార్థంబు, కొలనుబావినుయ్యిగ్రొచ్చుచోట, నడిగిచేయవలయు నొడయండుఁజేనికి, హానిఁదేకయున్న నాఁగఁదగదు." విజ్ఞా. వ్య, కాం.

**నురుఁగు.** దే. వి. ఫేనము. "సీ. కలకంఠిలోచనంబులుగందుమీలుకునుమగంధివిమలహాసమునురుంగు." రాజ. ౧, ఆ.

**నురుఁగుదబ్బ.** దే. వి. కారిజెము, కాలఖండము.

**నురువు.** దే. వి. నురుఁగుయొక్కరూపాంతరము.

**నులిచియాడు.** దే. స. క్రి. (నులిచి+ఆడు.) నాశముచేయు. "సీ. ఆమేటితనదుపై బద్ధవ్యూహాభంగిఁజూపట్టంగఁబన్నిహాతిక, రప్రహారప్రవర్తనలచేఁ జీకాకువఱుచుచుఁగడుఁజొచ్చినులిచియాడు." రాఘు. ౪, ఆ.

**నులిపిడి.** దే. వి. ధాన్యమును కాళ్లతోఁ ద్రొక్కినలుచుట. "వ. నులిపిడికింజొచ్చినప్రబలహాలికునిలీలనేలంబెట్టికాలంజమిరి." భార. ద్రో. ౩ ఆ.

**నులుచు.** దే. స. క్రి. ధాన్యాదికము కాళ్లతోఁ ద్రొక్కినలుపు. "గీ. తాఁచియొక్కనిఁదేరితోఁ వైచియొకని, గ్రుద్దియొక్కనిమోఁచేతఁ గ్రుమ్మియొకని, నులిచియొక్కనిమెడనొక్కివిఱిచియొకని వాత్మణంబునఁదెగటార్చినాఁడుగురను." రామా. ౬, ఆ.

**నులుపు.** దే. స. క్రి. 1. నులుచు; 2. చంపు. "తలిపిపెయ్యఁబట్టినులిపెనేడు." హరి. పూ. ౬, ఆ.

**నులుమాడు.** దే. స. క్రి. (నులుము+ఆడు.) 1. చూర్ణముచేయు; 2. చంపు. "క. తలిమితనమునుముసైన్యము, నులుమాడఁగఁగనికురుయోధనుఁడుమున్నుగనే, క్షత్రఅనీయోధులుమార్కొని, యలిముతినొప్పించిపట్టి నతిమిపాదివిన్రన్." భార కర్ణ. ౨, ఆ.

**నులుము.** దే. స. క్రి. 1. చూర్ణముచేయు; "దైత్యులన్ నులుముచు." రా. యు, కాం.—2. చంపు. వి. చూర్ణము. "పదఘట్టనంబులఁజదిసితాలునులుముగాఁగ." భార. ఆది. ౬, ఆ.

**నులుముచేయు.** ద్వ. స. క్రి. 1. చూర్ణముచేయు, 2. చంపు.

**నులక.** దే. వి. మంచమల్లెడుసన్నపుదారము. (చూ. నుల్క.)

**నులి.** దే. వి. 1. వ్రేఁగులలోనొప్పి; 2. చిక్కు. "సీ. కౌస్తుభోజ్జ్వలపదకంబునఁబెనఁగొన్న చారుహారమునులిచక్కఁజేసి." హరి. పూ. ౫, ఆ. "ఎ, గీ. ఈఁకనులిదీర్చికొంచునొక్కింతదడవు." ప్రభా. ౨, ఆ. "ఎ, గీ. తళుకుఁగొనగోరమీసలనులియొడల్చు." కళా. ౫, ఆ.—విణ. అల్పము. (నులివెచ్చ, నులివేఁడి. మొ.)

**నులించు.** దే. ప్రే. నులియఁజేయు, నులుచు. "ఉ. తానునుదైత్యులావునకుఁ దద్దయు మెచ్చుచుఁబేర్చి దేవకీ, సూనుఁడుకొమ్ములూఁది మెడనుక్కఁ

గనెత్తినులించిత్రెంపివే, వేసెతీదప్పఁద్రోచుట యు." హరి. పూ. ౮, ఆ.

నులిగొను. దే. అ. క్రి. (నులి+కొను.) చిక్కుపడు. (చూ. చెలఁది.)

నులితడ. దే. వి. మహాబలి?.

నులిపురుగులు. ద్వ. వి. బ. కడుపులోని సన్నయేమి డికలు.

నులియు. దే. అ. క్రి. 1. ఏదైననొకటి తాఁకుటచే స్థానముతప్పియిట్టటుతొలఁగు; "చ. వైరవునసంగముల్ నులియవ్రేటులనిమ్ముగఁ దాఁకినప్డు." భార. శల్య. ౧, ఆ. — 2. పాడియగు. (చూ. నలియు.)

నులివాల్లు. దే. వి. బ. కొంచెమువాడుటలు. (చూ. వసివాల్లు.)

నులివాల్లువాడు. దే. అ. క్రి. కొంచెమువాడు. "క. నులివాల్లువాడుచున్నవి, లలితమహాతరుణదేహలతికలు." విక్ర. ౫, ఆ.

నులివు. దే. వి. నులియుట. (ఉలివువంటిది.)

నులివెట్టు. దే. స. క్రి. (నులి+పెట్టు.) నులుచు.

నులుచే. దే. ప్రే. నులియఁజేయు. "గీ. తోఁకనులుచుఁగదియఁదొడఁగుఁవొలఁగు." పంచ. నా. ౨, ఆ.

నులుపు. దే. ప్రే. నులుచుయొక్కరూపాంతరము.

నులుము. దే. స. క్రి. 1. రెండువ్రేళ్లతోకండనుగట్టిగాఁబట్టియటునిటుత్రిప్పు; "సీ. నిజశిక్షలోబుద్ధినిలకవిస్వరములఁబలికిన బుగ్గలు నులిమినులిమి." కళా. ౮, ఆ. — 2. ఉన్మూలించు, పెల్లగించు. "విభీషణుఁడు భీష్ముఁడనుశంకనులిమివైచె." రాఘ. ౮, ఆ. "సీ. బలిమివాసవుచెట్టునులిమివాకిటఁబెట్టుకలిమివాలుగకంటిచెలిమివాని." చంద్రా. ౧, ఆ.

నులుసు. దే. వి. న్యూనత. "తరల. నులుసులేకఫలించునోఁచిననోములెల్లనునీవయై." భాగ. ౧౦, స్కం. పూ.

నుల్క. దే. వి. నులకయొక్కరూపాంతరము. "భద్రగజేంద్రము నుల్కత్రాళ్లచేనోముని నాధకట్టువడియుండునె." భో. ౮, ఆ.

నువు. దే. వి. నువ్వుయొక్కరూపాంతరము. "నువుగింజకుఁజోటిడదుతనువు." రా, వి. 3, ఆ.

నువ్వు. దే. వి. సస్యవిశేషము. బ. ధాన్యవిశేషము. (దీనిభేదములు. అడవినువ్వు, వెఱ్ఱినువ్వు.)

నుసము. దే. వి. కసరు. "ద్వి. కమనీయసరసిబిసములునుసములు." హరిశ్చ. ౧, భా.

నుసలు. దే. అ. క్రి. 1. ఆలస్యముచేయు; "గీ. నుడివినంతవట్టునుసలకయిచ్చుచో, నేలకట్టువిష్ణుఁడేటిమాట." భాగ. ౮, స్కం. — 2. పూను. "క. మగువలుమగలనియెఱుఁగఁడు, మృగములకోరసిలఁడేమిమిడిమేలమితం, డగపడుననితలఁచితిమే, నుఁగుఁగంబంబునకుఁడివియ నుసలితిమినుమీ." రామా. ౨, ఆ. — స. క్రి. (ఒళ్లు) విఱుచుకొను. "ద్వి. వెడనిద్రనొంది, నుసలినమసలిననొప్పిఁజెప్పినను." హరిశ్చ. ౨, భా. "మైనుసలుచు." శశాం. ౮, ఆ.

నుసి. దే. వి. పురుగులుతొలువఁగారాలుమ్రానిపొడి. "చ. మడవకముష్టియోగ్యమగుమధ్యములోనెలవంకదైనయ, ప్పడఁతుకభ్రూలతాధనువుపట్టిమనోభవుఁడింతనుండియుఁ, విడుచునకానిమానఁడిదినిక్కముషట్పదకీటజుష్టమై, యుడుగకకమ్మధూళినుసి యొల్కుచునున్న పురాణచాపముఁ." నై. ౫, ఆ. — విశ. అల్పము. "ఈనుసివిల్లొకపెద్దకొండగాఁజూచెదరెల్లవారు." రామా. ౮, ఆ.

నుసిపురుగు. ద్వ. వి. మ్రానుతొలిచి నుసిరాల్చెడుపురుగు, ఘుణము.

నుసుఁగు. దే. స. క్రి. తిరస్కరించు. "ఎ, గీ. అన్నశంసుండునుసుఁగువైఖానసులను, నాదురాత్ముండుశ్రోత్రియునపహసించు, నాఖలుఁడుసోమయాజినిరాకరించు, నక్కిరాతుఁడనుష్ఠాతధిక్కరించు." నై. ౬, ఆ.

నుసుమ. దే. వి. ఎండకాలమునకన్నులయందు ముసరెడు చిన్నదోమ.

నుసుము. దే. స. క్రి. ఆకర్షించు. "వ. తనుఁదానముడిసడలు నిద్దంపువలువలదరిపాటునంజరణాంగుళీయదంశికలంబట్టినుసిమిన." వసు. ౮, ఆ.

నుసులు. దే. అ. క్రి. మెదలు. "ఎ, గీ. పసులపాఁతఱవీరెందునుసులనీయరు." సా. ౨, ఆ. — వి. లాఘవము. "వ. అతండదిమేనినుసులునందప్పింప." సం. "తంప్రహారమసంభ్రాంతోలాఘవేన మహాబలః, మోఘందుర్యోధనశ్చక్రే." భార. శల్య. ౨, ఆ. "వ. నుసులులేకమానంబుమనంబునకుధనంబుగా." ఉ, హరి. 3, ఆ.

## నూ.

**నూ.** దే. విణ. వృత్తియందు నూవుశబ్దమునకు అంత్యవర్ణములోపింపఁగా మిగిలినరూపము. (ఉదా. నూఁబిండి, నూఁబువ్వు. మొ.)

**నూఁక.** దే. వి. వృక్షవిశేషము.

**నూఁగు.** దే. వి. 1. కొన్ని యాకులమీఁదను కాయలమీఁదను ఏర్పడియుండు చినచిన్న ముండ్లు. "నూఁగునూఁగుఁ లేఁగొమ్మలు." నిర్వ. ౬, ఆ.—2. వడ్లులోనగువానిరేణువు; 3 లేఁతదనము. "సీ. వెడవెడ నూఁగారివింతయైయేర్పడఁ దారనివళులలో నారునిగుడ." భార. విరా. ౧, ఆ.—విణ లేఁత. (నూఁగారు, నూఁగుమీసము. మొ.)

**నూఁగుడు.** దే. వి. వడ్లులోనగువానిరేణువు. "క బ్రదికెడునంతకుఁబురుషుఁడుఁ, బ్రిదులక నిలువెల్లఁ బగలఁబెనఁగొనియుండుఁ, గుదురుకొనిదూది నూఁగుడు, పొదిఁగిన కార్పాసబీజమునకుం బ్రతియై." కవిక. ౫, ఆ.

**నూఁగుదోస.** దే. వి. (చూ.) కూఁతురుబుడమకీ.

**నూక.** దే. వి. తండులకణము, శంబూకము.

**నూకు.** దే. స. క్రి. 1. త్రోచు; 2. త్రోలు "ఏటల వికిఁ వాహంబునడ్డంబునూకిరసావల్ల భుఁడేసె." స్వా. ౪, ఆ.

**నూకుడు.** దే. వి. త్రోపుడు.

**నూగు.** దే. వి. నూవునకు మొదటిరూపము.

**నూచే.** దే. వి. పొడి. "ఉ. కొన్నిటిహస్తముల్ చదియఁగొన్నిటికొమ్ములుదుమ్ముధూళిగాఁ, గొన్నిటిఁగుంభముల్ వగులఁ గొన్నిటిఁగాళులు నుగ్గునూచగాఁ,గొన్నిటిఁబార్శ్వముల్ నలియఁగొన్నిటివీఁపులుపిండిపిండిగా, నన్నిటిభీముఁడుద్భటగదాహతినేనుఁగుపేఁటలాడఁగన్." భార. భీష్మ. ౨, ఆ. (రూ. నూచము "క. అరదంబులుపొడిపొడిరైయె, హారులగములునుగ్గునూచమై మొత్తపుఁగా, ల్వురుచిదురుపలైపడని, ష్ఠురగతివిహరించెహాయనూనుఁడుగదతోన్." భార. భీష్మ. ౨, ఆ.) నుగ్గునూచ అని యొకానొక నిఘంటువునందుఏకపదము గావ్రాయఁబడియున్నది. అట్లు చెప్పినచో నూచశబ్దము నిరర్థకమగును. నుగ్గుశబ్దము ప్రత్యేకముగాను ప్రయోగింపఁబడుచున్నది. కనుక నుగ్గునూచశబ్దములు రెండుచేరినప్పుడు చిక్కలిపొడియనియర్థముచెప్పవచ్చును. దీనికి పైయుదాహరణమునందు దుమ్ముధూళిగా అని చెప్పియుండుటయే ప్రమాణముగా గ్రహింపవలెను.

**నూతనము.** సం విణ. (అ.ఆ.అ.) క్రొత్త, నవీనము

**నూత్నము.** సం. విణ. (అ అ. అ.)——పై.——

**నూదోస.** దే.వి. నూఁగుదోసయొక్క రూపాంతరము

**నూనియ.** ద్వ. వి. నూనెయొక్క రూపాంతరము సీ కమనీయ గతిఁదిలోత్తము నేర్పుఁగాక నూనియయంట నెవ్వారు నేర్తురనుచు." వసు. ౫ ఆ.

**నూనె.** ద్వ. వి. (నూవు+నేయి) తైలము (ఇది చమురుకలుగఁజేసెడువిత్తులుగలచెట్లునకు వెనుక వచ్చినప్పుడు ఆయాయిచమురునకర్థమగును ఉదా. ఇప్పనూనె, వేఁపనూనె. మొ)

**నూనెముంత.** ద్వ. వి. గుచ్ఛబలకీ.

**నూనెముడి** ద్వ. వి కీలుగంటు. "సీ. నిడుదవేనలి నూనెముడి జాఱఁ జిగురాకుపాదఁదూలు గాచ్చుఁగదియుకరణి." స్వా. 3, ఆ.

**నూనెయగిసె** ద్వ. వి. నల్లగిసె, అతసికీ.

**నూపురము.** సం వి. అ. పుం, న. అందె, మంజీరము

**నూయి.** దే వి. చేఁదబావి, కూపము. (నుయ్యికి మొదటిరూపము )

**నూర్చే.** దే. స. క్రి. నూఱుచుయొక్క రూపాంతరము. "క. కంటకంబులఁగాళ్లన్, విపరీతతనూర్చుచునే, రుపునంబల్లేరులూడ్చిత్రోయుచుఁడనుచున్." ఆము. ౬, ఆ.

**నూర్పిడి.** దే. వి. నూఱిపిడియొక్క రూపాంతరము

**నూర్పు.** దే. వి. నూఱుపుయొక్క రూపాంతరము

**నూఱంచులకైదువు.** దే. వి. వజ్రాయుధము శతకోటి. 'ఉ.మించినపేర్మినేయెడలమిన్నులుముట్టి వెలుంగునట్టినూ,ఱంచులకైదువుల్."లక్ష్మీ ౨ ఆ

**నూఱిపిడి** దే. వి. నుఱిపిడియొక్క రూపాంతరము

**నూఱు.** దే స. క్రి. 1. ఆయుధమువాఁడిచేయు, 2. సన్నకంటమర్దించు. స. శతము. 'బాహువుల్ నూఱునుజాఁచి." హరి. పూ. ౪ ఆ.

**నూఱుచే.** దే. స. క్రి. నుఱుచుయొక్క రూపాంతరము.

**నూఱుపు** దే. వి నుఱిపిడి.

**నూలిగరను** దే. వి. బట్టతల.

**నూలు.** దే. వి. ప్రత్తివడికినపోఁగు, తంతువు. 'కొనుదీఁగలేనూలును." సా. ౨, ఆ.

నూలుకొను. దే. అ. క్రి. 1. ఒప్పుకొను; 2. కుదురుకొను; 3. చక్కఁబడు; 4. పురికొను. (చూ. నూల్కొను.) (ప్రే. నూలుకొలుపు, నూలుకొల్పు ఒప్పుకొనఁజేయుటకు. — "ఉ. మిక్కిలిమిక్కుటంబగుతమిన్ రతికిన్ సతినూలుకొల్పుచున్." కళా. ౭, ఆ. — కుదురుపఱచుటకు. — "మనములునూలుకొల్పి." భార. విరా. ౪, ఆ. — చక్కఁబఱచుటకు.—"వ. అలికదేశంబునంగలయఁబడినయలకంబులునూలుకొలిపి." ఉ, హరి. ౫, ఆ.)

నూలుకోలు. దే. వి. నూలుకొనుట.

నూల్కొను. దే. అ. క్రి. నూలుకొనుయొక్క రూపాంతరము. (ఒప్పుకొనుటకు. — "కన్నవకెంపు భాగ్యబంధురసహజారుణత్వమని నూల్కొననాడితివి." కా. ౨, ఆ.—కుదురుకొనుటకు.— "పెద్దవడికక్కటనీమదికార్యవృత్తినూల్కొనియె." భార. ఉద్యో. ౨, ఆ.—చక్కఁబడుటకు.—"తత్తనువులు నూల్కొనన్ నివిరి." భార. విరా. ౪, ఆ.—పురికొనుటకు.—"క. అప్పులుకులకలుకలుమది,నుప్పరమెగయంగనెసఁగెనుల్లాసము మై, నొప్పారఁగబరిగోలల, నొప్పించినభద్రగజము నూల్కొన్నగతిన్." ఉ, హరి. ౫, ఆ.) (ప్రే. నూల్కొలుపు, నూల్కొల్పు.—పురికొల్పుటకు. — "తానెలుఁగిచ్చివీటికైనూల్కొలిపెన్." భార. విరా. ౪, ఆ.)

నూవు. దే. వి. నువ్వునకు మొదటిరూపము. "క. నూవుంబువ్వునుసంపెఁగ, పూవు గెలిచి బిరుదుముత్తెపుంజల్లిగన్, దావైచెననఁగముంగర,తోవనరుహనేత్రనాస తులలేకొప్పున్." శశిబిందు చరిత్రము.

## నృ.

నృత్తము. సం. వి. అ. న. నర్తనము, (చూ.) నృత్యము.

నృత్యము. సం. వి. అ. న. శరీరహస్తనేత్రాభినయములచేత భావమును తెలుపుచు ఆడెడు ఆట.

నృపతి. సం. వి. ఇ. పుం. 1. రాజు; 2. కుబేరుఁడు.

నృపలక్ష్మము. సం. వి. న్. న. రాజునకుఁబట్టెడు తెల్లగొడుగు.

నృపాలుఁడు. సం. వి. అ. పుం. రాజు, ఏలికఁడు.

నృపుఁడు. సం. వి. అ. పుం.——పై.——

నృశంసుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) క్రూరుఁడు.

నృసింహుఁడు. సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. నరశ్రేష్ఠుఁడు.

నృహరి. సం. వి. ఇ. పుం.——పై.——

## నె.

నె. దే. విణ. నెఱనెతిశబ్దములకు వృత్తియందు అంత్యవర్ణములోపింపఁగామిగిలినరూపము. (వృత్తియందు దీనిమీఁదిహల్లునకు ద్విత్వముపచ్చెడి. ఉదా. నెఱశబ్దమునకు.— నెచ్చెలి, నెత్తమ్మి, నెత్తటి, నెత్తామర, నెత్తావి, నెమ్మది, నెవ్వగ, నెవ్వడి. మొ. నెతిశబ్దమునకు.—నెన్నడ, నెన్నడుము, నెన్నుదురు, నెన్నొసలు, నెమ్మెయి, నెమ్మేను, నెమ్మొగము, నెమ్మోము, మొ. నెన్నడ, నెన్నడుము, నెమ్మేను ఇత్యాదిస్థలములయందు నెతిశబ్దపూర్వకమై అర్థము పొసఁగియుండునట్లు నెఱశబ్దపూర్వకమైపొసఁగియుండదనియెఱుంగవలయును. కొన్నియెడల తత్సమపదము పరమగునపుడునుద్విత్వముకానఁబడుచున్నది. "నీవునెమ్మనమునసంతసిల్లుడుసమస్తజగంబులుశాంతిఁబొందు." భార. అర. ౪, ఆ.)

నెంజిలి. దే. వి. మనోవ్యధ, ఆధి. "క. అనిదొంగిలిచెఱగాఁడ, చ్చెనితండను నెంజిలింగృశించుచుఁజిత్తం, బునఁబట్టలేకగోల్గో, లుననేడ్చెన్ బాష్పకణములుర్గడు వెడలన్." పర. ౪, ఆ.

నెక్కరి. దే. వి. ఒకానొకచెట్టు.

నెకొను. దే. అ. క్రి. పాదుకొను. "అత్తలన్ నెకొనిమోములంబొడమునెవ్వగతోడ." భార. ఉద్యో. ౧, ఆ. (ప్రే. నెకొలుపు, నెకొల్పు. "క. అక్కటదైవమురాజ్యముఁ, ద్రొక్కొనియాలిందనూజుఁదెగనమ్మంగా, నెకొలిపిహరిశ్చంద్రుని, నిక్కడఁగాడ్పఱిచెనింక నేగతిఁ బోదున్." మార్క. ౧, ఆ. "ఇంతులుందగిలినీపైఁ జూడ్కినెకొల్పినెమ్మనముల్ విస్మయమందఁజూచెదరు." భార. విరా. ౧. ఆ.) (నెలకొనుయొక్కరూపాంతరము.)

నెకోలు. దే. వి. నెకొనుట.

నెగడి. దే. వి. దుష్టమృగములు బెదరుటకును చలికాఁచుకొనుటకును వేసెడుమంట. "గీ. నెగడికిఁ బాచనమున, కింధనములిచ్చిధనములనెసకమెసఁగు." భార. అను. ౨, ఆ.

నెగడు. దే. అ. క్రి. 1. బయలుమెఱయు; "గీ. ఆపద, నిస్తరించిపిదప నెగడవలయు." భార. విరా. ౧, ఆ.—2. వర్ధిల్లు. వి. (చూ.) తంతువాగము. "ద్వి. ఒడ్డనములు నెగళ్లు." రా. యు, కాం. (కొంద ఱుజలగ్రహమని యర్థము వ్రాసియున్నారు.)

నెగవు. దే. వి. ఎగవునకు మొదటిరూపము.

నెగయు. దే. అ. క్రి. ఎగయునకు మొదటిరూపము. (ఎగురుటకు.—"క. నెటిసక్కఁగఁద్రోచి యొత్తెనెగయంగనృపా." భార. ఉద్యో. 3, ఆ.—పయికిలేచుటకు.—"సీ. నెగసినకొనలేచినింగియంతకు నవులఁద్రోవఁగఁదనరారుదాని." భార. విరా. ౧, ఆ.)

నెగయుదెంచు. దే. అ. క్రి. (నెగయు+తెంచు.) పైకిలేచు, నెగయు. "గీ. బంధనంబులెల్లఁబాయుడుభీముండు, నీరిలోననుండి నెగయుదెంచె." భార. ఆది. ౫, ఆ. (స్వార్థమున తెంచు.)

నెగవు. దే. వి. ఎగవునకు మొదటిరూపము. "సీ. నిఖిలాండములునొక్కనెగవునదాఁటంగఁ గలయుద్భతోగ్రవేగంబువాని." హరి. పూ. ౪, ఆ. (ఇది కెడవువంటిది.)

నెగులు. దే. వి. 1. బాధ; "గీ. నిజముచెప్పిననీకు నేనెగులు లేదు." కాశీ. ౪, ఆ.—2. దుఃఖరూపమైనవిచారము. "ఎ, గీ. అనుఁగుఁజెలినిబోలె నలరుఁదీవియనూఁది, నిగిడిమనములోని నెగులుఁ జేతఁ, జప్పుడేమియైనసరగ నాలించుచు, నున్న దానినొక్కయువిదఁగాంచి." య. 3, ఆ.

నెగ్గడము. వై. వి. త్రొక్కిడి, సమ్మర్దము.

నెగ్గు. దే. అ. క్రి. నిర్వహిల్లు. (నిగ్గుయొక్క రూపాంతరము.)

నెగ్గురు. దే. వి. గుండెయదరుటయందగుననుకరణము. "ఉ. అన్నీరజగంధిఁజూచియెద నెగ్గురనన్ గడుభిన్నచిత్తుఁడై." శుక. ౧, ఆ.

నెచ్చు. దే. వి. మిక్కిలిసన్నమైననూకలసమూహము.

నెటిక. దే. వి. వ్రేళ్లుమొదలగువాని కీళ్లకదలికచప్పుడు.

నెటుకురు. దే. వి. నెటికవిఱుగుటయందగు ననుకరణము. "సీ. అష్టోత్తరశతవ్రణాఢ్యత్వుఁడగురాజపిటకునకునువీఁపు నెటుకురనియె." జై. ౮, ఆ.

నెట్టన. దే. అవ్య. క్రి. విణ. అనివార్యముగ. "క. ఎట్టివిశిష్టకులంబునఁ, బుట్టిన సదసద్వివేకములు గల్గియుమున్, గట్టినకర్మఫలంబులు, నెట్టనభోగింపకుండ నేర్తురె మనుజుల్." భార. ఆది. ౫, ఆ. (రూ. నెట్టనము. "ఎ, గీ. పాత్రమెఱుఁగనిచెనఁటిభూపతులయిండ్ల, కెట్టినియతాత్మకులనైన నేగఁజేయు, ద్వారనిలయులువారింపవారినచట, నిలువఁబెట్టును గామఁబు నెట్టనముగ." శివ. ఉ. ౨, ఆ.) (దీనిని ద్రుతప్రకృతికముగావాడుచున్నారుగాని దానికి సరియైనప్రయోగములేదు. అదిగాక యది ద్రుతాంతమైనయెడఁబత్వాంతరమున మువర్ణాంతము గాదు.)

నెట్టపంట. దే. అవ్య. క్రి. విణ. నిష్కారణముగ.

నెట్టిక. దే. వి. నెటికయొక్కరూపాంతరము.

నెట్టికసీల. వై. విణ. సదాచారసంపన్నమగుస్వభావముగలవాఁడు, సదాచారసంపన్నమగు స్వభావముగలది. "పట్టినచలమున నీగతి, మట్టముగానేఁ బిలుకుమార్చికదలిరా, నెట్టికసీలలుమదిలోఁ, బుట్టినహర్షమునఁ దమతపోవనమునకున్." జై. ౬, ఆ. "ఉ. నెట్టనయల్లలచ్చియలనీశలభూపతియుండనీవునీ, నెట్టికసీలపై మనసు నిల్పుటకేమనవచ్చు." ఆము. ౬, ఆ.

నెట్టియము. దే. వి. 1. చుట్టకుదురు; 2. గుండుపాఁగ. "వ. కెంజడముడి బిగియించి నెట్టియంబుచుట్టిన జగజెట్టి." భీ. ౫, ఆ.

నెట్టు. దే. స. క్రి. పూనిత్రోయు. "క. పెట్టిరి విషాన్నమంటం, గట్టియుఘనపాశములనుగంగానదిలో, నెట్టియురాజ్యము వెడలం, గొట్టిరిధర్మంబువిడిచికుటిలాత్మకులై." భాగ. 3, స్కం. ["ద్వి. పూతిగంధంబులఁబొరలింతురుగ్ర, వైతరణీనదివడినెట్టిత్రోతురు." (ఇక్కడనెట్టియనఁగా పూనియనిమాత్రమర్థము.) నల. ౪, భా.]—వి. 1. పూనిక; "ఎ, గీ. అంజకయశేషసుమనోవనాగ్రదేశ, ముఖరభూరిద్విజావళి మ్రోలనెట్టు, గానిలువనేర్తునాత్మయోగంబుఁదొఱఁగి, సనుదుగాకనితాల్చెరూక్షప్రతిజ్ఞ. హన. ౧, ఆ.—2. బ. బాలక్రీడావిశేషము, (రూ. నెట్లు.)(చూ. చిమ్ముబిల్లలు.)

నెట్టుకొను. దే. అ. క్రి. 1. పూనుకొను; "వ. నేను నాధాతోత్తరీయంబు నడుమం జొట్టుకొనినెట్టుకొనియుండితి." భో. ౭, ఆ.—2. నెలకొను; "ద్వి. నెట్టుకొనినతోలుకరిమించో." విష్ణు. ఉ. ౪, ఆ.—3. అతిశయించు. "గీ. పట్టఁగూడనితమకంబు నెట్టుకొనఁగ." కళా. 3, ఆ.—స. క్రి.

బలాత్కరించు. "గీ. నృపకులాబ్ధిచంద్ర నీవిం తనెట్టుకో, నంగఁ ద్రోచిపోవ నాకుఁదగదు." భో. ౭, ఆ.

నెట్టె. దే. వి. ఉద్ది. "ద్వి. నిండారుప్రేమతో నెట్టె లుగట్టి, చెండునుదండంబుఁ జెలువొప్పఁబట్టి." రా. బాల, కాం.

నెట్టెము. దే. వి. నెట్టియయొక్క రూపాంతరము. (గుండుపోగకు. "సీ. తనయదుగుందమ్ము లనురాచనెట్టెంపుఁబులుదిండి రాతుమ్మెదలు మెలంగ." య. ౧, ఆ.)

నెడిమె. దే. వి. ద్వీపము. (అప్ర.)

నెత్తకమ్మ. దే. వి. (నెత్తము+కమ్మ.) పాచికలపందెము. "సీ. నిలుమహాబొంకకు నెత్తకమ్మయటంచుఁ బత్తులు లెక్కడునొయ్యఁబల్కుమనుచు." కళా. ఆ.

నెత్తపలక. ద్వి. వి. (నెత్తము+పలక.) నెత్తమాడెడు పలక, అష్టాపదము. (చూ. తమకు.)

నెత్తము. దే. వి. 1. పాచికలాట; "శా. సోళాడో ప్నియు నెత్తముల్ మొదలుగా జూదంబు నీవాడు న, వ్వేళల్." జై. 3, ఆ.—2. పందెము; "సీ. తనకులాగైన నెత్తంబు గైకొని పన్ని పాసికల్ తాలించిపాటెటింగి." ఉ, హరి. 3, ఆ.—3. కొండమీఁది విశాలసమప్రదేశము. "సీ. నెత్తమ్ములే కొండనెత్తమ్ములందాడు విద్యాధరీకోటివిటులతోడ." స్వా. ౪, ఆ. (వృత్తియందు అంత్యవర్ణలోపము. నెత్తపలక. మొ.)

నెత్తలు. దే. వి. బ. (నెఱ+తెఱలు.) పెద్దయలలు, కల్లోలము. "చదలేటినీటి నెత్తలుజనించు క్రొన్నురువుదండముల్లై." లక్ష్మీ. ౨, ఆ.

నెత్తి. దే. వి. తల, శిరము. "ఎ, గీ. కాకియైన గద్దయినను లూకమైన, నెత్తిసోఁకినవాఁడాఱు నెలలఁగెడయు." జై. ౮, ఆ. (రూ. నెత్తికాయ.)

నెత్తురు. దే. వి. రక్తము, (రూ. నెత్రు.)

నెత్తురుఁబ్రొద్దు. ద్వి. వి. (నెత్తురు+ప్రొద్దు.) సంధ్యాకాలము. "వ. అత్తఱిఁగడిఁది నెత్తురుంబ్రొద్దగుట." స్వా. ౪, ఆ.

నెత్తురుకందు. ద్వి. వి. (చూ.) జొత్తుపాప. (రూ. నెత్రుకందు. "ఎ, గీ. నేత్రములువిప్పనట్టియా నెత్రుకందు." పాండు. 3, ఆ.)

నెత్తురుద్రావుఁడు. దే. వి. (నెత్తురు+త్రావుడు.) రాక్షసుఁడు, అస్రపుఁడు. "క. కావునమీరా నెత్తురు, ద్రావుడువంగడపుఁగడలి తామరదాయక్, వేవేగఁ దెండునేడ, ద్దీవికి దొరఁజేసియును తుఁదిర మొప్పారన్." అచ్చ. యు, కాం.

నెత్తురుపొడ. దే. వి. (చూ.) ముణ్ణుఁబాము.

నెత్తురుబంక. దే. వి. మలముతో నెత్తురును బంకయును పడు వ్యాధివిశేషము.

నెత్తురువాఱు. దే. అ. క్రి. (నెత్తుర+పాఱు.) ఎఱ్ఱనగు, జొత్తిల్లు. "క. కడలును నెత్తురువాఱఁగఁ, దొడఁగెన్." హరి. పూ. ౬, ఆ.

నెత్రు. దే. వి. నెత్తురుయొక్క రూపాంతరము. "నెత్రుటేర్లు." కా. 3, ఆ.

నెనడు. దే. వి. ఎముకలలోని క్రొవ్వు, మజ్జ. "చ. నెత్తురుల్ నెనడును గ్రోలిభూతములు నిక్కుచు నీల్గుచుఁజొక్కుచుండఁగన్." భార. ద్రో. ౨, ఆ. "గీ. నెనడు మెదడు మలము నెత్తురు శుక్లంబు, మూత్రమనెడునివియు మొదలుగాఁగ, గుబిలిచెమటపుసులుగోరుశ్లేష్మంబశ్రు, జలములివి శరీర మలములయ్యె." విజ్ఞా. ఆచా, కాం.

నెనరు. దే. వి. 1. కృతజ్ఞత; 2. ప్రేమము. "గీ. వనితనాకన్న నెనరైనవారు నీకుఁ, గలుగ నేర్తురె." భాగ. ౧౦, స్కం. ఉ.

నెపము. వై. వి. 1. వ్యాజము; "వ. అతివతి నెపంబున." భార. అర. ౧, ఆ.—2. కారణము*; "క. విపరీతగతిని సుందుం, డుపసుందుఁడుఁదాఁకిపొడిచిరొండొరులు మహా, కుపితాత్ములయితిలోత్తమ, నెపమున దృఢముష్టిఘాతనిర్ఘాతములన్." భార. ఆది. ౮, ఆ.—3. తప్పు*. "చ. తివిరిమురారి నీకుఁగడుఁదీపుగఁజెప్పినపల్కుగల్గినన్, గువలయనేత్ర నీమనసుగూడినవారికి నైనఁజెప్పఁగా, వవలదు దాన నొండొక నెపంబుఘటించుతురె తెంగిరేనినీ, సవతులు కృష్ణుబుద్ధివిరసంబగునీ దసఁదప్పయుక్తిచేన్." భార. అర. ౫, ఆ.

నెప్పరము. దే. వి. వేగము. "వ. అత్తఱిఁదత్తఱంబునఁదత్తడులంబల్లింపకయ నెప్పరంబున నెక్కఁబోవువారును." పా. ౪, ఆ. (రూ. నెప్పళము.)

నెప్పరి. దే. విశ. (నెప్పు+అరి.) ఉపాయమెఱిఁగినవాఁడు, ఉపాయమెఱిఁగినది. "క. అప్పురిఁగలయప్పరిగల, నెప్పరులగుమగువలెక్కి నిక్కితమనెఱిం, గొప్పుల కలకల్పకముల, గొప్పును ముఱేరికోరికోయుదురదనన్." భద్రా. ౧, ఆ.

నెప్పరించు. దే. స. క్రి. మూదలించు. (దానివాకు నెప్పరించిపొమ్ము)

నెప్పు. దే. వి. 1. స్థానము; 2. స్థైర్యము; (చూ. జీ నా.) 3. ఉపాయము. రస. 3, గుచ్ఛము.

నెప్పుకొను. దే. అ. క్రి. పాదుకొను. "సీ. నెల నెప్పుకొనిరొప్పుపులినైనఁబీడించిపడవైతుఁజొచ్చినీపాదమూన." స్వా. ౪, ఆ.

నెమకు. దే. స. క్రి. వెదకు, అన్వేషించు. "సీ. తన మణిపడిపోవధరణీతలంబుననెమకంగవచ్చిననింగియునఁగ." పా. ౨, ఆ.

నెమకుడు. దే. వి. నెమకుట, అన్వేషణము.

నెమరు. దే. వి. పశువులు కొంచెమునమలితిన్నదానినోటికితెచ్చుకొనిమరలచక్కఁగానమలుట, రోమంథము.

నెమరుచు. దే. స. క్రి. నెమరువేయు. (రూ. నెమర్చు. "చ. ప్రమదముఁగ్రల్లసిల్లఁదనుపారఁగనిద్రలువోయిపల్లెలన్, గమియనెమర్చిమేసలుగఁగాఁబొరిఁబెండలువెట్టిలేచిన, త్సములఁదలంచిపంచితిలిచన్నులఁజేఁపొదవంగఁబెంపుతోఁ, గొమరుగఁ జూరుహుంకృతులగోవులుచెన్నువహించెమందలన్." హరి. పూ. ౮, ఆ.)

నెమిలి. దే. వి. 1. మయూరము; "ఎ, గీ. పక్షములుగప్పిపెనఁబొఁపపాపలకును, మేపులొసఁగిరక్షించునెమిళ్లు." జై. ౪, ఆ.—2. నెమిలియడుగు చెట్టు. (నెమలియనివాడుచున్నారుగాని దానికిఁదగినప్రయోగము కనఁబడలేదు.)

నెమిలియడుగు. దే. వి. 1. పూతికరజము?; 2. బ. కుచనఖక్షతములు.

నెమిలివడ్లు. దే. వి. బ. శాలిధాన్యవిశేషము. "సీ. క్రొత్తగోనియలబియ్యముఃవట్లునెమిలివడ్లు, నొదివిరిప్రాలును నొనరంగఁబోసి చాఁపలుమంచములుమీఁదబలియఁగట్టు." హరి. పూ. ౭, ఆ.

నెమ్మి, యు. దే. వి. 1. ప్రేమము; "క. నెమ్మిగలవానివాచి, త్తమ్మెరిసెడువానిసకలధర్మప్రియునా, తమ్మునివిడురుందోడ్కొని, రమ్మరుగుముకామ్యకాఖ్యరమ్యాటవికిన్." సం. "భ్రాతామమసుహృచ్చైవసాక్షాద్ధర్మఇవాపరః, తస్యస్మృత్వావ్యవసుభృశం హృదయందీర్యతీవమే, తమానయస్వధర్మజ్ఞంమమభ్రాతరమాశువై." భార. అర. ౧, ఆ.—2. నెమ్మది; "క. ఇమ్మతిమతీపురమ్మునఁ దమ్ముండును దానునతిముదమ్ముననుండున్, నెమ్మినిల్వలుఁడనువాఁ, డిమ్మహిధనవంతుఁడతఁడయివ్వరికంటెన్." భార. అర. ౨, ఆ.—3. సంతోషము; "క. త్రిణయనుఁడువరము వేఁడుము దనుజాధిపయనుడునతఁడుదగ్గయినెమ్మిన్." ఉ, హరి. ౬ ఆ.—4. క్షేమము; "గీ. అన్నగాదిలిచుట్టమవగుచు ఁజని, నెమ్మియొఱఁగించియుసుఱులునిలిపినట్టి, నినొ్నకింతయునగ్గింపనేరనింక, బుడమినెదురెందులనులేక తడవుమనుము." అచ్చ. సుం, కాం.—5. నెమిలి. "సీ. నెఱివేణిమెఱియించినెమ్మిబోదనుఁలేఁచి వడిఁగేకవేయించెవనితయొకతె." చంద్రా. 3 ఆ.—వై. సంజ్ఞ శము?. "రగడ. నెమ్మినుండియీ నెమ్మికినదరెదు కొమ్మాపొన్నలుకొమ్మాపదరెదు." య. ౪, ఆ

నెమ్మిక. దే. వి. నెమ్మి, ప్రేమము 'ఉ. నేయములజ్జయుంగరుణనెమ్మికకోపభయైకలేశమే నేయఁడఁజూచినన్మదికినించుకయించక." రస. 3 గుచ్ఛము. (స్వార్థమున క ప్రత్యయము.)

నెమ్మిజొట్టు. ద్వ. వి. బర్హిచ్ఛాదము?.

నెమ్మిరవుతు. ద్వ. వి. కుమారస్వామి, శిఖివాహనుఁడు

నెమ్మిఱేఁడు. దే. వి.——వై.——

నెమ్మిలి. దే. వి. నెమిలియొక్క రూపాంతరము.

నెమ్మిలిపరుఁజు. దే. వి. కత్తిపరుఁజు.

నెమ్ము. దే. వి. 1. తడి; 2. బ. పలకలులోనగునవియంటవేయలోపలఁజొప్పించెడుమేకులు. బడిచక్రముల రంధ్రములయందు చొప్పించెడు ఇనుపగొట్టములు. (అని కొందఱు.)

నెమ్ముకొను. దే. అ. క్రి. చెమ్మగిల్లు. (వానచేత నేల నెమ్ముకొన్నది.)

నెయి. వై. వి. నెయ్యియొక్క రూపాంతరము.

నెయ్యపుటలుక. ద్వ. వి. (నెయ్యము+అలుక.) ప్రణయకోపము.

నెయ్యపుఱేఁడు. ద్వ. వి. (నెయ్యము+ఱేఁడు.) మన్మథుఁడు, రతిపతి.

నెయ్యమాడు. ద్వ. అ. క్రి. (నెయ్యము+ఆడు) స్నేహించు.

నెయ్యమి. వై. వి. నెయ్యముయొక్క రూపాంతరము. (ఇంపునకు.—"క. అయ్యాకలదొకవిన్నపమియ్యుపవనసీమనిప్పుడేనేర్చుగతిన్, నెయ్యమినొకపూఁజప్పర, మొయ్యనరచియించితినిసమ్ముజ్జ్వలభంగిన్." చమ. ౨, ఆ.)

నెయ్యము. వై. వి. 1. స్నేహము; "క. రమణినిజ భ్రాతృనిరోా, గముఁదలఁపకయపుడు భీముఁగ లసెఁబతిస్నే, హముకామినులకుబలవం, తముపె ఱనెయ్యములువేయుఁదత్సదృశములే." భార. ఆది. ౭, ఆ.—2. ఇంపు. "అమ్మహాత్సవము నెయ్యమునఁజూడంగఁదివిరి." భార, ఆది. ౭, ఆ.

నెయ్యరి. ద్వ. విణ. (నెయ్యము+అరి.) స్నేహితుఁడు, స్నేహితురాలు. "సీ. నేర్పులేకచెడంగనిం డవేగురునుండియనవోడువారు నెయ్యరులుగారు." రామా. ౭, ఆ.

నెయ్యి. వై. వి. 1. తైలము; (చూ. నేయి.) 2. ఘృతము*. (నేయియొక్కరూపాంతరము.)

నెయ్యుఁడు. వై. విణ. స్నేహితుఁడు. "వానికినెయ్యుఁడై." భార. సభా. ౧, ఆ.

నెయ్యురాలు. ద్వ. విణ. (నెయ్యము+ఆలు.) స్నేహితురాలు.

నెర. దే. విణ. వృత్తియందునెరవుశబ్దమునకుమీఁది వర్ణములోపింపఁగా మిగిలినరూపము. "నెరవిల్కాఁడవునీవెరామ." రామా. ౭, ఆ.

నెరడు. దే. విణ. గొగ్గి, విషమము. (ఆచోటునెరడుగానున్నది.)

నెరపు. దే. ప్రే. (నెరయఁజేయు.) 1. నించు; 2. నెఱవేర్చు; "వ. అట్టివసంతసమయంబునంబురందరాదేశంబునెరపంబూని చనుదెంచినవనజలోచనలు." లక్ష్మీ. ౨, ఆ.—3. పఱపు; "విక్రయార్థమైనెరపినమౌక్తికంబులన." భల్లా. ౫, ఆ.—4. వ్యాపింపఁజేయు. (చూ. నెఱపు.)—వి. వ్యాపనము. "క. తోరపునెరపుల్, దులకించునాటతిమిచే." య. ౪, ఆ.—విణ. అధికము. "ఆలాపముల్నెరపయ్యెన్." ఉ, హరి. ౫, ఆ.

నెరయిక. దే. వి. నెరయుట. (చూ. నెరయు.)

నెరయు. దే. అ. క్రి. 1. నిండు; "క. తరళనయనాబ్జదళములు, నెరయఁగఁబై మున్ను చల్లిన్నృపసుతుఁబూజించిరి." భార. ఆది. 3, ఆ.—2. నెఱవేఱు, (చూ. నెఱపు.)—3. వ్యాపించు. "మ. ధరణీమండలినెందుఁజూంబరఁగి పాతాళంబునంబ ర్వ్వని, ర్జరనాథప్రముఖామరాఖిలనివాసశ్రేణులందోలిమై, నెరసెన్." లక్ష్మీ. 3, ఆ.

నెరవంజి. దే. వి. ఒకానొకచెట్టు. (దీనిని వైద్యనిఘంటువులయందు నెరవెందయని వాడుచున్నారు.)

నెరవు. దే. వి. 1. పూర్తి; 2. వ్యాపనము; "క. తరువౌకటిపెటికిలాంగల, ధరుఁ డుద్ధతిఁ బూఁచి హయరథద్విపసుభటో, త్కరముల్రమ్మగ్గింపఁగ న, న్నెరవులు విచ్చుటయుఁ మేదినీధరుఁ డలరెన్." హరి. ఉ. 3, ఆ.—3. మార్గము; "ద్వి. ఆ నెరవునుమీఁఅహంసములరుగు, నాపైనిగారుడంబైనమార్గంబు." రా. కిష్కిం, కాం.—4. ఒకానొకచెట్టు. విణ. 1. పూర్ణము; 2. అధికము; 3. యుక్తము; 4. విశాలము; 5. వ్యాపకము; "నెరవతఁడుండనున్వలయునిండుక." ఆము. ౪, ఆ.—6. వ్యాప్తము. "మహాస్రగ్ధర. తరుణీదామోదరీయోదరకుహరదరీస్థానమీవిశ్వధాత్రీ, శ్వరుకీర్తుల్ ముంచిపాఱంజటులగతిజగజ్జాలముల్ దేలియాడన్, మురజిన్నాభిప్రణాళీముఖమున ధవళాంభోజమన్ పేరుగాఁదా, నెరవైతత్పారమంతర్నిబిడమయి బహిర్నిర్గమంబున్భజించెన్." నై. ౫, ఆ. (చూ. నెఱవు.) (వృత్తియందు అంత్యవర్ణలోపము. చూ. నెర.)

నెరవెంద. దే. వి. తీక్ష్ణగంధము?.

నెరసు. దే. వి. 1. తప్పు; "చ. సుకవులసూక్తులందుసరసుల్ నెరసుల్ వెదకంగఁబోరు." అని. ౧, ఆ.—2. కళంకము; "సీ. నిండారుచందురునెరసుతక్కువపడఁ దిలకించుముద్దుమోములబెడంగు." హరి. ౭, ఆ.—3. దోషము; "మ. అతనిన్ వీక్షించియాచూడ్కియే, నెరసుంబొందకయుండవచ్చిమముఁదానెమ్మిన్ మహాభాగ్యసుం, దరుఁడక్రూరుఁడుచూచుఁగాత." హరి. పూ. ౮, ఆ.—4. నలుసు; "గీ. అనిమిషులగుండెలోగాలమఖిలలోక, నేత్రములనాటివేధించునెరసుగాలి, కాలిసుల్లు కుభృత్పాళిపాలిపిడుగు, రావణుఁడుడిందెభువనముల్ రక్తిఁజెందె." ఉ. రా. ౧, ఆ.—5. గవుండ్లవాఁడుకత్తులునూఱెడుపాడి.

నెరి. దే. వి. వక్రత. "సీ. మొలకచీఁకటిజలజలరాల్పఁగారాదె నెరులుమించినవీరికురులయందు." పాండు. ౧, ఆ.

నెరుము. దే. స. క్రి. రాచు. "ద్వి. నెఁమిడాకాలఁ బెండేరంబుఁబెట్టి." సా. ౨, భా.

నెఱ. దే. విణ. వృత్తియందునెఱవుశబ్దమునకు మీఁదివర్ణములోపింపఁగా మిగిలినరూపము. (నెఱగాణ, నెఱజాణ, నెఱజోదు, నెఱతనము, నెఱవడి. మొ.) ["క. కరువలికొమరుఁడుముదిమ, బ్బ

రమందుచుఁగల్లతపనిపజ్జకుఁజనినన్, గరమరుదందుచువాఁడున్, వెరవొప్పఁగఁ గొమ్మమెకపునెఱికిట్లనియెన్." (అని యీగ్రంథకర్తప్రయోగించినాఁడు. ఇతఁడుతప్ప దీని నిట్లు భిన్నముగాఁబ్రయోగించినవారులేరు.) అచ్చ. యు, కాం.] (రూ. నెఱా, నేఱా.)

**నెఱఁకు.** దే. వి. నెఱనుయొక్క రూపాంతరము. (ఇది తఱచుగా బహువచనాంతమయినప్పుడేకుజంతముగా కానఁబడుచున్నది.)

**నెఱక.** దే. వి. వెండ్రుక, కేశము.

**నెఱకాఁడు.** దే. విశే. (నెఱవు+కాఁడు.) పూర్ణుఁడు.

**నెఱను.** దే. వి. 1. మర్మము; "క. మఱచితిగాకల తాంగీ, కఱకంఠునితోడనాడు కాత్యాయనినీ, నెఱనెఱిఁగినాడచెప్పిన, తెఱఁగిదెసమకూరెనింకదిగులేమిటికిన్. ఉ, హరి. ౫, ఆ.—2. జీవస్థానము. (చూ. దట్టము.)

**నెఱపు.** దే. ప్రే. (నెఱయఁజేయు.) 1. నించు; "నిండుమనంబుతో నెఱపుము చెలిమి." అభిమన్యుద్విపద.—2. నెఱవేర్చు; "గీ. ప్రతిననెఱపుమవశ్యంబుపౌత్రునోసఁగి." మార్క. ౮, ఆ.—3. పఱపు; 4. వ్యాపింపఁజేయు. "కమ్మజవ్వాదివలపునెఱపెడిసురఁటీలగఱులగాడ్పులుసోఁకి." శశాం. 3, ఆ.—వి. వ్యాపనము. విశే. అధికము. (చూ. నెరపు.)

**నెఱయు.** దే. అ. క్రి. 1. నిండు; 2. నెఱవేఱు; (చూ. నెఱపు.) 3. వ్యాపించు. "ద్వి. పొండన్న సగరులుభుజశక్తిమెఱసి, నెఱసిబ్రహ్మాండంబునిండగర్జించి." రా. బాల, కాం.

**నెఱవాది.** దే. విశే. (నెఱవు+ఆది.) నేర్పరి. "క. అఱువదినాలుగువిద్యలు, నఱువదినాలుగుదినంబులంతనవారల్, నెఱవాదులైనకతమున, నెఱినొక్కకనాటివినికినేర్చిరిలేశా." భాగ. ౧౦, స్కం. పూ.

**నెఱవిద్దె.** ద్వ. వి. (నెఱవు+విద్దె.) హస్తలాఘవముగల జాలవిద్య.

**నెఱవు.** దే. వి. 1. పూర్తి; "ద్వి. నెఱవారనందఱసిర్జించె." రా. యు, కాం.—2. వ్యాపనము; 3. మార్గము. విశే. 1. పూర్ణము; "ద్వి. కఱకైనయాకుంభకర్ణునియందు, నెఱవైనకడిమికినిలువకళవులు." రా. యు, కాం.—2. అధికము; "గీ. పుడమియెల్లతోఁడఁదొడరనీలావేమి, ఖరునికంటెనల్లగట్లనూడు. కొడుకుకంటెగండ్రగొడ్డలితాలువు, నేలవేల్పుకంటెనెఱవెచెప్పుమ." అచ్చ. యు, కాం.—3. యుక్తము; "వ. అందునందునవేఁటకునెఱవైనవానినేర్పరించితెచ్చుటకునను చరులనీవునీవనినియమించి." స్వా. ౪, ఆ.—4. విశాలము; "క. ముఱిముఱిచీఁకటిలోనం దఱురాజులుసమరముడిగితగనెల్లిటికిన్, గొఱగలకలనగునడువుఁడు, నెఱవగుగోవర్ధనాద్రినేలకునుచున్." ఉ, హరి. ౪, ఆ.—5. వ్యాపకము, 6. వ్యాప్తము. (చూ. నెరవు.)

**నెఱవేఱు.** దే. అ. క్రి. ముగియు, సిద్ధించు

**నెఱసరి.** ద్వ. విశే. శూరుఁడు. "క. చఱినుండితొలఁగనుఱికెడు, నెఱసరిసింగంబుఁబోలెనిబ్బరముగఁగ్రే, ళ్లుఱికెందొలఁగన్ బగతుని, యఱకటనుండిభువిమీఁదికబ్బలియుండున్." హరి. పూ. ౬, ఆ.

**నెఱా.** దే. విశే. నెఱయొక్క రూపాంతరము. "నెఱాతెలి." అల్లసానిపెద్దనగారివృత్తమాలిక.

**నెఱి.** దే. వి. 1. అందము; "క. వసివాళ్లువాడియప్పుడు, వసంతసమయంపుటెండ వలనన్ నెఱివోఁ, గసుగందులుకందిననవ, కుసుమలతికవోలెమిగులఁగోమలియొప్పెన్." కళా. ౪, ఆ.—2. ఆచారము; "క. ఈనెఱిఁగైకొనిశూద్రుం, డైనను గ్రమవృత్తినవ్యయంబగుపదమున్, గానఁగఁబడయుటకల్గును, వానికినియమములత్రోవలవకయునికిన్." భార. అను. 3, ఆ.—3. వస్త్రపుకుచ్చె; "సీ. నెఱి పెట్టికట్టిననిండుచెంగావిపైఁగాంచికాఘంటికల్ కళవళింప." పాంచా. ౨, ఆ.—4. క్రమము; "క. నెఱిదప్పంబడిపెల్లుగ, నొఱలెడినరవాజికరులయులివభిమన్యుం, డఱిముఱిఁబడుటకువగమదిఁ, బఱిగొననిలపెలుచనఱచుభంగిఁజెలంగెన్." భార. ద్రో. ౨, ఆ.—5. పక్షియీఁకలచిక్కు; "సీ. అలఁతఁజీఱినయీఁకలనెఱిఁదీర్చుజక్కవలుచెందొవలకేఁకటయొనర్ప." భార. ఉద్యో. ౨, ఆ.—6. న్యాయము; "గీ. నీకువిరలఁదేర్చుటనెఱియకాదె." భార. ఉద్యో. 3, ఆ.—7. పరాక్రమము; "క. నెఱినఱకవైరివీరుల, నెఱఁకులుతూఱంగనేయునృపపుంగవునం, పఱకోర్వకపిఱుదఁజనిరి, వెఱచివిపణ్ణులయిసకలవిషయాధిపతుల్." భార. ఆది. ౪, ఆ.—8. పూర్తి; "మీఁదఁబురోచనుకృతినె

త్రి నేర్పడునంతకును." భార. ఆది. ౭, ఆ.—
9. అక్కు; "ఎ, గీ. కఱికి నెఱి నెఱిఁగో లెమ్ముకయు
నవిఱుఁగ, విఱిచె." స్వా. ౪, ఆ.—10. వక్రత;
"ఎ, గీ. ఇంతికచములు నెఱిగలయింద్రశిలలు."
చంద్ర.—11. విధము; "మీరి నెఱికిన్ సహాయ
పడుటీప్సితమేనిగడంగుఁడు." హరి. ఉ. 3, ఆ.—
12. ప్రజ్ఞ; "వ. ఆనక్కాలుపరంబులుద్రవ్యం
గఱచిన నెఱిదప్పి యయ్యస్త్రంబు నిర్గతప్రాణం
బయ్యె." భార. శాం. 3, ఆ.—13. బ. వెండ్రు
కలు; "ఎ, గీ. నెఱులు నేర్పునఁదడియార్చి నెలఁ
తయోర్తు" య. ౪, ఆ.—14. చుట్ట వెండ్రుకలు.
"సీ. నెఱులనున్న నికప్పు తుఱుఁగలిగొనఁగూడి
పొదలు వెండ్రుకలు కొప్పునకు నెయిద." హరి.
పూ. ౭, ఆ.—విశే. వక్రము. "నెఱులైయొప్పు
వినీలకేశములు." హరి. పూ. ౫, ఆ.

నెఱిక. దే. వి. 1. వస్త్రపుకుచ్చె; "సీ. బంగారుస
రిగలపట్టంచువలిపంపు నెఱిక మీఁగాళ్లపైనొఱ
సియాడ." సురా.—2. పైఁటపానడ. "సీ. అచ్చ
వెన్నెలచాయనవఘళింపఁగఁజాలు నిద్దంపు వెలిప
ట్టు నెఱికగట్టి." సై. ౭, ఆ.

నెఱిపడు. ద్వ. అ. క్రి. అగు, సిద్ధించే. "క. కాని
యటులుండి నెఱిపడు, నైన తెఱఁగుదోఁచిమాయ
మగు." భార. శాం. 3, ఆ.

నెఱియ. దే. వి. 1. చీలిక; 2. నేలపగులు.

నెఱె. దే. వి. నెఱియయొక్క రూపాంతరము.

నెఱ్ఱియ. దే వి. ——పై.——

నెఱ్ఱె. దే. వి. నెఱ్ఱియయొక్క రూపాంతరము.

నెల. దే. వి. 1. మాసము; (బహువచనమునందు నె
ల్లు అని యొకానొకకవి ప్రయోగించినాఁడు. "నా
తికిఁదొమ్మిది నెల్లు నిండఁగన్." య. ౫, ఆ.)—
2. చంద్రుఁడు; "క. నెలలన్నియు నిండఁగన, న్నె
లఁతకు జనియించె నిండు నెలపున్నమకున్, నెల
కొనియుదయించుపగిది, నెలమిఁగొడుకు సకలకు
వలయేచ్ఛాకరుఁడై." హరి. పూ. ౫, ఆ.—
3. పున్నమ; "సీ. నెఱచందురుని కాంతి నెవ్వేము
సృజియించియకలంకవిలసనంబలవరించి." షో.
౭, ఆ.—4. స్థానము; "క. అనిపలుకుకలశభవ
ముఖ, మునిజనములప్రశ్నవాక్యములువినిపుర
భి, త్తనయుఁడంత త్రివిధమునొ, క్క నెలనుగుమి
గూడియునికి గనఁజాలమికిన్." (చూ. ముందు
పద్యము.) పాండు. ౧, ఆ.—5. కర్పూరము;
(చూ. నెలవత్తి.) 6. ఆఁడుదానిశిరోభూషావిశే
షము.

నెలఁత. దే. వి. ఆఁడుది, వెలఁది, వనిత.

నెలఁతుక. దే. వి. (నెలఁత+ఉక.)——పై.——
(స్వార్థమున ఉక.)

నెలకట్టు. దే. వి. రాతికట్టడపు నేల, కుట్టిమము.
"సీ. అడుగులనునుఁగాంతినయ్యెడపద్మరాగంబు
ల నెలకట్టుకరణినొప్ప" భార. విరా. ౪, ఆ.

నెలకువ. దే. వి. స్థానము. "క. విననురావణుఁడఁ
టరిపుఁ, డా నెలకువఁ జొచ్చి పొదివితఁటకయ్య
మునన్, జేసెత్తురుగాకుండఁగ, వానింజంపితఁట
తగ దెవర్ణనసేయన్." నిర్వ. ౨, ఆ. (ఇది పొలఁ
కువవంటిదని తోఁచెడి.)

నెలకూన. ద్వ వి. 1. బాలచంద్రుఁడు; 2. నఖత్ర
తము. వసు. ౭, ఆ.

నెలకొను. దే. అ. క్రి. నెలవుకొనుయొక్క రూ
పాంతరము. (నిలుకడయగుటకు.—"క. మర్త్యు
లకే కాంతికవృత్తిని, నెలకొనఁగా నెట్లువచ్చు."
భార, శాం. ౭, ఆ.—నిలుచుండుటకు.—"గీ
నేరుపున నిట్టులుద్దుల నేఱుపఱచి, రామకృష్ణా
దులొకట శ్రీదామముఖ్య, లొకట నెలకొని."
దశావతారచరిత్రము. ౯, ఆ.)

నెలగ. దే. వి. ధనము. "క. కలిమికినిదగిన కొలఁ
దిని, నెలగల వెలివిడువకున్న నిలుపెక్కడిదా,
కలయఁగనిండిన చెఱువున, కలుఁగించుకవిడువ
కున్న నాఁగనిభంగిన్." ద్వా. ౨, ఆ.

నెలచూలి. దే. వి. బుధుఁడు, సౌమ్యుఁడు.

నెలతాలుపు. దే. వి. శివుఁడు, చంద్రశేఖరుఁడు.
(రూ. నెలతాల్పు. "సీ. నెలతాల్పు దేవరయలి
గిపఁబనిగాదు వెండిగుబ్బలిఁదేకయుండనిండు."
య. 3, ఆ.) (ఇట్లు జాబిలితాలుపు. పెం.)

నెలత్రావడము. దే. వి. చకోరపక్షి. "తరుణిచూ
పులు నెలత్రావడంబులఁ బ్రోచు." హన. ౪, ఆ.

నెలపట్టి. దే. వి. బుధుఁడు, సౌమ్యుఁడు.

నెలపాలు. దే. వి. చంద్రకళ, నెలవీసము.

నెలపులుఁగు. దే. వి. చకోరపక్షి. (రూ. నెలపుల్గు.
"వాకట్టు నెలపుల్గుమూఁకకు." చంద్ర.)

నెలమేపరి. దే. వి. రాహువు, విధుంతుదుఁడు.

నెలఱాయి. దే. వి. చంద్రకాంతపుశిల. "సి. [illegible]
ఱాతిచాలు నిగ్గులలో నిమిస్నేటి రా[illegible]
లయారభటివలన." రామా. ౧, [illegible] (రూ. [illegible]

జా. "నెలజాచొక్కపుమేడలోన." చంద్రా. ౨, ఆ.) (ఇట్లు నెలచేట్టు, నెలచేలువ. మొ.)

నెలవంక. ద్వ. వి. 1. బాలచంద్రుఁడు; 2. నఖక్షతము. "సీ. బింకంపుసానులవంకరాపడి నెలవంక పైఁబూనినవానిమాని." వసు. ౧, ఆ.

నెలవంకకోల. ద్వ. వి. అర్ధచంద్రబాణము. "నెలవంకకోలలఁద్రుంచివైచి." రా. యు, కాం.

నెలవత్తి. ద్వ. వి. పచ్చకప్పురపుపలుకు. "సీ. మంచివాసనలవాసించిన నెలవత్తి బాగాలురాకులు వడఁగఁబోసి." కళా. ౭, ఆ.

నెలవరి. దే. విశే. నెళవరియొక్క రూపాంతరము. "క. తలవరులుఁ నెలవరులుఁ, బొలపరులుఁ వచ్చి." సా. 3, ఆ.

నెలవీసము. దే. వి. చంద్రకళ, నెలపాలు.

నెలవు. దే. వి. 1. వాసస్థానము; "వానినెలవుగంటి." భో. ౫, ఆ.—2. స్థానము; "ఈనెలవును బృందారకాధీనము." భార. స్వ. ౧, ఆ.—3. పరిచయము.

నెలవుకొను. దే. అ. క్రి. 1. నిలుకడయగు; 2. నిలుచుండు. (చూ. నెలకొను.)

నెలవెలుఁగు. దే. వి. వెన్నెల, చంద్రిక.

నెల్లి. దే. వి. ఒకదినుసు కూరాకుచెట్టు, అగ్నిమంథము.

నెవడు. దే. అ. క్రి. వి. నెగడుయొక్క రూపాంతరము. (బయలుమెఱయుటకు.—"గీ. కువలయప్రీతికాముఁడై నెవడురాజు, గాఢరూఢప్రసన్నతఁ గానితిరుగ, సాధుబుద్ధివికావైతిళంబరారి, వేమునకుఁబోయుపాలయ్యె వృద్ధసేవ." పంచ. వేం. ౪, ఆ.)

నెవము. వై. వి. నెపముయొక్క రూపాంతరము. (కారణమునకు. — "గీ. చివురుఁగెమ్మోవి చిఱుగాటు నెవముగాఁగఁ, దామరస నేత్రకోపింపఁదగదుమమ్ము." నై. ౮, ఆ.)

నెవయు. దే. అ. క్రి. నెగయుయొక్క రూపాంతరము. (ఎగురుటకు. — "క. అవమానదుఃఖితుండయి, పొవయుచుఁగోపానలంబుపొడమి వెలుంగఁగ, బవనసఖుఁడగ్నికణములు, నెవయఁగఁదవపొడవునూ పెనివధుని మ్రోలన్." భార. సభా. ౧, ఆ.)

నెవిలి. దే. వి. నెమిలియొక్క రూపాంతరము. (అప్ర.)

నెవులు. దే. వి. నెగులుయొక్క రూపాంతరము.

నెవ్వ. దే. వి. 1. దారిద్ర్యము; "పర్షంపు నెవ్వన్." ఆము. ౪, ఆ.—2. ఆపద; "శా. నిన్నుంబొమ్మను వేళ నేమనిరిమా నెవ్వల్ విచారింతురే." భాగ. ౧౦, స్కం. పూ.—3. వఱపు, వగ్రహము. "సీ. వానలు లేక నెవ్వను బైరులన్ని యువాడఁదొడంగిన నోడిపజలు." అచ్చ. బాల, కాం.

నెళవరి. దే. విశే. 1. పరిచయముగలవాఁడు; 2. మర్మము నెఱిఁగినవాఁడు.

నెళవు. దే. వి. 1. పరిచయము; 2. మర్మము.

నెళినెళి. దే. వి. విఱుగుటయందగుధ్వన్యనుకరణము. "ద్వి. నిజరథంబంతయు నెళినెళివిఱుగ." రా. యు, కాం.

## నే.

నే. దే. స. నాశబ్దప్రథమైకవచనమునకు సరళస్థిరవర్ణములు పరములగుచో ద్రుతము లోపించినరూపము (నేగలిచితిని, నేవింటిని. మొ.)—వై. వి. నేయియొక్క రూపాంతరము. "ప్రజ్వలితాత్యుగ్రదవాగ్ని నేమిడిచినంజల్లారునే." ఉ. రా. ౨, ఆ.

నేఁజెల్ల. దే. అవ్య. (నేను+చెల్లె) సంతాపమును దెలుపును. "గీ. అకట నేఁజెల్ల నేఁజెల్ల హాకుమార, హాతనూభవ హావత్స యనుచు నార్తిఁ, దల్లియును దండ్రియును వచ్చి తనుఁ జూచి బోదివిరి." హరి. పూ. ౫, ఆ.

నేఁడు. దే. వి. ఈదినము.

నేఁత. దే. వి. 1. నేయుట, వయనము; 2. బ. సన్నబారచాఁపులు. కవిక. 3, ఆ.

నేఁతకాఁడు. దే. వి. నేఁత నేయువాఁడు, తంతువాయుఁడు.

నేఁతపలక. దే. వి. నేఁతకాఁడు నేయునపుడు పడుగు పేకలను ఉగ్గించునట్టిపలక.

నేఁతపురుగు. ద్వ. వి. సాలెపురుగు, తంతువాయము.

నేఁతరి. దే. వి. (నేఁత+అరి.) నేఁతకాఁడు.

నేజె. దే. వి. చిల్లకోల. "సీ. అనుఁగుఁజొట్టంబైనయలవసంతునిరాకవిరవాజిబలు నేజవిఱుగఁజూచి." చంద్రా. 3, ఆ. (రూ. నేజము. "క. నేజముగొనియిప్పొటున, నేజమునింజేర్తునను చునిశిచరవీరుల్, జేజేలిడసాహసమున, జేజేలగజంబు కుంభసీమంగ్రుమ్మెన్." కళాం. ౫, ఆ.)

నేజా. దే. వి. నేజెయొక్క రూపాంతరము. "కల్వ మొగ్గ నేజానటుచిమ్మి." భాను. 3, ఆ.

నేటించు. దే. అ. క్రి. దృఢపడు. "ఆ. నిన్ను సన్నుతించి నేటించి మ్రొక్కెడు, హరిము రారిశౌరియ వధరింపు." భద్రరాజపుత్రచరిత్రము. 3, ఆ.

నేటు. దే. వి. నిశ్చయము. "ద్వి. నేటుగానీకల్లనిజములు రెండుఁ, దేటగానిప్పుడు తెలుపకయున్న." సా. ౭, భా.—విశ. దృఢము. "ఎ, గీ. మహోదరుతోడ నేటుగ సుషేణుఁ, డునువిరూపాక్షుతోడరామునియనుంగుఁ, దోడఁబుట్టువు నేర్తెఱఁ దొడరి." అచ్చ. యు, కాం.

నేటుకొను. దే. అ. క్రి. నేటించు. (చూ. గోటాపన.)

నేటుసేయు. ద్వ. స. క్రి. (నేటు+చేయు.) నిశ్చయపఱచు. "ద్వి. పాటితప్పితివిపమోపాపపుణ్యముల, నేటుసేయఁగలేక." సా. ౭, భా. (చూ. ఓటుసేయు.)

నేత. సం. విశ. (ఋ. ఈ. ఋ.) ప్రభువు, ఏలిక.

నేతిబీఱ. ద్వ. వి. (నేయి+బీఱ.) ఒకదినుసుబీఱ, ఘృతకోశాతకి.

నేత్రము. సం. వి. అ. న. 1. కన్ను; 2. తంత్రాడు; 3. ఏఱు; 4. వలిపము; 5. తేరు; 6. వేరు. విశ. డు. ఒడయఁడు.

నేదిష్ఠము. సం. విశ. (అ.ఆ.అ.) మిక్కిలిసమీపము.

నేను. దే. స. నాశబ్దమునకు ప్రథమైకవచనము.

నేపథ్యము. సం. వి. అ. న. 1. వస్త్రాద్యలంకారము; 2. నాట్యస్థానము (కొన్ని నిఘంటువులయందీ పాఠము.)

నేపాళము. ఉభ. వై. వి. వృక్షవిశేషము. సం. వి. అ. పుం. 1. దేశవిశేషము; 2. ఇక్షువిశేషము.

నేపాళిక. సం. వి. ఆ. స్త్రీ. నేపాళపుచెట్టు.

నేబు. దే. వి. పండ్రెండు కాసులనాణెము.

నేమకము. వై. వి. నేమము, నియమము.

నేమము. ఉభ. వై. వి. నియమము. "ఉ. గట్టిగనిశ్చయించెనా, భామలజట్టియిచ్చి తనపట్టినయట్టికడింది నేమముల్, దామదిఁగొన్నినా ళ్లవిహతంబుగనిల్పికొనన్ మనంబులోన్." కళా. ౬, ఆ. —సం. అ. పుం. 1. కాలము; 2. మేర; 3. ఖండము; 4. ప్రాకారము; 5. కపటము.

నేమి. సం. వి. ఇ. స్త్రీ. 1. బండికంటికడకమ్మి; 2. గిలక. పుం. తినాసము.

నేమించు. వై. స. క్రి. నియమించు. "ఎ, గీ. మతియుఁగడుఁబేరుగలిగినమలలునరసి, యున్నతావులఁగదలింపకునిచిరండు, మీరలంచును బిలిచి నేమించిపనుప." యు. 3, ఆ.

నేము. దే. స. క్రి. ధాన్యము చేటలోఁ బోసికొని యిటునటుఁద్రిప్పు. స. నాశబ్దప్రథమాబహువచనమునకు రూపాంతరము.

నేయము. వై. వి. 1. స్నేహము; (నెయ్యమునకు మొదటిరూపము. చూ. నెమ్మిక.)—2. న్యాయము. "నేయముగాదుపద్దంటే నిలిచేది మేరగాదు." క్షేత్రయ.

నేయి. వై. వి. నెయ్యికి మొదటిరూపము. (తైలమునకు.—"క. నేయిపాలఁ బడినదీవియ, మాయుకరణిఁగర్మసిద్ధిమలిగినహీన, త్వాయత్తంబైతానును, మాయును దైవానుకూల్యమహిమమహీశా." భార. అను. ౧, ఆ.)

నేయు. దే. స. క్రి. 1. నేఁతచేయు; 2. చాఁపలఁలో నగువానిని అల్లు.

నేరఁబోతు. దే. విశ. (నేరమి+పోతు.) తెలియనివాఁడు, అనభిజ్ఞుఁడు.

నేరమి. దే. వి. 1. అజ్ఞానము; "క. ఏనెఱుఁగమినిట్లడిగితి, నా నేరమిసైఁపవలయు." భార. ఆర. ౫, ఆ.—2. దోషము. "సీ. పరులచేవిడువంగఁబడివిభుండు, కడఁగక విముఖుండుకాఁజనదని శుభక్షాత్రధర్మంబులోకంబులందు, నిలిపెఁదానిదిపతి నేరమియే." భార. సభా. ౨, ఆ.

నేరము. దే. వి. తప్పు, అపరాధము. "చ. మిమ్ము మును వేఁటలాడికడిమిన్ నొగిలించు మహాపరాధమున్, రమణినిశాతదీర్ఘతర రంగదపాంగములం జరించునే, రమునుసహించిచూపుఁడుకురంగములారలతాంగిచన్నమా, ర్గముశశిమౌళిమస్తకకరంబులుమీకువిహారధామముల్." రామా. ౫, ఆ.

నేరాజె. దే. విశ. సరిగతో నేసినది, జెరబాజె. (వస్త్రము.)

నేరిమి. దే. వి. నేరుపు, సామర్థ్యము.

నేరుచు. దే. అ. క్రి. ఓపు. స. క్రి. అభ్యసించు. (రూ. నేర్చు. ఓపుటకు. — "పలుకఁగ నేర్తుగదా." (చూ. తిలకించు.)

నేరుపరి. దే. విశ. (నేరుపు + అరి.) సామర్థ్యముకలవాఁడు, సమర్థుఁడు, (రూ. నేర్పరి.)

నేరుపు. దే. ప్రే. నేరుపజేయు. వి. సామర్థ్యము. (రూ. నేర్పు.)

నేరుపుకాఁడు. దే. విణ. నేర్పరి, (రూ. నేర్పుకాఁడు.)

నేరుపులాఁడు. దే. విణ. (నేరుపులు+ఆఁడు.) నేరుపుకాఁడు. "పెనుబొజ్జనిడ్డెనల్ నిసుచు నేరుపులాఁడు." అచ్చ. బాల, కాం.

నేరెడు. దే. వి. నేరేడుయొక్క రూపాంతరము. "ఉ. ఆరమణీయజంబువునయందనిశంబును భూరిసింధుర, స్ఫారఫలంబు లన్నగముపైఁబడి ప్రయ్యఁగఁదద్రసంబుసాం, పారమహాప్రవాహనదిరై దివిజాద్రిఁ బ్రదక్షిణించియ, న్నేరెడుమ్రాని మూలమున నెక్కొనియుండు జగత్ప్రశస్తమై." మార్క. 3, ఆ.

నేరేడు. దే. వి. జంబువు.

నేతా. దే. విణ నెతాయొక్క రూపాంతరము. "మ. రవిదీప్రద్యుతియంద్రు పావకుని నేతామంట మారంద్రువా, రివిధంబుల్ పెనుపంజుక్రిందిదివియల్ శేరాజనిన్నన్నచో, నవునాఁడావక తేజ మోర్వక చుమీయజ్ఞాతుఁడబ్ధిఁబడుఁ, భవనంబుల్ వడిఁజొచ్చునిచ్చశిఖి దీపశ్రేణిదంభంబునన్." చంద్ర.

నేల. దే. వి. 1. భూమి; "సీ. నేలనీరనలంబుగాలినభంబును నేనిటఁబొడవైనయీశరీరము." మార్క. 3, ఆ.—2. ప్రదేశము; "క. భక్తకోటులలో నే, లంద్రిమ్మరునాత్మపురవి, చంద్రవిలోచనవివేకచైతన్యనిధీ." ఉ, హరి. ౨, ఆ. (ఈ యుదాహరణమునకు ముందుభాగము త్రోవకడ వ్రాయఁబడియున్నది.) —3. దేశము. "ఆ. నేలప్రొద్దు తింగిచాలుమానిసిరణో, ద్యమమొనర్చుఁగాక." సం. "దేశకాలౌతుసం ప్రేక్ష్యయోద్ధవ్య మితి మేమతిః." భార. విరా. ౪, ఆ.

నేలఁగలుపు. దే. అ. క్రి. (నేలన్+కలుపు.) చంపు.

నేలకడిమి. ద్వ. వి. భూకదంబము.

నేలకలిగొట్టు. దే. వి. భూపాటలి.

నేలకుఁగోలకుఁదెచ్చు. దే. స. క్రి. క్రిందుమీఁదు చేయు.

నేలగుమ్మడి. దే. వి. భూమికర్కారువు.

నేలగుమ్ముడు. ద్వ. వి. విదారి. (ఇది ద్వివిధము.—తెల్ల నేలగుమ్ముడు, నల్ల నేలగుమ్ముడు అని. ఇదియె తెల్ల నేలగుమ్ముడు.)

నేలగొలిమిడి. దే. వి. గోలోమి.

నేలచూలి. దే. వి. సీత, భూమిజ. "ఆ. నేలచూలివెదకగాలిబిడ్డఁడులోను, గానుగలిగినట్టికడిఁదికొమ్మ, మెకపుగముల నమపు మించి యందతిశ్రోన, నవమఁడుప్పఁగడలియవలికరిగి." య. 3, ఆ.

నేలజెమ్మి. ద్వ. వి. పిన్న జెమ్మి, శమీరము.

నేలతంగెడు. దే. వి. చిన్నతంగెడు, ఆకుల్యము.

నేలతాడు. ద్వ. వి. తాళమూలిక.

నేలతామర. ద్వ. వి. మెట్టదామర, స్థలపద్మిని.

నేలతాలుపు. దే. వి 1. పర్వతము, భూధరము; "నేలతాలుపురాచచూలిగాదిలికందు." అచ్చ. బాల, కాం.—2. రాజు, భూధరుఁడు. "క. సరిక పుమానిసియనినీ, తలఁపునని పుడల్ల నేలతాలుపుమిన్నక, జాలుకగఁజూ చెదవతనిక, గెలువఁగసీవంటివారికినిదరమగు నే." అచ్చ. యు, కాం. (ఇట్లు పుడమితాలుపు, మన్నుతాలుపు. మొ.)

నేలతొలసి. ద్వ వి. భూతులసి.

నేలనమిలి. దే. వి. పక్షివిశేషము. "సీ. నేలనమిళ్లపై నేలఁపుడేగలవిడిచి యేపునఁబేఁచమడఁపఁజేసి." రసి. ౧, ఆ.

నేలనేరెడు. దే. వి. కాకినేరెడు, భూమిజంబుక.

నేలపట్టి. దే. వి. 1. అంగారకుఁడు, భౌముఁడు; 2. నరకాసురుఁడు; 3. సీత, భూపుత్రి.

నేలపల్లటీ. దే. వి. పారావతవిశేషము.

నేలపొన్న. ద్వ. వి. కోలపొన్న, అంఘ్రిపర్ణి.

నేలమాలె. ద్వ. వి. భూమిలోపలియిల్లు. "వ. బహుశ్రుతుండు నేలమాలెనున్నట్టికాలవేది పాలికింజనుదెంచి." విక్ర. 3, ఆ. (మొదటిరూపము నేలమాలియ.)

నేలములక. దే. వి. వాఁకుడు, వార్తాకి.

నేలయుసిరిక. దే. వి. (నేల+ఉసిరిక.) భూమ్యామలకి.

నేలరేగు. దే. వి. భూబదరి.

నేలఱేఁడు. దే. వి. రాజు, భూపతి. "తే. మీనలోచనయనుమాటమిథ్యగాక, యుండునట్లుగనొక్కచేదండయాన, దండదీయక నిలిచియుద్దండలీల, తెప్పవేయకయన్నేల ఱేనిఁజూచె." రసి. ౧, ఆ.

నేలవేము. దే. వి. భూనింబము.

నేలవేలుపు. దే. వి. బ్రాహ్మణుఁడు, భూదేవుఁడు. "ఎ, గీ. నేలవేలుపు మేలిటి సేమములకు, నెలవు." య. 3, ఆ.

నేలసంపెఁగ. ద్వ. వి. భూమిచంపకము౹.

నేలా(పు. దే. వి. (నేల+ఆ(పు.) శ్యేనవిశేషము. (చూ. నేలనమిలి.)

నేవడము. దే. వి. నేవళమునకు మొదటిరూపము.

నేవము. వై. వి. సెవముయొక్క రూపాంతరము.

నేవళము. దే.వి. మణులుగ్రుచ్చినహారము. "సీ. మొలనూలునొడ్డాణమును నేవళంబుఁ బుంజాలదండయుబన్నసరము మొగపు, తీఁగయు." కళా. ౭, ఆ.

నేస్తకత్తె. వై. విశే. (నేస్తము + కత్తె.) స్నేహితురాలు. (మొదటిరూపము నేస్తకత్తియ.)

నేస్తకాఁడు. వై. విశే. (నేస్తము+కాఁడు.) స్నేహితుఁడు. "తే. కటికిచీఁకటినెఱనేస్తకాఁడుఁబోలె, ధృతియొసంగఁగదానిమందిరముఁజేరి." శుక. ౨, ఆ.

నేస్తము. వై. వి. మైత్రి, చెలిమి, స్నేహము.

నేస్తురాలు. ద్వ. విశే (నేస్తము+ఆలు.) స్నేహితురాలు.

నేహరము. దే. వి. నేవళముయొక్క రూపాంతరము. "ద్వి. లోహజితంబులైలోలతమించు, నేహరంబులుగొన్నినీలాలనమర." హరిశ్చ. ౨, భా. (దీనికి గ్రంథాంతరమందు ప్రయోగము కనఁబడదు.)

## నై.

నైకభేదము. సం. విశే. (అ. ఆ. అ) అనేకభేదములుకలది.

నైగనిగ్యము. సం. వి. అ. న. నిగనిగలాడుట.

నైగమము. సం. వి. అ. న. వేదాంతము. విశే. పట్టణముది.

నైగముఁడు. సం. వి. అ. పుం. 1. సాగరుఁడు; 2. వణిజుఁడు.

నైచికము సం. వి. అ. న ఆవుయొక్క శిరఃప్రదేశము.

నైచికి. సం. వి. ఈ. స్త్రీ. చక్కనిరూపమును మంచిప్రాయమునుగలిగిసమృద్ధిగపాలిచ్చెడియావు.

నైచ్యము. సం. వి. అ. న. (భక్త్యాదులచేఁగలుగు) అధమభావము.

నైజము. సం. విశే. (అ. ఈ. అ.) 1. తనది; 2. స్వాభావికము.

నైపథ్యము. సం. వి. అ. న. 1. వస్త్రాద్యలంకారము; 2. నాట్యస్థానము.

నైపుణము. సం. వి. అ. న. నేర్పరితనము, నిపుణత్వము.

నైపుణి. సం. వి. ఈ. స్త్రీ. ——పై.——

నైపుణ్యము. సం. వి. అ. న ——పై.——

నైమిత్తికము. సం. విశే. (అ. ఈ. అ.) నిమిత్తమువలనఁగలిగినది.

నైమేయము. సం. వి. అ. పుం. సరకులమార్పు, నిమయము.

నైయగ్రోధము. సం. వి. అ. న. మఱ్ఱిపండు.

నైయాయికుఁడు. సం. వి. అ. పుం. న్యాయశాస్త్రము తెలిసినవాఁడు.

నైరాశ్యము. సం. వి. అ. న. ఆశలేనితనము.

నైరృతి. సం. వి. ఇ స్త్రీ. పెద్దమ్మ. పుం. నైరృతుఁడు.

నైరృతుఁడు. సం. వి. అ. పుం. చతుర్థదిక్పాలకుఁడు, మూలఱేఁడు.

నైర్ఘృణ్యము. సం. వి అ. న. దయలేనితనము, నిర్ఘృణత్వము.

నైర్మల్యము. సం. వి. అ. న. నిర్మలత, నిర్మలత్వము.

నైల్యము. సం. వి. అ. న. నల్లఁదనము, నీలత్వము.

నైవేద్యము. సం. వి. అ న. నివేదింపఁదగినవస్తువు.

నైష్కికుఁడు. సం. వి. అ. పుం. టంకసాలకధికారి.

నైష్ఠికుఁడు. సం. విశే. (అ ఈ.అ.) నిష్ఠగలవాఁడు.

నైష్ఠుర్యము. సం. వి. అ. న. నిష్ఠురత, నిష్ఠురత్వము.

నైసర్గికము. సం. విశే. (అ.ఈ.అ.) స్వాభావికము.

నైస్త్రింశికుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) కత్తియుద్ధముగాఁగలవాఁడు.

నైస్పృహ్యము. సం. వి. అ. న. ఇచ్ఛలేనితనము, నిస్పృహత, నిస్పృహత్వము.

## నొ.

నొంచు. దే. ప్రే. నొవ్వఁజేయు. "ఎ, గీ. ధర్మనందనుండు, నొంచెనిశితవిశిఖపంచకమ్మునవమ్మ, హీకుమరముదర్పమెసకమెసఁగ." భార. కర్ణ. ౧, ఆ.

నొక్కము. దే. వి. పెద్దసదాప, శతావ్హయ౹.

నొక్కు. దే. స. క్రి. అదుము. వి. 1. అదుముడువలనఁగలిగినపల్లము; 2. ముడుత. "ప్రిదిలికైరవదళశ్రేణినొక్కులుదీర్చె." స్వా. 3, ఆ.

నొక్కుడు. దే. వి. నొక్కు. "సీ. తలిరుపైఁగెంపులుదాఁచినచందాన మునిపండ్లనొక్కుల్ల మోవులలర." య. ౫, ఆ.

నొగ. దే.వి. కాఁడిమానికి ఆధారమైబండిలోనముసాని మొదటనుండెడు నిడుపాటిమ్రాను, కూబరము.

**నొగులు.** దే. అ. క్రి. 1. ఎడలు, వికలమగు; "వ. వీఁపులుపగిలియుమూఁపులునొగిలియు." ఉ, హరి. 3, ఆ.—2. నొచ్చు. వి. 1. వికలమగుట; 2. నొప్పి. "క. తనువునొగిలించుకంటెను, మనమునొగుల్చుటయెహింసమదిఁబరికింపఁ, దనువునొగులపుడతీఱును, మనము నొగులుమనినదనుకమానదుసమ్మీ."

**నొగులుచే.** దే. ప్రే. (నొగులఁజేయు.) 1. ఎడలించు; 2. నొప్పించు. (చూ. నొగుల్చు. ఎడలించుటకు.—"తేరుపదిబాణములనొగిల్చె." ఉ, హరి. 3, ఆ.—నొప్పించుటకు.—"భోజవరుఁ రెంటనొగిల్చిన." జై. ౭, ఆ.)

**నొచ్చిల్లు.** దే. వి. బ. చొంగ.

**నొచ్చు.** దే. అ. క్రి. 1 నొప్పిఁజెందు; (నాకుకాలునొచ్చుచున్నది.)—2. దారిద్ర్యాదులచేపీడనొందు. (వాఁడిప్పుడు మిక్కిలి నొచ్చియున్నాఁడు.)

**నొచ్చుకొను.** దే. అ. క్రి. పశ్చాత్తాపపడు. (వాఁడు మాటమీఱిచెప్పినాఁడుగాని అవలచాలనొచ్చుకొన్నాఁడు.)

**నొచ్చుకోలు.** దే. వి. నొచ్చుకొనుట, పశ్చాత్తాపపడుట.

**నొడలదొంతి.** దే. వి. సంశయము. (అప్ర.)

**నొడి.** దే. వి. నుడియొక్క రూపాంతరము.

**నొడికాఁడు.** దే. విశే. మాటలమారి. "ఇంకందనుఁగన్న దప్పనొడికాఁడనికొంకితిఁగాని." భార. అశ్వ. 3, ఆ.

**నొడికారము.** దే. వి. నుడికారముయొక్క రూపాంతరము. "వ. కళావతీనీవు నొడికారపుమాటలం బ్రోడవనివిందు." సై. ౫, ఆ.

**నొడికారి.** దే. విశే. (నొడికారము+ఇ.) మాటచమత్కారముగలవాఁడు. "ఉ. కప్పముపేర నేఁడు నొడికారితనంబునమోసపుచ్చఁగా, నుప్పలుదత్తురే." ఉ, హరి. ౮, ఆ.

**నొడుగు.** దే. స. క్రి. వి. నుడుగుయొక్క రూపాంతరము.

**నొడుచు.** దే. స. క్రి. తప్పులుపట్టు.

**నొడుపు.** దే. వి. తప్పులుపట్టుట.

**నొడువు.** దే. స. క్రి. వి. నుడువుయొక్క రూపాంతరము.

**నొప్పి.** దే. వి. 1. బాధ; 2. ఒప్పమి, ఆపద. "క. అపాండవమధ్యమునకు, నొప్పమిపుట్టంగవలయునుల్లముగలఁగెన్, దప్పదునాకలనీసఖు, నొప్పిపరిహరించిదయఁగనుంగొనుమనినన్." జై. ౭, ఆ.

**నొప్పిగుంటి.** దే. విశే. (నొప్పి+కుంటి.) వ్యాధిగ్రస్తుఁడు.

**నొల్లు.** దే. స. క్రి. బిడ్డలునోటవ్రేల్లిడుకొనిచప్పరించు. "సీ. వ్రేళులుకఱవంగ వెరవల్వరించిరో నోరఁజేతులుగ్రుక్కినొల్లునాఁడ." నిర్వ. ౧, ఆ.

**నొవ్వి.** దే. వి. 1. వేదన; "క. ఎవ్వరు తే నెడనొక్కఁడు, నొవ్వంగానడిచె నేనినొప్పికొలఁదియున్ జివ్వకతమునరయందగు, నొవ్విన్ వాఁడెగ్గులాడునుత్తమునయినన్." విజ్ఞా. ప్రా, కాం.—2. వ్యాధి. "క. ఎవ్వరు నేటికి నా మెయిఁ, గ్రొవ్విన మాంసంబుగలదు కొనుమాఁకలియున్, నొవ్వియునుదీఱునంతట, నవ్వలనారోగ్యమగుమృగాధిపనీకున్." పంచ. నా. ౧, ఆ. (నొవ్వుయొక్క రూపాంతరము.)

**నొవ్వు.** దే. వి. 1. వేదన; "తే. వాయువంగంబులందు దుర్వ్యాప్తిఁగదిరి, నొవ్వుఁదెవులునుబుట్టించుఁ గ్రొవ్వుచెఱుచు, సందులెడలించుఁగ్రమమున నొందుఁబరఁగి, తనువుమ్రానుగఁజేసిజీవుని వెలార్చు." భార. అశ్వ. ౧, ఆ.—2. వ్యాధి. (చూ. నొవ్వి.)

**నొసలు.** దే. వి. నుదురు, ఫాలము.

**నొష్ట.** గ్రా. వి. (నొసటకు గ్రామ్యము.)

## నో.

**నోఁచు.** దే. స. క్రి. వ్రతమాచరించు. "మహోగ్రపు నోములు నోఁచుచున్న యయ్యోగివరేణ్యు నేమమున నుల్లము వెన్నవలెంగరంగ." పాండు. ౩, ఆ.

**నోఁత.** దే. వి. నోఁచుట. "చ. వెలిచవిఁగోరుదుండగపువేడుకకత్తెలనోమునోఁత." కవిక. ౮, ఆ.

**నోటిబీగము.** దే. వి. దేవతాప్రార్థనకై దౌడలయందుకుట్టుకొనెడు చొకపు లోహపుకమ్మి.

**నోటు.** ఆం. వి. చిన్నచీటి, విలువగలకాగితము. (బ్యాంకునోటు, ప్రామిసరీనోటు.)

**నోము.** దే. స. క్రి. 1. వ్రతముచేయు; "ఉ. మున్నెన్నిటనోమి కాంచిరొసమిద్ధతపఃఫలసారమైనయో, ద్యన్నయశీలునిన్నుఁదలిదండ్రులు." రామా. ౩, ఆ.—2. పోఁగొట్టు. వి. వ్రతము.

నోయు. దే. అ. క్రి. నోచ్చు. "క. నోసినడెంద ముపగులఁగ." రా. సుం, కాం.

నోరు. దే. వి. ముఖద్వారము, వక్త్రము.

నోరుమెంగ. దే. విశే. మూఁగ. "క. తన్నట్లుపలికి ద్రొబ్బఁగ, మిన్నకచననంతనోరుమెంగయొయ్య దియా, మున్నాడినమాటలబిరు, సెన్నఁగనిదికని యొయ్యతఁడుపేక్షయొనర్చెన్." కళా. 3, ఆ.

నోరూరు. దే. అ. క్రి. (నోరు + ఊరు.) 1. రుచిగలవస్తువులుతినుకోరికచే నోటనీళ్లూరు; 2. ఆపేక్షించు. "సీ. సంపెంగపొదరింటిచక్కిఁగోరఁటఁ గాంచియుసురంచుమగుడనోరూరునవియు." పా. 3, ఆ.

నోరెత్తు. దే. అ. క్రి. (నోరు + ఎత్తు.) మాటాడ యత్నించు.

నోవరి. దే. విశే. (నోవు+అరి.) వ్యాధిగలవాఁడు.

నోవి. దే. వి. నోవుయొక్కరూపాంతరము.

నోవు. దే. వి. నొప్పియొక్కరూపాంతరము. "క. కౌరవపాండవులందె, వ్వారలకుంజావునోవు వచ్చినమేలు, ర్వీరమణచిత్తముననిట్లారయుమానీ కుదుఃఖమగునక్లైనన్." భార. ఉద్యో. 3. ఆ.

## నౌ.

నౌ. దే. వి. నవ్వు. (మొదటిరూపము నవు.)

నౌక. సం. వి. ఆ. స్త్రీ. నావ, ఓడ.

నౌకాదండము. సం. వి. అ. పుం. ఓడనడపుగడ.

నౌకు. దే. వి. మొత్తి. "ద్వి. నల్లమబ్బుకుఁగ్రిందనౌ కుదాపునను, దెల్లనివాల్చుక్క తెగిపడ్డరీతిఁ, గని పించె." సా. ౨, భా. (మొదటిరూపము నవుకు.)

నౌడుకొట్టు. దే. అ. క్రి. మిణకరించు. (మొదటిరూపము నవుడుకొట్టు. "ద్వి. అనియిట్లుదేవేంద్రుఁ డాడినమాట, వినియునువిననట్లు విస్మయంబంది, చ్యవనుఁడూరకయుండె శార్ఙ్గరవుండు, నవుడు కొట్టెనునీళ్లు నమలెఁగశ్యపుఁడు." హరిశ్చ. ౧, భా.)

నౌబతు. హిం. వి. చర్మవాద్యవిశేషము.

నౌరు. దే. విశే. మృదువు. (మొదటిరూపము నవురు.)

## న్య.

న్యంకువు. సం. వి. ఉ. పుం. 1. ఇఱ్ఱి; 2. ముని.

న్యక్కారము. సం. వి. అ. పుం. తిరస్కారము.

న్యక్కృతి. సం. వి. ఇ. స్త్రీ. న్యక్కారము.

న్యక్షము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అధమము; 2. సమస్తము.

న్యగ్రోధము. సం. వి. అ. పుం. 1. మఱ్ఱి; 2. జెమ్మి; 3. బార.

న్యగ్రోధి. సం. వి. ఈ. స్త్రీ. ఎలుకజీడి.

న్యర్బుదము. సం. వి. అ. న. పదియర్బుదములసంఖ్య. విశే. పదియర్బుదములసంఖ్యగలది.

న్యస్తము. సం. విశే. (అ. ఆ. అ.) ఉంచఁబడినది.

## న్యా.

న్యాదము. సం. వి. అ. పుం భోజనము, కుడుపు.

న్యాయము. సం. వి. అ. పుం. 1. తగవు; 2. స్వధర్మమువలన చలింపకుండుట; 3. తర్కశాస్త్రము.

న్యాయ్యము. సం. విశే. (అ. ఆ. అ.) న్యాయముతోఁ గూడినది.

న్యాసము. సం. వి. అ. పుం. 1. ఉనుచుట; 2. ఇల్లడ; 3. వాడిక.

## న్యు.

న్యుబ్జము. సం. వి. అ. న. కర్మరంగమనుమ్రానిపండు. పుం. దర్భతోఁచేసినస్రుక్కు.

న్యుబ్జుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. క్రిందఁచూచువాఁడు; 2. తెవులుచే వంకరైనవాఁడు.

## న్యూ.

న్యూనము. సం. విశే. (అ. ఆ. అ.) 1. తక్కువైనది; 2. నిందింపఁదగినది.

## ప.

ప. ఒకయక్షరము.

పంకజము. సం. వి. అ. న. తామర, అసలుఁబుట్టువు.

పంకము. ఉభ. దే వి. పాలు. "సీ. లేడిపిల్లలకుబాలెంతచివ్వంగులుపంకంబుఁజిచ్చుచుఁబంచితిల్లు." హై. ౮, ఆ.—సం. అ. పుం, న. 1. బురద; 2. పాపము.

పంకరుహము. సం. వి. అ. న. తామర, అసలుఁబుట్టువు.

పంకా. హిం. వి. పెద్ద విసరుఁగఱ్ఱ.

పంకి. వై. వి. బురద. "చ. పొగడలసాదరాచిలుకపుత్తడిపావలుతావిదూపవుం, బొగలుజవాదిపంకితెలిముత్యపుఁజిప్పపసిండిగిండియున్, బగడపుఁగోళ్లమంచము జమల్ పఱపుం గపురంపుఁజిన్నికెం, పుగములజాలవల్లికయుఁ బువ్వులమించులనిల్వుటద్దముల్." య. ౪, ఆ.

**పంకించు.** యు. దే. స. క్రి. పట్టించు. "సీ. కలదు లేదను పాటి గారనూనెయొకింత పంకించితలచి క్కువాపిమడిచి." శై. ౬, ఆ "క. బింకపు ప్రే తలవాతెఱ, మంకెనపూఁదేనెతేటమానకపైఁబై, నింకఁగనింకఁగ బలుమఱుఁ, బంకించుటఁబోలె మోవిఁ బచ్చనహెచ్చన్." పాండు. ౨, ఆ.— వై. అ. క్రి. చలించు. "సీ. బాంధవపితృమాతృ భక్తిఁజెందినవాఁడు కిల్బిషంబులకుఁబంకించువాఁడు." శై. 3, ఆ.

**పంకిలము.** సం. విణ. (అ. ఆ. అ.) బురదగలది. (దేశము.)

**పంకెన.** దే. వి. తడి, పదను. "సీ. పాపటయిడినూనె పంకెనతోనున్న గా దువ్వి నెఱులుకీల్గంటువైచి." హంస. ౨, ఆ.

**పంకేజము.** సం. వి. అ న. పంకజముయొక్క రూపాంతరము.

**పంకేరుహము.** సం. వి. అ. న. పంకరుహముయొక్క రూపాంతరము.

**పంగ.** వై. వి. ఎడముగాచాఁగినశాఖ*. "క. పాదచ దరిబూదిచఱచిన, యొడళ్లతో సాల్గురెండునొక టియఁబంగల్, వెడలినకొమ్ముల బరువున, నడు గిడఁగాలేవుబలిసియందులదుప్పుల్." స్వా. ౪, ఆ.

**పంగటి.** వై. విణ. ఎడముగలది. (పంగటికాళ్లు.)

**పంగటించు.** వై. స. క్రి. ఎడముగాచాఁచు.

**పంగటికాళ్లవాఁడు.** ద్వ వి. దొడ్డికాళ్లవాఁడు, ప్రగతజానుకుఁడు.

**పంగనామము.** ద్వ. వి. నడుమ ఎడముగలుగపంగవలెతీర్చిన తిరుమణి. (ఎడములేకతీర్చిన తిరుమణి ఋంగనామము.)

**పంగము.** వై. వి దేవబ్రాహ్మణవృత్తులమీఁద దొరతనమువారు తీసెడు చతుర్థాంశమైన కప్పము.

**పంగిడి.** దే. వి. ఓదము, (చూ.) అవపాతము.

**పంగు.** దే వి. భయము.

**పంగువు.** సం వి. ఉ. పుం. శని. విణ. ఈఁచఁబోయిన కాలుగలవాఁడు.

**పంగెన.** దే. వి. (చూ.) పంగిడి.

**పంచకము.** సం. వి. అ. న. యుద్ధభూమి. స. అయిదు.

**పంచగవ్యము.** సం. వి. అ. న. అయిదువిధములైనగో సంబంధివస్తువులు. (అవి ఆవుపేడ, పంచితము, పాలు, పెరుఁగు, నెయ్యి.)

**పంచగూఢము.** సం. వి. అ. పుం. తాఁబేలు. (ఇట్లు పంచగుప్తము.)

**పంచజనుఁడు.** సం. వి. అ. పుం. మనుష్యుఁడు, మానిసి

**పంచత్వము.** సం. వి. అ. న. 1. చావు; 2. పంచభావము

**పంచదశి.** సం. వి. ఈ. స్త్రీ. 1. అమావాస్య, 2. పున్నమ

**పంచనఖము.** సం. వి. అ. పుం. పులి, వ్యాఘ్రము

**పంచనఖి.** సం. వి. ఈ. స్త్రీ. ఉడుము.

**పంచపాత్రము.** సం. వి. అ. న. పంచపాత్రముల సమాహారము. (వాడుకయందు లోహపాత్రవిశేషము.)

**పంచభద్రము.** సం. వి. అ. పుం. అయిదుచోట్లమంచిసుళ్లుగలగుఱ్ఱము.

**పంచమంగళము.** సం. వి. అ. పుం. స్తనశిరఃకుంభచూళికావక్షోమధ్యములయందుమంచిసుళ్లుగలగజము.

**పంచమము.** సం. వి. అ. పుం. 1. కోయిల, 2. రాగవిశేషము; 3. ఒకస్వరము. (చూ. స్వరము.) విణ. 1. అయిదవది; 2. ఇంపైనది.

**పంచమి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పక్షమునందు అయిదవతిథి, 2. ద్రౌపది.

**పంచముఁడు.** సం. వి. అ. పుం. మాలవాఁడు విణ నేర్పరి.

**పంచలక్షణము.** సం. వి అ. న. పురాణము (పంచలక్షణములు.— సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితము.)

**పంచపట్టె** వై. గ్రా వి. అయిదుపట్టెలు. 'సీ కన్నుప్పవిభునివక్త్రముమజ్జనవుబింబపంచపాయకు మేనుపంచపట్టె." రుక్మి. ౫, ఆ.

**పంచవన్నియ.** వై. గ్రా. వి. పంచవన్నె. "సీ పంచవన్నియతోడఁబ్రసవనారాచుని సెజ్జిచిచ్చఱకటజిత్తినాఁడు." భీ. ౧, ఆ.

**పంచవన్నె.** వై. గ్రా వి. అయిదువర్ణములు.

**పంచశరుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు, మరుఁడు

**పంచశాఖము.** సం. వి. అ. పుం. చెయ్యి కరము

**పంచసారము.** సం. వి. అ. పుం. పంచదార.

**పంచాంగము.** సం. వి. అ. న. తిథివారనక్షత్రయోగకరణములను తెలియఁజేసెడు జ్యోతిషగ్రంథభాగము. పుం. 1. కూర్మము; 2. అశ్వవిశేషము, 3. ప్రణామవిశేషము.

**పంచాంగులము.** సం. వి. అ. పుం. ఆముదపుఁజెట్టు.

**పంచాణుఁడు.** సం. వి. అ. పుం. శిల్పి.

పంచాననుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, అయిదుమోములవేలుపు. (ఇట్లు పంచాస్యుఁడు, పంచముఖుఁడు. మొ.)

పంచాయతి. సం. వి. ఇ. స్త్రీ. న్యాయముతీర్చుటకై మధ్యస్థముగా నేర్పడిన అయిదుగురికూటమి.

పంచాలి. సం. వి. ఈ. స్త్రీ. గీతవిశేషము, పంజెళము.

పంచాస్యము. సం. వి. అ. పుం. సింహము, తెలనోటిమెకము. (ఇట్లు పంచాననము, పంచముఖము. మొ.)

పంచితము. దే. వి. గోమూత్రము.

పంచితిల్లు. దే. అ. క్రి. గోవుమూత్రమువిడుచు, (రూ. పంచితిలు.) (చూ. నెమర్చు.)

పంచివేఁత. దే. వి. ఒక్కఁడొక్కఁడింతింతయియ్యవలసినదని భాగములువేసికొనుట, చందా.

పంచె. దే. వి. 1. పడుచువాఁడును పడుచుదియును కట్టుకొనెడు చిన్నవస్త్రము; 2. అంగవస్త్రము. (మొదటిరూపము పంచియ.)

పంచే. వై. వి. 1. గృహాదిపార్శ్వప్రదేశము; "క. వికలగతినున్న రాక్షసు, లాక నొకని మొగంబుఁగానకూరక చనిరం, తకునరుణకిరణుకిరణము, లకుఁబడమటికొండపంచలంబడవలసెన్." ఉ, హరి. ౪, ఆ.—౨. పంచేపాక*. విణ. అధికము*. (చూ. పంచేకరపాటులు.)

పంచేకము. యు. దే. వి. అశ్వముయొక్కపశ్చాత్ప్రదేశము. "ఎ, గీ. పంచకముఅొమ్మువిరివిగ్గైపరిఢవిల్ల." సా. ౧, ఆ.—వై. అయిదుతూములు*.

పంచేకరపాటులు. ద్వ. వి. బ. (పంచే కరము+పాటులు.) అత్యధికదుఃఖములు. "వ. అప్పుడుహరివిరించులు నక్తంచరులచేతఁ బంచకరపాట్లువడియంతఃకరణంబులంజింతించి." భీ. ౪, ఆ. "పంచకరపాట్లువడితన్నుఁబెంచి." కాశీ. ౪, ఆ.

పంచేదార. వై. వి. శర్కర.

పంచేపాక. ద్వ. వి. ఇంటిప్రక్కవంచికట్టినకట్టడము.

పంచేబంగాళము. వై. విణ. దూరము. "సీ. ప్రబలాంధకారధారాచ్ఛటాపటలంబుపంచబంగాళమైపాఱిపోవ." కాశీ. ౧, ఆ.

పంచాణము. వై. వి. శిల్పము*. (చూ. పంచాణంబువాఁడు.)

పంచాణంబువాఁడు. ద్వ. వి. శిల్పి. "వ. అచ్చటిపంచాణంబువారువినునట్టుగా నప్పటప్పటికినాగపట్టణప్రసిద్ధబుద్ధాయతనంబు కన్నపోయెననిపలుకుచుండ." పర. ౫, ఆ. (రూ. పంచాణమువాఁడు, పంచాణపువాఁడు, పంచాణంపువాఁడు.)

పంచాది. ద్వ. వి. (పంచే+అది.) 1. పంచే; 2. పంచేపాక. "సీ. పంచాదియరుఁగుపైఁబంచాస్త్రబాణసమాకులమానసుండగుచునుండె." పర. 3, ఆ. (చూ. ఏఁడాది.)

పంచారము. వై. వి. 1. వ్యాపనము; 2. అతిశయము*. (చూ. పంచారించే.)

పంచారించే. వై. అ. క్రి. 1. వ్యాపించు; "వ. కమలకోరక కనకకలశ కరికుంభప్రముఖంబులగునుపమాద్రవ్యంబులక్రొవ్వడంచి పంచారించిపిక్కటిల్లి." పాండు. 3, ఆ.—2. అతిశయించు*. "రగడ. పంచారించినకైవల్యశుభప్రచయంబులకునుఖనిమణికర్ణిక." కాశీ. ౬, ఆ.

పంచే. దే. స. క్రి. 1. ఆజ్ఞాపించే; "వ. తనశిష్యులైనపైలవైశంపాయన సుమంతజైమినులం బంచిక్రమంబునఁజతుర్వేదసూత్రంబులఁజేయించిశేదవ్యాసుండై." భార. ఆది. ౧, ఆ.—2. పుచ్చే; "ఈతనింబంచితిసైన్యయుక్తముగ." భార. శాం. ౨, ఆ. (పనుచుయొక్క రూపాంతరము. చూ. పనుచు.)—3. భాగించే

పంజరము. సం. వి. అ. న. 1. పంజెరము; 2. గవుసెన. పుం. 1. శరీరము; 2. శరీరముయొక్క రొముకలగూఁడు.

పంజి. దే. వి. కప్పము, కరము.

పంజె. వై. వి. బారంగి*. (మొదటిరూపము పంజియ.)

పంజె. వై. వి. అవిక*. "గీ. కొండలకుసన్నలిడుభంగిఁగోమలాంగి, పయ్యెద మొఅంగిచనుదోయిఁబంజఁదార్చె." రామా. ౪, ఆ. (ఇది విచార్యము.)

పంజెన. దే. వి. నిగరమైనది. (అప్ర.)

పంజెరము. వై. వి. పక్షినిపెట్టి పెంచెడుగూఁడు. "పంజరంపుచిలుకాయను." అచ్చ. అ, కాం.

పంజెళము. వై. వి. (చూ.) పంచాలి. "తే. పాడిమెచ్చించె నొకయింతిపంజళమున." కాశీ. ౬, ఆ.

పంజాయీ. దే. వి. ఒకదినుసుదివటీ. "జగతీజ్యోతులుకాగడాలుఁబలుఁపంజాయీలు." హంస. 3, ఆ.

పంజో. దే. వి. 1. దివటీ; (చూ. సేఠా.) 2. ఒకదినుసుదివటీ; "దివటీలుఁదిగ్వళికలుం బంజాల్ మహాజ్యోతులున్." హంస. 3, ఆ.—౩. విడవలిలోనగువానికట్టు; (చూ. జెల్లి.)—4. విడవలిలోనగువా

నిగంటు. "సీ. పంజాజాడల నేగుపదవిరోసినఁగర్గెఁ బంజాజాడల నేగుపదవియిచట." రామా. ౫, ఆ.

**పంజాలకమ్మలు.** దే. వి. బ. రత్నములు చెక్కినకమ్మలు. "ఉ. బంగరుతళ్కుచెక్కులను బంజాలకమ్మలడాలుచిందు ద్రొక్కంగ." ఉ, రా. 3, ఆ.

**పంట.** దే. వి. 1. పండుట; 2. కృషి; 3. ఫలము. (చూ. పెడఁగు మొదటియర్థము నుదాహరణము.)

**పంటకాఁపు.** దే. వి. 1. పంటచేజీవించువాఁడు, కృషీవలుఁడు; 2. రెడ్లలో ఒకతెగవాఁడు.

**పంటరెడ్లు.** దే. వి. బ. రెడ్లలో ఒకతెగవారు.

**పంటవలఁతి.** దే. వి. భూమి. "సీ. బాహుసౌధక్రీడఁ బరఁగుపంటవలంతితో య్యాలి సిడుద కస్తూరిబొట్టు." పా. ౧, ఆ. (ఇట్లు పంటచెలి, పంటపొలఁతి. మొ.)

**పంటసాల.** ద్వ. వి. 1. ఉగ్రాణము; 2. కణఁజెము.

**పంటి.** దే. వి. పనఁటియొక్క రూపాంతరము. "సీ. ఏటినీటికటంచుఁ బాటిపంటెత్తుక పలుమాఱుఁ దిరుగునిబ్బరముతోడ." హంస. ౧, ఆ.

**పంటించు.** దే. అ. క్రి. 1. జోగుచేయు; "శా. మింటన్ బ్రోసిన బ్రోఁతతాలిమినిలో మేండ్రింపమున్నీవు నా, యింటంబుట్టెదవంచుఁ గంసుఁడు దొడిన్ హింసించె నీయన్నలన్, గంటంగూరుకుదేఁడునీయుదయ మీకారాజునుల్ సెప్పఁగాఁ, బంటింపం డెదురేగు దెంచువడినీపై నేఁడు సన్నద్ధుఁడై." భాగ. ౧౦, స్కం. పూ.—2. తడఁబడు. "అలంతనూర్పుపలవుల్ సాలంగఁబంటింపఁగా." భాను. ౪, ఆ.

**పంటె.** దే. వి. సాలెవాఁడునూలుచుట్టెడు సాధనవిశేషము. (మొదటిరూపము పంటియ. దీని నే పంటెకఱ్ఱ, పంటెకోల అందురు.)

**పంట్ర.** దే. వి. చిల్లులుగల అలుఁగులు మూఁడువాలుగుగలకఱ్ఱ. (దీని నే పంట్రకోల అందురు. "తే. కంపతోడుగీడ్చినట్లేదు కానఁజన్న, తెరు వెఱుంగుచు మొకఁ డేగిపరువుతోన, పడియడఁగియుండఁగాఁబటపటనముండ్లు, గాలిఁగదలుటగని పంట్రకోలఁబొడిచె." స్వా. ౪, ఆ.)

**పంట్రించు.** దే. స. క్రి. పంట్రతోఁబొడుచు.

**పండ.** సం. వి. అ. స్త్రీ. యథార్థము నెఱిఁగెడుబుద్ధి.

**పండావారు.** దే. వి. బ. జగన్నాథాదిదేశములందుండుజనులు.

**పండితుఁడు.** సం. వి. అ. పుం. చదువరి.

**పండు.** దే. అ. క్రి. 1. ఫలించు; 2. శయనించు. "తే. స్నానమొనరించునప్పుడు జపము సేయు, నపుడుఁ గరపాత్రమున భిక్ష యడుగునపుడుఁ, బండునప్పుడు బొంతపైనుండు మనసు, బీదగఱచిన బూరెయబ్భిక్షునకును." పంచ. వేం. ౧, ఆ.—వి. ఫలము. విశే. పండినది. (పండుటాకు. మొ.)

**పండుఁడు.** సం. వి. అ. పుం. నపుంసకుఁడు, పేడి.

**పండుకొను.** దే. అ. క్రి. శయనించు. (స్వార్థమున కొను.)

**పండుగ.** దే. వి. 1. ఉత్సవము; "ద్వి. పాలివోనిజప్వనంబునఁ గన్నుపండు, గలుసేయుదానిచక్కఁదనంబు పెక్కు." విష్ణు. పూ. 3, ఆ.—2. సంక్రాంతిలోనగునది.

**పండుగు.** దే. వి. పండుగయొక్క రూపాంతరము. (ఇది దండుగువంటిది.)

**పండుచేఁప.** దే. వి. మత్స్యవిశేషము.

**పండువ.** దే. వి. పండుగయొక్క రూపాంతరము.

**పండువు.** దే. వి. పండుగుయొక్క రూపాంతరము. (చూ. పండుగు.)

**పండువెన్నెల.** ద్వ. వి. పూర్ణచంద్రిక.

**పండేరము.** వై. వి. భత్యము. "ఉ. చేరినృపాలుఁడర్పణముచేసినఁ జక్కెరలుప్పతిల్లు పం, డేరములారగించుచునటింపఁదొడంగె మహేశుఁడింపునన్." సా. ౧, ఆ.

**పండ్రెండు.** ద్వ. స. (పది+రెండు.) ద్వాదశసంఖ్య. (చూ. మండ్రాటము.)

**పండ్లమాను.** దే. వి. చేలలో పైరులోనిగాదముపోవునట్లు దున్నెడు సాధనవిశేషము.

**పంతకాఁడు.** ద్వ. విశే. (పంతము+కాఁడు.) 1. పోటిచేయువాఁడు; 2. ప్రతిజ్ఞకలవాఁడు; 3. పౌరుషముకలవాఁడు.

**పంతగించు.** వై. అ. క్రి. 1. పోటిచేయు; 2. ప్రతిజ్ఞచేయు; "ద్వి. శూలాయుధుఁడ నీవు చూచితే వేని, బాలిఁజిక్కుదువని పంతగించితిని." విష్ణు. ఉ. ౪, ఆ.—3. విధించు*. "క. అనికలుద్రావ టరయొవ్వరి, కినిగాదని పలికి పంతగించుచు సంజీవని చేతఁగడుపులోఁగచు, ననువుగఁ బ్రతికింపఁ దలిసియతఁడిట్లనియెన్." యు. 3, ఆ.

**పంతము.** వై. వి. 1. పోటి; "మ. తమిఁబూఁదీఁగెల తూఁగుటుయ్యెలలఁ బంతాలాడుచుందూఁగునా కొమరుంబాయవు గబ్బిగుబ్బెతలయంఘ్రుల్

చక్క(గాఁజాఁగిమిం, టిమొగంబైచనుదెంచుతీవిఁ గనుఁగొంచేదివ్యమానీంద్రనా, కమ్మృగీనేత్రల మీఁదఁ గయ్యమునకుఁ గాల్సాఁచులాగొప్పెడుఁ." కళా. ౧, ఆ.—2. ప్రతిజ్ఞ*; "మ. పరితాపంబునఁబొందునప్పాలఁతికిఁ బంతంబునేనిచ్చితిఁ, దరుణీతెచ్చెదనీమనోరమణుఁజింతాభారమింతేలయంచు." ఉ, హరి. ౫, ఆ.—3. పౌరుషము*; "పడుచులతోడఁబోరుటదిపంతమె." ఉ, హరి. 3, ఆ.—4. విధము*. "ద్వి. తటుకనఁదుమ్ముపంతముఁజెప్పుమనిన." హరిశ్చ. ౨, భా.

పంతు. దే. వి. మేలిమి "ద్వి. అంతకంతకులతాంతాయుధకేళి, పంతుపహించి యప్పద్మజాండు." విష్ణు. పూ. 3, ఆ.—విశ. మేలు. "పరిజనకోపదంభమునఁబంతుగఁజూడవు." రస. ౧, గుచ్ఛము

పంతులు. దే. వి. బ. 1. చదువులయ్యవారు; 2. కొందఱుబ్రాహ్మణులలో గొప్పయుద్యోగస్థులకు పూజ్యవాచకము.

పంద వై. విశ. పిఱికి. "ఆ. ఓరోరియిం, కొందుఁబోవవచ్చుఁబందనిలువుము." భార. అర. ౬, ఆ.

పంది. దే. వి. సూకరము. (దీని భేదములు. ఊరఁబంది, అడవిపంది, ముండ్లపంది.)

పందికొక్కు. దే. వి. మూషిక.

పందగడ్డ. ద్వి. వి. పరకెగడ్డ, శృంగాటకము?.

పందిగోరు. ద్వి. వి. వేఁటకానిసాధనవిశేషము "క. పడదోల్లునుముప్పిళ్లును, నడిదంబులు వెడఁదవాతియలుఁగులపొదులున్, దడవిండ్లుఁబందిగోళ్లును, గెడలున్ ధరియించి భటులుకెలఁకులఁగొల్వన్." భల్లా. 3, ఆ.

పందిపీఁట. ద్వి. వి. గాఁడీమొదలగు ఎక్కుడుబండ్ల చివరనుపందిమూతివలెమ్రానులోనగువానితోఁ జేసియమర్చిన పరికరవిశేషము.

పందిపోటు. దే. వి. పందీఁటె. (చూ. తీడు)

పందిముక్కు. దే. వి. పందిపీఁట.

పందిమూతి. దే. వి.——వై.——

పందిరి. దే. వి. గుంజెలునాటి మీఁదకొయ్యలుకట్టి టెంకాయాకులులోనగువానికప్పినది, పందిలి "సీ. శైత్యసాంద్రిమలుతుపారాంతమునఁజేరెనిరులతో ద్రాక్షపందిరులవిరుల." ఆము. ౫, ఆ.

పందిలి. దే. వి. పందిరియొక్కరూపాంతరము, కాటుమానము.

పందీఁటె. దే. వి. (పంది+ఈఁటె.) పందినిపొడుచునట్టియీఁటె, పందిపోటు. (చూ. చేకత్తి.)

పందుము. వై. వి. (పది+తూము.) పదితూములు.

పందెకాఁడు. ద్వి. వి. (పందెము+కాఁడు.) పందెముపెట్టి కోడిమొదలగువాని జగడమునకువిడుచువాఁడు. "సీ. పందెకాండ్రకునిచ్చిపరిహాసకులకిచ్చికూడియాడెడుధూర్తకోటికిచ్చి." విక్ర. ౭, ఆ.

పందెము. వై. వి. 1. జూదములోనగువానియందు ఓడెడునాఁడు గెలిచెడువానికిచ్చునట్లు పంతమాడిపెట్టెడు ధనాదికము; 2. దాయము. (మొదటిరూపము పందియము.)

పందేరము. దే. వి. ధనాదికము పంచిపెట్టుట.

పందొమ్మందుము. ద్వి. వి. (పందొమ్మిది+తూము.) పందొమ్మిదితూములు.

పందొమ్మిది. ద్వి. స. (పది+తొమ్మిది.) ఏకోనవింశతి.

పంపకము. దే. వి. 1. పంచుట; 2. పంపుట.

పంపర. సం. వి. ఆ. స్త్రీ. పంపరపనస?.

పంపరపనస. మి. వి. పంపరయను ఫలవృక్షము.

పంపించే దే. స. క్రి. పంచు, పుచ్చు. (స్వార్థమున ఇంచు.)

పంపిణి. దే. వి. పంచిపెట్టుట.

పంపు. దే. స. క్రి. 1. ఆజ్ఞాపించు; "క. చంపునొకోయక్కటకా, రింపఁదలంచునొకొ లఘుచరిత్రంబులకున్, బంపఁగడంగునొకోశం, కింపండీకఱకుటసురకీడొనరింపన్." నిర్వ. ౫, ఆ.—2. పంపించు. వి. 1. ఆజ్ఞ; "మీరలెల్లనాపంపునఁబోరికిఁజనుఁడు." జై. ౭, ఆ. (చూ. అంచే.)—2. ఆజ్ఞాపింపఁబడినపని; "ఉ. అత్తలకెల్లభూరివినయంబునఁబంపుదగంగఁజేయుచున్, జిత్తమెలర్పనాథుపనిసేయుచు." నిర్వ. ౭, ఆ.—3. పంపకము; "పాలుపంపనియీకయేలిమాటలనమ్ములకఁదీర్చెదరు." భార. ఉద్యో. 3, ఆ.—4. వరిమళ్లవరుస; "తత్కలమాంకూరపు పంపుమేయుచెలజింకన్ సారెవారించు." వసు. ౧, ఆ.—5. మారణకర్మము; "చ. బాలలపయిఁబంపువెట్టివెతలంబఱపందగునాసమీరణా." చంద్ర.—6. తులామానవిశేషము.

పంపువడు. ద్వి. అ. క్రి. (పంపు+పడు.) ఆజ్ఞాపింపఁబడు. "వ. మహాప్రసాదంబనిపంపువడిచంపకాపురంబునకరుదెంచువారు." జై. ౪, ఆ.

పంపుపెట్టు. దే. స. క్రి. (పంపు+పెట్టు.) ఆజ్ఞాపించు. "ఉ. మీరిఁక నేఁటనుండియును మేదినిలోఁ గలపిన్నబిడ్డలక్, వారక చంపుఁడంచు బలవంతులఁ దెంపునఁ బంపు పెట్టినక్." వి, పు. ౭, ఆ.

పంబ. వై. వి. చర్మవాద్యవిశేషము.

పంబు. దే. అ. క్రి. అతిశయించు. "పంబిన వేడ్కలు ల్లమునఁ బైకొన." రా. బాల, కాం.—వి. ఎద్దుమీఁద వేసెడు పెద్దసిద్దె. హంస. ౫, ఆ. (చూ. పమ్ము.)

పంబుదాల్లు. దే. వి. (పంబు+తాల్లు.) దేని నేని ఈడ్చి కట్టెడు త్రాళ్లు. "జగాడం బారుపహోంబట్టుపఁబుదాల్లు." రసి. 3, ఆ.

పకపక. దే. వి. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము. "క. పకపకనవ్వుచు నొకవి, ప్రకరేబరమాంగమల్లవుచ్చి పునుకపా, త్రికలోనఁ గడిగి పెట్టుచు నకుటిలమతిఁ గృష్ణనీకు నర్పితమనుచుక్." ఉ, హరి. ౨, ఆ.

పకాపక. దే. వి. పకపకయొక్క రూపాంతరము. "నిండుచందురుఁ బకాపకనవ్వు మొగంబు." శేష. ౧, ఆ.

పకీరు. హిం. వి. (చూ. ఫకీరు.)

పకీలు. దే. వి. ఏయుటయందగు ధ్వన్యనుకరణము. "ఉ. కీరమనీవు కొంతచెలికిక్ సకిగావుననీదు మాటలక్, గీరమసైఁచితిక్ మధుప కీటములేఁగయి కొన్న యీ వెడం, గీరమచేరి చేయురుతు లేవిఁ జూరతిపుష్పకోమలాంగ, గీరమణుండు తాళకఁ కీలనసక్ దలద్రవ్వనేసినక్." చంద్ర.

పకోడి. హిం. వి. భక్ష్యవిశేషము. (రూ. పగోడా.)

పక్క. యు. దే. వి. పడుకయొక్క రూపాంతరము. వై. 1. పార్శ్వము; 2. పక్షము.

పక్కణము. సం. వి. అ. పుం. బోయపల్లె.

పక్కణి. దే. వి. బరణి. "జవ్వాదిపక్కణి." నీలా. 3, ఆ.

పక్కము. వై. వి. మాసార్ధము. విణ. తోడు. "తే. నీవచుట్టంబుఁ బక్కంబు నీవచెలియు." భార. కాం. ౧, ఆ.

పక్కా. హిం. విణ. పక్వమైన, సిద్ధమైన, నిండు.

పక్కాలి. దే. వి. (చూ.) తణగము, నీళ్లు తెచ్చెడి తోలు సంచి. (రూ. పకాలి.)

పక్కి. వై. వి. పులుఁగు, పక్షి.

పక్కిడాల్వేలుపు. ద్వ. వి. విష్ణువు, గరుడధ్వజుఁడు.

పక్కియ. యు. దే. వి. పక్కచెట్టు. వై. పార్శ్వము. "క. హరుశరముననరుశరమును, సరినిరు పక్కియలఁ దాఁకి జవమతిశరసం, భరమునఁ దిరిగెవరాహము, శరనిధిమథనమునఁ దిరుగు శైలము పోలెక్." భార. అర. ౧, ఆ.

పక్కిమొదలివాఁడు. ద్వ. వి. కిన్నరుఁడు.

పక్కిరాయఁడు. వై. వి. గరుత్మంతుఁడు, ఖగేశ్వరుఁడు.

పక్కు. దే. వి. 1. ఎండినపట్టు; "చిట్లుగందపుం బక్కులతోడి దేహములు." వి, పు. ౬, ఆ.— 2. నవ్వుటలోనగు వానియందగు ధ్వన్యనుకరణము. (పక్కునవవ్వు, పక్కునఁ దిట్టు, పక్కునఁ బిగులు, పక్కునఁ బొడుచు. మొ.) (ఆమ్రేడితమునందు పక్కుపక్కు. "పక్కుపక్కున సంఘ్రిపాశము ల్ వెసఁద్రెంచి." స్వా. ౪, ఆ. మొ.)

పక్కున. దే. ద్ర. క్రి. విణ. తటాలున. "పక్కున వేసరంజనదు." స్వా. 3, ఆ.

పక్కె. దే. వి. 1. పిచులము; (పక్కియయొక్క రూపాంతరము.) 2. మత్స్యవిశేషము. (దీని భేదములు. చేదమామపక్కె, బుడ్డపక్కె, బొందపక్కె మంగలపక్కె, మాచెనపక్కె, మోరపక్కె.)

పక్కెర. వై. వి. గుఱ్ఱములోనగువాని అంగీ (చూ. కడపటియుదాహరణము.) "సీ. పన్నగాశికి నెదుర్పడ వెండి రెక్కలుధరియించె ననఁ గఁబక్కెరసెలంగ." పా. ౪, ఆ. "సీ. అర్జునునకుఁ బ్రబలసింహమునకుఁ బక్కెర పెట్టినయట్లు దేవతలునెయ్యంబుతోడఁ, బరమఁ దొట్టిపాశుపతమాదిగా దివ్య, శరములిచ్చిరి." భార. అర. ౧, ఆ. "క్రీడియేనుంగుపక్కెరచిఱునుగ్గుసేయ." భార. ద్రో. ౧, ఆ. "క. పూఁబక్కెరగలకుకతురగము, నెక్కిన వెడవింటిరౌతు కెఱఁగితిమార్తిక్." భో. 3, ఆ. "వ. సుశర్మయు నేలినవానిపనిఁ బూనిజోడు పక్కెర కైదువుబిరుదురవణంబు మొదలైనసవరణంబులం జూడ నక్కజంబుగాఁ గూడి." భార. విరా. 3, ఆ.

పక్కెరాలు. ద్వ. వి. (పక్కెర+ఆలు.) అంతఃపురపు కావలికత్తె. "క. అనియచ్చటిపైకావలి, పెనురక్కసి పక్కెరాండ్రఁ బిలిచితినుండీ, వనితనిక రెండుసెలలగు, దనుకంజూచియని చెప్పిదైత్యుఁడు నోరోయిక్." రామా. ౬, ఆ.

పక్రిమము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పండినది; 2. వండఁబడనది.

పక్వము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పరిపాకముఁ బొందినది; 2. చేటుమూఁడినది. "పక్వోవూనః జ్వరస్త్రీణామ్."

పక్షకము. సం. వి. అ. పుం. 1. దిడ్డివాకిలి; 2. పక్క.

పక్షచరము. సం. వి. అ. పుం. తనకదుపునుబాసి యొంటిఁజరించెడియేనుఁగు.

పక్షచరుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

పక్షతి. సం. వి. ఇ. స్త్రీ. 1. పాడ్యమి; 2. ఱెక్క మొదలు.

పక్షపాతము. సం. వి. అ. పుం. ఒకపక్కకొఱగుట.

పక్షపాతి. సం. వి. న్. పుం. పక్షపాతముకలవాఁడు.

పక్షభాగము. సం. వి. అ. పుం. ఏనుఁగుయొక్క పార్శ్వభాగము.

పక్షము. సం. వి. అ. పుం. 1. నెలయందు పదియేనుదినములు; 2. ఱెక్క; 3. ప్రక్క; 4. ప్రక్కయిల్లు; 5. పగ; 6. బలము; 7. రాజెక్కెడియేనుఁగు; 8. ప్రొయ్యినోరు; 9. చెలికాఁడు; 10. సహాయుఁడు; 11. తర్కవిషయసాధ్యము; 12. కేశతత్పర్యాయములకు పరమైనచోసమూహము. (కేశపక్షము. మొ.)

పక్షాంతము. సం. వి. అ. పుం. 1. పున్నమ; 2. అమావాస్య.

పక్షి. సం. వి. న్. పుం. చిలుకమొదలైనది, పులుఁగు.

పక్షిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. రెండుపగళ్లతోఁగూడినరాత్రి; 2. రాత్రి; 3. పున్నమ; 4. ఆఁడుపక్షి.

పక్షీకరించు. సం. అ. క్రి. పక్షముంచు.

పక్ష్మము. సం. వి. న్. న. 1. ఱెప్పవెండ్రుక; 2. పక్షిత్రుప్పుడు; 3. నూలులోనగువాని సన్నపుతునుక; 4. అకరువు.

పక్ష్మలము. సం. విణ. (అ. ఆ. అ.) పక్ష్మములుగలది.

పక్ష్మలించు. సం. అ. క్రి. ఱెప్పవేయు. "వ. సరసీతీరంబునసారసంబుసారస్యంబుపక్ష్మలింప." కాశీ. ౨, ఆ.

పగ. వై. వి. 1. విరోధము; 2. విరోధి; "క. మనకుఁ బగయింద్రుఁడ కాఁడెయెల్లభంగులఁదలఁపఁగ." నిర్వ. ౫, ఆ.

పగఁబట్టు. ద్వ. అ. క్రి. (పగన్+పట్టు.) పగగొను. "ద్వి. ఆతరుణినామీఁదఁ, బగఁబట్టియేల భూపతికెఱిఁగించు." సా. ౨, భా.

పగగొను. ద్వ. అ. క్రి. (పగ+కొను.) విరోధపడు. "క. శకునివినుసమరధుఁడుపాం, డుతనూజులతోడనెప్పుడుంబగగొనివా, రికిఁగీడురోయు." భార. ఉద్యో. ౪, ఆ.

పగచాటు. ద్వ. వి. దూషించుట. "క. కసరెత్తిముక్కుడుస్సిన, పసరముపలెరేఁగి పరుషభాషలనన్నున్, విసువకపగచాటునఁబో, మ్మసమునవనదండపాలుఁడట్లొనరించెన్." పంచ. వేం. ౧, ఆ. "హస్తపంజరమునఁబూనిపెంచు శుకశాబకముంబగఁజాటుదయ్యె." కవిక. 3, ఆ.

పగటివేలుపు. దే. వి. (పగలు+వేలుపు.) సూర్యుఁడు, అహస్కరుఁడు. (రూ. పగటివేల్పు. "ఆ. చాలఁదపముఁబూనిసంయములవనముల, నిన్నుఁ గాంచువేడ్కనున్నవారు, దర్శనంబొసంగఁదగు రామయనిమేలు, కొల్పననఁగఁబగటివేల్పువొడిచె." అధ్యా. అ, కాం.)

పగటు. వై. స. క్రి. ప్రకటించు*. "క. ధరనెవ్వారలుచేసిన, దురితంబులునుచ్చరింపదోసమఁటమహా, పురుషులకొకకొదయొకచోఁ, బొరసిననది పగటుపాపముల్ పృథగనునే." కళా. ౮, ఆ. "సీ. తామరసంబులఁదన్మృణాళంబులఁ బగటుమొగంబులుబాహువులును." హరిశ్చ. ౧, ఆ.— వి. 1. ప్రకాశము*; "సీ. అవయవసరససౌష్ఠవములఁబెంపొందుమృగవిశాలేక్షణల్ పగటునూప." హన. ౫, ఆ.—2. లావణ్యము*. "ఆ. వచ్చిమదికిమెచ్చువచ్చునచ్చెలివింత, పగటుఁజూచి." శుక. ౧, ఆ.

పగడ. దే. వి. పాచికలమీఁది ఒంటిచుక్క. స. ఒకటి.

పగడపుజిట్ట. ద్వ. వి. (పగడము+జిట్ట.) పక్షివిశేషము.

పగడపురిక్క. వై. వి. (పగడము+రిక్క.) ఆర్ద్రానక్షత్రము.

పగడము. వై. వి. మణివిశేషము, ప్రవాళము.

పగడసాల. ద్వ. వి. (పగడ+సాల.) 1. పాచికలు సారెలుగలసొగటాలపలక; "ద్వి. పగడంబుపలకపైభవ్యరత్నముల, జగడంబుగులికెడుసారెలువన్ని, కనకకీలితపాశకములతోఁదెచ్చి, యునిచెవారలచెంతినొకదివ్యకాంత, జగదీశుఁడపుడు శ్రీసతిమోముఁజూచి, పగడసాలిదితెచ్చెఁబడ్డతినీచెలియ, యాడెదవేయొకయాటనాతోడ., విష్ణు. పూ. ౨, ఆ.—2. సొగటాలఆట. ...ద్వి.

"పగడసాలాడంగఁ బ్రమదంబుసొంది, జగతీశయి చటికిఁజనుదెంచినపుడు, నినుఁజిన్నపుచ్చుటనీతి కాదింక." నళ. 3, భా. (సంధినివర్ణవికారము.)

పగతుఁడు. ద్వ. వి. (పగ+అతఁడు.) శత్రువు.

పగతురాలు. ద్వ. వి. (పగతుఁడు + ఆలు.) శత్రురాలు.

పగదారి. వై. విణ. విరోధమువహించినవాఁడు.

పగఱు. ద్వ. వి. బ. (పగ+వారు.) శత్రువులు. "క. కఱకంఠవరమునాకుఁబ, గఱఁబరిమార్పంగశక్తిగలుగఁగనిమ్మా." భార. సౌ. ౧, ఆ. "పగఱుపోయిరిపోయిరి." (చూ. తాఁకుదల.)

పగలింటిదొర. దే వి. (పగలు+దొర.) సూర్యుఁడు అహర్పతి.

పగలు. దే. వి. దినము. (హలవసానంబులుపరమగుచో దీనియుత్వమునకు వికల్పముగాలోపంబగు. "పగల్ సనెఁజనెఁబగల్.")

పగలువత్తి. ద్వ. వి. ఒకదినుసుబాణపుసంచే, మత్తాబు.

పగవాఁడు. ద్వ. వి. పగతుఁడు, శత్రువు.

పగిడి దే. వి. కరబుజేము?.

పగిది. వై. వి. 1. విధము*; 2. కప్పము*. "ఆ. నందుఁడాదిగాఁగఁగొందఱుగొల్లలు, పగిదిధనముఁదీర్పఁబొలుఁజమురు, నులుపగొంచుఁగంనుఁడున్నచోటికిఁబోవు, వారిఁగాంచెననతిదూరమునను." వి, పు. ౭, ఆ.

పగులఁగొట్టు. దే. స. క్రి. (పగులన్ + కొట్టు.) పగుల్చు.

పగులఁబాఱు. దే. అ. క్రి. (పగులన్ + పాఱు.) పగులు. (చూ. పాఱు.)

పగులు. దే. అ క్రి. భిన్నమగు. వి. చీలిక.

పగులుచు. దే. ప్రే. పగులఁజేయు, (రూ. పగుల్చు.)

పగుల్లువాఱు. దే. అ. క్రి. (పగుల్లు+పాఱు.) చీలు.

పగ్గము. వై. వి. 1. గుఱ్ఱములోనగువానికళ్లెములోనగువానియందుతగిల్చి యీడ్చిపట్టెడుత్రాడు; "క. అగ్గలికనతఁడుహయముల, పగ్గంబులుసడలవిడిచిపటురయమునవా, మొగ్గరముఁదఱియఁబఱపిన, మ్రగ్గనురథపంచశతము మత్స్యాధిపుచేన్." భార. విరా. 3, ఆ. "ఉ. మేఁడియుసీరమున్ భుజముమీఁదభరించుచుఁ బోతుఁబెద్దతోఁ, గూడఁగఁగాఁడిఁబూన్చిమునికోలకరంబునఁబట్టిపగ్గమున్, త్రాడునుమోకువాఱెనయుఁదాలిచియుండటచెన్నుఁబొంగుత్రే, లాడఁగఁగా పెఁగట్టుకొనియక్కుటిలాత్మకుఁడేగఁజేనికిన్." శేష. ౪, ఆ.—2. సాలెవాఁడుపడుగునీడ్చికట్టెడుత్రాడు*; (చూ. కుంచె.) 3. తరిత్రాడు*; "ఉ. ఆదిమవ్యాళము దీనిపగ్గమయినట్టియవష్టదలంతునెప్పుడున్." స్వా. ౫, ఆ.—4. త్రాడు*. "సీ. వలపగ్గములుత్రెంచికలఁబడఁగొందఱిబొజ్జలుప్రయ్యంగఁబొడిచిపొడిచి." నీలా. ౨, ఆ.

పగ్గించు. వై. అ. క్రి. ప్రజ్ఞలుపలుకు. "వ. చూప అగ్గింపఁబగ్గించియు నెగ్గించియు." ఉ, హరి. ౫, ఆ.

పగ్గె. వై. వి. 1. సామర్థ్యమునుదెలుపుమాట, "ఎ గీ. చెంతఁజేరిననీవేమిచేయుదాన వాయెనీపట్టి పగ్గెలేలమ్మయనుచు." ఉ, రా. ౬, ఆ.—2 సామర్థ్యము*. "ఎ. గీ. కోఁతులెచ్చుటజగడంపుఁజేఁతలెచటఁ; బగ్గెలటువెట్టిదిగ్గునఁ బాఱిచనుఁడు" అచ్చ. యు. కాం. (మొదటిరూపము పగ్గియ)

పంక్తి. సం. వి ఇ. స్త్రీ. 1. వరుస; 2. ఒకఛందస్సు, (చూ. ఛందస్సు ) 3. పది.

పచ. సం. వి. ఆ. స్త్రీ. పాకము, వంట.

పచంపచ. సం. వి. ఆ. స్త్రీ. మ్రానిపసుపు?.

పచనము. సం. వి. అ. న. పాకము, వండుట.

పచారి. హిం. వి. చిల్లరదినుసులమ్మువాఁడు. (పచారి దినుసులు.)

పచేరము. వై. వి విహారము. (ఇది నైఘంటికము.) (పచారు, వాడుకరూపము.)

పచేళిమము. సం. విణ. (అ. ఆ అ తనంతట పక్వమైనది.

పచ్చి. దే. విణ. 1. తడిగలది, (పచ్చిపిడుక. మొ.) 2. ఉడుకనిది; (పచ్చిపులుసు. మొ.) 3. ఎండనిది; (పచ్చికసవు. మొ.) 4. కాలనిది; (పచ్చికుండ. మొ.) 5. తేఱనిది; (పచ్చియొడలు. మొ.) 6. మఱుఁగులేనిది; (పచ్చిమాట. మొ.) 7. ముదురనిది. (పచ్చికాయ. మొ.)

పచ్చిక. దే. వి. (పచ్చి+కలది.) పచ్చికసవు, శాదము.

పచ్చిదేఱు. దే. అ. క్రి. (పచ్చి+తేఱు.) పచ్చియగు.

పచ్చిబియ్యపుమామిడి. దే. వి. (పచ్చిబియ్యము+మామిడి.) నారలేక కండగలమామిడి?.

పచ్చిబియ్యము. దే. వి. 1. నానఁబ్రాలు, 2. ఉప్పుడుచేయనిబియ్యము.

పచ్చెకాఁడు. ద్వ. విణ. (పచ్చెము+కాఁడు.) చూచుచుండఁగా దొంగిలించువాఁడు.

పచ్చెము. వై. వి. చూచుచుండఁగా దొంగిలించుట. (మొదటిరూపము పచ్చియము.)

పచరణ. వై. వి. నటన*. "ద్వి. పచరణకాదుమీపాదంబులాన." హరిశ్చ. ౧, భా.

పచరించు. వై. అ. క్రి. ప్రవర్తించు. "ఎ, గీ. నేలపైనిల్చితమయేపునిల్పలేక, బెడిదముసఁబర్వెపిడుగులకడిమియెంత, యనుచు గేలిగ రచ్చలనాడుకొనుచు, నేచిపచరింతురచ్చటిరాచవారు." య. ౧, ఆ.—స. క్రి. 1. ప్రసరింపఁజేయు*; "తే. తన్నుఁగానంగరానీకతనువుదాఁచి, యాకసంబుననుండివిహంగరాజు, భక్తినెఱకలనీడనప్పుష్టనాథు, మీఁదఁబచరించెబీఱెండ మెఱయకుండ." హరి. పూ. ౭, ఆ.—2. (అంగడియందమ్ముటకు) సరకులసమర్చు*; "చ. వననిధిలోనిరత్నములువాసుకిమూర్ధజరత్నసంఘముల్, గొనఁగనశక్యముల్ జనులకుల్ సమకూఱదుగాననెప్పుడుల్, గొనఁగఁబరార్థ్యవస్తువులఁగోరినవానినయిచ్చునత్తెఱం, గునఁబచరింతురంగళులఁగోమటులప్పురిసిద్ధరత్నముల్." భార. ఆది. ౮, ఆ—3. వలపఱచు*; "సి. సాయంతనంబనుజాలరిజలధిలోఁబచరింపవలడిగ్గఁబాఱినట్లు." ఉ, హరి. ౪, ఆ.—4. ప్రయోగించు*; "సీ. అవలిరెండవయుపాయంబైనభేదముఁ బచరించుఁబున్యాపాపములయందు." భో. ౭, ఆ.—5. బాణముప్రయోగించు*; "అంబకపంచకంబుగలయంబచరించుచు." వసు. ౫, ఆ.—6. చాఁచు*, 'చ. చేతులుపచరించుచున్ దనువుధూళిమెయింబొరయంగనేలన, న్నెలమిని గాఁగిలించుకొనవు." మార్క. ౧, ఆ.—7. నడపు*; "సీ. శుచివృత్తినెన్నాళ్లుపచరించెనోతీర్థసంవాసమిచటివిహంగవ్రజంబు." వసు. 3, ఆ.—8. సవరించు*; "క. కనికనుకనిఁదమకైదువు. లనువుగఁబచరించికొనుచునభిముఖులైయుం, తనతత్తేజోహతదశ, ఘనులగుటందల్లడిల్లిక్రమ్మఱిరివెసన్." హరి. ఉ. ౬, ఆ.—9. ప్రకటించు*. "ద్వి. హరివద్దనడచినయవ్వార్తలెల్లఁ, బచరించి." విష్ణు. ఉ. ౫, ఆ.

పచరింపు. వై. వి. ప్రసరణము. "గొనబుంబచరింపులసిగ్గుఁబ్రేమయుంబెనఁగొని." వు. ౨, ఆ. (చూ. అరగింపు.)

పచారము. వై. వి. అంగడి*. "ద్వి. మెఱుఁగుముత్తెపుడాలమించుపచారము." విష్ణు. ఉ. ౪, ఆ.

పచారించు. వై. స. క్రి. 1. నడపు*; "ఈగతినిజక్రీడల్ పచారించుచో." రామా. ౬, ఆ.—2. ప్రసరింపఁజేయు*. "వ. నుసునసోగవెన్నెలలంగలసిపిసాళించుచంచలదృగంచలప్రభలంబచారించి." స్వా. ౫, ఆ

పచ్చ. వై. వి. 1. పసరువన్నె; 2. పసుపువన్నె*; 3.మరకతమణి*;4.పచ్చనిచెట్టుమొదలైనది*;"పసినేదుదర్శించుఁబైరుఁబచ్చ." పాండు. 3, ఆ. "ఉ. కోరికలెల్లఁజాలనొడఁగూర్చుప్రియుంబెడఁబాసినట్టిపం, కేరుహపత్రలోచనకుఁగీరముపైరముహారమెంతయుక్, భారముమంచికప్పురపుఁబల్కులుముల్కులుపచ్చవెచ్చశ్శ్రీం, గారవనాంతరాళశశికాంతపువేదులు నూఁదులారయన్." హరిశ్చ. 3, ఆ.—5. కరచరణాదులయందుపొడుచుకొనుటచేతనేర్పడెడుపసరువన్నెరేఖ*. విశ. 1. పసరువన్నెగలది; 2. పసుపువన్నెగలది*. [పచ్చ అను విశేషణము ముందుగల సంజ్ఞావాచకశబ్దములు.—పచ్చగన్నెరు (పచ్చపూవులగన్నెరు?.), పచ్చగోరంట (కురంటకము?.), పచ్చచేమంతి (కురంటకము?.), పచ్చజేనము (శణపుష్పి?.), పచ్చజొవ్వి (కలుజొవ్వి, కపీతనము?.), పచ్చనీరుల్లి (దుర్ద్రుమము?.), పచ్చపెసలు (ఖండీరము.), పచ్చయరఁటి (మహారంభ?.), పచ్చయిరుగుడు (పారిణి?.). ఇత్యాదులు.]

పచ్చఁబ్రాలు. ద్వ. వి. బ (పచ్చ+ప్రాలు.) శోభనాక్షతలు. "ఉ. అల్లనవెండిపళ్లెరములందునగందముఁబూలఁబచ్చఁబ్రాల్, పెల్లుగనించి." య. ౪, ఆ.

పచ్చకన్నులమెకము. ద్వ. వి. సింహము, హర్యక్షము. "రాచపచ్చకన్నులమెకము." అచ్చ. యు, కాం.

పచ్చకన్నులవేల్పునూఁడు. ద్వ. వి. ఒకానొకరాక్షసుఁడు, పింగళాక్షుఁడు. "ఎ, గీ. వ్రేలిమిడిఁబచ్చకన్నులవేల్పునూఁడుఁ, జిదిమివైచిన." అచ్చ. సుం. కాం.

పచ్చకప్పురము. వై. వి. చల్లఁదనమును మంచి పరిమళమునుగల యొకవిధమయిన కర్పూరము.

పచ్చగన్నెరు. ద్వ. వి. 1. పచ్చపూవులగన్నెరు?; 2. ధాన్యవిశేషము. "పచ్చగన్నెరు పూఁబాలు." ఆము. ౧, ఆ. (చూ. కస్తురిపట్టెలు.)

**పచ్చడము.** వై. వి. 1. పఱుపుమీఁదపఱచెడుదుప్పటి; "వెన్నెలవెల్లపచ్చడమువిచ్చినయంబరశయ్యమీఁద." లక్ష్మీ. 3, ఆ.—2. వస్త్రము*; "క. కడకడలికేఁడివెలుఁగను, జడదారివడిఁ గొమునుంగఁ జనిజేగుఱుఁబచ్చడమాఱఁగబ్టైదరినఁ, బడమటనెఱసంజనిండెబలుఁపుగమటియుక్." య. ౨, ఆ.—౩. కట్టువస్త్రము*; "తే. అమరవందితశూలాయుధమునఁజేరి, యొడలుతిత్తొల్చితోలుపచ్చడము చేసి, యుత్తరాసంగముఁగఁజేసి యుండవలయు, నోడిగిలిరక్తబిందువులుట్టిపడఁగ." కాశీ. ౫, ఆ.—4. అంగవస్త్రము*. "సీ. కటిమండలమున నీర్కావిదోవతి మీఁదవెలిపట్టుపచ్చడంబలవుమిగుల." రుక్మి. ౧, ఆ.

**పచ్చడి.** దే. వి. 1. కూరగాయదినుసులుమొదలైనవానినేదేనిఖండములుచేసివేసి పలుచగాచేసినవ్యంజనవిశేషము; 'ఎ, గీ. ఊరుఁబిండులునొకకొన్నియొక్కకొన్ని, యూరుఁగాయలుఁబచ్చళ్లునొక్కకొన్ని." పాండు. ౪, ఆ.—2. ఖండము; "వెడఁదగొడ్డండ్లఁబచ్చడిసేయఁబడువారు." కవిక. ౫, ఆ.—3. ఊరుఁబిండి.

**పచ్చతలపిచ్చుక.** ద్వ. వి. పక్షివిశేషము, పీతముండము.

**పచ్చన.** వై. వి. 1. పసరువన్నె; 2. పసుపువన్నె*. (విశేషణమైనచో. "పచ్చనిహురుమంజిపనివాగపక్కెర." స్వా. ౪, ఆ. మొ.) (చూ. అలకన.)

**పచ్చపచన.** వై. వి. (పచ్చన+పచ్చన.) మిక్కిలిపచ్చన. "పచ్చపచనయినదళంబులు." చమ. ౧, ఆ.

**పచ్చపిట్ట.** వై. వి. పక్షివిశేషము, హారితము.

**పచ్చపులుఁగు.** ద్వ. వి.——వై.——

**పచ్చముపాడు.** దే. విణ (పాడు+పాడు.) మిక్కిలిశూన్యము. "సేనలన్నియుంబచ్చముపాడుగావితిగిపాఱె." జై. ౪, ఆ.

**పచ్చవలువదారి.** ద్వ. వి. విష్ణువు, పీతాంబరుఁడు.

**పచ్చవారువపుజోదు.** ద్వ. వి. (పచ్చవారువము+జోదు.) 1. సూర్యుఁడు, హరిదశ్వుఁడు; 2. మన్మథుఁడు, శుకవాహుఁడు. (రూ. పచ్చవార్వపుజోదు. "సీ. పచ్చవార్వపుజోదుపచ్చవార్వపుజోదువలకన్నుఁగొడుకునైవలపుగులుక." అచ్చ. బాల, కాం.)

**పచ్చవిలుతుఁడు.** ద్వ. వి. మన్మథుఁడు, ఇక్షుధన్వుఁడు. "క. సెచ్చెలులుతన్నుఁగొలువఁగఁ, బచ్చవి[illegible]ముయొల్లఁబద్మాననయై, యచ్చుపడినట్లు మెఱయుచు, నచ్చటికేతెంచె భూవరాత్మజ ననిమిష్." భార. అర. ౭, ఆ. (రూ. పచ్చవిల్తుఁడు. ఇట్లు పచ్చవిలుకాఁడు. మొ.)

**పచ్చాకు.** ద్వ. వి. (పచ్చ + ఆకు.) హరితపత్రికాపత్రము.

**పజె.** వై. వి. జనము. "క. దేవరనీవీపజలను, బ్రోవఁగ." నీలా. ౨, ఆ.

**పజ్జ.** వై. వి. 1. వెనుక; "గీ. నాదుకోదనంబునన్నునెఱుంగఁగ, వలతువేనినమరవల్లభుండ, నాపిఱుందరమ్మునావుడునప్పుడు, వనితపజ్జనరిగెవాసవుండు." భార. ఆది. ౭, ఆ.—2. సమీపము*. "క. పలలాదబలంబులలకపజ్జకుఁజనియెన్" ఉ, రా. 3, ఆ.

**పటకా.** హిం. వి. నడుముబిగించుపట్టె, నడికట్టు.

**పటకారుఁడు.** సం. వి. అ. పుం. సాలెవాఁడు.

**పటచ్చరము.** సం. వి. అ. న. ప్రాఁతగుడ్డ.

**పటపట.** దే. వి. కదలుటయందును కొఱుకుటయందును పగులుటయందును నగు ధ్వన్యనుకరణము. (చూ. పంట్రకోల.) "గీ. పటపటఁగపాలపంక్తులుఁపగులఁగొటికి." స్వా. ౪, ఆ. "చ. పటపటపండ్లుగీటుకొని పంక్తిముఖానురభర్తపుష్పకం, బటుడిగి." ఉ, రా. 3, ఆ. "పటపటటాకికంబమిరుపాయలుగా." పా. 3, ఆ.

**పటము.** ఉభ. వై. వి. పాఁపపడగ. సం. అ. పుం. న. 1. వస్త్రము; 2. చిత్తరువువ్రాయువస్త్రాదికము. పుం. పోరటికి.

**పటలము.** సం. వి. అ. న. 1. ఇంటికప్పు; 2. సమూహము; 3. పరివారము; 4. గ్రంథభాగము, 5. నేత్రరోగవిశేషము; 6. నొసటిబొట్టు. పుం. రత్నదోషము.

**పటలి.** సం. వి. ఈ. స్త్రీ. సమూహము.

**పటవణి.** దే. వి. వ్యాపనము. "అరిగలపటవణినలరుచోట్లు." కళా. ౮, ఆ.

**పటవణించు.** దే. అ. క్రి. వ్యాపించు. "పటవణించినయరిగలపాఁజు." కవిక. ౨, ఆ.

**పటవాసకము.** సం. వి. అ. పుం. వస్త్రములకు వాసనకట్టెడు బుక్కాము.

**పటహము.** సం. వి. అ. పుం, న. తప్పెట. పుం. యుద్ధవాద్యపు మ్రోఁత.

**పటా.** వై. వి. గోనెపట్టలోనగునది*. "ఎ, గీ. పసిఁడికమరుపటాయొక్కకిసలయాక్షి, మొలనుధరి

యించె." రసి. ౧, ఆ. (పట్టాయొక్క రూపాంతరము.)

పటాకి. హిం. వి. మందుసామానుజాతి, (టపాసు అని కొందఱందురు.)

పటాణి. దే. వి. గుఱ్ఱము. "చిలుకపటాణిరాతు." ఉ, రా. ౪, ఆ.

పటాపంచే. దే. విశ. అగోచరము. "పాపపూరుషుఁ బటాపంచచేసి." పాండు. ౨, ఆ. (రూ. పటాపంచేము. "మిమ్ముం జేర్చొన్నమాత్రంబటాపంచంబైదురితంబులెల్లజనఁగా." విజ. ౨, ఆ.)

పటాలము. వై. వి. దండు*.

పటిక. వై. వి. పటికారము. "పటికనార్చినపైఁడిప్రతిమపగిది." పర. ౨, ఆ.

పటికబెల్లము. ద్వ. వి. (పటికము+బెల్లము.) కండచేక్కర.

పటికము. వై. వి. ఒకదినుసు తెల్లటాయి.

పటికారము. వై. వి. (పటిక+కారము.) వెలిగారము.

పటికిరింత. దే. వి. చేలము. "ద్వి. పటికిరింతలపిల్లిపట్టినదొబ్బ." హరిశ్చ. ౨, భా.

పటితళించే. దే. స. క్రి. చేఱచే. "గీ. బాహువెత్తిచటిల్లనఁబటితళించి." ఉ, హరి. ౬, ఆ.

పటిమ. సం. వి. న్. పుం. 1. నేర్పు; 2. ఓపిక.

పటిష్ఠము. సం. విశ. (అ. ఆ. అ.) మిక్కిలిపటువైనది.

పటీరము. సం. వి. అ. న. చందనము. పుం. చందనవృక్షము.

పటుకాఋ. దే. వి. పట్టుకాఋయొక్క రూపాంతరము.

పటుకు. దే. వి. పడవైచుటయందగుధ్వన్యనుకరణము. "పటుకునఁబడవైచి." భీ. ౨, ఆ.

పటుక్కు. దే. వి. తెగుటయందగుధ్వన్యనుకరణము. "కుట్టుపటుక్కునందునిసి." ఆము. ౪, ఆ.

పటుపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. రెడ్డివారినానఁబ్రాలు?.

పటువు. సం. వి. ఉ. న. ఇందుప్పు. పుం. చేతిపాట్ల?. విశ. 1. చొరవకాఁడు; 2. తెవులులేనివాఁడు; 3. నేర్పరి.

పటుసాలె. వై. వి. పట్టుసాలెయొక్క రూపాంతరము.

పటేలు. మహ. వి. గ్రామాధికారి.

పటోలము. సం. వి. అ. పుం. 1. చేఁతిపాట్ల?; 2. పొట్ల?.

పటోలి. సం. వి. ఈ. స్త్రీ. పొట్ల, పటోలిక?.

పట్ట. వై. వి. 1. చెట్టుమీఁదితోలు; (చూ. సార.) 2. గోనెపట్టలోనగునది. (కమ్మరపట్ట. మొ.)

పట్టకము. సం. వి. అ. పుం. తమ్మపడిగము. "శ్లో. అధమాతురుశిరవాసితమ్, నిజతాంబూలరసేనరంజితమ్, తపనీయమయేహిపట్టకే, ముఖగండూషజలంవిధీయతామ్." దేవీమానసికపూజ.

పట్టడ. దే. వి. కుమ్మరివడ్లంగిలోనగువారు పనులుచేయుచోటు, ఆవేశనము.

పట్టణము. సం. వి. అ. న. కోటచేతను అగడ్తచేతను దుర్గమమైన ప్రధాననగరము.

పట్టపగలు. దే. వి. (పగలు+పగలు.) మట్టమధ్యాహ్నము, కుతపము.

పట్టపుటేనుఁగు. వై. వి. రాజెక్కెడియేనుఁగు, భద్రగజము.

పట్టపువాఁడు. దే. వి. (పట్టము+వాఁడు.) తెూలివాఁడు. (ఇక్కడ పట్టమునకుపట్టుట అర్థము. అప్పుడిది అడ్డముమట్టములోనగువానివంటిది.)

పట్టభంగము. సం. వి. అ. పుం. మెట్టు, సోపానము. "లోనికిమణిపట్టభంగసరణిఁ దరణీసురుఁడేగి." స్వా. ౨, ఆ.

పట్టము. ఉభ. దే. వి. బిరుదు. (పట్టపుపేరు.) వై. రాజ్యము. "రాకాసిపెకఁ బట్టంబె లెనతండు." య. ౨, ఆ.—సం. అ. పుం. రాజ్యాభిషేకకాలమునెనొసటఁగట్టెడుపట్టె; 2. పట్టునూలు; 3. చెట్టుమీఁదిపట్ట; 4. (రాజోద్యోగులకిచ్చెడు) పట్టా; 5. చదుకము; 6. (వ్రణముమొదలైనవానికి కట్టెడు) కట్టు; 7. సన్నెకల్లు; 8. పీట.

పట్టసారాయి. వై. వి. మద్యవిశేషము.

పట్టా. వై. వి. 1. రాజోద్యోగులకిచ్చెడుకవులు; 2. రెండువైపులవాదరగలపెద్దకత్తి; 3. గోనెపట్టలోనగునది*. (చూ. పటా )

పట్టి. ఉభ. దే. అవ. పంచమీవిభక్తియందువచ్చెడియొకానొకప్రత్యయము. వి. అపత్యము. (కొడుకు, కూఁతురు.)—సం. ఈ. స్త్రీ. 1. పలక; "లలాటపట్టి."—2. రాజ్యాభిషేకకాలమునందునొసటఁగట్టెడుపట్టము. ఈ. స్త్రీ. న్. పుం. ఎఱ్ఱలొద్దుగు?.

పట్టించే. దే. ప్రే. 1. (విద్యార్థులకు నూతనపుస్తకపఠనమును) ప్రారంభముచేయించు; 2. ప్రారంభముచేయించు. (రేపు నీపనిపట్టించెదను.)

పట్టించు. దే. వి. 1. (విద్యార్థులకునూతనపుస్తకపఠనము) ప్రారంభముచేయించుట; 2. అక్కఱ. (వానికి చదువునందు పట్టించులేదు.) (చూ. ఆరగించు.)

పట్టిక. సం. వి. అ. స్త్రీ. 1. పలక; "ఫాలపట్టిక."— 2. మంచములోనగువానిచట్టము; 3. కమ్మరవానిదాఁగలి.

పట్టికాఖ్యము. సం. వి. అ. పుం. ఎఱ్ఱలొద్దుగు?.

పట్టికామంచము. సం. వి. అ. పుం. పట్టెమంచము.

పట్టిపట్టి. దే. వి. మనుమఁడు, మనుమరాలు.

పట్టియ. వై. వి. 1. పలక; (చూ. తగడు.) 2 రాజ్యాభిషేకకాలమునందు నెసటఁగట్టెడు పట్టము*; 3. మంచములోనగువానిపట్టె*; "వ. కౌశల్యయందమరించినవారినీలంపుఁబట్టియలును." అని. ౧, ఆ. "సీ. పెద్దతామరకెంపుబిగిపట్టియలచేతసొబగైనముత్యాలసోరణముల." య. ౧, ఆ. — 4. మిద్దెటింట్లకుమీఁదనడ్డముగాపఱచెడు ద్రాసులోనగునది*; 5. పక్క*; 6. పట్టెవలెతీర్చినద్రవ్యద్రవ్యపురేఖ*; 7. బ. పట్టెలుతీర్చినసున్నపుపూఁతలోనగునది*. (చూ. పట్టె.)

పట్టియము. వై. వి. 1. పెద్దకత్తి; (చూ. చేకత్తి.) 2. కత్తి*. (చూ. పట్టెము.)

పట్టిలి. దే. వి. ఎడముగావంపఁబడినవ్రేళ్లుగలచేర.

పట్టిసము. సం. వి. అ. పుం. ఆయుధవిశేషము, అడ్డకత్తి. "చ. ముసలగదాధనుర్విశిఖముద్గరతోమరభిండివాలప, ట్టిసపరిఘాదులొక్కరవడిఁగొనిచుట్టునుముట్టినొంప." రా. యు, కాం.

పట్టీ. దే. వి. 1. వస్తువులనామములనువరుసగావ్రాసినకాకితములోనగునది; 2. లోపలవక్కపెట్టిచుట్టినతమలపాకుచుట్ట; 3. ఇనుములోనగువానిఊకు.

పట్టు. యు. దే. అ. క్రి. 1. చెల్లు; "క. అదియతివిస్తారముపె, క్కుదినంబులుపట్టుఁజెప్ప." భార. అశ్వ. 3, ఆ.—2. బహుకాలముచెల్లు; "చ. చుట్టుచుమొగంబువ్రేసినటులౌతనయూర్ధ్వులనింకియించిపో, యినపలుపేంట్లుగోరఁగొనియొత్తనపట్టెనుమాటిమాటికిఁ." ఆము. ౫, ఆ.—3. పద్దుపట్టు; "ఉ. పట్టినకార్యమీశ్వరుఁడుపట్టిపెనంగినఁజేరనీకచే, పట్టుటరాజధర్మము." జై. ౮, ఆ.—4. ఇంకు; "నాకట్టుమనఁబుపట్టు." భార. విరా. ౨, ఆ.—5. ప్రారంభించు; "పట్టుపెకిముసురందు." ఆము. ౮, ఆ.—6. అంటు; (వీనికి అక్షరమునోటపట్టదు, గుడ్డకుచాయపట్టలేదు.) 7. అక్కఱకలుగు; (కావలసియుండినదీవుపోనాకేమిపట్టినది.) 8. పట్టుదలచేయు; "వ. అనినధర్మాచరణంబునకింతపట్టిపెనంగందగునె." భార. ఉద్యో. ౮. ఆ.—9. కలుగు. (జొన్నవెన్నుతీసినది ఇంకగింజపట్టలేదు, వీనికిక్రొవ్వుపట్టినది.)—స. క్రి. 1. గ్రహించు; "పడఁతినీకరములుపట్టంగఁదివిరి." భార. విరా. ౨, ఆ. (ఈయుంగరమునావ్రేలుపట్టదు, ఈగోనెయెంతబియ్యముపట్టును. ఇత్యాదిస్థలములయందుపట్టు అనుక్రియగ్రహణార్థకమనియేయుండునవి.)—2. నిర్బంధముచేసిగ్రహించు; (గుఱ్ఱమునుపట్టికట్టుము.)—3. అవలంబించు; "వ. మాపట్టినయపురుగంటవ్రేళ్లంగాలుండు మూషకవ్యాజంబునంగొఱికిన." భార. ఆది. ౨, ఆ.—4. ఊఁదు, "పట్టెశంఖము." భార. విరా. ౮, ఆ.—5. మూర్కొను; (వాసనపట్టు.)—6. పిసుకు; (వాకు నడుముపట్టుము.)—7. జెట్టికిలెటిఁగికరచరణాద్యవయవములను ఇటునటుకదలకయదుము. — వి. 1. గ్రహణము; (చంద్రగ్రహణము నెలపట్టు, సూర్యగ్రహణముపొద్దుపట్టు.) 2. పద్దు; "చ. కార్యపుమాటలిట్టివే, పతిదెసఁగూర్మివాపుటకుఁబట్టుగనెక్కుపతిక్కువంచును, న్నతులగుమేదినీశులకునానగఁబల్కుటగాక." భార. ఉద్యో. ౮, ఆ.—3. పూఁత; "నిడువాలికకస్తురిపట్టువెట్టి." పా. ౧, ఆ. "సీ. గరితలటొమ్ములగడితంపుగోడలఁబట్లునుబట్లునుబసపాసంగ." అచ్చ. బాల, కాం.—4. వాసస్థానము; "క. వినుసంసృతిమృత్యువుప, ట్టనఘానిస్సంగవృత్తియమరగృహము." భార. శాం. ౮, ఆ.—5. స్థానము; "సీ. అర్కునియుదయంబునస్తమయము, నగుపట్టుపొలిమేరలైన మహాక్షేత్రమంతయునొక్కండయనుభవించె." భార. ద్రో. ౨, ఆ.—6. అవకాశము; "వ. కాలక్రమంబుననచ్చోటఁదిరుగంబట్టుగానక." భార. అర. ౮, ఆ.—7. వెడలుపు; "వ. పట్టుగలపటికంపుఱాచట్టు నేలలనట్టుకొని." స్వా. 3, ఆ.—8. ధైర్యము; "క. ముట్టఁబడిదీర్ఘసూత్రుం, డిట్టట్టురుగఁగనుపాయమేదియుకనిచే, బట్టువడెదనదుడెందము, పట్టువదలిచకితవికలభావేంద్రియుండై." భార. శాం. 3, ఆ.—

9. విషయము; "క. చుట్టతనంబునఁగడుమా, పట్టునఁగనికరముకూర్మిబయలుపడంగా, నెట్టుకొనిశేల్పుటొజ్జల, పట్టికచుండొరిమతోడఁబనులొనరింపక." య. 3, ఆ.—10. కారణము; "పుష్కరంబు బ్రహ్మకు నాదినాఁ బట్టయ్యెనెట్లొకొ." భార. శాం. ౪, ఆ.—11. అవలంబము; (వానికిపట్టుదొరకలేదు.)—12. అక్కఱ; (నీకాకార్యమందుపట్టున్నదా?) — 13. పట్టుదల; (అందేమియుపట్టుకానము.) — 14. ఘట్టము; (ఇది మంచిపట్టు ఇక్కడవదలకుము.)—15. జెట్టికీలెఅఁగికరచరణాద్యవయవములను ఇటునటుకదలకయదుముట; 16. బంధుత్వము. (కొన్నినిఘంటువులయందు ఈయర్థము వ్రాయఁబడియున్నది.) — వై. ఒకజాతిపురుగులపిల్లకలిగెడు ఒకదినుసు మేలుతరపునూలు. (పట్టుచీర, పట్టుఅవిక. మొ.)

పట్టుఁగొమ్మ. దే. వి. (పట్టు+కొమ్మ.) ఊఁతకోల, ఆధారము. "కౌరవకోటికిఁబట్టుఁగొమ్మ." భార. శాం. ౧, ఆ.

పట్టుకాఱు. దే. వి. నిప్పునకాఁచినలోహములను ఎత్తెడు ఒకయినుపకోఱముట్టు, సండంశము.

పట్టుకొను. దే. అ. క్రి. 1. నెలకొను, నిలుచు; "చ. అనిమునిచెప్పవేడ్కహృదయంబునఁబట్టుకొనంగమైథిలీ,తనయులుదానికియ్యకొని." నిర్వ. ౧౦, ఆ. — 2. (వాయురోగము మొదలగువానిచేత) బిగిసికొను. (మెడపట్టుకొన్నది ) (ప్రే. పట్టుకొలుపు.)

పట్టుకోలు. దే. వి. నిలుపు. "ఎ, గీ. వెగడుపడినయుల్లంబుపట్టుకోల్ పఱుపఁదనకు, వశముగాకున్న." భార. విరా. ౨, ఆ.

పట్టుజీనువు. ద్వ. వి. పక్షివిశేషము. "చ. పగడపుజిట్టలకొమనికిపట్టుగఁగట్టినపట్టుజీనువుల్." వసు. ౧, ఆ. (కొందఱు దీనికర్థము 'పిగిలిపిట్ట' అని వ్రాసియున్నారు.)

పట్టుడు. దే. వి. పట్టుదల. (చూ. సగ్గిసముగ్గిసలు.)

పట్టుదల. దే. వి. వదలనిపట్టు, అభినివేశము.

పట్టుపురుగు. వై. వి. పట్టువంటివర్ణముగల ఒకదినుసుపురుగు, ఇంద్రగోపము.

పట్టుబడి. దే. వి. ఏదేనొకదానిక్రింద వ్యయమైన ధనము.

పట్టువడు. ద్వ. అ. క్రి. (పట్టు+పడు.) 1. చిక్కు; "క. పట్టువడినసుగ్రీవునిఁ, గట్టెదురంగాంచి." భార. అర. ౭, ఆ.—2. విదితమగు. "సీ. నెఱివిట్టిదనియింతినీనెమ్మనంబెన్ని భంగులనరసినఁబట్టువడదు." భార. విరా. ౨, ఆ. (ప్రే. పట్టువఱుచు. విదితముకావించుటకు. "వ. అనియాశిశుపాలుంబట్టువఱుచుచున్న." భార. సభా. ౨, ఆ.)

పట్టుసారువ. దే. వి. మీటఁద్రొక్కువాఁడుపట్టుకొనుటకు గుంజతోచేర్చికట్టిన పంగలకొయ్య.

పట్టుసాలె. వై. వి. పట్నూలవాఁడు. (మొదటిరూపము పట్టుసాలియ.

పట్టె. వై. వి. 1. పలక; 2. మంచెములోనగువాని చట్టము*; 3. రాజ్యాభిషేకకాలమునందునొసటఁగట్టెడుపట్టము*; "నొసటహొంకపట్టెఁగట్టి." అచ్చ. యు, కాం.—4. మిద్దెటిండ్లమీఁదఁబఱచెడుమ్రానులోనగునది*; 5. పక్క*; (అరవపట్టెలుతీర్చినదా?) 6. పట్టెవలెఁదీర్చిన ద్రవద్రవ్యపురేఖ*; (పట్టెనామము.) 7. కుంచె*; 8. బ. పట్టెవలెఁదీర్చిన సున్నపుపూఁతలోనగునది*. (మాణిక్యపట్టెలు, సున్నపుపట్టెలు. మొ.) (పట్టియరొక్కరూపాంతరము.)

పట్టెడ. దే. వి. 1. మంచెములోనగువానికినల్లెడునవారు; "వ. పట్టియలనలవరిఁచియల్లిన పట్టుపట్టెడయును." అని. ౨, ఆ.—2. ఎద్దుమొదలైనవానిమెడకుకట్టుటకు ఉపయోగముగానూలితోచేసినపట్టె; 3. పట్టెవలెకోసినతోలు; "బిగిపట్టెల్లమరించి." రామా. ౨, ఆ. — 4. పట్టెవలెచాఁగఁగొట్టినతగడు; 5. పట్టెవలెనుండెడు స్త్రీకంఠాభరణవిశేషము; "ద్వి. బంగారుపట్టెడబన్నసరంబు." సా. ౨, భా.—6. కమసాలెవానిదాఁగలి; (చూ. కమటము.)—7. వృక్షవిశేషము.

పట్టెడమ్రాను. దే. వి. సానదిండుప్రక్కకొయ్యల క్రిందిచట్టము.

పట్టెమంచెము. వై. వి. నవారుపట్టెడ అల్లినమంచెము.

పట్టెమాఱుపు. ద్వ. వి. వస్త్రమునందలిచిత్రవర్ణవిశేషము.

పట్టెము. వై. వి. పట్టియవుఱొక్కరూపాంతరము. (కత్తికి. "వ. విచిత్రవేగంబునఁగల భాషిణికాప్పుపట్టెపట్టెంబుజళిపించి." దీనిక్రింద "సత్తికిఁగత్తిచెయ్యెత్తిమ్రొక్కి." అనియున్నది. శశా. 3, ఆ.)

పట్టెవర్ధనము. మి. వి. మగవారుమిక్కిలివెడల్పుగా సుదళముగానుపట్టెవలెతీర్చిననొసటిబొట్టు. "ఎ, గీ. పెనగిరియొక్కడుపట్టెవర్ధనమునాక." హరి శ్చ. ౪, ఆ.

పట్నము. వై. వి. పట్టణము. హంస. ౧, ఆ.

పట్రా. దే. వి. కిరాతభేదము. (పట్రవాఁడు,పట్రది.)

పఠనము. సం. వి. అ. న. పఠించుట, చదువు.

పఠించు. సం. స. క్రి. చేదువు.

పఠిత. సం. విణ. (ఋ. ఈ. ఋ.) పఠించువాఁడు.

పఠితము. సం. విణ. (అ. ఆ. అ.) పఠింపఁబడినది.

పఠితవ్యము. సం. విణ. (అ.ఆ.అ.) పఠింపఁదగినది.

పడఁకు. దే. వి. 1. సందు; "చ. జడధిమథింపఁజిక్కి సుధసౌరభమానుటఁజావుదక్కెఁగా,పడఁకులనుం డిదుగ్ధభవపాండిమబొందులనందమొందనిం, ద డవిమెకాలతోఁగదుపులైచరియించునుమేఁతకై బయల్, వెడలి డులీకులీరళకులీమకరీముఖవారి జంతువుల్." స్వా. ౫, ఆ.—2. గుహ. "ఆ. అ పుడుపడఁకునుండియరుదెంచుసింగంపుఁ, గొద మహోలె." అచ్చ. యు, కాం.

పడఁత. దే. వి. హనువు. "సీ. భంగించినట్లుండుపడఁత మాటికిమాటికూర్ధ్వకంపంబుసేయుటకతమున." కాశీ. ౬, ఆ.

పడఁతి. దే. వి. ఆఁడుది, ఇంతి, తొయ్యలి, వనిత.

పడఁతుక. దే. వి. (పడఁతి + ఉక.)——పై.—— (స్వార్థమున ఉక.)

పడగ. వై. వి. 1. టెక్కెము; "తే. పడగలంతంతఁగ్రాలంగసిడములొప్ప." నిర్వ. ౬, ఆ.—2. సర్పఫణము; "క. నీపడగమీఁదనుండెడు, నాపదచిహ్నములుచూచినగరుడుఁడుని, న్నేపునభక్షింపఁడు." వి, పు. ౭, ఆ.—3. స్త్రీకర్ణభూషావిశేషము*. "ఎ, గీ. పొగడమువ్వపూసనాణెమెట్టెబవిర పడగ, చుక్కబొట్టనఁజిటిపొటి సొమ్ముగలిగి." పంచ. వేం. ౪, ఆ.

పడగదారి. వై. వి. పాము, ఫణి. అచ్చ. అ, కాం. (ఇట్లు పడగతాలుపు.)

పడచు. దే. స. క్రి. పడయుయొక్కరూపాంతరము. (పొందుటకు.—"క. ఎడపడకుండంగుడిచిన, కుడుపుప్రమాణంబుగాదు కొన్నతెలంగుకా, బడచినతెలఁగునుదెలుపని, యడికుడుపునఁ బాడిగ లువదభినవదండి." విజ్ఞా. వ్య, కాం. — సంపాదింగుటకు. (చూ. పడవు.)

పడత. దే. వి. పణతకు మొదటిరూపము.

పడవు. దే. వి. 1. ఆర్జనము; (చూ. పడవుఁగొమ్మ.) 2. ఆర్జితవిత్తము. "క. తనపడచినసొమ్మయినను, దన వలసినయట్లుపంపఁదగుఁబుత్రులకుఁకా, దనతండ్రి పడవుసుతులకు, జనకుఁడుపంచంగవలయు సరి పాళులఁగకా." విజ్ఞా. వ్య, కాం.

పడమటికొండ. ద్వి. వి. (పడమర+కొండ.) పశ్చిమశైలము, అస్తపర్వతము.

పడమటిదొర. దే. వి. (పడమర+దొర.) వరుణుఁడు.

పడమర. దే. వి. పశ్చిమదిక్కు. "సీ. నిడుపునఁదూర్పును బడమరకై రెండుకడలునంభోనిధిఁగదిసి యుండు." భార. భీష్మ. ౧, ఆ.—విణ. పశ్చిమము. "పడమటిదిశ." కళా. ౨, ఆ.

పడవుఁగొమ్మ. దే. వి. (పడవు+కొమ్మ.) వెలయాలు, వేశ్య. చంద్రా. 3, ఆ. (ఇట్లు పడవుఁజెలి, పడవుఁజేడియ. మొ.)

పడము. వై. వి. అందలమునక్రింద పఱచెడు రత్నకంబళము*. "జిగిగుల్కులేమావి చిగురుటాకుపడమ్ము." చంద్రా. 3, ఆ. "నయముమించినముసనాబుపడము." రా, వి. ౨, ఆ. (చూ. గొడియ గొడె.)

పడయు. దే. స. క్రి. 1. పొందు; "ఆ. పరమమంత్రవిధులఁ బశువులుయూపంబు, లందుఁగట్టఁబడిమహాశుచిత్వ, విభవమొందువిహితవిశసనక్రియమేను, విడిచిదివ్యసుఖముపడయుఁబోలఁతి." భార. అను. ౫, ఆ.—2. సంపాదించు; "సీ. పెండ్లియగువేడ్కభార్గవుఁడప్పుడవరుణేంద్రుపాలికిఁజనివానిఁబడసితెచ్చె." భార. అర. 3, ఆ.—3. (బిడ్డను) కను. "సీ. ఇట్టిసంతతిగన్నయిమ్మహాపాతకంబునకుఁబ్రాయశ్చిత్తమనఁగఁబ్రీతిఁ,బడసె." నిర్వ. 3, ఆ.

పడలు. దే. వి. బ. రాసులు. (చూ. తొడరుశబ్దము నాలుగవ అర్థము.)

పడవ. యు. దే. వి. 1. యుద్ధము; "క. పడవకయిపచ్చియిదుమలఁ, బడవళమా." సత్య. 3, ఆ.—2. ప్రళయము. వై. చిన్నదోనె*.

పడవలము. దే. వి (పడలు+వలము.) సేనాముఖము, నాసీరము.

పడవాలు. వై. వి. 1. సేనాధిపతి; ద్వి. రా. కిష్కిం, కాం.—2. స్వల్పసేనాధిపతి*. "వ. వారునందండనాయకులనుబడవాళ్లనుబిలిపించి." అని. ౪,ఆ.

పడసాల. ద్వి. వి. (పడము+సాల.) కూటము. "సీ. ప్రహరిగోడలుగొప్ప పడసాలమేల్మచ్చుగారముం గిలివింత గానిపొరుగు." శుక. ౨, ఆ.

పడాల. వై. వి. అందలముమీఁదిపన్నాగము. "సీ. అరిదిపట్టుపడాలయంచులగతిఁగ్రిందిపత్త్మమాలికలు చూపట్టుచుండ." కళా. ౭, ఆ.

పడాలు. వై. వి. పడవాలుఁయొక్కరూపాంతరము. (స్వల్పసేనాధిపతికి. "ద్వి. ఉచితాసనంబులనుండిపడాలు, లుచితంబులెటిఁగింప." రా. యు, కాం.)

పడి. దే వి. రెండుసోలలకొలఁది.

పడికట్టు. దే. వి. 1. తూనికకల్లు; 2. మర్యాద; 3. సోపానము.

పడిగ. వై. వి. తమ్మయుమిసెడిపాత్రము, (రూ. పడిగము.)

పడిగల్లు. దే.వి.(పడి+కల్లు.)తుపాకిగుండు. "ద్వి.కొక్కులుపడిగంటఁగూలుచందమున."రా. సుం, కాం.

పడిగాపు. దే. వి. (పడి+కాపు.) పంచేనుకాచియుండుసేవకుఁడు. "క. పుడమివిభులెంద ఱెందఱొ, పొడగాన్పులు లేక ద్వారభూములయందుఙ్, బడిగాపులువడియుండఁగ,బడుగులకేలబ్బుఁగంసభంజనుసేవల్." కు. ౧, ఆ.

పడితరము. దే. వి.ఏర్పాటు,ఏఁటేఁటవచ్చుమొత్తము.

పడిదియ. దే. వి. చేకలవాఁడు చేలువలు అద్దెకిచ్చుట. "క. మెడవాలూడయనివస్త్రము, తడఁబటిచిన నమ్మికొనినఁ దారోయిడినఙ్, బడిదియవెట్టినఁగట్టిన, నడయఁబణత్రయముదండు వరువఁగవలయుఙ్." విజ్ఞా. ప్రా, కాం. (రూపాంతరము పడిద.)

పడిదెము. దే. వి. ద్రవరూపమగువ్యంజనవిశేషము, ఊర్పు. "సీ. అప్పడంబులువడియములుఁదాలింపులుఁబలుచనినులి వెచ్చపడిదెములును." జై. ౩, ఆ. (మొదటిరూపము పడిదియము.)

పడియ. దే. వి. నీళ్లునిలిచినచిన్నపల్లము. "తే. అబ్ధిలంఘింపనోపినయలఘుబాహు, బలునికతిదుష్కరమెచాటిపడియదాఁట." హరిశ్చ. ౨, ఆ.

పడియచ్చు. ద్వి. వి. ఒత్తిరూపమేర్పఱచుటకైతొలిచినయచ్చు. "హరుఁబగగొన్న వేల్పుఁబడియచ్చునవొత్తినలీల." చంద్రా. ౨, ఆ.

పడివాగె. ద్వి. వి. ఎక్కుటకాయిత్త పఱుచునపుడు సవరించెడు గుఱ్ఱపుసవరణ. "సీ. తగవేలమూడఁగ్రొత్తగవేలసంఖ్యలైపడివాగెఁబఱతెంచుఁగ్రొధహరులు." హస. ౫, ఆ.

పడిసెము. వై. వి. శైత్యరోగవిశేషము*.

పడివారి. వై. వి. పణిహారి. "ద్వి. పడివారులనుబిల్వఁబంచియాక్షణమె, కడఁకతోఁగల్యాణకటకంబునందు." పండి. ౧, ప్ర.

పడు.వై.అ.క్రి.1. పతనమగు; 2. శ్రమమునొందు*; "ఉత్సాహ. అతఁడుకురుకులంబుతోడిపొం, దునకుఁ బడఁడెజగము మెచ్చఁదొడఁగి పెక్కుభంగులఙ్." భార. స్త్రీ. ౧, ఆ.—3. రాలు*; 4. శయనించు*; (చూ. ఊడనిఁబాడురెండవయర్థము.) 5.చేచ్చు*; "ఆ.చంపెదేనిమమ్ముజలములులేనిదేశమునఁజంపవలయుఁగమలనాభ, నిక్కమింతవట్టు నీచేతఁబడుటకుఁ, దగుదుమనిననగుచు నగధరుండు." భార. ఆర. ౮, ఆ.—6. పుట్టు*; "క.జగతీశుఁడుపడినధనం, బగపడినను బ్రాహ్మణునకునర్థము వెట్టం, దగునటవిప్రోత్తముచే, నగపడిననతండుకుడువ నర్హుండంతఙ్." సం. "రాజాలబ్ధ్వానిధిందద్యాద్ద్విజేభ్యోర్ధంద్విజఃపునః, విద్వానశేషమాదద్యాత్స సర్వస్యప్రభుర్యతః." విజ్ఞా. వ్య, కాం.—7. అస్తమించు*. "క. అవనీశయీహాయంబులు, పవనగతింబఱచుఁబ్రొద్దువడకుండఁగనే, డవిదర్భకు." భార. అర. ౨,ఆ.—స. క్రి. 1. అనుభవించు, "ఇంతపడుదునె." భార. ఆర. ౨, ఆ. —2. పొందు. "క. ఇమ్మెయినధికపుఁబరితా, పమ్మునుబడుసూతుహృదయపద్మంబలరఙ్, దమ్మికొలంకులు మొగుడవ, నమ్ములుసోలంగదివసనాథుఁడు గ్రుంకెఙ్." భార. విరా. ౨, ఆ.

పడుక.వై.వి.పఱపు.(చూ.పడు నాలుగవయర్థము.)

పడుకటిల్లు.ద్వి.వి.(పడుక+ఇల్లు.)శయనగృహము.

పడుకు. దే. వి. ఱాయి, శిల. (చూ. తొడుకు.)

పడుగాయ. ద్వి. వి. (పడు+కాయ.) రాలినకాయ.

పడుగు. దే. వి. 1. వస్త్రపునేఁతయందలినిడుపునూలు; 2. పైకప్పుతీసినజొన్నకుచ్చెలవరికుప్పలోనగునది.

పడుగొమ్మ. ద్వి. వి. (పడు + కొమ్మ.) క్రిందికిపడుచున్నకొమ్మ, శిఫ.

పడుచు. దే. వి. 1. కన్యక; ౨. కన్నెతికముకానివేశ్య; 3. బాలిక; "క. అంబయునటసాళ్వునికడ, కుంబోయిననతఁడుభీష్ముకొనిపోయినదా, నింబడుచుంగైకొనధ, ర్మంబేకన్యాత్వమెడలెమగువా

నీకుఁగా." భార. ఉద్యో. ౪, ఆ.—4. బాలుఁడు. "క. కడవంగ నలచినవాఁడీ, పడుచనుచుఁగా బురిటి యిల్లుపడఁతుక వెడలెఁగా." మార్క. ౫, ఆ.

**పడుచేఁజేఁత.** ద్వ. వి. జారత్వము. "ద్వి. పడుచుఁ జేఁతలుమానిపార్వతీశ్వరుఁడు." భల్లా.

**పడుచేది.** దే. విణ. (పడుచే+అది.) యౌవనముగలది.

**పడుచేరాసి.** ద్వ. వి. కన్యారాశి

**పడుచేలతిండి.** దే. విణ. శిశుఘాతిని. "తే. కటకటా చిన్ని నెత్తురుఁగందురాచ, పట్టిఁజక్కనిపాపనిఁబట్టిచంప, నేచిమృత్యుస్వరూపమైయొచట నుండి, వచ్చెనీపడుచులతిండియిచ్చటికిని." హరిశ్చ. ౫, ఆ.

**పడుచేవాఁడు.** దే. విణ. యౌవనముగలవాఁడు.

**పడుదల.** దే. వి. పక్షివిశేషము, డాబ.

**పడువ.** దే. విణ. మిక్కిలి పల్లమైనది. (నేల.)

**పడువరి.** ద్వ. వి. కోఁతకోయునప్పుడు గింజలురాలి మొలచినవరిపైరు.

**పడె.** దే. వి. పడియయొక్కరూపాంతరము. "సీ. నీరదాగమమేఘనిర్యత్పయఃపానచాతకం బేగు నేచాటిపడెకు." భాగ. ౧౦, స్కం. ఉ.

**పడ్డ.** వై. వి. తొలిచూలియావు, (లేక) గేదె.

**పణఁకు.** దే. వి. పడఁకుయొక్కరూపాంతరము.

**పణత.** దే. వి. నాఁగేటిగొడగ.

**పణము.** ఉభ. దే. వి. మల్లబంధవిశేషము. సం. అ. పుం. 1. పందెము; 2. వెల; 3. కూలి; 4. ధనము; 5. మోదము; 6. కొనుట; 7. వ్యవహారము; 8. కర్షమెత్తురాగిటంకము; 9. గవ్వయెత్తు; 10. అమ్మఁదగినకూరలోనగువానిపిడికిలి.

**పణవము.** సం. వి. అ. పుం. ఉడుక.

**పణస.** సం. వి. అ. పుం. పనస౧.

**పణాయితము.** సం. విణ. (అ.ఆ.అ.) పొగడఁబడినది.

**పణితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పొగడఁబడినది; 2. పందెముగాఁజేయఁబడినది.

**పణితవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. పొగడఁదగినది; 2. అమ్మఁదగినది.

**పణిదము.** దే. వి. పడిదియయొక్కరూపాంతరము.

**పణిహారి.** వై. వి. ద్వారపాలకుఁడు. "వ. పణిహారుల వలనఁదనరాకయెఱింగించి." భాగ. ౧౦, స్కం. పూ.

**పణ్య.** సం. వి. ఆ. స్త్రీ. మానేరుతీఁగ. విణ. 1 పొగడఁదగినది; 2. అమ్మఁదగినది.

**పణ్యవీథి.** సం. వి. ఈ. స్త్రీ. అంగడివీథి.

**పణ్యాంగన.** సం. వి. ఆ. స్త్రీ. వెలయాలు, వేశ్య.

**పణ్యాజీవుఁడు.** సం వి. అ. పుం. వర్తకుఁడు, బేహా

**పణ్యారము.** వై. వి. 1. నానఁబప్పు*; "మ. శనివారోత్సవమాచరించెమునిశిష్యవ్రాతముం దాను ముని పణ్యారముతోడబూరెగమి తోమండెం తండంబుతో, ననుకుంబాసెముతోడఁబొందు లమాహారంబుతో నేతితో, ఘనరంభాఫలఖం శర్కరలతోఁ గారుణ్యపాథోధికిన్." భీ. ౨, ఆ.- 2. భక్ష్యము*. "పణ్యారంపుఁ బుణ్యాంపుకంథల." ఆము. ౧, ఆ.

**పతంగము.** సం. వి. అ. న. పాదరసము. పుం. 1. పక్షి 2. మిడుత; 3. బాణము; 4 పిల్లి; 5. శాలిధాన్యవిశేషము.

**పతంగిక.** సం. వి. ఆ. స్త్రీ. తేనెటీఁగ, పుత్తిక.

**పతంగుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు, వేఁడివేల్పు

**పతకము.** వై వి. హారమునడుమనుండెడురత్నపుబిల్ల

**పతగము.** సం. వి. అ. పుం. పక్షి, పతంగము.

**పతత్తు.** సం. వి. త్. పుం.——వై.——

**పతత్రము.** సం. వి అ. న. ఱెక్క, పత్రము.

**పతత్రి.** సం. వి. ఇ. న్. పుం. పక్షి, గరుత్మంతము

**పతద్గ్రహము** సం. వి. అ. పుం. తమ్మపడిగము.

**పతనము.** సం. వి. అ. న. పడుట, పాటు.

**పతయాళువు.** సం. విణ (ఉ.) పడెడుస్వభావముకలవాఁడు.

**పతాక.** సం. వి. ఆ. స్త్రీ. 1. టెక్కెము; 2. టెక్కెపుఁగంబము; 3. సౌభాగ్యము. అ. పుం. ము. అభినయహస్తవిశేషము. (బొటనవ్రేలినివంచి చూపుడువ్రేలి మొదటఁగూర్చి వ్రేళ్లన్ని చక్కఁగాఁ జాఁచిపట్టినది.)

**పతాకి.** సం. విణ. (న్. ఈ. న్.) టెక్కెముగలవాఁడు.

**పతాకిని.** సం. వి. ఈ. స్త్రీ. సేన, ధ్వజిని.

**పతి.** సం. వి. ఇ. పుం. మగఁడు. విణ. ఏలిక.

**పతింవర.** సం. వి. ఆ. స్త్రీ. తనంతట మగని వరించునట్టి ఆఁడుది, వర్య.

**పతితుఁడు.** సం. విణ (అ. ఆ. అ.) 1. పడినవాఁడు, 2. పదవిచెడినవాఁడు.

**పతిమ.** వై. వి. ప్రతిమ. "క. మనమునఁగల్గిన తీరున నినుమగనిగా వ్రాసికొన్న నిలువుఁబతిమలన్, గనుఁగొనియెఱుంగక పలికిన, ననఁబోఁడిం గిని యుఁదగునెనకులానీకున్." య. ౫, ఆ.

పతివత్ని. సం వి. ఈ. స్త్రీ. ముగసాలు, (రూ. పతిపత్ని.)
పతివ్రత. సం వి. ఆ. స్త్రీ. పతిభక్తిగల యిల్లాలు, క్రొత్తడి.
పత్తనము. సం. వి. అ. న. పట్టణము, ప్రోలు.
పత్తి. ఉభ. దే. వి. ప్రత్తి. సం. ఇ స్త్రీ. 1. గమనము, 2. సేనావిశేషము. (ఒకరథము ఒకయేనుఁగు మూడు గుఱ్ఱములు ఏవురు కాల్బురునుగలది.) పుం. కాలిబంటు.
పత్తిరి. వై. వి. పూజకుపయోగించెడు బిల్వదళము లోనగునది. "ఉ. తత్తఱపాటులేక నదిఁ దాన మొనర్చిపినాకపాణిదే, వోత్తమువిశ్వనాథుఁగరుణో దధిఁ గమ్మనిపూవుగుత్తులన్, బత్తిరిఁబూజచేసినుతిపాఠములన్ తవణించువారికిన్, దొత్తులువోలెదక్కుదురుతోప్పలుదోరలు ముక్తిభామినుల్." కాశీ. ౨, ఆ.
పత్తిరిబొట్టు. వై. వి. తిలకవిశేషము.
పత్తిరేకు. దే. వి. లోహములనదికించునపుడు పత్తివలెఁగొట్టిపెట్టెడు సజాతీయమైనపొడిరేకు. "క. తనుమధ్యవలీభంగము, లనుగూర్పఁగనవియుఁదత్కులములెయగుటఁగం, తునియిడినపత్తిరేకనఁ, జనునొడ్డాణమునవడుముచామకునమరున్." ఆము. ౫, ఆ.
పత్ని. సం. వి. ఈ. స్త్రీ. అగ్నిసాక్షిగాఁబెండ్లాడిన పెండ్లాము, భార్య.
పత్రపరశువు. సం. వి. ఉ. పుం. ఆకుటాయి.
పత్రపాళ్య. సం. వి. ఆ. స్త్రీ. పాపటబొట్టు.
పత్రభంగము. సం. వి. అ. పుం. స్త్రీలయొక్క చెక్కిలిలోనగువానియందు వ్రాయఁబడు మకరికాపత్రము.
పత్రము. సం. వి. అ. న. 1. ఆకు; 2. వ్యవహారముయొక్క చెల్లుబడికై యొకరొకరు వ్రాసికొనెడు ఆకు; 3. ఱెక్క; 4. వాహనము; 5. బాణము; 6. చేరకత్తి; 7. లవంగపుఁబట్ట.
పత్రరథము. సం. వి. అ. పుం. పక్షి, పులుఁగు.
పత్రరేఖ. సం. వి. ఆ. స్త్రీ. (చూ.) పత్రభంగము.
పత్రల. సం. వి. ఆ. స్త్రీ. 1. పెద్దయేలకి?; 2. శ్రీతాళము?.
పత్రలత. సం. వి. ఆ. స్త్రీ. మిక్కిలి నిడుపుచేరియ.
పత్రలేఖ. సం. వి. ఆ. స్త్రీ. (చూ.) పత్రభంగము.
పత్రస్నుహి. సం. వి. ఈ. స్త్రీ. ఆకుజెముడు?.
పత్రాంగము. సం. వి. అ. న. 1. రక్తచందనము; 2. భూర్జము?; 3. పద్మకాష్ఠము?.
పత్రాంగుళి. సం. వి. ఈ. స్త్రీ. (చూ.) పత్రభంగము.
పత్రి. ఉభ. వై. వి. పత్తిరియొక్క రూపాంతరము. భల్లా. ౩, ఆ.—సం. న్. పుం. 1. డేగ; 2. పక్షి; 3. బాణము; 4. కొండ, 5. మ్రాను; 6. రథికుఁడు.
పత్రిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కాగితము; 2. వ్యవహారముయొక్క చెల్లుబడికై యొకరొకరు వ్రాసికొనెడుపత్రము.
పత్రోర్ణము. సం. వి. అ. న. మఱికిరెత్తినపట్టుచీర. పుం. దుండిగము?.
పథము. సం. వి. అ. పుం. మార్గము, త్రోవ.
పథి. సం. వి. న్. పుం.——వై.——(దీనికి ఈ రూపమున తెనుఁగువందు ప్రయోగములేదు)
పథికుఁడు. సం. వి. అ. పుం. దారినడచేవాఁడు.
పథ్యము. సం. విశే. (అ. ఆ. అ.) హితము.
పదంపడి. దే. అవ్య. 1. వెనుక; "చ. మున్నుమా, తరపితృవందనంబును బదఁపడిమిత్రసహాభివాదనా, దరము." ఉ, హరి. ౪, ఆ.—2. మఱియు; "వ. మఱియుఁగొందఱుయజ్ఞపాత్రంబులనగ్నులంజలచిరి, వెండియుఁగొందఱు హోమాగ్నులార్చిరి, పదంపడికొందఱు హోమకుండంబులయందుమూత్రంబులువిడిచిరి." భాగ. ౪, స్కం.
పదకము. ఉభ. వై. వి. క్రమము*. "క. ఇదినాకానతియిచ్చిన, పదకము కలరూపువిన్నపముచేసితినీ, హృదయంబునఁగైకొనుమిం, దుదలంపులుదక్కమనవుడుంగుపితుండై." నిర్వ. ౪, ఆ.—సం. అ. పుం. పతకము.
పదగుఁడు. సం. వి. అ. పుం. కాలిబంటు.
పదచాళి. వై. వి. నాట్యభేదము, పెక్కణము. (చూ. తీరుపు.)
పదటము. దే. వి. అత్రము, తత్తఱము. "ద్వి. పట్టనుంకించినపదటము." విష్ణు. ఉ. ౪, ఆ.
పదటు దే. వి. పదటముయొక్క రూపాంతరము. "ద్వి. పదటునలేచి." విష్ణు. పూ. ౧, ఆ.
పదడు. దే. వి. బూడిద, భస్మము. "ఆ. పదడయరానియాఁడువోడలికిఁగలిగినఁ, బాపకృతులదానిఁబగటుఁగలుప, నగుచుఁబుణ్యవిధిసమాచరణములఁగై, సేఁతుపలయఁగాక చెలువుమిగుల." భార. శాం. ౫, ఆ. "ద్వి. పదడుచేపట్టుడుఁబసిఁడిమైచనథ." పండి. ౨, ప్ర.

పదను. దే. వి. 1. సమయము; "క. మనగతియీా, పదనునఁగడుఁజూలుకఁదనముపట్టయితోఁ చెలీ." పంచ. నా. ౨, ఆ.—2. తడి; "ఉ. పంటవలంతికిం బొడమిభూసిలుసీతవుగాననేలలో, నంటినఘర్మవారిఁబదనైపులకోదయసస్యసంపదల్, గెంటకయుంటనీకతగునేఁ డిట నావ్యవసాయమేర్పడెల్, గంటినిరంతరానుభవగౌరవసౌఖ్యముపండెఁగోరికల్." రామా. ౪, ఆ.—3. వాఁడి; "తే. సరగమిన్నకమ్మరిసంజకొలిమి, బెట్టుగాఁగాఁచిబంగారుచుట్టువాలు, పదనుపెట్టఁగఁగొనిపోయిపట్టలేక, విడిచెననఁబ్రొద్దుపడమటికడలిమునిఁగె." య. ౨, ఆ.—4. పరిపాకము. "క. ఇదె పోయెదఁగౌరవ్యులఁ, బదనికిరాఁబలికిసంధిపాటించెద." భార. ఉద్యో. 3, ఆ.

పదనుకొను. దే. అ. క్రి. తడియు. "సీ. అరచంద్రులోని చిహ్నంశంబునుంబోలెనుదుటఁగస్తురిబొట్టుపదనుకొనఁగ." పాండు. ౪, ఆ.

పదపడి. దే. అవ్య. పదంపడియొక్క రూపాంతరము. (వెనుకననుటకు.—"సీ. పనియేమిపంచినఁబదపడిచేసెదననకతఁబంచినయాక్షణంబ, చేయుచు." భార. ఆది. 3, ఆ.—మఱియుననుటకు.—"క. పదిదినములైదుప్రొద్దులఁ, బదపడిరెన్నాళ్లునొక్కపగలుఁ రేయుఁ, మదమునరణమొనరించిరి." భార. ఆది. ౧, ఆ.) ["క. ముదమున హరియునుజాఁడును, జదువులుమునులాదిగాఁగసకలజనంబుల్, మదనారిఁగొల్వవచ్చిరి, పదపడిసంభ్రమముభయమునుభక్తియుఁగదురన్." (ఇక్కడ పదపడి అనఁగా అత్యంతము అని యర్థముగుచున్నది.) వీర. ౧, ఆ.]

పదము. సం. వి. అ. న. 1. పాదము; 2. పద్యపాదము; 3. ఇసుకలోనగుచోట్లఁగనఁబడెడు పాదచిహ్నము; 4. చిహ్నము; 5. శబ్దము; 6. వాక్యము; 7. ప్రయత్నము; 8. స్థానము; 9. కపటము; 10. వస్తువు. పుం. కిరణము.

పదరము. నై. వి. తములపాకులు పదిలముగానుంచెడియడపము*.

పదరు. దే. అ. క్రి. 1. త్వరపడు; "వ. కెంజిగుల్లకుఁ బదరుచుఁగొరలు తేంట్లకు బెదరుచు." కళా. ౬, ఆ.—2. కోపించు; "క. నీమాటకుమాయళ్వ, త్థామవచనములకు నేఁబదరుదు నె." భార. ద్రో. 3, ఆ.—3. చలించు. "సీ. పైమిన్ను వ్రాలినఁ బదరనిర్ధైర్యంబుఁగటకటాకలఁచిచీకాకుచేసె." చం ద్ర.—స. క్రి. ఆక్షేపించు; "వ. అని గాంధారి బదరి." భార. ఆది. ౫, ఆ.—వి. బ. త్వరితప్రమాట. "ఎ, గీ. జిహ్వాకలకు, ననుపు నెఱవాదిబంటుపంతపుఁబదరులు." స్వా. ౬, ఆ.

పదవి. ఉభ. వై. వి. ఉన్నతస్థితి*. సం. ఈ. స్త్రీ. మార్గము.

పదాజి. సం. వి. ఇ. పుం. పదాతి.

పదాతి. సం. వి. ఇ. పుం. కాలిబంటు.

పదార్థము. సం. వి. అ. పుం. 1. వస్తువు; 2. శబ్దములయొక్క అభిధేయము. (సప్తపదార్థములు.—ద్రవ్యము, గుణము, కర్మము, సామాన్యము, విశేషము, సమవాయము, అభావము.)

పదాఱు. ద్వి. స. (పది+ఆఱు.) పదునాఱు.

పది. ఉభ. వై. స. తొమ్మిదియు నొకటి, దశకము. (తఱుచుగా ఒకఁడులోనగునవిపరమగుచో ఉదంతంబగు. ఉదా. పదునొకండు, పదుమూడు, పదునాలుగు, పదునేను, పదునాఱు, పదునేడు, పదునెనిమిది. పదుగురు. మొ.)—సం. వి. ద్. పుం. పాదము. "సీ. తూలింపవాయొద్దుత్రోచినపిచ్చుకుం టనుపల్క పదులు పంగునకుఁగూర్చి." రా, వి. ౧, ఆ.

పదింబదిగ. ద్వి. క్రి. విశే. (పదియున్+పది+కాన్.) గట్టిగా, చక్కఁగా. "కవిరాజవిరాజితము. నీకరుణకుఁ బాత్రుఁడుగాఁడు పదింబదిగాఁగనిచ్చినవాఁడఁదుదన్." రాఘ. ౪, ఆ.

పదికుఁడు. సం. వి. అ. పుం. పదాతి, కాలిబంటు.

పదియార్థము. ద్వి. వి. (పది+అర్థము.) పదునాఱు తూములు.

పదిలపడు. వై. అ. క్రి. 1. దృఢపడు*; "ఎ, గీ. పాశుపతమటమీాఁదను బదిలపడును." భీ. ౫, ఆ.—2. స్థిరపడు*. (చూ. పదిలించు.) (ప్రే. పదిలపఱుచు.)

పదిలము. వై. వి. స్థైర్యము*. "మ. యతిశ్రేష్ఠుఁడొండొక్కచోఁ, బదిలంబారఁగనిల్చిపిల్చెననికిన్ బ్రత్యర్థినత్యర్థియై." హరి. ఉ. ౧౦, ఆ.—విశే. 1. జాగరూకము*; "నీవుపదిలంబుగఁగోడలఁబట్టకున్న." నీలా. ౨, ఆ.—2. దృఢము*. "అల్లనతోఁడొంటియున్కిఁబదిలంబుగఁజూచి." భో. ౪, ఆ.

పదిలించు. వై. స. క్రి. పదిలపఱచు. (దృఢపఱచుటకు.— "క. ఇదియొకరాత్రి సకృత్యము, మదివె ఱపకుమనుచు నెన్నిమాటలు ధైర్యం, బొదవఁగఁ దనుబోధించిన, హృదయము పదిలింపలేక యెడ యని చింతన్." రా. అర, కాం.—స్థిరపఱచుటకు. "ముకుందు లోకత్రయవందితున్ హృదయకంజమునన్ బదిలించి." శై. 2, ఆ.)

పదిలుఁడు. వై. విశే. 1. జాగరూకుఁడు*; "క. ఇది యేటిచంద మేటికి, మదియిట్టిదియయ్యె ననుచుమఱియెయ్యన నేఁ, బదిలుఁడనై." హరి. ఉ. ౬, ఆ.—2. స్థిరుఁడు*. "క. ఇదె యేనుగూడవచ్చితిఁ, బదిలుఁడ నై పోరుమింక బకమర్దన." భార. భీష్మ. ౨, ఆ.

పదుండ్రు. ద్వి. స. పదుగుండ్రుయొక్క రూపాంతరము. "చ. తొడరి భవత్తనూజులు పదుండ్రు సముద్భటసింహనాదులై." భార. కర్ణ. 3, ఆ.

పదుగు. దే. వి. పదువునకు మొదటిరూపము.

పదుగుండ్రు. ద్వి. స. పదుగురునకుమాఱురూపము.

పదుగురు. ద్వి. స. పదిమంది. (పదికి మహన్మహత్యర్థకబహువచనాంతాదేశము.)

పదునల్గుము. ద్వి. వి. (పది+నల్గుము.) పదు నాలుగు తూములు.

పదును. దే. వి. (పది+ఊను.) పదియంగుళములపఱకు నేలయందు తడిచొచ్చునంతటి వర్ష ప్రమాణము.

పదు నెనమందు ము. ద్వి. వి. (పది+ఎనమందుము.) పదు నెనిమిదితూములు.

పదు నేడ్డుము. ద్వి. వి. (పది+ఏడ్డుము.) పదు నేడు తూములు.

పదునొకొల్తుము. ద్వి. వి. (పది+ఒకొండు+తూము.) పదునొకండుతూములు.

పదుపు. దే. వి. పదువు. "పాఁపపదుపు." మార్క. ౧, ఆ. "క. అపుడగ్గి వన్నెతొలువే, లుపుతన నెమ్మేనిమంటలుగ డించిగగా, దుపుతండ్రిఁ బొదుపఁ గ్రొఁతిప, దుపుపైనతఁడమ్ములెమ్మెతోఁ బఱపుట యున్." అచ్చ. యు, కాం.

పదుముత్తుము. ద్వి. వి. (పది+ముత్తుము.) పదుమూడు తూములు.

పదురు. యు. దే. అ. క్రి. త్వరపడు. వి. 1 విధము; "క. తుద మొదలెఱుఁగక చదువుల, పదురెఱుఁగ కతమ్ము నెందుఁ బదురెఱుఁగనిదు, ర్మదకవులఁ గుదియఁబద్యపు, గుదియలఁ జదుపంగవలదొగుటలడఁగన్." కవిస. ౧, అధికారము.—2. బ. త్వరితపుమాట. "ద్వి. చదురులఁ బదురులు." భాగ. ౧, స్కం.—వై. స. పదుగురునకు మాఱురూపము. "చ. పదురునిజాప్తకింకరులు పార్శ్వయుగంబున భక్తిఁ గొల్చిరా." కాశీ. 3, ఆ.



పదురుచు. దే. ప్రే. పదురఁజేయు. (చూ. ప్రదురుచు.)

పదువు. దే వి. సజాతీయప్రాణిసమూహము. "చుట్టపుంబదువు." హరి. ఉ. 3, ఆ. (పదుగుయొక్క రూపాంతరము.)

పదువురు. ద్వి. స. పదుగురుయొక్క రూపాంతరము.

పద్గుఁడు. సం. వి. అ. పుం. పదాతి, కాలిబంటు.

పద్దియము. వై. వి. పద్దెము. "సీ. చిలుకబోదలమచ్చికలు చేసి ముద్దులు చిలుకఁ బద్దియములు చెప్పరాదె." నీలా. ౨, ఆ.

పద్దు. వై. వి. 1. పంతము*; 2. ప్రతిజ్ఞ*; 3. అంకెలకత్తెము*.

పద్దెము. వై. వి. పద్యము. "ఉ. అచ్చ తెనుంగుఁ బద్దెము కైనను గబ్బములోనను డిసన్, హెచ్చని యాడుచుందురు." య. ౧, ఆ.

పద్ధతి. సం. వి. ఇ. స్త్రీ. 1. త్రోవ; 2. వరుస; 3. అడుసు.

పద్నాల్గు. ద్వి. స. పదునాలుగుయొక్క రూపాంతరము. "పద్నాల్గవయేఁట." చంద్రా. 3, ఆ.

పద్మ. సం. వి. ఆ. స్త్రీ. 1. లక్ష్మి; 2. బొరంగి?; 3. మెట్టదామర?. అ. పుం, న. ము. 1. తామర; 2. ఒక నిధి; (చూ. నిధి.) 3. వ్యూహవిశేషము; 4. సంఖ్యావిశేషము; 5. ఏనుఁగు మొగమునందలిబొట్లసమూహము. పుం. పాము.

పద్మకము. సం. వి. అ. న. 1. ఏనుఁగు మొగమునందలిబొట్లసమూహము; 2. పద్మకాష్ఠము?.

పద్మకాష్ఠము. సం. వి. అ. న. ఓషధీవిశేషము.

పద్మకోశము. సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము. (అయిదు వ్రేళ్లను కొనలుకూడకుండునట్లు విల్లువలె వంచి యెడముగలవానిఁగాఁ బట్టినది.)

పద్మచారిణి. సం. వి. ఈ. స్త్రీ. మెట్టదామర?.

పద్మనాభుఁడు. సం. వి. అ. పుం. హరి, వెన్నుఁడు.

పద్మనాయకులు. సం. వి. అ. పుం. బ. వెలమజాతిలో నొకతెగవారు.

పద్మపత్రము. సం. వి. అ. న. మెట్టదామరదుంప.

పద్మపుఁదీఁగ. మి. వి. (పద్మము+తీఁగ.) చోరపుష్పి?.

**పద్మబాంధవుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు, తామరచెలి.

**పద్మరాగము.** సం. వి. అ. పుం. మాణిక్యవిశేషము, తామరకెంపు. (ఇది సింహళమునపుట్టినది, రక్తవర్ణముకలది, ఉత్తమజాతిరత్నము. చూ. మాణిక్యము.)

**పద్మవెలమలు.** మి. వి. గ్రా. బ. (చూ.) పద్మనాయకులు.

**పద్మాకరము.** సం. వి. అ. పుం. 1. కొలను; 2. చెఱువు.

**పద్మాటము.** సం. వి. అ. పుం. తగిరిసకి.

**పద్మాలయ.** సం. వి. ఆ. స్త్రీ. లక్ష్మి, తమ్మియింటిగరిత.

**పద్మి.** సం. వి. న్. పుం. ఏనుఁగు, గజము, ద్విపము.

**పద్మిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. తామరతీఁగ; 2. తామరకొలను; 3. తామరతంపర; 4. స్త్రీజాతివిశేషము; 5. ఆఁడేనుఁగు; 6. లక్ష్మి.

**పద్య.** సం. వి. ఆ. స్త్రీ. త్రోవ. అ. న. ము. ఛందోబద్ధమైనకావ్యము. పుం. డు. శూద్రుఁడు.

**పద్రుచే.** దే. ప్రే. పదురుచేయొక్కరూపాంతరము. (చూ. ఎద్రుచే.)

**పన.** దే. వి. చేలలోకోసివేసిన ఓదెలప్రోగు.

**పనఁటి.** దే. వి. 1. వంటకుండ; "చ. అడరుగళాస్రధారలు మహాముఖవాంతసుధాంబుధారలుకా, బొడువగువహ్నికీలములు పొంగుసుగాఁ బెఱదైత్యకోటికిఁ, బెడిదపుఁగిన్కతోనెసరుపెట్టినపెద్దపనంటిఁబోలెనె, క్కుడువెసరాహుమస్తకముగొన్నసుదర్శనదేవుఁగొల్చెదకా." ఆము. ౧, ఆ.—2. కుండ.

**పనవు.** వై. స. క్రి. ప్రలాపించే. "క. అనిపలికిమతిచెయుఁగొడుకుం, బనవుచు." భార. ద్రో. ౨, ఆ.

**పనస.** వై. వి. 1. వేదభాగము; 2. వృక్షవిశేషము. (దీనిఁగొందఱుకవులు వైకృతముగా వాడియున్నారుకనుక సంస్కృతమున పణస అని యేపాఠము ఉండునని తోఁచెడి.)

**పనసవాండ్రు.** ద్వ. వి. బ. కమసాలెవారిని యాచించిబ్రతుకువారు.

**పనాయితము.** సం. విశ. (అ.ఆ.అ.) పణాయితము.

**పని.** దే. వి. 1. వ్యాపారము; "ఇంద్రియంబులపనులనణఁచి." వా. ర, ఆ.—2. కర్మము; "క. విసుకర్తవ్యతమంబగు, పని బ్రాహ్మణపూజనంబు." భార. అను. ౨, ఆ.—3. ప్రయోజనము; "ద్వి. వినుముకౌశికయింకవిపరీతతపము, పనిలేదు." రా. బాల, కాం.—4. శిల్పము; (ఇందు మంచిపనిచేసియున్నారు.)—5. నియోగము. "ఉ. ఆయతపక్షతుండహతి నక్కులశైలము లెల్ల నుగ్గుగాఁ, జేయుమహాబలంబును బ్రసిద్ధియునుంగల నాకునీపనికా, బాయకతల్లి మ్మునందవడుఁబాములమోవనువారికికాఁ బనుల్, సేయను నేమికారణము సెప్పుము నాకుఁబయోరుహాననా." భార. ఆది. ౨, ఆ.

**పనిగొను.** దే. స. క్రి. (పని+కొను.) నియోగించే. "క. నన్నుం, బనిగొనఁదలఁచిననిలిచెద, ననుమానముగలిగనేనియఱిగెదనధిపా." భార. విరా. ౧, ఆ.

**పనితము.** సం. విశ. (అ. ఆ. అ.) పొగడఁబడినది.

**పనిముట్టు.** దే. వి. కొలుముట్టు, ఉపకరణము.

**పనివంచే.** దే. స. క్రి. (పని+పంచే.) పనిగొను. నియోగించే. "సీ. అన్యులఁబనివంచునప్పాడాముద్దియపలుకులతీపుకోర్కులఁగెరల్ప." భార. అను. ౧, ఆ.

**పనివడు.** ద్వ. అ. క్రి. (పని+పడు.) అక్కఱపడు. "క. పనివడియహింసవ్రతముగఁ, గొనివనమునన్న మునులకుకాఁ దొడరదెహింసనము." భార. ఆర. ౫, ఆ.

**పనివాఁడు.** దే. వి. భృత్యుఁడు, కింకరుఁడు.

**పనివిను.** దే. అ. క్రి. ఆజ్ఞావశవర్తియగు. "క. వచ్చినపుడర్ఘ్యపాద్యము, లిచ్చిసువర్ణాకపీఠమిడిమునివరమీ, రిచ్చోటికింబడలికమై, విచ్చేయుటయేమితెలుపవేపనివిందుకా." రామా. ౮. ఆ. (మఱియునిదికొద్దివారుగొప్పవారితోవచ్చెదనుపోయెదను అనుటయందును ఉపయోగింపఁబడును. వచ్చెదననుటకు.—"క. క్రమ్మఱఁబనివినియెదఁజొ, మ్మమ్మభవత్సేవకు." భో. ౬, ఆ.—పోయెదననుటకు.—"ఏనుబనివినియెదనన్నలఘుకృపఁజూడుము." భార. అను. ౧, ఆ.)

**పనుకు.** దే. అ. క్రి. ఆగ్రహించే. "క. అనుచుఁగదలిపోవచ్చిన, ననుమానముమానిహంసుఁడమ్మునిఁజేప, ట్టినచందమేమిసెప్పదుఁ, బనికినకాలోరగంబుపట్టుటదోఁచెకా." ఉ, హరి. ౮. ఆ.

**పనుగొను.** దే. అ. క్రి. (పన్ను+కొను.) 1. గట్టిపడు, దృఢపడు; "గాంగసైకతభూములకా, బనుగొనకా ధనువభ్యసించుచు." భార. ఆది. ౮, ఆ.—2. కలుగు. "క. ధనమునకైధర్మముదెస, ననాదర

ముచేసినేనినాన్నృపతికిన, ద్ధనమును జెడుదుర్యశ ముఙ్, బనుగొనుఁదుదిదుర్గతియును బొటిలునన ఘా." భార. శాం. ౨, ఆ.

పనుచే. దే. స. క్రి. 1. నియోగించే; "తే. అయ్యప నియేమియనిదండకరిగియరిగి, యతఁడుపనిచిన పనుపుతోయ్యలియెనర్చె." పర. ౧, ఆ.—2. పుచ్చే. "సేఁబనిచెదవ జ్రముఙ్." భార. అశ్వ. ౧, ఆ. (చూ. అనుచే.)

పనుపడు. ద్వ. అ. క్రి. పన్నుపడుయొక్క రూపాంతరము. (కలుగుటకు.—"క. తనువొప్పెడునదియకా వన, మునునూతనమిట్టినీకుఁబోలఁతీయోగం, బునవింతచోరవయెమ్మెయిఁ, బనుపడియెఙ్ జెపుమ దాఁపఁబనిలేదింకఙ్." భార. అను. ౬, ఆ.—నాటుటకు.—"క. అనఘవినుమేగురుఁడనా, మనంబు శిష్యుండువిమలమానసనీపైఁ, బనుపడిన ప్రీతిఁజెప్పితి, ననితిరసులభాతిగుహ్యమగునిప్ప థముఙ్." భార. అశ్వ. ౨, ఆ.) (ప్రే. పనుపఱుచే.)

పనుపరి. దే. విశే. (పనుపు + అరి.) ఆజ్ఞకులోఁబడినవాఁడు.

పనుపు. దే. వి. నియోగము. (చూ. పనుచే.)

పన్న. దే. విశే. 1. అనామధేయుఁడు; "ఉ. పెన్నిధిఁ గన్నవాఁడు మతిపెంపునఁబ్రాణసమానమిత్త్రుఁడై, యున్నమహాత్మునింగదిసియొయ్యనఁజెప్పినఁ జెప్పఁగాకయే, పన్నలకైనఁజెప్పినవిపద్దశనొందఁడెయట్లుగానవి, ద్యోన్నతుఁడైనపాత్రునకు నుత్తమయోగముఁజెప్పటొప్పగుఙ్." శివ. ఉ. ౧. ఆ.—2. వృద్ధుఁడు.

పన్నకము. దే. వి. పన్నుగడ, పన్నిక, రచన.

పన్నగము. సం. వి. అ. పుం. 1. పాము; 2. పద్మకాష్ఠము?.

పన్నగాశనుఁడు. సం. వి. అ. పుం. గరుత్మంతుఁడు, పాఁపమేపరి.

పన్నము. ఉభ. వై. వి. వేదమునందలి అష్టమునకు అవయవము. సం. విశే. (అ. ఆ. అ.) జాఱినది.

పన్నా. గ్రా. వి. కాకితము, వస్త్రము మొదలగువాని వెడల్పు.

పన్నాగము. దే. వి. అందలముమీఁదికప్పు. "పాన్నాకుమేల్పచ్చవన్నియపన్నాగము." చంద్రా. 3, ఆ.

పన్నారు. దే. వి. బాలికలాడుకొనుగురిగి. "సీ. పాఁపమేపరిపచ్చపన్నారులోవులఁ గులుకుగుజ్జెనగూళ్లకుడుచుటుడిగి." య. 3, ఆ.

పన్నిక. దే. వి. పన్నుగడ, పన్నకము, రచన.

పన్నిదము. వై. వి. 1. జూదమునందు ఒడ్డెడుధనాదికము; (చూ. పందెము.) 2. పాచికలఁగవ్వలు మొదలగువానిపొర్లిక. "ద్వి. ప్రాణవిభుని, యాటకొపన్నిదంబయితనయాడు, నాటకుఁగూడనియట్టులైయున్న, యాలెక్కలీక్షించియద్భుతంబంది." విష్ణు. పూ. ౨, ఆ.

పన్నిద్దఱు. ద్వ. స. (పది + ఇద్దఱు.) పండ్రెండుమంది. (పండ్రెంటికిమహన్మహత్యర్థకబహువచనాంతాదేశము.)

పన్నిద్దుము. ద్వ. వి. (పది+ఇద్దుము.) పండ్రెండు తూములు.

పన్నిరుగురు. ద్వ. స. (పది+ఇరుగురు.) పన్నిద్దఱు.

పన్నిరువురు. ద్వ. స. పన్నిరుగురుయొక్క రూపాంతరము.

పన్నిల్లము. మి. వి. (పది+ఇల్లము.) పండ్రెండుపలములు.

పన్నీరము. సం. వి. అ. న. పన్నీరు. "శ్లో. కర్పూరరేణుసికతాకమనీయగర్భే, పన్నీరశీతలశిలాతలపుష్పతల్పే, కేళీముకిరదళకల్పితకాయమానే, ధారాగృహేరఘుపతిస్వదధేనిదాఘే." సాహిత్యరత్నాకరమున రసతరంగము.

పన్నీరు. వై. వి. హిమాంబువు.

పన్ను. దే. అ. క్రి. 1. యుద్ధమునకుసిద్ధపడు; "ఉ. పన్నినవాఁడవింకఁ జెడిపాఱకుమీయని మూదలించి." ఉ, హరి. 3, ఆ.—2. కలుగు. "క. అన్నలినాత్ములవాలుం, గన్నులకెదిరింపలేనికతము నఁగాదే, పన్నినభయమునచేడిస, లెన్నఁడుజలదుర్గములను వెడలఁగవెఱచుఙ్." హరిశ్చ. ౨, ఆ.—అం, ప్రే. 1. సిద్ధపఱుచే; "మ. కడఁకంబన్నఁగనానతిచ్చెఁజతురంగంబుల్ రణక్రీడకుఙ్, వెడలఙ్." ఉ, హరి. ౪, ఆ.—2. కలుగఁజేయు. "సీ. బలభిదారామసంభవలతాంతశ్రేణిఁబన్నుమునాకొకచిన్నితేరు." పాండు. ౫, ఆ.—స. క్రి. 1. ఏర్పఱుచే; "క. ధనురాచార్యుఁడుతగఁబన్నినసద్మవ్యూహమొరులు నేరరుచోర." భార. ద్రో. ౨, ఆ.—2. చేయు. "ద్వి. మీరునాసఖులుగామీయొద్దిదివ్య, నారులాడిగముఁబన్నఁగ

నుండవలయు." విష్ణు. పూ. ౨, ఆ.—వి. కప్పము. విణ. ఒప్పు. "ఉ. మహీదేవకులావతంసరవితేజ వివాహము నీకు నాకు ముక్, భావజశక్తి నైనయది పన్నుగ నన్నుఁ బరిగ్రహింపు." భార. ఆది. 3, ఆ.

పన్నుండు. దే. అ. క్రి. శయనించు, పరుండు.

పన్నుగడ. దే. వి. 1. రచన; 2. ఏతపు కడవ పైదండెనుంచి త్రాళ్లతో బిగించుట.

పన్నుపడు. ద్వి. అ. క్రి. 1. వాడుకపడు; 2. కలుగు; 3. నాటు. (చూ. పనుపడు.) (ప్రే. పన్నుపఱచు. "వ. అన్నులని ద్రంగ్రొన్న నవిలుకాని చిన్నెలం బన్నుపఱచియు." కృష్ణా. 3, ఆ.)

పన్నె. దే. వి. 1. మగ్గమునందు పడుగునూలు వేఱు వేఱు చొప్పించుటకై నడుమ దువ్వెనపండ్లవలె నిలువుగా నేర్పడియుండునట్లు వెదురుబద్దలతో అడ్డముగాఁ గట్టఁబడిన సాలెవాని సాధనవిశేషము. 2. అంకవన్నె వెనుకటి యినుపముల్లు. (మొదటి రూపము పన్నియ.)

పన్పు. దే. వి. పనుపుయొక్క రూపాంతరము. "పార్థివప్రాగ్రసరుండు ధర్మసుతు పన్పిది." భార. ఆర. ౫, ఆ.

పప్ప. దే. వి. భక్ష్యము.

పప్పణము. సం. వి. అ. పుం. పాపట!.

పప్పర. దే. వి. కింశుకము!. (దీని భేదము నీరుపప్పర.)

పప్పళి. దే. వి. 1. వస్త్రమునందలి చిత్రవర్ణవిశేషము; "పులితోలు చిఱుతపప్పళి పచ్చడము తోడ." పాంచా. 3, ఆ.—2. చిత్రవర్ణవస్త్రవిశేషము. "సీ. చిఱుతపప్పళి రోసి సరిగంచు పసుపుపప్పళి కుచ్చెల చెఱంగు వాఱఁగట్టి." శుక. ౧, ఆ.

పప్పు. దే. వి. 1. పొట్టుపోయి బద్దలైన కాయధాన్యము; 2. సూపము.

పప్పుచేయు. ద్వి. స. క్రి. నుఱుము చేయు. "ఎ, గీ. పరశువులఁ ద్రెంచి గదలచేఁ బప్పుచేసి." కవిక. ౨, ఆ.

పబువు. వై. విణ. ప్రభువు.

పబ్బము. వై. వి. 1. సంక్రాంతిలోనగునది; (చూ. తూలుఁడు.) 2. ఉత్సవము*; "కన్నులపబ్బము." ~~~, వి. ౪, ఆ.—3. ఆతిథ్యము*. "ఆ. నీవు గాకయింక నెఱయంగ నిరువురఁ, దొడుకవచ్చితేని నొడికమైన, భంగిము వ్వురకును బబ్బంబు వెట్టెదఁ, గూర్చి తెమ్ము మ్రొక్కు దీర్చికొనఁగ." పంచ. నా. ౫, ఆ.

పబ్లికు. ఆం. విణ. అందఱికిచెందిన, బహిరంగమైన.

పముజా. దే. వి. పంజానకు మొదటిరూపము.

పమ్మకము. దే. వి. అంచులుమడిచికుట్టెడు కుట్టు.

పమ్ము. దే. అ. క్రి. అతిశయించు. "పమ్మిన తేజమ్ము దెసలఁ బరఁగఁగ." మార్క. ౫, ఆ. (పంబుయొక్క రూపాంతరము.) స. క్రి. అంచులుమడిచి కుట్టు.

పయఁట. వై. వి. స్త్రీల ఱొమ్ముమీఁది వస్త్రము. "పయంటయంటగమకించు." విజ. ౨, ఆ. (పయ్యఁటయొక్క రూపాంతరము.)

పయనము. వై. వి. ప్రయాణము.

పయనించు. వై. అ. క్రి. ప్రయాణమగు.

పయర. దే. వి. 1. దక్షిణపుగాలి; 2. గాలి; 3. దక్షిణపుగాలిచేఁ బండెడు పెసలులోనగు కాయధాన్యము. (పయ్యరయొక్క రూపాంతరము.)

పయస్య. సం. వి. ఆ. స్త్రీ. 1. పాల!; 2. పిన్నపాల!; 3. రెడ్డివారి నానఁబ్రాలు!. విణ. 1. పాలకుహితమైనది; 2. పాలయందుఁ బుట్టినది. (నేయిలోనగునది.)

పయస్విని. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆవు; 2. ఏఱు; 3. పాలగొలిమిడి!.

పయస్సు. సం. వి. స్. న. 1. పాలు; 2. నీరు.

పయోజము. సం. వి. అ. న. తామర, నీటిపుట్టుగు.

పయోధరము. సం. వి. అ. పుం. 1. పాలిండ్లు; 2. మబ్బు; 3. టెంకాయ; 4. కోశకారమను చెఱకు!.

పయోధి. సం. వి. ఇ. పుం. సముద్రము.

పయోరాశి. సం. వి. ఇ. పుం. సముద్రము, నీటికుప్ప.

పయ్య. వై. వి. పల్లవన్నె. విణ. పల్లవన్నెగలది. "పయ్యకెంపు." య. 3, ఆ.

పయ్యఁట. వై. వి. పయఁట. "పయ్యంట చలింపఁగా నురఁటినల్లనవీచుచు." శశాం. ౪, ఆ.

పయ్యద. ద్వి. వి. పయ్యెదయొక్క రూపాంతరము. "యాన వేగమునఁ బయ్యదకొంగు సడలిన." పా. ౮, ఆ. (సంధిని వర్ణవికారము.)

పయ్యర. దే. వి. 1. దక్షిణపుగాలి; "రగడ. కురువిందన దెగిలు బుకొనియెఁ బయ్యరదొంగ, విరులఁగరి కుంభకుచ వెరఁజూమయ్యరగ్రుంగ." స్వా. 3, ఆ.—2. గాలి. "సీ. కూళతో శ్వాసపుఁగూటు వగాటంపు టడవుల మేటి పయ్యరయనుంగ." అచ్చ. బాల, కాం.

పయ్యెద. ద్వ. వి. (పయి+ఎద.) పైఁట. "జిలుఁగు పయ్యెద." య. 3, ఆ.

పర. ఉభ. దే. వి. 1. కంటిపొర; "చ. జరదలకొన్న మేనిజిగిజాఱువినంబడదయ్యెమాటని, త్యరుచిర భోజనంబువడిదప్పెఁగనుంగవనెంతయేనియుం, బరలుదయించెదంతములబల్మి వకావకలయ్యెఁదెల్లగా, నరసెశిరోజముల్ జనప నార తెఱంగునవిప్రమాళికిన్." శేష. ౧, ఆ.—2. అరఁటిలోనగు వానిపొర. "సీ. అలరులేఁజిగురుకొమ్మలనండగొనియుండెఁబరలెత్తెనరఁటికంబములచాలు." భా ను. ర, ఆ.—వై. విణ. వృత్తియందుపరముశబ్దమున కుమీఁదివర్ణములోపింపఁగా మిగిలిన రూపము. (చూ. పరగడుపు.)—సం. వి. ఆ. స్త్రీ. వాగ్భేదము.

పరంగి. వై. వి. 1. శ్వేతముఖుఁడు; హంస. ౧, ఆ.— 2. మూలికావిశేషము*.

పరంగీలాగి. ద్వ. వి. కెంపుజాతిదినుసు. "వ. దుష్టజనశిక్షణశిష్టజనరక్షణంబులు నెఱపుటకువిన్నపంబులకుడగ్గఱు రౌద్రకరుణారసంబులతెఱంగున మెఱుంగుపరంగీలాగికెంపులపోఁగులుబెడంగుసూప." చంద్ర.

పరంజ. వై. వి. ఇల్లుకట్టునపుడు పనివారలకొఱకు కొయ్యలతోఁగట్టిన కట్టడము; సారువ.

పరంజము. సం. వి. అ. పుం. 1. గానుఁగ; 2. చేరకత్తియలుఁగు; 3. నురుఁగు.

పరంపర. సం. వి. ఆ. స్త్రీ. 1. వరుస; 2. సంతానము; 3. హింస.

పరంపరాకము. సం. వి. అ. న. యజ్ఞమునందలి పశువధ.

పరంపరావాహనము. సం. వి. అ. న. తేరుమోకు. అనేకులుమోయునట్టి యందలములోనగునది. (అని కొందఱు.)

పరంపరుఁడు. సం. వి. అ. పుం. ముమ్మనుమఁడు.

పరఁగు. వై. అ. క్రి. 1. ప్రయుక్తమగు; "వ. ఆనూతనందనుండు మొదలగునమ్మేటిమగలమార్గణమ్ములమ్మనుజపతిపైఁబరఁగుటయు." భార. కర్ణ. ౨, ఆ.—2. ప్రవర్తిల్లు; "క. ఎక్కడనడచుసత్యం, బెక్కడధర్మంబుపరఁగునెక్కడగలుగుం, జక్కటినిలుచుంగృష్ణుం, డక్కడనతఁడున్నకతననగు జయమధిపా." సం. "యతస్సత్యంయతోధర్మో యతోహ్రీరార్జవంయతః, తతోభవతిగోవిందో యతఃకృష్ణస్తతోజయః." భార. ఉద్యో. ౨, ఆ.—3. ప్రసరించు*; "క. తిరిగితిమిగాలికైనం, జొరఁగూడనిచోటులెల్లసూర్యమరీచుల్, పరఁగనినెలవులుసూచుట, యరుదే యనిరుద్ధుఁజూడనలవడదయ్యెన్." ఉ, హరి. ౫, ఆ.—4. ప్రసిద్ధమగు*; "క. ఉత్తమమగువంశంబున, నుత్తమకులమునవితండనుత్తమయశుఁడై, యుత్తమనృపతికిఁబుట్టుట, నుత్తముఁడనఁగంబరంగునుర్విననిమునుల్. చనిరి." మార్క. ౫, ఆ.—5. ప్రయాణమగు*; "క. ఆదివ్యౌషధమునుదన, పాదంబులయందుఁదాల్చిపరఁగిరయమునన్, భూదేవుఁడు దఙ్ముఖుఁడై, మోదంబునహిమనగేంద్రమునకుం జనియెన్." మార్క. ర, ఆ.—6. ప్రవహించు*; "అస్తోకప్రవాహంబులైపరఁగెన్ రక్తనదుల్." భార. ద్రో. ౧, ఆ. — 7. విహరించు*. "వ. యథేష్టవిహరణంబులనహరహంబునుం బ్రవర్తిల్లుచున్న యేమునిన్నుంగన్యకాంతఃపురంబుననొక్క సరోవరంబునంబరఁగుతఱి." ప్రభా. ౧, ఆ.

పరఁట. దే. వి. ఏఱుఁబిడక, కరీషము.

పరఁటి. దే. వి. పనఁటియొక్కరూపాంతరము. (వంటకుండకు. "ఐదాఱుపరంట్లవంటకము." భో. ౬, ఆ.)

పరఁటిపుట్టువు. దే. వి. అగస్త్యుఁడు, కుంభసంభవుఁడు. "సీ. ఎఱుఁగఁడుమత్తిల్లిపరఁటిపుట్టువు గ్రుక్కగొనినయప్పుడుగలకుతిలపాటు." య. ౧, ఆ.

పరఁటె. దే. వి. పంటెకు మొదటిరూపము. (చూ. కుంచె.)

పరక. దే. వి. 1. రెండువీసములు; 2. గడ్డిమొదలగు వానిపోఁచ. "తే. ఒక్కఁడడుగెత్తిపరక వేయుచునుదాఁచి, నట్టరిగిటెంకిగనివీఁకఁబట్టుటయును." స్వా. ర, ఆ.

పరకాశాబట్ట. వై. వి. తెల్లని నాజూకుబట్ట.

పరకీయ. సం. వి. ఆ. స్త్రీ. త్రివిధనాయికలలో నొకతె. (చూ. నాయిక.) విణ. ఇతరునిది.

పరగడుపు. ద్వ. వి. (పరము+కడుపు.) ఆహారము వేయనికడుపు.

పరగణా. హిం. వి. జమీలోభాగము.

పరచి. దే. వి. (చూ.) ఎరవు, యాచితకము.

పరజాతుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) బానిసవాఁడు.

త్రి, ప్రబలితివినీకులస్థానపౌరుషముల,కొచ్చెము
గనేలచొచ్చితిపిచ్చపనికి." రామా. ౭,ఆ.—వై.
వి. పిచ్చి.
పిచ్చేపట్టు. దే. వి. లుబ్ధత్వము.
పిచ్చేపెసలు. దే. వి. బ. ఒకదినుసుపెసలు.
పిచ్చేలించే. దే. అ. క్రి. 1. అతిశయించే. "ఆ. పొ
రిఁబొరిఁగదిరెడు, భీతిమానసమునఁబిచ్చలింప."
ఉ, హరి. ౬, ఆ.—2. భయపడు. "క. ఒనరింపఁ
బిచ్చలింపక, మునుకొనియయ్యాడవిమన్కి మొన
కాండ్రతనికా,జెనసిపెనుఁజెట్లుగట్లును, బెను పొ
దవఁగఁబఅపుటయును బెగడకవాఁడుకా." అచ్చ.
యు, కాం. (ఈయర్థమునకు ప్రాచీనప్రయోగ
ము కనఁబడలేదు.)—స. క్రి. ప్రశంసించే. "ఉ.
ఎట్టిలా, వెట్టిపరాక్రమస్ఫురణమెట్టిరయంబని
పిచ్చలింపఁగకా." భార. భీష్మ. ౧, ఆ. "చ. అ
వ్విరాటునివిడిపించెదకా రణపటుత్వమువైరులు
పిచ్చలింపఁగకా." భార. విరా. 3, ఆ.
పిచ్చే. యు. దే. వి. చింతవిత్తు. వై. జంతువులకడు
పులోనిపిత్తకోశము.
పిచ్చేక. దే. వి. పిచ్చికయొక్క రూపాంతరము.
పిచ్చేకకాలు. దే. వి. తృణవిశేషము, పర్వటము.
పిచ్చేకకుంటు. దే. వి. అనూరుఁడు. "సీ. ఉత్తానుఁ
డై విన్కకొఱగి పిచ్చుకకుంటువిప్రతీపంబుగావి
నుతిసేయ" కాశీ. ౧, ఆ.—విశ. కాళ్లులేని
వాఁడు. (చూ. గుజ్జే.)
పిచ్చేకుంటు. దే. వి. (పిచ్చేక+కుంటు.) అనూరుఁ
డు. "సీ. చుట్టుపర్వులకునించుకయునీడొందలే
కినుహరుల్ పిచ్చుకుంటునకగపడె." ఉ, రా. ౧,
ఆ.—విశ. కాళ్లులేనివాఁడు. "ఎ, గీ. అవలఁగొ
అగాకపిచ్చుకుంటయియనంగుఁ,డనుపుగొనఁజొ
చ్చె." ఆము. ౨, ఆ.
పిచ్చేగుంటివాండ్రు. దే.వి. బ. కమ్మవారిని అడిగికొని
జీవించువారు. బిచ్చెమెత్తువారు.(అనికొందఱు.)
పిచ్ఛ. సం. వి. ఆ. స్త్రీ. 1. అరఁటి?; 2. ఒఱ; 3. గు
జ్జుపుకాలిపుండు; 4. పోఁక; 5. సమూహము;
6. పాముయొక్క జోల్లు;7. బూరుగుబంక;8.వరు
స, 9. గంజిమీఁదిమీఁగడ. అ. న. ము. 1. నెమిలి
పురి; 2. సిగ. పుం. తోఁక.
పిచ్ఛందకము. సం. వి. అ. పుం. రాజగృహరచన.
పిచ్ఛిల. సం. వి. ఆ. స్త్రీ. 1. ఇరుగుడు?; 2. బూ
రుగు?. విశ. 1. పేరినది; 2. మీఁగడకట్టినది.

పిటకము. సం. వి. అ. పుం, న. పుండు. పుం 1. చిన్న
పెట్టె; 2. చిన్నగంప.
పిటము. సం. వి. అ. పుం. గంప, కండోలము.
పిట్ట. వై. వి. పులుఁగు, పక్షి, ఖగము, విహంగము.
పిట్టపిడుగు. దే. క్రి. విశ. అనివార్యము. "తే. పిడుగు
మొత్తినగతిఁగూలుఁబిట్టపిడుగు."కవిస. ౧,ఆశ్వా
సము. "ఆ.పిడుగువైచిచంపుఁబిట్టపిడుగు."చంద్ర
(పిట్టపిడుగు — పిట్టపిడుగుగానని యర్థము.)
పిట్టు. వై. వి. వాసెనమీఁదపక్వముచేసినపిండి*.
పిఠరము. సం. వి. అ. న. 1. కవ్వపుకోల; 2. ముస్తె!
పుం, న. వంటకుండ.
పిడి. దే. వి. 1. కత్తిపరుఁజేలోనగునది, త్సరువు; "సీ.
కఱకుదుండగపుకక్కసులఁద్రెంపఁగఁ జాలుజా
లువాపిడివాలువాలువాని."చంద్రా. ౧, ఆ.-
2. పిడికిలి; "ద్వి. వడిరక్కసులపట్లువదలెన్న
ట్లు, పిడిపట్లువదలినఁబెటెలిపేడెత్తి." రా. బాల.
కాం.—3. ఆఁడుమృగము. "వ. తొడిగినయమ్ము
నన పడిపోరలుపిడులవిడువక బిడిముడిపడుకడఁ
తులును." ఉ, హరి. ౪, ఆ. "తే. చుట్టునతిలు
గ్గాలనడుమ, నమరుపిడిపిండులోనిమహాగజేం
ద్రు,కాంతినలరుకుమారునంతంతఁగనియె." హరి.
ఉ. ౭, ఆ. "పిడియేనిక." "మనుఁబిడి."
పిడికట్టు. దే. వి. వింటినడుము, లస్తకము.
పిడికిలి. దే. వి. ముడువఁబడినవ్రేళ్లుగల అఱచేయి.
ముష్టి.
పిడికిలించే. దే. స. క్రి. పిడికిటఁబట్టు. "వ. తూర్పు
ననుత్తరంబునంగలుగు నరనాయకులునానాసేనా
సమన్వితులైవచ్చిచిచ్చయినసుం బిడికిలింతుమను
చున్నవారు." భార. ఉద్యో. ౨, ఆ.
పిడికోల. దే. వి. నాఁగేలులోనగువానిమేడి.
పిడిగంట. ద్వ. వి. నిడుపుపిడిగలగంట. "సీ. పిడిగం
టలును గేకిపింఛంపుఁగుంచెలుఁ, నత్రముల్ పులిగో
ళ్లుచామరములు." రాజ. ౧, ఆ.
పిడిగుద్దులు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. (చూ.
కుప్పిగంతులు.)
పిడిగొట్టు. దే. స. క్రి. (పిడి+కొట్టు.) ఎద్దుగట్టు
పిడిమూర. దే.వి. ముడువఁబడినవ్రేళ్లుగలమూర,రత్ని.
పిడియము. దే. వి. పిడెము. "చ. చల్లడములుపూని
మీఁదఁబడిలంబుగఁగట్టినమట్టికాసెకా, బిడియ
ములంటదో(పి." స్వా. ౪, ఆ.

పిడివాటు. దే. వి. 1. పనకట్టలను చేతికొలఁది కొత్తి గింజెలురాలఁగొట్టుట; 2. ఒడంబడిక. (పిడివాటు చీటి.)

పిడివాదము. అర. వి. మూర్ఖవాదము.

పిడివేయు. దే. అ. క్రి. పసులకటిలో చేయిడి త్రిప్పు.

పిడిసాన. ద్వ. వి. వడ్లవాఁడును తాళ్లపనివాఁడును కొయ్యలకును రత్నములకును బెజ్జము వేసెడు సాధనము, ఆస్ఫోటని.

పిడుఁజు. దే. వి. పశువులదేహమందు చేరి రక్తముపీల్చెడు జంతువిశేషము.

పిడుఁదు. దే. వి. పిడుఁజుయొక్క రూపాంతరము.

పిడుక. దే. వి. పిసికిపిడుచగాచేసి తట్టియెండఁబెట్టిన పేఁడ, కరీషము. (వాడుక పిడకయని.)

పిడుకమొసలి. దే. వి. శింశుమారభేదము. హంస. ౪, ఆ.

పిడుగు. దే. వి. అశని, నిర్ఘాతము.

పిడుగుకైదువు. దే. వి. వజ్రాయుధము. "సీ. పిడుగుకైదువుపెట్టుతడకట్టుగాఁ బయోధి మహావధి రసంబుచమిరెననఁగ." వసు. ౫, ఆ.

పిడుచే. దే. వి. అన్నములోనగువానిముద్ద. (వాడుక పిడచేయని.)

పిడుచేపాఁత. ద్వ. వి. అలుకుచుట్ట.

పిడుచు. దే. స. క్రి. రసములోనగువానిపిండు.

పిడుత. దే. వి. మిక్కిలి చిన్నకుండ. (వాడుక పిడతయని.)

పిడెము. దే. వి. బాఁకు. "పులితోల్ కాసెలనంట దోఁపినపిడెంబుల్." సా. ౧, ఆ. (పిడియముయొక్క రూపాంతరము.)

పిడ్గు. దే. వి. పిడుగుయొక్క రూపాంతరము. "ఉ. రాజీవవిరోధిమండలము చిచ్చఱపిడ్గునుబోలె నేఁచినఁ, దీవఁదొడంగెఁ దెమ్మెరలు వెన్నెలమంటలు మీఁదఁజల్లుచున్." షో. ౨, ఆ.

పిణ్యాకము. సం. వి. అ. పుం, న. 1. తెలికపిండి; 2. ఇంగువ; 3. చిల్లమడ్డి; 4. కుంకుమపువ్వు.

పిత. సం. వి. ఋ. పుం. తండ్రి. (తండ్రులు అయిదుగురు.—కన్నవాఁడు, వడుగుచేసినవాఁడు, చదువుచెప్పినవాఁడు, అన్నముపెట్టినవాఁడు, వెఱపుదీర్చి కాపాడినవాఁడు.) ద్వి. తల్లిదండ్రులు.

పితర. వై. వి. తండ్రి. "వ. పితరయుఁబితామహుండును బ్రపితామహుండుననఁగఁబిండసంబంధులు మువ్వురు." మార్క. 3, ఆ.

పితరవొర. ద్వ. వి. యముఁడు, పితృపతి. (చూ. కేటత్రాఁడు.) (ఇట్లు పితరులఱేఁడు. మొ.)

పితరుఁడు. వై. వి. 1. తండ్రి; "క. సతియుంబతియును సుతుఁడును, బితరుఁడు నొండొరులతోడఁ జెనఁగెడుచోసా, క్షిత్వగ్రణి మాన్వకయు, న్నతఁడు పణత్రయము దండునరువఁగవలయున్." విజ్ఞా. ప్రా, కాం.—2. బ. మృతిపొందినపితృవర్గము వారు, పితృదేవతలు. "క. కృతమతియైయేడేఁడులు, హుతవహుఘృతమునను బ్రీతినొందించినను, వ్రతుఁడీరేడుతరంబుల, పితరులఁగొనిదివికి నేగుఁబెంపెసలారన్." భార. అర. ౪, ఆ.

పితరులచుక్క. వై. వి. మఘానక్షత్రము.

పితలాటము. దే. వి. మోసము. (రూ. పితలాటకము.)

పితామహి. సం. వి. ఈ. స్త్రీ. తండ్రితల్లి.

పితామహుఁడు. సం. వి. అ. పుం. 1. తండ్రితండ్రి; 2. తండ్రి; 3. బ్రహ్మ.

పితాళ్లు. వై. వి. బ. పితరులుయొక్క రూపాంతరము. "ద్వి. తగఁబితాళ్లకుఁదిలోదకములునడపి, జగములనిటసత్యసంధుండవగుము." రా. బాల, కాం.

పితుకు. దే. స. క్రి. పాలుపిండు. "ఎ, గీ. ఇద్ధరాదోగ్ధ్రిఁగ్రేపులనెలమిఁజేర్చి, పితికికొనుఁడనిపని చెసమ్మతముమిగుల." హరి. పూ. ౧, ఆ.

పితూరి. హిం. వి. రాజద్రోహము, కలహము, కుట్ర.

పితృపతి. సం. వి. ఇ. పుం. యముఁడు, పితరులఱేఁడు.

పితృప్రసువు. సం. వి. ఊ. స్త్రీ. ప్రొద్దుపొడుచుటకు ముందైదుగడియలపఱకును ప్రొద్దుగ్రుంకిన వెనక మూఁడుగడియలపఱకును గలకాలము.

పితృయజ్ఞము. సం. వి. అ. పుం. పితృతర్పణము.

పితృవనము. సం. వి. అ. న. శ్మశానము, ఒలికిమిట్ట.

పితృవ్యుఁడు. సం. వి. అ. పుం. తండ్రితోడఁబుట్టినవాఁడు.

పిత్తము. సం. వి. అ. న. ధాతువిశేషము. (చూ. ధాతువు.)

పిత్తల. సం. వి. ఆ. స్త్రీ. నీరుపిప్పలి?. అ. న. ము. ఇత్తడి. విణ. పిచ్చేగలది. (రూ. పిత్తడి.)

పిత్తు. దే. అ. క్రి. అపానవాయువువిడుచు. వి. అపానవాయువు.

పిత్ర్యము. సం. విణ. (అ. ఆ. అ.) తండ్రిది.

పిత్సంతము. సం. వి. త్. పుం. పక్షి. విణ. పడనిచ్ఛగలది.

**పిదప.** దే. వి. వెనుక. "ఇచ్చినపిదప." ఉ, హరి. ౨, ఆ.—విశే. 1. వెనుకటిది; "పిదపటికథ." భార. ఉద్యో. 3, ఆ. "పిదపటిపట్టి." భార. కర్ణ. ౨, ఆ. "పిదపటిపత్త్రము." విజ్ఞా. వ్య, కాం. — 2. తక్కువ, నీచము. (పిదపచేను, పిదపపని. మొ.)

**పిదపిద.** దే. విశే. 1. అనుకు; (చూ. పిదపిదన.) 2. మృదువు. "ద్వి. చెదరక యదరక చిడిముడిగొనక, బెదరకపదరకపిదపిదగాక, క్రొవ్వాడిసూపక క్రూరతలేక." పండి. ౧, భా.

**పిదపిదన.** దే. వి. 1. అనుకుదనము; 2. మృదుత్వము. విశే. 1. అనుకు; "వ. శీకరపరంపరలచొదుగులు మదుగులుగొనినఁ బిదపిదనగుమఁ జిదుకుచిదుకు మనుకొంపులును." భాగ. ౧౦, స్కం. పూ. — 2. మృదువు. (చూ. పిదపిద.)

**పిదుకు.** దే. స. క్రి. పితుకుయొక్క రూపాంతరము.

**పిధానము.** సం. వి. అ. న. మఱుఁగు, తిరోధానము.

**పిన.** దే. విశే. పిన్నయొక్క రూపాంతరము. (పినతల్లి, పినతండ్రి. మొ.)

**పినగుమ్ముడు.** ద్వ. వి. ఉేఁకు?.

**పినద్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. కట్టఁబడినది; (వస్త్రము.) 2. తొడుగఁబడినది. (కవచము.)

**పినాకము.** సం. వి. అ. పుం, న. 1. శివుని విల్లు; 2. త్రిశూలము; 3. మట్టివాన.

**పినాకి.** సం. వి. న్. పుం. శివుఁడు, ముక్కంటి.

**పినాకిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. నదీవిశేషము; 2. వీణావిశేషము.

**పినుఁగు.** దే. వి. లుబ్ధుఁడు. "ఆ. జివురుఁగండెలుగా లవుఁజివ్వ వెదురు, లాదియగుసాధనంబులఁ బవరించు, కొని హుటాహుటినడలతోఁ బినుఁగులెల్లఁ, గదిసినడచిరి యమ్మహీ కాంతుఁ బుత." సా. ౧, ఆ.—విశే. లుబ్ధుఁడు. (చూ. పిలుఁగు.)

**పిన్న.** దే. విశే. చిన్న. (పిన్నవాఁడు, పిన్నది.) "పిన్నటినవ్వు." భార. ద్రో. ౪, ఆ.

**పిన్నకక్కెర.** ద్వ. వి. పక్షివిశేషము, కక్కెర.

**పిన్నగోరఁట.** ద్వ. వి. సహా?.

**పిన్నగ్రద్ద.** ద్వ. వి. పక్షివిశేషము, చింద.

**పిన్నజెమ్మి.** ద్వ. వి. నేలజెమ్మి, శమీరము?.

**పిన్నటనాడు.** దే. వి. పిన్ననాడుయొక్క రూపాంతరము. "ఉ. పిన్నటనాటనుండినను బెద్దగఁజూచిన వంశవృద్ధులన్, మిన్నకచంపిచేకొనిన మేదిని నాకిదియేల." జై. ౧, ఆ.

**పిన్నతుమికి.** దే. వి. కాకితుమికి?.

**పిన్నదూలగొవెల.** దే. వి. దూలగొవెల, కండూర?.

**పిన్ననాడు.** దే. వి. బాల్యదశ, చిన్ననాడు.

**పిన్ననుదురు.** దే. వి. ఏనుఁగునొసటిబుడిపి. వాకుంభము.

**పిన్ననేరెడు.** దే. వి. కాకినేరెడు, కాకజంబువు?.

**పిన్నపాఁపర.** దే. వి. పాఁపర, గోతుంబ?.

**పిన్నపాప.** దే. వి. కన్యక. "సీ. పిన్నపాపవునీవుపితృపరాధీనవు కార్యనిర్ణయశక్తి కలదెనీకు." నై. ౨, ఆ.

**పిన్నపాల.** దే. వి. చిఱుపాల, క్షీరావి?.

**పిన్నములక.** దే. వి. నేలములక, కంటకారిక?.

**పిన్నముల్లంగి.** ద్వ. వి. క్షుద్రమూలకము?.

**పిన్నయిప్ప.** దే. వి. మధూళిక?.

**పిన్నరికము.** దే. వి. పిన్నతనము.

**పిన్నసరగోఁగు.** దే. వి. కములవల్లభి?.

**పిపాస.** సం. వి. ఆ. స్త్రీ. నీరుత్రాగనిచ్ఛ, నీరుపట్టు.

**పిపాసితుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) నీరుత్రాగనిచ్ఛకొన్నవాఁడు.

**పిపాసువు.** సం. విశే. (ఉ.) నీరుత్రావనిచ్ఛించువాఁడు.

**పిపీలిక.** సం. వి. ఆ. స్త్రీ. చీమ. (రూ. పిపీలి. ఈ. స్త్రీ.)

**పిప్పల.** సం. వి. ఆ. స్త్రీ. పిప్పలి?. అ. న. ము. జలము. పుం. 1. రావి?; 2. బాతు.

**పిప్పలాశనము.** సం. వి. అ. పుం. ఏనుఁగు, గజము.

**పిప్పలి.** సం. వి. ఈ. స్త్రీ. ఊపణ?. ఇ. పుం. రావి?.

**పిప్పి.** దే. వి. నలిచిరసముపిండిన ఆకులోనగునది.

**పిప్పిక.** సం. వి. ఆ. స్త్రీ. పండ్లపాఁచి, దంతమలము.

**పిప్పిరి.** దే. వి. పిప్పి. "విరోధిసేనలన్ బిప్పిరిచేసెదన్." జై. ౬, ఆ.

**పిప్లువు.** సం. వి. ఉ. పుం. పుట్టుమచ్చ, తిలకాలకము.

**పిమ్మట.** దే. వి. మనోవ్యథ. "క. ఆరీతినంతిపురమున, నారీతిలకంబుసఖిజనంబులుగొలువం, జేరినపిమ్మటమదిలోఁ, గూరినపిమ్మటవిరాళిగొనఁదుండెన్." విజ. ౨, ఆ. — క్రి. 1. అనంతరము; 2. పరోక్షమందు. "సీ. తులువపిమ్మటనిన్నుదూషించుపలుకులుకులజులునిజముగాఁగొనుట." భార. అను. ౪, ఆ.

**పియ్యి.** దే. వి. పీయియొక్క రూపాంతరము.

**పిర.** దే. వి. కానిలోనాలవభాగము.

పిరంగి. దే. వి. సిపాయిలు యుద్ధమప్పుడు మందుగుండు వేసిగట్టించి కాల్చెడియినుపగ్రోవి. (చూ. అగాదు.)

పిరంగీ. దే. వి. పిరంగియొక్క రూపాంతరము.

పిరి. దే. వి 1. మెలి; 2. వెంటి; "పిరిచుట్టుగఁజుట్టి." కళా. ౬, ఆ. (చూ. పిరిగొను.) 3. గోనెలలో నగునవి కట్టెడుత్రాడు.

పిరిగొను. దే. అ. క్రి. (పిరి+కొను.) పెనఁగొను. "క. సురలచ్చెరువును మెచ్చును, బిరిగొనుచిత్తములతోడ." భార. శల్య. ౨, ఆ.—స. క్రి. మెలిపెట్టు. (చూ. పల్లరు.)

పిరువీఁకు. దే. వి. (పీఁకు+పీఁకు.) 1. పీఁకులాట; "క. తరుణీయేరికిఁజెల్లునె, యరయుఁగనేమింతవారమునకొనవనిదిగోఁ, బిరువీఁకుగనున్నదితాఁ, గిరమద్భుతమైనసవతికయ్యముచేతన్." కళా. ౧, ఆ.—2. బాధ. "క. ఈరాత్రియకారణపుం, బేరలుకఁదదాత్మకెడసి పిరువీఁకగుచో, ప్పారయభాగ్యవిహీనలు, లేరెవ్వరునవనిమండలిన్ననుఁబోలన్." ప్రభా. ౫, ఆ.

పిరువీఁకులాడు. దే. అ. క్రి. (పిరువీఁకులు+ఆడు.) పెనఁగులాడు. "ఒండొంటితోఁబిరువీఁకులాడు." ఆము. ౬, ఆ.

పిరువీఁకుసేయు. ద్వ. స. క్రి. (పిరువీఁకు+చేయు.) 1. పీఁకులాడు; "క. కనిచుట్టువారుకొనియిట్టునటుంబిరువీఁకుసేయుచు." పర. ౫, ఆ.—2. బాధించు. "వ. ఇట్లుబహువిధంబులంబొదివి కాలకౌశికునిం బిరువీఁకుసేయు బ్రహ్మచారులకుఁ బ్రియంబునవందనంబొనర్చి." హరిశ్చ. ౪, ఆ. (చూ. వెనుకటిపద్యము.) (రూ. పిరువీఁకులుసేయు.)

పిర్వీఁకు. దే. వి. పిరువీఁకుయొక్క రూపాంతరము. (బాధకు.—'అసహ్యవర్తనముఁన్ బిర్వీఁకులంబెట్టుదుర్జాతున్." పాండు. ౪, ఆ.)

పిఱికి. వై. విశ. భయశీలుఁడు, భీరువు. "క. వెఱపెట్టిదియోయెన్నఁడు, నెఱుఁగనినీయట్టివానికెవ్వరొకోయీ, పిఱికితనమింతయులవడఁ, గఱపినవారనుచు శౌరికలకలనవ్వెన్." భార. ఉద్యో. 3, ఆ.

పిఱికికండ. వై. వి. అధైర్యము. "ఎ. గీ. పిఱికికండయొకింతలేకటిమివేడ్కఁ, జిచ్చుఱుకఁబోవువికచరాజీవనేత్ర, కశ్వమేధంబుఫలముతథ్యంబుగలుగు." కాశీ. ౨, ఆ.

పిఱికిమెకము. వై. వి. జింక, హరిణము.

పిఱు. దే. వి. వ్యుత్పత్తియందు పిఱుఁదుశబ్దమునకు అంత్యసర్గములోపింపఁగా మిగిలినరూపము. (పిఱుతివియు. మొ.)

పిఱుఁదు. దే. వి. 1. మొలకువెనుకటిభాగము, నితంబము; 2. వెనుక. "శా. ద్రోణాచార్యుపిఱుందనొప్పెదృఢ హస్తుల్ బద్ధగోధాంగుళి, త్రాణుల్ మార్గణపూర్ణతూణులుమహా ధన్వుల్ కుమారుల్ తను, త్రాణోపేతులురంగమధ్యమున నంతన్ నిల్చిరి." భార. ఆది. ౬, ఆ. "క. పిఱుఁదికిఁబోనిచ్చినవి, ల్లటితికిసైయల్లచాఁప." రా. అర, కాం. ౨, ఆ.

పిఱుఁదుకొను. దే. స. క్రి. వెంబడించు. "సీ. రథ్యాప్రవీపోత్థరవముచేగిఁకోటి పిడుగులనెఱవిడిఁబిఱుఁదుకొనఁగ." ఉ, హరి. 3, ఆ.

పిఱుతివియు. దే. అ. క్రి. (పిఱుఁదు+తివియు.) వెనుదీయు, పరాఙ్ముఖమగు. "వ. ఇట్లుభయసైన్యంబులుఁబిఱుతివియక పూర్వపశ్చిమసముద్రంబులతెఱంగునంగవిసి." శేష. ౫, ఆ.

పిఱుతివుచు. దే. అ. క్రి. (పిఱుఁదు+తివుచు.)——పై. —— "క. మనవాఁడైనంద్రుఁడుచె, ప్పినమాటలువింటిరింకఁబిఱుతివకమలల్, కొనివచ్చికట్టఁగట్టుఁడు, చనవలయుఁగడలిదాఁటిసరగునమనకున్." య. 3, ఆ.

పిఱుదీయు. దే. అ. క్రి. (పిఱుఁదు+తీయు.)——పై.—— "సీ. మొలనూలుబిగియించివెలఁదివెన్నెలఁజొచ్చుఁబిఱుదీయకేటిలోనుఱుకుకరణి." స్వా. 3, ఆ.

పిఱుము. దే. వి. పరుషభావము. "చ. కడుం, బిఱుములచూపులుఁదఱుమబీఱసరఁబులుఁగల్గురూపమై." ఉ. హరి. ౨, ఆ.—విశ. పరుషము. "సీ. ద్వాదశరూపముల్ దాల్చియుగ్రమయూఖుఁ డేవేళఁబచరించునెంచఁబిఱుము." హరిశ్చ. ౪, ఆ.

పిఱుపడు. ద్వ. అ. క్రి. (పిఱుఁదు+పడు.) 1. వెనుదీయు; 2. భయపడు. "క. చాపలచేగాండీవిమ, హారథికులతోడవచ్చెననివినిగుండెల్, నీరైసైంధవతనయుఁడు, పేరోలగముండిబిట్టుపిఱుపడిచచ్చెన్." జై. ౭, ఆ.

పిఱుపెట్టు. దే. స. క్రి. (పిఱుఁదు+పెట్టు.) అనాదరించు. "అ. చలనమేదిపుట్టుఁజావునుబిఱుపెట్టి, యామిపార్థిజనులనపహసించు, నెలమితోడలేమి

కలిమివాటింపని,రమణునికియజగరవ్రతంబు." భార. శాం. ౪, ఆ.

పిఱువోవు. దే. అ. క్రి. (పిఱుఁదు+పోవు.) వెనుదీయు. "సీ. పిఱువోవనందుఁదతటిమికొమ్ములఁనట్టి లోడర నొండొంటిపైఁ ద్రోచిత్రోచి." హరి. పూ. ౬, ఆ.

పిఱుసను. దే. అ. క్రి. (పిఱుఁదు+చేను.) ——పై. ——"క. మఱతు రెయాడినమాటలు, పిఱుసని పోఁదగునెమీకు బెదరకయెదురై, తఱుఁదు భీష్మునిగీష్మని, తెఱుఁగరె ము న్నేనుగలఁగ నేలా వెఱవ౯." భార. భీష్మ. ౨, ఆ.

పిఱ్ఱ. దే. వి. పిఱుఁదు, నితంబము.

పిలపిల. దే. వి. మూఁగుటయందును వచ్చుటయందును పోవుటయందును బిక్కిరించుటయందును నగు ననుకరణము. "పిలపిలమూఁగ." సా. ౩, ఆ. "పిలపిలనేతేర."విజ.౨,ఆ."పిలపిలనేఁగ." రసి. ౫, ఆ. "ద్వి. పిలపిలఁజెవులల్ల బిక్కిరించుకొని." వశి. ౩, భా.

పిలుఁగు. దే. వి. విణ. పినుఁగుయొక్కరూపాంతరము. (లుబ్ధునకు.—"క. కలదాసన్యాసికిబహు,కలధౌతసువర్ణపూర్ణకంథ సదా య, ప్పిలుఁగుయతిమఅపుమోసము, కలనేనియులేక దానిఁగని రక్షించు౯." పంచ. వేం. ౧, ఆ.)

పిలుక. వై. వి. పక్షిలోనగువానిపిల్ల. ("అంచేపిలుక." "సింగపుఁబిలుక." "తేఁటిపిలుక." "తెమ్మెరపిలుక." మొ.)

పిలుకు. దే. వి. గర్వము. (చూ. పిలుకుమాలు.)

పిలుకుమారు. దే. అ. క్రి. 1. చేచ్చు; "ఉ. ఇంచుకయేనియుఁ౯వనట నెన్నఁడుఁ బొందనితల్లి నేఁడు నా, మంచితనంబున౯ బిలుకుమారినవాథుని నుగ్రశత్రుల౯, మంచునినుండుఁబోలెఁబరిమార్చు మహాబలుఁ జూచియిట్లుఁదుః, ఖించుచునుండఁ జూచితి సకిల్బిషచిత్తున కింతపెద్దయే." భార. అశ్వ. ౪, ఆ.—2. నాశమొందు. (చూ. పిలుకుమాలు.) (రూ. పిల్కుమాఱు. పిలుకుమాలుయొక్కరూపాంతరము.)

పిలుకుమార్చు. దే. ప్రే. (పిలుకుమారఁజేయు.) 1. చంపు; "క. పట్టినచలమున నీగతి, మట్టముగా సేనఁ బిలుకుమార్చిక దలిరా, నెట్టిక సీలలుమదిలోఁ, బుట్టినహర్షమునఁదమఱపోవనమునకు౯." శై.౬, ఆ.—2. నాశముచేయు. "సీ. సముచితంబైనలజ్జాభరంబునఁబోలెఁ బ్రియసఖీసఖ్యంబుఁబిలుకమార్చి." కవి. ౩, ఆ. (మొదటిరూపము పిలుకమారుచే.)

పిలుకుమాలు. దే. అ. క్రి. 1. చేచ్చు; (చూ. పిలుకుమారు.) 2. నాశమొందు. "చ. సరకుగొనఁడు పాండుసుత సైన్యనికాయమునింక మకేనియు౯, గరులఁరథంబులు౯ హరులఁ గాల్బలముల్దన వీఁకవిచ్చియు౯, మరలియుఁ దూలియుఁబిలుకుమాలియునల్గడఁబాఱియు౯వియ, చ్చరులకువేడ్కసేఁయ భుజసారము శౌర్యముఁజూపెనేపున౯." భార. కర్ణ. ౧, ఆ. (రూ. పిల్కుమాలు.)

పిలుకుమాల్చు. దే. ప్రే. పిలుకుమాలఁజేయు. (మొదటిరూపము పిలుకుమాలుచే.)

పిలుచు. దే. స. క్రి. ఆహ్వానించు, (రూ. పిల్చు.)

పిలుపు. దే. వి. పిలుచుట, ఆహ్వానము.

పిలుపుడు. దే. వి.——పై.——

పిల్క. వై. వి. పిలుకయొక్కరూపాంతరము. "తెమ్మెరపిల్క." చంద్రా. ౨, ఆ.

పిల్ల. వై. వి. 1. పక్షిలోనగువానిసంతతి; (కోడిపిల్ల, మేఁకపిల్ల, ఎలుకపిల్ల, అరఁటిపిల్ల. మొ.) 2. అఁడుపడుచు*; 3. బ. బిడ్డలు*. విణ. చిన్న*. (పిల్లకాలువ. మొ.)

పిల్లఁగ్రోలు. ద్వ. వి. (పిల్ల+క్రోలు.) పిల్లనగ్రోవి. మురళి. "సీ. బంగారుతగటుదుప్పటిబిగ్గమొలఁజుట్టి కేలఁజొక్కపుఁబిల్లఁగ్రోలువట్టి." నీలా. ౧, ఆ. "దానవులు పిల్లంగ్రోళ్లుపట్టంగ." భీ. ౪, ఆ. (సంధియందు వర్ణాధిక్యము. ఇట్లు పిల్లఁగ్రోవియందును.)

పిల్లఁగ్రోవి. ద్వ. వి.——పై.——

పిల్లకాయ. ద్వ. వి. బాలుఁడు.

పిల్లగడ్డము. ద్వ. వి. నడుమమాత్రము కొంచెము వెండ్రుకలుగలగడ్డము. "సీ. పిల్లగడ్డముమించఁ బెంగిమీసలుకుక్షి గోళఁబుమీఁద నుయ్యాలలూఁగ." ఆము. ౬, ఆ.

పిల్లగాఁడు. ద్వ. వి. (పిల్ల+కాఁడు.) బాలుఁడు.

పిల్లగిఱులు. ద్వ. వి. బ. బాలక్రీడావిశేషము.

పిల్లజుట్టు. ద్వ. వి. బాలురముండటిసిగ.

పిల్లదీపు. ద్వ. వి. (పిల్ల+తీపు.) బాలక్రీడావిశేషము. (చూ. తూరనతుంకములు.)

పిల్లదీవి. వై. వి. బాలక్రీడావిశేషము. "సీ. తూరన తుంకాలుగీరనగింజలు పిల్లదీవాలంకి బిల్లగోడు." కాశీ. 3, ఆ.—బ. పిల్లదీవులు. (చూ. గుబ్లు.)

పిల్లనగ్రోలు. ద్వి. వి. (పిల్ల+క్రోలు.) పిల్లనగ్రోవి.

పిల్లనగ్రోవి. ద్వి. వి. (పిల్ల+క్రోవి.) ఊఁదుటకనువుగా బెజ్జములు వేసిన వెదురుగొట్టము, మురళి.) సంధియందువర్ణాధిక్యము. ఇట్లు పిల్లనగ్రోలునందును.)

పిల్లనూయి. ద్వి. వి. నూతిలోపలి చిన్ననూయి, కూపకము. (పిల్లబావియనుచో బావిలోపలిచిన్న బావి అని యర్థమెఱుంగునది.)

పిల్లపీచర. ద్వి. వి. పీచర, శతావరి*.

పిల్లపెసర. ద్వి. వి. కాకిపెసర, ముద్గపర్ణి*. (ధాన్యవాచకమైనచో పిల్లపెసలు.)

పిల్లము. సం. వి. అ. పుం. తడికన్ను. విణ. తడికన్ను గలది.

పిల్లమెఱము. ద్వి. వి. 1. తలక్రిందుగా వేసెడు లాఁగు; 2. లాఁగు. "తే. పిల్లమెఱముఁబోదుకుప్పించరాదు, దీని నేలాగునఁదరింపఁదీరుమనకు." రామా. ౬, ఆ.

పిల్లవ్రేలు. ద్వి. వి. చిటికెనవ్రేలు. "వలకాలిపిల్లవ్రేల్." జై. ౮, ఆ.

పిల్లాఁడి. దే. వి. పిల్లాణికి మొదటిరూపము. "ఉ. ఆ కపిల్లాఁడికరంబువ్రేలఁ బదిలఁబుగఁదాల్చినవాఁడు మాడవే." కళా. ౭, ఆ.

పిల్లాకము. సం. వి. అ. పుం, పక్షిపిల్ల.

పిల్లాణి. దే. వి. ఆఁడుదాని కాలినాలుగవవ్రేలియందలి ఆభరణము.

పిల్లి. వై. వి. మార్జాలము. (దీనిభేదములు.—జెంగుపిల్లి, నీరుపిల్లి, జవాదిపిల్లి, పునుఁగుపిల్లి, బూతపిల్లి. మొ.)

పిల్లికవ్రతనము. ద్వి. వి. (పిల్లికను+రతనము.) వైడూర్యము. "పిల్లికవ్రతనంపుఁ బెద్దమందసములు." అచ్చ. సుం, కాం.

పిల్లిగడ్డ. వై. వి. పునుఁగుచెట్టము. "సీ. పిల్లిగడ్డకుఁ దాపిపెల్లుగా నొనఁగూర్చి కుందనంబునకేల కూర్పఁడయ్యె." నీలా. ౧, ఆ.

పిల్లు. దే. వి. పుల్లుయొక్క రూపాంతరము. "ఆ. పిల్లుగట్టునలకు బేరుండుదానైన, నాయమునకు వెచ్చమధికమైన." విక్ర. ౨, ఆ.

పిల్లేరుగంతు. ద్వి. వి. (పిల్ల+ఏరుగంతు.) తలక్రిందుగా వేసెడులాఁగు.

పిశంగము. సం. వి. అ. పుం. కపిలవర్ణము. విణ. కపిలవర్ణముగలది.

పిశాచము. సం. వి. అ. పుం. 1. దేవయోనివిశేషము; 2. పిల్లి.

పిశాచి. సం. వి. ఈ. స్త్రీ. 1. స్త్రీపిశాచము; 2. జటామాంసి.

పిశిత. సం. వి. ఆ. స్త్రీ. జటామాంసి. అ. న. ము. మాంసము.

పిశున. సం. వి. ఆ. స్త్రీ. 1. స్పృక్క*; 2. కొండబెండ*. అ. న. ము. కుంకుమపువ్వు. పుం. కాకి.

పిశునుఁడు. సం. వి. అ. పుం. నారదుఁడు. విణ. 1. కొండెకాఁడు; 2. దుష్టుఁడు.

పిష్టకము. సం. వి. అ. న. నూఁబొడి. పుం. 1. పిండివంట; 2. నేత్రరోగవిశేషము; 3. కించిజ్జఘనాధిక్యమునుస్తనాంతవిస్తృతియుఁగలగజవిశేషము.

పిష్టపచనము. సం. వి. అ. న. పిండివంటచేసెడుపాత్రము. బూరెలమూకుడు. (అని కొందఱు.)

పిష్టము. సం. వి. అ. న. 1. పిండి; 2. సీసము. విణ. పొడిచేయఁబడినది.

పిష్టాతకము. సం. వి. అ. పుం. వస్త్రములకువాసన కట్టెడుబుక్కాము, పటవాసకము.

పిస. దే. వి. అవివేకము. "చ. రసికుఁడుగానియర్థమధురంబగుకావ్యగభీరభూరివా, గ్విసరమెఱుంగనేరఁడవివేకియొకానొకకారణంబునన్, వెసఁ జనిరాజగేహమునవిద్రుమపంజరకీరిఁజూచితాఁ, బిస నెలతగ్గుదూడయని పిల్చును గొల్లఁడు జాతిభావలన్." చమ. ౧, ఆ.

పిసక. దే. వి. తలవెండ్రుకలయందు చెమటచే బఁదనగొను ముఱికి.

పిసరు. దే. వి. 1. కడిగినధాన్యములో త్రోవుడుపడినది; "ద్వి. పిసరుగాఁచినకుండ పేర్పుచందమున, నెసఁగినబాఁకినోరెంతయుఁదెఱచి." హరిశ్చ. ౨, భా.—2. లేశము; (పిసరంతపొడి.) 3. విష్ఠ. (పిసరువెళ్లగ్రుద్దినాఁడు.)

పిసాచి. వై. వి. పిశాచి, పిశాచము*.

పిసాళము. దే. వి. 1. వికాసము; "క. అంతవసంతముజితహే, మంతముదీపించెమత్తమధుకరకలభా, క్రాంతమురుపుష్పరసవే, శంతముసకలద్రుములఁ బిసాళముచెలఁగన్." పాండు. ౪, ఆ.—2. పరిహాసము; "తే. విప్రనారాయణునిఁజూచివెలఁదులపుడు, కడుఁబిసాళంపుఁబలుకులుబనడపుచుం

డఁ, జిలుకపలుకులతోడిమ్రాఁకులనుబోలె, వికృతిలేక తఁడీక్షింప వెఱఁగుపడిరి." పర. 3, ఆ.—3. ప్రకాశము; 4. వ్యాపనము; 5. దొంగయెత్తు. (చూ. పిసాళించు.)

పిసాళి. దే. విణ. 1. ప్రకాశముకలది; "అలఁతిపిసాళినవ్వు." పాండు. ౪, ఆ.—2. వ్యాపనముగలది; "ఉ. చందురకావిపావడపిసాళిరుచుల్ సరిగంచుచీరపైఁ, జిందులుద్రొక్క." విజ. ౨, ఆ. (చూ. ఊఁక.)—3. దొంగయెత్తుగలది. "చాలుంజాలుఁ బిసాళిసేఁతలు." కా. ౨, ఆ.

పిసాళించు. దే. అ. క్రి. 1. ప్రకాశించు; (చూ. పచారించు.) 2. పరిమళించు; "సీ. సద్యోవినిర్భిన్నసారంగనాభికాహృతమైపిసాళించుమృగమదంబు." స్వా. ౨, ఆ.—3. వ్యాపించు; "క. పరిమళధూపముజాలక, సరణిఁబిసాళింప." జై. ౭, ఆ.—4. పరిహాసములాడు; "వ. అనియీప్రకారంబునమతియునొండొరులతోననేకవిధసరససల్లాపంబులంబిసాళించుచు." కళా. ౧, ఆ.—5. దొంగయెత్తువేయు. "ద్వి. కొడుకువిలపించుకొనుచునీవున్న, నెడపకెవ్వరొనర్తురీపనులెల్లఁ, జాలులేలెమ్మపిసాళింపకనుచు." హరిశ్చ. ౨, భా.—స. క్రి. పరిహసించు. "ద్వి. లేఁతచందురుఁ బిసాళించునెన్నుదురు." హరిశ్చ. ౨, భా.

పిసి. దే. వి. తొలియందుబిగఁగొట్టుటకై చెక్కినస్తంభము పట్టెలోనగువానిచివర.

పిసికిళ్లు. దే. వి. బ. 1. జొన్నలులోనగువానియూఁచేబియ్యము; 2. పిసుకుటలు. (చూ.) ఆము. ౪, ఆ.

పిసిడి. దే. విణ. పిసిని. "సీ. పిసిడియర్థముఁగూడఁబెట్టినట్లావంకఁబోతుటీఁగకునైనఁబొలయరాదు." జై. ౧ ఆ.

పిసినారి. దే. విణ. (పిసిని+అరి.) పిసినిగొట్టు, లోభి. (స్వార్థమున అరి. సంధియందు వర్ణవికారము.)

పిసిని. దే. విణ. పిసినివాఁడు. (పిసిడియొక్క రూపాంతరము.)

పిసినిగొట్టు. దే. విణ. పిసినారి. (స్వార్థమున కొట్టు.)

పిసుకు. దే. స. క్రి. 1. పిండిలోనగువానిచేతమర్దించు; 2. పాదములులోనగువానినొత్తు.

పిహితము. సం. వి. అ. న. 1. ఒక అర్థాలంకారము; (చూ. అలంకారము.) 2. కనుఱెప్పమూఁత. విణ. కప్పఁబడినది.

పిళ్ల. అర. వి. కొన్ని జాతులపేరునకుఁజేర్చెడుపదము.

పిళ్లారి. దే. వి. వినాయకుఁడు. అచ్చ. కిష్కిం, కాం.

పిళ్లు. దే. వి. బ. దూడలనుకుడుపనీనియావులనుమాడలువచ్చినయావులనుమరులుకొలుపుటకైతద్యోనిద్వారమునఁ జొప్పించిలాగెడుతోరపుకసవుపెంటి. "వ. క్రేపులంగొననియావులంబాలంగంగట్టిపిళ్లువెట్టియు మందులుపట్టియుం జాలదుఃఖపఱిచిచేఁపెఱుంగించువారును." హరి. పూ. ౫, ఆ.

## పీ.

పీఁకు. దే. స. క్రి. 1. పెఱుకు; 2. తీసివేయు.

పీఁకులాట. దే. వి. పీఁకులాడుట, పిసుపీఁకు.

పీఁకులాడు. దే. అ. క్రి. (పీఁకులు+ఆడు.) పెఁకులాడు. (ఏలనాతో పీఁకులాడెదవు.)

పీఁకుపీఁకాడు. దే. స. క్రి. (పీఁకు+పీఁకు+ఆడు.) మిక్కిలిపెఱుకులాడు. "సీ. దీనిఁగంకశివాగృధకాకకులము, లాదిగాఁగలుగుక్రవ్యాదములకుపీఁకాడుటనెఁగిలియయ్యెనకట." భార. స్త్రీ. ౨, ఆ.

పీఁకె. దే. వి. 1. నాగసరములోనగువాద్యముఖమునఁజొప్పించెడుకొవిపుల్ల; 2. కాలిపఱెఁజుట్టినచిన్నఆకుచుట్ట; "సీ. నిడుపునాకులుమడిచిపెకెలుచుట్టి యూఁదుచునటియింతురొక్కవేళ." వి. పు. ౭, ఆ.—3. తాగిమిగిలినపొగచుట్ట.

పీఁకెవాఱు. దే. అ. క్రి. 1. చేష్టటయగు; 2. కృశించు. "సీ. బలురాజనంపుఁబొట్టలుపీఁకెవాఱెఁబోముద్దియపిక్కలకుద్దిగాక." అచ్చ. అర, కాం.

పీఁచెము. వై. వి. పించెముయొక్క రూపాంతరము.

పీఁచెర. దే. వి. శతావరి. (ఇది ద్వివిధము.—పిల్లపీఁచెర, పెద్దపీఁచెర. ఇదే పిల్లపీఁచెర.)

పీఁచు. దే. వి. గూఁడువలెఁబెనఁచుకొనియుండునార. (టెంకాయపీఁచు, బీఱకాయపీఁచు. మొ.)

పీఁట. వై. వి. కూర్చుండెడుపలక, ఆసనము.

పీఁటవెట్టు. ద్వ. అ. క్రి. (పీఁట+పెట్టు.) లేవకయొకచోటనేపాదుకొనియుండు. "ఎ. గీ. ఈఁకెపోటులబడిఁబ్రేవులీఁదులాడఁ, బోయిపోలేకదడిదొట్టిపాదలుసాచ్చి, బెండువడియునుజొరగీదుపీఁటవెట్టి, చూపులనెయేర్పుఁబ్రజనొక్కనూకరంబు." స్వా. ౪, ఆ.

పీగ్రద్ద. ద్వ. వి. పీతిరిగద్ద, అతాయి.

పీఠమర్దుఁడు. సం. వి. అ. పుం. శృంగారనాయక సచివులలో నొకఁడు. (చూ. సచివుఁడు.) విణ. ధృష్టుఁడు.

పీఠము. సం. వి. అ. పుం. ఆసనము, పీఁట.

పీఠి. సం. వి. ఈ. స్త్రీ.——పై.——

పీఠిక. సం. వి. ఆ. స్త్రీ. 1. గ్రంథము మొదటవ్రాసెడు దానిపుట్టుపూర్వోత్తరము; 2. ఉత్కృష్ట పీఠము.

పీడ. సం. వి. ఆ. స్త్రీ. 1. బాధ; 2. కరుణ; 3. శిరస్సు; 4. సరళవృక్షము.

పీడనము. సం. వి. అ. న. పగులవేఁగలుగురాయిడి.

పీడించు. సం. స. క్రి. బాధించు, నొగులుచు.

పీడితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. పీడింపఁబడినది; 2. పిసుకఁబడినది.

పీడ్యమానము. సం. విణ. (అ. ఆ. అ.) పీడింపఁబడుచున్నది.

పీత. ఉ. క. వై. వి. ఎండ్రకాయ. సం. ఆ. స్త్రీ. పసుపు. అ. పుం. ము. 1. ఎండ్రకాయ; 2. పసుపువర్ణము. విణ. 1. పసుపువర్ణముగలది; 2. త్రాగఁబడినది.

పీతదారువు. సం. వి. ఉ. పుం, స్త్రీ. దేవదారువృక్షము.

పీతద్రువు. సం. వి. ఉ. పుం. 1. మ్రానిపసుపు; 2. సరళవృక్షము.

పీతనము. సం. వి. అ. న. 1. కుంకుమపువ్వు; 2. హరిదళము; 3. దేవదారువృక్షము. పుం. అంబాళము.

పీతముండము. సం. వి. అ. పుం. పచ్చతలపిచ్చుక.

పీతసాలకము. సం. వి. అ. పుం. వేఁగిస.

పీతాంబరుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు, పచ్చవలువవారి. విణ. పీతవస్త్రముగలవాఁడు.

పీతి. సం. వి. ఇ. స్త్రీ. పానము. పుం. గుఱ్ఱము.

పీతిగోరువంక. ద్వ. వి. పక్షివిశేషము, విట్చారిక.

పీతిఁగద్ద. ద్వ. వి. (పీతి+గద్ద.) పీగ్రద్ద. (సంధియందు వర్ణాధిక్యము.)

పీతిరిగుంట. ద్వ. వి. (పీతి+గుంట.) ముఱికిగుంట. (సంధియందు వర్ణాధిక్యము.)

పీతోలు. గ్రా. వి. పైనుండు సన్ననిచర్మము.

పీనము. సం. వి. అ. న. సంతోషము. పుం. చెమట. విణ. బలిసినది.

పీనసము. సం. వి. అ. పుం. రోగవిశేషము, పడిసెము.

పీనాహము. సం. వి. అ. పుం. 1. ఇటికలోనగువాని చేత కట్టఁబడినమూతివాతికట్టు, తాగాఁడి.

పీనుఁగు. దే. వి. ప్రాణమువాసినబొందె, శవము. "క. ప్రోవులుగట్టినగుఱ్ఱపుఁ బ్రేవులు నేనుంగుతలలు పీనుంగులుర, క్తావిలత వెల్లచీరలుఁ, గావులునైథటనికాయకాయంబులునై." భార. భీష్మ. ౨. ఆ.

పీనుఁగుఁదిండి. దే. వి. (పీనుఁగు+తిండి.) పిశాచము.

పీనోధ్నీ. సం. వి. ఈ. స్త్రీ. పెద్దపొదుఁగుగలయావు.

పీన్గు. దే. వి. పీనుఁగుయొక్క రూపాంతరము.

పీయి. దే. వి. మలము, విష్ఠ, పురీషము.

పీయూషము. సం. వి. అ. న. 1. అమృతము; 2. జున్నుపాలు.

పీరు. దే. అ. క్రి. పీలుయొక్క రూపాంతరము. వి. క్షీరధార, గుమ్మ.

పీరుచు. దే. స. క్రి. పీలుచుయొక్క రూపాంతరము, (రూ. పీర్చు.)

పీర్లు. హిం. వి. మహమ్మదీయుల భక్తుల జ్ఞాపకార్థమైన చిహ్నలు.

పీల. దే. విణ. బక్క, కృశము.

పీలి. దే. వి. 1. పక్షివిశేషము; "పీలిగఱులయంపకోలలు." స్వా. ౪. ఆ. (పికిలియొక్క రూపాంతరము.)—2. ఓడకుదారిచూపెడుచుక్కాని.

పీలిక. దే. వి. వస్త్రములోనగువానిఖండము.

పీలికాఁడు. దే. వి. ఓడచుక్కానుత్రిప్పెడువాఁడు, కర్ణధారుఁడు.

పీలు. దే. అ. క్రి. పిగులుయొక్క రూపాంతరము.

పీలుకము. సం. వి. అ. పుం. పక్షిపిల్ల.

పీలుచు. దే. స. క్రి. 1. జుఱ్ఱు; 2. ఊపిరిపట్టి పొడిముక్కులోపలికీడ్చుకొను. (రూ. పీల్చు.)

పీలుపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. 1. చేఁగ; 2. దొండ.

పీలువాది. సం. వి. న్. పుం. ఒకమతమువాఁడు.

పీలువు. సం. వి. ఉ. పుం. 1. గోలుగుచెట్టు; 2. ఏనుఁగు; 3. పరమాణువు; 4. తాటిచెక్క; 5. పుష్పము; 6. బాణము.

పీవము. సం. విణ. (న్. ఈ. న్.) పీనము, బలిసినది.

పీవరము. సం. వి. అ. పుం. తాఁబేలు. విణ. 1. బలిసినది; 2. క్రొవ్వినది.

పీవరి. సం. వి. ఈ. స్త్రీ. పెద్దపీఁచర.

## పు.

పుంఖము. సం. వి. అ. పుం. బాణముక్రిందిచివర, పింజె.

పుంఖితము. సం. విణ. (అ.ఆ.అ.) పుంఖానుపుంఖముగాఁజేయఁబడినది.

పుంగవము. సం. వి. అ. పుం. 1. ఎద్దు; 2. ఓషధి విశేషము.
పుంగవుఁడు. సం. వి. అ. పుం. (ఉత్తరపదమైనచో) శ్రేష్ఠుఁడు.
పుంసకు. దే. వి. తెల్లపొడలకుష్ఠము. పులిపులి. (అని కొందఱు.)
పుంజము. సం. వి. అ. పుం. రాశి, ప్రోగు.
పుంజి. వై. వి. సమృద్ధి*. "ఖంజరీటంబులపుంజిఁదలుప." దశా. ౯, ఆ. — విణ. సమృద్ధము*. (ఆ గ్రామమిప్పుడు పుంజిగానున్నది.)
పుంజికొను. ద్వి. అ. క్రి. గుబురుకొను. "వ. పుంజికొనివెడలినిడుదలైయుండుకఱకుగిలునాసాకేశంబులును." కవిక. ౫, ఆ.
పుంజీ. దే. వి. నాలుఁగు.
పుంజీభవించు. సం. అ. క్రి. రాశివడు, ప్రోగువడు.
పుంజేము. వై. వి. ముప్పదియొనికలనూలు*.
పుంజాలదండ. వై. వి. ఆఁడుదానికంఠాభరణవిశేషము. "తే. దండసకిమెడఁబుంజాలదండవెట్టు." పాండు. 3, ఆ. (చూ. ఒడ్డాణము.)
పుంజు. దే. వి. మగకోడి, కుక్కుటము.
పుంజుదాలుపు. దే. వి. (పుంజు+తాలుపు.) కుమారస్వామి.
పుంట. దే. వి. సంధ్య.(పూఁటయొక్కరూపాంతరము.)
పుండరీకము సం. వి. అ. న. 1. తెల్లదామర; 2. తెల్లగొడుగు; 3. తీర్థవిశేషము; 4. గంధద్రవ్యవిశేషము. పుం. 1. ఆగ్నేయపుదిక్కునందలియేనుఁగు; 2. బెబ్బులి; 3. కప్పు; 4. తియ్యమామిడి?; 5. తెల్లపొడలకుష్ఠము. డు. 1. ఒకానొకముని; 2. నిఘంటువులుచేసినవారలలో నొకఁడు.
పుండరీకాక్షుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు, తెలిదమ్మికంటి.
పుండలించు. దే. అ. క్రి. అభూతకల్పనముచేయు.
పుండు. దే. వి. వ్రణము, పిటకము.
పుండ్రము. సం. వి. అ. పుం. 1. నలుపుగలసినయెఱ్ఱచెఱుకు?; 2. తెల్లదామర; 3. నుదుటినామము; 4. పురుగు; 5. పువ్వులగురివెంద, పుండ్రకము?; 6. వంగదేశము. డు. ఒకరాక్షసుఁడు.
పుంత. దే. వి. (చూ.) ఉపరిథ్య.
పుంభావము. సం. వి. అ. పుం. ప్రౌఢిమము.
పుంశ్చలి. సం. వి. ఈ. స్త్రీ. అంకుటాలు, కులట.
పుంసవనము. సం. వి. అ. న. 1. గర్భచిహ్నము తెలిసినతోడనే పురుషప్రజగాపుట్టవలెనని చేసెడియొకానొకశుభకర్మము; (చూ. కర్మము.) 2. క్షీరము.
పుకారు. హిం. వి. కేకలు, అల్లరి, వదంతి.
పుకిలించు. దే. స. క్రి. పుక్కిలించుయొక్కరూపాంతరము. (చూ. పల్లరు.)
పుకిలింత. దే. వి. పుక్కిలింతయొక్కరూపాంతరము.
పుక్క. దే. వి. బుగ్గయొక్కరూపాంతరము.
పుక్కిలి. దే. వి. బుగ్గలోపలిభాగము.
పుక్కిలించు. దే. స. క్రి. నీళ్లులోనగువానిగండూషించు.
పుక్కిలింత. దే. వి. పుక్కిలించుట, గండూషము.
పుచ్చె. దే. వి. 1. తలపుట్టి; 2. టెంకాయభాండ్లములోనగునది.
పుచ్చే. దే. వి. కాళింగి?. (దీనిభేదముచేఁతిపుచ్చే.)
పుచ్చేడీక. దే. వి. సిగ్గరి. "సీ. పుచ్చడీకతనంబుపోఁబెట్టిగిరికన్యపతిఁగోల్వ నాయాసపడినచోటు." స్వా. ౨, ఆ.
పుచ్చు. దే. అ. క్రి. పుప్పిపట్టు. ప్రే. పోఁజేయు. "ఆ. భూరిభుజుఁడుతానెపోయెనోనీవెట, కేనిపుచ్చితోనిజేచ్ఛ." భార. అర. 3, ఆ.—స. క్రి. 1. గ్రహించు; "ఉ. తన మెడ హేమసూత్రమొకదారుపుసందగిలించిగ్రక్కునన్, జనినసెటింగివాయసము చంచుపుటంబునదానిఁబుచ్చి." పంచ. నా. ౧, ఆ. - 2. పెఱుకు. "శా. విద్యుద్వహ్నిశిఖాసముచ్చయరుచిన్ వెల్గొందు దంచజ్జటన్, సద్యఃక్రోధముతోడఁబుచ్చివయిచెన్ త్ర్యక్షుండు చక్రమధ్యంబునన్. వ. ఇట్లు పెఱికివైచిఁరుద్రుఁనిజటయందు." భాగ. ౪, స్కం. —వి. ఆముదపుమడ్డి.
పుచ్చుకొను. దే. స. క్రి. గ్రహించు. "వ. దానింబుచ్చుకొనియభిమంత్రించిచండకౌశికుండు బృహద్రథునకిచ్చి." భార. సభా. ౧, ఆ. (స్వార్థమునకొను.)
పుచ్చుకోలు. దే. వి. పుచ్చుకొనుట, గ్రహణము.
పుచ్ఛటి. సం. వి. ఈ. స్త్రీ. నెటికవిఱుచుట. (దీనిఁగొందఱు పున్నపుంసకలింగములుగా వ్రాసియున్నారు.)
పుచ్ఛము. సం. వి. అ. పుం, న. 1. తోఁక; 2. వెనుకప్రక్క.
పుటపుట. దే. వి. అదురుట యందగునను కరణము. "ద్వి. నాసికయుఁ, బుటపుటఁగటములుఁ బొంగఁ బొరినదుర." హరిశ్చ. ౧, భా.

పుటపుటన. దే. విణ. 1. అధికము; "వ. కొంతెలుఁక నగుమదముపుటపుటన." ఆము. ౧, ఆ.—2. ప్రవృద్ధము. "క. ఇటనభమిటభూవలయం, బిటబలి సద్మంబునుండునిరవులివియనఁ బటువులగువలులచెలువునఁ, బుటపుటనైనున్న చిన్ని బొజ్జగదలఁగన్." పాండు. ౨, ఆ.

పుటపుటనగు. దే. అ. క్రి. (పుటపుటన+అగు.) ప్రవృద్ధమగు. "వ. చేమంతిపూబంతులఁబుటపుటనై." స్వా. 3, ఆ.

పుటభేదము. సం. వి. అ. పుం. 1. పట్టణము; (రూ. పుటభేదనము. న.) 2. చతుర్విధవాద్యము; 3. ఏటివంపు.

పుటము. ఉభ. వై. వి. అశ్వగతివిశేషము, (చూ.) ప్లుతము. (పుటముల్ దుమికించు అనుచోపుటములుగాదుమికించుననుట. దీనికి ఏకవచనాంతముగా ప్రయోగము కనఁబడలేదు.) (చూ. తీరు.) – సం. అ. పుం, న. 1. పూలబుట్ట; 2. దొప్ప; 3. గుజ్జుపుకాలిగొరిజె.

పుటముబ్బు. ద్వ. అ. క్రి. (పుటము+ఉబ్బు.) మీఁదికుబ్బు. "చ. అలికులవేణియారునవయౌవనమన్ వలరాచతోఁటలోఁ, బొలుచునితంబవేదికడఁబొక్కిలిడిగ్గియచెంతనీలసం, కలితనవాంబుయంత్రమగుఁగానియెడన్ రసగుంభనంబుసం, ధిలఁబుటముబ్బనేనదుమనిల్చిఘనస్తనసూనగుచ్ఛముల్." వసు. ౨, ఆ.

పుటమెగయు. ద్వ. అ. క్రి. (పుటము+ఎగయు.) 1. మీఁదికెగయు; "క. పుటమెగసితాళవృక్షముఁ, జటులోద్ధతిఁబూని పెఱికిసారథినవనిన్, విటతటముగఁబడవైచెను, బటుభుజసత్వంబుమెఱయఁబవనజుఁడల్కన్." మై. 3, ఆ.—2. దాఁటు. "క. ఇటునిశ్చయించియపుడటు, నిటుచూచిమహేంద్రశైలమెక్కినలంకా, పుటభేదనంబు మీఁదికిఁ, బుటమెగయనువాయునూతిపొమ్మని కదలెన్." రామా. ౫, ఆ.

పుటి. సం. వి. ఈ. స్త్రీ. 1. పూలబుట్ట; 2. దొప్ప.

పుటిక. వై. వి. చిన్నగంప, (రూ. పుట్టిక.)

పుటితము. సం. వి. అ. న. దొప్పవలెకూర్పఁబడినరెండుచేతులు, దోసిలి. విణ. 1. కుట్టఁబడినది; 2. దొప్పగాఁజేయఁబడినది.

పుటుక్కు. దే. వి. తెగుటయందగుధ్వన్యనుకరణము. (పుటుక్కున తెగెను.)



పుట్ట. దే. వి. 1. వల్మీకము; 2. చిన్నపొద; 3. జన్మస్థానము. (రోగములపుట్ట. మొ.)

పుట్టకాఁపు. దే. వి. ఎలుఁగు, భల్లూకము.

పుట్టకాలివాఁడు. దే. విణ. (పుట్టకాలు+వాఁడు.) పుట్టకాలుగలవాఁడు, వల్మీకపాదుఁడు.

పుట్టకాలు. దే.వి. పుట్టవలెదుర్మాంసము పెరిఁగినకాలు.

పుట్టకూడు. దే. వి. చీమగుడ్లతోఁగలసినపుట్టమట్టిముద్ద. "వ. పుట్టకూటికిం జీమలకు నెలుంగులుగులగులంబుట్టలునిశితనిజనఖరకులిశకోటులం గోరాడ." స్వా. ౪, ఆ.

పుట్టకూడుదిండి. దే. వి. (పుట్టకూడు+తిండి.) ఎలుఁగు, భల్లూకము. (ఇట్లు పుట్టకూడుమేపుడు.)

పుట్టకొక్కు. దే. వి. పుట్టయందు తెల్లగామొగ్గవలెమొలచునది, భూస్ఫోటము. (ఇది మిక్కిలి మెత్తగానుండును.)

పుట్టకోట. ద్వ. వి. కోటకు బలముకోసము కోటబయట వేసిన మట్టితిన్నె.

పుట్టగొడుగు. దే. వి. పుట్టయందు తెల్లగాగొడుగువలెమొలచేనది, ఛత్త్రాకము. (దీనిపుట్టంగొడుగనియొకానొకఁడు ప్రయోగించియున్నాఁడు.)

పుట్టగోఁచి. దే. వి. పెద్దకాపీనము.

పుట్టచెండు. ద్వ. వి. (పుట్టము+చెండు.) 1. ఎగురఁగొట్టియాడెడువస్త్రాదికృతమైనబంతి; "వ. పుట్టచెండుకరణి నెగసి." రామా. ౭, ఆ.—2. బ. బాలక్రీడావిశేషము. (చూ. ఆలంకులు.)

పుట్టచేర్పు. దే. వి. (చూ.) పుట్టకొక్కు. "చెలికోమలతపుట్టచేర్పులమన్నించు." హన. ౪, ఆ.

పుట్టతమ్మ. దే. వి. ఒకదినుసుతమ్మి.

పుట్టతేనె. దే. వి. పుట్టలోపెట్టిన పెరతేనె.

పుట్టతేలు. దే. వి. మండ్రగబ్బ.

పుట్టపుట్టువు. దే. వి. వాల్మీకిముని. "ఆప్రచురకవిత్వతత్త్వనిజభక్తిఁదలంచెదఁబుట్టపుట్టువున్." వి క్ర. ౧, ఆ.

పుట్టము. వై. వి. వస్త్రము.

పుట్టి. దే. వి. 1. మానవిశేషము; (నాలుగుపేఁదుములకొలఁది.) 2. పేములతోపెద్దగంపవలె అల్లిమీఁదతోలుకప్పి కుట్టఁబడినయేఱుదాఁటెడుసాధనవిశేషము. (వానిపుట్టిమునిఁగెను, వానిపుట్టిముంచెను ఇత్యాదిస్థలములయందు వాఁడెక్కిన పుట్టిమునిఁగెను, వాఁడెక్కినపుట్టిముంచెను అని శబ్దార్థము. వాఁడు మునిఁగెను, వాని ముంచెను అని

తాత్పర్యార్థము. అప్పుడు మునుఁగుటకును ముంచుటకును చెడుటయు చెఱుచుటయునర్థము.)

పుట్టిక. వై. వి. పుటికయొక్క రూపాంతరము. "పండ్లపుట్టికల్." కళా. ౬, ఆ.

పుట్టినిల్లు. దే. వి. (పుట్టిన+ఇల్లు.) మాతృగృహము, జన్మస్థానము.

పుట్టు. దే. అ. క్రి. జన్మించు. వి. జన్మము.

పుట్టుక. దే. వి. జన్మము. (స్వార్థమునక ప్రత్యయము.)

పుట్టుకల్లరి. దే. విశే. పుట్టుక మొదలుకల్లలాడువాఁడు. "తే. పుట్టుకల్లరియైపాపములకునెల్లఁ, దిట్టయైలోకములచేతఁదిట్టువడిన, కట్టిఁడికినిట్టికష్టంబుగానొనర్చి, తగవిధాతృఁడుచతురుఁడై నెగడెనేడు." భార. అర. ౫, ఆ.

పుట్టుగట్టు. ద్వి. వి. ఉదయాద్రి. "ఆ. బ్రతుకుఁద్రోవయిట్లుపరఁగ నేఁజెప్పినఁ, గచుఁడు వెడలెనిందుకడుపు వ్రచ్చి, పుట్టుగట్టుచటినిబొడముతమ్ములవిందు,కరణిమేని తెల్విగడలుకొనఁగ."య.3,ఆ.

పుట్టుగు. దే. వి. పుట్టుక, జన్మము. (చూ. పుట్టువు.)

పుట్టుగొడ్డు. దే. విశే. పుట్టుక మొదలుగొడ్డుతనము గలది.

పుట్టు గ్రుడ్డి. దే. విశే. పుట్టుక మొదలుగుడ్డివాఁడైనవాఁడు, జనుషాంధుఁడు. (ఇట్లు పుట్టుచీకు. "ఆ. పుట్టుచీకువృద్ధుఁబూతిగంధాసను, వేదజడునిఁబొందవెలఁదిరోసి." భార. ఆది. ౪, ఆ.)

పుట్టుచెయువు. ద్వి. వి. జాతకర్మము.

పుట్టుపాప. దే. విశే. వ్యాధిచే తెల్లఁబాఱిన దేహము గలవాఁడు.

పుట్టుబడి. దే. వి. పుట్టుక, ఉత్పత్తి.

పుట్టుమచ్చ. దే. వి. పుట్టుక మొదలు దేహమునందు కలిగిననల్లబొట్టు, తిలకాలకము.

పుట్టుమూఁగ. ద్వి. వి. పుట్టుక మొదలు మూఁగయైన వాఁడు. (చూ. తమ్మిపుట్టు.)

పుట్టువడుగు. ద్వి. వి. పుట్టుక మొదలు బ్రహ్మచారియైనవాఁడు.

పుట్టువు. దే. వి. పుట్టుక. (చూ. కూటువు.) (పుట్టుగుయొక్క రూపాంతరము.)

పుట్టువెట్టి. దే. విశే. పుట్టుక మొదలు వెట్టివాఁడైన వాఁడు.

పుట్టినిల్లు. దే. వి. పుట్టినిల్లుయొక్క రూపాంతరము. "ఎ,గీ. మూడుమూర్తులపుట్టినిల్లు మొదలిసెలవు." భాగ. ౮, స్కం.

పుడమి. వై. వి. నేల, భూమి.

పుడమితాలుపు. ద్వి. వి. 1. శేషుఁడు; 2. రాజు; 3. పర్వతము. "తే. అచటి, పుడమితాలుపుగమిహెచ్చుపొగడనరిది." అచ్చ. బాల, కాం.

పుడమిపట్టి. ద్వి. వి. 1. అంగారకుఁడు; 2. నరకాసురుఁడు; 3. సీత, భూమిజ. "తే. తపసిజాబిల్లిజఘరాంద్రదండనుండఁ, బుడమిపట్టికిమదిఁగోర్కి పుట్టుటయును." రామా. ౫, ఆ.

పుడమిపుట్టు. ద్వి. వి. 1. చెట్టు, భూజము; 2. సీత, భూమిజ. "తే. పుడమిపుట్టగులతకూనపూవుఁబోఁడి, కొమ్మసైదోడుమీకుభూజమ్ములార, తోడునీడయునగుచుఁగాపాడుఁడరసి, యభిమతైకఫలావాప్తియగునిజంబు." రామా. ౫, ఆ.

పుడమిఱేఁడు. ద్వి. వి. రాజు, భూపతి.

పుడమివేలుపు. ద్వి. వి. బ్రాహ్మణుఁడు, భూదేవుఁడు. "తే. ఇప్పుడమితాగ్రహంబున నేసరేఁగి, యిప్పుడమి వేల్పుఁగొలమువారిందిరేశ, వెలియుగిలియంచునున్నారు." పర. ౨, ఆ.

పుడమీశుఁడు. వై. వి. గ్రా. రాజు. "క. పుడమీశ సత్యవాక్యము, నడపుము." సకల. ౨, ఆ. (ఇట్లు పుడమీశ్వరుఁడు.)

పుడికిరించు. దే. స. క్రి. (చూ.) పుణికిరించు.

పుడికిరింత. దే. వి. పుడికిరించుట, పుణికిరింత.

పుడికిళ్లు. దే. వి. బ. (చూ.) పుణికిళ్లు.

పుడిసిలి. దే. వి. కుదియఁబట్టిన చేరలోసగము, ప్రసృతి.

పుడిసిలించు. దే. స. క్రి. (జలములోనగువాని) పుడిసిటఁబట్టు. "వారిధుల్ పుడిసిలింతుమె." రా. యు, కాం.

పుడిసిలింత. దే. వి. పుడిసిటఁబట్టుట, పుడిసిలించుట.

పుడుఁకులు. దే. వి. బ. భక్ష్యవిశేషము. "ప. పుడుఁకులునడుకులు." కాశీ. 2, ఆ.

పుడుక. దే. వి. 1. పుల్ల; 2. కట్టెపుల్ల. (వాడుకపుడకయని.)

పుడుకబావిలి. దే. వి. స్త్రీకర్ణభూషావిశేషము.

పుడుకు. దే. స. క్రి. 1. కొంచెముగా ఇచ్చు; "తే. పుట్టలినుమంతయిడనిడఁబొదలుటెఱిఁగి, పుడుకఁబుడుకంగఁగాటుకపోకచూచి, విత్తసముపార్జనవ్యయవృత్తులందుఁ, జిత్తమిడినవర్తకులకుఁజేటులేదు." విక్ర. ౨, ఆ.—2. ఇచ్చు; "క. అడిగెడువారలుమునుమయి, పుడికెడువాఁడొకఁడులేకపురుషాల్పతయై, పడఁతులుంతలచైకులములు, నె

డియున్నయలుప్రబలిజగముశిథిలతనొందుఁ." హరి. ఉ. ౯, ఆ.—3. (అయిదువ్రేళ్లతో) గ్రహించు. "మోము వ్రేళులంబుడుకుచు." ఉ, హరి. ౫, ఆ.—వి. ఈవి. "పుడుకులకొఱకు." అచ్చ. అ, కాం.

పుడుకుఁగల్లు. దే. వి. (పుడుకు+కల్లు.) చింతామణి. "ఎ, గీ. పుడుకుఁగల్లలజెట్టికైపొడమినట్టి, మెట్ట వాల్పిట్టరామేనిదిట్ట వేల్పు." అచ్చ. బాల, కాం.

పుడుకుఁదొడుకు. దే. వి. (పుడుకు+తొడుకు.) కామధేనువు. (చూ. తొడుకు. ఇల్లుపుడుకుఁబసి.)

పుడుకుమ్రాను. దే. వి. కల్పవృక్షము. "తే. కొండ వీడేలు వేలుపుఁగూడిపాల, కడలినడుచక్కిబలు మానికములదీవిఁ, బుడుకుమ్రాఁకులుమారేళ్లఁ బొదలిపొదలు, కడిమిపూఁదోఁటలోనాడుగరితెఁదలఁతు." అచ్చ. బాల, కాం.

పుణికిరించు. దే. స. క్రి. 1. కొంచెముగా ఇచ్చు; 2. (సన్నిపాతదోషము చేత వ్రేళ్లతో) గ్రహించు. (పుడికిరించుయొక్క రూపాంతరము.)

పుణికిరింత. దే. వి. పుడికిరింతయొక్క రూపాంతరము.

పుణికిల్లు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. (పుడికిల్లుయొక్క రూపాంతరము.)

పుణుఁకులు. దే. వి. బ. పుడుఁకులుయొక్క రూపాంతరము.

పుణుకు. దే. స. క్రి. వి. పుడుకుయొక్క రూపాంతరము.

పుణ్యకము. సం. వి. అ. న. ఉపవాసాదిరూపవ్రతము.

పుణ్యజనుఁడు. సం. వి. అ. పుం. 1. నైరృతి; 2. రాక్షసుఁడు; 3. యక్షుఁడు; 4. పుణ్యాత్ముఁడగుమనుష్యుఁడు.

పుణ్యజనేశ్వరుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు.

పుణ్యభూమి. సం. వి. ఇ. స్త్రీ. వింధ్యమునకును హిమవంతమునకును మధ్యదేశము.

పుణ్యము. సం. వి. అ. న. 1. ధర్మము; 2. సుకృతము. విణ. 1. పవిత్రము; 2. మనోజ్ఞము.

పుణ్యవంతుఁడు. సం. విణ. (త్. ఈ. త్.) 1. ధార్మికుఁడు; 2. సుకృతి.

పుణ్యాత్ముఁడు. సం. విణ. (న్.) పుణ్యస్వరూపుఁడు.

పుణ్యాహము. సం. వి. అ. న. పుణ్యదినము.

పుణ్యాహవాచనము. సం. వి. అ. న. దైవాదికర్మప్రారంభమునందు మంగళార్థముపుణ్యాహమనుశబ్దమును మూఁడుమాఱులుచెప్పెడు శుభకర్మము.

పుతపుత. దే. వి. చలనమునందగునసుకరణము. (ఆ మాట విన్నదిమొదలు నామనసు పుతపుతయను చున్నది.)

పుతపుతపోవు. దే. అ. క్రి. వివశమగు. "తే. భుజములుద్ధతిఁబుతపుతపోవఁగఱచె." ఉ, హరి. ౬, ఆ.

పుత్త. వై. వి. పృష్ఠము.

పుత్తడి. యు. దే. వి. అపరంజి. "సీ. తరతరంబులనుండితనయింటనలరుపుత్తడిపైఁడిబుట్టమస్తమున వెలయ." శుక. ౧, ఆ.—వై. (చూ.) పుత్తళిక. "మ. పురుషాకారముతోడనున్న శిఖియోపుంస్త్వంబులేదోయదే, తరువోపుత్తడిరూపొచిత్తమును జైతన్యంబుశూన్యంబొకో, విరసత్వంబులప్రోవొనిర్భరకళా విజ్ఞానసర్వస్వమో, యరుదీచందముఁగనిల్చెధృతినిందస్పందమందస్మితిఁ." లక్ష్మీ. ౨, ఆ.

పుత్తళి. ఉభ. దే. వి. పుత్తడియొక్క రూపాంతరము. సం. ఈ. స్త్రీ. పుత్తళిక.

పుత్తళిక. సం. వి. ఆ. స్త్రీ. వస్త్రదంతకాష్ఠాదులచేత చేయఁబడినబొమ్మ.

పుత్తిక. సం. వి. ఆ. స్త్రీ. పెరయీఁగ, పతంగిక.

పుత్తెంచు. దే. ప్రే. (పుచ్చు+తెంచు.) పుచ్చు. (స్వార్థమున తెంచు.)

పుత్రిక. సం. వి. ఆ. స్త్రీ. 1. కూఁతురు; 2. పుత్తళిక; 3. లక్కదూది.

పుత్రుఁడు. సం. వి. అ. పుం. కొడుకు. (పుత్రులు పన్నిద్దఱు. 1. ఔరసుఁడు. (భార్యయందు తనకుఁబుట్టినకొడుకు.) 2. క్షేత్రజుఁడు, (ఏదేనియొకకారణమున సంతానవిచ్ఛిత్తికలుగఁగా పెద్దలయనుజ్ఞచేత తనభార్యయందు దేవరుఁడులోనగువారికిఁబుట్టినకొడుకు.) 3. దత్తుఁడు, (దత్తుతీసికొన్నకొడుకు.) 4. కృత్రిముఁడు. (గుణజ్ఞుఁడనియభిమానించిపెంచుకొన్నకొడుకు.) 5. గూఢోత్పన్నుఁడు, (భార్యయందు తనకుతెలియకుండఱంకుమగనికిఁబుట్టినకొడుకు.) 6. అపవిద్ధుఁడు, (తల్లిచేతఁగాని తండ్రిచేతఁగాని యుభయులచేతనుగాని విడువఁబడఁగా తెచ్చిపెంచుకొన్నకొడుకు.) 7. కానీనుఁడు, (తనభార్యయందు కన్యాత్వమున రహస్యముగా నితరునికిఁ బుట్టినకొడుకు.) 8. సహోఢజుఁడు, (గర్భిణిగానుండ తెలిసికాని తెలియకకాని వివాహముచేసికొన్న భార్యయందుఁబుట్టిన యాకొడుకు.)

9. క్రీతుఁడు, (తల్లిదండ్రులవద్ద వెలయిచ్చికొనుకొన్నకొడుకు.) 10. పౌనర్భవుఁడు, (పునర్భువునందుఁబుట్టినకొడుకు.) 11. స్వయందత్తుఁడు, (తల్లిదండ్రులులేక కానితల్లిదండ్రులచేతనకారణముగ విడువఁబడి కానితనంతట నేను నీకుఁబుత్త్రుఁడనయ్యెదనని వచ్చినకొడుకు.) 12. జ్ఞాతిరేతుఁడు. (జ్ఞాతికొడుకు.) (వీరిలో మొదటియార్గురు బంధువులుదాయాదులునగుదురు. వెనుకటియార్గురుబంధువులగుదురుగాని దాయాదులుకారు. ఇదిభారతమునందువ్రాయఁబడియున్నవిధమున ననుసరించినది. జ్ఞాతిరేతుఁడనుదానికిమాఱుగా మనుస్మృతియందుపారశవుఁడు (లేక) శౌద్రుఁడనియువిజ్ఞానేశ్వరీయమునందుపుత్త్రికాపుత్త్రుఁడనియు వ్రాయఁబడియున్నది.)

పుదియబొట్టు. ద్వ. వి. ఊర్ధ్వపుండ్రము. "సీ. తుదివ్రేల నెగసనద్దొచినపుదియబొట్టురుఫాలపట్టికనుల్లసిల్ల." రా. అర. ౨, ఆ.

పుదీనా. హిం. వి. సువాసనగల ఒక మొక్క.

పునర్నవ. సం. వి. ఆ. స్త్రీ. గలిజేరు?. అ. పుం. ము. గోరు.

పునర్భవ. సం. వి. ఆ. స్త్రీ. చంద్రకళ. అ. పుం. ము. 1. గోరు; 2. సంసారము. విణ. మరలఁబుట్టినది.

పునర్భువు. సం. వి. ఊ. స్త్రీ. మాఱుమనువుది, దిధిషువు.

పునర్వసు. సం. వి. ఉ. పుం. ఒకనక్షత్రము. (చూ నక్షత్రము.) వు. 1. విష్ణువు; 2. శివుఁడు; 3. కాత్యాయనముని.

పునశ్చరణము. సం. వి. అ. న. మంత్రముయొక్క పునఃపునఃపఠనము.

పునస్సంధానము. సం. వి. అ. న. విచ్ఛిన్నమైపోయిన యగ్నినిమరలహోమగుండమునందుఁగూర్చుట.

పునస్సంస్కారము. సం. వి. అ. పుం. ద్వితీయవారోపనయనాదిసంస్కారము.

పునాది. దే. వి. బలమునకైగోడకడుగునభూమిలోలోఁతుగాత్రవ్విపెట్టెడుగోడ, మూలబంధము.

పునాసలు. వై. వి. బ. సూర్యుఁడుపునర్వసునక్షత్రమందుండఁగావిత్తినసజ్జలులోనగుధాన్యములు*. ఆము. ౪, ఆ.

పునీతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పవిత్రుఁడు.

పునుఁగు. దే. వి. మార్జాలికవలనఁగలుగుగంధద్రవ్యము.

పునుఁగుచేట్టము. దే. వి. పునుఁగుండునట్టికోశము, బిడాలకము.

పునుఁగుపిల్లి. ద్వ. వి. పునుఁగుతీసెడుపిల్లి, మార్జాలిక.

పునుఁగురాజనాలు. దే. వి. బ. మిక్కిలివాసనగల శాలిధాన్యవిశేషము.

పునుక. దే. వి. తలచిప్పయెముక, కపాలము.

పునుకతాలుపు. దే. వి. శివుఁడు, కపాలభృత్తు. "సీ. ప్రోల్లుగూల్పఁగడంగుపునుకతాలుపుమాడ్కి జగముడంపఁగఁబూనుజముని కరణి." అచ్చ. యు. కాం.

పునెము. వై. వి. విణ. పున్నెముయొక్కరూపాంతరము. (సుకృతమునకు.—"క. వినవమ్మభామినీమణి, మనమున నీకితరసంగమము ప్రియమైనన్, మునుగొంతికమలబాంధవు, నెనసియుఁబునెము అుగనట్టులేవర్తిలుమీ." శుక. ౧, ఆ.)

పున్న. దే. విణ. పిన్న. (పున్నతేలు. మొ.)

పున్నమ. వై. వి. శుక్లపక్షమునందుపదునేనవతిథి.

పున్నాగము. సం. వి. అ. పుం. 1. సురపొన్న?; 2. ఇంద్రునియేనుఁగు; 3. పురుషశ్రేష్ఠుఁడు; 4. తెల్లగలువ; 5. జాజికాయ.

పున్నియము. వై. వి. సుకృతము. "తే. ఎన్నఁడునునేగిలేనట్టియిమ్మహాశ్మశానమునయందుఁగాపున్నజంతువులకు, నేటి నాకంబుపున్నియంబెడలినప్ప, డొఱకమునఁగూలవలయుఁగీలాడినట్లు." కాశీ. ౨, ఆ.—విణ. సుకృతముకలది*.

పున్నెము. వై. వి. విణ. పున్నియముయొక్క రూపాంతరము. (సుకృతమునకు. — "అన్నెముపున్నెమెఱుఁగనమ్మ." శుక. ౨, ఆ.)

పుప్పము. వై. వి. పువ్వు, పుష్పము. ఆం, సం.

పుప్పి. దే. వి. వ్యాధిచేతపురుగుపడిగోరులోనగునది పుచ్చుట.

పుప్పించు. దే. ప్రే. పుచ్చు. "తే. నాదుగుడిపొంతఁజాలనున్నతిఁదనర్చు, తోరణస్తంభమెక్కియెవ్వారునెఱుఁగ, కుండనిచ్చెనఁబుప్పించియుండుమువిద, యట్టులైనను నేగెదవమరపురికి." పా. 3, ఆ. (ఇచ్చుటప్రేరణార్థకమైనపుచ్చునకుమీఁద ఇంచుక్కనిచేయుంగునది.)

పుప్పిపురుగు. ద్వ. వి. (చూ.) సుసిపురుగు.

పుప్పు. దే. వి. పశువులగోరిజెలువ్రస్సిపురుగులుపడెడువ్యాధి. (చూ. అదురుద్రిక్క.)

పుష్పాడి. ద్వ. వి. (పూ+పొడి.) పుష్పములయందలిధూళి, పరాగము.

పుబ్బ. వై. వి. ఒకనక్షత్రము. (చూ. నక్షత్రము.) (పాడ్యమి ని సంస్కృతపదముగా వ్రాసిననిఘంటుకారుఁడు దీనిని సంస్కృతపదముగా వ్రాసియున్నాఁడు.)

పుమాంసుఁడు. సం. వి. స్. పుం. మనుష్యుఁడు, మానిసి.

పుయిలోటు. దే. వి. (పుయిలోడుట.) వెనుదీయుట, సంకోచము. "తే. నీవుఁదమ్ములు నొక్కెడ నిలిచి చూచు, చుండుఁడనిపల్కుటయుఁబుయిలోట తోడఁ, గీచకారాతిఁదప్పక చూచినగుచు, నతని కిట్లని చెప్పె ధర్మాత్మజుండు." భార. విరా. 3. ఆ. (రూ. పుయిలోటము. "సీ. జనులు గాంచినమానుషముదూలుఁదనకను పుయిలోటమున మోము పుల్లసిలఁగ." భార. విరా. ౨, ఆ.) (చూ. పుయిలోడు.)

పుయిలోడు. దే. అ. క్రి. (పుయిలు+ఓడు.) వెనుదీయు, సంకోచించు. "వ. ధర్మనందనుండతనియుద్ధతికింబుయిలోడి." భార. ఉద్యో. ౧, ఆ. (ఇందు పూర్వావయవము అన్యదేశ్యము. ఇది ఈడేలు, సెలవేలు శబ్దములవంటిది.)

పురందరుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

పురంధ్రి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. కుటుంబముగల ఆఁడుది; 2. ఆఁడుది.

పురటి. దే. వి. సంధ్య. (పూఁటకు మొదటిరూపము.) అం, భా.

పురడించు. వై. అ. క్రి. పురణించుయొక్క రూపాంతరము.

పురణించు. వై. అ. క్రి. 1. వర్ధిల్లు; "వ. కృష్ణుండు జన్మించినది యాదిగా గోవులు ప్రతివత్సరంబును బ్రనూతలై క్రేపులు పురణించివచ్చు." హరి. పూ. ౬, ఆ.—2. విజృంభించు*. "క. కురుబలము దెపురణించెబడలుపలుతమరమ్మా." భార. ద్రో. ౫, ఆ.

పురపుర. దే. వి. పొక్కుటయందగు ననుకరణము. "దానిఁజూచియేఁబురపురఁబొక్కుదుఁగా." భార. విరా. ౨, ఆ.

పురపురలాడు. దే. అ. క్రి. (పురపురలు + ఆడు.) మిక్కిలి యపేక్షపడు.

పురము. సం. వి. అ. న. 1. పట్టణము; 2. పాటలీపుత్రమనుపట్టణము; 3. శరీరము; 4. ఇల్లు; 5. మేడ; 6. మూడు. పుం. గుగ్గిలపుఁజెట్టు.

పురస్కరించు. సం. స. క్రి. 1. ముందిడుకొను; 2. పూజించు.

పురస్కారము. సం. వి. అ. పుం. 1. ముందిడుట; 2. పూజనము; 3. సన్మానము; 4. పరిగ్రహించుట; 5. తడుపుట; 6. శత్రువాక్రమించుట; 7. అపదూఱుపడుట.

పురస్కార్యము. సం. విణ. (అ. ఆ. అ.) పురస్కరింపఁదగినది.

పురస్కృతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. ముందిడఁబడినది; 2. పూజింపఁబడినది; 3. సన్మానింపఁబడినది; 4. పరిగ్రహింపఁబడినది; 5. తడుపఁబడినది; 6. శత్రువుచేనాక్రమింపఁబడినది; 7. అపదూఱుపడినది.

పురస్కృతి. సం. వి. ఇ. స్త్రీ. (చూ.) పురస్కారము.

పురస్త్రియ. సం. వి. ఆ. స్త్రీ.——వై.——

పురస్సరుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ముందునడచువాఁడు, పురోగముఁడు.

పురహరుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

పురాకృతము. సం. విణ. (అ.ఆ.అ.) పూర్వజన్మమందు చేయఁబడినది. (శుభాశుభకర్మము.)

పురాణము. సం. వి. అ. న. 1. సర్గప్రతిసర్గాదిపంచలక్షణములతోఁగూడిన బ్రాహ్మాది; (అవి పదునెనిమిది.— బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, శైవము, భాగవతము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, భవిష్యత్తు, బ్రహ్మకైవర్తము, లైంగము, వారాహము, స్కాందము, వామనము, కౌర్మము, మాత్స్యము, గారుడము, బ్రహ్మాండము.)— 2. పదునెనిమిది. పుం. కర్షమెత్తుటంకసాలవాటు. విణ. పురాతనము.

పురాణించు. ఉభ. వై. అ. క్రి. 1. వర్ధిల్లు; "వ. నాచేతం గ్రేపులు పురాణించుటం జేసి కొండొకకాలంబునీకదుపులం బెనుతు." భార. విరా. ౧, ఆ. "దండకము. ఉల్లోకసౌందర్యధుర్యస్థితిన్ విస్తృతంబౌ నురస్సీమజీమూతమైహారవర్షోపలశ్రేణి రాణించుమించున్ బురాణింపఁగాఁజేయ." పాండు. ౪, ఆ.—2. విజృంభించు*. (చూ. పురణించు.)— సం. స. క్రి. పురాణముచెప్పు. (చూ. దొరఁకొను.)

పురాతనము. సం. విణ. (అ.ఈ.అ.) బహుదినములవాటిది.

**పురాయించు.** వై. అ. క్రి. 1. వర్ధిల్లు; 2. విజృంభించు*. "దండకము. శాక్వరస్కంధబంధుత్వగంధంబురూపించుమూఁపుల్ పురాయింప." పాండు. ౪, ఆ.

**పురారి.** సం. వి. ఇ. పుం. శివుఁడు, ముక్కంటి.

**పురావృత్తము.** సం. వి. అ. న. తొల్లిటికథ.

**పురి.** ఉభ. దే. వి. 1. మెలి; 2. నెమిలిపింఛము; "తే. మేఘరాజులు సరసతమిూఱఁదమ్ముఁ, దరళవిద్యుల్లతాదీర్ఘతరకటాక్ష, వీక్షణకలాపములగారవింపనలరి, నెమ్మివర్తించుఁబురివిచ్చి నెమ్మిగములు." రామా. ౬, ఆ.—3. కవియుట, ఆక్రమణము; "ఆపురికిదుర్వారోద్యముండైన యాహరియుండోడబె." భార. ఉద్యో. ౪, ఆ.—4. ధాన్యము పోసియుంచుటకుగడ్డితోఁ గట్టినకూటు.—సం. ఈ. స్త్రీ. పట్టణము, ప్రోలు.

**పురికొను.** దే. అ. క్రి. కవియు, క్రమ్ము. "పురికొనుచుండెరలుచు." భార. భీష్మ. ౨, ఆ. (చూ. ప్రే.) "డెందంబునఁ బురికొనుకౌతుకముతోడ." స్వా. ౨, ఆ. (ప్రే. పురికొలుపు. "క. సైరింపకయేడ్తెఱఁగురు, వీరాగ్రణియిరువదేనువేలరథంబుల్, పోరికిఁబురికొలిపినవి, స్ఫారగతింగూడికవిసెఁబార్థునిమిూఁదన్." భార. భీష్మ. ౨, ఆ.)

**పురిడిపిట్ట.** ద్వ. వి. పక్షివిశేషము, పూరేడు.

**పురిపులుఁగు.** దే. వి. నెమిలి, బర్హిణము. (చూ. గొరగొర.) (ఇట్లు పురిపిట్ట.)

**పురివిచ్చు.** దే. అ. క్రి. వేఱుపడు, పాయు.

**పురీతత్తు.** సం. వి. త్. న. ప్రేగు, ఆంత్రము.

**పురీషము.** సం. వి. అ. న. మలము, విష్ఠ.

**పురుగు.** వై. వి. క్రిమి, కీటకము.

**పురుటియాలు.** దే. వి. (పురుడు+ఆలు.) బాలెంతరాలు. "సీ. పొదివితేఁగానకపొత్తులలోఁబట్టఁబోనాడుకొనినలేఁబురుటియాండ్రు." రామా. ౬, ఆ. (రూ. పురుటాలు. "క. పురుడీబోటికి నిందిర, పురుడంబికగాక యొరులుపురుడేయనుచున్, బురుటాలికిఁబదిదినములు, పురుడుప్రవర్తించిరిలమిఁబుణ్యపుగరితల్." భాగ. ౮, స్కం.)

**పురుటిల్లు.** దే. వి. (పురుడు+ఇల్లు.) ప్రసవగృహము, అరిష్టము.

**పురుడించు.** దే. అ. క్రి. పోలికయగు. "క. బద్దులఁ దొలిపుట్టుగువెడ, బుద్ధులనొండొంటితోడఁబురుడించినపె, న్నుద్దులమద్దులముద్దుల, సుద్దులబాలకుఁడు ద్రోచెక్షోణింబడఁగన్." వి. పు. ౭, ఆ.—స. క్రి. పోలు. "శా. సింగంబున్న గుహానికేతమునకున్ శీఘ్రంబునన్ వచ్చుమా, తంగంబుం బురుడించుచున్." భార. విరా. ౨, ఆ.

**పురుడు.** దే. వి. 1. జాతాశౌచము; "తే. పదిదినంబులుసన్నభూపాలుసతికిఁ, బురుడువెడలెఁద్రయీగణ్యఁబుణ్యరాము, యతిమనఃపద్మమధుప్రతముఁగన్న, పువ్వుఁబోఁడికిజగములఁబురుడుగలదె." రామా. 3, ఆ.—2. జాతాశౌచసమయము. "క. ధరణిఁగడుఁబేదవారును, బురుటికిఘృతతైలధాన్యములఁదెచ్చెరముం, దరసంగ్రహింతురవిమన, కరుడుగ నతిదుర్లభంబులర్థములేమిన్." భార. అర. 3, ఆ.—విశే. ఏ. సమానము, సమానుఁడు. "క. పురుషోత్తముతోనెప్పుడుఁ, బురుడీతండంద్రు." హరి. ఉ. ౫, ఆ.

**పురుభువు.** సం. విశే. (ఉ. ఉ. ఉ.) మిక్కుటము, (రూ. పురుహువు.)

**పురులోము.** దే. అ. క్రి. (పురులు+ఓము.) క్షాత్రము మెఱయించు.

**పురువు.** ఉభ. వై. వి. పురుగుయొక్కరూపాంతరము. (చూ. పుర్వు.)—సం. అ. పుం. 1. తల; 2. ఒకరాజు. విశే. మిక్కుటము.

**పురుషకారము.** సం. వి. అ. పుం. పురుషప్రయత్నము.

**పురుషము.** సం. వి. అ. పుం. 1. క్రియలమిూఁదివిభక్తులసంజ్ఞ; (ఇవి మూడు.—ప్రథమపురుషము, మధ్యమపురుషము, ఉత్తమపురుషము.) 2. శాస్త్రము; 3. సురపొన్న ?.

**పురుషాయితము.** సం. వి. అ. న. ఉపరతి.

**పురుషార్థము.** సం. వి. అ. పుం. పురుషప్రయోజనము. (పురుషార్థములు నాలుగు.—ధర్మము, అర్థము, కామము, మోక్షము.)

**పురుషుఁడు.** సం. వి. అ. పుం. 1. మనుష్యుఁడు; 2. సాంఖ్యజీవుఁడు; 3. పరమాత్మ.

**పురుషోత్తముఁడు.** సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. శివుఁడు.

**పురుహూతుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

**పురె.** దే. అవ్య. ప్రశంసార్థకము. (చూ. బాపురె.)

**పురే.** దే. అవ్య. పురెయొక్కరూపాంతరము. "చాలుఁబురేసరోజభవ." భాగ. 3, స్కం.

పురోగముఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ముందునడచువాఁడు.
పురోగామి. సం. విణ. (న్.ఈ.న్.)——పై.——
పురోగుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ——పై.——
పురోడాశము. సం. వి. అ. పుం. 1. యజ్ఞార్థమైన అపూపము; 2. సోమలతరసము; 3. హుతశేషము.
పురోణి. వై. వి. చిన్నయుత్తరము, చీటి.
పురోధనుఁడు. సం. వి. న్. పుం. పురోహితుఁడు, (రూ. పురోధ.)
పురోభాగి. సం. విణ. (న్.ఈ.న్.) ఎప్పుడును తప్పులు వెదకువాఁడు.
పురోహితుఁడు. సం. వి. అ. పుం. శుభాశుభవైదిక కర్మములను చేయించుచు మేలుకీడులను తెలుపుచుండెడి యాచార్యుఁడు, ఒజ్జ.
పుర్వు. వై. వి. పురువుయొక్క రూపాంతరము. "చ. పొత్తినూలిపుర్వనకెనగాకుబంధకుఁడవుగా దనకజ్ఞుఁడుదానయమ్మెయిన్." భార. శాం. ౬, ఆ.
పుఱియ. వై. వి. పుఱ్ఱె. "చ. కఱచినపీనుఁగుల్ వెడఁదకప్పెరయుల్ మొలఁబచ్చితోల్లునుం, బుఱియలపేరులున్." ఉ. హరి. ౨, ఆ.
పుఱ్ఱ. దే. విణ. ఎడమ, వామము. (పుఱ్ఱచేయి. మొ.)
పుఱ్ఱియ. వై. వి. పుఱియకు మొదటిరూపము.
పుఱ్ఱు. దే. వి. పలుచేనిమలము.
పుఱ్ఱె. వై. వి. (చూ.) పునుక.
పుల. దే. విణ. పసుపుమించిన తెలుపువన్నెకలది. (పులకండము.) (పుల్లయొక్క రూపాంతరము.)
పులకండము. ద్వ. వి. కండచక్కెర. "సీ. పలుకుచిల్కకుఁబెట్టు పులకండమోయనముంగరముత్తెంబుమురువుసూప." చంద్రా. 3, ఆ.
పులకము. సం. వి. అ. పుం. 1. పులగము; 2. ఏనుఁగునకిచ్చెడియన్నపుకబళము; 3. పురుగు; 4. చెట్టుమీఁదినల్లపురుగు; 5. నులిపురుగు; 6. మణిదోషవిశేషము; (అనఁగా మణులయందలిచీలిక.) 7. వజ్రమణి; 8. హరిదళము; 9. కడప¶.
పులకరము. వై. వి. 1. గగుర్పాటు; 2. జ్వరము*.
పులకరించు. వై. అ. క్రి. గగుర్పొడుచు.
పులకలు. సం. వి. అ. పుం. గగుర్పాటు. "వ. అస్తంబునంగల మణిప్రస్తరంబుల విశ్రాంతిఁజెందించినమేనంబులకలిప్పడుంబొడమెడు." స్వా. ౧, ఆ. (తెనుఁగుననిది స్త్రీసమముగాను బహువచనాంతముగాను బ్రయోగములంజూపబడెడు.)

పులకించు. సం. అ. క్రి. గగుర్పాటుగలదియగు.
పులగము. వై. వి. పెసరపప్పుచేర్చివండినయన్నము.
పులపాడుచు. దే. అ. క్రి. అప్పువేయకపోవు. "క. చప్పుడుసేయకసంజ్ఞకుఁ, జప్పట్లిడుకొంచుఁగొండసరియలవెంటన్, జప్పళ్లకుఁబులపాడుచుచుఁ, జొప్పరయుచునీలవెట్టుచునుశబరభటుల్." భల్లా. 3, ఆ.
పులము. సం. వి. అ. పుం. గగుర్పాటు. విణ. విపులము.
పులసరము. దే. వి. పాకము చెడుటవలనఁ గలిగిన పులుసు.
పులసరి. దే. విణ. గర్విష్ఠుఁడు. "ద్వి. కలవానియట్లునిక్కంబునీవొక్క, పులసరితనమునఁబుచ్చితి కొలుచు." భల్లా. ౪, భా.
పులాకము. సం. వి. అ. పుం. 1. పొల్లు; 2. మెతుకు; 3. సంక్షేపము.
పులావు. హిం. వి. ఒకవిధమైన వంటకము.
పులి. దే. వి. వ్యాఘ్రము. విణ. పులిసినది. (పులికడుగు. మొ.)
పులికడుగు. దే.వి. పులిసినకడుగునీరు, ధాన్యామ్లము.
పులికూడు. దే. వి. 1. పులిసిన యన్నము; 2. భిక్షాన్నము. "చెలిపులికూడుమానుపనిశ్రీదునిఁగాదని." పను. ౧, ఆ.
పులికోచు. దే. వి పులిముఖమువంటి ముఖముగలిగిన సాలెపురుగువంటి యొకపెద్దపురుగు.
పులిగంజి ద్వ. వి. పుల్లనీళ్లు, ఆరనాళము.
పులిగాయము. దే. వి. అటినగంటిమచ్చ. "క. తిలకించితివేస్పపమొక్కలమగునీచెంచుమేనఁగలపలుగంటుల్, బలుసింగపుపలుగంట్లా, పులిగాయములెల్లఁబెద్దపులిగాయంబుల్." చంద్రా. ౨, ఆ.
పులిగోరు. దే. వి. 1. నడుమ వ్యాఘ్రనఖమును పతకమునకుమాఱుగాఁ గూర్చినహారము; (చూ. మొలకట్టు.) 2. వ్యాఘ్రనఖము¶.
పులిచించెలము. ద్వ. వి. పులిచింత¶.
పులిచింత. ద్వ. వి. చుక్రిక¶.
పులిచెంచలి. దే. వి.——పై.——
పులిచెవులాకు. ద్వ. వి. (పులిచెవులు+ఆకు.) ఒకానొకమందుచెట్టు.
పులిజూదము. ద్వ. వి. ఒకానొక ఆట.
పులిత్రేఁపు. దే. వి. అజీర్ణపుత్రేఁపు.
పులినము. సం. వి. అ. న. ఇసుకదిన్నె, సైకతము.

పులినీరు. ద్వ. వి. రక్తమువిఱిగిగాయములోనగువానియందుండికాఱెడునీరు. "క. హరునఱకాలం జొరఁబడి, శిరమునకుఁ బెడలెనీదుశితఖండము చం, దురయదిసెలవడినేఁడుఁ, దొరఁగెడుపులినీరుగాంగతోయముపేరఁ." చంద్ర.

పులిపిరి. దే. వి. దేహమునందు మిరియమువలెపెరిఁగెడు దుర్మాంసవిశేషము, కేమము.

పులిపిరికాయ. దే. వి.——పై.——

పులిపులి. దే. వి. పులిపిరికాయ. విణ. పీడితము, అవమర్దితము. "సీ. పులిసేరుచోఁబులిపులిసేయలాపేల్వ్రేలికీమూలికవెలసెనేని." చంద్రా. ౨, ఆ. "సీ. పులిఁగ్రమ్ముకొని పులిపులిగనీఁటెలఁ గ్రుమ్మియేపుతోమగఁటిమిచూపువారు." రసి. ౧, ఆ.

పులిపులికాయ. దే. వి. పులిపిరికాయ, కేమము.

పులిపెంజెర. దే. వి. కాటుకరేకుపాము.

పులిమిపుచ్చు. దే. స. క్రి. (విషయమును) తేలికగా పోనిచ్చు. "క. తెలుఁగుకవిత్వముచెప్పఁ,దలఁచినకవియర్థమునకుఁదగియుండెడుమా,టలుగొనివలెలుంబ్రాసం, బులునిలుపకయొగినిబులిమి పుచ్చుటచదురే." నిర్వ. ౧, ఆ.

పులిమెకము. ద్వ. వి. మత్స్యవిశేషము.

పులిమెట్టు. దే. వి. తేర్చినకడుగుయొక్కయడుగుది.

పులియ. దే. వి. విస్తరాకు. "క. సెలనాళ్లుసునియతుండై,పలాశపత్రములపులియఁబాయకద్విజాఁడి, మ్మలభోజనంబుచేసిన, ఫలమిలఁజాంద్రాయణంబుఫలముంగలుగుఁ." విజ్ఞా. ఆచా, కాం.

పులియఁడు. దే. వి. పులివలెనుండుటచే కుక్కకియ్యఁబడినపేరు. (చూ. గబ్బి.)

పులియఁబాఱు. దే. అ. క్రి. (పులియఁ +పాఱు.) పులియు. "సీ. పూఁబోఁడికెమ్మోవిపులియఁబాఱనితేనెసతిమోముకందనిచందమామ." చంద్ర. (చూ. పాఱు.)

పులియు. దే. అ. క్రి. పుల్లనగు.

పులిహోర. అర. వి. పులుసుకలిపినయన్నము. (రూ. పులిహూర.)

పులిరుసు. దే. వి. పుల్లిరుసుయొక్కరూపాంతరము.

పులివరుగు. దే. వి. పులియఁబెట్టినవరుగు. కాశీ. 2, ఆ.

పులిసరి. దే. వి. పులుగుడు, వాతఘ్ని ?.

పులు. దే. వి. 1. రత్నమాలిన్యము; "పులుకడిగినరత్నకళికలీల." పర. ౨, ఆ.—2. కసవు. "పులుమఖశాలికానికటభూములమేయుచు." ఆము. 3, ఆ.—విణ. అల్పము. (పులుమానిసి. మొ.) (వెనుకటి రెండర్థములయందిది పుల్లుయొక్కరూపాంతరము.

పులుఁగు. దే. వి. పక్షి, విహగము, పిట్ట.

పులుఁగుపిట్ట. ద్వ. వి. గుడ్లగూబ, ఘూకము.

పులుఁగుబొల్లఁడు. దే. వి. గరుత్మంతుఁడు.

పులుఁగుఱాయి. దే. వి. పచ్చ, గారుత్మతము.

పులుఁగుఱేఁడు. దే. వి. గరుత్మంతుఁడు,ఖగేశ్వరుఁడు.

పులుకాసిపురువు. ద్వ. వి. పచ్చెఱ్ఱపురుగు. ("ద్వి. రాజులువాటించురాణివాసముల, నోజతోనూడిగంబొనరింపఁదమకు, పరవుడుగాఁజేసిపరుసనర్తింపఁ, బురిలోనఁబులుకాసిపురువులతరమె." (ఇక్కడ పులుకాసిపురువులనఁగా అల్పులని యర్థము.) హరిశ్చ. ౨, భా.)

పులుకాసిపులుఁగు. దే. వి. చిలుక. "తే. ఇన్నిదేవళ్లఁగొలిచినేనేమిగంటిఁ,బోయిపచ్చనిపులుకాసిపులుఁగుచేత, మోసపోయితినకుందుమొనయుఖేద, మారటమొనర్పవిసివియయ్యారిబసివి." శుక. 3, ఆ.

పులుకుపులుకు. దే. వి. ఱెప్పలుమూసిమూసితెఱచేమేచూచుటయందగుననుకరణము."తే.పులుకుపులుకునఁజూచియక్కలికితోడఁ, బలుకుపలుకునదైన్యంబుదొలుకఁబలికె." సా. ౨, ఆ. (రూ. పుల్కుపుల్కు. "సీ. భోగించువారలఁబుల్కుపుల్కనఁజూచి మెల్లనగ్రుక్కిళ్లుమ్రింగువారు." నై. 2, ఆ.)

పులుగరి. దే. విణ. (పులుగు + అరి.) జోడయొతిఁగినవాఁడు. "క. వినివారీగడగీగడ, యననేమియునేమెఱుంగమాసామ్మఖిలం, బునువచ్చునేనినీచె, ప్పినపులుగరివెచ్చమెల్లఁబెట్టెదమనినఁ." పర. ౫, ఆ.

పులుగాకు. దే. వి. (పులు + కాకు.) ఉపద్రవము. "ద్వి. పలుగాకులైబహుభంగులనిట్లు, పులుగాకులొనరింపఁబోలదేమాన్ప." హరిశ్చ. ౧, భా.

పులుగు. దే. వి. 1. గుఱుతు; "ఎ, గీ. పొలఁతిరేలుసీయునికియపులుగుగాదె." ఆము. ౫, ఆ.—2. జోడ. (చూ. పులుగరి.)

పులుగుడు. దే. వి. పులిసరి, వాతఘ్ని ?. (ఇది ద్వివిధము. నల్లపులుగుడు, తెల్లపులుగుడు.)

పులుదిండిటాయి. దే. వి. (పులు+తిండిటాయి.) ఇంద్రనీలమణి. (చూ. సెట్టెము. (ఇట్లు పులుదిండి చలువ.)

పులుప. దే. వి. పలుచేగానూతినపుల్లయూరుఁబిండి. కాశీ. ౭, ఆ.

పులుమానిసి. ద్వ. వి. అల్పమనుష్యుఁడు. (చూ. దెస.)

పులుము. దే. స. క్రి. 1. రుద్దు; 2. నలుపు; 3. ఉనుము; 4. కొట్టు. వి. కుష్ఠరోగము.

పులుముడు. దే. వి. రుద్దుడు, మార్జనము.

పులుమ్రాను. దే. వి. తాళనారికేళాదితృణద్రుమము.

పులుసు. దే. వి. 1. ఒకరసము, అమ్లము; (చూ. రసము.) 2. వ్యంజనవిశేషము.

పులుసుఁగూర. ద్వ. వి. (పులుసు+కూర.) పులుసు పోసివండినకూర.

పులోమజ. సం. వి. ఆ. స్త్రీ. ఇంద్రునిభార్య, శచి.

పులోమజిత్తు. సం. వి. త్. పుం. ఇంద్రుఁడు.

పుల్కసుఁడు. సం. వి. అ. పుం. 1. బోయవాఁడు; 2. మాలవాఁడు; 3. అధముఁడు. (రూ. పుల్కసుఁడు.)

పుల్గము. వై. వి. పులగముయొక్క రూపాంతరము. "మాయక్క నీకునుబుల్గంబిడెదపంచెఁగైకొనుము." భల్లా. ౫, ఆ.

పుల్గరి. దే. విశే. పులుగరియొక్క రూపాంతరము. "ఏముమాపురమున కేగితెచ్చెదము పుల్గరిధనంబ నిరి." పర. ౫, ఆ.

పుల్పిరి. దే. వి. పులిపిరియొక్క రూపాంతరము.

పుల్పొడుచు. దే. అ. క్రి. పులపొడుచుయొక్క రూపాంతరము. "జడతఁదుద జెప్పులఁగన్నువిప్పి పుల్పొడుచుచు." ఆము. ౪, ఆ.

పుల్ల. దే. వి. 1. పుడక; 2. సమిధ; 3. పొయినిడుకట్టె. విశే. 1. పుల్లనిది; (పుల్లదానిమ్మ. మొ.) 2. పసుపుమించినతెలుపువన్నెగలది. (పుల్లావు. మొ.)

పుల్లంటుటాయి. దే. వి. (పుల్లు + అంటుటాయి.) ఇంద్రనీలమణి.

పుల్లకంద. ద్వ. వి. ఒకదినుసుకంద?.

పుల్లగిల్లు. దే. అ. క్రి. భయపడు. (రూ. పుల్లగిలు. "క. తనచేతన్నృపతిసుతుఁడెటిఁ, గినఁబైవచ్చున నిపుల్లగిలిపోఁజూచుచుఁ, వనసత్త్వములత్యుగ్రం, బున మెదలఁగఁజూచి పాటిపోవను వెఱచుచుఁ." భో. ౫, ఆ.)

పుల్లగూర. ద్వ. వి. (పుల్ల+కూర.) (చూ.) పులుసుఁగూర.

పుల్లగొరక. దే. వి. నీరుకోడి, పరిప్లవము.

పుల్లతి. దే. వి. సాదనకాండ్రుగుటికినాడెడుకోల.

పుల్లతీఁగ. ద్వ. వి. సోమలత. "సీ. కమలారినామంబుగైకొన్న వివియునిపుల్లతీఁగలుచూచిపుల్లసిల్లి." పాండు. ౫, ఆ.

పుల్లదానిమ్మ. ద్వ. వి. అమ్లదాడిమము?.

పుల్లన. దే. వి. పులుసు. విశే. పులుసుగలది. (వృత్తియందు విశేషణమగుచో పుల్లని. చూ. అలకన.)

పుల్లనీళ్లు. ద్వ. వి. బ. కూటినీళ్లు, ఆరనాళము.

పుల్లప్రత్తి. దే. వి. ఒకదినుసుప్రత్తి.

పుల్లప్రబ్బ. దే. వి. అమ్లవేతసము?.

పుల్లబచ్చలి. దే. వి. వల్లిసూరణము?.

పుల్లమామిడి. దే. వి. కొండమామిడి?.

పుల్లయుసిరిక. దే. వి. (పుల్ల+ఉసిరిక.) కొండయుసిరిక?. (దీని కాయలు పెద్దవి.)

పుల్లరి. దే. వి. (పుల్లు+అరి.) పసులఁ కసవుమేయుటకైయిచ్చెడుపన్ను, తృణభాగధేయము.

పుల్లరుజా. దే. వి. (పుల్లు+అరుజా.) మత్స్యవిశేషము. హంస. ౪, ఆ.

పుల్లవడు. ద్వ. అ. క్రి. (పుల్ల+పడు.) స్తంభించు. "క. పుల్లవడిచలముకోపము, పొల్లపడిచనంగఁగొంత ప్రొద్దుమొగమునఁ, వెల్లఁదనముగదురనిలిచి, యెల్లజనులువినఁగమఱియునిట్లనిపలికెఁ." భార. అర. ౪, ఆ. "క. తల్లియుఁదండ్రియుఁజెలిఁగుసఁ, బుల్లవడఁగవారికడకుఁబోయితడయఁగా, నొల్లకపయనమువీడ్కో, లెల్లనుదనయిచ్చఁదెల్పి యిట్లనియెఁదగఁ." భార. ఉద్యో. ౪, ఆ.

పుల్లవావిలి. దే. వి. తెల్లవావిలి, శ్వేతసురస?.

పుల్లవెలఁగ. దే. వి. ఒకదినుసువెలఁగ?.

పుల్లసిల్లు. దే. అ. క్రి. 1. వివర్ణమగు; (చూ. పుల్లతీఁగ.) 2. కలఁగు. (రూ. పుల్లసిలు.—కలఁగుటకు.— "ఉ. ముల్లనుగంధినామనసుమోహమునాఁటిడిపెట్టినీవున, న్నొల్లకవీడనాడెదవయోతగవామగవారిచిత్తముల్, పుల్లసిలంగఁజేయఁబొరపొచ్చెములాడఁగనాఁడువారికే, చెల్లునుజెల్లఁబోవ్రతము చెడ్డసుఖంబునుదక్కదయ్యెఁగా." వి. పు. ౨, ఆ.)

పుల్లావు. దే. వి. (పుల్ల+ఆవు.) కపిలధేనువు. "శార్దూలమంచో పుల్లావుశిరంబుఁద్రుంచె." భాగ. ౯, స్కం.

పుల్లియ. దే. వి. పుల్లె. "తే. ఇచటికెంగిలిపుల్లియ తేల వచ్చె." కాశి. 3, ఆ.

పుల్లిరుసు. దే. వి. (పుల్లు+ఇరుసు.) తొండాపుత్రా టికి అనుదలగానమర్చిన చిన్న యిరుసు.

పుల్లు. దే. వి. కసవు, తృణము. (చూ. పులు.) విశే. అల్పము. (పుల్లిరుసు. మొ.)

పుల్లుడి. దే. వి. (పుల్లు+ఉడి.) ఒకానొకప్పుడు సాగుబడికుపయోగించెడుపొలము. (ఇట్టివి ఏడుడి, నీరుడి.)

పుల్లుఅుకుపాము. దే. వి. (పుల్లు+ఉఅుకుపాము.) సర్పవిశేషము.

పుల్లె. దే. వి. విస్తరాకు. (పుల్లియయొక్క రూపాంతరము.)

పుల్లెన. దే. వి. ఒకానొకమందుచెట్టు.

పువు. వై. వి. పువ్వుయొక్క రూపాంతరము. "చ. ఇన్న దిగ్గుంకియందఱం, బువులీకఁగోని తెండు శివపూజకటంచుదశాస్యుఁడంచినన్." ఉ, రా. 3, ఆ.

పువుఁబోఁడి. ద్వ. వి. పువ్వుఁబోఁడియొక్క రూపాంతరము. "వేల్పుంబువుంబోంఁడ్లు." య. ౧, ఆ.

పువ్వాటు. ద్వ. వి. (పువు + వాటు.) ముందు వెనుకలకు నూఁగాడుట.

పువ్వార. ద్వ. వి. (పువు+వార.) ఈఁదుతాడులోనగునానివంటి చెట్లయొక్క పూఁత.

పువ్వారుఁబోఁడి. (పువ్వు+ఆరు+పోఁడి.) పుష్పమువలె మిక్కిలి మనోజ్ఞరాలగు ఆఁడుది; 2. ఆఁడుది. "క. ఎవ్వడినీ తెఱఁగంతయుఁ, బువ్వారుం బోఁడినాకుబొంకక చెపుమా." రసి. 3, ఆ.

పువ్విలుకాఁడు. ద్వ. వి. (పువు+విలుకాఁడు.) మన్మథుఁడు, పుష్పధన్వుఁడు. "ఉ. పువ్విలుకాఁడు వాహృదయమున్ నొగిలించుచునున్న వాఁడు." ఉ, రా. 2, ఆ.

పువ్విలుతుఁడు. ద్వ. వి. (పువు+విలుతుఁడు.) ——వై.——"క. పువ్విలుతుతండ్రియచ్చట, ముప్పంకమురువునమురళి నెంరయించెమనం, బువ్విల్లూరఁగశ్రుతులకు, నవ్విధముఁదదీయపదయుగాంకము తెల్పన్." పాండు. ౫, ఆ.

పువ్వు. వై. వి. పువు, పూవు, విరి, పుష్పము.

పుషితము. సం. విశే. (అ.ఆ.అ.) పోషింపఁబడినది.

పుష్కర. సం. వి. ఆ. స్త్రీ. మెట్టతామర. అ. న. ము. 1. ఆకాశము; 2. ఉదకము; 3. తామర; 4. మెట్టతామరదుంప; 5. తొండముచివర; 6. వాద్యముఖము; 7. కత్తివాదర; 8. బాణము; 9. కుష్ఠమనెడు ఓషధి; 10. ఒకద్వీపము; (చూ. ద్వీపము.) 11. తీర్థవిశేషము. పుం. 1. బెగ్గురుపక్షి; 2. రోగవిశేషము; 3. సర్పవిశేషము. డు. 1. ఒకరాజు; 2. వరుణునికొడుకు.

పుష్కరాహ్వము. సం. వి. అ. పుం. బెగ్గురుపక్షి.

పుష్కరిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. కోనేఱు; 2. తామరకొలను; 3. ఆఁడేనుఁగు. (మగయేనుఁగు—పుష్కరి. న్. పుం.)

పుష్కలము. సం. విశే. (అ. ఆ. అ.) 1. శ్రేష్ఠము; 2. అధికము; సమృద్ధము.

పుష్టము. సం. విశే. (అ.ఆ.అ.) 1. పోషింపఁబడినది; 2. బలిసినది.

పుష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. పోషణము; 2. బలుపు; 3. సమృద్ధి.

పుష్పంధయము. సం. వి. అ. పుం. తుమ్మెద.

పుష్పకము. సం. వి. అ. న. 1. కుబేరునివిమానము; 2. కుసుమాంజనము; 3. రత్నకంకణము; 4. కుంపటి. పుం. కృష్ణుని తేరిగుఱ్ఱములలో నొకటి.

పుష్పకేతువు. సం. వి. అ. న. కుసుమాంజనము. పుం. మన్మథుఁడు.

పుష్పదంతము. సం. వి. అ. పుం. వాయువుదిక్కునందలి యేనుఁగు. డు. ఒక విద్యాధరుఁడు.

పుష్పధన్వుఁడు. సం. వి. న్. పుం. మన్మథుఁడు, పూవిలుతుఁడు.

పుష్పపుటము. సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము.

పుష్పఫలము. సం. వి. అ. పుం. కపిత్థము, వెలఁగ?.

పుష్పమంజరి. సం. వి. ఈ. స్త్రీ. 1. పూగుత్తి; 2. బ. ధాన్యవిశేషము.

పుష్పము. సం. వి. అ. న. 1. పూవు; 2. స్త్రీరజస్సు; 3. కండివనము?; 4. మాచిపత్రి?.

పుష్పరథము. సం. వి. అ. పుం. క్రీడాయోగ్యమగురథము, (రూ. పుష్యరథము.)

పుష్పరసము. సం. వి. అ. పుం. పూఁదేనె.

పుష్పలావిక. సం. వి. అ. స్త్రీ. పూలబంతులు సరములులోనగునవి గ్రుచ్చియమ్మెడు ఆఁడుది.

పుష్పలిహము. సం. వి. హ్. పుం. షట్పదము, తుమ్మెద.

పుష్పవంతులు. సం. వి. త్. పుం. ద్వి. సూర్యచంద్రులు.

పుష్పవతి. సం. వి. ఈ. స్త్రీ. రజస్వల, ముట్టుది.
పుష్పశరుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు.
పుష్పసమయము. సం. వి. అ. పుం. వసంతఋతువు, పూఁదఱి.
పుష్పించు. సం. అ. క్రి. వికసించు, పూచు.
పుష్పిక. సం. వి. ఆ. స్త్రీ. 1. దంతమలము; 2. లింగమలము.
పుష్పిణి. సం. వి. ఈ. స్త్రీ. (చూ.) పుష్పవతి.
పుష్పితము. సం. విణ. (అ. ఆ. అ.) పూచినది.
పుష్యమి. సం. వి. ఈ. స్త్రీ. ఒకనక్షత్రము. (చూ. నక్షత్రము.)
పుష్యము. సం. వి. అ. పుం. 1. పుష్యమీనక్షత్రము; 2. పౌషమాసము; 3. పుష్యరాగము; 4. కలియుగము.
పుష్యరాగము. సం. వి. అ. పుం. శ్వేతమణివిశేషము.
పుసలాయించు. వై. స. క్రి. బుజ్జగించు.
పుసి. దే. వి. నేత్రమలము, దూషిక.
పుసుకు. దే. వి. తుమ్ముటలోనగువానియందగు ధ్వన్యనుకరణము. (పుసుకని తుమ్మెను, పుసుకున చెప్పెను.)
పుస్తకము. సం. వి. అ. న. లిఖితపత్త్రసంపుటము.
పుస్తము. సం. వి. అ. న. 1. లప్పము వేయుటలోనగు శిల్పులపని; 2. పుస్తకము; 3. మాంసపుచెక్కలము.
పుస్తు. దే. వి. దుర్గంధము. "ద్వి. అదెవచ్చెనడపీనుఁగనుచునంతంతఁ, గదియుచు మైపుస్తుకంపునకెడసి, తొలఁగుచుఁబురజనుల్ తుప్పనినుమియ." హరిశ్చ. ౨, భా.
పుస్తె. దే. వి. మంగళసూత్రము. "తే. పుస్తెగట్టినయది మొదల్ పొంతరావు." రుక్మాం. ౪, ఆ.
పుస్తెముడుపు. దే. వి. కంటెబొట్టు.
పుళిందము. సం. వి. అ. పుం. ఒకదేశము. (చూ. దేశము.)
పుళిందుఁడు. సం. వి. అ. పుం. ఇతరభాష తెలియక అడవియందు వాసముచేయుచు మిక్కిలి జీవహింసాపరుఁడై తిరిగెడు ఒకజాతిబోయవాఁడు.

## పూ.

పూ. వై. వి. పువ్వు. "ఎ, గీ. కాలకంఠునిశిరసుపూగగనగంగ." కాశీ. ౧, ఆ. (దీనికి వృత్తియందు ఊకారమునకువలెనుమాగమాదికార్యము సెలుంగవలెను. ఉదా. పూఁగొమ్మ, పూటడిదము.)
పూంచు. దే. ప్రే. పూనుచుయొక్క రూపాంతరము. "క. కాంచనమాలాలంకృత, చంచత్తనులీలమెఱయుజవనాశ్వములన్, బూంచిరథంబునమణిమయ, పంచాననకేతువెత్తెబంధురభంగిన్." భార. విరా. ౪, ఆ.
పూఁచు. దే. అ. క్రి. పూను, ఉద్యమించు. "క. పూఁచివిధునిమీఁదసైన్యములతో వెడలెన్." శాం. ౪, ఆ.
పూఁచేప. ద్వ. వి. (పూ+చేప.) మత్స్యవిశేషము. (దీనిని అఱవమున వరాలందురు.)
పూఁట. దే. వి. 1. సంధ్య; "ఉ. రేపటిపూఁటనెన్నికొనిప్రేఁడుపసింగొనిపోయి మేపితా, మాపటిపూఁటనెన్నినక్రమంబుననీఁదగు." విజ్ఞా. ప్రా, కాం.—2. దినము; "సీ. ఈపూఁటదప్పించియెల్లి చూచెదనన్నఁబతివేఁడ్కఁజెఱుమటపాడిగాదు." భో. ౪, ఆ.—3. కాలము; (పగటిపూఁట, రాత్రిపూఁట.) (పురఁటయొక్క రూపాంతరము.)—4. ఒకఁడు చేయవలసినపనిని నేను చేసెదనని మఱియొకఁడు పూనుట, ప్రతిభూత్వము. విణ. (చూ. పూఁటకాఁపు.) "క. మీకునుధర్మవిరోధము గాకుండుటకేనపూఁట." భార. శాం. ౬, ఆ.
పూఁటకాఁపు. దే. విణ. ఒకఁడు చేయవలసినపనిని నేను చేసెదనని పూనుకొనిన మఱియొకఁడు, ప్రతిభువు. "సీ. వినుమింతియీయర్థమును ఘటింపఁగఁజేయఁబుష్పనారాచుండుపూఁటకాఁపు." నై. ౨, ఆ.
పూఁటకూళ్లమ్మ. ద్వ. వి. (పూఁటకూళ్లు + అమ్మ.) వెలతీసికొని వేళవేళకు అన్నమువండిపెట్టెడు వంటలక్క.
పూఁటకూళ్లయిల్లు. దే. వి. (పూఁటకూళ్లు + ఇల్లు.) పూఁటకూళ్లువండిపెట్టెడు గృహము.
పూఁటకూళ్లు. దే. వి. బ. వెలతీసికొని వేళవేళకు పెట్టెడు అన్నము.
పూఁటపడు. ద్వ. అ. క్రి. (పూఁట+పడు.) ఒకఁడు చేయవలసినపనిని నేను చేసెదనని మఱియొకఁడుపూనికగొను. "ఉ. అనతియిచ్చినట్లసరియాఁకలనున్నప్రపన్నుపాలికిం, పూనఁగనేగిపూఁటపడియొప్పగనాతనియప్పుదీఱిచెన్, దానతిచిత్రవైభవమునన్ ధనధాన్యపురాసులెన్నియోఁ, గానఁబడంగఁజేసిసిరికాంతునికేమివిచిత్రమింతయున్." పర. ౪, ఆ.

**పూఁటవాటు.** ద్వ. వి. పూఁటపడుట. "ఆ. అన్నదమ్ముఁడైననాలుమగండైనఁ, గొడుకుఁదండ్రియైనఁ గూడియుండి, పొత్తుధనమునందుఁబూఁటవాటు సునప్ప, సాక్ష్యమునువహింపఁజనదుజగతి." విష్ణు. వ్య, కాం.

**పూఁటవెట్టు.** దే. స. క్రి. (పూఁట+పెట్టు.) ఒకఁడు తాను చేయవలసినపనిని మఱియొకనిని నీవు చేయుమని పూనికగొలుపు. "ఎ, గీ. ఒయ్యఁ జేరికచేసిసామ్మెప్పఁజెప్పఁ, బూఁటవెట్టుము నను." పర. ౪, ఆ.

**పూఁడులు.** దే. విశే. బ. అనేకములు. (సంవత్సరములు.) "ఇట్టివిమెల్లఁజూచిరానెఱకలుగట్టుకొన్న మఱియేఁడులుపూఁడులుపట్టు." స్వా. ౧, ఆ. (రూ. పూండ్లు. "క. నావుడుముట్టినజగడం, బీవేళనెతీర్ప వేనియేండ్లకొ బూండ్లకొ, నీవేమితీర్చ దనుటయు." జై. ౪, ఆ. "క. ఆగుణమణి యొక్కనికిడు, బాగాలేచాలుబహుళపరిణయములకుఁ, బాగైనవలువలొకనివి, భోగింపఁగసీమ కేండ్లపూండ్లకుఁజాలున్." పాంచా. ౪, ఆ.)

**పూఁత.** దే. వి. 1. చర్చ; 2. చందనము; "పువ్వులు పూఁతతమ్ములమర్థిఁబుచ్చుట." విజ్ఞా. ప్రా, కాం. —3. సున్నపుగచ్చు.

**పూఁదఱి.** ద్వ. వి. (పూ + తఱి.) వసంతఋతువు, పుష్పసమయము.

**పూఁదేనియ.** ద్వ. వి. (పూ+తేనియ.) పుష్పరసము, మకరందము. "సీ. పూఁదేనియలఁజాలఁబొదలు తేఁటుల మ్రోఁతరహిమించుననుఋములరవలిగాఁగ." య. ౪, ఆ. (రూ. పూఁదేనె.)

**పూఁపు.** దే. వి. పూనిక, ఉద్యమము. "ఒక్కపూఁపునసయాఘాతించినాకుఁ మహోదారంబైన శుభంబొనర్పుఁడు." హరి. పూ. ౯, ఆ.

**పూఁబాళ.** ద్వ. వి. (పూ+పాళ.) 1. పువ్వులుగల పాళ; 2. బ. ధాన్యవిశేషము. (చూ. కుసుమ.)

**పూఁబిండె.** ద్వ. వి. (పూ+పిండె.) మిక్కిలి లేఁతపిందె, పూప. (మొదటిరూపము పూఁబిందియ.)

**పూఁబోఁడి.** ద్వ. వి. (పూ+పోఁడి.) (చూ. పువుఁబోఁడి.) "క. పూఁబోఁడులకును విటులకు, వేఁబోకలఁదలరుసొంపువీడ్కొలుపుఁబురిన్, లేఁబోఁకఁబోఁకతోఁటల, పూఁబాళలకమ్మతావిఁ బొదలినగాడ్పుల్." భీ. ౧, ఆ.

**పూగము.** సం. వి. అ. న. పోఁక. పుం. 1. ప్రోగు; 2. పోఁకమ్రాను; 3. గంగరావి?.

**పూచి.** దే. వి. 1. తృణవిశేషము; 2. బాధ్యత, కార్యము.

**పూచిక.** దే. వి.——పై.——

**పూచే.** వై. అ. క్రి. 1. పుష్పించే; 2. తప్పనుట్ల పొడము*; "ఉ. పూచినమావులకొదవిలిపువ్విలుజోదునకమ్మెమాధవుండేచినశంక." ఆము. ౫, ఆ.—3. నిస్సారమగు*. "వీఁకతోఁగడుఁబూచుమ్రాఁకులవిఱుపును." భార. సభా. ౨, ఆ.

**పూజ.** సం. వి. ఆ. స్త్రీ. అర్చన, సపర్య, నమస్య.

**పూజకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) అర్చకుఁడు.

**పూజనము.** సం. వి. అ. న. పూజించుట, అర్చన.

**పూజనీయుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పూజింపఁదగినవాఁడు.

**పూజించే.** ఉభ. వై. సం. స. క్రి. పూజచేయు, అర్చించు. "సీ. నీతండ్రిగంగననిచ్చనిచ్చలుమమ్ముఁ బూజించెనపరంజిపూలచేత." అచ్చ. బాల, కాం.

**పూజితవ్యుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) పూజనీయుఁడు.

**పూజితుఁడు.** సం. వి. అ. పుం. వేలుపు. విశే. పూజింపఁబడినవాఁడు.

**పూజె.** దే. వి. ఘటాదులమీఁదిచిత్రము. (కుండకు పూజెలు పెట్టిరి.)

**పూజెకుండలు.** ద్వ. వి. ఐరేనికుండలు. "నాల్గువంకలనుపొంగుచుఁ బూజెకుండలలరెన్ గన్గొంటె." య. ౪, ఆ.

**పూజెగులు.** దే. వి. బ. (పూజె+కాఁగులు.)——పై.——ఆం, భా.

**పూజెసేయు.** ద్వ. స. క్రి. (పూజె+చేయు.) ఘటాదులనుచిత్రించే. "సీ. తురగఖురోద్ధూతధూళి దిక్కులఁబ్రాఁకిభుజగారిఱెక్కలఁబూజెసేయ." ఉ, హరి. ౭, ఆ.

**పూజ్యుఁడు.** సం. వి. అ. పుం. మామ. విశే. పూజింపఁదగినవాఁడు.

**పూజే.** వై. వి. అర్చన. "ఎ, గీ. తమ్మిపూమిద్దెగద్దెపైఁగమ్మవిల్తు, నిమ్ముగానిల్పియొమ్మెనుగొమ్మలెల్లఁ, గ్రమ్ముకొనిపెక్కులాగులదొమ్మిగూడి, పూజలొనరించియిట్లనిపొగడిరపుడు." నీలా. 3, ఆ.

**పూజెరి.** ద్వ. వి. (పూజె+అరి.) అర్చకుఁడు. "సీ. పూజరిబ్రాహ్మణపుత్రి యొకర్తుసుగాత్రినాఁబరఁగెడుకాంతగలదు." కళా. ౪, ఆ.

పూజారి. ద్వ. వి. పూజేరియొక్క రూపాంతరము. "ఉ. పూజారివధూటివచ్చిజలజాతవిలోచనఁజూచియిట్లనున్." విక్ర. ౮. ఆ.

పూటము. దే. వి. బరువు, భారము.

పూడ. దే. వి. మూడి, గుదము.

పూడిక. దే. వి. నూయిమొదలగువానియందు అడుగునపూడినమన్ను.

పూడు. దే. అ. క్రి. 1. పల్లముగుట్టిలోనగువానిచే నిండు; 2. నిండు. వి. పూడిక.

పూడుఁబాము. దే. వి. (పూడు+పాము.) మట్టిలో పూడియుండు ఇరుదలలపాము. "ఉ. శేషానిలభుగ్విభుం డురుసహస్రశిరంబులఁ దాల్చిలోకముల్, హీనపుఁబూడుఁ బాముధరియించెదనంచుఁదలంచుచాడ్పునన్." వి, పు. ౧, ఆ.

పూడుచు. దే. ప్రే. 1. పూడఁజేయు; 2. పాఁతు. (రూ. పూడ్చు.)

పూడుపు. దే. వి. 1. పూడ్చుట; 2. నిక్షేపము.

పూత. దే. వి. పూచుట, వికసనము.

పూతన. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొక రాక్షసి; 2. కరక్కాయ. అ. పుం. ము. గజవిశేషము. (పిపాణకర్ణనయనచరణములలో ఏదేనినొక్కటి నొక ప్రక్కకలుగక మఱియొకప్రక్కనన్నియుఁ జక్కగాఁ గలిగి మేఘమువలె నల్లనై మంజిడిపన్నె గిలసఖురోమములుఁగలిగినది. ఇది యూధనాశకమంత్రము.)

పూతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తూర్పెత్తినది; 2. పరిశుద్ధమయినది; 3. నిషేకట్టఁబడినది.

పూతిక. సం. వి. ఆ. స్త్రీ. తొమ్మనగొట్టిపిండిచెట్టు. అ. పుం. ము. 1. నెమిలడుగుచెట్టు; 2. పూతిమార్జాలము.

పూతికరజము. సం. వి. అ. పుం. నెమిలడుగుచెట్టు.

పూతికాష్ఠము. సం. వి. అ. న. 1. దేవదారువు; 2. సరళవృక్షము.

పూతిగంధి. సం. వి. ఇ. పుం. దుర్గంధము, గదురు.

పూతిదారువు. సం. వి. ఉ. పుం. దేవదారువు.

పూతిఫలి. సం. వి. ఈ. స్త్రీ. కారుగచ్చ.

పూత్యండము. సం. వి. అ. పుం. 1. కస్తురిమెకము; 2. గదురుకంపుగల ఒకదినుసు పురుగు.

పూదియ. దే. వి. పూదె. (చూ. గవ్వచౌకము.)

పూదె. దే. వి. బంగారుపూస. "ఉ. కాలకళాదుఁడెండయను కాంచనరేణువుఁ బ్రత్యగాశనాఁ, గ్రాలెడుక్రొవిఁగూర్చికరఁగంగఁబ్రవర్ధనమొదుజాళువా, మేలిమిపూదెనాఁబోలుపుమీఁదె నినుండదికాఁకయార్చఁగీ, లాలనిలాగునఁగ్రుంకెనఁబశ్చిమాంబుధిన్." కళా. ౫, ఆ.

పూదెగట్టు. దే. అ. క్రి. (పూదె+కట్టు.) బంగారుపూసగానేర్పడు. "పూదెగట్టినతత్వబోధమునక." కళా. 3, ఆ.

పూనిక. దే. వి. కడఁక, ఉద్యమము. "ఎ, గీ. నీయశోలక్ష్మిఁబోలుపూనికలఁదపము, నేఁడు నెనరించుచున్నాఁడునీలగళుఁడు." కా. ౨, ఆ.

పూనికి. దే. వి.——పై.——(చూ. పూన్కి.)

పూనిగొల్లలు. ద్వ. వి. బ. గొల్లలలోనొక తెగవారు.

పూనీరు. వై. వి. పన్నీరు.

పూను. దే. అ. క్రి. కడఁగు, ఉద్యమించు. "ఉ. ప్రేనితనూజుఁడొక్కరుఁడు వీర్యసమగ్రుఁడపో లెవచ్చినా, పూనిన పూన్కియంతయును బొంకగునట్లుగఁజేసె." హరి. ఉ. 3, ఆ. — స. క్రి. 1. ధరించు; "జడల్ పూనున్." భార. శాం. ౨, ఆ. (ఈ యర్థమునందు దీనికి ఆదిహల్లువికల్పముగాలోపించును. చూ. ఊను.) అప్పకవి. "ఆ. పూనె నెగసెఁబోద వెఁబొనరఁబొందెనటన్న, పలుకులందు మొదలఁగలుగునట్టి, వ్యంజనంబులఁడఁగి వానిపైస్వరములు, నిలుచువలసినపుడు నీరజాక్ష." అని సామాన్యముగావిధించినవిధికిచిన్నయసూరిగారువ్యవస్థయేర్పఱుపక. "పూనుపాదవులకాదిలోపంబొకానొకండువచియించెనదియు విచారమూలకంబు." అని వ్రాయుటకు కారణమేమో తెలిసినదికాదు.)—2. వహించు. "ఎ, గీ. రాజులేకున్న రాజ్యమరాజకమగు, ననినఁబతియాజ్ఞశిరమునఁనతఁడుపూని." ఉ, రా. ౭, ఆ.

పూనుచు. దే. ప్రే. పూనఁజేయు. (రూ. పూన్చు.)— వహింపఁజేయుటకు.—"మ. భువనేశత్వభరంబుఁబూన్పఁదగునేపూరున్ జఘన్యాత్మజున్." భార. ఆది. 3, ఆ. "క. అనిలజవాశ్వంబులఁబూన్చిన రథములనెక్కి." భార. సభా. ౧, ఆ.

పూనూక. ద్వ. వి. మిక్కిలి సన్ననూక.

పూనూనె. ద్వ. వి. సంపెంగనూనె.

పూనె. దే. వి. బరణి. "రగడ. మిక్కుటపుఁగస్తూరి పలపులుమించుపునుఁగిడఁదగినపూనెలు." శుక. ౧, ఆ.

**పూన్కి.** దే. వి. పూనికియొక్క రూపాంతరము. "తే. దండితోరాతినీదేవికుండలమ్ము, లిమ్మునాపూన్కి యిదిసఫలమ్ముగాఁగ." భార. ఆది. ౧, ఆ.

**పూప** దే. వి. 1. పూఁబిందె; "చ. కొలఁదికిమించు కెంజిగురుగుత్తులమొగ్గలఁబువ్వుగుచ్ఛకం, బులఁ బువుఁదేనెఁబుట్టెడులఁబూపలఁబిందెలఁగాయ లన్ ఫలం, బులనెపుడున్ సమగ్రపరిపూర్తివహిం చుచుఁదద్వనప్రజం, బెలమివహించునందనసమృ ద్ధికిఁగోటిగుణాధికంబుగన్." కళా. ౧, ఆ. (చూ. పిందియ.)—2. శిశువు; "పూపయితండు." కృష్ణా. 3, ఆ.—3. కంటిపాప. "బాసవాల్కను పూప." య. ౧, ఆ. –విశే. లేఁత. "కసుగాఁపు పూపవయసుమిటారి." పాండు. 3, ఆ.

**పూపము.** సం. వి. అ. పుం. 1. భక్ష్యము; 2. పిండి వంట.

**పూపలిక.** సం. వి. ఆ. స్త్రీ. అపూపము, పిండివంట.

**పూయము.** సం. వి. అ. న. 1. చీము; 2. జోదము; 3. పీనుఁగు.

**పూయు.** దే. స. క్రి. 1. చందనములోనగుదానిని అలఁదు; 2. మన్నులోనగువానిని మెత్తు.

**పూరకము.** సం. వి. అ. పుం. 1. ఊపిరిఁబూరించు ట; 2. మాదిఫలము?.

**పూరకుఁడు.** సం. విశే. (అ.ఆ.అ.) నించువాఁడు.

**పూరగించు.** వై. స. క్రి. 1. నెఱవేర్చు; "క. తను, మిగిలిప్రతినపూరగింపమేకొనిచనునా, మఁగఁటి మియులావుమాన్పుట, తగవాగురునకు." భార. ద్రో. ౨, ఆ.—2. కడపు*. "రజనిఁబూరగిం ప." రా. యు, కాం.

**పూరణము.** సం. వి. అ. న. 1. నించుట; 2. గుణిం చుట; 3. కుడుములు మొదలగుపిండివంటలలోపలపె ట్టెడుబెల్లమువేసినూఱినపప్పుముద్దలోనగునది; 4. గలిజేరు?. విశే. నించునది.

**పూరణి.** సం. వి. ఆ. స్త్రీ. 1. పేక; 2. బూరుగు?.

**పూరము.** సం. వి. అ. పుం. 1. జలప్రవాహము; 2. భక్ష్యము; 3. వ్రణసంశుద్ధి; 4. గలిజేరు?.

**పూరా.** హిం. విశే. సంపూర్ణమయిన.

**పూరి.** దే. వి. 1. గడ్డి, తృణము; 2. మృగములచను పాలు. "సీ. భేరుండములుప్రక్కఁబెట్టిచన్నుల పూరిపాటించిశరభడింభములకిచ్చు." జై. ౪, ఆ.

**పూరించు.** సం. స. క్రి. 1. పూరగించు; 2. నించు.

**పూరిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. బూరె; 2. పూరీ*.

**పూరితము.** సం. విశే. (అ.ఆ.అ.) 1. నింపఁబడినది; 2. గుణింపఁబడినది.

**పూరీ.** వై. వి. భక్ష్యవిశేషము*. (ఒకానొక అధు నిక నిఘంటుకారుఁడు పూరీపోళీశబ్దములను సం స్కృతముగా వ్రాసియున్నాఁడు. అది విచా ర్యము.)

**పూరుదొన్నె.** ద్వ. వి. ఒకానొకచెట్టు.

**పూరుషుఁడు.** సం. వి. అ. పుం. మనుష్యుఁడు, మానిసి.

**పూరెడు.** దే. వి. పూరేడుయొక్క రూపాంతరము.

**పూరెకు.** ద్వ. వి. 1. పుష్పదళము; 2. బ. ధాన్యవిశేషము.

**పూరేడు.** దే. వి. పక్షివిశేషము.

**పూర్ణ.** సం. వి. ఆ. స్త్రీ. 1. తిథివిశేషము; (చూ. తిథి.) 2. పున్నమ.

**పూర్ణపాత్రము.** సం. వి. అ. 1. (చూ. పూర్ణాన కము మొదటియర్థము.); 2. వస్తుసంపూర్ణపా త్రము.

**పూర్ణమాసము.** సం. వి. అ. పుం. పున్నమనాటియా గము, (రూ. పౌర్ణమాసము.)

**పూర్ణము.** సం. వి. అ. న. వింటినారిని చెవిదాఁకతిగు చుట. విశే. 1. నిండినది; 2 శక్తికలది; 3. సమ స్తము.

**పూర్ణానకము.** సం. వి. అ. న. 1. ఉత్సవకాలమునం దు సంతోషముచే వస్త్రాభరణాదికము దోఁచు కొనుట, దోఁపు; 2. తప్పెట.

**పూర్ణిమ.** సం. వి. ఆ. స్త్రీ. పౌర్ణమాసి, పున్నమ.

**పూర్ణీభవించు.** సం. అ. క్రి. పూర్ణమగు, నిండు.

**పూర్తము.** సం. వి. అ. న. 1. నూతిని బావిని చెఱువు నుత్రవ్వించుట, గుడికట్టించుట, తోఁటపెట్టిం చుట, అన్నముపెట్టుట; 2. పాలనము. విశే. 1. నింపఁబడినది; 2. కప్పఁబడినది.

**పూర్తి.** సం. వి. ఇ. స్త్రీ. పూరణము, నింపు.

**పూర్నము.** వై. వి. కుడుములు మొదలగుపిండివంట లలోపలఁబెట్టెడు బెల్లము వేసినూఱినపప్పుముద్ద లోనగునది.

**పూర్వ.** సం. వి. ఆ. స్త్రీ. తూర్పు, తొలిదిక్కు.

**పూర్వగంగ.** సం. వి. ఆ. స్త్రీ. నర్మదానది.

**పూర్వజ.** సం. వి. ఆ. స్త్రీ. అక్క. విశే. మొదట పుట్టినది.

**పూర్వజుఁడు.** సం. వి. అ. పుం. అన్న. విశే. మొదట పుట్టినవాఁడు.

**పూర్వదేవుఁడు.** సం. వి. అ. పుం. తొలివేల్పు.

పూర్వపక్షము. సం. వి. అ. పుం. 1. వాదము; 2. శుక్లపక్షము.
పూర్వపర్వతము. సం. వి. అ. పుం. తూర్పుకొండ. (ఇట్లు పూర్వాద్రి. మొ.)
పూర్వఫల్గుని. సం. వి. ఈ. స్త్రీ. ఒకనక్షత్రము. (చూ. నక్షత్రము.)
పూర్వభద్రపదము. సం. వి. అ. పుం. ఒకనక్షత్రము. (చూ. నక్షత్రము.)
పూర్వము. సం. విశ. (అ. ఆ. అ.) 1. మొదటిది; 2. మొదటిదిక్కుది; 3. మొదటిచోటిది; 4. ముందటికాలముది.
పూర్వరాగము. సం. వి. అ. పుం. శ్రవణమువలనఁగాని దర్శనమువలనఁగాని పరస్పరము వృద్ధిఁ బొందిన యనురాగముగల నాయికానాయకులకు అయోగమునందుఁగలిగెడి దశావిశేషము. (ఇది త్రివిధము. నీలీరాగము, కుసుంభరాగము, మంజిష్ఠారాగము.)
పూర్వరాత్రము. సం. వి. అ. పుం. ముందటిదినము రాత్రి.
పూర్వాషాఢ. సం. వి. ఆ. స్త్రీ. ఒకనక్షత్రము. (చూ. నక్షత్రము.)
పూర్వాహ్ణము. సం. వి. అ. పుం. దినపూర్వభాగము, లేఁబగలు.
పూర్వులు. సం. వి. అ. పుం. బ. ముందటివారు.
పూర్వోత్తర. సం. వి. ఆ. స్త్రీ. ఈశాన్యదిగ్భాగము.
పూలగురివెంద. ద్వ. వి. వాసంతి.
పూలమట్ట. ద్వ. వి. మత్స్యవిశేషము.
పూలము. సం. వి. అ. పుం, న. గడ్డికట్ట.
పూలముడుపు. ద్వ. వి. (పూలు+ముడుపు.) గర్భిణికిచేయించెడు పుష్పధారణము.
పూలి. దే. వి. ఒకానొకచెట్టు.
పూవత్తి. వై. వి. బాణసంచువిశేషము.
పూవింటి. ద్వ. వి. (పూ+విల్లు.) మన్మథుఁడు, పుష్పధన్వుఁడు. "ఎంతయువింతబెడంగుఁగన్న పూవింటిమెఱుంగుఁదూపుక్రియ." పర. ౨, ఆ.
పూవింటివాఁడు. ద్వ. వి.——వై.——
పూవిలుకాఁడు. ద్వ. వి. మన్మథుఁడు, పుష్పధన్వుఁడు.
పూవిలుతుఁడు. ద్వ. వి.——వై.——
పూవు. వై. వి. 1. పుష్పము; 2. కాఁకరపత్తిలోనగు వానియందలి పువ్వు*; 3. కంటియందుపడెడు పువ్వు*.
పూవుఁబోఁడి. ద్వ. వి. (చూ. పువ్వుఁబోఁడి.) "అప్పూవుంబోఁడులుముప్పిరతో." స్వా. ౬, ఆ.
పూవుగట్టు. ద్వ. అ. క్రి. (పూవు+కట్టు.) పూవుగలదియగు. "పూవుగట్టినగందవొడివోలెఁబరిమళభరితమైనెఱయ." రామా. ౧, ఆ.
పూషుఁడు. సం. వి. న్. పుం. ద్వాదశాదిత్యులలో నొకఁడు. (చూ. ఆదిత్యుఁడు.)
పూస. దే. వి. 1. పూదె; 2. మణి; 3. వ్రేలులో నగువానికీలు.
పూసకజ్జము. ద్వ. వి. భక్ష్యవిశేషము, మనోహరము.
పూసకామంచి. ద్వ. వి. తృణవిశేషము.
పూసయెముక. దే. వి. వెన్నుపూస, కశేరుక.
పూసలగురివెంద. ద్వ. వి. గుంజ.
పూసలవాఁడు. దే వి. రత్నములుసానపెట్టువాఁడు, మణికారకుఁడు.

పృ.

పృక్క. సం. వి. ఆ. స్త్రీ. పిక్కి. శాకవిశేషము. (అని కొందఱు.)
పృక్తము సం. విశ. (అ. ఆ. అ.) కూడుకొన్నది.
పృక్తి. సం. వి. ఇ. స్త్రీ. స్పర్శము, తాఁకుడు.
పృచ్ఛ. సం. వి. ఆ. స్త్రీ. ప్రశ్నము, అడుగుట.
పృచ్ఛించు. సం. స. క్రి. ప్రశ్నముచేయు, అడుగు.
పృతన. సం. వి. ఆ. స్త్రీ. 1. సేన; 2. సేనావిశేషము. (ఇన్నూటనలువదిమూడురథములు అన్నియేనుఁగులు ఏడ్నూటయిరువదితొమ్మిది గుఱ్ఱములు వేయినిన్నూటపదునేనువురుకాల్బురునుగలది.)
పృతనాషాట్టు. సం. వి. హ్. పుం. ఇంద్రుఁడు.
పృథక్పర్ణి. సం. వి. ఈ. స్త్రీ. కోలపొన్న.
పృథగ్జనుఁడు. సం. వి. అ. పుం. 1. నీచుఁడు; 2. మూర్ఖుఁడు; 3. పాపి.
పృథగ్విధము. సం. విశ. (అ ఆ.అ.) పెక్కువిధములుగలది.
పృథివి. సం. వి. ఈ. స్త్రీ. భూమి, (రూ. పృథవి.)
పృథివీపతి. సం. వి. ఇ. పుం. 1. రాజు; 2. యముఁడు; 3. వృషభమనెడు ఓషధీవిశేషము.
పృథుకము. సం. వి. అ. పుం. 1. పిల్ల; 2. అడుకులు.
పృథురోమము. సం. వి. న్. పుం. చేప. విశ. పెద్ద వెండ్రుకలుగలది.
పృథులము. సం. విశ. (అ. ఆ. అ.) విరివియైనది.

**పృథువు.** సం. వి. ఉ. స్త్రీ. 1. నల్లజీలకఱ్ఱ; 2. ఇంగువ వ్రాను. పుం. 1. అగ్ని; 2. ఒకరాజు. విణ. 1. గొప్పది; 2. విరివియైనది.

**పృథ్వి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పుడమి; 2. ఇంగువ ప్రాను; 3. నల్లజీలకఱ్ఱ. విణ. విరివియైనది.

**పృథ్వీక.** సం. వి. ఆ. స్త్రీ. పెద్దయేలకులు.

**పృదాకువు.** సం. వి. ఉ. పుం. 1. పాము; 2. తేలు; 3. పులి; 4. చిఱుతపులి.

**పృశ్ని.** సం. వి. ఇ. పుం. 1. కిరణము; 2. బోయవాఁడు. విణ. (మా. అలిపిరి.)

**పృశ్నిపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. కోలపొన్న ?.

**పృషతము.** సం. వి. అ. పుం. 1. దుప్పి; 2. నీటిబొట్టు. విణ. బ్రహ్మబిందువుతోఁగూడినది.

**పృషత్కము.** సం. వి. అ. పుం. బాణము, శరము, అమ్ము.

**పృషత్తు.** సం. వి. త్. న. నీటిబొట్టు. పుం. దుప్పి. విణ. బ్రహ్మబిందువుతోఁగూడినది.

**పృషదంశకము.** సం. వి. అ. పుం. పిల్లి, (రూ. వృషదంశకము.)

**పృషదశ్వుఁడు.** సం. వి. అ. పుం. వాయువు, గాలి.

**పృషదాజ్యము.** సం. వి. అ. న. పెరుఁగుతోఁగలపఁబడిన నేయి.

**పృష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) అడుగఁబడినది.

**పృష్టి.** సం. వి. ఇ. స్త్రీ. 1. తాఁకుడు; 2. కిరణము.

**పృష్ఠమాంసాదనము.** సం. వి. అ. న. కడచినపనికి చింతించుట.

**పృష్ఠము.** సం. వి. అ. న. 1. మూఁడి; 2. వీఁపు; 3. వెనుకప్రక్క; 4. యజ్ఞసంబంధిస్తోత్రవిశేషము.

**పృష్ఠ్యము.** సం. వి. అ. న. పృష్ఠములనెడియజ్ఞసంబంధిస్తోత్రవిశేషములసమూహము. పుం. మోపుమోసెడుగుఱ్ఱము.

## పె.

**పె.** దే. విణ. వృత్తియందు పెనుపుశబ్దమునకుమీఁది వర్ణములులోపింపఁగా మిగిలినరూపము. (దీనికి పరుషసరళములుపరములగునపుడునుమాగమంబగును. పెన్గురుఁజు, పెన్జిలువ, పెన్జీఁకటి, పెన్జెమట, పెన్తోఁట, పెన్దడి, పెన్దత్తఅము, పెన్దపసి, పెన్దరఁగ, పెన్దీఁగ, పెన్దుఱుము, పెన్దెర, పెన్దెవులు, పెన్బులుఁగు, పెన్బొగ, పెన్బ్రోడ, పెన్బ్రోవు, పెన్గుబ్బ, పెన్జెగతి, పెన్జెడ, పెన్దరి. మొ. ఇందలి ద్రుతంబునకు బిందువునగు. పెంజీఁకటి. మొ.) (ఒకానొకచో స్థిరముపరమగునపుడును బిందువుకానంబడియెడి. "సీ. పెంధూళియెసఁగ నందందకాల్ద్రవునదగ్రతమహీతలముగ్రక్కదలుచుండ." మార్క. ౬, ఆ.)

**పెంకి.** దే. వి. ఒకానొకతీఁగ.

**పెంకు.** దే. వి. 1. ఇంటికికప్పెడు ఓడుబిల్ల; 2. కుండలోనగువాని పెంచిక. (కుండపెంకు, అద్దపుపెంకు, పుఱ్ఱెపెంకు. మొ.)

**పెంకె.** దే. విణ. 1. మొండికట్టె; 2. మూర్ఖుఁడు.

**పెంకిపురుగు.** ద్వ. వి. ధాన్యమునకుఁబట్టెడు ఒకదినుసుపురుగు.

**పెంచిక.** దే. వి. కుండలోనగువాని పెంకు. "సీ. రయమున నాళికేరఫలమొక్కటివేయఁబెటిలిపెంచికలునొప్పింపఁబ్రజల." జై. ౪, ఆ. (పుఱ్ఱెపెంచిక.)

**పెంచు.** దే. ప్రే. పెనుచేయొక్క రూపాంతరము. వి. పెంచిక. "క. భవదురుతరపురదాహ, శ్రవణంబుననంటివచ్చి బ్రహ్మాండఘుటం, బవియించిన పెంచునసీ, భువనముతోనుడుకఁబెట్టిపొరఁబెడఁగపులన్." రామా. ౭, ఆ.

**పెంచుకొను.** దే. స. క్రి. దత్తుతీసికొను.

**పెంజెర.** దే. వి. ఒకదినుసుకొండచిలువ. (దీని భేదములు — తుస్సుపెంజెర, పొట్టపెంజెర, రక్తపెంజెర.)

**పెంట.** యు. దే. వి. 1. చీఁపురుకట్టచేత ఊడ్చియెత్తినచెత్తలోనగునది; 2. ఎరువుకుప్ప; "క. కోపించిచెండియింటిస, మీపంబుననున్న పెంటమీఁదన్ వైచెన్." జై. ౪, ఆ.—3. ఆవులమందముండున్నచోటు. వై. పేఁటయొక్కరూపాంతరము. (మంగలపెంట. మొ.)

**పెంటగట్టు.** దే. అ. క్రి. (పెంట+కట్టు.) పెంటకై మందగట్టు.

**పెంటపట్టు.** దే. వి. పసులులోనగువానిదొడ్డి. "వ. మేఁతవెంబడిం బొలముపల్లంబులందిరిగితిరిగి పెంట్రికలువెట్టుపెంటపట్టునకువచ్చి." "వ. ఉపరిప్రదేశంబులఁగాఁగెనుప పెంటపట్లనీరాఱు నేఱుఁబిడకలదాల్లిడి." స్వా. ౪, ఆ.

**పెంటి.** దే. వి. పశుపక్ష్యాదిస్త్రీజాతి. "తే. పఱవనోపకయున్న మైమఱచి పెంటిఁ, బెనఁగియున్నను బ్రసవింపమొనసియున్నఁ, దెవులుకొనియున్నమృగములఁదివిరిగేయ, రెఱిచియాహారముగ

మను సెఱుకులయిన." భార. ఆది. ౫, ఆ. "తే. అంతఁబడమట సెఱసంజయాముకవిసె, నలినికను మూసెఁదుమ్మెదకలువకరిగెఁ, బులుఁగిరవుఁజేర మెఱుఁగుడుఁబురువు వెలిఁగెఁ, బెంటిసెడఁబాసి జక్కవయొంటిఁదిరిగె." రామా. ౬, ఆ. (పెంటితాడు.)

పెంటిక. దే. వి. ఉండఉండగా వేసెడు మేఁకలోనగువాని పేఁడ.

పెంటికరడు. దే. వి. చిన్న అల.

పెంటిపడు. ద్వ. అ. క్రి. కవగూడు. "ద్వి. మృగపక్షిపశువులు మేఁతలువదలి, పగలు రేయును బెంటిపడిపాయవయ్యె." ప్రభు. 3, ఆ.

పెంట్రిక. దే. వి. పెంటికకు మొదటిరూపము. (చూ. పెంటపట్టు.)

పెండ. దే. వి. పేఁడయొక్క రూపాంతరము.

పెండరము. దే. వి. పెండారముయొక్క రూపాంతరము.

పెండలము. దే. వి. ఒకదినుసుదుంప.

పెండారము. దే. వి. (చూ.) గండపెండారము.

పెండియము. దే. వి. 1. కాలధరించెడు పెండెము; "చ. హరిమొదలైనదిక్పతులయాకృతులన్ దనరారియున్న యా, బిరుదులఁగ్రాలు పెండియముఁ బెంపగురత్నమయూఖచారునూ, పురమును వామపాదమునఁబొల్పువహింపఁగ." రా. యు, కాం.—2. దొడ్డిమొదలైనవానివాకిటికిఁ బెట్టెడు పెండెము.

పెండిలి. దే. వి. వివాహము. (చూ. పెండిలిసేయు.)

పెండిలియగు. దే. స. క్రి. (పెండిలి+అగు.) వివాహమగు. "పెండిలియగుమయియ్యింతి." భార. ఆది. ౮, ఆ. (రూ. పెండ్లియగు. "క్రమంబున నేవురుఁ బెండ్లియగుఁడుకృష్ణ." భార. ఆది. ౭, ఆ.)

పెండిలియాడు. దే. స. క్రి. (పెండిలి + ఆడు.) —వై.— "దానిఁదృణబిందుఁడు పెండిలియాడి." వి, పు. ౪, ఆ. (రూ. పెండ్లియాడు. "సాగరవల్లభుఁబెండ్లియాడెదో." వై. ౪, ఆ.)

పెండిలిసేయు. ద్వ. స. క్రి. (పెండిలి + చేయు.) పెండ్లాడు. (రూ. పెండ్లిసేయు. "ఆ. మమ్ముఁబెండ్లిసేయుమా ప్రాణవల్లభ, ప్రాణమిచ్చికావు భక్తవరద, నీవుసేయు పెండ్లినిత్యంబుభద్రంబు, పిన్ననాటిపెండ్లి పెండ్లికాదు." భాగ. ౧౦, స్కం. పూ.)

అం. ప్రే. పెండ్లాడఁజేయు. "క. పాలఁతులరూపవతులఁబెం, డిలిసేసెరిదొరలువాంసడిభకులకు." ఉ, హరి. ౪, ఆ.

పెండె. దే. వి. 1. ఇంటివాసములమీఁద అడ్డముగా వేసికట్టెడుకొయ్య; "సీ. పెండెఁగట్టెడుచోటఁ బెనుఁబగడపుఁదీఁగలీఁత మెల్లెలతుల్య మెపుడున్న పతి." రా, వి. 3, ఆ.—2. పొగాకుమొదలైనవానినగయందుసగము.

పెండెకట్లు. దే. వి. బ. పెండెలవలెపట్టెలుగాఁదీర్చినవిభూతిరేఖలు. "విబూదిపెండెకట్లు." హంస. ౧, ఆ.

పెండెము. దే. వి. 1. గండపెండారము. "పెండెంబు డాకాలఁబెట్టి." ఉ, హరి. ౪, ఆ.—2. పలుగాఁడితలువు. (పెండియముయొక్క రూపాంతరము.)

పెండెరము. దే. వి. పెండేరముయొక్క రూపాంతరము.

పెండేరము. దే. వి. పెండారముయొక్క రూపాంతరము. (చూ. నెరుము.)

పెండ్లము. దే. వి. (పెండ్లి+అము.) వివాహమైనభార్య. "క. అడ్డముచెప్పకకడపటి, బిడ్డఁడురాముండునుతులఁబెండ్లమునచటన్, గొడ్డంటండెగనడిచిన, జడ్డనఁదలయూఁచి మెచ్చెజమదగ్ని మదిన్." భాగ. ౯, స్కం.

పెండ్లాడు. దే. స. క్రి. (పెండ్లి+ఆడు.) వివాహమగు. (మొదటిరూపము పెండ్లియాడు.)

పెండ్లాము. దే. వి. పెండ్లముయొక్క రూపాంతరము.

పెండ్లి. దే. వి. పెండిలియొక్క రూపాంతరము. (బ. పెండ్లిండ్లు. "క. పెనుమినుకుఁద్రోవఁబెండ్లిం, డ్లొనరించి." అచ్చ. బాల, కాం.

పెండ్లికుండలు. ద్వ. వి. బ. పూజెలుపెట్టి పెండ్లియందుపయోగించెడుకుండలు, ఐరేని.

పెండ్లికూఁతురు. దే. వి. 1. వివాహదీక్షితురాలు, వధువు; (చూ. నలఁగు.) 2. కోడలు. (చూ. పెండ్లికొడుకు.)

పెండ్లికొడుకు. ద్వ. వి. 1. వివాహదీక్షితుఁడు, వరుఁడు; "వ. అయ్యాదిమవరుండుదివ్యాప్సరసలుహరిద్రాదికస్నానీయద్రవ్యమండనంబొనర్పఁబెండ్లికొడుకై." ఆము. ౬, ఆ.—2. అల్లుఁడు. "తే. అర్థితోనోషధీశ్వరుఁడాదియైన, పెండ్లికొడుకులనెల్లనుబిలువఁబంచె." భీ. ౨, ఆ.

పెండ్లిగుమ్మడి. దే. వి. వివాహాదిశుభదినములయందు ఉపయోగించెడుగుమ్మడి, బూడిదగుమ్మడికి,

**పెండ్లినడక.** దే. వి. పెండ్లియందువలెతిన్నగానడచు నడక. "పెండ్లినడకల నడచెన్." భాను. ౧, ఆ.

**పెండ్లియరుగు.** దే. వి. (పెండ్లి + అరుగు.) పెండ్లి యందు వధూవరులు కూర్చుండుటకై ప్రేలెడు ఎత్తున చౌకముతీర్చి వేసెడుతిన్నె.

**పెందలకడ.** దే. ద్ర. క్రి. విశ. (పెన్ + తలకడ.) ప్రొద్దుపోకమునుపు.

**పెందలాడ.** దే. ద్ర. క్రి. విశ. పెందలకడయొక్క రూపాంతరము.

**పెందిరువడి.** దే. వి. (పెన్ + తిరువడి.) (వైష్ణవభాషయందు) గరుత్మంతుడు. "పెందిరువడింగని." ఆము. ౪, ఆ.

**పెందెరువు** దే. వి. (పెన్ + తెరువు.) రాజమార్గము. "వ. కరినగరంబుపెందెరువుగైకొని." భార. ఉద్యో. 3, ఆ.

**పెందొడ.** దే. వి. (పెన్ + తొడ.) ఊరుమూలము.

**పెంద్రోవ.** దే. వి. (పెన్ + త్రోవ.) ముక్తి. "ఉ. ఏవిభుపాదపద్మరతులెన్నడు నెవ్వరుఁబొందలేని పెంద్రోవఁజరంతురు." భాగ. ౧౦, స్కం. పూ.

**పెంపగు.** దే. అ. క్రి. (పెంపు + అగు.) వర్ధిల్లు. "క. నీపేరినీసరోవర, మేపారన్ ఖ్యాతిగాంచునిందు మునుంగన్, బాపములువాయుపుణ్యశ్రీ పెంపగు మోక్షలక్ష్మీచేకూఱుఁదుదన్." శేష. ౫, ఆ.

**పెంపాఱు.** దే. అ. క్రి. (పెంపు + ఆఱు.) గొప్పయగు. "ఉ. వీరలుధర్మమార్గముసవిస్తరతన్ దగనాడిరేని యుఁ్టన్, వారలుదీనికియ్యకొనినన్ వినుమచ్యుతయట్టిసంధిపెంపారఁగ నేర్చునే." భార. ఉద్యో. 3, ఆ.

**పెంపు.** దే. ప్రే. నాశముచేయు. "ఉ. తెంపరియైపొరింబొరిని దేవకిబిడ్డలఁజిన్నికుఱ్ఱలన్, జంపితివంతనైన నుపశాంతివహింపకకాలమీఁదనన్, బెంపితివిస్సిరోయిదియ నీరమె నాసరసన్ జనించినిన్, జంపెడి వీరుఁడొక్కఁడెసత్కృతినొందెడువాఁడుదుర్మతీ." భాగ. ౧౦, స్కం. పూ. "సీ. తనమహోహవదీక్షతనమహోహవదీక్షపగిది నావావనీపకులఁబెంప." వసు. ౧, ఆ.—వి. 1. సమృద్ధి; 2. నాశము; "సీ. అసురశక్తిరేఁచునూతనసారసాటోపమెంటిగాంద్రకుఁబెంపులొసఁగునెచట." హన. ౨, ఆ. (ఇది పైరెండర్థములకు నుదాహరణము.)—3. అతిశయము; "సీ. మోహంబువలనఁబై మునురులోభంబులోభాతిశయమునఁగామమగ్గలించుఁ, గామంబు పెంపునఁగడఁగుఁ గ్రోధంబు క్రోధంబునవైరమెంతయును బెరుఁగు." భార. ఆర. ౪, ఆ.—4. గౌరవము; "క. సంపదలేమికిమదిశో, కింపవు శత్రువులచేతికిని లోనగుటా, హింపవునీపూరకునికి, పెంపనిపాటించెదట్టిజే లయుఁగలఁడే." భార. శాం. ౪, ఆ.—5. మహత్వము. "వ. సర్వలోకాభిగమ్యుండగు నమ్మహానుభావునకుమనమభిగమ్యులమైతిమి, మనకింతకంటెను బెంపెయ్యది." భార. ఉద్యో. 3, ఆ.

**పెంపుడు.** దే. విశ. పెంపఁబడినది. (పెంపుడుచిలుక.)

**పెంపుమీఱు.** దే. అ. క్రి. అతిశయించు. "సీ. ప్రతిదేశమునుభోగభాగ్యసంపత్ప్రజాసంపూర్ణవిభవమై పెంపుమీఱుఁ, బ్రతిదేవతావాసమతులితనిత్యోత్సవాడంబరంబులనతిశయిల్లు." పు. ౧ ఆ.

**పెకలు.** దే. అ. క్రి. 1. పెల్లగిల్లు; "పెకలియజాండకర్పరము బీటలువాఱఁగమేను పెంచి." పా. 3, ఆ.—2. ప్రయాణమగు. "తే. నృపతికీతనికక్షౌహిణీదశకము, కలిగిననునందునొకకొంతగానిపెకలి, యంతయునురాదుచనుదెంచుహయముబడిని." జై. ౨, ఆ.

**పెకలుచు.** దే. ప్రే. (పెకలఁజేయు.) పెకలించు. "క. ఒకపాదపంబుఁగేలం, బెకలిచికొనియెదుర." రామా. ౫, ఆ. (రూ. పెకల్చు). "చ. జలరుహనాభుఁడిట్లురథసంబునందఁపారిజాతముగన్, బలిమిఁబెకల్చియెత్తె." పా. ౪, ఆ.)

**పెక్కండ్రు.** వై. స. బ. అనేకులు. (పెక్కుశబ్దమునకు మహన్మహత్యర్థకరూపము.)

**పెక్కణము.** వై. వి. 1. అభినయముతోడినృత్యము; "సీ. మొకములచాయ వేఱొకచందముగనిల్పి కమలసంభవుఁడు పెక్కణమొనర్ప." ఉ. హరి. ౪, ఆ.—2. మల్లరంగము*. (చూ. ప్రెక్కణము.)

**పెక్కలి.** దే. వి. ఒకానొకచెట్టు.

**పెక్కు.** వై. స. అనేకము.

**పెక్కురు.** వై. స. బ. పెక్కండ్రుయొక్కరూపాంతరము. నీలా. ౨, ఆ.

**పెక్కువ.** దే. వి. 1. వర్ధనము; "వ. ఇట్లు పెరిఁగినవింధ్యంబునొద్దకువచ్చి వేల్పులెల్లదానివర్ధనంబువారింపనోపకయగస్త్యుపాలికింజని వింధ్యంబుపెక్కువయెడింగించియిట్లనిరి." భార. ఆర. 3, ఆ.—2. ఆధిక్యము. "ఉ. పెనంగిరిబాహుశౌర్యముల్

త్రాసునఁదూన్పవచ్చుననఁదక్కువ పెక్కువలేక యిద్దఱుఁ." జై. ౫, ఆ.

పెగడ. దే. వి. ప్రెగడయొక్క రూపాంతరము.

పెగలు. దే. అ. క్రి. పెకలుయొక్క రూపాంతరము. (పెల్లగిల్లుటకు. "ఆ. వగరుపుట్టినంతఁబెగలెడం తంబులు." భాగ. ౬, స్కం.)

పెగలుచు. దే. ప్రే. పెకలుచుయొక్క రూపాంతరము.

పెగ్గుమ్మడు. వై. వి. (పెద్ద+గుమ్మడు.) శ్రీపర్ణి.

పెగ్గురు. వై. వి. బెగ్గురుపక్షి, సారసము. (ఇది యిట్లు పరుషాదిగానును కానఁబడుచున్నది.)

పెచ్చారి. దే. విణ. మూర్ఖుఁడు. "క. మచ్చరపువాసుదేవుఁడు, పెచ్చారితనంబుమ్రానుపిల నిట్లని యెఁ." ఉ. హరి. 3, ఆ.

పెచ్చు. దే. వి. 1. అక్క అనుబట్టి నాణెములమార్పు లోనగువానియందు అధికముగానిచ్చెడుధనము; 2. పండులోనగువానిమీఁదితోలు. విణ. అధికము.

పెటపెట. దే. వి. పండ్లుకొఱుకుటలోనగువానియం దగుధ్వన్యనుకరణము. (కొఱుకుటయందు. "ఆ. పెదవులదరఁబండ్లుపెటపెటఁగొఱుకుచు." భాగ. ౬, స్కం.—ఉఱుముటయందు. (చూ. టొట టొట.)—పగులుటయందు. "దిక్కులుపెటపెటఁ బగులంగనార్చి." సైం. 3, ఆ.—పెటులుటయం దు. "ద్వి. పెటపెటఁబెటిలిపెన్బిడుగులుపడియె." హరిశ్చ. ౧, భా.—ప్రేలుటయందు. "ద్వి. పటుతరంబైననాబాణాగ్నిశిఖలఁ, బెటపెటఁబ్రేలక ప్రిదిలిపోఁగలరె." రా. యు, కాం.—విఱుగుటయందు. "ద్వి. పెళపెళధ్వనులనుబెటపెటస్వనులఁ, గలయదిక్కులద్రువఁగావిల్లువిఱిగె." రా. బాల, కాం.

పెటపెటమను. దే. అ. క్రి. (పెటపెట+అను.) పెటపెట అను ధ్వనికలదియగు. "ద్వి. పెటపెటమని వేఁగబ్రిదిలికంబంబు, పటపటవ్రయ్యలైపగుల నానడుమ." భాగ. ౭, స్కం.

పెటపెటలాడు. దే. అ. క్రి. (పెటపెటలు+ఆడు.) పెటపెటమను. "పెటపెటలాడుచుఁ విఱిగె." రా. బాల, కాం.

పెటిలు. దే. అ. క్రి. పెట్లు. "క. అలరెండారలుసంధ్యో, జ్జ్వలనశిఖాదహ్యమానచరమాద్రివనా, వళిఁబెటిలువంశపటలం, బులనెగసినగొప్పవెలఁది ముత్తెములనఁగఁ." పర. 3, ఆ. (ఇది యిట్లు ఇకారమధ్యముగా ప్రతులయందుఁ గానఁబడుచున్నది.)

పెటుకు. దే. విణ. విరసము. (ఏలపెటుకుమాటలాడెదవు.)

పెటులు. దే. అ. క్రి. పెట్లు. "సీ. బడబానలాహతిజడనిధిలోనున్న పటుశైలతతి ప్రేలిపెటిలెనో క్కా." లక్ష్మీ. ౫, ఆ.—వి. పెట్లుఁగ్రోవి. "సీ. పెటులుదప్పదులాత్మభీరుస్వయంగ్రాహపరిరంభసుఖముఖేచరులకొసఁగ." స్వా. ౫, ఆ.

పెట్ట. దే. వి. 1. పశుపక్షిస్త్రీజాతి; "క. ఆలేమయిల్లువెడలెను, గోలయుబలె నొక్కపెట్టకుక్కుం గొనుచుఁ." శుక. ౨, ఆ. "వ. సంచారార్థంబు దిక్కులకువెడలునక్కలరవంబుల నుక్కఁదండ సంబువోనిముక్కున నంకుశంబులంబోలుచరణనఖాంకురంబులఁ బెట్టనుంబోతునుంగఅచియునిటి కియుఁబట్టియేకాంత ప్రదేశంబున భక్షించునది యై." కాశీ. ౬, ఆ.—2. అఁడుకోడి.

పెట్టమారి. దే. వి. అఁడుకోడిపలెనుండుపుంజు.

పెట్టు. దే. అ. క్రి. కలుగు. "క. గడగడనడఁకెడు మేనఁ, నిడువెండ్రుకవెట్టె." ఉ. హరి. ౫, ఆ.—స. క్రి. 1. ఉంచు; 2. (పక్షులులోనగునవి) గర్భమునుండిగ్రుడ్లను వెలిపుచ్చు; (కోడిగ్రుడ్లు పెట్టెను.)—3. గ్రుడ్లుపొదిఁగిపిల్లను చేయు; "సీ. చతురభాషిణియొక్కశారికనర్తించునదిపిల్లఁబెట్టియింపారఁబండ్లు, తెచ్చియర్మిలిదానికిచ్చుచో." భార. శాం. 3, ఆ.—4. ధరించు; "ఎ. గీ. రాజ్యమింతయునీసొమ్ము రాజవీవు, కుడువఁగట్టను బెట్టనుగొఱఁతలేక, యేనుఁగులగుఱ్ఱములనెక్కియెల్లవారుఁ, గొల్వసాధురక్షకుఁడవైకొలువుమింక." హరి. పూ. ౯, ఆ.—5. ఇచ్చు; "క. కుడువక పెట్టకకూఢ్రుఁడు, కడునెక్కుడుగూర్చినట్టికనకముఁగోలుచుఁ, బుడమిపతిధర్మకృతులకు, నిడఁదగుసగముగొనిమేదినీశ్వరవర్యా." భార. శాం. 3, ఆ.—6. మోపు; (వాఁడు తానుచేసి ఆదినామీఁద పెట్టినాఁడు.) 7. గోడమొదలగువాని లేపు; "పెట్టనికోటనీకుహరి." భార. ఉద్యో. ౧, ఆ.—8. నాటు; "క. సుగ్రీవుఁడయో, మీపెట్టుచెట్టుకాఁడా." రామా. ౬, ఆ.—(చెట్టుపెట్టినవాఁడునీళ్లుపోయును.)—9. కొట్టు. (చెంపను రెండుపెట్లుపెట్టినాఁడు.) (ఇది విడుచులోనగు

ధాతువులకు అనుప్రయుక్తమయినప్పుడు బొత్తిగా ననుఅర్థమును దెలిపెడిని. ఉదా. వాఁడుపాఠశాల విడిచిపెట్టెను.)—వి. 1. దెబ్బ; "తే. ఎందునీతివిహీనుని౯ జెందునట్టి, సిరినిదిట్టుదురెట్లుదాఁ జేరనితని, ననుచు భూజనులందఱు నినుముఁగూడి, యున్నయగ్నికిఁబెట్లు రాకుండు నెట్లు." కళా. ౭, ఆ.—"వింటిపెట్టు." ద్వి. రా. సుం, కాం. — 2. ఈవి; (పెట్టుపోఁతలు.) — 3. మాఱు; "తమ్ములునవ్విభుఁడు౯, వేవురపెట్టుగసంతతికల్తురునీమదినిల్పుము." భార. స్త్రీ. ౧, ఆ. — 4. ఆవృత్తి. "క. ఆమహిమరయెుఱుఁగనేరని, పామరులాకారపూజఁబరఁగుదురొకపె, ట్టామడచననోపకయర, యామడచనినిల్చినట్టయాత్మవివేకీ." వా. ౫, ఆ. "వ. ఏచియు, గ్రుపగతిమాత్స్యకేకయముఖంబగుపాండవసైన్యమొక్క పెట్టపరఁగినీబలంబులకడంక యడంచిమదించి పేర్చిన౯." భార. ద్రో. ౫, ఆ. (ఇది యీయర్థమునందు ఏకార్థకశబ్దపూర్వకముగానే ప్రయోగింపఁబడును.)

**పెట్టుఁజెట్టు.** దే. వి. (పెట్టు+చెట్టు.) కల్పవృక్షము.

**పెట్టుకొను.** దే. స. క్రి. ఉంచుకొను. (సొమ్ములు పెట్టుకొను, పేరుపెట్టుకొను. మొ.)

**పెట్టుకోలు.** దే.వి. పెట్టుకొనుట. "వైరముండామదిఁబెట్టుకోలుసుఖతంత్రముగాదు." భార. శాం. 3, ఆ.

**పెట్టుడు.** దే. వి. ఈవి, త్యాగము, దానము.

**పెట్టుబడి.** దే. వి. దేనికేని వెచ్చమునకై మొదటపెట్టి నధనము.

**పెట్టుమందు.** దే. వి. స్వవశమగుటకుగాను పెట్టెడు మందు, వశ్యౌషధము. "పెట్టుమందు నీపతికిదపాలతోనిడుముభర్తవశుండగు." రుక్మాం. 3, ఆ.

**పెట్టువడు.** ద్వ. అ. క్రి. (పెట్టు+పడు.) దెబ్బతిను.

**పెట్టె.** వై. వి. 1. సొమ్ములులోనగునవియుంచెడు పేటిక; 2. పల్లకినడిమి పెట్టె*; "పల్లకులుగదల్చి పెట్టెలకెలంకులసాత్యకిఁబోవఁబంచి." జై. 3, ఆ.— 3. బండిపరముమీఁదిపెట్టె*; 4. పాముచుట్టుకొనుచుట్ట*. (మొదటిరూపము పెట్టియ.)

**పెట్టెబండి.** ద్వ. వి. పరముమీఁద పెట్టెవలె నమర్చిన బండి.

**పెట్టెపెట్టు.** ద్వ. అ. క్రి. (పెట్టె+పెట్టు.) (పాము) చుట్టుకొను. "సీ. పీఠరూపంబునఁబెట్టెపెట్టినశేషుఫణరత్నఘృణులకుఁబ్రాఁకువెట్టు." పాండు ౪, ఆ.

**పెట్రక్కొలికికట్టు.** దే. స. క్రి. పెడ రెక్కలువిఱిచికట్టు.

**పెట్లకంబము.** ద్వ. వి. (పెట్లు+కంబము.) అదురువేటుగొట్టము.

**పెట్లదిమ్మె.** దే. వి. (పెట్లు+దిమ్మె.) 1. అదురువేటుగొట్టము; 2. చేలయందుపక్షులనుదోలుటకై సర్పాకారముగాపేనిపెట్టుకొనియుండెడుచేరు.

**పెట్లమారి.** దే. విశే. (పెట్లు + మారి.) దెబ్బలుతిను స్వభావముకలవాఁడు, దెబ్బలుతినుస్వభావముకలది. "సీ. కోరిబఁతులఁజాలగుణవంతములటంచుఁ బెట్లమారులనీడు పెట్టఁదగునె." చంద్ర.

**పెట్లాఁగు.** దే.వి. (పెట్లు+లాఁగు.) మల్లబంధవిశేషము.

**పెట్లు.** దే. అ. క్రి. కాలిధ్వనిపూర్వకముగ బ్రద్దలగు. "పొగిసెదిక్కులుమెకంబులయంగములుపెట్లె." చంద్రా. ౨, ఆ. (పెటులుయొక్క రూపాంతరము.)

**పెట్లుఁగ్రోవి.** దే. వి. (పెట్లు+క్రోవి.) అదురువేటుగొట్టము. "సీ. వలలును బెట్లుఁగ్రోవులుఁబెద్దయురులును దెరలును బోనులుదీమములును." హరిశ్చ. ౨, ఆ.

**పెట్లుప్పు.** దే. వి. (పెట్లు+ఉప్పు.) ఒకదినుసుఉప్పు.

**పెఠిల్లు.** దే. వి. 1. హాతియందగుధ్వన్యనుకరణము; (చూ. కఠిల్లు.) 2. పిడుగుపడుటయందగుధ్వన్యనుకరణము. (ఆమ్రేడితమునందు పెఠిల్లుపెఠిల్లు, పెఠిల్లుపెఠిలు. "క. ధళధళ మెఱపులు మెఱయఁగఁ, బెళపెళనుఱుముచుఁ బెఠిల్లుపెఠిలునఁబిడుగుల్, నలుగడఁబడబెడిదపుధా, రలఁగలబలువానజలధరంబులుగురిసె౯." కళా. ౪, ఆ.)

**పెడ.** వై. విశే. 1. పెద్ద; "సీ. నడయభ్యసించినపెడగొండలునుబోనియాభీలసత్వమత్తేభములును." పర. ౪, ఆ.—2. వెనుకటిది; "పెడకచ్చపిడ." నవ. 3, భా. "పెడముట్టు." భార. శల్య. ౧, ఆ.—3. విపరీతము*. "ఉ. ఈ పెడబుద్ధినీకొజనియించె నెుయేజడుఁడైనఁదెల్పెనో." ఉ. రా. ౭, ఆ.

**పెడఁబాయు.** దే. స. క్రి. ఎడఁబాయునకు మొదటిరూపము. "మ. సురసేవించినవాతవాఁడియయిన౯సొమ్మెల్లఁబోనాడిన౯, బురుషద్వేషిణియైనగొడ్డయిన నెవ్వుంగూఁతులంగన్నమైఁ, బరపారోగముగల్గి నేనియునుదబ్భార్యం బెడంబాసియు, పూరుషుండొండొకపెండ్లియాడినను నో

ప్పు గాదప్పు లేదేమియుఁ గ." సం. "సురాపీవ్యాధితాధూర్తా వంధ్యార్థఘ్న్యప్రియంవదా, స్త్రీప్రసూశ్చాధివేత్తవ్యా పురుషద్వేషిణీతథా." విజ్ఞా. ఆచా, కాం.

పెడక. వై. వి. 1. కత్తియొక్క పృష్ఠభాగము*; 2. ఆకుయొక్క పృష్ఠభాగము*. (చూ. పెణక.)

పెడకంటి. దే. వి. కాఁపువారిజాతివిశేషము. హంస. ౪, ఆ.

పెడకట్టె. వై. విశ. పెడసరకట్టెకురూపాంతరము.

పెడకట్లు. ద్వ. వి. బ. చేతులను వెనుకకువిఱిచికట్టుట. "ద్వి. కఱకుఁ ద్రాడులఁ బెడకట్లుకట్టించె." సా. ౫, భా.

పెడకేలు. వై. వి. వెనుకకుత్రిప్పినభుజము.

పెడగాలు. ద్వ. వి. (పెడ+కాలు.) వెనుకకుమడిచినకాలు.

పెడచెవి. వై. వి. చెవివెనుకటిభాగము. "తే. బహువిధంబులఁబలుకునాపలుకులెల్లఁ, జెవిటికైవడిఁదనపెడచెవులఁబెట్టి, యీఱతాఱులుమఱుమాటలిచ్చియపహ, సించెదుర్యోధనుఁడు వేయుఁజెప్పనేల." భార. ఉద్యో. ౪, ఆ.

పెడచేయి. వై. వి. చేతికివెనుకటిభాగము, మీఁజేయి.

పెడతల. ద్వ. వి. తలవెనుకటిభాగము, అవటువు. "సీ. పెడతలఁజెంపలనడుసెత్తిముందటనైదుకూఁకటులుండునట్లుగాఁగఁ, దలబోడిగావించి" షో. 3, ఆ.

పెడదారి. వై. వి. తప్పుత్రోవ, అపథము.

పెడనెల. ద్వ. వి. తీర్పరి. (అప్ర.)

పెడమరలు. ద్వ. అ. క్రి. వెనుకకుతిరుగు. "తే. పెడమరలియేసెవానినప్పుడమరుండు." నై. ౬, ఆ.— వి. వెనుకకుతిరుగుట. (చూ. పెడమర్లు.)

పెడమర్లు. ద్వ. అ. క్రి. వెనుకకుతిరుగు. "ఉ. పందీఁ బెనుగ్రుచ్చియెత్తెఁగడుహెచ్చరికన్ బెడమర్లిగ్రక్కునన్." చంద్రా. ౨, ఆ.—వి. వెనుకకుతిరుగుట. "సీ. ఇలమీఁదఁదలతాఁకనీప్రక్కనాప్రక్కఁ బెడమర్లుగాఁబొడపెట్టిపెట్టి." కాశ. ౨, ఆ. (పెడమరలుయొక్కరూపాంతరము.)

పెడమఱు. దే. అ. క్రి. వెనుకకుమరలు. "క. పఱతెంచికదియఁబడియే, ద్దెఱవ్రేసినమోముదాఁకి తిరిగెగరుడియు, త్తఱిఁజక్రంబునహరిపెడ, మఱి వైచెనుదనుజానుజామస్తకముదగన్." నిర్వ. 3, ఆ. (ప్రే. పెడమఱించు.)

పెడమల్లె. వై. వి. ఒకజాతిపెద్దమల్లె.

పెడము. వై. వి. పెడమోముయొక్కరూపాంతరము. "తే. పచ్చతామానికంబులపల్లెరములఁ, బచ్చగందనికూరలేర్పడమిఁజూచి, పెట్టరనిపెండ్లిపెద్దలు పెడముపెట్టఁ, బెట్టుటకునంగనలకును బట్టెఁదడవు." నై. ౬, ఆ. "సీ. యానంబుమురిపంబునందలమొరపంబునడుగుఁదామరలకుఁబెడముసేయ." షో. ౮, ఆ.

పెడమోము. వై. వి. వెనుకకుతిరిగినమొగము.

పెడమోముపడు. వై. అ. క్రి. (పెడమోము+పడు.) వెనుకకుతిరిగినమొగమగు. "సీ. ప్రేల్చుచుఁబఱతెంచుభిదురంబునని మొనఁబెడచేతఁబెడమోము పడఁగనడిచి." లక్ష్మీ. ౨, ఆ.

పెడరేఁచు. వై. ప్రే. పురికొలుపు. "వ. ఇట్లాక్రమించినయాకలితత్త్వవిముఖవిచారుండై యనూరోచ్చ్రాయంబువడింబెడరేఁప." హన. 3, ఆ.

పెడలు. దే. వి. పెరడు. "ఆ. తమకసాధ్యమైనఁదమితోడఁగాంక్షింతు, రారనాళముసుధరాధినాథ, తమకుసులభమైనయమృతంబుఁగైకొన, రెందుఁబెడలిచెట్టుమందుగాదు." కళా. ౮, ఆ. (ఇక్కడ పెరటియనియున్నను బాధలేదు. అయినను పాఠమిట్లుకనఁబడుచున్నది.)

పెడసరకట్టె. ద్వ. విశ. (పెడసరము+కట్టె.) మూర్ఖుఁడు, మూర్ఖురాలు.

పెడసరము. దే. వి. మూర్ఖ్యము.

పెడిసె. దే. వి. పక్షివిశేషము. (అప్ర.)

పెడులు. దే. అ. క్రి. పెట్లు. "చ. పెడిలినువర్ణపర్వతముపెక్కుతెఱంగులవ్రయ్యునట్టులు." భార. ఆది. ౮, ఆ. (పెటులుయొక్కరూపాంతరము.)

పెడ్డ. దే. వి. మట్టిపెల్ల. (అమడిగడ్డపెడ్డలుగానున్నది.)

పెణక. యు. దే. వి. ఇంటియొక్క ఒకభాగపుకప్పు. వై. పెడకయొక్క రూపాంతరము. (ఆకుయొక్కపృష్ఠభాగమునకు.—చూ. తెలె.)

పెత్తనగాఁడు. ద్వ. విశ. (పెత్తనము+కాఁడు.) అధికారి.

పెత్తనము. వై. వి. (పెద్ద+తనము.) 1. అధికారము; 2. వార్ధకము.

పెద. వై. విశ. పెద్దయొక్కరూపాంతరము. (పెదతండ్రి. మొ.)

పెదవి. దే. వి. మోవి, వాతెర, అధరము.

పెద్ద. వై. విణ. 1. వృద్ధుఁడు; 2. పెద్దవాఁడు, జ్యేష్ఠుఁడు*; 3. గొప్పవాఁడు*; "ఆ. హరిసహస్రశీర్షుఁబరఁగుసహస్రాక్షుఁ, వేదమయుసహస్రపాదుఁనలఁతు, నైనవారికంటెనలఁతిపెద్దలకును, జాలఁబెద్దయగుదయాళుఁగొలుతు." భార. శాం. ౨, ఆ.—4. అధికము*; "పావనిమెయిలావుపెద్ద." భార. శల్య. ౨, ఆ.—5. శ్రేష్ఠము*; "యజ్ఞవిధానములవాలుతంబుపెద్ద." భార. అశ్వ. ౨, ఆ.—6. దీర్ఘము*. "ఆ. ఎట్టిసాధ్వులకునుబుట్టినయిండ్లను, బెద్దకాలమునికీతద్దతగదు, పతులకడనయునికిసతులకుధర్మువు, సతులకేడుగడయుఁబతులచూవె." భార. ఆది. ౪, ఆ.—క్రి. విణ. అత్యంతము*. "పెద్దమెచ్చి." భార. ఆది. ౫, ఆ. (కడపటి రెండర్థములయందునిదియువర్ణాంతమునయ్యెడి. "పెద్దయుంబ్రొద్దుచింతించి." భార. అర. ౨, ఆ. "పెద్దయువిచారించి." మొ.)—[పెద్ద అను విశేషణముముందుగలసంజ్ఞావాచకశబ్దములు.—పెద్దకక్కెర (కర్కరేటువు.) పెద్దకాఁకర (మహాకారవేల్లము†.), పెద్దకాఁచి (కాకాదని†.), పెద్దకూఁకటిమూగ (మాందిలవము.), పెద్దకొంగ (బలాకము.), పెద్దగటిక (గండాలి†.), పెద్దగుమ్మడి (పెండ్లిగుమ్మడి†.), పెద్దగుమ్ముడు (శ్రీపర్ణి†.), పెద్దగోరఁట (కురంటకము†.), పెద్దచేఁతరాసి (మహాఝురసి†.), పెద్దచేమంతి (మహాసహా†.), పెద్దజెల్లిమెకము (సృమరము.), పెద్దతుమ్మి (మహాద్రోణము†.), పెద్దదవనము (మహాదమనము†.), పెద్దదుప్పి (రామము.), పెద్దదూలగోవెల (మహాత్మగుప్త†.), పెద్దదోస (రాజకర్కటి†.), పెద్దనువ్వు (మహాతిలము†.), పెద్దనేరెడు (మహాజంబువు†.), పెద్దపల్లెరు (మహాపలంకష†.), పెద్దపాఁపర (ఇంద్రవారుణి†.), పెద్దపీఁచేర (పీవరి†.), పెద్దపెన్నేరు (మహాశ్వగంధ†.), పెద్దబీఱ (రాజకోశాతకి†.), పెద్దబోడతరము (మహాముండిని†.), పెద్దమాచేరు (మహాజ్యోతిష్మతి†.), పెద్దముత్తవపులగము (అతిబల†.), పెద్దములక (మహావార్తాకి†.), పెద్దముల్లంగి (మహామూలకము†.), పెద్దమ్రాను (డుండుకము†.), పెద్దయీఁడ (స్వర్ణపారేవతము†.), పెద్దయేలకి (బృహదేల†.), పెద్దవరగోఁగు (బృహత్పీలువు†.), పెద్దవిరి (మహానీలి†.), పెద్దవేము (మహానింబము†.), పెద్దారుగ (వరకము.) మొ.]

పెద్దకాఁపు. ద్వ. విణ. గ్రామాధికారి.

పెద్దతల. ద్వ. విణ. పెద్దగానుండి కార్యములనునడపించువాఁడు. "క. పెద్దతలలేకమీరీ, నిద్దపురూపములనిచటనిలిచినమనకుఁ, బెద్దఱికముచాలదుపెఱ, సుద్దులుగల్పింతురెందుసుజనులుగలరే." కళా. ౬, ఆ.

పెద్దనిదుర. వై. వి. పెద్దనిద్దురయొక్క రూపాంతరము. "తే. పెద్దనిదురకుమ్రాఁగన్నుపెట్టుచున్న, మానవునిఁదెచ్చిదక్షిణమస్తకంబు, గామహీశయ్యనునిచియుత్క్రాంతిదాన, మవనిదేవోత్తమునకొక్కయావునిచ్చి." వి, పు. ౪, ఆ.

పెద్దనిదురవోవు. ద్వ. అ. క్రి. (పెద్దనిదుర+పోవు.) చచ్చు.

పెద్దనిద్దుర. వై. వి. చావు, దీర్ఘనిద్ర. "ఉ. కందఁడు భీతిఁగుందఁడు ప్రకంపితమొందఁడు పెద్దనిద్దురం, జెందఁడు." భాగ. ౬, స్కం.

పెద్దనెల. ద్వ. వి. జ్యేష్ఠమాసము.

పెద్దపులి. ద్వ. వి. బెబ్బులికి మొదటిరూపము.

పెద్దపులుఁగు. ద్వ. వి. గుడ్లగూబ, మహాపక్షి.

పెద్దపాల. వై. వి. గోమాంసము.

పెద్దమ్మ. వై. వి. (పెద్ద+అమ్మ.) 1. జ్యేష్ఠాదేవి; 2. పెదతల్లి.

పెద్దరోగము. మి. వి. దేహముతెగదినెడు వ్యాధివిశేషము.

పెద్దఱికము. ద్వ. వి. పెద్దతనము.

పెద్దలు. వై. వి. బ. తెలిసినవారు*.

పెద్దవాకిలి. ద్వ. వి. గోపురద్వారము.

పెద్దవారము. మి. వి. బుధవారము.

పెద్దవిన్నపము. వై. వి. చెవుడు, బధిరత్వము.

పెద్దవిన్నపమువాఁడు. ద్వ. విణ. చెవిటివాఁడు.

పెద్దవీది. వై. వి. రాజమార్గము.

పెద్దవేలుపు. ద్వ. వి. బ్రహ్మ, సురజ్యేష్ఠుఁడు.

పెద్దవ్రేలు. ద్వ. వి. బొటనవ్రేలు, అంగుష్ఠము.

పెద్దాకుచెట్టు. ద్వ. వి. (పెద్ద + ఆకుచెట్టు.) ఒకానొక అడవిచెట్టు.

పెద్దాపురి. దే. వి. పెద్దాపురమునందు చేయఁబడుశర్కర.

పెద్దింటమ్మ. ద్వ. వి. (పెద్ద + ఇల్లు + అమ్మ.) ఒక గ్రామదేవత. (గ్రామదేవతాభేదము లిట్టులనేకములుగలవు.)

పెన. దే. వి. 1. మెలిక; "సీ. ఉడుపథంబున జాఱు నుడుపప్రతతిభాతి మెడహారములపెన పుడమిఁ దాఁక." పాండు. ౫, ఆ.—2. బంధము; "క. అప్పుడు గరుడుని ఱెక్కల, చప్పుడు దూరమున నెఱిఁగి సైరింపఁగలే, కప్పెనలు విడిచి రాఘవు, లొప్పఁగ భుజగంబు లొక్కయొరవడిఁ బఱచెన్. వ. ఇట్లు బంధమోచనంబు సేయుచు." రా. యు, కాం.—3. రెండు పశువులను జేర్చి బంధించెడు బంధము.

పెనఁకువ. దే. వి. 1. పెనఁగులాట; 2. చేట్టుకొనుట; (చూ. పెనఁగు.) 3. మేళనము; "క. వినుసత్త్వరజస్తమముల, పెనఁకువ కవుల వెలుఁగొందు పెంపు గలుగుతు, ర్యనిరంజన తత్త్వము పరి, మనః ఘూర్ణాది భావనీయమను వేదంబుల్." భార. శాం. ౮, ఆ.—4. యుద్ధము; "పెనఁకువ కర్ణుఁడేఁబదుగు." భార. కర్ణ. 3, ఆ.—5. వివాదము; "క. ఒక్కఁడు మానుషమూఁదఁగ, నొక్కఁడు దైవంబు నూఁది యొడఁబడకున్నన్, నిక్కపు మానుషమున్ గొని, తక్కక పెనఁకువలు దీర్పఁ దగు సభ్యులకున్." విజ్ఞా. వ్య, కాం.—6. కలయిక. "బెడిదంపుఁ బెనంకువ గోళ్ల నొక్కుచున్." చంద్ర.

పెనఁకువలుగొను. దే. అ. క్రి. (పెనఁకువలు + కొను.) మెలివడు. "వ. అఱుతి సరులు కలయంబడుచుఁ దిరుగుచుఁ బెనఁకువలుగొన." భాగ. ౮, స్కం.

పెనఁగఁబడు. ద్వి. అ. క్రి. (పెనఁగన్ + పడు.) పెనవేసికొను. "పెనఁగంబడు రథ్యములన్ మరల్పఁగా నొండు విధంబు గానక." జై. ౫, ఆ.

పెనఁగాడు. దే. అ. క్రి. (పెనఁగి + ఆడు.) పెనఁగొను. "చ. పవనజు చాపమున్ హరుల పగ్గములున్ దునుమాడి కాఁడితో, నవి పెనఁగాడఁగా నెడఁదయమ్మునఁ గేతువుఁ గూల్చి." భార. ద్రో. ౮, ఆ. (మొదటి రూపము పెనఁగియాడు. చూ. ఊఁగాడు.)

పెనఁగు. దే. అ. క్రి. 1. పెనఁగొను; 2. చేట్టుకొను; "రోయుతీఁగ కాళ్లం బెనఁగెఁగ దాయనుమ." భార. ఆది. ౫, ఆ.—3. కలయు; "క. మనసిజ రాగంబునఁ బెనఁ, గినయిట్టిని లేడిఁ జూచి." భార. ఆది. ౫, ఆ.—4. యుద్ధము చేయు; "నకులుఁడు సూతపుత్త్రుఁడుఁ బెనంగు నెడన్." భార. కర్ణ. ౧, ఆ.—5. మాఱాడు. "ఉ. నావుడు భానుతో డనరనాథవరేణ్యుఁడు పల్కె నింకరా, జీవదళాక్షి యాహితవు సెప్పకుమిప్పనిఁ బూని బ్రహ్మయున్, దేవవిభుండు నేఁడరుగుదెంచి వ్రతప్రతికూలురైననే, నావిధమేలమానుదుఁ బెనంగకతక్కుమటంచుఁ ద్రోయుచున్." రుక్మాం. ౫, ఆ.—వి. పెనఁకువ. "పెనఁగీక పెనఁగిన." ఆము. ౬, ఆ.

పెనఁగులాట. దే. వి. (పెనఁగులాడుట.) పెనఁగొనుట. (రూ. పెనఁగులాటము. "తరులతల పెనఁగులాటములు." రాఘ. ౨, ఆ.)

పెనఁగులాడు. దే. అ. క్రి. (పెనఁగులు + ఆడు.) మల్లాడు. "సీ. హేలారచిత పుష్పమాలానిచిత కేశభృంగ మల్లములతోఁ బెనఁగులాడు." పు. ౧, ఆ.

పెనఁగువడు. దే. అ. క్రి. (పెనఁగు + పడు.) చేరు. "క. కరుణాతిశయంబుఁ బ్రజా, పరిపాలనరతియుఁ బెనఁగువడియుల్లములోఁ, బిరిగొన." నిర్వ. ౧, ఆ.

పెనఁగొను. దే. అ. క్రి. (పెన + కొను.) 1. మెలిగొను; "చ. అనుడు ముదంబు నెమ్మియును నాత్మఁ బెనంగొనననన్నతోడని, ట్లను విదురుండు." భార. ఉద్యో. ౨, ఆ.—2. చేరు. "భూషణోత్కరముతోఁ బదహస్తతలంబులుర్విపైఁ బెనఁగొని చారుభంగియు నుభీషణ రేఖయుఁ దాల్ప." భార. ద్రో. ౨, ఆ.

పెనచే. దే. ప్రే. పెనఁగఁజేయు. "బలితపుశాఖ యందుఁ బదపష్మయుగంబుఁ బెనంచి." భో. ౨, ఆ.

పెనపరి. దే. విశే. (పెనపు + అరి.) 1. వివాదశీలుఁడు; "క. అప్పుగొని పెట్టనొల్లక, త్రిప్పియు కారణము ఏసుమతీపతిసభకున్, జెప్పఁగవచ్చిన పెనపరి, నప్పుడడంచి ధనము నరుపఁగవలయున్." (ఇందు అరుపఁగన్ అనునది అంతర్భావితప్రేరణముగా నుండునని తోఁచెడి.) విజ్ఞా. వ్య, కాం.—2. భేదశీలుఁడు. "క. హరిపలికిన విధమెంతయు, నెరవైయున్న యదివింటెయిమ్మాట తెఱం, గరయుదముతో లుతనీపెన, పరిచందంబెల్ల నెఱుకపడియెడుఁ బిదపన్." భార. ఉద్యో. 3, ఆ.

పెనపు. దే. ప్రే. (పెనయఁజేయు.) 1. కలపు; 2. పెనఁచే. వి. 1. వివాదము; 2. భేదము.

పెనము. దే. వి. దోసెలులోనగునవి కాల్చెడు గుండ్రనియినుపతగడు, స్వేదని.

పెనయు. దే. అ. క్రి. 1. కలయు; 2. పెనఁగు. "ఆ. రూపు పేరు రెండు రూఢితోఁ గలిగినఁ, బేరురూపు క్రియను బెనసియుండు, నామరూపములును నాశమొందుట మేలు."

పెనపెట్టు. దే. స. క్రి. (పెన+పెట్టు.) మెలిపెట్టు. "సీ. వినుమూనములుగాఁగవసతోడఁజెనపెట్టిన ట్టెంబుగాఁద్రేవుఁజుట్టినాఁడు." స్వా. ౪, ఆ.

పెనవేయు. దే. స. క్రి. 1. మెలిపెట్టు; 2. పశువులను ఒకటితో నొకటిఁజేర్చిముడివేయు.

పెనిమిటి. దే. వి. (పెనుపు+మేటి.) మగఁడు, భర్త. (చూ. పాటపాట.)(ఇందుసంధినివర్ణవికారము.)

పెను. దే. విశే. వృత్తియందు పెనుపుశబ్దమునకుమీఁదివర్ణములోపింపఁగామిగిలినరూపము. (పెన్నుద్ది, పెన్నూఁతి; పెనుఁగొమ్మ, పెనుమేటి. మొ. దీనికి అచ్చుపరమగునపుడుద్విత్వమనియెఱుంగునది, దీనికిస్థిరవర్ణములుపరములగునపుడు ఉత్వలోపంబు బహుళంబు గానగు. పెన్నాటకము, పెన్నింట, పెన్నీరు, పెన్నెత్తురు, పెన్నెనరు, పెన్నెలి, పెన్నుద్ద, పెన్నుసరు, పెన్నెక. మొ.)

పెనుఁగొమ్మ. దే. వి. (పెనుపు+కొమ్మ.) చెట్టుమొదటికొమ్మ, కవట, స్కంధశాఖ.

పెనుఁబాము. దే. వి. (పెనుపు+పాము.) కొండచిలువ, అజగరము. "వ. తనపట్టినసురియనప్పెనుఁబామువదనంబువ్రయ్యందలిగిన." భార. అర. ౨, ఆ.

పెనుచు. దే. ప్రే. పెరుఁగఁజేయు,వర్ధిల్లఁజేయు, పెంచు.

పెనుపడు. దే. అ. క్రి. (పెనుపు+పడు.) 1. అతిశయిల్లు; "సీ. బిరుదుకాహళములు పెనుపడఁబైమ్రోయ ఘనశస్త్రరోచులాకసముఁబ్రాఁక." జై. ౨, ఆ.—2. వర్ధిల్లు. "క. ఘనమైనకోపవహ్నియుఁ, బెనుపడ." రా. అర, కాం. ౨, ఆ.

పెనుపరి. దే. విశే. (పెనుపు + అరి.) వృద్ధిఁబొందించువాఁడు.

పెనుపారు. దే. అ. క్రి. (పెనుపు+అరు.) పెంపారు.

పెనుపు. దే. వి. 1. పెంచుట; "ఆ. పరిజనములఁబెనుపతికిహితము." భార. శాం. ౨, ఆ.—2. వృద్ధి; 3. ఆధిక్యము; "పెనుపునాకసంబవియాబృంహితముల్." భార. శల్య. ౧, ఆ. — 4. మహత్వము. "క. వినుమునరేశ్వరకర్ణుని, పెనుపుమహేంద్రుండువచ్చిప్రియమునశచిక్తై, తనునర్థింపఁగనిచ్చెను, గొనుమనిలోకంబులెఱుఁగఁగుండలయుగముల్." భార. ఉద్యో. ౨, ఆ.

పెనుమసనము. ద్వ. వి. (పెనుపు+మసనము.) కాశీ. "పెనుమసనంబునంగలవు పె మ్ములు." కాశీ. ౬, ఆ.

పెనుమినుకులు. దే. వి. బ. (పెనుపు+మినుకులు.) వేదము. (చూ. పేరిమికాఁడు.)

పెనుమ్రాను. దే.వి.(పెనుపు+మ్రాను.)దుండిగము?

పెనువెల్లి. దే. వి. (పెనుపు+వెల్లి.) ప్రళయకాలమునందలియేకార్ణవము. "వ. అప్పెనువెల్లియెల్లనడంగిపోవందొడంగునెడ." భార. అర. ౪, ఆ.

పెనువ్రేలు. దే. వి. (పెనుపు+వ్రేలు.) బొటనవ్రేలు, అంగుష్ఠము.

పెన్న. వై. వి. పినాకినీనది.

పెన్నడపులుఁగు. దే. వి. (పెన్+నడపులుఁగు.) కురరము.

పెన్నెరు. దే. వి. పెన్నేరుయొక్క రూపాంతరము.

పెన్నేరు. దే. వి. అశ్వగంధి?

పెన్మిటి. దే. వి. పెనిమిటియొక్క రూపాంతరము. "పెన్మిటివస్త్రము." కళా. ౮, ఆ.

పెమ్మె. దే. వి. పెరిమెయొక్క రూపాంతరము. "ద్వి. జనవరాధమశూరజనుఁడిట్టిరెయెడలఁ, బెమ్మెలుపలుకు నేపేర్చినశక్తి, సమ్మదంబుగఁజోపిజయమొందుఁగాక." భాగ. ౧౦, స్కం.

పెయ్య. దే. వి. 1. పాలువిడిచిన ఆఁడుదూడ; (చూ. తెలుగు.) 2. దూడ; "క. పసురుచిపిదుకఁగఁబాత్రము, బిసరుహముగఁజిత్రరథుఁడు పెయ్యగఁగొనిరిం, పెసఁగన్ గానక్షీరం, బసమునగంధర్వవరులునమరాంగనలున్." హరి. పూ. ౧, ఆ.— 3. ఆవు. "సీ. వలయుకోరికలియ్యఁగలపెయ్యగలిగిముష్టింపచుల్ పరితుష్టిఁజెందుటెల్ల." ఉ, రా. ౫, ఆ.

పెర. యు. దే. వి. తేనెతెట్టె. "సీ. గురివెంపపూఁదేనెపెరలకైతమలోనఁబొత్తుపోవకసారె పోరుఁగొన్న." పాండు. ౧, ఆ.—వై. స. అన్యము. "క. పెరజనులయందువిభునకు, నరయంగవినోదమాత్రమనురాగమెదం,బొరసినయప్పుడుపలువురు, తమునులయెడరాగమొకఁడుతాల్చుటతరుణీ." మార్క. ౫, ఆ.

పెరక. దే. వి. పెంకు, పెంకె.

పెరజు. దే. వి. సర్వవిశేషము. (అప్ర.)

పెరడు. దే. వి. ఇంటివెనుకటిదొడ్డి, నిష్కుటము.

పెరయీఁగ. దే. వి. ఒకదినుసుతేనెటీఁగ, పుత్తిక. "క. పెరయీఁగలగతిఁగవియుచు." భార. ద్రో. ౧, ఆ.

పెరరేచు. వై. స. క్రి. ప్రేరేపణచేయు. "క. భర తునిఁగనుఁగొనినిజసో, దరుఁ బడినచోటికిఁపు డుదైవమునిన్నుఁ, బెరరేచితెచ్చెనిపుడెం, దరి గొదుకుఁకునెదురననుచునాటోపమునన్." జై. ౬, ఆ.

పెరరేపు. వై. స. క్రి. పెరరేచుయొక్క రూపాంతరము.

పెరవణి. వై. వి. పేరణియాట. "ద్వి. అంగజారాతికి నానందమొదవ, భృంగిముందటివంకఁ బెరవణి చూప." ప్రభు. ౨, ఆ. (ఈరూపము ఈయొకచోటనే కనఁబడుచున్నది.)

పెరసు. దే. వి. పొల, మాంసము.

పెరిమ. వై. వి. ప్రేమ. "చ. రంగనాథుని, మ్మనమునిల్పఁజొచ్చెఁ బెరిమంబులకించుక పోలపాళితోన్." పర. 3, ఆ.

పెరిమె. దే. వి. పెద్దతికము. "రగడ. నేర్పుమైనట్లయదినెఱులఁదోలుపూఁదుటిమె, దర్పకునకర్పింపఁదలఁపదెంతటిపెరిమె." స్వా. 3, ఆ.

పెరుఁగాకు. దే. వి. (పెరుఁగు+ఆకు.) పెరుఁగుతోఁటకూర, శాకిని.

పెరుఁగు. దే. అ. క్రి. 1. వర్ధిల్లు; "క. అనఘుమదాలసకడుపున, జనియించియయోగిమాతచనుగుడిచిపెరిం, గినతనయులితరవనితల, తనయులుచనుత్రోవఁజనఁగఁదగిరెయిడువారే." మార్క. 3, ఆ.—2. ఎదుగు. "తే. వింధ్యమమరాద్రిమాద్రికివివిధతార, కములుమొలపూసలుగఁ బెరుంగమదిఁదలఁచె." పాండు. ౫, ఆ.—వి. దధి. "ఉ. కమ్మనిజున్నుమంచినెయి గట్టిదిమీఁగడతోఁ బెరుంగు." హంస. ౨, ఆ.—విశే. 1. ఏండ్లుచెల్లినవాఁడు, ఏండ్లుచెల్లినది; 2. వృద్ధిపొందినది. (చూ. పెరువు.)

పెరుఁగుడు. దే. వి. 1. వర్ధనము; 2. వృద్ధి.

పెరుఁగుతోఁటకూర. దే. వి. పెరుఁగాకు, శాకినీ.

పెరుఁగుసంద్రము. ద్వ. వి. పెరుఁగుసముద్రము, దధ్యుదము.

పెరుగు. దే. అ. క్రి. తెగు. "పెరిగినహారరత్నముల పెల్లునకొక్కఁడుఁదామ్రపర్ణియై." పా. ౮, ఆ.

పెరుమాకోయిల. దే. వి. (పెరుమాళ్లు+కోయిల.) కాంచీపురము. (చూ. కోయిల.)

పెరుమాళ్లు. దే. వి. బ. విష్ణువు. "మనసుకృతంబు పెంపుపెరుమాళ్లెయొఱుంగు." పర. ౨, ఆ.

పెరువు. దే. అ. క్రి. 1. వర్ధిల్లు; 2. ఎదుగు. (చూ. పెర్గు.) వి. దధి. "క. తరువంబెట్టినబానల, పెరువులుమునుగిలుకరించి పేర్చినవెన్నల్, సురువులెసఁగఁగ్రోలిపిదప, సురలంద్రోచుచునుబోవునుక్కివపుగతిన్." హరి. పూ. ౫, ఆ.—విశే. 1. ఏండ్లుచెల్లినది, ఏండ్లుచెల్లినవాఁడు; "పెద్దకాలమునాఁటిపెరువ." కాశీ. ౨, ఆ.—2. వృద్ధిపొందినది. "వ. తెరువులంబెరువులయివిరువులుగఁ బూచినురువులలరు కదంబతరువులును." రాజ. ౨, ఆ. (పెరుఁగుయొక్క రూపాంతరము.)

పెర్కు. దే. అ. క్రి. పెఱుకుయొక్క రూపాంతరము. (పీకుటకు. "ద్వి. విజయలోలుఁడైవానిసాలుకపెర్కిచంపె." రా. సుం, కాం.)

పెర్గు. దే. అ. క్రి. వి. పెరుఁగుయొక్క రూపాంతరము. (వర్ధిల్లుటకు. "పలుకుందొయ్యలిచేతిరాచిలుకఁ బెంపంబెర్గి." విక్ర. ౭, ఆ.)

పెర్వు. దే. అ. క్రి. వి. పెరువుయొక్క రూపాంతరము. (దధికి. — "అంగనలన్ వెన్నలుపేడుఁబెర్వుదరువంగా." హరి. పూ. ౫, ఆ.)

పెఱ. వై. స. అన్యము. "క. చఱచియొకచేతఁగూర్మముఁ, బెఱచేతగజంబుఁబట్టిపెనఁచిఖగేంద్రుం, డెటికిన్ నిగగనవీధిన్, బఱచెవిపుచ్చరవిమానపఙ్క్తులుదూలన్." భార. ఆది. ౨, ఆ. (ఇట్లు పెఱ, చెఱ ఇత్యాద్యనేకశబ్దములయందు శకటరేఫము కనఁబడుచుండఁగా చిన్నయసూరిగారు "శకటరేఫముతత్సమతద్భవములందులేదు." అని చెప్పుటకు అభిప్రాయమేమో తెలిసినదికాదు.)

పెఱగాయ. ద్వ. విశే. (పెఱ+కాయ.) కుత్సితుఁడు. "క. కటకటగురువులతోనే, గుటగుటలానేనుగోరుకోరికవితగా, నటునిటుఁబ్రొద్దులుఁపుచ్చుచు, నటమటఁబెఱగాయనుద్దు లాడెదవౌరా." శకాం. 3, ఆ.

పెఱమగఁడు. ద్వ. వి. జారుఁడు. "వ. పెఱమగలచేనంపించుకొనిమరలునప్పుడు." చంద్ర.

పెటిక. దే. వి. ఎద్దులోనగువానిమీఁదవేసిపోయించెడుగోనెమూట. "చ. మఱియునునన్నిదింగలసమంచితకాంచనరాశిబందులం, బెటికలపోవులంగొలఁదివెట్టఁగఁబెక్కుగుబారువుల్ జనుల్, వెఱగుపడంగఖేచరులువెక్కసమందఁగళత్రుకోటికిన్, వెఱపొనరించువార్తపృథివిన్ బరఁగన్ ఁనడపించెభూపరా." భార. అశ్వ. 3, ఆ.

**పెటికాటము.** దే. వి. ఎడ్లులోనగువానిచే ధాన్యాదులు మోయించుట.

**పెఱుకు.** దే. స. క్రి. 1. పీకు; 2. పెల్లగించు. "చ. గుఱుకొని నేలవ్రక్కలుగఁ గ్రొచ్చియు మన్నులు వ్రింగియుం శిలల్, పెఱికియు." రా. బాల, కాం.—3. మోయు. "ఎ. గీ. బలిమిఁ గొనినధనముపదివేలయొంటెలు, పెఱికి రాఁగ వైరిభీకరుండు, వచ్చెనకులుఁడు." భార. సభా. ౧, ఆ. (అం, ప్రే. మోయించు. "సీ. వలుదయేనుఁగు ముత్తెములుపట్టిపులుల పైఁ బెఱికిన యిట్టిఁగోల్పెఱికగములు." చంద్రా. ౨, ఆ.)

**పెఱుగు.** దే. అ. క్రి. 1. కదలు, ఉద్యమించు; "క. చక్కనగుమనిసరక్కసుఁ, డక్కజముగఁ బెఱిగివచ్చియయ్యనిలజునీ, యుక్కును బీరముఁజూచెదఁ, జిక్కఁగ నిల్వుమని కడువిజృంభించివడిన్." భార. ఆది. ౬, ఆ. "ఉత్సాహ. ఏలదీని నెడయుఁ జేయనీక్షణంబయేగిపాం, చాలుఁబట్టి తెత్తమధిక శౌర్యలీల మెఱయఁగాఁ, బోలుననుచుఁ బెఱిగి రాజపుత్రులెల్లనరిగిపాం, చాలుపురముముట్టికొనిర సంఖ్యబలసమేతులై." "సీ. వారణావతమునవారెల్లఁ బాండవాగమనంబువిని సంతసమునఁ బెఱిగి, కరమొప్పఁగ రథ తురగ బలాఢ్యులై యెదురువచ్చిరి కడుముదముతోడ." భార. ఆది. ౬, ఆ.—2. విజృంభించు. "తఱచుటమ్ముల నేడు పెఱిగి చందంబుచేసె." భార. కర్ణ. ౧, ఆ.

**పెలుకుఱు.** దే. అ. క్రి. భయాదులచేత అంగములు విలవిలపోవు, విహ్వలించు. "చ. ఖలుఁడు బృహద్రథాత్మజుఁడు గర్వితుఁడై మహిలో నిరాజులన్. బెలుకుఱఁ బట్టి తెచ్చి." భార. సభా. ౧, ఆ.

**పెలుచ.** దే. వి. 1. అతిశయము; "కుడిచెవిపొన్నమునాఁకటి పెలుచను." భార. ఆది. ౫, ఆ.—2. ఆగ్రహము; "క. అనుపలుకులకయ్యంగన, ఘనకోపముగదిరినీచు గావునజంకిం. చినఁగాని మెత్తఁబడిపోఁ, డనిమనమునఁదలఁచి యిట్టులని యొన్ బెలుచన్." భార. విరా. ౨, ఆ. "క. కొట్టువడియటకుమును పే, తిట్టంబడియేడ్చు వాడు దెసగని మదిలోఁ, గట్టలుక వొడమి నాసఖు, లిట్టనిరిమ నీంద్రుతోడ సెత్తిన పెలుచన్." స్వా. ౪, ఆ.—3. ఆధిక్యము; 4. కాఠిన్యము. (చూ. పెలుచన.) —విణ. అధికము. "పెలుచగుపూఁపుతో." య. 3, ఆ.—క్రి. ఉచ్చైరర్థకము, గట్టిగా. "పెలుచ నూకద్ధయోక్కృపరియోగుడుఁయోధన. . . అనిపలికి." భార. ద్రో. ౫, ఆ. "పాంచజన్యంబుఁ బెలుచఁ బూరించి." నిర్వ. 3, ఆ. (ఇది నల్లలోనగువాని వంటిది.)

**పెలుచన.** దే. వి. 1. అతిశయము; (చూ. పెలుచ.) 2. ఆటోపము; (చూ. పెల్చన.) 3. ఆగ్రహము; "క. జననియనకయుబ్లెంతయు, నసులంకించితటు గావునన్ బదము మహిన్, దునిసిపడుఁగా కయని పెలు, చనశపియించుటయు వెఱచి జముఁడాతురుఁడై. వ. తండ్రిపాలికరిగి ప్రణతియొనర్చి తనయపచారంబునుఁ దల్లి కోపించియిచ్చిన శాపంబును నెఱింగించి." హరి. పూ. ౧, ఆ.—4. ఆధిక్యము; (చూ. పెల్చన.) 5. కాఠిన్యము; (విశేషణమగుచో "బలితంపుజంఘుల పెలుచని తొఁడున." హరి. ఉ. ౫, ఆ.)—6. ఉచ్చైర్నాదము. (విశేషణమగుచో "పెలుచని యెలుఁగున." భార. శాం. 3, ఆ.) చూ. అలకన.)

**పెల్కఱు.** దే. అ. క్రి. పెలుకుఱుయొక్క రూపాంతరము. "పెల్కఱిదిశాదంతావళశ్రేణిమ్రొగ్గె." మార్క. ౬, ఆ.

**పెల్చ.** దే. వి. విణ. పెలుచయొక్క రూపాంతరము.

**పెల్చన.** దే. వి. పెలుచనయొక్క రూపాంతరము. (ఆటోపమునకు. — "క. కృతహస్తుఁడు పెల్చననేనమ్ములనారెం, టిని దెల్లఁగ నేసెఁగడుఁగఠినహృదయుండై." భార. ఆది. ౫, ఆ. (ఈపద్యము ముందుభాగమును. చూ. పెనఁగుకడ.)—ఆధిక్యమునకు.—"ఇంత పెల్చననీవాడెదవంతతక్కవనెబేలా." భార. శాం. 3, ఆ.)

**పెల్ల.** దే. వి. ఎండి పెల్లగిలినపలుచనిమంటిగడ్డ.

**పెల్లగించు.** దే. ప్రే. పెల్లగిలఁజేయు, ఉన్మూలించు.

**పెల్లగిల్లు.** దే. అ. క్రి. 1. పాదు ఊడిలేచు, ఉన్మూలితమగు; "సీ. పృథివీతలంబెల్లఁ బెల్లగిల్లఁగడంగెనతి మలినంబయ్యె నంబరంబు." రామా. ౫, ఆ.—2. పాఱు. (రూ. పెల్లగిలు. పాఱుటకు. "రారాజు సైన్యంబులొక్క మొగిం బెల్లగిలంగ." భార. కర్ణ ౨, ఆ.)

**పెల్లిదము.** ద్వ. వి. (పెల్లు+ఇదము.) పెల్లు, అతిశయము. "క. ఒదవెదుతృష పెల్లిదమున, పదనమువఱు వట్టువట్టె." భార. విరా. ౨, ఆ.

**పెల్లు.** వై. వి. 1. అతిశయము*; "హవ్యవహశిఖల పెల్లిది." భార. ఆది. ౨, ఆ. "భీకరబాణవర్షముల

పెల్లున." భార. విరా. 3, ఆ.—2. ఆధిక్యము*. "ఉ. పెల్లునఁ బెద్దసేపు రణభీషణలీలఁ జెమర్చి డస్సియుక్." రా. యు, కాం.—క్రి. విశే. అత్యంతము*. "క. డొల్లెడుతలయును దునిసెడు, విల్లును గరనొలగు మేను విఱిగెడు సిడముక్, బెల్లుదొరఁగు నెత్తురునై, పల్లటిలందొడఁగెనపుడు పాండవబలముల్." భార. భీష్మ. ౧, ఆ. "క. కరిహయతతిఁ బెల్లుగ నశ్రులురులఁ జొచ్చెను." భార. భీష్మ. ౧, ఆ.—విశే. అధికము*.

పెల్లుకొను. ద్వ. అ. క్రి. అతిశయిల్లు. (చూ. దల్లు.)

పెసర. దే. వి. సస్యవిశేషము.

పెసలు. దే. వి. బ. పెసరధాన్యము. (దీని భేదములు నల్లపెసలు, పచ్చపెసలు, పిచ్చపెసలు.)

పెళపెళ. దే. వి. 1. ధ్వనివిశేషము; "పెళపెళనిచీర." స్వా. ౫, ఆ.—2. విఱుగుటలోనగు వానియందగు ధ్వన్యనుకరణము. (విఱుగుటయందు; "ద్వి. పృథులశాఖలు గాలిఁ బెళపెళ విఱిగి, పృథివిపైఁ మ్రాఁకులు పెల్లుగాఁగూల." హరిశ్చ. ౧, భా.—విఱుచుటయందు; "పెళపెళ బల్లెముల్ విఱిచి." ఉ, రా. ౭, ఆ.—ఊఱుముటయందు; "పెళపెళమబ్బుబిట్టుఱుము." ఆము. ౮, ఆ.—ఆర్చుటయందు. "సీ. నిగిడి తెర్వరులగుండెలు జల్లురనఁ బేర్చి పెళపెళనార్చుకొ వెలకుఁదోఁడు." య. ౫, ఆ.)

పెళపెళయను. దే. అ. క్రి. (పెళపెళ+అను.) తోలులోనగునవి పెళపెళయని ధ్వనించు. "మృగకృత్తి పెళపెళయనఁగ." ఆము. ౮, ఆ. "సీ. కలమాన్నరుచితోడఁ గలహించు జాడ దువ్వలువ పింజెలు పెళపెళయనంగ." పా. ౨, ఆ.

పెళుచు. దే. విశే. 1. మూర్ఖుఁడు; "ఎ, గీ. చాలకుండిన నగుఁ జెట్టబాలుఁ డితఁడు, కొసరి గొంతెమకోరికల్ గోరనేని, యిడక పోఁబోలదిడఁబోలదీరు దివియఁ, బేనురాకున్నెతైర్థికుల్ పెళుచులంద్రు." పాండు. ౮, ఆ.—2. విరసము. "పెళుచుమాటలుకొన్ని పిమ్మటాడిన నేమి."

పెళ్లమ్రాను. దే. వి. దున్నినపిమ్మట మిణ్ణుపల్లములు సరిపడమీఁదనీడ్చెడు పలక.

పెళ్లు. దే. వి. విఱుగుటలోనగు వానియందగు ధ్వన్యనుకరణము. (విఱుగుటయందు; "సీ. నిక్కి పెళ్లనికొమ్మలుక్కునవిఱుగంగఁ దిగిచి ధారణిఁ ద్రోచి పగులఁ ద్రొక్కి." హరి. పూ. ౬, ఆ.—విఱుచుటయందు; "ద్వి. అసురుల చేతిశస్త్రాస్త్రంబులాడి సి, వెసఁ బుచ్చి పెళ్లునవిఱుతురుకపులు." రా. యు, కాం.—దాఁటుటయందు. "ఉ. బెబ్బులిగొంతు క్రోల్గఱచి పెళ్లున మార్గముడ ద్రెళ్లదాఁటుచుక్." ఆము. 3, ఆ.)

పెళ్లెము. దే. వి. మద్యము చేయుటకు అనేకవస్తువులు చేర్చిచేసినపిండి, మేదకము.

## పే.

పేఁట. వై. వి. 1. నగరము*; "క. ఎక్కడఁ జూచినఁ గాల్బల, మెక్కడఁ జూచిన రథంబు లిభతురగచయం, బెక్కడఁ జూచినఁ దామై, క్రిక్కిఱిసెఁ బేఁట నాల్గుకెలఁకుల సేనల్." కవి. 3, ఆ.—2. శాఖానగరము*. "పురములు కాల్చి కూపములు పూడిచి పేఁటలు దోఁచి." బ్ర. ౫, ఆ.

పేఁటు. దే. వి. బీఁటిక. (చూ. పట్టు. దే. అ. క్రి. రెండవయర్థము నుదాహరణము.)

పేఁడ. దే. వి. గోమయము, (రూ. పెండ.)

పేఁడగువ్వ. దే. వి. పారావతవిశేషము.

పేఁడపురుగు. ద్వ. వి. పేఁడయందుండు ఒకదినుసు పెక్కుపురుగు.

పేఁడు. దే. స. క్రి. దారము పేను.

పేక. దే. వి. వస్త్రముల నేఁతయందలి యడ్డనూలు.

పేగు. దే. వి. ప్రేగుయొక్క రూపాంతరము.

పేచకము. సం. వి. అ. పుం. 1. గుడ్లగూబ; 2. ఏనుఁగుతోఁక మొదలు; 3. దానిసమీపము.

పేచి. కన్న. వి. భారము, తంటా.

పేచిక. దే. వి. ఒకానొకచెట్టు.

పేచీఖోరు. తంటాలమారి.

పేజి. ఆం. వి. పుట.

పేట. ఉభ. దే. వి. హారములో నొకసరము, యష్టి. సం. ఆ. స్త్రీ. పెట్టె. (రూ. పేటము, పేటకము. అ. పుం, న.)

పేటఁబెట్టు. ద్వ. అ. క్రి. (పేటన్+పెట్టు.) యత్నించు. "చ. పయిఁబయిఁ బందుకొల్చు విరిపైఁడి యుగట్టి దినుస్సు తాయిలం, ప్పయు మఱి బంటుబానిసలుఁ బైరముఁ బెయ్యయుఁ జేనుఁ జెట్టులో, నయిన సమస్తసంపదలు నన్నవితీర్ణికి వెచ్చపెట్టి కాఁ, బ్రియలుధరించుసొమ్ములకుఁ బేటఁబెట్టెఁ జలింపకంతటక్." కళా. ౬, ఆ.

పేటాడు. దే. అ. క్రి. (పేటు+ఆడు.) భేదించు.

**పేటి.** ఉభ. దే. వి. నడికట్టు.—సం. ఈ. స్త్రీ. పెట్టె.

**పేటిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. పెట్టె; 2. సమూహము.

**పేటీ.** దే. వి. పేటియొక్క రూపాంతరము.

**పేటు.** దే. వి. 1. పరిగలోనగువానితో నేసినపట్టె; 2. పర్వతశిఖరము.

**పేడి.** వై. వి. నపుంసకుఁడు. "క. చనఁబేడికి దారక్రియ, యును జెవిటికి మధురగీతియును జీకునక, త్యనుపమసురూపదర్శన, మును జేయుటఁబోలుఁగృష్ణుఁబూజించుటిలన్." భార. సభా. ౨, ఆ.

**పేడు.** దే. వి. సన్నచెక్క.

**పేడె.** వై. విణ. గడ్డముమీసములేనివాఁడు*. (గడ్డముమీసములేనిది. పేడెమూతి.)

**పేడెత్తు.** దే. అ. క్రి. (పేడు+ఎత్తు.) విచ్చు, తొలఁగు. "మ. దీపించు పెన్దత్తడిం, బునఁబేడెత్తినలజ్జనంఘ్రికటకంబుల్ మ్రోయనడ్డంబుని, ల్చినయయ్యచ్చరఁజూచి." స్వా. ౨, ఆ.

**పేణి.** వై. వి. భక్ష్యవిశేషము.

**పేద.** వై. వి. భటుఁడు. "క. చనుచో వాకిటి పేదలు, కనిదిగ్గనలేచి." సా. ౨, ఆ. — విణ. 1. పిఱికి; "ఉ. ఈదనుజుండుచిక్కెభయమేటికిలుబ్ధకులారయాత్మకుల్, బేదతనంబుమేలె." స్వా. ౪, ఆ.—2. దరిద్రుఁడు*; "ఆ. పేదయైనధనదు పెన్నుద్దియైతగు, నాయమునకు వెచ్చమల్పమైన." విక్ర. ౨, ఆ.—3. అనుద్ధతుఁడు*; "తే. ఉద్ధతులమధ్యమునఁబేదకుండఁదగునె." కవిక. ౨, ఆ.—4. అశక్తుఁడు*. "పేదతాపసులు." భార. అర. ౭, ఆ. "వ. ఇప్పేద గుఱ్ఱంబు లతిదూరంబెట్లు పోవనోపు." భార. అర. ౨, ఆ.

**పేదర్కి.** ద్వ. వి. పేదఱిమియొక్క రూపాంతరము. (దారిద్ర్యమునకు. "సీ. కమ్మఁబువ్వులుఁబూఁతకలలో పలను లేక పేదర్కికతమునఁబెండ్లిలేక." పంచ. నా. ౫, ఆ.)

**పేదఱికము.** ద్వ. వి. దారిద్ర్యము. "క. కడుఁబేదఱికంబుకంటెఁగష్టముగలదె." విక్ర. ౨, ఆ.

**పేదఱిమి.** ద్వ. వి. 1. దారిద్ర్యము; (చూ. పేదర్కి.) —2. పిఱికితనము. "తే. దండివైరెమ్మునసు పేదఱిమివిడిచి." భార. భీష్మ. ౧, ఆ.

**పేదపడు.** వై. అ. క్రి. (పేద+పడు.) 1. దారిద్ర్యమునుపొందు; "తే. చెల్లియుండియు సైరణసేయనతఁడుఁ, బేదపడియును నర్థికిఁబ్రియములోడఁ, దనతుఁగలభంగినిచ్చునతండుఁబుణ్య, పురుషులని చెప్పిరార్యులుబుధవరేణ్య." భార. ఉద్యో. ౨, ఆ.—2. దైన్యమునుపొందు. "సీ. పేదపడ్డాఁడవుప్రియజనంబును బరివారంబులేదియ్యవస్థకెంత, వగచెదవో దానవశ్రేష్ఠ." భార. శాం. ౪, ఆ.

**పేనా.** అం. వి. కలము.

**పేను.** దే. స. క్రి. దారము పేఁడు. వి. తలయందు పట్టెడు జంతువిశేషము, యూకము.

**పేన్నీళ్లు.** ద్వ. వి. బ. (పేఁడ+నీళ్లు.) కలయంపిచల్లెడు పేఁడకలిపిననీళ్లు. "నిల్చినచోటఁబేన్నీళ్లు చల్లి."

**పేపర.** దే. వి. పక్షివిశేషము. (అప్ర.)

**పేము.** దే. వి. ప్రేముయొక్క రూపాంతరము.

**పేముబొద్దు.** దే. వి. గోడయంచులయందు పేమువలె ఏర్పఱచెడుబొద్దు.

**పేయ.** దే. వి. పెయ్యకు మొదటిరూపము.

**పేయము.** సం. వి. అ. న. 1. నీళ్లు; 2. పాలు. పుం. 1. అచ్చపుఁదేట; 2. వెలవ. విణ. త్రాఁపఁదగినది.

**పేరంట్రము.** దే. వి. పేరఁటముయొక్క రూపాంతరము. (మొదటియర్థమునకు. "తే. ఇతఁడుపిల్వనిపేరంట్రమేగుదెంచి, పాటిచెప్పెదననుచుదబ్బలుపలికె." హరిశ్చ. ౪, ఆ. పేరంట్రము పేరంట్రముగాననియర్థము.)

**పేరఁటము.** దే. వి. 1. వివాహాదిశుభకార్యములు నడపుటకు ముత్తయిదువలు ఇరుగుపొరుగు ముత్తయిదువలనురమ్మని పిలుచుట; "పెండ్లిన్పపాలునింటనని పేరఁటముల్ ప్రియమొప్పఁజెప్ప." కళా. ౭, ఆ.—2. వివాహాదిశుభకార్యములయందు ఇరుగుపొరుగు ముత్తయిదువలు వచ్చిచేయు తత్సంబంధమైన కార్యము. "సీ. కైసేసికచిలోను గాఁగలదేవపురంధ్రివర్గములు పేరఁటముసేయ." హరి. ఉ. ౮, ఆ.

**పేరఁటాలికూర.** ద్వ. వి. ఒకదినుసుకూరాకు.

**పేరఁటాలు.** దే. వి. 1. పేరఁటమునకువచ్చిన ముత్తయిదువ; "క. చెలరేఁగి రెండుదోయుం, బుల పేరంటాండ్రుఁజిత్తములకెంతయు వే, డ్కలుమీఱఁజల్లులాడిరి, తలఁకకయభినవశుభాక్షతవ్రాతములన్." కళా. ౭, ఆ.—2. మృతనువాసిని.

**పేరడవి.** ద్వ. వి. (పేరు+అడవి.) మహారణ్యము.

**పేరణము.** వై. వి. పేరణియొక్క రూపాంతరము. "సీ. వడఁకుపన్నగరాజుపడగలమీఁదసర్వాంసవాకాంతపేరణమునూప." ఉ. హరి. ౪, ఆ.

పేరణి. యు. దే. వి. అంగీ. "తలనిద్దాతగటీలుపే రణులుపైదట్లున్." రా. వి. ౨, ఆ.—వై. భాండోపరిన్నృత్యము. "మేలొయ్యారములనచ్చరలు పేరణినటింప." ఉ, రా. ౨, ఆ.

పేరము. దే. వి. పేరము రొయొక్క రూపాంతరము. "సీ. కలరవంబులరకంబులు పికంబులుగేరరమణఁగీరములుపేరములువాఱె." భద్రా. ౧, ఆ.

పేరాముదపుఁజెట్టు. ద్వి. వి. (పేరాముదము+చెట్టు.) రక్తైరండము?.

పేరాముదము. ద్వి. వి. (పేరు+ఆముదము.) రక్తైరండతైలము.

పేరాముదాలు. ద్వి. వి. బ. పేరాముదపువిత్తులు.

పేరి. ఆం. వి. ఒకవిధమైన ఫలవృక్షము.

పేరిమి. దే. వి. (పేరు+ఇమి.) 1. గౌరవము; 2. అతిశయము. (చూ. పేర్మి.)

పేరిమికాఁడు. దే. విశే. గొప్పవాఁడు, ఘనుఁడు. "పెనుమినుకుండెగలు పొగడుపేరిమికాఁడా." అచ్చ. సుం, కాం.

పేరీఁదు. దే. వి. (పేరు+ఈఁదు.) ఖర్జూరము?.

పేరు. దే. అ. క్రి. 1. ఘనీభవించు; 2. సాంద్రమగు; "చీఁకటుల్ పేరినయొక్కచోటుగని." హరి. ఉ. ౧౦, ఆ.—3. అతిశయించు; "పేరినవేదన." చంద్రా. ౨, ఆ.—వి. 1. నామము; 2. కీర్తి; "క. పెనఁకువమము నూర్చికొనుము పేరును బెంపున్." హరి. ఉ. ౯, ఆ.—3. దండ. "సీ. అత్తగారిచ్చిన హారిసుదర్శనపుఁబేరునకుముత్తియిదువవనటంబొంద." పాండు. 3, ఆ.—విశే. 1. పెద్ద; "పేరోలగము." "పేరుబలఁగము." మొ.—2. అధికము. "ఎ, గీ. భీతిపగఱకునాత్మలోఁబేరుపెరిఁగె." రామా. 3, ఆ. (హల్లుపరమగుచో దీని యుకారమునకు వికల్పముగా లోపంబగు. "ధరణియందుఁబేర్కలవాఁడు." హరి. ఉ. ౭, ఆ.)

పేరుంగరము. దే. వి. (పేరు+ఉంగరము.) పేరుచెక్కిన ఉంగరము, ముద్రిక.

పేరుకొను. దే. స. క్రి. 1. పేరుపెట్టిపిలుచు; 2. పిలుచు; (చూ. పేర్కొను.) 3. ఉచ్చరించు, వచించు; "వ. అద్దేవునిసహస్రనామంబులుఁబేరుకొని." ఉ, హరి. ౨, ఆ. "క. పేరుప్రమాదవశంబునఁ, బేరుకొనుటకల్లయయ్యె." నై. ౪, ఆ.—4. స్తుతించు. (చూ. పేర్కొను.)

పేరుకోలు. దే. వి. పేరుకొనుట.

పేరుగ్రుచ్చు. దే. స. క్రి. (పేరు+క్రుచ్చు.) 1. పేరుపెట్టిపిలుచు; "ఆ. అడరిపెలుచ నేడ్చె నా అడిపోయిన, ప్రజలపేరుగ్రుచ్చిపనవిపనవి." భార. మౌ. ౧, ఆ.—2. చెప్పు. "నీవుపేరుగ్రుచ్చినయవియెల్లమేలు." భార. శాం. ౫, ఆ. (క్రుచ్చు అనునదికూర్చుయొక్క మాఱురూపమనియెఱుంగునది. చూ. వాక్రుచ్చు.)

పేరుచు. దే. అ. క్రి. 1. అతిశయించు; 2. విజృంభించు. స. క్రి. 1. ఒకటిమీఁదనొకటిపెట్టు; (తాళ్లుపేర్చిపెట్టుము.) 2. ఒకటిమీఁద నొకటిగాపెట్టియేర్పఱచు. (రూ. పేర్చు.—అతిశయించుటకు.—"క. అతతసామ్రాజ్యమంతకంతకుఁ బేర్చెన్." లక్ష్మీ. ౨, ఆ. — విజృంభించుటకు.—"క. కార్చిచ్చుకవిసిమృగముల, నేర్చుగరణినేడు భీష్ముఁడేచినకడిమిన్, బేర్చి మనసేనఁబొదివెశ, రార్చులనవ్వీరుఁగన్నులారంగంటిన్." భార. భీష్మ. 3, ఆ.—ఒకటిమీఁదనొకటిగాఁబెట్టియేర్పఱచుటకు.—"వ. సరయూతటంబునసాదపేర్చి." రా. అ, కాం.)

పేరుడు. దే. వి. పేరుట, ఘనీభవించుట.

పేరుపు. దే. వి. 1. ఒకటిమీఁదనొకటిపెట్టుట; 2. కుండపెంకు. (చూ. పేర్పు.)

పేరెము. దే. వి. 1. గుఱ్ఱపుపరుగు; 2. పరుగు.

పేరోజెము. వై. వి. మరకతమణివిశేషము. "పేరోజంబుమణులమొగముట్టు." స్వా. ౪, ఆ.

పేరోజము. సం. వి. అ. న. క్షుద్రమణివిశేషము.

పేరోదనము. వై. వి. పేరోజెముయొక్క రూపాంతరము.

పేర్కొను. దే. స. క్రి. పేరుకొనుయొక్క రూపాంతరము. (పేరుపెట్టిపిలుచుటకు.—"చ. అమితసహస్రవర్షవిశదాయుషు నన్నిటులెవ్వఁడోర్కొనా, విమలతపంబుఁగైకొనకవృద్ధతనూడకబాలుగానవ, క్షమిగులనిట్లుపేర్కొనియె." హరి. ఉ. ౯, ఆ.—పిలుచుటకు. —"వ. అక్కమఠంబుఁబేర్కొని." భార. ఆర. ౪, ఆ.—స్తుతించుటకు.—"సీ. శ్రీకాంతుకమనీయశృంగారలావణ్యకథలు పేర్కొనుశారికాగణంబు." లక్ష్మీ. ౧, ఆ.)

పేర్కోలు. దే. వి. పేరుకోలుయొక్క రూపాంతరము.

**పేర్పు.** దే. వి. పేరుపుయొక్క రూపాంతరము. (ఒకటిమీఁద నొకటి పెట్టుటకు.—"పేర్పుగ భుజించి." జై. ౬, ఆ.—కుండ పెంకునకు. చూ. పిసరు.)

**పేర్మి.** దే. వి. పేరిమియొక్క రూపాంతరము. (గౌరవమునకు. — "ఉ. ఇమ్మనుజేంద్రుఁడింద్రదనుజేంద్రులకంటె మహావిలాససౌ, ఖ్యమ్ములఁబెద్దయిద్ధరణిఁగావుననీతని పేర్మికిఁదగన్, నెమ్మినొనర్చదన్ సభ." భార. సభా. ౧, ఆ.—అతిశయమునకు.—"ఆ. ఇమ్మణి, మంతుఁడిపుడుతనదుమదముపేర్మి,నన్ను నరయకుమి సెనామీఁద." భార. అర. ౪, ఆ.)

**పేలపిండి.** ద్వ. వి. పేలాలువిసరిచేసినపిండి, సక్తువు.

**పేలలు.** దే. వి. బ. లాజలు. (దీనిని ఆవాలవలెనే ప్రేలాలనివాడెదరు. వృత్తియందేకవచనాంతము. పేలగింజలు. మొ.) (ప్రేలలయొక్క రూపాంతరము.)

**పేలవము.** సం. విశ. (అ.ఆ.అ.) పలుచనిది, విరళము.

**పేలా.** దే. వి. నీళ్లుత్రాగెడు ఒకదినుసుగిన్నె.

**పేలిక.** దే. వి. చింపిగుడ్డ. (చూ. నాలిక.)

**పేలు.** దే. అ. క్రి. సెగచేతవేఁగియుబుకు. (ప్రేలుయొక్క రూపాంతరము.)

**పేలుచు.** దే. ప్రే. పేలఁజేయు, (రూ. పేల్చు.)

**పేవు.** దే. వి. పేగుయొక్క రూపాంతరము.

**పేశలము.** సం. వి. అ. పుం. 1. కోయిల; 2. కోఁకలి. విశ. 1. నేర్పుగలది; 2. చక్కనిది.

**పేశి.** సం. వి. ఈ. స్త్రీ. 1. గ్రుడ్డు; (ఇకారాంతమునగు.) 2. కత్తియొఱ; 3. మాంసపుముద్ద.

**పేశీకోశము.** సం. వి. అ. పుం. అండము, గ్రుడ్డు.

**పేషణము.** సం. వి. అ. న. నూఱుట.

**పేషణి.** సం. వి. ఈ. స్త్రీ. నూరెడుఱాయి, సన్నెకల్లు.

**పేష్కషు.** హిం. వి. జమీఁదారులు ప్రభుత్వమువారికి కట్టుపన్ను.

**పేష్కారు.** హిం. వి. అమల్దారుక్రిందియుద్యోగస్థుఁడు.

**పేసము.** వై. వి. (చూ.) వేసము.

## పై.

**పై.** దే. వి. మీఁదు, ఉపరిభాగము. (పైక్రిందులు, పైమాట. మొ.) (మొదటిరూపము. పయి.)

**పైఁట.** వై. వి. పయఁటయొక్క రూపాంతరము. "పైఁటకులాగులాడి." పాంచా. ౫, ఆ. (మొదటిరూపము. పయిఁట. "జిలుఁగుపయింటదూల." కవి. 3, ఆ.)

**పైఁడి.** దే. వి. 1. బంగారు; 2. ధనము. "క. ఆపిమ్మట నేవచ్చెద, నాపైఁడి మహత్త్వముచటనడిపించెద." భల్లా. ౫, ఆ.—3. (చూ.) ఉంకువ. (మొదటిరూపము. పయిఁడి.)

**పైఁడికంటి.** దే. వి. (పైఁడి+కన్ను.) పక్షివిశేషము, కనకాక్షి. విశ. బంగారు చాయకన్నులుఁగలది. (మొదటిరూపము. పయిఁడికంటి.)

**పైఁడిచూలాలు.** దే. వి. భూమి, వసుగర్భ. "తే. అమరిపుప్పొడికుప్పలైయంతకంత, మెట్టదామరపాకులమీఁదజాఱెఁ, బైఁడిచూలాలివేవిళ్లపాయఁదోఁట, కలిమిచెలివెట్టుకల వంటకంబులనఁగ." య. ౪, ఆ.

**పైఁడితామర.** ద్వ. వి. మెట్టతామర, స్థలపద్మిని. (మొదటిరూపము పయిఁడితామర.)

**పైఁడినెలఁత.** దే. వి. లక్ష్మి, ఇందిర. "మ. గెలుపుంబైఁడినెలంతఁగైకొనియొసగ్గింపంజగంబంతయున్." య. ౬, ఆ. (మొదటిరూపము పయిఁడినెలఁత.)

**పైఁడిప్రత్తి.** ద్వ. వి. కార్పాసభేదము. (మొదటిరూపము పయిఁడిప్రత్తి.)

**పైఁడిముడుచు.** దే. అ. క్రి. నిశ్చితార్థముచేయు. (మొదటిరూపము పయిఁడిముడుచు.)

**పైఁడిముడుపు.** దే. వి. నిశ్చితార్థము. (మొదటిరూపము పయిఁడిముడుపు.)

**పైఁడిఱేఁడు.** దే. వి. కుబేరుఁడు, ధనాధిపుఁడు. (ఇట్లు పైఁడిదొర, పైఁడిరాయఁడు. మొ.) (మొదటిరూపము పయిఁడిఱేఁడు.)

**పైకము.** ఉభ. దే. వి. 1. రెండుకాసులనాణెము; "క. అరపైకంబునుజేయని, హరివాసరమునకునైనిజార్తిఁజెందునుమన్, గరవాలుచేతఁబూనిన, కరణియునుపమొలకుమేడగాల్చుటనుమ్మీ." రుక్మా. ౫, ఆ.—2. ధనము; "సీ. పరవర్తకులకెల్లసరకులిచ్చెదనని తివిరిపైకముఁగొని త్రిప్పుచుండు." భల్లా. 3, ఆ.—3. సమూహము. (మొదటిరూపము పయికము.)—సం. అ. న. పికములసమూహము.

**పైకూటమి.** దే. వి. ఉపరిసురతము. (మొదటిరూపము పయికూటమి.)

**పైకొను.** దే. అ. క్రి. 1. మీఱు; 2. కవియు; "క. దానఁగడుడస్సినాతని, సేనయురాతులదియొత్తఁగిచెచ్చెరబలసం, తానముతోడంబైకొని, యానర

పతిఁజేతేచిరి." భార. అశ్వ. ౧, ఆ.—3. యత్నిం చు; "క. ప్రాణములకొక్కఁడగునా, ప్రాణేశ్వరిదోఁచుకొనియెఁబట్టిమదాప్త, ప్రాణులబంధించెనుమ, త్ప్రాణంబులుగొనఁగ నెపుడుఁ బైకొని యుండుఁజా." రా. కిష్కిం, కాం.—4. కలుగు. "క. వినుమత్త్రిగ్రహావళి, మునదేశంబులకును శుభమునశుభమును బై, కొనుఁదత్పీడలువిబుధులు, గని శాంతియొనర్పవలయు గ్రక్కననఘా." మార్క. ౪, ఆ. (ప్రే. పైకొలుపు. "సీ. అడరియింద్రుండు బ్రహ్మాస్త్రంబుఁ బైకొల్పనదిమురాంతకు నాభియందుడిందె." పా. ౫, ఆ.) (మొదటిరూపము పయికొను. "చ. పయికొనినన్నునిట్లుమరుబారికిఁ నుగఁజేయఁబూనియే, నియతియొవట్టిసందియమునీకొనరింపఁగఁబోలుఁగాని." కళా. ౭, ఆ.)

పైజోలు. దే. వి. మచ్చె. (మొదటిరూపము పయిజోలు.)

పైజోలుమట్ట. దే. వి. మత్స్యవిశేషము. (మొదటిరూపము పయిజోలుమట్ట.)

పైఠ. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడువారిపైఁట. "శా. లంకాపురీ, పాపగ్రంథికులాంగనాకుచతటీ పైఠాపట గ్రాహబా, హాపాటచ్చర." మరున్నందనశతకము.

పైఠరము. సం. విణ. (అ. ఈ. అ.) పిఠరమునందు వండఁబడినది. (పిండివంట.) (చూ. పిఠరము.)

పైతామహము. సం. విణ. (అ. ఈ. అ.) పితామహసంబంధమైనది.

పైతృకము. సం. విణ. (అ. ఈ. అ.) పితృసంబంధమైనది.

పైతృష్వసేయుఁడు. సం. వి. అ. పుం. మేనత్తకొడుకు.

పైతృష్వస్రీయుఁడు. సం. వి. అ. పుం.——పై.——

పైత్తము. సం. విణ. (అ. ఈ. అ.) పిత్తమువలనఁగలిగినది. (వ్యాధి.)

పైత్రము. సం. విణ. (అ. ఆ. అ.) పితృసంబంధమైనది.

పైద. దే. వి. పిల్లకాయ. "ఎ, గీ. పడుచుఁబైద వెంటఁబడినొవ్వనడుచునో." భో. ౪, ఆ. "ఉ. హాళిమనంబునం బెరుఁగ నాలయిబిడ్డయి బంటుఁబైదయై, మూలధనార్జనంబునిలుముంగిలియైగళదఘ్నదర్పతన్, వాలెడువారికెట్టులపవర్గముభర్గముకుం దుఁడిచ్చెనిం, కేలకళాసమేలజడ లేలకమండలు వేలదండముల్." పాండు. ౫, ఆ. (మొదటిరూపము పయిద.)

పైదలి, దే, వి. ఆఁడుది. (మొదటిరూపము పయిదలి.)

పైనము. వై. వి. పయనముయొక్కరూపాంతరము. "పడమరవెట్టగాఁద్వెదురఁ బైనముసాగని వెళ్లఁ ఓఁడు." చంద్రా. ౨, ఆ. (మొదటిరూపము పయినము.)

పైపడు. ద్వ. అ. క్రి. 1. మీఁదు; 2. పైకొను, కవియు. "క. ఆపదసమస్తలోకులఁ, బ్రాపించుఁదొలంగునపుడపవనముభంగిన్, బైపడునాపద సైఁచిన, భూపాలాక్షణములోనఁ బొందు శుభంబుల్." రా. అర, కాం. ౨, ఆ. (మొదటిరూపము పయిపడు. మీఁదుటకు. "ద్వి. భయమునుబ్రియమును బైపాటునిగ్గుఁ, బయిపడుచుండనప్పడఁతుకయుండె." రా. యు, కాం.) (చూ. ప్రేపు.)

పైపాటు. ద్వ. వి. (పైపడుట.) కవియుట. (మొదటిరూపము పయిపాటు. "బాలసమీరణంబు పయిపాటుననించుకసోఁకినన్." విజ. 3, ఆ.)

పైపైగ. దే. ద్ర. క్రి. విణ. (పైపై+కాన్.) సులభముగా. (ఆ తప్పు పైపైగ తేలిపోయినది.) (మొదటిరూపము పయిపయిగ.)

పైర. దే. వి. పయరయొక్కరూపాంతరము. (మొదటిరూపము పయిర.)

పైరము. దే. వి. ఆవు. (చూ. పేటనఁబెట్టు.) (మొదటిరూపము పయిరము.)

పైరు. దే. వి. సస్యము. (మొదటిరూపము పయిరు.)

పైరులరాయెకిమీఁడు. దే. వి. చంద్రుఁడు, ఓషధీశుఁడు. (మొదటిరూపము పయిరులరాయెకిమీఁడు. "వారలాకోఁతిపయిరులరాయెకిమీనిఁ బొడవిపల్ దెఱఁగులఁబోర." అచ్చ. యు, కాం.)

పైలుమాను. హిం. వి. జెట్టివాఁడు.

పైశాచము. సం. వి. అ. పుం. నిద్రించియు తాగి మైమఱచియు శీలము సంరక్షింపఁ బరాకుపడియున్నదానిని సంభోగేచ్ఛచే రహస్యముగాఁ జేసికొనువివాహము. (చూ. వివాహము.) (ఇది యధమము.) విణ. పిశాచసంబంధమైనది.

పైశున్యము. సం. వి. అ. న. కొండెకానితనము.

పైసరము. దే. వి. రతి. (మొదటిరూపముపయిసరము.)

పైసలా. హిం. వి. తీర్పు, పరిష్కారము.

పొ.

పొ. దే. విణ. వృత్తియందు పొన్ను శబ్దమునకుమీఁది వర్ణములోపింపఁగామిగిలినరూపము. (దీనికి పరుషసరళములు పరములగునపుడునుమాగమంబగు.

పొఁబట్టు, పొంబనఁటి, పొంగట్టు. మొ.)—అవ్య. నిశ్చయమును దెలుపును. "ఆ. తొల్లిసప్తమునులుదుర్భిక్షవేళన, నన్యగతికులగుచుఁ బ్రాణధృతికి, శవముఁదినఁగనైన సమ్మతించిరిగాని, యొల్లరైరిపొన్పుఁడొసఁగుధనము." పర. ౪, ఆ.

పొంకపడు. ద్వి. అ. క్రి. (పొంకము+పడు.) పొందికపడు. (ప్రే. పొంకపఱుచు. "ఇంకఁగావ్యవిశేషము ల్పొంకపఱుతు." కా. ౨, ఆ.)

పొంకము. దే. వి. పొందిక. "పంకజాతమ్ములపొంకమెడలె." పు. ౧, ఆ.

పొంకించు. దే. స. క్రి. పొంకపఱుచు.

పొంగటినెల. దే. వి. (పొంగలి + నెల.) మార్గశీర్షమాసము.

పొంగటిపండుగ. ద్వి. వి. (పొంగలి+పండుగ.) మకరసంక్రాంతి.

పొంగట్టు. ద్వి. వి. (పొన్ను+గట్టు.) హేమాద్రి.

పొంగరము. దే. వి. ఒకదినుసుపిండివంట.

పొంగలి. దే. వి. పాలుచేర్చిపొంగించునట్టి అన్నము. (దీని భేదములు పప్పుపొంగలి, చక్కెరపొంగలి.)

పొంగలించు. దే. అ. క్రి. నిక్కు. "ఆ. పులకలంగమునను బొంగలింప." మై. ౨, ఆ.

పొంగారు. దే. అ. క్రి. (పొంగు+ఆరు.) 1. ఉబుకు; "సీ. ఉరవడివర్ధిల్లుచున్న జలంబుచేఁ బొంగారి దెసలెల్ల మ్రింగికొనుచు." భార. అర. ౪, ఆ.—2. సంతోషించు; "క. అనినదము విని యాదవ, సేనలు పొంగారి నెదురుసేసలు సల్లెన్, మానవతీతతివందిజనానూనస్తుతులు నెలఁగెనచ్యుతు ప్రోలన్." ఉ, హరి. 3, ఆ.—3. అతిశయించు; "క. రంగగుతోడవులఁ బూఁతల, నంగుఁగైసేసియుందు నాడెడు తమిచేఁ, బొంగారెడు వేడుకతో, సింగారపుఁ దోఁటకరిగి చెలువలుఁదానున్." య. 3, ఆ.—4. విజృంభించు; "మత్తకోకిల. ఆ, వీరుఁడున్ గదఁ జూర్ణితంబుగ వ్రేసె నా సురభంగిఁ బొం, గారి దారుణవజ్రపాతరయంబునన్ బటుహస్తుఁడై." భార. అర. ౫, ఆ.—5. నిక్కు. "పాలిండ్లు వొంగార." స్వా. ౨, ఆ.

పొంగిలి. దే. ప. పక్షులయాహారము. "చ. పులుఁగులఁ జూడమా యెడలబోధము గల్గియు మోహమెట్టిదో, సొలయక యాఁకటన్నలియుచుం జనిపొంగిలి తెచ్చి తెచ్చిచం, చుల వెడలించు పిల్లలకుఁ జొప్పడుమక్కువనింతకంటె నే, తలఁపఁగ బంధులందువసుధావరమోహము మర్త్యకోటికిన్." వర్క. ౬, ఆ.

పొంగు. దే. అ. క్రి. 1. ఉల్బణమగు; 2. సంతోషించు. 3. గర్వించు. వి. 1. ఉల్బణము; "చ. అడరుగరప్రధారలు మహోముఖవాంతసుధాంబుధారలన్ బొడవగు వహ్నికీలములఁ బొంగునుగా." అము. ౧, ఆ.—2. సంతోషము; "ఆ. వానిపొంగు క్రుంగ వాఁడేల వచ్చెను."—3. గర్వము. (నీపొంగు క్రుంగ.) "మ. మును వేచేతులు గల్గి క్రొవ్వుదు మదమోహాంధతన్ హైహయార్జునుఁడన్ రాజును గ్రుంగైభృగుతనూజుండాజిలో నెవ్విధం, బున కుందెచ్చెనెఱుంగ వేయటుల నీపొంగేనడంగింతు." హరి. ఉ. ౮, ఆ.

పొంగునీళ్లు. ద్వి. వి. బ. చిట్టుడుకునీళ్లు.

పొంగుప్రాలు. దే. వి. బ. ధాన్యవిశేషము.

పొంచిక. దే. వి. పొంచు. "మ. సర్పంబేపు మైనింకఁ బొం, చిక నే తెంచుఁ బ్రనూతికాలమును వచ్చెన్ గార్యమెట్లుండునో." పంచ. నా. ౧, ఆ. (ఇపెంచికవంటిది.)

పొంచు. దే. అ. క్రి. ఏదేనినుద్దేశించి మఱుఁగుపడి కనుపెట్టియుండు. వి. ఏదేనినుద్దేశించి మఱుగుపడి కనుపెట్టియుండుట.

పొంజు. దే. స. క్రి. పోఁజుయొక్క రూపాంతరము "ద్వి. దర్భ, కసవులు సన్నంబుగాఁ బొంజిపొంజి విసువక యందిచ్చు విశ్వాసమునను." ప్రభు. ౨, ఆ.

పొంటె. దే. ద్ర. కొఱకు అను ప్రత్యయార్థమునందు వచ్చునది. "మధ్యాక్కర. పయోరుహాగర్భుఁడు రగవిషాపేత జీవసంజీవనోపదేశంబు, కరుణగశ్యపునకునిచ్చె నఖిలలోకహితంబు పొంటె." భార. ఆది. ౨, ఆ.

పొంత. వై. వి. 1. సమీపము; "తే. పురుషుమానసేతదృఢమైనఁబువ్వుఁబోఁడి, వికృతిపై కొన్న సెపొంత వెన్న గాదె." పు. ౨, ఆ.—2. తీరము. "వ. హిరణ్వతియనునదిపొంతవిడిదలగా నిరుపించి." భార. ఉద్యో. ౪, ఆ.

పొంతకడవ. వై. వి. ప్రొయ్యిదగ్గఱి నీళ్లకుండ.

పొంతకత్తె. ద్వి. వి. (పొంతము+కత్తె.) కుంటెనకత్తె.

పొంతనము. ద్వి. వి. (పొందు + తనము.) గ్రహమైత్రి. "తే. అతఁడును బొంతనము లెల్లనరసి లెస్సయున్నదని పల్కియారేయి యొక్కలగ్న, మేర్చి చియిరుగుపొరుగు నెఱుఁగకుండఁ, దనతనూ

వనతనికిదారవోసె." శుక. ౩, ఆ. (స్వార్థమున తనము.)

పొంతము. దే. వి. పొందు, స్నేహము. "ధర్మసూతి తోఁబొంతము మేలు." సం. "సాధుమన్యైపాం వైస్సహసంగతమ్." భార. ఉద్యో. ౩, ఆ.

పొందిక. దే. వి. 1. పొంకము; (మాటపొఁదిక గా లేదు.) 2. చేరిక; "సీతాకాంతమునిస్త్రీలపొం దికలనురగి." రామా. ౫, ఆ.—3. కలయిక. "క. పొందికకుఁదగినయువతిని." రామా. ౫, ఆ.

పొందు. దే. అ. క్రి. (కన్ను) వాలు. "ఆ. కడుపు నిండఁగుడువఁగానమి రేయెల్లఁ, గన్ను వొందకున్నఁ గరముడస్సి, యున్నవాఁడ." భార. ఆది. ౬, ఆ.—స. క్రి. 1. ప్రాపించు; (చూ. తలపెట్టు.) 2. కలయు. వి. 1. పొందిక; "మాటపొందెటింగి." భార. ఉద్యో. ౧, ఆ. —2. స్నేహము; "తే. ఎట్లు. పుడమి ఱేనికినీకునుబొందు బెరసె." అచ్చ. సుం, కాం.—3. సంధి; (చూ. పడు.) 4. ప్రాప్తి; "మ. జలచారస్తబ్ధరోమత్స్యకే, సరితల్ పొంగనతౌరసం భమునవాచ్ఛాదించుఁదాఁబ్రౌఢిమన్." ఆము. ౫, ఆ. -5. అభేదము; "అహోకొందటీపొంద ఱుంగరు." ఉ, హరి. ౩, ఆ —6. అనుకూల్యము. "సీ. రాజానొజ్జలమంత్రరక్షాబలంబునరాఁబొం దుగాదయ్యె రాక్షసునకు." నై. ౪, ఆ.—విశే. స్నేహితుఁడు. "చ. కళలకునిమ్ముసొమ్ముసెకకంటి కిమింటికిఁజెన్ను వెన్నుతో, ఝ్యలిసయిదోడుకూ డుదివిజాళికి హేళికి జంటతుంటవిల్, గలవొర పొందువిందువిఁగల్వకుఁజల్వకుఁ క్కటిక్కలే, వె లఁదులనీవిబావికుచి వీడికిఁబ్రాచికివచ్చెఁజెచ్చె రన్." హన. ౪, ఆ.

పొందుకాఁడు. దే. విశే. స్నేహితుఁడు. "ఆ. ఎల్లత నువులందునిరవొందుతనతోడఁ, బొందుసేసినట్టి పొందుకాని, పొందువొందలేఁడుపురుషుండుగు ణముదా, గుణినిబోలునట్టిగుణిభజింతు." భాగ. ౬, స్కం.

పొందుకొను. దే. అ. క్రి. నెలకొను. "క. మంద విసర్పిణియనవా, నందముతోఁజీరపేను నరపతిశ య్యన్, బొందుకొనిపెద్దగాలం, బెందునుబో కచోటనుండునిష్టమెలర్పన్."పంచ. నా. ౧, ఆ.

పొందుపడు. ద్వ. అ. క్రి. సరిపడు, అనుకూలించు. "సఖ్యంబైననాతోనపొందుపడున్." రా. యు. కాం.

పొందుపాటు. ద్వ. వి. సరిపడుట, అనుకూలించుట.

పొంపిరి. దే. వి. సాంద్రత. "చ. ఉరుతరమైనవేద నకునోర్వక భీకరమైనవక్త్రగ, హ్వరమురయం బునందెఱవవావిరిభీకరనక్రకూర్మద, ర్దురసముపే తమైజలము దొట్టుచువచ్చినవాతనించెఁబొం, పిరి దగనాయునందనుఁడు ప్రేవులప్రోవులముద్దఁజె చ్చెరన్." రా. యు, కాం.—విశే. సాంద్రము. "చ. జలజభవాండమొప్పెఁగలశంబువిధంబునవం దులోనను, జ్వలమగుచంద్రికాపటలిసన్నుతికె క్కెఁబయఃప్రపూర్ణమై, లలితకలాకలాపసదలం కృతిచారుసుధామరీచియుం, పులగనిర్మైతనర్చెఁ బయిఁబొంపిరిగట్టినపూఁగడోయనన్." (పొం పిరి—పొంపిరిగాననియర్థము.) భో. ౪, ఆ.

పొంపిరివోవు. దే. అ. క్రి. (పొంపిరి + పోవు.) 1. అతిశయించు; "గాఢ్ఫునకును నెక్కుడైజవము పొంపిరివోయెమిగాని." భార. ఆర. ౭, ఆ.—2. వర్ధిల్లు; (చూ. దట్టుఁడు.)—3. వ్యాపించు; "త్రి జగంబులంబొగడుపొంపిరివోవ." నిర్వ. 3, ఆ.— 4. పుట్టు; 'క. పొంపిరివోయెడుతనయను, కం పాతిశయమునఁబట్టి కంధరునెట్లుం, జంపఁగఁ జాలకరోషము, పెంపునఁగారాగృహమునఁ బె ట్టింగఁబనిచెన్." నిర్వ. ౭, ఆ.—5. సంతోషిం చు; "క. మరలవిడిసిగెలుపునఁబొం, పిరివోవు చులంకఁదలఁచిపెనుపొసరఁబమూ, వరులఁబిలిపిం చిపోదమె, పురమునకనిచెప్పెదనుజపుంగవుఁడే లమిన్." నిర్వ. ౫, ఆ.—6. విజృంభించు; "వ. వివిధదేశాధీశులునాతోడసుఖదుఃఖంబులకియ్య కొనియగ్గలికమైనగ్గినైనకుఱుకనుసముద్రంబైన నీఁదను దెంపుసేసిపొంపిరి వోవుచున్నవారు." భార. ఉద్యో. ౩, ఆ.—7. ప్రసిద్ధికెక్కు. "ఉ. భూరినియుద్ధకౌశలతఁ బొంపిరివోయివెలుంగు చున్నచా, ణూరునిముష్టికుఁబిలిచి." వి. పు. ౭, ఆ.

పొంపు. దే. వి. 1. మెడవెనుకటిభాగము; (మెడ పొంపు.) 2. ఒప్పు. "ఆ. పొదలఁదూఱువారుఁ బుట్టలమాటున, నీఁగువారుఁబరువులెత్తువారుఁ, ద్రెళ్లువారుబొబ్బరించువారును నేలఁ, బొరలు వారునైరిపొంపుదటిఁగి." అచ్చ. యు, కాం. (దీని కీయర్థమునం దీగ్రంథకర్తప్రయోగములే కనఁబ డుచున్నవి.)

పొంపెసలారు. దే. అ. క్రి. (పొంపు+ఎసలారు.) ఒప్పగు. "క. కాటుక, పొక్కుడుచందముననింగి

పొంపెసలారక౯." షో. ౫, ఆ. (దీనికి ప్రయో గమొక్కటే కానఁబడుచున్నది.)

పొకారు. దే. అ. క్రి. నాశమగు. (పోకారుయొ క్కరూపాంతరము.)

పొకారుచు. దే. ప్రే. పొకారఁజేయు, నాశముచే యు. "ఉ. కానకకన్నమానుతుఁబొకారిచియి న్నియుమిథ్యచేసితే." రామా. ౨, ఆ. (పోకా రుచుయొక్క రూపాంతరము.)

పొకాలు. దే. అ. క్రి. 1. వెడలు; "శా. బ్రాహ్మ్యమింకో హాహాచాలుఁబొకాలిపోయెదరొ పోరో నోటిక్రొవ్వేటికి౯." (మీఁద "క. వారునురు మనివెడలిపోయిరి.") స్వా. ౬, ఆ.—2. పోవు. "చ. కరినిభయానతోనిదపొకాలెదమిన్నులఁవ డ్డచోటికి౯." కాశీ. ౨, ఆ. "అనపత్యతవం కనూర్ధ్వలోకమ్ములులేకపోయినఁ బొకాలఁగని మ్ము." జై. ౭, ఆ. (పోకాలుయొక్కరూపాంత రము.) (ఇది కోపదుఃఖకాలములయందుపయో గపడిచెడు మాట.)

పొక్కలి. దే. వి. 1. ఎత్తుడుప్రొయ్యి; 2. మూడు రాళ్లుపెట్టినప్రొయ్యి.

పొక్కి. దే. వి. 1. గుఱుతు; "సీ. ఏతెంతుననిపొక్కి యిడిపోయిమత్తాళిచూడనాకడఁదొంగి చూడ వైతి." పంచ. వేం. ౩, ఆ.—2. ఉపాయము.

పొక్కిలి. దే. వి. 1. బొడ్డు; 2. గుంట. "చ. వనితకు చాద్రులంబొడమివాటపుఁబొక్కిలినిండి యుబ్బి జాల్, గొనికటిచక్రమాని మెఱుఁగుందొడ లైవిరివానివచ్చునూ, తనకిరణామృతౌఘములదం డవాలాంకపదోత్థితంబులై, మనునుడివోనిగర్భ కలమంబులుగావెలతొంగిజంఘికల్." వసు. ౨, ఆ. (ఇది రెండర్థములకు నుదాహరణము.)

పొక్కిలిచూలి. దే. వి. బ్రహ్మ, నాభిజన్ముఁడు.

పొక్కు. దే. అ. క్రి. 1. దుఃఖించు; "ఉ. ఱెక్కలు రావుపిల్లలకు ఱెపటనుండియుమేఁతగానమి౯, బొక్కెడుగూఁటిలో." భాగ. ౬, స్కం.— 2. బొబ్బలేచు; "వ్రేళులపుటంబులుపొక్కఁదొ డంగె." భార. విరా. ౧, ఆ.—3. ఉలుకు. "క. క క్కుఱితికాఁడుకార్యము, చక్కటియెఱుఁగండు సందెజామునతఁడు౯, బొక్కిపడనీవుకోఱల, నెక్కినవటమీఁదనుండనొప్పగుఁజామ్మి." పంచ. నా. ౧, ఆ.—వి. 1. దుఃఖము; "ఆ. కడుపుపొ క్కుమాన్పికావవయ్య." భాగ. ౮, స్కం.— 2. బొబ్బ; 3. ఎండిలేచినపెల్ల; "పలకపొక్కు."— 4. జనశ్రుతివిశేషము.

పొక్కుడు. దే. వి. ఎండిలేచినపెల్ల, పొక్కు. (చూ. పొంపెసలారు.)

పొగ. దే. వి. ధూమము.

పొగకన్ను. దే.వి. అగ్నిజనించినశివునిఫాలనేత్రము. "సీ. పులితోలుచిత్రంపువలిపదుప్పటిఁజేసిపొగ కన్నుకస్తూరిబొట్టుఁజేసి." భల్లా. ౪, ఆ.

పొగకత్తి. దే. వి. ఇంటిపైకప్పుసందులయందుపొగచే తచుట్టఁబడి కత్తివలెఁగనఁబడెడు సూర్యకిరణము.

పొగగూఁడు. దే. వి. ఇంటికప్పునందు పొగపోవుట కేర్పఱచినసందు.

పొగచు. దే. ప్రే. (పొగయఁజేయు.) 1. పొగయిం చు; "సీ. అగరుధూపము వెట్టియాభ్యంతరంబైన గగనావకాశంబుఁబొగచునారు." నై. ౬, ఆ.— 2. సాతాళించు. "చ. వలపులుగ్రమ్మఁగాఁబొగ చివండినకారపుఁగాయగూరలు." ఉ,రా. ౫,ఆ.

పొగచుట్ట. దే. వి. పొగాకుచుట్ట.

పొగచూరు. దే. అ. క్రి. పొగపట్టు. "సీ. కనకవ ర్ణుండైనకైటభాసురవైరిపొగచూరనల్లనై బొగ్గుఁ డయె." భీ. ౪, ఆ.

పొగచెట్టు. దే. వి. పొగాకుచెట్టు, ధూమ్రపత్రిక

పొగడ. వై. వి (చూ. వకుళము.) (చూ. పొగడు)

పొగడిక. దే. వి. పొగడు, స్తుతి, స్తోత్రము.

పొగడికోలు. దే. వి. పొగడికొనుట. "తే. అన్యకీర్త నంబునన్యనిందయుఁదన్నుఁ, బరఁగఁబొగడికో లుఁబ్రబ్బికోలు, నాపగాతనూజయార్యవృత్తము లుగా, వనిరిపినివార్యులైనమునులు." సం. "ఆత్మ నిందాత్మపూజాచపరనిందాపరస్తవః." భార. సభా. ౨, ఆ.

పొగడిత. దే. వి. 1. స్తుతి; 2. కీర్తి. "క. జగములనె ల్లనునిండిన, పొగడితఁగడువెలితిచేసిపొల్లయొడ లిక౯, దగునేజన్మవ్రతములు, దిగవిడువఁగనేడు నాకుఁద్రిభువనదీపా." సం. "నమేకీర్తిః ప్రణశ్యే త త్రిషులోకేషువిశ్రుతా." భార. అర. ౭, ఆ.

పొగడు. దే. స. క్రి. స్తుతించు. "తే. పొగడఁదగు వానిఁగానరేపొగడలార." భాగ. ౧౦, స్కం. పూ.—వి. స్తుతి. (చూ. తెగడు.)

పొగడ్త. దే. వి. 1. స్తుతించుట; "చ. దోర్బలవిదితుం డుకుంభజుఁడుబాలునిసొక్కరుఁజంచలాత్మువెం, గలిఁగడుఁబెద్దఁజేయుచుఁ బొగడ్తకుఁజొచ్చె."

భార. ద్రో. ౨, ఆ.—2. స్తుతి; "గరుడునికాం తికిన్ హరిపొగడ్తయొనర్చు." ఉ, హరి. ౭, ఆ.—3. కీర్తి. "తే. ధరణిఁబరఁగుఁబొగడ్తయెందాఁకనం త, కాలమునుబుణ్యలోకంబుగల్గునండ్రు." సం. "యావత్కీర్తిర్మనుష్యస్య పుణ్యలోకేప్రగీయ తే." భార. ఉద్యో. ౨, ఆ. (పొగడితయొక్క రూపాంతరము.)

పొగడ్తపడు. ద్వ. అ. క్రి. (పొగడ్త+పడు.) స్తుతిం పఁబడు. "అఖండితశౌర్యమునస్త్రవీర్యమున్ భుజబలమున్ బొగడ్తపడ." భార. భీష్మ. ౨, ఆ.

పొగపు. దే. ప్రే. సాతాళించు. "వండినచొప్పునం బొగపువాసనయున్." భీ. ౨, ఆ. ["తేనియన్ బొగపినపల్కులన్ బొగడి." (ఇక్కడ పొగపిన అనఁగా పక్వముచేసిన అని యర్థము.) పాండు. ౧, ఆ.]

పొగబాణము. మి. వి. ఒకగినుసుబాణపుసంచు.

పొగయు. దే. అ. క్రి. 1. పొగగలదియగు; 2. కు ములు. "క. జ్ఞాతులుతమలోఁబొంటినఁ, జేతో మోదమునఁజెలఁగిచెలువొందుదుర,న్నీతింబాసిన విగతవి, భూతింగడకొఅవులట్లపొగయుదురధి పా." భార. ఉద్యో. ౨, ఆ.

పొగరు. దే. వి. 1. గర్వము; 2. దైర్ఘ్యము; "అగ రుధూపపుఁబొగల్ పొగరారుకురులుగా." రా మా. ౭, ఆ.—3. తీక్ష్ణగంధము.

పొగరుఁబోతు. దే. విశే. (పొగరు+పోతు.) గర్వ శీలుఁడు.

పొగాకు. దే. వి. (పొగ+అకు.) ధూమ్రపత్రము.

పొగులు. దే. అ. క్రి. 1. పరితపించు; "తే. పొరలుఁ గెరలువియోగాగ్నిఁబొగులునొగులు." రామా. ౪, ఆ.—2. కుములు. "ఆ. పొగిలిపొగిలికాలుమ గువదేహంబున, నగరుపరిమళములపొగలు వెడ లె." భాగ. ౧౦, స్కం. పూ.

పొచ్చెము. దే. వి. 1. న్యూనత; "దీననేపొచ్చెమునొ చ్చెముంజొరదు." పాండు. ౨, ఆ.—2. కపట ము. ఉ. పొచ్చెములేనినెయ్యమునఁబూనివిపద్ద శనొందకుండఁగా, నెచ్చెలిఁగావఁజూచుమహనీ యునికెట్టిదకాలము." భార. శల్య. ౧, ఆ. "చ. పురుషవరేణ్య యేలయిటుపొచ్చెపుమాటలనన్నొ అంగెదు." హరి. పూ. ౨, ఆ. "చ. ఉదరమునం దు విశ్వమునునున్నది వెల్పలశూన్యమిన్మెయిన్, బొదలినమఱ్ఱియాకుపయిఁబొచ్చెపు బాలుఁడవై వినోదసం, పదవిలసిల్లెదు." హరి. ఉ. ౯, ఆ.—విశే. న్యూనము. "క. ఇచ్చటిబంధులునీవును, నచ్చెరుపడివినుచునుండనయిదూర్లునుమా, కిచ్చిన నుజాలునంటిని, బొచ్చెముకాదింతవట్టుఁబూర్ణ మునుమ్మీ." భార. ఉద్యో. 3, ఆ.

పొట. వై. వి. దొప్ప. (ఆకుపొట.)

పొటకరించు. దే. అ. క్రి. 1. అతిశయించు; "ఆ. గం ధకరటినూత్నకమలంబుఁబోలెన, ప్పురుషుఁడల సలీలపొటకరింపఁ, ద్రుంచెనవ్విరించిపంచమవ దనంబుఁ, బ్రఖరదీర్ఘహస్తనఖరధార." కాశీ. ౪, ఆ.—2. వర్ధిల్లు. "తే. విశ్వగర్భుఁడుతనగర్భవివర మందుఁ, బూఁటపూఁటకుఁబూర్ణుఁడైపొటకరిం ప, వ్రేఁకఁజూలాలితనమునవేల్పుఁబెద్ద, పొలఁతి కంతిలనీళ్లాడుప్రొద్దులయ్యె." భాగ. ౮, స్కం.

పొటకలి. దే. వి. పొట్టకఱ్ఱియొక్క రూపాంతరము. "క. వనజదళాయతనవలో, చనచరణములాత్మజా తశాలేయములౌ,టనుకోయప్పట్టులరా, జనపుం బొటకలులనెగడెజంఘులపేరన్." చంద్ర.

పొటకఱ్ఱి. దే. వి.——పై.——"చ. కలికరిరాజవం పుఁబొటకఱ్ఱులనెల్లఁదృణీకరించుచున్." భాను. ౨, ఆ.

పొటపొట. దే. వి. రాలుటలోనగువానియందగు ధ్వ న్యనుకరణము. (రాలుటయందు.— "కనుఁగ్రేవ నిప్పుకల్ పొటపొటరాల." భాగ. ౯, స్కం.—పడుటయందు.—"సీ. కణఁతలెల్లనుగాతుకలఁగిది క్కరులకుఁబొటపొటఁగన్నీరు బొట్లుపడియె." రామా. ౮, ఆ.—కురియుటయందు.—(చూ. తొ టతొట.) పొడముటయందు. "ద్వి. పొటపొటఁ జెమటమైఁబొడమ." హరిశ్చ. ౧, భా.)

పొటమరించు. దే. అ. క్రి. 1. బొబ్బలోనగునది లేచు; 2. చిగురులోనగునదిపుట్టు. (రూ. పొట మరిల్లు, పొటమరిలు.)

పొటము. యు. దే. అ. క్రి. పుట్టు. "క. నటనావాం కృతిఁదమలోఁ, జిటపొటజగడంబులూర్వశీరం భలకున్, బొటమినమేలేర్పులుపఁగ, నిటమిము రప్పించెనిర్జరేశ్వరుఁడధిపా." విక్ర. ౨, ఆ. (పొడముయొక్క రూపాంతరము.) వై. నాసా పుటము. "ద్వి. పొటములతోముక్కుబోసిపోఁ గలిచి." రా. యు, కాం.

పొటి. వై. విశే. పొట్టియొక్క రూపాంతరము.

**పొటిపొటి.** వై. విశే. అల్పము. "క. అటులేనియుఁ జెప్పెదనీ, పొటిపొటితలపోఁతలెల్లఁబోవనడువు మా, రటముడుగు నెమ్మనమునొ, క్కటిగానొనరిం చిగట్టిగావినుమధిపా." పాండు. ౫, ఆ.

**పొటుకు.** దే. వి. 1. చెట్టుమీఁదనుండి వానచినుకులు పడుటయందగుధ్వన్యనుకరణము; 2. ప్రొద్దుపొడుచుటయందును క్రుంకుటయందునగు అనుకరణము.(ప్రొద్దుపొడుచుటయందు.-(చూ.పొటుక్కు.) క్రుంకుటయందు." "అంతఁబ్రొద్దుపొటుకునఁగ్రుంకెన్." సా. 3, ఆ.)

**పొటుక్కు.** దే. వి. పొటుకుయొక్క రూపాంతరము (ప్రొద్దుపొడుచుటయందు. "ఉ. ప్రొద్దుపొటుక్కునంబొడుపుభూధరకూటము లెక్కెడిగ్గుమన్." కాశీ. ౪, ఆ.)

**పొటేలు.** దే. వి. పొట్టేలుయొక్క రూపాంతరము. "చ. గొఱియలమేఁకపోతులను గొప్పపొటేళ్లను గోడిపుంజులన్." చాటుపద్యము.

**పొట్ట.** దే. వి. 1. కడుపు; 2. వరిపొట్ట.

**పొట్టకఅ.** దే. వి. పొట్టకట్టుయొక్క రూపాంతరము.

**పొట్టకఱుకు.** దే. వి. ఎన్ను పొట్టపట్టుపరువము.

**పొట్టకట్టు.** దే. వి. బయటికిరాక లోపలబలిసియుండు ఎన్ను, కలమగర్భము.

**పొట్టపక్షెడ.** దే. వి. టంగువాఱు.

**పొట్టపెంజెర.** దే. వి. ఒకదినుసుపెంజెర.

**పొట్టము.** దే. వి. గోఁచి, కాపీనము.

**పొట్టకూటివాఁడు.** దే. విశే. (పొట్టకూడు+వాఁడు.) కడుపుకూటికిపనిచేయువాఁడు.

**పొట్టకూడు.** దే. వి. జీతముమాఱుగా పొట్టకుపెట్టెడు అన్నము, కడుపుకూడు.

**పొట్టక్రొవ్వు.** దే. వి. ఆహారమువలనఁగలిగినమదము.

**పొట్టపోసికొను.** దే. అ. క్రి. మానావమానములెంచక కడుపునించుకొను.

**పొట్టవాఁడు.** దే. విశే. బొజ్జకడుపువాఁడు.

**పొట్టి.** వై. విశే. వామనుఁడు, వామనము.

**పొట్టింపుచీరణము.** దే. వి. ఒకదినుసుచిన్నచీరణము.

**పొట్టికాఁకర.** వై. వి. పొట్టికాయలుగలకాఁకర, కర్కోటము.

**పొట్టిపిట్ట.** వై. వి. పక్షివిశేషము.

**పొట్టియ.** దే. వి. తేలు, వృశ్చికము. "తే. అగ్గిఁబడఁబోవుపొట్టియనమరఁబట్టి, మనుపఁబూన్పానిఁ గుట్టకమానఁగలదె." అచ్చ. యు, కాం.

**పొట్టు.** దే. వి. 1. ఊముక; 2. కాయధాన్యములమీఁదితోలు.

**పొట్టుపొరలగు.** దే. అ. క్రి. పీడితమగు. "వ. పునర్జన్మంబుకలదు లేదనుసంశయంబుతోఁబొట్టుపొరలగుదురునరులు." భార. అను. ౫, ఆ.

**పొట్టెలు.** దే. వి. పొట్టేలుయొక్క రూపాంతరము.

**పొట్టేలు.** దే. వి. గొఱ్ఱెపోతు, మేషము.

**పొట్రేను.** ద్వి. వి. (పొట్టి+రేను.) ఒకదినుసుచెట్టు.

**పొట్ల.** వై. వి. ఒకానొకతీఁగ, పటోలిక. (దీని భేదములు.—గుజ్జుపొట్ల, చేఁదిపొట్ల.)

**పొట్లపూరిక్క.** వై. వి. పుష్యమీనక్షత్రము

**పొట్లపూరిక్కనెల.** ద్వి. వి. పుష్యమాసము.

**పొట్లము.** వై. వి. 1. పువ్వులు మొదలగువానిని ఆకులలోనగువానియందుంచి మడిచినమడుపు; 2. గుంపు*. "ఆ. అట్లుపఱచువారిఁబొట్లముగా నురవఁజించి." అచ్చ. యు. కాం.— 1. సేన*. "క. అతియుతినపొట్లముతిను, గితికొనికొలువంగవరిగె." అచ్చ. కిష్కి. కాం.

**పొట్లు.** దే. అ. క్రి. పొఁచిపట్టు. (అప్ర.)

**పొడ.** దే. వి. 1. రూపు; "క. ఇవ్విధమున నేధర్మము, నెవ్వలఁబొడలేకపోవ నేమనిచెప్పన్, బువ్వులుపాములుమొదలుగఁ, గ్రొవ్వేసఁగఁగ నెందుఁబరఁగికొనికావించున్." హరి. ఉ. ౯. ఆ.—2. చూపు; "పొడలేకఘాతములు సోలెన్." రా. యు, కాం.—౩. దేహమునందుపెద్దబొట్టుగాఁగనఁబడురేఖ. "చ. అడవికివేఁటమైనరిగియాతఁడొకానొకనాఁడొకింతయున్, మెడమలఁగింపలేకతనమేపొడలొందునురండునేకమై, పొడముఁగబీడకన్నుఎడిబూడిదపండునుబోలెబూదుపారెడునొకదుప్పికింగవియఁబ్రేలిభయ జ్వరత్తప్తిత్తమై." పాండు. ౫, ఆ.

**పొడక.** దే. వి. పొణకకుమొదటిరూపము.

**పొడకట్టు.** దే. అ. క్రి. 1. కనఁబడు; "పెన్నిధిగతిన్ వ్రతికిన్ బొడకట్టవేల్పుఁదొయ్యలి." స్వా. ౬, ఆ.—2. ప్రత్యక్షమగు. "ద్వి. ప్రాణినాశమునకుభయపడిమిమ్ముఁ, బూనియెంచితిమీరుపొడకట్టినంత, నెప్పటియట్లరహించెలోకంబులు." విష్ణు. పూ. 3, ఆ.

**పొడగను.** దే. స. క్రి. (పొడ+కను.) చూచు. "క. కడకంటిచూడ్కిదళముఖుఁ, బొడగని." నిర్వ. ౭, ఆ. (ప్రే. పొడగనిపించు. "క. నుడువులప

డఁతుక మగనికిఁ, బొడచూపనితనదురూపుఁబొ డగనిపించెన్, జడనిధిశయనుఁడుకొంగున, ముడిచినమణిగాదెభక్తముఖ్యులకెల్లన్." పాండు. ౨, ఆ.)

పొడగాంచు. దే. స. క్రి. (పొడ+కాంచు.)——పై.——"వ. యశోదానందనులంబొడగాంచి." వి, పు. ౭, ఆ.

పొడగానుపు. దే. వి. పొడగనుట, దర్శనము. (రూ. పొడగాన్పు. "తే. కౌరవోత్తమ యనఘనీకతనమాకు, జలజలోచనుపొడగాన్పుసంభవించె, నట్లుగాకున్నమముబోంట్లకమ్మహాత్ము, దర్శనముకల్గునేధరాస్థలిఁదలంప." శేష. 3, ఆ.)

పొడచూచు. ద్వ. స. క్రి. పొడగాంచు. "క. నాతోడిప్రేముడింగడు, నాతురయైయెదురుసూచునంబకుఁజేతః, ప్రీతిగఁజనియాయమఁబొడ, చూతుంబోనీఁగదేవిశుద్ధచరిత్రా." భార. విరా. ౪, ఆ.

పొడచూపు. ద్వ. అ. క్రి. 1. కనఁబడు; "తే. పన్నగాధీశభోగతల్పంబుమీఁదఁ, దత్ఫణారత్నదీప్తిమైతళుకుఁజూపఁ బాలమున్నీటిలోనిద్రమేలుకొన్న, హరికిఁబొడచూపనేతెంచెహరిహయుండు." భీ. ౪, ఆ.—2. ప్రత్యక్షమగు. "నాకమ్మైఁ బొడచూపెఁదానుగ్రుపతోనాడందు." భార. అర. ౪, ఆ.

పొడతెంచు. దే. అ. క్రి. 1. ఉదయించు; "తే. లలితకాశ్మీరభవసమాలపనకర్మ, పాటలంబైననీముఖాబ్జంబుతోడ, నౌరయుఁగాకభవత్కేళి యోగ్యమైన, పొడుపుగుబ్బలిఁ బొడతెంచుపూర్ణవిధుఁడు." నై. ౫, ఆ.—2. పుట్టు. "పులకంబులతోఁ బొడతెంచెఁగంపమున్." ఉ, హరి. ౫, ఆ.

పొడదామర. దే. వి. 1. మండలాకారకుష్ఠము; 2. ఒకదినుసు పచ్చాకు.

పొడనీడ. దే. వి. సందులగుండతోఁచి పొడపొడగానేర్పడునీడ. "క. మిడుతగమికవియుతఱుచునఁ, బొడనీడలునెండతునియప్రోవులుగలయం, బుడమిందిలతండులగతిఁ, బడఁగానుడువీథినుండిపఱచిరిపెలుచన్." రా. యు, కాం.

పొడపత్రి. ద్వ. వి. ఒకానొకచెట్టు.

పొడము. దే. అ. క్రి. పుట్టు, జనించు. (చూ. పొడమూడవయర్థము.)

పొడయెండ. దే. వి. (పొడ+ఎండ.) సందులగుండతోఁచి పొడపొడగానేర్పడు ఎండ. "వ. పొడయెండయుఁ బోలయనీక కేతనంబులుగట్టించి." రా. యు, కాం.

పొడలమెకము. ద్వ. వి. దుప్పి, చమూరువు.

పొడవడఁగు. దే. అ. క్రి. (పొడవు + అడఁగు.) 1. చెడు; "వ. పొడవడంగినపల్లంబులును." కళా. ౧, ఆ.—2. చచ్చు. "వ. అట్లుయమునమడువునం బడినహంసుడుపొడవడంగుటసకలగంధర్వులుహరినామకీర్తనంబునగీతంబులొనర్చిరి." ఉ, హరి. ౪, ఆ.

పొడవడఁచు. దే. ప్రే. (పొడవడఁగఁజేయు.) 1. చెఱుచు; "క. అపమానితులగుధరణీ, దివిజులుకోపాగ్నిశిఖలదీపించిమహా, ద్రవిడద్వీపంబులతో, నవనినయిఁబొడవడంతురప్రతికారుల్." భార. అర. ౫, ఆ.—2. చంపు.

పొడవడు. ద్వ. అ. క్రి. (పొడ+పడు.) కనఁబడు. "సీ. ఆహూతులైనమహామునీశ్వరులచేఁ బొడవడదయ్యెభూభువనతలము." పా. ౫, ఆ.

పొడవు. దే. వి. రూపు. "క. పదునాలుగు లోకంబులుఁ, బొదలింపంద్రుంపవలసి పొడవులు రెండై, తుదిఁదారొక్కటియగుదురు, వదరలఁజేయుదురుభేదవాదులనెల్లన్." ఉ, హరి. ౨, ఆ.

పొడవుసూపు. ద్వ. అ. క్రి. (పొడవు + చూపు.) 1. ప్రత్యక్షమగు; (చూ. పొడువు.) 2. కనఁబడు.

పొడసుత్తె. దే. వి. చిన్నసుత్తె.

పొడి. దే. వి. చూర్ణము. విశ. ఎండినది. (పొడిగుడ్డ.)

పొడిగొట్టు. దే. స. క్రి. (పొడి+కొట్టు.) చేనియందలి చెట్లుకొట్టు.

పొడిచీఁకటి. దే. వి. మసమసకనిచీఁకటి, అవతమసము. "క. అట్లుపొడిచీఁకటిన, ప్పోరఁబడ సైంధవునినరు, బారిఁబడఁజెచితి." భార. శల్య. ౨, ఆ.

పొడిసేయు. ద్వ. స. క్రి. (పొడి+చేయు.) చూర్ణముచేయు. "భీముండు కౌరవవ్యూహంబున్ బొడిసేయుచుఁబేర్చెన్." భా. భీష్మ. ౨, ఆ.

పొడుగు. దే. అ. క్రి. 1. ఉన్నతమగు; 2. వర్ధిల్లు. వి. 1. మీఁదు; (చూ. పొడుగుమడుగు.) 2. ఉన్నతి; 3. ఎత్తు. విశ. 1. ఉన్నతము; 2. ఉత్కృష్టము. (చూ. పొడువు.)

పొడుగుమడుఁగు. దే. వి. ఆకాశగంగ. (చూ. తొడుగు.)

పొడుచు. దే. అ. క్రి. 1. పోట్లాడు; "సీ. సమకట్టి సైన్యంబు సైన్యంబుతో నొండొఁడొడరిమీముప్వ రతో డనొండె, నిద్దఱతో నొండె సెక్కటియొక్క నితో నొండెఁబొడిచెదదోర్బలమున." సం. "సైన్యేనసైన్యంవ్యూఢేన ఏక ఏకేనవాపునః, ద్వాభ్యాంత్రిభిర్వాయోత్స్యేహంయుగపత్పృథగేవవా." భార. సభా. ౧, ఆ. (ఇదికయ్యము, మేడము అనుశబ్దములతోఁ జేరివచ్చునపుడు చేయు అను నర్థమునిచ్చుచున్నది. "తే. అధిపనీతనయుండుగయ్యంబువొడుచుఁ, దెంపువదలకవిభవంబు పెంపు మెఱయ." భార. భీష్మ. ౧, ఆ. "పొడుతు నెట్లుఁ బాండుపుత్రులతోఁ గయ్యమేను." భార. శల్య. ౧, ఆ.)—2. ఉదయించు. "క. తరణివొడిచితమముచెఱుచు, కరణిని." సం. "ఉదయన్ వాయథాసూర్యోనాశయంత్యశుభంతమః." భార. శాం. ౨, ఆ. "సీ. పడియుండివాఁడిలఁబొడిచినచందురుక్రియఁదత్తలము లెలింగింపకున్నె." భార. ద్రో. ౨, ఆ.—స. క్రి. 1. పిడికిలిలోనగువానితో గ్రుమ్ము; "సీ. తెగిగతిలేనిపోటుగ నొడ్డనద్దల గిద్దలఁబొడుచు వేగినబిగాది." పంచ. వేం. ౧, ఆ.—2. బల్లెములోనగువానితో గ్రుచ్చు; 3. వ్రేయు; "ఆ. వానిమస్తకంబు వ్రయ్యఁగవడిగదఁ, బొడిచెరుధిరవారిపూర మొలుక." భార. అర. ౧, ఆ.—4. కుట్టు; "ఆ. మేలుకొలుపుచున్న మెల్లన నించుక, పొరలిచిన్న నల్లిపొడిచెనంచు." అచ్చ. యు, కాం.—5. (ఆన) పెట్టు. "క. వెడదెరువు లిచటఁజెల్లవు, పుడమినహాహదొంగలానవొడిచినఁగోకల్, విడుతురె." కళా. 3, ఆ.

పొడుపు. దే. వి. 1. పొడుచేట; (పొడుపుమాట.) 2. ఉదయము; "తే. ప్రొద్దు, పొడుపునకుమున్న వెడలించెఁబురము సకల, జనములను జీవధనముల సరకునతఁడు." భార. మౌ. ౧, ఆ. "ఎ. గీ. వినుమునీకీర్తినీభుజాన్వితకృపాణి, నీకరమునీరుచియ కానివెఱయఁగాదు, విధుపొడుపుగాదుపవిగాదు వేల్పుమ్రాను, కాదురవిబింబమోబభూకాంతునరస." కా. ౫, ఆ.—౩. పోటు.

పొడుపుఁగొండ. ద్వి. వి. (పొడుపు+కొండ.) ఉదయాద్రి. "ఉ. కోమలధాముఁడైపొడుపుఁగొండకునిండుకిరీటమయ్యె." రామా. ౭, ఆ.

పొడుము. దే. వి. పొడి, చూర్ణము.

పొడువ. దే. విశే. (పొడుచువాఁడు.) దుర్జనుఁడు. "ఆ. పొడువయిల్లుసారఁగఁబోలుఁబొమ్మనియిట్లు, నట్టుఁజూచిమనసుపట్టలేక, దర్వియురసిమున్ను దాఁచిపోయినచోట, నున్ననూరకుండెనుడుకుమాలి." భో. 3, ఆ.

పొడువఁడు. దే. విశే. (పొడువ+అఁడు.)——పై.——"క. వెడవెడనార్చుచుఁ బెఱికిన, పిడియము వలకేలఁగ్రాలబిఱబిఱవెంటం, బడియీపొడువఁడుముద్దుం, గొడుకుండగఁజూచెనెందుకొన్ని నెఱుఁగన్." పంచ. వేం. ౧, ఆ. (స్వార్థమున అఁడు.)

పొడువు. దే. వి. 1. ఉన్నతి; "క. పొడువునఁబ్రాయంబునఁగడుఁ, గడిఁదిబలంబుననుజూడఁగానసదృశునీ, కొడుకనియీతనినెంతయు, నెడమడుగుగఁజూపెదేలయిుండఱునగఁగాన్." భార. ఆది. ౮, ఆ.—2. ఎత్తు; "క. పుడమికివితస్తిమాత్రపుఁ, బొడువుననాక్షేత్రరాజమువిరాజిల్లున్." పాండు. ౨, ఆ.—౩. మీఁదు. "పొడువునందుండివెసఁదలక్రిందుగాఁగెడయించి." పాండు. ౮, ఆ.—విశే. 1. ఉన్నతము; "ఆకసంబుకంటెఁబొడువు జనకుఁడు." భార. అర. ౬, ఆ.—2. ఉత్కృష్టము. "ఎ. గీ. పొడమివ్రేతెనిముందఱఁ బొడవుసూపెఁ, బొడువులందెల్లఁబొడువైనబోటువేల్పు." ఉ. హరి. ౨, ఆ. (పొడుగుయొక్క రూపాంతరము.)

పొడ్చు. దే. అ. క్రి. పొడముయొక్క రూపాంతరము. "బోరనవిస్ఫులింగములుపొడ్చఁగ." భార. అర. ౩, ఆ.

పొణక. దే. వి. ఈఁతబ్రద్దలులోనగువానితో నల్లిన బొట్ట, కుమూలవిశేషము.

పొణకుకట్టి. దే. వి. తేలికైన యొకదినుసుకట్టి.

పొతక. దే. వి. పొత్తర.

పొతము. వై. వి. 1. పొట్లము; "చ. ఇతఁడొకనాఁటిరాతిరిరహింందనవేశ్యకుఁబూవుజొంపముల్, పొతముగఁగొంచుఁబోవుతఱిబోరననందొకపూవుజాతియ, ప్రతిహతమైతనర్చునయవాయుపుదిస్పనఁబడ్డఁజూచియా, యుతిమగునట్టిభీతినిశివార్పితమంచునుబల్కెనెమ్మదిన్." భల్లా. 3, ఆ.—2. గుంపు*. "చ. అతఁడొకనాఁడువేఁటకొఱకైతను నేలినవారువెడ్కతోఁ, బొతముగఁబైనమాటఁగని." భల్లా. 3, ఆ.

పొతుకు. దే. వి. ధాన్యపురాశిచుట్టుగేఁచెడుగిజి.

పొత్తము. వై. వి. 1. పుస్తకము; 2. కావ్యము*; "ఉ. అచ్చతెనుంగుఁబద్దెమొకటైనను గబ్బము లోన నుండినన్, హెచ్చనియాడుచుందురదియెన్నచునేర్పునఁబొత్తమెల్లని,ట్లచ్చతెనుంగునన్ నొడువనందులచందమెఱుంగువారెదన్, మెచ్చరొయబ్బురంబనరొ మేలనరో కొనియాడరో నినున్." య. ౧, ఆ.—౩. గ్రంథము*. "ద్వి. ఆద్యులపొత్తములందెల్లవెదకి." బస. ౧, ఆ.

పొత్తర. దే. వి. ఆకులులోనగువానికట్ట.

పొత్తరము. వై. వి. నూఱెడుగుండ్రాయి, ఉపల*.

పొత్తరముల్లు. దే. వి. ఒకదినుసుపచ్చిక.

పొత్తి. వై. వి. 1. మెత్తనిసన్ననిపాఁతవస్త్రము; (పొత్తిగుడ్డ.) "క. అత్తఱినరవీక్షలనా, పొత్తులలోశిశువుచిబుకముగళంబుపయిన్, హత్తనదిచూచితెలిఁదలు, కొత్తుచులేఁజెక్కులదరనొయ్యన నగియెన్." కళా. ౫, ఆ.—2. చెట్టుమీఁదినార*; (పొత్తిచీర.)3.పోఁకపూగుత్తిమీఁదిపట్ట,కుహళి*; "సీ. నునుఁబోఁకపొత్తిఁగుట్టినదొప్పగమితోడరంభావిశాలపర్ణములుపఱచి." ఆము. ౧, ఆ.—4. విశల్య†*.

పొత్తిక. వై. వి. మెత్తనిసన్ననిచిన్నవస్త్రము*. "క. కురుపీరులగెలిచితదంబరములలోఁజిత్రవర్ణభాసురములుగాఁ, దరమెఱఁగిలోచనోత్సవ, కరములుగాబొమ్మపొత్తికలకుండెండీ." భార. విరా. ౮, ఆ. (స్వార్థమున కప్రత్యయము.)

పొత్తికడుపు. వై. వి. క్రీఁగడుపు, వస్తి.

పొత్తిగడ్డ. వై. వి. పొత్తి, విశల్య†.

పొత్తిచీర. వై. వి. నారచీర†.(చూ. పసిఁడిపురుగు.)

పొత్తిదామర. వై. వి. (పొత్తి+తామర.) ముడుఁగుఁదామర, నమస్కారి†.

పొత్తినూలికాయ. ద్వ. వి. (పొత్తినూలు+కాయ.) పొత్తినూలిగూఁడు. "ఆ. తనకుఁదానబంధమొనరించుకొనియెడు, పొత్తినూలికాయపురువుభంగి, నగుణమయ్యుసగుణతావాప్తిఁబొందున, క్షరము ప్రకృతిగుణముసంక్రమించి." భార. శాం. ౬, ఆ.

పొత్తినూలు. ద్వ. వి. పట్టుపురుగునేసెడు పట్టునూలు. (చూ. పుర్వు.)

పొత్తు. దే. వి. 1. స్నేహము; "లోనిపొత్తువెలివృత్తంబున్ జనస్తుత్యముల్ కావింపందగునీకు." భార. ఉద్యో. 3, ఆ.—2. సంగతి; "క. జనకునిఁదెగటార్చినపా, పునకుంబ్రాణంబుతోడిపొత్తునమనఁగా, మనమునఁదాలిమిగలుగునె, చనుఁగాకయతండుచనినసద్గతికతగన్." భార. అశ్వ. ౮, ఆ. "ఆ. అనుపనీతుతోడనాలితోఁబొత్తునఁ, గుడువఁజెల్లు." విజ్ఞా. ఆచా, కాం. — 3. అవిభక్తత; "క. పొత్తునఁగుటుంబరక్షకుఁ, బొత్తులవారందఱప్పువుచ్చినచోటన్, బొత్తులవారందఱుబుణ, విత్తంబరువంగవలయువిధివంతముగన్." సం. "అవిభక్తైఃకుటుంబార్థే యదృణంతుకృతం భవేత్, దద్యుస్తద్రిక్థినః ప్రేతే ప్రోషితేవాకుటుంబిని." విజ్ఞా. వ్య, కాం.—4. ఉమ్మడి. "క. ఉత్తమమగుద్రవ్యంబును, విత్తంబునుదగ్రజానికి వింశాంశంబున్, బొత్తుననిచ్చిసహోదరు, లత్తిసమాంశంబుగొనుటయర్థంబెందున్." విజ్ఞా. వ్య, కాం.—విణ. 1. స్నేహితము; "కోపముపాపమునకుఁబొత్తు." కళా. 3, ఆ.—2. సంగతము. "ఉ. ఎత్తిలికావుకావురని యేడ్చితదీయపయోధరాగ్రముల్, కుత్తుకదాఁకఁబీల్చికొనిక్రోలెఁగ్రమంబునఁజన్నుపాలతో, నెత్తురుమున్నుగాఁగగణనీయములైచను సప్తధాతువుల్, పొత్తుగఁ బ్రాణముల్ చెనఁటిబొందియత్రిక్కఁగనొక్కవ్రేల్మిడిన్." హరి. పూ. ౫, ఆ.

పొత్తుకత్తె. ద్వ. విణ. స్నేహితురాలు. "వ. తమతమపొత్తుకత్తెలుందారును." భాగ. ౧౦, స్కం. పూ.

పొత్తుకాఁడు. దే. విణ. స్నేహితుఁడు.

పొత్తుగుడుపు. దే. వి. (పొత్తు+కుడుపు.) సహభోజనము, సజగ్ధి.

పొత్తువు. వై. వి. సరస్వతి*.

పొత్తుసేయు. ద్వ. అ. క్రి. (పొత్తు+చేయు.) స్నేహించు. "ఉ. గ్రుచ్చికవుంగిలించుకొనెఁగూర్మియుభక్తియుఁబొత్తుసేయఁగా." జై. ౧, ఆ.

పొత్తెము. దే. వి. గరిడీసాలయందు క్రిందపఱచెడియెఱ్ఱమన్ను. "మ. గరిడిన్ బొత్తెపు మట్టిచల్లడముచెంగావిన్ గళల్ దేఱుకా, సెరహిన్ మీఱఁగఁజొచ్చి." కనకరంజని. ౫, ఆ.

పొత్రము. వై. వి. పొత్తరముయొక్కరూపాంతరము.

పొద. దే. వి. ఒకటితోనొకటి పెనఁగొన్నబోదలేని చిన్నచెట్లగుంపు, గుల్మిని.

పొదక. దే. వి. పెద్దయెలుఁగు, పెద్దగొంతు.

పొదడు. దే. విణ. పొట్టివాఁడు, వామనుఁడు.

ప్రి.

**ప్రిదులు.** వై. అ. క్రి. 1. విరియు; "సీ. ప్రిదిలిక్రొ రవదళశ్రేణినొక్కులందీ కెం శశికాంతపఙ్క్తుల జలములూరె." స్వా. 3, ఆ.—2. సడలు; "క. తెల్లముగ సుతుపడుటవిని, జల్లన డెందంబు సెదర సంధులుప్రిదులన్." భార. ద్రో. ౨, ఆ. (చూ. గనయము.)—3. తగ్గు*; "ప్రిదులనిశౌర్యసంపదల." కళా. ౮, ఆ.—4. ఊడు*; "ఉ. శ్యేనముఖంబునం బ్రిదిలి చెచ్చెర మేదినిఁబడ్డశారికన్." మార్క. 2, ఆ.—5. జాఱు*; "ద్వి. ప్రిదిలినపయ్యెదబిగియఁజేర్చుచును." రా. అర, కాం.—6. తొలఁగు*; "తే. పగతుఁడిట్టులు లెస్సలోఁబడియె వీనిఁ, బ్రిదిలి పోనీక యింకఁ జంపెదర యమున." హరి. పూ. 2, ఆ.

**ప్రియ.** ఉభ. దే. వి. పిరయొక్క రూపాంతరము. సం. ఆ. స్త్రీ. ప్రియురాలు.

**ప్రియంగువు.** సం. వి. ఉ. స్త్రీ. 1. కొఱ్ఱలు; 2. నల్లావలు; 3. పిప్పలి?; 4. ప్రేంకణము?. న. కుంకుమము.

**ప్రియంవదుఁడు.** సం. వి. అ. పుం. ఒక ఖేచరుఁడు. విణ. ఇచ్చకమాడువాఁడు.

**ప్రియకము.** సం. వి. అ. పుం. 1. కుంకుమము; 2. చిత్రవర్ణముగలజింక; 3. తుమ్మెద; 4. కడప?; 5. ప్రేంకణము?; 6. వేఁగిస?.

**ప్రియత.** సం. వి. ఆ. స్త్రీ. స్నేహము, చెలిమి.

**ప్రియపడు.** మి. అ. క్రి. ప్రియంపడు, ఇష్టపడు.

**ప్రియము.** సం. వి. అ. పుం. 1. వృద్ధియనెడు ఓషధి; 2. స్నేహము; 3. సంతోషము. (వెనుకటి రెండర్థములకును తెనుఁగున భారతాదిగ్రంథములయందు ప్రయోగము.) విణ. 1. ఇష్టము; 2. హెచ్చు వెలగలది. (కఱవులో బియ్యము చాల ప్రియముగానుండెను.)

**ప్రియవాది.** సం. విణ. (న్. ఈ. న్.) ఇచ్చకమాడువాఁడు, ప్రియంవదుఁడు.

**ప్రియవాదిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. వివాహాదిప్రయుక్తమంగళవాద్యము; 2. వివాహాదిప్రయుక్తమంగళవాద్యధ్వని.

**ప్రియాల.** సం. వి. ఆ. స్త్రీ. ద్రాక్ష?. అ. పుం. ము. మోరటి?.

**ప్రియాళువు.** సం. వి. ఉ. పుం. ప్రియాలము, మోరటి?. (దీనికి దోహదక్రియ గీతి.)

**ప్రియుఁడు.** సం. వి. అ. పుం. ప్రాణనాథుఁడు.

ప్రీ.

**ప్రీణనము.** సం. వి. అ. న. తృప్తిఁబుట్టించుట.

**ప్రీతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. సంతోషము; 2. స్నేహము; 3. ఒక గ్రహయోగము; (చూ. యోగము.) 4. మన్మథునిభార్య.

**ప్రీతిదత్తము.** సం. వి. అ. న. అత్తగారిచేతఁగాని మామగారిచేతఁగాని ప్రేమచేనియ్యఁబడినదియు పాదవందనకాలమునం దియ్యఁబడినదియునైన స్త్రీధనము.

**ప్రీతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రీతిఁబొందినవాఁడు, ముదితుఁడు.

ప్రు.

**ప్రుంగుడు.** దే. వి. తెల్లకుష్ఠము, శ్విత్రము.

**ప్రుచ్చు.** దే. అ. క్రి. పుచ్చిపట్టు. "మ. హరిసాధింతుహరిన్ వధింతుహరిఁ బ్రాణాంతంబు నొందింతుఁదా, హరికిన్ వైరినటంచు మీఁదుపటురోషాయత్తుఁడై యెప్పుడున్, దిరుగుంబ్రువ్వదు నోరు ప్రిళిపడదున్ దేహంబుదాహంబుతో, నరకప్రాప్తియు నొందఁడే క్రియ జగన్నాథుం బ్రవేశించెనో." భాగ. 2, స్కం. (పుచ్చునకు మొదటిరూపము.)

**ప్రుప్పి.** దే. వి. 1. ప్రుచ్చుట; 2. మణిదోషవిశేషము. (పుప్పికి మొదటిరూపము.)

**ప్రువ్వు.** వై. వి. పురువుయొక్క రూపాంతరము. (చూ. పొడ.)

**ప్రుష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) కాల్పఁబడినది, దగ్ధము.

ప్రె.

**ప్రెక్కణము.** వై. వి. 1. అభినయముతోడి నృత్యము. (చూ.) పెక్కణము; 2. మల్లరంగము*. "వ. అని మెత్తనయియ్యకొని గజాలస్యంబునం బ్రెక్కణంబుచొచ్చి భూపాలునిముందట భుజాస్ఫాలనంబు చేసి మ్రొక్కి మరలు నెడ." సం. "ప్రవిశేశమహారంగమ్." భార. విరా. ౨, ఆ.

**ప్రెగడ.** ద్వ. వి. ప్రెగ్గడయొక్క రూపాంతరము. (మంత్రికి. — "క. ప్రెగడలమనసులు విరసములగు గతినడచు రిపురాజ్యమరసి విభిన్నం, బుగఁజే

సికలఁచి పైకొని, జగతీవరకొనఁగవలయు సౌకర్య మగన్." భార. ఆశ్ర. ౧, ఆ. — ప్రధానపురుషునకు. — "క. తగనీలోనూహింపుము, దిగవిడువకుధర్మతనయుదృఢమతి వైపాం, దగుచందము కొడుకులకున్, బ్రెగడలకుం జెప్పితీర్పు పెంపేర్పడఁగన్." భార. ఉద్యో. ౨, ఆ. — యువరాజునకు. చూ. ప్రెగ్గడ.)

ప్రెగ్గడ. ద్వ. వి. (పేరు+కడ.) 1. మంత్రి; "సుమంత్రుఁడనఁగఁబరఁగు ప్రెగ్గడయును." అచ్చ. అ, కాం. —2. ప్రధానపురుషుఁడు; (చూ. ప్రెగడ.) 3. యువరాజు. "ఉ. నాదు నెయ్యపుం, దమ్ముఁడు కైటభాంతకుఁడు దక్షతఁ బ్రెగ్గడయైసమస్తభా, రమ్మువహింపఁగాఁ ద్రిదశరాజ్యము నెమ్మదిఁజేయుచుండుదున్." నై. 3, ఆ.

ప్రెబ్బొత్తి. ద్వ. క్రి. విశ. (పేరు+బొత్తి.) నిశ్చయముగా. "ద్వి. ప్రెబ్బొత్తి పెయ్యల పెద్దయొకండు." భల్లా. ౫, భా.

ప్రెవడ. ద్వ. వి. ప్రెగడయొక్క రూపాంతరము.

## ప్రేం.

ప్రేంకడము. వై. వి. (చూ.) ప్రియాళువు? "తే. అంబుజాననయొకతె గానంబు సేయఁ, గడువికాసంబునొంది ప్రేంకడవుఁదరువు, నుతియొసంగెనవీన ప్రసూనవిసర, లీనవదలీనసంతానతానములను." రుక్మి. 3, ఆ.

ప్రేంకణము. వై. వి. (చూ.)——పై.——"రగడ. పుడుకుమల్లనగందపొడికిని ప్రేంకణము, దడయకిటనీకిత్తుఁదగరత్న కంకణము." స్వా. 3, ఆ.

ప్రేంకనము. వై. వి. (చూ.)——పై.——(చూ. నన.)

ప్రేంఖ. సం. వి. ఆ. స్త్రీ. 1. డోల; 2. పర్యటనము; 3. నృత్యము; 4. అశ్వగతి.

ప్రేంఖణము. సం. వి. అ. న. 1. నృత్యవిశేషము; "తే. ఒందుపనులకు పెలవులేకునికిఁజేసి, యభ్యసించితి శైశవమాదిగాఁగ, దండలాసకవిధమునుగుండలియును, బ్రేంఖణంబు తెఱంగును బ్రేరణియును." భార. విరా. ౧, ఆ. (చూ. పెక్కణము.)— 2. పర్యటనము; 3. ప్రవేశము; 4. నాటకము.

ప్రేంఖితము. సం. విశ. (అ.ఆ.అ.) 1. ఊఁచఁబడినది; 2. కదలింపఁబడినది.

ప్రేఁపుడు. దే. విశ. అధికుఁడు. "క. సన్నపువారలనధిపతి, మన్నించినఁ బ్రేఁపుడైనమంత్రికి బ్రతుకే, మున్నదిమునుమున్న యతఁడు, సన్నకుసన్నచటువానిచనకున్నఁజెడున్." పంచ. నా. ౧, ఆ.

ప్రేఁబ్రాలు. దే. వి. బ. (ప్రేల+ప్రాలు.) ప్రేలగింజలు. "ఎ, గీ. కుప్పఁజిచ్చిడి ప్రేఁబ్రాలుగొఱంకఁదివురు." పాండు. ౪, ఆ.

ప్రేక్ష. సం. వి. ఆ. స్త్రీ. 1. బుద్ధి; 2. ఈక్షణము; 3. నృత్యేక్షణము.

ప్రేక్షణము. సం. వి. అ. న. 1. నేత్రము; 2. ఈక్షణము; 3. నృత్యేక్షణము.

ప్రేక్షణికుఁడు. సం. విశ. (అ. ఈ. అ.) చూచేవాఁడు, దర్శకుఁడు.

ప్రేక్షణీయము. సం. విశ. (అ. ఆ. అ.) చూడఁదగినది, దర్శనీయము.

ప్రేక్షితము. సం. విశ. (అ. ఆ. అ.) చూడఁబడినది, దర్శితము.

ప్రేగు. దే. వి. కడుపులోని పేగు, అంత్రము.

ప్రేచే. వై. స. క్రి. ప్రేరేచేయొక్క రూపాంతరము.

ప్రేతపురము. సం. వి. అ. న. యమపట్టణము.

ప్రేతము. సం. వి. అ. పుం. 1. నరకమందుండు జంతువు; 2. భూతవిశేషము. విశ. పీనుఁగు.

ప్రేతవనము. సం. వి. అ. న. ఒలికిమిట్ట, శ్మశానము.

ప్రేపు. వై. వి. ఉషఃకాలము, వేకువ. "ఉ. ప్రేపులు రేలుఁ బెద్దయును జేర్చిసమీపనగేంద్రచంద్రకాం, తోపలతోయదంబు నదులొక్క మొగింజను దెంచియాదటన్, బైపడఁదానునల్లసితభాతిఁ దదీయనదాభిసారమున్, దీపెసలారఁగైకొనిమదించునదీపతికోర్కి వింతగన్." లక్ష్మి. ౧, ఆ.

ప్రేమ. సం. వి. న్. పుం, న. 1. హర్షము; 2. స్నేహము. (రూ. ప్రేమము.)

ప్రేము. దే. వి. బెత్తము, వేత్రము. (పేమునకు మొదటిరూపము.)

ప్రేముడి. వై. వి. స్నేహము. (చూ. పొడచూచే.)

ప్రేముడించే. వై. అ. క్రి. 1. ప్రియపడు; "చవులకుఁ బ్రేముడించుననిశంబును నాలుక." భార. ఆర. ౬, ఆ. — 2. శోకించే*; "ఆ. భీమనందనుచావునఁ బ్రేముడించి, ధర్మతనయుండు బాష్పంబు ధారలవర, మేనుడిల్లంబుగాఁ దేరిమీఁదవివశుఁ, డగుచుఁ జతికిలఁబడుటయునచ్యుతుండు." సం. "అశ్రుపూర్ణముఖోరాజానిశ్వసంశ్చపునఃపునః, కశ్మలం ప్రావిశద్ఘోరం దృష్ట్వా కర్ణస్య విక్రమమ్, తంతథావ్యధితందృష్ట్వా కృష్ణోవచనమబ్రవీత్." భార.

ద్రో. ౫, ఆ.—3. బాధపడు*. "తే. చావుతథ్యముమనకువిచారమేల, పెక్కుదినములయాఁకటఁ బ్రేముడించు, హరికిచెచ్చోట నేమియుదొరకదయ్యె, నరయనంతయుదైవికంబట్లకాద." పంచ. నా. ౧, ఆ.

ప్రేయసి. సం. వి. ఈ. స్త్రీ. ప్రియురాలు.

ప్రేయసుఁడు. సం. వి. న్. పుం. ప్రియుఁడు.

ప్రేరకుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ప్రేరేపణచేయువాఁడు.

ప్రేరణము. సం. వి. అ. న. ప్రేరేపణ. (ఇది ఆకారాంతస్త్రీలింగముగాను కనఁబడుచున్నది.)

ప్రేరణి. సం. వి. ఈ. స్త్రీ. నృత్యవిశేషము. "సీ. కుండలీప్రేరణీదండలాసకముఖ్యనృత్యంబులచ్చరల్ సెలపుచుండ." పు. ౧. ఆ. (చూ. పేరణి.)

ప్రేరణీయము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రేరణచేయఁదగినది.

ప్రేరించు. సం. స. క్రి. ప్రేరేపణచేయు, ప్రేరేచు.

ప్రేరితము. సం. విణ. (అ.ఆ.అ.) ప్రేరేపఁబడినది.

ప్రేరేచు. వై. స. క్రి. ప్రేరించు. "ఎవ్వరైనఁబ్రేరేచిరో నీవెపేద్కుఁజరించెదో." ఉ, రా. ౨, ఆ.

ప్రేరేపణ. వై. వి. ప్రేరణము. (ఇది వాడుకలోనిది.)

ప్రేరేపించు. వై. స. క్రి. ప్రేరేపుయొక్క రూపాంతరము. (ఇది వాడుకలోనిది.)

ప్రేరేపు. వై. స. క్రి. ప్రేరేచుయొక్క రూపాంతరము. "క. ఈరీతిమనకువిరహము, ప్రేరేపయశోదపట్టిఁ బెడఁబాపినయా, క్రూరునినక్రూరుండని, యేరీతింబిలువవచ్చునింతులువినరే." వి. పు. ౭, ఆ.

ప్రేలడము. దే. వి. ప్రేలుట. "ఆ. మనసురాదునాకుమానినీమణులార, ప్రేలడములుగట్టి పెట్టిరండు,కాకయున్ననన్నుఁగనలింపకూరక, యుండుఁడనినవారలులుకుపుట్టి." చంద్రా. ౨, ఆ. (దీనికి పురాతనగ్రంథములయందు ప్రయోగముకానఁబడదు.)

ప్రేలరి. దే. విణ. వదరుఁబోతు, జల్పాకుఁడు. "క. ప్రేలరులైవెడయఁబుల, నాలిగొనకపొందుతోలఁగియనవుడు." హరి. పూ. ౮, ఆ.

ప్రేలలు. దే. వి. పేలలకు మొదటిరూపము. (వృత్తియందేకవచనాంతము. ప్రేలగింజలు.)

ప్రేలిక. దే. వి. పేలికకు మొగటిరూపము.

ప్రేలు. దే. అ. క్రి. 1. వదరు; "క. కాలుఁడుప్రేరేపఁగనిటు, ప్రేలినయంతటసెనిన్నుఁబెద్దగఁదలఁపం, బోలు నెమాకును." భార. ఉద్యో. ౨, ఆ.—2. వేఁగు; (చూ. పొడ.) 3. వేఁగియుబుకు. "సీ. పగిలిభద్రేభకుంభములమౌక్తికములు పెటిలి నల్దిక్కులఁబ్రేలిపడఁగ." జై. ౪, ఆ.

ప్రేలించు. దే. ప్రే. (ప్రేలఁజేయు.) వేఁచు. (రూ. ప్రేల్చు. "ఆ. సప్తహయుఁడుమూర్తిసప్తకంబుధరించి, కరమువేఁడిమిగులుకరములొప్ప, నదనదీజలములుదధిజలంబులుఁ, బీల్చిజగములెల్లఁబ్రేల్చఁగడఁగి." భార. అర. ౪, ఆ.)

ప్రేలుడు. దే. వి. ప్రేలుట.

ప్రేవు. దే. వి. ప్రేగుయొక్కరూపాంతరము. "క. ప్రోవులుగట్టినగుట్టపుఁ, బ్రేవులు." భార. భీష్మ. ౨, ఆ.

ప్రేషకుఁడు. సం. విణ. (అ.ఈ.అ.) పంపువాఁడు.

ప్రేషణము. సం. వి. అ. న. పంపుట.

ప్రేషణీయుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) పంపఁదగినవాఁడు.

ప్రేషితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పంపఁబడినవాఁడు.

ప్రేష్ఠము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ప్రియమైనది.

ప్రేష్యుఁడు. సం. వి. అ. పుం. భృత్యుఁడు. విణ. పంపఁదగినవాఁడు.

## ప్రై.

ప్రైషము. సం. వి. అ. పుం. 1. ప్రేషణము; 2. మర్దనము; 3. క్లేశము; 4. ఉన్మాదము.

## ప్రొ.

ప్రొద్దు. వై. వి. 1. సూర్యుఁడు; "వ. కందమూలఫలంబులయాహారంబుగాఁబ్రొద్దువడినచోటనివాసంబుగామృగంబులసహాయంబుగావనంబునంబరిభ్రమించితి." భార. అర. ౨, ఆ.—2. కాలము*; "క. ఏప్రొద్దుశూద్రమునివిగ, తప్రాణునిఁజేసితీవుధర్మనిరతినా, విప్రశిశువుచైతన్యం,బొప్రొద్దయనూనముగసమాహితమయ్యెన్." నిర్వ. ౧౦, ఆ. (చూ. నేల.)—3. దినము*; (చూ. పదపడి.) 4. పూఁట*; "సీ. అధ్యయనంబునుయజనంబు దానంబు నధ్యాపనంబునుయాజనముఁబ్రతిగ్రహంబును బ్రశాంతియుఁదపస్సత్యశౌచంబులువిప్రధర్మంబులౌప, దలఁదక్కనతనికివలవదువాణిజ్యమగ్ని కార్యంబు శూద్రాన్నవర్జ, నమునిజ

దారసంగమనియమంబును నిరుప్రొద్దుగుడుపును హింసలేమి, యునునివాసశుద్ధియును నతిథిప్రియ, త్వంబుబ్రాహ్మణులకువలయుఁదపము, స్వర్గసాధనముగధర్మమూలముగవా, రలసృజించెఁగా దెనలినభవుఁడు." భార. అను. ౫, ఆ.—5. ఉషఃకాలము*; "రమణుల్ ప్రొద్దునమేలుకాంచి." భాగ. ౧౦, స్కం. పూ.—6. బ. ప్రసవదినములు. "క. ముద్దియమునిహృత్కమలము, లుద్దామశ్రీసమృద్ధినొందఁగఁగనియెన్, బ్రొద్దులు నిండుటఁజేసెల, సద్దీప్తసహస్రభానుశతకోటిని భున్." రామా. 3, ఆ.—(చూ. ఉద్దియసేయు.) (ఉషఃకాలము అను నర్థమునందు కొందఱు అవ్యయముగా వ్రాసియున్నారు. ఆపక్షమున ప్రొద్దిటిపూఁట, ప్రొద్దుటెండ ఇత్యాదిరూపములు సిద్ధింపవు.)

**ప్రొద్దుఁగల్లు.** ద్వ.వి. (ప్రొద్దు+కల్లు.) సూర్యకాంతశిల. "ప్రొద్దుఁగల్లాడెంపుమిద్దియులును." అచ్చ సుం, కాం. (ఇట్లు ప్రొద్దుతాయి.)

**ప్రొద్దుఁగొడుకు.** వై. వి. (ప్రొద్దు+కొడుకు.) 1. యముఁడు; 2. శనైశ్చరుఁడు; 3. కర్ణుఁడు; 4. సుగ్రీవుఁడు. (ఇట్లు ప్రొద్దుఁబట్టి. మొ.)

**ప్రొద్దుచూలి.** ద్వ. వి.——పై.——

**ప్రొద్దుదిరుగుడు.** ద్వ. వి. (ప్రొద్దు+తిరుగుడు.) సూర్యానువర్తిని?.

**ప్రొద్దుచిక్క.** వై. వి. ఉత్తరఫల్గునీనక్షత్రము.

**ప్రొద్దుచిక్కనెల.** ద్వ. వి. ఫాల్గునమాసము.

**ప్రొద్దులనెల.** ద్వ. వి. (ప్రొద్దులు+నెల.) ప్రసవమాసము, వైజననము. "తే. సతికిఁబ్రొద్దులనెల చొచ్చె జడత హెచ్చె." కళా. ౫, ఆ.

**ప్రొయి.** దే. వి. ప్రొయ్యియొక్కరూపాంతరము.

**ప్రొయ్యి.** దే. వి. వంటకు అగ్నిని ప్రజ్వలింపఁజేసెడు యంత్రవిశేషము, అధిశ్రయణి. (ఇది త్రివిధము.—గడ్డప్రొయ్యి, గాఁడిప్రొయ్యి, గుంటప్రొయ్యి.)

## ప్రో.

**ప్రోఁగు.** దే. వి. పోఁగునకు మొదటిరూపము.

**ప్రోఁజే.** దే. స. క్రి. (చూ.) పోఁజే. "ఉ. ప్రత్తినిఁబ్రోఁజుచున్ వడికి బ్రాహ్మణుఁడిచ్చుపవిత్రతంతువుల్, క్రొత్తగనేకవింశతియుఁగూర్చి." ఉ, హరిశ్చ. ౪, ఆ.

**ప్రోక.** వై. వి. ప్రోగు, రాశి*. "క. అంకరముతోడనప్పెను, మూఁకలపైకుతికికతినముష్టినిహతులన్, మ్రాఁకులశిలలనుబీనుఁగు, ప్రోకలుగావించిరపుడుపాడవడఁగవడిన్." రా. యు, కాం.

**ప్రోక్షణము.** సం. వి అ. న. 1. (నీళ్లు) చిలుకరించుట; 2. (యజ్ఞమునందు) పశువునువధించుట.

**ప్రోక్షించు.** సం. స. క్రి. 1. (నీళ్లు) చిలుకరించు; 2. (యజ్ఞమునందు) పశువునువధించు.

**ప్రోక్షితము.** సం. విశ. (అ.ఆ.అ.) 1. చిలుకరింపఁబడినది; 2. (యజ్ఞమునందు) వధింపఁబడినది.

**ప్రోగు.** వై. వి. ప్రోక, రాశి*. (చూ. ప్రోవు.)

**ప్రోచికోలు.** దే. వి. (బలహీనత్వముపొందినగవాదికమును) కాపాడియనుభవించుకొనుట. (వానికి ఆయావును ప్రోచికోలుగా ఇచ్చినాఁడు.) విశ. వ్యర్థము. (గడ్డిపోఁచయు ప్రోచికోలు కాదనఁగా మనుష్యుని చెప్పనేల.) (దీనిని వాడుకయందు పోచికోలందురు.)

**ప్రోచిల్లు.** వై. వి. బ. పోచిల్లకు మొదటిరూపము.

**ప్రోచు.** వై. స. క్రి. అన్నపానాదులిడిపోషించు. "క. పేదమనసగుటధర్మువు, గాదునరేంద్రునకుజగముగావన్ బ్రోవన్, గాదెన్నృపులోకపాలాం, శోదితుఁడుగఁజేసెఁబద్మయోనిచతురతన్." భార. శాం. ౧, ఆ.

**ప్రోడ.** వై. విశ. 1. ప్రగల్భుఁడు; 2. నిపుణుఁడు; "క. మీసలుదువ్వుచునుడుగని, రోసంబునఁదేరులెక్కిప్రోడలయినరా, కాసిపజీరులఁగొందఱు, బాసటగొనినల్ దెఱఁగులపౌఁజులుఁగొలువన్." అచ్చ. యు, కాం.—౩. వివేకి*. "ఎ, గీ. బుద్ధిచెప్పినవినియెడుప్రోడగాఁడు." భార. స్త్రీ. ౧, ఆ.

**ప్రోడఁడు.** వై. విశ. ప్రోడయొక్కరూపాంతరము. (నిపుణునకు.—"క. ఏడెనిమిదిదినములనీ, రేడుజగంబులనువ్రాసియిచ్చెదనీకున్, జూడుముచిత్రపటములోఁ, బ్రోడండైనిన్నుఁ బొంది పోయినవానిన్." వి, పు. ౭, ఆ.) (ఇది జోణఁడువంటిది.)

**ప్రోతము.** సం. వి. అ. న. వస్త్రము. విశ. కుట్టఁబడినది.

**ప్రోథము.** సం. వి. అ. పుం, న. గుఱ్ఱపుముక్కు. పుం. 1. గర్భపిండము; 2. పిఱుఁదు; 3. జీర్ణవస్త్రము. విశ. 1. తెరువరి; 2. ప్రసిద్ధికెక్కినది; 3. స్థాపింపఁబడినది.

ప్రోది. వై. వి. 1. పోషణము; "వసుమతీసురవంశవతంసమెల్లవారు న్వినుతింపఁ బెంపొసఁగఁ బ్రోదియొనర్చుచుఁదల్లిఁదండ్రి." పాండు. ౨, ఆ.— 2. వైభవము*. "క. ఆదట నేనుఁగుడిగితన, పైదలియుండాను బైఁడిపళ్లెరములము, త్తైదువలారతులీఁగాఁ, బ్రోదిందననగరుసొచ్చెఁ బూనికతోడన్." య. ౪, ఆ.

ప్రోదిగొను. ద్వి. స. క్రి. (ప్రోది+కొను.) పోషించు. "మ. అనిఁజెండాడివిపక్షవృక్షములశౌర్యాగ్నిచ్ఛటం బ్రేల్చి, శస్త్రశరచ్ఛేదములన్ రణోర్వితలమున్ సంక్షుణ్ణముంజేసి వై, రృసృగార్ద్రంబొనరించి ప్రోదిగొనకుద్యత్కీర్తిసస్యౌఘముల్, వెససిద్ధించునె యంచుఁబల్కు నరసోర్వీనాథుయోధావళుల్." కా. 3, ఆ.

ప్రోదిసేయు. వై. స. క్రి. (ప్రోది+చేయు.) పోషించు. "సీ. ఆదిమనృపగతిమేదినీజనములఁ బ్రోదిసేయుచు నొప్పుమాదవిభుని." కళా. ౧, ఆ.

ప్రోపడు. వై. అ. క్రి. (ప్రోవు+పడు.) పోషింపఁబడు. (ఇది త్రోపడువంటిది.)

ప్రోపరి. ద్వి. విశే. (ప్రోవు+అరి.) 1. పోషకుఁడు; 2. రక్షకుఁడు. "ఉ. కల్లలకల్లనిల్కడలు గారెకనుంగొన నేల ప్రోపరుల్." అచ్చ. అ, కాం.

ప్రోవు. వై. వి. పోషణము. "ఆ. కొడుక నిన్నుఁ గాంచుకొం టెఁత నోము లెకాని, పెంచి గారవించి పేర్మి నీదు ప్రోవుగుడువఁ గాంచుపుణ్యంబు తుదిముట్ట, నేలచేయనైతి నేనుగుఱ్ఱ." భార. అర. ౭, ఆ.

ప్రోయాలు. ద్వి. వి. (ప్రోలు+ఆలు.) ఇల్లాలు, పురంధ్రి. "ఉ. పాలును నీరు నేఱుపఱుపంగలమావులవేదపీథివా, హ్యాళియొనర్చు నేయళికులాలకదాసితవర్ణయయ్యునే, బాలసువర్ణరూపమునభాసిలుబానలు మోము వేల్పుప్రో,యాలు ప్రవీణమాయకమహాకృతినాథుఁ గృతార్థుఁ జేయుతన్." రామా. ౧, ఆ. (ఇక్కడ ప్రోలుశబ్దమునకు ఇల్లు అర్థమని గ్రహింపవలెను.)

ప్రోలు. వై. వి. పట్టణము. "ఆ ప్రోలు." ఉ, రా. 3, ఆ.

ప్రోల్గుడువు. దే. స. క్రి. ప్రేరేచు. (అప్ర.)

ప్రోవు. వై. వి. ప్రోగుయొక్క రూపాంతరము. "సీ. రోమాంచలీలల ప్రోవులై యొండొరువుల మూర్తులాశ్లేషకలనసోఁగియ." ఉ, హరి. 3, ఆ. "ఉ. వేవురుచంద్రులొల్లఁబడి వేవురుసూర్యులు లక్షపావకుల్, ప్రోవయియున్న యట్టిదగు భూరితరంబగు తేజము." హరి. ఉ. ౯, ఆ.

ప్రోవుకొను. ద్వి. అ. క్రి. రాశిపడు. (ప్రే. ప్రోవుకొలుపు. "ప్రోవుకొల్పెడు మహామలకోపమమౌక్తికావళిన్." కవిక. ౬, ఆ.)

ప్రోషము. సం. వి. అ. పుం. కాల్చేట, ప్లోషము.

ప్రోషితభర్తృక. సం. వి. ఆ. స్త్రీ. ప్రియుఁడు దేశాంతరగతుఁడైయుండ ఖేదము నొందియుండు నాయిక. (చూ. నాయిక.)

ప్రోషితుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) దేశాంతరగతుఁడు.

ప్రోష్ఠి. సం. వి. ఈ. స్త్రీ. ఎగిరియెగిరిపడెడు మత్స్యవిశేషము.

ప్రోహము. సం. వి. అ. పుం. 1. ఏనుఁగుకాలు; 2. ఏనుఁగుమోఁకాలు; 3. కూర్పు; 4. నేర్పు. విశే. 1. నేర్పరి; 2. డు. తార్కికుఁడు.

## ప్రౌ.

ప్రౌఢ. సం. వి. ఆ. స్త్రీ. స్వీయాంతర్భేదవిశిష్టనాయికావిశేషము. (పదునెనిమిదియేండ్లకు పైపడిన వయస్సుగలిగి సంపూర్ణ యౌవనముగలది.)

ప్రౌఢి. సం. వి. ఇ. స్త్రీ. ప్రౌఢిమ, నేర్పు.

ప్రౌఢిమ. సం. వి. న్. పుం. నేర్పు, (రూ. ప్రౌఢిమము.)

ప్రౌఢుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) 1. ప్రగల్భుఁడు; 2. నిపుణుఁడు; 3. ప్రవృద్ధుఁడు.

ప్రౌష్ఠపద. సం. వి. ఆ. స్త్రీ. పూర్వాభాద్రానక్షత్రము. అ. పుం. ము. భాద్రపదమాసము. (రూ. ప్రోష్ఠపద, ప్రోష్ఠపదము.)

## ప్ల.

ప్లక్షము. సం. వి. అ. పుం. 1. జువ్వి; 2. కలుజువ్వి; 3. రావి; 4. ఒకద్వీపము. (చూ. ద్వీపము.)

ప్లవ. సం. వి. అ. పుం. ఒకసంవత్సరము. (చూ. సంవత్సరము.) న. ము. 1. కయివడిముస్తె; 2. గంధతృణము. పుం. 1. తెప్ప; 2. కప్ప; 3. కోఁతి; 4. గొఱ్ఱె; 5. నీరుకాకి; 6. నీరుకోడి; (కొందఱు కన్నెలేడియందురు.) 7. వాటపుఁబల్లు నేల; 8. ప్లుతస్వరము; 9. దాఁటు; 10. కాకితుమ్మికి; 11. జువ్వి. డు. మాలవాఁడు.

ప్లవంగ. సం. వి. అ. పుం. ఒకసంవత్సరము. (చూ. సంవత్సరము.) ము. 1. కోఁతి; 2. కప్ప.

ప్లవంగమము. సం. వి. అ. పుం. 1. కోఁతి; 2. కప్ప.
ప్లవగము. సం. వి. అ. పుం. 1. కోఁతి; 2. కప్ప. డు. అనూరుఁడు.

ప్లా.

ప్లాక్షము. సం. వి. అ. న. ప్లక్షఫలము.

ప్లీ.

ప్లీహము. సం. వి. న్. పుం. హృదయమున ఎడమప్రక్కనుండెడు మాంసగోళము.
ప్లీహశత్రువు. సం. వి. ఉ. పుం. ములుమోదుగు?.

ప్లు.

ప్లుతము. సం. వి. అ. న. వేగమున అంతమేరయు సముగాఁబోయెడు అశ్వధారావిశేషము. నిబ్బరము. (చూ. ధార.) పుం. మూడుమాత్రలకాలము గలస్వరము.
ప్లుష్టము. సం. విశ. (అ. ఆ. అ.) కాల్పఁబడినది.

ప్లో.

ప్లోషము. సం. వి. అ. పుం. కాల్చుట, ప్రోషము.

ఫ.

ఫ. ఒక అక్షరము.
ఫకీరు. హిం. వి. భిక్షుకుఁడు, మహమ్మదీయులలో బైరాగి.
ఫక్కి. సం. వి. ఈ. స్త్రీ. రీతి, ప్రకారము.
ఫక్కిక. సం. వి. ఆ. స్త్రీ. ఏకగ్రంథము.
ఫక్తు. హిం. క్రి. విశ. మాత్రము, ఊరక, ఉత్త.
ఫణ. సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. పాముయొక్క పడగ.
ఫణి. సం. వి. న్. పుం. పాము, సర్పము, భోగి.
ఫణిజ్జకము. సం. వి. అ. పుం. మరువము, (రూ. ఫణిర్జకము?.)
ఫణితము. సం. వి. అ. న. వాక్కు. విశ. చెప్పఁబడినది.
ఫణితి. సం. వి. ఇ. స్త్రీ. వాక్కు.
ఫర్మానా. హిం. వి. రాజాజ్ఞ, శాసనము. (రూ. ఫర్వానా.)
ఫర్మాయించు. హిం. వి. ఆజ్ఞాపించు.
ఫర్వా. హిం. వి. లక్ష్యము.
ఫర్మాయిషి. హిం. వి. ఏదైననొకపనిచేయ నాజ్ఞయిచ్చుట.
ఫలకము. సం. వి. అ. పుం. పలక. పుం, న. కేడెము.
ఫలపూరము. సం. వి. అ. పుం. మాదిఫలము.
ఫలము. సం. వి. అ. న. 1. పండు; 2. పంట; 3. ప్రయోజనము; 4. లాభము; 5. జాజికాయ; 6. ప్రత్తికాయ; 7. కేడెము; 8. బాణముములికి; 9. నాఁగటికఱ్ఱు; 10. పందికోలచివర.
ఫలముపాటు. గ్రా. వి. లాభము, ప్రయోజనము.
ఫలవంతము. సం. విశ. (త్. ఈ. త్.) పండ్లుగలది. (వృక్షము.)
ఫలసాయము. గ్రా. వి. పంట.
ఫలాధ్యక్షము. సం. వి. అ. న. క్షీరిక, పాల?.
ఫలానా. హిం. విశ. అట్టి, ఒకానొక. (రూ. ఫలాని.)
ఫలి. సం. వి. ఈ. స్త్రీ. ప్రేంకణము?. విశ. (న్.) పండ్లుగలది. (వృక్షము.)
ఫలించు. సం. అ. క్రి. 1. పండు; 2. నెఱవేరు.
ఫలితము. సం. వి. అ. పుం. వృక్షము. విశ. ఫలించినది.
ఫలినము. సం. విశ. (అ. ఆ. అ.) పండ్లుగలది. (వృక్షము.)
ఫలిని. సం. వి. ఈ. స్త్రీ. 1. తరిగొఱ్ఱి?; 2. ప్రేంకణము?. విశ. పండ్లుగలది. (వృక్షము.)
ఫలేగ్రహి. సం. విశ. (ఇ.) ఫలించునది. (వృక్షము.)
ఫలేరుహ. సం. వి. ఆ. స్త్రీ. కలిగొట్టు?.
ఫల్గునుఁడు. సం. వి. అ. పుం. అర్జునుఁడు.
ఫల్గువు. సం. వి. ఉ. స్త్రీ. కుక్కమేడి?. విశ. సారములేనిది.
ఫసలీ. హిం. వి. పంట, సంవత్సరము.

ఫా.

ఫాంటము. సం. వి. అ. పుం. ఆయాసములేక చేసిన కషాయములోనగునది.
ఫాణితము. సం. వి. అ. న. కండచక్కెర.
ఫామేదా. హిం. విశ. అలవరిన, చేయితిరిగిన.
ఫాయిదా. హిం. వి. లాభము.
ఫారం. ఆం. వి. లెక్కలచిట్టా.
ఫారసి. హిం. వి. ఒకభాష. (రూ. పారసి.)
ఫాలనేత్రుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.
ఫాలము. సం. వి. అ. న. నెత్తి. పుం. నాఁగటికఱ్ఱు. డు. 1. బలరాముఁడు; 2. శివుఁడు. విశ. ము. నూలిచే నేయఁబడినది. (వస్త్రము.)
ఫాల్గునము. సం. వి. అ. పుం. 1. ఒకమాసము; (చూ. మాసము.) 2. ఏఱుమద్ది?. డు. అర్జునుఁడు.
ఫాల్గునికము. సం. వి. అ. పుం. ఫాల్గునమాసము.

ఫి.

ఫిరాయించు. హిం. స. క్రి. మార్చు.
ఫిర్కా. హిం. వి. ఒకభాగము.
ఫిర్యాది. హిం. వి. వాది.
ఫిర్యాదు. హిం. వి. విన్నపము, మొఱ.

ఫీ.

ఫీజౌ. ఆం. వి. బ. ఇంత యిత్తుమని ఒడఁబడిన ద్రవ్యము, జీతము.

ఫు.

ఫురసత్తు. హిం. వి. అవకాశము.
ఫుల్లము. సం. విణ. (అ.ఆ.అ.) వికసించినది, విరిసినది.
ఫుల్లరీకము. సం. వి. అ. పుం. పాము, సర్పము.

ఫే.

ఫేనము. సం. వి. అ. పుం. సముద్రపునురుఁగు.
ఫేనిక. సం. వి. ఆ. స్త్రీ. భక్ష్యవిశేషము, ఫేణీ.
ఫేనిలము సం. వి. అ. న. రేగుఁబండు. పుం. కుంకుడుకా. విణ. నురుఁగుగలది.
ఫేరవము. సం. వి. అ. పుం. నక్క. డు. రాక్షసుఁడు.
ఫేరువు. సం. వి. ఉ. పుం. నక్క, జంబుకము.
ఫేల. సం. వి. ఆ. స్త్రీ. ఎంగిలి, ఉచ్ఛిష్టము.

ఫ్లా.

ఫ్లానెలు. ఆం. వి. ఉన్నివస్త్రము.

ఫ్సా.

ఫ్సాతము. సం. విణ. (అ. ఆ. అ.) భక్షింపఁదగినది.

బ.

బ. ఒక అక్షరము.
బంక. దే. వి. 1. చెట్లయందుఁగలిగెడు జిగటగలవస్తువు, నిర్యాసము; 2. వ్యాధివిశేషము.
బంకమన్ను. ద్వ. వి. జిగటగల ఒకదినుసుమట్టి.
బంకముచ్చు. దే. విణ. పిసినారి, లోభి.
బంకు. దే. వి. సందువీధి. విణ. 1. శూరునివలెనటించువాఁడు; "చ. అనుటయుహంసుఁడిట్లనుజనార్దనులోముదిజోదుభీష్మునాం, డనఁబని లేదుబాహ్లికుఁడునాతనికంటెనుబంకు." ఉ, హరి. ౪, ఆ.—2. కావలివాఁడు.
బంకెత. దే. విణ. (బంక+ఎత.) లుబ్ధురాలు. "ద్వి. బంకెతల్ అంకెతల్ పచ్చిరక్కసులు."పండి. ౫, ప్ర.

బంకోలు. వై. వి. జన్మఖయిదు వేయఁబడినవారినిపంపు ద్వీపాంతరము.
బంగనబయలు. వై. వి. (బయలు+బయలు.) బట్టబయలు.
బంగరము. వై. వి. బంగారముయొక్క రూపాంతరము. (చూ. గవ్వచాకము.)
బంగరు. వై. వి. బంగారుయొక్క రూపాంతరము. "క. కరులేటికిగడితపుబం, గరులేటికిమతియుమేల్నగరులేటికిరా, సిరులేటికిబల్రతనపు, సరులేటికినిన్నువిడిచి చనుసెడఁదరుణీ." రసి. ౬, ఆ.
బంగరుకొండ. వై. వి. హేమాద్రి. "బంగరుకొండధైర్యమున." బ్ర. ౨, ఆ.—విణ. మంచివాఁడు. (చూ. బంగారుకొండ.)
బంగరుపిచ్చిక. ద్వ. వి. పక్షివిశేషము. (చూ. గడ్డిపిట్ట.)
బంగరువు. వై. వి. బంగరుయొక్క రూపాంతరము. "పదాఱువన్నెబంగరువున." పాండు. ౧, ఆ.
బంగల. దే. వి. కుంపటి, అంగారధానిక.
బంగారము. వై. వి. స్వర్ణము. విణ. దుర్లభము*. "సీ. కప్పుకోకేల బంగారమా పువుబంతులవిసువర్ణలతోదయములుసుమ్ము." పు. ౧, ఆ.
బంగారు. వై. వి. విణ. బంగారముయొక్క రూపాంతరము.
బంగారుకుండ. వై. వి. స్వర్ణఘటము. విణ. మనోజ్ఞ. (చూ. తేరకుఁదేర.)
బంగారుకొండ. వై. వి. హేమాద్రి. విణ. మంచివాఁడు*. (వీఁడు మాబంగారుకొండ.)
బంగారుతీఁగలు. వై. వి. బ. శాలిధాన్యవిశేషము. "సీ. కణఁజముల్ నిండ బంగారుతీఁగలుగూర్పఁజాలమేమతిముత్తెసరులుగూర్ప." కవి. ౧, ఆ.
బంగాళము. ఉభ. వై. వి. వంగదేశము. (ఇది వాడుకలోనిది.) సం. అ. పుం. ఇక్షువిశేషముకా.
బంగాళా. హిం. వి. పెద్ద యిల్లు.
బంగాళి. సం. వి. ఈ. స్త్రీ. కొమ్మరంటికా.
బంగి. వై. వి. గంజాయి, మదమత్తము.
బంగి. హిం. వి. టప్పామీఁదవచ్చు వస్తువులకట్ట.
బంగిముచ్చు. ద్వ. విణ. బంగితాగువాఁడు.
బంజరు. హిం. వి. బీడునేల.
బంజారి. హిం. వి. ఒకజాతిజనులు, లంబాడివాండ్రు.
బంటి. దే. అప. నీళ్లకొలఁదినిదెలిపెడు ప్రత్యయము. (మోఁకాలిబంటి, మొలబంటి, పుక్కిటిబంటి. ఈఁతబంటి. మొ.)

బంటు. వై. వి. 1. సేవకుఁడు*; 2. భక్తుఁడు*; "సీ. మునిమాపు బలుగంబమునఁబుట్టి బంటునక్కఱఁ గాచినట్టిసింగంబవీవ." పా. ౧, ఆ.—3. శిష్యుఁడు*. "చ. గొనముల ప్రోకయంగిరసుకూరిమిసు న్నఁడు వేల్పుటొజ్జపే, ర్మినిగనుఁగొన్న బిడ్డమతి మీకునుబంటు." య. 3, ఆ.—విశే. శూరుఁడు. "క. ఇంటం దేవులునఁజచ్చుట, కంటెను బాపంబులొండుగలవెన్న పులకున్, బంటైకలనంబొలియుటఁ, గంటనిధానంబుఁగంటకాదేమనకున్." భార. భీష్మ, ౧, ఆ.

బండ. యు. దే. వి. 1. వెడలుపుఱాయి; 2. పొట్టిరోఁకలి. విశే. ఆటేగినది. వై. వి. ఘోరకృత్యములచే బిచ్చమెత్తెడు ఒక నీచజాతి. (బండవాఁడు, బండది.) విశే. ఆకతాయి*.

బండఁడు. వై. విశే. ఆకతాయి*. (బండయొక్కరూపాంతరము. బిడ్డఁడులోనగువానివంటిది.)

బండగు. వై. వి. బోను*. (చూ. దీము.)

బండగుఁడు. వై. విశే. బండ, ఆకతాయి*. "ఎ, గీ. జాలికాదులచేత దూషకులచేతఁ, బ్రల్లదులచేత వంశనాపకులచేత, డాంబికులచేతఁబచ్చిబండగులచేతఁ, గల్లరులచేత దర్పించుఁగలియుగంబు." జై. ౫, ఆ.

బండము. వై. వి. వస్తువు. "క. కొలుచాదిగఁగలబండము, గొలుచు నెడన్ దూఁచుచోటఁ గుటిలతఁ దఱుఁగన్, గొలిచినఁదూఁచినబండము, దళము నబేహారిమీఁదదండువుదగులున్." విజ్ఞా. ప్రా, కాం.

బండరువు. వై. వి. బండారము. "సీ. ఆయాధికవ్యయానధికంబును బ్రజాళివిరుజంబుఁగాఁగబండరువుగూర్చి." ఆము. ౪, ఆ.

బండవలము. వై. వి. 1. సంచిమొదలు*; 2. సామర్థ్యము*.

బండాట. ద్వి. వి. (బండ+ఆట.) ఆకతాయితనము. (రూ. బండాటము. "ఎ, గీ. తోడబండాటమునఁ గోకదోఁచుకొనుచు." కవిక. ౪, ఆ.) (చూ. అఱకడ.)

బండారము. వై. వి. బొక్కసము. "సీ. బండారములయందుఁ బరమవిశ్వాసులభక్తులదక్షులఁబంచితయ్య." భార. సభా. ౧, ఆ.

బండారి. ద్వి. వి. (బండారము+ఇ.) బొక్కసమునకధికారి. "ఎ, గీ. తనరుచలమర్తిగండ ప్రతాపరుద్ర, మనుజవరునకుబండారియును మహాధి, కారియును నాప్తుఁడునునయిగణనకెక్కె, మేరుధీరుండు నాగయమేచశౌరి." మార్క. ౧, ఆ.

బండారు. యు. దే. వి. (బండ+అరు.) ఱాతిమీఁద ఱాచిపూసికొనెడుపసుపు. "ద్వి. బండారుకొమ్మినిపట్టపు సెట్టి, యిలుదూఱనిచ్చునే." భల్లా. ౧, భా.—వై. వి. బండారము. "బండారిలు." ఆము. ౪, ఆ.

బండారుఁడు. సం. వి. అ. పుం. బట్టలను కాచువాఁడు.

బండారుపిచ్చిక. దే. వి. (చూ.) పీతముండము.

బండాలము. వై. వి. సామగ్రి, సామర్థ్యము. (బండవలముయొక్క రూపాంతరము.)

బండి. దే. వి. 1. శకటము; 2. రథము. "సీ. ఎలుఁగులుఁబులులుఁగారెనుఁబోతులునుబూను బండిపై దేవాంతకుండువచ్చె." రామా. ౫, ఆ.

బండిగిల్లు. దే. అ. క్రి. కడగండ్లుపడు.

బండిగురిగింజె. ద్వి. వి. బండిగురివెందగింజె.

బండిగురివెంద. ద్వి. వి. కాంభోజీ?.

బండిమొగ్గరము. దే. వి. శకటవ్యూహము.

బండిరిక్క. ద్వి. వి. రోహిణీనక్షత్రము.

బండు. వై. వి. 1. ఆకతాయితనము*; "ఎ, గీ. నీవు వచ్చితిమేలయ్యె నిదియెచాలు, నతఁడురాకున్నఁ గొదలేశమైనలేదు, తానుభిక్షాకపాలంబుదాల్చి వచ్చి, బండుసేయుటకంటెరాకుండుటుఁ అవు." కాశీ. 2, ఆ.—2. ఆకతాయిమాట*. (నన్ను వాఁడు బండుబూతులు తిట్టినాఁడు.)

బంతి. యు. దే. వి. చెండు. వై. 1. పఙ్క్తి; (చూ. పసాదము.) 2. పది. (చూ. నట్టు.)

బంతికట్టు. ద్వి. వి. కుప్పనుఱుచునప్పుడు ఎడ్లవరుస కుఁగట్టెడుపలుపు.

బంతికుడుపు. ద్వి. వి. అనేకులుఁచేరి భుజించుట, సజ్ఞ్ధి.

బంతిచెట్టు. దే. వి. ఒకదినుసు చేమంతిచెట్టు.

బందడము. దే. వి. దొంతికుండ.

బందన. వై. వి. 1. జిగట*; 2. బంక*.

బందనగొను. ద్వి. అ. క్రి. (బందన+కొను.) జిగటగలదియగు. "వ. ఇందూపలస్యందంబులకువిందులగు నిందీవరమరందంబులపెందడింబడిబందనగొను వలిమించు క్రొమ్మించుటొదులీఁదియాఁది." స్వా. 3, ఆ.

బందము. వై. వి. 1. దూలముపైగుజ్జులకుబిగువునిమిత్తములంకెగానమర్చినపట్టె*; 2. చెట్టెక్కువాఁడు

కాలికితగిలించుకొనెడుత్రాడు*; 3. పశువులకు రెండుకాళ్లుచేర్చికట్టెడుత్రాడు*.

బందలము. దే. వి. బందడముయొక్క రూపాంతరము.

బందా. వై. విణ. చెఱఁబడ్డవాఁడు*. "ఎ, గీ. పవన పర్ణాంబుభక్షులైనవసి యినుప, కచ్చడాల్ కట్టుకొనుమునిముచ్చులెల్లఁ, దామరసనేత్ర లిండ్లబందాలుగారె." స్వా. ౨, ఆ.

బందాము. వై. వి. బందముయొక్క రూపాంతరము.

బందారు. దే. వి. ఒకానొకచెట్టు.

బంది. ఉభ. వై. వి. నిర్బంధము*. (చూ. తెక్కలి.) సం. ఈ. స్త్రీ. 1. చెఱ; 2. చెఱఁబడ్డది.

బందికాఁడు. ద్వి. వి. బందిపోటుదొంగ. "చ. జలరుహమిత్రుఁడాత్త రుచిసంపదఁజీఁకటి బందికానికిన్, గలఁగుచువీనిలోననిడికైకొనసమ్మికకాఁపులంచుఁజు, క్కలదొరయొండదాడివిని గ్రక్కునఁదానునుగాంతివీనిలో, పలనెలకొల్పెనాఁబలుకఁబొలెనిశాంతనిశాంతదీపముల్." పా. ౨, ఆ.

బఁదిఖానా. హిం. వి. చెఱసాల. (రూ. బందేఖానా.)

బందిగము. వై. వి. చెఱసాల. "ఎ, గీ. ధర్మమార్గంబుదప్పనితండ్రినుగ్ర, సేనుశృంఖలాబద్ధునిఁజేసిబంది, గమునవిడిమేటిదైత్యులఁగాపువెట్టెఁ, గంసుఁడత్యంతభీకరాకారుఁడగుచు." వి, పు. ౭, ఆ.

బందిపోటు. ద్వి. వి. నిర్బంధపఱిచికొట్టిదోఁచేట.

బందు. యు. దే. వి. బోరువపక్షి. వై. 1. ఆవరణము*; "ద్వి. గొనబైనయెలదీఁగగుమిగప్పుకొన్న, నునుపొన్నచెట్టుబందుననందమైన. చందుకాంతిన్నెపై." విష్ణు. ఉ. ౪, ఆ.—2. గోపనము*; 3. పెట్టెమొదలగువానిమూలలబిగించెడియినుములోనగువానితగడు*; 4. నిరోధము*, కట్టివేత.

బందుకట్టు. ద్వి. వి. జాతికట్టుపాటు.

బందుగుఁడు. వై. వి. చుట్టము. "క. పగతురనడఁచుటయుంబం, దుగులంగాపాడుటయునుదొరంబరయన్, దిగకంటికైననిదికదుఁ, దగిలినమేల్గాదెయిపుడెదంబరికింపన్." నీలా. 3, ఆ.

బందువుఁడు. వై. వి. బందుగుఁడుయొక్క రూపాంతరము.

బందె. వై. వి. 1. పశువులచెఱ*; "సీ. కట్టఁగాపింపదతక్షితలేమినూరూరబందెలఁబడిపోయెఁబశుగణంబు." స్వా. 3, ఆ.—2. పశువులదండుగ*; "క. ఎనుమునకుబందెపాతిక, గొననగుమొదవునకుఁబరకగొఱియకువీసం, బొనరవొరుచేనుమేసిన, నినుమడిగొనవలయునెడయఁడెత్తిఁగివిడిచినన్." విజ్ఞా. ప్రా, కాం.—3. నిర్బంధము*. "సీ. ఆదికాలమునాటియగ్రహారంబులు బందెలుకల్పించిపాడుసేయు." వి, పు. ౨, ఆ.

బందెకత్తె. వై. విణ. చెఱలో వేయునది. "సీ. మదనుసమ్మోహనమంత్రాధిదేవతల్ పంచశిలీముఖుబందెకత్తెలు." భాగ. ౬, స్కం.

బందెకాఁడు. ద్వి. విణ. చెఱలోవేయువాఁడు.

బందెగొను. ద్వి. స. క్రి. (బందె+కొను.) చెఱఁబెట్టు. "తే. అర్కవెన్నాడిరాజశుద్ధాంతగణము, తారకలబందెగొని." కవిక. ౪, ఆ.

బందెడ. దే. వి. తెల్లవావిలి, శ్వేతసురసి.

బందెలపోతు. ద్వి. విణ. చెఱవేయుస్వభావముగలవాఁడు. "ద్వి. అచ్చినాయెదుర బ్రహ్మకుఁబోపరాదు, పురిలోనబందెలపోతీతఁడనఁగ." హరిశ్చ. ౨, భా.

బందోబస్తు. హిం. వి. ఏర్పాటు, భద్రము, పరిష్కారము.

బంధకము. సం. వి. అ. న. 1. చెఱసాల; 2. మాఱుపు. పుం. కుదువ.

బంధకి. సం. వి. ఈ. స్త్రీ. 1. అంకుటాలు; 2. ఆటకత్తె; 3. ఆఁడేనుఁగు.

బంధనము. సం. వి. అ. న. 1. కట్టు; 2. కట్టుటకుఁదగిన సాధనము; 3. కుదువ; 4. కొల; 5. చెఱ; 6. చెఱసాల; 7. తొడిమ.

బంధనాలయము. సం. వి. అ. పుం. చెఱసాల.

బంధము. సం. వి. అ. పుం. 1. కట్టు; 2. చెఱ; 3. కుదువ; 4. కావ్యరచనావిశేషము; 5. సంయోగవిశేషము.

బంధస్తంభము. సం. వి. అ. పుం. (ఏనుఁగునుకట్టెడు) కట్టుఁగంబము.

బంధించు. సం. స. క్రి. బంధనముచేయు, కట్టు.

బంధుజీవకము. సం. వి. అ. పుం. మంకెన.

బంధుత. సం. వి. ఆ. స్త్రీ. బంధుసమూహము.

బంధుర. సం. వి. ఆ. స్త్రీ. వేశ్య. అ. న. ము. మకుటము. పుం. 1. కలహంస; 2. పక్షి; 3. నూనెమడ్డి; 4. ఆఁడుగుఱి; 5. మంకెన. విణ. 1. ఒప్పిదమైనది; 2. వంగినది; 3. మధ్యోన్నతమును పార్శ్వానతమునైనది. (రూ. బంధూరము.)

బంధులుఁడు. సం. వి. అ. పుం. అంకుటాలికొడుకు, కాలచేరుఁడు

బంధువు. సం. వి. ఉ. పుం. 1. చుట్టము; 2. జ్ఞాతి; 3. మిత్త్రుఁడు; 4. మంకెన?.
బంధూకము. సం. వి. అ. పుం. 1. మంకెన?; 2. వేఁగిస?.
బంపు. దే. వి. పండ్లపాఁచి, పాఁకుడు. "సీ. సన్ను తించుచుఁజేరుజటివరేణ్యులనోటి బంపుకంపు నసెగఁద్రొక్కువెగటు" చంద్రా. ౧, ఆ.
బంబ. దే. విణ. స్థూలము. "ద్వి. భవ్యహస్తముల, బంబ లింగంబులఁబాపనివారు." ప్రభు. 3, ఆ.
బంబోతు. దే. విణ. (బంబ+పోతు.) మిక్కిలి బలిసినవాఁడు. "బంబోతద్దాసరి." ఆము. ౬, ఆ.
బంభరము. సం. వి. అ. పుం. భ్రమరము, తుమ్మెద.
బంహిష్ఠము. సం. విణ. (అ.ఆ.అ.) మిక్కిలి బహువు. (బహువు=తఱచు.)
బకదారి. దే. వి. పారావతవిశేషము.
బకము. సం. వి. అ. పుం. 1. వక్కుకొంగ; 2. బకపుష్పము?. డు. 1. ఒకరాక్షసుఁడు; 2. కుబేరుఁడు.
బకవైరి. సం. వి. న్. పుం. 1. కృష్ణుఁడు; 2. భీమసేనుఁడు.
బకాను. దే. వి. చిఱువేరు?.
బకాయ. హిం. వి. వెనుకటిబాకి, నిలువసొమ్ము.
బకాల్. హిం. వి. మైనపువత్తులమ్మువాఁడు, కోమటి.
బకోటము. సం. వి. అ. పుం. వక్కుకొంగ, బకము.
బక్క. దే. విణ. బక్కటిల్లినవాఁడు, బక్కటిల్లినది. బ. వి. గని త్రవ్వువారు.
బక్కటిల్లు. దే. అ. క్రి. 1. కుష్కించు; 2. కృశించు.
బక్కమజ్జిగ. ద్వ. వి. నీళ్లు అధికముగాఁజేర్చినమజ్జిగ.
బగబగ. దే. వి. మండుటయందగు ధ్వన్యనుకరణము. "చ. సోదరుంబగగొనిరాజ్యలోభమునఁబట్టివధించినదుష్టకర్మునిన్, బగబగమండుమంటలనుబట్టియునెట్టఁగలేదు." రుక్మాం. ౨, ఆ.
బగళంబుసేయు. ద్వ. స. క్రి. (బగళంబు + చేయు.) తొలఁగించు. (చూ. పాలకి.) (రూ. బగళముసేయు, బగళమ్ముసేయు.)
బగళము. దే. వి. తొలఁగుడు, అపసరణము. "సీ. అవసరంబిప్పుడయగుసంతదాఁకనుబగళమైనిలుఁడుదిక్పాలవరులు." లక్ష్మీ. ౧, ఆ. "తే. బెరసిభద్రమహాకాళిభృంగిరిటులు, పాయుబగళంబుతొలఁగుడిచ్చేయుఁడనుచుఁ, బార్శ్వములయందుమిగులనార్భటముసేయు." భీ. ౫, ఆ.
బగి. వై. వి. ప్రక్క, పార్శ్వము*.
బగిస. దే. వి. నృత్తవిశేషము.
బగిసి. వై. వి. బవిసియొక్కరూపాంతరము.
బగీలు. దే. వి. సంతాపమునందగుధ్వన్యనుకరణము. (అమాటవినఁగానేనాకడుపులోబగీలుమన్నది.)
బగ్గుముపాడు. దే. విణ. (పాడు+పాడు.) మిక్కిలి పాడు. (చూ. క్రోవిమూడవయర్థము.)
బగ్గరి. దే. విణ. (బగ్గు+అరి.) బగ్గనిమండిపడువాఁడు.
బగ్గి. దే. వి. బూడిద.
బగ్గు. దే. వి. మండుటయందగు ధ్వన్యనుకరణము.
బగ్గుండి. దే. వి. రక్తవర్ణచూర్ణము. "ఎ, గీ. త్రాడుఁదాలుపుఁజెలిపైఁడిమేడమీఁద, గొండ్లిసలుపుచుననుఁగులఁగూడిచల్లు, లాడుబగ్గుండిపొడులననలరియపుడు, చదలఁగొదలేక సంజకెంజాయ లమరె." (ఇక్కడ బగ్గుండికి రక్తవర్ణముమాత్రమర్థము.) అచ్చ. ౧, కాం.
బగ్గుమను. దే. అ. క్రి. (బగ్గు+అను.) బగ్గునమండు.
బచ్చెన. వై. వి. 1. పూఁత*; "ఎ, గీ. గంధవాహంబులేదునుగఱులుగాఁగ, విలయకాలానలజ్వాలములికిగాఁగ, లచ్చిచనుదోయికుంకుమ బచ్చెనయుగఁ, బాలమున్నీటియల్లుఁడు బాణమయ్యె." భీ. ४, ఆ.—2. వర్ణము*. "తే. అమలశశికాంతకాంతశుద్ధాంతకేళి, కానిశాంతాంతరంబునగమ్మరనెడు, పచ్చబచ్చెనచిత్తరు పనులమించు, ప్రతిమసంఘటనలమండపంబులోన." హంస. ౧, ఆ.
బచ్చెలి. దే. వి. కలంబి?. (దీని భేదములు తీఁగబచ్చలి, దుంపబచ్చలి. ఇదే తీఁగబచ్చలి.)
బచ్చె. వై. వి. 1. వైశ్యుఁడు; "తే. బలయురత్నాకరములుసంచులుగఁజేసి, పాదివినిధులెల్లఁగొనిసంచిమొదలుచేసి, బేరమాడెడుపాటియుదారలక్ష్మి, బచ్చులున్నారలప్పురిఁబెచ్చువెరిఁగి." పాండు. ౧, ఆ.—2. బొక్కసమునకధికారి*; "ఉ. లాలనఁగొత్తబెబ్బులికళాసనువెట్టిరి యాసనంబుగా, గోలయుసాధువైనయొకకోమటికిన్ నిషధేంద్రుబచ్చుకున్." నై. ౬, ఆ.—3. వెండిబంగారములనాణెము చూచువాఁడు*. "చ. మరునకుఁజైత్రమంత్రివనమండలరాజ్యఫలైకకాంచనో, త్కరముకరంబొసంగుటయుఁ దావులబచ్చులుచేరితచ్ఛదా, వరణముఁబాయవిప్పిపరువంబుగనెన్నికకక్కఁ జేయుచున్, దొరయఁగనీరుకంటెచెలిధూర్తవతంసమలీమసాళులన్." వసు. 3, ఆ.

బజంత్రి. హిం. వి. మేళము, మేళగాఁడు. (బాజా బజంత్రీలు.)

బజీతు. వై. విశ. భంగమునొందినది. "తే. ఆఁటదాని బజీతుసేయంగవలెను." ఆము. ౫, ఆ.

బజ్జి. దే. వి. ఎనిచిపలుచనగాఁజేసెడు వ్యంజనవిశేషము. (చూ. తియ్యఁగూర.)

బజారము. వై. వి. వ్యభిచారము*.

బజారి. వై. విశ. (బజారము+ఇ.) వ్యభిచారిణి. "అగడాడెడుచిల్క యనంబజారి." చంద్ర. "ఏలబజారిరంతులివియెవ్వరు మెత్తురు." సా. 3, ఆ.

బజారించు. వై. అ. క్రి. వ్యభిచరించు*.

బజారు. వై. వి. అంగడివీధి*.

బజారుమాట. వై. వి. వీధులయందుఁజెప్పుకొనుమాట, కోలాహలము.

బజ్జెడి. దే. వి. పాదవిన్యాసవిశేషము. "ద్వి. బహుచిత్రగతులతో బజ్జెల్లుద్రొక్క." పల్నాటిచరిత్రము. ౨, భా.

బటాకబయలు. వై. వి. విశ. బటాబయలుయొక్క రూపాంతరము. "క. పయ్యెదగొబ్బునబటాకబయలుగఁజేసెన్." సా. 3, ఆ. (స్వార్థమున క కారాగమము. చూ. బట్టబయలు.)

బటాని. అన్య. వి. ఒకవిధమైన కాయధాన్యము.

బటాబయలు. వై. వి. విశ. బట్టబయలుయొక్క రూపాంతరము. "చ. అనవుడునవ్విశాలతరశాక్షికటాక్షములందునంకురిం చినయలుకంబటాబయలు సేయక." సా. ౨, ఆ (చూ. బట్టబయలు.)

బటాబూరము. వై. వి. (బటారము + బూరము.) పెద్దటికము*. "తే. కలనిదఁట్యు, ములబటాబూరమిందేమిముట్టఁగలదు." ఉ, హరి. 3, ఆ.

బటారము. వై. విశ. గొప్ప*. (లోలాటారము బయలుబటారము.)

బటువు. యు. దే. వి. 1. గుండ్రన; చంద్ర.—2. గుండ్రనియుంగరము; "ఎ, గీ. తరుకుజిగికెంపుబటువుప్రత్యర్థిభిన్న, మధ్యరుచిచండమార్తాండమండలంబు, తనవిమలకీర్తికాంతకు." చంద్రా. ౧, ఆ.—3. బటువుబిల్ల. "ఆ. పసిఁడికుండకరణిఁబచ్చనికేడెంబు, ఫాలిసెల్లుపట్టుబటువురీతి, గాఢరక్తరుచులు గ్రమ్మనిమ్మగుప్రభల్, తతిఁగియస్తమించెదరణియంత." సురా.—విశ. గుండ్రనిది. వై. దృఢము.

బటువుఁగైదువు. దే. వి. (బటువు+కైదువు.) చక్రాయుధము. (ఇట్లు బటువువాలు.)

బటువుబిల్ల. దే. వి. బిల్లతలగడ. ఆము. ౧, ఆ.

బట్ట. యు. దే. వి. పసులదేహముమీఁది తెలుపులౌనగువానిచాఱ. (బట్టావు. మొ.) విశ. వెండ్రుకలూడినది. (తల.) వై. వి. వస్త్రము. "ద్వి. తుదనుగట్టినబట్టదోఁచుకపోయె." నళ. 3, భా.

బట్టకడిమి. ద్వి. వి. ధూళికదంబము*.

బట్టగుత్తు. వై. విశ. సిగ్గుమాలినవాఁడు, నిర్లజ్జుఁడు. "ద్వి. బట్టగుత్తనినిన్నుఁబ్రజలువీక్షింపఁ, జట్టుమోయించెదసర్వదాచూడు." హరిశ్చ. ౨, భా.

బట్టతల. దే. వి. వెండ్రుకలూడినతల, ఇంద్రలుప్తకము.

బట్టతలవాఁడు. దే. విశ. బట్టతలగలవాఁడు, ఇంద్రలుప్తకుఁడు.

బట్టబయలు. వై. వి. (బయలు+బయలు.) మిక్కిలి బయలు. "ఎ, గీ మండువేసవిఁబంచాగ్నిమధ్యమమున, భయదజలదాగమంబునబట్టబయట, గాటమగుచలివేళలనీటిలోన, భార్గవుఁడుఘోరమైనతపంబొనర్చె." పర. ౧,ఆ.—విశ. మిక్కిలి బయలైనది. (చూ. బటాబయలు, బటాకబయలు.)

బట్టమేఁక. ద్వి. వి. పక్షివిశేషము.

బట్టి. దే. వి. 1. వాగ్ధోరణి; (చూ. బట్టికాఁడు.) 2. ఆవము.

బట్టికాఁడు. దే. వి. 1. చిలుక; 2. గోరువంక.

బట్టినగోల. దే. వి. ఎద్దుమీఁద గోనెలెత్తివేసెడుకఱ్ఱ, ఎత్తనగోల.

బట్టు. వై. వి. బట్టువాఁడు, వంది.

బట్టె. దే. వి. కాలువ, కుల్య.

బట్లె. దే. వి. ఒకదినుసుమూకుడు.

బట్వాడా. హిం. వి. కూలిపంచియిచ్చుట.

బడ. దే. విశ. 1. పెద్ద; (చూ. బడగొండ.) 2. మిక్కిలి. "బడబాకినోరు." భల్లా. ౨, ఆ.

బడగులు. అన్య. వి. నీలగిరులలోనుండు నొకజాతిజనులు. (వడగరులు.)

బడగొండ. ద్వి. వి. (బడ+కొండ.) కొండవలె పెద్దఆకారముకలిగి నీర్లుగలిగిన మేఘము.

బడప. దే. వి. ఇడుమ, ఆపద.

బడబ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడుగుఱ్ఱము; 2. బ్రాహ్మణస్త్రీ; 3. తార్చునట్టియాఁడుది.

బడబడ. దే. వి. పాఱుటయందగుధ్వన్యనుకరణము. "క. బడబడఁబాఱుచుగడగడ, వడఁకుచు." పాండు. ౫, ఆ.

బడబానలము. సం. వి. అ. పుం. బడబాగ్ని, వార్వపుటగ్గి.

బడలిక. దే. వి. అలయిక, అలపు, శ్రమము.

బడలు. దే. అ. క్రి. శ్రమపడు. వి. శ్రమము. (చూ. బడలుపడు.)

బడలుపడు. ద్వి. అ. క్రి. బడలు, శ్రమపడు. (రూ. బడల్పడు. "చ. తనగదచేతరాక్షసులదారుణశస్త్రచయంబునశ్రమం, బుననతిపీరుఁడైనిలిపిపోరనిశాచరులంబడల్పడన్, ఘనభుజదండచండహతిఁగ్రాఁచిన." భార. అర. 3, ఆ.)

బడవా. వై. వి. 1. తార్చునది; 2. తార్చువాఁడు*. (ఒక తిట్టుగా వాడఁబడును.)

బడాయి. హిం. వి. గర్వము, అతిశయము.

బడాయించు. హిం. అ. క్రి. అభివృద్ధియగు. స. క్రి. అభివృద్ధిచేయు.

బడాయిఖోరు. హిం. వి. అతిశయముగా మాటలాఁడువాఁడు.

బడి. దే. అప. భావార్థమునందువచ్చెడి యొకానొకప్రత్యయము. (ఏలుబడి, వచ్చుబడి. మొ.)— వి. 1. పాఠశాల; 2. దిట్టము; "చ. ఎల్లిదండనిపుఁజాటఁబంచిదొరలందఱకున్ బడిసేయుఁడేడ్తెఱన్." భార. ఉద్యో. ౪, ఆ.—3. క్రమము. "క. తోడిఁబడవిషయాతురునవి, విడుమనియొడికంబెఁగలదవే తెపగనే, ర్వడరఁగథాదులనొకటన్, బడిదోఁపఁగఁబలికిమైత్రి వాపుటయొప్పున్." ఆము. ౪, ఆ.—ద్ర. వెంబడి. "సీ. భువిఁగవితాకన్యఁబుట్టించెనెవ్వాఁడు బడినాగములెల్లనడపెనెవ్వఁడు." వసు. ౧, ఆ.

బడికోడి. దే. వి. కోడిబడియొక్క మాఱుపాటు. (చెక్కచేరువంటిది.)

బడికోలు. దే. వి. పోలిక. ఆము. ౫, ఆ.

బడిత. దే. వి. ఇనుపకట్లగుదియ, పరిఘము.

బడితపాఠము. వై. గ్రా. వి. చేదివినపాఠము. "ద్వి. ఒజ్జలకు,బడితపాఠముదొంగపదరులన్నియును." హరిశ్చ. ౨, భా.

బడిద్రిప్పు. దే. స. క్రి. (బడిమి+త్రిప్పు.) బడియు. "ఎ, గీ. డాసితెలితేకుమూఁకుటఁగేసరాన్న, పుంజమప్పుడుబడిద్రిప్పిపోసెనొకతె." చమ. ౨, ఆ.

బడిపెద్ద. ద్వి. వి. ఉపాధ్యాయులకు సహాయత్వమును వహింపఁగల ముఖ్యవిద్యార్థి.

బడిమి. దే. వి. 1. బడియుట; 2. చక్రాకారభ్రమణము; "ద్వి. పురిచుట్టుబడిమిగాఁద్రిప్పి." సా. ౭, భా.—3. భూతబలి.

బడియ. దే. వి. చిన్నదుద్దుఁగఱ్ఱ. "సీ. అర్చుచుగోపాలురందఱునందందబడియలతాలనుబడఁగవైచి." హరి. పూ. ౬, ఆ.

బడియు. దే. స. క్రి. (దృష్టిదోషపరిహారార్థము.) దిగఁదీయు. వై. 3, ఆ.

బడిలి. దే. వి. తూఁటు, బెజ్జము, రంధ్రము.

బడివారడి. దే. వి. ప్రతిమనుష్యునకువేసెడుపన్ను.

బడిశము. సం. వి. అ. న. (చేఁపలనుపట్టెడు) గాలము.

బడిసివాటు. దే. వి. దిగఁదీసి వేయుట. విణ. దిగఁదీసివేసినది. "తే. బ్రహ్మలోకంబుకాశికిబడిసివాటు." కాశీ. ౭, ఆ.

బడుగు. దే. వి. శవము. విణ. 1. కృశము; "సీ. కడుఁగృశత్వంబునఁ బిడికిటిలోపలనడఁగెడుబడుగునెన్నడుముతోడ." కళా. ౫, ఆ. (ఆమ్రేడితమునందు బడుగుబడుగు. "వ. బడుగుబడుగగునడుముపసంగడునొడికమగువాని." ఆము. ౬, ఆ.)—2. అశక్తుఁడు. "మ. అడుగన్ నిన్ను వరంబు వేగమయుహాల్యాజారవిచ్చేయునా, కుడురాజార్థవిభూషణుండువరమీనున్నాఁడుయుష్మాదృశుల్, బడుగుల్ వాంఛితమీసమర్థులెవ్వధాలాపప్రబంధంబులన్, జడివెట్టం బనిలేదుమిన్న కతపశ్చర్యావిరోధంబుగాన్." కాశీ. ౪, ఆ.

బడువ. దే. విణ. బాడువయొక్క రూపాంతరము.

బడువు. దే. విణ. బడుగుయొక్క రూపాంతరము.

బడె. దే. వి. బడియయొక్క రూపాంతరము. "ఎ, గీ. ఉడుమునడిఁకియున్న నడుఁకునెబడెవెట్టు." భో. ౪, ఆ.

బడ్డు. దే. వి. ముగుతి.

బణ్ణము. వై. వి. క్రొత్తయిత్తడిపాత్రముల సమూహము*.

బతము. వై. వి. వ్రతము. కళా. 3, ఆ.

బతినీ. దే. వి. ఒకదినుసుపట్టుపస్త్రము. "వ. వలిపంబులుఁబప్పళులుమాదావళులుజిలుఁగులుజీబులునేతలుగింటెంబులుబతినీలు." కవిక. 3, ఆ.

బతిమాలిక. దే. వి. బతిమాలుట.

బతిమాలు. దే. స. క్రి. దైన్యముతో వేడుకొను.

బతిమాలుచే. దే. ప్రే. బతిమాలఁజేయు. "క. గత జీవుఁడు ప్రేఁగనియెడి, కతయదిమునీ యయ్యోఁ బజ్జీక్రంతునియెడఁదా, నతఁడుమును బ్రతికి ప్రేఁగ్రై, బతిమాలిచెజగముఁజచ్చిభారమువాపెన్." రామా. ౮, ఆ.

బత్తడిక. దే. వి. బత్తళికకు మొదటిరూపము. లక్ష్మీ. ౩, ఆ.

బత్తళి. దే. వి. (చూ.) బత్తళిక. (ఒకనిఘంటుకారుఁడు బత్తళి అని పదమెత్తియున్నాఁడు.)

బత్తళిక. దే. వి. అమ్ములపొది. "తే. అరుణరుచిఁబొల్చునెలనాఁగయంఘ్రియుగము, లీలఁబంకరుహశ్రీలనేలలేద, పద్మలోచనజంఘలుబత్తళికలఁ, జెలఁగిప్రదరాన్వితములుగాఁజేయలేవె." కవి. ౧, ఆ.

బత్తాయి. అన్య. వి. బతావియయను ద్వీపమునుండి వచ్చిన (నారింజపండు.)

బత్తి. వై. వి. భక్తి. "అంగనయెంతటిపుణ్యమూర్తివో బత్తిజనింపనాదుచెఱఁబాపితి." శుక. 3, ఆ.

బత్తుఁడు. యు. దే. వి. కమసాలెవారిపట్టపుఁబేరు. వై. భక్తుఁడు. "క. బత్తులునువాకత్తుల, మొత్తిరిపళుసమజముండములుచండములౌ, నెత్తురుధారలుదారవి, పత్తిమిరనవారుణప్రభలఁబ్రబలంగన్." పాండు. 3, ఆ.

బత్తెము. వై. వి. భోజనమునకైయిచ్చెడు ద్రవ్యము*.

బదనామి. హిం. వి. అవమానము, చెడుపేరు. (బదలాము అని వాడుకమాట.)

బదనిక. వై. వి. చెట్టుమీఁదమొలచునట్టి ఓషధివిశేషము.

బదర. ఉభ. దే. వి. పగులు. (ఆకుండబదరపోయినది.) సం. ఆ. స్త్రీ. 1. కారేలకికి; 2. పాఁచితీఁగ; 3. ప్రత్తిచెట్టు. అ. న. ము. 1. రేఁగుపండు; 2. ప్రత్తికాయ. పుం. 1. ప్రత్తిచెట్టు; 2. ప్రత్తిజెడ.

బదరి. సం. వి. ఈ. స్త్రీ. 1. రేఁగుకి; 2. గంగరేఁగుకి; 3. ప్రత్తిచెట్టు.

బదరికము. దే. వి. పెట్టె. "ఆ. మూడువగలపగిదిముడుపులుదెప్పించి, కలయనొక్కబదరికముననుంచి, కాంతలేశ్వరునినగరిపురోహితుఁడైన, గాలవునకుఁగౌతుకమునఁబనిచె." హై. ౮, ఆ.

బదలాయించు. హిం. స. క్రి. మార్చు.

బదులు. దే. వి. 1. మాఱు; కవి. 3, ఆ.—2. అప్పు; (చేబదులు.) 3. ప్రతి.

బద్ద. వై. వి. 1. కాయయొక్కఖండము*; 2. వెదురులోనగువానిఖండము*; 3. చీలిక*. (ఆఱకాలుబద్దలుబద్దలుగాచీలినది.) విశే. పలుచనిది*. "ద్వి. బద్దపిక్కలునంటబలిసినతొడలు." హరిశ్చ. ౩, భా. (బ్రద్దయొక్కరూపాంతరము.)

బద్దకము. వై. వి. సోలుమాలిక, ఆలస్యము*.

బద్దకించే. వై. అ. క్రి. సోలుమాలు.

బద్దపరి. ద్వ. వి. బ్రద్దపరియొక్కరూపాంతరము.

బద్దించే. దే. స. క్రి. (సరిగా ఉన్నదా లేదా అని) కొలిచినది తిరుగకొలుచు.

బద్దు. దే. వి. అసత్యవచనము, బొంకు. "క. ఇద్దఱుసుంజనియేటికిఁ, బొద్దునఁదీర్థంబులాడిపోరుచుఁదిరుగన్, గ్రద్దత్తుకొనియెనీసుతు, బద్దులనల్లనుండుననుచుఁబలుకఁగవెఱతున్." పంచ. నా. ౧, ఆ.

బద్దుర. దే. వి.——పై.——

బద్దె. వై. వి. 1. వస్త్రమునొందలు; 2. అపరకర్మము చేయునపుడు జందెమువలెవేసికొనెడు వస్త్రఖండము.

బద్ర. వై. వి. పండ్రెండు. "క. అత్తీవంచిత్తిగదుగ, సత్తాదచ్చౌకపంచచావంచీరై, దత్తిగయద్దుగబద్రలు, చిత్తంబునఁదలఁచినట్లు చేతికిఁదెచ్చున్." ఉ, హరి. 3, ఆ. (సొగటాలాటయందుపాచికలురెండు. ఆపాచికలొక్కొక్కటికి నాలుగు ప్రక్కలు. ఒక్కొక్కప్రక్కకు ఆఱునాఱును నాల్గునాల్గును మూడుమూడును ఒకటొకటియు నుగాజతలు ఎనిమిదింటికి బొట్లు ఇరువదియెనిమిదియైయుండును. ఆపాచికలురెంటినితాళించివేయునపుడు వానిపార్శ్వభేదముచేతపండ్రెండు, పది, తొమ్మిది, ఎనిమిది, ఏడు, ఆఱు, అయిదు, నాలుగు, రెండునుగా పందెములుతొమ్మిదిపడును. కాన ఆపందెములు తొమ్మిదియునీపద్యమునందు చెప్పఁబడియున్నవి.

బద్రము. వై. విశే. పదిలముయొక్కరూపాంతరము.

బధిరితము. సం. విశే. (అ. ఆ. అ.) బధిరముగాఁ జేయఁబడినది. "బధిరితదిఙ్ముఖుండు." భార. భీష్మ. ౧, ఆ.

బధిరుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) చెవిటివాఁడు.

బద్ధము. సం. విశే. (అ. ఆ. అ.) కట్టఁబడినది.

బధ్యము. సం. వి. అ. పుం. నీళ్లురాకుండకట్టినకట్ట. (చూ. శేయము.)

బధ్యుఁడు. సం. విణ. (అ.అ.అ.) చావఁదగినవాఁడు.
బనాతు. హిం. వి. ఒకవిధమైన ఉన్నిబట్ట.
బనాయించు. హిం. స. క్రి. కల్పించు.
బనారసు.హిం.వి.కాశీపట్టము.(బనారసుచీరె.మొ.)
బన్నపడు. వై. అ. క్రి. (బన్నము+పడు.) భంగము నొందు*. "ఎ, గీ. తక్కఁగలయింతిగములనాద న్యులడరి, పట్టికొనియేచిపీడెల్లబన్నపడఁగ, దొ డ్డగొనిరథకుంజరతురగతతులు, తమకువలవకుని కిదిగఁద్రావిచనిరి." భార. మా. ౧, ఆ.
బన్నము. వై. వి. 1. అవమానము*; "ఉ. నన్నిటు లాదురాత్మసదనంబునకున్ జనుమన్న జంతకీ, బ న్నములన్నియుం దెలియఁబ ల్కెదఁగాకని పో యె." భార. విరా. ౨, ఆ.—2. ఆపద*. "ఉ. క్రొన్నెలవెన్నెలన్ సమదకోకిలకాకలికారవం బులన్, జెన్నఁటియెన్ని బన్నములుచెందఁగఁగూ డునొ." రసి. 3, ఆ.
బన్నసరము. వై. వి. నానావిధములయినమణులుగ్రు చ్చినహారము. "సీ. జనియించె నొక్కొ పచ్చని మొల్కయను బుద్ధిగ్రుచ్చినపచ్చలకొమరువలన, సమకూడెనొక్కొ దాడి మఫలోద్భవబీజమతిప ద్మరాగసామగ్రివలనఁ, బొడకట్టె నొక్కొ జం బుఫలంబులను మనోభ్రమమింద్రనీల విభ్రమ మువలనఁ, దోఁతెంచెనొక్కొ మధూక పుష్పము లనునాసహూర్తంబిముత్యములవలన, దానియటు లెత్తిపనుపాడఁదలఁచిచనుడు, బరణిమూఁకుటనె లకొన్నబన్నసరముఁ, గఱచికొనిపోయెఁజెల్కె ప్రగల్భవిటుఁడు, బాలికామానసముఁగొనుపగి దినవుడు." పాండు. ౪, ఆ. ("పగడంపుబన్నస రము." చంద్ర. ఇత్యాదిస్థలములయందు బన్నస రమునకు హారముమాత్రమర్థము.)
బన్నసరి. వై. వి. బన్నసరముయొక్క రూపాంతరము. "ఎ, గీ. పరఁగ వెలలేనిచౌకట్లుబన్నసరులుఁ,బసి మిసొప్పారుపచ్చలపతకములును, గండపెండా రములులోనుగాఁగఁగలుగు, సొమ్ములొక యింతి కైసేసెసొంపుమెఱయ." య. ౪, ఆ.
బభ్రువు. సం. వి. ఉ. స్త్రీ. కపిలగోవు. పుం. 1. (చూ.) వెంట్రువ; 2. విష్ణువు; 3. శివుఁడు; 4. అగ్ని. విణ. 1. పచ్చనిది; 2. బట్టతలవాఁడు.
బమ్మ. వై. వి. బ్రహ్మ, నలువ. "క. తమ్ములకన్నను గన్నులు, తొమ్మిదిగుణములను హెచ్చు తొయ్యలి కంచుకన్, బమ్మతదక్షియుగోపాం, తమ్మునవ్రాసి ననవాంకతంబెలిపెఁజెవుల్." కవి. ౧, ఆ.
బమ్మరించు. వై. అ. క్రి. భ్రమించు. "శయానుండ య్యునాసీనుఁడయ్యుఁబిత్రుకేశిఁగని బమ్మరించె నేనియదిపితృగ్రహము." భార. అర. ౫, ఆ. (రూ. బమ్మరిల్లు. "సీ. పన్నగఁబులకెల్లభయము మిక్కుటముగాఁ బాతాళలోకంబు బమ్మరిల్లె." విక్ర. ౪, ఆ.)
బమ్మెర. వై. వి. భ్రమము, భ్రాంతి.
బమ్మెరపోక. ద్వ. వి. బమ్మెరపోవుట, భ్రమపడుట. "బమ్మెరపోకతో." పంచ. వేం. ౨, ఆ.
బమ్మెరపోవు. ద్వ. అ. క్రి. భ్రమపడు. "క. ఆబెడి దపుమ్రోఁతకుఁగా, దేబమ్మెరపోయి దేవదేవరనగ రన్, వేబెండుపడిరిమొగముల, పైబెగ్గలికంబు దేఁబరిజనులెల్లన్." హరి. పూ. ౯, ఆ.
బయకాఁడు. ద్వ. వి. (బయలు+కాఁడు.) రాగము ను బయలుపఱచువాఁడు, గాయకుఁడు. "చ. అన ఘయపూర్వమైనభవదాగమనంబుతలంపనొక్క చోఁ, బొనరినకయ్యమిప్పుడెగఁ బోయఁగవచ్చి నయట్లుతోఁచెనీ, వనుపమదేసదానవమహాహవ నాటకసూత్రధారివై, ఘనముగవీణెమీటుబయ కాఁడవునీయొళవేసెఱుంగనే." కళా. ౪, ఆ. "సీ. ఇంపుసొంపులఁబాడు నెలతేఁటిబయకాఱు లకుపన్నె మీఱునీలములొసంగి." అని. ౨, ఆ. ("అలరాజనిభాస్యయెలుంగుగట్టివాకోయిలకం చుకుత్తికలకున్ బయకాఁడనవచ్చు." (ఇక్కడ బయకాఁడనఁగా గానవిద్యోపాధ్యాయుఁడు అని యర్థము.) విజ. ౧, ఆ.)
బయకారము. ద్వ. వి. (బయలు+కారము.) యౌవ నమునందు బయలుపడుశృంగారచేష్ట. (దీనికి అల్ల సాని పెద్దనగారుచెప్పిన ఉత్పలమాలికావృత్తము నందు ప్రయోగము.)
బయకారి. ద్వ. విణ. (బయకారము+ఇ.) విలాస వతి. "తే. మంతుఁడనొప్పునెఱవింతవహొంతకా రి, సొగసుబయకారిచానసుజాడదగ్గి, కేకరించిన నాతఁడుకెరలికాంచి, యిదియుపగలాఁడిరాయ నికదియఁజనఁగ." హంస. ౫, ఆ.
బయలు. వై. వి. 1. బహిఃప్రదేశము; 2. చెట్టుచేమ లేనిచోటు; "చ. అమరిన లేఁతపచ్చికబయళ్లను దట్టములైనయింద్రగో,పములునటింపఁగా." వి, పు. 2, ఆ.—3. ఆకాశము*. "ఇప్పుడీబయలుచె

ప్పినమాటలునమ్మవచ్చునే." వీర. ౨, ఆ.—విణ. శూన్యము*. "వ. అక్కు_రురాజాతనచుట్టునుంబయలగుటచూచి." భార. శల్య. ౨, ఆ.

బయలుదామర. వై. వి. (బయలు+తామర.) మెట్టదామర, స్థలపద్మము. "ద్వి. బయలఁదామరలఁగీడ్పఁ అచుపాదములఁ." హరిశ్చ. ౧, భా.

బయలుదేఱు. ద్వ. అ. క్రి. (బయలు+తేఱు.) బయలువెడలు, నిర్గమించు.

బయలుపడు. వై. అ. క్రి. ప్రకాశితమగు. (రూ. బయల్పడు. "సంగరోత్సవోద్యమరభసాతిరేకముబయల్పడుటించుక లేక." భార.విరా.౨,ఆ.)

బయలుమెఱయు. ద్వ. అ. క్రి. బయలుపడు. "వ. తారందఱువిరాటునికొలువుకూటంబునకుంబోయి బయలుమెఱసియుండువారుగా నిశ్చయించి." భార. విరా. ౫, ఆ.

బయలువెడలు. ద్వ.అ.క్రి. బయలుదేఱు, నిర్గమించు.

బయలువోవు. ద్వ. అ. క్రి. (బయలు+పోవు.) బయలుపడు. "ద్వి. నిన్నొక్క_, పనిఁబంపవేఁడెదబయలువోకుండఁ, జేసెదవేనియుఁజెప్పెద." నవ. 3, భా.

బయానా. హిం. వి. సంచకరువు.

బయావారి. హిం. విణ. వివరమైన.

బయ్యంకలు. దే. వి. బ. వేవిళ్లు, దౌహృదము.

బయ్యఁడు. దే. విణ. మందుఁడు.

బరక. దే. విణ. కఱకైనది. (పిండిబరకగానున్నది.)

బరకము. దే. వి. దూదిబరువు.

బరగడ. దే. వి. ధాన్యపురాశిలోనగువానిమీఁదవేసెడు మట్టిముద్ర.

బరగడము. దే. వి. వృక్షవిశేషము.

బరడు. వై. వి. గఱుకైనపట్టలోనగునది.

బరణి. వై. వి. కాటుక మొదలగునవియుంచుకొనెడు పాత్రము, కరాటము. "ఎ, గీ. మించుబీఱెండ నగ్నిఁబుట్టించునరణి, కలుషఘోరపయోరాశిఁగడపుతరణి, తోఁచెఁబ్రాచీమహీధరోత్తుంగసరణి, ప్రాఁజదువుమానికంబులబరణితరణి." పా. ౪, ఆ.

బరణిచుక్క_. వై. వి. భరణీనక్షత్రము.

బరతరపు. హిం. వి.ఉద్యోగమునుండితొలిసివేయుట.

బరదుపిట్ట. ద్వ. వి. పక్షివిశేషము.

బరపట. దే.వి. 1. తృణవిశేషము; 2. బ. తృణధాన్యవిశేషము. (చూ. ఈఁజేటి.)

బరమా. దే. వి. (చూ.) పిడిసాన.

బరవసము. దే. వి. ధైర్యము. "క. శరగురుఁడేచటికిఁ దఱిమిన, వెరవుననచ్చటికి నెల్లవిక్రాంతిధురంధరుఁడగుధృష్టద్యుమ్నుఁడు, బరవసముదలిర్పనడ్డపడిపోరాడెన్." భార. ద్రో. ౧, ఆ.

బరాతము. హిం. వి. లిఖితపూర్వకమైన ఆజ్ఞ.

బరాబరి. దే. వి. హెచ్చరిక. "సీ. స్వస్తికహస్తులై సమ్ముఖమ్మున బరాబరిగాఁగసర్వసుపర్వులుండ." కాశీ. ౨, ఆ.—విణ. సరియైన.

బరాబరిక. దే. వి. బరాబరియొక్క_రూపాంతరము. "సీ. తనదుదండపుఁగట్టియను బెత్తము గఁ బట్టి ప్రతిహారులనుబరాబరిక చేసి." చంద్రా. 3, ఆ.(స్వార్థమున కప్రత్యయము.)

బరానర్దు. హిం. వి. ఉజ్జాయింపు, మదింపు.

బరి. దే. వి. 1. పార్శ్వము; "వ. బరితోడబరియుసరిబెరయనొరయుచు." జై. ౨,ఆ.—2.(చూ.) గిఱి;"ద్వి.పర్ణశాలకుఁజుట్టుబరులేదువ్రాసి."రా. అర. కాం.—3. (చూ.) బరిగోల; 4. దొఁగ; "మ. అవనీశత్రిదశేంద్రుచూపుబరికన్యాగండపాలిద్వయీ, నవలావణ్యరసంబుఁగొల్లగొనియంతంతంతఫాలంపురా, జావిలోకించిచలించికొనినయాసామ్మెల్లఘుర్ణాంబుకై, తపమొప్పన్ వెసడించితా అఁగబరితాపించకుఁజాంతమున్." స్వా. ౫, ఆ.—5. శత్రువు. "ఎ, గీ. చిచ్చువాతనుబరివాతఁ జిక్కు_పడక, తప్పిపోయినవారలేతఙ్జాలంద్రు." కాశీ. ౬, ఆ.—విణ. వృత్తియందు బరిగిశబ్దమునకు మీఁదివర్ణములోపింపఁగామిగిలిన రూపము. "బరిమేను." భార. కర్ణ. 3, ఆ. మొ.

బరికట్టె. ద్వ. వి. (బరిగి+కట్టె.) అలుగులేనియీఁటె.

బరికాఁడు. దే. వి. మావటివాఁడు. "మ. మతిశంకింపఁగముట్టివిక్రమరసోన్మాదంబునన్ భూవిభున్, గదత్రేయంగనతండుపైఁబడిభుజాగర్వంబునంబట్టినా, రదుఁడార్వన్ బరికాఁడునిర్భయతఁజేరంజూచినంబట్టును, న్నదకుండాలములీలదిక్కులితనామత్రావణున్ రావణున్." నిర్వ. ౭, ఆ.

బరికె. దే. వి. గఱుకులుగలయొండినతాటిమట్ట. విణ. చింపితి. "తే. నిడుదపాదవునుమిడిగ్రుడ్లుబడువుటాడలు, గుంతమోమునుగుఱుకేలఁగుండకడుపు, మిట్టపండ్లును నెంతయుఁ బెట్టిదంపుఁ, బలుకులునుదురాచారంబుబరికెతలయు." మార్క. ౫, ఆ.

బరికమ్మి. ద్వ. వి. (బరిగి + కమ్మి.) బరికట్టె. "ద్వి. గొడ్డలిబరిగమ్మికూటికుండయును." భల్లా. 3, భా.

బరిగి. దే. విణ. ఏమియులేనిది, శూన్యము.

బరిగిరౌతు. ద్వ. వి. పల్లము వేయనిగుఱ్ఱముమీఁదనెక్కెడుసారథి.

బరిగోల. దే. వి. (బరి+కోల.) 1. ఏనుఁగుప్రక్కలు పొడిచిబెదరించుటకై అర్ధచంద్రాకారముగా ఉక్కుతోఁచేసిన అలుఁగుగల వేణుదండము; "క. బరిగోలచేతమదసిం, ధురముంగనలించినట్లుతూపులనాభూ, వరుఁగనలించుచుఁగవచము, సురియలుగానేసివిల్లుముష్టికిఁద్రుంచెన్." రా. అర, కాం. ౧, ఆ.—2. బాణము. "రగడ. క్రొవ్వి క్రొవ్విరి మొగ్గమరుబరిగోలగోలయిదేల దాఁటితి." వసు. 3, ఆ.

బరిచి. దే. వి. ఈఁటె, కుంతము. (రూ. బరిచీ. "ద్వి. పరశుపట్టిసములబాఁకులవాఁడి, బరిచీలనురుగదాప్రముఖాయుధముల." సా. ౨, భా.)

బరిజోగి. ద్వ. వి. (బరిగి+జోగి.) పాములవాఁడు. "క. పొరిఁబొరినాడింతురుదరపోషణములకున్, బరిజోగులుపెట్టెలనిడి." జై. ౭, ఆ.

బరిడెగవ్వ. ద్వ. వి. భక్ష్యవిశేషము. హంస. ౧, ఆ.

బరిడెపురుగు. ద్వ. వి. బరిణెపురుగు.

బరిణెపురుగు. ద్వ. వి. బొద్దీఁక.

బరివెంక. దే. వి. పక్కిచెట్టు.

బరిస. దే. వి. ఇనుపకట్లగుదియ, పరిఘము.

బరుకు. దే. స. క్రి. 1. తోలులేచునట్లుగీఱు; 2. గీఱు. "క. మరిగినవిధమునఁజేరువఁ, దిరుగుంబసిగొనుచుఁగలయఁద్రుణములు వెదకున్, ఖురపుటమునఁగడుపొయ్యన, బరికికొనుచుఁజక్కనిలుచుఁ బలుమఱునెదురన్." రా. అర, కాం. ౨, ఆ.

బరుజో. దే. వి. గజ్జె, కింకిణి.

బరువడి. దే. ద్ర. మరల. "క. ఒండొరులఁజూచియానన, మండలములఁ దెలివియొలయమూకన్నియకా, తండుపరుండగుబరువడి, రండనికార్యోక్తిమైమరల్చిరివానిన్." భో. 3, ఆ.

బరువు. వై. వి. 1. భారము; 2. సరకులునింపినకంట్లములోనగునది*.

బరుసద్దసరము. వై. వి. (బరుసు+అడ్డసరము.) అంబష్ఠ?.

బరుసు. వై. విణ. 1. కఱకైనది; "ద్వి. బరుసుమీసముచెక్కుపైఁబులిపిరియు." నవ. 3, భా.—2. గఱుకు*. (చూ. తీడు.)

బర్కరము. సం. వి. అ. పుం. 1. ప్రాయపుపశువు; 2. మేఁక; 3. పరిహాసము.

బర్బర. సం. వి. ఆ. స్త్రీ. వాయింట?. పుం. ము. 1. బారంగి?; 2. బొబ్బరలు; 3. ఒకదేశము. విణ. గఱుకులుగలది. "సీ. తనభుజాపరిఘుచేధరణీవరారోహధరియించిబర్బరబాహుఁడయ్యె." జై. ౧, ఆ.

బర్బురము. సం. వి. అ. పుం. బొబ్బలి?.

బర్హపుష్పము. సం. వి. అ. న. 1. గండివనము?; 2. పచ్చాకు; 3. మాచిపత్రి. (రూ. బర్హిపుష్పము.)

బర్హము. సం. వి. అ. పుం, న. 1. నెమిలిపురి; 2. ఆకు; 3. గండివనము?; 4. పచ్చాకు; 5. మాచిపత్రి.

బర్హి. సం. వి. న్. పుం. 1. నెమిలి; 2. దర్భ?.

బర్హిచూడము. సం. వి. అ. న. నెమిలిజొట్టుచెట్టు.

బర్హిణము. సం. వి. అ. పుం. 1. నెమిలి; 2. దర్భ?.

బర్హిర్ముఖుఁడు. సం. వి. అ. పుం. నిర్జరుఁడు, వేల్పు.

బర్హిశ్శుష్మ. సం. వి. న్. పుం. అగ్ని, అనలుఁడు.

బర్హిష్ఠము. సం. వి. అ. న. కురువేరు, హ్రీబేరము.

బర్హిస్సు. సం. వి. స్. పుం. అగ్ని, హుతాశనుఁడు. పుం, న. దర్భ?.

బఱటు. దే. స. క్రి. 1. గోఁకు; "అ. మూఁగవానియెదుటముక్కుబఱట, రానిచందమయ్యె." భో. ౬, ఆ.—2. సైఁగగాగోఁకు. "తే. బఱటికొనిపోయికృతవర్మఁబన్నఁబనిచె." భార. ఉద్యో. 3, ఆ.

బఱబఱ. దే. వి. ఈడ్చుటయందగు ధ్వన్యనుకరణము (వానికాలుపట్టి బఱబఱయీడ్చెను.)

బఱ్ఱె. దే. వి. ఎనుము, గేదె, మహిషి.

బల. సం. వి. ఆ. స్త్రీ. 1. ముత్తవపులగము?; 2. విద్యావిశేషము.

బలఁగము. వై. వి. పరిజనము. "ఎ. గీ. పాండ్యుఁడతిరఘుండుబలఁగంబుగలవాఁడు." భార. ఉద్యో. ౪, ఆ. "చ. అనుటయుఁలజ్జనజ్జలరుహాననయించుకయోరగాఁగవం, చినమొగమొప్పనేమనుచుఁ జెప్పెదదానచేసికాదరో, యనఘుచరిత్రనాకుఁగలయట్టిబలంగముల్లెల్లఁబొనియా, ఘనగహనప్రవేశములఁగష్టపుఁబాటులఁగుందితింగడున్." కళా. 3, ఆ.

బలకరము. దే. వి. కావలి. "తే. గాలిఁ దేజీమెకంబు లుకోలుపులులు, కోదమసింగముల్ రెంటఁ ద్రాగుడుమెకంబు, లలభిరద్వాజముని రాజనిలయమునకు, బలకరంబున్న బోదులపగిదిఁ బొలిచె." రా మా. ౫, ఆ.

బలకరించు. వై. అ. క్రి. వ్యాపించు*. (చూ. గిలకరించు.)

బలకాయించు. దే. అ. క్రి. (బలము+ఇంచు.) అతిశయించు. (సంధియందు వర్ణవికారము.)

బలకొట్టు. దే. అ. క్రి. ఆఁ అని శ్రుతిపట్టు.

బలకొను. దే. అ. క్రి. (బలము+కొను.) అతిశయించు. "క. తలఁపఁజతుష్పదులధికులు, బలకొనిమతివారికంటెఁ బాదద్వయముల్, గలమనుజులలఘుతముల్, మ్ములవారలయందు వర్ణములు నాల్గరయన్." భాగ. 3, స్కం.

బలదేవుఁడు. సం. వి. అ. పుం. 1. బలరాముఁడు; 2. వాయువు.

బలపడు. ద్వ. అ. క్రి. (బలము+పడు.) అధికమగు.

బలపము. దే. వి. 1. పలక వ్రాసెడు సాధనము, కఠిని; 2. చోరసాధనవిశేషము. (చూ. గద్దగోరు.)

బలభద్రిక. సం. వి. ఆ. స్త్రీ. కలుక్రాంతి.

బలభద్రుఁడు. సం. వి. అ. పుం. బలరాముఁడు.

బలము. ఉభ. దే. విశ. అధికము. (వానివద్ద దుడ్డు బలముగానున్నది.) సం. వి. అ. న. 1. గంధము; 2. రసము; 3. రూపము; 4. సత్త్వ; 5. బలుపు; 6. సైన్యము. పుం. కాకి.

బలయు. వై. స. క్రి. పరివేష్టించు. "క. అద్రిచరసేనఁ గొంచుస, ముద్రము బంధించి కడచిమువ్వురు సద్రిక్తూ, టాద్రి బలసియున్నారదె, ముద్రితలంకాకవాటముగ దాశరథుల్." రా. యు, కాం.

బలవంతము. ఉభ. వై. వి. బలాత్కారము*. "క. బలవంతముజూదమునకుఁ, బిలువంబడిమగుడనగుచు పెద్దలకనితా, నలఘుఁడు ధృతరాష్ట్రజుతో, నలయక ధర్మజుఁడు జూదమాడఁగడంగెన్." (బలవంతము-బలవంతముగాననియర్థము.) భార. సభా. ౨, ఆ.—సం. విశ. (త్. ఈ. త్.) బలముగలది.

బలవిన్యాసము. సం. వి. అ. పుం. వ్యూహముతీర్చుట.

బలసూదనుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

బలా. దే. అవ్య. బళాయొక్క రూపాంతరము. "పంచచామరము. బలాబలాలితోడ బాలఁబట్టిబిట్టు చుట్టిసే, హాలాహాలిశాహాలాహాలాభయాబుధ త్కఁదీర్చెదన్." స్వా. ౪, ఆ.

బలాక. సం. వి. ఆ. స్త్రీ. 1. పెద్దపెంటికొక్కెర; 2. పెంటికొక్కెర. అ. పుం. ము. 1. పెద్దకొక్కెర; 2. కొక్కెర.

బలాత్కరించు. సం. స. క్రి. బలాత్కారముచేయు.

బలాత్కారము. సం. వి. అ. పుం. మిక్కిలి నిర్బంధించుట, బలవంతము.

బలాదూరు. హిం. వి. దిగఁదుడుపు. (చేటును దూరపఱచుటకు నిచ్చుబలి.)

బలారా. దే. అవ్య. బలాయొక్క రూపాంతరము. "బలారా బలారాతిప్రోద్భవుఁ డెంతసేసె." విజ. 3, ఆ. (ఇది ఔరావంటిది.)

బలారాతి. సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు, వేల్పుఱేఁడు.

బలాహకము. సం. వి. అ. పుం. 1. మేఘము; 2. విష్ణువు తేరిగుఱ్ఱములలో నొకటి; 3. సర్పవిశేషము.

బలి. సం. వి. ఇ. పుం. 1. కప్పము; 2. (పూజార్థమైన) కానుక; 3. చామరదండము; 4. ఒక అసురరాజు. విశ. (న్. ఈ. న్.) బలముగలవాఁడు.

బలిజె. దే. వి. శూద్రజాతివిశేషము. (బలిజెవాఁడు, బలిజెది.)

బలితము. వై. విశ. 1. బలిష్ఠము; "క. బలితపుటురగామంబున, నిలుచుటయారజ్జు ద్రవ్వనీలిగినుముతుల్, వెలలిచని సుఖులగుదుర, వ్వల నెఱుఁగరు పడుదురందువత్సదు రాత్ముల్." భార. శాం. ౬, ఆ.—2. స్థూలము*. "సీ. కృశదైత్యజాతివర్గులనిటులనురీతిఁ గలకంఠిలేఁగొను బలితమయ్యె." ఉ. రా. ౨, ఆ.

బలిధ్వంసి. సం. వి. న్. పుం. విష్ణువు, హరి, వెన్నుఁడు.

బలిపుష్టము. సం. వి. అ. పుం. 1. కాకి; 2. నక్క కొంగ.

బలిపెట్టు. మి. స. క్రి. చంపు.

బలిభుక్కు. సం. వి. జ్. పుం. 1. కాకి; 2. ఊరఁబిచ్చుక.

బలిమి. వై. వి. 1. దేహబలము; "తేలెమ్మురణంబులో బలిమిచూపుము." హరి. ఉ. ౬, ఆ.—2. బలాత్కారము*. "తే. స్నాతకులలేనిపూవులుఁ జందనంబుఁ, జను సెబలిమినిగొని తాల్ప." భార. సభా. ౧, ఆ.

య్యాట, లాడుతద్వ్యధూవయస్యలనఁగ." కళా. ౮, ఆ.

**బులుపు.** దే. వి. సుఖము. (చూ. బులియు.)

**బుల్ల.** దే. వి. మగగుజ్జి.

**బువ్వ.** దే. వి. అన్నము, వంటకము.

**బువ్వకుడుపు.** దే. వి. (చూ.) అన్నప్రాశనము.

**బువ్వము.** దే. వి. వివాహమునందు బంధువులయిన మగవారు ఆఁడువారు అందఱును ఒకటిగాఁ గూర్చుండి వేడుకగా భుజించుట.

**బువ్వముబంతి.** ద్వ. వి. (చూ.) హరిబువ్వము.

**బుస.** దే. వి. 1. పాముయొక్క పూత్కారము; 2. నిట్టూర్పు. "సీ. భూరిభుజంగికాభుక్తనిర్ముక్తుఁ డైవారకబుసకొట్టువానిఁదెగడి." వసు. ౧, ఆ. (ఇది రెండర్థములకు నుదాహరణము.)

**బుసకొట్టు.** దే. అ. క్రి. 1. (పాము) బుస్సను; 2. నిట్టూర్చు; "క. ఊర్పుల్, మిన్నందఁగబుసకొట్టుచు." ఆము. ౬, ఆ.—3. (ఏనుఁగుతొండముతో) పూత్కారముచేయు; "ఏనికమూఁక తేసి వేమఱు బుసకొట్టఁగా." య. ౧, ఆ.—4. (సింహము) పూత్కారముచేయు. "సీ. పాటింపనోరిబొబ్బాటమేవడిగాని ఘోరాజిలోబుసకొట్టుచుంట." కా. ౫, ఆ.

**బుసబుస.** దే. వి. నీళ్లుపొంగుటలోనగువానియందగు ధ్వన్యనుకరణము.

**బుసబుసలాడు.** దే. అ. క్రి. (బుసబుసలు+ఆడు.) బుసపెట్టు.

**బుసము.** సం. వి. అ. న. 1. పొల్లు; 2. మీఁగడతీసిన పెరుఁగు; 3. పిడక. (రూ. బుషము.)

**బుసి.** ఉభ. దే. వి. (చూ.) నిగుడు. సం. ఈ. స్త్రీ. పశ్చిమసముద్రము నడుమనుండెడు వరుణోద్యాన నది.

**బుసిపోవు.** దే. అ. క్రి. (బుసి+పోవు.) చెడు.

**బుసుకుజొన్న.** ద్వ. వి. ఒకదినుసుజొన్నi.

**బుస్సు.** దే. వి. పాముబుసకొట్టుటయందగుధ్వన్యనుకరణము. "కాలసర్పముసమున్నతినాడఁగతేపమీఱుబుస్సంచుఫణాగ్రమెత్తి." హంస. ౫, ఆ. "తోటకవృత్తము. బుస్సన మ్రోఁగుచు వాఁడిక, మించినపాములమేల్చిలుకేసెక." అచ్చ. యు., కాం.

బూ.

**బూఁజు.** దే. వి. ఎండసోఁకమిచే తడివస్తువులమీఁదఁగలుగు కొంచెముమాసిన తెలుపు.

**బూఁజుపట్టు.** దే. అ. క్రి. బూఁజుగలదియగు.

**బూఁగు.** దే. వి. బూఁజుయొక్క రూపాంతరము.

**బూఁదుపారు.** దే. అ. క్రి. బూఁజుపట్టు. "బూఁదుపారఁగ మేఁ బూదిఁబూసినవారు." పాండు. ౧. ఆ. "బూడిదపండునుబోలెబూఁదుపారెడు నొకదుప్పికింగవియ." పాండు. ౫, ఆ.

**బూక.** దే. విశే. బూటకము, మాయ.

**బూగర.** దే. వి. 1. తమిదలు మొదలగుధాన్యముల మీఁదిపొట్టు; 2. ఇండ్లవాసములకుఁ బట్టెడుబూజి.

**బూచి.** వై. వి. భూతము. "ఆ. బూచివోలెనున్న వాచంయమునిమోము, బాల్యచాపలమునఁ బట్టుటయును." స్వా. ౪, ఆ.

**బూచిగాఁడు.** ద్వ. వి. (బూచి+కాఁడు.) బూచివలె నుండుటచేకుక్కకియ్యఁబడినపేరు. (చూ. గబ్బి.)

**బూచివాఁడు.** ద్వ. వి. బూచి, భూతము.

**బూచేలకాఁడు.** ద్వ. వి. శివుఁడు, భూతేశుఁడు.

**బూటకము.** దే. వి. 1. మాయ; "దండకము. నీబూటకంబెవ్వరుక నేటుగానారయక లేరుగా." నీలా. ౨, ఆ.—2. వంచన. "ఉ. మాటలువేయు నేలయొకమర్మముసెప్పెదమోక్షదాతలై, పాటిలువిష్ణుశంకరులభక్తిదృఢంబుగఁగల్గనేనినా, నాటికివానికన్నిసుగుణమ్ములుఁ దామెఘుటింపముక్తుఁడౌ, బూటకపుక విచారములఁబోవఁగనేమిఫలంబుభూవరా." పు. ౧, ఆ.

**బూటకీఁడు.** దే. విశే. (బూటకము + ఈఁడు.) 1. మాయావి; 2. వంచకుఁడు. "ఆ. నన్ను శూలియితరులెఱుఁగ, కుండఁదలుపువెడలికొనిపోవజనులెల్ల, బూటకీఁడుపాఱిపోయెనండ్రు." బస. ౧, ఆ.

**బూటకుఁడు.** దే. విశే. మాయావి, బూటకీఁడు. "ద్వి. బూటకులను మాయపారిగొనుచుండు." ప్రభు. ౨౮, ఆ.

**బూడిద.** వై. వి. 1. గోమయభస్మము, బూది.

**బూడిదగుమ్మడి.** వై. వి. (చూ.) పెండ్లిగుమ్మడిi.

**బూడిదపండు.** ద్వ. వి. విభూతియుండ. (చూ. బూఁదుపాఱు.)

**బూడిదపన్ను.** ద్వ. వి. శ్మశానమునందు శవమునుకాల్చుటకైయిచ్చెడుపన్ను.

బూఁడ్ద. వై. వి. బూడిదయొక్క రూపాంతరము. "సీ. చక్రంబుపనిసేయుసడిసన్న నీపెంపు బూఁడ్ద బొట్టయ్యె నేభూరికీర్తి." మార్క. ౧, ఆ.

బూతపిల్లి. వై. వి. (బూతము+పిల్లి.) (చూ.) పూతికము. "ఆ. మహినిబూతపిల్లిమచ్చికయయునుబోతె, రాచమాటనమ్మరాకయుండు." భల్లా. ౪, ఆ.

బూతము. వై. వి. 1. పిశాచము; "క. ఆతతివెన్నెలదగుమ, జ్జాతాజాబిల్లి వెజ్జుజగమునకెల్లన్, రాతిరిసోఁకినచీఁకటి, బూతమువిడిపింపఁజల్లుబూతియుఁబోలెన్." య. ౨, ఆ.—2. ప్రాణి. (చూ. ఎకసక్కెము. విశ.)

బూతాటము. దే. వి. (బూతు + ఆడుట.) బూతులాడుట. "బూతాటమాడితిట్టునతని." విజ్ఞా. ప్రా, కాం. (చూ. అఱకడ.)

బూతి. వై. వి. 1. బూది; 2. తిండి.

బూతు. దే. వి. 1. కుచ్చితపుతిట్టు; 2. కుచ్చితపుతిట్టుతిట్టువాఁడు; "సీ. బండలుబూతులుపరిహాసకులునట్టువారాదిగాఁగలవీరుదక్క." విజ్ఞా. ప్రా, కాం.—3. బట్టువాఁడు. "ఆ. బూతుపొగడినట్లుపొగడెదుపొగడంగ, వలయునేనిసుగుణవంతులైన, కర్ణశల్యులాదిగాఁగలవీరులఁ, బొగడుచుండరాదెప్రొద్దువోవ." సం. "యస్యసంస్తవవక్తాత్వం వందివత్సతతోత్థితః." భార. సభా. ౨, ఆ.

బూద. దే. వి. పాలకుండ. "మ. ఉదరోలూఖలమెక్కినిక్కసహజాంకోపేంద్ర సంయుక్తుఁడై, చదలన్ బూదశశాంకసీరి కరవిస్తారంబులంబట్టి బె, ట్టదుమన్ గాఱెఁ జకోరగోపతతిపాలైచంద్రికాక్షీరముల్, పాదివెన్ ఘూర్ణితదుగ్ధధామనిబిడప్రోద్భూతసంరంభముల్." వసు. ౪, ఆ.

బూది. వై. వి. గోమయభస్మము, బూడిద.

బూదిచేఱుచు. ద్వ అ. క్రి. బూఁజుపట్టు.

బూదె. వై. వి. చతుర్దశితిథి*.

బూబు. హిం. వి. తురకస్త్రీ.

బూమియ. వై. వి. 1. మాఱువేషము; "ఉ. ఏనికమోముబూమియవహించి చరించుచునుండుకామధు, గ్ధేనువు డుంఠి కాశినిది తెల్లమువేలుపు గిడ్డికానినా, డీనుసెమోతుతర్ణకమునిచ్చుసెకాంతుతదుగ్ధధారదూ, ర్వానవపల్లవావలులువైచినమాత్రనభక్తకోటికిన్." కాశీ. ౬, ఆ.—2. మాయ*; 3. వంచన*. (చూ. బూమె.)

బూమె. వై. వి. బూమియయొక్క రూపాంతరము. (మాఱువేషమునకు.—"ఉ. నావుడునయ్యయాతిమదినాటినప్రేముడిముజ్జగంబులన్, బ్రోవఁగఁగావబీరమునఁబొల్పగు రాముఁడునట్టిబూమెచే, నేవగమోసపోయె." య. ౨, ఆ.—మాయకు.—"తే. మాకునభిలాషయిట్టిది మనుజనాథ, కోర్కియీడేర్పఁదగుదేనిఁగొనుముభూతి, కాకయుండినఁబ్రొద్దుకల్గంగనను పు, పోయివచ్చెదమింతేసిబూమెలేల." భల్లా. ౪, ఆ.—వంచనకు.—"తే. నన్నుఁగొనివచ్చునప్పుడునాథనీవు, నీకుఁగల్గువ్రతంబులునియమములును, దెలియఁజెప్పిన నిన్నెలతేటిమాతు, భూపవల్వదునన్నింత బూమెసేయ." రుక్మాం. ౫, ఆ.)

బూమెకత్తియ. వై. విశ. బూమెలుగలది. "సీ. పుష్పలావికయోర్తుబూమెకత్తియయోర్తుగంధవాహినియోర్తొకర్తులంజె." కాశీ. ౫, ఆ (రూ. బూమెకత్తె.)

బూమెకాఁడు. ద్వ. విశ. బూమెలుకలవాఁడు.

బూమెలాఁడి. ద్వ. విశ. (బూమెలు+ఆఁడి.) బూమెకత్తె.

బూమెలాఁడు. ద్వ. విశ. (బూమెలు+ఆఁడు.) బూమెకాఁడు.

బూర. వై. వి. వాద్యవిశేషము*. (చూ. బూరగ.) "క. బోరనబూరలుబేరులునుగరంబుచెలంగెన్." అచ్చ. యు, కాం.—విశ. స్థూలము*.

బూరఁడు. వై. విశ. విజృంభించినవాఁడు*. "చెప్పిననద్దురాత్మకుఁడుసింగఁపుబూరఁడునై." పంచ. వేం ౧, ఆ.

బూరకాలివాఁడు. ద్వ. విశ. ఏనుఁగుకాలివాఁడు.

బూరకాలు. ద్వ. వి. ఏనుఁగుకాలు. "సీ. బూరకాళులునీచఁబోయిన చేతులుఁగోలుమూఁపులుముడిగొన్నతొడలు." ఉ, హరి. ౨, ఆ.

బూరగ. వై. వి. 1. నాగసరమునకుసుతియిచ్చెడువాద్యవిశేషము, బూర*. (చూ. నాగసరము.) 2. తార*. "ద్వి. బూరగల్ కంచుకొమ్ములు కాహళములు, బోరుకొల్పుటకు నంబుధు లెల్లఁగలఁగ." నళ. ౨, భా.

బూరగడ్డి. ద్వ. వి. తృణవిశేషము.

బూరగొమ్ము. ద్వ. వి. (బూర+కొమ్ము.) వంకరగానుండువాద్యవిశేషము, కొమ్ము, శృంగము. "ఉ. తారలుబూరగొమ్ములునుదప్పెటలున్ బటహం

బులుక్ బదుల్. నూఱులు వేలు మ్రోయు." రామా. ౫, ఆ.

బూరటు. వై. వి. ఉల్బణము*.

బూరటించే. వై. ప్రే. బూరటిల్లఁజేయు.

బూరటిల్లు. వై. అ. క్రి. 1. నిండు; "తే. అంబరము దిశలు, బూరటిల్లంగఁజెలఁగెఁదదారవంబు." భార. విరా. ౪, ఆ.—2. ఉబ్బు*. "సీ. కలము పైఁ గీలించి గాలి కత్తినచాఁపఁబోలిమిన్నంతయు బూరటిల్లె." భార. ఉద్యో. ౪, ఆ. (రూ. బూరటిలు.)

బూరియ. వై. వి. బూర. "ఎ. గీ. బూరియలులడ్డువంబులుపొరలిపాఱి." నై. ౬, ఆ.

బూర్నీసు. గ్రా. వి. మొత్తనికంబళి.

బూరుగు. దే. వి. శాల్మలి!.

బూరుగుదీవి. ద్వ. వి. శాల్మలద్వీపము.

బూరువు. దే. వి. బూరుగుయొక్క రూపాంతరము.

బూరె. వై. వి. భక్ష్యవిశేషము. (బూరియయొక్క రూపాంతరము.)

బూల. దే. వి. లేఁతతాటిమ్రానిలోని పేడు.

బూలి. దే. విశే. నిస్సారమైనది.

బూసము. దే. వి. ధాన్యము. (ఇది విచారణీయము.)

బూసి. దే. వి. ఇండ్లవాసములకుపట్టెడుసాలెపట్టు.

బృ.

బృంద. సం. వి. ఆ. స్త్రీ. తొళసి!. అ. న. ము. సమూహము.

బృందారకుఁడు. సం. వి. అ. పుం. వేలుపు. విశే. 1. మనోజ్ఞుఁడు; 2. శ్రేష్ఠుఁడు.

బృందిష్ఠము. సం. విశే. (అ.ఆ.అ.) మిక్కిలి మనోజ్ఞమయినది.

బృంహితము. సం. వి. అ. న. ఏనుఁగుయొక్క గీఁక.

బృహతి. సం. వి. ఈ. స్త్రీ. 1. వాఁకుడు!; 2. ములక!; 3. ఒకఛందస్సు; (చూ. ఛందస్సు.) 4. ఉత్తరీయము; 5. విశ్వావసునివీణ. విశే. గొప్పదైనది.

బృహతిక. సం. వి. ఆ. స్త్రీ. ఉత్తరీయము.

బృహత్కుక్షి. సం. విశే. (ఇ.) పెద్దకడుపువాఁడు.

బృహత్తు. సం. విశే. (త్. ఈ. త్.) గొప్పది.

బృహత్ఫలువు. సం. వి. ఉ. పుం. పెద్దవరగోఁగు!.

బృహదేల. సం. వి. ఆ. స్త్రీ. పెద్దయేలకి!.

బృహద్బీజము. సం. వి. అ. న. అండవృద్ధి. పుం. అంబాళము!.

బృహద్భానువు. సం. వి. ఉ. పుం. అగ్ని, పావకుఁడు.

బృహన్నల. సం. వి. ఆ. స్త్రీ. అర్జునునికి వేషాంతరమునందలి నామము. అ. పుం. ము. పెద్దకిక్కస!.

బృహన్మరీచము. సం. వి. అ. న. మిరపకాయ.

బృహస్పతి. సం. వి. ఇ. పుం. సురగురువు, వేల్పుటొజ్జ.

బృహస్పతివారము. సం. వి. అ. పుం. ఒకవారము. (చూ. వారము.) (ఇట్లు గురువారము.)

బె.

బెంగ. దే. వి. 1. విరహవ్యథ; "అన్నన వింటిదంట చేసెంతెఁగలంగి బెంగగొని." రసి. ౫. ఆ.—2. కూఁత. "ఉ. బెంగలిడంగఁగూటియిటు పెంటిని గానక తేలిపోయి." సా. ౨. ఆ.

బెండ. దే. వి. ఎద్దునాలికచెట్టు. (దీనిభేదము కప్పురపుబెండ.)

బెండగిల్లు. దే. అ. క్రి. పెల్లగిల్లు, ప్రయాణమగు.

బెండు. దే. వి. జీలుగు!. విశే. నిస్సారము. "సీ. మండెడుపటుకాలదండంబుచేతులఁ బిసికి వేఁడిమియార్చి బెండుచేసి." హరి. పూ. ౪. ఆ.

బెండుమానిసి. ద్వ. వి. బలహీనుఁడైన మనుష్యుఁడు. "వ. నారలగరుడకపిధ్వజంబులుం జక్రగాండీవంబులు బెండుమానిసులకు భీషణంబులుగాని నాకుఁ బరితోషణంబులు." భార. కర్ణ. ౨. ఆ.

బెండుపడు. ద్వ. అ. క్రి. (బెండు+పడు.) బలహీనతనొందు. "ఎ. గీ. అధికశౌర్యసారులగు కపిపీఁల చేతనొచ్చి దైత్యసేన భీతిఁ, బఱచెఁగొంత బెండుపడియుండెఁగొంతధూమ్రాక్షు వెనుక కొదిఁగెనంతఁగొంత." భార. అర. ౨, ఆ.

బెకబెకలాడు. దే. అ. క్రి. (బెకబెకలు+ఆడు.) (కప్పలు) కూయు.

బెకొట్టు. దే. అ. క్రి. (బెంగ+కొట్టు.) వాపోవు.

బెగడు. దే. అ. క్రి. భయపడు. వి. భయము.

బెగడుపడు. ద్వ. అ. క్రి. (బెగడు+పడు.) భయపడు. (ప్రే. బెగడుపఱచు.)

బెగ్గడిల్లు. దే. అ. క్రి. భయపడు. "ఉ. ఒక్కటిమున్న వచ్చుటయునున్న విరామికి బెగ్గడిల్లుదుర్." మార్క. ౫, ఆ. (రూ. బెగ్గడిలు.)

బెగ్గడు. దే. అ. క్రి. బెగడుయొక్క రూపాంతరము.

బెగ్గలము. వై. వి. 1. విహ్వలత; "క. కడుభీతియు బెగ్గలమును, నడరఁగ." మార్క. ౧, ఆ.—2. భయము*. "వ. బెగ్గలంబగ్గలింపగ నాధ్యక్షుండు రథంబుదోలుకొనియూ క్రోశించుచుంబురంబున కరుదెంచి." సం. "గోపాధ్యక్షో భయత్రస్తో రథమాస్థాయ సత్వరః." భార. విరా. ౪, ఆ.

బెగ్గలించు. వై. అ. క్రి. 1. విహ్వలించు; "చ. జలధీశనందనులు . . . పదాతులఁగూడికడఁగి పెల్లుగన్, బలుచిరిపట్టణంబు దెసఁబౌరజనంబులు బెగ్గలింపఁగన్." నిర్వ. ౫, ఆ. —2. భయపడు*. "వ. ఎరకైవచ్చియిట్లుతోఁచినయెలుక యూరఁటిబారిదప్పిపోవరామిదలంచి బెగ్గలించి ధైర్యంబుకలిమింగార్యంబూహించి యప్పిల్లింగొంజొకచేరంజనుచుదానితో నిట్లనియె." భార. శాం. 3. ఆ.

బెగ్గలికము. వై. వి. భయము*. "క. ఆబెడిదపు మ్రోఁతకుఁగా, దేబమ్మెరపోయి దేవదేవరనగరన్, వేబెండువడిరి మొగములఁ, పైబెగ్గలికంబు దేఱఁబరిజనులెల్లన్." హరి. పూ. ౯, ఆ.

బెగ్గిల్లు. వై. అ. క్రి. 1. విహ్వలించు; 2. భయపడు*; 3. చింతించు*; "శా. రక్షోనాయకులార నిర్జరపరివ్రాతంబు చేతన్ సుధా, భిక్షాపాత్రము వోయెనంచు మదిలో బెగ్గిల్లఁగా నేటికిన్, రక్షార్థం బుభజింపరాదె యభవున్ ద్రైలోక్య కుక్షింభరున్, దాక్షారామపురాగ్రనాధుని సుధాధామార్ధచూడామణిన్." భీ. ౪. ఆ. 4. చలించు*; 5. బెదరు*. (రూ. బెగ్గిలు.—విహ్వలించుటకు.—"ఆశావారణశ్రేణి బెగ్గిలి మ్రొగ్గ బడియెన్." హరి. ఉ. ౪. ఆ.—భయపడుటకు.—"క. ఆమారీచునిక్రౄత్రిమ, భీమస్వరము విని సీత బెగ్గిలివింటే, రామునియార్తధ్వానము, నేమయ్యెను వేగమరుగ వేవిభుకడకున్." రా. అర. కాం. ౨, ఆ.—చలించుటకు.—"క. ఆతనిబాసటగాఁగొని, యాతులువలన డించిజన్నమలర నొనర్తున్, నీతలఁపున నిపుడేమియు, భీతునుపకయనుపుము నిన బెగ్గిలియతఁడున్." అచ్చ. బాల, కాం.—చెదరుటకు.—"చ. తొలఁగెఁగడంకవీడె ధృతిదూలె వివేకమడంగె బుద్ధిబె, గ్గిలెనభిమానమేగెఁద్రపగంటెనయంబభయంబుగుందెగా, నిలెబిగితాటె మేనుకులశీలము గ్రుంగెముడింగె గౌరవం, బలుకుపతగ్గ దైవమకటాయిటఁదెచ్చు నెయేమివచ్చునే." చంద్ర.)

బెగ్గురు. వై. వి. సారసపక్షి. (శౌందఱు పెగ్గురందురు.)

బెజ్జము. దే. వి. తూఁటు, రంధ్రము.

బెట్ట. దే. విశే. వేండ్రము, తీక్ష్ణము.

బెట్టించు. దే. స. క్రి. (నిర్బంధమునుండి.) మరలించు. "సీ. అప్పాటఁబ్రబలుజటాసురునడరిదండించఁజేసిమనల బెట్టించుకొనియె." భార. విరా. ౧, ఆ. "తే. బవరములు గావవితిగిన బౌరసాఁప, వచ్చునేయొక్కరుండు విప్వచ్చుడడరి, పసుల బెట్టించునపుడు నీబలము విఱుగ, దయ్యె నేనీవుఁగర్ణుండు నచటలేరె." భార. ఉద్యో. ౨. ఆ.

బెట్టిదము. దే. వి. (బెట్టు + ఇదము.) 1. ఉద్ధతి; 2. క్రౌర్యము. "క. క్షమయును బ్రియవాదిత్వము, శమమును నార్జవము దుర్విచారులు గడుంజా, లమిగా నూహింతురులో, కము వెఱచుట బెట్టిదంబుగ లుగుటఁజూమ్మీ." రా. యు. కాం.—విశే. 1. ఉద్ధతము; 2. క్రూరము; "క. భువిఁబుత్రస్నేహము మా, నవజాతికె కాక లేదె నరనాయక మీఁ, దువిచారింపక చేసితి, తవిలెఁగదా నీకు బెట్టిదపుఁబాపముదాన్." భో. ౭, ఆ. "ఎ. గీ. కులములందెల్ల నీరాచకులము చాల, బెట్టిదంబు." భార. భీష్మ. ౧, ఆ.—3. కఠినము; "క. అది బెట్టిదంపు వెరవున, మృదుభూతోపాయమునను మేకొనదు ప్రజన్, బోదువవలయు నాజ్ఞాసం, పదగల స్వాగతముతోడఁ బతియవహితుఁడై." భార. శాం. 3, ఆ.—4. బ. నిష్ఠురవచనము. "వ. ఇప్పాపాత్ముండు ప్రియవచనంబులం బోవండు, బెట్టిదంబులంగాని చక్కంబడండు." భార. అర. ౭, ఆ.

బెట్టిదుఁడు. దే. విశే. (బెట్టు+ఇదుఁడు.) 1. ఉద్ధతుఁడు; "రౌద్రరససమగ్రతఁగడు బెట్టిదుఁడై." మార్క. ౮. ఆ.—2. క్రూరుఁడు; "చ. బె, ట్టిదుఁడగు కాముతూపులఁ దొడింబడకుండఁగఁ గావుమిత్తటిన్." భార. విరా. ౨, ఆ.—3. కఠినుఁడు. "క. మృదువులకుఁజాలమృగువులు, విదితయశావినుము పాండవేయులు కడు బె, ట్టిదులు బెడిదంపువారికి, మదలో భిత్వము లులేవు మందునకైనన్." భార. ఆశ్ర. ౧, ఆ.

బెట్టిదురాలు. దే. విశే. (బెట్టిద + ఆలు.) బెట్టిదము గలది. (మా. బెట్టిదుఁడు.)

బెట్టు. దే. వి. 1. గౌరవము; 2. ఉద్ధతి; "పల్లఱుబెట్టు మాపిసంజాట్టము లైనఁదాలుదురె." ఉ. రా. ౨, ఆ.—3. అతిశయము. "చ. జనవినుత ప్రభాకలితచంద్రమతీతలఁబట్టి మోహముల్, పెనఁగొ

నఁజేసిపాదహతిబెట్టు మెయిన్ ద్విజరాజు రేసికై, కొనన ఖిలక్షమాభరముఁ గ్రూరవిపాదపయోధిఁ గ్రుంకఁగం, టినిగలయంగ నామనము నెవ్వగఁజేయఁగఁజేయుమీవనన్." హన. ౨, ఆ.—విశే. ఉద్ధతుఁడు. "చ. తనచతురంగసేనలుశతంబులు వేలును గోటులున్ ధరన్, బెనఁగొనఁగూల్చెవీఁడుకడుబెట్టు." ఉ, హరి. ౬, ఆ.—క్రి. విశే. 1. అత్యంతము; "మ. అవ్వీరుఁడువాలునుంబలు కయున్ ఘోరాకృతింబుచ్చికొం, చురయుంబారఁగడంగిబెట్టదర సంక్షోభించెనీసైన్యముల్." భార. భీష్మ. ౨, ఆ.—2. గట్టిగా; (చూ. అల్లన.) "బెట్టుగవినిచెన్ శివారుతము." భార. ద్రో. ౧. ఆ.—3. దృఢముగా. "మ. కడిందివృషాధముఁడగ్గలంపుఁదెం. పుఱవుగఁదాఁకెఁగృష్ణుఁడతఁడొడ్డినకొమ్ములువట్టిబెట్టుగన్." హరి. పూ. ౭, ఆ.

బెడఁకు. దే. అ. క్రి. 1. చలించు; "సీ. గతిసంభ్రమంబున గరిమబెడంకుచునకనకల్గుడుచునెన్నడిమిసొబగు." కళా. ౪, ఆ.—2. తొలఁగు. "చ. కబళముగొందుగాక త్రిజగంబువడంక బెడంకనిత్తువే." వసు. ౪, ఆ.—వి. 1. చలనము; 2. తొలఁగుడు.

బెడఁగారు. దే. అ. క్రి. (బెడఁగు+ఆరు.) అందగించు. "సీ. సరిలేనిరాకట్టుజాళువామొలకట్టుబెడఁగారునీర్కావిపింజెతోడ." స్వా. 3, ఆ.

బెడఁగు. దే. అ. క్రి. అందగించు. "మహీజంబుమడ్కిఁగొమ్మలబెడంగి." భాను. ౧, ఆ.—వి. 1. అందము; "ఆ. వీరసేనసుతుఁడువీరుండుహంసల, నడబెడంగుఁజూచినగుచు." భార. అర. ౨, ఆ.—2. విలాసము. "ఉ. కరంగనివాఁడుగల్గునే, రయుయ్యెడరంభదాను మెఱయించుబెడంగులకంచునవ్వుచున్." కళా. 3, ఆ.—విశే. 1. అధికము; "మ. ప్రబలాకారముతోగిరీశశిరమున్ బ్రాపింపఁబెన్ తాఁగనాఁ, గబెడంగయ్యెజనాపవాదము." వసు. ౫, ఆ. (దీనికి వేఱుప్రయోగము కనఁబడలేదు.)—2. మనోజ్ఞము. "క. ఖరకిరణతాపమునవురు, తరదవదాహమున శోషితములైనవనాం, తరతరుతతికాప్యాయన, కరమైవర్షాగమంబుకడుబెడఁగయ్యెన్." భార. అర. ౪. ఆ.

బెడఁద. దే. వి. 1. బాధ; "శా. చాలుంజాలుబెడందయేలచనుమాత్మాభృత్యసమీపోర్వికిన్." రవి. ౫, ఆ.—2. ఆపద. "చ. నాయెడహృదయంబులోఁగృపవహించితపోధనవర్యసారకున్, బెడఁదలుచుట్టియుప్పపయిఁబెట్టకయింతటఁ దృప్తిఁబొందుఁడీ." హరిశ్చ. 3, ఆ.

బెడక. దే. వి. ఉత్తగోనె.

బెడద. దే. వి. భక్ష్యవిశేషము. "వ. కర్జకాయలు బెడదలులడ్వాలు." హంస. ౧, ఆ.

బెడిదము. వై. వి. 1. భయంకరత్వము*; "ద్వి. కాలదండమునవలరెడు బెడిదంబు." హరిశ్చ. ౧, భా.—2. కఠినత్వము*. విశే. 1. భయంకరము; (చూ. బెగ్గలికము.)—2. అధికము*; "సీ. వెడఁదజాచలుపలబెడిదంపుఁగఠినతసరకుసేయునియురస్స్థలముతోడ." పర. ౨, ఆ. (దీనికి ప్రయోగాంతరము మృగ్యము.) 3. కఠినము*; 4. బ. పరుషవచనము*. "రాజు బెడిదంబులుపల్కినయేని సైఁపుము." భార. ఉద్యో. 3, ఆ. (బేడిదముయొక్క రూపాంతరము.)

బెడిదుఁడు. వై. విశే. 1. భయంకరుఁడు*; "ద్వి. బెడిదుండువీఁడనఁబృథివిఁబేర్పడితి" రా. యు, కాం. —2. కఠినుఁడు. (చూ. బెట్టిదుఁడు*.)

బెడిదురాలు. ద్వ. విశే. (బెడిదము + ఆలు.) బెడిదముగలది. (చూ. బెడిదుఁడు.)

బెడియు. దే. అ. క్రి. 1. తప్పు; 2. వికలమగు. (చూ. కూనగుంత.)

బెణఁకు. దే. అ. క్రి. వి. బెడఁకుయొక్క రూపాంతరము.

బెత్త. వై. వి. (చూ.) బెత్తిలి*.

బెత్తము. వై. వి. పేము, వేత్రము.

బెత్తిక. దే. వి. ఎండిలేచిన మట్టిపెళ్ల.

బెత్తిలి. వై. వి. తర్జని మొదలైననాలుగు వ్రేళ్ల అడ్డకొలత*. "చ. కలఁకదొలంగ వేఁవత గ్రక్కున బెత్తిలియెత్తి వ్రేయుడున్, మలచవు వేణినట్టనడుమన్ దగిచేతికిఁదున్క చిక్క." ఉ. రా. 3, ఆ.

బెత్తు. యు. దే. వి. 1. (చూ.) బెత్తిక; "సర్వదిగ్వలయాంబరక్షితిభాగముల్ బెత్తులెత్త." శశాం. ౫, ఆ.—2. గౌరవము. వై. బెత్తము. "సీ. వామనుకోలెమ్మువన్నెబెత్తుగఁజేసి ఫణిహారములుయోగపట్టెఁజేసి." భల్లా. ౪, ఆ.

బెదరింపు. దే. వి. బెదరించుట. "పోపొండమ్మరో పోవుపెట్లుబెదరింపుల్ మానుఁడిచ్చోటు." చంద్రా. ౨, ఆ. (చూ. అరగింపు.)

బెదరు. దే. అ. క్రి. భయపడు. (చూ. పదరు.) వి. భయము.

బెదరుపడు. ద్వ. అ. క్రి. భయపడు, బెదరు. "ఎ, గీ. అనుచుఁజెలులాడుదురుజాలకాంతరాళి, విలసి తార్థేందునకుఁజిల్కపల్కులకును, గమ్మవిరితేనె కునుగండుతుమ్మెదకును, బెదరుపడునట్టిశరదిందు వదనఁజూచి." భాను. ౩, ఆ.

బెదరుపోతు. దే. విణ. భయశీలుఁడు, భయశీలురాలు.

బెబ్బులి. ద్వ. వి. (పెద్ద+పులి.) వ్యాఘ్రము.

బెరయు. దే. అ క్రి. 1. కలుగు; "చ. నీ. వరయని యట్టియర్థమొకటైననుగల్గునె రైన నామదిన్, బెరసినకోర్కి దేవవినిపింతు దయామతిఁజిత్తగింప వే." భాగ. ౭. స్కం.—2. వ్యాపించు; "క. కురిసెనురపుష్పవర్షము, హరిపైనప్సరసలాడిరా తోద్యంబుల్, మొరసెసుఖస్పర్శం బై, బెరసెన్ బవనంబు దెసలువెలసెన్ గలయన్." హరి. పూ. ౬. ఆ.—3. చేరు. "సీ. వినుముఋగ్వేదాది వేద ముల్ నాలుగుఁగల్వాదులైనయంగంబులాఱుఁ బె రసివిద్యలుపది." భార శాం. ౩. ఆ. "క. పెరుఁగు టప్రగ్గఁగఁజవులం, బొరయుటయరుచంబుగాఁ గఁబుట్టుటపాపం, బెరయుటపాయ." భార. స్త్రీ. ౧, ఆ.—స. క్రి. పొందు. "క. హరిహరసర సిజసంభవ,వరాంశజాలయునట్టిసుతులఁబడసెము నీంద్రుం, డరుదుగసమ్మోదమునం. బెరసెనుబెన్ని ధులఁగన్నపేదయుఁబోలెన్." శశాం. ౭. ఆ.

బెరసు. వై. విణ. 1. క్రూరము*; "బెరసునల్లద్రా వుకుపడఁతి." నీలా. ౧, ఆ.—2. మిశ్రిత*. "బె రసుపచ్చడములు." నీలా. ౩. ఆ.

బెరికి. దే. వి. కొఱఁత. న్యూనత. (చూ. నమఁబ్రా యివడు.)

బెరుకు. దే. వి. 1 భేదము; "తే. నందగోపకరోహి ణీనందనుండు, పెరుఁగుచున్నాఁడుమీయొద్దగిరి మతోడ. నీకుమారునిఁబెంచినట్లాకుమారు. నరసి రక్షింపుమీమదిబెరుకులేక." వి. పు. ౬, ఆ.— 2. ప్రయోజనము. "తే. చెక్కుమీటినవసగాఱుశి శువుభక్తి, నుగ్రతపమొనరించుచున్ననతిని, యు తులతపము విఘ్నంబుసేయంగఁబూని, పెక్కు మాయలుపన్నినబెరుకులేదు." వి. పు. ౭. ఆ.

బెలంచి. దే. వి. పక్షివిశేషము. (అప్ర.)

బెలము. వై. వి. బొక్క, కలుఁగు.

బెలయు. దే. అ. క్రి. వ్యాపించు. "నవ్వునిండార మొగంబునన్ బెలయనప్పరమేశ్వరుఁడొప్పె." లక్ష్మీ. ౫, ఆ.

బెల్లము. దే. వి. చెఱకుపాలుకాఁచఁగానైనముద్ద, గుడము.

బెల్లి. దే. విణ. వంచకము. "బెల్లిమాటలు." అచ్చ. అ, కాం.—వంచకుఁడు, వంచకురాలు. "ఓసిబెల్లి." కళా. ౩, ఆ.

బెల్లించే. దే. స. క్రి. వంచించే. "ద్వి. బెల్లించియ తని." రా. బాల, కాం.

బెల్లింపు. దే. వి. బెల్లించుట, వంచనము. "క. అల్లం దుకందుకొనినీ, బెల్లింపులఁబడినమొదలు పెను బాములకే, యిల్లైతి." ఇలా. ౮, ఆ. (చూ. అర గింపు.)

బెసుకు. దే. అ. క్రి. (చూ.) బెడియు.

బెస్త. దే. వి. చేఁపలనుపట్టుటచేతను పల్లకిలోనగువా నిమోసికొనిపోవుటచేతను జీవించెడు ఒకజాతి వాఁడు. బోయీ. "ఆ. మీరలిప్పుడిచటఁజేరిమి క్కిలిప్రియ. త్నంబుతోడఁదగిలినడుచుచుండ, విషమముగుచుగమనవేగంబునను బాధ, పెట్టుచు న్నదనినబెస్తలనిరి." భాగ. ౫, స్కం. ౧, ఆ. (చూ. తగటీ.)

బెహారము. వై. వి. బేహారముయొక్క రూపాంతర ము. "క. పెక్కండ్రొక్కటియైతా, రొక్కబె హారంబెయాడుచుండఁగదానం, దక్కువయొక్కు వదగిలిన. నెక్కటిగాననుభవించుటుచితంబెం దున్." విజ్ఞా. ప్రా. కాం.

బెహారి. వై. వి. బేహారియొక్క రూపాంతరము. "అం దఱుకొక్క బెహారిచేరహాస్యనియతిమూల్యమం దుకొనియచ్చటికింగొనిపోయె." కళా. ౬, ఆ.

బెళఁకు. దే. అ. క్రి. 1. చలించు; 2. బరయు. "సీ. జి లుఁగుదువ్వలువింతబెళఁకినగరుదాల్చుతనువెట్టు లోర్చునోధాతువస్త్ర, భిరణమునకు." పాండు. ౮, ఆ.—వి. చలనము. "సీ. కంఠహారంబులగంతు లజతగూడిపిడికెఁడునడుముతో బెళఁకుఁజూప." ఆని. ౫, ఆ. (బెడఁకుయొక్క రూపాంతరము.)

బెళఁగు. దే. వి. బెడఁగుయొక్క రూపాంతరము. "చ. బెళఁగుదలిర్పఁగానధరబింబముఁజించెడుచోటఁ జిల్కయై." పాంచా. ౫, ఆ.

బెళగువ్వ. దే. వి. (బెళవ+గువ్వ.) (చూ.) బెళవ. "సీ. పెనుదవ్వుదగదొట్టఁజనిరెట్టపడఁ గొట్టెను డువీధిబెళగువ్వవొక్కయణుజు." స్వా. ౮, ఆ.

బెళవ. దే. వి. పక్షివిశేషము.

**బెరుకు.** దే. అ. క్రి. తళతళమని ప్రకాశించు. య. ౫, ఆ.—".సీ. చిన్నటవాఁడు కార్చిచ్చు వేఁజుట్టఁగాఁ బేర్చినబింకముల్ బెరుకవయ్యె." చమ. ౨, ఆ.— వి. తళతళమను ప్రకాశము. "చ. బెరుకులుచిమ్ము చుంగలికిబిత్తరి చూపుసరత్నకుండలాం, చలకపణోజ్జ్వలత్వముపసల్ నెఱపన్." కళా. ౧, ఆ.

## బే.

**బే.** వై. వి. అంబేయొక్క మాఱురూపము. "బేయను." భో. ౬, ఆ.

**బేఁటు.** దే. వి. 1. ఎండిన యడుసులోనగువాని పెల్ల; "చ. తనయూర్పులనింకియుంకిపో.యినపలుబేంట్లుగోరఁగొని యెత్తఁపట్టెను మాటిమాటికిన్." ఆము. ౫, ఆ.— 2. కొండలోనగువానియందలి చీలిక. (గ్రంథములయందిట్లు పరళాదిగాఁ గనఁబడుచున్నది. వాడుకలో పరుషాదిగాఁ గానఁబడియెడి.)

**బేగడ.** దే. వి. కాకిబంగారు, అభ్రకము. (చూ. బిల్ల.)

**బేగి.** వై. క్రి. విణ. వేగముగ.

**బేజెరూరు.** హిం. విణ. అనగత్యమైన.

**బేజారు.** హిం వి. అలయిక.

**బేడ.** దే. వి. 1. పరకరూపాయ; 2. బ. కాయధాన్యములపప్పు.

**బేడిగ.** దే. వి. పన్ను, భాగధేయము.

**బేడిజెము.** దే. వి. మాయ, టక్కు.

**బేడిదము.** వై. విణ. బెడిదమునకు మొదటిరూపము. (భయంకరమునకు.— "క. బేడిదమగునా దెబ్బకు, నోడకవిల్లెక్కుడించియుగ్రుఁడువై చెన్, గ్రీడించువేడ్కననిలోఁ, గ్రీడించుక వెగడుపడఁబరిస్ఫుటశక్తిన్." కాశి. ౮, ఆ.)

**బేడిస.** దే. వి. శకులము అను మత్స్యము. పాఠీనము అను మత్స్యము. (అని కొందఱు.) శఫరి అను మత్స్యము. (అని కొందఱు.)

**బేడౌలు.** హిం. విణ. వికారమైన.

**బేతాళము.** సం. వి. అ. పుం. 1. పిశాచము; 2. భూతావిష్టమృతశరీరము. డు. యమకింకరుఁడు.

**బేది.** దే. వి. పాసనము, విరేచనము.

**బేపరవా.** హిం విణ. లక్ష్యములేని.

**బేమరమ్మతు.** హిం. విణ. చెడిపోయిన, శిథిలమైన.

**బేరకత్తె.** వై. విణ. (బేరము+కత్తె.) బేరమాడునది. (మొదటిరూపము బేరకత్తియ.)

**బేరకాఁడు.** ద్వ. విణ. (బేరము+కాఁడు.) బేరమాడువాఁడు.

**బేరజెము.** దే. వి. 1. కుత్సితపుఁ డక; "రగడ. ఇంతిపావురపురొదయేలవినెదారజము. వింతయేవిరహిణులవెతఁబెట్టు బేరజము." స్వా. 3, ఆ.— 2. బ. పరుషవచనము. "ఎ, గీ. కాంతుఁడపరాధియైధైర్యకలనఁజేరఁ, గోడములాడుదైన్యంబు గీలుకొనిన, బేరజములాడుధీరాదిభేదవశత, నదియెతిద్విధమెట్లన్ననమపదింతు." శృం. ౨, ఆ.— విణ. కుత్సితుఁడు, కుత్సితురాలు. "అమ్మదిబేరజమిట్లనియె." శుక. ౨, ఆ.

**బేరము.** ఉభ. వై. వి. 1. వర్తకవ్యాపారము; (చూ. బచ్చు.) 2. వెలకువస్తువునిచ్చుకొలఁదిఁ డుగుట.— సం. అ. న. ప్రతిమ. "పంకములోని హైమబేరము." పర. ౫, ఆ.

**బేరి.** వై. వి. 1. వాద్యవిశేషము; "సీ. బేరులుఢోల్లుతిప్పెటలుకాళెలుపిల్లఁగ్రోవులు తుడుములు రీవిమెఱయ." అచ్చ. యు. కాం.— 2. (బేరము+ఇ.) వైశ్యుఁడు.

**బేరీజు.** హిం. వి. 1. రాజుకిచ్చు పన్నుమొత్తము; 2. లెక్కవివరము.

**బేల.** వై. విణ. మూఢుఁడు. (చూ. తలియ.)

**బేలరి.** దే. విణ. (బేలు+అరి.) మోసకాఁడు, వంచకుఁడు. "బేలరివైతి." (దీని ముందుభాగము. చూ. ఆలరి.) భాగ. 3, స్కం.

**బేలాయఖు.** హిం. విణ. తగియుండని.

**బేలు.** దే. వి. మోసము, వంచన. (చూ. బేలుపడు. బేలుపోవు. మొ.)

**బేలుపడు.** ద్వ. అ. క్రి. మోసపోవు. "దానిచేతనసేకులు బేలుపడిరి." సం. "తయారాజానోవిప్రలబ్ధాః." భార. అర. ౮, ఆ. (ప్రే. బేలుపఱచు.) (రూ. బేల్పడు. "మాటపసబేల్పడిక్రమ్మఱఁజేరుటొప్పనే." భార. శాం. 3, ఆ.)

**బేలుపోవు.** దే. అ. క్రి.—వై.—(ఈ విషయమునందు వాఁడు బేలుపోయినాఁడు.) (ప్రే. బేలుపుచ్చు.)

**బేలువెట్టు.** దే. స. క్రి. (బేలు+పెట్టు.) మోసపుచ్చు. "క. తానఁటమాంసముఁదినదఁట, యీనక్కయుబేలువెట్టెనిన్నాళ్లును." భార. శాం. 3, ఆ.

**బేవారసు.** హిం. విణ. నాథుఁడులేని, హక్కుదారులేని.

బేసము. వై. వి. (చూ.) వేసము. "వ. తీయనిపం ఙ్క్లకుఁగదియంబడి కయ్యంబుసేసియేసరేఁగి బేసంబులుగాసంబులుగొని." భాగ. ౮, స్కం.

బేసరి. దే. వి. ఒకదినుసుముక్కర.

బేసి. దే. విణ. సమముకానిది, విషమము.

బేసికంటి. దే. వి. (బేసి+కన్ను.) శివుఁడు, విరూపాక్షుఁడు. "సీ. నగఁగల్గినసుజాలు మొగసాలవాకిలిగాపించుచు బేసికంటిశైన." య. ౧, ఆ.

బేసికైదువుజోదు. ద్వ. వి. మన్మథుఁడు, అసమశరుఁడు.

బేహరము. వై. వి. బేహారముయొక్క రూపాంతరము. "సీ. బేహరమాడింపఁ బెరిఁగినధనమును" పంచ. నా. ౫, ఆ.

బేహరి. వై. వి. బేహారియొక్క రూపాంతరము. "మ. మిారలిట్లతికష్టస్థితి నూడ బేహరులపాలైపోవనా చెట్టవ, ట్టితిరేయుంచు." కళా. ౭, ఆ.

బేహారము. వై. వి. వర్తకవ్యాపారము, వాణిజ్యము. "ఎ. గీ. ఆధిపకృషి సేయుటయును బేహారమాడుటయునుగోరక్షగావించుటయును మొదలు, గాఁగబ్రదికెడుతెరువులుగానిగావె." భార. శాం. ౨, ఆ.

బేహారి. వై. వి. (బేహారము+ఇ.) వర్తకవ్యాపారము చేయువాఁడు, వణిజుఁడు. "క. సరకమ్మెడు బేహారులు, నరపతి సుంకరులలెక్కనమ్మికతోడన్, సరకమ్మినసొమ్మునఁదా, రిరువురియును పాలుసుంకమాఁదగుఁ బ్రీతిన్." విజ్ఞా. ప్రా, కాం.

## బై.

బైజె. దే. వి. అజ్ఞానము. "ఉ. కల్లలువేదముల్ స్మృతులుఁగల్లలుకల్లలుయజ్ఞకర్మముల్, కల్లలుపైతృకక్రియలుకల్లలుఘోరతపఃప్రభావముల్, కల్లలు దేవకార్యములుకావున బైజెలుమానిమామతం, బెల్లవిధంబులన్ నడపుఁడిమ్ములముక్తికిఁబోవఁ గోరినన్." వి, పు. ౮, ఆ. (మొదటిరూపము బయిజె.)

బైడాలము. దే. వి. కోపము, కినుక. (మొదటిరూపము బయిడాలము.)

బైరవాసము. వై. వి. ఉత్తరీయము. (మొదటిరూపము బయిరవాసము.)

బైరాగి. వై. వి. విరక్తుఁడైనతీర్థవాసి*. "తే. అన్నపాలుండుసతతమభ్యాగతులకు, రోగులకుసిద్ధులకు నుబైరాగులకును, వైదికులకునుగోరినయర్థవితతి, నిండువేడుకనొసఁగుచునుండునంత." బ్ర. ౨, ఆ. (మొదటిరూపము బయిరాగి.)

బైరి. దే. వి. శ్యేనవిశేషము. (చూ. అణుజో.) (మొదటిరూపము బయిరి.)

బైలగు. ద్వ. అ. క్రి. (బైలు+అగు.) బయలుపడు. "సీ. గర్భగార్భకతనూకాంతిబైలగులీలవిమలాంగినూఁగారువిపులమయ్యె." ఉ, రా. ౨, ఆ. (మొదటిరూపము బయిలగు.)

బైలు. వై. వి. బయలుయొక్క రూపాంతరము. (చూ. బైలగు.) (మొదటిరూపము బయిలు.)

బైసణ. దే. వి. వీణెసొరకాయయొక్క బంధనము. (మొదటిరూపము బయిసణ.)

బైసి. వై. వి. 1. భాగ్యము; "ఉ. నీ, బైసిదొలంగఁ దొత్తువలెఁబాపెడఁగూటికిఁజీరకుఁజెడన్." పంచ. నా. ౧, ఆ.—2. గౌరవము*. "ఎ. గీ. చేసియిటులేకలమ్ముల బైసిగొనియె." చంద్రా. ౨, ఆ. (బవిసియొక్క రూపాంతరము. మొదటిరూపము బయిసి.)

బైసుక. దే. వి. నియమనము, ప్రతిజ్ఞ. "ఎ. గీ. పలకడఁటుమకబైసుకపల్లటిలక." ఉ, హరి. 3, ఆ. "ఆ. ప్రాణమిత్తునంచుబైసుకవెట్టఁగ, వలదుపొమ్ముభూపవరకుమార." రుక్మాం. ౫, ఆ. (చూ. కొసరు.) (మొదటిరూపము బయిసుక.)

## బొ.

బొంకణము. వై. వి. బొక్కణముయొక్క రూపాంతరము. "ఆ. కటితటంబునందుఁగట్టినగోఁచియు, నొలువఁబడితివిట్టులొంటిఁదిరిగి, చంకబొంకణమునుసడలినదికశైనఁ, గొండలందుఁదిరుగకుండుదేవ." బస. 3, ఆ.

బొంకప్ప. దే. వి. మత్స్యవిశేషము.

బొంకరి. దే. విణ. (బొంకు + అరి.) అసత్యవాది. (చూ. కొండీయుఁడు.)

బొంకి. దే. వి. బోఁకియొక్క రూపాంతరము.

బొంకించు. దే. స. క్రి. మోసపుచ్చు. "ద్వి. చేతిలోఁజెయివేసి చీకాకుపటిచి, పోతివిబొంకించి భూపాలతనయ." సా. 3, భా.—ప్రే. బొంకఁజేయు.

బొంకు. దే. స. క్రి. అసత్యమాడు. వి. అసత్యవచనము. విణ. అసత్యము.

బొంకులాఁడి. దే. విణ. (బొంకులు+ఆఁడి.) అసత్యములాడునది.

బొంకులాఁడు. దే. విణ. (బొంకులు+ఆఁడు.) అసత్యములాడువాఁడు. "ఆ. బాలకుఁడువృద్ధుపగవాఁడుచుట్టంబు, బూతుసూనగాఁడుపాతకుండు, బొంకులాఁడుమ్రుచ్చుముండరికొండీఁడు, కల్లుద్రాగువాఁడుగాఁడుసాక్షి." విజ్ఞా. వ్య, కాం.

బొంగరము. వై. వి. బాలురాడుకొను బొమ్మరము. "ద్వి. బొంగరాలాడుచుబోడికల్ దాను, సంగతిఁబాయకచరియించుచున్న." సా. ౧, భా.

బొంగు. దే. వి. ఎండిన లావుబోలువెదురు.

బొంగువెదురు. ద్వ. వి. 1. గాలిసోఁకునమ్రోఁగెడుబోలువెదురు; 2. బోలువెదురు.

బొండ. దే.వి.తప్పుచేసినవారికాలుసేతులకుతగిల్చెడుదారుయంత్రవిశేషము. ద్రుపదము. (ఇది బొండకొయ్య, బొండమ్రాను అనియు చెప్పఁబడును.)

బొండము. దే. వి. బొండలమునకు మాఱురూపము. "క. ఆనాలుగుభూతంబులు, మానుగనొక్కొకటియేడుమాఱులుపొదువన్, లోనమరెనుబొండములోఁ, గానంబడునారికడపుఁ గాయయుఁబోలెన్." వి, పు. ౧. ఆ.

బొండలము. దే. వి. టెంకాయమీఁదిబొసిక. "సీ. ఎళనీటిబొండలంబులువోలెమెదడెల్ల జొత్తిల్లెవైచి నడొల్లుపుఱ్ఱగములు." (ఇట్లొకపాఠము. చూ. ఎడనీరు.) ఆము. ౬, ఆ.

బొండాము. దే.వి.బొండముయొక్క రూపాంతరము.

బొండిగ. దే. వి. ఈసెమొదలు, తొడిమ.

బొండు. దే. విణ. గుండ్రమైనది. (బొండుగంటలు.)

బొండుగ. దే.వి. కంఠనాళము. "కొండఱబొండుగల్ వగులద్రుద్దియు." అచ్చ. యు, కాం.

బొండుమల్లె. ద్వ. వి. మల్లికావిశేషము, గుండుమల్లె?.

బొండువ. దే. వి. బొండుగయొక్క రూపాంతరము. భార. శాం. 3, ఆ.

బొంటెము. దే. వి. ముండ్లకంపతో అల్లి తెట్టునకమర్చెడు తడుకు.

బొండ్లము. దే. వి. బొండలముయొక్క రూపాంతరము. "అరుణంపుబొండ్లముల." ఆము. ౧, ఆ.

బొండ్లాము. దే. వి. బొండ్లముయొక్క రూపాంతరము. (చూ. ఎడనీరు.)

బొంత. యు. దే. విణ. పెద్ద. (చూ. బొంతరఁటి. మొ.) వై. వి. చలికప్పునకును పఱపునకును ఉపయోగముగా దూదిలోనగువానిఁజేర్చి దట్టముగాకుట్టిన గంత*.

బొంతకాకి. ద్వ. వి. మాలకాకి, కాకోలము.

బొంతజెముడు. ద్వ. వి. ఒకదినుసుజెముడు?.

బొంతరఁటి. దే. వి. (బొంత+అరఁటి.) పెద్దకాయలుగల ఒకదినుసు అరఁటి. మహేంద్రి?.

బొంతఱాయి. దే. వి. శిలాభేదము.

బొంతు. దే. వి. జొన్నలులోనగువాని గింజలయడుగుననుండు కుదురువంటిపొట్టు.

బొంద. దే. వి. 1. రంధ్రము; 2. తాడులోనగు చిన్నచెట్టు. (తాటిబొంద, ఈఁతబొంద.)

బొందకోల. దే. వి. మల్లసాధనాయుధవిశేషము.

బొందడము. ద్వ. వి. (బొంత+దడము.) బొందళమునకు మొదటిరూపము. నై. 2. ఆ.

బొందడీఁడు. ద్వ. విణ. (బొందడము+ఈఁడు.) బొందడము తొడిగినవాఁడు. వర్మితుఁడు.

బొందపక్క. దే. వి. మత్స్యవిశేషము.

బొందపువ్వు. ద్వ. వి. తాటిమోవునుపట్టియుండెడునూఁగుపూవు.

బొందళము. ద్వ. వి. (బొంత+దళము.) కవచము. "కెందమ్మిబొందళపున్ రౌతునువ్రాసినట్టి పడకింటన్." ఉ. రా. ౪. ఆ.

బొంది. దే. వి. మేను, శరీరము. (చూ. పీడ్వడు.)

బొందిలి. దే. వి. ఒకజాతి.

బొందు. దే. వి. 1. దారము; (చూ. తవణిల్లు.) 2. చొక్కాయముడివేసెడుసన్ననాడా; 3. పుష్పసరము; "తే. నియమమునఁబుష్పములుగోసి నేర్పుమీఱఁ, బలుదెఱంగులవింతవింతలుగమాలి, కలునుబొందులఁగందుకంబులురచించి." కళా. ౪. ఆ.—4. వెన్నుదీయుటకు యోగ్యముగాని వరిలోనగునది.

బొందుపోవు. దే. అ. క్రి. వరిలోనగునది వెన్నుదీయ యోగ్యముగాకపోవు.

బొందె. దే. వి. అరఁటి ఊఁచే.

బొక్క. యు. దే. వి. నోరునిండినపొడియగు తినుబండము. (వాఁడు అడుకులు రెండుబొక్కులు బొక్కిపోయినాఁడు.)–వై. 1. బిలము; 2. రంధ్రము*; 3. శవమునుపూడ్చెడుపల్లము*. "ద్వి. ఎడనెడబొక్కలనిడినబాలకుల, వెడలించిభక్షించుబేతాళతతులు." పారిజా. ౨, భా.

బొక్కణము. వై. వి. విబూదిసంచి*. "ద్వి. పాడల కళాసంబొబూదిబొక్కణమె." హరిశ్చ. ౧, భా.

బొక్కనియ. వై. వి. గుఱ్ఱమునకు ఉలవలుపెట్టెడు బొక్కెన. "సీ. మోదంబుతో నశ్వ ముఖులలాయంబులఁగట్టిబొక్కనియలఁగవణమెత్తు." లక్ష్మీ. ౨, ఆ. (బొక్కెనయొక్క రూపాంతరము.) (దీనికి ప్రయోగాంతరము కనఁబడలేదు.)

బొక్కబెరడు. ద్వి. వి. సర్పవిశేషము.

బొక్కలాఁడు. ద్వి. వి. (బొక్కలు+ఆఁడు.) 1. సర్పము; 2. కన్నగాఁడు. "ద్వి. శ్రుతిబాహ్యుఁడిలఁ బుట్టుగ్రుడ్డుతామసుఁడు, గతిచెడ్డచెడుగు తెక్కలిబొక్కలాఁడు. పదవిహీనుఁడుజగత్ప్రాణభక్షకుఁడు, వెదకియీవిసపాలవిత్తు నేమందు, నని పామునిందించి." హరిశ్చ. ౨, భా. (ఇది రెండర్థములకునుదాహరణము.)

బొక్కసము. దే. వి. 1. అర్థభారము; "తే. అస్థిగర్భితతామ్రపేట్యన్వితమగు, బొక్కసంబెత్తుకొని పోయెబోయయనుచు." (దీనికి వెనుక. "ఎ, గీ. పాపకర్ముండు దెంచర్థభారమనుచు, వంచనాపాటవంబునఁగొంచుఁబోయి.") కాశీ. ౫, ఆ. — 2. సప్తాంగములలో నొకటి. కోశము; 3. భాండాగారము.

బొక్కి. దే. విశే. 1. పండ్లులేనిది; (బొక్కినోరు.) 2. మాంసములేనిది. (బొక్కిబొమ్మ.) (చూ. తెఱ్ఱి.)

బొక్కిస. దే. వి. వస్త్రములుపెట్టెడు పెట్టె. కరోటకము.

బొక్కిసా. దే. వి. చిన్నమూట, అల్పభారము.

బొక్కు. దే. స. క్రి. ఏదేని నోరునిండ వేసికొనితిను. వి. నిండిననోరు, బొక్క.

బొక్కులాడు. దే. స. క్రి. (బొక్కులు+ఆడు.) (చూ.) బొక్కు.

బొక్కెన. యు. దే. వి. నీరుపిప్పలి?. వై. 1. గుఱ్ఱమునకు ఉలవలుపెట్టెడు తోలుసంచి; 2. నీళ్లెత్తిపోసెడు తోలుసంచి; 3. నీళ్లుచేఁదెడి యినుపపాత్రము*.

బొగడ. దే. వి. 1. బుగడ; 2. చూచుకము; కళా. ౧, ఆ. —3. మంచెపుఁగోడుశిఖరము; (చూ. తరువడి.) 4. గండపట్టెమీఁదిగుబ్బ; 5. చెఱువుకట్టలో నగువానియందు నీళ్లుదూఱివచ్చెడు రంధ్రము.

బొగ్గు. దే. వి. మండిచల్లారిన కట్టెతునుక, కాళిక.

బొచ్చె. దే. వి. 1. కుండలోనగువానిపెంకు; 2. తలపుఱ్ఱె; 3. మత్స్యవిశేషము.

బొచ్చె. దే. వి. కేశము, రోమము.

బొజుఁగు. వై. వి. విటుఁడు. "క. సిరులచెలిమగనియడుగునఁ, గరమరుదుగఁబొడమిముజ్జగంబులయందున్, గరగరిక నెఱపుజక్కర, విరిఁబోఁడిబొజుంగ ప్రాఁతవేల్పులగొంగా." అచ్చ. అర, కాం.

బొజ్జ. దే. వి. కడుపు, కుక్షి. ఉదరము.

బొజ్జవాఁడు. దే. విశే. పెద్దకడుపువాఁడు, పిచండిలుఁడు.

బొటనవ్రేలు. దే. వి. పెద్దవ్రేలు, అంగుష్ఠము.

బొటమనవ్రేలు. దే. వి.——వై.——"క. గల్లనియందెలు మొరసినఁ, గొల్లలకొల్లను మఁజనికోమలులపుడే, యల్లనబొటమనవ్రేలని, మెల్లనహరిపంటనంటమెఱుముచునొక్కన్." సత్య. ౮, ఆ.

బొటవ్రేలు. దే. వి.——వై.——"సీ. ఘనసారచూర్ణమొక్కలతాఁగితెచ్చినబొటవ్రేలనే చుక్కబొట్టువెట్టి." స్వా. 3, ఆ. (చూ. నింగిసిగ.)

బొటిమ. దే. వి. (చూ.) మొటిమ, అవగండము.

బొట్ట. దే. వి. వెదురుబద్దలులోనగువానిచేనల్లిన గాదె.

బొట్టడి. దే. వి. దొర్లించెడు నల్లకాయి.

బొట్టనగోలలు. దే. వి. బ. బాలక్రీడావిశేషము. (చూ. చిమ్ముబిల్లలు.)

బొట్టనవ్రేలు. దే. వి. బొటనవ్రేలుయొక్క రూపాంతరము. పాండు. ౫, ఆ.

బొట్టము. దే. వి. గోఁచి. కౌపీనము.

బొట్టవ్రేలు. దే. వి. బొటవ్రేలుయొక్క రూపాంతరము.

బొట్టియ. యు. దే. వి. బాణములోనగువానిచివర నేర్పఱిచెడుతామరమొగ్గవంటిమొలిక. (చూ. బింకము రెండవయర్థము.(బొట్టెకోల.)—వై. 1. కొడుకు; "వేల్పుగొంగతొలుబొట్టియ." అచ్చ. యు, కాం.—2. కూఁతురు. "పుడమిబొట్టియ." అచ్చ. యు, కాం.

బొట్టియఁడు. వై. వి. కొడుకు. "గాడుపుబొట్టియఁడు." (ఇక్కడ బొట్టియ అనియుండిననుండవచ్చును. అయినను పాఠమిట్లుండుటవల్లను బొట్టెఁడు అని ప్రయోగముండుటవల్లను ఈ పాఠమే గ్రహింపఁబడెను.) అచ్చ. యు, కాం.

బొట్టు. వై. వి. 1. తిలకము; 2. అనుస్వారము; 3. జలాదిబిందువు*; 4. మంగళసూత్రమునందు గ్రుచ్చెడు స్వర్ణాభరణవిశేషము*.

బొట్టుగు. వై. వి. తిలకవృక్షము?.

బొట్టుదారము. ద్వి. వి. బొట్టునుగ్రుచ్చెడు మంగళసూత్రము.

బొట్టువు. వై. వి. బొట్టుగుయొక్క రూపాంతరము.

బొట్టె. వై. వి. 1. కొడుకు; 2. కూఁతురు. (బొట్టియయొక్క రూపాంతరము.)

బొట్టెఁడు. వై. వి. 1. బాలుఁడు*. "క. ఎట్టిమొనగాండ్రు రేనియు, గట్టిగనాయెదుటదిటముగనకపఱతురా, నెట్టుకొని నేఁడుమిగులన్ బొట్టెఁడవీవెట్లునిలిచిపోరెదుచెపుమా." అచ్చ. బాల, కాం. (బొట్టియఁడుయొక్క రూపాంతరము.)

బొట్టెకోల. దే. వి. తామరమొగ్గవంటి ములికిగల బాణవిశేషము. "ఎ, గీ. కామునికిబొట్టెకోలలుగా వెనాళ, ములఁబ్రకాశించుతామరమొగ్గలరయ." కళా. ౭, ఆ.

బొడబొడ. దే. వి. 1. కాఱుటయందగు ధ్వన్యనుకరణము; "నోటనుఁబొడబొడరక్తముందొరఁగ." అధ్యా. అర, కాం.—2. మ్రోయుటయందగు ధ్వన్యనుకరణము. "ద్వి. పుతియమూఁగలుబొడబొడమనిమ్రోయ." హరిశ్చ. ౧, భా.

బొడిగ. వై. వి. బాలకుఁడు*.

బొడిప. దే. వి. చెట్లయందలి బుడిపి.

బొడిమ. దే. వి. పావకోళ్లబిరడ.

బొడియ. దే. వి. రెండుసిద్దెలకువేసెడు పెన.

బొడ్డ. దే. వి. అత్తి, ఉదుంబరము?.

బొడ్డనబావి. ద్వి. వి. నడుమ పిల్లనూయిగలకోనేఱు. "వ. వజ్రపురంబునంగలకొలంకులం దటాకంబులంగేళాకూళులబొడ్డనబావులనడ్డపెట్టులేక విహరించుటకు వజ్రనాభుముదలయడిగి." ప్రభా. ౧, ఆ.

బొడ్డసరము. దే. వి. పైరులో మొలచు ఒకదినుసు చిన్నచెట్టు.

బొడ్డు. దే. వి. 1. నాభి; 2. నూతిచుట్టు ఎత్తుగా పెట్టినగోడ.

బొడ్డుఁజెవిక. ద్వి. వి. (బొడ్డు+చెవిక.) చుట్టుకొల్లారము నడిమిచోవడి.

బొడ్డుపుడక. దే. వి. ఒకదినుసు మ్రానికొఱముట్టు.

బొణిగ. దే. వి. 1. సరకులోనున్న చేతిసిద్ద; 2. బ. పొట్టుపీడి బద్దలుకాని కాయధాన్యము; 3. బొంతుపీడని జొన్నలోనగునవి; 4. భక్ష్యవిశేషము; 5. కొయ్యగంట.

బొత్త. దే. వి. తామ్రాదిపాత్రములబొంద.

బొత్తాము. ఆం. వి. గుండి. (రూ. బొత్తాను.)

బొత్తిగ. వై. ద్ర. క్రి. విశే. మొదలంట, ఆమూలము.

బొద. దే. వి. తృణవిశేషము, బల్బజము.

బొది. దే. వి. ఓడలుచేసెడుచోటు.

బొద్ది. దే. వి. ఒకదినుసుకూరాకు, వృద్ధదారకము.

బొద్దిఁక. దే. వి. బరిణెపురుగు.

బొద్దు. దే. వి. 1. గోడలులోనగువాని అంచులయందేర్పఱచెడు తదవయవవిశేషము, టాకు. (దీని భేదములు. అడఁగుబొద్దు, పేముబొద్దు.)—2. బ. హస్తాభరణవిశేషము.

బొద్దుకీటు. దే. వి. గోడమీఁద బొద్దేర్పఱచి పెట్టెడు కీటు.

బొనము. దే. వి. మెఱుఁగు. "మేడికాయబొనము."

బొప్పఁడు. దే. విశే. మూఢుఁడు. "క. వెడనవ్వి బొప్పఁడప్పుడు, జడుఁడైయాకిన్నరయ్యసన్నిధిఁ బలికెన్." బస. ౫, ఆ.

బొప్పాయపండు. వై. వి. ఒకజాతిఫలము.

బొప్పి. దే. వి. పోటుచేత దేహమునందు ఉబ్బుగా లేచెడు బుడిపి.

బొబ్బ. దే. వి. 1. పొక్కు; 2. సింహనాదము; "ఆదెసబొబ్బలు వార్పులుబహుతూర్యకోటియుఁ జెలఁగె." భార. భీష్మ. 3, ఆ.—3. పెద్ద అఱపు. "బొబ్బలు నార్పుల్ పటుసింహ నాదములునుత్పాదింప." భీ. ర, ఆ.

బొబ్బమెకము. ద్వి. వి. సింహము, కేసరి.

బొబ్బర. వై. వి. 1. చెట్టుమీఁదిబరదు; 2. సస్యవిశేషము; "వ. ప్రత్తిసంపత్తియుబొబ్బరయుబ్బరంబును." భీ. 3, ఆ.—3. బ. ధాన్యవిశేషము. (ఇవి నల్ల అలసందలు.)

బొబ్బరించు. దే. అ. క్రి. బొబ్బవేయు.

బొబ్బరింత. దే. వి. బొబ్బరించుట.

బొబ్బలి. వై. వి. ఒకానొకచెట్టు, బర్బురము.

బొబ్బాటము. దే. వి. బొబ్బరింత. (చూ. బుసకొట్టు.)

బొమ. దే. వి. బొమ్మయొక్క రూపాంతరము. (కనుబొమకు. —"బొమలల్లన్ ముడివడ్డ." భార. ఉ

డ్యో. ౨, ఆ.—ప్రతిమకు.—"వ్రాసినచిత్రపుం బొమకుఁబ్రాణమువచ్చినభంగిలేచి." విక్ర. ౭, ఆ.)

బొమముడి. దే. వి. కోపముచేతకలిగెడు బొమల ముడి, భ్రుకుటి.

బొమముడిపాటు. ద్వ. వి. బొమముడిపడుట. "చ. బొమముడిపాటుజంకెనయొఁబూనిపురంధ్రులు సాపరాధులౌ రమణులువేఁడుకొన్ననను రాగము దాల్పుదురట్లుగాదుమ, త్ప్రమువుపరాధలేశము నుదాల్పని నీవిపుడెంత్రమ్రొక్కినన్, దమలదు శాంతిఁబొందదుమదీయమనం బిఁకఁజాలుఁబ్రార్థనల్." కా. ౨, ఆ.

బొమిక. దే. వి. ఎముక. "సీ. ముంగాళ్లపైఁజాఁగి మ్రుచ్చుచూపులుపర్వబొమికలెత్తుకపాటిపోవు శునులు." ఆము. ౬, ఆ.

బొమికము. దే. వి. బొమ్మికముయొక్క రూపాంతరము.

బొమిడిక. దే. వి. కిరీటము. "సీ. దట్టంపుమల్లెలతల బొమిడికవెట్టిసా.పారుపువ్వులజోడుదొడిగి." వీర. ౨, ఆ. (రూ. బొమిడికము. "సీ. తిమిరాసురునిగెల్వసమయశౌర్యధరించుచికిలికెంపులబొమిడికమనంగ." భాను. ౩, ఆ.)

బొమిడీకము. దే. వి. బొమిడికముయొక్క రూపాంతరము. (చూ. బొమిడిక.)

బొమ్మ. యు. దే. వి. 1. కనుబొమ, భ్రూవు; 2. ప్రతిమ; (చూ. బొమ.) 3. బిరుదచిహ్నము; "వ. పిఱికిబంటునుంబోలెనిలుపకబొమ్మలువదలి." కవిక. ౪, ఆ. (ఇది రెండర్థములకు నుదాహరణము.) -- 4. అవమానచిహ్నము. "ద్వి. కట్టెఁడిమరునకుగట్టిగాబొమ్మ, గట్టితివేని." విష్ణు. ఉ. ౪, ఆ. "వ. జక్కిణికొరవంజివేషములఁ గేళికసల్పిరిదేవతానటీ, మణులకుబొమ్మవెట్టుక్రియ." రా. మా. ౨, ఆ.—విణ. అల్పము.—వై. బ్రహ్మ. (చూ. అగసాలె.)

బొమ్మంచే. ద్వ. వి. (బొమ్మ+అంచే.) 1. ఎఱుపు; 2. బ. ఎఱుపువన్నెవస్త్రము. విణ. ఎఱ్ఱనిది. "క. మంచిదియటువలెనాఁబొ, మ్మంచుసుబొమ్మంచుమోవి హాసనాంకురముల్, మించఁగగిరిసుత పంచినఁ, జంచలలోచనలుగొల్వఁజనెనిలయమునుమన్." ఉ. రా. ౭, ఆ.

బొమ్మఁడు. వై. వి. బ్రాహ్మణుఁడు. "క. ఎదురగుటతెలిసిపాఱుం, బొడుపడుకొనిచనియె మాఱు భూమికినటసం, దడిబొమ్మఁడుపెండ్లాడెడు, వడువునఁగనుగాఁపుఁబూపవయసుమిటారిన్." పాండు. ౩, ఆ.

బొమ్మచారి. వై. వి. బ్రహ్మచారి, వడుగు.

బొమ్మచేక్క. వై. వి. అభిజిన్నక్షత్రము.

బొమ్మజెముడు. వై. వి. సింహాండము ?.

బొమ్మడాయ. దే. వి. నేలనడఁగియుండు మత్స్యము, మద్గురము.

బొమ్మపెండ్లిండ్లు. దే. వి. బ. బాలికాక్రీడావిశేషము. (చూ. అచ్చనగండ్లు.)

బొమ్మముడి. దే. వి. బొమముడియొక్క రూపాంతరము.

బొమ్మమేడి. దే. వి. (చూ.) కాకిమేడి ?.

బొమ్మరము. వై. వి. 1. బాలురాడుకొనుబొంగరము; "క. అమ్మాధవార్జునులఁబెను, దుమ్ముపొడుఁగరథము తిరుగఁదొడఁగెఁడడవుగా, బొమ్మరముతిరుగునట్లవడిఁ, గుమ్మరిసారెగుడిదిరుగుకొనెడువిధమున్." జై. ౫, ఆ.—2. బ. బాలక్రీడావిశేషము. (చూ. చిమ్ముబిల్లలు.)

బొమ్మరవోవు. ద్వ. అ. క్రి. (బొమ్మరము+పోవు.) భ్రమించు. "భుజంగపతిబొమ్మరవోయె." రా. బాల, కాం.

బొమ్మరాకాసి. వై. వి. బ్రహ్మరాక్షసి, బ్రహ్మరాక్షసుఁడు. "ద్వి. బొమ్మరాకాసుల భోజనమ్ములకు, రమ్మనిప్రార్థింపరాఁడొక్కరుండు." హరిశ్చ. ౨, భా.

బొమ్మరిల్లు. దే. వి. (బొమ్మ+ఇల్లు.) బాలికలు బొమ్మల నుంచి ఆడుకొనెడు చిన్నయిల్లు.

బొమ్మరాయి. దే. వి. శిలావిశేషము.

బొమ్మికము. దే. వి. బొమ్మిడికముయొక్క మాఱురూపము.

బొమ్మిడికము. దే. వి. బొమిడికముయొక్క రూపాంతరము. (చూ. బొమిడిక.)

బొమ్మిడీకము. దే. వి. బొమ్మిడికముయొక్క రూపాంతరము.

బొరిగ. దే. వి. గడ్డిపెల్లగించెడు గుద్దలి.

బొరుగులు. దే. వి. బ. పేలగింజె.

బొరువులు. దే. వి. బ. బొరుగుయొక్క రూపాంతరము. కళా. ౬, ఆ.

బొరుసు. దే. వి. 1. కణిక; "తే. బొరుసునొసలను జెంద్రంపుబొట్టుపెట్టి." రాజ. ౩, ఆ.—2. వేఁపుడుచేట్టి.

**బొాటియ.** దే. వి. 1. బిలము; "తే. నఱుజూరూపూని కుత్తుకబొాటియఁజొొచ్చి." అచ్చ. యు, కాం.— 2. పర్వతబిలము; "సీ. పఱచివాఁడొొక్క గుబ్బలిపె నుబొాటియలోఁదూఱినఁతఁడునుదో నెతూఱి." అచ్చ. కిష్కిం, కాం.—3. గొొయ్యి; "భూదార ములు నేలబొాటియలలోఁ డాఁగు." భాగ. ౧, స్కం.—4. లోపలినీరింకిపోయియెండిననారిక డపుబొాండము. "భార్యకఁ పాగసారకుండనా రికడపుంబొాటియల్ తవిలించి." ఆము. ౧, ఆ.

**బొాటియమొాలి.** దే. వి. వాల్మీకి. "క. అనినెనరొాద వఁగనిటుల. య్యనియో రెపుఁడిండిదాసరయ్య తెలిపినఁ, వినిబొాటియమొాలిగొొదలోఁ, దనివిస నకయవలికతయుఁదమి డుగుటయుఁ." అచ్చ. ఆ, కాం.

**బొాట్టి.** దే. వి. బొాజ్జెకడుపు. "సీ. వలపగ్గములఁద్రెం చికలనడఁగొొంపటిబొాట్టులు వ్రయ్యంగఁ బొాడిచి పొడిచి." నీలా. ౨, ఆ.

**బొాట్టిజెట్ట.** దే. వి. పక్షివిశేషము.

**బొాక్టి.** దే. వి. బొాటియయొక్క రూపాంతరము. (మొ దటిరూపము బొాట్టియ.)

**బొాల్లఁడు.** దే. వి. బొాల్లిగుఱ్ఱము. "ఉ. నల్లని మేనునిల్వ తిరునామము పచ్చని పట్టునాభిపైఁ, దెల్లనితమ్మి యుంగలుగు దేవుఁడుకుంకుమపన్నె పుల్గు రా, బొా ల్లనినెక్కినల్పు తెలుపుంగల పువ్వులదండ దెచ్చి యుత్ఫుల్లనిజాంజలిఁ జిగురుఁబోఁడి కొసంగవె సఁ గృపామతిఁ." వైజ. ౧, ఆ. "క. ఒనరించిన నీలనినడ, గనిబొాల్లనిఁగత్తలాని." ద్వా. 3, ఆ.

**బొాల్లి.** దే. విణ. తెల్లనిది, తెల్లనివాఁడు. "సీ. పరికిం పమీ తెగపక్షపాతధురీణమరయంగ నెఱబొాల్లుల కటమీరు." చంద్ర.

**బొాల్లికోడి.** ద్వ. వి. జలకుక్కుటము.

**బొాల్లిగ్రద్ద.** ద్వ. వి. గరుత్మంతుఁడు.

**బొాల్లిపూస.** దే. వి. ఇంద్రవల్లి?.

**బొాల్లిమోరమెకము.** ద్వ. వి. ఎలుఁగు, భల్లూకము.

**బొాల్లు.** దే. అ. క్రి. అసత్యమాడు. వి. అసత్యము.

**బొాసబొాస.** దే. వి. వెడలుటయందగు ధ్వన్యనుకరణ ము. "వ. కడుపులనుండిబొాసబొాస వెడలుప్రేవుల ప్రోవులదిమి." ఉ, రా. ౪, ఆ.

**బొాసిక.** దే. వి. బెంకాయమొదలగువాని పైతోలు.

**బొానుక.** దే. విణ. బలిసినది, బలిసినవాఁడు. "సీ. పని లేనిపనిబక్క బలిసినబొానుకచిక్కినవాఁడు దగు నెలలెనిమిదింట." జై. ౧, ఆ.

**బొాళుకుబొాళుకు.** దే. వి. క్రక్కుటలోనగువానియం దగుధ్వన్యనుకరణము. "తే. వచ్చిశ్రీరామునడుగు లవ్రాలెనప్ధి, కేలఁగవపట్టినిజసతుల్ వ్రాలవంప, నవనినురమానవీఁపునమ్ములెక్క, బొాళుకుబొాళు కునఁగ్రొన్నెత్తురొాలుకనపుడు." రామా. ౭, ఆ.

## బో.

**బోఁకి.** దే. వి. 1. కుత్సితపాత్రము; 2. జెలగడుగు దోనె.

**బోఁకె.** దే. వి. ఎమ్ము, ఎముక, అస్థి.

**బోఁటి.** దే. విణ. వంటి. వంటివాఁడు. "మత్తకోకిల. నాఁటనుండియునాసమాలిన నామనంబుననాకు ని, కేటిజీవనమంచు నీతపమిట్లునన్నితిఁగాకయే, నాఁట నేనియులె వ్రతస్థుఁడనన్నెతిఁగియునిట్టినా, బోఁటిభీతుని నీకుఁదోడనఁబోలు నేదశకంధరా." రా. అర, కాం. "బోటుఁడనాలుచన్నెమిము బోం ట్లకు." కళా. ౭, ఆ.

**బోక్కాణము.** సం. వి. అ. పుం. 1. గుఱ్ఱమునకు ఉలవలుపెట్టెడు బొక్కెన; 2. నీళ్లెత్తిపోసెడు బొక్కెన.

**బోగమాట.** దే. వి. (బోగము+ఆట.) బోగముదాని నృత్యము.

**బోగము.** వై. వి. 1. లంజెవెల; (బోగముది.) 2. వెల. "మేల్ బోగపురేఁటెముల్." య. ౪, ఆ.

**బోగముది.** ద్వ. వి. (బోగము+అది.) వెలయాలు.

**బోగి.** యు. దే. వి. సంక్రాంతిపండుగకు తొలిదినము. వై. విణ. భోగముగలవాఁడు, భోగముగలది. "ఇది పుట్టుబోగి." య. ౪, ఆ.

**బోగు.** దే. వి. పూఁనికి. "క. కదునిదుమలఁబడివారి, ప్పుడుమునుపటినెలవువదలి బోగుమిగులఁగఁ, దొడుకులునుబృందయనియెడు, నడవికిఁగాఁపు రమువచ్చిరలజడిమీఅఁ." నీలా. ౧, ఆ.

**బోగుబడి.** దే. విణ. (చూ.) దూఁబఱఁదిండి.

**బోటి.** దే. వి. 1. ఆఁడుది; "క. తేఁటియొకటియొరు ప్రియకును, మాటికిమాటికిని నాగమదజలగంధం బేటికినని తనఁబొందెడు, బోటికినందిచ్చునిందు బోటుఁదనమునఁ." భాగ. ౧, స్కం.—2. చెలి కత్తె. "ఎ, గీ. అంగపలికాంతమన్నించునమఁగు

గుచుఁ." రా. అర, కాం. (వృత్తియందంత్యవర్ణలోపము. ఉదా. బోనకావడి, బోనపుట్టిక. మొ.)

**బోనముకత్తె.** వై. వి. బోనకత్తె. "ఈనిసుపుబోనముకత్తెలకైనఁబట్టఁగాముట్టఁగనీము." కృష్ణా. 3, ఆ.

**బోనముపెట్టె.** వై. వి. తోలుకప్పినగుండ్రనిపెట్టె.

**బోను.** దే. వి. 1. మృగములులోనగువానినిపట్టెడు కపటయంత్రము; 2. పెంపుడుమృగములుండుటకై చట్టుకమ్ములమర్చిచేసిన ఒకవిధమైన పెట్టె లోనగునది. "ఉ. బోనునసన్న మత్తహరిపోలిక బ్రాహ్మణశాపయుక్తిసెం, తేనియుఃశాంతిఁజెందనితఁడు." ఉ, రా. ౫, ఆ.

**బోనుపాయ్య.** దే. వి. అటునిటు తీసికొనిపోఁదగిన మఁటిపాయ్య.

**బోము.** దే. వి. బలవంతము, బలాత్కారము.

**బోయ.** దే. వి. 1. కిరాతుఁడు; "తే. దీనితేనియఁ ద్రావినమానవులకు, జరయురుజయునుడప్పియుఁ జావుఁగల్గ, వనఁగఁగొందఱుబోయలు వినికడఁగి, యఱక మొఱకులైచటఁబడనతికిరపుడు." సం. "తతఃకిరాతాస్తద్దృష్ట్వా." భార. ఉద్యో. ౨, ఆ.—2. కైవర్తుఁడు. "క. తలవిసరివెలదగఁగఁబో, యలకీవలదయ్యయనిన." భార. అను. ౨, ఆ.

**బోయఁడు.** దే. వి. బోయవాఁడు. (బోయయొక్క రూపాంతరము.)

**బోయత.** దే. వి. బోయది. (కిరాతస్త్రీకి. "ద్వి. తనపుణ్యమ్మనబోయతనుబిట్టుగదివి, కోనుకనిఁదనుకించికొఁగిటఁజేర్చె." విష్ణు. పూ. 3, ఆ.)

**బోయి.** దే. వి. బోయీయొక్క రూపాంతరము.

**బోయీ.** దే. వి. పల్లకిమోచేవాఁడు, బెస్త.

**బోయీఁడు.** దే. వి. బోయి. (స్వార్థమున ఈఁడు.)

**బోయెత.** దే. వి. బోయతయొక్క రూపాంతరము. "చ. అతినవపల్లవోజ్జ్వలతరాంబరయౌతొలు సంజగబ్బిబో, యెతతటివేచివింటఁగదియించిన వేగురుఁజొక్కయుంటను, ధ్రుతగతిఁదద్విజాధిపతి దారఁదమింగడపక్షదదండసం, హతిక్రియఁదారకల్ సెదరనండజకోటిభ్రమించెనల్లడన్." హన. ౮, ఆ.

**బోర.** దే. వి. రొమ్ము, అక్కు, ఎద, వక్షము.

**బోరగించు.** దే. ప్రే. బోరగిల్లఁజేయు.

**బోరగిల్లు.** దే. అ. క్రి. 1. రొమ్ము భూమిసాను; 2. రొమ్ము భూమి నానఁబరుండు. (రూ. బోరగిలు. రొమ్ము భూమిసానుటకు. —"చ. క్షతమునముక్కునంజెవులఁ గన్నులనొక్కెడు రక్తమంగము, ప్లుతముగఁజేయఁగానతఁడు బోరగిలంబడియెన్ ధరన్." భార. శల్య. ౧, ఆ.—రొమ్ము భూమినానఁబరుండుటకు. —"సీ. పొలుపారఁగాబోరగిలి పాన్పునాల్గుమూలలకునువచ్చును మెలఁగిమెలఁగి." (ఇక్కడ భూమియనునది పఱపులోనగువానికిని ఉపలక్షణము.) హరి. పూ. ౫, ఆ.)

**బోరన.** దే. ద్ర. క్రి. విశే. శీఘ్రముగా. "క. మనుజేశ్వరులెల్లనుబో, గనదమయంతీస్వయంవరమునకునొప్పన్, జనుదెంచిరిసైన్యస్యం, దనఘట్టననవనితలముత్తల్లడపడఁగన్." భార. అర. ౨, ఆ. "క. ఈరథికులుతనునిమ్మెయిఁ, బోరికిఁదఱుమంగఁదానుఁబుఱికొనకిచటన్, గౌరవపతిడాఁగినగతి, బోరనఁజనిచెప్పవలయు భూనాథునకున్." భార. శల్య. ౨, ఆ.

**బోరప్రాఁకుడు.** దే. వి. పాము, ఉరగము. "ఎ, గీ. దోసపుగయాళి, బోరప్రాఁకుడుఁగోలములప్పల్లు తేఁడ." అచ్చ. బాల, కాం.

**బోరు.** దే. వి. వానకురియుటయందగుధ్వన్యనుకరణము; (వానబోరున కురియుచున్నది.) విశే. పెద్ద (ఉదా. బోరుతలుపులు. మొ.)

**బోరుకలఁగు.** దే. అ. క్రి. మ్రోఁగు, ధ్వనించు. "కటకరవంబుబోరుకలఁగన్." స్వా. ౫, ఆ. "వాద్యముల్ బోరుకలంగ." విజ. 3, ఆ. (ఒకానొక గ్రంథమునందు బోరుకల్గు అని ప్రయోగింపఁబడియున్నది.)

**బోరుకాడించు.** దే. ప్రే. బోరుకాడఁజేయు. "తే. పాపనికినూనెతలయంటిపసుపుఁబూసి, బోరుకాడించిహరిరక్షపొమ్మటంచు, జలములొకకొన్నిచుట్టిరాజిలెడుతొట్ల, నునిచిదీవించి పాడిరయ్యువిదలెల్ల." భాగ. ౧౦, స్కం. పూ. (చూ. బోర్కాడించు.)

**బోరుకాడు.** దే. అ. క్రి. (బోరుక+ఆడు.) (బిడ్డలు) స్నానముచేయు.

**బోరుకొను.** దే. అ. క్రి. బోరుకలఁగు, మ్రోఁగు. "తే. భేరిమొదలగువాద్యముల్ బోరుకొనఁగ." ఇలా. ౧, ఆ. (ప్రే. బోరుకొలుపు. "ద్వి. బూరగల్ కంచుకొమ్ములుకాహళములు, బోరుకొల్పటకునంబుధులెల్లగలఁగ." నవ. ౨, భా.)

**బోరుతలుపులు.** దే. వి. బ. నగరులోనగువాని వాకిటిపెద్దరెక్కతలుపులు. "ఎ, గీ. బీగములువుచ్చిగ

డీయలు పెకలఁజేసి, బోరుతలుపులు దెఱచిగొబ్బునఁబురంబు వెడలె నానకదుందుభివిష్ణుమాయ, యఖిలమునుగప్పితనకుఁదోడైనటింప." వి, పు. 2. ఆ.

బోరువ. ద్వ. వి. (బోరు+వా.) ఒకదినుసు పెద్దగద్ద.

బోరెము. దే. వి. దూదింగోనగువానిమాట. "గెంటెపుబోరెములు." హంస. ౫. ఆ.

బోరెంపోతు. దే. వి. తిండిపోతు, క్రొవ్వినవాఁడు.

బోర్కాడించే దే. (ప్రే). బోరుకాడించుయొక్క రూపాంతరము. "శా. ఆలీనాతోలుచూలిబిడ్డనికిబోర్కాడించిచేసూతికా, శాలామధ్యవిశాలతల్పగతనైవన్నిచ్చినిద్రింప." భాగ. ౧౦. స్క. ౦. ఉ.

బోర్కాడు. దే. అ. క్రి. బోరుకాడుయొక్కరూపాంతరము.

బోర్డు. ఆం. వి. (1) కార్యనిర్వాహకసభ; (2) పెద్ద కొయ్యపలక.

బోర్తలుపులు. దే. వి. బ. బోరుతలుపులుయొక్క రూపాంతరము. "బలుకంచుగుబ్బబోర్తలుపులు." హంస. ౨ ఆ.

ోలము. సం. వి. అ. పుం. బాలెంతబోళము.

ోలు. దే. విశ. లోపల ఏమియులేనిది. "ద్వి. బోలుసొమ్ములు." హరిశ్చ. ౨. భా.

ోలె. దే. వి. 1. ఓటికుండ; 2. కుండబొచ్చె.

ోలెము. దే. వి. వేగము. (చూ. నడగఁడు.)

ోసి. దే. వి. పండ్లులేనిది, బొక్క. "బోసినోరు." రాజ. 3. ఆ.

ోసివడు. ద్వ. అ. క్రి. (బోసి+పడు.) బోసివోవు. "సీ. ఎచ్చోటనులివేఁడియెండఁ బండులురాలిపూసాక్కవదనంబుబోసివడిరొ." భీ. 3, ఆ.

ోసివోవు. దే. అ. క్రి. (బోసి+పోవు.) బోసియగు. (చూ. పాటము.) (ప్రే). బోసివుచ్చు. "సీ. పటుచపేటంబునఁబండ్లుడుల్లఁగ మొత్తిపూసాక్కవదనంబుబోసివుచ్చె." కాశీ. 2. ఆ.)

ోసేయు. వై. స. క్రి (బోనము+చేయు.) భుజించు. "ఎ. గీ. అబిడన్నంబుసంకటియుంబలియును, జేయుపవరేయివేళబోసేసిపోవు." హంస. ర, ఆ.

ోళము. వై. వి. గంధరసము.

ోళా. వై. విశ. కపటములేని, దాపరములేని.

బ్ర.

బ్రక్క. దే. విశ. దీనుఁడు. "ఈబ్రక్కద్విజాఁజాడరయ్యసభవారు." అను. ౬, ఆ. (బక్కకు మొదటిరూపము)

బ్రతుకు. దే. అ. క్రి. జీవించు. "క. ఏవేళనైనఁబ్రియపడి, రావించునుదానివలనబ్రతికితిఁజుమ్మీ." భో. ౫, ఆ.—వి. 1. జీవనము; "క. నీ, బ్రతుకుబయల్గానువాలిపయ్యరకుత్తా." నీలా. 3, ఆ.— 2. స్థితి. "చ. ఈ, జగములపుట్టువుంబ్రతుకుఁజావునునీవలనఁ స్వభావమై, నెగడినరాజసాదికమనీయగుణత్రయిచేష్టితంబులు." వి, పు. ౨, ఆ.

బ్రతుకుఁదెరువు. దే. వి. (బ్రతుకు+తెరువు.) జీవనోపాయము.

బ్రదిమి. దే. వి. జీవనము. "తే. అరయఁగారణమించుకయైనలేక, వలముగలవాఁడుబడుగైనవలములేని, వాఁడువలమైనఁదెలియంగవలయువాని, బ్రదిమియెనిమిదినెలలౌటభవ్యమతులు." శివ. ఉ. ౨, ఆ.

బ్రదుకు. దే. అ. క్రి. వి. బ్రతుకుయొక్కరూపాంతరము. [జీవించుటకు.—(చూ. ఎడరు. రెండవ అర్థముకడ.) జీవనమునకు.—"ఎ, గీ. అట్టిబెడిదంబునకునోర్వకమరవరులు, మునులునజుఁడుమన్నగమహామూర్తివిష్ణు, నుదరదేశంబుసొత్తురుబ్రదుకుఁగోరి." హరి. పూ. ౧. ఆ.]

బ్రద్ద. యు. దే. వి. 1. తునుక; 2. చీలిక. వై. పేము. (చూ. కుప్పసము రెండవ అర్థముకడ.)

బ్రద్దపరి. ద్వ. వి. పేములతోనల్లిన కేడెము. "ద్వి. శతమాయుఁడడిదంబుజళిపించిపూన్చి, శతబలివిపులవక్షంబేయుటయును, సరభసుండైయప్పుళితబలిబ్రద్ద, పరిఁదప్పనొడ్డి కృపాణోగ్రధారఁజలమునఁదెగవ్రేసె శతమాయుతొడలు." రా. యు. కాం.

బ్రద్దర. ద్వ. వి. (బ్రద్ద+అర.) 1. తునుక; 2. చీలిక.

బ్రద్దలవారు. ద్వ. వి. బ. వేత్రధరులు. "ద్వి. క్రందుగాకుండంగ బ్రద్దలవారు, సందడిజడియ." రా. యు, కాం.

బ్రధ్నము. సం. వి. అ. పుం. వేరు, బుధ్నము.

బ్రధ్నుఁడు. సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. శివుఁడు.

బ్రమయు. వై. అ. క్రి. భ్రమించు, బమ్మెరవోవు.

**బ్రమరిదిరుగు.** ద్వి. అ. క్రి. (బ్రమరి+తిరుగు.) చుట్టివచ్చు. "క. ఎత్తినగదలంకించియు, హత్తియునుం బ్రమరిదిరిగియడిచియుఁ బైపై, నొత్తియుఁదట్టియుఁబట్టియు, మత్తగజద్వయముఁబోలెమలసిరిరువురున్." ఉ, హరి. 3, అ.

**బ్రమరివాఱు.** దే. అ. క్రి. (బ్రమరి + పాఱు.) బ్రమరిదిరుగు. "ఎ, గీ. మల్లసఱచుచు నార్చుచు మలసి బ్రమరి, వాఱుచును బెక్కు బిరుదులు పలికి పలికి, మెలఁగియాఁబోతులుం డెడుపొలములరసి, అంకెపట్టుకనుంగొనిబింక మెసఁగ." హరి. పూ. ౬, అ. (ఒకానొకచోట బ్రమరులువాఱు అని ప్రయోగింపఁబడియున్నది.)

**బ్రమ్మి.** వై. వి. సోమెదచెట్టు.

**బ్రల్లు.** దే. వి. కూలుటయందగు ధ్వన్యనుకరణము. "ఉ. ఈ, రావిఁగడిందికొమ్మొకటి బ్రల్లనఁగూలె దనేనుబోవుచున్." పర. ౫, అ. (బల్లురొయొక్క మొదటిరూపము.)

**బ్రహ్మ.** సం. వి. న్. పుం. 1. నలువ; (నవబ్రహ్మలు.—భృగువు, పులస్త్యుఁడు, పులహుఁడు, అంగిరసుఁడు, అత్రి, క్రతువు, దక్షుఁడు, వసిష్ఠుఁడు, మరీచి.) 2. విష్ణువు; 3. బ్రాహ్మణుఁడు; 4. ఒక ఋత్విజుఁడు. (చూ. ఋత్విజుఁడు.) న. ము. 1. పరమాత్మ; 2. వేదము; 3. తపము. పుం. ఒక గ్రహయోగము. (చూ. యోగము.)

**బ్రహ్మచర్యము.** సం. వి. అ. న. ఆశ్రమవిశేషము. (చూ. ఆశ్రమము.)

**బ్రహ్మచారి.** సం. వి. న్. పుం. ముంజిత్రాడులోనగువానిధరించి వేదముచదివి బ్రహ్మచర్యవ్రతము నందుండువాఁడు.

**బ్రహ్మణ్యము.** సం. వి. అ. పుం. గంగరావి. విణ. బ్రాహ్మణహితము.

**బ్రహ్మదర్భ.** సం. వి. ఆ. స్త్రీ. ఒకదినుసు ఓమము.

**బ్రహ్మదారువు.** సం. వి. ఉ. న. గంగరావి.

**బ్రహ్మపుత్రము.** సం. వి. అ. పుం. 1. పడమరపాఱెడి యొక యేఱు; 2. విషభేదము.

**బ్రహ్మబంధువు.** సం. విణ. (ఉ.) 1. గుణింపఁబడువాఁడు; 2. దూఱఁబడువాఁడు.

**బ్రహ్మబిందువు.** సం. వి. ఉ. పుం. వేదపాఠమునందలి నోటితుంపర.

**బ్రహ్మభూయము.** సం. వి. అ. న. బ్రహ్మత్వము.

**బ్రహ్మమేఖలము.** సం. వి. అ. పుం. బ్రహ్మచారులకు ముంజిగా ఉపయోగింపఁబడు తృణవిశేషము.

**బ్రహ్మయజ్ఞము.** సం. వి. అ. పుం. వేదపాఠము.

**బ్రహ్మరంధ్రము.** సం. వి. అ. న. నడునెత్తి, మాడపట్టు.

**బ్రహ్మరథము.** సం. వి. అ. పుం. మృతిపొందిన సన్న్యాసులను తీసికొనిపోయెడు వాహనము.

**బ్రహ్మవర్చసము.** సం. వి. అ. న. సదాచారాధ్యయనసమృద్ధి.

**బ్రహ్మవాది.** సం. వి. న్. పుం. వేదాంతి.

**బ్రహ్మసాయుజ్యము.** సం. వి. అ. న. బ్రహ్మత్వము.

**బ్రహ్మసువు.** సం. వి. ఊ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

**బ్రహ్మసూత్రము.** సం. వి. అ. న. యజ్ఞోపవీతము.

**బ్రహ్మాంజలి.** సం. వి. ఇ. పుం. వేదాధ్యయనకాలమునందలి మ్రొక్కు.

**బ్రహ్మారణ్యము.** సం. వి. అ. న. వేదపాఠభూమి.

**బ్రహ్మావర్తము.** సం. వి. అ. పుం. డిల్లికి వాయవ్యభాగముననుండెడు దేశవిశేషము.

**బ్రహ్మాసనము.** సం. వి. అ. న. ధ్యానోపాయభూతమైన పద్మస్వస్తికదండాద్యాసనము.

## బ్రా.

**బ్రాఁతి.** దే. వి. ప్రేమ. "ఉ. వీణియమట్టొటలమిగులవింతలు పెంపుడుచిల్కబోదతో, రాణదలిర్పఁ బల్కుట గరంబపురూపముపూర్వమెంతయున్, బ్రాణసఖీరహస్యముల బ్రాఁతియుఁగ్రీడలు కానివావియా, యేణవిలోలలోచనకు హెచ్చినమన్మథచేష్టనయ్యెడన్." కళా. ౬, అ. "చ. పలువురియందునొక్కనికి బ్రాఁతియు నొక్కనియందుఁజూడదన, గ్గలమగు ప్రేమపల్వురకుఁగల్గుటయద్భుతము." స్వా. ౬, అ.—విణ. 1. అధికము; "ఉ. భూసురకోటివేఁడుటయుఁబోఁడిగఁ బ్రాణములైననిత్తునా, బాసదినేశలోకమునఁ బ్రస్ఫుటమెంతయునట్లుగావునన్, వాసవుఁడట్టెనన్నడుగవచ్చుఁ బ్రియంపడివాకునొక్కబ్రాఁ, తే సురలోకవందితమదింగవచంబునుగుండలంబులున్." భార. అర. 2, అ.—2. దుర్లభము; "ధర్మతత్పరులకుగల్గు బ్రాఁతె." భార. శల్య. ౧, అ. "ఆ. ఇమ్మెయిముక్తి, బ్రాఁతె బ్రాహ్మణులకురాజులకును." భార. అశ్వ. ౧, అ.—3. ప్రియము. "తే. ఇచటమత్ప్రీతి చేసినన్నెలికొనుము, భక్తిగానినీకేమియుబ్రాఁతి గాదు." ఉ. హరి. ౨, అ. "తే. పగఱలెలలోఁట

నీడలు బ్రాంతియయ్యెఁ, బగుళులును రేలుఁదనుగా
లి బ్రాంతియయ్యె, రేలు వెన్నెలబయళులు ప్రియ
ములయ్యె, రేలుఁబగళులు నిద్రలు ప్రియముల
య్యె." లక్ష్మీ. 3, ఆ.

బ్రాంది. ఆం. వి. ఒకవిధమైన మద్యము.

బ్రాహ్మణబ్రువుఁడు. సం. వి. అ. పుం. జాతిమాత్రో
పజీవియైన బ్రాహ్మణుఁడు.

బ్రాహ్మణము. సం. వి. అ. న. 1. బ్రాహ్మణసమూ
హము; 2. వేదభాగము.

బ్రాహ్మణాయనుఁడు. సం. వి. అ. పుం. విద్వాంసుఁ
డును సత్కర్మపరుఁడునైన వంశకర్తవలనఁబుట్టిన
విప్రుఁడు.

బ్రాహ్మణార్థము. సం. వి. పితృకార్యములయందు
భోజనమునకుఁబోవుట.

బ్రాహ్మణి. సం. వి. ఈ. స్త్రీ. 1. బ్రాహ్మణునిభార్య;
2. నలికండ్లసాము; 3. చిఱుతేకు?.

బ్రాహ్మణుఁడు. సం. వి. అ. పుం. పాఱుఁడు.

బ్రాహ్మణ్యము. సం. వి. అ. న. 1. బ్రాహ్మణసమూ
హము; 2. బ్రాహ్మణభావము; 3. బ్రాహ్మణకర్మ
ము. పుం. డు. శని.

బ్రాహ్మము. సం. వి. అ. న. పెద్దవ్రేలి మొదటనుం
డెడు బ్రహ్మతీర్థము. పుం. విద్యయునాచారముఁగ
లవరునిఁదా నేపిలిచివధూసహితముగవస్త్రాదులచే
నలంకరించిపూజించికన్యనిచ్చి చేయువివాహము.
(చూ. వివాహము.) విశ. బ్రహ్మసంబంధమైనది.

బ్రాహ్మణయష్టిక. సం. వి. ఆ. స్త్రీ. చిఱుతేకు, బా
రంగి?.

బ్రాహ్మి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకమాతృక; (చూ.
మాతృక.) 2. సరస్వతి; 3. బాఁపనచీమ; 4. పొ
న్నగంటికూర; 5. బారంగి?; 6. సోమెదకూర.

## బ్రు.

బ్రుంగు. దే. అ. క్రి. ప్రూఁడు; "ఆ. అశ్వసుభటత
తులయంగఖండంబులు, రుధిరకర్దమమున బ్రుంగి
యున్న, పెల్లు మాదకౌద్రబీభత్సకరణాభ, యా
నకైక హేతువయ్యెనధిప." భార. ద్రో. ౧, ఆ.—
2. మఱుఁగు; 3. మునుఁగు.

బ్రుంగుడు. దే. విశ. 1. మఱిఁగినది; "ఉ. విస్మయ
మొప్పఁగాదనుజవీరులమాయలచేత బ్రుంగుడై, భ
స్మముఁనోపల■ మెఱయు పావకమూర్తియుఁబో
లెవానుడే, వస్మరణప్రభావమునవర్ధితుఁడై వెలుఁ
గొందుచుండె." వి, పు. ౨, ఆ.—2. మునిఁగినది.
"ఉ. భూవరయిట్లునాసికముపోయినరక్తముచేత
బ్రుంగుడై, జేవుఱుఁగొండచందమునఁజెయ్యొలు
దక్కినిశాచరుండువా, పోవుచులోనసిగ్గుదలపో
యుచువచ్చినత్రోవనేగిమై, రావణుఁగాంచిమ్రొ
క్కికడుఁగ్రమ్మినభీతినిబల్కెనెంతయుఙ్." మై.
౨, ఆ.

బ్రుంగుడుపడు. ద్వ. అ. క్రి. (బ్రుంగుడు+పడు.)
మఱుఁగుపడు. "తండ్రిసద్గుణసముదయము బ్రుం
గుడుపడ మెలఁగుపుత్రుఁడుహీనుఁడు." మార్క.
౨, ఆ. (ప్రే. బ్రుంగుడుపఱుచు. "తే. కర్ణుఁ
దొలుచూలుగా నేలకంటెతల్లి, నీదుమంత్రంబుపర
మవిషాదకారి, యయ్యెమాకెల్లనట్టిబలైకగణ్యుఁ,
గర్ణు బ్రుంగుడుపఱుచుటకారణమున." భార. స్త్రీ.
౨, ఆ.)

బ్రుంగుడుపాటు. ద్వ. వి. బ్రుంగుడుపడుట. "ఉ.
పేరునుం, బుట్టునుమాలియిప్పుడిటు బ్రుంగుడు
పాటునఁబొందఁజూచినా, కెట్టుమనంబుపట్టు."
భార. విరా. ౨, ఆ.

బ్రుంగుపడు. ద్వ. అ. క్రి. మగ్నమగు. "తే. సుత
కళత్రాదిసకలవస్తువులువగల, బ్రుంగుపడనిసు
ఖంబుసేయంగఁజాలవు." కవిక. ౫, ఆ. (బ్రుం
గుడుపడుయొక్కమాఱురూపము.)

బ్రుంచు. దే. ప్రే. బ్రుంగఁజేయు.

బ్రుయ్యు. దే. అ. క్రి. నశించు. "ఆ. దానఁజేసిమీరు
నేనును బ్రుయ్యుఁబా, పంబులేక వెడలఁబడితిమి."
భార. మా. ౧, ఆ.

బ్రుసి. సం. వి. ఈ. స్త్రీ. వ్రతులఆసనము, (రూ.
బృషి.)

## బ్లా.

బ్లాంకెటు. ఆం. వి. బనాతుపచ్చడము.

## భ.

భ. ఒక అక్షరము.

భంగ. సం. వి. ఆ. స్త్రీ. జనపవిత్తులు. అ. పుం. ము.
1. చెఱుపు; 2. అల; 3. అవమానము; 4. రోగ
ము; 5. రోగవిశేషము.

భంగపడు. మి. అ. క్రి. (భంగము+పడు.) అవమాన
పడు.

**భంగపాటు.** మి. వి. భంగపడుట. "ఎ, గీ. నీవును నాపద, కోర్చిభంగపాటుదీర్చికొనుము." భార. విరా. ౧, ఆ.

**భంగపెట్టు.** మి. స. క్రి. (భంగము+పెట్టు.) భంగపఱుచు. "సభఁ ద్రుపదాత్మజభంగపెట్టరే." భార. ఉద్యో. 3, ఆ.

**భంగి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. విధము. ఈ. స్త్రీ. 1. భంగము; 2. గంజాయి.

**భంగించు.** సం. స. క్రి. భంగపఱుచు.

**భంగురము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. నశించునది; 2. వంకరైనది.

**భంగ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) భంగలుపండునది. (పొలము.)

**భంజకము.** సం. విశే. (అ. ఆ. అ.) విఱుచునది.

**భంజనము.** సం. వి. అ. న. విఱుపు.

**భంజలి.** సం. వి. ఈ. స్త్రీ. పామువలె వంకరగాపోయెడి అశ్వగతివిశేషము.(రూ.భంజలిక. అ. స్త్రీ.) (చూ. మురళి.)

**భంజించు.** సం. స. క్రి. విఱుచు.

**భంజిక.** సం. వి. అ. స్త్రీ. చిఱుతేఁకు?.

**భంటాకి.** సం. వి. ఈ. స్త్రీ. ములక?.

**భండనము.** సం. వి. అ. న. 1. యుద్ధము; 2. కవచము; 3. దుశ్చేష్ట.

**భండారము.** సం. వి. అ. పుం. బొక్కసము.

**భండించు.** సం. అ. క్రి. బండాటలాడు. "క. ఖండింపుము సుతునటుగా, కుండిన వ్రతమైనమాని యుండుము నీవీ, యొండైనఁజేయుకూరక, భండించినఁగలదెపరమపదవిన్నృపాలా." రుక్మాం. ౫,ఆ.

**భండీరము.**సం.వి.అ.పుం.1.దిరిసెనము?;2.చిట్టికూర.

**భండీరి.** సం. వి. ఈ. స్త్రీ. మంజిటి?.

**భండుఁడు.**సం.వి.అ.పుం.దుశ్చేష్టుఁడు, ఆకతాయి.

**భంబు.** సం. వి. అ. న. 1. నక్షత్రము; 2. ఆకాశము. పుం. కిరణము. (చూ. కంబు.)

**భక్తము.**సం.వి.అ.న.అన్నము.విశే. భాగింపఁబడినది.

**భక్తి.** సం. వి. ఇ. స్త్రీ. 1. సేవ; (ఇది అష్టవిధము.—భాగవతవాత్సల్యము, భగవత్పూజయందనుమోదము,భగవదర్చన,భగవద్విషయమునందదంభము, భగవత్కథాశ్రవణేచ్ఛ, స్వరనేత్రాంగవికారము, సదాభగవదనుస్మరణము, అమాంసభక్షణము. భక్తిలక్షణమునవవిధము. — శ్రవణము, కీర్తనము, స్మరణము, పాదసేవ, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనము.) 2. భయముతోఁగూడిన స్నేహము; 3. భాగము.

**భక్తుఁడు.** సం. వి. అ. పుం. భక్తిగలవాఁడు,డింగరీఁడు.

**భక్షకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) తిండిపోతు.

**భక్షణము.** సం. వి. అ. న. భక్షించుట, తిండి.

**భక్షణీయము.** సం. విశే. (అ. ఆ. అ.) భక్ష్యము

**భక్షించు.** సం. స. క్రి. భక్షణముచేయు, తిను.

**భక్షితము.** సం. విశే. (అ.ఆ.అ.) భక్షింపఁబడినది

**భక్ష్యకారుఁడు.** సం. విశే. (అ. ఈ. అ.) పిండివంటవాఁడు, (రూ. భక్ష్యంకారుఁడు.)

**భక్ష్యము.** సం. వి. అ. న. తినుబండము. (పంచభక్ష్యములు.—భక్ష్యము, భోజ్యము, లేహ్యము, చోష్యము, పానీయము.) విశే. తినఁదగినది.

**భగందరము.** సం. వి. అ. పుం. మర్మస్థానమునందలి వ్రణము.

**భగము.** సం. వి. అ. పుం. న. 1. శ్రీ; 2. వీర్యము; 3. ఇచ్ఛ; 4. జ్ఞానము; 5. వైరాగ్యము; 6. కీర్తి; 7. మాహాత్మ్యము; 8. ఐశ్వర్యము; 9. యత్నము; 10. ధర్మము; 11. మోక్షము; 12. యోని. పుం. డు. ద్వాదశాదిత్యులలో నొకఁడు. (చూ. ఆదిత్యుఁడు.)

**భగవంతుఁడు.** సం. వి. త్. పుం. 1. విష్ణువు; 2. శివుఁడు; 3. బుద్ధదేవుఁడు. విశే. పూజ్యుఁడు. (రూ. భగవానుఁడు.)

**భగవతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. సరస్వతి; 2. పార్వతి; 3. గంగ. విశే. పూజ్యురాలు.

**భగిని.** సం. వి. ఈ. స్త్రీ. తోడఁబుట్టినది.

**భగ్నము.** సం. విశే. (అ. ఆ. అ.) భంగమునొందినది.

**భజనము.** సం. వి. అ. న 1. సేవించుట; 2. భాగించుట.

**భజమానము.** సం. విశే. (అ.ఆ.అ.) 1. సేవించునది; 2. భాగించునది; 3. న్యాయముతోఁగూడినది.

**భజించు.** సం. స. క్రి. 1. సేవించు; 2. భాగించు. (సంభజించు అనియు.)

**భజివ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) 1. సేవింపఁదగినది; 2. భాగింపఁదగినది.

**భటము.** సం. వి. అ. పుం. దినముయొక్క పదునేనవ భాగము. (చూ. దినము.)

**భటిత్రము.** సం. విశే. (అ. ఆ. అ.) ఇనుపసలాకకు గ్రుచ్చి కాల్చినది. (కఱకుట్లు.)

**భటుఁడు.** సం. వి. అ. పుం. 1. కాలిబంటు; 2. పనివాఁడు.

**భట్టారకుఁడు.** సం. వి. అ. పుం. 1. (నాట్యపరిభాషయందు) రాజు; 2. ముని; 3. సూర్యుఁడు.

**భట్టిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. (నాట్యపరిభాషయందు) రాజు పెండ్లాము; 2. బ్రాహ్మణుని పెండ్లాము.

**భట్టుఁడు.** సం. వి. అ. పుం. బట్టువాఁడు. "విద్వాంసకవయోభట్టాః." అభిధానదర్పణము.

**భద్ర.** సం. వి. ఆ. స్త్రీ. 1. తిథివిశేషము, (చూ. తిథి.) 2. కృష్ణుని అష్టమహిషులలో నొకతె; 3. గంగానది. అ. న. ము. 1. శుభము; 2. బంగారు; 3. నాగముస్తె. స్త్రీ. న. ఒకకరణము. (చూ. కరణము.) పుం. 1. గజజాతివిశేషము; (చూ. గజము.) (ఈజాతిగజము శుభకార్యములయందు పురప్రచారయోగ్యమైనది.) 2. ఎద్దు; 3. కాటుకపిట్ట. డు. 1. శ్రీభద్రుఁడు; 2. పురుషజాతివిశేషము. (చూ. పురుషుఁడు.) విణ. 1. శుభకరము; 2. శ్రేష్ఠము.

**భద్రకుంభము.** సం. వి. అ. పుం. రాజద్వారమునం దుంచిన జలపూర్ణమైన స్వర్ణకలశము.

**భద్రదారువు.** సం. వి. ఉ. న. దేవదారువు.

**భద్రపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. గుమ్ముడు.

**భద్రబల.** సం. వి. ఆ. స్త్రీ. గొంతెమగోరు.

**భద్రముస్తకము.** సం. వి. అ. పుం. నాగముస్తె.

**భద్రయవము.** సం. వి. అ. న. కొడిసెకాయ.

**భద్రశ్రీ.** సం. వి. ఈ. పుం. చందనము, గంధము.

**భద్రాకరణము.** సం. వి. అ. న. క్షౌరము, వపనము.

**భద్రాసనము.** సం. వి. అ. న. రాజుకూర్చుండుపీఠము.

**భయంకరము.** సం. విణ. (అ. ఆ. అ.) భయమును పుట్టించునది.

**భయము.** సం. వి. అ. న. వెఱపు. విణ. వెఱపుపుట్టించునది.

**భయానకము.** సం. వి. అ. పుం. 1. నవరసములలో నొకటి; (చూ. రసము.) 2. పులి; 3. రాహువు. విణ. భయానకరసముగలది.

**భరంతు.** హిం. వి. ఇంటిమట్టము.

**భరటుఁడు.** సం. వి. అ. పుం. 1. కూలివాఁడు; 2. కుమ్మరవాఁడు.

**భరణము.** సం. వి. అ. న. 1. భరించుట; 2. కూలి; 3. జీతము; 4. ఇరువదితులముల మానము.

**భరణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకనక్షత్రము; (చూ. నక్షత్రము.) 2. భూమి.

**భరణ్యము.** సం. వి. అ. న. 1. కూలి; 2. జీతము.

**భరద్వాజము.** సం. వి. అ. పుం. ఏట్రింత. డు. 1. ఒకముని; 2. ద్రోణుఁడు.

**భరము.** సం. వి. అ. పుం. 1. అతిశయము; 2. బరువు; 3. బారువ.

**భరించు.** సం. స. క్రి. 1. మోచు; 2. ప్రోచు. (సంభరించు అనియు.)

**భర్గుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

**భర్జనము.** సం. వి. అ. న. వేఁచుట, భ్రష్టి.

**భర్జించు.** సం. స. క్రి. భర్జనముచేయు, వేఁచు.

**భర్త.** సం. వి. ఋ. పుం. మగఁడు. విణ. 1. మోచువాఁడు; 2. ప్రోచువాఁడు.

**భర్తి.** హిం. వి. సంపూర్తి.

**భర్తృదారకుఁడు.** సం. వి. అ. పుం. (నాట్యపరిభాషయందు) యువరాజు.

**భర్తృదారిక.** సం. వి. ఆ. స్త్రీ. (నాట్యపరిభాషయందు) రాజుకూఁతురు.

**భర్త్సనము.** సం. వి. అ. న. బెదరింపుమాట.

**భర్మము.** సం. వి. అ. న్. న. బంగారు. న్. న. జీతము.

**భల్లము.** సం. వి. అ. న. బల్లెము. పుం. ఎలుఁగుబంటు.

**భల్లాతకి.** సం. వి. ఈ. స్త్రీ. జీడి.

**భల్లారే.** దే. అవ్య. ఆశ్చర్యార్థకము. (రూ. బళిరే.)

**భల్లుంగము.** సం. వి. అ. పుం. గట్టివెదురు.

**భల్లుకము.** సం. వి. అ. పుం. 1. ఎలుఁగుబంటు; 2. కోఁతి.

**భల్లూకము.** సం. వి. అ. పుం. ఎలుఁగు, భల్లుకము.

**భవదీయము.** సం. విణ. (అ. ఆ. అ.) నీది.

**భవనము.** సం. వి. అ. న. 1. అగుట; 2. ఇల్లు.

**భవనాసి.** గ్రా. వి. అక్షయపాత్ర.

**భవము.** సం. వి. అ. పుం. 1. పుట్టుక; 2. సంసారము; 3. ప్రాప్తి; 4. శుభము; 5. సత్త.

**భవాదృశుఁడు.** సం. విణ. (శ్) నీవంటివాఁడు.

**భవాని.** సం. వి. ఈ. స్త్రీ. పార్వతి, గట్రాచూలి.

**భవికము.** సం. వి. అ. న. శుభము, మేలు.

**భవిత.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) కాఁగల స్వభావము గలవాఁడు.

**భవితవ్యము.** సం. వి. అ. న. 1. భాగ్యము; 2. శుభము. విణ. కాఁదగినది.

**భవిష్ణువు.** సం. విణ. (ఉ.) కాఁగల స్వభావముగలవాఁడు.

**భవిష్యత్తు.** సం. విణ. (త్. ఈ. త్.) కాఁగలది.

భవిష్యము. సం. వి. అ. న. 1. భాగ్యము; 2. శుభము. విశ. కాఁగలది.
భవ్రుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.
భవ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. గజపిప్పలి?. అ. న. ము. 1. శుభము; 2. ఎముక. విశ. 1. శుభమైనది, 2. సత్యమైనది; 3. యోగ్యమైనది; 4. కాఁగలది.
భషకము. సం. వి. అ. పుం. శునకము, కుక్క.
భషణము. సం. వి. అ. న. కుక్కయొక్క మొఱుగు.
భసలము. సం. వి. అ. పుం. తుమ్మెద, భృంగము.
భస్త్ర. సం. వి. ఆ. స్త్రీ. (కమ్మరవాని) కొలిమితిత్తి.
భస్త్రి. సం. వి. ఈ. స్త్రీ.——పై.——
భస్మగంధిని. సం. వి. ఈ. స్త్రీ. రేణుకయను గంధద్రవ్యము.
భస్మగర్భ. సం. వి. ఆ. స్త్రీ. 1. కంపుటేరుగుడు?; 2. ఇరుగుడు?.
భస్మము. సం. వి. న్. న. ఏదయినను కాలి తెల్లగానైన పొడి, బూది.
భస్మీకరించు. సం. స. క్రి. భస్మముచేయు.

## భా.

భా. సం. వి. ఆ. స్. స్త్రీ. సూర్యుని వెలుఁగు, కిరణము.
భాంగీనము. సం. విశ. (అ.ఆ.అ.) భంగలుపండినది. (పొలము.)
భాండము. సం. వి. అ. న. 1. తొడవు; 2. గుఱ్ఱపుఁ దొడవు; 3. కుండలోనగు మట్టిపాత్రము; 4. ఎద్దువు; 5. మొదలిసొమ్ము; 6. సంచిమొదలు.
భాండాగారము. సం. వి. అ. న. ధనముండుచోటు, బొక్కసము.
భాండి. సం. వి. ఈ. స్త్రీ. మంజెటి?.
భాగధేయము. సం. వి. అ. న. భాగ్యము. పుం. కప్పము.
భాగము. సం. వి. అ. పుం. 1. పాలు; 2. భాగ్యము.
భాగించే. సం. స. క్రి. భాగముచేయు, పంచే.
భాగినేయుఁడు. సం. వి. అ. పుం. తోఁడఁబుట్టినదాని కొడుకు, మేనల్లుఁడు.
భాగీరథి. సం. వి. ఈ. స్త్రీ. గంగ, మిన్నేఱు.
భాగ్యము. సం. వి. అ. న. 1. అదృష్టము; 2. సుకృతము. విశ. భాగింపఁదగినది.
భాజనము. సం. వి. అ. న. 1. పాత్రము; 2. యోగ్యము.
భాటకము. సం. వి. అ. పుం. బాడిగ, అవక్రయము.

భాణము. సం. వి. అ. పుం. నాటకభేదము. (చూ. నాటకము.)
భాతి. సం. వి. ఇ. స్త్రీ. 1. కాంతి; 2. విధము. (రెండవ అర్థమునకు తెనుగు గ్రంథములయందు ప్రయోగము.)
భాద్రపద. సం. వి. ఆ. స్త్రీ. ఉత్తరభద్రపదానక్షత్రము. అ. పుం. ము. భాద్రపదమాసము.
భానుమంతుఁడు. సం. వి. త్. పుం. సూర్యుఁడు. విశ. కిరణముగలవాఁడు.
భానువు. సం. వి. ఉ. పుం. 1. సూర్యకిరణము; 2. సూర్యుఁడు.
భామ. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుది. అ. పుం. ము. 1. కోపము; 2. సూర్యకిరణము. డు. సూర్యుఁడు.
భామిని. సం. వి. ఈ. స్త్రీ. 1. క్రీడాసమయము నందు కోపముచూపెడు ఆఁడుది; 2. ఆఁడుది.
భారకుఁడు. సం. వి. అ. పుం. బరువుమోసెడి కూలివాఁడు.
భారతము. సం. వి. అ. న. వ్యాసప్రోక్తమైన అయిదవవేదము; 2. హిమవత్పర్వతమునకును దక్షిణసముద్రమునకును నడుమైన ఒక వర్షము. (చూ. వర్షము.) పుం. డు. నట్టువుఁడు.
భారతి. సం. వి. ఈ. స్త్రీ. 1. సరస్వతి; 2. వాక్కు; 3. ఒక కావ్యవృత్తి; (చూ. వృత్తి.) 4. పక్షివిశేషము.
భారద్వాజము. సం. వి. అ. పుం. పక్షివిశేషము, ఏట్రింత.
భారద్వాజి. సం. వి. ఈ. స్త్రీ. అడవిప్రత్తి?.
భారము. సం. వి. అ. పుం. 1. బరువు; 2. బారువ.
భారయష్టి. సం. వి. ఇ. స్త్రీ. కావడిబద్ద.
భారవాహుఁడు. సం. వి. అ. పుం. బరువుమోసెడువాఁడు, భారకుఁడు.
భారి. హిం. విశ. గొప్ప, ఘనమైన, బలిసిన.
భార్గవి. సం. వి. ఈ. స్త్రీ. 1. లక్ష్మి; 2. పార్వతి; 3. గఱిక?.
భార్గవుఁడు. సం. వి. అ. పుం. శుక్రుఁడు; 2. పరశురాముఁడు.
భార్గి. సం. వి. ఈ. స్త్రీ. బారంగి?.
భార్య. సం. వి. ఆ. స్త్రీ. అగ్నిసాక్షిగా పెండ్లాడిన పెండ్లాము, పత్ని.

భార్యాటికుఁడు. సం. వి. అ పుం. పెండ్లామునూట జవదాఁటనివాఁడు.

భాలూకము. సం. వి. అ. పుం. భల్లుకము, ఎలుఁగు.

భావ. సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.) ము. 1. సత్తు; 2. మనోవికారము; 3. అభిప్రాయము; 4. ఆత్మ; 5. పుట్టుక; 6. ధాత్వర్థరూపక్రియ; 7. స్వభావము; 8. పదార్థము; 9. విభూతి; 10. రత్యాది. డు. (నాట్య పరిభాషయందు) విద్వాంసుఁడు.

భావజుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు, తలఁపు చూలి.

భావన. సం. వి. ఆ. స్త్రీ. అ. న. 1. తలఁపు; 2. వాసనకట్టుట.

భావి. సం. విణ. (న్. ఈ. న్.) కాఁగలది, భవిష్యత్తు.

భావించు. సం. అ. క్రి. ఎంచు, తలఁచు.

భావికము. సం. వి. అ. న. ఒక అర్థాలంకారము. (చూ. అలంకారము.)

భావితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. పొందఁబడినది; 2 కర్పూరాదులచేత వాసనకట్టినది.

భావిని. సం. వి. ఈ. స్త్రీ. 1. భావముగల ఆఁడుది; 2. ఆఁడుది.

భావుకము. సం. వి. అ. న. శుభము, భవికము.

భావుకుఁడు. సం. వి. అ. పుం. తోడఁబుట్టినదాని మగఁడు, బావమఱఁది.

భావ్యము. సం. విణ. (అ. ఆ. అ.) అవశ్యముకాఁదగినది.

భాష. సం. వి. ఆ. స్త్రీ. 1. సంస్కృతాది; 2. మాట; 3. ప్రతిజ్ఞ; 4. ప్రమాణము.

భాషణము. సం. వి. అ. న. మాటాడుట.

భాషించు. సం. అ. క్రి. మాటాడు.

భాషితము. సం. వి. అ. న. మాట. విణ. మాటాడినది.

భాష్యము. సం. వి. అ. న. సూత్రవ్యాఖ్యానగ్రంథము. విణ. మాటాడఁదగినది.

భాసంతము. సం. వి. అ. పుం. గంపపులుఁగు. విణ. చక్కనిది.

భాసమానము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రకాశించుచున్నది.

భాసిల్లు. సం. అ. క్రి. ప్రకాశించు. (ఉద్భాసిల్లు, సముద్భాసిల్లు అనియు.)

భాసురము. సం. వి. అ. పుం. పటికపుఱాయి. విణ. ప్రకాశించునది.

భాస్కరుఁడు. సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. అగ్ని.

భాస్వంతుఁడు. సం. వి. త్. పుం. సూర్యుఁడు. విణ. ప్రకాశించువాఁడు.

భాస్వరుఁడు. సం. వి. అ. పుం.—పై.—

## భి.

భిండిపాలము. సం. వి. అ. పుం. విడిచివాటుగుదియ. (వాడుకయందు భిందివాలమందురు. చూ. భిందిపాలము.)

భిందిపాలము. సం. వి. అ. పుం. విడిచివాటుగుదియ. రెండు మూడు చక్రములుఁగల మాదిగకత్తి. (అని కొందఱు.) (చూ. భిండిపాలము.)

భిక్ష. సం. వి. ఆ. స్త్రీ. 1. బిచ్చము; 2. బిచ్చమెత్తిన వస్తువు; 3. కడికొలఁది అన్నము; 4. కూలి; 5. సేవ. (రూ. భిక్షము.)

భిక్షించు. సం. స. క్రి. భిక్షమెత్తు.

భిక్షుకుఁడు. సం. వి. అ. పుం. భిక్షమెత్తుకొని జీవించెడు సన్యాసి.

భిక్షువు. సం. వి. ఉ. పుం. 1. బ్రహ్మచారి; 2. సన్యాసి.

భిత్తము. సం. వి. అ. న. ఖండము, తునుక.

భిత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. భేదనము; 2. గోడ; 3. జొత్తిలి.

భిత్తిక. సం. వి. ఆ. స్త్రీ. 1. పిడుగు; 2. గోడ; 3. చేల్లగడ్డ.

భిద. సం. వి. ఆ. స్త్రీ. 1. భేదము; 2. భేదనము; 3. భేదోపాయము.

భిదురము. సం. వి. అ. న. వజ్రాయుధము, తాలివాలు.

భిన్నము. సం. వి. అ. పుం. 1. అర్థదోషములలో నొకటి; 2. నీలరత్న దోషము. విణ. 1. పగిలినది; 2. చీలినది; 3. విరిసినది; 4. వేఱుపడినది; 5. కూడినది.

భిల్లుఁడు. సం. వి. అ. పుం. బోయవాఁడు.

భిషక్కు. సం. వి. జ్. పుం. చికిత్సకుఁడు, వైద్యుఁడు.

భిస్స. సం. వి. ఆ. స్త్రీ. అన్నము, వంటకము.

భిస్సట. సం. వి. ఆ. స్త్రీ. మాఁడన్నము.

## భీ.

భీ. సం. వి. ఈ. స్త్రీ. భయము, వెఱపు.

భీకరము. సం. విణ. (అ. ఆ. అ.) వెఱపుపుట్టించునది, భయంకరము.

భీతము. సం. వి. అ. న. వెఱపు. విణ. వెఱచినది.
భీతి. సం. వి. ఇ. స్త్రీ. 1. వెఱపు; 2. వణఁకు.
భీతిల్లు. సం. అ. క్రి. భయపడు, వెఱచు.
భీమము. సం. వి. అ. పుం. భయానకరసము. విణ. భయానకరసముకలది.
భీముఁడు. సం. వి. అ. పుం. 1. ధర్మరాజుతమ్ముఁడు; 2. ఒక రాజు; 3. శివుఁడు. విణ. భయంకరుఁడు.
భీరుకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వెఱపరి.
భీరువు. సం. వి. ఊ. స్త్రీ. 1. వెఱపరియగు ఆఁడుది; 2. ఆఁడుది. ఉ. స్త్రీ. పిల్లపీఁచర? విణ. వెఱపరి.
భీలుకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) భీరుకుఁడుయొక్క రూపాంతరము.
భీషణము. సం. వి. అ. పుం. భయానకరసము. విణ. భయానకరసముగలది.
భీష్మము. సం. వి. అ. పుం. విణ.——పై.——
భీష్మసువు. సం. వి. ఊ. స్త్రీ. గంగానది.
భీష్ముఁడు. సం. వి. అ. పుం. 1. శాంతనవుఁడు; 2. శివుఁడు. విణ. భయంకరుఁడు.

భు.

భుక్తము. సం. విణ. (అ. ఆ. అ.) భుజింపఁబడినది; 2. అనుభవింపఁబడినది.
భుక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. భోజనము; 2. అనుభవము.
భుగ్నము. సం. విణ. (అ.ఆ.అ.) 1. వంగినది; 2. విఱిగినది; 3. వంకరైనది.
భుజ. సం. వి. ఆ. స్త్రీ. అ. పుఁ. ము. చేయి.
భుజంగభుక్కు. సం. వి. క్. పుం. నెమిలి, పాఁపమేపరి.
భుజంగమము. సం. వి. అ. పుం. పాము.
భుజంగము. సం. వి. అ. పుం. పాము. డు. విటుఁడు.
భుజంగాక్షి. సం. వి. ఈ. స్త్రీ. సర్పాక్షి?
భుజకీర్తి. సం. వి. ఇ. స్త్రీ. బాహుపురి.
భుజగము. సం. వి. అ. పుం. పాము.
భుజపత్రము. సం. వి. అ. పుం. బుజెపత్తిరి?
భుజశిరస్సు. సం. వి. స్. న. మూఁపు, అంసము.
భుజాంతరము. సం. వి. అ. న. ఱొమ్ము, క్రోడము.
భుజించు. సం. స. క్రి. 1. తిను; 2. అనుభవించు.
భుజిష్య. సం. వి. ఆ. స్త్రీ. 1. పరిచారిక; 2. వేశ్య. అ. పుం. ము. చేతకట్టుకొనెడు తోరము. డు. పరిచారకుఁడు. విణ. స్వతంత్రుఁడు.
భువనము. సం. వి. అ. న. 1. జగము; 2. ఉదకము; 3. ఆకాశము.
భువనేశ్వరము. సం. వి. అ. న. గృహవిశేషము, చేట్టుబసంతి.
భువి. సం. వి. ఊ. స్త్రీ. 1. భూమి; 2. స్థానము.

భూ.

భూకదంబము. సం. వి. అ. పుం. నేలకడిమి?
భూకము. సం. వి. అ. న. 1. బొక్క; 2. కాలము.
భూగృహము. సం. వి. అ. న. నేలమాలియ.
భూజము. సం. వి. అ. పుం. వృక్షము, పుడమిపుట్టు.
భూజాని. సం. వి. ఇ. పుం. 1. విష్ణువు; 2. రాజు.
భూతకేశము. సం. వి. అ. పుం. మరులుజెడ?
భూతధాత్రి. సం. వి. ఈ. స్త్రీ. భూమి, నేల.
భూతము. సం. వి. అ. న. 1. పృథివ్యాది; (ఇవి ఐదు.—పృథివి అప్పు. తేజస్సు. వాయువు, ఆకాశము.) 2. పిశాచాది; 3. ప్రాణి. పుం. 1. దేవయోనివిశేషము; 2. కృష్ణచతుర్దశి. డు. కొడుకు. విణ. 1. తగినది; 2. కడచినది; 3. నిక్కమయినది; 4. పొందఁబడినది; 5. వెలసినది; 6. (ఉత్తరపదమైనచో) సమానమైనది.
భూతయజ్ఞము. సం. వి. అ. పుం. భూతబలి
భూతవేశి. సం. వి. ఈ. స్త్రీ. తెల్లవావిలి?
భూతాత్మము. సం. వి. న్. పుం. దేహము. డు. బ్రహ్మ.
భూతావాసము. సం.వి.అ.పుం.విభీతకము, తాండ్ర?
భూతి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఐశ్వర్యము; 2. సంపద; 3. భస్మము; 4. సత్తు; 5. పుట్టుక; 6. ఏనుఁగుశృంగారము.
భూతికము. సం. వి. అ. న. 1. ఓమము; 2. కర్పూరము; 3. కామంచికసవు; 4. చీఁపురుకసవు; 5. నేలవేము? (రూ. భూతీకము.)
భూతులసి. సం. వి. ఈ. స్త్రీ. నేలతొళసి?
భూతేశుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు. బూచేలఱేఁడు.
భూదారము. సం. వి. అ. పుం. వరాహము, కిటి, పంది.
భూదేవుఁడు. సం. వి. అ. పుం. బ్రాహ్మణుఁడు, నేలవేలుపు.
భూధరము. సం. వి. అ. పుం. పర్వతము, నేలతాలుపు.
భూనింబము. సం. వి. అ. పుం. నేలవేము?
భూపతి. సం. వి. ఇ. పుం. రాజు, నేల ఱేఁడు.
భూపది. సం. వి. ఈ. స్త్రీ. మల్లియ?

భూపాటలి. సం. వి. ఈ. స్త్రీ. నేలకలిగొట్టు?.
భూపుఁడు. సం. వి. అ. పుం. రాజు, ఱేఁడు.
భూపూగము. సం. వి. అ. పుం. (చూ.) తోఁటపోఁక?.
భూబదరి. సం. వి. ఈ. స్త్రీ. నేలరేను?.
భూభుజుఁడు. సం. వి. జ్. పుం. రాజు, ఱేఁడు.
భూభృత్తు. సం. వి. త్. పుం. 1. కొండ; 2. రాజు. (దీనికి సరియైన తెనుఁగుమాట నేలతాలుపు.)
భూమి. సం. వి. ఇ. స్త్రీ. 1. నేల; 2. చోటు.
భూమిక. సం. వి. అ. స్త్రీ. 1. మాఱువేషము; 2. రచన.
భూమికర్కారువు. సం. వి. ఉ. పుం. నేలగుమ్మడి?.
భూమిచంపకము. సం. వి. అ. పుం. నేలసంపెఁగ?.
భూమిజ. సం. వి. ఆ. స్త్రీ. సీత. అ. పుం. డు. 1. అంగారకుఁడు; 2. నరకాసురుఁడు.
భూమిజంబుక. సం. వి. అ. స్త్రీ. 1. కాకినేరేడు?; 2. నేలనేరేడు?.
భూమిస్పృశుఁడు. సం. వి. శ్. పుం. 1. కోమటి; 2. మనుష్యుఁడు.
భూమ్యామలకి. సం. వి. ఈ. స్త్రీ. నేలయుసిరిక?.
భూయస్సు. సం. విశ. (స్.) అధికము, మిక్కుటము.
భూయిష్ఠము. సం. విశ. (అ.ఆ.అ.)——పై.——
భూరి. సం. వి. ఇ. న. బంగారు. విశ. అధికము.
భూరిఫేన. సం. వి. ఆ. స్త్రీ. సంబరేను?.
భూరిమాయము. సం. వి. అ. పుం. జంబుకము, నక్క.
భూరిమాయువు. సం. వి. ఉ. పుం.——పై.——
భూరుండి. సం. వి. ఈ. స్త్రీ. గురుగు?.
భూరుహము. సం. వి. అ. పుం. వృక్షము, పుడమిపుట్టు.
భూర్జము. సం. వి. అ. పుం. బుజపత్తిరి?.
భూవరుఁడు. సం. వి. అ. పుం. రాజు, పుడమిఱేఁడు.
భూష. సం. వి. ఆ. స్త్రీ. భూషణము, తొడవు.
భూషణము. సం. వి. అ. న. 1. అలంకరణము; 2. తొడవు.
భూషించు. సం. స. క్రి. స్తుతించు. (సముద్భాషించు అనియు.)
భూషితుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) అలంకరింపఁబడినవాఁడు.
భూష్ణువు. సం. విశ. (ఉ.) కాఁగల స్వభావముగలవాఁడు.
భూసురుఁడు. సం. వి. అ. పుం. బ్రాహ్మణుఁడు, నేలవేలుపు.
భూస్తృణము. సం. వి. అ. న. చిప్పకసవు?.

## భృ.

భృంగము. సం. వి. అ. న. లవంగపుఁబట్ట. పుం. 1. తుమ్మెద; 2. కూఁకటిమూఁగ; 3. గుంటగలిజేరు?. డు. విటుఁడు.
భృంగరాజము. సం. వి. అ. పుం. 1. గుంటగలిజేరు?; 2. గండుతుమ్మెద; 3. కూఁకటిమూఁగ.
భృంగారము. సం. వి. అ. పుం. 1. గుంటగలిజేరు?; 2. బంగారుగిండి.
భృంగారి. సం. వి. ఈ. స్త్రీ. చిమ్మటపురుగు, ఝిల్లిక.
భృంగి. సం. వి. ఈ. స్త్రీ. అతివస. న్. పుం. భృంగీశ్వరుఁడు.
భృగువు. సం. వి. ఉ. పుం. 1. కొండచేతియ; 2. ఒక ముని; 3. శుక్రుఁడు; 4. శివుఁడు.
భృతకుఁడు. సం. వి. అ. పుం. కూలివాఁడు.
భృతము. సం. విశ. (అ. ఆ. అ.) 1. భరింపఁబడినది; 2. నింపఁబడినది.
భృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. మోచుట; 2. కూలి; 3. వెల.
భృతిభుజుఁడు. సం. వి. జ్. పుం. కూలివాఁడు.
భృత్య. సం. వి. ఆ. స్త్రీ. కూలి. అ. పుం. డు. పనివాఁడు, బంటు.
భృశము. సం. క్రి. విశ. అ. న. పెల్లు. విశ. అధికము.
భృష్టము. సం. విశ. (అ. ఆ. అ.) వేఁచఁబడినది.
భృష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. వేఁపుడు; 2. పాడడవి.

## భే.

భేకము. సం. వి. అ. పుం. 1. కప్ప; 2. మేఘము.
భేకి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుకప్ప, వర్షాభ్వి.
భేదకుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) భేదించువాఁడు.
భేదనము. సం. వి. అ. న. భేదించుట. పుం. పుల్లబచ్చలి?.
భేదము. సం. వి. అ. పుం. 1. భేదనము; 2. వేఱిమి; 3. విశేషము; 4. ఒక ఉపాయము. (చూ. ఉపాయము.) (ఇది త్రివిధము.—ఒండొరులస్నేహము చెఱుచుట, ఒండొరులకు రాయిడిపుట్టించుట, బెదరుచూపుట.)
భేదించు. సం. ప్రే. భేదిల్లఁజేయు. (నిర్భేదించు అనియు.)
భేదితము. సం. విశ. (అ. ఆ. అ.) భేదింపఁబడినది.
భేద్యము. సం. విశ. (అ. ఆ. అ.) భేదింపఁదగినది.
భేదిల్లు. సం. అ. క్రి. 1. వేఱగు; 2. చీలు.
భేరి. సం. వి. ఈ. స్త్రీ. వాద్యవిశేషము, దుందుభి.

**భేరుండము.** సం. వి. అ. పుం. పక్షివిశేషము. విణ. భయంకరము.

**భేలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. మూర్ఖుఁడు; 2. పిఱికి; 3. చలించువాఁడు.

**భేషజము.** సం. వి. అ. న. ఔషధము, మందు.

భై.

**భైక్షము.** సం. వి. అ. న. భిక్షాసమూహము.

**భైరవము.** సం. వి. అ. పుం. భయానకరసము.

**భైరవి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పార్వతి; 2. రాగవిశేషము.

**భైరవుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు. విణ. భయానకరసముకలవాఁడు.

**భైషజ్యము.** సం. వి. అ. న. ఔషధము, మందు.

భో.

**భోక్త.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) 1. భుజించువాఁడు; 2. అనుభవించువాఁడు.

**భోక్తవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. భుజింపఁదగినది; 2. అనుభవింపఁదగినది.

**భోగగృహము.** సం. వి. అ. న. పడకిల్లు.

**భోగము.** సం. వి. అ. పుం. 1. సుఖము; 2. భోజనము; 3. పాముయొక్క పడగ; 4. పాముయొక్క శరీరము; 5. ధనము; 6. వేశ్యాదులకిచ్చెడువెల; 7. పాలనము. (అష్టభోగములు. — గృహము, శయ్య, వస్త్రము, ఆభరణము, స్త్రీ, పుష్పము, గంధము, తాంబూలము.)

**భోగవతి.** సం. వి. ఈ. స్త్రీ. 1. పాతాళము; 2. పాతాళమునందలియేఱు. విణ. భోగముగలది.

**భోగి.** సం. వి. న్. పుం. 1. పాము; 2. రాజు; 3. మంగలి. విణ. సుకవాసి.

**భోగించు.** సం. అ. క్రి. సుఖించు, అనుభవించు. (ఉపభోగించు అనియు.)

**భోగిని.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుఁబాము; 2. భోగముది; 3. పట్టాభిషిక్తురాలుకాని రాజుభార్య.

**భోగ్యము.** సం. వి. అ. న. 1. ధనము; 2. ధాన్యము. విణ. భోగింపఁదగినది.

**భోజనము.** సం. వి. అ. న. ఆహారము, కుడుపు.

**భోజ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) భుజింపఁదగినది.

**భోషాణము.** దే. వి. పెద్దపెట్టె.

భౌ.

**భౌతికము.** సం. వి. అ. న. ముత్తెము. విణ. భూతసంబంధమైనది.

**భౌముఁడు.** సం. వి. అ. పుం. 1. అంగారకుఁడు; 2. నరకాసురుఁడు. విణ. భూమియందుఁబుట్టినవాఁడు.

**భౌరికుఁడు.** సం. వి. అ. పుం. బంగారునాణెపు బండారమునకధికారి.

భ్ర.

**భ్రంశము.** సం. వి. అ. పుం. 1. చలించుట; 2. జాఱుట.

**భ్రకుంసుఁడు.** సం. వి. అ. పుం. భ్రుకుంసుఁడుయొక్క రూపాంతరము.

**భ్రకుటి.** సం. వి. ఇ. స్త్రీ. భ్రుకుటియొక్క రూపాంతరము.

**భ్రక్షము.** సం. వి. అ. పుం. తనతప్పును మఱుఁగుపుచ్చుట.

**భ్రమణము.** సం. వి. అ. న. తిరుగుడు. పుం. తుమ్మెద.

**భ్రమము.** సం. వి. అ. పుం. 1. భ్రాంతి; 2. తిరుగుడు; 3. బండికంటితిరుగుడు; 4. నీళ్లు వెలికిఁబోవుటకేర్పఱచిన తూములోనగునది.

**భ్రమరకము.** సం. వి. అ. పుం. 1. తుమ్మెద; 2. బొంగరము; 3. ముంగురులు.

**భ్రమరము.** సం. వి. అ. పుం. 1. తుమ్మెద; 2. ముంగురులు; 3. అభినయహస్తవిశేషము.

**భ్రమరించు.** సం. అ. క్రి. భ్రమణముచేయు, తిరుగు. "షట్పదములుపుష్పగుచ్ఛములపై భ్రమరించు చు." హరిశ్చ. ౧. ఆ.

**భ్రమి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. భ్రమణము, తిరుగుడు.

**భ్రమించు.** సం. అ. క్రి. భ్రమరించు, తిరుగు.

**భ్రష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) జాఱినది.

**భ్రష్టుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) వెలివేయఁబడ్డవాఁడు, (రూ. భ్రష్టు.)

భ్రా.

**భ్రాంతము.** సం. విణ. (అ. ఆ. అ.) భ్రాంతినొందినది.

**భ్రాంతి.** సం.వి.ఇ.స్త్రీ. 1. మిథ్యామతి; (ఉన్నదిలేనట్టులేనిది ఉన్నట్టునుతలఁచుట.) 2. భ్రమణము; 3. ఒక అర్థాలంకారము. (చూ. అలంకారము.)

భ్రాజితము. సం. విశే. (అ. ఆ. అ.) ప్రకాశము నొందినది.

భ్రాజిష్ణువు. సం. విశే. (ఉ.) ప్రకాశించువాఁడు.

భ్రాత. సం. వి. ఋ. పుం. తోడఁబుట్టినవాఁడు.

భ్రాతృవ్యుఁడు. సం. వి. అ. పుం. 1. తోడఁబుట్టినవాని కొడుకు; 2. పగవాఁడు.

భ్రాత్రీయుఁడు. సం. వి. అ. పుం. తోడఁబుట్టినవాని కొడుకు.

భ్రామరము. సం. వి. అ. న. భ్రమరములుకూర్చిన తెల్లనితేనె. పుం. ఒకదినుసురాయి. విశే. భ్రమరసంబంధమైనది.

భ్రాష్ట్రము. సం. వి. అ. పుం. వేఁపుడుచేట్టి, మంగలము.

భ్రు.

భ్రుకుంసుఁడు. సం. వి. అ. పుం. స్త్రీవేషము వేసికొని ఆడెడుపురుషుఁడు.

భ్రుకుటి. సం. వి. ఇ. స్త్రీ. బొమముడి. (రూ.) భృకుటి.

భ్రూ.

భ్రూకుంసుఁడు. సం. వి. అ. పుం. భ్రుకుంసుఁడు యొక్క రూపాంతరము.

భ్రూకుటి. సం. వి. ఇ. స్త్రీ. భ్రుకుటియొక్క రూపాంతరము.

భ్రూణ. సం. వి. అ. స్త్రీ. చోలాలు. అ. పుం. ము. 1. గర్భము; 2. బిడ్డ.

భ్రూభంగము. సం. వి. అ. పుం. బొమముడి.

భ్రూవు. సం. వి. ఊ. స్త్రీ. కనుబొమ.

భ్రే.

భ్రేషము. సం. వి. అ. పుం. తనకుచితమైన ధర్మము నుండి చలించుట.

మ.

మ. ఒక అక్షరము.

మంకు. దే. విశే. 1. మొండి; 2. మూర్ఖుఁడు.

మంకెన. దే. వి. 1. బంధూకము; 2. ఎద్దుమీఁద నీళ్లబిందెలుతెచ్చునపుడు ఆ బిందెలక్రింద కుదురుగా సంతనచేసియుంచఁబడు బెత్తిపుబుట్టలజత.

మంఖణము. సం. వి. అ. న. పిక్కలకుఁదొడిగికొను కవచము.

మంగ. దే. వి. పిండీతకము.

మంగల. దే. వి. క్షౌరకజాతి. (మంగలవాఁడు, మంగలది.)

మంగలకత్తి. ద్వ. వి. మంగలవానికత్తి, క్షురము.

మంగలకత్తిరూపు. ద్వ. వి. కృత్తికానక్షత్రము.

మంగలపక్కి. దే. వి. మత్స్యవిశేషము.

మంగలపిట్ట. ద్వ. వి. ఏట్రింత, భారద్వాజము.

మంగలము. దే. వి. వేఁపుడుచేట్టి, భ్రాష్ట్రము.

మంగలి. దే. వి. మంగలవాఁడు, క్షౌరకుఁడు.

మంగలికోళ్లు. దే. వి. బ. సన్నాయి, నాగసరము. "క. మంగళసూత్రము గట్టఁగ, రంగాశ్రీకినంతరంగరాజేంద్రుఁడుపు ణ్యాంగనలపెండ్లిపాటలు, మంగలికోళ్లమృదుగీతిమధురిమ నెనయన్." కళా. ౭, అ.

మంగలిపని. దే. వి. క్షౌరము. "తే. వలయుఁబ్రాహ్మఖోదబ్రాహ్మత్వములనొకటి, దారికంబులుఁదిక్కులు నువారములును, తోస్యులెతేఁగించినవిమేలును ప్రత్యేక, శీలమంగలిపనికినిర్దైలమునకు." భార. అను. ౪, అ.

మంగళ. సం. వి. ఆ. స్త్రీ. 1. పార్వతి; 2. తెల్లగఱిక. అ. న. ము. 1. శుభము; 2. క్షేమము.

మంగళదేవత. సం. వి. ఆ. స్త్రీ. లక్ష్మి.

మంగళవారము. సం. వి. అ. పుం. ఒకవారము. (చూ. వారము.)

మంగళసూత్రము. సం. వి. అ. న. బొట్టుదారము.

మంగళహారతి. వై. వి. మంగళారతియొక్క మాఱురూపము.

మంగళారతి. వై. వి. మంగళకరమైన ఆరతి. "ద్వి. అంగనల్ వివిధపుష్పాంజలులిచ్చి, మంగళారతులెత్తినుహిమ్రొక్కువారు." బస. ౧, అ. (ఇది అంచేయానవంటిది.)

మంగళాశాసనము. సం. వి. అ. న. (వైష్ణవపరిభాషయందు) ఆశీర్వాదము.

మంగళుఁడు. సం. వి. అ. పుం. అంగారకుఁడు.

మంగళ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. గోరోజనము; 2. జమ్మి; 3. తెల్లవస; 4. సనాపి. అ. న. ము. 1. మల్లెపూవాసనగల అగరు; మల్లెపూవాసనగల నల్ల అగరు. (అని కొందఱు.) 2. మాఁగడపెరుఁగు. పుం. 1. కలుక్రాంతి; 2. మారేడు; 3. రావి; 4. చిఱువెనగలు. విశే. శుభకరము.

మంగి. దే. వి. మంగలవాఁడు, క్షౌరకుఁడు.

మంగు. దే. వి. మాఁగుయొక్క రూపాంతరము.

మంగుడు. దే. వి. ముఖమునందలి నల్లనిపొడ.

మంచము. సం. వి. అ. పుం. 1. మంచేము; 2. మంచె.

మంచి. దే. వి. మేలు. (మంచిసెబ్బరలు.) విణ. ఆరో గ్యము. "ఉ. మంచిగభూరిభూసురసమాజమునె ల్లనుభక్తితోడఁబూజించి." భార. సభా. ౧, ఆ. [మఱియు దీనికి సందర్భానుసారముగా అనేకా ర్థములుకలవు. "సీ. మంచిమగందుదామగ్రంథ యసమసంగ్రామకేళీగాఢకౌతుకుండు." (ఇక్కడ మంచికి మిక్కిలియని అర్థము.) భార. విరా. 3, ఆ.]

మంచిగందము. ద్వ. వి. శ్రీచందనము.

మంచినీళ్లు. ద్వ. వి. బ. పానయోగ్యమగు జలము.

మంచినూనె. ద్వ. వి. తలంటుకొను తైలము.

మంచిపాము. దే. వి. నాగుఁబాము, త్రాఁచు.

మంచిబెల్లము. దే. వి. చెఱకురసముతో చేసినబెల్లము.

మంచిముత్తెము. ద్వ. వి. అకృత్రిమమైన మౌక్తికము.

మంచియ. వై. వి. మంచెకు మొదటిరూపము.

మంచె. వై. వి. జొన్న చేను మొదలగుచోట్ల కూర్చుం డుటకై యెత్తుగా వేసెడు చప్పరమువంటిపందిరి

మంచేము. వై. వి. మంచము, పర్యంకము.

మంచు. దే. క్రి. మనుచుయొక్క రూపాంతరము. "ఉ. మంచితనేకయాగములమానుగదక్షిణలిచ్చి విప్రులకా." భార. ఆది. ౨, ఆ.—వి. హిమము.

మంచుఁగొండ. ద్వ. వి. హిమవత్పర్వతము. (ఇట్లు మంచుగుబ్బలి. మొ.)

మంచుతతి. దే. వి. హేమంతఋతువు.

మంజరి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. చిగిరించినలేఁత కొమ్మ; పూచినలేఁతకొమ్మ. (అని కొందఱు.) 2. బొట్టుగుళీ; 3. పెద్దముత్తెము. (దీనికర్థము పూగుత్తియని తఱచుగా వాడుదురు. "స్యాద్గుచ్ఛకస్తుస్తబకః." అని పూగుత్తిపర్యాయములు మఱి యొకచోఁ జెప్పఁబడియున్నవి కదా.)

మంజిటి. వై. వి. మంజిష్ఠ.

మంజిడి. వై. వి 1. చిత్రవర్ణవస్త్రము*; "సీ. బలు మంచుఁగంబాలబలసి రాఁజొట్టినక్రొత్తమంజిడి బాగుఁగొఱఁతసేసి." (ఈ పద్యమునందు ఎత్తుగీ తము చూడవలసినది.) ఉ. హరి. ౨, ఆ.—2. నీల వస్త్రము*. "సీ. వృష్టిగాశుద్ధాంబువేణిమజ్జనమా ర్చిశిఖరిమేఘముగమంజిడిఘటించి." పాండు. ౨, ఆ.["సీ. మక్కళించినకావుమంజిళ్లపెందెరలుంగ రంబులఁబట్టియెత్తువారు." (అను నీ యుదాహర ణమునుబట్టి యీ రూపమే సరియని తోఁచు చున్నది.) నై. ౫, ఆ.]

మంజిమ. సం. వి. న్. పుం. మనోజ్ఞత, (రూ. మం జిమము.)

మంజిష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకానొకచెట్టు; 2. మిక్కిలి ప్రకాశించెడి యెఱుపు.

మంజిష్ఠారాగము. సం. వి. అ. పుం. బయటికిని విశే షముగా కనఁబడుచు లోపలను ఎప్పటికి వీడకుం డెడు గాఢానురాగము. (చూ. పూర్వరాగము.)

మంజీరము. సం. వి. అ. పుం. అందె, నూపురము.

మంజులము. సం. వి. అ. న. 1. పొంచి; 2. పొదరిల్లు. పుం. ఒకదినుసు కూకురుగుండెంగపక్షి. విణ. ఒప్పిదమైనది.

మంజువు. సం. విణ. (ఉ.) మనోజ్ఞము.

మంజూరు. హిం. వి. అంగీకారము.

మంజూష. సం. వి. ఆ. స్త్రీ. పెట్టె, మందసము.

మంజెస. వై. వి.——పై.——"ఉ. ఘనభుజుండురా ధయనుదానిపతియొక్క, సూతుఁడరుగుదెంచి చూచిరత్నపుంజభరితమైనమంజసలోనున్న, కొ డుకుదానితోనకొనుచువచ్చి." భార. ఆది. ౫, ఆ.

మంజోడి. దే. వి. వజ్రములతూనిక, (రూ. మం జోళి.)

మంట. దే. వి. 1. జ్వాల; 2. కోపము; "తే. పావకుం డునుగపటంపుభూపవరుండుఁ, దమ్ముఁగదుఁజేరిమం దమేలమ్ముతోడ. నున్నవారికిఁ గీడుచేయుదురు వారి, కంచితిస్నేహమునమంటలధికమగును." వి, పు. 2, ఆ.—3. చెఱుకుమానెడునొప్పి. (గాయ ముతగిలినచోట మంటయెత్తుచున్నది.)

మంటకము సం.వి.అ.పుం.భక్ష్యవిశేషము, మండెగ.

మంటచేమురు. దే. వి. ఎఱ్ఱగాఁగాలినగరిటెలోపో యఁగా మండెడుచేమురు. (ఇట్లు మంటనేయి. మొ.)

మంటమారి. దే. విణ. 1. జ్వలనశీలుఁడు; (చూ. నే తా.) 2. కోపశీలుఁడు. "తే. మఱియునమ్మంట మారిఁ, గలయనెక్కించుకొనిపచ్చి మలయనగ భు,జంగవిపదిగ్ధపవనుపైఁజలమువొడమ." వసు. ౪, ఆ.

మంటినూనె. ద్వ. వి. (మన్ను+నూనె.) (చూ.) మట్టి తైలము.

మండ. ఉభ. దే. వి. 1. శాఖ; 2. ఉపశాఖ; "ప. మండగలకంపమండలు." స్వా. ౪, ఆ.—3. వేఁపుడు కుచ్చు; 4. చీలమండ. సం. ఆ. స్త్రీ. ఉసిరిక?.

మండకంచేము. ద్వ. వి. అంచుకట్టినకంచేము.

మండనము. సం. వి. అ. న. 1. భూషణము; 2. అలంకరించుట. విణ. అలంకరించునది.

మండపము. సం. వి. అ. పుం, న. 1. చుట్టును నడుమను మఱుఁగులేక స్తంభములునిలిపికట్టినకట్టడము, చవిక; 2. చావడి.

మండపి. సం. వి. ఈ. స్త్రీ. చిన్నమండపము.

మండము. ఉభ. దే. వి. చేఁపలఁబొడుచు చిల్లకోల. సం. అ. న. మీఁగడ. పుం, న. 1. గంజి; 2. నూనెలోనగువానితేట. పుం. 1. ఆముదపుఁజెట్టు; 2. భూషణము; 3. ఒకదినుసు కూరాకు.

మండలము. సం. వి. అ. న. 1. పరివేషము; 2. దేశము; 3. కుష్ఠము; 4. విలుకాఁడు రెండుకాళ్లతో మండలాకారముగానిలుచుట; (చూ. స్థానము.) 5. పన్నిద్దఱురాజులు. పుం. 1. సమూహము; 2. వలయాకారముగాదీర్చినయొకవ్యూహము; 3. కుక్క. త్రి. సూర్యచంద్రాదులబింబము.

మండలాగ్రము. సం. వి. అ. పుం. ఖడ్గము. కత్తి.

మండలి. సం. వి. ఈ. స్త్రీ. సమూహము. న్. పుం. 1. పాము; 2. మండలేశ్వరుఁడు; 3. సూర్యుఁడు; 4. పిల్లి; 5. కుక్క.

మండలేశ్వరుఁడు. సం. వి. అ. పుం. అధీశ్వరసార్వభౌములకంటె ఇతరుఁడైనరాజు.

మండవాయి. ద్వ. వి. గుల్ఫవాయువు.

మండహారకుఁడు. సం. వి. అ. పుం. కల్లుగీయువాఁడు.

మండాటము. దే. వి. దైన్యముతో యాచించుట.

మండాడు. దే. స. క్రి. దైన్యముతో యాచించు. "ద్వి. ఆవేళభయకంపితాత్ముఁడైవాఁడు, చండికి నీశ్వరేశ్వరునకునెరఁగి, మండాడఁబోయిన." పండి. ప్ర. ౧.

మండాము. దే. వి. మండముయొక్కరూపాంతరము.

మండి. దే. వి. ఒకకాలు నేలమోఁకరించుట.

మండిగండ్రలు. దే. వి. బ. ధాన్యవిశేషము.

మండిగము. దే. వి. వాకిటిక్రింద అడ్డుగానమర్చిన కొయ్య, శిల.

మండితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అలంకరింపఁబడినవాఁడు.

మండిలూటి. దే. వి. బయటపొటమరింపక లోపల నణఁగియుండువ్రణము.

మండీ. దే. వి. మండికి మొదటిరూపము.

మండు. దే. అ. క్రి. 1. జ్వలించు; "క. క్రోధం, బేమియుమానకమండెడు, నామునిమునియే." స్వా. ౪, ఆ.—2. చుఱుకుమనినొచ్చు; (గాయముమండుచున్నది.) 3. ఈర్ష్యాదులచేఁదపించు. (ఒళ్లు మండుచున్నది. మొ.)

మండునెల. దే. వి. వసంతఋతువు. "ఎ, గీ. వలపుఁదూపులుకరసానవాఁడిసేసి, మండు నెలతోడఁదనమేనమామయైన, నిండునెలతోడవలరాజునిర్జరేంద్రు, సభకునేతెంచె భుజబలోత్సాహమెసఁగ." ఉ, హరి. ౨. ఆ.

మండువా. వై. వి. 1. పాక; 2. ఒకతట్టు గోడలేని గుత్తాలపాక. "మహాస్రగ్ధర. ఎకరాలకా మండువాసాహిణములఁగల భద్రేభసందోహవాహ, ప్రకరంబుంగొంచు." స్వా. ౧, ఆ.

మండూకపర్ణము. సం. వి. అ. పుం. దుండిగము?.

మండూకపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. 1. పొన్నగంటి?; 2. బెండ?; 3. మంజిష్ఠ?.

మండూకము. సం. వి. అ. పుం. 1. కప్ప; 2. దుండిగము?. (రూ. మండుకము.) డు. ఒక ఋషి.

మండూరము. సం. వి. అ. న. 1. ఇనుపచిట్టెము; 2. ఇనుపచిట్టెముతోచేసిన సిందూరము.

మండె. దే. వి. జొన్నకంకులు పొగాకులోనగునవి మ్రగ్గుటకై ప్రోగువేసిమీఁదకప్పిపెట్టుట. (మొదటిరూపము మండియ.)

మండెఁగ. వై. వి. పంచదారవేయని గోదుమపూరీ. "సీ. చింపివల్కములేమిచేసెడిదనఁగావునెఱపైనకండమండెఁగలుగాని." జై. ౨, ఆ. "క. మండెం, గలుచీరలుగ భుజక్రియ, వలపించెంబెండ్లివారివనితయుఁబోలెన్." సై. ౬, ఆ.

మండెము. వై. వి. మాఁడెముయొక్కరూపాంతరము.

మంద్ర. దే. వి. ఒకానొక ముండ్లచెట్టు. "ఎ, గీ. మామ్పుచిటికొక్కిసీకాయ మంద్రలొట్టి." హంస. ౪, ఆ.

మంద్రగబ్బ. దే. వి. నల్లని పెద్దతేలు, షడ్బిందువు.

మంద్రాటము. దే. వి. సంతాపము. "శా. సంద్రేంద్రాదులు నీగతింజనఁగ జంభద్వేషిముఖ్యామరుల్, మంద్రాటం బిదియేల చెప్పెదము కామధ్వంసి కీనేమముల్, గుంద్రాణ్యైనఁజెమర్చునింతికకటా

గోపాలచూడామణికిన్, గంధ్రోకానరొవారు చెప్పఁదగదాక్షైలాసవాచంయముల్." ఉ, హరి. ౨, ఆ.

మంత్రాడు. దే. అ. క్రి. సంతాపించు.

మంత. సం. విణ. (బు.ఈ.బు.) ఆలోచించువాఁడు.

మంతనము. వై. వి. 1. ఆలోచన; "మ. యదువంశంబుననంబుజోదరుసుం దాబ్రహ్మాయుంబోలెనీ, వుదయంబొంది సమస్తయాదవ భయవ్యుచ్ఛేదదక్షుండవై, త్రిదశేంద్రాదుల మంతనంబులనుబుద్ధిం గాంతు." హరి. ఉ. ౧. ఆ.—2. ఏకాంతము*, "తే. మంతనంబున నేమే మొమాటలాడి." అచ్చ. సుం, కాం.—3. రహస్యము*. "క. దంతిపురనాథవినుమొక, మంతనమెఱిఁగింతుశమదమంబులఁ నంహితా,వంతుఁడుభవంతుఁజేయవు.కంతునిగురు భక్తిముక్తిగలిగించుగతిన్." భాగ. ౬. స్కం.

మంతిరము. వై. వి. 1. ప్రసవోపాయము*; 2. జాలవిద్య*. (మంత్రమునకు మొదటిరూపము.)

మంతరసాని. వై. వి. మంత్రసానికి మొదటిరూపము.

మంతవ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఆలోచింపఁదగినవాఁడు.

మంతిరి. వై. వి. మంత్రి. "మ. చెంతమం, తురులంబిల్చిప్రవాహకారణముఁ దోడ్తోనారయం బంచినన్." ఉ, రా. 3, ఆ.

మంతిరించే. వై. అ. క్రి. మంత్రముచేయు. "ఎన్ని మందులిడితివో యేమిమంతిరించితివో." క్షేత్రయ.

మంతు. యు. దే. వి. ప్రసిద్ధి. "ద్వి. మంతుకెక్కిన హనుమంతుండుఁదాము." రా. కిష్కిం. కాం.—వై. 1. మంత్రి; "క. సంతసిలియాతఁడాహను, మంతునకానతియొసంగిమదిలోనిగులన్, పంతయొలర్పఁగనపుడే, మంతులతోఁగూడిచనియెమలయుంబునకున్." అచ్చ. కిష్కిం, కాం.—2. చదరంగమున మంత్రిగానుంచుకొన్నకాయ*; 3. మంత్రము. (చూ. నాగబెత్తము.)

మంతువు. సం. వి. ఉ. స్త్రీ. తెలివి. పుం. 1. అపరాధము; 2. మనుష్యుఁడు; 3. రాజు.

మంత్రకాఁడు. ద్వ. వి. (మంత్రము+కాఁడు.) ఇంద్రజాలవిద్య నెఱిఁగినవాఁడు. "క. తెగుతలలు మొలచుతలలున్, దిగువంబడుతలలుమొగులుతెరువునకువడిన్, నెగయుతలలప్పుడబ్బుర, మగుచున్ జగమంత్రకానియాటయుఁబోలెన్." అచ్చ. యు, కాం.

మంత్రణ. సం. వి. ఆ. స్త్రీ. రహస్యాలోచన. (యూ. మంత్రణము. అ. న.)

మంత్రము. ఉభ. వై. వి. 1. ప్రసవోపాయము*; (మంత్రసాని.) 2. జాలవిద్య*. (చూ. మంత్రకాఁడు.)—సం. అ. పుం. 1. గాయత్రిలోనగునది; 2. రహస్యము; 3. అథర్వవేదము.

మంత్రవాది. సం. వి. న్. పుం. మాంత్రికుఁడు.

మంత్రసాని. వై. వి. (మంత్రము+సాని.) సుఖముగా ప్రసవింపనుపాయముచేసెడుచికిత్సకురాలు, సావిక. (మంతరసానియొక్క రూపాంతరము.)

మంత్రాంగము. సం. వి. మంత్రిత్వము, తంత్రము.

మంత్రి. సం. వి. న్. పుం. 1. బుద్ధిసహాయుఁడు; 2. సహాయుఁడు.

మంత్రించే. సం. అ. క్రి. మంతిరించే.

మంథదండము. సం. వి. అ. పుం. కవ్వము.

మంథనము. సం. వి. అ. న. త్రచ్చుట. పుం. కవ్వము.

మంథని. సం. వి. ఈ. స్త్రీ. (చూ.) తరిగడవ.

మంథము. సం. వి. అ. పుం. 1. కవ్వము; 2. కంటినొప్పి; 3. అంబలి; 4. వధము. డు. సూర్యుఁడు.

మంథరజ్జువు. సం. వి. ఉ. పుం. (చూ.) తరిత్రాడు.

మంథరము. సం. వి. అ. పుం. 1. కవ్వము. విణ. 1. చొరవలేనిది; 2. మెల్లగాఁబోవునది; 3. వంకరైనది; 4. విరివియైనది.

మంథాద్రి. సం. వి. ఇ. పుం. కవ్వపుఁగొండ. (ఇట్లు మంథాచలము, మంథశైలము. మొ.)

మంథానము. సం. వి. అ. పుం. మంథదండము, కవ్వము.

మంద. దే. వి. 1. ఊరికివెలుపల పశువులుండుచోటు, గోష్ఠము; "ఆ. పుణ్యదినమునందుభూసురానుజ్ఞతో, నుపవసించిగోవులున్నమంద. కరిగిపరమని యతినయ్యహోరాత్రము, గోష్ఠమునవసించినిష్ఠతోడ." భార. అను. ౨, ఆ.—2. పశుసమూహము; 3. గొల్లపల్లె, వ్రజము. "వ. జనపదంబులును బురంబులును గ్రామంబులును బల్లెలును మందలును." సం. "స్ఫీతాన్ జనపదాంస్తత్ర పురగ్రామవ్రజాకరాన్." భాగ. ౧, స్కం.

మందకట్టు. దే. వి. గొల్లపల్లెలవారు ఏర్పఱుచుకొన్న యేర్పాటు.

మందగామి. సం. విణ. (న్. ఈ. న్.) మెల్లగానడచువాఁడు.

మందగించె. వై. అ. క్రి. మందమగు. "యానముల్ వేమఱుమందగించె." హంస. ౨, ఆ.

మందగొను. దే. అ. క్రి. మందగాఁగూడు. "క. ఇచ్చోఁబచ్చికమేసిన, విచ్చోఁద్రాగినవితోయమే గినవిచ్చో, నిచ్చోటమందగొన్నవి, యిచ్చోఁ బాసినవి జాడయిదెయిదెయనుచుఁన్." భాగ. ౧౦, స్కం. పూ.

మందట. దే. వి. 1. సమీపము; "చ. మనములస మ్మతించితమమందటనాసభవారుతీర్చిచె, ప్పినగ తిచేసిరి." పంచ. నా. ౧, ఆ.—2. అడఁకువ. "మ. వినుకుం భాండయనేకకాలము మహావీరాహవ ప్రౌఢిపెం, పునఁగ్రీడింపఁగలేకవాడగుభుజం బుల్ మందటంబొందినన్." హరి. ఉ. ౭, ఆ.

మందటిల్లు. దే. అ. క్రి. అడఁగు. (రూ. మందటి లు. "క. క్రమ్ముచీఁకటి, మందటిలెన్ మేలుకట్టు మానికములచేన్." య. ౮, ఆ.)

మందడి. వై. వి. గుజ్జుపుళాల, మందుర. "ద్వి. ఈ రేయిమందడియెల్లమైమఱచి, తౌరునిద్రించుచు త్తఱిఁజిచ్చువెట్టు, మీవాజిశాలలనిటుచేసితేని, భావములోననాపలుకులుమెచ్చి, తగన్నపుండి చ్చునర్థంబులోనీకు, సగమిత్తు." నవ. 3, భా.

మందడీఁడు. దే. వి. (మందడి + ఈఁడు.) గుజ్జుపు వాఁడు, మందురకుఁడు. "ఎ, గీ. లాయమునను న్న, యపుడుదోసఁగించుకయులేనియట్లుగాఁగ, మాటిమాటికిఁబకికించిమందడీల, కెల్లనూఱటయ గుచువర్తిల్లనేర్తు." భార. విరా. ౧, ఆ.

మందపిచ్చుక. దే. వి. చటకవిశేషము, ఖంజరీటము.

మందప్రోయాలు. ద్వ. వి. గొల్లది, వ్రేత. "ఎ, గీ. మందప్రోయాండ్రకూఁతిమిత్రానిపందు." పాండు. ౨, ఆ.

మందము. ఉభ. దే. విశ. 1. దట్టము; 2. స్థూలము. "ద్వి.నడుముమందంబాయెవాభికన్పడియె." నళ. ౨, భా.—సం. వి. అ. పుం. గజజాతివిశేషము. (చూ. గజము.) (ఈ జాతిగజము యుద్ధకాలము నందు వాహనయోగ్యమైనది.) విశ. 1. చొరవలే నిది; 2. మెల్లనిది.

మందరము. సం. వి. అ. పుం. 1. కవ్వపుఁగొండ; 2. మందారమనుకల్పవృక్షము. విశ. 1. అలస ము; 2. బహుళము.

మందల. దే. వి. 1. మేర; "వ. వసుదేవుండుబ్రదు కుమందలగంటిననుచుసుందరియుందాను మం దిరంబునకుంబోయిడెందంబుననానందంబుఁబొం దియుండె." భాగ. ౧౦, స్కం. పూ. (మేర యనఁగా నిక్కడ విధమనియర్థము.)—2. మనుదల, జీవము; "వ. ఇట్లు రాజలోకంబునెల్లనక్రమం బుననోడించి సాల్వరాజుమందలవిడిచి." సం. "జిత్వావిసర్జయామాస జీవంతంనృపసత్తమమ్." భార. ఆది. ౮, ఆ. "సహదేవుఁజాలుకనమర్దించి మందలవిడువఁడే." భార. కర్ణ. ౧, ఆ. (ఇది యీయర్థమునందువిడుచుధాతువుతోఁగూడియే ప్రయోగింపఁబడియున్నది.) — 3. సమీపము.

మందలించె. దే. స. క్రి. 1. చెప్పు; "తే. ఇంతయలు కకుఁ గారణంబిదియటంచు, మందలింపుమునా యానమందయాన." ఇళా. ౮, ఆ.—2. ఆజ్ఞా పించె; "తే. మందకొండలమంద నమందవృష్టిఁ, గ్రందుకొనుఁడచు నింద్రుండు మందలింప." భాగ. ౨, స్కం. (ఇక్కడ చెప్పననుటకంటె అజ్ఞాపింపననుటయుక్తము.)— 3. మనవిచేయు; "తే. ఇన్నియుపచారములుచేసి యిందువదన, ల న్నియునుజాడమునుపటికన్న మిగుల, బాధకము లయ్యెదయలేని ప్రభువుతోడ, మందలించినమ నవులచందమునను." అని. 3, ఆ.—4. హెచ్చరిం చె; "ద్వి. నీవునుదేవమునిశ్రేణిఁగలసి, వేవచ్చిన నుఁజేర వేఁడుచున్నపుడు, మందలించెదఁగాక." విష్ణు. పూ. 3, ఆ.—5. తలఁచె. "సీ. ముక్తకం చుకమస్తముక్తాఫలంబులమందలింతురుగురువింద లట్లు." కాశీ. ౨, ఆ.

మందలింపు. దే. వి. వ్యవహారము. (చూ. ఆరగింపు.)

మందస. వై. వి. పెట్టె. "ద్వి. తటుకుననరిగిమందసఁ బట్టుఁడనుచు." నవ. 3, భా. (రూ. మందసము. "చందుగుపెట్టెలుమందసములు." నీలా. 3, ఆ.)

మందహాసము. సం. వి. అ. పుం. చిఱునవ్వు.

మందాకిని. సం. వి. ఈ. స్త్రీ. 1. గంగ; 2. ఆకాశ గంగ; 3. ఒకానొకవృత్తము; 4. అఱువదేండ్ల ఆఁవుది.

మందాకు. దే. వి. (మందు+ఆకు.) ఓషధి. (చూ. పసరు మొదటియర్థము.)

మందాక్షము. సం. వి. అ. న. సిగ్గు, లజ్జ, వ్రీడ, త్రప.

మందారము. ఉభ. దే. వి. మేఘావరణము. సం. అ. పుం. 1. ఒక కల్పవృక్షము; 2. జిల్లేడు?; 3. బాడిద ము?.

మంది. దే.వి.1. జనసమూహము; 2. పరిజనము; "ఉ. తప్పుగణించికాదొరలు దండనసేయుదురొద్దివారివా, తప్పునకల్గిమందిగల దాననటంచును మూరుతూపులం, గుప్పితివీవు." ఉ. రా. ౬, ఆ.—3. కాలుబలము. "ఉ. మందిగుఱాలు సేనఁగులుమావుతులంగ దొరలెన్నఁ బెక్కులై, గ్రందుగఁగూర్చితో నెదురుగాఁజనిపోఁజులుదీర్ప." య. ౧, ఆ.

మందిరము. సం. వి. అ. న. 1. ఇల్లు; 2. పట్టణము. పుం. సముద్రము.

మందీభవించు. సం. అ. క్రి. మందమగు.

మందు. దే. వి. 1. ఔషధము; 2. పథ్యౌషధము; 3. ప్రతిక్రియ; "క. వినుముపురాతనజన్మం, బునఁ జేసినయట్టికర్మములఫలములుప్రా, జ్ఞునిసైనఁబొందువానికి, మనుజేశ్వరమందు ధైర్యమహిమయచుమ్మీ." భార. శాం. ౪, ఆ.—4. ఉపాయము. "చ. అనిమొనదేవదానవులనైననుగెల్వనశక్యమిమ్మహాత్మునినొకమందు సెప్పెదనుతుక వాతఁడయ్యొనసంగవిన్నయం, తనయితఁడాయుధంబుదిగఁద్రావియచేష్టతఁబొందునప్పుడీ, తనిఁబరిమార్పవచ్చునిదితప్పనుపాయము గల్గదెమ్మెయిన." భార. ద్రో. ౫, ఆ.—విశ. దుర్లభము. "కూడు దానఁగల్గె నేనిఁగూరగుటమందు." ఆము. ౪, ఆ.

మందుఁడు. సం. వి. అ. పుం. శని. విశ. 1. చొరవలేనివాఁడు; 2. అల్పుఁడు; 3. ఇచ్చేవచ్చినట్టు తిరుగువాఁడు; 4. నిర్భాగ్యుఁడు; 5. మూర్ఖుఁడు; 6. వ్యాధిగ్రస్తుఁడు.

మందుపట్టడ. దే. వి. బాణసంచుచేసెడుశాల.

మందుభాయి. గ్రా. వి. నల్లమందుతినువాఁడు.

మందుమల. ద్వ. వి. మందుచెట్లుండుపర్వతము, ద్రోణము.

మందుర. సం. వి. అ. స్త్రీ. 1. లాయము; 2. పడక.

మందురకుఁడు. సం. వి. అ. పుం. గుఱ్ఱపువాఁడు, మందడీఁడు. "క. ఆవనితయునిచ్చెఁగూర్చుహయపాలునకుక. క. అమ్మందురకుఁడుతద్గృహ, సమ్మార్జనికిచ్చె." విక్ర. 3, ఆ.

మందులమారి. దే. విశ. మర్లుమందుపెట్టువాఁడు, మర్లుమందుపెట్టునది.

మందెమేలము. దే. వి. 1. ఉపేక్ష; "వ. సితచ్ఛత్రచామరశంఖకిరీట చిత్రశయ్యాసౌధసింహాసనంబులు కైకొనుట మనమందె మేలంబునంగాదె." సం. "కిరీటమాసనంశయ్యాం ఛుంజత్యస్తనుపేక్షయా." భాగ. ౧౦, స్క౦. ఉ.—2. చనవు; "క. అనిచెనకుచునదితనుడా, సినమునిశోపించి యోనిచెడుగ వెలిపుమా, లినముంగడియఁగవచ్చెదు, మునుకొని యీమందె మేలమునకోర్వఁజుమీ." భో. ౪, ఆ.—3. స్నేహము. (చూ. మంట రెండవ అర్థము.)

మందోష్ణము. సం. వి. అ. న. ఇంచుకవేఁడి. విశ. ఇంచుకవేఁడియైనది.

మంద్రము. సం. విశ. (అ. ఆ. అ.) గంభీరమైనది. (స్వరము.)

మంపిల్లు. దే. అ. క్రి. మత్తిల్లు. "సీ. క్రొల్పులల్ మంపిల్లి గొటగొటమనిరొప్పిబలుసింగములనైనఁ బట్టఁజూచు." సా. ౧, ఆ. (రూ. మంపిలు. "ద్వి. పరలోకసౌఖ్యసంపదలమంపిలుము." విష్ణు. ఉ. ౫, ఆ.)

మంపు. దే. వి. 1. మత్తు; "ఉ. మంపెసఁగంగటాక్షలవమాత్రముచేత నెముజ్జగంబుమో, హింపఁగఁ జేయుభారమిఁకనీవువహించితిగాన." విజ. ౧, ఆ.—2. మైకము. "సామినీకన్నులనిద్దురమంపు." క్షేత్రయ.

మంపుగొను. దే. అ. క్రి. (మంపు+కొను.) మత్తిల్లు. "తే. మంపుగొనిమేయయిటంగకమలనిమలని." ఉ. హరి. ౪, ఆ. (ప్రే. మంపుగొలుపు.)

మంబరము. దే. వి. దహనము. (చూ. మంబరముసేయు.)

మంబరముసేయు. దే. స. క్రి. (మంబరము+చేయు.) దహించు. "ఉ. కాఁగిటం, జేపడఁబట్టిమంబరముసేసెదిగంబరవేషఁగృత్య." ఉ. హరి. 3, ఆ.

మకరందము. సం. వి. అ. పుం. పూఁదేనె.

మకరకంఠి. సం. వి. ఈ. స్త్రీ. నడుమ మొసలిముఖమేర్పఱచిన కంఠభూషావిశేషము.

మకరకుండలము. సం. వి. అ. న. మొసలిముఖమేర్పడఁజేసిన పురుషునికర్ణభూషావిశేషము.

మకరతము. సం. వి. అ. న. మరకతముయొక్క మాఱురూపము. "చ. సకియకళంకతోయకణసంగతపద్మపలాశమధ్యమా, ల్లకరుచులొప్పెడుక గొలఁకులచ్చినిమంగనిచెల్లి హెచ్చఁగా, మకరతపాత్రలోవిమలమౌక్తికముల్ జతగూర్చిరత్నదీ, పకలననిచ్చునారతులభావమునక గనుఁగొంటయిచ్చటక." ఉ. రా. ౬, ఆ.

మకరతోరణము. సం. వి. అ. పుం, న. మొసలిరూప మేర్పడఁజేసిన తోరణము.

మకరధ్వజుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు. (ఇట్లు మకరకేతనుఁడు. మొ.)

మకరము. సం. వి. అ. పుం. 1. పెద్దచేఁప; మొసలి. (అని కొందఱు.) 2. ఒకనిధి; (చూ. నిధి.) 3. ఒక రాశి; (చూ. రాశి.) 4. అభినయహస్తవిశేషము.

మకరాంకుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

మకరాలయము. సం. వి. అ. పుం. సముద్రము, కడలి.

మకరిక. సం. వి. ఆ. స్త్రీ. మకరికాపత్త్రము. "శ్రీ రుక్మిణికిమకరికలుచెక్కులవ్రాసి." ఉ, రా. ౧, ఆ.

మకరికాపత్త్రము. సం. వి. అ. న. స్త్రీలకు చెక్కిళ్లలోనగుతావులయందు లత్తుకతో వ్రాసెడు మకర రూపమగురేఖ.

మకరివల. దే. వి. మృగములనుబట్టెడు ఒకదినుసు వల. "వ. తెరచీరకట్టలు ప్రోఁగుచుట్టలు దొడ్డివల లేటివల కుందేటివల పందివల సవదండవల మకరివల యెలికవల మొదలుగా వల నూవలలును." కాశీ. 3, ఆ.

మకాము. హిం. వి. బస. ప్రయాణమునందు నిలుచు స్థలము.

మకిల. వై. వి. 1. ముఱికి*; 2. నలుపు*.

మకుటము. సం. వి. అ. న. కిరీటము, బొమిడికము.

మకురము. సం. వి. అ. పుం. 1. అద్దము; 2. పొగడ?; 3. మల్లెపువ్వు; 4. కుమ్మరిసారెఁద్రిప్పెడుకఱ్ఱ.

మకురుతనము. దే. వి. మూర్ఖత్వము, మొండితనము.

మకుష్టకము. సం. వి. అ. పుం. అడవిపెసలు, (రూ. మకుష్ఠకము.)

మకూలకము. సం. వి. అ. పుం. దంతిచెట్టు.

మక్క. వై. వి. బిడ్డలుగన్న స్త్రీకి పొత్తికడుపునఁబుట్టెడి అపాయకరమైన నెత్తురుగడ్డ.

మక్కనగాయ. ద్వ. వి. (మక్కన+కాయ)—వై.—

మక్కల్లము. సం. వి. అ. పుం.——వై.——

మక్కళించు. దే. అ. క్రి. 1. తిరుగుకొను; (వానికి జ్వరము మక్కళించుకొన్నది. అనఁగా జ్వరము నిలిచియుండి మరలవచ్చినదనుట.) 2. సరిపడు; (చూ. మంజిడి.) 3. సరిపోలు. "సీ. కరికరశీకర కణములు విక్రాంతమకుటముక్తారుచిమక్కళింప." ఉ, హరి. ౭, ఆ.—అం, ప్రే. 1. తిరుగుకొనఁజేయు; "సీ. విజేయమైనయొడ్డాణంబులవణిచేనక్కళించినపొట్టమక్కళించి." (ఇక్కడ తిరుగుకొనఁజేయుట అనఁగా లోపలికి అడఁచుకొన్న కడుపును మరలనుబ్బించుట అని యర్థము.) స్వా. ౧, ఆ.—2. సరిపఱచు; "సీ. నేసకొప్పునఁజొట్టుశిఖిపింఛరింఛోళి మక్కళించినజిల్లుమడుఁగుపాగ." (ఇక్కడ సరిపఱచుట అనఁగా చెక్కుట.) కాశీ. 3, ఆ. "సీ. మారేడుబుఱ్ఱలో మక్కళించుకసందిఁగట్టినచంద్రశేఖరుఁడు వెలయ." (ఇక్కడ సరిపఱచుట అనఁగా ఇముడ్చుట.) హంస. ౧, ఆ.—3. సరిపోల్చు. "ఎ, గీ. తొడలునఁటికంబంబులు మెడలుఁబోఁక, బోదలు సెలుంగులును బరవుష్టతతులు, మాటలును గీరభాషలును మక్కళించి, చిగురుఁబోఁడులువనకేళిసేయఁజేయ." ఉ, హరి. ౫, ఆ.

మక్కా. వై. వి. యవనదేశమునందలి ముఖ్యపట్టణము*.

మక్తా. హిం. వి. గుత్త.

మక్కి. దే. విశే. నిస్సారము. "తే. మందగుదిపుప్పి గొరిసెలుమక్కిరొండ్లు." హంస. ౫, ఆ. (ఇక్కడ మాంసములేనిదని యర్థము.)

మక్కు. దే. అ. క్రి. 1. కాంతిహీనమగు; "వెలవెలనైనభోవీధిఁదారలుమక్కు." కన్యకా. ౮, ఆ.—2. నవయు; "ఉ. ఒక్కనివేఁడఁబోవుమతియొక్కని చేటునకియ్యకోవుపే, యొక్కనిసొమ్ముకాసపడనొల్లవుమూలవిఘాతనిర్దయుం, డక్కటనీరునుం దృణము నానిమహోగ్రవనాంతరంబులన్, మక్కెడు నీకునిట్టియవమానము మానముదప్పఁజేసెనే." పంచ. నా. ౨, ఆ.—3. చచ్చు. "వ. ఇట్లు పెక్కుపరుసలు రక్కసులయుక్కివంబునమక్కిన." యు. 3, "క. దిక్కులరాజులసెల్లను, మక్కించిధనంబుగొనుటమయకృతసభము, న్నెక్కుట జన్నముసేయుట, నిక్కముహరిమనకుదండనిలిచినఁగాదే." భాగ. ౧౦, స్కం. "ద్వి. ఒక్కొక్కజనుఁడుర్వినొదవుపాపముల, మక్కించువేణుగుల్మమునగ్నివోలె." భాగ. ౭, స్కం.—స. క్రి. గిఱు. "క. ముక్కునఁజీఱియుగోళ్లన్, మక్కియుసొప్పింపనడవిమక్కివజీరుం, డక్కాళ్ఁదద్దగ్రుద్దియు, నెక్కలునుఱుమాడియున్ నెత్తింగుఁదించెన్." అచ్చ. యు, కాం.—వి. మాలిన్యము. "సీ. ధూళిమక్కెక్కిమంగళులతిప్పలు రేఁగువడువునగాలినాడెడు వెలుకల." అము, ౭, ఆ.

మక్కువ. దే. వి. కూరిమి, ప్రేమము.
మక్కెలు. దే. వి. బ. ఎముకలు, అస్థులు.
మక్షిక. సం. వి. అ. స్త్రీ. ఈఁగ.
మఖము. సం. వి. అ. పుం. యజ్ఞము, జన్నము.
మగ. దే. వి. పుంస్త్వము. (మగవాఁడు.)
మగఁటిమి. దే. వి. 1. మగతనము, పౌరుషము; 2. శౌర్యము. (చూ. పూరిగించు.)
మగఁడు. దే. వి. 1. పురుషుఁడు; "సీ. చూచినమగలైనఁజొక్కెడునట్టిసౌందర్య సంపద సొంపువాల్చెననియు." నిర్వ. ౧, ఆ.—2. భర్త; "ఆ. మగఁడులేని మగువమాడ్కిఁ గాకున్నె నా, సేనభీష్మతేమిఁజేసినేడు." భార. భీష్మ. ౧. ఆ.—౩. రాజు; "మ. అపుడప్పక్కిమగండు రక్కసుల బల్మిన్ దాఁకియిబ్భంగిను, గ్రపుఁగయ్యంబొనరించిమూర్ఛిల." రామా. ౫, ఆ.—4. శూరుఁడు. "క. పాండవులనాజి నూర్చుని, తండనిమీరాజునూతితిన యునిఁబోగడుక, గండడఁచెభీముఁడిట్టిము, గండుగలఁడెపిదపనెట్లుకయ్యముసెల్లెన్." భార. కర్ణ. ౨, ఆ. (వృత్తియందంత్యవర్ణలోపము. మగపాటు, మగపాండు. మొ.)
మగచెయ్యువులు. ద్వి. వి. బ. గ్రామ్యధర్మము. (ఇట్లు మగపనులు. మొ.)
మగధము. సం. వి. అ. పుం. ఒకానొకదేశము.
మగధుఁడు. సం. వి. అ. పుం. వంశావళి చదువడువాఁడు, (రూ. మాగధుఁడు.)
మగనాలు. దే. వి. (మగని+ఆలు.) మగఁడుగల ఆఁడుది, పతిపత్ని.
మగపాడి. దే. వి. 1. శౌర్యము; "క. అయ్యెడమానమువదలక, డయ్యకమగపాడితో దృఢంబుగఁ బోరన్." భాగ. ౧౦, స్కం. ఉ.—2. ఉపరతి.
మగపోఁడుములు. దే. వి. బ. గ్రామ్యధర్మము.
మగమానికపువాలు. ద్వి. వి. వజ్రాయుధము. 'తే. తనరమగమానికపువాలుదాల్పుజోదు, వేడుకలు మీఱిసాడుబత్తేడ." నీలా. 3, ఆ.
మగమానికము. ద్వి. వి. రవ, వజ్రము. "సీ. తగు వేల్పుదొరరాణి మగమానికపుసొమ్ము సెగ కేని చానగొజ్జఁగలబంతి." య. ౧, ఆ.
మగమానివాలు. ద్వి. వి. వజ్రాయుధము. అచ్చ. యు, కాం.

మగటాయి. దే. వి. మగమానికము. "మ. నెలతచొక్కపుమేడలోనమగటానిద్దంపుఁగీల్తాఁగుటయ్యేలలో." చంద్రా. ౨, ఆ.
మగలాగు. దే. వి. మగపాడి, ఉపరతి.
మగవాఁడు. దే. వి. 1. పురుషుఁడు; 2. శూరుఁడు.
మగిడి. దే. వి. పాములవాఁడు ఊఁదెడు వాద్యవిశేషము.
మగుడఁబడు. ద్వి. అ. క్రి. (మగుడన్ + పడు.) మగుడు. (స్వార్థమున పడు.)
మగుడు. దే. అ. క్రి. మరలు.
మగుడుచే. దే. ప్రే. మగుడఁజేయు. (రూ. మగుడ్చు. "అమ్మహితుండుమన్మథున్, గొడుకుగఁబంచివేతనుమగుడ్పఁగవచ్చె." భార. అను. ౪, ఆ.)
మగులు. దే. వి. గోడమీఁదికప్పు. (చూ.) మదురు.
మగులుగోడ. ద్వి. వి. మగులుపెట్టినగోడ. "ఆ. మగులుగోడమీఁద మ్రాఁకులుచిగురుజొంపములువానిమీఁదఁబ్రచురదోహదములఘూపములునుడి సకుమాటుగగూఢగతిని గాంతఁగొను మనతఁడుసనియె." కళా. 3, ఆ.
మగువ. దే. వి ఆఁడుది, ఇంతి, పొలఁతి, స్త్రీ.
మగ్గపుగుంత. ద్వి. వి. సాలెవాఁడు నేయుటకుఁగూర్చున్నపుడు కాలుచాఁచుకొనెడుపల్లము. (చూ. కుంచె అయిదవయర్థము.)
మగ్గము. దే. వి. సాలెవాఁడు నేసెడు యంత్రము.
మగ్గఁ. దే. వి. (మగ్గము+అఁ.) సాలెవాఁడు.
మగ్గు. దే. అ. క్రి. ఉక్కచే చెమ్మగిల్లిచెడు.
మగ్గుడు. దే. వి. మగ్గుట.
మగ్గుడుపాఱు. దే. అ. క్రి. మగ్గు.
మగ్దూరు. హిం. వి. అధికారము, శక్తి.
మగ్నము. సం. విశే. (అ. ఆ. అ.) మునిఁగినది.
మఘ. సం. వి. ఆ. స్త్రీ. 1. మొక్కజొన్నలు; 2. ఒకనక్షత్రము. (చూ. నక్షత్రము.) అ. పుం. ము. 1. యజ్ఞము; 2. ఒకానొకదీవి.
మఘవంతుఁడు. సం. వి. న్. పుం. ఇంద్రుఁడు, వేల్పుఱేఁడు. (మఖవంతుఁడు అనియు.)
మఘవుఁడు. సం. వి. న్. పుం.——పై.——(మఖవుఁడు అనియు.)
మచర్చిక. సం. వి. ఆ. స్త్రీ. ప్రశస్తవాచకము, మతల్లిక.
మచ్చిక. దే. వి. 1. మోహము; "ఉ. మచ్చికవీరికెల్లబహుమాత్రపుఁజోద్యము దేహిపుట్టుచుం, జచ్చుచునుండఁజూచెదరుచావకమానెడువారిభం

గినీ, చచ్చినవారికే డ్చెదరుచావునఁ గొల్లకడాఁగవచ్చునే, యొచ్చటఁబుట్టినచ్చటికి నేగుటనైజము ప్రాణికోటికిన్." సం. "అహో అమీషాంవయసాధికానాంవిపశ్యతాంలోకగతింవిమోహః, యత్రోద్భవస్తత్రగతంమనుష్యంస్వయంధర్మాఅపిశోచంత్యపార్థమ్." భాగ. ౭. స్కం. "తే. మైత్రియునునానుకూల్యంబుమచ్చికయును, గలిగియక్కాంతనిన్నెప్డుఁగదిసియుండ, మిత్రకామేష్టియొనరింతు." మార్క. ౫. ఆ. — 2. ఆసక్తి. (చూ. మచ్చిగ.)

మచ్చికపడు. ద్వ. అ. క్రి. 1. మరులుకొను; 2. మరగు.

మచ్చిగ. దే. వి. మచ్చికయొక్క రూపాంతరము. (మోహమునకు. — "మ. తగు నేమాధవయిట్టివాఁడిపలుకుల్ ధర్మంబులేయీయెడన్, మగలన్ బిడ్డలుసోదరుల్ జనకులన్ మున్ను నివారింపమచ్చిగనీయంఘ్రులఁ జేరనారమిటఁబోఁజేకొందురేవారలా, పగిదే మొల్లముకింకరీజనులుగా భావించిరక్షింపవే" భాగ. ౧౦. స్కం. పూ. — ఆసక్తికి. "చ. తగిననరేంద్రసూనుఁబనితన్నుఁబ్రియంబునఁబిల్చితెచ్చిన, చ్చిగసుతనిచ్చిమత్ప్రతిముఁజేసిన." విక్ర. ౬, ఆ.)

మచ్చెకంటి. ద్వ. వి. (మచ్చెము+కన్ను.) 1. చేఁపలవంటికన్నులుగల ఆఁడుది; 2. ఆఁడుది. "మత్త. మచ్చెకంటిమముందలంతు నెమానసంబున." కళా. 3, ఆ

మచ్చెము. వై. వి. చేఁప "క. మచ్చెమయినీవుసోమకు, ద్రుచ్చిలి వేదములుగొనుచుమున్నీరుసారన్, జొచ్చిపరిమార్చునుగుడఁగ, నచ్చదువులు తెచ్చినాఁడవచ్యుతలీలన్." రా. యు, కాం.

మచ్చే. దే. వి. 1. పుట్టినప్పుడే దేహమునందుఁగలిగిన నల్లనియెఱ్ఱనిచుక్క, లాంఛనము; 2. గాయము మొదలైనవి మానినపిమ్మట దేహమునందేర్పడెడు గుఱుతు.

మచ్చేమాయు. దే. అ. క్రి. నశించు.

మచ్చేము. దే. వి. గుఱుతు. "సీ. అంగీకృతాంగచైత్రాధిదేవతలాత్తసుమచోరుమచ్చంబు చూపుకరణి." వసు. ౨, ఆ. "ద్వి. తోఁపమచ్చంబుగాఁ దొడవులమూట, నూడిదపెట్టితానురిఁగెనాచోరుఁడు." హరిశ్చ. ౩, భా.

మచ్చేరము. వై. వి. 1. చేలము; 2. ద్వేషము. (చూ. మచ్చేరించు.)

మచ్చేరి. వై. విశే. (మచ్చేరము+ఇ.) 1. చలపాది; "చ. మనమున దేవదానవులుమచ్చరులైకడుఁబిచ్చలించిసం, పదలనుగోరిపోరుసెడ." భాగ. ౬, స్కం. — 2. ద్వేషి.

మచ్చేరించు. వై. అ. క్రి. 1. చలపట్టు; 2. ద్వేషించు. "సీ. మగలతో నిల్లాండ్రుమచ్చరించెదరండ్రుసుతుఁలుతండ్రులఁదెగఁజూతురండ్రు." సం. "పితృమాతృసుహృద్భ్రాతృ దంపతీనాంచకల్కనమ్." (కల్కనమ్=కలహోది.) భాగ. ౧, స్కం.

మచ్చేరికము. వై. వి. 1. చేలము; "ఉ. ఏటికినోపనిస్థితిగదిక్రియసారెకుఁబట్టివాదముల్, మాటికిమాటికిన్ బెనఁచిమచ్చరికంబుననాడనీకు." హరిశ్చ. ౧. ఆ. — 2. ద్వేషము; 3. పోటి. "క. చీనాంబరమణిభూషణ, నానాగంధానులేపనవమాల్యములన్, మానినులునువైదర్భియు, మానుగఁగైసేసికొనిరిమచ్చరికమునన్." విక్ర. ౫, ఆ.

మచ్చేరికించు. వై. అ. క్రి. 1. చేలపట్టు; 2. ద్వేషించు. "ధూర్తకోటితోమచ్చరికించుచున్." విక్ర. ౮, ఆ. "చ. మదగజరాజకుంభముల మచ్చరికించునురోజకుంభముల్, కదిసికలంతమేరయునుగైకొనియున్నవి" నై. ౮, ఆ.

మచ్చేరీఁడు. వై. విశే. (మచ్చేరి+ఈఁడు) మచ్చేరముకలవాఁడు. "ఆ. చిచ్చులేకచిముడుమచ్చరీఁడీసుద్దివిజ్ఞనాభుఁడోర్చువాఁడెయకట." ప్రభా. ౧ ఆ. (స్వార్థమున ఈఁడు.)

మచ్చు. దే. వి. 1. మీఁదికట్టడములేనిమిద్దెటిల్లు; "తే. మచ్చులమేడలనెలవులెల్లఁ గ్రొత్తసింగారములఁ దళుకొత్తఁజేసి." అచ్చ. అ, కాం. — 2. చొక్కుపొడి; "ఎనయఁగమచ్చుఁజల్లిభ్రమయించి." రసి. ౪, ఆ. — 3. మృగాదులు వలలోఁదగులుకొనుటకై వలకుసమీపమున నుంచఁబడు నాహారము, ప్రలోభనము; "మ. గగవారణ్యచరాంధకారగజమున్ గాలాహ్వయవ్యాధుఁడ, చ్చుగఁబట్టం దమకించిమచ్చిడుటకైమూతాంకురశ్రేణిచే, నొగిఁగల్పించిసకందుకంబనఁగ నూత్న్యండంతవీక్షింపఁగాఁ, దగెమందప్రభతోడఁబశ్చిమమహాధాత్రీధరేంద్రంబునన్." భాగ. ౧౦, స్కం. పూ. — 4. ఎన్నెసరగానున్నదని చూచుకొనుటకై యగసాలెవాఁడిచ్చెడు వెండిబంగారములకమ్మి; "ద్వి

అచ్చుగాసతివి యోగాగ్ని కీలలకు, మచ్చిదియన నొప్పుమాణిక్యమిచ్చె." (ఇక్కడ మచ్చుఁగా కేవలము మాదిరియనియర్థము.) రా. సుం, కాం.— 5. బ. వన్నె యొరసిపరీక్షించుటకై యగసాలలో నగువారుంచుకొనియుండెడు వెండిబంగారముల కమ్ములు. (చూ. కమటము.)

మచ్చుకత్తి. ద్వి. వి. కొమ్ములుఁ అకెడు మోటకత్తి.

మచ్ఛము. సం. వి. అ. పుం. మత్స్యము, చేఁప.

మజాకూరు. హిం. వి. పైనచెప్పిన, ఈ.

మజాబతు. హిం. విణ. గట్టి.

మజారి. హిం. వి. దినపుకూలి.

మజ్జ. సం. వి. ఆ. స్త్రీ. న్. పుం. చెట్టుచేవ. న్. పుం. ఎముకలయందలి నేయి.

మజ్జనము. సం. వి. అ. న. స్నానము, మునుక.

మజ్జిగ. వై. వి. చల్ల, తక్రము*.

మజె. దే. అవ్య. ప్రశంసను తెలుపునది. "క. భుజగర్వమడఁగఁగట్టిన, భుజగాస్త్రములిట్టునట్టుఁబొరలంబడినక్, గజిబిజిలేదు మొగంబున, మజబాపు రేపీనీఁబోలమగలుంగలరే." ఉ, హరి. ౫, ఆ.

మజో. దే. అవ్య. మజెయొక్కరూపాంతరము. "మీసలువడి పెట్టునూరకమజాయను." విక్ర. ౮, ఆ.

మజ్జె. దే. అవ్య.——పై——

మజ్జెరె. దే. అవ్య. మజ్జె, (రూ. మజ్జెరే.)

మజ్జో. దే.అవ్య. మజ్జెయొక్కరూపాంతరము. (చూ. బూతము.)

మజ్జోరె. దే. అవ్య. మజ్జెరెయొక్కరూపాంతరము, (రూ. మజ్జోరే.)

మటమట. దే. వి. మలమలయొక్కరూపాంతరము. "క. ఆఁకటమటమటమాఁడుచు." భాగ. ౯. స్కం.

మటమటలాడు. దే. అ. క్రి. (మటమటలు+ఆడు.) మండు, జ్వలించు.

మటిక. దే. వి. మట్టికయొక్కరూపాంతరము.

మటుమాయ. దే. విణ. (మాయము+మాయము.) మిక్కిలి మాయము. "ద్వి. మటుమాయకలిపట్టిమగువనునన్నె." (మటుమాయ = మటుమాయగా నని యర్థము.) నళ. 3, భా. (రూ. మటుమాయము. "ఎన్నఁడు నేర్చినాఁడవురయీమటుమాయపుమాటలీవు." సా. ౨, ఆ.)

మటుమాయలాఁడు. దే. విణ. (మటుమాయలు+ఆఁడు.) మిక్కిలి మాయలుగలవాఁడు. (చూ. చేవ్వ.)

మట్ట. దే. వి. 1. తాటిచెట్టులోనగువాని కొమ్మ; "మట్టగీసెడుకత్తిఁబట్టుబెబ్బులిచేత." సురా.—2. అవులులోనగువానితోఁక. "వ. ఒండొండమట్టలెత్తుకొని నేలమట్టవిసియుద్రువఁబనులు వెసందిరిగిమున్నువివ్వచ్చుండుపచ్చినజాడఁగైకొని దక్షిణదిశకుఁజిత్తులఁవోడుచుచుందిరలంబాతిన." సం. "ఊర్ధ్వపుచ్ఛా న్విధున్వానా ధావమానా స్సమంతతః." భార. విరా. ४, ఆ.

మట్టగించే. వై. స. క్రి. తగ్గించు. "మరుఁడేలతాలిమిమట్టగించె." చంద్ర.

మట్టగిడుసు. దే. వి. మత్స్యవిశేషము.

మట్టపలక. వై. వి. (మట్టము+పలక.) మట్టముచూచెడుపలక.

మట్టమధ్యాహ్నము. మి. వి. పట్టపగలు. "ఎ, గీ. మట్టమధ్యాహ్నమిది సుధామధురవాణి, యుర్విమిచ్చేఁబథశ్రమంబపనయింప." పాండు. ౧, ఆ.

మట్టము. వై. వి. కొలఁది. విణ. 1. తక్కువ*; "క. హితముగలకుడుపుమతిగు, గ్వితతులఁబొడమంగనీనివిధముననతిస, ద్వ్రతుఁడైనవాఁడునిర్మల, మతిచేనఘరాశి నెల్లమట్టముసేయుక్." భాగ. ౬, స్కం.—2. పొట్టి*; "క. కుఱుమట్టపుఁబడుచువడుగుకొంతనటించెక్." భాగ. ౮, స్కం.— 3. సమము*. "ఎ, గీ. మిట్టుఁబల్లంబుగట్టును మెట్టునొక్క, మట్టమైయదినునుపారు." భార. అను. ౧, ఆ. "భర్తమట్టమేఁడాదికిమరణమొందు." కవిస. ౧, ఆ. (వృత్తియందు హల్లుపరమగుచో మువర్ణము లోపించును. మట్టపలక, మట్టపాటి. ము.)

మట్టసము. వై. విణ. 1. కుఱుచైనది*; 2. పరిమితము*. "పసిమినుప్పొంగుమట్టసపుసొమ్ములతోడ." య. ౨, ఆ.

మట్టసి. వై. విణ. పొట్టివాఁడు*.

మట్టాడు. దే. అ. క్రి. (మట్టి+ఆడు.) 1. నడచు; "సీ. ఖురములసప్తసాగరములు రొంపిగానుంకించిమట్టాడునొక్కమాటు." భాగ. 3, స్కం.— 2. సంచరించు; "మ. క్రమ్మతిచూచుంజెవిదార్చినిల్చుమలఁగుక్ మట్టాడుఁగోరాడు నే, మఱినట్లుండుఁదృణంబు మేయుమలయుక్ మాయామృగంబిమ్ములక్." భార. ఆర. ౬,ఆ.—3. వ్యాపించు*. "ద్వి. మహనీయతరమైనమణికుండలముల, మహిమదిక్కుల నెల్లమట్టాడుచుండ." రా. యు, కాం.

మట్టి. వై. వి. మన్ను, మృత్తిక.

మట్టిక. దే. వి. గోరుచిక్కుడు, (రూ. మటిక?.)

మట్టితైలము. మి. వి. మట్టివలనఁదీసెడు ఘృతి.

మట్టియ. యు. దే. వి. 1. మగవానికాలి రెండవవ్రేలి మించు; "సీ. మట్టియలొండొంటిబిట్టుతాఁకఁగ నేలనందందమునికాళ్లనప్పళించు." భార. విరా. ౨, ఆ. (చూ. మట్టె.) 2. బ. ఆఁడుదాని కాలి రెండవవ్రేలిమెట్టెలు. (చూ. బిబ్బిలికాయ.)—వై. మట్టి. "సీ. కల్పింపనేర్చిరిగంగమట్టియమీఁదఁగస్తూరికాపత్రకములునొసల." భీ. ౧, ఆ.

మట్టు. యు. దే. స. క్రి. త్రొక్కు. "చ. కొడుకుల పాటునూచికడుఁ గోపమెలర్పఁగఁదల్లులొక్కయు, మ్మడివనజాయతేక్షణుని మట్టఁదలంచి." హరి. పూ. ౬, ఆ.—వి. 1. త్రొక్కుడు; "ఎ, గీ. బలనికాయముకాలిమట్టులనడంచుఁ, గటకమునునింకననుచు నుత్కలమహీశుఁ, డనుదినమ్మును వెఱచునెవ్వనికినతఁడు, రాజమాత్రుఁడె శ్రీకృష్ణరాయవిభుఁడు." పా. ౧, ఆ.—2. కుదురు; "నేల మట్టవిని." (మా. మట్ట.) 3. ప్రదేశము. (అడుగు మట్టు, పైమట్టు.)—వై. 1. మితి; "ఉ. మైవదలించిపూర్వమగు మట్టునగాడ్పులుసాఁగనిచ్చి." పాండు. ౨, ఆ.—2. పర్యంతము*. విశే. 1. తక్కువ*; 2. మితము*.

మట్టుకాఁకర. ద్వ. వి. ఒకదినుసు కాఁకర, కర్కోటము?.

మట్టుకొను. దే. అ. క్రి. కుదురుకొను. "ఎ, గీ. చిత్తజాతుండుకనుమాయచేసినాఁడొ, మనమనంబుల విభ్రాంతిమట్టుకొనెనొ." విక్ర. ౧, ఆ. (ప్రే. మట్టుకొలుపు. "సీ. సలలితసత్కీర్తిచంద్రికఁబగతురమనసులతాపంబు మట్టుకొల్పి." విక్ర. ౨, ఆ.)

మట్టుచేయు. వై. స. క్రి. తగ్గించు.

మట్టుపడు. యు. ద్వ. అ. క్రి. కుదురుపడు. (ప్రే. మట్టుపఱచు. "ఎ, గీ. గుండెనీఱుగనవిసికాకుత్థ్సునర్యుఁ, డెట్టకేలకుధైర్యంబు మట్టుపఱిచి." శై. ౬, ఆ.)—వై. అడఁగు. "ఎ, గీ. మఱియుదనుజొండుశాంబరీమంత్రమహిమఁ, బర్వతారణ్యాజీమూతపటలభయద, మృగసరీసృపవితతి నిర్మింపనరుఁడు, మట్టుపడనేసెనాయాయిమార్గణముల." శై. ౫, ఆ.

మట్టుపెట్టు. ద్వ. స. క్రి. అడఁచు, చంపు. "ఉ. గట్టులమట్టుపెట్టుబలుకైదువఁబట్టినయట్టిదిట్టఁడుఁ, దిట్టతనంబువాసి పొలడిండికిలోఁబడి గాసిఁజెందఁగా, నెట్టుసహింపవచ్చు." ఉ, రా. ౫, ఆ. "సీ. ప్రళయాబ్ధిమోఁకాలి బంటిగాఁజరియించు మధుకైటభులఁబట్టిమట్టుపెట్టె." ఉ, రా. ౨, ఆ.

మట్టుబచ్చెలి. ద్వ. వి. దుంపబచ్చెలి, ఉపోదక?.

మట్టుబీఱ. ద్వ. వి. ఒకదినుసుబీఱ.

మట్టుమిగులు. ద్వ. అ. క్రి. అతిక్రమించు.

మట్టుమీఱు. ద్వ. అ. క్రి.——వై.——

మట్టె. దే. వి. 1. మగవానికాలి రెండవవ్రేలిమించు; "మ. జడచొళ్లెంబునుబట్టుదట్టియునురత్నాటకాలంకృతుల్, మెడహారంబులుమట్టెవన్నెయగుచున్ లీలావిలాసంబుపెం, పడరంజేయఁగ." కాశీ. ౮, ఆ.—2. బ. ఆఁడుదానికాలి రెండవవ్రేలిమెట్టెలు. "ఉ. అందెలున్, మట్టెలుదిట్టమైచెలఁగ మందగతింజనియవ్వనంబునన్." భో. 3, ఆ.—విశే. బట్టచాఱలుగలది. (మట్టెయావు. మొ.)

మట్ర. ద్వ. వి. దున్నునపుడు కొండ్ర తిరుగక నడుమ నిలిచెడు కొంచెముతావు. "వ. తప్పిదాటిమడిమట్రచేనుచెట్లున్నపట్లరసి తనపట్టులంగావువెట్టుచు." పాండు. 3, ఆ.

మఠము. సం. వి. అ. పుం. సన్యాసులులోనగువారు ఉండెడుచోటు.

మఠ్యము. సం. వి. అ. పుం. తాళభేదము. (పది అక్షరములకాలము.)

మడ. దే. వి. ప్రవాహమార్గము. "క. నడుకట్టలినుకతిప్పలు, మడలుదరులు వాఁకలునుగ్రమంబుననొకఁడున్, గడవఁబడకుండఁగృష్ణుఁడు, పడఁతులకునుయమునయాటపట్టుగఁజేసెన్." హరి. పూ. ౭, ఆ. "ద్వి. పొదలవృక్షములనీడలను, మడల తీరంబులమడువులమేటి, పడియల." నవ. 3, భా.

మడఁక. దే. వి. 1. మడుపు; 2. (చూ.) అరక.

మడఁగు. దే. అ. క్రి. 1. వంగు; 2. మరలు. "సీ. మ్రానుపేరేటిచేమడఁగు నామడఁగదోమడఁగుఁబేరేటినీమ్రానుమడఁచె." ఉ, హరి. ౨, ఆ. "వ. కండలువ్రాలియుగుండెలుగూలియు, రూపులడంగియు నేవులుమడంగియు." మార్క. ౬, ఆ.

మడఁచు. దే. ప్రే. మడఁగఁజేయు. (చూ. లంగగొను.)

మడఁతి. దే. వి. ఆఁడుది, పడఁతి, ఇంతి, స్త్రీ.

మడఁతుక. దే. వి.——వై.——(స్వార్థమున ఉక.)

మడకత్తి. దే. వి. లావుకట్టె.

మడచెట్టు. దే. వి. వృక్షవిశేషము.

మడత. దే. వి. 1. (వస్త్రపు) మడుపు; 2. (కడుపు మీఁది) మడుపు; 3. భక్ష్యవిశేషము.

మడత్రొక్కు. దే. స. క్రి. (మడఁగన్ + త్రొక్కు.) తాటాకులు దొంతిగా అడికి అణఁగఁద్రొక్కు.

మడమ. దే. వి. గుదికాలు. "వ. మడమల మెడమలం చియుండలంచినయు." ఉ, హరి. ౬, ఆ.

మడవ. దే. వి. (మడ + వా.) మళ్లకు పాదులకు నీళ్లు పాఱెడు కాలువముఖము. "సీ. అడుసుఁదుంపు రుచెక్కుటద్దంబులను బర్వమళ్లకు మడవలు మార్చి మార్చి." కళా. ౮, ఆ.

మడవచేఁప. దే. వి. మత్స్యవిశేషము.

మడవు. దే. అ. క్రి. 1. విముఖమగు; "క. కడవస ములుఁగోలలుఁగ, ప్పడములువీరలధనంబుపరికిం పఁగనె, క్కడిదేశికులనివగవక, మడవకతెనుమ ధ్యవిందు మనమునమండెన్." భార. ఆది. ౭, ఆ.—2. నిష్ఫలమగు. "క. చెడఁగఁబువారుచెడు గులుఁ, గడుకొనినీయట్టివారికర్జంబులుచె, ప్పడువారుగాకనీకున్, మడవకనాయట్టినారిమా టలుకొఱయే." భార. సభా. ౨, ఆ.

మడి. దే. వి. 1. మడుఁగువస్త్రము; 2. వరిపొలము, కేదారము. విణ. 1. పరిశుద్ధము; 2. వృత్తియందు ఉత్తరపదమైన మడుఁగుశబ్దమునకు ఆదేశముగా వచ్చెడిరూపము. (ఇరుమడి, ముమ్మడి, నలుమడి.)

మడికాసు. దే. వి. వెండి, రజతము. "ఒంటిగామడి కాసుగుంటిపైఁగూర్చుండి." కా. ౨, ఆ.

మడిచేలు. ద్వ. వి. (మడిచిన + చేలు.) వైష్ణవస్త్రీలు ముందుండియెత్తి వెనుకకుచెక్కుకొను కోకచేలు.

మడిపెసలు. దే. వి. మడియందుపైరగునల్లపెసలు.

మడిమంచే. దే. విణ. బలహీనము. "చ. చెట్లుపట్టిమ నుప్రాఁతదళంబులతోడఁ దోలెనా, మనిదొర మంచురాజు మడిమంచగఁ గోయిలగంట మ్రోయఁగన్." స్వా. ౬, ఆ. (రూ. మడిమంచేము. "ద్వి. బలదేవుఁడుద్ధతిఁబరిఘుంబుఁబూని, మలయు రుక్మినిమడిమంచంబుచేసె." భాగ. ౧౦, స్కం.)

మడియఁడు. దే. విణ. మూఢుఁడు. "తే. త్రిమ్మరిగ దాసదాగతితెలిసిచూడ, మెతియఁడుగదాయనం గుఁడేతతిమతిమడి, యఁడుగదాయలజైవాతృకుఁ డుతలంప, నిట్టిచెడుగులచేబాధయెట్టులోర్తు." సా. ౨, ఆ.

మడియు. దే. అ. క్రి. 1. చేచ్చు; 2. తునుఁగు. "క. తోమరముశక్తియుబె, ట్టిదముగనతఁడదరించిన, మదముననయోధ్యాధవరుఁడు మడియించెనెడన్." భార. ద్రో. ౮, ఆ.

మడిసంచి. దే. వి. మడుఁగువస్త్రములుంచుకొనెడు సంచి. హంస. ౨, ఆ.

మడిసంది. దే. వి. చేంక, కక్షము. "ఉ. రావణయి ష్వాదైనరఘురామునిముందఱసన్నుఁబెట్టివా, చా వినయంబెచాలుమడిసందులఁగేలిడి నిల్వఁగాచు ని, న్నావసుధేశమౌళికిదయారసశీతలముల్ కటా క్షముల్." రామా. ౬, ఆ.

మడుఁగు. దే. అ. క్రి. 1. అడఁగు; "మత్ప్రకృతి యందుఁజరాచరంబుదోఁచ మడుఁగు." ఉ, హరి. ౨, ఆ. "ఉడిగిమడింగిమైమఱచియున్నతటిన్." ఉ, హరి. ౫, ఆ. 2 వంగు.—వి. 1. గుణము; (దీనికది యెన్నిమడుఁగులు హెచ్చు.)—2. హ్రదము; 3. కొలను; "చ. పొలియఁగఁజేసెఁ ష్మడుఁ గుఁబొల్పెసఁగన్ జలపాదశేషమై." పంచ. నా. 3, ఆ.—4. పరిశుద్ధి; 5. పరిశుద్ధవస్త్రము; "మ. జలకంబాడిమడుంగుగట్టి మణిభూషాదీప్య మా నాంగియై." పా. ౨, ఆ.—6. ఎనిమిదవీసెల కొలఁది; 7. అడఁకువ, ఉపశాంతి. (చూ. మడు వు.) 8. బ. ఆకుమడుపు. "చ. సురఁటియొకర్తు వీవనొక సుందరియాకు మడుంగులియ్య." రుక్మి. ౫, ఆ.—విణ. పరిశుద్ధము. "ఉ. ఒత్తుగమాంస మున్ మడుఁగుటోగిరమున్ ఘృతశర్కరాదు లున్." హరిశ్చ. ౧, ఆ.

మడుఁచు. దే. ప్రే. మడుఁగఁజేయు.

మడుపు. దే. వి. 1. మడత; 2. మడుఁగువస్త్రము; "క. తడియొత్తెనొకతెవలిపపు, మడుపులుఁగట్టంగని చ్చెమటియొక్కతె." అని. ౫, ఆ.—3. బ. ఆకు చుట్టలు. "క. వచ్చికపురంపుబాగా, లిచ్చిపిదప మడుపులొసఁగి." ఉ, రా. ౬, ఆ.

మడువు. దే. అ. క్రి. వి. మడుఁగుయొక్క రూపాం తరము. (ఉపశాంతికి.—"ఆ. ఆవులించుతలయు నడరెడునట్టయుఁ, జూచిప్రీతుఁడుగుచు సురని రోధి, యచటిడింభతతికినాఁకలిమడువుగా, నిచ్చి యాగ్రహమున నిట్టులనియె." నిర్వ. ౮, ఆ.)

మడ్గు. దే. అ. క్రి. మడుఁగుయొక్క రూపాంతరము. (గుణమునకు,—"సీ. ముమ్మడ్గుపుష్కరంబునకున

ల్లడుఁగుపంపకు నిదియనఁదగిప్రకటమహిమ." పాండు. 3, ఆ.)

మడ్డి. దే. వి. నూనెలోనగువానియందు అడుగున నిలిచెడుమటికి. విణ. మూఢుఁడు.

మడ్డు. దే. వి. ఇనుపగుంటు. "ఉ. ఏఁగలలోన నెం డెఋఁగనీ వెవిభుండవుసందియంబునా, పైఁగల దేని చూడుమని ప్రాగ్దిశగౌతమ దారజారునిన్, దాఁగడునమ్మఁజేయుటకుఁ దక్కక యెత్తెడునట్టి యెట్టిగాఁ, గాఁగినమడ్డు చండ మెసఁగంగనుపట్టె నినుండనుష్ణతన్." ప్రభా. ४. ఆ.

మడ్డుకత్తి. ద్వి. వి. మచ్చుకత్తి.

మడ్డువు. సం. వి. ఉ. పుం. గుమ్మెట, తుడుము.

మణఁగు. దే. అ. క్రి. మడఁగుయొక్క రూపాంతరము.

మణి. సం. వి. ఇ. పుం, స్త్రీ. 1. పచ్చతాయిలోనగునది; (ఇది అశ్మజాతి.) 2. ముత్యములోనగునది; (ఇది అనశ్మజాతి.) 3. ముంత; 4. మనికట్టు; 5. గొఱ్ఱె మెడచన్ను; 6. మగవానికామచివర. పుం. సర్పవిశేషము.

మణికము. సం. వి. అ. పుం. కాఁగు, ముంత. (అని కొందఱు.)

మణికారుఁడు. సం. వి. అ. పుం. రత్నములను సానఁబట్టువాఁడు.

మణిగ. దే. వి. మళిగ. (అప్ర.)

మణిగము. దే. వి. మణియమునకు మొదటిరూపము.

మణిగాసనము. దే. వి. సన్న సున్న పుప్పొడి. "సీ. మణిగాసనములు ప్రేమనొనర్చి గోడలఁదెలువారవిష్ణులీలలఁలిఖించి." రుక్మాం. ౧, ఆ.

మణితము. సం. వి. అ. న. 1. రతికాలమునందలిగళరవము; 2. కోకిలధ్వని.

మణిప్రవాళము. సం. వి. అ. పుం, న. రెండుభాషలు కలిసినకవిత్వము.

మణిబంధము. సం. వి. అ. పుం. చేతిమనికట్టు.

మణిరంజనము. సం. వి. అ. న. వర్ణపు రేకు.

మణియకాఁడు. దే. విణ. (మణియము+కాఁడు.) అధికారి.

మణియము. దే. వి. అధికారము. (మణిగముయొక్క రూపాంతరము.)

మణిసిల. వై. వి. కొండమీఁదియొకదినుసుఎఱ్ఱమన్ను.

మణుఁగు. దే. అ. క్రి. వి. మడుఁగుయొక్క రూపాంతరము.

మణుఁగుబూలు. ద్వి. వి. బ. భక్ష్యవిశేషము.

మణుఁచు. దే. ప్రే. మణుఁగఁజేయు.

మణువు. దే. అ. క్రి. వి. మణుఁగుయొక్క రూపాంతరము.

మణేదారు. హిం. వి. గ్రామవ్యవహారి.

మతంగజము. సం. వి. అ. పుం. ఏనుఁగు, గజము.

మతంగుఁడు. సం. వి. అ. పుం. 1. ఒకఋషి; 2. మాదిగవాఁడు.

మతకము. దే. వి. మాయ. "క. వారుమయశంబరాది రాక్షసులమాయలుంగడచిన మతకంబులుఁగలిగిని రూపింపరాకయుండుదురు."భార. అను. ౨,ఆ.

మతకరి. దే. విణ. (మతకము+అరి.) మాయావి. "చ. మతకరిచాలుఁజాలునిఁక మా దెసరాకుమటంచు నల్కతో, నతిపబొమల్ ముడించె." కా. 3, ఆ.

మతము. సం. వి. అ. న. 1. అభిప్రాయము; 2. సమ్మతి; 3. శాస్త్రము. విణ. 1. సమ్మతము; 2. తెలియఁబడినది; 3. పూజింపఁబడినది. (త్రిమతములు.—వైష్ణవము, మాధ్వము, స్మార్తము. షణ్మతములు.—వైష్ణవము, శైవము, శాక్తము, గాణపతము, సౌరము, కాపాలికము.)

మతలబు. హిం. వి. విషయము, తాత్పర్యము.

మతల్లిక. సం.వి. ఆ. స్త్రీ. ప్రశస్తవాచకము, మచర్చిక.

మతాబు. దే. వి. మత్తాబుయొక్క రూపాంతరము.

మతి. సం. వి. ఇ. స్త్రీ. 1. శాస్త్రచింతనాదులచేఁగలుగునర్థనిర్ణయజ్ఞానము; 2. ఇచ్ఛ; 3. తలఁపు.

మత్కుణము. సం. వి. అ. పుం. 1. నల్లి; 2. కొమ్ములు లేనియేనుఁగు; 3. నారికేళము. డు. గడ్డము మీసములేనిమగవాఁడు.

మత్తకాశిని. సం. వి. ఈ. స్త్రీ. 1. మదముచేత ప్రకాశించునట్టి ఆఁడుది; 2. ఆఁడుది. (రూ. మత్తకాసిని.)

మత్తము. సం. వి. అ. పుం. మదముపట్టినయేనుఁగు. విణ. మదముపట్టినది.

మత్తల్లిక. సం. వి. ఆ. స్త్రీ. మతల్లికయొక్క రూపాంతరము.

మత్తవారణము. సం. వి. అ. పుం. 1. ఓఱగుదిండు; 2. మదించినయేనుఁగు.

మత్తా. వై. వి. మత్తు.

మత్తాబు. దే. వి. (చూ.) చంద్రజ్యోతి.

మత్తి. వై. వి. కాముము*. (చూ. మత్తికాఁడు.

మత్తికాఁడు. ద్వి. విణ. కాముకుఁడు. "తే. మనసుమ్రుచ్చిలిపొచ్చినమత్తికాఁడు, వీఁడుపొమ్మనిచేసాఁ

చె వెలఁదియపుడు, కాముఁడటమీఁదననిరుద్ధుఁగా త్రమునను, జిగురుఁబట్టెంబుఁజేర్చుటచెప్పినట్లు.'' ఉ, హ. ౫, ఆ.

మత్తిల్లు. వై. అ. క్రి. మత్తుకొను, మదించు.

మత్తు. వై. వి. మంపు, మదము.

మత్తుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) మదించినవాఁడు.

మత్సరము. సం. వి. అ. పుం. 1. ఈర్ష్య; 2. క్రోధము. విణ. 1. ఈర్ష్యకలది; 2. క్రోధముగలది.

మత్స్యండి. సం. వి. ఈ. స్త్రీ. కండచెక్కెర, (రూ. మత్స్యండి.)

మత్స్యధాని. సం. వి. ఈ. స్త్రీ. మీలబుట్ట, కువేణి.

మత్స్యపిత్త. సం. వి. ఆ. స్త్రీ. కటుకరోహిణి.

మత్స్యబంధనము. సం. వి. అ. న. గాలము, బడిశము.

మత్స్యము. సం. వి. అ. పుం. 1. చేప; 2. ఒకానొక దేశము.

మత్స్యాక్షి. సం. వి. ఈ. స్త్రీ. 1. పొన్నగంటికూర; 2. సోమెదకూర.

మథనము. సం. వి. అ. న. త్రచ్చుట, మంథనము.

మథించు. సం. స. క్రి. మథనముచేయు, త్రచ్చు.

మథితము. సం. వి. అ. న. నీళ్లుకలియనిమజ్జిగ. విణ. 1. త్రచ్చఁబడినది; 2. ఒరయఁబడినది.

మదకలము. సం. వి. అ. పుం. మదపుటేనుఁగు. విణ. మత్తుచేత వ్యక్తముకానిమాటలుకలది.

మదట. వై. విణ. మత్తుఁడు, మత్తురాలు.

మదనచేతులు. దే. వి. బ. దంతెలు. "సీ. తనువెల్లఁ జల్లగాఁదనయునినక్కునఁబొదువనిచేతులు మదనచేతులు." చంద్రా. ౧, ఆ.

మదనము. సం. వి. అ. పుం. 1. ఆమని; 2. ఉమ్మెత్త; 3. మంగ; 4. మయినము.

మదని. సం. వి. ఈ. స్త్రీ. జవాదిపిల్లి.

మదనుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు, మారుఁడు.

మదమడఁచు. మి. స. క్రి. (మదము+అడఁచు.) చెంపు. (చూ. ఒదుఁగుపడు.)

మదము. సం. వి. అ. పుం. 1. క్రొవ్వు; 2. ఏనుఁగు క్రొవ్వు; 3. రేతస్సు; 4. ఏనుఁగురేతస్సు; 5. కస్తూరి; 6. గర్వము; 7. సంతోషము. (ఏనుఁగునకుమదము ఎనిమిదిచోట్లఁబుట్టును. వానికిపేళ్లును వేర్వేఱు. చెక్కిళ్లఁబుట్టునదిదానము, కన్నులఁబుట్టునది సీధువు, చెవులఁబుట్టునదిసాగరము, తొండముచివరఁబుట్టునదిశీకరము, చనుమొనలఁబుట్టునది శిక్యము, మేహనమునఁబుట్టునది మదము, హృదయమునఁబుట్టునది ఘర్మము, చరణములఁబుట్టునదిమేఘము. త్రిమదములు.—విద్యామదము, ధనమదము, కులమదము. అష్టమదములు.—అన్నమదము, అర్థమదము, స్త్రీమదము, విద్యామదము, కులమదము, రూపమదము, ఉద్యోగమదము, యౌవనమదము.)

మదస్థానము. సం. వి. అ. న. కల్లుత్రాగెడియిల్లు.

మదహత్తి. వై. వి. మదపుటేనుఁగు,మదకలము. "ఎ, గీ. అచటియొకపాటిదొరమదహత్తులకును, నెత్తుగున్నలుదిక్కులమత్తకరులు." పాంచా. ౧, ఆ.

మదావళము. సం. వి. అ. పుం. ఏనుఁగు, గజము.

మది. వై. వి. 1. బుద్ధి; "అక్కర. అదియునుంగాక పరప్రయోగమాయలుగలవెఱిఁగి, మదినుంచునది." భార. అర. ౧, ఆ.—2. మనస్సు*. "క. ఇది నీకోరినఫలమని, సుదతికినిరుద్ధుఁజెలువనూపి యిటులనుఁ, మదిఁజొచ్చినీకుఁగూరిమి, యదికినవలరాచచుట్టమానోకాఁడో." ఉ, హరి. ౫, ఆ.

మదించు. ఉభ. వై. అ. క్రి. తలఁచు. (చూ. జౌటాడు.) స. క్రి. మదింపువేయు*. (ఈయర్థమునందు కొన్నిచోట్ల మతించు అని వాడెదరు.) సం. అ. క్రి. క్రొవ్వు. (మదియించు అనియు.)

మదింపు. వై. వి. ఇంతియని వెలమొదలగువాని నూహించుట. (చూ. మదించు, అరగింపు.)

మదిమది. వై. వి. నెమ్మది, నిశ్చింత. "చ. త్రిదశపతిఁ జయించిజగతీతలమంతయునేలుబాణుఁడే, మదిమదినుండిదానవసమాజముచేటునకై త్రిలోచనుఁ, గదనమువేఁడె." ఉ, హరి. ౫, ఆ. (బాణుఁడే అనునప్పుడు ఇక్కడి ఏకారము ఆధిక్యమును తెలుపుచున్నది. చూ. ఏ.)

మదిర. సం. వి. ఆ. స్త్రీ. సుర, మద్యము, కల్లు.

మదిరాక్షి. సం. వి. ఈ. స్త్రీ. 1. మదముకప్పిన కన్నులుగల ఆఁడుది; 2. ఆఁడుది.

మదీయము. సం. విణ. (అ. ఆ. అ.) నాది.

మదుగు. దే. వి. అనుకు. "వ. శీకరపరంపరలచొదుగులుమదుగులుగొనినఁబిదపిదనగుచు." భాగ. ౧౦, స్కం. ౦. పూ.

మదుపు. దే. వి. ఆకుపచ్చ. కవిక. 3, ఆ.

మదుము. దే. వి. మదుగుయొక్కరూపాంతరము.

మదురు. దే. అ. క్రి. కమియు. (మదురఁబండినపండు.) వి. గోడమీఁదికప్పు. (దీనిని మదులు అని వాడెదరు.)

మదురుగోడ. ద్వ. వి. మదురు పెట్టినగోడ. "ద్వి. జా లినాతోడ సొజ్జలుచెప్పియున్న, మాటనీకెతిఁగిం చిమదురుగోడైన, దాఁటిపోయెదనింక దాఁపుర మేల." పారిజా. ౨, భా.

మదురువు. వై. వి. 1. మద్యము; "క. మదురువుగొని యొడలెఱుఁగక, మదాకులమనస్కులైనమానవుల కునిం, పాదవియఁబిడికిళ్లంగొని, చదియఁబొడు చు నేనియదియుసౌఖ్యంబగు నే" లక్ష్మీ. ౪, ఆ.— 2. మత్తు*. "సీ. మదురువుగొనిమాఱుమలయు కా రినుఁబోతు నెడిసి కొమ్ములువట్టిమడుఁగఁద్రో చి." లక్ష్మీ. ౨, ఆ.

మదువు. దే. వి. మడుగుయొక్కరూపాంతరము.

మదోత్కటము. సం. వి. అ. పుం. 1. మదపుటేనుఁ గు; 2. కపోతము.

మద్దతు. హిం. వి. సహాయము.

మద్గురము. సం. వి. అ. పుం. (చూ.) బొమ్మడాయ.

మద్గువు. సం. వి. ఉ. పుం. 1. నీరుకాకి; 2. మత్స్య విశేషము.

మద్ది. దే. వి. అర్జునము‡. (దీనిభేదములు ఇనుమద్ది, ఏఱుమద్ది.)

మద్దికాయలు. దే. వి. బ. బాలకులచెవితమ్మెలనుంచె డుభూషణవిశేషము. "విడిగలమద్దికాయకవవీను లసొంపుఘటింప." ("మద్దికాయకవ." ఇక్కడ వృత్తియందేకవచనము.) చంద్రా. ౨, ఆ.

మద్దెల. వై. వి. చర్మవాద్యవిశేషము. (చూ. దిమిదిమి.)

మద్దెలరూపురిక్క. వై. వి. ధనిష్ఠానక్షత్రము.

మద్యము. సం. వి. అ. న. కల్లు, సుర, కాదంబరి.

మధుక. సం. వి. ఆ. స్త్రీ. తిప్పతీఁగ. అ. న. ము. అతి మధురము. పుం. 1. ఇప్ప‡; 2. నెమిలి. డు. వం దిమాగధజాతివాఁడు.

మధుకరము. సం. వి. అ. న. భిక్షాన్నము. పుం. 1. తు మ్మెద; 2. జీవకము‡.

మధుక్రమము. సం. వి. అ. పుం. మద్యపానక్రమము.

మధుద్రుమము. సం. వి. అ. పుం. ఇప్ప‡.

మధుపము. సం. వి. అ. పుం. తుమ్మెద, తేనెతిండి. విణ. మద్యపానముచేయునది.

మధుపర్కము. సం. వి. అ. న. 1. పెరుఁగుతోకలసిన తేనె; 2. పెండ్లిలోవధూవరులకిచ్చెడువస్త్రము.

మధుపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. 1. గుమ్మడు‡; 2. తిప్ప తీఁగ; 3. నీలిచెట్టు.

మధుమేహము. సం. వి. అ. పుం. మూత్రరోగవిశేషము.

మధుయష్టిక. సం. వి. ఆ. స్త్రీ. అతిమధురము.

మధుర. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకపట్టణము; 2. సదా పా‡; 3. అడవిసదాపా‡. అ. న. ము. విషము. పుం. తియ్యన. విణ. 1. తియ్యనిది; 2. ఇంపైనది.

మధురస. సం. వి. ఆ. స్త్రీ. 1. చాఁగ‡; 2. ద్రాక్ష‡; 3. పిన్నపాల‡.

మధురిక. సం. వి. ఆ. స్త్రీ. అడవిసదాప‡.

మధురిపుఁడు. సం. వి. ఉ. పుం. విష్ణువు, శౌరి, వెన్నుఁడు.

మధురిమ. సం. వి. న్. పుం. తియ్యన, (రూ. మధు రిమము.)

మధులిహము. సం. వి. హ్. పుం. తుమ్మెద, తేనెతిండి.

మధువారము. సం. వి. అ. పుం. మద్యపానక్రమము.

మధువు. సం. వి. ఉ. స్త్రీ. పాలకూర. న. 1. నీరు. 2. పాలు. పుం, న. 1. కల్లు; 2. తేనె; (ఇది త్రివి ధము. — మాక్షికము, భ్రామరము, సారఘము. పౌత్తికమనికొందఱు.) ౩. పూఁదేనె. పుం. 1. చైత్రమాసము; 2. వసంతఋతువు; 3. ఇప్ప‡; 4. గోరఁట‡.

మధువ్రతము. సం. వి. అ. పుం. తుమ్మెద, భృంగము.

మధుశిగ్రువు. సం. వి. ఉ. పుం. ఎఱ్ఱపువ్వులమునగ‡.

మధుశ్రవ. సం. వి. ఆ. స్త్రీ. తెల్లగురిజె‡.

మధుశ్రేణి. సం. వి. ఈ. స్త్రీ. చాఁగ‡.

మధుష్ఠీలము. సం. వి. అ. పుం. ఇప్ప. (రూ. మధు ష్ఠీవము‡.)

మధుసూదనుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు. ము. తుమ్మెద.

మధుస్రవ. సం. వి. ఆ. స్త్రీ. పాలకూర.

మధూకము. సం. వి. అ. పుం. ఇప్ప, (రూ. మధు కము‡.)

మధూలకము. సం. వి. అ. పుం. నీరిప్ప‡. కొండ యిప్ప. (అని కొందఱు.)

మధూలిక. సం. వి. ఆ. స్త్రీ. 1. పుప్పొడి; 2. చాఁగ‡.

మధూళి. సం. వి. ఇ. స్త్రీ. 1. కల్లు; 2. పూఁదేనె.

మధ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకఛందస్సు; (చూ. ఛందస్సు.) 2. స్వీయాంతర్భేదవిశిష్టనాయికా విశేషము. (ఉదయించినయౌవనముగలది, పదు మూడేండ్లు మొదలు పదునెనిమిదేండ్లపర్యంతమైై నవయసుగలది.) అ. న. ము. అవకాశము. పుం, న. నడుము. పుం. మానమున అరత్నిప్రమాణముహీ నమైనయేనుఁగు. విణ. 1. నడిమిదరముది; 2. నడి మిది.

మధ్యదేశము. సం. వి. అ. పుం. భారతవర్షమునడిమి దేశము.

మధ్యమ. సం. వి. అ. స్త్రీ. 1. దుద్దు; 2. వాగ్భేదము; 3. నడిమివ్రేలు; 4. క్రొత్తగసమర్తాడినది. అ. పుం, న. ము. నడుము. పుం. 1. కురుక్షేత్రప్రయాగ హిమాద్రివింధ్యములకు నడుమనున్న దేశము; 2. ఒకస్వరము. (చూ. స్వరము.) విణ. నడిమిది.

మధ్యరాత్రము. సం. వి. అ. పుం. నడురేయి.

మధ్యలోకము. సం. వి. అ. పుం. భూలోకము.

మధ్యస్థుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) నడుమనుండిపక్షపాతములేక యిరుతెగలవారికి సరిగా న్యాయము చెప్పువాఁడు.

మధ్యాహ్నము. సం. వి. అ. పుం. పట్టపగలు.

మధ్వాసవము. సం. వి. అ. పుం. ఇప్పపువ్వుకల్లు.

మన. దే. స. మనము అనుదానికి ప్రాతిపదికము.

మనఃప్రభవుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు, తలఁపుచూలి.

మననము. సం. వి. అ. న. చింతన, గమనము.

మనము. ఉభ. దే. స. నీవును నేనును. సం. వి. స్. న. 1. మనసు; 2. బుద్ధి.

మనవి. దే. వి. విజ్ఞాపనము. "మనవియుక్తి తెలుంగు మీకు నినది." రాఘ. ౧, ఆ.

మనశ్శిల. సం. వి. అ. స్త్రీ. మణిసిల.

మనసరి. మి. విణ. (మనసు+అరి.) బుద్ధిమంతుఁడు. "క. అనయమునిజప్రచారం, బనయముగాకుండ నచటనతిశౌర్యమునన్, మనసరియే కేసరియని, మనసరిరాకొమరుమూఁకమనుమనురీతిన్.' రామా. ౧, ఆ.

మనసిజుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు, తలఁపుచూలి.

మనసు. సం. వి. స్. న. మానసము. (మొదటిరూపము మనస్సు.) విణ. ఇష్టము. "మనసయ్యె వెళ్లిడియుఁ." రామా. 3, ఆ. (ఈ యర్థము సంస్కృతమునలేదు.)

మనస్కరించు. సం. అ. క్రి. మనసుంచు. (వాఁడు మనస్కరించి ఆపనిచేసినాఁడు.)

మనస్కారము. సం. వి. అ. పుం. మనఃప్రయత్నము. మనఃపూర్తి. (అని కొందఱు.)

మనస్వి. సం. విణ. (న్. ఈ. న్.) మంచిమనస్సుకలవాఁడు.

మనాయించు. గ్రా. స. క్రి. లక్ష్యపెట్టు, విను, లోఁబడు.

మనికట్టు. ద్వి. వి. మణిబంధము. "వ. మనికట్లనని కట్లులవటిచియుం జెటిచియు." ఉ, హరి. ౬, ఆ.

మనికి దే. వి. 1. జీవించుట; 2. వసించుట; "క. క్షీరోదకగతిఁ బాండవ, కౌరవులొండొఁగూడిమనికి గార్యంబు." భార. ఉద్యో. 3, ఆ.—3. జీవనము; "సీ. ఏనతి దీనతనే కాకినైమనమనికియుఁ దానొక్కమనికియగునె, యిట్టిజీవనమదిగాల్పనే." మార్క. ౭, ఆ.—4. వాసస్థానము; "చ. ఎనయఁగనీ నివాసమునకేనరుదెంచెదనంచు నాపయిన్, గనుఁగొననిక్కపుంబ్రియముగల్గినవాఁడునుబోలెఁబల్కియూ, మనికికి రాకతక్కనుమానెడుఁగాకమదీయదృష్టికిన్, బనుపడిమ్రోలనున్నగతిమాయలు సేయఁగ నేలభర్తకున్." కా. ౨, ఆ.—5. స్థానము. "అమ్మనికిమహీజముల్." వసు. ౨, ఆ.

మనికితపడు. ద్వి. అ. క్రి. (మనికితము+పడు.) దుఃఖపడు. "క. తనపతిఁగానకయెంతయు, మనికితపడివచ్చికామమంజరిచూరఁగా." విక్ర. ౬, ఆ.

మనికితపాటు. ద్వి. వి. మనికితపడుట. "ద్వి. మనికితపాటుతోమఱికుందికుంది." విష్ణు. పూ. ౨, ఆ.

మనికితము. దే. వి. దుఃఖము. "క. తనయాగమునిఘ్నముచే, సినకీడునవజ్రియింతచేసెనుమీగో, ధనములమిమ్మునుగాచెద, మనికితములుమానుఁడనుచుమదిఁగృపమెఱయన్." వి, పు. ౭, ఆ.

మనితము. సం. విణ. (అ. ఆ. అ.) తెలియఁబడినది.

మనీష. సం. వి. ఆ. స్త్రీ. బుద్ధి, ప్రజ్ఞ, మతి.

మనీషి. సం. వి. న్. పుం. విద్వాంసుఁడు. విణ. బుద్ధిమంతుఁడు.

మను. యు. దే. అ. క్రి. 1. జీవించు; (చూ. మనికి రెండవయర్థము.) 2. వర్తించు. "క. కలిమికినొప్పగునీగియు, బలిమికిఁదొడవైనయట్టిబలఁగమునైలో, కులచిత్తములకువ్రేఁగగు, కొలఁదిమనక్ గుంతిపెద్దకొడుకునకమరున్." భార. విరా. ౨, ఆ.—వి బుళ్యవాచకమైనమన్ను శబ్దమునకువృత్తియందు ద్విత్వములోపించినరూపము. (ఉదా. మనుఁబిడి, మనుఁబెంటి, మనుఁబోతు. మొ.)—వై. 1. మట్టి; "క. తనమనములోనసెంతట, ననుమానముతీఱిశుద్ధియగునందాఁకన్, మనుశౌచము సేయుటదగు, సెనికయుఁగొలఁదియును వెదకరెన్నఁడుఁబెద్దల్." విజ్ఞా. ఆచా, కాం.—2. నేల*. "సీ. అదనులోఁజేఁపిచన్నవసిరౌషధులమన్నొద

వుకొండలకల్లఁబిదుకనెత్తెఁగె." (ఇక్కడ ఉకారమునకు లోపము.) స్వా. ౨, ఆ.

మనుఁగు. దే. అ. క్రి. చేచ్చే. "అతనిఘోరశరాళి ననేకరాక్షసుల్ మనిఁగిరి." అధ్యా. యు, కాం.

మనుకువ. దే. వి. వాసస్థానము. (చూ. ఒరిమ.)

మనుగడ. దే. వి. 1. జీవనము; 2. జీవనోపాయము. "క. పనులయెడ మేలుగాంచిన, మనుగడయగ్గలముచేసిమన్నింపుము." భార. ఆశ్ర. ౧, ఆ.

మనుగుడుపు. దే. వి. (మనువు + కుడుపు.) (చూ.) అల్లెము.

మనుచే. దే. ప్రే. మనఁజేయు. (రూ. మంచే.)

మనుజాశనుఁడు. సం. వి. అ. పుం. రాక్షసుఁడు, మానిసిదిండి.

మనుజుఁడు. సం. వి. అ. పుం. మనుష్యుఁడు మానిసి.

మనుజేంద్రుఁడు. సం. వి. అ. పుం. రాజు. మానిసిఱేఁడు.

మనుదిండి. ద్వ. వి. (మను + తిండి.) ఒకదినుసుపాము, మాలుధానము.

మనుపరి. దే. విశే. (మనుపు+అరి.) కాపరి, రక్షకుఁడు.

మనుపాల. దే. వి. పాలకూర, జీవంతి.

మనుపీనుఁగు. దే. వి. జీవచ్ఛవము.

మనుపు. దే. ప్రే. మనుచుయొక్కరూపాంతరము. వి. రక్షణము.

మనుమఁడు. దే. వి. పౌత్రుఁడు. "క. కనికసికరము దవఁగఁజ, క్కనికరములఁగౌఁగిలించికాంతాయుతుఁడౌ, మనుమనిసుఖాన్వితుఁడవై, మనుమనిదీవించెసబహుమానముగాఁగన్." అని. ౫, ఆ.

మనుమరాలు. దే. వి. (మనుమ+ఆలు.) పౌత్రి.

మనువర్తి. గ్రా. వి. జీవనమునకై యిచ్చుసొమ్ము, (రూ. మనోవర్తి.)

మనువు. ఉభ. దే. అ. క్రి. మనుఁగుయొక్కరూపాంతరము. వి. 1. జీవనము; "ఎ, గీ. అలుపోరినచానవచ్చునయ్యదుఃఖ, మునకొసుఖమునకొనరులమనువుచెపుమ." మార్క. ౫, ఆ.—2. వర్తనము; "నీమనువుదుష్కరంబు." భాగ. ౨, స్కం.—3. మగనివరించుట; "ఈమనువిదియేలలక్ష్మణకుమారునినిర్జితమారుఁబొందు." రా. అర. కాం. ౧, ఆ.—4. మగఁడు. సం. ఉ. పుం. 1. వైవస్వతాది; (వీరు పదునలువురు.—స్వాయంభువుఁడు, స్వారోచిషుఁడు, ఉత్తముఁడు, తామసుఁడు, రైవతుఁడు, చాక్షుషుఁడు, వైవస్వతుఁడు, సూర్యసావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, రౌచ్యుఁడు, భౌచ్యుఁడు.) (ఇవి కొన్నిచోట్ల వేఱువిధముగా వ్రాయఁబడియున్నవి.) 2. మంత్రము.

మనుష్యధర్ముఁడు. సం. వి. న్. పుం. కుబేరుఁడు.

మనుష్యయజ్ఞము. సం. వి. అ. పుం. అతిథిపూజ.

మనుష్యుఁడు. సం. వి. అ. పుం. మనుజుఁడు, మానిసి.

మనోగుప్త. సం. వి. ఆ. స్త్రీ. మణిసిల.

మనోజవసుఁడు సం. విశే. (అ.ఆ.అ.) తండ్రినిబోలినవాఁడు. (కొడుకు.) (రూ. మనోజవుఁడు.)

మనోజుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు, తలఁపుచూలి.

మనోజ్ఞము. సం. విశే. (అ. ఆ. అ.) సుందరము.

మనోభవుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు, తలఁపుచూలి.

మనోరథము. సం. వి. అ. పుం. ఇచ్ఛ, కోరిక.

మనోరమము. సం. విశే. (అ. ఆ. అ.) మనోజ్ఞము.

మనోహతుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) మనసుచెడినవాఁడు.

మనోహరము. సం. వి. అ. న. 1. బంగారు; 2. భక్ష్యవిశేషము. "ద్వి. అతిరసంబులుమనోహరములునైన, యతిరసంబులుమనోహరములుమఱియు." రా. బాల, కాం.—విశే. మనోజ్ఞము, ఇంపైనది.

మనోహ్వ. సం. వి. ఆ. స్త్రీ. మణిసిల.

మన్కి. దే. వి. మనికియొక్కరూపాంతరము.

మన్దిండి. ద్వ. వి. మనుదిండియొక్కరూపాంతరము. "ఎట్టిరోఁకటిబండజెట్టిమన్దిండి." ఉమ. 3, ఆ.

మన్న. దే. వి. అడ్డగింపు, నిరోధము.

మన్నన. వై. వి. 1. సమ్మానము. "క. మన్ననకుబ్బకయవమతి, తన్నొందినస్రుక్కఁబడకధరణీశుకడన్, మున్నున్నయట్లమెలఁగిన, నన్నరునకుశుభములొదవునాపదలడఁగున్." భార. విరా. ౧, ఆ.—2. గౌరవము.

మన్ని. యు. దే. వి. జీవము. "ఎ, గీ. మనఁగనాబుద్ధివినకనామన్నిగొంటివి." రా. కిష్కిం, కాం. "సీ. కడఁదిమ్మృత్యువుపుష్పగంధయైచనుదెంచినీమన్నిగొనిరొనేన్నృపతనూజ." భోజ. ౬, ఆ.—వై. పెడతలయందుండుసరము.

మన్నించే. వై. స. క్రి. 1. సమ్మానించు; 2. గౌరవించు. "క. అన్నయిదిధర్మువనిమీ, యన్నునసన్ను సన్నతి

ప్రియంబునసెదలో, మన్నించియేమిపనిచినఁ, గ్రన్ననవాపనుపుసేయఁగఁడఁగుముబుద్ధిన్." భార. ఆది. ౬, ఆ.

మన్నింపు. వై. వి. 1. మన్నించుట; 2. అపరాధక్షమము. (చూ. ఆరగింపు.)

మన్నిక. వై. వి. మన్నన, సమ్మానము.

మన్నిగొను. దే. స. క్రి.(మన్ని+కొను.)చెంపు. "క. కన్నుండఁగంటిపాపం,గొన్నట్లుమొఱంగిబాలుఁ గొనిపోవుటకై, యన్నీచుబంధుయుతముగ, మన్నిగొనకయున్న నేటిమాటలుమనకున్." హ. హరి. ౫, ఆ.

మన్నియ. వై. వి. ప్రభువు*. "ఆమన్నియ తేరియక్కజపుమావులఁగూల్చి." అచ్చ. ఆర, కాం.

మన్నియఁడు. వై. వి.——పై.——"మన్నియరగండఁడు." కా. ౧, ఆ. (రూ. మన్నెఁడు.)

మన్నీఁడు. ద్వ.వి.(మన్ను+ఈఁడు.)——పై.—— "తే. అంతఁదనపట్టియగువాలినడఁగఁజేసి, నీకొమరుఁడంచువేల్పుమన్నీఁడు ప్రొద్దు నలమిముట్టడివేయించెననఁగమబ్బు, తెగలుపడిఁబర్వెఁజుక్కలతెరువునందు." అచ్చ. కిష్కిం, కాం.

మన్ను. యు. దే. వి. 1. బుఱ్ఱమృగము; "తే. పంకముగొరిజదిగఁబడిపఱవలేవు, మన్నులివ్వేళ రేగటి మన్నులందు." స్వా. ౪, ఆ.—2. యుద్ధసాధనవిశేషము. "వ. కొంకిమన్ను దగరు మొదలుగాఁ గలసాధనంబులచేఁజీకాకుపఱిచియు." హ,హరి. 3,ఆ.—వై. 1.మట్టి; 2. నేల*. (చూ. జే. మొదటి యర్థము.)

మన్నుఏఁడు. ద్వ. వి. రాజు, భూపతి. కాశీ ౬, ఆ.

మన్నెకాఁడు. ద్వ. వి. (మన్నెము+కాఁడు.)——పై.——"రక్కసిమన్నెకాఁడు." అచ్చ. సుం, కాం.

మన్నెము. వై. వి. సమ్మానించియిచ్చినకొంతభూభాగము*.

మన్నెముల్లు. ద్వ. వి. మేఁకలకాలిగిట్టలలోని ముల్లు తీసెడు పెద్దసూది.

మన్మఁడు. దే. వి. మనుమఁడుయొక్క రూపాంతరము.

మన్మథ. సం. వి. అ. పుం. ఒకసంవత్సరము. (చూ. సంవత్సరము.) ము. 1. కామచింత; 2. వెలఁగ.

మన్మథుఁడు. సం. వి. అ. పుం. మరుఁడు, మారుఁడు.

మన్మనము. సం. వి. అ. పుం. ఆలుమగలు సురతకాలమునందు దేశభాషతోఁ జెవిలో మెల్లఁగా చెప్పుకొను మాట.

మన్య. సం. వి. ఆ. స్త్రీ. పెడతలయందుండునరము.

మన్యువు. సం. వి. ఉ. పుం. 1. క్రోధము; 2. శోకము; 3. దైన్యము; 4. యజ్ఞము.

మన్వంతరము. సం. వి. అ. న. 1. డెబ్బదియొక్క దివ్యయుగములు; 2. మనుకాలమధ్యచరిత్రము.

మపుష్టకము. సం. వి. అ. పుం. (చూ.) మకుష్టకము.

మప్పితము. దే. విశ. మితము, పరిమితము.

మప్పు. దే. స. క్రి. మరపుయొక్క రూపాంతరము.

మబ్బు. దే.వి. 1. మేఘము; 2. చీఁకటి; "ఉ.ఘనాఘనముల్ పొగరెక్కి కేవలాం, ధంకరణంబులై బహువిసంబులమబ్బులుగొల్పుఁగంటివే." రామా. ౬, ఆ.—3. అజ్ఞానము. "అహా తెల్విలేదయ్యె మబ్బునకున్ లోనయినాఁడు వీఁడుపదరుంబోతీవు." చంద్ర.

మబ్బుకొను. దే. అ. క్రి. మంపుకొను. పా. ౨, ఆ.

మబ్బుత్రోవ. దే. వి. ఆకాశము, మేఘద్వారము. (చూ. అంగద ఆఱవయర్థము.) (ఇట్లు మొగులు దారి.)

మబ్బుమేపరి. దే. వి. వాయువు, ప్రభంజనుఁడు. "సీ. మబ్బుమేపరికూనగొబ్బునవానిసింగాణిముత్తునియలుగానడంప." అచ్చ. సుం, కాం.

మబ్బురవుతు. ద్వ. వి. ఇంద్రుఁడు, మేఘవాహనుఁడు.

మభ్యపెట్టుట. వై. స. క్రి. మోసముచేయుట, ఉపాయముగా దాఁటవేయుట.

మమత. సం. వి. ఆ స్త్రీ. మమత్వము, అభిమానము.

మమ్మ. దే. అవ్య. ప్రశంసను తెలుపునది. (చూ. మమ్మారె.)

మమ్మరె. దే. అవ్య.——పై——(రూ. మమ్మరే.)

మమ్మా. దే.అవ్య. మమ్మయొక్క రూపాంతరము.(చూ. రోయు. స. క్రి.)

మమ్మాయి. దే. వి. లేహవిశేషము.

మమ్మారె. దే. అవ్య. మమ్మరెయొక్క రూపాంతరము. "క. అమ్మదనాగేంద్రంబును, గుమ్మరిసారెగతిఁ జుట్టుకొనివడిఁదిరుగన్, మమ్మారెయనుచుఁజూపఱు,ముమ్మాఱుంబొగడిరొక్క మొగినవ్వేళన్." శకాం. ౫, ఆ. (రూ. మమ్మారే.)

మమ్ము. దే. వి. సముద్రముమీఁద ఓడలకు విఘాతము గావించెడు సుడిగాలివిశేషము.

మయము. సం. వి. అ. పుం. 1. ఒంటె; 2. కంచర గాడిద.
మయష్టకము. సం. వి. అ. పుం. అడవిపెసలు, (రూ. మయష్ట్రకము.)
మయుఁడు. సం. వి. అ. పుం. అసురశిల్పి.
మయువు. సం. వి. ఉ. పుం. 1. కిన్నరుఁడు; 2. మృగవిశేషము.
మయూఖము. సం. వి. అ. పుం. 1. కిరణము; 2. కాంతి; 3. జ్వాల.
మయూరకము. సం. వి. అ. న. మయిలుతుత్తము. పుం. ఉత్తరేను?.
మయూరతుత్థము. సం. వి. అ. న. మయిలుతుత్తము.
మయూరము. సం. వి. అ. పుం. 1. నెమిలి; 2. నెమిలిజుట్టు; 3. ఓమము; 4. ఉత్తరేను?.
మయూరవిదళ. సం. వి. ఆ. స్త్రీ. నల్లతెగడ?.
మర. దే. వి. 1. కీలు; (మరగాలు, మరచుట్టు. మొ.) 2. తిరుగుడుచీల; 3. తిరుగుడుమెక్కు. (చూ. మరగొమ్ము.) (ఆధునికులు కొందఱు దీనిని శకటరేఫముగాఁ బ్రయోగించియున్నారు.)
మరందము. సం. వి. అ. పుం. పూఁదేనె. (మకరందముయొక్క రూపాంతరము.)
మరకము. అర. వి. ఎనిమిదిపల్లు, తూము.
మరకతము. సం. వి. అ. న. పచ్చరాయి, గారుత్మతము.
మరకాఁడు. దే. వి. (చూ.) నావికుఁడు. "సురరాజునకుఁ బొందుకరఁజేర్చుమరకాఁడు." స్వా. ౪, ఆ.
మరగాలు. దే. వి. కృత్రిమపాదము.
మరగు. దే. అ. క్రి. 1. పరిచితమగు; "క. మరగిన సింహముమృగములఁ, బొరిగొనుచునునరులఁగాచుపోలికినంతః, పరిచితపననుఁడునఘములఁ, బొరిగొనుమను నరులదేహములురక్షించుచున్." మార్క. 3, ఆ. (చూ. తరపు.)—2. ఆశపడు. "క. నినుఁజూచిమరగివచ్చిన, ననుఁజేకొనకునికినీకునాయమెచెపుమా." భో. ౪, ఆ.—స. క్రి. ఆశించు. "క. తలిదండ్రులుగడియించిన, పలుగులలో విత్తమెల్ల ముండలకొఱకై, వలపునను సరిని పెట్టుచు, నెలమి మెయిన్ మరగెనెక్కయీడిగదానిన్." భల్లా. ౧, ఆ.
మరగొమ్ము. దే. వి. (మర+కొమ్ము.) గుఱ్ఱముమీఁది పల్లమునకు ముందు వెనుకలనానికకై యెత్తుగా నేర్పఱిచియుండుభాగము. "క. తరుణీ వెలవకు పల్లపు, మరగొమ్మేమఱకునాకుమర్యాదావి, స్మరణంబైనదిమాటల, పరాకుచేననుచుఁదనదుపారీంద్రంబున్." కళా. 3, ఆ.
మరచెట్టు. దే. వి. తిరుగడ. ఆము. ౪, ఆ.
మరణము. సం. వి. అ. న. చావు, మృతి.
మరణించు. సం. అ. క్రి. మరణముచేయు, చచ్చు.
మరతకము. సం. వి. అ. న. మరకతముయొక్క మారురూపము.
మరపు. దే. ప్రే. మరగఁజేయు. (చూ. తరపు.)
మరమేకు. దే. వి. తిరుగుఁడుచీల.
మరమ్మతు. హిం. వి. బాగుచేయుట.
మరలఁబడు. ద్వ. అ. క్రి. (మరలన్+పడు.) మరలు. "క. ధృతరాష్ట్రుండిటమీఁదను, సుతులునుళకునియునుసూతసూనుండును నే, గతినడపించిరివారల, మతిమయనుష్ఠించుఁగాక మరలంబడునే." భార. ఉద్యో. ౧, ఆ. (స్వార్థమున పడు.)
మరలఁబాటు. ద్వ. వి. మరలఁబడుట.
మరలు. దే. అ. క్రి. 1. తిరుగు, నివర్తిలు; "అంతతో మరలుమదీయకోపశిఖి." భార. ఉద్యో. ౪, ఆ.—2. వెనుకకుతిరుగు. "సీ. రామభద్రుండుగరంబు దూరంబు గానరిగియంతటనుదామరలుదృష్టి, కొనరుగైకొని." రాఘ. 3, ఆ.
మరలుచు. దే. ప్రే. మరలఁజేయు. (రూ. మరలచ్చు. చూ. బరువడి.)
మరిపలి. దే. వి. మనుఁగుడుపు.
మరసాన. ద్వ. వి. తాళ్లపనివాని సాధనవిశేషము.
మరాటము. దే. వి. ఒకచెట్టు, లాంగలి.
మరాటి. వై. వి. ఒకానొక దేశస్థుఁడు.
మరాటిమొగ్గ. వై. వి. ఒకానొక అంగడిదినుసు.
మరాళము. సం. వి. అ. పుం. హంస, అంచ.
మరి. దే. వి. ఏ. తడవ, వారము. "క. ధరణింగాశ్యపవైశ్యా, నరమార్కండేయులోలినజగద్ధితవా, క్పరులైరొక్కడనారొక, మరిగోష్ఠీనిరతినుండి మనుజాధీశా." భార. అను. ౨, ఆ. (ఇది ఏకాది శబ్దపూర్వకము గాఁ బ్రయోగింపఁబడును గాని ప్రత్యేకముగాఁ బ్రయోగింపఁబడదు.) "అగ్నికిని మరిపోయిచెప్పుము." భార. అశ్వ. ౧, ఆ.—అవ్య. మఱియు. "ఆ. మరియునొక్కసాలమిరుగేలఁబెఱికియు." రా. అర, కాం. ౧, ఆ. (ఇది ఈయర్థమందులఘురేఫముగా నీగ్రంథమునందు మాత్రము కనఁబడుచున్నది.)

మరించే. సం. అ. క్రి. మరణించుయొక్కరూపాంతరము.
మరిగొమ్మ. దే. వి. (చూ.) కలుఁజో.
మరిచము. సం. వి. అ. న. మిరియము.
మరిడిమహాలక్ష్మి. దే. వి. ఒకదేవత.
మరిడివ్యాధి. దే. వి. కలరాజాడ్యము, వాంతిభ్రాంతి.
మరియాద. వై. వి. క్రమము, మేర. "క. నరనాథుఁ గొలిచియలఁతఁడు, దిరిగితినాకేమియనుచుఁ దేఁకువలేక, మ్మరియాదదప్పమెలఁగినఁ, బురుషార్థంబు నకుహానిపుట్టకయుఁన్నే." భార. విరా. ౧, అ.
మరీచము. సం. వి. అ. న. మరిచముయొక్కరూపాంతరము.
మరీచి. సం. వి. ఇ. పుం, స్త్రీ. కిరణము. పుం. ఒక ఋషి. (చూ. ఋషి.)
మరీచిక. సం. వి. ఆ. స్త్రీ. ఎండమావులు, మృగతృష్ణ.
మరు. దే. వి. వృత్తియందు మారుశబ్దమునకాదేశరూపము. (వేమరు.)
మరుఁడు. వై. వి. మన్మథుఁడు, మారుఁడు.
మరుతేజి. ద్వ. వి. చిలుక, కీరము.
మరుత్తు. సం. వి. త్. స్త్రీ. పిక్కచెట్టు. పుం. 1. గాలి; 2. వేలుపు.
మరుత్వంతుఁడు. సం. వి. త్. పుం. ఇంద్రుఁడు.
మరునిల్లు. ద్వ. వి. (మరుని+ఇల్లు.) మదనగృహము.
మరున్మాల. సం. వి. ఆ. స్త్రీ. పిక్క?.
మరుపని. ద్వ. వి. సురతము. "రగడ. పనుపడ్డదిమరుపనులకునదిమును." య. ౪, అ.
మరులు. దే. వి 1. మోహము; "ద్వి. మహనీయమగు విష్ణుమాయావిలాస, మహిమమిందిరఁబెద్దమరులునముంచె, హరిమాయచేమోహితాత్మయైలక్ష్మి, పరమవిద్యయుదివ్యభావంబుమఱచి."విష్ణు.పు. ౨, అ.—2. పిశాచము. (చూ. మరులుఁ ఱేఁడు.)
మరులుఁదీఁగ. ద్వ. వి మరులుజెడ. "ఆ. మరులుఁ దీఁగమట్టి యిరులన్నసోయని, యొదుతిమిస్రఁ గాదువడి." ఆము. ౫, అ.
మరులుకొను. దే. అ. క్రి. మోహించు. (ప్రే. మరులుకొలుపు.)
మరులుజెడ. ద్వ. వి. మట్టినతోడనే మరులుపుట్టించెడియోషధి, భూతకేశము.
మరులుమాతంగి. దే. వి. ——పై.——
మరులుఱేఁడు. దే. వి. పిశాచవల్లభుఁడు. ఉ, హరి. ౨, అ.

మరువకము. సం. వి. అ. పుం. 1. మరువము?; 2. మంగ?.
మరువము. వై. వి. వాసనగల ఒకానొకచిన్నచెట్టు. (చూ. పట్టివేరు.)
మరువు. సం. వి. అ. పుం. 1. నిర్జలప్రదేశము; 2. పర్వతము.
మర్కటము. సం. వి. అ. పుం. 1. కోఁతి; 2. సాలెపురుగు. (రూ. మర్కటకము.)
మర్కటి. సం. వి. ఈ. స్త్రీ. 1. తీఁగకానుగ?; 2. దూలగొండి?.
మర్కారి. గ్రా. వి. పడవనడిపించువాఁడు.
మర్తబు. హిం. విణ. పరిష్కారమైన, ముగిసిన.
మర్త్యము. సం. వి. అ. పుం. భూలోకము.
మర్త్యుఁడు. సం. వి. అ. పుం. మనుష్యుఁడు.
మర్దనము. సం. వి. అ. న. 1. పిసుకుట, సంవాహనము; 2. నూఱుట, చూర్ణనము.
మర్దలము. సం. వి. అ. పుం. మద్దెల. (దీని ధ్వని గుండిలము.)
మర్దించే. సం. స. క్రి. మర్దనముచేయు, నూఱు.
మర్దితము. సం. విణ. (అ. ఆ. అ) నూఱఁబడినది.
మర్నాఁడు. దే. వి. మఱునాఁడుయొక్కరూపాంతరము. "ఎ, గీ. తత్సు, రంబుతీర్పఁదనదుమర్నాటిపయన, మునకుఁదోడడిగె." పర. ౫, అ. (మరునాఁడు అని యొకచోఁ గానఁబడుచున్నది. అది ప్రక్షిప్తమనితోఁచెడి.)
మర్మము. సం. వి. న్. న. 1. జీవస్థానము; 2. కిటుకు.
మర్మరము. సం. వి. అ. పుం. చొక్కాకులయొక్కయు వస్త్రములయొక్కయు మ్రోఁత, పెళపెళ.
మర్మస్పృక్కు. సం. విణ. (శ్. ఈ. శ్.) మర్మమును దాఁకునది.
మర్యాద. సం. వి. ఆ. స్త్రీ. 1. పొలిమేర; 2. తీరము; 3. కట్టుపాటు; 4. సమ్మానము.
మర్లుఁబాము. దే. వి. (మర్లు+పాము.) (చూ.) మనుదిండి.
మర్షము. సం. వి. అ. పుం. ఓరుపు, క్షమ.
మఱఁదలు. దే. వి. (మఱఁది+ఆలు.) 1. తమ్మునిభార్య; 2. భార్యచెల్లెలు; 3. తనకంటెచిన్నదగు మేనత్తమేనమామలకూఁతురు.
మఱఁది. దే. వి. 1. చెల్లెలిమగఁడు; "సీ. వినిపనుదే వుండు మనమునహర్షించి యనుజనుమఱఁదినిఘనుఁడుచూడఁ, దనపురోహితుఁగశ్యపుఁడనుమ

హాత్ము, బ్రీతిఁబుత్తెంచె." భార. ఆది. ౫, ఆ.—2. భార్యతోఁబుట్టువు; "ఉ. కంతునిమేనమామ బుధగణ్యాతపస్వికిఁగంటిపాప భా, స్వంతునియుద్దికాఁడు సురసంతతిబోనము వెండిగిన్నె యా, సంతమసంబుశత్రువునిశాసతికిఁబ్రియవల్లభుండుశ్రీ, కాంతుమఱంది శూలికడకన్నుగు వేలుపువోఁ చెదూర్పునన్." భల్లా. ౫, ఆ.—౩. మేనమామకొడుకు; "సీ. శ్రీమన్మహాగుణస్తోమాభిరాముఁడై తేజరిల్లెడు ధర్మరాజునకును, దమమఱందిగిరీంద్రధరుఁడు గండంబుగావించి సేయంగల విన్నపములు." భాను. ౪, ఆ. (చూ. అన్నన్న.)—౪. మగనితమ్ముఁడు. "ఈపైఁడిచాయలచేమించునతండు నామఱఁది." దశా. ౮, ఆ.

మఱక. దే. వి. 1. కఱ; 2. మేఁకపడ్డ. "చ. నూత్నఘటగర్భమునంగలసక్తువంతయున్, దఱుఁగక యమ్మిమేఁకఁగొనదానికిఁబిల్లలు రెండుగల్గున, మ్మఱకలు రెంటికింబొడముమానుగదూడలునాల్గు." పంచ. నా. ౫, ఆ.

మఱకువ. దే. వి. అజ్ఞానము. (చూ. ఎఱుకు.)

మఱచే. దే. స. క్రి. మఱపుఁజెందు. "రగడ. అంజదిదియొలదేఁటికనేమఱచెమఱచెదమే మనంబున." పా. ౪, ఆ.

మఱపు. దే. వి. 1. విస్మృతి; 2. అజ్ఞానము, "ఉ. నీమహిమార్ణవంబుమదినిక్కముగా నెఱుఁగంగలేక నీ, ప్రేమకువచ్చుదాసునకుఁబిచ్చతనంబున నెగ్గుచేసితిన్, నామఱపున్ సహింపుమటనారకుఁడై నమనంబులోభవ, న్నామముచింతసేసిననంతసుఖస్థితిఁజెందకుండునే." భాగ. ౯, స్కం.—౩. పారవశ్యము; "సీ. మఱపుమున్నీటిలోమానసంబులు దేలబిగియారుకొఁగిట బెరయువారు." ఉ, హరి. ౫, ఆ.—4. ప్రమాదము. "క. తఱచుగమెకములఁబొరిగొను, మఱపునవచ్చితిమిదవ్వమనపాలమిటకి, త్తఱినగునిమిత్తములునృప,కొఱగావిడెమనకుఁబెద్దగొడవగునినన్." స్వా. ౪, ఆ.

మఱలు. దే. అ. క్రి. మగ్లు. "క. ఎఱిఁగియుసాహసమతివై, మఱలింపఁగఁదగు సెరథము." రా. యు, కాం. (కవిత్రయము వారిప్రయోగములందిదియు లఘురేఫముగా కనఁబడలేదు.)

మఱి. దే. అవ్య. 1. వెండియు; "క. ఉఱుముచునుమెఱుముచుఁబిడుగులు, వఱలఁగనల్లడలఁ బడనవారితవృష్టుల్, గుఱుకొనికురియఁగఁబంచెను, మఱియును నయ్యనలుమీఁద మఘవుం డలుకన్." భార. ఆది. ౮, ఆ.—2. ఇంకను; 3. అనంతరము. "వ. ఏనువివాహంబయినపదంపడిభీమసేనుండువివాహంబయిన మఱి యర్జునుండు వివాహంబగుఁగాక." భార. ఆది. ౭, ఆ.

మఱిగ. దే. వి. జోడ్తవెలపలె బలపపుఱాతితోఁజేయఁబడినపాత్రము.

మఱిమఱి. దే. అవ్య. 1. మఱియుమఱియు; 2. అత్యంతము. "క. మానుము ప్రాణముకన్నన్, మానంబధికంబటంచుమఱిమఱిసభ్యుల్, భూనాధపల్కువినవే, సానితనంబేలబానిసగనమ్మునకన్." భల్లా. ౫, ఆ.

మఱియొకటి. ద్వ. స. (మఱి+ఒకటి.) అన్యము. (ఇట్లు మఱియొకఁడు.)

మఱు. దే. వి. ప్రాత్తియందు మఱుగు మఱుస మాఱు శబ్దములకాదేశరూపము. (మఱుపడు, మఱునాఁడు, మఱుమాట. మొ.)

మఱుఁగు. దే. అ. క్రి. 1. చాటగు; 2. సంతాపించు. "క. అఱువదివేలబ్దంబులు, నెఱయఁగమనిసుతులఁగనని నెవ్వగచేతన్, మఱుఁగుచుజరమేనంగ్రిక్కిఱియఁగఁ దఱిదప్పిసుతుల నిక్కేఁగంటిన్." రా. బాల, కాం. "వ. మలమలమఱుంగుచు." భార. ఆది. 3, ఆ.—వి. చాటు. "క. విడిపించుకొనిమఱుంగున, నిడినతనదుభూషణంబులెల్లను బ్రేమం, దొడిగిగృహంబునకల్లన, నడచెఁబతిచరిత్రభావనలమనమలరన్." కళా. ౪, ఆ. (చూ. మఱువు.)

మఱుఁగుదొడ్డి. దే. వి. మఱుఁగుపెరడు.

మఱుఁగుపడు. ద్వ. అ. క్రి. మఱుఁగు.

మఱుఁగుపెరడు. దే. వి. విష్ఠావిసర్జనస్థానము.

మఱుకువ. దే. వి. సంతాపము. "తే. అనినధర్మజుఁడిట్లనునద్దురాత్ముఁ, బొలియఁజేయుటదగదుదుస్సలఁదలంచి, వానినొకతప్పునకుసైఁపవలదెయాంబి, కేయమహిషికిమఱుకువఁజేయఁజనునె." భార. ఆర. ౬, ఆ.

మఱుగుజ్జు. ద్వ. విశ. (మాఱు+గుజ్జు.) గూనివాఁడు, గూనిది.

మఱునాఁడు. దే. వి. (మఱుస+నాఁడు.) మఱుసటిదినము.

మఱుపడు. ద్వ. అ. క్రి. (మఱుఁగు+పడు.) మఱుఁగగు. "ఆ. మనుజులంటకుండమఱుపడఁజేసిన,

యస్త్రశస్త్రసంచయంబుగాని, శవముగాదు." భార. విరా. ౪, ఆ.

మఱుమాట. దే. వి. (మాఱు+మాట.) ప్రతివచనము.

మఱుమ్రోఁత. దే. వి. (మాఱు+మ్రోఁత.) ప్రతిధ్వని.

మఱువ. ద్వి. వి. (మఱుఁగు + వా.) కుండ. (చూ. మఱువకందు.) విశ. మూఁగ.

మఱువకందు. ద్వి. వి. అగస్త్యుఁడు, కుంభసంభవుఁడు. "ఆ. మఱువకందుజోగి తెఱవాయి మెకమున్న, చెంతకరిగి." అచ్చ. అర. కాం.

మఱువు. దే. వి. 1. కవచము; "ఆ. మఱువుఁగొంద ఱేచినఱకిరపుడు." మార్క. ౫, ఆ.—2. చాటు. "సీ. ఆత్మరంధ్రములించుకైననునొరులకుఁ దెలుఁగ రాకుండనుమఱువు సేయుము." భార. ఆశ్ర. ౧, ఆ.

మఱుస. దే. విశ. ఆవలిది. "మఱుసటినాటివేకువ నమాత్యుఁడు మేల్కని." జై. ౫, ఆ. (వృత్తి యందు అంత్యవర్ణమునకు వికల్పముగా లోపంబగు. మఱునాఁడు, మఱుపుట్టువు, మఱుమేను. మొ.)

మఱుసంజె. ద్వి. వి. (మఱుస+సంజె.) సాయంసంధ్య.

మఱ్ఱి. దే. వి. వటవృక్షము.

మల. వై. వి. కొండ, తిప్ప, మెట్టు, పర్వతము.

మలఁక. దే. వి. 1. చిక్కు; "ద్వి. మటుమాయవిధిప ట్టిమలఁకలఁబెట్టు." హరిశ్చ. ౧, భా.—2. చుట్టు; "పాఁపతరిత్రాటిమలంకల." కాశీ. ౫, ఆ.—3. మెలిక. "క. తామరసనేత్రవీనుల, తో మొన సిజయింపలేక త్రొక్కటమున నెం, తో మలఁకలఁ బడి స్రుక్కుచు, వేమఱుశష్కులులు గ్రాఁగ వేఁగుచునుండెన్." రసి. ౨, ఆ.—విశ. వంకర. "చ. మలఁకలుమాప్రచారములుమాముఖముల్ విషవహ్నికీలముల్." భాగ. ౧౦, స్కం. పూ.

మలఁకతూము. ద్వి. వి. పదికుంచెములకొలఁదిగల మానవిశేషము.

మలఁకపుట్టి. దే. వి. ఇన్నూఱుకుంచెములకొలఁదిగల మానవిశేషము.

మలఁకమెఱుపు. దే. వి. ధనురాకారమగు మెఱుపు.

మలఁగ. దే. వి. ఎద్దుపైఁగంతతో డిసరకుగోనె.

మలఁగు. దే. అ. క్రి. 1. తిరుగు; "మలఁగుమీ మెల్ల నిగాలికిన్." భాగ. ౧౦, స్కం. పూ.—2. మరలు; "సీ. తనయొప్పిదముఁగన్నఁదగిలియెవ్వరికైన మలఁగిక్రమ్మఱఁజూడవలయువాఁడు." భార. విరా. ౨, ఆ.—3. వంకరగు. "మలఁగిమలంగి . . . పాఱె." భీ. ౪, ఆ.

మలఁచు. దే. ప్రే. మలఁగఁజేయు. స. క్రి. త్రోలుచు. "చ. కరుగునఁబోయమూడ్కిన్ నుడికంబుగ తాఁతమలంచుకైవడిన్." చంద్రా. ౨, ఆ.

మలఁపు. దే. ప్రే. మలఁగఁజేయు. "క. మదిమఱపు నఁబాపముదన, కొదవుటయును విడపవగచియొ కసగమునునే, నిదిసేయునింకననియెడు, మదిఁదె అసగముఁగనరుండుమలఁపునఘుంబుల్." భార. అర. ౫, ఆ.—వి. నర్తనము. (చూ. మలఁపుగొను.)

మలఁపుగొను. దే. అ. క్రి. (మలఁపు+గొను.) నర్తించు. "వ. ఎడనెడం బడంతుకలు మలంపుగొన." ఆము. ౪, ఆ.

మలక. దే. వి. 1. తురక; 2. మూకుడు.

మలకడము. దే. వి. పాదరక్ష. "వెలివాడపని క్రొత్తమలకడాలు." ఆము. ౬, ఆ.

మలగొంగ. ద్వి. వి. ఇంద్రుఁడు, నగవైరి. "సీ. మలగొంగయలరుటెత్తులఁగట్టియిడుచుండుదంటమోములసామిపంటసేయు." అచ్చ. సుం, కాం. (ఇట్లు మలదాయ, మలసూడు.)

మలగొను. దే. అ. క్రి. (మలఁక+కొను.) మెలిగొను. "సీ. మలగొన్న తేరివాజులఁబగ్గములచేదిగించిసారథ్యమంగీకరింప." జై. ౫, ఆ. (చూ. నాగబెత్తము.)

మలచేము. దే. విశ. 1. అధికము; 2. గొప్ప. (చూ. నట్టనడుము.)

మలప. దే. వి. దూడచచ్చిపాలిచ్చెడుధేన్వాదికము.

మలపు. దే. ప్రే. (మలయఁజేయు.) 1. త్రిప్పు; "మేపుగలుగు నెడలమెలఁగమలప." భార. విరా. ౧, ఆ. -2. మరలించు. "క. వలదనియెన్ని తెఱంగుల, మలపిన." అచ్చ. అర, కాం.—వి. ఆధిక్యము. "సీ. కమలభవాండంబుఁగదలించిసలిలంబు మనమీఁదనించినమలపులేదు." ఉ. హరి. ౬, ఆ.

మలపువు. సం. వి. ఈ. స్త్రీ. కుక్కమేడి.

మలమనికి. ద్వి. వి. కోఁతి, నగౌకసము. (రూ. మలమన్కి. "ఇత్తెఱంగునమలమన్కిమొత్తములు." అచ్చ. యు, కాం.)

మలమల. దే. వి. మాఁడుటమఱుఁగుటలయందగుధ్వన్యనుకరణము. (చూ. మఱుఁగు రెండవ యర్థము. కూఁక.)

మలమాసము. సం. వి. అ. పుం. అధికమాసము.

మలము. సం. వి. అ. పుం, న. 1. విష్ఠ; (ద్వాదశ మలములు.—వస, శుక్లము, రక్తము, మజ్జము, మూత్రము, విష్ఠ, పింజూషము, నఖము, శ్లేష్మము, అశ్రువు, దూషిక, స్వేదము.) (జిహ్వామలము కులుకిము, దంతమలము పిప్పిక.) 2. కిట్టము; 3. దోషము.

మలయ. సం. వి. ఆ. స్త్రీ. తెల్లతెగడ? అ. పుం. ము. 1. ఒక కొండ; 2. ఆరామము; 3. ఒక దేశము.

మలయజము. సం. వి. అ. పుం. 1. చందనవృక్షము; 2. చందనము.

మలయమ్మ. వై. వి. (మల+అమ్మ.) పార్వతి. "సీ. మలయమ్మ వేటాడమూపాలఁగల్గుమీ సింగపుఁగొదమఁ దెచ్చెదము నీకు." య. ౨, ఆ.

మలయిక. దే. వి. విహారము. (సందర్భము నుబట్టి తక్కిన యర్థముల నూహించునది.)

మలయు. దే. అ. క్రి. 1. తిరుగు; "న. వీరభద్రుండు మాఱు లేక మలయుచుండె." కాశీ. ౭. ఆ.—2. పెనఁగు; "హస్తికరకాండతతుల్ మసకంపుఁ బాములైమలసినచోట." పా. ౧, ఆ.—3. వ్యాపించు; "ఆ. అకటసతికినంతరంగమైయుండియు, మలయుకయ్య నీవు మలయపవన." కవిక. 3, ఆ.—4. ఉద్యమించు; "తే. మలసిఱంకెలు వైచుచు మాఱుకొనిన, వృషభములభంగినక్షురుల్పృషభులిల్లు, సమదగతిఁజేరు సెడఁజూచి రిమురులర్థి, ననిమిష త్వంబుదమకప్పుడచ్చుపడఁగ." భార. విరా. ౫, ఆ.—5. ఉద్రేకించు; "తే. కన్యలావణ్యరిసనుధాగాహనమున, విభునినయనములస్వప్న వృత్తిఁజెంది, ఘనసుతదురోజ హేమాద్రిమనికిమరగి, మహితసురతానుభూతికైమలయుచుండు." వసు. 3, ఆ.—6. తపించు. "తే. మరుని వేడిమి నెంతయు మలసెనమ్మ." య. ౫, ఆ.

మలయువు. సం. ఈ. స్త్రీ. కుక్కమేడి?

మలాక. దే. వి. శ్రీఖండము.

మలాము. (చూ. మొలాము.)

మలారము. దే. వి. 1. మట్టిగాజులగుది; 2. నిడుపుకొయ్యకొనను రెల్లులుకట్టి వీధిలోనగునది ఊడ్చు సాధనము.

మలికితము. దే. వి. సందేహము. "క. చదువులకు నుజ్జ్వయైకడుం, బొదలినమాయయ్యపొత్తపుంగూర్పరచే, నిదితగవనిపించెద నే, మదిలోపల నీకునింత మలికితమున్న౯." య. ౪, ఆ.

మలిగండ్లు. దే. వి. బ. (మలి+కండ్లు.) మలిచితీయఁ దగినతాలు. "ద్వి. మలిగండ్లుదీసినమంచిబియ్యంబు, నిలుచువిధంబున నిస్సారదుష్ట, వాసనసెంతయుఁబడికడకొత్త, భాసురజ్ఞానసంపదస్ఫూర్తిఁబొందు." ప్రభు. ౨౪, ఆ.

మలినము. సం. విశ. (అ.ఆ.అ.) 1. మాసినది; 2. నల్లనిది; 3. దూషితమైనది.

మలిని. సం. వి. ఈ. స్త్రీ. ముట్టుది, ఋతుమతి.

మలిమ్లుచము. సం. వి. అ. పుం. 1. దోమ; 2. మలమాసము. డు. 1. దొంగ; 2. అగ్ని.

మలీమసము. సం. వి. అ. పుం. ఇనుము. విశ. మాసినది.

మలు. దే. విశ. మఱుసటి అదేశరూపమైన మఱు శబ్దమునకు రూపాంతరము. (ఉదా. మలుకారు, మలుసంజ మొ.)

మలుఁగు. దే. వి. మత్స్యవిశేషము, పాఁపమీను.

మలుకారు. ద్వ. వి. 1. ముక్కారుపంటలో రెండవకారు; 2. శీతకాలము.

మలుకు. దే. వి. దారములోనగువాని నెదురెదురుగా తగిలించి మరల పెడమర్లత్రిప్పినది. (రూ. మల్కు. "మల్కుతోడా మెలి పెట్టికట్టిన కడానిజగాజిగి పాగమీఁద." శశాం. ౫, ఆ.)

మలుకువ. దే. వి. ముతికి, మాలిన్యము.

మలుఁగు. దే. అ. క్రి. 1. ఆఱు; "క. అకృష్ణుఁడుని జసౌమ్యా, లోకనమున నాశిఖిని మలుఁగఁజేసెం బూ, ర్వాకారతనవ్వనముని, రాకులతంబొలిచె నదిమహాద్భుతమయ్యె౯." భార. అను. ౪, ఆ.—2. నశించు. (చూ. నేయి.) వి. తుంటి.

మలుచు. దే. స. క్రి. 1. బియ్యములోనగునవితాల్లు పోనచెరుగు; 2. తతిమెనఁబెట్టు; 3. తాతిసిలో లుచు. (రూ. మల్చు. తతి మెనఁబెట్టుటకు.—"ఊరులు మల్చి వేసినటులున్న వి." విజ. ౧, ఆ.)

మలుపక్కము. ద్వ. వి. కృష్ణపక్షము. (శుక్లపక్షము తొలుపక్కము.)

మలుపు. దే. ప్రే. (మలుఁగఁజేయు.) 1. ఆర్చు; 2. నశింపఁజేయు. "ఎ, గీ. వీఁడు మకరాక్షుఁడి పుడు నీవాఁడియుల్ల, మలిపిపోలుపఱిఁజేయువాఁడ్ల గఁడు సుమ్ము." అచ్చ. యు, కాం.

మలుసంజె. ద్వ. వి. సాయంసంధ్య. (చూ. తొలుసంజె.)

మల్ల. వై. వి. మంటికంచము, సానిక.

మల్లకము. సం. వి. అ. పుం. ఆ. స్త్రీ. దీపపుప్రమిద.

మల్లకుఁడు. దే. విశే. కఠినుఁడు, గడుసరి. "క. తల్లి కిఁదండ్రికి సుతులకు, సెల్లవిధంబులను వలయు హితములు సెప్పన్, మల్లకుఁడు గాక కర్జము, సల్లాపము గాఁగఁజూపి సౌజన్యమునన్." భార. అను. ౪, ఆ.

మల్లగుల్లము. దే. వి. వాదులాట.

మల్లచేఱచు. ద్వ. అ. క్రి. (మల్లట+చఱచు.) భుజాస్ఫాలనము చేయు. "మల్ల చఱచుచు నార్చుచు." హరి. పూ. ౬, ఆ.

మల్లచేఱపు. ద్వ. వి. మల్లచఱచుట, భుజాస్ఫాలనము.

మల్లట. ద్వ. వి. మల్లాటయొక్క రూపాంతరము.

మల్లడి. దే. వి. 1. పరితాపము; 2. పెనఁకువ.

మల్లడించు. దే. అ. క్రి. 1. పెనఁగొను; "తే. మనములోఁ దుఃఖతాపముల్ మల్లడింప." భాగ. ౪, స్క.—2. అతిశయించు. "మనములోపలరోషంబు మల్లడింప." భాగ. ౪, స్కం.

మల్లడిగొను. దే. అ. క్రి. (మల్లడి+కొను.) 1. పెనఁగొను; "క. తనవూజ త్రోపువడుటకు, మనమునఁ గోపమును సిగ్గు మల్లడిగొనఁగా." హరి. పూ. ౭, ఆ. —2. పరితపించు. "క. చిడిముడిపడుచు నెదురుస నఁ, గడఁగుచు హారములు చక్కగాఁ ద్రోచుచు మ, ల్లడిగొనుచు." భార. విరా. ౨, ఆ. (ప్రే. మల్లడిగొలుపు. "మానని కోపమిట్లు మదిమల్లడిగొల్పఁగ." పాండు. ౪, ఆ.)

మల్లము. సం. వి. అ. పుం. (చూ.) మల్ల.

మల్లరము. దే. విశే. మదించినది. "మల్లరంపుటాఁబోతులు." పర. 3, ఆ. "వ. మల్లరపుఁగల్లరితేఁటిదండంబులు." కళా. ౬, ఆ.

మల్లసాల. వై. వి. భోజనశాల. "క. ఎల్లెడఁబరదేసులకును, గుల్లంబంచలు నురచ్ఛకొట్టంబులునం, గల్లను గాకతలంపఁగఁ, జల్లని సున్నంపు మల్లసాలలు గలవే." హరిశ్చ. ౪, ఆ. (ఇది మల్లెసాలయని వక్రమధ్యముగా ప్రతులయందుఁగానంబడియెడి.)

మల్లాట. ద్వ. వి. మల్లాడుట.

మల్లాడు. ద్వ. అ. క్రి. (మల్లు+ఆడు.) పెనఁగాడు. "వ. అతండొక్కతరువు కరయుగళినిఁజీయంబట్టి పెల్లగింప మల్లాడు నాలోనన." స్వా. ౪, ఆ.

మల్లామడి. దే. విశే. పీడితము, పీడితుఁడు. "క. లొల్లియగు పగలత్రొక్కున, నిల్లిగ్గులు గానవచ్చు వ్యాదయములోనన్, మల్లామడియగు మదనుఁడు, మెల్లనఁగూర్చుండె దాల్మి మినుమినుకనఁగన్." ఉ, హరి. ౫, ఆ.

మల్లారము. దే. వి. మలారమునకు మొదటిరూపము.

మల్లిక. సం. వి. ఆ. స్త్రీ. 1. మల్లెతీఁగ; 2. మృత్పాత్రవిశేషము. అ. పుం. ము. మాసినముక్కుకాళ్లుగల తెల్లహంస.

మల్లికాక్షము. సం. వి. అ. పుం. 1. మాసినముక్కు కాళ్లుగల తెల్లహంస; 2. తెల్లనికన్నులుగల గుఱ్ఱము.

మల్లియ. వై. వి. మల్లెతీఁగ. (చూ. నల్లన.)

మల్లు. వై. వి. 1. కోఁతి; 2. జెట్టిపెనఁకువ*.

మల్లుఁడు. సం. వి. అ. పుం. జెట్టి. విశే. శ్రేష్ఠుఁడు.

మల్లుకట్టు. ద్వ. స. క్రి. అడ్డగించు.

మల్లుపెనఁగు. ద్వ. అ. క్రి. జెట్టిపెనఁకువగా పెనఁగు. "ఉ. బల్లిదులైనబుత్తుయదుభర్తలుదగ్రపరాక్రమంబునన్, మల్లుపెనంగునంత." వి, పు. ౬, ఆ.

మల్లె. యు. వై. వి. 1. మల్లిక1; (దీనిభేదములు బొండుమల్లె, నూదిమల్లె. మొ.) 2. మల్ల. దే. బ. స్ఫోటకపు బొబ్బలయందుఁగలుగు పురుగులు.

మల్లెజేగులు. ద్వ. వి. రావులుఁగు, లోహస్పృష్టము.

మల్లెలగుది. ద్వ. వి. మల్లెపూగుత్తివలె మనోజ్ఞముగుటచే కుక్కకియ్యఁబడినపేరు. (చూ. గబ్బి.)

మవ్వము. దే. వి. కోమలత. "ఉ. మవ్వమెక్కియు, క్కుమ్మడినంకురించులత లొప్పఁదొఱఁగవె నీరుగానమిన్." నిర్వ. ౫, ఆ. — విశే. కోమలము. "క. ఇవ్విధమున నొండొరుపయి, మవ్వంబుగఁ బ్రబలుప్రేమమహిమంబులతో, జవ్వనపుబోఁడుములు గడు, నవ్విభుఁడున్ సతియుఁ గడపనంతటిలోనన్." కళా. ౭, ఆ.

మశకము. సం. వి. అ. పుం. 1. దోమ; 2. దేహమువిరియు రోగము.

మశహరి. సం. వి. ఈ. స్త్రీ. దోమతెర, చతుష్కి.

మసాతు. హిం. వి. నేల కొలుచుట.

మసాఖతు. హిం. వి. భూమిని బాగుచేయుట.

మసాల్చి. హిం. వి. దివిటీలుపట్టువాఁడు, దీపములు వెలిఁగించువాఁడు.

మషి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. కాగితము వ్రాసెడుమసి.

మషిమణి. సం. వి. ఇ. స్త్రీ. మసిబుడ్డి.

మస. దే. వి. విలాసము. "వలరాచమస." విక్ర. ౮, ఆ. "క. జిగిబిగివగచిన్నెలమస." హంస. ౨, ఆ.

మసఁగు. దే. అ. క్రి. రేఁగు, విజృంభించు. (చూ. పసగరగొను.)

మసక. వై. వి. 1. ఇంచుకనలుపు*; 2. మునిచీఁకటి*. "ప్రొద్దుమసకంబడె." జై. ౭, ఆ. (ఆమ్రేడితమునందు మసమసక. ఇంచుకనలుపునకు.—"వ. పారదస్ఫటికపటీరపాండురుచి పుండరీకంబులపసకుమసమసకలెసకొల్పుమిసిమిగలభోగిభోగభాగంబునకు పరభాగంబుమిగుల." ఆము. ౬, ఆ.—మునిచీఁకటికి.—"వ. ఒండొంటికింజేరంబులువాఱి కుప్పించితప్పించుకొనుదుష్పులఖురజరజశ్ఛటలనెసకమెసఁగు మసమసకలనుఱుంగువడి." స్వా. ౮, ఆ.)

మసకన. వై. వి. 1. ఇంచుకనలుపు*; 2. మునిచీఁకటి*. [ఆమ్రేడితమునందు మసమసకన. "క. మసమసకనయ్యెదిక్కులు." (చూ. ఎగయు.) (మసమసకనయ్యెననఁగా మసమసకనకిలవియాయెననుట.) (విశేషణమగుచో. "క. పసిపాపయొండకొనలును, మసమసకనియిరులుకలసిమఃమలరించెఁ." నై. ౭, ఆ.) (ఇక్కడ మసమసకనకు ఇంచుకమాత్రమర్థము.) చూ. అలకన.]

మసకము. దే. వి. 1. సంభోగేచ్ఛ; "వ. మసకంబునంబెనంగుపాములపగిది. . . కలయబెరయు."ఉ. హరి. 3, ఆ.—2. సంభోగము. "వ. మసకంబునకుఁ బెనఁగుకొదమనాగులబాగున మేనులునుట్టవెట్టుకొని పెనంగుచు." భో. ౫, ఆ. "వ. మసకపుఁబ్రతిములమేల్కట్లును." (ఇక్కడ శయనగృహవర్ణనము. చూ. మసకొను.) కవిక. 3, ఆ.

మసకొను. దే. అ. క్రి. (మసకము+కొను.) సంభోగేచ్ఛగొను. "సీ. ప్రాణనాయికతోడఁబర్యంకసీమలమసకొని పెనఁగుసంభ్రమమువిడిచి." కాశి. ౨, ఆ. (ప్రే. మసకొల్పు. "ఉ. చల్లనిబెల్లిమాటలపసఁ మసకొల్పుచునెల్లవారలఁ." అచ్చ. అ, కాం.)

మసటు. దే. వి. ముఱికి, మాలిన్యము. "మ. అసిధారాదళితాత్మబంధుభుజమధ్యస్వైరనిర్యద్ధ్వనిఁ, మసమైపుట్టినయమ్మహాదురితముఁ మస్వట్టియుఁ వాజిమేధసమిద్ధానలభూతిచేసునిమియుందప్పింపలేనైతినీ,కసటెప్పాటఁదొలంగునెట్టులగుదుఁ గల్యాణకల్యాత్ముఁడఁ." పాండు. ౫, ఆ.

మసడు. దే. వి. మసటుయొక్కరూపాంతరము. ఆం. భా. ప్ర, కాల.

మసనము. వై. వి. శ్మశానము. "అగణ్యపుణ్యాజనపాళికాసమసనంబు." (నలకథయందు పుణ్యాజనపాళికి ఆస అని ఛేదము.) హన. ౫, ఆ.

మసర. దే వి. ధూసరవర్ణము. విణ. ధూసరవర్ణముగలది.

మసరు. దే. వి. ఆవేశము. "తే. బలోదారుఁడైన, మహిషుఁడెప్పుడుమదమునమసరుకవిసి, కలఁచుచున్నాఁడుత్రిభువనకమలవనము." మార్క. ౬, ఆ.

మసలిక. దే. వి. మాంద్యము. విణ. మందము. "అరుంగుమెఱుంగు మెట్టికల్ మసలికయెక్కుఁడు." (మసలిక=మసలికగా.) పాంచా. ౮, ఆ.

మసలు. దే. అ. క్రి. 1. తడయు; "క. ఈయున్నపాష్యప్రోలికిఁ, బోయికడుంబెద్దదవ్వు పోయినయట్ల, త్ర్యంబుతవిమలతపోమహి, మాయిన్నిదినంబులేలమసలితిచెపుమా." భార. ఆది. ౧, ఆ.—2. నీళ్లుమలములకాఁగు; 3. విహరించు; "క. ఏలావనరమ్యములగు, వేలావనములనుబవనవిచలద్వీచీ, లాలితసముద్రవిద్రుమ, మాలాపులినస్థలములమసలుచులీలఁ." భార. ఆది. ౭, ఆ.—4. వెనుకకుతిరుగు. "క. వసుమతిమనమింతకుమును, వసుధాధిపకంటిమేనువర్ణమృగమురా, క్షసకృత్యమ్మిదివలవదు, మసలుఁడుసతులతులచపలమతులుదలంపఁ." రా. అర, కాం. ౨, ఆ.

మసలుకొను. దే. అ. క్రి. మసలు. "వ. నొసటిమృగమదపుటసలునమసలుకొనితుం పెసలాడుకురులు." భాగ. 3, స్కం. (స్వార్థమున కొను.)

మసారము. సం. వి. అ. పుం. ఇంద్రనీలము. "తరళమసారసారనిభతారకముల్." పాండు. ౨, ఆ.

మసాల. హిం. వి. సంభారము, గుఱ్ఱమునకిచ్చుమందు.

మసి. ఉభ. వై. వి. 1. నలుపు*; 2. బొగ్గు*; 3. మయిల*. సం. ఇ. ఈ. స్త్రీ. కాగితముఁ వ్రాసెడుకాటుక. ఈ. పెద్దసదాపు?.

మసికట్టు. ద్వ. వి. బంగారులోనగువానిచిలుము.

మసికోఁతి. ద్వ. వి. నల్లకోఁతి.

మసిబుడ్డి. మి. వి. మసిపోసెడుబుడ్డి.

మసీదు. దే. వి. తురకలగుడి. య. ౧, ఆ.

మసుర. సం. వి. ఆ. స్త్రీ. వేశ్య. పుం, స్త్రీ. చిఱుసెనగలు.

మసూర. సం. వి. ఆ. స్త్రీ. వేశ్య. పుం, స్త్రీ. చిఱుసెనగలు. పుం. ము. బిల్లతలగడ.

మసూరవిదళ. సం. వి. అ. స్త్రీ. నల్లతెగడ?.

మసూరి. సం. వి. ఈ. స్త్రీ. ఒకదినుసుగజ్జి. (రూ. మసూరిక.) (అ. స్త్రీ.)
మసృణ. సం. వి. ఆ. స్త్రీ. నల్లగిసె. విశ. 1. చిక్కనిది; 2. నున్ననిది.
మసెల. దే. వి. అటుక.
మస్కరము. సం. వి. అ. పుం. వెదురు, వేణువు.
మస్కరి. సం. వి. న్. పుం. సన్యాసి, భిక్షుకుఁడు.
మస్తు. దే. వి. మసటుయొక్కమాఱురూపము.
మస్తకి. హిం. వి. ఒక మందుదినుసు.
మస్తము. సం. వి. అ. న. తల, (రూ. మస్తకము.) (పుం, న.)
మస్తరించే. దే. స. క్రి. లోపఱచే. "ఉ. ఎంతయు ఘోరమైనవిపినే భము మెల్లనమస్తరించిమా, వంతుఁడుకంఠపీఠిఁగుదే వైచి సుఖంబుగనెక్కునట్టు లు." కాశీ. ౫. ఆ.
మస్తరు. దే. వి. లోఁకువ, అధీనత. (మూ. మస్తరించు.)
మస్తిష్కము. సం. వి. అ. న. తలమెదడు.
మస్తీ. వై. వి. మదించినయేనుఁగు. "మ. తెలిపూగద్దియగాడు పుంగొదమమస్తీనెక్కి లేఁదేటిగం, టలసంధిల్లురొదాళముల్ పరవమింటన్ వెంటఁజంద్రాదుల, గ్గలికన్ ముంగలబారుదీరినదువన్ గాలార్చుచున్ నాకికిం, దలిరుంబెద్దహజారపున్నడిమిచెంతన్ డిగ్గితానచ్చటన్." చంద్రా. 3, ఆ.
మస్తు. యా. దే. వి. సమృద్ధి. వై. మదము.
మస్తువు. సం. వి. ఉ. న. పెరుఁగుమీఁదిమీఁగడ.
మహంతు. దే. వి. దేవస్థానములకు ధర్మకర్తృత్వము జఱిగించు బైరాగి.
మహజర్నామా. హిం. వి. బహుజనుల వ్రాతపూర్వకమయిన విన్నపము.
మహతి. సం. వి. ఈ. స్త్రీ. 1. నూఱుతంతులుగల నారదునివీణ; 2. తెనుఁగువ్యాకరణమున తిర్యగితర స్త్రీవాచకశబ్దములకు సంజ్ఞ. విశ. గొప్పది.
మహత్తు. సం. వి. త్. న. దొరతనము. పుం. 1. బుద్ధితత్వము; (మూ. తత్వము.) 2. తెనుఁగువ్యాకరణమునపురుషవాచకశబ్దములకుసంజ్ఞ. విశ. గొప్పది.
మహనీయుఁడు. సం. విశ. (అ.ఆ.అ.) గొప్పవాఁడు.
మహము. సం. వి. అ. పుం. 1. ఉత్సవము; 2. తేజము.
మహలు. హిం. వి. దేశములోనిభాగము, రాజమందిరము.
మహస్సు. సం. వి. స్. న. 1. తేజము; 2. ఉత్సవము.
మహసూలు. హిం. వి. పంట.
మహాంగము. సం. వి. అ. పుం. ఒంటె, క్రమేలకము.
మహాకందము. సం. వి. అ. పుం. 1. వెల్లుల్లి; 2. దుర దకంద.
మహాకాలుఁడు. సం. వి. అ. పుం. 1. శివుఁడు; 2. ఒక శివభటుఁడు.
మహాకులుఁడు. సం. విశ. (అ.ఆ.అ.) గొప్పకులము నఁబుట్టినవాఁడు, కులీనుఁడు.
మహాగణులు. సం. వి. బ. జంగాలగురువులబిరుదు.
మహాజాలి. సం. వి. ఈ. స్త్రీ. పచ్చని పువ్వులుగల ఆవడ.
మహాదేవుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.
మహాధనము. సం. వి. అ. న. 1. చిల్లమడ్డి; 2. బంగారు; 3. కృషి; 4. గొప్ప వెలగలవస్త్రము; 5. గొప్ప వెలగలవస్తువు. విశ. గొప్ప వెలగలది.
మహానటుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.
మహానసము. సం. వి. అ. న. పాకస్థానము, వంటయిల్లు.
మహానీలము. సం. వి. అ. పుం. 1. సింహళద్వీపమునందుఁగలిగినయింద్రనీలమణి; 2. గుంటగలిజేరు. డు. దేవయోనిసర్పవిశేషము.
మహాపథము. సం. వి. అ. పుం. 1. ప్రాణాంతము; 2. రాజమార్గము.
మహాపద్మము. సం. వి. అ. పుం. 1. ఒకనిధి; (మూ. నిధి.) 2. సంఖ్యావిశేషము; 3. దేవయోనిసర్పవిశేషము.
మహాప్రళయము. సం. వి. అ. పుం. లోకనాశనము, బ్రహ్మప్రళయము.
మహాబల. సం. వి. ఆ. స్త్రీ. నులితడ. అ. న. ము. సీసము. పుం. డు. వాయువు. విశ. మిక్కిలి బలిమిగలవాఁడు.
మహామాత్రుఁడు. సం. వి. అ. పుం. 1. కార్యసహాయుఁడు; 2. మావటీఁడు; 3. సంపన్నుఁడు.
మహామృగము. సం. వి. అ. పుం. ఏనుఁగు, ఎక్కుడు మెకము.
మహారంభ. సం. వి. ఆ. స్త్రీ. పచ్చయరఁటి.
మహారజతము. సం. వి. అ. న. స్వర్ణము, బంగారు.
మహారజనము. సం. వి. అ. న. 1. కుసుమపువ్వు; 2. బంగారు.
మహారణ్యము. సం. వి. అ. న. గొప్పయడవి, పేరడవి.
మహారథుఁడు. సం. వి. అ. పుం. పదునొకండువేల మంది విలుకాండ్రతో పోరెడు యోధుఁడు. తన్నును సారథిని గుఱ్ఱములను కాపాడుకొనుచు

నేలువాఁడవుగా." రా. యు, కాం. (ఈ యర్థమునందిది యీ గ్రంథమునందుమాత్రము సార్ధబిందుకముగాఁ గానఁబడుచున్నది.)

మూఁడుచు. దే. ప్రే. మూఁడఁజేయు, కలిగించు. (రూ. మూడ్చు. "మోహముదాహముగా మదికి మూడ్చుచున్నది." నై. ౨, ఆ.)

మూఁత. దే. వి. 1. మూయుట; 2. మూయుటకుఁ దగిన మూఁకుడులోనగునది.

మూఁతబల్ల. దే. వి. వాచోరుపట్టె.

మూఁపు. దే. వి. భుజశిరము, అంసము.

మూఁపురము. దే. వి. ఎద్దుయొక్క భుజశిరము, కకుదము.

మూకుఁడు. సం. వి. అ. పుం. ఒక అసురుఁడు. విణ. మూఁగవాఁడు, (రూ. మూకు.)

మూగురు. దే. స. ముగ్గురునకు మొదటిరూపము.

మూగేలు. దే. వి. గంధమూషిక, చుంచు.

మూచూచు. దే. స. క్రి. (మూతి+చూచు.) మూర్కొను, ఆఘ్రాణించు. "క. విను మొరుచూచినమూచూ,చినభోజ్యమునింద్యము."భార.అను.౮,ఆ.

మూట. వై. వి. బట్టలులోనగువానిముడియ*.

మూటము. దే. వి. ముటముయొక్క రూపాంతరము.

మూడమంచు. దే. వి. దట్టమైనమంచు, హిమాని. "తే. అర్జునుఁడుగవియించినయంపమూడ, మంచుదళముగఁగప్పిన మార్గణాంశు, జాలములవెసవిరియించెశాంతనవప,తంగుఁడుద్యోతమానప్రతాపలీల." భార. విరా. ౫, ఆ.

మూడి. దే. వి. ముడ్డికి మొదటిరూపము. "ఎ, గీ. లేఁడుతగవరియొందునుమూడిఁజొచ్చి, వాతవెళ్లెడువాఁడెయెవ్వాఁడుననుచు." కళా. ౨, ఆ.

మూడు. దే. స. రెండునొకటి. (ఇది సార్ధబిందుకమనుటకుఁ గవిత్రయము వారి ప్రయోగములయందుఁదగిన యుదాహరణములు దొరకమిగాకయిది బహువచనమున మూళ్లని వాడఁబడుచున్నది.)

మూఢుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. తెలివిలేనివాఁడు; 2. బాలుఁడు.

మూతము. సం. వి. అ. న. రాజోలుచేతిక్రిందనుంచుకొను తలగడ. విణ. కట్టఁబడినది.

మూతి. దే. వి. 1. నోటిపైభాగము; 2. ముఖము.

మూత్రకృచ్ఛ్రము. సం. వి. అ. న. నీరుడిరోగము.

మూత్రము. సం. వి. అ. న. నీరు, కాలుమడి.

మూత్రించు. సం. అ. క్రి. నీరువిడుచు, కాలుమడుచు.

మూత్రితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) నీరువిడిచినవాఁడు.

మూదల. దే. వి. (మూల+తల.) నిరూపణము, తార్కాణ. "క. వేదములకునఖిలస్మృతి, వాదములకు బహుపురాణవర్గంబులకున్, వాదైనచోటులనుదా, మూదలధర్మార్థకామమోక్షస్థితికిన్." భార. విరా. ౧, ఆ.

మూదలించు. దే. స. క్రి. 1. నిరూపించు, తార్కాణించు; "తే. ఏమిరావాసుదేవుఁడ నేనయనుచుఁ, జెప్పికొనవచ్చునేయింకఁజెపుమనాకు, నిన్నుఁగన్నపుడ్డచక్రాగ్నినీఱుసేయ, వచ్చుమూదలించుట కింతవలసెఁజేయ." హరి. ఉ. ౬, ఆ. "సీ. మ్రుచ్చిలఁదలఁచెవీఁడిచ్చలోనని మూదలించి దండించుమలిమ్లుచులను." కళా. ౭, ఆ.—2. ఎచ్చరించు. "ఉ. పాండునృపాగ్రనందనుఁడుఁ బావనియుంగవలుంజలంబుమై, నొండొరుమూదలించుకొని యొక్కటఁదాఁకిన." భార. కర్ణ. ౨, ఆ.

మూదలిక. దే. వి. మూదల, తార్కాణ.

మూన. దే. వి. 1. వస్త్రగాలితముచేయఁగా రాలక నిలిచినది; 2. రాగులు ఆముదాలు మేలురాసి కాఁగా మిగిలినపొల్లు.

మూను. దే. స. క్రి. వస్త్రగాలితముచేయు.

మూయు. దే. స. క్రి. 1. మూఁతపెట్టు; (కన్నుమూసెను, పెట్టెమూయుము, తలుపుమూసితిని. మొ.) 2. కప్పు. (చేసినతప్పు మూసిపెట్టినదాఁగునా!)

మూర. దే. వి. రెండుజేనలకొలఁది, హస్తము. విణ. నిడుపైనది. (చూ. మూరకోక.)

మూరకోక. దే. వి. బారచేఁపు.

మూరకోల. దే. వి. గజపుకోల.

మూరిఁబోవు. దే. అ. క్రి. (మూరి+పోవు.) 1. అతిశయించు; "శా. శ్రీకంఠుండుసదాశివుండునియతిన్ శృంగారలోలుండుగా, రీకాంతాసహితంబుసమ్మదముమూరింబోవవేంచేసె." వీర. 3, ఆ. —2. వర్ధిల్లు; "ఎ, గీ. అట్లుగానఁబ్రావృట్ఛరదాగమముల,నధికభక్తిమహాపూజయాచరించి,నన్నుసేవించిమనుజుండునాప్రసాద,మునధనముధాన్యమునుగల్గిమూరిఁబోవు."మార్క.౬,ఆ.—3.విజృంభించు; "సీ. వేఱయొకత, విశ్వకర్మునికూఁతువిశదలావణ్యసముజ్జ్వలఁజేకొనిమూరిఁబోయి." హరి.

ఉ. ౪, ఆ.—4. సఫలమగు; "మ. ఈ, పడఁతిం బుత్రునిఁ జేసి మీఁదగుకృపా ప్రావీణ్యముం బెంపు నే, ర్పడ నాకోరిక మూరిఁబోఁదగఁగృ తార్థత్వంబు నొందింపరే." మార్క. 2, ఆ.—5. నశించు. "ఎ, గీ. చదువుచట్టువడియె శాస్త్రంబుమన్నయ్యె, బుద్ధిపురువు మేఁ పెఁబుణ్య మడఁగె, నీతిమట్టువడియె నిర్మలజ్ఞానంబు, మొదలికుడిగె బోధమూరిఁబోయె." భాగ. ౬, స్కం.

మూారు. దే. అ. క్రి. అతిశయించు. (చూ. ఎంత రెండవయర్థము.)

మూారుకొండ. ద్వ. వి. రూపగంధి?.

మూారుకొను. దే. స. క్రి. ఆఘ్రాణించు. "క. కనుఁగన్నై వినుఁజెవియై, కొనుఁజవిజిహ్వయయి మూరుకొను నాసికయై, తనువై స్పర్శముఁగనుఁగొను, ననవద్యాబుద్ధియాత్మయందు నిలుచు చుక్." భార. శాం. ౫, ఆ.

మూారుతము. వై. వి. 1. పంద్రెండు క్షణముల కాలము; 2. రెండుగడియలకాలము. "మూారుతము డాసె." అచ్చ. అ, కాం.

మూార్కొను. దే. స. క్రి. మూారుకొనుయొక్క రూపాంతరము. "సీ. అంటి చూడని మించు టద్దంపు పలకలు కొఁదమరా యంచ మూర్కొననితూండ్లు." రామా. ౪, ఆ.

మూర్ఖుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) తెలిసి తెలియని వాఁడు, (రూ. మూర్ఖు.)

మూర్ఛ. సం. వి. ఆ. స్త్రీ. రోగాదులచేత స్మృతితప్పుట, సొమ్మ.

మూర్ఛన. సం. వి. ఆ. స్త్రీ. సంగీతమునందు క్రమముగా సప్తస్వరములయొక్క ఆరోహణావరోహణములు.

మూర్ఛాలుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) మూర్ఛరోగము గలవాఁడు.

మూర్ఛితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) 1. మూర్ఛిల్లినవాఁడు; 2. మూర్ఛారోగముగలవాఁడు; 3. మూఢుఁడు; 4. పొడుమైనవాఁడు.

మూర్ఛిల్లు. సం. అ. క్రి. మూర్ఛపోవు, సొమ్మసిల్లు.

మూర్తము. ఉభ. వై. వి. మూారుతముయొక్క రూపాంతరము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కఠినమైనది; 2. మూర్ఛరోగముగలది; 3. స్వరూపముగలది.

మూర్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. శరీరము; 2. కాఠిన్యము; 3. ప్రతిమ. (త్రిమూర్తులు.—బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుఁడు.)

మూర్ధము. సం. వి. న్. పుం. శిరము, తల.

మూర్ధాభిషిక్తుఁడు. సం. వి. అ. పుం. 1. రాచవాఁడు; 2. రాజు; 3. మంత్రి.

మూర్వ. సం. వి. ఆ. స్త్రీ. చాఁగ?.

మూాల. ఉభ. దే. వి. 1. విదిక్కు, కోణము; 2. గొంది; 3. కొప్పు. "సీ. ముదువంగ నేర్తురు మూలఁగమ్మని తావిగలుగు క్రొవ్విరులులోఁగందకుండ." భీ. ౧, ఆ.—సం. ఆ. స్త్రీ. ఒకనక్షత్రము. (చూ. నక్షత్రము.)

మూాలకము. సం. వి. అ. పుం, న. ముల్లంగి?.

మూాలగ. దే. వి. (చూ.) సెనడు, మజ్జ.

మూాలదుంప. మి. గ్రా. వి. (మూాలము + దుంప.) మొదటిగడ్డ, మూాలకారణము.

మూాలఫల. సం. వి. ఆ. స్త్రీ. కొమ్మనగోలిమిడి?.

మూాలబంధము. సం. వి. అ. పుం. (చూ.) పునాది.

మూాలము. సం. వి. అ. న. 1. వేరు; 2. మెట్టదామరదుంప; 3. ఊడ; 4. మొదలు; 5. సంచిమొదలు; 6. సమీపము; 7. ఒకనక్షత్రము.

మూాలమట్టము. దే. వి. గోడలమూాలలను సరిచూచెడు మూఁడుమూాలల మట్టపలక.

మూాలముట్టు. మి. గ్రా. అవ్య. క్రి. విశే. ఆ మూాలము. "తే. మూాలముట్టుగఁ దెలిపెనమ్మునివరుండు, ప్రార్థితుండయి నాకునపర్వరమవిద్య." స్వా. 3, ఆ.

మూాలతాయి. దే. వి. వజ్రమణి. (రూ. మూాలతా. "సీ. ఆమూాలనును మూాలతా మొత్తముల చఱులా మూాలముగఁదీవలంటవలయు." వసు. ౨, ఆ.)

మూాలవేఁడు. దే. వి. నిర్ఋతి, కోణపుఁడు. "వాలుపోచుక యయుండు మూాలవేఁడు." అచ్చ. సుం, కాం.

మూాలాధారము. సం. వి. అ. న. గుదస్థానమునందుండెడు నాడులకాధారమైనచక్రము.

మూాలిక. సం. వి. ఆ. స్త్రీ. మందాకు?. అ. పుం. డు. వృక్షమూాలమునఁగూర్చుండి తపము చేయుటయే వ్రతముగాఁగలవాఁడు. (చూ. వ్రతి.)

మూాలుగు. దే. అ. క్రి. 1. నొప్పివలని బాధచే ఒకవిధముగా ధ్వనించు; 2. కూయు. (చూ. పాళము.) (ధనమెక్కుచోటనుంచి పెక్కుదినములైనయెడ అచ్చోట ధనపిశాచము చేరి మూాలుగునని చెప్పుదు

రు.)— వి. 1. మాలుగుట, కుంథనము; 2. ప్రసాధని?. (రూ. మూల్గు.)
**మూల్యము.** సం. వి. అ. న. 1. వెల; 2. జీతము.
**మూవ.** యు. దే. వి. మువ్వకు మొదటిరూపము. "మూవగోపాల." క్షేత్రయ.—వై. విణ. మూఁగయొక్క రూపాంతరము. "తే. మూవలమువో లెదీని చేఁజావనేల, యీడుగను జెప్పదమమన మెఱిఁగినంత." నా. ౨, ఆ.
**మూవురు.** దే. స. మూగురుయొక్క రూపాంతరము.
**మూష.** సం. వి. ఆ. స్త్రీ. (చూ.) మూస.
**మూషకపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. ఎలుకజీడి?.
**మూషికము.** సం.వి.అ.పుం.1.ఎలుక; 2.పందికొక్కు.
**మూషితము.** సం. విణ. (అ. ఆ. అ.) దొంగిలింపఁబడినది. (ముషితముయొక్క రూపాంతరము.)
**మూస.** వై. వి. బంగారులోనగువానిఁగరఁగెడుకరువు.
**మూసిక.** దే. వి. మంగళసూత్రమునందు తాలిబొట్టుకు ఈవలావల గ్రుచ్చికట్టుకొనెడు నానుక్రోవి. "ఎ. గీ. తాలి, బొట్టుమూసికతోఁగూర్చిపాసఁగనఱుతఁ, ద్రాడుగట్టక." నీలా. ౧, ఆ.

## మృ.

**మృగణ.** సం. వి. ఆ. స్త్రీ. వెదకుట, అన్వేషణము.
**మృగతృష్ణ.** సం. వి. ఆ. స్త్రీ. ఎండమావులు, మరీచిక.
**మృగదంశకము.** సం.వి.అ.పుం.1.కుక్క; 2.ఎలుఁగు.
**మృగధూర్తకము.** సం. వి. అ. పుం. నక్క, జంబుకము.
**మృగనాభి.** సం. వి. ఇ. పుం. జింకపొక్కిలి, కస్తూరి.
**మృగమదము.** సం.వి.అ.పుం.కస్తూరి, మెకపుటామ.
**మృగము.** సం. వి. అ. పుం. 1. పశువు; 2. జింక; 3. అడవియందుతిరిగెడి యేనుఁగు; 4. మృగశీర్షము; 5. అన్వేషణము; 6. వేఁట; 7. వేఁడుట.
**మృగయ.** సం. వి. ఆ. స్త్రీ. 1. వేఁట; 2. వెదకుట.
**మృగయుఁడు.** సం. వి. ఉ. పుం. 1. బోయ; 2. బ్రహ్మ.
**మృగరిపువు.** సం.వి.ఉ. పుం. సింహము, హర్యక్షము.
**మృగవాహనుఁడు.** సం. వి. అ. పుం. వాయువు, జింకరౌతు.
**మృగవ్యము.** సం. వి. అ. న. వేఁట, ఆఖేటము.
**మృగశిర.** సం. వి. ఆ. స్త్రీ. స్. న. ము. మృగశీర్షము.
**మృగశీర్షకము.** సం.వి.అ.పుం.అభినయహస్తవిశేషము.
**మృగశీర్షము.** సం. వి. అ. న. ఒకనక్షత్రము. (చూ. నక్షత్రము.)
**మృగాంకుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు, జింకతాలుపరి.
**మృగాజీవము.** సం. వి. అ. పుం. సివంగి, తరక్షువు. డు. బోయవాఁడు.
**మృగాదనము.** సం. వి. అ. పుం. సివంగి, మెకములతిండి. డు. బోయవాఁడు.
**మృగితము.** సం. విణ. (అ. ఆ. అ.) వెదకఁబడినది.
**మృగేంద్రుఁడు.** సం. వి. అ. పుం. సింహము, మెకముల ఱేఁడు.
**మృగోర్వారువు.** సం. వి. ఉ. పుం. బుడమ?.
**మృగ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) వెదకఁదగినది.
**మృజ.** సం. వి. ఆ. స్త్రీ. నూనెమొదలైనవానిపూఁత.
**మృడాని.** సం. వి. ఈ. స్త్రీ. పార్వతి, గట్రాచూలి.
**మృడుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.
**మృణాళము.** సం. వి. అ. న. వట్టివేరు. పుం, న. బిసము, తూఁడు.
**మృతము.** సం. వి. అ. న. 1. మృతి; 2. యాచితవృత్తి. విణ. మృతిఁబొందినది.
**మృతాలకము.** సం. వి. అ. న. తొగరిమన్ను.
**మృతి.** సం. వి. ఇ. స్త్రీ. మరణము, చావు.
**మృత్తాలకము.** సం. వి. అ. పుం. 1. తొగరి?; 2. తొగరిమన్ను; 3. అడవితొగరిఁతీఁగ.
**మృత్తిక.** సం. వి. ఆ. స్త్రీ. 1. మన్ను; 2. తొగరిమన్ను.
**మృత్తు.** సం. వి. ద్. స్త్రీ. 1. మన్ను; 2. తొగరిమన్ను.
**మృత్యుంజయుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు, మిత్తిగొంగ.
**మృత్యువు.** సం.వి. ఉ. పుం, న. మరణము. పుం. మరణాధిదేవత.
**మృత్స.** సం. వి. ఆ. స్త్రీ. 1. మంచిమన్ను; 2. తొగరిమన్ను.
**మృత్స్న.** సం. వి. ఆ. స్త్రీ. 1. మంచిమన్ను; 2. తొగరిమన్ను; 3. అడవితొగరితీఁగ.
**మృధము.** సం.వి.అ.న. యుద్ధము, ప్రధనము, పోరు.
**మృదంగము.** సం. వి. అ. పుం. 1. మద్దెళ; 2. తప్పెట; 3. సద్దు; 4. వెదురు?.
**మృదుత్వక్కు.** సం. వి. చ్. పుం. బుజపత్తిరి?.
**మృదులము.** సం. విణ. (అ. ఆ. అ.) మెత్తనిది.
**మృదువు.** సం. విణ. (ఉ. ఈ. ఉ.) 1. మెత్తనిది; 2. సోమరి.
**మృద్వీక.** సం. వి. ఆ. స్త్రీ. ద్రాక్ష?. (రూ. మృద్విక.)

మృధము. సం. వి. అ. న. మృధముయొక్క రూపాంతరము.

మృష. సం. అవ్య. అసత్యము.

మృష్టము. సం. విశ. (అ. ఆ. అ.) కడుగుటలోనగు వానిచేత గరగరికైనది.

## మె.

మెంచే. వై. వి. తురక, మ్లేచ్ఛుఁడు.

మెండియము. దే. వి. మెండెము. (చూ. పొరుగు రెండవయర్థము.)

మెండీఁడు. దే. వి. (మెండెము+ఈఁడు.) చూపుడు వ్రేలు. (చూ. పొరుగు రెండవయర్థము.)

మెండు. దే. వి. 1. ఆధిక్యము; "తమ మెండుగను వేల్పుం దండములకన్న లకుఁ బండువులు గా." మై. ౨, ఆ.—2. అతిశయము; "ఏ. మిటమిటంగా యుదట్టంపుఁ బండువెన్నెల మెండునం బెండువడి." స్వా. 3, ఆ.—3. మిట్టు. విశ. అధికము.

మెండుకొను. దే. అ. క్రి. 1. అతిశయించు; "క. తన, దండను వేదండయానతరితీపువగల్, మెండుకొననుండ." శశాం. ౨, ఆ.—2. విజృంభించు; "ఎ, గీ. నికుంభుఁడంతఁ, జండమైనకాలదండం బుఁదాల్చిన, దండధరుఁడపోలె మెండుకొనుచు." రా. యు, కాం.—3. నిండుకొను. (చూ. నిండుకొను.) (ప్రే. మెండుకొలుపు.)

మెండెము. దే. వి. చూపుడు వ్రేలవేసికొనెడియుంగరము. (మెండియముయొక్క రూపాంతరము.)

మెండొడ్డు. దే. అ. క్రి. (మెండు+ఒడ్డు.) ఎదిరించు. "సీ. మాటికిమాటికినుగనితో మెండొడ్డిచలపాదితనమునవలిగియుండు." శశాం. ౪, ఆ.

మెంతులు. వై. వి. బ. సంబారువు దినుసు. (ప్రకృతియందేకవచనాంతము. మెంతికూర, మెంతిమజ్జిగ. మొ.)

మెంబరు. ఆం. వి. సభికుఁడు.

మెకపుటాము. వై. వి. (మెకము+ఆము.) కస్తూరి, మృగమదము. "ఎ, గీ. మేలిగొజ్జంగిపూనీట మెకపుటాము, కలిపి." అచ్చ. అ, కాం.

మెకము. వై. వి. 1. నాలుగు కాళ్లజంతువు; (చూ. మృగము.) 2. జింక. "కావుననీవుబంగరు మెకంబు తెఅంగున వేగ నేగి." అచ్చ. అర, కాం.

మెకములతిండి. ద్వ. వి. సివంగి, మృగాదనము.

మెకములఱేఁడు. ద్వ. వి. సింహము, మృగేంద్రుఁడు.

మెకమెకపడు. ద్వ. అ. క్రి. ఉద్ధతినొందు. "క. ఒకనాడజుండునీనీ, డకుడబ్బాటరుగు దెంచుటయు నమ్మేలా, త్రికుప్రేగైమన్నించిన, మెకమెకపడితిట్లపలుకుమీఁరగరేపుణ." భార. శాం. 3, ఆ.

మెకమెకపాటు. ద్వ. వి. మెకమెకపడుట, ఉద్ధతి. "చ. ఒక పెనుఁబాఁపఱేఁడు చలమొప్పరసాతలసీమకుంజకో, రకములుభూతధాత్రికిసురల్ దివికిణ్ బగదీఱునట్లు గా, మెకమెకపాటుతోడనిను మ్రింగకపోరిపుడుంద్రిలోకకం, టకుఁడవుగాననీయుడలునజ్జుగఁజేసెకురంగలాంఛనా." స్వా. 3, ఆ.

మెక్కు. దే. స. క్రి. తిను, భక్షించు.

మెగము. వై. వి. మెకమునకు మొదటిరూపము.

మెచ్చు. దే. స. క్రి. 1. శ్లాఘించు; 2. లక్ష్యపెట్టు. "సీ. వాఁడునాయుష్యగర్వమున మునీంద్రులనెవ్వరి మెచ్చకయేగియొక్క, ధవళాక్షుఁడనుతపోధను నొద్దగర్వించిపలికిన." భార. అర. 3, ఆ. (ప్రే. మెచ్చించు, మెప్పించు.) – వి. 1. శ్లాఘన; (చూ. అచ్చు. వి. రెండవయర్థము.) 2. బహుమానము; "నాతలఁపువేగ మెచ్చెప్పిన మెచ్చువెట్టెదణ." వీర. ౨, ఆ.—3. ప్రీతి. "నీకుమెచ్చుగని దప్రాణమిచ్చెదము." భార. అర. ౪, ఆ.—విశ. శ్లాఘ్యము. "లాఁతిరాజులకుమెచ్చేయివిధంబు." భార. ఉద్యో. 3, ఆ.

మెచ్చులచెట్టు. దే. వి. కల్పవృక్షము. "ఇచ్చనిచ్చినకోర్కులిచ్చుమెచ్చులచెట్టు." సమీ. ఆ.

మెచ్చులాఁడి. దే. వి. (మెచ్చులు+ఆఁడి.) మెచ్చుకొనఁదగిన ఆఁడుది. "ఎ. నిలింపపతికొలువువెలచెలువలచెలువంబులు మెచ్చని మెచ్చులాఁడులు." ఉ, రా. ౫, ఆ.—విశ. మెచ్చుకొనఁదగినది.

మెచ్చులాఁడు. దే. విశ. (మెచ్చులు+ఆఁడు.) మెచ్చుకొనఁదగినవాఁడు.

మెటిక. దే. వి. మెట్టికయొక్క రూపాంతరము.

మెట్ట. దే. వి. 1. నీరాసరాలేకపండెడుచేను; 2. మెరకనేల. 3. పాదము; "గీ. చుట్టువాలును నెవ్వఁబోఁగొట్టువాలు, బిట్టుగ్రాలుపసిండిక్రొంబట్టుసాలు, మెట్టజాలు మొగుల్పస మెట్టఁజాలు, నట్టిడాలునుగలజగజెట్టిదలఁతు." అచ్చ. బాల, కాం.

మెట్టజీలుగు. దే. వి. సస్యవిశేషము. "ద్వి. మెట్టజీలుగు మేలు మెట్టపాలయ్యె." విష్ణు. పూ. 3, ఆ.

మెట్టతమ్మి. ద్వ. వి. స్థలపద్మిని?.
మెట్టపంట. దే. వి. మెట్టచేనిపంట.
మెట్టవాలుపిట్ట. ద్వ. వి. కోడి, చరణాయుధము. (రూ. మెట్టవాల్పిట్ట. "ఎ, గీ. మెట్టవాల్పిట్టరా మేనిదిట్ట వేల్పు." అచ్చ. బాల, కాం.)
మెట్టిక. దే. వి. మెట్టు, సోపానము. (చూ. చేతగట్టు.)
మెట్టినిల్లు. దే. వి. (మెట్టిన+ఇల్లు.) (ఆఁడుదాని) అత్తగారిల్లు.
మెట్టు. దే. స. క్రి. త్రొక్కు. "మెట్టినకొండ క్రుంగఁ బడి మేదిని బీఁటలువాఱ." రా. యు, కాం.—వి. 1. త్రొక్కుడు; "క. రక్కసుల వేడబంబులు, మిక్కిలినాముకొని కొట్టు మెట్టాడంగా." య. ౨, ఆ.—2. సోపానము; 3. తిప్ప; (చూ. మట్టము మూడవయర్థము.)—4. కొండ; "ఏ మెట్టియ్యది మెట్టు గాదిదివనంబు." రా. అర, కాం.—5. సుంకము పుచ్చుకొనెడుఘట్టము; 6. పులిమజ్జిగ; 7. బ. చెప్పులు; "సీ. నడునెత్తిసిగలు గీర్వాణంబు లెగువాఱ మెట్టులు త్రొవ్వఁడి మెఱుఁగు సురెలు." రసి. ౧, ఆ.—8. పావకోళ్లు; "తే. సింహగతిమీఱు వసురాజు చెంతనొక్క, తోయధరవేణి పాదముల్ తుడిచి మెట్లు, వెట్టె." వసు. ౫, ఆ.—9. వీణెసరకట్లు. "దంతపు మెట్ల వెంబడిం జేవడి వీణె మీటుటయు." ఆము. ౧, ఆ.
మెట్టుఁబ్రాలు. దే. వి. బ. (మెట్టు+ప్రాలు.) తలఁబ్రాలు. "క. తదనంతరంబ హర్షము, పొదలు మదిన్ మెట్టుఁబ్రాలపుట్టికలయెడన్, గదియంబట్టిన పెందెర, గదియించిరి బంధుజనులు కన్యావరులన్." స్వా. ౫, ఆ.
మెట్టుకు. దే. ద్ర. 1. తుదకు; 2. మొత్తమునకు. (మెట్టుకువాఁడిచ్చువాఁడు కాఁడు.)
మెట్టె. దే. వి. మట్టెయొక్క రూపాంతరము. (మొదటిరూపము మెట్టియ.)
మెట్లగుంటక. దే. వి. గుంటక భేదము.
మెడ. దే. వి. కంఠము, గళము.
మెడకాయ. దే. వి.——పై.——
మెడనూలు. దే. వి. బంగారుతీఁగెలహారము.
మెడవాలు. దే. వి. చొకలవాఁడు, చొకలది. "ద్వి. పరజంగమము మెడవాలు మాచయ్య, హరగణంబుల కెల్లనడిగట్టనిన." ప్రభు. ౧౨, ఆ.
మెడిదము. దే. వి. ధ్వని. "ఎ, గీ. గొరగొరంజనుపందులఘుర్ఘురంవు, మెడిదములఁబుడమియుగడగడవడంక, నెపుడు నెడయాని చీఁకట్లనివముకొనుచు, నొంటిఁజొరరాని యట్లుగా నుండె మఱియు." య. ౧, ఆ.
మెడుడ. దే. వి. పులిమజ్జిగ.
మెణకరి. దే. వి. బ్రహ్మచారి. "సీ. మాతండ్రి చేగుజ్జు మెణకరి గొన్న భూగగనంబులేలంగఁ గలిగెనొక్కొ." ఉ, హరి. ౫, ఆ.
మెణత. దే. వి. మెల్లె. "ద్వి. మెండుగావసులకు మెణత లల్లించి." పలనాటిచరిత్రము.
మెతుక. వై. విశే. 1. మృదువైనది; (మెతుక నేల.) 2. మందము*. (మెతుకయెద్దు.)
మెతుకు. దే. వి. అన్నముయొక్క కణము.
మెత్తి. వై. వి. 1. పఱపు*; 2. సాగరము మోసెడియెద్దు గంతిమీఁదిపఱపు*; 3. గుత్తుపుపల్లము*. "పసిఁడి పక్కెరజరబాజు మెత్తియు." రసి. ౧, ఆ.—విశే. మృదువైనది.
మెత్తఁబడు. వై. అ. క్రి. (మెత్తన + పడు.) 1. మృదువగు; "వ. అని మెత్తంబడని చిత్తంబున." భాగ. ౭, స్కం.—2. అణఁగు*. (చూ. పెలుచ రెండవయర్థము, గుసగుసలుఁబోవు.)
మెత్తఁబాటు. వై. వి. 1. మృదుత్వము; "ఉ. యాగవిముక్త మైచను హయంబునకడ్డము వచ్చిపట్టికా, కీగతి మెత్తఁబాటు తగునే." భార. అశ్వ. ౪, ఆ.—2. ఆలస్యము. "తే. పిఱికితనము నేమఱుటయుఁ దెఱవతనము, మెత్తఁబాటునఁ గార్యంబు నత్తెఱంగు, నేరమియు విషయంబులఁ గూరుటయును, గలుగు పతికి నొందదు సిరి తొలఁగిపోవు." సం. "అతిభీరు మతిక్లీబం దీర్ఘసూత్రం ప్రమాదినమ్, వ్యసనాద్విషయాక్రాంతం నభజంతి నృపం ప్రజాః." భార. అర. ౬, ఆ.
మెత్తఁబాఱు. ద్వ. అ. క్రి. (మెత్తన+పాఱు.) మెత్తఁబడు. చంద్రా. ౧, ఆ. (చూ. పాఱు.)
మెత్తగిల్లు. వై. అ. క్రి. మెత్తనగు.
మెత్తడము. దే. వి. మెత్తుట. "మంటిమెత్తడము." వి. పు. ౭, ఆ.
మెత్తడి. దే. వి. మత్స్యవిశేషము.
మెత్తన. వై. వి. 1. మృదుత్వము; 2. కాంతి*. "క. ఆమూర్తియట్టితేజం, బామహిమనిజాంతరంగమద్భుతభీతి, వ్యామోహితంబుసేయం, గా మెత్తనఁ గొంతసేపు కనుఁగొనియలుకన్." హరి. పూ. ౫, ఆ.—విశే. మృదువు. "తనయుల్లము మెత్తన." భార.

విరా. ౧, ఆ. —క్రి. విణ. తిన్నగా*. "క. అమ్మునికడకుఁ, మెత్తనచని నారదముని, యత్తెఱఁగె తీఁగింప." భార. అను. ౫, ఆ.

మెత్తినగోడ. ద్వ. వి. లోపల ఎనుకలుంచి పెట్టినగోడ, ఏదూకము.

మెత్తు. దే. స. క్రి. మన్ను లోనగువాని దళముగాపూయు. వి. మన్ను లోనగువాని దళముగా పూసిన పూఁత. "సీ. మూసి ముల్లడిచి గుమ్మలకొల్పుపై మెత్తు లూడ్చుఁడుపస్తైనముండుఁగాని." పాండు. ౪, ఆ.

మెదడు. వై. వి. తలయందుండు క్రొవ్వు, మస్తిష్కము*.

మెదలిక. దే. వి. మెదలుట.

మెదలు. దే. అ. క్రి. 1. కొంచెము చలించు; (వాఁడుకదలమెదలలేకయున్నాఁడు.) 2. సంచరించు. "మ. అదె నక్తంచరులిందునందును మహోగ్రాకారులై క్రందుగా, మెదలంజొచ్చిరి." సం. "నక్తంచరాశ్చరంత్యేతే." భార. అర. ౭, ఆ.

మెదలుచు. దే. ప్రే. మెదలఁజేయు. "కాలుచెయ్యి మెదలుపకున్నఁ." బై. ౮, ఆ. (చూ. మెదల్చు.)

మెదించు. వై. స. క్రి. మెదుచుయొక్క రూపాంతరము. "మృగీమదంబుఁగపురింబును సాంకవముఁ మెదించి." రుక్మి. ౨, ఆ. (ఇది నులించునంటిది.)

మెదుక. వై. వి. పిసక*. "ద్వి. మెదుకపట్టినతల." హరిశ్చ. ౨, భా. —విణ. మందము, మందుఁడు*. "క. అదియమహాఫలమనితన, హృదయంబునఁ బౌండరీక మెప్పుడెఱుఁగఁడా, మెదుకచనునిది యముక్తి, ప్రదమని పెఱతీర్థమునకు బహునిగమనిధీ." పాండు. ౫, ఆ.

మెదుకగొను. ద్వ. అ. క్రి. (మెదుక+కొను.) పిసకపట్టు. (చూ. ముదుక.)

మెదుకు. దే. వి. మెతుకుయొక్క రూపాంతరము.

మెదుగు. దే. అ. క్రి. 1. ధాన్యము పొట్టుపోవనలఁగు; 2. నలఁగు. "క. కన్యలు, మెచ్చరువార్ధకముచే తమెదిగినవానిఁ." వి. పు. ౪, ఆ.

మెదుగుడు. దే. వి. పాఁతవస్త్రము. "సీ. జలకమార్చు నఖంపచస్వచ్ఛజలములఁదడియొత్తుఁగడు మెదుగుడులఁబోదివి." పాండు. ౨, ఆ.

మెదుచు. వై. స. క్రి. మేదించు. "సీ. ఫాలభాగమ్మునఁబన్నీటమెదిచినకమ్మకస్తురితిలకమ్ముదీర్చి." కాశీ. ౭, ఆ. (చూ. పాయగొమ్మ.)

మెదుపు. దే. ప్రే. మెదుగఁజేయు. "మ. దేవకీ, తినయుఁడాశిలఁగ్రొచ్చివైచి మెదపెఁదద్దైత్యుఁజూర్ణంబుగఁ." పాండు. ౫, ఆ.

మెదువు. వై. విణ. 1. మృదువు; పాండు. ౪, ఆ. 2. మందము*.

మెనుపు. దే. స. క్రి. (కవ్వముతో) ఎనుచు.

మెనుసురేషఁ. ఆం. వి. భూమికొలఁతసంబంధమైన శాస్త్రము.

మెప్పు. దే. వి. 1. శ్లాఘన; 2. ప్రీతి; (చూ. మెచ్చు.) 3. వరము. "సీ. నాకుముందలమితోడ, నీవొసంగెదనన్న నెఱ మెప్పులిప్పుడు మఱచినాఁడవులోన నెఱుకమాలి." అచ్చ. అ, కాం.

మెయి. దే. అవ. కొన్నియెడల తృతీయావిభక్తియందుగువచ్చెడు ప్రత్యయము. (ఉదా. అలుకమెయి, చలముమెయి. మొ.)— వి. 1. దేహము; "క. మయునమ్ములు సురవర్ధకి, మెయిఁగాఁడి." హరి. ఉ. ౧౦, ఆ. —2. విధము; "క. మిగిలిపవమానసుతుపై, భగదత్తుఁడుమత్తగజముఁబఱపియతనినా, ళుగములఁబొదివినన మ్మెయి, మొగులురవింబొదువుదర్పముందలఁపించెఁ." భార. భీష్మ. ౨, ఆ.—3. పార్శ్వము; "ఉ. ఏవరా. రోహలుమమ్ముఁబోలమికి రూఢిగ నమ్మెయి నున్నయాజగ, న్మోహనమూర్తియర్థపతినుద్దుకుమారుఁడెసాక్షి." కళా. ౧, ఆ. "ఇరుమెయి." భార. విరా. 3, ఆ. "రెండుమెయిల." భార. ద్రో. ౫, ఆ. —4. వెంబడి. "క. ఏకరసమగు క్షేత్రము, నేకౌషధిరసమయంబయినయట్లునుమీ, యేకవిధమైనబుద్ధియ, నేకనులగు కర్మములమెయింబొకనృపా." భార. శాం. ౪, ఆ. (మయియొక్క రూపాంతరము.) (చూ. మేను.)

మెయికొను. దే. అ. క్రి. 1. సమ్మతించు; "క. ఓ, డకుమున్నతపదమునిచ్చుటకుమెయికొంటిఁ." భార. అను. ౪, ఆ.—2. కలుగు; "క. ఉత్తములాశ్రితులఁగృపా, యత్తతఁజేపట్టిప్రోతురటుగాకున్నఁ, రిత్తచనఁజేయరొండుని, మిత్తంబునవైనబ్రతుకు మెయికొనఁజాతురే." భో. ౧, ఆ.—3. అనుకూలించు. (చూ. మెరమెర మూఁడవయర్థము.) స. క్రి. అంగీకరించు. (చూ. కొఱు. వి. మొదటి యర్థము.) (మయికొనుయొక్క రూపాంతరము.)

మెయికోలు. దే. వి. మయికోలుయొక్క రూపాంతరము.

మెయితాలుపు. దే. వి. ప్రాణి, శరీరి. "మెయితాలుపుపిండువులను." అచ్చ. యు, కాం.

మెయిపాలు. దే. వి. సమభాగము. "క. పెక్కండ్రు పూఁటవారలు, తక్కొని మెయిపాళ్లనరువఁదగు నొకచాయన్, బెక్కండ్రుపూఁటయగుచో, నొక్కని చేనైననర్థ మొడయుండుగొనున్." సం. "బహవస్స్వర్యదిస్వాం శైర్దద్యుః ప్రతిభువో ధనమ్, ఏకచ్ఛాయాశ్రితేష్వేషు ధనికస్యయథారుచి." విజ్ఞా. వ్య, కాం.

మెయిమఱపు. దే. వి. మయిమఱపుయొక్క రూపాంతరము.

మెయిమెయి. దే. వి. విశ. మయిమయియొక్క రూపాంతరము.

మెయివడి. దే. వి. విశ. మయివడియొక్క రూపాంతరము.

మెయిమఱువు. దే. వి. మయిమఱువుయొక్క రూపాంతరము.

మెరక. వై. వి. మిట్టనేల.

మెరమెర. దే. వి. 1. మనోవ్యథ; (చూ. మురమురరెండవయర్థము.) 2. సంశయము; "క. అఁపథముపాపమనిమది, మెరమెరగలదేనిఁదగిన మెయిఁజేయుముభూ, వరప్రాయశ్చిత్తము." భార. శాం. ౧, ఆ.—3. భేదము. "క. పురుషుఁడనవేటొకండే, పురుషోత్తముఁడైనయేన పురుషోత్తమతా, స్ఫురణకుఁబురుషత్వంబను, మెరమెరగల దదియకాదమెయిఁకొనుఁగ్రియకున్." భార. భీష్మ. ౧, ఆ.

మెరమెరపడు. ద్వ. అ. క్రి. సంశయపడు. "వ. అనిచిత్తమోహంబుఁదిరస్కరించుచు నిజాశ్రమంబునకువచ్చితనమనంబున మెరమెరపడుచుండె." వా. ౪, ఆ.

మెరమెరపాటు. ద్వ. వి. మెరమెరపడుట. "ద్వి. సరకుసేయుదునె యీసామ్రాజ్యపదవి, మెరమెరపాటేలమీకుఁజిత్తముల." హరిశ్చ. ౧, భా.

మెరమెరలాడు. దే. అ. క్రి. (మెరమెరలు+ఆడు.) బాధపడు. (కన్ను మెరమెరలాడుచున్నది, మనసు మెరమెరలాడుచున్నది.)

మెఱచు. దే. అ. క్రి. తళుక్కని ప్రకాశించు. "వ. నీలకంఠనిటలతటనయనశిఖిశిఖాసహాయంబైన తెఱంగున మెఱచిచఱచినంబురంబు సొరకకృత్యాకృత్యంబులేక మరలిపఱవంజొచ్చిన." ఉ, హరి. 3, ఆ.

మెఱపు. దే. వి. 1. తటిత్తు; (చూ. ఒఱపు. వి. ఆఱవయర్థము, తఱపి. వి. రెండవయర్థము.) 2. ప్రకాశము. "ఎ, గీ. మదురుగోడల మెఱపువాల్మగల యొఱపు." రసి. ౧, ఆ.

మెఱపుఁదీఁగ. ద్వ. వి. (మెఱపు+తీఁగ.) 1. జ్యోతిష్మతీలత; 2. తీఁగవంటి మెఱపు.

మెఱము. దే. స. క్రి. నాటినశల్యాదికము ఇటునటు మెదల్చు. "వ. నెఱఁకుల మెఱుంగుటమ్ములు మెఱమిన తెఱంగుననతనిచరిత్రస్మరణంబులు చిత్తోత్కంపంబునొనరింప." లక్ష్మీ. ౪, ఆ.—వి. పిల్లమెఱము. "చ. మెఱములువైచుచున్ నెగసి మేఘములంటుచు." రా. యు. కాం. "క. చుట్టుకపడెనతఁడ, వ్వనజాతుని యెదుర మెఱము వైచినభంగిన్." జై. 3, ఆ.

మెఱమెచ్చు. దే. వి. (మెచ్చు+మెచ్చు.) మిక్కిలి మెచ్చు. "చ. మనములమాటలం గ్రియలమన్నన లీనొకనాఁడు నెట్టికా, మినులకు గారవంబు మెఱమెచ్చులకైపచరింతుఁగాని." పా. ౧, ఆ.

మెఱయు. దే. అ. క్రి. 1. ప్రకాశించు; 2. బయలుపడు. "మెఱసి యేనుపచారము వేడ్కసేయఁగా నెన్నఁడు మెచ్చునో." భాను. 3, ఆ.—అం, ప్రే. బయలుపఱచు. "క. కఱచు నెడ నేయు నెడపడిఁ, బఱచు నెడం బెనఁగు నెడన పౌరబలంబుల్, మెఱయు నెడ భీముసకునం, దొఱఁగీడ్వడఁదొడఁగిరుద్ధతులు రాజసుతుల్." భార. ఆది. ౫, ఆ.

మెఱవడి. దే. వి. 1. అతిశయము; (చూ. చేగ.) 2. ఉద్రేకము; "ఎ. అనిమతియుఁ జెఱకువిలుతుని మెఱవడి నెఱసిన నెఱబిరుదు వెఱఁగుపడి." భాగ. ౭, స్కం.—3. ఊరేగింపు; (వాడుకయందు మెఱవణి.) 4. ధైర్యము; "ద్వి. మెఱవడి మైనురమెఱికి." భాగ. ౫, స్కం.—5. నేర్పు; "వ. వివిధాయుధంబులసాధనంపు మెఱవళ్లెఱింగించు నక్తంచరులును." ఉ, రా. ౪, ఆ.—6. గౌరవము. "క. వెఱవకు నీవు నురేశ్వర, యొఱుఁగుదు నే నాదురాత్మ నిప్పుడవానిన్, మెఱవడియొనర్చి బుద్ధులు, గఱపివరంబిచ్చి శాంతుఁగావింతురహీ." (మెఱవడియొనర్చి—గౌరవించియనుట.) శేష. ౪, ఆ.—విశ. ప్రకాశితము. "క. నెఱవగ్గలింపఁజొక్కులు, తఱచైపొడముటయుఁగగనతల మొప్పారెన్, మెఱుఁగారుముత్యములచే, మెఱవడియగునల్లపట్టు మేల్కట్టుగతిన్." విక్ర. ౨, ఆ.

మెఱికలు. దే. వి. బ. పొట్టువీడీవీడనిబియ్యము.

మెఱియ. దే. వి. గుండ్రాయి.

మెఱియఁడు. దే. విణ. చలింపనివాఁడు. (చూ. మడియఁడు.)

మెఱియత. దే. విణ. చలింపనిది. "క. నీవిచ్చో మెఱియతవయి, కావరమునవలసినట్లుగయ్యాళింపం, గా వెఱచి పెద్ద మొఱగా, నేవీరినివారిఁదగిలియేల వచింతున్." కళా. 3, ఆ.

మెఱుఁగు. దే. వి. 1. తళతళయనెడు కాంతి; (చూ. మిడుఁగుఱు రెండవయర్థము.) 2. మెఱపు; "చ. ఎద్దులాఱునూ, ఱునురథముల్ శతంబును మెఱుంగుల మొత్తమువోనియంగనా, జనశతకంబు." భార. కర్ణ. ౨, ఆ.—3. నెయ్యి మొదలైనవానిజిడ్డు.

మెఱుఁగుఁబోఁడి. దే. వి. (మెఱుఁగు + పోఁడి.) 1. మెఱపువలెమనోజ్ఞాంగులగుఆఁడుది; 2. ఆఁడుది. "క. మెఱుఁగుంబోఁడికిమరాళి మృదుమధురోక్తిన్. వ. ఇట్లనియె." ప్రభా. 3. ఆ.

మెఱుఁగుడుఁబురువు. ద్వి. వి. (మెఱుఁగుడు+పురువు.) మిడుఁగుఱుఁబురుగు. (చూ. పెంటి.)[రూ. మెఱుఁగుడుఁబుర్వు. "చ. సురవరవర్ణినీమణులు శోభిలుమింటనటించు వేళఁద,త్పురహరినీలహర్మ్యశ్రీ రుచిఁబొల్చినచోటులఁద్రోవగానమిన్, గరమరుదందితత్తఱిలిగాఢతమఃపటలప్రచారులై, యురుతరదీప్తులన్ మెలఁగుచుండ్రు మెఱుంగుడుఁబుర్వులోయనన్." (ఇచ్చట మిడుఁగుఱుఁబుర్వు అనియున్నను బాధలేదు. అయినను ప్రతులయందిట్లుపాఠము కనఁబడుచున్నది.) భల్లా. ౧, ఆ.]

మెఱుఁగుజెట్టి. దే. వి. ఒకదినుసుజెట్టి, కుటరాజము.

మెఱుఁగుడునూనె. ద్వి. వి. మెఱుఁగునకై పెట్టెలులోనగువాని మీఁదపూసెడు పూఁతనూనె.

మెఱుఁగునల్లలు. ద్వి. వి. బ. (చూ.) కట్లదండ.

మెఱుఁగురిక్క. ద్వి. వి. 1. పగడము; 2. కాంతిగల నక్షత్రము.

మెఱుకు. దే. స. క్రి. పెఱుకు, ఉత్పాటించు. "సీ. మెడపట్టిగోర్గ్గాండి మెఱికిపుచ్చుఁడుపీనిగ్రుడ్లుచెక్కుల నెత్తురులుస్రవింప." సం. "ఉత్పాటయాస్యనేత్రేత్వంనిధాయచరణౌగళే." కాశీ. 3, ఆ.

మెఱుము. దే. అ. క్రి. మెఱచు. "క. ఉఱుముచు మెఱుముచుఁబిడుగులు, వఱలఁగనల్లడలఁబడనవారితవృష్టుల్, గుఱుకొనికురియఁగఁబంచెను, మఱియును నయ్యనలుమీఁదమఘవుండలుకన్." భార. ఆది. ౮, ఆ.—స. క్రి. పొడుచు. "వ. లాసియు ద్రేసియుఁదఱిమియు మెఱిమియు." ఉ, హరి. 3, ఆ.—వి. మెఱపు.

మెలఁకువ. దే. వి. 1. మేలుకొనుట; (ఎంతలేపినను వానికి శీఘ్రముగ మెలఁకువరాదు.) 2. వర్తనము; "వ. వీరెల్లనిట్టిట్టి మెలఁకువల మెలంగుదురనితత్కృతాకృతంబులు నేనయెఱుంగుదు." భార. ఆర. ౫, ఆ.—3. జాగరూకవర్తనము. "క. జలతైలబిందువయినా, మెలఁకువ వెల్లివిరియైన మేలగునే." ఉ, హరి. ౫, ఆ.—4. జీవనము; "ఆ. తలముదప్పిన మెలం, కువలకల్పులియ్యకొనుటదగునె." భార. విరా. ౧, ఆ.—5. సంచారము. "క. మెలఁకువలుచాలితమతమ, నిలయంబులకేగనిపచ్చినెమిళులు." కవిక. ౪, ఆ.

మెలఁకువకాఁడు. దే. విణ. జాగరూకతగలవాఁడు, జాగరూకుఁడు.

మెలఁగు. దే. అ. క్రి. 1. వర్తించు; (చూ. కలపనఁబిండి.) 2. జాగరూకతతో వర్తించు; 3. సంచరించు; "ఆ. కుడిచినపుడునిద్ర గూరినయప్పుడు, మేలుకొనినయపుడు మెలఁగినపుడు, విష్ణుకీర్తనంబు విష్ణుచింతయుఁగాని, పలుకఁడొండుబుద్ధిఁదలఁపఁడొండు." లక్ష్మీ. 3, ఆ.—4. జరగు. "సీ. పాలుపారఁగాబోరగిలి పాన్పునాల్గుమూలలకును వచ్చును మెలఁగి మెలఁగి." హర, పూ. ౫, ఆ.

మెలఁచు. దే. ప్రే. మెలఁగఁజేయు. "వ. దవ్వుచేరువలనిర్ధార్యంబులుగా మెలంగఁదేజికాళ్వంబు మెలంచుచు." స్వా. ౪, ఆ.

మెలఁత. దే. వి. నెలఁత, ఆఁడుది. "ఉ. ఆపురిమించుటోవరుల నాడు మెలంతలగాన మాధురిన్." హ న. ౧, ఆ.

మెలఁతుక. దే. వి. (మెలఁత+ఉక.)— పై.— (స్వార్థమున ఉక.)

మెలకు. దే. అ. క్రి. జ్వలించు. (చూ. మిడుకు మొదటియర్థము.)

మెలపు. దే. ప్రే. మెలయఁజేయు. "క. పగవానిపక్షమునవాఁ, డగపడినంగాచెనేని నాసన్నునిఁగాఁ, దగ మెలపఁదగదు మెలపిన, దిగునుపమర్దనుఁడుఁబోలెధీరహితుండై." పంచ. నా. 3, ఆ.—వి. 1. జాగరూకత; "ఆ. అతఁడు సెజ్జఁజేరియధిపుతోనియ్యెడ, నిద్రవోదు నేను నృపవరేణ్య, మీరునిదురడక్కి మెలపుననాచరణంబులొత్తుచునికినాకుఁబ్రియము." భార. అను. ౨, ఆ.—

2. మెత్తఁబాటు; (చూ. రూ. మెల్పు.) 3. భ్రమణము; "సీ. మృగమదంబును మదమృగమునుహసియించుఁగాయంపువలపుకన్దోయిమెలపు." అని. ౨, ఆ. — 4. చలింపమి. "సీ. పూఁదీగెఁబోఁడిచూపులుచంచలములని మెలపు సెన్నడుపునమేళవించె." (ఇక్కడ చలింపమియనఁగా మాంద్యము. చూ. ముందు వెనుకటిచరణములు.) విక్ర. ౪, ఆ. — (రూ. మెల్పు. మెత్తఁబాటునకు.— "న. విదురాది సజ్జనులబుద్ధికి రాను చితంబుతోఁడి మెం, ల్పుఁబరు సందనంబునను భూపకు లెల్లవిని౦గ నాడుమీ." సం. "తత్తత్తేశపభాషే ఖాఽసాంత్వంహాయదినేతరత్." భార. ఉద్యో. 3, ఆ.)

మెలయు, యు. దే. అ. క్రి. 1. వర్తించు; 2. జాగరూకతతో వర్తించు. వై. పెనఁగు. (కలసిమెలసి.) (చూ. మెలుసు.)

మెలి. వై. వి. మెలిక, మెలుసు, పెన.

మెలిక. వై. వి. మెలి, మెలుసు, పెన.

మెలిగొను. ద్వి. అ. క్రి. (మెలి+కొను.) పెనఁగొను. "హారముల్ మెలిగొన." కవి. 3, ఆ.

మెలిదారము. ద్వి. వి. తాళ్లపనివారు దిండుప్రక్క కొయ్యలకుఁగట్టెడు బిగిదారము.

మెలియు. వై. అ. క్రి. పెనఁగు. (చూ. మెలుచు, మెలుసు.) (మెలయుయొక్క రూపాంతరము.)

మెలిపడు. వై. అ. క్రి. (మెలి+పడు.) మెలిగొను.

మెలివెట్టు. ద్వి. స. క్రి. మెలివేయు.

మెలుచు. వై. ప్రే. మెలియఁజేయు, పెనఁచు. "చ. కేలఁగేల్, మెలిచినబెళ్కుబేడిసలమిన్నలచిన్నెలవెన్నుదమ్ము బల్, సోలపులచూపులత్తుకలజొత్తిలఁజూచెలతాంగినాథునిన్." రస. 3, గుచ్ఛము.

మెలుసు. వై. వి. మెలిక. "వ. ఇనుపగొలుసులమెలుసులువీడిన." భాగ. ౧౦, స్కం. పూ.

మెల్త. దే. వి. మెలఁతయొక్క రూపాంతరము. నై. ౫, ఆ.

మెల్తుక. దే. వి. మెలఁతుకయొక్క రూపాంతరము. మార్క. ౫, ఆ.

మెల్ల. దే. విణ. 1. కంటికడకొఱఁగినది; (చూపు.) (మెల్లకన్ను.) 2. మేలైనది. (వానిపనియిప్పుడు మెల్ల.)—క్రి. విణ. తిన్నగా. (మెల్లగా మాటాడుము, మెల్లగా రమ్ము.)

మెల్లకంటి. దే. విణ. (మెల్ల+కన్ను.) కేకరాక్షుఁడు, కేకరాక్షి.

మెల్లన. దే. వి. 1. తిన్నన; 2. అల్లన. (విశేషణమైనచో మెల్లనినగవు, మెల్లనిమాట. మొ.) (చూ. అలకన.)

మెల్లా. దే. ... వేనిక. (ఇది వాడుకలోనిది.)

మెల్లె. దే. వి. (...) చివక. "ఈఁతమెల్లె." మొ.

మెసఁగు. దే. స. క్రి. తిను, భుజించు. "చ. తనకెనయైనబాలకులఁ దా ... గొల్లలిండ్లకున్, జని పెను వెన్న ముద్దలు మెసంగుచు." రుక్మి. ౨, ఆ.

మెసవు. దే. స. క్రి. మెసఁగుయొక్క రూపాంతరము.

మెహనతు. హిం. వి. పాటు, కష్టము, బహుమతి.

## మే.

మే. దే. వి. 1. శరీరము; "విధినా మేఁ బ్రాణముల్ నిల్పె." భార. శల్య. ౨, ఆ.—2. విధము; "నీతలఁపు మేగెలుపన్ వశమే." భార. ద్రో. ౫, ఆ.—3. పార్శ్వము. "ద్వి. ఇరుమేల." భాగ. ౮, స్కం. (మెయియొక్క రూపాంతరము. చూ. మేను.)

మేండము. సం. వి. అ. పుం. మేషము, పొట్టేలు.

మేంఢ్రించు. దే. స. క్రి. భేదించు. (చూ. పంటించు)

మేంథి. సం. వి. ఈ. స్త్రీ. మెంతి?

మేఁక. వై. వి. 1. ఛాగి; 2. ఛాగము.

మేఁకతిండి. ద్వి. వి. తోఁడేలు, వృకము.

మేఁకపోతు. ద్వి. వి. ఛాగము.

మేఁకరాసి. వై. వి. మేషరాశి.

మేఁకసారము వై. వి. స్వరవిశేషము, గాంధారము.

మేఁగు. దే. స. క్రి. 1. పూయు; "సీ. లోకపాలోన్నతప్రాకారములయందు మృగమదపంకంబు మేఁగిరొక్కొ." భో. ౨, ఆ.—2. ఆవరించు. (చూ. మ్రేఁగు.) (మ్రేఁగుయొక్క రూపాంతరము.)

మేఁడి. వై. వి. నాఁగటిదుంప వెనుక నిలిపినకొయ్య*. (చూ. పగ్గము.) (దీనిని మేఁడికఱ్ఱయనియు వాడుదురు.)

మేఁడికోరు. వై. వి. మేఁడిపాలు.

మేఁడిచీల. ద్వి. వి. మేఁడిజాతిరాకుండ వేసినచీల.

మేఁడితోఁక. ద్వి. వి. దున్నెడువాఁడు పట్టుకొనుటకు మేఁడిచివరను అడ్డముగా చెక్కిన చిన్నకొయ్య.

మేఁడిపాలు. ద్వి. వి. సేద్యకాఁపునకువచ్చు ధాన్యభాగము. (నేలయొడయునికివచ్చు ధాన్యభాగము కోరు.)

మేఁడిసోగ. ద్వి. వి. మేఁడితోఁక.

మేఁత. దే. వి. పశ్వాద్యాహారము.

మేఁతరి. దే. వి. (మేఁత+అరి.) కొందఱు శిల్పులలో ముఖ్యుఁడు. విణ. తిండిపోతు.

మేఁతాడు. దే. అ. క్రి. (మేఁత+ఆడు.) మేఁతమేయు. "పొలమున మేఁతాడి." పంచ. వేం. 3, ఆ. (రూ. మేఁతలాడు. "సీ. మిన్నేటిదరులందు మేఁతలాడుచునున్న యెదుటు రాయంచలేఁ గొదమ యనఁగ." సా. ౧, ఆ.)

మేకము. సం. వి. అ. పుం. మేఁక, ఛాగము.

మేకు. దే. వి. గూటము.

మేకొను. దే. అ. క్రి. 1. సమ్మతించు; 'ఇందొక్కరుఁడైనఁ గేశవుహితోక్తికి మేకొనఁడె యెయ్యె." భార. ఉద్యో. ౪, ఆ.—2. కలుగు; (చూ. చెందు, బెట్టిదము.) 3. పూను. "ఉ. మేలున సంతసిల్లు నెడ మేకొని యాపద పొందు నాపదం, దూలఁగఁబూని సౌఖ్యములుదోఁచు." భార. అర. ౫, ఆ.—స. క్రి. పొందు. "వృత్రునిఁ జంపినప్పుడె సురేంద్రుని మేకొనె బ్రహ్మహత్య." ఉ. రా. ౭, ఆ. (ప్రే. మేకొలుపు.) (మెయికొనుయొక్క రూపాంతరము.)

మేకోలు. దే. వి. మేకొనుట. (పూనికకు. — "క. తమతమ దేశంబులకై, మిముఁగొని పాండవుల గెలుచు మేకోలునభూ, రమణులు కొందఱు వచ్చిరి." భార. భీష్మ. ౧, ఆ.)

మేఖల. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడుదానియొక్క యొనిమిది పేటల మొలనూలు; 2. కొండనడుము; 3. చిలుకడత్రాడు.

మేఖలకన్యక. సం. వి. ఆ. స్త్రీ. నర్మదానది.

మేగలి. దే. వి. పూనిక. "క. ఆటోపమడఁగియుచ్చటి, మేటిమగలఁ జిచ్చవడిరి మేగలిఁ గర్ణుం, డేటల వికిఁగవిసెదను, జ్యాటంకృతి సెలఁగఁ బొండవాగ్రజుఁ బెలుచన్." భార. కర్ణ. ౩, ఆ. (ఈ పదము ఇక్కడ నొకచోటనే కానఁబడుచున్నది గాన ఇట్లొకపదము కలదని దృఢముగా చెప్పుటకు ధైర్యము చాలదు. పదమిట్లుండునేని సందర్భముఁ బట్టి దీనికీయర్థము ఉండవచ్చునని నిర్ణయించి వ్రాయఁబడినది.)

మేఘద్వారము. సం. వి. అ. న. ఆకాశము, మొగులుదారి.

మేఘనాదము. సం. వి. అ. పుం. 1. ఉఱుము; 2. చిత్తికూర. డు. 1. రావణుని కొడుకు; 2. వరుణుఁడు.

మేఘనాదానులాసి. సం. వి. న్. పుం. నెమిలి.

మేఘనామము. సం. వి. న్. పుం. నిడుముస్తె.

మేఘపుష్పము. సం. వి. అ. న. 1. ఉదకము; 2. తూర. పుం. కృష్ణుని తేరుగుఱ్ఱములలో నొకటి. (చూ. రథ్యము.)

మేఘము. సం. వి. అ. పుం. 1. మబ్బు; 2. ఏనుఁగు కాఁకియందలి మదము; 3. ముస్తె.

మేఘవాహనుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు, మబ్బురౌతు.

మేచకము. సం. వి. అ. న. చీఁకటి. పుం. 1. నెమిలి పురికన్ను; 2. నలుపు. విణ. నల్లనిది.

మేజా. హిం. వి. బల్ల.

మేజువాని. హిం. వి. విందు

మేజోడు. గ్రా. వి. పాదరక్షలకులోపలఁ గాలికి వేయు జోడు.

మేట. దే. వి. (చూ.) ఎక్కలి.

మేటరి. దే. విణ. (మేటి+అరి.) మేటి, శ్రేష్ఠుఁడు. "జ్యోతిశ్శాస్త్రులకెల్ల మేటరివి." భాగ. ౧౦, స్కం. పూ. (స్వార్థమున అరి.)

మేటి. దే. వి. 1. అధిపుఁడు. "తే. అంబురాశి నదంబుల కచలములకు, నాహిమాద్రిపత్రులకుఁ గశ్యపసుతుండు, మేటియైయొప్పు క్రియ సురకోటికెల్లఁ, బ్రభుఁడవీ వొక్కరుఁడ కావె పద్మనాభ." హరి. పూ. ౭, ఆ.—2. కసవువామి. విణ. శ్రేష్ఠము. "పశువులను మేటియాజము." భార. అశ్వ. ౩, ఆ.

మేటి. ఆం. వి. చిల్లఱపనులు చేయు సేవకుఁడు.

మేటిల్లు. దే. అ. క్రి. అతిశయించు. "క. సభా, భూమికిఁ జనియెడువారికి, శ్రీ మేటిల్లంగ మంచిచీరలు వలయున్." హరి. పూ. ౯, ఆ.

మేడ. దే. వి. (చూ.) సౌధము. "క. ఆమగువయట్లు పలుకుచు, నా మేడన్ వారనిలిపియరుగు తెఱఁగుత త్స్వామినియగు గణికామణి, తామఱుఁగున నుండి చూచి తలఁకెడుమదితోన్. క. ఎవ్వారో దివ్యస్త్రీ, లివ్వరసౌధంబు నాశ్రయించిరి." కళా. ౬, ఆ.

మేడము. వై. వి. 1. కూడిక; "సీ. రథికహస్తిపకతౌరంగికుల్ వలగొని మేడమైకనుచూపుమేరనడువ." ఉ. రా. 3, ఆ.—2. యుద్ధము*. (కోడిమేడము.) (చూ. మేడముపొడుచు.)

మేడముపొడుచే. ద్వ. అ. క్రి. యుద్ధము చేయు. "క. ఓడిటినన్నన్, వారక మేడముపొడుతుర." బస. ౬, ఆ. (చూ. పొడుచే.)

మేడి. దే. వి. అత్తి, ఉదుంబరము?

మేడుపడు. ద్వ. అ. క్రి. (చూ.) మేడ్పడు.

మేడెము. దే. వి. చెక్కడపుజోడుకీయంచుపనితరము. (మొదటిరూపము మేడియము.)

మేడ్పడు. ద్వ. అ. క్రి. అజ్ఞతఁబొందు. (చూ. మిడుఁగుఱు.) (మేడుపడుయొక్క రూపాంతరము.)

మేఢ్రము. సం. వి. అ. పుం. మేహనము.

మేతాలువు. దే. వి. మెయితాలువుయొక్క రూపాంతరము.

మేదకము. సం. వి. అ. పుం. (చూ.) పెల్లెము.

మేదకుఁడు. దే. విఱ. కపటములేనివాఁడు. "ద్వి. సుకవాసిపనిపండమాపుగుజ్జింబు, మామిడీక్రింది సోమరిమేదకుండు." హరిశ్చ. ౨. భా.

మేదర. దే. వి. వెదురుచేఁపలులోనగునవియల్లిజీవించెడి యొకానొకజాతి. (మేదరవాఁడు, మేదరది.)

మేదరసాని. ద్వ. వి. మేదరవానిభార్య.

మేదరి. దే. వి. (మేదర+ఇ.) మేదరవాఁడు, కటకారుఁడు. (చూ. ప్రావ.)

మేదస్సు. సం. వి. స్. న. మెదడు.

మేదావి. దే. వి. ఔపాసనాగ్నిమసి. "సీ. తలకుజన్నిదముమేదావిబొట్టునుజన్నిపట్టెవర్ధనమునుజిట్టితడుపు." కళా. ౪. ఆ.

మేదించు. వై. స. క్రి. మర్దించు. (చూ. కులుకు. క్రి. రెండవయర్థము.) (మెదించుయొక్క రూపాంతరము.)

మేదిని. సం. వి. ఈ. స్త్రీ. భూమి, వసుధ, నేల.

మేదురము. సం. విఱ. (అ ఆ. అ.) చక్కనై నునుపైనది.

మేధ. సం. వి. ఆ. స్త్రీ. ధారణాశక్తిగలబుద్ధి. అ. పుం. ము. యజ్ఞము.

మేధావి. సం. వి. న్. పుం. చిలుక. విఱ. మేధగలవాఁడు.

మేధి. సం. వి. ఇ. పుం. పసులఁగట్టుటకు కళ్లమునఁ బాఁతినగుంజె, కట్టుగొఱ్ఱు.

మేధ్యము. సం. వి. అ. పుం. ముంజికసవు. విఱ. పవిత్రము.

మేన. ఉభ. దే. వి. తోడఁబుట్టినదానియొక్కయు తండ్రితోడఁబుట్టినదానియొక్కయు తల్లితోడఁబుట్టినవానియొక్కయు దేహసంబంధము. ఉదా. మేనగోడలు, (తోడఁబుట్టినదానికూఁతురు.) మేనత్త, (తండ్రితోడఁబుట్టినది.) మేనబావ, (తనకంటె పెద్దవాఁడైనమేనత్తమేనమామలకొడుకు.) మేనమఱఁదలు, (తనకంటె చిన్నదైన మేనత్తమేనమామలకూఁతురు.) మేనమఱఁది, (తనకంటెచిన్నవాఁడైనమేనత్తమేనమామలకొడుకు.) మేనమామ, (తల్లితోడఁబుట్టినవాఁడు.) మేనల్లుఁడు, (తోడఁబుట్టినదానికొడుకు.) మేనవదిన, (తనకంటెపెద్దదైన మేనత్తమేనమామలకూఁతురు.)—సం. వి. ఆ. స్త్రీ. మేనక.

మేనకాత్మజ. సం. వి. ఆ. స్త్రీ. మేనకకూఁతురు, పార్వతి.

మేనటికము. దే. వి. తోడఁబుట్టినదానియొక్కయు తండ్రితోడఁబుట్టినదానియొక్కయు తల్లితోడఁబుట్టినవానియొక్కయు దేహసంబంధభావము.

మేని. దే. వి. కాంతి.

మేను. దే. వి. 1. శరీరము; 2. జన్మము; "క. ఈమేన నెవ్వనికి నే, నేమియునప్రియముసేయనెంతయు నాతో, ల్బామునఁ నొనరించినయది, యేమైనఁగలిగె నేనియొఱఁగింపుతగన్." శేష. ౨, ఆ.—3. పార్శ్వము. "క. బంబోతద్దాసరియ, ఫుంబదహతులం గపోణిపోటులనిరుమే, నంబొడుచుచుఁబెనఁగుచుఁబో, వంబట్టిపటంబుచేర్చివాఁడిట్లనియెన్." ఆము. ౬, ఆ. (మెయి, మై, మే, మేను శబ్దములే గ్రంథములయందు పార్శ్వార్థకములుగా కనఁబడుచున్నవిగాని మేల అని యొకశబ్దము ఆ యర్థము కలదిగా కనఁబడలేదు. అట్లుండ నీతిచంద్రికయందు "ఒకమేల." అని ప్రయోగింపఁబడియున్నది. దానికి ఆకరమేమో తెలిసినదికాదు.)

మేనుతాలువు. దే. వి. మేతాలువు, శరీరి. "ఎ. గీ. మేనుతాలువుగమికల్ల మేల్దనర్చు." అచ్చ. బాల. కాం.

మేనేజరు. ఆం. వి. పైయధికారి, కార్యనిర్వాహకుఁడు.

మేపరి. దే. విఱ. (మేపు+అరి.) తినువాఁడు, భక్షకుఁడు. "పాలమేపరి." అచ్చ. అర. కాం.

మేపు. దే. ప్రే. మేయఁజేయు. వి. 1. పశుపక్ష్యాద్యాహారము; (చూ. మలపు మొదటియర్థము.) "ఎసరయుఁగ వెన్నయుమేపుమేపునొసఁగుచుఁ." పాండు. ౪, ఆ. "భాస్వరవిలసితవృత్తము. గోపురవిలసనమాఁపినమాఁపుఁ ఘోరహాలాహలమొనసినమేపుఁ." సమీ. ౪, ఆ.- 2. దోసెపిండిమొ

దలైనదానికి నూటి కూడఁజేర్చెడు మినుపపప్పు లోనగునది.

మేపుట్టువు. దే. వి. 1. కూఁతురు, తనూజ; 2. కొడుకు, తనూజుఁడు. "సోఁకు జేనియనుఁగు మేపుట్టువు." అచ్చ. యు, కాం.

మేమఱువు. దే. వి. కవచము. (మెయిమఱువు యొక్క రూపాంతరము.)

మేముడు. దే. వి. మేకోలు, సన్మతి.

మేమెయి. దే. వి. అనాయాసము. (చూ. మైమై.) క్రి. విశే. అనాయాసముగా. "మేమెయియాత్రనిఁ దాఁకెన శస్త్రవిద్యాలసితుండు సాత్యకి." భార. శల్య. ౧, ఆ.

మేయు. దే. స. క్రి. పశ్వాదులు మేఁతఁదినుట. "పచ్చికమెచ్చికమేయు." (ఇక్కడ జింకకర్త.) పంచ. నా. ౨. ఆ. "అహవుడు మేఁతమేసి." (ఇక్కడ పక్షికర్త.) భాగ. ౭. స్కం. "ఒలికినదానిమేయుటను." (ఇక్కడ ఎలుకకర్త.) కాశీ. ౬. ఆ. (చూ. ఒత్తు. విశే.)

మేర. దే. వి. 1. ఎల్ల; 2. మర్యాద; "క. పూరరయనిర్ఘోషంబుల, మేరలు నెఱుకలు సుగలవె." లక్ష్మీ. ౫. ఆ.—3. క్రమము; "ధరిత్రి దాశరథి మేరల్ దాల్చి నారా." భాను. ౧, ఆ.—4. ఏర్పాటు. "క. ఊరూరఁ దప్పకుండఁగ, మేరలు చేయింతు నిపుడు మీ శిష్యులకున్, వారంబులొసఁగునట్లును, దారితపర్ణాశనములు తగనొనరింతున్." రాజ. 3. ఆ.

మేరు. దే. వి. (చూ.) మేరువు.

మేరువు. ఉభ. దే. వి. 1. (చూ.) సారువ; "ఎ. గీ. ఎండుఁబగడపు మేరువులెత్తు వారు." య. ౪, ఆ.—2. శిఖరమునందుంచెడు మణి. "సీ. పైపూఁతయుచిగాక ప్రతియొకిన్నరకాయలరిది మేరువు తలయుంపినిడిన." వసు. ౨, ఆ.—3. హారమధ్యమునందు వ్రేలెడుమణి.—సం. ఉ. పుం. హేమాద్రి.

మేలమాడు. దే. స. క్రి. (మేలము+ఆడు.) పరిహాసము చేయు. "తోడికోడండ్రు పదినెలు మేలమాడుచుండ." వి, పు. ౭, ఆ.

మేలము. దే. వి. పరిహాసము. "మేలములఁగుమారుల కుఁదగన్. వ. ఇంపు పుట్టించుచు." సం. "కృతాతిథ్యస్తు గోవిందస్సర్వాన్ పరిహసన్ కురూన్." భార. ఉద్యో. 3, ఆ.

మేలిమి. దే. వి. 1. ఆధిక్యము, ఔత్కృష్ట్యము, గౌరవము; (వృత్తియందంత్యవర్ణలోపము. ఉదా. "మేలికూడు గూరలు." "మేలిపటికంపు గోడలు." మొ.) (ఇట మేలియనఁగా మేలిమిగలయని యర్థము.)—2. అపరంజి.

మేలిల్లు. దే. వి. (మేలు+ఇల్లు.) మేడ, సౌధము.

మేలు. దే. వి. ఏ. 1. శుభము; "క. కర్మముల మేలునిచ్చును, గర్మంబుల కీడునిచ్చు." భాగ. ౧౦, స్కం. పూ.—2. ఉపకారము; "వెండియుఁగడు మేలొనరించు."—3. పుణ్యము; "తే. మేలు రెండులోకంబుల మేలు తెచ్చుఁ, గీడు చేసినఁ దప్పదు కీడయగును." భార. అను. ౧, ఆ.—4. సుకృతము; "ఎ. గీ. ఇంతియ, కానిలేదె తొంటిమేనఁజేసి, నట్టిమేలు." భార. స్త్రీ. ౨, ఆ.—5. లాభము; "ద్వి. మేలమాడుచు మంచిమేలాయెననుచు." సా. ౨, ఆ.—6. విశేషము; "ఈవిశ్వంబునఁ గల్గు మేలిదియపో." కళా. ౨, ఆ.—7. వలపు; "క. మెలఁతకుఁ బతిపైనైనను, మెలఁతుకపైఁ బతికినైన మేలుగలిగెండున్, గలదది మెలఁతకుఁ బతికిన్, వలపు సమంబగుట జన్మవాసన చెలియా." స్వా. ౬, ఆ.—8. మదము. (చూ. జోగా.)—విశే. 1. శుభమైనది; 2. అధికము; "మ. ఈ తనతో సాటియనంగ మేలననమందశ్రీవిలాసంబుచేఁ, గాని యీలోకములెల్ల మేలుదును." నిర్వ. 3, ఆ. 3. శ్రేష్ఠము; "యుగంబులఁ గృతంబు మేలు." భార. అర. ౨, ఆ.—4. ఉపరి. (మేలిల్లు. మేలుకట్టు. మొ.)—అవ్య. ప్రశంసనార్థకము, ఔర. "తెలివిమేలు." (చూ. బాపురే.) ఆమ్రేడితమునందు మేలుమేలు. "శా. ఆమందాకిని మాళిఁబూనినను నర్థాంగీకృతంజేసితౌ, నామేల్ మేలు." వసు. ౧, ఆ. (మేలురా, మేల్రా అనియు ప్రయోగములు కలవు. "మేల్రాయన." చంద్రా. ౨, ఆ.)

మేలుకట్టు. దే. వి. 1. ఉల్లెడ, 2. మెట్టు. "ద్వి. స్ఫటికంపు మేల్కట్లపై నెక్కలేని, కుటిలకుంతలయొట్లు గుట్టలెక్కెదవు." నళ. ౨, భా. (ఈయర్థమునకుఁ బ్రయోగాంతరము మృగ్యము.)

మేలుకను. దే. అ. క్రి. మేలుకొను. "క. నానామంజులమాగధ, గానధ్వనులెసఁగ మేలుకని." విక్ర. ౪, ఆ. (రూ. మేల్కను. "క. అనిలసుతుఁడంతటనమే, ల్కని నీల్గుడు." భార. ఆది. ౫, ఆ.)

మేలుకనుపు. దే. ప్రే. మేలుకనఁజేయు, మేలుకొలుపు. "సీ. దుగ్ధాబ్ధిలోపలి తోయజాక్షుని మేలుకనిపి తీరంబునకనుపకున్న." భో. ౧, ఆ. (రూ.

**మేల్కనుపు.** "క. అనితనుఁగౌశికమునిమేల్కనుపంగాలేచి." రా. బాల, కాం.)

**మేలుకమ్మిచీర.** ద్వ. వి. ఓరమూడంగుళములవెడల్పు చాయనూలితోనేసిన అంచులుగలకోక.

**మేలుకాంచే.** దే. అ. క్రి. మేలుకొను. "యోగనిద్రారతినొంది మేలుకాంచి లోకంబులుగావింపఁదలఁప." భార. శాం, ౬, ఆ.

**మేలుకొను.** దే. అ. క్రి. నిద్రఁదెలియు. స. క్రి. మోహించు. ఉ, రా. ౪, ఆ. (రూ. మేల్కొను.)

**మేలుకొలుపు.** దే. ప్రే. మేలుకొనఁజేయు.

**మేలుకోలు.** దే. వి. మేలుకొనుట, అనబోధము.

**మేలుచేయి.** ద్వ. వి. హెచ్చు. "చ. అనితలనీవుపొందుతనయావలికెప్పుడు మేలుచేయి నా, తనయులకుంబరాక్రమము తక్కువయుం బ్రకటింప నిందు." భార. భీష్మ. ౨, ఆ.—విశే. 1. హెచ్చైనది. హెచ్చైనవాఁడు; "భుజంగమస్వామికిమేలుచేయిపటువాగ్విభవంబున." నై. ౨, ఆ. —2. గెలుపుగలది, గెలుపుగలవాఁడు. "తే. భండనంబునఁ బార్థుచేఁబడక నేడు, మేలుచేయైతి నేనియుఁ మృత్యువునకు, సెన్నఁడగపడ." భార. కర్ణ. ౨, ఆ.

**మేలుపడు.** ద్వ. అ. క్రి. వలపుగొను. "ఎవ్వనిఁజూచిమేలుపడితేయరవిందదళాక్షి." విజ. 3, ఆ. (రూ. మేల్పడు. "ఇక్కొమ్మయొక్కనిపైమేల్పడియేగుచున్నసాలపుంగాన్పించె." ఉ, రా. ౪, ఆ.)

**మేలుబంతి.** ద్వ. వి. 1. విద్యార్థులు చూచి వ్రాయడి వ్రాయమాదిరికిమీఁద మొదట వ్రాసిన అక్షరములపఙ్క్తి; 2. చూచియేదేనియొకపని నేర్చుకొనుటకుఁ గాని చేయుటకుఁగాని మొదట నేర్పడినమాదిరి. "వైష్ణవకోటికెల్లనీత్రోవయ మేలుబంతి." వి. పు. ౨, ఆ. "ఆ. హీనజన్మమటుటయెవ్వఁడేనొక ప్రాణి, సంతసిలుటముక్తిపొంతయగుట, మేలకాదెశబరి యమేల్బంతిగాఁడెన, శ్వరపుదేహమమ్మిపరముగొనుట." ఆము. ౬, ఆ.—విశే. శ్రేష్ఠము. "తే. మేదినీనాథులకునెల్లమేలుబంతి." వి. పు. ౨, ఆ.

**మేలుమచ్చు.** దే. వి. 1. చంద్రశాల; "వ. అచ్చటంబచ్చలగచ్చు మేడలమేలుమచ్చుల." (చూ. మీఁదిది, చోఁప మాడపయర్థము.) హై. ౨, ఆ.—2. బ. బాలికాక్రీడావిశేషము. (చూ. డాఁగనమ్ముచ్చులు.)

**మేలురాసి.** ద్వ. వి. తూర్పెత్తినధాన్యపుప్రోగు.

**మేలువాఁడు.** దే. విశే. వలపుకాఁడు. "తే. అంతరంగకుమేలువాఁడైమురారి." ఆము. ౫, ఆ.

**మేవ.** దే. వి. మత్స్యవిశేషము.

**మేవడి.** దే. వి. 1. నమ్రత; "ఆ. అరినృపాలు పెంపునాత్మీయశక్తియు, నెఱిఁగిమార్గవృత్తినెదురుపడక, యుచితవృత్తినతనియుద్ధతి మేవడిఁ, గడపిహీనబలుఁడుచెడక నిలుచు." భార. శాం. 3, ఆ.—2. ఉపాయము. "ఆ. కయ్యమునకువలదు కాల్ద్రవ్వనధిపసా, మమునభేదమునను మార్తునుగు, మెత్తచేసిచెటిచి మేవడిఁదప్పించు, కొను తెలిఁగిఁ టింగికొనుట మేలు." భార. శాం. ౨, ఆ.—విశే. ఉచితము. "చ. ప్రియమెసఁగఁదగఁ బిలిచి పెట్టెడుకూడదిలెస్సకూడుద, క్కయునయహీనత్వంబమకు నాపదయానెడనిట్టునట్టునే, మిక్కుటన లేనికూడదియుఁ మేవడియైచను." భార. ఉద్యో. 3, ఆ.

**మేవడికాఁడు.** దే. విశే. 1. నమ్రతగలవాఁడు; 2. ఉపాయముగలవాఁడు.

**మేవు.** దే. స. క్రి. మేఁగుయొక్క రూపాంతరము.

**మేషము.** సం. వి. అ. పుం. 1. పొట్టేలు; 2. ఒకరాశి; (చూ. రాశి.) 3. ఔషధవిశేషము.

**మేషి.** సం. వి. ఈ. స్త్రీ. గొఱ్ఱె.

**మేస్టరు.** ఆం. వి. ఉపాధ్యాయుఁడు, యజమాని.

**మేస్త్రీ.** అన్య. వి. పనివారలమీఁద పెద్ద.

**మేహనము.** సం. వి. అ. న. 1. మగగుఱి; 2. మూత్రము.

**మేహము.** సం. వి. అ. పుం. రోగవిశేషము. (ఇది యిరువదివిధములుగలది.)

**మేళకము.** సం. వి. అ. పుం. సంగమము, కూడిక.

**మేళగాఁడు.** ఉభ. దే. విశే. (మేళము+కాఁడు.) మేళమువాయించువాఁడు. మి. గ్రా. వేశ్యాదిజనసమూహములోనివాఁడు. "వ. తలంగిపోకయుట్టునట్టునుమిట్టుమిట్టాడుచిట్టెవడుగులనానట్టువనగపునంగోపంబుఁగదుర నదలించుచుఁ దనమేళగాండ్రనాలోకించి." ప్రభా. ౧, ఆ.

**మేళగించే.** వై. అ. క్రి. 1. జతగూడు*; 2. కలియు*. అం, ప్రే. 1. జతగూర్చు*; "ప్రభాతాయాతవాతాహతాలోలతంత్రుల మేళగింపఁగదవే." స్వా. 3, ఆ.—2. కలుపు*. (చూ. మేళవించు.)

**మేళనము.** సం. వి. అ. న. కూడిక, మేళకము.

**మేళము.** ఉభ. దే. వి. నాగసరములోనగువాద్యములజత.—సం. అ. పుం. 1. కూడిక; 2. రాగానుగుణముగ స్వరస్థానములయందు మెట్లుకుదుర్చుట;

"సీ. పోలుపొందనలుగుణంబులపైశ్రుతుల్గూర్చి సారదనేళ ప్రకారమరసి." హంస. ౨, ఆ. "సీ. లలితాంగుళీదళంబులుసమేళములైనసారెలపైరాగసంపదలిడ." వసు. ౨, ఆ.—3. వేశ్యాది జనసమూహము.

మేళవించే. వై. అ. క్రి. మేళగించుయొక్క రూపాంతరము. [జతగూడుటకు.—"తే. వీరశృంగారములు మేళవించి పట్టి, చెలువమున." జై. ౫. ఆ.—కలియుటకు.—"సీ. బండికందెనతోడఁ బ్రతివచ్చు మైచాయనీలిపచ్చడముతో మేళవింప." నై. ౭, ఆ.—కలఁపుటకు.—"పావిరిఁగమ్మనీరుమృగనాభిరసంబున మేళవించి." నై. 3, ఆ. ("వీణె మేళవించి." అనుచోలక్షణచే వీణెయందలి మెట్లను మేళవించియనియర్థము.) కళా. ౨, ఆ.]

## మై.

మై. దే. అవ. కొన్ని యెడల తృతీయావిభక్తియందు వచ్చెడి ప్రత్యయము. (ఉదా. ఓర్పుమై, భక్తిమై. ము.)—వి. 1. దేహము; "వేమరునడు నెత్తిమూర్ధ్నునుమైపులకింప." ఉ. రా. ౪, ఆ.—2. విధము; "మ. కవలే తెంచిరి వేడ్క నొండొరులకుంగయ్యంబు మైఁజెప్పఁచుక్." భార. భీష్మ. ౧, ఆ.—3. పార్శ్వము; "రెండుమైల నడుతము." భార. విరా. 3, ఆ. "ఇరుమై." ఆము. ౬, ఆ.—4. తడవ. "అలసింహకిశోరములోక్క మైమదోన్నత్తగజావళింబోదువుమాడ్కి." భార. ఉద్యో. ౨, ఆ. (మొదటిరూపము మయి. చూ. మేను.)

మైకము. దే. వి. మత్తు, భ్రమ. (మొదటిరూపము మయికము.)

మైకొను. దే. అ. క్రి. సమ్మతించు, ఇయ్యకొను. (మొదటిరూపము మయికొను.)

మైకోలు. దే. వి. సమ్మతి, ఇయ్యకోలు. నై. 3, ఆ. (మొదటిరూపము మయికోలు.)

మైజాఱు. దే. వి. కొంతయెడయెడముగా అడ్డకమ్ములు వాటించిన ఆఁడుదానిచీరకొంగు. (మొదటిరూపము మయిజాఱు.)

మైతాలుపు. దే. వి. ప్రాణి, శరీరి. (మొదటిరూపము మయితాలుపు.)

మైత్రము. సం. వి. అ. పుం. దినముయొక్క మూడవ భాగము. (చూ. దినము.)

మైత్రావరుణి. సం. వి. ఇ. పుం. అగస్త్యుఁడు.

మైత్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. మిత్రభావము; 2. మిత్రకర్మము; 3. అనూరాధానక్షత్రము.

మైత్ర్యము. సం. వి. అ. న. 1. మిత్రభావము; 2. మిత్రకర్మము.

మైథునము. సం. వి. అ. న. 1. గ్రామ్యధర్మము; 2. కూడిక.

మైద. యు. దే. వి. గోరంట?. వై. మైకము*. "నిద్రమైదనుబడి లేపమేల్కనునుదారమధువ్రతినాథుభంగి." హరి. పూ. ౧, ఆ. (మొదటిరూపము మయిద.)

మైదానము. హిం. వి. బయలుభూమి.

మైదు. వై. వి. 1. మాయ*; 2. మైకము*; 3. చొక్కుపాడి*. (మొదటిరూపము మయిదు.)

మైనపుజిడ్డి. ద్వి. వి. మైనపుగుడ్డ.

మైనపువత్తి. వై. వి. దీపము వెలిఁగించుటకు మైనముతో చేసినవతి.

మైనము. వై. వి. సిక్థకము. (మొదటిరూపము మయినము.)

మైనరు. ఆం. వి. స్వాతంత్ర్యమునకుఁదగిన యీడురానివాఁడు.

మైనికుఁడు. సం. వి. అ. పుం. జాలరి, కైవర్తుఁడు.

మైపూఁత. దే. వి. (చూ.) అంగరాగము.

మైపోక. దే. విశ. తేలిక. కాశీ. ౬, ఆ.

మైమై. దే. వి. అనాయాసము, అనుపద్రవము. "వ. సింహబలుండునిన్నుఁబరిభవించి మైమైతోనయనికిం జేసియెల్లియుంజెనకవచ్చు." భార. విరా. ౨, ఆ.—క్రి. విశ. అనాయాసముగా. "మైమైపోరిరి." భార. విరా. ౨, ఆ. (రూ. మైమయి. అనాయాసముగాననుటకు. "తొల్లియేమగలుఁ మైమయిపోరొనర్చిరె." హరి. ఉ. ౬, ఆ.) (మొదటిరూపము మయిమయి.)

మైమఱపు. దే. వి. పారవశ్యము. (మొదటిరూపము మయిమఱపు.)

మైమఱువు. దే. వి. కవచము. (చూ. దట్టము. విశ. రెండవయర్థము.) (రూ. మయిమఱువు.)

మైరేయము. సం. వి. అ. న. చెఱకురసమునఁజేసిన కల్లు. ఆరెపువ్వు బెల్లముకడుగునీళ్లు వీనితో చేసిన కల్లు. (అని కొందఱు.)

మైల. వై. వి. 1. మాలిన్యము*; 2. అశుచిత్వము*; 3. మలినవస్త్రము*; "ఉ. మానుగనంటరానికొఱమా

లినమైలలమోపుపీఁపునన్, బూనిధరించి." పంచ. నా. ౪, ఆ.—4. చీఁకటి*. "జిలిబిలిమైలనద్దసలఁజేకొనిరొన్." హన. ౪, ఆ.—విణ. 1. మలినము; 2. అశుచి*. (మొదటిరూపము మయిల.)

**మైలత్రోవి.** ద్వ. వి. మురళి.

**మైలచాయతొండ.** ద్వ. వి. ఒకదినుసుతొండ, దుష్ప్రభ.

**మైలవడు.** వై. అ. క్రి. (మైల+పడు.) 1. మలినమగు; "నిజవంశము మైలవడంగఁజేసితి." జై. ౬, ఆ.—2. అశుచియగు*. "ఆ. అగ్నిచల్లనైనసజ్జమిత్రుఁడు మైల, వడ్డ." భార. అశ్వ. ౧, ఆ.

**మైలారు.** దే. వి. ఒక క్షుద్రదేవత. (చూ. గొరగ.) (మొదటిరూపము మయిలారు.)

**మైలావు.** ద్వ. వి. (మైల+ఆవు.) పొగచాయగలఆవు.

**మైలుతుత్తము.** వై. వి. మయూరతుత్థము. (మొదటిరూపము మయిలుతుత్తము.)

**మైవడి.** దే. వి. 1. సమ్మతి; "తే. బహువిధంబులనమ్మెయిఁబలుకునతని, పలుకులేర్పడవిని మెత్తవడినయట్లు, సుభగి మైవడిచూపు గాఁజూచితనదు, హృదయ మెఱిఁగించు తెఱఁగుననిట్టులనియె." భార. విరా. ౨, ఆ.—2. అనుకూల్యము; (చూ. అనుకూలమనునర్థము.) 3. విధము; "ఉ. లాలనఁగ్రొత్తబెబ్బులికళాసము వెట్టిరియాసనంబుగా, గోలయుసాధువైన యొకకోమటికిన్ నిషధేంద్రు బచ్చుకున్, మేలపు మైవడిందమసమీపముధూర్తులు." హై. ౬, ఆ.—4. సౌమ్యత. "వ. అదియెట్లనిసధర్మనందనుండతనియుద్ధతికింబుయిలోడి మైవడిగలనడవడింబ్రవర్తిల్లుచుండియుజూదంబువెంటమోసపోయిలొడరిచిక్కనంబడియె." భార. ఉద్యో. ౧, ఆ. "చ. మైవడితోడన తెల్పితెల్పియూ, యావినయబుద్ధిమాన్పఁగలయంతయు నింకనునాడిచూతమే." లక్ష్మీ. ౫, ఆ.—విణ. అనుకూలము. "వ. సెలసంగడీలకైవడి నెల్లనడవడికి మైవడియై మెలయుచిలుదొడలును." లక్ష్మీ. 3, ఆ. (మొదటిరూపము మయివడి.)

## మొ.

**మొంటె.** దే. వి. మొరఁటెయొక్కరూపాంతరము.

**మొండరి.** ద్వ. విణ. (మొండి+అరి.) మొండితనముగలవాఁడు. (చూ. గోడచేర్పు.) (స్వార్థమునఅరి.)

**మొండాడు.** ద్వ. అ. క్రి. (మొండి+ఆడు.) మొండాటలాడు. "క. అది, మొండాడఁగముక్కుసెవులుమునుకుపమాన్చెన్." య. 3, ఆ. (చూ. దండమొదటియర్థము.)

**మొండి.** వై. విణ. 1. చేతులుకాళ్లుతెగినవాఁడు; "ద్వి. మొండియై నెత్తుటమునిఁగియున్నాఁడ, దండించి బేతాళతలద్రుంచిపొమ్ము." సా. ౬, భా. "చీకొలమాలిన మొండివాని కేచొప్పునఁజిక్కనోతరుణీ." భో. ౫, ఆ.—2. మూర్ఖుఁడు*; 3. కొంతతెగినది*; (చేయికాలులోనగునది.) "ద్వి. ప్రుక్కకరామానుజుండు శూర్పణఖ, ముక్కునుజెవులును మొండిసేయుటయు." రా. బాల, కాం.—4. మొక్కపోయినది*; (మొండిగంటము. మొ.) 5. వట్టిది*. (మొండిమెడ. మొ.)

**మొండికట్టె.** వై. విణ. మొండితనముగలవాఁడు.

**మొండు.** వై. విణ. మొండియొక్కరూపాంతరము.

**మొండెపుగాము.** వై. వి. (మొండెము+గాము.) రాహువు.

**మొండెపురక్కసుఁడు.** వై. వి. (మొండెము+రక్కసుఁడు.) కబంధుఁడు. అచ్చ. అర, కాం.

**మొండెము.** వై. వి. తలతెగినశరీరము, కబంధము (మొదటిరూపము మొండియము.)

**మొకమాలు.** దే. వి. ఒకానొకమేలు దినుసుపట్టు. "సీ. చికిలికళ్లెము క్రొత్తమొకమాలువాగెహొరంగారు జలతారుటంగువాలు." రసి. ౧, ఆ.

**మొకము.** వై. వి. మొగముయొక్కరూపాంతరము. (చూ. పెక్కణము, మొగము.)

**మొకరము.** దే. వి. మొక్కరముయొక్కరూపాంతరము. "మెఱుంగుదేలుతొగచుట్టపుటా మొకరంబుమాటుగానచ్చపలాక్షినిల్వ." వసు. ౬, ఆ.

**మొకరరు.** హిం. విణ. నిర్ణయింపఁబడిన.

**మొకరి.** వై. విణ. 1. మ్రోఁగునది; (చూ. ఓఁక మొదటియర్థము.) 2. అసంబద్ధవచనములాడునది. "ద్వి. మొకమునఁదగబొమముడివెట్టుకొనుచు, మొకరయై పెటిగియేపునమల్లచఱచి." రా. సుం, కాం.

**మొక్క.** వై. వి. 1. మొలక; 2. చిగురుమొలక*; "సీ. ముందటనెలమావి మొక్కలనలరింపఁగర్తదానగుచెలికాఁడునడవ." హరి. ఉ. ౬, ఆ.—3. బ. ఒకదినుసుజొన్నలు. విణ. 1. వ్యర్థము; 2. మొనమడఁగినది*.

**మొక్కఁడు.** దే. విణ. బలిసినవాఁడు.

మొక్కచెడు. ద్వ. అ. క్రి. అవమానపడు.

మొక్కట్టు. ద్వ. వి. (మొకము+కట్టు.) ముఖవైఖరి.

మొక్కడి. దే. వి. చిన్నకొమ్ములుగలయేనుఁగు.

మొక్కడీఁడు. దే. వి. మొక్కడియొక్క రూపాంతరము. (స్వార్థమున ఈఁడు.)

మొక్కపడు. వై. అ. క్రి. భంగపడు. (ప్రే. మొక్కపఱుచు. "క. రక్కసిమగువలయీలువు, మొక్కపఱిచెదీవ." పా. ౧, ఆ.)

మొక్కపోవు. ద్వ. అ. క్రి. 1. మొనమడఁగినదగు; "తత్ప్రదరంబిప్పుడు మొక్కపోదు." రా. కిష్కిం, కాం. -- 2. భంగపడు. (ప్రే. మొక్కపుచ్చు. భంగపఱుచుటకు.—"అవ్వాఁడిమి మొక్కపుత్తునని." (ఇక్కడ వాఁడిమికి తేజమర్థము.) రా. సుం, కాం.) (రూ. మొక్కలుపోవు.)

మొక్కమామిడి. ద్వ. వి. జీడిమామిడి*.

మొక్కము. వై. వి. ఒకానొక చెట్టు, ముష్కకము.

మొక్కరము. దే. వి. 1. స్తంభము; 2. గడెమ్రాను. "తలుపుమూసి మొక్కరమిడియుక." శుక. ౨, ఆ.

మొక్కలము. వై. వి. 1. ముష్కరత్వము*; "దండకము. శక్రనీ మొక్కలంబుల్ వినంబడ్డవే కావె." కాశీ. ౭, ఆ.—2. శౌర్యము*; "చ. కవకపనవ్వియజ్ఞతురగంబు మెడందనయుత్తరీయముక, లవుఁడుదగిల్చి మొక్కలముసంగదళీతరువందుఁ గట్టివేయ." జై. ౬, ఆ.—3. ధైర్యము*; "చ. నలినదళాక్షినీవు బలినందనుకూఁతురవిట్టినిన్ను మొ, క్కలముననొక్కరుండుదనకౌఁగిటనుంచునె యిట్లుకన్నునీ, రొలుకఁగ వెట్టి వేసెఱపకోడక నొంపఁగ పానికెక్తలల్, గలవువిచారహీనవయికంపమునొందకు వేతలోదరీ." ఉ, హరి. ౫, ఆ.— 4. ఉత్సాహము*; "చ. మొ,క్కలముననాతఁడాతగరుకాయము సొచ్చెజయాభిలాషియై." భో. ౫, ఆ.—5. బ. ముష్కరవచనము*. "మ. బలియుండు గ్రుఁడు యశావనాశ్వధరణీపాలుండు తత్సైన్యులా, జాలముక్కాఁకలనాఱి తేఱినమహాశూరుల్ చలంబెత్తి మొ,క్కలముల్ పల్కితి." జై. ౧, ఆ.— విణ. 1. ముష్కరము; (చూ. నీరుహామి.) 2. అప్రతిహతము*. "చ. ననుఁగనియొండుసత్వముమనంబున బెగ్గిలి డాయునప్పుడి, మ్మునివరుఁడిట్టువోలెఁగృపమొక్కలమైశరభంబుగాఁగఁజేయునొ." భార. శాం. 3, ఆ.

మొక్కలి. వై. విణ. (మొక్కలము+ఇ.) 1. ముష్కరుఁడు; ఉ, గా. ౪, ఆ.—2. శూరుఁడు*. "సీ. మొక్కలి దొరచేత మ్రొక్కించుకొనువాఁడ ముగుదరో నీకునే మ్రొక్క నెంతు." సత్య. 3, ఆ.

మొక్కలించు. వై. అ. క్రి. 1. ముష్కరము చేయు; 2. ఉత్సహించు*. "సీ. లంఘనలాఘవోల్లసనంబుమై మొక్కలించి హార్దులఁజౌకళింపకుండ." కవిక. ౧, ఆ. (ప్రయోగములున్నయెడల మొక్కలమునకుకలిగిన తక్కినయర్థములును దీనికి చెప్పుకొనవచ్చును.)

మొక్కలింపు. వై. వి. ముష్కరము చేయుట. క్షేత్రయ. (చూ. అరగింపు.)

మొక్కలికాఁడు. ద్వ. విణ. ముష్కరుఁడు. (స్వార్థమున కాఁడు.)

మొక్కలీఁడు. ద్వ. విణ. (మొక్కలి+ఈఁడు.) 1. ముష్కరుఁడు; "సీ. మంత్రివిద్వేషంబు మాన్యపరాభవంబును బ్రజాపీడనంబులునుగలిగి, మొక్కలీఁడగుటయు." భార. అశ్వ. ౧, ఆ.— 2. శూరుఁడు*. "ఉ. ఒండురథంబువోవిడిచి యుక్కునఁజక్కని మొక్కలీఁడనక, రెండవకొమ్ముతోండమున నేర్పునమాఁటి." పాంచా. ౧, ఆ. (స్వార్థమున ఈఁడు.)

మొక్కలుఁడు. వై. విణ. శూరుఁడు*. "ఉ. ఎక్కడివారొకోగరుడుఁ డెక్కడుగాఁగలవారువీరపో, యెక్కుడు వారులోకులకనేకవిధాకరభీకరాకృతుల్, ముక్కటమూవురిక్కడకు మొక్కలులైయరుదెంచిరంచు." (ముక్కటమూవురు అనఁగా సరిగా ముప్వురు అనియర్థము.) ఉ, హరి. ౬, ఆ.

మొక్కు. దే. అ. క్రి. 1. దండము పెట్టు; 2. ముడుఁగు. (చూ. ముసుఁగు రెండవయర్థము.) వి. దండము. (మ్రొక్కుయొక్క రూపాంతరము.)

మొక్కుబడి. దే. వి. దేవతాప్రార్థన. (మ్రొక్కుబడియొక్క రూపాంతరము.)

మొగ. వై. వి. 1. అప్రాణివస్తుముఖము; "మొగయక్కలి."–2. మొదలు*; "వారిలో మొగఁదగువానికి." జై. ౨, ఆ. "మొగజోదు." (ఇక్కడ మొగజోదనఁగా మొదటిజోదు — యోధముఖ్యుఁడు అనుట.) ఉ, హరి. ౪, ఆ.—3. ద్వారము*; "అక్కలుఁగు మొగంబడుకొక్కటిత్రోచి." అచ్చ. కిష్కిం, కాం.—4. మొగ్గయొక్క రూపాంతరము. "రగడ. మొగలివిరులెపూ మొగలివి నెచ్చెలి." య. ౪, ఆ.

మొగకట్టు. ద్వ. అ. క్రి. మ్రోగు. "కంకణనిక్వణంబుమొగకట్టఁగ." సై. ౭, ఆ.

మొగకొను. ద్వ. అ. క్రి. అభిముఖమగు. "క. వినుమింక నెన్నఁడును మొగ, కొనరీయోడిచనువారు గురుకోల్తలకున్." భార. ద్రో. ౧, ఆ. (ప్రే. మొగకొలుపు. "ఉచితక్రియకున్ మొగకొల్పి." భార. మా. ౧, ఆ.)

మొగచాటు. ద్వ. విశే. మొగముకొట్టునది, వెగటు. "క. పదునాల్గుమహాయుగముల, ముదుకకుభీమేశ్వరునకు మొగచాటైయుం, డదుసానిపెండ్లియెప్పుడు, నదిదాక్షారామమహిమమవునో కాదో." భీ. ౧, ఆ.

మొగడ. వై. వి. మొగ్గ. "ఉ. తుమ్మెదకంటుపూమొగడతోనెనవచ్చులతాంగిముక్కు." రామా. ౪, ఆ.

మొగడించు. వై. అ. క్రి. మొగుడు, ముకుళించు. "తమ్ములు మొగడించిన." య. ౨, ఆ.

మొగడు. దే. వి. ఇంటినడికొప్పు. "సీ. తగుపద్మరాగంపు మొగడులు చెన్నొందవైదూర్యవలభులుఁ న్నెచూప." భాగ. 3, స్కం.

మొగతప్పు. ద్వ. అ. క్రి. పెడతిరియు, విముఖమగు. "సీ. దంతులు ద్రోచినఁదాలసాలాదులమొగతప్పబలువిడిపోఁదువారు." రా. యు, కాం.

మొగతిరుగు. ద్వ. అ. క్రి.——వై.——"క. అమ్ములనేనుఁగుకొమ్ముల, నమ్మత్తగజమ్ము నొంపనటిమటిమనసై, న్యమ్మెల్లఁజదియఁబఱచెఖ, యమ్మునమొగతిరిగి దిక్కుల ద్రువ్వఁగఁ బెలుచన్." భార. భీష్మ. ౨, ఆ

మొగదల. ద్వ. వి. (మొగ + తల.) 1. ఎదురు; 2. ముందటిభాగము.

మొగపడు. వై. స. క్రి. చూచు. "వ. తన్ను మొగపడకముందఱనతనింగనిననెంతయుంగలుషించు." హరి. పూ. ౮, ఆ.

మొగపాళము. ద్వ. వి. ఇల్లులోనగువానిముందటిభాగము, నిస్సరణము, (రూ. మొగవాళము.)

మొగపిటిక. ద్వ. వి. (మొగము+పిటిక.) తాఁబేలు. "ఎ, గీ. మొగపిటికెఁగాంత ప్రపదముల్ తగులఁబోవు." హన. ౪, ఆ.

మొగపు. ద్వ. వి. (మొగ+పూస.) హారాదులముఖభాగము. "సీ. ధాత్రీమహాదేవితాల్చినమున్నీటిముటలనూలిరత్నంపుమొగపనంగ." ప్రభా. ౧, ఆ.

మొగమిచ్చు. ద్వ. అ. క్రి. (మొగము + ఇచ్చు.) సుముఖుఁడగు.

మొగము. వై. వి. 1. ముఖము; 2. ఎదురు*; "చ. బలవంతుఁడొకండిటుచేసెనంచునీ, మొగమునఁదల్పినీ హృదయమున్నొగిలించుటకార్తిఁ జెందదన్." ఉ, రా. ౪, ఆ.—3. ద్వారము*. "ఉ. నిత్యల, క్ష్మీలతికాలవాలమగుజీవన మంతయు నీమొగంబు గాఁ, బాలనసేయుము." భార. విరా. ౨, ఆ.—విశే. ముఖ్యము*. "ఉ. ఆహవవీరవాహినులకన్నిటికిన్ మొగమైమరుత్సుతుం, డాహవదోహలుండమరె." భార. అర. ౭, ఆ. (మొగరాడు.)

మొగముట్టు. ద్వ. వి. (మొగము+ముట్టు.) అశ్వముఖాలంకారము. (చూ. నిగరము.)

మొగమున. వై. ద్ర. తోడుతో*. "క. పోయినమొగమునవచ్చుటఁ, జేయుతెఱంగెల్లనీకుఁ జెప్పితిఁబదపడ్, మాయయ్యపెద్దకొలువున, వాయోడకయిట్లనంగవలయుంజుమ్మీ." భార. ఉద్యో. ౧, ఆ.

మొగమోట. ద్వ. వి. (మొగమోడుట.) 1. దాక్షిణ్యము; (చూ. మొగమోడు.) 2. సంకోచము. "తే. ఓరినాముందఱనె మొగమోటలేక, నీవుగర్వించి బ్రాహ్మణనిందచేసితి." వి, పు. ౪, ఆ. (రూ. మొగమోటము.—సంకోచమునకు.—"మ. మొగమోటంబుననీవువారియెదుటన్ ముఖ్యంబుయుద్ధంబు కాఁ, దెగనాడన్ వెఱతేని." ఉ, హరి. ౪, ఆ.)

మొగమోడు. ద్వ. అ. క్రి. (మొగము+ఓడు.) 1. దాక్షిణ్యపడు; "క. గురులకుభక్తుఁడుదారుఁడు, కరుణగలఁడుశౌర్యధైర్యగాంభీర్యధురం, ధరుఁడు మొగమోడునాకుర, పరపౌత్రునిలేమి కోర్వవచ్చునెచెపుఁడా." భార. ద్రో. ౨, ఆ.—2. సంకోచించు. "క. తగవరియగుదానొంచినఁ, దగుదండముఁ రాజువానిదండింపదగున్, మొగమోడివిడిచెనేనియు, నగుఁబాటగుఁబాపమొందు నరనాథునకున్." విజ్ఞా. ప్రా, కాం.

మొగరంబము. దే. వి. తుమ్మెద, భ్రమరము. "సీ. పక్కులెత్తినగోటి పసలునిబ్బెపుఁబొడల్ భ్రమరకంబులు మొగరంబములును." చంద్రా. ౧, ఆ.

మొగరము. దే. వి. మొగ్గరముయొక్కరూపాంతరము.

మొగరించు. దే. స. క్రి. ఆక్రమించు. "హంసడిభకులునన్నుఁ మొగరించిన." ఉ, హరి. ౪, ఆ.

నుజేసినట్టియా, త్రేఁకపుఁగేడుగాక ప్రజవేఁచఁ దలంచినగోరుచుట్టుపై, రోఁకటిపోటుచందము గరోపిజనుల్ నమఁజూచితిట్టరే." జై. ౧, ఆ. (బలరామునిరోఁకలి సౌనందము.)

రోఁజు. దే. అ. క్రి. నిట్టూర్చు, నిశ్వసించు. "ఉగ్రపన్నగముచాడ్పునరోఁజుచు." సం. "వినిశ్వసన్ సర్ప ఇవోగ్రతేజాః." భార. అర. ౫, ఆ. వి. నిశ్వాసము.

రోఁజేడు. దే. వి. రొంజేడు, ప్రలాపము.

రోఁత. దే. వి. 1. ఏవము, జుగుప్స; "ఉ. కూఁతురనీవు వట్టిచెడుఁగూఁతలుగేఁతలు నేర్చికష్టులన్, మూఁతులనాకఁగానిధనమూలవిటాలిని జేరవైతివి, రోఁతకునిన్ను నెల్లరునురోయఁగ నీసరివారునవ్వ నీ, కోఁతివిటుండుసల్పు వెడకోడిగముల్ గనిమాఁటి వత్తురే." భల్లా. ౫, ఆ. -2. బ. తిట్లు.

రోఁతగించు. దే. అ. క్రి. రోఁతపడు.

రోక. దే. వి. మూల, కోణము.

రోకము. సం. వి. అ. న. 1. ఓడ; 2. బెజ్జము; 3. కదలిక. పుం. 1. వెలుఁగు; 2. రొక్కపమ్మకము.

రోకు. దే. వి. వికాసము. "సీ. ప్రవిమలకుసుమసంపదలకుదూరమైరోకువాసినమహీరుహమురీతి." మార్క. ౧, ఆ.

రోగము. సం. వి. అ. పుం. 1. వ్యాధి, తెవులు; 2. కుష్ఠౌషధము.

రోగహారి. సం. వి. న్. పుం. 1. జాము?; 2. బూడిదగుమ్మడి?. విణ. వైద్యుఁడు.

రోగి. సం. విణ. (న్. ఈ. న్.) వ్యాధిగ్రస్తుఁడు, తెవులుగొంటు.

రోచన. సం. వి. ఆ. స్త్రీ. 1. గోరోజనము; 2. ఉత్తమస్త్రీ; 3. ఎఱ్ఱగలువ అ. పుం. ము. కొండబూరుగు?. విణ. ప్రకాశించునది.

రోచని. సం. వి. ఈ. స్త్రీ. 1. తెల్లతెగడ?; 2. కంపిల్లము?.

రోచమానము. సం. వి. అ. పుం. గుఱ్ఱపు మెడసుడి.

రోచిష్ణువు. సం. విణ. (ఉ.) ప్రకాశించువాఁడు.

రోచిస్సు. సం. వి. స్. న. సూర్యకిరణము, వెలుఁగు.

రోజు. హిం. వి. దినము.

రోటు. దే. వి. (చూ.) ఈఁచే.

రోటువోవు. దే. అ. క్రి. (రోటు + పోవు.) ఈఁచేఁబోవు. "ద్వి. రోటువోయినచెయ్యిరొమ్ము కంపరము, వాటుఁగాలునుఁటోటివలెనున్ననడుము." హరిశ్చ. ౨, భా.

రోడ్డు. ఆం. వి. మార్గము, రస్తా.

రోదనము. సం. వి. అ. న. 1. ఏడ్పు; 2. కన్నీరు.

రోదని. సం. వి. ఈ. స్త్రీ. తీఁటకసింద, కచ్ఛుర?.

రోదసి. సం. వి. ఈ. స్త్రీ. 1. మన్ను; 2. మిన్ను; 3. మన్నుమిన్ను.

రోదస్సు. సం. వి. స్. న.——వై.——

రోదించు. సం. అ. క్రి. రోదనముచేయు, ఏడ్చు.

రోధస్సు. సం. వి. స్. న. తీరము, దరి, గట్టు.

రోధించు. సం. స. క్రి. అడ్డగించు. (అనురోధించు, నిరోధించు, సంరోధించు అనియు.)

రోపణము. సం. వి. అ. న. 1. మోపుట; 2. పైరుచేయుట.

రోపము. సం. వి. అ. పుం. 1. బాణము; 2. రోపణము.

రోమంథము. సం. వి. అ. పుం. పశువులచర్వితచర్వణము, నెమరు.

రోమము. సం. వి. న్. న. ముఖము శిరముతక్కఁ దక్కిన దేహమునందుఁగల వెండ్రుక.

రోమవిక్రియ. సం. వి. ఆ. స్త్రీ. రోమాంచము.

రోమశము. సం. వి. అ. పుం. 1. పంది; 2. గొఱ్ఱె. విణ. వెండ్రుకలు గలది.

రోమశి. సం. వి. ఈ. స్త్రీ. ములఁదోస?.

రోమశుఁడు. సం. వి. అ. పుం. శరీరమునందు ఎలుఁగునకువలె నిడువెండ్రుకలుఁగలవాఁడు.

రోమహర్షణము. సం. వి. అ. న. రోమాంచము. పుం. తాండ్ర?. డు. ఒకసూతుఁడు.

రోమాంచము. సం. వి. అ. పుం. గగుర్పాటు.

రోమావళి. సం. వి. ఈ. స్త్రీ. నూఁగారు. (రోమరాజి అనియు.)

రోయి. వై. వి. 1. వేశ్యకిచ్చెడుశుల్కము*; (చూ. రో.) 2. పందెము*; "క. దమయంతిరోయిగాఁజూ, దమునీతోనాడఁగడఁగెదను." భార. అర. ౨, ఆ.—3. కుదువ*; "క. రోయిగొనివడ్డికిచ్చినఁ, బాయకనెలనెలనశీతిభాగముగొనినన్, న్యాయమగుమిగులఁగొనుట, న్యాయంబొడఁబడనిచోటనభినవదండీ." సం. "అశీతిభాగోవృద్ధిస్స్యాత్ మాసిమాసిసబంధకే." విజ్ఞా. వ్య. కాం.—4. ఎరవు, చేబదులు*. (చూ. ప్రాయఁడి మొదటియర్థము.)

రోయు. దే. అ. క్రి. రోఁతపడు. "క్రూరతకోర్చియుంచుకయురోయక." భార. భీష్మ. ౩, ఆ.—

స. క్రి. 1. వెదకు; "ఉ. జాయనుజాపవేమియను జాయను నవ్విధిరెుంతచేసెనా, రాయను నాదు గుండెబలురాయను నాత్త పరాక్రమోన్నతుల్, రోయనుగానవాంతరమురోయనుదుష్టకురంగచేష్టను, మ్రాయనుజానకీదనుజమాయలఁగ్రుంకితో పల్కుమాయనుక్." రామా. ౫, ఆ.—2 నిందించు; (చూ. రోఁత.) 3. విడుచు. (ఇది వాడుకలోనిది.) ఒకానొక ఆధునికకవి దీనిని వెదకు అనునర్థమునందు శకటరేఫముగా ప్రయోగించియున్నాఁడు. అది యాదరణీయముకాదు.)

రోలంబము. సం. వి. అ. పుం. భృంగము, తుమ్మెద.

రోవెలఁది. ద్వ. వి. వారస్త్రీ, వేశ్య. (చూ. రో.)

రోషము. సం. వి. అ. పుం. కోపము, కినుక.

రోషించు. సం. అ. క్రి. రోషపడు, కినియు.

రోసము. వై. వి. రోషము, కినుక.

రోసించు. వై. అ. క్రి. రోషపడు, రోషించు. "క. అసమరప్రాధికిమది, రోసించి." విక్ర. ౪, ఆ.

రోసుబడి. దే. విణ. గ్రా. రోఁతగొట్టు. (ఏమి నీవు వట్టిరోసుబడిగా నున్నావు.)

రోహణము. సం. వి. అ. న. ఎక్కుట. పుం. ఒకకొండ.

రోహము. సం. వి. అ. పుం. 1. ఎక్కుట; 2. మొలక.

రోహి. సం. వి. ఇ. న్. పుం. 1. మఱ్ఱి; 2. ములుమోదుగు; 3. రావి.

రోహిణము. సం. వి. అ. పుం. బాడిదము.

రోహిణి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకనక్షత్రము; (చూ. నక్షత్రము.) 2. అంగిటిముల్లు; 3. ఆవు; 4. తొమ్మిదేండ్లకన్యక; 5. బలరామునితల్లి; 6. కటుకరోహిణి; 7. తెల్లచండ్ర.

రోహితకము. సం. వి. అ. పుం. 1. ములుమోదుగు; 2. కెంపు.

రోహితము. సం. వి. అ. న. (చూ.) 1. కొరదు; 2. కుంకుమపువ్వు; 3. నెత్తురు. పుం. 1. ఎఱుపు; 2. ఎఱ్ఱచేఁప; 3. కేసరిమృగము; 4. ములుమోదుగు. విణ. ఎఱ్ఱనిది.

రోహితాశ్వుఁడు. సం. వి. అ. పుం. 1. అగ్ని; 2. హరిశ్చంద్రునికొడుకు.

రోహిషము. సం. వి. అ. పుం. కొండగొఱ్ఱె.

## రౌ.

రౌతు. వై. వి. గుఱ్ఱమునెక్కువాఁడు, సాది. (మొదటిరూపము రవుతు.)

రౌద్రము. సం. వి. అ. పుం. 1. నవరసములలో నొకటి; (చూ. రసము.) 2. ఎండ; 3. దినముయొక్క మొదటిభాగము. (చూ. దినము.) విణ. 1. భయంకరము; 2. తీక్ష్ణము.

రౌద్రి. సం. వి. ఇ. పుం. ఒకసంవత్సరము. (చూ. సంవత్సరము.)

రౌను. ఆం. వి. ప్రయాణము.

రౌప్యము. సం. వి. అ. న. రూప్యముయొక్క రూపాంతరము.

రౌమకము. సం. వి. అ. న. సంభరిదేశమున రుమయనెడు గనియందుఁబుట్టిన ఉప్పు.

రౌరవము. సం. వి. అ. పుం. నరకవిశేషము. విణ. భయంకరము.

రౌలు. దే. అ. క్రి. రగులుయొక్కరూపాంతరము. (మొదటిరూపము రవులు.)

రౌలుకోలు. దే. వి. రౌలుకొనుట. (మొదటిరూపము రవులుకోలు.)

రౌలుచు. దే. ప్రే. రగులుచుయొక్కరూపాంతరము. (మొదటిరూపము రవులుచు.)

రౌహిణేయము. సం. వి. అ. పుం. దినముయొక్క తొమ్మిదవభాగము. (చూ. దినము.) విణ. ఆవునకుఁబుట్టినది. (దూడ.)

రౌహిణేయుఁడు. సం. వి. అ. పుం. 1. బలరాముఁడు; 2. బుధుఁడు.

రౌహిషము. సం. వి. అ. న. కామంచి. పుం. కొండగొఱ్ఱె.

## ఱ.

ఱ. ఒకయక్షరము.

ఱంకాట. ద్వ. వి. (ఱంకాడుట.) జారత్వముచేయుట. "శౌర్యంబు ఱంకాటసాహసంబు." విష్ణు. వ్య, కాం.

ఱంకాడు. ద్వ. అ. క్రి. (ఱంకు+ఆడు.) జారత్వముచేయు.

ఱంకు. వై. వి. జారత్వము. "సీ. జనులొక్కతటిఁ దొల్లిసమయంబుదమలోనఁజేసిక్రూరతయుఁ ముచ్చిమియుఱంకు, పైఁపక." భార. శాం. ౨, ఆ.

ఱంకుఁబోతు. ద్వ. వి. (ఱంకు+పోతు.) జారుఁడు, జారిణి.

ఱంకుటాలు. ద్వ. వి. (ఱంకు+ఆలు.) జారిణి.

ఱంకుతెవులు. ద్వ. వి. మేహరోగము.

అంకుమగఁడు. ద్వా. వి. జారుఁడు. (చూ. గోలెము.)

అంకులరాట్నము. వై. వి. ఉత్సవకాలమునందు వేడుకకు బాలకులు ఎక్కి త్రిప్పించెడు చుట్టుతొట్ల లేర్పఱచిన వలయాకారపుయంత్రవిశేషము.

అంకులాఁడి. ద్వా. వి. (అంకులు+ఆఁడి.) జారిణి.

అంకుపోవు. ద్వా. అ. క్రి. (అంకు+పోవు.) జారత్వముచేయు.

అంకె. దే. వి. 1. వృషభధ్వని; "ఉ. అంకెలుగర్జలై యడరఱాపుఁదనంబున నెందుఁబర్వని, శ్శంకవిలోకవైద్యుతకృశానుశిఖల్ దెసలెల్లఁగప్పఁగా." హరి. పూ. ౭, ఆ.—2. ధ్వని; "అనేకంబులు తూర్యముల్ దిశలుఅంకెల్ వేయఁజేయన్." రా మా. ౭, ఆ.—3. కేక. "ఉ. మాటిమాటికిన్, అంకెలువేయుదుష్కవిగణంబులనెల్లఁద్రుణీకరించెదన్." రుక్మి. ౧, ఆ.

అంకెత. ద్వా. విణ. (అంకు+ఎత.) జారిణి. (చూ. బంకెత.)

అంతిల్లు. దే. అ. క్రి. కలకలధ్వనిచేయు, (రూ. అంతిలు.)

అంతు. దే. వి. కలకలధ్వని. "ఉ. అంతులుమీఁదుమిక్కిలిగఱాఁగతనంబునదొమ్మిచేసి." భీ. ౪, ఆ. "మ. వినియాఅంతుదురంతశైలమథనావిర్భూతసింధూద్ధత, ధ్వనియోకాకమహోదకప్రళయసంత్రాసంబులోకాళిఁబై, కొనికారించెనోయామదుస్సహమహాకోలాహలోద్వృత్తికే, మినిమిత్తంబని భర్తలోకభరణో స్నేహంబు వాటింపఁగాన్." వసు. ౨, ఆ.

అంపకాఁడు. దే. వి. (అంపము+కాఁడు.) అంపముతో పలకలులోనగువాని కోయువాఁడు.

అంపము. దే. వి. పలకలులోనగునవికోసెడు సాధనము, క్రకచము.

అంపిల్లు. దే. అ. క్రి. 1. వ్యాపించు; "క. అంతటఁగడలందెల్లఁగో, అంతయొకింతయునులేక అంపిల్లెనిరుల్." అచ్చ. సుం, కాం.—2. పర్విల్లు; "సీ. తెగినసోఁకుడుమూఁకమగిడినాబలు విద్దెపెంపునబ్రతికిఅంపిల్లుచుండ." య. 3, ఆ.—3. విజృంభించు; 4. అతిశయించు. (రూ. అంపిలు.—విజృంభించుటకు.—"చ. దళముగనుండుకోటలతుదండవిలించినమించుపైఁడిప్రాల్, గలకటిటెక్కెముల్ గనిపగల్ మెఱుఁగుల్ గలమబ్బులంచుఅం, పిలితగనాడ నన్నమిలిపిండుఁగనుంగొని చిన్కుఁగూటియ, ప్పాలుఁగులుసంతసిల్లఁగడుపుల్ గడునిండఁగనానుకోర్కులన్." య. ౧.—అతిశయించుటకు.—"అంపిలఁసొంపు." య. ౧, ఆ.)

అంపు. దే. వి. 1. అచ్చే; 2. కలకలము.

అంపె. దే. వి. 1. మాదిగవాఁడుతోలుకోసెడు సాధనవిశేషము; 2. తాటాకులుమట్టగించికోసెడుసాధనవిశేషము. (మొదటిరూపము అంపియ.)

అక్కు. దే. స. క్రి. గీఱు. వి. గీఱ. "ఉ. చెక్కులఱక్కులన్ మిగులఁజెల్వగుమోవినిబంటి నొక్కులన్." రాజ. ౨, ఆ.

అట్టు. దే. వి. దూఱు, నింద. "సీ. గతిమాలిబిగియారుకొఁగిలిలేని యాఅడికూర్మికే నేల అట్టవడితి." ఉ, హరి. ౫ ఆ.

అప్ప. దే. వి. చిన్నతాయి. (చూ. పేటనఁబెట్టు.)

అవఱవ. దే. వి. కోపవికారము. "క. తివిరికరవాలు సేకొని, అవఱవలెసఁగంగనత్తెఅవహైజనుచో." అచ్చ. సుం, కాం.

అవిక. దే. వి. కంచెల. "చ. అవికయుఁబట్టుపుట్టముచెఱంగుమఱుంగయియున్కిఁజేసి." సై. 2, ఆ. "కలయఁగఁజంద్రకావిఅవికంబలెఁగుంకుమపూసి." విజ. ౨, ఆ. (అధునికులు కొందఱు దీనిని లఘురేఫముగాఁ బ్రయోగించియున్నారు.)

అవ్వ. దే. వి. దూఱు, నింద. "క. ఇవ్విధమునఁబ్రతిదినమును, నవ్వేలఁదిచరింపఁగొందఱతిదూషకులై, అవ్వలునేయుచునోరుల, క్రొవ్వునఁబాపంబు పంచికొందురుపరుసన్." భో. 3, ఆ.

అవ్వాడు. దే. స. క్రి. (అవ్వ+ఆడు.) నిందించు.

ఱా.

ఱా. దే. వి. ఱాయిశబ్దమునకుప్రత్తియందుమీఁదివర్ణములోపింపఁగా మిగిలినరూపము. (ఱాపువ్వు. మొ.)

ఱాఁగ. వై. వి. జారిణి. "తే. పూనుమీమయిభోగంబుభూమిఁగణంబు, వెసగనీవనియాఱాఁగరొముసఁగరాఁగ." సా. ౨, ఆ.—విణ. 1. ఉద్ధతుఁడు*; "గోడనొల్వుడుఱాఁగ గుఱ్ఱంబునెఱిఁగోదు." అచ్చ. బాల, కాం.—2. ధూర్తుఁడు*. (చూ. అంతు.)

ఱాఁగతుంగ. ద్వా. వి. భద్రముస్తకము. (సంస్కృతమునందుభద్రముస్తకపర్యాయమైనగుంద్రాశబ్దముయొక్క వ్యుత్పత్తిని విచారింప ఱాఁగతుంగ అని చెప్పుట యుక్తమనితోఁచుచున్నది. ఈపదము

ఒక నిఘంటువునందు వ్రాయఁబడి యున్నది. భద్రముస్తకమునకు తెనుఁగున నాగముస్తెయని వాడుచున్నారుగాని దాని వ్యుత్పత్తిని విచారింప సంస్కృతపర్యాయముల అర్థమున ననుసరించినదిగా కనఁబడలేదు.)

**ఱాచు.** దే. స. క్రి. 1. రాపుడుచేయు; "ద్వి. ఏచిన గురుభక్తి నెల్లలోకనుల, ఱాచినకొడుకునా ఱడిఁ జంపుకొంటి." రా. అ, కాం.—2. రుద్దు.

**ఱాతిగుండె.** దే. వి. (ఱాయి+గుండె.) కఠినహృదయము.

**ఱాతినార.** దే. వి. (ఱాయి+నార.) ఓషధీవిశేషము.

**ఱాతిపాఁచి.** ద్వ. వి. (ఱాయి+పాఁచి.) ఔషధవిశేషము.

**ఱాతియులి.** ద్వ. వి. (ఱాయి+ఉలి.) కాసెయులి.

**ఱాతివాలు.** ద్వ. వి. (ఱాయి+వాలు.) వజ్రాయుధము. "తే. నెత్తురునఁదోఁగిబవరంపు నేలఁద్రెళ్లి, సోఁకుదొరయుప్పెగట్టులనూడుఱాతి, వాలుచేఁబడ్డ జేగుఱు వాఁగుగముల, తోదొరయు మేటిగుబ్బలి దొరదొరయుచు." అచ్చ. యు, కాం.

**ఱాపు.** దే. వి. రాయిడి. (చూ. ఱంకె మొదటియర్థము.)

**ఱాపువ్వు.** ద్వ. వి. (ఱాయి+పువ్వు.) అశ్మపుష్పము. (మొదటిరూపము ఱాతిపూవు.)

**ఱాయి.** దే. వి. శిల. "క. వాయుల్లమరయనినుమో, ఱాయోకాకిట్లురూపఱకవిననోర్చెన్" భార. భీష్మ. 3, ఆ.

## ఱి.

**ఱింగు.** దే. వి. ఱెక్కలగాలిచప్పుడు. 'ఉ. ఱింగను మ్రోఁతమ్రోఁగుచును ఱెక్కలపాములువోలె శౌరిచే, సింగిణివింట వెల్లిగొనుచిత్రశరంబులనూఱు నొంచి." పా. ౫, ఆ.

**ఱికము.** దే. అప. భావమునందువచ్చెడు ఒకానొక ప్రత్యయము "క. తెఱవకుఁగుచమండలమును, మఱిపిఱుఁదునుఘనము చేసిమధ్యమునకుఁబే, దఱికము సఁగె ననియజానం, దఱుదూఱుట మానెఁ జాలుదాల్చుటవలనన్." భో. 3 ఆ.

**ఱిక్క** దే. వి పశువులఁదోలునప్పటిధ్వని. "ద్వి. కుక్కలఁబిల్చుచు ఱిక్కవెట్టుచును, నెక్కొననోర గాలనిల్పుచుఁజనుచు." భాగ. 3, స్కం.

**ఱిక్కించు.** దే. స. క్రి. నిక్కించు. "సీ. ఱిక్కించుకొనియున్న ఱెక్క మొత్తముతోడి యొడలుఁజాడించి నెవ్వడివిదుర్చు." నై. ౨, ఆ.

**ఱిచ్చ.** దే వి. నిశ్చేష్టత. (చూ. ఱేఁడు.)

**ఱిచ్చపడు.** ద్వ. అ. క్రి. (ఱిచ్చ+పడు.) చేష్టలుదక్కు. "క. ఱిచ్చపడియుభయబలములు, నచ్చెరువుగఁజిత్రరూపులట్లుండ." భార. భీష్మ. ౧, ఆ. "ఉ. చూపఱల్, ఱిచ్చపడన్ వడింబఱచె ఱెప్పలువైచినయంతమాత్రలో, నెచ్చటికేగనోయనఁగ" పర. 3, ఆ. "క కవిసిబలముఁజంపంబాం, డవయోధులు నిల్వరించుటకుఁజాలక ఱిచ్చవడినఁగని పెల్లుగఁ గౌరవసైన్యములడరెనుద్ధురస్ఫురణమెయిన్." భార భీష్మ. ౨, ఆ.

**ఱిచ్చవాటు** ద్వ వి. ఱిచ్చవడుట 'చ. అనవినిఱిచ్చవాటుసకలాంగములం గడలేని దైన్యమా, ననమునమన్యువేగముమనంబునఁగ్రమ్మఁగ." హన. 3, ఆ.

**ఱిప్పు** దే వి. ఱివ్వుయొక్క రూపాంతరము. "క అప్పుడమికాన్పు నెత్తుక, ఱిప్పునఁజదలునకు నెగసి ఱేసినకడఁకన్, గుప్పునఁజనుతిఱినొడయఁడు తప్పకయొకకోల వానితలఁదెగ నేసెన్." అచ్చ ఆర, కాం

**ఱిమ్ము.** దే. స. క్రి. చిమ్మనఁగ్రోవితో జలాదికముఁజిమ్ము

**ఱివ్వు.** దే. వి. ఎగయుటయందగుధ్వన్యనుకరణము. "సీ. బడివాయకిలనగప్రతతితో ఱివ్వున నెగసినట్లయిలోఁచుమగువలార." వసు. ౮, ఆ.

## ఱు.

**ఱు.** దే. అప. ఒకానొక బహువచన ప్రత్యయము (ఉదా. విలుకాఱు, వేఁటకాఱు. మొ.)

**ఱుప్పు.** దే. స. క్రి. ఱువ్వుయొక్క రూపాంతరము. భాను ౨, ఆ.

**ఱువ్వు.** దే. స. క్రి. విసరివైచు. "సీ. డిండిమంబును కుబ్బిగండాల్పదాన మేఱులుఁగఁదద్వహుఱాలఱువ్విఱువ్వి." ఆము. ౨, ఆ.—వి. 1. ఱెక్కలగాలి చప్పుడు; "ఉ. ఱువ్వను మ్రోఁతతో నెదురెఱుంగనివీఁకఁబరాక్రమించుచో" భో. 3, ఆ.—2. కూలుటయందగుధ్వన్యనుకరణము. "క. ఈలీల సుమిత్రాసుతుఁ, డాలిగొనఁగ నెత్తురోడల నంతటఁగాఱన్, దూలుచుసోలుచువ్రాలుచు, తూలుచు బారివనరుచును ఱువ్వునఁగూలెన్." రా. అర, కాం. ౨, ఆ.

**ఱువ్వఁబులుఁగు.** దే. వి. పక్షివిశేషము, ఖంజరీటము.

### ఊా.

ఊావు. దే. స. క్రి. ఊవ్వునకు మొదటిరూపము. "సీ. పసలేరునిలురోరి పాతకులారని దేవాయుధంబులుఊావువారు." ఆము. ౬, ఆ.

### ఱె.

ఱెక్క. దే.వి.పక్షము."ఉ. ఱెక్కలుచించికంఠమున ఱేకులువాపి శిరంబు వ్రచ్చి." భార. భీష్మ. ౨, ఆ.
ఱెక్కచేవు. దే. వి. కొన్నిమూరలుగల ఱేకు.(చూ. బారచేఁవు.)
ఱెక్కపాయలు. దే. వి. బ. ధాన్యవిశేషము.
ఱెప్ప. దే. వి. కను ఱెప్ప. "ఉ. కంటికిన్, ఱెప్పయుఁబోలెమాటయిుచెఱిం బనులారసి యొజ్జవాడ్పునన్, జెప్పుచు." భార. ఉద్యో. ౪, ఆ.
ఱెప్పపాటు. ద్వ. వి. నిమిషము.
ఱెల్లు. దే. వి. తృణవిశేషము, శరము.
ఱెల్లుచూలి. దే. వి. కుమారస్వామి, శరజన్ముఁడు.
ఱెల్లుదీవి. ద్వ. వి. కుశద్వీపము.

### ఱే.

ఱేఁచు. దే. వి. శునకవిశేషము. (ఱేఁచుకుక్క.)
ఱేఁడు. దే. వి. 1. దొర; "క. ఱేనికి సంతసముచేసి ఱేసిరి కడఁకన్." య. ౨, ఆ.—2. మగఁడు. "క. ఱేనియనుమరణమునందన, మేనువిడిచినట్టి కాంత మేలిపదవికిం, దానునతండును నరిగియు, నూనస్థిరసుఖములందుచుండుటవిందున్."భార. శాం. 3, ఆ.
ఱేకు. దే. వి. 1. పుష్పదళము; "సీ. కబరికాభరము పైఁగన్నె గేదఁగిపువ్వుఱేకుతోఁగూడరే ఱేనిఁ బొదివి."వై. ౬, ఆ.—2. తగడు; 3. ఈఁక; (చూ. ఱెక్క.) 4. అంచుకమ్ములులేనివస్త్రము; 5. దుప్పటిలో సగము.
ఱేకుమడఁచు. దే. స. క్రి. అణఁగఁద్రొక్కు. పాంచా. 3, ఆ. (చూ. లంగగొను.)
ఱేపు. దే. వి. 1. ప్రాతఃకాలము; "ఉ. ఱేపులుభీమలింగముగుఱించి జపంబొనరించె నిచ్చటన్." భీ. ౨, ఆ. — 2. వెనుకటిదినము. (ఈ పదమునకు రాజమహేంద్రమునందు కడచినదినము అర్థముగా వాడుచున్నారఁట.) (రేపుయొక్క రూపాంతరము.)

ఱేయు. దే. అ. క్రి. 1. అతిశయించు; (చూ. ఱేపు.) 2. విజృంభించు. (చూ. ఱేఁడు మొదటియర్థము.)
ఱేల. దే. వి. ఆరగ్వధము. "పంచచామరము. చాలుఁజాలు నెంతకైనఁజాలునున్న గన్నెరుల్, ఱేలపూలకేలఁగోలఱేయ." య. ౪, ఆ.

### ఱై.

ఱైక. దే. వి. అవిక. "కలఁగినకొప్పుతోఁజిటిలుగందముతోవిడివడ్డఱైకతో." శకాం. ౪, ఆ. (మొదటిరూపము అయిక.) (చూ. అవిక.)

### ఱొ.

ఱొచ్చు. దే. వి. 1. తిరస్కారము; "వ. రఘువరులసచ్చరితోచ్చయంబుల నుచ్చరించుచుఁ దొచ్చెంబులఱొచ్చు సేయుచు." రామా. ౫, ఆ —2. బురద; 3. అపవాదము; "ఆ. ఇట్టులగుటయెఱిఁగియెఱిఁగియేనియును నె, ఱుంగకేనిబలిమిఱొచ్చుగడిగి, చేయుపనిఫలంబు సిద్ధింపకుండుట, కొలఁదిఁబోకదుఃఖములనుగలుగు." భార. అశ్వ. ౨, ఆ.—4. సందడి. "ఱొచ్చొర్వకిటులొంగఁ జొచ్చెమేను." ఆము. ౫, ఆ.
ఱొడ్డ. దే. విణ. ఎడమ. (ఱొడ్డచేయి.)
ఱొడ్డు. దే. విణ. అధికము. (ఱొడ్డుపులుగు.)
ఱొమ్ము. వై. వి. వక్షము. "తే. ఱొమ్ముగుటిచేసియేయుమెఱుంగులెల్ల, కడలనింపుచునదిసని కాఁడుటయును." అచ్చ. కిష్కిం. కాం.

### ఱో.

ఱోలు. దే. అ. క్రి. బాధచేనఱచు, విలపించు. "ఉ. సమయించెనుగ్రుఁడై, ఱోలఁగరోఁజగాఁబలుమఱుంబొరలంబడి లాలగ్రక్కన, వ్యాలుమగండువాక్పరిభవంబుదలంచుచు శౌర్యధుర్యుఁడై." భార. సౌ. ౧, ఆ. (ఒకానొకఁడుఈయర్థమునందుదీనిలఘురేఫముగాఁబ్రయోగించినాఁడు. అది సాధువుకాదు.) వి. దంచుటరుబ్బుటలోనగువానికి ఉపయోగించెడుసాధనము, ఉలూఖలము.
ఱోలుమ్రాను. దే. వి. ఉత్తరాసితిరిగెడు ఉతక.

### ల.

ల. ఒకయక్షరము. దే. అవ. 1. ద్వితీయా బహువచనమునందువచ్చెడు ప్రత్యయము; (ఉదా. రాములన్, వనితలన్, వనములన్. మొ.)—2. తృతీయాదిబహువచనము పరమవుచుండఁగావచ్చెడు ఆగ

ము.(ఉదా. రాములచేతన్, వనితలకొఱకున్, వనములకున్. మొ.)

లంక. ఉభ. దే. వి. 1. దీవి; "సీ. సెలయేటియిసుక లంకలపరాహంబులు మొత్తంబులై త్రవ్వుముస్తెలె త్త." స్వా. ౨, ఆ.—2. తలవాకిటిప్రక్కగది. సం. ఆ. స్త్రీ. 1. రావణునిపట్టణము; 2. ఒకానొకరాక్షసి; 3. ఱంకుటాలు; 4. కలాయము.

లంకణము. వై. వి జ్వరాదులచేతనుండెడి యుపవాసము.

లంకించు. వై. అ. క్రి. తగులు*. "క. లంకించియరుంధతిపతి, మంకణునకుఁజెప్పె." భీ. 3, ఆ. — స. క్రి. 1. పెనవేయు*; (చూ. లంకె యనుమూడవయర్థము.) 2. అవమానించు*. "క. జననియనకయిట్లంతయు, ననులంకించితి." హరి. పూ. ౧, ఆ.

లంకిణీ. అన్య. వి. ఒకవిధమైన బట్ట.

లంకియ. వై. వి. 1. సంగము*; 2. తగులుపాటు*; (చూ. లంకె.) 3. పెన*. "సీ. శిక్షింపవలయునట్టి, గుజ్జుకోడెలజట్టిగొని ప్రీతిలంకించి యుండ లంకియతోనగండుమీఱి, పాఱెనక్కోడియల్ పడియున్న చనుపలూక్టేనుంగుపై." భార. శాం. ౪, ఆ.

లంకె. వై. వి. లంకియయొక్క రూపాంతరము. (సంగమునకు.—"ఉ. ఇంకొకయేఁడువోయిననరేశ్వరయాతలికేయినీవు నా, లంకెకువచ్చియాత్మజాలలక్షణవంతులఁగాంచెదు." భాగ. ౯, స్కం.— తగులుపాటునకు. — "చావునకునింకలంకెగాఁజనదు." జై. ౭, ఆ.—పెనకు —"తే. క్రేపువాపోవఁబట్టిలంకియకుఁదార్చి." పాండు. ౫, ఆ.)

లంకెపలువు. ద్వ. వి. లంకెవేసెడుపలువు. "బల్లిదపు లంకెపలువులు." నీలా. ౨, ఆ.

లంకెపాటు. వై. వి. తగులుపాటు, తగులము. "సీ. తన పాదములకును దమతలలకులంకెపాటనిదుర్గాధిపతులువల్క." సా. ౧, ఆ. "సీ. లలనపాదంబుల లంకెపాటైయుండి రాఁజను నేనూపురంబులార." రామా. ౫, ఆ.

ంకెపీఁట. వై. వి. పెనవేసెడి మ్రానిపలక.

లంకెవెట్టు. ద్వ. స. క్రి. (లంకె+పెట్టు.) 1. తగులు పఱుచు; "ఎ, గీ. విష్ణుభక్తులందువిష్ణువునందుఁగ, లంక మొదలమననులంకెవెట్టి, విహితరాజ్యవృత్తి విడువనివాఁడునై, యతఁడురాచతపసియనఁగనొప్పె." భాగ. ౯, స్కం.—2. పెనవేయు. "తే. పర్వతమువంటియొకకొమ్మువందిమీఁద, నుఱికియొకజాగిలముచెవియొడిసిపట్టి, యదియుఁదనచాయఁదిరుగఁదానట్లతిరిగె, లంకెవెట్టినకైవడిశంకలేక." పు. ౨, ఆ.

లంకోయిక. సం. వి. ఆ. స్త్రీ. పిక్కటి.(రూ. లంకాసిక.)

లంగ. వై. వి. లంఘనము. (చూ. లంగగొను.)

లంగగొను. ద్వ. స. క్రి. (లంగ+కొను.) లంఘించు, దాఁటు. "చ. గురుకుచగుబ్బచన్నుఁగవ గోర్పిళులాడునుబుట్టచెండ్ల బొం, గరముల సొక్కలంగగొనుఁ గైరవపుంబలుసంగడంబులన్, దరలకయొత్తిపట్టు జిగితాళపుఁజిప్పలనొత్తియాడుఁ దా, మరవిరిమొగ్గగుత్తిఁ బలుమాఱును తీకు మడంచు నెంతయున్." చంద్రా. ౨, ఆ.

లంగము. సం. వి. అ. పుం. సంగము. డు. విటుఁడు.

లంగరు. వై. వి. ఓడనిలుచుటకై అడుగున దిగవేసెడు నాగేలువంటి యినుపసాధనము*, జీను.

లంగోటి. హిం. వి. గోచి.

లంఘ. సం. వి. ఆ. స్త్రీ. దాఁటు, లంగ.

లంఘనము. సం. వి. అ. న. 1. దాఁటు; 2. దూఁకుడు; 3. గుఱ్ఱపుదూఁకుడు; 4. లంకణము.

లంఘించు. సం. అ. క్రి. దూఁకు. స. క్రి. దాఁటు. (పరిలంఘించు, పరివిలంఘించు, విలంఘించు. అనియు.)

లంచము. సం. వి. అ. పుం. లంచేము, ఉత్కోచము.

లంచెగొండి. ద్వ. విశ. (లంచేము + గొండి.) లంచేముతీయువాఁడు.

లంచేము. వై. వి. తనపని చక్కఁబెట్టుకొనుటకై యొకనికి రహస్యముగానిచ్చు ధనము.

లంజ. సం. వి. ఆ. స్త్రీ. వేశ్య.

లంజిక. సం. వి. ఆ. స్త్రీ.——వై.——

లంజియ. వై. వి. లంజె*. "క. మునినాథయేనునిరతము, ననిమిషపతికొలువులంజియను." వి, పు. ౨, ఆ.

లంజె. వై. వి. వేశ్య*. (లంజియయొక్క రూపాంతరము.

లంజెకాఁడు. ద్వ. వి. విటకాఁడు, విటుఁడు.

లంజెత. ద్వ. వి. లంజియ, వేశ్య. "ద్వి. లంజెకాఱులసొమ్ములంజెతలంది." భల్లా. (స్వార్థమున తప్రత్యయము.)

లంజెబేడిస. ద్వ. వి. మత్స్యవిశేషము.

లంజెటికము. ద్వ. వి. వేశ్యాసంభోగము. భల్లా. ౫, ఆ.

లంజెసవరము. వై. వి. గొంతెమగోరు, ప్రసారణి.

లండి. దే. విణ. కుత్సితురాలు, కుత్సితుఁడు. "లండి కిఁజేకడెంబు." హంస. ౫, ఆ.

లండు. దే. విణ.——వై.——(చూ. కూళుఁడు మొదటియర్థము.)

లండుఁబోతు. దే. విణ. (లండు+పోతు.)——వై.——హారిశ్చ. ద్వి. ౨, భా. (స్వార్థమున పోతు.)

లంద. దే. విణ. పొట్టవాఁడు, తుందిలుఁడు.

లంపట. దే. వి. 1. శ్రమము; (చూ. లంపటపడు.)—2. ఆపద. (రూ. లంపటము.—ఆపదకు.—"క. లంపటము నివారింపను, సంపదకృపసేయ జయము సంపాదింపఁగ, జంపెడివారివధింపను, సొంపారఁగనీకచెల్లుసోమార్ధధరా." భాగ. ౮, స్కం.)

లంపటపడు. ద్వ. అ. క్రి. (లంపట+పడు.) శ్రమపడు. "క. మునుపాకనికినుండఁగఁజా, లనియచ్చో నిరువురొదిఁగి లంపటపడుచో, మనిచెప్పనైననాయనఁ, గనిచోటిచ్చిరిక్కపాధికతనమ్మునులుఁగ." పర. ౧, ఆ.

లంపటుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) అత్యాసక్తిగలవాఁడు.

లంపతా. దే. వి. దాసీపుత్త్రుఁడు. (లంపతావాఁడు అనియు.)

లంపాకము. సం. వి. అ. పుం. ఒకదేశము. విణ. ఆసగలది.

లంపు. దే. వి. దొంగమేఁత. "వ. గతికజొంపంబుల గుంపులకుతికిలంపులుమేయుచు." భాగ. ౧౦, స్కం. పూ.

లంపులమారి. దే. విణ. దొంగమేఁతమేయునది. "లంపులమారిదాననినులాఁచుక మాదిగవాఁడుగోయ." హంస. ౫, ఆ.

లంబనము. సం. వి. అ. న. 1. వ్రేలుడు; 2. మెడనువ్రేలాడుహారము లోనగునది.

లంబమానము. సం. వి. అ. న. మెడనువ్రేలాడుహారము లోనగునది. విణ. వ్రేలాడునది.

లంబము. సం. వి. అ. పుం. వ్రేలుడు. విణ. దీర్ఘము.

లంబాడి. హిం. వి. ఒకజాతిజనము.

లంబి. దే. వి. కుటుంబము.

లంబిక. సం. వి. ఆ. స్త్రీ. కొండనాలుక.

లంబితము. సం. విణ. (అ. ఆ. అ.) వ్రేలుడు.

లంబీ. దే. వి. లంబియొక్కరూపాంతరము.

లంబు. వై. వి. 1. స్థౌల్యము*; 2. గొప్పతనము*. "నీలంబుజిగికాంచినీలంబువలదను." శశాం. 3, ఆ.

లంబుషము. సం. వి. అ. పుం. ఏడుపేటలముత్యాలహారము.

లంబోదరుఁడు. సం. వి. అ. పుం. వినాయకుఁడు.

లంభనము. సం. వి. అ. న. 1. తిట్టుట; 2. దూషించుట.

లంభించు. సం. స. క్రి. 1. తిట్టు; 2. దూషించు.

లకుచము. సం. వి. అ. పుం. గజనిమ్మ*.

లకుముకి. దే. వి. ఆకసమునందుండి చెక్కలార్చుచు పొంచువేసి నీటిలోపలనుండు మత్స్యమునుపట్టుకొనిపోయితినెడు పక్షివిశేషము, టిట్టిభము.

లకోటా. హిం. వి. ఉత్తరము లోననుంచు కాకిదపు సంచి.

లకోరి. దే. వి. క్రూరబాణము. "ఉ. హెచ్చినబొమ్మవిండ్లఁగదియించినచూపులకోరికోలలఁగ, మెచ్చుముదుంగనేయుచు." చంద్రా. ౧, ఆ.

లకోరీ. దే. వి. 1. లకోరియొక్కరూపాంతరము; "క. ఈరీతింగొందలిరుల, కోరీసురతాణి కాఁకఁగూర్చుచకోరీ, శారీకీరీమత్తమ, యూరీరవములకునలికియుగ్మలిమదిలోఁగ." చంద్ర.—2. పారావతవిశేషము. "మేలైన లకోరీలు." సా. ౧, ఆ.

లక్క. వై. వి. ఒకానొకచెట్టుబంక, జతువు.

లక్కతెవులు. ద్వ. వి. ఒకదినుసుచీడ.

లక్కనము. వై. వి. 1. వ్యాకరణాదిశాస్త్రము; "ఉ. లక్కనమెంచికైతమొదలఁగ నుగుణాక్షరముల్ ఘటింపఁగ, డక్కఱనేలునేల గలయంతయునూరెలరాచబేసికం, బ్లొక్కటఁగొల్వఁగామెలిసియొజ్జయునిచ్చలఁబిచ్చలించురా, పెక్కకకబ్బము లెవ్వలయునెయ్యెడనెల్లరుమెచ్చనచ్చుగఁగ." కవిస. ౧, ఆ.—2. గుఱుతు.

లక్కపెట్టె. వై. వి. చిత్రపేటిక.

లక్కబియ్యము. ద్వ. వి. లక్కపొడి.

లక్కాకు. ద్వ. వి. (లక్క+ఆకు.) ఆఁడువారుచుట్టికమ్మచెవినుంచుకొనెడు లక్కపూసిన తాటాకు. (చూ. అక్షింతలు.)

లక్కిమి. వై. వి. లక్ష్మి.

లక్కుమనుఁడు. వై. వి. లక్ష్మణుఁడు. అచ్చ. ఆ. కాం.

లక్ష. సం. స. ఆ. స్త్రీ. అ. పుం. నూఱువేలు. వి. అ. న. ము. 1. గుఱి; 2. నెపము.

లక్షకము. సం. వి. అ. పుం. లక్ష్యార్థమును తెలిపెడు శబ్దము.

లక్షణ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఒకశబ్దవృత్తి; (చూ. వృత్తి.) 2. ఆఁడుబెగ్గురు. అ. న. ము. 1. గుఱి; 2.

తు; 3. చూపు; 4. వ్యాకరణాదిశాస్త్రము; 5. పేరు. పుం. బెగ్గురు. (పురాణమునకుఁగల పంచలక్షణములు.—సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము, వంశానుచరితము.)

లక్షించు. సం. స. క్రి. 1. గుఱిచేయు; 2. చూచు. (ఆలక్షించు అనియు.)

లక్ష్మణ. సం. వి. ఆ. స్త్రీ. ఆఁడుబెగ్గురు. అ. న. ము. 1. గుఱుతు; 2. పేరు.

లక్ష్మణుఁడు. సం. వి. అ. పుం. రామునితమ్ముఁడు. విణ. శ్రీమంతుఁడు.

లక్ష్మము. సం. వి. న్. న. 1. గుఱుతు; 2. ముఖ్యము.

లక్ష్మి. సం. వి. ఈ. స్త్రీ. 1. రమ; 2. సంపద; 3. వస్త్రభూషణాదులవలనఁగలిగినశోభ; 4. మెట్టదామరతీ; 5. బుద్ధియనెడుగంధద్రవ్యము; 6. గొల్లజిడ్డుతీ; 7. ప్రేంకణముతీ.

లక్ష్మీపతి. సం. వి. ఇ. పుం. 1. విష్ణువు, లచ్చిమగఁడు; 2. ప్రభువు.

లక్ష్మీవంతుఁడు. సం. విణ. (త్. ఈ. త్.) 1. సంపదగలవాఁడు; 2. ఒప్పిదము గలవాఁడు.

లక్ష్యము. సం. వి. అ. న. గుఱి. పుం. లక్షణచేఁదెలియఁదగినయర్థము.

లగడ. దే. వి. చిమిడినయన్నము, చిమిడిక.

లగనము. వై. వి. లగ్నము. "క. తొగనూడు గ్రుంకదట్టం, బుగఁజీఁకటులొాదవెరిక్కమొత్తమువొడమెకా, లగనమునుడాసెనయ్యెడఁ, దగఁబెద్దలునైదువలునుదద్దయుసెలమికా." నీలా. 3, ఆ.

లగాము. హిం. వి. కళ్లెము.

లగాయతు. హిం. వి. ఆరంభము, మొదలు.

లగుడము. సం. వి. అ. పుం. దండము.

లగుడు. దే. వి. శ్యేనవిశేషము. (చూ. నింగి.)

లగువు. వై. వి. 1. చేలుకన; 2. లాఘవము; "ఓరిలాపులగువుంగలపోటరివో లెంత్రేలెదేమి." భాగ. ౧౦, స్కం. ఉ.—3. గంతు.—విణ. చేలుక.

లగ్గ. వై. వి. (ముట్టడించి) కోటనుబ్రాఁకుట*. "వ. సత్వదాత్మండనుకలాపూర్ణుని ప్రెగ్గడతమమొగ్గరంబునగ్గలికమెఱయలగ్గకుడగ్గతించిన." కళా. ౫, ఆ.

లగ్గదింపు. ద్వ. వి. కోటమీఁదనుండి శత్రువులపయిఁద్రోసెడు ఱాతిబండలోనగునది.

లగ్గపట్టు. ద్వ. స. క్రి. (ముట్టడి వేసి) కోటనెక్కు. "ద్వి. పైరులులగ్గపట్టఁగరాదులంక." రా. యు, కాం.

లగ్గము. వై. వి. లగనముయొక్కరూపాంతరము.

లగ్గు. దే. వి. 1. మేలు, శుభము; "వ. అనంతరంబతనదక్షిణభుజాస్పందనంబుపలక్షించిమీఁద లగ్గగుననుచు." భార. అర. ౪, ఆ.—2. ఉత్తరక్రియ. "వ. దుర్యోధనాదులకునంతకంటెవిభవంబెసంగనాంబికేయుండౌర్ధ్వదైహికక్రియలాచరించునట్లుగానొనర్చితానెఱింగినవారలకెల్లలగ్గులుసేయుటకుఁదగుబంధులుఁలేరనివసుంధరావల్లభులనెల్లనుద్దేశించియంచితదానంబులఁజేయధౌమ్యుంబనిచె." భార. శాం. ౧, ఆ.

లగ్నకుఁడు. సం. వి. అ. పుం. పూఁటకాఁపు, ప్రతిభువు

లగ్నము. సం. వి. అ. న. రాశ్యుదయము. పుం. మదపుటేనుఁగు. విణ. 1. తగులుకొన్నది; 2. సిగ్గుఁబొందినది.

లఘిమ. సం. వి. న్. పుం 1. లఘుత్వము, చేలుకన; 2. ఒక విభూతి. (చూ. ఐశ్వర్యము.) (రూ. లఘిమము.)

లఘిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి చులుకనైనది; 2. మిక్కిలి తక్కువైనది.

లఘుకము. సం. వి. అ. పుం. తోఁటపోఁకతీ.

లఘులయము. సం. వి. అ. న. నీటివట్టివేరు

లఘువు. సం. వి. ఉ. స్త్రీ. పిక్కతీ. న. నల్లగలు. క్రి. విణ. శీఘ్రము. విణ. 1. వడిగలది; 2. చేలుకనిది; 3. చేవలేనిది; 4. ఒప్పిదమైనది.

లఘ్వి. సం. వి. ఈ. స్త్రీ. బండి. విణ. 1. చులుకనైనది; 2. కుఱుచనైనది.

లచ్చి. వై. వి. 1. లక్ష్మీదేవి; 2. సంపద. "క. కడులచ్చిగలిగి నేనియుఁ, గుడుతురుకట్టుదురుగాక." భాగ. ౧౦, స్కం. పూ.

లచ్చిమగఁడు. ద్వ. వి. విష్ణువు, లక్ష్మీపతి. "ఎ, గీ. అమ్మహాక్రీడనస్థలి నాచరించె, లంఘునాక్రీడనముతోల్లిలచ్చిమగఁడు." పాండు. ౫, ఆ.

లచ్చివారము. మి. వి. గురువాసరము. (ఇది సైఘంటికము.)

లచ్చెనము. వై. వి. 1. గుఱుతు; 2. వ్యాకరణాదిశాస్త్రము.

లజ్జ. సం. వి. ఆ. స్త్రీ. సిగ్గు, త్రప, వ్రీడ.

లజ్జాలువు. సం. విణ. (ఉ.) లజ్జాశీలుఁడు, సిగ్గరి.

లజ్జించు. సం. అ. క్రి. సిగ్గుపడు.

లజ్జితము. సం. విణ. (అ. ఆ. అ.) సిగ్గుపడినది.

లటక్కు. దే. వి. మ్రింగుటలోనగువానియందగుధ్వన్యనుకరణము. (వాఁడు దాని నోటవేసికొని లటక్కున మ్రింగెను.)

లట్టము. సం. వి. అ. పుం. కప్పెర.

లట్టు. దే. వి. 1. పడియ; 2. గాఁడి.

లట్టువ. వై. వి. చిటితాళము*. "చ. కరమునమ్రానిలట్టువయుఁగంబళమంసమునందుఁజంకిటం, దిరిపపుఁగూడయుంగొని తదీయనివాసమునిర్గమించి." వై. ౩, ఆ. (ఇది విచార్యము.)

లట్వా. సం. వి. ఆ. స్త్రీ. వాద్యవిశేషము. అ. పుం. ము. లడ్డు.

లడాయి. హిం. వి. యుద్ధము, జెగడము.

లడి. దే. వి. నిడుపుగాచుట్టినసరిగలోనగువానిచుట్ట.

లడ్డిగ. వై. వి. ప్రయాణముపోవునప్పుడు నెయ్యినూనెమొదలగునవిపోసికొనిపోయెడు చిన్నమూతిగలపాత్రవిశేషము*. "తేనెలడ్డిగ." (రూ. లడ్డిగము. "నేతిలడ్డిగము." మొ.)

లడ్డు. వై. వి. చక్కెరపాఁగుతోఁజేసెడు భక్ష్యవిశేషము.

లడ్డుకము. సం. వి. అ. పుం, న. లడ్డు, లట్వము.

లడ్డువము. వై. వి. (చూ.) లడ్డు. (చూ. బూరియ.)

లడ్వము. వై. వి. లడ్డువముయొక్క రూపాంతరము. (చూ. ఓఁగు.)

లత. సం. వి. ఆ. స్త్రీ. 1. తీఁగ; 2. ఎక్కుడుదీఁగ; 3. గఱికె?; 4. పూలగురివెంద?; 5. ముత్యాలహారపుపేట; 6. కొమ్మ; 7. పిక్క?; 8. ప్రేంకణము?; 9. చీమ; 10. సాలెపురుగు; 11. కస్తూరి.

లతకూన. మి. వి. లేఁతతీఁగవంటి ఆఁడుది. "సీ. లతకూనవినవమ్మ లతకూనగాదిది తరుణలతాతన్వితనువుగాని." భాను. ౩, ఆ.

లతాంతము. సం. వి. అ. న. పుష్పము, పూవు.

లతాప్రతానని. సం. వి. ఈ. స్త్రీ. ఒకటితోనొకటి పెనఁగొన్నతీఁగలోనగునది.

లతార్కము. సం. వి. అ. పుం. పచ్చనీరుల్లి?.

లతిక. సం. వి. ఆ. స్త్రీ. 1. తీఁగ; 2. నూఱుపేటలహారము.

లత్తి. దే. వి. 1. దెబ్బ; 2. ఆపద.

లత్తిక. దే. వి. బలుపును చప్పుడునుగల ఒకదినుసు గచ్చకాయ.

లత్తిచేప. దే. వి. మత్స్యవిశేషము.

లత్తుక. వై. వి. లాక్షారసము, అలక్తకము.

లత్తుకబొత్తులు. ద్వ. వి. బ. ధాన్యవిశేషము. హంస. ౪, ఆ.

లద్ది. దే. వి. గుఱ్ఱములోనగువాని మలము.

లద్దిపిప్పి. దే. వి. ఒకదినుసు చీడపురుగు.

లద్దిపురుగు. ద్వ. వి. మగ్గినమ్రానులోనగువానియందుకలిగెడు తెల్లనిక్రిమివిశేషము.

లద్దె. దే. వి. (నేయువాఁడువస్త్రపుచివరనువిడిచెడి) కచ్చు. (మొదటిరూపము లద్దియ.)

లపక. దే. వి. ధనము, విత్తము.

లపనము. సం. వి. అ. న. 1. ముఖము; 2. నోరు; 3. మాట.

లపితము. సం. వి. అ. న. మాట. విణ. మాటలాడఁబడినది.

లప్ప. దే. విణ. రాశి. "కస్తురిలప్ప." "చక్కెరలప్ప." "సీ. మంచులప్పలమించుమంచెంగమదుపులుపారలితెట్టువగట్టునురువులయ్యె." వై. ౨, ఆ.

లప్పము. వై. వి. మ్రానిపెట్టెలోనగువానిసందు గొందులకు మెత్తెడు ఒకదినుసునున్నపుముద్ద*.

లబ్బిలు. హిం. వి. తురకలలో నొకజాతివారు.

లబ్ధము. సం. వి. అ. న. భాగహారముచేయగా నేర్పడుసంఖ్య. విణ. పొందఁబడినది.

లబ్ధవర్ణుఁడు. సం. వి. అ. పుం. విద్వాంసుఁడు, చేదువరి.

లబ్ధి. సం. వి. ఇ. స్త్రీ. లాభము, ప్రాప్తి, కలిమి.

లభించు. సం. అ. క్రి. ప్రాప్తించు, కలుగు.

లభ్యము. సం. విణ. (అ. ఆ. అ.) 1. లభింపఁదగినది; 2. యుక్తము.

లమిడి. హిం. వి. బాందిస్త్రీ. ఒక తిట్టుమాట.

లయ. ఉభ. దే. వి. మోసము. సం. అ. పుం. తౌర్యత్రికసామ్యము.

లయము. సం. వి. అ. న. నీటివట్టివేరు. పుం. 1. నాశము; 2. ఆలింగనము.

లయకారి. దే. విణ. మోసకాఁడు. "తే. అతనిఁ గప్పిపెట్టెడినీలయకారిదొంగ." వై. ౪, ఆ.

లయించు. సం. అ. క్రి. 1. నశించు; 2. సక్తమగు.

లయ్య. వై. వి. వేశ్య*. (ఇది లక్షణగ్రంథములయందువ్రాయఁబడియున్నదిగాని దీనికిప్రయోగము మృగ్యము.)

లలంతిక. సం. వి. ఆ. స్త్రీ. మెడనువ్రేలాడుహారము లోనగునది.

లలన. సం. వి. ఆ. స్త్రీ. 1. విలసనశీలయైన ఆఁడుది; 2. ఆఁడుది; 3. నాలుక.

**లలాటము.** సం. వి. అ. న. నొసలు, నుదురు, అలికము.

**లలాటిక.** సం. వి. ఆ. స్త్రీ. పాపటబొట్టు.

**లలామకము.** సం. వి. అ. న. (చూ.) బాసికము.

**లలామము.** సం. వి. న్. న. 1. గుఱుతు; 2. టెక్కెము; 3. తొడవు; 4. నొసటనుంచుకొనెడుబొట్టు; 5. గుఱ్ఱమునొసటిచుక్క; 6. తోఁక; 7. కొమ్ము; 8. ప్రభావము; 9. గుఱ్ఱము; 10. (ఉత్తరపదమైనచో) శ్రేష్ఠము.

**లలి.** దే. వి. 1. క్రమము; (చూ. తలరు అయిదవయర్థము.) 2. ప్రేమ; "ద్వి. పొరిఁబొరిఁదమచంచుపుటములుసాఁచి, నిరతంబుగాఁగ వెన్నెలఁబుక్కిలించి, లలితోడఁదమప్రియులకు నిచ్చియిచ్చి." రా. యు, కాం.—3. వికాసము; "ద్వి. దళము నలిగి వెల్లఁ దప్పియందంద, లలిదక్కుచును గమలంబులు మొగిడె." రా. యు, కాం.—4. ఉత్సాహము. "లలిమీఱఁ హరికంసుమంచమునకుఁ లంఘించి." వి, పు. ౭, ఆ.

**లలితము.** సం. వి. అ. న. సుకుమారత్వముచేతనగు అంగవిన్యాసరూపమైన స్త్రీలయొక్క శృంగారచేష్టావిశేషము. విశే. 1. ఈప్సితము; 2. మనోజ్ఞము.

**లవంగము.** సం. వి. అ. న. కరాపువు.

**లవణము.** సం. వి. అ. న. ఉప్పు. (త్రిలవణము—సైంధవము, బిడము, రుచకము.) పుం. 1. ఉప్పన; 2. ఉప్పుసముద్రము. (డు. ఒక అసురుఁడు.) విశే. 1. ఉప్పనిది; 2. లావణ్యముగలది.

**లవణాకరము.** సం. వి. అ. పుం. 1. ఉప్పుసముద్రము; 2. ఉప్పళము.

**లవణి.** దే. వి. బిగువు. "సీ. ఐణేయమైనయొడ్డాణంబులవణిచేనక్కళించినపొట్టమక్కళించి." స్వా. ౧, ఆ.

**లవణోదము.** సం. వి. అ. పుం. ఉప్పుసముద్రము.

**లవనము.** సం. వి. అ. న. పైరులోనగువాని కోఁత.

**లవనసు.** ఆం. వి. జీవనార్థమయియిచ్చు ద్రవ్యము.

**లవము.** సం. వి. అ. పుం. 1. లేశము; 2. చేటు; 3. కోఁత. డు. రామునికొడుకు.

**లవలవ.** దే. విశే. భేదిల్లినది. "ద్వి. పటువజ్రనిష్ఠురపాదఘట్టనల, లవలవలైకుతలంబుగ్రక్కదల." హరిశ్చ. ౧, భా.

**లవలి.** సం. వి. ఈ. స్త్రీ. ఒకానొకతీఁగ.

**లవాజేమా.** దే. గ్రామసేవకుల జీతములకై తీసికొనఁబడు కొద్దిపన్ను.

**లవింమే.** సం. స. క్రి. కోయు.

**లవిటి.** దే. వి. ఱెక్కమొదలు, పక్షతి.

**లవిత్రము.** సం. వి. అ. న. కొడవలి, దాత్రము.

**లశునము.** సం. వి. అ. న. 1. వెల్లుల్లి†; 2. కెంపునందలిదోషవిశేషము. (అనఁగా పాలు పైఁబూసినట్లుండెడు తెల్లడాలు.)

**లష్కరు.** హిం. వి. దండు.

**లసుకు.** దే. స. క్రి. నాశముచేయు. "చ. లసికిరిజోదులగ్గలిక లగ్గలకెక్కనఁగుంతపజ్జుకలన్, వసుమతిఁగూల్చియున్ గదలవైచియుఁగత్తులవ్రక్కలించియున్, వసులవధించియున్ ముసలవర్గములన్ బడమోఁదివాలుకల్, మసలఁగ వేఁచివంచియును మందులతిత్తులఁగాల్చివైచియున్." రా, వి. ౫, ఆ.

**లస్తకము.** సం. వి. అ. పుం. ధనుర్మధ్యము, పిడికట్టు.

**లహరి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. పెద్ద అల, కడలు.

లా.

**లాంగలము.** సం. వి. అ. న. 1. నాఁగలి; 2. తాడు†, 3. ఒకపువ్వు; 4. గృహదారువిశేషము; 5. మగగుఱి.

**లాంగలి.** సం. వి. ఈ. స్త్రీ. 1. తరిగొఱ్ఱి†, (రూ. లాంగలికి.) 2. నీరుపిప్పలి†. న్. పుం. 1. నాఁగటిజోదు; 2. నారికడము†; 3. పాము.

**లాంగూలము.** సం. వి. అ. న. 1. తోఁక, 2. మగగుఱి. పుం. అభినయహస్తవిశేషము. (ఉంగరపువ్రేలినివంచి చిటికెనవ్రేలినిపైకెత్తి కడమ మూడువ్రేళ్లనూర్ధ్వాకారముగా త్రేతాగ్నులవలెపట్టినది.)

**లాంఛనము.** సం. వి. అ. న. 1. గుఱుతు; 2. పేరు.

**లాంతరు.** ఆం. వి. దీపముపెట్టుటకై అద్దములతో చేసినది.

**లాంపట్యము.** సం. వి. అ. న. లంపటభావము. (చూ. లంపటుఁడు.)

**లాఁక.** దే. వి. పక్షియీఁక.

**లాఁకకట్టు.** దే. వి. విఱిచికట్టిన పెడచేతులకట్టు.

**లాఁగ.** దే. వి. బొఱియ, బిలము. "సీ. లాఁగలఁబుట్టల లోఁగినశిఖులభుజంగమకులముల మ్రింగికొనుచు." భార. అశ్వ. ౨, ఆ.

లాఁగడాఁగుడు. దే. వి. సర్పము, బిలేశయము. "లాఁగడాఁగుడుటాఁగ ప్రోఁగులిడెడు ప్రోడ." అచ్చ. బాల, కాం.

లాఁగరి. దే. వి. (లాఁగ + అరి.) చెవి, శ్రోత్రము.

లాఁగించే. వై. అ. క్రి. లంఘించు. "వ. నడుము లాఁగించివైచియు." ఉ, హరి. 3, ఆ. (ఇది విచార్యము.)

లాఁగు. వై. వి. 1. లంఘనము; "ఎ, గీ. లాఁగు వేగంబు మెఱసిచలంబు నెఱపి, మల్లుతనమున మెప్పింతు మనుజవిభుని." భార. విరా. ౧, ఆ.—2. చల్లడము*. "కావిలాఁగులునీలికాసెలు." రసి. ౧, ఆ.

లాఁచే. దే. అ. క్రి. 1. కవియు; "సీ. తనబిడ్డఁజెఱ నిడ్డదనుజు మ్రింగఁగనుర్వి లాఁచెనోయనితోఁ చెలంకమీఁద." రామా. ౭, ఆ. — 2. పొంచు. "ద్వి. గోఁచికాఁడైదానిఁగొనుచునేతెంచి, లాఁచియున్నాఁడునీలాగొత్తిచూడ." హరిశ్చ. ౨, ఆ.

లాఁత. దే. వి. లాయుట. (చూ. లాయు.)

లాఁతసేయు. ద్వ. అ. క్రి. (లాఁత+చేయు.) లాయు. "వ. కరాళింపకలాఁతసేయక." ఉ, హరి. ౮, ఆ.

లాఁతి. దే. స. పెఱ, అన్యము. "ఉ. మమ్మునిమ్మెయిన్, లాఁతులఁగాఁదలంపకునలంపకుచాలనలంగియుండఁగన్." ఉ, హరి. ౮, ఆ.

లాఁతు. దే. విణ. అధికము. "తే. అనినలాఁతుగఁ గోల్పోకనతఁడురాజు, రడ్డిఁగనునని కోదయుఁ దీర్పంగమగుడి, యంతఁబరియును బైప్రజకలికి పాటి,పోవవాఁడును వెడపోట్లుపొడిచిచనియె." ఆము. ౨, ఆ.

లాఁపరా. దే. వి. (లాఁపు+రాయి.) జలద్వారముఖమునతృణాదికముచొరకుండ నమర్చియుండెడు గండ్లఱాయి. "వ. గుడిలాఁపరాతూపరాణికడనిలిచి." ఆము. ౨, ఆ. (సంధిని వర్ణవికారము.)

లాఁపు. దే. వి. లాఁచేట. (చూ. లాఁచు.)

లాకకట్ట. దే. వి. లాకలతోడ చుట్టియుంచిన పనిముగియనిపడుగు.

లాకలు. దే. వి. బ. పడుగునందక్కడక్కడచొప్పించెడు వెదురుబ్రద్దలు. హంస. ౨, ఆ. (వృత్తియందేకవచనాంతము. ఉదా. లాకచేతులు.)

లాకు. ఆం. వి. కాలువలో నేర్పఱచఁబడు బంధనము.

లాక్ష. సం. వి. ఆ. స్త్రీ. లక్క, జతువు. (రూ. రాక్ష.)

లాక్షణికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) లక్షణజ్ఞుఁడు.

లాక్షాప్రసాదనము. సం. వి. అ. పుం. ఎఱ్ఱలొద్దుగు.

లాగము. వై. వి. లాఘవము. "అతండు వానిఁగడు వేగములాగము నొప్పమీఁదికిన్ వైచె." హరి. పూ. ౭. ఆ.

లాగి. ద్వ. విణ. (లాగము+ఇ.) లఘువు, సులభము. "చ. సరసనయానుభావమునఁజక్కనిచక్కరబొమ్మలాగిగా, దొరకెనటంచు మనమ్మతిని." శకాం. ౮, ఆ.

లాగించే. దే. స. క్రి. కొనిపోవు. "క. అనిననది యెంతగలద, ట్లనసేసెదనంచుఁ జనియట నొకానొకనాఁ, డొనవెట్టుకొనిమెలంగఁగ, ననువైన సుమంతుపావలదిలాగించెన్." (చూ. ముందు వెనుకలు.) సా. 3, ఆ.

లాగు. దే. స. క్రి. ఆకర్షించే. వి. 1. ఆకర్షణము; (లాగులాడు.)—2. విధము; (చూ. నీరుమానిసి.) 3. సమ్మతి. (చూ. నెత్తము రెండవయర్థము.)

లాగుకొను. దే. స. క్రి. అపహరించుకొను. (ఆ సొమ్మంతయు వాఁడు లాగుకొన్నాఁడు.)

లాగులాడు. దే. అ. క్రి. (లాగులు+ఆడు.) పెనఁగులాడు. "పైఁటకులాగులాఁడి." పాంచా. ౫, ఆ.

లాఘవము. సం. వి. అ. న. 1. లఘుత్వము; 2. ఆరోగ్యము.

లాచారు. హిం. విణ. నిరాధారముగానుండు.

లాచి. దే. వి. 1. గుఱ్ఱముమీఁదను గాడిదమీఁదను వేసెడు గోనె; 2. చిన్నబండిమీఁద తెచ్చుభారము.

లాచీ. దే. వి. లాచియొక్క రూపాంతరము.

లాజ. సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. బ. పేలాలు. అ. న. ము. వట్టివేరు. పుం. నానబియ్యము.

లాటరీ. ఆం. వి. చీట్లువేసి వస్తువులనమ్ముట.

లాటి. దే. వి. పక్షివిశేషము.

లాటీ. వై. వి. దుడ్డుకఱ్ఱ, లౌడియొక్క రూపాంతరము. (ఇది వాడుకలోనిది.)

లాటు. ఆం. వి. ఏలములో నొకపద్దు.

లాడము. దే. వి. గుఱ్ఱపుగొరిజెలకుకొట్టెడి యినుపతగటిబిళ్ల.

లాడి. దే. వి. 1. పెద్దపుండు; "ఉ. లాడికిమాఁగు కాకులఁ బలాయనమొందఁగఁ జేయవీఁపు పైఁ, ద్రాడునవ్రేలునీఁకగుది." హంస. ౫, ఆ.— 2. బలి. "ఎ, గీ. దీని, వత్సయుతముగనివ్వనీవాటమునకు, లాడిఁ గావింతునంతఁ దొలంగుదూఱు." పాండు. ౫, ఆ. (ఈయర్థమింకను విచార్యము.)

లాడె. దే. వి. బరువుమోసెడియెద్దువీఁపున బరువెక్కించుట. (మొదటిరూపము లాడియ.)

**లాతము.** దే. వి. సన్యాసులు చేతఁబట్టెడుదండము. "లాతపుఁగోల." (చూ. నాగబెత్తము.) "ఈలాతంబునవ్రాయఁబట్టణములౌ." (దీనికి ముందు పద్యము (చూ.) ఉరువిడి.) విక్ర. ౨, ఆ.

**లాతాము.** దే. వి. లాతముయొక్క రూపాంతరము. (చూ. కకపాల.)

**లాదు.** హిం. వి. కట్టడములలో వంపులుకట్టునపుడు వానికాధారముగా కట్టుకట్టడము.

**లాభము.** సం. వి. అ. పుం. 1. క్రయవిక్రయముల వలన వచ్చినవిశేషధనము; 2. వడ్డి; 3. ప్రాప్తి.

**లామజ్జకము.** సం. వి. అ. న. నీటివట్టివేరు.

**లాయఖు.** హిం. విణ. తగిన.

**లాయము.** వై. వి. అశ్వశాల. (చూ. మందడీఁడు.)

**లాయరు.** ఆం. వి. న్యాయవాది.

**లాయిలాసా.** హిం. వి. శ్రమ.

**లాయు.** దే. అ. క్రి. ఉద్రేకించు, విజృంభించు. "మ. లయకాలోత్థ పతంగబింబముక్రియన్ లాయున్ యదీయోగ్రని, ర్దయనిర్ముద్రసుదర్శనాఖ్య పటుచక్రంబిద్ధదైతేయసం, క్షయసంక్రీడకునట్టిదేవుఁడుకృపాకల్యాణుఁడజ్ఞాత్ముఁడ, క్షయుఁడాత్మీయపరాభవంబెటునునిచ్చన్ సైఁపఁగానేర్చునే." హరి. ఉ. ౭, ఆ. (చూ. మెఱుము. స. క్రి.)

**లాల.** సం. వి. ఆ. స్త్రీ. చొంగ, స్యందిని.

**లాలనము.** సం. వి. అ. న. లాలించుట, బుజ్జగము.

**లాలము.** దే. వి. ఉల్లారుక్రిందిజాలరు. (చూ. లాలసరి.)

**లాలస.** సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. 1. అధికేచ్ఛ; 2. ఔత్సుక్యము; 3. యాచన. విణ. విషయాసక్తురాలు.

**లాలసరి.** ద్వా. వి. (లాలము + సరి.) గుజ్జుపుపల్లము మీఁదియుల్లారుక్రిందవ్రేలెడుజల్లులదండ. "వ. పార్శ్వంబులం గట్టుకొంబట్టులాలసరిసమకట్టు లెక్కలుగా." స్వా. ౪, ఆ.

**లాలాటికుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) 1. ప్రభువుయొక్క అభిప్రాయమును తెలిసికొనువాఁడు; 2. కార్యమునందు నేర్పుచాలనివాఁడు.

**లాలి.** దే. వి. ఉయ్యేల. "తే. లాలిఁగట్టిరిగంధోపలాలితాఖి, లాలిసుమచంద్రకాంతోపలాలిసౌధ, లాలితస్థలిహరునియిల్లాలిఁబాడి, మేలిజవరాలిగములురాచూలికపుడు." సా. ౧, ఆ.

**లాలించు.** సం. స. క్రి. లాలనముచేయు, బుజ్జగించు.

**లాలిత్యము.** సం. వి. అ. న. లలితభావము.

**లాలు.** దే. విణ. ఎఱుపు. "సీ. మధుభూపసైనికమండలిలాలుజెండాలనఁదలిరాకుడాలునిగిడె." కవి. ౨, ఆ.

**లాలూచి.** హిం. వి. 1. అత్యాశ; 2. నైచ్యము.

**లావకము.** సం. వి. అ. పుం. లావుకపిట్ట. (గౌరికము, పాంసులము, పౌండ్రము, కర్బురము అని ఇది చతుర్విధము.)

**లావణము.** దే. వి. కొలువునకుక్రొత్తగావచ్చినకొలువుడుకానినిపట్టికయందువ్రాసికొనుట. (కొలువుడుకానిని కొలువునందుండిత్రోయుట సలితము.)

**లావణి.** దే. వి. పసులుమేసెడు బీటినేలకై ముందుగానిచ్చెడుధనము.

**లావణ్యము.** సం. వి. అ. న. 1. ముఖకాంతివిశేషము; 2. ఉప్పన.

**లావనము.** సం. వి. అ. న. లవనముయొక్క రూపాంతరము.

**లావరి.** దే. విణ. (లావు+అరి.) బలవంతుఁడు. (చూ. అఱక.)

**లావాదేవి.** హిం. వి. ఇచ్చిపుచ్చుకొను సంబంధము.

**లావు.** దే. వి. 1. బలము; "ఆ. ఇవ్విధమున నేచియిరువురుఁబెద్దయుఁ, బ్రొద్దుపోరవాయుపుత్రుబలము, తోడుతోడఁబెరుఁగఁదొడఁగెనాకీచకాధమునిలావుపిదపఁదఱుఁగఁజొచ్చె." భార. విరా. ౨, ఆ.—2. సామర్థ్యము; "ఆ. పిన్నవాఁడనని యుఁబెక్కుసంస్కృతములు, వినని వాఁడ నని యు వెఱపుమాను, మత్ప్రసాదదివ్యమహిమచేనంతైనఁ, గవితఁజెప్పులావుగలదునీకు." వీర. ౧, ఆ.—3. ఆధిక్యము, అతిశయము; "కొలువులావునదేవతలైనమెచ్చరే." ఉ, హరి. 3, ఆ.—4. పక్షతి. (చూ. కనిమసఁగుమొదటి యర్థము.) విణ. 1. స్థూలము; 2. అశక్యము. "ఉ. వారలన్, లావు రణంబులో మనకలంఘ్యబలాఢ్యులనింక నోర్వఁగాన్." భార. సభా. ౨, ఆ.

**లావుక.** వై. వి. ఒకానొకపక్షి. (చూ. రవాళి.)

**లాసకము.** సం. వి. అ. పుం. నెమిలి. డు. లాస్యము చేయువాఁడు, ఆటకాఁడు.

**లాసము.** సం. వి. అ. పుం. ఆట, లాస్యము, నృత్యము.

లాసిక. సం. వి. ఆ. స్త్రీ. లాస్యముచేయునది, ఆటకత్తె.

లాస్ఫోటని. సం. వి. ఈ. స్త్రీ. ఆస్ఫోటనియొక్క రూపాంతరము.

లాస్యము. సం. వి. అ. న. 1. నృత్యము; 2. తౌర్యత్రికము.

లాహిరి. దే. వి. మైకము. "లాహిరిపట్టినభాతి." కాశీ. ౨, ఆ. (రూ. లాహిరీ. "చ. గడుసరిలాహిరీమసగ గ్రమ్మినమత్తులుగారె భూపతుల్." రాజ. 3, ఆ.)

లాహిరిమోదము. దే. వి. గంజాయిపొగపట్టెడు పాత్రవిశేషము. (ఇది విచార్యము.)

లాళము. దే. వి. లాడముయొక్క రూపాంతరము.

## లి.

లింగఁడు. వై. వి. జంగమయ్య. "క. బాలునిఁబాలకుఁబిలిచెడు, లీలంగరయుగముసాఁచిలేమయొకతెయి, ట్లాలింగనిఁగని వేగం, బాలింగనమొసఁగవచ్చునటులుమదించెన్." రాజ. ౨, ఆ.

లింగకట్టుమాత్ర. మి. గ్రా. వి. (లింగము + కట్టు మాత్ర.) లింగాకారముగాచేసిన రసవస్తువుల గుళిక.

లింగకాయ. మి. గ్రా. వి. (లింగము + కాయ.) లింగధారులులింగమునుంచి కట్టుకొనెడు వెండి బంగారములతోఁ చేసినసజ్జెకాయ.

లింగదొండ. మి. గ్రా. వి. (లింగము+దొండ.) లింగాకారపు ఒకదినుసు దొండతీ.

లింగపొట్ల. మి. గ్రా. వి. (లింగము + పొట్ల.) లింగాకారపువిత్తులుగల ఒకదినుసుపొట్ల, లింగబీజతీ.

లింగబలిజెలు. మి. గ్రా. వి. (లింగము+బలిజెలు.) లింగధారులయినబలిజెవారు.

లింగబీజ. సం. వి. ఆ. స్త్రీ. లింగపొట్లతీ. అభి.

లింగము. సం. వి. అ. న. 1. పానవట్టముమీఁదిశివమూర్తి; 2. గుఱుతు; 3. మగగుఱి; 4. అనుమానము; 5. పంచవింశతితత్త్వములయందు ఆదియగు ప్రకృతి.

లింగరాజు. మి. గ్రా. వి. (లింగము+రాజు.) కూఁకటిమూఁగ.

లింగవృత్తి. సం. వి. ఇ. పుం. (చూ.) తాఁటదమ్మఁడు.

లింగి. సం. వి. న్. పుం.——పై.——

లింగిని. సం. వి. ఈ. స్త్రీ. దూతికావిశేషము.

లికుచము. సం. వి. అ. పుం. లకుచముయొక్క రూపాంతరము.

లిక్క. దే. వి. గడ్డిలోనగువానితోసెడి చిన్న కొడవలి.

లిక్ష. సం. వి. ఆ. స్త్రీ. చెమటచే తలవెండ్రుకలయందుపట్టెడి ఈరు.

లిఖించే. సం. స. క్రి. వ్రాయు. (లిఖియించుఅనియు.)

లిఖితము. సం. వి. అ. న. 1. వ్రాఁత; 2. వ్రాయి. విశే. వ్రాయఁబడినది.

లిఖితవ్యము. సం. విశే. (అ. ఆ. అ.) వ్రాయఁదగినది, లేఖ్యము.

లిఖితుఁడు. సం. వి. అ. పుం. 1. పత్రమువ్రాసికొనువానిచేరప్పింపఁబడి పత్రమునందు సంతకము చేసినసాక్షి, వ్రాఁతసాకిరి; 2. ఒకముని.

లిద్ది. దే. వి. 1. దంచిమిక్కిలిలోఁతుపడిన మ్రానితోటికిఁగొట్టెడుగూటము; "ద్వి. పెద్దగాఁదనమేను పెంచిననిండ, లిద్దిగొట్టినయట్టిలీలర్యై." భాగ. ౧౦, స్కం.—2. పడిసెముచేత ఊపిరిరాక ముక్కడఁచుకొనుట.

లిపి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. రేఖారూపమైనయక్షరవిన్యాసము, వ్రాయి.

లిపికరుఁడు. సం. వి. అ. పుం. వ్రాయసకాఁడు, లేకరి.

లిపికారుఁడు. సం. వి. అ. పుం.——పై.——

లిపీకరుఁడు. సం. వి. అ. పుం.——పై.——

లిప్తకము. సం. వి. అ. పుం. విషముపూసినబాణము. విశే. పూయఁబడినది.

లిప్తము. సం. విశే. (అ. ఆ. అ.) 1. పూయఁబడినది; 2. భుజింపఁబడినది.

లిప్స. సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛ, కోరిక.

లిబ్బి. దే. వి. 1. ధనము; 2. రాశి; 3. నిధి.

లిబ్బిపడఁతి. దే. వి. లక్ష్మి.

లిబ్బిరాయఁడు. దే. వి. కుబేరుఁడు, ధనాధిపతి.

లిభి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. లిపియొక్క రూపాంతరము.

లిమ్మ. దే. వి. మాంసాదులమీఁద ముసురుకొను ఈఁగలనుదోలెడురెమ్మ. చెన్న. ౪, ఆ.

లియ్యము. వై. విశే. లయించినది. (నామనసు అందు లియ్యమైనది.) "లియ్యమువియ్యమానో." పాంచా. 3, ఆ.

**లివ.** దే. వి. లాఘవము. "ఉ. అ, య్యారెబలంబుధాటిబలియాలివయంచువజీరులెంచఁగన్." (చూ. తీరు. అ. క్రి.) చంద్రా. ౨, ఆ. "సీ. కడుడాకమీఱంగ మడమలుదాఁటించు చునుముందటికిలివచూపిచూపి." కళా. 3, ఆ.

**లివలివ.** దే. వి. దంతములుకదలుటయందగుధ్వన్యనుకరణము. "వ. కుదురుపట్టెడలి వెడలిలివలివంగ దలఁరదనపఙ్క్తులును." కవిక. ౫, ఆ.

## లీ.

**లీఢము.** సం. విణ. (అ. ఆ. అ.) తినఁబడినది.

**లీనము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. లయించినది; 2. కరఁగినది.

**లీల.** సం. వి. ఆ. స్త్రీ. 1. క్రీడ; 2. శృంగారచేష్ట; 3. ప్రేమాధిక్యమున వేషభాషణాదులచేత ప్రియుని అనుకరించునట్టి స్త్రీశృంగార చేష్టావిశేషము; 4. క్రియ; 5. (తెనుఁగున) విధము. "ఈలీలన్." మొ.

**లీస్టు.** ఆం. వి. పట్టీ, జాబితా.

## లు.

**లు.** దే. అప. ప్రథమాబహువచనప్రత్యయము. (ఉదా. రాములు, వనితలు, వనములు. మొ.)

**లుంగ.** దే. వి. వస్త్రభారము.

**లుంగము.** సం. వి. అ. పుం. ఫుల్లమాదిఫలము? "ఉత్సాహ. అంగనాలలామఁగానవాలతాకుడుంగమా, తంగమాభుజంగమాపతంగమాకురంగమా, లుంగమాలవంగమాతులుంగమాధవీనట, ద్భృంగమావనీరమాకరీరమాసమీరమా." రామా. ౫, ఆ.

**లుంగి.** దే. వి. కుల్లాయకుప్పసములుచేర్చికుట్టినపావడ.

**లుంటాకుఁడు.** సం. వి. అ. పుం. దొంగ. విణ. దోఁచుకొనువాఁడు. "ఓఘునతమోలుంటాకకీర్తీ." పర. 3, ఆ.

**లుంఠనము.** సం. వి. అ. న. భూమిమీఁదిపొర్లిక.

**లుకలుక.** దే. వి. పరుగెత్తుటయందును పురుగులుతొలుచుటయందును నగుధ్వన్యనుకరణము. "క. ఒకమొంగము గాక దివిజాలు, తిక మక గొని వైరులెల్లదీకొనితమ్ముం, బకపకనగవకవకలై, లుకలుకఁబరువెత్తిరోడిలోఁగొనుభీతిన్." భాగ. ౭, స్కం. "లుకలుక మస్తకంబు చెవులుం గ్రిమిలొల్వఁగ." భల్లా. ౨, ఆ

**లుకలుకలాడు.** దే. అ. క్రి. (లుకలుకలు+ఆడు.) తడఁబడు.

**లుక్కా.** సం. వి. చ్. పుం. 1. లోపము; 2. కోఁత.

**లుగచెడు.** దే. అ. క్రి. బాగుతప్పు.

**లుగ్సాను.** హిం. వి. నష్టము.

**లుచ్చా.** హిం. వి. నీచుఁడు, తుచ్ఛుఁడు.

**లుడుగు.** దే. వి. ఎద్దుమెడనుకట్టు నొకవిధమైన గంట.

**లుఠనము.** సం. వి. అ. న. 1. భూమిమీఁదిపొర్లిక; 2. భూమిమీఁది గుఱ్ఱపుపొర్లిక.

**లుఠితము.** సం. విణ. (అ. ఆ. అ.) భూమిమీఁద పొర్లాడినది. (గుఱ్ఱము.)

**లుప్తము.** సం. వి. అ. న. దొంగిలించినసొత్తు, దొంగసొమ్ము. విణ. 1. లోపించినది; 2. కోయఁబడినది

**లుబ్ధకుఁడు.** సం. వి. అ. పుం. 1. బోయవాఁడు; 2. పిసినివాఁడు.

**లుబ్ధుఁడు.** సం. వి. అ. పుం. బోయవాఁడు. విణ 1. ఆసగలవాఁడు; 2. పిసినివాఁడు.

**లులాయము.** సం. వి. అ. పుం. కారెనుపోతు.

**లులి.** దే. వి. తక్కున. "లులిగన్నఁబడకున్న." ఉ. హరి. 3, ఆ.

**లులితము.** సం. విణ. (అ. ఆ. అ.) చలించినది.

**లులివడు.** ద్వ. అ. క్రి. (లులి+పడు.) హీనమగు. "రగడ. పొలఁతిసైఁపవుమాకు నీకయపోలుఁబో లులివడినకల్లలు." పా. ౪, ఆ.

**లుల్లిగాఁడు.** దే. విణ. కీడ్వడినవాఁడు, అధముఁడు.

## లూ.

**లూఁటి.** దే. వి. 1. ఉపద్రవము; "ఉ. లూటిచేసిద, క్కాంచుకొనంగ వేళయని కేరుచుఁదూఱుచుఁదిట్టికొట్టిదం, డించిరిమించితన్మధువనీపరిపాలకులడ్డగించినన్." రామా. 2, ఆ.—2. దొడయందలి వ్రణము; 3. వ్రణరంధ్రము.

**లూటీ.** దే. వి.——పై.——

**లూడువులు.** దే. వి. బ. చెప్పులు, పాదరక్షలు. (అప్ర.)

**లూత.** సం. వి. ఆ. స్త్రీ. 1. సాలెపురుగు; 2. చీమ; 3. రోగవిశేషము.

**లూనము.** సం. విణ. (అ. ఆ. అ.) కోయఁబడినది.

**లూమము.** సం. వి. అ. న్. న. తోఁక, లాంగూలము.

**లూలామాలము.** దే. వి. మోసము, వంచన. "క. లూలామాలపుమాటలు, చాలుననిననలిగితననిజంబగు

రూపం, బాలోనఁదెలుపవలెనని, నీలగ్రీవుండు నిటలనేత్రముఁజూపఁ." కాశీ. 3, ఆ.

## లె.

లెంక. దే.వి. భటుఁడు, సేవకుఁడు. "క. అవసరమ్ముక్షణలంగై,దుపకర్జములందు వేఁటతోఁటలయందున్, దవులైనపాఁతలెంకల, మవ్వటఁమనుఁ జూడు మోపినవుడెవుడైనఁ." రామా. ౨, ఆ.

లెంట. దే. వి. పటికము. (అప్ర.)

లెంప. దే. వి. 1. చెంప; 2. ప్రక్క.

లెంపకాయ. దే. వి. (చూ.) చెంపకాయ.

లెంబి. దే. వి. లంబియొక్క రూపాంతరము.

లెక్క. వై. వి. 1. లక్ష్యము*. "నాకునరుఁడేమిలెక్క." రాఘ. ౪, ఆ.—2. సంఖ్య*.

లెక్కగొను. ద్వి. స. క్రి. (లెక్క+కొను.) లక్ష్యముచేయు. "చక్రధరులెక్కగొనఁడు." భార. ఉద్యో. ౧, ఆ.

లెక్కపెట్టు. ద్వి. స. క్రి. 1. లక్ష్యముచేయు, 2. ఎన్నికచేయు.

లెక్కసేయు. వై. స.క్రి.——పై.——(లక్ష్యముచేయుటకు. — "వ. అయ్యర్థంబు లెక్కసేయక యున్న." కాశీ. ౬, ఆ.)

లెక్కించు. వై. స. క్రి.——పై.——

లెప్ప. దే. వి. గుఱి, లక్ష్యము. [రూ. లెప్పము. "ద్వి. లెప్పమాదనప్రాణలింగంబు." పండి. ౧, ప్ర. "క. మీపుష్పగంధినెయ్యపుఁ, జూపులకును లెప్పమైనసుకుమారవపు, ర్శ్రీపెంపునఁదనరినవసుధాపతిసుతుసఖుఁడనింద్రదత్తాహ్వయుఁడన్." (గ్రంథములయందు కొన్నిచోట్ల దెప్పమనికనఁబడుచున్నది. అది సరియనిచెప్పుటకుఁ దగినప్రయోగము దొరికినదికాదు.) భో. 3, ఆ.]

లెస్స. దే. వి. క్షేమము. "ద్వి. నీలెస్సనాలెస్స." రా. ఆ, కాం.—విశ. 1. క్షేమయుక్తము; "లెస్సలారాచవారు." స్వా. ౫, ఆ.—2. యోగ్యము; "తల్లికృపసేఁత పెద్దయును లెస్స." భార. అను. ౧, ఆ.—3. శ్రేష్ఠము. "అల్లవెలెస్స పువ్వులు."నిర్వ. ౮, ఆ.

లెస్సవాఁడు. దే.విశ. యోగ్యుఁడు. హరి. పూ. ౯, ఆ.

## లే.

లే. దే. విశ. వృత్తియందు లేఁతశబ్దమునకుమీఁదివర్ణములులోపింపఁగా మిగిలినరూపము. (దీనికిఁబరుషములు పరమగుచో సరళాగమంబగు. ఉదా. లేఁగప్పు, లేఁగరువలి, లేఁగొడుకు, లేఁగొన, లేఁగొమ్మ, లేఁగొను, లేఁజెందురుఁడు, లేఁజెప్పుడు, లేఁజొన, లేఁజిగురు, లేఁజీఁకటి, లేఁజూపు, లేఁజోలు, లేఁడెక్క, లేఁడెమట, లేఁదగిరిస, లేఁదడి, లేఁదరఁగ, లేఁదాఁకు, లేఁదూఁడు, లేఁదెర, లేఁదేఁటి, లేఁబట్టి, లేఁబాపఁడు, లేఁబాయము, లేఁబొద, లేఁబొన్న, లేఁబొర, లేగాడ్పు, లేజేవరాలు, లేకోటి, లేనగవు, లేనడుము, లేనెల, లేబిత్తరి, లేబుడుత, లేమావి, లేపూక, లేయనఁటి. మొ.)—అవ్య. నిశ్చయార్థకము. (ఔలే, దానికంటె ఇది విశేషములే.)

లేఁక. దే.వి. లెంక, భటుఁడు. "లేకయుండిన విసివియాలేఁకలు." (లేక = లేవక) అచ్చ. యు, కాం. (గ్రంథములయందీపాఠము కొన్నిచోట్లఁ గనఁబడియెడి.)

లేఁగ. దే.వి. (లేఁత+కానుపు.) 1. క్రొత్తగాఁగలిగిన దూడ, తర్ణకము; (లేఁగటియావు.) ("ఆ. లేఁగ దూడనొక్క లేమచిక్కముతోడఁ, గుదువవిడిచెనొక్కకోమలాంగి, కాఁగిపొంగుచున్న కాఁగులపాలలో, నీరుచల్లమఱచి నిలిచియుండె." వి, పు. ౭, ఆ. ఇక్కడ లేఁగశబ్దమునకు క్రొత్తగాఁగలిగినదనిమాత్రమర్థము.)—2. దూడ, వత్సము. "చ. ఇదియొకమంచిలేఁగవినుఁడెంతయుఁనొప్పెడునంచుదానత, త్పదముఁలఁదోఁకయుంబిగియఁబట్టిచెలంగివెలంగ్రాలనితోఁ, జదియఁగనొక్కపెట్టుగొని చంపెఁగుమారుఁడు లేఁగరక్కసుం, గుదులుకొనంగబాలకులుకోయనియార్వన ఖర్వలీలతోఁ." భాగ. ౧౦, స్కం. పూ.

లేఁగటియావు. దే. వి. లేఁతదూడగల ఆవు, ధేనువు.

లేఁగసవు. ద్వి. వి. (లేఁత+కసవు.) బాలతృణము.

లేఁత. దే. విశ. 1. తరుణము; "లేఁతప్రాయము." 2. పేలఁకన; "ఉ. పూఁతపసిండివంటివలపుంబచరించుకులంబునీతికిన్, లేఁతగదమ్మ." స్వా. 3, ఆ.—3. సుకుమారము. "మేనులేఁత." (మఱియు దీనికి వృత్తియందు కొంచెము, చిన్న, తిన్న, తేలిక, పలుచ, మెత్త, సన్న మొదలగు అనేకార్థములుగలవు. చూ. లే.)

లేఁబగలు. దే. వి. (లేఁత+పగలు.) ప్రాహ్ణము. "సీ. వినుసైకతనివాణ్ణ మునివేదనినదంబుఁ దగుచోట నుండిలేఁబగటిదాఁక." పాండు. ౫, ఆ.

**లేఁబోక.** దే. వి. (లేఁత + పోక.) మందగమనము. (చూ. పూఁబోఁడి.)

**లేఁప్రొద్దు.** ద్వ. వి. (లేఁత+ప్రొద్దు.) అపరాహ్ణము.

**లేక.** వై. వి. 1. జాబు; "క. నీపతినీకైవందుచు, నా పేరనులేకయనిపి నాఁడనియిదె నే, నా పులుఁగు వలనఁదెలిసిము, దాపూర్ణతనుబ్బివిడిచి యనిపితి దానిన్." ప్రభా. ౪, ఆ.—2. ఎడములేక మిక్కిలిచేరికయగుపృక్షాదులవరుస; 3. సమూహము. "తేనియతిండిలేకలు." (చూ. తేనియతిండి)

**లేకరి.** ద్వ. వి. (లేక+అరి.) లేఖకుఁడు.

**లేకి.** దే. వి. రాలినధాన్యపుగింజెలు. "లేకినిధివ్రజంబు." కవిక. ౧, ఆ.—విణ. అప్రయోజకుఁడు.

**లేకిబ్రతుకు.** దే. వి. లేకిగింజెలేఱికొని బ్రతికెడు బ్రతుకు, ఉంఛవృత్తి.

**లేకివాఁడు.** దే. విణ. 1. లేకిగింజెలేఱికొని బ్రతికెడు వాఁడు, "ద్వి.పక్కసేయని లేకివాఁడవునీవు." హరిశ్చ. ౨, భా.—2. అప్రయోజకుఁడు.

**లేఖ.** సం వి. ఆ. స్త్రీ. 1. ఎడములేక మిక్కిలిచేరికయగు వృక్షాదులపఙ్క్తి; 2. లిపి. ఆ. స్త్రీ. అ. పుం. జాబు. ఆ. పుం. ఇచ్చిపుచ్చుకోలుపత్రము. ఉ. వేలుపు.

**లేఖకుఁడు.** సం. వి. అ. పుం. వ్రాఁతకాఁడు, లేకరి.

**లేఖనము.** సం. వి. అ. న. 1. వ్రాఁత, 2. వాంతి; 3. బుజెపత్తిరి?.

**లేఖని.** సం. వి. ఈ. స్త్రీ. వ్రాసెడుకలము. (రూ. లేఖిని.)

**లేఖనికుఁడు.** సం. వి. అ. పుం. 1. జాబుకొనిపోవువాఁడు; 2. తనగుఱుతిడి యొకరిచేవ్రాయించువాఁడు.

**లేఖనీయము.** సం. విణ. (అ. ఆ. అ.) వ్రాయఁదగినది, లేఖ్యము.

**లేఖర్షభుఁడు.** సం. వి. అ. పుం. వేల్పుఱేఁడు.

**లేఖహారకుఁడు.** సం. వి. అ. పుం. జాబుకొనిపోయి యిచ్చువాఁడు.

**లేఖితము.** సం. విణ. (అ. ఆ. అ.) లిఖితము.

**లేఖ్యము.** సం. వి. అ. న. వ్యవహారవిషయమైనవ్రాఁత. విణ. వ్రాయఁదగినది.

**లేచు.** దే. అ. క్రి. 1. ఉత్థితమగు; 2. మేలుకొను; 3. ఘోటమరించు.

**లేట.** దే. వి. కొమ్మ, శాఖ. "సీ. మానికమ్ములమూట మరునిగెల్పులకోట పండువెన్నెలతేట పసిఁడిలేట." అచ్చ. బాల, కాం.

**లేటమొగముపడు.** ద్వ. అ. క్రి. (లేటమొగము+పడు.) విముఖమగు. "క. ఏటునవాటునవ్రేటునఁ, బోటునదళముఖుఁడురౌద్రముగనఱుమటయుక్ లేటమొగము పడియుత్తులు, కోటసారంబాతిర సురకోటెగువంగన్. నిర్వ. ౪, ఆ.

**లేటి.** దే. వి. 1. జింక; "తే. లేటివలలును మఱియుఁ గుందేటివలలు." య. ౧, ఆ.—2. ఆఁడుజింక, "తే. పెంపుడిట్టులఁగినుకను బెనఁచిపోయి, కొమ్ము నుచ్చులు దగిలించుకొన్న నరిగి, రాజుచూడంగఁ జెప్పంగ రానికడిమి, నీటియలఁగ్రుమ్మినొంచిరి లేటిమగల." య. ౨, ఆ.—౩. మగజింక ' క. లేటిందాఁచుకొనవొ్ము, న్నీటన్ నడయాడలే దొనినుద్విజరాజం, చేటికిఁబలుకంగోకా, ఖేటక పాటవకిరాతకేసరివిళశీ.' పాంచా. 3, ఆ.

**లేటు.** అం. విణ. ఆలస్యము, వెనుకఁటి.

**లేడి.** దే. వి. లేటియొక్క రూపాంతరము. (బ లేళ్లు.)

**లేడికంటి.** దే. వి. లేడికన్నులవంటి కన్నులుగల ఆఁడుది, మృగాక్షి.

**లేదు.** దే. వి. ఎలుఁగుబంటి. "చ. విచారవిమూఢున కైననీవుప, ల్కినపలుకియ్యకోలగునె లేదువనంబునజున్ను రేఁచితి, య్యనిమధుపానమొల్లకరయంబునసెండలవాటుసేయునే." భో. ౪, ఆ. (ఇది అపూర్వపదముగానున్నది.)

**లేదుబంతి.** ద్వ. వి. బొంకు. "చ. తెలియఁగఁజూచి నట్లసెమదిన్ బుధులార సితప్పనీపయిన్, గలదని పల్కుచోఁగుచయుగంబటు బట్టబయల్గఁ జేసి తో, యలికచలేదుబంతియనదటిదెందముని శ్చయంబుపెం, పొలయఁగఁగిల్లతోడనిజమోపదుగాఁదలపోసిచూచినన్." సా. 3, ఆ. (ఒకానొకచో లేదుబంతీయని దీర్ఘాంతముగా ప్రయోగము కానఁబడుచున్నది.)

**లేపకుఁడు.** సం. వి. అ. పుం. సున్నములోనగువాని పూయువాఁడు.

**లేపనము.** సం. వి. అ. న. 1. అలుకుట; 2. పూఁత, 3. భోజనము.

**లేపము.** సం. వి. అ. పుం. 1. పూఁత; 2. భోజనము, 3. సున్నములోనగునది.

లేపు. దే. ప్రే. లేవఁజేయు. వి. 1. పడకమీఁదపఱచెడుపఱపు; "చ. అకలుషదివ్యరత్నమయమూనాకశేలిగృహంబులోఁపలన్, జికిలికిరీటిపచ్చలరచించినచిల్కలకోళ్లనందమూ, సకిసెలపట్టెమంచమునచాయనగానుతివానుపైఁదురం, గికపెంకమాలులేపుననొగిన్ శయనించి మనోభవవ్యథన్." హంస. ౧, ఆ.—2. జోలు.

లేప్యము. సం.వి.అ. న. పూఁత. విణ. పూయఁదగినది.

లేబరము. దే. విణ. శూన్యము. "సీ. ప్రావితో పర్షంబుసమకూరకుండుటఁబంటలేబరమయ్యెఁబాఁడితోఁడ." కాశీ. ౧, ఆ.

లేమ. వై. వి. ఆఁడుది, మగువ, వనిత. విణ. లేఁత*.

లేమి. దే. వి. 1. కలుగమి; 2. ఉండమి; 3. దారిద్ర్యము. "వ. తోలంగం ద్రోయరాని లేమికి మదినొండుపాయంబులేమికిం గొండొకచింతించి." విక్ర. ౨, ఆ.

లేమిడి. దే. వి. (లేమి+ఇడి.) దారిద్ర్యము. (స్వార్థమున ఇడి.)

లేలిహానము. సం. వి. అ. పుం. పాము. (రూ. లేలీహానము.) విణ. మాటిమాటికి లేహనముచేయునది.

లేవ. దే. వి. గుజ్జుపుతలాటము. "సీ. బలితంపుఁబులుతిండిమలదాయరాచెక్కడవుగోపపనిచొక్కటంపులేవ." చంద్రా. ౨, ఆ. (దీనికి ప్రయోగాంతరము మృగ్యము.)

లేవడి. దే. వి. 1. లేమి; "సీ. నిదురలేవడిఁగెంపుసెరయుకన్గవతోడఁ బొడిపొడియైనమేపూఁతతోడ." రసి. ౪, ఆ.—2. దారిద్ర్యము. "మ. లేవడిం, బడిరుండుండదగదంచుసత్వగరిమన్ మన్యంబుగన్పట్టఁగా." చంద్రా. ౧, ఆ.—విణ. 1. దరిద్రము; "లేవడియొంటేనిజీవనంబు." సై. ౧, ఆ.— 2. "లేవడియైనభుక్తిగొనిలేవడిగంబడదాఁకలింతయున్." పాండు. ౪, ఆ.

లేవుడి. హిం. వి. దొంగనుకట్టి వీధివీధికి త్రిప్పుట; అవమానపఱచుట.

లేశము. సం. వి. అ. పుం. కొంచెపుఁదనము. విణ. కొంచెము.

లేసు. వై. విణ. 1. మేలుకన*; 2. సులభము*.

లేహనము. సం. వి. అ. న. నాకుట.

లేహము. సం. వి. అ. పుం. భోజనము, కుడుపు.

లేహ్యము. సం. వి. అ. న. 1. నాకిభుజింపఁదగిన మందు; 2. నాకిభుజింపఁదగిన వ్యంజనవిశేషము; 3. అమృతము. విణ. నాకఁదగినది.

## లై.

లైను. ఆం. వి. వరుస.

లైసెన్సు. ఆం. వి. సెలవుచీటి.

## లొ.

లొంక. దే. వి. కోన "ఆ. ధరణిపాలుఁడంతదురగంబునచ్చోటఁ, గట్టివాలుచేతఁ బట్టుకొనుచు, లొంకఁజొచ్చినాత్మఁగొంకకకాలుఁడు, కదిసిదివిరుపట్టివెదకుమాడ్కి." ద్వా. ౫, ఆ.

లొంగు. దే. అ. క్రి. 1. లోఁగుపగు; 2. వెనుదీయు. (లోఁగుయొక్కరూపాంతరము.)

లొండు. దే. వి. జలాశయవిశేషము. (చూ. డిగియ.)

లొంప. దే. వి. అల్పగృహము, కొంప.

లొంపు. దే. వి. ఒకతెగ.

లొగ్గడి. దే. వి. కలగుండు, క్షోభము.

లొగ్గడిల్లు. దే. అ. క్రి. కలగుండుపడు, క్షోభించు.

లొచ్చు. దే. వి. తక్కువ. (చూ. లొజ్జు.) విణ. న్యూనము. "మ. ఇ, చ్చెలులెల్లన్ మనలక్ష్మణాసతికిలొచ్చేసుమ్ము రమ్యాకృతిన్." చమ. ౨, ఆ.

లొజ్జు. దే. వి. విణ. లొచ్చుయొక్కరూపాంతరము. (తక్కువకు. — "లొజ్జించుకయుం బూనని సౌయ్యంబున." అచ్చ. బాల, కాం.)

లొట. దే. విణ. అణఁగినది. "ద్వి. లోకంబులోలేని లొటతొఁటకత్తె." (ఇక్కడ అణఁగినదనఁగా బయటికిమంచిదానివలెఅణఁకువకలిగియుండునదియని అర్థము.) హరిశ్చ. ౨, భా. (లొట్టయొక్క రూపాంతరము.)

లొటకజిట్ట. దే. వి. (చూ.) లొట్టకన్నుజిట్ట.

లొటలొట. దే. వి. పోవుటయందగుధ్వన్యనుకరణము. "లొటలొటఁజని."

లొటలొటమను. దే. అ. క్రి. (లొటలొట+అను.) లొటలొటయనిధ్వనించు. "క. తొటతొటపుర్వులుదొరఁగఁగ, లొటలొటమనుకొంచునిండ్లలోనికిఁజన." భల్లా. ౨, ఆ.

లొటారము. దే. వి. బొక్క, బిలము.

లొటిపిట. ద్వ. వి. ఒంటె, ఉష్ట్రము. (లొట్టిపిట్టయొక్కరూపాంతరము.)

లొటిపిట్ట. ద్వ. వి. ——వై.——

కావరమునఁగానవునీ, కావరమజూఁడిచ్చెనసుచున దిచెల్లెనునీ, కీవఱదనుకను విడుమిం, కీవరదర్పము కడంకనీడమృగాంకా." శశాం. ౫. ఆ. మొ.)

వఱగొడ్డము. ద్వి. వి. (వఱ+గొడ్డగము.) వంకరమాట. "సీ. వరునితో నేప్రొద్దువఱగొడ్డమాడుటభర్తమర్మంబులేర్పఱచుచుంట." భల్లా. ౪. ఆ. (ఇందువకారముయతియందుండుటవల్లను ఇది వ్యుత్పత్తికి కొంచెము సరితట్టవచ్చుటవల్లను ఈపదమిట్లుండుటయే సరియని తోఁచుచున్నది. అప్పుడు ఒఱగొడ్డెముదగ్గఱనుండు నుదాహరణమునందు "భీముఁడువఱగొడ్డములాడంగ." అని పద్యము నుదిద్దుకొని యీపదము నెత్తివేయవలెను.)

వఱడు. దే. వి. 1. పెద్దజాతినక్క; ముదినక్క. (అని కొందఱు.) 2. నక్క. "క. ధృతరాష్ట్రునగ్నిహోత్రా, యతనంబుననఱచెవఱడులు." సం. "తతో రాజ్ఞోధృతరాష్ట్రస్యగేహే గోమాయురుచ్చైర్వ్యాహరత్." భార. సభా. ౨, ఆ.

వఱద. దే. వి. వెల్లువ, ప్రవాహము. "ఇమ్మెయిన్ వఱదంద్రోవఁగఁజేసెనేయకటదైవంబు." భార. అర. ౭, ఆ. "క. మెఱపులుతఱచుగఁబెళపెళ, నుఱుముచుపడగండ్లతోఁబయోధారలు పెన్, వఱదలుగానెల్లెడఁజిచ్చఱపిడుగులతోడవానజడిగొనికురియన్." జై. ౫, ఆ.

వఱదగుడి. దే. వి. సూర్యాదిపరివేషము, పరిధి.

వఱదవాఱు. దే. అ. క్రి. (వఱద+వాఱు.) ప్రవహించు. "ఆ. రక్తంబు, వదనగహ్వరమునవఱదవాఱ." భాగ. ౧౦, స్కం. పూ.

వఱపు. దే. వి. వానలేమి, అవగ్రహము. "చ. వఱపునమేను లెండఁదమవారియొడం బెడఁబాసి జీవముల్, దొఱఁగిధరిత్రిఁడిందియతిదుర్దశఁగాలము వేచియుండఁగా, నుఱువగువానఁబ్రాణములునొయ్యననూల్కొనమున్నుదొల్లినే, డ్డెఱఁగనుపట్టు దర్దురతతిన్ గనియుద్యమ మొప్పఁజేయఁగన్." పంచ. నా. ౨, ఆ. ("మన్నుదొల్లి." ప్రతియందిట్లు కనఁబడుచున్నది.)

వఱల. దే. వి. వృద్ధతపస్వి. (అప్ర.)

వఱలు. దే. అ. క్రి. 1. ప్రకాశించు; "క. అతిమతినిరువురశరములు, తఱచుగ నెండొరులబిట్టుదాఁకినవయ్యి, ద్దఱు నెత్తుటఁదోఁగికడున్, వఱలిరికల్పాంతనవదివాకరులక్రియన్." భార. ద్రో. ౪, ఆ.—2. ప్రవర్తిల్లు; "సీ. నిండుమనంబుతో నుండు నారాయణుం డెటిఁగించెనో యిటవఱలుసునికి." పాండు. 3, ఆ.—3. వ్యాపించు. "క. ఉఱుములతో మెఱుములతో, వఱలెడుపెనుగాలితోడవడగండులతోఁ, దఱచగుపిడుగులతోడను, వఱదలపైవఱదలెగయవర్షముగురిసెన్." పర. ౧, ఆ.

వఱువట్లు. దే. వి. బ. (వట్టులు+వట్టులు.) మిక్కిలి వట్టులు.

వఱువట్లుగొను. దే. అ. క్రి. (వఱువట్లు+కొను.) మిక్కిలియెండు. "క. విరులుఁజిగుళ్లునుజొరవుగ, సిరిగందపుటసలాకింతచిలచిలమనివే, గిరమవఱువట్లుగొనఁగఁడుఁ, బొరలెడితరలాక్షితాపముంగనికలఁకన్." కళా. ౬, ఆ.

వఱువాత. వై. ద్ర. ప్రాతఃకాలమున. (చూ. అఱజాతి.) "సీ. వైవవేయిమ్మహోవాతూలవరువాతవఱవాతనినుఁబ్రతివాసరంబు." రామా. ౭, ఆ.

వట్టు. దే వి. ప్రవాహము. "నెత్తురువట్టులువాఱఁ జంపుదురు." భార. అను. ౫, ఆ.—"చ. వననరులాజిఁబీనుఁగులవట్టుగఁజంపిరి తద్బలంబులన్." రామా. ౭, ఆ.

వట్టె. దే. వి. బీటిక. (మొదటిరూపము వట్టియు.)

వట్టొడ్డు. దే. అ. క్రి. (వట్టు+ఒడ్డు.) ప్రవహించు. "సీ. కన్నీరువట్టొడ్డికాంతియంతయుఁగుంది వెలఁదినీకనుదోయివిన్ననయ్యె." భార. విరా. ౨, ఆ.

వల. యు. దే. వి. 1. మత్స్యములనుపట్టెడుజాలము; (చూ. ఉరి.) (దీనిభేదములు.—అనుకువల, ఎడవల, డొంకవల, త్రోపుడువల, దాఁటుడువల, మెడవల, సన్నవల. మొ.) 2. మృగములు పక్షులు మొదలగువానిఁబట్టెడువాగుర. "క. వలలోన నున్నపులుఁగుల, వెలువడఁగావిడిచి." భార. శాం. 3, ఆ. (దీనిభేదములు. — ఎలుకవల, ఏఁదువల, కుందేటివల, దొడ్డివల, పందివల, లేటివల, సవదండవల. మొ.) విశ. వృత్తియందువలను శబ్దము నకు మీఁదివర్ణములోపింపఁగా మిగిలినరూపము. (వలకన్ను, వలకేలు, వలచెవి, వలమూఁపు, వలమూల, వలవంక. మొ.)—వై. వి. కామము. "క. కాదంబిఁద్రావింతును, జూదంబాడింతువలలఁ జొక్కఁబెట్టం, బైదలులనియోగింతును, పైదర్భతనూజమీఁదివలపుడిగింతున్." వై. ౭, ఆ.

వలఁకు. దే. వి. దిక్కు. "క. బలమెల్లఁజెదరినాలుగు, వలఁకులఁజెడిపోయె." హరి. ఉ. 3, ఆ. (వలను యొక్కరూపాంతరము.

**వలఁకువు.** దే. వి. వలఁకు, దిక్కు. (ఇది కొలఁకువువంటిది.)

**వలఁతి.** దే. వి. ఆఁడుది. అం, శే.—విశే. 1. నేర్పరి; "ఏనునీమతిబోధింపవలంతినే." భార. ఉద్యో. 3, ఆ.—2. అధీనము; "సీ. నీదక్షవాటికానిలయంబునందుండుజనులకుభోగమోక్షములువలఁతి." భీమ. 3, ఆ.—3. అనుకూలము. "ఎ, గీ. వరుణునకుఁడాఁగికొనఁబోటు వలఁతియగుట, నుదధినాయకభావంబునుపకరించె." పా. ౫, ఆ.

**వలకట్టు.** దే. స. క్రి. (వలను+కట్టు.) అనుకూలపఱచు. "వ. అతండువిద్యాధికుండుకాకుండుటంజేసినిజగౌరవశైథిల్య భయంబున నితరులగువిద్యాధికులకురాజగృహంబునఁ బ్రవేశంబు లేకయుండదౌవారికాదిసకలపరిజనచక్రంబును వలకట్టుకొనియుండుటయు." కళా. ౨, ఆ.

**వలకడ.** ద్వ. వి. (వలను+కడ.) దక్షిణపుదిక్కు.

**వలకాఁక.** ద్వ. వి. మన్మథతాపము, క్షేత్రయ.

**వలకాఁడు.** ద్వ. వి. కాముకుఁడు. వసు. ౪, ఆ.

**వలకారి.** ద్వ. విశే. వలపించువాఁడు, వలపించునది. "సీ. వక్రభావంబులువలకారిబాగులువలసియొల్లములునువట్టిపసలు." పాండు. 3, ఆ.

**వలగొను.** దే. స. క్రి. (వలను+కొను.) ప్రదక్షిణించు. "వ. యథోచితప్రకారంబునవీడుకొనివలగొనిమగిడిరి." సం. "కృష్ణంకృత్వా ప్రదక్షిణమ్." భార. ఉద్యో. 3, ఆ.

**వలగ్నము.** సం. వి. అ. పుం, న. దేహముయొక్కమధ్యము, నడుము.

**వలచు.** యు. దే. అ. క్రి. వాసనగొట్టు. "సీ. కసటువోబీఱెండఁ గరఁగికఱ్ఱలనంటి గమగమ వలచుచొక్కపుజవాజి." స్వా. ౨, ఆ.—వై. స. క్రి. 1. కోరు; "దానివినఁగవలతు." భార. ఆది. 3, ఆ.—2. కామించు.

**వలచుట్టు.** దే. స. క్రి. (వలను+చుట్టు.) (చూ.) వలగొను. "ఉ. నావలచుట్టిహర్షకలనావలమానమనోంబుజంబుతో, నావలవైరిఁబల్కనచలాగ్రణిమామకశోకవార్ధికిన్, నావలతాంగినబ్ధిరశనావలయేశ్వరుకేలఁగూర్చెదే, నావలవంతదీర్చెదఘునంతకృపారసవాసవాసవా." (వలవైరి=బలవైరి.) వసు. ౫, ఆ.—వి. వలగొనుట.

**వలజ.** సం. వి. ఆ. స్త్రీ. 1. చక్కనిచూపుగల ఆఁడుది; 2. భూమి. అ. న. ము. 1. వరిమడి; 2. పైరు; 3. ధాన్యరాశి; 4. పురద్వారము; 5. యుద్ధము.

**వలతి.** దే. వి. స్థానము. "ఎ, గీ. వచ్చెనలకూబరుండున్నవలతికతివ." య. ౨, ఆ.

**వలదు.** దే. వి. ఆధిక్యము. (వీనికేమివలదువచ్చినది.) విశే. అధికము. "ఉ. చక్కిలిగింతవెట్టిననుసారెఁగికాకికనవ్వుచుంబయిం, బక్కఁబడంగఁజక్కనికుమారునిమక్కువ మీఱనేడ్పురాఁ, జెక్కిలిమీటియెత్తియొదఁజేరిచిముచ్చటదీఱునట్లుగా, నక్కటముద్దులాడవలదా వలదా యిటువంటి భాగ్యముల్." సా. ౧, ఆ.

**వలదొర.** ద్వ. వి. మన్మథుఁడు, రతిపతి. అని. ౨, ఆ. (ఇట్లు వలరాయఁడు. మొ.)

**వలన.** దే. అప. పంచమీవిభక్తియందువచ్చెడి యొకానొక ప్రత్యయము.

**వలనము.** సం. వి. అ. న. 1. కంటిపాపతిరుగుడు; 2. తిరుగుడు. పుం. ఇట్టి.

**వలను.** దే. వి. 1. దిక్కు; "వ. అతనిపోయినవలనెఱుంగుదురేనియానతిండు." భార. ఆర. ౨, ఆ.—2. పార్శ్వము; "క. ఉరగపతితలలవలనురు, తరజవమునసురులూఁది." భార. ఆది. ౨, ఆ.—3. ఉపాయము; "ద్వి. ఈనాగపాశంబులిపుడువాయుటకు, వానరేశ్వరులారవలనుసెప్పెదను." రా. యు, కాం.—4. నేర్పు; "వ. ఇంకనువలనుగలవారలంబంచి యాతనినిమ్ముగా నెఱుంగవలయు." భార. ఆర. ౨, ఆ.—5. ప్రదక్షిణము; "ద్వి. అమరేంద్రుదెస విరూపాక్షుంబుగాంచి, ప్రమదంబుమీఱంగ వలనుగావచ్చి." రా. బాల, కాం.—6. శకునము; "ఎ, గీ. వలనులెస్సైనమిక్కిలినలరుకొనుచు." యు. ౨, ఆ.—7. విధము; "సత్రమెవ్వలనుగాఁజేసిరి." భాగ. ౪, స్కం.—8. ఒప్పిదము; "సూతకృత్యముల్ వలనుగఁబూని." భార. ద్రో. ౪, ఆ.—9. శుచిత్వము; "తే. వార్చివాఙ్మనోనియతితోవలనుగలిగి, యుత్తరంబొండెఁదూర్పుదిక్కొండెఁజూచి, జానుమధ్యంబులందు హస్తంబులుండఁ, గుడుచునదిపవిత్రాన్నంబుగుణివరేణ్య." మార్క. 3, ఆ.—10. అనుకూల్యము; "ద్వి. వలనుతప్పిననిందవచ్చెనీతనికి." సా. ౪, భా. —విశే. 1. కుడి, దక్షిణము; "వలనాహస్తంబునన్." భద్రా. ౧, ఆ.—2. యుక్తము.

"మఱిరొండు మార్గంబు వలనుగాదు." రా. కిష్కి౦, కాం.

వలపల. దే. వి. (వలను+పల.) దక్షిణభాగము. "ఎ, గీ. వలపలాదిగాఁగ జలములఁదడిచుఁగ, ముట్టివార్వవలయు." విజ్ఞా. ఆచా, కాం.

వలపలగిలుక. దే. వి. రేఫముయొక్కరూపాంతరనామము.

వలపలించు. దే. స. క్రి. వలగొను, వలచుట్టు. "వ. గాంధారీనందనుండు వలపలించిచుట్టుకొనిరా నదిసరకుసేయకబకవైరి దాపలించితిరిగెన." సం. "దక్షిణంమండలంరాజన్ ధార్తరాష్ట్రోభ్య వర్తత, సవ్యంతు మండలంతత్ర భీమసేనోభ్య వర్తత." భార. శల్య. ౨, ఆ.

వలపు. యు. దే. వి. వాసన. "ఆటతోఁటవలపుల్." రామా. 3, ఆ.—వై. 1. కోరిక; (చూ. బాహిర పోవు మొదటియర్థము.) 2. కామము.

వలపుకత్తె. వై. విశ. కామముగలది, కాముకి. (మొదటిరూపము వలపుకత్తియ.)

వలపుకాఁడు. ద్వ. విశ. కామముగలవాఁడు, కాముకుఁడు.

వలపుకీలు. వై. వి. పోఁకముడి, నీవి. "ఎ, గీ. అనుచుఁ దగబుజ్జగించి హస్తాంబుజమున, వలపుకీలువిదుల్చెభూవల్లభుండు." సై. ౭, ఆ.

వలపుమోపరి. దే. వి. వాయువు, గంధవహుఁడు. "సీ. వలపుమోపరిజియ్యవలమూలదయ్యాంబుగుండులతలకట్టుపండుదండి." అచ్చ. బాల, కాం.

వలపురాయఁడు. వై. వి. మన్మథుఁడు, రతిపతి. (చూ. నీరాట రెండవయర్థము.)

వలభి. సం. వి. ఈ. స్త్రీ. 1. కొణిగ; 2. చంద్రశాల.

వలమానము. సం. విశ. (అ. ఆ. అ.) 1. తిరుగుచున్నది; 2. చలించుచున్నది.

వలము. దే. వి. 1. విస్తారము; "ఎ, గీ. ముప్పదియోజనముల, పొడువుపదియోజనమ్ములనడిమివలము, గలుగునగ్గిరి." సం. "దశయోజనవిస్తారస్త్రింశద్యోజనముచ్ఛ్రితః." రా. సుం, కాం.—2. స్థౌల్యము. విశ. స్థూలము. (చూ. బ్రదిమి.)

వలమురి. దే. వి. (వలను+మురి.) దక్షిణావర్తశంఖము. (చూ. ఉత్తిద మొదటియర్థము, ముడుఁగు మూడవయర్థము.)

వలమురితాలుపు. దే. వి. విష్ణువు, శంఖపాణి. "చ. వలమురితాలుపింకనిటవచ్చుటమానుమచ్చెకంటినా." పాండు. ౫, ఆ.

వలయము. సం. వి. అ. పుం, న. కడియము. పుం. 1. కుండలాకారము; 2. కంఠమాల.

వలయితము. సం. విశ. (అ. ఆ. అ.) చుట్టఁబడినది.

వలయు. యు. దే. అ. క్రి. 1. ఇష్టమగు; "వలయు నాహారములు." భార. అశ్వ. ౪, ఆ. "వలసినసేలును." భార. విరా. ౧, ఆ. 'ఇది వలయునా? వలవదు.'—2. అవశ్యకమగు; "మాకురక్షకుఁడొకనుహీవరుండువలయు." భార. శాం. ౨, ఆ. "దేవహితముదీనిఁదీర్చవలయు." భార. అర. ౨, ఆ. "పనుపవలసెమాతభావనుపేక్షించి." భార. అర. ౨, ఆ. "వలదుకుక్కలవిడువంగ." స్వా. ౪, ఆ. —3. యుక్తమగు; "క. దానికి సూర్యఁగవలయుం, గానికనలవలదు." భార. కర్ణ. ౧, ఆ.—4. విహితమగు. (ఈయర్థమందిది విధ్యాద్యర్థకమయి విధినిషేధములను దెలుపును.) "తే. కడఁగి నేఁడురథమ్మోవుగడపవలయు." భార. విరా. ౪, ఆ. "ఇడుమకుడువవలసె." భార. విరా. ౨, ఆ. "అడుగవలదు." భార. ఉద్యో. 3, ఆ. (ఆదిశబ్దముచేత ప్రార్థనమునకు. — "వ. తరువాతి వృత్తాంతంబు కృపాయత్తచిత్తంబున నానతీవలయు." స్వా. 3, ఆ. — శాపమునకు. — "అరదంబుచక్రంబుపుడమిఁగ్రుంగవలయు." భార. కర్ణ. ౨, ఆ.) (దీనికి మొదటియర్థమునందుసాధారణంబుగఁబ్రథమాంతనామపదంబకర్తయగు. రెండవయర్థమునందుఁ బ్రథమాంతనామపదంబుగాని అన్నంతక్రియాపదంబుగాని కర్తయగు. మూడవయర్థమందును నాలుగవయర్థమందును తఱచుగ అన్నంతక్రియాపదంబులెకర్తలగు. "చ. వలదని యెంతచెప్పినను వావిరినైకడు వేగపాటుమైఁ, బలుమఱు పెల్లెడం దొడరఁబాఱెదు." (ఇత్యాదిస్థలములయందువలదనుక్రియకుఁగర్తయధ్యాహార్యము.) భార. విరా. ౨, ఆ. కొన్నియెడల కర్తృభూతక్రియావ్యుత్తియగుధాతువునకు మాఱుగా భావప్రత్యయాంతశబ్దంబును నయ్యెడి. "వ. ఎవ్వరిం బాటించుటవిభునకువలయును." భార. అను. ౧, ఆ. మఱియును మొదటి రెండవ నాలుగవ యర్థములయందు తద్ధర్మభూత వ్యతిరేకార్థములయందును, మూడవయర్థమందు తద్ధర్మ వ్యతిరేకార్థములయందును

దీనికి ప్రయోగములు కానఁబడుచున్నవి.)—వై. వలయితము. "క. విడివడిజలమధ్యమునకుఁ, గడువేగమకమఠమేగ గ్రక్కునబొక్కం, బడె నెలుక వానిఁబొడగని, పడఁగాకము నెగసె మ్రాగముపలయంబాటెఁ." పంచ. నా. ౨, ఆ.

వలరాచేపని. ద్వ. వి. గ్రామ్యధర్మము. నీలా. ౧, ఆ.

వలరాజు. వై. వి. మన్మథుఁడు, రతిపతి. "సీ. వలరాజు చేమించుపవిఁ గాంచితులకించు నలయంచఁగిటినొంచియులఁచినటులు." ఉ. రా. ౮, ఆ. (ఇట్లు వలఱేఁడు. మొ.)

వలవంత. ద్వ. వి. మన్మథవ్యథ. "సీ. వలవంతసంతాపమొలసియుఁ బెల్లాసచలిమిరిఁ దోడ్తోన శమనమొంద." హరి. ఉ. ౭, ఆ.

వలవల. దే. వి. 1. ఏడ్పుటయందగుధ్వన్యనుకరణము. "సీ. తళుకునిద్దంపుటద్దపుమోముకళతప్పె వలవలకన్నీరువడువకమ్మ." అని. ౨, ఆ.—2. వ్రాలుటయందగుధ్వన్యనుకరణము. "చ. నేలపై, వలవలవ్రాలెఁ గీలె డలివ్రాలిన పుత్తడిబొమ్మ కైవడిఁ." భాగ. ౧౦, స్కం. ఉ.

వలవలన. దే. విశే. వదిలినది. "వలవలనైనదంతములు." (చూ. వగరము.)

వలస. వై. వి. రాజోపద్రవాదులచే దేశమువిడిచి పరదేశమునకుఁబోవుట*. "చుక్కలవలసత్రోవ." స్వా. 3, ఆ.

వలసతీయు. ద్వ. అ. క్రి. (చూ.) వలసపోవు.

వలసపోవు. ద్వ. అ. క్రి. రాజోపద్రవాదులచే దేశమువిడిచి పరదేశమునకుఁబోవు.

వలాహకము. సం. వి. అ. పుం. 1. మేఘము; 2. కృష్ణునిరథ్యములలో నొకటి; (చూ. రథ్యము.) ౩. పర్వతము. ౪. రాక్షసుఁడు.

వలి. ఉభ. దే. వి. 1. శైత్యము; "ఎ, గీ. వానలకు నెండలకుఁ గరువలికివలికి, సైఁచి." అచ్చ. సుం, కాం.—2. కంపము. విశే. శీతము. "వలిగాడ్పు." వసు. 3, ఆ.—సం. వి. ఇ. స్త్రీ. 1. కడుపుమీఁదిముడుత; 2. ముడుత.

వలికి. దే. వి. సారసపక్షి, బెగ్గురు.

వలిగొను. దే. అ. క్రి. (వలి+కొను.) 1. చలిగొను. "ద్వి. వలిగొన్న మెయి." సా. ౫, భా. 2. వణఁకు.

వలితము. సం. వి. అ. న. (చూ.) వల్గితము. విశే. 1. చుట్టఁబడినది; 2. చలనమునొందినది.

వలిమఁడు. సం. విశే. (అ. ఆ. అ.) వలులుంగలవాఁడు.

వలిపని. దే. వి. శైత్యోపచారము. నీలా. 3, ఆ.

వలిపము. దే. వి. 1. మడుఁగువస్త్రము; "పలుచనిసన్నకావివలిపంబులుఁగట్టఁగనిచ్చి." విక్ర. ౧, ఆ.—2. సన్నని తెల్లవస్త్రము. "చ. వలిపముగట్టివాఁరములు వైచిపటీరము మైనలందిజా, దులునెటిక్రొప్వనందుటిమి త్రోవనెపోయితి మేనిఁ దాఁకియుం, దలఁచెడువారులేరని మనంబుకలంకలు దేర్చి జారకాం, తలసముయస్థలంబులకుఁ దార్చిరి దూతికలట్టివెన్నెలన్." పా. ౨, ఆ.—విశే. 1. పరిశుద్ధమైనది; "వలిపపుసన్నకావులను." లక్ష్మీ. 3, ఆ.—2. తెల్లనైనది. "తే. తారకాధీశుకిరణకదంబకంబు, చిలికెఁబలుచనివలిపంపు జిలుఁగుమంచు." పా. ౨, ఆ.—(వృత్తియందు అంత్యవర్ణము వికల్పముగా లోపించును. "సీ. కలువపుప్పొళ్లచేఁగసటైనవెన్నెల వలిపవెన్నెలలోన వడిచితేర్చి." పా. ౨, ఆ. "వలిపచెంగావిపావడ" శశాం 3, ఆ.)

వలిపిరి. దే. వి. 1. చేలి, 2. వడఁకు.

వలిపిరిగొట్టు. దే. విశే. వడఁకువాఁడు.

వలిభము. సం. వి. అ. పుం. ఆఁడుదాని కోకకుచ్చెళ్లు.

వలిభుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) వలులుగలవాఁడు.

వలిమల. ద్వ. వి. మంచుఁగొండ, శీతనగము. "వలిమలయల్లువానితలవాడనిపువ్వయి." య. ౮, ఆ. (ఇట్లు వలిగట్టు, వలిగుబ్బలి, వలిగొండ.)

వలిమిడి. దే. వి. పశువులకు కాలిమడమలయందుఁ గలిగెడు రోగవిశేషము.

వలిమొలక. దే. వి. భీముఁడు, వాయుపుత్త్రుఁడు. ఆం, భా. ప్ర, కా.

వలియు. దే. అ. క్రి. 1. సన్నగిలు, "వాఁకలబడినీరువలియఁబాఱఁగ." హరి. పూ. ౭, ఆ.—2. డయ్యు. "సీ. ఎదిరినపోతులనెవ్వాని నైననవారణ నోడించివలియఁదోలు." హరి. పూ. ౫, ఆ.

వలివెలుఁగు. దే. వి చంద్రుఁడు, హిమాంశువు. "ప. మందయానలచెక్కులవెలుంగువలివెలుఁగుంజూపి." వసు. ౮, ఆ. (రూ. వలివెల్గు. "సీ. వలివెల్గు టావెల్గువలు వారిమదనవహ్ని జ్వాలికలవేఁడి నిగురఁబోలు." వసు. ౮, ఆ.)

వలీకము. సం. వి. అ. న. ఇంటిచూరు, నీవ్రము.

వలీముఖము. సం. వి. అ. పుం. వానరము, తఱులమోరమొకము.

వలుంద. దే. విణ. స్థూలము, వలము. "చాలవలుంద మీలఁగైకొని." చెన్న. ౪, ఆ.

వలుకు. దే. వి. వళుకుయొక్క రూపాంతరము.

వలువ. దే. వి. 1. సన్నవస్త్రము; (చూ. వల్వ.) 2. వస్త్రము. (రూ. వలువము. చూ. వల్వ.)

వలువు. దే. వి. వలువయొక్క రూపాంతరము. "ర౧డ. పదియార్వన్నియ బంగరువలువును, మెదలెడిత ళుకులమేలిమిచెలువును." కళా. ౮, ఆ.

వలె. దే. ద్ర. 1. వలయుంజో అనుదానికాదేశము; 2. ఉపమావాచకము. "క. లలనానురుచిరతరలీ, లలనాన్నృపుఁదెత్తు వేయు లాగులఁదెలుపజో, వలె నామదిఁదలఁచఁగనీ, వలెనాకిఁక నాప్తులైనవారుం గలరే." రుక్మి. ౨, ఆ.

వలెవాటు. దే. వి. వల్లెవాటుయొక్క రూపాంతరము. (వల్లెవాటుగామెలిపెట్టివైచుకొన్న యుత్తరీయమునకు.—"సీ. ఉదిరిబంగరు వ్రాతహొంబట్టువలెవాటు సడలించివెసఁ గటి స్థలినిజుట్టి." పాండు. ౧, ఆ.)

వల్కము. సం. వి. అ. న. 1. చెట్టుమీఁదిపట్ట, నార; 2. లవంగపుఁబట్ట; 3. తునియ.

వల్కలము. సం. వి. అ. పుం, న. చెట్టుమీఁదిపట్ట, నార.

వల్గ. సం. వి. ఆ. స్త్రీ. (చూ.) వాగె, వాగ.

వల్గనము. సం. వి. అ. న. (చూ.) వల్గితము.

వల్గితము. సం. వి. అ. న. వేగముగావిడువఁబడి మీఁదికిఁగాళ్లుకదలించుచుపాఱెడి అశ్వధారావిశేషము. (చూ. ధార.)

వల్గువు. సం. వి. ఉ. న. కొరివెంద్రుక. పుం. మేఁకపోతు. విణ. చక్కనిది.

వల్చు. యు. అ. క్రి. స. క్రి. వలచుయొక్క రూపాంతరము. (వాసనగొట్టుటకు.—"తనువుమీజో పొలవల్చుజాలరిదాన." భార. ఆది. 3, ఆ.)

వల్ద. దే. విణ. వలుందయొక్క రూపాంతరము. భార. ఆది. ౪, ఆ.

వల్పము. దే. వి. విణ. వలిపముయొక్క రూపాంతరము. (అంత్యవర్ణలోపమునకు.—"వల్పపయ్యెద. వల్పపావడ." మొ.)

వల్పు. యు. వి. వలపుయొక్క రూపాంతరము. (వాసనకు.—"చెంగలువలవల్పు." స్వా. ౬, ఆ.)

వల్మీకపాదుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పుట్టకాలివాఁడు.

వల్మీకము. సం. వి. అ. పుం, న. పుట్ట. (రూ. వల్మికము.)

వల్మీకశింబి. సం. వి. ఈ. స్త్రీ. పుట్టతమ్మి.

వల్ల. దే. అవ. పంచమీవిభక్తియందువచ్చెడువలనయొక్క రూపాంతరము. "చలిమలవల్లనుల్లసిలు చల్లఁదనంబున." స్వా. ౨, ఆ.—విణ. అనుకూలము. "దక్షిణాంస చూచుక నయన ప్రకంపగుణసూచనలేమియుఁవల్లగావు." పా. ౧, ఆ.

వల్లకాడు. ద్వ. వి. (వల్లడి+కాడు.) శ్మశానము. "తే. అబ్బెనే నేఁడుమీకు మధ్యాహ్నభిక్ష, బ్రహ్మపురివాడఁగాశికాపట్టణమున, నబ్బదోనాకుఁబోలె మహర్షులార, వాడవాడలనే పెద్దవల్లకాట." కాశీ. ౭, ఆ.

వల్లకి. సం. వి. ఈ. స్త్రీ. వీణ, విపంచి.

వల్లడి. దే. వి. 1. అకారణమైనయాపద; 2. కొల్ల.

వల్లడికాఁడు. దే. విణ. 1. అకారణము ఆపదచేయువాఁడు; 2. కొల్లపెట్టువాఁడు.

వల్లభము. సం. వి. అ. పుం. మేలిజాతిగుఱ్ఱము. విణ. ప్రియము.

వల్లభుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. ప్రియుఁడు; 2. అధిపతి.

వల్లము. దే. వి. పరవాలజాలె. "సీ. వల్లంబుపోనాడు వైత్యుని శేవనుగాలు కాలినపిల్లి క్రమము తోఁప." హంస. ౧, ఆ.

వల్లరసి. దే. వి. ఒకానొకచెట్టు.

వల్లరి. సం. వి. ఈ. స్త్రీ. 1. చిగిరించినలేఁతకొమ్మ; పూచినలేఁతకొమ్మ. (అని కొందఱు.) పూగుత్తి. (అని కొందఱు.) (చూ. మంజరి.) 2. తీఁగ.

వల్లవుఁడు. సం. వి. అ. పుం. 1. గొల్లవాఁడు; 2. వంటవాఁడు; 3. భీముఁడు.

వల్లి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. తీఁగ, లత, వ్రతతి.

వల్లించు. దే. స. క్రి. వల్లెవేయు. అం, ప్రే. వల్లెవేయించు. "వల్లించు శ్రీరామనామ సుధామాధురి సాధురీతి." పాండు. ౪, ఆ. (చూ. వల్లె.)

వల్లిగము. దే. వి. బొక్కెనమీఁదియినుపవలయము.

వల్లియ. దే. వి. వల్లెత్రాడు. "వ. వల్లియలుసైచికొఁడెలంబట్టి." హరి. పూ. ౫, ఆ. (చూ. వల్లె.)

వల్లిసూరణము. సం. వి. అ. పుం. పుల్లబచ్చలి.

వల్లువము. దే. వి. పరవాలజాలె, వల్లము. "పెనంగవల్లువము ద్రెంచి." ఆము. ౬, ఆ.

వల్లూరము. సం. వి. ఆ. స్త్రీ. అ. పుం, న. 1. కలి వాడు; 2. పందినంజుడు.

వల్లె. దే. వి. 1. పశుబంధనరజ్జువు; "ఎ, గీ. వల్లెవైచు వారెవ్వరుమల్లురాల." ఉ, హరి. ర, ఆ.—2. వరు ణునిపాశము; 3. చెప్పినది మరలమరలఁజెప్పుట. అవ్య. అంగీకారార్థకము. "క. వల్లెయనిరాజనం దను, లెల్లనుసమకట్టి." భార. ఆది. ౬, ఆ.

వల్లెతాలుపు. దే. వి. వరుణుఁడు, పాశి. (రూ. వల్లె తాల్పు.)

వల్లెవాటు. దే.వి.వల్లెయొక్కవాటువంటివాటు."సీ. వల్లెవాటుగఁగొంతవలువచన్గవనిల్పి పెరచేతనీవిఁ గల్పించుకొనుచు." కళా. 3, ఆ.—2. వల్లెవాటు గామెలిపెట్టివైచుకొన్న యుత్తరీయము. (చూ. వలెవాటు.)

వల్వ. దే. వి. వలువయొక్కరూపాంతరము. [సన్న వస్త్రమునకు.— "సీ. మొనసినతమిఁబోఁకముడిఁ దివ్వఁబెనఁగఁగాఁ జినిఁగినసనువల్వసేలతోడ." (ఇక్కడవల్వశబ్దమునకుసన్న మనూత్రమర్థము.) యు. ౨, ఆ.] (రూ. వల్వము. "పసుపుఁబొడితో లువల్వంబుసెసకమెసఁగ." ఆము. ౬, ఆ.)

వశ. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడేనుఁగు; 2. గొడ్డుటావు; 3. ఆవు; 4. కూఁతురు; 5. పెండ్లాము; 6. ఆఁడు ది. విశ. లోఁకువైనది.

వశంవదుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) లోఁకువయ గునట్లు మాటలాడువాఁడు.

వశక్రియ. సం. వి. ఆ. స్త్రీ. వశముచేసికొనెడు మం త్రతంత్రాదికర్మము.

వశము. సం. వి. అ. పుం. 1. లోఁకువ; 2. ఇచ్ఛ; 3. ప్రభుత్వము. విశ. లోఁకువైనది.

వశవర్తి. సం. విశ. విధేయుఁడు.

వశి. సం. విశ. (న్. ఈ. న్.) 1. లోఁకువైనవాఁడు; 2. ఇంద్రియనిగ్రహముగలవాఁడు.

వశికము. సం. విశ. (అ. ఆ. అ.) శూన్యము.

వశిరము. సం. వి. అ. న. ఇందుప్పు. పుం. 1. ఉత్తరే ణుకి; 2. గజపిప్పలికి. (రూ. వసిరము.)

వశీకరణము. సం. వి. అ. న. మందుమాఁకులచేత లోఁ కువగాఁజేయుట.

వశీకరించు. సం. స. క్రి. మందుమాఁకులచేత లోఁకు వగాఁజేయు.

వశ్యము. సం. విశ. (అ. ఆ. అ.) మందుమాఁకులచేత లోఁకువైనది.

వశ్యౌషధము. సం. వి. అ. న. పెట్టుమందు.

వషట్కృతము. సం. విశ. (అ. ఆ. అ.) అగ్నియం దు వేల్వఁబడినది. (హవిస్సు.)

వస. ఉభ. వై. వి. ఒకమందుదినుసు. సం. ఆ. స్త్రీ. కడుపులో బొడ్డుక్రిందనుండెడి యుల్లిపొరవం టిక్రొవ్వు, వప.

వసంతద్రుమము.సం.వి.అ.పుం.మామిడి,అమ్రముకి.

వసంతము. ఉభ. దే. వి. పసుపునుసున్నమునుకలిపి నయెఱ్ఱనీళ్లు. సం. అ. పుం. 1. ఒకఋతువు; (చూ. ఋతువు.) 2. ఒకానొకరాగము.

వసతి. ఉభ. దే. వి. సౌఖ్యము. (అక్కడ నీళ్లవసతి లేదు.) విశ. సౌఖ్యకరము. (అచోటు నాకు వసతి గానున్నది.) సం. వి. ఇ. స్త్రీ. 1. ఇల్లు; 2. ఉనికి; 3. రేయి; 4. బుద్ధాలయము.

వసనము. సం. వి. అ. న. 1. ఉనికి; 2. వస్త్రము.

వసనాభి. వై. వి. గ్రా. విషవిశేషము, వత్సనాభి.

వసపడు. వై. అ. క్రి. (వసము+పడు.) "క. వసుధ సుబుత్రాదికదు, ర్వ్యసనముసైతమునుదండ్రివా రించుటకుకా, వసపడదఁటమఱిరాజ్య, వ్యసనము వారింపనెంతవాఁడెవ్వఁడుకా." ఆము. ర, ఆ.

వసపోవు. ద్వ. అ. క్రి. (వసము+పోవు.) శక్యమగు. "సీ. తమపట్టినొకనికీసమకట్టవసపోనివిలువెట్టి రనితిట్టివిరటుఁడరిగె." పాంచా. ౨, ఆ.

వసము. వై. వి. స్వాధీనత, అధీనత. "చ. అసదుగఁదాఁ కిమేనఁ దఱచైపొరి సెత్తురు గ్రమ్ముపోటులకా, వసమఱితూలుచుండియును." భార. విరా. 3, ఆ. "చ. అసదృశశక్తిచేజితుఁడనైపరరత్నమిష్ట గాంచినీ, వసమునఁజిక్కితికా." హరి. ఉ. ౮, ఆ.—విశ. 1. అధీనము; (చూ. కారూరు.) 2. శ క్యము*. "హరికికా బ్రత్యర్థియైనిల్వఁగావసమే యెంతటివారికికా." హరి. పూ. 3, ఆ.

వసల. దే. వి. కొయ్యకు అదుకు వేసెడుకొయ్య. (రూ. వసలా.)

వసార. దే. వి. కూటమునకుప్రక్కనుండెడుకట్టడ ము, పంచాది. (రూ. వసారా.)

వసి. ఉభ. దే. ఉప. మిక్కిలి. (క్రియకుముందు వసి మాలు, వసివాడు, వసివాఱు. విశేష్యమునకు ముందు. వసితాఁకు.) వై. వి. 1. కొనచెక్కినకొ య్య; 2. మీఁదుమొనగానాటినమేకు; 3. ముల్లు*. సం. ఇ. పుం. ఉనికి.

వసించు. సం. అ. క్రి. వాసముచేయు, ఉండు.

వసిగొను. దే. అ. క్రి. (వసి+కొను.) పూను, ఉత్స హించు. "ద్వి. వసిగొనివారియుదేవతలుసెత్తంగ, వెసనూపి రేయత్నవినిహితత్పణము." భాగ. ౬, స్క౦.

వసివాళ్లు. దే వి. బ. (వసివాడు+లు.) మిక్కిలి వా డుటలు. "ఎ, గీ. కందకుండంగవసివాళ్లు సెంద కుండ." చంద్ర.

వసుంధర. సం. వి. ఆ. స్త్రీ. భూమి, వసుధ, నేల.

వసుకము. సం. వి అ. న. చేవుటుప్పు. పుం. 1. జిల్లే డు*; 2. బకపుష్పము*.

వసుగర్భ. సం. వి. ఆ. స్త్రీ. భూమి, వైఁడిచూలాలు

వసుదేవుఁడు. సం. వి అ. పుం. కృష్ణునితండ్రి.

వసుధ. సం. వి. ఆ. స్త్రీ. భూమి, మహి, మేదిని, నేల.

వసుమతి. సం. వి. ఈ. స్త్రీ.—వై.—

వసులపాఁతఱ. దే. వి. (వసులు+పాఁతఱ.) ఒకదిను సుపందెపుపుంజో. "ఎ, గీ. వసులపాఁతఱలీరెం డునుసులసీయరు." (ఇక్కడ వసులపాఁతఱలనఁ గా వసులపాఁతఱలవంటివారనుట.) సా. ౨, ఆ.

వసులు. దే. అ. క్రి. తొలఁగు, అపసరిల్లు.

వసువు. సం. వి. ఉ. న. 1. బంగారు; 2. రత్నము; ౩. ధనము పుం. 1. బకపుష్పము*; 2. పలుపు; 3. కిరణము; 4. అగ్ని; 5. ఒకరాజు; 6. గణదేవ తావిశేషము. (అష్టవసువులు.—ఆపుఁడు, ధ్రు వుఁడు, సోముఁడు, అధ్వరుఁడు, అనిలుఁడు, ప్రత్యూషుఁడు, అనలుఁడు, ప్రభాసుఁడు.) (ఇవి మతిమొక్కచో వేఱొకక్రమముగా చెప్పఁబడియున్నవి.) విణ. మధురము.

వసూలు. హిం. వి. జేమ, పోగుచేయుట.

వస్తము. సం. వి. అ. న. ఇల్లు, గృహము, గేహము.

వస్తాదు. హిం. వి. ఉపాధ్యాయుఁడు, యజమానుఁడు.

వస్తి. సం. వి. ఇ. పుం, స్త్రీ. 1. బద్దె; 2. పొత్తికడుపు.

వస్తువు. సం. వి. ఉ. న. పదార్థము, బండము.

వస్త్యము. సం. వి. అ. న. ఇల్లు, గృహము, సద్మము.

వస్త్రము. సం. వి. అ. న. వలువ, వసనము.

వస్నస. సం. వి. ఆ. స్త్రీ. సన్నపునరము.

వస్నము. సం. వి. అ. న. 1. వస్త్రము; 2. ధనము; 3. కూలి; 4. వెల.

వహనము. సం. వి. అ. న. 1. వహించుట; 2. ఓడ.

వహము. సం. వి. అ. పుం. 1. ఎద్దుమూఁపురము; 2. వాహనము.

వహి. ఉభ. దే. వి. 1. లెక్కపుస్తకము; 2. పుస్తక ము; ౩. విధము. "సీ. ఒకకొన్నిసిగరలుకొకకొ న్నియంబలు లొకకొన్నివహుల పూపొక్కర ములు." పాండు. ౪, ఆ. సం. విణ. (న్. ఈ. న్) వహించువాఁడు.

వహించు. సం. స. క్రి. తాల్చు. (వహియించుఅనియు.)

వహేలనము. సం. వి. అ న. తిరస్కారము, తెగడిక.

వహ్ని. సం. వి. ఇ. పుం. 1. అగ్ని; 2. చిత్రమూలము*.

వహ్నిశిఖము. సం. వి. అ. న. 1. కుంకుమపువ్వు; 2. కుసుమపువ్వు.

వహ్నిసంజ్ఞకము. సం. వి. అ. పుం. చిత్రమూలము*.

వళక్షము. సం. వి. అ. పుం. తెలుపు. విణ. తెల్లనిది.

వళాగ్రము. దే. వి. క్రముకభేదము. (అప్ర.)

వళావళి. దే. వి. 1. కుతూహలము; "ఉ. అంబురుహా క్షినాసికనిజాన్వయశత్రువుఁజంపకప్రసూ, నం బుఁగరంబుగెల్చుట మనంబునఁబెట్టి తదీయ పా ర్శ్వ్వయు, గ్మంబునినిత్యసేవకతఁగ్రాలెడునీక్షణ తారకాఖ్యరో, లంబకదంపతుల్ పెనువళావళి నెంతయుసంభ్రమించుచుణ్." ప్రభా. ౨, ఆ.— 2. విజృంభణము. "విపులవైరిమరాళులు సేయు నివ్వళా, వళులకుడాఁగుటో." భాను. 3, ఆ. "సీ. లలితానసెందుమండలపాండురచ్ఛాయవనరుహా వళివళావళియడంప." వసు. 3, ఆ.

వళి. సం. వి. ఇ. స్త్రీ. 1. కడుపుమీఁదిముడుత; 2. ముడుత; 3. యత్యక్షరము.

వళిరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మెల్లకంటివాఁడు. (రూ. వలిరుఁడు.)

వళుకు. దే. వి. తగవు. "బంగరుంగొంచెముకానిహే నికళుకుల్ వళుకుల్ పచరించు." రా, వి. ౪, ఆ.

## వా.

వా. వై. వి. 1. నోరు; "చ. ఇ,స్వడునరుఁగాంచిమా రతనిపోటునుతించుచుభీతినిట్లువా, విడిచిఁయు సే కథంగిఁబృథివీపతివేఁడిఁడిఁజేయుటొప్పునే." భా ర. విరా. ౪, ఆ.—2. ఖడ్గధార*. "ఉ. వా, తప్పు కవ్రేసెనొక్కమొగిఁ దార్కొనిభీమశిరంబువ క్షముణ్." జై. ౨, ఆ.

వాంచు. వై. ప్రే. వంచుయొక్కరూపాంతరము.

వాంఛ. సం. వి. ఆ. స్త్రీ. ఇచ్ఛ, కాంక్ష, కోరిక.

వాంఛించు. సం. స. క్రి. ఇచ్ఛించు, కాంక్షించు, కోరు.

వాంఛితము. సం. విణ. (అ. ఆ. అ.) కోరఁబడినది.

వాంతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వాంతియొత్తఁబడినది; 2. వెడలఁగ్రక్కఁబడినది.

వాంతి. సం. వి. ఇ. స్త్రీ. 1. వమనము; 2. వెడలఁగ్రక్కుట.

వాంశికుఁడు. సం. వి. అ. పుం. పిల్లంగ్రోవి యూఁదు వాఁడు.

వాఁక. యు. దే. వి. వైపు. (చూ. కరవాఁక. మొ.) వై. ఏఱు*. (వరకువాఁక దొరకుమూఁక.) విణ. వంకర. "తే. కడునడవిఁ బేర్చునొక వాఁక కనుమలోన." పర. ౪, ఆ.

వాఁకతాలుపు. ద్వ. వి. శివుఁడు, గంగాధరుఁడు. "వలిగుబ్బలిపట్టియు వాఁకతాలుపుఁన్." పాండు. ౧, ఆ.

వాఁకుడు. వై. వి. కంటకారిక?.

వాఁగరత. వై. వి. (నాఁగులు + అరత.) సముద్రతీరము. (రూ. వాఁగర్త.) (వృత్తియందేకవచనాంతము.)

వాఁగడుపు. దే. వి. (వాఁపు+కడుపు.) వాఁపుగల కడుపు. "సీ. బీదనరాలతోఁ బెరుఁగు వాఁగడుపులో బల్లనల్లడలందుఁ ద్రుళ్లిపడఁగ." శుక 3, ఆ.

వాఁగు. వై. అ. క్రి. 1. వదరు; (వాని నోరూరక వాఁగుచున్నది చూడు.) 2. మ్రోఁగు. "క్రంగు నవాఁగు." విజ. ౧, ఆ. — వి. 1. సెలయేఱు*; "చ. వనములయందుఁ గ్రుమ్మరుచు వాఁగుల ద్రెంతలనీరు ద్రావి." రా. యు, కాం. —2. సైన్యము*; "క. వెలుఁగుగని కడఁగి యిరువాఁ, గులుఁ బోరికిఁ జొచ్చె." భార. విరా. 3, ఆ.—౩. బ. అలలు.

వాఁగుడు. వై. వి. మ్రోఁగుడు, మ్రోఁత, ధ్వని.

వాఁచు. వై. అ. క్రి. 1. ఏఁకరు*; "ఉ. ఏము సైతముఁన్, వాఁచినవారియట్ల గరువంబునఁ గన్గొనుచుంటిమవ్విభుఁన్." వి. పు. ౭, ఆ.—౨. ఊఁదు*.

వాఁడి. దే. వి. 1. పదను, నైశిత్యము; "క. వాఁడు మొదలు గాఁబగతుర, వాఁడిగలుఁగు తూపుగములవలన మొఱసిరియే, నేఁడు వధింతును చెవ్వగ, వేఁడిమిఁ బడఁ జాలకొక్క వెరవు దలఁచితిఁన్." భార. సౌ. ౧, ఆ. "తే. మారుతమ్ములవాఁడికి మలయమాట, మారుతమ్ములవేఁడికి మట్టుమీఱు, చంద్రకిరణమ్ములకు శుకశారికాళి, చంద్రకిరణమ్ములకుఁ జాలజలదరించు." విజ. 3, ఆ.—౨. శౌర్యము. "క. నేఁడింక సెటిఁగిరీటరవుల, వాఁడఁగ దాడు మచునేమ వారిఁ దొలంగం, బోఁడిమి చెడ దేమదిఁ గడు, వాఁడిగల దిశాకునకట వారిజనాభా." భార. ఉద్యో. ౪, ఆ.—విణ. 1. పదనైనది, నిశితము; "వాఁడితూపులు." — 2. తీక్ష్ణము; "వాఁడిమయూఖముల్ గలుగు వాఁడపరాంబుధిఁ గ్రుంకె." భార. ఆది. 3, ఆ.—3. క్రూరము. "క. నాఁడగ్నిలోనఁ ద్రోచిన, వాఁడవకటయుంతఁ బోకవల్లభనిమ్మై, నేఁడడవిఁ ద్రోచితెదగడు, వాఁడిగదే నీకు రాఘువకుల ప్రవరా." నిర్వ. ౧౦, ఆ.

వాఁడిమగఁడు. దే. విణ. శూరుఁడు. "క. నీవొకతవె లయిలఁ బది, వేవుర నేవలచిపట్టి వెదకిన నడ్డం, బై వచ్చి పలదు నానిం, దే వాఁడిమగండు లేమియొఱుఁగవుకంటే." భార. విరా. ౨, ఆ.

వాఁడిమి. దే. వి. 1. తేజము, ప్రతాపము; "క. రాజపుత్త్రులుదమమై, వాఁడిమిదప్పిననిప్పుల, వేఁడిమిచెడినట్లు జనుల విని యలుకుదురే" (దీనికిముందుభాగము. చూ. పోఁడిమి.) భార. ఉద్యో. 3, ఆ.—2. శౌర్యము. "ఉ. వీఁడొకరుండె యింక బల విక్రమసంపదగల్గి పోరిలో, వాఁడిమి సొంపుచూపఁగలవాఁడు సుయోధనుపాలఁ బేర్చు." భార. కర్ణ ౧, ఆ.

వాఁడు. దే స. (ఆశబ్దమునకు మహదర్థక ప్రథమైకవచనరూపము.) ఆపురుషుఁడు.

వాఁత. వై. వి. తెవులుగొంటులైన పశ్వాదులకు వేసెడు మాఁడు (గొల్లవాఁడు ఆకోడెకు వాఁత వేసినాఁడు.)

వాఁపి. వై. విణ. (వాఁపు+ఇ.) వాఁపురోగముగలవాఁడు. ఆం, భా. ద్వి.

వాఁపిరి. ద్వ. వి. (వాఁపు+ఇరి.) ఏఁకరుట, ఏఁకట

వాఁపిరిగొట్టు. ద్వ. విణ. (వాపిరి+కొట్టు.) వాఁపిరి వాఁడు, ఏఁకరువాఁడు.

వాఁపు. వై. వి. 1. ఊఁదు, శోఫ; 2 ఏఁకట.

వాకట్టు. ద్వ. వి. (మూలికామంత్రములచేత చేసెడు) వాగ్బంధనక్రియ. "ద్వి. కాలాహిజవశక్తిఁ గట్టు వాకట్టు." విష్ణు. పూ. ౨. ఆ.—విణ. వాగ్బంధనముచేయునది. "సీ. మొగముపార్శ్వములకు మగిడింపకుండ వాకట్టుమూలిక వాగెఁబట్టిపట్టి." కళా. 3, ఆ. "సీ. తేనెలుట్టెడుమాట తేటలపసలు వాకట్టుమంత్రంబులకరణినమర." కళా. ౨, ఆ. (చూ. చేకట్టు.)

వాకబుచేయుట. హిం. క్రి. తెలిసికొనుట, విచారించుట.

వాకము. దే. విణ. వాటము. "ద్వి. ఈకొండపడమట నీకొండక్రేవ,వాకమానొక పెద్దవటముమూలము న." రా. అ, కాం.

వాకాటు. ద్వ. వి. వాగ్వాదము. "క. ఆకాశదివ్యమునులును, నాకౌకః ప్రత్యనీక నాయకమును లున్, వాకాటులకుంజొచ్చిరి, పాకంబులుదప్పి నట్టిపటురోషములన్." భీ. ౪, ఆ.

వాకిలి. ద్వ. వి. (వా+ఇల్లు.) గృహద్వారము. "కృపుఁడున్ హార్దిక్యుఁడున్ వాకిటనిలిచి." భార. సౌ. ౨, ఆ. (సంధిని వర్ణవికారములు.) (వాకు, ఇల్లు అనువాని మూలపదములనుగా నుంచి మిశ్రపదముగాఁజేసినయెడ నచ్చతెనుఁగు ప్రయోగములకు విరోధమగుచున్నది.)

వాకు. సం. వి. చ్. స్త్రీ 1. పలుకు; 2. పలుకుఁజెలి.

వాకొను. ద్వ. అ. క్రి. 1. మాటాడు; "ద్వి. ప్రాకృతులట్లసర్వజ్ఞుఁడవయ్యు,వాకొందురేయిచ్చవచ్చినయట్లు." రా. కిష్కిం. కాం.—2. అఱచు. "క. కనుఁగొనిపలుదెఱఁగులవా,కొనిలేపఁగ."అచ్చ. యు, కాం. (ప్రే. వాకొలుపు, వాకొల్పు."పరులఁజూపులు వాకొల్ప." నై. ౭, ఆ.)

వాక్కు. సం. వి. చ్. స్త్రీ. వాకునకు మొదటిరూపము.

వాక్పతి. సం. వి. ఇ. పుం. 1. బ్రహ్మ; 2. బృహస్పతి; 3. కవీశ్వరుఁడు. విణ. మిక్కిలి చతురముగ మాటలాడువాఁడు.

వాక్యము సం. వి. అ. న. 1. పదపదార్థములయొక్క పరస్పరసంబంధము చెడక యేకార్థత్వము గలిగి క్రియతోడఁగాని తదితరముతోడఁగాని ముగిసెడి పదసముదాయము; (ఉదా. వివేకముగలవారు తమకుఁగలకొలందిఁ గుడిచికట్టి నెమ్మదినుందురు,ఒకరు చెప్పినదువినక తామును దెలిసికొనకయుండుట మూర్ఖులకు సహజము.) 2. మాట.

వాక్రుచ్చు. ద్వ. స. క్రి. (వా+కూర్చు.) 1. పేరుచెప్పు;"ఉ. మెచ్చిరొయొకింతగౌరవము మెచ్చకయుండిలఘుత్వలేశమున్, దెచ్చుటకున్ సమర్థులెకృతిక్రియకున్ గుకవిత్వగర్వితుల్, తచ్చరితంబుపేక్షుచితంబగుఁగాకనగంగనైనవా,క్రుచ్చియజాగళస్తనసగోత్రులవారల నెన్న నేటికిన్." కళా. ౧, ఆ.—2. చెప్పు. "సీ. నృపులచేభట్టికానికలు దెచ్చిన సొమ్ముకొలఁది యెవ్వరికి వాక్రువ్వఁగాదు." విక్ర. ౫, ఆ. (సంధిని వికారము.)

వాగ. సం. వి. ఆ. స్త్రీ. (చూ.) వాగె, వల్గ.

వాగఱ. దే. వి. (వ్రాయు+కఱ్ఱ.) ముచ్చివాఁడు చిత్తరువువ్రాసెడుతూలిక. (సంధిని వర్ణలోపము.)

వాగళము. వై. వి. వాగళ్లముయొక్క రూపాంతరము.

వాగళ్లము. వై. వి. (వా+కళ్లము.) కళ్లమునకుముందు భాగము, ఖలముఖము.

వాగాయిత్తము. వై. వి. వాగ్వివాదము. (ఇది వాడుకలోనిది.)

వాగీశుఁడు. సం. వి. అ. పుం. 1. బ్రహ్మ; 2. బృహస్పతి; 3. కవీశ్వరుఁడు. విణ. మిక్కిలి చతురముగ మాటలాడువాఁడు.

వాగుజి. సం. వి. ఈ. స్త్రీ. కారుగచ్చేకి.

వాగుర. సం. వి. ఆ. స్త్రీ. (మృగములను పక్షులను పట్టెడి) ఉరి, వల.

వాగురికుఁడు. సం. వి అ. పుం. ఉరులు వలలు పన్ని మృగములను పక్షులనుపట్టెడు వేఁటకాఁడు.

వాగె. వై. వి. గుఱ్ఱము నోటికళ్లెమునకుతగిలించెడు పగ్గము "ఘోటకంబునకువాగెయుదంతికినంకుశంబునేకరణినివారకంబులు." సం. "యథాహిరశ్మయోశ్వస్య ద్విరదస్యాంకుశోయథా." భార. శాం. ౨, ఆ. (చూ. ఒత్తిడి రెండవయర్థము.) (మొదటిరూపము వాగియ.)

వాగ్గులికుఁడు. సం. వి. అ. పుం. అడపకాఁడు.

వాగ్మి. సం వి. న్. పుం. 1. చిలుక; 2. బృహస్పతి. విణ. యుక్తియుక్తముగా మాటలాడువాఁడు.

వాఙ్ముఖము. సం. వి. అ. న. (చూ.) ఉపన్యాసము.

వాచ. సం. వి. ఆ. స్త్రీ. వాకుయొక్క రూపాంతరము.

వాచంయముఁడు. సం. వి. అ పుం. మౌనవ్రతముకలవాఁడు, మౌని.

వాచకము. సం. వి. అ. పుం. వాచ్యార్థమును తెలిపెడు శబ్దము.

వాచస్పతి. సం.వి.ఇ.పుం.బృహస్పతి, వేల్పుటొజ్జ.

వాచాటుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) వలవని పెక్కుమాటలాడువాఁడు, వదరుఁబోతు.

వాచాలుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) ——పై.——

వాచించు. సం. స. క్రి. 1. చెప్పు; "సీ. ఇల్లుమంచము లేక వెల్లిపైఁదేలాడ శ్రీనాథుఁడౌటవాచింప నేల." చంద్రా. ౧, ఆ.—2. చదువు. చంద్రా. 3, ఆ.

వాచికము. సం. వి. అ. న. సమాచారము, (చూ.) వక్కాణము.

వాచ్యము. సం. వి. అ. పుం. అభిధచేఁ దెలియఁదగిన యర్థము. విణ. 1. చెప్పఁదగినది; 2. నిందింపఁదగినది.

వాచేరము. ద్వ. వి. వాచేరపముయొక్క రూపాంతరము.

వాచేఱచే. దే. అ. క్రి. మొఱపెట్టు. "చ. వెఱచిన వాని దైన్యమున వేఁడుఱనొందినవాని నిద్రపై, మఱచినవాని సౌఖ్యముగ మద్యముద్రావినవాని భగ్నుడై, పఱచినవాని సాధుజడభావమువానిని గావుమంచువా, చఱచినవానిఁ గామినులఁ జంపుటధర్మముగాదుఫల్గునా." భాగ. ౧, స్కం.

వాచేరపము. ద్వ. వి. వాచేరుట పరిదేవనము. ఆం, భా. ప్ర.

వాచేరు. ద్వ. అ. క్రి. పరిదేవనముచేయు. "ద్వి. చనుసెమాటలఁ బొద్దుజరపుచునిల్వ, మునితనూజుఁడుజలమ్ములకువాచార" హరిశ్చ. ౧ భా. "సీ. నీతాతసెఱుఁగమూసెలఁతలబతిమాలి వెన్నకువాచారుచున్నవాఁడు." ఉషానిరుద్ధసంవాదము.

వాచోరు. ద్వ. వి. ఇంటిముంజూరు. పాండు. ౫, ఆ.

వాజపేయము. సం. వి. అ. పుం, న. యాగవిశేషము.

వాజము. సం. వి. అ. న. 1. నెయ్యి; 2. నీళ్లు; 3. హవిస్సు. పుం. 1. బాణముఱెక్క; 2. ఱెక్క; 3. వేగము; 4. ధ్వని.

వాజి. సం. వి. న్. పుం. 1. గుఱ్ఱము; 2. పక్షి; 3. బాణము.

వాజిదంతకము. సం. వి. అ. పుం. అడ్డసరము?.

వాజిబీ హిం. విణ. సరియైన, న్యాయమైన.

వాజె. దే. వి. రోఁత. "సీ. దేవురించుచువాజదేఱెడుమొగమువుబడఁ బాఱుచుండెడుబడుగుటోడలు." హరిశ్చ. ౪, ఆ. విణ. రోఁతగలది.

వాజెము. దే. వి. పక్షివిశేషము. (చూ. వంగపండు.)

వాటపడు. ద్వ. అ. క్రి. అనుకూలమగు. "సీ. శశిమోమునవనపోలఁజాలమిశశిరేఖవంటిదియనిపల్కవాటపడునె." కవి. ౨, ఆ.

వాటపద్యములు. గ్రా. వి. అటవిడుపుపద్యములు.

వాటము. ఉభ. దే. విణ. 1. జాఱుపుగానుండునది; "వాటపుఁబొక్కిలి." వసు. ౨, ఆ.—2. అనుకూలమైనది; "వ. ఇచ్చోటువేఁటకువాటంబనివేఁటకాండ్రు విన్నవించు మాటలాలించి." య. ౧, ఆ.—3. సత్త్వమంటునది; "సెయ్యంబుమనమునవాటమయినది." మార్క. ౬, ఆ.—4. పొందికయినది; "వదలినద్రిండుదొంటిగతివాటముగా దిగియించి." శై. ౨, ఆ. — 5. ఓర. "వ. నిజకుటీరద్వారంబులకవాటంబువాటంబుచేసి." వి, పు. ౭, ఆ. — సం. వి. అ. పుం, న. కూరలోనగువాని తోఁట. అ. పుం. 1. త్రోవ; 2. చెట్టువెలుగువేసినచోటు; 3. వెలుగు; 4. ఇండ్లవరుస; 5. భాగము.

వాటి. సం. వి. ఈ. స్త్రీ. 1. కూరలోనగువానితోఁట; 2. ముండ్లకంచె.

వాటిక. సం. వి. అ. స్త్రీ. 1. తోఁట; 2. ఇండ్లవరుస.

వాటు. దే. వి. 1. వైచుట; "ద్వి. వడివైచు తమతమ వాటులచేత." రా. యు, కాం.—2. దెబ్బ, పోటు. "ఉ. ఎత్తినతీవ్రకోపమున నింతిపయింబడఁగత్తివైచినన్. ఆ. వాటుదాఁకిముక్కువ్రయ్యలైపడెనని, ముదితశోకకొంగుమూసికొంచు, వాడవారలెల్లపడి వెంటఁదిరుగంగఁ, బోయిరాజునగరఁగూయుచుండె." పంచ. నా. ౧, ఆ.

వాటుఁగాలు. దే. వి. (వాటు+కాలు.) నడచునపుడు పక్కవాటుగాపోయెడు కాలు. (చూ. రోటువోవు.)

వాటురాయి. దే. వి. దొంగలువైచుటకు అనువుగా ఏటి తీసికొనిపోయెడుఱాయి. "ద్వి. ఒలుకుల బూడిదయునువాటురాలు." భాగ ౫, స్కం.

వాటులాడు. దే. అ. క్రి. (వాటులు+ఆడు.) కొట్లాడు. "చ. ఇరువురు నీలనీరజనిభేక్షణ లించినవద్కతోఁబర, స్పరమెదిరించికాంచనపుబంతులఁ దచ్చన వాటులాడఁగా." నై. 3, ఆ.

వాట్యాలకము. సం. వి. అ. పుం. ముత్తవపులగము?.

వాట్లీఁడు. దే. విణ. (వాట్లు+ఈఁడు.) కొట్లాడువాఁడు. "ఆ. వాదులానితోడ వాట్లీనితోడను, బూతుతోడఁదిండి పోతుతోడ, నటమటీనితోడనడియరితోడను, వెలకుసెత్తిమాడపెరవుగాదు." ఉ, హరి. 3, ఆ.

వాడ. యు. దే. వి. తావి. (వాడగాలి.) పసుపుతావి. (అని కొందఱు.) వై. 1. వీధి; "శా. అచ్చోనద్భుతంబందన, వ్వాడంబౌరజనంబులెల్ల నితఁడెవ్వాఁడొక్కొ నేత్రోత్సవం, బైడాయంజుపుడెంచెనంతటనుమాయఁబయ్యో నంచెంతయున్." (చూ వెనుక.) నై. 3, ఆ.—2. ఇండ్లవరుస*.

వాడఁబాఱు. దే. అ. క్రి. (వాడన్ + పాఱు.) వాడు. "వాడఁబాఱెఁదొడఁగెన్ జెంగల్వలున్ గల్వలున్." భాను. 3, ఆ. (చూ. పాఱు.)

వాడకట్టు. ద్వి. వి. వాడ, వాటిక, వీధి.

వాడగన్నేరు. దే. వి. ఒకదినుసుగన్నేరు?. (పచ్చగన్నేరు అని తోఁచెడి.)

వాడగాలి. దే. వి. మలయమారుతము.

వాడవదినె. వై. వి. వేశ్య, కులట. (అని కొందఱు.)

వాడిక. దే. వి. చెప్పకచూపకయుంచినయిల్లడ, ఉపనిధి.

వాడు. దే. అ. క్రి. మ్లానమవు. స. క్రి. ఉపయోగపఱుచు. వి. వాడుట, మ్లాని. "అతనిమైవాడునుహాయచయంబుదప్పియు." భార. ద్రో. 3, ఆ. "క. అరుదెంచియలిగియుండెడి, యరుదెంచివితాకుతాఁకుదైతహతహతోఁ, దటియంగనరిగితో, దరియంగమువాడు గాంచి దయదయివాఱన్." సా. ౨, ఆ.

వాడుక. దే. వి. 1. ఉపయోగము; 2. అభ్యాసము; 3. వ్యవహారము.

వాడుకపడు. ద్వి. అ. క్రి. పనుపడు, అలవడు.

వాడుకొను. దే. స. క్రి. 1. జనులు ప్రవాదముగా చెప్పుకొను; 2. ఉపయోగపఱుచుకొను.

వాడుచు. దే. ప్రే. వాడఁజేయు, వాడించు.

వాడుదల. దే. వి. వాడుక, అభ్యాసము.

వాడుదెంచు. దే. అ. క్రి. (వాడు+తెంచు.) వాడుపాఱు. "సీ. పగలింటిసెగలచేసొగటొందుపూఁదీఁగవడువునసొమ్మెనువాడుదెంచె." అని. 3, ఆ. (స్వార్థమున తెంచు.)

వాడుపడు. ద్వి. అ. క్రి.—వై.—ప్రే. వాడుపఱుచు. "సీ. వెలలేనికళలతో వెలయునీసొమ్మోమువనితయేవికలుండువాడుపటిచె." ఉ, రా. ౪, ఆ.)

వాడుపాఱు. దే. అ. క్రి.—వై.—"సీ. లవలీదళములట్లసవరైనచెక్కులువాడుపాఱఁగముద్దులాడియాడి." ఉ, రా. ౪, ఆ.

వాడెదవ. దే. వి. చెఱకుచివర, ఇక్ష్వగ్రము.

వాణి. సం. వి. ఈ. స్త్రీ. 1. పలుకు; 2. పలుకుఁజెలి. ఇ. ఈ. స్త్రీ. నేఁత.

వాణిజుఁడు. సం. వి. అ. పుం. వర్తకుఁడు, వణిజుఁడు.

వాణిజ్యము. సం. వి. అ. న. వణిగ్వ్యాపారము.

వాణిని. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆటకత్తె; 2. తుంటెనకత్తె; 3. ముగ్ధ; 4. విదగ్ధ.

వాతకము. సం. వి. అ. పుం. సోమిదము?.

వాతకి. సం. వి. ఈ. స్త్రీ. సోమిదము?. విణ. (న్. ఈ. న్.) వాతరోగముగలవాఁడు.

వాతకుంభము. సం. వి. అ. పుం. ఏనుఁగునొసటిబుడిపి, పిన్నసుదురు.

వాతగానివాఁడు. దే. వి. బట్టలకురంగువేయువాఁడు.

వాతఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. పులుగుడు?.

వాతపోథము. సం. వి. అ. పుం. మోదుగు, కింశుకము?.

వాతప్రమి. సం. వి. ఈ. పుం. వాతమృగము.

వాతము. సం. వి. అ. పుం. వాయువు, గాలి.

వాతమృగము. సం. వి. అ. పుం. గాలికెదురునడిచెడియిఱ్ఱివంటిమృగము.

వాతరట్టు. ద్వి. విణ. (వాతన్+రట్టు.) వదరుపోతు. "చ. అదియటులుండెసాహసపుటగ్గలికంబలెవాతరట్టవై, వదరితికొన్ని." చంద్ర.

వాతవాఁడి. ద్వి. విణ. (వాతన్+వాఁడి.) అప్రియంపదుఁడు. (చూ. పెడఁబాయు.)

వాతాయనము. సం. వి. అ. న. కిటికీ, గవాక్షము.

వాతాయువు. సం. వి. ఉ. పుం. 1. జింక; 2. వాతమృగము.

వాతారి. సం. వి. ఇ. పుం. ఒకానొకచెట్టు, వాలుఁడు.

వాతికాసు. వై. వి. (వాయి+కాసు.) లంచము. (ఇది పామరులు వాడుకొనుమాట.)

వాతిబియ్యము. ద్వి. వి. (వాయి+బియ్యము.) దహనముచేయునపుడు బంధువులు పీనుఁగునోటవేసెడు బియ్యము.

వాతూలము. సం. వి. అ. పుం. 1. గాలి; 2. సుడిగాలి. విణ. 1. గాలిసయింపనిది; 2. వెఱ్ఱెత్తినది.

వాతెఱ. ద్వి. వి. (వా+తెఱపి.) పెదవి. "చ. సెతికురులున్ విలోలసితనేత్రయుగంబును నొప్పులొప్పువా, తెఱయును." భార. ఆది. ౭, ఆ. (కొందఱు వాతెరయని లఘురేఫముగా ప్రయోగించియున్నారు. అప్పుడు వాయికితెరయని వ్యుత్పత్తి.)

వాత్య. సం. వి. ఆ. స్త్రీ. సుడియుగాలి, సుడిగాలి.

వాత్సకము. సం. వి. అ. న. వత్సములసమూహము. (వత్సము=దూడ.)

వాత్సల్యము. సం. వి. అ. న. వత్సలభావము, పుత్రులయందుఁగలస్నేహము.

వాదడుచే. ద్వ. అ. క్రి. (వాదు+అడుచే) వాదాడు, వాదించు. "వ. ఇట్లిద్దఱుఁబరస్పరజయార్థులగుచు వాదడిచియడిచితమతారతమ్యంబామ్నాయంబు లనడిగిరి." కాశీ. ౫, ఆ.

వాదనము. సం. వి. అ. న. వీణాదిచతుర్విధవాద్యధ్వని

వాదము. సం. వి. అ. పుం. 1. వాగ్వివాదము; 2. రస వాదము; 3. తగవు.

వాదర. వై. వి. (వాఁడి+దార.) (ఖడ్గాది) తీక్ష్ణధార.

వాదాడు. ద్వ. అ. క్రి. (వాదు+అడు.) వాదించు.

వాది. సం. వి. న్. పుం. తగవునకు పోయినవాఁడు. విణ. వాదించువాఁడు.

వాదించే. సం. అ. క్రి. 1. వాదాడు; 2. తగవాడు.

వాదిత్రము. సం. వి. అ. న. 1. తతము ఆనద్ధము సుషిర ము ఘనము అనెడు వాద్యచతుష్టయము, ఆతో ద్యము; 2. వాద్యధ్వని.

వాదు. వై. వి. వాదము. (చూ. మూదల.)

వాదులాఁడు. ద్వ. విణ. (వాగులు+ఆఁడు.) వాదాడు వాఁడు. (చూ. వాట్లీఁడు.)

వాదోడు. ద్వ. విణ. (వా+తోడు.) 1. మాటకుసహా యము; "శా. సింగారంబగుముద్దుఁజిల్కతనకుఁ జేదోడువాదోడుగన్." విజ. ౨, ఆ. — 2. పసులకు నాలికచేఱులులోను గాఁగల తెవు ళ్లను పరిశీలింప నోటఁజొప్పించి నోరు తెఱపించు టకై యేర్పఱచిన దార్వాయసరూపయంత్రవిశే షము. (చూ. ముకుబంతి.)

వాద్యము. సం. వి. అ. న. వీణలోనగునది.

వాన. దే. వి. 1. వర్షము; 2. వర్షాకాలము. "సీ. వాన యునీతునువర్షించిమండు వేసవిగాకమున్న సస్య ములపంట, లాదవెదురతిఱిసెత్తునదిశత్రుపయి." భార. శాం. ౨, ఆ.

వానకాల్లు. దే. వి. బ. వర్షధారలు. "సీ. ఘనమేఘమున వానకాల్లు వ్రేలినమాడ్కి ముక్తకేశంబులుముసుఁ గుపడఁగ." భో. ౪, ఆ.

వానకోయిల. ద్వ. వి. 1. చాతకపక్షి; 2. సర్పవిశేషము.

వానజాలిపులుఁగు. దే. వి. హంస. "చ. అనవల వానజాలి పులుఁగాపనజాతినిఁజేరివేఁడినన్." హంస. ౪, ఆ.

వానతఱి. దే. వి. వర్షాకాలము, వర్షఋతువు.

వానపిచ్చెలి. దే. వి. వానకోయిల, వర్షప్రియము.

వానపాము. దే. వి. ఎఱ్ఱ, మహీలత.

వానపేస. దే. వి.—— వై.——

వానప్రస్థము. సం. వి. అ. పుం. 1. ఒక ఆశ్రమము; (చూ. ఆశ్రమము.) 2. ఇప్పచెట్టు; ౩. మోదుగు చెట్టు.

వానము. సం. వి. అ. న. 1. కుట్టుపని; 2. పోఁప, 3. గతి, 4. వాసన; 5. సారంగము. విణ. 1. ఎండి నది; (కాయలోనగునది.) 2. అడవిది.

వానరము. సం. వి. అ. పుం. కోఁతి, మర్కటము, కపి.

వానరాయి. దే. వి. వడగల్లు, వర్షోపలము.

వానస్పత్యము. సం. వి. అ. పుం. పూఁచికాచెడుచెట్టు. (పూవక కాచెడుచెట్టు వనస్పతి.)

వానాయుజము. సం. వి. అ. పుం. వనాయుదేశము నందుఁబుట్టినగుఱ్ఱము. (చూ. వనాయుజము.)

వాని. దే. వి. విణ. వాఁడియొక్క రూపాంతరము. (సైశిత్యమునకు.—"క. అనినవినివానిమదిఁదోఁ ప." జై. ౪, ఆ.)

వానీఁడు ద్వ. వి (వాని+ఈఁడు.) 1. వానెకులము వాఁడు, 2. కుబేరుఁడు. ఆం, సం.

వానీరము. సం వి. అ పుం ప్రబ్బ, వేతసము చెట్టు.

వాను. దే. స. క్రి. (కుండలు) చేయు. "అజాండ భాండముల్ వానను." ఆము. ౧, ఆ.

వానె. వై. వి. వైశ్యకుల విశేషము. "క. ఆనందవన మునందొక, వానెవణిజానింటనుండివైశ్యుండుప దా, ర్థానయనార్థము పోయినఁ, దానొక్కఁడు పట్టమునకుఁదదవసరమునన్" కాశీ. ౫, ఆ.

వానెత. వై. వి. వానెకులము నాఁడుది.

వానేయము. సం. వి అ. న. కైవడిముస్తె, పరిపేలవము చెట్టు.

వాపము. సం. వి. అ. పుం. 1. గొఱుగుట; 2 విత్తు ట; 3. నేయుట.

వాపసుచేయు. హిం. క్రి. మార్చు, మఱియొకటి యిచ్చుట.

వాపి. సం. వి. ఈ. స్త్రీ. నడబావి, దీర్ఘిక.

వాపితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. గొఱుగఁబడి నది; 2. విత్తఁబడినది.

వాపు. వై. వి. వాయింపుయొక్క రూపాంతరము. ఆం. భా. ప్ర

వాపుచ్చే. ద్వ. స. క్రి. 1. నోరు తెఱచు; "క. చూపు లక్ష్మీపతిరూపము, నాపోవకత్రావిత్రావిహర్షో ద్ధతయై, వాపుచ్చిమందమధురా, లాపంబులఁబో గడెనదితిలక్ష్మీనాథున్." భాగ. ౫, స్కం.— 2. చెప్పు. "వాపుచ్చేనిసెప్పగన్." (వాపుచ్చని =చెప్పని—అనఁగా,చెప్పఁగూడనియనియర్థము.) కవిక. ౩, ఆ.

వాపోక. ద్వ. వి. 1. అఱచుట; 2. ఏడ్చుట.

వాపోవు. ద్వ. అ. క్రి. 1. అఱచు; "సీ. అదితిపుత్రుఁడు దయింపనభిముఖుండై నక్క వాపోయె మంటలు వాతఁగలుగ." భాగ. ౧, స్కం. — 2. ఏడ్చు. "క. అనియనుగుచుండ బాలిక, కనునులుముచుఁ బెదవివిడిచి కటకట వాపో, యెను మొగ్గవాలు చందం, బునఁబడు మెగనెత్తికొనుచుఁ బొత్తులమీఁదఁ." (చూ. వెనుకటిభాగము.) కళా. ౬, ఆ.

వాప్యము. సం. వి. అ. న. చెంగల్వకోష్టు?.

వామ. సం. వి. ఆ. స్త్రీ. ఉత్తమస్త్రీ. అ. న. ము ధనము. పుం. ఆవుపాదుఁగు. డు. 1. శివుఁడు; 2. మన్మథుఁడు. విశే. 1. సవ్యము; 2 సుందరము; 3. వక్రము; 4. హ్రస్వము; 5. ప్రతికూలము.

వామదేవుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

వామనగాయ. దే. వి. (వామనము+కాయ.) ఊరఁగాయకు ఉపయుక్తమైన ఒకదినుసుకాయ.

వామనగొమ్ము. దే. వి. (వామనము+కొమ్ము.) ఊరవేసిన వామనగాయఖండము.

వామనపాతుకాఁడు. దే. వి. పక్షివిశేషము. ఆం, భా. ద్వి.

వామనము. సం. వి. అ. పుం. 1. దక్షిణపుదిక్కునందలి యేనుఁగు; 2. మానమునకు రెండరత్నులకంటె మీఱఁగొఱవడినయేనుఁగు; (ఇది నింద్యము.) 3. ఊడుగు?.

వామనములు. దే. వి. బ. వామనగాయలు. "ర. వామనములు నవామలకములు వామగతిడిగవామయులకకు." చంద్ర.

వామనుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు విశే. పొట్టివాఁడు.

వామలూరువు. సం. వి. ఉ. పుం. పుట్ట. (రూ. వామలూరము.)

వామలోచన. సం. వి. ఆ. స్త్రీ. 1. చక్కనికన్నులుగల ఆఁడుది; 2. ఆఁడుది.

వామి. ఉభ. దే. వి. ప్రోగు, రాశి. "ఎ, గీ. వంటకట్టెలకని తెచ్చివామిలిడిన, యగలుమ్రాఁకులపై." య. ౧, ఆ.—సం. ఈ. స్త్రీ. 1. ఆఁడుగుఱ్ఱము; 2. ఆఁడుగాడిద; 3. ఆఁడులొట్టియ; 4. ఆఁడునక్క.

వాము. దే. స. క్రి. (చూ.) కోరు.

వాయ. వై. వి. 1. దంచుటకై ఱోటిలోనొకతూరిపోసెడు ధాన్యము; 2. కొండసందిచ్చిననేల.

వాయదండము. సం. వి. అ. పుం. సాలెవాఁడు నేతసరితట్టెడుపలక.

వాయనము. సం. వి. అ. న. వ్రతోద్యాపనకాలమునందు ఉపాయనముగానిచ్చెడు మోదకము.

వాయము. దే. విశే. వ్యర్థము. "వాయపురజ్జులేల." మార్క. ౪, ఆ. (చూ. రజ్జులాఁడు.)

వాయవ్యము. సం. విశే. (అ.ఆ.అ.) వాయుసంబంధమైనది. (దిక్కులోనగునది.)

వాయసము. సం. వి. అ. పుం. 1. కాకి; 2. అగలుమ్రాను; 3. సరళద్రవమను ధూపద్రవ్యము.

వాయసారాతి. సం. వి. ఇ. పుం. గుడ్లగూబ.

వాయసి. సం. వి. ఈ. స్త్రీ. 1. కాఁచి?; 2. బమ్మమేడి?.

వాయసోలి. సం. వి. ఈ. స్త్రీ. కారుకొల్లి, కాకోలి?.

వాయి. వై. వి. 1. నోరు; "ఉ. వానిముక్కునన్, వాతను గర్ణరంధ్రముల వారక శోణితధార లొల్కఁగా." భార. సభా. ౧, ఆ.—2. ముఖము*; "మిడుతలుఁచిచ్చువాతఁబడి." రా. యు. కాం.— 3. ఖడ్గధార*; 4. వాయువు. (కోరవాయి, మండవాయి, వాయివిళంగము.)

వాయించే. వై. స. క్రి. (వీణాదివాద్యములను) వాదనముచేయు. "సీ. నేలయునింగియుఁదాళములుగా వించియేపునరేఁగి వాయించియాడ." భార. విరా. ౨, ఆ.

వాయింట. దే. వి. ఒకదినుసుకూరాకు, బర్బర. (దీని భేదము కుక్కవాయింట.) ఆ, పా. ద్వి.

వాయింపు. వై. వి. వీణాదివాదనము, వాయించుట. (చూ. ఆరగింపు.)

వాయిదము. వై. వి. వాద్యము. "ఉ, పొల్తుకలు పేరఁటముల్ దగఁజెప్పవీటిలో, నల్లెడఁద్రిమ్మరందొడఁగిరింపుగవాయిదముల్ సెలంగఁగన్." య. ౪, ఆ.

వాయిదా. హిం. వి. గడువు.

వాయిదార. వై. వి. వంకలుగలకత్తి*. ఆం, భా. ద్వి.

వాయివిళంగము. వై. వి. విడంగము, క్రిమిఘ్నము?.

వాయువు. సం. వి. అ. పుం. గాలి. (దీని భేదములు.— గోగంధనము, వాసంతము, చారము, కించులుకము, ఇరింగణము, ఝుంఝు, మోషకము, వాత్య. (ఆయాయర్థము నాయాయిపదముకడఁజూచునది.) పంచవాయువులు.—ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము. పంచోపవాయువులు.—నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయము.)

వాయువేగి. సం. వి. న్. పుం. వాయువుయొక్క వేగమువంటివేగము గలిగినదగుటచేత కుక్కకియ్యఁబడినపేరు. (చూ. గబ్బి.)
వాయుసఖుఁడు. సం.వి.అ. పుం. అగ్ని, గాలిసెచ్చెలి.
వాయోడు. ద్వి. అ. క్రి. (వా+ఓడు.) మాటపిఱికియగు. "క. మాయయ్య పెద్దకొలువున, వాయోడక యిట్లనంగవలయుంజుమ్మీ." భార. ఉద్యో. ౧, ఆ.
వార. దే. వి. 1. ఎనిమిదిపుంజెములనూలు; 2. (లెక్కలయందలి) ఎచ్చుతక్కువలు.
వారంటు. అం. వి. (ఒకని పట్టుకొనుటకు) అధికారపత్రిక.
వారఁబట్టు. ద్వి. స. క్రి. (వా+రాన్+పట్టు.) ఆపోశించు. "ఉ. అగస్త్యమూర్తియై, యీవృషకేతనుం డరిమహీశబలాంబుధివారఁబట్టెడున్." జై. ౧, ఆ. "సీ. రథచక్రనేమినిర్గతభూరజోరాజివార్ధులొక్కమ్మడివారఁబట్ట." (ఇక్కడ వారఁబట్టననఁగా ఇంకింపఁగాననియర్థము.) జై. ౫, ఆ.
వారకము. ఉభ. దే. వి. లేనికాలమునందు వృద్ధ్యాదులు లేక యుపయోగార్థమొకరికిచ్చికలిగినకాలమునందు మరలఁబుచ్చుకొనెడు ధనాదికము. "క. వారణ ఘోటకభాండా, గారంబులుమొదలుగాఁగఁగలధనములతో, నూరినుతయందఱము నీ, వారకములుగాఁగమమ్ము వగవుముబుద్ధిన్." భార. అది. 3, ఆ. "సీ. పలుకులచెలువంబుకలికికీరములకు వారకమిచ్చితేవనజగంధి." విక్ర. ౭, ఆ.—సం. అ. పుం. గుఱ్ఱమునడ. విణ. వారించునది.
వారడ. దే. వి. తాటాకువారినచిప్ప.
వారడి. దే. వి. నష్టి, లోపము. (ఆవారడియింపుఁ గలసివచ్చెను.)
వారణు. వై. స. క్రి. చాలించు. (అప్ర.)
వారణ. సం. వి. ఆ. స్త్రీ. చెలియలికట్ట. అ. న. ము. వారించుట. పుం. ఏనుఁగు.
వారణబుస. సం. వి. ఆ. స్త్రీ. అరఁటి. (రూ. వారణవృష.)
వారధి. దే. వి. వంతెన.
వారము. ఉభ. దే. వి. వారువముయొక్క రూపాంతరము. "క. తేరులుచెయిగలమెకములు, వారము కాలరులుఁదన్ను వావిరిఁగొలువన్, బేరులుబూరలుఁగాలలు, బోరుకలఁగనపుడెరలిపోరికిఁజనియెన్." అచ్చ. యు, కాం.—సం. అ. న. మద్యపాత్రము. పుం. 1. [illegible]శ్యాదివాసరము; (ఇవి రేడు.—ఆదిత్యవారము, సోమవారము, మంగళవారము, బుధవారము, బృహస్పతివారము, శుక్రవారము, శనివారము.) 2. తడవ; 3. సమూహము, 4. వాకిలి; 5. క్షణము; 6. కుబ్జవృక్షము. డు. శివుఁడు.
వారముఖ్య. సం. వి. ఆ. స్త్రీ. యోగ్యతఁబట్టి జనులచేత సత్కరింపఁబడినవేశ్య.
వారయాత్రికుఁడు. సం. వి. అ. పుం. పెండ్లిచుట్టము. "తే. అరగించిరసాధారణానురక్తి, వారయాత్రికులును బెద్దవరుసవారు." సై. ౬, ఆ.
వారవాణము. సం. వి. అ. పుం, న. కవచము.
వారసు. హిం. వి. ఆస్తికర్త.
వారస్త్రీ. సం. వి. ఈ. స్త్రీ. వేశ్య. (ఇట్లు వారకాంత. వారాంగన. మొ.)
వారాన్నిధి. సం. వి. ఇ. పుం. సముద్రము. "ఉ. పున్నమవన్నె శంభుతలపూవు ముకుందునిచూపు దట్టపున్, వెన్నెలదుంపజక్కవలవేసరిచీఁకటిమూఁకవిప్పువా, రాన్నిధియుబ్బు తామరలరాయిడివేల్పులపంట మింటిపైఁ, దిన్ననిపూర్వచంద్రికలు దిక్కులకున్ వెదచల్లుచుండఁగన్." వి, పు. ౭, ఆ.
వారాశి. సం. వి. ఇ. పుం. సంద్రము, నీటికుప్ప. "వారాశిగర్వంబుమేరమీఱె." స్వా. 3, ఆ. (రూ. వారిరాశి.)
వారాహి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఒకమాతృక; (చూ. మాతృక.) 2. అడవియాఁడుపంది; 3. పాఁచితీఁగ; 4. నేలతాడు?.
వారి. సం. వి. ఇ. న. 1. నీళ్లు; 2. కురువేరు. స్త్రీ. సరస్వతి. ఈ. కుండ. ఇ. ఈ. 1. ఏనుఁగుఁబట్టెడుదోటు; 2. ఏనుఁగుఁబట్టెడుపల్లము, (చూ.) అవపాతము.
వారించు. సం. స. క్రి. అడ్డగించు, నివారించు.
వారిజము. సం. వి. అ. న. 1. తామర; 2. ఉప్పు. పుం. 1. శంఖము; 2. శంబూకము; 3. బాడిదము?.
వారిజేము. వై. వి. పారిభద్రము?. అం, భా. ద్వి. కొండబూరుగు?. (అని కొందఱు.)
వారిణ. దే. వి. చిన్నచేపలనుబట్టెడు సాధనవిశేషము.
వారిదము. ఉభ. వై. వి. పారిభద్రము?. "క. మదిఁగొఁఱకొఱనిగుడఁగన, ప్పుదిమొగములజోదు లేని పైనూర్మలుకుల్, చదలద్రువనేసిరిరివా, రిదముతెఱంగొందఁజేసి ప్రేళ్లిడినొంచెన్." అచ్చ. యు, కాం.—సం. అ. పుం. 1. మేఘము; 2. ముస్తె?.
వారిధి. సం. వి. ఇ. పుం. వారినిధి, సముద్రము.

వారిపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. (చూ.) నాచుకూ.

వారివాహము. సం. వి. అ. పుం. మబ్బు, నీరుతాల్పు.

వారు. యు. దే. స. క్రి. రెండుచేతులతో తాటాకు ఓరచివ్వు.—వై. అ. క్రి. 1. ఉడుగు*; "క. భూరి భుజుం డర్జునుఁడతి, శూరుఁడుదన యస్త్రవిద్యఁ జూపఁగ రంగ, ప్రారంభుండైనతనిక్, వారకవ ర్ణించుజనరవంబిదియధిపా." భార. ఆది. ౭, ఆ. "క. దారాపేక్షంగష్ట, ప్రారంభముఁబూనియిహ మునందుఁబరమునక్, వారనిసంక్లేశంబులఁ, గూరునరుఁడుదానిఁజేరగొనకొండ్రెబుధుల్." భార. శాం. ౭, ఆ. (దీనికి వ్యతిరేక క్త్వార్థమందును వ్యతిరేకార్థకవిశేషణమునందును మాత్రము ప్రయోగములు కానఁబడెడి.) 2 వడియు*. (గంజివారెను.)

వారుచు. యు. దే. అ. క్రి. స. క్రి. వై. ప్రే. వార్చునకు మొందటిరూపము.

వారుణి. సం. వి. ఈ. స్త్రీ. 1. పడమటిదిక్కు; 2. సారాయి; 3. శతభిషఙ్నక్షత్రము; 4. ఒక దినుసుగడికటి.

వారుపు. యు. దే. వై. వి. వార్పునకు మొదటిరూపము.

వారువపుజన్నము. ద్వి. వి. అశ్వమేధయాగము. "వారువంపుజన్నము." అచ్చ. బాల, కాం.

వారువము. దే. వి. గుఱ్ఱము, అశ్వము. "శ్రుతులునాలుగును వారువములయ్యె." భీ. ౪, ఆ.

వార్చు. యు. దే. అ. క్రి. ఆచమించు. "ఒడలుకడిగికొనివార్చి." స్వా. ౨, ఆ.—స. క్రి. ప్రతీక్షించు. "ప. భవదాగమనంబువార్చినియతవృత్తినున్నవాఁడ." భార. శాం. ౭, ఆ.—వై. ప్రే. వారఁజేయు. (వంటలక్క గంజివార్చెను.)

వార్డరు. ఆం. వి. చెరసాలలోనుండు బంట్రౌతు.

వార్త. సం. వి. ఆ. స్త్రీ. 1. వృత్తాంతము; 2. వర్తనము; 3. జీవనోపాయము; 4. అర్థానర్థవివేచనవిద్య; (చూ. విద్య.) 5. వార్తాకముకూ. అ. న. ము. 1. పొల్లు; 2. ఆరోగ్యము. విణ. 1. రోగము తీఱినది; 2. జీవనోపాయముగలది.

వార్తాకము. సం. వి. అ. పుం. వంగకూ.

వార్తాకి. సం. వి. ఈ. స్త్రీ. ములకకూ.

వార్తావహుఁడు. సం. వి. అ. పుం. 1. కావడిమోసెడువాఁడు; 2. వృత్తాంతమును తెలిసికొనిపోయి చెప్పువాఁడు.

వార్తికము. సం. వి. అ. న. ఉక్తానుక్తదురుక్తార్థములను వ్యక్తముచేసెడు గ్రంథము. పుం. పక్షివిశేషము.

వార్తికుఁడు. సం. వి. అ. పుం. సందేశహరుఁడు, దూత.

వార్ధకము. సం. వి. అ. న. 1. వృద్ధత్వము; 2. వృద్ధసమూహము.

వార్ధక్యము. సం. వి. అ. న. ముసలితనము, వృద్ధత్వము.

వార్ధి. సం. వి. ఇ. పుం. వారిధియొక్క రూపాంతరము.

వార్ధుషికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వడ్డికిచ్చి జీవనముచేయువాఁడు, కుసీదుఁడు.

వార్పు. యు. దే. వి. ఆచమనము. వై. గంజి.

వార్మణము. సం. వి. అ. న. వర్మములసమూహము. (వర్మము=కవచము.)

వార్వపుటగ్గి. ద్వి. వి. (వార్వము+అగ్గి.) బడబాగ్ని. "సీ. ఎఱుఁగఁడుతనలోన నేప్రొద్దుఁబాయకరేర్చువార్వపుటగ్గియొగ్గుమదిని." య. ౧, ఆ.

వార్వము. దే. వి. వారువముయొక్క రూపాంతరము. "ఎ, గీ. పఱులు నేనికతిండి వార్వమును దోలుత, గాఁగఁదాచెక్కె." కళా. 3, ఆ.

వార్షికము. సం. వి. అ. న. కలుత్రాంతకూ. విణ. 1. వానకాలమునఁ బుట్టినది; 2. సంవత్సరకాలపరిమితిగలది.

వాలంటువిల్లు. దే. వి. (వాలు+అంటువిల్లు.) జాళ్లపనివారి వాలుగట్టిన పెద్దవింటికోల.

వాలు. దే. వి. సన్నగాఁ గోసినతోలు.

వాలెన. దే. వి. (వాలు+ఎన.) 1. నాగతోఁ కాఁడిని చేర్చికట్టెడు వాలులోనగునది; "ఎ, గీ. గుఱ్ఱముల నాలుగమ్ములఁగూల నేసి, వాలెనయుఁజక్రరక్షకద్వయముఁద్రుంచి." ఉ, హరి. 3, ఆ.—2. ఏఁడికోలతోఁ కాఁడిని చేర్చికట్టెడువాలులోనగునది; (చూ. పగ్గము మొదటియర్థము.) 3. ముంగిసవ్రానితో గడను చేర్చికట్టెడు వాలులోనగునది.

వాలెనపీఁట. ద్వి. వి. ఏఁడికోలకును కాఁడికిని నడుమచేరికగానుండెడుకొయ్య.

వాలకము. ఉభ. దే. వి. 1. మోసము. "వానివాలకమొకవీరవానరలలామముగన్గొని." రామా. 2, ఆ.—2. వేషము, (చూ. అట్టాడు.)—సం. అ. పుం, న. 1. ఉంగరము; 2. నూడిగము.

వాలధి. సం. వి. ఇ. పుం. ఏనుఁగుగుఱ్ఱములోనగువాని తోఁక.

వాలపాశ్య. సం. వి. అ. స్త్రీ. జెడబిళ్ల, పాపిటబొట్టు.

వాలము. ఉభ. వై. వి. బెబ్బులి. "క. వాలమ్ములదంష్ట్రాకర, వాలమ్ముల నెత్తియేసివాలమ్ములవే, జాలమ్ములఁ దగిలినకిటి, జాలమ్ముల దూఁటెనింద్ర జాలమ్మనఁగన్." సా. ౧, ఆ.—సం. అ. పుం. 1. తోఁక; 2. తలవెండ్రుక; 3. కత్తి.

వాలయించు. దే. అం, ప్రే. నిర్బంధించు. "క. ఏవారికి నిన్ను వాలయింపఁగ నేలా." భో. ౫, ఆ. (వాలాయించుయొక్క రూపాంతరము.)

వాలఱుగుడు. ద్వ. వి. (వాలు+అఱుగుడు.) వాలిఁడి కోఁతి.

వాలహస్తము. సం. వి. అ. పుం. 1. వెండ్రుకలుగలతోఁక; 2. వెండ్రుకలసమూహము.

వాలాయము. దే. వి. నిర్బంధము. "చవిగానియిందుల కుహెూరాహెూరిగాఁబోరియేలా వాలాయము నేయఁగా." స్వా. 3, ఆ.—విణ. 1. అనివార్యము; "సీ. సుతులుపుట్టిరియేని సుతులకుమృత్యువు వాలాయమై వెంటవచ్చెనేని." భాగ. ౧౦, స్కం. పూ. "క. వాలాయమువలరాయని, వాలాయము పోఁకిధైర్యవప్రంబగలన్." (వాలాయము—వాలాయముగ.) భద్రా. ౨, ఆ.—2. నిరంతరము. "సీ. ఆవేలుపుఁ టేలికఁజుట్టిరా నేను చేతు, లవెడల్పు నేలవాలాయంబుగాఁ గసవూడ్చియర్మి భజించుచున్న జనుల, చేతఁబూజలు గొనుఁబూతనాభూతనారీహర్త." పాండు. ౫, ఆ.—క్రి. విణ. అవశ్యము. "క. మాయాపదఁబావుమువా, లాయము." రామా. 3, ఆ. "ద్వి. ఈదేవునినడుగు, వాలాయమిదివినవలచితివేని." విష్ణు. పూ. ౧, ఆ. (వాలాయము—వాలాయముగ.)

వాలాయించు. దే. అ. క్రి. నిర్బంధపడు. "క. వాలాయించినవనంబున, నేలమ్మతపంబు సేయ." వీర. ౨, ఆ.—అం, ప్రే. నిర్బంధపఱుచు. "ఐ. మీకునా చెప్పినట్లుగుఁగదాయని వాలాయించియడిగినప్పుడు." భో. ౭, ఆ.

వాలారు. ద్వ. విణ. (వాలు+ఆరు.) వాఁడియైనది. "వాలారుతైకరజంబులే నిగిరించె." పా. ౫, ఆ. ("వాలారుతూపు." చూ. శారి.)

వాలిఁడి. ద్వ. వి. (వాలు+ఇఁడి.) తోఁకలేనికోఁతి. విణ. తోఁకలేనిది.

వాలిక. ఉభ. దే. విణ. 1. దీర్ఘము; "క్రొవ్వాఁడివాలికచూపుల్." రామా. ౧, ఆ.—2. వాఁడియైనది. "క. వాలికకైదువులాడిన నే, లకొఁగి రొప్పిరభిమన్యులక్ష్మణులక్రియన్." (చూ. దీనిముందుభాగము కొండొక మూడవయర్థము కడ.) భార. స్త్రీ. ౨, ఆ. "వాలికయమ్ములు." భార. భీష్మ. ౧, ఆ.—సం. వి. ఆ. స్త్రీ. అంగిటిగుంట.

వాలు. యు. దే. అ. క్రి. 1. అతిశయించు; "వాలినస్పేర్ధి." హరి. ఉ. ౪, ఆ.—2. క్రిందికిదిగు; 3. ఒఱగు; 4. వంగు. (వ్రాలుయొక్క రూపాంతరము.) (చూ. వాలుచు.)—స. క్రి. అతిక్రమించు. "క. నీకును నాకున్, వాలియవిచేయవచ్చునె." (చూ. దీనిముందుభాగము మూఁడు అ. క్రి. మొదటియర్థము కడ.) భార. శాం. 3, ఆ.—వై. వి. 1. కత్తి; "క. వాలుపయినడచునట్ల, బ్బాలికవడవడవడంకి." భార. ఆది. ౨, ఆ.—2. దైర్ఘ్యము*; "సీ. లోలాక్షిచూపువాలుఁగల వాలుగమీలపజ్క్తిమధ్యమునఁగూర్పంగమఱచె." భాను. ౪, ఆ.—3. వాఁడిమి*. (చూ. వాలారు.)—విణ. 1. దీర్ఘము*; "సీ. వాలుగాఁగై వ్రాలువేలుపుపూబంతిచాలు మేలైనవాసనలు గట్టు." రామా. ౧, ఆ.—2. వాఁడి*; "తే. నూతునెక్కువాలమ్మునన్రుక్కనేసి." భార. భీష్మ. ౨, ఆ. (రూ. వాలురమ్ము. హరి. పూ. ౯, ఆ.) (ఇది గొడ్డురాలువంటిది.)—3. క్రూరము*. "ఎ. గీ. వాలుమృగములున్న వనమనితలఁపక." భార. ఆది. ౬, ఆ.

వాలుఁగంటి. దే. వి. (వాలు+కన్ను.) 1. దీర్ఘములయినకన్నులుగలయాఁడుది; 2. ఆఁడుది. (విశాలాక్షి.) "శా. వాలుంగంటికినింటియాతఁడుమనోవాఁఛాప్రదానక్రియా, హేలాలోలుఁడు." హరిశ్చ. 3, ఆ.

వాలుక. సం. వి. ఆ. స్త్రీ. ఇసుక. అ. న. ము. నూఁగుదోసకి.

వాలుకొంగ. ద్వ. వి. వక్కుకొంగ, బకము.

వాలుగ. దే. వి. 1. మత్స్యవిశేషము; "సీ. తెలివాలుగలడాలుగల సోగకనుదోయి సొంపుగుల్కెడునిద్రమంపుఁజూచి." శుక. ౧, ఆ. (చూ. వాలుదైర్ఘ్యవి మనునర్థము.)—2. మత్స్యము. "ఉ. వాలముతాఁకునన్ గిరులువజ్రనిపాతముసంస్మరింపఁజేన్, వాలుగలై." పా. 3, ఆ.

వాలుగకంటి. దే. వి. 1. వాలుగవంటికన్నులుగలయాఁడుది; 2. ఆఁడుది. (చూ. నులుము రెండవయర్థము.)

వాలుగటెంకి. దే. వి. మత్స్యవిశేషము.

వాలుగడాలు. దే. వి. మన్మథుఁడు, మీనకేతనుఁడు.

వాలుగడుపు. ద్వ. వి. (వాలు+కడుపు.) బొజ్జ.(రూ వాల్గడుపు.)

వాలుగపాము. దే. వి. మత్స్యవిశేషము.

వాలుచు. దే. ప్రే. వాలఁజేయు. (రూ. వాల్చు). వం చుటకు.—"అన్న దీసుతుఁడుశక్తివైవ మెయివాల్చి యదిపట్టివైచె." భార. భీష్మ. 3, ఆ.)

వాలుచేక్క. ద్వ. వి. ఈక్కుఁడు.

వాలుడు. దే. వి. వాతారి?. "ఎ, గీ. కోరివాలుడుతై లంబుఁగ్రోలువారు." పంచ. వేం. ౧, ఆ.

వాలుపు. దే. వి. వాల్చుట. "అరవాలుపుచూపులు." (రూ. వాల్పు.)

వాలుప్రొద్దు. ద్వ. వి. లేఁబ్రొద్దు, అపరాహ్ణము.

వాలుమగఁడు. ద్వ. విణ. శూరుఁడు. "క. తాలిమియు ధృతియుఁబ్రజ్ఞా, శీలతయుఁబరాత్మగుణవిశేషజ్ఞతయుం, గాలోచితకార్యముఁగల, వాలుమగండే లుజలధివలయితధరణిన్." పంచ. వేం. 3, ఆ.

వాలుమెకము. వై. వి. అడవిపంది. ఆం, భా. ద్వి, కాం.

వాలువ. దే. వి. వాలుగయొక్క రూపాంతరము. "చ. వడిఁబుటమెత్తిదాఁటు నిడువాలువచాలువయింత నంతఁబై, నిడు వెలిగుంచెలన్ దెలుప." పంచ. వేం. ౪, ఆ.

వాలూరు. దే. అ. క్రి. ఆలస్యమగు. "ద్వి. ఏలినపతి కార్యమెడయైనయెడను, వాలూరనటు సేయు వాఁడు మధ్యముఁడు." రా. యు, కాం.

వాలెము. దే. వి. విణ. క్రి. విణ. వాలాయముయొక్క రూపాంతరము.(నిరంతరమునకు.—"క. నీవారమ నుచునమ్మిక, తోవాలెముగొలుచువారిదోసఁగుల పాలం, బోవిడిచినిరాబారుల, గావించుచెనంటి వీవెకదపరికింపన్." అచ్చ. యు, కాం.—అవశ్య మునకు.—"చ. నేలతొల్పయి, ప్పనితలఁబూనిర క్కసునిపాలెమువాలెముసొచ్చిచేడియం, గనుఁ గొని." అచ్చ. కిష్కిం, కాం.)(ఈరూపమీతిమ్మన కవిత్వమునందుమాత్రమే కనఁబడుచున్నది.)

వాల్కము. సం. విణ. (అ. ఈ. అ.)నారది. (చీర.)

వాల్గంటి. ద్వ. వి. వాలుఁగంటియొక్క రూపాంతరము. "ఆవాల్గంటింజేకొంటిమి." భాగ. ౧, స్కం.

వాల్మీకి. సం. వి. ఇ. పుం. సంస్కృత రామాయణమును రచించిన మహర్షి.

వాల్లభ్యము. సం. వి. అ. న. ఆధిపత్యము, దొరతనము.

వావదూకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) యుక్తియుక్తముగా మాటలాడువాఁడు, వాగ్మి.

వావాదు. వై. వి.(చూ.)ఉపన్యాసము, వాఙ్ముఖము*.

వావి. దే. వి. బంధుత్వము. "వావిఁజెల్లెలుగానికూఁతురువంటిది." భాగ. ౧౦, స్కం. పూ.

వావింట. దే. వి. వాయింటయొక్క మాఱురూపము.

వావిక. దే. వి. కుత్తుకమొదటఁగలగుంట.

వావిరి. దే. వి. 1. క్రమము; "క. రూపకమష్టవి, ధావహమగులక్షణంబు లలలక్ష్యంబుల్, వావిరిసొం నర్థువీనికి." కా. ౫, ఆ. "ఈవావిరి." కా. 3, ఆ.—2. అనుగతి; "క. పోవఁగనయ్యగసాలెయు, వావిరిఁదోడరుగ." భో. ౫, ఆ.—3. ఉత్కర్షము. "వావిరిదక్కిన చామరంబులున్." రా. యు, కాం.—విణ. 1. అధికము; "ఒడవెవావిరియైజలతృష్ణనాకు." రా. యు, కాం.—2. అనుగతము; "చ. వలదనియెంతచెప్పినను వావిరివైకడు వేగపాటుమైఁ, బలుమఱుసెల్లెడందొడరఁబొఱెదు." భార. విరా. ౨, ఆ.—3. ఉత్కృష్టము. "వారిజసంభవుండొసఁగెవావిరియైనవరంబులు." నిర్వ. ౪, ఆ.

వావిలి. దే. వి. శేఫాలిక?. (ఇది ద్వివిధము; నల్లవావిలి, తెల్లవావిలి. ఇదియె నల్లవావిలి.)

వావురము. దే. వి. వారువమునకు మాఱురూపము. "సీ. సెలతొల్పు నేవడమ్ములకు నైవేల్పుబోనమ్ముఁ దెచ్చినవావురమ్మువాఁడు." రా, వి. ౧, ఆ. (దీనికి సరియైనప్రయోగము చిక్కినదికాదు.)

వావృత్తము. సం. విణ. (అ. ఆ. అ.) వరింపఁబడినది.

వాశకము. సం. వి. అ. పుం. అడ్డసరము?.

వాశి. సం. వి. ఈ. స్త్రీ. (చూ.) బాడిస.

వాశిత. సం. వి. అ. స్త్రీ. 1. ఆఁడేనుఁగు; 2. ఆఁడుది. అ. న. ము. మృగపక్షిధ్వని. విణ. వాసనకట్టఁబడినది.

వాస. దే. వి. ఇంటికిమీఁదపఱపెడువాసము. "నివేశనంబులో బంగరువాస." అని. ౧, ఆ.

వాసంతము. సం. వి. అ. పుం. 1. ఒంటె; 2. కోయిల; 3. తెమ్మెర. విణ. 1. ఉంచఁబడినది; 2. వసంతసంబంధమైనది.

వాసంతి. సం. వి. ఈ. స్త్రీ. 1. అడవిమొల్ల?; 2. పువ్వులగురివెంద?; 3. బట్టకడిమి?.

వాసకము. సం. వి. అ. పుం. 1. ఇల్లు; 2. అడ్డసరము?.

వాసకసజ్జిక. సం. వి. ఆ. స్త్రీ. ప్రియుఁడు పడకకు వచ్చెదునని తెలిసిపడకిల్లునింగారించితానునుసింగారించుకొనియుండెడునాయిక. (చూ. నాయిక.)

వాసగృహము. సం. వి. అ. న. పడకిల్లు, భోగగృహము.

వాసన. సం. వి. ఆ. స్త్రీ. 1. గంధము; 2. అనుభూతార్థస్మృతి; 3. ప్రత్యాశ. అ. న. ము. 1. వాసనకట్టుట; 2. వస్త్రము; 3. వీరాసనము. విశ. వసనసంబంధమైనది.

వాసనకొడుపు. మి. వి. పెద్దయూఁదుచత్తి. అము. ౪, ఆ.

వాసపోయు. దే. అ. క్రి. వాసాలుపఱుచు. "సీ. వాసపోసెడుచోట వాసనగలవాసమే పెవాసముసొక్కఁడింతెమహీప." రా, వి. 3, ఆ. (చూ. వాస.)

వాసము. ఉభ. దే. వి. ఇంటికిమీఁదపేఱపెడుపట్టె. (చూ. వాసపోయు.) — సం. వి. న. వస్త్రము. (చూ. చాలు మొదటియర్థము.) (మొదటిరూపము వాసన్ను.) అ. పుం. 1. ఇల్లు; 2. అడ్డసరము.

వాసయోగము. సం. వి. అ. పుం. గందపొడి, చూర్ణము.

వాసరము. సం. వి. అ. పుం, న. దినము, దివసము, ప్రొద్దు.

వాసవుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు, వేల్పుఱేఁడు.

వాసి. ఉభ. దే. వి. 1. తారతమ్యము; "క. ఆసేనకునీసేనకు, వాసియడిగెదీవు." భార. ఉద్యో. ౨, ఆ.—2. భేదము; "సీ. ఇందుఁదర్కకంటె భేదంబుపరికింపసొనరించెఁబడసెనిలిపె, ననునివిమొదలైనయట్టి భూతార్థంపుఁగ్రియలపట్టునసొనరించుఁబడయు, నిలుపుననునివియాదిగాఁగలభవిష్య, దర్థవచనంబులైన క్రియాపదంబు, లునుచుకొనుటయొవాసియొందునుదలంప." కళా. ౫, ఆ.—3. అధిక్యము; "వ. తేజంబువాసికినాసపడియొడియూయిరువురకుసఖ్యంబు సమకూరనేర్చునేయనుటయు." భార. ఉద్యో. ౧, ఆ.—4. లాభము; (వాఁడువడ్డికివాసికిచ్చిజీవనముచేయుచున్నాఁడు.)—5. ప్రసిద్ధి; "ఇందునందునువాసికెక్కెరి." భాగ. ౨, స్కం.—6. పరిమితి. (ఇందు ముప్పాతికవాసి గ్రంథమచ్చుపడినది.)—విశ. 1. ఉత్కృష్టము; (దానికంటె నిదివాసి.) 2. స్వస్థము; (ఇప్పుడు నాకు ఒళ్లువాసిగానున్నది.) 3. బాగు. "క. కాశీమహిమమువిూచే, వాసిగవినిసంశయములువాసితిమి." కూర్మపురాణము. ౪, ఆ.—సం. వి. ఈ. స్త్రీ. వాశియొక్కరూపాంతరము.

వాసించు. సం. అ. క్రి. వసించు. స. క్రి. వాసనకట్టు. (చూ. సెలవత్తి.)

వాసిత. సం. వి. ఆ. స్త్రీ. 1. ఆఁడేనుఁగు; 2. ఆఁడుది. అ. న. ము. మృగపక్షులధ్వని. విశ. 1. వాసనకట్టినది; 2. వాసెనకట్టినది.

వాసుకి. సం. వి. ఇ. పుం. ఒక సర్పరాజు.

వాసుదేవుఁడు. సం. వి. అ. పుం. వసుదేవునికొడుకు, కృష్ణుఁడు.

వాసువు. సం. వి. ఊ. స్త్రీ. నాట్యపరిభాషయందు బాలిక.

వాసె. వై. వి. వాసెగ్రోలు. "మ. ఎలమిందుమ్మెదమ్రోఁతవాసెరవలైయింపొందమత్తిల్లుకో, వెలసీకారులకూఁకపాటలమరన్ వేడ్కతో నాలిగా, డ్పులపేరంగలనట్టువుల్ గఱపఁగో పుల్ నూపురేదీవెపా, త్రలకయ్యామనిపూవుముత్తెపుసరుల్ దాల్పంగనిచ్చెంగడున్." య. ౪, ఆ. (మొదటిరూపము వాసియ.)

వాసెగ్రోలు. ద్వ. వి. (వాసె+గ్రోలు.) పిల్లంగ్రోవి. అము. ౪, ఆ.

వాసెన. వై. వి. అవిరిపోకయొసటికుండమూతిమూసికట్టినగుడ్డ*.

వాసెనకట్టు. ద్వ. వి. వాసెనగుడ్డకట్టువంటికట్టు. "ఉ. మాసినచీరగట్టుకొని మానముతోడనిరస్తభూషయై, వాసెనకట్టుకట్టినిడువాలికకస్తురిపట్టువెట్టిలో, గానిలి చీఁకటింటికడకంకటిపై జలదాంతచంద్రరే, ఖాసదృశాంగియైపొరలెగాఢమనోజవిపాదవేదనన్." పా. ౧, ఆ.

వాసెనకుడుము. ద్వ. వి. ఇడ్డెనయను పిండివంట.

వాస్తవము. సం. వి. అ. న. యథార్థము.

వాస్తవికము. సం. విశ. (అ. ఈ. అ.) యథార్థమైనది.

వాస్తవ్యము. సం. విశ. (అ. ఆ. అ.) వసింపఁదగినది.

వాస్తవ్యుఁడు. సం. వి. అ. పుం. గృహస్థుఁడు. "పండినపెరటికల్పకమువాస్తవ్యుండు." స్వా. ౧, ఆ.

వాస్తుకము. సం. వి. అ. న. ఒకదినుసుకూరాకు, చక్రవర్తము. (రూ. వాస్తూకము.)

వాస్తువు. సం. వి. ఉ. పుం, న. 1. ఇండ్లుమొదలైనవియేర్పఱుపఁదగినభూమి; 2. ఇల్లు.

వాస్తోష్పతి. సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు, వేల్పుఱేఁడు.

వాస్త్రము. సం. విశ. (అ. ఆ. అ.) 1. వస్త్రముచేతఁగప్పఁబడినది; (రథము.) 2. వస్త్రసంబంధమైనది.

వాహద్విషము. సం. వి. ష్. పుం. ఎనుపోతు.

వాహనము. సం. వి. అ. న. ఎక్కఁదగినయేనుఁగులోనగునది.

వాహము. సం. వి. అ. పుం. 1. గుఱ్ఱము; 2. ఎద్దు; 3. భుజము; 4. వాయువు; 5. ఇరుసు.

వాహసము. సం. వి. అ. పుం. 1. పెనుఁబాము; 2. తూముకాలువ; 3. నీరుచెంచేలికి.

వాహితము. సం. విణ. (అ. ఆ. అ.) వహింపఁబడినది.

వాహిత్థము. సం. వి. అ. న. ఏనుఁగుయొక్క వాత కుంభము క్రిందిచోటు.

వాహిని. ఉభ. వై. వి. వాఘోరణి. సం. వి. ఈ. స్త్రీ. 1. నది; 2. సేన; 3. సేనావిశేషము. (ఎనుబదియొక్క రథము అన్ని యేనుఁగులు ఇన్నూట నలువది మూడుగుఱ్ఱములు నన్నూటయేవురు కాల్వురును గలది.)

వాహినీపతి. సం. వి. ఇ. పుం. 1. సేనానాయకుఁడు; 2. సముద్రుఁడు.

వాహ్యము. సం. వి. అ. న. వాహనము. విణ. వహింపఁదగినది.

వాహ్యాళి. సం. వి. ఇ. స్త్రీ. స్వారి. (చూ. ప్రోయాలు.)

వాళి. దే. వి. 1. పసులుపోవుదారి; 2. వాడుక.

## వి.

వి. దే. అప. ది అనుదానికి బహువచనము. (చూ. ది.)

వింగడము. వై. విణ. 1. విస్తీర్ణము; "వింగడమైనయొక్క వనవీథిఁగనుంగొనె." ఆము. ౫, ఆ.—2. సుందరము; "సీ. వింగడంబైనట్టి ముంగిటనిడికొన్న బృందావనికిమ్రుగ్గు పెట్టుఁదాన." ఆము. ౪, ఆ. 3. విపరీతము*. "క. అంగజహరుని ప్రసాదము, నంగలుగుచువచ్చెనుతుఁడునాఁడాదిగమా, వంగడమునదియిప్పుడు, వింగడమైకూఁతురు ధ్వవించెకానాకుకా." విజ. ౨, ఆ.—4. వేఱు*. (చూ. వింగడించు.)

వింగడించు. వై. స. క్రి. వేఱుపఱచు, విభజించు. "అమరవరక్షమామరవరాంచితవృత్తులువింగడించి." హంస. ౨, ఆ.

వింజామర. మి. వి. (వెల్ల+చామర.) తెల్లనిచామరము. "ఎ, గీ. భార్యవింజామరిడనొప్ప పాండ్యుఁగనియె." ఆము. ౪, ఆ. (రూ. వింజామరము. "ఎ, గీ. రమణశ్రీదేవివింజామరంబువీవ." శేప. ౫, ఆ.) (సంధిని వర్ణవికారము.) (అఱవమున వెణ్ శామర మందురు.) (ఇది ముంగోపమువంటిది.)

వింజిలి. దే. వి. మత్స్యవిశేషము.

వింజేము. వై. వి. వింధ్యపర్వతము. కళా. ౫, ఆ.

వింట. దే. వి. వినుట, శ్రవణము. కళా. ౨, ఆ.

వింటాలము. దే. వి. మల్లబంధవిశేషము. హంస. ౧, ఆ.

వింటికోల. దే. వి. (విల్లు+కోల.) తాళ్లపనివానియొక్క ధనురాకారమైన సాధనవిశేషము.

వింటిపట్టు. దే. వి. (విల్లు+పట్టు.) (చూ.) అమ్మువేటునేల, ధన్వంతరము.

వింటిరాసి. ద్వ. వి. (విల్లు+రాసి.) ధనూరాశి.

వింటివాఁడు. దే. విణ. (విల్లు+వాఁడు.) విలుకాఁడు.

వింత. దే. వి. ఆశ్చర్యము. విణ. 1. అపూర్వము; (చూ. ఒయ్యమొదటియర్థము.) 2. అన్యము.

వింతరాలు. దే. విణ. (వింత+ఆలు.) అన్యురాలు. "సీ. ముంగొంగుఁబసిఁడియై మూల్గుపుణ్యంబులవిట్టివీఁగుదురెట్టివింతరాండ్రు." భాగ. ౬, స్క. (ఇది ముద్దరాలువంటిది.)

వింతవాఁడు. దే. విణ. అన్యుఁడు. "సీ. వింతవానిఁ గటాక్షవీక్షణంబునఁజూచు కిసలయోష్ఠివహించుగిల్లకన్ను." సం. "కటాక్షయతివాన్యంవైకేక రాక్షీతుసాభవేత్." కాశీ. ౨, ఆ.

విందు. దే. వి. 1. చుట్టములులోనగువారికిపెట్టెడుభోజనము; "చ. అప్పుడ, య్యఖిలనృపాలకోటికిమహర్షులకుకా దనపాకచాతురీ, సుఖమెఱిఁగింపగం ధవహనూనుఁడు విందని చెప్పె నేర్పునకా." జై. ౮, ఆ.—2. ఆతిథ్యము; ద్వి. కరమర్థిమాయింటికడవిందుగుడిచి, యరుగుము." రా. బాల, కాం. —3. చుట్టము; "విందులకెల్ల నేఁడిచటవిందు." పాంచా. ౪, ఆ.—4. అతిథి. "క. భూనుకేశ్వర ప్రీతిం, బొందితినినుఁగనితగియెడు, విందవయితి నాకు." భార. శాం. 3, ఆ.

విందుపురుగు. ద్వ. వి. ఒకదినును సాలెపురుగు.

విందువు. సం. విణ. (ఉ. ఊ. ఉ.) తెలియువాఁడు.

విన్ధ్య. సం. వి. ఆ. స్త్రీ. లవలికి. అ. పుం. ము. పర్వతవిశేషము. డు. బోయవాఁడు.

వింశతి. సం. స. ఇ. స్త్రీ. ఇరువది. విణ. ఇరువదిసంఖ్యగలది.

వింశము. సం. విణ. (అ. ఈ. అ.) ఇరువదవది.

వికంకతము. సం. వి. అ. పుం. ములువెలమి. పుల్లవెలఁగి. (అని కొందఱు.)

వికచము. సం. వి. అ. పుం. కేతుగ్రహము. విణ. 1. వికసించినది; 2. వెండ్రుకలులేనిది.

వికట. సం. వి. ఆ. స్త్రీ. వజ్రవారాహియనుదేవత. విణ. 1. మిక్కిలి వంకరైనది; 2. వికృతమైనది; 3. చక్కనైనది.

వికటకవి. సం. వి. ఇ. పుం. వికటముగా మాటలాడు వాఁడు, హాస్యకరుఁడు.

వికటించు. సం. అ. క్రి. వంకరయగు, ఎదురుతిరుగు. (వాఁడు నాతో వికటించియున్నాఁడు.)

వికత్థనము. సం. వి. అ. న. స్తోత్రము, పొగడిక.

వికర్తనుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

వికర్మికుఁడు. సం. వి. అ. పుం. అంగడిపాఱుపత్తె కాఁడు.

వికలము. సం. విణ. (అ. ఆ. అ.) విచ్ఛేదమునొందినది.

వికల్పము. సం. వి. అ. పుం. 1. భ్రాంతి; 2. మాఱుదల; 3. అవాంతరకల్పము; 4. ఒక యర్థాలంకారము. (చూ. అలంకారము.)

వికవిక. దే. వి. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము. (చూ. తిరుగలి రెండవయర్థము.)

వికస. సం. వి. ఆ. స్త్రీ. మంజిడికీ. అ. పుం. డు. చంద్రుఁడు.

వికసనము. సం. వి. అ. న. వికాసము, తెలివి.

వికసించు. సం. అ. క్రి. వికాసముపొందు, విరియు.

వికసితము. సం. విణ. (అ. ఆ. అ.) వికసించినది.

వికస్వరము. సం. విణ. (అ. ఆ. అ.) వికసించునది.

వికారము. సం. వి. అ. పుం. 1. మనసుయొక్క కాని రూపముయొక్క కాని మాఱుపాటు; 2. తెవులు. (షోడశవికారములు. — ఏకాదశేంద్రియములు పంచభూతములును.)

వికారి. సం. వి. న్. పుం. ఒకసంవత్సరము. (చూ. సంవత్సరము.) విణ. వికారముగలది.

వికావిక. దే. వి. 1. నవ్వుటయందగుధ్వన్యనుకరణము; "వికావికనవ్వు." ఇలా. 3, ఆ.—2. కేరుటయందగుధ్వన్యనుకరణము; "అటఁదోఁచె గగనం పుఁబస వికావికఁగేరునసదుఁగొను." చంద్రా. 3, ఆ.—విణ. బ. చెల్లాచెదరు.

వికాసము. సం. వి. అ. పుం. వికసనము, తెలివి.

వికాసి. సం. విణ. (న్. ఈ. న్.) వికాసముకలది.

వికిరము. సం. వి. అ. న. గజకుంభస్థలమధ్యము. పుం. 1. పక్షి; 2. ఖండము; 3. శ్రాద్ధకాలమునందు నిమంత్రితులు భుజించిన పిమ్మట విస్తరకు ముందఱ వేసెడు అన్నము; 4. నూయి.

వికీరణము. సం. వి. అ. న. వెదచల్లుట. పుం. జిల్లేడుకీ.

వికీర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వెదచల్లఁబడినది; 2. చెదరినది.

వికుర్వాణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సంతోషమునొందిన మనస్సుకలవాఁడు.

వికృతము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వికారమునొందినది; 2. తెవులునొందినది; 3. రోఁతయయినది.

వికృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. వికారము; 2. ఒకఛందస్సు. (చూ. ఛందస్సు.) పుం. ఒకసంవత్సరము. (చూ. సంవత్సరము.)

విక్కము. సం. వి. అ. పుం. ఇరువైయేండ్లవయస్సుగల యేనుఁగు.

విక్కవిరియు. దే. అ. క్రి. (విరియు + విరియు.) మిక్కిలి విరియు. "సమ్మోదంబునవిక్కవిరిసి." భాగ. ౧౦, స్కం. పూ.

విక్కు. దే. అ. క్రి. 1. విజృంభించు; "క. అక్కొమ్మ మెకపుజోదులు, విక్కుచునక్కొండయెక్కి విరితేనియలం, జొక్కటపుఁదియ్యపండుల, జక్కర తెలినీళ్లనలపు సడలించితగన్." అచ్చ. కిష్కిం, కాం. — 2. గర్వించు. "క. చిక్కంబోవీఁడునాదు చేతనటంచున్, విక్కుచుఁ దల్లికడకుఁజని." చంద్రరేఖావిలాసము. ౨, ఆ.

విక్రమ. సం. వి. అ. పుం. ఒకసంవత్సరము. (చూ. సంవత్సరము.) ము. 1. అధికబలము; 2. ఆక్రమణము; 3. శౌర్యము; 4. చరణము.

విక్రమించు. సం. అ. క్రి. 1. వీర్యముచూపు; 2. శౌర్యముచూపు.

విక్రముఁడు. సం. వి. అ. పుం. 1. విష్ణువు; 2. విక్రమార్కరాజు.

విక్రయము. సం. వి. అ. పుం. అమ్మకము, విపణము.

విక్రయి. సం. వి. న్. పుం. (చూ.) విక్రయికుఁడు.

విక్రయించు. సం. స. క్రి. విక్రయముచేయు, అమ్ము.

విక్రయికుఁడు. సం. వి. అ. పుం. అమ్మెడువాఁడు.

విక్రాంతి. సం. వి. ఇ. స్త్రీ. 1. విక్రమము; 2. అశ్వగతి.

విక్రాంతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) విక్రమించినవాఁడు.

విక్రియ. సం. వి. ఆ. స్త్రీ. (చూ.) వికారము.

విక్రీడితము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ఆడఁబడినది.

విక్రీతము. సం. విణ. (అ.ఆ.అ.) విక్రయింపఁబడ్డది.

విక్రేత. సం. వి. ఋ. పుం. విక్రయించువాఁడు.

విక్రేయము. సం. విణ. (అ. ఆ. అ.) విక్రయింపఁదగినది.

విక్లబుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) భయశోకాదులచేత చేతులుకాళ్లు విలవిలపోవువాఁడు.
విక్షావము. సం. వి. అ. పుం. 1. దగ్గు; 2. తుమ్ము.
విక్షిప్తము. సం. విశే. (అ. ఆ. అ.) 1. ఎగురవేయఁబడినది; 2. విసరివేయఁబడినది.
విక్షేపము. సం. వి. అ. పుం. 1. ఎగురవేయుట; 2. విసరివేయుట; 3. కదలిక.
విక్షేపించు. సం. స. క్రి. 1. ఎగురవేయు; 2. విసరివేయు.
విఖ్యాతము. సం. విశే. (అ.ఆ.అ.) విఖ్యాతిఁజెందినది.
విఖ్యాతి. సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలి ప్రసిద్ధి.
విఖ్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ముక్కుపోయినవాఁడు, ముక్కిఁడి. (రూ. విఖ్రుఁడు.)
విగడియ. వై. వి. గడియలో అఱువదవభాగము. "ఒక్కవిగడియలోనన్." రామా. ౮, ఆ.
విగతము. సం. విశే. (అ.ఆ.అ.) బొత్తిగాఁబోయినది; 2. వెలుఁగులేనిది.
విగమము. సం. వి. అ. పుం. 1. నాశము; 2. విభజనము.
విగళనము. సం. వి. అ. న. మిక్కిలి జాఱుట, విస్ఖలనము.
విగళితము. సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి జాఱినది.
విగాఢము. సం. విశే. (అ.ఆ.అ.) (చూ.) విగాహితము.
విగాహము. సం. వి. అ. పుం. మునుఁగుట. (రూ. విగాహనము.)
విగాహించు. సం. అ. క్రి. మునుఁగు, క్రుంకు.
విగాహితము. సం. విశే. (అ. ఆ. అ.) మునిఁగినది.
విగుణము. సం. విశే. (అ.ఆ.అ.) విభిన్న గుణముగలది.
విగుర్వించు. దే. స. క్రి. (విఱుచు+విఱుచు.) చక్కగావిఱుచు. "క. గర్వించిపలికితివినీ, గర్వముభుజవీర్యమును బ్రకాశంబుగనీ, పర్వతశిఖరంబెత్తివి, గుర్వింపుముచూతమనినగోత్రభిదుండున్." భార. ఆది. ౬, ఆ.
విగ్రహము. సం. వి. అ. పుం. 1. శరీరము; 2. విభాగము; 3. విస్తారము. పుం, న. 1. యుద్ధము; 2. షడ్గుణములలో నొకటి. (చూ. గుణము.)
విగ్రహించు. సం. అ. క్రి. కలహించు, పోరు.
విగ్రుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) (చూ.) విఖ్యుఁడు.
విఘటిక. సం. వి. ఆ. స్త్రీ. (చూ.) విగడియ.
విఘసము. సం. వి. అ. పుం. దేవతాతిథులభుక్తశేషము.
విఘాతము. సం. వి. అ. పుం, న. 1. అడ్డంకి; 2. పెద్దదెబ్బ; 3. చెఱుపు.
విఘాతించు. సం. స. క్రి. 1. చెఱుచు; 2. చంపు.

విఘ్నపడు. మి. అ. క్రి. (విఘ్నము+పడు.) అడ్డిపడు. (చూ. జాలి మూడవయర్థము.)
విఘ్నము. సం. వి. అ. పుం. అడ్డి, అంతరాయము.
విఘ్నరాజు. సం. వి. అ. పుం. 1. వినాయకుఁడు.
విచక్షణుఁడు. సం. వి. అ. పుం. చదువరి. విశే. నేర్పరి.
విచయనము. సం. వి. అ. న. వెదకుట, అన్వేషణము.
విచర్చిక. సం. వి. ఆ. స్త్రీ. గజ్జి, పామ.
విచారణ. సం. వి. ఆ. స్త్రీ. ప్రమాణములచేత విషయమును పరిశీలించుట, చర్చ.
విచారణీయము. సం. విశే. (అ. ఆ. అ.) విచారణచేయఁదగినది.
విచారపడు. మి. అ. క్రి. (విచారము+పడు.) సంతాపించు.
విచారము. సం. వి. అ. పుం. 1. ఆలోచనము; 2. సంతాపము.
విచారించు. సం. అ. క్రి. 1. ఆలోచించు; 2. సంతాపించు. "వ. సహజంబైనపరమపాతివ్రత్యంబున సకలధర్మంబులును సాధించికృతార్థవయ్యెదువిచారింపకుము." కాశీ. ౫, ఆ.
విచారితము. సం. విశే (అ. ఆ. అ.) విచారింపఁబడినది.
విచార్యము. సం. విశే. (అ.ఆ.అ.) విచారింపఁదగినది.
విచికిత్స. సం. వి. ఆ. స్త్రీ. సంశయము, సందియము.
విచికిలము. సం. వి. అ. పుం. 1. ఒకదినుసుమల్లె?; 2. మల్లె?; 3. దవనము?.
విచిత్రము. సం. వి. అ. న. ఆశ్చర్యము. పుం. చిత్రవర్ణము. విశే. 1. ఆశ్చర్యకరము; 2. చిత్రవర్ణముకలది.
విచల్లిక. సం. వి. ఆ. స్త్రీ. (చూ.) పావలి?.
విచేష్టించు. సం. అ. క్రి. మిక్కిలిచేష్టించు. భార. ఉద్యో. ౨, ఆ. (చూ. చేష్టించు.)
విచ్చేయు. మి. గ్రా. అ. క్రి. 1. వచ్చు; "ఉ. ఈయెడ కుంబ్రసన్నమతినిందఱుఁగైకొని దేవనీవు విచ్చేయుటఁ జేసిమానియమశీలత యుత్తమసిద్ధిఁబొందె." హరి. ఉ. ౫, ఆ.—2. పోవు. "క. చెచ్చెరఁ గరినగరికి నీ, విచ్చేసిన నిమిషమైన వేయేండ్లగు నీ, వెచ్చోటికివిచ్చేయక, మచ్చికతో నుండుమయ్య మానగరమునన్." భాగ. ౧, స్కం.— ["క. నిచ్చలులోపలి కాంతలు, మచ్చికఁదనతోడ నాడు మాటలునాకున్, ముచ్చటలుసెప్పమెల్లన, విచ్చలవిడిఁదొడలమీఁదవిచ్చేసినపా." (ఇక్కడ విచ్చేయుటయనఁగాకూర్చుండుట.) భాగ. ౧, స్కం.]

(విజయంచేయుటకు మాఱురూపము.) (చూ. విజ యము చేయు.)

విచ్చే. దే. వి. నాలుగువేళ్లకు చుట్టితీసిననూలిచుట్ట.

విచ్చేలవిడి. దే. వి. (విచ్చేలు+విడి.) స్వాతంత్ర్యము. "క. విచ్చేయుమదితిగర్భము, చెచ్చెర వెలువడుమ హాత్మ చిరకాలంబుగా, విచ్చలవిడిలేకమరులు, ముచ్చటపడియున్న వారు ముదమందింపగా." భాగ. ౮, స్కం.—విశ. స్వతంత్రము. "విచ్చల విడిచేతకర్జమె." భార. విరా. ౨, ఆ.—క్రి. విశ. యథేచ్ఛము. "సీ. చదలెల్లనద్రువవిచ్చలవిడిమె రయువాయిదములు బెడిదంబురొదలుగాఁగ." అచ్చ. బాల, కాం.

విచ్చేవిచ్చేలు. దే. అవ్య. యథాయథలు.

విచ్ఛాయ. వై. వి. రత్నదోషవిశేషము.

విచ్చు. దే. అ. క్రి. 1. విరియు; "వనితపల్వరుసవివ్వని మొల్లమొగడలు." చంద్ర.—2. చీలు. అం, ప్రే. విరియఁజేయు. (కనువిచ్చిచూచెను.) ప్రే. విడు చుయొక్కరూపాంతరము. "చనువిచ్చిమేడలగా." ఆము. ౨, ఆ.

విచ్చుకత్తి. ద్వ. వి. ఒఱదూసినకత్తి.

విచ్చుటాకు. దే. వి. (విచ్చు+ఆకు.) చెవ్వాకు.

విచ్చుమొగ్గ. ద్వ. వి. 1. విరియుమొగ్గ; 2. చెల్లాచెదరగు ట. "సీ. ఎలమిఁబొల్పగుయూధికలకుసంతలకూ టములకునుమఱివిచ్చుమొగ్గలాదవె." ఆము. ౪, ఆ. (ఇది రెండర్థములకునుదాహరణము.)—విశ. 1. చెల్లాచెదరైనది; "ప్రజజాతెలగ విచ్చుమొగ్గ వడిగా." పాంచా. ౨, ఆ.—2. చెల్లాచెదరుచే యునది. "ముచ్చుచేరువలకువిచ్చుమొగ్గ." కవి. 3, ఆ.

విచ్ఛాయము. సం. వి. అ. పుం. రత్నదోషవిశేషము. విశ. ఛాయపోయినది.

విచ్ఛిత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఎడఁబాటు; 2. వస్త్ర భూషణాద్యలంకారము కొలఁదిగానుండినను మి క్కిలి యొప్పిదమునుతోఁపఁజేసెడు స్త్రీలయొక్క శృంగారచేష్టావిశేషము; 3. పూఁత; 4. నఱుకుడు.

విచ్ఛిన్నము. సం. విశ. (అ. ఆ. అ.) 1. ఎడఁబడినది; 2. పూయఁబడినది; 3. నఱకఁబడినది; 4. వంకరై నది.

విచ్ఛేదము. సం. వి. అ. పుం. 1. ఎడఁబాటు; 2. నఱ కుడు.

విజనము. సం. విశ. (అ.ఆ.అ.) జనులులేనిది, ఏకాం తము.

విజయ. సం. వి. ఆ. స్త్రీ. 1. జయతిథి; 2. పార్వతి; 3. పార్వతియొక్క చెలికత్తె. అ. పుం. 1. ఒక సం వత్సరము. (చూ. సంవత్సరము.) 2. దినము యొక్క ఆరవభాగము. (చూ. దినము.)

విజయంచేయు. మి. అ. క్రి. (విజయము+చేయు.) 1. వచ్చు; "వ. దివ్యబోధమహనీయుండైనయమ్మ హాత్ముండు విజయంచేయుటయు." భార. ౨, ఆ.—2. పోవు. "క. మసలితిరివిచిత్రకథా, రస వృత్తిందడవెఱుంగరాకయనుష్ఠా, నసమయమ య్యెనభోమ, ధ్యసమీపంబునకుఁదరణియరదము వచ్చెగా, విజయంచేయుఁడు." నిర్వ. ౭, ఆ. (విజ యము చేయుయొక్క రూపాంతరము. చూ. విజ యము చేయు.)

విజయచ్ఛందము. సం. వి. అ. పుం. ఏనూఱుపేటలు గలహారము.

విజయదశమి. సం. వి. ఈ. స్త్రీ. ఆయుధములులోన గువానిఁబూజించెడు ఆశ్వయుజమాసము శుక్లప క్షమునందలి పదవతిథి.

విజయము. సం. వి. అ. పుం. 1. మిక్కిలిగెలుపు; 2. దినముయొక్క ఆఱవభాగము. (చూ. దినము.)

విజయముచేయు మి. అ. క్రి. 1. వచ్చు; "ఉగ్రసేనుని విజయముచేయుమనుఁడు." హరి. ఉ. ౫, ఆ.—2. పోవు. "వ. ఇవ్వార్షికదినంబులుగడపిశరత్సమ యంబునవిద్విషత్సంహారంబునకువిజయముచేయు మనుటయు." ఆము. ౪, ఆ. (ఇది పూజ్యులయొ క్క రాకపోకలయందే ప్రయోగింపఁబడెడి.)

విజయి. సం. విశ. (న్.ఈ.న్.) విజయముగలవాఁడు.

విజయుఁడు. సం. వి. అ. పుం. 1. అర్జునుఁడు; 2. విష్ణు ద్వారపాలకులలో నొకఁడు.

విజాతి. సం. వి. ఇ. స్త్రీ. 1. విభిన్నజాతి; 2. విశేష జాతి.

విజాతీయము. సం. విశ. (అ. ఆ. అ.) విజాతిసంబం ధమైనది.

విజిగీష. సం. వి. ఆ. స్త్రీ. మిక్కిలి జయింపనిచ్ఛ.

విజిగీషువు. సం. విశ. (ఉ.) మిక్కిలి జయింపనిచ్ఛ గలవాఁడు.

విజితుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) జయింపఁబడిన వాఁడు.

విజిలము. సం. విణ. (అ. ఆ. అ.) మీఁగడగట్టినది, (పెరుఁగులోనగునది) పిచ్ఛిలము.
విజృంభణము. సం. వి. అ. న. మిక్కిలి జృంభణము. (చూ. జృంభణము.)
విజృంభించు. సం. అ. క్రి. 1. చెలరేఁగు; 2. వికసించు.
విజృంభితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. వికసించినది; 2. ఆవులించినది.
విజ్ఞప్తి. సం. వి. ఇ. స్త్రీ. విజ్ఞాపనము, విన్నపము.
విజ్ఞాతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ప్రసిద్ధుఁడు.
విజ్ఞానము. సం. వి. అ. న. 1. శాస్త్రాదులయందలి జ్ఞానము; 2. విశేషజ్ఞానము; 3. కార్యము.
విజ్ఞాపనము. సం. వి. అ. న. విజ్ఞప్తి, (చూ.) విన్నపము.
విజ్ఞాపించు. సం. స. క్రి. విజ్ఞాపనముచేయు, విన్నవించు.
విజ్ఞుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) నిపుణుఁడు, నేర్పరి.
విజ్జు. దే. అ. క్రి. వ్యాపించు. "విరులపైనఖకాంతివిజ్జరాల్చి." ఉ, హరి. ౫, ఆ.—వి. తన్నుకొనుటయందగుధ్వన్యనుకరణము. "సీ. పల్యాణములక్రిందఁబడినరాహుత్తులుఁగూలి విజ్జునఁదన్నుకొనెడిహరులు." శై. ౫, ఆ. (ఆమ్రేడితమునందు విజ్జువిజ్జు. "విజ్జువిజ్జునఁదన్నంగ." స్వా. ౪, ఆ.)
విజ్జోడు. ద్వ. విణ. (వీడు+జోడు.) జోడుకానిది, సరికానిది. "సీ. శ్రుతులువిజ్జోడైనచోఁదంత్రి బిగిసిరాఁబీడించికిటకిటబిరడఁద్రిప్పు." వై. ౧, ఆ.
విజ్జోడుపడు. ద్వ. అ. క్రి. భేదపడు. "సీ. కల్పనాకేళిప్రకారమాత్రములైనయస్మదాఖ్యానక్రియాదికముల, తోడసెందునాకింతవిజ్జోడుపడక, సమమగుటయెట్లొయనువిచారముగలిగియు." కళా. ౫, ఆ.
విటంకము. సం. వి. అ. పుం, న. కొణిగయందలిగువ్వగూఁడు.
విటకత్తె. మి. గ్రా. వి. విటుకులాఁడి, విటి.
విటకాఁడు. మి. గ్రా. వి. విటుఁడు. (చూ. లోఁగలి.) (స్వార్థమున కాఁడు.)
విటతటము. దే. విణ. విటతాటముయొక్క రూపాంతరము. "క. పుటమెగసితాళవృక్షముఁ, జటులోద్ధతిఁబూనిపెఱికి సారథినవనిఁ, విటతటముగఁబడవైచెను, బటుభుజసత్వంబుమెఱయఁ బవనజుఁడల్కన్." మై. 3, ఆ.
విటతాటనము. దే. విణ. తాఱుమాఱు. "సీ. మండితధ్వజదండమండలంబులుగిట్టి విటతాటనంబుగవిఱిచివిఱిచి." భార. విరా. ౫, ఆ.
విటతాటము. దే. విణ.—పై.—"సీ. తరువులెల్లడవిటతాటంబులైకూలెగ్రహతారకావళి కాంతిమాసె." భాగ. 3, స్కం.
విటపము. సం. వి. అ. పుం, న. 1. చిగిరించినకొమ్మ; 2. కొమ్మ; 3. చిగురు; 4. బోదలేనిచెట్టు. డు. విటగాయఁడు.
విటపి. సం. వి. న్. పుం. 1. చెట్టు; 2. మఱ్ఱిచెట్టు.
విటరాయఁడు. వై. వి. విటశ్రేష్ఠుఁడు. "క. పటుతరమగుమద్వీణా, స్ఫుటమధురరవంబుచెవులసోఁకినమాత్రన్, విటరాయఁడైనఁగానీ, ఘుటదానుఁడుగాఁడె రెండుగడియలలోనన్." రుక్మాం. ౨, ఆ.
విటి. సం. వి. ఈ. స్త్రీ. విటకత్తె, విటుకులాఁడి.
విటుఁడు. సం. వి. అ. పుం. విటకాఁడు, పల్లవుఁడు.
విటుకులాఁడి ద్వ. వి. (విటుకులు+ఆఁడి.) విటురాలు.
విట్఩దిరము. సం. వి. అ. పుం. తుమ్మి. వెలితుమ్మి. (అని కొందఱు.)
విట్చరము. సం. వి. అ. పుం. (చూ.) ఊరఁబంది.
విట్సారిక. సం. వి. అ. స్త్రీ. పీతిగోరువంక.
విట్టు. సం. వి. ష్. స్త్రీ. విష్ఠ, మలము.
విడంగము. సం. వి. అ. పుం, న. 1. వాయువిళంగములు; 2. వంటయుప్పు. విణ. నేర్పరి.
విడంబన. సం. వి. ఆ. స్త్రీ. అ. న. ము. 1. అనుకరించుట; 2. మోసపుచ్చుట.
విడంబించు. సం. స. క్రి. 1. అనుకరించు; 2. మోసపుచ్చు.
విడఁద్రొక్కు. దే. స. క్రి. (విడన్+త్రొక్కు.) విడుచు.
విడనాడు. దే. స. క్రి. (విడన్+ఆడు.)—పై.—"ద్వి. అంతటనృపతిభార్యనువిడనాడి, చింతించుచునుగద్దెచేరికూర్చుండి." సా.
విడవలి. దే. వి. ఇండ్లకుకప్పెడు తృణవిశేషము.
విడి. దే. వి. 1. అరుణకాంతి; "చ. విడిగలకెంపుతారవల వింతపసుల్గలతాళి." శుక. ౧, ఆ.—2. ప్రతాపము; "క. వెడలికడలడలవారిధి, పడువునసెడపడకప్రాయువానరసేనం, బొడగనినడవఁగనబ్బులు, విడిఁగనుఁగొనిరఘువరుండు విస్మితుఁడగుచున్." రా. యు, కాం.—3. క్రోధము; "క. బాలకులారధరిత్రీ, పాలకుశిశుపియింతుననుచు బలువిడివివిలో, లాలకుఁడగుమునికుంజర, బాలకుఁడరిగెన్

త్రిలోకపాలకులజరకా.వ.ఇట్లు రోషించి.ిభా గ.ద,స్కం.—4.పరాక్రమము;"ఆ.ఉద్ధవిడినప సులమాఁచ ముట్టుగఁదెత్త."సం."అధవాగోసహ స్రాణి శుభానిచబహూనిచ, వివిధానిహరిష్యా మగ్ని ప్రతిపీద్యపురంబలాత్."భార. విరా. 3,ఆ. "ఒండొరుబల్విడ్ల."రా.యు,కాం."బలువిడిలో డవచ్చి." రా. కిష్కి౦. కాం. "వ ఇట్లుహార్దిక్యబ లువిడికోపాటించి."భార. ద్రో. ర, ఆ —5. ప్ర త్తికాయలోని జెడ. "తే నింగియనిరొదుప్రత్తి చేనికినిరత్త, బలియిడిరనంగనెఱ సంజతోలుతన మరఁ, దఱచుగాదానవిరిసిన మెఱుఁగుఁబ్రత్తి, వి ల్లునాఁజూక్కలెంతయునుల్లసిల్లె."కళా.ర,ఆ.— విశ. 1. అరుణము; "చిగురులవిడిసంజనిగుడుచో ట." (విడిసంజ=ఎఱసంజె.) స్వా 3, ఆ.— 2.ప్రత్యేకమైనది,(విడాకు,విడిపూస ఒకయెద్దు విడిగామేయుచున్నది.) 3. విడువఁదగినది, (విడి కథ.) 4. పనినుండివిడిచినది. (విడికోడె, ఇప్పు డువీఁడు విడిగానున్నాఁడు.)—క్రి.విశ.ఒంటరి. "క. ఆసమయంబున భిక్షుని, వేసమునదశాననుం డువిడిచను దేరక,భూసుతపూజరొనర్చి ను,భా సనమిడిమధురఫలములర్పించితగన్."(విడి=విడి గ.) అధ్యా. అర, కాం.

విడిగోలు. దే. వి. (విడి+కోలు.) మాఱుపు. విశ. పని లేనిది

విడిచివాటుగుదియ. ద్వ. వి. భిండిపాలము, సాఁగు.

విడిదల. ద్వ. వి. (విడిది+తల ) విడియుచోటు, విడి సినచోటు. "వ. హిరణ్వతియను పుణ్యనదిపాంత విడిదలగానిరూపించి." భార. ఉద్యో.ర, ఆ.— "ధర్మసుతునివిడిదలకరిగెను."భార.ద్రో.౨,ఆ. (దండువిడియుచోటు స్కంధావారము, దండు వందొక్కొక్కఁడు విడిసినచోటు శిబిరము.)

విడిది. దే. వి. 1. విడియుట; 'ఆ. కృష్ణుకొంగుఁగేలఁ, గీలించి సేదుమా, యింటవిడిదిచేసి యేగుమెల్లి, య నిన." వి, పు. ౭, ఆ —2. విడిసినచోటు. (సేన నావిడిదికిపోయెదను.)

విడిపట్టు. దే. వి. (విడిది+పట్టు.) విడిదిచోటు. "తే. భానురావాసములువిడిపట్టులొసఁగి."రుక్మి.3,ఆ.

విడిముట్టు . దే.వి.1.వాసస్థానము;"ఎ,గీ.జన్నములతిం డివిడిముట్టు చలువగట్టు."య.౨,ఆ.—2.కాఁపు రము; "సీ. విప్రాలయమునందు విడిముట్టుగానుం డువానిమంటలలోన నైవలేదు."యక్షాం.౨,ఆ.—

3. విడిది. "వ. తుహినాచలేంద్రుండుతనకునియ మించినవిడిముట్టుప్రవేశించియుండె."వీర. 3,ఆ.

విడిముడి. దే. వి. ధనము. "క. కొడుకులుపుట్టనిమాని సి, తొడుకులుబల్మియునునిండ్లుఁదొడవులుమావు ల్, పుడమియునెక్కుడుమేకములు, విడిముడి యుంజొట్టములును వితగాఁదలఁతుర్ " అచ్చ. బాల, కాం.

విడియము. వై వి. విడెము "కప్పురపుర్ విడియమ్ము. శృం. 3, ఆ. (రూపాంతరము విడియ. "ద్వి. ఎక్క డివిడియలిందెవ్వరువచ్చి రిక్కడికనితనయింతిని నడుగ." భాగ. ౧౧, స్కం.) (ముపర్ణకము లేనిరూ పము గ్రంథములయందు తఱచు వాడుకలోనిది కాదు.)

విడియు. దే. అ. క్రి ప్రయాణమైపోవువారు దారి
లో నొకచోటఁ 2. వీడు, "విడియంబలుకం
గ." భార విర ఆ.—3. జాఱు. "తే. అర్థి
నన్నంబుఁగుడు సందుఁగలిపి, విషము పెట్టిరి
పెట్టినవిడిసిః రముతోఁగూడ సగరుండు
ఘనుఁడుపుట్ట, కుళసూర్తితోఁజక్రవర్తియ
య్యె." భా స్కం.

విడిపడు ద్వ. అ విడి+పడు.) 1. వీడు, "విడి
పడ్డకైకతో .ర,ఆ —2. జాఱు, "సీ.ఆ
యొల్కవిడిః హీసురుచేతియర్ఘ్యజలంబు
లయందుఁబః చ. నా. 3, ఆ —3. తెగనుం
డి వేఱుపడు వు విడివడినది.) 4. నిర్బంధ
ముసుండితో వీఁడు విడివడి యథేచ్ఛము
గా తిరుగుచ ు.)

విడివాటుబడియ డిచివాటుగుదియ. "ఎ,గీ
భావభవుచేతిః బడియదుడ్డు."కవిక.ర,ఆ
విడివేఁట. దే. వి. ట. "తే అపుడువిడివేఁటవి
దుమనియాః రాజుముంగలికడకుఁజేరంగ
వచ్చి,లగుడు ుడేగలోనుగనుగల్గు, వేఁట
పులుఁగులవిః కికగని."య.౨,ఆ.(చూ.
విడి, వేఁట.)

విడిపోవు.దే.అ. క్రి. (విడి+పోవు.) వదలు,విడివడు.

విడు. దే. అ. క్రి వీడు. "విడఁబాఱుకొప్పు."కళా. 3, ఆ.—అం. ప్రే. విడుచు. "ధైర్యంబువిడఁదెట్టి తత్తఱములు." పాండు. ౨, ఆ.

విడుగడ. దే. వి. విడుపు, విడుదల, విమోచనము. "జనకానుమతంబున నాబలారికిఁ గా విడుగడఁజేసె." నిర్వ. ౭, ఆ.

విడుగర. దే. వి ——పై.——భార. శాం 3, ఆ.

విడుగు. దే. అ. క్రి. వికసించు. "విడిగెఁబయోజమ్ములు."

విడుచే. దే. ప్రే. విడఁజేయు, విమోచనముచేయు.

విడుత. దే. వి. తడవ. (నీవొకవిడుతవానితోఁజెప్పుము.)

విడుదల. దే. వి. విడుగడ, విడుగర, విమోచనము.

విడుపరి. దే. విశ. (విడుపు+అరి.) 1. పరిత్యాగశీలుఁడు; (చూ. విడుపు.) 2. త్యాగశీలుఁడు. "విడుపరితనపుబలీ." య. ౫, ఆ.

విడుపు. దే. వి. 1. విమోచనము, పరిత్యాగము; "ఆ. విడుపువలయుసకలవిషయవాంఛలయందు, విడుపుఁబోలుగుణము వెదకిరెయెందుఁ, గానరైరిబుధులు కలదెపరిత్యాగ, శీలునకునసాధ్య సిద్ధియెందు." భార. అర. ౫, ఆ. -2. త్యాగము, దానము. "ఎ, గీ. పుడమి, వేల్పులకుఁబైఁడియొసఁగెడు విడుపు నీట, నిండికొదవేమియును లేకయుండెఁగడలి." య. ౧, ఆ.

విడుమర. దే వి. విడుదల, విమోచనము. "క. మనమునఁగృపవుట్టెడున, ట్లనయముఁగీడైనయునికి కాతండెమ్మెఁ, గనియెనువిడుమర." సం. "కథంవా సవిముచ్యేతనరస్తస్మాన్మహాభయాత్." భార. స్త్రీ. ౧, ఆ.

విడువడు. ద్వ. అ. క్రి. (విడుపు+పడు.) విడివడు. (చూ. దుడుకఁడు.)

విడూరము. సం. వి. అ. పుం విదూరముయొక్క రూపాంతరము.

విడెము. వై. వి. తాంబూలము. (విడియము యొక్క రూపాంతరము.)

విడ్చు. దే. ప్రే. విడుచేయొక్క రూపాంతరము. "చాలవయ్యెదీటునకము విడ్వ" భార మహా. ౧, ఆ.

విడ్డూరము. వై. వి. మార్ఖ్యము*. విశ మూర్ఖము*

విడ్పు. దే. వి. విడుపుయొక్క రూపాంతరము. (విమోచనమునకు.—"ఉ దాస్యకృతినాజనయిత్రికిని వ్విధంబునఁ గా, రాకయుదైవకృత్యమమనంబునఁ బొంగుదువిడ్పుగల్గినఁ గా." భార. అను. ౧, ఆ.)

విడ్యము. వై. వి. విడియముయొక్క రూపాంతరము. "ఎ, గీ. తరుణధావనధగధగద్దళనమణుల, హత్తుకొల్పిరిలేఁతవిడ్యములడాలు." పాండు. 3, ఆ.

విడ్వరము. సం. వి. అ. న. ఉపద్రవము. వి, పు. ౨, ఆ.

విత. వై. విశ. వితాయొక్క రూపాంతరము. శశాం. 3, ఆ.

వితండ. సం. వి. ఆ. స్త్రీ. స్వపక్షపాతముగ వాదించెడువాదము. అ. పుం. ము. తిలువునకువేసెడు తాళము.

వితంతువు. సం. వి. ఉ. స్త్రీ. ముండమోపి, విధవ.

వితంసము. సం వి. అ. పుం. మృగములను పక్షులనుఁ బట్టెడు ఉరిత్రాడు.

విததము. సం విశ (అ. ఆ. అ.) విరివిచేయఁబడినది.

వితతి. సం. వి. ఇ. స్త్రీ. 1. విరివి; 2. సమూహము.

వితథము. సం. విశ. (అ ఆ. అ.) అసత్యమయినది. (మాట)

వితమరి. ద్వ. విశ. (వితము+అరి.) కార్యదక్షుఁడు.

వితము. వై. వి. విధము. "ద్వి. ప్రతిమీఱుసంకల్పభవకల్పలతిక, వితముననతులితవిభ్రమోన్నతియు." విష్ణు. ఉ. ర, ఆ.

వితరణము. సం. వి. అ. న. విడుపు, దానము, ఈవి.

వితరణి. సం. వి. ఇ. పుం. దాత, ఈవికాఁడు. "క. ఇచ్చిచనునర్థమెల్లను, విచ్చలవిడినప్రదాత వితరణిగాఁడే." విక్ర. ౨. ఆ.

వితర్కము. సం. వి. అ. పుం. 1. ఊహ; 2. సంశయము.

వితర్కించే. సం. అ. క్రి. 1 ఊహించు; 2. సంశయించు.

వితర్ది సం. వి. ఇ. స్త్రీ. అరుఁగు. (రూ. వితర్దిక. ఆ. స్త్రీ.)

వితస్తి సం. వి. ఇ. పుం, స్త్రీ. (చూ.) జేన.

వితా. వై. విశ. వ్యర్థము. "వితాతోలు వేల్పుమూఁక చేఁజనినకచుందలంపమదిచాలఁగరంగదె." య. 3, ఆ.

వితాకు. దే. వి. 1. నిశ్చేష్టత, 2. పారవశ్యము; "చ. గడెతడవాతఁడొక్కపనిగాఁ జనియింటికి రాకయుండినఁ గా, దడఁబడుమీఁదెఱుంగదువితాకున నుండునుజిన్నవోవు." శశాం. ౨, ఆ.—3. పరాకు; "సీ. ఈవితాకునమేఁతియిడనైతిఁ గాబ్రోదిగొరఎంకకనుచుఁదానరిగెనొకతె" య. ౫, ఆ.—విశ. 1. నిశ్చేష్టితుఁడు, నిశ్చేష్టితురాలు; "సొరుగునుసొమ్మసిల్లు మదిఁజొక్కువితాకవు." ఇలా. 3, ఆ.— 2. పరవశుఁడు. "క. కనుఁద్రామిచొక్కుఁజల్లిన, యనువునవందఱువితాకులైయుండంగఁ గా." విజ. ౧, ఆ.

వితాకుఁడు. దే. విశ. నిశ్చేష్టితుఁడు "వ. కదలింపలేక వితాకుండై." రామా. ౮, ఆ. "క. నలుఁదిక్కుల్

కనుఁగొనుచు వితాకుఁడనై, చనసేరకయుంటి." పంచ. వేం. 3, ఆ.

**వితాకుపడు.** ద్వ. అ. క్రి. నిశ్చేష్టితుఁడగు. "మార్గముదప్పికంపలఁ జిక్కిమదిఁ వితాకుపడి చింతమునుంగుచు." ద్వా. 3, ఆ.

**వితానము.** సం. వి. అ. న. వృత్తవిశేషము. పుం, న. 1. మేలుకట్టు; 2. యజ్ఞము; 3. విరివి. పుం. 1. సమూహము; 2. అవసరము. విణ. 1. మందము; 2. శూన్యము

**వితావిత.** వై. విణ. మిక్కిలి వ్యర్థము. "ఉ. ఏరొకటబ్బెరామునకుసెడ్డుపొసంగవు చంద్రమఃకళా, ధారికినొక్కయెద్దదివితావిత సీరములేమిఁగావునఁ, సీరికినొంటిపోఁగుకువిశేషములేశివుఁడాది భిక్షుకం, చేరులుసెడ్డుఁగల్గిసుసమృద్ధిగఁ బాదజాలుందురప్పరిఁ." శశాం. ౨, ఆ.

**వితీర్ణము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. దాఁటఁబడినది; 2. ఇయ్యఁబడినది.

**వితీర్ణి.** సం. వి. ఇ. స్త్రీ. ఈవి, వితరణము.

**వితున్నకము.** సం. వి. అ. న. 1. కొతిమిరి; 2. మయిలుతుత్తము. పుం. నేలయుసిరిక†.

**వితున్నము.** సం. వి. అ. న. 1. నీరుచెంచేలి†; 2. పాఁచి†.

**విత్తి.** దే. వి. మిక్కిలి చిన్నగోనె.

**విత్తనము.** దే. వి. విత్తు, బీజము.

**విత్తము.** సం. వి. అ. న. ధనము. విణ. 1. తెలియఁబడినది; 2. పొందఁబడినది; 3. ప్రసిద్ధిఁబొందినది; 4. విచారింపఁబడినది.

**విత్తు.** దే. స. క్రి. (విత్తనములు) చల్లు. వి. విత్తనము.

**విదగ్ధుఁడు.** సం. విణ. (అ.ఆ అ.) 1. నేర్పరి; 2. చొరవకాఁడు.

**విదరము** సం. వి. అ. న చీల్చుట, వ్రచ్చుట.

**విదర్భ.** సం. వి. ఆ. స్త్రీ. ఒకపట్టణము. అ. పుం. ము. ఒకదేశము.

**విదళనము.** సం. వి. అ. న. 1. మిక్కిలి ఖండించుట; 2. మిక్కిలి భేదించుట.

**విదళము.** సం. వి. అ. న. కందులు మొదలగు వానిపప్పు.

**విదళించు.** సం. స. క్రి. 1. మిక్కిలి ఖండించు; 2. మిక్కిలి భేదించు.

**విదళితము.** సం. విణ. (అ.ఆ.అ.) 1. మిక్కిలి ఖండింపఁబడినది; 2. మిక్కిలి భేదింపఁబడినది.

**విదారకము.** సం. వి. అ. పుం. 1. చెలమ; 2. పిల్లనూయి. విణ. చీల్చునది.

విదారణము. సం. వి. అ. న. 1. చీల్చుట; 2. చంపుట; 3. యుద్ధము. (ప్రవిదారణము అనియు.)

విదారి. సం. వి. ఈ. స్త్రీ. 1. తెల్లనేలగుమ్మడి†; 2. ముయ్యాకుపొన్న†; 3. వ్యాధివిశేషము.

విదారించు. సం. స. క్రి. చీల్చు, వ్రచ్చు.

విదారిగంధ. సం. వి ఆ. స్త్రీ. ముయ్యాకుపొన్న†.

విదిక్కు. సం. వి. శ్. స్త్రీ. రెండుదిక్కులనడుము, మూల.

విదితము. సం. విణ. (అ ఆ. అ.) 1. తెలియఁబడినది; 2. అంగీకరింపఁబడినది.

విదియ. వై. వి. (పక్షముందు) రెండవతిథి.

విదీర్ణము. సం. విణ. (అ. ఆ. అ.) చీల్పఁబడినది.

విదురు. దే. అ. క్రి. విదులునకు మొదటిరూపము. (చూ. విదురుచు.)

విదురుఁడు. సం. వి. అ. పుం. ధృతరాష్ట్రునితమ్ముఁడు. విణ. 1. తెలియునట్టివాఁడు; 2. తెలిసినవాఁడు.

విదురుచు. దే. ప్రే. విదురఁజేయు, విదిలించు. (రూ. విదుర్చు. "బిట్టుదూలినల్దిక్కులఁగూల గాత్రము విదిర్చె." రా. యు. కాం.)

విదురుపు. దే. వి. విదురుచుట. (రూ. విదుర్పు. "ఆక్కవిదుర్పు." ఆము. ౪, ఆ.)

విదులము. సం. వి. అ. పుం. 1. ప్రబ్బ†; 2. నీరుప్రబ్బ†. (రూ. విధులము.)

విదులు. దే. అ. క్రి. రాలు. (చూ. విదులుచు.)

విదులుచు. దే ప్రే. విదులఁజేయు. (రూ. విదుల్చు. "ద్వి. దోపతి ధూళి విదుల్చుచు లేచి." పారిశ్చ. ౨, భా.)

విదులుపు. దే. వి. విదులుచుట. (రూ. విదుల్పు. "వ. కేలుపట్టి తివంబోయి యాలజ్జావతిచేతివిదుల్పులంబడి." ప్రభా. ౫, ఆ.)

విదువు. సం. వి. ఉ. పుం. ఏనుఁగుకుంభస్థలమధ్యము.

విదుషి. సం వి. ఈ. స్త్రీ. విద్వాంసురాలు.

విదూరము. సం. వి. అ. పుం. వైడూర్యమణిపుట్టెడు దేశవిశేషము.

విదూషకుఁడు. సం. వి. అ. పుం. శృంగారనాయక సచివులలోనొకఁడు. (చూ. సచివుఁడు.) విణ. పరులను దూఱువాఁడు.

విదేశము. సం. వి. అ. పుం. అన్యదేశము.

విదేశీయుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) అన్యదేశస్థుఁడు.

విదేహము. సం. వి. అ. పుం. దేశవిశేషము. విణ. దేహములేనిది.

విద్దె. వై. వి. విద్య. చేదువు. "క. అద్దినమునందుఁ శుచిర్మై, ప్రొద్దున మేల్కాంచి బుధుఁడు భువనారాధ్యక్, విద్దెలతల్లిఁ బితామహు, ముద్దియఁ బూజింతు ననిస మున్నతభక్తిక్." శేష. ౫, అ. (మొదటిరూపము విద్దియ.)

విద్దెము. వై. వి. బాలక్రీడావిశేషము*. "సీ. వ్రేలు చేతికినిచ్చి విద్దెంబులాడంగ నిలిపినఁ గొంకుచు నిలువనేర్చె." వి. పు. ౭, అ. (మొదటిరూపము విద్దియము.)

విద్య. సం. వి. అ. స్త్రీ. 1. చేదువు; 2. జ్ఞానము. (చతుర్విద్యలు.—ఆన్వీక్షికి, (ఇందు విజ్ఞానము తెలుపఁబడును.) త్రయి, (ఇందు ధర్మాధర్మములు తెలుపఁబడును.) వార్త, (ఇందు అర్థానర్థములు తెలుపఁబడును.) దండనీతి. (ఇందు నయానయములు తెలుపఁబడును.)—షడ్విద్యలు.—ఆకర్షణము, స్తంభనము, మారణము, విద్వేషణము, ఉచ్చాటనము, మోహనము. — చతుర్దశవిద్యలు.—చతుర్వేదములు, షడంగములు, మీమాంస, న్యాయశాస్త్రము, పురాణములు, ధర్మశాస్త్రము.—అష్టాదశవిద్యలు.—చతుర్దశవిద్యలు, ఆయుర్వేదము, ధనుర్వేదము, నీతిశాస్త్రము, అర్థశాస్త్రము.)

విద్యమానము. సం. విశే. (అ. ఆ. అ.) వర్తమానము.

విద్యాధరుఁడు. సం. వి. అ. పుం. దేవయోనివిశేషము.

విద్యార్థి. సం. వి. న్. పుం. చదువుకోరువాఁడు, చదువువాఁడు.

విద్యావంతుఁడు. సం. విశే. (త్. ఈ. త్.) విద్యగలవాఁడు, చదువరి.

విద్యుత్తు. సం. వి. త్. స్త్రీ. 1. మెఱపు; 2. సంధ్య. విశే. మెఱుఁగులేనిది.

విద్యోతించే. సం. అ. క్రి. ప్రకాశించు, వెలుఁగు.

విద్రధి. సం. వి. ఇ. స్త్రీ. కడుపులోనిబల్ల.

విద్రవము. సం. వి. అ. పుం. 1. యుద్ధమువలనఁ బాఱిపోవుట; 2. బుద్ధి; 3. నింద; 4. కాఱుట.

విద్రావము. సం. వి. అ. పుం. యుద్ధమువలనఁ బాఱుట.

విద్రావితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) యుద్ధమువలనఁ బాఱిపోయినవాఁడు.

విద్రుచే. దే. ప్రే. విదురుచేయొక్క రూపాంతరము. "సీ. మొగివిప్పు పసిఁడిగేదఁగి తేకుగమిమించు పిశదచ్ఛదమ్ములవిద్రిచివిద్రిచి." పాండు. ౪, అ.

విద్రుతము. సం. విశే. (అ. ఆ. అ.) కరఁగఁబడినది.

విద్రుమము. సం. వి. అ. పుం. 1. పగడము; 2. పగడపుఁజెట్టు; 3. చిగురు.

విద్రుమలత. సం. వి. అ. స్త్రీ. గువ్వగుత్తికపి.

విద్వాంసుఁడు. సం. వి. స్. పుం. చేదువరి. విశే. ఎఱుకగలవాఁడు.

విద్విషుఁడు. సం. వి. అ. పుం. పగవాఁడు, శత్రువు.

విద్వేషణము. సం. వి. అ. న. 1. విరోధము; 2. షడ్విద్యలలో నొకటి. (చూ. విద్య.)

విద్వేషము. సం. వి. అ. పుం. పగ, విరోధము.

విద్వేషి. సం. విశే. (న్. ఈ. న్.) పగవాఁడు, విరోధి.

విద్వేషించే. సం. అ. క్రి. పగగొను, విరోధించు.

విధ. సం. వి. ఆ. స్త్రీ. సమృద్ధి. అ. స్త్రీ. అ. పుం. ము. 1. ప్రకారము; 2. విధి; 3. వేతనము; 4. గజకబళము. (విధాశబ్దము ప్రకారార్థమునందు పుంలింగముగాను నిఘంటువులయందు చెప్పఁబడియున్నది.)

విధవ. సం. వి. ఆ. స్త్రీ. పెనిమిటిలేనిది, ముండమోపి.

విధాతృఁడు. సం. వి. ఋ. పుం. 1. బ్రహ్మ; 2. మన్మథుఁడు. (రూ. విధాత.)

విధానము. సం. వి. అ. న. 1. చేయుట; 2. ఆజ్ఞ; 3. పూజ; 4. గజకబళము; 5. ఉపాయము; 6. ధనము.

విధాయకము. సం. వి. విధి, ఆజ్ఞ.

విధాయకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) విధించువాఁడు.

విధాయి. సం. విశే. (న్. ఈ. న్.)——పై.——

విధి. సం. వి. ఇ. పుం. 1. బ్రహ్మ; 2. చేయుట; 3. కాలము; 4. భాగ్యము; 5. అలంకారవిశేషము; 6. ఏర్పాటు. (ఇది త్రివిధము. — అపూర్వవిధి, నియమవిధి, పరిసంఖ్యావిధి.)

విధించే. సం. స. క్రి. కట్టడచేయు, ఏర్పాటుచేయు.

విధుంతుదుఁడు. సం. వి. అ. పుం. రాహుగ్రహము.

విధుతము. సం. విశే. (అ. ఆ. అ.) విడువఁబడినది; 2. కదలింపఁబడినది.

విధురము. సం. వి. అ. న. 1. ఎడఁబాటు; 2. వైకల్యము. విశే. 1. ఎడఁబాటునొందినది; 2. వైకల్యమునొందినది.

విధువనము. సం. వి. అ. న. కదలించుట, విధూననము.

విధువు. సం. వి. ఉ. పుం. 1. చంద్రుఁడు; 2. విష్ణువు; 3. కర్పూరము.

విధూతము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కదలింపఁబడినది; 2. విడువఁబడినది.

విధూతి. సం. వి. ఇ. స్త్రీ. కదలించుట, విధువనము.

విధూననము. సం. వి. అ. న.——పై.——

విధేయుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) వినయముగల వాఁడు.

విద్ధకర్ణి. సం. వి. ఈ. స్త్రీ. చిఱుబొద్ది.

విద్ధము. సం. విశే. (అ.ఆ.అ.) 1. తొలుపఁబడినది; 2. త్రోయఁబడినది; 3. బాధింపఁబడినది; 4. సమానమైనది.

విధ్వంసము. సం. వి. అ. పుం. మిక్కిలి ధ్వంసము.

వినత. సం. వి. అ. స్త్రీ. 1. గరుత్మంతునితల్లి; 2. వంపుపెట్టె. విశే. 1. వంకరైనది; 2. వంగినది; 3. గురుశిక్షితమైనది.

వినతి. సం. వి. ఇ. స్త్రీ. 1. వినయము; 2. నమస్కారము.

విననివాఁడు. దే. విశే. చెవుటివాఁడు, బధిరుఁడు.

వినమితము. సం. విశే. (అ.ఆ.అ.) మిక్కిలి వంగినది.

వినమ్రము. సం. వి. అ. న. తగరము. విశే. మిక్కిలి వంగినది.

వినయము. సం. వి. అ. పుం. 1. వినమ్రత; 2. గురుశిక్ష.

వినాయకుఁడు. సం. వి. అ. పుం. 1. విఘ్నేశ్వరుఁడు; 2. బుద్ధదేవుఁడు; 3. గరుత్మంతుఁడు; 4. గురువు.

వినాశము. సం. వి. అ. పుం. మిక్కిలి నాశము. (చూ. నాశము.)

వినినిందించు. సం. స. క్రి. మిక్కిలి నిందించు.

వినికి. దే. వి. వినుట, వినుకలి, ఆకర్ణనము.

వినికిడి. దే. వి. (వినికి + ఇడి.) వినికి. (స్వార్థమున ఇడి.)

వినిమయము. సం. వి. అ. పుం. 1. వస్తువులమాఱుపు; 2. కుదువ.

వినియుక్తము. సం. విశే. (అ. ఆ. అ.) వినియోగింపఁబడినది.

వినియోగము. సం. వి. అ. పుం. 1. ఉపయోగము; 2 నియమనము.

వినియోగించు. సం. స. క్రి. ఉపయోగపఱచు.

వినిర్గతము. సం. విశే. (అ. ఆ. అ.) బయలువెడలినది.

వినీతము. సం. వి. అ. పుం. చక్కగామోసెడిగుఱ్ఱము.

వినీతుఁడు. సం. వి. అ. పుం. వర్తకుఁడు. విశే. 1. జితేంద్రియుఁడు; 2. గురువుచేత శిక్షింపఁబడిన వాఁడు; 3. గురువుచేత శిక్షింపఁబడనివాఁడు; 4. వినయముగలవాఁడు.

విను. దే. స. క్రి. ఆకర్ణించు. వి. ఆకాశము. "విను పున్నపుష్టి సురిసెన్." మార్క. ౨, ఆ. (వాల్లు పరమగుచో దీనియుకారమునకు వికల్పముగా లోపంబగు. "విన్వీథి." భార. ఆది. ౨, ఆ.)

వినుకలి. దే. వి. వినికి, ఆకర్ణనము. "దీని విన్న యవ్వినుకలియొట్టులైన సొక వెంటసహించితి." హరి. ఉ. 3, ఆ.

వినుకలికంటి. దే. వి. (వినుకలి + కన్ను.) పాము, చక్షుశ్శ్రవము.

వినుకెంపు. దే. వి. సూర్యుఁడు, ద్యుమణి. "సీ. వినుకెంపునగఁజాలు సునుకెంపుతెగడాలు మొనయింపుకుండలంబులు వెలుఁగ." ఉ. రా. ౧, ఆ. (ఇట్లు వినుమానికము, వినురతనము.)

వినుచు. దే. అ. క్రి. వినవచ్చు. "మ. కడుంజిత్రంబుతోఁదవ్వులన్, వినిచెన్ మానవభాషణంబులుగడున్ విస్పష్టమైపీనులన్." భో. ౫, ఆ.—ప్రే. వినఁజేయు, వినిపించు. "సరస్వతివినిచెన్ మునులెల్లవినఁగ." భార. ఆది. ౮, ఆ.

వినుచూలి. దే. వి వాయువు, నభస్వంతుఁడు. (రూ. విన్నుచూలి. "అవ్విన్నుచూలికొమరుఁడు." అచ్చ. సుం, కాం.)

వినుద్రిమ్మరి. దే వి. (విను + త్రిమ్మరి.) ఖచరుఁడు. "సీ. వినుద్రిమ్మరులు కజివేల్పుహజ్జను బూజసలిపిన క్రొత్తచెంగలువలనఁగ" అచ్చ. అ, కాం.

వినుప్రోలు. ద్వ. వి. స్వర్గము.

వినుమ్రాను. దే. వి. కల్పవృక్షము. "సీ. వినుమ్రానిపరువంపు విరిదండ వెదనుంచికలయసెమ్మెయిఁగమ్మ కలపమలఁది." అచ్చ. సుం, కాం.

వినువలను. దే. వి. స్వర్గము. (రూ. విన్వలను. "విన్వలనిలోనమృతంబుసురక్షితస్థితిన్. ఉండుసన." భార. అను. ౧, ఆ.)

వినువాఁక. ద్వ. వి. గంగ, స్వర్నది. "సీ. కరికర్ణపుటమరుద్గతివీఁకవినువాఁక పువ్వుపుప్పొడిధూళిఁబోవఁద్రోవ." రామా. ౧, ఆ.

వినుసిగదేవర. ద్వ. వి. శివుఁడు, వ్యోమకేశుఁడు. "చ. వినుసిగదేవరన్ నలువ వేల్పులముప్పదిమూడుకోటులన్, బనిగొని." రామా. ౧, ఆ.

వినోదము. సం. వి. అ. పుం. 1. క్రీడాదులచేత ప్రొద్దుపుచ్చుట, వేడుక; 2. క్రీడ.

వినోదించు. సం. అ. క్రి. 1. క్రీడాదులచేత ప్రొద్దుపుచ్చు; 2. క్రీడించు.

విన్కలి. దే. వి. వినుకలియొక్కరూపాంతరము. "చ. వారినిద్దఱన్, బలసి మరుందు తుల్యరసపాకము తీపులుగ్రోల్చె విన్కలిన్." హరి. ఉ. ౨, ఆ.

విన్కి. దే. వి. వినికిడియొక్క రూపాంతరము.

విన్న. వై. విశ. వివర్ణమైనది.

విన్నఁబడు. వై. అ. క్రి. (విన్న+పడు.) వివర్ణమగు. "వినుమోయబ్జాస్య నీకింతమాత్రన విన్నంబడనేల." పా. ౪, ఆ.

విన్నఁబాటు. వై. వి. విన్నఁబడుట, వైవర్ణ్యము. "క. మురరిపుఁడు గినుక వారుణ, శరము ప్రయోగింపఁ దడవశాంతం బయ్యెన్, హరుబాణము బాణాసురు, పరివారంబునకు విన్నఁబాటు దలిర్పన్." హరి. ఉ. ౮, ఆ.

విన్నఁబోవు. ద్వ. అ. క్రి. (విన్న+పోవు.) వివర్ణమగు. "ఆమంత్రినందను వాక్యంబులు నిక్కమయ్యెనని విన్నంబోయి." సా. ౨, ఆ.

విన్నన. వై. వి 1. వైవర్ణ్యము; "క. కన్నీరొలుకఁగ వగచిన, నన్నరపతు లెల్ల నేడ్చి రార్తరవంబుల్, మిన్నందనశ్రుజలములు, విన్ననివదనములయందు వెల్లిగొనంగన్." భార. ద్రో. ౧, ఆ. (చూ. అలకన.)—2. న్యూనత*. "తే. తొమ్మనూఱునుదొంబది తొమ్మిదియును, జలజములఁబూజచేసెను శార్ఙ్గపాణి, వేయిటికి నొక్క పద్మంబు విన్ననైన, నహహ నియమంబునకు భంగ మయ్యెననుచు." భీ. ౬, ఆ.

విన్ననువు. వై. వి. 1. నేర్పు*; "క. అనినవిని నగుచుఁ గుంభజ, తనయుం డిట్లనియె నస్త్రదగ్ధుని బ్రతికించిన మేలకాదనీ వి, న్ననువు నెఱంగెదము గాక నరసఖుదీనన్." భార. సౌ. ౨, ఆ.—2. విధము*. "వ. జ్వలనజ్వాలాకలాపంబులు రూపంబులు గైకొన్న విన్ననువున." ఉ, హరి. ౬, ఆ.

విన్నపత్రిక. మి. గ్రా. వి. (విన్నపము+పత్రిక.) విజ్ఞాపనపత్రిక. "ఎ. సింధుకటకాధీశ్వరుండగు సింధురాజునకుఁ దత్త్రమంబంతయుఁ దేటతెల్లంబుగా విన్నపత్రిక వ్రాసి పుత్తెంచిన." భల్లా. ౪, ఆ.

విన్నపము. వై. వి. మనవి, విజ్ఞాపనము.

విన్నము. సం. విశ. (అ. ఆ. అ.) 1 పొందఁబడినది; 2. తెలియఁబడినది; 3. విచారింపఁబడినది.

విన్నవించు. వై. స. క్రి. మనవిచేయు, విజ్ఞాపించు.

విన్నాణము. వై. వి. 1. నేర్పు*; "ఉ. ప్రాణమువంటి నాకు నిజభావముఁ దాఁపఁగఁ జెల్లునమ్మనీ, ప్రాణవిభున్ బ్రభూతగుణబంధురుఁ దెల్పఁగదమ్మ యంచు వి, న్నాణము గాసఖీజనులు నల్లడలన్ గదియంగ." కా. ౫, ఆ.—2. మల్లబంధము* "సీ. చేలికిఁ బట్టినముసు సన్నపు విన్నాణములు దొరఁకొన్నను ముట్టికొనఁడు." భార. విరా. ౨, ఆ.—3. ఒప్పిదము*. "లోలశఫరీని బిరీసకటాక్ష కాంతి వి, న్నాణము చూప." వసు. ౨, ఆ. విశ. ఒప్పిదమైనది*. శకాం. ౧, ఆ.

విన్నాణి. వై. వి. (విన్నాణము+ఇ.) సన్న్యాసి. "ఆ. వేదవిదునిచేత విన్నాణిచేతను, దపసిచేతఁ బిన్నదానిచేత, రాయబారిచేత రాయసుంకరులచేఁ, గూలిపుచ్చుకొనుట చాలఁదప్పు." సం. నశ్రోత్రియే ప్రవ్రజితే నయజ్ఞే." విజ్ఞా. ప్రా, కాం.—విశ. నేర్పరి. "మ. బహువర్ణంబులు బ్రహ్మలోల్లిజగము త్పాదింప విన్నాణిగాక." భాగ. ౨, స్కం.

విన్ను. దే. వి. ఆకాశము. (చూ. కిలాతము.) (విను శబ్దమునకు మొదటిరూపము.)

విన్యసించు. సం. స. క్రి. ఉంచు. "వ. దక్షిణజానూరుమధ్యంబున వామపాదంబును వామజానూరుమధ్యంబున దక్షిణపాదతలంబును విన్యసించి." కాశీ. 3, ఆ.

విన్యస్తము. సం. విశ. (అ. ఆ. అ) ఉంచఁబడినది. (మొదటిరూపము న్యస్తము.)

విన్యాసము. సం. వి. అ. పుం. 1. ఉనుచుట; (మొదటిరూపము న్యాసము.) 2. రచన.

విపంచి. సం. వి. ఈ. స్త్రీ. 1 వీణ; 2. క్రీడ. (రూ. విపంచిక. అ. స్త్రీ.)

విపక్షుఁడు. సం. వి. అ. పుం. శత్రువు విశ. పక్షము లేనివాఁడు.

విపణము. సం. వి. అ. పుం. అమ్మకము, విక్రయము.

విపణి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. ఇ. పుం. 1. అంగడి; 2. అంగడివీధి; 3. అంగడియందుండు అమ్ముడుసరకు. న్. పుం. వర్తకుఁడు.

విపత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. విపత్తు; 2 యాతన.

విపత్తు. సం. వి. ద్. స్త్రీ. ఆపద, ఇడుమ. (దీనికి విరుద్ధార్థకపదము సంపత్తు.)

విపథము. సం. వి. అ. పుం. చెడుత్రోవ, దురధ్వము.

విపన్నము. సం. వి. అ. పుం. పాము. విశ. విపత్తునొందినది.

విపరీతము. సం. విశ. (అ. ఆ. అ.) వ్యత్యస్తము.

విపర్యయము. సం. వి. అ. పుం. వ్యత్యాసము.

విపర్యస్తము. సం. విశ. (అ. ఆ. అ.) విపర్యాసము నొందినది.

విపర్యాసము. సం. వి. అ. పుం. (చూ.) విపర్యయము.

విపశ్చితుఁడు. సం. వి. త్. పుం. చదువరి, పండితుఁడు.

విపాకము. సం. వి. అ. పుం. 1. దుష్పాకము; 2. పరిపాకము; 3. పరిణామము; 4. పాకము. విణ. పాకముచెడినది.

విపాదిక. సం. వి. ఆ. స్త్రీ. (చూ.) పాదస్ఫోటము.

విపాశ. సం. వి. ఆ. స్త్రీ. నదీవిశేషము. విణ. విడిచిపోయిన పాశములుగలది.

విపినము. సం. వి. అ. న. అడవి, వనము, అరణ్యము.

విపుల. సం. వి. ఆ. స్త్రీ. నేల. విణ విరివియైనది.

విప్పు. దే. ప్రే. విడుచుయొక్క రూపాంతరము. వి. 1. విరియుట; "సీ. ఛిద్రోత్థహాతవలత్కద్రూజమనఁజుట్టతోవిప్పుతోదరిఁదొండమాడ." ఆము. ౪, ఆ.—2. విరిసి పాఱుట; "సీ. తనయభిజాతనూతన సుపర్ణమూర్తివిషధరంబులకెల్లవిప్పానర్ప." వసు. ౭, ఆ.—3. వైశాల్యము; "క్రోశమువిప్పు." హరి. పూ. ౪, ఆ —4. బాహుళ్యము. "ఈజనుల విప్పుగనుంగొన వచ్చినం బురంబునకీచటిమ్ముచాలదనుబుద్ధిజనించె." హరి. ఉ. ౨, ఆ.

విప్రకారము. సం. వి. అ. పుం. 1. తిరస్కారము; 2. అపకారము; 3. దంతనిష్పీడనమువలనఁ గలిగిన ముఖవికారము లోనగునది.

విప్రకృతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. తిరస్కరింపఁబడినవాఁడు; 2. అపకారముచేయఁబడినవాఁడు.

విప్రకృష్టము. సం. విణ. (అ. ఆ. అ ) దవ్వు, దూరము

విప్రతిపత్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. కలఁత; 2. విరోధము.

విప్రతీపము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ప్రతికూలము. (చూ. ప్రతీపము.)

విప్రతీసారము. సం. వి. అ. పుం. 1. పశ్చాత్తాపము; 2. కోపము; 3. అకృత్యము.

విప్రయాణము. సం. వి. అ. న. యుద్ధమునఁబాఱిపోవుట, పలాయనము.

విప్రయోగము. సం. వి. అ. పుం. స్త్రీపురుషులయెడఁబాటు, విప్రలంభము.

విప్రలంభము. సం. వి. అ. పుం. 1. (చూ.) విప్రయోగము; 2. (చూ.) విసంవాదము; 3. మిక్కిలి వంచనము.

విప్రలబ్ధ. సం. వి. ఆ. స్త్రీ. సంకేతస్థలమునందు ప్రియుఁడు లేనికారణమున మోసపోయి వ్యాకులతఁబొందునట్టినాయిక. (చూ. నాయిక.) విణ. వంచింపఁబడినది.

విప్రలాపము. సం. వి. అ. పుం. 1. పరస్పరవిరుద్ధమైనమాట; 2. అపార్థమైనమాట.

విప్రశ్నిక. సం. వి. ఆ. స్త్రీ. సోదెచెప్పునది, కేల్పుసాని.

విప్రుఁడు. సం. వి. అ. పుం. బ్రాహ్మణుఁడు, పాఱుఁడు.

విప్రుషము. సం. వి. ష్. స్త్రీ. నీటిబొట్టు.

విప్లవము. సం. వి. అ. పుం. 1. కొల్లలు మొదలగు దేశోపద్రవము; 2. ముష్టిప్రహారాది.

విబంధము. సం. వి. అ. పుం. మలమూత్రబంధనరోగము.

విబుధుఁడు. సం. వి. అ. పుం. 1. చదువరి; 2. వేలుపు; 3. చంద్రుఁడు.

విబూది. వై వి. బూది, భస్మము.

విభక్తము. సం. విణ. (అ. ఆ. అ.) విభాగింపఁబడినది

విభక్తి. సం. వి. ఇ. స్త్రీ. 1 విభాగము, 2. ప్రథమాది. (ఇవి యేడు.—ప్రథమ, ద్వితీయ, తృతీయ చతుర్థి, పంచమి, షష్ఠి, సప్తమి.)

విభజనము. సం వి. అ. న. విభజించుట, విభాగము.

విభజించు. సం స. క్రి. పంచు, విభాగించు.

విభవ. సం. వి. అ. పుం. ఒకసంవత్సరము. (చూ. సంవత్సరము.) ము. 1. సంపద; 2. ధనము.

విభాకరుఁడు. సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. అగ్ని.

విభాగము. సం. వి. అ. పుం. 1. పాలు; 2. పంపకము.

విభాగించే. సం. స. క్రి. భాగించు, పంచు. (సంవిభాగించు అనియు.)

విభాజకము. సం. విణ. (అ. ఈ. అ.) విభజించునది. (భాగహారమునందు విభజించుసంఖ్య.)

విభాజితము. సం. విణ. (అ. ఆ. అ.) విభజింపఁబడినది. (భాగహారమునందు భాగింపఁగా ఏర్పడిన మొత్తము.)

విభాజ్యము. సం. విణ. (అ. ఆ. అ.) విభజింపఁదగినది. (భాగహారమునందు భాగింపఁదగిన సంఖ్య.)

విభాతము. సం. వి. అ. న. వేకువ, (చూ.) ప్రభాతము.

విభావన. సం. వి. ఆ. స్త్రీ. ఒక యర్థాలంకారము. (చూ. అలంకారము.)

విభావము. సం. వి. అ. పుం. 1. రసోత్పాదనకారణము; (ఇది ద్వివిధము.—ఆలంబనవిభావము, ఉద్దీపనవిభావము.) 2. పరిచయము.

విభావరి. సం. వి. ఈ. స్త్రీ. 1 రేయి; 2. పసుపు, 3. కుంటెనకత్తె.

విభావసుఁడు. సం. వి. ఉ. పుం. 1. సూర్యుఁడు; 2. అగ్ని.

విభీతకము. సం. వి. అ. పుం. తాండ్రి.

విభీషణము. సం. వి. అ. పుం. కిక్కసకసవు. విణ. మిక్కిలిభయంకరమైనది. వి. డు. రావణునితమ్ముఁడు.

విభుఁడు. సం. వి. ఉ. పుం. 1. ప్రభువు; 2. శివుఁడు; 3. బ్రహ్మ; 4. సర్వవ్యాపకుఁడు.

విభూతి. సం. వి. ఇ. స్త్రీ. 1. తిర్యక్పుండ్రధారులు ధరించెడుభస్మము; 2. ఒక ఐశ్వర్యము. (చూ. ఐశ్వర్యము.)

విభూషణము. సం. వి. అ. న. తొడవు, ఆభరణము.

విభ్రమము. సం. వి. అ. పుం. 1. భ్రాంతి; 2. వస్త్రభూషణాదిప్రయుక్తమైనకాంతివిశేషము; 3. వచనభూషణవిపర్యాసరూపమైన స్త్రీలయొక్క శృంగారచేష్టావిశేషము.

విభ్రాట్టు. సం. విణ. (జ్.) (భూషణాదులచేత) ప్రకాశించువాఁడు.

విమతుఁడు. సం. వి. అ. పుం. శత్రువు. విణ. విరుద్ధమైన మతము గలవాఁడు.

విమనుఁడు. సం. విణ. (స్.) (చూ.) అంతర్మనుఁడు.

విమర్దనము. సం. వి. అ. న. 1. చందనములోనగువాని పూయుట; 2. కస్తూరిలోనగువానినూఱుట.

విమర్శనము. సం. వి. అ. న. (చూ.) పరామర్శము.

విమర్శము. సం. వి. అ. పుం. ఒక నాటకసంధి. (చూ. సంధి.)

విమర్శించే. సం. స. క్రి. పరామర్శముచేయు.

విమల. సం. వి. ఆ. స్త్రీ. సంబరేను?. విణ. 1. నిర్మలమైనది; 2. ఒప్పిదమైనది.

విమాత. సం. వి. ఋ. స్త్రీ. సవతితల్లి.

విమానము. సం. వి. అ. పుం, న. 1. అంతరిక్షమునందు దేవతలు ఎక్కి సంచరించెడు రథము; 2. చక్రవర్తియొక్క సౌధము; 3. గుఱ్ఱము; 4. నీళ్లమీఁద జను లెక్కిపోయెడు కలము.

విముక్తము. సం. విణ. (అ.ఆ.అ.) మిక్కిలివిడువఁబడినది.

విముఖుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) పరాఙ్ముఖుఁడు

విమోచనము. సం. వి. అ. న. మిక్కిలి విడుపు.

విమోహము. సం. వి. అ. పుం. మిక్కిలి మోహము.

విమోహించే. సం. అ. క్రి. మిక్కిలి మోహించు.

విమోహితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి మోహించినవాఁడు.

వియచ్చరుఁడు. సం. వి. అ. పుం. దేవయోనివిశేషము, ఖచరుఁడు, మింటితెరువరి.

వియత్తు. సం. వి. త్. న. ఆకాశము, మిన్ను.

వియద్గంగ. సం. వి. ఆ. స్త్రీ. ఆకాశగంగ, మిన్నేఱు.

వియమము. సం. వి. అ. పుం. 1. హింసాదులవలన నుడుగుట; 2. బాధ.

వియాతుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) దిట్టతనముగలవాఁడు.

వియామము. సం. వి. అ. పుం. వియమముయొక్క రూపాంతరము.

వియుక్తము. సం. విణ. (అ.ఆ.అ.) వియోగముగలది.

వియోగము. సం. వి. అ. పుం. ఎడఁబాటు, విరహము. (దీనికి విరుద్ధార్థకపదము సంయోగము.)

వియ్యంకుఁడు. దే. వి. (వియ్యము + అంకుఁడు.) వియ్యమందినవాఁడు. (పెండ్లికొమార్తె తండ్రికి పెండ్లి కొమారునితండ్రియు, పెండ్లికొమారుని తండ్రికి పెండ్లికొమార్తెతండ్రియు పరస్పరము వియ్యంకులని యెఱుంగునది.)

వియ్యంకురాలు. దే. వి. (వియ్యంకుఁడు+ఆలు.) వియ్యమందినది. (పెండ్లికొమార్తెతల్లికి పెండ్లికొమారునితల్లియు, పెండ్లికొమారునితల్లికి పెండ్లికొమార్తెతల్లియు పరస్పరము వియ్యంకురాండ్రని యెఱుంగునది.)

వియ్యపురాలు. దే వి. (వియ్యము+ఆలు.) వియ్యంకురాలు.

వియ్యపుసాని. ద్వ. వి (వియ్యము+సాని) వియ్యపురాలు.

వియ్యమందు. దే. అ. క్రి (వియ్యము+అందు.) సంబంధముచేయు. భార. ఆర ౭ ఆ "ఈసత్యసౌభాగ్యవర్ధనుతోనియ్యెడ వియ్యమందఁగలిగెఁ ధన్యుండనైతిఁ." రామా. ర, ఆ.

వియ్యము. దే. వి. 1. వైవాహికసంబంధము; 2. వియ్యంకుఁడు. 'వియ్యము దలంపఁ లచ్చిఁగన్నయ్య." చంద్రా ౧, ఆ

విరక్తి. సం. వి. ఇ. స్త్రీ. రాగములేమి, విరాగము.

విరక్తుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. విరక్తిగలవాఁడు, 2. అనురాగములేనివాఁడు.

విరచించే. సం. స. క్రి. విశేషముగా రచించు.

విరచితము. సం. విణ. (అ.ఆ.అ.) విశేషముగా రచింపఁబడినది.

విరజ. సం. వి. ఆ. స్త్రీ. వైకుంఠమునందుండు నొకానొకనది.

విరజస్తమసుఁడు. సం. వి. స్. పుం. రజస్తమోగుణములులేనివాఁడు, సాత్వికుఁడు.

విరజాజి. ద్వ. వి. జాజివగ, నవమాలిక?. "సీ. విరజాజివిరులరోవరులముంగిటిచాయ నల్లిబిల్లిగ ద్రాక్షలల్లుకొనియె." భాను. ౨, ఆ.

విరజోది. ద్వ. వి. విరజోజియొక్క రూపాంతరము.
విరటుఁడు. వై. వి. విరాటరాజు.
విరతము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి విరతిఁ బొందినది.
విరతి. సం. వి. ఇ. స్త్రీ. విశ్రాంతి, విరామము, ఉడుకువ.
విరమించు. సం. అ. క్రి. విశ్రాంతిఁబొందు, ఉడుగు.
విరవాజి. ద్వ. వి. విరజోజియొక్క రూపాంతరము. (చూ. విరవాది.)
విరవాది. ద్వ. వి. విరవాజియొక్క రూపాంతరము. "రగడ. మితిలేనితేనెనా మెతఁజే సెవిరవాది, యి తరలతికలమరగియేఁగునదిపరవాది." స్వా. 3, ఆ.
విరవిర. యు. దే. వి. 1. విరియుటయందగుధ్వన్యను కరణము; "తొవలువిరవిరవిరిసెన్." సా 3, ఆ.— 2. త్రెళ్లుటయందగుధ్వన్యనుకరణము. "విరవిరఁ ద్రెళ్లినొవ్వడరవివ్వాలుఁడై." నిర్వ. ౪, ఆ.—వై. వి. విలవిలయొక్క రూపాంతరము. (చూ. విరవిర వాఱు, విరవిరవోవు.)
విరవిరవాఱు. ద్వ. అ. క్రి. (విరవిర+పాఱు.) విర విరవోవు. "చ. మైవిరవిరవాఱఁజేసడలివిల్లువ డంగనిరాముఁడిట్లనున్." రా. యు, కాం.
విరవిరవోవు. ద్వ. అ. క్రి. (విరవిర+పోవు.) విల విలవోవుయొక్క రూపాంతరము. (చూ. నిడు వెండ్రుక వెట్టు.)
విరసము. సం. వి. అ. పుం. అర్థదోషములలోనొకటి. విణ. 1. రసములేనిది; 2. విరుద్ధరసముగలది.
విరసించు. సం. అ. క్రి. 1. విరసత్వమునొందు; 2. ద్వే షించు. "సీ. కలనైనఁ జెదిరింపఁదలఁచుముల్లోకం బువిరసించియేకూరుఁడొరయునతని." జై. ౬, ఆ.
విరహము. సం. వి. అ. పుం. ఎడఁబాటు, వియోగము.
విరహి. సం. వి. న్. పుం. విరహముగలవాఁడు.
విరహిణి. సం. వి. ఈ. స్త్రీ. విరహముగలది.
విరహితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. విడువఁబడినది; 2. లేనిది.
విరహోత్కంఠిత. సం. వి. ఆ. స్త్రీ. వేళకునాయ కుఁడురాకతడయఁగా విరహముచేత తహతహ పడునాయిక. (చూ. నాయిక.)
విరళ. సం. వి. ఆ. స్త్రీ. నల్లయుప్పి?
విరళము. ఉభ. దే. వి. ఒకవిధమైనపన్ను. (విరాళము యొక్క రూపాంతరము.) సం. అ. న. పెరుఁగు. విణ. ఎడమయినది.
విరళి. వై. విణ. విరాలము*.

విరాగుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) విషయేచ్ఛార హితుఁడు.
విరాజమానము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ప్రకాశించుచున్నది.
విరాజితము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ప్రకా శితము.
విరాట్టు. సం. వి. జ్. పుం. 1. ఆదిదేవుఁడు; 2. క్ష త్రియుఁడు; 3. గరుత్మంతుఁడు.
విరామము. సం. వి. అ. పుం. విశ్రాంతి, ఉడుకువ.
విరాలము. సం. విణ. (అ. ఆ. అ.) వలపుఁబుట్టిం చునది. "ఉ. అంతవసంతకాలముసమంచితసాల ముకోకిలారవా, క్రాంతదిగంతరాలముశుకప్రి యలీలముమత్తభృంగ వి, భ్రాంతలతాంతజాలము పరాగవిశాలము పాంథకామినీ, కాంతమనో విరాలము జగత్త్రయమోహనరీతిఁదోఁచినన్." భాను. ౨, ఆ. (ఒకఁడు విరాళము వైకృతమనె.)
విరావము. సం. వి. అ. పుం. మ్రోఁత, ధ్వని.
విరాళము. యు. దే. వి. ఒకవిధమైన పన్ను. వై. వలపు*. "సీ. కొమ్మసింగారంపుఁగొలఁకునఁదేలక బలువిరాళపు వెట్టతొలఁగుటెట్లు." నీలా. ౨, ఆ.
విరాళి. వై. వి. 1. వలపు*; "చ. మెలఁతుకరంగపల్ల ఘునిమీఁదివిరాళిఁబ్రియంబుతోడనె, చ్చెలులు వచించుపల్కు చెవిఁజేర్పదు." పర. 3, ఆ.— 2. భక్తి*. "చ. మనమునవిష్ణుచింతనలుమానఁడుమీని విరాళియెట్టిదో." వి, పు. ౨, ఆ.
విరి. దే. వి. పుష్పము. విణ. 1. వికసించినది; "సీ. శ్రీరమ్యుఁడగునాదినారాయణునినాభిఁ బొలు పారవిరిదమ్మిపూవువోడమె." భో. ౧, ఆ.— 2. వీడినది; "విరిదల." రా. బాల, కాం.—3. తొ లఁగినది. "మొగులుఁవిరియొండ." రామా. ౬., ఆ.
విరించనుఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మ, నలువ.
విరించము. సం. వి. అ. పుం. దినముయొక్క పదవభా గము. (చూ. దినము.)
విరించి. సం. వి. ఇ పుం. 1 బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు.
విరించుఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మ, విరించనుఁడు.
విరిగి. దే. వి శ్లేష్మాతకము?
విరిఁబోఁడి. దే. వి. 1. పుష్పమువలె మనోజ్ఞురాలైన ఆఁడుది; 2. ఆఁడుది. (చూ. అలరుఁబోఁడి.)
విరిదట్టు. దే. విణ. (విరి+తట్టు.) ఎడఁబాటునొంది నది, వియుక్తము. "క. విరసంబునఁదమనిరువుర, విరిదట్టుగఁజేసినట్టివిశ్వావసుఁడు." వి, పు. ౬, ఆ.

గుళబ్దమునకు పైనికులర్థము. చూ. వాఁగు.) భార. ద్రో. ౫, ఆ.

వెడఁగుపాటు. ద్వ. వి. వెడఁగుపడుట. (జడత్వము నొందుటకు. చూ. గ్రుక్కుమిక్కునును.)

వెడఁగువడు. ద్వ. అ. క్రి. జడత్వమునొందు. "ద్వి ఎవపక నాజ్ఞాతులిప్పుడున్న, విడిపించుకొనలే కవెడఁగురుపడిరి." భాగ. ౮, స్కం.

వెడఁద. దే. విశ. విశాలము. మువాఁడు." భాగ. ౨, స్కం. "వెడఁదకన్నులు."

వెడఁదమోముమెకము. ద్వ. వి. సింహము, పంచాస్యము.

వెడఁదవాతియమ్ము. ద్వ. వి. (వెడఁదవాయి+అమ్ము.) బాణవిశేషము. "అ. అన్ని వెడఁదవాతియమ్ముల దృతముగ, నొక్కముష్టిఁదొడిగి యుక్కుమెఱయ, నతఁడులీలఁగునిమెనందఱతలలును, ఘోర భంగిరక్తధారలెగయ." భార. విరా. ౫, ఆ.

వెడలఁబడు. ద్వ. అ. క్రి. (వెడలన్+పడు.) వెడలు. "తే. వాసరోజాత్మగోత్రపధార్ణవమున, మునిఁగి యున్నాఁడఁజేయూర్పుకొనఁగలేక, నీకృపాదృష్టిపేరోడగాకయున్న, వెడలఁబడుటెట్లుమఖముగావించుటెట్లు." జై. ౧, ఆ. (స్వార్థమున పడు.)

వెడలఁబాటు. ద్వ. వి. వెడలఁబడుట. "చ. భువనభయంకరంబులగుపోరులఁ దమ్ములతోడఁగూడినీ, వువెడలఁబాటులెస్స." భార. శాం. ౧, ఆ.

వెడలఁబాఱు. దే. అ. క్రి. (వెడలన్+పాఱు.) వెడలు. (చూ. పోలు. వి. చూ. పాఱు.)

వెడలు. దే. అ. క్రి. బయలువెళ్లు

వెడలుచు. దే. ప్రే. వెడలఁజేయు. "కొమ్మకేలుచెలువంబుగఁబట్టి యయాతినూతిలో వెడలిచి." య. 3, ఆ. (రూ. వెడల్చు.)

వెడలుపు. దే. వి. వైశాల్యము, (రూ. వెడల్పు.)

వెడవింటి. దే. వి. (వెడ+విల్లు.) మన్మథుఁడు, ఇక్షుధన్వుఁడు. (చూ. తొఁగ రెండవయర్థము.)

వెడవిలుకాఁడు. దే. వి.——పై.——(చూ. వంకిణి.) (ఇట్లు వెడవిలుతుఁడు.)

వెడవెడ. దే. విశ. అత్యల్పము, సూక్ష్మము. "వెడవెడనడుములు." (చూ. వీఁగియాడు) "వెడవెడపనులు." శకాం. ౪, ఆ.—క్రి. విశ. 1. సూక్ష్మముగ; "వెడవెడనేతుపొల్లియిదవింటి." భార. ఉద్యో. ౪, ఆ.—2. మందముగ; "వ. వెడవెడ నవ్వుచు." భార. ఉద్యో. 3, ఆ. "వెడవెడపోవు." ఆము. ౪, ఆ.—3. మృదువుగ. "వెడవెడదడియొత్తి." ఆము. ౫, ఆ. "వెడవెడయూఁకొని." భార. ఉద్యో. ౨, ఆ.

వెడ్డరి. దే. విశ. (వెడ్డు+అరి.) కపటి, వంచకుఁడు.

వెడ్డు. దే. వి. 1. కపటము; "సీ. వెట్టులుతోలుమేనవెడ్డునసాధుజనము మోసపుచ్చిధనంబుగొన్న, జనులు." భార. అను. ౫, ఆ.—2. వంచన. "ఎ, గీ. ఇట్టిగతిఁజెల్వకును వెడ్డు వెట్టునొక్కొ." ప్రభా. 3, ఆ.

వెడ్డువెట్టు. దే. స. క్రి. (వెడ్డు+పెట్టు.) వంచించు. "ద్వి. దారుణక్రియల వెఱపింతురలఁతురు వెడ్డు వెట్టుదురు." రా. యు. కాం. "వ. అని వెడ్డువెట్టిన నతండు బేల్పడిఁయట్లచేసె." భో. ౫, ఆ.

వెణఁగు. దే. విశ. వెడఁదయొక్క రూపాంతరము. "ఉ. నందసుతుంగనుంగొని వెణందకనుంగవనించెబాష్పములే." శృం. ౨, ఆ. (దీనికిఁ బ్రయోగాంతరము మృగ్యము.)

వెణుతురు. వై. వి. కరీరము? (వెలుతురుయొక్క రూపాంతరము.)

వెత. వై. వి. దుఃఖము. "తే. అతనియానతిఁగైకొని వెతలుమఱచి." నీలా. ౨, ఆ.

వెతకు. దే. స. క్రి. అన్వేషించు. "చ. అతఁడుమహాప్రసాదమనియల్లోలివాకిలిచొచ్చియచ్చటన్, వెతకి." ఉ. రా. ౪, ఆ.

వెతారము. దే. వి. వెత, దుఃఖము, వ్యథ.

వెద. దే. వి. 1. విత్తుట; "వ. వెదపదనికిరొంపిగలంచి." భార. విరా. ౫, ఆ.—2. పశుగర్భాధానము; "వ. వెదలొనర్చు జక్కవపెంటికూటువలును." నీలా. 3, ఆ. "సీ. హాలజీవిసందోహములకుబలాకికావిసరంబులకుమంచి వెదలుదొరకె." ఆము. ౪, ఆ.—3. పశుబుతువు; "ఎ, గీ. వెదవివేకించుఁ గ్రీడించువిక్రమించు." భాగ. ౮, స్కం.—4. కొప్పు. (చూ. పినుమ్రాను.)

వెదకు. దే. స. క్రి. వెతకుయొక్క రూపాంతరము. "క. బంధులగురులన్, వెదకిప యించుసౌఖ్యం, బదియేటికి." భార. ఉద్యో. ౧, ఆ.

వెదకుడు. దే. వి. వెదకుట, అన్వేషణము.

వెదగొట్టు. దే. వి. విత్తులు వెదవేసెడుగొట్టు.

వెదచల్లు. దే. స. క్రి. 1. పాఱఁజల్లు; (వాఁడు బాలుగుతట్టులరూకలు వెదచల్లినాఁడు.) 2. వ్యాపిం

పఁజేయు. "చ. తన్నుఁ తండువ, త్సలతయుగారవం
బు వెదచల్లెడుమాటలనాదరింపఁగన్." ప్రభా.
౪, ఆ.

వెదచిందు. దే. అ. క్రి. వ్యాపించు. "సీ. అలచెందొ
వలవిందుచెలువెందు వెదచిందు మొగమున కొంక
వింతజిగిసొలంక." పా. ౧, ఆ.

వెదపెట్టు. దే. స. క్రి. విత్తు. (చూ. నిట్టు రెండవ
యర్థము )

వెదావు. దే వి. (వెద+ఆవు.) వెదపదనైయాఁబోతు
చేవెనుకొనఁబడు ఆవు, సంధిని. (ఇట్లు వెదమొ
దవు. మొ.)

వెదురు. వై. వి. వేణువు. (ఇది ద్వివిధము. గట్టివెదు
రు, బొంగువెదురు.)

వెదురుకంపజిట్ట. ద్వ. వి. పక్షివిశేషము.

వెదురుపాలు. వై. వి. త్వక్షీరము.

వెదురుపిచ్చిక. ద్వ. వి. పక్షివిశేషము.

వెదురుప్పు. ద్వ. వి. (వెదురు+ఉప్పు.) వెదురుపాలు.

వెదురుమిడుత. ద్వ. వి. క్రిమివిశేషము.

వెదురువిల్లు. ద్వ. వి. వెదురుబద్దలతోఁజేసిన విల్లు.
(చూ. విల్లు.)

వెనకయ్య. వై. వి. వినాయకుఁడు, విఘ్నేశ్వరుఁడు.

వెనకు. దే. స. క్రి. వెదకుయొక్క రూపాంతరము.
"తే. తనకుఁబగయగుప్రొద్దును వెనకికనక, కనలు
చీఁకటిరక్కసికన్నులందుఁ, దొరుఁగుకనకనమను
నిప్పుఁదునుకలనఁగఁ, బొడిచెనెడనెడమిడుఁగు
ఱుఁబుర్వులంత." య. ౨, ఆ.

వెనకుడు. దే. వి. వెదకుడుయొక్క రూపాంతరము.

వెను. దే. వి. వెన్నుయొక్క రూపాంతరము. అవ్య.
వెనుక. (దీనికి హల్లుపరమగుచో ఉత్వమునకు విక
ల్పముగా లోపంబగు. "వివరత్నప్రోతసౌధాం
గణస్థలులన్ వెన్నవిచ్చు నిర్మల తనుచ్ఛాయన్
నిరీక్షించి." కా. 3, ఆ.)

వెనుఁబడు. ద్వ. అ. క్రి. 1. (చూ.) విషాదించు; "క.
చనిమదనాగ్నిజ్వాలలు, దనుకఁగనిట్టూర్పుగా
ద్భువదండడినిగుడన్, దనునూరార్పఁగసఖిదొర,
కొనమికి వెనుఁబడుచుఁ గీచకుండాసతితోన్."
భార. విరా. ౨, ఆ. "చ. నన్నుఁగే, వలమునుము
ట్టనెవ్వరికివచ్చునసుంగలఁగుక్ వెనుంబడున్."
భార. విరా. ౨, ఆ.—2. ఖేదపడు. "క. తనుఁ
బాయఁజాలకందఱు, వెనుఁబడుటయెఱింగి." ని
ర్వ. ౩, ఆ.

వెనుఁబాటు. ద్వ. వి. వెనుఁబడుట. (విషాదమునకు.—
"క. అనినసతనిచిత్తంబున, వెనుఁబాటంతయును
బాయువెరవుకలిమియె, ల్లనుదెలియునట్లుగాని,
ట్లనియెంబాంచాలియుచిత మగుచందమునన్."
భార. విరా. ౧, ఆ —ఖేదమునకు.—"క. అనుప
లంకులకువిషాదము, దనుకఁగధృతరాష్ట్రవిభుఁడు
దననందనునే, మనియుఁబలుకఁగఁజాలక, వెనుఁ
బాటునవిట్టులనియె విదురునితోడన్." భార.
ఉద్యో ౨, ఆ.)

వెనుక. ద్వ. వి. 1. పశ్చాద్భాగము; "వెనుకకుఁబ
డఁద్రోసె." వి, పు. ౨, ఆ. — 2. ముందు;
"సీ. అయ్యనీనామధేయంబేమియొప్పుడు వెనుక
కుమారుండువిషయమెద్ది." రామా. ౬, ఆ.—
3. పడమర; (చూ. చుట్టలుఁగు.) 4. ఉపేక్ష. "ఎ,
గీ. అనినవారలిట్టులనిరితండిరిచావు, వినియువెనుక
చేసిచనఁగనగునె." భో. ౬, ఆ.—విణ. 1. పశ్చా
ద్భాగముఁనున్నది. "ఎ, గీ. ఇనుఁడుసీతుగాలి
వెనుకగామొనడి, పించినదుపసంభవించుజయ
ము." భార. శాం. 3, ఆ.—2. ముందటిది. "ఎ, గీ.
అంతనుద్దాలకుండుసన్యాసియయ్యెఁ, గానిగా
ర్హస్థ్యధర్మంబుఁబూనఁడయ్యెఁ, దరుణిచేసినవె
నుకరోఁతలుదలంచి.' వై. ౪, ఆ.—ద్ర. 1. వెం
బడి; (నావెనుకరమ్ము.) 2. పిమ్మట. (నేను వెనుక
వచ్చెదను.) (దీనిమొదటిరూపము వెనుకల.)

వెనుకచిక్కు. దే. అ. క్రి. వెనుకపడు.

వెనుకచూపులమేకము. ద్వ. వి. ఎలుఁగు, భల్లూకము.

వెనుకటిపని. దే. వి. అపరకర్మము. అచ్చ. యు, కాం.

వెనుకటివాఁడు దే. వి. (వెనుక+వాఁడు.) అనుజుఁ
డు. విణ. వెనుకనున్నవాఁడు.

వెనుకదీయు. దే. అ. క్రి. (వెనుక+తీయు.) 1. వెను
కకుమరలు; 2. సంకోచించు.

వెనుకద్రొక్కు. దే. అ. క్రి. (వెనుక + త్రొక్కు.)
వెనుదీయు.

వెనుకపడు. ద్వ. అ. క్రి. 1. వెనుకచిక్కు; 2. (ధనము
వెచ్చముకాక) కూడఁబడు.

వెనుకపాటు. ద్వ. వి. వెనుకపడుట. "వ. నవ్వుటా
లకు వెనుకపాటునంగదిసి." స్వా. 3, ఆ.

వెనుకమేను. దే. వి. వీఁపు, చరమాంగము.

వెనుకమ్రాను. దే. వి. ఏతపుబానకు నీళ్లెత్తువాఁడు
కూర్చుండుటకై నిలువుగాళ్లమీఁద అడ్డముగానుం
చినమ్రాను.

వెనుకల. ద్వ. వి. (వెను+కలను.) (చూ.) వెనుక. (ఇది ముంగలవంటిది. ఈపదము సాధువే కాని దీనికి ప్రయోగము మృగ్యము. వెనుకాలయనుట గ్రామ్యము.)

వెనుకవేయు. దే. స. క్రి. (ధనము వెచ్చము చేయక) కూడఁబెట్టు.

వెనుకొను. దే. స. క్రి. వెంబడించు. "ఆ. హయముఁ దోలుకొని రయంబున నేనెను, కొనఁగనిట్లుపఱచి క్రోడమెక్క, బొటిచుఁజొచ్చి యతలమునకు డిగ్గుటయును, తోనచొచ్చి దానిఁగానకచట." మార్క. ౨, ఆ.

వెనుచేఱచు. దే. స. క్రి.——పై.——"క. పరసేనలు వెనుచఱచుచుఁ, బఱతేరఁగఁ బాటిపోవఁ బాడియె మీకుక్." ఉ, రా. 3, ఆ.

వెనుతవులు. దే. స. క్రి.——పై.——(చూ. వెన్తవులు.)

వెనుదన్ను. దే. అ. క్రి. స. క్రి. వెన్నుదన్ను యొక్క రూపాంతరము. (వెనుక నిల్చుటకు.—"పార్థివుఁడుక్ వెనుదన్ని చూడ." భార. విరా. ౫, ఆ.)

వెనుదీయు. దే. అ. క్రి. (వెను+తీయు.) వెనుకకుమరలు. "కురిసెడువృక్షవర్షమునకుక్ వెనుదీయక." ఉ, రా. ౭, ఆ.

వెనువెంట. దే. ద్ర. మిక్కిలి వెంబడి.

వెన్క. దే. వి. విణ. ద్ర. వెనుకయొక్క రూపాంతరము. [పశ్చాద్భాగమునకు.—(చూ. వేగిరకాఁడు.) వెంబడికి.—"దాని వెన్కను బక్షీంద్రుఁడు." భాగ. ౮, స్కం.]

వెన్కొను. దే. స. క్రి. వెనుకొనుయొక్క రూపాంతరము. "చ. ప్రకుపితుఁడై యతండునను బాయక వెన్కొనిపట్టనుగ్రతక్." కళా. 3, ఆ.

వెన్తవులు. దే. స. క్రి. వెనుతవులుయొక్క రూపాంతరము. ఆను. ౬, ఆ.

వెన్న. వై. వి. (వెల్ల+నేయి.) పెరుఁగు చిలికియెత్తినది. నవనీతము.

వెన్నంటు. దే. స. క్రి. (వెన్ను+అంటు.) వెంబడించు.

వెన్నడాయి. ద్వ. వి. పక్షివిశేషము.

వెన్నడి. దే. వి. వెంబడి. "శౌరియుసహాగ్రజుఁడై రథమెక్కి యయ్యపక్రాంతుని వెన్నడిందగులఁగా." హరి. పూ. 3, ఆ.

వెన్నడించు. దే. స. క్రి. వెంబడించు. "తే. విఱిగి పాఱినఁబోనీక వెన్నడించు, హలధరునిఁజూచి." ఉ, హరి. 3, ఆ.

వెన్నడికొను. దే. స. క్రి.——పై.——"వీరి వెన్నడికొనియిట్లుచేసెనె యనాథులఁబోలె విధాతృఁడు." భార. అర. ౭, ఆ.

వెన్నదొంగ. ద్వ. వి. కృష్ణుఁడు, నవనీతచోరుఁడు. (ఇట్లు వెన్నముచ్చు.)

వెన్నపడిదము. ద్వ. వి. ఒకదినుసుపిండివంట. "ఎ, గీ. గోవజవ్వాజిఁగస్తూరిఁగొఱతపఱుచు, వెన్నపడిదంబుజొబ్బిలవిద్రిచివిద్రిచి." నై. ౬, ఆ.

వెన్నపాలకాయ. ద్వ. వి. భక్ష్యవిశేషము.

వెన్నపూస. ద్వ. వి. వెన్నముద్ద.

వెన్నప్పము. వై. వి. (వెన్న+అప్పము.) మధురభక్ష్యవిశేషము. (చూ. కడియపుటట్టు.)

వెన్నమడుఁగు. ద్వ. వి. వస్త్రవిశేషము. హంస. ౫, ఆ.

వెన్నముద్దకోడి. ద్వ. వి. పక్షివిశేషము.

వెన్నముద్దలు. ద్వ. వి. బ. శాలిధాన్యవిశేషము. హంస. ౪, ఆ.

వెన్నమెఱుఁగు. ద్వ. వి. భక్ష్యవిశేషము. హంస. ౧, ఆ.

వెన్నయుండ. ద్వ. వి. (వెన్న+ఉండ.) మధురభక్ష్యవిశేషము.

వెన్నవెదురు. వై. వి. ఒకదినుసుకూరాకుచెట్టు, విశల్య.

వెన్నాడు. దే. స. క్రి. (వెన్ను+ఆడు.) వెన్నడించు. "సీ. ఒకకానలోపలనొకకిరాతుండేటు వడిపాఱుమృగమువెన్నాడిపఱచి, కానక." వా. ౫, ఆ.

వెన్నిచ్చు. ద్వ. అ. క్రి. (వెన్ను+ఇచ్చు.) వెనుదీయు. "ద్వి. పగఱకు వెన్నియ్యఁ బాటిగాదయ్య."

వెన్ను. దే. వి. 1. వీఁపు; 2. వరిమొదలగువాని ఎన్ను; "తే. కలమగర్భంబులీఁతిజంఘులకుసూడి, వేగఁ దృణమూనితలవంచె వెన్నుఁజూపి." రుక్మి. ౪, ఆ.—౩. ఇంటి నడికొప్పు. "వ. పాడిల్లునుంబోలె వెన్నొఱగి." కవిక. ౪, ఆ. (ఈ రెండు ఉదాహరణములందును శ్లేష.)

వెన్నుఁడు. వై. వి. విష్ణువు, కృష్ణుఁడు.

వెన్నుకట్టె. ద్వ. వి. పృష్ఠబంధము.

వెన్నుగాఁడి. దే. వి. (వెన్ను+కాఁడి.) ఇంటి నడికొప్పుమ్రాను.

వెన్నుదన్ను. దే. అ. క్రి. (వెన్ను+తన్ను.) వెనుకనిల్చు. "వెన్నుదన్ని చూచునవసరంబున." ఉ, హరి. 3, ఆ.—స. క్రి. వెంబడించు. "వెన్నుదన్ని నిలిచెదానవేశ్వరుఁడు." నిర్వ. 3, ఆ.

వెన్నుపట్టె. ద్వ. వి. 1. ఇంటి వెన్నుగాఁడి; 2. వీఁపు నడిమియెముక.

వెన్నుపాము. దే. వి. వెన్నెముకయందుండుపురుగు, కుండలి.

వెన్నుపూస. దే. వి. వీఁపునడిమియెముక.

వెన్నుబ్రద్ద. దే. వి. వెన్నుగాఁడి.

వెన్నుమ్రాను. దే. వి.——పై.——

వెన్నెముక. దే. వి. (వెన్ను+ఎముక.) వీఁపు నడిమియెముక, కశేరుక.

వెన్నెల. ద్వ. వి. (వెల్ల+నెల.) 1. చంద్రునియొక్క తెల్లనికాంతి, చంద్రిక; 2. అంజలివిశేషము.

వెన్నెలకారు. ద్వ. వి. శరదృతువు.

వెన్నెలకుప్పలు. ద్వ. వి. బ. బాలక్రీడావిశేషము. (చూ. డాఁగిలిముచ్చులు.) (ఇట్లు వెన్నెలప్రోవులు.)

వెన్నెలకోలు. ద్వ. వి. నమస్కారము. "మంజులగితిరగడ. విష్ణుపురంబున విలసిల్లుమహా, విష్ణుస్వామికి వెన్నెలకోలని." హంస. ౪, ఆ.

వెన్నెలగుత్తి. ద్వ. వి. చంద్రుఁడు, శుభ్రాంశువు.

వెన్నెలపులుఁగు. ద్వ. వి. వెన్నెలకు సంతోషించెడు పక్షివిశేషము, చకోరము. (ఇట్లు వెన్నెలపిట్ట.)

వెన్నెలఱేఁడు. ద్వ. వి. చంద్రుఁడు, కళానిధి. (ఇట్లు వెన్నెలరాయఁడు.)

వెన్బడు. ద్వ. అ. క్రి. వెనుఁబడుయొక్క రూపాంతరము. (విషాదించుటకు. — "ఉ. ఏక్రియఁ బారధిఁ ద్రచ్చువారము ధ్రువంబుగ దానికిఁ గవ్వమెద్దియా, ధారముదానికెద్దియని తద్దయు వెన్బడియున్న." భార. ఆది. ౨, ఆ.)

వెన్పాటు. ద్వ. వి వెనుఁబాటుయొక్క రూపాంతరము. (విషాదమునకు.— "ఎ, గీ. తలఁకువుట్టెఁగొంకుకొలఁదికిమీఱె వె, న్పాటుదోఁచెముట్టుపాటు దొడరె." భార. విరా. ౨, ఆ.)

వెప్పు. దే. వి. వేఁడిమి. "వ. ఉప్పువెప్పునుంగలయప్పితితఖండంబులు." స్వా. ౪, ఆ.

వెమ్ము. దే. అ. క్రి. తప్తమగు, తాపమునొందు. "ద్వి. క్రమ్మెడుశోకాగ్నికణములందంద, వెమ్ముచురఘురాము వీఁపునరాల." రా. అ, కాం. "తే. ఉమ్మలికమునఁ దద్దయు వెమ్మునంత, రంగములతోడనరగిరిగంగ దెసకు." భార. స్త్రీ. ౨, ఆ.

వెయి. దే. స. వేయియొక్క రూపాంతరము.

వెరఁగు. దే. వి. 1. ఆశ్చర్యము; "క. వెరఁగయ్యెడు దేవపుడీ, తరుణిగుణంబులుమతింపఁ దానువిరక్తిఁ, స్థిరుఁడట్లయుండితోడసె, విరహార్తుఁడనై తినసుటవివరింపఁజెలీ." ప్రభా. ౪, ఆ.—2. నిశ్చేష్టత. (చూ. వెఱఁగు.)

వెరఁజాడు. దే. స. క్రి. (వెరఁజి+ఆడు.) జోరుకొను. "ఆ. ఉవిదనీకుఁదలియదో కానియేయింట, నైనఁ జొచ్చియెప్పుడైనవచ్చి, వెదకి వెదకి వెన్న వెరఁజాడుచున్నాఁడు, నీసుతుండుమమ్ము నిలువనీక." వి. పు. ౭, ఆ. (చూ. ఊఁగాడు.)

వెరఁజే. దే. స క్రి. జోరుకొను "మ. అనురేంద్రాళయకుండికాచ్ఛరుధిరవ్యాప్తస్వకచ్ఛాయగాం, చినముద్యత్ప్రతిసింహ మత్సరమిళచ్చేష్టందదుద్దామదీర్ఘ సటార్ఘాటముఁ బెల్లగించుగతినాంత్రశ్రేణిఁగింకఁ బెరం, జానితక్రూరభవన్నఖావళులుప్రోచుఁ బ మర్త్యపంచాననా." ఆము ౪, ఆ. (చూ. కడుకొను మొదటియర్థము.)

వెరవరి దే విశః (వెరవు+అరి.) ఉపాయశాలి. ' జరాసంధుని వెరవరిగామెచ్చరు." ఉ, హరి. ౪, ఆ.

వెరవిఁడి. దే విశ (వెరవు+ఇఁడి.) ఉపాయహీనుఁడు. దానినీ వెరవిఁడిగానలేఁడు." భార. ద్రో. ౨, ఆ.

వెరవు దే వి. 1. ఉపాయము; (చూ. బెట్టిదము. విశ. రెండవయర్థము.) 2. జీవనోపాయము; "క. కరిసనమును బేహారము, నరసిపసులఁ గూర్చుటయును ననఁగావృత్తుల్, నరులకునిందెవ్వనికే, వెరవుచితంబదియువానివేల్పైయుండుఁ బ." హరి. పూ ౭, ఆ.—3. విధము "క సిరిరామోహాకాలాడ్డిన, కరణినిబైకొనుచునేసె కదియఁగననునీ, వెరవునవిడనాడుచునొక, తిరిపవుఁజెలిపట్టిఁజేరఁ దివిరెదవేమీ." య. ౨, ఆ.—విశ 1. యుక్తము; "క పరపగుమోహరమేర్పను, వెరవగుచోనల్లినేడువిడిసెద." ఉ, హరి. ౪, ఆ. — 2. అధీనము. "క. గరుడునిపైశార్ఙ్గధను, ర్ధరుఁడగువిష్ణుండుమేరుతటిఁబోల్చుతటి, త్పరివృతజలదముఁబోలుట, వెరవదనుజరాజహంసవితతి యితనికిఁ బ." నిర్వ. 3, ఆ.

వెరవేఁకి. ద్వ. వి. విరహతాపము. "ఉ. ఏవిదినంబులోరజనులెయ్యవియోవిను నిద్రయెట్టిదో, వేవుటయెప్పుడోయకట వెమ్మునఁబునకెద్దిమందొయే, త్రోవలఁబోయెనోతలఁపుతోడనచెయ్వులెఱుంగనేను నా, కీవెరవేఁకిమాన్పఁగమలేక్షణయబ్బితినీపువెజ్జవై." హరి. ఉ. ౭, ఆ. (ఇందలి వెరశబ్దము విరహార్థకమయి ప్రత్యేకముగా ప్రయోగములందు కానఁబడదు.)

**వెరసి.** దే. వి. లెక్క-మొత్తము. విణ. కడపటిది. "వ. ఇన్నియుఁజెప్పనేల వెరసిమాటయొకటివినుమని యిట్లనియె." కళా. ౫, ఆ.

**వెరను.** దే. వి. అంకెలులోనగువానిపఙ్క్తి. "చ. ఒక్కొకవానిఁగొల్చుచు, స్వరసులసంఖ్యలుంగలయనేర్పున నేర్పడఁజూచిరండొరొగిన్." రా. యు, కాం.

**వెరువు.** దే. వి. వెరవుయొక్క-రూపాంతరము. (చూ. గొరువంక.) (ఇట్లు ఉకారమధ్యముగా వాడుక లేకయున్నను ఇది యిట్లే యుండవలయునను టకుఁబ్రయోగము కానఁబడుచున్నదిగాని అకారమధ్యముగా వాడుక విశేషించియుండినను అది యట్లే యుండవలెననుటకుఁదగిన ప్రయోగము కానఁబడదు.)

**వెఱ.** దే. వి. 1. భయము; "క. చెఱువునడుమవిసిన నుబెను, వెఱమెకములుచెదరినను వివేకనిధీయు, క్కఱిబహుళసైన్య మఱిమఱిఁ, బఱచినవాఁగంగరాదుబలియురకైనన్." భార. శాం. 3, ఆ.— 2. ఆశ్చర్యము. "తే. వారుఁదానురహస్యవిచారపరత, నుండివెఱతోడిభయమునను దిలకొనుచు." కవిక. ౬, ఆ.

**వెఱఁగు** దే. వి. 1. ఆశ్చర్యము; "వ. అరవిందనాభు రాకకు విస్మయంబందుచున్న యన్నరవరాగ్రణిం గనుంగొనియిట్లనియె." "తే. అర్ధరాత్రంబువచ్చెనీహరియటంచు, మనమునందేల వెఱఁగంద." జై. ౧, ఆ.—2. నిశ్చేష్టత. "మనంబులోపలన్ వెఱపును ఖేదమున్ వెఱఁగువిస్మయముంబొడమంగ" ఉ, హరి. ౫, ఆ. (చూ. వెఱఁగుపాటు)

**వెఱఁగుపడు.** ద్వ. అ. క్రి. 1. ఆశ్చర్యమునొందు; (చూ. తఱుఁగు.) 2. నిశ్చేష్టతఁబొందు. (చూ. వెఱఁగుపాటు.)

**వెఱఁగుపాటు** ద్వ. వి. వెఱఁగుపడుట. (ఆశ్చర్యమునకు.—"చ. కౌరవసేనలోనిభూ, పతిసుతకోటికిన్ వెఱఁగుపాటొనరించిరి బాణజాలసం, వృతగగనాంగణంబగునవీనమహాహవవిభ్రమంబున ." భార. విరా. ౫, ఆ.—నిశ్చేష్టతకు.—"తే. దానికమ్మునులెల్లఁజిత్తమునభయము, విస్మయంబును బెనఁగొన వెఱఁగుపాటు, గదిరిచిత్రరూపంబులకరణినుండ." భార. అను. ౪, ఆ.) (చూ. వెన్బాటు.)

**వెఱఁగొందు.** దే. అ. క్రి. (వెఱఁగు+ఒందు.) ఆశ్చర్యపడు.

**వెఱక.** దే. వి. వెంద్రుక. "సీ. మత్స్యోదరత్వమయము పెన్ వెఱకఁగుట్టినయోటితిపిరి దండెయును మెఱయ." ఆము. ౬, ఆ.

**వెఱచేఱచు.** దే. అ. క్రి. భయపడు. (చూ. ఒక్కఱ. విణ.)

**వెఱచు.** దే. అ. క్రి.——పై.——"వ. ద్విరదంబులలోఁజిక్కియుఁజొక్కియు దెరువుఁబోవెఱచియుంబఱచియు." ఉ, హరి. ౬, ఆ. (చూ. అఱచు మొదటియర్థము.)

**వెఱపరి** దే. విణ. (వెఱపు+అరి.) భయముగలవాఁడు. భయముగలది.

**వెఱపిఁడి.** దే. విణ. (వెఱపు+ఇఁడి.) భయములేనివాఁడు, భయములేనిది.

**వెఱపు.** దే. వి. భయము. (చూ. వెఱచు.)

**వెఱబొమ్మ.** దే. వి. పశ్వాదులకు వెఱపుపుట్టుటకై భీకరాకారముగఁ బ్రతిష్ఠించెడు ప్రతిమ. "క. నెఱపగుసంపదగలిగిన, నెఱిదానంగుడువఁగట్టనేరనిమనుజుం, డఱిమఱిఁజేనికిఁగట్టిన, వెఱబొమ్మయొకాదయెన్నివిధములఁజూడన్." విక్ర ౭, ఆ. "ద్వి. మఱిమన్మథునిసూత్రమహిమచేఁదిరుగు, వెఱబొమ్మరోయనవెసనడియాస, విరసవర్తనములవెలఁదియాభంగి, నిరువురిసన్నిధికడతొలఁగారి." రా. అర, కాం.

**వెఱవెఱపాటు.** ద్వ. వి. నిశ్చేష్టత "ద్వి. కరములు మొగిడించికడువిస్మయంబు, వెఱవెఱపాటునువిహ్వలత్వంబు వెఱపునుమఱపును వీటతాటముగ." రా. అ, కాం. (దీనికీగ్రంథమునందుతప్ప మఱియెక్కడను ప్రయోగము కనఁబడలేదు.)

**వెఱ్ఱి.** దే. వి. 1. పిచ్చి, ఉన్మాదము; (చూ. ఒఱపు. విణ. మొదటియర్థము.) 2. అవివేకము. "క. జడలుధరియించియడవుల, నిడుములఁబడికాయగసరులేమెసఁగెడుపెన్, బడుగునినుఁగపయఁ దగునా, విడువిడునీకేలపట్టె వెఱ్ఱిలతాంగీ." రామా. ౬, ఆ.— విణ. 1. పిచ్చివాఁడు, ఉన్మత్తుఁడు; (చూ. వెద్దు మొదటియర్థము.) 2. వివేకములేనివాఁడు, వివేకములేనిది. "క. తెగిపోయినవారేడ్చిన, మగుడుదురే వెఱ్ఱులార." భార శాం. 3, ఆ. "వెఱ్ఱికార్యము." భార. ద్రో. ४, ఆ. [వెఱ్ఱిశబ్దము ముందుగలసంజ్ఞావాచకశబ్దములు.—వెఱ్ఱిచెఱకు (చెఱకువంటితృణవిశేషము), వెఱ్ఱిజిల్లెడు (రాజార్కము?), వెఱ్ఱితుమ్మ (తుమ్మదిసుసు?), వెఱ్ఱివిత్తు

(నిమ్మదినుసు.), వెట్టిపుచ్చే (పుచ్చేదినుసు.), వెట్టిబచ్చేలి (బచ్చేలిదినుసు.), వెట్టిబీఱ (చేఁతిబీఱ.), వెట్టిమేడి (కాకిమేడి.), వెట్టియావ (తెల్లావ.) ఇట్టివి.]

వెట్టినీళ్లు. ద్వ. వి. బ. మద్యము. "తే. వెగ్గలపుఁబచ్చినంజుళ్లు వెట్టినీళ్లుఁ, దోరహత్తుగనిడఁగడుపార మెసఁగి." అచ్చ. యు, కాం.

వెట్టిబాగులు. దే. వి. వివేకములేనిది. వివేకములేనివాఁడు.

వెట్టివాఁడు. దే. విణ. వెట్టిపట్టినవాఁడు, ఉన్మత్తుఁడు.

వెల. దే. వి. 1. కొనువస్తువులులొనగువానికిచ్చెడు విలువ, మూల్యము; "క. వెలఁగొనియెడువేశ్యాదుల, బలిమిఁగలిసినాతఁడచ్చుఁబదిపణములొగిఁన్." విజ్ఞా. ప్రా. కాం. (చూ. కడుకొను.) 2. పందెము. (చూ. వాట్లీఁడు.)

వెలఁగ. దే. వి. కపిత్థము. "చ. ఇదియొకమంచిలేఁగ వినుఁడెంతయుసొప్పెడునంచుఁదానత, త్పదము లుఁదోఁకయుంబిగియఁబట్టిచెలంగివెలంగ మ్రానితోఁ, జదియఁగనొక్కపెట్టుగొని చంపెఁగుమారుఁడులేఁగరక్కసున్." భాగ. ౧౦, స్కం. పూ.

వెలఁది. దే. వి. 1. గరగరికయైన ఆఁడుది; 2. ఆఁడుది; 3. ధాళధళ్యము. "తే. ఈవెలందియొడల్ పైఁడిలోఁ వెలంది." విజ. ౧, ఆ.—విణ. 1. నిర్మలము; "సీ. ఓలినన్నింటిసద్యోఘృతంబులనించి వెలఁదిపట్టునవర్తులలవరించి." భో. ౨, ఆ. "వెలఁదిముత్తెము." పర. 3, ఆ. "వెలఁదివెన్నెల." స్వా. 3, ఆ.—2. ప్రసన్నము. "పల్కెననుంగువెలంది పల్కులన్." హ. న. ౨, ఆ.

వెలఁదుక. దే. వి. (వెలఁది+ఉక.) వెలఁది. "క. వే, వేలింటంజేజేనవ, లాలుండఁగనీకుని వ్వెలందుకకొఱయే." అచ్చ. సుం, కాం. (స్వార్థమున ఉక.)

వెలచు. వై. స. క్రి. శుద్ధిచేయు, తోము. "సీ. ఆయింటిగృహిణినాయకుఁడు భుజించిన పసిఁడిపళ్లెరము వెల్పలికిఁదెచ్చి, వెలచుచోఁదళతళతళ కులుచిమ్ము తత్ప్రతికజంచితప్రతనొడిసి, యతఁడుపుచ్చుకొనియె." పర. ర, ఆ. (చూ. ఎడ్డెన.)

వెలనాడు. దే. వి. దేశవిశేషము. (రూ. వెల్నాడు.)

వెలమ. దే. వి. శూద్రజాతివిశేషము. (వెలమవాఁడు, వెలమది.) బ. ఆజాతివారు.

వెలమసంది. దే. వి. సేలవేముయొక్క అవాంతరభేదము, కాకజంఘ.

వెలయాలు. దే. వి. (వెల+ఆలు.) వేశ్య. (ఇట్లు వెలవెలఁది. మొ.)

వెలయు. వై. అ. క్రి. 1. ప్రకాశించు; 2. ప్రసన్నతనొందు; (చూ. బెరయు రెండవయర్థము.) 3. ప్రసిద్ధికెక్కు*; "ఎ. గీ. తానవెలయుమనుష్యుఁడుత్తముఁడుపిత్రుపి, తామహులచేతవెలయునతండుజగతి, మధ్యముఁడుమాతచేతనుమాతృబంధు, గణముచే వెలయునతండుగష్టతరుఁడు." మార్క. ౨, ఆ.—4. బయలుపడు*. "తే. వికృతవేషావృతంబయి వెలయఁడితఁడు, నివురుగవిసినమెఱయునినిప్పువోలె." "సం. కపేష వేషసంఛన్నో భస్మన్యేవహుతాశనః." భార. విరా. ౪, ఆ.

వెలరారు. ద్వ. అ. క్రి. (వెలరు+ఆరు.) తెల్లనగు. "సీ. జలధరప్రకరంబువెలవెలనైతోఁచెవెలరారి దిక్కులువిశదమయ్యె." పద్మ. ౯, ఆ.

వెలరు. వై. వి. తెల్లన. "తే. నెఱయుకీర్తిప్రతాపాధ్యు నిన్నుఁదలఁప, యశముశౌర్యంబుగలిగినట్లు లరువెలరుఁ, గాఁకయును." కా. ౨, ఆ.

వెలరువాఱు. ద్వ. అ. క్రి. (వెలరు+పాఱు.) 1. తెల్లనగు; "సీ. ఉదరస్థుఁడగుబాలునుజ్జ్వలకాంతిదావెలిఁబేర్చెననమేను వెలరువాఱె." లక్ష్మీ. 3, ఆ.—2. వెలవెలఁబోవు. "వ. అట్లుదూఱినవెలరువాఱి చేయునదిలేక." నై. ౨, ఆ.

వెలలు. దే. అ. క్రి. వెడలుయొక్కరూపాంతరము. "క. వెలలిబలరిపుఁడుచలమునఁ, గలహమునకుఁజొచ్చి." భార. ఉద్యో. ౧, ఆ.

వెలలుచు. దే. ప్రే. వెడలుచుయొక్కరూపాంతరము.

వెలవ. వై. వి. కాఁపుడుగంజి. "సీ. యవలునుగ్గుగధేనునివహనఁద్రొక్కించి వెలవయత్తెఱఁగునూకలనకాఁచి." భార. అను. 3, ఆ.

వెలపడము. దే. వి. ఒకవిధమైన పరిధాన్యము.

వెలవెలఁబాఱు. ద్వ. అ. క్రి. (వెలవెల+పాఱు.) వివర్ణమగు. "చ. వెలవెలఁబాఱెదన్ముఖము వెల్వెలఁబాఱెవిటాననాబ్జముల్." స్వా. ౫, ఆ. (చూ. పాఱు.)

వెలవెలఁబోవు. ద్వ. అ. క్రి. (వెలవెల + పోవు.) ——వై.——"మోము వెలవెలఁబోవుచు."

వెలవెలన. వై. వి. వెలవెలపాటు. (విశేషణమగుచో "వెలవెలని మొగమున." పంచ. వేం. ౧, ఆ.) (చూ. అలకన.)

వెలవెలనగు. ద్వ. అ. క్రి. (వెలవెలన+అగు.) వెలవెలఁబోవు. "క. తలయుంబీరయు నెండలును, తెలతెలగానట్టెపిండి దిక్కులఁగప్పన్, బలపలని వేడ్కతోడుత, వెలవెలనై బ్రాహ్మణుండువిస్మితుఁడయ్యెన్." పంచ. నా. ౫, ఆ.

వెలవెలనవోవు. ద్వ. అ. క్రి. (వెలవెలన+పోవు.) —వై.—"తే. ముచ్చువేడుకకత్తెలమోము లెల్ల, వెలవెలనవోవఁదూర్పునఁ దెలుపుదోఁచె." కళాం. ౪, ఆ.

వెలవెలపాటు. వై. వి. వైవర్ణ్యము. "వ. అమ్మగువ మొగము వెలవెలపాటులేనవ్వునడంచి." ఆము. ౫, ఆ.

వెలవెల్లనగు. ద్వ. అ. క్రి. (వెలవెల్లన+అగు.) వెలవెలఁబోవు. "సీ. బంధులయ్యాదవపతికెట్టిఁగిం చిననలఁదురివెలవెల్లనగుచుఁగొంత, ప్రొద్దునివ్వెఱఁగంది." భార. మా. ౧, ఆ.

వెలారించు. దే. స. క్రి. వెలారుచుయొక్క రూపాంతరము. "ఎ,గీ. తొల్లిపడినపాటు తెల్లవెలారింతు." సం. "అద్యక్రోధం విమోక్ష్యామి నిగూఢం హృదయేచిరమ్." భార. శల్య. ౨, ఆ.

వెలారుచు. దే. స. క్రి. (వెలి+ఆరుచు.) 1. వెడలించు; 2. బయలుపఱుచు. (రూ. వెలార్చు. వెడలించుటకు.—"క. ఏర్పడలోపగతురనువె, లార్పకలోకంబునకుఁదొలంగకకుదురై, నేర్పనమనఃపవనములు, గూర్పకయోగీశ్వరుండగు నెయ్యెబ్బంగిన్." శివ. ఉ. ౧, ఆ.—బయలుపఱుచుటకు.—"తే. అతఁడాత్మీయగాన, నైపుణివెలార్చుచును జగన్నాథుఁగొలిచె." కళా. ౨, ఆ.)

వెలి. యు. దే. వి. 1. బయలు; 2. బహిస్కారము; 3. దేహముయొక్క బహిఃప్రదేశము; "క. వెలి శుచియైమతితీర్థం, బులుసొచ్చుటమేలు." భార. అను. ౫,ఆ.—4. బయలుపాటు. "క. తలలోపలనాళికపూ, సలప్రుచ్చిన నూలుపోలఁ జల్లినరీరుం, బలె వెలియెఱుంగకమనసులు, గలసియభేదముగఁ గాఁపుకడనతఁడుండున్." పాండు. 3, ఆ.— విణ. బాహ్యము. "ఉ. క్షత్రియుఁడెందునాజి వెలిగానిజరాజ్యముపైరికిచ్చునే." మార్క. 3, ఆ.—వై. వి. తెలుపు. విణ. తెల్లనిది.

వెలికత్తెరనేల. ద్వ. వి. కంకరమన్నుకలిసినభూమి.

వెలికి. దే. వి. ఒకానొకచెట్టు, గంధపిండీతకము?.

వెలికిలు. దే. అ. క్రి. 1. వీఁపుక్రిందగు; (వెలికిలఁబడెను.) 2. వీఁపుక్రిందుగాపడుండు. "చ. వెలికిలిసెజ్జమీఁదఁగడువిప్పుగుకన్నులచాయలొప్పఁజె, క్కిలిగిలిగించివ్రేతలునగింపఁగనుండుటయాదిగాఁగఁజె, న్నలరెడునిమ్మహాత్ముని సమంచితశైశవముంగ్రమంబుతో, విలసితదృష్టినందనుభవించినయాజనులెట్టిధన్యులో." హరి. పూ. ౭, ఆ.

వెలిగడ. ద్వ. వి. (వెలి+కడ.) మెట్టనేల.

వెలిగారము. వై. వి. (వెలి+కారము.) బంగారమునకు కాంతిగలుగఁజేసెడి యొకదినుసు తెల్లనియుప్పు, టంకణము.

వెలిగిడ్డి. వై. వి. కామధేనువు.

వెలిగుల్ల. వై. వి. శంఖము. "క. వెలిగుల్లయుపవమాలయుఁ, గలిమియు మానికముమేనఁ గలిగినవేల్పున్." ద్వా. ౪, ఆ.

వెలిగొండ. ద్వ. వి. (వెలి+కొండ.) దూరమునందున్న పర్వతము.

వెలిగారు. ద్వ. వి. (ఇంద్రుని) తెల్లయేనుఁగు, ఐరావతము.

వెలిగ్రుక్క. దే. వి. రతికూజితము, మణితము.

వెలిచేంద్ర. ద్వ. వి. తెల్లచేంద్ర, కదరము?.

వెలిచేవి. దే. వి. జారత్వము.

వెలిచె. దే. వి. పక్షివిశేషము, వర్తకము. (మొదటి రూపము వెలిచియ.)

వెలితి. దే. వి. 1. తక్కువ; 2. తఱుచుఁదనములేమి. విణ. 1. తక్కువైనది; 2. తఱుచుకానిది.

వెలితిప్ప. వై. వి. వెండికొండ, కైలాసము.

వెలితుమ్మ. ద్వ. వి. తెల్లతుమ్మ, విట్ఖదిరము?.

వెలిదుక్కి. దే. వి. నీళ్లుకట్టక వానతడిచే దున్నుట. (మఱియొకటి రొంపిదుక్కి.)

వెలిపము. దే. వి. వలిపముయొక్క రూపాంతరము. (సన్నని తెల్లవస్త్రమునకు.—"సీ. వెన్నెలపోరవంటివెలిపంబుచెంగావి జిలుఁగుపావడమీఁదనలవరించి." య. ౨, ఆ.)

వెలిపుచ్చు. దే. స. క్రి. బయలుపఱుచు.

వెలిపెట్టు. దే. స. క్రి. వెలివేయు. "సీ. వెలిపెట్టి రేబాడబులుపరాశరుఁబట్టివాశకన్యాకేళితప్పఁజేసి." స్వా. ౨, ఆ.

వెలిబిత్తరి. దే. వి. మల్లబంధవిశేషము.

వెలిపాడు. దే. వి. విదేశములకంపఁబడు ధాన్యాదులు. (లోపాడు, విదేశములనుండి తేఁబడు ధాన్యాదులు.)

వెలిమావు. ద్వ. వి. (ఇంద్రుని) తెల్లగుఱ్ఱము, ఉచ్చైశ్శ్రవము.

వెలిమిడి. ద్వ. వి. (వెలి+మిడుఁగు.) 1. భస్మము; "సీ. తగనంధకునకునద్దంబుఁజూపినయట్లువెలిమిడిలోనెయ్యివేల్చినట్లు." పంచ. నా. ౧, ఆ. (చూ. ములుగు.) 2. బూడిద. (చూ వెల్మిడి)

వెలిమొట్ట. ద్వ. వి. మత్స్యవిశేషము.

వెలిమ్రాను. ద్వ. వి. దేవతరువు, కల్పవృక్షము.

వెలియు. దే. అ. క్రి 1 వానకురిసినిలుచు; 2. చాయయొత్తిపోవు.

వెలియునికి దే. వి. (వెలి+ఉనికి) పరదేశమునందలి యునికి, ప్రవాసము.

వెలివాఁడు. దే. వి. చండాలుఁడు. "వెలివాండ్రుర పల్లెకుఁజేరి." సం. "తస్మిన్ శ్చాండాలపక్కణే." భార. శాం. 3, ఆ.

వెలివాడ. ద్వ. వి. చండాలవాటిక.

వెలివాడవాఁడు. ద్వ. వి. చండాలుఁడు. "సీ. ప్రార్థింపనున్వాఁడుపాదాగ్రముల వ్రాలి వెలివాడవాఁడుతద్విప్రకులుని." కాశీ. ౭, ఆ.

వెలివాఱు. దే. వి. కోటాడెడుచోట బయటచుట్టు పాఱించెడుపోఁగు. (చూ అరడము)

వెలివిరియు. దే అ. క్రి. వెల్లివిరియుయొక్క రూపాంతరము. (ఉబుకుటకు.—"అంతరంగమున నిండిన హాస్యరసంబు మోముపై వెలి విరియంగనీక." భార. విరా. 3, ఆ.) (చూ. పొలుపు రెండవయర్థము.)

వెలివిసరు. దే. అ. క్రి. బయలుపడు. "క. విరసము వెలిసాహసముం, బురికొన నిట్లుభయసైన్యములుపోరఁగ్రూర, క్షురసతరసములగదురన, శరనిధిసత్వములు వెలివిసరిరాఁదొడఁగెన్." పంచ. వేం. ౪, ఆ.

వెలివేయు. దే. స. క్రి. బహిష్కరించు. "ద్వి. వెంగలిగామిమ్ము వెలివేసికొనఁడు." భల్లా. ౨, భా.

వెలిసె. దే. వి. ఇంటిచూరు.

వెలు. దే. వి. వృత్తియందు వెలికివచ్చెడు ఆదేశము. (ఉదా. వెలుపల, వెలువడు. వెం.)

వెలుంగు. దే. అ. క్రి. 1. ప్రకాశించు; 2. జ్వలించు. "ఆ. పద్మబాంధవుతోంటియట్ల వెలుంగఁగ, వలయుగురుఁడుచూచిరియులమికొంద." పూర్వ. 3, ఆ.—వి. 1. ప్రకాశము; 2. కిరణము; "మ. తళుకుంబ్రొద్దువెలుంగుక్రొంబసిఁడినిగ్గాచోపుడుం గట్టియన్." చంద్రా. ౧, ఆ.—3. ఎండ. (చూ. కాచు. అ. క్రి. రెండవయర్థము.)

వెలుఁగుఱేఁడు. దే. వి. సూర్యుఁడు, త్విషాంపతి.

వెలుఁగొందు. దే. అ క్రి. (వెలుఁగు+ఒందు.) ప్రకాశించు.

వెలుక. ద్వ. వి. (వెలి+ఉక.) తెల్లన. (స్వార్థమున ఉక.)

వెలుకఁబాఱు. ద్వ. అ. క్రి. (వెలుక+పాఱు.) వెల్లఁబాఱు. "క. తనదువర్ణము, బాధితమగునేని వెలుకఁబాఱు ఘనుండున్." పాండు. ౪, ఆ. (చూ. పాఱు.)

వెలుగు. దే వి. లోపల పశువులు లోనగునవి చొరక తోఁట మొదలగువానిచుట్టు ముండ్లచెట్లుపెట్టి యొదిగించిన ఆవరణము. "ఆ. వేయిచేతులిచ్చి వెట్టిఁజేసినకూలి, బాణుఁజెఱుపఁదలచి భండనంబుఁ, గలుగఁజేసెనింక వెలుగుచేన్మేసినఁ, గాచువారలెందుఁగలరుజగతి." ఉ హరి. ౫ ఆ. (రూ వెల్గు.)

వెలుచే దే. వి. సర్పము. (చూ వెల్చ.)

వెలుచు దే. స. క్రి. తోలు. "క. శరములవేగంబు నగద, పరుసఁదనంబునను గలఁగఁబడిచేడ్పడు నా, కరులందోలెనుభీముఁడు, వెరవునగోపకుఁడుకదుపువెలిచినమాడ్కిన్." భార. భీష్మ. ౨, ఆ. (ప్రే వెలిపించు.) ప్రే. 1. వెడలించు; "వ. వెలిచిన కన్నునీరుజడి" ఉ, హరి. ౫, ఆ.—2. (నూలు) తోఁడు. (వెలలుచుయొక్క రూపాంతరము. రూ. వెల్చు.)

వెలుతురు. యు. దే. వి. ప్రకాశము, ఎండ. "క. వెలుతురసలంటి యొండియు." ఆము. ౪, ఆ. (రూ. వెల్తురు.) -- వై. వెఱుతురుయొక్క రూపాంతరము.

వెలుపల. దే. వి. (వెలి+పల.) బహిఃప్రదేశము. "వ. తలుపులు వెలుపలంగాడనియు." ఉ, హరి. ౭ ఆ. (చూ. లోపల. వి.) విణ. వెలియైనది. "క. శతకఁడుదా వెలుపలయై, యే తెఱఁగున నైన వారియొపడఁచిపరా, భూతులఁజేయుదునని ప్రఖ్యాతజమాయాధిరూఢుఁడయిపురివెడలెన్." కళా. ౭, ఆ. (చూ. వెలు.)

**వెలుపలించు.** దే. స. క్రి. వెలిపఱుచు. (రూ. వెల్వలించు.)

**వెలుపించు.** దే. స. క్రి. వెలుపుచేయు. "పెట్టనుబట్టి తెక్క వెలుపించి." సా. ౧, ఆ.

**వెలుపు.** దే. వి. వెవెలుపుయొక్క రూపాంతరము.

**వెలుపుడు.** దే. వి. నూలువెలుచుటట. ఆం, భా. (చూ. వెలుచు.)

**వెలువడము.** దే. వి. సస్యవిశేషము. (చూ. వరగ.) బ. ధాన్యవిశేషము. (చూ. వెల్వడము.)

**వెలువడు.** ద్వ. అ. క్రి. (వెలి+పడు.) 1. బయలుపడు; "నూతిలో వెలువడఁగో మలిందిగిచె." భార. ఆది. 3, ఆ.—2. బయలుదేఱు. "క. వెలువడియె నశేషరాజ్యవిభవచ్యుతుఁడై." భార. అర. ౨, ఆ. (చూ. వెలు.)

**వెలువరించు.** ద్వ. ప్రే. వెలువఱుచుయొక్క రూపాంతరము. (రూ. వెల్వరించు. "తే మృగియులందఱు సని వెల్వరించి." స్వా. ౪, ఆ.)

**వెలువఱుచు.** ద్వ. ప్రే. వెలువడఁజేయు.

**వెల్కఁబాఱు.** ద్వ. అ. క్రి. వెలుకఁబాఱుయొక్క రూపాంతరము. "ద్వ. దేహకళ వెల్కఁబాఱె." రా. బాల, కాం.

**వెల్చు.** దే. వి. వెలుచేయొక్క రూపాంతరము. "వెల్చులక్రియఁగానరానిగతులన్ మయిమైఁబెనఁచున్." స్వా. 3, ఆ.

**వెల్చె.** దే. వి. వెలిచెయొక్క రూపాంతరము. "ప్రల్లదంబునను వెల్చెలకుందగముద్దుపెట్టి యొక్కెడ మటికాటులాడనిడు" భల్లా. 3, ఆ.

**వెల్తి.** దే. వి. విణ. వెలితియొక్క రూపాంతరము.

**వెల్పల.** దే. వి. విణ. వెలుపలయొక్క రూపాంతరము (చూ. వెలచు.)

**వెల్మిడి.** ద్వ. వి. వెలిమిడియొక్క రూపాంతరము. (బూడిదకు.—"మనసయ్యె వెల్మిడియు." రామా. 3, ఆ.)

**వెల్ల.** వై. విణ. తెల్లనిది, ధవళము. "కుంభభవకృపాచార్యులయుష్ణీషములు వెల్లలు." భార. విరా. ౫, ఆ.

**వెల్లఁకి.** దే. వి. గడ్డ. "చ. మాకుఁగాయలుఁ,గనురులువేల్లు వెల్లఁకులుఁగాక సముజ్జ్వల[illegible]ణంబులున్, బసిఁడియు నేల." నిర్వ. ౧౦, ఆ. "ఛైదకి తెరపోయి వేరువెల్లంకి." క్షేత్రయ.

**వెల్లఁబాటు.** వై. వి. (వెల్ల+పాటు.) వెల్లనగుట. కవిక. ౪, ఆ.

**వెల్లఁబాఱు.** ద్వ. అ. క్రి. (వెల్ల+పాఱు.) వెల్లనగు, వైవర్ణ్యముఁబొందు. "క. ఒసఁగు నెడఁగరుఁగరిలు, నొసఁగియొసఁగి వెల్లఁబాఱు నొగిసీకరణిన్, వినువక యొసఁగఁగనేర్చునె, యసదృశగతినంబువాహమాబళినరసా" కా. ౨, ఆ.

**వెల్లచేఱవు.** ద్వ. వి. సున్నపుపూఁత.

**వెల్లడి.** వై. వి. 1. బయలు*; 2. ప్రసిద్ధి*.

**వెల్లన.** వై. వి. తెల్లన. (విశేషణమగుచో "వెల్లనికన్నులు.") (చూ. అలకన.)

**వెల్లనగు.** ద్వ. అ. క్రి. (వెల్లన+అగు.) వెల్లఁబాఱు. "క. తల్లడపడియరదముడిగి, విల్లును నమ్ములును విడిచి వెల్లనగుచు మే, నెల్లఁజెమర్పఁగనూర్పులు, పెల్లుగనమ్మునుజపకువు పెలుచంబఱచెన్." భార. అర. ౬, ఆ.

**వెల్లాటకత్తె.** ద్వ. వి. (వెల్లాటకము+కత్తె.) జారిణి. "తే. నీ జననిపుణ్య జనవర్ణనీయసాధ్వి, నీజనకుఁడెన్న నభిమాననియతిధనుఁడు, నీనగరుపోకటికిఁ గకునిలువరాని, దయ్యె వెల్లాటకత్తెవై వాటయిరిది." శుక. ౧, ఆ.—వేశ్య. (అని కొందఱు.) (మొదటిరూపము వెల్లాటకత్తియ.)

**వెల్లాటకము.** ద్వ. వి. (వెల్ల+అటకము.) ప్రసిద్ధి. "ఎ, గీ. సంభవించిరి గంధర్వజాతిననిఁ, గలితసంబేలవెల్లాటకంబు సేయ." భీ. ౧, ఆ.

**వెల్లి.** యు. దే. వి. 1. ప్రవాహము; 2. పరంపర. "భావజాసలరంపవెల్లిపాల్పడితి." మార్క. ౪, ఆ.—వై. తెలుపు. "ఈ. వెల్లులుగూటఁబోసికొను వేసుకఁబుక్కిటఁబట్టిచీకటుల్, జల్లునఁబాఱఁగానుమిసుఁజూఁగినకోరికలంజకోరికల్." కవిక. ౪, ఆ.

**వెల్లిక.** దే. వి వెల్లియొక్క రూపాంతరము. (ప్రవాహమునకు.—"అజాబిల్లి వెలుంగు వెల్లికలడాయున్ లేక." వసు. ౪, ఆ.)

**వెల్లిగొను.** దే. అ. క్రి. (వెల్లి+కొను.) 1. ప్రవహించు; "శా. ఇంకేభంగిందరియింతు వెల్లిగొని పెల్లే తెంచుశోకాంబుధిన్." హరిశ్చ. ౫, ఆ.—2 పరంపరగా వెడలు. (చూ. టింగు.) (ప్రే. వెల్లిగొలుపు.)

**వెల్లివిరి.** దే. విణ. ప్రకటితము. "ఎ, గీ. కంటు[illegible]మునదేవకీకమలముఖికిఁ, గడుపుదిగఁబ[illegible]

నక్కటయటంచు, వెల్లివిరిగాఁగవాడుదురెల్లవారు." వి. పు. ౭, ఆ.

**వెల్లివిరియు.** దే. అ. క్రి. 1. ప్రవహించు; "తే. పెరిఁగి పాండవాంబుధి వెల్లివిరిసినపుడు." భార. భీష్మ. ౧, ఆ.—2. ఉబుకు; "ఎ, గీ. ఉల్లమునుండి ఖేదంబు వెల్లివిరిసె." భార. విరా. ౨, ఆ. (చూ. వెలివిరియు.) —3. వ్యాపించు; "చ. అచ్చెరువుగఁబోయి వెల్లివిరిసెన్ గపివాహినిలంక చుట్టునున్." రా. యు, కాం.—4. ప్రకటితమగు; "ఆ. నీకడింది లావు సేసెఱుంగ సెవాలి, తోఁకఁజుట్టికడలిఁద్రోయుటయును, ఱెఱను బెట్టివేయి చేతుల మొకిమీఁదు, విడుచుటయు జగమున వెల్లివిరిసె." అచ్చ. యు, కాం.—5. చెదరు. (చూ. చెన్ను రెండవ యర్థము.)

**వెల్లివోడుచు.** దే. అ. క్రి. (వెల్లి+పొడుచు.) ప్రవహించు. "గంగయాతనిముఖాగారంబుపై వెల్లి వొడిచిన." హరి. పూ. 3, ఆ.

**వెల్లుల్లి.** ద్వ. వి. (వెల్ల+ఉల్లి.) తెల్లగడ్డ, లశునము.

**వెల్లువ.** దే. వి. 1. ప్రవాహము; 2. సేన; "తే. వెదకి మఱిగల్గుమల లెల్లఁగదియఁజేర్చి, కట్టగట్టినఁగా సల్యపట్టిమున్ను, వెల్లువలనెల్లనడిపించి వెనుకఁదగిలి, తమ్ముఁడును దాను మున్నీరుదాఁటియవల." య. 3, ఆ. (ఈయర్థముల రెంటియందు నిది వాహినీ శబ్దసమానార్థకము.)—3. ఇటికగోడల యింటిచూరు.

**వెల్లువగట్టు.** దే. అ. క్రి. (వెల్లువ+కట్టు.) 1. ప్రవహించు; 2. మడుఁగుకట్టు. "చ. వికచసరోజమధ్యమున వెల్లువగట్టుమరందబృందమున్." భాను. ౨, ఆ.

**వెల్లెలుక.** ద్వ. వి. (వెల్ల+ఎలుక.) తెల్లయెలుక. (మొదటిరూపము వెల్లయెలుక.) (చూ. కల్లెలుక.)

**వెల్వడము.** దే. వి. వెలఁవడముయొక్క రూపాంతరము. "సీ. సడఁతినిన్నంటి వెల్వడము కోర్కిఫలించెననరాజభోగమే యతికయిల్లు." (ఇక్కడ శ్లేష.) రసి. ౧, ఆ.

**వెల్వడు.** ద్వ. అ. క్రి. వెలువడుయొక్క రూపాంతరము. "ఉ. తమిస్రపుం, జంబులువోలె వెల్వడియొ శైలవిశాలగుహాళిఘుండి సా, గంబులయూధములే." భార. ఆది. ౬, ఆ.

**వెల్వెలఁబాఱు.** ద్వ. అ. క్రి. వెలవెలఁబాఱుయొక్క రూపాంతరము. (చూ. వెలవెలఁబాఱు.)

వెల్వెలుకఁబాఱు. ద్వ. అ. క్రి. (వెల్వెలుక+పాఱు.) మిక్కిలి వెలుకఁబాఱు. "సీ. విమతుల మోములు వెలవెలఁబాఱంగ విమలాస్యమోము వెల్వెలుకఁబాఱె." భాగ. ౧౦, స్కం. పూ. (వెలువెలుకఁబాఱుయొక్క రూపాంతరము.)

వెల్వెల్ల. వై. విశ. (వెల్ల+వెల్ల.) మిక్కిలి వైవర్ణ్యము. "అవ్విభుఁడు గర్వంబేది వెల్వెల్లగన్." భార. శల్య. ౧, ఆ.

వెస. వై. వి. వేగము. "పదంబులన్ గడున్ వెసగదియన్." భార. విరా. 3, ఆ. "హయములకుఁ దెవులుగడువెసమైఁజననిచ్చుట." (కడువెసమైఁ జననిచ్చుట హయములకుఁదెవులు అని యన్వయము.) హరి. పూ. 3, ఆ.—క్రి. విశ. శీఘ్రముగ*. "క. గౌతమికిం, జనియట్టులపల్కనదివెసం దెరువిచ్చెన్." భో. 3, ఆ.

వెసనము. వై. వి. వ్యసనము. (ఇది కొన్ని నిఘంటువులందు వైకృతముగా వ్రాయఁబడియున్నది.)

వెసల. దే. వి. వంటకుఁడు. "క. వెసలలనామణిబంగరు, వెసలలదొంతరలఁడించి వినయముమదికిం, పొసఁగఁగఁగంకణరవములు, పొసఁగఁగ నారసి రసాన్నములువడ్డించున్." విజ. ౨, ఆ.

వెళ్లు. దే. అ. క్రి. 1. వెడలుయొక్క రూపాంతరము; (వానిని వెళ్లఁగొట్టెను, వాఁడు ఇల్లు వెళ్లిరాఁడు.) 2. పోవు. (నేను ఊరికి వెళ్లివచ్చితిని.)

## వే.

వే. యు. దే. స. వేయి. "క. మొగములు వేగలశేషుండు." కవి. ౧, ఆ.—విశ. అనేకము. (వేమాఱులు.)—వై. క్రి. విశ. 1. వేగముగ; "క. కీచకునియింట సెప్పుడు, వాచవియగుబహువిధంపు వారుణిగలుగున్, వేచనియిచటికిఁగొనిర, మ్మాచూతముగాని నీగమన వేగంబున్." భార. విరా. ౨, ఆ.—2. శీఘ్రముగ*. "క. వి, రోచనుఁడాత్మీయత్విగ్రుచిఁదల్లితనూ, గోచరకాంతియఖిలమును, వేచెన్నఱఁజేసె." హరి. పూ. ౧, ఆ. (అప్రేడితముగుచో వేవే. "ఉ. నా, కీయకృతంబువాటిలుటయేర్పడమీకతిఁగింపఁగోరెవే, వేయిటుపాఱు తెంచితి." నిర్వ. ౨, ఆ.)

**వేంచేయు.** మి. గ్రా. అ. క్రి. 1. వచ్చు; "క. వేంచేయుము నాయింటికి." భాగ. ౧౦, స్కం. పూ.—2. పోవు; "ఎ, గీ. దివిజాలుమునులును

బ్రాహ్మణులును, జనిరినిజమందిరములకు జలజనయన, భవులువేంచేసిరిస్వకీయభవనములకు." భాగ. ౪, స్కం.—3. కూర్చుండు; "ఎ, గీ. ఉరగరిపువాహనమునసొక్కెక్కవేళ, వేడ్కవేంచేసి మెఱయుఁదిర్వీధులందు." పాండు. ౪, ఆ.—4. నివసించు. "వ. ఔద్దాలకఋష్యాశ్రమంబునందు వేంచేసియున్న వాఁడు." శేష. ౪, ఆ. (విజయము చేయుయొక్క మాఱురూపము.) (చూ. విజయము చేయు.)

వేంద్రము. దే. వి. తాపము. (చూ. ... క్రము.)

వేఁకటి. దే. వి. గర్భము. (వ్రేఁ ... రూపాంతరము.)

వేఁకరము. దే. వి. ఉపద్రవము

వేఁకరి. దే. వి. (వ్రేఁకము+అరి ... దము.

వేఁకి. దే. వి. జ్వరము. (చూ.

వేఁగి. వై. వి. పులి, వ్యాఘ్రము

వేఁగినాడు. దే. వి. వేఁగీదేశము.

వేఁగిస. దే. వి. సర్జకము?.

వేఁగీ. దే. వి. దేశవిశేషము. "వ ... అఖిలజలధివేలావలయవలయిత వసుమతీ వ ... విభూషణంబైన వేఁగీదేశంబునకు." భార. ఆ ... ౧, ఆ.

వేఁగు. దే. అ. క్రి. తపించు (వ్రేఁగుయొక్కరూపాంతరము.)

వేఁచు. దే. ప్రే. వేఁగఁజేయు, వేఁగించు.

వేఁట. దే. వి. 1. మృగయ; "ఉ. నేఁటికినొప్పఁగా కరజనీచరువీడెటులైనసెల్లిపో, దాఁటికవాటముల్ విఱుగదాఁచుచుఁజేతులతీఁటవోవమై, తీఁటలువుచ్చిరక్కసులఁదీర్చుటరాముఁడొనర్పనున్న పెఁ, వేఁటకురావణాది మృగబృందముఁదార్చుటలంచునార్చినన్." రా. యు, కాం. (ఇది ద్వివిధము—మృగములవేఁట, పక్షులవేఁట. అందు మృగములవేఁట ఏదువేఁట, గంటవేఁట, తెరవేఁట అని త్రివిధము. పక్షులవేఁట పాదివేఁట, విడివేఁట అని ద్వివిధము.)—2. మేఁకపోతు; "వ. వేఁటమాంసంబష్టమాసంబులు, దుప్పిమాంసంబు నవమాసంబులు, గురుపోతుమాంసంబు దశమాసంబులు, తగరుమాంసం బేకాదశమాసంబులు, గోవుపాలును బాయసంబును బండ్రెండు మాసంబులు పితృదేవతలకుఁదృప్తియొనరించు." మార్క. 3, ఆ.—3. పొట్టేలు. "క. ఏటికినీరాచతికము, బోటులుమెఱవెట్టఁబకువు బోరనియుఱవన్, వేఁటలనీడ్చెడుదొంగల, గీటడఁపవువెడలిశవముక్రియనుండెదిదే." భాగ. ౯, స్కం.

వేఁటకాఁడు. దే. వి. బోయ, మృగయుఁడు. భార. శల్య. ౨, ఆ.— విణ. సంహారకుఁడు. (చూ. కాచు రెండవయర్థము.)

వేఁటకుక్క. ద్వి. వి. వేఁటాడుటయందు నేర్పుగల శునకము, విశ్వకద్రువు.

వేఁటగిరి. దే. వి. వేఁటాడిజీవించెడిబోయ. "క. వేఁటకరుల్ గలయలవన, నాటగిరుల్ నూటిభిల్లవరులేనాదుల్, వేఁటగిరుల్ వేఁటకరుల్, వేఁటమరుల్ దొరకుదొరకువిడివడియంతన్." రా, వి. 3, ఆ.

వేఁటపల్లె. ద్వి. వి. బోయపల్లె, పక్కణము. "సీ. వింధ్యాద్రినడుమనిర్వింధ్యాతటంబునఁగానలో నొక్కపక్కణముగలదు, పింగాక్షుఁడనియెడు పేరివాఁడా వేఁటపల్లెయేలెడుభిల్లపరివృఢుండు." కాశీ. ౪, ఆ. (మొదటిరూపము వేఁటపల్లియ.)

వేఁటపిట్ట. ద్వి. వి. దీమపుపిట్ట. (చూ. దీమము.)

వేఁటరి. దే. వి. (వేఁట+అరి.) వేఁటకాఁడు. "చ. బలిరేపురేయరరబాపురెయంచువచింపవేఁటరుల్." చంద్రా. ౨, ఆ.

వేఁటాడు. దే. స. క్రి. (వేఁట+ఆడు.) 1. అడవియందు మృగములను పక్షులను వధించు; 2. వధించు. "క. వేఁటాడెదఁబ్రతిబలంబువీరులనెల్లన్." భార. ఉద్యో. ౪, ఆ. (రూ. వేఁటలాడు. వి. వేఁటలాట.)

వేఁడి. దే. వి. 1. వేఁడిమి; "ఎ, గీ. కందువారలనిట్టూర్పుగాడ్పువేఁడి, ముకురములు." నై. ౧, ఆ.—2. తాపము; "ఎ, గీ. వేఁడియొల్లనుడపివిబుధారికినుకమై, భీతిపాత్రుఁజేసె వీతిహోత్రు." లక్ష్మీ. ౨, ఆ.—3. చుఱుకు; "ఆ. సప్తహయుఁడుమూర్తిసప్తకంబుధరించి, కరమువేఁడిమిగులుకరములొప్ప, నదనదీజలములునుదధిజలంబులుఁ, బీల్చిజగములెల్లఁద్రేల్చఁగడఁగి." భార. అర. ౪, ఆ.—4. తేజము. "క. అపరిమితమైననీయుగ్రపువేఁడింబ్రాణులెల్లఁగ్రాఁగెడుఁదేజం, బుపసంహరింపుసృష్టికి, విపరీతము పుట్టకుండ విశ్వమయాత్మా." మార్క. 2, ఆ.—విణ. 1. ఉష్ణము; "ఆ. వేఁడివేఁడినీరువెడఁదకాటుకకంటి, కొలకులందుమాటికొలుకుచుండ." సా. 3, ఆ.—2. ఎక్కడనున్నాఁడు. "ఉ. పోఁడిగనెందునుంగలఁడుపొమ్మనుదానునిజవ్యాపుండియో, వేఁడిర

మానిభుండసెడి వేతేఁడి దైత్యు విదృష్టినుండిరో, వాఁడిది వ్రేయునింక నని వావిరిఁగంబము నందు నుండియో, నాఁడటులుద్భవించుట యనందగు సర్వగతాత్ముఁడల్పుఁడే." భో. ౧, ఆ. (దీనికి నీరుశబ్దము పరమగునపుడు డివర్ణలోపము చూపట్టెడు. "తే. ఏళ్లనీరులనొండె వేనీళ్లనొండెఁ గడుపటాతఁ దోమిననొండెఁ గలుగు శుద్ధి." మార్క. 3, ఆ.)

వేడికంటి. దే. వి. (వేడి+కన్ను.) శివుఁడు, ఉగ్రాక్షుఁడు. "ఉ. ముక్, మ్రింగినయావిసంబు వెస మీఁదికిఁ బిచ్చిలు వేడికంటియాజంగమటంచు." య. ౪, ఆ.

వేడిమి. దే. వి. 1. వెచ్చన; 2. తాపము. "క. వేడికొనిశృపణుటైకను, పోఁడిమియదియేల రాజపుత్రులుదముమై, వాఁడిమిదప్పిననిప్పుల, వేడిమి చెడినట్లుజనులు విని యలుకుదు రే" భార. ఉద్యో. 3, ఆ.

వేడివెలుఁగు. దే. వి. సూర్యుఁడు, ఉష్ణరశ్మి. "ఉ. వేడినవట్లకాక పృథివింజిరకాలమభీష్ట సౌఖ్యముల్, పోఁడిగమీరు గాంచి మతిపొందుఁడుమద్గతియంచుఁజెప్పియుఁ, వేడివెలుంగులోలిఁ బదివేలసహస్రములున్న భంగిని, వ్వాఁడువెలుంగునట్టిబుధవత్సలుఁడేగెనదృశ్యమూర్తియై." భో. ౪, ఆ.

వేడివేలుపు. దే. వి. 1. సూర్యుఁడు, తపనుఁడు; "చ. ఉదిరిపసిండిచాయగలయొప్పులకుప్పలు వేడివేలుపుం, గొదమ లుదారపావకునికుఱ్ఱలుఁ చిచ్చఱకంటిసెచ్చెలుల్, తుదిజమువేడముల్ పిడుగుతున్కలువానరవీరు లొక్కటన్, బొదివిరిలంకచుట్టునసుభూగగనంబులునిండ నార్చుచున్." రామా. ౭, ఆ.—2. అగ్ని, జ్వలనుఁడు. "సీ. హరిహయవాహనా హంకారము హరించి వేడివేలుపు జాడ మెంటనంటి." పను. ౪,ఆ. (రూ. వేడివేల్పు.)

వేఁడు. దే. స. క్రి. 1. ప్రార్థించు, "ఉ. వీరకుమారయేను నిను వేఁడెదఁ బ్రార్థనసల్పుమయ్య." మార్క. ౨, ఆ.—2. కోరు; "చ. వడిగొనిగోగణంబుఁబొదువంబఱతెంచితి రిల్లవారము న్నొండఁబడిపొందు నందసులయున్నెడ యిమ్మెయిఁగాన వేఁడి." భార. విరా. ౪, ఆ.—3. యాచించు. "వీరలునొరు వేఁడఁబోదురె."సం."ఏవమప్యయమర్థ్యంతః పరఃకార్యోర్థ్యయాచితుమ్." భార. ఉద్యో. ౧, ఆ. (చూ. వేఁడుకోలు.)—స. ఎవఁడు. "తే. వీరిలో ముఖ్యులెవ్వారు వేఁడు రాముఁ, డతని యనుజన్ముఁడెట్టివాఁ డనుచుఁబలుక." రామా. ౭, ఆ.

వేఁడుకొను. దే. స. క్రి. ప్రార్థించు, (రూ. వేఁడికొను.) (చూ. వేఁడిమి.) (స్వార్థమున కొను.)

వేఁడుకోలు. దే. వి. వేఁడుకొనుట. "మత్త. వేఁడుకొంతయుఁగష్టమైనను వేఱులేని సుహృజ్జనున్, వేఁడుకోలుచితంబె." భార. ఆది. ౫, ఆ. (రూ. వేఁడికోలు )

వేఁత. దే. వి. వ్రేఁతయొక్క రూపాంతరము.

వేఁదుఱు. దే. వి. ఉన్మాదము. "ఉ. వేఁదుఱుగొన్న మానవుని వేమఱుఁగంటియు బిట్టుగాల్చియున్, మోఁదియునీటఁద్రొక్కియును మొక్కనితీర్పఁగడంగు వెజ్జున, ట్లేదఁగ నిన్ని చందములనీ తనిదీర్చుటకై పెనంగితిన్." లక్ష్మీ. ౫, ఆ.—విశ. 1. ఉన్మత్తుఁడు; "ఆ. ఏను వేఁదుఱుగుదువాని నీవేఁదుఱు, పట్టిచదువఁగలదె." సం. "ఉన్మత్తోహమనున్మత్తం కాంతమన్వపసంచిరమ్." భార. శాం. ౪, ఆ.—2. మూఢుఁడు. "విజయుండుచచ్చు నే వేఁదుఱులార." భార. అశ్వ. ౪, ఆ.

వేఁపి. దే. వి. కుక్క, శునకము, సారమేయము. (ఇది వేఁగుధాతు కృదంతము.)

వేఁపు. దే. వి. వేఁచుట, వేఁపుడు. (వ్రేఁపుయొక్క రూపాంతరము.)

వేఁపుడు. దే. వి. 1. వేఁచుట, భర్జనము, 2. వేఁచెడు చట్టి. విణ. వేఁచినది. "క. ఉడికినపిష్టమిరియము, పొడిబెల్లముఁజల్లియుద్దుపొడిరాలిచి నేతడనెఱ్ఱఁగ వేఁచిన వేఁ, పుడుఁగందమిళింద వేణిపొందుగనిడియెన్." పాంచా. ౪, ఆ.

వేఁబోక. దే. వి. వేగుఁబోకయొక్క రూపాంతరము (చూ. పూఁబోఁడి.)

వేకువ. దే. వి. వేగుజాము, ప్రభాతము. "వేకువగుచో." హంస. ౨, ఆ.

వేగ. వై. వి. 1. వడి; 2. త్వర. "అధృతరాష్ట్రుండవినీతిచేసినను సంధింపఁగరాదంచు వే, గతెగంబాఱుకు." భార. ఉద్యో. 3, ఆ.—క్రి. విణ. త్వరితము. "ఇప్పని వేగతీర్తు నేమటు." య. ౨, ఆ. (వేవేగయని ప్రయోగము.) (ఇది కుండలోనగు వానివంటిది.)

వేగంటి. దే. వి. (వే+కన్ను.) ఇంద్రుఁడు, సహస్రాక్షుఁడు. "ఎ. గీ. దీనిఁగనుఁగొన్న వేగంటిదేవర కును, వెచ్చనిట్టూర్పుపుక్కిటఁ బెడలకున్నె." రామా. ౬, ఆ.

వేగపడు. మి. అ. క్రి. త్వరపడు. "వేగపడుట మేలె." భార. ఉద్యో. 3, ఆ.

వేగపాటు. మి. వి. వేగిరపడుట. (చూ. తేఁకువ రెండవయర్థము.)

వేగము. సం. వి. అ. పుం. 1. జవము; 2. ప్రవాహము; 3. త్వర; (చూ. వేగ.) 4. విపహ్నిత్కఫలము; 5. మలమూత్రాదిప్రవృత్తి; 6. త్వరితము. "మాన్పవలయుఁ బో వేగంబభూభారముఁ బో." హరి. ఉ. ౧, ఆ.

వేగరి. దే. వి. (వేగు+అరి.) సమాచారము తెలుపువాఁడు, చారుఁడు. "అవృత్తాంతము వేగరుల్ తెలుపఁగా." ఉ, రా. ౧, ఆ.

వేగి. సం. వి. న్. పుం. గుఱ్ఱము. విశే. వడిగలది.

వేగించు. దే. అ. క్రి. జాగారముచేయు. "క. నిశ లెల్లనతఁడుదనప, ర్ణశాలలోపల సుఖంబుననునిద్రింపఁ బో, శశిముఖితదాగమాశా, వశతఁ బో వేగించుఁజేరువనొకగుడిసెలోఁ బో." పర. 3, ఆ.

వేగిరకత్తె. వై. విశే. (వేగిరము+కత్తె.) త్వరగలది. "వేగిరకత్తెవీవు." విజ. 3, ఆ. (మొదటిరూపము వేగిరకత్తియ.)

వేగిరకాఁడు. ద్వ. విశే. (వేగిరము+కాఁడు.) త్వరగలవాఁడు. "ఉ. వేగిరకాఁడుమన్మథుఁడు వెన్కయుముందునుజూడఁడు." విజ. 3, ఆ.

వేగిరపడు. వై. అ. క్రి. (వేగిరము+పడు.) త్వరపడు. "వేగిరపడిరొయెదవేలయింత." భార. సౌ. ౧, ఆ.

వేగిరపాటు. వై. వి. వేగిరపడుట. "వ. అతనివేగిరపాటుచూచిశిరఃకంపంబుసేయుచు." భార. విరా. ౨, ఆ.

వేగిరపెట్టు. ద్వ. స. క్రి. (వేగిరము+పెట్టు.) త్వరపఱచు. "వ. ఆరథికసారథులంజూచువేడ్కమనంబున వేగిరపెట్టెడు." భార. విరా. ౫, ఆ.

వేగిరము. వై. వి. 1. వేగము; "క. హరితేజముహరికాంతియు, హరివిభవము హరిభయంకరాకృతి హరివే, గిరముహరివిక్రమంబును, హరియనుపేరిటికిలక్ష్మినాపాదించుఁ బో." ఉ, హరి. ౬, ఆ.—2. త్వర. "సీ. ఉండునీవిచ్చోటనూఱుటనేఁ డెల్లికురలకిక్కేమి వేగిరము వచ్చె." వై. ౪, ఆ.— క్రి. విశే. త్వరితము. "సీ. కావింతునశనసంస్కారంబుమీరారగింతురుగాని వేగిరమయనుడు." పాండు. ౪, ఆ.

వేగిరించు. వై. అ. క్రి. త్వరపడు. "సిద్ధుఁడాత్మలోననయంబు వేగిరించుచు." కళా. 3, ఆ.

వేగు. దే. అ. క్రి. 1. ఉదయమగు; "క. వేగుటయు సత్వరంబుగ, నాగాంగేయుండుమించియనికినడిచినఁ బో." భార. భీష్మ. ౨, ఆ.—2. శుభోదయమగు. "ఉ. కంసునిబాధలంబడుజగంబులకింతట వేగుఁగాత." హరి పూ. ౯, ఆ.—వి. 1. రాజ్యసమాచారము; "క. కింకరులచేతనంతఁ బో, లంకకు వేగందె." రామా. ౭, ఆ.—2. చారుఁడు. "తే. అరులకడనిజభూమియందునుజతనుజ, బాంధవామాత్యమిత్రులఁబార వేప, ధరుల వేగులుగాఁ బెట్టధరణిపునకు, వలయునెండొరుసెఱుఁగనివారు గాఁగ." భార. శాం. ౨, ఆ.

వేగుఁజుక్క. ద్వ. వి. (వేగు+చుక్క.) శుక్రుఁడు. "క. ఇనరథతురంగహేషలు, వినవచ్చినఁగెరలిగగనవీధికిలంఘిం, చెనుపొడుపుఁగొండఁగేసరి, యనవేగుంజుక్కవొడిచెనంతఁ బో ప్రాచిఁ బో." రామా. ౨, ఆ.

వేగుఁబోక. దే. వి. (వేగు+పోక.) వేకువ, ప్రభాతము. "క. వేగుంబోకలమేల్కని, భాగవతోద్గీయమానభగవద్గీతా, రాగంబులకునుమదిను, ద్వేగంబువహించుఁజేఁదువిన్నవిధమునఁ బో." వై. ౭, ఆ.

వేగుజాము. ద్వ. వి. తెల్లవాఱుజాము. "మ. అకటాయేమనిదూఱుదాన మిమునాథా వేగుజామయ్యె." కళా. ౪, ఆ.

వేగురు. దే. స. బ. వేయిమంది. (వేయికి మహన్మహత్వర్థక బహువచనాంతాదేశము.)

వేగురుఁజుక్క. ద్వ. వి. (వేగు+చుక్క.) శుక్రుఁడు. "మ. పొడమెఁ బో వేగురుఁజుక్కకాలఫణభృద్భోగోల్లసద్రత్నమై." పా. ౨, ఆ. (సంధివి వర్ణాధిక్యము.)

వేగువాఁడు. దే వి. వేగులవాఁడు, చారుఁడు. (చూ. కద. వై. రెండవయర్థము.)

వేచు. దే. స. క్రి. ఎదురుచూచు, ప్రతీక్షించు. "క. శక్తికనుగుణముగభి, క్షాచర్యసేయువిప్రుల, వేచియుడఁగవలయు నెపుడు వేగమభిక్షుల్." భార. అను. 3, ఆ.

వేమెంగులపాగ. దే. వి. (వేమెంగులు+పాగ.) శేషుఁడు, సహస్రఫణుఁడు. (అప్ర.)

వేటు. దే. వి. వ్రేటుయొక్క రూపాంతరము. (అదురువేటు, కూఁతవేటు. మొ.)

వేడబము. వై. వి. 1. మాయ; "చ. సబలునశక్తుఁజేయుదుపశక్తుబలాఢ్యునిఁజేయుదజ్ఞునిన్, విబుధునొనర్తువివ్విబుధునిన్ జడుగానొనరింతువెల్లెలుం, గఁబడుభవత్స్వభావమజకంతు హరాదులెఱుంగ లేరువే, డబములుగాక యైహికజడత్వములున్నవెనీకురాఘవా." ఉ, రా. ౫, ఆ.—2. వంచన; "మ. తలఁపుల్ చిచ్చులుమాటలు జ్వాలనుధాధారల్ విధుండైనవు, వ్విలుతుల్ మెచ్చరు అన్యులందలఁతురే విశ్వాసముల్ లేదు క్రూ, రలు పొత్తుంబతిసైనఁజంపుదు రధర్మల్ నిర్దయల్ చంచలల్, వెలయాండ్రెక్కడవారివేడబములా వేదాంతసూక్తంబులే." భాగ. ౯, స్కం.—3. వేషము. "వ. కిరీటకోటిఘటితమణిమయూఖరేఖాపుంజంబుకల్లయరసంజపొడుపు వేడబంబు విడంబింప." కాశీ. ౫, ఆ.

వేడము. వై. వి. మండలాగ్రము*. (చూ. వేఁడివేలుపు మొదటియర్థము.) (చూ. వేలము.)

వేడించు. వై. స. క్రి. చుట్టివచ్చు, పరివేష్టించు. "వ. నవమాలికలంగ్రీడించుచు నారంగంబులవేడించుచు." కళా. ౬, ఆ.

వేడుక. దే. వి. 1. కుతూహలము; "క. మునినాథ యీకథాస్థితి, వినిపింపుమువినఁగనాకు వేడుకపుట్టెన్." భాగ. ౮, స్కం.—2. ఇచ్ఛ, అభిలాష; "క. రసగంధప్రముఖంబుల, దెసవేడుకలేక." భార. శాం. ౫, ఆ. "క. వినునాదెసనీకునింతవేడుకగలదేఁ,గను దెఱచిచక్క చూడుము."భో.౪, ఆ.—3. సంతోషము; "ఉ. పీడవగర్భమాజలరుహేక్షణదాల్చినలోకమంతయున్, వేడుకనొందె." వి, పు. ౭, ఆ.—4. వినోదము; (అది నేను వేడుకకు చెప్పితిని.) 5. వినోదకార్యము. (ఆవేడుక చూతమురమ్ము.) విణ. వినోదకరము. (అది వినవిన వేడుక.)

వేడుకకత్తె. ద్వ. వి. 1. వేశ్య; "క. కాఁపున మీమదికింపుగ, వేవేగవల్లఁతియైన వేడుకకత్తెన్, రావించెద." రాజ. ౩,ఆ.—2. జారిణి. భాగ. ౯, స్కం. (మొదటిరూపము వేడుకకత్తియ.)

వేడుకకాఁడు. దే. వి. 1. జారుఁడు; "క. అనివేఁడినసత్తాపసి, వినుమేవగసైననీకు వేడుకకానిన్, గొనితెచ్చెదమచ్చాతురి, గననేనేఁడనుచుఁబల్కి గక్కున వెడలెన్." శశాం. ౪, ఆ.—2. విటుఁడు. "ఉ. వేడుకకాండ్రకైతిరుగు వేశ్యలనాడినజాడనన్నుని, ట్లాడఁగఁబాడియౌనె." ఉ, రా. ౪, ఆ.—విణ. 1. కుతూహలపరుఁడు; "క. పొలుదునీరెడత్రెవ్వఁగఁ, దాఁబెడిదమైనయొండదనుకఁగనిపురం, బాఁటిమడువంతవేడుక, కాఁటులుజాలరులునూచిక్రందుకొనంగన్." భార. శాం. ౩, ఆ.—2. అపేక్షకుఁడు; "క. కయ్యంబులవేడుకకాఁ, డయ్యున్నతకలహకేళికాకాంక్షుఁడై, నెయ్యమునవచ్చెనారదుఁ, డయ్యెడదదివినుండివారినభిదర్శింపన్." రాఘు. ౨, ఆ.—3. క్రీడాసక్తుఁడు; "ఉ. ఆడుచునుండెఁగానమునికంజలినేయఁగనేరఁడయ్యెన, వ్వేడుకకాఁడుపుట్టదొకవేళవివేకముదొడ్డవారికిన్."(చూ. పూర్వార్ధము మోడుచు.) కాశీ. ౬, ఆ.—4. వినోదకరుఁడు. "క. సంగడిలోకములన్నియు, మ్రింగుచుఁగక్కుచునుబయలమెలఁగించుచును, పొంగొడువేడుకకాఁడటు, మ్రింగుడువడెబకునిచేతమీఁదఁటిఁగిన్నృపా." భాగ. ౧౦, స్కం. పూ. (రూ. వేడ్కకాఁడు.)

వేడుకజోదము. ద్వ. వి. (చూ.) కరిఖలము.

వేడుకపడు. ద్వ. అ. క్రి. 1. కుతూహలపడు; "వ. శుచిముఖీ నీదు విద్యావిలసనంబు విన్నవించిన నయ్యువినవలయునని వేడుకపడుచున్నవాఁడు." ప్రభా. ౪, ఆ.—2. అపేక్షించు. "విష్ణుఁజూడ నీవు వేడుకపడితి." భార. శాం. ౨, ఆ. (రూ. వేడ్కపడు.)

వేడుకసేయు. ద్వ. అ. క్రి. (వేడుక+చేయు.) అపేక్షపడు. "సురేశ్వరునియంతటివాఁ డఖిలాప్సరోంగనావిటుఁ డొక మర్త్యభామినికి వేడుకసేయుచునున్నవాఁడు."సై. ౪, ఆ.—స. క్రి. అపేక్షించు. (రూ. వేడ్కసేయు. అపేక్షించుటకు.— "చ. ఎల్లిదులగువారికేటికిసలీలవిహారము వేడ్కసేయఁగన్." నిర్వ. ౮, ఆ.)

వేడెపెట్టు. ద్వ. స. క్రి. (వేడెము+పెట్టు.) పరివేష్టింపఁజేయు. "అ. చాళింపకుండఁ జతురంగబలముల, సారిదివేడెపెట్టిచుంచుబిగియఁ, బట్టిచదివె

నొసలిపట్టికమీఁదఁగ, నృష్టిమెఱయు బిరుదపద్మమపుడు." జై. ౭, ఆ.

**వేడెము.** వై. వి. మండలగతి. "వ. పద్మరాగమణిచూడంబగు కేడెంబునుంగొని వేడెంబునందురంగంబు పఱపి." స్వా. ౪, ఆ.

**వేడ్క.** దే. వి. విశ. వేడుకయొక్క రూపాంతరము. (కుతూహలమునకు.—"చ. తమతమయుంగనల్కరముతత్పరతన్ బిగియించు కౌఁగిలిల్, గమకపువేడ్కనించుకయుఁ గైకొనక." కళా. ౫, ఆ.) (ఆమ్రేడితమగుచో వేవేడ్క. చూ. వాసె.)

**వేణి.** సం. వి. ఇ. స్త్రీ. అనేకప్రవాహములయొక్క కూడిక. ఇ. ఈ. స్త్రీ. సర్పాకారముగా అల్లిన జేడ. ఈ. స్త్రీ. 1. కాలువ; 2. డావరడంగి.

**వేణిక.** సం. వి. ఆ. స్త్రీ. సర్పాకారముగా అల్లిన జేడ.

**వేణుకము.** సం. వి. అ. న. 1. (ఏనుఁగునుబొడిచెడి) బరిగోల; 2. (పసులను దోలెడు) మునికోల. (రూ. వైణుకము.)

**వేణుధ్ముఁడు.** సం. వి. అ. పుం. పిల్లంగ్రోవి యూఁదువాఁడు.

**వేణులావకుఁడు.** సం. వి. అ. పుం. మేదరవాఁడు. పర. ౨, ఆ.

**వేణువు.** సం. వి. ఉ. పుం. 1. వెదురు; 2. పిల్లంగ్రోవి; 3. ఒకరాజు.

**వేతనము.** సం. వి. అ. న. 1. సంబళము; 2. కూలి.

**వేతసము.** సం. వి. అ. పుం. ఒకానొకతీఁగ, ప్రబ్బ.

**వేతస్వంతము.** సం. విశ. (త్. ఈ. త్.) మిక్కుటమైన ప్రబ్బలుగలది. (దేశము.)

**వేత్త.** సం. విశ. (ఋ. ఈ. ఋ.) తెలిసినవాఁడు.

**వేత్రధరుఁడు.** సం. వి. అ. పుం. బెత్తమును చేతఁబట్టినవాఁడు, కట్టిక.

**వేత్రము.** సం. వి. అ. న. బెత్తము. పుం. బెత్తపుచెట్టు.

**వేత్రవతి.** సం. వి. ఈ. స్త్రీ. నదీవిశేషము.

**వేదండము.** సం. వి. అ. పుం. ఏనుఁగు, గజము.

**వేదన.** సం. వి. ఆ. స్త్రీ. 1. నొప్పి; 2. తెలివి.

**వేదము.** సం. వి. అ. పుం. తొలంచేదువులు. (వేదములు నాలుగు.—ఋక్కు, యజుస్సు, సామము, అథర్వము.)

**వేదముఖ్య.** సం. వి. ఆ. స్త్రీ. పునుఁగుఁబిల్లి.

**వేదముఖ్యకము.** సం. వి. అ. పుం. కచోరము.

**వేదాంతము.** సం. వి. అ. పుం. ఉపనిషత్తు.

**వేదాంతి.** సం. వి. న్. పుం. 1. వేదాంతము తెలిసినవాఁడు; 2. బ్రహ్మచారి.

**వేది.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 1. యజ్ఞము మొదలగువానికై చదరముగా నేర్పఱచినతిన్నె; 2. తిన్నె; 3. ముద్దుటుంగరము. ఇ. న్. పుం. విద్వాంసుఁడు. న్. బ్రహ్మ. విశ. తెలిసినవాఁడు.

**వేదిక.** సం. వి. ఆ. స్త్రీ. తిన్నె. (వేదియొక్క రూపాంతరము.)

**వేదు.** దే. వి. 1. వికటగంధము; 2. గంధము; "క. అదండజడలదండను, వేదండఁజెలంగఁజెరివివేదండగతిన్, వేదండముచేపీచుచు, నాదండధరారిఁబోలెనాఁడుమవచ్చెన్." వి. పు. ౧, ఆ.—3. వెగటు; 4. బ వెగటుమాట. (చూ. అంబేద.)

**వేద్యము.** సం. విశ. (అ. ఆ. అ.) తెలియఁదగినది.

**వేధ.** సం. వి. స్. పుం. 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3 విద్వాంసుఁడు.

**వేధము.** సం. వి. అ. పుం. తొలిపుచ్చుట.

**వేధించు.** సం. స. క్రి. 1 తొలిపుచ్చు; 2. బాధించు.

**వేధితము.** సం. విశ. (అ.ఆ.అ.) 1. తొలిపుచ్చఁబడినది; 2. బాధింపఁబడినది.

**వేధ్యము.** సం. వి. అ. న. గురి. విశ. తొలిపుచ్చఁదగినది.

**వేనలి.** వై. వి. 1. జేడ; "చ. తనుకుఁబసిండిమెట్లుబెడిదంబుగవెన్నునంటితోఁచువే, నలికడయంచులారుజత నమ్మనఁదీడిబిగించినట్టితం, త్రులుజఘనస్తనద్వయము తోరపుఁగాయలుకొనుజాలువా, యొళవుగనాతిజవ్వన మహాహామహింగాంచెఁగదుంబ్రవీణతన్."చంద్ర.—2. కొప్పు*. "వేనలివిరిదండఁజెర్వి." కవి. 3, ఆ.—3. వెండ్రుక*. (చూ. నూనెముడి.)

**వేనవేలు.** దే. విశ. బ. (వేలు+వేలు.) పెక్కువేలు. "ఎ,గీ. వేనవేలుమస్తకములు వేనవేలు, కన్నులును వేనవేల్నాలుకలునుగలుగు, మూర్తివి." హరి. పూ. ౭, ఆ.

**వేపథువు.** సం. వి. ఉ. పుం. 1. కంపము; 2. స్వరకంపము.

**వేపనము.** సం. వి. అ. న. వణఁకుట, కంపనము.

**వేపితము.** సం. విశ. (అ. ఆ. అ.) కంపితము. "అతిభీషణకోపవేపితాధరుండగుచున్."వి,పు.౪,ఆ.

**వేమము.** సం. వి. న్. పుం. (చూ.) నేతపలక.

వేమరు. దే. ద్ర. క్రి. విశ. వేమారుయొక్క రూపాంతరము. "వేమరునడుసెత్తిమూర్కొనుచు." ఉ, రా. ౪, ఆ. (చూ. మారు.) (ఈ రూపము చింత్యము.)

వేమఱు. దే. ద్ర. క్రి. విశ. వేమాఱుయొక్క రూపాంతరము.

వేమారు. దే. ద్ర. క్రి. విశ. మాటిమాటికి. రామా. ౧, ఆ.

వేమాఱు. దే. ద్ర. క్రి. విశ.——పై.——

వేము. దే. వి. వేఁపచెట్టు, నింబము. (దీనిభేదములు.—నేలవేము, తురకవేము.)

వేయంచులవాలు. ద్వ. వి. (వేయి+అంచులు+వాలు.) విష్ణుచక్రము, శతారము.

వేయి. దే. స. సహస్రము. "సీ. రావణకుంభకర్ణద్విపేంద్రములకు సింగంపువేయి మూరంగళాయి" పాంచా. ౧, ఆ.

వేయిచేతులరొకిమీఁడు. ద్వ. వి. (వేయిచేతులు+ఎకిమీఁడు.) కార్తవీర్యార్జునుఁడు, సహస్రబాహువు. (చూ. వెల్లివిరియు నాలుగవయర్థము.)

వేయు. దే. స. క్రి 1. వైచు; 2. దిగవిడుచు; (బావిలో చెంబువేసినాఁడు.) 3. ఉంచు.

వేరమి. వై. వి. వేరముయొక్క రూపాంతరము.

వేరము. వై. వి. విరోధము. "ఉ. వీరును బాండుపుత్రులును వేరముదక్కి పొసంగిమన్కికై, పోరితమాడి యేసటులు బుద్ధులు సెప్పినభంగియుం." భార. ఉద్యో. 3, ఆ.

వేరు. దే. వి. చెట్టుయొక్క మూలము. స. ఏ. అన్యము. "తే. కౌరవులనేమమెల్ల వేర్వేరనడిగె." భార. ఉద్యో. ౨, ఆ.

వేరుపనస. ద్వ. వి. వేరునందు పండ్లుపండెడుపనస.

వేరువిత్తు. దే. విశ. నాశకము, నాశకుఁడు. "క. వినవే మీకెల్లవేరు విత్తనినన్నుం." భార. ద్రో. ౪, ఆ.

వేఱడము. దే. వి. భేదము. "క. అం, డ్రకుమగలకునిట్టి వేఱడంబులుగలవే." భో. ౭, ఆ.

వేఱేఁడి. దే. విశ. (వేఱు+ఇఁడి.) అవివేకి. "ఉ. వేఱేఁడిద్దైనమానిసికి వెండివివేకము గల్గనేర్చునే." భార. ఉద్యో. 3, ఆ. "వేఱేండితనంబుచేత." ఉ, హరి. ౪, ఆ.

వేఱేఁడించు. దే. స. క్రి. అవివేకమొందఁజేయు. "ఉ. తెంపున,క్కజపుబెంపును వేఱేఁడింపఁడుగదా కర్ణుండుదీనాకృతిం." (అవివేకమొందఁజేయుట యనఁగా అవివేకముచే వానిఁజెఱుచుటయనియర్థము.) భార. కర్ణ. ౧, ఆ. (ఇది ప్రాఁతప్రతులయందలిపాఠము.)

వేఱిమి. దే. వి. భేదము, వేఱడము.

వేఱు. దే. వి. భేదము. (చూ. వేఁడుకోలు.) స. ఏ. అన్యము. "వేఱొక భంగిఁబాకములు విన్ననువొప్పఁగసంఘటించి." భార. పరా. ౧, ఆ.

వేఱుపడు. ద్వ. అ. క్రి. భేదపడు. (రూ. వేర్పడు. "క. ఈ,పురుషులుగూడినసృష్టికి, వెరవరులదిసంఘటిలదు వేర్పడిరనిం." భార. శాం. ౫, ఆ.)

వేఱుపాటు. ద్వ. వి. 1. భేదము; 2. విరోధము. (రూ. వేర్పాటు. చూ. చిరమర.)

వేఱుపోవు. దే. అ. క్రి. వేఱుపడు. (ప్రే. వేఱుపుచ్చు.)

వేఱుబందము. ద్వ. వి. వేఱుపాటు, భేదము.

వేల. సం. వి. ఆ. స్త్రీ. 1. చెలియలికట్ట; 2. పొలిమేర; 3. ఉప్పెన; 4. రాజభోజనము; 5. అనాయాసమరణము; 6. వ్యాధి; 7. బుధునిభార్య.

వేలము. వై. వి. 1. వేడముయొక్క రూపాంతరము; "చ. చలిమిరిగాడ్పుచేనెగసిసన్నపుసుళ్లగుచాకసంబుమం, దలవిలసిల్లెబుప్పొడులుదట్టముగామదిఁగ్రమ్ముకూర్మిచే, గలిగివిరాళిఁగుందు తెఱగంటినెలంతలమీఁదఁజొన్పపూ, విలుతునిపైఁడిచుట్టలుఁగు వేలములంబవెసాంపుపెంపునన్." యు. ౪, ఆ.—2. శిబిరము*. వ. వలరాజుపూఁదూపులకులికి వేలంబువెలికింజని రావణుండు ద్రిమ్మరునట్టియెడ." యు. ౨, ఆ.

వేలిమి. దే. వి. హోమము. "వేలిమియుంసురార్చనయు విప్రసపర్యయుఁజిక్కె." స్వా. ౨, ఆ.

వేలిమికట్టియ. ద్వ. వి. సమిధ. "సీ. విటకచాకృప్తికివినువునొక్కలతాంగి వేలిమికట్టియల్ విఱిచి తెచ్చు." కవిక. ౬, ఆ. (రూ. వేలిమికట్టె.)

వేలిమిబొట్టు. ద్వ. వి. (చూ.) రక్ష. "సీ. నొసటివేలిమిబొట్టు మనిమీఁదమృగనాభి తిలకంబుబటువు గాఁదీర్చవచ్చు." రామా. ౨, ఆ.

వేలు. దే. అ. క్రి. వి. వ్రేలుయొక్క రూపాంతరము.

వేలుచు. దే. స. క్రి. హోమాగ్నియందు నేయిమొదలగువానిసమర్పించు. (రూ. వేల్చు. "తే. పందునకుబిడ్డనిచ్చిన చందమొంద, బూదిలోనేయివేల్చినపోల్కియౌటి, కడవలోనీళ్లువట్టినకరణియగున, పాత్రజనులకుఁ బెట్టుట భారవేంద్ర." భార. శాం. ౧, ఆ.)

సురమాయి. దే. విణ. మిక్కిలినల్లనిది. "సీ. పడగలంత దఁబడఁదొడరుభోగులఁగెల్చి సురమాయిజల్లులసొబగుఁగాంచె." భాను. ౪, ఆ. (దీనికి వృత్తియందు వికల్పముగా అంత్యవర్ణలోపము. "చ. చటులతఁ శాంభులం గెలువఁ జాలినశంబర దైత్యభేదికిన్, బటువగు పెక్కు జోడుసురమాజగజల్లుల మేటికరాళుబం, ట్లపెకలకంతముల్ మదకుకావలిపచ్చని దాలువావురా, లటె పనవాటిలోన జలజాననయే గతిడాఁగవచ్చితే." భాను. 3, ఆ.

సురమాలి. దే. విణ. గాలినించినది. (చూ. బాలీసు.)

సురర్షి. సం. వి. ఇ. పుం. నారదాదిదేవఋషి.

సురలోకము. సం. వి. అ. పుం. స్వర్గము, వేల్పుఁబ్రోలు.

సురవర్త్మము. సం. వి. న్. న. ఆకాశము, వేల్పుఁదెరువు.

సురస. సం. వి. ఆ. స్త్రీ. 1. నాగమాత; 2. సర్పాక్షిరి. అ. న. ము. నల్లగగ్గెరి. విణ. తియ్యనిది.

సురాచార్యుఁడు. సం. వి. అ. పుం. బృహస్పతి, వేల్పుటొజ్జ.

సురామండము. సం. వి. అ. న. కల్లుతేట, కల్లుమీఁగడ. (అని కొందఱు.)

సురాలయము. సం. వి. అ. పుం. మేరుపర్వతము.

సురాష్ట్రజము. సం. వి. అ. పుం. 1. తొగరి; 2. తొగరిమన్ను; 3. అడవితొగరితీఁగె.

సురాళము. దే. వి. 1. భూతావేశజనితశిరోభ్రమణము; 2. కోపావేశము.

సురాళించు. దే. స. క్రి. (దృష్టిదోషపరిహారార్థము.) దిగఁదుడుచు. "ఎ, గీ. కడమపూదండ లెల్లనొక్కటిగఁబట్టి, బాలకవుడు సురాళించి పాఱవైచె." కళా. 2, ఆ.

సురిగ. దే. వి. చిన్నకొమ్మ, ఉపశాఖ.

సురిగి. దే. వి. ఒకానొకచెట్టు.

సురియ. వై. వి. చురకత్తి. "ఎ, గీ. సారస్వతప్రౌఢిమూర్తి, యీసురియచేత నాలుకఁగోసికొనియు." కళా. 3, ఆ.

సురియాఁడు. ద్వ. వి. (సురియ+ఆఁడు.) మాలవాఁడు. "ఎ, గీ. వచ్చు సేవింప సురియాఁడు వైష్ణవుండు." ఆము. ౬, ఆ. (ఇందు ఉత్తరపదము అరవము.)

సురుఁగు. దే. అ. క్రి. 1. అదృశ్యమగు; "వరాహముక డంకనదర్శితమయ్యెనయ్యెడన్, పందిసురిఁగిపోయినన్నృపాలతనూజుఁడుచిన్నవోయి." విక్ర. 3, ఆ.— 2. పాఱు; "చ. నాడలఘోషయాత్రలోఁ, గురుపతిడించి క్రీడికృపకుం దగుపాత్రముఁ జేసి యొక్కడన్, సురిఁగితి." భార. కర్ణ. ౨, ఆ.— 3. జోడఁగాఁబోవు; "సీ. అదెయెవ్వరో పిలిచెద రునన్నే మొకో యరసివచ్చెదనంచు సురిఁగెనొకతె." కళా. 2, ఆ.—4. చలించు. "సుడిగాలి త్రిప్పులసురుఁగదేయితన్వి." (చూ. ఉత్తరార్థము.) హంస. 3, ఆ. (చూ. ప్రబ్బ.)

సురుగుడు. దే. వి. ఒకానొక యెఱ్ఱచాయచెక్కచెట్టు.

సురుడు. దే. వి. దివటీకిమాఱుగా కాల్చిపట్టుకొనెడు వెలుతురుకట్టెలకట్ట. అం, భా.

సురుమా. హిం. వి. ఒకవిధమైన కాటుక, అంజనము.

సురుము. దే. వి. పొడి, చూర్ణము. అం, భా.

సురూపుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. చక్కనివాఁడు; 2. విద్వాంసుఁడు.

సురె. వై. వి. సురియయొక్కరూపాంతరము. "సీ. అందమైమెరుసు రెచందమై శోభిల్లు నారీలలామ నూఁగారుసొబగు." పర. 3, ఆ.

సురెయాఁడు. ద్వ. వి. సురియాఁడుయొక్కరూపాంతరము.

సురేకారము. ద్వ. వి. ఒకదినుసు ఉప్పు.

సురోదము. సం. వి. అ. పుం. కల్లుసముద్రము.

సుఱసుఱ. దే. వి. స్రుక్కుటయందగుధ్వన్యనుకరణము. "వానిమై సుఱసుఱస్రుక్కు సెక్కి." నిర్వ. 2, ఆ.

సులభము. సం. విణ. (అ. ఆ. అ.) సుఖముగా లభించునది. (సులభముకానిది దుర్లభము.)

సులువు. వై. విణ. తేలికనైన.

సులోచనము. సం. వి. అ. న. ముక్కద్దము.

సుల్తాను. హిం. వి. తురుష్కప్రభువు.

సువర్చల. సం. వి. ఆ. స్త్రీ. నింగిమిరి.

సువర్ణకము. సం. వి. అ. పుం. ఱేల, కృతమాలము.

సువర్ణము. సం. వి. అ. న. 1. బంగారు; 2. మాడ; 3. ధనము; 4. ఒకపువ్వు; 5. నల్లఅగలు. విణ. మంచివర్ణముగలది.

సువల్లి. సం. వి. ఈ. స్త్రీ. కారుగచ్చ.

సువహ. సం. వి. ఆ. స్త్రీ. 1. అందుగు; 2. కారేలకి; 3. చెప్పుతట్ట; 4. నల్లవావిలి; 5. సర్పాక్షి; 6. వీణె. విణ. సుఖముగ మోపఁదగినది.

సువారము. వై. వి. పంట*. "చ. పొడిమిరియంబుగా పెడలిపోయెడుకొండలఁనుగ్గచేసిరో, క్కుడుం జలజంతులంబోలసుకూరలఁజాఁడిపెడందచిప్పలం. దుడుకఁగఁబెట్టిముత్తియపుటోగిరముల్ గడుఁగు

మ్మరించెన, య్యోడరఘువీరుసాయకములెక్కడనే ర్చె సువారభుంబనుల్." రామా. ౭, ఆ.

సువాల. ద్వ. వి. సువ్వాలయొక్క రూపాంతరము. (చూ. అల్లొనేరెడు మూడవయర్థము.)

సువాసిని. సం. వి. ఈ. స్త్రీ. పేరంటాలు.

సువ్రత. సం. వి. ఆ. స్త్రీ. సులభముగా పిదుకఁదగిన యావు. విణ. మంచివ్రతముగలది.

సువ్వలాల. ద్వ. వి (సువ్వి+అలతి+అలతి.) సువ్వాల.

సువ్వాల. ద్వ. వి. (సువ్వి + అలతి.) ఆఁడువారు పెండ్లిండ్లయందు సువ్వియను పదముతో ఆలాపముచేసి పాడెడుపాట. "క. అలలనామణికాగ, య్యాలియుకానొక్కవేళనక్కఱతోను. వ్వాలలుసోబానలుధవ,ళాలుఁ మొదలైనపాటలాదట నేర్పెఁ." శుక. ౧, ఆ.

సువ్వి. దే. వి. దంచుటయందగు ధ్వన్యనుకరణము.

సుషమ. సం. వి. ఆ. స్త్రీ. మిక్కిలిశోభ. విణ. 1. మనోజ్ఞమైనది; 2. సరిసమానమైనది.

సుషవి. సం. వి. ఈ. స్త్రీ. 1 కాఁకరతీఁ; 2. జీలకఱ్ఱ; 3. నల్లజీలకఱ్ఱ. (రూ. సుశవి.)

సుషి. సం. వి. ఇ. స్త్రీ. బెజ్జము, రంధ్రము.

సుషిమము. సం. వి. అ. న. చల్లన. విణ. చల్లనిది. (రూ. సుశిమము.)

సుషిర. సం. వి. ఆ. స్త్రీ. గువ్వగుత్తికతీ. అ. న. ము. 1. బెజ్జము; 2. పిల్లంగ్రోవిలోనగువాద్యము. పుం. కీక్కసతీ. విణ. బెజ్జముగలది.

సుషుప్తి. సం. వి. ఇ. స్త్రీ. ఒళ్లెఱుఁగనినిద్ర. (ఇది త్ర్యవస్థలలో నొకటి. చూ. అవస్థ.)

సుషుమ్న. సం. వి. ఆ. స్త్రీ. ఒకనాడి. (చూ. నాడి.)

సుషేణము. సం. వి. అ. పుం. కలివితీ.

సుషేణిక. సం. వి. ఆ. స్త్రీ. నల్లతెగడతీ.

సుస్తీ. హిం. వి. సోమరితనము.

సుహృదుఁడు. సం. వి. ద్. పుం. చెలికాఁడు.

సుళువు. వై. విణ. సులభము. (రూ. సులువు.)

సుళ్లమారి. దే. విణ. 1. సుడులుఁగలవాఁడు; 2. చుట్లుఁబెట్టువాఁడు. "క. అనిలుఁడు సుళ్లమారికమలారి నిశాచరుఁడు." శృం. ౧, ఆ. (ఇది రెండర్థములకు నుదాహరణము.)

## సూ

సూకరము. సం. వి. అ. పుం. పంది, వరాహము.

సూక్ష్మము. సం. వి. అ. న. 1. అధ్యాత్మము; 2. కపటము. పుం. అణువు. విణ. సన్నము.

సూచకము. సం. వి. అ. పుం. 1. సూది; 2. నక్క; 3. కుక్క; 4. కాకి; 5. పిల్లి.

సూచకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. కొండెము చెప్పువాఁడు; 2. బోధచేయువాఁడు.

సూచన సం. వి. ఆ. స్త్రీ. 1. జాడ; 2. గ్రుచ్చుట; 3. తెలుపుట; 4. చూపు

సూచి. సం. వి. ఈ. స్త్రీ. 1. సూది; 2. అభినయహస్తవిశేషము. (చూ. సూచీముఖము.)

సూచించు. సం. స. క్రి. 1. జాడగా తెలియఁజేయు; 2. తెలియఁజేయు.

సూచిక. సం. వి. ఆ. స్త్రీ. సూది. విణ. తెలియఁజేయునది.

సూచితము. సం. విణ. (అ.ఆ.అ.) 1. జాడగా తెలుపఁబడినది; 2. తెలుపఁబడినది.

సూచీముఖము. సం. వి. అ. పుం. 1. అభినయహస్తవిశేషము; (తక్కిన వ్రేళ్లు ముడువఁబడి ముక్కుమోప నిలువుగా చాఁపఁబడిన చూపుడువ్రేలు గలది.) 2. బాణము; 3. పక్షివిశేషము.

సూటి. దే. వి. 1. గుఱి; "తే. చెలఁగుమూవింటినేర్పునఁజేతిసూటి, నీవు చూచినఁజాలు." రామా. ౨, ఆ.—2. విధము. "ఎ, గీ. సుఖముసొంపునొక్కసూటినసడపంగ." నిర్వ. ౮, ఆ.

సూటికాఁడు. దే. విణ. 1. గుఱికాఁడు; 2. అందగాఁడు.

సూటిపడు. ద్వ. అ. క్రి. సరితూఁగు. "అపంచనాయతియాదృచ్ఛికసూక్తిసూటిపడ." వసు. ౨, ఆ.

సూడించు. దే. అ. క్రి. పగగొను. "క. చేడియచూపులుదమలో. సూడించె." విక్ర. ౮, ఆ.

సూడిగములు. దే. వి. బ. 1. ఆఁడుదాని చేతిగాజులు; "తే.కంకణంబులతోసూడిగములురాయ." కాశీ. ౫,ఆ.—2. చేతికడియములు. "క. కనువీనులరాచసూడిగంబులతోఁడా." అచ్చ. సుం, కాం.

సూడిద. దే. వి. కానుక. "సీ. తరుణియొక్కతె పూవుదండసూడిదపెట్టి హేలాపరీరంభమిచ్చరించె." జై. 3, ఆ.

సూడు. దే. వి. 1. పగ; "క. సూడొక్కటియునుమతిదాఁ, గీడొక్కటియునుజగంబు కీర్తించుటకై." ఉ, హరిశ్చ. ౪, ఆ.—2. పగవాఁడు. "ఐక్కపగమిసూడు చక్కని పగకాఁడు." శకాం. ౧, ఆ.

సూడుకాఁడు. దే. వి పగవాఁడు, శత్రువు. ఆం, భా.

**సూదుకొను.** దే. అ. క్రి. పగగొను. "ఎ, గీ. ఇరుగు పొరుగులవారి నింటింటివారి, సూదుకొనఁ దిట్టి మతికానికూడు గుడువదు." భో. 3, ఆ.

**సూదుపట్టు.** దే. స. క్రి. విరోధించు. "తే. చూడ కేటికినిదువాలుసోగమీల, సూదుపట్టఁగఁజాలె డుచూపుఁగొనల." నై. ౮, ఆ.

**సూతకము.** సం. వి. అ. న. 1. జాతాశౌచము; 2. మృతాశౌచము. పుం. న. పాదరసము.

**సూతము.** సం. వి. అ. పుం. పాదరసము, సూతకము.

**సూతి.** సం. వి. ఇ. స్త్రీ. 1. కుట్టు; 2. ప్రసవము.

**సూతిక.** సం. వి. ఆ. స్త్రీ. బాలెంతరాలు.

**సూతిని.** దే. వి. దేశవిశేషము. (చూ. బాలీసు.)

**సూతుఁడు.** సం. వి. అ. పుం. 1. తేరుగడపువాఁడు; 2. బట్టువాఁడు; 3. వడ్లంగి.

**సూత్థానుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) నేర్పరి.

**సూత్రధారుఁడు.** సం. వి. అ. పుం. 1. ఆటాడించువాఁడు; 2. నడపించువాఁడు; 3. వడ్లంగి; 4. వేల్పుకోఁడు.

**సూత్రపడు.** మి. అ. క్రి. జేతపడు. "క. క్షేత్రంబు పురుషకారము, ధాత్రీశ్వరబీజమరయ దైవము రెండుఁ గా, సూత్రపడఁగూడెనేనిం, బాత్రమగుంగర్షకరుఁడు ఫలమునకెందుఁ గా."

**సూత్రము.** సం. వి. అ. న. 1. నూలిపోఁగు; 2. శాస్త్రాది సూచనాగ్రంథము; 3. జన్నిదము; 4. ఏర్పాటు.

**సూత్రించు.** సం. స. క్రి. సూత్రపఱచు. "శ్లోకంబుల్ శతకోటికాండములుగాసూత్రించి." నిర్వ. ౧, ఆ.

**సూదంటుఱాయి.** ద్వ. వి. (సూది+అంటుఱాయి.) అయస్కాంతము.

**సూదనము.** సం. వి. అ. న. చంపుట. విణ. చంపునది.

**సూదము.** సం. వి. అ. పుం. వండినపప్పు.

**సూది.** వై. వి. గుడ్డలుకుట్టుసాధనము.

**సూదిగొంటు.** వై. వి. ఒకదినుసుపోఁక, లతాపూగము.

**సూదితము.** సం. విణ. (అ. ఆ. అ.) చంపఁబడినది.

**సూదిమల్లె.** వై. వి. ఒకదినుసుమల్లె.

**సూదిరాయి.** ద్వ. వి. సూదంటుఱాయి.

**సూదుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) వంటవాఁడు.

**సూన.** సం. వి. ఆ. స్త్రీ. 1. కూఁతురు; 2. కొండనాలుక; 3. వధస్థానము. [ఇవి అయిదు.—కండని, (తోలు,) పేషణి, (సన్నికల్లు,) చుల్లి, (ప్రొయ్యి,) ఉదకుంభి, (నీళ్లకడవ,) మార్జని, (పొరక.) ఇట్లు.] అ. న. ము. 1. ప్రసవము; 2. పుష్పము. విణ. శూన్యము.

**సూనగాఁడు.** మి. గ్రా. విణ. (సూన + కాఁడు.) చేంపువాఁడు. (చూ. గొడగరి.)

**సూనరి.** మి. గ్రా. విణ. (సూన + అరి.) 1. చేంపువాఁడు; "సాలయక నిత్యమొక్కొక్కనినిసూనరివో లెవధించి." భార. సభా. ౧, ఆ.—2. పూవులమ్మువాఁడు. "సూనరియన్నంబుజూదరియన్నంబు."

**సూనుఁడు.** సం. వి. ఉ. పుం. 1. కొడుకు; 2. తమ్ముఁడు; 3. సూర్యుఁడు. (స్త్రీలింగమైనచో. వు. కూఁతురు.)

**సూనృతము.** సం. వి. అ. న. శుభము. విణ. ప్రియమును సత్యమునైనది. (మాట.)

**సూపకారుఁడు.** సం. వి. అ. పుం. వంటవాఁడు.

**సూపము.** సం. వి. అ. పుం. వండినపప్పు. డు. వంటవాఁడు.

**సూయాణము.** వై. వి. శత్రుభయంకరమైనదండయాత్ర. "సీ. తగునాజ్ఞసూయాణముగనొనరించెమంచిగ నేలనాలుగు సెలఁగులకును." భార. విరా. ౫, ఆ.

**సూరణము.** సం. వి. అ. పుం. కందగడ్డ.

**సూరసూతుఁడు.** సం. వి. అ. పుం. అనూరుఁడు.

**సూరి.** సం. వి. ఇ. పుం. సూర్యుఁడు. ఇ. న్. పుం. పండితుఁడు.

**సూరుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

**సూరెగిల్లు.** దే. అ. క్రి. ప్రక్కకొదుఁగు. "మ. అనురాధీశ తనూజాకోల్తలకుఁ గాకత్యంతభీతిం గలం, గిసురానీకము సూరెగిల్లిన." నిర్వ. ౭, ఆ. (రూ. సూరెగిలు. "సీ. కమనీయబహుచిత్రగతులనేపారుచోసురవిమానంబులు సూరెగిలఁగ." భో. ౭, ఆ.)

**సూరెపాను.** దే. వి. ఆలవట్టము. "రగడ. చికిలిపుత్తడిక్రొత్తహరువులఁజెందునివిగో సూరెపానులు, ఒకటఁగస్తురిమెకములుండుటకొప్పు నీదంతంపుబోనులు." శుక. ౧, ఆ.

**సూరెపుటము.** వై. వి. (మా.) సూర్యపటము. "రగడ. మొకమాలులును సూరెపుటములుబనాతులును." హంస. ౫, ఆ.

**సూరెలు.** దే. వి. బ. పార్శ్వము. "క. సూరెలను వందిజనులిం, పారఁగనుతియింప." భార. స్త్రీ. ౨, ఆ. "అతనిఁగొనిపోయి వారితలిదండ్రుల సూరెలనిల్పి." రామా. ౨, ఆ.

సూర్మి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. లోహపుప్రతిమ. (రూ. సూర్మి.)
సూర్యకాంతము. సం. వి. అ. పుం. సూర్యరశ్మితగులుటచే నిప్పుకలిగెడు ఒకదినుసుఱాయి.
సూర్యతనయ. సం.వి.ఆ.స్త్రీ. యమునానది, కాళింది.
సూర్యపటము. సం. వి. అ. పుం. మేలుతరపు మెుకమాలు. "ఎ, గీ. చాయసూర్యపటంపుఁగుల్లాయ పోసఁగ." చంద్రా. ౨, అ.
సూర్యుఁడు. సం. వి. అ. పుం. వెలుఁగుఱేఁడు.
సూర్యానువర్తిని. సం. వి. ఈ. స్త్రీ. ప్రొద్దుతిరుగుడు?.
సూల. వై. వి. రోగవిశేషము. "చ. కడుపునసూలయెత్తి వడిగాసిలిప్రాణములేగునట్లరయె." హంస. ౧, అ.
సూలచేకట్లు. దే. వి. కంకణవిశేషము. "సూలచేకటు లొక్కమూలవైచి."
సూసకము. దే. వి. స్త్రీలు తలనుధరించెడు తిరుగుడుబిల్ల. "సీ. చెంగల్వపూదండఁజేర్చి పెందుఱుముపై ఘనసారమున సూసకము ఘటించి." చంద్రా. ౩, అ.
సూసరి. దే. వి. సున్నముపూయువాఁడు, లేపకుఁడు.

## సృ.

సృక్వము. సం. వి. న్. న. పెదవిమూల, సెలవి.
సృక్వి. సం. వి. ఇ. న ——పై.——
సృగము. సం. వి. అ. పుం సాఁగు, భిండివాలము.
సృగాలము. సం. వి. అ. పుం. నక్క, జంబుకము.
సృజన. సం. వి. ఆ. స్త్రీ. సృష్టి. (చూ. విశ్వసృజుఁడు.)
సృజించు. సం. స. క్రి. సృష్టిచేయు.
సృజ్యము. సం. విణ. (అ. ఆ. అ.) సృజింపఁదగినది
సృణి. సం. వి. ఇ. పుం, స్త్రీ. అంకుశము.
సృణిక. సం. వి. ఆ. స్త్రీ. చొంగ. (రూ. సృణీక.)
సృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. త్రోవ; 2. పోక.
సృమరము. సం. వి. అ. పుం. పెద్దచమరమృగము.
సృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) 1. సృజింపఁబడినది; 2. విడువఁబడినది; 3. నిశ్చయింపఁబడినది; 4. అధికమైనది.
సృష్టి. సం. వి. ఇ. స్త్రీ. 1. సృజించుట; 2. స్వభావము.

## సె.

సెంటెపు. అం. వి. శిక్షావిధి.
సెక. వై. వి. 1. జ్వాల; 2. తాపము*. "మత్తకోకిల. సెకలుచల్లనితేఁటి రొండలచేత వేడుకసేయఁగా, నకటసాటియెుకాలముల్ శరదాగమంబునకెయ్యెడన్." రుక్మాం. ౪, అ.
సెకకంటి. ద్వ. వి. (సెక+కన్ను.) శివుఁడు. (చూ. పాండు. విణ.)
సెకవెలుఁగు. ద్వ. వి. సూర్యుఁడు, ఉష్ణరశ్మి. "క. అదరుంగ, క్షుననెడమకన్ను సెకవెలుఁగ, గునకున్." య. ౧, ఆ.
సెగ. వై. వి. సెకయెుక్కరూపాంతరము.
సెగఱేఁడు. ద్వ. వి. అగ్ని, శిఖావంతుఁడు. "సెగఱేనిచానగొజ్జెఁగలబంతి." య. ౧, ఆ.
సెగ్గము. దే. వి. రోఁత. "క. సెగ్గంబులదసఁబోవక, సిగ్గులుగైకొనకమాననీమఁ జనకపే, రగ్గలికరెండుమనసులు, డగ్గఱి చూపుబడి సుత్కటంబుగఁ గలసెన్." హరి. ఉ. ౭ ఆ.—(చూ. సెగ్గించు.) విణ. నింద్యము. "కలసెవ్వఁడుదగ్గఱినేనిసెగ్గమే." ఉ, హరి. ౫, ఆ. (చూ. అలి.)
సెగ్గించు. దే. స. క్రి. రోయు. "సీ. కడునకర్తుఁడు ప్రోవఁగాఁజాలఁడితఁడనిసెగ్గింతురర్థిఁగృపీవలుండు,బడుగునుసలెద్దురోసినపగిది." భాగ. 3, స్కం.
సెగ్గింపు. దే. వి. రోఁత. (చూ. అరగింపు.)
సెగ్గు. దే. వి. సెగ్గముయెుక్కరూపాంతరము.
సెజ్జ. వై. వి. శయ్య. "సీ. ఈమత్తియాకొకోయేకార్ణవమునాడు శేషాహికాయికి సెజ్జయయ్యె." భో. ౨, ఆ.
సెట్టి. వై. వి. 1. కోమట్లులోనగువారి పట్టపుఁబేరు; 2. వర్తకుఁడు*. "వ. వారింగొన్నట్టిసెట్టి." కళా. ౩, ఆ.
సెపియించు వై. స. క్రి. శపియించు. "క. నృపసీవుమదీయంబగు, జపముఫలంబడిగితేమ సమ్మతిసీఁగా, విపరీతఫణితులాడిన, సెపియింతుఁజుమిరాయెుఱుంగఁజెప్పితినీకున్." భార. శాం. (రూ. సెపించు.)
సెబాసు. హిం. అవ్య. బళీ. "సెబాసురఘూరిజయంత." ఉ, రా. ౪, ఆ. (చూ. సేబాసు.)
సెబ్బర. దే. వి. చెడుగు. (మంచిసెబ్బరలు.) విణ. చెడ్డది. (చూ. సెబ్ర.)
సెబ్ర. దే. వి. సెబ్బరయెుక్కరూపాంతరము. (చెడ్డది అనుటకు.—"గుణమాసెబ్ర." హంస. ౫, ఆ. "ఎ, గీ. సెబ్రచెంచదమాబ్రాహ్మణబ్రువుండు." పాండు. ౪, ఆ.)
సెమ్మె. వై. వి. దీపస్తంభము*.

సెర. దే. వి. నేత్రమునందలి రేఖ. "తే. రేచికూర్చుండి కలయుంగఁజూచి రొప్పి, సెరల కాంతియు దంతరుచియును బెరయు, టతిమనోహరముగఁ దనసుతుని తోడ, మనుజనాయకకుశలమేయనుడునతఁడు." భార. అశ్వ. ౪, ఆ.

సెరగు. దే. వి. ఆపద. "క. ధరణీసురవరులకుఁగడు, సెరగైయుండు నెడ నెడయుఁ జేయుదు రెమహా, పురుషులనినరుఁడు విలుగొని, యరిగెను ముద్ముచ్చుల పిఱుందనవ్విప్రుపనిన్." భార. ఆది. ౭, ఆ.

సెల. వై. వి. 1. సెలయేఱు; (చూ. జెల జెలకడ ప్రవహించుటయందు అనుసర్థము.) 2. బాణపుములికి; "ద్రోణునంప సెలలవియుటయున్." భార. ఉద్యో. ౪, ఆ.—3. ఏదుపందిముల్లు; 4. మునికోల మొదలగువాని చివరయందలి యినుపముల్లు; 5. బాణము*; "సీ. సెలవాఱ సెలసొమ్ము సిల వైచి శరభంబుఁబరిమార్పకున్న నీ బంటఁగాను." పంచ. వేం. 3, ఆ.—6. వ్రణమునందు చీమువ్యాపించెడి రంధ్రము*. "వ. ఎఱకలువిఱుగనఱికినయెడల సెలలకునిడినజలగలపోలువున." పా. ౨, ఆ.

సెలకట్టె. వై. వి. 1. బాణము; 2. బాణమువలె వేగముగాఁబాఱునట్టి శ్యేనవిశేషము. "క. మొలదట్టి చెఱఁగుఁజెక్కుచు, బలుదిట్టకిరాతుఁడొకఁడుపటువగుముష్టిన్, సెలకట్టెఁబట్టి వేఱొక, సెలకట్టెంగొట్టి వైచెఁజెమరుంగాకిన్." స్వా. ౪, ఆ. (కొందఱు ఆధునికకవులు జలకట్టెయని ప్రయోగించినారు. అపశబ్దమున నది యవ్యుత్పన్న పదమగుటమాత్రముగాక యీ యుదాహరణమునందలి వేఱొక యను విశేషణమునకు ప్రయోజనమును లేక పోవుచున్నది.) (మెఁదటిరూపము సెలకట్టియ.)

సెలగ. దే. వి. 1. ఉపశాఖ; అం, భా. 2. దోసెఁడుగింజలు.

సెలగత్తి. ద్వ. వి. (సెలగు+కత్తి.) కల్లుగీఁచువానికత్తి. "సీ. అడిద, ములబల్లెములనీఁటియుల సెలగత్తులగుదియలఁదూపులగొడ్డళులను." అచ్చ. యు, కాం.

సెలగు. దే. స. క్రి. ఖండించు. "చెండాడెన్ గొండగొర్లన్ సెలగసెలుఁగులన్." య. ౨, ఆ. (చెలగుయొక్కరూపాంతరము.) (చూ. చెలవు.)

సెలగొమ్మ. దే. వి. (సెలగ+కొమ్మ.) ఉపశాఖ. "వ. చెలంగి సెలగొమ్మలెక్కి వ్రేలుచు." భో. ౪, ఆ.

సెలగోల. ద్వ. వి. (సెల+కోల.) గొల్లవాఁడుపసులమేపెడుకోల. "తే. చిఱుతకూఁకట్లుదూఁగాడఁజేతిచల్ది, చిక్కములు సెలగోలలుఁ జెలువుమిగుల." హరి. పూ. ౫, ఆ.

సెలపంది. ద్వ. వి. ఏదుపంది, ముండ్లపంది.

సెలపుండు. ద్వ. వి. నారికుఱుపు, నాడీవ్రణము.

సెలయు. దే. అ. క్రి. విజృంభించు. "ఆమేటిదొరసెలసితానలమన్మతి." (హరిశ్చంద్రకథయందు ఆమేటిదొర సెలసి అనియు, నలకథయందు ఆమేటిదొర సెలసితానలమన్మతి అనియు భేదములు.) హవ. ౨, ఆ.—స. క్రి. చిమ్ము. "సీ. అలవోకఁగనకాద్రి సెలయుచో విరిసిన హరివరాహముదంష్ట్రనవతరించె." పాండు. ౧, ఆ. (చెలయుయొక్కరూపాంతరము.)

సెలయూట. ద్వ. వి. (సెల+ఊట.) కొండయూట, ప్రస్రవణము.

సెలయేఱు. ద్వ. వి. (సెల+ఏఱు.) పర్వతమునుండి పాఱెడునది, నిర్ఝరము.

సెలవడు. వై. అ. క్రి. (సెల+పడు.) సెలవాఱు. (చూ. పులినీరు.)

సెలవాఱు. ద్వ. అ. క్రి. (సెల+పాఱు.) సెలవేయు. "తే. త్రిపురసంహారమొనరించునపుడుహరుఁడు, బండికల్లుగనీమేనుగండిచేసె, నదియు సెలవాఱి శిగటాఱవైతిచంద్ర, యకటరోహిణివలనిపథ్యమునఁజేసి." స్వా. 3, ఆ.

సెలవి. వై. వి. పెదవిమూల. "సీ. సెలవులవనదంశములుమూఁగ సెలవెట్టఁగ్రోల్పులుల్ పొదరిండ్లగుఱకలిడఁగ." స్వా. ౨, ఆ.

సెలవిచ్చు. దే. స. క్రి. (సెలవు+ఇచ్చు.) ఆజ్ఞాపించు. "క. తనపరి, వారము సెలవిచ్చెవారు వంబులఁబట్టన్." జై. ౭, ఆ.

సెలవిల్లు. దే. వి. సెలనువిల్లుయొక్కరూపాంతరము. "క. సెలవిండు లెక్కువెట్టుచు, సెలవిండున్నృపాలయనుచుఁజేరికిరాతుల్, వలకేల మ్రొక్కిచూడుము, వలకేల మెకాలఁదోలవలె మేమనికిన్." సా. ౧, ఆ.

సెలవు. దే. స. క్రి. సెలగుయొక్కరూపాంతరము. "సీ. ఈనగాగ్రంబుననీనగాఁడినయంతశిలలైనమిన్నేఱు సెలవకున్నె." ఉ, హరి. ౨, ఆ.—వి. 1. ఆజ్ఞ; 2. ఉపయోగము. (చూ. ప్రేంఖణము మొదటియర్థము నుదాహరణము.)

సెలను. దే. వి. ఒకానొక చెట్టు. "సీ. కలుగొట్టు మోదుగు కానుగు వావిలి చెలిమేడి నేరేడు సెలనుబలును." పంచ. వేం. ౪, ఆ. (చెలిమేడి-ఇది సందిగ్ధము.)

సెలసువిల్లు. దే. వి. సెలసుబద్దలతోఁజేసినవిల్లు.(చూ. విల్లు.) "సీ. తుదిసెమ్మిపురికుంచెతూర్చికట్టినగంట గలిగిననిడుదలల్ సెలసువిల్లు." చంద్రా. ౨, ఆ.

సెల్లా. వై. వి. అంచుకమ్ములులేని తెల్లవస్త్రము*. "ఉ. పూనిసఖీమణుల్ కుసుమపూజిగిపావడగీలుకొల్పియుం, పైనమిటారిబల్పిఱిఁదునందుఘటించిన జిల్గుచల్వసె, ల్లాసెతేమించెఁ జెంగలువలంగలవు ప్పొడిగప్పుకొన్నజాం, బూనదసైకతంబుపయిఁ బున్నమవెన్నెలగాయుకైవడిన్." భాను. ౪, ఆ.

సెల్లుఁడు. వై. వి. శల్యుఁడు. "ఆ. సెల్లుఁడట్లు సేలఁద్రెళ్లి చెచ్చెరలేచి, యొడలుదుడిచికొనుచు నొయ్యన రిగె." (అచ్చుపుస్తకమునందు "శల్యుఁడట్లు" అని యున్నది. అప్పుడు ఛందోలక్షణమునకు దోషము.) భార. ఆది. ౭, ఆ.

సెవ. వై. వి. సెగయొక్క రూపాంతరము.

సే.

సేకము. ఉభ. వై. వి. సెగ*. "ఎ, గీ. కుసుములుకుంపటి సేకముల్ గోరువారు." పంచ. వేం. ౧, ఆ. (ఇది విచార్యము.)—సం. అ. పుం. 1. చల్లుట; 2. తడుపుట.

సేకరము. వై. వి. సంగ్రహము.

సేకరించు. యు. దే. అ. క్రి. తెప్పిఱిల్లు. "వ. మదమలందాటించినఘోటకంబు వెగ్గలంబున మ్రొగ్గియు నగ్గిలికచెడక మోఁకరించుకొని కొన్నియడుగులు చనిసేకరించుకొనికంచుమించుగాఁ బఱచుటగన నచరులవెఱఁగుపఱిచె." స్వా. ౪, ఆ.—వై. స. క్రి. సంగ్రహించు.

సేగి. దే. వి. 1. నష్టి; "క. మీసేగు లెల్లనచ్చెద, వేసఱకుఁడు." హరి. పూ. ౫, ఆ. "క. వెలగొనియమ్మినబండము, విలిచినతనికీనివాఁడు వేగ మెదానం, గలలాభముఁదాఁబీఁదగుఁ, గలసేగియు నెటేఁగియుఁ బవఁ గాఁదగుఁబిదపన్." విజ్ఞా. ప్రా, కాం.—2. ఆపద, కీడు. "తే. అలనృపాలకబాలకుడల్ల నల్ల, నడుగుపెట్టంగడంగిననడుగుపట్టి, రఖిలదైత్యులునాఁటనయ్యాదిదేవు, నడుగుపట్టినఁగలదె సేడకటసేగి." రామా. 3, ఆ.

సేచకము. సం. వి. అ. పుం. మేఘము. విశే. 1. చల్లునది; 2. తడుపునది.

సేచనము. సం. వి. అ. న. 1. చల్లుట; 2. తడుపుట; 3. ఓడలోఁజొచ్చిన నీళ్లు వెలికిఁ జొఱఁజల్లెడు తొట్టెన.

సేడుకట్టు. దే. వి. సాలెవాని సాధనవిశేషము.

సేతువు. సం. వి. ఉ. పుం. 1. నీటికట్ట; 2. ఉలిమిరి?.

సేద. వై. వి. శ్రమము, బడలిక*. "క. వలసినఫలమూలాదులు, నలువునఁజిత్తములుదనియనమలుఁడుమధురా, మలజలములు ద్రావుడుసే, దలువాయఁగన నుడుఁబవనతనయుఁడుసతితోన్." రా. కిష్కిం, కాం.

సేదగొను. ద్వ. అ. క్రి. (సేద+కొను.) బడలు, శ్రమమునొందు. "క. చివురులిలుకానిచెయ్యులసేదగొన్న, యన్నుమిన్నల." అచ్చ. అ, కాం.

సేద్యము. వై. వి. పయిరుపెట్టుట, కృషి*.

సేద్యకాఁడు. ద్వ. వి. సేద్యముచేయువాఁడు, కృషీవలుఁడు.

సేన. ఉభ. దే. విశే. బహువు. (వాఁడువచ్చి సేనసేపైనది.) సం. వి. ఆ. స్త్రీ. దండు, సైన్యము.

సేనము. దే. వి. చిన్నయులి, బంగారునఱకెడియులి. (అని కొందఱు.) (ఇది సానము అని కొన్నిచోట్ల వ్రాయఁబడియున్నది.)

సేనాంగము. సం. వి. అ. న. రథగజతురగపదాతి చతుష్టయము.

సేనాని. సం. వి. ఈ. పుం. 1. కుమారస్వామి; 2. సేనాధిపతి.

సేనాముఖము. సం. వి. అ. న. 1. సేనయొక్క అగ్రభాగము; 2. మూడురథములు మూడేనుఁగులు తొమ్మిదిగుఱ్ఱములు పదునేవురుకాల్బంటును గల సేన.

సేపు. దే. వి. కాలము. ("ఇంచుకసేపు." మొ.)

సేబాసు. దే. అవ్య. సెబాసుయొక్క రూపాంతరము. (చూ. బసివి.)

సేమంతిక. సం. వి. ఆ. స్త్రీ. చేమంతి?. "క. సేమంతికాస్రగంచిత, సీమంతవతీకుచోష్ణజిత శీతభయ, శ్రీమంతంబైగొబ్బున, హేమంతము దోఁచెమదనుఁడేచెవిరహులన్." భాగ. ౧౦, స్కం. పూ. (మొదటిరూపము సేమంతి. ఈ. స్త్రీ.)

సేమము. వై. వి. 1. ఉన్నదిచెడకుండుట; 2. శుభము.

సేరి. దే. విశే. ఈనాముకానిపొలము.

సేరు. దే. వి. 1. ఆఱువదినాలుగుడబ్బులయెత్తుపట్టెడు మానవిశేషము; 2. ఇరువదిడబ్బులయెత్తు; 3. ఇరువదినాలుగు తులములయెత్తు.

సేల. వై. వి. వస్త్రము. "సీ. మొనసినతమిఁబోఁకము డిదివ్వఁబెనఁగఁగాఁజీనిఁగినననువల్ప సేలతోఁడ." య. ౨, అ.

సేలు. దే. వి. పాలుయొక్క రూపాంతరము. (అప్ర.)

సేవ. సం. వి. అ. స్త్రీ. శుశ్రూష, కొలువు.

సేవకము. సం. వి. అ. పుం. వీణకరివె, ప్రసేవకము.

సేవకుఁడు. సం. వి. అ. పుం. కొలువుడుకాఁడు. విణ. కొలుచువాఁడు.

సేవనము. సం. వి. అ. న. 1. కొలువు; 2. కుట్టు.

సేవి. సం. వి. న్. పుం. సేవకుఁడు, కొలువుడుకాఁడు.

సేవించే. సం. స. క్రి. కొలుచే. (సంసేవించే. అనియు.)

సేవిక. సం. వి. అ. స్త్రీ. సేవియ. "సీ. గోధూమసేవికాగుచ్ఛంబులల్లార్చి ఖండశర్కరలతోఁగలపిక లపి.' నై. ౬, అ.

సేవితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సేవింపఁబడినవాఁడు.

సేవియ. వై. వి. గోదుమనూకతో సన్నగాతాలికలు చేసి పాలుపోసివండెడు భక్ష్యవిశేషము. "సీ. తెగినజందెములేలతెచ్చెదరనఁగావువినుఁ డివిసన్న సేవియలుగాని." జై. ౧, అ.

సేవె. వై. వి. సేవియయొక్క రూపాంతరము. "సీ. అనుకువెన్నెలఁదాల్చితునిచి సేవెలుచేసివెన్నెలపాల నుజాన్నెనర్చి." య. ౨, అ.

సేవ్యము. ఉభ. దే. వి. దున్నిసిద్ధముచేసిన పొలము. సం. వి. అ. న. 1. వట్టివేరు; 2. నీటివట్టివేరు. విణ. సేవింపఁదగినది.

సేస. వై. వి. 1. అక్షత; "సీ. మందారసుమకాయమానముల్ పవమానశీర్ణకేసరములసేసచల్ల." వసు. ౬, అ.—2. సేసఁబ్రాలు; "అతివసతీకరోన్నమితయైవిభునాదలసేసచల్లె." వసు. ౬, ఆ. —3. పాపట*.

సేసఁబ్రాలు. ద్వ. వి. బ. తలఁబ్రాలు. "లీలఁబార్వతిసేసఁబ్రాలుశివుమాళిఁబోసె." వీర. 3, అ.

సేసకొప్పు. ద్వ. వి. కొండెసిగ. (చూ. మక్కళించు.)

సేళము. దే. వి. ఒకానొకచెట్టు, కారంభ.

## సై.

సై. వై. ఉప. సహాశబ్దార్థకము. (సైదోడు. మొ.) (మొదటిరూపము సయి.)

సైంధవము. సం. వి. అ. పుం, న. ఇందుప్పు. పుం. గుఱ్ఱము. విణ. సింధువునఁబుట్టినది.

సైంహికేయుఁడు. సం. వి. అ. పుం. రాహుగ్రహము.

సైఁచే. వై. అ. క్రి. 1. ఓర్చుకొను; 2. రుచించు*. (నాకదిసైఁచదు.) స. క్రి. ఓర్చు. (మొదటిరూపము సయిఁచే. ఓర్చుకొనుటకు.—"ద్వి. ఇంచుక సేపు సయించునీవింక." భాగ. 3, స్కం.)

సైఁదము. దే. వి. గోదుమపిండి. "సీ. పాయసంబులు నపూపములు సైఁదపుఁబిండివంటలు పప్పును వలయునట్టి, ఫలశాకములువండఁబంపుఁడు." భాగ. ౧౦, స్కం. పూ.

సైఁపు. వై. వి. ఓర్పు. "ద్రుపదాత్మజనాసభనట్లుచేసి నకొదానికిసైఁపలెస్సయని." భార. ఉద్యో. 3, అ. (మొదటిరూపము సయిఁపు.)

సైఁపుడు. వై. వి. —— పై. —— (మొదటిరూపము సయిఁపుడు.)

సైకతము. సం. వి. అ. న. 1. ఇసుకదిబ్బ; 2. ఇసుకనేల.

సైకము. దే. వి. సూక్ష్మత్వము. "ఎ, గీ. కలహశీలరాత్రిసిసయికంబులేదు." భార. అను. ౫, అ.—విణ. సూక్ష్మము. "క. నడుమెంతసైకమోహో, పిడికిటిలోనడఁగు." విజ. ౨, అ. (మొదటిరూపము సయికము.)

సైగ. వై. వి. హస్తాదులసంజ్ఞ. (మొదటిరూపము సయిగ.)

సైడు. ఆం. వి. ప్రక్క, పుట.

సైతము. వై. అవ్య. కూడ. "ఉ. మేముసైతముల్, వాఁచినవారియట్లగరువంబునఁ గన్గొనుచుంటిమవ్విభుల్." వి. పు. ౬, అ. (మొదటిరూపము సయితము.)

సైతవాహిని. సం. వి. ఈ. స్త్రీ. బాహుదయనెడునది.

సైతాను. హిం. వి. పిశాచములయధిపతి.

సైదోడు. ద్వ. వి. (సై+తోడు.) తోఁబుట్టువు. (చూ. పొందు. విణ.)

సైద్ధాంతికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) సిద్ధాంతము తెలిసినవాఁడు.

సైనికుఁడు. సం. వి. అ. న. సేనాధిపతి. విణ. సేనతోఁ జేరినవాఁడు.

సైన్యము. సం. వి. అ. న. సేన. పుం. కృష్ణునితేరిగుఱ్ఱములలోనొకటి. (చూ. రథ్యము.) విణ. సేనతోఁగూడినది.

సైరంధ్రి. సం. వి. ఈ. స్త్రీ. 1. (చూ.) గట్టువాలు; 2. అంతఃపురపుకావలికత్తె; 3. సంకరజాతిస్త్రీ.

సైరణ. వై. వి. సహనము. (మొదటిరూపము సయిరణ.)

సైరించు. వై. అ. క్రి. సైరణచేయు. "ఎ, గీ. కేచి యాహారమునకని వేడ్క కనియు, నఖిలజీవులవిట్లు నిత్యంబుసమయఁ, జేయునీవరమునని పుసిద్ధుఁడైన, నితఁడుసైరించునేలోకహితవిచార." నిర్వ. 3, ఆ. (మొదటిరూపము సయిరించు.)

సైరికము. సం. వి. అ. పుం. దున్నెడియెద్దు. విణ. సీరసంబంధమయినది. (సీరము=నాఁగలి.)

సైరికుఁడు. సం. వి. అ. పుం. దున్నెడువాఁడు, హాలికుఁడు.

సైరిభము. సం. వి. అ. పుం. 1. కారెనుపోతు; 2. స్వర్గము.

సైరేయకము. సం. వి. అ. పుం. తెల్లగోరంట, ములుగోరంట. (అని కొందఱు.)

సైలరు. ఆం. వి. ఓడలమీఁద పనిచేయువాఁడు.

## సొ.

సొంటి. వై. వి. పక్వముచేసియెండఁబెట్టిన అల్లము.

సొంటు. వై. వి. తప్పు, దోషము*. "తే. వెంటనరుదెంచుతనమచ్చికంటితీరు, సొంట్లుసోదింపఁగడకంటఁజూచుకొనుచు." శుక. ౨, ఆ.

సొంతము. వై. విణ. స్వకీయము. (ఈ యిల్లు నాకు సొంతము.) (వృత్తియందు వికల్పముగ అంత్యవర్ణలోపము. సొంతపని.)

సొంపిల్లు. దే. అ. క్రి. సొంపగు. (రూ. సొంపిలు.)

సొంపు. దే. వి. 1. సమృద్ధి; "క. భూసురవరులకురత్నని, వాసాలంకారధేనువసుధాదాన, శ్రీసొంపునసంపన్నులఁ, జేసెఁగరంధముఁడు ప్రీతచిత్తుండగుచున్." మార్క. ౮, ఆ. "చోళమండలము సొంపులాత్మమెచ్చుచు." పర. ౨, ఆ.—2. సంతోషము; "ఉ. తాపసాగ్రేసరపేరు పెంపునెతీఁగింపుముసొంపుజనింపనావుడున్." రామా. ౪, ఆ.—3. ప్రసన్నత; "సొంపుననుజందురుఁడు." య. ౧, ఆ.—4. సుఖము; "ఉ. అచ్చోనినునిచ్చనిచ్చలును సొంపులముంపుదురమ్మువెంబడిన్." రామా. ౫, ఆ.—5. సౌందర్యము. "సీ. కొలువుసేయఁగవచ్చుకొదమపాయపువారసుందరుల్ నృపు సొంపుచూచిచూచి." పు. ౧, ఆ.

సొగటాలు. ద్వ. వి. బ. (సొగపు+ఆటలు.) పగడపాలాట. "క. జిగిగలకెమ్మోవులఁజెలు, నగవులనిగనిగలు దేలునవ్యధ్వనితోఁ, దగనందలొక్కమొగిద్రొ, సొగటాలాడుదమటంచు సుదతులు పల్కన్." చమ. ౧, ఆ. (సంధిని వర్ణలోపవర్ణవికారములు.) (వృత్తియందేకవచనాంతము. "సొగటాసారెలు." కవిక. 3, ఆ.

సొగటు. దే. వి. వాడు. "సీ. పగలింటిసెగలచేసొగటొందుపూఁదీఁగెవడువున నెమ్మేనువాడు దేఱె." అని. 3, ఆ.

సొగపు. వై. వి. చొక్కు, పారవశ్యము. "చ. సొగపునరాజనందనునిచూపులు నిల్పెఁదదంతరంబులన్." నై. 3, ఆ. "క. విడువక మీగానముసొగ, పిడుటయుమఱిపాడుఁడనుటయొగ్గెపాసెం, బడిగినవారలుబీదలె, కొడిమెలుగట్టకుఁడయతనిఁగొనఁబనియేలా." ఆము. ౫, ఆ.

సొగయిక. వై. వి. సొగపు, చొక్కు, పారవశ్యము.

సొగయు. వై. అ. క్రి. 1. చొక్కు, పరవశత్వము నొందు*; "క. నెత్తురుపడిసినమూర్ఛా, యత్తుండైసొగయుటయును." భార. ఉద్యో. ౪, ఆ.—2. మూర్ఛిల్లు*. "తే. వైచుటయురక్కసుఁడు నేలవ్రాలిసొగసె." (చూ. వెనుకటిభాగము.) మార్క. ౭, ఆ.

సొగసు. వై. వి. 1. అందము*; (దీనిఁ జూచువారు సొగయుదురని వ్యుత్పత్తి.)

సొగసుకత్తె. వై. వి. విటకత్తె. (చూ. సొగసుకాఁడు.) విణ. అందగత్తె.

సొగసుకాఁడు. ద్వ. వి. విటకాఁడు. "చ. వన్నెకాఁడవై, కలయుమెలంగుబల్ సొగసుకానికినెత్తులువెట్టలేముజా, ణలకడకేగుమంచువిటునవ్వుదురప్పురిఁబుష్పలావికల్." చంద్రా. ౧, ఆ.—విణ. అందగాఁడు.

సొగియించు. వై. అ. క్రి. సుఖించు. "ఉ. చందనచారుపత్త్రకముసంస్తుతకౌస్తుభ కర్ణికంబున, స్పందితలాంఛనభ్రమరసంగమనోజ్ఞముసైనయట్టిగో, విందునురస్థ్సలంబయరవిందముగాసొగియించియున్నయ, య్యిందిరచూచుఁగాతఁగృపనింపగుచూపులభక్తసంతతిన్." లక్ష్మీ. ౧, ఆ.

సొగియు. వై. అ. క్రి. ఇంపగు*. (చూ. సొరదోఁకి.)

సొచ్చెము. వై. వి. పెచ్చు, అధికము*. "ఉ. ధనేశునిధుల్ తమయప్పువడ్డికిన్, వచ్చిన సొచ్చెమెంతసుచునవ్వుదురప్పురిలోని కోమటుల్." కకాం. ౨, ఆ.

సొజ్జె. దే. వి. బియ్యముకేఁచి వండినయన్నము.

సొజ్జబూర. ద్వ. వి. భక్ష్యవిశేషము. "సీ. పొంగరంబులుసొజ్జబూరెలొఁగులుసేవెలుక్కెరలతిసెలుచక్కిలములు." కళా. ౭, ఆ.

సొటసొట. దే. వి. కార్శ్యము.

సొటసొటవోవు. దే. అ. క్రి. (సొటసొట+పోవు.) కృశించు. "క. దిటచెడకదిగులుగొని సొట, సొటవోవక వెనుకముందుచూడక." హంస. ౫, ఆ. (రూ. సొటసొటలువోవు. "సీ. ఈతూండ్లుభుజియించుజాతియంచలుసొటసొటలు వోకున్నవాశోభనాంగి." విజ. 3, ఆ.) (ఈ యర్థమునందు సొటసొటలాడు అనురూపము మిక్కిలి వాడుకలో నున్నది.)

సొట్ట. దే. వి. చొట్టయొక్కరూపాంతరము.

సొడ్డు. దే. వి. న్యూనత, కొఱఁత*. "చ. వం, గడమునకెల్ల సొడ్డనినఁగాదటు నేనలపిన్న నాఁడె వేర్పడితినటన్నఁబోవునె." సా. ౨, ఆ.

సొత్తు. వై. వి. సొమ్ము*.

సొద. వై. వి. పీనుఁగును గాల్చుటకుఁ బేర్చిన కట్టెలు లోనగువాని ప్రోగు.

సొన. దే. వి. 1. గుడ్డులోని జెన; 2. బెండలోనగువానిమీఁదినూఁగు; "సీ. సొనదేఱిపొటమరించి నెఱెవాసినయట్టి యాకురాలుపుగండ్లయందుఁ దొరిఁగి." స్వా. ౬, ఆ.—3. ఊటకాలువ.

సొనచిక్కుడు. దే. వి. ఉలవకాయవంటికాయలుగల ఒకానొకచెట్టు.

సొన్నము. వై. వి. 1. బంగారు; "సొన్నపుసన్నసేలకటిఁజుట్టి." విజ. ౨, ఆ.—2. మాడ. "తే. కోటిసొన్నాలుదశశతఘోటకములు." శై. ౮, ఆ. (వృత్తియందు మువర్ణలోపమును అంత్యవర్ణమునకు దీర్ఘంబునగు. "సొన్నాటంకము.")

సొన్నారి. ద్వ. వి. (సొన్నము + అరి.) అగసాలెవాఁడు. (చూ. కమ్మటము.)

సొబగు. వై. వి. చక్కఁదనము, సౌందర్యము*.

సొబగుఁడు. వై. విణ. చక్కనివాఁడు. "క. వామాక్షినీకుఁ గుశలమె, నీమనసెవ్వారియందు నిత్యప్రేమం, బై మెఱయునట్టి సొబగులు, నీమగలేవురకు నిపుడు సెమ్మదియెమదిన్." భార. అర. ౬, ఆ.—వి. విటుఁడు*. "బలియుండా సొబగుండు భావభవదర్పభ్రాంతుఁడై వచ్చి." భార. విరా. ౨, ఆ.

సొబన్న. దే. వి. బఢబచూలు. ఆం, భా.

సొమ్మ. వై. వి. మూర్ఛ*. "సొమ్మదలిసి." అచ్చ. యు, కాం.

సొమ్మగొను. ద్వ. అ. క్రి. (సొమ్మ + కొను.) సొమ్మసిల్లు. "క. నొప్పిఁబడివాఁడుతద్దయు, నుప్పరమద్రుపంగనార్చియొకవాలుందూ, పప్పాలము ద్రిమ్మరిపయిం, గుప్పునసడరింపసొమ్మగొనియుండునెడన్." అచ్చ. యు, కాం.

సొమ్మవోవు. ద్వ. అ. క్రి. (సొమ్మ+పోవు.) సొమ్మసిల్లు. "తే. సొమ్మవోయి, పడియె నాతఁడు చూపఱుభయమునొంద." హరి. పూ. ౬, ఆ. (రూ. సొమ్ములువోవు. "చ. సొలసియతండుతేరిపయిసొమ్ములువోయెనచేతనస్థితిన్." ఉ, హరి. ౪, ఆ.)

సొమ్మసిల్లు. వై. అ. క్రి. మూర్ఛిల్లు. (రూ. సొమ్మసిలు. "క. అనియొకగుహాకుంజనితె, చ్చినసొమ్ములుగాంచిసొమ్మసిలితెలిసి." రామా. ౫, ఆ.)

సొమ్ము. వై. వి. 1. ధనము; "ఎక్కుడుసొమ్ముగలవాఁడనెంతయర్థంబైనయిచ్చినిన్ను విలిచెద." మార్క. ౧, ఆ.—2. ఆభరణము*; 3. గోధనము*; "సీ. దొడ్డపట్టులగొప్పదొరసానులయొడళ్ల సొమ్ములుసొమ్ములుసొంపునెఱప." అచ్చ. బాల, కాం. (ఇది రెండర్థములకు నుదాహరణము.) — 4. అధీనవస్తువు*. "ఉ. చక్రముశంఖమున్ గదయుశార్ఙ్గముఖడ్గము విస్ఫురన్మహా, విక్రముఁడైన దేవుఁడు త్రివిక్రము సొమ్ములు." హరి. ఉ. ౬, ఆ.

సొరంగము. వై. వి. గుహవలెతొలిచినరంధ్రము.

సొరగు. దే. అ. క్రి. లీనమగు. "సీ. వెలయునీవెన్నలతెలుపునఁజామలచూపుచీఁకటిచొచ్చిసొరగకున్న." లక్ష్మీ. ౨, ఆ.

సొరదోఁకి. దే. విణ. దురాచారుఁడు. "సీ. వర్ణసంకరమునువావులతబ్బిబ్బుసొరదోఁకితనమును సాగియదందు." భల్లా. ౧, ఆ.

సొరపు. దే. విణ. కృశము. (చూ. పొరపు. విణ.)

సొరము. వై. వి. 1. కంఠధ్వని; 2. షడ్జాది.

సొరిది. దే. వి. 1. వరుస; 2. క్రమము.

సొరుగు. దే. అ. క్రి. మూర్ఛిల్లు. "క. అల్లలనయతని వచనము, లెల్లన్ విని మొదలుఁనఱక నించుకవడిలోఁ, ద్రెళ్లెడికదళికవలెనా, తల్లీయనిబెట్టుసొరిగిధరపైఁబడియెన్." ఉ, రా. ౬, ఆ.—వి. మూర్ఛ. "వ. పైఁబైఁ బెరుఁగుసొరుగునన్ ధరంబడిపొరలి." సా. 3, ఆ.

సొఱి. దే. వి. తుంబికి. (దీనిభేదము చేఁతిసొఱి.) (చూ. సొఱ్ఱి.)

సొఱ్ఱి. దే. వి. సొఱికు మొదటిరూపము. "చివికికంప లఁగాచినవెఱ్ఱి సొఱ్ఱితీవలు." పంచ. వేం. ౧, ఆ.

సొలపు. దే. వి. 1. పారవశ్యము; "జిలిబిలిముద్దుఁ బల్కుల సొలపలరారె." రసి. ౫, ఆ.—2. వైముఖ్యము. "ఎ, గీ. నాతిరాయంచగుమిఁగూడినడ చుమురువు, చెలులగెలువంగఁజను నాటి సొలపున లఁపు." విజ. 3, ఆ.

సొలయిక. దే. వి. వైముఖ్యము. "వ. అలయికసొల యికలనెుకవింతయొయ్యారంబుఁజూపుచూపుల పసకుంజూపోపక." కళా. ౬, ఆ.

సొలయు. దే. అ. క్రి. 1. మూర్ఛపోవు; "తే. అమ్మగధప తియు, సొలసివేగయాలోనన తెలిసినిలిచి." హరి. ఉ. ౧, ఆ.—2. వెనుదీయు; "క. బాణా, సురున కుఁదోడుపడవచ్చిసొలయుటవినరే." సాంబోపాఖ్యానము.—3. వైముఖ్యమునొందు; "సీ. మామ కునత్తకుమార్పల్కు దేవపిత్రతిథి పూజనములయందుసొలయ." భార. అను. ౪, ఆ.—4. వైరస్యమునొందు. "సీ. బాములన్ని యుఁబడినామీఁదసొల యకయున్న వేల్పులతాల్మియొప్పఁబొగడ." లక్ష్మి. ౫, ఆ.

సొలిమిడి. దే. వి. సొమ్మ, మూర్ఛ. ఆం, భా.

సొవ. దే. వి. సవయొక్కరూపాంతరము. (ఆమ్రేడితమగుచో సొవసొవ. "తే. ఇరుగుపొరుగులదం పతులేపురేఁగి, సంగమక్రీడనోలాడి సరసమాడు, సొవసొవలు విన్నమాత్రనుస్సురుమటంచు, మన్మథునిబారిగొల్లైరై మగువతలఁకు." హంస. ౫, ఆ.)

సొసాయించు. దే. క్రి. మందలించు, హెచ్చరించు.

సో.

సోఁకు. దే. అ. క్రి. 1. తగులు; 2. గ్రహమావేశించు. వి. 1. స్పర్శము; "చ. సోఁకుసెఱుఁగు శక్తిచర్మమునకుం బ్రభవింపదు." భార. అశ్వ. ౨, ఆ.—2. రాక్షసుఁడు. "క. ఆసోఁకు జోదుఁభైకొని, కోసంబున వింటినారిమ్రోయించికడుక, వాని లకోరులబడిబడి, సేనికలంచుటయువాఁడు హెచ్చినకిచుకక." అచ్చ. యు, కాం.

సోఁకుచుక్క. ద్వి. వి. (సోఁకు+చుక్క.) మూలానక్షత్రము.

సోఁకుటొజ్జ. ద్వ. వి. (సోఁకు+ఒజ్జ.) శుక్రుఁడు, దైత్యగురువు.

సోఁకుడు. దే. వి. 1. స్పర్శము; "దయ్యముపేరుపేరి కుచితంబగుసోఁకుడు." చంద్ర.—2. గ్రహావేశము; "తే. కాఁగియున్న దిమిగులనంగంబుచూడఁ, గలవరించుచునున్న దికలదోయేమొ, సోఁకుడల్లస న్యాసికేచూపవలయు, భామననిపల్కెనాసత్య భామనగుచు." విజ. 3, ఆ.—3. పిశాచము; "సీ. ఈపికంబులఁ జూచియిందీవరేక్షణ చెదుగుసోఁకుఁడులంచుజడిసెనేమొ." రసి. ౪, ఆ.—4. రాక్షసుఁడు. "ఉ. బల్లిదులై జగంబుమనుపక జెఱుపం గలయట్టిమీరయి, ట్లుల్లమునందు సోఁకుడులనొం డొకకొండఁగఁజూచిచెల్లఁబో, యిల్లొకపట్టునం గడచియేఁగఁగఁ జేరనిచుంచుఁగుఱ్ఱనిక, మొల్లపుఁ గాఱు గానలకుమున్న రకంగొనిపోవఁజూతురే." అచ్చ. బాల, కాం.

సోఁకుడుముడుఁగు. దే. వి. ఓషధివిశేషము.

సోఁకుదయ్యము. ద్వ. వి. వాయువు, స్పర్శనము. రుక్మి. 3, ఆ.

సోఁకులఱేఁడు. దే. వి. నైరృతి, మూలఱేఁడు.

సోఁగు. వై. వి. సరము. "సీ. ఒకచోఁబునర్వనువూఁ గెవృక్షపుఁ గొమ్మనుడివడ్డముత్యాల సోఁగుఁబోలె." కాశీ. ౧, ఆ.

సోఁపు. దే. వి. ఒకానొక సంబారపుదినుసు.

సోఁపుఁబిండి. ద్వ. వి. చణకపిష్టము, చమని.

సోగ. దే. వి. దైర్ఘ్యము. "సీ. కేలిమైనొక్కటలీలఁ గ్రొక్కుతికడువాలుగసోగలమేలుడించి." భార. విరా. ౨, ఆ.—విశ. దీర్ఘము. "సోగమెడ." భల్లా. ౪, ఆ.

సోజరు. ఆం. వి. సైనికుఁడు.

సోడు. దే. వి. మాడపట్టు, బ్రహ్మరంధ్రము. "క. నీదగు తనువునదివ్యా, మోదముసాంద్రమయిసోడుము ట్టెడు." భార. అను. ౨, ఆ.

సోఢ. సం. విశ. (ఋ. ఈ. ఋ.) ఓపువాఁడు; 2. ఓర్చువాఁడు.

సోఢము. సం. విశ. (అ. అ. అ.) ఓర్వఁబడినది. (అపరాధములోనగునది.)

సోణము. దే. వి. బాసామూలము. "శా. ముక, రాట్కంఠీరవమై యొనర్చెవడిసోణాలంట భూణాచ్ఛిదక." అము. ౫, ఆ.

సోద. దే. వి. గప్పు, గార.

సోదన. వై. వి. 1. శోధనము; 2. శకునార్థము రామాయణము మొదలైన గ్రంథములయందు దారము వేసి శోధించుట. "సీ. పతినన్ను (జనవున (బాలించునాయని ధైర్యంబు వదలి సోదనలుచూచి." రుక్మాం. 3, ఆ.

సోదరి. సం. వి. ఈ. స్త్రీ. తోడఁబుట్టినది.

సోదరుఁడు. సం. వి. అ. పుం. తోడఁబుట్టినవాఁడు.

సోదర్యుఁడు. సం. వి. అ. పుం.——పై.——

సోదించు. వై.స.క్రి. శోధనచేయు. (చూ. సాంటు.)

సోద. వై. వి. రాఁగలమేలుఁకీడులనుగూర్చి చేయు ప్రశ్నము. "తే. వనితయిటువచ్చినీవునీవలయు సోద, గొనుము." ప్రభా. ౫. ఆ. (మొదటిరూపము సోదియ.)

సోదకత్తె. వై. వి. సోదచెప్పునది, దైవజ్ఞ. (మొదటి రూపము సోదకత్తియ.)

సోదము. వై. వి. సోద్దముయొక్క రూపాంతరము. "ఎ, గీ. సోదమాసామివేఁటాడి చూడరాద." ఉ. రా. ౭, ఆ.

సోద్దము. వై.వి. ఆశ్చర్యము. విణ. ఆశ్చర్యకరమైనది.

సోధ్రకము. సం. వి. అ. పుం. బిల్లి?.

సోన. దే. వి. 1. అల్పవర్షము; "క. కురిసెవిరిసోనవానలు." రామా. ౪, ఆ.—2. వర్షము. "చ. మెఱుఁగులుగర్జితంబులును మిక్కిలి సోనయుఁగల్గు మేఘముల్, గిఱికొననొప్పునాకసములీల రణక్షితి మాడనొప్పగుఁ, దలుచుగభూషణద్యుతివితానముపర్వ గజవ్రజంబుపై, ల్లాఁటులుచునెత్తుర్దొరుఁగుచుండనొగింబడియున్ననత్తఱిఁ." భార ద్రో. ౧, ఆ.

సోనంగి. ౖ వి. శునకజాతి. (రూ. జోనంగి.)

సోపనము. ౖ వి. మెట్టు. "ఆ. నేతికుండమోచియే తెఱఁగుననె[illegible], నాలువ్రాఁకునైపుణంబుగలుగు." భార. శాం. [illegible] ఆ.

సోపప్లవుఁడు. సం. [illegible] అ. పుం. రాహువుచేపట్టఁబడినవాఁడు. (చంద్రు[illegible], లేక సూర్యుఁడు.)

సోపానము. సం. వి. అ[illegible]. మెట్టు, ఆరోహణము. (రూ. సౌపానము.)

సోబ. వై. వి. వ్యాధివిశేషమ[illegible]ఫ.

సోబతు. హిం. వి. తోడు, స[illegible]సము.

సోబనము. వై. వి. మంగళము. "[illegible]వరిఖపసెడము లేదిఁక, సువిదకు సోబనపుజలక[illegible]ధరింపంగా, జవరాండ్రఁబసుపుము." య. ౪,

సోభాన. వై. వి. ఒకదినుసు పెండ్లిపాట*. (చూ. సువ్వాల.)

సోబె. వై. వి. నిబ్బెము. (మొదటిరూపము సోబియ.)

సోమ. వై. వి. 1. శ్రమము; "ద్వి. ఇతఁడు, సోమకోర్వఁగలేఁడుసుకుమారమూర్తి." హరిశ్చ. ౧, భా.—2. పరాక్రమము*. "ద్వి. ఉరుమదేభంబులు నుత్తమాశ్వములు, నరిదిరథంబులు నలరుకాల్బలము, సోమమైసవనంబుచుట్టును గాచి." రా. యు, కాం. (చూ. సోమము.)

సోమకర్కటి. సం. వి. ఈ. స్త్రీ. కరవుచ్చే?.

సోమధార. సం. వి. ఆ. స్త్రీ. ఆకాశగంగ.

సోమపీథి. సం. వి న్. పుం. యజ్ఞమునందు సోమపానము చేయువాఁడు. (రూ. సోమపీతి.)

సోమపుఁడు. సం. వి. అ. పుం.——పై.——

సోమము. ఉభ. వై. వి. పరాక్రమము*. "క. అమిషమనిదానింగొనఁ, గామదిసమకట్టియొక్కఖగమూఖగముల్, సోమమునఁదాఁకదివిసం, గ్రామంబారెంటికయ్యెఁగడురభసమునన్." భార. ఆది. 3, ఆ. (సోమయొక్కరూపాంతరము.)—సం. అ. పుం. 1. తిప్పతీఁగ; 2. జలము; 3. కర్పూరము; 4. దినముయొక్క పదునొకండవభాగము. (చూ. దినము.)

సోమయాజి. సం. వి. న్. పుం. యజ్ఞముచేసినవాఁడు.

సోమరాజి. సం. వి. ఈ. స్త్రీ. కారుగచ్చే?.

సోమరి. ద్వ. విణ. (సోము+అరి.) అలసుఁడు, మందుఁడు. "సోమరిగాలి." స్వా. 3, ఆ.

సోమవల్కము సం. వి. అ. పుం. 1. వెలిచంద్ర?; 2. తేకు?.

సోమవల్కలము. సం. వి. అ. పుం. వెలిచంద్ర?.

సోమవల్లరి. సం. వి. ఈ. స్త్రీ. సోమెదకూర.

సోమవల్లి. సం. వి. ఈ. స్త్రీ. తిప్పతీఁగ.

సోమవారము. సం. వి. అ. పుం. ఒకవారము. (ఇట్లు ఇందువారము. మొ.) (చూ. వారము.)

సోమసూత్రము. సం. వి. అ. న. 1. పానవట్టమునుండి నీళ్లుపోవుదారి; 2. సోమసూత్రమువంటి ముఖభాగముగలిగిన లోహపాత్రవిశేషము.

సోమాసి. వై. వి. సోమయాజి.

సోమించు. వై. అ. క్రి. 1. సరిపోలు; "క. అమనిములుమోదుగులతో, సోమించి మురాంతకాను జుఁడు." ఉ, హరి. ౪, ఆ.—2. పరాక్రమించు*; "ద్వి. సోమించి నిజబల స్ఫురణంబుచూపి. రా

ముఁడాభార్గవరాముభంగించె." రా. యు, కాం.— 3. విజృంభించు*; "ద్వి. రాముండుభునుఁడనిర మణి నీవెపుడు, సోమించి యాడెదు సృక్కకిం తైన." రా. సుం, కాం. — 4. వ్యాపించు*. "క. సేమమునఁ ఖిలచిదచి, త్స్తోమంబున నాత్మవగుచు సోమించుటచే, సేమయిపరులయిసర్వము, నైమె ఆసెదవీవొకండవంబుజనాభా." కవిక. ౨, ఆ.

సోమిద. వై. వి. తిప్పతీఁగ?.

సోమిదము. దే. వి. శణపర్ణి?.

సోమిదమ్మ. వై. వి. (సోమిద+అమ్మ.) సోమయాజి భార్య.

సోమిసాని. వై. వి. (సోమిద+సాని.)——వై.——

సోము. వై. వి. సుఖము. విణ. ఆసక్తము*. "చూపులు విష్ణుమూర్తులకుసోముగ." భో. ౨, ఆ.

సోముఁడు. సం. వి. అ. పుం. 1. చంద్రుఁడు; 2. శివుఁడు; 3. కుబేరుఁడు; 4. వాయువు; 5. పితృదేవత; 6. ఒకవసువు; (చూ. వసువు.) 7. ఒక వానరుఁడు.

సోమెద. వై. వి. ఒకదినుసుకూరాకు, సోమవల్లరి.

సోమోద్భవ. సం. వి. అ. స్త్రీ. నర్మదానది.

సోయగము. దే. వి. అందము, చక్కఁదనము. "సీ. అణిముత్యమ్ము సోయగముమించినవ్రాలు వరుసతోనిరుగేలవ్రాయనేర్చె." విక్ర. ౧, ఆ.

సోరంగి. దే. వి. మత్స్యవిశేషము.

సోరణగండ్లు. దే. వి. బ. (సోరణము+గండులు.) గవాక్షము. "ఎ, గీ. మలయమారుతమే తెంచు తలిరుటాకు, గములసందులుసోరణగండ్లుగాఁగ." భాను. ౨, ఆ. (వృత్తియందేకవచనాంతము. "ఐ. మెఱుంగు కెంపుటా సోరణగండి చిఱుతతెమ్మెర సోఁకున." ఉ, రా. ౨, ఆ. చూ. అఱువుల్లు.)

సోరణము. దే. వి. గవాక్షము. (చూ. పట్టియ మూడవయర్థము.)

సోరు. దే. వి. సోరువ్వ, పెట్లువ్వ.

సోరువా. హిం. వి. మాంసపుచారు.

సోర్ణగండ్లు. దే. వి. బ. సోరణగండ్లుయొక్కరూపాంతరము. "ఎ, గీ. తెల్లవాఱుచున్న దివియలల్లార్చుచు, సోర్ణగండ్లయందుఁజొచ్చినుడిసి, తిరిగివేగుఁబోకతెమ్మెరలెలదీఁగ, తొనలువంకలొత్తునవలఁద్రోచు." భార. ఉద్యో. ౨, ఆ.

సోల. దే. వి. పదునాఱుదబ్బులయెత్తు వస్తువుపట్టెడు కొలవిశేషము, నికుంచకము.

సోలము. దే. వి. 1. మత్తు; "ఎ, గీ. ఒండొరులచిత్తములునాటి రొలయుచున్న, చొక్కుటెక్కుడుసేయంగసోలమడరి." నిర్వ. ౫, ఆ. "సీ. అలరుతేనియఁగ్రోలిరొలయసోలంబునమురియ తేఁటులనును వ్రేఁతయింపు." భార. అను. ౧, ఆ.— 2. చొక్కు. "సీ. పాలఁతులనునుఁదీవుఁబలుకుల యింపునసల్లంబుసోలంబు నొందునపుట." లక్ష్మీ. ౨, ఆ. "సీ. చూపులనిగురొత్తు సోలంబుతోడన సోలంబుతనువునమేళవింప." విక్ర. ౧, ఆ.

సోలింత. దే. వి. వివశత్వము నొందివ్రాలుట. (చూ. పారవు. విణ.)

సోలు. దే. అ. క్రి. వివశత్వము నొందివ్రాలు.

సోళాదొప్పి. దే. వి. ద్యూతవిశేషము. "శా. సోళాదొప్పియు నెత్తముల్ మొదలుగాజూదంబునీవాడునవ్వేళల్." శై. 3, ఆ. (కొన్నిచోట్ల సోళాందొప్పి అని కనఁబడుచున్నది.)

## సౌ.

సౌందర్యము. సం. వి. అ. న. చక్కఁదనము.

సౌకర్యము. సం. వి. అ. న. 1. అనాయాసము; 2. సూకరభావము.

సౌకుమార్యము. సం. వి. అ. న. 1. సుకుమారత్వము; 2. కావ్యగుణములలోనొకటి. (చూ. గుణము)

సౌఖశాయనికుఁడు. సం. వి. అ. పుం. రాజులను నిద్రమేలుకొలుపువాఁడు. విణ. సుఖనిద్రయాయని ప్రశ్నముచేయువాఁడు.

సౌఖ్యము. సం. వి. అ. న. సుఖము.

సౌగంధికము. సం. వి. అ. న. 1. చెంగలువ; 2. కామంచి?. పుం. 1. మాణిక్యవిశేషము (ఇది ఆంధ్రమునందుపుట్టినది, అశోకపుచిగురు దాలుగలది, మధ్యమజాతిరత్నము. చూ. మాణిక్యము.) 2. గంధకము. డు. సుగంధవస్తువ్యాపారముచేయువాఁడు.

సౌగంధ్యము. సం. వి. అ. న. వాసన.

సౌచికుఁడు. సం. వి. అ. పుం. కుట్టుపువాఁడు.

సౌజన్యము. సం. వి. అ. న. సుజనత్వము, మంచితనము.

సౌదాగరు. హిం. వి. వర్తకుఁడు, గుఱ్ఱముల బేరగాఁడు.

సౌదామని. సం. వి. ఈ. స్త్రీ. 1. మెఱుపు; 2. ఒక దినుసు మెఱుపు; 3. ఒక అప్సరస్త్రీ. (రూ. సౌదామిని.)

సౌదాయికము. సం. వి. అ. న. తల్లిదండ్రులచేత నేనియు అన్నదమ్ములచేత నేనియు నియ్యఁబడు స్త్రీధనము.

సౌధము. సం. వి. అ. పుం, న. రాజగృహము, నగరు.

సౌనికుఁడు. సం. వి. అ. పుం. మృగపక్ష్యాదులను జంపి విక్రయించి జీవించువాఁడు.

సౌప్తికము. సం. వి. అ. న. 1. నిద్రించుటలోనగు సమయములందు శత్రువులపైఁబడి చంపుట; 2. మహాభారతమునందలి యొకపర్వము.

సౌభాగినేయి. సం. వి. ఈ. స్త్రీ. భాగ్యవతికూఁతురు.

సౌభాగినేయుఁడు. సం. వి. అ. పుం. భాగ్యవతికొడుకు.

సౌభాగ్యము. సం. వి. అ. న. 1. సుభగత్వము; 2. ఒకగ్రహయోగము. (చూ. యోగము.)

సౌభ్రాత్రము. సం. వి. అ. న. మంచితోఁడఁబుట్టుఁదనము.

సౌమనస్యము. సం. వి. అ. న. 1. సుమనోభావము; 2. శ్రాద్ధమునందు పిండదానానంతరము బ్రాహ్మణహస్తమునందిచ్చెడు పుష్పదానమంత్రము.

సౌమ్య. సం. వి. అ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

సౌమ్యుఁడు. సం. వి. అ. పుం. బుధగ్రహము. విణ. 1. తిన్ననివాఁడు; 2. ఒప్పినవాఁడు; 3. సోముఁడు దేవతగాఁగలవాఁడు.

సౌరభము. సం. వి. అ. న. 1. వాసన; 2. కుంకుమము; 3. బోళము. పుం. ఎద్దు.

సౌరభేయము. సం. వి. అ. పుం. ఎద్దు, బలీవర్దము.

సౌరభేయి. సం. వి. ఈ. స్త్రీ. ఆవు, గోవు.

సౌరభ్యము. సం. వి. అ. న. 1. వాసన; 2. ఒప్పిదము; 3. గౌరవము.

సౌరము. సం. వి. అ. న. ఒకమతము. (చూ. మతము.)

సౌరాష్ట్రము. సం. వి. అ. న. కంచు. పుం. 1. ఒకదేశము; 2. రాగవిశేషము.

సౌరాష్ట్రికము. సం. వి. అ. పుం. విషభేదము. విణ. సౌరాష్ట్రదేశసంబంధమైనది.

సౌరి. సం. వి. ఇ. పుం. 1. శనైశ్చరుఁడు; 2. యముఁడు.

సౌరికుఁడు. సం. వి. అ. పుం. కల్లమ్మువాఁడు, కబ్బిలి.

సౌరు. దే. వి. 1. అందము; 2. [illegible]ము. (చూ. గగ్గులకాఁడు.) విణ. మనోజ్ఞము. ([illegible]దటిరూపము సవురు. అందమునకు.—"చ. చె[illegible]లకోఁడనీసవురు సన్నముగా నిఁకనిందు రాకుమి [illegible]లా. 3, ఆ.)

సౌవర్చలము. సం. వి. అ. న. ఒకది[illegible] ఉప్పు.

సౌవర్ణకరణి. సం. వి. ఈ. స్త్రీ. ఓషధివిశేషము. (దీ తోఁ చేరిన తక్కినమూఁడు.—విశల్యకరణి, సంధకరణి, సంజీవకరణి.)

సౌవిదల్లుఁడు. సం. వి. అ. పుం. అంతఃపురపు కావవాఁడు.

సౌవిదుఁడు. సం. వి. అ. పుం.——పై.——

సౌవీరము. సం. వి. అ. న. 1. పులియఁబెట్టిన కడుఁగనీళ్లు; 2. నీలాంజనము; 3. రేఁగుఁబండు. పుం ఒకానొకదేశము.

సౌశీల్యము. సం. వి. అ. న. సుశీలత్వము.

సౌష్ఠవము. సం. వి. అ. న. 1. సుష్ఠుభావము; 2. నాట్యాంగవిశేషము.

సౌహార్దము. సం. వి. అ. న. సుహృద్భావము, స్నేహము.

సౌహిత్యము. సం. వి. అ. న. తృప్తి, తనివి.

సౌహృదము. సం. వి. అ. న. (చూ.) సౌహార్దము.

సౌహృద్యము. సం. వి. అ. న.——పై.——

## స్కం.

స్కందుఁడు. సం. వి. అ. పుం. కుమారస్వామి.

స్కంధము. సం. వి. అ. పుం. 1. మూఁపు; 2. చెట్టుబోదె; 3. యుద్ధము; 4. సమూహము; 5. శరీరము. డు. దశార్ణదేశపురాజు. (స్కంధత్రయము.—అదానము, నిదానము, చికిత్స. (ఇవి వైద్యశాస్త్రమునందలివి.) స్కంధపంచకము.—రూప, వేదనా, విజ్ఞాన, సంజ్ఞా, సంస్కారములు. (ఇవి బౌద్ధశాస్త్రోక్తములు.)

స్కంధపట్టిక. సం. వి. అ. స్త్రీ. తలుపునకమర్చెడు గందపట్టె.

స్కంధశాఖ. సం. వి. అ. స్త్రీ. మ్రానిమొదటికొమ్మ.

స్కంధావారము. సం. వి. అ. పుం. 1. దండువిడిసిన చోటు; 2. దండు.

స్కన్నము. సం. విణ. (అ. ఆ. అ.) జాఱినది.

## స్ఖ.

స్ఖలనము. సం. వి. అ. న. 1. జాఱుపాటు; 2. తొట్రుపాటు.

స్ఖలించు. సం. అ. క్రి. 1. జాఱు; 2. తొట్రుపడు.

స్ఖలితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. జాఱినది; 2. తొట్రుపడినది.

## స్ఖా.

స్ఖాలిత్యము. సం. వి. అ. న. స్ఖలితభావము, పొరపాటు.

స్టా.

స్టాంపు. ఆం. వి. బిల్ల, ముద్ర, ముద్రవేసినకాగితము.

స్టీ.

స్టీమరు. ఆం. వి. పొగయోడ.

స్టే.

స్టేషన్. ఆం. వి. ఉండుతావు, (పోలీసుస్టేషన్, రైలుస్టేషన్. మొ.)

స్త.

స్తంబకరి. సం. వి. ఇ. పుం. ధాన్యము.

స్తంబఘనము. సం. వి. అ. పుం. వరిపైరు మొదలగు వానికోసెడు కొడవలిలోనగునది.

స్తంబఘ్నము. సం. వి. అ. పుం.——పై.——

స్తంబము. సం. వి. అ. పుం. 1. వరిలోనగువానిగంట; 2. బోదెలేని చిన్నచెట్టు.

స్తంబేరమము. సం. వి. అ. పుం. ఏనుఁగు, గజము.

స్తంభనము. సం. వి. అ. న. 1. మ్రానుపడఁజేయుట; 2. మంత్రశక్తిచేత అగ్నిలోనగువానిశక్తి నణఁగఁజేయుట. (ఇది షడ్విద్యలలో నొకటి. చూ. విద్య.)

స్తంభబలి. సం. వి. ఇ. పుం. (చూ.) కంబవల్లి.

స్తంభము. సం. వి. అ. పుం. 1. కంబము; (గృహమధ్యస్తంభము కవారము.) 2. మ్రానుపాటు.

స్తంభయిత. సం. విశే. (ఋ. ఈ. ఋ.) స్తంభించువాఁడు.

స్తంభించు. సం. అ. క్రి. మ్రానుపడు. అం, ప్రే. మ్రానుపడఁజేయు. "భుజస్తంభమ్ముల్ స్తంభించి." భార. అర. 3, ఆ. (సంస్తంభించు అనియు.)

స్తనంధయ. సం. వి. ఆ. స్త్రీ. పాలుద్రాగెడు ఆఁడుబిడ్డ, చంటిపాప.

స్తనంధయుఁడు. సం. వి. అ. పుం. పాలుత్రాగెడు మగబిడ్డ, చంటిపాప.

స్తనము. సం. వి. అ. పుం. కుచము, చను.

స్తనయిత్నువు. సం. వి. ఉ. పుం. 1. మబ్బు; 2. ఉఱుము.

స్తనితము. సం. వి. అ. న. ఉఱుము, గర్జితము.

స్తన్యము. సం. వి. అ. న. చనుపాలు.

స్తబకము. సం. వి. అ. పుం. పూగుత్తి, గుచ్ఛకము.

స్తబ్ధము. సం. విశే. (అ. ఆ. అ.) 1. అణఁగినది; 2. ముడిచికొనినది.

స్తబ్ధరోమము. సం. వి. న్. పుం. పంది, వరాహము.

స్తిమితము. సం. విశే. (అ. ఆ. అ.) తడిసినది.

స్తవము. సం. వి. అ. పుం. స్తోత్రము, పొగడిక.

స్తి.

స్తిమితము. సం. విశే. (అ. ఆ. అ.) 1. కదలనిది; 2. తడిసినది.

స్తు.

స్తుతము. సం. విశే. (అ. ఆ. అ.) స్తోత్రముచేయఁబడినది.

స్తుతి. సం. వి. ఇ. స్త్రీ. స్తోత్రము, పొగడిక.

స్తుతించు. సం. స. క్రి. స్తోత్రముచేయు, పొగడు.

స్తుతిపాఠకుఁడు. సం. వి. అ. పుం. బట్టువాఁడు.

స్తుత్యము. సం. విశే. (అ. ఆ. అ.) స్తోత్రముచేయఁదగినది.

స్తూ.

స్తూపము. సం. వి. అ. పుం. మట్టిమొదలగువానిదిబ్బ.

స్తే.

స్తేనుఁడు. సం. వి. అ. పుం. దొంగ, చోరుఁడు.

స్తేమము. సం. వి. అ. పుం. తడియుట, సముందనము.

స్తేయము. సం. వి. అ. న. దొంగతనము, చౌర్యము.

స్తేయి. సం. వి. న్. పుం. దొంగ, చోరుఁడు.

స్తై.

స్తైన్యము. సం. వి. అ. న. దొంగతనము, చౌర్యము.

స్తో.

స్తోకకము. సం వి. అ. పుం. చాతకపక్షి, వానకోయిల.

స్తోకము. సం. వి. అ. న. నీటిబొట్టు. పుం. వానకోయిల. విశే. అల్పము.

స్తోత్రము. సం. వి. అ. న. స్తుతి పొగడిక.

స్తోమము. సం. వి. అ. పుం. 1. సమూహము; 2. స్తోత్రము; 3. యజ్ఞము.

స్త్రీ.

స్త్రీ. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుది. (స్త్రీజాతులు నాలుగు.—పద్మిని, చిత్రిణి, హస్తిని, శంఖిని.)

స్త్రీఘోషము. సం. వి. అ. పుం. వేకువ, ప్రభాతము.

స్త్రీధనము. సం. వి. అ. న. అధ్యగ్నికృతాదిస్త్రీద్రవ్యవిశేషము. (ఇది షడ్విధము.—అధ్యగ్నికృతము,

అధ్యావాహనికము, స్త్రీదత్తము, భ్రాతృసౌదాయికము, మాతృసౌదాయికము, పితృసౌదాయికము.)
**స్త్రీధర్మిణి.** సం. వి. ఈ. స్త్రీ. ఋతుమతి, ముట్టుది.
**స్త్రీభూషణము.** సం. వి. అ. న. మొగలి?.

## స్త్రై.

**స్త్రైణము.** సం. వి. అ. న. స్త్రీస్వభావము. విణ. స్త్రీసంబంధమయినది.

## స్థ.

**స్థండిలము.** సం. వి. అ. న. వ్రతముపూనినవాఁడు పండుకొనుటకు దర్భాదులచేసంస్కరింపఁబడిన భూమి. అగ్నిహోత్రమునుంచుటకై సంస్కరించిన స్థానము. (అని కొందఱు.)
**స్థగనము.** సం. వి. అ. న. కప్పు, ఆచ్ఛాదనము.
**స్థగితము.** సం. విణ. (అ.ఆ.అ.) కప్పఁబడినది, ఆచ్ఛాదితము.
**స్థపతి.** సం. వి. ఇ. పుం. 1. శిల్పివిశేషము; 2. బృహస్పతిసవనముచేత యజించినవాఁడు; 3. అంతఃపురపు కావలివాఁడు. విణ. శ్రేష్ఠుఁడు.
**స్థపుటము.** సం. విణ. (అ. ఆ. అ.) మధ్యానతము పార్శ్వోన్నతమునైనది.
**స్థలపద్మిని.** సం. వి. ఈ. స్త్రీ. మెట్టతామర?.
**స్థలము.** సం. వి. అ. న. మెట్టనేల.
**స్థలి.** సం. వి. ఈ. స్త్రీ.——పై.——
**స్థవిరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ముసలివాఁడు.
**స్థవిష్ఠము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి స్థూలము.
**స్థవీయము.** సం. విణ. (స్. ఈ. స్.) రెంటికంటె మిక్కిలి స్థూలము.

## స్థా.

**స్థాండిలుఁడు.** సం. వి. అ. పుం. స్థండిలభూమియందు శయనించెడు వ్రతి, స్థండిలశాయి.
**స్థాణువు.** సం. వి. ఉ. పుం. 1. మేకు; 2. శివుఁడు. పుం, న. కొమ్మలులేనిచెట్టు, మ్రోడు. విణ. స్థిరమయినది.
**స్థాత.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) ఉండువాఁడు.
**స్థాతవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ఉండఁదగినది.
**స్థానము.** సం. వి. అ. న. 1. చోటు; 2. ఉనికి; 3. త్రివర్గమునందొకటి; (అనఁగా క్షయవృద్ధ్యష్టవర్గమునందు శత్రువుతో సమముగానుండుట. చూ. వర్గము.) 4. విలుకానియుద్ధమప్పటినిలువు; (ఇది పంచవిధము.—ప్రత్యాలీఢము, ఆలీఢము, సమపదము, విశాఖము, మండలము.) 5. పోలిక.
**స్థానాపతి.** సం. వి. అ. పుం. మధ్యవర్తి.
**స్థాని.** సం. విణ. (న్. ఈ. న్.) స్థానముకలది.
**స్థానికుఁడు.** సం. వి. అ. పుం. 1. స్థానమునకధ్యక్షుఁడు; 2. గుడిపారుపత్తెకాఁడు.
**స్థానీయము.** సం. వి. అ. న. పట్టణము, ప్రోలు.
**స్థాపకుఁడు.** సం. విణ. (అ.ఆ.అ.) స్థాపించువాఁడు.
**స్థాపత్యుఁడు.** సం. వి. అ. పుం. అంతఃపురపు కావలివాఁడు, హెగ్గడి.
**స్థాపనము.** సం. వి. అ. న. 1. స్థాపించుట; 2. సమాధి; 3. పుంసవనము.
**స్థాపని.** సం. వి. ఈ. స్త్రీ. చిఱుబొద్ది?.
**స్థాపించు.** సం. స. క్రి. స్థాపనముచేయు, నిలుపు.
**స్థాపితము.** సం. విణ. (అ.ఆ.అ.) 1. నిలుపఁబడినది; 2. నిశ్చయింపఁబడినది.
**స్థామము.** సం. వి. న్. న. శరీరబలము.
**స్థాయి.** సం. విణ. (న్. ఈ. న్.) ఉండునది.
**స్థాయిభావము.** సం. వి. అ. పుం. రసస్థితస్వాదుత.
**స్థాయుకుఁడు.** సం. వి. అ. పుం. ఒకగ్రామమునకధికారి.
**స్థాలము.** సం. వి. అ. న. భోజనపాత్రము, కంచము.
**స్థాలి.** సం. వి. ఈ. స్త్రీ. 1. వంటకుండ, లోవి; 2. కలిగొట్టు?.
**స్థాలీపులాకన్యాయము.** సం. వి. అ. పుం. కుండెఁడు అన్నమునకు ఒక మెతుకునుపట్టిచూచుట అనెడు న్యాయము.
**స్థావరము.** సం. వి. అ. న. వింటినారి. పుం. కొండ. విణ. కదలనిది.
**స్థావిరము.** సం. వి. అ. న. వృద్ధత్వము, ముదిమి.
**స్థాసకము.** సం. వి. అ. పుం. 1. చేతనిడినకుంకుము లోనగునది; కుంకుములోనగువానిపూఁత. (అని కొందఱు.) 2. నీరులోనగువానియందలిబుగ్గ.
**స్థాస్నువు.** సం. విణ. (ఉ.) బహుకాలము ఉండునది.

## స్థి.

**స్థితము.** సం. విణ. (అ. ఆ. అ.) 1. ఉన్నది; 2. నిలుచున్నది; 3. నిశ్చయింపఁబడినది; 4. ప్రతిజ్ఞచేయఁబడినది.

స్థితి. సం. వి. ఇ. స్త్రీ. 1. ఉనికి; 2. కూర్చుండుట; 3. నిలుకడ; 4. మేర.

స్థిర. సం. వి. ఆ. స్త్రీ. 1. నేల; 2. ముయ్యాకుపొన్న ?. అ. పుం. ము. 1. కొండ; 2. చెట్టు; 3. మోక్షము. డు. శని. విణ. నిలుకడైనది.

స్థిరవారము. సం. వి. అ. పుం. శనివారము. (ఇట్లు మందవారము.) (చూ. వారము.)

స్థిరాయువు. సం. వి. స్. పుం. బూరుగు ?.

స్థూ.

స్థూణ. సం. వి. ఆ. స్త్రీ. 1. స్తంభము; 2. ఇనుపప్రతిమ.

స్థూరి. సం. వి. న్. పుం. బరువుమోసెడుగుఱ్ఱము.

స్థూలనాసము. సం. వి. అ. పుం. పంది, సూకరము.

స్థూలపుష్పకము. సం. వి. అ. పుం. మాదెన ?.

స్థూలము. సం. వి. అ. న. గుడారము. విణ. 1. బలిసినది; 2. బుద్ధిలేనిది.

స్థూలలక్షుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) 1. మిక్కిలి యీవికాఁడు; 2. మిక్కిలి వెచ్చకాఁడు.

స్థూలోచ్చయము. సం. వి. అ. పుం. 1. పెద్దఱాయి; 2. బొటిమ; 3. ఏనుఁగు నడితరపునడ; 4. అసాకల్యము.

స్థే.

స్థేమము. సం. వి. న్. న. శరీరబలము.

స్థేయుఁడు. సం. వి. అ. పుం. 1. పురోహితుఁడు; 2. తీర్పరి. విణ. మిక్కిలి స్థిరుఁడు.

స్థై.

స్థైర్యము. సం. వి. అ. న. స్థిరత్వము. పుం. జాపత్రి.

స్థౌ.

స్థౌణేయము. సం. వి. అ. పుం. 1. గండివనము ?; 2. మాచి ?.

స్థౌరము. సం. వి. అ. న. గుఱ్ఱముమీఁదునమోసెడుబరువు.

స్థౌరి. సం. వి. న్. పుం. బరువుమోసెడుగుఱ్ఱము.

స్థౌల్యము. సం. వి. అ. న. స్థూలభావము.

స్న.

స్నపనము. సం. వి. అ. న. స్నానము, మునుక.

స్నపితము. సం. విణ. (అ. ఆ. అ.) స్నానముచేసినది.

స్నవము. సం. వి. అ. పుం. స్రవణము, కాఱుట.

స్నస. సం. వి. ఆ. స్త్రీ. సన్నపునరము.

స్నా.

స్నాతకుఁడు. సం. వి. అ. పుం. స్నానశీలవ్రతుఁడు. (చూ. వ్రతి.)

స్నాతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) స్నానముచేసినవాఁడు.

స్నానము. సం. వి. అ. న. 1. మునుక; 2. నలుఁగుపిండి.

స్నానీయము. సం. వి. అ. న. నలుఁగుపిండి.

స్నాయువు. సం. వి. ఉ. పుం, స్త్రీ. సన్నపునరము.

స్ని.

స్నిగ్ధము. సం. విణ. (అ. ఆ. అ.) 1. స్నేహముగలది; 2. నునుపుగలది; 3. చిక్కనగలది.

స్నిగ్ధుఁడు. సం. వి. అ. పుం. స్నేహితుఁడు.

స్ను.

స్నుక్కు. సం. వి. హ్. స్త్రీ. జెముడు ?.

స్నుతము. సం. విణ. (అ. ఆ. అ.) కాఱినది, రీణము.

స్నువు. సం. వి. ఉ. పుం. కొండచెఱ్ఱము.

స్నుష. సం. వి. ఆ. స్త్రీ. కోడలు.

స్నుహి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. జెముడు ?.

స్నే.

స్నేహము. సం. వి. అ. పుం. 1. చెలిమి; 2. చేమురు.

స్నేహించు. సం. అ. క్రి. స్నేహముచేయు.

స్నేహితుఁడు. సం. వి. అ. పుం. చెలికాఁడు. విణ. చెలిమిగలవాఁడు.

స్నై.

స్నైగ్ధ్యము. సం. వి. అ. న. స్నిగ్ధభావము, స్నేహము.

స్ప.

స్పందము. సం. వి. అ. పుం. ఇంచుకకంపము.

స్పర్ధ. సం. వి. ఆ. స్త్రీ. 1. పోటి; 2. పోలిక; 3. క్రమసమున్నతి.

స్పర్ధాలువు. సం. విణ. (ఉ.) స్పర్ధగలవాఁడు.

స్పర్శనము. సం. వి. అ. న. 1. తాఁకుడు; 2. ఈవి. పుం. వాయువు.

స్పర్శము. సం. వి. అ. పుం. 1. తాఁకుడు; 2. తాఁకునది; 3. ఈవి; 4. వ్యాధి.

స్పర్శవేధి. సం. వి. న్. పుం. (చూ.) పరుసవేది.

స్పశము. సం. వి. అ. పుం. యుద్ధము, పోరు.

స్వకుఁడు. సం. వి. అ. పుం. 1. వేగులవాఁడు; 2. పులితోడను ఏనుఁగుతోడను పోట్లాడెడు వాఁడు.
స్పష్టము. సం. విశే. (అ. ఆ. అ.) వెల్లడియైనది.

స్పృ.

స్పృక్క. సం. వి. ఆ. స్త్రీ. పిక్క?.
స్పృక్కు. సం. వి. శ్. స్త్రీ. స్పర్శము.
స్పృశి. సం. వి. ఈ. స్త్రీ. వాఁకుడు?.
స్పృశించు. సం. స. క్రి. తాఁకు. (సంస్పృశించు అనియు.)
స్పృశ్యము. సం. విశే. (అ.ఆ.అ.) స్పృశింపఁదగినది.
స్పృష్టకాండుఁడు. సం. వి. అ. పుం. ఆయుధమును ధరించి జీవించువాఁడు.
స్పృష్టము. సం. విశే. (అ. ఆ. అ.) స్పృశింపఁబడినది. (ఉపస్పృష్టము అనియు.)
స్పృష్టి. సం. వి. ఇ. స్త్రీ. తాఁకుడు.
స్పృహ. సం. వి. అ. స్త్రీ. ఇచ్ఛ, కోరిక.
స్పృహణీయము. సం. విశే. (అ.ఆ.అ.) కోరఁదగినది.
స్పృహ్యము. సం. వి. అ. పుం. మాదిఫలము. విశే. కోరఁదగినది.

స్ప్రె.

స్ప్రష్ట. సం. వి. ఋ. పుం. తపింపఁజేయురోగము.

స్ఫ.

స్ఫట. సం.వి.ఆ.స్త్రీ.అ.పుం.ము. పాముయొక్కపడగ.
స్ఫటి. సం. వి. న్. పుం. పాము. "స్ఫటిరాడాదివరాహాకీర్తితబలుఁడా." బ్ర. ౧. అ.
స్ఫటికము. సం. వి. అ. పుం. పటికపుఱాయి.

స్ఫా.

స్ఫాతి. సం. వి. ఇ. స్త్రీ. వృద్ధి.
స్ఫారము. సం. వి. అ. పుం. 1. చలనము; 2. బంగారులోనగువానిచీలిక. విశే. అధికమయినది.

స్ఫి.

స్ఫిక్కు. సం. వి. చ్. జ్. స్త్రీ. పిఱుఁదులయున్నతి.
స్ఫిరము. సం. విశే. (అ. ఆ. అ.) అధికమైనది.

స్ఫీ.

స్ఫీతము. సం. విశే. (అ. ఆ. అ.) అధికమైనది.

స్ఫు.

స్ఫుటనము. సం. వి. అ. న. భేదించుట.
స్ఫుటము. సం. విశే. (అ.ఆ.అ.) 1. స్పష్టమయినది; 2. వికసించినది.
స్ఫురణము. సం.వి. అ.న. 1. అదురుట; 2. తోఁచుట.
స్ఫురించు. సం. అ. క్రి. 1. అదురు; 2. తోఁచు.
స్ఫురితము. సం. వి.అ. న. 1. చుంబనవిశేషము; 2. రతిబంధవిశేషము. విశే. 1. అదిరినది; 2. తోఁచినది.
స్ఫులింగము. సం. వి. అ. పుం. అగ్నికణము, మిడుఁగుఱు.

స్ఫూ.

స్ఫూర్జకము. సం. వి. అ. పుం. తుమ్మిక?.
స్ఫూర్జథువు. సం. వి. ఉ. పుం. వజ్రధ్వని.
స్ఫూర్తి. సం. వి. ఇ. స్త్రీ. 1. అదురుట; 2. తోఁచుట.

స్ఫే.

స్ఫేష్ఠము. సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి అధికమయినది.

స్ఫో.

స్ఫోటకము. సం. వి. అ. పుం. బొబ్బలుపొక్కెడు రోగవిశేషము.
స్ఫోటము. సం. వి. అ. పుం. భేదించుట.

స్మ.

స్మయము. సం.వి.అ. పుం. 1. గర్వము; 2. ఆశ్చర్యము.
స్మరణము. సం. వి. అ. న. 1. తలఁపు; 2. జ్ఞప్తి.
స్మరహరుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.
స్మరాంకుశము. సం. వి. అ. పుం. పెంచిదిద్దినగోరు.
స్మరించు. సం. స. క్రి. స్మరణముచేయు, తలఁచు.
స్మరుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు, మరుఁడు.
స్మర్త. సం. విశే. (ఋ. ఈ. ఋ.) స్మరించువాఁడు.

స్మా.

స్మారితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) తలఁపుసాక్షి. (చూ. సాక్షి.)
స్మార్తము. సం. వి. అ. న. స్మృత్యుక్తకర్మము. విశే. స్మృతిసంబంధమైనది.

## స్మి.

స్మితము. సం. వి. అ. న. అధరమునందుమాత్రము ప్రకాశించెడు చిఱునవ్వు. (ఇది యుత్తమము. చూ. హాసము.)

స్మితి. సం. వి. ఇ. స్త్రీ. స్మితము, చిఱునగవు.

స్మృతము. సం. విణ. (అ. ఆ. అ.) తలఁపఁబడినది.

స్మృతి. సం. వి. ఇ. స్త్రీ. 1. తలఁపు; 2. ధర్మశాస్త్రము; 3. బుద్ధి; 4. ఒక యర్థాలంకారము. (చూ. అలంకారము.)

## స్మే.

స్మేరము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కొంచెము నవ్వునది; 2. వికసించినది.

## స్య.

స్యందనము. సం. వి. అ. న. 1. కాఱుట; 2. జలము. పుం. తివాసము? పుం, న. రథము.

స్యందము. సం. వి. అ. పుం. స్రవణము, కాఱుట.

స్యంది. సం. విణ. (న్. ఈ. న్.) స్రవించునది.

స్యందిని. సం. వి. ఈ. స్త్రీ. చొంగ, లాల.

స్యదము. సం. వి. అ. పుం. వేగము, వడి.

స్యన్నము. సం. విణ. (అ.ఆ.అ.) కాఱినది, స్రుతము.

## స్యా.

స్యాలిక. సం. వి. అ. స్త్రీ. భార్యతోడఁబుట్టినది. (రూ. శ్యాలిక.)

స్యాలుఁడు. సం. వి. అ. పుం. భార్యతోడఁబుట్టినవాఁడు. (రూ. శ్యాలుఁడు.)

## స్యూ.

స్యూతము. సం. వి. అ. పుం పల్లిక, దాఁగర. విణ. కుట్టఁబడినది.

స్యూతి. సం. వి. ఇ. స్త్రీ. 1. కుట్టు; 2. సంతతి.

స్యూనము. సం. వి. అ. పుం. దాఁగర, స్యూతము.

## స్ర.

స్రంసనము. సం. వి. అ. న. క్రిందపడుట.

స్రంసి. సం. వి. న్. న. పోఁక. పుం. గొనుగు? విణ. క్రిందపడునది.

స్రగు. దే. అ. క్రి. సన్నువడు కొందటిరూపము.

స్రగ్వి. సం. విణ. (న్.ఈ.న్.) పూలదండగలవాఁడు.

స్రజము. సం. వి. జ్. స్త్రీ. పూలదండ, హారము.

స్రవ. సం. వి. ఆ. స్త్రీ. పేఁగ?. అ. పుం. ము. కాఱుట.

స్రవంతి. సం. వి. ఈ. స్త్రీ. నది, తరంగిణి, ఏఱు.

స్రవణము. సం. వి. అ. న. స్రవము, కాఱుట.

స్రవించే. సం. అ. క్రి. కాఱు. (స్రవియించుఅనియు.)

స్రష్ట. సం. వి. ఋ. పుం. బ్రహ్మ, ధాత, నలువ.

స్రస్తము. సం. విణ. (అ.ఆ.అ.) జాఱినది, చ్యుతము.

## స్రా.

స్రావకము. సం. విణ. (అ. ఆ. అ.) కాఱునది.

స్రావణము. దే. వి. అగసాలెవానికొఱముట్టు.

స్రావము. సం. వి. అ. పుం. స్రవము, కాఱుట.

స్రావి. దే. వి. సరవియొక్క మాఱురూపము.

## స్రు.

స్రుక్కఁబడు. ద్వి. అ. క్రి. (స్రుక్కన్ + పడు.) స్రుక్కు, దుఃఖించు. "అవమతి తన్నొందిన స్రుక్కఁబడక." భార. విరా. ౧, ఆ. (స్వార్థమున పడు.)

స్రుక్కు. ఉభ. దే. అ. క్రి. 1. వెనుదీయు; "ఉ. పాపవృత్తికిన్, స్రుక్కక వైరమెత్తికడుఁగ్రూరుఁడవై యిటు సేఁతచూడఁగా, దిక్కులుగెల్వఁగాదునను ద్రొక్కనఁబోయితిగానియిప్పుడిన్." నిర్వ. ౫, ఆ.—2. భయపడు; "స్రుక్కముచావునకార్తనేమియున్." భార. అర. ౪, ఆ. "తే. రక్కసుల కోఁడనేడిటుస్రుక్కనేల, దురములోపల మార్తురఁదొడరిగెలుచు, జాడలెన్నినఁగలవెదజంకుమాని, చెఱుపుదొడరనిత్రేలిమిచేయుమొకటి." అచ్చ. యు, కాం.—3. ముడుఁగు; "క. జక్కవలలరఁజకోరము, లుక్కఱఁగమలములు విరియసొగిఁగైరవముల్, స్రుక్కసమస్తజనంబులు, త్రొక్కదిశలువెలుఁగభాస్కరుఁడు పొడతెంచెన్." భో. ౧, ఆ.—4. ముడుతపడు; "తే. కలయనరసె వెంద్రుకలుస్రుక్కెఁజర్మంబు, వీఁపువంగెబొమలుత్రేలఁబడియెఁ, గన్ను లనువుదప్పెఁగదలెదంతంబులు, కణఁకలడఁగెశిరముపణఁకఁదొడఁగె." భో. ౬, ఆ.—5. తగ్గు; (చూ. ముడుఁగురెండవయర్థము.)—6. దుఃఖించు; "ఉ. సత్యయింతకున్, స్రుక్కకయున్న నీమహిమనూచినబోటులు విన్నవింపఁగన్." పా. ౧, ఆ.—7. చింతించు; "భీమ

తనూభవకెృష్ణునంబునకా స్రుక్కుచు నుండె నైన
ధుండును గడుం జింతవహించె." నై. ౪, ఆ.—
౮. మూర్ఛిల్లు; "తే. కంకటము దూటి తుంగంబుగాఁ
డిపోవఁ, గ్రూరనారాచమేసిన స్రుక్కి నతఁడు."
భార. ద్రో. ౨, ఆ.—9. సంకోచించు; "తావినీత
మై స్రుక్కుచు నీచభామినుఁ జూప్పనఁ బల్కె-
డు." భార. విరా. ౧, ఆ.—10. వాడు; "తే. కఱ
కు కెండదాఁకిన తొగ కామభంగిఁ, బాఁపకేని
మే నెంతయుఁ బలముదఱిఁగి, స్రుక్కె." హరి. పూ.
౩, ఆ.—11. చేట్టుకొను. ఆము. ౫, ఆ.—వి.
1. చిక్కు; "సీ. మార్గాలకంబుల స్రుక్కు చక్కఁగాఁ
దీర్చినలువు పెమ్మనములో మొలవఁ బెట్టు." నై. ౭,
ఆ.—2. దుఃఖము; "భోగంబులకా మెచ్చు కా స్రు
క్కును లేక యుండు." భార. శాం. ౨, ఆ.—
3. శోకము; "సీ. సౌఖ్యంబు దుఃఖంబు సంప్రాప్త
మైన చో నుబ్బు స్రుక్కులు లేకయుండె నేని." పు.
౧, ఆ.—4. బ. కడుపు మీఁదిముడుతలు. "సీ. నగ
వులును నువులు నడలు రాయంచలు స్రుక్కులత
రఁగలు ప్రాక్కిలి సుడి." నీలా. ౨, ఆ.—సం. చ్.
స్త్రీ. మిల్లివంటి యజ్ఞోపకరణవిశేషము.

స్రుతము. సం. విశే. (అ. ఆ. అ.) కాఱినది.

స్రుతి. సం. వి. ఇ. స్త్రీ. కాఱుట.

స్రువ. సం. వి. అ. స్త్రీ. 1. అందుగు; 2. చేఁగ్రి. అ. పుం. ను. స్రుగ్భేదము.

స్రువావృక్షము. సం. వి. అ. పుం. ములువెలఁగ. (రూ. స్రుచావృక్షము.)

## స్రో.

స్రోతస్విని. సం. వి. ఈ. స్త్రీ. నది, నిమ్నగ, ఏఱు.

స్రోతస్సు. సం. వి. స్. న. 1. ప్రవాహము; 2. ఏఱు; 3. నీరువచ్చెడి తూము; 4. ఇంద్రియము; 5. తొండము చివర.

స్రోతోంజనము. సం. వి. అ. న. నీలాంజనము.

## స్లే.

స్లేటు. అం. వి. రాతిపలక.

## స్వ.

స్వకము. సం. విశే. (అ. ఆ. అ.) స్వకీయము.

స్వకీయము. సం. విశే. (అ. ఆ. అ.) తనది.

స్వచ్ఛందము. సం. విశే. (అ. ఆ. అ.) స్వతంత్రము.

స్వచ్ఛము. సం. వి. అ. పుం. తెలుపు. విశే. తెల్లనిది.

స్వజనుఁడు. సం. వి. అ. పుం. సగోత్రుఁడు, జ్ఞాతి.

స్వతంత్రము. సం. విశే. (అ. ఆ. అ.) సొంతము.

స్వతంత్రింపు. సం. అ. క్రి. ఒకరియనుమతిలేక తానుగా ఏర్పడు.

స్వధితి. సం. వి. ఇ. పుం. గండగొడ్డలి, పరశువు.

స్వనము. సం. వి. అ. పుం. మ్రోఁత, శబ్దము, ధ్వని.

స్వనితము. సం. వి. అ. న. ఉఱుము. విశే. మ్రోసినది.

స్వప్నక్కు. సం. విశే. (క్.) నిదురపోతు.

స్వప్నము. సం. వి. అ. పుం. 1. కల; 2. నిదుర; 3. చూపు.

స్వభాను. సం. వి. ఉ. పుం. ఒక సంవత్సరము. (చూ. సంవత్సరము.)

స్వభావము. సం. వి. అ. పుం. స్వధర్మము.

స్వభువు. సం. వి. ఊ. పుం. 1. విష్ణువు; 2. శివుఁడు.

స్వము. సం. వి. అ. పుం, న. 1. ధనము; 2. తాను. విశే. తనది.

స్వయంభువు. సం. వి. ఊ. పుం. 1. బ్రహ్మ; 2. విష్ణువు; 3. శివుఁడు; 4. మన్మథుఁడు.

స్వయంవర. సం. వి. ఆ. స్త్రీ. తనంతట మగని వరించు నట్టి యాఁడుది.

స్వరము. సం. వి. అ. పుం. 1. అకారాది; 2. ఉదాత్తాది; (ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము.) 3. షడ్జాది; (స, రి, గ, మ, ప, ధ, ని.) 4. ముక్కుగాలి; 5. కంఠధ్వని.

స్వరాట్టు. సం. వి. జ్. పుం. 1. బ్రహ్మము; 2. ఇంద్రుఁడు. (రూ. స్వరాటు.)

స్వరితము. సం. వి. అ. పుం. స్వరవిశేషము. (చూ. స్వరము.)

స్వరువు. సం. వి. ఉ. పుం. 1. వజ్రాయుధము; 2. యూపస్తంభముయొక్క తునుక; 3. బాణము; 4. యజ్ఞము. విశే. స్వతంత్రము.

స్వరూపము. సం. వి. అ. న. స్వభావము.

స్వర్గము. సం. వి. అ. పుం. దేవలోకము, వేల్పుఁబ్రోలు.

స్వర్ణకారుఁడు. సం. వి. అ. పుం. అగసాలెవాఁడు.

స్వర్ణక్షీరి. సం. వి. ఈ. స్త్రీ. రెడ్డివారినానఁబ్రాలు.

స్వర్ణది. సం. వి. ఈ. స్త్రీ. ఆకాశగంగ, వేల్పుటేఱు.

స్వర్ణపారేవతము. సం. వి. అ. న. పెద్దయీడి.

స్వర్ణము. సం. వి. అ. న. బంగారు. పుం. ఎఱ్ఱటెంకాయచెట్టు.

స్వర్భానువు. సం. వి. ఉ. పుం. రాహువు

స్వల్పము. సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి అల్పమయినది.

స్వవాసిని. సం. వి. ఈ. స్త్రీ. 1. పేరంటాలు; 2. పుట్టినింటనుండెడి యాఁడుది.

స్వస. సం. వి. ఋ. స్త్రీ. తోడఁబుట్టినది.

స్వస్తి. సం. ఇ. అవ్య. శుభము. "స్వస్తియగుఁగాక." కాశి. ఖం. 3, ఆ.

స్వస్తికము. సం. వి. అ. పుం. 1. తూర్పువాకిలిగల రాజగృహము; 2. వేదుకము; 3. భుజబంధవిశేషము; 4. మంగళవస్తువు; 5. ముగ్ధస్త్రీహస్తవిన్యాసవిశేషము; 6. అభినయహస్తవిశేషము; (వ్రేళ్లు చాఁపఁబడిన చేతులను మణికట్లయందుఁగూర్చి వెలిముఖముగా నెడమప్రక్క పట్టినది.) 7. పాములయొక్క పడగమీఁది వంపయిన మొనలుగల యర్ధచంద్రాకారవు నల్లనిరేఖ.

స్వస్తిముఖము. సం. వి. అ. పుం. జాబు.

స్వస్తిముఖుఁడు. సం. వి. అ. పుం. 1. బ్రాహ్మణుఁడు; 2. బట్టువాఁడు.

స్వస్థము. సం. విశే. (అ. ఆ. అ.) నెమ్మదిగానుండునది.

స్వస్రీయ. సం. వి. ఆ. స్త్రీ. మేనకోడలు. అ. పుం. డు. మేనల్లుఁడు.

## స్వా.

స్వాంతము. సం. వి. అ. న. 1. మనస్సు; 2. గుహ.

స్వాగతము. సం. వి. అ. న. 1. కుశలప్రశ్నము; 2. సుఖముతోడిరాక; 3. వృత్తవిశేషము.

స్వాచ్ఛ్యము. సం. వి. అ. న. స్వచ్ఛత.

స్వాతంత్ర్యము. సం. వి. అ. న. స్వతంత్రభావము, స్వతంత్రత.

స్వాతి. సం. వి. ఇ. స్త్రీ. సంజ్ఞాదేవి. ఇ. పుం, స్త్రీ. ఈ. స్త్రీ. నక్షత్రవిశేషము. (చూ. నక్షత్రము.)

స్వాదనము. సం. వి. అ. న. పానము.

స్వాదము. సం. వి. అ. పుం. 1. రుచి; 2. రుచిచూచుట.

స్వాదితము. సం. విశే. (అ. ఆ. అ.) పానముచేయఁబడినది.

స్వాదుకంటకము. సం. వి. అ. పుం. 1. పల్లేరు; 2. ములువెలఁగ.

స్వాదుధన్వుఁడు. సం. వి. న్. పుం. తియ్యవిలుకాఁడు, మన్మథుఁడు.

స్వాదురస. సం. వి. ఆ. స్త్రీ. 1. కారుగోలిమిడి; 2. ద్రాక్ష.

స్వాదువు. సం. విశే. (ఉ.) 1. ఇంపయినది; 2. గరగరిమైనది; 3. తియ్యనిది.

స్వాదూదకము. సం. వి. అ. పుం. మంచినీళ్లసముద్రము.

స్వాద్వి. సం. వి. ఈ. స్త్రీ. ద్రాక్ష.

స్వాధీనపతిక. సం. వి. ఆ. స్త్రీ. స్వాధీనుఁడైన పెనిమిటిగలనాయిక. (చూ. నాయిక.)

స్వాధీనుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) తనకు లోఁబడినవాఁడు.

స్వాధ్యాయము. సం. వి. అ. పుం. 1. వేదాధ్యయనము; 2. వేదము; 3. జపము.

స్వాధ్యాయి. సం. వి. న్. పుం. 1. వేదాధ్యయనము చేయువాఁడు; 2. పట్టణమునందలి వర్తకుఁడు.

స్వానము. సం. వి. అ. పుం. స్వనము, ధ్వని, మ్రోఁత.

స్వాపతేయము. సం. వి. అ. న. ధనము, విడిముడి.

స్వాపము. సం. వి. అ. పుం. 1. నిద్ర; 2. శయనము; 3. అజ్ఞానము; 4. తిమ్మిరి.

స్వాభావికము. సం. విశే. (అ. ఈ. అ.) స్వభావముచేతఁగలిగినది.

స్వామి. సం. వి. న్. పుం. 1. ఒడయుఁడు; 2. కుమారస్వామి. విశే. అధికారి.

స్వామిని. సం. వి. ఈ. స్త్రీ. ఒడయురాలు.

స్వామ్యము. సం. వి. అ. న. సొంతము. (అష్టస్వామ్యములు.—విక్రయ, దాన, వినిమయ, జల, తరు, పాషాణ, నిధి, నిక్షేపములు.)

స్వారాజ్యము. సం. వి. అ. న. స్వర్గలోకప్రభుత్వము.

స్వారాట్టు. సం. వి. జ్. పుం. స్వర్గలోకాధిపతి, ఇంద్రుఁడు.

స్వారి. దే. వి. వాహ్యాళి, విహారము. "ఎ, గీ. శివుఁడు మంధానగిరితుంగశృంగవీధిఁ, జెలువుమీఱంగ స్వారిసేఁచేయునపుడు." ఉ, రా. ౧, ఆ.

స్వాస్థ్యము. సం. వి. అ. న. స్వస్థత, నెమ్మది.

స్వాహా. సం. వి. ఆ. స్త్రీ. అగ్నిభార్య.

## స్వి.

స్విన్నము. సం. విశే. (అ. ఆ. అ.) స్వేదముతోఁగూడినది.

## స్వీ.

స్వీకరించు. సం. స. క్రి. అంగీకరించు.

స్వీకర్త. సం. విశే. (ఋ. ఈ. ఋ.) స్వీకరించువాఁడు.

స్వీకారము. సం. వి. అ. పుం. అంగీకారము.

స్వీకృతము. సం. విశే. (అ. ఆ. అ.) అంగీకరింపఁబడినది.

**స్వీయ.** సం. వి. అ. స్త్రీ. పతియందుమాత్రము అను రాగముగలనాయిక. (చూ. నాయిక.) విణ. తనది.

## స్వే.

**స్వేదజము.** సం. విణ. (అ. ఆ. అ.) చెమటవలనఁ బుట్టినది. (పురుగులోనగునది.)
**స్వేదని.** సం. వి. ఈ. స్త్రీ. పెనము, కందువు.
**స్వేదము.** సం. వి. అ. పుం. 1. చెమట; 2. చెమట పోయుట.

## స్వై.

**స్వైరి.** సం. విణ. (న్. ఈ. న్.) స్వతంత్రుఁడు.
**స్వైరిణి.** సం. వి. ఈ. స్త్రీ. అంకుటాలు, జారిణి.
**స్వైరిత.** సం. వి. అ. స్త్రీ. యథేచ్ఛత.
**స్వైరుఁడు.** సం. విణ. (అ.ఆ.అ.) 1. స్వతంత్రుఁడు; 2. సోమరి.

## హ.

**హ.** ఒకయక్షరము.
**హంకరించు.** వై. అ. క్రి. అహంకరించు.
**హంకారము.** వై. వి. అభిమానము, అహంకారము. "తనువుమూలము దుఃఖములకు దేహముకర్మము ననుబుట్టు హంకారమునుగల్గునమ్మెన." అధ్యా. కిష్కిం, కాం. "సీ. తలకొందునెఱతనంబులు పుట్టుపుట్టిల్లు హంకారములకెల్ల నాటపట్టు." చంద్రా. ౨, ఆ.
**హంగామా.** హిం. విణ. కొంతకాలము ఉండు.
**హండ.** సం. వి. అ. స్త్రీ. వెడల్పునోరుగల పెద్దమృత్పాత్రము. (వాడుకయందు వెడల్పు నోరుగల లోహపాత్రముగానున్నది. మఱియు నిది దీర్ఘాంతముగానే వాడుకలోఁ గనఁబడుచున్నది.) (రూ. హండి. ఈ. స్త్రీ.)
**హంత.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) హింసించువాఁడు.
**హంభ.** సం. వి. ఆ. స్త్రీ. గోధ్వని.
**హంవీరుఁడు.** సం. వి. అ. పుం. క్షత్రియుఁడు. విణ. శూరుఁడు. "సమరహంవీరుఁడు." శశాం. ౫, ఆ.
**హంస.** సం. వి. అ. పుం. 1. అంచే; 2. యోగివిశేషము; 3. పరమాత్మ; 4. తెల్లగుఱ్ఱము; 5. మంత్రవిశేషము; 6. శరీరవాయువిశేషము; 7. మాత్సర్యము; 8. (ఉత్తరపదమైనచో) శ్రేష్ఠము. (రాజహంస.) (రూ. హంసము.)
**హంసకము.** సం. వి. అ. పుం. కాలియందె.
**హంసపక్షము.** సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము.
**హంసపాదము.** సం. వి. అ. పుం. (చూ.) అంచ పదము.
**హంసవాహనుఁడు.** సం. వి. అ. పుం. బ్రహ్మ, అంచరవుతు.
**హంసాయి.** హిం. వి. ఇరుగుపొరుగువాఁడు.
**హంసాస్యము.** సం. వి. అ. పుం. అభినయహస్తవిశేషము.
**హంసి.** సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుహంస. (రూ. హంసిక. అ. స్త్రీ.)
**హంసుఁడు.** సం. వి. అ. పుం. 1. సూర్యుఁడు; 2. జీవుఁడు; 3. విష్ణువు; 4. శివుఁడు; 5. లోభగుణములేని రాజు.
**హక్కన్సు.** హిం. వి. పగ.
**హక్కు.** హిం. వి. బాధ్యత.
**హక్కుదారు.** హిం. వి. బాధ్యతగలవాఁడు, ఆస్తికర్త.
**హజరతు.** హిం. వి. గౌరవార్థపదము.
**హజారము.** దే. వి. అజారమునకు మొదటిరూపము. (ఆస్థానమండపమునకు.—"కొలువుహజారమై." రామా. ౧, ఆ.)
**హజారు.** దే. వి. ఆస్థానము. "క. వచ్చినమంతిరినృపతివి, యచ్చరనాయకుననుజ్ఞనవసరసచివుల్, చెచ్చెరహజారునకుఁబిలువ, వచ్చినదిగ్గనరుంగువడి డిగ్గితగన్." రా, వి. ౫, ఆ. (హజారముయొక్క మాఱురూపము.)
**హజ్జ.** దే. వి. పాదము. (అజ్జకు మొదటిరూపము.)
**హట్టము.** సం. వి. అ. పుం. అంగడివీధి.
**హట్టవిలాసిని.** సం. వి. ఈ. స్త్రీ. నఖమనెడు గంధద్రవ్యము.
**హఠము.** సం. వి. అ. పుం. 1. పట్టు; 2. బలాత్కారము; 3. యోగవిశేషము.
**హఠవాది.** సం. విణ. (న్. ఈ. న్.) పట్టుపట్టి సాధించువాఁడు.
**హడపము.** దే. వి. అడపమునకు మొదటిరూపము.
**హతి.** సం. వి. ఇ. స్త్రీ. కొట్టు, దెబ్బ. (ఉపహతి అనియు.)
**హతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) 1. కొట్టఁబడినవాఁడు; 2. మనసుచెడినవాఁడు.
**హత్తి.** వై. వి. ఏనుఁగు, గజము. (చూ. కత్తిరించు.)

**హత్తు.** దే. అ. క్రి. అత్తునకు మొదటిరూపము. (కలుగుటకు.—"ఆచంద్రాననపొందు నాకెటువలెన్ హత్తించెదో." రసి. 3, ఆ.)

**హత్య.** సం. వి. ఆ. స్త్రీ. చంపుట, హననము.

**హదను.** దే. వి. అదనునకు మొదటిరూపము. "ఆహదనంబెలంగుజనము." అము. ౪, ఆ.

**హద్దు.** దే. వి. మేర, ఆజ్ఞ.

**హననము.** సం. వి. అ. న. హత్య, చంపుట.

**హనుమ.** వై. వి. హనుమంతుఁడు. "హనుమకనిలజుండనియెన్." భార. అర. 3, ఆ.

**హనుమంతుఁడు.** సం. వి. త్. పుం. ఆంజనేయుఁడు.

**హనుమఁడు.** వై. వి. అనుమఁడునకు మొదటిరూపము.

**హనుమానుఁడు.** సం. వి. త్. పుం. హనుమంతుఁడు.

**హనువు.** సం. వి. ఉ. స్త్రీ. 1. నఖమనెడు గంధద్రవ్యము; 2. చావు; 3. ఆయుధము; 4. వ్యాధి. పుం, స్త్రీ. చెక్కిలిమీఁదిభాగము.

**హన్నుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) విష్ఠించినవాఁడు. (హన్నము అని చెప్పి విష్ఠింపఁబడినది. అని కొందఱు.)

**హమాంబాపతు.** హిం. వి. మొత్తము.

**హమేషా.** హిం. అవ్య. ఎల్లప్పుడు, అవశ్యముగా.

**హయగ్రీవుఁడు.** సం. వి. అ. పుం. 1. విష్ణ్వవతారవిశేషము; 2. దైత్యవిశేషము.

**హయపుచ్ఛి.** సం. వి. ఈ. స్త్రీ. కారుమినుము?.

**హయమారకము.** సం. వి. అ. పుం. గన్నేరు?.

**హయము.** సం. వి. అ. పుం. అశ్వము, గుఱ్ఱము.

**హయాము.** హిం. వి. కాలము, ఏలుఁబడి.

**హరకత్తు.** హిం. వి. ఆటంకము.

**హరణము.** సం. వి. అ. న. 1. హరించుట; 2. (చూ.) అరణము; 3. భాగహారము.

**హరబ్బి.** దే. వి. 1. దేశవిశేషము; 2. ఆదేశపుగుఱ్ఱము.

**హరి.** సం. వి. ఇ. న. ఒకవర్షము. (చూ. వర్షము.) పుం. 1. విష్ణువు; 2. ఇంద్రుఁడు; 3. సూర్యుఁడు; 4. చంద్రుఁడు; 5. యముఁడు; 6. సింహము; 7. గుఱ్ఱము; 8. కోఁతి; 9. పాము; 10. గాలి; 11. కిరణము; 12. కప్ప; 13. చిలుక. విణ. 1. పచ్చనిది; 2. బంగారువర్ణముగలది.

**హరించు.** సం. అ. క్రి. అడఁగు. "క. ఏతపములనే జపముల, నేతీర్థవిలోకనములనే క్రతువులనీ, జ్ఞాతివధంబొనరించిన, పాతకము హరించుననఁదపస్వియతనితోన్."కై. ౧, ఆ.—అం, ప్రే. అడఁచు.

**హరిగ.** దే. వి. కేడెము. "చ. దురమునలక్ష్మణుండుని హతుండయినంగుఱుఁడచ్చలంబునన్, హరిగయు వాలుఁగైకొని." కై. ౫, ఆ. (అరిగకు మొదటిరూపము.)

**హరిగోలు.** దే. వి. అరిగోలునకు మొదటిరూపము.

**హరిచందనము.** సం. వి. అ. న. 1. చెందిరము; 2. వెన్నెల. పుం, న. 1. పసుపువన్నెగల చందనము; 2. ఒకకల్పవృక్షము. (చూ. కల్పవృక్షము.)

**హరిణము.** సం. వి. అ. పుం. 1. జింక; 2. తెలుపు. విణ. తెల్లనిది.

**హరిణక్రీడనము.** సం. వి. అ. న. బాలక్రీడావిశేషము. "వ. అందఱుహరిణక్రీడనంబను నాటకుం దొడంగి." హరి. పూ. 2, ఆ.

**హరిణి.** సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుజింక; 2. ఒకయప్సరస్త్రీ; 3. బంగారుప్రతిమ; 4. వృత్తవిశేషము; 5. అడవిమొల్ల?. విణ. ఆకుపచ్చవర్ణముగలది.

**హరిత.** సం. వి. ఆ. స్త్రీ. గరిక?. అ. పుం. ము. 1. ఆకుపచ్చవర్ణము; 2. పచ్చగుఱ్ఱము; 3. పచ్చపిట్ట; (ఇదే గిజిగాఁడు.) 4. పచ్చపెసర?; 5. సింహము. విణ. ఆకుపచ్చనిది.

**హరితకము.** సం. వి. అ. న. కూర, శాకము.

**హరితపత్రిక.** సం. వి. ఆ. స్త్రీ. పచ్చాకుచెట్టు.

**హరితాళము.** సం. వి. అ. న. హరిదళము.

**హరిత్తు.** సం. వి. త్. స్త్రీ. దిక్కు. పుం. 1. ఆకుపచ్చవర్ణము; 2. పచ్చగుఱ్ఱము; 3. సింహము. పుం, న. గరిక?. విణ. ఆకుపచ్చనిది.

**హరిదళము.** వై. వి. అరిదళమునకు మొదటిరూపము. "సీ. నిద్రమేల్కాంచినసెత్తమ్మిమొగడలపరువంపు పుప్పొళ్లహరిదళముగ." కాశీ. ౧, ఆ.

**హరిదశ్వుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

**హరిద్ర.** సం. వి. ఆ. స్త్రీ. పసుపు, నిశాహ్వ.

**హరిద్రాభము.** సం. వి. అ. పుం. పసుపువర్ణము. విణ. పసుపువర్ణముగలది.

**హరిద్రువు.** సం. వి. ఉ. పుం. మ్రానిపసుపు.

**హరిన్మణి.** సం. వి. ఇ. పుం. పచ్చ, మరకతము.

**హరిప్రియ.** సం. వి. ఆ. స్త్రీ. 1. లక్ష్మి; 2. భూమి; 3. తొళసి; 4. ఏకాదశి.

**హరిబువ్వము.** దే. వి. వివాహమునందు నాలవనాటి రాత్రి బంధువులైన మగవారు ఆఁడువారు అందఱును ఒకటిగాకూడి వేడుకగా భుజించుట.

**హరిమంథకము.** సం. వి. అ. పుం. సెనగలు.

హారివాణము. సం. వి. అ. పుం. తట్ట.

హారివాలుకము. సం. వి. అ. న. నూఁగుదోస, కూఁతురుబుడమకి.

హారివాసరము. సం. వి. అ. పుం. ఏకాదశి.

హారిహయుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

హారీతకి. సం. వి. ఈ. స్త్రీ. కరకకి.

హారుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

హారువు. దే. వి. 1. మనోజ్ఞత; "అ. పాండురంగను కవిపద్యంబుహారువును." పాంచా. ౧, ఆ.—2. నాణెమైనపని. "క. వెరవరులీహారువులకీ, గురుకుచలనితలఁచి." రామా. ౨, ఆ.—విశే. 1. మనోజ్ఞము; "ఎ, గీ. మెఱుఁగుబంగరుపుహారువుఁ, బనులనలరొందుగోనబుటుప్పరిగయఁడు." అచ్చ. అ, కాం.—2. నాణెము. "క. హారువుగొనమ్ముల తిట్టా." అచ్చ. కిష్కిం, కాం.

హారుసము. వై. వి. అరుసమునకు మొదటిరూపము. "చ. పరహితుఁడైనవానికిశుభంబులంభించిన నెల్లవారలుకా, హారుసమెకంద్రు." ఉ, రా. ౨, ఆ.

హారుసించు. వై. అ. క్రి. సంతోషించు. "ద్వి. హారుసించిపేరేకుకర్పించుకొఱకు." భల్లా. ౧, భా.

హారేణువు. సం. వి. ఉ. స్త్రీ. రేణుకయను గంధద్రవ్యము. పుం. లంకలు.

హార్కారా. హిం. వి. వార్తాహరుఁడు.

హార్త. సం. విశే. (బు. ఈ. బు.) హరించువాఁడు.

హార్మ్యము. సం. వి. అ. న. మిద్దెటిల్లు.

హార్యక్షము. సం. వి. అ. పుం. సింహము, పచ్చకన్నులమెకము.

హార్యక్షుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు.

హార్షకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) సంతోషింపఁజేయువాఁడు.

హార్షణము. సం. వి. అ. న. సంతోషించుట. పుం. 1. ఒక గ్రహయోగము; (చూ. యోగము.) 2. నేత్రరోగవిశేషము. విశే. సంతోషించువాఁడు.

హార్షమాణుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) సంతోషము నొందిన మనసుగలవాఁడు.

హార్షము. సం. వి. అ. పుం. సంతోషము, హారుసము.

హార్షి. సం. విశే. (న్. ఈ. న్.) సంతోషముగలవాఁడు.

హార్షించు. సం. అ. క్రి. సంతోషించు, హారుసించు.

హాలము. సం. వి. అ. న. నాఁగలి. (బలరామునిహాలము సంవర్తకము.)

హాలహాలము. సం. వి. అ. పుం. హాలాహాలమనువిషము.

హాలాయుధుఁడు. సం. వి. అ. పుం. 1. బలరాముఁడు; 2. మడఁకదున్నువాఁడు.

హాలాహాలము. సం. వి. అ. పుం. 1. హాలాహాలమను విషము; 2. బల్లి; 3. నలికేఁచు.

హాలి. సం. వి. ఇ. స్త్రీ. నాఁగలి. న్. పుం. 1. బలరాముఁడు; 2. మడఁకదున్నువాఁడు.

హాలికుఁడు. సం. వి. అ. పుం. మడఁకదున్నువాఁడు.

హాలిని. సం. వి. ఈ. స్త్రీ. తతిగొట్టి.

హాలిప్రియ. సం. వి. అ. స్త్రీ. కల్లు. అ. పుం. ము. కడపకి.

హాల్కా. హిం. విశే. అల్పమైన, నీచమైన.

హాల్య. సం. వి. ఆ. స్త్రీ. నాఁగళ్లసమూహము. విశే. ఒకతూరి దున్నినది. (పొలము.)

హాల్లకము. సం. వి. అ. న. చెంగలువ.

హాల్లకల్లోలము. దే. విశే. అల్లకల్లోలమునకు మొదటిరూపము. "సీ. కలగుండుపడిహాల్లకల్లోలమై చాలఁగలఁగెనాహీనులు భంగములతోడ." జై. ౨, ఆ.

హాల్లీసకము. సం. వి. అ. న. స్త్రీలు పెక్కండ్రుచేరి మండలాకారముగా తిరుగుచుఁజేయు నృత్యము.

హాల్లు. సం. వి. కకారాదియక్షరములలో నొకటి.

హావణించు. దే. ప్రే. 1. అలంకరించు; "సీ. అవనీవధూమణిహావణించుకాంచియై యుంభోధియొం దాఁకనలరుచుండు." శకాం. ౧, ఆ.—2. ధరించు; "పయ్యెదఁజెంగావి పావడహావణించి." శకాం. ౪, ఆ.—3. చక్కబఱచు; "ఇంటిజగడమింటిలో నెహావణింపక." జై. ౬, ఆ.—4. ఉంచు. "పక్కలోపవళించి పదముపైహావణించి." సత్య. 3, ఆ.

హావణింపు. దే. వి. అలంకరణము. "ఆహావణింపు సొంపులుకా." శకాం. ౨, ఆ. (చూ. ఆరగింపు.)

హావణిక. దే. వి. అలంకారము. "అరుదాహావిడుదులున్నహావణికపొలుపు." విజ. 3, ఆ.

హావణిల్లు. దే. అ. క్రి. 1. ప్రకాశించు; "సీ. తనమఱుంగునదురంతప్రతాప స్ఫూర్తిహావణిల్లునినుఁడు నునడఁగియుండ." పంచ. వేం. ౧, ఆ.—2. విజృంభించు. "ద్వి. చెవులఁదొమ్మిదిలెక్క శ్రీలనుద్రొక్క, హావణిల్లు నలచక్కనయ్యచేడక్క." విష్ణు. ఉ. ౪, ఆ.

హావణు. దే. వి. ఒప్పిదము. "సీ. ధవళాంబువినిచొక్కు హావణుదెల్పెడులీల హాళిఁ గోయిలపల్కు లాలకించి." విజ. ౧, ఆ.

హావనము. సం. వి. అ. న. హోమము.

హవనీయము. సం. విణ. (అ. ఆ. అ.) హోమము చేయఁదగినది.

హవము. సం. వి. అ. పుం. 1. ఆజ్ఞ; 2. పిలుపు; 3. యజ్ఞము.

హవాలా. హిం. వి. అధీనము, పరము.

హవిష్యము. సం. వి. అ. న. 1. హవిస్సు; 2. నెయ్యి.

హవిస్సు. సం. వి. స్. న. 1. అగ్నిహోత్రమునందు వేల్చుటకు ఇవురఁబెట్టినయన్నము; 2. నెయ్యి. (రూ. హవి.)

హవేలి. హిం. వి. నగరు, రాజాకుచెందినది.

హవ్యము. సం. వి. అ. న. దేవతలకీఁదగినయన్నము.

హవ్యవాహనుఁడు. సం. వి. అ. పుం. అగ్నిహోత్రుఁడు. (రూ. హవ్యవహుఁడు.)

హసంతి. సం. వి. ఈ. స్త్రీ. 1. కుంపటి; 2. మల్లెకీ; 3. శాకినీభేదము.

హసదు. దే. విణ. దొడ్డవాఁడు. (అప్ర.)

హసనము. సం. వి. అ. న. 1. హాస్యము; 2. హాస్యరసము.

హసని. సం. వి. ఈ. స్త్రీ. కుంపటి. (హసంతియొక్క రూపాంతరము.)

హసము. సం. వి. అ. పుం. 1. హాస్యము; 2. హాస్యరసము.

హసాదు. దే. అవ్య. గొప్పవారియాజ్ఞను విధేయులు మంచిదని యంగీకరించుటయందువచ్చునది. "అతఁడుహసాదటంచతిరయంబునలంకకుఁబోయి." ఉ, రా. ౨, ఆ. (ఇది అసాదునకు మొదటిరూపము. దీనికాయర్థమునను దానికీయర్థమునను చెప్పవచ్చును.)

హసించు. సం. అ. క్రి. హాసముచేయు, నవ్వు.

హసితము. సం. వి. అ. న. పండ్లు తెలియనవ్వెడునవ్వు. (ఇది యస్మితమువలె నుత్తమము. చూ. హాసము.) విణ. 1. వికసించినది; 2. నవ్వినది.

హస్త. సం. వి. ఆ. స్త్రీ. ఒక నక్షత్రము. (చూ. నక్షత్రము.) అ. పుం. ము. 1. చేయి; 2. తొండము; 3. మూర; 4. (కేశపర్యాయములకు వెనుకవచ్చినప్పుడు) వానిసమూహము. (కేశహస్తము. మొ.)

హస్తవారణము. సం. వి. అ. న. 1. చేతితో అడ్డగించుట; 2. చంపవచ్చినవాని నడ్డగించుట.

హస్తి. సం. వి. న్. పుం. ఏనుఁగు, గజము, దంతావళము.

హస్తినఖము. సం. వి. అ. పుం. గవనివాకిటవాటముగా నేర్పఱచిన మట్టిదిబ్బ.

హస్తిని. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆఁడు ఏనుఁగు; 2. హస్తినాపురము; 3. స్త్రీజాతివిశేషము. (చూ. జాతి.)

హస్తిపకుఁడు. సం. వి. అ. పుం. మావటివాఁడు.

హళఁది. వై. వి. అళఁదికి మొదటి రూపము. (చూ. తలాడ.)

హళహళి. సం. వి. ఈ. స్త్రీ. త్వర. "చ. హళహళినవ్వలిచ్చిన క్రియన్ బిరితేనియలాను లేఁటులున్." ఉ, రా. ౭, ఆ. (రూ. హళహళిక. ఆ. స్త్రీ. "సముచితహళహళికలతో రాయంచలు మ్రోయన్." కళా. ౭, ఆ.)

హళాహళి. ఉభ. దే. వి. కలకలధ్వని. "సీ. తులఁపరాచిలుక ముఁకలహళాహళులకుఁ బాఁపమేపు డుఁబుల్లుబారురొదకు." నీలా. ౩, ఆ.—సం. ఈ. స్త్రీ. 1. త్వర; "ఉ. చెప్పెడిదేమినావలపుచేసినచేతలుకొల్వులోనని, న్నిప్పుడుగంటినప్పుడపయింబడనీడిచినిల్వఁబడ్డపా, టప్పుడదెంతయైనఁగలదట్టి హళాహళికింతసేపునీ, వొప్పెడుదాఁకఁదాళుటకరో మదిమెచ్చదుగాన్పఫాలకా." విజ. ౧. ఆ.—2. శౌర్యము. "ఉ. విరహార్తుని మీఁదనెనీదుశౌర్యముల్. భావజయీహళాహళిఁగపాలికిముందఱఁజూపలేవుగా." సా. ౨, ఆ.

## హా.

హా. సం. అవ్య. 1. ఆశ్చర్యమును దెలుపునది; 2. దుఃఖమును దెలుపునది.

హాకీము. హిం. వి. యజమాని, వైద్యుఁడు.

హాజరు. హిం. విణ. వచ్చియున్న.

హాజారము. దే. వి. హజారముయొక్క రూపాంతరము. (కొలువుకూటమునకు.—"క. రోజింపుమనుచుఁబనిచిన. హాజారంబునకువచ్చి యమ్మంత్రి వరుండు." రామా. ౨, ఆ.

హాటకగర్భుఁడు. సం. వి. అ. పుం. (చూ.) హిరణ్యగర్భుఁడు.

హాటకము. సం. వి. అ. న. 1. బంగారు; 2. ఉమ్మెత్తకీ.

హాని. సం. వి. ఈ. స్త్రీ. 1. తక్కువగుట; 2. కీడు.

హామిక. వై. వి. ఆమికకు మొదటిరూపము*. "ద్వి. పాయంపుహామిక." విష్ణు. ఉ. ౮. ఆ.

హాయనము. సం. వి. అ. పుం, న. 1. సంవత్సరము; 2. కిరణము. పుం. ధాన్యవిశేషము.

హాయి. దే. వి. సుఖము, సౌఖ్యము.

**హారకుఁడు.** సం. వి. అ. పుం. 1. దొంగ; 2. జూదరి. విణ. దోఁచుకొనువాఁడు.

**హారతి.** వై. వి. ఆరతికి మొదటిరూపము. "నక్షత్ర పు హారతి." బ్ర. 3. ఆ.

**హారము.** సం. వి. అ. పుం. 1. నూటయెనిమిదిపేటల ముత్యాలపేరు; 2. యుద్ధము. విణ. హారసంబంధమయినది.

**హారి.** సం. వి. ఇ. స్త్రీ. పథికజనసమూహము. విణ. మనోజ్ఞమైనది. (న్. ఈ. న్.) 1. హరించువాఁడు; 2. హారముగలవాఁడు.

**హారిద్రము.** సం. వి. అ. పుం. 1. కడప!; 2. పసుపువర్ణము. విణ. పసుపువర్ణముగలది.

**హారీతము.** సం. వి. అ. పుం. 1. పచ్చపిట్ట; 2. కపటము. డు. మునివిశేషము.

**హారువు.** దే. వి. జూదమునందలిపరిభాష. ఉ. హరి. 3. ఆ.

**హార్దము.** సం. వి. అ. న. స్నేహము.

**హార్యము.** సం. వి. అ. పుం. తాండ్ర!. విణ. హరింపఁదగినది.

**హాల.** సం. వి. ఆ. స్త్రీ. సారాయి. అ. పుం. ము. నాఁగేలు.

**హాలహాలము.** సం. వి. అ. పుం, న. హాలాహలముయొక్క రూపాంతరము.

**హాలాహలము.** సం. వి. అ. పుం. 1. నల్లకండ్లపాము; 2. బల్లి. పుం, న. విషభేదము.

**హాలికుఁడు.** సం. వి. అ. పుం. హలికుఁడుయొక్క రూపాంతరము.

**హాలుసాలు.** హిం. వి. నడచుసంవత్సరము.

**హావడి.** దే. వి. ఉపద్రవము. "శా. వర్ణింపు నెవ్వాఁడు రజకా, హావళ్లఁదగునవ్యభూప్రజలరాజాయాయిజాత్యాచితిని, బ్రోవంగాఁదగు." ఆము. 5, ఆ. (ఆవడికి మొదటిరూపము.)

**హావము.** సం. వి. అ. పుం. భ్రూనేత్రాదివికారములచేత గాంచెను తెలియఁదగిన మనోవికారము.

**హావళి.** దే. వి. హావడియొక్క రూపాంతరము. "సమీపదేశముల్ హావళిఁబోవకుండ." వి. పు. 2, ఆ. "లోకావళిహావళింగను." ఉ. రా. 4, ఆ.

**హాసము.** సం. వి. అ. పుం. 1. హాస్యము; (ఇది స్మితము, హసితము, విహసితము, ప్రహసితము, అపహసితము, అతిహసితము అని యాఱువిధములుగలది.) 2. హాస్యరసము.

**హాసించు.** సం. అ. క్రి. నవ్వు. "పకపకహాసించు." చంద్రా. ౧, ఆ.

**హాస్తికము.** సం. వి. అ. న. హస్తిసమూహము.

**హాస్యము.** సం. వి. అ. న. 1. నవ్వు; 2. ఒకరసము. (చూ. రసము.)

**హాస్సీలు.** హిం. వి. పన్ను.

**హాహా.** సం. అవ్య. 1. ఆశ్చర్యమును తెలుపునది; 2. దుఃఖమును తెలుపునది.

**హాహాుఁడు.** సం. వి. అ. పుం. ఒకానొక దేవగాయకుఁడు.

**హాళి.** దే. వి. ఆసక్తి. "ఎందుమీఁదిహాళియును లేక." ఉ. రా. ౪, ఆ. "క. హాళింగొనియాడందగు, హేళిఁబ్రసన్నోదయుని ద్రయీమధుపాళిని, గేళీసంకీలితకం, కేళిగుళుచ్ఛస్వరూపఘృణిరంఛోళిని." రామా. ౧, ఆ.

## హి.

**హింగుది.** సం. వి. ఈ. స్త్రీ. ఇంగుదియొక్క రూపాంతరము.

**హింగునిర్యాసము.** సం. వి. అ. పుం. 1. ఇంగువరసము; 2. వేఁపచెట్టు.

**హింగువు.** సం. వి. ఉ. న. ఇంగువ.

**హింగుళము.** సం. వి. అ. పుం, న. రాగద్రవ్యవిశేషము, ఇంగిలీకము.

**హింగుళి.** సం. వి. ఈ. స్త్రీ. ములక!.

**హిండనము.** సం. వి. అ. న. 1. వ్యాప్తి; 2. భ్రమణము; 3. సురతము.

**హిండితము.** సం. విణ. (అ. ఆ. అ.) వ్యాపించినది.

**హింతాలము.** సం. వి. అ. పుం. గిఱకతాడు!.

**హిందోళము.** సం. వి. అ. పుం. ఒకానొకరాగము. (దీనిని శిశిరవసంతఋతువులసంధిని పాడుదురు.)

**హింస.** సం. వి. ఆ. స్త్రీ. 1. చంపుట; 2. దొంగతనము; 3. బాధించుట.

**హింసకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) హింసించువాఁడు.

**హింసనము.** సం. వి. అ. న. హింసించుట.

**హింసించు.** సం. స. క్రి. 1. చంపు; 2. బాధించు.

**హింస్ర.** సం. వి. ఆ. స్త్రీ. నల్లమువ్వి!. విణ. చంపునది.

**హిక్క.** సం. వి. ఆ. స్త్రీ 1. ఎక్కిలి; 2. పైఁడికంటియనుపక్షి.

హిజారు. దే. వి. కాలికిలోడిగిలాసుచట్ట. "పసిండి పట్టుహిజారు." శుక. ౧, ఆ. (ఇజారునకు మొదటి రూపము.)
హిజిరి. హిం. వి. మహమ్మదీయశకము.
హిజ్జలము. సం. వి. అ. పుం. ఎఱ్ఱగన్నేరు?
హితము. సం. విణ. (అ. ఆ. అ.) 1. వెనుకటికి మేలు చేయునది; 2. ధరింపఁబడినది; 3. పోయినది.
హితవరి. వై. విణ. (హితవు+అరి.) ఇతవరికి మొదటి రూపము. (స్వార్థమున అరి.)
హితవు. వై. విణ. ఇతవునకు మొదటిరూపము.
హితుఁడు. సం. విణ. (అ.ఆ.అ.)హితవుచెప్పువాఁడు.
హిమ. సం. వి. ఆ. స్త్రీ. పాలకూర. అ. న. ము. 1. మంచు; 2. చందనము. విణ. చల్లనిది.
హిమకరుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు, చేలి వెలుఁగు.
హిమధాముఁడు. సం. వి. న్. పుం.——వై.——
హిమవంతము. సం. వి. త్. పుం. హిమవత్పర్వతము, మంచుకొండ.
హిమవాలుక. సం. వి. ఆ. స్త్రీ. కర్పూరము.
హిమాంబువు. సం. వి. ఉ. న. పన్నీరు.
హిమాంశువు. సం. వి. ఉ. పుం. చంద్రుఁడు, చేలి వెలుఁగు.
హిమాచలము. సం. వి. అ. పుం. మంచుకొండ. (ఇట్లు హిమాద్రి. మొ.)
హిమాని. సం. వి. ఈ. స్త్రీ. హిమసమూహము.
హిమాలయము. సం. వి. అ. పుం. మంచుకొండ.
హిమావతి. సం. వి. ఈ. స్త్రీ. రెడ్డివారినానఁబ్రాలు?
హిమిక. సం. వి. ఆ. స్త్రీ. హిమము, మంచు.
హిర్ణ్మయము. సం. వి. అ. న. ఒకవర్షము. (చూ. వర్షము.) విణ. బంగారుమయము.
హిరణ్యగర్భుఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మ.
హిరణ్యము. సం. వి. అ. న. 1. బంగారు; 2. మాడ; 3. ధనము; 4. గవ్వ; 5. రేతస్సు.
హిరణ్యరేతసుఁడు. సం. వి. స్. పుం. 1. అగ్ని; 2. సూర్యుఁడు. (రూ. హిరణ్యరేతుఁడు.)
హిరణ్యవాహము. సం. వి. అ. పుం. శోణనదము.
హిలమోచిక. సం. వి. ఆ. స్త్రీ. చిలుకకూర.
హిహకము. సం. వి. అ. పుం. దేహము ముడుఁచుకొన్న పిల్లి.
హిహీ. దే. అవ్య. ఇసీ. "హిహీయిటురండు." ఉ, రా. 3, ఆ. (ఇహిహీయొక్క మాఱురూపము.)

## హీ.

హీనము. సం. విణ. (అ. ఆ. అ.) 1. తక్కువైనది; 2. దూఱఁదగినది; 3. విడువఁబడినది.
హీర. సం. వి. ఆ. స్త్రీ. 1. చీమ; 2. లక్ష్మి. అ. పుం. ము. వజ్రమణి.

## హు.

హుంకరించు. సం. అ. క్రి. హుమ్మని ధ్వనించు.
హుంకారము. సం. వి. అ. పుం. హుమ్మని ధ్వనించుట.
హుంకారించు. సం. అ. క్రి. హుంకారముచేయు. "ధరాచక్రంబు ఘూర్ణిల్లఁగా హుంకారించిన." వీర. ౪, ఆ.
హుంకృతి. సం. వి. ఇ. స్త్రీ. హుంకారము.
హుండీ. హిం. వి. సొమ్మిచ్చుట కాజ్ఞాపత్రిక.
హుకుం. హిం. వి. ఆజ్ఞ.
హుజూరు. హిం. వి. సముఖము, సమక్షము.
హుటాహుటి. దే. వి. గమనవేగము. "క. నడచు హుటాహుటిఁబూడిచి, విడిచెమ్మహాబిలమునొక్కవిగడియలోనన్." రామా. ౮, ఆ.—విణ. వేగవంతము. "హుటాహుటినడలన్." స్వా. ౧, ఆ.
హుడుక్క. సం. వి. ఆ. స్త్రీ. అ. పుం. ము. ఉడుక.
హుతభుక్కు. సం. వి. జ్. పుం. అగ్ని హోత్రుఁడు.
హుతవహుఁడు. సం. వి. అ. పుం.——వై.——
హుతాశనుఁడు. సం. వి. అ. పుం.——వై.—— (రూ. హుతాశుఁడు.)
హుమా. దే. వి. హుమాయియొక్క రూపాంతరము. "క. గిత్తహుమా నెక్కి హయాయులు గెరదు ఁడా." నీలా. 3, ఆ.
హుమాయి. దే. వి. గుఱ్ఱము. (చూ. జోక చేయు రండవయర్థము.)
హురుమత్తు. దే. విణ. గొప్ప, పెద్ద. "సీ. ఒక్కనిబ్బరముగా హురుమత్తు పరువెత్తు సల్లించుకళ్లెముల్ గల్లనంగ." కృష్ణ. ౧, ఆ. (చూ. హుర్మత్తు.)
హురుముంజి. దే. వి. దేశవిశేషము. "పరహురుముజిమహీశసుతుండు." భాను. ౪, ఆ. "ఉ. ముక్కుఁబెట్టిగట్టి హురుముంజి చొకారపు ముత్తియంబుచే, ర్చుక్కయమర్చి." పాంచా. ౨, ఆ. (రూ. హురుముంజీ. "మ. చెలువంబైకెరలన్ వెలుంగుహురుముంజీదేశపున్ముత్తియం, బులలోఁగూర్చినచేఁజుక్క." అని. ౫, ఆ.)

హుర్మత్తు. దే. విణ. హురుమత్తుయొక్క రూపాంతరము. "హుర్మత్తుగఁదోఁచెమింటనెదురన్ ద్విజరాజౌకఁదుద్ధతిన్." చంద్రా. 3, ఆ.

హుర్మంజి. దే. వి. హురుమంజియొక్కరూపాంతరము. "సీ. తోకెంచెనొక్క మధూకపుష్పములనువాసనహుర్మంజి ముత్యములవలన." పాండు. ౪, ఆ.

హుసారు. హిం. వి. జాగ్రత్త. (చూ. హైషా.) (రూ. హుషారు.)

హులిక్కి. దే. వి. హులిక్కియొక్క రూపాంతరము. "అప్పాదితోషణమా దబ్బఱ సత్యమా హులిక్కి." హంస. ౫, ఆ.

హులిక్కి. దే. వి. అభావము. "లేదరదంబు తత్తడిహులిక్కి." స్వా. ౪, ఆ.

## హూ.

హూ. దే. వి. అవులించుటయందగు ధ్వన్యనుకరణము. "సీ. ఒదిఁగిలికనువిచ్చి హూయని బిట్టావులించి కొండొకదేతిలేచినీల్గి,కలయఁజూచుటయును." భార. ఆర. ౭, ఆ.

హూణము. సం. వి. అ. పుం. దేశవిశేషము. (ఆదేశస్థులు హూణులు.)

హూతము. సం. విణ. (అ.ఆ.అ.) పిలువఁబడినది. (ఆహూతము అనియు.)

హూతి. సం.వి.ఇ. స్త్రీ. పిలుపు. (ఆహూతి అనియు.)

హూహువు. సం. వి. ఊ. పుం. ఒకానొక దేవగాయకుఁడు.

హూహూ. దే. వి. చలియందగు ధ్వన్యనుకరణము. "సీ. జనులుహూహూయనుచలివేళఁగుత్తుకబంటితోయములలోఁపలవసించి." భాగ. ౪, స్కం.

## హృ.

హృతము. సం. విణ. (అ. ఆ. అ.) హరింపఁబడినది. (అహృతము అనియు.)

హృతి. సం. వి. ఇ. స్త్రీ. హరణము. (అహృతి అనియు.)

హృదయంగమము. సం. విణ. (అ. ఆ. అ.) మనసుకింపైనది. (మాట.)

హృదయము. సం. వి. అ. న. 1. మనస్సు; 2. గుండెకాయ; 3. రొమ్ము.

హృదయాళువు. సం. విణ. (ఉ.) మంచిమనసుగలవాఁడు.



హృది. సం. వి. ద్. న. 1. మనస్సు; 2. గుండెకాయ; 3. రొమ్ము.

హృద్య. సం. వి. ఆ. స్త్రీ. బుద్ధియనెడి రోషధి. అ. పుం. ము. వశీకరణవేదమంత్రము. విణ. 1. మనసుకింపైనది; 2. మనసుకు హితవైనది; 3. మనసునందుఁబుట్టినది.

హృషీకము. సం. వి. అ. న. ఇంద్రియము.

హృషీకేశుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు, వెన్నుఁడు.

హృష్టి. సం. వి. ఇ. స్త్రీ. సంతోషము.

హృష్టుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సంతోషించినవాఁడు.

## హె.

హెగ్గడి. వై. వి. 1. అంతఃపురపు కావలివాఁడు; "సీ. అవిమున్న తాఁబెట్టినట్టిచోటరయించికానకవచ్చి హెగ్గళ్లుచెప్ప." పర. 3, ఆ.—2. అంతఃపురపు కావలికత్తె.

హెగ్గడికత్తె. వై. వి. అంతఃపురపు కావలికత్తె. "ఉ. సఖి, వారముతోరమారమణివచ్చెను హెగ్గడికత్తెలెందఱోఁ, గోరిభజింప." కళా. ౨, ఆ. (స్వార్థమున కత్తె.)

హెగ్గడికాఁడు. ద్వ. వి. అంతఃపురపుకావలివాఁడు. (స్వార్థమున కాఁడు.)

హెగ్గడీఁడు. ద్వ. వి. (హెగ్గడి+ఈఁడు.) హెగ్గడికాఁడు. "తే. అతఁడుతెచ్చినరత్నభూషాంబరాదు, లందుకొనహెగ్గడీలతో నానతిమ్ము." సత్య. ౪, ఆ. (స్వార్థమున ఈఁడు.)

హెచ్చేరించే. దే. స. క్రి. ఎచ్చరించునకు మొదటిరూపము.

హెచ్చేరిక. దే. వి. ఎచ్చరికకు మొదటిరూపము. (చూ. సాహెబా.)

హెచ్చేరికించే. దే. స. క్రి. ఎచ్చరికించునకు మొదటిరూపము.

హెచ్చిరిల్లు. దే. అ. క్రి. ఎచ్చిరిల్లునకు మొదటిరూపము. (రూ. హెచ్చిరిలు.)

హెచ్చిల్లు. దే. అ. క్రి. వర్ధిల్లు. (రూ. హెచ్చిలు.) "వినీతిహెచ్చిలనెదురేగి." ఉ, రా. ౮, ఆ.

హెచ్చు. దే. అ. క్రి. వి. ఎచ్చునకు మొదటిరూపము.

హెడ్డు. అం. విణ. పయినుండు. (హెడ్డుగుమాస్తా, హెడ్డుమేస్టరు. మొ.)

## హే.

హేజీబు. దే. వి. మంత్రి. రా, వి. ౫, ఆ.
హేడుఁడు. సం. వి. అ. పుం. అంతఃపురపుకావలివాఁడు. విణ. మూర్ఖుఁడు.
హేతి. ఇ. స్త్రీ. 1. అగ్నిశిఖ; 2. మంట; 3. సూర్యకిరణము; 4. ఆయుధము.
హేతువు. సం. వి. ఉ. పుం. కారణము, కతము.
హేమంతము. సం. వి. అ. పుం. మంచుకాలము. (చూ. ఋతువు.)
హేమకారుఁడు. సం. వి. అ. పుం. అగసాలెవాఁడు.
హేమదుగ్ధకము. సం. వి. అ. పుం. మేడి౹.
హేమపుష్పకము. సం. వి. అ. పుం. 1. సంపెంగ౹; 2. లొద్దుగు౹.
హేమపుష్పిక. సం. వి. ఆ. స్త్రీ. పచ్చపూమొల్ల౹.
హేమము. సం.వి.అ.న్.న. 1. బంగారు; 2. ఉమ్మెత్త౹.
హేమాద్రి. సం. వి. ఇ. పుం. బంగరుకొండ.
హేమాహేమీలు. దే. విణ. బ. అధికులు.
హేమించు. సం. అ. క్రి. బంగారగు.
హేయము. సం. విణ. (అ. ఆ. అ.) విడువఁదగినది.
హేరంబుఁడు. సం. వి. అ. పుం. 1. పిల్లారి; 2. శౌర్యముచే గర్వించినవాఁడు.
హేరవళి. దే. వి. పాడపన్నెకోళ.
హేరాళి. దే. వి. హింసించుట, ఉపద్రవపెట్టుట. "ఉ. రాముఁడనంగఁజెప్పుమధరానురుఁ డొజమదగ్నిపుత్త్రుఁడై, సోమకిరీటికిన్ శరణుచొచ్చిగుహుండునుదానుఁగూడిపో, రాములతోడనుంబరశురాముఁడనన్ విలువిద్య నేర్చిహే, రాములఁదండ్రి నాటిరిపులందునుమాడిన యట్టిరాముఁడో." భల్లా. ౨, ఆ.
హేరావళి. దే. వి. హేరవళియొక్కరూపాంతరము.
హేరాళము. సం. విణ. (అ. ఆ. అ.) అధికము. "క. సారమతిదక్షవాటిక, తూరుపుగవనిన్ బ్రసిద్ధితోవసియించున్, హేరాళక్రీడాసం, చారిణి నూకాంబభక్తజనరక్షణయై." భీ. ౧, ఆ.
హేల. సం. వి. ఆ. స్త్రీ. భ్రూనేత్రాదివికారముల చేత చక్కగా తెలియఁదగిన మనోవికారము; 2. నదీవిశేషము; 3. తిరస్కారము.
హేవాకము. సం. వి. అ. పుం. ప్రౌఢిమ; 2. తెలివి.
హేవిళంబి. సం. వి. న్. పుం. ఒకసంవత్సరము. (చూ. సంవత్సరము.)
హేష. సం. వి. ఆ. స్త్రీ. గుఱ్ఱముయొక్క సకిలింత.
హేషించు. సం. అ. క్రి. గుఱ్ఱముసకిలించు.
హేషితము. సం. వి. అ. న. గుఱ్ఱముయొక్క సకిలింత.
హేళనము. సం. వి. అ. న. తిరస్కరించుట.
హేళి. సం. వి. ఇ. పుం. 1. సూర్యుఁడు; 2. ఆలింగనము.

## హై.

హైన్యము. సం. వి. అ. న. హీనత్వము, హీనత.
హైమనము. సం.వి.అ. పుం. మార్గశీర్షమాసము. విణ. 1. మంచుచేతకలిగినది; 2. బంగారుచేతకలిగినది.
హైమము. సం. వి. అ. న. వేకువను మంచువలనఁగలిగిన జలము. విణ. 1. మంచుచేతకలిగినది; 2. బంగారుచేతకలిగినది.
హైమవతి. సం. వి. ఈ స్త్రీ. 1. పార్వతి; 2. ఆకాశగంగ; 3. కరక౹; 4. తెల్లవస౹; 5. రెడ్డివారినానఁబ్రాలు౹.
హైయంగవీనము. సం. వి. అ. న. 1. తొలినాడు చిలికియెత్తిన ఆవువెన్న; 2. తొలినాడు చిలికియెత్తిన ఆవువెన్న కాఁచిననెయ్యి.
హైరాను. హిం. విణ. ఎటుతోచని, తొందరపడిన.

## హొ.

హొ. దే. విణ. ప్రత్యయంగు హొన్ను శబ్దమునకు మీఁదివర్ణములోపింపఁగా మిగిలినరూపము. (దీనికి పరుషసరళములు పరములగునపుడు సమాగమంబగు. ఉదా. హొంగాళె, హొంబట్టు. మొ.)
హొంత. దే. వి. పరిశ్రమము. "శే. హొంతఁబాడుట పనవిహారోత్సవంబు, సలుపుటయు." అని. ౨, ఆ.
హొంతకాఁడు. దే. వి. జెట్టివాఁడు. (చూ. సంగమము. దే.)
హొంతకారి. దే. వి.——పై.——భార. విరా. ౧, ఆ.
హొన్నిత్తడి. ద్వ. వి. (హొన్ను + ఇత్తడి.) ఇత్తడిలో భేదము.
హొన్ను. దే. వి. పొన్ను, బంగారు, స్వర్ణము. (ఇది యన్యదేశము.) (ప్రత్యయం దంత్యవర్ణలోపము. చూ. హొ.)
హొమ్ము. దే. విణ. ఒమ్మునకు మొదటిరూపము.
హొయలు. దే. వి. విలాసము. "అప్పురిలోనబొజుంగుమిన్న రెల్లపుడుదినాంత వేళలహొయల్ మెఱయన్ విహరింతురు." రమి. ౧, ఆ.
హొయలుబండి. దే. వి. గాడీ.

హొరంగు. దే. వి. విలాసము. "సోయగపుమేని హొరంగుతుఱంగలింపఁగా." రసి. ౫, ఆ.

## హా.

హా. యు. దే.వి. పిలుచుటయందగుధ్వన్యనుకరణము. "హానిలుము." భో. ౪, ఆ.—వై. అవ్య. ఆశ్చర్యమునందువచ్చును. "హాయని... పుష్పవృష్టిగురియించిరి." భార. అర. ౭, ఆ.

హాడము. సం. వి. అ. పుం. ఓడ, నావ, తరణి.

హాత. సం. వి. ఋ. పుం. ఋగ్వేదము తెలిసిన ఋత్విక్కు.

హాత్రి. సం. వి. ఋ. పుం.——వై.——

హాదా. హిం. వి. ఉద్యోగము.

హామము. సం. వి. అ. పుం. 1. వైశ్వదేవము; 2. దేవయజ్ఞము.

హామ్యము. సం. వి. అ. న. నెయ్యి. విణ. హామము చేయఁదగినది.

హార. సం. వి. ఆ. స్త్రీ. 1. అహోరాత్రము; 2. రాశ్యర్థము; 3. లగ్నభేదము; 4. శాస్త్రవిశేషము; 5. రేఖాభేదము.

హారాట. దే. వి. ఆటోపము. "హారాటమై నేలమొత్తికొనంగాబవరంబులం గెలువఁగా." భార. ఉద్యో. ౧, ఆ.

హారాహారి. దే. క్రి. విణ. అవిరామము. "చవిగానియిందులకు హారాహారిగాఁ బోరియేలా వాలాయమునేయఁగా." స్వా. 3, ఆ.

హారు. గ్రా. వి. ధ్వన్యనుకరణము. (హారుగాలి.)

హాళి. దే. వి. కామునిపండుగ కడపటినాడు తగులఁబెట్టుటకై పోగుచేసెడుగడ్డికంప. (ఇది యన్యదేశ్యము.)

హాళిక. కన్న. వి. భక్ష్యవిశేషము.

హాళిపండుగ. ద్వ. వి. కామునిపండుగ.

## హౌ.

హౌదా. హిం. వి. ఏనుఁగుమీఁది అంబారి.

హౌసు. దే. వి. 1. సొగసు; 2. ఒయ్యారము. (మొదటిరూపము హవుసు.)

హౌసుకాఁడు. దే. విణ. 1. సొగసుకాఁడు; 2. ఒయ్యారకాఁడు. (మొదటిరూపము హవుసుకాఁడు.)

## హ్ర.

హ్రదము. సం. వి. అ. పుం. 1. ఏటినడుమలోఁతుగలచోటు; 2. లోఁతుగల నిడుపాటి నీటిపల్లము.

హ్రసిష్ఠము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి హ్రస్వమైనది.

హ్రస్వగవేధుక. సం. వి. ఆ. స్త్రీ. బీఱి.

హ్రస్వము. సం. విణ. (అ. ఆ. అ.) 1. కుఱుచ; 2. పొట్టి.

హ్రస్వాంగము. సం. వి. అ. పుం. జీవకమను గంధద్రవ్యము.

## హ్రా.

హ్రాదిని. సం. వి. ఈ. స్త్రీ. 1. వజ్రాయుధము; 2. ఏఱు; (రూ. హ్రదిని.) 3. మెఱపు; 4. అందుగు.

## హ్రి.

హ్రిణీయ. సం. వి. ఆ. స్త్రీ. 1. సిగ్గు; 2. రోఁత.

## హ్రీ.

హ్రీ. సం. వి. ఈ. స్త్రీ. సిగ్గు, లజ్జ, వ్రీడ, త్రప.

హ్రీణము. సం. విణ. (అ. ఆ. అ.) సిగ్గునొందినది.

హ్రీతము. సం. విణ. (అ. ఆ. అ.) ——వై.——

హ్రీబేరము. సం. వి. అ. న. కురువేరు.

## హ్రే.

హ్రేష. సం. వి. ఆ. స్త్రీ. హేషయొక్క రూపాంతరము.

## హ్లా.

హ్లాదనము. సం. వి. అ. న. 1. సంతోషించుట; 2. సంతోషము.

శబ్దరత్నాకరము సంపూర్ణము.

PRINTED AT THE S. P. C. K. PRESS, VEPERY, MADRAS—1912.